# ఆంధ్ర
# వ్యాకరణసంహితా సర్వస్వము

సంజ్ఞా సంధి తత్స మాచ్ఛిక పరిచ్ఛేదములు

మొదటిసంపుటము

గ్రంథకర్త:
కళాప్రపూర్ణ
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి




ఆంధ్రవిశ్వకళాపరిషత్
ప్రచురితము

---

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
వారిచే ముద్రితము
1951



కళాప్రపూర్ణ
శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

కృతికర్త:

కళాప్రపూర్ణ

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి.

---

కృతిభర్త:

డాక్టర్

కట్టమంచి రామలింగారెడ్డిగారు.

# కృతిసమర్పణము

## రసాలగవృత్తమ్.

శ్రీమదాన్ధ్రమహీసుతసత్తమః
కట్టమంచి కులామ్బుధిచన్ద్రమాః
ఆన్ధ్రవిశ్వకళాపరిషద్విభూ
రామలిఙ్గపదాఞ్చితరెడ్డిరాట్
విద్వదిన్ద్ర కవీన్ద్ర విమర్శకో
మాం దయాపరిపూర్ణదృశా సదా
మానయ న్నిజమిత్రపదం ముదా
సార్థకీ కురుతా దపిదూరగః ౧

---

క. తనకృతిఁ గళాప్రపూర్ణుం
డనుచును దన కతిప్రియముగు నాంధ్రమునకు సే
వను సత మొనరించు ననున్
బొనర్తు పరిషత్తు గౌరవోపాధ్యాయున్. ౨

శా. ఆంధ్రవ్యాకృతిసంహితన్ మదుపదిష్టాంధ్రీయసర్వస్వమున్
స్వాంధ్రప్రాభవపట్టబంధముఁ దలిర్పం జేసి తేతజ్జ్ఞ నీ
రంధ్రవ్యాప్తసుకీర్తిచాంద్రమస భా రారాజ దేతత్త్రిలిం
గాంధ్రంబందుఁ గళాధినాథమహిమోదారుండవై వెల్గవే 3

క. అని ముదమున నే వేఁడిన
మనమునఁ గల యాదరంబు మఱిమఱిఁ దనమో
మునఁ దోఁచకాఁడఁగ "శాబ్దిక
ఘన, నీదగుపల్కు నాకుఁ గాదన నగునే! ౪

క. భానుని భానులచేఁ గద
తాను సుధానిధి కళానిధానం బగుటల్

ధీనిధి తావక గోతతి
నానుచు దీపింతు ననియె నాచతురుండున్.

## శీర్షము

సంస్కృతాంధ్రంబుల సాహిత్యపరసీమ
సత్కవీంద్రుఁడు జ్యోతిషప్రవక్త
కట్టమంచ్యన్వయ కలశోదధి కళాధి
రామలింగారెడ్డి రాడ్విభునకుఁ
దాను బ్రపౌత్త్రుండుఁ దత్ప్రశిష్యుండయి
యాపేరనే పేర్మి నలరువాఁడు
భారతాదిగ్రంథ పద్యరత్నంబులఁ
గూర్చు సుబ్రహ్మణ్య కూర్మితనయుఁ
డాంగ్లాంధ్రపండితుం డాంధ్రవిశ్వకళాప
రిషదుపాధ్యక్షుండు తేండ్లతేఁడు
రాజదాంధ్రవ్యాకరణసంహితేడ్య స
ర్వస్వంబునకుఁ దాను బతియు నగుట
తే. గీ. ప్రగుణశాలికి రాజ్యాధిపత్య మగుట!
స్వర్ణభూషకుఁ బరిమళావాప్తి యగుట!
భవ్యగుణరూపవతికి సౌభాగ్య మగుట!
పండితాళికి విత్తసంపత్తి యగుట!

## షష్ఠ్యంతములు

క. స్వక నిటల ఘటితలక్ష్మ
ప్రకటిత నిజభావి విజ్ఞ పండితగురు కు
క్షు కవీంద్ర కృతకులోత్తం
స ప్రపితామహసుధీంద్ర సదభిఖ్యునకున్

క. చండాంశుతేజునకు సా
ఖండలయశునైభవునకు ఖండితరిపు దు
ర్గాండిర్యునకున్ నందిత
పండితమండలి కఖండ పాండిత్యునకున్

క. పారావారగభీరున
కారాద్ధ సరస్వతికిని నాత్మశ్లాఘా
దూరునకున్ ధీరునకున్
రారాజత్కీర్తికాంతి రాజితమహికిన్. ౯

క. ఆదర్శప్రాయముగా
నాదిమకావ్యముల మధ్యమాద్యతనములన్
మేదుర విమర్శనంబుల
నాదృతి నొనరుచు విమర్శకాగ్రసరునకున్ ౧౦

క. కవితాతత్త్వవిచారము
సువిమలమార్గములఁ జేసి శోధించిన సత్
కవికి బహుఖండకావ్య సు
కవికిన్ "పోటీపరీక్ష" కవివిజయునకున్ ౧౧

క. ఏరీ నీ కెదు రెందున్
లేరే యనఁదగిన రామలింగారెడ్డిట్
ఛౌరికి ఫలానుమేయ
ప్రారంభునకున్ శుభంకరారంభునకున్ ౧౨

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్చిన యాంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వంబనెడు కృతి సమర్పితంబయ్యె.

విశాఖపట్టణము
29-10-49

ఇట్లు సుజన విధేయుండు
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి
గ్రంథకర్త

# విజ్ఞప్తి

ఆంధ్రవ్యాకరణ మనునది యాంధ్రమహాప్రబంధములందలి యాంధ్రవాగ్దేవతాకారము నావిష్కరించునదియేకాని వేఱుకాదు. తొలి నలంతియయియున్న యాంధ్రభాష సంస్కృతప్రాకృతభాషాసంకలనమున వలంతియయ్యె. తా నాంధ్ర విద్వాంసుఁడు కావలయునన్న కుతూహలముగల యాతఁడు సంస్కృతవ్యాకరణ సాహిత్యపాండిత్యము గల్గియుండవలయును. ఈవిషయమున నన్నయభట్టారకుఁ డీ క్రిందిరీతిని వక్కాణించెను.

శ్లో. శాస్త్ర మపౌరుష మాద్యం । ప్రాయికనిత్యప్రయోగలక్ష్మైతత్,
దృశ్య మతిస్థవిరం యజ్ । జ్ఞాత్వా శబ్దాః ప్రయుక్త అర్హ సమః.

(వ్యా. సం. ౧ VII విష).

నన్నయాథర్వణు లిట్టియభిప్రాయము గలవారగుటచేతనే యాంధ్రమహాప్రబంధములం దతి ప్రచురములై యున్న సంస్కృతశబ్దములందును దన్మయవాక్యములందును గల కృత్తద్ధితసమాసకారకాదివిషయములను వివరింపక యట్టివానిజ్ఞానము సంస్కృతవ్యాకరణములమూలముననే విశదపడఁగల దనునిశ్చయముతోఁ దత్పరిశిష్టవిషయములనే యుపదేశించిరి. ఉత్తమాంధ్రవిద్యార్థి సంస్కృతవ్యాకరణసాహిత్యసంపన్నుఁ డయి యుండవలయు ననెడి నిరూఢాభిప్రాయముతోనే యాంధ్రభాషకు సంస్కృతభాషామయవ్యాకరణమును వారు రచించినవారయిరి. ఆంధ్రమహాప్రబంధములెల్ల సంస్కృతాంధ్రవ్యాకరణసాహిత్యకూలంకషపాండిత్యఘనులగు వాగనుశాసనాదిమహాకవుల సంస్కృతాంధ్రవాగ్దేవతోపాసనాఫలరూపములె యగుటంజేసి సాంస్కృతికాచ్ఛికభాషాసంప్రదాయభూయిష్ఠములై వెలయుచున్నవి. అట్లగుటచే సంస్కృతాంధ్రవ్యాకరణసాహిత్యాభిరుచి లేనివార లాంధ్రమహాప్రబంధముల కొకజోత పెట్టవలసినదె యనుటకు సందియము లేదు. అట్టి పండితమ్మన్యు లాంధ్రమహాప్రబంధములను సేవించుట యన్నది యంధగజదర్శనకథావిధమై యుండు ననఁగును.

ఆంధ్రవాఙ్మయమునందలి యాంధ్రమహాభారతాది కతిచిద్గ్రంథములు మాత్రమె కొంత యస్పష్టమగు ముద్రణసంస్కారముతో ముద్రితములై యున్నవి. తక్కిన వెక్కుమహాప్రబంధములు తగినముద్రణసంస్కారపులేమిచేఁ బ్రమాదభూయిష్ఠములై యున్నవి. (చూడుఁడు వ్యా. సం. ౬3 VII విష.). అట్లగుటంజేసి

B

మున్నగు ప్రాచీనద్రావిడవ్యాకరణవిషయములు తెల్గున సేకరించియున్నాను. ఆంధ్ర వాగ్దేవత యనుగ్రహించుఁగాక !

భాషకుఁ బెరుగుట సహజమగుటచేత దాని నాపుట యుక్తముగాదనెడిది సిద్ధాంతముగాదు. అయ్యది సిద్ధాంతాభాసము... బూరగాళ్ళ పెరుగువనువలెనే దాని నాప శక్యమును గాదు. సస్యమును బెంచుకృషీవలుఁడు సహజముఁగ మొలచి పెరుఁగుచున్న చిగిరింతను గాబును నున్మూలించియు సస్యము క్రొవ్వి పెరుఁగునపు డద్దానిని గోసియు సస్యమును ఫలోన్ముఖముగ వర్ధిల్లఁజేయుట సహజము. అట్లె యుచ్చారణవేగాదికముచేత నపభ్రష్టమగుచుఁ బెరిఁగెడిభాష పెరుగువను సవరించి యద్దానిని రసవత్కావ్యోపయోగిగా సంతరించుట యావశ్యకము. అట్టిశక్తి భాషా సాహిత్యపాండిత్యశాలియగు పండితకవీంద్రునకే యలవడును. కావున సాధారణు లగు పండితమ్మన్యు లట్టిపనికి దొరకొనరాదు.

యుక్తాహారవిహారముల నిచ్చగింపక యథేష్టాచరణమున వర్తిల్లువాని యారోగ్యము చెడునట్లు భాషాపాండితీసంపాదనాశ్రమ విముఖుఁడయి యథేష్ట వ్యవహారముచేయువానిభాషయు రుగ్ణమై పీడాకరమగును.

నేను చిరకాలము క్రిందటినుండియుఁ బ్రయోగాన్వేషణముచేసి యీవ్యాకరణమును రచింపఁగడంగి కారకాంతము రచించియుండఁగా ౧౯౪౨ క్రైస్తవాబ్దపు సెప్టంబరుమాసమున "ఆంధ్రవిశ్వకళాపరిష" దుపాధ్యక్షులును, విమర్శకాగ్రగణ్యులును నగు శ్రీ. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు నన్ను రావించి యీ వ్యాకరణమును బూర్తిచేయుటకు నాకుఁ దగినప్రోత్సాహము గావించి యీ గ్రంథమును ముద్రింప నేర్పాటు చేయించినందులకును, వారీగ్రంథమును గృతినందుట కంగీకరించినందులకును వారియెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను. మఱియు నీగ్రంథ మాంధ్రవ్యాకరణసంహిత లనఁదగు నన్నయాథర్వణకారికాదుల పరిశీలనముతోను బహుళాంధ్రవ్యాకరణవిషయవిమర్శనములతోను వెలయుచున్న దనుచు నియ్యది "ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వ" మనఁదగునని సదభిఖ్య నొసంగినందులకును వారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

విజయనగరము. }
10-8-1950. }

ఇట్లు సుజనవిధేయుఁడు
వఝల చినసీతారామస్వామిశాస్త్రి
(గ్రంథకర్త.)

# అకారాద్యనుక్రమణిక

0

# బాలవ్యాకరణసూత్రసూచి

---

# ముఖ్యవిషయసూచిక

## స ం ధి ప రి చ్ఛే ద ము.

## సంధిపరిచ్ఛేదము.

సంధి విషయ సూచిక

పుట.

పుట.

ముఖ్యవిషయసూచిక

# ముఖ్య విషయ సూచిక

# ఉదాహృతగ్రంథ సంకేత వివరణపట్టిక.



| | |
|---|---|
| అచ్చ. | అచ్చ తెనుఁగు (ఆచ్ఛికము) |
| అచ్చ - రా. | అచ్చ తెనుఁగు రామాయణము. |
| అజం. | అజంతపరిచ్ఛేదము. |
| అథ - | అథర్వణకారికావళి (వికృతివివేకము - కారికావళి) |
| అనుబం. | అనుబంధవ్యాఖ్య. |
| అనుశాసనము. | ఆంధ్రభాషానుశాసనము. |
| అప్పక. | అప్పకవీయము. |
| అమ. | అమరము (నామలింగానుశాసనము) |
| అమ - సు. | అమరసుధావ్యాఖ్య. |
| అశ్వ. | అశ్వమేధపర్వము. |
| అహో. | అహోబలపండితీయము (కవిశిరోభూషణము) |
| ఆ. | ఆశ్వాసము. |
| ఆం - చిం. | ఆంధ్రశబ్దచింతామణి = (చింతామణి = నన్నయభట్టీయము) |
| ఆంధ్రాక్ష. | ఆంధ్రాక్షరతత్వము. |
| ఆం - భా. | ఆంధ్రభాషార్ణవము. |
| ఆం - భా - అ. | ఆంధ్రభాషానుశాసనము (అనుశాసనము = భాషానుశాసనము) |
| ఆం - భా - చ. | ఆంధ్రభాషాచరిత్రము (భాషాచరిత్రము) |
| ఆం - భా - వి. | ఆంధ్రభాషావికాసము (భాషావికాసము) [పరిషత్పత్రిక. |
| ఆం - సా - ప. | ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (పరిషత్పత్రిక - సాహిత్య |
| ఆం - భూ. | ఆంధ్రభాషాభూషణము. |
| ఆచ్ఛి. | ఆచ్ఛికపరిచ్ఛేదము. |
| ఆది. | ఆదిపర్వము (భారతము) |
| ఆను. | ఆనుశాసనికపర్వము (భారతము) |
| ఆము. | ఆముక్తమాల్యద. |
| ఆర. | ఆరణ్యపర్వము (భారతము) |
| ఆశ్ర. | ఆశ్రమవాసపర్వము (భారతము) |
| ఉద్యో. | ఉద్యోగపర్వము (భారతము) |
| ఉ - భా. | ఉత్తరభాగము. |
| ఉ - రా. | ఉత్తరరామాయణము. |
| ఉ - హరి. | ఉత్తరహరివంశము. |

| | |
|---|---|
| [illegible] | [illegible]కావ్యము |
| [illegible] | [illegible]ము ([illegible]తము) |
| [illegible] | క[illegible]భూషణము. |
| [illegible] | క[illegible]శనము. |
| [illegible] | క[illegible]వాక్యశుద్ధి. |
| [illegible] | క[illegible]దయము. |
| [illegible] | కవిక[illegible]రసాయనము. |
| [illegible] | కవికల్పద్రుమము. |
| [illegible] | కవిజనాశ్రయము. |
| [illegible] | కవిజనాంజనము. |
| [illegible] | కవిజనమండనవ్యాఖ్య (వికృతివివేకటీక) |
| [illegible] | కవిసంశయవిచ్ఛేదము. |
| క.జ. సంజీ. | కవిజనసంజీవని. |
| క.శి. | కవిశిరోభూషణము. |
| కా.ప. | కారకపరిచ్ఛేదము. |
| కా. | కారికావళి (అథర్వణ కారికావళి = వికృతివివేకము) |
| కావ్యా.ద. | కావ్యాదర్శము (సంస్కృత) |
| కావ్యాలం. | కావ్యాలంకారచూడామణి. |
| కాశీ. | కాశీఖండము. |
| కృదం. | కృదంతపరిచ్ఛేదము. |
| కౌ. శర. | కౌముదీశరదాగమము. |
| క్రియా. | క్రియాపరిచ్ఛేదము. |
| గాణ. | గాణపతవివరణము. |
| గుప్తార్థప్రకాశిక. | బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక = ప్రకాశిక. బా. గు. ప్ర. |
| గురుబా. | గురుబాలప్రబోధిక (లింగాభట్టీయము) |
| చండ. | చండప్రాకృతవ్యాకరణము. |
| చంద్రా. | చంద్రాంగదచరిత్రము. |
| చింతామణి. | ఆంధ్రశబ్దచింతామణి (నన్నయభట్టీయము) [శోధనము. |
| చిం. వి. పరి. | చింతామణివిషయపరిశోధనము = విషయపరిశోధనము = పరి |
| తత్త్వ. | తత్త్వబోధిని. |
| తద్ధి. | తద్ధితపరిచ్ఛేదము. |
| తద్భ. | తద్భవము. |
| తర్క. | తర్కసంగ్రహము. |

| | |
|---|---|
| తారా. | తారాశశాంకవిజయము. |
| తృ - ము. | తృతీయముద్రణము. |
| తె. | తెలుఁగు. |
| తొలు. | తొలుకాప్యము. |
| త్రివిక్ర. | త్రివిక్రమశబ్దానుశాసనము. |
| త్రిలిం. | త్రిలింగలక్షణశేషము = ప్రౌఢవ్యాకరణము. |
| దశా. | దశావతారచరిత్రము. |
| దుర్గా. | దుర్గాదాసవ్యాఖ్య. |
| ద్రోణ. | ద్రోణపర్వము (భారతము) |
| ద్విప. | ద్విపద. |
| ద్వి - ము. | ద్వితీయముద్రణము. |
| ద్వి. | ద్వితీయావిభక్తి. |
| న. | నపుంసకలింగము. |
| నన్నయభట్టీయము. | ఆంధ్రశబ్దచింతామణి = చింతామణి. |
| నన్నయా. | నన్నయాథర్వణీయము. |
| నన్ని - కు. | నన్నిచోడ కుమారసంభవము. |
| నరస. | నరసభూపాలీయము. |
| నామలిం. | నామలింగానుశాసనము = అమరము. |
| నారా. | నారాయణీయాంధ్రవ్యాకరణము. |
| నా - లిం. | నామలింగానుశాసనము (అమరము) |
| నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము. |
| నీలా. | నీలాసుందరీపరిణయము. |
| నృసింహా. | నృసింహపండితీయము. |
| నైష. | శ్రీహర్షునినైషధము. |
| పండి. | పండితారాధ్యచరిత్రము. |
| పరిశోధనము. | చింతామణివిషయపరిశోధనము = చిం. వి. పరి. |
| పర్వ. | పర్వము. |
| పా - ఇ అ. | పా ఇ అ సద్దమహణ్ణవము. |
| పాండు. | పాండురంగమాహాత్మ్యము. |
| పాణి. | పాణినీయము. |
| పాణి-కావ్య. | పాణినీయము—కావ్యవాఙ్మయము. |
| పాణి-శి. | పాణినిశిక్ష. |
| పారి. | పారిజాతాపహరణము. |

| | |
|---|---|
| పా. | పాక్షదవ్యాఖ్య. |
| పుం. | పుంలింగము. |
| పు. | పుట. |
| పే. కావ్యాఖ్య. | బాలవ్యాకరణ సారస్యసర్వస్వ పేటిక. |
| ప్ర. | ప్రథమావిభక్తి. |
| ప్ర. కాశికావ్యాఖ్య. | బాలవ్యాకరణ సుప్తార్థప్రకాశిక = సుప్తార్థప్రకాశిక. |
| ప్రకీ. | ప్రకీర్ణపరిచ్ఛేదము. |
| ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| ప్రా-స. | ప్రాకృతసమము. |
| ప్రా-ప్ర-కా. | ప్రాకృతప్రకాశిక. |
| ప్రౌఢ. | ప్రౌఢవ్యాకరణము = త్రిలింగలక్షణశేషము |
| బసవ. | బసవపురాణము. |
| బసవ-పీ. | బసవపురాణపీఠిక. |
| బా (బాల). | బాలవ్యాకరణము |
| బా-సు-ప్ర. | బాలవ్యాకరణసుప్తార్థప్రకాశిక. |
| బాల-మ. | బాలమనోరమావ్యాఖ్య. |
| బాల-పీ. | బాలసరస్వతీయపీఠిక. |
| బాలక. | బాలకవిశరణ్యము-(శరణ్యము) |
| బాలస. | బాలసరస్వతీయము. |
| బా.సా.పే. | బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటిక. |
| బిల్వే. | బిల్వేశ్వరీయము. |
| భట్టారకుడు. | నన్నయభట్టారకుడు. |
| భాగ. | భాగవతము. |
| భాను. | భానుమతీపరిణయము. |
| భాషాచరిత్రము. | ఆంధ్రభాషాచరిత్రము. |
| భాషానుశాసనము. | ఆంధ్రభాషానుశాసనము. |
| భాషావికాసము. | ఆంధ్రభాషావికాసము. |
| భార. | భారతము. |
| భాస్క. | భాస్కరరామాయణము. |
| భీమ. | భీమఖండము. |
| భీష్మ. | భీష్మపర్వము. |
| మనుచ. | మనుచరిత్రము = స్వారోచిషమనుసంభవము. |

| | |
|---|---|
| మహా. | మహాప్రస్థానపర్వము. (భారతము.) |
| మార్కం. | మార్కండేయపురాణము. |
| ముగ్ధ. | ముగ్ధబోధవ్యాకరణము. |
| మౌసల. | మౌసలపర్వము (భారతము.) |
| యయా. | యయాతిచరిత్రము. |
| రాఘ. | రాఘవపాండవీయము. |
| రాజశే. | రాజశేఖరవిలాసము. |
| రాజ-వి. | రాజవాహనవిజయము. |
| రామ-వ్యా. | రామతర్కవాగీశవ్యాఖ్య. |
| లింగా. | లింగాభట్టీయము. (గురుబాలప్రబోధిక.) |
| వసుచ. | వసుచరిత్రము. |
| వసు-వి. | వసుచరిత్రవిమర్శనము. |
| వాచ. | వాచస్పత్యము. |
| వికృ. | వికృతివివేకటీక = కవిజనమండనవ్యాఖ్య. |
| విజయ. | విజయవిలాసము |
| వి-పు. | విష్ణుపురాణము. |
| విరా. | విరాటపర్వము (భారతము.) |
| విష. | విషయము. |
| విషయపరిశోధనము. | చింతామణివిషయపరిశోధనము. |
| విస్తర. | విస్తరవ్యాఖ్య. |
| వై-దీ. | వైకృతదీపిక |
| వై-పా. | వైయాకరణపారిజాతము |
| వ్యా-సం. | ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము |
| శబ్దర. | శబ్దరత్నాకరకోశము |
| శబ్దస్తో. | శబ్దస్తోమమహానిధి. |
| శబ్దా-చిం. | శబ్దార్థచింతామణికోశము. |
| శరదా. | శాముచీశరదాగమము. |
| శ-ర. | శబ్దరత్నాకరకోశము. |
| శరణ్యము. | బాలకవిశరణ్యము. |
| శల్య. | శల్యపర్వము (భారతము.) |
| శాంతి. | శాంతిపర్వము (భారతము.) |
| శివరా. | శివరాత్రిమహాత్మ్యము. |
| శుక. | శుకసప్తతి. |

| | |
|---|---|
| శృం-నై. | శృంగారనైషధము శ్రీనాథునిది. |
| షడ్భా. | షడ్భాషాచంద్రిక. |
| సంజీ. | సంజీవనీవ్యాఖ్య. |
| సంజ్ఞా. | సంజ్ఞాపరిచ్ఛేదము. |
| సంధి. | సంధిపరిచ్ఛేదము. |
| సంధిగ్రం. | సంధిగ్రంథము (శ్రీకోరాడ) |
| సం. | సంస్కృతము. |
| సం-స. | సంస్కృతసమము. |
| సభా. | సభాపర్వము (భారతము) |
| సర్వల. | సర్వలక్షణసారసంగ్రహము |
| సమా. | సమాసపరిచ్ఛేదము. |
| సర్వ.సం. | సర్వశబ్దసంబోధిని. |
| సమా.కుసు. | సమాసకుసుమావళి. |
| సాహిత్యపరిషత్పత్రిక. | ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. |
| సాహి-ద. | సాహిత్యదర్పణము. |
| సి.కౌ. | సిద్ధాంతకౌముది |
| సూ-రాని. | శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు. |
| సౌప్తి. | సౌప్తికపర్వము (భారతము) |
| స్కాం. | స్కాంధము. |
| స్వర్గా. | స్వర్గారోహణపర్వము (భారత.) |
| స్వా. | స్వారోచిషమనుసంభవము (మనుచరిత్రము.) |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| స్త్రీ-ప. | స్త్రీపర్వము (భారతము.) |
| హంస. | హంసవింశతి. |
| హర. | హరవిలాసము. |
| హరి. | హరివంశము. |
| హరికా. | హరికారికావళి. |
| హరిశ్చం.వి. | హరిశ్చంద్రనలోపాఖ్యానవిమర్శము |
| హలం. | హలంతపరిచ్ఛేదము. |

మఱికొన్ని ప్రబంధములసంజ్ఞలు కోశాదులలో సుప్రసిద్ధములుగాన నిందెల్ల వానిని జూపలేదు.

# ఆంధ్ర

# వ్యాకరణసంహితా సర్వస్వము

## సంజ్ఞాపరిచ్ఛేదము

నన్నయాథర్వణీయము ౧-1. వి.

విశ్వశ్రేయః కావ్యం, త దదోషా పరిశ్కృతాచ వాగర్థౌ। సా వాగ్వ్యా, రసవృత్తి స్సాధ్యో్యహి రసోయథాయథం కవిభిః॥ (ఆం-చిం-౧-కా. అహోబల. ఉ: ౭; ౨౨; ౪౧; ౮౪. పు.)

### కల్పతరు వ్యాఖ్య

శ్లో. సుధియా పరిపూతమానసౌ । కలయేऽహం జగతః ప్రియంకరౌ ।
సితరౌ మను వేఙ్కటామ్బికౌ । ముఖలిఙ్గేశ్వరజన్మృతీ హ్యాపి. ౧

శ్లో. పితామహభ్రాతృసుతం స్వవిద్యా। గురుం చ చిన్తామణిసత్సమాఖ్యమ్,
శ్రీవత్స గోత్రోద్ధరణప్రశస్తిం। నమామి నారాయణసత్కవీన్ద్రమ్. ౨

(మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీపరమేశ్వర పరముగాను నర్థద్వయ మెన్నవగును. రెండవశ్లోకమున మద్గురువులగు నారాయణపండితుల పక్షముగాను, విష్ణుపక్షముగాను నర్థద్వయము నెన్నునది. రెంటను నుపమాధ్వనిని బరిశీలింప నగును. భ్రాతృజాయా మ్మను మేఘసందేశప్రయోగము చొప్పున రెండవశ్లోకమునందలి భ్రాతృసుతశబ్దము సప్రమాణ మగుచున్నది.)

శ్లో. శబ్దశాసననన్నార్య మాన్ధ్రకావ్యకృతాం గురుమ్,
వన్దే కవిత్రయగురు మాన్ధ్రవ్యాకృతికృద్గురుమ్. 3

శ్లో. తచ్చిన్తామణి శిష్టార్థం వ్యాచకారాన్ధ్రలక్షణమ్,
యోऽస్మై ద్వితీయాచార్యాయ నమోऽథర్వణసూరయే. ౪

శ్లో. నన్నయాథర్వణీయాద్య సంహితార్థప్రకాశకాః,

తన్ముని దృష్టతయా తురీయే వేదేచ." (శబ్దస్తో.)

"అథర్వణ. పుం. శివే ఇతి త్రికాణ్డశేషః." (శబ్దా. చిం.)

అను కోశములనుబట్టి వికృతివివేక కర్తను సయితము "అథర్వణుఁడు" అనియె చెప్ప వలసినట్లు తోఁచును. కాని కవిశిరోభూషణ వికృతివివే కాదులం దెల్లముద్రణము లందును వ్రాఁతలయందును "అథర్వణ" శబ్దమె చూపట్టుచున్నది. అథర్వవేదద్రష్ట యగు ముని వికృతివివేకకర్త కాఁడనుట నిశ్చయము. "ననామ్ని వ్యుత్పత్తిః" అను చొప్పున సంజ్ఞలయందు వ్యుత్పత్తి సరిపడకుండుట దుష్టము కాదు. పలసినచో వ్యుత్పత్తియు నిటుఁ గుదురుపడుచున్నది. "అర్వన్ - పు. (ఋ+వనిప్)" "యజ్వన్-పు (యజ్+భూతేక్వనిప్") (శబ్దస్తో) అనువాని చొప్పున "ధృ+వనిప్" (ధృజవధ్వంసనే) (శబ్దకల్పద్రుమము) అనురీతిని "ధర్వన్" శబ్ద మేర్పడును. పతనముగలవాఁడు 'అథర్వన్' అనుదానికిఁ బతనము లేనివాఁ డని యర్థము. శబ్దశాస్త్రమునఁ బ్రమాదము లేనివాఁడని తాత్పర్యము. "త్రాసుస్నిస్ మన్ క్వనిప్ వనిప్ విచ్ క్విపః" (ముగ్ధవ్యా. ౧౦౩౨ సూ.) "పృథగ్యోగాత్ సర్వధాతుభ్యో విహితా అపి ప్రయోగానుసారాత్ ధాతువిశేషేభ్య ఏవ...వనిప-మూహ. భూరి దదాతీతి భూరిదావా, పరిణి జాయతే వారిజావా, ఉభయత్ర విద్వనో రితిజా...ఏవం యజతేస్మ యజ్వా" (దుర్గాదాస వ్యాఖ్య. ముగ్ధ-వ్యా. ౧౦౩౩ సూ.) కాన వికృతి వివేకకర్త 'అథర్వణుఁడు' కావచ్చును.

"అథర్వణుఁడు సం-వి-అ-పుం ౧ శివుఁడు ౨ ఒకానొక ఆంధ్రవ్యాకరణకర్త" (సూ-రా-ని) అని సూ-రా-నిఘంటుకర్తలు సరిచేసికొన నక్కఱలేదు. శబ్దరత్నాకర కర్త సంస్కృతకోశ ప్రసిద్ధములగు నథ ర్వాథర్వణ శబ్దముల యర్థము లథ ర్వాథర్వణ శబ్దములకుఁ జూపుట కేవలము పొరపాటు. "అథర్వము సం-వి-న-ఒక వేదము." (శ-ర)

ఆంధ్రశబ్ద చింతామణి నన్నయభట్టారక కృత మనియు నథర్వణ కారికావలి యనఁబడెడి వికృతివివేకము తచ్చింతామణికి విస్తృత వివరణగ్రంథ మనియు నయ్యది యథర్వణాచార్య కృతమనియు నారచించిన చింతామణి విషయపరిశోధనమునందును వైయాకరణ పారిజాతమునందును విపులవిమర్శన పురస్సరముగ వచింపఁబడెను. గ్రంథవిస్తరభీతి నిం దావిషయములు ప్రసక్తము కాలేదు. (విస్తర.)

విస్తర. ౧ I విషః—ఆంధ్రభాషాచరిత్రకర్తగారు నారచించిన గ్రంథములు రెండును జదివియు నందు ఖండింపఁబడినయుక్తులనె మరల నెత్తి వ్రాయుచుఁ

స్వస్థాన వేష భాషా,భిమతా స్సన్తో రసప్రలుబ్ధ
ధియః, లోకే బహుమన్యన్తే, వైకృత కావ్యాని
హ్యన్య దపహాయ. (ఆం-చిం-౨-కారి-అహో-౧౦౧
పు.)

స్వస్థానా
క. ౧ II

కల్ప-౧ II విష:— రసప్రలుబ్ధధియః =రసాస్వాదన తత్పర హృదయులగు' సన్తః=పండితులు, స్వస్థాన=స్వదేశమందలి, వేషభాషా=వేషభాషలందు, అభిమతాః= అభిమానముగలవారగుచు, లోకే=ఆంధ్రదేశమునందు, అన్యత్ =వైకృతకావ్య భిన్నములగు ప్రకృతిభూత సంస్కృతకావ్యములను, అపహాయచ=విడిచియు వైకృతకావ్యాని=ఆంధ్రభాషామయ కావ్యములను, బహుమన్యన్తే= బహూక రించుచున్నారు. శ్రవణ పఠన పాఠన రచ నాదులచే నాచరించుచున్నారని భావము.

సంస్కృతము వ్యవహారస్థము కామిం జేసి తద్భాషామయ కావ్యములకన్న వ్యవహారస్థమగుటచేత జీవకళా కలితమగు స్వదేశభాషామయమయిన కావ్యములు రసాస్వాదన విషయమునఁ బ్రకృష్టతరము లనఁదగును. కావున సంస్కృతభాషామయ కావ్యములను విడిచియు నాంధ్రకావ్యముల స్వకాలపండితు లాదరించుచున్నారని తాత్పర్యము. ఇట్టియాదరణము నరసియే యాంధ్రమున విస్తృత మహాప్రబంధము లేని కొఱంతను దీర్పనెంచి నన్నయభట్టారకుఁ డాంధ్రమున మహాభారతమును నద్దాని కుపకారకమగు నాంధ్రశబ్దచింతామణి యను నాంధ్రవ్యాకరణమును రచింప నారంభించె నని యెఱుంగునది. గ్రంథకర్త కిట్టి యభిప్రాయ ముండుటచేతనే యేతద్గ్రంథాదిని జేసిన కావ్యప్రశంస సుసంగత మగుచున్నది. (వై- పా-౧౭ మో-౨౦ ప-విష.)

సిద్ధి ర్లోకా ద్ధ్రువా శ్శ్యా, లోకోఽ నన్యాదృశశ్చ నిత్య
శ్చ। సంస్కారార్థో నియమోఽ నియమా ద్గ్రామ్యం
హి య త్త్వపభ్రంశః. (ఆం-చిం-3 కారి. అహో
౧౧౪-౧౦౬ పు.)

నన్నయా
౧ III విష.

కల్ప-౧ III విష:— వ్యాకరణ గ్రంథాదిని గావ్యప్రశంస చేయుటంబట్టి వ్యాకరణము కావ్యభాషా మాత్రానుశాసనమే యని భట్టారకాశయము విశద మగుచున్నది. అట్లయినను నాంధ్రభాషా భూషణ కావ్యాలంకారచూడామణి ప్రభృతి కావ్యేతరలక్షణగ్రంథములు సైతము తత్తద్గ్రంథకర్తలచే గావ్యభాష తోనె రచింపఁబడి యుండుటం జేసి యంతటను సల్లక్షణభాషయె ప్రయోజ్యమని

ప్రాచీనాంధ్రపండితుల సిద్ధాంతమని విశదమగుచున్నది. (నారచించిన బాలసరస్వతీయ టీక. ౧౮-౨౩ విష) (వై-పా- ౧౦-౨౭-౨౮ విష.)

సిద్ధి రిత్యాది:—సిద్ధిః=ఆంధ్రసాధుశబ్దముల సిద్ధి, లోకాత్=పండితలోక వ్యవహారమువలన, దృశ్యా=గ్రహింపఁదగినది. అనవ్యాదృశః=వేఱువిధముకాని దనఁగా నేకరూపమున నుండునదియు, నిత్యశ్చ=స్థిరపడినదియు నగు, లోకవ్యవహారమే యని, లోకః=మీఁడి సూత్రములోఁ జెప్పఁబడిన లోకశబ్దముచే గ్రహింపనగును. వ్యావహారికభాష దేశకాలాది భేదములవలనను, వక్తల ముఖయంత్రాదుల భేదమువలనను వారివారి జ్ఞానభేదమువలనను నుచ్చారణ సౌలభ్యాపేక్షాదికము వలనను వివిధములగు మార్పులను సదా పొందుచుండును. కావున నట్టి వ్యావహారికభాషలోఁ బండితవ్యవహారములం దేకరూపమున నంతటను స్థిరపడి పండితకవీంద్రులచే నాదరింపఁబడిన భాష గ్రంథరచనా యోగ్యమని గ్రహింపవలయును. నియమః=వ్యాకరణము, సంస్కారార్థః=పైని వ్రాసినరీతిని బండితకవీంద్రావృత భాషాస్వరూపమును నిరూపించుట యను సంస్కారమే ప్రయోజనముగాఁ గల దగుచున్నది.

యత్తు = ఏది, అపభ్రంశః = అపభ్రంశ మని పండితులచేఁ జెప్పఁబడునో, తత్ = అట్టి, గ్రామ్యమ్ = గ్రామ్యభాష, అనియమాత్ = పయిని వ్రాసిన వ్యాకరణసంస్కారము లేకుండుటచే విస్తరించును. లోకవ్యవహారమునుండి యేర్పడిన పండితకవీంద్రాదృత భాష సాకల్యముగను, నిస్సంశయముగను, సామాన్యులచే గ్రహింపఁబడుట యశక్యమగుటచే నట్టివారికిని నూతనాభ్యాసకులకును గ్రంథప్రయోగయోగ్య భాష నుపదేశించునట్టి యసాధారణపండిత రచిత వ్యాకరణము లేనిచో గ్రంథములం దపభ్రంశాపరనామక గ్రామ్యము వ్యాపించునని తాత్పర్యము. లక్షణవిరుద్ధ మగుభాష గ్రామ్యమని ఫలితార్థము. ఉదా: వస్తాడు - తెస్తాడు - మొ.

నన్నయా.
౧ IV విష.

సన్మూలవత్త్వాద్రూఢత్వా ద్గృహీతత్వాచ్చ సాధుభిః,
నాపభ్రంశత్వ మేతస్య నియమాభావతస్తు తత్,
నివారణాయ తస్యైవ ప్రవృత్తి ర్విదుషా మభూత్,
తదర్థ మేవహి వయం భూయసా ప్రయతామహే,
గ్రామ్యతా పరిహారేణ హితా స్యా చ్ఛబ్దకల్పనా,
కవితోపాశ్రితం దోషం నైవ కిఞ్చి త్సహామహే.
(వికృ-సంజ్ఞా ౧-౨-3 కా. అహో. ౧౦౫ పుట.)

శ్లో. ౧ IV విష:—"అస్యా శ్చ సంస్కృతా దస్య దపభ్రంశత యోచిత"మ్మను సంస్కృతప్రాకృతేతర గ్రామ్యభాషేతరములగు భాషలెల్ల నపభ్రంశములె యని చెప్పరాదు. ఈ యాంధ్రభాషలోని సంస్కృతా త్తను దానిచే వ్యాకరణసంస్కార సంస్కారమును బొందినందున నపభ్రంశత మనిపించుకొనునని గ్రహింపవలెను. ఈవిష యమునే యథర్వణుడు సత్కావ్యలక్ష్యత్వా దిత్యాదిచే వివరించుచున్నాఁడు. సత్కావ్యలే క్ష్యత్వాత్=పండితకవీంద్ర ప్రయోగములును బండితకవీంద్రోపదేశములును మూలములుగాఁగలవగుటవలనను, రూఢత్వాత్=మహాకావ్య పండితకవీంద్ర వ్యవహార ములందుఁ బ్రసిద్ధమయియున్నవగుటవలనను, సాధుభిః=శిష్టులచే, గృహీతత్వాచ్చ=ఆద రింపఁబడినవగుటవలనను, ఏతస్య-ఈయాంధ్ర గ్రాంథికభాషకు, అపభ్రంశత్వమ్=గ్రామ్యత, న=లేదు. తత్ = ఆయపభ్రష్టత, నియమాభావతస్తు=పండితకవీంద్ర ప్రయోగ మూలక వ్యాకరణసంస్కారాభావమువలన నైనచో సంభవించును. తస్యైవ=అట్టియపశబ్దత యొక్కరే, నివారణాయ=వారించుటకు, విదుషామ్=పాణిని వాల్మీకి నన్నయాదుల, ప్రవృత్తిః=లక్షణరచనావ్యాపారము, అభూత్=ఆయెను. తదర్థమేవహి=అందులకే కదా, వయమ్=అస్మదాదులమును, భూయసా=అధికముగా, ప్రయతామహే= ప్రయత్నించుచున్నాము. కవితోపాశ్రితమ్=కవికృతుల నాశ్రయించిన, దోషమ్= చ్యుతసంస్కృతిదోషమును, కిఞ్చిదపి=ఇంచుకేనియు, నసహామహే=సహింపఁజాలము గ్రామ్యతా పరిహారేణ=గ్రామ్యదోషము లేకుండఁగా, శబ్దకల్పనా=శబ్దరచనము, హితాస్యాత్=సమ్మతమగును.

ఇటఁ జెప్పఁబడిన గ్రామ్యశబ్దము చ్యుతసంస్కృత్యపరనామ కాపశబ్ద పర్యాయమనియు నాలంకారికులచేఁ జెప్పఁబడిన గ్రామ్యతాశ్లీలతాది పరము కాదనియు గ్రహింపవలయును.

ఆలంకారిక గ్రామ్యత:—కామం సర్వోప్యలఙ్కారో రస మర్థే నిషిఞ్చతు। తథాప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా॥ కన్యే కామయమానం మాం త్వం న కామయసే కథమ్। ఇతి గ్రామ్యోఽయ మర్థాత్మా వైరస్యాయైవ కల్పతే॥ కామం కన్దర్పచణ్డాలో మయి వామాక్షి నిర్దయః। త్వయి నిర్మత్సరో దిష్ట్యే త్యగ్రా మ్యోఽర్థో రసావహః॥ శబ్దేఽపి గ్రామ్యతాఽస్త్యేవ సా సభ్యేతరకీర్తనాత్, యథా యకారాదిపదం, రత్యుత్సవ నిరూపణే। పదసన్ధానవృత్త్యా వా వాక్యార్థ త్వేన వా పునః, దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యా భవతః ప్రియా. (యభు మైథునే) నిష్ఠ్యూతోద్గీర్ణ వాన్తాది గౌణవృత్తి వ్యాపాశ్రయాత్, అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్షాం విగాహతే. (కావ్యాదర్శము). (వై-పా-౨౧ మొ-౩౬ వ-విష).

నన్నయాథ ౧ V విష.

ఆద్యా మహార్హా సా మూలం, సర్వస్యేతి నిగద్యతే,
తదనుక్తస్య కార్యస్య, వక్తా భవతి పాణినిః, శ్రుతే౽
పశబ్దే చోక్తేవా, ప్రమాదాత్ పాణినిం స్మరేత్,
అథవా ఫణినా మీశం, చిన్తయే ద్బహుశో బుధః,
ప్రాకృతే షడ్విధే చాపి, వాల్మీకింవా మహేశ్వరమ్,
ధ్యాయే దత్రతు నావేవ, స్మరే త్పణ్డితసత్తమః.
(వికృ-సంజ్ఞా-౪-౫-౬ కారి. అహో. ౧౦౭-౧౨౦ పు).

కల్ప. V విష:—ఆద్యేత్యాది :—ఆద్యా = సంస్కృతభాష, మహార్హా = మిక్కిలిపూజ్యమైనది. సా = ఆగీర్వాణభాష, సర్వస్య = భారతదేశములోని సర్వభాషలకును, మూలమ్ = ప్రకృతియై యున్నది. ఇతి = అని, నిగద్యతే = చెప్పఁబడుచున్నది. తత్ = ఆకారణమునవలన, అనుక్తస్య కార్యస్య = వికృతిభాషావ్యాకరణములలోఁ జెప్పఁబడనట్టి వ్యాకరణకార్యములకెల్ల, పాణినిః=ప్రకృతిభూతసంస్కృతమున కనుశాసనముచేసిన పాణినిముని, వక్తా = ఉపదేశకుఁ డగుచున్నాఁడు. అట్లగుటచేత సంస్కృతభాషయందు, అపశబ్దే = అపశబ్దము, ప్రమాదాత్ = పొరపాటువలన, స్మృతే = స్మరింపఁబడినను, (వినుటచేతననిభావము) ఉక్తే = పలుకఁబడినను, పాణినిమ్ = పాణినిమునిని, స్మరేత్ = స్మరింపవలెను. అథవా = లేదా, ఫణినామీశమ్ = పతంజలిని, బహుశః = పలుసారులు, బుధః = వివేకి, చిన్తయేత్ = స్మరింపనగును. షడ్విధేప్రాకృతే = మహారాష్ట్ర్యాది షడ్విధప్రాకృతములయందును నపశబ్దము స్మృతమైనను బల్కఁబడినను, మహేశ్వరమ్ = ప్రాకృతవ్యాకర్తయగు నీశ్వరునిగాని లేదా, వాల్మీకిమ్ = వాల్మీకిమహర్షినిగాని, ధ్యాయేత్ = ధ్యానింపవలెను. అత్రతు = ఈయాంధ్రభాషయం దపశబ్దము స్మృతమయినను వచింపఁబడినను, నావేవ = మాయిద్దఱనే, నన్నయాథర్వణుల ననిభావము. పణ్డితసత్తమః = వివేకి, స్మరేత్ = స్మరింపవలయును. "మామేవ స్మరే"త్తను పాఠము చింతామణి వికృతివివేక గ్రంథముల సంబంధము నెఱుంగని లేఖకాదులచేఁ బ్రక్షిప్తము కానోపును. తత్తద్వ్యాకర్తల స్మరణముమూలమున గుణదోషవివేచనశక్తి యావేశించి సాధుశబ్దస్ఫూర్తి కల్గునని తాత్పర్యము. గ్రంథకర్తృస్మరణమె సాధుశబ్దజ్ఞానజనక మగునపుడు వ్యాకరణపఠనఫలము చెప్పెడిదేమి యని కైముత్యన్యాయమున విశద మగుచున్నది.
(వై-పా-3౭-౪3-౪౪-విష.)

సన్నరూ ౧ VI విష.

ఆద్య ప్రకృతిః ప్రకృతి, శ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః, కేవలతయానుసర్ప, త్యుభేచ యేయం యథాతథం భాషా. (ఆం-చిం-౪ కారి. అహో. ౧౧౭ పు.)

కల్ప-౧ VI విష:—ఆద్యప్రకృతిః = ఆద్యప్రకృతియగుసంస్కృతభాషయు, ప్రకృతిశ్చ=ద్వితీయప్రకృతియగుషడ్విధ ప్రాకృతభాషయు, ఆద్యే=తెల్గునకు మొదటివి. ప్రకృతిభూతము లనియర్థము. ఏషా=ఈయాంధ్రభాష, తయోః=ఆరెండిటికిని, వికృతిః=వికృతి, భవేత్=అగును. యేయంభాషా=వికృతి యనఁబడుచున్న యీయాంధ్ర భాష, కేవలతయా=పార్థక్యముతో నుండియు, (వేఱుగ నేర్పడియు) ఉభేచ=ఆసంస్కృత ప్రాకృతములను, యథాతథమ్=యథేచ్ఛముగా ననఁగా యథార్థ్యముగా, అనుసర్పతి=అనుసరించివర్తిల్లుచున్నది.

ఇచటి ప్రకృతివికృతిభావము జన్యజనకభావరూపము కాదు. ఇంక "ప్రకృతివద్వికృతిః" అను మీమాంసా న్యాయమునఁ దోఁచు ప్రకృతివికృతిభావ మని గ్రహింపవలయును. కావుననే యాంధ్రశబ్దరూప సాధనవిషయమునఁ బ్రకృతులగు సంస్కృతప్రాకృతభాషల వ్యాకరణములందుఁ జెప్పఁబడిన పెక్కు వ్యాకరణకార్యములును, సంజ్ఞాదికమును, నీతెలుఁగునఁ జెప్పఁబడలేదనియు నట్టి యనుక్తవిషయము లెల్ల నీప్రకృతిభూత సంస్కృతప్రాకృతభాషల వ్యాకరణములనుండి తెలిసికొనవలయు ననియు గ్రహింపవలయును. ఈవిషయమునే యథర్వణాచార్యుఁడు "తదనుక్తస్య కార్యస్య, వక్తాభవతిపాణినిః" అనువాక్యముచే(౧ V విష) విశదీకరించియున్నాఁడు. వికృతియజ్ఞ విశేష విషయముల నుపదేశించి ప్రకృతియజ్ఞ సామాన్య విషయములను "శేషం ప్రకృతివత్" అని వచించుట మీమాంసా సంప్రదాయము కదా. అట్లే సంస్కృతోక్తములగు కృత్తద్ధిత సమాసాదుల్లును సుప్తిజ్ఞుల్లును (మహత స్సోర్ధ జనితో భవేత్పుంసీత్యాది సందర్భములందు వాడఁబడినవి. లట్ లిట్ ప్రభృతిసంజ్ఞలును, నాదిగాఁగల సంస్కృతవ్యాకరణోక్త విషయము లాంధ్ర వ్యాకర ణానుక్తములై తెలుఁగువ్యాకరణములలో నుపయోగించుకొనఁబడుచున్నవి. అట్లే "స స్సమాసః (౧-౧-౭) మిదన్త్యే" "ద్వివచనస్య బహువచనమ్" (౨-3-3౪) (షడ్భాషాచంద్రిక) మున్నగు ప్రాకృతవ్యాకర ణోక్త విషయము లనుక్తము లగుచుఁ దెలుఁగువ్యాకరణములలో నుపయోగించుకొనఁబడుచున్నవి, అట్లే "శ్రీ = సిరీ" మున్నగుచోట్లఁ గల్గిన వైకృతవిశేషము లాంధ్ర వ్యాకర ణానుక్తము లగుచుఁ బ్రాకృతవ్యాకరణములనుండి గ్రహింపఁబడుచున్నవి.

"వికృతిత్వవ్యపదేశాత్, ప్రకృతివ ద్వికృతి రితిన్యాయే నాను క్తస్య కార్యస్యాత్ర తాభ్యాం ప్రాప్తి రిత్యాచా ర్యాశయః, తేన "హల న్త్యమ్" "సానునాసికోచ్చారణం జిత్" ఇత్యాదికార్యం ప్రవర్తతే. ఇమ మర్థం సూచయితు మేవ తత్ర తత్ర సుమ్ సుసాది వ్యవహారో లభ్యత ఇతి జ్ఞేయమ్" (అహో. ౧౨౦ పు.) ఇట్లగుటంజేసి "ఏషా తయో ర్భవే ద్వికృతిః" అనుసూత్రముచే నన్నయ సంస్కృతప్రాకృతములతోఁ దెలుంగునకు జన్యజనకభావము నంగీకరించెననియు, ద్రావిడభాషా కుటుంబము వేఱుకుటుంబ మగుటచే నట్లువచించుట పొరపాటనియు వచించు కొందఱు పాశ్చాత్యభాషా పండితులమాటలు కేవలము సత్యవిదూరము లని యెఱుంగునది. "ప్రకృతిద్వయజా తజ్జా, తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా" అని యిట్లు తత్సమ తద్భవములకు మాత్రమే సంస్కృత ; ప్రాకృత మూలకత్వమును వచించి "ప్రవాహినీ దేశ్యా" యని దేశ్యమునకు స్వాతంత్రతను వక్కాణించిన నన్నయ భట్టారకుఁ డాంధ్రదేశ్యమునకును సంస్కృతప్రాకృతజన్యత్వము నంగీకరించె ననుట యుక్తమా? (వై-పా ౩౮ మొ ౪౪ వ-విష) "దేశ్య మార్షంచ రూఢత్వా। త్స్వ తన్త్రత్వాచ్చ భూయసా। లక్ష్మనాపేక్షతే తస్య। సంప్రదాయోహి బోధకః ॥ దేశ్య మవ్యుత్పత్తిమత్త్వా। త్ప్రాకృతత్వేన కథ్యతే॥" (అహో. ౧౨౮ పు.) అనుచొప్పున దేశ్యమును సయితము ప్రాకృతమని వ్యవహరించుటయుఁ గలదు. "ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము కాన" (కావ్యాలం-౯ ఉల్లా-౮ ప) (వై-పా-౪౧ మొ ౪౨ వ విషయ)

నన్నయా ౧-VII విషయ

శాస్త్ర మపౌరుష మాద్యం, ప్రాయిక నిత్య ప్రయోగ
లక్ష్మ తత్, దృశ్య మతిస్థవిరం య, జ్జ్ఞాత్వా శబ్దః
ప్రయుక్త ఆర్షసమః. (ఆం-చిం-సంజ్ఞా-౫ కారి.అహో.
౧౧౯ పు.)

కల్ప-౧ VII విష:—ఆంధ్రభాషకే కాక ప్రాకృతభాషకును బ్రకృతి యగు సంస్కృతభాషకుఁ గల పాణినీయాదివ్యాకరణములు మిక్కిలి విస్తృతములగుటంజేసి యట్టిభాషనుండి వచ్చు సంస్కృతసమాదుల ప్రాతిపదికముల రూపసాధనాదిప్రక్రియఁ జెప్పినచో గ్రంథమున కత్యంతవిస్తృతి పునరుక్తియు సంభవించునని తలంచి గ్రంథకర్త తెల్గువ్యాకరణము నభ్యసింపఁగోరువారు పాణినీయాదులను ముందుగ నభ్యసింపవలసినదే యని చెప్పుచున్నాఁడు:—అపౌరుషమ్=పురుషసామాన్యకర్తృకముకాక, పాణిన్యాది ఋషిప్రోక్త మగునట్టియు (లేదా, అపౌరుషేయముగా నంగీకరింపఁబడుచున్నట్టియు) ప్రాయిక నిత్య ప్రయోగలక్ష్మ = ప్రాయికములు - నిత్యములు మున్నుగాఁగల విధుల లక్షణములు గల్గినట్టియు (కవిప్రయోగములనుబట్టి ప్రాయికతా

నిత్యతా పాక్షికతాదులను సామాన్యులకు గ్రహింపశక్యముకాదు. అట్టివివేచనముసు మహాసమర్థులగు పండితకవీంద్రులే చేయవలయుననని భావము.) అతిస్థవిరమ్ = మిక్కిలిప్రాచీనమైనట్టియు, ఏతత్ - ఆద్యమ్ - శాస్త్రమ్ = ఈసంస్కృతవ్యాకరణశాస్త్రము, దృశ్యమ్ = ఆంధ్రవ్యాకరణజిజ్ఞాసువులకు ముందుగఁ దెలిసికొనఁదగినది. యత్ = ఏసంస్కృతవ్యాకరణమును, జ్ఞాత్వా = తెలిసికొని, ప్రయుక్తః = ప్రయోగింపఁబడిన, శబ్దః = శబ్దము, ఆర్షసమః=ఋషిప్రయోగమువలెఁ బ్రామాణికమగుచున్నదో యట్టిదానిని నభ్యసింపవలెనని పూర్వవాక్యముతో నన్వయించుకొనునది.

భట్టారకుఁడు సంస్కృతసమశబ్దముల రూపసాధనము సంస్కృతప్రకృతులను మూలముగాఁ గొని చేయఁదలఁచి యున్నాఁడుగాన నట్టి సంస్కృతప్రకృతుల వ్యుత్పత్త్యాదికము సంస్కృతవ్యాకరణ జ్ఞానము లేక సంభవింపనేరదని చెప్పుట సుప్రసక్తమగుచున్నది. ప్రాకృతవ్యాకరణ సాధ్యశబ్దములెల్ల సంస్కృతశబ్దములవలెఁ దెల్గునఁ బ్రవేశించుట సంప్రదాయముకాదు గావున వానిని దేశ్యములనువలెనే పండితలోక వ్యవహారమువలనఁ దెలిసికొన నగునని తాత్పర్యము.

ఇట్టి ప్రసక్తి నరయక బాలసరస్వతి యీకారికను జింతామణిలోఁ జేర్పక యుపేక్షించెను. అహోబలపండితుఁడును నక్లేచేసినను దీనిని దనవ్యాఖ్యలోఁ జూపి యున్నాఁడు. "శాస్త్ర మపౌరుష మాద్యం। ప్రాయిక నిత్యప్రయోగ లక్ష్మైతత్। దృశ్య మతిస్థవిరం య। జ్జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః॥ ఇతి క్వచిత్ పుస్తకే సరస్వతీకర లిఖితఏవ శబ్దానుశాసన ప్రణీతత్వేన పద్యం స్థితమ్॥" (అహో. ౧౧౯ పు.) "ప్రాలమ్బక నిత్య ప్రయోగ లక్ష్మేతి" కవిశిరోభూషణపాఠము ఛందోభంగ దూషితముగాన లేఖకాది ప్రమాద ప్రక్షిప్త మనఁదగును. (వై-పా. ౪౫-౪౬-౪౭-విష.)

వర్ణలోపాగమా నైకే, సర్వస్మిం స్తద్భవే పదే, భిన్న
త్వం యుక్తవర్ణస్య, లోపాదేశాగమా స్తథా. తద్భ
వే సంస్కృతీయే స్యు, రాదేశాద్యా స్తథాన్యతః,
స్యా ద్వర్ణస్య వ్యత్యయశ్చ, కుత్రచి త్కవిసమ్మతః.
(వికృ-సంజ్ఞా ౭-౮ కారి-అహో-౧౭౩-పు.)

సన్నయా శర్వణీయము. ౧-VIII విషయము.

కుత్రచి చ్ఛబ్దభేదేషు, భవే త్పర్యస్త లిఙ్గతా. (వికృ-అజం-౬౨-కా. అహో-౩౪౭-పు.)

కథిత స్తద్భవస్యాపి, దీర్ఘాన్తత్వం క్వచి ద్భవేత్.
(వికృ-సంజ్ఞా-౨౮-కారి-అహో-౧౬౯-౩౦౩-పు.)

క్వచిదాద్యస్య శబ్దస్య, వికారే త్వన్యవాచ్యతా.
(వికృ-అజం-౬౨-కారి-అహో-౩౪౮-పు.)

కల్ప-౧ VIII విష:—తత్సమశబ్దవిషయమును బ్రసంగించిన యనంతరమునఁ దద్భవముల వికారములను వివరించుచున్నాఁడు. వర్ణలోపేత్యాది:—సర్వస్మిన్ = సర్వవిధములుగల, తద్భవేపదే = తద్భవపదమునందును, నైకే = అనేకవిధములగు, (దీని కీక్రింది వాక్యత్రయమునందును నన్వయము.) వర్ణలోపాగమాః = వర్ణలోప వర్ణాగమవర్ణాదేశములు, భవన్తి = అగుచున్నది. వర్ణలోపాది వికారములు గల్గు చుండఁగా నాకారమందును నర్థమందును బ్రకృతిశబ్దముతోడ బలమైన పోలికగల్గి యుండుట తద్భవశబ్దములకు ముఖ్యలక్షణమని తాత్పర్యము. ఉదా: ప్ర-సప్త=వి-సత, ఇట వర్ణలోపము. ప్ర- రథః = వి - అరదము, ఇట 'అ'కార వర్ణాగమము. థకార మునకు దకారాదేశము. ప్ర - రాజా=వి-రాజే, ప్ర - మఞ్చః=వి-మంచేము,' రాజు' అను తత్సమరూపమునకుఁ దద్భవరూపము 'రాజే' అనునది. ఇటుఁ దత్సమత్వమునఁ దాలవ్యజకారము. తద్భవత్వమునదంత్యజకారము. 'మంచము' అను తత్సమమునకు 'మంచేము' అను తద్భవమునందును దంత్యతాలవ్య చకార వ్యత్యాసముమాత్రమే కల్గినది. సంస్కృతములోని వర్గపంచమ ఞకార మనుస్వార మగుట తద్భవలక్షణము కాదు. అట్టి మార్పు తత్సమమందే కల్గును. పై సందర్భమునుబట్టి యాకారమందుఁ గాని యర్థమునందుఁగాని యేదేని వికృతి తద్భవములకు లేనిచోఁ దద్భవత్వ మంగీకార్యము కాదని గ్రహింపవలయును. యుక్తవర్ణస్య = హల్సంయోగముగల వర్ణమునకు, భిన్నత్వమ్ = వికర్షమును, తథా = ఆప్రకారముగానె, లోపాదేశా గమాః = వర్ణలోపవర్ణాదేశవర్ణాగమములును, స్యుః = అగుచున్నవి. ఉదా: ప్ర- చన్ద్రః - (తత్స) చంద్రుఁడు = (వి) చేందురుఁడు, (ప్ర) - శ్రీః = (తత్స) శ్రీ = (వి) సిరి. ప్ర - రత్నమ్ = తత్స - రత్నము = (వి) రతనము. అన్యతః = స్థలాంతరము లందు, కుత్రచిత్ = కాదాచిత్కముగ, సంస్కృతీయే = సంస్కృతప్రకృతికమగు, తద్భవే = తద్భవశబ్దమునందు, వ్యత్యయశ్చ = వర్ణములు తార్మాఱుగుటయు, కవి సమ్మతః = కవిసమ్మతము, స్యాత్ = అగును; తథా = ఆవిధముగనే యట్టివ్యత్యయ స్థలములందును, ఆదేశాద్యాః = వర్ణాదేశవర్ణలోపవర్ణాగమాదులును, స్యుః = యథాసంభవముగ నగును. ఉదా:—(ప్ర) పారావతః = (తత్స) పారావతము = (వి) పావురము, పారువము. దేశ్యములందును నిట్టి వికృతులు గల్గును. వార్వము = (వి) వావురము - వారువము. ఏడు+పది=డెబ్బది మొ.

కుత్రచిత్ - శబ్దభేదేషు = కొన్నిశబ్దవిశేషములందును, పర్యస్తలిఙ్గతా = పుల్లింగాదులవ్యత్యాసము, భవేత్ = అగును. ప్ర - ఈర్ష్యా = (తత్స) ఈర్ష్య = (తద్భ) = ఈరసము. సం. వీటికా = తత్స - వీటిక = (తద్భ) వీడియము = వీడ్యము.

ఈసూత్రము నిట సమన్వయింప నక్కఱలేదు. "తద్భవే సంస్కృతీయే స్యు, రాదేశావ్యా॥" అనుదానిచేతనే యిట్టివియు సాధ్యములగును. (చూ-౧౬౮-౧౭౩-విష.)

కథిత ఇత్యాదిః—"తద్భవస్యాపి శబ్దస్య, దీర్ఘాన్తత్వం క్వచి ద్భవేత్" అని దీనికిఁ బాఠాంతరము గలదు. (అహో-303-పు-విక్ర-అజం-30-కారి) తద్భవస్య = తద్భవశబ్దమునకు, దీర్ఘాన్తత్వంచ = హ్రస్వమురాక దీర్ఘము నిల్చుటయు, క్వచిత్ = ఒకానొకచో, కథితః = కవులచేఁ బలుకఁబడుచున్నది. ఉదా:—సం - పల్యఙ్కికా = తత్స - పల్యంకిక = (తద్భ) పల్లకి = పల్లకీ. పల్లకీలు నం|దలములు—(కళా-౨ ఆ-శ-౮) ఇది సంస్కృతమే యని కొంద ఱందురు. కాని ప్రామాణిక సంస్కృతకోశములం దెచ్చటను నీశబ్దము చూపట్టలేదు. వృథా = వితా = విత - ము.

క్వచిత్ = ఒకప్పుడు, ఆద్యస్య - శబ్దస్య = సంస్కృతశబ్దమునకు, వికారే = తద్భవత్వమున, అన్యవాచ్యతా = అన్యార్థకత్వ మనఁగా నర్థమం దొకవిధమగు మార్పును, గల్గును. ఉదా: సం - గౌరవమ్ = తత్స - గౌరవము =(పూజ్యత) తద్భ - గారవము = (ప్రేమ) సం - కన్యకా = తత్స - కన్యక = (అవివాహిత.) తద్భ - కన్య = లేఁత - చిన్న - కన్యకలను = చిన్నయుద్ధము. (రాఘవ-౧ ఆ)

ఇట "వర్ణలోపాగమా నేకే" (అహో-౧౭3 పు) మున్నగునపపాఠములు కవిశిరోభూషణమున లేఖకాది ప్రమాదమునఁ బడియున్నవి. విస్తరభీతిచే వానిని విమర్శింప నైతిని.

తద్భవశబ్దములందలి వికారముల యోపసాధనప్రక్రియ యప్పకవీయ కవిసంశయవిచ్ఛే దాదులలోఁ గొంత వివరింపబడెను. గ్రంథవిస్తరభీతి నీటఁ జూపలేదు. వై-పా ౮౮ ము ౧౮౦-వ విషయములు).

విరళానాం వేచోపాదిక, శబ్దానాం ప్రవ్యాహారస్తు
సన్నతా శబ్దజ్ఞాః, ఇహాతు ప్రవ్యాహార్యార, సఙ్కేతిత సుప్ర
ఆ IX అః సిద్ధ మేవ పదమ్. (తెర - చిర - సంజ్ఞా ౧౯ కారి -
అహో ౧౭3 పు).

కల్ప ౧ IX విష:—కౌశవ్యాకరణాదిసమ్మత సంస్కృత శబ్దములకెల్లఁ దెలుఁగువిభక్తులను జేర్చి తత్సమములుగ వాడనగు నన్నవిషయము ప్రాయికాభిప్రాయమనియు, నందు—సుంకేతిత సుప్రసిద్ధ శబ్దములనుమాత్రమే యోరర్ధమున వాడవలయు ననియు నిరూపించుచున్నాఁడు. విరళానాం = సంస్కృతమునఁ బ్రచుర ప్రయోగము లేని యప్రసిద్ధములగు, వేచోపాదికశబ్దానాం = "వేచ - ఊష"-అనునవి

యిత్యాదిగాఁగల శబ్దములను, శబ్దజ్ఞాః=సంస్కృతశబ్దశాస్త్రపండితులు, ప్రత్యాహార స్తు= ప్రయోగముల వ్యవహరింతురుగాక, ఇహాతు = ఈయాంధ్రభాషయందన్ననో, సర్వ్యాలిత సుప్రసిద్ధమైన పదమ్ = వివక్షితార్థబోధన శక్తిమంతమగు సుప్రసిద్ధ శబ్దముమాత్రమే, ప్రత్యాహార్యమ్ = ప్రయోగముల వ్యవహరింపవలయును, కోశవ్యాకరణాది సమ్మతములయినను సంస్కృతములోని మాఱుమూల శబ్దముల నాంధ్రకావ్యములందు వ్యవహరింపరాదని తాత్పర్యము. వ్యాకరణాది సమ్మతములగు "పేచ - ఊష" అనునవి మొదలగు మాఱుమూల శబ్దము లప్రయుక్త దోషదూషితములు. కావని సంస్కృతవ్యాకరణ మహాభాష్యకర్త వచించుటచే (త్రి-వి-ప-౧౩ విషు) నట్లు సంస్కృతశబ్దశాస్త్రజ్ఞు లప్రసిద్ధశబ్దములను బ్రయోగించుట కంగీకరించినను నంగీకరింతురుగాక; ఆంధ్రమహాకావ్యములలో మాత్రము ధ్వనిరసస్ఫూర్తిప్రతిబంధకములగు నప్రసిద్ధశబ్దములను బ్రయోగింపరాదని నన్నయభట్టారకుఁడు నియమించెను. ఆంధ్రమహాకావ్యవాఙ్మయము లేని తనకాలమున నట్టి మహాకావ్యవాఙ్మయవత్త్వావస్థ నాంధ్రభాషకు సంఘటింపనెంచి సంస్కృతభాషనుండి శబ్దములను గ్రహించువిషయమునఁ బయినియమ మావశ్యకమని భట్టారకుఁడు తలంచెను.

నన్నయాథర్వణీయము, ౧ X పద.

సర్వే శబ్దాః ప్రయోక్తవ్యా, యది దోషవివర్జితాః,
అప్రయుక్తత్వ దోషస్తు, న విరుద్ధో హారే ర్మతే.
శాస్త్ర ప్రయోగ వచసోః, శాస్త్రం బలవ దుచ్యతే,
అనిష్పన్నే పదే తేన, ప్రయోగాశ్రయణం హితమ్.
(విక్రు-సంజ్ఞా-౩౦-౩౧-కారి-అహో-౧౭౬-పు.)

కల్ప ౧ X విషః—పయిరీతిని బ్రథమాచార్యుఁడు నియమించినను క్రమక్రమముగ నాంధ్రమహాకావ్య వాఙ్మయము విస్తరించిన కాలమునాఁడగు ద్వితీయాచార్యుఁ డాంధ్రమహాకావ్యములం దట్టి యప్రసిద్ధ సంస్కృతశబ్దములనే కాక సంస్కృతవ్యాకరణసాధ్య కృతకసంస్కృతశబ్దములను నైత మరసినవాఁడగుట చేత సంస్కృతకోశవ్యాకరణాది సమ్మతశబ్దములనెల్లఁ బ్రాయికముగఁ బ్రయోగింపనగు ననియు, నింకను సంస్కృతవ్యాకరణ మహాకవిప్రయోగములకు విరోధము కన్పట్టినపుడు సంస్కృతవ్యాకరణమునకే ప్రామాణ్య మొసంగవలయుననియు "వ్యుత్పన్న మితి గౌడీయై। ర్నాతిరూఢ మపీష్యతే" (కావ్యాదర్శము) "స్యాతా మదోషౌ శ్లేషాదౌ। నిహతార్థాప్రయుక్తతే" (సాహిత్యదర్పణము) అనునవి యాదిగాఁగల సంస్కృతాలంకారిక వచనములను సర్వానీనవైయాకరణాశయములను ననుసరించి

యి ట్లుపదేశించుచున్నాఁడు. సర్వే శబ్దా ఇత్యాదిః—దోషవివర్జితాయది = చ్యుత సంస్కారదోషములేనియెడల, సర్వేశబ్దాః = సంస్కృతములోని సమస్తశబ్దములును, ప్రయోక్తవ్యాః = ప్రాయికముగఁబ్రయోగింపఁదగినవె, అప్రయుక్తత్వ దోషస్తు= కవిప్రయుక్తముకానిది ప్రయోజ్యము కాదనెడి యాలంకారికదోషము, హారేర్మతే = హారిపండితునిమతమున, నవిరుద్ధః = విరుద్ధముకాదు. మఱియు, శాస్త్ర ప్రయోగవచసోః = సంస్కృత వ్యాకరణ కవి ప్రయోగములలో, శాస్త్రమ్ = సంస్కృత వ్యాకరణమే, బలవత్ = బలవత్తరమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. తేన – ఆ వ్యాకరణముచేత, అనిష్పన్నేపదే = నిష్పన్నముకాని శబ్దమువిషయమున, ప్రయోగాశ్రయణమ్=కవిప్రయోగముల నాశ్రయించుట, హితమ్=సమ్మతమైనది. సంస్కృత వ్యాకరణవిరుద్ధము కానపుడె కవిప్రయోగమునకుఁ బ్రామాణ్య మని భావము. ఈవిషయము లాచ్ఛికశబ్దములపట్టున నుపచరింపవు.

పైరీతి నున్న నన్నయాథర్వణుల యభిప్రాయములను గ్రహింపక యహోబలపండిత అప్పకవ్యాదులు "శాస్త్రప్రయోగవచసో" రిత్యాది ప్రకృతాథర్వణ కారిక లాచ్ఛికశబ్దవిషయమునను వచింపఁబడిన వనుకొనుచు నాంధ్రవ్యాకరణములకు మహాకవిప్రయోగములకన్న నెక్కుడుప్రామాణ్య మొసఁగి యీక్రిందిరీతిని వ్రాయుట పొరపాటు:—"పనిఁగొంట నీకుఁ బ్రాభవముకాదె" ఇత్యాది శ్రీనాథ వచనస్య ప్రామాదికత్వ మేవే త్యవధేయమ్" (అహో-౪౯౯-పు) "సుతులఁ గని యెదుకొలకు" "నీవు ఘటించుకంటె" ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాది వచనానాం కిమ్మూల మితి వయం న విద్మః" (అహో-౫౦౦-పు).

క. విరచించెను శ్రీనాథుఁడు। ధరణిని శృంగారనైషధంబునఁ గూర్పం
డిరి యెుండొరునని కానక। పరపురుషక్రియలఁ బ్రకృతిభావము కలదే.
(అప్పక-౪-ఆ.) (చిం-వి-పరి-౨౦-మొ-౨౫-వ-విష.)(వై-పా-౨౨-మొ-౨౬-వ-విష.)

పై సందర్భము సరికాదు. వ్యాకరణమునకుఁ గవిప్రయోగమునకంటె నధిక ప్రామాణ్య మొసఁగుట సంస్కృతశబ్దవిషయమునందుమాత్రమే యని యథర్వణాశయము నెన్నవలెను. ఆంధ్రవ్యాకృతులు మహాకవిప్రయోగ మూలకములని గ్రహింపవలెను.

బాలవ్యాకరణ
వివరణము.

శ్రీ హయగ్రీవాయ నమః.

## సంజీవనీ వ్యాఖ్య

సంజీ ౧-XI విష:—శ్రీహయగ్రీవాయ = శ్రీహయగ్రీవమూర్తికొఱకు, నమః = నమస్కారము. పీ.........బ్రహ్మ సకలసృష్టి। కాదిభూతములుగ వేదము

ల్నాలుగుఁ గలిగింప (భా-శాంతి-౬-ఆ-౪౭౮) వానిని మధుకైటభాసురు లపహరించి పాతాళమున నడఁగించుటంజేసి బ్రహ్మచేఁ బ్రార్థితుండయి శ్రీమహావిష్ణువు హయగ్రీవమూర్తిని ధరించి యారక్కసుల వంచించి యవ్వేదములం దెచ్చి విధాతకొసంగఁ బ్రపంచసృష్టి సాగె ననెడి భారతగాథ ననుసరించి గ్రంథకర్త యాంధ్ర వాఙ్మయాభిభూత పంచమవేద భారతాంధ్రభాషా స్వరూపమును గాపాడి యాంధ్రలోకమున వెలయించుటకయి బాలవ్యాకరణమును రచింప నారంభించి గ్రంథాదిని జేసిన హయగ్రీవ నమస్కారరూప మంగళాచరణము సాహూతముగ (వి<u>స్తర</u>) మున్న దనఁదగును.

---

విస్తరము ౧ XI విష:—బాలవ్యాకరణ మవతరించునాఁటి కాంధ్రభాష చాలదుఃస్థితికి రానారంభించెను. అది గద్యరచనారంభకాల మగుటంజేసి వ్యావహారికాంధ్రభాషావాసనలు పండితరచనలలోను చదికి భారతముద్రణములలోను నెలకొనసాగెను. రసోదంచిత కావ్యరచనమునకు సయితము వ్యావహారికాంధ్రమే యుపయోగింపఁదగుననెడి యభిప్రాయము తలచూపసాగెను. అపండితులగు లేఖకపాఠకాదుల మూలమున మహాప్రబంధములలోఁ బడిన వ్యావహారికరూపములు ప్రాచీనమహాకావ్యముల ముద్రణములలో నెలయఁబొడఁగెను. అట్టియెడల బాలవ్యాకణమే యవతరించి యుండనిచోఁ బ్రాచీనాంధ్రభాషాస్వరూప మీపాటికి కడు గంటి యుండెడిది. పయివిషయముల కీక్రింది బాలకవిశరణ్యాపంక్తులే నిదర్శనము లనఁదగును. "చిన్నయ సూరిగారు పుట్టకమునుపే తెలుగుబడులు తెలుగువ్యాకరణాలు పుట్టినవి. ఆబడులలో తెలుగు చెప్పినవారున్ను అప్పటివ్యాకరణాలు వ్రాసినవారున్ను ఆయనవంటి పండితులు కాకపోలేదు. చన్నపట్ణమందున్న గవర్నమెంటు పాఠశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా నున్న రావిపాటి గురుమూర్తిశాస్త్రులుగారు వ్యావహారికభాషలో 1819 సం॥న విక్రమార్కచరిత్రమున్ను 1834 వ సం॥న పంచతంత్రమున్ను 1836 వ సం॥న వ్యాకరణమున్ను వ్రాసినారు. ఆవ్యాకరణమున్ను ఆపంచతంత్రమున్ను చాలాకాలము బడులలో వాడుకగా చదువుకొనేవారు. ఉదయగిరి శేషయ్యగారి వ్యాకరణము 1857వ సంవత్సరమున వ్యావహారికభాషలోనే వ్రాసియున్నది...కాంబిల్ బ్రౌను మొదలయిన ఇంగ్లీషువారు తెలుగుపండితులవద్ద నేర్చుకొని ఇంగ్లీషుభాషలో తెలుగులక్షణము వ్రాసినారు...రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి వ్యాకరణము (1836సం. సూత్రము 147) కూఁతురు శబ్దమునకు ఏతటము (అంగము) కూఁతు, కూఁతురి. ప్రథమాబహువచనము - కూఁతురులు, కూఁతుండ్లు, కూఁతుళ్లు- కూఁతులు." (బాలక - ౩౧ - ౩౨ పుటలు.)

బాలవ్యాకరణ వివరణము. ౨ విషయ.

## బాలవ్యాకరణము.

సంజ్ఞేపని ౨ విష:—బాలవ్యాకరణము = గ్రహణధారణపటువులగు (విస్తర) వలనా గురువునుండికాని గ్రంథమునుండికాని శాస్త్రవిషయములను గ్రహించుట యందును నట్టివిషయములను ధారణచేయుటయందును సమర్థులగు విద్యార్థులకు శబ్దశాస్త్రము నుపదేశించుగ్రంథము. "విశేషేణ ఆక్రియన్తే వ్యుత్పాద్యన్తేశబ్దా అనేన" (శబ్దార్థచిం) అని వ్యాకరణశబ్ద వ్యుత్పత్తిని గ్రహింపవలెను.

---

విస్తర I-౨ విషయము:—"గ్రహణ ధారణ పటు ర్బాలః" (తర్కసంగ్రహము) బాలవ్యాకరణశబ్దములోని బాలశబ్ద మప్రౌఢార్థక మని తలంపఁజేయు చున్న ప్రౌఢవ్యాకరణ మనుపేరు సమర్థముగాదు. సూత్రరచనాపద్ధతినిబట్టియు శాస్త్రవిషయములనుబట్టియుఁ ద్రిలింగలక్షణశేషముకన్న బాలవ్యాకరణమే ప్రౌఢతర మనుటలో విప్రతిపత్తి యుండనేరదు. మఱియు నద్దాని నామాంతరమగు "త్రిలింగలక్షణశేషము" అనునదియు ననుపపన్నమె యనఁదగియున్నది. చింతామణి బాలవ్యాకరణములందు సంగ్రహింపఁబడని కొన్ని ప్రయోగవిశేషములు త్రిలింగ లక్షణశేషమునఁ జూపఁబడినవి. కొన్నియెడలఁ జింతామణి బాలవ్యాకరణ సూత్రములు సవరింపఁబడినవి. కాని త్రిలింగభాషాలక్షణములే యగు వికృతివివేకాదుల లోని విశేషములే యిందుఁ బునరుక్తములై యున్నవి. ఇంతియకాక చింతామణి బాలవ్యాకరణములలో లేనట్టియు వికృతివివే కాహోబలపండితీయాదులలో నుపదే శింపఁబడినట్టియు ననేకవిషయము లిందు సంగ్రహింపఁబడలేదు. మఱియు భారతాది ప్రాచీనాంధ్రవాఙ్మయస్థ ప్రయోగవిశేషములు–వికృతివివేకాదులలో సంగ్రహింపఁ బడనివి–పెక్కు లిందును సంగ్రహింపఁబడలేదు. దిఙ్మాత్రముగ నుదాహరించెద:— "దీర్ఘః స్యా ద్వర్ణనిర్దేశే" (వికృ-అజం-౮౭ కా.) "ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు" (ప్రౌఢ-సంజ్ఞా-3 సూ.) "ఏకత్వే సస్యవాచిత్వం। బహుత్వే ధాన్యవాచితా" (వికృ-అజం-౬౭ కా.) "సస్యవాచకంబులును. . ." (ప్రౌఢ-శబ్ద ౨౫-3౭ సూ.).

"జ్ఞానముంబట్టి ముక్తుఁడు" (బా-కార-౧౭ సూ.) అని బాలవ్యాకరణకర్త యుదాహరించియు "పట్టి" పరమగునప్పటి ద్రుతాగమము నుపదేశింప మఱచెను త్రిలింగలక్షణశేషమునందును నయ్యది సంగ్రహింపఁబడలేదు. అట్టిద్రుతాగమ మథర్వణునిచేఁ జిరకాలముక్రిందట నుపదేశింపఁబడియే యున్నది. "పరుషే సరళే చైవ ప్రమాణే ను ముతో భవేత్।అద్రుతా త్స్వరసా దందు, పట్టి కూర్చి విభక్తిషు" (అథ-సంధి-౨3 కా).

విస్తర II-౨ విష:—"క. ఆమ్నాయముల పర్వములలో। నామానుష్యుఁడు నుడువు తెలుఁగు లగఁనికొని కృతుల్। దాము రచించిరి తిక్కనసు। ధీమణి మొదలైన తొంటి తెనుఁగుకవీంద్రుల్॥" (అప్ప-౧-ఆ-౪౭ ప) అనుచొప్పున నన్నయభట్టారకునికిఁ దర్వాతివారు నన్నయభారతభాషను జాలవఱకనుసరించుచునే వచ్చిరి. అట్లే యుత్తరోత్తరులు పూర్వపూర్వ మహాకవుల భాషాప్రయోగపద్ధతులను బ్రాయికముగా ననుసరించుచుండెడివారు. ఉత్తరోత్తరమహాకవులు పూర్వపూర్వమహాప్రబంధముల భాషాపద్ధతులలో నలంతి సవరణము లెచ్చటనేనిఁ జేసినఁజేసిరే కాని సాధారణముగా వాని ననుసరించుచునే వచ్చిరి. మహాకవుల కావ్యములభాషకు లక్షణము ప్రాయఁ దలంచువా రట్టి మహాప్రబంధముల నెల్ల సావధానముగఁ జదివి యాయా విషయములనెల్ల నేర్చి కూర్పవలయును. ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్ట విరచితమను నమ్మకముతో నద్దానిని మూలముగాఁ జేసికొని సూరి బాలవ్యాకరణమును రచించెను. చింతామణి ప్రాయికముగాఁ దత్సమశబ్ద స్వరూపనిరూపణ ప్రవణమగుటంజేసి యందు సంగ్రహింపఁబడని యాంధ్రభాషాలక్షణములు పెక్కు. వికృతివివేకమను నామాంతరముగల యథర్వణకారికావళి పూరించుచున్నది. అట్టి కారికావళి నుదాహరించుచు రచించిన యహోబలపండితీయమును నట్టి కారికావళి టీకయగు కవిజనమండనమును గొంతవఱకుఁ బరిశీలించి సూరి వలయువిషయములను వానినుండి సేకరించి బాలవ్యాకరణము రచించెను. కాని వానిలోని విషయములను సూరి సాకల్యముగా సంగ్రహింపఁడయ్యెను. కావుననే బాలవ్యాకరణ మాంధ్రభాషకు విస్తృతలక్షణ మనిపించుకొనదయ్యెను. ఇందు లేని పెక్కువిషయములను సంగ్రహించు ప్రౌఢవ్యాకరణమే యిందులకు నిదర్శన మగుచున్నది. సూరియు నిట్లు వచించెను. "ఆ. వె. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల। క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య। ములను లాఁతి లక్ష్యములఁ గాంచి తక్కుల। క్షణ మెఱింగి కొనుఁడు చతురమతులు॥" (బాల-పీఠిక) "రేఫంబులు లఘ్వలఘువులుం దక్కం గల విశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు" (బాల-ప్రకీ-౨౫ సూ).

విస్తర III-విష ౨:—అహోబలపండితీ యాథర్వణ కారికావ ళ్యాదులలో నంగీకరింపఁబడిన కొన్ని విషయములను సైతము సూరి కొన్నియెడల సాధువులుగా నంగీకరింపకుండుటయుఁ గలదు. "బహుళగ్రహణముచే స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు......సంస్కృతీయంబునకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి. కాని దానికిఁ బూర్వకావ్యములందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు.

గం గానకాఽి-నెలం ఱచ్చెను" (బా-సంధి - ౪ సూ-విన) అథర్వణునినాడును పత్స మూనావంధి గలవని సూరి యవయంజాలండయ్యెను. (ఉ I విష) అదియట్లుండ నాను క్తమాల్యాహాపి మహాకావ్యములందలి ప్రయోగములను నథర్వణాచార్యోప దేశములను గవిత్రయమువారికి సమ్మతములు కావని తోఁచుటచేఁ గావలయుఁ బ్రమా ణీకరింపలేదు. ఇట్లే యథర్వణాచార్యుఁడును విన్నకోట పెద్దిరాజును "నూఁతు" శబ్ద ముక ద్వైకత్వమున నంతటను రువర్ణాగమము పాక్షికమని చెప్పియున్నను భారత మునం దట్టిప్రయోగము లెచ్చటను లేమింజేసి "నూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది." (బా-ఆచ్ఛి-౯-సూ) అని సూరి యట్టి రూపము లను నిరసించెను.

క్రీ॥ శ॥ ౧౩౫౦ సంవత్సరమునకుఁ దర్వాతి కావ్యములలోఁ బ్రవేశించి యున్నను నన్యదేశ్యశబ్దములు చింతామణి భారతములకు సమ్మతములు కావని తలఁచి కావలయు సూరి దేశ్యభాషానిరూపణసందర్భమున వాని నుదాహరింపలేదు.

"చ. ఈ। చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్" (మను-౨ ఆ-౧౧) "చ. అ। న్నినదముకన్నఁ దిన్ననయి" (వసు-౨-ఆ-౫౮) "క. ఊ। హించ నోకనాల్గు గడియల। సంచారము నలయు" (కళా-౩-ఆ-౫౯) ఇట్లు మహాకవి ప్రయుక్తములయ యున్నను, 'వల్ల, కన్న' అను విభక్తిప్రత్యయములు పత్వా భావము మున్నగునవి చింతామణియం దనుక్తములును భారతాది ప్రాచీన తమ మహాప్రబంధముల కెక్కనివియు నగుటచేఁ గాఁబోలును సూరిచే నంగీకరింపఁబడ లేదు. భారతచింతామణివిరుద్ధములు కావని తనకుఁ దోఁచునపుడు మాత్రమే యితర మహాకవుల ప్రయోగములను నథర్వణా దీతర వైయాకరణవచనములను సూరి ప్రమాణీకరించుచుండును. "అనుకృతిని సిడుదకుఁ గుఱుచ యగునని యొకండు పలికె, నది నిరాకరంబు." "దుర్బలస్య బలం రాజా యన వినవె" (మను-౪-ఆ-౭౪) (బా-సంధి-౫౪-సూ) సిడుదకుం గుఱుచ యగునన్న హాఁ డప్పకవి. క-ఖ్యాతిగ 'న హారేస్తు పర। స్త్రాత' యనుట దెలిసి కృతిమొదలఁ దలఁచి వేసన్" (అప్ప-౧-ఆ-పీఠిక- ౧౭-ప) పయిరీతుల నరయఁగా సూరి చింతామణి భారత ప్రయోగములనే ప్రాయిక ముగ మూలముఁ జేసికొని బాలవ్యాకరణమును రచింప నెంచెనని తోఁచుచున్నది. కాని ప్రథమ ప్రయత్న మగుటచేతను నోపికయుఁ గాలమును జాల కుండుటచేతను (అనుబంధ) నేదోయొకరీతి నప్పటికిఁ బ్రామాణికాంధ్రభాషా సామాన్యస్వరూపము

అనుబంధము - విస్తర III విషయ ౨:—సూరిగారు చరమావస్థలో ననా

బాలవ్యాకరణ
వివృతి. 3 విష.　　సంజ్ఞా పరిచ్ఛేదము.

సంజీవని 3 విషయము:—సంజ్ఞా పరిచ్ఛేదము = బాలవ్యాకరణవిషయముల నుపదేశించుటలో నుపయోగించు కొన్ని సామాన్యవిషయములు సంకేతములు న్యాయములు మున్నగువానిని విశదీకరించు గ్రంథభాగము. (విస్తర) ఈ సంజ్ఞా పరిచ్ఛేద విషయములు గ్రంథమధ్యమందును నాయా సందర్భములలో విశదీకరింపఁ బడుటయుఁ గలదు. "జిత్తు బిందుపూర్వకం బగు" (బా-తత్స-౧౯-సూ) "కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు" (బా-క్రియా-౫౦-సూ-విష).

దిక్ప్రదర్శితముగనైనఁ జూపినం జాలునని తనకుఁ దోఁచుటచేతఁ గావలయు భారత ప్రయోగములలోని లక్షణవిశేషములే యనేకములు సూరిచే బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడఁజాలవయ్యెను. ఇంతియకాక సూరి చింతామణి నర్థము చేసికొను టలోఁ జింతామణి వ్యాఖ్యలగు బాలసరస్వతీ యాహోబలపండితీయములను నాధారముగఁ గొనుచు వచ్చుటంజేసి తద్వ్యాఖ్యాద్వయస్థ ప్రమాదములకుఁ బెక్కిటికిఁ బాల్పడుచు వచ్చెను. ఈవిషయ మాయా సూత్రముల టీకల సందర్భము లలో విశదపడఁగలదు. భారతప్రయోగముల పద్ధతులను సైతము సూరిగారు కూలంకషముగా స్పృశించిన ట్లగపడమికిఁ గసడదవాదేశ బాహుళికవిధానమే నిదర్శన మనఁదగును. (౭౭-విష).

విస్తరము 3 విషయము:—"పేరులనుగుఱించి చెప్పుభాగము సంజ్ఞాపరిచ్ఛేదము" (బా-గు-ప్ర) "పేరులకు సంబంధించిన గ్రంథభాగము సంజ్ఞాపరిచ్ఛేదము" (బా-సా-పే) అనువ్యాఖ్యలు సరికావు. బాలవ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదములోనియేవో యలంతిసూత్రములు పేరులను సంబంధించియున్నను నాపరిచ్ఛేదములోని విషయము లనేకము లట్టివికావు. "సంస్కృతమునకు వర్ణము లేఁబది" (బా-సంజ్ఞా-౧-సూ.) "దీర్ఘముమీఁద సాథ్యపూర్ణము లేదు" (బా-సంజ్ఞా-౧౫-సూ) "యకారంబును వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదట లేవు" (బా-సంజ్ఞా-౧౭-సూ) "ఆర్యవ్యవహారంబుల దృష్టంబులు గ్రాహ్యంబులు" (బా-సంజ్ఞా-౨3-సూ) మొ.

రోగ్యదశలో నుండి బాలవ్యాకృతిని ముద్రింపించి యుందు రని తోఁచెడిని. క్రీ॥ శ॥ ౧౮౫౮ డిసెంబరు బాలవ్యాకరణ ప్రథమముద్రణ సమయము. క్రీ॥ శ॥ ౧౮౬౧ సంవత్సరమున రాచపుండుపీడ. ౧౮౬౨ సంవత్సరమున వీరు స్వర్గస్థులైరి.

సంజీవని ౨ విషయము:—సంస్కృత ప్రాకృత వ్యాకరణ ప్రసిద్ధవిషయము లిందుఁ బ్రాయికముగా విడువఁబడును. ఆంధ్రవ్యాకరణ విద్యార్థి సంస్కృతప్రాకృత వ్యాకరణజ్ఞాన కలితుఁడయియె యుండవలయు నను చింతామణి హృదయము (౧-VII విష) సూరికిని నభిప్రేతమె యని గ్రహింపవలెను.

చింతామణిలోని యజంత హలంత పరిచ్ఛేదవిషయము లిందుఁ దత్సమాచ్ఛిక కారక సమాస తద్ధిత పరిచ్ఛేదములుగఁ జాలవఱకు సంస్కృత వ్యాకరణపద్ధతి (సిద్ధాంతకౌముదిపద్ధతి) ననుసరించి వివరింపఁబడినవి. చింతామణిలోని క్రియాపరిచ్ఛేద విషయము లిందుఁ గ్రియా కృదంత పరిచ్ఛేదములుగ నేర్పఱుపఁబడెను. ఇందలి ప్రకీర్ణపరిచ్ఛేదము తక్కినపరిచ్ఛేదముల నెల్ల సంబంధించునదియై యున్నది.

నన్నయా థర్వణీయము. ౫ విషయము.

ఆద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః (ఆం - చిం - సంజ్ఞా - ౫ కారి-అహో-౧౩౨-పు).

కల్పతరు ౫ విష:—ఆద్యాయాః = కావ్యసంస్కృతభాషకు, వర్ణాః = వర్ణసమామ్నాయము, పఞ్చాశత్ = ఏఁబది.

బాలవ్యాకరణ వివరణము. ౫ I విషయము.

సంస్కృతభాషకు వర్ణంబు లేఁబది ౧ - అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః; క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న - ప-ఫ-బ-భ-మ; య-ర-ల-వ; శ-ష-స-హ-ళ. ఇం దకారాదు లచ్చులు. కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది. (అచ్ + హల్ = అజ్ఝల్).

సంజీవని ౫ I విష:—ప్రాచీనతమ కాలమున నార్యుల వాడుకలో నున్న భాష సంస్కరింపఁబడి శిష్టులచే వాడఁబడెడిదై సంస్కృతమను పేరఁ బరఁగెను. దీని స్వరూపమునే పాణినీయము విశదీకరించుచున్నది. ఇట్టి శిష్టవ్యవహారభాషనే కొన్ని మార్పులతో మహాకవులు కావ్యములందు వాడఁగా నది కావ్యసంస్కృత భాష యనఁబడినది. ఈ ట్లీ రెండిటికిని జాలభేద మున్నను నర్వాచీను లట్టి భేదమును గణించుటగాని యట్టి మహాకావ్యభాష లక్షణములను బరిశీలించి వేఱుచూపుటగాని జరుగలేదు. ఇంతియకాక పాణినీయమునె రెండిటికిని లక్షణముగా నెంచుచుఁ (చిం-వి-పు-౭౬-౮౦-౮౭-వి) బాణినీయమునకు లొంగని మహాకవిప్రయోగము

లసాధువు లనుచు సోఢవ్యము లనుచు నట్టివాని నితరులు ప్రయోగింపరాదనుచు వచించుచున్నారు. ప్రాకృతాంధ్రములకన్నఁ దొల్లిటి వాఙ్మయము కలదగుటచే నాంధ్రవైయాకరణులు సంస్కృతము నాద్యయని వ్యవహరింతురు.

శిక్షా ప్రాతిశాఖ్యాది వేదవ్యాకరణములలో "త్రిషష్టి శ్చతుష్షష్టి ర్వా। వర్ణాః శమ్భుమతే మతాః" (పాణిని శిక్ష. వై-పా-౨౩౭-౨౭౭-విష) అనుచొప్పున గీర్వాణభాషా వర్ణసమామ్నాయ మధికసంఖ్యాక మగుటంజేసియు శిష్టవ్యవహారస్థ లౌకికసంస్కృత వర్ణసమామ్నాయమునందును ప్లుతాక్షరపరిగణన ముండుటం జేసియు నాంధ్రభాషోపయోగి మహాకావ్య సంస్కృతభాష కేఁబదియే వర్ణసమామ్నాయమని విశదపఱుచుట కీసూత్ర మారంభింపఁబడెను. తత్సమ తద్భవ ప్రకృతుల వర్ణముల జ్ఞానమును నావశ్యకమే యగుటంజేసి సంస్కృతప్రాకృత వర్ణసమామ్నాయ వివరణ మావశ్యకమే యనఁదగును.

సంజీవని ౫ II విష:—అచ్చు లనఁగా స్వరములు (విస్తర I) వీనిని బ్రాణము లనియు వాడుదురు. హల్లు లనఁగా వ్యంజనములు. వీనిని బ్రాణి లనియు వ్యవహరింతురు.

'అ - ఇ - ఉ - ఋ - ఌ' అనునవి హ్రస్వాచ్చులు. 'ఆ - ఈ - ఊ - ౠ - ౡ - ఏ - ఐ - ఓ - ఔ' అనునవి దీర్ఘాచ్చులు. (విస్తర-II). అనుస్వార విసర్గముల నుభయ

విస్తరము I-౫ II విష:—అచ్-'హల్' అనునవి సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధములగు ప్రత్యాహారములు. "అ ఇ ఉణ్-ఋ ఌ క్-ఏ ఓ ఙ్ - ఐ ఔ చ్; హ య వ రట్ - ల ణ్ - ఞ మ ఙ ణ న మ్ - ఝ భ ఞ్ - ఘ ఢ ధ ష్ - జ బ గ డ ద శ్ - ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ - క ప య్ - శ ష స ర్ - హ ల్" అనునవి పదునాల్గును మాహేశ్వరసూత్రములు. అనఁగా మహేశ్వరుఁడు పాణినిమునికిఁ బ్రసాదించినవి. ఈసూత్రములతుది హల్లులు 'ఇద్వర్ణములు.' పూర్వపూర్వసూత్రములలోని యేవర్ణమైనను నట్టి యిద్వర్ణముతో జోడించినచో నది తనకును మధ్యవర్ణములకును సంజ్ఞ యగుచుండును. దానికే ప్రత్యాహార మనిపేరు. అట్లేర్పడినవే 'అచ్ - హల్' అను ప్రత్యాహారములు. (సి-కౌ-బాలమ-౧-౨-సూ)

విస్తర II - ౫ II విష:—హ్రస్వాచ్చును బల్కుట కొక 'మాత్ర' కాలము పట్టును. ఒకసెకెండులో (౧/౫) నయిదవభాగపు కాల మొకమాత్ర, "నిమేషైస్సప్తవింశత్యా। కాలో గుర్వక్షర స్తతః" (సూర్యసిద్ధాంతము.) దీర్ఘాచ్చును బల్కుటకు రెండుమాత్రల కాలము పట్టును. మూఁడుమాత్రల కాలమందును

పొల్లు లుభయములు కావు. అనఁగా వీనియందు స్వరధర్మములును వ్యంజనధర్మములును గలసి యున్నవని. (విస్తర III). స్వరమే యక్షరము. వ్యంజన మక్షరాంగము. (విస్తర IV).

---

ఒకటికంటె నెక్కువ కాలమునందును బలుకుస్వరము ప్లుత మని సంస్కృతవైయాకరణులు చెప్పిరి. మాత్రలో సగము కాలమునఁ బొల్లుహల్లు పల్కఁబడును. "ఏకమాత్రో భవే ద్ధ్రస్వో, ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే। త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో, వ్యఞ్జనం త్వర్ధమాత్రకమ్॥"

ప్లుతస్వరము త్రిమాత్రిక మని తెల్పుటకయి దానిప్రక్కను '3' అను త్రిసంఖ్య నిల్పఁబడును. ఉదా: రామ 3. రమే 3. మొ. తెల్గున దీర్ఘమే ప్లుత స్థలములందును వాడఁబడును. (౧౩౮—౧౪౧ విష) ప్లుతస్వరమును ప్రాకృతవైయాకరణులు సైత ముపేక్షించిరి. తెల్గున ద్విత్వమందే బహుత్వ మంగీకరింపఁబడును గాన త్రిమాత్రిక ప్లుతస్థలములందును ద్విమాత్రికదీర్ఘమే వాడఁబడును.

విస్తర III-విష ౫-II:—హల్లులమీఁద స్వరము నిల్చినట్లు వీనిమీఁద నిలువదు. ఇది స్వరధర్మము. హల్లులవలెనె యివియు నచ్చుల సాహాయ్యము లేక పలుకఁబడవు. ఇది వ్యంజనధర్మము. ఇట్లివి యుభయము లగుటచేతనే మాతృకాపాఠములో స్వరవ్యంజనముల నడుమ నిల్పఁబడినవి. "అచః స్వయం విరాజన్తే హలస్తు (హలః=హల్లులు. 'హల్' అనునది ముగ్ధబోధవ్యాకరణ సంజ్ఞ) పర మాత్రికాః" (ముగ్ధ-౨౦ సూ-వ్యాఖ్య) "అనుస్వార విసర్గ జిహ్వామూలీ యోపధ్మానీయానా మకారోపరి శర్షుచ పాఠ స్యోపసంఖ్యాతత్వేన" (సి-కౌ)

విస్తర IV-విష ౫-II:—"ఉభయే త్వక్షరాణి" (ఉభయే=హ్రస్వదీర్ఘస్వరములు) "అనుస్వారో వ్యఞ్జనం చాక్షరాఙ్గమ్" (ఋగ్వేద ప్రా. ౧ పటల) (వై-పా-౧౪౪-౧౪౫-౨౧౨ విష) పయి సందర్భమునుబట్టి "క్-చ్ మొదలగునవి మాత్ర లనఁబడును. మాత్రయనఁగా నక్షరావయవము." (ఆం - భా - అ - సంజ్ఞా - ౧౬ ప్రథమముద్రణము) అను వాక్యములు ప్రామాదికములు. అనుశాసనతృతీయ ముద్రణమున నవి తొలఁగింపఁబడుట ప్రశంసనీయము. "క్ - చ్" మొదలగు వ్యంజనము లర్ధమాత్రికములు గాన మాత్రలు కానేరవు. మాత్ర స్వరమే యగును గాన నది యక్షరము. అక్షరాంగ మెంతమాత్రము కానేరదు. హల్లు లక్షరావయవములు.

సంజీవని ౬ విష:— ఆంధ్రమహాకావ్య రచన పఠనాది సందర్భములందును గృతిప్రద్ధానాది సందర్భములందును మాతృకాపూజాదిక మావశ్యక మనెడి ఛంద శ్శాస్త్రసంప్రదాయ మాంధ్రమహాకావ్యవాఙ్మ యోపయోగి కావున నద్దాని ననుస రించి 'ౡ' కారము నంగీకరించి సంస్కృత వర్ణసమామ్నాయము పంచాశ త్సంఖ్యా కమని యాంధ్రవైయాకరణులు చెప్పిరి. అట్లు కానిచో నాంధ్రమహాకావ్యోపయోగి సంస్కృతమున నెచ్చటను గన్పట్టని 'ౡ' కారము నంగీకరింపవలసిన ప్రసక్తి యేము న్నది? "సాహిత్యరత్నాకరే—శ్లో-ప్రభూ నుద్దిశ్య పద్యంవా । ప్రబన్ధంవా కదా చన । న వక్తవ్యం న వక్తవ్యం । మాతృకా పూజనం వినా" (అప్ప. ౨ ఆ. ౩౮౯)

మాతృకాపూజ చేయునపుడు వాగ్దేవత యాకారమును లిఖించి యందుఁ బంచాశ ద్వర్ణములను నిల్పవలయునని సంప్రదాయము. "సీ—అద్వాయ మాదల యాఘాల మిద్వాయి...ఌ వర్ణద్వంద్వ ముభయదంత చ్ఛదములు । తే-గీ... । ఏ వధూమణి కట్టి వాగ్దేవిఁ గొలుతు" (అప్ప. ౨ ఆ. ౩౯౩) మతాంతరము "ఌం నమో దక్షిణగణ్డే ౡం నమో వామగణ్డే" (వర్ణోద్ధారణ తంత్రము-శబ్దకల్పద్రుమ కోశము-'ౡ' శబ్దము.)

సంజీవని ౭ విష:— అనంతామాత్యుఁడు ళకారమును విడిచి క్షకారమును జేర్చి పంచాశత్సంఖ్యను బూరించెను. (విస్తరI-II) కాని క్షకారము కషసంయోగ రూపమగుచుఁ బూర్వాక్షరమునకు గురుత్వము నొదవించుచున్నది-కాన నది ప్రత్యే కాక్షరము కానేరదు. కావుననే ధాతుపాఠమున రక్షాదిధాతువులును నామ లింగానుశాసన నానార్థవర్గములో "ప్రేక్షా"ది శబ్దములును షాంతశబ్ద సందర్భమునఁ జేర్పఁబడినవి.

---

విస్తర 1-౭ విష:—అనంతామాత్యుఁ డాగమశాస్త్రము ననుసరించి క్షకార మును జేర్చినను ళకారమును వీడుట వింత. ఆగమశాస్త్రమున ళకారము నైతము చేర్పఁబడినది. కావుననె యం దేకపంచాశ ద్వర్ణము లంగీకరింపఁబడెను.

"అక్షరమాలా-స్త్రీ-అకారాది క్షకారాన్తః అక్షః-తత్కృతా తత్ప్రతినిధిభూ తావా మాలా (శాంత) ఏకపఞ్చాశ ద్వర్ణమాలాయామ్. తత్ప్రతినిధిభూతాయాం స్ఫటికాదిగ్రథితాయాం బాహ్యామాలాయాంచ.—విభ్రాన్త మచ్ఛ స్ఫటికాక్షమాల యేతి మాఘః-తద్వివరణమ్:—క్రమోత్క్రమగతే మాలా । మాతృకార్ణే సమేరుకే (అర్ణః=వర్ణః) లావసానై స్స్పష్టవర్గై । రన్తర్యజనకర్మణీతి సనత్కుమారీయే ." (వాచస్పత్యము) పదునారచ్చు లొకవర్గము.। ఇరువదిరెండుస్పర్శము లైదువర్గములు.

సంజీవని ౮ విష:— సంస్కృత వర్ణసమామ్నాయమున సూరిచేఁ జూపఁబడిన 'ళ' కారము 'ఈళే' 'హేళా'ద్యాది శబ్దగత వర్ణమని యంగీకరింపనగును. ప్రాచీనకాలమున నిట్టి ళకారముచోట "ఴ" అను వర్ణముండెడిది. అది డకారముయొక్క యీషత్ స్పృష్టోచ్చారణము గల్గి యుండెడిది. "Pleasure" అను నాంగ్లశబ్దములోని "ష" కారమును జాలవఱకుఁ బోలిన ధ్వనిగల్గి యుండెడిది. ఇయ్యది తమిళమున నేఁటికిని నిల్చియున్నది. తమిళులు దీనిని "ழ" అను రీతిని లిఖింతురు. ప్రాచీనాంధ్రమునను నిది యుండెడిది. యుద్ధమల్లుని బెజవాడశాసనమునందే కాక ద్వితీయ కులోత్తుంగ-చోళుని పొందువ గ్రామ శాసనమునందును గలదు. ఇది యాకాలములోని యాంధ్రకర్ణాట సాధారణలిపిలో "ఴ" అను రీతిని లిఖింపఁబడియున్నది. దీనిని భట్టారకుఁడు చింతామణిలోని సంస్కృత వర్ణసమామ్నాయపు పంచాశ ద్వర్ణములలో నుద్దేశించి యుండును. కాలక్రమమున నిది తెలుఁగున నంతరించి ద్రావిడ మూర్ధన్య ళకారము వంటి ధ్వనిగలదిగఁ గొన్ని శబ్దములందును, డకారముగఁ గొన్ని శబ్దములందును, బరిణమించినది.

సంజీవని ౯ విష:—శిక్షా ప్రాతిశాఖ్యాదుల నాఁటికి లేనట్టియుఁ దర్వాతి సంస్కృతమున నవతరించినట్టియు ముకుళ- గోళ- గరళాది శబ్దగతమగు నలఘు దంత్యలకారధ్వని మఱియొకటి నన్నయనాఁటికె వెలసి యుండెను. అయ్యదియుఁ గాలక్రమమునఁ బయినివ్రాసిన ద్రావిడమూర్ధన్య ళకారధ్వనితోనె (గయ్యాళి-త్రుళ్ళు మున్నగువాని లోనిది) యుచ్చరింపఁబడుచు దానిలిపితోనె గుఱితింపఁబడుచున్నది. కాని ముకుళాది శబ్దములలోనిది దంత్యలకారస్థానికమె యగుటం

---

అంతస్థోష్మము లెనిమిదియు రెండువర్గములు. "ళ - క్ష" అను రెండును గలిపి యేఁబదియొకటి వర్ణములు. దీనినిబట్టి యంతర్యాగ కర్మమునం దేఁబదియొక్క పూసల జపమాల నుపయోగింపవలె నని విశదమగుచున్నది.

విస్తర II-౨ విష:—క్షకారోచ్చారణమున నుండఁదగిన (Section) "సెక్షన్" అనుదానిలోని 'క్ష్' అనుదానివంటి యుచ్చారణము మాఱి విలక్షణమగు మిశ్రధ్వని ప్రసిద్ధమైయున్నది. మఱియు "వచ్చెన్+క్షత్రియుఁడు=వచ్చెక్షత్రియుఁడు" మున్నగు చోటులందు సరళాదేశము రాదు. అంతియకాక స్థిరపరకత్వమునందువలెనె క్షకార పరకత్వమున ద్రుతలోపము కల్గును. ఇట్లు క్షకారోచ్చారణమునఁ గొంత వైలక్షణ్య మగపడుచున్నను దానిని నొక పృథగ్వర్ణముగ నెన్నరాదు. అది కషల సంయోగముగా నుండుటచేతనే సూరి యనంతామాత్యపద్ధతిచొప్పున దానిని వర్ణసమామ్నాయమున నొక ప్రత్యేకవర్ణముగ నెన్నకుండుటయె లెస్స యనఁదగును.

జేసియు (విస్తర I·II·III) లఘ్వలఘువులకుఁ బృథగ్గణనము చింతామణికర్తకును సూరికిని మాత్రమె కాక సంస్కృతప్రాకృత వైయాకరణుల కెవ్వరికిని సమ్మతము కాకుండుటం జేసియు నట్టి ముసుళాదిశబ్దగతమగు నలఘులకారము సూరిచే సంస్కృత వర్ణసమామ్నాయములోని ళకారముగ నుద్దేశింపఁబడలే దనుటకు సందేహము లేదు.

---

విస్తర I·౯ విషః—"నాన్యేషాం వైధర్మ్యం, లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అను చింతామణికారికనుబట్టి తెలుఁగున య-ర-ల-వ-లు నాల్గిటికిని లఘ్వలఘుతారూప ద్వైవిధ్యము కలదనకతీరదు. లఘ్వలఘువులగు రేఫ అకారములకును లఘ్వలఘువులగు యవలకును వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము చేయని చింతామణికర్తయుఁ దదనుయాయి సూరియు సంస్కృత వర్ణసమామ్నాయమునందును నచ్చాంధ్ర వర్ణసమామ్నాయమునందును వర్ణాంతరముగఁ బేర్కొన్న ళకారము నలఘులకారముగఁ దలంచిరని చెప్పుటకు వలనుపడదుగదా. కాన వర్ణసమామ్నాయ గత ళకారభిన్నమగు నలఘు లకారము నెద్దానినేని పయి "లఘువోలఘువశ్చేతీ"త్యాదికారికలోఁ జింతామణికర్త యుద్దేశించెనని యంగీకరింపక తీరదు. డకారస్థానిక మగుటచే మూర్ధన్య మనఁదగిన హేళనాదిశబ్దగత (హేడన=హేలన=హేళన) ళకారము నలఘుదంత్యలకార మనరాదు. ఇంక దంత్యలకారస్థానిక మగుటచేత దంత్యమేయై యలఘూచ్చారణమాత్ర విశేషముగల ముసుళాది శబ్దగత ళకారము నలఘుదంత్య లకార మనుట యుక్తము. ఇట్టి యభిప్రాయము తోడనే సూరి చింతామణ్యనుసారముగ నచ్చాంధ్ర వర్ణసమామ్నాయగత గయ్యాళిప్రభృతి శబ్దస్థ మూర్ధన్య ద్రావిడ ళకార మలఘులకారము కాదనియుఁ దద్భిన్నమై దంత్య రేఫ (వై-పా-౯ ౮౩ విష) లకారస్థానికమగు "ఏళులు, పాళులు" మున్నగు శబ్దములలోని సాధ్యళకార మలఘులకారమనియుఁ గంఠోక్తముగఁ జెప్పెను. (బా-సంజ్ఞా-౧౮-సూ-అచ్చు ౧౩ సూ) త్రాళ్ళు మున్నగువానిలోని ళకారమును జింతామణికర్త సాధింపలేదు. అచట "త్రాడ్లు" అనురూపమె యాకాలమునఁ బ్రసిద్ధమై యుండెడిది. చింతామణియు నట్టిరూపమునె సాధించుచున్నది. (చిం-వి-ప-౩౩ విష). తర్వాతికాలమున మహాకవిసమ్మతమై యేర్పడిన 'త్రాళ్ళు' మున్నగుశబ్దములందలి ళకారము డకారస్థానికమైనను నది "ఏళ్ళు-పాళ్ళు" మున్నగు చోటులందువలెనె బహువచన లకారనిమిత్తకమై దానితో నేకరూపత నందినదై (వైకృతానాం లుకి భవే ల్లడయో రేకరూపతా) (౧౯౯ విష) వెలసిన దగుటం జేసి తత్సమానన్యాయమున నలఘులకారముగ సూరిచేఁ బేర్కొనఁబడెను.

లకారమునకు ద్వైవిధ్యము సంస్కృతవ్యాకరణములలోఁ జెప్పఁబడ లేదు.

ప్రాకృతవ్యాకరణములందు మాత్రమె చెప్పఁబడినది. "లోళః"(3-౨-౪౮)...ముకు లోళముకుళో,...(షడ్భా ౧౮౮ పు) ఇదియే "అన్యైన్యవ్యాకరణ స్పష్టాః" అను చింతామణికారికచే నుద్దేశింపఁబడె ననుటకు సందేహము లేదు. అట్టి పైశాచీ ప్రాకృతసంపర్కముచేతనే సంస్కృతములోని ముకుళాదిశబ్దగత లకారమున కల ఘూచ్చారణవిశేషము కల్గెననియు నట్టి ప్రాకృత ళకారమును వలెనె యీసంస్కృత ళకారమును నైత మలఘులకారముగఁ జింతామణికర్త తలంచెననియు నప్పైసూరియు వచించెననియు గ్రహింపనగును.

విస్తర II. ౯ విష:— "వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య (౮-3-౧౮) పదాన్తయోర్వకార యకారయోర్లఘూచ్చారణౌ వయౌ వాస్తోఽచి పరే." (సి-కౌ- ౧౭౮ సూ) అను పాణినిసూత్రముచేఁ బ్రతిపాదింపఁబడిన లఘు య వలకు సంస్కృతవర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము లేదు. అట్లె "లోళః (3-౨- ౪౮) పైశాచ్యాం లకారస్య ళకారః స్యాత్-కమళో-కోమళో-ముకుళో-"(౧౯౧౬-క్రీ-శ-ముద్రితము.బొంబాయి గవర్న మెంటు గ్రంథమాల.షడ్భాషాచంద్రిక)అను వాల్మీకి సూత్రముచే లేదా త్రివిక్రమసూత్రముచేఁ బ్రతిపాదితమగు నలఘులకారమున కును బ్రాకృతవర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము లేదు. (చింతామణికర్తయుఁ దదనుయాయి సూరియు సంస్కృతప్రాకృ తాచ్ఛాంధ్రవర్ణసమామ్నాయములలో లఘ్వలఘు య వలకుఁ బృథగ్గణనము చేయలేదు. అట్లె యలఘురేఫమును నైత మచ్ఛాంధ్రవర్ణసమామ్నాయమునఁ జేర్పలేదు. ఇంత యేల, లఘ్వలఘువులకుఁ బృథగ్గణనము లేదన్న తలంపుననే సూరి "వర్ణసమామ్నాయమునందలి ళకారము వర్ణాంతరము గాని యలఘుళకారము గాదు." (బా-సంజ్ఞా-౧౮ సూ) అని కంఠోక్తముగాఁ జెప్పెను. దీనికి గుప్తార్థప్రకాశికాకర్త చేసిన యర్థ మపార్థమని ముందు నిరూపింపఁబడును. (౪౮-విష)

"ఇందువలన శాకటాయనుని మతమున య వ ల కు లఘుప్రయత్నతరత్వ మున్నదనియే తెలియుచున్నది. గాని య-వ-లకుఁ గొన్నియెడల గురూచ్చారణమును గొన్నియెడల లఘూచ్చారణమును, నుండునని స్పష్టముగా లేదు" (ఆం- భా-చ-౧౩౮ పుట. 27 సూ-వ్యా) ఇదియొక శంకయగునా? లఘువులని కొన్నిటిని జెప్పి నపుడు పరిశిష్టము లలఘువులని వేఱచెప్పవలయునా? మఱియు వానియుచ్చారణ స్వరూపము నిరూపించుటకై యట్లైనఁ జెప్పఁబడెనేకాని సంస్కృతప్రాకృతములలో లఘ్వలఘుతల నిరూపణమునకుఁ బ్రయోజనము తెలుఁగునందువలె లేదుగదా! "ప్రాకృతమున...ఆసూత్రము...లకారపు గురులఘూచ్చారణములను బోధింప

సంజీవని ౧౦ విష:—ముందు వివరింపఁబోవు (౧౨ విష) వర్ణపార్థక్య నిరూపకమగు "అనుప్రదానా" దిత్యాది కారికనుబట్టి సయితము లఘ్వలఘు వర్ణములకు వర్ణమాలలోఁ బృథగ్గణనము చేయుట కవకాశము లేదు. (వై - పా - ౨౮౫ మొ. ౨౮౭)

సంజీవని ౧౧ విష:—"యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్ర మధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః" (సి-కౌ- ౧౬౮సూ-వివ) "లఘూచ్చారణే లేదు" (ఆం-భా-చ-౧౫౪౭ పు) నిజమె. కాని లకారజన్యములగు ముకుళాదిశబ్దములలోని వర్ణము నుచ్చరించుటలో జరుగు స్థానకరణశైథిల్య తదభావములనుబట్టి భట్టారకుఁడట్లు లఘువుల లక్షణము ననుసరించి యుద్దేశించె ననుటలో విరోధమే మున్నది?

విస్తర-III-౬ విష:— పేటికావ్యాఖ్యాతయు గుప్తార్థ ప్రకాశికావ్యాఖ్యాతయు ముకుళాదిశబ్దగత ళకారమె సంస్కృత వర్ణసమామ్నాయగత ళకామని శిక్షా ప్రాతిశాఖ్యాది విరుద్ధముగ వ్రాసిరి. "ళకారము మాహేశ్వరసూత్ర ప్రసిద్ధము కాకున్నను ననాదిగ దీని యుచ్చారణము దేవభాషం దోఁచుచుండుటంజేసి వర్ణాంతరముగ నాదృతమయ్యె" (బా-సా-పే-సంజ్ఞా-౧ సూ.), ఇది ప్రాతిశాఖ్యములలో లేదు. దీని కనాదిత్వ మెట్లు సంగతమగును?

"సంస్కృతభాషయందు లకారమునకు ళకారముకూడఁ బలుకవచ్చును. ఇది (అచ్చాంధ్ర వర్ణసమామ్నాయగత ళకారము) యట్టిది గాదు "గళము=గలము. మంగళము=మంగలము" ఇత్యాదిస్థలములయందు ళ లలకు భేదములేదు. ఈ తెనుఁగుభాషయందు భేదము తప్పకయున్నది." (బా-గు-ప్ర-సంజ్ఞా ౧౩-సూ) "కాఁబట్టి ప్రాకృతభాషయందుఁబలె నాంధ్రమునందును లకారముకంటె ళకారము మఱియొకవర్ణముగాని గీర్వాణభాషయందుంబలె వర్ణాంతరము కాకపోదని స్పష్టపడుచున్నది." (బా-గు-ప్ర- అనుబంధ-ద్వి. ము. ౧౮౧ పు) ఇట్లు సంస్కృతమున లకారముకంటె ళకారము భిన్నముకానపు డద్దానిని సంస్కృత వర్ణాసమామ్నాయమునఁ బృథగ్గణనము చేయు టెట్లుపొసఁగునో తెలియకున్నది. అభిన్నములగు బ వ లకుఁ బృథగ్గణనము చేయలేదా యని శంకింపరాదు. బకార మోష్ఠ్యము. వకారము దంతోష్ఠ్యము. బకారము స్పృష్టము. వకార మీషత్స్పృష్టము. (౧౨ విష) లఘ్వలఘువుల కిట్టి వర్ణపార్థక్యసంపాదక సామగ్రి లేదు. స్థానకరణముల శైథిల్య తదభావ రూపమాత్రమగు (౧౧ విష) లఘ్వలఘువుల భేదము వర్ణపార్థక్యసంపాదకము కానేరదు.

స్థానకరణశైథిల్యం జాయతే" (కాశికావృత్తి). ఈలక్షణముల చొప్పున ముందు వివరింపఁబోవు రీతిని (౧౧ విష) యకారాదుల యుచ్చారణమునందలి స్థానకరణముల శైథిల్యత(బిగువు లేకుండుట) యున్నచో నవి లఘువులు. అశిథిలత (బిగువు)యున్నచో నవి యలఘువులు నగునుగాని యుత్పత్తిస్థానకరణాదులలో వానికి భేదము లేనందున వర్ణమాలలో వానికిఁ బృథగ్గణనము లేదని సిద్ధాంతిత మగుచున్నది.

సంజీవని. ౧౨ విష:—విసర్గము క-ఖ పరక మగునపుడు "జిహ్వామూలీయము" అనియు, ప-ఫ-పరక మగునపుడు "ఉపధ్మానీయము" అనియు వ్యవహరింపఁబడును. అప్పుడు విసర్గము 'ᳵ' అనులిపితోఁ జూపఁబడును. "ᳵ కᳵపా వితి కపాభ్యాం ప్రాగర్ధ విసర్గసదృశౌ జిహ్వామూలీ యోపధ్మానీయౌ" (సి-కౌ. బాలమ-౧౨సూ-విష) జిహ్వామూలీయోపధ్మానీయములు విసర్గాపరానతారములే. వర్ణాంతరములు కానేరవు. (ఆహా ౧౩౮ పు)

సంజీవని. ౧౩ విష:—"క్ష-త్స-జ్ఞ-ష్ణ-హ్న-హ్మ-హ్వ-"అను సంయోగములందు వింతలగు నపభ్రష్టధ్వను లర్వాచీనముగ వాడుక కెక్కినవి"క్ష=త్ష-త్స=చ్ఛ-జ్ఞ=గ్న్య-ష్ణ=ష్ణ-హ్న=న్హ-హ్మ-మ్హ-హ్వ=వ్హ" అనురీతి నించుమించుగా వినఁబడుచున్నవి. వీనిలోఁ హకారమును సంబంధించినవి ప్రాకృతభాషా సంపర్కజన్యములనఁదగును - "హ్న-హ్ణ-హ్మ-ష్మ నలమాం స్థితి రూర్ధ్వమ్" ప్రాకృతప్ర-౩ప-౮సూ).కొన్ని సంస్కృత శబ్దముల విషయమున గ్రంథకర్తలును భ్రాంతులగుచు నూతనశబ్దములను భాషలోఁ జూపుచున్నారు.

| శబ్దస్తోమమహానిధి | శబ్దార్థచింతామణి | లింగాభట్టీయము | శబ్దరత్నాకరము |
|---|---|---|---|
| పత్తన = పట్టణ | పత్తన = పట్టన | పత్తన = పట్టన | పత్తన = పట్టణ |
| కహ్లార | కహ్లార | కహ్లార | కల్హార |
| భాల | భాల | ఫాల | ఫాల |
| దులీ = దులి | దులీ=దులి=ధులి | ధులీ = ధులి | దులి=ధులీ=ధులి |

ఇందుఁ గొన్నింటికిఁ బ్రాసాదినిబద్ధ ప్రయోగములును గలవు. "అథర్వణాచార్యుల విరాటపర్వమునందు:—"తే-గీ-ధాంధమిత భేరికా ధ్వానముం ధులీని నాదమును..." (అప్పక-౫ అ-౧౫౫ ప) "క-రణ...పట్టణ మదోద్భటసుభట సంకటంబుగ...మణిగణ...తృణ...(నిర్వ. ౫ ఆ ౭౯) క-ఇట్టి క...పట్టణ...(ఉ-హరి ౧ ఆ-౩౬)

సంజీవని. ౧ర విష:—వర్ణోత్పత్తి స్థాన కరణాది భేదములు గల్గునపుడే వర్ణములకుఁ బృథక్ పరిగణన మంగీకరింపఁ బడును. నోటిలోని మీఁదిభాగములు వర్ణోత్పత్తిస్థానములు. జిహ్వాభాగాదులు వర్ణోత్పత్తి కరణములు. (వై-పా-౧ర౧ వి) "క. కాదులు నైదైదు కూర్పనగు వర్గంబుల్..." (ఆం-భూ ౧౫ ప) అను కేతన వాక్యముచొప్పున "క-ఖ-గ-ఘు-ఙ" అనునవి కవర్గ మనఁబడును. ఇట్లు చవర్గాదుల నెన్నునది.

అ-ఆ-కవర్గము-హకార విసర్గములు కంఠ్యములు. ('అ-ఆ-కవర్గము-జిహ్వామూలీయము' అనునవి జిహ్వామూలీయము లనుట యుక్తము) ఇ-ఈ-చవర్గము-య-శ-లు తాలవ్యములు; ఋ-ౠ-టవర్గము-ర-ష-లుమూర్ధన్యములు.(రకారము దంత్యమనుట లెస్స. వై-పా ౧౮౩-౯౮ర-౧౮౫-విష)ఌ-ౡ-తవర్గము-ల-స-లుదంత్యములు. ఉ-ఊ-పవర్గము-ఉపధ్మానీయము-ఓష్ఠ్యములు. అనుస్వారము-ఞ-మ-ఙ-ణ-న-లును ననునాసికములు. ఏ-ఐ-లు కంఠతాలవ్యములు. ఓ-ఔ-లు కంఠోష్ఠ్యములు. వకారము దంతోష్ఠ్యము. వర్గప్రథమ ద్వితీయములును జిహ్వామూలీ యోపధ్మానీయములును విసర్గమును శ-ష-స లును శ్వాసములు. తక్కిన యక్షరములు నాదములు. వర్గప్రథమ తృతీయ పంచమములును య-ర-ల-వ లును నల్పప్రాణములు. తక్కినవి మహాప్రాణములు. కకారము మొదలు మకారము తుది వఱకు ననఁగా నయిదువర్గముల యక్షరములును స్పర్శములు. య-ర-ల-వ లు - ఈషత్స్పృష్టములు - అంతస్థములును. శ-ష-స-హ లూష్మములు. ఏ ఐ-ఓ-ఔ లు సంధ్యక్షరములు. అని పాణినీయులు చెప్పుదురు. (విస్తర)

---

విస్తర I ౧ర విష:—శ్లో. అనుప్రదానాత్ సంసర్గాత్, స్థానాత్కరణవిభ్రమాత్ ।జాయతే వర్ణవైశేష్యం, పరిమాణాచ్చ పఞ్చమాత్. (వై-పా-౧ర౧ విష) అనుప్రదాన మనెడి బాహ్యప్రయత్న భేదమువల్లను, వాయు సంసర్గాతిశయరూప భేదమువలనను, తాల్వాది వర్ణోత్పత్తిస్థాన భేదమువలనను, వర్ణోత్పత్తికరణమగు (వర్ణోత్పత్తిసాధనమగు) జిహ్వాప్రచార భేదమువలనను, స్వరోచ్చారణమునందలి మాత్రా (కాలవిశేష) భేదమువలనను, వర్ణములకుఁ బ్రత్యేకత యంగీకరింపఁబడునని. యర్థము.

విస్తర II-౧ర విష:—అనుప్రదాన మనునది బాహ్యప్రయత్నము. బాహ్య మనఁగా ముఖయంత్రమున కవ్వలిభాగము. అనఁగాఁ గంఠము. శ్వాసవర్ణము నుచ్చరించునపుడు కంఠబిలము తెఱవఁబడి యుండును. కాన శ్వాసమునిర్నిరోధముగా వెడలివచ్చును. నాదవర్ణోచ్చారణమునఁ గంఠబిలము మూయఁబడి యుం

ఘోష. కాన వర్ణోత్పాదక నిశ్వాస మట్టి మూఁతను విడఁగొట్టుకొని వెడలివచ్చును. ఘోషవర్ణమెడల నాదిత యనఁగా నాదము సంభవించును. ఈరెండువిధములగు ప్రయత్నములచేతను వర్ణములకు వరుసగా శ్వాసనాద సంజ్ఞలు గల్గినవి. మహాప్రాణ వర్ణోచ్చారణమున బయలుదేఱు నిశ్వాసమున వాయుసంసర్గాతిశయ ముండును. కాన 'ఖ'కారాదులకు మహాప్రాణసంజ్ఞ సార్థక మగుచున్నది. పయిరీతిని బయలువెడలు నిశ్వాసము ముఖయంత్రమార్గమున మాత్రమె వచ్చినచో నిరనునాసికవర్ణములు జనించును. ముఖ నాసా మార్గములు రెండింటను వచ్చినచో సానునాసికవర్ణములు జనించును. ఙ-ఞ-ణ-న-మ-ల యుచ్చారణమున నిశ్వాసము రెండుమార్గములను వచ్చునుగాన నవి ద్విస్థానికములు ననునాసికములును ననఁబడుచున్నవి. అచ్చులు నిరనునాసికములు సానునాసికములునుగా నుచ్చరింపఁబడును. అనుస్వార మనునాసికమె. ఇఁక నిశ్వాసము ముఖయంత్రమార్గమున వచ్చునపుడు జిహ్వాభాగములు తాల్వాదిస్థానములను దాఁకి యుండఁగా నానిశ్వాస మట్టితాఁకును విడఁగొట్టుకొని వెలికి వచ్చుటచేత వర్ణోత్పత్తి యగును. కాఁగాఁ దాల్వాదులు వర్ణోత్పత్తి స్థానములనియు, జిహ్వాభాగములు వర్ణోత్పత్తి కరణము లనియు వ్యవహరింపఁబడుచున్నవి. కంఠము ముఖయంత్రమున కవ్వలిభాగము గానఁ గవర్గమును పాణినీయులవలెఁ గంఠ్య మనుటకంటె జిహ్వామూలీయ మనుట యుక్తము. ఉచ్చారణమున ముఖయంత్రసంబంధమే లేమించేసి హాకార విసర్గములను మాత్రము కంఠ్యము లనఁదగును. నాలుకకు మీఁదనుండు శిరోభాగ మెల్లఁ దాలువనఁబడును. అట్లయినను దానిని నాల్గుభాగములుగ విభజించి యీక్రిందిరీతిని వరుసగా వ్యవహరింతురు. ౧ హనుమూలము. (దీనిని జిహ్వామూల మనుట యుఁ గలదు; కొందఱు మృదుతాలు వందురు) ౨ మూర్ధము; ౩ తాలువు, ౪ దంతమూలము. క-చ-ట-త-వర్గముల యుత్పత్తిలో నట్టి తాలుభాగములం దొక్కొక్కదానిని (౧) జిహ్వామూలము, (౨) మణపఁబడిన జిహ్వాగ్రము (౩) జిహ్వామధ్యము (౪) జిహ్వాగ్రమును దాఁకుట సంభవించును. కానఁ దాలుభాగములు వానివానికి స్థానములు. ఆయా జిహ్వాభాగములు కరణములు. పవర్గోచ్చారణమునఁ గ్రిందిపెదవి మీఁదిపెదవిని దాఁకుట సంభవించును. కాన వానికిఁ గ్రిందిపెదవి కరణము. మీఁదిపెదవి స్థానము. ఇట్లు స్థానములను గరణములు స్పృశించుట సంభవించును గాన వర్గాక్షరములకు స్పర్శములను పేరు సార్థక మగుచున్నది. అంతస్థముల యుచ్చారణమున స్థానములను గరణము లించుక స్పృశించునుగాన నవి యీషత్స్పృష్టములు, లేదా దుస్స్పృష్టములు నని చెప్పఁబడును. ఊష్మముల యుచ్చారణమున స్థానములను

సంజీవని. ౧౫ విష:—స్వరమె యక్షరము. వ్యంజన మక్షరాంగము. స్వరముల హ్రస్వ దీర్ఘ భేదములు వాని యుచ్చారణకాలములోని మాత్రా భేదమున సంభవించునని యీావటికే (౫. II విష) వ్రాయఁబడెను. అంగియగు స్వరముయొక్క యుచ్చారణకాలములోనే దాని యంగములగు హల్లుల యుచ్చారణకాల మిమిడి యుండును. కాన 'క్ర' మున్నగునవియు నేకమాత్రికములె యని గ్రహింపవలెను. కావుననే యట్టివి లఘువులె యగుచున్నవి. కం. "ఒక్కమాత్ర లఘువై ద్విమాత్రికము గురు వగ్యోన్" (కవిజనా. సంజ్ఞాధి - ౧౨ ప) పరమందున్న హల్లుల సంయోగమును బల్కుటలోఁ గల్గు నూనికవల్ల సంభవించెడి సంయోగపూర్వస్వరోచ్చారణములోని కాలదైర్ఘ్యముచే నట్టిసంయోగపరకస్వరము ద్విమాత్రికమగుట యను భవసిద్ధమును శాస్త్రసిద్ధమును నై యున్నది.

సంజీవని. ౧౬ విష:—కకారోచ్చారణమున మహాప్రాణ మనఁదగు వాయు సంసర్గాతిశయము కల్గినచో ఖకారము జనించును. కకారోచ్చారణమున నాదిత మేళగించుటచే గకారము జనించును. అట్టి గకారోచ్చారణమున వాయుసంగ్రాతి శయము గల్గుటచే ఘకార ముత్పన్నమగును. కకారోచ్చారణమున నాదితయు నానునాసిక్యమును మేళగించుటచేత ఙకారము జనియించుచున్నది. ఇట్లొక్కొక్క వర్గములోని యక్షరములు వాని పుట్టుకలోనైతము పరస్పరసంబంధము గల్గి యున్నవని యెఱుంగునది. (వై - పా - ౨౧౨ విష.)

నన్నయా థర్వణీయము. ౧౭ విషయము.

ప్రకృతేస్తు తే దశోనాః స్యుః. (అం-చిం-సంజ్ఞా-౫ కారి-అహో-౧౩౨-పుట).

ఏజఘో వక్రః। వక్రతము ఐచ్. (అం-చిం-సంజ్ఞా-౧౨-౧౩-కారి-అహో-౧౬౧-౧౬౨-పు).

---

గరణములు తాఁకక సన్నిహితములై యుండఁగా నూష్మరూప నిశ్వాసము వెడలును. కావుననే యవి యూష్మము లనఁబడుచున్నవి. వకారోచ్చారణమునఁ గ్రింది పెదవి మీఁదిదంతములను దాఁకుట సంభవించును. కాన నది దంతోష్ఠ్య మనఁబడును. ఐకారోచ్చారణమున "అ+ఇ" అనునవియు, ఔకారోచ్చారణమున "అ+ఉ" అను నవియు విశ్లిష్టావయవములుగా ననఁగా వేర్వేఱుగా వినఁబడునట్లు సంధించి యుండును. ఏకారోచ్చారణమున 'అ+ఇ' అను నవియు ఓకారోచ్చారణమున 'అ+ఉ' అనునవియుఁ బ్రశ్లిష్టావయవములై యనఁగా మిశ్రితము లగునట్లు సంధించి యుండును. కాన నవి సంధ్యక్షరములని వ్యవహరింపఁబడును. (వై - పా - ౧౮౧ మొ- ౨౧౫ - వ-విష)

[illegible]-౧౭ - విష:—ప్రకృతేస్తు = ప్రాకృతభాషకైనచో, తే = ఆసంస్కృత [illegible] [illegible], [illegible] = పఠితవ్యసగలవి యగును. అనఁగాఁ బ్రాకృతము [illegible] [illegible] కలుగవని యనిభావము. ఏక్ = ఏజ్ ప్రత్యాహారము. ఏ ఓ లని [illegible]. వక్ర = వక్రసంజ్ఞ గలవి. అథోశబ్దము మధ్య మంగళార్థకము. ఐచ్ = ఐచ్ ప్రత్యాహారము, ఐ ఔ లని యర్థము. వక్రతమః = వక్రతమసంజ్ఞ గలది.

[illegible]. ౧౩ I [illegible].

ప్రాకృతమునకు వర్ణములు నలువది. ౨. అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః; క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ; త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ. కొందఱిమతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱిమతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ లు వక్రములని ఐ ఔ లు వక్రతమంబులని ప్రాచీనులు వ్యవహరింతురు.

సంజీవని. ౧౩ I విష:—ప్రకృతులనఁగా జనులు; వారివాడుక వలనఁ గలుగు భాష ప్రాకృత మనఁబడును. వేదకాలమునకు ముందువెన్కల వ్యవహార ప్రవాహమున వెలయు నార్యభాషల పరిణామములె ప్రాకృతభాషలు. అట్టివాని నుండియె సంస్కృతభాషసైతము వెలసినది. నేటి మరాటీ ప్రభృతి గౌడభాషలును బ్రాకృతములె కాని చింతామణికర్తయు సూరియును నుద్దేశించిన ప్రాకృత మిట్టి వాడుకభాషలలోనిది కాదు. వేదకాలమునాఁటి శిష్టవ్యవహారభాష సంస్కరింపఁబడి నదై సంస్కృతముగ వెలసినది. అట్టిసంస్కృతమునుండి తర్వాతి ప్రాకృతవైయాకర ణులచేఁ బ్రాకృత వాఙ్మయానుసారముగ సాధింపఁబడినవియుఁ బ్రాకృతవ్యాకరణ కాలపు వ్యావహారికభాషలనుండి గ్రహింపఁబడి సంస్కరింపఁబడినవియు నయిన మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, యపభ్రంశము ననెడి షడ్విధప్రాకృతములలో నొకటగుమహారాష్ట్రీప్రాకృతము నన్నయభట్టుచే నుద్దేశింపఁ బడినది. అట్లగుటంజేసి ప్రకృతియగు సంస్కృతమునుండి యేర్పడినది ప్రాకృతమనియు వ్యుత్పత్తి నెన్నఁదగును. (విస్తర) ప్రాకృతభాషాషట్కమునందు మహారాష్ట్రీస్వరూ పమె యధికతమమయి యుండును. ఈషద్భేదములవలనఁ దక్కిన భాషాభేదము లేర్పడెను. షడ్విధములలోను మహారాష్ట్రికిఁ బ్రాకృతమనియు సంజ్ఞ గలదు.

---

విస్తర-౧౭ I విష:—సంస్కృతనాటకస్థిత వ్యాకరణసాధ్య ప్రాకృతమునుండి సంస్కృత మేర్పడెనని పేటికావ్యాఖ్యలోఁ బక్షాంతరము చూపఁబడెను. (బా-సా-పే ర పుట) ఇది సరికాదు. లక్ష్మీశబ్దమునుండి లచ్ఛీ యను ప్రాకృతశబ్ద ముత్పన్న మయి

సంజీ ౧౭ II విష:—మహారాష్ట్రీ ప్రాకృతమున విసర్గనుగాని జిహ్వామూలీయోపధ్మానీయములుగాని లేవు. మహారాష్ట్రిలో నెల్లెడలను నకారము ణకారముగ మాఱిపోవును. స్వవర్గీయసంయోగమున నెల్లయెడలను ఙ - ఞ లు మహారాష్ట్రిలో వెలయుచున్నవి. కాన సూరి వివరించిన వర్ణమాలలలోని విసర్గ నకారములను దీసివేసి ఙ ఞ లను జేర్చుట చింతామణిహృదయ మనఁదగును. చింతామణికర్త తానుద్దేశించిన ప్రాకృతపు వర్ణములను బేర్కొనమింజేసి సూరి కిట్టి చిక్కు గల్గెను. (విస్తరI-II-III) మహారాష్ట్రీ ప్రాకృతమున నలఘు ళకారము "కోమళో ముకుళో" మున్నగురీతిది గలదు. (౫౭ - విష-కల్పత) అట్లయినను సంస్కృతమునందు వలెనె ప్రాకృతమందును నలఘు ళకారమునకు వర్ణమాలలోఁ బృథగ్గణనము లేమింజేసి (౧౧ విష) ప్రాకృత వర్ణసమామ్నాయమున సూరిగా రుదాహరించిన ళకారము హేళనాది శబ్దగత ళకారమె యనుట నిర్బాధము-(౮ - ౯ - విష) సంస్కృత వర్ణమాలలోని ళకారమునకుఁ బ్రాకృతమున స్థితిలేదని ప్రాకృతవ్యాకరణములలో నెందును లేదు.

సంజీవ-౧౮ విష:—సూరిగారు ప్రాకృత వర్ణసమామ్నాయమున దంత్య చజల నుపదేశింపలేదు. అట్లగుటంజేసియే బా - సంజ్ఞా ౧౯ సూత్రము నుదాహృతులలో

---

నదనుట వర్ణవికారపద్ధతికి సరిపడి యుండును గాని లచ్ఛీ శబ్దమునుండి లక్ష్మీశబ్దముత్పన్నమైనదనుట యుక్తమయి యుండదుగదా. (చిం-వి-పరి-౭౬ విష).

విస్తర I ౧౭ II విష:—"నోణః సర్వత్ర" (ప్రా-ప్రకా-౨ పరి - ౪౨ సూ) అను వరరుచిసూత్రముచొప్పున లౌకికప్రాకృతమున నెల్లెడలను నకారము ణకారముగఁ బరిణమించుచుండును. కావుననే ప్రాచీనుఁడగు చండుఁడు ప్రాకృతమున నకారము లేదని "న ప్లుత ఙ ఞాః-ప్లుతా-వర్ణా ఙకార నకార ఞకారాశ్చ ప్రాకృతే న భవన్తి. శ్లో. ఐ ఔ ప్లుతౌ తతః పశ్చాత్ । ఋౠౡౡ చతుః స్వరాః॥అః ఙ ఞ న శ షా స్సన్తి॥ ప్రాకృతే నైవ కర్హిచిత్......ఙ ఞౌ స్వవర్గసంయుతౌ భవత ఏవ - అహఙ్కారః = అహఙ్కారో, అఞ్చితమ్ = అఞ్చితం (చండవ్యా. స్వరవి-౧౯-సూ).

నన్నయకుఁ దర్వాతివారగు హేమచంద్రాదులు పదాదిని వికల్పముగా నకార ముండవచ్చునని చెప్పిరి కాన నన్నయ కర్తృకమగు చింతామణిలో నట్టి విషయము లేకుండుట యుక్తమేకదా.

ఇంకఁ జింతామణి యుద్దేశించినది ప్రాకృతభాషాషట్క మన్నచో (ఆం-భా-అ-సంజ్ఞా ౯ సూ. ప్రథమముద్రణ) మాగధిలోని జిహ్వామూలీయమును శ వర్ణమును జేర్పవలయును. ఆపక్షమునఁ జింతామణి చెప్పిన చత్వారింశత్సంఖ్య విరోధించును.

"జ్ఞా-జా" అని యిట్లు ప్రాకృతశబ్దావస్థలో దంత్యతానుమాపక లిపిని జూపక ప్రాకృతము శబ్దావస్థలో ననఁగా వచ్చు తెనుఁగు స్థితిలో "జడ-జేముఁడు" అని యిట్లు దంత్య తానుమాపక లిపితో నుదాహరించిరి. (విస్తర).

...విష:—సంస్కృత సమములవలెనే ప్రాకృత సమములును ప్రసిద్ధములె యైనను వాని కెల్ల నాంధ్రమున సంస్కృతసమములవంటి ధారాళ ప్రవేశము లేదు. అనాంధ్రవర్ణ ఘటిత సంస్కృతశబ్దములనువలె నట్టి యనాంధ్రవర్ణ ఘటిత ప్రాకృతశబ్దములను వ్యాకరణములచొప్పునఁ దత్సమములనుగాఁ జేసి ప్రయోగింపరాదు. కట్టి ప్రాకృతశబ్ద మొక్కటియైన నాంధ్రమున లేదు. సూరిగారును "సంస్కృత సమేతరంబైన యీభాష యచ్చ యనంబడు" (బా-అచ్చ-౧ సూ) అను

---

విస్తర II. ౧౨ II విష:..."ఐ ఔ లును గలవని చిన్నయసూరి వ్రాసెను గాని ఐ ఔ లే ప్రాకృతమందును గనఁబడలేదు" (ఆం-భా-అ-సంజ్ఞా-౯ సూ-టిప్పణి. ప్ర-ము-౧౯) అనువ్రాత సరికాదు "ఐ దౌతౌచ కేషాఞ్చి న్మతే భవత ఏవ. కైతవమ్ = కైఅవం. సౌదర్యమ్ = సౌఅరిఅం-కౌరవాః=కౌలవా" (చండవ్యా. స్వరవి-౧౯ సూ) 'అయి ఐ' (౨-౮-౨౪) ఐ సహి, పక్షే అఇ సహి-(అయి సఖి) (షడ్భా-౧౦౮ పు)

విస్తర III. ౧౨ II విష:—వక్ర వక్రతమాది సంజ్ఞలు త దనుమాపక ప్రాచీనాంధ్రకర్ణాటక సాధారణ లిపి సిద్ధము లనఁదగును. (చూ-వై-పా ౨౬౪ విష)

విస్తర. సంజ్ఞ-౧౮ విష:—"చ జౌ తజ్జే ప్రాకృతే చాదన్త్యావేవ న సంశయః" (అథర్వణ) (౩౧ విష). "ప్రాకృతే తద్భవే చాపిచ జౌ దన్తభవౌ స్మృతౌ" (వికృ-సంజ్ఞా ౯ కారి) (అహో ౧౨౬ పు) అనుకారికల నుదాహరించి యప్పక వ్యహోబల పండితులు ప్రాకృతమున దంత్య చ జ లు గలవని ప్రామాదికముగ వ్రాసిరి. (అప్ప. ౧ ఆ ౨౫౪ ప) పయి కారికలలోని ప్రాకృతశబ్దమున కాంధ్రదేశ్య మని యర్థము. (౪౯ II విస్త) ప్రకృతుల వాడుకలోని దనఁగాజనులవాడుకలోనిది ప్రాకృతము, గానఁ బ్రాకృతశబ్దమునకు దేశ్య మర్థ మనఁదగును. (౧౨ I విష). దేశ్య మవ్యుత్పత్తిమత్త్వాత్ ప్రాకృతత్వేన కథ్యతే" (అహో ౧౨౮ పు) "గీ-ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము కాన" (కావ్యాలం-౯ ఉల్లా ౮ ప) అనుప్రాచీనుల వచనములచొప్పునఁ బ్రాకృతశబ్దమునకు దేశ్య మనునర్థము సమూల మనఁదగును. "ప్రాకృతే తద్భవే చాపీత్యాది కారికలోని ప్రాకృతశబ్దమున కట్లు దేశ్యమని యర్థము చెప్పనిచోఁ దెనుఁగులోని తద్భవములందు దంత్య చ జలు గలవని చెప్పి యాంధ్రదేశ్యమునందును నవి గలవని చెప్పకుండుట యనెడి యసంగతి దుర్వార మగును. దేశవ్యవహారమున దంత్యధ్వని లేనపు డయ్యది తద్భవమునందుఁ గల్గుట యసంభవముగదా.

సూత్రముచేఁ బ్రాకృతసమమునకు సయిత మాచ్ఛికత్వము నంగీకరించిరి. ఇఁకఁ బ్రాకృతమును సంస్కృతప్రకృతికమె యగుటంజేసి సంస్కృతసమ విలక్షణ ప్రాకృతసమములును బ్రాకృతభవములును సంస్కృతభవములె యనుటలో విరోధము లేదు. సంస్కృతశబ్దములకుఁ బ్రాకృతద్వారమునఁ దెనుఁగులోఁ బ్రవేశము నంగీకరించుటయు నక్కారణమునఁ బ్రాకృత వర్ణసమామ్నాయము నుపదేశించుటయు ననావశ్యకము లనఁదగును. (వై - పా - ౪౪ - ౫౨ - ౭౨ - విష) అట్లయినను "(సం) పఞ్చాశత్ = (ప్రా) పణ్ణాసా - (తె) పనస. (సం) స్తమ్భః=(ప్రా)-ఖమ్భా=(తె) కంబము, మున్నగు కొన్ని తెలుఁగుశబ్దములం దాంధ్ర వైకృతలక్షణవిదూర ప్రాకృతలక్షణములు వెలయుచుండుటం జేసి కాఁబోలుఁ జింతామణికర్త ప్రాకృత సమ భవముల నుపదేశింపఁగా సూరియుఁ దన్మార్గానుయాయి యయ్యె నని గ్రహింపవలయును. ప్రాచీన కాలమునఁ బ్రాకృతములు వ్యావహారికభాషలుగా నుండుటంజేసి తెనుఁగులోనికి వచ్చిన వైకృతములు పెక్కు ప్రాకృతద్వారముననే వచ్చినవని తలఁచి నన్నయ యథాస్థితముగా నుపదేశించినవాఁ డయ్యెను.

షట్త్రింశ దత్ర తే;న్యే। చానుప్రవిశన్తి శబ్దయోగ
వశాత్. (ఆం - చిం - సంజ్ఞా ౫ కా. అహో ౧౩౨ పు)

నన్నయా థర్వణీ ౨౦ విష

ద్వివి ధా ది దు దే దో తో। చో వక్రత మావథా
ప్యనుస్వారా। క గ చ జ యుగ ట డ ణ త ద న।ప
బ మ య ర ల వ స హ ళం తు హల్వర్ణః॥ (ఆం -
చిం-సంజ్ఞా ౬ కారి - అహో ౧౪౨ పు).

కల్పత - ౨౦ - విష:—"ప్రకృతేస్తు తే" అనుచోప్పున నీసూత్రమందును 'తే' అనుదానికి "షట్ త్రింశ దత్ర" అనుదానిలోనె ప్రవేశ ముచితము. అత్ర = ఈయచ్చతెల్గునందు, తే = ఆవర్ణములు-షట్త్రింశత్ = ముప్పదియాఱు, అన్యేచ = ఇతరవర్ణములు సయితము, శబ్దయోగవశాత్ = సంస్కృతసమశబ్దయోగము మూలమున, అనుప్రవిశన్తి = ఆంధ్రభాషయందుఁ బ్రవేశించుచున్నవి.

ద్వివిధేత్యాది:—ద్వివిధ = హ్రస్వదీర్ఘరూపములగు, అ ది దు దే దో తః = అత్-ఇత్-ఉత్-ఏత్-ఓత్ = "అ - ఇ - ఉ - ఎ - ఒ" అనునవియు వక్రతమా=ఐఔ

---

చింతామణి శేషముగు వికృతివివేకమున నాంధ్రదేశ్యము నందలి చ జ-ల దంత్యత నుపదేశింపక ప్రాకృతభాషయందలి "చ జ"ల దంత్యత గలదని యథర్వణుఁడు చెప్పుట పొసఁగదుగదా. (వై-పా-౫౨౫ విష) అహోబలపతి పై కారికకు నపార్థము చేసికొని "జూదము" శబ్దము తత్సమ మని వ్రాయుట పొరపాటు. (అహో ౧౨౭ పు).

[illegible] = [illegible]స్వరములును, అచః = అచ్చు లగుచున్నవి. [illegible] హ్రస్వక్రమములు లేమింజేసి, "ఏత్ - ఓత్" అని సంస్కృతభాషా [illegible] భట్టారకుఁడు ప్రయోగించినను వానికి - 'ఎ - ఒ' అనియె భట్టారక [illegible]. అ ఏ వ్యక్తుల తోపాటుగ హ్రస్వములె యుద్దేశింపఁబడిన వనఁ [illegible] "కంఠేऽనాగ్యారాజాదేః" "ఏద స్తతాచ నామ్నా । మన్యతరస్యా మహాసంజ్ఞాయామ్" అను సూత్రములందును నన్నయ యవలంబించి యున్నాఁడు. కాన "అ - ఆ - ఇ - ఈ - ఉ - ఊ - ఎ - ఏ - ఐ - ఒ - ఓ - ఔ - ఁ - ం" అనునవి యచ్చు తెలుఁగునందలి యచ్చులని విశదమగుచున్నది.

క గ = క - గ - లును, చ జ యుగ = చ - చే - జ - జే లును ట - డ ణ - త - ద - న - ప - బ - మ - య - ర - ల - వ - స - హ - ళం - తు='ట - డ - ణ త - ద - న - ప - బ - మ - య - ర - ల - వ - స - హ - ళ' అనునవియు-హాల్వర్గః = అచ్చతెలుఁగునందలి హల్లుల సముదాయ మనియర్థము. పయిరీతి నచ్చులు ౧౪+ హల్లులు-౨౩ = కలిపి ముప్పదియేడు అగుచున్నవి. అలఘు రేఫమునకును నలఘు ళకారమునకును బృథగ్గణనము లేమింజేసి యవి ప్రత్యేకవర్ణములు కావు. అట్లగుటంజేసి "ప్రత్వత్ర గృహ్యతే ద్వివిధ ఇతి రేఫస్య ద్వైవిధ్య కథనేన గురు రేఫస్య వర్ణ మధ్యే పరిగణనవశాయాం సప్తత్రింశ దిహాన్యే' ఇ త్యప్పకవి పుస్తకపాఠోపి సాధు రేవ. తస్య రేఫభేదత్వే నావర్ణాన్తరత్వా దపరిగణన దశాయాం మయంపాఠ ఇతి వివేకః" అనునహోబలపతి సమన్వయము సరికాదని యెఱుంగునది. (చూ- విస్తర II-III ౯-విష. ౧౦-౧౧-౧౪ విష) పైరీతినె ముప్పదియేడు వర్ణముల పక్షమునఁ గల్పించిన "య రయుగ లయుగ వ స హా శ్చ హాలః" అను నప్పకవి పుస్తకపాఠ మును బ్రక్షిప్తమే యని విశదమగుచున్నది.

తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు. 3. అ-ఆ-

బాలవ్యా ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-అం-అఁ; క-గ-చ-చే-జ-

ఆంI విష జే-ట-డ-ణ-త-ద-న-ప-బ-మ-య-ర-ల-వ-స-హ-ళ.

సంజీవని. ఆం I విష:—ఈసూత్రములోని "తెనుఁగునకు" అనుదానికి సంస్కృతసమేతరమగు నచ్చతెనుఁగున కని (బా-అచ్చి-౧సూ) యర్థము. అనఁగా "సంస్కృతభవము, ప్రాకృతసమము, ప్రాకృతభవము, నాంధ్రదేశ్యము" అను భేద ములు గల తెల్గుభాష కని యర్థము. అన్యదేశ్యములగు తురుష్కాంగ్లేయాది భాషాశబ్దముల ప్రవేశము భారతకాలమునకుఁ దర్వాతి తెలుఁగున సంభవించుటచే జేసి యన్యదేశ్యము సూరిగారిచే నుపదేశింపఁబడదయ్యె. అక్కారణమున నవాంధ్ర

వర్ణము లన్యదేశ్యపదముల మూలమున భారతభాషలోఁ బ్రవేశింప లేదు. అనాంధ్ర వర్ణఘటిత వైకృతములు (అనింద్యగ్రామ్యములు) భారతమున లేవు.

సంజీ ౨౧ I విషః—లేఖక ముద్రణసంస్కర్త్రాప్రభృతుల ప్రమాదములచే భారతమునఁ గొన్ని యన్యదేశ్యపదములును వైకృతశబ్దములలో ననాంధ్రవర్ణము లును బ్రవేశించి యున్నవి. "మానిని—ఏచి తలిర్చి తనర్చిన క్రోవుల నిమ్మగు తావులఁ జొంపములన్ (ఆది. ౪ ఆ ౨౦) ఇందలి తావు శబ్దములోని తకారము ప్రాసాది గతము కాదు. కాన 'టావుల' నని యీ గ్రంథకర్త ప్రయుక్తపాఠమై యుండు ననఁ దగును. లేదా యాంధ్ర విశ్వకళా పరిషత్పుస్తకాలయములోని ౭౯-౨౧౧ నెంబరు గల తాళపత్ర మాతృకయందలి పాఠముచొప్పున "తావుల" నను పాఠము నంగీక రింపనగును. "ఉ-పీనుఁగు వెంటగాఁ బడిన బిడ్డలనెల్లఁ దలంచు చెప్పుడున్।మానఁగ రామి...।తాను సహించి యేమిగతిఁ దావుకొనున్ మెయిఁ బ్రాణ మర్జునా" (మౌస ౧ ఆ ౧౨౨) అని యిట్లు తావు శబ్దము భారతమునందు వెలసియున్నది.

సంజీ. ౨౧ II విషః—"కఱకంఠా క్షమియింపుము" (అర-౧ ఆ 3౨౮ ప) అనుపద్యమునందు నయితము "కఱకంటా" అనుపాఠమె నన్నయప్రయుక్తమై యుండును. ఈ ఠ కారము నయితము ప్రాసాదిగతము కాదు (వై-పా ౪3౧ విష) నాయొద్దనున్న తాళపత్రమాతృకలు రెండిటియందును ఠకారఘటితపాఠమె యున్నది. కాని తాళపత్రమాతృకలు తప్పుల తిప్ప లగుటంజేసి వానిలోని ప్రాసాది గతములుకాని స్థలములందలి ప్రక్షిప్తపాఠము లనఁదగువానిని సవరించుట కెవ్వ రును బ్రతిఘటింపఁజాలరుగదా! (విస్తరము I-IV) అహోబలపండితుఁడును'ట'. కార ఘటితపాఠమునె యంగీకరించెను. (వై-పా-౪3౧ విష) "చుట్టుకైదువుతాల్పు" ఇత్యాదౌ 'వు' వర్ణకః 'నలువ' ఇత్యాదౌ హ్రస్వ స్సమాసాన్తః ... ... 'కఱ కంటుఁడు' ఇత్యత్ర టకారః (సమాసాన్తః) (అహో-౪౪౮ పు) పై రెండుచోట్లను ముద్రితాహోబలపండితీయమున 'ఠ' కారమె పడియున్నది. కాని ఠకారముచోట

---

విస్తర I ౨౧ II విషః—పై ప్రయోగములందు ఠకారమే యున్నదని భ్రమించి, ముద్రణసంస్కర్తలు, స్థలాంతరములందెల్లఁ దాళపత్ర మాతృకాపాఠము లను సవరించుచున్నవారయ్యు నిట నట్లు దిద్దరైరి. (విస్తర III. ౨౧ II విష) ఇట్లె మఱికొన్నియెడలను నపపాఠములు ముద్రణములందు విస్తరించియున్నవి. శా-ఏడ క్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్ । రూఢిం గౌరవసైన్య... (ఆది ౧ఆ ౭౦ ప) ఈపద్యమునందు 'రూఢిన్' అనుచోట, 'రూడిన్' అను తద్భవ రూపము కవిప్రయుక్తము కానోపును. ఎచ్చటను వర్గప్రాసము నంగీకరింపని నన్నయ

కహాంధ్రస్య ... కారము సమాసాంత ప్రత్యయ మగునని యహోబలపతి వ్రాసియుండు నను యసంభవముగదా. బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణ కర్తలు తకారపాఠము సంకేతించుట పొరపాటు(బా-సంజ్ఞా-౨౩ సూ) (ప్రౌఢ-సంజ్ఞా-౯సూ. సమాస ౨౭సూ) ఈ క్రింది కేతన ప్రసంగమునుబట్టి బహుళ్రీహియగు కలకంఠశబ్దము తకారఘటితముగా బ్రయోగింపఁబడెనని భ్రమింపరాదు. కం- తెనుఁగుపదంబులపైఁ బెంపొనరఁగ సంస్కృతము, చెల్లు నొక్కొకచోటన్ । మునుసుకవీంద్రులు కృతులం । బనిగొని రచియించినక్షి పరిపాటిమెయిన్॥ క-వాఁడిమయూఖము లనఁగా। వేఁడిపయోధార లనఁగ నింజామక నామూఁడస్త్రంబు లనంగాఁ। బోఁడిమి కలకంఠ నామముం బోలి తగున్॥ (ఆం-భూ-౧౩౨-౧౩౩-ప) ఇందలి తక్కిన యుదాహృతు లన్నిటి సాహచర్యమున 'కలకంఠ' శబ్దోదాహృతియందును నిర్బాధమగు కర్మధారయమె కేతనాభిప్రేత మనక తీరదుగదా.

---

యిటుఁ బ్రయోగించె ననుట యుక్తము కాదుగదా." తెనుఁగు పలుకులలోఁ గొన్నింట వర్గద్వితీయ చతుర్థాక్షరములు గలవు. ఆంధ్రవ్యాకరణకర్త లవి లేవనుట యసంగతమని నా తలంపు" (బసవ-పీఠిక-౯౮ పు.) ఈయభిప్రాయము ముందు విమర్శింపఁబడును (విస్తర I-౬౦ II విష)

విస్తర II. ౨౧ II విష:—ఇట్లు సోమయాజి భారతభాగమునను లేఖక పాఠక ముద్రణసంస్కర్తృ ప్రభృతుల మూలమున ననాంధ్రవర్ణములు నన్యదేశ్యములును బడియున్నవి. "లయగ్రాహి........రక్త। స్రావమునఁ బెల్లయిన తేవమునఁ జూడఁ గడునేవమగు పట్ల మృతభావగతు లయ్యున్॥ (స్త్రీ-౨-ఆ ౫ ప) ఇందలి 'తేవమున' అనుచోట "తేవయును" అని నాయొద్దనున్న తాళపత్రమాతృకలో నున్నది. కాన నిచట 'తేవమున' అనునది కవిప్రయుక్తపాఠ మనఁదగును. తేవము శబ్దము తేమశబ్దభవ మనఁదగును. "తేమః పుం. సముందనే ఆర్ద్రీభావే" "తేమనమ్-న-ఆర్ద్రీకరణే" (శబ్దా-చిం) తే-గీ. నెత్తురుల తేవ యెక్కిన నేలఁ బొరలుచున్నవా రేమిచెప్పుదు.॰ (స్త్రీ-౨ ఆ ర ఖండ) "నెత్తురుల నేవయెత్తిన" అని తాళపత్త్రమాతృకలలో నున్నది. ఈ పాఠమె లెస్స యనఁదగును.

విస్తర III-౨౧ II విష:—సీ-కోట యేమర కెప్పుఁ బాటించి గడ్డియుఁ గాణంబుఁ గొల్చును గట్టియలును॥ (శాంతి ౨ ఆ ౧౭౮ ప) సీ——ఆ-వె. కవణములును బెల్లుగా నొడఁగూర్చి (ఉద్యో ౧ ఆ ౯౩ ప) ; వీనిలోని కాణ, కవణ శబ్దములు "కబళ=కవళ" శబ్దభవములు. పయి శాంతిపర్వపద్యములోని "ఖాణము" అను ముద్రిత పుస్తకపాఠము లేఖకాది ప్రక్షిప్తము. "కబళ=కవళ=కవణ=కాణ" అని

సంజ్ఞా. ౨౨ I విష:—అర్వాచీనాంధ్రమహాకవు లన్యదేశ్యముల సైతము ధారాళముగ్గాఁ బ్రయోగింప నారంభించుటంజేసి మహాప్రాణా ద్యనాంధ్రవర్ణము లచ్ఛాంధ్రకావ్యములందును బ్రవేశించెను. అట్లనాంధ్రవర్ణముల కలవాటుపడిన యర్వాచీనకవులు కొన్ని యాంధ్రదేశ్యములందును మహాప్రాణాదివర్ణముల నరుదుగఁ బ్రయోగింపసాగిరి. ప్రాచీనాంధ్రభాషానుశాసన తత్పరత్వమున సూరి యట్టి మహాప్రాణాదివర్ణముల నచ్ఛాంధ్రవర్ణసమామ్నాయమునఁ జేర్పఁడయ్యెను. ప్రౌఢ

---

యిట్లు వికృతిక్రమము నరయునది. లకారము నకార మగుటయు (లాంగలము=నాఁగలి) వకారలోపమునఁ బూర్వస్వరమునకు దీర్ఘ మగుటయు వైకృతలక్షణములే కదా. శబ్దరత్నాకరకర్త కవణ కాణ శబ్దములు ఖాదన శబ్దభవములని ప్రకృతివికృతి శబ్దార్థసామ్య విదూరముగా వ్రాయుటయు ఖాణశబ్దమునం దనాంధ్రవర్ణముండుటచే నది యనింద్యగ్రామ్యమని వ్రాయుటయు నవిమర్శనకృతములు. శబ్దరత్నాకరకర్తయు సూ-రా-నిఘంటుకర్తలును నీక్రింది యనియత శబ్దాలంకారమును మూలముగాఁగొని ఖాణశబ్దము మహాప్రాణవర్ణఘటితము సంగీకరించుట వింత. క-వీణాక్షి నపుడు వెడసిం। గాణి గొని యలరుఁదూఁపుగమిఁ జక్కొరయే। ఖాణముగాఁ గలిగిన ఖేం। ఖాణముదొర పింజపింజ గాడఁగ। నేసెన్॥ (విజ.౧-ఆ) శబ్దరత్నాకరకర్త యీపద్యమున నింకొక పొరపాటునకును లోనయ్యెను. ఖేంఖాణశబ్ద మెచ్చటను లేదు. "ఖేంఖాణము-స-వి-అ-పు. గుఱ్ఱము" (శ-ర) అని యీయపశబ్దమును జూపుటయు, దీని సుశబ్దమగు "కంఖాణ" శబ్దమును జూపక విడిచికొనుటయు శబ్దరత్నాకరకర్త ప్రమాదములె యనకతీరదు. మ-తలఁపం జొప్పడి...సము। త్కలికారింఖదసంఖ్య సంఖ్యజయవత్ కంఖాణ రింఖావిశ్రం। ఖలసంఘాత ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు... (రాఘువ-౧-ఆ-౬౫) ఈపద్యమున కంఖాణశబ్దగత కకారము యతిస్థానఘటిత మగుటచే నట "ఖేం" అని యుండరాదనుటకు సందేహము లేదు.

విస్తర IV-౨౧ II విష:—సీ...చిత్రలలితగతి నొప్పు నేనూఱుగాడీలు.౫."(ఆది-౮-ఆ-౨౨౧) అను నన్నయపద్యమును జూపి శబ్దరత్నాకరకర్త "గాడి-గాడీ శబ్దములను నాంధ్రదేశ్యములుగా నుదాహరించెను. వావిళ్ళవారి ముద్రణమున "గాడిదలను" "గాడీలుసింధుజ" "గాంధర్వహయముల" "ఖరములమఱిసింధు" అను పాఠాంతరములు చూపఁబడినవి. సూ-రా-నిఘంటువున నీపాఠము సరికాదనియు "గాడిదలను" అనుపాఠ ముండఁదగుననియు నదియే మూలభూత సంస్కృత శ్లోకమునకు సరిగనుండుననియు గాడీ లనుపాఠము పద్యములో రథములు చెప్పఁబడుటచేఁ బునరుక్త మగుననియు వ్రాయఁబడెను.

6

నాన్నెచ్చ యక్షరములను లేకుండఁజేసి సంస్కృతప్రాకృతాచ్ఛాంధ్రములకు వేర్వే ఱుగ నుదాహరణముల నుదాహరింపకయు నన్యదేశ్యముల మూలమునఁ దెలుఁగునఁ బ్రవేశించిన మహాప్రాణముల నుజ్జగింప నిచ్ఛగింపకయుఁ ద్రిలింగలక్షణశేషమున "ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైయెసు" (ప్రౌఢ - సంజ్ఞా ౧ సూ) అని సూత్రించెను. మఱియును వ్యవహారవశమున నపభ్రష్టముగ నచ్ఛాంధ్రదేశ్యశబ్దములలోఁ బ్రవేశించినమహాప్రాణములను బోలఁగింపక "అవఘళించు" మున్నగురీతినె శబ్దరత్నాకరమున నుదాహరించెను. అట్టివాని ననింద్యగ్రామ్యము లనియైనఁ జెప్పలేదు. ఇట్టిస్థితిలో మహాప్రాణాపేఘటిత కఱకంఠాది వైకృతశబ్దముల ననింద్యగ్రామ్యములని యాతఁడు వ్రాయుటలో యుక్తి యేమియుఁ గన్పట్టదు. ఆంధ్రదేశ్యములందే మహాప్రాణము లుండఁదగినపు డింకఁ దద్ఘటిత తద్భవశబ్దములకు గ్రామ్యత యెట్లుకల్గును? (వై-పా-౬౨౨ విష) అర్వాచీనమహాకవులు మహాప్రాణఘటితదేశ్యశబ్దములను బ్రయోగించి రనుటకు దిఙ్మాత్రముగ నుదాహరించెదను. క. ఢుంఠిపు (విస్తర) భైరవుని శితి। కంఠు విశాలాక్షి దండకరు జాహ్నవి వై।కుంఠపతి గుహుని లోలా।ర్కుం లేవలు మీఱ భూవరుఁడు పొడఁగనియెన్ ॥ (కవిసింగరన్నగారి త్రైశంకవో పాఖ్యానము. (అప్పక-౫ఆ-౧౫౭-ప) ఇందలి యాంధ్రదేశ్యమనఁబడుచున్న నవ్యలేవ శబ్ద తకారము ప్రాసగతమగుట మార్పరానిదై యున్నది. శా. మక్కామండుప పండువా భయదదోర్గాహాత్మ్య ఘాటీమహా। తుఖ్ఖార ప్రతిరుద్ధ భూఖపన హిందూరాజ్యసంస్థాపనా। ప్రాక్షదోృత...। ప్రక్షర్వీకృత...॥ (నరస-౫ఆ-౨౭౭-ప) ఇట్టికవి ప్రయోగమును జూచికొనక శబ్దరత్నాకరకర్త "మక్కా-వై-వి-యవనదేశమునందలి ముఖ్యపట్టణము" (శ-ర) అనివ్రాసెను. "మక్కా- ద్వీపాంతరమునందలి యొకపట్టణము, 'మఘః' అనునది ప్రకృతి" (వైకృదీ) తురుష్కుల పుణ్యక్షేత్రవాచకమగు నీమఖ్ఖాశబ్దము మఘశబ్దభవ మనుట విశ్వసనీయమై యుండలేదు.

సంజీవని - ౨౨ II విషయము:—శబ్దరత్నాకరకర్త యిట్టి మార్పరాని కవిప్రయోగములుగల చోటులందుమాత్ర మనాంధ్రవర్ణముల నాంధ్రదేశ్యవైకృతము

---

విస్తర ౨౨-I విష:—"ఢుణ్ఢిః పు. శ్రీగణేశవిశేషే. యథా:-శ్లో-అన్వేషణే ఢుఢి రయం ప్రథితోస్తి ధాతుః।సర్వార్థఢుణ్ఢితతయా భవ ఢుణ్ఢినామా। (శబ్దా-చిం) శ్లో-ఢుణ్ఢాన్వేషణ ఇత్యేకో। ఢకారాన్తః ప్రకీర్తితః (కవికల్పద్రుమ) అను ప్రమాణములనుబట్టి ఢుంఠిశబ్ద మపశబ్ద మనవలసియున్నది. కాని నీ-కంఠాగ్రకరిరాజు ఢుం(ఢు?)ఠివిఘ్నేశుండు (కాశీ-౧-ఆ-౨) అను శ్రీనాథమహాకవి ప్రాసప్రయోగము ఠకారస్థితికిఁ బ్రమాణముగఁ గన్పట్టుచున్నది.

లలో ననింద్య గ్రామ్యములుగ నంగీకరించి తక్కిన యాచ్ఛికశబ్దములలోని యనాంధ్ర వర్ణములను దొలఁగించుట యుక్తము. శబ్దరత్నాకరకర్త "మజ్జా-మాస్టీఁడు-బళీ" శబ్దముల నంగీకరింపకఁ మజ్ఝా-మాష్టీఁడు-భళీ శబ్దములను ప్రమాణప్రదర్శనము లేకుండఁగనే యుదాహరించెను. అట్లె జఱభిశబ్దమున భకారము నంగీకరించెను, 'జేఱబి'అనుటలో విరోధము కన్పట్టదు. ఇట్టె తపర-తావు-ఢాకశబ్దములలో ననాంధ్ర వర్ణము లున్నవనియు నవియన్యదేశ్యము లనియు నప్పకవ్యాదులు చెప్పిరి. కాని యవి వరుసగా 'వతర-స్థావర-డాక-శబ్దభవములనియు 'టపర-టావు-డాక' అనురూప ములతో నంగీకరింపఁ దగినవనియు గ్రహింపవలయును. ఠీవిలోని ఠకారమును నిర్వహింపఁజాలు కవిప్రయోగము లేమింజేసి 'టీవి'యని యంగీకరించుటే యుక్తము (విస్తర)

---

విస్తర-౨౨ II విష:—ఆ-వె-ఠపర ఠీవి ఠేవ ఠావును ఢాకయు। మొదలుగా ద్వితీయములు చతుర్థ। వర్ణములును గలుగువాక్యంబులును స్వదే। శ్యములుగాని వైకృతములు గావు (అప్పక-౨-ఆ-౧౩౮-ప) (గిడుగువారి సంస్కరణము) ఆ-వె-ఠపర ఠీవి ఠేవ ఠావును ఢాకయు। మొదలుగా ద్వితీయములు చతుర్థ।వర్ణములును గలుగువాక్యంబు లన్యదే।శ్యములు గాని వైకృతములు గావు. (అహోబలపండితీయ పాఠము. అహో ౧౮౨ పు) ఈ రెండుపాఠములలో గిడుగువారి పాఠము సరి కాదని తోఁచుచున్నది. సీ...స్వర్ణాక్షరములందుఁ బంచవర్గములను; సమములై యుండు నక్షరములు ప:।...తే-గీ-జగతి శుద్ధాంధ్రదేశ్యభాషాపదముల। వెదకినను లేవు... (అప్పక ౨-ఆ-౫౮-గిడుగువారి సంస్కరణము) అని చెప్పినయప్పకవి ఠవ రాదు లాంధ్రదేశ్యములని వచింపఁజాలఁ డనుట యుక్తము.

పయిని వ్రాసిన సంజీవనీవిస్తరములను బట్టి యీ క్రింది యాధునికవ్యాకర్తల వ్రాఁతలు సరికా వనఁదగును. "ఠపర-ఠేవ-ఠావు-ఢాక-యిత్యాదు లనాంధ్రవర్ణయు క్తాన్యదేశ్యములు" (గాణ-౭౩-పు) "ఠపర-ఠావు-ఠింగణా-ఢాక-మజ్ఝా-భళీ-ఇత్యాదు లన్యదేశ్యములు-మజ్జా-బళీ యనురూపములను నిఘంటువులందుఁగొందఱు నిరూ పించిరి. కాని యవి మజ్ఝా-భళీ యనువాని రూపాంతరములు." (ఆం-భా-అ-సంజ్ఞా-౧౧-సూ-ప్ర-ము) "జఱభి-మజ్ఝా-మాష్టీఁడు-భళీ-ఇట్టివి దేశ్యములు. ఠావు-ఢాక-ఠింగణా...ఇట్టి వన్యదేశ్యములు. దేశ్యములో నొత్తక్షరములు లేవనుటకు మజ్జా బళీ ఇత్యాదిరూపములను నిఘంటువులు చూపినవిగాని అది సరిగాదు" (ఆం-భా-ఆ-౧౧ సూ-తృ-ము.)

పైపాఠిలో తేవ యనువానిలోని తకారమునకు మాత్రమే ప్రయోగము గలదు, 'ఠావ్ర-తవర-ఢాక' యనువాని నిజస్థితి టావు-టవర-డాక యనియుఁ పైపంజీవిలోఁ జూపఁబడెను. ఇవి వరుసగా "స్థావర-వఠర-డాక" శబ్దభవము లనియు పంజీపనిలో వ్రాయఁబడెను. "వఠరః-పు - మూర్ఖే"...త్రి - శఠే - మన్దే - (శబ్దా-చిం) "వచి-మనిభ్యాం చిచ్చ-వఠరో మూర్ఖః" (సి-కౌ-౭౧౭-సూ-ఉణాది) "వచ పరిభాషణే-మన జ్ఞానే-ఆభ్యా మర ప్రత్యయః స్యాత్-సచ-చిత్-ఠకార శ్చాన్తా దేశః" (బాలమ). ఇట్లు సంస్కృతమునఁ బ్రసిద్ధమైన వఠరశబ్దపు వైకృతరూపము వర్ణవ్యత్యయపరిణామమున 'టవర' అనియేర్పడును. (వై-పా-౨౬౨ విప) వర్ణవ్యత్యయము లేని 'వటర' యను వైకృతమును గలదు. "వఠర" దే-వి. ద్విపద - వఠరవై కొంచెపువాఁపైఁ జూపు।నటన మామ్ముందఱ నడవ దెల్లపుడు (భాగ.౧స్కం, తవరను మాఱురూపము-శ.ర) ఇది కేవలము ప్రామాదికము. పై ద్విపదలో "వటరవై" అను నది కవిప్రయుక్తపాఠ మని యందలి ప్రాసము విశదీకరించుచున్నది. శబ్దరత్నాకర కర్త 'తవర' శబ్దనిర్వాహమునకయి వెనుకటి ఖాణశబ్ద సందర్భమునందువలెనే (౨౧ II విష-విస్తర III) యిచటను బ్రమాదమునకుఁ బాల్పడియెను. ఇచటనైత మీఁ క్రింది విజయవిలాసపద్యములోఁ గవితలంచిన శబ్దాలంకారముతోఁ దృష్టి సందక శబ్దరత్నాకరకర్త శబ్దాలంకారాతిశయ సంఘటనాభిలాషము నందుటయే యీతని నిట్లు భ్రమపెట్టినవి. "తవర-దే-విణ-నేర్పరి. క-కొమ్మపయిఁ బక్షపాతము। నెమ్మెయి నెఱపుమ విదేల యేఁచెద వకటా।కమ్మగ నవాతు చక్కెర।కమ్మగ మాటాడు తవర కలకంఠవరా (విజ-౩-ఆ)" (శ-ర) ఇట "మాటాడు టవర" అనియే నిల్పి యథా లాభముగ శబ్దాలంకారతృప్తిని గవితోపాటుగఁ గోశకర్తయు నందుట యుక్తము కదా.

డాక యనునదియు డాక శబ్దభవమే, ఢాక కాదు-ఢాక యనునది వ్యావహారికరూపము. "ఖల ంచిభ్య ఇని ర్వక్తవ్యః-డాకినీ." (సి-కౌ-౧౨౬౦-సూ-విప-౨౭ ౩వ వార్తి) "డాకినీ-స్త్రీ-కాళీగణవిశేషే।డాకానాం సమూహే" (శబ్దా-చిం) "డాకినీ-స్త్రీ-డాకానాంసమూహః-ఇని-కాళ్యాగణభేదే"-(శబ్దస్తో) వీనినిబట్టి-'డాకము=పిశాచము' అను సంస్కృతసమమునందు స్త్రీసమతారూప శబ్దవికృతియు, భీకరత - ఘోరత మున్నగు నర్థముల లబ్ధిచే నర్థవికృతియు నుండుటచే డాకశబ్దము డాకశబ్దభవమె యనఁదగును. శబ్దరత్నాకరకర్త 'డాక' అనియె దేశ్యముగా నుదాహరించెను. సూ-రా-నిఘంటుకర్త లదిచూచి 'డాక' శబ్దమునట్లె యుదాహరించుటయేకాక యూవివరణమున "ఢాక అన్యదేశ్యమనియు చతుర్థవర్ణయుక్తమనియుఁ ఆ-వె-తవర

-తీపి తేవ తావును ఢాకయు!...అన్య దేశ్యములు గానివైకృతములుగావు అని అప్పక-౨-ఆ-౧౩౭ లో కలదు. కాని నిర్ధారకప్రయోగములు లేవు" అనివ్రాసియు మరల "ఢాక-వి-విజృంభణము..." అను వర్గచతుర్థయుక్త ఢాకశబ్దమును దేశ్యముగాఁ జూపుటయు "క...|పెల్లుగ ఝళిపించు వ్రాలు పెనుఢాకను..." అనురీతిదుర్బల ప్రమాణములు చూపుటయుఁ బూర్వాపరసందర్భశూన్యముగా నున్నవి.

'తావు' అనుచో 'టావు' అనునది యంగీకార్యము. తావుశబ్దము వైకృతమనియు నవాంధ్రవర్ణయుక్తిచే ననింద్యగ్రామ్య మనియు శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. కానివైకృతదీపికయందు దీనిప్రకృతి చూపఁబడలేదు. అట్లగుటంజేసి కావలయు సూ-రా-నిఘంటుకర్తలు-టావు-తావు-తావు-శబ్దములను మూఁడిటిని దేశ్యములనుగాఁ జూపిరి. సీ-హరిద్రరుచిసమానాకృతులగు తావు లడరెడు...(ఛిరా-ర-ఆ-౫౦) అను నిట్టి దుర్బలప్రయోగములనె చూపిరిగాని తవర్ణమును నిర్వహింపఁజాలు ప్రాసప్రయోగమును జూపఁజాలరైరి. ఇట్లు తకారమును నిర్వహించు ప్రబలప్రయోగము లేమింజేసియు నిర్మూలముగ నవాంధ్రవర్ణముల నాంధ్రదేశ్యములో నంగీకరించుట సంప్రదాయవిరుద్ధ మగుటంజేసియు స్థావరశబ్దభవములగు తావలము-తావు-టావు శబ్దముల నంగీకరించుట యుక్తము. కం...తొల్లిటి!తావున నిడి మహిమతో విడంబించుటయున్ (వి-పు-౭-ఆ) అనియిట్లు శబ్దరత్నాకరకర్త యిట్టి వివాదస్థలములందు "టకార"ము నిల్పినను క్షతిలేని యతిస్థానగతప్రయోగములను జూపుచు తీవి ప్రభృతిశబ్దములను సైతము మహాప్రాణవర్ణముతోనె చూపెను. సీ-తీవియుఁ దేజుఁ బాడియు మగంటిమి తాల్మి. (అచ్చ-రా-యుద్ధ-శ-ర) క-తవతవ లే కరుగుదుము హుటాహుటి నడలన్॥ (స్వా-౧-ఆ-శ-ర) తవణిల్లు గండపెండారమమర. (కాశీ-3-ఆ-శ-ర) సీ-డాకొల్పు వజ్రంపు తవిణ యనఁగ. (భాను-3-ఆ-శ-ర).

తీవి-తేవ - తవణిల్లు - తవిణ - మున్నగునవి హిందీకోశములలోఁ గన్పట్టలేదు. కావున వీనిని, టీవి-టేవ-టవణిల్లు-టవిణ-మున్నగురీతి నాంధ్రదేశ్యములుగ నంగీకరించుట యుక్త మని తోఁచెడిని. ఠింగణా మజ్జాశబ్దములు హిందీకోశములలోఁ గన్పట్టుచున్నవి. కావున నట్టివాని నన్యదేశ్యము లనఁదగును. జరాభీ శబ్దభవ మనఁదగు 'జేబుభి' శబ్దము నంగీకరించుట యుక్తము. కులటకు జరాభీతి యుండుట సహజముగదా. సూ-రా-నిఘంటువున దీని కనేకప్రయోగములు చూపఁబడినవి. అందొక్కటైన నింపలి "భ" కారమును నిర్వహింపఁజాలు నది లేదు. ఆ-వె॥ "జలభితనము లెందుఁ గలచి తీవు" (నన్నె-కు-౬-ఆ-౬౭3-ప) అనురీతి ప్రబలప్రయోగములచే నిందు నలఘురేఫ మున్నదనుట నిశ్చితము. సూ-రా-నిఘంటుకర్తలు "జేలభుఁడు

సంజీవని ౨౩ I విష:—ధ్వన్యనుకరణశబ్దములం దర్వాచీనకావ్యములలోనే కాక ప్రాచీనప్రయోగములందును మహాప్రాణఘటితశబ్దము లుండుట విరుద్ధము కాదు. ధ్వన్యనుకరణశబ్దము లోకభాషలోని వనిపించుకోనవు కావున వానిలోని మహాప్రాణములను దొలఁగింపరాదు. క...నిస్సాణజ। ఢాంకృతులును గలసి యుద్భటంబుగఁ బెడిగెఁ (భీష్మ-౩౩-౧౩౩) (పెలుగు=విజృంభించు) తే-గీ-ఢాంఢ మితి ఢక్కకాధ్వానము ఢంలీని। నాదమును (అథర్వణభా-విరా-అప్పకవీఆ-౧౫౫౪) ఢంకశబ్దమే సంస్కృతకోశమునందును లేదుగాన డకారప్రాస మనరాదు. (౧౩విష)

సంజీ ౨౩ II విష:—శబ్దరత్నాకరకర్త 'కఠిల్లు-పెఠిల్లు' మున్నగువానిలోని మహాప్రాణముల నంగీకరించియు 'గుభేలు-ధింధిం-ధిమిధిమి-ఛళఛళ-భోరు' మున్నగు శబ్దములలోని మహాప్రాణములను దొలఁగించుటకు యుక్తియేమియు లేదు. క-వెను గుబ్బలి పడినగతి గుభేలునఁ బడియెన్॥ (రామా-౮౫-౪-౨) వెనుగుబ్బలి పడినధ్వని ననుకరించునపుడు మహాప్రాణభకారఘటితశబ్దమే యర్హముకదా.

సంజీ ౨౮ విష:—మూఠాను-వచ్చాను-మున్నగుచోటులందు వ్యావహారిక భాషలో "ఇవర్ణాఉవర్ణమిశ్రణమునఁ దాలవ్యావేశముగల "అ-ఆ" అని గుఱితింపఁ దగిన విజాతీయధ్వనులు వినఁబడుచున్నవి. ఇట్లే "సాఫుగ-ఫసలీ-ఫారము-ఫీజు-మున్నగు శబ్దములలోఁ బైరీతిని గుఱితింపఁదగిన ('f') 'ఫ' అను ధ్వనివంటి ధ్వని వినఁబడును. సీ-(క-కలుబు) పాపి-దుష్టుఁడు-చ-ఎఱిఁగితి మద్దిరయ్య తడవేటికి గుఱ్ఱపుదొంగ వీఁడె యీజలభునిఁ బట్టి చంపుఁడు... (భాగ-౯-స్కం-౨౦౭)...ద్వి-తొలగాని జలభుల కొయ్యనగాండ్ర (బసవ-౫-ఆ-౯౧) (సూ-రా-ని) అని జలభుఁడు శబ్దమును జూపిరిగాని యచట సైతము "జలబి=పాపి" అనిచూపుటలో క్షతికానరాదు.

"పరిషవము-కఠిల్-పెఠిల్-మొదలగు దేశ్యములందును కంఖాణము-ఖంగులు-పైఠిణీ-మొదలగు నన్యదేశ్యములందును..." (బా-సా పే-సంజ్ఞా-౪-సూ-వ్యా) అను పేటికాపంక్తులును సరికావు. కంఖాణశబ్దము సంస్కృతము - అన్యదేశ్యము కాదు. "కంఖాణః-అ-పు-అశ్వః" - (సర్వశబ్దసంబోధినీకోశము) మ-తదుదగ్రజైత్రయాత్రాసము। త్కలికారింఖ। దసంఖ్య సంఖ్యజయన త్కంఖాణ రింఖావిశ్రం। ఖల...(రాఘు-౧-ఆ-౯౪) కఠిల్-పెఠిల్ శబ్దములు ధ్వన్యనుకరణములె కాని యొకభాషలోనివి కావు. 'ఖంగు' అనుదానిని సవరించి శబ్దరత్నాకరకర్త 'కంగు' అని చూపెను. తక్కిన పరిషవ-పైఠిణీశబ్దములందును మహాప్రాణములను నిర్వహించు ప్రబలప్రయోగము లగపడవు.

చున్నది. 'బ్రహ్మ-జిహ్వా' మున్నగువానిలో "బ్రమ్హ-జిన్హ" మున్నగురీతిధ్వనులు వినఁబడును. ఇట్టివెల్ల నపభ్రష్టములె యగుటంజేసి యుపేక్ష్యములు-వీనిని మహాకవు లెవ్వరును నంగీకరించినజాడ కన్పట్టదు (వై-పా-౬౭౮) విస్తర)

సంజీవని ౨౫ విష:—అచ్చాంధ్రవర్ణసమామ్నాయములోని ళకార మలఘువు కాదనుటకు నందలఘురేఫమును జేర్పకుండుటయె నిదర్శనము-లఘ్వలఘువు

---

విస్తర-౨౮ విష:—"అ-ఆ-ఫ" ఈ మూఁడును దెలుఁగున జేరినవి...ఉదా. తాటి+ఆకు=తాటాకు, ఇట్లు మఱ్ఱాకు-కొట్టాఁడు (వ్యావహారికశబ్దములో నర్థబిందు వుండవలెనా ?) వెళ్లావు - ఇచ్చాను - మొదలగుశిష్టప్రయోగములు ప్రసిద్ధములు - మూఁడవ దన్యదేశ్యములతోఁ గలసి చేరినహల్లు...కాఫీ" (ఆం-భా-అ-సంజ్ఞా-౧౮-సూ) తెలుఁగునఁ గావ్యభాషావిషయమున మహాకవిప్రయోగముగాని పండితమహాకవీంద్రలక్షణముగాని ప్రమాణము. అట్టి ప్రామాణ్య మీ ధ్వనులకుఁ గన్పట్టలేదు. మహాకవుల గ్రంథములలోఁ బ్రయుక్తములగు 'తాటాకు' మున్నగు శబ్దములలో నీధ్వనులు తత్తత్కవులచే నుద్దేశింపఁబడినవని నిర్ణయించుట కవకాశము కానరాదు. ఉ.............తా।టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాప మంచు...(తారాశ) క-మఱ్ఱాకునఁ బండెడు దొర।గుఱ్ఱానకు...(జైమి-౪-ఆ-౧౮౦) క-ఇమ్మహి రామానుజవిభు। నమ్మాజమ్మకు...(పాండు-౧-ఆ-౭౪-ప) చ...ఆధర ణీంద్రుఁడు బైచమాంబికన్ (నరస-౧-ఆ-౮౫-ప)"కంచంత కాపురము,వెండుంగరము" (అహో-౧౯౮-పు) పైడందెలు గల్లుమన (రాజశే-౧.ఆ) తాటాకుమున్నగుశబ్దములలో 'అ-ఆ' మున్నగు శుద్ధస్వరములె తత్తత్కవులచే నుద్దేశింపఁబడె ననుటకు వాని వాని శుద్ధస్వరములతోడి యతిప్రయోగములు నిదర్శనములు కాఁగలవు. మఱియు నన్నయాథర్వణాదివైయాకరణు లీనూతనధ్వనులను వర్ణసమామ్నాయమునఁ జేర్పకనలేదు.

ఆధునికవైయాకరణులు కొంత యీనూతనధ్వనుల సంధులు దుష్టములని శ్రుతికటువులనియుఁ (బా-గు-ప్ర-సంధి-౮-సూ-వ్యా) (విస్తర-౭౦-విష) జెప్పిరి కాని యది సరికాదు.క-సవతాలికిఁ బతిదలఁచిన...(ఆను-౫-ఆ-౪౯-౨-ప) సీ...గీ...తగుమాట గానాట।గాదు...(ఆశ్వ-౧-ఆ-౩౮) ఇట్లుసోమయాజియే యిట్టి సంధులను బ్రయోగించి యున్నాఁడు. అట్లయినను బ్రాచీనవైయాకరణులు వీనియందలి స్వరములు శుద్ధములె యనుతలంపున విశేషించి వర్ణింపరైరి. నాగరకవ్యవహారోచ్చారణమె ప్రమాణీకరించినచో "చ-అనవలసంటిగా కెలుఁగవా యొకమాటనె మర్మకర్మముల్

లకుఁ బృథగ్గణనము చేయుట సంస్కృతవ్యాకర్తృసమ్మతము కాదని యీావలకె నిశ్చేకరింపఁబడెను (౮-౯-౧౦-౧౧-౧౪-౧౭ విష) "వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరముగాని, యలఘుళకారము కాదని యెఱుంగునది" (౫౦ విష) అని సూరిగారే వక్కాణించిరి-కాన గయ్యాళి త్రుళ్ళు మున్నగువానిలోని ళకార మలఘుళకారము కాదు. అది వేఱొకవర్ణము.

సంజీవని ౬౬ విష-అత్వవిశిష్ట చ జ లచ్చాంధ్రమున దంత్యములె యగును గానఁ దాలవ్య చ జ లను వర్ణసమామ్నాయమునఁ జూపుటలో నత్వవిశిష్టముగ నిల్పరాదని చెప్పఁదగదు. వర్ణసమామ్నాయోదాహృతవర్ణములందలి యత్వముచ్చారణమాత్రఫలకమె కాని వేఱువిధము కాదు.

సన్నయా
౨౭ విష.

అన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్ -
(ఆం-చిం-సంజ్ఞా ౫ కారి-అహో ౧౩౨ పు)

కల్ప-౨౭ విష:—ఈ సూత్రమున కీవలకు వ్యాఖ్య చేయఁబడెను- ౨౦-విష. "స్వాతన్త్ర్యేణ పాదయక్షరాణాం ప్రవేశో నాస్తి-కింతు షణ్ముఖుఁడు-శరీరము - భళీ - మజ్ఝ ఇత్యాది తత్సమాది ద్వారా ప్రవేశ స్సంభవ తీత్యర్థః (అహో ౧౪౦ పు) భళ్యాదుల విషయమున నీవలకు విమర్శింపఁబడెను. (౨౨ II విష. సంజీ.)

బాలవ్యాకరణ
వివరణము ౬౭ I
విషయము.

ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ
ఙ ఞ శ ష లు సంస్కృతసమంబులను గూడి తెలుఁగున
వ్యవహరింపఁబడును. ౪.
ఋతువు-పితౄణము-క్లృప్తము-ౡకారము-దుఃఖము-
ఖడ్గము-ఘటము-ఛత్రము-ఝరము - కంఠము-ఢక్క-
రథము-ధరణి-ఫణము-భయము-పఙ్క్తి-ఆజ్ఞ-శరము-
షండము.

---

(విజయ) మున్నగుచోట్ల 'అనవలశంటి' అనురీతిని శకారాదేశాదులను విధింపవలసి యుండును. ఇంతియకాక-"తిత్తివెండుంగరము వ్రేల హత్తియుండ." (హంస-౪-ఆ) మున్నగుచోట్ల - 'ఉ' అనునది మొదలగు ననేకాపభ్రష్టధ్వనుల నంగీకరింపవలసి వచ్చును. భ్మ(బ్రహ్మ) వ్వ(జిహ్వ)మున్నగు ననంతాపభ్రంశముల నంగీకరింపవలసి యుండును. "కాఫి" అనుసామాన్య ఫకారముతోడిరూపమె శబ్దరత్నాకర నూతన ముద్రణమునం దుదాహరింపఁబడెను. శబ్దరత్నాకర ప్రాచీనముద్రణమున నీశబ్దము లేదు. ఇదే యననేల? ఈ నవీనముద్రణమునఁ గన్పట్టుచున్న యిట్టి యన్యదేశ్యము లెవ్వియుఁ బ్రాచీనముద్రణమున లేవు. ఇవియెల్ల నేటివారి ప్రక్షిప్తములె. ఇవి శబ్దరత్నాకరకర్తృసమ్మతము లని భ్రమింపరాదు.

సంజీ-౨౭ I విమ:—సూరి యన్యదేశ్యముల నంగీకరింపనివాఁ డగుటంజేసి సంస్కృతసమములనుండిమాత్రమె ఋప్రభృతివర్ణముల ప్రవేశమును జూపెను. సంస్కృతసమంబులను గూడి యనుటచేఁ దత్సమములెయగు ప్రాకృతసమములలోని మహాప్రాణాదిఘటితశబ్దములకుఁ దెల్గునఁ బ్రవేశము లేదని విశదమగుచున్నది. ఋూకారఘటితప్రత్యేకశబ్దము సంస్కృతమునఁ బ్రసిద్ధమై యుండమింజేసి "పితౄ+ఋణమ్=పితౄణమ్" అను సంధిస్థల ముదాహృత మయ్యెను. ఌకారమున కట్టిస్థలము లేమింజేసి "ఌకారము" అనిమాత్రమె యుదాహరింపఁబడెను. గుప్తార్థప్రకాశికాకర్త 'క్లృప్తము' అనిచూపక "క్ఌప్తము" అనిచూపుటచే (బా-గు-ప్ర-౪-పుట-ప్ర-ము-౪-పుట-టీక-ద్వి-ము) ఌకారము హల్లుపయి నిల్చునపుడు "అ" కారానుమాపకమగు తలకట్టు వ్రాయరాదని యాతఁడు తలంచెనని తోఁచుచున్నది. ఆపక్షమునందు దుఃఖము మున్నగుచోటులందలి యుకారలేఖనమునందును బితౄణమనుచోటి ఋూకారలేఖనమునందును దలకట్టుల నేల నిల్పెనో తెలియకున్నది.

సంజీవని-౨౮ విమ:—ఞకారమున కగతికముగా సూరి పఞ్జికా శబ్దము నుదాహరించెను. "అనుస్వారస్య యయి పరసవర్ణః" (౮-౪-౫౮) (సి-కౌ-౧౨౪-సూ) అను పాణినిసూత్రముచొప్పున సమానపద మందనుస్వారమునకు వర్గాక్షరపరకత్వమునఁ బరసవర్ణాదేశము నిత్యముగా నగునుగాన నచట ఞకార ముండక నరాదు. ఆంధ్రవైయాకరణపండితకవీంద్రు లీపరసవర్ణాదేశము నుపేక్షించుటంజేసి యాఞకారస్థానమున నిండుసున్నయె నిల్చునుగాన నది సరియగు ఞకారోదాహృతి కానేరదు. "వా పదాన్తస్య" (౮-౪-౫౯) (సి-కౌ-౧౨౫-సూ) అనుచొప్పున సంస్కృతమందె "సంగమః-త్వంకరోషి" మున్నగు పదాంతస్థలములలో నీ పరసవర్ణాదేశమునకుఁ బాక్షికత యంగీకరింపఁబడెను. ఆంధ్రమహాకవులును నాంధ్రలాక్షణికులును బదాంతమందే కాక పదమధ్యమం దనఁగా సమానపదమందును నీపరసవర్ణాదేశము నుపేక్షించిరి. భారతాదిప్రాచీనమహాకావ్యములం దెచ్చటను "క - మిాన్తరఁగల సంతోషా। క్రాన్తులు జాలరులు గనిరి రహి నన్నదిలో" (కల్పితపద్యభాగము) అను రీతిగల పరసవర్ణాదేశస్థాపక ప్రయోగములు గన్పట్టలేదు. ఇంతియకాక యీక్రింది రీతిని వర్గపంచమాదేశనిరాసక ప్రయోగములు సైతముచూపట్టుచున్నవి. క-పంగుల మూకాంగుల వికలాంగులను నబాంధవుల దయం బ్రోతె భయార్తుం గడిఁదిశత్రునైననుసంగరరంగమునఁ గాతె శరణంబనినన్ (సభా ౧ ఆ ౨౫౫) (విస్తర)

విస్తర I-౨౮ విమ:—గుప్తార్థప్రకాశికాకర్త "నిండు-పాణ్డవ" అనువాని ప్రాసమును జూపి యందొకట బిందువును నొకట ననునాసికమును గలవనియు వానిలో

కొన్ని చోట్ల సంస్కృతసమాసిక్యములు నొకమూర్ధన్యతయు నుండఁగా వేఱొకట నొక సమాసిక్యములు ద్విగుణమూర్ధన్యతయు నున్నను ప్రాసవిషయమున నట్టి యీష ద్భేదమును మనిపకీడేమనియు నట్టిప్రాసము సంయుక్తప్రాసమె యనియు నిట్లు ప్రాసప్రకరణప్రేరితవిషయములను బహునాలుగుపుటల గ్రంథముతో విస్తరించి (౮౮౮- ౯౦-పు. ఆం. వ్యా. ప్ర.) తుది కట్టిసంస్కృతసమములలోఁ బరసవర్ణాదేశము నుజ్జగించి వర్గపంచమాదేశమును నిల్పుటే యుక్తమని తనయాచర్చ నుపసంహరించుకొనెను.

విస్తర II-౨౮వ విష:—ఆంధ్రచ్ఛందో లక్షణశాస్త్రజ్ఞులయిన కావ్యాలంకార చూడామణికారాదులగు ప్రాచీనులుసయితము బిందుయతికి సంస్కృతశబ్దము నుదాహరించుటయు వర్గపంచమాదేశనిరసనమునకు నిదర్శనమె యనఁదగును. నిత్య మనునది గాకున్నను బాక్షికముగనైనఁ బరసవర్ణాదేశము సమ్మతమె యైనచో వర్గ పంచమయుక్తసంస్కృతశబ్దములలో సంయుక్తయతిపద్ధతిని వళి చెల్లుచుండఁగా బిందు యత్యంగీకారము చేసియుండరుగదా. చ-కినుకఁ జళుక్యవంశనృపకేసరి చేసినచోఁ గృపాదంబనమునఁ గల్గుఁ బో సురగణత్వము తత్పదవారిజాతవం।దనమునఁ గల్గుఁబో మనుజనాథత తప్పటదర్శనావలం। బనమునఁ గల్గుఁబో గగనమధ్యనివాసము వైరి కోటికిన్ (కావ్యాలం-౭-ఉల్లా) బిందుయతి. తే-గీ-జాకు వడిచెల్లు రత్నకంకణ మనఁగ ఙాకు వడిచెల్లు బర్హిపింఛం బనంగ।...(కవిజ-సంజ్ఞాధి-౮౮-౮౯-ప). అప్పకవి యనుకృతసంస్కృతవిభక్త్యంత శబ్దములనుసైతము బిందుయతి కుదాహరించెను. బిందుయతి - తే-గీ-జ్ఞానవేద్యాయ తప్తకాంచనవిభూష। ణాయ మేచకవర్ణకంఠ ప్రియాయ। నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత। మనసిజాతాయ గోపడింభాయ యనఁగ॥ (అప్పక-౩-ఆ-౧౩-ప).

విస్తర III-౨౮వ విష:—పయిరీతిని వర్గపంచమాదేశము ప్రాచీనకవిపండిత లాక్షణికసమ్మతము కామింజేసి యే సూరి జకారోదాహృతివిషయమున నట్లుగటికవర్గ పంచమాదేశము నంగీకరించినను "కంఠము-షండము" అనుశబ్దములను బిందుయుత ములుగనే యుదాహరించెను. తెనుఁగువిభక్తి చేరునపుడే యిట్టి మార్పు గల్గునుగాన "కంఠము - షండము" మున్నగునవి తద్భవము లనరాదు అవి తత్సమములె. సూరి తలంచినట్లు జకారోదాహృతికి గతి లేకపోలేదు. స్వరపూర్వకస్థలములందే బిందువు నకు వర్గపంచమాదేశము తెల్గున రాదుగాని, బిందువు నిల్పుటకు వీలుపడని హల్

సన్నయాథర్వణీయము ౨౯ I విషయము.

దీర్ఘః స్యా ద్వర్ణనిర్దేశే ప్రత్యయోऽన్యత్ర చ క్వచిత్ ।
కేషాంచిత్ ప్రత్యయేనైవ । తత్ప్రయోగ స్తు సమ్మతః ॥
ద్వన్ద్వే తు స్త్రీవ దిష్టం స్యాత్ । క్వచి ద్రూపం నపుంసకే ॥
(వికృ-అజం - ౮౮-౧౫౭-కా-అహో-౩౬౮-౩౬౫-పు).

కల్ప-౨౯ I విష:—వర్ణనిర్దేశే=ఆయావర్ణముల నిర్దేశవిధానములందు, దీర్ఘః= వానికి దీర్ఘము కల్గును. అన్యత్ర=పక్షాంతరమున, క్వచిత్ = ఒకానొకప్పుడు, ప్రత్యయశ్చ = కారేఫప్రత్యయములలో నొకటి వచ్చుటయుఁ గలదు. ఉదా:—కాకు గా వచ్చును = కకారమునకు గకారము వచ్చును. రాకు లా వచ్చును=రేఫమునకు లకారము వచ్చును. జాకువడి చెల్లు రత్నకంకణ మనంగ । ఝాకు వడి చెల్లు... (కవిజ - సంజ్ఞాధి-౭౯-ప) కేషాంచిత్ =కొన్ని యక్షరములకు, ప్రత్యయేనైవ=కారప్రత్యయముతోనె, తత్ప్రయోగస్తు=దాని ప్రయోగము, సమ్మతః = సమ్మతమైయుండును. ఉదా: "ఆకారమునకీకారము వచ్చును" మున్నగుచోట్ల దీర్ఘవిధానమర్థసందేహజనక మగును గాన దీర్ఘాక్షరములకుఁ గారప్రత్యయప్రయోగమె సమ్మత మగుననిభావము. అట్టి

---

పూర్వోక్తస్థలములందు వర్గపంచమమె నిల్చును-కాన జకారస్థితికి "శార్ఙ్గము" అని యుదాహరించుట యుక్తము (అనుబంధము).

---

అనుబంధ-విస్తర III-౨౯ విష:—ఇట్టి యాశయముతోనె నే నొకప్పుడు జకారమునకు 'శార్ఙ్గ'శబ్దము నుదాహరించుట యుక్త మని ప్రచురింపఁగా నందుఁ బరసవర్ణాదేశము లేదనియు గకారము లేదనియు నేను వ్రాసిన ట్లారోపించి గుప్తార్థప్రకాశికాకర్త యతిప్రసంగము చేసెను. (బా-గు-ప్ర - అనుబంధ - ౧౮౯-ద్వి-ము).

"అక్కన్ దళితాపత్యానురక్తిన్" (రాఘు-౨-ఆ-౧౨-ప) ఇత్యత్ర "అనుస్వారస్య యయి పరసవర్ణః ఇతి సాధుత్వ మూహ్యమ్." (అహో-౨౧౩-పు) అను నహోబలపతి వాక్యమునుబట్టి పై ప్రయోగము వర్గపంచమాదేశాంగీకారమునకు నిరూపించుచున్నదని చెప్పరాదు. ఆపద్యమున రామాయణార్థమున "కందళిత" శబ్దమందు నెఱసున్నయె కవిసమ్మతముగా నిల్వవచ్చును. అట్టియెడ భారతార్థమున "అక్కన్+దళితాపత్యానురక్తిన్" అనుచోట సహజసరళపరకత్వమునను నిండుసున్న నిల్చుటలో విరోధము లేదు. (బా-సంధి-౧౯-సూ) ఇట్టి ప్రయోగము వర్గపంచమాదేశస్థాపకము కానేరదని నేను బ్రచురింపఁగా (పరిషత్ పత్త్రిక - కాళయుక్తి - మార్గశిరపుష్య) నట్టి వ్రాతను గ్రహింపనేరక గుప్తార్థప్రకాశికాకర్త యతిప్రసంగము చేసెను (బా-గు-ప్ర- అనుబంధ-౧౫౧-పుట-ద్వి-ము).

[illegible] IV-[illegible] విమ:—అర్వాచీనకవుల గ్రంథములందు బంధకవిత్వపు రచ[illegible] [illegible]దేశము పాక్షికముగఁ గన్పట్టుచున్నది. దీనినరసియే సూరి "[illegible]" అను నుదాహృతి కంగీకరించియుండెను.



చక్రబంధము. నరస-ర-ఆ-ఠర-పద్యము—ఈచక్రబంధపద్యమున మూఁడవ వలయమందు నిముడ్పఁబడిన "నారసింహశజ్కితం" అనుదాని సిద్ధికయి "సింధు" అనుచో వర్గపంచమాదేశమును బాటింపకుండుటయు "శజ్కి" అనుచో వర్గపంచమాదేశమును జేయుటయు సంభవించెను. ఆఱవవలయమున "మూర్తికవికృతి" అనుదాని నిముడ్పులో నీవర్గపంచమాదేశప్రసక్తి రాలేదు.

సందేహము కల్గ నపుడు 'ఐకి జౌవచ్చును' అనురీతిని దీర్ఘమె నిల్చుట నిర్బాధము - ద్వన్ద్వేతు = ద్వంద్వసమాసమందైనచో, స్త్రీవత్ = స్త్రీసమత్వ మనఁగా ప్రత్యయ రాహిత్యము, ఇష్టంస్యాత్ = అభిమత మగును. క్వచిత్ = ఒకప్పుడు, మునాపిచ = ముపర్ణకముతోడిరూపమును, సమ్మతమె. ఉదా: కగలు, చజలు-మొ - కగములు-చజములు ననియు నుండనగును. అమహత్త్వమున ముపర్ణకము రావచ్చు ననిభావము. ప్రయోగములు: కం. కచటతపలనఁగఁ బరఁగిన।...(కవిజ-సంజ్ఞాధి-౬౮-ప) క-వలని సచో లళములు డళ।ములు మఱి ఋక్రాంతవర్ణములు ప్రాసములై।...(కవిజ-సంజ్ఞా-౯౦-ప) (కావ్యాలం-౭-ఉల్లా-౯౫-ప) (విస్తర I మొ-V.)

---

విస్తర I-౨౯ I విషః—పయివిషయములలోఁ గొన్నిటిని ప్రౌఢవ్యాకర్త యిట్లు సంగ్రహించెను."౨ సూ. నిర్దేశవిధానోచ్చారణంబులందఱుచుగఅవర్ణాదులు కారప్రత్యయాంతము లగును. రవర్ణ మిఫప్రత్యయాంతము నగు. 3 సూ-ఒకచో హ్రస్వంబు దీర్ఘంబగు. ౭ సూ-దీర్ఘంబు దీర్ఘంబ." (ప్రౌఢ-సంజ్ఞా) "దీర్ఘంబుదీర్ఘంబ" అనుదానిలోని యవధారణముచే "కారేఫములును రాదను" నర్థము సంభవించుచున్నది. దీర్ఘస్థలములలోఁ గారేఫములే రావలె నను నభర్వణాశయమును ప్రౌఢవ్యాకర్త చూచికొన్నట్లు తోఁపదు.

విస్తర II-౨౯ I విషః—'వర్ణా త్కారః (౨౨౨౭-వార్తి) నిర్దేశ ఇత్యేవ - అకారః-కకారః, "రాదిఫః" (౨౨౨౮-వా) రేఫః,' (సి-కౌ-3౨౮౫-సూత్రమునొద్ద) "వా సరూపవిధినా కారోపి రేఫస్య - తేనరకారాదీని నామానిశ్రృణ్వతో మమ పార్వతి. ఇత్యాదిప్రయోగః సాధురేవ - 'అస్యచ్వౌ' ఇత్యాదౌ తు కారప్రత్యయాభావో బాహుళకా దేవ" (తత్త్వబోధిని - ఉత్తరకృత్ -౫౪౦-౫౪౧-పు) ఇట్టిది బాహుళకవిధి యగుటచేతనే వర్ణసమామ్నాయపారాయణాదులలో "కారేఫ" ప్రత్యయములు రాకుండుట విరుద్ధముకాదు.

విస్తర III-౨౯ I విషః—పయి పద్ధతులెల్ల వర్ణములకే కాక గణాదులను బేర్కొనునపుడును దత్తద్గణనామాద్యక్షరములకును వర్తించును. గణాద్యక్షర దీర్ఘముమాత్రము గణద్వితయార్థబోధక మగుచుండును. క...దీర్ఘ।స్వరయుతమై యున్న గణా।క్షరములు తద్గణము రెండుగా నెన్నఁబడున్॥ (కవిజ-సంజ్ఞాధి-౨౧-ప) ఉదా:—జకారమున్।గకారమున్।సుకాంతి కొ।ప్పకుండు నే॥(కవిజ...వృత్తాధి౧౧ప) చ-నజభజజల్ జరేఫలు పెనంగి...(కవిజ-వృత్తాధి౧౦౭) నజభజజల్=నగణజగణ భగణజగణజగణములు. జరేఫలు = జగణరగణములు. పొత్తై।గాగా।పత్తిం।గన్యా (కవిజ-వృత్తాధి-౧౨ప) గాగా=గగణచతుష్టయము.

[illegible]మున [illegible]మును స్త్రీసమత్వమును వచ్చుటయుగలదు. క-పాఘా [illegible] పాపాక్షర (కవిజ-సంజ్ఞాధి-౫౩-ప).

బాలేన్దు పరిధి శృఙ్గావర్త కుశగ్రన్థి దాత్ర పరశు
సమా ఆద్యా ఇభకరతుల్యౌ। స్తద్దీర్ఘా శూన్యల
సన్నిభా వన్యే॥వర శార్ఙ్గ పిప్పలదళా।ఝృక్-శ్ పన్న
గ సన్నిభాః క్రమాత్పరుషాః। స్తమ్భవిలేఖాధి
కృతాస్త ఏవ వర్గద్వితీయవర్ణాద్యాః॥ కీర తరి హ
స్తిమస్తక।శుక్తి తులాసన వితర్ది సీరసమాః। అన్తస్థా
శ్చోష్మాణో।దన్త్యౌ చ జౌ గురురలౌ చ బిన్దుయుతౌ॥
(ఆం-చిం-సంజ్ఞా-౨౦-౨౧-౨౨-కా-అహో-౧౭౯-పు.)

[illegible] యము సూ II విషయము.

కల్ప సూ II విష:—చిరకాలమునుండియు నన్నయనాఁటివఱకును నాంధ్రకర్ణాటభాషలకు లిపియొక్కటియె యై యుండెడిది. అట్టి యాంధ్రకర్ణాటసాధారణలిపి యందుఁ గొన్ని మార్పులుచేసి తెల్గున కొక శ్లాఘ్యమగు ప్రత్యేకలిపిని భట్టారకుఁ డుపదేశించెను. కాని ప్రాచీనలిపి కలవాటుపడిన తెల్గువారిచే నట్టిలిపి పూర్తిగ స్వీకరింపఁబడకున్నను దలకట్టు నొత్తుగుఱుతు మున్నగు కొన్నిమాత్రమె గ్రహింపఁబడినవి. అట్టి స్వకల్పితలిపి స్వరూపమును నన్నయ వివరించుచున్నాఁడు. బాలేన్ద్వ త్యాది:—ఆద్యాః = అకారాదులు వరుసగా, బాలేన్దు = బాలచంద్రునితోఁడను (—=అ) పరిధి=పరివేషముతోఁడను (ం = ఇ) శృఙ్గ = వృషభాదుల కొమ్ముతోఁడను (✓=ఉ) ఆవర్త=సీటిసుడితోఁడను(=ఋ)కుశగ్రన్థి=దర్భముడితోఁడను (=ఌ) దాత్ర=కొడవటితోఁడను (= ఎ) పరశు=గండ గొడ్డటితోఁడను (=ఒ) సమాః= సమానాకారముగల వగుచున్నవి. తద్దీర్ఘాః=వానిదీర్ఘములు, ఇభకరతుల్యాః=ఏనుఁగు

---

విస్తర IV-సూ 1 విష:—వర్ణసంఘాతమును బేర్కొనునపుడును బైరీతులు గలవు. క-శ్రీకారము గలపద్యము...(కవిజ-సంజ్ఞాధి-౫౨-ప) క. పోలఁగ"పు-ఫు-బు-భు"-లకుమూ।పోలికవడి...(కవిజ-సంజ్ఞాధి-౭౩-ప) "శ్రీ" కారము='శ్రీ' అనునక్షరము. పుఫుబుభులకు='పు-ఫు-బు-భు' అనునక్షరములకు - మూ='ము' అనునక్షరము.

విస్తర V-సూ I విష:—అచ్చులపైఁ జేర్పఁబడిన కారప్రత్యయము తపరకరణమువలెనే మాత్రాకాలబోధక మగునని భ్రమింపరాదు-ఉదా: ఇకారంబుమీఁదికు ను వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు. హారిని-హారికిని-శ్రీని-శ్రీకిని-మొ (బా-తత్స-౨౬-సూ).

తొండమువంటి యాకారములు గలవగుచున్నవి (…= దీర్ఘపుగుడుతు) '…'=అ మున్నగు నకారాదిచిహ్నములతో నట్టి దీర్ఘపుగుడుతును జేర్పవలెను. (…=ఆ; …=ఈ; …=ఊ; …=ఋూ; …=ఏ; …=ఓ; …=ఓ(ఇట్లు కొన్నిటం గన్పట్టును) అన్యోన్యతక్కినవనంగా - 'ఐ' కారమును 'ఔ' కారమును, శూలసన్నిభా=శూలము వంటియాకారము (…)గలవగుచున్నవి. అనఁగా ఎకారచిహ్నముతో శూలాకారమును జేర్పఁగా నై కారమును నొకారచిహ్నముతో శూలాకారమును జేర్పఁగా నౌకారమును నేర్పడు నని భావము. (…=ఐ - …=ఔ.) ఇట్లుగ నాంధ్రకర్ణాట సామాన్యలిపిలో నున్నహల్లులపై నిల్చునప్పటి యచ్చులచిహ్నములె వానిప్రత్యేక స్థితిలో నయితముండనగునని నన్నయ సంక్షేపాభిలాషతో నవరించెను.

పరుషాః = కచటతపలు వరుసగా, దర=శంఖముతోడను, (… = క్) శార్ఙ్గ= ఎక్కిడిన వింటితోడను (=…చ్) (నారినాకర్షించిన - ఎక్కిడిన - వింటివలె నుండును) పిప్పలదళ=రావియాకులోని సగముతోడను (… =ట్) అఙ్కుశ=గజాంకుశముతోడను. (…=త్) పన్నగ=పడగయెత్తిన పాముతోడను (…=ప్) సన్నిభాః=తుల్యములగు నాకారములు గలవగుచున్నవి. ఈయాకారము లాంధ్రకర్ణాటసాధారణలిపిలోనివె. స్తమ్భవిలేఖాధిక్యైః= స్తంభాకారరేఖల విలేఖనాధిక్యములచేత, తపవ=అకచటతపల యాకారములె, వర్గద్వితీయవర్ణాద్యాః=తత్తద్వర్గ ద్వితీయాదుల యాకారములగుచున్నవి. వర్గద్వితీయాదుల కాంధ్రకర్ణాటసాధారణలిపిలోఁ బ్రత్యేకాకారకలిపులున్నను సౌలభ్యార్థమును లిపివిస్తృతినిరాసార్థమును భట్టారకుఁ డిట్లు నూతన పద్ధతినిగల్పించెను. స్తంభాకార ( | ) విలేఖనము తత్తద్వర్గప్రథమముల కూర్ధ్వమున లిఖించుట సుకరముగాన నదియె భట్టారకహృదయ మనఁదగును. సంజీవని పదునాల్గవ విషయమున వివరింపఁబడినరీతిని వర్గప్రథమధ్వనులపై వాయుసంసర్గాతిశయ, నాదితానునాసిక్య మేళనములచే వర్గద్వితీయాదుల ధ్వను లేర్పడునుగానఁ దత్తద్వర్ణవైశేష్య సంపాదకసామగ్రి కొక్కొకదాని కొక్కొక స్తంభాకారరేఖ వర్గప్రథమములపై నిల్పుట సయుక్తికమని నన్నయ తలంచెను. పరుషముల యాకారములపై నుచ్చారణార్థ కాకారలిపిని మేళగించుటచే నేర్పడిన వర్ణాక్షరముల యాకారము లిచటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. …=క్ - …=క - …=ఖ - …=గ - …=ఘ - …=ఙ; ఇట్లె తక్కిన వర్ణాక్షరముల లిపుల నెఱుంగునది.

ఇంక నంతస్థోష్మముల యాకారముల నుపదేశించుచున్నాఁడు. ఆంధ్రకర్ణాట సాధారణలిపిలో నైతము నంతస్థోష్మముల లిపి హల్లులపై నిల్చునపుడును వానిప్రత్యేక

స్థితిలోను నించుమించుగా నేకరీతినే యుండును. కాన నట్టిలిపులనె యుపదేశించు చున్నాఁడు. యకార లకారముల లిపులలో నించుక భేద ముండుటచే వానిగుణి తములనె (హల్లులపై నిల్చునప్పటి యాకారములనె) యంగీకరించెను. 'వు - ఉ' అను వాని లిపులతో సాంకర్యము వాటిల్లకుండుటకై యట్లంగీకరించె నని యెన్ననగును.

కీరతరీత్యాదిః—అన్తస్థాః=యరలవలును, ఊష్మాణశ్చ = శషసహలును, వరు సగా, కీర = చిలుకతోడను (ౢ = య్, తరి = ('నౌ' పాఠాంతరము) ఓడతోడను (=ర్) హస్తిమస్తక=గజశీర్షముతోడను (=ల్) శుక్తి=ముత్యపుఁజిప్పతోడను (=వ్) తులా=తరాసుతోడను, (=శ్) ఆసన=వేత్రాసనముతోడను, (=ష్) వితర్ది=వేదికతోడను (=స్) సీర=నాఁగటితోడను (=హ్) సమాః=సమానమైన యాకారములుగల వగుచున్నవి. దన్త్యచజౌ=చే జేలును, గురురలౌచ=ఱ ళలును, బిన్దుయుక్తౌ=బింద్వుతోఁగూడియేర్పడుచున్నవి. (=చే, =జే, =ఱ, =ళ.) ఇట్లు వీనితలపై బొట్టునునిల్పవలె నని యౌచిత్యమునుబట్టి వ్యాఖ్య చేసికొనవల యును. ఆంధ్రకర్ణాట సాధారణలిపిలో 'ఱ' అనునదియలఘురేఫాకారము. అలఘుల కారమునకుఁ బ్రత్యేకాకారము లేదు. కావుననే యలఘులకారమునైతము ద్రావిడ ళకార లిపితోనే వ్రాయఁబడుట సంభవించెను. అందు దన్త్య చ జలకును బ్రత్యేకా కారములు లేవు. కాన నన్నయ 'ఱ ళ' అను లిపుల నుపేక్షించి యేకరీతిని సయుక్తి కముగా లిపి నుపదేశించెను. అర్ధబిందు పూర్ణబిందు శబ్దములె వాని యాకారములను విశదపఱచుచున్నవి. (ఁ=అరసున్న. ం=నిండుసున్న) కేవలప్రాచీనకాలమున 'అ' కార చిహ్నము హల్లుపయి నిల్చునపుడు '—' అనునాకృతితోనె యుండెడిది. నన్నయనాఁ డది చంద్రరేఖవంటి యాకారము నంద నారభించుటచే దానినె యంగీకరించి నన్నయ బాలేందుసదృశ మనివర్ణించెను.

నన్నయా
నిర్వణీయము
అ III విషయము.

పఞ్చ వర్గాదయో వర్ణా । శ్చఝ శార్ఙ్గాదిసన్నిభాః ।
తిర్యగ్రేఖా యుజ శోర్ధ్వం । దణ్డరేఖాన్వితా అధః ॥
తపవచ ద్వితీయా స్స్యు । రూర్ధ్వరేఖాద్వికాన్వితాః ।
ప్రథమాస్తుతృతీయాః స్యు । స్తృతీయాస్తే చతుర్థకాః ॥
రేఖాద్వయాధోదణ్డేన । యుక్తాః స్యు రనునాసికాః ।
మిళద్దణ్డద్వయోపేతాః । ప్రథమా లిపయః స్మృతాః ॥
పూర్ణేన్దుసదృశః పూర్ణ । స్త్వర్ధ స్త్వర్ధేన్దుసన్నిభః ॥
(వికృ-సంజ్ఞా-౩ వి-షో-౩ శ్లో-కారి-అహో-౧౨౦-౧౨౧-పు.)

కల్ప॰-టీ॥ III విష:—నన్నయోపదిష్టలిపిలోని స్పర్శముల లేఖనమం దూర్ధ్వ రేఖల బాహుళ్యముచే లేఖనపఠనాదులు సులభముగా నుండఁజాల వనితలఁచి యథర్వణుఁ డిట్లు సవరించుచున్నాఁడు. మఱియు నన్నయనాఁటివఱకును నాయా హల్లుల లిపులను మాత్రము వ్రాసి వానిపై నకారచిహ్నమును ('—' అనుదానిని) లిఖింపకుండుటయే వానివాని పొల్లులలిపులై యుండెను. (క=క; క్=క్) నన్నయ కాలమందె తలకట్టు '—' అని వ్రాయుటకు మాఱుగా '◡' అను బాలచంద్రా కార లిపితో వ్రాయుట యారబ్ధ మయ్యెను. అట్టి సంప్రదాయములతో నన్నయ లిపి నథర్వణుఁడు సవరించుచున్నాఁడు. పఞ్చవర్గాదయఇతి—పఞ్చవర్గా దయః=అయిదువర్గముఁల మొదటివర్ణములు, శఙ్ఖశార్ఙ్గాదిసన్నిభాః = నన్నయ యుప దేశించినరీతినె శంఖశార్ఙ్గాదిసదృశాకారములు గలవైయై, తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వమ్=మీఁద నొకతిర్యగ్రేఖతోఁగూడిన వగుచున్నవి. (క=క్) తఏవ=అవియే, అధఃదణ్డరేఖాన్వితాః=క్రింద దండాకారరేఖతోఁ గూడినవై, ద్వితీయాఃస్యుః=వర్గ ద్వితీయవర్ణము లగుచున్నవి. (ఖ=ఖ్, ఛ=ఛ్, ఠ=ఠ్, థ=థ్, ఫ=ఫ్) ప్రథ మాస్తు=ఆవర్గప్రథమలిపులె, ఊర్ధ్వరేఖాద్వికాన్వితాః=మీఁదను రెండుతిర్యగ్రేఖలు గలవై, (ఒకటిపొల్లుగుఱుతు నొకటినాదితా విశేషపుగుఱుతు) తృతీయాఃస్యుః=వర్గ తృతీయానుమాపకము లగుచున్నవి. (గ=గ్, జ=జ్, డ=డ్, ద=ద్, బ=బ్) తృతీయాః = ఆతృతీయలిపులె, రేఖాద్వయాధోదణ్డేన = అట్టిరేఖాద్వయముతోనే కాక యధోదండరేఖతో, యుక్తాః=కూడినవై, చతుర్థకాః = వర్గచతుర్థలిపు లగుచు న్నవి. (ఘ=ఘ్, ఝ=ఝ్, ఢ=ఢ్, ధ=ధ్, భ=భ్). ప్రథమాః లిపయః=తత్తద్వర్గ ప్రథమలిపులె, మిళద్దణ్డద్వయోపేతాః=ఒకటిపై నొకటినిల్చిన దండాకారరేఖల ద్వీక ముతోఁ గూడినవై, అనునాసికాః = తత్తద్వర్గపంచమములుగ, స్మృతాః=చెప్పఁబడు చున్నవి. (ఙ=ఙ్, ఞ=ఞ్, ణ=ణ్, న=న్, మ=మ్.) కాదివర్గము లకారవిశిష్టము లగు నప్పటి యాకృతులు: (క= క, ఖ =ఖ, గ=గ, ఘ=ఘ, ఙ=ఙ.) పూర్ణః=నిండు సున్న, పూర్ణేన్దుసదృశః=పూర్ణచంద్రునివంటి యాకారము గలది- (౦). అర్ధస్తు=ఖండ బిందు వన్ననో, అర్ధేన్దుసన్నిభః = అర్ధచంద్రుని యాకారము గలది- (ఁ).

కల్పతరు-టీ॥ IV విష:—ఇయిరీతి నుపదిష్టములగు నన్నయాథర్వణలిపు లెంత యుక్తియుక్తముగను నెంతశాస్త్రసమ్మతముగను నెంతసులభముగనునున్నను మార్పును సహింపని జనసామాన్యముచే నుపయోగించుకొనఁబడదయ్యె. కాఁగా నన్నయాథ ర్వణులు చేసినమార్పులులేని ప్రాచీనాంధ్రకర్ణాటసాధారణలిపియె జనసామాన్య ముచే వాడుకొనఁబడుచు నాంధ్రదేశమున నేఁటియాంధ్రలిపిగను, గర్ణాటదేశమున

[illegible]కర్ణాటలిపికను గాలక్రమసిద్ధములగు నలంతిమార్పులతో నేర్పడియెను. (విస్తర) [illegible] నాంధ్రకర్ణాటలిపులు రెండిటికిని నంతగొప్ప భేదము కన్పట్టదు. హిందూ[illegible] తమిళలిపి, నాగరలిపి యాంధ్రకర్ణాటసాధారణలిపి మున్నగువానికెల్ల [illegible] మూలమైయున్నది. నన్నయాథర్వణులు చేసిన సముచితములగు [illegible] నాంధ్రులిచే వాడుకొనఁబడకున్నను నన్నయోపదిష్టమగు [illegible] తలకట్టు (◡) నథర్వణోపదిష్టములగు తిర్యగ్రేఖాకారమైన

---

విస్తర I అ IV విప:—"ఈయార్యాగీతులలో గ, జ, డ, ద, బ, ఞ, ష, మ, ల యాకారము వర్ణింపఁబడలేదు......అచ్చుల దీర్ఘముల యిభకన [illegible]యొక్క 'ఇ'కారమునకుఁ జెల్లునే కాని తక్కినవానికి వర్తింపదు........ ఖ, [illegible], క్ర, క్ష, ఫ, ల క్రింద ఒత్తుండుననియు నవి స్తంభాకారమున నుండుననుటయు పదునొకండవ శతాబ్దపు లిపికే కాదు, పండ్రెండవ శతాబ్దారంభమునయున్న లిపికిని వర్తింపదు. నేటి లిపిలోఁగూడ ఖశలకు వర్తింపదు." "నన్నయభట్టు స్వయముగ దగ్గఱనుండి చెక్కించిన నందంపూడి శాసన...లిపికిని వై..... లిపికిని పోలిక తగలదు. కావున నీ యార్యాగీతులు ప్రక్షిప్తము లనవలెను. లేదా చింతామణి నన్నయకృతము కాదనియైన ననవలెను" (ఆం-భా-చ-౧౫౬వ పు) ఈలిపిశ్లోకము లార్యాగీతులనుట ఛందః పరిశీలనరాహిత్యకృతము. చింతామణికారికలలో నొక్కటేని యార్యాగీతి లేదు. 'ఖ' అని వ్రాసియు నందధోదండరేఖ లేదనుట 'దశమో మృతః' అను వాక్యమును స్మృతిగోచరము కావించుచున్నది. గ, జ, డ, ద, బాదుల యాకారములు వర్ణింపఁబడలేదనుట నరయఁగా వీరు "స్తమ్భవిలేఖాధిక్యైస్తుర్యవర్గద్వితీయ వర్ణాద్యాః" అనుకారికను గాని యందలి "ఆద్యాః" అను పదమునుగాని యవగాహనము చేసికొన్నట్లు కాన్పింపదు. "ఈలిపి పదునొకండవ శతాబ్దపు లిపికే కాదు పండ్రెండవ శతాబ్దారంభమునయున్న లిపికిని వర్తింపదు." మున్నగు వీరివాక్యములను బరిశీలింపఁగాఁ వీరు నా రచించిన వైయాకరణ పారిజాతములోని యీకారికల సమన్వయము నొకసారియైనఁ జిత్తగింపకయే "న ఛేత్తవ్యం న బోద్ధవ్యం। న శ్రావ్యం వాదినో వచః। ఝటితి ప్రతివక్తవ్యం। సభాసు విజిగీషుభిః" అనురీతిని బరిహసింప నారంభించినట్లు కన్పట్టుచున్నది. ఈలిపి సాకల్యముగ వాడుక కెక్కలేదని వ్రాసిన వై-పా-౨౭౨ విప. మూడవ పంక్తిని వీరు చిత్తగింతురుగాక. వాడుక కెక్కని యీలిపి మఱి యేశతాబ్దములోనివాఁడు రచించెనని తలంచి వీరు "చింతామణి నన్నయకృతము కాదనియైన ననవలెను"అని వ్రాసిరో తెలియకున్నది.

పొల్లుగుఱుతును ( ⁄ ) వర్గయుక్కుల యథోదండరేఖలును (ఖ=ఖ) నర్గపంచమముల మిళద్దండద్వయరేఖలును (ఙఞలందుమాత్రమె) (ఙ=జ, ఞ=ఞ) నాంధ్రకర్ణాటసాధారణలిపిలోఁ జేరి నేఁటికిని నాంధ్రులచే వాడుకొనఁబడుచున్నవి. పదుమూఁడవ శతాబ్దమునకుఁ (విస్తర) బూర్వము వర్గయుక్కుల కథోదండరేఖయుఁ బదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వము బాలచంద్రాకారమగు తలకట్టును నాంధ్రకర్ణాటసాధారణలిపిలో లేవు-కాన నన్నయలిపిశ్లోకములు పదునొకొండవ శతాబ్దము నాఁటివనియు, నథర్వణుని లిపిశ్లోకములు పదుమూఁడవ శతాబ్దము నాఁటివనియు నిశ్చయింపవచ్చును. (వై-పా-౨౬౦ మొ-౨౭౨ విమ)

---

విస్తర II ౭౯ IV విమ:—"శతానామబ్దానాం సమాహారః శతాబ్దీ" అని చెప్పిన 'శతాబ్ది' యనవలెను. అకారాన్తోత్తరపదో ద్విగు స్త్రియా మిష్టః- (౧౪౧౬- వార్తికము - ౨౨౧ సూత్రమునొద్ద.) 'ద్విగోః' (౪-౧-౨౧) అదన్తాద్ద్విగో ర్ఙీప్ స్యాత్ - త్రిలోకీ (సి-కౌ ౪౭౬ సూ) అనుచెప్పిన నకారాన్తోత్తరపద సమాహారద్విగువున ఙీప్ప్రత్యయము రాకతప్పదని కొందఱు తలంచుచున్నారు. 'శతాబ్ది' అను దానికిసైతము కవిప్రయోగ ముపలబ్ధము కామింజేసి దీనిని బాత్రాదిగణమున నిల్పి "పాత్రాద్యన్తస్య న" (౧౪౧౬ వార్తి, ౨౨౧ సూత్రమునొద్ద) అను చెప్పిన దీనికి స్త్రీత్వము లేమింజేసి ఙీప్ప్రత్యయము రానేర దనఁదగును. దీనికి మఱొక సమాధానమును గలదు. ఇట్టి సమాహారద్విగువునందే యొక్కశబ్దమే ఙీప్పుతోడను ఙీప్ప్రత్యయ రాహిత్యముతోడను బ్రయోగము లున్నవు డట్టిశబ్దమును బాత్రాదిగణములోనిల్పుట యుక్తముకామింజేసి యీక్రిందిరీతిని వైయాకరణులు సమర్థించుచున్నారు. శతావయవమగునబ్దము శతాబ్దమనిమధ్యమపదలోపిసమాసము నంగీకరించినచో ద్విగువు కామింజేసి ఙీప్పు రానేరదు. శతావయవ మగునబ్దమనఁగా శతమగు నబ్దసముదాయము. ఇచటియబ్దశబ్ద మబ్దసముదాయపర మగుచున్నది. "నను త్రిలోకనాథః పితృసద్మగోచరః. ఇతి కథం కాళిదాసప్రయోగః...త్రయాణాం లోకానాం సమాహారఇతి విగ్రహే "తద్ధితార్థఇతి ద్విగుసమాసేతు "ద్విగోః" ఇతి ఙీప్ప్రసంగః...పాత్రాదిత్వాత్ నస్త్రీత్వ మిత్యభ్యుపగమే 'యది త్రిలోకీ గణనాపరా స్యాత్' ఇత్యాదిప్రయోగాః నయుజ్యేర న్నితిచేత్ సత్యమ్ లోకశబ్దోఽత్ర లోకసముదాయపరః. త్ర్యవయవో లోక స్త్రిలోకఇతి మధ్యమపదలోపీ సమాసః. ఏతచ్చ 'ద్విగో ర్లుగనపత్యే' ఇతిసూత్రే భాష్యేస్పష్టమ్." (సి-కౌ-౭౨౭ సూ. బాలమ.) తత్త్వబోధినియందును నిట్లే వ్రాయఁబడెను (౧౬౯ పుట)ఇట్టియెడలఁ గొందఱు పైనుదాహరించిన "త్రిలోకనాథః-త్రిలోకీ" అను ద్వివిధప్రయోగస్థితిఁబట్టి పాత్రా

కల్పకసప్త-శా V. విష:—కాలక్రమమున 'చ - జ' లపై దంత్యతకార చిహ్నముకు 'ఁ' అను గుఱుతు నిల్చి దంత్య చ జల కనుమాపక మగు చున్నది. (చే - ౯) అట్టి దంత్యచిహ్నము నేఁడు తలుచుగా నుజ్జగింపఁబడు చున్నది. ప్రాచీనాంధ్రకర్ణాటసాధారణలిపిలో ననుస్వారము వర్గాక్షరపరక మగు నపుడు సంస్కృతపద్ధతిని వర్గపఞ్చమానునాసికముల లిపితో వ్రాయఁబడెడిది. నన్నయాథర్వణోపదిష్టమగు నర్ధానుస్వారలిపి నేఁటిముద్రణములలో విస్తరించినది. శాసనములందును తాళపత్రమాతృకలందును నర్ధానుస్వారమునయితము పూర్ణానుస్వారలిపితోనె వ్రాయఁబడుచువచ్చెను. అపుడు ఖండపూర్ణోచ్చారణభేదమున కనుమాపకముగఁ బూర్ణానుస్వారస్థలముల పరహల్లూరకయై ద్విత్వరూపమున వ్రాయఁబడుచువచ్చెను. ఉదా: సంక్కరము చదువంగ్గ. చదువంగ = చదువఁగ ప్రాచీనాంధ్రకర్ణాటసాధారణలిపిలో దుస్స్పృష్ట డకారము (వై-పా-౧౮౮ మొ. ౧౯౪ వ-విష. ౨౩౬-౨౨౭-౨౨౮ విష.) 'ఌ' అను లిపితో వ్రాయఁబడెడిది. ఇది యుద్ధమల్లుని బెజవాడశాసనమున మూఁడుచోటుల లిఖింపఁబడియున్నది. (దీని మొదటఁ దెల్పినవారు కీ. శే. కొ. వేం. లక్ష్మణరావుగారు) ఆంగ్లభాషలోని Pleasure=

---

దుల స్త్రీత్వప్రతిషేధము పాక్షికమని తలంచిరి. వైయాకరణులు పాత్రాదులలో నుదాహరించిన "పాత్రాద్యన్తస్య న(౧౫౪౯ వార్తి)పఞ్చపాత్రమ్ త్రిభువనమ్ చతుర్యుగమ్" (సి-కౌ-౮౨౧ సూత్రమునొద్ద) అనువానిలోని త్రిభువనశబ్దమునకు ద్విగుసమాసస్త్రీత్వము నంగీకరించి "త్రిభువనీ" అని ప్రయోగించిరి. చ......కలితప్రభవ స్థితిసంవ్యాప్తిక్రియానిరతి వివర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్ది...(శల్య ౧ ఆ ౨౬౫)ను...ఈయరదంబెక్కి వధింపు మీవును మదీయస్ఫారసాధ్యనిర్భరభంగిన్ దశకంధరుం ద్రిభువనీభంగోన్నమత్కంధరున్. (అర-౭ ఆ ౧౪౭ ప) ప్రసంగవశమున నిట భట్టాకుని "త్రిపురుషాః" అనుప్రయోగము ప్రశంసింపఁబడున్నది.

"తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాః" (నన్నయభారతాది మంగళాచరణ శ్లోకము) దీనికిని వైయాకరణపద్ధతి నుల్లంఘింపకయె సాధుత్వము సమ్మతముగ సమర్థింపనగును. "త్ర్యవయవో లోక స్త్రిలోకఇతి మధ్యమపదలోపీసమాసః ఏతచ్చ 'ద్విగో ర్లుగనపత్యే' ఇతిసూత్రే భాష్యే స్పష్టమ్. షోడశపదార్థానా మిత్యత్రతు షోడశసంఖ్యాకాః పదార్థాఇతి మధ్యమపదలోపీసమాసఇత్యలమ్" (బాలమ-౭౨౭ సూ. వ్యా) ఇట్లు "త్రిసంఖ్యాకాః పురుషాః = త్రిపురుషాః" అనుమధ్యమపదలోపి సమాసాశ్రయణమున, "సప్తర్షయః" అనుదానివంటి సంజ్ఞకాదనుపక్షమునందును నిర్బాధముగ "త్రిపురుషాః" అనునది సమ్మత మగుచున్నది.

(ప్లషర్) అను దానిలోని 'ష' అను దానిధ్వనివంటి ధ్వనితో దీని నుచ్చరింతురు. కాలక్రమమున నిది తెలుఁగునఁ గొన్నియెడల డకారముగను, గొన్నియెడల ళకారముగను మాఱిపోయినది. అరయ నరయ దానిలిపియె (ఱ = ఴ = ళ) ళకార లిపిగా మారినదేమో ? దీనిస్వరూపోచ్చారణముల విషయము నారచించిన వైయాకరణ పారిజాతమున విస్తరముగా వ్రాయఁబడెను. (వై-పా. ౨౬౫-మొ - ౩౦౭ వ-విష) (చిం-వి-పరి-౫౧౭ విష).

పయిరీతిని ప్రాచీనాంధ్ర కర్ణాట సాధారణ లిపిని సవరించిన నన్నయాథర్వణుల యీలిపి శ్లోకముల కర్థము గ్రహింపఁజాలక బాలసరస్వతి వీని నుపేక్షించెను. అప్పకవియు దదనుసారియగు నహోబలపతియు నీశ్లోకములకుఁ దప్పులతిప్పలుగా వివరణము వ్రాసిరి. వికృతి వివేకటీకాకర్త వీనికి వ్యాఖ్యచేయలేదు. నారాయణీయ గాణపత వివరణకర్త అప్పకవిచేసిన వివరణమును జూపుచుఁ బ్రాచీనకాలపు శాసన లిపిని నేఁటిలిపిని మేళవించి చూపుటలో వారియుద్దేశమేమో తెలియకున్నది. అప్పకవి తప్పుగాఁజేసిన లిపివర్ణనమె ప్రాచీనలిపి స్వరూపమని తలంచిరేమో ? కీ. శే. కొమరరాజు వేంకటలక్ష్మణరావు పంతులుగా రాంధ్రవిజ్ఞాన సర్వస్వమునం దక్షరశబ్దమునొద్ద నీవిషయమును విస్తరించిరి. అందును నీశ్లోకముల యర్థము ప్రామాదికముగనె యున్నది. (వై-పా-౨౯౩-విష) (వై-పా-౭౮౧ మొ-౨౯౫ వ-విష. చూడనగును.)

నన్నయాథర్వణీయము ౩౦ విషయము.

ప్రాతిపదికం హి నామ। ప్రత్యయ ఇహావర్ణకః క్రియా
ధాతుః। ప్రాణా స్సమాసతోఽచో। బిన్దు రనుస్వార
ఏజఖో వక్రః॥ వక్రతమ ఐ ఝల స్స్యు। స్సమాసతః
ప్రాణినో ద్రుతాఖ్యో నః॥ క చ ట త పాః పరు
షాఖ్యా। గ జ డ ద బా స్తు సరళాః స్థిరా ఇతరే॥ (ఆం-
చిం-సంజ్ఞా ౧౨-౧౩ కారి॥ అహో. ౧౬౦ మొ-౧౬౩
వ-పు).

కల్పతరువు ౩౦ విష:—ఇహ=ఈయాంధ్రమున, ప్రాతిపదికమ్=ప్రాతిపదికము, నామ = నామమనియు, ప్రత్యయః = ప్రత్యయము, వర్ణకః = వర్ణకమనియు, ధాతుః=ధాతువు, క్రియా=క్రియయనియు, అచః=అచ్చులు, సమాసతః=సంక్షేపముగా, ప్రాణాః=ప్రాణములనియు, అనుస్వారః=అనుస్వారము, బిన్దుః=బిందువనియు, అఖో=పిమ్మట, ఏజ్=ఏ ఓ లు, వక్రః=వక్రములనియు, ఐచ్= ఐ ఔ లు, వక్రతమః=

వక్రతమములనియు, హాలః=హల్లులు, సమాసతః=సంక్షేపముగా, ప్రాణినః=ప్రాణు లనియు, నః=నకారము, ద్రుతాఖ్యః=ద్రుతమనియు, క చ ట త పాః=క చ ట త ప లు, పరుషాః=పరుషములనియు, గ జ డ ద బా స్తు=గ జ డ ద బ లు, సరళాః= సరళములనియు, ఇతరే=తక్కినహల్లులు, స్థిరాః= స్థిరములనియు, స్యుః=వ్యవహరింపఁ బడుచున్నవి.

బాలవ్యాకరణ వివరణము ౩౦ I విష

క చ ట త ప లు పరుషములని, గ జ డ ద బ లు
సరళములని చెప్పంబడు-౫.
ఇతరములగు హల్లులు స్థిరములు-౬.
ఖ-ఘు-ఙ,-ఛ ఝు-ఞ-ఠ-ఢ-ణ-థ-ధ-న-ఫ భ-మ య-ర-ల-
వ-శ-ష-స-హ-ళ.

సంజీవని ౩౦ I విష:—"నామము-క్రియ-ప్రాణము-ప్రాణి-బిందువు" అను నవి ప్రసిద్ధము లగుటంజేసియుఁ ప్రాతిపదికాదులు సంస్కృతవ్యాకరణమునఁ బ్రసిద్ధము లగుటంజేసియు వానిని వేర్వేఱ వచింపలేదు. పరుషసరళ స్థిర సంజ్ఞలు మాత్ర మిందు వచింపఁబడెను. బా. సంజ్ఞా. ౨ సూత్రము వివరణమున వక్ర వక్రతమ సంజ్ఞలు వివరింపఁబడెను. బా. సంజ్ఞా-౧౧సూత్రమున "నకారంబు ద్రుతంబు" అని సూత్రింపఁబడును. బా. తత్స-౧౦సూత్రము వివృతిలో "ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు" అని తెలుపఁబడును.

బా-సంజ్ఞా-౭ సూత్రముచొప్పునఁ దాలవ్య చ జ లు, దంత్యచ జ లకును గ్రాహకము లగుటంజేసి క చ చే ట త ప లు పరుషములనియుఁ గ జ జే డ ద బ లు సరళము లనియు గ్రహింపనగును. లఘ్వలఘుప్రులు భిన్నాక్షరములు కావింజేసి లఘ్వలఘుకూప ద్వివిధాంతస్థములును స్థిరములె యని యెఱుంగనగును.

ఈ పరుషాదిసంజ్ఞ లన్వర్థము లనఁదగును. ఉచ్చారణవిషయమున శ్వాసముల కన్న నాదములు సులభము లగుటచేత శ్వాసములను బరుషములనియు, నాదములను సరళములనియు వచించుటచే నవి సార్థకము లనఁదగును. సులభోచ్చారణముచేతనే వైకృతత్వమందును సంధులందును బరుషములకు సరళము లాదేశము లగుట ప్రచురమై యున్నది. ప్రక్రియలో ద్రుతము తోఁడునఁ బరుషములు సరళములుగ మాఱునట్లు స్థిరము లించుకేని మార్పు నందకుండుటచేత వాని స్థిరసంజ్ఞయు నన్వర్థమగుచున్నది. పరుషసరళములకన్న భిన్నత చూపనగుటంజేసి వానికి మాత్రమె స్థిరసంజ్ఞ యంగీకరింపఁబడె నని యైనఁ జెప్పనగును.

ఇన్ద్రాద్యా అపిచ గణాః। వళి రాద్య మనన్తరాక్షరం
ప్రాసః। (అం-చిం-సంజ్ఞా ౧౫ కారి. అహో ౧౬౪ పు)
శుభవర్ణాః శుభశబ్దా। యేచ శుభగణా స్తఏవ
కావ్యాదౌ। గ్రాహ్యాః పురాస్త్రగిరిరసరుద్రేష్వక
చటతపా నిన్ద్యాః। (అం-చిం. అప్పక-౨ఆ.౧౪-౨౬౩
౩౬౧-౩౬౨ ప. వివరణపద్యము. అహో ౧౬౫ పు.)
తృతీయోచ్చ తృతీయోష్మా। తృతీయ స్సరళస్త్రయః।
షోడశవ్యఞ్జనం చాపి। షష్ఠస్థానే న యుజ్యతే॥ వికృ-
నన్నయాథర్వణీయము 30 11 విషయము సంజ్ఞా ౧౦ కా అహో ౧౬౬ పు.)
అవాన్తరకథాస్థాన।విశ్రాన్త్యాశ్వాస ఉచ్యతే। ప్రత్యన్త
పూరణం భిన్న। వృత్తై ర్గజముదీరితైః। సద్గీతకవితా
యాంతు।గణాదౌ యతి రుచ్యతే। ప్రాసో వా నాతిసా
మీప్యే।నాతిదూరే విధీయతే।గీతే తాళానుగుణ్యేన।
హ్రస్వః స్యాద్దీర్ఘసంశ్రుతిః।హ్రస్వశ్రుతిస్తు దీర్ఘస్య।
దోష ఇత్యుచ్యతే బుధైః. (వికృ-అజం-౯౭-౯౯-౧౦౦
కారి అహో ౩౩౫-౩౭౬ పు.)

కల్ప - 30 II విషః—ఇన్ద్రాద్యాఅపి చ = ఇంద్రచంద్రసూర్య గణములు నైతము తెల్లునఁ గలవు. అపిచ శబ్దముచే 'సంస్కృతచ్ఛందశ్శాస్త్రప్రసిద్ధములగు మ, య, ర, స, త, జ, భ, న, ల, గ, ము లనెడి నిసర్గ గణములును, గా భ జ స నల ములనెడి (చతుర్) మాత్రాగణములును ననెడియర్థ మాకృష్ట మగుచున్నది. ఆద్యమ్ = పాదాదివర్ణము, వళిః = వడిసంజ్ఞగలది. అనన్తరాక్షరమ్ = పాదములోని రెండవ యక్షరము, ప్రాసః = ప్రాససంజ్ఞగలది. ఈ చింతామణి కారికచేతనే గతార్థ మగుటంజేసి "ఆన్ధ్రపద్యావళౌ ప్రాసం। ద్వైతీయీకం తథాదిమమ్। వళిం తన్నియమస్థానే। తద్ధి తన్నియతం విదుః" (వికృ-అజం-౧౦౧-కారి.) అనునది ప్రక్షిప్త మనఁదగును. నారాయణీయమున నిది యాథర్వణముగ నాంధ్రీకరింపఁ బడుట సరికాదు (నారా-సంజ్ఞా ౯౫ కా-౧౦౧ప)

శుభవర్ణాః = శుభవర్ణములును, శుభశబ్దాః — మాంగళ్యవాచకములును, శుభగణాశ్చ = మగణాది శుభగణములును, యే = ఏవికలవో, తఏవ = అవియే, కావ్యాదౌ = కృత్యాదిని, గ్రాహ్యాః = ప్రయోగార్హములు. పురాస్త్రగిరిరసరుద్రేషు = 3-5-7-9 (రస = నవరసములు) ౧౧ స్థానములందుఁ గృత్యాదిపద్య

ప్రథమపాదమున అ క చ ట త పాః = అ క చ ట త ప వర్ణములు నిన్ద్యాః = ప్రయోగార్హములు కావు. కృత్యాది పద్యప్రథమాక్షరము శుభవర్ణమై యుండవలయును. ఈకారిక యహోబలపండితునిచే స్వీకరింపఁబడ లేదు. అప్పకవిపుస్తకపాఠముగాఁ జూపఁబడెను. (అహో ౧౬౪) కాని అహో ౧౫ పుటలో నీకారిక మాత్రము నన్నయవిగా నంగీకరింపఁబడియున్నది. "ఆచార్యేణాప్యుక్తమ్. శుభదస్తాస్త్వశుభశబ్దా యే చ శుభగణా ఇతి" (విశ్వశ్రేయ ఇతి సూత్రవ్యాఖ్య.)

సీ. ఆది పద్యాది మూఁడు గణాక్షరములు । చూడవలెఁ గాని యన్నియుఁ జూడవలదు (సులక్షణసారము ౧౧౯ ప) అను ఛందశ్శాస్త్ర సంప్రదాయము -నొప్పునఁ బండ్రెండువర్ణములవఱకు (గణమునకు నాలుగు చొప్పునఁ బండ్రెండు వర్ణములు మూఁడుగణములకగును) శుభవర్ణము లుండవలయునని విశద మగుచున్నది.

క. చందనతరుసంగతిఁ బిచు । మందంబులు పరిమళించుమాడ్కిని నందా । నందకరమైన గణముల । పొందున దుష్టగణవర్ణములు ప్రియ మొసఁగున్॥ ఆ-వె. పరశువేదితోడ బెరసినలోహంబు । జాతరూప మైనచందమునను । సారమైనగణము సంగతిఁ దనకీడు । మాని దుష్టగణము మంచిదగును. (సులక్ష-౧౧౫-౧౧౬ప.)

అను ఛందశ్శాస్త్ర సంప్రదాయము వర్ణవిషయమున ననుసంధించుటచేఁ గృత్యాది పద్యాదిచరణమున '౧-౩-౫-౭-౯-౧౧' అను విషమవర్ణములు వాయుబీజములగు "అ క చ ట త ప" లు కాకున్నచో ననఁగా శుభవర్ణములె యైనచో వాని ప్రక్కనుండు సమస్థానవర్ణములును శుభములె యగునని భట్టారకుని హృదయము.

అప్పకవీయములోని "ఆద్యో వళి ర్ద్వితీయో । వర్ణః ప్రాసో త్ర...... । వృత్తం జాతి శ్చేతి...... । మిత్రా న గలా విన్ద్యాః......" (అప్ప-౨ ఆ-౧౫ మొ-౧౯ ప- శ్లో. అప్పక-౩-౪ ఆశ్వాసములలో వివరింపఁబడెను). (అహో ౧౬౪ పు) అనుకారికలు ప్రక్షిప్తములని తలఁచి యిటఁ బ్రదర్శింప లేదు. అవి బాలసరస్వతీయమున లేవు. అప్పకవి యే ఛందోభాగమును విస్తరింపఁజేయఁ దలఁచి దానికి మూల ముండవలయు ననుతలంపున వీనిని బ్రక్షిప్తము చేసెనేమో? అహోబలపతియుఁ దదనుయాయి నారాయణీయకర్తయు నప్పకవీయములోనుండుట నరసి స్వీకరించిరి. అప్పకవి కథర్వణకారికావళి లభింపదయ్యె. లభించియే యుండిన నందలి విషయ పరంపర నెల్ల వివరించి యుండఁడా? తృతీయోఽ చ్ఛేత్యాదికారిక మఱికొన్ని కారికలతోపాటుగ నప్పకవికిఁ బండితపరంపరాయాతముగ వినఁబడియుండుటచేఁ గావలయు నద్దాని నొకరీతినిట్లు వివరించెను. "కం. మూఁడవతావున మొద

లిటి। మూఁడు సరళవర్ణములును మూఁడవ స్వరమున్ ।......॥ గీ॥ షోడశాక్షర మాఱవచోట నిలిపి ।......" (అప్ప-౨౫-౩౬౮-౩౬౯.ప). చింతామణికి వికృతివివేకము వివరణగ్రంథమని యాతనికిఁ దెలియమింజేసి యీ క్రిందివిమర్శ మాతఁడు చేసికొనఁ జాలఁడయ్యె.

తృతీయో చ్చేత్యాద్యథర్వణపూరణమును బట్టి శుభవర్ణా ఇత్యాదికారిక మాత్రము నన్నయోక్తము కాఁదగునని విశ్వసించి బాలసరస్వతీయమున లేకున్నను స్వీకరించితిని. (నారచించిన బాలసరస్వతీయ సీరిక-౩౭-౩౮-౩౯విష) తృతీయో చ్చేత్యాద్యథర్వణపూరణములోని తకారము పునరుక్తము కాకుండుటకై 'శుభవర్ణా'ఇత్యాది కారికలోని రసశబ్దమునకుఁ దొమ్మిదియను నర్థ మంగీకరింపఁబడెను. '౩-౫-౭-౯-౧౧' అనువరుస కుదురుపడుటకును బై ఛందశ్శాస్త్ర సంప్రదాయము సరిగ సమన్వితమయి యుండుటకును 'రసగిరి' అను నప్పకవీయస్థితిని మార్చి 'గిరిరస' అను పాఠము సత్య మనుతలఁపున నంగీకరించితిని. ఏ సరళములో తెలియకుండ "సరళా స్త్రయః" అని యథర్వణుఁడు వచించియుండఁ డనుతలంపున "తృతీయే సరళాః" అనుపాఠము నుజ్జగించి "తృతీయసరళః" అనుపాఠము ప్రక్రమానుగుణముగ నుండునని యంగీరికంచితిని.

తృతీయో ఽచ్చేత్యాదిః—తృతీయః - అచ్చు = మూఁడవయచ్చగు 'ఇ' వర్ణమును, తృతీయోష్మా = ఊష్మములలోని మూఁడవదగు స వర్ణమును, తృతీయ సరళః = సరళములలోని మూఁడవదగు డ వర్ణమును, అనెడి, త్రయః = మూఁడును షోడశవ్యఞ్జనంచ = హల్లులలోఁ బదునాఱవదగు త వర్ణమును, షష్ఠస్థానేకృత్యాది పద్యప్రథమపాదములోని యాఱవచోట, నయుజ్యతే = ప్రయోగింపఁబడరాదు.

అవాన్తరేత్యాదిః—అవాన్తరకథాస్థానవిశ్రాన్త్యా = కావ్యకథలో నవాన్తరకథారంభమందలి విశ్రాంతిచేత, ఆశ్వాసః = ఆశ్వాసమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ప్రత్యన్తపూరణమ్ = ఆశ్వాసాంత్యమునఁ జేయు కృతిపతిప్రశంస, ఉజనుదీరితైః = ప్రథమాంతశబ్దములతోను, సంబోధనశబ్దములతోను, (ఆమన్త్రణసుజనోఃస్తః క్రమేణ చాదారదా గమావన్తే) భిన్నవృత్తైః = వేఱువృత్తవిశేషములతోఁ జేయనగును, సఙ్గీతకవితాయాంతు = యక్షగానాదులందన్ననో, గణాదౌ = గణాదియందు, యతిః = విశ్రమము, ఉచ్యతే = చెప్పఁబడును. లేదా, ప్రాసోవా = ప్రాసయతియైనను, నాతిసామీప్యే, నాతిదూరే = మిక్కిలిసమీపము కానట్టియు మిక్కిలిదూరము కానట్టియు, స్థలములందు, విధీయతే = విధింపఁబడును.

[illegible] = [illegible]మందు, తాళానుగుణ్యేన = త్రిపుటాది తాళముల కనుకూల [illegible], [illegible] = హ్రస్వాచ్చు, దీర్ఘసంశ్రుతిః = దీర్ఘ మగుటనికి గలది గానోపును. [illegible] = [illegible]మునకు, హ్రస్వశ్రుతిస్తు = హ్రస్వము వినికిగల యుచ్చారణము, [illegible] = దుష్టమని, బుధైః = పండితులచేత, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

[illegible]పక్షమున "[illegible]హ్రస్వ[illegible]వళౌ ప్రాసం। ద్వైతీయాకం తథాదిమమ్। [illegible]స్థానే"...అనునవి మున్నగు పెక్కు కారికలు (౧౦౧ మొ-౧౦౭వ-కా) [illegible]ములుగాఁ కవిజనమండనమున నుదాహరింపఁబడెను. అవి యహోబల [illegible]మునందును లేవు. కొన్ని పునరుక్తములు. కవిజనమండనకర్త యహోబల [illegible]ములోని కారికలనె యెత్తి వ్రాసికొనెను గాని యాతనికిఁ బ్రత్యేకమగు [illegible] లభించి యుండలేదనుట స్పష్టము (నా రచించిన యథర్వణకారికావళి [illegible] ప్రక్షిప్తములనుటకు సందేహము లేదు.

| | |
|---|---|
| [illegible] | పాదంబునఁ బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసం |
| 3౦ III | బులు నాఁబడు. ౨3-(ప్రకీర్ణక) |

సంజీవని 3౦ III విష:—సూరిగారును పైని వివరించినరీతినే "ఇన్ద్రాద్యా అపి చే"త్యాది బాలసరస్వత్యంగీకృతకారికనె చింతామణికారికగ విశ్వసించి యిట్లు వివరించిరి. అర్థముస్పష్టము. వ్యాకరణోపయోగులు కామింజేసి "శుభవర్ణా" ఇత్యాది చింతామణికారికను, తృతీయో చ్చేత్యా ద్యథర్వణకారికను సూరి వివరింపలేదు.

దీర్ఘ స్సంయుక్తాద్యః। పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ
ఏతే గురువ శ్చైషా। స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః॥
శాస్త్రార ఏకమాత్రాం। లఘో ర్ద్వేమాత్రే గురో రితి
వదన్తి, (ఆం-చిం-అప్పక-౨ఆ ౧౭-౨౧ కా॥ అప్ప

నన్నయా — క ఆ ౨౯-౭౭-మొ-౫3వ-పద్యములు వివరణము)
థర్వణీయము — (అహో ౧౪౪ పు).

3౦ IV విషయము. — సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్సర్వ మాన్ధ్రపదం
లఘు। భవే దాద్యసమాసేపి। రేఫయోగా త్పదం
తథా। పదే పిచ తథాత్వం స్యాత్। క్వచి న్నైవ
సరేఫయోః॥ (వికృ-సంజ్ఞా ౧౧-౧౨ కా॥ అహో
౧౪౪ పు.)

కల్ప - ౩౦ IV విష:—దీర్ఘః = దీర్ఘాక్షరమును, సంయుక్తాద్యః = హల్లుల సంయోగమునకుఁ బూర్వాక్షరమును, పూర్ణానుస్వార పూర్వవర్ణశ్చ = నిండు సున్నకు ముందటియక్షరమును, (తెల్గునవిసర్గము లేదు. ఖండబిందువునకు ముంపటి యక్షరమునకు దానివలన గురుత్వము లేదు) అనెడి, ఏతే = ఇవి, గుర్వక్షరాః = గురువులగు నక్షరములు, శేషాః సర్వే = మిగిలినవెల్ల, లఘ్వక్షరా ఇతి = లఘు వర్ణములని, జ్ఞేయాః = తెలియఁదగును. శాస్త్రారః = ఛందశ్శాస్త్రజ్ఞులు, లఘోః = లఘువునకు, ఏకమాత్రామ్ = ఒకమాత్రకాలమును, గురోః = గురువర్ణోచ్చారణ మునకు, ద్విమాత్రే = రెండుమాత్రల కాలమును, ఇతి = పట్టునని, వదన్తి = చెప్పు దురు. ఉ. 'రక్షింపఁగా' ఇందు 'ర' అనునది సంయోగపూర్వము గాన గురువు. 'క్షిం' అన్నునది పూర్ణానుస్వారపూర్వము గాన గురువు. 'ప' అనునది లఘువు. 'గా' అనునది దీర్ఘము గాన గురువు. అథర్వణుఁడు విశేషములను వచించుచున్నాఁడు. సంస్కృ తాద్యే = సంస్కృతశబ్దాదియున్న, సంయుక్తే=సంయుక్తాక్షరము పరమై యుండఁగా, సర్వమ్, ఆన్ధ్రపదమ్ = సమస్తమైన తెలుఁగుశబ్దము తుదివర్ణమును, లఘు = లఘువే యగుచున్నది. సంయోగపూర్వత్వమునఁ గౌరవ మట్టియెడలఁ గలుగనేరదు. చ-చిరముగ బ్రహ్మకుం దపము... (ఆది ౨ ఆ ౧౨౫ ప) సంస్కృతశబ్దమగు బ్రహ్మశబ్దపు మొదటి 'బ్ర' అనుసంయోగమునకు ముందరనున్న 'గ' అనుదానికి గురుత్వము లేదు. "ఆంధ్రపదమ్ - సంస్కృతాద్యే" అనునవి రెండును బ్రాయికాభి ప్రాయమునఁ జెప్పఁబడినవి. 'మ. జయ ప్రాఁబల్కుఁలఁ గాచుదేవ..." (ఇదికల్పిత పద్యభాగము) అనుచో నాంధ్రపదాదిస్థిత సంయోగమునకు ముందున్న సంస్కృత జయశబ్దాంతిమస్థ మగు 'య' అనునదియు గురువు కానేరదని యెఱుంగునది. పర పదాదిస్థ ద్విత్వము పూర్వపదాంత్యవర్ణ హ్రస్వీభావమునకు మూలమగునపుడు మాత్ర మీవిధి వర్తింపనేరదు. ఉ. అమ్ముదిత న్విభీతహరిణాక్షి...(సభా ౨ ఆ ౨౮౭) ఉ. ముల్లోకము దాన యేలుగతి లోలవిలోచన యేమిచెప్పుదున్ (పారిజా. ౧ ఆ. ౭౫) వీనిలోని 'అమ్ముది' అను దానిలోని 'అ' అనునదియు, 'ముల్లో కము' అనుదానిలోని 'ము' అనునదియు గురువులేకదా! (చూడుఁడు. ఆం-చిం- వాలం-౫-కారి-బా-సమాస-౧౩-౧౮—౧౭ సూ.)

భవే దిత్యాది:—అద్యసమాసేపి = సిద్ధసమాసమునందును, రేఫ యోగాత్ = రేఫసంయుక్త పదాదివర్ణమునుమూలమున, పదమ్ = పూర్వపదాన్త్యాక్షరము, తథా భవేత్ = అశ్లేయమనఁగా లఘువేయగును. 'అపచ' అనుదానిమహిమచే సీవిధి "ప్ర - హ్ర" అను నక్షరములకు ముందటివర్ణము స్థలముననే ప్రాయికమగుఁగా

[illegible] యొక్కుఁడగుచు. "చ. ఘనదురితానుబంధ కలికాలజదోష తుషార [illegible] వన యమునయప్రభావమున......" (ఆది ౧ ఆ ౫౪ ప) అనియును, [illegible]. .........ఒక్క చూతఫలం బ। య్యవనిజమువలన నమ్ముని। ప్రవరు పృ[illegible]బముపై బడిఁ బడియెన్' (సభా౧ఆ౧౮౩) అనియును నన్నయయే వికల్పించెను. "క్ర-హ్ర-వాక్యతి పిఙ్గళసూత్రమ్. యథా గృహీతప్రత్యుద్గమనీయవస్త్రా ఇతి [illegible] ఏవం త్వయా పుణ్యే ప్యేవం। మధుర ముదకం కాళియ హ్రదే ఇతి [illegible]" (ముగ్ధ ౫౦ సూ. వ్యా.) "ఈదన్తా ఇక్ష్వాదేవ కృతహ్రస్వాః" అని చింతామణిలో నన్నయయె ప్రయోగించెను. చ. కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి [illegible]క్రప్రక్రమల్ మహో। గ్రపుఁడిఁ దోడ్పడంగ........" (శల్య ౧ ఆ ౨౨౧) "[illegible]సమాసే రేఫసంయోగే పరే పూర్వపదస్య లఘుత్వే "క. ......[illegible]త తాళిపక్షమ్ము హ్రదమునఁ బడియె" నిత్యాదయః కవిప్రయోగా ఉదాహరణమ్" ([illegible] ౧౦౫ పు.) (విస్తర. I-II)

---

విస్తర. I. ౩౦ IV విమః—సంయుక్త ఇత్యాదివిధి ప్ర హ్ర పూర్వాక్షరస్థల మాత్ర విషయక మనిగ్రహింపక గాణపతవ్యాఖ్యాత "లోకాదిత్రిలోకపూజ్యులు" అనియుదాహరించెను. ఇదిసరికాదు. ఉ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పద మైనవాఁడు, లోకాది, త్రిలోకపూజ్యుఁడని యాత్మ నెఱింగి... (సభా ౨ ఆ ౧౮ ప) అనుసీపద్యమున, "లోకాది = లోకములకును లేదా లోకులకెల్లను, ఆది మొదటివాఁడు, త్రిలోకపూజ్యుఁడు" అనుచొప్పున వ్యస్తముగ నన్వయింపఁ దగును గాన నది యాద్యసమాసోదాహరణము కానేరదు. ప్రహ్రేతర సంయుక్త వర్ణపరకత్వమున సంస్కృతమందు లఘుత్వము సమ్మతమె యైనచో "పాదాదా విహ వర్ణస్య। సంయోగః క్రమసంజ్ఞికః। పురస్థితేన తేన స్యా। ల్లఘుతా పి క్వచి ద్గురోః। ఇవ మత్రో దాహరణమ్ - అల్పవ్యయేన సున్దరి। గ్రామ్యజనోమృష్ట మశ్నాతి" (వృత్తరత్నాకరము. ౧ - ౧౦-౧౧ శ్లో) అనియిట్లు క్రమసంజ్ఞిక పాదాది 'గ్ర' వర్ణరూప సంయోగపరకత్వమునఁ బూర్వవర్ణమునకు లఘుత్వము సంపాదించు ప్రయాసమును గేదారాన్తర్వాణి పడియుండఁడుగదా. ప్రహ్రేతర రేఫసంయుక్త పరకత్వమున లఘుత్వము ప్రామాణికకవి ప్రయోగములలో లేదు. క. ధరణీసురశాపమునకు। హరిహరబ్రహ్మాదులైన నడ్డము గలదే (భాగ ౧౧ స్కం ౨౫) క. ఆరయ వర్ణింపలేరు హరబ్రహ్మాదుల్॥ (భాగ ౧౧ స్కం ౬౧) క. ఘనతరముగఁ జంద్రసూర్యగ్రహముల జాడల్ (భాగ. ౧౨ స్కం. ౧౨) మ.

బలభిన్ముఖ్యదిశాధినాథవరులున్ ఫాలాక్ష బ్రహ్మాదులున్ (భాగ. ౧౨ స్కం. 3౬) భాగవతము ౧౧ - ౧౨ స్కంధములకుఁ గర్తవెలిగందలి నారయకవి, ఇట్టిసామాన్య కవుల ప్రయోగములు లక్షణనిర్ణయముపట్ల సమర్థములు కాఁజాలవు. | "సంస్కృతమునఁ బాదాంతలఘువునకుఁ, బాక్షికముగాగురుత్వము గల్గును. వ్యస్తపదాది సంయోగపరకత్వమునందును బూర్వపదాంతిమలఘువునకు గౌరవము గల్గును. పాదాదివ్యస్తపదస్థ సంయోగము క్రమసంజ్ఞ గలదనియు నదిపరమగునపుడు పూర్వ పాదాంతిమలఘువునకు వికల్పముగ గురుత్వము గల్గుననియుఁ జెప్పఁబడెను. ద్వితీయ చరణాంత్యము శ్లోకాంత్యముతో సరిగ భావింపఁబడును" ఈవిధులేవియుఁ దెలుంగున వర్తింపవు. మఱియు వ్యంజనపరకము సంస్కృతమున లఘువు. తెలుంగున నదిగురువు...ల ఘ్వేకాక్షర పూర్వక్రియాన్తిమ స్యానయో భవే దిద్వా" (అం. చిం. క్రియా ౧౨ కా) అను సూత్రమునఁ జింతామణికర్త సంస్కృతపద్ధతిచొప్పున 'వధ్. వస్' మున్నగుధాతువులలోని వకారాదులు లఘువులని వచించియున్నాఁడు. కాని పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే" (౧౨ III విష) అనుసూత్రమున ద్రుతసంశ్లేషముచేఁ బద్యాంతవర్ణమునకు గురుత్వము నథర్వణుఁ డుద్దేశించెను. "చ...రాజమహేంద్రుఁ డున్నతిన్." (ఆది. ౧ ఆ. 3. ప.) అనునది మొదలుగ గుర్వవసాయిపద్యముల పరంపర వ్యంజనపరకము గురువనుటకుఁ బ్రమాణమగు చున్నది.

విస్తర II ౩౦ IV విష:- సిద్ధసమాసములందు రేఫసంయుక్తమేకాక సంయోగమాత్రము పరమైనను గొన్నియెడల గురుత్వములేని ప్రయోగములనుచునొకచో నిట్లుదాహరింపఁబడినవి. ద్విపద. "శునకగార్దభమ్లేచ్ఛ శుకదర్దురాది | జనితమునీంద్రాది జాతములెల్ల | శివభక్తిఁగాదె విశిష్టమై పరఁగె. (బసవ. ౭ ఆ. ౮౮౧ - ౮౮౯ ప.) అంధక|కరిదైత్య|వ్యాఘ్ర|త్రి|లా|లాజ|లంధరాదుల నిర్దళనము సేయండ|నింతింతపనులకు నీశ్వరుండేల|కంతుసంహారు నొక్కగణముచాలండె (బసవ. ౬ ఆ. ౧౬౭ ప.) పయి రెండుస్థలములందును సలముగా నుండవలసిన ద్వితీయగణస్థలములలో 'త్య. ఘ' లు గురువులగుటచే గణభంగ మేర్పడుచున్నది. అన్నిప్రతులందును నీపాఠములే కలవు. వీనిని సమర్థించుట యెట్లో" (బసవ. పీఠిక. ౯౬ పు.)

అంధకేత్యాదిపద్యమున 'త్య' అనునది గురువైనను గణభంగము లేదు. ప్రాచీనకాలమునందలి యింద్రగణములలో మగణసగురువులు సైతము గలవు. ఆ. వె. ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల| నైనగణము లినసురాధిపేందు|గణము లక్షరోపకరణంబు లవి యాది|లఘుగణంబు మొదల లఘువు నిలుప (కావ్యాలం. ౧

ప్రదేశేష్వాది:—ప్రదేశి=ఆభ్యిక ములలో సమానపదమందున్నైతము, తథాత్వం, స్యాత్=ఉన్నది కొన్నిచోటుల రేఫసంయోగపరకత్వమున లఘువుగురువు కాకుండుట కలదని యర్థము. ఉదా. "అదురుచు=అద్రుచు - అద్రువన్" అనువానిలోని 'అ.' అను నది లఘువే యగును-దానికి గురుత్వము లేదు. ఇట్లె - ఎద్రుచు - విద్రుచు - పద్రుచు క్రుచు - చిద్రుప - మున్నగువానియందును లఘుత్వమె కన్పట్టుచున్నది. ఇట్టి చోటులను గ్రంథకర్తలు శిథిలద్విత్వమందురు. ఉదా సీ...ఆ-వె-కురిసెఁ బుష్పవృష్టి; సురసందుభిధ్వనుల్ | చెలఁగె సకలభువనవలయ మద్రువ (III) (ఆది ౫ ఆ ౧౨౮ప) (సభా-౧౩౧౨-ఆరణ్య౧౩౧౭-౨౩౧౨-౪౭౩-మొ) చ. ఎద్రిచిన కాలపాక మున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం | బ్రద్రిచినవారు మన్ని శితబాణపరంపరపైవ మిణ్గు ఉుచ్ | విద్రువఁగఁ దత్ఫలంబుల చవిం జరితార్థులుగా శరీరపుం | జిద్రుపలు చేరఁ

ఉల్లా) అని పెద్దిరాజు తననాఁటికి మగణసగురువు లింద్రగణములలోను గగసగణము లినగణములలోను నక్కరలలోమాత్రము కన్పట్టినందున "అక్షరోపకరణంబులు" అని చెప్పెను గాని యంతకును బ్రాచీనకాలమున నవి సీసేతరజాతులందును వెలసి యుండెడివి. (వై. పా. ౩౪౪ విషు) ఇంతయేల? యీ సోమనాథుఁడే ద్విపద చరణాంత్యమున గగములను బ్రయోగించియున్నాఁడు "ప్రేమం బెలర్పంగ భృత్యే ఉపరాధ (౦౦) | స్వామినో దణ్డమన్ చదువు నిషించి" (బసవ. ౪ ఆ. ౧౫౬ ప.) పాయక శ్రుతిరసాన్ భక్తస్య జిహ్వా | గ్రే యని యేప్రొద్దు ప్రాయుఁ గావునను (బసవ. ౫ ఆ. ౫౯౦ ప) పయిద్విపదలలో "రాధః-జిహ్వా" అనునవి గగములుగా నున్నవి...ఈ గణభంగములు సంస్కృతభాషానుకరణమునఁ బడినవి. వీనిని సమ ర్థించుట యెట్లో? లఘు ర్భవే ద్గురుః క్వచి | చి ద్గురుశ్చ లఘు ర్భవేత్ | ఉచ్చార ణస్య కల్ప్యత్వా | న్నిదానం తత్ర సద్వచః" అనునథర్వణకారిక గతికావలె నేమో? అని పీఠికాకర్త వ్రాయుట సరికాదు. గణముల గురులఘుత్వము లుచ్చారణమును బట్టి మారుట కేవలను నప్రసిద్ధవిషయము. తెల్గునఁ బాదాంత్యగురువు లఘు వగుట యశ్రుతచరము. పయియథర్వణకారిక రేఫముల లఘ్వలఘుతల విషయమునఁ జెప్పఁబడినదే కాని గణాక్షరముల గురులఘుతల విషయమున వచింపఁబడినది కాదు. (౫౦ I విషు) "క్వచిదేకస్యైవలఘుత్వం గురుత్వం చాప్యస్తి. లఘు ర్భవే ద్గురుః క్వచి |చి ద్గురుశ్చ లఘు.ర్భవేత్ ...ఇత్యథర్వణవచనాత్. 'సీ. పరమాత్మ పదములఁ దొరఁగి పాతెదు...' గీ. తొఱఁగి నెత్తావి యందులో నెఱయఁనొప్పె' ఇతినృసింహ పురాణే" (అహో ౧౪౯ పు.)

దత్నతుల చేతులఁ గాకకులంబు వాతులన్ (ఉ. హరి ౪ ఆ ౧౧౯) క. నీచిత్త మిగ్రుచుఁ బ్రకటస। దాచావుల...(కవిజ సంజ్ఞా-౧౪౭) గీ. ఇగ్రుచు కోర్కుల తనదెంద మివతళింప (కవికర్ణ-3ఆశ-౪) గీ...లతాంగి। యెట్టిక్లేశంబులకునైన నీడఁ బోదు। తనమనంబున నిగ్రుచు సంతానకాంక్ష (శివరా ౨ ఆ 3౯ ప. సూ రా.ని)

క్వచిదిత్యాది - క్వచిత్ = కొన్నియెడల, సరేఫయోః = రేఫసంయుక్త వర్ణము పరమైయుండఁగా, నైవ = అట్లుకాదు. రేఫసంయోగపరకత్వమునఁ గొన్ని యెడలఁ బూర్వాక్షరము లఘువు కానేకాదు గురువే యగునని తాత్పర్యము.
ఉదా:—వట్రువ - అబ్రము - కప్రము - మొ.

| | |
|---|---|
| | చుక్ పరక రు వర్ణంబునకు ముందటి దువర్ణంబు |
| బాలవ్యా. | నుత్వంబునకు లోపంబు విభాషనగు, నగుచోఁ |
| 30 V | దత్పూర్వంబు గురువు గాదు. ౨౦. (ప్రకీర్ణ) |
| విమ. | అదురుచు - అద్రుచు - ఎదురుచు - ఎద్రుచు - పదు |
| | రుచు - పద్రుచు. |

సంజీవని 30 V విమ:—అదురుచు మున్నగువానిలోనిది ప్రేరణార్థకచుక్కు (బా-క్రియా-23-సూ) అట్టి చుక్కునకు ముందటి ధాతుసంబంధి రు వర్ణమునకుఁ బూర్వమందున్న 'దు' అనుదాని మీఁది 'ఉ'కారము వికల్పముగా లోపించు నని యర్థము. చుక్కు చేరనపు డదురు మున్నగుధాతువులలోని దకారముమీఁది యుత్త్వమునకు లోపము లేదనిభావము. ఇట్టి లోపము వచ్చునపు డేర్పడు రేఫ సంయోగమునకు ముందటి లఘువు గురువుకాదు. చౌ రే రుపధాత్మన శ్చేత్యాది చింతామణిసూత్రమునకే యిదియు వివరణము కావున 'అదురుచు' మున్నగుచోట్ల "అద్రుచు - అదుర్చు" మున్నగురీతిని రూపద్వయము సంభవించునని యెఱుంగునది. అందు"అద్రుచు" మున్నగుచోటులందలి 'ద్రు' అనుదానికి ముందటి లఘువు గురువు కాదని యెన్నఁనగును. ఇట్టిసంయోగమును గర్ణాటులు శిథిలద్విత్వ మందురు. ఇట్టి శిథిలద్విత్వము "ఇగురుచు = ఇగ్రుచు మున్నగుచోట్లసయితము గలదు. వీనికెల్లఁ బ్రయోగములు కల్పతరువులోఁ (30 IV విమ) జూపఁబడినవి

"హ్రస్వం లఘు (౧-౪-౧౦) సంయోగే గురు (౧-౪-౧౧) దీర్ఘం చ (౧-౪-౧౨) (సి-కౌ-3౧-3౨-33 సూ - సంజ్ఞా) అని సంస్కృతవ్యాకరణమునందు గురులఘువుల స్వరూపము విశదపఱుపఁబడి యున్నదనియుఁ గొఱవడిన విషయ ములు తనవ్యాకరణము ప్రక్రియలో నంత గా నావశ్యకముగావనియుఁ దలంచి

కాపలయుడు సూరి యిచటి నన్నయాథర్వణీయకారికలను సాకల్యముగా వివరింపలేదు.

నన్నయాథ ర్వణీయము. ౩౧ వివయము

అద్దన్త్యా స్తాలవ్యాశ్చ వ్యక్రాః స్యాన్మిథ స్సవర్ణా శ్చ
(ఆం - చిం - సంజ్ఞా ౧౧ కా. అహో ౧౫౯ పు.)
ప్రాకృతే తద్భవే చాపి । చ-జౌ ద న్తభవౌ స్మృతౌ॥
(వికృ - సంజ్ఞా ౮ కారి. అహో ౧౨౬ పు.)

కల్ప ౩౧ వివ:—ద న్త్యా = దంత్యములగు, చుః = చవర్గము, (అచ్చ తెలుఁగు చవర్గము 'చ జ'లు మాత్రమె) అత్ = అకారయుక్తమై యుండును. తాలవ్యాః - చుః=తాలవ్యములగు చవర్గము, (చ-జలు) వక్రాః=ఎకారవిశిష్టమయి యుండును. మిథః= పరస్పరము, సవర్ణాశ్చ - సావర్ణ్యము గలదగును. దంత్యచకారమునకును దాలవ్య చకారమునకును మైత్రిగల్గును. అట్లే దంత్యజకారమునకును దాలవ్యజకారమున కును మైత్రిగల్గుచుండును. యతిప్రాసాదులం దొకటి కొకటి చెల్లునని తాత్పర్యము.

ప్రాకృతే = ఆంధ్రదేశ్యమునందును, తద్భవే = వైకృతమునందును మాత్రమె, చ-జౌ = చకార జకారములు, ద న్తభవౌ = దంత్యములుగ, స్మృతౌ= చెప్పఁబడినవి. ఇట్లనుటచేతఁ దత్సమములందలి చ జ లేయచ్చుతోఁ గూడినను దాల వ్యములే యగునని తెలియనగును. ఇచటి ప్రాకృతశబ్ద మాంధ్రదేశ్యపరమని యీావలకె వ్రాయఁబడెను. (విస్తర ౧౮ విష)

దంత్యతాలవ్యంబులైన చ జ లు సవర్ణంబులు. ౭
తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును దాలవ్య
జకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని
తాత్పర్యము.

బాలవ్యాకరణ వివరణము. ౩౧ I-వివయము

ఇ-ఈ-ఎ-ఏ-లం గూడిన చ-జ-లు తాలవ్యంబులు. ౮
చిలు - చీమ - చెవి - చేమ - జిల - జీడి - జెట్టి - జేజే.
అ - ఆ - ఉ - ఊ - ఒ - ఓ - ఔ - లం గూడిన చ జ లు
దంత్యంబులు -౯. చలి - చాప - చుక్క - చూపు - చొక్కు - చోటు - చౌక ; జముఁడు - జాతర-జున్ను - జూలు - జొన్న - జోలి - జౌను. ఐదంతములైన చజలు సమేతరములందు లేవు.

సంజీవని ౩౧ I విష:—గ్రాహకము = గ్రహించునది. (విష. ౩౦ I) వ్యాకరణములందుఁ దాలవ్య చ-జ-లకుఁ జెప్పఁబడిన కార్యములు దంత్య చ-జ-లకును నగుననియు, దంత్యతాలవ్య చ - జ-లకుఁ బరస్పరమును యతిప్రాసాదిమైత్రి గలదనియుఁ దాత్పర్యము. అర్థములు:—జిల = దురద, జేజే = దేవత, సోక్కు = పారవశ్యము, జాతర = యాత్రోత్సవము, జోలి = వృత్తాంతము. జోకు = మెత్తగిల్లు. సూరిగారు విస్తరించి చెప్పిన ౮-౯ సూత్రముల విషయములు 'అద్దన్త్య' ఇత్యాదిసూత్రములనుండి గ్రహింపందగినవె యనఁదగును. (విస్తర I - II.)

---

విస్తర I ౩౧ I విష:—అచ్చాంధ్రమున నన్నయనాఁటికే వాడుక కెక్కిన చ జ ల దంత్యతకుఁ దాలవ్యస్వరయోగము ప్రతిబంధకమని 'అద్దన్త్య' ఇత్యాది సూత్రమువలన వ్యక్తమగుచున్నది. ఈసూత్రములో వక్రశబ్దము కంఠతాలవ్యమగు 'ఏ' త్వమును మాత్రమె చెప్పునని ముందు వివరింపఁబడును. (౩౧ II విస్త:) చ జ లకు దంత్యత కంఠ్య స్వరయోగముచేఁ గలుగు ననుటంజేసి "తాలవ్యశ్చువ్వక్రః" అనుదానిలోని వక్రశబ్దార్థమగు "కంఠతాలవ్యమైన 'ఏ' త్వము తాలవ్యస్వరసామాన్యమును బోధించు ననఁదగును. కాన 'ఇ - ఈ-ఎ - ఏ'లం గూడిన చ-జ లు తాలవ్యములనియుఁ, దక్కినస్వరములతోఁ గూడిన చ - జ-లు దంత్యములనియుఁ జింతామణ్యాశయము వర్ణింపనగును. ఎత్వమువలెనె 'ఐ' కారమునందును దాలవ్యత యున్నను 'ఐ - ఔ' లలో శ్లిష్టావయవమగుచు (౧౮ విష) 'అ' త్వము మొదట వినఁబడును గానఁ దదోగమున 'అద్దంత్య' ఇత్యాదిచే "చ జ" లకు దంత్యత గలుగుటయే చింతామణ్యభిప్రాయ మనఁదగును. కాన "ఓత్వవిశిష్ట చ-జ లు తాలవ్యము లగుట చింతామణ్యభిమత మేమో?" యనెడి యాధునికవిమర్శకోక్తి పరాస్తమగుచున్నది. (పరిషత్పత్రిక ఈశ్వరసం॥ ఆశ్వ - కార్తి- ౧౭౩ పు.)

విస్తర II ౩౧ I విష:—'తాలవ్య శ్చు ర్వక్రః" అనుదానిలోని వక్రశబ్ద మెత్వమాత్రపరము. తాలవ్యహల్లుపైఁ గంఠతాలవ్య స్వరమగు 'ఏ'త్వము నిల్చునపు డుచ్చారణసౌలభ్యాపేక్షచే నెత్వములోని తాలవ్యత యడంగి కంఠ్యమగు 'అత్వము' వినఁబడుటయు నట్లె యోష్ఠ్యహల్లుపైఁ గంఠోష్ఠ్యస్వరమగు 'ఒ'త్వము నిల్చునపు డందలి యోష్ఠ్యత యడంగి కంఠ్యమగు 'అ'త్వము వినఁబడుటయు నేఁటివ్యవహారమునఁ గన్పట్టును. ఉదా:—యెన్నడు = యన్నడు, యెడ = యడః; వొకటి = వకటి, వోడ = వాడ, ఇట్టివెయగు "చెద = చద, చెమ్మ — చమ్మ, చేప = చాప, జేన = జాన" మున్నగువానిలోసి

జెప్పఁబడిన దంత్యత (వి స్తర) యాంధ్రికశబ్దములకు మాత్రమె యని గ్రహింపవలెను, కాన సంస్కృతశబ్దములందలి చ-జ లేయచ్చుతోఁ గూడినను తాలవ్యములె యగును. సంస్కృతమునందలి చ-జలకు దంతోచ్చారణమె లేదు. దంత్యత్వతాలవ్యత్వ ఘటక స్వరములకుఁ బరస్పరము యతిమైత్రి లేమిం జేసి యాంధ్రికదంత్య చ-జలకు సాంస్కృతికతాలవ్య చ-జలతో మాత్రమె యతిమైత్రి నుదాహరింప నసు వగుచున్నది.

---

వి స్తర ౩౭ విష:— వెనుక నుదాహరించిన రీతిని (౧౮ విష) దంత్య చ - జల యుచ్చారణమునఁ దకారాద్యుచ్చారణమునందువలె జిహ్వాగ్రము దంత మూలములను దాఁకుట సంభవింపదు. ఈ దంత్య చ-జల యుచ్చారణమునందును దాలవ్యముల నుచ్చరించు నప్పటివలెనె జిహ్వామధ్యభాగము తాలువును (మూర్ధ దంతమూలముల నడిమి శిరోభాగము) (అను) దాఁకుచుండఁగా నాలుక యొక్క పార్శ్వభాగము దంతములను దాఁకుటయు సంభవించును. కేవల తాలవ్య చ-జల యుచ్చారణమున నట్లు జిహ్వాపార్శ్వభాగదంతస్పర్శము సంభ వింపదు. కావున "ఇ, ఈ, ఎ, ఏ లతోఁ గూడిన చ - జలు కేవలతాలవ్యము లనియుఁ (సంస్కృతమందువలె), "అ-ఆ" ప్రభృతులతోఁ గూడిన చ - జలు దంత తాలవ్యములనియుఁ జెప్పనగును. అట్లయినను గురుపాండవవ్యవహారన్యాయమునఁ గేవలతాలవ్యములగు చ - జలు తాలవ్యములనియు, దంతతాలవ్యములగు చ-జలు దంత్యములనియు భేదస్ఫూర్తికయి వ్యవహరింపఁబడుచున్నవి. (వై-పా-౧౭౮ విష) పై రీతిగా దంత్య చ - జలకు గల వర్ణోత్పత్తిస్థానకరణభేదమునుబట్టి వర్ణపార్థక్య సంపాదకసామగ్రి (౧౮ విష.) దంత్య చ జలకుఁ బూర్ణముగ నుండుటం జేసియె చింతామణికర్తయుఁ దదనుయాయి సూరియు వీని నచ్చాంధ్రవర్ణసమామ్నాయ

---

అనుబం. ౩౭ వి సర:— నవ్యులు తాలువనఁగా దౌడ యని యర్థము చేయుచున్నారు. "తాలవ్యములు— దౌడల సాహాయ్యమున నుచ్చరింపఁ బడునవి. చిలుక......" (బా-గు-ప్ర-సంజ్ఞా ౧ సూ-వ్యా.) "తాలవ్యమన దౌడలఁ బుట్టినది......దౌడలకు నాలుక తాఁకఁజేసి పలుకవలసినది తాలవ్యము" (బా-సా-పే-సంజ్ఞా-౩ సూ-వ్యా) "దౌడలనుండి పుట్టినవి తాలవ్యములు" ఆం-భా-అ. ప్ర-ఋ-౧౮ పు.) "తాలువనఁగా దౌడకాదని వైయాకరణపారిజాతమునం దే కాక స్థలాంతరములందును నేను బ్రచురించితిని, అనుశాసనతృతీయముద్రణమునఁ బె వాక్యముజ్జగింపఁబడుట ప్రశంసనీయము.

౯-నౌ-క్షేపణకు పదుష్టజయులకు నఖిలజే। వాసురాదులు (ఆది-౩ఆ-౨౮ప)
...పరాతిపాపుల చైవడ్ప్పన కెవ మెచ్చు, .........। జఘనచక్రంబుపైఁ జైలుపు
...... (ఆది ౩ ఆ ౩౯౫) ఉ. క్రచ్చెఱ నొక్కరక్కసుఁడ కాఁడు
...కాడు ఎల్లలోక్కఁజై। వచ్చిన.........। ప్రచ్చి.........। మెచ్చెగు...
......(ఆది ౬ ఆ ౨౦౦)

సంజీవని ౩౩ విష:—"చస్త్యచ-జౌ గురర-లౌ చ బిన్దుయుతౌ" అనియిట్లు చింతామణికర్త చ-జ-లపై బొట్టుల నుంచినచో నవి దంత్యతానుమాపకము లగునని చెప్పెను. కాని యీ సందర్భమునఁ జింతామణికర్త యుపదేశించిన యీ సూత్రసరణి సాకల్యముగా వాడుకకెక్కదయ్యెను.

సంజీవని ౩౪ విష:—చ-జల దంత్యత కనుమాపకముగా దానిపయి దంత్య తాక్షేపరూపమగు 'ౘ' అను చిహ్నమును నాధునికులు నిల్పుచువచ్చిరి. కాని యట్టిదియు లేఖన ముద్రణాదులం దుపేక్షితమె యగుచున్నది. బాలవ్యాకరణము నందుఁ బ్రత్యేకముగా దంత్యత నుదాహరించు స్థలములందుమాత్రమె యట్టిలిపి కన్పట్టుచున్నది. భారతాదిప్రబంధముద్రణములందును ప్రౌఢవ్యాకరణమునందును లక్ష్మీనారాయణీయకోశమునందును నట్టిలిపి పాటింపఁబడ లేదు. శ-ర, సూ-రా-నిఘంటువులం దుదాహృతశబ్దములందు మాత్ర మట్టిలిపి నిల్పఁబడుచున్నది.

సంజీవని ౩౪ I విష:—ఐదంతములయిన చ - జలు సంస్కృతసమేతరశబ్దము లందు లేవనిసూరి వచించెను. ఇందులకు విరుద్ధముగా "చైవుల సాకిరి చాయ మగఁడు" అని యాంధ్రనామసంగ్రహమున బ్రయోగింపఁబడెను. (దేవ - ౩౬) (విస్తర) లక్ష్మీనారాయణీయకోశమున "చైదము - చైది" శబ్దము లుదాహరింపఁ బడినవి - ఇంకను నందలి చైదము శబ్దము శబ్దరత్నాకరోదాహృత మనుచు 'శ' అను

మున వెలువ్వ్నములుగఁ బఠించిరి. ఇట్టివిషయమును గ్రహింపక పేటికా వ్యాఖ్యాత "చింతామణియందుఁ లేఁ గాక యిం దాయా యచ్చుల సంబంధముచే "చ-జ" లకుఁ గలిగెడు దంత్యతాలవ్యతల నిర్ణయించు నీసందర్భము చూపట్టుటంబట్టి వర్ణ సమామ్నాయమున 'చ-జ' లను రెంటినే నిల్పుట యుచితము" (బా-సా-వే సంజ్ఞా-౯ సూ-వ్యా.) అని వ్రాయుట కేవలము పొరపాటు.

విస్తర-౩౪ I విష:—"చైవులసాకిరి చాయమగఁడు" అనునది చూపట్టుం గాని 'చయివుల' అని దిద్దనగుటఁ దృశ్యము. ఇది కేవలసంస్కృతసమవిషయము." (బా-సా-వే. సంజ్ఞా ౯ సూ-వ్యా.) అను పేటికావ్యాఖ్యానపంక్తుల యభిప్రాయ మేమో తెలియకున్నది. ఏకోశమునందును "చయివు" అను 'అ'కారయుక్త చకార

గుర్తుతో నసత్యముగ వ్రాయఁబడెను. శబ్దరత్నాకరమున" - చెయిదము - చెద్దము అనియె యున్నవికాని 'ఐ' దంతములు లేవు. తే. గీ. రమణతో నాంధ్రనామ సంగ్రహమునందుఁ । జెయివులకుఁ జైవులంచు వచించెఁ బైఁడి।పాటిలక్ష్మణకవి యది పాటిసేయఁ । దగదు గదకబ్బముల మహీధరశతాంగ॥ శా॥ చేరం జో టొక టెందుఁ గానక భ్రమం జెయ్వేది...(ఎఱ్ఱ - హరివం) సీ. చెయ్వు లన్నియుఁ దక్కఁ జిత్రరేఖ (వసుచ) ఉ. సింగంబుల్ మునిబాలికల్ దిరుగుచుం జెయ్వేది...(ఉత్తరరా) (సర్వల - ౨ ఆ - ౧౩౧ మొ ౧౩౮ ప) కాని యీవిమర్శమునకు విరుద్ధప్రయోగ ములును గలవు "చైవు = చెయువు ఉ.........అ । చక్కెరబొమ్మ మార్మలయు చైవులకున్ విభుఁ డుల్లసిల్లు చున్ (శుక - ౧ ఆ ౨౧౩ - కాళిందీ ౨ ఆ - ౬ - సూ. రా - ని.)" కాని శుకసప్తతి చంద్రాంగదచరిత్రము మున్నగు సాధారణకవుల ప్రబంధములు శబ్దస్వరూపనిర్ణయ విషయమునఁ బ్రమాణీకరింపఁదగినవి కావు.

సంజీ. ౩౫ II విషః—సంధిస్థలములో నాచ్ఛికములందును నైదంత చ-జలు లభింపవచ్చును. అట్టియెడల సంధిపూర్వావస్థలోని దంత్యతాలవ్యతలె చ - జలకు నిల్చును, ఉదా:—అచ్చు + ఐనది = అచ్చైనది. (వి సర)

---

ఘటిత శబ్దము కన్పట్టదు, సంస్కృతసమములం దైకారయుక్త చకారవచ్ఛబ్దములు గలవు. ఉదా:—చైత్యము - చైద్యుడు - చైత్రము - చైతన్యము-మొ.

విస్తర-౩౫ II విషః—సంధిస్థలములందలి దంత్యతాలవ్యతలను నిర్ణయించుటకుఁ జింతామణిభారతములలో నవకాశము లేదు. సూరిగారు తమ సూత్రాంధ్ర వ్యాకరణమున(౧౮౪౧-క్రీ-శ.)"అక్కజాదిషు. కంచంత-కాచాకు-పచ్చాకిత్యాదీనా మక్కజాదిత్వా త్సంధిత్వ ఏవగన్తవ్యమ్." అని వ్రాసి "కంచి+అంత = కంచంత, కాచి+ఆకు= కాచాకు, పచ్చి+ఆకు = పచ్చాకు" అనువానిలోని చకారతాలవ్యతను సంధిపూర్వావస్థానుసారముగ నెన్నక యక్కజాదిపాఠమున సాధించిరి. అది సరికా దనితలఁచి కావలయుఁ దమయాంధ్రశబ్దానుశాసనమున "పదాదిసంయోగంబునం దొంటియట్లొండె నగు" అని సంధిపూర్వావస్థితిని బాక్షికముగ నంగీకరించిరి. మఱియు నాలోచించి తమపద్యాంధ్రవ్యాకరణమున నట్టిస్థితిని బాహుళకముగావిధించిరి. తే॥ గీ-అత్వ మాత్వ ముత్వం బూత్వ మొత్వ మోత్వ । మౌత్వ మెనసిన చ-జలు దంత్యములు ఱఁలు । తాలుజములగుఁ నొలియచ్చు దార్కొనంగ । బహుళముగఁ బూర్వవృత్తంబు వడయు శౌరి. (ఇదియె నారాయణీయ తద్వివరణములకు మూల మనున ట్లున్నది (నారా - సంజ్ఞా ౭౬ పద్య -

సంజీ ౩౬ విమ:—'అర్చిస్ - శోచిస్ - వాజిన్' అనునవి ప్రాతిపదికములు - సూరి యెల్లెడలను ప్రాతిపదికముల నైనె విభక్త్యంతములను జేయుచుండును. కావునఁ బ్రథమైకవచనమున నికారాంతములు చ-జోపకములు నగు నాని ప్రాతిపదికములకు బహువచనము పరమగునపుడని యీ సూత్రవాక్యమున కర్థముచేయవలెను. (విస్తర I) అర్థములు:—చాక్రిక = ఫలిదించనాను చెప్పు, ...టము = శిశునిజడముపి.

'రాజాశబ్ద బొక్కటి' యనుటచే రాజాశబ్ద మేకత్వమందును బహుత్వమందును (రాజా రాజాలు) దత్త్య జకారయుక్తమై యున్నదని సూరియాశయము విశదమగుచున్నది. (విస్తర II, III)

సంజీ ౩౭ విమ:—'అర్చులు - రాజా' మున్నగుసంస్కృతసమము లందలి చ జలు దంత్యములని చెప్పుటకు నేఁటివ్యవహారమే యాధారము కాని వేఱు ప్రమాణ మగపడదు. ఈపక్షమున "అచ్చు = స్వరము, రవి తేజోఽడు, విగ సంకోచుఁడు," మున్నగుచోటులందును సూరి దంత్యతను విధింపకుండుటలో యుక్తి

---

విస్తర I-౩౬ విమ:—"ఇకారాంతసంస్కృతసమముల చ-జలకు బహువచనము పరమగునపుడు......" (బా-సా-వే. సంజ్ఞా ౧౦ సూ. వ్యా) ఈవాక్యము సరి కాదు. సంస్కృతసమ మనఁగా విభక్త్యంతరూపము—దానికి బహువచనము పరమగుట యసంభవము. ప్రాతిపదికమునకె బహువచనము పరమగుచుండుట సూరిప్రక్రియలోని సంప్రదాయము.

విస్తర II ౩౬ విమ:—"రాజాశబ్దం బొక్కటి యేకవచనాంతంబును దంత్య యుక్తంబుగాఁ గనంబడుచున్నది" (బా-గు-ప్ర. సంజ్ఞా. ౧౦ సూ వ్యా.) అను ప్రకాశికవ్రాత సరికాదు. 'రాజా' అనునపుడు వినఁబడు దంత్యత 'రాజాలు' అనునపుడు వినఁబడలేదా? 'రజా' అను నేకవచనాంతము మాత్రము దంత్య యుక్తమని సూరి వచింపలేదు—"రాజాశబ్దంబు" అనెను.

విస్తర III-౩౬ విమ:—గుప్తార్థప్రకాశికాకర్త "అర్చులు-రాజా" మున్నగు చోటులందుఁ దాలవ్యోచ్చారణము దుష్టకమును (౭ ఫుట-ద్వి-ము.) బహుశ్రమాపాదక వక్రతమముఖభావతాపాదకమును (౧౮౨ ఫుట-ద్వి-ము.) నగుటచే సూరి యిట్లు దంత్యతను సూత్రించెనని వ్రాసెను. ఈ సూత్రమునఁనె యుదాహరించిన "చక్రికాదిశబ్దములలోని తాలవ్యోచ్చారణమున నట్టి యాయాసము వీరికిఁ దోఁచకుండుట వింతగనున్నది.

కాక ...డు. ఇట్టి వానియందును దంత్యోచ్చారణ బహుచున్నదని నేఁటివైయాకరణులు తెలుపుచున్నారు. "అచ్చులు = స్వరములు" ఇత్యాదిసూత్రము వర్తింపకున్నను ...కి ... ప్రసిద్ధము, (బా-సా - వే - సంజ్ఞా ౧౦ సూ-వ్యా) మఱి కొన్ని తత్సమశబ్దములతుదనుండు చకార జకారములు 'ఉ' కారముతోఁ గూడి ... ఉ. ...ప్ - అచు - అచ్చులు, (ఆం-భా-అ. సంజ్ఞా ౧౨ సూ)

ఆం... క్రొత్తవి మహాకావ్యప్రయోగములె యాధునికములని యుపే క్షించిన (బా - సంధి - ౮ సూ) సూరి నేఁటివాడుకలోని యీయపభ్రష్టోచ్చారణ మును ప్రమాణీకరించి సూత్రించుట యుక్తమని తోఁపకున్నది.

సంజ్ఞ ౩౮ విషః—"తే, గీ. దంత్యతాలవ్య చ - జలను ధరణి వ్రాయు। తఱిని శుద్ధాంధ్రలిపిని భేదంబుకలిమి। ద్వ్యర్థ కృతులను దలకట్టు లనుచు నొకట। నిడియు నొకచోన నడిమను నిడఁగరాదు. రాఘవపాండవీయమునందు—ఆ-వె. ఎందు వేఁట కారె యి...క లేమనసుతో। దారసంగసుఖము తప్పఁద్రోచి। తకట పాండురాజ యశ మెగ్గు...తి! క్రూరదశ రథేశకులము రోయ (పాండుర + అజయశము- రామాయణార్థము; పాండు రాజ + యశము - భారతార్థము) వ........ఆద్య ప్రకృతియ దంత్యములు లేవు కనుక శుద్ధసంస్కృతమైన పాండురాజశబ్దము నందుఁగల జకారము తాలవ్యమె కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవ లాంధ్రులు దంత్యోచ్చారముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. అట్లగుటం జేసి కవితాప్రవర్తకు లయిన సూపరాజుగారింతవట్టును విచారించి తాలవ్యము గానే ప్రయోగించిరి." (అప్పక - ౨ ఆ ౧౩౫ - ౧౩౬ ప) పైప్రయోగమందు రామాయణార్థము దలి జకారము తాలవ్య మగుట నిశ్చయ మగుటంజేసి పాండురాజ యను భారతార్థపక్షమునందును దాలవ్యమె యనఁదగునని యప్పకవి సమర్థించి పాండురాజు భీమరాజు మున్నగుచోటులందలి జకారమును దంత్య ముగా నుచ్చరించుట యపభ్రష్టోచ్చారణమని సిద్ధాంతీకరించెను. (విస్తర) (వైయా - పా - ౫౮౪ విష)

---

విస్తర-౩౮ విషః—గుప్తార్థప్రకాశికాకర్త పయియప్పకవీయగ్రంథము బాల వ్యాకరణమునకు విరుద్ధముకాకుండ సరిపెట్టఁదలపడి యీక్రిందిరీతిని వ్రాయ సాహసించెను—'ప్రసిద్ధమగు కనిన్ప్రత్యయాంతమగు 'రాజన్' అనుదాని తత్సము రూపమైన 'జు' అనునది దంత్యజకార యుక్తమని సూరిచెప్పవలసియుండు "పాండు రోగమితనియందుఁ బ్రకాశించు" అనువ్యుత్పత్త్యర్థముగల యప్రసిద్ధమగు నధిక

సంజీ ౩౯ విష:—రాజో శబ్దములోని జకారమును దంత్యముగాఁ బలుకుట నిర్మూలము కాదు. రాజశబ్ద భవమగు వైకృత రాజో శబ్దమునందలి జకారము దంత్యమనుట యుక్తమేకదా. 'రాజో' అనువైకృతశబ్దము కలదనుటకు గీ. "రాజో చెప్పంగఁ జూడంగ రాని కడిమి। ........." (యయాతి - ౨ ఆ - ప్రౌఢ - సంజ్ఞా ౬ సూ) అను నచ్చతెనుఁగుకావ్యములోని రాజోశబ్దప్రయోగము ప్రమాణ మగు చున్నది. (విస్తర) దీనికి వైకృతత్వ మంగీకరించియుఁ దత్సమరాజు శబ్దము దంత్య జకారఘటితమని సూరి యభిప్రాయముచొప్పున నంగీకరించినచోఁ దద్భవరాజోశబ్ద మునం దద్భవత్వాంగీకారబీజమె లేకపోవలసివచ్చును. తత్సమ తద్భవ రూపద్వయ

---

రణార్థక ఘుఖంతమైన 'అ' కారాంతరాజశబ్దము రాఘవపాండవీయమునఁ బ్రయుక్త మయ్యెననియు నది తాలవ్యజకారయుక్త మగుటలో బాలవ్యాకరణవిరోధము లేదనియుఁ దనయీ యపమార్గమునసే యప్పకవియు వ్రాసెననియు గుప్తార్థ ప్రకాశికాకర్త ప్రసంగించెను. (బా-గు-ప్ర-బాల-సంజ్ఞా ౧౦ సూ-వ్యా.) ఈ యప్రసిద్ధమగు రాజుఁడు శబ్దము సైతము శుద్ధసంస్కృతమె యగుటచేత నిందలి జకారముసయితము దంత్య మెట్లు కాకుండును? ప్రసిద్ధసంస్కృతశబ్దగత జకారము దంత్యమనియు నప్రసిద్ధసంస్కృత శబ్దగత జకారము తాలవ్యమనియుఁ జెప్పుట యుక్తమా? మఱియు నప్రసిద్ధ రాజుఁడు శబ్దమును రాఘవపాండ వీయకర్త ప్రయోగించె ననుటలో యుక్తి యేమున్నది ? శుద్ధసంస్కృత రాజ శబ్దము తాలవ్యజకారయుక్తమే యని యుద్ఘోషించు నప్పకవి యప్రసిద్ధ శుద్ధ సంస్కృత శబ్దగత జకారము మాత్రము తాలవ్యమని తనవలెఁ బల్కెననుట యన్యాయ్యముకాదా?

విస్తర-౩౯ విష:—అచ్చాంధ్రకావ్యములలోఁ బ్రయుక్తమగు రాజు శబ్దము వైకృతముకాదనియు సంస్కృతసమమే యనియు నయ్యది యచ్చాంధ్ర కావ్యములలోఁ బ్రయోగించుటచే నది గ్రామ్యమనియుఁ గవిప్రయుక్తమగుటచే దాని కనింద్యగ్రామ్యత నంగీకరింపఁ దగుననియు నిట్లు గుప్తార్థప్రకాశికా వేటికా వ్యాఖ్యాతలు వ్రాయుటయు సరికాదు. (బా-గు-ప్ర-తత్స ౭౮ సూ-వ్యా.) (బా-సా-వే- సంజ్ఞా. ౧౧ సూ-వ్యా.) ఇట గుప్తార్థప్రకాశికాకర్త యీతత్సమశబ్ద ప్రయోగ మచ్చాంధ్రకావ్యములలో నన్యదేశ్యశబ్దప్రయోగమువలె ననింద్య గ్రామ్యము కాఁదగునని వ్రాయుటయు సరికాదు, అన్యదేశ్యములు సంస్కృత సమేతరములగుటచే నవి యాచ్ఛికములె. వానిప్రయోగము గ్రామ్యమె కాదు.

పఠనం వాకారమునఁగాని యర్థమునఁగాని యేమేని భేదమును జూపకుండుట సంప్రదాయవిరుద్ధముగదా.

సంజీవని ౮౦ విష:—ప్రౌఢవ్యాకరణకర్తయు బాలవ్యాకరణమార్గము నాంధ్రపాండిత్యప్రయోగమునకు విరోధింపకుండ సమర్థింపనెంచి శ్లేషాదులలో ఖండాఖండశబ్దములకును లఘ్వలఘు యరలవ ఘటితశబ్దములకును 'వబ - వలా'ది భిన్నాక్షరఘటిత శబ్దములకును నైక్యము నంగీకరించునట్లె దంత్యతాలవ్య చ-జ ఘటితశబ్దములకును నభేదమును బాటించి యొకయర్థమున దంత్యజకారఘటిత శబ్దముగను, వేఱొకయర్థమునఁ దాలవ్యజకారఘటితశబ్దముగను నొక్కశబ్దము నె ప్రయోగింపనగు ననుచు "ఒకానొకచో జకారం బుభయంబు నగు. శ్లేషయందు జకార మొక్కటియె యొకయర్థమున దంత్యమును వేఱొకయర్థమునఁ దాలవ్యము నయ్యెడు నని యర్థము" (ప్రౌఢ - సంజ్ఞా ౫ సూ) అని వచించెను. మఱియు నిట్టి మార్గమునం దస్వరసతచేఁ గావలయు "రాజు వైకృతంబని కొంద అందురు. అపుడు తత్సమంబునందలి చ - జలు దంత్యములు కావని యూహించునది. ఉ. తే-గీ. రాజు చెప్పంగఁ జూడంగరాని కడిమి (య - ౨ ఆ)" అని సరళమార్గమును సయుక్తము సూత్రించెను. సూరి పోరవడి "భీమరాజు - పాండురాజు" మున్నగు తత్సమము లందలి రాజుశబ్దపు జకారమునకు వ్యావహారికశబ్దశ్రవణ వాసనాబలమున దంత్యత నంగీకరించినంతమాత్రమున నిన్ని యపమార్గములను ద్రొక్కవలయునా?

సంజీవని ౮౧ విష:—శ్లో. అ దా దు దూ దో దౌ దా ద్దా । దన్త్యావే వాత్ర కేచన । వదన్తి తత్త్వం బహుషు । సమేదన్తోపధా చ - జోః । న త దస్మ త్తారూఢం । త దభావేపి సజ్జతేః। కేచి ద్రాజ్ఞో౽పి సర్వత్ర । న త చ్ఛేష్ట మసజ్జతేః॥ (హరికారికావళి - సంజ్ఞా - ౧౨ - ౧3 శ్లో) అని కీర్తిశేషులగు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి గారు వచించిరి. సంస్కృతసమేదంతోపధా చ - జలకు బహుత్వమున దంత్యత నుప దేశించుటయు రాజుశబ్ద జకారమునకు దంత్యతను విధించుటయు బాలవ్యాకర ణమునందుమాత్రమె కన్పట్టుచున్నవి. అట్టి విషయములను నిరాకరించునదియుఁ, దక్కిన బాలవ్యాకరణవిషయముల నెల్ల భాషాంతరీకరణమువలె సంగ్రహించు నదియు నగుటంజేసి శిష్టుకృష్ణమూర్తిశాస్త్రికృత హరికారికావళియె బాలవ్యాకరణ మూలకమని నిశ్చిత మగుచున్నది. ఇందులకు విపరీతముగ బాలవ్యాకరణమె హరి కారికావళిమూలకమని వాదించు బాలవ్యాకరణగుప్తార్థ ప్రకాశికాకారుని వాద మెల్ల నొక్క యీనిదర్శనముచే నున్మూలితమగుచున్నది. (బా - గు - ప్ర - ప్రకీర్ణక

పరిచ్ఛేదము తుది. ౫౧౨ పు. మొ. ౫౩౫ పు. ద్వితీయముద్రణము) ఇట్టి యప సిద్ధాంతమును సమర్థించుకొనుటకయి సుప్తార్థప్రకాశికాకర్త చూపిన హేత్వా భాసములెల్ల నాయాసందర్భములలో నిరాకరింపఁబడును.

> ద్రుతాఖ్యో నః. (ఆం. చిం. సంజ్ఞా. ౧౩ కా. అహో ౧౬౨ పు.) తిఙ్మధ్యనామకాః స్యుర్మధ్యమపురుషాశ్చ యే రమాన్తాశ్చ (ఆం. చిం. క్రియా ౧౨ కారి. అహో౨౨౮ పు.) తిఙ్మధ్య శేషషష్ఠీసుస్ కర్మప్రవచనీ
> 
> నన్నయాథర్వణీయము ౭౨ విషయము
> 
> యజవిభక్తిః। కిఞ్చి త్ప్రశంస నాద్భుత। సన్తాప యదా తదాకి మేవాంశ్చ।క్త్వా కిల తూష్ణీ మాద్యా। వభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్। అన్యే ద్రుతప్రకృతయో । యే స్యు ర్హ్యేను జీవితద్రుతా నిత్యమ్॥ (ఆం. చిం. సంజ్ఞా ౧౬-౧౭. కారి. అహో. ౧౭౦ పు.) ద్రుతోపజీవిన శ్శబ్దాః। కేచిత్ సుకవిసమ్మతాః। సంబన్ధస్తిఙ్ సుబన్తాభ్యాం । పూర్వత్రచ పరత్రచ॥ (వికృ. అజం. ౭౬ కా. అహో ౩౫౮ పు.)

కల్ప ౭౨ విషః—నః = పొల్లునకారము, ద్రుతాఖ్యః = తెల్గున ద్రుతమని పేర్కొనఁబడును. మధ్యమపురుషాశ్చ = మధ్యమపురుషక్రియలును, రమాన్తాశ్చ = రేఫాంతక్రియలును మాంతక్రియలును, యే = ఏవికలవో యవి, తిఙ్మధ్యనామకాః = తిఙ్మధ్యసంజ్ఞగలవి, స్యుః=అగుచున్నవి. తిఙ్మధ్య=తిఙ్మధ్యసంజ్ఞికక్రియలును, శేషషష్ఠీ= యొక్కషష్ఠియు, సుస్ = ప్రథమావిభక్త్యంత పదములును (సు. ఔ. జస్ = సుస్-ప్రత్యాహారము) కర్మప్రవచనీయజవిభక్తిః = కర్మప్రవచనీయార్థకములగు కూర్చి - గుఱిచి - గుఱించి, మున్నగుపదములును, కిఞ్చిత్ = ఇంచుక మున్నగు కించిదర్థకములును, ప్రశంసన = బళి - బాపురేమున్నగు ప్రశంసార్థకపదములును, అద్భుత = ఔర-ఆహా మున్నగు నాశ్చర్యార్థకపదములును, సన్తాప=అక్కట కటకట - మున్నగు సంతాపార్థక పదములును, యదాతదా = ఎప్పుడు - అప్పుడు - ఇప్పుడు 'అనుపదములును,కిమ్ = 'ఏమి - ఏల' అను కిమర్థకములును, ఏవాంశ్చ = 'అ - ఎ - ఏ' అను నవధారణాద్యర్థక స్వరములును, క్త్వా = చదివి - చదువక మున్నగు క్త్వార్థక పదములును, కిల = 'అఁట - అంట' అను కిలార్థక పదములును, తూష్ణీమ్ = ఊరక .. మిన్నక మున్నగుపదములును, ఆద్యాన్ = మొదలగుపదములను, కళాః =

[illegible]లబుగా, [illegible] దుదిని సహజమగు పొల్లునకారము లేనిది = ద్రుత ప్రకృతికము కానివి అభిదధతే = చెప్పుచున్నారు. అన్యే = కళలుకాని యాంధ్ర పదములెల్ల, ద్రుతప్రకృతయః = ద్రుతప్రకృతికము లనఁబడుచున్నవి. ప్రకృతిసిద్ధ మగు ద్రుతము తుదినిగలవని తాత్పర్యము. యే = యేపదములు, నిత్యమ్ = సదా, అనుజీవిత ద్రుతాః = అనుసరించి నిల్చియుండు, పొల్లు నకారము తుదిని గలవగుచున్నవో, యవి ద్రుత ప్రకృతికములని పూర్వవాక్యముతో నన్వయము. ఆహ్యాకే = అనుటచేత - మఱి - మున్నగు నితరపదములును జెప్పఁబడుచున్నవి. 'చూచుము చూచుఁడు' అనువానిసంక్షేపరూపములగు 'చుమ్ము - చూ - చుండు - చుఁడు పదములు మధ్యమపురుష క్రియలుగానఁ దిఙ్మధ్యసంజ్ఞ గలవగుచుఁ గళ లగు చున్నవి. అహోబలపతి చుమ్ము పద మాద్యశబ్దగ్రాహ్య మగుటచేఁ గళయగునని ప్రామాణికముగ వ్రాసెను. (అహో ౧౭౧) 'అపుడు - ఇపుడు - ఎపుడు' అనునవి ప్రథమాంతము లగుటచేతనే కళలగుచుండఁగా వానిని "యదా - తదా" అనుచుఁ బ్రత్యేకించి కళలుగఁ జెప్పుట ప్రపంచార్థమని బాలవ్యాకరణమున వివరింపఁబడెను. (బా. సంధి. ౧౨ సూ.) 'రక్షించుచున్నది. రక్షించుచున్నవి.' అనురూపములు భట్టారకుని ప్రక్రియలో సైతము 'రక్షించుచున్న+అది = రక్షించుచున్నది, రక్షించు చున్న+అవి = రక్షించుచున్నవి' (ఆం. చిం. ౮ కా. శబ్దా త్తచ్ఛబ్దాతః) అనురీతిని సైతము సాధ్యములగును గాన నవి ప్రథమాంతములవలెనె కళలె యని నన్నయ యాశయము. తమిళాదీతర ద్రావిడభాషలలో నేఁటికిని 'అదు - అవు' అనునవే తెలుఁ గులోని 'అది - అవి' అనువానికిఁ బర్యాయములై యున్నవి. కావునఁ దెలుఁగులోని "రక్షింపదు - రక్షింపవు - రక్షింపఁగలదు - రక్షింపఁగలవు" మున్నగునవి ప్రాచీ నాంధ్రమున నుండెడివని యూహింపఁదగిన 'అదు - అవు' అనువానినుండి యేర్పడినవే యనవచ్చును గాఁబట్టి యవియును బ్రథమాసదృశములై కళలె యగు ననఁదగును. తిక్కననాఁటికి గ్రాంథికతావస్థ నందిన "రక్షించుచున్నాఁడు - రక్షించుచున్నారు - రక్షింపఁగలాఁడు - రక్షింపఁగలారు" అనునవి నన్నయ వాడుచున్న 'రక్షించుచున్న వాఁడు - రక్షించుచున్నవారు, రక్షింపఁగలవాఁడు - రక్షింపఁగలవారు' అనువాని సంక్షేపరూపములె యగుటచే నవియును బ్రథమాంతములవంటివె యై కళలగు చున్నవి. పై వాని సాహచర్యమున 'రక్షింపఁగలఁడు - రక్షింపఁడు' అను డుజంత మహత్కర్తృక ప్రథమపురుషైకవచనములును బ్రథమాసదృశము లనఁదగును గావునఁ గళలె యగుచున్నవి. పై సందర్భమునుబట్టి తిఙ్మధ్యములు సైతము ప్రథమాసదృశములె యనఁదగియున్నను నవి వీనికన్న మఱికొంత విదూరస్థితిలో

[బా. సంజ్ఞా. ౧౧ సూ] ఉత్తమపురుషైకవచనములు ప్రథమాతుల్యములుకావు, నప

నుండుటంజేసి వాని నీరీతిని విడువక ప్రత్యేకముగా గ్రంథకర్త పేర్కొనెనని యెన్నఁదగును. ఈవిషయమున మఱొకబలమైన హేతువు గలదు. నేను తాను శబ్దములు ప్రథమైకవచన 'సు' ప్రత్యయాంతము లగుటచేత (సు జసో ర్ను - మూ వురూ చ తత్ర స్తః. ఆం. చిం. హలం ౫౭ కారి) నవి కళలె యగుచున్నవి. 'అన్యే ద్రుతప్రకృతయః' అనుదానిచే వానితుదిని ద్రుతము చేరదు. నేనుశబ్దపు తుదివర్ణ మగు 'సు' అనునదే యుత్తమపురుషైకవచనముల తుది నుండు 'సు' ప్రత్యయ మనుట భాషాతత్వశాస్త్రముచొప్పున సరియైనను నట్టిస్థితి విదూరవృత్తిక మగుటచే మార్పుగల్గి యుత్తమపురుషైకవచన క్రియలెల్ల ద్రుతప్రకృతికము లగుచున్నవి. వానితుదిని "అన్యే ద్రుతప్రకృతయః" అను సూత్రముచే ద్రుతముచేరి "రక్షించితినిన్" మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ఇట్లగుటచేతనే యీయుత్తమ పురుషైకవచనములను వీనితోపాటు తిజ్మధ్య క్రియలను బయిని వివరించిన ప్రథమా సదృశ క్రియలతోపాటుగ విడువక భట్టారకుఁ డట్టిక్రియల కళాద్రుతప్రకృతికత్వ ములను బ్రత్యేకముగా వివరించినవాఁ డయ్యెను.

పయిరీతిని గళలనిపించుకొనని పదములె ద్రుతప్రకృతికము లగునని యెఱుంగునది—అనఁగా నట్టి పదములతుదిని బొల్లునకారము నిల్చునని తెలియు నది:—"సీత+ను = సీత+నున్ = సీతనున్" అనురీతిని బ్రక్రియ నెన్నవలెను— అనఁగా 'సీతను' అనుద్వితీయాంతము కళాశబ్దభిన్నము కాన 'అన్యే ద్రుత ప్రకృతయః' అనుచొప్పున ద్రుతప్రకృతికము కావలయుటంజేసి యీసూత్రము చేతనే దానితుదిని బొల్లునకారము చేరునని యెన్నునది—ఇట్లే చేత తోడాదుల కును "వచ్చితిని - చేసెదను - జేయుదును - చేయును" మున్నగు క్రియాపదముల కును బ్రకృతసూత్రము చేతనే వ్యంజన నకారయోగముగల్గి రామునిసిన్- రామునిచేతన్ - రాముని తోడన్ - రామునికొఱకున్ - వచ్చితినిన్ - చేసెదనున్ - చేయుదునున్ - చేయునున్ - మున్నగురూపము లేర్పడును. (చూ ౬౧ I. ౧౨౦. ౧౩౧ I విషయము.) ఇట్టివానితుది నకారము సరళస్థిరపరకత్వమునను నవసాన మునను లోపింపఁగా - చేసెదను మున్నగురూపములు సిద్ధించును. అట్టియెడలఁ గవిభల్లటసూత్రముచేత (౨౧౦ II విష.) (ఆం-చిం-హలం ౮ కారి.) నుల్లోపము రాఁగా - 'చేసెదన్' మున్నగురూపములుసిద్ధించును. ఇట్టివానితుది నకారము సయితము "వాక్యాంతగతపదానాంచ" అనుచొప్పున (అవసాన ద్రుతలోపము నందఁగా) లోపింపఁగా "చేసెద" మున్నగురూపములు సిద్ధించును. (చిం-వి-ప- ౯౭-౧౦౨ విష.)

ద్రుతోపజీవినశ్శబ్దాః:— ద్రుత = సముచ్చయాద్యర్థ విశేషబోధకమగు ద్రుతరూప 'నుక్' శబ్దముతోఁ గలసియే ప్రయుక్తములగుచున్న, కేచిత్ శబ్దాః = కొన్నిశబ్దములు, సుకవిసమ్మతాః=సత్కవిసమ్మతములగుచున్నవి. తిఙ్సుబన్తాభ్యామ్= తిఙన్తసుబన్తపదములతో, పూర్వత్ర చ పరత్ర చ = పూర్వమందును బరమందును, ఆ ద్రుతోపజీవిశబ్దముల కన్వయము సమ్మతమగును. ఉదా:— పూర్వత్రాన్వయః:— ఎంతయుఁ గే దనరు చకోరక్యమన్మథుఁడు. (ఆది. ౧ ఆ ౫.) ఇదియు మొదలుగాన్ (ఆది. ౭ ఆ ౨౫౦.) పరత్రాన్వయః:— తనుమధ్య వివాహ మయ్యెదము నని పలికెన్ (ఆది. ౭ ఆ ౨౮౫.) చ. వినఁడును గానఁడున్ మఱియు నీకును నాకు మరల్పవచ్చునే (ఉద్యో. ౨ ఆ. ౧౮ ప.) మఱియు 'కడున్ - ఎప్పుడున్ - అనుటయున్ - అనుడున్-' మున్నగునవియు ద్రుతోపజీవిశబ్దములె. ఇవి ద్రుతప్రకృతికపదములు గావు. ఇవి యర్థవిశేషబోధక 'ను' శబ్దముతోఁ గూడి ప్రయుక్తము లగుచుండును. ఉదా:— నే నెప్పుడుఁ గొల్చెద నిత్యాదౌ సదా పర్యాయో ద్రుతప్రకృతికసంజ్ఞికః"— (అహో. ౧౭౦ పు.) ఈ వ్రాఁత ప్రామాదికము - యదా తదా శబ్దార్థకములు కళలు, యదార్థకమగు "ఎప్పుడు" అను కళాశబ్దముపై సాతత్యాతిశయబోధక 'ను' శబ్దము చేరుటచే "ఎప్పుడున్" అనునది యేర్పడును. "కడు-దే-ద్ర-" (శ-ర) ఇట్లు 'కడున్' అనునది ద్రుతప్రకృతికావ్యయమనుటయుఁ బ్రామాదికమే. "ఏడ్తెఱన్-క్రమ్మఱన్-చెచ్చెరన్-గ్రక్కునన్ - అంతన్ - మిగులన్..." (అహో. ౩౭౮.) అనువానిని ద్రుతోపజీవిశబ్దములుగా నహోబలపతి యుదాహరించుట సరికాదు. "ఏడ్తెఱ - దే - వి అతిశయము" "క్రమ్మఱు. దే. అ. క్రి. మరలు" "చెచ్చెర. దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగ" "మిగులు. దే. అ. క్రి. అతిశయించు" "గ్రక్కున. దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగ" "అంత. వై. స...వి. అప్పుడు" (శ. ర.) ఇట్లుగ 'ఏడ్తెఱన్' అనునది తృతీయార్థక ద్వితీయాంత మగుటచేతను, 'క్రమ్మఱన్ - మిగులన్' అనునవి నుజ్యంతము లగుటచేతను 'అంతన్' అనునది సప్తమ్యర్థకద్వితీయాంత మగుటచేతను వానిని ద్రుతోపజీవిశబ్దము లనరాదు. ఇంక నవి ద్రుతప్రకృతికములు.

నకారంబు ద్రుతంబు. ౧౧.

ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు. ౧౨.

ప్రథమా కయి పట్టి యొక్కేతరవిభక్తులును, ఉత్తమ పురుషైకవచనంబులు, భూతతద్ధర్మాద్యర్థక ప్రథమ

పురుషైకవచనంబులు, ఆశీరాద్యర్థంబులైన యెడు
తవర్ణకంబులు, శత్రుతు మానంతర్య చే దాద్యర్థకం
బాలవ్యాకరణ బులు నేను తానుపదంబులు వలెప్రభృతులును ద్రుత
వివరణము ప్రకృతికంబులు. నన్నున్ - నాచేతన్ - నాతోడన్-
౪౨ I విషయము నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ -
మాలోపలన్ - మాయందున్ - వత్తున్ - వచ్చెదన్
వచ్చెన్ - వచ్చున్ - ఎచ్చెడున్ - ప్రసన్ను లయ్యె
డున్-కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్ - కొట్టఁగన్ -
కొట్టుడున్ - కొట్టినన్ - నలెన్ - ఎంతయున్ -
పోలెన్ - అయ్యున్ - ఇత్యాదు లూహ్యంబులు.

సంజీవని. ౪౨ I విష:—చింతామణి ప్రక్రియయందువలెఁ గాక బాలవ్యాకరణప్రక్రియయందు ద్రుతప్రకృతికశబ్దములకెల్ల వానిద్రుతము "తృతీయాదుల నుగాగమంబగు" (బా. తత్స. ౮. సూ.) మున్నగుసూత్రములచేఁ బ్రత్యేకముగ విధింపఁ బడుచుండును. కాన నిచటి ద్రుతప్రకృతికముల పట్టిక స్పష్టప్రతిపత్తిమాత్రఫలకము. కావున నిందు - భావలక్షణార్థక నుజ్యంతము, (బా. క్రి. ౪౦ సూ.) వలయ్వాదియోగజభావార్థక నుజ్యంతము (బా. క్రియా. ౧౨౨ సూ.) నన్నదేకవచనార్థకవిశేషణము (బా. కార. 33 సూ.) కలజీ పదుజీ పరక నుగాగమాంతములు (బా. క్రియా. ౨౧ సూ.) మున్నగునవి యుదాహరింపఁ బడకున్నను క్షతిలేదు. చింతామణిపక్షమున ద్రుతము పొల్లు నకారపు రూపము గలది - సూరి పక్షమున నిది 'ను' స్వరూపము గలది. చింతామణిప్రక్రియచొప్పున ధాతుజవిశేషణములు (రక్షించినన్ మున్నగురీతిని) ద్రుతప్రకృతికములె యైనను నవి సదా విశేష్యములతోఁ గర్మధారయముగ సమసించుచుండును గాన వానిద్రుతమునకు సదా సామాసికలోపము గల్గును. (ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు. అం. చిం.) (విస్తర I) ఇట్టిస్థితి నరసియే కావలయు సూరి ధాతుజవిశేషణములకు

---

విస్తర I ౪౨ I విష :—ధాతుజవిశేషణములతోపాటుగ గుణవిశేషణములును జింతామణిపక్షమున ద్రుతప్రకృతికములె యనకతప్పదు. వానికిని విశేష్యముతోఁ గర్మధారయము నియతముగ నగుచుగాన సామాసికద్రుతలోప మట్టియెడలను గల్గుచుండును. (అను.)అట్లయిన "తెల్లన్+కన్=తెల్లఁగన్ తెల్లంగన్' మున్నగు

---

అనుబంధము విస్త I ౪౨ I విష:—తెల్లన - తెల్లనివస్త్రము - మున్నగు రూపముల నరసినపుడు తెల్లాదివిశేషణములు ద్రుతప్రకృతికములని తోఁపక

ద్రుతాగమమును విధింపక వానిని కళలనుగానె సాధించెను. (బా. క్రియా. ౨౨ పెం. ౬౩ సూ.) (విస్తర II.)

---

సనిష్టరూపములు గల్గవా యని శంకింపరాదు. అట్టియెడల 'తెల్ల' మున్నగు విశేషణములకు విశేష్యతావివక్షచే నవి ప్రథమాంతములె యగును. (తెల్లగన్ = తెల్లన యగునట్లుగా ననికదా యర్థము) కాన నట్టిశంకకుఁ బ్రసక్తియుండదు. ఇంతయేల? తెల్ల - నల్ల మున్నగునవి విశేష్యములుగ సయితము వాడఁబడుచున్నవిగదా. ఉదా - నల్ల గలిగిన. - ... నల్ల లేదయ్యెనేని (ఆది. ౨ ఆ. ౩౨ ప.). తెల్లన్ మున్నగునవి 'చేయన్ - చేయుచున్' మున్నగువానితోపాటు స్త్రీసమము లనఁ వగును. అపదం న ప్రయుఞ్జీత" అను వైయాకరణసిద్ధాంతముచొప్పున వీనికిఁ బదత్వము సిద్ధించుటకయి వీనిపయిని 'సు' ప్రత్యయము నిల్చుటయు వీని స్త్రీసమత్వాంగీకారమున నట్టి ప్రథమైకవచన ప్రత్యయము లోపించుటయు ననుప్రక్రియ కెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరుగదా. (౧౧౯ I విష) ఇట్టి ప్రథమాంతత్వము కళాత్వసంపాదకము కాదని నన్నయాథర్వణుల యాశయమును వర్ణింపనగును. ప్రతిపదోక్తావ్యయములలోఁ గొన్నిటికి "కిఞ్చిత్ ప్రశంసనే"త్యాదిరీతిని కళాత్వోపదేశమే యట్టి వ్యాఖ్యానమునకు మూలము కానోపును. అవియెల్ల నైరీతిని స్త్రీసమత్వమునఁ బ్రథమైకవచనాంతము లనకతీరదుగదా.

విస్తర II. ౮౨ I విష:-గాణపతవివరణకర్త "నన్నయభట్టాదిపూర్వవైయాకరణుల మతమునఁ గ్రియాజన్యవిశేషణములు ద్రుతాంతములు" (గాణ. సంధి. ౮౧. సూ. వ్యాఖ్య.) అని యంగీకరించుచు, "క్రియాజన్యవిశేషణముల కచ్చుపరంబగుచో నిత్యముగను, హల్లుపరంబగుచోఁ గ్వాచిత్కముగను ద్రుతమునకు లోపంబు గలుగదు." (నారా. గాణ. సంధి ౮౧ సూ.) అని ప్రామాదికముగ సూత్రించెను. "చేయునతఁడు - చేసెడు నతఁడు" మున్నగురూపముల సిద్ధికయి

---

మానదు. చేసెడు నతఁడు - చేయునతఁడు మున్నగుచోటులందు ద్రుతాగమమును విధింపని నన్నయాథర్వణులకు ధాతుజవిశేషణముల ద్రుతప్రకృతికత్వ మభిప్రేతమె యని విశదము కాకపోదు. మఱియు నుదంతములకుఁ గర్మధారయాదులలో నుమాగమవిధానము (నుమ్‌చోతః - తళుకుంజెక్కులు. మొ.) సయితము వాని ద్రుతాంతత్వమును వ్యక్తపఱుపఁజాలును. తెల్లందనము - నల్లందనము మున్నగు చోటులందలి నుమాగమవిధానమును నట్టిదియె. ("తనే చ కుత్రచి దతః." వికృతి వివేకము).

సంజీవని. ర౨ II విష:—"ద్రుతోపజీవిశబ్దాః" (ర౨ విష) అను నథర్వణ వచనము నరయక సూరి "ఎంతయుఁ ఆయ్యున్" అనువానిని ద్రుతప్రకృతికము లనుగా నుదాహరించెను. అవి ద్రుతోపజీవిశబ్దములే కాని ద్రుతప్రకృతికములుగావు.

అట్లారెండును నొకజాతివగుటచే బాలవ్యాకరణమూలమందు వలె ప్రభృతుల నుదాహరించుటలో 'పోలెన్' అనుదానితర్వాత "ఎంతయున్" అనునది యుండుట యుక్తము. సముచ్చయార్థక 'ను' శబ్దము ద్రుతప్రకృతికము. కాని దానికిఁ బ్రత్యేకప్రయోగము లేమిఁజేసి "ఎంత - అయి" అనువానితో జోడించి యుదాహరించెను. "మిగులన్-మరలన్" అనువానిని "బా. గు. ప్ర; బా. సా. సే" వ్యాఖ్యాతలు వలె ప్రభృతులలోఁ జేర్చుట సరికాదు. (౧౨ సూ. వ్యాఖ్య) అవి "మిగులు - మరలు" అను ధాతువుల నుఙ్యంతరూపములు. "అందు - ఇందు - ఎందు" అనునవి కళలని కొందఱు భ్రమింతురు గాని యవి ద్రుతప్రకృతికములు. (విస్తర.)

---

యీాతఁడు స్వరపరకత్వమున సామాసికద్రుతలోపని రాసమును నిత్యముగా సూత్రించుటచేత "చదివినయాతఁడు - చదువుచున్నయాతఁడు - చదువఁగలయాతఁడు - చదివెడియాతఁడు - చదువనియాతఁడు మున్నగుసాధురూపములెల్ల నీయనపక్షమున నసాధువులె కావలసివచ్చును.

విస్తర ర౨ II విష:—ఇవి కళలనుటకు "ఇందు ప్రత్యక్షు" మనెడి యుద్ధమల్లుని బెజవాడశాసనప్రయోగము నొకముఖ్యప్రమాణముగ నేఁటి విమర్శకులు కొందఱు చూపుదురు. అంద్వాంద్వెందులమీఁద నిట్టి గసడదవాదేశప్రయోగము భారతాదిప్రామాణికగ్రంథములం దెందును లేదు. బెజవాడశాసనకర్త యచటి యిందుశబ్దము సప్తమ్యర్థక ప్రథమాంతముగ (బా. కార. ౨౫ సూ.) భావించెనేమో ? ఏది యెట్లయినను సోమయాజి "ఎందు" శబ్దమును ద్రుతప్రకృతికముగాఁ బ్రయోగించి యుండుటచేఁ దద్విరుద్ధమగు నీశాసనప్రయోగము ప్రామాణికము కానేరదు. క. విను సకలభూతముల వ । ర్తనములు గనునపుడు బుద్ధిఁ దవులఁబడక యెం । దును బరఁగి దివ్యబోధం । బున నలవడు నట్టి పెంపుఁ బొందు మనింద్రా॥ (శాంతి. ౨ ఆ. ౧౨ ర ప. ప్రాసగతము) సకలభూతవర్తనములు గనునపుడు వాని యందుఁ దవులంబడక "ఎందును = ఏబ్రహ్మమునందు, పరఁగి=వర్తించి, దివ్యబోధంబునన్=దివ్యజ్ఞానముతో నలవడునో యట్టిపెంపును బొందుమని పద్యార్థము. సీ. ఈ రెండుపీడుల తారతమ్యంబుల, నెఱుఁగుదు పోరైన నెవ్వ రో ర్తు।గిది నిశ్చయింతషే,

పొందుప నుపాయంబుఁ, బౌరుషంబును గలవారుగలరు । చూతము చెప్పుమన్న...
... యు బసవపురాణ మనుకథయందు । ననుపమంబుగఁ
... సుయ్యె. (బసవ. ౧ ఆ. ౬౨౮ ప.) పై వానియందలి 'ను' అనుదాని కర్థ విశేషసాపేక్షకత్వ మేమియు లేకుండుటచే నది ద్రుతమనుటలో శంకాలేశ మయినను లేదుగదా. మహాకవిప్రయోగము లిట్లుండఁగా నంద్వాదులు సప్తమ్యర్థకములయి యుండఁగా నిక్కిండికేతి సధువాతసులు వ్రాయుట సాహసము. "అందు - ఇందు - ఎందు ఈమూఁడును విభక్త్యంత ప్రతిరూపకములైన యవ్యయములు......... ఈమూఁడును భారతశాసనపత్త్ర పుస్తకములందును పూర్వశాసనములందును, కళలు గానె యున్నవి." (ఆం. భా. అ. విభక్తి ప్ర. ౧౧ సూ. వి.) ఇట్టివానిని విభక్తి ప్రతిరూపకము లనుట సంప్రదాయముకాదు. తత్తద్విభక్త్యంతముకాకయె విభక్త్యంతమువలెఁ భాసిల్లునది విభక్తిప్రతిరూపకావ్యయమనఁ బడుట సంప్రదాయము. ఉదా:— "అహంయుః - అస్తిక్షీరా"(సి - కౌ. అవ్యయ ప్ర) (౨౧౧ విష)

"అందు శబ్దమునుకూడ నిటీవలివారు ద్రుతాంతముగాఁ జేసియుందురు... ప్రాచీనకాలమున నదికళయె యనుటకు శాసనప్రయోగములు భారతాదిప్రయోగములుకూడ నిదర్శనము లగుచున్నవి. 'అందు నుండె' అనునపు డొకప్పుడు సముచ్చయార్థక మగుట 'ఉన్' అనుదానితోఁ గూడి నదియుఁ గావచ్చును" (కోరాడవారి సంధిగ్రంథము) - పయిని జూపిన భారతాదిప్రయోగములలో సముచ్చయార్థ విశేషమునకుఁ బ్రసక్తియేమియు లేదనుటకు సందియము లేదుగదా.

"కాన్+అ=కాన = కాఁగానే" అనుచేదము చొప్పున కానశబ్దము కళ యనఁ దగును. 'కావునన్' అనుదాని సంక్షేపరూపము 'కానన్' అనికావచ్చు ననుతలంపున నర్వాచీనకవులు దీనిని ద్రుతప్రకృతికముగా నైతము ప్రయోగించిరి. భారతాది ప్రాచీనగ్రంథములలో 'కాన' అనునది కళగానె ప్రయుక్తమయి యున్నది.

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్......కా। న తగం బొందుట.........
(ఉద్యో. ౧ ఆ. ౩౫౭ ప) (విస్తర III. ౮ IV విష).

"ఒండేన్ = ఒండెన్" అనునవి 'ఒండేని' అనుదాని సంక్షేపరూపము లగుటచే నవి ద్రుతోపజీవి శబ్దము లనఁదగును. కోశకారులవి ద్రుతప్రకృతికము లనుట సరి కాదు. "ఒండె - అవ్య. ద్రు.......పక్షాంతరమును దెల్పును. ఒండేని (ఒండెనేని) = ఒండె. అవ్య. (ఒండెన్+ఏని) పక్షాంతరమును దెల్పును" (సూ. రా. ని) ఇట్లు సూ. రా. నిఘంటువున శబ్దరత్నాకరము ననుసరించియే వ్రాయంబడెను. 'ఒండెన్'

సంజీవని. ౮౨ III విష:—వ్యాకరణవిధుల చొప్పున 'ను' స్వరూపద్రుతము మీఁది యుకార మికారముగా మాఱు నపుడా 'ని' స్వరూపమును, (బా. తత్స. ౨౬ సూ.) నస్థాని స్వరములోపింపఁగా మిగిలిన పొల్లునకారమును ద్రుతములె యనఁదగును.

"ద్రుతః. పుం... త్రి. జాతద్రవీభావే ఘృతసువర్ణాదౌ" (శబ్దా. చిం.) అను చొప్పున ద్రుతిని బొందు స్వభావముగలది యనఁగా నొల్లని యెడల లోపించు స్వభావముగలది కాన నీపేరు ద్రుతమునకు సార్థక మగుచున్నది. "ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవునది" (ప్రౌఢ. సంజ్ఞా ౭ సూ.) అని త్రిలింగలక్షణశేష కర్త వివరించెను. పదము తుదిని బ్రకృతిచేతనే నిల్చియుండునది యనఁగ నయ్యది యర్థవిశేషబోధకము కాదు. అట్టి పదము ద్రుతప్రకృతిక మనఁబడుచున్నది. (విస్తర) ఇట్లగుటచే 'రాముఁడును గృష్ణుఁడును వచ్చిరి' మున్నగుచోట్ల 'రాముఁడును గృష్ణుఁడును' మున్నగునవి ద్రుతప్రకృతికము లనిపించుకొనవు. అవి ద్రుతాంతము లనిపించుకొనును. ద్రుతప్రకృతికముల ద్రుత మవసానాదులలో

---

అనునది ద్రుతప్రకృతికమని కోశద్వయమునందును వ్రాయంబడుట యొకపొరపాటు. మఱియు 'ఒండేని' అనుదానికి 'ఒండెన్+ఏని' అని ఛేదమును జూపుట రెండవపొరపాటు. అట్టి పరరూపసంధి దుర్ఘటము. వ్యాకరణవిరుద్ధము. కాన "ఒండు+ఏని= ఒండేని" అని ఛేదము చూపుట యుక్తము. ఒండుశబ్ద మన్యార్థక మగుటచే నట్లే జంటకుఁ బక్షాంతర మనునర్థము లభించుట యుక్తము. కోశద్వయచ్ఛేదపక్షమున 'ఏని' శబ్దము కేవలము నిరర్థకమగుట యింకొక యనుపపత్తి. ఉ. భావములో నదంభ యగు భక్తికి సంతస మందుఁడొండె, నొండె విధియింపుఁ డిప్పుడు కడిందిగ దండము... (శృం. నై. ౮ ఆ. ౧౧౩ ప.)

విస్తర ౮౨ III విష:—"చింతామణి ప్రణాళికలో ......... 'అన్యే ద్రుతప్రకృతయో। యే స్యు ర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్' అనుదానిచేఁ గళలుకాని వానికెల్ల నకారము నిత్యముగా నగును. అందలి ద్రుతప్రకృతిక సంజ్ఞ సార్థకము. ఇం దట్టిప్రక్రియ లేమి ద్రుతప్రకృతిక మనుమాట నేతిబీరకాయను బోలె. పరికింప నిద్ధానింబట్టి పోలె నిత్యాదులు ద్రుతప్రకృతికములును పక్కంగలవి ద్రుతాంతములును నయ్యెడి" (బా. సా. వే. సంజ్ఞా ౧౨ సూ. వ్యా) అను వేటికావ్యాఖ్య సరికాదు. 'రామునిచేతను' మున్నగువాని రూపసాధనప్రక్రియలో ద్రుతవిధానము చేయఁబడినంతమాత్రమున వానికి ద్రుతప్రకృతికత్వము లేదనుట యుక్తము

[illegible] వాని కవయవార్థభంగము గలుగదు. ఉదా:— రామునిచేతను = రామునిచేతన్ = రామునిచేత. మొ. పదాంతేతర స్థలములందు నకారము ద్రుతము కాదు. ఉదా:— అనుచు = అన్చు = అంచు - మొ. ఇందులోని 'ను' కారమునకు స్వరద్రుతియుఁ బూర్ణానుస్వారాదేశమును గల్గినను నది ద్రుత మనిపించుకొనదు.

సంజ్ఞ రత I విష:— ద్రుతస్వరూపవిషయమునఁ జింతామణిమార్గము సూత్రమే గొంత మార్పుఁబడెను. చింతామణినిబట్టియు నన్నయభారతప్రయోగములనుబట్టియు ద్రుతము నకారవ్యంజనమాత్రరూపమె యని విశదమగుచున్నది. (చిం. వి. వ. ౧౮౩ మొ. ౧౩౮ వ విష.) (విస్తర) రామునిచేతన్ మున్నగువాని లోని నకారపు పొల్లునకు 'ను' స్వరూపము చింతామణిప్రక్రియలో లభింప నేరదు. రామునిచేతను మున్నగురీతి 'ను' స్వరూపప్రయోగము ప్రాసాదిస్థల

---

కాదు. ఎద్దానికి ద్రుతవిరహితముగాఁ బ్రయోగముండదో యది ద్రుతప్రకృతిక మనియు, నెయ్యది ద్రుతవిరహితమై యుండి యర్థవిశేషబోధకమగు 'ను' శబ్దముతోఁ జేరుటచే ద్రుతాంతమగుచు నుండునో యది ద్రుతప్రకృతిక మనిపించు కొనక ద్రుతాంత మనిపించుకొనుననియు గ్రహింపవలయును. కాన "పోలెను" మున్నగువానియందు వలెనే 'రామునిచేతను' మున్నగువానియందును దుదిద్రుత మర్థవిశేషబోధనార్థము చేరిన 'నున్'శబ్దసంబంధి కాక ప్రకృతిసిద్ధమే యగుటంజేసి వానికల్ల ద్రుతప్రకృతికతాసంజ్ఞ సార్థకమే యనఁదగును

విస్తర రత I విష:—చింతామణి బాలవ్యాకరణంబుల కిట్టిభేదము గల దని తెలిసికొనక యధునాతనులు పెక్కురు కవిశిరోభూషణములోని ప్రామాదిక వ్యాఖ్యానమున భ్రమించి నన్నయాథర్వణులకు సయితము ద్రుత'ను'స్వరూపము సమ్మతమే యని వ్రాయుచున్నారు.

"అచ్సహితమును నజ్రహితమును (ను. ని. న్) ద్రుతమే" (నారా. గాణ. సంజ్ఞా. ౮౧ కారి ౮౭ వ) "ఎట్లు పరిశీలించినను అచ్సహితముకూడ ద్రుతమను సంగతి సకలలాక్షణికసమ్మతముగాఁ గనిపించుచున్నది" (నారా. గాణ. సంధి ౨౬వ, ౧౧౩ కారి, వివ) అని గాణపతవివరణకర్త వ్రాసెను. పెక్కురులాక్షణికు లర్వా చీనులు ద్రుతమునకు'ను' స్వరూపమునంగీకరించిరని నేను మొదటనె చెప్పితిని. అచ్సహితము ద్రుతమనుట నన్నయాథర్వణసమ్మతము కాదని మాత్రమే నానిశ్చయము. "ద్రుతాఖ్యోనః" అని నకారవ్యంజనమునకు మాత్రమె నన్నయద్రుతత్వమును వచిం

నిబద్ధమై కవిప్రయుక్తమని విశ్వసింపఁదగినది నన్నయభారతభాగమున నెచ్చటను లేదు. ఇంక "రామునిచేతను (రామునిచేతన్+ను) లక్ష్మణునిచేతను (లక్ష్మణుని

---

చెను. అట్లగుటచేతనే "వాక్యాంతగతపదానాం చ" అనుసూత్రముచే నవసానద్రుత లోపమును మాత్రమే నన్నయ యుపదేశించెను గాని ద్రుత'ను'స్వరూపము నంగీకరించు సూరిప్రభృతులవలె "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు" (బా. సంధి. ౨౧ సూ.) అనురీతి నవసాన ద్రుతస్వరలోపవిధానమును జేసియుండలేదు. నన్నయభారతభాగమున నెచ్చటను ద్రుత 'ను' స్వరూపమును నిర్వహింపఁజాలు ప్రయోగము లేదు. ద్రుతము 'ను' స్వరూపమే యనునిశ్చయముతో నున్న యాధునికులు భారతమును ముద్రించుటలోను వ్రాయుటలోను 'ను' స్వరూపద్రుతమును నిల్పినను నవి యన్యథాసిద్ధములగుటచే నన్నయప్రయుక్తములని విశ్వసింపఁదగవనుచు నారచించిన చింతామణివిషయపరిశోధనమునందు ముద్రితపుస్తకస్థిత నన్నయభారతభాగప్రయోగములు పెక్కు విమర్శింపఁబడినవి. (చిం. వి. ప ౧౩౩ మొ. ౧౩౮ వ విష.) అట్టి ననుస్వరూపయప్రయోగములె మఱికొన్ని గాణపతవివరణమునఁ జూపఁబడినవి. (గాణ. సంధి ౨౬, ప ౧౩౨ ౩౩౦ విష.) పిష్టపేషణమువంటిదైయైనను వానికిని నిచట సమాధానము చూపఁబడుచున్నది. "చనియెసుదివికి" (గాణ) "చనియెఁదాఁదివికి" (వావిళ్ల ముద్ర. ఆర ౩ ఆ. ౩౩౧ ప.) క. పెక్కువిధములను వచ్చు భిన్నావస్థన్ (గాణ) ఈ గాణపతపాఠము భగ్నచ్ఛందము. "పెక్కు ప్రకారముల నుండు భిన్నావస్థు" (వావి. ము. ఆర ౩ ఆ ౩౩౪.) "అక్కర - అరిగె నీశాను దిక్కునకు నీతమ్ముఁ డతివేగమునను" (గాణ) "అరిగె నీశాను దిక్కున కనిలజాతుఁ డనిలవేగమున" (తాళపత్రమాతృక. (వావిళ్ల ముద్రమునందును "అనిలవేగమున" అను పాఠమే యున్నది. కావున "అతివేగమునను" అనుపాఠము ప్రక్షిప్త మనఁదగును. "అరిగె నీశానుదిక్కునకు నీతమ్ముఁ డనిలవేగమున" అనిదియైన నంగీకరింపనగును. (ఆర ౩ ఆ ౩౭౩.) క. "ఘనుఁ డీపార్థుఁడు నావల | నను దివ్యాస్త్ర ప్రయోగనైపుణుఁడయి—(గాణ) "క. ఘనుఁ డీపార్థుఁడు నావల | నన దివ్యాస్త్రప్రయోగ......(వావి. ముద్ర. ఆర ౪ ఆ ౪౬.) ఇట్లె యీక్రింది ప్రయోగములందును సుచితమగు నవధారణార్థకమైన 'అ' శబ్దము లేఖనముద్రణములలోఁ బోయినపాఠములు కొన్ని చూపఁబడినవి. "చేయునుగాక" (గాణ) 'చేయునకాక' (సాధుపాఠము) (ఆర ౧ ఆ ౨౩౫.) "దుష్ప్రతాపమునను" (గాణ)

ప్రత్యయములు వర్ణింపఁబడెను" అనురీతిగల సముచ్చయాద్యర్థవిశేషబోధక 'ను' శబ్దములు మాత్రమె నన్నయభారతభాగమునఁ గన్పట్టుచున్నవి.

---

"మత్స్యశాపమునను" (సాధు) (సభా ౧ ఆ ౧౨౨.) "అంశమునను" (గాణ) "అంశమునను" (సాధు) (ఆది. ౧ ఆ ౧౧౨.) "అంతరిక్షమునను" (గాణ) "అంతరిక్షమునను" (సాధు) (ఆర. ౧ ఆ ౧౧౨.) "తాపమునను" (గాణ) "తాపమునను" (సాధు) (ఆర ౧ ఆ ౧౧౨.) (ఆ. ప్రాణభయమున వచ్చి యిప్పుడు నన్ను నాశ్రయించె నాశ్రితుఁ డెట్లు యథముఁ డయిన! విడువఁ దనినను నేనెట్లు విడుతు దీని" (గాణ) "విడువఁదనిన నేనెట్టులు విడుతు దీని" (ఆర ౩ ఆ ౨౩౨.) అనునది నన్నయ ప్రయుక్తపాఠము కానోపును. "వాన నేమింపం!భావితభాగ్యుఁ డయ్యెను...... ధర్మజుండు" (సభా ౨ ఆ ౫౫.) అనుచోటి 'ను' శబ్దము (అయ్యెన్+నున్ = అయ్యెను!) సంభావితభాగ్యవత్త్వావిశేషమును నంకలియద్భుతత్వమును ననెడి యర్థవిశేషలను బోధించుచున్నది. (చిం. వి. ప ౧౩౫ విమ.)

గాణపరవివరణకర్త "సంధి ౧౬ ప.౧౨౦ కారి; ౨౬ పద్య-౧౩౦ కారి" అను వాని వివరణములందుఁ బునరుక్తముగా 'ను' స్వరూపద్రుతము నన్నయాథర్వణ సమ్మత మనుటకుఁ గొన్ని హేత్వాభాసములను జూపెను. "అలుకిచ సంశ్లేషః స్యాత్"—"మఱొకెడసంశ్లేషము నగు" (సంధి ౧౬ పద్య ౧౨౦ కా.) వివరణము:—"నకారపుఁబొల్లే ద్రుతమగుచో లోపాభావపక్షమున సంహితచే సంశ్లేషరూప మెట్లును సిద్ధించుచున్నది. కానఁ దిరిగి తద్విధానము వ్యర్థమే యగును. స్వత్వముగూడ ద్రుతమగుటచేతనే పక్షమున సంశ్లేషమును విధించెను." (నారా. గాణ ౨౬ పద్య ౧౩౦ కారి. వివ.) ఈయభిప్రాయమె "౧౬ పద్య ౧౨౦ కారి." వివరణమందును వ్రాయఁబడెను.

నన్నయాథర్వణుల ద్రుతస్వత్వసంశ్లేషముల స్వరూపము గ్రహింపమిచే నిట్లు వ్రాయుట సంభవించెను. నన్నయాథర్వణులమతమున స్వత్వసంశ్లేషములు రెండిటను ద్రుతము నకారవ్యంజనరూపముననే యుండును. నకారవ్యంజన రూపద్రుతము పూర్వస్వరాంగముగఁ బల్కఁబడునపుడు సంశ్లేష మనియుఁ, బర స్వరాంగముగఁ బల్కఁబడునపుడు స్వత్వమనియు నన్నయాథర్వణులు వ్యవహరించిరి. ఆదేశసరళపరకత్వమున సంశ్లేషము సంభవింపదనియు ననఁగా నట్టియెడల ద్రుతమును బూర్వస్వరాంగముగఁ బల్కరాదనియుఁ బరస్వరాంగముగఁ బల్కినం గాని సరళాదేశమే రాదనియు, నన్నయాథర్వణులు వ్యక్తపఱిచిరి. కావుననె

సంజీవని. ౪౩ II విష:—చింతామణిపక్షమున నేను - తాను మున్నగునవి కళలు (విస్తర) వ్యంజనమునకుఁ బ్రాణమననఁగా జీవకళను స్వర మొసంగును. కావున నట్టిస్వరము తుదినిగలశబ్దము కళ యనిపించుకొనును. బాలవ్యాకరణపక్షమున నిట్టి సార్థక్యము పొసఁగదు. మఱియు ద్రుత 'ను' స్వరూపముమీఁది క చ ట త ప లకు గ జ డ ద బాదేశము వచ్చిన ప్రాసాదిస్థలనిబద్ధ ప్రామాణికప్రయోగ మొక్కటేని కన్పట్టలేదు. ఇంకను నేను శబ్దరూపాంతరమగు "ఏను" శబ్దము మీఁది పకారమునకు వాదేశప్రయోగము సోమయాజభారతభాగమునఁ బ్రాసస్థలనిబద్ధమై కన్పట్టుచున్నది - క - కిపదొసలును గాండీవము । నవల నిడంబనుపు ముంద ఆరదము డిగు మే । ను విదప డిగియెద - (శల్య. ౨ ఆ ౩౩౩) - నాచూచిన తాళపత్త్ర

---

చింతామణిలో నాదేశపరశపరకత్వమున సంశ్లేషము వచింపఁబడకుండుటయు సరళస్థిరపరకత్వమునమాత్రమె సంశ్లేషము వచింపఁబడుటయు సంభవించెను. (౮౦. ౮౧. ౮౨ విష.) ప్రతిపక్షులమతమున ద్రుతమునకు 'ను' స్వరూపమును 'స' కారవ్యంజనరూపమును నంగీకరింపఁబడుటచే వీరిపక్షమున ద్రుతమునకు స్వత్వసంశ్లేషవిధాన మనావశ్యక మనియుఁ బాక్షికబిందు లోపమాత్రవిధానముతోఁ జాలుననియు నట్లగుటచే స్వత్వసంశ్లేషవిధానము స్వమతమున వ్యర్థమనియు గాణపతవివరణకర్త కేట్లుతోఁపలేదో తెలియకున్నది. ఇంకను బ్రతిపక్షులపక్షము నన్నయాథర్వణుల వచనములకుఁ గేవలమువిరుద్ధమని ౮౦ - ౮౧ విషయములలో విపులముగాఁ జూపఁబడును.

విస్తర ౪౩ II విష:—అహోబలపండితుఁడు సయితము తాను - నేను శబ్దములు కళలనియె యభిప్రాయపడెను. అశ్లోకానిచో—నేను తాను శబ్దముల ద్రుతమునకు లోపమును విధించు "వా త్మాస్మదో ర్ద్రుతస్య స్యా ల్లుగి"తి చింతామణిసూత్రవ్యాఖ్యలో నాత్మాస్మ దర్థకములగు తాను నేను శబ్దములు ప్రథమైకవచన 'ను' ప్రత్యయాంతము లగుటచే ద్రుతత్వము దుర్లభమని తలంచి యా 'ను' ప్రత్యయముమీఁది స్వరము లోపించుట కేదో సూత్రములోని చకారమును గతిగాఁ గల్పించియు వాత్మాస్మదోరిత్యాదిసూత్రోపదిష్ట ద్రుతలోపవిధానవైయర్థ్యాన్యథానుపపత్తిచే నుల్లోపమును గల్పించియుఁ బ్రయాసపడి యుండఁడుగదా. "నాతోడను+వచ్చె = నాతోడవచ్చె" అనురీతిని స్థలాంతరములందువలెనే ద్రుతలోపము కల్గునని తలంపఁడా?

"సకలోశ్చేతి చకారేణ ఉత్వలోపేకృతేవశిష్టస్య ద్రుత స్యాత్రగ్రహణమ్. . .లుగ్విధిపర్యుదాసయో స్సామర్థ్యాద్వా భవత్యుల్లోప ఇతి సువచమ్"

మాతృకలందెల్ల నిట్లే యున్నది- "ఏ న విడువ డిగియొడ" అనుముద్రణసంస్కర్తృ పరకల్పనము ప్రామాదికము. అవధారణార్థకశబ్దముమీఁద గ స డ ద వాదేశము నన్నయ భారతప్రయోగవిరుద్ధము. క...పర్వం। బ కడున్ మేలనఁగ శాంతి పర్వము వెలయుఁగాక (ఆది. ౧ ఆ ౫౭ ప) "క...ఏ। ను వెనుక డిగియొడ-." అను పాఠాంతరములు లేఖకపాఠకాదిసాహసప్రక్షిప్తములు. (చూ. బసవపురాణ టీక-౧౦౭ పుట. బాలకవిశరణ్యము ౭౧౭ పుట)

సంజీ. ౪౩ III విష:—'ను'స్వరూపము ద్రుతము కాదనుట పైరీతిని నన్నయ భారత నన్నయాథర్వణసమ్మతమై యున్నను నీసందర్భమునందలి చింతామణిసూత్రములకు వ్యాఖ్యచేయుటలోఁ గొన్నియెడల ద్రుత 'ను' స్వరూపాంగీకారము బాల సరస్వత్యహోబలపండితుల పంక్తులలోఁ గనవచ్చుచున్నది. అట్టిప్రామాదికవ్యాఖ్యల ననుసరించుటచే సూరియు నట్లె 'ను' స్వరూపమునకు ద్రుతత్వము నంగీకరించెను. నన్నయభారతభాగమునందువలెఁగాక సోమయాజిభారతభాగమున 'ను' స్వరూపము నకుఁ బ్రాస్థలఘటితప్రయోగములు గలవు కాని తిక్కయజ్వభారతభాగము మున్నగు ప్రామాణికగ్రంథములం దెందును నట్టి 'ను' స్వరూపముమీఁది కచటతపలకు గ జ డ ద బాదేశము ప్రాసాదిస్థలఘటితమైనది కనవచ్చుటలేదు. క. విని పార్థుఁ డిట్లు గలిగిన। యనియం దారుద్రునకొ జయము నీకోక। గ్గెనుదాని తెఱంగేర్పడ। వినఁ గౌతుక మొలసెఁ జెప్పవే విశ్వాత్మా॥ (శాంతి ౬ ఆ-౪౪౨) కం...ధరణి లంఘిం। చెను మఱపు లేక పేరు। క్కున...(భీష్మ ౩ ఆ ౯౪) చ॥ కవిసి ఖరంబులైన ముని కాళ్ళను ప్రేయఁగఁ బాము నీరిలో। ను వెడలకుండి కూర్మ మతనుస్థిర...(అను-౧ ఆ ౨౩౭) (ఇట 'నీరిలోను' అనుచో వలన కాదేశంబైన సప్తమిమీఁది యుండి ప్రౌఢవ్యాకరణసిద్ధాంతభంజకముగ లోపించె- ప్రౌఢ.కార ౧౧ సూ.) విస్తరభీతిని విరమించితిని గాని యిట్టి 'ను' స్వరూపప్రయోగములు సోమయాజిభారతభాగమునఁ బెక్కు గలవు. నన్నయపద్ధతిని సవరించిన సోమయాజివిషయములలో నిది యొకటి. (విస్తర I ౬౩ I విష) తిక్కనకుఁ బూర్వులు నన్నయ తర్వాతివారునగు సోమనారాధ్యుఁడును నన్నెచోడుఁడును నిట్టి'ను'స్వరూపమును బ్రయోగించియున్నారు.ద్విపద.

---

(అహో ౨౩౭ పు) (౧౬ విష), అరయ నరయ నహోబలపతి తాను నేను శబ్దముల కుల్లోపము నతిప్రయాసమునఁ గల్పించి ద్రుతలోపవిధికి సార్థక్యమును ఘటించుటచే 'ను' స్వరూపమునకు ద్రుతత్వము లేదన్న తలంపుకూడ నిచటఁ గద్దెనని తోఁచుచున్నది.

అసలార నొసఁగితి మట్లు గావునను (బస - ౧ ఆ ౯౬౨ ప) ద్వి. ఎసకంబుతోఁ జెప్ప నిష్ట మయ్యెడిని (బస ౧ ఆ ౪౮ ప) క...పురుషుఁ డెఱుఁగు మనమా | రసు శబ్దస్పర్శ రూపరసగంధంబుల్ (నన్నె - కు - ౬ ఆ ౭౨౪ ప) క. తనమనమున...ని | ల్చెను వడఁకు న్నీర మునిఁగి లేచిన భంగిన్ (నన్నె - కు - ౭ ఆ ౪౯౬)

పయిరీతిని నన్నయభారతభాగచింతామణులకు విలక్షణమగు 'ను' స్వరూపము మహాకవులచేఁ బ్రయోగింపఁబడుటంజేసి యది గ్రాహ్య మనకతీరదు గాని యట్టి 'ను' స్వరూపమువిూఁద ద్రుతకార్యమగు గ. జ డ ద బాదేశము నన్నయతిక్కనల భారతభాగములందేకాక ప్రామాణికకవిప్రబంధములం దెందును లేదు. (విస్తర)

---

విస్తర ౪౩ III. విమ:—అట్లయినను బాలవ్యాకరణకర్త 'ను' స్వరూపమె ద్రుతమునకు మూలరూపమనియు నదియె ద్రుతపరిపూర్ణాకారమనియు నది గ జ డ ద బాదేశజనకమనియుఁ గవిశిరోభూషణాద్యనుసారముగఁ బ్రమాదపడి యుపదేశించెను. (బా. సంధి. ౧౬-౧౭-౨౦ సూ). ఇట్టి సూరి సందర్భమునకు వ్యాఖ్యచేయుటలోఁ జేటికాకర్త "ఉత్వవిశిష్టమయి యుండుట, పొల్లరూపముగ నుండుట యను రెండే రూపములు గాని యితరరూపములు ద్రుతమునకు సంభవింపవను దృఢవిశ్వాసముతో సూరి యుండుట స్పష్టమయ్యె. దీన 'నకారంబు ద్రుతంబు' అనుసూత్ర ముత్వవిశిష్టమును పొల్లు రూపమును నైన నకారములను రెండిటిని బోధించునదిగా సూరి యెన్నెననుట స్పష్టమయ్యె" (బా. సా. వే. సంజ్ఞా ౧౨ సూ. వ్యా. ౧౮ పు) అని వ్రాయుట వింతగనున్నది. ద్రుత 'ను' స్వరూపమునకాదేశసరళపరకత్వమున ఖండపూర్ణబిందువులతోపాటు సంశ్లేషరూపమునఁబడు పొల్లు నకారపు రూపము నైతము విభాషగ సంభవించునని సూరి సూత్రించెను. (బా. సంధి. ౧౭. సూ). కావున ఖండపూర్ణ ములవంటిదే యీపొల్లు నకారమును నైయున్నది. ఇట్టిస్థితిలో "ను - న్" అనునవి రెండే ద్రుతనిజరూపములని యెట్లు చెప్పనగును ? 'ను' స్వరూపముతోపాటు పొల్లు నకారమును ద్రుతమూలరూపమే యని సూరి తలంచినచో నిఁక నవసానద్రుతస్వరలోపవిధానమునకుఁ (బా. సంధి ౨౦ సూ) బ్రసక్తి యేమున్నది ? మఱియు నాదేశసరళాదిపరకత్వమున ద్రుతమునకు సంశ్లేషవిధానమును వ్యర్థమే (బా. సంధి ౧౭, ౧౮) యగును. "ను-న్" అనునవి రెండును ద్రుతమూలరూపములె యనుతలం పున్నపుడు సూరి నుగాగమ విధానస్థలములందెల్ల వ్యంజననకారమునె విధించి యుండఁడా? ద్రుతస్వరలోప ద్రుతసంశ్లేషవిధానగౌరవమున కేలపాల్పడును ? ఇంతయేల ? "పక్షంబున స్వత్వం

సం.జీ. ౪౪ విష:— నేను తాను శబ్దముల తుదిస్వరపు లోపము కవిభల్లట సూత్రముచేతను (౨౦౦ II విష.) 'విష్ణునే న్నివునేని కొల్చెద' మున్నగుచోటులం దట్టియేని శబ్దాంత్యస్వరలోపము "అపిశబ్దార్థస్యైతః" (౭౦ విష.) అనుసూత్రముచేతను సంభవింపఁగాఁ బరిశిష్ట నకారరూపవ్యంజనము ద్రుతత్వ మందుట నన్నయాథర్వణసమ్మతము. 'ఏని - ఏనియున్ - ఏనిన్ - ఏన్' అని యిట్లు బాలవ్యాకరణపక్షమున ద్రుతత్వము సంపాదింపఁబడుట (౪౫ I విష.) ముందు వివరింపఁబడును. నేను తాను శబ్దములలోని 'ను' స్వరూపము బాలవ్యాకరణపక్షమున ద్రుతస్వరలోపము కాఁగా (బా. సంధి ౧౭. ౧౮-౨౦ సూ.) 'నేన్ - తాన్' అనురూపముల

---

బడు - స్వత్వం బనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము." (బా. సంధి - ౧౭ సూ. వి.) అని ద్రుతస్వత్వమును నిరూపించి యట్టి ప్రకృతిభావమునకు సూరి "ప్రాఁచెను గలు గలు-వచ్చెను గోవులు" అని యుదాహరించి ద్రుతమూలస్వరూపము 'ను' అనునదే యని నిశ్చయీకరించియున్నాఁడు. అట్లయినఁ బ్రకృతమగు ౧౭ సూత్రమునందును సంధి. ౨ - ౫ - ౬ సూత్రములందును "ద్రుతమును వ్యంజన నకారరూపముతో నుదాహరింపనేల? 'నకారంబు ద్రుతంబు' అని సూత్రింపనేల?" యని శంకింప రాదు. ప్రకృతసూత్రమునందలి యుదాహృతులెల్ల నవసానద్రుతస్వరలోపము నందిన (బా. సంధి ౨౦ సూ) రూపములే యననగును. చింతామణిసమ్మతమగు ద్రుతనకారస్వరూపము తనపక్షమునందును ద్రుతస్వరలోపమూలమున సంభవించు నని చూపుట కిట్లు సూరి సూత్రించి యుదాహరించి యుండునని యెన్ననగును. ఇంక సంధి ౨-౫-౬ సూత్రములందు స్వరపరకత్వమున నవసానద్రుతస్వరలోప మెట్లు కల్గుననుశంక యుక్తమె. కాని సూరి చింతామణి మహాకవిప్రయోగముల యనురోధమున నట్టిస్థలములందు ద్రుతపూర్వస్వరసంధులను విధించుచున్నవాఁ డగుటం జేసి 'ను' స్వరూపద్రుతము నట్టియెడల నిల్పినచో నిష్టరూపసిద్ధి కలుగదను తలంపున నట్టిచోట్ల లుప్తాచ్కద్రుతమును నిల్పె ననఁదగును. ద్రుతపరకస్వరము నకుఁ బ్రత్యేకముగ సంధి విధింపఁబడునపుడు విధానసామర్థ్యమున ద్రుతస్వరలోప ద్రుతలోపములు స్వరపరకత్వమునందు సయితమంగీకరింపందగునని సూరి యభిప్రాయమును వర్ణింపఁదగును. అట్లుగాక "నన్నును+అడిగె" అనురీతినె యుదాహరించినచో నచట 'నన్ననడిగె' అనునదె పరరూపసంధ్యుదాహరణమగుటయు 'నన్నడిగె' అనునిట్టిరూపములు సిద్ధించుటకె తనపద్ధతిలో నవకాశము లేకుండుటయు సంభవించునుగదా.

నందును. అట్టిశబ్దముల తుది నకారము ద్రుత 'సు' స్వరూపరూపాంతరమే యగుట చేత ద్రుతమనుటలో సందియమే లేదు. (విస్తర)

---

విస్తర - 'ఠ' విష:—కళాపదముల తుదినున్నయచ్చులు లోపించునపుడు పరిశిష్టమగు నకారము సయితము ద్రుతమె యని చింతామణియాశయము గాన "నేను=నేన్, తాను=తాన్, విష్ణునేని శివునేని= విష్ణునేన్ శివునేని, మ్రానుపడు = మ్రాన్‌పడు" మున్నగు స్థలముల తుది వ్యంజన నకారములు చింతామణిపక్షమున ద్రుతములె యనిపించు కొనును. మ్రాన్పడు (మ్రానుపడు) మిన్నడు (మిన్ను పడు = మినుపడు) కన్పట్టు (కన్నుపట్టు = కనుపట్టు) మున్నగు చోటులందు మ్రాన్బడు - మిన్బడు-కన్బట్టు" మున్నగురీతి గజడద బాదేశమును నిర్వహింపఁజాలు ప్రయోగములుగాని, యట్టి యాదేశములేని ప్రయోగములుగాని ప్రాసాదిస్థల గతములు ప్రాచీనమహాకావ్యములలోఁ గన్పట్టలేదు. గ జ డ ద బాదేశములేని 'మ్రాన్పడు - కన్పట్టు' మున్నగురూపము లను, 'మిన్వడు' మున్నగు గ స డ ద బావాదేశరూపములను జింతామణిపక్షమున సాధించికొనుటకు "వినా ద్వితీయం స్యాద్దస్య। దాత్మనోః స్వన్తయోరపి। నోరన్యస్యాపి సర్వం స్యా। ద్బహుళం సత్ప్రయోగతః" (౨౬ విష) అనునథర్వణ వచన మాధారము గలదు. "స్వాంతము లయినను ననఁగాఁ బ్రథమైకవచనాంతము లయినను నేను తాను శబ్దముల 'సు' వర్ణమునకు స్వరలోపము కల్గునపుడు (౨౧౧ II విష) సంశ్లేషేతరద్రుత కార్యము లగును. 'అన్యస్యాపి నోః' అనఁగా నేనుతాను భిన్న పదాంతిమ 'సు' వర్ణమునకు స్వరలోపము గల్గునపుడును (౨౧౦ II విష) సర్వద్రుతకార్యములును బహుళముగా నగును" అని పై కారిక కర్థము. దీనినిబట్టి మ్రాన్వాదిశబ్దావయవ నకారమునకును ద్రుతకార్యభూత గ జ డ ద బాదేశాభావమును, (మ్రాన్పడు) 'ఏను+పది= ఏఁబది' మున్నగుచోటులందలి శబ్దావయవనకారమునకు ద్రుతకార్య జనకత్వమును బహుళగ్రహణమహిమచే సంభవించును (౨౬ విష.) - 'నో రన్యస్యాపి' అనుచోటి 'సు' శబ్దము 'ని - న' మున్నగువానికిని నుపలక్షణమగుచున్నది. ఉదా:—చక్కన+కన్ = చక్కఁగన్ - రాముఁడేని+కృష్ణుఁడేని=రాముఁడేఁ గృష్ణుఁడేని. మొ. 'నేన్-తాన్' అనువాని నకారమునకు ద్రుతత్వము నిత్యమగుటచే నీక్రింది నన్నయప్రయోగములు సరియగుచున్నవి. క. దేవార్థముగాఁ దెచ్చిన। యీావసుధాధిపుల నేల యే విడుతు...(సభా ౧ ఆ ౧౯౭ ప) తే - గీ. నీకు నే దాసి నగుదు (ఆది ౨ ఆ ౩౨) చ......మస్తకంబుపై। నిడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్......(సభా ౨ ఆ- ౩౦ ప.)

సంజీ. రా౫ I విష:— పయిసందర్భమునుబట్టి శబ్దావయవనకారమునకు ద్రుతత్వము లేదని సూరిపక్షమున సిద్ధాంత మేర్పడుచున్నది. ఈపక్షమున "కను+దోయి=కన్దోయి=కందోయి" (బా. సంధి. ౧౮-౨౨ సూ.) అను నుదాహృతు లెట్లు కుదురును? అను విషయమును బరిశీలింపవలసియున్నది. బాలవ్యాకరణమును బరికించు శ్రీలింగలక్షణశేషకర్త యీవిషయమున నీక్రిందిరీతిని వివరించెను. "నకారం బసాధారణంబు ద్రుతంబు. ప్రత్యయాగమావయవాత్మకంబయి యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసంజ్ఞికంబని యర్థము" (ప్రౌఢ. సంజ్ఞా. ౭ సూ.) దీనిబట్టి రూపసాధనప్రక్రియ చూపఁబడని ప్రతిపదోక్తావ్యయములందు మాత్రము (వలెను - పోలెను - మొ.) శబ్దావయవ ను వర్ణమునకు ద్రుతత్వ మంగీకార్యమనియుఁ, దక్కినచోటులందు శబ్దావయవ 'ను' వర్ణమునకు ద్రుతత్వము లేదనియు నటఁ ప్రత్యయాగమాత్మక 'ను' వర్ణకమునకుమాత్రమె ద్రుతత్వము గలదనియు విశదమగుచున్నది. ఈపక్షమున సూరియుదాహృతులలోని 'కన్' అనుదానియందలి నకారము 'కన్ను' శబ్దములోని 'న్ను' అనుదాని లుప్తశేషము కాదనియు (బా. ప్రకీ. ౭. ౧౬ సూ.) బా. సంధి ౨౫ సూత్రముచొప్పున నేర్పడు (విస్తర I.) "కన్ను+ను+దోయి = కందోయి" అనుదానిలోని నుగాగమసంబంధి యనియు (విస్తర II.) నీ బాలవ్యాకరణపక్షమున నంగీకార్య మనఁదగును. ఇందుల కీక్రింది ప్రౌఢవ్యాకరణకర్త శబ్దరత్నాకరకోశపంక్తులు మార్గదర్శకములగుచున్నవి.

---

విస్తర I - రా౫ I విష:—"సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు" (బా. సంధి-౨౫ సూ.) అనుసూత్రముచే "కన్నుయొక్క+దోయి = కన్ను+ను+దోయి" అను రీతిని నుగాగమము వచ్చును. ఈసూత్రములోని సమాసశబ్దము కేవలకర్మధారయపరమే కాదు. ఇట్టి షష్ఠీసమాసములందును నీ నుగాగమము వచ్చును. సూరియే "సింగపుంగొదమ" అని యుదాహరించెను. ఉ. తొంగలిఱెప్పలన్... కన్నుంగవ యాక్రమించుకొనునో...(మనుచ-౨ ఆ ౩౨ ప.) అని షష్ఠీసమాస నుగాగమమునకుఁ బ్రామాణికప్రయోగములును గలవు.

విస్తర II. రా౫ I విష:—"కందోయి" (కన్ను+ను+దోయి) అనుచోటి 'ను' అనునది "నిక్కాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బా. సమా, ౨౦సూ.) అనుదానిచొప్పునను దీనికి వివరణమె యనఁదగు ప్రౌఢ - సమా. ౩౬

సంజీ - ౪౫ II - విష :—"ఏని - దే - అవ్య......(ఏనియు నని ప్రయోగింపఁబడుటచేత దీనిని ద్రుతప్రకృతికముగా గ్రహింపఁగూడదు. 'ఏనిన్ - ఏన్ -' అనురూపములు యు వర్ణమును, నివర్ణమును (ఏనియున్) లోపింపఁగా నైనవని యెఱుంగునది" (శ.ర) 'ఏనియున్' అను ప్రయోగమునుబట్టి 'ఏని' శబ్దము కళ యనకతీరదు. ఏనిశబ్ద నివర్ణ ముత్వవిశిష్టముకాదుగాన నది యవ్యయశబ్దావయవ మయ్యు ద్రుతము కానేరదనెడి ప్రౌఢవ్యాకర్త యాశయము యుక్తమే యనఁదగును.

"కం......ఈతం। డేమేఁ గర్మముఁ జేసెం। దా మృతిఁ బొందించె నదియ తలకొని యతనిన్ (అను - ౧ ఆ - 33)చ......ఎక్కడేఁ జనుము......(శాంతి - 3 ఆ 3౪౮ ప.)కం......ఎందే। నిన్నొకని కలవడు నాతం। డనుమానింపఁడు......(శాంతి ౫ఆ - 3౭౮ ప.) మ. అనుమానం బదియేల......అట్లయే। నిభంబుం గమ ఠంబునుం గలవు" (అను - ౧ ఆ ౨౧౮ ప).

పయిరీతి ప్రయోగములందలి యేనిశబ్దస్థల ద్రుతకార్యములంబట్టి 'ఏనిన్ - ఏన్' శబ్దములు ద్రుతాంతము లనకతీరదయ్యెను. కావుననె ప్రౌఢవ్యాకర్త పయి శబ్దరత్నాకరపంక్తులచే నట్లు సమర్థించినవాఁ డయ్యెను. ఏనిశబ్దము సముచ్చయాద్యర్థ విశేషబోధక 'ను' శబ్దాంతమై 'ఏనియును' అనురూపమందుననియు, నట్టి "యును" శబ్దములోని 'ను' అనునది యుత్వవిశిష్టావ్యయ శబ్దావయవమగుటచేత

---

సూత్రముచొప్పునను లోపించునని యాపక్షమువా రంగీకరింపవలయును - గుప్తార్థ ప్రకాశికాకర్త పయివిషయమును గ్రహింపఁజాలక, బాలవ్యాకరణపక్షమువారు బా. ప్రకీ ౭-౧౬ సూత్రములచొప్పున "కన్ను+ను+దోయి" అనుచోటి 'న్ను' అను దానిలోని యుత్వనకారములకు లోపము చేయవలసియున్నట్లును నట్టియెడల శబ్దావయవ నకారమొకటి మిగులును గాన సమాస నుగాగముతోఁగూడ "కన్ందోయి"అను ననిష్టరూపము ఘటిల్లుననియు నసంగతముగ వ్రాసెను. "కన్నుందోయి నుండి కందోయి కాదు. ఇచట సంయుక్త నువర్ణోకారమునకు హల్పరకత్వమున లోపమగునను (బా - ప్రకీ - ౧౬ సూ.)సూత్రమున బిందువు నడుమ నడ్డునుగాన దకారపరత్వములేక 'ఉ' కారలోపము రాదు." (బా.గు - ప్ర - అనుబంధ - ౧౬౪ పుట - ద్వి - ము.) అనియు వ్రాసెను. బాలవ్యాకరణపక్షమువా రీతఁ డారోపించిన రీతిని బ్రకీర్ణకసూత్రముల నాశ్రయింపక నిక్కాలాదిసూత్రమున 'న్ను' లోపము చేయుదురు కాన నీతని చర్చయెల్ల నిరర్థక మగుచున్నది.

ద్రుతమగుట నిక్షేపావమనియు ద్రుతస్వరలోపమున 'ఏనియున్' అనురూప మేర్పడు లనియు, పిదప యువర్ణలోపమున "ఏనిన్" అనియు, 'నియు'వర్ణలోపమున 'ఏన్' అనియు ద్రుతాంతరూపములు నిర్బాధముగా నేర్పడుననియు ప్రౌఢవ్యాకర్త్రభి నిష్కర్షప్రకార మగుచున్నది-(విస్తర I) ఇంకం జింతామణిపక్షమున "అపిశబ్దార్థ స్యైతః" (౮౫ విష.) అనుసూత్రముచొప్పున "ఏని" శబ్దములోని 'ఇ' కారము లోపింపంగాం బహిర్ణిష్ట నకారరూపవ్యంజనము ద్రుతమగుట నన్నయాథర్వణసమ్మతమని యీావలికె వ్రాయంబడెను (౮౫ - విష.) (విస్తర II)

---

విస్తర I - ౮౫ II విష :—గుప్తార్థప్రకాశికాకర్త కీ ప్రౌఢవ్యాకర్త్రభిప్రాయము సమర్థనము బోధపడ లేదు. ఏని శబ్దావయవ నకారమె ద్రుతమని ప్రౌఢవ్యాకర్త సమర్థించినట్లు పై శబ్దరత్నాకరపంక్తులవలన నాతనికి వింతగ బోధపడెను. అట్లగుటం జేసి యీ క్రిందిరీతి నసంగతముగం జర్చించి తుదికిం బ్రౌఢవ్యాకరణసూత్రమున కపార్థము చేసెను. "ఉత్వవిశిష్టమైన నకారమె ద్రుతమని వ్రాసిన ప్రౌఢవ్యాకరణ కర్త 'ఏన్' అనుచో నివర్ణము లోపింపంగా నకారపుంబొల్లునే ద్రుతాంతమగునని స్వవచనవ్యాఘాతముగా నెట్లభిప్రాయపడియె. కాన ప్రత్యయాద్యాత్మక మనునది యుదాహరణమాత్రముగాని పరిగణనము కాదు......ప్రత్యయాదుల 'ను' కారము ద్రుతమగుట ప్రాయిక మని ప్రౌఢవ్యాకరణకర్త భావము. అందుననే ......ఉత్వవిశిష్టముకాని 'ఏని' నకారము ద్రుతమై-సరళాదికార్యములం గలిగించెడి" (బా - గు - ప్ర - అనుబంధ ౧౬౨ పుట. ద్వి - ము.)

విస్తర II. ౮౫ II విష:—ఈసందర్భమున నారాయణీయ తద్వివరణకర్త లీక్రింది రీతి సంప్రదాయవిరుద్ధములగు విషయములను వ్రాసిరి. "క్వచిత్ ప్రత్యయయోగే చ। తథాత్వ మభిధీయతే."= "గీ-కొన్నిచోట్లం బ్రత్యయమును గూడిమాడి। కూడ నట్టులే......వ్యా - ఎల్లయందు—ఎల్లన్ ద్రుతాంత మేయయ్యు దీనిచే ద్రుతము 'అందు' ప్రత్యయము పరమగునపుడు లోపించె. ఇటం బ్రత్యయము 'యును' అనుదాని కుపలక్షణము.- మిక్కిలిన్+యును=మిక్కిలియున్......ఎనిన్ + యును=ఏనియున్. ఇది కళయని శబ్దరత్నాకరము......"(నారా - గాణ - సంధి ౮ ప - ౧౦౭ కారి.) ప్రకృతులకుం గళాద్రుతప్రకృతికత్వములను వచించుట సంప్రదాయవిరుద్ధము కళాద్రుతప్రకృతికత్వములు పదత్వముతో సంభవించునవి - కాన 'ఎల్లన్' అను ద్రుతప్రకృతికపదముమీాంద 'అందు' ప్రత్యయము నిల్చుటయుం దన్మూలముగా ద్రుతలోపమును వచ్చెననుటయుం గేవలము నసంభవములు. శబ్దరత్నాకరము 'ఏని' శబ్దము

సంజీ. ౪౫ III విష :—పయిరీతినె "కమ్మని+తేనె = కమ్మందేనె; చక్కన+కాన్= చక్కంగాన్ - ఏను+పది= ఏఁబది" మున్నగుచోట్లులందలి శబ్దావయవ నకారములకు ద్రుతత్వము బాలవ్యాకరణపక్షమున దుర్ఘట మగుటంజేసి యట్టి చోట్లులందలి నకారమునకు ద్రుతకార్యజనకత్వమును బ్రత్యేకముగ సూత్రించి యట్టి రూపముల నీక్రిందిరీతిని బ్రౌఢవ్యాకర్త సాధించికొనెను - "గుణవాచకంబులు కొన్నింటి 'సి' గాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందువగు" (ప్రౌఢ సమా ౧౩ సూ.) "గుణవాచకంబు క్రియావిశేషణంబగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి" (ప్రౌఢ - సమా. ౧౪సూ.) . పయి రెండుసూత్రములందును విధింపఁబడిన బిందువు ద్రుతాకార్యమె యగుటచేతఁ దక్కినసరళాదేశకార్యమును గల్గెనని యెఱుంగునది-"పది యుత్తరపదంబగుచో నేను - తొమ్ముల 'ను, మ్ము'లకు బిందువును, ఎని కెనును, ఏడునకు వర్ణవ్యత్యయంబును, ఆపరుషంబునకు సరళంబును గ్రమంబుగ నగు." ఏఁబది - తొంబది...... ఎనుబది ......డెబ్బది. (ప్రౌఢ - సమా ౨౪). ఇట్లీతఁడు బాలవ్యాకరణపక్షపు ప్రక్రియను జక్కపఱుచుకొనుటంజేసి యీపక్షమునఁగన్పట్టు - కన్పడు - మ్రాన్పడు - చన్కట్టు-మిన్వడు - గిరివ్రజమున్నరంబు మున్నగుచోట్లులందెల్ల శబ్దావయవ నకారమునకు ద్రుతత్వాభావము బాగుగఁ గుదురుపడెను. (విస్తర I)

---

కళయనెనుగాని 'ఏనిన్' శబ్దము కళయనిచెప్పలేదు. 'అపిశబ్దార్థస్యైతః' అను చింతామణిసూత్రమె 'ఏని' కళయని యుద్ఘోషించుచున్నది. 'ఏనిన్' అనునదే 'యును' శబ్దయుక్తము. కాన దానిపయిని మరల 'యును' శబ్దమును జేర్చుట యసంగతము. 'యును' శబ్దము కాదు. 'ఉను' శబ్దము. అందలియకారము స్వరసంహితలో వచ్చునాగమము. ద్రుతప్రకృతికములమీఁద నట్టి 'యును' నిల్చుట కేవలము నసంభవము. "నాకును నీకును గలదు" మున్నగురీతిని ద్రుతములపై 'ను' శబ్దము నిల్చును గాని 'యును' నిలువనేరదు - (౭౪—విష.). క్వచిత్ప్రిత్యయయోగేచేత్యాదికారికకిది యర్థమే కాదు. అహోబలపతి ననుసరించుట నిందుఁ గొన్నితప్పులు వాటిల్లినవి. తక్కినవి స్వయంకృతములు. క్వచిదిత్యాది ప్రకృతకారిక షష్ఠీ భవేద్వితీయాతుల్యేత్యాది చింతామణిసూత్రముతో నదుకఁదగినది. (౨౭౦ వి)(అహో ౧౮౫-౨౧౭ పు.)

విస్తర I - ౪౫ III విష :—గుప్తార్థప్రకాశికాకర్త, "ప్రత్యయంబును (ఫలమును - నేను - వెళ్ళుచున్నాను) ఆగమంబును (వానిచేతను - చేయుచును -

షష్ఠ్యర్థకము (అనుబంధ I) అవ్యయంబును (అపుడును - మఱియును - అన్నయును) నైన యుకారాంత నకారంబె ద్రుతసంజ్ఞ గలదియని చెప్పుట యుక్తము." (బా - గు - ప్ర - సంజ్ఞా ౧౧ సూ). అని యిట్లు ప్రౌఢవ్యాకరణపంక్తులనె చాలవఱకు నెత్తి వ్రాసికొనియుఁ బ్రౌఢవ్యాకరణపద్ధతులను సరిగ గ్రహింపక తానంగీకరించి వ్రాసి కొన్న పయిపంక్తులకు విరుద్ధముగ (రశ్మి I విష) "కన్దోయి" అనుచోటి 'కన్' శబ్దమున కీక్రిందిరీతిని బ్రక్రియను జూపెను. "కన్దోయి" (కన్ను+దోయి) ఇట్లుండఁ బ్రకీర్ణపరిచ్ఛేదములోని యేడవసూత్రంబున ద్విత్వనకారలోపంబు గలిగి "కను దోయి" అగును. ప్రకీర్ణపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రంబున 'కను' శబ్దంబు యొక్క ఉకారంబునకు లోపంబు రాఁగా "కన్+దోయి" అగును. ఇప్పుడీసంధిపరిచ్ఛేదములోని......ప్రకృతసూత్రంబున ద్రుతలోపంబు గలుగ 'కన్దోయి' అని సంశ్లేషరూప మగుచుండును. (అనుబంధ II) ఈపరిచ్ఛేదములోని నుగాగమనకారం

---

అను I విస్తర. I రశ్మి II I విష:—ఈ బా. గు. ప్ర. కర్తవ్రాఁత సరికాదు. 'చేయుచును' అనుచోటి 'ను' అనునది యాగమంబుగాదు "చువర్ణంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు" (బా. క్రి. ౪౩ సూ) అను బాలవ్యాకరణసూత్రముచొప్పున 'చు' అనుదానితోపాటు ద్రుతమును బ్రత్యయభాగమె యగుచున్నది. 'మమ్మును' అనుదానిలోని 'ను' అనునదియు నాగమంబు కాదు. 'ను' అనునది ద్వితీయాప్రత్యయము. బాలవ్యాకరణమున "తృతీయాదులకు నుగాగమం బగు" (తత్స. ౮. సూ.) అని తృతీయాదులకు మాత్రమె 'ను' గాగమంబు విధింపఁబడినది.

అనుబంధము-II విస్తర I-రశ్మి III విష:—సుప్తార్థప్రకాశికాకర్త కిచటి ప్రౌఢవ్యాకరణపద్ధతియేకాక బాలవ్యాకరణపద్ధతియు బోధపడిన ట్లగపడదు. ప్రాఁతాదిసంధిసందర్భములోని బా. సంధి. ౩౭ సూత్రముచొప్పున విధింపఁబడిన నుగాగమ నకారంబునకుఁ దత్సూత్రవివరణములోని "వ్యవస్థితవిభాషచే నీద్రుతమునకు సంశ్లేషంబు లేదు" అను సూరి వాక్యముచే సంశ్లేషము లేదని యర్థముచేసికొనక యీపరిచ్ఛేదములోని నుగాగమ నకారముతో సంశ్లేషం బుండదని యిట్లపార్థము చేసికొనెను. ఈపక్షంబున "సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకు......నుగాగమం బగు"......చిగురున్గయిదువు"..." (బా. సంధి. ౭౫ సూ) అను బాలవ్యాకరణ సూత్రోదాహరణంబుల కేమిగతి యని యాలోచించుతలంచెనో తెలియకున్నది.

బుతో సంశ్లేషం బుండదనియు సహజ నకారంబుతో . సంశ్లేషరూపంబు నిర్బాధం బనియు వెనుకనె చెప్పంబడియె" (బా - గు - ప్ర - సంధి ౨౨ సూ.) ఈమార్గమె గాణపతవివరణకర్తచే ననుసరింపఁబడియెను (గాణ - సంజ్ఞా ౩౧ సూ.)

విస్తర II. ౪౫ III విష :—ప్రౌఢవ్యాకరణములోని ద్రుతత్వపరిష్కార పంక్తులను స్వీకరించియు నట్లద్దానికి విరుద్ధముగ "కన్దోయి" శబ్దములోని 'కన్' అను సంశ్లేషనకారము శబ్దావయవమనియు ద్రుతమనియు ప్రాయుటెట్లు పొసంగునని ప్రశ్నింపఁగాఁ (కాళయుక్తిసం॥ మార్గశిరపుష్య-౫౦-సా-వు.) దానుస్వీకరించి తన గ్రంథమునఁ జూపిన యాప్రౌఢవ్యాకరణ ద్రుతత్వపరిష్కారపద్ధతియే సరికాదనుచు నా మార్గమును విడిచికొని ద్రుతస్వరూపవిషయమున బాలవ్యాకరణమునకుఁ గేవలము విలక్షణమగు చింతామణిమార్గమునఁబడి యాక్రిందిరీతిని "కన్దోయి" అను చోటి ప్రక్రియను జూపఁగడంగెను. "కన్నులయొక్కదోయి యనుషష్ఠీతత్పురుష విగ్రహ మిట్లుండఁగా 'షష్ఠీభవేద్ద్వితీయా తుల్యాతత్పురుషసంస్థితానామ్నా' మను (హలంతపరి) సూత్రమున 'కన్నులన్+దోయి' యనియై 'లోపశ్చవిభక్త్యాదే' రితి (హలంతపరి) సూత్రమునఁ 'గన్+దోయి' యయ్యె. ఇపుడు 'హేరాజన్' అను శబ్దము సంబుద్ధ్యంతమైనట్టులే 'ప్రత్యయలోపే ప్రత్యయే' తిసూత్రమున నంతర్వర్తి ద్వితీయావిభక్తికిఁ బ్రత్యయలక్షణము సల్పఁగా స్వాశ్రయనాంతత్వముగల యీశబ్దము ద్వితీయాంతమయ్యె." (బా-గు - ప్ర - అనుబంధము ౧౬౧పుట.) ఈ వీరి చర్చ యసంగతిపరంపరాభూయిష్ఠమై యున్నది. బాలవ్యాకరణకర్త యుదాహరించిన 'కన్' శబ్దమును బాలవ్యాకరణానుకూల ప్రక్రియచొప్పున సాధించుటగదా యుక్తము. ద్రుతస్వరూపవిషయమునందును షష్ఠీతత్పురుష రూపసాధనప్రక్రియ విషయమునందును భిన్నాభిప్రాయుఁడై చింతామణిమార్గమును మార్చి మార్గాంతరమున బాలవ్యాకరణప్రక్రియను సూరి నడుపుచుండఁగా నిట సూరియుదాహృతి నట్టి విలక్షణ చింతామణిప్రక్రియతోఁ జూపుట కేవలము నసంగతముకాదా ? షష్ఠీ సమాసప్రక్రియ నడుపుటలో "సమాసవిభక్తికిలోపంబగు. లట్టునకుఁ గాదు...గుణములప్రోక..." (బా. సమా ౪౫ సూ.) అనియిట్లు సూరి "లట్టునకులోపముగా" దని యుద్ఘోషించుచుండఁగా "కన్నులన్+దోయి=కన్దోయి" అని సాధించుట యెంత యన్యాయ్యము! మఱియు షష్ఠీసమాసమున సూరి 'యొక్క' అనువిభక్తికే లోపము వచ్చునని వచించెనుగాని దానికి ద్వితీయ నాదేశించి యాద్వితీయకు లోపమును వచింపలేదు. ఇంకఁ జింతామణిమార్గమున నయిన రూపసాధనప్రక్రియ సరిగాఁ జూపఁబడెనా యన్న నదియుఁ జింతామణిసంప్రదాయమునకుఁ గేవలము

సంజీవని - ౨౭ విషయము :—అప్పకవీయము సైత మాంధ్రశబ్దచింతామణికి వివరణగ్రంథమే. చింతామణి పద్ధతిచొప్పున ద్రుతపరకస్వరసంధివిషయమున (బా - సంధి - ౨ - ౧౬ - ౯ - సూ.) స్వరసంధికి ద్రుతము ప్రతిబంధకము కాదనియు నట్టి యెడల నది యదృశ్యమగు ననఁగా లోపించుననియు (౨౭ విష.) గ్రహింపవలయును. "అచాం సంధౌ ద్రుతోఽదృశ్యః । స్థితోఽపిచ సదా భవేత్" (వికృ. సంధి ౧౬ కారి.) "సంధి విధానసామర్థ్యాదేవ సంధివేళాయాం ద్రుతస్యా ఽదృశ్యతా జ్ఞాపితా" (అహో ౧౮౯). ఈవిషయమున బాలవ్యాకరణకర్తయుఁ జాలవఱకీమార్గమునే యనుసరించెను. అప్పకవి యన్ననో పరరూపసంధి చేయఁదలఁచినపుడాపూర్వపదము కళయే యగుననియు నపు డాని ద్రుతప్రకృతికత పాక్షిక మగుననియు నొక నూతనమార్గ మవలంబించెను. కాన నుకారాంత ప్రథమేతరవిభక్తుల ద్రుతప్రకృతికత్వము పాక్షికమని వచింపవలసినవాఁ డయ్యెను - తే - గీ - ప్రథమ దక్కఁగ నితరవిభక్తులందుఁ। దుదలఁ గొమ్ములు గల విభక్తులకు, షష్ఠిఁ। బలుకు కాఁగుచికిని వికల్పంబువలన। నిల ద్రుతప్రకృతికత్వంబు గలుగుచుండు (అప్ప ౨ ఆ. ౧౬౫ ప.) సీ. నిన్ను నెఱుంగంగ నే నెంతవాఁడను; ('నిన్ను నే నెఱుఁగంగ' అనునది

---

విరుద్ధమై యున్నది. షష్ఠీతత్పురుషమునందలి షష్ఠికి ద్వితీయ నాదేశించునపు డాద్వితీయాప్రత్యయరూప 'ను' వర్ణకాకార ద్రుతమునకు "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" (ఆం. చిం. సంధి ౯ కారిక.) అనుసూత్రముచొప్పున లోపము చేయుట సంప్రదాయముకాని "లోపశ్చవిభక్త్యాదేః" (ఆం. చిం. హల ౧౭ కారి) అను సూత్రముచే ద్వితీయావిభక్తికి లోపము చేయుట చింతామణిసిద్ధాంతము కాదు. "లోపశ్చవిభక్త్యాదేః" అనుసూత్రముచే విభక్తిలోపము చేయునపు డచట షష్ఠికే లోపముచేయుట సంప్రదాయముగాని యచటి షష్ఠికి ద్వితీయాదేశముచేసి యాద్వితీయకు లోపము చేయుట చింతామణిపద్ధతి కాదు. మఱియు గుప్తార్థప్రకాశికాకర్తచూపిన చొప్పున "కన్నులయొక్కదోయి" అనువిగ్రహమున "కన్నుదోయి" అనురూపము సాధ్యమైనట్లు "సీతారాములయొక్కశక్తి" అనువిగ్రహమున "సీతారాముశక్తి" అనునిష్టరూపము సిద్ధింపవలసివచ్చును. గుప్తార్థప్రకాశికాకర్త యంగీకరించి సాధించిన 'కన్నులయొక్కదోయి' అనువిగ్రహమునందలి "కన్నుదోయి" అనురూపసిద్ధి కేవలము శాస్త్రవిరుద్ధము. ఇంకనట్టి విగ్రహమున "కన్నులదోయి" అను రూప మేర్పడుటయే చింతామణికిని బాలవ్యాకృతికిని సమ్మతమై యుండును.

ముద్రణాసంస్కర్తృ ప్రమాదకృత పాఠము) నన్నేలుకొనుము ఘృణాసముద్ర (అప్ప - ౪ ఆ ౪౭ ప.) - (విస్తర I - II)

ద్రుతప్రకృతికంబులు గాని శబ్దంబులు కళ లనం బడు. ౧౩.

---

విస్తర I-రజ విష:—ఈసిద్ధాంతముచొప్పుననె యప్పకవి "ఆ-వె. తన్ను నిన్ను నన్ను విన్ను మన్నా మిన్ను। చన్ను కన్ను వెన్ను శబ్దములకు। జడ్డ లుండుఁ బోవుఁ జర్చింప నివి ద్రుత। ప్రకృతు లెపుడు గావు భక్తసులభ" (అప్ప. ౪ ఆ. ౨౭ ప.) అని వచించెను. విన్ను మున్నగునవి ప్రథమైకవచనాంతము లగుటచే నవి యెన్నఁడును ద్రుతప్రకృతికములు కావనుటలో విప్రతిపత్తి లేదు. ద్వితీయాంతత్వమునందును బాక్షికముగాఁ గళలని యతఁడు తలంచిన "తన్ను నిన్ను నన్ను" అనువానిని దక్కిన కళాశబ్దములతో జోడించి చెప్పుటలో విరోధము లేదు. అప్పకవి ద్రొక్కిన యీనూతనమార్గమును గ్రహింపక గుప్తార్థప్రకాశికాకర్త "తన్ను నిన్ను నన్ను శబ్దంబులు ద్వితీయాంతంబులు కావున ద్రుతప్రకృతికంబులు. పైపద్యంబులో నప్పకవి కళాశబ్దంబులలోఁ బరిగణించుట కవిరభసహేతుకంబు". (బా. గు. ప్ర. సంజ్ఞా. ౧౨ సూ. వ్యా.) అని వ్రాయుట సరికాదు. ద్రుతప్రకృతికత్వంబు పాక్షిక మగుటం జేసి వానిని "తన్నును నన్నును నిన్నును" అని పేర్కొనునపు డవి ద్రుతప్రకృతికము లనఁబడును. 'తన్ను నిన్ను నన్ను' అని పేర్కొనునపు డవి కళలనఁబడును. ఇట్టి స్థితిలో విరోధ మేమున్నదని పత్త్రికాముఖమునఁ బ్రశ్నించినను నప్పకవి నూతనమార్గము బోధపడదయ్యె. అట్లగుటచే మరల నెప్పటియట్లె "రాముని శబ్దములోని "ని" వర్ణకమువోలె 'తా. నా. నీ' శబ్దముల 'అమ్' విభక్తిస్థానిక 'న్ను' వర్ణమును ద్వితీయావిభక్తి యనకతీరదు.... "తే-గీ. తన్ను నిన్న"ను పద్యములోని (అప్ప. ౪ ఆ. ౨౭ ప.) కళాభ్రమ నివారణయత్నము కవిరభసహేతుక మనియెలుంగుదురుగాక" (బా. గు. ప్ర. అనుబం. ౧౬౮-౧౬౯ పు. ద్వి - ము.) అనియె వ్రాసెను.

విస్తర II రజ విష:—"తన్ను నన్ను నిన్ను...ద్వితీయావిభక్తి చేరనపు డివి కళలైన ప్రకృతులని తెలుచున్నది. (ఆం. భా. అ. సంధి. ౨౦-౨౧ సూ. టిప్పణము.) -ఈవాక్యము సరికాదు. 'తా. నా. నీ' అనునవి ప్రకృతులు. పదములకె కళాద్రుతప్రకృతికత్వము ప్రసిద్ధము. ప్రకృతులకుఁ గళాద్రుతప్రకృతికత్వములను జెప్పుట శాస్త్రవిరుద్ధము. ద్వితీయైకవచనము పరమగునపుడె 'తన్ను నన్ను నిన్ను' అనునాకారము లేర్పడును. అవి ప్రకృతు లనుటయు సంప్రదాయవిరుద్ధమె.

బాలవ్యాకరణ పరిచ్ఛేద I-విషయము

రాముఁడు - రాములు - హాయము - విష్ణువు - గోడ - మేడ - అయ్య - అమ్మ - రామునికయి - జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి - వచ్చితివి - వచ్చితిరి - వచ్చితిమి - రాఁడు - రారు - రాదు - రావు - కొట్టక - తిట్టక - ఎత్తలి - ఒత్తలి - ఊరక - మిన్న - బల్లి - అక్క - ఏల - ఇత్యాదులూహించునవి.

సంజీవని ౪౭ I విష:—కళ యనఁగా హల్లునకు జీవకళ నొదవించు స్వరము. అట్టి స్వరము తుదినిగల శబ్దములు కళలు. బాలవ్యాకరణపక్షమున ద్రుతము 'ను' స్వరాంతమగుటంజేసి యీ వివరణము సరిపడదు; ఎల్లపదములును కళలె కావలసి వచ్చును. కాని కళాసంజ్ఞ చింతామణికృత మగుటచేతను చింతామణిపక్షమున నకారవ్యంజనమె ద్రుతమగుటచేతను ఆపక్షమున నిది సార్థకమగును. బాల వ్యాకరణపక్షమున నిది సంజ్ఞామాత్రమె యనఁదగును.

సంజీ ౪౭ II విష:—"ఉ. కాదన కిట్టిపాటి యుపకారము తక్షకుఁ డేకవిప్రునందుఁబోదనఁజేసి వేసె......(ఆది ౧ ఆ. ౧౨౫ ప.) క. నుతియు నమస్కృతి యును లేక తిరిగి......(శాంతి. ౫ ఆ. ౧౬౨) మున్నగు మహాకవిప్రయోగము లనుబట్టి వ్యతిరేకార్థకము కళయె యనుటలో విప్రతిపత్తిలేదు. (విస్తర)

విస్తర ౪౭ II విష:—క. కాఱడవిఁ బఱచు మృగముల। నూఱడకం దిగిచి డస్సి (ఆది. ౮ ఆ. ౧౦౦ ప.), క. అనఘు యిదియేటితప మే। మనుపమదుష్కృతుల మగుట నాధారము లే। కను సంతానోచ్ఛేదం। బున ప్రేలెద మధమలోకముల కేఁగుదు మనన్॥ (ఆది. ౨ ఆ. ౧౪౫ ప.) ఈనన్నయ ప్రయోగములనుబట్టి వ్యతిరేకార్థకము ద్రుతప్రకృతికమని కొందఱు భ్రమింతురు. అది సరికాదు. పైవానిలో మొదటిపద్యమున "ఊఱడకం దిగిచిడస్సి" అని నాయొద్దనున్న యొక తాళపత్రమాతృకలో నున్నది. "ఊఱట లుడిగించ్చి" అని మఱొక తాళపత్రమాతృకలో నున్నది. ప్రౌఢ. శబ్ద. ౧౧౮ సూత్రపు వివరణమునఁ బ్రౌఢవ్యాకర్త యిట్లుదాహరించినను నాతఁడు దనశబ్దరత్నాకరమున "ఊఱడు" శబ్దమునొద్ద "ఊఱడక వధించి" అను పాఠము నుదాహరించెను. ఇట్టి పాఠభేదము లుండుటచే నీపద్యము వ్యాకరణ స్థితిని నిరూపింపఁజాలునని కానేరదు. మఱియు నూఱడకం దిగిచి యనుపాఠముపక్షమునను 'అనఘేత్యాది' ద్వితీయపద్య ప్రయోగమునందును 'ను' శబ్దము పాదపూరణార్థకమగుచు నిల్చినదనియు నక్కారణమున నాప్రయోగములు వ్యతిరేకార్థక ద్రుతప్రకృతికత్వమును నిర్వహింపఁజాలవనియుఁ బ్రౌఢవ్యాకరణమున వ్రాయఁ

సంజీ ౪౭ III విషః—"ఎత్తిలి - ఒత్తిలి - దేశ్యావ్యయములు......ఇందుఁ గ్త్వార్థకోదాహృతి లేదు." (బా - సా-వే - సంజ్ఞా ౧౩ సూ.) ('గ్త్వా' కాదు - క్త్వా అనవలెను) - అను పేటికావ్యాఖ్య సరికాదు. ఈపేటికకు మూలమనఁదగు శబ్ద రత్నాకరమునఁ దదనుసారి సూ - రా. నిఘంటువునను, 'ఎత్తిలి - యొత్తిలి' అను

---

బడెను. (ప్రౌఢ.శబ్ద. ౧౧౬ సూ. సంజ్ఞా. ౮ సూ.) కాని యిట్టి 'సు' శబ్దము పాద పూరణార్థకము కాదనియు సముచ్చయార్థక మనియు బాలకవిశరణ్యకర్త యీ క్రిందిరీతిని వ్రాసెను. "ఇక్కడ దుఃఖితులమగుటను, ఆధారము లేకను, అని సముచ్చయార్థకములుగానే ప్రయుక్తములయి ఉన్నవి. మేము కనబరచిన ప్రయోగాలలో చాలాచోట్ల వ్యతిరేకక్త్వార్థకము తర్వాత నకారము సముచ్చయార్థకము గానే ఉన్నది. చూడండి.........క. అనఘ యిది యేటితప మే। మనుపమ దుష్కృతుల మగుట నాధారములే। కను సంతానోచ్ఛేదం। బున వ్రేలెద మధమ లోకముల తెరువు సనన్ (ఆది. ౨ ఆ. ౧౩౯.) క. కాఱడవిఁ బఱచు మృగముల। నూఱడకం దిగిచిడస్సి...(ఆది. ౪ ఆ. ౧౮.)" (బాలక. ౨౨౩-౨౨౪ పు.)

ఆధునిక కవిప్రయోగములు మఱికొన్ని యతిప్రాసాదిస్థలనిబద్ధములుకానివి యిందుఁ జూపఁబడెను. ఈ బాలకవిశరణ్యప్రయోగములనె (బాలక. శ. ౨౦౦ పు.) యనుశాసనకర్త చూపియు శరణ్యకర్తవలె సముచ్చయార్థక 'సు' శబ్దము చేరినట్లు వ్రాయక యర్థవిశేషశూన్యముగనె చేరినట్లు "వ్యతిరేకార్థకముమీఁద 'సు' చేరుటయుఁ గలదు." (ఆం. భా. అ. ప్రయో. ౩౨ సూ. ద్వి. ము. ౬౪ సూ. తృ. ము.) అని సూత్రించెను. "సముచ్చయార్థమునకు నవసరంబులేని..." మున్నగురీతిని ప్రకాశికాకర్తయు వ్రాసెను. ఈ వ్రాఁతలు సరికావు. అనఘేత్యాదిభారతపద్యమున "అనుపమదుష్కృతుల మగుటను, నాధారము లేకను," అని యిట్లు సముచ్చయార్థము స్పష్టముగా వెలయుచునే యున్నది. రెండవపద్యమున "ఊఱడకన్" అను పాఠము పక్షమునను, "ఎడ తెఱపి లేక వేఁటతమకమునఁ దిగిచె" ననెడి విశ్రాంతి రాహిత్య దార్ఢ్యమును నచటి 'సు' శబ్దము బోధించుచున్న దనుట సహజముగ నున్నది. ఇట్లె ప్రౌఢవ్యాకర్త యీసందర్భమున నర్థవిశేషబోధక 'సు' శబ్దఘటిత ప్రయోగములనెల్ల నవిమర్శితముగఁ బాదపూరణార్థకత్వమునకె యుదాహరించెను. "మున్ను ముచ్చిచ్చును విరాళిఁ గొన్నచోటు" అనుదానిని సైతము పాదపూరణార్థకత్వమునకె యుదాహరించెను. త్రేతాగ్నులవంటి పరిశుద్ధులు నయితను విరాళిఁగొని రని యిట్లగ్నులయందున్న మనోధైర్య పారిశుద్ధ్యాతిశయమ్ము లచటి 'సు' శబ్దముచే బోధింపఁబడుచున్నవిగదా. (విస్త II-౮౪ I విష.)

గణ ప్రతిపదోక్తావ్యయములుగనే చూపఁబడినవి. "ఎత్తిలి- దే - అవ్య - గట్టిగా." "ఒత్తిలి-దే - అవ్య - గట్టిగా" (శ-ర) శబ్దరత్నాకరమందును, సూ. రా. నిఘంటువు నందును, 'ఎత్తిలు' ధాతువు చూపఁబడకున్నను 'ఒత్తిలు' ధాతువు చూపఁబడినది. "ఒత్తిల్లు - దే.అ - క్రి. ప్రక్కకొరఁగు. ఒత్తగిల్లు - (రూ-ఒత్తిలు) "ఒత్తిలి రిత్త పైకొనుచు" (శ - ర). 'ఒత్తు' ధాతువునుండి 'ఒత్తిల్లు = ఒత్తిలు' అను ధాతువు లేర్పడినట్లు 'ఎత్తు - దే - అ - క్రి. కలుగు - పుట్టు.' అనుధాతువు నుండి "ఎత్తిల్లు = ఎత్తిలు" అను ధాతువు లేర్పడు ననుట యుక్తము. "ఈ పిల్ల డెత్తిర్లడు - అగ్ని మొత్తిర్లినది కాదు" అనురీతి నెత్తిలుధాతు వ్యావహారికరూపములు ప్రసిద్ధములై యున్నవి. ఉ. ఎత్తిలి కావుకావురని యేడ్చి......(హరి - పూ. ౬ ఆ ౬౧ ప.)ఉ... పూ.గుత్తుల వ్రాలి తేనియలు కుత్తుకబంటిగఁ గ్రోలి లీలమైనొత్తిలి మ్రోయు చింపు వళులొత్తుచునుండు మదాళివంపతుల్ (విక్ర - ౧ ఆ - శ - ర) ఈ ప్రయోగముల లోని "ఎత్తిలి - ఒత్తిలి" అనునవి క్త్వార్థకములనుటలో విప్రతిపత్తి యుండదుగదా. "రాదు - రారు - రాము - రావు" అనువ్యతిరేకక్రియల నుదాహరించు ప్రక్రమ మున "కొట్టక - తిట్టక" అను వ్యతిరేకక్త్వార్థక రూపములను ముందుగ నుదాహ రించి పిదప "ఎత్తిలి - ఒత్తిలి" అను క్త్వార్థకముల నుదాహరించుట శంకాస్పదము కాదు.

'ఏల' అనునది ద్రుతప్రకృతిక మను భ్రాంతితోఁ గొందఱు "ఏల ననఁగా" అని వాడుచుందురు. "యదా తదా కి మేవాంశ్చ" అని నన్నయ కిమర్థమును గళయని యుపదేశించెను. మ - క్షితి నెందుం జరియించి.......యతఁ డీ క్రౌర్యంబు నేయంగ నేల తొడంగెన్......" (శాంతి. ౨ ఆ. ౬౬) అను సోమయాజిప్రాస ప్రయోగము దాని కళాత్వమును నిర్వహించుచున్నది.

| | |
|---|---|
| నన్నయాథ | సిద్ధ స్సాధ్యశ్చాను । స్వారః పూర్ణార్ధ భేదతో ద్వివిధః । |
| ర్వణీయము. | ప్రాస్వా త్పూర్ణోఽపి భవేద్దీర్ఘాచ్చేత్ ఖణ్డఏవ స |
| ౪౫ విషయము. | జ్ఞేయః॥ (ఆం - చిం-సంజ్ఞా - ౮ కారి-అహో ౧౪౩పు.) |

కల్ప ౪౫ విషః—సిద్ధః, సాధ్యశ్చ, అనుస్వారః = ప్రకృతిసిద్ధమగునట్టియు, వ్యాకరణసాధ్యమగునట్టియు ద్వివిధమగు ననుస్వారమును, పూర్ణార్ధభేదతః = పూర్ణమను నర్ధము ననెడి భేదద్వయముచే, ద్వివిధః = మరల రెండువిధము లగుచు న్నది. సిద్ధపూర్ణము, సిద్ధఖండము, సాధ్యపూర్ణము, సాధ్యఖండము నని నాల్గు విధములగుచున్న దని తాత్పర్యము. సః = ఆ సిద్ధసాధ్యరూప ద్వైవిధ్యముగల

యనుస్వారము, హ్రస్వాత్ =హ్రస్వమునకుఁదర్వాత, పూర్ణోఽపి భవేత్ = పూర్ణ రూపముగ నైతముండును. అపి శబ్దస్వారస్యముచే ఖండరూపముగను నుండుననియు నదియె ప్రచురముగఁ గన్పట్టుననియు నర్థము లభించుచున్నది. సిద్ధ సాధ్య బిందువులు హ్రస్వమునకుఁ దర్వాత ఖండ పూర్ణ ద్వివిధరూపములను నుండుననని ఫలితార్థము. దీర్ఘాచ్చేత్ = దీర్ఘమునకుఁదర్వాత నన్ననో, ఖణ్డఏవ = అరసున్నమాత్రమె యుండును. దీనిచే దీర్ఘమునకుఁదర్వాత సిద్ధముగాని, సాధ్యముగాని నిండుసున్న యుండనేరదని స్పష్టపడుచున్నది. "నిత్యం దాకాదేశ్చ స్యా" దిత్యాది (౧౯౩ విష.) సూత్రములచేఁ బ్రత్యేకముగ విధింపఁబడిన "ఆంధ్ర - వాంఛ" మున్నగు చోటులందు విధానసామర్థ్యముచే దీర్ఘపూర్వకపూర్ణము లుండుట నిర్బాధమని యెఱుంగునది. దీర్ఘమునకుఁదర్వాత సాధారణముగా నిండుసున్నను బల్కుటకు కాల దైర్ఘ్యావశ్యకత నొదవించి శ్రమాపాదక మగునుగాన దీర్ఘముమీఁది నిండుసున్న నిలువక ఖండముగఁ దేలిపోవు నని తాత్పర్యము. సంయోగపరకత్వమునఁ బూర్వ స్వరమున కర్థానునాసిక్యము నుచ్చరించుట సుకరము కామింజేసి యట్టియెడల నిండుసున్న నిల్చుటో లోపించుటో సంభవించునేకాని యది ఖండముగాఁ దేలి పోనేరదని యెఱుంగునది. ఉదా: తేండ్లు - ('తేఁడ్లు' అని యుండనేరదు) ఏండ్లు ('ఏఁడ్లు' అని యుండదు) 'మూఁడుచు = మూడ్చు' అనుచోటి ఖండమే లోపించి పోయినది. (౨౦౨ విష.) "సః=సిద్ధ సాధ్యశ్చ ఖణ్డానుస్వారః హ్రస్వాత్ = లఘ్వ క్షరాత్ పరశ్చేత్ పూర్ణోఽపి భవేత్" (అహో ౧౬౭ పు.) అను నవిశిరోభూషణ వ్యాఖ్య సరికాదు. "ఖండము పూర్ణమగుట కుదాహరణము. కలఁగు = కలంగు" (గాణ.సంజ్ఞా ౫౯ ప. ౫౬ కారి.) అను గాణపతవివరణమును దీనినె యనుసరించెను. ఖండబిందువునుండి పూర్ణమును సాధించుట కెచ్చటను బ్రసక్తి చింతామణిలో లేదు. అహోబలపతి యిచటి ప్రమాదముచొప్పుననె "సానునాసికోచ్చారణం జేతి సూత్రేణ సానునాసికత్వే రాముఁడు - హ్రస్వాత్ పరత్వాత్ రాముండు." (అహో ౨౮౮ పు.) అనియు నపవ్యాఖ్య చేసెను. (విస్తర II ౧౨౭ విష.)

హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు
వైకల్పికముగ నగు. ౧౯.

బాలవ్యా. వివరణము ౪౦ I విష. — అడఁకువ = అడంకువ, అరఁటి = అరంటి, ఎఱుఁగుట= ఎఱుంగుట, బలఁగము=బలంగము, మగఁటిమి = మగంటిమి.

దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు. ౧౫.
వాఁడు-వీఁడు - రాఁడు - లేఁడు-కాఁబోలు - కాఁబట్టి-
గోఁగులు - రేఁగులు.

సంజీ రూ I విష:—౧౪ - సూ - వ్యాఖ్య:—ఈసూత్రమునందలి యుదాహృతులెల్ల సిద్ధబిందుస్థలములె యగుటచేతను, ౧౫ సూత్రమునందలి యుదాహృతులెల్ల సాధ్యబిందుస్థలములె యగుటచేతను, నీ ౧౪ సూత్రము కేవలము సిద్ధబిందువిషయకమె యనియు ౧౫ సూత్రము కేవలసాధ్యబిందువిషయకమె యనియు సూరి ప్రాశయమును వర్ణింపనగును. మగఁటిమి శబ్దములోని ఖండమునైతము ప్రకృతి సిద్ధమెయని తక్కినవాని సాహచర్యమున నిర్ణయింపనగును. (విస్తర.)

సంజీ రూ II విష:—౧౪ సూత్రమున హ్రస్వముమీఁది ఖండమునకు మాత్రమె పూర్ణము విభాష నాదేశించుటచే దీర్ఘముమీఁది సిద్ధఖండము పూర్ణము కానేరక ఖండముగానే నిల్చిపోవునను నర్థము లభించుచున్నది. ఉదా:—తోఁచు - వాఁడిమి - వేఁడి - మొ. శబ్దరత్నాకరమున "తీండ్రించు" మున్నగుకొన్ని దీర్ఘపూర్వక పూర్ణయుతశబ్దములు చూపట్టుచున్నవి. ఇట్టివానిని నిర్వహించు ప్రబల ప్రయోగములు భారతమున గన్పట్టలేదు. కాని "శా. తండ్రీ నాకు...। తీండ్రల్ గల్గిన... (మను - ౫ ఆ - ౭ - ౧.) అను కవిపితామహప్రయోగము గలదు. 'తీఁడి రించు' మున్నగువానిలోని ఖండములు "సమానపదంబునందు...(బా. అచ్చి. ౧౫ సూ. ౨౦౨-I-విష.) అనుసూత్రముచేఁ బూర్ణము లగుచున్నవి గాన నవి సాధ్యపూర్ణములె యనఁదగును. "పూంచు" మున్నగునవి పూను ప్రభృతుల ప్రేరణరూపములగుటంజేసి (బా. క్రియా. ౭౭ సూ.) యవియు సాధ్య పూర్ణయుతములె యననగును.

---

విస్తర-రూ I విష:—ఇందలి యుదాహరణములలో మగఁటిమి యనునది తప్పఁ దక్కినవెల్ల సిద్ధఖండములు గలపదములని చెప్పవలసియున్నట్లును నందలి టివర్ణము నౌపవిభక్తికముగ సమర్థించుకొనలేనట్లును ౧౪ సూత్రపు పేటికా వ్యాఖ్యలో వ్రాయఁబడెను. మగఁటిమిశబ్దములోని 'టి' వర్ణము విభక్తి నిమిత్తకము కాకుండుటచే నది యౌపవిభక్తిక మనుకొనుట పొరపాటు. "మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బా. తద్ధి ౮ సూ.) అనుసూత్రమున మగఁటిమి శబ్ద మొక తద్ధితాంత నిపాతముగ వచింపఁబడుటంజేసి యది తక్కిన యుడుకువ మున్నగువానితోపాటుగ సిద్ధఖండయుక్తమె యనఁదగును.

క. కాంచనమాలాలంకృత|చంచత్తనులీల మెఱయు జవనాశ్వములన్|బూంచి రథంబున (విరా. ౪ ఆ. శ-౪)-కోశములలో 'కాంచు' అనునదొక సకర్మకక్రియా మాత్రముగఁ జూపఁబడుచున్నది కాని యదియు "కను" ధాతు ప్రేరణరూపమే యనఁదగును. "కాంచు=కానుచు.స-క్రి-దర్శించు. చూచు. చ. ...యా|దవకులపారి జాతమును...కాంచి...(ఉ. హరి. ౪-౨౧"-సూ.రా.ని.) ఇట్టిచోటులందెల్ల "తన్నుఁ గనునట్లుచేసి" అనునర్థము నెన్నునది. ఇట్లని దీర్ఘపూర్వకపూర్ణప్రయోగములు లేవనఁ జాలము. క. పొండిగ నగజతపశ్శిఖి|మూండుజగంబులను...బ్రహ్మాండము కాఁచిన... (నన్నె. కు. ౬ ఆ. ౨౧౩) ఉ. వీంగు......వా|మాంగమునందు......లోఁగిన... (నన్నె. కు. ౧ ఆ. ౪) ద్విపద. పాండురాంగంబైన పడఁతిగర్భమునఁ | బొండిగా వెల్గుచుఁ బుత్త్రుఁ డీక్రియను | (బసవ. ౧ ఆ. ౩౫౩ ప.) - ప్రగీతి. మూండు నేసి... ...| పొండిగా...... ని | ట్లుండఁ జెప్పవలయు......(కవిజ. జాత్యధి. ౨౧ ప.) ఇట్టి ప్రాసనిబద్ధప్రయోగములు భారతమునఁ గన్పట్టలేదు. "దీర్ఘాచ్ఛే త్ఖణ్డఏవ" అని భట్టారకుఁడు కంఠోక్తముగ నిషేధించుచున్నాఁడు. భారతకవులేకాక నాచనసోమ శ్రీనాథాదులును నిట్టి దీర్ఘపూర్వకపూర్ణములను బ్రయోగింపలేదు. అట్లయినను నన్నయకుఁ దర్వాతఁ గొందఱుకవులు వీనిని బ్రయోగించుటచే నిట్టివానిని బ్రౌఢ వ్యాకర్తయేని పాక్షికముగా సాధువులే యని యంగీకరించుట యుక్తము.

సంజీ. ౪౭ III విష:—కల్పతరువులోఁ జూపఁబడినరీతి (౪౭ విష) నహోబలపతి చేసిన ప్రామాదికవ్యాఖ్య ('సః = ఖణ్డానుస్వారః' అనెడిది) ననుసరించి సూరి ౧౪ సూత్రముకు సూత్రించినకారణమున నియ్యది వివిధములగు నసంగతు లకు లోనగుచున్నది. బాలవ్యాకరణప్రక్రియచొప్పున నెచ్చటను ఖండమునుండి పూర్ణమును ౧౪ సూత్రముచే సాధించుకొనవలసిన ప్రసక్తి లేమింజేసి యిది సాధ్య బిందువిషయకము కానేరదు. మఱియు నిరర్థకము నగుచున్నది. సిద్ధానుస్వారవిష యక మందమన్న నుచ్చారణభ్రష్టమగు నరసున్ననుండి నెఱసున్నను సాధించుట కేవలము నసంగత మగును. మఱియు నిట్లు వ్యాకరణముచే సాధింపఁబడినపుడు 'అడంకువ' మున్నగువానిలోని పూర్ణములును సాధ్యములె యగునుగాన నింక సిద్ధపూర్ణమన్నది గగనారవిందమె యగును. ఇంతియకాక యనుస్వారచరిత్రమును బట్టి పూర్ణబిందువు ప్రాచీనతరమై యుండుటచేతను నుచ్చారణసౌలభ్యాపేక్షచే నద్దానిని దేలఁబల్కుటవలన నట నరసున్న యేర్పడుటచేతను బూర్ణమునుండి ఖండ మును సాధించుట యుక్తముగాని ఖండమునుండి పూర్ణమును సాధించుట యుక్తముకాదు. ఇట్టి యపమార్గపు వాసనచేతనే చింతామణికి వివరణము వ్రాయఁ

గడంగిన నారాయణీయ తద్వివరణకర్త లీక్రిందిరీతిని వ్రాసిన వారైరి. "తే. హ్ర స్వముపయి ఖండంబు పూర్ణంబు నగును। గాదు ఖండంబున కది దీర్ఘంబు మీఁద" (నారా) "వివ. ఖండము పూర్ణమగుటకుదా: కలఁగు = కలంగు, అడఁకువ = అడంకువ, అనఁటి = అనంటి - మొ" (గాణ. వివ. సంజ్ఞా. ౫౬ కా. ౫౯ ప.)

సంజీ - ౮౯ IV విష:—పయి యసంగతులను దప్పించుటకయి ౧౮ సూత్రమునకుఁ బ్రయోజనకల్పనము చేయఁబడుచున్నది. నన్నయనాఁటికి ఖండానుస్వార సంబంధియగు నర్ధానునాసికోచ్చారణము నిల్చి యున్నను దిక్కననాఁటికే యది యంతరింపసాగెను. సూరినాఁటి కది బొత్తిగా నంతరించుటచేత నాతఁడు ఖండానుస్వారస్థితి నభ్యాసకులకుఁ దెలుపుమార్గములను యథావకాశముగఁ జూపవలసి యుండునుగదా. సాధ్యఖండజ్ఞానము వ్యాకరణమువలననే కల్గనోపును. దీర్ఘపూర్వకసిద్ధఖండములను దెల్పుట సాధారణముగ శక్యమేకాదు. అట్టివి కోశాదుల మూలమునఁ దెలియఁదగినవే. ఇంక హ్రస్వపూర్వక సిద్ధఖండములను దెల్పుటకుఁ గొంత యవకాశ మున్నది. అట్లు తెల్పుటయే ౧౮ సూత్రమునకుఁ బ్రయోజనమని యెన్నదగును. హ్రస్వముమీఁదఁ బూర్ణము నిల్చియున్న రూప ముచ్చారణవేద్యము గాన నట్టి సబిందుకరూపమును దాని యశ్రుతబిందుక రూపమును గోచరించునప్పుడట్టి శ్రూయమాణపూర్ణబిందుక శబ్దములోని బిందుస్థానమున నశ్రుతబిందుక శబ్దమునందు ఖండము గలదని యీసూత్రముచే బోధ్యమగును. ఇట బిందుచరిత్రానుసారముగాఁ బూర్ణమునకే ఖండము నాదేశించినచోఁ బూర్ణము తేలిపోని "అపరంజి - చేమంతి - నారింజ - పావంచ - గావంచ" మున్నగు కతిచిచ్ఛబ్దములలోని పూర్ణములచోట నయితముఖండము పాక్షికముగఁగల యనిష్టరూపముల నంగీకరింపవలసివచ్చును. కాన సిద్ధఖండమునకుఁ బూర్ణము నాదేశించుటయె యుత్తమపద్ధతి యనఁదగునుగదా.

సంజీ. ౮౯ V. విష: సోమయాజినాఁటికి ఖండబిందూచ్చారణ మంతరింప నారంభించుటచేతనే శ్రుతికమ్యతాభంగము లేమింజేసి కొన్నియెడల నాతఁడు ఖండాఖండప్రాస మంగీకరించి ప్రయోగించెను. నన్నయభారతభాగమున నెచ్చటను నట్టి ఖండాఖండప్రాసప్రయోగము లేదు. (వై. పారి. ౩౨౮. మొ. ౩౩౮ వ. విష.) కం. తగ నాఘురువృద్ధునకు నా। సఁగె నాఁటికి దివ్యదృష్టి (ఆశ్వ. ౨ ఆ. ౧౨౧) (విస్తర.)

విస్తర. ౮౯ V విష:—'బసఁగు' శబ్దము భారతకాలమున సబిందుకము కాదని తెల్పిరు వ్రాసిరి. (యువసం. మార్గశీర్ష భారతి) ఈయొక్క చోటనే

కాక పెక్కుచోటులందు సోమయాజి ఖండాఖండ ప్రాసప్రయోగ మార్గదర్శకుఁడయ్యెను. తిక్కన 'ఒసఁగు' శబ్దమును స్థలాంతరములందును సబిందుకముగనే ప్రయోగించెను. క. అనియెం గావునఁ గుంతీ । తనయాగ్రజ నీవు నివ్విధముల జనములం । గొనియాడుము వారలు శో।భనములొసంగుదు రఘుంబుఁ బాపుదురు కృపన్ (అను. ౨ ఆ. ౧౩౬) క. కోనవరము విమానము । గారవమున నాకుఁ గమలగర్భుఁ డొసంగెన్ (నిర్వ. ౨ ఆ. ౪౫ ప.) తే-గీ. ఇంపొసంగు నీయర్మిలి యెల్ల వమ్ము । గాఁగ........(నిర్వ. ౯ ఆ. ౮౮ ప.) ఈ చోటులందెల్లఁ దాళపత్త్రమాతృకలలోని పాఠము పైరీతినే యున్నది. ఉ. .........కమ్మనూనె మై । నఁటి నలుంగుతో జలకమార్చి యొసంగిరి ధౌతవస్త్రముల్. (హర) ఒసఁగు సబిందుకత భారతసమ్మతము కాదను నిశ్చయముతోడనే బసవపురాణమును నాంధ్రవిశ్వకళాపరిషన్ముద్రిత రంగనాథరామాయణమును బరిష్కరించుటలో వందలకొలఁదిగ నున్న యొసఁగు శబ్దబిందువులు నూకివేయఁబడినవి. కాని రంగనాథరామాయణమున నొకచోఁ బరిష్కర్తగారు ప్రమాదపడి విశ్రమస్థానగతమునే వెకలించుట మఱచిరి. ద్విపద. "స్వస్తి యెల్లప్పు డొసంగుదు రనుచుఁ । బ్రస్తుతిసేసి యా భామాలలామ (యా. ము. రంగ. అయో. ౧౧౬ పు. ౨౨ పం) తిక్కన ఖండాఖండప్రాసము నంగీకరింప లేదనుట కింత ప్రయాసపడుట వ్యర్థము. ఆతఁ డనేకస్థలములఁ బ్రయోగించెను. ఉ. కీచకకోటిచేత నొక కీడును బొందక వచ్చి తమ్మ నిన్ । వేఁచిన దుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ (విరా. ౩ ఆ. ౪౫ ప) (వేఁచు=వేఁగఁజేయు=పీడించు) ఉ. నీతిఁ దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం । బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు భూజనుల్ । వేఁతురు..... (సౌప్తి. ౧ ఆ. ౩౫) (వేఁతురు=వేఁగునట్లు చేయుదురు=నిందింతురు) క. మీఁటుగలరథికులను నొక । నాఁటను వేవుర వధింతు నరుశరములు నో । నాటి పడవైచునంతకు । వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరుల నెల్లన్ ॥ (ఉద్యో. ౪ ఆ. ౪౦౭) (మీఁటుగల రాజరథికుల । నాఁటికి...వావిళ్ళ) ఉ. జాతర సేయఁగావలయు...... । బ్రాఁతిగభక్తి తోడ......(మౌస. ౧ ఆ ౨౪).క. కూఁతురు పదమురుకారము । బ్రాఁతిగఁ దాఁ జెడు (ఆం. భూ. ౯౯ ప. బ్రాఁతిసబిందుకము) క. బిగు వెడలక నిలిచి పడున్ । నగములు వేతసచయంబు నమ్రంబై పె । ల్లగు మావేగము గడపి యె । సఁగుఁ బూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్ ॥ (శాంతి. ౩ ఆ. ౮౮ ప) క. కేతనకపిభయదంబై । తోఁతేరఁగ (కర్ణ. ౩ ఆ. ౧౭౪) "తోఁచులో వాస్తవముగ ఖండబిందువు లేదు...... కనుకనే తోఁతెంచులో సైతము(తోఁచు+తెంచు) లేదు. ......తోఁచులో నర్థాను

౮౯ I - వి. సంజీవని— ౧౫ సూ:—దీర్ఘమునీఁదితాల్వాది సూత్రము వ్యాఖ్యానించిన మాత్రవిషయకమని యీావఱకు వ్రాయఁబడెను. 'వాఁడు, వీఁడు' అను సర్వనామ్నాతులలోని 'ఁడు' అనునది, బా. తత్స. ౨౨ సూత్రము చెప్పున వచ్చిన 'డు జ్' ప్రత్యయము. 'రాఁడు, లేఁడు' అనువానిలోని 'ఁడు' అనునది బా. క్రియా. ౮ సూత్రమునఁ జెప్పఁబడిన 'డు జ్' ప్రత్యయము. 'రేఁగులు, గోఁగులు' అనువానిలోని 'ఁగు' అనునది బా. అచ్చి. ౧౬ సూత్రము చెప్పున వచ్చు 'గు' జాదేశము. ఇవెల్ల జిత్తులు గాన "జిత్తు బిందుపూర్వం బగు"

---

స్వార మున్నదని నమ్మికొని పైసూత్ర (ఖండబిందువుమీఁది సిద్ధచకారమునకు ముత్తు పరంబగునప్పుడు ప వలగు. బా. క్రియా. ౮౯ సూ. అనుసూత్రమును) మాధారముగాఁ జేసికొని "తోఁపదు" అని కొందఱు వ్రాస్తున్నారు. (బాలక. శ. ౧౬౭-౧౬౯ - పు) అని - కీ. శే. కళాప్రపూర్ణ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు వ్రాసిరి. కాని "తోఁచు - తోఁతెంచు" సార్ధబిందుక ములే. తోఁచులో నర్ధానుస్వార మున్నదని నమ్ముకొని యెవరో కొందఱు 'తోఁపదు' అని ప్రయోగించుటే కాదు. కవిబ్రహ్మగారే మార్పరాని యతిస్థానములందుఁ బ్రయోగించిరి. చ. ......బం । ధురతర వారివాహములు దోయజబాంధవుఁ గప్పు చాప్పు దోఁ । ప రయముమైఁ గడంగి యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగా ।... (శల్య. ౧ ఆ. ౩౩౫) ఉ. ......క్రూరవిచేష్టితవిభ్రమంబు దోఁ । ప న్నురమాడుఁ బ్రథబలభాసిత భూరిభుజావిహారుఁడై । (సౌప్తి. ౧ ఆ. ౧౭౫) ఈప్రయోగము లనుబట్టి "సైఁపన్" మున్నగువానికి "సైఁచు" ప్రభృతులవలెనే 'తోఁపన్' అనుదానికి మూలమగు తోఁచుధాతువును సార్ధబిందుక మనుటకును, దీనినిబట్టి 'తోఁతేరన్' అనునదియు సార్ధబిందుకమె యనుటకును, దిక్కన ఖండాఖండప్రాసమును బ్రయోగించె ననుటకును, సందియంబు లేదుకదా.

మఱియు వేంకటరామమూర్తి పంతులుగారు తాళపత్రమాతృకాలేఖనము బిందునిర్ణయమునఁ గొప్పఁగాఁ బ్రమాణీకరించెడువారుగావున నిట్లు చూపు చున్నాను "తుదిముట్ట సూన్యమై తోంచుచున్నదియు" (రంగ. అర. ౧౨౭౮వ) "ఇది నాకు దుఃఖమై యిప్పుడు తోంచె" (రంగ. అర. ౧౩౫౦వ) (చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక. ౧౩-౧౨-౧౪ - నెం. D.N - ౯౭౭. రంగనాథరామా యణ తాళపత్రమాతృక). ఇందీసందర్భమున ననేకస్థలములయందీ 'తోంచు' అనునది గలదు. విస్తరభీతిని జూపనైతిని. తోంచు శబ్దసంబంధి యగు "తోస్తు" అను తమిళశబ్దమున ననుస్వారమూలమగు నకారము వెలయుచున్నది.

(బా. తత్స. ౧౯ సూ.) అనుచోఁప్పున విధింపఁబడిన యనిర్దిష్టబిందువిధానస్థలములు. అనఁగా ఖండబిందువనికాని పూర్ణబిందువనికాని నిర్దేశించి చెప్పక బిందుమాత్ర మును విధించిన స్థలములని యర్థము. ఇట్టి యనిర్దిష్టబిందువిధాన స్థలములందు ఖండ పూర్ణములు రెండును బర్యాయముగా రాఁదగి యుండును గాన నట్టియెడల దీర్ఘము నకుఁ దర్వాతఁ బూర్ణము రానేరదని యీసూత్రము నిర్ణయించును దీర్ఘముమీఁద ననుటచేత హ్రస్వపూర్వకస్థలములందు ఖండపూర్ణములు రెండును బర్యాయముగ వచ్చును. ఉదా. రాముఁడు = రాముండు, చదువఁడు = చదువండు, నన్నుఁజూ చెను=నన్నుంజూచెను. మొ. ప్రకృతసూత్రములోని తక్కిన 'కాఁబోలు, కాఁబట్టి' అను రెండుదాహృతులందు సైతము "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు" (బా. సంధి. ౧౨ సూ.) అనుసూత్రముచే ననిర్దిష్ట ముగా బిందువు విధింపఁబడుటచే ఖండపూర్ణములు రెండును బర్యాయమున రావ లసియుండఁగా నవి దీర్ఘపూర్వక స్థలములగుటం జేసి ప్రకృతమగు ౧౫ సూత్రముచేఁ బూర్ణబిందువు రాదయ్యెను.

ఉ. వీండె ఖలుండు దక్షుఁడు.....సర్వప। ధ్యుండు (నన్నె. కు. ౨ ఆ. ౨౧౨ ప.) అనియిట్లు లెంకణాదిత్యాదులు సిద్ధబిందువులనువలెనె (౮౦ II విష.) సాధ్యబిందువులనుసైతము దీర్ఘపూర్వములను బ్రయోగించియున్నారు. అట్టివానిని గ్వాచిత్కముగాఁ బ్రయోగదృష్టములైన దీర్ఘపూర్వకసాధ్యములును గ్రాహ్యము లని యంగీకరించు టుచితము. నన్నయాథర్వణ, తిక్కన, శ్రీనాథాదులెవ్వరును బ్రయోగింపలేదని సూరి యుపేక్షించినట్లు కన్పట్టుచున్నది.

ఈ ౧౫ సూత్రములోని సాధ్యశబ్దము వ్యాకరణసాధ్యమాత్రములకెల్ల వాచకము కాదు. కాన తేంట్లు, ఏండ్లు, తేండ్లుమున్నగు (బా. అచ్ఛి - ౧౫ సూ.) చోట్లఁ బ్రత్యేకముగాఁ బూర్ణమును వ్యాకరణము సాధించుస్థలములం దీసూత్రము వర్తింపనేరదు. అట్టియెడల విధానసామర్థ్యమున దీర్ఘపూర్వకస్థలములందును సాధ్య పూర్ణము రాఁదగునని గ్రహింపవలయును. (విస్తర. I - II)

---

విస్తర. I - ౮౯ [1]. విష:—పైసందర్భమునుబట్టి "దీర్ఘమునకుఁ దర్వాతను నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయునుగాని వ్యాకరణము చేత నిండుసున్న రానేరాదు" (బా. గు. ప్ర. సంజ్ఞా. ౧౫ సూ. వ్యా.) అనువ్యాఖ్య సరికాదని తెల్లమగుచున్నది. ఈవిషయమును బత్త్రికాముఖమునఁ బ్రశ్నింపఁగాఁ బ్రకాశికాకర్త బాల.సంజ్ఞా. ౧౮ సూత్రములోని "వికల్పముగ" అనునది తన వ్యాఖ్యానపంక్తిలోని కనువృత్తమగునని యొకవింతసమాధానము నొసంగెను.

సంజ్ఞా - ౪౯ II విష :— నిద్దంపుమోము - రెండింటినిమున్నగుచోటులం దని క్లిష్టముగ ద్రుతమాత్రవిధానము చేసినచో "నిద్దంపుమోము - రెండిటిని" మున్నగు సంశ్లిష్టఖండబిందుఘటిత రూపములు రావలసివచ్చునన్న తలంపుచే నట్లు చేయక చింతామణికర్త "మోస్తువిభక్త్యేకవచనకేపు - ంపూ" (౯౪. విష.) అనియు "పౌపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టి - ంట్యాదయో భవన్తీహ" (౨౨౭ విష.) అనియు నట్లు నిర్మించుక పువర్ణమును, బూర్ణబిందుపూర్వక

(బా. గు. ప్ర. అనుబంధము ౧౬౬ - ౧౬౭ - ద్వి. ము), మూలములోని పదము వ్యాఖ్యాతృ వ్రాసినపంక్తిలోని కనువృత్తి యగుట యశ్రుతచరము. మఱియు "దీర్ఘం బుతర్వాత నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయును" అను లక్షణవాక్యమున నట్టి యనువృత్తమగు "వికల్పముగ" అనునది సమన్వితమై కుదురుపడదని చూచుకొనకుండుట యింకను వింత. ఇంక "దీర్ఘాత్ పరశ్చేత్ ఖండ ఏవ సతు పూర్ణః" అనురీతి నహోబలపత్యాదులు చెప్పినట్లె తనచేతను జెప్పఁబడెనని యింకొక సమాధానమీయఁబడెను. అహోబలపండితుఁడు తనవలె "నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయును" "దీర్ఘమునకుఁ దర్వాత నిండుసున్న వ్యాకరణముచేత రానేరదు" అని వ్రాయకుండుటం జేసి యాతనివ్యాఖ్య ప్రత్యేక పూర్ణవిధానస్థలములకు విషయముకాదని చెప్పుటకుఁ గొంత యవకాశమున్నది కాని తనప్రసంగమునట్లు సవరించుకొనుట యెట్లు సాఁగును ?

విస్తర II - ౪౯. I. విష: —అనిర్దిష్టబిందువిధానస్థలములలో హ్రస్వపూర్వకత్వమున ఖండపూర్ణములు రెండును బర్యాయముగా వచ్చునను సూరిమార్గమును గ్రహింపక గుప్తార్థప్రకాశికాకర్త "ఈసూత్రమున బిందువు ముందుగఁగలిగిన డువర్ణకమువచ్చి 'డిద్ధుఁడు' అనిద్యైనది. తరువాత 'హ్రస్వముమీఁదనున్న యఱసున్న నిండుసున్న యగును' అనునర్థమిచ్చు సంజ్ఞాపరిచ్ఛేదమందలి పదునాల్గవసూత్రంబున 'డిద్ధుండు' అని యగును" అని యిట్లు వ్రాయుట సరికాదు. సంజ్ఞాపరిచ్ఛేదములోని ౧౪ సూత్రము సాధ్యబిందువిషయకమె కాదు. అది యట్లుండ సూరి యహోబలపతిపడిన యథమార్గమునఁ బోక (౪౮ విష. కల్పతరు) "జిత్తు బిందుపూర్వం బగు" (బా. తత్స. ౧౯) అని ప్రత్యేకముగ సూత్రించికొని యనిర్దిష్టబిందువిధానమున ఖండపూర్ణములు రెండును బర్యాయముగ వచ్చునట్లు ప్రక్రియ నడపికొనెనే కాని మొదట నరసున్నను నిల్పి దానికి బా. సంజ్ఞా. ౧౪ సూత్రముచే నిండుసున్న చేసెడి రీతిని ప్రక్రియను నడపలేదు. కాన సూరి త్రొక్కిన ఋజుపద్ధతిని మాపుట యుక్తముకాదు.

పువర్ణమును నల్లె నిర్బిందుక టివర్ణమును బూర్ణబిందుపూర్వక టివర్ణమును బ్రత్యే కముగ విధించికొనెను. బాలవ్యాకరణకర్తయు "కర్మధారయంబులందు మువర్ణ కంబునకుం బు . ంపు లగు" (బా. సంధి. 3౭ సూ.) అనుసూత్రముచే "పు. ంపు" లనల్లె వేర్వేఱుగ విధించెను. టి - ంటుల ప్రక్రియను నేకవిధముగ నడపెను. బా. ఆచ్ఛి. ౨౮. 3౧ సూత్రములచే నిర్బిందుకమగు "టి" వర్ణమును విధించి బా. ఆచ్ఛి. 3౨. 33 సూత్రములచే దానికిఁ బూర్ణబిందుపూర్వకత్వమును విధించెను.

నన్నసూ ౫౦ విష　తృతీయే ప్రథమే వర్ణే। పరవేవ హి దృశ్యతే। బిన్దు ర్వైకృతమధ్యేతు। నాఽన్యవర్ణే పరేతు సః" (వికృ. సంజ్ఞా. ౧౦ కారి. అహో. ౧౭౭౭ పు)

కల్ప - ౫౦-విష :—అత్ర = ఈయాంధ్రభాషయందు, వైకృతమధ్యే=ఆచ్ఛిక పదమధ్యమున, బిన్దుః = ఖండపూర్ణాన్యతరబిందువు, తృతీయే - ప్రథమే - వర్ణే - పర ఏవ= వర్గప్రథమతృతీయము లనఁగాఁ బరుషసరళములు పరమగునపుడుమాత్రమె, దృశ్యతేహి= కనఁబడుచున్నది. హిశబ్దము ప్రసిద్ధ్యర్థకము. అన్యవర్ణే పరేతు= పరుష సరళేతరము పరమగునపుడు, సః= ఆబిందువు, న= లేదు. అనఁగా స్థిరపరకబిందు వుండరాదని యర్థము. 'కంసాళి' శబ్దము వ్యావహారికరూప మనఁదగును. 'కంసాల - వి. స్వర్ణకారజాతి. ఆ-వె. ...కం। సాలజాతివాఁడు చాలఁ గీడు. (భోజరా. ౫ ఆ 3౨౨ ప)' "కంసాలి - వి.(క. కంసాళిక) స్వర్ణకారుఁడు. సీ. స్వర్ణకారాభిధ పరఁగు బారసి యగసాలి సొన్నారి కంసాలి యనఁగ. (ఆం. భా-౨ ఆ ౨౮౭" సూ-రా-ని) (విస్తర) భారతాది ప్రాచీనగ్రంథములలో 'కంసాల - కంసాలి' అనురీతి ప్రయోగ ములు లేవు. అనంతామాత్యుని పై భోజరాజీయపద్యమున సీ. ఆ - వె. వారు నల్ల చేసి వచ్చి రట్లగుటఁ గం। సాలజాతివాఁడు చాలఁ గీడు" అనుచోట సీ ... ఆ-వె. వారు నల్ల చేసి వచ్చి రట్లుగఁ గమ। సాలజాతివాఁడు చాలఁ గీడు" (భోజరా. ౫ఆ. 3౨౨ ప) అని కవిప్రయుక్తపాఠమైయుండు ననఁదగును. ఇంక నాంధ్రభాషార్ణవము

---

విస్తర - ౫౦ - విష:—"కమ్మరి ...గీ. సరగ మిన్నుకమ్మరి సంజకొలిమిఁ - బెట్టుగాఁ గాఁచి బంగారుచుట్టువాలు। పదను వెట్టఁగ......" (యయా. ౨ ఆ. ౬౮ ప. సూ. రా. ని) ఇట్టి ప్రయోగములనుబట్టి "కమ్మరము - కమ్మరి" మున్నగునవి యినుపపని చేయు లోహకారుని సంబంధించినవేకాక స్వర్ణకారుని సంబంధించు నవియు ననఁదగును.

సవ్యసోక్షము ఘటచేత నందు వ్యావహారికపదములు పెక్కు గ్రహింపఁబడినవి. కాన కొంపఱి శబ్దముల గ్రాంథికతావిషయమున మహాకవిప్రయోగప్రామాణ్యము నరయ వలసియుండును.

| | |
|---|---|
| | సంస్కృతసమేతరములయిన తెలుఁగుశబ్దములయందుఁ |
| బాలవ్యాకరణ | బరుషసరళములకు ముందే బిందువు కానంబడు |
| వివృతి | చున్నది. ౧౮. |
| ౨౦ I విష. | సంకర - కలఁకువ - మంచు - త్రాఁచు-దంట - దాఁటు - |
| | కొంత - కోఁత. ఇత్యాదు లూహ్యంబులు. |

సంజీ. ౨౦ I - విష :—కలఁకువ= క్షోభము= కలఁత. త్రాఁచు= సర్పము.

అచ్చతెలుంగున ఖండపూర్ణములలో నేదియున్నను బరుషసరళములకుఁ బూర్వమందే యుండునని యర్థము. కానఁ బరుషసరళములకెల్లఁ బూర్వమున బిందువుండకతీరదని తలఁపరాదు. ఉదా: కడచు - ఎఱుక మొదలగువానిలో బిందువుండదు.

సంజీ. ౨౧ విష :—ఈ ౧౮ సూత్రమునైతము ప్రత్యేకముగఁ జెప్పఁబడిన విశేషవిధులను బాధింపనేరదు. ఉ. వచ్చెంధాత్రీపతి (బా. సంధి. ౧౮ సూ). "త్రిశంకవోపాఖ్యానములోని కవిసింగరన్న ప్రయోగము:—క. డుంఠిశు భైరవుని శితి। కంటు విశాలాక్షి దండకరు జాహ్నవి వై। కుంతపతి గుహుని లోలా। ర్కుం శేపలు మీఱఁ భూవరుఁడు గనుఁగొనియెన్." (అప్పక. ౨ ఆ. ౧౨౪) (౨౨ విష. సంజీ) "తే-గీ. ధాంధమితభేరికాధ్వానముం ధులీని। నాదమును......(అథర్వణాచార్యులవిరాటపర్వము). తే-గీ......ఊఁది ప్రాస। బంధ మగుఁ గృష్ణుఁడుదయించినం ధరిత్రి॥" (అప్పక. ౨ ఆ. ౧౨౭-౧౨౮). ఇట్టిప్రయోగము భారతమునఁ గన్పట్టలేదు. కాని లుగ్వా ద్రుతప్రకృతికా దిత్యాది (౮౧ - విష) చింతామణి సూత్రము నాధారముగఁ గొని సూరి యిట్టిప్రయోగముల కనుకూలముగ వర్గయుక్సరళేత్యాది (బా. సంధి. ౧౯సూ) సూత్రమును రచించెను. (౮౨ II విష. విస్తర).

సంజీ. ౨౨ విష :—ప్రకృతమగు ౧౮ సూత్రమునయితము ఖండానుస్వారస్థితిని గ్రహించుటలోఁ గొంత సౌకర్యము నొదవించును. రూపసాధన ప్రక్రియా విషయమునందును నీసూత్రమున కుపయోగముగలదు. "పండ్లు - కాండ్లిత్యాదులందు డాకు ళాదేశము కొందఱు వక్కాణించిరి. తెనుఁగున బిందుపూర్వకస్థిరము

లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు." (బా - అచ్చి. ౧౫ సూ) అని సూరిగారే వివరించిరి. ఇట్లిస్థలమున బిందుపరకత్వమున స్థిరవర్ణాదేశము వారింపఁబడెను. మఱికొన్ని యెడల స్థిరవర్ణాదేశము వచ్చుటచే నచటి బిందువు ప్రకృతసూత్రానుకూలముగ లోపించుటయు సంభవించును. ఉదా: వేసఁగి = వేసవి. పోఁడిమి = పోడిమి. (౨౦౧ విష) (బా. అచ్చి. ౨౭ ప్రకీ. ౧౩ సూ).

అద్యః క్రియాసు భూతా । ర్థద్యోతిన మాద్యగం
వినా సర్వః।యశ్రుతి మార్యా లఘుయం । ప్రవదన్తి
ప్రాణకేః పరం ప్రాణమ్॥ (అం. చిం. సంజ్ఞా. ౧౦ కా.
అహో. ౧౫౦ పు.)

భావిక్రియాసు యస్య స్యా । దేత్వ మేవ ప్రయోగ
తః । డోలా భూషోత్తరిద్యేషు । వినైత్వం నాస్తి
మధ్యమే॥(వికృ. సంజ్ఞా. ౨౩ కా. అహో. ౧౫౩ పు.)

నన్నయాథర్వణీయము. ౫౩ విష.

ఆద్యవర్ణాస్తు హాత్వేన । న గృహ్యన్తే కదాపిచ ।
ప్రాణాత్ ప్రాణో లఘు ర్యః స్యాత్ ।స హాల్చ్ఛచ్చ
క్వచి ద్భవేత్ । చే ద్యత్వం తస్య కల్ప్యం స్యా । ద్వికృ
త్యాదౌ భవేన్న ణః ॥(వికృ. సంజ్ఞా. ౨౮ కా. అహో
౧౫౫-౧౫౭ పు.) సర్వత్రా౽జ్వ త్కార్యం।జ్ఞేయం
యస్య ద్రుతప్రకృతికేభ్యః।లుక్ సంశ్లేషౌ నా౽చి॥...
(అం. చిం. సంధి. ౯ కారి. అహో. ౨౧౬ పుట.)
వికృత్యాదిగతో యో ౽త్ర।స్యా చ్ఛబ్దాన్తరయోగ
తః।ప్రాణమాత్రావశేషః స్యా । దితి శ్రీకవిస మ్మతేః॥
(వికృ. సంజ్ఞా. ౨౨ కారి. అహో. ౧౫౨ పు.)

కల్ప - ౫౩ విష:—అద్య ఇత్యాది - క్రియాసు = క్రియాపదము లందు, భూతార్థద్యోతినమ్ = భూతార్థమును దెల్పునట్టి, (చనియెన్ - పోయెన్ - మొ.) స్థలములలోని యకారమును, ఆద్యగమ్=పదాదిగతయకారమును, వినా=వినాగా, సర్వః యః=తెనుఁగునందలి సమస్తమైన యకారమును, అత్=అకారయుక్తమైయుండును. (అద్ధన్త్య ఇత్యాది సూత్రమునందును నిల్లె 'అత్' అనుదాని కకారవంత మనునర్థము వాడఁబడెను. ౩౧ విష.కల్ప.) యశ్రుతిమ్=యకారోచ్చారణము గల, ప్రాణకేః పరం ప్రాణమ్=స్వరముకంటెఁ బరమైనస్వరమును, ఆర్యాః=వైయాకరణులు, లఘుయమ్ = లఘుయకారమునుగా, ప్రవదన్తి=చెప్పుచున్నారు. ఉదా:

మా+అష్ట = మాయష్ట-మొ. భావిక్రియా స్వీత్యాదిః-భావిక్రియాసు = చనియెడ మున్నగు భవిష్యదర్థబోధక తద్ధర్మాద్యర్థక క్రియాపదములందును, యస్య=యకారమునకు, ఏత్వమేవ=ఎకారమే - (హ్రస్వవక్రము సంస్కృతమున లేమింజేసి "ఏత్వ" మని చెప్పఁబడినను నిట హ్రస్వవక్రమనియె దానియర్థము. "ఏదంతతాచ నామ్నా మస్యతస్యా మియాన్తానామ్)" ప్రయోగతః = కవిప్రయోగ ప్రామాణ్యమున గ్రహింపనగును. డోలా భూషోత్తరీయేషు వినా=డోలార్థకమగు 'ఉయ్యెల' శబ్దము నందును, భూషణరూప రక్షాబంధనార్థకమగు "తాయెతు" శబ్దమునందును, నుత్తరీయార్థకమగు 'పయ్యెద' శబ్దమునందును, దప్పి, మధ్యమే = పదమధ్యమందును, ఏత్వమ్=ఎకారయుక్తయకారము, నాస్తి = లేదు. చింతామణిలోని పూర్వశ్లోకమగు (సంజ్ఞా. ౫ కారి.) లఘువో ఒలఘువ శ్చేతీత్యాది కారికలో నంతస్థముల లఘ్వలఘుతల ప్రసంగ మారబ్ధమగుటంజేసి యనంతరకారికయగు నద్యఃక్రియా స్వీత్యాది ప్రకృతసూత్రమున లఘుయకారస్వరూపము వచింపఁబడెను. "అన్యేన్యవ్యాకరణ స్పష్టా" ఇత్యాది పూర్వకారికచొప్పున రేఫమునకే కాక యకారమునకును లఘ్వలఘుతలు విశదీకరింపఁబడెను. లకార వకారముల లఘ్వలఘుతలను నన్నయాథర్వణులు వచింపలేదు. (౫౨ విష.)

ఆద్యవర్ణాస్త్వీత్యాదిః—ప్రాణాత్ = స్వరముకంటెఁ బరమైన, ప్రాణః = స్వరము, లఘు ర్యః స్యాత్ = లఘుయకారవంత మగును. సః=అట్టి లఘుయకారయుతస్వరము, క్వచిత్ = ఒకానొకప్పు డనఁగా శ్లేషానుకూలం దనిభావము. అచ్చు = అచ్చును, హల్చు=హల్లును, నగును. ఉదా:—ఆ యతివ సుశోభనాకృతి=ఆ+అతివ, సుశోభనాకృతి; ఆ+యతి - వసుశోభనాకృతి. మొ. ఇట్లుగ, యత్వమ్ = యకారవత్త్వము, కల్ప్యం స్యా చ్చేత్ =ఆగమముగాఁ జేర్పవలసివచ్చినయెడల, ఆ ద్యవర్ణాస్తు=(ఆది+అవర్ణా స్తు) పదాదిగతములగు 'అ—ఆ' అనువర్ణములు, హ త్త్వేన న గృహ్యన్తే=అకారయుక్త పదాదిగత యకారములుగ ననఁగా నలఘుయకారములుగ గ్రహింపఁబడవు. "యేమి" మున్నగుచోటులం దన్నో పదాదిని హల్లగు నలఘుయకారము గలదనియె చెప్పనగు ననితాత్పర్యము.

ప్రసక్తానుప్రసక్తముగా నిట్లు నన్నయాథర్వణులు పయిరీతిని జెప్పినను నీసందర్భమున నేయే యచ్చులతో నెప్పుడెప్పుడు యకారము గూడియుండునో యనువిషయము నుపదేశించుట వారిహృదయము కాదనియు నిటఁ బ్రయోజనాంతరము గలదనియు గ్రహింపవలయును. తాలవ్యయకారమును గంఠతాలవ్యమగు 'ఏ' వర్ణముతోఁ బల్కుట భ్రమాపాదక మగుటచే నద్దానిని గంఠ్యమగు

‘అ’ వర్ణముతో “(పోయెదను,) పోయదను, (ఆయెను) - ఆయను, (కనియెద,) కని యద” అనురీతిని వ్యవహారమునఁ బల్కుచుండుట విస్తరించి యుండుటంజేసి యట్టి యెడల ‘ఎత్వఘటిత’ యకారరూపము సాధువనియు ‘అ’ త్వఘటితయకారరూప మపభ్రష్ట మనియు నెత్వాత్వ సందేహనిర్ణాయకముగాఁ బయిరీతిని వెనుకటి చ జల దంత్యతాలవ్యతల సందర్భమునందు వలె (౩౧ విష. విస్తర. II) నన్నయాథర్వ ణులు ప్రసంగించిరని యెఱుంగనగును. ఇట్లు కానిచోఁ బదాదిగతయకారములును భూతతద్ధర్మార్థకక్రియాపదస్థిత యకారములును నుయ్యేలాదిశబ్దత్రితయగత యకార ములును మాత్రమె “ఎ” వర్ణయుక్తములనియుఁ దక్కిన యాచ్ఛికశబ్దప్రపంచము నందలి యకారములెల్ల ‘అవర్ణ’యుక్తములె యనియు వారు వచించిరన్నచో “చెయిది - చెద్ది - చేయుట - పోయుట - చేయి - చెయువు” మున్నగుశబ్దజాలము లోని ‘అ’ వర్ణేతరస్వరయుక్తములగు యకారములెల్ల నసాధువులె కావలసి వచ్చునుగదా.

అవర్ణయుక్త సహజయకార మనఁగా నలఘు యకారము పదాది నుండదను ప్రసంగము రాఁగా ద్వితీయప్రకృతిరూప ప్రాకృతభాషలలోఁ బదాదిని బ్రసిద్ధమై యున్న ణకార మచ్చతెలుఁగుపదములలో నారీతిగఁ బదాదిని నిల్వనేరదని యథర్వ ణుఁడు వివరించుచున్నాఁడు. వికృత్యాదౌ=అచ్చతెల్గుపదముల మొదట, ణః=ణకా రము, నభవేత్ = ఉండనేరదు. “ఆదేస్తు వా (౧ - ౩ - ౪౩) న ఇత్యనువర్తతే. ఆదే ర్నకారస్య ణో వాస్యాత్. నరః=ణరో, నతః = ణఓ, నదీ=ణఈ. (షడ్భా. - ౪౪ వు).

సర్వత్రాజ్వదిత్యాది-అద్య ఇత్యాదికారికలోఁ బదాదిని “యెవఁడు-యేలు” మున్నగురీతిని యకారముండునని చింతామణికర్త యంగీకరించినవాఁ డగుటచే సంధుల లో “వచ్చె న్యెప్పుడు-వారుయెవరు” మొదలగు ననిష్టరూపములు పుట్టవలసివచ్చు నని శంకించుకొని “సర్వత్రే త్యాదికారికచే వారించుచున్నాఁడు. ద్రుతప్రకృతికేభ్యః= ద్రుతప్రకృతికములకంటెఁ బరముగా, అచి = అచ్చుపరమగునపుడు, లుక్-సంశ్లేషౌ= ద్రుతమునకు లోపసంశ్లేషములు, న = కానేరవు. కావున స్వరసదృశమగు పదాది యకారము పరమగునపుడును ద్రుతలోపసంశ్లేషములు కలుగనేరవని ఫలితార్థము. సంశ్లేష మనఁగా వ్యంజన నకారరూపద్రుతము పూర్వాచ్చు నత్తియుండుట యని నన్నయాథర్వణ సిద్ధాంతము. (౮౦ విష.) (చిం-వి-ప - ౧౩౧. ౧౩౨ విష.) కావున “లుక్-సంశ్లేషౌ నాచి” అనఁగా ‘వచ్చెన్+అతఁడు’ మున్నగుచోటులందు ద్రుతము పూర్వాచ్చు నత్తియుండక పరాచ్చుతోఁగూడి ‘వచ్చెనతఁడు’ అనురూపము నొంద

ంచునని యెఱుఁగునది. ద్రుతము పరహల్లుతోఁ గూడికొనుట సంశ్లేషమనిపించు గాన తనుస్వసిద్ధాంతము నందలి సంశ్లేషనిషేధమె తెలుపుచున్నది.

ఇన్ని "పద్యార్ధావసానేషు । శ్లిష్టతా నస్య కథ్యతే" (వికృ. సంధి ౧౯ కా.) ఈ వికృతికారికయుఁ గంబాదిపద్యావసానమున ద్రుతమునకు "కం. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్" అనురీతి సంశ్లేషము కల్గునని చెప్పుచుండుటచేత నథర్వణునకుఁ బయినన్నయసిద్ధాంతము సమ్మతమెయని స్పష్టపడుచున్నది. (౪౦. I విష.) (విస్తర I.) వికృత్యాదిత్యాది:—అత్ర=ఈ తెనుఁగుభాషయందు వికృత్యాదిగతః యః = అచ్చతెనుఁగుశబ్దములు మొదటనుండు 'యొసఁడు' మున్నగుశబ్దముల లోని యకారము, శబ్దాంతరయోగతః = శబ్దాంతరములతో సంధించునపుడు, ప్రాణమాత్రావశేషః స్యాదితి = అట్టియకారము లోపించి దానిమీఁది స్వరము

---

విస్తర I ౪౩ విష:—"సంశ్లేష మనఁగా మీఁదిహల్లుతో ద్రుతముకూడికొనుట" (నాగా. గాణ. సంధి. ౧౬ ప. ౧౨౦ కారి. వివ.) అను గాణపతవివరణము నన్నయాథర్వణసిద్ధాంతవిరుద్ధ మని పయిసందర్భముచే విశదపడుచున్నది. ఈవివరణ కర్త తాఁ జెప్పెడి సంశ్లేషలక్షణమునకు విరుద్ధముగా ద్రుతద్విత్వస్థలములలో నీసంశ్లేషశబ్దము నుపయోగించుటయుఁ గలదు. "ద్రుతద్విత్వరూపసంశ్లేషము". (గాణ. సంధి. ౧౯ ప. ౧౧౮ కారి. వివ.) "సర్వము న్నతని ఇత్యాదికమున వ్యవహరింపఁబడుటనుబట్టి ద్రుతసంశ్లేషము......". (గాణ. సంధి. ౧౩ ప. ౧౧౭ కా. వివ.) ద్రుతము పూర్వాచ్చు నత్తియుండునపుడే యట్టి పూర్వాచ్చునకుఁగల యూనికకు భంగము లేకుండఁగను, "లుక్సంశ్లేషౌ నాఽచి" అను నియమమునకు భంగము లేకుండఁగను నచటి ద్రుతమునకుఁ గొన్నియెడల స్వరపరకత్వమున ద్విత్వము కల్గును. (౪౭ I. విష. కల్ప.) ఈవాడుకయందు నాచెప్పిన సంశ్లేషలక్షణము గోచరింపక తీరదు. "అన్నిష్టసఖిత్యాదులు ద్రుతసంశ్లిష్టరూపములు (చూ. ౩౭ సూ.) గావు. అథర్వణునకుమాత్ర మిట్టి సంశ్లేషరూపములు సమ్మతములె." (గాణ. సంధి. ౧౯ ప. ౧౧౮ కా. వివ.) ఈవ్రాఁతలో మఱొకపొరపాటు కన్పట్టుచున్నది. "అన్నిష్టసఖి" అనుచోటి నకార మావయవికము గాన నది ద్రుతసంశ్లిష్టరూప మనిపించుకొనదని యీతని యాశయము. "అపిశబ్దార్థస్యైతః" అను చింతామణిసూత్రము చొప్పున "ఏని" శబ్దైకారమునకు లోపము గల్గుటయు మిగిలిన యావయవిక నకారమునకు ద్రుతకార్యములగు లోపాదులు గల్గుటయు నరయునపుడు నన్నయమతమున నావయవిక నకారమునకును ద్రుతత్వము సమ్మతమె యనకతీరదు. (విస్తర. ౯౯ విష.)—

మాత్రమె నిల్చునని, శ్రీకవిసమ్మతేః = నన్నయభట్టారకుని సమ్మతినిబట్టి, లేదా మహాకవి ప్రయోగసమ్మతినిబట్టి తెలియనగును. "ద్రుతప్రకృతికేభ్యః లుక్ సంశ్లేషౌనాచి" అనుదానినిబట్టి పదాదియకారాజ్య్వద్భావము ద్రుతప్రకృతికములతో సంధించునపుడే కాక "వాఁడుయెవఁడు" మున్నగు నెల్లసంధులందును బాటింపవలయునని యథర్వణుని వివరణమున కభిప్రాయము.

పయిరీతిని నన్నయాథర్వణు లిద్దఱును బదాదియకారసంధి ప్రక్రియను వివరించియుండుటంజేసి పదాదియకారమును నిషేధించు "అద్యః క్రియాసు భూతాద్యర్థసముద్ద్యోతినం వినా సర్వః" "వికృతిపదాదౌ ప్రథమాన్తస్థ తృతీయానునాసికౌ న స్తః" అనునప్పకవీయచింతామణి పాఠములు ప్రక్షిప్తము లనియెఱుంగునది. "వికృత్యాదౌ భవే న్న ణః" అనియు "భావిక్రియాసు యస్య స్యాదేత్వమేవ ప్రయోగతః" అనియు నథర్వణుఁడు చేసినసవరణములనుబట్టి తృతీయానునాసికము పదాదినుండదని చింతామణి చెప్పుటయు భూతాద్యర్థేత్యాదిపాఠములోని యాదిశబ్దముచే భావిక్రియలు గ్రహింపఁబడునని చింతామణి తలంచె ననుటయుఁ గేవలము నసంభవము లగుటచే నట్టిపాఠములు ప్రక్షిప్తములనుటకు సందేహము లేదు. (విస్తర II)

---

విస్తర II ౫౩ విష:—ఆంధ్రభాషాచరిత్రకర్తగారు పయిరీతిని సమన్వయించికొనక తాము ప్రతిజ్ఞచేసిన "దానియందలి.....సూత్రరచనయందును భాషయందును ననేకములగు లోపములున్నవి" (ఆం. భా. చ. ౧౫౩ పు. ౭), అను వాక్యములకు గుఱిగ "అద్యఃక్రియాస్విత్యాదిసూత్రమునకు నేడియో సమన్వయముచేయుట, మరలుట, మున్నగురీతిని జర్చనడపి తుదికి" ఆద్యగమ్మనుపాఠమును విడిచికొని "భూతాద్యర్థసముద్యోతిన"మ్మను నప్పకవిప్రక్షిప్తపాఠము నంగీకరించిరి. ఈపక్షమున "సర్వత్రాజ్వదిత్యాదికారిక విరోధించునని స్మరింపనైన లేదు. అట్లని దానిని జూడలేదనరాదు. చింతామణిని బరిహసించుటకై వెనుకటిపుటలోనె (౧౫౭ - ౮) 'వాఁడెముఁడు' మున్నగు ననిష్టరూపముల యుత్పత్తికయి యాసూత్రమును స్మరించి దానిని జింతామణిలోనిదానినిగ నంగీకరించియున్నారు. సంధి. 3౫సూత్రముఁగ నద్దానిని జింతామణిలోనిల్పి దానికి వ్యాఖ్యయుఁ జేసిరి. ఆవఱకు మనసుతీర నిరసించియుండుటచేఁ దృప్తినంది కావలయు నద్దానివ్యాఖ్యలో 'వాఁడెముఁడు' మున్నగు శంకలకుఁ జోటిచ్చి నిరాకరింపలేదు. (ఆం. భా. చ. ౧౫౭ పుట. ఆం. - చిం. సంజ్ఞా. ౨౭సూ. వ్యా.)

పయిరీతి నథర్వణుఁడు పదాదియకారసంధి ప్రక్రియను వివరించెనని యంగీకరించి యుదాహరించియు నహోబలపతి "ఆద్యవర్ణాస్తు హాల్త్వేన (ఆద్యవర్ణాస్తు = పదాదియకారము లని యహోబలవ్యాఖ్య)న గృహ్యన్తే కదాపిచే త్యథర్వణాచార్యస్య స్వసిద్ధాన్తవచనాచ్చ. తస్మా దప్పకవిపుస్తకపాఠఏవ ('భూతాద్యర్థ సముద్ధో్య్యమే' అను పాఠము) సాధు రితి ప్రతిభాతి. సర్వత్రాజ్యాదిత్యాది సూత్రం తు తత్పుస్తకే న దృశ్యతఏవ. తేన 'ఏవ్వఁడు' ఇత్యాదౌ యత్వ మాదౌ న పండితహృదయంగమమ్" (అహో. ౧౫౫ పు.) అని కవిశిరోభూషణమున వ్రాయుట కేవలము పొరపాటు. "ఆద్యవర్ణాస్త్వి" త్యాదికారిక కహోబలపతి చేసిన "పదము మొదటివర్ణము లెన్నఁడును హల్లులు కావు" అను నర్థము ననుసరించి యతోధిక ప్రమాదముగ గాణపతవివరణకర్త వ్రాసిన యీక్రిందివివరణమును బరాస్తమగుచున్నది. "మొదటిలిపులని సామాన్యముగాఁ జెప్పుటచేత యకారవిషయముననే కాక యచ్చులై యుండి హల్ శ్రుతిగల వువూవోవోల విషయమునఁగూడ నీయది ప్రవర్తించునని గ్రహించునది" "ద్వితీయాచార్యులు......ఎవఁడు అనియె లిఖింపవలెనని శాసించెను" (గాణ. సంజ్ఞా. ౮౩ ప. ౭౭ కారి. వివ.)

అప్పకవీయముద్రణములందును దాళపత్త్రమాతృకలందును సర్వత్రే త్యాది చింతామణికారికయు దాని కప్పకవిచేసిన వివరణపద్యములును వెలయుచునే యున్నవి.

పయిని వివరించిన విరోధమును గనిపెట్టి ప్రక్షిప్తపాఠకర్తలు "సర్వత్రే త్యాది" కారికను దొలఁగించిన యప్పకవీయమాతృక యహోబలపండితునకు లభించెనో? లేక యహోబలపతియే యాకారిక లేదని సాహసముతో వ్రాసెనో? తెలియకున్నది.

బాలవ్యాకరణ వివరణము. ౫౩ I విషయము.

యకారంబును వు-వూ-వో-వో-లును దెలుఁగుమాటలకు మొదట లేవు. ౧౭. ఎవఁడు-ఎక్కడ - ఏమి-ఏల-ఉండ-ఊరు ఒకఁడు-ఓడ - హరియతఁడు-నిద్రవోరు నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకారవకారంబులుగాని పూర్వసిద్ధంబులు గావు. వోఢృ వోఢవ్యశబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వు-వూ-వో-వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది. ఉదకము-ఊర్మిక-ఓదనము.

సంజీవని - ౫౩ I విష:—వోఢ = వహించువాఁడు, వోఢవ్య = వహింపఁదగినది, ఊర్మిక=ఉంగరము, ఓదనము=అన్నము. "సంస్కృతసమంబులందు సహితము వృ-వౄ-వొ-వో" అను నేఁటిముద్రణములు ప్రామాదికములు, ప్రక్షిప్తములును. బాలవ్యాకరణ ప్రథమముద్రణమునందును దర్వాతి కొన్ని ముద్రణములందును "వొ" అనునది లేదు. సంస్కృతమున "ఒ" అనెడి హ్రస్వస్వరమె లేకుండుటం జేసి తత్సహితవకారము లేదనుట యసంగతము. (విస్తర.)

సంజీ. ౫౩ II విష:—అప్పకవీయములోని చింతామణి ప్రక్షిప్తపాఠములె యుక్తములని యహోబలపండితుఁ డభిప్రాయపడుటచేతను, (అహో. ౫౫ పు.) సూరి చింతామణిని గ్రహించుటలో నహోబలపండితీయమునె కేవలముగా ననుసరించుచు వచ్చుటచేతను నప్పకవీయప్రక్షిప్తపాఠముల యర్థమె బాలవ్యాకరణమున వివరింపఁబడెను. కాన నట్టి "వికృతిపదాదౌ ప్రథమాస్తస్థ (య) తృతీయాను నాసికౌ(ణ) న స్తఃక్వచిదపి న స్త ఉదోతౌ, దన్త్యోష్ఠభవస్య (వృ వౄ వొ వో) వికృతి శబ్దాదౌ" (అప్ప. ౨ ఆ. ౬౮-౨౨౦ ప.) అనెడి యప్పకవీయకారికయె ప్రకృత బాలవ్యాకరణ సూత్రమునకు మూలమని యెన్నవగును. ఈ యప్పకవీయపాఠము ప్రక్షిప్తమనియుఁ జింతామణిసమ్మతము కాకుండుటచే గ్రాహ్యము కాదనియుఁ (౫౩ విష.) గల్పతరువులో విశదీకరింపఁబడెను. (చిం. వి. ప. ౧౧౫ మొ. ౧౨౮ వ. విష.) (వై. పా. ౫౦౩ మొ. ౫౨౦ వ. విష.)

---

విస్తర ౫౩ I విష:—పేటికావ్యాఖ్యాత సయితము సంస్కృతసమంబులం ద్విత్వాదివాక్యములోని 'వొ' అనుదానిని దొలఁగింపలేదు. వ్యాఖ్యలో రెండు చోట్ల 'వొ' అను దాని నట సూరి నిల్పినట్లె వ్రాసెను. (బా. సా. వే. సంజ్ఞా. ౧౭ సూ. వ్యా. ౨౫-౨౬పు.) వోఢృ - వోఢవ్యశబ్దములె కాక వోకారము పదాదినిగల మఱికొన్ని సంస్కృతపదములు వోళికా......మున్నగునవి గలవని గుప్తార్థప్రకాశికా పేటికా వ్యాఖ్యాతలు చూపిరి. అట్టివి తెలుఁగున నప్రయుక్తము లగుటంజేసి విరళానిత్యాది కారికచొప్పున (౧ IX - విష.) నుపేక్ష్యములని సూరి విడిచియుండును. అట్లు సంస్కృతకోశములనుండియెత్తివ్రాసినపుడు వోకారాదిశబ్దములే యుండిపోయినవని చూపనేల? వృ వౄ లాదినిగలవి సయితము కోశములందు లేకపోలేదు. "వృకః - పుం. బకపాదపే. శివమల్ల్యామ్......(శబ్దా. చిం.) వృగయోగే - వృజ్ఞతి - వృట హింసాయమ్. వృణ్టయతి - (శబ్దస్తో) మున్నగువానిని నాయాధాతువుల క్విబన్త రూపములను నేల చూపరాదు?

ఆంధ్రశబ్దచింతామణి యాంధ్రకావ్యవాఙ్మయారంభకాలమునాఁటి దగుటచే నందాంధ్రప్రపంచమునందలి పండితవ్యవహారభాషనుండి సాధువులని తనకుఁ దోఁచు శబ్దములను గ్రహించుట చింతామణికర్తకుఁ గర్తవ్యమయ్యెను. పండితవ్యవహారభాషనుండి సాధుశబ్దములను గ్రహించుటయందును వానిని గావ్యోపయోగ్యములుగఁ జక్కఁజేసి కావ్యములం దుపయోగించుటయందును బండితకవీంద్రాంధ్రవైయాకరణులుమాత్రమె యధికారులనుట భాషాశాస్త్రసిద్ధాంతము గదా. అట్లగుటంజేసి చింతామణికర్త తననాఁటికిఁ బండితవ్యవహారమున నున్న "యెవఁడు-యేఁబు" మున్నగు పదాదియకారఘటితరూపములను సాధువులుగ నెన్నుకొనెననుట యుక్తము. "తొలుతఁ బదాదిని యకారము నంగీకరించి సంధికాలమున దానికి లోపమును జెప్పికొనుటకన్న నట నచ్చునే యంగీకరించుటలోఁ బ్రక్రియాలాఘవ ముండుననుట సత్యమెయైనను, శబ్దసహజమై పండితవ్యవహారస్థమై యున్న యకారము లేదనుట యుక్తముకాదని భట్టారకుఁడు తలంచి యుండును. "(తె) యెవరు=యేరు, (తమి) యారు-(కన్న) ఆర్; (తె) యేనుఁగు-(తమి) యానై-(కన్న) ఆనై; (తె)-యేబు-(తమి) యాబు (కన్న) ఆబు." అని యిట్లే పదాదియకారమును దానివికృతులును బ్రాచీనద్రావిడభాషలలోఁ గన్పట్టుచుండుటంజేసి యీపదాదియకార మపభ్రష్టమై యేర్పడినదికాదనియు శబ్దములలో సహజమై యున్నదనియుఁ జెప్పుటకు సందేహము లేదు. అట్లయినను నప్పకవ్యహోబలపత్యాదులు "తదభావేపి బాధకాభావేన తదపేక్షయా ఽతికల్పనాగౌరవస్యా ఽనుచితత్వాత్" (అహో. ౧౫౫ పు.) అనియిట్లు చర్చించుచు "వుండ-వూరు-వాకఁడు-వోడ" మున్నగుచోటులందలి పదాది వకారమువలెనె "యెవరు" మున్నగువానిలోని పదాదియకారమును నపభ్రష్టమెయని సిద్ధాంతీకరించుటచే సూరియు నట్లె వివరించెను. కాని యిట యవలకుఁ జాలభేదము గలదు. "తండ్రియెవరు" మున్నగు కొన్నిచోటులందైనఁ బదాదియకారమునకు నేఁటికిని గవిప్రయోగములందును స్థితి గలదు. వూరుప్రభృతులలోని వకారమున కెన్నఁడును నెచ్చటను గ్రాంథికభాషలో స్థితి లేదు. ఇంకను "ఆవూరు" మున్నగుచోటులందలి వకారముపోయి యచట "ఆయూరు" మున్నగురీతిని యకారము నిల్చుచున్నది. ప్రాచీనద్రావిడభాషలలోనయిత మిట్టి వకారమునకు స్థితి లేదు. ఉ. (తె) ఊరు. (తమి) ఊర్.

ఈయుసందర్భమునుబట్టి కల్పతరువులో వ్రాయఁబడినరీతిని "సర్వత్రాప్యకార్య మితి సూత్రంతు తత్పుస్తకే న దృశ్యతఏవ" (అహో. ౧౫౫ పు.) అను నహోబలపతి వాక్యము సత్యవిదూరమనియు నక్కారిక చింతామణికర్తృకృతమె

యనియు గ్రహింపవలెను. అప్పకవి తనపద్ధతికి విరోధములేకుండ నక్కారిక నాంధ్రీకరించిన పద్యము లప్పకవీయతాళపత్త్రమాతృకలందును ముద్రణములందును వెలయుచునే యున్నవి. (విస్తర.)

---

విస్తర ౫౩ II విష:—"అవి (సర్వత్రాజ్వా దిత్యాది కారికావివరణ పద్యములు) పదాదియకారము నంగీకరింపని యప్పకవిప్రణాళికకు విరుద్ధములగుటఁ దరువాతివారు తెలియక దూర్చిన ప్రక్షిప్తపద్యములని విశ్వసింపనగును" (బా. సా. పే. సంజ్ఞా. ౧౭ సూ.) అనిపేటికావ్యాఖ్యాత వ్రాసెను. అట్టికారిక లేని యప్పకవీయతాళపత్త్రమాతృకను జూపలేదుగదా యీయూహ కాధార మేమున్నది? "వికృత్యాదిగతో యోఽత్రేత్యా ద్యథర్వణకారికనుబట్టి యథర్వణుని నాఁటికే సర్వత్రాజ్వాదిత్యాది కారిక చింతామణిలోనుండెననక తీరదుగదా. మఱియు నాపద్యము లప్పకవిప్రణాళికకు విరుద్ధములుగ నుండలేదు. సర్వత్రాజ్వాదిత్యాదికారిక వ్యవహారస్థపదాదియకారపరమని సమన్వయించి తనపద్ధతికి బాధలేకుండ నప్పకవి జాగ్రత్త పడుటకు యత్నించెనని యాతని యావివరణపద్యములె విశదపఱుచుచున్నవి. ఉ. ఆరయ వైకృతోక్తులఁ బదాదులయందు యకారముండఁబా | తీరునఁ బల్కువ్రాయి గణుతింపఁగ నచ్చుగు దానిడాఁపలన్ | నీరజనాభ నాంతములు నిల్చిన నచ్చుటఁ బ్రాణసంధి చె | న్నారు నితండు వైద్యవసుధాధిపు నే పడఁగించె నేఁడనన్ (అప్ప - ౫ ఆ ౪౦ ప) కం || శృంగాంత్యవక్రయుగముల | సాంగత్యము వాకు నాంధ్రసంస్కృతముల నా | దిం గలుగ దట్టివాౙ్రి ధ | రం గలయు ద్రుతాంతములను బ్రాణములట్లన్ || (అప్ప - ౫ ఆ - ౪౨) క. ముంగాముదువులు నాలుగు | నుంగరములు... (అప్ప - ౫ ఆ - ౪౩ ప) వుంగరములు మున్నగువాని సాహచర్యమునను "పల్కువ్రాయి" అనువాక్యమునను వ్యవహారగతపదాది యకారమునుగూర్చియే యప్పకవి ప్రసంగించెనుట స్పష్టము. ఈతఁ డిటఁ జూపిన నైపుణిలో నించుక కొఱంతవచ్చెను. అట్టికొఱంత లేకుండ నితఁడు "సర్వత్రాజ్వాదిత్యాదినన్నయాథర్వణ కారికలలోఁ బదాదివకారమునకు నైత మజ్వద్భావమును వకారవ్యంజనలోపమును విధింపఁబడి నట్లు సవరించివేసియున్నచో నీతని యీప్రక్షిప్తపాఠకల్పనాసాహసకృత్య మభేద్యమై సఫలమై యుండెడిది. అట్లు చేయఁజాలమింజేసి యేకబా నన్నయాథర్వణులు కావ్యభాషలోని యకారమునకె యజ్వద్భావమును బ్రసంగించిరనియు వ్యావహారిక శబ్దములలోని యకారమునకుఁగాదనియు నట్లుకానిచో వుంగరము మున్నగు వ్యావహారికశబ్దములలోఁగల పదాదివకారమునకును నజ్వద్భావ వకార వ్యంజన లోపములను నప్పకవి వివరణపద్యములందువలెనె నన్నయాథర్వణులు విధించియుండ

లఘువో లఘువ శ్చేతి, ద్వేధా ఒన్త స్థాన్ విదన్తి
శాస్త్రాకః । అన్యోన్యవ్యాకరణస్పష్టా । ర స్త్వత్ర
[illegible] గృహ్యతే ద్వివిధః (ఆం. చిం. సంజ్ఞా ౯. కారి.
ఆహో. ౧౪౭ పు.)

---

[illegible] సిద్ధపత్యమును బయలుపెట్టుట కవకాశము లభించినది. "క్వచిదపి న [illegible] । వన్త్రోష్ఠభాగస్య వికృతిశబ్దాదౌ" అనియిట్లు పదాదివకారనిషేధమును [illegible] పదాదియకారనిషేధముతో పాటు చేసియున్నయెడలఁ జింతామణికర్త [illegible] వ్యాకరికలో సైతము పదాదియకారమునకుఁ జేసినట్లె పదాదివకార [illegible] లోపములను విధించియుండఁడాయెను ననుపపత్తి దుర్వార [illegible] నప్పకవి యత్నము విఫలమయ్యెను.

యకారాదులు పదాదినుండవని చెప్పినపుడు 'జకారాదులుసైత ముండవని చెప్పనక్కరలేదా' యని తలంచికావలయు ననుశాసనమున "జ ఝ ణ ళ వు వూ వో వో. ఇవి యాంధ్రపదముల మొదట నుండవు" (ఆం. భా. అ. సంజ్ఞా [illegible] సూ.) అని సూత్రింపఁబడెను. పదాదిని య వ ణ లువ్యవహారాదులలో నెచ్చట నైన నుండుట గలదుగానఁ దన్నిషేధమునకుఁ బ్రసక్తిగల్గెనుగాని 'జ ఝ ళ' అను వానికెచ్చటను నునికి యప్రసిద్ధముగాన వీనినిషేధ మప్రసక్తము. కల్పతరువునఁ జూపఁబడినరీతిని బ్రాకృతపదాది ణకారస్థితి సూరకి స్ఫురింపమిం జేసి కావలయు నథర్వణుఁడు నిషేధించియున్నను బదాది ణకారనిషేధమును సూరిసూత్రింపఁడయ్యె.

అర్వాచీనకవులు కొందఱు వ్యావహారికపదములలోని పదాదియకారస్థితికి బ్రామాణికతాపదవిని బ్రసాదించి ప్రయోగించిరి. క. అవ్వనములు దమకుయ్యమై। యవ్వనమునఁ గ్రొవ్వి......(మడికిసింగన్న పద్మపురాణము. ౧ ఆ. ౯౧ ప. బాల. క. ౩౨౨ పు.) ఉ. నవ్వుచుఁ జెక్కు మీటి...... । యవ్వనలక్ష్మికిన్......(అనంతుని భోజరాజీయము. VII. ౧౧౮. బాలకవిశ. ౩౨౨ పు.) (నారా. గాణ. సంజ్ఞా ౮౪ప. ౭౮ కారి.) ఇట్టిప్రయోగములు సన్నయాథర్వణసమ్మతములు కామిం జేసియు భారతాదిప్రాచీనకావ్యప్రయుక్తములైనను గామిం జేసియు సూరి యుపేక్షించి యుండును. లేదా పయిప్రయోగములందు "ఔ" కారపూర్వక వకారమునకును ద్విరుక్తవకారమునకును నుచ్చారణసామ్యమునఁ బ్రాసవిశేషము పయికవులచే నంగీకరింపఁబడి యుండెననుట యుక్తము. యౌవనశబ్దాపభ్రంశ గ్రామ్య యవ్వన శబ్దమును గవులు ప్రయోగించిరని గాణపతవ్యాఖ్యాత వ్రాసెను. మహాకవులు ప్రయోగించిరని యంగీకరించినపిదప వానికి గ్రామ్యతను వచించుట సంప్రదాయ విరుద్ధము.

కల్ప - ౫౭ విష:—శాస్త్రారః=వ్యాకరణ శాస్త్రపండితులు, అన్తస్థాన్=య ర ల వ లను, లఘవః=లఘువులని, అలఘవశ్చేతి=అలఘువులని, రెండువిధములుగా, విదన్తి=గ్రహించుచున్నారు. అన్యే=రేఫేతరములగు య వ ల లు, అన్యవ్యాకరణ స్పష్టాః = సంస్కృతప్రాకృతవ్యాకరణములందును, విశదీకరింపఁబడినవి రః=రేఫము, అత్రతు = ఈతెల్గుభాషయందు మాత్రము, ద్వివిధః = రెండు విధములుగలదై యున్నది. "౧౬౭ సూ. వ్యో ర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య. (౮-3-౧౮) పదాన్తయో ర్వకార యకారయో ర్లఘూచ్చారణౌ వ యౌ వాస్తాంశిపరే. దేవాయిహ - అసావాదిత్యః" (సి - కౌ. స్వాదిసంధి) "యశ్రుతి రః (౧ - 3 - ౧౦) ప్రాయోఽలు గిత్యాదినా కాదీనాంలోపేసతి యోఽవశిష్యతే అవర్ణః సః అవర్ణాత్పరో లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి." (షడ్భా.) అనురీతిని సంస్కృతప్రాకృత వ్యాకరణములలో య వ ల లఘుత్వము ప్రసంగింపఁబడియున్నది. సంస్కృతప్రాకృత వ్యాకరణములం దెచ్చటను లకారపు లఘ్వలఘుతలు వచింపఁబడలేదు. కాని సంస్కృతప్రాకృతములలో లకారమున కుచ్చారణాద్వైవిధ్యము గలదనుట కీక్రిందివి ప్రమాణములగుచున్నవి. "తదుక్తం భోజరాజేన. ర - లయో ర్ల - డయో స్తద్వ। ల్ల - ళయో శ్శ-సయోరపి। వ-బయోః......స్యాదభేదేనకల్పనమ్." (అహో. ౧౩౭ పు. (ఇది నాయొద్దనున్న లిఖితమాతృకపాఠము. ముద్రణములలో "తదుక్తం త్రిభోజనే" అనునపపాఠము వెలసియున్నది.) ఇట్లాంధ్రమున గోళ గరళ వ్యాళాది శబ్దములు కొన్నిటిలోమాత్రమె యలఘులకారము వినఁబడుచున్నది. కర్ణాటమున సంస్కృతశబ్దము లన్నిటియందును నీళకారాదేశము పాక్షికమని చెప్పఁబడియున్నది. "లోళః. (వృత్తి) లకారస్య ళకారాదేశో వా భవతి. జల = జళ, తిలక = తిళక,......" (కర్ణాటశబ్దానుశాసనము. ౧౩౯సూ.) సంస్కృతశిక్షా ప్రాతిశాఖ్యములలో నెచ్చటను నిట్టి యలఘులకార ముపదేశింపఁబడకున్నను ఋగ్వేదప్రాతిశాఖ్యములోని యీక్రిందిసూత్రమునుబట్టి చిరకాలముక్రిందటనే యీధ్వని సంస్కృతమున నంకురించెనని తోఁచుచున్నది. "జిహ్వాగ్రాన్తాభ్యాంచ వచనం లకారే. జిహ్వాగ్రేణ వక్తవ్యలకారః యదాజిహ్వాయాః అన్తాగ్రాభ్యా ముచ్యతే తదా స దోషో భవతి." (ఋగ్వేదప్రా. ౧౮పట. ౨౭సూ.) ఇట్టి దుష్టో చ్చారణమె కాలక్రమమున గోళ గరళ వ్యాళాది శబ్దములలో విస్తరించి యుండు నవియు నదియే మహారాష్ట్ర్యాది ప్రాకృతములలోనికి వచ్చియుండెననియు నట్లగుట చేతనే యట్టి మహారాష్ట్ర్యాదులలోని ళకారమునకు లకారము పైశాచీప్రాకృతమున నీక్రిందిరీతిని విధించికొనవలసెననియు గ్రహింపనగును. "ళోలః. (3. ౨. ౯౭)

[illegible] లకారః స్యాత్. ముకుళ్లో = ముకులో, కోషళ్లో = [illegible]....." షడ్భా. చెన్నపురి విశ్వవిద్యాలయ పుస్తకభాండాగారము [illegible] సంవత్సరమున మైసూరు విద్యాతరంగిణీ ముద్రా [illegible] బొంబాయిగవర్నమెంటు గ్రంథమాలలోని షడ్భాషాచంద్రిక [illegible] "[illegible] పైశాచ్యాం లకారస్య ళకారో భవతి" అనియున్నది. ఈపాఠ [illegible] కాదని సూచించిన వైయాకరణపారిజాతమున సవిస్తరముగఁ జర్చింపఁ [illegible] కారవిధానము లేకయే దానికి లకారవిధానము సంగతముగదా! (వై. పా. [illegible] విష.) ఈయపపాఠమే యప్పకవీయాదుల కెక్కినది.

పయినుదాహరించిన ఋగ్వేదప్రాతిశాఖ్యసూత్రముచొప్పున జిహ్వాగ్రమె [illegible] దాని పార్శ్వమును దంతమూలములకుఁ దాఁకుటచే జనించిన శిథిలస్పర్శోచ్చా [illegible] లఘులకారధ్వనిగఁ బరిణమించె ననఁదగును. నాగరలిపియందిది "ळ" అను లిపితో వ్రాయఁబడుట గలదు. ఇయ్యది ద్రావిడభాషాస్థిత 'గయ్యాళి - కూళ - త్రుళ్ళి' ప్రభృతిశబ్దగత మూర్ధన్యళకారమునకు సన్నిహితముగుటచేత నట్టి ద్రావిడభాషాశబ్దోచ్చారణ సంపర్కమున మూర్ధన్యళకారాఽభిన్నోచ్చారణము గల్గి దానిలిపితోనే తెల్గున వ్రాయఁబడుచున్నది. నన్నయాథర్వణు లీయలఘుల కారమును నలఘువకారమును నిరూపించి యుండలేదు. అట్లయినను "లఘువోఽలఘువ శ్చేతి। ద్వేధాఽ న్తస్థా న్వద న్తి శాస్త్రరః" అనియు, "నాన్యేషాం వైధర్మ్యంలఘ్వలఘూనామ్" అనియు (ఆం. చిం. సంజ్ఞా. ౯. ౧౧. కా.) భట్టారకుఁడు తెల్గున లళలకు యతిప్రాసమైత్రి నుపదేశించుటచేతను, "గోళః" (ఆం. చిం. అజం. ౧౮ కా.) అనుసూత్రముచే నలఘులకారవిధానము చేయుటచేతను, "ద న్త్య చ - జౌ గురుర - లౌచ [illegible]" (ఆం. చిం. సంజ్ఞా. ౨౨ కారి.) (౭౯ II విష.) అని యలఘురేఫలకారముల లిపిని వర్ణించుటచేతను, తెలుంగునందును నలఘు 'ల - వ'ల స్థితి నంగీకరింపక తీరదు. కాన సంస్కృతమునందలి దంత్య లకారమునుండి జనించిన గోళ గరళాదులలోని ళకారసామ్యమునఁ దెల్గునందును దంత్య రేఫ లకారజన్యమగు - "గోరులు=గోళ్ళు, నీరులు=నీళ్ళు, పాలులు=పాళ్ళు" మున్నగుబహువచనళ (ల్) కారమున కలఘుత్వము నంగీకరించుట యుక్త మనఁదగును. ఇట్లె సంస్కృతమున స్వరసంధిలో వచ్చు "అసౌ+ఆదిత్యః = అసావాదిత్యః" అనునది యాదిగాఁగల స్థలములందలి వకారమునకు లఘుత్వ మంగీకరింపఁ బడినట్లె తత్సమానన్యాయమునఁ దెల్గునందును "రామ ఉత్తః = ర+ఉ+తు = ర+వ్+ఉ+ తు = రవుతు, చిగురు=చి+ఉ+రు=చి+వ్+ఉ+రు=చివురు" (వై. పా. ౩౭౬ విష.) (బా. అచ్చి. ౨౭. సూ. గెలుచు+నుజీ =

గెలుచు+అన్ = గెలు+వ్+అన్ = గెలువన్" (బా. క్రియా ౮౭ సూ.) మున్నగు స్థలములలోని స్వరసంహితా వ్యవధాయక వకారమునకు లఘుత్వ మంగీకరించు టుచితము. ఈవిషయమున బాలసరస్వ త్యప్పక వ్యహోబలపండితులును దదను యాయి సూరియుఁ జేసిన గ స డ ద వాదేశ వకారలఘుత్వ కల్పనము నిరాధార మును నిర్యుక్తికమును నగుటచే నుపేక్ష్య మనఁదగును. (వై. పా. ౩౭౬ విష.)

య ర ల వలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు - ౧౮.

హరియతఁడు. ఇత్యాదు లందాగమయకారము లఘువు. తక్కినయకార మలఘువు. విఱుగు మెఱుఁ గిత్యాదులందు రేఫం బలఘువు. ఇదే శకటరేఫ మని చెప్పఁబడును. శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు. పెరుగు - కరుగిత్యాదులందు రేఫంబు లఘువు. ఏళులు-పాళులు-త్రాళులని బహుత్వమందు ర-ల-డల కాదేశమయిన ళకార మలఘువు. తల - నెల - యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడువలికె నిత్యాదులందున్న పాదేశవకారము లఘువు. తక్కిన వకార మలఘువు. వర్ణసమామ్నాయమందలి ళకా రము వర్ణాంతరము గాని యలఘుళకారము గాదని యెఱుంగునది.

బాలవ్యా ౫౪ I విషయ.

య - వ - ల - లు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫంబులు పొరయవు. (౨౪. ప్రకీర్ణకపరిచ్ఛేదము.)

సంజీ. ౫౪ I విషః—పెరుగు = తెగు, కరుగు=పోఁత పోసెడి యచ్చు. స్థాన కరణ స్పర్శమునందలి శైథిల్య తదభావములచే నంతస్థముల లఘ్వలఘుత లేర్పడు ననియు నట్టివి పృథగ్వర్ణములు కామింజేసి వానికి వర్ణసమామ్నాయమునఁ బృథగ్గ ణనము లేదనియు నీవలకె వ్రాయఁబడెను. (౧౧ - ౧౭ విష) (విస్తర) "వర్ణసమా మ్నాయః = పుం. (సమ్+ఆ+మ్నా = అభ్యాసే) వర్ణమాలాయామ్" (శబ్దా. చిం.)

---

విస్తర ౫౪ - I విషః—అలఘువులగు నంతస్థములను గురువులనియు వాడు దురు. "దన్త్య చ - జౌ గురుర - లౌ చ బిన్దుయుతౌ" (ఆం. చిం. సంజ్ఞా. ౨౨ కారి.) అని భట్టారకుఁడె వ్యవహరించెను.

సంజీ - ౧౮౬ విష:—'హరి+అతఁడు' అనుచోఁ బరరూపసంధి లేమింజేసి బా. సంధి. 3 సూత్రముచొప్పున యడాగమమురాఁగా 'హరియతఁడు' అనియగును. ఆ ప్రియాగమయకారమె లఘువని సూరియె వివరించెను. "అతఁడు+కలికె = అతఁడు వలికె" మున్నగుచోటులందు బా. సంధి - ౧౩ సూత్రముచొప్పున వచ్చిన యా దేశ వకారము లఘువని తాత్పర్యము. ఇట్లనుటచేత శబ్దసిద్ధ య వ లలఘువులని తెలియుచున్నది. ఉదా - కాయ - చేయును. వాఁడు - వరుస - మొ. ఇట గ స డ ద వా దేశములోని వకారము లఘువనుటకుఁ బ్రమాణము లేదనియు స్వరసంధిలో నాగమముగవచ్చిన వకారమునకు లఘుత్వము నంగీకరించుటకు సంస్కృత ప్రాకృతవ్యాకరణమార్గములు నన్నయ లఘుయకారవిధానమును బ్రమాణములు కాఁగలవనియుఁ గల్పితమువున వ్రాయఁబడెను గాన నిటఁ బునరుక్తము చేయలేదు. "చిగురు, చివురు, రాహుత్తు = రవుతు, గెలుచు+అన్ = గెలువన్" మున్నగు చోటులందుఁ బ్రక్రియాసౌకర్యమునకై గకారచకారములకు వకారాదేశము చేయుట (బా. ఆచ్ఛి. ౨౭ క్రియా. ౮౭ సూ) వ్యాకరణములందు వెలసియున్నను నట్లు గకారచకారములు వకారముగఁ బరిణమించుటకుఁ దగినసంబంధము వానికి లేమింజేసి యట్టి యెడల గకారచకారములు లోపించిన సంహితలో వ్యవధాయకముగా నుచ్చారణసౌకర్యార్థము వకారాగమము వచ్చెననుట శబ్దతత్త్వశాస్త్రసమ్మతముగా నుండును.

సంజీ ౧౮౭ విష:—పెరుగు ప్రభృతులలోని రకారము లఘువు. విఱుగు ప్రభృతులలోని ఱకార మలఘువు. ఇట్టివి విభిన్నాక్షరములని యప్పకవ్యాహారోబలపండి

---

"వీనికి సంస్కృతమున నంతఃస్థములని పేరు. నోటిలోపలిభాగము నంటి పలుకఁబడునవిగాన వీనికీపేరుకల్గెను"(బా. సా. పే. సంజ్ఞా ౧౮ సూ.) ఈవాక్యము శబ్దశాస్త్రజ్ఞానశూన్యతామూలకము. ఏది నోటిలోపలిభాగము నంటునో తెలుపఁబడదయ్యె. మఱియు నంతస్థములకే యననేల ? పెక్కువర్ణముల యుచ్చారణమునఁ గరణభూతజిహ్వాభాగములు నోటిలోపలి తాల్వాదిభాగములను దాఁకుచుండును గదా. అంతస్థశబ్దార్థ మీక్రిందిరీతిని బలువురు పలువిధముల వివరించిరి. స్పర్శోష్మములనడుమ నివి యుండునుగాన నంతఃస్థములని కొందఱు చెప్పుదురు. జిహ్వాభాగ కరణముల తుదిభాగము తాల్వాదిస్థానములఁ దాఁకునుగాన నివియంతస్థములని కొందఱు చెప్పుదురు. "ఏవం యకారాదీనాం చతుర్ణాం కరణాంతవ్యాపారనిష్పాద్యత్వా దన్తస్థా ఇత్యాఖ్యా" (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౪౩ సూ. వ్యా.) (వై. శా. ౧౬౭ విష.)

తులయూళయను. ఈపక్షమున వీరు ఱకారమును శకటరేఫమని వ్యవహరించుట యుక్తముకాదు. య వ లకువలెనే ర - లలకును ఱ - ళలతో లఘ్వలఘూచ్చారణ భేదముమాత్రము గలదనియు నవి వేర్వేఱువర్ణములు కావనియుఁ దలంచునప్పుడే “రయోస్తు నిత్యం స్యాత్” నురీతి నేకశేషమును “రాదిఫః” అనుచోప్పున వచ్చు నిఫప్రత్యయమును సుసంగతములయి యుండును. (వై. పా. ౪.౨౧ విష) ప్రాచీన ద్రావిడభాషలలో ఱకారోచ్చారణమున “ట” కారావేశ ముండెడిది. అదియే నేఁటికిని దమిళభాషలో ద్విరుక్త ఱకారోచ్చారణమునఁ గన్పట్టుచున్నది. (తమి) - కూఱు (చెప్పు) కూఱ్ఱు = (“కూట్రు” అని తమిళులు పల్కుదురు) మాట; తెలుఁగునందలి కుఱు+ఉసురు = కుట్టుసురు (బా. సంధి. ౧౭సూ) మున్నగు సంధిరూపము లిట్టిస్వభావముచేతనే లభించియుండు ననఁదగును. ఉచ్చారణమునందలి యిట్టి యత్యంతవైలక్షణ్యముచేతనే ప్రాచీనద్రావిడకవులు రేఫఱకారములకు యతి ప్రాసమైత్రి నంగీకరింపరైరి. కాని నన్నయభట్టునాఁటి కట్టి టకారావేశకలితోచ్చారణము తెల్గున ద్విరుక్తశకటములందుసైతము లేమింజేసియు ర - ఱ - ల యుచ్చారణమున స్థానకరణస్పర్శములో శైథిల్య తదభావ రూపభేదము మాత్రమె వెలయుచుండుటం జేసియు నివి భిన్నాక్షరములు కావనియు వీనిభేదము తక్కిన లఘ్వలఘువులగు నంతస్థలములవంటిది మాత్రమె యనియు నాతఁడు తలంచి “లఘవో౽లఘవ శ్చ” తీత్యాదిసూత్రముల నుపదేశించినవాఁ డయ్యెను. కావుననే ‘రయోస్తు’ అనెడి యేకశేషము నాతఁడు ప్రయోగించెను. అట్లె శకటమున కచ్చాంధ్రవర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము నంగీకరింపక “షట్త్రింశదత్ర” (ఆం. చిం. సంజ్ఞా. ౬ కా.) అనిసూత్రించెను. ఇట్లైయైనచో వీనికి యతి ప్రాసవైరము నంగీకరింపనేలయని శంకింపరాదు. ఆవఱకు ద్రావిడకవులు వారి కావ్యలందు ర - ఱలకు యతిప్రాసవైరమును నియతముగఁ బాటించుచుండుటం జేసి తదనురోధమునఁ దానును వాని వైధర్మ్యమును సూత్రించినవాఁడయ్యెను. సూరి స్థలాంతరములందువలెఁ గాక యీసందర్భమున నప్పకవ్యహోబలపండితుల మార్గము ననుసరింపక బాలసరస్వతిమార్గమునే యంగీకరించి యంతస్థముల లఘ్వలఘువులకు వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము లేదనుసిద్ధాంతము నవలంబించెను. కావుననే యచ్చాంధ్రవర్ణసమామ్నాయమునఁ బృథగ్వర్ణముగఁ బేర్కొనఁబడిన గయ్యాళి, త్రుళ్ళు మున్నగుశబ్దములలోని మూర్ధన్యద్రావిడళకారమునకు నలఘుత్వము నంగీకరింపక “ఏళులు, పాళులు, త్రాళులని బహుత్వమందు ర - ల - డ - ల కాదేశమైన ళకార మలఘువు. తల. నెల. యిత్యాదులందలి లకారము లఘువు.” అని సూరి

విశదముగా వ్రాసెను. మఱియు "వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము గాని యలఘులకారము గాదని యెఱుంగునది" అని తననిశ్చయమును స్పష్టపఱిచెను. (విస్తర I మొ. Vవ)

---

విస్తర I. ౨౬ విష:—సూరిగారి యీవాక్యమునకు "ళకారము వర్ణాంతరముగాని యలఘుళకారము గాదనఁగా వర్ణాంతరమైన యలఘుళకారమెయని నిశ్చితార్థము" (బా. గు. ప్ర. సంజ్ఞా ౧౮ సూ. వ్యా. ౧౬ పు.) అని వక్తృతాత్పర్యవిరుద్ధముగా గుప్తార్థ ప్రకాశికావ్యాఖ్యాత యర్థముచేసి వర్ణసమామ్నాయగతళకారమున కలఘుత్వము నంగీకరించిన స్వకీయప్రామాదికవ్యాఖ్యను సమర్థించికొన యత్నించెను. శబ్దసిద్ధళకారమునకే యలఘుత్వము సూరికి సమ్మతమైయున్నచో నలఘురేఫవిషయమున 'విఱుగు, మెఱుఁగు' శబ్దములలోని శకటముల నుదాహరించినట్లె యీయలఘుళకారవిషయమునందును తళుకు - బెళుకు - మున్నగుశబ్దములలోని ళకారము నొక్కటినయిన నుదాహరింపక ప్రత్యేకముగా బహువచనమునందుఁ దనచేఁ గంఠోక్తముగ నలఘువులని (బా. అచ్చి. ౧౩. ౧౮ సూ.) విధింపఁబడిన '(పాలు) - పాళులు' మున్నగుశబ్దములలోని ళకారములను మాత్ర ముదాహరించి యుండునా? ఇట్లు స్వవాదానుకూల్యమునకై సూరివాక్యమున కపార్థము చేయుటచే సూరిగారి స్థలాంతరములునైతము విరోధింపఁగా నాతఁడు విచారవిదూరుఁడై వ్రాసెనని బా. గు. ప్ర. వ్యాఖ్యాత యీ క్రిందిరీతిని వ్రాయుట కేవలము నన్యాయ్యము, అనుచితము. "కాన లఘులకారమును నలఘులకారమును బఠించిన రీతినె వర్ణసమామ్నాయమున లఘురేఫమునేకాక యలఘురేఫమును బఠియింపఁదగినదియని విశదమయ్యెడి. అటులు సూరి చేయకునికి యవిచారమూలకం బనందగు" (బా. గు. ప్ర. అనుబంధ. ౧౮౨ పు. ద్వి. ము.) అలఘురేఫమునువలెనె యలఘులకారమునుసయితము వర్ణసమామ్నాయమున వేఱుగఁ బరిగణింపక సూరి వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరమే కాని యలఘువు కాదని యుద్ఘోషించుచుండఁగా నట్టి వాక్యమున కపార్థముచేసి యాతనికి నవిచారమూలకత్వము నంటఁగట్టుట యెంతయు నన్యాయ్యము !

విస్తర II. ౨౭. విష:— పయిరీతినె "అలఘులకారంబునకుంబోలె నలఘురేఫమునకును నట్టి సాధ్యశకటరేఫములె న్యాయ్యంబైన యుదాహరణంబులై యుండి, విఱుగు మెఱుగిత్యాదులందలి శకటాకారరేఫ మలఘువు గాని (కానట్టి) వర్ణాంతరమైయుండు. ఇట్లుండఁగా సూరిగారు స్వవచనవిరుద్ధముగా సంజ్ఞా ౧౮ సూత్రమునొద్ద విఱుగు మెఱుగుశబ్దము లలఘురేఫమునకు నుదాహరణములుగా

నేలయిచ్చితో......" అని యిట్లు వ్యాఖ్యానముగా గుప్తార్థప్రకాశికాకర్త వ్రాసెను. (బా. గు. ప్ర. అనుబం. ౧౩౬. ౧౩౭ పు. ద్వి. ము.) "వర్ణసమామ్నాయమందలి త్యాది సూరివాక్యమునకుఁ దదభిప్రేతార్థమును జెప్పి తత్స్థానమున నాతని గ్రంథమునకుఁ బరస్పరవిరోధము గలదనుట యెంతయు సాహసకృత్యము! త్రుళ్ళు - బెళుకు మున్నగు వానిలోని ళకారముపలె విఱుగు మెఱుఁగు ప్రభృతులలోని ఱకారము వర్ణాంతరము కానేరదు. ఈఱకార మలఘువు, ఆళకార మలఘువు కాదు. లఘువును గాదు. వర్ణాంతరము. ఇట్లు సూరి ప్రకృతసూత్రవివరణమున విశదీకరించి యుండఁగా నాతని గ్రంథమున స్వవచనవిరోధ మెక్కడిది? మఱియు సూరియంతస్థముల లఘ్వలఘుతలను వాని సిద్ధసాధ్యతలను బ్రయోజకములనుగా నెన్నలేదు. "హరి యతఁడు - అతఁడు వలికె" మున్నగుచోటులలోని సాధ్య యవలు లఘువులనియు, "వెళులు - పాళులు - త్రాళులు" మున్నగువానిలోని సాధ్యళకార మలఘు వనియు సూరికంఠోక్తముగాఁ బ్రకృతసూత్రవివరణమున వక్కాణించి యున్నాఁడు. ఱకారవిషయమున సాధ్యఱకారములె కాక శబ్దసిద్ధఱకారములను నలఘువులెయను నభిప్రాయముతో నున్నవాఁడుగాన వేని నుదాహరించిన నేమి యనుతలంపున విఱుగు మెఱుఁగు ప్రభృతులలోని సిద్ధఱకారములను జేర్కొనెను. ఈవాక్యములోని ప్రభృతిశబ్దముచే సాధ్యఱకారములును గ్రహింపఁబడును. మఱియు నట్టి సాధ్య ఱకారవిధానసందర్భమున వాని నలఘువులనుచు సూరి కంఠోక్తముగ వచించియు నున్నాఁడు. (విలుకాఱు. బా. ఆచ్ఛి. ౭ సూ; చెఱుచు. బా. క్రియా. ౮౧ సూ; పఱుచు. బా. క్రియా. ౮౨ సూ.) ఇట్టిస్థితిలో నకించిత్కరములగు సిద్ధసాధ్యతలను బ్రకాశికాకర్త యూఁతగొనుట నిష్ఫలము.

విస్తర III ౫౬ విష:—"లఘుయకారవకారములువోలె వర్ణసమామ్నాయమున నీయలఘురేఫంబును వేఱుగ గణింపఁబడఁగూడదని సూరిగారి తాత్పర్యమని వివరించుచున్నారు. కాని వీరివాక్యంబు సమంజసంబుగాఁ గనంబడలేదు. అలఘుయవలతో యతిప్రాసశ్లేషాదులందు నభేదబుద్ధిని మెలంగుచున్న లఘుయవలకు వర్ణసమామ్నాయమందలి యవలతో నంతర్భావము చెప్పనలవియగుంగాని సర్వాంశములయందును రాక్షసకృత్యముతో లఘురేఫముపైఁ బగసాధించి పెచ్చుపెరుఁగుచున్న యలఘురేఫమునకు రేఫములో నంతర్భావము నొడువఁగా నెట్లు పొసగెడు" (బా.గు.ప్ర. అను.౧౨౭, ౧౨౮ ద్వి. ము) అని యిట్లు ప్రకాశికాకర్త మఱొక యశాస్త్రీయప్రసంగమును జేసెను. పృథగ్వర్ణతాంగీకారమునకు యతిప్రాసాదిమైత్రి సాధకమనుట కేవలము శాస్త్రవిరుద్ధము. "అనుప్రదానా" దిత్యాది (౧౪ విష,)

కాలకచోప్పూన నవుప్రవాదాది భేదములవలన వర్ణపార్థక్యము నంగీకరించుట శిక్షా శాస్త్రసిద్ధాంతము. (వై. పా. ౧౮౧ విష.)

విస్తర IV ౧౬ విష:—"అచ్చి. ప. ౧౩ సూత్రమున ర-డలతోఁబాటిగా లకారమునకు కలఘులకారము విధింపఁబడుచుండెడి. లకారమున స్వామముగా నలఘులకారంబునకు గ్రహణము న్యాయ్యంబయ్యెనేని యీసూత్రమున బహూకముగాఁ బునర్విధానమేల యవసరంబగు" (బా.గు.ప్ర.అనుబం. ౧౮౦ పు.ద్వి.ము.) అని గుప్తార్థప్రకాశికాకర్త యింకొకశంకఁ జేసెను. నిజమే! చింతామణిలో నట్లు లకారమున కలఘులకారము పునరుక్తముగా విధింపఁబడలేదు. (చిం.వి.ప.౩౩ విష.) "రాలః" అని రేఫమునకుమాత్రమె (అలఘు) లకారాదేశము చేయఁబడెను. సూరిగారికాలమున కలఘులకారము ద్రావిడళకారమువంటి యపభ్రష్టోచ్చారణముతో వాడుక కెక్కుటంజేసియు దానిలిపితోనె గుర్తింపఁబడునలవాటు వ్యాపించుటం జేసియు నప్పుకవ్యవహారంబులపతు లారెండిటికి నభేదభ్రాంతి నంది చర్చించుటం జేసిరు నారెండును—౧. త్రుళ్ళు ప్రభృతులలోని ద్రావిడళకారము, ౨. పాళలు (పాలులు) ప్రభృతులలోని యలఘులకారమును—నభిన్నములు కావనియు నవి వేర్వేఱు విధములైనవనియు విశదీకరించుటకయి పాళ(ల)లు ప్రభృతులలోనిది వర్ణాంతరళకారము కాదనియు నలఘులకారమాత్రమె యనియు నాతఁడు విశదీకరింపవలసి వచ్చెను.

విస్తర V ౧౬ విష:—"ఏళులు - ఇత్యాదులందలి ళకారము నేరీతి నేముఖమున నలఘూచ్చారణతోఁ బలుకుచుంటిమో (భూతమా?) బెళుకు ఇత్యాదులందలి ళకారంబును నలఘూచ్చారణతోఁ బలుకుటకు నారీతియు నాముఖమును గాక వేఱొకటి యుండునేమో? విమర్శకులు సెలవిత్తురుగాక!" (బా. గు. ప్ర. అనుబం. ౧౩౬ పు. ద్వి. ము.) అనియిట్లు విమర్శసహాముకాని యింకొక యాపత్తి ప్రకాశికాకర్తకుఁ దోఁచెను. నేఁటి యపభ్రష్టోచ్చారణమె శాస్త్రీయమని భ్రమించి ప్రకాశికాకర్త యిట్లుల్లసమాడుట సరికాదు. బెళుకుప్రభృతులలోని ళకారము మూర్ధన్యము. "ఏళ్ళు-పాళ్ళు" మున్నగువానిలోనిది దంతమూలీయమును (౧౮ విష.) నలఘూచ్చారణముగలదియు నగుటచే వానియుచ్చారణ మేకరీతి నుండుననుట శిక్షాశాస్త్రజ్ఞానహైన్యమూలక మనవగును. (౧౮ విష.) "నావిళంబు......" (తొలుకాప్పియము ౯౬ సూ.) దీనియర్థము:—నాలుకయొక్క పార్శ్వములుబ్బి మీఁదిదంతమూలమునున్నానుముకును నొక్కి తాఁకుటచేత లకారము పుట్టును. నాలుకయొక్క పార్శ్వములుబ్బి మూర్ధమును దేలికగాఁ దాఁకుటచేత ళకారము జనించును. ఇట్లు ద్రావిడ

సంజీవని - ౫౭ విష:—తత్సమములందు శకటరేఫము లేదనుట నిర్వివాదమె కాని తద్భవములందుసు లేదనుచు 'శకటరేఫము తత్సమతద్భవములందు లేదు' అని ప్రకృతసూత్రపువివరణమున సూరి వ్రాసెను. ఇట్టివ్రాత సరికాదనుచు "తద్భవములందును నలఘురేఫము గలదు" (ప్రౌఢ. సంజ్ఞా. ౯ సూ.) అని సూత్రించి త్రిలింగలక్షణశేషకర్త 'కఱకంఠుఁడు - కాఱియ - పిఱికి - వెఱ - గొఱియ' మున్నగువానిని బ్రయోగప్రదర్శనపూర్వకముగా సుదాహరించెను. అందు 'కఱకంఠాదులకు' భారతప్రయోగములు శబ్దరత్నాకరమునందుసు జూపఁబడినవి. కాని కఱప్రభృతిశబ్దములు దేశ్యములని సూరి యభిప్రాయపడి యుండును. కఱ - వెఱప్రభృతులు దేశ్యములనియుఁ జెప్పనగును. (వై.పా. ౭౩౧ విష.) తద్భవములందు శకటరేఫము గలదని యహోబలపండితుఁడును వ్రాసెను. "నను యది పాఱుశబ్దస్య తద్భవత్వం తర్హి గురురేఫః కథ మితిచేన్నైష దోషః, ఉక్కెఱ-కఱకు-మొఱకు - ఇత్యాదితద్భవేష్వపి తచ్ఛ్రవణాత్. అతఏవాథర్వణః లక్ష్యానురోధేన ఉచ్చారణస్య కల్ప్యత్వమాహ" (అహో. ౩౦౮) కాని నన్నయభట్టారకుఁ డెచ్చటను దద్భవములలో శకటరేఫమును బ్రయోగింపలేదు. (వై. పా. ౭౩౨ - ౭౩౧ విష.).

> నాన్యేషాం వైధర్మ్యం । లఘ్వలఘూనాం రయో
> స్తునిత్యం స్యాత్ । (ఆం. చిం. సంజ్ఞా ౧౧ కా.
> అహో. ౧౫౭) కశ్చి ద్వదతి సాంగత్యం । యతావే
> వానయో స్తథా।అవదచ్చాత్ర సాంగత్యం।ప్రాసేష్వ
> పిచ కశ్చన । అనయో స్సంగతిం యస్తు । కరోతి కవితా
> కృతౌ । అస్యా అత్యన్తదుష్టత్వా । ద్దుష్కృవి స్సహి
> కథ్యతే ॥ (వికృ. సంజ్ఞా. ౨౦ - ౨౧ - కా. అహో.
> ౧౫౭ పుట.)

నన్నయాథర్వణీయము ౫౭ విషయము.

కల్ప. ౫౭ విష:—అన్యేషామ్ = రేఫవ్యతిరిక్తములైన య - ల - వ - లనెడి, లఘ్వలఘూనామ్ = లఘ్వలఘువులగు నంతస్థములకు, వైధర్మ్యమ్ = యతి

---

ళకారోచ్చారణ స్వరూపమును దొలుకాప్పియరుగారు నిరూపించిరి. దంతమూలీయ ళకారోచ్చారణములోని స్థానకరణయోగమునందలి శైథిల్యాభావ మలఘుల కారోచ్చారణజనకమగునని యీావఱకు సంస్కృతపండితసిద్ధాంతము విశదీకరింపఁ బడెను. (౮-౯-విష.) విస్తర భీతిచే నింతతో నీగుప్తార్థప్రకాశికానుబంధములోని యసంగతప్రసంగముల చర్చ విరమింపఁబడెను.

ప్రాసాదిక్షైతము, న=లేదు. రయోస్తు = లఘ్వలఘురేఫములకుమాత్రము, నిత్యమ్ = స్వాభావికమైనది, స్యాత్ = అగును, రేఫఱకారములకు యతిప్రాసాది మైత్రి యెంతమాత్రమును లేదని తాత్పర్యము. (సంజ్ఞా. సూ. వివ.)

కశ్చిదిత్యాదిః—అనయోః = ఈరేఫఱకారములకు, యతావేవ = యతి యందుమాత్రమే, సాంగత్యమ్ = మైత్రిని, కశ్చిత్ = ఒకానొకఁడు, వదతి = ప్రయోగించుచున్నాఁడు, తథా = ఆప్రకారమే, అత్ర = ఈతెల్గునందు, ప్రాసేష్వపి = ప్రాసములందునైతము, సాంగత్యమ్ = మైత్రిని, కశ్చన = మఱొకకవి, అవదచ్చ = ప్రయోగించెను. అనయోః = ఈరేఫద్వయమునకును, యస్తు = ఏకవి, కవితాకృతౌ = కవనరచనయందు, సంగతిమ్ = మైత్రిని, కరోతి = ప్రయోగించునో, అస్యాః అత్యన్తదుష్టత్వాత్ = ఈమైత్రి మిక్కిలిదుష్టమైన దగుటచేత, సః = ఆకవి, దుష్కవిః = కుకవియని, కథ్యతే = చెప్పఁబడును.

నన్నయా సూ I వివ.

లఘు ర్భవే ద్గురుః కుత్ర। చి ద్గురుశ్చ లఘు ర్భవేత్
ఉచ్చారణస్య కల్ప్యత్వా। న్నిదానం తత్ర సద్వచః
(వికృ. సంజ్ఞా. ౧౩ కా. అహో. ౧౯౯ పు.)

కల్ప - సూ I వివ:—అథర్వణాచార్యులనాఁటికే రేఫఱకారముల లఘ్వలఘుచ్చారణభేదము సంయితము సడల నారంభించుటచేత వానియతిప్రాసాదిమైత్రిని గొందఱు చేయసాగిరని పై యథర్వణవాక్యములచే విదితమగుచున్నది. అట్లయినను "రయోస్తునిత్యంస్యాత్త"ని భట్టారకుఁడు నొక్కినక్కాణించుటచేతను నాతనిభారత భాగమున నెచ్చటను రేఫద్వయమైత్రి ప్రయోగింపఁ బడకుండుటచేతను నథర్వణాచార్యుఁ డట్టిమైత్రిని జేయుట దుష్టమని స్పష్టముగా వివరించెను.

లఘు ర్భవేదిత్యాదిః—కుత్రచిత్ = ఒకానొకప్పుడు, (నన్నయేతరప్రయోగములలో) గురుః = ఱకారము, లఘుః = రకారము, భవేత్ = అగును. లఘుశ్చ= రకారమునైతము, గురుః = ఱకారము, భవేత్ = అగును. ఉచ్చారణస్య = ఉచ్చారణము, కల్ప్యత్వాత్ = కవివ్యవహారాధీన మగుటవలన, తత్ర = వానిగౌరవలాఘవముల విషయమున, సద్వచః = మహాకవిప్రయోగము, నిదానమ్ = మూల మనఁగాఁ బ్రమాణ మగుచున్నది. (విస్తర) సోమయాజిప్రభృతి మహాకవి ప్రయో

---

విస్తర. సూ I వివ:—బ్ర - శ్రీ - వేటూరి ప్రభాకరశాస్త్రిగా రీయథర్వణకారికలోని గురులఘుశబ్దములకు ఛాందసిక మాత్రాకృత గౌరవలాఘవపరముగ నర్థముచేసిరి. (జన. పు. పీఠి. ౯౬ పు.) ఈయర్థ మాంధ్రలాక్షణిక సంప్రదాయ

గములలో నొక్క శబ్దమందె యొకట రేఫమును మఱొకట ఱకారమును గన్పట్టు చుండుటం జేసియు నట్టి మహాకవులు దుష్కవులనుట కేవలము నసంభవమగుటం

---

విరుద్ధము. గ్రంథకృదనభిప్రేతము. మఱియుఁ, బాదాంతగురువు లఘువగుట కీకారిక యూంతగాఁ గొనఁబడెను. పాదాంతలఘువు గురువగుట గలదుగాని గురువు లఘు వగుట కేవలము నసంభవము. ప్రాచీనకాలమున గగ మినగణముగా నుండుట నర యమి వీరిట్టె యపమార్గమునఁ బడవలసెను. ప్రకృతకారిక రేఫఱకారవిషయకము గానే యహోబలపతిచే సమన్వయింపఁబడెను "కుత్రచిదేకస్యైవ గురుత్వం లఘుత్వం చాప్యస్తి. లఘు ర్భవే ద్గురుః కుత్ర। చి ద్గురుశ్చ లఘు ర్భవేత్......ఇత్యథర్వణ వచనాత్." (అహో. ౧౮౯ పు.) అని యహోబలపతి యర్థముచేసి "తొరఁగు = తొఱఁగు" అను ద్వైరూప్యము నుదాహరించెను. ప్రౌఢవ్యాకరణకర్తయు నీకారి కను రేఫఱకారపరముగనె యర్థముచేసెను. కాని యతఁడు వేఱురీతి నుదాహ రించెను. "దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫం బగు......కం. చే। కుఱె......। గీ। తీర్చికొనుము ...... లఘు ర్భవే ద్గురుః కుత్ర। చి ద్గురుశ్చ లఘు ర్భవేత్ ...... అని యథర్వణాచార్యులు......(చేకూరు లఘురేఫము. తీఱు అలఘురేఫము." (ప్రౌఢ. ముక్తలక్షణవివేచనము. ౯౫ పు.) " ౩౦ - రయోస్తు నిత్యం స్యాత్ ......ఈనిషేధసూత్రము రేఫశకటరేఫములకు యతిప్రాసస్థానములందు కవులు మైత్రిని గల్పించినయనంతరము పుట్టియుండవలెను. పదమూఁడవశతాబ్దము వఱకును దెనుఁగుకవులు రేఫశకటరేఫసాంకర్యమును జేయలేదు." (ఆం. భా. చ. ౧౫౮౯ పు.) ఈసిద్ధాంతము విపరీతముగా నున్నది. నన్నయనాఁటికే రేఫశకటరేఫజ్ఞానము పండితమాత్రవేద్యమై యుండుట తటస్థించుట చేతను నెవ్వరేని వానిసాంకర్యముఁ జేసిన శంకాంకుర మొదవుటచేతను నాతఁ డట్టి సాంకర్యముచేయరాదని నిషేధించి యుండును. అదియే సంభావ్యవిషయము. అంతియకాని మహాకవులు వానిమైత్రి నంగీకరించుచుఁ బ్రయోగించినపిదప నేవై యాకరణుఁడైన నిషేధించు టెట్లుపొసఁగును? అథర్వణునినాఁటి కట్లు కవులు వాని మైత్రిని బ్రయోగించుటచేతనే వారిని నిరసింపఁజాలక లఘు ర్భవేద్గురుః కుత్ర। చి దిత్యాదికారికచే వారిప్రయోగములందలి శబ్దములలో నిపాతన్యాయమున నుభయ రేఫముల నంగీకరించినవాఁడయ్యె. నన్నయేతరులెల్ల వానిమైత్రిని బ్రయోగించిన వారే. సీ......గీ - ఎఱుక నీ కప్పుడెందుండి దొరకెపడియె (నన్నె. కు. ౨ ఆ. ౧౬౮.) ద్విపద. గొఱియఁ బట్టుడుఁ దద్దఁ గోపించిచూచి। పరువడి కిన్నరబ్రహ్మయ్య యొదిరి (బసవ. ౫ ఆ. ౬౦) తిక్కన చేసిన స్థలములు కల్పతరువుననె చూపఁబడెను.

కేశీయు నథర్వణుఁ డిట్లు కొన్నిశబ్దములందుఁ బర్యాయముగ రేఫఱకారోభయస్థితి నంగీకరించెను. క. చేతఁ గొని యుప్పునములుట। రాతిపయిని నుప్పుగొనుట రాత్రి దధిపయఃపా। వేతంబుగఁ గుడుచుట ధ। శ్వేతరములు రేయి సక్తు వెగ్గు నరేంద్రా (అను. ౮ ఆ. ౧౧౧) క. నాయుల్ల మరయ నినుమో। తౌ యో కాకిట్లు రూపఱక వినవోర్చెన్। (భీష్మ. 3 ఆ. ౮౯) ఆ. వె.......అధికభక్తి। నెరఁగి ప్రియమువలికి తెరువిత్తు రిట్టిద ... (ఆది. ౭ ఆ ౧౧౨ ప.) క. ఎఱఁగిన నప్పెసువ్రేఁగున। విఱుగు టయును శాఖ. (అను. ౧ ఆ. ౨3౭)

కల్ప - సూ II విమ:—మహాకవులు కొన్నియలంతిస్థలములందు రేఫఱ కారమైత్రిని బ్రయోగించినట్లు కన్పట్టినను దక్కినస్థలములం దెల్ల నసందిగ్ధముగ సాంస్కృతిక రేఫప్రాసమున నసందిగ్ధములగు రేఫములను, నట్లె ఱకారప్రాసము లందును నసందిగ్ధములగు ఱకారములను నియతముగఁ బ్రయోగించుట నరసినపుడు వారు రేఫఱకారవైరమును బాటించుటయందే పట్టుదల గలవారని తోఁపకమానదు. ఇక్కారణమున వా రేవో కొన్నియలంతిస్థలములందుఁ జేసిన రేఫఱకారమైత్రి యాయాశబ్దములం దుభయరేఫస్థిత్యంగీకారమునఁ జేయఁబడినదే కాని వేఱుకాద నియు, గావుననే యథర్వణాచార్యుఁడు పైరీతిని సామరస్యము నుపదేశించెననియు గ్రహింపవలయును. చ-వెఱచినవారి...నిద్రమై। మఱచినవారి... । పఱచినవారి... వా। చఱచినవారి...(సర్వల. 3 ఆ. ౨ఱభాగ. ౭ స్క.) ఇట్టి పద్యశతములు భాగ వతమునందు సైతము కన్పట్టుచుండుటంజేసి యాంధ్రమహాకవు లెవ్వరును రేఫ ఱకారమైత్రిని ధారాళముగా ధరణి... । పఱచు...మున్నగుశబ్దములకుఁ బ్రాసము ఘటించి ప్రయోగించుస్వభావముగలవారు లేరనుటకు సందియములేదు. (వై. పా. 3౯౦. 3౯౧ విమ.)

కావుననే యట్టి యథర్వణసిద్ధాంతము ననుసరించి యాంధ్రలాక్షణికులు— తాళ్లపాకము తిరుమలయ్యదేశికుఁడు, కాకునూరి యప్పకవి, కూచిమంచి తిమ్మకవి, భారతము లక్ష్మీపతి, ఓగిరాల రంగనాథకవి, బహుజనపల్లి సీతారామాచార్యులు— మున్నగువారు పెక్కురు గొప్పపరిశ్రమముచేసి యాంధ్రమహాకావ్యములను బరి శీలించి యతిప్రాసాదిస్థలనిబద్ధ రేఫఱకారఘటితములను నుభయరేఫకలితశబ్దములను బ్రయోగప్రదర్శనపూర్వకముగా విభజించి గ్రంథరచనమును జేసియున్నారు. ఈ విషయములెల్ల నారచించిన వైయాకరణపారిజాతమునందు విపులముగఁ జూపఁ బడెను. (వై. పా. 3౮౭ మొ. ౫౦౨ వ విషయములు.)

అథర్వణునినాఁటికే రేఫఱకారముల యుచ్చారణభేద మంతరించినది. అట్లు గుటంజేసి రేఫఱకారముల నుచ్చారణమునుబట్టి తెలిసికొనుట కవకాశము లేదని

తలఁచి యథర్వణుఁడు రేఫఱకారము లుండుచోటులను గొంతవఱ కుపదేశింపఁ దలంచెను. తలఁచి నన్నయభారత భాగమందలి యతిప్రాసస్థలములలోనివానిని దెలుపు కొన్నియనుగమములను నీక్రిందిరీతి నుపదేశించెను. అప్పటికి వెలసియున్న యాంధ్రమహాకావ్యవాఙ్మయములో నొక్క నన్నయభారతభాగమందు మాత్రమె, రేఫఱకారమైత్రి యనఁదగు నుభయరేఫకశబ్ద ద్వైరూప్యము లేమింజేసి యద్దానియందలి రఱలకు మాత్ర మీయనుగమములను సూత్రించినవాఁడగుట్ట నని తోఁచెడిని.

క్రియాన్తే చాన్యవర్ణేచ। లఘురేఫాః ప్రకీర్తితాః
ద్వివిధా ది దు తశ్చస్యు। రయవౌ చ క-గౌ తథా।
నన్నయా ౫౮ III చ-సౌ ప-బౌ-త-దౌ వర్ణా। న-మ-వా అససంయుతాః
వివయము. ఏతే ద్వితయసంయుక్తా। రేఫో న్యత్ర తు సమ్మతః
లఘు ర్నాస్తి బకారస్యాఽ। లఘు స్సస్య కదాపిచ।
(వికృ.సంజ్ఞా.౧౩ మొ. ౧౯ వ.కారి. అహో. ౧౪౯ ౧౫౦ పు.)

కల్ప - ౫౮ III విష:—క్రియాన్తేచ=క్రియాపదముల తుదిని నిల్చెడి బహువచనప్రత్యయములందును, అన్యవర్ణేచ = క్రియాప్రత్యయేతర ప్రత్యయములం (వర్ణ=వర్ణిక) దనఁగా నృపాలురు-బాలురు-వారు-వీరు మున్నగు బహువచన నామ ప్రత్యయములందును, లఘురేఫాః = లఘురేఫములె, ప్రకీర్తితాః = వెలసియున్నవి. ఉదా.-చొచ్చిరి - పూజించితిరి-వారు-వీరు-మీరు-తారు-ఎల్లరు-పలువురు-రాము లార - బాలురు మొ. ద్వివిధ=హ్రస్వదీర్ఘరూపములయిన, అదిదుతశ్చ = అవర్ణేవర్ణోవర్ణము లును, అయవౌచ=(ఎ+ఒ=అయొ.దీని ద్వివచనము-అయవౌ.) 'ఎ'కారమును,'ఒ'కార మును (ప్రత్యేకించి చెప్పుటచే 'ద్వివిధ' అను సమాసగతవిశేషణము దీనిని జెందదు) తథా=ఆప్రకారముగనే, క-గౌ=కకార గకారములును, చ-సౌ=చకార-సకారము లును, ప-బౌ=పకార-బకారములును, త-దౌ=తకార-దకారములును, ననెడి, వర్ణాః= వర్ణములును, న-మ-వాః=నకార-మకార-వకారములును, ఏతే=ఈయక్షరములు, అససంయుతాః = హలంతరసంయుక్త రేఫములు పరమందుఁగలవి కానివై (ఇట్లనుట చేత 'హలంతరసంయుక్తములు రేఫములె యగును. శకటరేఫములుకావు' అని తేలు చున్నది. ఉదా. వస్త్రువ. పేర్మి.) ద్వితయసంయుక్తాః=రేఫఱకారములు రెంటిలో నేదేని పరమందుఁగలవి, స్యుః = అగుచున్నవి. అన్యత్ర = తక్కినచోటులందు, రేఫః = లఘురేఫమే సమ్మతము. బకారస్య = బకారమునకుఁ దర్వాత, లఘుః=లఘు

శేషము, నాస్తి-లేదు. సస్య = పకారమునకుఁ దర్వాత సయితము, అలఘుః=అనుస్వారము, కదాపిచ = ఎప్పుడును లేదు. ఈకారికలలోని లక్షణములును వానిలక్ష్యములును సుగమములు కావింపజేసియు నీలక్షణములు నన్నయభారతభాగ యతిప్రాసస్థలస్థిత రేఫఱకారసమాశ్రవిషయకములని గ్రహించి యుండమింజేసియు నహోబలపత్యాదులీకారికల నుదాహరించుటలోఁ గొన్ని యపపాఠములు పడినవి. ద్విరేఫవర్ణదర్పణకారాదులు వీని కపార్థములను జేసికొనిరి. వానివిమర్శనము నారచించిన వైయాకరణపారిజాతమునఁ గనఁదగును. (వై. పా. ౩ ౯౨ మొ. ౮౨౯, విష.) నారాయణీయతద్వ్యాకరణకర్తలును నీవిషయమున నపపాఠములను నపార్థములను నంగీకరించిరి. (నా. నా. సంజ్ఞా. ౬౫ మొ. ౬౯ కారి. ౬౭ మొ. ౭౮ వ. పద్య)ములును "పదేఽపిచ సంఘాత్యంస్యాత్ । క్వచి న్నైవ నపరేఫయోః." అనుసూత్రము లక్షరముల గౌరవలాఘవములను జెప్పునవై యుండఁగా (౩౦ IV విష) వానిని రేఫఱకారనిర్ణయపరములుగా నన్వయించికొనుటయు నందలి "పదేఽపిచేత్యా"దికము రేఫఱకారపరముగా నన్వయింప వీలుపడమింజేసి దానిని విడుచుకొనుటయు నవిమర్శమూలకములు. (నా. నా. సంజ్ఞా ౬౫ ప. ౬౨ కారి.)

క్రియాన్తేచేత్యాది కుదాహృతులు:—చొచ్చిరి (ఆది. ౭ ఆ ౧౦౦) లోకపాలురన్ (సభా. ౧ ఆ ౨౨౫) వేల్పులార, ఈశులార (ఆది. ౭ ఆ ౨౦౯) తారు (తమరు) (సభా. ౧ ఆ ౧౭౮) నల్వురన్ (ఆది. ౮ ఆ. ౩౧౪) కాల్వురు (ఆది. ౧ ఆ ౮౧) 'అసపంయుతా' యనుదానికి—పేర్మి (ఆది. ౮ ఆ ౭౦ ప.) ద్వివిధేత్యాదికి—అరిది (ఆది.౧ఆ. ౧౦౬) అఱము (అర. ౨ ఆ ౧౧౧) ఎఱఁగు(ఆది. ౭ ఆ. ౧౧౨ ప.) ఒరులు (ఆది. ౧ ఆ ౧౬౦) ఎఱుకు (ఆది. ౫ ఆ ౫౩) ఒఱవ(అర.౨ఆ. ౧౩౫)కరము (ఆది. ౧ ఆ ౧౨౨) కారించు. (ఆది. ౫ ఆ. ౧౬౬). కఱచు (ఆది. ౩ ఆ ౧౨) కాఱడవి (ఆది. ౪ ఆ ౧౯) ఇవెల్ల ప్రాసస్థానగత ప్రయోగములె. ఇట్లె యన్నిటికిని నుదాహృతులు నారచించిన వైయాకరణపారిజాతమునఁ గనందగు. (వై. పా. ౪౦౬ మొ. ౪౧౦ వ. విష.) పై యథర్వణానుగమములకు విరుద్ధస్థలములు నన్నయేతరకవిప్రయోగములలో వెలయుచుండుటంజేసి పై యనుగమములు నన్నయప్రయోగములనుబట్టియే యుపదేశింపఁబడిన వనుటకు సందియము లేదు.

నన్నయాథర్వణీయము ౫ం IV విషయము

లఘవ శ్శాఖశైలాగ్న । యోఽన్యే, ఖగతిబర్హిషః
అన్యే ఽన్తరితసన్మృశో । న్యైనయుక్తాః కదాపిచ । కేచి
ద్వదన్తి చ లఘూన్ । బిన్దుబాణ శిలీముఖాన్ । తథాం
వదన్తి కేచిత్తు । హార్యక్షి శిఖరాన్ పరాన్ । (వికృ.
సంజ్ఞా ౧౬, ౧౭, ౧౮ కారి. అహో. ౧౪౯-౧౫౦)

కల్ప. ౫ిరా IV విష:—అన్యే = కొందఱు, శాఖిశైలాగ్నయః = తరు, పర్వతా, ఒగ్ని వాచకములు, లఘవః = లఘురేఫయుక్తములని చెప్పుదురు. ఉ. ఉసిరిక - నేరెడు - తరిగొండ-ఎరగలి - మొ. అన్యే = కొందఱు, ఖగతిబర్హిషః = పక్షి (తిర్యక్కులును) వాచకములును దృణవాచకములును, లఘురేఫయుక్తములె యందురు. ఉదా. పూరేడు - తగరు-అగురు- పూరి మొ. అన్యే=మఱికొందఱు, అన్తరిక్షసదృశః = వ్యోమ సాదృశ్య వాచకములు, లఘురేఫయుక్తము లందురు; ఉదా. ఉప్పరము. సరి - దొర - కరణి - మొ, యుక్తాః = ద్విత్వాక్షరములు, కదాపిచ=ఎప్పుడైనను, న= లఘురేఫములు కానేరవు. ఉ, ఇఱ్ఱి - తొఱ్ఱ - గొఱ్ఱియ - కుఱ్ఱి-మొ. కేచిత్ = కొందఱు, బిన్దు = అనుస్వారవాచకమును, బాణ = శరవాచకమును, శిలీముఖాన్ = భ్రమరవాచకమును, లఘూన్వదన్తి = లఘురేఫయుక్తములనుగాఁ జెప్పుదురు. ఉ. అరసున్న - జిరా - బరిగోల - మొగరంబము - మరునల్లె - మొ. తథా = అల్లె, కేచిత్తు = మఱికొందఱు, హరి = సింహవాచకమును, అఙ్ఘ్రి = పాద వాచకమును, ఖ = అనుస్వారవాచకమును, శరాన్ = కాశతృణవాచకమును, పరాన్ = ఇతరములగు నలఘువులనుగా, వదన్తి = చెప్పుచున్నారు. ఉ. తెఱనోటి మెకము, 'అఱకాలు, అఱసున్న, నెఱసున్న, తెల్లు, మొ. శకటరేఫ నిర్ణయకర్తయగు భారతము లక్ష్మీపత్యవధానిగారును నీరీతినె యీకారికల కర్థము చేసికొని కావలయును, దన శకటరేఫనిర్ణయగ్రంథమున "అథ రేఫసమామ్నాయః। క్రియతే శ్రూయతాం విభో......వాచకా స్తరుపీడుథామ్।......తిర్యగ్వాచీ రః (౫౩ పుట.)......గిరివాచకాః।......"అనియిట్లు శాఖిశైలాగ్నయ ఇత్యాద్యథర్వణ కారికాపద్ధతినె వివరించిరి.

కల్ప. ౫ిరా V విష:—ఇట్టి సహజమును, సరళమును, సంప్రదాయసిద్ధమును నగురీతిని బోక, ద్విరేఫవర్ణదర్పణకర్తయగు నోగిరాలరంగనాథకవి పైయథర్వణ కారికలను, రేఫఱకారఘటితశబ్దముల సంఖ్యలను వచించువానినిగా నర్థము చేసికొని యీక్రిందిరీతిని వివరించెను. ఇట్టికారికలయర్థము సుగ్రహము కామిం జేసియే వీనిలోఁ గొన్ని యపపాఠములును గవిశిరోభూషణమున లేఖకాదిప్రమాదమునఁ బడినవి. అట్టి పాఠములనె ద్విరేఫవర్ణదర్పణకారుఁడును గ్రహించెను. "లఘవ శ్శాఖిశైలాగ్న। యోఽన్యే ఖ గజ బర్హిషః।........" (అహో ౧౮౯) రంగనాథకవి వివరణపద్యములు:—గీ. శౌరి ముప్పాటయెనుబది శకటరేఫ।ములును మున్నూట డెబ్బదిమూఁడు రేఫ।ములును దగు లక్ష్యముల వీనిఁ దెలియవలయుఁ। దద్విదుచ్చారణప్రభేదంబువలన. గీ. పరఁగ నేనూఱు శకటరేఫములు రేఫ।ములును నేనూట

యేఁబది యెలుఁగుచునుచుఁ। గొంద ఱార్యులు వలికిరి కొలఁదిపెట్టి। దాని నంగీకరించె నథర్వణుండు॥ (కవిరే. ౧ ఆ. ౬ పుట.) - "శిఖిశైలాగ్న్యయః (౩౭౩) ఖగజబర్హిషః (౩౮౦) హావ్యక్షజ్ఞైః ఖరరాన్ (౫౦౦) బిన్దుబాణశిలీముఖాన్ (౫౫౦)" ఈరీతి నథర్వణుని వాక్యము సంఖ్యాపరమని రంగనాథకవి యాశయము. ఈతని యాశయమునె నారాయణీయ గాణపతవివరణము లనుసరించుచున్నవి. అథర్వణునినాటికిని నేఁటికిని రేఫఱకారముల సంఖ్యల తీరు భేదింపలేదనుట కేవలము నసత్యమునకతేదు. అథర్వణుఁడు నన్నయభారతభాగ యతిప్రాసస్థలఘటిత రేఫఱకారశబ్దములనె యెన్నె నని యీవఱకు నిరూపితమయ్యెను. అయ్యవి యీరంగనాథకవి సంఖ్యలకు సరిపడి యుండలేదు (వై - పా - ౪౦౬ - మొ. ౪౧౦ విష). శబ్దరత్నాకరాది కోశములలోని రేఫఱకారఘటితశబ్దముల సంఖ్యలు వీనికంటె బొత్తిగా నధికములు. మఱియు "అన్యే స్తరితుఖచ్చశో, న్యేన యుక్తాః" (౨౦౦) అనుపాఠము నంగీకరించి రంగనాథకవి వ్యుత్పత్తిశకటరేఫఘటిత శబ్దములు రెండువందలని చెప్పెను గాని యొక పదిటికంటె నెక్కుడుగ నుదాహరింపఁ జాలఁడయ్యెను. పైసందర్భముచొప్పున నీసంఖ్యాపరార్థ మథర్వణాభిప్రేత మనుట విశ్వసనీయముకాదు. సంఖ్యాపరమె యైనచో "స్యురుచ్చార ణభేదతః। యథాయథం ప్రయోగార్హాః..." ఇత్యాదులకుఁ బ్రసక్తియే లేదుగదా. మఱియు గ్రామమానుషనామములలో రేఫఱకారనిశ్చయము లేనపుడు రేఫమునె నిల్పవలెనన్న యుత్తరవాక్యముచేఁ బూర్వవాక్యస్థ విషయములు నయిత మాయాపదార్థముల పేరులనుబట్టి రేఫఱకారనిర్ణయమును గ్రంథకర్త వచించుచున్నట్లు నిశ్చయించుట యుక్తముగదా. (వై - పా - ౪౪౫ మొ. ౪౫౦ - వ - విష).

వేద్యాశ్చైతే ప్రయోగేషు।స్యు రుచ్చారణభేదతః।
యథాయథం ప్రయోగార్హా।రేఫా స్సర్వే ప్రయోగతః।
నన్నయా ౫౭ VI విషయము — అనిశ్చయో భవే ద్యత్ర। గ్రామమానుషనామసు।
రేఫయో ర్నిశ్చయ స్తత్ర। రేఫమాత్రైకగోచరః॥
(వికృ - సంజ్ఞా - ౧౬ - ౧౭ - ౧౯ కారి॥ అహో
౧౫౦ పు)

కల్పతరు - ౫౭ VI విష:—రేఫఱకారయుక్తశబ్దముల నెన్నెడి యుపాయములను బైరీతిని స్థూలదృష్టి నుపదేశించి వానినిశ్చయము మహాకవిప్రయోగైకవేద్యమని తుది కుపదేశించుచున్నాఁడు. ఏతేచ = ఈరేఫఱకారములు, ఉచ్చారణభేదతః = పండితుల యుచ్చారణభేదమువలన, ప్రయోగేషు=ప్రయోగముల విష

యమున, వేద్యాః స్యుః=తెలియఁదగిన వగును. ప్రయోగతః = మహాకవుల ప్రయోగముల చొప్పుననే, సర్వే రేఫాః = సమస్తరేఫఱకారములును, యథాయథమ్ = యథాస్వరూపముగా, ప్రయోగార్హాః=ప్రయోగింపఁదగిన వగును. గ్రామనామానుష నామసు = గ్రామమనుష్యాదుల పేరులు కవిప్రయోగస్థములు కానపుడు, యత్ర = ఏస్థలమందు, అనిశ్చయః భవేత్ = నిశ్చయింపరాదో యచట, రేఫయో ర్నిశ్చయః= రేఫఱకారముల నిశ్చయము, రేఫమాత్రైకగోచరః = రేఫమాత్రమునకె విషయము కాఁదగును. ఱకారముగా నిశ్చయించు కవిప్రయోగము లేనపుడు రేఫమునె నిశ్చయింపవలె ననిభావము. కాకరపఱ్ఱు మొదలగు గ్రామనామములలో ద్విరుక్తతనుబట్టి శకటద్విత్వమె యని నిశ్చయింప నగును. తక్కిన - కారాడ - కోరాడ మున్నగుచోట్ల ఱకారనిశ్చయము లేమింజేసి రేఫమునే నిల్పవలయును;

| | |
|---|---|
| | య - వ - ల - లు లఘ్వలఘువులు మైత్రిం బొరయు |
| బాలవ్యాకరణ | రేఫంబులు పొరయవు. (ప్రకీ - ౨౮ సూ.) రేఫంబులు |
| వివరము. | లఘ్వలఘువులుం దక్కుంగల విశేషంబులు నార్య |
| ౫౭ VII విష | వ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు. (ప్రకీ. ౨౯ సూ). |

సంజీవని. ౫౭ VII విషః—'యవల' అనెడి యంతస్థముల లఘ్వలఘువులకు యతిప్రాసాదిమైత్రి సమ్మతమనియు లఘ్వలఘురేఫములకు యతిప్రాసాదిమైత్రి ప్రాచీనాంధ్రమహాకవిసమ్మతము కాదనియు ౨౮ సూత్రమునకుఁ దాత్పర్యము. (పొరయు = పొందు) మీఁద నుదాహరించిన రీతిని నన్నయాథర్వణులచేత నుపదేశింపఁబడినచొప్పునను, నన్నయాదిప్రాచీనమహాకవిప్రయుక్త యతిప్రాసాదిస్థలనిబద్ధ ప్రయోగములచొప్పునను రేఫఱకారముల స్వరూపములు దెలియఁదగును. అట్లె బాలవ్యాకరణమునఁ జెప్పఁబడని యితరలక్షణవిశేషములను సయితము మహాకవిప్రయోగాదుల మూలమునఁ దెలియవలయుననిసూరి స్వగ్రంథలోపమును బూరించికొనెను. (౨౯సూ) ఇది బాలవ్యాకరణము తుదిసూత్రముగాన నిందు శ్రేయంబు అనుశబ్దముచే గ్రంథాంతమంగళాచరణము నిర్వర్తింపఁబడెను.

ర - ఱల వివరణమువిషయము కల్పతరువునఁ గొంతవివరింపఁబడెను. తక్కిన విషయములు వైయాకరణపారిజాతమునఁ గననగును. (వై. పా. ౩౮౦ - మొ. ౫౦౨ వ. విష.)

సన్నయభట్టీ యము. ౫౯ పద్యము.

తజ్జా సమాచ దేశ్యా। గ్రామ్యా చేయం చతుర్విధా
భవతి। ప్రకృతిద్వయజా తజ్జా। తుల్యాతు సమా
ప్రవాహినీ దేశ్యా॥ (ఆం. చిం. సంజ్ఞా ౧౪ కారి)
(ప్రహ్లా ౧౭౨ పుట)

కల్ప. ౫౯ విష:—ఇయమ్=ఈయాంధ్రభాష, తజ్జా=తద్భవమనియు, సమాచ =తత్సమ మనియు, దేశ్యా = దేశ్యమనియు, గ్రామ్యాచ=గ్రామ్య మనియు, చతుర్విధా = నాల్గువిధములుగలది, భవతి = అగుచున్నది. ప్రకృతిద్వయజా=ఆద్యప్రకృతి ద్వితీయప్రకృతియు ననఁబడు సంస్కృతప్రాకృతములనుండి పుట్టినభాష, తజ్జా= తద్భవ మనఁబడును. ఇది సంస్కృతభవము ప్రాకృతభవము నను రెండువిధముల నేర్పడును. తుల్యా = సంస్కృత ప్రాకృత శబ్దములందు మార్పేమియు లేక నామవిభక్తి క్రియావిభక్తియోగ విషయకమగు మార్పుమాత్రము గలభాష, సమా = తత్సమ మనంబడును. ఇది సంస్కృతసమము ప్రాకృతసమము నను రెండు విధముల నేర్పడును. ప్రవాహినీ = ఆంధ్రలోకవ్యవహారప్రవాహమున వెలయు భాష, దేశ్యా = దేశ్య మనఁబడును. ప్రాకృతసమములు రెండువిధములు. ౧. సంస్కృతసమ ప్రాకృత సమము. ఇది సంస్కృతసమమె యనఁదగును. ౨. సంస్కృతభవప్రాకృతసమము. శ్రీః (సం) సిరీ (ప్రాకృతము) సిరి (ప్రాకృతసమము.). ఇవి చింతామణిమతమున నిట్లు తత్సమములుగా నంగీకరింపఁబడినను గేతనాది లాక్షణికు లిట్టివానిని దద్భవ ములనుగానె వచించిరి. వారు సంస్కృతసమములను మాత్రమె తత్సమము లందురు. సూరి యిట్టివానిని దత్సమములని చెప్పినను నివి వైకృతములు నాచ్ఛిక ములు ననివచించెను. (బా. ఆచ్ఛి. ౧ సూ). (విస్త. ౫౯ II విష, ౧౮౮ విష.).

బాలవ్యాకరణవివృతి. ౫౯ I. విష.

సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు. ౧౯

| సంస్కృతము | సంస్కృతసమము | సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|---|---|
| రామః | రాముఁడు | అగ్నిః | అగ్గీ | అగ్గి |
| విద్యా | విద్య | ఆటిః | ఆడీ | ఆడి |
| హరిః | హరి | ఆలిః | ఓలీ | ఓలి |
| ధేనుః | ధేనువు | (పక్షి.) | | |
| భువి | భువి | కటుః | కారో | కారము |
| పితా | పిత | గౌరవమ్ | గారవం | గారవము |

| | | | | |
|---|---|---|---|---|
| గౌః | గోవు | జటా | జడా | జేడ |
| నౌః | నావ | మిరా | మేరా | మేర |
| ద్యౌః | దివి | యమః | జమో | జేముఁడు |
| హృద్ | హృది | రాజ్ఞీ | రాణీ | రాణి |
| జగత్ | జగత్తు | శృఙ్గారః | సింగారో | సింగారము |
| | జగము | శ్రీః | సిరీ | సిరి. |

ఇత్యాదు లూహ్యంబులు. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౫౯ I విష:— ఆటిః = శరారిపక్షి = ఒకదెసను బాతు. ఆడిశబ్దము సంస్కృతమందును గలదు. "ఆడి - సం - వి - ఇ - స్త్రీ - ఆటి. ఆడేలు. క. ఆడి బకసాంపరాయము। వేడుకఁ జెప్పినను వినిన విఘ్నము లడఁగున్" (మార్కండే - ౨ ఆ. శ. ర)ఇట్టి ప్రాసస్థలసిద్ధసమాసమునుబట్టి 'ఆడి' శబ్దము సంస్కృత సమమె యనఁదగును. ప్రాకృతసమ మన్నచో నది యాచ్ఛికముగాన (బా. ఆచ్ఛి.౧ సూ) సిద్ధసమాసము దుర్ఘట మగును. ఆళిశబ్దమునకు సఖ్యాద్యర్థములు పెక్కుగలవు. ఓలిశబ్దమున కందలి పంక్తియను నర్థముమాత్రమె గలదు. గౌరవశబ్దమునకుఁ బ్రీతి యను నర్థము లేకున్నను దానివైకృతమగు గారవశబ్దమునకుఁ బ్రీతియనునర్థము నైతము గలదు. మిరాయను సంస్కృతశబ్దము శబ్దస్తోమమహానిధి శబ్దార్థచింతామణి కోశములలో లేదు, కాని మీరశబ్దము పుంలింగము సీమార్థకము శబ్దార్థచింతామణికోశమునఁ గలదు. "మీరః. పుం......సీమని...... శు - సి - చి - మీనాం దీర్ఘశ్చేతి క్రన్" (శబ్దా. చిం) "శు-సి-చి-మీనాం దీర్ఘశ్చ. (ఉణాది. ౧౮౩ సూ) శు - సౌత్రః - శూరః - సీరమ్ - చీరమ్-మీరః = సముద్రః" (సి. కౌ. బాలమ. ౧౦౮౫ పుట) సంస్కృతగ్రంథములం దిట్లుండఁగా నీక్రిందిరీతిని శ - ర - కోశమున వ్రాయఁబడుట వింత. "మిర-సం. వి. ఆ. స్త్రీ. మేర. మర్యాద." (శ - ర) "మిరాయాంలిత్ (౧-౨-౪౨) ఇత ఇత్యనువర్తతే—ఏదితిచ......మేరా - సీమా" (త్రివిక్రమశబ్దానుశాసనము) అను త్రివిక్రమసూత్రము (వాల్మీకిసూత్రమె) పై సూరిరచనకును, శబ్దరత్నాకరమునకును మూలము కానోపును. పరిశీలింపఁగా "మీరాయాం లిత్" అని త్రివిక్రమప్రయుక్త పాఠమైయుండు ననియు, బహుళాధికారములోని దగుటచేతఁగాని సూత్రారంభసామర్థ్యమునఁగాని "ఈ" కారమునకు "ఏ" కారము వచ్చెననియుఁ జెప్పుట యుక్తమనితోఁచెడిని.

సంజీవని. ౫౯ II విష:—ప్రాకృతసమములు సంస్కృతసమములవంటివి కావు. ఏవో కొన్నిశబ్దములు సంస్కృతసమములై తెలుఁగునను రాకున్నను (బా.తత్స.

౨౭ సూ) ప్రాయికముగా సంస్కృతశబ్దములెల్లఁ దత్సమములై తెనుఁగునఁ జేర వచ్చును. ప్రాకృతశబ్దముల కట్టిప్రవేశము లేదు. (౧౯ విష) కవిప్రయుక్తము లగు నేవో "సిరి" ప్రభృతులగు కొన్నిశబ్దములకు మాత్రమె తెల్గునఁ బ్రవేశము సమ్మతమగుచున్నది. అట్టిప్రవేశమునైన మచ్ఛాంధ్రవర్ణఘటిత ప్రాకృతశబ్దములకు మాత్రమె సమ్మతమైయున్నది. అనాంధ్రవర్ణములగు మహాప్రాణములతో నుండు "సోక్ష" ప్రభృతి ప్రాకృతశబ్ద మొక్కటికేని తెన్గునఁ బ్రవేశము కన్పట్టదు.

సంస్కృతసమప్రాకృతసమములగు "ఆణ" ప్రభృతులు సంస్కృతసమము లనియు సంస్కృతభవప్రాకృతసమములగు 'అగ్గి-సిరి.' ప్రభృతులు సంస్కృతభవము లనియుఁ (విస్తర) దక్కినలాక్షణికులెల్లఁ జెప్పుదురు. కాని చింతామణికర్తయుఁ దదనుయాయి సూరియు నట్లు సమ్మతింపరు. అట్టిద్వివిధములగు శబ్దములను వీరు

విస్తర. ౨౯ II విష:—"ప్రాకృతసమంబులు సంస్కృతభవంబులని వాడ నచ్చును. ఇందులకుఁ బ్రమాణము. క. వదలకసిద్ధాక్షరములఁ । బొదివిన వర్ణములఁ దూలిపోఁబలుకఁగ న। ర్థదమై ప్రాకృతనిభమగు । నది తద్భవపదమునాఁగ నభిమత మయ్యెన్" (కావ్యాలం. బా. గు. ప్ర. ౧౯ సూ. వ్యా) అనుగుప్తార్థప్రకాశికా వ్యాఖ్య ప్రామాదికము. గుప్తార్థప్రకాశికాకర్త యనుకొన్నట్లు పయిపద్యములోని ప్రాకృతనిభశబ్దమునకు ద్వితీయప్రకృతిసమమని యర్థముకాదు. దానికి దేశ్యసమ మని చూడామణికర్త్రభిప్రేతార్థము నెన్నఁదగును. తే ॥ గీ. విశ్రుతులు హేమ చంద్రత్రివిక్రమాదు । లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ । యాంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయమ కాన । వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ (కావ్యాలం ౯ ఉల్లా) అనిచూడామణికర్త వచించి యున్నాఁడు. మఱియుఁ జూడామణికిఁ బ్రాకృత సమములుబ్రాకృతభవములు ననుభేదముల నంగీకరించు నభిప్రాయమే లేదు. అందు సంస్కృతసమములు సంస్కృతభవములు ననుభేదములు మాత్రమె చెప్పఁబడినవి. కావుననె ప్రాకృతభవములుగా బాలవ్యాకరణమున నుదాహరింపఁబడిన "జేన్నము-పుడమి-వెన్నుఁడు-వెజ్జు"అనునవి పైపద్యములోని ప్రాకృతనిభ(దేశ్యసమ)తద్భవముల కుదాహరణములుగఁ జూపఁబడినవి. క. వదలక సిద్ధాక్షరములఁ । బొదివినవర్ణములఁ దూలిపోఁబలుకఁగ న। ర్థదమై ప్రాకృత నిభమగు । నది తద్భవపదమునాఁగ నభిమత మయ్యెన్. సీ. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు, చంద్రముండనుపేరు చంద మామ । యోధులు జోదులు యోగులు జోగులు, బృందంబు బిందంబు పృథివి పుడమి । విష్ణుండు వెన్నుఁడు వెజ్జునా వైద్యుండు, పుస్తంబు పొత్తంబు ప్రౌఢ ప్రోడ॥......(కావ్యాలం ౯ ఉల్లా. ౧౮. ౧౯ ప). సంస్కృతశబ్దమునందు వర్ణాగ

ప్రాకృతసమములనియె వాడుదురు. ఆడిప్రభృతి సంస్కృతసమప్రాకృతసమములను వీరిపక్షమున సైతము సంస్కృతసమములనియుఁ జెప్పుటలో విరోధములేకున్నను నట్టివి ప్రాకృతసమములును ననఁదగిన వగుటచేత బా. ఆచ్ఛి. ౧ సూత్రము చెప్పిన సూరిమతమున నవి యాచ్ఛికములయి యాచ్ఛికకావ్యప్రయోగయోగ్యము లగుచున్నవి,

సంజీవని ౫౮ III విష—ప్రాకృతమున 'చ-జ 'లకు దంత్యత లేదు-కాని వానితోనున్న ప్రాకృతశబ్దములు ప్రాకృతసమము లగునపుడవి యాచ్ఛికములె. యగును గాన వానిలోని "చ-జ"లకు దంత్యత సంభవించునని సూరియాశయము. కావుననె ప్రాకృతత్వావస్థలో "జడా-జమో" అని దంత్యతానుమాపకచిహ్నరహితముగను, ప్రాకృతసమత్వావస్థలో "జెడ-జెముడు" అనుదంత్యతానుమాపకచిహ్నసహితముగను, వానిలోని 'చజ' లు సూరిచేఁ జూపఁబడినవి.

సంజీవని-౫౮ IV విష:—"స్మరకటోర్వ్రీసర - కారౌ (౧-3-౧౦౦) అనయో ర్యథాసంఖ్యం ఈసర - కా రఇత్యాదేశౌ భవతః......కటుశబ్దే స్మరకటోర్వ్రీసర కారావితి కారాదేశే కారో ఇత్యాది రామవత్"(షడ్భా-౬౮-౬౬పు)(విస్తర) అను

గమాది వికారముగల్గినపు డాంధ్రదేశ్యనిభమై తద్భవమని పేర్కొనఁబడునని పై చూడామణిపద్యమునకుఁ దాత్పర్యము. కేతనమున్నగు లాక్షణికులుసైతము సంస్కృతసమేతరములగు దేశ్యేతరములను దద్భములనుగానే వ్యవహరించిరి. ఆ-వె. తత్సమంబునాఁగఁ దద్భవంబన నచ్చు। తెనుఁగునాఁగ మఱియు దేశ్యమనఁగ। గ్రామ్యభాషనాఁగఁ గల వైదుతెఱఁగులు। వేఱె వేఱె వాని విస్తరింతు. (ఆం. భూ. ౧౭ ప) క. మును సంస్కృతపదములపై। దెనుఁగువిభక్తులు ఘటించి తేటపడఁగఁ జె। ప్పిననది తత్సమమనఁ జను। వనము ధనము పురుషుఁ డబల వసుమతి యనఁగన్ (ఆం. భూ. ౧౮) అనిచెప్పి యిటఁ బ్రాకృతసమములగు 'సిరి' మున్నగువానిని సైతము తత్సమములలోఁ జేర్కొనక తద్భవంబులనుగానే వివరించెను. ఇట్లు తిమ్మకవ్యాదులును వివరించిరి. సీ......తే. గీ. స్నిగ్ధమునకు నిద్దంబుశ్రీకి సిరియు... తద్భవంబులు చెల్లు భూధరశతాంగ (సర్వల ౧ ఆ. ౩౦ ప) సంస్కృతసంబంధమును బట్టి మాత్రమె యవి తద్భవములని తెలియనగునుగాని యంతకన్న దేశ్యముతోడి భేదము వానియందుఁ జూపట్టదని చూడామణికారాదుల భావము. ఇట్లగుటచే నాంధ్రదేశ్యమం దుండరాని మహాప్రాణాదిఘటిత ప్రాకృతశబ్దములు ప్రాకృతసమములుగాఁ దెలుంగునకు రానేరవని ధ్వనితమగుచున్నది.

విస్తర. ౫౮ IV విష:—"ప్రాకృతసమంబులలోని 'కారము' అనుశబ్దము కూర

ప్రాకృతవ్యాకరణసూత్రముచెప్పఁబడెఁ బ్రాకృతమున 'కారో' అనునది కటుశబ్దభవ
మై యేర్పడుచుండఁగాను సూరి యుదాహృతిసమూల మగుచున్నది-(స్మరకటుక్షారీ సరకా
రౌ|౧-౩-౧౦౨| స్మరకటుశబ్దయో రీసర-కారశబ్దా వాదేశౌ యథాసంఖ్యం వా భవతః-
ఉదా—ఈసరో, సరో; కారో - కడూ.) (త్రివి-ప్రా-శబ్దా)-

---

శబ్దభవంబనియు క్షారశబ్దము కటుశబ్దపర్యాయంబనియుఁ గొందఱ యభిప్రాయము బాగుగనేయున్నది. "(బా. గు ప్ర. ౧౮. పుట. ద్వి. ము)" కార మను ప్రాకృతసమంబునకుఁ గటుశబ్దమును మూలముగఁ జూపుటకంటె వర్ణసారూప్యము ననుసరించి క్షారశబ్దమును మూలముగఁ జూపుట యుచిత మని ప్రౌఢవ్యాకర్త..." (బా. సా. వే. ౩౭ పు) ఈ ప్రౌఢవ్యాకర్తమతము బాగుగనె యున్నదనుట సరి కాదు. మఱియుఁ ప్రౌఢవ్యాకర్త యనకున్నను జేటికావ్యాఖ్యాత క్షారశబ్దమూలక మనుచు "కారము ప్రాకృతసమ" మనుటయు సరి కాదు. క్షారశబ్దమూలకత్వమున నది సంస్కృతభవమె యగును. "కారము క్షారశబ్దభవము ఇందు సారూప్యము గనంబడెడి. క్షారశబ్దము కటుశబ్దపర్యాయంబు నగు. త్రిరాత్ర ముభయో రధశ్శయ్యా. బ్రహ్మచర్యమ్. క్షారలవణవర్జనంచ అని యాపస్తంబసూత్రవాక్యము." (ప్రౌఢ సంజ్ఞా ౧౦ సూ.) ఈవిషయముల సూ. రా. నిఘంటువునందును నెక్కింపఁబడెను. వీరికి "క్షారము = కారము" (కవిసం. 3 తరం. ౮ పద్య. వివ. ౬౮ పుట) అను కవిసంశయవిచ్ఛేదోదాహృతి మూలమని తోఁచెడిని. ఈమతమువారు పై యాపస్తంబసూత్రములోని క్షారశబ్దమునకు వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థమును జూచికొనక లవణశబ్దసాహచర్యమునుబట్టి క్షారశబ్దము కటుశబ్దార్థకముగఁ బై సూత్రమునఁ బ్రయుక్తమయ్యెనని భ్రమించి రనఁదగును. "హైమశిమ్బికా రాజమాషా| మాషాముద్గా మసూరికాః|లజాః ప్రియకశ్చ నిష్పావాః| స్తిలాద్యాః క్షారసంజ్ఞితాః" (గార్గ్యనారాయణపండితరచితమగు నాశ్వలాయనస్మృతి వ్యాఖ్య ౮ ఖండ. ౧౦ సూ) ప్రౌఢవ్యాకరణకర్త తన శబ్దరత్నాకరమునందుసయితము క్షారశబ్దము కొన్ని రకముల పప్పుదినుసులకు వాచకమని వ్రాసియుండలేదు. క్షారశబ్దమును శ్రీనాథుఁడు భసితపర్యాయముగ వాడెనని యీక్రింది యాతనిగద్యమువలనఁ దెలియ నగును. "అమష్టంబులు నఫేనంబులు, నబుద్బుదంబులు, నక్షారంబులు నలవణంబులు నకలుషంబులు, నదుర్గంధములు, నయిన యుదకంబులు......(కాశీ. ౫ ఆ. పు)—" (భూతిర్భసితభస్మనీ| క్షారః.....అమర. స్వర్గ) భసితజలము లనఁగా బురదనీరు. నదీసముద్రాదుల జలములలో నుప్పులు బురదయు నుండుట సహజముకాని "బట్టి" [illegible] రసముండుట సహజముకాదుగదా. గుప్తార్థప్రకాశికాకర్త యీశ్రీనాథగద్య

సంజీవని-౫౯ V. విమ:—"సంస్కృతప్రాకృత తుల్యం బగుభాష తత్సమంబు" అనఁగా శబ్దావయవమునందు వికృతి యుండనట్టియు నాంధ్రవిభక్తియోగమునఁ దన్మూలకములగు మార్పులునుగలుగునట్టియు సంస్కృతప్రాకృతశబ్దములు తత్సమము లని యర్థము (విస్తర I. II)

---

మును జూపి "కార" శబ్దము కటుపర్యాయమని వ్రాయుట మిక్కిలి వింతగనున్నది. కారశబ్దమునకు "ఒజ్జ" అనునర్థము గలదనుటకుఁ బ్రమాణము కన్పట్టకున్నది. కారము కటుశబ్దమూలక మనుటలో రూపసామ్యము లేకుండుట శంకాస్పదము కానేరదు. "(సంస్కృ.) స్తమ్భః = (ప్రాకృ.) ఖంభో = (తద్భ.) కంబము" అనుచో నాకారసామ్యము లేకున్నను బ్రాకృతవ్యాకరణపద్ధతి ననుసరించి "కంబము" స్తంభ శబ్దమూలకము ప్రాకృతభవము నని ప్రౌఢవ్యాకర్త తన వైకృతదీపికలో సంగీక రించెను. "కంబము = గుంజె...... స్తమ్భః" (వై. దీ.)

విస్తర I. ౫౯ V విమ:—"అనఁగా సంస్కృతశబ్దములయుఁ బ్రాకృతశబ్దములయు నంతమందుండునట్టి దీర్ఘము విసర్గము మొదలగువానిని శాస్త్రప్రకారంబున మార్చి లింగభేదములనుబట్టి ప్రథమాదివిభక్తులను జేర్చినఁ దత్సమంబులగు. ఉదా. (సంస్కృ.) హరిః (సం. సమ.) హరి. (సంస్కృ) ధేనుః (సం - సమ) ధేనువు. (సంస్కృ.) పితా. (సం. స.) పిత......" (బా. గు. ప్ర. ౧౯ సూ. సంజ్ఞా.)అను గుప్తార్థప్రకాశికావ్యాఖ్య సరికాదు. చింతామణికర్తయుఁ దదనుయాయి సూరియు సంస్కృతప్రథమావిభక్త్యంతములను మూలముగఁగొని వానితుదివిసర్గాదులకు లోపమును విధించి యాంధ్రవిభక్తిమేళనము చేయురీతిని నజంతరూపసాధన ప్రక్రియను నడపలేదు. సంస్కృతప్రాతిపదికములను మూలముగఁగొని రూపసాధన ప్రక్రియను నడపిరి. "ఋకారంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు" (బా. తత్స. ౫౨ సూ.) ఇక్లై యంతటను బ్రక్రియ నడుపఁబడెను.

విస్తర II. ౫౯ V విమ:—'రామ - రాముఁడు; పితృ - పిత ; రాజన్ - రాజు ; బుద్ధిమత్ - బుద్ధిమంత - బుద్ధిమంతుఁడు ; అన్త - అంతము ; భూ - భువి' మున్నగుచోటులందుఁ గల్గినమార్పులు విభక్తియోగమూలకములగుటం జేసి యవి తద్భవతాపాదకములు కానేరవని యెఱుంగునది. "రాజు" శబ్దతత్సమత్వమును గూర్చి యీావలకే వ్రాయఁబడెను (౧౮ విమ.) అక్లై తెనుఁగువిభక్తులు కూడునపుడే 'అన్త' మున్నగువానిలోని వర్గపంచమములచో ననుస్వారము నిల్చి "అంతము" మున్నగురూపము లేర్పడును. అట్టి మార్పునైతము తద్భవతాసంపాదకము కానే రదు. (విస్తర. III. ౨౮ విమ. ౨౮ విమ.) ఇక్లై యంతటను గ్రహింపవలయును.

వన్నయా ప్రకృతిద్వయజా తజ్జా. (ఆం-చిం-సంజ్ఞా౧౮ కా.)
థర్వణి. వర్ణలోపాగమాసైకే, సర్వస్మింస్తద్భవే పదే.....
౬౦ విష. (వికృ సంజ్ఞా-౩-రా-కా-అహో. ౧౭౨ పు.)

కల్పతరువు - ౬౦ విష:—వీని వ్యాఖ్య ౧ VIII - విషయమున వ్రాయఁబడెను.

సంస్కృతప్రాకృతభవం బగు భాష తద్భవంబు. ౬౦

బాలవ్యాకరణ వివరణము ౬౦ I విషయము.

| సంస్కృతము. | సంస్కృతభవము. | సంస్కృతము. | సంస్కృతభవము. |
|---|---|---|---|
| ఆకాశః | ఆకసము | వక్రః | వంకర |
| కుడ్యమ్ | గోడ | వేసరః | వేసడము |
| చన్ద్రః | చెందురుఁడు | సముద్రః | సంద్రము |
| తమఙ్గః | తమగము | సూచీ | సూది |
| తామరసమ్ | తామర | స్మరః | మరుఁడు |
| నారాచః | నారసము | హారణమ్ | అరణము |
| నిఘః | నెపము / నెవము. | హారితాళమ్. | హారిదళము |
| ముఖమ్ | మొకము / మొగము | | |
| మృగః | మెకము / మెగము | | |

ఇత్యాదులు గ్రహించునది.

బాలవ్యాకరణ వివరణము సంజ్ఞా. ౬౦ I విష.

| సంస్కృతము. | ప్రాకృతము. | ప్రాకృతభవము. |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చెర. |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరమ్ | అచ్చెరువు. |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణమ్ | పయనము |
| ప్రవాళమ్ | పవాళో | పవడము / పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చెరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |

| | | |
|---|---|---|
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వెజ్జో | వెజ్జె |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

సంజీవని - ౨౦ I విష:—సంస్కృతప్రాకృతభవం బనఁగా సంస్కృతప్రాకృత శబ్దములందు వ్యవహారవశమున వర్ణాగమ వర్ణాదేశ వర్ణలోప వర్ణవ్యత్యయ భిన్నతాది వికారములుగల్గుటచే వేఱురూపున నేర్పడుట యనియర్థము. అట్టి వికృతులను బైసూరిగారి యుదాహృతుల నెన్నఁనగును. వర్ణాగమ—(సం) వక్రః = వంకర; వర్ణాదేశ—(సం) ఆకాశః = ఆకసము; వర్ణలోప—(సం) తామరసమ్ = తామర; వర్ణవ్యత్యయ - (సం) పారావతః = పావురము; భిన్నత - (సం.) వక్రః=వంకర మొ. ఇట్లాకారమందే కాక యర్థమునందును మార్పుగల్గుట గలదు. (సం.) గౌరవమ్ = గురుత్వము-(తద్భ) గారవము=ప్రేమము-మొ. "ప్రవాలో" అనురూపము "పా ఇ ఆసద్ద మహార్ణవ" మందుఁ జూపఁబడెను. కాని రేఫము లోపించుట, పైశాచీతర ప్రాకృతములలో శత్వమగుట, ప్రాకృతవ్యాకరణ సిద్ధములు గాన సూరి యుదాహృతియె సమంజసము. "బాలవ్యాకరణ ప్రథమముద్రణమున "వేజ్జో" అని ప్రాకృత రూప ముదాహరింపబడెను. ద్విత్వపరకత్వమున దీర్ఘమునకు హ్రస్వత ప్రాకృత వ్యాకరణసిద్ధ మను (రాజ్యమ్ = రజ్జం) తలంపున నర్వాచీనులు దిద్దిరనఁదగును. తమజ్గః = మంచె; నిభః=వ్యాజము; వేసరః=గాడిద (ఆడుగుఱ్ఱమునందు గాడిదవలన జన్మించినది); పనస=ఏఁబది పదములుఁగల మంత్రము; అఙ్గారః = కొఱవి; ఇంగలము= బొగ్గు. ఇట నర్థపరిణామమును గ్రాహ్యమై ననఁదగును. కాని "అఙ్గార" అను సంస్కృత ప్రకృతికిని "బొగ్గు" అనునర్థము గలదని కొన్నికోశములలోఁ గలదు. ఇంగాల శబ్దము సంస్కృతమందే కలదని కొన్నికోశములలో నుదాహృతమై యున్నది. (విస్తర I-II) ఇట్లె "కల్హారము, పట్టణము" మున్నగు ననేకప్రాకృతశబ్దములు సంస్కృతమునఁ జేరినవి. "(సంస్కృ) స్తమ్భః - (ప్రా) ఖంభో - (వై) కంబము" అని

---

విస్తర. 1 ౨౦ I విష:—"అఙ్గార—అస్త్రీ. (అఙ్గ+ఆరన్)అర్ధదగ్ధే, అగ్నిసంక్రాన్తే, అగ్నిశూన్యేవా,అఙ్గార ఇతిప్రసిద్ధే కాష్ఠఖణ్డే" (కొఱవి) (శబ్దస్తో). "అఙ్గార. అస్త్రీ౧ భృఙ్గరాజః, ౨ అగ్నియుక్తమ్, 3 ఇఙ్గాలమ్. (తె) బొగ్గు" (సర్వ. సంబో) "ఇఙ్గాలః—అ; పు. శిఖికః (తె) బొగ్గు" (సర్వ. సంబో.) "ఇంగాలము - ప్రా. వి.

పూరాక్షి యుదాహరించి యుండఁగా సూ-రా-నిఘంటువున 'కంబము. వి-(సం) స్కమ్భః (ప్రా) కంభో..." అని వ్రాయఁబడి యున్నది. ప్రకృతివికృతులకు వర్ణసామ్యము చాలవని కాఁబోలును సూ. రా. నిఘంటుకారు లిట్లు మార్చి వ్రాసిరి. స్కమ్భ శబ్దము శబ్దస్తో. శబ్దా. చిం. కోశములలోఁ గన్పట్టలేదు. ష్టుభి-ష్టభి-స్తభిజ్ స్తమ్భే। స్కభి ఇ ప్రమ్భుః స్మృతః" (కవికల్పద్రుమము) అనుచొప్పున స్కభి ధాతువు నుండి యేర్పడిన స్కమ్భశబ్దము నెందేని కనిరేమో? కావుననే ప్రాకృతరూపము "ఖంభో" అని యుండఁగా వీరు "కంభో" అని ప్రాకృతరూపమును జూపిరి. ప్రాకృత వ్యాకరణములందెల్ల "ఖంభో" అను ప్రాకృతశబ్దము మాత్రమె స్తమ్భశబ్దమునుండి సాధింపఁబడి యున్నది. "స్తమ్భే. (౪౮) ౧౧. స్తో రిత్యనువర్తతే. త్వేతచ. స్తమ్భే ఖో స్సంయుక్తస్య ఖకారో భవతి తు. ఖంభో-థంభో. కాష్ఠాదిమయః..." (త్రివిక్ర. ప్రా. శబ్దా. ౧ అధ్యా-౪ పా ౧౧ సూ). "స్తమ్భే - (౧-౪-౧౧) ఖ లిత్యనువర్తతే, స్వేతే చ, ఖోరితిచ. స్తమ్భే ఖో రాదేశ స్సంయుక్తస్య ఖకారో వా స్యాత్. ఖమ్భో సపక్షే-కగేతిసలోపే థమ్భో." (షడ్భా ౨౪ పు.)

---

అ. పు. బొగ్గు." (శ. ర) "అఙ్గారచుమ్బిత మివ వ్యథమాన మాస్తే. అనినిప్పు పక్షమునఁ బ్రయోగము. కళఙ్క స్తత్ర తోన్యే। వ్రజతి మలినాఙ్గార తులనామ్. అనిబొగ్గు పక్షమునఁ బ్రయోగము. నిప్పువేరు—బొగ్గువేరనికొందఱు" (గురుబాలప్రబోధిక= లింగాభట్టీయము). "అఙ్గారే శతధా తేఽపి। మాలిన్యం నైవ గచ్ఛతి" (వాచస్పత్యోదాహృతము) "వితేను రిఙ్గాల మివాఽయశః పరే" (నైష. ౧ సర్గ. ౯ శ్లో.) (తెలుఁగుముద్రణము.) "వితేను రఙ్గార మివాఽ యశః పరే" (నైష. ౧ సర్గ. ౯ శ్లో. నాగరముద్రణము. కలకత్తా) "పక్వాఙ్గారలలాటేతు" (౧. ౨. ౧౨) పక్వ - అఙ్గార-లలాట - ఇత్యేతేషు ఆదేరవర్ణస్య ఇత్వం భవతి. (సం.)పక్వమ్ (ప్రా) పిక్కం, పక్కం, (సం.) అఙ్గారః (ప్రా) ఇంగాలో - అంగాలో; ......" (త్రివిక్ర. ప్రా. శబ్దా. ౨౨ పు.)

విస్తర II. ౬౦ I విష:—"ఇందలి యుదాహరణములెల్ల సంస్కృత పదములు మూలముగాఁ గలవియేగానఁ బ్రాకృతసముభవములనెల్ల సంస్కృతభవములుగా నిర్ణయించి ప్రాకృతసమభవవిభాగము లనావశ్యకము లనఁ జనును. కాని సంస్కృతమునఁ జూపట్టని ప్రాకృతదేశ్యములనుండి కలిగిన పదములు తెలుఁగుననైనఁ జూపశక్యమేని యవ్విభాగములకు సార్థక్యము సంభవింపకపోదు." (బా. వ్యా. పే. ౨౦ సూ. వ్యా.)అని వ్రాసెనే కాని పేటికావ్యాఖ్యాత యట్టి ప్రాకృతదేశ్యములనుండి కలిగిన ప్రాకృతసముభవశబ్దముల నుదాహరింపఁ జాలఁడయ్యె. మఱియు

ఈయి సందర్భమునుబట్టి సూరిగారి వ్రాఁతయె సమూల మగుచున్నదనఁ దగును.

సంజీవని. ౬౦ II విష:—మహాకవిప్రయుక్తములగు పెక్కుతద్భవములు శబ్దరత్నాకరాది కోశములలో నుదాహరింపఁబడలేదు. సరిగాఁ జూచికొనక కొన్ని సమస్తపద తద్భవములు లక్షణవిరుద్ధములని కొందఱు భ్రమించుచున్నారు. శబ్దరత్నాకరకర్త యట్టి వానిలోఁ గొన్ని యనింద్యగ్రామ్యములనుచు నుదాహరించెను. మఱి కొందఱు వానినిజరూపమును జూచికొనక లేఖకపాఠకాదుల ప్రమాదమునఁ బడియున్న ప్రామాదికరూపములతో గ్రహించి కవులు వైరిపదదోషమును బ్రయోగించిరని తలంచుచున్నారు. సమస్తపదముల తద్భవములు పెక్కు కవిప్రయుక్తములై యున్నవి. ఉదా: (సం.) వాల్మీకేశుఁడు (తద్భ.) వాలుమీకేసుఁడు.

---

“చూపశక్యమేని” అనునాతని వాక్యమునుబట్టి యట్టి యభిప్రాయపు దౌర్బల్య మంగీకృతమగుచున్నది. ఇంతియకాక యట్టి యేవో మృగ్యశబ్దముల పట్టున మాత్రమే ప్రాకృతసమ ప్రాకృతభవవిభాగము సార్థకమనుటచే సూరిచూపిన యుదాహృతులలోఁ బ్రాకృతసమభవములకును, సంస్కృతభవములకును వైలక్షణ్య మేమియు లేదనియు యాదృచ్ఛికముగా వానివానిని వేర్వేఱ సూరి యుదాహరించెననియుఁ జేటికాకర్త తలంచెనని విశదమగుచున్నది. అది సరి కాదు. (మూ. ౧౯ విష.) సంస్కృతశబ్దములు వర్ణలోపాదివికృతుల నందుటలోఁ బ్రాకృతపద్ధతి విరుద్ధ వికృతుల నందునపుడు మాత్రమే యవి కేవలసంస్కృతభవములనియుఁ బ్రాకృత పద్ధత్యనుసారి వికృతుల నందునపు డవి ప్రాకృతద్వారమున వచ్చినవనఁ దగుటం జేసి వానిని బ్రాకృతసమభవములనఁ దగుననియు నొకయేర్పాటు మనసున నిడికొని సూరి యుదాహరించెనే కాని యాదృచ్ఛికముగా నుదాహరించినవాఁడు కాఁడు. ఆకాశశబ్దము ప్రాకృతమగునపుడు “ఆ ఆస = ఆయాస” అని యేర్పడును. అట్లె కుడ్యశబ్దము ప్రాకృతమగునపుడు “కుడ్డ” అని యేర్పడును. నారాచశబ్దము “ణారాఅ = ణారాయ” అని యేర్పడును. మృగశబ్దము “మిఅ = మియ” అని యేర్పడును. సూచీశబ్దము “సూఈ” అనియేర్పడును. సముద్రశబ్దము “సముద్ద” అని యేర్పడును. అవి యట్టిరూపములకు విలక్షణములగు “ఆకసము, గోడ, నారసము, మెకము, సూది, సంద్రము” అనురూపముల నందునపు డవి ప్రాకృతద్వారమున వికృతుల నంద లేదనియు నట్లగుటచే నవి వేఱువిధముగల సంస్కృతభవములనియుఁ జెప్పుట యుక్తముగదా. అట్లే తక్కినవానియందును బ్రాకృతపద్ధతి వైలక్షణ్యము నరయునది.

(సం.)-త్రయోదశ (తద్భ) తేరసులు. (చూ. చంద వ్యా. III విభాగ. ౨౪-3౪ సూ. త్రయోదశ = తేరసు) (సం.) తపోనిధి (తద్భ.) తవనిది. (సం.) పృథివీశుఁడు. (తద్భ.) పుడమీసుఁడు. మొ. (విస్తర.)

---

విస్తర. ౬౦ II విషః—ప్రయోగములు:—ద్విపద = ఆ వాలుమీఁ కేసుఁ జుత్తుఁ గలంగ। (బసవ. ౪ ఆ. ౭౬౪ ప.) థారుణి వెలయరే తేరసు లనఁగ (బసవ ౬ ఆ ౪౬౪ ప) పగతుఁ డాసించునే పరధనంబునకు। మృగపతి యెద్దైన మేయునే పుల్లు! (బసవ. 3 ఆ. ౧౭) ఇట్టిప శబ్దరత్నాకరమున సంగ్రహింపఁబడలేదు. "కర్నా టాంధ్రలాక్షణికులు కావ్యదోషములలో గణించిన వైరిపద మను శబ్దదోషము వీరి (శివకవుల) కృతులలోఁ బెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది. దీపగంభములు... మజ్జఁబావి......తవనిధి......" (బసవపురాణపీఠిక. ౯౭ - ౯౮ పుట.) ద్విపద. సజ్జనలీల మజ్జనబావిలోన। యజ్జలంబులు......(బసవ.౬ ఆ. ౨౪౧ ప.) ఇటఁ దా లవ్యజకారమును నిల్పి వైరిపదదోషము నారోపించుట సరికాదు. మజ్జనశబ్దభవము 'మజ్జనము' అనుట లెస్స. ద్విప. భువి జనులెల్లను బొగడుచు నుండఁ। దవనిది దేదర దాసయ్య కీడె (బసవ. ౬ ఆ. ౪౯౮) ఇట "తవనిధి" అని వర్గచతుర్థమును నిల్పి వైరిపదదోషము నారోపించుట సరికాదు. ఇట్లే 'తపోరాజ' శబ్దభవము 'తవ రాజు' అగును. ద్విప. తవరాజు వల్లభుఁడు. (బసవ. ౫ ఆ. ౪౪౧ - ౪౪౨. సూ. రా. ని.) "పుడమీశుఁడు. వై. వి. గ్రా. రాజు." (శ. ర) ఇచట "పుడమీసుఁడు" అను తద్భవరూపము నంగీకరించుట యుచితము. కాని "ద్విపద—పుడమీశ మీఁ ధనం బునకుఁ జేసాఁప। నొడలి కిచ్చితి......(బసవ. 3 ఆ. ౨౪ ప.)అనుచోట సంబో ధనమున సంస్కృతేతరములకు"డు"లోపము రాదుగాన "పుడమి" శబ్దము సంస్కృ తమె యని గ్రహింపకతీరదు. "పుడ ఉత్సర్గే." అను ధాతువుమీఁద "పచాద్యచ్" అనుచోప్పున "అచ్" ప్రత్యయము రాఁగా 'పుడ' శబ్ద మేర్పడును. పిదప "పుడం మినోతీతి=పుడమిః" అనుప్రక్రియచొప్పున 'పుడమి' అనుసంస్కృతశబ్దము సిద్ధించును. "మి క్షేపే" అను స్వాదిధాతువుపైని "క్విప్" ప్రత్యయమునిల్పి పైరూపమును సాధించునది. సస్యాదులను విరఁజల్లునని వ్యుత్పత్త్యర్థము నెన్నునది. పాల్కురికిసోమ నాథుఁ డిట్టిరూపములను బ్రయోగించుట వింతకాదు. "దీపకఁభంబు లెత్తించిన యట్లు" (బసవ. ౧ ఆ. ౧౨3 ప.) "దీపగంభములు. కంభమని సంస్కృతశబ్దము లేదు గావునను, ఉన్న దనుకొన్నను దెనుఁగుసంధి చొప్పున "క" "గ" యగుట యసంగతము గావునను నిది వైరిసమాసమె. తెనుఁగుపలుకులలోఁ గొన్నింట వర్గ ద్వితీయచతుర్థాక్షరములు గలవు. ఆంధ్రవ్యాకరణకర్త లవి లేవనుట యసంగతమని

సంజీవని - ౬౦ III - విష:—తద్భవ ప్రపంచమును సరిగాఁ బరిశీలించికొనక నేఁటి ముద్రణాసంస్కర్తలు "డ ఢ" ప్రాసము మున్నగునవి మహాకవిసమ్మతములని తలంచుచున్నారు. శా. ఏడక్షౌహిణు లిట్లు పాండవబలం బేకాదశాక్షౌహిణుల్। రూఢిం గౌరవసైన్య మీయుభయమున్ రోషాహతాన్యోన్యమై। (ఆది. ౧ ఆ. ౭౦ ప.) ఇచట రూఢిశబ్దభవమగు "రూడి" శబ్దమును నన్నయ ప్రయోగించెననియు డ-ఢ ప్రాసము నంగీకరింపలేదనియు గ్రహింపవలయును. ఉ. కాదన కిట్టి పాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం। బోధనఁజేసి చేసె (ఆది. ౧ ఆ. ౧౨౩ ప. ౨ ఆ. ౨౦౮ ప.) ఇచట భట్టారకుఁడు "ఏకవిప్రసంబోధనఁజేసి చేసె" అని ప్రయోగించెననియు ద-ధ ప్రాసము నంగీకరింప లేదనియు నెన్నఁదగును. ఇట సాధ్యసమాసమును 'సంబోదన' అనుతద్భవమును నన్నయచే నంగీకరింపఁబడె ననితలంపనగును. చ. నిరురుతి వారి మాయల కనిం బ్రతిమాయ లొనర్చి ... ... (నన్ని. కు. ౧౨ ఆ. ౮౨౨ ప.) (సం. నిర్బృతి (తద్భ) - నిరురుతి.) పాల్కురికి సోమనాథుఁడు

---

నాతలంపు......సోమనాథుఁడే- కంభకట్లను మేలుకట్లను బోలుచు । గంభీరపుష్ప కాగారంబునందు । (బసవ. 3 ఆ. ౧౨౮ ప.) అని "కంభ" పదమును బ్రయోగించెను" (బసవపురాణపీఠిక. ౯౮ పుట.) ఈవ్రాఁత సరికాదు. (చూ. విస్తర I. ౨౧ II విష.) "౧౯౮౮ సూ. కం శం భ్యాం వ భ యు స్తి తు తయసః (౫. ౨. ౧౩౮) ... ... కంవః-కమ్భః" (సి. కౌ. తద్ధిత. పాఞ్చమిక) అను పాణినీయము చొప్పున "కంభ" శబ్దము సంస్కృతమునఁ గలదనుటకు సందియములేదు. "కమ్ - అస్యాస్తీతి కమ్భః "కమ్. అవ్య. పాదపూరణే. జలే. మస్తకే. సుఖే. మజ్జలే" (శబ్దస్తో.) "దీపకంభంబు లెత్తించినయట్లు" అనుపద్యమున "గ" కారాదేశముతో ముద్రితమే కాలేదు. అచట సరళమగు "గ" కార మున్నదనుటకుఁ బ్రమాణము లేదు. మఱియు నచ్చ తెనుంగున వర్గచతుర్థము గలదని యిట నంగీకరింపవలసిన యావశ్యకత లేదు. కంభశబ్ద మిట శుద్ధసంస్కృతమె యగుచున్నది. "దీపకంభ" ములన్నది సిద్ధసమాసమే యగుచున్నది. కంభశబ్దము తద్భవమన నేల? తద్భవములలో వర్గయుక్కులు లేవనెడి వైయాకరణవచన మసంగత మననేల? సోమనాథుఁడు స్థలాంతరమునఁ బ్రయోగించిన "కంభకట్లను మేలుఁకట్లను బోలుచు" అనుపద్యమునందలి "కంభకట్ల" నుపాఠము ప్రామాదికము "క భకోట్లను మేలు కట్లను బోలుచు। గంభీరపుష్ప కాగారంబునందు" అనుచో "కంభకోట్లను" అనుపాఠము కవిప్రయుక్తము కానోపును. అచట "కట్టు" శబ్దము సుసంగతమును గాదు, కోటిశబ్దము సమర్థమయి యున్నది.

పయి నన్నయాదుల ప్రయోగముల నరసియే కావలయు నీక్రిందిరీతి వింతవింత తద్భవములను బ్రయోగించెను. "ఉపాద్దేయయ్య" (బసవ. ౭ ఆ. ౨౦౯ పు.) (సం) ఉపాధ్యాయ (తద్భ) ఉపాద్దేయ. "ఉపా.ద్దేలయ్య" అను ముద్రణము సరికాదు. "ఆలిసేయుచుఁ బల్కు నది తద్దె కాఁగ" (బసవ. ౩ ఆ. ౭౬ పు.) (సం.) తథ్య (తద్భ) తద్దె. పై పద్యములో "తథ్య కాఁగ" అని ముద్రించుట సరికాదు. "దమ్మ కవిల" (బసవ. ౭ ఆ. ౨౨౩ పు.) ఇట "ధర్మకవిలె" అను ముద్రణము సరికాదు. (సం.) ధర్మకపిల (తద్భ.) దమ్మకవిల. "ధర్మార్థముగ విడిచిన కపిలగోవు" అని యర్థము. (విస్తర.)

---

విస్తర ౬౦ - III విప:—బసుమానఁగలిసె (బసవ.౭ ఆ. ౨౧౬ పు.) (సం.) భస్మాన=(తద్భ) బసుమాన. మాజనము (బసవ ౭ ఆ. ౨౧౩ పు.) (సం) మహాజన. "సహాయము = (తద్భ.) సాయము" అనుచోటనువలె "మహాజన" శబ్దము "మాజన"అని యేర్పడుట వింతకాదు. ఉదుబటుఁ డవనొప్పు (బసవ. ౭ ఆ.౨౧౯పు.) (సం) ఉద్భట. వేగ మింతేలయ్య విరుపాచ్చదేవ-(బస-౭ఆ౨౮౨ పు.) (సం.) విరూపాక్ష. జంగమకోటికిసడిసన్నదాసి (బస ౧ ఆ. ౬౦ పు.) శంకర నీబంటు శంకర దాసి (బస. ౨ ఆ. ౮౬ పు.) 'కాక-కాకి' అనురీతిని 'దాస=దాసి' అని యేర్పడ నగును. 'శంకరదాసి' అను సమాసము 'కృష్ణరాయఁడు' అనుదానివంటిది కానో పును, లేదా శంకరదాస శబ్దభవము 'సంకరదాసి' అని కావచ్చును. ఇట్లె తాపసశబ్ద భవము తాపసి. (బస. ౧ ఆ. ౨౬ పు.) నంబియు గింబియు నంబికిఁగూర్చు | సంబుండు గింబుండు సకలభక్తులకు | (బస. ౮ ఆ. ౧౨౯ పు.) శంభుఁడు శబ్దభవము సంబుఁడు. ద్విపద-ఆసివదేవుఁడు నంతఁ గోపించి | యోసి నేఁడేల........(బస. ౩ ఆ. ౭౨ పు.) శివ(తద్భ) సివ-ద్వి. మా శివసోదరి...పాసెంబు(బస. ౩ ఆ.౭౧ పు.) అనుపాఠము సరికాదు-'మాసివుసోదరి' అనుట యుక్తము. తన్ను మహాభక్త తతి నుద్దెసించి(బస.౩ ఆ.౭౨పు.) ఉద్దేశించు-తద్భ-ఉద్దెసించు. ఆస్వాదించు (కాశీ. ౫ ఆ. ౧౧౪.) మంగళారతులెత్తి (బస.౨ ఆ.౨౯) (మంగళారాత్రిక-తద్భ-మంగళారతి. బస వయ్య. (బస. ౧ఆ. ౨౬పు.) వృషభ-తద్భ-బసవ. ఇచ్చితే బ్రదుకుమా యీసరయ్య యను (బస) ఈశ్వర-తద్భ-ఈసర. బుజ్జగించును వెజ్జు బుజ్జను బెట్టి-|నిజ్జీవిక్రియఁ బడు నివ్వెఱఁగందు. (బస. ౩ ఆ. ౭౧ పు.) నిర్జీవి-తద్భ-నిజ్జీవి. కజ్జంబు నావుఁడు సజ్జలుఁడంత | లజ్జయు......(బస. ౮ ఆ. ౧౦౭ పు.) కజ్జంబు మీఁ దెఱుంగక పల్కు బల్లు | బిజ్జలక్షోణీశ...(బస. ౫ ఆ. ౧౮౫ పు) కార్యము-తద్భ—కజ్జము. ఈచో ట్లయందెల్ల 'నిర్జీవి-కర్జము'అను రూపములను నిల్పి బసవపురాణపీఠికాకర్త ప్రాసంబు

లందు శివకవులకు 'కతిపయ హల్స్వామ్యమున్నను జాలు'నను నూతనసిద్ధాంతము నంగీకరించుట సరికాదు. మీఁద నుదాహరించినరీతిని వింతవింత తద్భవములను బ్రయోగించు సోమనాథకవి యిటుచటనైతము "నిజ్జీవి-కజ్జము" అను తద్భవముల నంగీకరించె ననుటయే యుక్తముగదా. కార్యశబ్దమునకు 'కజ్జేము-కర్జము'అను వికృతిద్వికముండుటయు వింతకాదు. శ్రీ-తద్భ-సిరి=తిరు; భక్తి-తద్భ - బత్తి=బగితి; లక్ష్మీ-తద్భ-లచ్చి=లక్కిమి; (లచ్చమ్మ-లక్కాంబ). ఆశ్చర్యము-తద్భ-అచ్చెరువు=అచ్చేరువు, ఉజ్జయని-తద్భ-ఉజ్జేని=ఉజ్జేని." అని యిట్లుగ నొక్కప్రకృతికి వికృతిద్వికముండుట ప్రసిద్ధమె. ద్విపద-సిరి మహాదేవుఁ డౌ సిరి గిరిపతికి|సిరి వాసుదేవాది సురులు సకుంబె, (బస. ౬ ఆ. ౨౦౧ పు) (సిరి=శ్రీకరమైన) కలితాత్ములై తిరు కాళాత్తి పురిని (బస. 3 ఆ. ౮౮పు) శ్రీ-తద్భ-తిరు.కాళహస్తి-తద్భ-కాళాత్తి. గీ-అట్టి మహిమల యుజ్జేని కరుగు...(కాశీ. 3 ఆ. ౧౦3) కం. ఏనును.........ఉ| జ్జేనికి.........(దశకు. 3 ఆ. ౫౯) మృగముపై పుట్టుఁడు మిమ్ము వధించి|బగుతుఁ డొక్కఁడు......... (బసవ. 3 ఆ. ౮౧పు.) ఈతని బగితియు... (బస. ర ఆ. ౧౭౯ పు.) క-బత్తులు నునువా కత్తుల| మొత్తిరిపశు...(పాండు. 3 ఆ. ౪ర.) సోమనారాధ్యుఁడు 'నిచ్చ-నిత్య' అను రెండిటిని, నిత్యశబ్దభవములనుగా నంగీకరించి ప్రయోగించెను. నిచ్చేఁ బార్వతి పూయుఁ బచ్చవిభూతి|యిచ్చె నొక్కయ్యనా కీమునిమాపు (బస. 3 ఆ. ౫౯ పు.) నిత్య నేమం బిది నేఁటి మ్రగ్గునకు| ముత్యాల పోడిమాకు ముక్కున వలయు (బస. ౨ ఆ. రర పు.) 'కన్నియ=కన్నె=కన్య' అనునవి కన్యకాశబ్దభవము లయినట్లు "నిత్తియము-నిత్తెము-నిత్య" అనునవి నిత్యశబ్దభవము లగుట వింతకాదు. సీ-"ధృతిఁగుంతిసుద్రభూపతుల నెయ్యపుఁ గన్యకలన" అనిరాఘవపాండవీయమున 'కన్య' అనువైకృతము ప్రయోగింపఁబడెను. ఇట్టి తద్భవస్త్రీసమశబ్దముగ 'నిత్య' అనుదాని నంగీకరించిబసవపురాణములోని "నిత్యపడి - నిత్యనేమము" మున్నగు వానిని సమర్థించుకొనుట యుక్తము. కాని బసవపురాణపీఠికాకర్త వ్రాసినట్లు సోమనారాధ్యుఁడు వైరిపదమును బ్రయోగించె ననుట సరికాదు. ఇట్టియెడల 'నిత్య' అనునది చరిత్రాదులలోని దగుటచేఁ దత్సమమను సూ. రా. నిఘంటుమార్గమును సరికాదు. దాని తత్సమత్వమునకుఁ బ్రమాణాంతరము కన్పట్టలేదు. ద్వి-మీఁద త్తిమీ ప్రాంత మీఁధర్మకపిల| మీఁదాసు ననుఁ గావరే దయతోడ (బసవ. ర ఆ. ౧౦౨౨) ద్వి, అవుదలల్ వంచుచు నయ్య మీఁదమ్మ|కపిలల మునుచును గడుదైన్యపడుచు (బసవ-2 ఆ. 3౯2 ప.) బసవపురాణపీఠికాకర్తగారిచట రెండుపద్యములందును "ధర్మకవిలె" అనినిల్పిరి. సూ. రా. నిఘంటుకారులట్టిపాఠము నేస్వీకరించిరి - ఈపాఠములు ప్రామాదికములు. (౬3 III వి.)

త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు. ౨౧

బా. వ్యా. ౭౧ విష. ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, దూడ, మేడ, కోఁత, రేఁత, తావి, మోవి. ఇత్యాదు లర యునది.

సంజీ. ౭౧ విష:—'ప్రవాహినీ దేశ్యా' అను చింతామణి సూత్రమున కిది వివరణము. తావి = పరిమళము. మోవి = అధరోష్ఠము. పేట = హారములో నొకసరము. ఊరు శబ్దము పూర్ శబ్దభవ మని కొందఱుతలంచుచున్నారు. త్రిలింగ దేశమునందలి వ్యవహారప్రవాహమున మాత్రము వెలయు భాష యాంధ్రదేశ్య మనితాత్పర్యము. దేశ్యశబ్దములకు వ్యుత్పత్తుల ననఁగాఁ బ్రకృతిప్రత్యయాది విభాగమును సువిస్తరముగ వైయాకరణులు వచించియుండలేదు. కాన వానికి లోకవ్యవహారమె మూలమనుట యుక్తము. "దేశ్య మార్షంచ రూఢత్వాత్ । స్వతన్త్రత్వాచ్చ భూయసా ॥ లక్ష్మ నాపేక్షతేతస్య । సంప్రదాయో హి బోధకః॥... దేశ్య మవ్యుత్పత్తిమత్త్వా। త్ప్రాకృతత్వేన కథ్యతే ॥" (హేమచంద్రుఁడు. ఊహో ౧-౨౮ పు) ప్రకృతిసిద్ధ మనఁగా స్వభావసిద్ధమగునది ప్రాకృత మను చొప్పున దేశ్యమును బ్రాకృతమనియు వ్యవహరింపఁదగు ననితాత్పర్యము.

రూపమునందును నర్థమునందును సంస్కృతప్రాకృతశబ్ద సంబంధము లేనట్టియు నన్యదేశ్య వ్యతిరిక్తమయినట్టియు నాంధ్రదేశ వ్యవహారప్రసిద్ధ మగునట్టియు శబ్దము దేశ్యమని గ్రహింపవలయును. సూరి యన్యదేశ్యము నంగీకరించువాఁడు కామింజేసి యతని పక్షమున దేశ్య మనఁగా నాంధ్రదేశ్యమనియే యర్థము. "తావి, మోవి, కౌను, మే నిత్యాదు లాంధ్రవర్ణయుక్తాన్యదేశ్యములు" (గాణ. వివ - ౮౩ పద్య - ౮౦ కారి. వ్యా) అనువ్రాఁత పొరపాటు. ఇవిభారతప్రయుక్తములు, ఆంధ్రదేశ్యములు, నన్యదేశ్యములు కావు.

సంజీ. ౭౧ I విష:—తమిళకన్నడాది భాషలసంబంధముగల తెల్గుశబ్దముల నన్యదేశ్యము లనరాదు. ద్రావిడభాషలలోని శబ్దములకుఁ బెక్కిటికి రూపమునం దును నర్థమునందును బరస్పరసంబంధ ముండుట సహజమె. అంతమాత్రమున నది యన్యదేశ్యమని తలంపరాదు. ఉదా. మూన్రు (తమి) మూరు (కన్న) మూఁడు (ఆంధ్రదేశ్యము). ఇట్లె పరస్పరసంబంధముగల శబ్దములు పరశ్శతములు గలవు. మూరుశబ్దము తెల్గున వాడఁబడునప్పుడు దాని నన్యదేశ్య మనఁజనును. ఉదా - మూరు రాయర గండఁడు. ఇది కర్ణాటరాజుల బిరుదము. ఆంధ్రదేశ్యశబ్దములలో మహాప్రాణవర్ణములు శ - షలు మున్నగునవి యుండనేరవనియు నట్టివర్ణముల

తోడి దేశ్యశబ్దముల నర్వాచీనులు ప్రయోగించిరనియు నీవఱకు వివరింపఁబడెను (౨౨ I - II విష. విస్త) ఇంక నితరభాషలలోని శబ్దములు భారతకవులచేఁ బ్రయోగింపఁబడలేదు. అట్టి హిందీప్రభృతి భాషలలోని శబ్దములు భారతకాలమునాఁటి కాంధ్రమున వెలసియుండలేదు. కాన నట్టియన్యదేశ్యశబ్దములు భారతమున లేవు. (౨౧ - ౨౨ - విష) (విస్తర I-V)

---

విస్తర. I. ౬౧ I విషః—గుప్తార్థ ప్రకాశికాకర్త యన్యదేశ్యములనుచుఁ గొన్నిటి నీసూత్రపువ్యాఖ్యలో నుదాహరించెను. అందలి గాడీశబ్దము భారత ప్రయుక్తమని యుదాహరించెను. అదిసరికాదని యీవఱకు విశదీకరింపఁబడెను. (౨౧ విష. విస్త IV.) 'తావు' అనునది భారతప్రయుక్తము కాదనియు నట 'టావు' అనుపాఠమె కవిప్రయుక్తము కానోపుననియు విశదపఱుపఁబడెను. (౨౨ విష. విస్త) 'పైతాణము' అనుదానిలో మహాప్రాణ ముండవలయునని నిర్వహించు ప్రయోగము లేదు. "తిరుతాయి-బిడారు" అనునవి తమిళకన్నడశబ్దములె యనుటకుఁ దత్తద్భాషలకె నియతములగు ప్రత్యేకధర్మవిశేషము లెవ్వియు వానియందు లేవు. తిరుశబ్దము శ్రీశబ్దభవము. ఉదా: తిరుపతి=శ్రీపతి. ఒక్కసిరిశబ్దము మాత్రమె శ్రీశబ్దభవము కాదు. "శిక్యము = చిక్కము, శిరోనామ = చిరునామ, చించ = చింత, చెమ్మ=తెమ్మ" మున్నగువానిని బరిశీలించునపుడు శవర్ణము తకారముగా మాఱుట యాంధ్రమునకు విలక్షణము కాదని తోఁచకమానదు.

విస్త II. ౬౧ I. విషః—"పల్లె" అనునర్థముగల సార్ధబిందుక పేఁటశబ్దమును సూరి యుదాహరింపలేదు. బాలవ్యాకరణ ముద్రణములలో నెందును సార్ధబిందుక పేఁటశబ్దము పడియుండలేదు. "ఫేట. దే. వి. హారములో నొకసరము." (శ-ర) అను నిర్బిందుకపేటశబ్దమె సూరిచే నుదాహృతమయ్యె ననుటలో సందియము లేదు. ఇట్టి స్థితిలో గుప్తార్థప్రకాశికాకర్త "మూలమునందు 'కోటపేఁట' శబ్దములు దేశ్యములుగా నుదాహరింపఁ బడ్డవి. కాని యట్లుగాదు....పింతాశబ్దభవము పేఁట" (బా. గు. ప్ర. సంజ్ఞా. ౨౧ సూ. వ్యా.) అని వ్రాయుట పొరపాటు. ఈ పొరపాటును సొంతము కాదు. ప్రౌఢవ్యాకరణ విషయముల స్వీకరించుటవల్లఁ గలిగినది. "కోటపేఁటలు వైకృతములు.........పింతాశబ్దభవముపేఁట." (ప్రౌఢ. సంజ్ఞా. ౧౧ సూ.) ఈ ప్రౌఢవ్యాకరణపు సవరణము సరికాదు. సూరి సబిందుక 'పేఁట' శబ్దము నుదాహరింపనే లేదు. బాలవ్యాకరణమును సవరించుటయే ప్రయోజనముగాఁగల ప్రౌఢవ్యాకరణసూత్రము నన్యథాసమర్థించుట సరికాదు. అపక్షమున నీసూత్రము కేవలము నసంగతముగనే యుండును గదా.

వి_స్త్ర III. ౬౧ I విషః—"కోటః, పుం. దుర్గే." "కోట్టః. పుం. పురస్య దుర్గే, రాజధాన్యామ్" (శబ్దా. చిం.) అని యుండుటచే స్త్రీసను కోటశబ్దము వైకృతమనుట యుక్తమె యనఁదగును.

వి_స్త్ర IV. ౬౧ I విషః—సూరియేకాక శబ్దరత్నాకరకారాదులును దేశ్యములుగా నుదాహరించిన పెక్కుశబ్దములు సంస్కృతప్రాకృతశబ్దముల నాకారము నందును నర్థమునందును బోలియున్నవి.

| శబ్దరత్నాకరము. | సంస్కృత. | ప్రాకృత | |
|---|---|---|---|
| వీసము-దే-వి- రూకలో పదునాఱవ భాగము. | వింశతిః | వీసా. | ఇటశబ్దరత్నాకరార్థము సరికాదు. మాషములో నిరువదవ భాగము వీసము. వీసమనఁగా వడ్లగింజ యెత్తు. నాల్గువీసములు గురివెంద గింజయెత్తు. "దశార్ధగుఞ్జం ప్రవదన్తి మాషమ్" (లీలావతి) "గుఞ్జా-స్త్రీ...చతుర్ధాన్యమానే. (శబ్దస్తో). |
| సవరలు-దే-వి- చెంచులు | శబరః | సవరో | |
| చాపు-దే-వి-మృతి ... | శాపః | సావో | |
| మగఁడు. దే-వి. ౧ పురుషుఁడు... ౨ భర్త...... | మహాన్ | మహో | 'సింహము—తద్భ- సింగము' మున్నగుచోటు లందువలెనె హకారము గకారమగును. |
| ను=(ఉను) దే...అవ్య. సముచ్చయార్థకము. | పునర్ | ఉణో | ఉమ్—తమిళము. |
| సీసకము. ఉభ - దే ౧ కిరీటము. | శీర్షకః | సీసఅం | 'సీసము' అనునది లోహవాచి యనుకొని - వెండి - బంగారు మున్నగు నూతనపద్యములు బిల్వేశ్వరీయమునఁ గల్పింపఁబడెను. గీతము శీర్షము మీఁద నిల్చునుగాన నా పద్యమునకు సీసమనుపేరు గల్గెను. |
| సోల-దే-వి...... తూముడి శేషము. | షోడశ | సోలస | కుంచములోని పదునాఱవ పాలు. |

సంజీవని. ౬౧ II విష:—మూలములోని "త్రిలింగదేశ" అనుశబ్దముచేఁ త్రిలింగశబ్దమునుండి తెలుఁగుశబ్దము పుట్టినదనియు దేశమునుబట్టియే భాషకుఁ దెలుఁగుభాష యనుపేరు వచ్చినదనియు సూరిగారు తలంచిరని విశదమగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| నాణెము-వై-వి | జ్ఞానమ్ | ఞాణం | ప్రశస్తమైనదని యర్థము. జ్ఞానమన్నిటను బ్రశస్తము. "నాణెము వై..నాణకమ్. (ప్రకృతి)" (వైకృతదీపిక) నాణకశబ్దము ప్రాకృతము నుండి సంస్కృతమునకు వచ్చియుండును. కాని సంస్కృతకోశములలో "న+అణకః" అని యున్నది. |

విస్తర. V. ౬౧ I విష:—ద్రావిడభాషలకు సంస్కృతప్రాకృతసంబంధ మత్యంతప్రాచీనకాలమునుండియుఁ గల్గియుండుటఁజేసి కొన్నితద్భవములరూపములు సంస్కృత ప్రాకృతశబ్దములకు మిక్కిలి విదూరము లగుచు వచ్చెను. ప్రాకృతాది వ్యావహారికభాషలలోని శబ్దములు కొన్ని సంస్కృతమునఁ జేరుటయు లేకపోలేదు. ఇట్టి కారణములచే నిది దేశ్యము నిది తద్భవము నని నిర్ణయించుట కొన్నియెడల మిక్కిలికష్టతరమై యుండును. తమిళుల కత్యంతప్రాచీనకాలమునుండి వాఙ్మయమేర్పడి యుండుటంజేసియు నది మొదలుగ వారు సంస్కృతము నెడఁబెట్టు పట్టుదల గలవా రగుచువచ్చుటంజేసియుఁ దమిళములోని తద్భవములు బొత్తిగాఁ బోల్పరాకున్నవి. ఇంతయేల! తమిళపండితులేకాక కొందఱాంధ్రపండితులును దమిళమునకుఁ బ్రాచీనకాలమునందును సంస్కృతసంబంధము లేదని వెఱ్ఱిగాఁ జెప్పునంతటి విదూరత సంభవించినది. "అతఏవ ద్రవిడభాషా అసంస్కృతానుసారిణ్యపి కుమ్భసంభవానుశాస్త్రకత్వేన పణ్డితై రాద్రియతే" (అహో ౯-౨ పు) ఇట్లనుట యపరిశీలనమూలకము. తమిళుల వాఙ్మయమునకెల్ల మొదటిదగు తొలుకాప్యమునఁ దమిళమునందు సంస్కృతశబ్దములు గలవని చెప్పఁబడి యున్నది. 'ఇయఱ్ చొల్, తిరిచొల్, దిశైచ్చొల్, వడచొల్, ఎన్ఱనైత్తే చెయ్యుళ్ ఈట్ట చ్చొల్లే" (తొలుకాప్యము ఎచ్చుఇయల్ ప్రకీర్ణప్రకరణము. ౧ సూ) చెయ్యుళ్ = కావ్యములలో, ఈట్ట = చేర్పఁదగిన, చొల్ = శబ్దములు, ఇయఱ్ చొల్ = జనసాధారణశబ్దములు, తిరిచొల్ = మాఱుమూలశబ్దములు, దిశైచ్చొల్ = అన్యదేశ్య శబ్దములు, వడచొల్ = సంస్కృతశబ్దములు, (వడ = ఉత్తరదిక్కు) ఎన్ఱ+అనై = అనునవియు, (వై - పా. ౨౦ విష)

లకారము నకారవికృతియైనందుట సహజమెయగుటచే (లాంగలము = నాఁగలి, తోల = తోన) తెలుఁగుశబ్దమునుండి తెనుఁగుశబ్ద మేర్పడినదని యెన్నవగును. (విస్తర I-VI)

విస్తర I. ౬౧ II విష:—"ఆంధ్రులు ఆంధ్రదేశము త్రిలింగదేశము" అనునవి ప్రాచీనశాసనములందుఁ గాన రావు. కాన "త్రిలింగశబ్దభవము తెలుఁగు, దానిపరిణామము తెనుఁగు" అనువిషయములును బ్రామాణికములు కావనియు ద్రావిడ భాషలలో నొకటియు నత్యంత ప్రాచీనమును నగు 'తెనుఁగు' అనునది సంస్కృతభవమును నర్వాచీనకల్పిత త్రిలింగశబ్దభవము ననుట సరి కాదనియుఁ విమర్శకు లీవిషయమున భిన్న భిన్న మార్గముల నూహించుచున్నారు.

'ఆంధ్రులు' అనునది ప్రాచీనశాసనముల కెక్కకుండుటకు విమర్శకు లీక్రింది యుక్తి నూహించుచున్నారు. "ఆంధ్రరాజులనెడి శాతకర్ణిరాజులు.........ఆంధ్ర భృత్యులనియు నాంధ్రులనియు భిన్న భిన్నముగా వ్యవహృతులయిన యీరాజులు దక్కను రాజ్యమును బాలించినకాలము దాదాపు క్రీ-పూ. ౭3 మొదలుకొని క్రీ. త. ౨౧౮ సం॥ వఱకు 3 శతాబ్దములుగా లెక్కింపఁబడినది." (ఆం. భా. వి. ౮ పు) "ఐతరేయబ్రాహ్మణ ప్రమాణముచేతను మనుస్మృతిచేతను బతితులని యూహింపఁబడిన యీయాంధ్రజాతిరాజులు.........యాగాదికములఁ జేసియు బ్రాహ్మణులఁ దనియించియు బౌద్ధులకు దానముచేసియు నున్నతిని జనసమ్మతినిఁ బడయవలయునని యత్నించుట స్పష్టము. అట్టివారు నిందకుఁ దావలమయిన యాంధ్రనామమును బరిహరించుట యుక్తమేకదా." (ఆం. భా. వి. ౧౮ పుట.) తెనుఁగుశబ్దము విషయమున విమర్శకు లిట్లూహించుచున్నారు గీ. ఎల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి। దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. (ఆము. ౧ ఆ ౧౫ ప) అను శ్రీకృష్ణదేవరాయల సూక్తిచొప్పునఁ దేనెల్లొలుకు శబ్దములు గలదగుటచేఁ దెలుఁగునకుఁ దెనుఁగను పేరుసార్థకమై యేర్పడెనని కొందఱనుచున్నారు (ఆంధ్రాష-౪౫-౪౬ పు).

విస్తర II. ౬౧ II. విష:—ఆంధ్రభాషావికాసకర్తగారు చూపిన మార్గము లలో నీక్రిందిదొకటి. క. తెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్. (ఆది. ౧ ఆ ౧౬ వ) అని నన్నయ ప్రాసస్థలమున నకారఘటితముగఁ బ్రయోగించుటచేఁ దెనుఁగుశబ్దమె ప్రాచీనము, తెలుఁగుశబ్దముదాని పరిణామరూపము. " 'తెన్' అను పదము నేఁడు తెనుఁగున నిత్యవ్యవహారములో దిగర్థమున భ్రష్టమయినది...... 'తెన్' అను మూలద్రావిడపదము అఱవము, కన్నడము, మలయాళము, అను మూఁడుభాషలయందును ననేకరూపములయందు విశాలమయిన ప్రచారములోఁ

గలదు. తెమ్మెరయందును, తెంగాయయందును, 'తెన్' శబ్దము గలదు. తెన్నేరు (తెన్నేటివారు) నందును గలఁదు.........ఇట్టి 'తెన్' అను పదమునకే 'కు' ప్రత్యయముచేరుటచేఁ దెనుఁగు అయినది.........సంస్కృతముననున్న దక్షిణ శబ్దము 'దక్షిన' యనురూపమును బ్రాకృతమున, బొందనగును. అఱవమున నిది 'తెక్కణమ్' అనురూపమును బొంది మిక్కిలి ప్రాచీనమైన శిలప్పదిగార మనునట్టి యఱవగ్రంథమునఁ బ్రయోగింపఁబడినది. (తెక్కణమలై.) ఈ తెక్కణపదమునుండి యె'తెక్కు' మొదలయిన పదములు వచ్చియుండవచ్చునని వాదింపవచ్చును. 'తెన్' అనుపదము మూలద్రావిడమైనను సంస్కృత దక్షిణపదజన్యమైనను బ్రకృతము తెనుఁగుశబ్దవ్యుత్పత్తికి సాధకమె గాని బాధకము గానేరదు తెనుఁగుశబ్దము దిగ్వ్యవహారిగావచ్చి పాతుకొని యుండవచ్చును" (ఆం. భా. వి. 31 - 32 పు) "దిగ్వాచకములనుబట్టియుఁ బాలకవ్యవహారమునుబట్టియు నామములును వ్యవహారములును గలుగును." (ఆం. భా. వి. 31 పు) "మొదట నాంధ్రదేశము నేలిన శాతవాహను లుత్తరమునుండి దక్షిణమునకును బడమటినుండి తూర్పునకును వచ్చినవారే" (ఆం. భా. వి. 13 పు) "తమ్ముఁ బరిపాలించువాంధ్రు) లుత్తరాదివారగుటచేఁ బాలితులయిన తెనుఁగువారు తమ్ము తెనుఁగువారని వ్యవహరించుకొనుచుండిరి." (ఆం. భా. వి. 31 పు) ఆంధ్రభాషావికాసకర్తగారి యీయూహమునఁ గొన్ని విషయములు సుసంభవములుగాఁ దోఁచకున్నవి. ఏనాఁడును 'తెన్' అను పదముదక్షిణదిగ్వాచిగాఁ దెలుఁగున వ్యవహారస్థమై యున్నట్లు నిదర్శనము కానరాదు. తమిళాదులలో నున్నంతమాత్రమునఁ దెలుఁగునను నుండునని యూహించుట సహజము కాదు. 'తెమ్మెర' అనుదానిలోని మొదటిఖండము దక్షిణదిగ్వాచియగు 'తెన్' శబ్దమె యనుట కాధారము కన్పట్టదు "తేమ = తెమ్మ = చెమ్మగలది. తెమ్మెర = చల్లనిగాలి"యని దానికి సుప్రసిద్ధాంధ్రశబ్దములతో నర్థము చెప్పవచ్చును. అట్టియెడ నప్రసిద్ధాంధ్రశబ్దమును గల్పించుట సరికాదు గదా. తెంకాయ శబ్దములోని మొదటిఖండము దిగ్వాచి 'తెన్' శబ్ద మనుటసరియై యున్నట్లు కాన్పింపదు. అదియును 'తేమ - తెమ్మ' శబ్దములసంక్షేపరూపమె యేమో ? నారికేళజలాదికము చలువచేయుట ప్రసిద్ధము. 'తెన్నేరు' శబ్దములోని మొదటిశబ్దము తెన్ను = (మార్గము)"శబ్దమేమో ? లేదా 'తెన్నేరు' అనునది తమిళశబ్దమైనఁ గావచ్చును. తెన్నేటివారు తమిళదేశమునుండి వచ్చియుందు రన్నశ్రుతి కానరాదు. కానఁ దెలుఁగున "తెన్" శబ్దము దక్షిణదిగ్వాచి యేనాఁడైనను గలదనుటను నిర్వహించు ప్రమాణము చూపట్టదు. కాన పాలకులగు

శాతవాహనులు తమకు దక్షిణముననున్న యాంధ్రులను దమిళశబ్దముతోఁ దెనుఁగు వారని వ్యవహరించిరని కాని పాలితులగు నాంధ్రులు తమ్ముఁ దమిళశబ్దముతోఁ దెనుఁగువారమని వ్యవహరించికొనిరని కాని చెప్పుట విశ్వసనీయము కాకున్నది. ఇంకఁ దమిళులు దమ కుత్తరముననున్న యాంధ్రులను దక్షిణదిగ్వాసులు గా వ్యవహరింపరుగదా. ఆంధ్రభాషావికాసకర్తగారే "ఆంధ్రులను అరవగ్రంథముల లోను శాసనములలోను "వడుగర్" అని వ్యవహరించుచుండిరి. 'వడుగువళి' యనుపద ముత్తరాపథము, అనునర్థమున వాడఁబడినట్లు........" (ఆం. భా. వి. ౩౦ పు) అని వ్రాసియున్నారు. ఇంక దక్షిణశబ్దమునకుఁ దమిళతద్భవమగు "తెక్కణ" శబ్దమునుండి 'తెన్' శబ్దము జనించెననుటయు భాషాపరిణామపద్ధతులను బట్టి విశ్వాసార్హము కాకున్నది. ఆం. భా. వికాస కర్తగారు త్రిలింగశబ్దభవము 'తెలుఁగు' అనుపక్షమునకును ననుకూలురె. "త్రికళింగశబ్దభవమును, త్రిలింగశబ్దభవ మును తెలుఁగు గావచ్చుననుటను ముందే దెలిపితిని" అని పర్యవసాననిరూపణ సందర్భమున వ్రాసిరి (ఆం. భా. వి. ౩౨ పు)

విస్తర III. ౬౧ II. విష:—తెలియుధాతువు జ్ఞానార్థకమగుటచేతను 'త్రిల్లిక' శబ్దమునకు దీప మర్థమని బ్రౌణ్యకోశమున నుండుటచేతను 'తిరిలి' శబ్దము జ్ఞానార్థకమనియు దానికి ద్రావిడభాషలలో నొకటగు కోదుభాషలోని 'ంగ' అనుబహు వచనము చేరుటచేత "తిరిలింగులు త్రిలింగభాష త్రిలింగదేశము" మున్నగునవి యేర్పడియుండవచ్చుననియు నట్టి త్రిలింగశబ్దమునుండి తెలుఁగుశబ్దమేర్పడి యుండ వచ్చుననియు "తిరిలింగ" శబ్దము ౫౯౫ (క్రీ. శ.) సంవత్సరపు గుణార్ణవపుత్త్రుఁడగు నింద్రవర్మ యనుకళింగగంగరాజుశాసనమునఁ గలదనియు (ఎపిగ్రాఫికాయిండి కా. XIV. ౮ భాగ) గొర్తి రామదాసుపంతులుగారు శారదాపత్త్రికలో నొకవ్యాస మును బ్రకటించిరి. ఈశాసనము ౧౦౨౭ (క్రీ. శ.) సంవత్సరపుదని యాంధ్రభాషా వికాసకర్తగారు వ్రాసిరి. (ఆం. భా. వి. ౧౯ పు.) ఇందు "తిరిలింగవాస్తవ్యాయ" అనియున్నదనియు దానిచే "తిరిలింగగ్రామవాసి" అనియే యర్థమగుననియు నక్కా రణమున "తిర్లింగి" అనుగ్రామము నేఁడు టెక్కలిసమీపమునఁ గలదనియు కుందూరి యీశ్వరదత్తుగారు వ్రాసిరి.

టాలమీ (క్రీ.శ. ౧౫౦) యనునాతఁడు తనభూగోళశాస్త్ర గ్రంథమున 'త్రిలిం గన్' అని వాడెనని మెక్రిండలుగారు తమ "ఏన్షియంటిండియా" యనుగ్రంథమున (౨౨౯పు.) వ్రాసియున్నట్లు శ్రీగొర్తి వేంకటరావు పంతులుగారు—ఆంధ్రవిశ్వకళా పరిషత్కళాశాలాచరిత్రశాస్త్రోపన్యాసకులు—చూపిరి. ఇందు 'త్రికలింగ' అనియు

తత్కర్త యుద్దేశమనియుఁ బొరపాటున నందలి కకారము పోయినదనియు నీశ్వర దత్తుగారు వ్రాసిరి.

"తారానాథుఁడనెడి టిబెత్తు పండితుఁడు త్రిలింగశబ్దమును దనగ్రంథము లలోఁ బెక్కుసార్లు వాడెను. తారానాథుఁడు, బౌద్ధమతము హిందూదేశమున నశింపకమున్నె వ్రాయఁబడిన గ్రంథములనుండి పలువిషయములను గ్రహించిన వాఁడు. రెండవశతాబ్దపు వాఁడగు (క్రీ. శ. ౧౫౦) (పురాణములకంటె మొదటి వాఁడు) టాలమీ యను గ్రీసుపండితుఁడు త్రిలింగశబ్దమును వాఁడెను" (కాల్డు వెల్లుగారి ద్రావిడవ్యాకరణపు పీఠిక ౨౫ పుటలోని విషయములసారము.) (చూడుఁడు. ఆం. భా. వి. ౧౮ పుట.) (మెక్రిండలు గారి ఏన్షియంటిండియా. ౧౮౮౫ (క్రీ. శ.) సంవత్సరపు ముద్రణము. ౨౩౧—౨౩౮ పుటలు.)

ఈ త్రిలింగశబ్దము 'త్రి+కళింగ' శబ్దపరిణామమని కొందఱు తలంచు చున్నారు. ప్రాచీన కాలమునఁ గళింగరాజ్యము మూఁడు భాగములుగ నేర్పడి యుండుటచేతఁ గళింగాధీశులు "త్రికళింగాధీశులను" ప్రశస్తి గల్గియుండెడివార నియుఁ, దన్మూలమున మహేంద్రగిరి మొదలుకొనియున్న దక్షిణకళింగమునకు "త్రికళింగము = త్రిళింగము = త్రిలింగము = తెలుంగు = తెనుంగు" అను పేరులు వరుసగాఁ గల్గినవనియుఁ వీరుతలంచుచున్నారు. (ఆంధ్రులచరిత్రము ౩౧ పుట.) ఆమూఁడు కళింగరాష్ట్రములు—ఉత్తరమున 'తామ్రలిప్తి, మధ్యమున "ఉఢ్ర" అనఁబడు 'ఉత్కలము' దక్షిణమున 'కంగోడ' అనునవి యని యువాన్చ్వాంగుగారి యాశయ మనుచు నాంధ్రులచరిత్రమున వ్రాయఁబడెను (౨౬౩ పు.) "కౌరాలక, మహాకాంతారా, మహేంద్రగిరికొత్తూరు" అనునవి యని యాంధ్రులచరిత్రము నందే మఱొకచోట (౨౬ పు) వ్రాయఁబడెను. "ఉత్కల - కంగోడ - కోసల" అను నవి యని కళింగదేశచరిత్రమున వ్రాయఁబడెను. (౨౬౨ పు.) ఈవాదము భ్రాంతి మూలక మనఁదగును. కళింగరాష్ట్రములు మూఁడుభాగము లయినంతమాత్రమున వానికి దక్షిణమునను్న యాంధ్రదేశమునకుఁ ద్రికళింగసంజ్ఞ గల్గెననుట సరికాదు. అట్టిసంజ్ఞ తక్కినవాని కేల కల్గరాదు. ఇట్టి యసంగతిని శంకించుకొనియే కావలయు "తెలుఁగు" శబ్దము "తలకళింగ" శబ్దభవమని శ్రీనుందూరి యీశ్వరదత్తుగారు వ్రాసిరి (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. ప్రమాధి సం॥ ఆశ్వయుజకార్తికమాసములు. ౨౮౩ - పుట.) తలకళింగ మనఁగాఁ గ్రిందికళింగ మని వ్రాసిరి. (౨౮౨ పు.) "తలకళింగ" అనుదానిస్థితి నిరాధారము. దానినుండి 'తెలుఁగు' అనునది జనించె ననుటయు విశ్వసనీయముగఁ గన్పట్టదు. 'త్రికళింగ' శబ్దమన్ననో శాసనప్రసిద్ధమయి

యున్నది. యుద్ధమల్లుని బెజవాడశాసనములలో (క్రీ. శ. ౮౫౦) నొకదానియందు "వేంగీభువః పతి రభూ త్త్రికళింగకో ష్టిః"(ఆం. చ. ౨౮-౨౯ పుట)అనియున్నది."త్రికళింగదేవ భోగ న స్తక- దేవగణికా. యా వాద్య కాం. గాయకానా మాధిపత్యమ్" (ముఖ కళింగమనెడి ముఖలింగ క్షేత్ర ప్రాంతమునందలి శాసనము. ౧౦౧౦ నెంబరు. కళింగదేశచరిత్రము. ౧౫౩ పుట) ఇట్టిశాసనప్రమాణములకు సమాధానము పరిశీలింపవలసియున్నది. ఈశాసనములలోని "త్రికళింగ" శబ్దమునకు "త్రి+కళింగ" అని ఛేదము కాదు. "త్రిక+లింగ" అనిఛేదము నెన్నదగును. ఈపక్షమున 'త్రిక+లింగ' శబ్దము 'త్రిలింగ' శబ్దపర్యాయమె యనఁదగును. శాసనములలో లకారస్థానమున ళకారములు పడుట మిక్కిలి ప్రచురము. కాని యీవిషయమున నొక పూర్వపక్షము లేచును. మెగస్తనీసు (౩౦౦. క్రీ. పూ) చెప్పినవానిని సంగ్రహించినప్లీనీ (క్రీ. శ. ౨౩) వాక్యములలో "ముదుకళింగ" = (modogalingae) అని యున్నదని మెక్క్రిండలుగారి యేన్షియంటిండియా యనుగ్రంథమున నుండుటచే (౧౩౮ పు) 'త్రికళింగ' శబ్దమునకు "త్రి+కళింగ" అనుఛేదమె ప్రాచీనసమ్మతమను వాదమున కవకాశము కల్గుచున్నది. కాని "ప్లీనీ వాక్యములోనిది "ముదుకళింగ" అనికాదనియు "మదుకళింగ" అని యెన్నఁదగుననియు (modogalingae) దానికి మూఁడుకళింగములని యర్థముకాదనియు మద్రదేశసంబంధమయిన మద్రకళింగమని యర్థమనియుఁ గళింగదేశచరిత్రమున (౨౭౦ పుట) వ్రాయఁబడెను.

ఇంతయేల! త్రిలింగక్షేత్రమే త్రిలింగదేశమని యీక్రిందిపురాణవచనములవలన విశదమగుచున్నది. శ్లో. శ్రీశైల భీమ కాళేశ।మహేన్ద్రగిరిసంయుతమ్। ప్రాకారంతు మహాత్ కృత్వా। త్రీణి ద్వారాణి చాకరోత్। త్రిలోచనో మహేశస్స। త్రిశూలంచ కరే వహన్। త్రిలిఙ్గరూపం న్యవసత్। త్రిద్వారేషు గణైర్వృతః। అన్ధ్రివిష్ణు స్సురయుతో। దనుజేన నిశమ్భునా। యుద్ధ్వా త్రయోదశ యుగాన్। హత్వా తం రాక్షసేశ్వరమ్। అవస త్తత్ర ఋషిభి। ర్యుతో గోదావరీతటే। తత్కాలప్రభృతి క్షేత్రం। త్రిలిఙ్గ మితివిశ్రుతమ్।" (బ్రహ్మాండపురాణము. ఆంధ్రులచరిత్రము. ౨౮ పుట) పైశ్లోకములనె బ్రహ్మాండపురాణమునుండి యుద్ధరించి కీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ పిడుపర్తి దక్షిణామూర్తిశాస్త్రి సిద్ధాంతిగారు ఆంగీరస సంవత్సర (శా. శ. ౧౭౮౪) పంచాంగపు పీఠికలో ధర్మశాస్త్రవిమర్శనసందర్భమున నుదాహరించిరి. వీరి నివాసస్థలము విశాఖపట్టనమండలములోని గజపతినగరము సమీపమందలి బూరుడుపేట గ్రామము. పైశ్లోకములలో కాళేశ్వరము హైదరాబాదులో నేడు ప్రసిద్ధమైన కాళేశ్వరమె యని వారు వ్రాసిరి. కాని

పురాణయుగమునాఁ డాంధ్రదేశ ముత్తరమునఁ జాలదూరమువఱకు వ్యాపించి యుండెడిదిగానఁ గాళిదాసువర్ణించిన మహాకాళనాథ లింగమే పురాణవచనముల లోని కాళేశ్వరలింగము కానోపునని నాతలంపు. స్వవాదబాధకము లగుటచే నీ వచనములు ప్రక్షిప్తములని యీశ్వరదత్తుగారు నిరాధారముగా వ్రాయ సాహసించిరి.

"ఈదేశసరిహద్దులలో మహేంద్రగిరికూడ గలపబడ్డది......ఈచతుర్లింగ మధ్య నున్న దేశముగా ఈతెనుగుదేశము చెప్పబడుటచే త్రిలింగబదము సరి బడదు" (శారదాపత్రిక ౧౩౧ పు) అని యిట్లు పైపురాణవచనములం దొక విరోధ మును స్వవాదానుకూల్యమునకై గొర్తిరామదాసుపంతులుగారు చూపిరి. కాని యట్టి విరోధ మావచనములలో లేదు. మహేంద్రగిరి త్రిలింగక్షేత్రము సరిహద్దు లలోఁ జేర్పఁబడెనే కాని మహేంద్రగిరియం దొకలింగము గలదని యా పురాణవచనములలోఁ జెప్పఁబడలేదు.

"ద్రావిడః త్రి......స్కన్దపురాణే. కర్ణాటా శ్చైవ తైలఙ్గా । గుజ్జరా రాష్ట్రవాసినః । ఆన్ధ్రాశ్చ ద్రావిడాః పఞ్చ । విన్ధ్యదక్షిణవాసినః" (శబ్దకల్పద్రుమ కోశము. శబ్దార్థచింతామణికోశము) ఇందలి తైలంగ శబ్దము త్రిలింగశబ్ద సంబం ధియె యనఁదగును. ఒకొక్క దేశమే వేర్వేఱుఖండములుగ విభక్తమగుచుండు నపుడు వేర్వేఱుపేరులతోఁ బునరుక్తమగుట విరుద్ధము కామింజేసి పైశ్లోకములో నాంధ్ర తైలంగములు వేఱుగాఁ జెప్పఁబడుట శంకాస్పదము కానేరదు. "ఉత్కలా మేఖలాః పౌణ్డ్రాః । కళిఙ్గా న్ధ్రాశ్చ సంయుగే" (భార - ద్రోణ - ౭ అధ్యా) అనుచో నుత్కల కళింగములు వేఱుగఁ జేర్పఁబడలేదా. ఇట్లు తలంపక యనొక విరోధ మునుకొని కావలయు నాంధ్రులచరిత్రలోఁ బైస్కాందవచన మీక్రిందిరీతిని సవరింపఁబడెను. "కర్ణాటా శ్చైవ త్రైలిఙ్గా । గూర్జరా రాష్ట్రవాసినః । ద్రావిడా ద్రావిడాః పఞ్చ । విన్ధ్యదక్షిణవాసినః" (ఆంధ్రులచరిత్ర. పూర్వభా ౨౬ పు.) రామదాసుపంతులుగారివ్యాసమున నీవచన మాంధ్రకౌముదిలోని దని వ్రాయం బడెను. (శారదా. ౧౨౮ పు) పయిపురాణవచనములలోఁ జెప్పఁబడిన త్రైలింగులు త్రిలింగదేశీయులె యనియెన్నఁదగును. "ఆన్ధ్రః. పుం......దేశవిశేషే. యథా జగన్నాథా దూర్ధ్వభాగ । మర్వాక్ శ్రీభ్రమరాత్మకాత్ । తావ దన్ధ్రాభిధో దేశః । ప్రోక్తః శ్రీ శక్తిసఙ్గమే" (శబ్దార్థచిం) ఆన్ధ్రః. పు. (ఆ+అన్ధ+రన్) ౧ దేశభేదే. ౨ తద్దేశవాసిని. ౩ తన్నృపేచ. ఆన్ధ్రా శ్శకాః పులిన్దాశ్చ । యవనాశ్చ నరాధిపాః । (భార. వనపర్వ. ౧౮౮ అధ్యా) సచ దేశః. బృ. సం. కూర్మవిభాగే ఆగ్నేయ్యాం

దిశి వర్తితః, 'ఆగ్నేయ్యాం దిశి కోసల కలిఙ్గ వఙ్గోపవఙ్గ జఠరాఙ్గాః। శౌణిక విదర్భ వత్సాన్ధ్రచేదికా శ్చోర్ధ్వకణ్ఠాశ్చ" (వాచస్పత్యము)

"మగధస్య వశగాః। కృతాః కర్ణ త్వయా పురా.....ఉత్కలా మేఖలాః పౌణ్డ్రాః। కలిఙ్గాన్ధ్రాశ్చ సంయుగే" (భార. ద్రోణ ౪ అధ్యా) "ధనంజయుండు హయంబు ననుగమించె నది మరలి మఱియును దక్షిణాభిముఖంబయి చని లెఱుఁగఁ బౌండ్రాంధ్ర ద్రవిళ కేరళ కర్ణాట దేశాధీశుల ననాయాసంబున వశగతులం గావించుకొని" (ఆంధ్రభార. అశ్వ. ౪ ఆ. ౧౧౩ వచనము)

పయి వచనములనుబట్టి పురాణయుగమునాఁటికే, క్రీస్తునకుఁ బూర్వము చాలకాలముక్రిందటి భారతమునాఁటికే- యాంధ్రులు రాజులై యున్నట్లును నాంధ్రుల దేశము, ద్రవిడ కర్ణాట సీమలలో నున్నట్లును విశదమగుచున్నది. అశోకుని శిలాశాసనమున (౧౩) నాంధ్రరాజులు పేర్కొనఁబడిరి. ఇంతయేల! ఐతరేయ బ్రాహ్మణమునందే యాంధ్రులు పేర్కొనఁబడిరి. "తస్య విశ్వామిత్ర స్యైకశతం పుత్త్రా ఆసుః......త ఏతేఽన్ధ్రాః పుణ్డ్రాః శబరాః పులిన్దా మూతిబాః...... (ఐతరే. ౭ పంచిక. ౩ అధ్యా. ౧౮ ఖండిక) దీనినిబట్టి విశ్వామిత్త్రపుత్త్రులగు నాంధ్రులు గంగాతీరమునుండి క్రమక్రమముగా వింధ్యదక్షిణవాసులగుచుఁ ద్రిలింగదేశమున స్థిరపడిరని విశదమగుచున్నది. "కారావరనిషాదాత్తు। చర్మకారః ప్రసూయతే। వైదేహకా దన్ధ్రిపతౌ। బహి ర్గ్రామప్రతిశ్రయౌ. ఇతిమనుః" (శబ్దకల్పద్రుమకోశము. అన్ధ్రశబ్దము) దీనినిబట్టి యాంధ్రులలోని పంచముల యుత్పత్తివిశదమగుచుండుటచేత మనుస్మృతికిఁ బూర్వమెయాంధ్రులు వెలసి యుండెడివారని వ్యక్తమగుచున్నది. అట్లయిన "నాంధ్రులు. వారిదేశము త్రిలింగదేశము" అనునవి తఱుచుగ శాసనముల కెక్కలేదు. భారతమునం దాంధ్రరాజులు పలుమారు పేర్కొనఁబడియే యున్నవిషయము పై నుదాహరింపఁబడెను. శాతవాహనులు మున్నగువా రాంధ్రరాష్ట్రమునే కాక వింధ్యదక్షిణభాగములోని చాలదేశముల నేలినవారగుటచే దక్షిణాపథాధీశులని పేర్కొనఁబడిరి. "దక్షిణాపథపతేః శాతకర్ణేః.....(రుద్రదమనశాసనము. క్రీ. వె ౧౫౧ సం॥) (ఆం. భా. వి. ౧౨ పుట)

ఆంధ్రశబ్దము భాషాపరముగా వాడఁబడుటకుఁ బ్రమాణము ౧౧ శతాబ్దము వఱకు లభింపలేదు. అంతవఱ కాంధ్రమున వాఙ్మయము లేమింజేసి యట్టివాడుకకుఁ బ్రమాణము లభింపఁదయ్యె. ఇట్లె 'తెలుఁగుభాష, తెనుఁగుభాష,' అనువానివాడుకకును మొదటిప్రమాణ మాంధ్రభారతమె యగుచున్నది. "యః సంస్కృత కర్ణాట

నన్నయా   అహేయ మన్యదేశీయం। య త్తదేవ ప్రయుజ్యతే.
౬౧ III వివ. (వికృ. సంజ్ఞా. ౧౩ కారి. అహో. ౩౫౮ పు.)

కల్పతరు ౬౧ III వివ:—అహేయమ్=నింద్యము కానట్టి యనఁగా వ్యాకరణాది విరుద్ధము కానట్టి, అన్యదేశీయమ్ = అన్యదేశ్యశబ్దము, 'రోజు' మున్నగునది, యత్=ఏదిగలదో, అనఁగా నేఁడి యాంధ్రదేశమున వాడుకకెక్కి యున్నదో తత్=ఆపదము, ప్రయుజ్యతఏవ = ప్రయోగింపఁబడుచునే యున్నది. లేదా—యత్. అన్యదేశీయమ్ = ఏయన్యదేశ్యశబ్దము, అహేయమ్ = ఆంధ్రపర్యాయ శబ్దాభావమున విడువరానిదో, తత్=ఆపదము, 'మలకలు' మున్నగునది, ప్రయుజ్యతఏవ = ప్రయోగింపఁబడుచునే యున్నది. ఉదా:—హుటాహుటి - రోజు మొ.

బాలవ్యా   బాలవ్యాకరణమున నీవిషయము సంగ్రహింపఁబడ
౬౧ IV వివ. లేదు.

సంజీవని. ౬౧ IV వివ:—పయిరీతి నథర్వణాచార్యుఁ డంగీకరించియున్నను నర్వాచీనమహాకవులు ప్రయోగించియున్నను భారతప్రయోగరాహిత్యమునను, చింతామణ్యంగీకృతము కాకుండుటను గావలయు సూరి యన్యదేశ్యము నుపేక్షించెను. "షట్త్రింశదత్ర" అని తెల్గునకు ౩౬ వర్ణములని చెప్పుటచేతనె చింతామణి యన్యదేశ్యశబ్దములను నిరసించెననుట వ్యక్తమగుచున్నది. ప్రయోగ:—మ...

---

ప్రాకృత పైశాచి కాంధ్రభాషాసు। కవిరాజశేఖర ఇతి। ప్రథిత స్సుకవిత్వవిభవేన" (నందమపూండిశాసనము. క్రీ. శ ౧౦౫౩) "తెలుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్. (ఆది. ౧ ఆ. ౧౫ ప) ఉ.....నన్నయబట్టు తెలుంగునన్ మహా। భారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్ (ఆది. ౧ ఆ ౨౬ ప)

పయివిషయములెల్లఁ బాగుగఁ బరిశీలించి విద్యానాథాదు లీక్రిందిరీతిని వ్రాసిరి. శ్లో. యోద్ధారో వయ మిత్యరీ నభిభవ న్త్య న్ధ్రక్షమాభృద్భటాః (ప్రతాపరుద్రీయము. నాటకప్ర. ౨౯-శ్లో) శ్లో. యై ర్దేశ స్త్రిభి రేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలిఙ్గాఖ్యయా। యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాః కృతాః। తే దేవాః ప్రసరత్ప్రతాపమధురాః శ్రీశైల కాళేశ్వర। ద్రాక్షారామనివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రియసే జాగ్రతు (ప్రతాపరు. నాట ౫ అం ౪౪) కం. ధర శ్రీపర్వతకాళే। శ్వర దాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా। కరమగుట నాంధ్రదేశం। బరుదారఁ ద్రిలింగదేశ మనఁజనుఁ గృతుఁలన్. (కావ్యాలం. ౯ ఉల్లా)

నిజామహల్ నజీరల్ భజింతురు నమ్రత్వముఁ గానలో ముసలిమానుల్గా విరక్తింపఁగన్. (వసు. ౧ ఆ. ౭౫) సీ. ఎదలపైఁ బొదలు పైయెయ్యరలు జాఱఁగఁ బాఱు పెచ్చులకు ముసుంగు లబ్బఁజేసె। ఘనభేరికాధ్వనుల్ విని గుండియలువ్రీల వ్రాలు మల్కాలకు గోలీలుసేసె। ఉరుగని విభ్రాంతిఁ దడగాళ్ళుపడ నిల్చు।ఖానులు డాఁగఁ జీకటులు సేసె।.........గీ...చను సపాద కుతుబసాహి నిజామాది కుతల పతులు।...(వసు. ౧ ఆ. ౭౬ ప.) శా. మక్షా మందువపందువా...।తుక్షార ప్రతిరుద్ధ...। ప్రాక్షదోశ్యత...। ప్రక్షర్వీకృత...(వరస. ౫ ఆ. ౨౭౭) ఇట్లు తురుష్కాదిభాషాశబ్దము లన్యదేశ్యము లనుట నిర్వివాదము. (౨౨ II సంజ్ఞ. దాని విస్తర.)

అన్యదేశ్యపదములను దెనుఁగులోనికిఁ దెచ్చునపుడు సాధారణముగా సంస్కృతశబ్దములను దెచ్చునప్పటి విధులే యుపయోగింపఁబడుచుండును. హలంత శబ్దము తుదిహల్లు కొన్నియెడల ద్విరుక్తమగును. సాధారణముగా నెల్లెడలను దుదిని 'ఉ' కారము నిల్చుచుండును. ఉదా. రోడ్డు. లైను. రైలు. మేజస్ట్రీటు. కలెక్టరు. గవర్నరు. మొ. ఇట్టియన్యదేశ్యశబ్దములు తెనుఁగులోనికి వచ్చుటలోఁ గొన్నియెడల శబ్దావయవమునఁ దత్సమములకువలెనే మార్పేమియు నుండదు. కొన్నియెడల వర్ణాగమాదివికృతులు తద్భవములందువలెనే కల్గును. అట్లయినను వానికిఁ దత్సమ తద్భవ వ్యవహారములేదు. కొన్నియెడల నన్యదేశ్యశబ్దము నర్థము నిచ్చు తెల్గుపదములను గల్పించికొనుటయుఁ గలదు. ఉదా: రైలు = ఇనుపదారి. అయోమార్గము. కలెక్టరు. గవర్నరు. కౌలు. కదపా మున్నగువాని కట్లు తెల్గు పదములను గల్పించుట వలనుపడదు. అట్లు కల్పించినచో వానికి వివక్షితార్థబోధన శక్తి కలుగదు. కావున నట్టియెడల నవి యాంధ్రదేశపు వ్యవహారమునకెక్కినను నెక్కకున్నను నట్టి యన్యదేశ్యశబ్దములనే తెనుఁగుచిహ్నములను జేర్చివాడు కొనుట యుక్తము. 'కలెక్టరు' అనుదానికి 'మండలాధీశుఁడు' అనునది సమానార్థకమె యైనను దానివల్ల వివక్షితార్థము స్ఫురింపదు. ప్రస్తుతము విద్యాశాఖలవార ట్టి యన్యభాషాశబ్దములకు సంస్కృతాంధ్రశబ్దములతోఁ బర్యాయములను గల్పించియు, సంస్కృతభాషాప్రసిద్ధసంజ్ఞల నేర్చియు గ్రంథరచనము చేయింప యత్నించుచున్నారు. ఇదియంతగాఁ బ్రయోజనకారియని తోఁచకున్నది. అన్యదేశ్య శబ్దములలోని యనాంధ్రవర్ణస్థితి శంకాస్పదము కాదు.)

సన్నసూత్ర ర్వణీయము ౨౨ విషయము.

అనియమా ద్గ్రామ్యంహి య త్త్వపభ్రంశః (ఆం. చిం. సంజ్ఞా. 3 కారి. అహో ౧౦౬ పుట.) సన్మూల వత్త్వా ద్గ్రాహత్వా ద్గృహీతత్వా చ్చ సాధుభిః । నాపభ్రంశత్వ మేతస్య । నియమాభావత స్తు తత్ ... (వికృ సంజ్ఞా. ౧-౨-3 కారి. అహో. ౧౦౯ పు.)

కల్పతరువు ౨౨ విష:—౧ IV విషయమున వీనికి వ్యాఖ్యచేయఁబడెను.

బాలవ్యాకరణ వివరణము ౨౨ I విషయము.

లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు. ౨౨.
వస్తాఁడు-తెస్తాఁడు - వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు.
తెచ్చేవాఁడు - వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు -
ఈభాష ప్రయోగంబున కనర్హంబు.

సంజీవని. ౨౨ I విష:—ప్రయోగంబున కనర్హంబు = గ్రంథంబులందుఁ బ్రయోగించుట కర్హంబుగాదని యర్థము. (విస్తర) వస్తాడు. (గ్రా) వచ్చును (సాధు) వచ్చేని (గ్రా) వచ్చెడిని (సాధు) వచ్చేవాఁడు వచ్చేటివాఁడు (గ్రా) వచ్చెడివాఁడు

---

విస్తర. ౨౨ I విష—"అనియమా ద్గ్రామ్యమ్. పామరాదిప్రయుక్తం య। త్త ద్గ్రామ్య మభిధీయతే అనునవి. మూలములు" (బా. సా. పే. ౩౬ పు.). "పామరాది ప్రయుక్తం య। త్త ద్గ్రామ్య మభిధీయతే (అథర్వ)" (ఆం. భా. అ. సంజ్ఞా. ౭౨ సూ. టిప్ప) ఇట్లీ యిద్దఱును "పామరాదీ"త్యాదికారిక యాథర్వణమని భ్రమించిరి. కాని యిది యాచార్యదండి కావ్యాదర్శములోని శ్లోకము. వికృతివివేక టీకా కారుఁడును దీని నాథర్వణ మనుకొని పొరపాటున మూలముగ నుదాహరించెను. అథర్వణ కారికలకు మూల మహోబలపండితీయము మాత్రమె. "ఆలంకారికాస్తు శబ్దార్థయో ర్గ్రామ్యత్వ మన్యథోచుః.....పామరాది ప్రయుక్తం య। త్త ద్గ్రామ్యమభిధీయతే ఇతి గ్రామ్యపదస్య లక్షణ ముక్త్వా గల్లాదయ శ్శబ్దా గ్రామ్యా ఇత్యూచుః" (అహో ౧౧౭ పు) అని యహోబలపతి యుదాహరించెనే కాని దీని నథర్వణకారికఁగా జూపలేదు. పేటికావ్యాఖ్యాత పామరాదీత్యాదికారిక ప్రకృత బాలవ్యాకరణ సూత్రమునకు మూలమని వ్రాయుటయు సరికాదు. పామరుల చుల్కనిపల్కులు గ్రామ్యమని యాలంకారిక సమయము. వ్యాకరణవిరుద్ధమగు నప శబ్దము గ్రామ్యమని వైయాకరణసిద్ధాంతము. ఈ రెండింటిని నభిన్నములుగా శబ్దైక్యమునుబట్టి పేటికావ్యాఖ్యాత భ్రమించుట వింత. "ఆలంకారిక గ్రామ్యము, వైయాకరణిక ('వైయాకరణ,' అనునది సాధురూపము) గ్రామ్యము నని గ్రామ్యము

(సాధు) పండితుల వ్యవహారమునందు నయిత మర్ధబిందూచ్చారణము లేమిం జేసి "వస్త్రాము" మున్నగు గ్రామ్యోదాహృతులలో ఖండబిందువును సూరి నిల్పుట యుక్తము కాదు.

---

ద్వివిధమగు. అర్థవిచారము ప్రధానముగాఁ గొన్నవా రాలంకారికులు. శబ్దవిచారము ప్రధానముగా నెంచెడువారు వైయాకరణులు" (బా. సా. వే. సంజ్ఞా ౨౨సూ. వ్యా) అని యిట్లు పలుచోటఁ బేటికావ్యాఖ్యాత వ్రాయుటయు సరికాదు. ఆ రెండువిచారములును బరస్పర భిన్నములు. మఱియు నాలంకారికులును శబ్దగ్రామ్యము నంగీకరింతురు "శబ్దేపి గ్రామ్యతా ఉస్త్యేవ।సా సభ్యేతరకీర్తనాత్......" (కావ్యాదర్శము.)

ఆలంకారిక గ్రామ్యదోషము శబ్దగతము నర్థగతమునై యుండును. శబ్దగ్రామ్యము—"గ్రామ్యత్వం యథా. కటి స్తే హరతే మనః. అత్ర కటిశబ్దో గ్రామ్యః" (సాహి ౫౭౪ కా) "గ్రామ్యత్వం పామరాదిసాధారణ జన ప్రయోజ్యత్వమ్." (జీవానంద వ్యాఖ్య) కం. పామరులభాష గ్రామ్యము।భామిని కటికల్లములు విభాసిల్లు ననన్ (సరస ౪ ఆ ౧౦ ప) కటిగల్లాదిశబ్దములు పురాతనకాలమునఁ బామరజనమాత్రప్రయోజ్యములై యుండెడివి. కాలక్రమమున నవి కావ్యముల కెక్కినవి. మ. లవలీపల్లవ పాండురంబులగు గల్లస్థలంబులన్ (పాండు. ౧ ఆ. ౧౬౪ ప) ఎ. గీ. బాపురే భూరికటితటీ భారమహిమ (పాండు ౧ ఆ ౧౧౭). ఇట్లగుటచే నర్వాచీను లిఁకను వానిని గ్రామ్యములుగా నుదాహరించుట సరికాదు. నేఁడు, పిఱ్ఱి ముడ్డి మున్నగునవి గ్రామ్యశబ్దములనుట యుక్తము. అర్థగ్రామ్యము—"స్వపిహి త్వం సమీపే మే।స్వపిమ్యేవ హాధునా ప్రియ॥ అత్రార్థో గ్రామ్యః."(సాహి.౫౭౬ కారి). దీని జీవానందవ్యాఖ్య—"అత్రోదాహరణే స్వపిహి-స్వపి మీతిపదద్వయప్రయోగో వైదగ్ధీరహిత ఏవేతి గ్రామ్యత్వ మితి భావః" "కన్యే కామయమానం మాం।త్వం నకామయసే కథమ్। ఇతి గ్రామ్యోయ మర్థాత్మా।వైరస్యా యైవ కల్పతే। కామం కందర్పచణ్డాలో।మయి వామాక్షీ నిర్దయః। త్వయి నిర్మత్సరో దిష్ట్యే।త్యగ్రామ్యార్థో రసావహః॥శబ్దేపి గ్రామతా స్త్యేవ। సా సభ్యేతరకీర్తనాత్। యథా యకారాది పదమ్। రత్యుత్సవనిరూపణే। పదబన్ధానువృత్త్యా। వాక్యార్థత్వేన వా పునః॥ దుష్ప్రతీతికరం గ్రామ్యం। యథా—"యాభవతః" ప్రియా।......"(కావ్యాదర్శము)

పేటికావ్యాఖ్యాత పలుమాఱు నీద్వివిధగ్రామ్యత్వములకును—ఆలంకారిక గ్రామ్యతావైయాకరణగ్రామ్యతలకు—సాంకర్యము దోఁచునట్లు ప్రసంగించుచు వచ్చెను—"గ్రామ్యమనఁగా ననాగరికుల యసభ్యవ్యవహారము........ఇందలి

సంజీవని. ౬౨ II విష:—లక్షణ మనఁగా వ్యాకరణము. వ్యాకరణసమ్మతము కానిభాష గ్రామ్యమని సూరి యాశయము. వ్యాకరణము మహాకవిప్రయోగ మూలకము గాన మహాకవిప్రయోగసమ్మతము కానట్టియు, నన్నయాదిపండిత కవీంద్రకృత వ్యాకరణసమ్మతము కానట్టియు భాష గ్రామ్యమని పర్యవసితార్థము. (విస్తర.)

---

గ్రామ్యపదమున కసభ్యవ్యవహారమేగాక యనుశాసన విరుద్ధమును(తయు?) నర్థ మయ్యెడిఁగాన నుత్తరసూత్రమునందలి కఱకంఠాదులకును గ్రామ్యతకలుగుచున్నది ... ప్రౌఢవ్యాకర్తయు నిట్టి యసభ్యవ్యవహార మాయా నీచపాత్ర ధోరణికి నైజమై యుండును గాన నాయా యవసరముల గ్రంథములందును నుపయోగింపనగునని వివరించెను......" (బా. సా. పే. ౩౬ పుట) ఇది సరికాదు. వైయాకరణులు చెప్పిన గ్రామ్యము వ్యాకరణవిరుద్ధస్థలములందే వర్తించును. దానికిఁ బామరాద్య సభ్యప్రసంగము లక్ష్యముకానేరదు. పామరులు కానట్టి సభ్యుల వ్యవహారమునందును వ్యాకరణవిరుద్ధతారూప గ్రామ్యము విరివిగాఁ గన్పట్టుచునేయున్నది. మఱియు సూరి యుదాహరించిన కఱకంఠాదులును ప్రౌఢవ్యాకర్త యుదాహరించిన 'చూసినాము' ప్రభృతులును వ్యాకరణవిరుద్ధమాత్రములే కాని యసభ్యములు కావు. చుల్కని పామరోక్తులును గావు.

విస్తరము. ౬౨ II విష:—పూర్వపూర్వలక్షణములకు సమ్మతములుకానివి యుత్తరోత్తరమహాకవులు సమ్మతించి ప్రయోగించునపు డవి యసాధువులు కానేరవు. అట్టివాని కుత్తరోత్తరలాక్షణికులు లక్షణకల్పనము చేసికొనవలసినదే. బాలవ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదపు ౨౩ సూత్రమున కిదేతాత్పర్యము. ప్రౌఢవ్యాకరణ కర్తచేసిన పనియు నిదియె. "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అని నన్నయ ప్రథమపురుషక్రియల 'ఇ' కారమునకునైతము సంధినిత్యతను సూత్రించి తన భారతభాగమున నట్లు ప్రయోగించియున్నను "మ...ము । ష్కరులై చేసిరి యంతచేసియు (ఉద్యో. ౩ ఆ. ౩౬)" అనురీతిని గవులు ప్రయోగించుటచే "ప్రథమే చోత్తమే చైవ । క్రియేతో వా భవే చ్చ్యుతిః" అనియథర్వణుఁడు సంధిపాక్షికతను సూత్రించికొనెను.

సూరి గ్రామ్యములుగా నుదాహరించిన వానివంటివి కవిప్రయోగములలోఁ జూపట్టుచున్నవని కొంద ఱుదాహరించుచున్నారు. "శా...దు । ర్దాంతానంతభవాంధకూపతరణప్రౌఢిన్ దృఢస్థేమఁ బా । టింతుర్ పెద్దలు తద్దనమ్మి నుయిదాఁటేవానికిం జింతయా । కంఠైనం. గడ.మేనియుం గడమ కాదాయంచు నూహించుచున్ (పాండు

సంజీవని. ౬౨ III విష:—లక్షణవిరోధము నాల్గువిధములుగా వెలయుచుండును. ౧ పండితవ్యవహారస్థ మగునట్టియు లక్షణసమ్మతమేని మహాకవి ప్రయోగ సమ్మతమేని కానట్టియుఁ బ్రయోగము. ఉదా: వస్తాడు మొ. ౨. పండితేతరుల వ్యవహారమున మాత్రముండెడి లక్షణ - కవిప్రయోగ - సమ్మతము కాని భాష. ఉదా: యెల్తాను - సెప్తాన్నే - యేంటి - యాడాడు? మొ. ౩-సలక్షణతాభ్రాంతిని సాధారణకవులు ప్రయోగించు లక్షణ మహాకవి ప్రయోగసమ్మతముకాని భాష. ఉదా:—చోరి. చనుదేఱువాఁడు - అచ్చటకు - మీఁదకు. పైనన్ - ఏల ననఁగా - ఆధిక్యత - గౌరవనీయులు - మొ. ౪ - పూర్వ పూర్వ లక్షణ - మహాకవి ప్రయోగ సమ్మతము కాకున ను నుత్తరోత్తరమహాకవులు సమ్మతించి ప్రయోగించుభాష. ఉదా - ఉన్నాఁడు - ఉన్నారు ఉత్తరియించు - మొ. వీనిలో నాల్గవ విధముగల భాషమాత్రమె సాధువుకానోపును తక్కినమూఁడు విధములును నగ్రాహ్యములు, నసాధువులు నని గ్రహింపవలెను. (విస్తర)

---

౪ ఆ. ౨౭౪ ప) ఇట నుయిదాఁటెడి యనుదాని వ్యావహారిక రూపము "దాఁటే వానికి" అనునది రామకృష్ణకవి ప్రయోగించెనా యని యాలోచింపవలసియున్నది. ఇట "నుయి దాఁటు+ఏ వానికిన్" అని ఛేదముచేసి యుంచుగాగమస్వరయతి నంగీకరించి కవిప్రయోగించెనా యనియు నాలోచింపనగును. ఈపక్షమున లక్షణవిరోధము కల్గనేరదు. మ. పడతీ......గుడి మ్రింగేవానికిం దల్పుల। ప్పడఘుల్ గావన......(ప్రబోధ ౨ ఆ. ౬౭ ప) ఇందును 'మ్రింగెడివానికి' అనుదాని గ్రామ్యరూపము "మ్రింగేవానికి" అనునది ప్రయుక్తమయ్యెను. కానిలోకోక్తుల ననుకరించి యుద్ధరించునపు డది కవిప్రయోగములో దోషమనిపించుకొనదు గాన నిందు "గుడి మ్రింగేవానికిఁ దల్పుల ప్పడములు గావు" అనులోకోక్తి (సామెత) యుద్ధరింపఁబడెనని సమర్థించుట కవకాశము కల్పట్టుచున్నది. "అనుకారేచ దోషాణాం। సర్వేషాం నైవ దోషతా" (సాహి. ౭ పరి. ౬౦౨ కారి)

విస్తర. ౬౨ III విష:—నేఁటికాలమున గ్రామ్యగ్రాంథిక భాషావివాదము ప్రబలియున్నది. పండితుల వాడుకలోని భాష గ్రామ్యము కానేరదని వ్యావహారిక భాషావాదుల సిద్ధాంతము. వీరిలో ముఖ్యులు కీర్తిశేషులు నగు కళాప్రపూర్ణ గిడిగు వేంకటరామమూర్తి పంతులుగారు, బ్ర-శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారును. శాస్త్రులవారీసిద్ధాంతముతోనె యాంధ్రభాషానుశాసన మనువ్యాకరణమును రచియించిరి. పంతులవారు తాము పరిశోధించి సంపాదించుకొన్న ప్రయోగసంచయమును శ్రీశాస్త్రులవారి కొసంగినట్లీ క్రిందిరీతిని వ్రాసియున్నారు.

"నా ప్రయోగసంచయము నాకు మ-జయంతి గంగన్న పంతులుగారు పంపివేసినారు. అవి బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ కిమ్మనికోరితే వారికిచ్చినాను. వారు వీటిని తమ ఆంధ్రభాషానుశాసనమందు ఇమిడ్చినారు" (బాలకవి శరణ్యము. ౨౦౦ పుట) పంతులవారి ప్రయోగసంచయములోనివి చాలవఱకుఁ గవిప్రయుక్తములని విశ్వసింపఁదగిన యతిప్రాసాది స్థలనిబద్ధములు కావు. తప్పుల తిప్పలగు తాళపత్త్రమాతృకలనుండియు నవ్యాశ్వప్నులగు ముద్రణసంస్కర్తల సంస్కారమునందిన ముద్రణములనుండియు స్వవాదానుకూల్యమునకై యెత్తికొనఁబడినవే. కవిప్రయోగములని విశ్వసింపఁదగిన యతిప్రాసాదిస్థలనిబద్ధములు మిక్కిలి యరుదు. మఱియుఁ బంతులవారి ప్రయోగసంచయములోఁ బ్రామాణికులుగ నెన్నుకొనఁబడుచున్న మహాకవి ప్రయోగములు మిక్కిలి యల్పసంఖ్యగలవి. పంతులవారు మొదట నాగరకుల నోటినుండివచ్చిన శబ్దమెల్ల సాధువె యను సిద్ధాంతముతో "నిజమైన సంప్రదాయము" అను గ్రంథము వ్రాసిరి. తుదికిఁ గవిప్రయోగసిద్ధభాష గ్రాహ్యమనుచు బాలకవిశరణ్య మను గ్రంథము వ్రాసిరి. ఆకవిప్రయోగముల నంగీకరించుటలోని వీరిపద్ధతులు పై నుదాహరింపఁబడినవి.

"ప్రయోగశరణము వ్యాకరణము......గ్రంథస్థములు కాకున్నను శిష్టుల వాడుకలో వినవచ్చు పూర్వకవి ప్రయుక్తములవంటి సుప్రయోగములకును సాధుత్వము నిర్ణయింపఁబూనిన యీ వ్యాకరణము ప్రయోగశరణ మగుచున్నది. ఇందలి లక్షణములకుఁ దగుచుగాఁ బూర్వగ్రంథములందు నాధునికకృతులందుఁ గనవచ్చెడి ప్రయోగము లుదాహరణములుగా నీయఁబడును. గ్రంథస్థములు కానివి శిష్టులవాడుకలోని వని తెలుపఁబడును" (ఆం. భా. అ. సంజ్ఞా. ౭ సూ. వృ. ము). "కొన్నిటికిఁ బూర్వకవి ప్రయోగములు లేకున్నను గవిప్రయుక్తములను బోలిన శిష్టవ్యవహారములోని శబ్దములుగూడ గ్రాహ్యములగును" (ఆం. భా. అ. ప్రయోగ. ప్ర. ౧ సూ. వృ. ము) సూరి మున్నగువారు వాడిన "ఆర్య వ్యవహారము = శిష్టవ్యవహారము" అనుదానికి మహాకవుల కావ్యములోని వ్యవహారమని యర్థము - వీరు వాడిన 'శిష్టవ్యవహారమ'నుదానికి - నాగరకజనవ్యవహారమని యర్థము. వీరు గ్రహించు కవు లేదోయొకగ్రంథమును రచించినవారు మాత్రమె కాని యాంధ్రభాషయందు మహాపండితులగు మహాకవులయిన ప్రామాణికులు కావలయునన్న నియమము లేదు. మహాకవి ప్రయోగమునకు సాధుత్వమునిచ్చుట సంప్రదాయము. దానిని బోలినవానికెల్ల సాధారణులు సాధుత్వము నంగీకరించుట కర్తలుగారు. "వేఁగుదేరన్" మున్నగువానిని బోలునని "పగుదేరెన్" మున్నగు

వానిని సాధువు లనరాదు. అప్లుభ్రమించి చనుదేరు - చోరి - మున్నగువాని నాధునిక కవులు ప్రయోగించిరి. (బాల. శర.౧౦ - ౧౧౧ పు.) అట్టి ప్రయోగములనుబట్టియా కవులు ప్రామాణికులు కారని యేర్పడునే కాని యట్టి ప్రయోగములకు సాధుత్వము నరుదరాదు. దినవెచ్చము మున్నగు వానిని బోలు 'పదతమ్ములు' 'అంబుజ ముఖి' మున్నగువానికి సాధుత్వము నంగీకరింపరాదు. సత్కవిప్రయోగములనుబట్టి యనుగమములను గల్పించు నధికారము పండితకవీంద్రులగు ప్రామాణికవైయాకరణులకు మాత్రమె యంగీకరింపఁబడుచున్నది.

"వచ్చాడు అనునది శిష్టవ్యావహారికమైనను సత్కవిప్రయుక్తము కాలేదు. కావున నపభ్రంశమనఁబడుచున్నది" (ఆం. భా. అ. సంజ్ఞా. ౩ సూ. ప్ర. ము.) "కొట్టినాఁడులోని నకారము లోపింపఁగా కొట్టి+ఆఁడు=కొట్టాఁడు అని ఇకారము ఆకారము కలియుటచేఁ బైపలుకుబడి వచ్చినది. ఈయక్షరముతోఁ గూడిన పై క్రియలు గ్రామ్యములుగ గణింపఁబడుచున్నవి" (ఆం. భా. అ. సంజ్ఞా ౧౮ సూ. ప్ర. ము.) ఇట్టివాక్యములు శిష్టవ్యవహారములకు సాధుత్వము నంగీకరించు స్వసిద్ధాంతమునకు బాధకములని తలంచికావలయును ననుశాసనకర్తగారు తృతీయ ముద్రణమున వానినివొలఁగించిరి.

అనుశాసనము సంజ్ఞా. ౭౩ సూత్రమునందు గ్రామ్యములకు "వోస్తాఁడు-చూశాను వుత్తరం - వూళ్ళో...దారాపుత్రులు - వలవదు..." అని ప్రథమముద్రణమున నుదాహరించియుఁ దృతీయముద్రణమున "చూశాను - వుత్తరం - వూళ్లో" అనువానిని దీసివేసిరి. శిష్టవ్యవహారములకు సాధుత్వము నంగీకరించుస్వసిద్ధాంతమున కిట్టివి గ్రామ్యములనుట విరోధించునని తలంచియే వీనిని దొలఁగించియుండురు. 'వోస్తాఁడు - ఒత్తాఁడు' మొదలగువానిలో నర్థబిందువును బ్రథమముద్రణమున నిల్పియుఁ దృతీయముద్రణమునఁ దొలఁగించిరి. నేటివ్యవహారమున నర్థబిందూచ్చారణ మప్రసిద్ధమని తలంచియె యద్దానిని దొలంగించియుందు రనఁదగును. "వాడుకలో వుత్తరము - వూరు - వొకఁడు - వోడ - యనునట్లుగా ఉ - ఊ - ఒ - ఓ - లకు వకారముచేర్చిన పదములు వినఁబడును గాని అట్టివానిని కావ్యముల ప్రయోగింపరాదు. ఉండ - ఊడ - ఒడలు - ఓపిక యనునట్లుగా ఉ-ఊ-ఒ - ఓ - లు మొదలఁగల పదములనువాడవలెను." (ఆం. భా. అ. సంజ్ఞా. ౪౪ సూ.) "యిపుడు-యేమి, యెవఁడు - యెందుకు - మొదలగునవి వాడుకలోఁగలవు. కాని వానిని వ్రాయునపుడు ఇపుడు - ఏమి - ఎవఁడు - అనురీతినే వ్రాయఁదగును. ఇట్లె కావ్యములఁ బ్రయోగింపనగును." (ఆం. భా. అ. సంజ్ఞా. ౪౫ సూ.). అని పరమును న

నన్నయా గ్రామ్యం తత్తద్విధా సాధు । కలకంఠముఖా హితాః.
౬౩ I విష. (వికృ. సంజ్ఞా. ౨౯ కారి. అహో. ౧౭౩ పుట)

కల్పతరు - ౬౩ I విషః—తత్తద్విధా = తత్తదుత్తరోత్తర పండితకవీంద్ర ప్రయోగసమ్మతిగాని యుత్తరోత్తర ప్రామాణికవ్యాకరణ విధిసమ్మతిగాని కల్గి యున్నపుడు, గ్రామ్యమ్ = పూర్వపూర్వవ్యాకరణవిరోధమునఁ గాని మహాకవి ప్రయోగవిరోధమునఁగాని యపశబ్ద మనఁదగినదియు, సాధు = సాధువే యగును. (విస్తరI) కావున కలకంఠముఖాః = 'కల యగుకంఠము గలవాఁడు' అను విగ్రహము చొప్పున మిశ్రబహువ్రీహి యగుటచే నసాధు వనఁదగిన 'కలకంఠుఁడు' మొదలగు

---

ణమున నిలిపియు నిష్టవ్రాతవ్యవహారములకు సాధుత్వము నొసంగు స్వసిద్ధాంతమునకు బాధకమని తెలిసికొని పై వాక్యములలోని బాధకవాక్యములను ద్వితీయముద్రణమునఁ దొలఁగించిరి.

మహాకవిప్రయోగసమ్మతము ప్రామాణికవ్యాకరణ సమ్మతముఁను నయినను గాకున్నను నాగరకులవ్యవహారమున నున్నరూపములకు సాధుత్వము నంగీకరించుట యనుశాసనకర్తగారి సిద్ధాంతమనుటకుఁ బైనివ్రాసిన విషయములె చాలును. అయినను వారి యనుశాసనశక్తినిసయితము దిఙ్మాత్రముగ నిటఁ జూపెదను. "స్త్రీసమములయిన తత్సమములు తత్సమములతోఁ గలసి యొక్కొకచో ద్వంద్వము లగును. ఉదా. కర్తకర్మక్రియలు. మొ. కాని సీతరాములు, ధాతహరివాసవులు మొదలైనవి శ్రావ్యములుగావు" (ఆం. భా. అ. సమాస. ౭౨ సూ. తృ. ము.) కర్తకర్మక్రియలు - కర్తరిప్రయోగము - కర్మణిప్రయోగము ననునవి కొందఱవ్యవహారమున నేకాక ప్రౌఢవ్యాకరణముననుఁ బ్రయోగింపఁబడినవి (ప్రౌఢ. వాక్య. 3 సూ) ఇవి ప్రామాణికవ్యాకరణ సమ్మతములు కావు. మహాకవిప్రయోగ సమ్మతములును గావు. కావున నపశబ్దము లనకతీరదు. అట్లయినను వ్యవహారస్థము లగుటచే ననుశాసనకర్తగారు వానిని సంగ్రహించిరి. కాన నపశబ్దములును శిష్టవ్యవహారస్థములు సాధువులని వీరిసిద్ధాంతము.

విస్తర. I ౬౩ I విషః—"సర్వత్రోదోతో ద్వ్యర్థవతి ముపత్" అని సూత్రించియు నన్నయ - "చ......నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి..." (అర. ౨ ఆ. ౭౯) అని ప్రయోగించుటచే నట్టి విశేషప్రయోగములనుబట్టి 'రజ్జులు' అనెడిశబ్దమునకు సాధుత్వమును "అసంబుద్ధౌ భవే ద్వావు। రస్త్రియాం ల్వాదివర్ణకే" (వికృ. అజం. ౨౮ కా.) అనుసూత్రముచే నథర్వణాచార్యుఁడు కల్పించెను. (౧౫౩ విష.)

శబ్దములు, హిత్వా = ఈ క్రిందిరీతి నన్నయభట్టారకులే ప్రయోగించి యుండుటచే సాధువు లగుచున్నవి. క. ఎఱుకని యెఱుఁగక నీకున్। మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం।గఱకంఠా క్షమియింపుము।.....(ఆర ౧ ఆ. ౩౨౬). నన్నయ భట్టునకు రేఫఱకారప్రాసమైత్రి సమ్మతము కాదను సిద్ధాంతముచొప్పున (౫౮. విష. ౫౬ విష. సంజ్ఞ) నిట 'గరకంఠా' అనుసిద్ధసమాసరూపమును నిల్పి ముద్రణసం

---

"మహతోఽత ఉ ద్వ్యభక్తౌ। మహత స్స్యా ద్దు జనితో భవే త్పుంసి" అని సూత్రించియు భట్టారకుఁడు "గీ - ఉత్తమజ్ఞానవృద్ధు నా నుండెనేని।...... (సభా. ౭ ఆ ౭౫) అని ప్రయోగించుటచే 'వృద్ధు' అను ప్రథమైకవచనస్థితికి సాధుత్వమును "ధూర్తస్వృద్ధౌ నీచమూర్ఖౌ।వృదన్తావపి సమ్మతౌ" (వికృ - అజం - ౨౭ కారి) అను సూత్రముచే నథర్వణుఁడు నిర్వహించెను.

ఇట్లు నన్నయ సామాన్యదృష్టిని వచించిన సూత్రములకు విరుద్ధముగ నతఁడే విశేషదృష్టిని బ్రయోగించుటచేఁ బ్రామాణికుఁడగు నథర్వణుఁ డట్టివానికి సాధుత్వమును సూత్రించినవాఁడయ్యెను. (౧౬౦ విష)

నన్నయభట్టుచింతామణికిని నతని భారతభాగములోని ప్రయోగములకును సమ్మతములుగాని ప్రయోగములు కొన్ని తిక్కయజ్వ తనభారతభాగమునఁ బ్రయోగించుటయు నట్టిది తనకును రుచించుటం జేసి యథర్వణాచార్యుఁడు వాని సాధుత్వమును సూత్రించుటయు సంభవించియున్నది.

"నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అని మధ్యమపురుషక్రియేకారముతోఁ పాటుగఁ బ్రథమపురుషక్రియేకారమునకును నిత్యసంధిని సూత్రించి నన్నయ తన భారతభాగమున నంతటను నట్లె ప్రయోగించియు నుండఁగాఁ దిక్కయజ్వ ప్రథమ పురుషేకారసంధి పాక్షికతను బ్రయోగించెను. "మ......ము। ప్కరులై చేసిరి యంతచేసియును......" (ఉద్యో. ౩ ఆ. ౩౬) కం. వంచనఁ గొడుకనిరి యెల్లవారలు వినఁగన్" (ఉద్యో. ౪ ఆ. ౩౭౨) ఇట్టి సంధిపాక్షికతను సమ్మతించి యథర్వణుఁడు "ప్రథమేచోత్తమే చైవ। క్రియేతో వా భవే చ్ఛ్రుతిః" (వికృ. సంధి ౬ కారి) అని సూత్రించెను. (౭౧ II-III విష).

ఉన్న - కల - న - వర్ణకంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపము నెచ్చటను జేయక నన్నయభట్టు తనభారతభాగమునం దెల్లఁ బ్రయోగించియున్నను సోమయాజి యట్టి వకారలోపమును బాక్షికముగఁ బ్రయోగించెను. ఉ. ఇప్పుడు వచ్చి వాఁడ విట నెల్లను జేయుదుగాక...... (విరా. ౫ ఆ. ౯౩) ఇట్టి తచ్ఛబ్దవకారలోపము నథర్వణుఁడును సమ్మతించి "తచ్ఛబ్దవస్య లోపః స్యా।దదాత్తోః క్వచి దేకతా" (వికృ. అజం. ౮౦. కారి.) అని సూత్రించెను.

స్కారము చేయరాదయ్యెను. అట్లె భట్టారకు నకుం దద్భవములందు శకటరేఫస్థితి సమ్మతముకాదను సిద్ధాంతముచొప్పునం (వై - పా ౪౩౦ - ౪౩౧ విష) (౫౭ విష. సంజ్ఞా) బాలవ్యాకర్త తలంచినట్లు (ప్రౌఢ. సంజ్ఞా. ౯ సూ) గరకింఠశబ్దభవమగు కఱకంఠశబ్ద మిట నన్నయప్రయుక్తము కానోపునని తలంపరాదయ్యెను. కాన "కఱ = నల్లనైన, కంఠుఁడు = కంఠముగలవాఁడు" అను మిశ్రబహువ్రీహిస మాసము నన్నయచేఁ బ్రయుక్త మయ్యెననియు మిశ్రబహువ్రీహి వ్యాకరణ సమ్మతము కామింజేసి యది గ్రామ్యమయ్యెననియు మహాకవి ప్రయుక్తమగుటచే నది నిపాతన్యాయమున సాధువగుచున్నదనియు నధర్వణుని యాశయమును వర్ణిం తురు. కాని నన్నయ యట్టి యపశబ్దమును బ్రయోగించె ననుటకన్న "కఱ = నల్ల నయిన, కంఠము = కంఠము కలవాఁడు = కఱకంఠుఁడు. దీనికి సంబోధనమున "కఱ

---

భట్టారకుఁడు "ద్రుతాఖ్యోనః" అని సూత్రించి యెల్లయెడలను ద్రుతమును నకారవ్యంజనరూపముగనె ప్రయోగించియున్నను సోమయాజి ద్రుత 'ను' స్వరూ పమును బ్రయోగించెను. క......ధరణిలంఘించెను మఱపులేక పేరుకున్..... (భీష్మ. 3 ఆ. ౯౪) (౪౩ III విష)

ఖండాఖండప్రాసమును నన్నయ యెచ్చటను బ్రయోగించియుండకున్నను సోమయాజి పలుచోటులం బ్రయోగించెను. (౪౨ V విష) ఉ. కీచకకోటిచేత నొక కీడును బొందక వచ్చి తమ్ము నిన్‌వేఁచిన దుర్మదుండు......(విరా. 3 ఆ ౪౫ ప) (౪౦ V వి)

"నాన్యేషాం వైధర్మ్యం। లఘ్వోలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అని నన్నయ వచించి తనభారతభాగమునం దెచ్చటను రేఫఱకారోభయఘటిత శబ్దాంగీకారప్రసక్తి గల్గకుండ వానివైధర్మ్యమునే ప్రయోగించియున్నను సోమ యాజి రేఫఱకారోభయఘటిత శబ్దాంగీకారమునకుఁ బ్రసక్తిని గల్గించెను. క. రాతిపయిని నుష్ణ గొనుట। రాత్రి దధి......(అను. ౪ ఆ. ౧౧౦) క. నాయుల్ల మరయ నిసుమో। ఱాయో కాకిట్లు రూపఱక విన......(భీష్మ. 3 ఆ. ౪౧౯) (౫౦ I విష.)

అచ్చు పరమగునపుడు సంధిలో మధ్యమపురుష మువర్ణకలోపమును భట్టారకుఁ డెచ్చటను బ్రయోగింపలేదు. "న ప్రాణేతు కదాచన" (వికృ. క్రియా ౭ కారి) అని యధర్వణుఁడు నిషేధించి యున్నాఁడు. అట్లయినను సోమయాజి దానిలోపమును బ్రయోగించెను. క.......రు। త్వాయకముల నినుఁ గూల్చెద। జూ యెవ్వత నైతినేమి......(భీష్మ. 3 ఆ. ౩౨౫) సోమయాజి ననుసరించి తర్వాతి మహాకవులు పెక్కురిట్టిలోపమును బ్రయోగించిరి. (౧౦౯ I విష)

కంటా" అనురూపము లభించును గాన నట్టిది నన్నయచేఁ బ్రయుక్తమైయుండు ననియు, నట్లయినను స్త్రీసమములకు నపుంసకసమములతో బహువ్రీహి నచ్చె చ్చుటను గన్పట్టమింజేసియు సంబోధనమున నాచ్ఛికశబ్దము డుజ్జునకు లోపము సమ్మతము కామింజేసియు నదియు గ్రామ్యమే యయ్యెననియు మహాకవి ప్రయుక్తమగుటచే సాధువగుచున్నదనియు నథర్వణాశయమును వర్ణించుచు "కఱకంటా క్షమియింపుము" అనుపాఠము నన్నయాభిప్రేతమని యథర్వణాశయమును గొందఱు వర్ణింతురు. 'కఱకంఠా' అనుదానిలోని మహాప్రాణ ఠకారము మహాకవిప్రయోగములలో నెచ్చటను బ్రాసగతముగఁ గన్పట్టమింజేసి యీపక్షము నిర్బాధమె యనఁదగును. అరయనరయ భట్టారకుఁ డిట్లును నపశబ్దమును బ్రయోగించెనని యథర్వణుఁ డంగీకరించె ననుటయు సరియని తోఁపకున్నది. 'కఱకంటా' అను సమాసములోని యుత్తరపదము "కంటము" అనునది యని యంగీకరింపక "కంటు" శబ్దమని యంగీకరించినచో గ్రామ్యతయే కల్గనేరదు. "కఱ = నల్లనగు, కంటు = కంఠము గలవాఁడు = కంఱకంటు" అని యేర్పడును. దీని సంబోధనమున "కఱకంటా" అను నిర్బాధరూప మేర్పడును. ఇందు "కఱ, కంటు" అనునవి రెండును స్త్రీసమములె యగుటచేత నీబహువ్రీహియందును శంకాలేశము కల్గనేరదు. "నీర = నీరు, మీన= మీను, రూప - రూపు" అను రూపములవలెనె కంఠ శబ్దభవము "కంటు" అని యేర్పడుట సహజమె యగును. (వై. పా. ౮౦ III విష) ఈపక్షమున "గ్రామ్యం

---

భావార్థక టవర్ణకము పరమగునపుడు పూర్వస్థితధాత్వవయవ 'ను' వర్ణము చోటబిందువును నన్నయ తనభారతభాగముననెచ్చటను బ్రయోగింపలేదు. "పూర్వస్య న వికారో నోః" (వికృ. క్రియా. ౧౯౭ అహో. ౪౯౯ పు) అని యథర్వణాచార్యుఁడు బిందువికారనిషేధమును జేసెను. అట్లయినను సోమయాజి దానిబిందువికారమును బ్రయోగించెను. క. అంటం గట్టం దగునే। యంటకు నగి......(ఆను. ౧ ఆ. ౨౮ ప) క. ఒంటిమెయి నుండఁగా ము। క్కంటికి నాకచ్ఛపంబు గౌరుం బట్టం। గంట యరిది......(ఆను ౧ ఆ ౨౨౩ ప) సోమయాజి ప్రయోగమునుబట్టి శ్రీనాథాదులును నిట్టి బిందుఘటితరూపములఁ బ్రయోగించిరి. కేతన దానిని సంగ్రహించెను. క. తినుటకుఁ దింట యగున్ మఱి। కొనుటకుఁ గొంట యగుఁ గనుటకుం గంటయగున్। వినుటకు వింట యగున్ దా। ననుటకు నంట యగు వలసినప్పుడు కృతులన్" (ఆం. భూ. ౧౫౮) సీ. మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి। పనిఁ గొంట నీకుఁ బ్రాభవముగాదె (శృం. నై. 3 ఆ. ౧౨౬ ప) ఇట్లివి మహాకవి సమ్మతములయ్యె.

తత్తద్విధా సాధు" అను నథర్వణవాక్యమునకుఁ బ్రసక్తియేమియని శంకింపరాదు. "తత్తద్విధా = ఆయాసామాన్యవిధులందు, గ్రామ్యమ్ = విశేషవృష్టిని బ్రయుక్తములై గ్రామ్యములనవలసిన, "విమోహారజ్జులు - వృద్ధు" మున్నగుశబ్దములందలి (విస్తర I ౬౩ I విష) గ్రామ్యము, సాధు = సాధువగును. కఱకంటుముఖాః = పరిశీలనరాహిత్యమున 'కఱకంఠుఁడు' మున్నగురీతిని గ్రహించి గ్రామ్యము లను కొనుచున్నవి 'కఱకంటు' మున్నగురీతిని గ్రహింపఁబడినవై, హితాః = వ్యాకరణ సమ్మతములే యగుచున్నవి" అని పైయథర్వణసూత్రమున కర్థమును గ్రహింప వలయును. (విస్త II)

---

విస్తర II ౬౩ I విష:—ఈక్రింది బాలసరస్వతీ యాహోబలపండితీయ ములనుబట్టి పైభారతపద్యమున (క. ఎఱుకనియెఱుఁగక......) "కఱకంటు" అను టకారఘటితపాఠమునె నన్నయప్రయుక్తమునుగా బాలసరస్వత్యహోబలపండి తులు విశ్వసించిరా యని యాలోచింపవలసియున్నది. "కఱకంటుఁ డనుచోట 'ట' కారము సమాసాంతము" (బాలస. హలం. ౧౬-౧౭ కారి. టీక. పరిషన్ముద్రణము) "చుట్టు కైదువు తాల్పు ఇత్యాదౌ పువర్ణకః. నలువ ఇత్యాదౌ హ్రస్వ స్సమా సాన్తః.....క్వచి దన్తిమవర్ణస్య సమాసాన్తత్వ మిష్యతే ఇత్యథర్వణః. 'కఱకం టుఁడుః ఇత్యత్ర టకారః......" (అహో ౪౪౬ పుట) "కఱకంటుఁడు ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః. కఱకంటుముఖా హితా ఇత్యథర్వణోక్తేః" (అహో ౪౩౬ పు) ఈసందర్భమునుబట్టి "కఱ+కంఠ" అను మిశ్రబహువ్రీహిలో 'ఠ' కారముచోట'ట' కారము సమాసాంతప్రత్యయము వచ్చెనని బాలసరస్వత్యహోబలపండితులు విశ్వసించిరని విశదమగుచున్నది. బాలసరస్వతీయటీకయందును నహోబలపండితీయ వ్యాఖ్యయందును ముద్రణసంస్కర్తృప్రమాదమున "కఱకంఠుఁడు" అనుచోట ఠవర్ణము" (బాలస) "కఱకంఠుఁడు ఇత్యత్ర ఠకారః" (అహో ౪౪౬ పు) "కఱ కంఠుఁడు ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః. కఱకంఠ ముఖా హితా । ఇత్యథర్వణోక్తేః" (అహో ౪౩౬) అని మహాప్రాణవర్ణమె యంతటను బడియున్నది. కాని ఠకారము చోట ఠకారమె సమాసాంతప్రత్యయము విధింపఁబడిన దనుట కేవలము నసంగ తము గాన టకారము సమాసాంతముగ విధింపఁబడె ననియే యుండఁదగును. 'కఱకంఠ' అనుమిశ్రబహువ్రీహిలో "టకారము" సమాసాంతముగ విధింపఁబడెనని బాలసరస్వత్యహోబలుల యాశయము చెప్పనగును. వేటికావ్యాఖ్యాతఠకారమె సమాసాంతమని వ్రాయుట సరికాదు. (బా. సా. వే. ౩౭ పు) "ద్వి. కఱకంఠ భక్తుఁ డొక్కరుఁ డర్ధరాత్రి । నరుదేర......" (బసవ. ౨ ఆ ౪౩౮) అనుపాఠము

ప్రౌఢ. ఉప II విస:— 'గ్రామ్యం తత్తద్విధా సాధు' అను ప్రకృత కారికలో "తత్తద్విధా" అనుదానికిఁ దత్తత్పాత్రముల యౌచిత్యమున" అని వ్యాఖ్యానించెను. ఐనను అహోబలపతి "చతుర్విధాభాషేతి గ్రామ్యయా సాకం వికృతా వ్యాకరణేషు స్వప్నం వదతి శబ్దానుశాసనాచార్యస్య కుత్రచి ద్వినియోగ ఇష్టఏవ. అన్యథా తస్యాగణనం వృథా స్యాత్. వినియోగోపి నాన్యత్ర యుక్త ఇతి. తత్తద్వ్యవహార పక్షనే కార్యః. అతఏవ ప్రోక్త ముధర్వణేన—గ్రామ్యం తత్తద్విధా సాధు. కలకంఠముఖా హితా ఇతి (అహో ౧౭౨ పు) ఇట్లర్థము చేయునపు డీకారికలోని కలకంఠో దాహరణము సుసంగతము కానేరదు. 'కలకంఠ' అను నపశబ్దమే నీచపాత్రము పల్కుటందును స్వాభావికము కాదుగదా. మఱియుఁ బాత్రౌచిత్యమనుసరించి భాష ప్రయోజ్యమన్నచోఁ బండితులు సైత మపశబ్దభూయిష్ఠ వ్యావహారికభాషతోనే ప్రసంగించుచుండుట ప్రసిద్ధమగుటంజేసి ప్రబంధములలోని పలకుఁబాషాప్రయోగ మస్వాభావికము ననుచితము ననవలసి వచ్చును. ఇట్టి యహోబలపతి వ్యాఖ్య ననుసరించియే కావలయుఁ బ్రౌఢవ్యాకర్త 'గ్రామ్యంబు దత్తజ్జాతి పాత్రంబులం బ్రయోగార్హం బగు" అని సూత్రించి "ఇతని। సూసినా మేలుబాగేము సేసినాము" "మొక్కేము సామి" మును గు వ్యావహారిక వాక్యముల నుదాహరించెను. (ప్రౌఢ - సంజ్ఞా ౧౫ సూ) ముద్రణములందు తే. గీ - వేసమున మేలుబాగేము సేసియుంట। నిపుడు గనుఁగొంటి మునికల్కు నెఱుకువారల। ముగుదమాటలు విని చాలనలరి...... (యయా ౧-ఆ ౧౨౦ ప) క - మ్రొక్కెదము సామి నీదమ్ము।......(రామా - ౨ ఆ ౭ ప) అని సంస్కర్తలచే సవరింపఁబడెను. కాని యెఱుకువారల ముగుదమాట లనుదాహ్యాగస్య...న నటఁ బ్రౌఢవ్యాకరణోదాహృతస్థితియె కవి ప్రయుక్త మనఁదగును. "అనిపల్కు" అనుదానితోఁ బైయపశబ్దముల ననుకరించి ప్రయోగించుటచే "అనుకారేచ సర్వేషాం। దోషాణాం నైవదోషతా" (సాహి - ౭ పరి. ౬౨ కా) అను చొప్పున నటఁ జ్యుతసంస్కారదోషము లేదు. కాని యట్టి యనుకృతి లేనపు డట్టి యపశబ్దము లెఱుకువారల విషయమునందును గావ్యములందుఁ బ్రయోజ్యములు కానేరవు. కావునఁ బ్రౌఢ వ్యాకరణసూత్రమున కవి సరియగు లక్ష్యములు కావు. ప్రామాణిక కావ్యములం దట్టిసూత్రమునకు లక్ష్యములు లభింపనేరవు. నాటకములలో నీచపాత్రముల భాష వ్యాకరణవిరుద్ధ వ్యావహారికభాష కావచ్చుననుచు నాధునికులు కొంద ఱపశబ్దప్రచురముగఁ గావ్యముల నడపుట కేవలము శాస్త్రసంప్రదాయ విరుద్ధము

---

ముద్రణపుస్తకస్థ(ము) ప్రమాదకృతము. "మొఱటవవంకియ్య...... । కలకంఠు భక్తుఁడు......" అని కవిప్రయుక్తము కానోపును.

ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. ౧౨.

బా. వ్యా. ౧౨ III విషయము. పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపఁదగు నని తాత్పర్యము. కలికంఠుఁడు ప్రాణగొడ్డము - జవగత్తె - కపిలకన్నులు - కపిలగడ్డము కపిలజడలు.

సంజీవని. ౧౨ III విష:—కలికంఠుఁడు శబ్దము కల్పితపత్రులో జెప్పఁబడిన రీతిగా మిశ్రబహువ్రీహి యగుటచే "స్త్రీ సమఘటితంబ యొకానొకండు బహు వ్రీహి చూపట్టెడు." (బా - సమా - ౭. సూ) అనుచెప్పిన గ్రామ్యమునఁ బడి యున్నను భట్టారక ప్రయుక్తము తాను విశ్వసించుటచే సాధువగుచున్నదనియుఁ దక్కిన యుదాహృతులెల్ల "కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు" (బా. సమా - 3 సూ - వివ) అనుచెప్పిన లక్షణవిరుద్ధములనఁ బడియున్నను మహా కవి ప్రయుక్తములుగాన సాధువులగుచున్నవనియు సూరియాశయము. మహాకవి ప్రయుక్తమాత్రములె యగు నీయుదాహృతులనుబట్టి "పెద్దలు వ్యవహరించిన మాట. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు" అను సూరివాక్యములకు మహాకవులు తమ కావ్యములలోఁ బ్రయోగించిన శబ్దములనిమాత్రమె యర్థము కాని పండితులు నిత్యవ్యవహారములో వాడెడిశబ్దములని యర్థముకాదు. (విస్తర 1) కలికంఠా క్షమియింపుము । నెఱి నెవ్వరి కెఱుఁగఁదగునె నీచరితంబుల్" (ఆర ౧ ఆ - 3౨౬)

---

విస్తర. 1 ౧౨ III విష:—త్రిలింగలక్షణ శేషకర్త ప్రాణగొడ్డము శబ్దము ప్రాణకుట్టిక శబ్దభవమగుటచే నగ్రామ్యమనఁదగునని (ప్రౌఢ. సంజ్ఞా. ౧౨ సూ) సమ ర్థించెను. "తద్భవములందును నలఘురేఫ బు గలదు, ఉదా—కలికంఠుఁడు- గాలికి యగలి........" (ప్రౌఢ. సంజ్ఞా ౯ సూ.) అని త్రిలింగలక్షణశేషకర్త సూత్రోదా హరణములను జూపెను. కాని నన్నయభట్టు భారతభాగమున నీవివాదస్థ కలికంఠ శబ్దముతప్పఁ దద్భవశకటరేఫప్రయోగము లేకుండుటంజేసి "శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు"(బా.సంజ్ఞా.౧౮ సూ.వివ)అనుసూరివాక్యమును ఖండింపఁదల చిన ప్రౌఢవ్యాకర్త తలంపు సఫలము కాఁజాలదు. (వై. పా. ౪౩౦. ౪౩౧ పుట)

పయి ప్రౌఢవ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదములోని ౯ సూత్రము తాత్పర్య మును సరిగ గ్రహింపఁజాలక గుప్తార్థప్రకాశికా కర్త "త్రిలింగ లక్షణమందు నయ్యవి గ్రామ్యములు కాక తద్భవములె యనిచెప్పఁబడినవి. ఎట్లన గరకంఠశబ్దభవము కలికంఠుఁడు..." (బా. గు. ప్ర. సంజ్ఞా. ౧౨ సూ. వ్యా.) అని యచటి తద్భ వతాకల్పనమునకుఁ బ్రయోజనమును వేఱుగా నెన్నుట పొరపాటు, త్రిలింగ

"కఱ = నల్లని, కంఠము = మెడ = కఱకంఠము" అను కర్మధారయమున నది యగ్రామ్యమగును. సీ. ప్రాణగోష్ఠములగు పసుల వారలఁ దీర్ప.....(ఉద్యో ౧ ఆ౨౩౧ ప) ప్రాణగోష్ఠము = ప్రాణహింసకము. "ప్రాణముగొడ్డము" అన్నచో నది యగ్రామ్యమె యగును. శా॥ దేవబ్రాహ్మణభక్తి ప్రౌఢ ప్రియవక్తృత్వంబు కాణాచి

లక్షణశేషకర్త మతమునను "కఱకంఠుఁడు" శబ్దము గ్రామ్యము కాకపోలేదు. అది తద్భవమని యంగీకరించునపుడు దానికి సమాసదోషము వారింపబడినను నంద నాంధ్రవర్ణమగు మహాప్రాణ ఠకార ముండుటచేనది గ్రామ్యమే యనియు మహాకవిప్రయుక్తమగుటచే ననింద్యగ్రామ్య మనియుఁ బ్రౌఢవ్యాకర్త యభిప్రాయము. కావుననె తత్కృత శబ్దరత్నాకరకోశమున "కఱకంఠుఁడు. వై. గ్రా. వి. శివుఁడు" అని యనింద్యగ్రామ్యముగ నుదాహరింపఁబడెను. ఈవిషయములను బత్త్రికాముఖమునఁ బ్రకటింపఁగా గుప్తార్థప్రకాశికానుబంధమున నేవేవో యసంగత ప్రసంగములు చేయఁబడెను. (బా. గు. ప్ర. అనుబంధము. ౧౬౭. మొ. ౧౭౩ వ. ద్వి. ము.) ఆ ప్రసంగములలోని ప్రకృతార్థ విషయకాభిప్రాయముల నిటఁ జూపెదను. "ఠకారస్థితి గ్రామ్యమే యయ్యేనేని యథర్వణాదుల నందఱను డీకొని శుద్ధినొందింతునని...చేసిన సీతారామాచార్యుల వారి మేలిపూన్కి యంతయు బూదిం బోసిన వేలిమి యున్కిం జెందవలసియుండు. అందున, గరకంఠభవమగు కఱకంఠశబ్దము శాస్త్రీయ మనవలయుంగాని గ్రామ్యం బనఁగూడదు." (బా - గు - ప్ర - ద్వి - ము - అనుబంధము ౧౬౯-౧౭౦ పుటలు.) "సీతారామాచార్యకృత శబ్దరత్నాకరముననే కఱకంఠశబ్దమునొద్ద గ్రామ్యతాచిహ్నమగు "గ్రా" వర్ణమేల లిఖింపఁబడినదని శంకింతురేని...అయ్యది (ఆ 'గ్రా' వర్ణము) ముద్రాప్రమాదహేతుక మని యెంచవలెను." (బా. గు. ప్ర. అనుబంధ. ౧౭౧ పుట. ద్వి. ము.) "ఠకారహేతుకగ్రామ్యత...మిశ్రసమాస పక్షమునసే యుండెననుట ప్రామాదికవచనము. అట్లైనయెడల సిరివల్లభుఁ డనుమిశ్రసమాసముకూడ భకారముచే గ్రామ్యము కావలసివచ్చును" (బా. గు. ప్ర. అను బ. ౧౬౯ పు. ద్వి. ము.) ఏమిసాహసము! తనకుబాధకమగు 'గ్రా' అనునది ముద్రాప్రమాదపతిత మఁట. మిశ్రసమాసమున ఠకారహేతుకగ్రామ్యత కలదని యెవ్వరు చెప్పిరి? గరకంఠశబ్దభవ మనుటచే నాచ్ఛికమగుచున్న "కఱకంఠ" శబ్దమున ననాంధ్ర వర్ణ ఠకారముండుట గ్రామ్యతామూల మనిచెప్పఁబడెను. 'సిరివల్లభు'డనునది షష్ఠీ సమాసము. మిశ్రసమాసము. తత్సమమగు "వల్లభుఁడు" శబ్దములో భకార ముండుట గ్రామ్యతాపాదక మెట్లగును?

విద్యావైదుష్యము లెక్కు, ధర్మముగాకుం బార్కా, మర్యాదకున్ । తా (టీ?) వౌచిత్యము జీవగఱ్ఱ..... అజాతశత్రుండు......... (విజయ - ౧ ఆ - ౨౦ ప) ఉ...లం। కావిభు జీవగఱ్ఱ......(రామా ౭ ఆ. ౧౮౦ ప.) శ్రేయోఘటికి జీవగఱ్ఱ (వి. ప్ర. ౧ ఆ. ౮౭ ప.) (మా - రా. ని.) జీవగఱ్ఱ = జీవనాధారము. జీవపుఁగఱ్ఱ" యనినచో నది యగ్రామ్యమె యగును. (విస్త II) "మధ్యాక్షరము. అవసరజ్ఞుండయి వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి। కపిలగడ్డంబును గపిల జడలును గపిలకన్నులును। దకసియస్నప లావు నల్లదీర్ఘపుఁ దనువును జూచి। యువిద కన్నులంగవ మొగిచి తెఱవక యుండె భయమునII ఆది. ౬ ఆ. ౨౫౮ ప.) ఈ యక్కరపద్యమున "పవ" ప్రాసము నన్నయ ప్రయోగించె నను నిశ్చయముతో సూరి యీపద్యమునుండియె "కపిలగడ్డము కపిలజడలు కపిలకన్నులు" అను వానినిదీసి యనింద్యగ్రామ్యములనుగా నుదాహరించె ననుటకు సందియములేదు. నన్నయయక్కరల లక్షణములు సుగ్రహములు కాకుండుటంజేసి యీపద్య మొక్కొక మాతృకలో నొక్కొకరీతి నున్నది. (నారచించిన యక్కర లను వ్యాసము. శ్రీవిజయనగర మహారాజావారి కాలేజి మేగజైను. ౭౦ మొ - ౧౦౩ పు. IV వాల్యము. 3 నెం) నేటి ముద్రణములలో నీపద్యమున "పవ" ప్రాసము సంస్కర్తలచేఁ దొల

---

విస్తర II ౬౩ III విషః—"జీవగఱ్ఱ. మి. వి. గ్రా జీవనౌషధము. జీవాతువు" (శ-ర). "ఇది యనింద్యగ్రామ్యమని పలువు రందురుగాని నాకిట్లు తోఁపదు ...జీవ = వీణ మొదలగువాని తంతి చక్కఁగా మ్రోఁగుటకుఁగాను వాని క్రింద నుంచెడు కంబపేఁచు లోనగునది...సీ. విపులతరంబగు వీణ దానది యెంత, కారణంబగు జీవగఱ్ఱయెంత। (చతుర్వేదసారము) సీ. శ్రుతికి నుత్కర్షంబు చూపంగ వలయుచోఁ। జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ (క్రీడాభిరామము)" (బసవపురాణ పీఠిక ౯౮ పుట) దీనినిబట్టి "జీవయొక్క కఱ్ఱ=జీవగఱ్ఱ" అని షాష్ఠీసమాసము నెన్నవలయుననియు నాపక్షమున గ్రామ్యతకుఁ బ్రసక్తి కల్గనేరదనియుఁ బీఠికాకర్త యాశయము విశదమగుచున్నది. పై విజయవిలాసాదిప్రయోగములలో వీరుచూపిన సమాసములోని యవయవార్థము వివక్షితార్థబోధనక్షమము కాకున్నది. కాన నచట జీవనార్థకజీవశబ్దమె కవ్యభిప్రేతమని యెన్నవగును. వీరుచూపిన జీవాశబ్దము క్రొత్తది కాదు. శబ్దరత్నాకరమునఁ జూపఁబడినదె. మఱియు నీ బసవపురాణపీఠికాకర్త తలంపు చొప్పున జీవాశబ్దమునె గ్రహించునపుడు షష్ఠీసమాసమున గ-స-డ-ద-వాదేశ మప్రసిద్ధమగుటంజేసి జీవగఱ్ఱశబ్దమున కనింద్యగ్రామ్యత దుర్వార మగుచున్నది.

నెంచ బడినది. కాని నేను జూచిన పెక్కుతాళపత్త్రమాతృకలలో దీని ప్రాసస్థలములందు - "అవసర.....కపిల...తపసి...ఉవిద..." అనునవే పైరీతినేయున్నవి. నేటి ముద్రణములలో నీపద్య మీక్రిందిరీతి నున్నది. "అవసరజ్ఞుండయి వ్యాసుఁ డెఱింగెనంత నత్తపసి కపిలగడ్డంబును గపిలజెడలును గపిల కన్నులును దవిన యాస్యవ నల్లనైన దీర్ఘప్రమాణవపువు జూచి యుపిద కన్నుంగవ మొగిచి తెలివకే యుండె భయమున" (ఆది. ౬ ఆ ౨౬౭ ప. వావిళ్ళవారిముద్రణము) ('తపసి' అనిది ప్రక్రాన్తా 'తవిన' అనినేల ప్రౌఢవ్యాకరణ కర్త యుద్ధృతపాఠమునే యంగీకరించి "కపిల శబ్దభవము కపిలశబ్దం పొందు గానంబడెడి" (ప్రౌఢ. సంజ్ఞా. ౧౩ సూ) అని సూత్రించి యీవివాదస్థపద్యమునే యుదాహరించెను. 'ద్రౌపది = ద్రోవది' అను రీతిని 'పకారము' వకారముగఁ బరిణమించుట వింతకాదు (వై. పా ౧౧౯ III విష) భారతమునఁగాని మఱియేప్రామాణికప్రబంధమునఁగాని పవప్రాసము కానరాదు. అట్లు - 'కపిలగడ్డము' మున్నగునవియు మహాకవి ప్రయోగించెనని విశ్వసింపఁదగిన రీతిని ప్రాసస్థలములలోఁ గన్పట్టలేదు. కాఁగా నీప్రౌఢవ్యాకర్త తలంచినట్లు సూరి యనింద్యగ్రామ్యము లనుకొన్న "కపిలగడ్డము - కపిలజెడలు - కపిలకన్నులు" అనునవి నింద్యగ్రామ్యములె యని యంగీకరింపక తీరదు. (విస్తర III)

---

విస్తర. III. ఉక్తి III విష:—తాళపత్త్రమాతృకలను బైరీతిని సంస్కరించుట సాహసమని తోఁచునుగాని వానిని బాగుగఁ బరిశీలించినచో నవి సవరింపఁదగిన దుఃస్థితిలో నున్నవనుటకు సందేహము లేదు (చూడుఁడు నారచించిన బాలసరస్వతీయటీక ౭ - ౧౩ - ౧౮ - ౧౯ - ౨౦ - ౨౧ - ౨౨ - ౨౩ - విష) ఈవిషయము పాఠకమహాశయులకు విశదపఱుచుటకై యిటఁ దాళపత్త్రమాతృకాలేఖనపద్ధతిని జూపి యెట్టిగ్రంథములు సుశబ్దాపశబ్దనిర్ణయవిషయమునఁ బ్రామాణికములని గ్రహింపఁదగునో యనువిషయమును బరిశీలించి నేఁటిముద్రణసంస్కారమువలనఁ గలుగుచున్న ప్రమాదములను విశదపఱుచుచున్నాను.

చ. అనిన సదస్యు లందఱు ప్రియంబున నిట్టి విశిష్ట విప్రముఖ్యునకు మహాతపోధనునకున్ దగు పాత్త్రున కేదియిచ్చినన్। ఘనముగ నక్షయంబు సగు గావున సద్ద్విజనాథు కోర్కె పెంపున పృథక్షాయగా జనదు భూవలయేశ్వర యిమ్ము నెమ్మితోనా॥

వ. అనిన విని సర్వజనానుమతంబుగా జనమేజయుండ స్తికు ప్రార్థనచేసి సర్పయాగం బుడిపించె నయ్యవసరంబునా॥

క. వానరజరత్కారుమునీం। ద్రునకు జరత్కారువకును సుతుఁడైన మహా। ముని వరు నస్తీకుని ముకంబున దలచిన బాయు నుగ్రభుజగభయంబులు॥

వ. మరి యస్తీకు చరితంబు విన్నవారికి సర్వపాపక్షయం బగు ననినా॥ (తాళ. ఆది ౨. ఆ. ౨౩౨. ౨౩౩; ౨౩౭. ౨౩౮)

ఇట్లు యింకను వివిధములగు తప్పుల కుప్పలయి యుండును. ఇట్టి మాతృకలను సవరింపక యథాస్థితముగ ముద్రింపవలె ననుట కేవలము నకృత్యము. ముద్రించితి మనుట వట్టికల్ల. అట్లగుటం జేసి బహుమాతృకాసాహాయ్యంబునను, దత్తద్గ్రంథ ప్రయోగప్రణాళికనంబునను, ప్రామాణికశాబ్దిక మహాకవీంద్ర రచిత వ్యాకరణముల యాధారంబునను ప్రామాణికమహాకవీంద్ర ప్రయోగ పరిశీలనంబునను నింక నిట్టి యుత్తమసాధనంబులఁ దాళపత్త్రమాతృకా సంస్కారము చేసి గ్రంథముల ముద్రించుట యత్యావశ్యక మని గ్రహింపవలెను.

పై ప్రమాణములకుఁ బరస్పరవిరోధము తటస్థించునపుడు మహాకవి ప్రబంధములలో నైనను కవిప్రయుక్తములని విశ్వసింపఁదగిన ఛందో యతి ప్రాస శ్లేషాదిస్థలనిబద్ధ ప్రయోగము లెక్కుడు ప్రమాణములుగ నంగీకరింపవగును. అంతియ కాని బాలకవిశరణ్యకర్త ప్రభృతులవలె దొరకిన తాటియాకుల తెడకలలో నెల్ల దొరికినప్రయోగములనెల్ల సంగ్రహించి ప్రామాణిక వ్యాకరణము లప్రమాణములని విజృంభించుట యుక్తముకాదు. మఱియుఁ బండితోత్తము లాయా గ్రంథములను జదివి యాయాకవుల ప్రామాణికత్వమును బరిశీలించి లక్షణపరిశీలన విషయమునఁ బ్రామాణిక గ్రంథముల నెన్నికొనుట యత్యావశ్యక మైయున్నది. ఈ విషయమున నప్పకవ్యాదులచేఁ బ్రామాణికముగా నంగీకరింపఁబడిన రంగనాథరామాయణము కొంత విమర్శితమగుచున్నది. రంగనాథరామాయణకర్త వైష్ణవుఁడు చక్రపాణిరంగనాథనామము గలవాఁడు ననియు నతనికి శివద్వేషమునఁ గన్నులుపోఁగా శైవుడై శివభక్తిదీపిక (నయనరగడ) శివమంత్రవర్ణనము (నమశ్శివాయ రగడ) రచించెననియు, గన్నులు వచ్చెననియు శైవుఁడయిన పిదప రంగనకవి యనఁబరఁగె ననియు బ్ర. శ్రీ. ప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిరి. (బసవపురాణపీఠిక ౨౭ ౨౯. పుటలు. తిరుపతి. శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు జర్నలు. VIII వాల్యు. నెం. I జనవరి—జూన్ ౧౯౪౭. క్రీ. శ.) రంగనాథుని కవిత ధారావాహి హృద్యము నైనను నందనేకములగు నపప్రయోగములు కన్పట్టుచున్నవి.

సమ్మదమున విష్ణు సాక్షాత్కరించె. (యూ. ము. ౩౩ పు) ఖండపరశు శిరఃకంపంబు సేసె(యూ. ము. ౭౫౩ పు) రాహుబాహుశబ్దసామ్యమునఁ బ్రామాణిక

కవిసమ్మతములు కాని విష్ణు-ఖండపరశు- మొ. ప్రయుక్తము లయ్యెను ఇవి యపశబ్దము లనఁదగును, క్రోధించు నయ్యింద్రజిత్తుఁ డగఁగ (యూ. ము. ౨౯౯ పు) తోఁ బలుకక యింద్రజిత్తుఁడు చేఁపలికె (యూ. ము ౩౦౭) అంతటఁ బోవక యాయింద్రజిత్తుఁ డంత నాకాశమై ...... (యూ. ము. ౪౦౭ పు) ఎగసిప్రేయఁగఁ ద్రుంచి యింద్రజిత్తుండు (యూ ము. ౪౧౮ పు) 'ఇంద్రజితుండు' అనుదానికి మొదటిరూపమని భ్రమించి కావలెను ఇంద్రజిత్తుండు' అను నపశబ్దము ననేకస్థలములఁ బ్రయోగించెను. (ఈ యపశబ్దము నయ్యలార్యుఁడు మాత్రము ప్రయోగించెను. ఏప్రామాణిక కవియు నిట్టిదానిని బ్రయోగింపలేదు. చ - గొనకొని.....యింద్రజిత్తుని (భాస్క-యుద్ధ ౧౩౭౮ ప) చ. ఘననిభు...—ఇంద్రజిత్తుని (భాస్క. యుద్ధ ౧౫౮౯ ప) ఇంద్రజిత్తునితోడన్ (భాస్క. యుద్ధ ౧౮౭౭ ప) ఇట్టి కవుల ప్రయోగములు లక్షణపరిశీలనవిషయమునఁ బ్రామాణికములుగా గ్రహింపరాదు) బుధులు దూర్వాంబులఁ బూతాక్షతములఁ (యూ. ము. ౫౨౪ పు) దూర్వాశబ్దము స్త్రీలింగము. దీనికి నువర్ణాంతరూపము ప్రామాణికకవి సమ్మతము కాదు. ఇది పక్షిగాదు మమ్మిందఱ జూచి నదయుఁడై యముఁ డిట్టు లరుదెంచినాఁడు। రాము కార్యార్థమై ప్రాణముల్ మనము। నీమహాపక్షికి నిచ్చుట లెస్స (యూ. ము. ౨౬౬ పు) మమ్ము శబ్దము మనశబ్దమునకుఁ బర్యాయముగా వాడుట ప్రామాణిక కావ్యములందుఁ గన్పట్టలేదు. అతినిష్ఠ వెలయ విశ్వామిత్రమౌని (యూ. ము. ౩౮-౩౬. ౭౩ పు) ఇట్లు విశ్వామిత్రశబ్దమున 'అ'కారము విఱిచి స్వరప్రధానయతిని బ్రయోగించుటప్రామాణిక కావ్యములందుఁ గానవచ్చుట లేదు. "మిత్రే చర్షౌ (౬-౩-౧౩౦)" అను పాణిని సూత్రముచొప్పున "విశ్వ+మిత్ర = విశ్వామిత్ర" అని దీర్ఘము వచ్చును. ఆకారము విఱుగు నను కొనుట పొరపాటు. మహనీయ రావణ మహిమచేఁ జేసి. (యూ. ము. ౩౮౬ పు) చే—చేతఁ బమిొంప. "చేసి" అను ప్రయుక్త మగుట ప్రామాణిక కృతులందుఁ జూపట్టలేదు. బింబోష్ఠములు చంద్రబింబాననములు (యూ. ము. ౫౨౪ పు) ఇట్టి యుపమానపూర్వపదకర్మధారయంబులు సాధువులు కానేరవు. మసలక పోదని మైందుండు పలికె (ప్రాచీనముద్రణము) మసల కోపుదునని మైందుండు పలికెనని యిటసంస్కర్త సవరించెను. (యూ. ము ౨౯౯ పు.) కాని యింకను నిట్టిద్రుతపూర్వస్వరసంధులు గలవు. కఁపింపఁజేసి తిక్ష్వాకువల్లభుల (యూ. ము. ౪౦౮ పు) ఈముహూర్తము దప్పనీనని శివుని గావించి యిసుకచేఁ గావించితేను (యూ. ము. ౬౩౩ ఆ. పుట) ఆరామవిభున కీయంగనామణియు। నీరామ కారామనృపతియుఁ దగును। (యూ. ము. ౨౮౬ పు) ఇటఁ

దగుదు రని యుండనగును. బహుద్బహువచనక్రియ కేకవచనస్థితి లక్షణవిరుద్ధము. "మహద్బహుకర్తృకక్రియకు నేకవచనంబు విభాషనగు" (ప్రౌఢ - క్రియా. ౬ సూ) ఈసూత్రము నిరాధారము. ఈసూత్రమునకు మూలముగ నుదాహరింపఁబడిన నన్నయప్రయోగము ప్రక్షిప్తపాఠయుతము. క. తనయొటఁగిన యర్థం బొరుఁ | డనఘా యిదియెట్లు చెప్పు మనియడిగినఁ జె | ప్పనివాఁడును సత్యము చె | ప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడున్ (ఆది. ౧ ఆ. ౧౩౭) ఇందుస్థలద్వయమునందును "చెప్పనివాఁడును" అని నన్నయప్రయుక్తముని విశ్వసింపఁదగును. "తిర్యగ్జడేషు కర్తృషు | బహువచనం చైకవచన మేవ స్యాత్తు" ని నన్నయ వచించియుండుటచే మహత్కర్తృకత్వమున నట్టిప్రయోగ మాతఁడుచేసెననుట విశ్వసనీయము కాదు. ఇట్టిప్రయోగము తిక్కనాదిప్రామాణికప్రబంధములం దొక్కటేని గన్పట్టలేదు. పయినివ్రాసిన లక్షణస్ఖాలిత్యములెల్ల ముద్రణసంస్కర్తగారు రంగనాథరామాయణములోనివని యంగీకరించిన గ్రంథభాగములలోనివె. వారు సంశయించి ప్రథమద్వితీయానుబంధములలోనికిఁ ద్రోసివేసిన గ్రంథభాగములందును, వావిళ్ళవారిపూర్వముద్రణమునందును నింకను ననేకములగు నపశబ్దములు వ్యావహారికప్రయోగములుగలవు. త్రోవయివ్వక (వావిళ్ళ. ౨౦౨ ప.) కుర్వదయ్యె(వావిళ్ళ ౨౯౧ ప) మొగతనము (యూ. ము. ౭౭౩ పు) ఇట్టివి పెక్కుగలవు. పూర్వముద్రణపాఠములను బ్రథమానుబంధమునఁ జూపెద మనిరేకాని సంస్కర్త లట్టి వావిళ్లవారి ముద్రణములోని వాని నేయనుబంధమునందును జూపలేదు.

రంగనాథరామాయణకవి ప్రాచీనుఁడయ్యు నర్వాచీనసాధారణకవుల గ్రంథములలోని వ్యావహారికప్రయోగములవంటివానిని పెక్కిటిని బ్రయోగించెను. అట్టిప్రయోగములు రంగనాథరామాయణములోనివేయని నిర్వివాదముగా సంస్కర్తగా రంగీకరించిన గ్రంథభాగములోనె వెలయుచున్నవి. చేసినావె. (యూ. ము. ౧౫౪ పు) చూచినావో (యూ. ము. ౧౯౪ పు) చూచినావు (యూ. ము. ౨౬౧ పు) పెట్టినావు, మించినావు (యూ. ము. ౩౦౭ పు) ఇట్టివానినెల్ల నిల్పియు సంస్కర్తగారు కొన్నియెడల సవరింప యత్నించిరి. "నెమ్మది నున్నావు నీకిది తగునె" (వావిళ్ళముద్రణము ౧౭౬ పు) ఇందలి 'ఉన్నావు' అనునది రంగనాథునివంటి ప్రాచీనుని గ్రంథమున నుండరాదని తలంచికావలయు "నెమ్మది నున్నాఁడ విదినీకుఁ దగునె" అని సంస్కర్తగారు సవరింపఁబోఁగా యతిభంగము సంభవించినది. అది గోశబ్ద మర్వాచీన మగుటచే రంగనాథరామాయణమువంటి ప్రాచీనగ్రంథమున నుండరాదను తలంపునఁ గావలయు సవరింపఁబడెను. కొలువ నున్నాఁ డదిగో చూడు

చేత (వావిళ్ళ. ము) శ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారి తాళపత్రమాతృకలోను నిల్చియున్నదికాని యూనివర్సిటీముద్రణమున "కొలువ నున్నాఁడదె గుణసత్కథనుఁడు" (యా. ము. ౩౭౬ పు) అని సవరింపఁబడెను. ఓయన్న కొని పోవుచున్నవాఁ డిదిగో (వావిళ్ళ) ఓయన్న కొనిపోవుచున్నవాఁ డనిన (యా, ము ౨౦౭ పు) ఇట్లు రంగనాథుఁడు వ్యావహారిక భాషాప్రయోగకుతూహలియై యుండ సంస్కర్త ప్రాచీనపద్ధతిని సవరించుట సరికాదుగదా. మఱియుంగ నీచేత మారీచిగాను (వావిళ్ళ. ము.) మఱియుగ్గ నేవల్ల మారీచం గాను (తాళపత్ర) మఱి యుంగ మారీచమనుజాశి గాను (యా. ము. ౪౭౩ పు) ('మారీచు' వాడుక పదము) సంస్కర్తగారు కొన్నియెడల నుత్తరాంధ్రప్రయోగములను నిల్పకపో లేదు. ఊరు రాస (యా, ము. ౨౦౪ పు) కత్తిరించుకపోయె (యా. ము. ౩౯౫) కూర్చుక (యా. ము. ౫౫౦ పు) పట్టవేనుంగు (యా. ము. ౧౧౭ పు) అయ్యుం డిరి (యుక్ప్రాసగతము) (యా-ము. ౫౫౨ పు.) ఇట్టివానిని నిల్పియు, అలిగటు పోయి (యా. ము. ౭౭౪) రామరామని (యా. ము. ౭౭౬) ఇట్టివానిని ద్వితీయానుబంధమున నిల్పియు "ముద్రికిచ్చి" (వావిళ్ళ ౧౪౯ పు.) మున్నగువాని నెందును సంగ్రహింపలేదు. సంప్రదాయసిద్ధముగా సంస్కర్తలు సవరింపవలసిన పెక్కుతప్పులు సవరింపక సంస్కర్తగారు నిల్పివేసిరి.

| తప్పు | ఒప్పు | యా. ము. |
|---|---|---|
| విభండక | విభాండక | ౧౨ పు. |
| సురలార పాటిల్లనిమ్ము | సురలార పాటిల్లనిండు | ౪౨ పు. |
| ఇంతియె | ఇంతియ | ౧౨౫ పు. |
| రత్నరాసులు | రత్నరాశులు | ౧౨౦ పు. |
| పగతుఱ | పగతుర | ౩ - పు. |
| బ్రహ్మాదిసురలు | బ్రహ్మాదిసురులు | ౨౨ పు. |
| సఖియ | సకియ | ౧౦౨ పు. |
| ఇందీవరాక్షి (నీవు) కర్తవై | ఇందీవరాక్షి కర్త్రివై | ౨౦౯ పు. |
| ఇచ్చుటకు | ఇచ్చుటికి | ౪౭ పు. |
| అభిరామముల | అభిరామత | ౫౩ పు. |
| నలరు | ల నలరు | మొ. |

మీఁద నుదాహరించినరీతిని బ్రాచీనలాక్షణిక నియమములను గొంతనడలించుకుతూహలముగల రంగనాథుని కావ్యమున నీక్రిందిరీతి గ స డ ద వాదేశములను నిల్పుట సహజము కాదు. విన్నవించిరిప్రీతి (ప్రీ) (యూ. ము. ౮ పు.) విషము ప్రయోగించె (ప్ర) (యూ. ము. ౭౯ పు) పెద్ద వార్ధినకు (ప్రా) (యూ. ము. ౨౩. ౧౦౫ పు.) రథికులుసర్పింప (చ) (యూ. ము. ౯౬ పు.) మగువసక్రంబు (చ) (యూ. ము. ౧౨౭ పు) హరివంచినాఁడో. హరుఁడువంచినాఁడో (వ) (యూ. ము ౩౦౮ పు). క్త్వార్థకాదులమీఁదనైతము గ స డ ద వాదేశము నిల్పఁబడెను. క్రొవ్విసచ్చుటయు (యూ. ము. ౭ పు.) తగిలి నైకొన్న (యూ. ము. ౨౦ పుట.)

ఈ రంగనాథరామాయణసంస్కర్తగారే బసవపురాణ సంస్కరణమును గావించిరి. ఆపీఠికలో నీక్రిందిరీతినివ్రాసిరి "తొలుత నీయాదేశము నీగ్రంథమునఁ బూర్ణిగాఁ బాటింపఁ దలంచితినిగాని భారతాదిప్రయోగముల ద్వైవిధ్యమునను దాళపత్రగ్రంథము లంతగా నీనియమమును బహుకాలమునసుండియే పాటింపకుండుటను......కొన్నియెడల నర్థక్లేశము గలిగించుటను......పర్యాలోచించి యాపూర్ణిని వీడి నేనును బహుళముగానే యీయాదేశము నిందుఁ బాటించితిని" (బసవ. పీఠిక. ౧౦౬ - ౧౦౭ పుటలు) ఇట్టి స్వాతంత్ర్యము సంస్కర్త కుండరానిది. గ్రంథములోని యతిప్రాసాదిస్థలనిబద్ధ ప్రయోగములనుబట్టియు గ్రంథకర్తస్వభావమునుబట్టియు, నాయాకాలముల కేర్పడియున్న లక్షణ శాస్త్రసిద్ధాంతములనుబట్టియుఁ నిట్టి విషయములను నిర్ణయించుట యుక్తము. మఱియుభారతమున నీయాదేశమునకు ద్వైవిధ్యము లేదు. అందీయాదేశము నిత్యము. (౭౭ - ౭౮ విష) మఱియుఁ దానుబాహుళికముగాఁ బాటింప నిశ్చయించుకొన్నపుడీ క్రిందిరీతి నాదేశముల నిల్పనేల? "ధర్మంబు నాల్గుపాదముల, మూఁడుపాదంబుల, ఒక్కపాదమునను (బసవ. ౯ పు) ఒక్కవెయ్యిశివంబు (బసవ. ౨౨౧ పుట.) ఒకొక్క ప్రశ్న (బసవ ౧౯౮ పు.) రంగనాథరామాయణములోని విట్టివి పైని చూపఁబడెను. తాళపత్రమాతృకలు తప్పులతిప్ప లన్నమాట నిజమేయైనను గవిరచనను గ్రహించుటకు నవియే యాధారము లగుటంజేసి వీలుపడినంతవఱకు వాని స్థితికి సన్నిహితముగానే సవరింపవలయును. రంగనాథరామాయణములోని కొన్ని సవరణములు:—

పలికడ కేతెంచి పల్కె మయుపుత్త్రి (వావిళ్ళ. ము.) పలికడ కేతెంచి పలికె మయపుత్రి. (తాళపత్ర) పలఁ జేరి మయుపుత్త్రి పలికె నిట్లనుచు (యూ. ము. ౮౯౩ పు.) వావిళ్ళవాఁముద్రణమునందును దాళపత్త్ర మాతృకా పాఠమునందును

ఛందోభంగము గల్గుటచే నానిని వారించుట కచటి కవిరచనమునెల్ల మార్పనేల? "పతికడకే తెంచి పలికె మనుసుత" అని సవరించుట న్యాయ్యము కాదా? ఇట సంస్కర్త సవరింపలేదనియు నట్టిపాఠమునైన నొకానొక తాళపత్త్ర మాతృక లోనిదే యనియుఁ జెప్పవచ్చునుగాని యాపక్షమున నది కవిప్రయుక్త మనుట కాధారమేమి? వావిళ్ళవారి ముద్రణపాఠమునే చూపకుండుట కేమికారణము? ఇట్లాముద్రణము నుపేక్షించుటచేఁ గొన్ని కవిరచనములు తార్మారగుచున్నవి. "ఉరుబాహుసత్వసముగ్రులై పేర్చి" (వావిళ్ళ. ము) 'ఉరుబాహుశక్తి సముగ్రులై తరిమి (తాళపత్త్రమా) వావిళ్ళవారి ముద్రణములోని యతిభంగము తాళపత్త్ర మాతృకాపాఠములో లేకుండుటచేతను నారెండిటికిని జాలవఱకు సంవాద ముండుటచేతను "ఉరుబాహుశక్తిసముగ్రులై తఱిమి" అనునదియె కవిప్రోక్తమని తోఁచకమానదు. ఇట్టిస్థితిలో వావిళ్ళవారి ముద్రణపుపాఠమునే యెచ్చటను జూపక "ఉరుబాహుసత్వపయోధులై పేర్చి" (యూ. ము. ౫౦౫ పు) అనురీతిని నిల్పిన సంస్కర్తగారి పాఠము కవికృతమనుట విశ్వసింపఁదగి యుండదుగదా. వేవేగ చంపు నిలింపకంటకుని (వావిళ్ళ-ము) లే వేగచంపు నిలింపకంటకుని (తాళపత్త్ర) వేవేగ చంపుమీ విబుధకంటకుని (యూ. ము. ౮౭౮ పు) వీనిలో మొదటిరెండి టికిఁ గల సంవాదముచేనందు యతిభంగములేని తాళపత్త్ర మాతృకాపాఠమె కవిప్రోక్తమని తోఁచక మానదుగదా. ఇట్టితాళపత్త్రమాతృకాపాఠ సంవాదముగల వావిళ్ళవారి ముద్రణములోని పాఠములనెచ్చటను జూపకసంస్కర్తగా రుపేక్షిం చుట కేవలము నన్యాయ్య మనకతీరకున్నది.

వావిళ్ళవారిముద్రణమున వెలసియున్న యఖండయతులు ప్రాసయతులును యూనివర్సిటీముద్రణమున సవరింపఁబడినవి. ప్రాచీనలక్షణబంధములను గొంతసడ లించు కుతూహలముగల రంగనాథుఁ డట్టివానిని బ్రయోగించె ననుటయె విశ్వాస పాత్త్రముగ నుండును. మునిమిడి యోజనంబులు మూఁడు గడవ|ననఘగంగాయము నలు గూడి యునికి (వావిళ్ళ. ము.) అనఘగంగానది యమునయుఁగూడి (పాఠాన్తర ము.) ననిచి గంగాయమునలు గూడి యునికి(యూ. ము. ౧౩౮ పు.) కొన్నియెడల సవరింపమఱచిరి. జలధులు గలఁగె దిశావలి పగిలె (యూ. ము. ౮౬౧ పు.) దండ| కారణ్యమునఁ జంపెఁ గసలి విరాధు (యూ. ము. ౫౮౭ పు.)

ప్రాసయతుల సవరణములు:—నడురేయి ని న్గడువడిని బొమ్మంటి. (వావిళ్ళ. ము.) నడురేయి నిన్నేల నడికిఁ బొమ్మంటి (యూ. ము. ౧౮౧ పు.) నిలువ గాకుండ నిచ్చలు నొసంగుదువె (వావిళ్ళ—ము.) నిలువ గాకుండ సన్నిధి నొసగుదువె

(యూ. ము. ౧౨౨ పు.) రసరసాన్నములను మెసవెడివాఁడు (వావిళ్ళ. ము.) (రస రస = షడ్రస) పొసఁగ రసాన్నముల్ భుజియించువాఁడు. (యూ. ము. ౧౨౩ పు.) శరణార్థిఁ బ్రోవని దురితాత్ముగతికి (వావిళ్ళ. ము.) శరణార్థిఁ బ్రోవని చపలాత్ము గతికి (యూ. ము.) ఎవసి గోహత్య చేసినవానిగతికి (వావిళ్ళ - ము) చెనసి గోహత్య చేసినవానిగతికి (యూ. ము. ౧౮౭ పు.) ఇవెల్ల సంస్కర్త చేసిన సవరణ ములు కావనియు వ్రాఁతప్రతులలోనివే యనియుఁ జెప్పవచ్చునుగాని యిట్టి వివాద స్థలములందైన నట్టిపాఠము లెందున్నవో టిప్పణిలోఁ జూపుట యుక్తము కాదా? మఱియుఁ బ్రాసయతులతో నున్న వావిళ్ళవారి ముద్రణమునందలి పాఠముల నే యనుబంధములోనైన సంగ్రహింపవలదా? రంగనాథరామాయణ ద్విపదలలోఁ బ్రాసయతులు లేవనియు "ఎసగు - ఒసగు, శబ్దములలో బిందువు లేదనియు నొకప్పుడు జరిగిన చర్చల కనుకూలముగ నీ ముద్రణసంస్కారమున నట్టిసిద్ధాంతము స్థిరపడు టకై 'ఎసఁగు-ఒసఁగు' అనువానిలోని బిందువులెల్ల నుస్ఖాలితము లయ్యెను. వావిళ్ళ వారిముద్రణమున బిందుఘటితరూపములు వందలకొలఁదిగ నున్నవి. యూనివర్సిటీ ముద్రణమునందన్ననో పొరపాటున నొక్కస్థలములో మాత్రము దాఁగియున్నది. స్వస్తి యెల్లప్పు డొసంగుదు రనుచు (యూ-ము. ౧౧౯ పు.) (౮౮ V. విస్తర.)

రంగనాథరామాయణముద్రణసంస్కర్తగారే బసవపురాణసంస్కరణము గావించిరి. ఆవిషయమునందును గొన్నిటి నిట విశదపఱుచుచున్నాను. బసవపురాణ కర్తయగుపాల్కురికి సోమనారాధ్యుఁడు సంస్కృతాంధ్రములందు గొప్పపాండిత్య ముగలవాఁడు. వైదికసిద్ధాంతపద్ధతిని వీరశైవస్థాపనము చేసినట్లె యాంధ్రకవిత్వము నందును వ్యాకరణపద్ధతుల ననుసరించుచునే వింతవింతలగు ప్రయోగములను జేసి తనపాండిత్యమును బ్రదర్శించు స్వభావము గలవాఁడు కావున నీతని గ్రంథమును సంస్కరించునపు డట్టి మెలఁకువతో నుండవలయును. "జల్లి పూరకమపశబ్ద మక్ర మము। పొల్లు వ్యుత్క్రియ జడ్డుపొం దసంఘటన। కాకువు వ్యర్థ మసంగతి విరసంబు వైకల్య మత్యుక్తి వైరిపదంబు। తలవిఱు పసఱు గ్రత శిథిలబంధ। ములు ... ...... గ్రామ్యోక్తి గంటకము। బ్రాభ ఛందోవిరుద్ధం బాదియగు న। లాభ ప్రలాపోక్తి లాఘవంబనక।......।ఇదమిత్థ మనుచోట నివియె ప్రామాణ్య।పద ములు గాఁగ ద్విపదలు సంధింతు।......(పండితారాధ్యచరిత్రము) (బసవ. పీఠిక ౭౭ పు.) అని ప్రతిజ్ఞ చేసిన ప్రామాణికకవి సోమనారాధ్యుఁడు వైరిపదసమాస మును నిరసించియుఁ బెక్కుచోటుల నట్టివానినె ప్రయోగించెనని పీఠికాకర్తగారు వ్రాసిరి. కాని యాయాచోటుల వానివాని తద్భవరూపములతోఁ గవిచేఁ బ్రయో

గింపఁబడుటంజేసి యట వైరిపదదోషము కలుగలేదు. ఈవిషయము (విస్తర. ౬౦ II. విష.) వెనుకటి తద్భవప్రకరణమునఁ బెక్కుస్థలముల విశదీకరింపఁబడెను. అట్టిదె మఱొకస్థల మిటఁ జూపఁబడుచున్నది.

సోమనారాధ్యుఁడు, 'ధర్మకపిల - దీనితద్భవము - దమ్మకవిల' అని ప్రయోగించియుండఁగా ముద్రణసంస్కర్తగారు 'ధర్మకవిలె' అనుదానిని నిల్పి కవివైరి పదమును బ్రయోగించెనని తలంచిరి. వీరితలంపుచొప్పుననె సూ. రా. నిఘంటుకారులును నుదాహరించిరి. "ధర్మకవిలె. మి. వి. (ధర్మము+కవిలె) ధర్మముల పుస్తకములలోని దానముల ననుభవించువాఁడు. ద్వి. మీదత్తి మీప్రోత మీధర్మకవిలె। మీదాసు ననుఁ గావరే దయతోడ. (బస. పు. ౪ ఆ. ౧౦౨పద్య.) ద్వి. అవుదలల్ వంచుచు నయ్య మీధర్మ।కవిలెల మనుచును గడుదైన్యపడుచు. (బస. పు. ౭ఆ. ౩౯౭ పద్య)" (సూ. రా. ని) "కవిలె. (లియ) వి. ౧... లెక్కపుస్తకము..." (సూ. రా. ని) ఈయర్థము పై బస. పురాణపద్యముల నెట్లుపొసంగునని వీరు తలంచిరో తెలియకున్నది. సోమనారాధ్యుఁడచట "ధర్మకపిల దీనితద్భవము-దమ్మకవిల" అనుశబ్దములఁ బ్రయోగించెను. ధర్మార్థముగ విడువఁబడిన 'కపిలధేనువు' అని యర్థము. ఎవ్వరికిని హింసింపరానిదని భావము. ఇట్లు మిక్కిలి ప్రౌఢముగను సుసంగతముగను నట సోమనారాధ్యుఁడు ప్రయోగించెను.

ప్రాసములలోఁ గతిపయహల్సామ్యమున్నను శివకవులు సమ్మతింతురనుచు నొకసిద్ధాంతమును నెలకొల్పి సంస్కర్తగారీక్రిందిరీతిని ముద్రణసంస్కారము గావించిరి.

౧ మర్త్యలోకమునకు మఱి వేఱెయొకఁడు। కర్త యున్నాఁడె......(బసవ. ౧ఆ. ౧౩ పు.)

౨. మధ్యాహ్నమగుటయు మారయ్యలింగ। తద్ధ్యానసుఖ (బసవ. ౫ ఆ. ౧౫౩ పు.)

౩. ఆక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిపి (బసవ. ౧ ఆ. ౧౪ పు.)

౪. కర్జంబు నావుడు బిజ్జలుఁ డంత। లజ్జయు......(బసవ. ౪ ఆ. ౧౦౭ పు.)

౫. బుజ్జగించుచు నెడ్లబుడ్లను బెట్టు। నిర్జివిక్రియ (బసవ. ౩ ఆ. ౭౧ పుట.)

౬. తత్త్రిపురాంతక స్థానవాస్తవ్యుఁ। డై త్రిపురాంతకు (బసవ. ౧ఆ.౨పుట.)

పయివిషయములుసరిగావు. సోమనారాధ్యుఁ డట్టి ప్రాసముల నంగీకరించువాఁడు గాఁడు. (బస. పీఠి. ౯౦ పు.)

౧. "మర్త్తలోకమునకు మఱి వేఱెయొకఁడు। కర్త్త యున్నాఁడె లోకత్రయ వరద." అని సోమనారాధ్యప్రయుక్తపాఠము కానోపును. మర్త్యశబ్దపర్యాయము 'మర్త్త' శబ్దము గలదు. "మర్త్త. పు. (మృ+తన్) మనుష్యే. భూలోకేచ. తత్ర భవః. మర్త్త్యః. యత్. మర్త్త్యః = మనుష్యే." (శబ్దస్తో) దీనినిబట్టి మర్త్త్యశబ్దము మర్త్తశబ్దమునుండియె సాధించికొనవలయునని విశదమగుచున్నది.

౨. "మద్ధ్యాహ్న మగుటయు మారయ్యలింగ। తద్ధ్యాన....." అనునది బసవపురాణక ర్త్రభిప్రేతపాఠ మనఁదగును. "అనచిచ" (౮-౪-౪౭) (౪౭ సూ. సి. కౌ. అచ్సంధి) అను పాణినిసూత్రముచొప్పున మధ్యాహ్నశబ్దములోని ధకారము పాక్షికముగా ద్విరుక్తమగును. ముద్రణసంస్కర్త్తగా రీకితిని ద్విత్వము చేసి ప్రాసములు సరిపెట్టక యెన్నెన్నో చోటులందుఁ బ్రాసభంగములను ముద్రింపించిరి. రంగనాథరామాయణమందును నిట్లె చేసిరి.

3. "ఆక్షణంబునఁ బంచభక్షములఁ గుడిపి।" అనునదిసోమనారాధ్యప్రయుక్తపాఠ మనఁదగును. "భక్ష - అదనే - చురాదిః - పచాద్యచ్ - భక్షః" అని భక్షశబ్దమును భక్ష్యశబ్దపర్యాయముగా సాధించికొనవచ్చును.

౪-౫ "కజ్జంబు నావుడు బిజ్జలుఁ డంత। లజ్జయు....." "బుజ్జగించుచు వెజ్జు బుజ్జను బెట్టు। నిజ్జీవిక్రియ" అనియిట్లు సోమనారాధ్యప్రయుక్త పాఠము లనఁదగును. ఇట్టి వింతతద్భవముల నాతఁ డనేకములనుఁ బ్రయోగించి యున్నాఁడు (విస్తర. ౬౦-II విష).

౬. "తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ। డత్త్రిపురాంతకుం డభినుతిఁ జేస్సు" అనునదిగ్రంథకృత్ప్రయుక్తపాఠ మనఁదగును. ఆ+త్రిపురాంతక. అప్ప్రిమద. (రాఘవ.) (ఆ+ప్రమద)

అద్వితీయుఁడు రామనాథుఁడే కర్త్త (బసవ. ౧౭౨ పుట.) ఇచట యతిభంగము ముద్రింపింపఁబడెను. "నద్వితీయుఁడు రామనాథుడే కర్త్త" అనునది సోమనారాధ్య ప్రయుక్తపాఠము కానోపును. నఞర్థకనశబ్దము ద్వితీయశబ్దముతో "సుప్సుపా" అనుచొప్పున సమసించె ననఁదగును. "సర్వస్య గాత్రస్య శిరఃప్ర। ధానం బనెడు మాట" (బసవ. ౪ ఆ. ౧౧౬ పు.) "కృతం కర్మ శుభాశుభం బనెడి" (బసవ. ౬ ఆ. ౨౦౦ పు.) "హరిగుం హరంతం బనుచు (బసవ. ౬ ఆ. ౨౦౩ పు.) అని యిట్లనేక స్థలములలో నపప్రయోగములు ముద్రింపింపఁబడినవి. "సర్వస్య గాత్రస్య శిరః ప్రధానంబు" అనురీతిని సోమనారాధ్యునివంటివాఁడు ప్రయోగించి యుండఁడనుటకు సందేహము లేదు. వానియందెల్లఁ బూర్ణబిందుపూర్వక బువర్ణకఘటితరూపములు

బాలవ్యా.
౬౩. IV విష. [ఇది సంజ్ఞాపరిచ్ఛేదము.]

సంజీవని ౬౩. IV విష:—ఇది పైనివివరించినది. సంజ్ఞాపరిచ్ఛేదము = సంజ్ఞలను దెలుపు వ్యాకరణభాగము. సంజ్ఞాపరిచ్ఛేదము ముగిసినదని యర్థము.

---

ప్రామాదికము లనిగ్రహింపవలయును. అట "ప్రధానమ్+అనెడు" మున్నగురీతిని ఛేదముచేసి "అహమాదీనాం ద్విత్వమ్" అనుచింతామణిసూత్రముచొప్పున ననుకరణసంధిలోని ద్విత్వమును గవిప్రయోగించియుండె ననుట నిశ్సంశయము. కాన "సర్వస్య గాత్రస్య శిరః ప్రధాన మ్మనెడుమాట" "కృతం కర్మ శుభాశుభ మ్మనెడి" "హరిగుం హర న్త మ్మనుచు" అనునవి సోమనారాధ్యప్రయుక్తపాఠము లనియెన్నఁదగును. విస్తరభీతిని విరమించితినిగాని యిట్టి వెన్నియేని సంస్కార ప్రమాదములు ముద్రితము లయ్యెను. (చూ. విస్తర. II. ౧౪౭. I. విష.)

ముద్రాశాలాధికారులు, నితరముద్రాపకులు, భాషాభిమానులగు ముద్రణసంస్కర్తలును ముద్రణసంస్కారవిషయమున నత్యధికమగు జాగరూకతను వహింపఁ బ్రార్థింపఁబడుచున్నారు. ముద్రణములు భాషావాఙ్మయాభివృద్ధి కత్యంతోపకారకములయి యున్నను ముద్రణసంస్కార లోపమునగొప్పయపకారము కల్గునని నామనవి. ముద్రణసంస్కర్తలు స్వాభిమతసిద్ధాంత స్థిరీకరణాభినివేశముతో సంస్కరించి భాషను దార్మాఱు చేయకుందురుగాక !



# ఆంధ్ర
# వ్యాకరణసంహితా సర్వస్వము
## సంధిపరిచ్ఛేదము

నన్నయా — ఆద్యన్తవర్ణయో రైక్యం । సంధిరిత్యుచ్యతే బుధైః ।
అథర్వణీయము. — పూర్వస్య పరరూపత్వ।మత్రైవ నియతం భవేత్ (వికృ.
౬౮ విషయము. — సంధి. ౧ కా. అహో ౧౯౮ పుట.)

కల్పతరువ్యాఖ్య. ౬౮ విషయము:—సంధిపరిచ్ఛేదము = వాక్యగతపదములను సన్నిహితముగాఁ బల్కునపుడు శబ్దముల పూర్వపరాక్షరములందుఁ గల్గు మార్పులను దెల్పు వ్యాకరణభాగము.

ఆద్యన్తేత్యాది:—ఆద్యన్తవర్ణయో రైక్యమ్ = 'పరపదము మొదటి వర్ణము పూర్వపదము తుదివర్ణము' అను రెండిటియేకీభావము, సంధిరితి = సంధియని బుధైః = పండితులచేత, ఉచ్యతే = చెప్పఁబడును. ఏకీభావము నందుటయనఁగా వాని రెండిటిచోటను నుచితమగు గుణవృద్ధ్యాదిరూపమైన యక్షర మేకాదేశ మగుట యనియర్థము. ఇట్టిస్థితి స్వరములసంధియందే సంభవించును. అట్టిసంధి సంస్కృతపదములయందే సంభవించును. ఉదా: రమా+ఈశః = రమేశః, ఇచట - 'ఆకారము - ఈకారము' అను రెండిటిచోటను 'ఏ' కార మేకాదేశమయినది. ప్ర+ఏజతే = ప్రేజతే. ఇచటఁ బరాక్షరరూప మేకాదేశమయినది. హరే+అవ = హరేవ. ఇటఁ బూర్వాక్షరరూప మేకాదేశ మయినది. అత్రైవ = ఈతెలుఁగు భాషయందు మాత్రమే, పూర్వస్య = పూర్వాక్షరమునకు, పరరూపత్వమ్ = పరాక్షరరూప మేకాదేశమగుట, నియతమ్ = నియతముగా, భవేత్ = అగును. అనఁగాఁ దెనుఁగున స్వరములసంధిలోఁ బూర్వపరాక్షరముల స్థానమునఁ బరాక్షరాకార మేకాదేశ మగునని యర్థము. తెల్గున నిట్టి పరరూపసంధియే యంతటను నగునని సాధారణముగాఁ జెప్పినను 'తెల్ల+అది = తెల్లది. మంచి+అది = మంచిది' మున్నగుచోటులందుఁ బూర్వరూపసంధియుఁ దెలుఁగున నరుదుగఁ గలదని యెఱుంగునది.

బాలవ్యాకరణ
వివృతి
ఉర I వచ

[సంధిపరిచ్ఛేదము.]

సంజీవని. ఉర I విష:—సంధిశబ్దమునకు సంధ్యభ్యాసవిహితకార్యమనియు, వర్ణద్వయ మేళనమనియు, సంహితయనియు, నర్థత్రయము కలదు. "సంధి. పు.....వర్ణద్వయజాతే వర్ణవికారభేదే" (శబ్దస్తో.) "సంధ్యభ్యాయవిహితకార్యం సంధిరితి" (ముగ్ధ. టీ. ౨౨సూ.) "సంధిః. పు..... వర్ణద్వయమేళనే, సంహితాయామ్......సంధివిధాయకసూత్రవిహితకార్యం వా" (శబ్దా. చిం.) దీనిని బట్టి సంధిపరిచ్ఛేద మనఁగా వర్ణద్వయసంధానమునఁ గలిగెడి కార్యముల నుపదేశించు వ్యాకరణభాగ మనునర్థము సప్రమాణమగుచున్నది. "పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధియనంబడు" (బా. సంధి. ౧ సూ.) అను సూరిగారి యచ్సంధినిర్వచనము సంధిశబ్దమునకుఁగల వర్ణద్వయమేళనరూపార్థముచే సమర్థమైయున్నది. సూరి సంధిపరిచ్ఛేదమున వివిధసంధికార్యములను వివరించియున్నాఁడు. ఈనిర్వచనము స్వరసంధిమాత్రపర మనుట స్పష్టము. (విస్తర I.)

సంస్కృతమునందువలె గుణవృద్ధ్యాది స్వరసంధికార్యవిశేషములు తెలుంగు స్వరసంధులలో లేవని యెఱుంగునది. సంధిశబ్దమునకుఁగల తక్కిన మూఁడవ యర్థము సంహితయనునది. సంహితాశబ్దమునకు "పర స్సన్నికర్ష స్సంహితా. (౧. ౪. ౧౦౯) వర్ణానా మతిశయితః సన్నిధిః సంహితాసంజ్ఞః స్యాత్." అని పాణినీయమున లక్షణము చెప్పఁబడినది. వాక్యగతశబ్దములలోని వర్ణముల నుచ్చరించుటలో నర్ధమాత్రాకాలికవ్యవధానముకంటె నెక్కుడువ్యవధానము లేకుండుట సంహిత యనఁబడును. "పరః = అతిశయితః......సన్నికర్షః = సామీప్యమ్ = అర్థమాత్రాధిక కాలవ్యవధానాభావః. అర్ధమాత్రా కాలవ్యవధానస్య అవర్జనీయత్వాత్......" (బాలమ. వ్యా.) "అర్థమాత్రోచ్చారణకాలేన అవ్యవహితయోః ద్రుతతరోచ్చారణం సంధిరితి." (శబ్దా. చిం. సంధిశబ్దము) (విస్తర. II) ఇట్టిసంహిత

విస్తర I. ఉర I విష:—ఈనిర్వచనము సరికాదని సంధిగ్రంథకర్త (౧౪ పు.) పెద్దచర్చచేసి తుదికి సూరిసంధికార్యములనెల్ల సంధిపరిచ్ఛేదమున వివరించెనని చెప్పుచుఁ దనయాక్షేపమును దాన యుపసంహరించికొనెను.

విస్తర II. ఉర I విష:—"పలుకుబడిలో వ్యవధానమెంతమాత్రమును లేకుండఁగా వర్ణములు మిక్కిలిదగ్గఱగా నుండుట సంహిత" (ఆం. భా. అ. సంధి

యుండునట్లుగ వాక్యగతశబ్దములను బలుకుట యైచ్ఛికమనియు సంహిత యుండునట్లు పల్కినపుడుమాత్రమె సంధికార్యములు వర్తించుననియు నట్లుపల్కక యధికవ్యవధాన ముండునట్లు పల్కినపుడు సంధికార్యములు వర్తింపవనియు సమానపదసమాసపదప్రభృతుల వర్ణముల యుచ్చారణమున మాత్రము సంహిత నిత్యమనియు నక్కారణమున నట్టియెడల సంధికార్యములు నిత్యముగ సంభవించుననియు సంస్కృత వైయాకరణులు చెప్పుదురు. "సంహితైకపదే నిత్యా । నిత్యా ధాతూపసర్గయోః । నిత్యా సమాసే వాక్యేతు । సా వివక్షా ముపేక్షతే ॥" (ముగ్ధ. దుర్గా. వ్యా. ౭౭ సూ.)

తెలుఁగున నట్లుకాదు. తెల్గున వాక్యమధ్యమందు సంహిత నిత్యము. "నిత్యా ధాతూపసర్గయోః" అనువాక్యమె పయికారిక యాంధ్రభాషావిషయకము కాదని విశదీకరించుచున్నది. "నస్యాద్వాక్యవిరామే తు । సంధ్యభావోఽపి దోషకృత్" (వికృ. సంధి. ౨ కా.) అను నథర్వణకారికయు దీనివివరణమె యనఁదగు "వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యు లండ్రు" (బా. సంధి. ౫౫ సూ.) అను సూరిసూత్రమును నాంధ్రమున సంహితయుఁ దత్కార్యభూత సంధులును వాక్యమధ్యమున నిత్యములెయని విశదీకరించుచున్నవి. వాక్యావసాన సంధ్యభావపాక్షికతాభ్యనుజ్ఞయె వాక్యమధ్యసంధినిత్యతను నిరూపించుచున్నది. వాక్యాంతమందుఁ బాదాంత మగునపుడుమాత్రమె సంధ్యభావము తెల్గున సమ్మతమయియున్నది.

తే॥ గీ. స్వాతీర్థాభిగమనంబు సర్వవేద । సమధిగమము సత్యంబుతో

---

౧౧౭ పు. ద్వి. ము ౯౧ పుట. ప్రౌ. ము.) అను ననుశాసనోక్తి శాస్త్రసమ్మతము కాదు. "సంధి యనఁగా వర్ణసంయోగము, అని సామాన్యార్థము. దీనినే సంహిత యందురు. భాషలో నుచ్చారణసౌకర్యముకొఱకు ఒకశబ్దము నంతమందుఁగల వర్ణము దానికి సన్నిహితపరమగు మఱియొకశబ్దము నాదివర్ణముతోఁ గలియుటే సంధి" (సంధి. ౫ పుట.) అను సంధిగ్రంథకర్తవ్రాఁత ప్రామాదికము. వర్ణసంయోగము సంహితకానేరదు. "......... నీవ యనుంగుంజెలివి - ఇచ్చటసంధికూడదు. ......... ఉచ్చారణలో సహజముగా ఈస్థలములందు విరామకార్య మవసరమైనది గనుక సంహితసంభవించదు." (బాలక. ౨౭౫ పు) అను శరణ్యకర్తవ్రాఁతయుఁ బ్రామాదికమె సంధికాని యచ్చులనడుమనిల్చు నాగమ యకారము విరామకార్యము కాదు. అదియు సంహితాకార్యమె. "యశ్రుతిత్వం సంహితాయా ముచ్చారణసౌకర్యార్థమ్" (అహో. ౧౫౬ పు.)

సరియుఁ గావు । ఎఱుఁగుము......(ఆది. ౪ ఆ. ౫౭ ప.) "సరియుఁగావ । యెఱుఁగుము" అను సవరించినపాఠము వావిళ్ళవారిముద్రణమున గ్రంథభాగములో నిల్పఁబడెను. "సరియుఁగావు ఎఱుఁగుము" అనునది పాఠాంతరముగఁ జూపఁబడెను. పయిస్థలమున నవధారణార్థమున కావశ్యకత లేమింజేసి భట్టారకుఁడు 'ఉ' కారసంధ్యభావమునె యచటఁ బ్రయోగించె ననఁదగును. నన్నయ ప్రథమ పురుషైకార్థములకును సంధిని నిత్యముగఁ బ్రయోగించువాఁడు గావున నీక్రింది యాతనిప్రయోగములును వాక్యాంతసంధ్యభావలక్ష్యములు కానోపును.

సీ॥...అ-హా ఒక్కసమయంబుఁ జేసిరి । ఒనర దాని తెఱఁగు వినుము తల్లి (ఆది. ౬ ఆ. ౨౬౭) ఆ. వె. అంతఁ గొందఱధికహాస్యంబు సేసిరి । అడవి నేమిరోసె దనిరి కొంద ఱు......(అర. ౨ ఆ. ౧౦౯)

పయిసందర్భమునుబట్టి "అపార్థము, అర్థసంశయము మొదలగునవి సంభవించునపుడు గద్యమున సంధ్యభావము దోషము కానేరదు......'అతఁడు+తగ్గెను.' ఇచట 'దగ్గెను' అని వ్రాసిన నర్థసంశయము గల్గును." (గాణ. సంధి. ౧౦౭ కారి. ౨ ప.) అనెడి గాణపతవివరణము నిరాధారమనఁదగును.

సంస్కృతమునందుసయితమాలంకారికులు వాక్యమధ్యమందలి విసంధిని దోషముగా నిరాకరింతురు. "విసంహితో విరూపో వా । యస్య సంధి ర్విసంధి తత్ ॥ యథా—శ్లో. శౌర్యాణి ఈదృశా న్యాసన్ ।......అత్ర శౌర్యాణి ఈదృశానీతి విసంధిః" (ప్రతా. దోష. ౧౮ శ్లో.) "శౌర్యాణిఈదృశా నీత్యత్ర సవర్ణదీర్ఘాభావా ద్విశ్లేషః. నచాత్ర వ్యాకరణవిరోధః. వాక్యసంధే ర్వైవక్షికత్వాత్. తదుక్తమ్. శ్లో. సంహి తైకపదే నిత్యా । నిత్యా ధాతూపసర్గయోః । నిత్యా సమాసే వాక్యేతు । సా వివక్షా మపేక్షతే (రత్నాపణవ్యాఖ్య) (విస్తర. III)

---

విస్తర III. ఉర I విష :— కీర్తిశేషులు కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు విసంధివివేకమను నొకచిన్నపుస్తకమును రచించి యందుఁ దెల్గునను వాక్యసంధి రైచ్ఛికమె యనుచుఁ బై "సంహి తైకపదేనిత్యా......" అనుకారికనే తమసిద్ధాంతమున కాధారముగఁ జూపిరి. అక్కారిక యాంధ్రభాషోపయోగికాదని పయిసంజీవనిలో విశదీకరింపఁబడెను. (ఉర I విష.) మఱియు నాంధ్రమహాకావ్యములం దెచ్చటను వాక్యమధ్యవిసంధి ప్రయుక్తమయి యుండలేదు. ఇంతియకాక స్వరసంధ్యభావమున నిల్చు యకారాగమము ప్రాంతిలో నుండనక్కఱలేదని శాస్త్రులవారిం కొకసిద్ధాంతమును సైతము తద్గ్రంథములో నిరూపించిరి. అందు.

నన్నయా  సంధి ర్నా చోఽచ్యనుతః. (ఆం. చిం. సంధి. ౧ కా. అహో-
ఒక విష  ౧౮౩ పు.)

కల్పతరు. ఒక విష:—అనుతః = హ్రస్వోకారవ్యతిరిక్తమైన, అచః = అచ్చు నకు, అచి = అచ్చుపరమగుచుండఁగా, సంధిః = పరరూపసంధి, న=కాదు. ఇట్లనుట చేతను, ననాది ష్విత్యాదులందలి వాత్తికవిధానముచేతను సాధారణముగా నుకారమున కచ్చు పరమగునపుడు సంధి నిత్యమని విశదమగుచున్నది. ఉదా. రాముఁడు+అతఁడు = రాముఁడతఁడు, రాముఁడు+ఏవఁడు = రాముఁడు+ఏవఁడు = రాముఁ డెవఁడు. మొ. (ఒక I విష.)

ఉత్తున కచ్చు పరంబగునప్రుడు సంధియగు. ౧.
పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట
బాలవ్యా. సంధి యనంబడు. రాముఁడు+అతఁడు = రాముఁ
ఒక I విష. డతఁడు, సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు.
మనము+ఉంటిమి = మనముంటిమి. అతఁడు+ఎక్కడ=
అతఁడెక్కడ. ఇతఁడు+ఒకఁడు = ఇతఁడొకఁడు.

సంజీవని. ఒక I విష:—ఉత్—ఉత్తు = హ్రస్వోకారము. హ్రస్వదీర్ఘకాలములలో నేకాలములోని యచ్చునకు "త" కారము చేర్తుమో యది యాకాలములోని యచ్చునే తెల్పును. ఇట్లు 'ఊత్తు' అనఁగా దీర్ఘోకారము. ఇట్లు స్వరమునకుఁ బరముగ 'త' కారమును జేర్చుట తపరకరణమని వ్యవహరింపఁబడును. "తపరస్తత్కాలస్య. (౧. ౧. ౭౦) తః పరోయస్మాత్ సచ తాత్పరశ్చో చ్చార్యమాణసమకాలస్యైవ సంజ్ఞః స్యాత్. (సి. కౌ. ఒ పు.) కారప్రత్యయయోగమున నిట్టియర్థవిశేషము లభింపనేరదు. (విస్తర. III. ౨౫ విష.)

---

లకు "యశ్శ్రుతి మార్యా లఘు యం, ప్రవదన్తి ప్రాణతః పరంప్రాణమ్". అనెడి చింతామణి వచనములోని శ్రుతిశబ్దస్వారస్యమె మూలమనిరి. అట్లు సంహితలోని యకారాగమమును వ్రాయక శబ్దగతస్వరమునుమాత్రము వ్రాయునపు డీక్రింది ప్రాసస్థలగత యకారద్విత్వమున కనుమాపక చిహ్నము నెట్లు లిఖింపఁదలంచిరో తెలియకున్నది. ఉ. నెయ్యముదప్ప నొండొకటి నీచెవిసోకెనె నాదుపల్కులం। దియ్యెడ సంజయా.........(ఉద్యో. ౧ ఆ. 3౦౮) మఱియు "ఆయతివసుశోభనాకృతి" మున్నగుచోటులందలి యర్థద్వయస్ఫోరక శబ్దలేఖన (ఆ + అ తీవ: ఆ + యతి + వసు.........) మెట్లని తలంచిరో తెలియకున్నది.

సంజీవని - ౨౫ II విష:—ఏకాదేశ మనఁగాఁ బూర్వపరస్వరముల కాదేశముగా వచ్చునది. అట్టి యాదేశము పూర్వపరస్వరముల మిశ్రణ మనఁదగును. (సంజీ. ౨౮ విష.) పలుకుబడిలో వక్తకుఁ బూర్వపదాంతిమస్వరముకన్నఁ బరపదాదిస్వరమం దాస్థ యధికమై యుండునుగానఁ దెనుఁగునందలి యీపరరూపాదేశము స్వాభావిక మననగును. పూర్వస్వరములోపించి పరస్వర మాచోట నిల్చుటయే యచట గోచరించును. అట్లయినను నాస్వర ముభయరూపమని యేకాదేశవిధానమున నెన్నఁదగును. అట్టిమిశ్రణములోఁ బరస్వరాంశ మధికమై యుండును.

సంజీవని. - ౨౫ III విష:—వచ్చెను + అతఁడు=వచ్చెనతఁడు-మున్నగు చోటులందలి పరరూపసంధియు నీసూత్రమునకు లక్ష్యమె యనఁదగును (విస్తర.)

బా. ప్రకీ-౧సూత్రము చెప్పునఁ బదాదినున్న ఋ ౠ వర్ణములు ర ల లవంటి వగుటంజేసి యీవిధి యట్టియెడల వర్తిల్లదు-ఉదా:—అతఁడు+ఋషి = అతఁడుఋషి. ఇచట బరరూపసంధి లేదు-యడాగమముసయితము రానేరదు.

నన్నయాథర్వ అచాంసంధౌ ద్రుతోఽదృశ్యః, స్థితోఽపి
౨౭ విష. చ సదా భవేత్. (వికృ, సంధి. ర కార. ఆహో ౧౮౯ పు.)

కల్పతరు - ౨౭ విష:—సదాస్థితోఽపిచ=పదము తుదిని సదా నిల్చునదే యైనను, ద్రుతః = ద్రుతనకారము, అచాంసంధౌ = పూర్వస్వరములకు సంధి చేయవలసివచ్చునపుడు, అదృశ్యః=లోపించునది, భవేత్=అగును. ఉదా:—నాకొఱకున్+ఇచ్చెన్=నాకొఱకిచ్చెన్. "అనాదిషువిభక్తి షన్తాతో వా" అనుసూత్రము చెప్పున సంధిపాక్షికముగాఁ జేయవలసెను గానఁ బయిరీతిని ద్రుతము లోపించెను. అనాదిష్విత్యాదిసూత్రము పాక్షికముగాన సంధిచేయఁదలంపని పక్షమున ద్రుత

---

విస్తర. ౨౫ III విష:— ఈయుకారసంధి కుదాహరించుటలో సూరి ద్రుతస్వరపరరూపసంధి కొకలక్ష్యమునయినను నియ్యలేదు. అట్లయినను నట్టిసంధికీసూత్రమె గతి యనకతీరదు. చింతామణి ద్రుతము నకారవ్యంజన రూపమని యంగీకరించునదిగాన నందిట్టి ద్రుతస్వరసంధికిఁ బ్రసక్తి లేదయ్యెను. సూరిమతమున 'ను' స్వరూపము ద్రుత మగుటంజేసి యిట్టిసంధి నుదాహరించుట యావశ్యకము. ఉదా:— వచ్చెను + అతఁడు = వచ్చెనతఁడు. నాతోను + అనెను = నాతోననెను. శ్రీని + ఏలెను = శ్రీనేలెను. నేను + హరిని + అనెను = నేను హరి ననెను. ఇత్యాదిస్థలములందలి పూర్వపదాంతస్థమగు 'ని' అనుదాని పూర్వరూపము 'ను' అనునదే కాన (బా. తత్స. ౫౭ సూ.) నట్టియెడల నుత్వమునకు నిత్వము చేయకమునుపే 'ఉకార' పరరూపసంధి వర్తిల్లును.

లోపము కలుగక "నాకొఱకు నిచ్చెన్" అనియె రూప మేర్పడును. ఇట్లగుటచేత 'నాకొఱకున్+ఇచ్చెన్' మున్నగుచోటులందు ద్రుతవ్యవధానముచే "అనాదిష్వి" త్యాది సూత్రమున కసంభవత్వము శంకించికొనరాదు. ఇట్లు సంధివిధానస్థలము లందు ద్రుతము లోపించును గాన ద్రుతపూర్వస్వరసంధి చింతామణిమతమున సుప్రసక్త మగుచున్నది.

నారాయణీయమున "గీ. అచ్చులకు సంధి యొనరించునట్టివేళ । నెందును ద్రుతం బదృశ్యంబు దృశ్యమునగు!"అని ద్రుతలోపము పాక్షికమని పై యథర్వణకారిక యర్థమును వివరించుట సరికాదు. ఇట్లు ద్రుతలోపమె పాక్షిక మగునపుడు ప్రథమేతరవిభక్త్యకారాదులపాక్షికసంధివిధులు వ్యర్థము కావలసి వచ్చును. మఱియు 'నాచేతన్+ఉన్నది' మున్నగుచోటులందును ద్రుతలోప పరరూపసంధు లనిష్టములు ప్రసక్తములు కావలసివచ్చును.

హ్రస్వోకారేతరస్వరము ద్రుతపరకమైనను గాకున్నను స్వరపరకత్వమునఁ బరరూపసంధిని బొందదని "సంధిర్నాచోఽచ్యుతః" అనుసూత్రమునఁ జింతామణి వచించినది గానహ్రస్వోకారేతరస్థలములందుఁ బ్రత్యేకవిధానము లేనపుడు సంధికిఁ బ్రసక్తియే కలుగదు. ప్రకృతసూత్రముచొప్పున ద్రుతము సంధి ప్రసక్తికిఁ బ్రతిబంధకము కామింజేసి "వచ్చున్+ఎపుడు" మున్నగుహ్రస్వోకారస్థలములందు "నస్యాత్తద్ద్రతోతః" అనురీతిని సంధి నిషేధింపఁబడనిచో 'వచ్చెపుడు' మున్నగు ననిష్టరూపములు దుర్వారము లగును.

"ఎల్లయందు, ఎల్ల ద్రుతాంతమె యయ్యు 'అందు' ప్రత్యయము పరమగునపుడు దీనిచే ద్రుతము లోపించె" (శారా. గాణ. ౧౦౨ కారి.) అనువివరణము సరికాదు. 'ఎల్ల' అను సర్వనామప్రకృతిమీఁద 'అందు' ప్రత్యయము నిల్చునపుడు వానినడుమ ద్రుత ముండుట కేవలము నసంగతము. (౮౭ II విష.) ఇట్లె యిచట నీవివరణకర్త యుదాహరించిన "మిక్కిలిన్+యును=మిక్కిలియును, ఏనిన్+యును=ఏనియును" అను నుదాహృతులును సరికావు. 'ఏని-మిక్కిలి' అనునవి రెండును గళలు. కాన వీని ద్రుతలోపయత్న మప్రసక్తము. తుదికి వివరణకర్తయే, "ఏనియున్ ఉదాహరణము కాదు" అని విడిచికొనెను. రెండును నుదాహృతులు కావనుట యుక్తము. "అపిశబ్దార్థస్యేశః" అనుసూత్రముచేఁ జింతామణికర్తయే కళయగు నేసశబ్దపుతుది "శ" కారమునకు లోపమును బ్రత్యేకముగా విధించెను. "అహోబలపతి ద్రుతోపజీవిశబ్దములలో "మిక్కిలియున్" అని యుదాహరించెను" అని యిచట వివరణకర్తవ్రాసెను. ద్రుతోపజీవి యనఁగా నర్థవిశేష

బోధకద్రుతరూప'ను' శబ్దము తుదిని గలదని యర్థము. కాన నది కళ యనుటలో బాధ లేదు. 'అప్పుడున్-ఇప్పుడున్' అనునవియు నహోబలపతిచే ద్రుతోపజీవిశబ్దములలో నుదాహరింపఁబడెను గాన నవియు ద్రుతప్రకృతికశబ్దములె యని వివరణకర్త చెప్పసాహసించునా ? (౮౨ I విష.)

క్వచిత్ ప్రత్యయయోగేఽపీత్యాది కారికకుఁ గలసందర్భమును గ్రహింపక యహోబలపతి ప్రమాదపడి "ప్రత్యయయోగే మిక్కిలియు నిత్యుదాహరణమ్" (అహో. ౧౮౯ పు). అని యుదాహరించుటయె యీనారాయణీయ తద్వివరణకర్తల ప్రమాదమునకు మూల మనఁదగును. క్వచిత్ప్రత్యయయోగేఽపీత్యాద్యథర్వణవచనము 'షష్ఠీభవేద్ద్వితీయాతుల్యేత్యాదిచింతామణికారికను సంబంధించునదై యున్నది. ఉదా:- దానియొక్క+కలరూపు = దానిన్+ది+కలరూపు = దానిది కలరూపు. "ది స్స్యాత్సంబన్ధార్థే" అనుచింతామణికారికచొప్పున యొక్కషష్ఠ్యర్థమున దిప్రత్యయము సంభవించుచున్నది. అట్టి దిప్రత్యయప్రయోగమందును బూర్వపదషష్ఠి ద్వితీయాతుల్య మగునని క్వచిత్ప్రియయోగేఽపీత్యాద్యథర్వణసూత్రము వచించుచున్నది. మఱియు 'మిక్కిలియున్' అనుచోఁ బ్రత్యయ మున్నదని యహోబలపతి యెట్లు భ్రమించెనో తెలియకున్నది. శబ్దరత్నాకరకర్త తలంచినట్లు మిక్కిలి శబ్దము కళ యనుటయె యుక్తము.

| | |
|---|---|
| పన్నయా | అనాదిషు విభక్తిషూతో వా.-(ఆం. చిం. సంధి. ౧ కా.) |
| ౭౬ I | చోర్వాస్యాద్వర్తమానవిహితస్య (అహో. ౧౮౯ పు.) |
| విషయము | (ఆం. చిం. సంధి. ౨ కా. అహో. ౧౯౨ పు.) |

సంజీవని. ౭౬ I విష:—అనాదిషు=ప్రథమేతరములైన, విభక్తిషు=విభక్తిప్రత్యయములతుదినున్న, ఉతః=ఉకారమునకు, వా=వికల్పముగా సంధి యగును. వర్తమానార్థమున విధింపఁబడిన (చుఁతిక్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలేస్యాత్) చోః=చుప్రత్యయమునకును, వాస్యాత్=వికల్పముగాఁ బరరూపసంధియగును. 'వచ్చుచున్నాఁడు' మున్నగుచోట్ల నపదాది నిత్యస్వరసంధియె యని యెఱుఁగునది. ఇట్లీ రెండుసూత్రములును ద్రుతపరకమగు 'ఉ' కారమునకుఁ బాక్షికసంధిని విధించుటచేత నట్టిసంధి సుప్రసక్తమగునట్లుగ 'అచాంసంధా' విత్యాదిచేత నిచటి ద్రుతము లోపించునని యెఱుంగునది. సంధ్యభావపక్షమున ద్రుతలోపము గల్గదు. ఉదా:-నాకొఱకున్+ఇచ్చె=నాకొఱకు+ఇచ్చె=నాకొఱకిచ్చె. వచ్చుచున్+ఉండె=వచ్చుచు+ఉండె=వచ్చుచుండె. ఇట్టిచోటులందు సంధ్యభావపక్షమున ద్రుతలోపము గల్గదుగాన "నాకొఱకు నిచ్చె, వచ్చుచునుండె" అనుపాక్షికరూపము

లేర్పడును. ఇట్లుకారసంధిపాక్షికతా విధానముచే నేతత్సూత్రములకువిషయము కాని యుకారమునకు "ఉసూతః" అనుసూత్రమున నిత్యసంధి యుద్దేశింపఁబడె ననుట స్పష్టమగుచున్నది. "అచాశేషః స్థక్తిషు" అనుచుఁ బ్రత్యయస్థోకారమునకు మాత్రమే పాక్షికసంధి విధించినవియమమువలనచే ప్రత్యయేతరవిభక్త్తుల యుకారమునకు సంధి రానేరదని వ్యాఖ్య చేసికొనవలయును. (విస్తర I) కాఁగా విభక్తులయుకారమునకు సంధికల్గనేని విభక్తిప్రత్యయస్థోకారమునకె సంధికల్గు ననునర్థము లభించును. కాన "రామున్+ఏలెన్"=అనుచోట 'రామేలెన్' అనుసంధిరూపము కల్గనేరదు. ఇంక 'రాము నేలెన్' అనుసంధ్యభావరూపముమాత్రమె సాధువని గ్రహింపవలయును. "దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసో" రిత్యాది చింతామణికారికలచొప్పున (ఆం. చిం. హలంత. ౫ కా.) "న్నుమ్" లాగమము లగుటచే (చిం. వి. పరి. ౯౫-౯౯ విష. తత్పరిశిష్టమానుబంధము-౧౮౩-౧౮౫ విష) "అమ్" పరకత్వమున "నన్నునున్-నిన్నునున్-తన్నునున్-ననునున్-నినునున్-తనునున్." అనురూపము లేర్పడును. 'నన్నునున్' మున్నగువానికి స్వరపరకత్వమునఁ బ్రకృతసూత్రముచొప్పున (నన్నునున్+ఏలెన్=నన్నును+ఏలెన్=నన్ను నేలెన్) నన్ను నేలెన్-నను నేలెన్ మున్నగురూపములు లభించును. 'నిరమోమహాతాం లుక్ చస్యా' త్తను సూత్రముచొప్పున 'ను' లోపమురాఁగా "నన్నున్-నిన్నున్-మున్నగురూపము లేర్పడును. అట్టివానిలోని-'న్ను'అనునది విభక్తిప్రత్యయముకామింజేసి "నన్నున్+ఏలెన్" మున్నగుచోట్లఁ బ్రకృతసూత్రముచే సంధికల్గనేరదు. కాన సంధ్యభావమునందలి 'నన్ను నేలెన్' మున్నగురూపములె లభించును. 'నన్నేలెన్' మున్నగు నన్నయాదిప్రయుక్తరూప

---

విస్తర I ౬౬ I విష :—ఆంధ్రభాషాచరిత్రమున నిట్లు వివరింపఁబడకుండుటయేకాక "రామునిన్ లోని 'ని' వర్ణము లోపించినచో దానితోఁబాటు దానివిూఁది ద్రుతముకూడ లోపించునుగదా. అప్పుడు.........రామడిగెను.........రాము యడిగెను ......... అనివార్యము లగుచున్నవి ......... 'రామునున్' అని యుండఁగా 'నిరమోమహాతాం' 'లుక్చస్యాత్' అనుసూత్రములను వెంటనే పట్టింపక" (ఆం. భా. చ. ౧౬౦ పుట) అనురీతిని గొన్ని యపమార్గములు వివరింపఁబడెను. ని-ను లు లోపించునపుడు వానితోఁ ద్రుత మేల లోపించును? లుప్తశేషము ను ద్వితీయాంతమెకదా. 'రామునున్' అని యుండు టేమి? అచటి 'ను' వర్ణకమునకు 'ని' వర్ణక మాదేశమగు టేమి? 'రామునున్' అనునది యపశబ్దము. డుమంతములపై 'ను' వర్ణకము రాదు. నివర్ణకమె వచ్చును.

ములు పయి చింతామణికారికలచొప్పున లభింపనేరవు. చింతామణి తత్సమశబ్ద నిరూపణప్రధానమును దిఙ్మాత్రప్రదర్శనప్రవణమును నగుటచే నీదేశ్యశబ్దసంధులు మహాకవిప్రయోగములవల్లనే గ్రాహ్యములని యెన్నఁదగును. అట్లుగాక నన్నయాథర్వణీయప్రక్రియచొప్పున సాధింతమను నాగ్రహముకల్గినచో నీక్రింది రీతిని ప్రక్రియ నెట్లైటో యరయనగును. 'నన్ - నిన్ - తన్' అనురూపములు 'నన్నున్ - నిన్నున్ - తన్నున్' అనువానినుండి కవిభల్లటసూత్రముచే సంపాదించి కొనవలయును. నిన్గఁబెబుద్ధి (ఆది. ౬ ఆ. ౨౫౪) తన్వేనుచున్నవారలకు (ఆది. 3 ఆ. ౯) మున్నగు నన్నయాదుల ప్రయోగములచే నట్టిరూపములు సాధువు లనక తీరదు. అట్టివానికి స్వరపరకత్వమున "నన్+ఏల=నన్నేల" మున్నగు ద్రుతద్విత్వరూపములు సిద్ధింపవచ్చును. (౭౮ I విస.) ఇట్టి ద్రుతద్విత్వరూపములు భట్టారకసమ్మతములు. క. నన్నేల యుపేక్షించితిరి (ఆది. 2 ఆ. ౧౦౬ ప.) సీ. వల్లియన్నిష్టసఖునూఁడియున్నదాని (ఆది. 3 ఆ. ౧౪౦.) మ......నం। దినియన్నేటితరంగలన్ (ఆది. ౮ ఆ. ౭౯ ప.) వృత్తుఁ డన్నసుర గర్వించి (ఆది 3 ఆ 3 ప) ఎన్నఁడు। న్నేని మోఘముకాదు (ఆది 2 ఆ ౧౪౦) నన్నయాథర్వణీయపక్షమున నిల్లైః "చన్నే" మున్నగురూపములను సయితము సాధించికొనవలయును. ఆ. వె. విప్రసతికి నూఱువేఁడఁ జన్వరములు (సభా. ౨ ఆ. ౨౬3 ప.) ఉ......మునీంద్ర నీకుఁజ। న్నే నలినాతులుండ్రు, మది నిల్వఁగ (ఆది ౯ ఆ. ౧౭౯) (చనున్ = చన్+ఏ = చన్నే). 'మమ్మున్+ఏలె మున్నగుచోటులందలి 'మ్ము' అనుదానియుకార విభాక్రిందిపరితిని విభక్తి ప్రత్యయోకారమే యనఁదగుటంజేసి యట్టివాని సంధిలోఁ ప్రకృత సూత్రముచేత సంధిపక్షమున 'మమ్మైలె' మున్నగు రూపములును సంధ్యభావపక్షమున 'మమ్మునేలె' మున్నగు రూపములును సిద్ధించును. "న్ము-మ్మూహ్రస్వశ్చాదే, వనిశోసిచ" అనుచింతామణి సూత్రము చొప్పున 'న్ముమ్ము' లు సమానకోటికములగుటచే 'మ్ము' అనునదియుఁ ప్రకృతిని జేరెడియాగమ మగుటచేతన్దాని 'ఉ' కారము విభక్తిప్రత్యయోకారమని యెట్లనఁదగునని యిట నొకశంక పొడమవచ్చును. కాని, 'నన్నునున్' మున్నగు నేకవచనరూపములవలె 'మమ్ములన్' మున్నగు బహువచనరూపములు నన్నయాథర్వణసమ్మతములు కావు. అట్టి లప్రత్యయఘటితరూపములు ప్రాచీనమహాకవిసమ్మతములును గావు. చింతామణికారికలచే వానికి 'ల' ప్రత్యయము లభింపదు.—'లుజసోలశసోఽలాన్నాత్' అనుచింతామణిచొప్పున శస్సునకు లాదేశము సర్వసాధారణముగా రాఁదగియుండఁ జింతామణి "తస్యజసో ము శసోల్ః" అని యిట్లు నీ నా తా మసశబ్దములరూపసాధనసందర్భ

మున మనశబ్దపుశస్సునకు మాత్రము లాదేశమును బ్రత్యేకముగా విధించుటచేత నాసందర్భములోని శబ్దచతుష్టయమునందలి మనశబ్దశస్సునకు మాత్రమె లాదేశము వచ్చుననియుఁ దక్కిన నీ నా తా శబ్దములశస్సునకు లాదేశమువచ్చుట చింతామణిస్వారస్యము కాదనియుఁ జెప్పకతీరదు. తదనుసారముగనే 'మమ్ములన్ - మిమ్ములన్-తమ్ములన్' అను ప్రయోగములును బ్రాచీనకావ్యములందు లేవు. పైరీతిని 'మమ్ము+శస్' అనురీతి నాశబ్దప్రయప్రక్రియ నిల్చియుండఁగా "నపదాన్యవ్యయసుప్తిజ్క్త్వాతుమునామ్......" అనుచింతామణి వచనము చెప్పిన సంస్కృతవిభక్తిప్రత్యయములకుఁ దెల్గునఁ బ్రయోగము నిషిద్ధమగుటంజేసి యట్టిశస్సు లోపించునని వ్యాఖ్య చేసికొనవలయును. (విస్తర II) అట్లుశస్సులోపించఁగామిగిలిన 'మమ్ము మిమ్ము తమ్ము' అనున ద్వితీయాబహువచనాంతరూపములగుచున్నవి. వానితుదని 'తెజ్మధ్య' సూత్రముచెప్పిన ద్రుతముచేరఁగా 'మమ్మున్' మున్నగురూపము లేర్పడును. పైప్రక్రియచెప్పిన నేర్పడినవగుటంజేసి "మమ్మున్" మున్నగువానిలోని 'మ్ము' అను దానిమీఁది 'ఉ' కారము విభక్తిప్రత్యయసంబంధిగాఁబరిగణింపఁ దగినదగుచున్నది. (చిం. వి. పరి. ౯౫ మొ. ౯౯ వ. విష. దానిప్రథమానుబంధము. ౧౯౨ మొ. ౧౪౫ వ విష.)

ప్రథమేతరవిభక్తి శత్రర్థక చువర్ణకంబులందున్న
యుకారమునకు సంధివైకల్పికముగానగును. ౨.
నన్నున్+అడిగె = నన్నడిగె - నన్నునడిగె.

---

విస్తర II ౬౬ I విష :—"మమ్మేలె - మిమ్మేలె - అనురూపములకు 'నపదాన్యవ్యయసుప్తిజ్క్త్వాతుమునామ్' అనుసూత్రము ప్రకారము గతి కల్పింపనెంచుటయు సరికాదు........." (ఆం. భా. చ. ౧౬౨౦ పు) అది సరికాదనుట సరికాదు. నన్నయభట్టారకుఁడు ప్రయోగించిన 'పృథపుచ్ఛక' (అది 3 ఆ ౨౦౪) తిక్కనప్రయోగించిన 'హాహాపుట్టు' (శల్య ౨ ఆ ౨౪౭) మున్నగువాని తత్సమపదత్వసిద్ధిఁ జేయవలసిన సంస్కృతవిభక్తిలోపమునకు "నపదాని" త్వాదిసూత్రము కన్న గత్యంతరములేదు. (చూ. విస్తర. ౧౧౨ II విష) "ననునున్ - మమునున్-నినునున్-మిమునున్ అను ననిష్టరూపము (చింతామణిచెప్పిన) లేర్పడుచున్నవి" (ఆం. భా. చ. ౧౬౨౧ పు) ఇవి యనిష్టరూపములనుట కాధారమేమి? ఇవి సాధురూపములు.

పౌరుషంబును గలవారు గలరు......(ఉద్యో. ౨ ఆ. ౩౦౮) ఈ పద్యమందలి ‘ఎందును’ అనుచోటి ‘ను’ అనునది సముచ్చయాద్యర్థవిశేషబోధకము కామింజేసి యది ద్రుతప్రకృతికమనుట స్పష్టము.

“నన్నును - మమ్మును - నిన్నును - మిమ్మును - తన్నును - తమ్మును” అనుశబ్దముల రూపసాధనప్రక్రియను జూపక సూరియట్టి సిద్ధరూపములనె యాచ్ఛికపరిచ్ఛేదమున (౯-౧౦-౧౧ సూ.) నుదాహరించెను. అట్లగుటం జేసి ‘నన్ను’ మున్నగు వానిలోని ‘న్ను-మ్ము’లు ద్వితీయావిభక్తి ప్రత్యయమునకే యాదేశ్యాగమములుగ సూరిచే నుద్దేశింపఁబడెనని చెప్పుటలో విరోధము లేదు (విస్తరI). కాని ‘నన్నున్ - మమ్మున్’ మున్నగువానిలోని ‘న్ను - మ్ము’ లమీఁది ‘ఉ’ కారము సూరిపక్షమున విభక్తి ప్రత్యయోకారమె యనఁదగుటం జేసి వానిపొడలఁ బ్రకృతసూత్రము వర్తిల్లుటలో వివాదము లేదు.

సూరిగారు ౨ - ౫ - ౯ సంధిసూత్రములలో ద్రుతపరకస్వరములకుఁ బరరూపసంధిని విధించుచున్నారు. ద్రుతవ్యవధానమున ద్రుతపూర్వస్వరమునకు స్వరపరకత్వముగాని పరరూపసంధిగాని ప్రాప్తింపకుండఁగా నట్టివిధానములకు వ్యర్థత కల్గుచున్నది. కాన నట్టి వైయర్థ్యముఁ బాపుటకై యేతద్విధానసామర్థ్యమునను నేమ్యాదులలో ‘కి’ షష్ఠిని బఱించిన సామర్థ్యమునను నిస్థలములందు మాత్రము స్వరపరకత్వమందు నైతము సంధ్యుదాహరణసందర్భమున ద్రుతస్వరలోపమును.

---

విస్తర I ౘూ II విష :— “కొఱకున్ - కున్” అనువానిలోని ఉకారము వలె ‘నన్ను’ లోని ‘ఉకారము’ విభక్తిసంబంధమైనది కాదు. నాశబ్దమున కాదేశముగావచ్చినది ‘నన్ను’. దీనిమీఁదివిభక్తి ‘ను’. దీని ‘ఉకారము’ లోపించునపుడు ‘నన్నున్’ అగును. దీనిలోని ఉకారము ప్రకృతిసంబంధమైనదగుటచేఁ బయిసూత్ర (ప్రథమేతరేత్యాది సూత్రము) మిచ్చట వర్తింపదు. అట్లువర్తించెనేని “రామున్+అడిగెన్ = రామడిగెన్” అని యేలకాఁగూడదు” (అం. భా. అ. సంధి. ౧౯ సూ. తృ. ము.) అను సూరిమైఁజేసినయనుశాసనాక్షేపము సరికాదని పైసంజీవనీసందర్భమునుబట్టి విశద మగుచున్నది. మఱియు నాశబ్దమునకు ‘నన్ను’ అనునది యాదేశమగునని సూరియెకాక వైయాకరణు లెవ్వరును జెప్పియుండలేదు. అట్టిస్థితిలో ‘నా’ శబ్దమున కాదేశముగావచ్చినది ‘నన్ను’ అని సూరిచెప్పినట్లుగ నారోపించి ‘న్ను - మ్ము’ లతుది ‘ఉకారము’ ప్రకృతిసంబంధమైనదని చెప్పుచు సూరిరచన సరిగలేదని నిరసించుట కేవలము నన్యాయ్యము.

ఏకరూపసంధి సందర్భమున సాకల్యముగ ద్రుతలోపము సంభవించునని యెఱుంగునది (విస్తర II)

---

విస్తర II, ఉ. II, విష. ఈసందర్భమునఁ జింతామణి బాలవ్యాకరణ మార్గములకుఁ జాలభేదము కన్పట్టుచున్నది.

బాలవ్యాకరణ ప్రక్రియయు దానికిమూలమగు బాలసరస్వతీ యాహోబల ప్రక్రియలును గుర్తుపడియుండలేదు. కావుననె చింతామణి సూత్రములకు నార చించిన చింతామణి విషయపరిశోధనమునందును బయికల్పతరువునందును మార్గాంతరమునఁ బ్రక్రియచూపవలసెను (చిం. వి. ప. ౫౬ మొ. ౧౦౧ వ. దాని ప్రశ్నానుబంధము— ౧౮౨ మొ. ౧౮౬ వ. విష.) చింతామణి కారికలచొప్పున 'నన్నునున్ - నిన్నునున్ -' మున్నగునవి ద్వితీయైకవచన పూర్ణరూపములు. బాలవ్యాకరణ పక్షమున "నన్నును - నిన్నును - తన్నును" అనునవి ద్వితీయైకవచన పూర్ణ రూపములు. ఇట్టిభేదముగల చింతామణి మార్గములతో బాలవ్యాకరణ మార్గములను సమీకరించియుఁ గలుపఁబఱచియుఁ బేటికావ్యాఖ్యాత యీ సందర్భమునఁ బెంచివ్రాసిన గ్రంథవిస్తృతి యప్రసక్తమును సత్యవిదూరమును ననఁదగును. దిఙ్మాత్రముగ నందలి ముఖ్యవిషయములిట విమర్శింపఁబడుచున్నవి.

"రామున్ + అభిరామున్' అనునపుడు విభక్తి ప్రత్యయస్థోకారము కామింజేసి ప్రథమేతర విభక్తివిధి ప్రవర్తింపదనునపుడు 'మమ్మున్ + ఏలె' అనునపుడు మాత్రము చింతామణిపక్షమున "అనాదిషు విభక్తిషూతోవా" అను చింతామణి సూత్రమెట్లు ప్రవర్తించు" అనునది చింతామణి విషయపరిశోధనము పయిఁబేటికా వ్యాఖ్యాతచేసిన యాక్షేపము సారాంశము. దీనికి సమాధానము :—'మమ్ము' అనుదానిపై 'శస్' అనెడి సంస్కృత ద్వితీయా బహువచన ప్రత్యయమునిల్చి నపదాన్యవ్యయేత్యాది చింతామణి సూత్రముచొప్పున లోపించినదగుటంజేసి యట్టి ప్రత్యయలక్షణము 'మమ్ము'అనుదాని తుది 'ఉకార'మునందావేశించుట న్యాయ్యము. (చిం. వి. స. ౫౫ విష.) 'రామున్' అనుచో నిట్టి ప్రక్రియ లేదు.—

"ఇకాదిసూత్రముచే (బా. సంధి. ౫సూ.) ద్రుతప్రకృతికస్వరసంధి నిషేధింపఁబడినదికాన ప్రాప్తిలేక నిషేధ మప్రసక్తమగుటంజేసి చింతామణియందు వలెనె బాలవ్యాకరణమునందును 'ఉత్వాత్వేత్వ'సంధివిధులు ద్రుతప్రకృతికా ద్రుతప్రకృతికసాధారణములయ్యెడి" (బా. సా. పే. ౭౬ పు.) అనునది మఱొకవిషయపు సారాంశము. దీనికి సమాధానము:—బాలవ్యాకరణమందలి యికాదిసూత్రము

లోని (సంధి. ౯ సూ.) విధేయము ద్రుతప్రకృతికములలో నీకాదులకె సంధియగునను నది మాత్రమె. కావున ద్రుతప్రాగ్వ్యస్వరసంధి బాలవ్యాకరణ సమ్మత మనుట సరిగాదు. ఇంకాదిశబ్దములకు మాత్ర మనుచోటి యవధారణముచే నీకాది ద్రుతప్రకృతికములకు మాత్రము సంధియగుననియు, దద్భిన్న ద్రుతప్రకృతికములకు సంధి కాద నియు స్పష్టప్రతిపత్తిగా వచింపఁబడినది(౩౩ I విష. దీని విస్తరానుబంధములు) మఱియు నీసందర్భమున 'చింతామణియందు వలెనె' అని యిట్లు బాలవ్యాకరణపద్ధతికిఁ జింతామణిపద్ధతి సామ్యముచూపుట సరికాదు. చింతామణిపక్షమున ద్రుతము నకారవ్యంజనరూపము. బాలవ్యాకరణ పక్షమున ద్రుతము 'ను' స్వరూపము. కాన బాలవ్యాకరణ పక్షమున ద్రుతపరకస్వరమునకుఁ బ్రత్యేకసంధి విధానస్థలములందు విధానసామర్థ్యమున ద్రుతలోపపూర్వకపరరూపసంధి ప్రాప్తించునేకాని తదితర స్థలములందు 'ను' వ్యవధానమున ద్రుతపరకస్వరమునకుఁ బరరూపసంధి ప్రాప్తింప నేరదు. అచటఁ బరరూపసంధి ద్రుతస్వరమునకె ప్రసక్తమగును. మఱియుఁ జింతామణి గ్రంథకర్తృకృతవివరణోదాహరణములు లేనిది. కావుననె వికృతివివేక మట్టి చింతామణ్యాశయమును "అచాంసంధౌ ద్రుతోఽదృశ్యః। స్థితోఽపి చసదాభవేత్" అని వివరించుచున్నది. బాలవ్యాకరణ మట్టిదికాదు. గ్రంథకర్తృకృతవివరణోదాహరణసంకలితము. పరరూపసంధిస్థలములెల్ల ద్రుతప్రకృతికాద్రుతప్రకృతిక సాధారణములనియు, నకారణమున ద్రుతప్రకృతికముల ద్రుతపరకస్వరముల కెల్లయెడలను బరరూపసంధి ప్రాప్తించుచుండఁగాఁ బ్రత్యేకించి సంధిని విధించుస్థలములు దప్పఁ దక్కినచోటులందుఁ బ్రాప్తించు పరరూపసంధిని 'ఇంకాది' సూత్రము వారించు చున్నదనియు సూరికే యభిప్రాయమున్నయెడల నాతఁ డట్టివిషయమును సయితము "ప్రథమేతరవిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని" (బా. సంధి. ౯ సూ.) అని వివరించినరీతినె యిట వివరించియుండఁడా? "అచాంసంధౌ" వికృత్యాదర్శ ధర్వణకారికార్థమును వచించియుండఁడా?

సూరిగారు సంస్కృతవ్యాకరణవాసనావాసితు లగుటంజేసి ప్రథమేతర విభక్తి సూత్రాదులలోని ద్రుతపరకస్వరసంధిస్థలములందు విధానసామర్థ్యమున నచట ద్రుతము లోపించునను పద్ధతి ననుసరించిరికాని యాంధ్రభాషాభూషణకర్త యట్టిస్థలములలోని ద్రుతములోపించునని యీక్రిందిరీతిని స్పష్టముగ వచించెను.

క. నన్నును నిన్నును దన్నును। నన్నందుల కునుల కీనులయందును మున్నై।
యున్ననకారపుఁ బొల్లులు। పన్నుగఁ బోఁజూపు నచ్చు పైనున్నయెడన్॥ (ఆం. భూ. ౫౧ ప)

సంజీవని. ౬౬ III విష:—"నన్నును - మమ్మును - నిన్నును - మిమ్మును - తన్నును - తమ్మును." అనుచోటులందు ద్రుతపూర్వస్వరసంధిసంభవించునపుడనఁగాఁ బరపదాదిస్వరము 'న్ను - మ్ము' లమీఁద నిల్చునపుడు వానిజడ్డలు ప్రకీర్ణపరిచ్ఛేదము నందలి ౭౯. సూత్రములచొప్పున లోపింపనేరవని తోఁచినదవప్రకీర్ణసూత్రమున సూరిగా రుపదేశించుటచేత 'ననడిగె. మమడిగె.' మున్నగు ననిష్టరూపములు ప్రకృతసూత్రముచొప్పున జనింపనేరవు. (విస్తర.)

ననన్నయా యద్రుతిమూర్ధ్య లఘుయం| ప్రవదన్తి ప్రాణతః పరం
౬౭ విష. ప్రాణమ్. (ఆం. చిం. సంజ్ఞా. ౧౦ కారి. అహో.
౧౫౬ పు.)

కల్పతరు. ౬౭ విష:—దీనికివలెనె వ్యాఖ్య చేయఁబడెను. (౫౩ I. విష.)

---

అప్పకవి యట్టివాని స్వరసంధిసందర్భమున నట్టి నన్ను ప్రభృతులు కళలె యనఁదగుననుచు వాని ద్రుతప్రకృతికత్వమునకు వైకల్పికత్వము నంగీకరించెను. (౭౬ - విష.) తే॥ గీ. ప్రథమదక్కఁగ నితరవిభక్తులందుఁ। దుదలఁ గొమ్ములుగల విభక్తులకు షష్ఠిఁ। బలుకుకాఁగుడికిని వికల్పంబువలన। నిలద్రుతప్రకృతికత్వంబు గలుగుచుండు (అప్ప. ౫ ఆ౧౫౫ ప.) సీ. నిన్ను నెఱుంగంగ నే నెంతవాఁడను నన్నేలుకొనుము ఘృణాసముద్ర। (అప్ప. ౫ ఆ.౫౬ ప.)

పయిరీతినున్న యప్పకవిప్రసంగ మరయునపు డీక్రింది యనుశాసనవివరణము సరికాదని తోఁచకమానదు. "తన్ను నన్ను నిన్ను ఇవి కళలని యప్పకవి చెప్పెను. ద్వితీయావిభక్తిచేరనపు డివి కళలైన ప్రకృతులని తెలియుచున్నది. (ఆం. భా. అ. సంధి. ౨౧ సూ. ౧౭౬ పుటలోని టిప్పణము) కళాద్రుతప్రకృతికత్వములు విభక్త్యంతములకె చెప్పుట సంప్రదాయము- కాని ప్రకృతులకుఁ జెప్పుట సంప్రదాయము కాదు. 'నన్నును' ప్రభృతిపదములకు నాప్రభృతులు ప్రకృతులనుట వైయాకరణ సంప్రదాయము. నన్ను ప్రభృతులు ప్రకృతులని యెవ్వరును జెప్పియుండలేదు.

గుప్తార్థప్రకాశికాకర్త పయినివివరించిన యప్పకవి మార్గముపైని జేసిన యాక్షేపము సరికాదని యీవలకె నిరూపితమయ్యెను (విస్తర. ౭౬ విష.)

విస్తరము. ౬౬ III విష:—ఇట్లు సూరి జాగ్రత్తపడెనని చూచికొనక ప్రౌఢవ్యాకరణకర్త ముక్తలక్షణవివేచనమునందలి (ప్రౌఢ. ౯౫ పుట.) "ద్విత్వర హితంబగు ద్వితీయావిభక్తియుకారమున కచ్చుపరంబగుచోసంధి రాదు.నను నెఱిఁగె- నిను నెఱిఁగె. మొ" అని యిట్లు పునరుక్తముగ నవరించెను.

బాలవ్యా. సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబు
౨౭ I నకు యడాగమంబగు. 3.

ఉద. మా+అమ్మ = మాయమ్మ, మా+ఇల్లు = మాయిల్లు.

సంజీవని. ౨౭ I విష:—సంధిలేనిచోట నఁగాఁ బరరూపసంధిలేని స్థలమని యర్థము. "ఆద్యన్తౌటకితౌ" (౧. ౧. ౪౬) టిత్ కితౌ యస్యోక్తౌ తస్య క్రమాదా ద్యన్తావయవౌ_స్తః." (సి. కౌ. ౯ పు) ఆగమాదికము దేనికి 'టిత్తు' గా విధింపఁ బడునో దాని కది యాద్యవయవముగ నిల్చును. దేనికి 'కిత్తు' గా విధింపఁబడునో దాని కది యన్తావయవముగ నిల్చును. ప్రకృతమున యకారాగమము టిత్తుగా విధింపఁబడెను గాన నది పరస్వరమునకుఁ బూర్వావయవముగా నిల్చును. 'మా+అమ్మ' అనుపరరూపసంధ్యభావస్థలమునందలి 'అమ్మ' అనునది 'యమ్మ' అని యగును. మాయమ్మ. ఇట్లె యంతటను నెఱుంగునది. 'యట్' అనుదానిలోని యకారము మీఁది 'అ' కార ముచ్చారణార్థకము. "హరి యతఁడు, ఇత్యాదులం దాగమ యకారములఘువు." (బా. సంజ్ఞా. ౧౫ సూ.) అనుచెప్పిన నీయాగమయకారము లఘూచ్చారణముగలదని యెఱుంగునది. వర్ణోత్పత్తి స్థానకరణములకు శైథిల్యము కలుగునట్టి యుచ్చారణము లఘూచ్చారణ మనఁబడును. (౧౪ విష.) (వై. పా. ౧౫౭ విష.) (విస్తర I ).

---

విస్తర I, ౨౭ I విష :—"సామాన్యముగాఁ దెలుఁగున అకారాంతములై యున్న పెక్కుశబ్దము లఱవమున ఐకారాంతములై యున్నవి. తెలుఁగునందలి వెల శబ్ద మాభాషలో 'విలై' అనురూపము గలదై యున్నది. ఇదియే ప్రాచీనభాషలో నొకకాలమున దీనిరూపంబై యుండవచ్చును.........కావున విలై = విలయ్ + ఆళ్ = విలయాళ్ = వెలయాలు అనురూపమును బొందియుండును.........
కావున అకారాంతశబ్దములపై నచ్చు నిలిచినపుడు సంధికార్యముగా గ్రహింపఁ బడుచున్న యడాగమను ఎచ్చటినుండియో హఠాత్తుగా వచ్చి చేరినదిగాని కేవల ముచ్చారణసౌకర్యమునకై చేర్పఁబడినదిగాని కాక ప్రాచీనభాషలో సహజముగా పూర్వశబ్దగతమె యై నిలిచి తరువాతికాలమున నాశబ్దస్వరూపము వ్యవహారమున మాఱుటచేతనో లేదా యనుచితవిభాగము మూలముననో ఆపదబంధమునుండి విడఁదీయఁబడి యొకయాగమముగ గ్రహింపఁబడినదని నిశ్చయింపఁదగియున్నది" (సంధి. ౨౫ - ౨౯ పుటలు) ఈసంధి గ్రంథకర్త వ్రాఁత సరికాదు.

తమిళమునకుఁ గొంతముంపుగ వాఙ్మయావస్థ గలిగినంతమాత్రమున నందలి శబ్దములెల్ల నారూపములతోనె యనాదిగాఁ బ్రాచీనద్రావిడభాషలో నుండెడివనియు,

నాతమిళశబ్దములె తెనుఁగుశబ్దములకుఁ బ్రాచీనాకారములై యుండెడివనియు నూహించుట కేవలము నసంగతము. తమిళమును దెనుఁగును విడిన కాలము చరిత్రకందనిది. అట్టి ప్రాచీనతమకాలమున నిటీవలి తమిళశబ్దములయాకారములే యుండెడివని యూహించుచు నాంధ్రవ్యాకరణకర్తలకుఁ జరిత్రజ్ఞానము లేనందున ననుచితశబ్దసాధనక్రమమును జూపిరని యించుకేని సంకోచింపక పల్కుట కేవలము సాహసము. కొన్ని 'అకార' స్థలములుతప్పఁ దక్కినచోటులందెల్ల నుచ్చారణార్థకముగ యకారాగమము నంగీకరించుచు నీవెలయాల్వాది కతిచిత్స్థలములందు మాత్ర మీనిరాధారకల్పనము చేయుట చరిత్రజ్ఞమ్మన్యతాకృతమేకాని వేఱుకాదు. అట్లు తక్కిన యికారాంతాదిస్థలములందెల్ల నెచ్చటినుండియో హఠాత్తుగా యకారమువచ్చి చేరినదని యెట్లును వీరంగీకరింపక తీరదు గదా. "తాలవేత్యరంబగు నేయచ్చులనడుమ నైనను గూడ సంధిలేనిచో యడాగమంబగుట (అచ్చులనడుమ యడాగమం బనుట కేవలము ననుపపన్నము. ఇట్లె యాపుటయందే వీరు వడాగమమనియు "టిత్త్వఫలజ్ఞానశూన్యముగనె విరుద్ధముగనైతము వాడిరి) కొంత వికృతముగాఁ గనంబడకమానదు." (సంధిగ్రంథము. ౨౮ పు.) అని యిట్లు వెలయాల్వాది స్థలములలో వీరభిప్రాయపడుట సరికాదు. ఆయాకాలము మున్నగుచోటులందలి యకారాగమమున కేమిగతి? అట్టివానికి వెలయాల్వాదులకువలె వీరేమియు గతి చూపఁజాలరుగదా.

"వెల్లయావు, చింతయాకు, అనురూపము లెచ్చటనో పద్యములందు ఛందస్సౌకర్యమునకై ప్రయోగింపఁబడుట తటస్థించినను వ్యవహారమున లేనేలేవు. సామాన్యముగా వెల్లావు, చింతాకు మొదలగురూపములె శిష్టకవితయందును శిష్టవ్యవహారమందునుగూడఁ గాంచనగును" (సంధి గ్రంథ ౨౮ పు) అని యిట్లు తాలవ్యేతరాచ్చులనడుమ యకారాగమ ముండదనునభిప్రాయమును సంధిగ్రంథకర్త విస్తరించి వెల్లడించెను. ఆయాకాలము మున్నగునవిసయితము శిష్టకవితలో నుండవందురు కాఁబోలు। శా. - నుయిదాఁచువానికిం జింతయా। కంత్రైనన్ - (పాండు. ౪. ఆ.) ఇట్టివి శిష్టకవితలు కావనుట సరియా?

సంహితలో నుచ్చారణసౌకర్యార్థముగ యకారము।నిల్పుసంప్రదాయము—అందును 'అ' కారద్వయమధ్యమున నిల్పుసంప్రదాయము—సంస్కృతప్రాకృతములయందె వెలసియున్నది. "దేవాః + అత్ర = దేవాయత్ర, దేవాఅత్ర, భోః + అచ్యుత = భోయచ్యుత, భోఅచ్యుత," మున్నగుచోటులందుఁ దాలవ్యసంబంధములేని 'అ' కారద్వయ మధ్యమందేకాక యోష్ఠ్యాచ్చునకుఁ దర్వాతనైతము

ఈయకారాగమమును వ్రాతలో నిల్పరాదనియు నిది యుచ్చారణమాత్రముననె వినఁబడుననియుఁ జెప్పెడి విసంధివివేకగ్రంథమతము సరికాదని యీావలికు వ్రాయఁబడెను. (౬౮ విష. వి స్త. IV)

---

సంస్కృతమున యకారాగమము కన్పట్టుచున్నది. ప్రాకృతమున 'అ' కారద్వయ మధ్యమందు యకారము వినఁబడునని చెప్పఁబడెను. ఉదా:—వచనమ్ = వఅణం= వయణం. "భోభగోఅఘోఅపూర్వస్య యోఽశి" (౮. 3. ౧౭—పాణినీయము). "యశ్రుతిరః (౧. 3.౧౦)ప్రాయోలుగితాదినా కా దీనాం లోపేసతి యోఽవశిష్యతే అవర్ణః సః అవర్ణాత్పరః లఘుప్రయత్నతరయకారశ్రుతిర్భవతి. ఉదా:—వచనమ్ = వఅణం = వయణం" (షడ్భా. ౧౧ పు.) చండుఁడు 'అ' వర్ణము తర్వాత మాత్రమె యేయచ్చునిల్చినను యకారాగమము వచ్చునని సూత్రించెను. "యత్వమవర్ణే........కాకాః – కాయా........అవర్ణఇతికిమ్. దేవాః = దే ఆ...." (ప్రాకృతలక్షణ. 3 విధాన. 3౯ సూ.)

వి స్తర II. ౬౭ I విష:—తెలుఁగునందును దమిళకర్ణాటములందువలెనె సంహితలోఁ గొన్నియెడల వకారము సైతము నిల్చుట కలదు. కాని యట్లు నిల్చుట కొన్నిసమానపదములందుమాత్రమె చూపట్టుచున్నది. ఉదా:—చతుర్థి = చఉతి = చవుతి, చతుష్కము = చఉకము = చవుకము, రాహుతుఁడు = రఉతు = రవుతుఁ (వై. పా. 3౭౬ విష.) యకారాగమమువలె వాక్యగతపదద్వయసంహితలో నిట్టి వకారాగమము చూపట్టదు. "మూఁడు + అంటు = మువ్వంటు - నెలకులోపల మూఁడుపురుడులు. ఉ:—చంటవిషంబు మెత్తుకొని చంపుదు నర్భకు నంచు వచ్చి ము। వ్వంటులనాఁడు పూతన యవారణ నెత్తికొనంగ...... (హరి. ఉభా. ౪ ఆ. ౨౫౧) మువ్వంటులనాఁడు. అనఁగా నెలపురిటిలోపల నని యర్థము." (శ - ర) ఈశబ్దరత్నాకరకల్పనము సరిగ్గాయున్నట్లగపడదు - మువ్వాపానకము- మువ్వాకోడె- మువ్వాపసరము-మున్నగుశబ్దములలోని మువ్వాశబ్దము 'కోమలము - లేఁత-మృదువు' అనునర్థములతో నగపడుచున్నది. కాన 'మువ్వ + అంటుల+నాఁడు = మువ్వంటులనాఁడు = మృదుస్పర్శగల లేఁతవయసునాఁడు' అని యర్థముచేయుట యుక్తము. మువ్వాశబ్దము మొవ్వుశబ్దమును సంబంధించినది కానోపును. 'ముయ్యేఁడు' మున్నగు మూఁడుశబ్దపుసమాసములలో యకారాగమమును మహాకవులు వాడుచుండుటచేఁ బైశబ్దరత్నాకరకల్పనము కవిసమ్మతము కానేరదు.

మ. తిరువారాధనమిట్లొనర్చి ధరణీదేహాన్వయ........ (పాండు. ౨. ఆ. ౨౪ ప.) తిరు + ఆరాధనము = తిరువారాధనము. తిరుశబ్దము శ్రీశబ్దభవమనఁ

సన్నిసూ. వాతః. (ఆం. చిం. సంధ. ౧ కారిక)
ఉప. సన్ధిస్తు ద్రుతపూర్వస్య। ప్రాయశోన భవేదతః. (వికృ.
రవ. సంధి. ౨ కా. అహో. ౧౮౨౭)

సన్నితిస ఉప విష:—అతః = అకారమున కచ్చుపరముగునపుడు పరరూప ... వా = వికల్పముగ నగును.

సం: స్త్విత్యాదిః—ద్రుతపూర్వస్య = ద్రుతమునకుఁ బూర్వముననున్న, అతస్తు = అకారమునకన్నను, సంధిః = పరరూపసంధి, ప్రాయశః = సాధారణముగ, నభవేత్ = కాదు. ఇచ్చాంసుధా విత్యాదివ్రాప్పున పాక్షికసంధికలుగకుండఁ బ్రాయికముగ నిషేధము సూత్రింపఁబడినది. ప్రాయశః అనుటచేత "ఇంకన్ - ఇంకన్ ఇంగన్-ఇంగన్." అనువానికిమాత్రము పాక్షికముగఁ బరరూపసంధి కలుగునని యెన్నవగును. ఉదా:—చేయక=ఉండెన్=చేయకుండెన్. చేయకయుండెన్, వలువ+ ఎడలన్ = వలువెడలన్. వలువయెడలన్, మొ. ద్రుతపూర్వాకారసంధ్యభావ మునకు:—చూడన్+అయితిని = చూడనయితిని. నాచేతన్+ఉన్నది. = నాచేత నున్నదిః 'ప్రాయశః' అనుటచే—ఇంకన్+ఏమి = ఇంకేమి, ఇంకనేమి, మొ.

బాలవ్యాకరణ వివరణము. ఉప I విషయము. అత్తునకు సంధి బహుళముగానగు. ర. మేన+అల్లుఁడు= మేనల్లుఁడు - మేనయల్లుఁడు, పుట్టిన+ఇల్లు = పుట్టినిల్లు- పుట్టినయిల్లు, చూడక+ఉండెను = చూడకుండెను - చూడక యుండెను.

సంజీవని. ఉప I విష:—బహుళమ్ = "బహవః బహుప్రకారాః సన్త్యస్యేతి బహులమ్, అథవా బహూనర్థాన్ లాతిగృహ్ణాతీతి బహులమ్" (ముగ్ధ. వ్యాఖ్య ౧౧౨౮ సూ.) అట్టి బహుళగ్రహణముచేఁ గలుగునర్థవిశేషము లీక్రిందిరీతిని వివ రింపఁబడినవి. "క్వచిత్ ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః। క్వచిద్విభాషాక్వచిదన్యదేవ।విధే విధానం బహుధాసమీక్ష్య। చతుర్విధం బాహుళకం వదన్తి" (శబ్దా. చిం. బాహు ళకశబ్దము) ౧ ప్రవృత్తి = కొన్నియెడల నిత్యముగావచ్చుట - ౨ అప్రవృత్తి = కొన్నియెడల వర్తిల్లకయేయుండుట - 3 విభాష=కొన్నియెడలవికల్పముగా నగుట. ర. అన్యదేవ = కొన్నియెడల వేఱువిధముగ నగుట. బాహుళకవిధానస్థలముండెల్ల

దగునుగాని యీవకారాగమఘటితము తమిళమునుండి గ్రహింపఁబడె ననవగును గాన నిది తెనుఁగున వ్యస్తసంహితలో వకారాగమము వచ్చుననుటకుఁ బ్రమా ణము కాఁజాలదు. ఇట్టివియు భారతమున లేవు.

నీనాల్గువిధములు వర్తిల్లనక్కఱలేదు. సాధారణముగా వైకల్పికముగా వర్తిల్లుటయుఁ దక్కినవిధములు యథాసంభవముగాఁ బ్రవర్తించుటయు సంభవించుచుండును (౩౮ సూ. బా. సంధి.) ప్రకృతసూత్రమున, మేనల్లుఁడు - మేనయల్లుఁడు మున్నగు చోటులందు వైకల్పికప్రవృత్తియు స్త్రీవాచకతత్సమసంబోధనాంతములపట్లను వెలయాల్వాయిలందును బ్రవృత్తియే లేకుండుటయు (అమ్మయిచ్చెను - దూతయితఁడు - చెలువుఁడయిందము - వెలయాలు - మొ.) సూరిచేఁ జూపఁబడెను. సూరిగారి యుదాహృతిస్వారస్యమున వ్యతిరేకవ్యాప్త కాకారమునకును, ధాతుజవిశేషణాకారమునకును సంధి వైకల్పికమని యెన్నవలెను. అస్మిభావార్థక టప్రత్యయాకారమునకును సంధిపాక్షికము. (ఉండుట యిదియు. (ఆది. ౨ ఆ. ౧౬౩) చేయుటిది- (ఆది. ౨ ఆ. ౮౮ ప.) అవధారణార్థస్ఫూర్తికి భంగము లేకుండుటకయి తదర్థకాకారమునకు సంధిరాదు. ఉదా. నీవయిదియు. మొ. "మేన మొదలయినవాని కత్త మొదలయినవి పరముగుచోట సంధి నిత్యము. ఉదా:—......మేనత్త. మేనయత్త (భార. ఆది. ౫ ఆ. ౧౩) వంటి ప్రయోగములు గలవుగాని యవి శిష్టవ్యవహారసమ్మతములు గావు." (ఆం. భా. అ. సంధి. 3 సూ. వివర.) ఇట్టియెడల నింకఁ బ్రయోగాంతరములను జూపుట యనావశ్యకము. ఇట్టి యనుశాసనము సంప్రదాయవిరుద్ధము. మహాకవిప్రయుక్తమును విశేషించి భట్టారకప్రయుక్తమును నేఁటి శిష్టవ్యవహారమును బట్టి నిరసించుట సాహసము. భట్టారకునికంటె శిష్టు లెవ్వరు? నన్నయభట్టు వేఱొకచోట సైతము 'మేనయత్త' అనియే (సభా. ౨ ఆ. ౫౫) ప్రయోగించెను. ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగ......(హరవి.) అని శ్రీనాథుఁడును బ్రయోగించెను. తమ మేనయత్త (హరి. ఉ. భా ౬ ఆ. ౨౬౨ ప.)

నన్నయా ౩౮ వినాలవర్ణంనోసంధి। మిశ్రతత్సమయోర్లుకి (వికృ.సంధి.
II విషయ. ౮ కా. అహో ౭౫౦ పుట.)

కల్పతరు ౬౮ II విష:—మిశ్రసమాసమునందును దత్సమశబ్దముల సమాసమునందును, లుకి = షష్ఠ్యర్థకద్వితీయారూపద్రుతము లోపించినదై యుండఁగా మిగిలిన అకారములలో, లవర్ణంవినా = 'ల' అనునది తప్పఁ దక్కినఁ 'అ' కారమునకు, సంధిః = సంధి, నో = కాదు. ఉదా:—'రాజులయొక్క+ఒద్ద = రాజులన్+ఒద్ద = రాజుల+ఒద్ద = రాజులొద్ద, రాజులయొద్ద.' అనిలవర్ణకస్థలములందు సంధి పాక్షికము. 'చెలువయానవము సీతయాననము' మొదలగు మిశ్రతత్సమసమాసములలో సంధిలేదు. చెలువయానవి మున్నగు నాచ్ఛికసమాసములలో సంధి యగుట

నిర్బాధమని తాత్పర్యము. పైస్థలములందు 'షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా తత్పురుష. సంస్థితానామ్నామ్' అనుచెప్పున షష్ఠి ద్వితీయారూపద్రుతాకారముతో నిల్వఁగా "ద్రుతస్యసర్వత్రలుక్ సమాసేషు" అనుచెప్పున ద్రుతమునకు లుక్కు సంభవించు నని యెఱుంగునది. అహోబలపతియు "లుకి = ద్రుతస్యలుకీత్యర్థః" (అహో. ౪౯౦ పుట.) అనియే వ్యాఖ్యచేసెను.

అథర్వణకారికచెప్పునః బయిరీతి నుదాహరించితినేకాని 'చెలువానతి' మున్నగురీతి నాచ్ఛికషష్ఠీసమాసములందు సైతము సంధియగుటకు భారతప్రయోగ ములు లభింపలేదు. అర్వాచీనమహాకవిప్రయోగములు కన్పట్టుచున్నవి. లేనెల యొక్క+అంత = లేనెలంత. ఈబిడయొక్క+ఆరు = ఈబిడారు. (విజ. ౧ ఆ. ౧౩౦ ప.) మేకయొక్క+ఎరువు = మేకెరువు (ఆము. ౮ ఆ. ౧౩౮ ప) (వి_స్తర.)

అచ్సన్ధియాథర్వణీయము. ఉ౯ విషయము.

భవ_న్తికేచిచ్ఛబ్దాస్తు। సాంగత్యేనైవ సాధవః। (వికృ. సంధి. 3 కా. అహో. ౧౭౭ పు.)సంధిర్నిత్యం ప్రత్య యస్య। తథార్యాదిగతస్యచ। అచోఽ చిక్వచి ల్లోపో। బహుళం స్యాత్ప్రయోగతః॥ కుత్రచిత్ సంస్కృతయోఽపి। ప్రాణోప్యత్రచ్యుతో భవేత్। (వికృ. సంధి. ౮-౧౩-3. కా. అహో. ౨౬౩-౧౯౧-౧౮౫ పు.)

కల్పతరు. ఉ౯ విష:—కేచిచ్ఛబ్దాస్తు = కొన్నిశబ్దములు, సాంగత్యేనైవ = సంధినిత్యతచేతనే, సాధవః = సాధువులు, భవ_న్తి = అగుచున్నవి. ఇట్టిసంధి నిత్య తకు స్థలములను వివరించుచున్నాఁడు. అచః = అచ్చునకు, ప్రత్యయస్య = ప్రత్య

---

వి_స్తర. ఉ౮ II. విష:—షష్ఠీసమాసములందే కాక వ్య_స్తస్థలములందును, నాచ్ఛికశబ్దముల 'అ' కారమునకుమాత్రమే సంధియగునని యహోబలపతి వ్రాసెను. "వ_స్తుత_స్తు ప్రయోగపరంపరాపర్యాలోచనయావైకృతప్రకృతిగత యోరేవ 'ఇ'-కా రాకారయోరేవ వైకృతే(స్వరేపరే)సంధిరితి సంసూచ్యతే (పోల్కితని-మిన్నకింకను) ఉభయకవిమిత్రాదిభిః ప్రాయశః ఏతన్మతమేవానుసృతమితి ప్రతిభాతి."(అహో.౪౯౧ పు.) ఈయహోబలపండితాశయము సరికాదు. కం. ........పాం। డవధర్మపత్ని నీకం। తవమానము సేయ (సభా. ౨ ఆ. ౨౦౩) ఆ. వె. ఎగువఁబడితి ముందఱింద్రు పంచిన.....(ఆది. ౭ ఆ. ౨౩౭) వ్య_స్తస్థలములలోఁ దత్సమాకారమునకును స్త్రీ వాచకసంబోధనాంతములకును సంధిలేదని ముందు వివరింపబడును.

యముయొక్కయు, ఇది యాగమాదులకు నుపలక్షణము. తథా=అల్లె, ఆ ద్యాదిగ తస్యచ = అయ్యి మున్న గుశబ్దములయొక్కయు, అచి = అచ్చుపరమగుచుండఁగా, లోపః=లోపము, (పరరూపసంధి) నిత్యమ్=నిత్యముగా నగును. క్వచిత్ = ఒకానొకప్పుడు, ప్రయోగానుసారముగా, బహుళంస్యాత్ =పై సంధిబహుళముగవర్తిల్లును. (విస్తర. I) క్వచిత్ = ఒకానొకప్పుడు, సంస్కృతీయోపి ప్రాణః=తత్సమశబ్దస్వరము సైతము, చ్యుతః=లోపించినది, భవేత్=అగును. ఉదా:—గంప+ఎడు=గంపెడు. (ఇవి ప్రత్యయాచ్పరకత్వముచందలి సంధినిత్యతకు దాహృతి. "పరిమితౌ సమస్తానా" మ్మనుసూత్రమునొద్ద విస్తరముగా నుదాహరింపఁబడును. తత్సమాకారసంధికి:— అన్న+అమ=అన్నమ, సిద్ధ+అన=సిద్ధన. మొ. (విస్తర. II) రామాయనమః+అనియె= రామాయనమ+ఓ+అనియె = రామాయనమో యనియె. నమశ్శబ్దవిసర్గస్యేత్యాద్య థర్వణకారికయు దీనిలక్ష్యముల నొసఁగుచున్నది. (౧౧3 విష. చూడు.)

---

విస్తర I. ౬౯ విష :—"అచోఽచీ" త్యాదికారికనహోబలపతి యిట్లదుక కున్నను దీనికిఁ బ్రత్యయాచ్పరకసంధిస్థలమునే యుదాహరించెను. "అచోఽచికు త్రిచిల్లోపో|బహుళంస్యాత్ప్రయోగతఇతీకారలోపః. చనెన్. (చని+ఎన్)"(అహో. ౧౫౧ పు.) వికృతివివేకటీకాకర్త యింకను బ్రమాదముగా నీకారిక నామ్రేడితసంధి పరముగా నన్వయించి యుదాహరించెను. నన్నయాథర్వణు లిద్దఱును నామ్రేడిత సంధివిషయమునఁ బ్రత్యేకముగా సూత్రించియుండుటచే నీతని సమన్వయము సరి కానేరదు.

విస్తర II. ౬౯ విష :—భవన్తీత్యాదికారిక కిట్లర్థముచేయక యహోబలపతి కొన్నియాధునికాశయములను బ్రయోగములను సాధించుట కీకారికనుపయోగిం చుట సరికాదు. "పొన్నాకు...ఆవంత...ఇత్యాదీనాం సంధేరేవ సున్దరత్వాత్... "అత ఏవాథర్వణేనోక్తమ్. భవన్తి కేచిచ్ఛబ్దాస్తు। సాంగత్యేనైవ సాధవఇతి." (అహో. ౧౫౮ పు.) ఈయహోబలపతి ననుసరించియే నారాయణీయతద్వివరణకర్తలీ యథర్వణకారిక కీక్రిందిరీతి నాధునికకవి ప్రయోగసాధకతను వివరించిరి. "సంధిచేసి ననే కాని......విపృతి - ఏసి - అంత - ఆకు మొదలయినవి పరమగునపుడు సంధి నిత్యముగ నగు. ఉదా:—ఎనిమిదేసి - పదేసి - ఆవంత - పొన్నాకు - మొ....... ఉత్తరార్థోదా—గంగను కానె దూఱఁగా. (గంగ+అను) (ఆము. ౨ ఆ.)...... ఈరంగభర్తంచు. (ఆము. ౬ ఆ)......చేష్టుడిగె. (ఆము. ౪ ఆ.)......అర్చిడఁగ రాదు. (వసు. 3 ఆ.)" (నారా. గాణ. సంధి. ౧౧౧ కారి. 2 పద్య.) ఇట్టి తత్సమ స్వరసంధులు నన్నయాథర్వణసమ్మతములు కావు. "ఆకు - అంత - ఏసి. పరమగు

బాలవ్యాకరణ వివరణము ౬౯ I విష.

బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లేదు. అమ్మ+ఇచ్చెను = అమ్మ యిచ్చెను. దూత+ఇతఁడు = దూత యితఁడు. చెలువుఁడ+ఇందము = చెలువుఁడయిందము. సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు. గంగను కాసె, నెలఁతిచ్చెను. వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకముచేతనే యని యూహించునది.

సంజీవని ౬౯ I విష:—సూరిగారు వివరింపలేదుగాని ౬౮ II. ౬౯. విషయములలోని షష్ఠీసమాససంధి విషయములును నార్యాదిశబ్దాదిస్వరపరకసంధి విషయములును బాలవ్యాకరణసూత్రము (౮ సంధి) లోని బహుళగ్రహణముచేతనే సంగ్రహింపఁదగును. "అమ్మ - అత్త" మున్నగుమహతీవాచకముల 'అ' కారమునకును, దూత - పిత - కర్త. మున్నగుతత్సమముల 'అ' కారమునకును చెలువుఁడ -

చోటను మేన మొదలైనవాని కత్త మొదలైనవి పరమగుచోటను సంధి నిత్యము. చింతాకు......మేనత్త......చింతయాకంతైనన్ (పాండు.). మేనయత్త (భార. ఆది. ౪ ఆ. ౧౭ ప.) వంటి ప్రయోగములు కొన్నిగలవుగాని యవిశిష్టవ్యవహారసమ్మతములు కావు" (ఆం. భా. అ. సంధి. ౨ సూ. వివ.) అని యిట్లనుశాసనకర్త నన్నయప్రయోగమును సైతము నిరసించెను. 'తమయంతలవారితోన' (ఉద్యో. ౨ ఆ. ౮౬) ఇందంతశబ్దముపరనుగునపుడు సంధి లేదు. "పొదలినమఱ్ఱియాకుపయిం (హరి. ఉ. భా. ౯ ఆ.) రావియాకు" (రుక్మా. ౧ ఆ.) అని యుదాహరించి గుప్తార్థప్రకాశికాకర్త 'ఇ' కారాంతస్థలములయం దాకుశబ్దపరకత్వమున సంధి సరికాదని వ్రాసెను. (బా. గు. ప్ర. 3౦ పు. ద్వి. ము.) "ఆకా" అని తనసూత్రాంధ్రవ్యాకరణమున సూత్రించి సూరి ప్రాయస్సంధిని విధించెనుగాని బాలవ్యాకరణమున నట్టి యభిప్రాయము నుజ్జగించెను. కం. .....నీ। ప్రజతామరయాకునీటిభంగి తలంకెన్ (ద్రోణ. ౮ ఆ. 3౦౯ ప.) అని తిక్కయజ్వయే యట్టినిత్యతను బ్రయోగింపలేదు. ఇట్టి సోమయాజిప్రయోగము తప్పనుకొని నేటి ముద్రణసంస్కర్తలు నేఁటి వాడుకచొప్పున "తామరపాకు" అని ముద్రింపించుచున్నారు. ప్రౌఢవ్యాకర్త యిట్టి పుగాగమమును సూత్రించెను. (ప్రౌఢ-సంధి-౮ సూ.)

రాముఁడ - రామ మున్నగుసంబోధనాంతముల 'అ' కారమునకును, స్వరపరకత్వ మున సంధిలేదని బాలవ్యాకరణసూత్రముఁబోని బహుళశబ్దముచే గ్రహింపనగు నని సూరిగారివివరణమునకుఁ దాత్పర్యము ఇయ్యది సముచితమేకాని సూరి "కుత్రచిత్ సంస్కృతీయోఽపీత్యాద్యథర్వణసూత్రమునకుఁ దత్సమశబ్దసామాన్య మునయొక్క 'అ' కారమునకు సంధి యగునని యర్థము చేసికొని పయిరీతిని వ్రాయుట సరికాదని దానికల్పతరువ్యాఖ్యవలన స్పష్టపడుచున్నది. "అయ్య అన్న" ప్రభృతి పూజ్యతా వాచకాది కతిచిత్ శబ్దాదిస్వరపరకత్వమున సంస్కృతీయమున కనఁగా సంస్కృతశబ్దగతాకారమునకు సంధికలదని మాత్రమె యథర్వణుని కారి కకుఁ దాత్పర్యము. ఆర్యాదిశబ్దాదిస్వరపరకత్వమున సంధియగుట యథర్వణ సమ్మత మగుటయేకాక మహాకవి ప్రయోగసమ్మతమును నయియున్నది. సూరిగారి పొరపాటు వివరణమున క్రిందియహోబలపతి వ్యాఖ్యమూల మనఁదగును. "సంస్కృతసమాంతస్థితస్యాచోఽపిక్వచిత్ సంధిః. గంగను కాసె- శ్రీరంగభర్తంచు- శౌరిచ్చు శుభములు ఇత్యాదికవిప్రయోగాత్. అత ఏవాథర్వణగ్రన్థే 'కుత్రచిత్ సంస్కృతీయోఽపి। ప్రాణోప్యత్ర చ్యుతోభవేత్' ఇతిస్థితమ్." (అహో. ౧౮౯ పు.) సూరివలెనె యనుశాసనకర్తయు నహోబలపతి ననుసరించెను. "ఇట్టియెడ సంధిరాదని చిన్నయసూరి చెప్పెనుగాని అథర్వణాచార్యుఁడు తత్సమాచ్ఛల కొన్నిట్కెచో సంధియగుననియే చెప్పెను. 'కుత్రచిత్ సంస్కృతయోపి......' (ఆం. భా. అ. సంధి. ౫ సూ) గంగ+అనుకాసె=గంగనుకాసె, శ్రీరంగభర్త+అంచు = శ్రీరంగభర్తంచు, మున్నగు నర్వాచీనకవిప్రయోగము లథర్వణవచనమునకు మూలములనుకొనుట సరికాదు. అథర్వణునినాఁటి కార్యాదిశబ్దాదిస్వరపరక సంస్కృతాకారసంధులు మాత్ర మరుదుగ భారతాదిప్రామాణికగ్రంథములందుఁ జూపట్టుచున్నవి. కాన నట్టిసంధులుమాత్రమె "కుత్రచిత్ సంస్కృతీయోఽపీత్యాద్యథర్వణవచనమునకు లక్ష్యము లనఁదగునని గ్రహింపవలయును. ప్రయోగములు:— సీ। అన్నమాంబా పతియనఘునిగేతన, మల్లనసిద్ధనామాత్యవరుల (విరా ౧ ఆ. ౧౦౪) 'అన్న+అమ = అన్నమ. సిద్ధ+అన = సిద్ధన. మల్ల+అన = మల్లన' అనుచోటి - 'అన్న - సిద్ధ - మల్ల' శబ్దములు సంస్కృతము లనుటలో సందేహములేదు. అట్టిసంస్కృతశబ్దములు 'అన- అప - అయ' మున్నగుపూజ్యార్థకములతో "సంస్కృతపదేనపరిమిత" మిత్యాదిచింతా మణిసూత్రముచొప్పునను "ద్వ్యక్షరాది చతుర్వర్ణ।పర్యన్తే"త్యాద్యథర్వణవచనము చొప్పునను (ఆం. చిం. హలం. ౧౯ కా. వికృ. అజం. ౧౦౮-౧౦౯ కా.) సమసిం పఁగాఁ బ్రకృతసూత్రముచొప్పున సంస్కృతాకారసంధిచే సిద్ధనేత్యాదిరూపములు

సిద్ధించును. కుత్రచిదితాథర్వణకారికలో సంస్కృతప్రాణము లోపించు ననుటచే "ధర్మోజయతనుచు" (జయతు+అనుచు) (భీష్మ. ౧ ఆ. ౭ గద్య.) (౧౧౬. విష. విస్తర.) మున్నగు నకారేతరసంస్కృతస్వరసంధిస్థలములును సంగ్రహింపఁబడు చున్నవి.

పయిరీతిలక్ష్యలక్షణముల నరసి సోమనారాధ్యుఁడును దర్వాతి మహాకవు లును మఱికొన్నిస్థలములలోని తత్సమాకారసంధులను, నార్యాదిశబ్దపరకత్వమున నికారాది తత్సమస్వరలోపములను నంగీకరించి ప్రయోగింపసాగిరని యీక్రింది ప్రయోగములవలన విశదమగుచున్నది. ద్విపద. వారించి యిది ప్రాఁతవార్తని యొద్ది। వారెల్ల నుడువ......(బసవ. ౫ ఆ. ౪౬౬.) ధరజినబౌద్ధులు దైవంబులేని। నరరూపులై యుండుదురె మహత్తణఁగి ॥ (బసవ. ౬ఆ. ౭౪౬) (మహత్త+అణఁగి= మహత్తణఁగి) "మహాత్తు. సం. వి. త్. దొరతనము...విణ. గొప్పది" అను శబ్దరత్నాకరపంక్తులు సరికావు. మహచ్ఛబ్దము భవచ్ఛత్రాదిసూత్రముచొప్పునఁ (బా. తత్స. ౮౭ సూ.) దత్సమముగఁ బ్రయోజ్యము కానేరదు. ముద్రి కిచ్చి (రంగ. రా. వావిళ్ల ముద్రణము. ౭ పు. ౨౦౬ పు.) గంగను కాసె (ఆము. ౨ ఆ. ౯) కం... । వరదాయ నమశ్శంకర।శరణన...చొచ్చెన్ (నన్నె. 3 ఆ. ౨౭౭) శరణ+అనన్=శరణనన్. (రక్షకా) (విస్తర. ౧౧౨ II విష.) "శ్రేష్ఠతావాచ కంబు లగునార్యాంబాద్యర్థకంబులు పరంబులగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము. ఉ. రామయ్య. సామయ్య. సీతమ్మ. లక్ష్మమ్మ. మొ. ఆదిశబ్దము 'అన్న - అప్ప - అక్క-లను దెలిపెడు." (ప్రౌఢ - సంధి. ౧ సూ.) ప్రౌఢవ్యాకర్త యిట మహా కవిప్రయోగములను జూపలేదు. ప్రయోగములు:—క - భూ । మండలవినుతుఁడవు లక్ష్మమావరతనయా (పాండు. ౧ ఆ. ౨౪ ప.) తే. గీ. లీల లక్ష్మమ్మ తనకు నిల్లాలు గాఁగ(పాండు. ౧ ఆ. ౪3)ఆ. వె. అంగుసింగరయ్య యనవద్యగుణగౌర । మాంబఁ బెండ్లియాడి(కళా. పీఠిక. 3౮) అకారేతరస్థలములం దీసంధి కనిత్యతయు నరుసుగఁ గన్పట్టెడి. క. ఇమ్మహి రామానుజవిభు । నమ్మాజమ్మకు......(పాండు. ౧ ఆ. ౬౮) సీ......గీ॥......రామానుజప్రధాన । మౌళియర్థాంగలక్ష్మి యమ్మాజియమ్మ. (పాండు. ౧ ఆ. ౬౭) అధర్వణునితర్వాతివాఁడగు విన్నకోట పెద్దిరాజునైతము తత్సరుస్వరసంధిని నిరసించియున్నాఁడు, తే. గీ. తెలుఁగుఁబలుకులు వెలిగాఁగ దివిజ భాష। లమరఁ దెలిఁగించినప్పుడు నచ్చుతోడ। వ్యక్తులై యుండునేకాని వాని తోడ। వర్ణవర్ణైక్యభావంబు వలనుగాదు. (కావ్యాలం. ౯ ఉల్లా. ౪౬ ప.) 'నెలఁ తిచ్చెను' మున్నగుచోటులందు స్త్రీవాచకాకారసంధి యర్వాచీనకవులచేఁ బ్రయో

గింపఁబడెనని సూరియే యుదాహరించెను. ద్వి. అమ్మయై శివుఁ గొనియాడుటంజేసి। యమ్మవ్వ యనురామమయ్యె వెండియును (బసవ. 3 ఆ. ౪౦౨) దీనిని బూజ్యార్థక శబ్దపరకాకారసంధియన్నను ననవచ్చును. సంబోధనమునందు వచ్చు 'అ' త్వమునకును 'అల - ఆర' మున్నగువానికిని సంధిని గొందఱు ప్రయోగించిరి. సీ. అల్లంత దవ్వుల నప్పులప్పు లనంగ ! ......(ఉ. హరి. ౨ ఆ. ౧౬) చ. తోడిఁబడ నమ్మలక్క లని (అమ్మల+అక్కలారా అని) (ఆము. ౨ ఆ. ౫౯) ద్వి. అమ్మలారక్కలారని న గించుచును (బసవ. ౫ ఆ. ౧౮౫) ఎఱుఁగరె శైనులా రెన్నఁడు మీర। లు (బసవ. ౬ ఆ. 3౯౨) ఓడులారేటికి నుత్తలపడఁగ (బసవ. ౭ ఆ. ౨౦౫) కుచములారనుచు (రంగ. రా. యు. ము. ౨౪౬ పు). మొ. శరణన (నన్నె-3 ఆ-౨౭౭)

నన్నయ. తద్వత్తదావిజస్య । ప్రాయస్తు స్యాత్కిమాదికస్యేతః ।
౭౦ విష. అపి శబ్దార్థస్యేతః (ఆం. చిం. ౨. ౩. కా. సంధి)

కల్పతరువు. ౭౦ విష:—తదాదిజస్య = తదాదిగణగతశబ్దముయొక్క తుది 'ఇ' కారమునకు స్వరపరకత్వమున, తద్వత్ =శత్రర్థకచువర్ణకమునకువలెనె, వికల్పముగా సంధియగును. ఉదా:—అది+ఏమి = అదేమి - అదియేమి. మొ. అది - అవి-ఇది - ఇవి - ఏది-ఏవి-కి-షష్ఠి మొదలగునవి తదాదులు. ఇది యాకృతిగణము. కిమాదికస్య = ఏమ్యాదిగణగతశబ్దముయొక్క, ఇతః = ఇకారమునకుసంధి, ప్రాయః= తఱుచుగా, స్యాత్ = అగును. ఉదా:—ఏమి+అది = ఏమది, ఏమి యది మొ. ఏమి - మఱి మొదలగునవి కిమాదులు. ఇదియు నాకృతిగణమె. అపి శబ్దార్థస్య - అపి శబ్దార్థకమగు 'ఏని' శబ్దముయొక్క, ఇతః = ఇకారమునకు, లుగ్వాస్యాత్ = లోపము వికల్పముగా నగునని చారేరిత్యాద్యుత్తరసూత్రమునుండి లుగ్వాస్యాత్తనునవి యధ్యాహృతము లగును. నిమిత్తము చెప్పఁబడమింజేసి యచ్చుపరమైనను హల్లుపరమైనను నవసానమందును 'ఏని'శబ్దేకారలోపము కల్గునని యెఱుంగునది.ఇకారము లోపింపఁగా మిగిలిన నకారము ద్రుతమగును గాన నట ద్రుతకార్యముల నరయునది. ఉదా:—ఒక్కఁడేని-ఒక్కఁడేన్ - హరినేని+అబ్జజనేని = హరినేనబ్జజనేని.— హరునేని+కృష్ణునేని=హరునేఁగృష్ణునేని. ఏనిశబ్దముపై నర్థవిశేషబోధకముగాఁ దఱుచుగా 'ను' శబ్దము నిల్చుచుండునుగాన 'ఒక్కఁడేనియున్ - హరినేని నబ్జజనేని - హరినేనియు నబ్జజనేని మొదలగురూపములును గలుగును. తదాది సంధివైకల్పికము - కిమాదిసంధిప్రాయికము నగుటచేత వానిని వేర్వేఱుగఁ జెప్పవలసెను. వేర్వేఱ చెప్పుట స్పష్టప్రతిపత్తికని యహోబలపతి చెప్పుట సరికాదు.

(అష్టా ౧౫౦ పు). హల్పరకత్వమందును నవసానమందును 'ఏని' శబ్దేకారలోపము గల్గవలయును గాన దానిని వేఱచెప్పుట యెట్లును నావశ్యకమె.

తదాదులకుఁ బాక్షికముగను గిహాదులకుఁ బ్రాయికముగను సంధిని బ్రయోగించునియమము నన్నయభారతభాగమునందు మాత్రమె వెలయుచున్నది. తక్కిన తిక్కనాదులెల్ల నట్టిభేదమును బాటింపక యంతటను వికల్పసంధినే ప్రయోగించుచు వచ్చుటచేత బాలవ్యాకరణమున నిట్టిభేదము లేకుండ 'ఏమ్యా'దీత్యాది సూత్ర మొక్కటియే యుపదేశింపఁబడెను. ఇంతియకాక యపిశబ్దార్థక మగు నేని శబ్దము సైతము బాలవ్యాకరణమున నేమ్యాదిగణపఠితముగనే గ్రహింపఁబడినది. హల్పరకత్వమందును నవసానమునందును నికారలోపనువచ్చి చింతామణి పక్షమందువలె 'ఏన్' అనురూప మేర్పడుట బాలవ్యాకరణపక్షమున సమ్మతముకాదు. అట్టి ప్రక్రియ బాలవ్యాకరణపద్ధతికి విరోధించును. కావుననే తద్విషయమునఁ జింతామణిమార్గమును వదలుకొని బాలవ్యాకరణకర్తయుఁ దదనుయాయులును మార్గాంతరమున 'ఏనిన్-ఏన్' అనురూపములను సాధించుకొందురు.(౪౫. విష) ప్రయోగములు:—క. ఏమని తలఁచునొకొ (అర ౧.ఆ ౨ ౩౮)క. నీఫే। రే మీవెవ్వరి తనూజవు......(ఆది. ౮ ఆ ౧౨౯) ఇది యేమియొకొ యనుచు (ఆది.3 ఆ.౨౧౨) ఉ......తత్కులం। బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము(ఆది. ౧ ఆ ౧౨౬) ఇట్టిచోట్ల నేమిశబ్ద మర్థవిశేషబోధకము. అదేల సంభవించె (ఆది ౪ ఆ ౨౬౧) మ. ఇవియేనున్ సతతంబు (ఆది౧ఆ౧౨) ఇది నీయదియే (ఆది ౭ ఆ ౪౧)ఎంతవివేకము గల్గెనేని యత్యంత......(ఆది ౭ ఆ ౫౯) నాలుగేన్। బాఁడికుట్టులనీఁడె. (ఆది. ౫ ఆ. ౨౧౮)

ఏమ్యాదుల యిత్తునకు సంధివైకల్పికము గానగు. ౫.
ఏమి-మఱి-కి షష్ఠి, అది-అవి-ఇది-ఇవి - ఏది - ఏవి - ఇది
యాకృతిగణము. ఏమి+అంటివి = ఏమంటివి - ఏమి
యంటివి. మఱి+ఏమి= మఱేమి, మఱియేమి-హరికిన్+
ఇచ్చె=హరికిచ్చె-హరికినిచ్చె.

బాలవ్యాకరణ వివరణము. ౭౦ I విషయము

సంజీవని. ౭౦ I విష:—'హరికిన్+ఇచ్చె=హరికిచ్చె' అనుచోటి ద్రుతస్వర లోప ద్రుతలోపము లీవఱకు వివరింపఁబడెను. (౬౬ II విష) 'ఇత్తు' అను తపరకరణముచే హ్రస్వమగు నికారమునకే యిట్లు పాక్షికసంధి యగునని యెఱుంగునది.ఆకృతిగణ మనఁగా నిందలిశబ్దము లివిమాత్రమె యని పఠితములు కాఁజాలవనియు, మహాకవిప్రయోగములనుబట్టి యిందలిశబ్దములను గ్రహించుకొనవలయుననియు

నర్థము. ఇత్తునకు సంధివైకల్పికమని చెప్పక యేమ్యాదులయిత్తునకని చెప్పుటచేత వ్యతిరేకార్థకవిశేషణేతరాసమాపకక్రియల యికారము-తత్సమేకారము-షష్ఠీసమాసములలోని యికారము మున్నగువానికి సంధి కానేరదనియుఁ దక్కిన మహాకవి ప్రయోగసమ్మతములగు నికారములకుఁ బాక్షికసంధి వర్తిల్లుననియుఁ దాత్పర్యము సెన్నవగును. సమాపకక్రియేకారసంధి ముందుఁ జెప్పఁబడును. ఉదా:—చేయని+అట్టి=చేయనట్టి-చేయనియట్టి, రాతిరి+ఎల్ల=రాతిరెల్ల-రాతిరియెల్ల, కుయ్యి+ఆలించి=కుయ్యాలించి-కుయ్యియాలించి, ఆనతి+ఇమ్ము=ఆనతిమ్ము-ఆనతియిమ్ము. మొ. "చేసెడి+అతఁడు=చేసెడి యతఁడు. చేసి+అడిగెను=చేసి యడిగెను. హరి+ఏఁగెను=హరి యేఁగెను. ఎవ్వరి యొక్క+ఇల్లు=ఎవ్వరి+ఇల్లు=ఎవ్వరియిల్లు" అనునవి మొదలగుచోట్ల లందు సంధి లేకుండుటయే ప్రాచీనపండితకవి సంప్రదాయము. "వినాలవర్ణం నో సంధిః మిశ్రతత్సమయోః ప్లుకి" (వికృ-సంధి-౮ కారి)(౬౭ II విష) అను నథర్వణకారికలోని యకారాంతలవర్ణపర్యుదాసస్వారస్యముచేత నాచ్ఛికశబ్దసంధి యభ్యనుజ్ఞగాని, మిశ్రతత్సమములసంధి నిషేధముగాని షష్ఠీసమాసములోని 'అ'కారాంతములకు మాత్రమే యని చెప్పవలసియున్నది. అట్లగునపుడే యీక్రింది కవిజనాశ్రయసంధి నిషేధము సమర్థము కాఁగలదు. క. పరఁగ నికారాంతోపరిత। త్స్వరము యికారంబుతోడ సదృశముగా నె। వ్వరియిల్లు దిట్లనక యె।వ్వరిల్లు దిట్లనఁ గుసంధివర్గం బయ్యెన్. (కవిజ. దోషాధి. ౧౬ ప) కవిజనాశ్రయకర్త చేసిన యీనిషేధమున కనుకూలముగా భారతాదిప్రాచీనకావ్యములం దిట్టి షష్ఠీసమాసగతేకారసంధిప్రయోగములు కన్పట్ట లేదు. (విస్తర) కాని యిందులకుఁ విరుద్ధముగా శ్రీనాథాదిమహాకవిప్రయోగములు కనంబడుచున్నవి. సీ.....మగనాలిసరిఁబోల్పఁ దగదు విధవ (కాశీ. ౨ ఆ. ౮౩) (మగనియొక్క+ఆలు=మగనాలు) దీనంఘ్రులు (నైష. 3 ఆ. ౨౦౨) ఇది మిశ్రసమాసమును నయియున్నది. (దీనియొక్క+అంఘ్రులు=దీనంఘ్రులు) వాననఁజెనటి

---

విస్తర I - ౭౦ I విష:—"సంబంధషష్ఠీరూపములందలి 'ఇ'త్వసంధికి నన్నయాది ప్రాచీనకవిప్రయోగములు సైతము గలవు. నరునునికి (ఆది. ౮ ఆ. ౧౬౭) కృష్ణు నల్లుఁడు (ద్రోణ. ౨ ఆ. ౨౭౮. ౩౩౭) జమునిల్లు (విరా. ౨. ఆ. ౨౦౮ ప.)" (బాలకవిశరణ్యము ౨౮౭ పుట.) అనుశరణ్యకర్తవ్రాఁత కేవలభ్రాంతిమూలకము. "నరుయొక్క+ఉనికి = నరు+ ఉనికి = నరునునికి. కృష్ణుయొక్క+అల్లుఁడు = కృష్ణు+అల్లుఁడు = కృష్ణునల్లుఁడు. జముయొక్క+ఇల్లు = జము+ఇల్లు = జమునిల్లు" అని యిట్టిసంధి ప్రక్రియచెప్పున షష్ఠీసమాసమునందు (బా. సంధి. ౩౮సూ.) అను సూత్రముచేత నట్టిరూపములు సుసాధములగును.

(శరు. ౫ ఆ. ౬౫) (వానియొక్క+అన్న=వానన్న)వదలక యాతనింట(అను. ౧ ఆ. ౮3) (ఆతనియొక్క+ఇంట=ఆతనింట) మహాకవిప్రయోగము లిట్లుండుటచేకాక కవి జనాశ్రయకర్త 'కుసంధి' యని నిరాకరించినరీతిగల 'మగనాలు' అనుచోట సంధి సత్యమును నైతక మహోబలపతి యాక్రిందిరీతిని వచించెను. "కంచంతకాపురము-మగనాలు ఇత్యాదిషు ప్రవృత్తిః" (అహో. ౧౯౮ పు) దీని ననుసరించి కావలయు ననుశాసనకర్త "మగనియాండ్రను ప్రయోగ మశ్రావ్యము" (ఆం. భా. ఆ. సంధి ౧3 సూ) అని వ్రాసెను. ఉ. ఆసమయంబునన్ మగని యాండురు (నిర్వ. ౫ ఆ.౯౮) ఉ. ఆసమయంబునన్ మగనియాండ్రను......(ఉత్తరా - సర్వల. ౧ ఆ ౯) ఆ-వె. మగనియాలి కిచ్చు మాటలాట. (విజ్ఞా. ప్రాయ. ౧౦౫) పురిటియాండ్రు. (సర్వల. రామాభ్యు. ౧ ఆ. ౧౧) అనుశాసనకర్త యిట్టి మహాకవిప్రయోగములను నిరసించుట సరికాదు.

పయిరీతి షష్ఠీసమాసములోని 'ఇ' కారమునకే కాక తత్సమేకారమునకును క్త్వార్థకేకారమునకును సంధిని బ్రాచీనకవులు ప్రయోగింపకున్నను నర్వాచీనమహాకవులు ప్రయోగింపకపోలేదు. అందుక్త్వార్థకేకారసంధులు ముందుఁ బ్రదర్శింపఁబడును. (౭౭ విష. విస్తర). తత్సమేకారసంధులు: సీ. తను హేమ మింకఁ బల్లవపుట ర్చిడఁగ రాదు। (వసు. 3 ఆ. ౧౮౦ ప) శౌరిచ్చు. (అహో ౧౮౯) నళినారఁట సౌరభోద్గారఁట (కవిరా. 3 ఆ. ఆం. భా. అ. ౨౮౮ పు. తృ. ము). మొ.

పయినుదాహరించినస్థలములుతప్పఁ దక్కినసమాసక్రియేతరములగుచోటులందు ధారాళముగఁ బాక్షికసంధి వర్తిల్లును. అట్టి సంధులెల్లఁ బ్రకృతమగు "ఏమ్యాద్యా"దిసూత్రమునకె లక్ష్యములని గ్రహింపవలెను. (విస్తరII.) ఏమి+అయ్యె=ఏమయ్యె, రాతిరి+ఎల్ల = రాతిరెల్ల, తెలివి+ఒంది=తెలివొంది, తెలియని+అట్టి =

---

విస్తర II. ౭౦ I విషః—ఇకారసంధి పాక్షికత యిట్లు ధారాళముగ నుపదేశింపఁబడియున్నను గొందఱు సరిగఁ బరిశీలింపక యిది లాక్షణికసమ్మతము కాదను నొకప్రామాదికాభిప్రాయ మేలకో వెలసినది. "ఇకారసంధులు క్త్వార్థక సంధులు మొదలయిన పూర్వలాక్షణికసమ్మతములుకాని ప్రయోగములు కలవు." (ఆంధ్రకవులచరిత్రము - ద్వితీయభాగము - ౧౫౦ పు. ౧౮౯౮ సం॥ ముద్రణము. చేమకూర వేంకటకవిచరిత్రము) ఇట్లె పెక్కురుకవులపై నీదోష మీకవులచరిత్రమునఁ జూపఁబడుచువచ్చెను. ఇట్టి యపసిద్ధాంతము లోకమున వెలయుటచేతనే యనుశాసనకర్త ప్రయోగవిశేషప్రకరణమున "దేశ్యేకారసంధి సర్వసమ్మతము." (ఆం. భా. అ. ౧౧ సూ. ప్రయోగ - ప్ర.) అని సూత్రించి యనేకప్రయోగము

తెలియవట్టి, సవతి+ఆలు = సవతాలు, తాటి+ఆకు = తాటాకు, మఱ్ఱి+ఆకు = మఱ్ఱాకు, మగని+ఆలు=మగనాలు, మొ. పక్షంబున—ఏమియయ్య-రాతిరియెల్ల, తెలివియొంది= తెలియని యట్టి మొ.

---

లనుజూపెను. ఈతఁడు సంధిప్రకరణమందును "ఏమ్యాదులయు కొన్ని యాచ్ఛికసర్వ నామవాచకములయు వ్యతిరేకభూతార్థక క్రియాజన్యవిశేషణములయు, ఇకారము నకు సంధి బహుళముగా నగును." (ఆం. భా. అ. సంధి ౧౩ సూ.) అని సూత్రించి పయిరీతిని సూరిగారు సూత్రించియున్నను దనవలెఁ బునరుక్తముగఁ జెప్పలేదని కావలయు "ఆచ్ఛికనామముల ఇకారమునకు బాలవ్యాకరణమున సంధి విధింపలేదు." అని పైసూత్రము క్రిందవివరించెను. ప్రాచీనలాక్షణికు లెవ్వరును నికారసంధిని నిరసింపలేదు. ఆంధ్రకవులచరిత్రకర్త మీఁద వ్రాసినరీతి నేల యట్లు తలంచెనో తెలియకున్నది.

క. అచ్చుగ నఱ్ఱిఱుఱ్ఱును । నచ్చులయంతమునఁ దెనుఁగు నభిధానములన్ । విచ్చలవిడిఁ బలుకులఁబెఱ । యచ్చులుసను దెంచు మానవాఖ్యలయందున్. తత్సంధి క్రమం బెట్టిదనినఁ గీ. అవనినాథుఁడు దయఁజూడ కలిగినాఁడు । రాజు దయలేక యున్నాఁడు రమణియెడను । అలరుబంతిది మేల్బంతి యది యనంగ । నెల్లకృతులను మిక్కిలి చెల్లుఁగాన (ఆం. భా. ౭౫ - ౭౬ - ౭౭ ప). అని కేతన ధారాళముగ నికారసంధి నుపదేశించెను. ఇంకఁ గవులచరిత్రకారుని ప్రామాదికాశయమున కీక్రింది కవిజనాశ్రయపద్యము కారణమని తోఁచుచున్నది. క. పరఁగనికారోపరితత్స్వరమ యికారంబుతోడ సదృశముగా నెవ్వరియిల్లిది యిట్లనకెవ్వరి ల్లిదిట్లనఁ గుసంధివర్గం బయ్యెన్ । (కవిజ. దోషాధి. ౧౯ ప.) కాని యిందలి యుదాహరణస్వారస్యమున నీతని యీనిషేధము షష్ఠీసమాసములోని యికారసంధికె యని యెన్ననగును. ఈవిషయము సంజీవనిలో విపులముగా వివరింపఁబడెను. ఇకారసంధి భారత ప్రయోగసమ్మతము నై యున్నది. ఎ. గీ. మెఱసి రాతిరెల్ల సుఱిక పవన । తనయుఁ డరిగె (ఆది. ౬ ఆ. ౧౬౧) క. మెలఁగ నేనా యథముని (విరా. ౧ ఆ. ౨౦ ప.) (ఏని+ ఆయథముని). క. మీఱెఱుఁగనట్టి లోకా । చారముగలదయ్య (ఆది. ౭ ఆ. ౨౪౯) (ఎఱుఁగని+అట్టి). సీ......తలయుఁ జెఱొక్కట (విరా. ౫ ఆ. ౧౫౦ ప.) ఆ. వె. ఆకుయ్యాలింపుఁ డకట. (విరా. ౩ ఆ. ౨౦) (కుయ్యి+ఆలింపుఁడు). గీ. ఆన । తిమ్మ రాముని (ఆర. ౬ ఆ. ౩౦౨) ఉ.......భాండవం । బె తెలివొంది కాల్చితి......। ఆ తెలివాత్మ నూల్కొలిపి (కర్ణ. ౩ ఆ. ౨౯౨ ప.) సంధిగతపదములు రెండును నాచ్ఛికములె కావలయునన్న భ్రాంతి యీప్రయోగముచే నిరస్తమగుచున్నది.

సంజీవని. ౭౦ II విష:—అవర్ణాదిపరకత్వమున నికారసంధిలోఁ దాలవ్యావేశముగల విజాతీయమగు 'త' వర్ణము జరించునని కొందఱియాశయ.కాని యది పండితసంప్రదాయ సిద్ధముకాదు. క. మీ రెఱుఁగనట్టి (ఆది. ౭ ఆ. ౨౪౯) ఆతెలివాత్మ (కృష్ణ. 3 ఆ. ౨౯౨) మున్నగుచోటులందువలెనే తాలవ్యావేశములేని శుద్ధమగు

---

"ఆకు . అంత.....మున్నగువానియచ్చులు పరంబగునపుడు సంధి నిత్యమని పెక్కు వ్యాకరణములు ఘోషించుచున్నవి. (ఆవ్యాకరణము లెవ్వియో ?) కాని...... ప్రకారాంత స్థలంబులలో నాకు శబ్దము పరంబగునపుడు సంధి శ్రుతికటువుగా నుండును. కాన. ఉ......తా। టాకులలోన....... క. మట్టాకునఁబండెడు.... మొదలైనవానియందు 'తాటియాకు మట్టియాకు' అని ప్రయోగించుటయే రమణీయము." (బా. గు. ప్ర. సంధి. ౪ సూ. వివృతి) అవిమర్శనకృతమగు నిట్టి ప్రకాశికాకారుని యపోహ మీక్రింది తిక్కయజ్వప్రయోగములచేఁ బరాస్తమగుచున్నది. క. సవతాలికిఁ బతివలచిన.....(అను. ౫ ఆ. ౨౯౨ ప.) (సవతి+ఆలికి). ఎ. గీ......తగుమాటగా నాట। గాదు......(ఆశ్వ. ౧ ఆ. ౩౪ ప.) (కాని+ఆట= కానాట) బా. గు. ప్ర. కారుని పయిభ్రాంతి నీక్రిందిరీతిని బాలకవిశరణ్యకర్త నిరసించెను. "మట్టాకు' అనేప్రయోగం. (జై. ౮ ఆ. ౧౪౦-౧౪౧-౧౪౭) జైమిని భారతంలో మూఁడుచోట్ల నున్నది. గుప్తార్థప్రకాశికాకారులకు శ్రుతికటువుగా ఉన్నా పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికి ఇంపుగానే ఉన్నది" "గుప్తార్థప్రకాశికాకారులు రుక్మాంగదచరిత్రములోని 'రావియాకు' అనుప్రయోగము నుదాహరించినారు. (సంధిలేమికి లక్ష్యముగ). ఈరుక్మాంగదచరిత్రములోనే (౨ ఆ. ౧౧౩) 'రావాకు' అనప్రయోగంకూడా ఉన్నది. ఇది వారుచూచినట్లు కనఁబడదు" (బాలక. ౨౩౪ ౨౩౫ పు.)

వెనుక నుదాహరించినరీతినున్న సోమయాజిగారి ప్రయోగములను బ్రమాణముగాఁ గొనియె యర్వాచీనులు పెక్కు రట్టిప్రయోగములను జేసిరి. "పాలుఁడొక్కఁడు పెండ్లైనబాలదాసు (హరివం.) సీ. ఒకజుట్టువ్రేలి వెంటుంగరంబు (హరవి.) తాటాకులలోనఁ (తారా.) మట్టాకునఁబండెడు (జై.) కం. కొలఁదైయొప్పని (నిర్వ. ౬ ఆ. ౬౧) ఉ......కట్టెఁడైన వీఁడిత్తఱి (నిర్వ. ౫ ఆ. ౧౦౬) అనవలసంటిగాక (విజయ.) రావాకు (రుక్మాం.) మగనాలి (కాశీ.) పడఁతర్ఘ్యపణ్యముల్ (బస. ౪ ఆ. ౭౪) కంచంతకాపురము (అహో.) పై। డందెలు గల్లుగల్లుమన (రాజశే) ఆప్రొద్దుపొంయు రాజనట్టి (పాండు.)" భారతప్రయోగమూలకము లగునిట్టి కవిప్రయోగములకు శంకింపనేల ?

'అ' వర్ణము నుచ్చరించుటయె కవిసమ్మతము. కావుననె యట్టియెడల"...... తా। టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడిన......(తా రా.)" అని యిట్లు శుద్ధముగు 'అ' వర్ణముతోడనె యతి ప్రయోగింపఁబడెను (విస్తర ౨౭ విష.) ఇట్టియెడల శిష్ట వ్యవహారములోఁ గేవలముగు 'ఏ' వర్ణమె కొన్నియెడల వినఁబడుట నరసి కావలయు (నందెమ్మ. నందెన్న. బుచ్చెన్న) సంస్కృతములోని గుణసంధివలెఁ దెలుఁగుననైతము హ్రస్వముగు 'ఎ' వర్ణము నేల నిల్పరాదని తలంచి పాల్కురికి సోమనారాధ్యుఁడు 'ఎ' వర్ణవిశ్లేషముతోఁ బ్రయోగించెను. ద్విపద. త్రిపురమున మాఁగైన పండితయ్య। చేయుదు వెంకమంచెనపండితులకు. (బస. ౬ ఆ. ౧౫౮) ఇట "ననామ్ని వ్యుత్పత్తిః" అనువాక్యముచొప్పున నవ్యుత్పన్నసంజ్ఞానామముగ సమాధానాంతరము చెప్పనగు నని తలంచియు నాతఁ డిట్లు ప్రయోగించెనని యూహింపనగును. కాని యీపద్ధతిని దర్వాతికవు లెవ్వరును నాదరించియుండమిఁ జేసి, కావలయు లాక్షణికు లెవ్వరును నిట్టివానిని సూత్రింపలేదు.

నన్నయాథర్వణీయము ౭౧ విషయము,

నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః (ఆం. చిం. ౧
కారి. అహో. ౧౫౦ పు.) ప్రథమేచోత్తమేచైవ।
క్రియేతోవాభవేచ్ఛ్రుతిః। నిత్యమన్యస్యవికృతౌ...
(వికృ. సంధి. ౬ కా. అహో ౧౫౦ పు)

కల్పతరు ౭౧ విష:—అనుత్తమపురుషక్రియాసు - ఉత్తమపురుషేతరక్రియ లయందనఁగాఁ బ్రథమమధ్యమపురుషక్రియల తుదనున్న ఇతః = హ్రస్వముగు 'ఇ' కారమునకు, నిత్యమ్ = నిత్యముగాఁ బకరూపసంధి యగును. ఉదా:—చేసిరి+ అపుడు = చేసిరపుడు, చేసితిరి+అపుడు = చేసితి పుడు, ఉత్తమపురుషక్రియలు 'కిమాదుల'లోనివిగాన వాని యికారమునకు సంధి వైకల్పికము. ఉదా:—చేసితిమి+ అపుడు = చేసితి మపుడు, చేసితిమి యపుడు ‾మొ.

"ఉత్వేయుతౌవనకారాస్యాతాం మధ్యోత్తమైకవచనానామ్।" (ఆం. చిం. క్రియా. ౯ కా.) "భూతాదుతాం పరేషామిత్" (ఆం. చిం. క్రియా. ౧౧ కా.) అనుచింతామణిసూత్రములచేత భూతకాలికోత్తమపురుషైకవచనప్రత్యయము 'ని' అనునదియనియు "తజ్మధ్యశేషషష్ఠీ" త్యాది సూత్రముచొప్పున (ఆం. చిం. ౧౬ ౧౭ కా.) దానితుదను ద్రుతము నిల్వఁగా 'నిన్' అగుననియుఁ, జింతామణిరూప సాధనప్రక్రియవలన విశదమగుచున్నది. కాఁగా "కొలిచితినిన్" అనునది చింతామణి సాధితమగు భూతకాలికోత్తమ పురుషైకవచన పూర్ణరూప మగుచున్నది. పిదప 'వాక్యాంతగతపదానాంచ' అనుచొప్పున ద్రుతలోపమును గవిభల్లటసూత్రముచే

నుత్వస్థానికేన్వలోపమును రాఁగా 'కొలిచితిన్' అనురూపాంతరమును సిద్ధించును. (విస్తర.) చింతామణిపక్షమున ద్రుతపరకస్వరసంధి విరుద్ధము కాదుగాన నట్టిసంధిపాక్షికముగా భట్టారకునిచేఁ బ్రయుక్తమైనది. సంధిపక్షమున "..చ.విపులమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశాస్త్రముల తెలింగెలింగితి నుదాత్తరసాన్విత..."

విస్తర ౭౧ విష:—"ఇన్నియనుపపత్తులతోఁ గూడిన ఈచుట్టు మార్గమును బట్టుటకంటె శాస్త్రులవా రహోబలాదులు త్రొక్కినమార్గము ననుసరించుటయె సమంజసము." (ఆం. భా. చ. ౧౬౦౨ - ౧౬౦౩ పు.) అని వ్రాసి భాషాచరిత్రకర్తగారు కొన్నివిమర్శసహములు కాని యనుపపత్తులనుజూపిరి. I. అహోబలపతి యంగీకరించి నట్లు 'కొలిచితిన్' అనురీతివె యుత్తమపురుషైకవచనపూర్ణరూపములుగఁ జింతామణిపక్షమునను నంగీకరింపు మందురుగదా యెట్లు పొసఁగును? చింతామణి "ఉత్వేయుతౌ నకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్ - భూతాదుతాం పరేషామిత్ - తిజ్మద్య......అన్యే ద్రుత ప్రకృతయః......" అని కంఠోక్తముగాఁ జెప్పుచు "కొలిచితిఁ క్" అనురీతిని సాధించుచున్నదే! II "కొలిచితిన్ అని వారి ప్రక్రియచొప్పున నేర్పడినరూపమందలి తుది నకారమునకు ద్రుతసంజ్ఞ చెల్లునా? ...కావున నది లోపించుటకుఁ బ్రసక్తిలేదు" (ఆం. భా. చ. ౧౬౦౩ పు.) "వినా ద్వితీయం స్యా ద స్మ।దాత్మనోః స్వ న్తయోరపి। నోః" అను నథర్వణవచనము చొప్పునఁ గళలగు 'ను - సి' అనువానిమీఁది స్వరము లోపించినను బరిశిష్టవ్యంజన నకారము ద్రుతమె యగునని సిద్ధాంతమగుటచే 'కొలిచితిని' అనుదానిలోనిస్వరము లోపింపఁగా మిగిలిన "కొలిచితిన్" అనునది ద్రుతాంతమగుటలో విప్రతిపత్తి యేమున్నది? (చూడు. ౨౧౦ II విష.) III. "కవిభల్లటైరిత్యాదిసూత్రము పదాంతమందలి వర్ణములకు వర్తించునా? ...పలుకు-పల్కు-అనుచు-అన్చు మొదలగువాని కింతవఱకును లాక్షణికు లీసూత్రమును వర్తింపఁజేయుచున్నారు." (ఆం. భా. చ. ౧౬౦౩ పు.) ఇది కేవలము నసత్యము. భాషాచరిత్రకర్తగారు లక్షణగ్రంథములను జదివి వ్రాసిన ట్లగపడదు. కవిభల్లటసూత్రము పదాంతమందలి స్వరలోపమునే చెప్పుచున్నది. "కవిభల్లటైః......చూడర్జనులు - వత్తుర్ఘనులు - ఇత్యాదికం క్రియోదాహరణమ్ - ......కన్దెఱచి - చన్గుడిచి - విల్వాని......ఉదాహరణమ్" (అహో. ౪౦౦ పుట). భాషాచరిత్రకర్తగారు దీనికి లక్ష్యము లనుకొన్నవి వేఱుసూత్రములకు లక్ష్యములు. "నలడాదే రన్తరుతశ్చ......చిలుక - చిల్క......పలుకులు - పల్కులు......" (అహో. ౨౩౬ పు) "శత్రర్థేతూతశ్చానోః......అనుచు - అన్చు" (అహో. ౧౯౬ పు.)

(ఆది. ౧ ఆ. ౧౦ ప.) (వింటివిన్+అనేకములు = వింటివనేకములు. ఎఱింగితిన్+ఉదాత్త = ఎఱింగితి నుదాత్త) అని యిట్టిసంధికిఁ బ్రాయికముగఁ బ్రయోగము లుండును. సంధ్యభావపక్షమునకు:—"అంటిని నిందలకు..." (ఆది. ౪ ఆ. ౧౦౮)' ఇట్టి సంధ్యభావపక్షప్రయోగము లరుదుగనుండును. ఇంక 'కొలిచితిన్+అబ్ధిజన్' అనుదానివంటి సంధిలో నేర్పడు, "కొలిచితబ్ధిజన్" అనుదానివంటి సంధిరూపములు సయితము ప్రాయికముగనే యుండవలసియున్నను నట్టిప్రయోగ మొక్కటిరైనను నన్నయభారతభాగమున లేమింజేసి 'తి' వర్ణస్థలమునందలి యుత్తమేకారమునకు సంధి నన్నయసమ్మతము కాదని నిశ్చయింపనగును గాన నట్టివానినిఁ గిమాదులలోఁ జేర్పరాదు. అట్లు సామ్యభ్రాంతిని గిమాదులలోఁ జేర్చి యాక్రిందిరీతిగ వైకల్పిక సంధి నహోబలపతి యుదాహరించుట సరి కాదు. "ప్రాయస్తుస్యాత్ కిమాదికస్యేతః—వ్యాఖ్యా......ప్రయోగ్రహణాత్ క్వచిత్ప్రవృత్తిః - క్వచిదప్రవృత్తిః - క్వచిద్విభాషా......కొలిచితి నబ్ధిజన్-కొలిచితబ్ధిజన్......ఇత్యాదౌ విభాషేతి" (అహో. ౧౯౪ పు.) గాణపతవివరణమునందును నీయహోబలపండితీయపద్ధతియే యనుసరింపఁబడెను (౧౧౨-౧౧౩ కారి. వివ. సంధి.)

ప్రథమే చేత్యాదిః—ప్రథమేచ=ప్రథమపురుషమందును, ఉత్తమేచ=ఉత్తమపురుషమందును, క్రియేతః=క్రియాపదముల 'ఇ' కారమునకు, చ్యుతిః=లోపము, వికృతౌ = తెలుంగున, వాభవేత్ = వికల్పముగ నగును. అన్యస్య = ప్రథమోత్తమభిన్నమగు మధ్యమపురుషక్రియేకారమునకు మాత్రము, నిత్యమ్=చింతామణ్యుక్తనిత్యసంధి యగును. నన్నయకాలమునఁ బ్రథమపురుషేకారసంధి నిత్యముగనె వెలయుచుండుటచేత నాతఁడు చింతామణిలో నట్లె చెప్పి తనభారతభాగమున నట్లె ప్రయోగించెను. అధర్వణునినాటికిఁ బ్రథమపురుషేకారమునకు నైత ముత్తమపురుషేకారముతోపాటుఁగఁ బాక్షికసంధి కవిప్రయుక్త మగుచుండుట చే నధర్వణుఁడిట్లు చింతామణిసూత్రమును సవరించుచు వివరించెను. మ......ము। పక్కరునై చేసిరి యంతచేసియును...... (ఉద్యో. 3 ఆ. 3౬ ప.) క......।ఒదవిననైరించి రిట్టి యునికియుఁగలదే (ఉద్యో. ౧ ఆ. ౯ ప.)

బాలవ్యాకరణ వివృతి. ౭౧ I పు.

క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు. ఉ. వచ్చిరి+అప్పుడు = వచ్చిరప్పుడు, వచ్చిరి యప్పుడు, వచ్చితిమి+ఇప్పుడు = వచ్చితి మిప్పుడు, వచ్చితిమి యిప్పుడు. మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును. ౭.

చితిని' అనిమాత్రమె. ఇట్టివానికి స్వరము పరమగునపు డిచటి 'ఇ' కారము ఉకార స్థానికముగాన నుకారమునకువలె నే నిత్యసంధియగును. ఉ. కొలిచితిని+అపుడు = కొలిచితి నపుడు. ఇట్టియెడల సిద్ధించు 'కొలిచితిన్' అనుచోటి 'ఇ' కారమునకనఁగా ద్రుతపరకస్వరమునకుఁ బ్రత్యేకసంధివిధానము లేమిం జేసి బాలవ్యాకరణపక్షమున సంధికిఁ బ్రసక్తియే లేదుగాన "కొలిచితిన్+అపుడు = కొలిచి తపుడు" అనురీతిగల యనిష్టరూపములు కలుగనేరవు. (విస్తర II) (చిం. పరి. ౧౦౧—౧౦౪ విష)

---

సంహితపై వత్తికమగుటం జేసి యిచట సంహితవివక్షు పంపుడు నిత్యసంధి సూత్రింప నేరదు. కాన నీప్రయోగములు ప్రథమపురుషేకారసంధ్యభావమును నిర్ణయింపఁ జాలవు. (చింతా. విష. పరి. ౧౦౩ విష.) పాదాంతమందలి వాక్యాంతమున నుకారసంధ్యభావము లేదా? (అనుబం.) ఇట్లు నన్నయయొక్కఁడే ప్రథమపురుషే కారసంధి నిత్యతను బ్రయోగించుటయుఁ జింతామణిమాత్రమే ప్రథమపురుషే కారసంధి నిత్యత నుపదేశించుటయు నా రెండుగ్రంథములకును నేకకర్తృకత్వమును నిరూపించుచున్నవనుటకు సందేహము లేదు.

విస్తర II. ౨౧ I విష:—కిమాదులలోఁ జేర్పకుండుటచేత నన్నయాథర్వణులపక్షమున "కొలిచి తబ్భిజన్" అనుదానివంటిసంధులు సాధువులు కానేరవు. (౨౧ విష. కల్పతరు.) బాలవ్యాకరణపక్షమున నిఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు. (బా. సంధి. ౯ సూ.) కావున నందును "కొలిచి తబ్భిజన్" మున్నగుసంధులు సాధువులు కావు. అట్లయినను "కొలిచితి నబ్భిజన్ - కొలిచి తబ్భిజన్......ఇత్యాదౌ విభాషా" (అహో. ౧౯౪ పు.) "వక్ష్యమాణ సూత్రేణ ప్రాయస్సన్ధిః. చేసితి నచ్యుతార్చనము, చేసితచ్యుతార్చనము" (అహో. ౧౯౦ పు.)

---

అనుబంధము—విస్త. I ౨౧ I విష:—"చింతామణియందు పాదాంతమునఁ గాని వాక్యాంతమునఁగాని సంధిలేమిదోషము కాదని సూత్రింపఁబడియుండ లేదు. ......తే. గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద। సమధిగమము సత్యంబుతో సరియుఁగావు। ఎఱుఁగు మెల్ల......(ఆది. IV ౯౬) అనుపద్యములో 'సరియుఁ గావు' అనుపాఠముతప్పు" (ఆం. భా. చ. ౧౬౦౪ పు) ఇది సరికాదు. చింతామణి దిక్ప్రదర్శనార్థకమగుటచేనందు సూత్రింపఁబడకుండుట లోపము కాదు. 'సరియుఁ గావు' అనుపాఠమె తప్పు. "సమానమైనవి సైతము కావు" అని యర్థమగుటచేత 'సరియుఁ గావు' అనుపాఠమె యొప్పు. అచట "ఏవార్థకశబ్దము" సుసంగతము కాదు. ఇది (చూడు. ౧౧౨ I విష) నన్నయప్రయుక్తము కాదు (౬౪ I విష.)

వెనుక నుదాహరించినరీతి నున్న మహాకవి ప్రయోగములను (౭౧ విష. కల్ప తరు) నధర్వణునిపదరత్నమును జూచికొనక యప్పకవి యీవిషయమున మిక్కిలి ప్రమాదపడి యీక్రిందిరీతిని వచించెను. క. విరచించెను శ్రీనాథుఁడు । ధరణిని శృంగారనైషధంబుఁ గూర్పుం । డిరి యొండొరు నని కానక । పరపురుషక్రియలఁ బ్రకృతభావముగలదే. (అప్పక. ౫ ఆ. ౬౮ ప.) శ్రీనాథుఁడు వెనుక నుదాహరించిన (ఉద్యో. ౧ ఆ. ౯ ప. ౩ ఆ. ౩౬ ౪) సోమయాజి ప్రయోగములను మూలముగాఁ గొని ప్రథమపురుషేకారసంధ్యభావమును "మ. బలభిద్వహ్ని పరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సం । ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి......(శృం. నైష.

---

అనునట్లు బలపండితీయ ప్రామాదిక వ్యాఖ్యను మూలముగాఁ జేసికొని కావలయును ముద్రణసంస్కర్త లిట్టిసంధులను మహాకావ్యములలో నిల్పుచున్నారు. ఉ. గాండివి నొవ్వఁబల్కితిటు కర్ణుని జంపక వచ్చితేని (శాంతి. ౧ ఆ. ౧౮ ప. వావిళ్ళ. ము). గాండివి నొవ్వం బల్కితిని గర్ణుని జంపక......(తాళపత్రమాతృక) తే. గీ. ఇంత వట్టును సైరించి తీవుగాన (విరా. ౫ ఆ. ౨౫౦ ప. వావిళ్ళ. ముద్ర.) గీ. ఇంత వట్టు సైరించితి నీవుగాన. (తాళపత్ర) - కం. కొందఱు రథికులు పఱవఁగ । నిందే టికి మున్నువచ్చి తన్నే యని (విరా. ౫ ఆ. ౭౯ వావిళ్ళ. ముద్ర.) క. కొందఱు రథికులు పఱవఁగ।నిందేటికి మున్నువచ్చి రిన్నే యని (తాళపత్ర.) (వావిళ్ళ. ముద్రణ పాఠాంతరమును) అందఱును బలాయితులగుట కిందేలవచ్చిరని సంగ్రామజిత్తు వారిని ధిక్కరించె నని భావము. క. మీతండ్రి కుఱికి నఱికిన । హేతియ నీకొఱకు నునిచి తెపుడ నలుకుదున్ । (కర్ణ. ౨. ఆ. ౩౨౯) (వావిళ్ళ. ముద్ర). క. మీతండ్రిఁ గోరి నఱికిన । హేతిన నీదైనకోర్కి నిపుడ నలుకుదున్, (తాళపత్ర.) (వావిళ్ళ. ముద్రణ పాఠాంతరమును). ధృష్టద్యుమ్ను నశ్వత్థామ నిలు నిలు మనఁగా నాతఁడు పల్కినవాక్య మిది.

రంగనాథరామాయణమునందు మాత్రము తాళపత్ర మాతృకలందు నయిత మిట్టిప్రయోగము కన్పట్టుచున్నది. అట్టివందలి లక్షణవిరుద్ధప్రయోగములలో నొకజాతి వని యీవఱకె చూపియున్నాను. (౬౩ III విష. విస్తర. III) కంపింపఁ జేసి తిక్ష్వాకువల్లభుల (రంగరా. యుద్ధ. ౨౮౬౦ ప.) (వావిళ్ళముద్ర. యూని. ముద్ర. ౮౦౭ పు.) కంప్పింపఁజేసి తక్ష్వాకువంశజుల (తాళపత్ర.) కామించి యిసు కచేఁ గావించితేను (యూ. ము. ౬౩౩) కావించి ళర్థి (వావిళ్ళ.) (విస్తర. I, ౭౩ IV విష).

3 ఆ.)" అని ప్రయోగించెను ఇచటి యప్పకవిప్రమాదము నహోబలపండితుఁడు "అప్పకవిస్తు ఏతద్గ్రంథసంపాదనవైధుర్యాత్ శ్రీనాథస్య భ్రాన్త్యనూనాత్" (అహో. ౧౯౦ పు.) అని నిరసించెను.

తే. గీ. ప్రథమసూత్రోక్తముత్తమపురుషమనుచుఁ । దత్పురుషమెల్లఁ గొనరాదు తద్బహూక్తి । మును కచ్ఛధ్యములతోడ నెన్నుకతన । నిత్యముగఁ బ్రాణసంధి దానికి ఘటిల్లు ॥ తే. గీ......వింటి మీవార్త మేమన వెలయు నిట్లు (అప్పక. ౫ ఆ. ౬౨. ౬౩ ప.) అని యిట్లుత్తమపురుషబహువచనముకళ గావున నిత్యమనుత్తమేత్యాదిచింతామణిసూత్రముచొప్పున నిత్యసంధి యద్దానికి సంభవించు ననుచు నప్పకవి యింకొక ప్రమాదమునకుఁ బాల్పడెను. ఇట్టి యీతనివ్రాఁత నన్నయాథర్వణసూత్రములకును, క......చూచితిమి యొకయులుకన్ (ఆది. ౫ ఆ. ౨౩౯ ప.) క......వచ్చితిమి యకుంఠిత......(విరా. ౪ ఆ. ౯౩ ప.) (సర్వల. ౧ ఆ ౨౦-౨౯ ప.) మున్నగు నన్నయతిక్కనలప్రయోగములకును గేవలము విరుద్ధమగుటచే నిర్మూల మనఁదగును. చింతామణిపద్ధతిలోఁ బరరూపసంధివిషయమునఁ బూర్వపదము ద్రుతప్రకృతిక మగుట సంధి ప్రతిబంధకముకాదుగదా. కళాత్వము సంధిఘటకమును గాదుగదా.

వెనుక నుదాహరించిన నన్నయాథర్వణసూత్రములకును, భారతాది మహాకావ్యప్రయోగములకును విలక్షణముగ మధ్యమపురుషబహువచనగతేకారమునకు సంధిపాక్షిక మనుచుఁ గూచిమంచి తిమ్మకవి యీక్రిందిరీతి వ్రాసియున్నాఁడు. "క. ధరఁ బ్రథమమధ్యమోత్తమ । పురుషల బహువచనములను బొందలేదు నచ్చుల్ । బెరయుచు నెడయుచు నుండున్ । గురుతరకరుణాంతరంగ కుక్కుటలింగా" (సర్వల. ౧ ఆ. ౧౯ ప.)......మధ్యమపురుషేకారమునకు వికల్పసంధి. చ. అదలిచి నిల్వ వారిఁ గని యంతకు కింకరు లెవ్వరయ్య మీ । రిదె యమునాజ్ఞఁ ద్రోచితిరి రొచ్చటి నుండిట (క్త్వార్థకసంధి) వచ్చినార । లెయ్యది......" (కవులషష్ఠము) (సర్వల ౧ ఆ ౨౦ ప.) ఈకవుల షష్ఠమన్న గ్రంథ మిపు డెచ్చటను లభింపలేదనియుఁ, దిమ్మకవ్యాదు లుదాహరించినపద్యములనుబట్టి యది భాగవతషష్ఠస్కంధమువంటి దనఁదగుననియు దీనిలోనిపద్యములు రాచమల్లువారి శృంగారషష్ఠములోని వనియు నుదహరింపఁబడియున్నవని యాంధ్రకవులచరిత్రమున వ్రాయఁబడెను. (ఆంధ్రక. ౧౮౪ పుట. ౧౮౯౫ సం. ముద్ర.) ప్రామాణికలాక్షణికు లెవ్వరును నంగీకరింపకట్టియుఁ బ్రామాణికకవు లెవ్వరును, బ్రయోగింపనట్టియు నీప్రయోగము నాగ్రంథకర్తయుఁ బ్రయోగించెననుట విశ్వసనీయమై యుండలేదు. "ఇదె యమునాజ్ఞఁ ద్రోచితి రదె

చ్చటనుండిటు...' అని కవిప్రయుక్తపాఠమై యుండునని విశ్వసింపనగును. లక్షణ విశేషప్రదర్శన కుతూహలియగు తిమ్మకవి యుదాహరించిన పెక్కు ప్రయోగములు తాళపత్త్రమాతృకలలోఁ గన్పట్టుచున్నవి. చ......గురుండుగాఁ। డె నరవరేణ్య ధర్మప్రకటీకృత......(ఉద్యో. ౨ ఆ. ౨౪ ప.) (సర్వల. ౫౫ పు. ౨ ఆ. ౨౬ ప). నాయొద్ద నున్న తాళపత్త్రమాతృకలు రెండిటిలోను "నరవరేణ్య నీకుఁ బ్రకటీకృత." అనియే యున్నది. వావిళ్ళవారిముద్రణమందును "నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృత......" అనియే యున్నది. లక్షణవిశేషప్రదర్శన కుతూహలమున నీతఁ డెట్టి కష్టములకు నోర్చునో యెరయుఁడు. "ఆదేశము (ద్రుతముమీఁద గ జ డ ద బా దేశము) రానందులకు:— క. నీచెప్పినపెద్దలు ద్రో। ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా। రై చన్న వారలం గొని। యే చక్కం బెట్టువాఁడనే పాండవులన్ (ఉద్యో ౨ ఆ. ౨౫౦ సర్వల. ౧ ఆ. ౧౨౦ ప.)" ఇందు "వారలంగొని। యే, చక్కం బెట్టువాఁడనేఁ బాండవులన్" అనుపాఠము నంగీకరించి "వారలం గొని యాయేనుబాండవులను జక్కఁ బెట్టు వాఁడను" అని సమన్వయించునపు డీపద్యము తిమ్మకవి కేమేనుపచరించునా ? (విస్తర)

---

విస్తర III. ౭౧ I. విష:—ఇట్టియవస్థలోనున్న తిమ్మకవ్యుదాహృతముగు, స్వార్థసాధిని ధారాళముగాఁ బ్రయోగించిన యీయుత్తరాంధ్రకవిప్రయోగము చూతగాఁగొని 'సాధిగ్రంథ' కర్త ప్రథమోత్తమపురుషక్రియల 'ఇ' కారముతోపాటు మధ్యమపురుషేకారమునకును సంధిపాక్షికతను స్థిరపఱిచికొని సమాపకక్రియా ప్రత్యయములు పురుషబోధకసర్వనామశబ్దము లతునివర్ణములె యనియు నట్టి సర్వనామములు ప్రాచీనతమకాలమున హలంతములును "కుత్రియలుకరము" అనఁగా 'ఉ' కారముతో (-ర్ధమాత్రికోకారముతోఁ) గూడినవనియు నట్టిచరిత్రము గలవానికిఁ బరరూపసంధి యేకరీతి నగుటయే యుక్తమనియు వానిలోఁ గొన్నిటికి నిత్యముఁ గొన్నిటికి వైకల్పికము నని యిట్లు భిన్నరీతిని జెప్పుట కవకాశములేద నియు నొకచర్చచేసెను. "త్రోచితిరి యెచ్చట అనుప్రయోగము నొకకవి ప్రయోగించియుండఁగా నొకలక్షణకర్త యుదాహరించియుండఁగా నట్టిరూపమును నిరాకరించుటకు మన కేమిహక్కుకలదో !" (సంధి. ౫౪ పుట.) "ఇట్టిరూపములన్నియు (ప్రథమమధ్యమోత్తమక్రియల ప్రత్యయములన్నియు) నొక్కరీతిగ నేర్పడినవే యగుటచే వానితుది యికారపుసంధివిషయమున మధ్యమపురుషక్రియలకును దక్కిన ప్రథమోత్తమపురుషక్రియలకును భేద మేర్పడుట కవకాశము కనఁబడదు" (సంధి. ౫౬ పుట.) అనియీరీతిగ సంధిగ్రంథకర్త వచించెను. పురుషబోధకప్రత్యయములకు

సంధివిషయమున భేదమీయనకుఁ గనఁబడకున్నను లాక్షణికాగ్రగణ్యులు మహా
కవులునగు నన్నయాథర్వణులకుఁ గనంబడినదయ్యెను. కవిబ్రహ్మయగు సోమయాజికిని
గనంబడెను. సంధిగ్రంథకర్త వచించిన పైవాక్యము లీక్రిందివాక్యములను స్మరింపఁ
జేయుచున్నవి. "శ్లో. కుమ్భకర్ణేభకారోస్తి। భకారోస్తి విభీషణే। రాక్షసానాం కుల
శ్రేష్ఠో। రాభణోనతురావణః". ఉ. "ఏముఱు పాండునందనులు నేకకులంబునఁ బుట్టి
యొక్కచో। నేమొకొఁ డైనఁ జేసి గడ నెక్కఁ జరించిన యట్టివార, ము। ద్దామబలంబు
శౌర్యమును దర్పము వారికకల్గి వారసం। గ్రామమునం జయింతు రనఁగా నొక
నిశ్చయ మెట్లుగల్గెడిన్" (ఉద్యో. ౨ ఆ. ౨౩౯) (దుర్యోధనునివాక్య మిది).

కవులపష్ఠములోనిదని తిమ్మకవి యుదాహరించిన ప్రయోగము కవిప్రయుక్త
మని విశ్వసింపఁదగనిదనియు "త్రోచితిరి యెచ్చటనుండి" అనుచో "త్రోచితి రదె
చ్చటనుండి" అని కవిప్రయోగించియుండుననియుఁ దిమ్మకవిప్రమాదప్రదర్శన
పూర్వకముగాఁ బైసంజీవనిలో వివరింపఁబడెను. వ్యవహారవశమున రూపనిష్పత్తి
ప్రాచీనశబ్దచరిత్రానుకూలముగఁ గల్గినచోఁ బ్రాచీనులకాలమునఁ గల్గవలసి
యుండును. కాని ప్రాచీనులగు నన్నయాదులకాలమునకె ప్రాచీనశబ్దచరిత్రవిలక్షణ
స్థితి యేర్పడినపిదప నైదాఱువందలసంవత్సరములనాఁడు చరిత్రశాస్త్రగంధమునేని
యాఘ్రాణింపని యొకసామాన్యకవినోట నట్టిచరిత్రశాస్త్రానుకూలప్రయోగ మవత
రించుటయు నటుపిమ్మట నైతము సకలమహాకవులును నట్టిస్థితి నుపేక్షించుటయుఁ
గేవలము నసంభవవిషయములు. లక్షణశాస్త్రసంప్రదాయవిదూరవిషయములు.
ఎంత తలక్రిందై పెనఁగి నలంగినను నన్నయభట్టారకుఁడు ప్రథమమధ్యమపురుష
క్రియేకారసంధిని నిత్యముగాఁ జేయుచు నుత్తమపురుషేకారసంధిని వికల్పించుట
కును, దిక్కయజ్వ మధ్యమపురుషేకారసంధిని నిత్యముగాఁ జేయుచుఁ దక్కినవాని
సంధిని వికల్పించుటకును, శబ్దచరిత్రశాస్త్రము నాధారముగఁ గొని యుక్తిని జెప్పు
టకు శక్యముకాదుగదా. శబ్దచరిత్రశాస్త్రమునకును వ్యాకరణశాస్త్రమునకును ముడి
పెట్టఁజూచుటయు, శబ్దచరిత్రోహాపోహములనుబట్టి వ్యాకరణశాస్త్రమును నిరసించు
టయుఁ గేవలము వెఱ్ఱితనము! శబ్దచరిత్రశాస్త్రము కేవలమువినోదైకఫలకమె కాని
యది శబ్దసాధుత్వజ్ఞానసాధకముకాదని తెలియకుండుట శోచనీయము. కేవలశబ్దచరిత్ర
జ్ఞత శబ్దసాధుతాజ్ఞాన భంజకమునుగాఁ గలదనుట కీక్రిందిరీతి సంధిగ్రంథప్రయోగ
ములె తార్కాణము. "పైనను. అక్కడకు. ఎచ్చటకు. వానితోకంటె. ఇకార
ముపైఁగంటె. తలఁచినవాఁడువలె. నన్నయతిక్కనలనువలెఁ దరువాతి వారెవ్వరును.
ప్రథమావిభక్త్యేకవచనము." మొ.

అథర్వణ ౭౭ క్త్వార్థేతో నభవేత్సదా. (వికృ. సంధి. ౬౭.) అహో.
[illegible] ౧౫౪ పు.)

కల్పతరు. ౭౨ వివ:—క్త్వార్థేతః = క్త్వాప్రత్యయార్థకమగు, ఇతః = హ్రస్వేకారమునకు, సదా = ఎల్లయెడలను, నభవేత్ = సంధిజరుగదు. ఉదా:—ఇచ్చి+అడిగెను = ఇచ్చి యడిగెను, చదివి+ఉండెను = చదివి యుండెను. మొ. "ఏడి - యిత్తే" మన్న సూత్రానితోపాటుగ నీక్త్వార్థకమగు 'ఇ' ప్రత్యయమునుసైతము కిమాదులలోఁ బఠింపనిచో నీసంధికిఁ బ్రాప్తియే లేదు. అట్లయినను స్వసమకాలికులు కొందఱు క్త్వార్థకేకారసంధిని బ్రయోగింప నారంభించుటచేఁ గావలయు నది మహాకవిప్రయుక్తము కామింజేసి కిమాదిగతముగా నెంచి ప్రయోగింపరాదని యథర్వణుండిట్లు నిషేధించెను.

బాలవ్యా. క్త్వార్థం బైనయిత్తునకు సంధిలేదు, ౮.
౭౭ I వివ వచ్చి+ఇచ్చెను = వచ్చి యిచ్చెను.

సంజీవని. ౭౨ I వివ:—భారతమునక్త్వార్థకేకారసంధి ప్రయుక్తము కాలేదు. తిక్కన తననిర్వచనోత్తరరామాయణమున నరుదుగఁ బ్రయోగించియు, నన్నయ భారతమున నొక్కటేని ప్రయోగములేమింజేసియు, నామ్రేడితస్థలములందును నన్నయక్త్వార్థకేకారసంధిని జేయమింజేసియుఁ (సంజీ. ౭౪ IV వివ.) గావలయు మనసుమార్చుకొని తనవిశాలభారతభాగమందెచ్చటను బ్రయోగింపఁడయ్యె. (విస్తర.) అట్లయినను నథర్వణతిక్కనలతర్వాతివారిక్త్వార్థకేకారసంధి నరుదుగఁ బ్రయోగించుచునే వచ్చిరి. భారతమునకును జింతామణి వికృతివివేకములకును సమ్మ

విస్తర. ౭౨ I వివ:—ఒకరెండుచోట్లుదు సోమయాజి తనభారతభాగమున క్త్వార్థకేకారసంధిని బ్రయోగించెనని యీక్రిందివాని నుదాహరించుచున్నారు. క. ఇతఁడు మదీయాగ్రపురోహితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించి పుదే। ధృతరాష్ట్రకడకుఁ బనుపుఁడు......(ఉద్యో. ౧ ఆ. ౩౮ ప.) ఇట నాయొద్దనున్న తాళపత్రమాతృకలు రెండిటను "ఎఱిఁగించితగన్" అను వావిళ్ళముద్రణపాఠమే వెలయుచున్నది. క. నమ్ముము నాకైదువు మోపగు। జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నాకం। దిమ్మనుడు......(విరా. ౪ ఆ. ౧౧౨ ప). (మోపు = కట్ట, విడిచి = విప్పి). ఇందు "అంది = అందుకొని, ఇమ్ము = నాచేతికిమ్ము" అని యర్థముచెప్పుచు క్త్వార్థకేకారసంధిగ దీని నుదాహరింతురు. కాని యిట "అందు+ఇచ్చు" అనుధాతువు లేకీభవించిన 'అందిచ్చు' అనుశబ్దపల్లవమును సోమయాజి ప్రయోగించె ననఁదగును. ఇట్టియభిప్రాయముతోనే "వానిం గాలుని కందిచ్చి"

తము కామింజేసి సూరియుఁ దనసూత్రాంధ్రవ్యాకరణమున నంగీకరించిన యీక్త్వార్థ కేకారసంధిని బాలవ్యాకరణమున నథర్వణసూత్రాంధ్రీకరణమె యనునట్లుగఁ బయికితె నిషేధమును సూత్రించినవాఁ డయ్యెను. "న క్త్వః" "క్త్వాపిసవర్ణేదృశ్యతే" (సూత్రాంధ్రవ్యా. సంధి. 3 పుట.) అని యిట్లు సూరి సూత్రించినట్లె యీక్త్వార్థ కేకారసంధి సవర్ణస్వరపరకత్వమందే మహాకవులగ్రంథములం దెన్నఁడుగను 'అ' కారాదిసవర్ణేతరస్వరపరకత్వమున నరుదుగను గన్పట్టుచున్నది. ప్రయోగములు:— మ. వెఱచిట్లంబుధినాథనందనులు......(నిర్వ. ౫ ఆ. ౧౧ ప.) ఆనందావారిముద్రణమున "వెఱనిట్లంబుధినాథనందనులు" అని యున్నది. నాయొద్దనున్న తాళపత్త్ర మాతృకలో 'వెఱచిట్లు' అనుక్త్వార్థకసంధిపాఠమే యున్నది. త్రిలిగలక్షణశేషకర్త "ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి" (ప్రౌఢ. సంధి. ౨ సూ.) అని సూత్రించి కొన్నికవిప్రయోగములను జూపెను. "శా.-నీచేతఁ జెప్పంపఁడే. (ప్రభా. ౪ ఆ. ప్రౌఢ. సంధి. ౨ సూ.) చ. ఏఱింగెఱింగి నా। వలు విడియేల కట్టుకొనివచ్చెను దానవి. (భాగ. ౯ స్కం. ప్రౌఢ. సంధి. ౨ సూ.) చ. అనవలసంటిగా కెఱుఁగవా యొకమాటనె మర్మకర్మముల్ (విజ. వి. ౧ ఆ.) క. అటుచూ పిటునిటుచూపటు (విజ. వి. ౨ ఆ.) సీ......చిరఁ జించిచ్చువారి (ఆము. ౬ ఆ.) కోరబెడంగనో. (అని+ఓ = అనో) (బసవ. 3 ఆ. ౪౨౦ ప.) దేవ యొక్కయ్యు యేతెం చాగించె (బసవ. ౫ ఆ. ౨౯3) పులిఁ గఱచుమియుచు. (బసవ. ౫ ఆ. ౪౭౯) కలఁడన్న వారికిఁ గలిగుండువాఁడు (బసవ. ౬ ఆ. ౧౨౬). మొ. ఆ. వె......పరమపతివ్రత। యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె (ఆని. ౬ ఆ. ౨౫౬) గీ. వాసుదేవునిచేనది వ్రయ్యలయ్యుఁ। దునియలయ్యును బొడియయ్యుఁ దొరఁగు ధరణి (ఉద్యో. ౨ ఆ. ౨౭౨) ఇట్టియెడల క్త్వార్థకేకారసంధి యని భ్రమింపరాదు. 'అయి+ఉను' అనుచో క్త్వార్థకేకారసంధియైనచో "అయును" అని కదా యేర్పడును. (౨౧౦ X విష.) "అయి+ఉను=అయియును" అని యేర్పడిన

(ఉ. హరి. ౧ ఆ. ౧౪౩ ప.) అని నాచనసోముఁడును బ్రయోగించెను. ఇట మురాంతకుఁడు నిశుంభుని లింగదేహము నందుకొని కాలుని కిచ్చెనని యర్థము చేయుట కెవ్వరును సాహసింపఁజాలరుగదా. ఇట్టి స్థితి నరయక పై తిక్కనప్రయోగమును బాలకవిశరణ్యకర్త క్త్వార్థేకార సంధిపట్టికలోఁ జేర్చుటయు ననుశాసనకర్త దాని నుద్ధరించుటయు, "తిక్కనవంటిమహాకవియే వాడినను......వానిని బండితులు దిద్దివేయుటయో......శబ్దపల్లవములని సమర్థించి......"అని సంధి గ్రంథకర్త వ్రాయుటయు సరికావు.

షిషప నికారమధ్యత్కాలవర్ణయకార ద్వయోచ్చారణమున సౌలభ్యాపేక్షచే "అయియున్" అను రూప మేర్పడెనని గ్రహింపవలెను. 'అయియును' అనుదాని రూపాంతరము 'ఐయును' అనియు నగును. "ఐయున్న ప్రమథగణానేకకోట్ల। నా యుంబగని" (బస. ౩ ఆ. ౩౨౧.)

నస్యాత్తద్ధర్మోతః (ఆం. చిం. సంధి. ౨ కా. అహో. ౧౯౨ పుట.)

నన్నయాథర్వణీయము ప్రథమ శ్చోత్తమశ్చైవ । తాసుతద్ధర్మ సంజ్ఞికౌ ।
౭౩ విషయము. భూతాద్య విషయాత్త్ర । చైకత్వార్థా భిధా యకౌ । ఉదన్తాచసదానాన్తౌ । నసంధి స్తత్రకల్ప్యతే.
(వికృ. సంధి. ౮ కారి. అహో. ౪౨౧ పుట.)

కల్పతరువు. ౭౩ విష:— తద్ధర్మోతః = తద్ధర్మార్థకమగు ధాతువు నుకారమునకు, నస్యాత్ =సంధి కాదు. చింతామణిమతమున 'ఉ' కారాదిసంధులు ద్రుత ప్రకృతికాద్రుత ప్రకృతికసాధారణములుగాన "వచ్చున్+ఇప్పుడు" మున్నగుచోటు లందు 'అనుతః' అనుచోట్పున నిత్యసంధి ప్రాప్తించుచుండఁగా "నస్యా" దిత్యాది ప్రకృతసూత్రముచే సంధి నిషేధింపఁబడుచున్నది. ఇట్లు నిషేధింపఁబడనిచో "అనుతః" అనుచోట్పున నిత్యసంధి ప్రాప్తింపఁగా "అచాంసంధౌద్రుతోఽదృశ్య ఇత్యాదిసూత్రముచే (౬౬ విష) ద్రుతము లోపించి "వచ్చున్+ఇపుడు = వచ్చిపుడు" అనురీతి ననిష్టసంధులు సంభవింపవలసివచ్చును. సంధి నిషేధింపఁబడుటచేత 'వచ్చున్+ఇపుడు = వచ్చునిపుడు, చేయున్+ఎపుడు = చేయునెపుడు' మున్నగు సంధ్యభావరూపములు సాధువులగుచున్నవి. సూత్రములోని "తద్ధర్మోతః" అనుచోటఁ దద్ధర్మార్థకధాతూకారమున కని వ్యాఖ్యచేసికొనవలయును. అట్లగుటచేఁ దద్ధర్మక్రియలందలి ప్రత్యయోకారములకు సంధి నిషేధము తగులదుగాన "చేయుదురు+అపుడు = చేయుదురపుడు, చేయుదువు+ఇపుడు = చేయుదువిపుడు, చేయుదువు=చేయుదు+ఉ=చేయుదు+ఇపుడు=చేయుదిపుడు, చేసెదు+అపుడు=చేసెదపుడు" మున్నగుచోటులయందలి నిత్యసంధులు సాధువు లగుచున్నవి. ఇంక "చేయుదున్." మున్నగుచోటులందలి దుతివర్ణకౌక్రమాత్ స్తో । నాద్యస్యాదేరిత్యాది చింతామణి కారికచోట్పున విధింపఁబడిన 'దు' ప్రభృతులు ప్రత్యయపరకత్వమున ధాతువునకు విధింపఁబడిన యాగమములగుటంజేసి యచటి 'ఉ' కారము ధాతూకారమె యనఁదగునుగాన నట్టి యుత్వమునకు సంధికాదు. ఉదా:—చేయుదున్ + అపుడు = చేయుదు నపుడు, మొ. 'చేయుదున్' అనుదానికి మొదటిరూపమగు "చేయుదు.

నున్" అనువానిలోని 'నున్' అనువానితుది 'ఉ' కారము ధాతుసంబంధి కాక ప్రత్యయసంబంధి యగుటచే "చేయుదునున్+ఇపుడు=చేయుదునపుడు" అనురూప మేర్పడును. తెఙ్మధ్యేత్యాదికారికలోని "అన్యే ద్రుతప్రకృతయః" అనుచోఁ జెప్పిన ధాతుజ విశేషణములు ద్రుతప్రకృతికములు. కాన "చేయున్+అట్టి" మున్నగు నుకారాంత తద్ధర్మార్థకవిశేషణములచోటులందు ధాతూకారమగుటంజేసి సంధికలుగక "చేయునట్టి" అనురూప మేర్పడును. ఇట ధాతూకారసంధి నిషేధస్వారస్యముచే "ద్రుతస్యసర్వత్ర లుక్సమాసేషు" అనుచోఁ జెప్పిన ద్రుతలోపము కలుగనేరదని వ్యాఖ్యానము చేసికొనవలెను. తక్కినధాతుజవిశేషణములచోటులందుఁ బయి సూత్రముచే సామాసిక ద్రుతలోపముకల్గి "చేసినయట్టి, చేసెడియట్టి మున్నగు రూపములె యేర్పడును. 'చేసెడున్' అను తద్ధర్మప్రథమపురుషైకవచనరూపమందలి 'డు' అనునది ధాతువునకు విధింపఁబడినదే కాన (తద్ధర్మప్రథమేస్యాత్తాం । డుడి వర్ణౌచనాన్తకౌ) నచట ధాతూకారసంధి నిషేధము తగులును. ఉదా:—చేసెడున్+ఎపుడు=చేసెడు నెపుడు. మొ.

అధర్వణాచార్యుఁడు పయిరీతిని 'తద్ధర్మోతః' అనుదానికి ధాతూకారమున కని యర్థము చేయనివారిపక్షమం దిచటితద్ధర్మశబ్దము తద్ధర్మప్రథమోత్తమపురుషైకవచనమాత్రపరమని యీ క్రిందిరీతిని వివరించెను. రెండుమార్గములందును ఫలభేదమంతగా లేదు. ప్రథమశ్చేత్యాది:—తాసు=ఆతద్ధర్మక్రియలయందు, ప్రథమశ్చ—ఉత్తమశ్చ=ప్రథమోత్తమపురుషము లగునట్టియు, భూతాద్యవిషయా=భూతాది కాలములకు గోచరము కానట్టియు, ఉదన్తా=హ్రస్వోకారాంతము లగునట్టియు, సదానాన్తా=ద్రుతప్రకృతికము లగునట్టియు, ఏకత్వార్థాభిధాయకా = 'చేయున్ - చేయుదున్' మున్నగురీతిగల యేకవచనరూపములు రెండుమాత్రమె, తద్ధర్మసంజ్ఞికా = నస్యాత్తద్ధర్మోత ఇత్యేతత్సూత్రోక్తతద్ధర్మశబ్దవాచ్యము లగుచున్నవి. తత్ర=వానియందలి, 'ఉ' కారమునకు, సంధి=సంధి, నకల్ప్యతే=కల్పింపఁబడదు. ఈ పక్షమునందును దద్ధర్మప్రథమోత్తమపురుషైకవచనములు మాత్రమె "నస్యాత్తద్ధర్మోతః" అనుసూత్రములోని తద్ధర్మశబ్దముచే వాచ్యములనియు వానికిమాత్రమె సంధినిషేధమనియు వివరింపఁబడుటచేత "చేయుదురు+ఇపుడు = చేయుదు రిపుడు - చలుపుదము+ఈనిదాఘదివసంబులు = చలుపుద మీనిదాఘదివసంబులు" మున్నగు చోటులందలి సంధులు నిర్బాధములగుచున్నవి. కాని తద్ధర్మార్థకవిశేషణోకారసంధి నిషేధింపఁబడమింజేసి యట్టియెడల సామాసిక ద్రుతలోపముకల్గి "వచ్చున్+అతఁడు=వచ్చుతఁడు" మున్నగు ననిష్టరూపములు దుర్వారము లగును. కాన నీపక్షమున

"ధాతుపదసంభవానాం విశేషణానాముత స్తథానుమచి" అనునప్పకవీయ చింతామణి పాఠము ప్రక్షిప్తము కావని యంగీకరింపవలసియుండును. "నః స్యాత్తద్ధర్మోతః" అనుపాఠము ప్రామాదికమని ౯౫ I విషయమున వివరింపఁబడును. (విస్తర. ౯౫ I విష. చూ.) అహోబలపండితుఁడు ప్రథమశ్చోత్తమశ్చైవేత్యాద్యథర్వణకారిక "నస్యాత్తద్ధర్మోతః" అనెడి చింతామణిసూత్రములోని తద్ధర్మశబ్దమును మాత్రమె వివరించుచున్నదని యర్థముచేయక యథర్వణమతమున నెల్లెడలను బ్రథమోత్తమ పురుషైకవచనములకు మాత్రమె తద్ధర్మసంజ్ఞ చెల్లునని ప్రామాదికముగ వ్యాఖ్య చేసెను ఈపక్షమునఁ బ్రథమోత్తమైకవచనేతరస్థలములందుఁ దద్ధర్మక్రియలరూప సాధన మెట్లో, ధర్మోత్తమమధ్యమపదిత్యాదు లథర్వణమతమున నెట్లు లభించునో, తెలియకున్నది. "ప్రథమోత్తమైకవచనాన్త యోర్న్యాన్తయోరేవపదయోః తద్ధర్మసంజ్ఞకత్వముక్తమ్ తేన తత్రోపచారార్థగతాసంజ్ఞా శబ్దగతత్వేన కృతేత్యవగన్తవ్యమ్. చేసెదన్-ఘటించెదన్ ఇత్యాదౌతన్మతే, నతద్ధర్మసంజ్ఞా. కింతు భావిక్రియా వ్యవహారఏవ ఘటింతు రిత్యాదావపి నాన్తత్వాభావాన్నతద్ధర్మసంజ్ఞా. వాగను శాసనమతే తేషాం తద్ధర్మార్థకత్వ మేవేత". (౧౫౯ పుట. అహో.) (౧౨౧ అహో.)

ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు. ౯.

బాలవ్యాకరణ వివరణము ౭౩ I విషయము.

ప్రథమేతరవిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని. వచ్చున్ + ఇపుడు=వచ్చు నిపుడు, చూడన్+ అయితిని = చూడ నయితిని, ఉండెడిన్ + అతఁడు = ఉండెడి నతఁడు. ఇఁక-ఇఁగ-ఎట్టకేలకు - ఈయవి యిఁకాదులని యెఱుంగునది. వీనికి సంధివైకల్పికము.

సంజీవని ౭౩ I విష:—ద్రుతపరకస్వరసంధి విధానవిషయమున నన్నయాథర్వణపద్ధతికిని బాలవ్యాకరణపద్ధతికిని గొంతభేదము గలదు. సంధిస్థలములందెల్ల ద్రుతము లోపించునని యథర్వణుఁడు కంఠోక్తముగ వచించెను. (౭౭ విష.) కాన నన్నయాథర్వణీయములోని స్వరసంధివిధులెల్ల ద్రుతప్రకృతికాద్రుతప్రకృతిక సాధారణము లనఁదగియున్నవి. బాలవ్యాకరణపద్ధతిలోఁ బ్రకృతసూత్రము ద్రుతప్రకృతికముల సంధిని నిషేధించుచున్నది. కానఁ బ్రథమేతరసంధివిధి మున్నగుచోట్ల సంధివిధానవైయర్థ్యాన్యథానుపపత్తిచే నచటమాత్రము ద్రుతము లోపించి సంధిజరుగునని వ్యాఖ్యచేసికొనవలసెను. (౭౭ II విష.) ఈరీతిగ సూరిమార్గమునకును నన్నయాథర్వణీయపద్ధతికిని భేదమున్నను ఫలభేదము లేదయ్యెను. నన్నయా

థర్వణీయపద్ధతిలో నైతము, ద్రుతప్రకృతికమగు 'అ' కారమునకు సంధ్యభావమె ప్రాయికమని యాథర్వణుఁడు వచించెను (౭౫ విష.) ద్రుతము పరమందుఁగల 'ఇ' కారాంతములకు కిమ్షష్ఠి భిన్నములకు 'కిమాదులలో' పాఠము నుజ్జగించుటచే నచటను భేదములేదు. ఇంక ద్రుతపరకములగు 'ఉ' కారాంతములలోఁ దద్ధర్మార్థక ధాతూకారములకు మాత్రము నన్నయాథర్వణీయపద్ధతిలో సంధి ప్రాప్తించుచుండఁగా నది నస్యాఃకత్వాదిసూత్రముచే నిషేధింపఁబడెను. (౭౩ విష). ఈరీతిగా రెండుమార్గములకును ఫలభేదము లేదు.

ద్రుతపరకస్వరములకు ద్రుతవ్యవధానముచేత స్వరపరకత్వము సంభవింపమిం జేసి బాలవ్యాకరణపక్షమునఁ బరరూపసంధికిఁ బ్రాప్తియే లేదు. కానఁ బ్రకృతసూత్రమున స్వరసంధి నిషేధము సిద్ధాన్తానువాదమే కాని ప్రత్యేకవిధికాదు. ద్రుతపరకస్వరములలో "ఇఁకా" దుల తుదిస్వరములకుమాత్రమె పరరూపసంధి యగునని ప్రకృతసూత్రమున కర్థమగుటంజేసి యిఁకాదుల పరరూపసంధి విధానమె యిందు విధేయమనియెఱుంగునది. (విస్తర I). ఇట్లు ద్రుతప్రకృతికములలో "ఇ" కాదులకుమాత్రమె

---

విస్తర I ౭౩ I విష:—పయిసంజీవనీసందర్భమునుబట్టి యీక్రింది వేటికాకల్పనము పరాస్తమగుచున్నది. "ఉత్వాత్వేత్వసంధి విధులందు ద్రుతప్రకృతికములకుఁ బ్రవేశమేలేదన్నచో వీనికి (వచ్చున్+ఇపుడు మున్నగువానికి) సంధిప్రాప్తియే లేదు. కాన నాయాసూత్రములసంధుల కివి గుఱియై యేతత్సూత్రనిషేధమునందునని గ్రహింపకున్న నివ్విధికి సార్థక్యముసంభవింపదు." (బా. సా. వే. ౫౭ పుట.) (సంధి. ౯ సూ. వ్యా.) "ద్రుతప్రకృతికో కారేకారాములకు సంధి ప్రాప్తియే లేమి...ఇఁకాదిసంధినిషేధము...మున్నగునవి శాస్త్రసంప్రదాయ విరుద్ధములనవలసి వచ్చును." "ఉత్వేత్వాత్వసంధి సామాన్యసూత్రములు ద్రుతప్రకృతికా ద్రుతప్రకృతిక సామాన్యములని యెన్ని ద్రుతప్రకృతికాచ్చులనుగూడ వానికి విషయములం జేసి యిఁకాదిసూత్ర నిషేధమునకు సార్థక్యమును గల్పించుటయు నావశ్యకమె" (బా. సా. వే. ౭౬ పుట. సంధి. ౨ సూ. వ్యా.) ఇట్టి కల్పన మనావశ్యకమని గ్రహింపవలయును. "సంధిర్నాచోఽచ్యనుతః" అను చింతామణిసూత్రములో నచ్చున కచ్చుపరమగుచుండఁగా సంధిలేదను నిషేధ మెట్లు సిద్ధాన్తానువాదకమో యట్లె సూరిగారి ప్రకృతిసూత్రమునందును ద్రుతపరకస్వరసంధినిషేధము సిద్ధాన్తానువాదకమె యనియు నచ్చట "ఉ" కారసంధికలెనే యిచ్చటనైత మిఁకాదిసంధి విధేయమనియుఁ బయిసంజీవనిలో వ్రాయఁబడినరీతిని సమన్వయించికొనుట యుక్తము. సూరికి ద్రుతపరకస్వరసంధి సమ్మతమె యైనచో నట్లు స్పష్టముగా వచిం

పరరూపసంధియగునని వచించుటంజేసి యిఁకారాదిభిన్నములగుటచేఁ బ్రథమేతర విభక్త్యుకారసంధియు (నాకొఱకున్+ఇచ్చె = నాకొఱకిచ్చె) శత్రర్థక చువర్ణకోకార సంధియు (వచ్చుచున్+ఏఁగెను = వచ్చుచేఁగెను) నేటూర్యాదికిషష్ఠిసంధియు (హరికిన్+ఇచ్చె = హరికిచ్చె) బాధితములు కాఁగా "ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనినిబాధించెడిని" అనిసూరి యట్టిబాధను వారించుచున్నాఁడు. ప్రథమేతరవిభక్త్యుకారసంధివిధి మున్నగునవి నిరవకాశము లనఁగా ద్రుతప్రకృతికముల తుది స్వరములకు సంధి లేదన్నచో నీప్రథమేతరవిభక్త్యాదులసంధివిధు లుదాహరణశూన్యములై వ్యర్థములు కావలసివచ్చును. ఇంక ప్రథమేతరవిభక్త్యుకారాదులసంధివిధులకే ప్రాబల్య మంగీకరించినచు దద్భిన్నములగు ననేకస్థలములు 'వచ్చున్+ఇపుడు= వచ్చునిపుడు' మున్నగునవి ద్రుతపరకస్వరసంధినిషేధమునకు లక్ష్యములు లభించును. కాన ద్రుతపరకస్వరసంధినిషేధము సావకాశము. ప్రథమేతరవిభక్త్యుకారాదులసంధి నిరవకాశము. కాఁబట్టి "నిరవకాశాహివిధయస్సావకాశాన్, విధీన్ బాధన్తే" అను న్యాయముచొప్పున నిరవకాశములగు ప్రథమేతరవిభక్త్యుకారసంధి ప్రభృతివిధులు ప్రకృతసూత్రనిషేధమును బాధించి వర్తిల్లునని తాత్పర్యము. "ప్రథమేతరవిధి" అనుదానిచేతనే కిషష్ఠియు గ్రహింపఁబడుచున్నది (విస్తర II).

---

చియె యుండును. నన్నయాథర్వణీయమున నట్లు "అచాంసంధౌ ద్రుతోఽదృశ్యః స్థితోఽపిచసదాభవేత్ర"ని స్పష్టముగా వివరింపఁబడియుండలేదా? ద్రుతవ్యవధానమున సంధికిఁ బ్రాప్తియే లేకుండఁగా నది సమ్మతమైనచో శోధింపఁబడనక్కఱ లేదా?

విస్తర II. ౨౩ I విష:—ఇఁకాదులకు భిన్నములగు ద్రుతప్రకృతికముల స్వరములకును సంధి యర్వాచీనకవుల ప్రయోగములలోఁ గన్పట్టుచున్నది. "వేంకటనాథకవి రచించినపంచతంత్రములో మాత్రము "ఘనతఃఘూర్జరీ......" అనేపద్యములో 'నగించటుగాక యుండినస్' అనే ప్రయోగ మున్నది. ఇటువంటిదే బహుళాశ్వచరిత్రములో (౨౬ పు.) (నేను) 'ఇడెదన్న' = (ఇడెదన్+అన్న) అనేప్రయోగము కనఁబడినది.......భారతం కర్ణపర్వము (II ఆ. ౩౨౯) లో ఉన్న - 'ఉనిచితిపుడు' శాంతిపర్వములో ఉన్న (I ఆ. ౧౪) 'పల్కితిటు' (అనునవి) సరియైనపాఠములుగా అంగీకరించలేము. ప్రాచీనకవులు ఇట్టిసంధి చేయకపోయినా ఉత్తరాంధ్ర కవులు కొందరు రచించినగ్రంథాలలో దీనికి (ద్రుతపరకోకారసంధికి) ప్రయోగములు కనబడుతున్నవి. (చూ. పట్టిక)" (బాలకవిశరణ్యము ౨౯౩ పుట.) అని శరణ్యమున వ్రాయఁబడెను. చ......చెడఁగొఱు కింతెకాక (భాస్కరశతక ౧౨ ప.)

సంజీవని. ౭౩ II విష:—ఇఁగశబ్ద మిఁక శబ్దపర్యాయము. ద్విపద. “ఇఁగ మెడఁ దునిమెన విధియేమిపుట్టె। జగములలో రిత్తసడి వచ్చె నీకు” (బసవ. ౫ ఆ. ౯౦. ప) కం. “వనటయుడుగు మిఁక దుర్మతి। యను బోలెను......” అని యిట్లు ప్రాజ్ఞము తెలిపిన ‘ఇఁక’ అనెడిరూపమును సోమయాజి ప్రయోగించియున్నాఁడు. పయి బసవపురాణద్విపద సఖండాఖండప్రాసముతో నున్నదని యంగీకరింపక బసవపురాణపీఠికాకర్త “ఇఁగ అరసున్న లేనిది. చిన్నయసూరిప్రభృతు లిది సానుస్వార మనిరి” అని వ్రాయుట సరికాదు. సోమనారాధ్యుఁడు స్థలాంతరములందును సఖండా

---

చిక్కితని (జైమిని ౮ ఆ. ౧౩౧) పొంది తనేక (కుచేలో. ౧ ఆ. ౭౦) వెడలగ్ని దీప్తులు (హంస. ౫ ఆ). ఇట్టివి శరణ్యపట్టికలోఁ జూపఁబడెను.

పై వానిలోని భారతప్రయోగములు శరణ్యకర్త తలంచినట్లె కవి ప్రయుక్తములు కావని (ప్రక్షిప్తములు) యీావలకు (విస్త. II ౭౧ I విష.) విశదపఱిచియున్నాను. తక్కినయుత్తరాంధ్రకవుల ప్రయోగములవంటి వింకను గలవు. అట్టివి నారచించినహరిశ్చంద్రనలోపాఖ్యాన పీఠికలో నుదాహరించియున్నాను. (హరిశ్చ. ౯౭ మొ. ౧౦౧ వ. పీఠిక). అవియెల్ల గాణపతవివరణమున స్వీకరింపఁబడెను. (గాణ. సంధి. ౩౫ సూ. వివ.) వాని నిటఁ జూపెద. సీ...గీ...దొరయఁజేయు దేవరరాజ్యంబు సిరి ఫలింప (హ. న. ౨ ఆ. ౩౮ ప.) ఇందునలపరార్థమున “దొరయఁజేయుదున్+ఏను” అనుచోఁ దద్ధర్మోకారసంధి యగపడుచున్నది. సీ...గీ....నేమించి నెయ్యంబుఁబ్రభులయెడ నో। నర్పుదురు మహిమ...” (హ. న. ౨ ఆ. ౫౧) ఇందును నలపరార్థమున ‘ఏను+ఒనర్పుదును+ఉరుమహిమ’ అనుచోఁ దద్ధర్మోకారసంధి కన్పట్టుచున్నది. “కననయ్యెడనఘ” (హ. న. ౮ ఆ ౫౮ ప.) అనుపద్యమునందును ‘కననయ్యెడున్+అనఘ’ అనుచోటసయితము తద్ధర్మోకారసంధి చూపట్టుచున్నది.

పయిరీతి నర్వాచీనకవులగ్రంథములలో ద్రుతపరకోకారసంధి పాక్షికత యరుదుగ నగపడుచున్నది. కాని యిట్టిసంధులు నన్నయాథర్వణసమ్మతములు కామిం జేసియుఁ బ్రచురప్రయోగప్రసిద్ధములు కామింజేసియుఁ గావలయు బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడలేదు. ప్రౌఢవ్యాకరణమునం దేని పూరింపఁబడలేదు. పై భారత ప్రయోగములకువలెనే వీనికిని పాఠాంతరములు వీరికిఁ జూపట్టెనేమో? గాణపతవివరణమున “పల్కితిటు” అనునది తిక్కన ప్రయుక్తముగాను నన్నయకారిక కుదాహృతిగాను వివరించుట సరికాదు. (నారా. సంధి. ౧౧౨ కారి. ౧౧౩ కారి. ౮—౯ పద్య. విప.)

ఖండప్రాసమును బ్రయోగించి యున్నాఁడు. ద్విపద. మ్రాఁకుగట్టిన యట్టిమానంపు గుడియు । ప్రాకటపుష్ప (బసవ. ౪ ఆ. ౭౯౨) బూదిదారాఁజదుపాగయదు తాను । షూఁదండు ముట్టించె నొక్క దీపంబు (బసవ. ౧ ఆ. ౩౩౭) బ్రాఁతిగా నాదివరాహ దంష్ట్రంబు । ఖ్యాతమిూశ్వరుచేతఁ గాదె యున్నదియు (బసవ. ౬ ఆ. ౮౩౩)

'ఎట్టకేలకున్-ఎట్టకేని' అనువానిలోని 'ఎట్టకున్' అనునది యిఁకాదులలోని దని చెప్పఁదగియున్నను 'ఎట్టకున్' అనునది పృథక్ప్రయోగయోగ్యము కామిం జేసియు నద్దానికి 'ఏలకున్ - ఏని' అనునవి పరముగునపుడుమాత్రమె పాక్షికసంధిప్రయోగములు లభించుచుండుటం జేసియుఁ గృతసంధికములగు నా రెండుస్థలములుమాత్రమె యిఁకారాదిగణమునఁ జేర్పఁబడెను. మఱియు 'ఏని' శబ్దము కళయగుటచే 'ఎట్టకేని' అనునది ద్రుతప్రకృతికములగు నిఁకాదులలోని దనుట పొసఁగనేరదు. కాన 'ఎట్టకేలకున్ - ఎట్టకు నేలకున్ - ఎట్టకేని - ఎట్టకునేని' అనునవి ప్రకృతలక్ష్యములని యెన్న నగును. తే. గీ. ఎట్టకేలకు నూల్కొల్పి యిట్టు లనియె (శల్య. ౨ ఆ. ౪౦౫) ఆ. వె. ఇయ్యకొనకయున్న నెట్టకేని (శాంతి. ౧ ఆ. ౧౬౪). ఉ. అల్లనమార్దవం బొనరు నట్టుగ నెట్టకునేని రాచి (విరా. ౨ ఆ. ౨౨౦ ప.) చ......అ । చ్చలమె ఫలంబొ యింకయినసంధి యొనర్చుట మేలు వారితోన్ (కర్ణ. ౩ ఆ. ౨౭౦). ఇంకేల (ఆది. ౨ ఆ. ౨౧ ప.)

నన్నయాథర్వణీయము. ౨౮ విషయము.

ఆద్యస్యామ్రేడితేఽన్త్యలోపశ్చ (ఆం. చిం. సంధి. ౫ కారి. అహో. ౨౦౧ పు.)

అద్రుతానామజాదీనాం । ద్విరుక్తావన్త్యలోపితా । అన్యే
షాంచ ద్విరుక్తాస్యు । ర్బహులోపాగమామతాః
(వికృ. అజం. ౮౧ కారి. అహో ౩౬౧ పు).

కల్పతరు. ౨౮ విష:—భృశాద్యర్థములందు రెండుమాఱులు పల్కఁబడిన వానిలో రెండవశబ్దమామ్రేడితసంజ్ఞగలది. ఆమ్రేడితే = ఆమ్రేడితశబ్దము పరమగుచుండఁగా ఆద్యస్య అన్త్యలోపశ్చ = మొదటిశబ్దముయొక్క యంత్యవర్ణమునకు లోపమును సంభవించును. చకారమువలనఁ గొన్నియెడల ననఁగా క్త్వార్థకారాదులకు లోపాభావము గలదని యర్థము. కాన నహోబలపతి "ఏవంచ ఆసియాని-ఆలసి యలసి-ఆడియాడి-ఇత్యాదిరూపాణామసాధుత్వమేవ" (అహో. ౩౬౧ పు.) అని వ్రాసినవ్రాఁత సరికాదు. ఆ. వె....అనుభవింత్రు । గాక యెఱఁగియెఱఁగి కడఁగి యారెంటిఁజే । కొందరయ్య యెట్టి కుమతులైన (౨౮ III విష.) (ఆది. ౩ ఆ. ౧౯౩ ప.) షష్ఠ్యాశ్చ ఉతోఽచీతిసూత్రమునుండి యింఁదచి యనునది యనువర్తించు

వనియు నక్కారణమున స్వరపరకత్వమందె యీసూత్రము వర్తిల్లునవియు నహో బలపతిప్రాసెను. "ద్విరుక్తస్యాత్రప్రయోగేఽజాదిత్వమేవ. అచీతిపదానువృత్తి రత్ర మానమ్.(అహో.౨౦౨పు.)ఉదా:—ఓహో=ఓహోహో. ఔరా+ఔరా=ఔరౌరా. మొ. హ్రస్వాచ్చులకుమాత్రమె సంధి విధింపఁబడుటంజేసి యామ్రేడితపరకపరరూప సంధి దీర్ఘాచ్చులకుసయితము సంభవించుననుట కీసూత్ర ముపదేశింపఁబడెనని యహో బలపండితుఁడు తలంచియుండును. కాని 'ఇంచుక+ఇంచుక = ఇంచించుక, నాఁడు+ నాఁడు = నానాఁడు, ఊరన్+ఊరన్ = ఉరూరన్' మొదలగురీతినిసయిత మిట నంత్య వర్ణలోపములు గ్రహింపవలెను. ఈవిషయమునె యథర్వణుఁడు విస్తరించి వివరించు చున్నాఁడు:—అద్రుతానామజాదీనామ్ = ద్రుతప్రకృతికములుకాని యజంతముల, ద్విరుక్తౌ = ద్విరుక్తియందు, అన్త్యలోపితా = పూర్వపదాంత్యవర్ణలోపము సంభ వించును. అన్యేషాంచ = హలాదులగునట్టియు ద్రుతప్రకృతికములగునట్టియు, శబ్ద ముల ద్విరుక్తియందును, బహులోపాగమాః = వివిధములైన లోపాగమాదులును, మతాః = సమ్మతములు, స్యుః = అగుచున్నవి. చకారమువలన సజాదికశబ్దము లకును వివిధలోపాగమాదులు సంభవింపవచ్చును. ఉదా:—మాటికిన్+మాటికిన్= మాటిమాటికిన్, మాటికి మాటికిన్, ఇంటింటికిన్ - ఇంటికి నింటికిన్, అప్పటప్పటికిన్- అప్పటి కప్పటికిన్, వెన్వెంటన్, తోడ్తోడన్, హరీహరి, హరిహరీ, భళీభళి, అదు కులు+అదుకులు = అందదుకులు, ఇంకులు+ఇంకులు = ఇట్టింకులు, మిట్లు+మిట్లు = మిఱుమిట్లు - మొ.

బాలవ్యా. ౭౪ I విష యము.

అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు. ౧౦. ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడిత మనంబడు. తఱుచుగ ననుటచేత నొకానొకచో వైకల్పికసంధియుఁ గలదని తాత్పర్యము:—ఔర+ ఔర = ఔరౌర, ఆహా+ఆహా = ఆహాహా, ఎట్టూ+ ఎట్టూ = ఎట్టెట్టూ, ఓహో+ఓహో = ఒహోహో, ఏమి+ఏమి = ఏమేమి, ఏమి యేమి. ఏగి యేగి యనుచో క్త్వార్థంబగుట సంధి లేదు.

సంజీవని. ౭౪ I విష:—అర్వాచీనముద్రణములలో బాలవ్యాకరణ సూత్ర మున 'తఱచుగ' అనియు 'ఏగి యేగి యనుచో క్త్వార్థంబగుట' అనియుఁ బాఠములు ప్రమాదవశమునఁబడినవి. బాలవ్యాకరణప్రథమద్వితీయముద్రణములచొప్పున నట్టి యపపాఠము లింతుం [illegible] ద్రుతమునకు [illegible]

మగునప్పుడు పరరూపాదేశాదిసంధికార్యములు వచ్చుట శాస్త్రవిరుద్ధము. అట్లువచ్చిన ప్రయోగములును లేవు. ఏగుధాతువు నిర్బిందుకమని సూరియాశయము. శబ్దరత్నాకరమునను నిది నిర్బిందువుగనె చూపఁబడెను. 'ఎగురు - ఎగయు' మున్నగువానినిబట్టి పరిశీలించినను నిది నిర్బిందుకమె యని తోఁచును. శ్లేషమున సఖండాఖండశబ్దమేళనమును సఖండాఖండప్రాసమును ధారాళముగ నంగీకరించి ప్రయోగించిన రాఘవపాండవీయకళాపూర్ణోదయాదులలోని యట్టిప్రమాణములను జూపి సూ. రా. నిఘంటుకర్తలు దీనిని సఖండముగ నిర్ణయించుట ప్రబలప్రమాణమూలకమని తోఁచదు.

సూరిగారును నహోబలపతివలెనె యజాదికళాశబ్దమునకె యంత్యవర్ణలోపరూపపరరూపసంధిని సూత్రించిరి. హలాదిద్రుతప్రకృతికముల యంత్యవర్ణలోపవిషయము కొంతవఱకు బాల. సంధి. ౪౦ - ౪౧ - ౪౨ - సూత్రములలో వివరింపఁబడును.

సంజీవని. ౨౮. II. విష:—"ఆమ్రేడితం ద్విస్త్రిరుక్తమ్" మ్మనునమరకోశాదికము చూపునట్టి ద్విరుక్తత్రిరుక్తశబ్దభాగమెల్ల నామ్రేడితమె యని చెప్పఁదగియున్నను "తస్య పరమామ్రేడితమ్. (౮ - ౧ - ౨) ద్విరుక్తస్య పరమామ్రేడితసంజ్ఞంస్యాత్" అనుపాణినీయవ్యవహారము ననుసరించి సూరి యామ్రేడితశబ్దమునకు వివరణము వ్రాసెను. "యద్యప్యామ్రేడితం ద్విస్త్రిరుక్త మిత్యమరవచనాత్ త్రిరుక్తస్యాప్యామ్రేడితసంజ్ఞాస్త్యేవ. తథాపి తస్య ప్రయోగాభావాద్ద్విరుక్తస్యేత్యుక్తమ్. (అహో. ౨౦౨ పుట). అనియిట్లు త్రిరుక్తప్రయోగమే లేదని యహోబలపతివ్రాయుట సరికాదు. క. తక్షకుఁ డతిభీతుండై। యాక్షణమున సరిగె సురగణాధిప నన్నున్। రక్షింపుము రక్షింపుము। రక్షింపుమ యనుచు నప్పురందరుకడకున్. (ఆది. ౨ ఆ. ౨౧౭) "సంభ్రమేణ ప్రవృత్తౌ యథేష్ట మనేకధా ప్రయోగో న్యాయసిద్ధః (వార్తి ౫౦౫౬). సర్ప సర్ప బుధ్యస్వ బుధ్యస్వ బుధ్యస్వ" (సి. కౌ. బాలమ-౫౫౦ పు.) అని యిట్లు పాణినీయులును త్రివాచప్రయోగము నంగీకరించి యున్నారు. (౨౩౩ విష).

సంజీవని. ౨౮ III విష:—సంభ్రమభృశాద్యర్థ విశేషములలో వచ్చెడి యీద్విరుక్తియందుఁ బరరూపసంధి కేవలము స్వాభావికమగుటచే దీర్ఘాచ్చులకు సైతము సంధి నిత్యముగానే వచ్చుచున్నది. (విస్తర). క్త్వార్థేకారసంధి యెట్టి

---

విస్తర. I ౨౮ III విష:—"ఔరౌర అని యయ్యెను. ఇచ్చోటమాత్రము ఔరయౌర' అనరాదు. ఇట్లె "అహాయాహా' అనరాదు. తక్కిన యుదాహర

యవస్థలోనయినను బ్రయోగించుట నన్నయభట్టారకునకు సమ్మతము కామింజేసిదీర్ఘా చ్చులకు సైతము నిత్యముగ సంధియగుచున్న యీయామ్రేడితసంధియందును నాతఁడు క్త్వార్థేకారసంధిని బ్రయోగింపఁడయ్యె. ఆ. వె. ఎఱిఁగి యెఱిఁగి నన్నునేకార్థసమవేతు (అర. ౨ ఆ. ౩౬ ప.) తే. గీ. ఏల బోధించితయ్య నీవెఱిఁగి యెఱిఁగి (అర. ౩ ఆ. ౩౨౧). ఆ. వె. ఎఱిఁగి యెఱిఁగి కడఁగి... (ఆది. ౩ ఆ. ౧౯౩ ప.) తే. గీ. ఏల యాశీవిషంబుల నెఱిఁగి యెఱిఁగి (సభా. ౨ ఆ. ౨౦౪). ఇట్లగుటంజేసి సూరి యేగి యేగి యనుచో సంధిలేదని వ్రాయుట యుక్తమేకాని (విస్తర). యాతఁడు "ఏమేమి - ఏమియేమి" అని ఇట్లామ్రేడితమునఁ బాక్షికసంధి నుదాహరించుట యుక్తమైయుండలేదు. ఇట్టియెడల సంధ్యభావమునకుఁ బ్రయోగము కన్పట్టలేదు. "బహుళమనుటచేత ఏగియేగి" ఇత్యాదులలేదు. ఏమేమి - ఏమియేమి ఇత్యాదులకు వికల్పము." (కవిజనమం డన టీక. వికృం సంధి. ౧౨ కారికవ్యాఖ్య) అనునాధునికుఁడగుద్వితింత్రిణీసీతారామకవియుదాహృతులనె యిచట సూరి యెత్తి వ్రాసెనా యని యాలోచింపవలసియున్నది. సూ౩కి వికృతివివేకము దాని యీటీకతో లభించి

ణములందు సంధి కలుగుటయుఁ గలుగకున్న యడాగమము కలుగుటయు నగునని యెఱుంగవలయును." (బా. సా. వే. సంధి. ౧౦ సూ. వ్యా.) ఈవ్రాఁత సరికాదు. "ఔరయౌర - ఆహయాహ" అని యేల యనరాదో? "ఎట్టూ యెట్టూ - ఓహో యోహో" అని యేల యనవచ్చునో? వివరింపలేదు. 'ఎట్టూ యెట్టూ' మున్నగు వానివంటి ప్రయోగ మేప్రామాణికకవిగ్రంథమందయినఁగలదా? మఱియు 'ఆహో+ఆహో=ఆహోహో' అని స్పష్టముగా సూరి దీర్ఘాంతశబ్దము నుదాహరించి యుండఁగా 'ఆహ' అనెడి యేకోశమందును లేని యశ్రుతచరశబ్దము నేల వేటికా వ్యాఖ్యాత ప్రక్షేపించెనో తెలియరాకున్నది.

విస్తర. II ౭౪ III విష:—ఆమ్రేడితమునందలి క్త్వార్థేకారసంధికి భాగవతమునఁ బ్రయోగములు గలవు. చ... ఎఱిం గెఱింగినా। వలు విడి యేల కట్టుకొని... (భాగ. ౯ స్కం. ౫౧౫ ప.) క. ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా। దురితము... (భాగ. ౧౦ ఉ. భా. ౯౩౧ స్కం. ప.) క్త్వార్థేకారసంధి యర్వాచీనమహాకవి ప్రయుక్తమయినను భారతసమ్మతముకామింజేసి సూరి యంగీకరింపలేదు. (౭౨ విష.) 'ఏమి యేమి' అనునది సాధువేకాదు. కాన తెలుచుగ నుదాని చొప్పునఁ గ్వాచిత్కసంధి పాక్షికతకు సూరి 'ఏమియేమి' అని యుదాహరించుట కంటె గీ... ఇంతయెు। ప్పనె యుడులోక మెట్ట యెదుర (కాశీ. ౪ ఆ. ౧౮౬) (చూ. బా. సంధి. ౪౦ సూ.) మున్నగు వాని నుదాహరించిన లెస్స యయియుండును.

యుండె ననువిషయము నారచించిన యథర్వణకారికావళీ విమర్శనమున నిరూపించి యున్నాను. (౪౪ మొ. ౪౭ వ. పుటలు. పీఠిక).

పరిమితౌ(తే)సమస్తానామ్. (ఆం. చిం. సంధి. ౧ కారి.
అహో. ౧౯౧ పు.)

నన్నయాథర్వణీయము. ౨౫ విష.

సంధిర్నిత్యం ప్రత్యయస్య । తథార్యాదిగతస్య చ ।
అచోఽచి క్వచిల్లోపో బహుళం స్యాత్ప్రయోగతః ॥
(అహో. ౨౬3 - ౧౫౧ - పుటలు. వికృ. సంధి.
౪ - ౧3 కారి.)

కల్పతరు. ౨౫ విష:—'పరిమితౌ' అనుచోట 'పరిమితే' అని నన్నయ ప్రయుక్తపాఠమై యుండునని తోఁచెడిని. పరిమిత మనఁగా నల్పాక్షరక ప్రత్యయాదికమని యర్థము. పరిమితే = ప్రత్యయాదుల యచ్చు పరమగుచుండఁగా, సమస్తానామ్ = అన్నియచ్చులకును సంధి నిత్యముగా నగును. "నిత్యమనుత్తమేత్యాది పూర్వసూత్రమునుండి "నిత్యమ్" అనునదియనువర్తించును. ఉదా:—వీసె+ఎఁడు = వీసెఁడు, అర్థ+ఇంచు = అర్థించు, పుష్ప+ఇంచు = పుష్పించు మొ. "సంస్కృతపదేన పరిమితమాన్త్రిపద" మిత్యాదిసూత్రమునఁ బరిమితశబ్దమల్పార్థకముగాఁ బ్రయోగింపఁబడెను. "పారిమిత్యల్లౌకికత్వాత్" (సాహి. 3 పరి. ౪౮ కారి.) జీవానందవ్యాఖ్య:—"పారిమిత్యాత్ = పరిమితత్వాత్ =అనుకార్యమాత్రగతత్వేన అల్పత్వాత్" అని పరిమితశబ్ద మల్పార్థకమైయున్నది. వర్ణశబ్దముమీఁద నల్పార్థకప్రత్యయము నిల్చుటచే వర్ణకశబ్దము ప్రత్యయార్థకమయినట్లె యల్పాక్షరార్థకపరిమితశబ్దమునైతము ప్రత్యయాగమాద్యర్థకమగుట విరుద్ధముకాదు. ఈయభిప్రాయమునే యథర్వణుఁడు "సంధిర్నిత్యం ప్రత్యయస్య" ఇత్యాదికారికచే వివరించెను. "సన్ధిర్నిత్యమి" త్యాదికారిక కివలకే వ్యాఖ్య చేయఁబడెను. (౯౯ విష.) "క్వచిద్బహుళ" మ్మనుటచేత 'ఎనిమిదవది - ఎనిమిదియవది, వారియందున్, రాములందున్ - రాములయందున్, మొదలగుచోట్ల సంధ్యభావము సాధువగుచున్నది. అహోబలపతి యిందు 'పరిమితౌ' అనియే నిల్పి దానికిఁ బరిమాణార్థక ప్రత్యయపరముగామాత్రము వ్యాఖ్య చేసెను "పరిమితౌ = పరిమాణార్థకేవర్ణకేపరే"... మానార్థాన్నిత్యమేకత్వే । ఎఁడుస్స్యాత్పరిమాణక ఇత్యథర్వణేనోక్తమ్." (అహో. ౧౯౧ పు.) ఈపక్షమునఁ బ్రత్యయాదిసాధారణాచ్పరకత్వమునందలి సంధి నిత్యత నన్నయానుక్త మనవలసివచ్చును. మేమిక నుదాహరించిన రీతిని నన్నయాభిప్రాయమును యథర్వణుఁడు వివరించియుండఁగా దానిని భిన్నార్థకముగా

నారాయణీయమున వివరించుట యుక్తముకాదు (నారా, ౧౧౦ - ౧౧౬ కారి. ౬ - ౧౨ సూ.)

అంద్వవగాగమంబులుదప్ప నపదాది స్వరంబు పరంబగు
నపు డచ్చునకు సంధియగు. ౧౧.

బాలవ్యా. మూఁడు+ఏఁడు = మూఁడేఁడు, వీసె+ఏఁడు = వీసేఁడు,
౭౫ 1 అర్థ+ఇంచు = అర్థించు, నిర్జి+ఇంచు = నిర్జించు, అంద్వ
విష. వగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవ
ముగా గ్రహించునది. రాములందు, రాములయందు,
హరియందు, ఎనిమిదవది - ఎనిమిదియవది.

సంజీవని. ౭౫ I విష:—అపదాదిస్వరము = అపద మనఁగాఁ బ్రత్యయాగ మాదుల, ఆదిస్వరము = మొదటియచ్చు. 'అందు' అనునది సప్తమీప్రత్యయము. 'అవ' అనునది పూరణార్థకప్రత్యయము. (బాల. ఆచ్ఛి. ౨౫ సూ). యథాసంభవ ముగా = ప్రయోగానుసారముగా. సూరిప్రత్యయ మనక 'అపద' మనుటచేత "ఇంచు" గాగమము, 'అవ' గాగమము మున్నగునవి సయితము గ్రహింపఁబడు చున్నవి. (విస్తర). "ఏని - ఏసి" మున్నగునవి యవ్యయములగుటంజేసి యవిపద ములే. అపదములు కావు. "చ.........వాయుసూ। నుని గవలన్ శినిప్రవరు నొంచెవడిన్ పదియేసియమ్ములన్ (శల్య. ౧ ఆ. ౧౯౧). ఉ. ఎవ్వనియేని ముఖా

విస్తర. I ౭౫ I విష:—"ఇంచు - అనునది స్వతంత్రప్రయోగార్హ మగు ధాతువగుటచేత నద్దాని నపద మనఁజనదు....లాక్షణికు లిద్దాని వివక్షింపమిని ప్రత్యయ మనవలసివచ్చెను" (బా. సా. వే. ౬౦ పుట.) ఈవాక్యము ప్రమాద భూయిష్ఠముగా నున్నది. ధాతువు స్వతంత్రప్రయోగార్హ మనుట యసంగతము. 'ఇంచు' అనుదానిని వైయాకరణు లాగమమనిరిగాని ప్రత్యయమనలేదు. ప్రత్యేక ప్రయోగార్హమగు 'అందున్=అస్థలమందు' అనుపదమున్నను "అందున్" అను శబ్దము సప్తమీప్రత్యయముగా నంగీకరింపఁబడుచుండలేదా. 'ఇంచు' అనుధాతు వున్నంతమాత్రమున 'ఇంచు' అనుశబ్ద మాగమమగుటలో బాధ యేమున్నది? ఇందు లాక్షణికులు చూచుకొననివిషయమేమి? "ఏఁడుగాగమము. ఇంచుగాగ మము అని ఆగమమాత్రములుగ గ్రహింపఁబడుచున్న 'ఏఁడు-ఇంచులు గూడ స్వతంత్రపదములె" (సంధిగ్రంథ ౮౮ పు.) అని సంధిగ్రంథకర్తవ్రాసెను. 'ఏఁడు' తద్ధితప్రత్యయము. విభక్త్యంతములుకాని వీనిని పదములనుట పొరపాటు.

మృతాంశుబిం। బమ్మున నుద్భవంబయిన......(ఆది. ౧ ఆ. ౭౭). మున్నగుమహా కవి ప్రయోగములు వీనిపదత్వమును బ్రత్యేకప్రయోగార్హతను నిరూపించుచున్నవి.

కుఱు చిఱు కడు నడు నిడుశబ్దముల ఱ డ ల కచ్చు
బాలవ్యా. పరమగునపుడు ద్విరుక్తటకారంబగు. ౧౨.
౭౬ కప. కుఱు+ఉసురు = కుట్టుసురు; చిఱు+ఎలుక = చిట్టె
లుక, కడు+ఎదురు = కట్టెదురు, నడు+ఇల్లు = నట్టిల్లు,
నిడు+ఊరుపు = నిట్టూరుపు.

సంజీవని. ೭೬ విషయము:—దీనికి నన్నయాథర్వణీయమూలము కన్పట్ట లేదు. ఈవిషయము సూరిపూరించినదె. (విస్తర.) 'ఉసుఱు' అని యిది శకటయుక్త ముగ శబ్దరత్నాకరమున నుదాహృతమయ్యెను. "కుట్టుసుఱు దే. వి. (కుఱుచ+ ఉసుఱు) కొంచెము మిగిలియున్న ప్రాణము" "ఉసుఱు - వై. వి. ప్రాణము" (శ.ర). "ఉసుఱు - ప్రాణము. అసవః" (వై. దీ) ఇందలి రేఫము శకటమనుటకుఁ దగిన ప్రామాణికప్రయోగము కన్పట్టలేదు. దీనిని సంబంధించినతమిళశబ్దము. 'ఉయిర్.' కన్నడశబ్దము 'ఉసిర్' అనునవై యున్నవి.

సంజీవని. ೭೬ I విష:—'కుఱుచ - చిఱుత - నిడుద - నడుము' అనునవి యాచ్ఛికవృత్తియందు. 'కుఱు - చిఱు - నిడు - నడు' అని శేషించుననియుఁ జిట్టె లుక ప్రభృతులలోని పూర్వపదము 'చిఱు' అనక 'చిట్టి' అనిగ్రహింపనగుననియు

---

విస్తర. ೭೬ విష:—"కేచిదాదౌద్విర్వర్ణకాః అనునాథర్వణము మూలము" (బా. సా. వే. ೬౧ పుట.) అను పేటికావ్యాఖ్య సరికాదు. ఈకారిక ద్విరుక్తసంధి విషయకమని యిందలి 'ఆదౌ' అనుదళము విశదపఱుచుచున్నది. "కేచిత్=కొన్ని, ఆదౌ=ఆమ్రేడితము పరమగుచుండఁగా మొదటిశబ్దమందు..." (కవిజనమండన వ్యాఖ్య. ౯౫ పుట.) "కేచిదాదౌద్విర్వర్ణకాః।...నట్టనడుము - కొట్టకొన - ఎట్ట యెదుట-పట్ట పగలు-మిట్టమిట్టు-ఇత్యాది" (అహోబ. 3౫3 పు.)

"సాధారణముగా నిట్టిరూపములు నన్నయభారతభాగమున నగపడమిం జేసి..." (బా. సా. వే. ೬౧ పు.) అనియు, "కట్టాణి మున్నగుతమిళరూపములను బట్టి యీద్విత్వవిధానమును సూరి కల్పించె" అనియుఁ, బేటికావ్యాఖ్యాతవ్రాయుట పొరపాటు. "కట్టెదురన్" (సభా. ౨ ఆ. ౯౭ ప.) కట్టలుకన్ (విరా. ౨ ఆ. ౨౧౧ ప.) వేఁడినిట్టూరుపో యన వెడలె...(విరా. ౨ ఆ. ౨3౬) అని యిట్లు నన్నయ తిక్క నలు సైతము వీనిని ధారాళముగాఁ బ్రయోగించియున్నారు.

శబ్దరత్నాకరప్రౌఢవ్యాకరణములయాశయము. (విస్తర).డ "చిట్టడవిఁజిట్టి" (ప్రౌఢ. సంధి ౪ సూ). ఈగ్రంథములు చిట్టడవి ప్రభృతులలోని యికారసంధికి నిత్యత నంగీకరించుటచే నీమార్గమందలి బాధతొలంగినది.

సంజీవని. ౭౬ II విషః—శబ్దరత్నాకరకోశమున 'కదు' శబ్దము ద్రుతప్రకృతిక మగునవ్యయముగ 'ద్రు' అనుసంజ్ఞతో నుదాహరింపఁబడెను. వేటికావ్యాఖ్యాతయు ననుశాసనకర్తయు నీమార్గమునె యనుసరించిరి. (బా. సా. వే. ౬౧ పు; ఆం. భా. అ. ౧౦౫ పు. తృ. ము.) కదుశబ్దము బాలవ్యాకరణపక్షమునఁ గళయగు విశేషణమె యనఁదగును. అత్యంతాతిశయద్యోతనమున నది చార్థక'ను'శబ్దాంతమయి "అందఱున్" మున్నగువానివలెఁ బ్రయోగింపఁబడునని యెన్నవగును. కదు నహితుండై. (ఆర. ౧ ఆ. ౧౧౦). కదునధికుతోడ (సభా. ౧ ఆ. ౧౨౪).

ఈద్విరుక్తటకారవిధి-కుఱుప్రభృతులపట్ల నిత్యమె యయ్యు 'కదు' శబ్దవిషయమునమాత్రము పాక్షికమని ప్రయోగములనుబట్టి బాలవ్యాకరణసూత్రమును సవరించుకొనవలసియున్నది. ప్రయోగములు:—అనికదునడలుగ (సభా. ౨ ఆ. ౧౨౭ ప.) (కదునడలున. తాళపత్త్రమాతృక) కదునెండ యెక్కునంతకు (ఆర. ౧ ఆ. ౧౯౯). కట్టెదురన్ (సభా. ౨ ఆ. ౯౭ ప.) (విస్తర.)

సంజీవని. ౭౬ III విషః—కుఱుప్రభృతులలోని యుపాంత్య ఱ డ ల కు ద్విరుక్తటకారాదేశము రాఁగా 'కుట్ ట్ +ఉ+ఉసురు=కుట్టుసురు' మున్నగురీతిని సంధిరూపము లేర్పడునని గ్రహింపవలెను. కుఱుప్రభృతుల ఱడల కన్యవహితాచ్పరకత్వము సూరిచే నుద్దేశింపఁబడ లేదని యాతనియుదాహృతులె విశదీకరించుచున్నవి.

---

విస్తర. ౭౬ I విషః—ఈమార్గమునె యనుసరించియు 'నడు-నిడు' అనునవి 'నడుము-నిడుద' అనువానిసంక్షేపరూపములని వేటికావ్యాఖ్యాత యేల వ్రాయలేదో తెలియకున్నది. "కుఱు-చిఱు అనునవి వృత్తియం దంత్యముగుహల్లు లోపించిన కుఱుచ-చిఱుత అనువానిరూపములు" (బా. సా. వే. ౬౧ పు.) అనిమాత్రమే వేటికలో వ్రాయఁబడెను.

విస్తర. ౭౬ II విషః—చింతామణిపక్షమున విశేషణములు ద్రుతప్రకృతికములుగాన 'కదున్' అనునది ద్రుతప్రకృతికమనకతీరదు. అత్యంతాతిశయార్థబోధమున 'చా' ర్థక 'ను' శబ్దము దానిపై నిల్వఁగా 'కదున్+నున్=కదునున్ = కదుస్' అని యిట్లు సంధిప్రక్రియ నెన్నవగును. విశేషణవిశేష్యములనడుమ నిట్లు 'ను' శబ్దము నిల్చుట విశేషవిధిగఁ బ్రయోగములనుబట్టి గ్రహింపవలెను.

(విస్తర I). కాన నచట మిగిలిన 'ఉ' కారమునకుఁ బరరూపసంధి వర్తిల్లును. అంతియ కాని బా. సంధి ౫౫ సూత్రముచొప్పున 'టు' గాగమువచ్చి 'కుట్టుటుసురు' 'కుఱుటుసురు' మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. అట్టి టుగాగమ నివారణ మునకె యీసూత్ర మీస్వరసంధిసందర్భమున గ్రంథకర్తచే సుసంగతముగ నిల్పఁ బడెనని గ్రహింపవలెను. (విస్తర II).

గసడదవాఃస్యుః ప్రథమా । మాత్రాదాత్తాస్తదోర్ద్వినై
నన్నచూడర్వ వైతే। నవికృతి శబ్దాత్ పరతః । సాంస్కృతికానాం
గామమ. ౭౭ విష. భవన్తి గసడదవాః॥ (ఆం. చిం.సంధి.౮- కారి. అహో.
౨౦౮ - ౨౦౯ - పు.)

---

విస్తర I. ౭౬ III విషః—"ఉత్వము మిగులునన్న నపదాదిస్వరసంధికేని యుత్వసంధికేని నిత్యప్రవృత్తి ననుమానింపకతీరదు. కాన 'ఉ-డు' ల కుత్వసహిత ములకే ద్విరుక్తటకారము విధించుట యుచితము" (బా. సా. పే. ౬౧ పు.) ఈ పేటికావ్యాఖ్య సరికాదు. ఉత్వసంధి యిచట నిత్యముగ వర్తిల్లుటలో బాధయేమియు లేదు. అది యిష్టాపత్తియే. అపదాదిస్వరసంధి కిచట నెంతమాత్రమును బ్రసక్తియే లేదు.

విస్తర II ౭౬ III విషః—ఈపట్టున ననుశాసనకర్త 'టు' గాగమమునకుఁ బ్రసక్తియే లేకుండునట్లుగ "అచ్చు పరమగునపుడు సమాసమునందు 'కుఱుచా' దుల తొలియచ్చుమీఁదివర్ణములకెల్ల ద్విరుక్తటకార మాదేశమగును" (ఆం. భా. అ. సంధి ౩౮ సూ.) అని సూత్రించెను. కాని యీపక్షమున "కుఱుచ+అసువు = కుట్టసువు." మున్నగు ననిష్టరూపములు సిద్ధింపవలసివచ్చును. సంస్కృతశబ్దపరకత్వ మున నిట్టిసంధి లాక్షణికమహాకవి సమ్మతము కాదు. (అనుబంధ) బాలవ్యాకరణపక్ష మునందన్ననో కడుశబ్దేతరములగు 'కుఱు' మున్నగురూపము లాబ్ధికవృత్తిలో మాత్రమె సిద్ధించునుగాన నందు 'కుట్టసువు' మున్నగు ననిష్టరూపము లుప్పతిల్ల

---

అనుబంధము. విస్తర II. ౭౬ III విషః—సంస్కృతశబ్దపరకత్వమున 'కడు' శబ్దడకారమునకు ద్విరుక్తటకారమువచ్చుట బసవపురాణమునఁ గన్పట్టుచున్నది. కట్టుగ్రముగఁగూడ ముట్టుఁడు మున్న (బసవ. ౩ ఆ. ౪౬౭) బిట్టుల్కిపడి మదిఁ గట్టుగ్రుఁడగుచు (బసవ. ౪ ఆ. ౧౩౫) సో మనారాధ్యుఁడు వింతవింత తద్భవము లను బ్రయోగించు స్వభావముగలవాఁడుగానఁ (౬౦ III) బయిస్థలములందు "కట్టుగ్గముగ-కట్టుగ్గుఁడగుచు" అని ప్రయోగించెనేమో?

కల్పతరు. ౭౭ విష:—ఆత్మాస్మదోర్ద్వినా=తా-నాశబ్దప్రథమైకవచనరూపములగు ద్రుత ప్రకృతికములైన 'నేన్ - తాన్' శబ్దములుతప్పఁ దక్కిన, ప్రథమామాత్రాత్=ప్రథమావిభక్త్యంత మాత్రమునకంటెఁ బరమయిన, ఏతేఏవ=ఈకచటతప లె, గసడదవాః స్యుః = వరుసగా గ స డ ద వ లగును. 'మిథస్సవర్ణశ్చ' అనుచోట్నున 'చ జ' లు 'చే జే' లకు గ్రాహకములగును: చేకారము సైతము సకారమగునని తాత్పర్యము. సాంస్కృతికానామ్ = సంస్కృతసమశబ్దములలో, నవికృతిశబ్దాత్ పరతః = (నఞర్థక'న'శబ్దముతోడి సమాసము) వికృతితఃశబ్దములకన్నఁ బరమైనను—వికృతిచిహ్నములగు డ్వాదిప్రత్యయములు లోపించినశబ్దములకన్నఁ బరమైనను—'క చ ట త ప' లకు, గ స డ ద వాః=గ స డ ద వ లు, భవన్తి= అగు

---

నేరవు. కడుశబ్దపక్షమున నీద్విరుక్తటకారవిధి పాక్షికమని యీవఱకే వ్రాయఁబడెను. (౭౬ II విష.)

విస్తర III. ౭౬ III విష:—ఇట్టిసూత్ర మిచటనే యుండుట యుక్తమై యుండఁగా సమాససంధిసందర్భములో నుండఁదగిన యీవిధి హరికారికావళికర్త యిచటఁ జెప్పినట్లును దాని నాంధ్రీకరించినవాఁ డగుటచే సూరి యిచటనే యుంచివేసినట్లును గుప్తార్థప్రకాశికాకర్త మిక్కిలిగ విస్తరించి హరికారికావళియె మూలగ్రంథమనెడి తనవాదమున కేదో గొప్పయుక్తి దొరకినదనుకొని "ఓనిష్పక్షపాతబుద్ధులారా" అని పెద్దభాంకారముచేసి విజృంభించెను. హరికారికావళి మూలగ్రంథమను ఘనతను దత్కర్తకు ఘటించునపు డొకటి రెండు చకారపుగుడులు తగిలినను నేమి కొఱంత యని తలంచి కావలయును గొన్నియెడలఁ గొండగాఁ జేయఁబడిన కృష్ణమూర్తిశాస్త్రి గారి నిట్లుగుప్తార్థప్రకాశికాకర్త బెండుపఱిచెను. "ఛందోనిరోధంబున సమాసప్రకరణభంగదోషమునకు సహితము తలయొగ్గి........కక్కుఱితిం జెందవలసీవచ్చెను.........ఛందోనియమంబునంజేసి యాపత్కాలంబున మర్యాదం దప్పి కంటకమార్గంబునంబడిన శాస్త్రులవారి......" (బా. గు. ప్ర. ప్రకీ ౫౭౬ పు. ద్వి. ము) అని యేమేమో ప్రల్లదములాడెను. పాపము! కృష్ణమూర్తిశాస్త్రివంటివాఁడు కొఱమాలినయనుష్టుప్ ఛందమున కింతభంగపాటుపడునా? స్వరసంధిప్రస్తావమున నీసూత్ర మిచట సుప్రసక్తమే యైయుండఁగా నీగోడవయేల? సమాససంధివిధులనెల్ల నొకచోటనే చెప్పునియమము బాలవ్యాకరణమునను లేదు. హరికారికావళిలోను లేదు. అపదాదిస్వరసంధి (బా. సంధి ౧౧సూ.) వ్యస్తపదసంధివిధులలోఁ జొచ్చియుండ లేదా? సమాససంధులనడుమ నామ్రేడితసంధివిధులు (బా. సంధి. ౪౦ - ౪౧ - ౪౨ సూ.) చొచ్చియుండ లేదా?

చున్నవి. (చిం. పరి. అనుబం. ౧౫౪ విష.) ఇట్లు నన్నయ తనకాలమునాఁటికి మాఱికమార్పుతోఁ బ్రసిద్ధమైయున్న ప్రథమమీఁది 'క చ ట త ప' లకు వచ్చు గ స డ ద వాదేశనిత్యతను సూత్రించెను. నన్నయకుఁ బూర్వకాలమున 'డు ము వు లు' అను ప్రథమావిభక్తి ప్రత్యయములమీఁదను స్త్రీసమములగు నచ్చుతెనుఁగు ప్రథమైకవచనశబ్దములమీఁదనుమాత్రమె యీయాదేశము నిత్యముగా వచ్చు చుండెడిది. నన్నయనాఁటికిఁ బయిరీతిని వచ్చుటేకాక స్త్రీలింగాది లుప్తప్రథమైకవచన సంస్కృతశబ్దములమీఁద నైతము పరుషములకు నిత్యముగ నీయాదేశము రాఁ దొడంగెను. కావుననె నన్నయ సూత్రించుటలోఁ బూర్వస్థితియందుఁ దననాఁటికి జరిగినమార్పు నుత్తరార్ధముతో 'డుమువు' విభక్తులు లోపించిన స్త్రీలింగాదిసంస్కృత రూపములమీఁదసయిత మీయాదేశము నిత్యముగనె వచ్చునని పునరుక్తముగ నొక్కి వక్కాణించెను. ఈనన్నయసిద్ధాంతమె భారతమున నియతముగఁ బాటింపఁ బడెను. భారతమున నీయాదేశమునకు వైకల్పికత బాహుళకత యనువవస్థలు లేవు. నన్నయకుఁ బూర్వకాలమునందలి యీయాదేశపుచరిత్రము పండ రంగునియద్దంకి శాసనమును యుద్ధమల్లుని బెజవాడశాసనమును బరిశీలించినచో విశదము కాఁగలదు. (వై. పా. 3౭౨ - 3౭౬ విష) (చిం. పరి. అనుబం. ౧౫౪ విష.) 'ఆత్మాస్మదోర్వినా' అనఁగా నేను తాను శబ్దముల తుదిస్వరము కవిభల్లటసూత్రముచొప్పున లోపించు టచే నేర్పడిన 'నేన్ = (ఏన్) తాన్' అనునవి ద్రుతప్రకృతికములగుటంజేసి యవి ప్రథమాంతములైనను వానిమీఁదిపరుషములకు గ స డ ద వా దేశము రాదని యర్థము. ఇంక వానిపై గ జ డ ద బాదేశాదిద్రుతసంధికార్యములె వచ్చునని యెఱుంగునది. ఇఁక 'నేను = ఏను. తాను' అనువాని తుదిస్వరము లోపింపనపు డవి చింతామణి పక్షమునఁ గళలె యగుటంజేసి (౪3 II విష.) వానిమీఁదిపరుషము లకుఁ బ్రకృతసూత్రముచే గ స డ ద వాదేశమె వచ్చును. క. కవదొసలును గాండీవము। నవల నిడంబనుపు ముంద రరదముడిగుమే। ను విదపడిగియెద...... (శల్య. ౨ ఆ. 333).

నన్నయాథర్వ ణీయము. ౭౭ I విషయము.

పరుషావాస్వరూపేణ। ప్రథమాన్తో పరిస్థితాః । కాకో
సంబోధనేచాపి । హ్యవ్యయే కర్మధారయే ॥ అచేత
నాస్థికేశబ్ద । ఇతి శృఙ్గారభూషణః । కేచిదాద్యస్యపోవ
స్య । న్నచ ప్రాసే యతౌతు వా । కేచిద్ద్వయోర్వి
కల్పత్వం । యతో సర్వత్ర కేచన । వికృతాత్ పరుషా
శ్చస్య । స్సు సఅద్యపదాదిగాః ॥ నవోగసడదాస్సేపి ।

పరుషాః ప్రథమాఽహితాత్। స్యుర్భిన్నాదేవతస్మాత్తే।
వినాద్వన్ద్వంహారేర్మతే ॥ (విశృ. సంధి. ౧౪. ౧౭ కారి.
అహో. ౨౧౦ ౨౧౧. పు.)

కల్పతరు. ౭౭ I విషః—అథర్వణుఁడు తనకాలమునాఁటికిఁ గొందఱుకవు లీయాదేశమువిషయమున భిన్నభిన్నాభిప్రాయులై యుండుట నరసి యవి భారత సమ్మతములు కామింజేసి స్వమతములు కాకున్నను వానిని గేచిన్మతములనుగా వివరించుచున్నాఁడు:—కా కౌ=అ-ఆ మున్నగుకాకాద్యర్థకస్వరములమీఁదను, సంబోధనే = సంబోధనప్రథమావిభక్తిమీఁదను, -వ్యయే = అవ్యయముమీఁదను, కర్మధారయే = కర్మధారయమందును, అచేతనార్థకే = జడవాచకశబ్దముమీఁదను, స్థితాః = ఉన్నటువంటి, పరుషాః = క చ ట త ప లు, ప్రథమాన్తోపరిస్థితాః = ప్రథమావిభక్తిమీఁద నిల్చినవైనను, వా = వికల్పముగా, స్వరూపేణ = స్వరూపముతో నిల్చునవి, భవన్తి = అగుచున్నవి, ఇతి = అని, శృఙ్గారభూషణః = శృంగారభూషణుఁడు తలంచుచున్నాఁడు. పైస్థలములందు గ స డ ద వాదేశము వైకల్పికమనుట శృంగారభూషణునిమతమని తాత్పర్యము. ఆద్యస్యపః = తత్సమ శబ్దముమీఁద నున్నపకారము, ప్రాసస్థలమందుమాత్రమె, వః = వకారము, నస్యాత్ = కాదనియు, యతౌతు = యతియందన్నచో, వా = వైకల్పికమనియు, కేచిత్ = కొందఱందురు. కేచిత్ = మఱికొందఱు, ద్వయోః = యతిప్రాసములు రెంటను, వికల్పత్వమ్ = వైకల్పికతను, నంగీకరింతురు. కేచన = ఇంకొకకొందఱు, యతౌ = యతిస్థలమందు, సర్వత్ర = అంతట నగును ననఁగా నిత్యమని తలంతురు. ఇంక హరిపండితమతమును వివరించుచున్నాఁడు :—వికృతాత్ - సుసః = వికృతిశబ్దప్రథమాంతముకంటెఁ బరమై యున్న, ఆద్యపదాదిగాః = సంస్కృతసమశబ్దాదిగతములగు, పరుషాశ్చ = క చ ట త ప లు సైతము, స్యుః = గ స డ ద వ లగుచున్నవి. వినాద్వన్ద్వమ్=ద్వంద్వసమాసమును వినాగా, సే=(కర్మధారయ) సమాసమునందు, ప్రథమాఽహితాత్ = ప్రథమ యనుటకు హితముగానిశబ్దముకన్నఁ బరమగు, పరుషాః=పరుషములు, వః-గసడ దాః ఆపి=వకారమును గ స డ ద లు ను, న=కావు, తస్మాత్=ఆకారణమున హారేర్మతే = హరిమతమున ద్వంద్వేతరస్థలముల, భిన్నాదేవ=వ్యస్తపదముకంటెఁ బరముగానే, తే=అవి, స్యుః=అగును. ఇట్లథర్వణుఁడు వివరించుటచే నాతనినాఁటికె యీయాదేశమునకు బాహుళకత యారంభించెనని యాతఁడు మతాంతరముఁగ న స్వరసోక్తినుదాహరించెనని యెన్న నగును. కవిజనమండనవ్యాఖ్యాత యిట్లు తలంపక "పరు

షావే"త్యాదికిక్రిందివిధమున వ్యాఖ్య చేసెను. "ప్రథమాన్తోపరి=ప్రథమావిభక్తికంటె పైనను,......స్థితాః = ఉన్నట్టి, పరుషాః = పకారములు, వాస్వరూపేణ=వాయనుస్వరూపముచే అగును......" (వికృ. సంధి. ౧౪ కారి. టీక). ఇట్లీచటి యథర్వణకారికలెల్లఁ గేవల పకారమాత్రవిషయకములుగ వ్యాఖ్యచేసెను. పకారము వకారమగువిషయమునందు సయితము బాహుళకత యాతనికాఁటికి మహాకవిసమ్మతముగా మింజేసి యాపక్షమైనను నథర్వణాంగీకృతమనుటసరికాదు. ఇట్లేయహోబలపతి తదనుయాయి నారాయణీయగాణపతవివరణకారాదులును నీకారిక లథర్వణసమ్మతములనుచు వ్యాఖ్యలనుజేసిరి. "నన్వేవంచేత్ అఖిలభువనములలోన వారణనగరి పురమతల్లినాఁడఁదఱచి ఇత్యాద్యాః సూరనాదికవిప్రయోగాః కథంసంగచ్ఛన్తఇతిచేత్ అథర్వణోక్తత్వాత్తత్సాధుత్వమవేహి.తద్గ్రన్థేతు "పరుషావాస్వరూపేణ..."ఇతి సంస్కృతాం సంస్కృతసాధారణ్యేన వికల్పఉక్తః." (అహో ౨౧౦ పు). "నలుగడలు - పలుదెఱఁగులు - తెలిదమ్మి-వెలిదామర - ఇతి రూపమాథర్వణమ్" (అహో. ౨౨౨ పు)."వికృతిశబ్దాత్ = సంస్కృతసమవ్యతిరిక్తశబ్దాత్, పరతః, సాంస్కృతికానాం = సంస్కృతశబ్దాదిగతానాం పరుషాణాం గసదవా నస్యుః" (అహో ౨౦౯ పు). అని యిట్లు నన్నయభాగమునకేకాక భారతమునకెల్ల విరుద్ధమగునట్లుగ నహోబలపతి నన్నయకారికకపవ్యాఖ్యచేసెను. తనకాలమునాఁటికి వివిధగతులనున్నప్రయోగములనుబట్టి భ్రమించి యహోబలపతి పైరీతి నన్నయకారికకును నర్థముచేసెను. ఇట్టి యహోబలపండితీయమునుబట్టియే కావలయు "తెలుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వ లు రావు" (బా. సంధి. ౧౪ సూ). అని సూరియు సూత్రించెను. "ప్రథమమీఁది యాచ్ఛికపరుషములకుఁ బైయాదేశము వైకల్పికము. తత్సమపరుషములకు రాదు. అథర్వ—శృంగారభూషణాదులమతము లింకను వేఱుగా నున్నవి" (ఆం. భా. అ. ౧౧౪ పు. తృ. ము). అని యనుశాసనకర్తయు వ్రాసెను.

'ఆత్మాస్మదోర్వా' అనుదానిచే 'నేను - తాను' అను తుదిస్వరము లోపింపని శబ్దములమీఁద సైతము గ స డ ద వాదేశము రాదనియు గ జ డ ద బాదేశమె వచ్చుననియు నెన్నుచు బాలవ్యాకరణకర్త "తాను జదివె" (బా. సంధి. ౨౩ సూ). అని యుదాహరించెను. పరుషావేత్యాదికారికల కహోబలపతి వివరించిన యర్థమునె ముద్దరాజు రామన మున్నగు నాంధ్రలాక్షణికులు తమతమలక్షణగ్రంథములలో వచించియున్నారు. తే-గీ. సంధిఁ బూర్వంబుఁ బ్రథమాంత శబ్దవితతి। పైఁ గ చ ట త పలకు వికల్పంబు చెల్లుఁ। గాకు సంబోధనావ్యయకర్మధార। యంబుల నచేతనంబుల నబ్జనాభ. (కవిసంజీవని ౧౨ ష. ౪ పు) దీనిని గూచిమంచి తిమ్మకవి యీక్రిందిరీతిని

విమర్శించెను. గీ. కాకు సంబోధనాన్వయకర్మధార। యంబుల నచేతనంబుల నగు వికల్ప। మనియె ముచు ముద్దరాజు రామనసులక్ష్య। ములు వినము కాకు సంబోధన లకుభర్గ. (సర్వల. ౧ ఆ. ౯౮ ప). ఇట్లు తిమ్మకవి కాకు సంబోధనములను ద్రోసిపుచ్చి యవ్యయకర్మధారయాచేతనములందుమాత్రము పాక్షికత్వము నంగీకరించి యుదాహరించెను. ఇదియు సరియగు ననుగమము కాదు. తననాఁటికి ధారాళముగా నీయాదేశమునకు బాహుళకత వెలసియుండుటఁ జేసి యట్టియర్వాచీనకవిప్రయోగములనుబట్టి యేదో యొకరీతి ననుగమము కల్పించి యట్టి యర్వాచీనకవిప్రయోగములను దిమ్మకవి యుదాహరించుటలో విరోధము లేకున్నను నట్టియాదేశబాహుళకతకు నింకను బాక్షికతకు భారతమునుండి ప్రయోగములను నతఁడు చూపఁగడంగుట కేవలము విరుద్ధమయియున్నది. అట్టియత్నమువలన నాతని కీయాదేశము భారతమున నిత్యమనువిషయము తెలియదనవలసివచ్చుచున్నది. భారతమునందలి దీని నిత్యతముందు విశదీకరింపఁబడును. (౨వ III వి).

ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు. ౧౩.

వాఁడు+కొట్టె = వాఁడుగొట్టె - వాఁడు కొట్టె.

అపుడు+చనియె = అపుడు సనియె - అపుడు చనియె.

నీవు+టక్కరివి = నీవు డక్కరివి - నీవు టక్కరివి.

బాలవ్యాకరణ మీరు+తలఁడు = మీరు దలఁడు - మీరు తలఁడు.

వివరణము. వారు+పోరు = వారు వోరు - వారు పోరు.

౨వ విషయము. అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుంగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి. రారు+కదా = రారుగదా - రారుకదా; వత్తురు+పోదురు=వత్తురు వోదురు - వత్తురుపోదురు.

సంజీవని. ౨వ విష:—తలఁడు = తలఁగుఁడు = తొలఁగుఁడు. అపుడు మున్నగునవి నిత్యైకవచనాంతము లనఁగాఁ బ్రథమైకవచనాంతములని యర్థము. ప్రథమమీఁద ననుటచే నీయాదేశము వ్యస్తస్థలమాత్రవిషయకమని విశదమగుచున్నది. ద్వంద్వమునందలి ప్రత్యేకవిధానముసైతము (బా. సంధి ౧౫ సూ.) దీనివ్యస్తస్థలమాత్రవిషయకతను వ్యక్తపఱుచుచున్నది.

చింతామణికర్త కళాద్రుతప్రకృతికములను వివరించునపుడు "తిఙ్మధ్యే" త్యాదికారికలో (౪౨ విష). 'సుప్' అనుదానిచేతఁ ('సు - ఔ - జస్' అనువాని ప్రత్యాహారము) ప్రథమావిభక్తికళయని చెప్పియు, "యదా తదా కిమేవాంశ్చ" అని యదా తదార్థకములగు "ఎప్పుడు - అప్పుడు" అనుశబ్దములును (ఇవి 'ఇప్పుడు' అనువానికిని నుపలక్షణములు) గళలె యని వేఱుగఁ జెప్పుటంజేసి యవి ప్రథమా విభక్తులు కావని యాతఁడు తలంచినట్లు విశదపడుచుండఁగాఁ బైయుదాహృతు లలో 'అపుడు' అనుదానిని బ్రథమాంతముగా నుదాహరించుట యెట్లు పొసఁగు నని శంకించుకొని 'అపుడు' ప్రభృతులు ప్రథమైకవచనములె యనియు (అప్ప టికి - అప్పటినుండి - అప్పటప్పటన్ - అప్పటిలో మున్నగువిభక్తిరూపము లుండు టచే నవి యవ్యయములు కావు) వాగనుశాసనులు 'యదా తదా' అని మరలఁ జెప్పుట ప్రపంచార్థ మనఁగాఁ బ్రథమావిభక్త్యంతరూపవైశాల్యమును జూపుటకె యనియు సూరి వివరించెను.

సంజీవని, ౭౨ I విషః—"ప్రథమామాత్రాత్ - అన్నందునఁ బ్రథమాసమ ములమీఁదను వచ్చును. అపుడు గనుపించె. ఇపుడు దావచ్చె. ఇత్యాది." (బాల సర. సంధి. ౭ కారి. టీక). "ప్రథమామాత్రాదిత్యత్ర యథా కథంచిత్ ప్రథమా తుల్యానా మపి గ్రహణమ్.........తేన అతఁడు ఘటియింపుచున్నాఁడుగదా. ఇత్యాదిరూపం సిధ్యతి." (అహో. ౨౦౮ పు.) అను బాలసరస్వతీయాహోబలపండి తీయాదివ్యాఖ్యలె 'అపుడు సనియె' అను సూరియుదాహృతికిని, "ఈకార్యము కళ లగుక్రియాపదములమీఁద సహితము కానంబడియెడి, గారుగదా" అను సూరివివ రణమునకును, మూలమని తోఁచుచున్నది. కాని "కళలగుక్రియాపదములమీద" అను వివరణము సరి కాదు. క......సమీరితమైచం। జూగుపాక్యం బది...... (శాంతి. ౬ ఆ. ౧౯౦ ప.) క॥ ఆతనికిఁ గలిగినప్పుడ। చూ తెగియె......(కర్ణ. 3 ఆ. ౧౦౨ ప.) (చూ = చుమ్ము). చ......పొ। మ్ము కపిఎరేణ్య......(భాస్క. యు. ౨౩౧శ్లో). ఇట్లుంతటను గళలమీఁద నాదేశాభావమె కన్పట్టుచున్నది. కాని సర్వనామకళాశబ్ద ప్రథమాంతిమవర్ణరూప పురుషబోధక ప్రత్యయములమీఁద— 'ము - వు - రు - ఁడు - ది - దు - వి - వు.' అనువానిమీఁద—నీయాదేశము భార తమున నిత్యముగ నగపడుచున్నది. చ..... సత్యముకంటెను నొండులే। దు దలఁప .....(శాంతి. 3 ఆ. ౪౧౯ ప.) మ. తగునే......లే। దుగదా......(నిర్వ. ౬ ఆ. ౧౬). ప్రాచీనకాలమున 'అది - అవి' అను శబ్దములకుఁ బర్యాయములై 'అదు-అవు' అనుశబ్దము లితరద్రావిడభాషలందువలెనె తెల్గునను నైతముండెడివి. వాని తుదివర్ణములె యీ'దు-వు'ప్రత్యయములు. ఉదా:—కలదు. కలవు, లేదు-లేవు. మొ.

సంజీవని. ౨౮ II. విష:—చింతామణిలోని 'ప్రథమామాత్రాత్' అనెడి మాత్రశబ్దముచే బ్రథమాప్రత్యయములగు 'డు - ము - వు-లు' అనునవియున్నను లోపించినను నట్టి ప్రథమాంతము తత్సమమైనను నాచ్ఛికమైనను బ్రథమమైనం జాలుననెడియర్థము సైతము లభించును. ఈవిషయమునె 'నవికృతీ' త్యాదికమగు నుత్తరార్థము విశదీకరించుచున్నది.

సంజీవని. ౨౮ III విష:—భారతమున. "అ - ఆ - ఎ - ఏ - ఓ -" అనునవి యాదిగాఁగల కాక్వాది స్వరములమీఁదను క్త్వాంతములమీఁదను సంబోధనాంతముల మీఁదను విశేషణములమీఁదను శేషషష్ఠ్యంతములమీఁదను నీయాదేశము నియతముగా నుజ్జగింపఁబడెను. (విస్తర). కాలక్రమమున మహాకవు లీయాదేశమునకు బాహుళకత—తుది కైచ్ఛికత—నంగీకరింపసాగిరి. నేఁడేవో యలంతిస్థలములు తప్ప (నిజముగ్గ - తెల్లగ్గ - తెల్లవ్వాటెను - మొ.) నంతటను నీయాదేశ ముపేక్షిత

విస్తర. ౨౮ III విష:—భారతమున 'ఆహా - ఓహో' మున్నగునవ్యయములమీఁదసైత మీయాదేశము నియతముగ నుజ్జగింపఁబడియుండఁగా (౨౮ విష. విస్తర. IV ) నట్టి నియమమునకు విరుద్ధముగా 'ఆహా' శబ్దముమీఁద నీయాదేశము పినవీరభద్రునిచే బ్రయోగింపఁబడెను. శా......। కైవారంబగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁగూడనా। హా వృట్టింపదె యిక్ష్వుధన్వునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్ (పినవీ. శాకుం. ౨ ఆ. ౧౮౮ ప.) భారతమున నిట్టి యవ్యయములమీఁద గ స డ ద వాదేశ మెచ్చటను జేయఁబడదు. క. ఆతని నత్యుగ్రానల। పాతోన్ముఖుఁ డైనవానిఁ బడకుండఁగనో। హోతఋకక్రమ్మఱు మని। యాతతభయుఁ గ్రమ్మఱించె నాస్తీకుఁడెడన్॥ (ఆది. ౨ ఆ. ౨౩౮ ప). ఇట నాశ్చర్యార్థకావ్యయముమీఁద గ స ఢ ద వాదేశాభావము ప్రాసస్థలనిబద్ధమై యున్నది. తత్కునకు మృతి సిద్ధమైయుండఁగాఁ దప్పుటచే నాశ్చర్య మొందవెననియరయునది. దీని ననుసరించియె సోమయాజియుఁ దననిర్వచనోత్తరరామాయణమున "ఉ......వైచితిం। బోశొఱగామి...ఓ।హో కృపమాలి (నిర్వ. ౯ ఆ. ౯౨ ప.) అని ప్రయోగించెను. సూ. రా. నిఘంటుకర్తలు పయిపినవీరభద్రునిపద్యములోని 'ఆహా' శబ్దము ద్వితీయార్థకప్రథమావిభక్తియనియు నట్లది ప్రథమాంతవిశేష్యమగుటచే నాదేశమువచ్చెననియు భ్రమించి యీక్రిందిరీతిని జూపిరి. "ఆహా. వి. ఆశ్చర్యము. శా......ఆ। హావృట్టింపదె..." (పి. శకుం. ౨ ఆ. ౧౮౮). ఇది సరికాదు. లింగకారకసంఖ్యార్థకత్వ మున్నంత మాత్రమున నవ్యయములను విశేష్యము లనరాదు. "స్వరాదీనాంతుకతిపయానాం లింగకారకసంఖ్యాన్వయోఽస్త్యేవ.........స్వస్తివాచయతి. స్వస్తివాచ్యః. క్షీ.ణే

మగుచున్నది. ఆ. వె. వెలయు నఖిలభువనములలోన వారణ। నగరిపురమతల్లి నాఁదనర్చి...(రాఘవ. ౧ ఆ. ౧౫). భారతార్థమున 'వారణనగరి+పురమతల్లి' అనుచో నాదేశ ముపేక్షితమయ్యెను. రామాయణార్థమున. 'అవారణ, నగరిపురమ తల్లి' అని ఛేదము. క. ఆపట్టణ మేలెడి పృథి। వీపాలుఁడు భృకుటిమాత్రవిముఖిత సమవా। టోపారిపంక్తిరథు డుద్దీపించు...—(రాఘవ. ౧ ఆ. ౨ ప.) రామాయణార్థమున 'భృకుటిమాత్రవిముఖితసమవాటోపారి+పంక్తిరథుఁడు' అనుచో నాదేశము చేతనవాచకముమీఁద నైత ముపేక్షితమయ్యెను. ఇట భారతార్థమున- 'సమవాటోప, అరిపంక్తిరథుఁడు' అని ఛేదము. ఉ. సీచనుదోయి...వయ। శ్శ్రీచనరెంటికింజెడిన......(మను. 3 ఆ. ౧౦౫) ఇట నాదేశము రాలేదు. భారతమున .క. కాపురివైయై సురరాజ్య।శ్రీ పాలింపంగ (ఉద్యో. ౧ ఆ. ౧౮౨ ప.). మ... వీ। ఁడు కృతఘ్నుండయి చెప్పె (భాస్కర. .యు. ౨౧౬౬.) చ....బీ। తు కుడిచి వచ్చి. (భాస్కర.) కం. చేతులకసివోఁ గయ్యము। చే త్రవిలెకునట్టివిధము...(హరి. ఉ. భా. ౭ ఆ. ౨౨ ప.) క. చేసఱచి నవ్వుచుం బరి। హాసోక్తులు (హరి. ఉ.భా. ౭ ఆ. ౭౮) ఇట్లు ద్వివిధమును బ్రయుక్తమయ్యెను.

| | |
|---|---|
| | తెనుఁగుమీఁది సాంస్కృతికపరుషములకు గ స డ ద |
| బాలవ్యా. | వ లు రావు. ౧౮. |
| ౭౦ IV | వాఁడు+కంసారి = వాఁడు కంసారి, వీఁడు+చక్రపాణి= |
| వివయ. | వీఁడు చక్రపాణి, ఆయది+టంకృతి = ఆయది టంకృతి, |
| | అది+తథ్యము = అది తథ్యము. ఇది+పథ్యము = ఇది |
| | పథ్యము. |

సంజీవని. ౭౦ IV విమ:—ఈసూత్రము నిర్మూలము. బాలసరస్వతీయాహోబలపండితీయానుసారముగ బా. సంధి. ౧3 సూత్రమును బాహుళకవిధిగ సూత్రించి నట్లు చింతామణిలోని 'నవికృతిశబ్దాది' త్యాదిసూత్రమున కపార్థము చేసికొని సూరి యీసూత్రమును భారతప్రయోగవిరుద్ధముగ సూత్రించెను. భారతప్రయోగముల కేకాక యీసూత్రమెల్ల ప్రామాణికగ్రంథములప్రయోగములకును విరుద్ధమై యున్నది. ఉదా:—మ. తగవు ఘటింప సత్పురుషదత్తములై చనుజీవనంబు లెం।త్రగుమతులై నమార్తురె. ..—(ఉద్యో. ౧ ఆ. ౨౭౬ ప.) క. అవిముక్తంబు... ఎవ్వం। డు వశియించును...(కాశీ. ౬ ఆ. ౨౬౦) (సర్వల ౧ ఆ. ౧౧౬) మ...

పుణ్యేస్వః పతతి. ప్రాతర్యజతే ఇత్యాదావకర్మకారకయోగదర్శనాత్." (సి. కౌ. ౪౩౨ సూ. బాలమ. 333 పు. అవ్యయాదాప్సుపఇతి సూత్రవ్యాఖ్య.)

వారివెం | పుష్పరీక్షింపమొ... (వసు. సర్వ్వల. ౧ ఆ. ౧౧౮) ఇ | ట్లుదపంబు... (నిర్వ. ౫ ఆ. ౮ ప.) శా...ఆశ్రమం | బుల్లై వల్య...వీ | రల్గోపించిన... (ఉ. హరి. ౪ ఆ. ౫౩ ప.) వేవణములు (విజ్ఞా-ప్రాయ. కాం. ౪౯ ప.) (ప్రౌఢ. సంధి. ౫ సూ.) (విస్తర).

కళలగు ప్రథమాంతములమీఁదను బ్రథమాంతకళాసర్వనామశబ్దాంతిమ వర్ణరూపపురుషబోధకక్రియాప్రత్యయములమీఁదను నీయాదేశము భారతమున నియతమై యున్నది. నేను తాను శబ్దములు కళలుగాన వానిమీఁద నీయాదేశము నిత్యముగా నేవచ్చును. వాని తుదిస్వరము లోపించునపుడు మిగిలిన 'నేన్ - తాన్' అను ప్రథమాంతములు ద్రుతప్రకృతికము లగుటచేత వానిమీఁద నీయాదేశము రాదు. అచట - గ జ డ దబాదేశమే వచ్చును. అచేతనవాచకములును బ్రథమాంతము లగునేని వానిమీఁదనైతమీయాదేశము నియతముగనే వచ్చును. తిమ్మకవిచెప్పిన ట్లట్టియెడల ఁబాక్షికత లేదు. మ...

విస్తర I. ౭౮ IV విష :—ఈనిరాధారసూత్రము నాధునికులు నిరాధారముగ నీక్రిందిరీతిని సవరింపఁగడఁగిరి. "కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక క త ప ల కు గ ద వ లు గానంబడియెడి. కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులందని యర్థము." (ప్రౌఢ. సంధి. ౫ సూ.) ప్రాసములందే యాదేశము వచ్చునపుడీకఁ దక్కినస్థలముల రాదనుట కాధారమే ముండును. ఇట్లె సూరిగారును దమ సూత్రాంధ్రవ్యాకరణాదులలో వింతవింతగా సూత్రించిరి. "నాచ్ఛికాదప్రాసేసాంస్కృతికానామ్." "జడసంబోధనకాకుభ్యోవా" (సూత్రాం. సంధి.) "సంస్కృతంబుమీఁదనే సాంస్కృతికంబులకు" "కాకుసంబోధనజడావ్యయంబులపై నెల్లెడల బహుళంబు" "ప్రాసంబునందు" "కర్మధారయంబునందు" "ద్వంద్వంబున నిత్యంబు" "అంతట సవలు బహుళంబని కొందఱార్యులు" (ఆంధ్రశబ్దానుశాసనము సంధి). ఇట్లు వింతవింతగ సూత్రించి తుదికి సూరిబాలవ్యాకరణమున నీవిధికి బాహుళకతను సూత్రించెను. ఈ గ స డ ద వాదేశపు కలవరమెల్ల నథర్వణుఁడు వివరించినశ్లోకంగారభూషణాదుల వివిధమతములమూలముననె కల్గినది. అహోబలపతియు నీకారికల నీక్రిందిరీతి నుదాహరించెను :—నినుఁ - గొనియాడ శక్యమవునె ద్రాపసమందార, త్రాపసమందార, రామా గ్రొనియాడెద నిను - కొనియాడెద నిను, రామద్రమాలనీల - తమాలనీల, రారసిరంతనోక్తినుత — చిరంతనోక్తినుత, సంసారభీతుఁడనైన గ్రర్కశుననుఁ గావుము - కర్కశు ననుఁ గావుము, నీదుపదభక్తిపటువు - పటువు, ఇత్యుదాహరణమ్. (అహో. ౨౧౦ పు.)

పార్శ్వంబు గావించిరా।కసుమిారాకా (శాంతి. ౨ ఆ. ౪౩౩) చా।యదలిర్పన్ (కర్ణ. 3 ఆ. ౨౧౯) క. చేసమరికొంచు...।డాసి—(ఆది. ౬ ఆ. ౨౦౬ ప.) మా। నుగ... (ఆది. ౭ ఆ. ౬౯) ఇ।మ్ముగ ... (సభా. ౨ ఆ. ౮౫) (అర. ౨ ఆ. ౧౪౧) (అర. ౪ ఆ. ౧౦౦) పొ। ల్పుగ...(అర. ౨ ఆ. ౮3) ద్వితీయార్థక ప్రథమమిాందసయితమిట్లు నిత్యముగనె వచ్చును. ఉజ్జ్వల। శ్రీదొలుంగె (ఉద్యో. ౧ ఆ. ౨౮౬) కల్పకం। బుగరము లీలఁదెచ్చె (ఉద్యో. ౨ ఆ. 3౧౦) పెద్దవారిమా। ట గొనమి (ఉద్యో. 3 ఆ. ౨౪) కేతనం। బు దునిమి...(భీష్మ. ౧ ఆ. ౨౫౨) సమాధి। శ్రీవాటింపు (అశ్వ. ౨ ఆ. ౨౧౯) వీసానకై...। చేసాచికొను కర్మజీవులతోడ (బసవ. ౭ ఆ. ౪౬౦) ('వీసానికై' అనుముద్రణము లక్షణవిరుద్ధము). తలు। చుగ...(ద్రో. ౪ ఆ. ౪౧) జెట్టుగ నాఁటిన...(ద్రోణ. ౪ ఆ. ౪౭) అ। ట్లుగ నీ...(నిర్వ. ౪ ఆ. ౭) (అట్టు - ఏకవచనము. అట్టులు - బహువచనము. అటులన్ = అట్లన్ - ద్వితీయా బహువచనములు. ఇట్లగుటచే "అట్టు - అట్టులు" అనునవి యవ్యయములు కావన వచ్చును). పురుషబోధకక్రియా ప్రత్యయములమిాఁద:—లే। దుగదా...(నిర్వ. ౬ ఆ. ౧౬ ప.) లే।వు దలఁప. (శాంతి. 3 ఆ. ౪౧౯) 'అది - అవి' అనువాని ప్రాచీనపర్యాయరూపములు "అదు - అవు" అనునవి తెల్గునఁదును నుండెడివి. వాని తుదివర్ణములు క్రియాప్రత్యయములలోమాత్రమె నేఁటికి నిల్చియున్నవి. లేదు-లేవు-చేయదు-చేయవు-కలదు-కలవు - మొ. 'అ' అనునది యవధారణార్థకావ్యయ మగుటచేదానిమిాఁద నీయాదేశము రాదు. క. పర్వం। బకదు న్ మేలనఁగ...(ఆది. ౧ ఆ. ౫౮). క. అప్పా। ట తనకు గుటిగానురవడి।నతఁడు (నిర్వ. ౬ ఆ. ౧౨౨) (పాటు+అ = పాట). ఇట్లగుటచేత "కవనోనలును...ఏ। నవిదప..." అనునధు నాతనులసవరణము ప్రామాదికము. "కవదొనలును...ఏ। నువిదప..." అనుపాఠమె కవిప్రయుక్తము. 'నేను - ఏను' అనునవి ప్రథమాంతములగుకళలు. వానిమిాఁద నీయాదేశము నియతము. (విస్తర).

విస్తర II. ౭౮ IV విష:—మహాకవిప్రయోగము లిట్లుండఁగా నేఁటి కొంద ఱీక్రిందిరీతిని వ్రాయుట సరికాదు. "ప్రథమమిాఁదను—ద్రుతప్రకృతికము లైన నేను - తాను మిాఁదతప్ప—నన్నయాదిప్రాచీనకవులకావ్యములలో ఈయా దేశము నిత్యముగా కనబడుతున్నది" (బాలకవిశరణ్యము. 3౧౭పు.) "నేను తానుశబ్ద ములమిాఁది పరుషములకు గ స డ ద వ లురావు. ఇవి ప్రథమాంతములైనను ద్రుత ప్రకృతికములుగావున ౪3 సూత్రముచే గ జ డ ద బ లు వచ్చును. ఉదా:...తాను జెప్పెను. నేను జదివితిని" (ఆం. భా. అ. సంధి. ౬౮ సూ.) నేను - తాను శబ్ద

మ. కౌరవవ్యాంబుజశ్రేణి చి। క్కువడంజేయదె. (విరా. ౧ ఆ. ౫౬) ఇందలి చిక్కుశబ్ద మవ్యయమనియు 'అవ్యయేకర్మధారయే' అనుచోఁ బ్రఁన నాదేశమువచ్చిన దనియు ముద్దరాజు రామన కవిజనసంజీవనిలో నుదాహరించుట సరికాదు. (కవిజనసం ౧ తరం. ౧౭ ప.) చిక్కుశబ్దము విశేష్యము. పయిపద్యమునఁ జిక్కుశబ్దము ద్వితీయార్థకప్రథమాంతముగఁ బ్రయోగింపఁబడుటచేత నాదేశము వచ్చినది. 'చిక్కు - దే. వి. ౧ మెలి. ౨ సంకటము.' (శబ్దర). ఇట్లె. 'ఒంటి' శబ్దము నవ్యయముగఁ దిమ్మకవి యుదాహరించుటయు సరికాదు. "చ. కౌరవసేన యేడ యొం। టిసనుట యేడ...(విరా. ౫ ఆ. ౨౩౮) (సర్వల. ౧ ఆ. ౧౦౮ ప.) ఇందు 'ఒంటి = ఏకాకి' అని యర్థము. ప్రథమాంతము. విశేష్యము. 'ఒంటి - విణ - ఏకాకి...వి. ఏకాకిత్వము...." (సూ. రా. ని.) సోమయాజి యీశబ్దముమీఁద స్థలాంతరమందును నాదేశమునె ప్రయోగించెను. చ...ఒం। టిదిగుదాని కోర్వదు...(విరా. ౧ ఆ. ౧౦౩).(ఒంటియందు ఉద్యో. ౩ ఆ. ౩౧)

కళలగు నవ్యయములుసైతము ప్రథమార్థకములు కానపుడు వానిమీఁద నీయాదేశము భారతాదిప్రాచీన గ్రంథములలో నియతముగా నుజ్జగింపఁబడెను. ఏల - ఏలా - మున్నగు నవ్యయములమీఁదను, 'అ - ఆ - ఎ - ఏ ఓ' మున్నగు

---

ములు ద్రుతప్రకృతికములు కావని యీావళికు నిరూపింపఁబడెను. (౮౩ III. ౮౮-౮౫ - ౮౬ - విష.) ఈవిషయమున బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగా రిట్లు వ్రాసిరి. క. ముంద రరదము డిగు మే। నువిదపడిగియెద (శల్య ౨ ఆ). అని తిక్కన, 'ఏను' కళగాఁ బ్రయోగించెను. 'ఏ। నవిదప' అనుసంస్కారము తప్పు. 'ఏ। ను వెనుక' అనుపాఠము కలదందురుగాని యది నా కే ప్రతిలోను గానరాలేదు. ఆశబ్దములను (తాను. నేను శబ్దములను) బ్రాచీనులు కళలుగానే ప్రయోగించిరని నానమ్మకము. కళలు గనుకనే 'ఏను' పై 'పిదప' 'విదప' అయినవి. మఱియు నేనుగరం బుత్సుకవృత్తితో, (నిర్వ. ౮ ఆ.) ఈ (నిర్వచనోత్తరరామాయణ) ప్రయోగము ద్రుతత్వమునకు సాధకమె. కాని ప్రాచీనప్రతులలోఁ బెక్కింటఁ దాను నేను శబ్దములమీఁది కచటతపలు గ స డ ద వలుగాఁ గానవచ్చినవి" (బసవపురాణపీఠిక. ౧౦౭ పుట.) పీరింతసందేహింపఁ బనిలేదు. నేను తాను శబ్దముల తుదినున్న 'ను' అనునది ద్రుతముగ నంగీకరించువారిపక్షమందు సైతము ద్రుత 'ను' స్వరూపము మీఁది పరుషములకు గ జ డ ద బాదేశమువచ్చుట (౯౦ II విష.) ప్రాచీనమహాకవిప్రయోగములం దెచ్చటను గానరాదు. నన్నయాథర్వణ పక్షమున ద్రుతమునకు 'ను' స్వరూపమె లేదు.

కాక్వాద్యక్షరకములమీఁదను సంబోధనాంతములమీఁదను లాక్షణికావ్యయములగు క్త్వాంతములమీఁదను నీయాదేశము భారతాదిప్రాచీనగ్రంథములలోఁ బ్రయుక్తము కాలేదు. మ...ప | ల తోలంగెన్...(శాంతి. ౨ ఆ. ౬౬). ఉ ...ఇంతనెప్పనే | లా పొరిగొందు (ద్రో. ౩ ఆ. ౧౫౮) కాక్వాదిస్వరములమీఁద క. పర్వం | బకడున్ మే లనఁగ...(ఆది. ౧ ఆ. ౫౮) మ. ధృతరాష్ట్రుఁడును...కా | నతగం బొందుట... (ఉద్యో. ౧ ఆ. ౩౫౮) (కాన్+అ = కాన = కాఁగానే = కావునవే) క. నీచె ప్పిన...వాకలం గొని | యేచక్కంబెట్టువాడ...(ఉద్యో. ౨ ఆ. ౨౫౦) (విస్తర.)

విస్తర. III. ౭౮. IV. విష:—ఇందలి 'కాన' శబ్ద మవ్యయమగుటచే నాదేశము పాక్షికముగాన రాలేదని తిమ్మకవి యుదాహరించెను. కాని కాక్వాదిస్వర ము మీఁద నాదేశము రాకుండుట మహాకవిసమ్మతమని తలంపఁడయ్యెను. మఱియు నిచటి 'కాన' శబ్దము 'కావునన్' అనుదానిరూపాంతరమనియె యాతఁడు తలం చెనుగాని యది "కాన్+అ" అనుచ్ఛేదముగలశబ్దద్వయము జంట యని యాతఁడు గ్రహింపలేదనియు విశదమగుచున్నది. ఇట్లె భారతసంప్రదాయములను గ్రహింపఁ జాలక యీవిషయమున గుప్తార్థప్రకాశికాకర్త యీక్రిందిరీతిని వింతవింత ప్రసంగ ములు చేసెను.

"మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము గుంతీనందనుల్ సింహముల్ | మతి సూహింప నసింహమైనవనమున్ మర్దింతు రెండున్ వనా | వృతవృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేటొందుఁగా | న తగంబొందుట కార్య మీయుభయమున్ సంతుష్టిమై నున్కికిన్ ॥ (ఉద్యో. ౧ ఆ. ౩౫౮) ఇందలి కానశబ్దము ద్రుతప్రకృతిక మగుటచే 'కానఁ దగంబొందుట' అనురీతిని బ్రాసభంగముకల్గు" అని శంకించుకొని దానిని గాపాడుటకై 'కాన తెగంబొందుట' అని పూర్వపక్షముగ సవరించి దీని యర్థము సరిపడలేదని యీపక్షమును నిరసించి స్వసిద్ధాంతముగ 'కాన తగంబొందుట' అనియే నిలిపి 'కాన = అడవి, తగన్ = యుక్తముగ, పొందుట = కలియుట' అని యర్థముచేసి గ స డ ద వాదేశము బాహుళకముగాన నిచట నాదేశము రాలేదని సమర్థించి 'సింహంబుకూడ వనంబుతోఁ గలిసియుండుట' అనునర్థము నిచ్చుశబ్దములు లేమింజేసి యర్థపుష్టి లేకుండఁగా నట్టివాని నధ్యాహార్యములనుజేసి దీర్ఘమగుచర్చను గుప్తార్థప్రకాశికాకర్త గావించెను. (బా. గు. ప్ర. ౪౨ - ౪౩ - పు. ద్వి. ము.) భారతమున గ స డ ద వాదేశము బాహుళకముగాక నిత్యమె యగుటంజేసి బా. గు. ప్ర. దీర్ఘ దీర్ఘప్రసంగమెల్ల వృథాప్రసంగమె యగుచున్నది. ఇంకఁ జేటికా వ్యాఖ్యాత, సంధి - ౧౬ సూత్రపువ్యాఖ్యలో నీ బా. గు. ప్ర. వ్యాఖ్యవిషయ

ములను జాలవఱకు స్వీకరించి యీసూత్రపువ్యాఖ్యలో సంక్షేపముగా వ్రాసి కవి సంశయవిచ్ఛేదాదులలో నేతత్సూత్రపువిషయము విస్తరింపఁబడియున్నదని వ్రాసెను. కాని కవిసంశయవిచ్ఛేదములో నీ గ స డ ద వాదేశవిషయము స్మరింపఁబడనైన లేదు. (బా. సా. వే. ౬౪ పుట.) వేటికావ్యాఖ్యాత "వారలం గొని। యే చక్కం బెట్టువాఁడ నేఁబాండవులన్" (ఉద్యో. ౨ ఆ. ౨౫౦) అనుపద్యములోని "కొని పదము తరువాతి 'యే' ప్రశ్నార్థకముగ నంగీకరించుటయే యుక్తముగును... ఈపక్షమున గ స డ ద వాదేశము వికల్పవిధి గాన, రాదయ్యెనని యెన్నునది" (బా. సా. వే. ౬౯ పు.) అని వ్రాసెను. దీనినిబట్టియీతఁడు సయుతము బా. గు. ప్ర. కర్త వలెనె భారతమున గ స డ ద వాదేశము నిత్యమనియు, ప్రథమార్థము లేని యవ్యయములమీఁద నాదేశము రాదనియు గ్రహింప లేదని స్పష్టపడుచున్నది.

"క. విదితముగఁ దాను నేనను। పదములు ప్రథములయి నాంతపదము లగు టఁదా।జివెను నేచదివితి.నని।వదలక యిరుదెఱఁగు పలుకవచ్చు మహేశా. ఆదేశము రానందులకు—కం॥ నీచెప్పిన పెద్దలు ద్రో। ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా। రై చన్న వారలంగొని। యే చక్కంబెట్టు వాఁడనే పాండవులన్. (ఉద్యో. ౨ ఆ. ౨౫౦) ఆదేశము వచ్చుటకు—క. ఏఁగోరినచెలువుఁడె నను। దాఁగావలె నంచు..." (విజయ. సర్వల. ౧ ఆ. ౨౭ పు.) ఇచట "వారలంగొనియే, నేను బాండవులను జక్కంబెట్టువాఁడ" అని సమన్వయించి, చతుర్థపాదాదినున్న 'ఏ' అను నది యవధారణార్థక కాక్వాదిస్వరమగుటచేత గ స డ ద వాదేశము రాలేదని చెప్పఁ దగియుండుటం జేసి "ఏన్" అను నస్మదర్థకముమీఁద నాదేశము రాలేదనుట కిది యుదాహరణమనెడి తిమ్మకవియాశయము సరికాదు. కాక్వాదిస్వరములమీఁద నాదేశము భారతసమ్మతము కాదనుటకు—క. కీచకుని,..కొనిర। మ్మా చూతము... (విరా. ౨ ఆ. ౯౯) క...డగ్గఱు। మాతలకక (ద్రోణ. ౫ ఆ. ౧౨౨) శా. ఇం। తే పోతమ్ము (ఉద్యో. ౧ ఆ. ౩౨౧) శా...పోయిన। ట్లే పోనిత్తురు...(ఉద్యో. ౩ ఆ. ౪౫) ఉ...,కీ। దేవరువంశ...(ఉద్యో. ౩ ఆ. ౧౭౧) ఉ...నే। నేతగ వ్రాఁది...(ఉద్యో. ౪ ఆ. ౩౯) క....। స్రోతోమార్గంబులఁ జూ। వేతమ...(అశ్వ. ౧ ఆ. ౧౭౪) క. ఒందమి సూ। రే తెరువు...(శాంతి ౬ ఆ. ౧౪) సీ. తునిసె। నో తేరువిఱిగెనో సూతుండు...(ద్రోణ. ౧ ఆ. ౮౦) సంబోధనాంతములమీఁద రాకుండుటకు - క...శ ర। ణ్యా కావునన్ను...(కర్ణ. ౨ ఆ. ౭౭) క...కృ। ష్ణా తుని మెద...(కర్ణ. ౨ ఆ. ౩౨౯) ఉ...మహా। త్మా తెలివొందె...(శాంతి. ౬ ఆ. ౫౫౯) ఉ...తల్లి కృప...(అను. ౧ ఆ. ౨౧౦) క...ఓ।మహా తక్షక...(ఆది. ౨ ఆ. ౨౩౫).

అప్పా। ట తనకు...(నిర్వ. ౬ ఆ. ౧౨౨) క్త్వాంతములమీఁద గ స డ ద వా దేశము నంగీకరించి తిమ్మకవి యీ క్రిందిపద్యము నుదాహరించెను. అది సరికాదు. క. ఆసభ నక్కటయి సీరు ! శ్యాసనుఁ డప్పాండుపుత్త్రసతిఁ గ్రూరాత్మం । డై సీర లొలిచి...(స్త్రీ. ౨ ఆ. ౫౬) వావిళ్ళవారి ముద్రణమునందు 'క్రూరాత్ముం । డై సంకలేక' 'క్రూరాత్ముం ! డై సంకటపడి' అని పాఠములు ముద్రితము లయియున్నవి. కాని నాయొద్ద నున్న తాళపత్త్రమాతృకలు రెంటను బయితిమ్మకవ్యుదాహృతమగు "ఐ సీరలొలిచి" అనుపాఠ మె యున్నది. భారతమున క్త్వాంతముపై గ స డ ద వా దేశము మఱెచ్చ టను లేమింజేసి యిచటఁ దిక్కయజ్వ "చీర" శ బ్ద భ వ మగు "సీర" శబ్దమును బ్రయోగించెనని యెన్నఁగును. చేలము = సెల్లా, నారాచము = నారసము, చంపకము = సంపఁగి మున్నగువానియందువలెనె చీరశబ్దచకారము సకారముగ వికృతి నొందుట వింతకాదు. (వై. పా. ౧౧౯ విష.)

అచేతనవాచకములమీఁద నా దేశమువచ్చు ననెడి యనుగమమునైత మసంగతమె. అచేతనవాచకము ప్రథమాంతమైనపుడు దానిపై నాదేశము నిత్యముగ వచ్చును. ప్రథమాంతము కానపుడు రాదు. ప్రథమాంతమగు నచేతనవాచకముపై నాదేశము పాక్షికమనుటయు భారతసమ్మతము కాదు. ఇట్టియెడల నాదేశము రాదనుట కుదాహృతి భారతమున లభింపమింజేసి తిమ్మకవి, కవిజనసంజీవనిలో నుదాహృతమగు నీక్రిందిపద్యము నుదాహరించెను.—క. నాపతులగు గంధర్వుల । చేపడి మృతిఁబొందె వీఁడె సింహబలుండీ।...(విరా. 3 ఆ. 3 ప) కాని యిందలి 'చే' శబ్దము ప్రత్యేకప్రథమాంతశబ్దము కాదు. 'అగ్గపడు = వశపడు' అనునర్థము గల శబ్దపల్లవ మీ 'చే పడు' శబ్దము. ఉ....పాండవుల్ । చే పడిరేని చంప...(ఉద్యో. ౪ ఆ. ౬౫) అని స్థలాంతరమందును నిట్లె సోమయాజియా దేశము నుజ్జగించెను. ఇదేకదా యీయాదేశమునకు భారతమునఁ గలయసాధారణ నియమవిశేషము.

---

శబ్దరత్నాకరమందును, సూ. రా. నిఘంటువునందునునీనన్న యపద్యములోని 'ఓహో' శబ్దము సంబోధనార్థకముగా వ్రాయుటచే నిట నుదాహరించితినిగాని యిందలి 'ఓహో' శబ్దమాశ్చర్యార్థక మెయనఁదగును. (విస్తర III ౭వ విష.)

క్త్వాంతములమీఁదను నా దేశము భారతసమ్మతముకాదు.ఉ...పర్చువా । రై తగ వాచరించి...(విరా. 3 ఆ. ౧౨) చ. ఆర్చి తనరథంబుపై...(విరా. 3 ఆ. ౨౦౨) క. నీచెప్పిన...వా।రై చన్న...(ఉద్యో. ౨ ఆ. ౨౫౦) మ...చూ।చి తగం బొమ్మని ...(ఉద్యో. 3 ఆ. ౬౦) క...దానంబులుచే । సి పడయు...(ద్రోణ. ౨ ఆ. ౨౯౯) క...మాంసము చవిగో । రి తినన్...(అను. ४ ఆ. ౨౯౧). మొ.

వచ్చినచోట నెల్లెడలను నియతముగా వచ్చుటయె. రానిచోట నెల్లెడలను నియతముగా రాకుండుటయె. ఇల్లు-కైకొను-పైపడు-చేపట్టు మున్నగు శబ్దపల్లవస్థలములందెల్ల నీయాదేశము రానేరదు.

'కైసేయు - చేసేతన్' అనునవి పయివానివంటివి కావు. క. కైసేసి మదవికారో। ల్లాసమ్మున మేనుపొంగ......(విరా. ౨ ఆ. ౩౭౯) (సర్వల. ౧ ఆ. ౧౧౨) కై = కయి = చేయి. కై+చేయు = 'చేతిమనిఁజేయు' అనఁగా 'నలంకరించు.' లేదా - 'అంగీకరించు.' రెండర్థములందును 'కై' శబ్దముద్వితీయార్థక ప్రథమగా వివక్షితమయ్యెను. కాన దీనిమీఁద నాదేశమువచ్చుట విరుద్ధము కాదయ్యె.

'చేసేతన్' అనుచో 'చేయి+చేయి+అన్ = చేసేతన్' అని ప్రక్రియ సెన్ను నది. 'నాడు+నాఁడు+కున్ = నానాఁటికిన్. నాఁడు నాఁటికిన్' అనుస్థలమందలి ప్రక్రియను స్మరించునది. పయిరీతిని 'చేసేతన్' అనుచో 'చే' శబ్దము ప్రథమాంతముగాన నాదేశము వచ్చుచున్నది. క. చేసె నఘము తత్ఫలముం। జే సేఁతం గుడిచె... (శాంతి. ౩ ఆ. ౨౫౧) శా. చేసేతం బృథివీశు లందికొనఁగా శ్రీపుణ్యతోయంబులం। జేసెన్ మజ్జనము...(నిర్వ. ౧ ఆ. ౨౬)

శేషషష్ఠీసమాస మందును గర్మధారయమందును నీ గ స డ ద వాదేశము రాదు. ఈయాదేశము వ్యస్తమాత్ర (ద్వంద్వేతర) గోచరము. కర్మధారయమున:— గొంతి ముద్దునే। యుకొడుకు...(విరా ౧ ఆ ౯౮ ప.) చూ। చు తలంపెత్తెడు... (భీష్మ ౧ ఆ ౨౦౬) త్రో। చు తలం పలవఱుచు (అను ౧ ఆ. ౭౨) సస్నానముసే।యు తలంపున...(సౌప్తి. ౧ ఆ. ౧౩౧) కైపెక్కిన। ట్టితలంపు...(ఉద్యో. ౩ ఆ. ౭౨) చ...పిన్నతునియలై...(సౌప్తి ౧ ఆ. ౯౮) ఏతెంచున।ట్టితెఱంగైన...(ఆర ౭ ఆ. ౨౯౨) షష్ఠీసమాసమున రానందులకు:—శా. బాహాబల।శ్రీకల్మిన్...(విరా. ౩ ఆ. ౧౪౬) (శ్రీయొక్క+కల్మిన్) కం. లోకేశ నీవు ధర్మ। శ్రీకావలిగాఁగ...... (శాంతి. ౬ ఆ. ౩౫౧) (ధర్మశ్రీయొక్క+కావలి) క. నీచెప్పినపెద్దలు...(ఉద్యో. ౨ ౨ ఆ. ౨౫౦) ఇం। టికడనయున్కి...(విరా. ౩ ఆ. ౧౫౧) కూచిమంచి తిమ్మకవి 'కాకా సంబోధనే చాపి। హ్యావ్యయే కర్మధారయే' అనుచొప్పునఁ గర్మధారయమున నాదేశము వికల్పమనుచు నీక్రిందిభారతపద్యము నుదాహరించెను. చ.... ఒం। డుగడకుఁ బోవకుండఁగ......(కర్ణ. ౩ ఆ ౭౯౩) మ......ఒం। డుగడన్ బుట్టిన...(విరా ౧ ఆ. ౧౩౦) ఈతఁ డి ట్లుదాహరించెనేకాని 'ఒం। డుకడ.' అను రీతి ప్రయోగమును మచ్చునకైన భారతమునఁ జూపఁగలఁడా? అట్టిప్రయోగ మొక్కటేనిలేదు. "ఒండు - ఎంత" మున్నగునవి విశేషణార్థము నిచ్చుచున్నను నివి

ప్రథమాంతసర్వనామములు. "ఒండు. వై. స." (శబ్దర) "ఎంత. ద్వి.|స...వకొలఁది" (శబ్దర) కాన నీనిమీఁద నాదేశము వచ్చుటయె సహజము. "ఒం|డు దలం పులు...(నిర్వ ౪ ఆ. ౩౧) ఎం|తగుమతులైన మూర్తురె...(ఉద్యో. ౧ ఆ. ౨౮౬) ఇట్టి వేనేతులు-ఇరుగురుదల్లులు - పన్నిద్దఱుదపసులు - మున్నగు ప్రథమాంతసర్వనామములమీఁద గ స డ వ వాదేశము భారతకవిసమ్మతము. ఇంక నలువది - అఱువది - ఇరువది - నలుగడలు - ఇరుగడ మున్నగుచోటులందు "నలు" మున్నగునవి ప్రథమాంతసర్వనామములు కావు. 'నలువది' మున్నగునవి సమాసము లనకతీరదు. కాన నట్టిచోటులందలి గ స డ ద వాదేశము సమాసాశ్రయవిధులచే సాధించుకొనవలయును. అట్టి సమాసాశ్రయవిధుల నాంధ్రవైయాకరణులు విస్తరించి చెప్పలేదు. అట్టివెల్ల "భూయసీదేశ్యశబ్దేషు। లోపవర్ణాగమశ్రుతిః" "నిక్కలాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బా. సమా. ౨౦ సూ.) అనునవి యాదిగాఁగలసూత్రములచే సాధించుకొననగును.

— 'వేగ - వే' అను రెండును సంస్కృతవేగశబ్దమూలకములు. ప్రథమైకవచనాంతములు. ఇందు'వే' అనునది తద్భవమనుట నిర్వివాదము. 'వేగ' అనునది వైకృతమని కొందఱు తలంచుచున్నారు. ప్రామాణికులు తత్సమమె యందురు. (చూ. తత్స. ౫ర సూ. ౧౬౨ I విష. విస్తర. వేగశబ్దము) ఈరెండిటిమీఁద నీయాదేశము భారతమున నియతముగ నుజ్జగింపఁబడియున్నది. మ. వే|గ లెగంబాఱుడు... (ఉద్యో. ౩ ఆ. ౨౫) వే|గ తొలఁగ నీడ్చె (శల్య. ౧ ఆ. ౨౪౧). క. కీచకుని...| వేచని యుచటికి...(విరా. ౨ ఆ. ౮౯). క. వేపోయి......(ఉద్యో. ౪ ఆ. ౩౮౭) ఉ. వే తఱియంగఁ జొచ్చి (భీష్మ. ౨ ఆ. ౩౧౬). క. వేతూలును......(కర్ణ. ౧ ఆ. ౮౮) ఇట్టిచోటులందలి వే- వేగశబ్దములు ప్రథమాంతవిశేష్యములు కావనియు, 'వేగముగా' అనునర్థమున లుప్త 'కన్' శబ్దకక్రియావిశేషణములుగా భారతకవులచే వివక్షింపఁబడినవనియు (ప్రౌఢ. క్రియా. ౨౨ సూ.) నక్కారణమున వీనిమీఁద గ స డ ద వాదేశము భారతకవిసమ్మతము కాదయ్యెననియు గ్రహింపవలయును. (విస్తర IV).

---

విస్తర. IV. ౭ర IV విష:—ఇంతటి నియమముగల యీయాదేశమును గూర్చి నేఁటివిమర్శకు లీక్రిందిరీతిని వ్రాయుట సరికాదు:—"ప్రాచీనతరశాసనరీతి ననుసరించి తొలుత నీయాదేశము నీగ్రంథమునఁ బూన్కితోఁ బాటింపఁదలఁచితిని గాని భారతాదిప్రయోగముల ద్వైవిధ్యమును బర్యాలోచించి యాపూన్కిని వీడి నేనును బహుళముగానే యీయాదేశము నిందుఁ బాటించితిని" (బసవపురాణ

సూచించుచితిమ్మకవి భారతములోనిదనుచు నీక్రిందిపద్యమును బ్రామాదికముగ నుదాహరించెను. క. ప్రదరప్రవాహమున న। ష్టుడవద్ద్వైరదంబు పటుగమన ముడిపి ముదం। బొదవిన సాత్యకి విలుబి। ట్టుదునిమె నమ్మగధనాథుఁడు మహోగ్రుండై (ద్రోణ. సర్వల. ౧ ఆ. ౧౦౨) ఇందలి 'బిట్టు' అనుపదియును 'బిట్టుగన్' అనునర్థముగలదై క్రియావిశేషణ మనఁదగియుండుటచే దీనిమీఁది పకారాదేశము భారతసంప్రదాయవిరుద్ధ మనఁదగియున్నది. కాని యీపద్యము ముద్రితభారత పుస్తకములందును, దాళపత్త్రమాతృకలందును గన్పట్టలేదు. తిమ్మకవి స్థలాంతరములందువలెనె యిచ్చట నైతము దీనిని భారతద్రోణపర్వపద్యముగా నుదాహరించుట పొరపాటనియు నిట్టిపొరపాటులు సర్వలక్షణసారసంగ్రహమునఁ బెక్కుగలవనియు నెఱుంగనగును.

నన్నయ. పరుషాణాం గ స డ ద వాః స్యుః పదాద్ద్వన్ద్వే (ఆం.
౪౯ విష. చిం. సంధి. ౧౦ కారి. అహో. ౨౨౨ పు.)

కల్పతరు. ౪౯ విష:—ద్వన్ద్వే = ఆచ్ఛికద్వంద్వసమాసమునందు, పదాత్ = పూర్వపదమునకంటెఁ బరమైనపరపదము మొదటనున్న; పరుషాణామ్ = క చ ట త ప

---

పీఠిక. ౧౦౬ పుట). ఇట్లు వ్రాయ సాహసించిరే! భారతమున నెచ్చటనైన ద్వైవిధ్యముగలదా ? మఱియు గ్రంథకర్తయభిప్రాయమును సందర్భ ప్రబలప్రయోగములనుబట్టి యరసి ముద్రణసంస్కారము చేయనగునుగాని సంస్కర్త తనయిష్టానుసారము సంస్కరించుటుచితమా ? తాను బసవపురాణమున బహుళముగాఁ బాటించుటేమి ? ముద్రణమువల్ల గ్రంథకర్తలయాశయము లిట్లు మాయుచున్నవే !

"ఆంధ్రశబ్దచింతామణ్యాదుల విశ్వసించి వ్యాకరణకర్తలు కొంద ఱాచ్ఛికములమీఁది తత్సమములకుఁ గలదని తత్సమములమీఁది యాచ్ఛికములకుఁ గలదని యింకేమోయని వ్రాసిరిగాని యదియెల్లఁ ద్రోసిపుచ్చఁదగినది. పరిశీలింపఁగాఁ గళలపైనుండు పదాది కచటతపలకు గ స డ ద వలు బహుళముగావచ్చుననుటయె చిక్కులేని నిర్వచనముగాఁ గానవచ్చుచున్నది" (బసవ. పీఠిక ౧౦౬ పు.) "చింతామణ్యాదులను విశ్వసించి" అనుటకుఁ జింతామణి చేసిన యపరాధమేమో ? తెలియకున్నది. ప్రథమమీఁది, అనుదానిని ద్రోసిపుచ్చి 'కళలమీఁది' అని నిల్పుట కేమి యాధారము ? ఇంతకును 'బహుళ' మన్నపు డింక నేమిచెప్పినను నెట్టిచిక్కైన నెట్లు వాటిల్లును ? ఇట్లు చెప్పుట కంతపర్యాలోచింపనేల ?—

లకు, గ స డ ద వాః = గ స డ ద వలు వరుసగా, స్యుః = అగుచున్నవి. ఉదా:— కూరగాయలు, కాలుసేతులు, టక్కుడెక్కులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు మొ. గ స డ ద వాఃస్యుః ప్రథమామాత్రాదిత్యాదిసూత్రముచేత వ్యస్తస్థలములందలి గ స డ ద వాదేశము నుపదేశించి యీసూత్రముచే ద్వంద్వసమాసమునందు మాత్రమె గ స డ ద వాదేశమును విధించుటంజేసి ద్వంద్వేతరసమాసములలో నీయాదేశము రాదని విశదమగుచున్నది. "ఇరుగడ - నలుగడలు, ఇరువది, నలువది, ఆఱువది" మున్నగుసమాసములలోని గ స డ ద వాదేశము లేకపోలేదు. కాని యట్టిస్థలములు నిపాతన్యాయమున 'ఔపవిభక్తిక వదన్తవిధయశ్చ' అను చింతామణిని వివరించుచు సమాసాశ్రయవిధుల నుపదేశించి సాధించుకొనఁదగినవే కాని ద్వంద్వమునందువలెనె కర్మధారయద్విగువులలో నీయాదేశమగునని తలంపరాదు. విశేషణసమాసములలో గ స డ ద వాదేశాభావము భారతసమ్మతమని యీవలనె నిరూపితమయ్యెను. (౭౮ IV విష.) కావున "నలుగడలు పలుదెఱంగులు, వెలిదమ్మి, వెలిదామర, ఇతిరూప మాథర్వణమ్, ఆచార్యస్యాపి సమ్మతమేవ, నల్గడ నిత్యాది, తత్ప్రయోగాత్" (అహో. ౨౨౨ పు.) అను నహోబలపతివాక్యములు సరికావనకతీరదు. వెనుకవివరించినరీతిని "అవ్యయే కర్మధారయే" అనునది యథర్వణమతము కామింజేసి 'వెలిదామర ఇతిరూప మాథర్వణమ్' అనుకవిశిరోభూషణవాక్యము సరికాదు.

ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడద
బాలవ్యా. వలగు. ౧౫.
౭౬ I విష. కూర+కాయ = కూరగాయలు, కాలు+చేయి- కాలు
సేతులు, టక్కు+టెక్కు = టక్కుడెక్కులు, తల్లి+
తండ్రి=తల్లిదండ్రులు, ఊరు+పల్లె=ఊరువల్లెలు.

సంజీవని. ౭౬ I విష:— ద్వంద్వంబునన్ = అచ్చతెలుఁగుద్వంద్వసమాసమునందు, పదంబుపయినను దళముచే 'కూరగాయలు' మున్నగురీతిని ద్వంద్వసమాసములోని పూర్వపదాపరపరుషములకు గసడదవాదేశము రాదని యెఱుంగునది. "నిత్యముగా నీవిధి యారబ్ధముకాన సంధి ౧౩ సూత్ర మైచ్ఛికశాస్త్రమని స్పష్టపడెను. మఱియు నాచ్ఛికద్వంద్వమున నిత్యవిధానమునంజేసి యితరాచ్ఛికమిశ్రసమాసముల నీవిధియైచ్ఛికమని గ్రహింపఁదగును" (బా. సా. వే. సంధి ౧౫ సూ. వ్యా.) ఈవ్రాత సరికాదు. సూత్రకర్త ౧౩ సూత్రము శాఖాంశకమని కంఠోక్తముగ వచించుచుండఁగాఁ బ్రకృతసూత్రనిత్యవిధానముచే నది యైచ్ఛికమనునర్థము

లభించుననుట యుక్తముకాదుగదా. మఱియు బాహుళకవిధి ప్రవృత్తివేఱు, ఐచ్ఛికవిధి ప్రవృత్తివేఱు. సమాసములలో ద్వంద్వమునమాత్ర మాదేశము నిత్యమని యుపదేశించుటచేఁ దక్కినసమాసములలో నీయాదేశము కానేరదనునర్థము లభించునుగాని తక్కిన సమాసములలో నైచ్ఛికముగావచ్చు ననునర్థ మెట్లు లభించును? శబ్దరత్నాకరమందును సూ. రా. నిఘంటువునందును 'తెలిదమ్మి - తెలిగంటి - తెలిదమ్మికంటి - తెలిపక్కము - తెలిపిట్ట - తెలిపులుఁగు - తెవులువడు - తెలితేఱి' మున్నగురీతిని నియమశూన్యముగ నీయాదేశను సమాసములం దంగీకరింపఁబడినది. కర్మధారయమునం దాదేశమువచ్చుటకుఁ బ్రాసాదిగతప్రబల ప్రయోగప్రమాణము కన్పట్టలేదు. "అవ్యయే కర్మధారయే" మున్నగుశృంగార భూషణాదిమతము లధర్వణసమ్మతములు కావనియు "తెలదమ్మి - వెలిదామర ఇతి రూపమాధర్వణమ్" (అహో. ౨౨౨) మున్నగుకవిశిరోభూషణవాక్యములు నిర్మూలములనియుఁ గల్పతరువులో వ్రాయఁబడియెను.

ద్వంద్వసమాసమందలి గ స డ ద వాదేశమునకును, ఎ - గీ...కూరగాయలును వంటకట్టియలును గడ్డి (ఉద్యో. ౧ ఆ. ౯౩) అతఁడు నోంచునె యన్నదమ్ములన్ (ఉద్యో. 3 ఆ. ౧౦౧) మున్నగురీతిగల ప్రయోగములు మాత్రమె లభించినవిగాని ప్రాసాదిస్థలగతప్రబలప్రయోగములు లభింపలేదు. కాని యీ విషయమున "పరుషాణాం గ స డ ద వాః స్యుః పదాద్ద్వంద్వే।" అనుభట్టాకక సూత్రమె ప్రబలప్రమాణమని యెన్నఁదగును.

ఒకపక్షమున - వెలిదామర - తెలిదమ్మి మున్నగురూపము లేవేని సమ్మతించునపుడు "ఔపవిభక్తికపద న్తవిధయశ్చ" అనుచింతామణిని విస్తరించుచు "నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బా. సమా. ౨౦ సూత్రంబు.) "ఆచ్ఛికసమాసంబులఁ దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి" (ప్రౌఢ. సమా. 3౬ సూ) మున్నగుసూత్రములను వివరించుచుఁ బ్రత్యేకముగా సామాసికవిధులను గల్పించుకొనవలసినదేకాని సాధారణముగఁ గర్మధారయద్విగువులలో గ స డ ద వాదేశము పాక్షికమనుట చింతామణి భారతములకుసమ్మతము కానేరదు.

"కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చ త ప ల కు స ద వ లు గానంబడవు" ఉదా—అందచందములు (అని. ౫ ఆ.) అప్పచెల్లెండ్రు. (నిర్వ. 3 ఆ.) కండతుండెములు (రామా. ౧ ఆ.) రాకపోకలు (భాగ. ౧౦ స్కంధ.)" (ప్రౌఢ. సంధి. ౬ సూ.) అను త్రిలింగలక్షణసూత్రమునైతము ప్రబలప్రమాణ

సూచకము కాదు. అందలి యుదాహృతులు ప్రాసస్థలనిబద్ధములు కామింజేసి యచటి యా దేశమాహాత్మ్యము తత్తత్కవ్యభిప్రేతమె యని నిశ్చితము కానేరదు. మఱియు సర్వాచీనమహాకవు లీగసడదవాదేశవిషయమున నియతత్వము నుపేక్షించిరని యీవఱకు విశదపఱిచియున్నాను. (౩౮ III విష.) పరుషాణాంగసడదవాః స్యుఃకిత్యాదిచింతామణి సూత్రమును విరోధించు ప్రాచీనమహాకవిప్రయోగము ప్రాసాదిస్థలనిబద్ధ మెచ్చటనుకన్పట్టలేదు. ప్రౌఢవ్యాకర్త యుదాహరించిన నిర్వచనోత్తర రామాయణపద్యము తాళపత్త్రమాతృకలలో నీక్రిందిరీతి నున్నది. క. విను మున్న దితియు దితియును । ననఁగశ్యపుభార్య లిరువు రప్పఁజెలియ లి । ట్లనిమిషుల న సురగణముం । గనిరి...(నిర్వ. 3 ఆ. ౯౬ ప.) ఇట్లిచట వ్యస్తముగనె తిక్కన ప్రయోగించె ననుటలో బాధచూపట్టదు. (విస్తర.)

సన్నసూ
త్రవ్యాఖ్య
౨౦ విష.

పరుషాద్రుతప్రకృతికా । త్సరళాః స్యుస్తద్ద్రుతంచ బిన్దుఃస్యాత్ । అవికారగతే తస్మి । న్నపిసరళా ఏవ సన్తితే పరతః (ఆది. చిం. సంధి ౬. కారి. ౨౦౬ - ౨౦౭ పు.)

కల్పతరువు. ౨౦ విష:—ద్రుతప్రకృతికాత్ = ద్రుతప్రకృతికముకంటెఁ బరమైన, పరుషాః = క చ ట త ప లు, సరళాః = గ జ డ ద బ లు, స్యుః = అగును. తద్ద్రుతంచ = ఆద్రుతమునైతము, బిన్దుః = ఖండపూర్ణాన్యతర మగుబిందువు,

---

విస్తర. ౩౯. I విష:—పయిప్రౌఢవ్యాకరణ సూత్రోదాహృతులను (సంధి ౬ సూ) ప్రౌఢ-సమా. ౨ూ సూత్రోదాహృతులను స్వీకరించి గుప్తార్థప్రకాశికాకర్త 'అప్పచెల్లెండ్రు అనునట్లు సంస్కృతభాషలోఁగూడ నొక్కెడ (మాతాపితలు...) దీర్ఘము శాస్త్రీయముగాఁ గాని పించుచున్నది" (బా. గు. ప్ర. సంధి. ౧౫ సూ. వ్యా.) 'మాతాపితలు' అనుచోట ఋవర్ణదీర్ఘము రాలేదు. 'ఆనఙ్' వచ్చినది. తెల్గులోనిది పూర్వపదాంతిమస్వరదీర్ఘము. మఱియు 'అన్నాదమ్ములు' మున్నగు చోటులందలి దీర్ఘము సంస్కృతానుకరణలబ్ధముకాదు. ఆంధ్రవ్యావహారిక రూపములలో సముచ్చయార్థక 'ను' శబ్దలోపమునఁ గల్గిన పూర్వస్వరదీర్ఘము. తల్లి-తండ్రీ కలరు. మొ. "తల్లిదండ్రులు మున్నగురూపములు వ్యస్తములుగాని సమస్తములు గావు." (బా. సా. పే. సంధి. ౧౫ సూ-వ్యా.) అనుపేటికావ్యాఖ్య కేవలము ప్రామాదికము. ఉత్తరపదబహుత్వమె యద్దానిసమస్తతకుఁ బ్రబలనిదర్శనమై యున్నది.

స్యాత్ = అగును. (విస్తర) తస్మిన్ = ఆద్రుతము, అవికారగతేऽపి = బిందురూప వికారమునుబొందక స్వస్వరూపముతో ననఁగా నకారవ్యంజనరూపముతోనున్నను, తేపరతః = పరమందున్నయాపరుషములు, సరళాఏవ = సరళములెయై, సన్తి = నిల్చును. ఉదా:—వచ్చెన్+కొడుకు = వచ్చెఁగొడుకు, వచ్చెం గొడుకు, వచ్చెన్ గొడుకు. మొ. చింతామణిమతమున ద్రుతమునకు 'ను' స్వరూపము లేమింజేసి "వచ్చెను గొడుకు" అనుసరళాదేశరూపము సిద్ధింపనేరదు. "అవికారగతే తస్మిన్నపి = బిందురూపవికారమును బొందక ద్రుతము స్వస్వరూపముతోనున్నను" అను దీనినిబట్టి ద్రుతము నకారవ్యంజనరూపముతోనుండి, పరహల్లుతో సంయోగించి యుండుట చింతామణిమతమున స్వత్వమని విశదమగుచున్నది. 'లుక్ సంశ్లేషౌనాऽచి ద్రుతస్య' (చిం. సంధి. ౯. కా.) అనుసూత్రముచొప్పున నకారవ్యంజనరూపద్రుతము పూర్వాచ్చునత్తియుండుట చింతామణిమతమున సంశ్లేషమని యీవఱకె విశదీకరింపఁబడెను. (ॠ3 I విష.) (చిం. వి. పరి. ౧3౧-౧3౨ విష.) "పద్యభేవావసానేషు। శ్లిష్టతాऽస్య కథ్యతే" (వికృ. సంధి. ౧౯. కారి.) అనుకారిక కందాది పద్యములలోని పద్యావసానద్రుతమునకు శ్లిష్టత యనఁగా సంశ్లేషముకల్గునని

---

విస్తర. I. ౭౦ విష:—"తద్ద్రుతంచ బిందుఃస్యాత్" దాని (ఆద్రుతప్రకృతిశబ్దపు) ద్రుతము బిందువుకూడ నగును. 'బిందురనుస్వారః' అనుసూత్రముచొప్పున ద్రుతమున కనుస్వారోచ్చారణముగూడఁ గలుగునని యర్థము. అనఁగా నాద్రుతమునకు దానితరువాతవచ్చు హల్లువర్గమునకు సంబంధించిన యనునాసికోచ్చారణము గలుగును. రామున్ గొల్చెద, రాముఙ్ గొల్చెద, దానిన్ జేయుదును, దానిఞ్ జేయుదును..."(ఆం.భా.చ.౧౬౧౧ పు)ఇట్లు బిందువనఁగా వర్గపంచమమని యర్థము చేయుట సరికాదు. దాని కట్టియర్థము లేదు. సంస్కృతశబ్దములలో బిందువుచోట నిత్యముగానుండెడి వర్గపంచమములనె యాంధ్రపండితలాక్షణికులు సమ్మతింపకుండఁగా బిందువే వచ్చుననెడి యిట్టిచోటులందు వర్గపంచమమును నన్నయ విధించెననుట కేవలము సాహసము. (చూడు. విస్తర I. II. III ౭౧ విష.) అచ్చాంధ్రవర్ణమాలలో 'ఙ ఞ లు' లేవని లాక్షణికులు తలంచుచుండఁగా "దానిఞ్జేయుదును" అనుట యెట్లు పొసఁగును. శాసనములలోని యశాస్త్రీయప్రయోగములనుబట్టి కావలయు భాషాచరిత్రకారు లిట్లు వ్యాఖ్యానించిరి. అట్లు 'రాముణ్డు'. మున్నగువానిని వీరుదాహరింపలేదు. (౧౬౨౫ పుట.) 'భయంపడు' మున్నగుచోట్ల (౧౬౦౮ పు.) 'మహాన్‌బిందుః' అనుటకు సరిగ నేదేనివర్గపంచమ మేల నిల్పరో ? వీరు ౧౬౧౬ పుటలో సరళాదేశసంధి లోనె వర్గపంచమముల నేలనిల్పలేదో ?

చెప్పుచుండుటచేత (కం. అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్) నథర్వణుననుసు సంశ్లేషమువిషయమున నన్నయాభిప్రాయమె సమ్మతమని విశదమగుచున్నది. (విస్తర II) "సంయోగాదిర్వా" (ఋగ్వేదప్రాతిశాఖ్యము ౧ పటలము) దీనిపార్షద వ్యాఖ్య:—"సంయోగాదిభూతో వర్ణః స్వరాన్తరేవర్తమానః పూర్వస్యవాస్వరస్యాఙ్గం భవతి పరస్యవా" అనుచోప్పున 'వచ్చెన్ వాఁడు'మున్నగుచోటులందు ద్రుతమునకు వకారముతోఁ గలసంయోగములో నట్టిసంయోగాది నున్న ద్రుతము పూర్వస్వరమునకుఁగాని పరస్వరమునకుఁగాని యంగముగాఁ బల్కనగునుగాన నందుఁ బూర్వస్వరాంగమగుట సంశ్లేషమన బడును. పరస్వరాంగమగుట స్వత్వమనిపించుకొనును. సంశ్లేషము - వచ్చెన్ వాఁడు. స్వత్వము - వచ్చె న్వాఁడు. ఇట్టి యభిప్రాయమె యథర్వణునకుఁ గలదని "పద్యావసానేసర్వేషాం। స్వత్వం నాప్నోతిసాధుతామ్" (వికృ. సంధి. ౨౧ కారి.) అనుకారికచే విశదమగుచున్నది. పద్యావసానమునందలి ద్రుతమునకుఁ బరస్వరమె యుండదుగాన నచట స్వత్వస్థితి సాధువుకాదనఁగా నవ్వలిపద్యములోని మొదటిస్వరమున కంగముగాఁ బల్కరాదనియుఁ బద్యద్వయమధ్యవర్ణములకు సంహిత యప్రసిద్ధమనియుఁ బయియథర్వణ కారికకుఁ దాత్పర్యము. ఇట్టి నన్నయాథర్వణుల గభీరాశయములను గ్రహింపఁజాలక యహోబలపతి 'ద్రుతము పయి హల్లుతోఁ గలియుట సంశ్లేషమనియు ద్రుతము'ను' స్వరూపముతోనుండుట స్వత్వమనియు వ్రాసెను. "లుగభావే నస్య పరవర్ణేనసాకం సంశ్లేషశ్చ భవేత్ చకారేణ స్వరూపేణావస్థితిః. వర్ణాన్తరత్వేన సందర్భవేళాయాం పృథక్పరిగణనంతస్యఫలమ్" (అహో. ౨౧౩ పు.) ఇట్టి యపమార్గగామి యగుటచేతనే యహోబలపండితుండు "వైజయంతీనవాంశుకవ్యాజమునను" ఇత్యాది జైమినీభారతాద్యుక్తేషు పద్యసమాప్తౌ స్వత్వ మసంగత మేవ" (అహో. ౨౧౪ పు.) అని సాహసముగా వ్రాయవలసినవాఁడయ్యెను. (చూ. చిం. వి. పరి. ౧౩౧-౧౩౨ విష.) కవిశిరోభూషణములోని యీయపమార్గమే తర్వాతి వైయా

---

విస్తర II ౨౦ విష:—పయిరీతినున్న భట్టారకునిసంశ్లేషము స్వరూపమును గ్రహింపకుండుటనే యాంధ్రభాషాచరిత్రకర్తగారికి క్రిందిరీతిని వ్రాయవలసివచ్చెను. "ఇట్టి ద్విత్వమునే సంశ్లేషమందురేని యాద్విత్వము నన్నయభారతమునఁ గానవచ్చుచున్నది (ధైర్యశక్తికిన్నరుదుగ మొ.) కాఁబట్టి చింతామణి నన్నయరచితము కాదనుటకు మఱియొకహేతు వేర్పడుచున్నది" (ఆం. భా. చ. ౧౬౦౫ పుట.) భట్టారకుని సంశ్లేషస్వరూపము పైరీతిదని గ్రహించినచోఁ దక్కినహేతువులవలెనే యీహేతువును హేత్వాభాసమగుచున్నదని తెలియనగును.

కరణులకెల్ల గతియగుటచేత నీతప్పుత్రోవ యెల్లెడల విస్తరించియున్నది. "సంశ్లేషం బనఁగా మీఁదిహల్లులతోఁగూడికొనుట" (బాల. సంధి. ౧౭ సూ.) "స్వాత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము" (బాల. సంధి. ౧౭ సూ.) ఇట్లె యర్వాచీనులెల్లరును దలంచుచున్నారు.

ద్రుతమును బూర్వస్వరాంగముగా ననఁగాఁ బూర్వస్వరము నత్తియుండునట్లు పల్కినపుడు (వచ్చెన్ వాఁడు) ద్రుతసంశ్లేషమనియు, 'వచ్చెన్వాఁడు' అను రీతిని ద్రుతమును బరస్వరాంగముగా ననఁగాఁ బరస్వరము నత్తియుండునట్లు పల్కినపుడు ద్రుతస్వాత్వమనియు భట్టారకుఁడు వ్యవహరించెను. నాదములగు ద్రుతానుస్వారముల తాఁకుడువలన శ్వాసములగు పరుషములు నాదములగు సరళములుగా మాఱుననియు నక్కారణమున ద్రుతము పూర్వాచ్చు నత్తునట్లు పల్కినచో నద్దాని తాఁకుడు చాలక పరస్థపరుషములకు నిత్యముగాఁ రావలసిన సారళ్యము సిద్ధింపక పోవలసివచ్చును గానఁ బరుషపరకత్వమున ద్రుతమునకు సంశ్లేషము నంగీకరింపరాదనియుఁదలంచి భట్టారకుఁడు గ జ డ ద బాదేశస్థలములలో సంశ్లేషమును విధింపఁడయ్యె. సరళస్థిరపరకత్వమున నిట్టిబాధ తటస్థింపదు గాన నట్టిసంధిలో 'లుగ్వాద్రుతప్రకృతికా'దిత్యాది కారికలో 'అలుకిచ సంశ్లేషస్స్యాత్త'ని సంశ్లేషము విధించినవాఁడయ్యెను. పయిరీతి నాదేశసరళపరకత్వమున సంశ్లేషము రానేరదనియు సహజసరళస్థిరపరకత్వమునందును గ్వాచిత్కముగా వచ్చుననియు విశదపడుటకయి భట్టారకుఁడు "సంశ్లేషశ్చస్యాత్త"ని చకారమును నిల్పెను. ఇట్టియర్థము నరసింహ యథర్వణుఁడు "శ్లిష్టత్వంచ క్వచిత్" అని వివరించెను. నన్నయాథర్వణులస్వాత్వసంశ్లేషముల స్వరూపము నెఱుంగని యహోబలు ననుసరించినవారగుటచేత నారాయణీయతద్వివరణకర్త లాకవిశిరోభూషణమార్గమునను నన్నయాథర్వకారికలకు వివరణముచేసి పైనుదాహరించిన సాధుమార్గముపయి "సంహితను వివక్షించుటచే స్వాత్వరూపమును, వివక్షింపకుండుటచే సంశ్లేషరూపమును సిద్ధించుచున్నవిగాన నీసూత్రమునకు వైయర్థ్యము కల్గుచున్నది" అని యాపత్తి నీయవలసినవారైరి. (నారా. గాణ. ౧౨౦ కారి. ౧౬ పద్య. వివృతి.) తెలుంగున వాక్యమధ్యమున సంహితను వివక్షింపకుండుట సంప్రదాయవిరుద్ధమనియైన గ్రహింపరైరి.

కల్పతరు. ౮౦ I విష:—క చ ట త ప లు హలంతర సంయుక్తము లయియున్నను గ జ డ ద బాదేశము రావచ్చునుగాని యవి శ్వాసవర్ణసంయుక్తము లగునపుడు మాత్రము సరళాదేశోచ్చారణము దుర్ఘటముగాన నట్టియెడల సరళాదేశాదికము రానేరదు. ఉదా:—తెచ్చెన్+త్సరువు = తెచ్చెన్ త్సరువు. వచ్చెన్

క్షత్త్రియుఁడు. మొ. "ఏగి యేగి యనుచోఁ గ్త్వార్థంబగుట" (బా. సంధి. ౧౦సూ.) అనునది ముద్రణసంస్కర్తృసాహసకృతము. సూరిగారు జీవించియున్న కాలమందలి (క్రీ. శ. ౧౮౫౭ సం.) ముద్రణమునందును దానికిఁ గేవలము సరియనఁదగు ద్వితీయముద్రణమునందును (క్రీ. శ. ౧౮౬౮ సం.) "ఏగి యేగి యనుచో క్త్వార్థంబగుట" అనియే యున్నది.

ముందు వివరింపఁబోవు "వినా ద్వితీయం స్యాదస్య। దాత్మనోః స్వాన్తయోరపి। నోరన్యస్యాపి సర్వం స్యా। ద్వికల్పం సత్ప్రయోగతః" (రా౦ III విష.) అను నథర్వణవచనము చొప్పున నావయవిక నకారవ్యంజనరూపద్రుతముపై సరళాదేశము వైకల్పికమని యెఱుంగునది. కావుననే "గిరివ్రజమున్పురంబు" (సభా. ౧ ఆ. ౧౩౩ ప.) మున్నగుచోట్ల సరళాదేశము చూపట్టదు. ఇట్లే జడిగొన్ కోర్కులు - కన్పట్టు - మ్రాన్పడు - మొదలగుస్థలములందును సరళాదేశము కన్పట్టదు. కాని యిట్టిసరళాదేశములేని ప్రయోగములు ప్రాసస్థలనిబద్ధములు భారతమున లభింపలేదు. (ఉ. శ్రీకర......ఎం। తే కృప......(దశా. ౧ ఆ. ౧ ప.) అనునాథునికవిప్రయోగ మొండుగలదు) ఇంతయేల! ఆదేశసరళపరకత్వమున ద్రుతము పూర్ణబిందువుగా నిల్చుటకుమాత్రమె ప్రాసస్థలనిబద్ధప్రయోగములు భారతమునఁ గన్పట్టుచున్నవి. ద్రుతము ఖండబిందువగురూపములకుఁగాని ద్రుతము నకారవ్యంజనరూపముతో నిల్చురూపములకుఁగాని ప్రాసస్థలనిబద్ధప్రయోగములు లభింపలేదు. అట్లయినను నన్నయాథర్వణసూత్రముల ప్రామాణ్యమున నాదేశసరళపరక ద్రుతమునకు ఖండపూర్ణములు రెండును బర్యాయముగ నాదేశమగుటయు, ద్రుతము నకారవ్యంజనరూపముతో నిల్చుటయు సాధువులుగా నంగీకరింపఁబడుచున్నవి. ఆదేశసరళపరకత్వమున ద్రుతము 'ను' స్వరూపముతో నిల్చుటకు 'ప్రాసస్థలనిబద్ధప్రయోగములు భారతమందే కాక యేమహాకవిగ్రంథమందును చూపట్టలేదు. మఱియు నట్టిస్థితి నన్నయాథర్వణ సమ్మతమును గాకుండుటచే సాధువు కానేరదు. కాని యప్పకవియు సూరియు నట్టిస్థితి నంగీకరించి యుదాహరించుటచే నేఁటివారెల్లరు నట్టి 'ను' స్వరూపద్రుతపూర్వక సరళాదేశరూపములను ధారాళముగా వాడుచున్నారు. ఇది కేవలము పొరపాటు.

ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు. ౧౬.

పూచెను+కలువలు = పూచెను గలువలు, తోఁచెను+చుక్కలు = తోఁచెను జుక్కలు, చేసెను+టక్కులు = చేసెను డక్కులు, నెగడెను+తమములు = నెగడెను

దమములు, మొగిడెను+పద్మము = మొగిడెను బద్మము.

ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు. ౧౭.

బాలవ్యాకరణ వివరణము. ౮౦ II విషయము.

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూచెను గలువలు = పూచెంగలువలు, పూచెఁ గలువలు, పూచెన్గలువలు; తోఁచెను జుక్కలు = తోఁచెం జుక్కలు, తోఁచెఁ జుక్కలు, తోఁచెన్జుక్కలు; చేసెను డక్కులు=చేసెండక్కులు, చేసెఁడక్కులు=చేసెన్డక్కులు; నెగడెను దమములు=నెగడెందమములు, నెగడెఁ దమములు, నెగడెన్దమములు; మొగిడెను బద్మము = మొగిడెం బద్మము, మొగిడెఁ బద్మము, మొగిడెన్బద్మము. పక్షంబున స్వత్వంబగు. స్వత్వమనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము.

సంజీవని. ౮౦ II విష:—తోఁచు = ఉదయించు. నెగడు = వ్యాపించు. మొగుడు = ముకుళించు. ఇచటి తాలవ్య చ జ లు దంత్య చ జ ల కును గ్రాహకములు, (బా. సంజ్ఞా. ౭ సూ.) కాన "చే" కారమునకు 'జే' కారమగును, కావుననె "జేక్కులు" అనుమూలోదాహృతి సుసంగతమగుచున్నది. "వచ్చెను+క్షత్త్రియుఁడు" మున్నగుచోట్ల శ్వాసపరకమగుటచేఁ బరుష కకారమునకు గకారాదేశము రానేరదు. అట్టియెడల సహజసరళస్థిరపగకత్వమందువలెను ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వములగును. ఉదా:—వచ్చెక్షత్త్రియుఁడు - వచ్చెన్క్షత్త్రియుఁడు- వచ్చెను క్షత్త్రియుఁడు మొ. 'రాముం గలసెను - రాముఁ గలసెను - రామున్గలసెను' అనురూపములకుఁ బర్యాయమగు స్వత్వరూపము 'రామునిగలసెను' అనియగునుగాని 'రామును గలసెను' అని కానేరదు (చూ. బాల. తత్స. ౫౨ సూత్రము) డుమంతములమీఁది 'ను' వర్ణకము 'ని' వర్ణకమగును. ఇట్లె - 'హరింగలసెను' మున్నగుచోటులందును 'హరిని గలసెను' అనియె యగును. (౧౩౩ విష.) "హరికిన్+కలదు" అనుచో స్వత్వరూపము "హరికిని గలదు" అని సూరిప్రభృతుల పక్షమునందు సిద్ధించునుగాని నన్నయాథర్వణులమతమున ద్రుతమునకు 'ను - ని' అనురూపములే లేవు. (౮౮- ౮౯- ౮౬ విష.) కాన "ఇ ఈ ఐ భ్యః పరంస్వత్వం। నిః స్యాదన్యత్ర నుర్భవేత్" అను నాథర్వణము" (బా. సా. పే. ౭౮ పు.) అను పేటికోదాహృతి యవిమర్శనమూలకము. నన్నయాథర్వణులమతమున ద్రుతమునకు

'ను - ని' అను రూపములు సప్తమ్యంతములుంగాం గొంజేసి సూరియుదాహరించిన "పూచెను గలువలు" మున్నగునవియు, తే. గీ. "నగరమునకు మహీజాతను గొనివచ్చె" అను నప్పకవి ప్రాస్థల నిబద్ధోదాహృతియు సాధుపులు కానేర వనకతీరదు. నన్నయ భారతప్రయోగములచొప్పునను నన్నయాథర్వణీయసూత్రములచొప్పునను ద్రుతమునకు 'ను' స్వరూపముకలదనుటకే యవకాశములేదు. అట్లయినను సోమయాజి భారతభాగప్రయోగములచొప్పున ద్రుతమునకు - "ను-ని" అనురూపములు గలవన నగునుగాని యట్టి 'ను' స్వరూపము కళ. దానిపై సరళాదేశాదిద్రుతకార్యములు రావు. సూరి యట్టిదానికి ద్రుతత్వముకలదని భ్రమించియుండును. అట్టి 'ను' స్వరూపము ప్రథమా ప్రత్యయమగునపుడు నేను - తాను శబ్దములమీఁది పరుష ములకు గ స డ ద వా దేశమును సోమయాజి ప్రయోగించెనని యీవఱకు వివరించి యున్నాను. (౮౮. ౮౯. ౮౬. విష.) (విస్తర. II. ౭౦ IV విష.) క. కవదొన లును......ఏ। నువిదపడిగియెద......(శల్య. ౨ ఆ. 333 ప.)

బాల. సంధి. ౧౭ సూత్రములోని విభాష వ్యవస్థితవిభాష యగుటచేఁ బ్రాఁతాదిసంధిలోని ద్రుతమునకు సంశ్లేషము లేదని సూరిగారు వచించిరి. (బా. సంధి. 32 సూ.) 'ప్రాఁత+కెంపు' - అనుచో "ప్రాఁగెంపు" అని యగునుగాని 'ప్రాఙ్గెంపు' అని కాదని సూరియాశయము. మూలమునఁ బూర్ణార్ధనిర్దేశము లేకుండ బిందుమాత్రము విధింపఁబడుటచే దీర్ఘముమీఁద నీసంధిలో నిండుసున్న లేదనియు (బా. సంజ్ఞా. ౧౯ సూ.) నుడి తొలిహ్రస్వముమీఁద ఖండబిందువురాద నియు (బా. సంధి. ౨౨ సూ.) నెఱుంగనగును. ఉదా:—ప్రాఁత+కెంపు = ప్రాఁ గెంపు. (ప్రాంగెంపు కాదు) కెంపు+తామర = కెందామర-'కెదామర' కానేరదు.

స్వత్వపక్షమునందును సంశ్లేషపక్షమునందును ద్రుతము వ్యంజన నకారరూప ముతో నుండుఁటయె యని (౮౦ విష.) కల్పతరువున నన్నయాథర్వణమతము నిరూ పింపఁబడెను.

సూరిస్వత్వ మనఁగా "ద్రుతమునకుఁ బ్రకృతిభావము" అని వ్రాసి సంధి ౧౬ సూత్రమున "పూచెను గలువలు" మున్నగురీతిని 'ను' స్వరూపమునె యుదాహ రించెను. ఇంక సంశ్లేషమనఁగా "ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట" యని సూరికంఠోక్తముగా వచించెను. "ను-అనుదానిమీఁది 'ఉ' కారము లోపింపఁగా 'న్' హల్మాత్రము మిగిలినది" (బా. గు. ప్ర. ౮౫ పు. ద్వి. ము.) అని గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడెను. కాని సూరి సంధి. ౨౦ సూత్రముచే నవసానమునందుమాత్రమె ద్రుతస్వరలోపమును విధించెను. కాన హల్పరకత్వమున ద్రుతస్వరలోపమునకు

విధానములేదు సూరిగారికిపై ౧౬-౧౭ సూత్రములలోని యుదాహృతులచొప్పున ద్రుతము 'ను' స్వరూపముతో నుండఁగా 'ఉ' కారలోప మెట్లువచ్చును ? ఆద్రుతము మీఁది హల్లుతోఁగూడికొనుట యెట్లు పొసఁగును? ఇంక నిట సంశ్లేషవిధాన మసంగతము వ్యర్థముచు గాకుండ నట్టి సంశ్లేషవిధాన సామర్థ్యముచే నచటి ద్రుతము నకు స్వరలోపము సంశ్లేషపక్షమునఁ గల్గునని యంగీకరింపవలసియున్నది. (విస్తర).

నన్నయాథర్వ ణీయము ౮౧ విషయము.

ఉగ్వా ద్రుతప్రకృతికాత్ । పరతస్సరశే స్థిరేచ నస్య స్యాత్ । అలుకిచ సంశ్లేషః స్యా । ద్విస్థం ప్రవద స్త్రితం క్వచిత్క్వచిత్ ॥ (ఆం. చిం. సంధి. ౮ కారి. అహో. ౨౧౨ - ౨౧౩ పుట)

కేచిద్వద న్త్యభేదత్వ । మనుస్వార మకారయోః (వికృ. సంధి. ౧౨ కా. అహో. ౨౦౩).

కల్పతరువు. ౮౧ విష:—ద్రుతప్రకృతికాత్ = ద్రుతప్రకృతికశబ్దముకంటె, పరతః = పరమందున్న, నస్య = నకారమునకు, సరశే - స్థిరేచ = సరళస్థిరవర్ణములు పరమగుచుండఁగా, లుక్ = ద్రుతమునకు లోపము, వాస్యాత్ = వికల్పముగా నగును. అలుకి = లోపాభావపక్షమందు, నస్య = నకారమునకు, సంశ్లేషశ్చస్యాత్ = సంశ్లేషమును ననఁగాఁ బూర్వాచ్చు నత్తియుండుస్థితియు, చ శబ్దముచే స్వత్వమును

విస్తర. I ౦ II విష:—ఈవిషయమునందును సూరె కవి శిరోభూషణము నను సరించి చింతామణి నర్థముచేసికొన్నవాఁడగుటఁ బ్రమాదపడవలసివచ్చెను-అహో బలపండితుఁడు "పరుషాద్రుతప్రకృతికా" ఇత్యాది చింతామణికారికకు వ్యాఖ్య చేయుటలో 'ను' అనునది ద్రుతస్వరూపమనియు దానిమీఁదిపరుషములకు గజడదబా దేశము వచ్చుననియు వివరించెను. "తస్మిన్ నకారే అవికారగతే = బిందుత్వమప్రాప్తేపి తే పరే పరుషాః సరళాఏవస్యుః న తు పరుషాః - సీతను గొల్చెదన్ - సీతన్గొల్చెదన్ - రామున్ దలఁచెదన్ ఇత్యా ద్యుదాహరణమ్, అత్రనకారస్య స్వత్వసంశ్లేషా వుభావపి సంభవతఏవ......"(అహో. ౨౦౭ పు.) స్వత్వమనఁగా ద్రుతమునకు 'ను' స్వరూపమనియు సంశ్లేష మనఁగా, నకారపుపొల్లు పరహల్లుతో సంయోగించుట యనియు నహోబలపతిసిద్ధాంతమని యీక్రింది యాతనివ్యాఖ్యవలనను విశదమగు చున్నది. "నస్య పరవర్ణేనసాకం సంశ్లేషశ్చ భవేత్ - చకారేణ స్వరూపేణావస్థితిః . వర్ణాన్తరత్వేన సందర్భ వేళాయాంపృథక్పరిగణనం తస్యఫలమ్.చ-అమలినతార కాసము దయంబుల నెన్నను సర్వవేదశాస్త్రముల యశేషపారము ముదంబునఁ బొందను... ఇత్యాది పద్యే ష్వాచార్యేణ వర్ణాన్తరత్వ ముపపాదితమ్,"(అహో.౨౧౩ పు.)పయి

భారతపద్యములోని 'ను' అనునవి సముచ్చయార్థక'ను' శబ్దములుగాని ద్రుతస్వత్వ రూపములు కావని మహోబలపండితుండు గ్రహింపకుండుట వింత! (అనుబం.)

విస్తర. II ౧౦ II విష:—భారతకవుల ప్రయోగముల నరయఁగా సందేహనిక్షాయకమగు ప్రాసస్థలనిబద్ధమగు ద్రుత 'ను' స్వరూపముమీఁది సరళాదేశ ప్రయోగము లేకుండుటయేకాక వ్యంజన నకారముమీఁది సరళాదేశమునకును బ్రాసస్థల నిబద్ధప్రయోగము లభింపలేదు. అట్లయినను నీక్రిందిపద్యమున ద్రుతనకార సంయోగప్రయోగమును నన్నయఁజేసెనని విశ్వసింపఁదగియున్నది. మత్తకోకిల... నాలుగేన్ । బాఁడికుఱ్ఱుల నీఁడె వీనికి...(ఆది. ౫ ఆ. ౨౧౮) ఇటఁ బ్రాసస్థలము కామింజేసి బకారాదేశము చేయఁబడెనని నిర్ణయింపరాకున్నను "అవికారగతే తస్మిన్నపిసరళా ఏవసన్తి తే పరతః"అని భట్టారకుఁడు సూత్రించియుండుటచేత "నాలుగేన్+పాఁడికుఱ్ఱులు" లేదా "నాలుగేను+పాఁడికుఱ్ఱులు" = "నాలుగేన్బాఁడి కుఱ్ఱులు" అని బకారాదేశముతో నన్నయ ప్రయోగించెననుట విశ్వసనీయమై యున్నది. ఆదేశసరళమునకు ముందటి నకారపుహల్లు పూర్ణబిందువువంటి యుచ్చారణముగలదగుటచే నది సరళాదేశజనకమగుట సహజమె యనఁదగును. ఇంక నాదేశసరళపరకద్రుతస్థానమున ఖండబిందువు నిల్చిన ప్రాసస్థల ప్రయోగములు సైతము భారతమునఁ గన్పట్టలేదు. కాన నట్టి ఖండబిందుస్థితికిని నన్నయాథర్వణసూత్రములును నీక్రిందియర్వాచీనకవిప్రయోగములునుమాత్రమె ప్రమాణము లనఁదగును.

క. విని యతనిం దనపైనిడు । కొని యేఁగి నియమికిఁ దగనిఘోరార్తి యొన । ర్చినవాఁడ...(రాఘవ. ౧ ఆ. ౨౮.) ఇందు "ఏన్+కినియమికి; ఏఁగి+నియమికి" అని పక్షద్వయమున ఛేదము; భారతార్థమున ద్రుతముచో ఖండము నిల్చినది. ద్విపద - ఏఁదప్పువట్టుదు నిలఁ బరస్త్రీల । మీఁదఁ గన్నార్పకుమీ బసవన్న (బసవ. ౧ ఆ. ౫౯౨) ఉ. కౌఁగిట...నీ । కేఁగలుగంగ....(ఉ. హరి. ౧ ఆ. ౬౪ ప.) శా... ఏఁగాదేనడతున్... । మూఁగంబాఱెన... । ఆఁగన్వచ్చియు... । దాఁగంబోవుట...

అను. విస్తర I ౧౦ II విష:—అప్పకవిద్రుత మాదేశసరళముతో సంయోగించుననియుఁ జెప్పలేదు. ద్రుతముచోట బిందు వాదేశము కానపు డాదేశసరళమునకు ముందుగ 'ను' స్వరూపము మాత్రమె నిల్చునని చెప్పి యుదాహరించెను. సీ. అవనిద్రుతప్రకృత్యంతద్రుతంబులు, చెడి బిందువులు గానియెడల వాని । వలపలి పరుషముల్ వరుసతో సరళంబు, లవుఁగాని యచట బిందువులు లేవు । తండ్రిపంపునను గాంతారంబునకు నేఁగి...తే. గీ. నగరమునకు మహీజాతను గొనివచ్చె అప్పక. ౫ ఆ. ౧౪౨ ప.)

ననఁగాఁ బరహల్లుతో సంయోగించి పరాచ్ఛున కంగమగుస్థితియు, స్యాత్ = అగును. క్వచిత్ = ఒకానొకప్పుడు, తమ్ = ఆనకారమును, కేచిత్ = కొందఱు, బిన్దుమ్ = బిందువునుగానైతము, ప్రవదన్తి = చెప్పుదురు. అట్టిబిందువు మకారపరకత్వమందు మాత్రమె నన్నయభారతమునఁ బ్రాసస్థలమునఁ గన్పట్టుచుండుటంజేసి యట్టి ప్రయోగములలోని యనుస్వారము మకారమున కభిన్నమగుచుఁ బ్రాసమును నిర్వహించు నని యథర్వణుఁడు వివరించుచున్నాఁడు:—కేచిదిత్యాది. అనుస్వారమకారయోః = పూర్ణబిందుమకారములకు, అభేదత్వమ్ = భేదము లేమిని, కేచిద్వదన్తి = కొందఱు చెప్పుదురు. ఇట్టి యభేదస్థితి కుదాహరణము...లయ గ్రాహి. కమ్మనిలతాంతములకుం మొనసీ......(ఆది. ౫ ఆ. ౧౩౮ ప.)

---

(శ. హరి. ర ఆ. ౯౨) క. ఏఁగోరినచెలువుఁడె ననుఁ। దాఁ గావలె నంచువచ్చి డగ్గఱివేఁడన్ । గౌఁగిలి యియ్యకవచ్చితి । నోఁగాదని వెనఁగి యెంత యవివేకమయో ॥ (విజ. 3 ఆ ౨౦ ప.)

ప్రాచీనులగు కేతన పెద్దన లీసందర్భమున ఖండబిందురూపములనే యుదాహరించిరి. ఆ. వె. దానిఁగనియెఁ జేరె వానిఁ డక్కరిఁజేసె । వాని దానిఁ దెగడె వానిఁ బొదివె । ... (ఆం. భూ. ౫ర ప.) గీ. జడులఁ గరుణించుఁ జతురులఁజాల్ఁ బ్రోచు । నాజిఁ డంకారరవమున నసము సేయు । భటులఁ దనియించుఁ బ్రజలకుఁ బాడి నడపు । శక్తవిజయుండు చాళుక్యచక్రవర్తి. (కావ్యా. ౯ ఉల్లా. ౬౧) ఇంక నాదేశసరళములమీఁది ద్రుతమునకుఁ బూర్ణబిందువగుటకు మాత్రము భారతమున ననేక ప్రయోగములు వెలయుచున్నవి. పూర్ణబిందువు తాఁకుడు పరస్థశ్వాసమును నాదముగా మార్చుట సహజమగుటంజేసి యట్టిప్రయోగములనుమాత్రమె భారతకవు లాదరించిరా యని యాలోచింపవలసియున్నది. ప్రాచీనులగు పెద్దన కేతన లీవిషయమున నిట్లు వచించిరి. తే. గీ. తద్ద్వితీయావిభక్తిపొంతలఁ జరించు । ఖద్దిగలసున్నసోకునఁ గచటతపలు । గజడదబ లగు నూఁదుట గలుగుఁ గవుల । యనుమతంబున నొక్కొక యవసరమున ॥ (కావ్యా. ౯ ఉల్లా. ౬౦ ప.) క. నాంతంబైన పదంబులపొంతంబై సున్నశబ్దముల కచటతపల్ । దొంతి గజడదబలగు న । య్యంత నకారమగు సున్న యభినవదండీ(ఆం. భూ. ౫౯ ప.) భారతప్రయోగములు:— క. పంగుల...భయా । ర్తుం గడిఁది శత్రునైనను। సంగరరంగమునఁ గాతె శరణం బనినన్ (సభా. ౧ ఆ. ర౫) శా. సింగం బాఁకటితో...వచ్చునో । జంగాంతారనివాసఖిన్నమతి...వ । చ్చెం గుంతీసుతమధ్యముండు...(విరా. ర ఆ. ౯౫.) టకారమున కయ్యలార్యుఁడు:—శా. నిండన్...చేర్పం డంకారభయంకరాయతి (భాస్క. యుద్ధ. ౧౦౭౯.)

కల్పతరువు. ౮౧ I విషః—సరళస్థిరములు పరమగునపుడు నకారపు పొల్లు లోపించుటగాని పూర్వాచ్చు నత్తియుండుటగాని పరహల్లుతో సంయోగించి యుండుటగాని సంభవించును. ఒకానొకప్పు డట్టినకారమునకుఁ బూర్ణబిందా్వ దేశము నైతము కావచ్చును. ఉదా:—పల్కెను+వాఁడు = పల్కెవాఁడు, పల్కెన్ వాఁడు, పల్కెన్వాఁడు. పూర్ణబిందువునకు:—చేసెన్+మేలు=చేసెంమేలు. ఇటలోపా ఐకమును గల్గును. చేసె మేలు - చేసెన్ మేలు. చేసెన్మేలు. మొ. ద్రుతము పూర్వా చ్చునత్తియున్నను బరహల్లుతో సంయోగించియున్నను నది పొల్ల నకారపు రూప ముతోనె యుండును. భేదమేమియుఁ జూపట్టదు. పలుకుబడిలో నించుకభేదము కన్పట్టును. సరళస్థిరపరకత్వమున నిండుసున్న ద్రుతమున కాదేశమగుట క్వాచి త్కము. భారతమున మకారపరకత్వమందుమాత్రమె నిండుసున్నవచ్చు ప్రాసస్థల గతప్రయోగములు కన్పట్టుచున్నవి. తరువాతి కవులకావ్యములలో మఱికొన్ని సరళస్థిరవర్ణములు పరమగునపుడును నిండుసున్నవచ్చుప్రాసస్థలగతప్రయోగములు చూపట్టుచున్నవి.

లయగ్రాహి. కమ్మనిలతాంతములకుం మొఁసివచ్చుమధుపమ్ముల.....(ఆది. ౫ ఆ. ౧౩౭) ఇందు బిందుపూర్వకమకారమునకు ద్విరుక్తమకారముతోననునాసిక ప్రాసము భట్టారకునిచేఁ బ్రయోగింపఁబడెను. తే. గీ. తమకుఁ దాము ద్విత్వం బులై తనరునవియుఁ। బూర్ణబిందులు డాఁపలఁ బొరయునవియుఁ। గలసి యనునాసిక ప్రాసము లనుపేర। నమ లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దామ॥ (అప్పక. 3 ఆ. 3౮౧ ప. ౫ ఆ. ౧౫౯ ప.) అప్పకవి వివరించిన పైనన్నయాభిప్రాయమునే, యథర్వణుఁడు కేచిద్వదన్తీత్యాదికారికచే విశదీకరించెను.

ఋ ౠ వర్ణములు స్వరములె యైనను సంధిప్రభృతివిషయములందు ర ల తుల్యకార్యముల నొదవించుచున్నవి. చ......ఈ। క్రతువున ఋత్విజుల్ కమల గర్భసమానులు.....(ఆది. ౨ ఆ. ౨౨౭) క. ఆఋషికుమారు కట్టిన। చీరలు... (అర. 3 ఆ. ౧౦౮) ఉ. శాంతుఁడు ఋష్యశృంగుఁ డనుసన్ముని.....(అర. 3 ఆ. ౯3) ఈవిషయమున నహోబలపతి యిట్లు వ్రాసెను. "ఋకారస్య రేఫావయవక త్వేన తస్మిన్ పరే ద్రుతస్యలుక్. రేఫస్య తదవయవకత్వంచ 'ఋతి సవర్ణేఋవా' ఇతివార్తికే ప్రసిద్ధమ్...అతఏవ తస్మిన్ పరే న సన్ధిః..." (అహో. ౨౧౨ పు.)

ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు
లోపసంశ్లేషంబులు విభాషనగు. ౧౮.

వచ్చెను+గోవులు=వచ్చెగోవులు, వచ్చెన్ గోవులు, వచ్చెను గోవులు; మెఱసెను+ఖడ్గము=మెఱసె ఖడ్గము- మెఱసెన్ ఖడ్గము - మెఱసెను ఖడ్గము. పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యంబులు. ౧(ప్రకీర్ణ.) ఆతఁడు ఋషి ఇట సంధిలేదు. ఆఋషి. ఇట యడాగమములేదు. వచ్చె ఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెను ఋషి. ఇట ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వములు.

బాలవ్యాకరణ వివృతి. ౮౧ II విషయము.

సంజీవని. ౮౧ II విష:—లోపసంశ్లేషములు విభాషనగు ననుటచే లోప సంశ్లేషములు రానపుడు ద్రుతము స్వరూపముతో నిల్చు ననఁగా స్వత్వము కల్గు ననునర్థము లభించుచున్నది. సూరిపక్షమున సంశ్లేష మనఁగా, ద్రుతము పర హల్లుతో సంయోగించుట. స్వత్వమనఁగా ద్రుతము 'ను' స్వరూపముతోను, ఇ ఈ ఐ లమీఁదను, డుమంతములమీఁదను, 'ని' స్వరూపముతోను (౧౩౩ విష. బా. తత్స. ౨౫ - ౨౬ సూ.) నిల్చుట. ఉదా:—హరిని+వేఁడెను = హరిన్వేఁడెను, (ఇది సంశ్లేషము)హరిని వేఁడెను. రామున్+వేఁడెను=రాముని వేఁడెను(స్వత్వోదాహృతులు) (రాముసు వేఁడెను-అసాధువు) హరి వేఁడెను, రాము వేఁడెను(ద్రుతలోపము). బా. సంధి. ౧౭ సూత్రసందర్భమునందువలెనె (౮౦II విష. సంజీ.) యిచట నైతము సంశ్లేషవిధానవై యర్థాన్యథానుపపత్తిచే సరళస్థిరములు పరమగునపుడు సంశ్లేష పక్షమున ద్రుతస్వరలోపముకల్గి "వచ్చెను+గోవులు = వచ్చెన్ గోవులు" మున్నగు సంశ్లేషోదాహృతులు సిద్ధించును. క్షత్త్రము. త్సరువు. మున్నగునవి పరమగునపు డును స్థిరపరకత్వమునందలి కార్యములె యగును (౮౦ II విష. సంజీ.) గెలిచెను+ క్షత్త్రము = గెలిచె క్షత్త్రము-గెలిచెన్ క్షత్త్రము - గెలిచెను క్షత్త్రము. తెచ్చెను+ త్సరువు = తెచ్చెత్సరువు - తెచ్చెన్త్సరువు. తెచ్చెనుత్సరువు. మొ.

ఋ ౠ వర్ణములందు ర ల లయావేశము వెలయుచుండుట నవి పరమగు నపుడు ర ల పరకత్వకమునందలి కార్యములె సంధివిషయమున నగునని తాత్ప ర్యము. ఉదా:—'అతఁడు+ఋషి' అనుచో 'అతఁ డృషి' అనుననిష్టరూపము గల్గ లేదని యర్థము 'ఆ+ఋషి' అనుచో 'ఆయృషి' అను ననిష్టరూపము గల్గనేరదని తాత్పర్యము. ప్రయోగములు:—ఉ.......ఇచ్చట। నైచ్చగు వీరిదై నసుఖనిద్రకు భంగము సేయనేర్తునే (ఆది. ౬ ఆ. ౨౦౦) కం.......। మానుప దిక్కుగలిగిన। న్రాని మ్మెలుగింపు మీ మొనంగలవారిన్ (కర్ణ. ౩ ఆ. ౨౧౩ ప). ఉ. చేసిన। న్నీ ఱగ బానసీని నొకనిం బురఁగా ననియట్లు (విరా. ౧ ఆ. ౭౭ ప.). ఇవి సంశ్లేషోదాహృతులు.

ఇంక స్వత్వోదాహృతులు:—కం. జయము నీకో, క। ల్గెను దాని తెఱం గేర్పడ... (శాంతి. ౬ ఆ. ౭౭౨ ప) కం...ధరణి లంఘిం। చెను మఱపు లేక పేరు। క్కున... (భీష్మ. ౩ ఆ. ౯౭ ప.) అప్పకవి ట త వర్గములలోని ద్వితీయ తృతీయ చతుర్థములు పరమగునపుడు ద్రుతమునకుఁ బరహల్లుతో సంయోగించుట (సంశ్లేషము) యుండదని వింతగ వచించెను. (విస్తర . రా౨ I విష.)

బాలవ్యా. రా౨ విష

వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. ౧౯. వచ్చెను+ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి. పాడెను+ గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు. కన్+దోయి = కందోయి.

సంజీవని. రా౨ విష:—వర్గయుక్కులు = వర్గాక్షరములలోని సమసంఖ్యాకాక్షరములు. ఖ - ఘ - ఛ - ఝ - మొ. ౧౮-౧౯ సూత్రములలోని సరళ శబ్దమాదేశ సరళపరముకాదు. సహజసరళపరము. ఆదేశసరళపరకత్వమున ద్రుతమున కెన్నఁడును లోపము కల్గనేరదు. ప్రకృతసూత్రములోని "పూర్ణబిందువును గానంబడియెడి" అనుచోటి చార్థక 'ను' శబ్దముచే మీఁది ౧౮ సూత్రముచొప్పున వర్గయుక్సరళపరకత్వమునందు లోపస్వత్వసంశ్లేషములు సైతము వచ్చునని విశదమగుచున్నది. కాన 'వచ్చెంధాత్రీపతి, వచ్చెధాత్రీపతి, వచ్చెన్ధాత్రీపతి, వచ్చెను ధాత్రీపతి'అని నాల్గువిధములగురూపము లేర్పడును. బాల - సంజ్ఞా - ౧౬ సూత్రముచొప్పున స్థిరపరకబిందువు సాధువుకాకున్నను బ్రకృతసూత్రము విశేషవిధిగాన 'కురిసెం భూమిని వాన' మున్నగుచోటులు సాధువులె యనఁదగును. బా. సంధి. ౨౨ సూత్రముచొప్పున నుడి తొలిహ్రస్వముమీఁది ద్రుతము లోపింపదుగాన 'కన్+దోయి' మున్నగుచోటులందు సంధి ౧౮ సూత్రముచొప్పున ద్రుతలోపము కల్గనేరదు. బా. సంజ్ఞా. ౧౫ సూత్రముచొప్పున 'వేగముగాం దాఁటెను' మున్నగురీతిని బ్రకృతసూత్రముచే నెఱసున్న రానేరదు.

సంజీవని. రా౨ I విష:—సూరిచింతామణి ననుసరించి యొకానొకచో నని సూత్రమున వచించినను నీసూత్రము చింతామణిసూత్రమునకు విలక్షణమె యనక తీరదు. మకారేతరస్థిరపరకత్వమున నిండుసున్న వచ్చుట చింతామణిహృదయము కాదు. అట్టి భారతప్రయోగమును లేదు. మత్తకోకిల—కమ్మనిలతాంతములకుం మొనసి (ఆది. ౫ ఆ. ౧౩౮). ఉ. ఇమ్ముగ...బిం। బమ్మున...లోకవం। ద్యుం ముని...(ఆది. ౧ ఆ. ౭౬). మత్తకోకిల - అమ్మునీశు నివాసశక్తి...వృష్టిఁజే। సెం

మహానది (అర. 3 ఆ. ౧౧౩). ఇట్లు మకారపరకత్వమునందుమాత్రమె ద్రుతము నెఱసున్నయగుటకు నన్నయభట్టు ప్రయోగము లుండుటయు వర్గయుక్సరళపరకత్వమున ద్రుతము పూర్ణబిందువగుటకు నన్నయభారతమునఁ బ్రయోగము లేకుండుటయు నరయఁగా "క్వచిత్కేచిత్" అనుచింతామణి సూత్రములోని దళముచే మకార పరకస్థలముమాత్రమె యుద్దేశింపఁబడెనని విశ్వసింపనగును. ఇంక సూరిగారివర్గయుక్ సరళపరకద్రుతపూర్ణబింద విధానమున కనంతామాత్యాప్పకవి తిమ్మకవీంద్రుల లక్షణములు మూలము కానోపును. (విస్తరము) కాని యప్పకవియుఁ జింతామణిచొప్పున మకారపరకద్రుతపూర్ణబిందువు నుదాహరించి కల్పతరువునఁ జూపంబడినరీతిని (౮౧ I విష.) ననునాసికప్రాసము ననుసరించి సమర్థించియె యున్నాఁడు. అట్లగుటంజేసి సూరి

---

విస్తరము. I ౮౨ I విష:—అనంతామాత్యుఁడు ధకారపరకద్రుతమునకుఁ బూర్ణబిందువును విధించెను. గీ. పేర్చిపొల్లనకారంబు బిందువగుచు। మీఁదనున్న ధకారంబు సూఁదఁబ్రాస। బంధమగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి। ...(ఛందోద. ౧ ఆ. ౫౭ ప.) ఈవిషయమున నప్పకవియుఁ దిమ్మకవియుఁ బ్రామాదికముగ వ్రాసిరి. క. ట త వర్గంబులు రెంటను। సతతము సరళాక్షరములు సమ లిపులును ని। ర్జిత మురనాంతపదాంత। ద్రుతములతోఁ గూడికొనవు తుదిగదిసినచోన్ క. కడుఁ దృతీయ చతుర్థవర్గములఁ గలుగు। సరళములును సమ లిపులును బరము లైన। తఱిని నాంతపదాంతద్రుతంబు పొల్లు। పిఱిఁదియై నిత్యముగఁ బూర్ణబిందు వగును. క. ముందర గ జ బ మకారము। లొందిననాంతములతుదల నుండు ద్రుతములం। గ్రందుకొని వికల్పంబున। బిందువులుగఁజేసి కృతులఁ బెట్టుదు రొకచోన్ (అప్పక. ౫ ఆ. ౧౮౬ - ౧౫౩ - ౧౫౭ ప.) క. తెల్లముగ గ జ డ ద బ ములు। పొల్లనకారంబుతోడఁ బొదలినయెడలన్। బొల్లులె నిల్చు నొకొకచోఁ। జెల్లును నెఱసున్న లగుచు శ్రీగౌరీశా॥ (సర్వల. ౧ ఆ. ౮౭ ప.) ట త వర్గ వర్గయుక్సరళములు పరమగునపుడు ద్రుతమునకు నిత్యముగ నిండుసున్న వచ్చుననెడి యప్పకవివచనమును, గ జ డ ద బములు పరమగునపుడు ద్రుతము పొల్లుగనె నిల్చును లేదా యరుదుగ దానిచో నెఱసున్న నిల్చును ననెడితిమ్మకవివచనమును నవిచారమూలకములు చింతామణివిరుద్ధములు ననకతీరదుగదా. ట త వర్గముల వర్గయుక్సరళములు పరమగునపుడు ద్రుతమునకు నిండుసున్నయె కాక లోపాదికములు గలుగుటయు గ జ డ ద బములు పరమగునపుడును ద్రుతలోపముగలుగుటయు మహాకవిప్రయోగప్రసిద్ధము కాదా? ఉ......ఇద్దురాత్ము దు। ర్వారమదీయబాహు...... (భార. సభా. ౨ ఆ. ౨౮౯.) ఉ...రమ్మని సన్నఁజేసె ధృతరాష్ట్రసుతాగ్రజుఁ డప్డు...

(సభా. ౨ ఆ. ౨౭౩.) సీ...! పాత్రు నాపస్తంబుసూత్రు ముద్గలగోత్రజాతు... నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్య (ఆది. ౧ ఆ. ౯.) (అనుబంధ.)

విస్తర. II రా౨ I విష:—ప్రయోగములు:—శా...నీ | కుం డక్కెం జతురాననత్వగుణయుక్తుల్ మీఱ వాణీమనో | భండారోద్ధత... (కవుల. షష్ఠము. సర్వల. ౧ ఆ. ౯3 ప.) స్రగ్ధర...అక్కం | దళితాపత్యానురక్తిన్ (రాఘ. ౨ ఆ. ౧3 ప) ('అక్కన్+దళిత' అని భారతార్థము 'అక్కందళితాపత్యానురక్తిన్' రామా య.) క. దుంతీశు భైరవుని శితి | కంఠు...లోలా | ర్కుం దేవ...(కవిసింగరన్న గారి శ్రీశంకరోపాఖ్యానము అప్పక. ౪ ఆ. ౧౪౭.) తే. గీ. ధాంధమిత భేరికాధ్వా నముం ధుళీని | నాదమును (అధర్వ. విరాట. అప్ప. ౪ ఆ. ౧౪౪ ప.) తే. గీ. ప్రాస | బంధమగు గృష్ణుఁ డుదయించినం ధరిత్రి (ఛందోద. ౧ ఆ. ౪౧). కం. తుంగమదుపున...కార్చి | ర్చుం గడచి యచటి బలములు...(ద్రోణ. సర్వల. ౧ ఆ. ౯౦ ప.) తిమ్మకవి దీనిని బొరపాటుగ నుదాహరించెను. 'కడచు' అనునది ధాతువు కాని 'గడచు' కాదు. కాన నిది యాదేశసరళపరకద్రుతబిందూదాహృతి కానోపును. కం. మిరియా | లుం జొన్నలసరిపోవే...(ఉ. హరి. ౧ ఆ. ౭౪.) ఉ. మంజ్వభిరామజైత్రమగు...వ్రే | సెంజ్వరుఁ డంత...ము | టం జ్వలనంబు రా...(ఉ. హరి. ౬ ఆ. ౮౮ ప.) ఉ. అంజసమానవాయు...క | ల్మిం జనియించు దుర్యశము...(ఆము. ౧ ఆ. ౯౧ ప.)

మకారసమానన్యాయమున నకారమునుసైత మనునాసికప్రాసము సందర్భ మున నప్పకవి మకారముతోపాటుగ నకారమునుసైతము సూత్రించెను. కాని

---

అనుబంధము. విస్తర. I రా౨ I విష:—"ద్రుతంబునకుఁ బ్రాసస్థానంబున మకారంబు పరంబగుచో నిందుసున్న యగునని తిమ్మకవీంద్రులయభిప్రాయంబు..." (బా.గు.ప్ర.౪3 పు. ద్వి. ము.) "ద్రుతమునకు మకారము పరమగునపుడు ప్రాసము లందు బిందువు విధించి యప్పకవ్యాదు లనునాసికప్రాసముం బొసంగఁజేసిరి. (అప్పక.3 ఆ. 3౭౨-3౭3 ప. ౪ ఆ. ౧౪౯.) తిమ్మకవియు నిమ్మార్గమునె యనుసరించెను." (బా. సా. పే. ౭౬ పుట. సంధి. ౧౯ సూ.) బా. గు. ప్ర. వ్యాఖ్యాతయుఁ బేటి కావ్యాఖ్యాతయుఁ బ్రౌఢవ్యాకరణసూత్రపఠనవాసనచే నిట్లు వ్రాసిరేకాని రా౨ I విష. విస్తరమున నుదాహరింపఁబడిన యప్పకవి తిమ్మకవులపద్యములలోఁ బ్రాసము లందుమాత్రమే యావిధులు వర్తించునని యెంతమాత్రము లేదుగదా - మఱియు నప్పకవిమార్గమును దిమ్మకవి యనుసరింపలేదు. తిమ్మకవి యప్పకవివలె వర్గయుక్కుల విషయము నెత్తలేదు. ఇంతేకాక యనునాసికప్రాసమును సంగ్రహింపలేదు.

మకారపరకద్రుతపూర్ణబిందువిధానము నుజ్జగించుట/సరికాదు. ఇట్టి సూరిలోపము సవరించుటకయి త్రిలింగలక్షణశేషకర్త "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు" (ప్రౌఢ. సంధి. ౨౨ సూ.) అని సూత్రించి పైనన్నయప్రయోగములను జూపెను. ఈరచనము నన్నయ ప్రాసప్రయోగ బాధను వారించినది. కాని నిర్బాధమును "కేచిద్వద న్త్యభిన్నత్వ। మనుస్వార మకారయోః" (౮౧ విష.) అను నథర్వణవచనసమ్మతమును నగుచింతామణిమార్గము ను పేక్షించి "లతాంతములకు మ్మెునసి" అనురీతిని మకారద్వయప్రయోగము నన్నయచేసెనని నూతనపద్ధతిని గల్పించుట కాధార మేమున్నది? మఱియుఁ బ్రాసస్థల ప్రయుక్తమనుటచేఁ బ్రామాణికమై నన్నయాథర్వణసమ్మతమైయున్న మకారపరక ద్రుతపూర్ణబిందువిధానము ప్రాసంబులందుమాత్రమె సాధువని చెప్పుట కేవలము నసంగతము లక్షణశాస్త్రసంప్రదాయవిరుద్ధమును నైయున్నది.

సంజీవని ౮౨ II విష.:—'కందోయి' అనుచోటి ప్రక్రియ వివరింపఁబడు చున్నది. 'కన్నుయొక్క+దోయి=కన్ను+దోయి' అనుషష్ఠీసమాసమున బా. సంధి. ౨౪ సూత్రముచొప్పున నుక్కు రాఁగా 'కన్ను+ను+దోయి' అని యేర్పడును. ఇట నిక్కులాదిసూత్రముచొప్పున (బా. సమా. ౨౦ సూ. దీనివివరణము ప్రౌఢ. సమా. 3౬ సూ.) 'కన్ను' అనుదానిలోని 'న్ను' అను భాగము లోపింపఁగా 'క+ను+దోయి' అని యేర్పడును. ఇందల్లి నుగాగమద్రుతము ప్రకృతసూత్రముచే నిండు సున్న కాఁగా 'కందోయి' అనురూపము సిద్ధించును. బా. సా. వే. వ్యాఖ్యాకర్త 'కందోయి' అనునది షష్ఠీసమాసమగుటచే బా. సంధి. ౨౪ సూత్రముచొప్పున

---

మకారపరకత్వమునందువలె నకారపరకత్వమునఁ బ్రాసభంగపుచిక్కు వాటిల్ల నేరదు. ద్రుతము పరనకారసంశ్లిష్టమగుచు ద్విత్వనకారప్రాసమున కనుకూలించియే యుండును. గీ. తమకుఁ దామ ద్విత్వంబులై తనరునవియుఁ। బూర్ణబిందులు డాఁపలఁ బొరయునవియుఁ। గలసి యనునాసికప్రాసము లనుపేర। న, మ, లమరుఁ గావ్యములయందుఁ దమకుఁ దామ॥ (అప్ప. 3 ఆ. 3౮౦ ప.) క. మిన్నేరుపాదమున ధా। తం నాభిని...।సాంనిధ్యము...। సంనుతి...(అప్ప. 3 ఆ. 3౮౧ ప.) క. తమ్ములను...భ। క్తింమురసంహారు...। సంముదమున (అప్ప. 3 ఆ. 3౮౨). అప్పకవీయముద్రణములలో గిడుగువారిముద్రణమునందుసైతము "ధా। తన్నాభిని..." "భ। క్తిమ్మురసంహారు..." మున్నగురీతిని లక్ష్యలక్షణసందర్భశూన్యముగ ముద్రింపఁబడుట శోచనీయము. ఇట నప్పకవిపై రీతి నకారమును జేర్ప నక్కఱ లేదు. "ధా।తన్నాభిని-సాన్నిధ్యము—సన్నుతి" అనియు నుండఁదగును గదా.

సామాసిక నుగాగమము కానేరదని యనుపపత్తిని జూపుచు నిట బాల. ప్రకీర్ణ. ౭-౧౬ సూత్రములచే "కన్ను" శబ్దము 'కన్' అని యేర్పడుననియు గత్యంతరాభావమున నిట నావయవికనకారమునకు ద్రుతత్వ మంగీకార్యమనియు నొకపక్షముగా నిరూపించెను. (బా. సా. పే. ౭౫-౭౬ పు.) కాని బా.।సంధి. ౨౫ సూత్రమునందలి 'సమాసంబుల' అను బహువచనస్వారస్యముచే షష్ఠీసమాసమునందును నుగాగమము వచ్చునని విశదపఱుచుటకే సూరి "సింగపుఁ గొదమ" అను షష్ఠీసమాసము నుదాహరించుటచేఁ బేటికావ్యాఖ్యాతచూపిన యనుపపత్తి పరాస్తమగుచున్నది. "కన్గవ - కన్గొనలు మున్నగుచోట్ల నకారము ద్రుతముకాదు. ఇచ్చట ప్రథమమీఁది కకారము గకారమైనది." (ఆం. భా. అ. సంధి. ౪౯ సూ.) ఈ వ్రాఁతయు సరికాదు. షష్ఠీసమాసమున గసడదవాదేశ మెంతమాత్రమును రాదు. (౨౭ IV విష.) మఱియు "కన్గవ - కన్గోనలు" మున్నగువాని మొదటిరూపములనఁదగు "కన్నుఁగవ - కనుఁగోనలు" మున్నగునవి నుగాగమయుక్తములై గజడదబాదేశపూర్ణానుస్వారములతోఁ గవిప్రయుక్తము లగుచున్నవి. ఉదా:— ఉ...కనుం । గోనలవిస్ఫులింగములు...(భాస్కర. యుద్ధ. ౧౬౭). ఉ. క। న్నుంగవయాక్రమించుకొనునో ముఖచంద్రు. (మను. ౨ ఆ. ౩౨.) "మఱియు నందు (చింతామణియందు.) షష్ఠీసమాసమునందలి షష్ఠ్యంతమునకు ద్వితీయాతౌల్యము సంభవించెడిఁగాన నేతత్సాధుత్వవిషయమునఁ బ్రతిబంధమే యగపడదు." (బా. సా. పే. ౭౬ పు.) అని పేటికావ్యాఖ్యాత యింకొకవిధమున ద్రుతస్థితిని సమర్థించెను. ఈసమర్థనము కేవలము ప్రామాదికము. "షష్ఠీభ వేద్ద్వితీయాతుల్యా । తత్పురుష సంస్థితానామ్నామ్" అనుచింతామణిసూత్రముచొప్పున లభించిన ద్వితీయా 'ను' ప్రత్యయద్రుతము "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అనుచొప్పున లోపించునని యీతఁడు గ్రహింపకుండుట వింత. చింతామణిప్రక్రియలోని షష్ఠికి ద్వితీయాదేశముచేయుట యెల్ల నట్టిద్వితీయా 'ను' ప్రత్యయమునకు సామాసికద్రుతలోపము చేయుటకేకదా!

ద్రుతస్య హలి బిన్దుః స్యా।చ్ఛ్లిష్టత్వంచ క్వచిత్ స్వతా।
లోపశ్చాప్యతృతీయాతు । నయుక్తోశబ్దవిన్మతే ।
(వికృ. సంధి. ౧౭ కారి. అహో. ౨౧౩ పు.)

స్వత్వం ప్రశ్లేషతాబిన్దుః । సమాసే న ప్రయోగతః ॥
(వికృ. సంధి. ౧౮ కారి. అహో. ౨౧౩ పు.)
క్వచిద్భవేత్సమాసేపి । ప్రాణిమాత్రస్య సంశ్రుతిః ॥

(వికృ. హాలం. ౬ కా. అహో. ౪౦౦ పు.)
ఆద్యేతృతీయేచకపా। స్తృతీయేస్యుః కవేతరే।
సన్నయా ఆద్యే ద్వితీయే తుర్యేచ। ప్రాప్నువన్తి నిమిత్తతామ్।
౮౨ III (వికృ. షంధి. ౧౯ కారి. అహో. ౨౧౪ పు.)
విష. వినాద్వితీయం స్యాదస్మ। దాత్మనోః స్వన్తయోరపి।
నోరన్యస్యాపి సర్వంస్యా। ద్బహుళం సత్ప్రయోగతః.
(వికృ. సంధి. ౩౨ కారి. అహో. ౨౩౨).
పద్యావసానే సర్వేషాం। స్వత్వం నాప్నోతి సాధు
తామ్ (వికృ. సంధి. ౨౧ కా. అహో. ౨౧౪ పు.)
పద్యభేదావసానేషు। శ్లిష్టతా నస్య కథ్యతే।అపరాన్తే
సమాసేచ। శబ్దే నో బిన్దురిష్యతే। ధూర్వాహస్యకుతే
తత్ర। కవివాఙ్మానముచ్యతే. (వికృ. సంధి. ౨౦-౨౧
కారి. అహో. ౨౧౪)

కల్ప. ౮౨ III విష:—పరుషపరక ద్రుతసంధికార్యములు మున్నగువాని విషయమునఁ జింతామణి చెప్పినవిషయములను సుబోధమునకై భంగ్యంతరముగ నథర్వణుఁడు వివరించుచున్నాఁడు. ద్రుతస్యేత్యాది:—శబ్దవిన్మతే = శబ్దశాస్త్రజ్ఞుల మతమున, హాలి = హల్లు పరముగుచుండఁగా, ద్రుతస్య = వ్యంజననకారరూపమగు ద్రుతమునకు, బిన్దుఃస్యాత్ = ఖండపూర్ణాన్యతరమగు సున్న యాదేశమగును. శ్లిష్టత్వంచ = స్వపూర్వాచ్చు నత్తియుండు స్వరూపముగల సంశ్లేషమును, క్వచిత్ = ఒకానొకప్పు డగును. స్వతా = పరహల్లుతో సంయోగించుస్వరూపముగల స్వత్వము సైతము నగును. లోపశ్చ = లోపము నగును. పయికార్యములెల్ల వ్యస్తస్థలవిషయకములు.

ఆద్యతృతీయాత్విత్యాది:—యుక్తౌ = శబ్దముల కలయికయం దనఁగా సమాసమందు, ఆద్యతృతీయాతు = బిందుస్వత్వసంశ్లేషములు, న = రావు. ఈవిషయ మునే యింకను విస్తరించి వివరించుచున్నాఁడు:—సమాసే = సమాసమందు, సాధారణముగా, స్వత్వమ్ = స్వత్వమును, ప్రశ్లేషతా = సంశ్లేషమును, బిన్దుః = బిందువును, న = రావని, ప్రయోగతః=కవిప్రయోగములనుబట్టి విశదమగుచున్నది. ఇంకఁ బరిశిష్టమగులోపముమాత్రము సమాసమున వచ్చునని యెఱుంగునది. సాధా రణముగా ననువ్యాఖ్యానముచేత—క్వచిత్ = కాదాచిత్కముగ, సమాసేఽపి = సమాసమందును, ప్రాణిమాత్రస్య=నకారవ్యంజనరూపద్రుతముయొక్క, సంశ్రుతిః = వినికి = లేదా, సంస్థితిః = ఉనికి, భవేత్ = అగును. 'ప్రాణిమాత్రస్య' యనుమాత్ర

శబ్దస్వారస్యముచ నట్టిప్రాణి యనఁగా ద్రుతము పూర్వాచ్చు నత్తియుండుసంశ్లేషము నందునే కాని సరళాదేశాది ద్రుతసంధికార్యము లెవ్వియుఁ గలుగవనునర్థము లభించుచున్నవి. ఉదా:—గిరివ్రజమున్ పురంబు (సభా ౧ ఆ ౭౩) మొ. చిగురుంగైకప్పు. ప్రాఁగేంపు. కెందామర మున్నగు రూపములలోని ద్రుతస్థితియు ద్రుతకార్య సరళాదేశాదికమును నీసూత్రమునకువిషయములుకావు.అయ్యవి"నుమ్‌చోతః"అనెడి సూత్రమునకును దద్వివరణమగు పరుషేసరళేచైవేత్యాదికారికకును జేయువిధానసామర్థ్యమున నిత్యాది (౧౨ విష) వ్యాఖ్యానవిశేషముచేత సంభవించునని యెఱుంగునది. కొందఱట్టిచోటులందలి ద్రుతకార్యము లెల్ల నీకారికచేతనె సిద్ధించునని వ్యాఖ్య చేయుదురు. అది సరికాదు.

ఆద్యేతృతీయేచేత్యాది:—కపాః = క చ ట త ప లు, అనఁగా నాదేశసరళములు, ఆద్యే = ఖండపూర్ణాన్యతరబిందువు విషయమునందును, తృతీయేచ = ద్రుతము పరహల్లుతో సంయోగించునట్టి రూపముగల స్వత్వమువిషయమునందును, నిమిత్తతామ్=నిమిత్తతను, ప్రాప్నువన్తి=పొందుచున్నవి. వికృతివివేకము చింతామణి శేషమగుటచే గ జ డ ద బా దేశవిధి పునరుక్తముగఁ జెప్పఁబడదయ్యె. సరళాదేశపక్షమున ద్రుతము పూర్వాచ్చు నత్తియుండుట స్వరూపముగఁగల సంశ్లేషముఁ జింతామణి యంగీకరింపదుగాన నథర్వణుఁడును వచింపలేదు. క వే త రే = క చ ట త వే తరము లనఁగా సహజసరళస్థిరములు, తృతీయే = స్వత్వవిషయమునందును, ఆద్యే = బిందువువిషయమునందును, ద్వితీయే=సంశ్లేషవిషయమునందును, తుర్యేచ = లోపవిషయమునందును, నిమిత్తతామ్ = నిమిత్తతను, ప్రాప్నువన్తి = పొందుచున్నవి, లుగ్వేతిసూత్రముచే సరళస్థిరపరకత్వమున సంశ్లేషమును బూర్ణబిందువును, విధింపఁబడెనుగాన నీవిషయములును జింతామణి కారికానిర్గళితార్థములె యని గ్రహింపనగును.

వినా ద్వితీయమిత్యాది:—స్వన్తయోరపి = సుప్రత్యయాంతములె యనఁగాఁ బ్రథమాంతములె యైనను, అస్మదాత్మనోః = నాతాశబ్దములయొక్క, నోః = నుప్రత్యయసంబంధమైన ద్రుతమున కనఁగా నుత్వలోపముచే సిద్ధించు 'నేన్-తాన్' అనువాని ద్రుతమునకు, ద్వితీయంవినా = సంశ్లేషముతప్పఁ దక్కినబింద్వాదికార్యజాతము. స్యాత్ = అగును. (చూ. ౭౨ విష. దీనివిస్తరము. ౧౬ విష. కల్పత.) కళలగు నేను తాను శబ్దములతుది 'ఉ' కారము లోపింపనిచో దానికి ద్రుతత్వమే లేదుగాన నిందు ద్రుతకార్యవిధానసామర్థ్యముచేతనే కవిభల్లటసూత్రమున నుత్వము లోపించినవే యీకారికకు విషయములని గ్రహింపవలయును. దీర్ఘము

మీఁది ద్రుతముగాన నిట నిండుసున్న రాదు. నేన్+చదివితిని = నేఁజదివితిని. తాన్+వినె = తాన్వినె. మొ. నన్నయాథర్వణులమతమున ద్రుత 'ను' స్వరూపమే లేదుగాన 'నేను జదివితిని' మున్నగు సరళాదేశరూపములు సాధువులు కాఁజాలవు. నన్నయాథర్వణులమతమున సంశ్లేషస్వత్వముల కుచ్చారణములోని ఈషద్భేదమే కాని రూపభేదము లేదు. నకారపుపొల్లుమీఁది పరుషమునకు (సరళాదేశము రాఁదగినఓటులందుమాత్రమె) సంశ్లేషనిషేధ మావశ్యకము. కాన "తాన్+చదివె= 'తాన్, చదివె'' అనురీతి రూపము కల్గనేరదు—'తాఁజదివె' అనియె యగును. "గిరివ్రజమన్, పురంబు" మున్నగుస్థలములందుమాత్రమె "శ్లిష్టత్వంచక్వచిత్" అనుదానికిఁ బ్రవృత్తి యని యెఱుంగునది. పై సందర్భమునుబట్టి 'తాన్, వినె' 'నేన్, వింటిని' మున్నగుచోటులందలి సంశ్లేషము విరుద్ధము కానేరదు. ఇట్టి యెడల వినాద్వితీయమ్మనెడి సంశ్లేషనిషేధమును గల్పింపనక్కఱలేదు. అన్యస్యాపినోః = తాను నేను శబ్దములలోని 'ను' అనుదానికంటె భిన్నమైన మ్రాను-మున్నగు వానిలోని 'ను' అనుదాని కుల్లోపముగల్గఁగా నిల్చునావయవికద్రుతమునకు సైతము, సర్వమ్ = ఎల్లద్రుతకార్యములును, బహుళమ్ = బాహుళకముగా, సత్ప్రయోగతః = మహాకవి ప్రయోగానుసారముగా, స్యాత్ = అగును. ఇందలి, "అన్యస్యాపి నోః" అనుచోటి 'ను' అనునది 'ఏని' మున్నగువానిలోని 'ని' మున్నగువానికిని నుపలక్షణ మగుచున్నది. మ్రాను - ఏను = (ఐదు) మున్నగు వాని తుది 'ఉ' కారము కవిభల్లటసూత్రముచేతను, 'ఏని' అనుదానిలోని తుది 'ఇ' కారము "అపిశబ్దార్థస్యైతః" అనుసూత్రముచేతను లోపింపఁగా - 'మ్రాన్ - ఏన్ - (ఐదు) ఏన్ (అప్యర్థకము) మున్నగురూపము లేర్పడును. 'మ్రాన్పడు' మున్నగుచోట్ల సరళాదేశాదికము రాకుండుటకును, ఏఁబది కన్గవ మున్నగుచోట్ల సరళాదేశాదికమువచ్చుటకును నీయథర్వణకారికలోని బహుళశబ్దమె సాధకమని గ్రహింపవలయును. నన్నయాథర్వణులపక్షమున, కన్గవ - కన్గోనలు, రాము నేఁ గృష్ణునేని మున్నగుచోటులందలి ద్రుతమావయవికమె యని యెఱుంగునది. ఏని శబ్దము లుప్తాచ్కమగునపు డందలి ద్రుతముమీఁది పరుషములకు సరళాదేశాదికము రాకుండుటకు ప్రాచీనప్రామాణికకవిప్రయోగము కన్పట్టలేదు. ధరణిదేవుల నాగయమంత్రికృతదశావతారచరిత్రమునందుమాత్ర మొక్క ప్రయోగ ముపలబ్ధమైనది.

ఉ. శ్రీకరమత్స్యకూర్మకిటిసింహవటూత్తమ రామబుద్ధక | ల్క్యాకృతులన్
వచోమరధరార్భకవాసవసంశ్రవార్కకా | మాకు ముదాప్తభృజ్జయకృతావనుఁడై

తను వేంకటేశాంకమౌ । తే కృపః బద్మనాభసటీవేశ్వరుఁ గృష్ణసుధీంద్రుఁ బ్రోచుతన్ ॥ (కళా. ౧ ఆ. ౧ ప.)

పద్యావసాన ఇత్యాది:—పద్యావసానే = పద్యము తుదిని, స్వత్వమ్ = ద్రుతము పరహల్లుతో సంయోగించుట లక్షణముగాఁగలస్వత్వము, సర్వేషామ్ = ఎల్లరమతములందును, సాధుతామ్ = అర్హతను, నాప్నోతి = పొందదు పద్యద్వయాద్యంతవర్ణ సంధి సంప్రదాయవిరుద్ధమగుటం జేసి పూర్వపద్యాంతిమ నకారపుహల్లు పరపద్యాదిమహల్లుతో సంయోగించుట యసంభవమని తాత్పర్యము. ఈసందర్భములోని యహోబలపండితీయము దదనుయాయికవిజనమండనగాణపతవివరములును బ్రమాదభూయిష్ఠము లయియున్నవి. అహోబలపతి ద్రుతము 'ను' స్వరూపముతో నిల్చుట స్వత్వమని తలంచినవాఁడగుటంజేసి "వైజయంతీనవాంశుకవ్యాజమునను ఇత్యాదిషు జైమినీభారతాద్యుక్తేషు సమాప్తౌస్వత్వ మసంగతమేవ" (అహో. ౨౧౭ పు.) అని వ్రాసెను.

పద్యభేదావసానేష్విత్యాది:—పద్యభేద = కందము మున్నగు కొన్నిపద్యముల, అవసానేషు = అంతములందు, నస్య=ద్రుతమనఁ నకనఁగా నకారపుహల్లునకు, శ్లిష్టతా = సంశ్లేషమనఁగా ద్రుతముపూర్వాచ్చునత్తియుండుట, కథ్యతే = చెప్పఁబడుచున్నది. ఉదా:—క. తెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్॥ (ఆది. ౧ ఆ. ౧౬). ఉ సర్వలో । కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్॥ (ఆది. ౧ ఆ. ౬). లఘువే తుదినుండవలసినగీతాదులతుదిని సంశ్లేష ముండనేరదని యెఱుంగునది.

అపరాన్తఇత్యాది:—అపరాన్తే = నాల్గవచరణముతక్కఁ దక్కినచరణముల తుదిని, సమాసేచ = సమాసమునందును, శబ్దే = శబ్దము పరమగుచుండఁగా, నః = ద్రుతమునకు, బిన్దుః = ఖండపూర్ణాన్యతరబిందువు, ధూర్వహస్యమతే = ధూర్వహునిమతమున, ఇష్యతే=సమ్మతమగుచున్నది. ధూర్వహగ్రహణముపూజార్థము— అపరచరణములతుదిని బరశబ్దముండునుగాన బిందువుండు ననుటచేఁ బద్యాంతమున బిందువుండరాదనునర్థము తేలుచున్నది. సమాసమున ద్రుతలోపము సామాన్యముగా నగుచుండుట సమ్మతమెయైనను వెనుకఁజెప్పినరీతిని బ్రాణిమాత్రము క్వాచిత్కముగ నిల్చునట్లె క్వాచిత్కముగా "తలఁబ్రాలు - నేసఁబ్రాలు - ఊరఁబంది - ఊరఁబిచ్చుక-తోఁడఁబుట్టువు" మున్నగుచోట్ల సమాసమునందును ద్రుతము లోపింపక బిందురూపమున నిల్చునని తాత్పర్యము. తత్ర = ఆవిషయమున, కవివాక్ =

మహాకవిప్రయోగము, మానముచ్యతే = ప్రమాణముగఁ జెప్పఁబడుచున్నది. (విస్తర.)

---

విస్తర. ౮౩ III విష:—"అపరాన్తఃపద్యసమాప్తిః తత్రస్థితస్య నస్య బిన్దుః తస్య న ప్రయోగప్రసిద్ధిః - సమాసే కెందమ్మి ఇత్యాద్యుదాహృతమ్. ఏతదప్య రూఢమ్. వించు - కంచు ఇత్యాదికం శబ్దోదాహరణమ్." (అహో. ౨౧౪ పు.) అని కవిశిరోభూషణమునఁ బ్రామాదికముగ వ్రాయఁబడెను. 'పద్యావసానే' ఇత్యాది పూర్వచరణములందుఁ బద్యాంతద్రుతకార్యములు చెప్పఁబడియుండఁగా 'అపరాన్తే' అనుదానికిని బద్యాన్తమందనియే యర్థముచేయుట సరికాదుగదా. అట్టి యపార్థ మునకుఁ బ్రయోగప్రసిద్ధి యెట్లు కల్గును? క్వచిద్భవేత్సమాసేపీత్యాదికముచే సామాసికద్రుతస్థితి వచింపఁబడుచుండఁగా నిటఁ బునరుక్తముగా నద్దానినే వచింప నేల? మఱియు "కెందమ్మీ" త్యాదిలక్ష్యములు రూఢములుకావనుట మిక్కిలి వింతగనున్నది. గీ. కురుబలంబు కెందామరకొలనిఁబోలె" (భీష్మ. ౧ ఆ. ౯౬). సీ...కెంగేలిజిగి...(అను. ౧ ఆ. ౪౮) గీ. కెంజాయమిగిలి...(ఉద్యో. ౪ ఆ. ౩౨౧). సీ. కెందమ్మితేకులయందంబుగల (భాస్కర. యుద్ధ. ౧౫౨౭). ఇంక "వించు - కంచు" ఇత్యాదులు "శత్రర్థేతూతశ్చానో । స్తస్యస్యాచ్చ పూర్ణబిన్దురపి" అనుచింతా మణి సూత్రమునకు లక్ష్యములగుచుండఁగా వానిని బయికారికకు లక్ష్య ములుగఁ జేయుట సరికాదు. అహోబలపతి యిచటనేకాక యీసందర్భములోని "ద్రుతస్యహాలీ" త్యాదికారికలందును సరియగువివరణము నీయలేదు. కొన్ని యెడలఁ బ్రామాదికముగ నైతము వివరించియున్నాఁడు. అట్లగుటచేతనే తదను యాయులగు కవిజనమండననారాయణీయ తద్వివరణకర్తలునైత మాయాప్రమా దములకు లోనగుచు నహోబలపతి వివరింపనిచోటులందు మఱియుఁ దప్పులకుఁ బాల్పడుచువచ్చిరి. ద్రుతస్యహాలీత్యాదికారికలోని "ఆద్యతృతీయాతు । న యుక్తా శబ్దవిస్మృతే" అనుదాని నహోబలపతి వివరింపలేదు. మఱియు దానితర్వాత నుండఁ దగిన "స్వత్వం ప్రశ్లేషతాబిన్దు।స్సమాసే న ప్రయోగతః" అను కారికను బూర్వసూత్ర వ్యాఖ్యలో నుదాహరించియుండుటచేత నిచటఁ జూపలేదు. అట్లగుటచేఁగవిజనమం డనకారాదులును నిట దీనినుదాహరింపరైరి. "ఆద్యతృతీయాతు । నయుక్తా విత్యాదికారిక నహోబలపతి వివరింపమింజేసి బిందుస్వత్వములు శబ్దవేత్తలమతము న రావని పయివివరణకర్తలు వివరించిరి. ఏశబ్దవేత్తయైనను నెచ్చటనైనను హల్పర కత్వమున బిందువును "ను" స్వరూపస్వత్వమును (వారిమతములోని స్వత్వము 'ను' స్వరూపముగాన) రావని చెప్పియుండలేదుగదా. "ఏతచ్ఛస్వత్వము

సమాసేన సంధేః  ప్రయోగాభావాత్ - 'స్వత్వం ప్రశ్లేషతాబిన్దు। స్సమాసేన ప్రయోగతః।' ఇత్యథర్వణవచనాచ్చ." (అహో. ౨౧౩ పు.) అని యహోబలపతి స్వత్వనిషేధమునకే దీనినుదాహరింపఁగా నట్టిస్వత్వమ్మునుదళమునే యూడఁబెఱికి 'న' అనువానిచో "తు" అనువానిని, నిల్పి "నిత్యం ప్రశ్లేషతాబిన్దు। స్సమాసేతుప్రయోగతః" అని విపరీతార్థకముగా కవిజనమండటీకాకర్త మార్చి యుదాహరింప సాహసించెను. నారాయణీయకర్త కవిజనమండనోదాహృతకారికార్థమునే క. "నిత్యంబుగ బిందువు శ్లి। ష్టత్వంబు సమాసమందు సాధ్వీమణి సా। ధుత్వము నొందును..." అని వివరించి యథర్వణకారికల నుదాహరించుటలోమాత్రము "స్వత్వం ప్రశ్లేషతేత్యాదిరూపమున నహోబలపండితీయపాఠమునె నిల్పెను. ఈ సందడిలోఁ బయిభాషాంతరీకరణపద్యమునఁ బ్రాసభంగమును జూచికొనలేదు.(నారా. సంధి. ౩౮ పద్య.)

క్వచిద్భవేత్సమాసే· పీత్యాదికారిక నహోబలపతి యుల్లోపవిధిసందర్భమున నుదాహరించుటచేఁ (అహో. ౮౦౦ పుట.) దదనుయాయివివరణకర్తలును నట్లె వివరించిరి. ఉదా - కనుదోయి=కన్దోయి. చనుదోయి=చన్దోయి. సమాసమునఁ గల్గు వర్ణలోపాదివివిధకార్యములతోపాటుగ నీయుల్లోపముసయితము చెప్పకున్నను క్షతిలేదుగాని "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అనుచింతామణిచే సిద్ధించు సామాసికద్రుతలోపముకల్గని "గిరివ్రజమన్, పురంబు" మున్నగునలంటిచోటులను సంగ్రహించుకొనుటకై యిక్కారికను సామాసికద్రుతలోపాభావపరముగా నన్వయించుకొనుట యావశ్యకముకాదా? మఱియుఁ బ్రాణమాత్రస్థితివిధానసామర్థ్యమున నుల్లోప మెట్లును సిద్ధించును.

"ఆద్యేతృతీయేచకపా" ఇత్యాదికారికలో "తృతీయాః స్యుఃకపేతరే" అని యుదాహరించి యహోబలపతి "కపాః=క చ ట త పాః, తృతీయాః=గ జ డ ద బాశ్చ బిన్దుస్వత్వయోర్నిమిత్తతాం ప్రాప్నువన్తి, క చ ట త పేభ్య ఇతరేవర్ణాస్సర్వే బిన్దుసంశ్లేషలోపేషు నిమిత్తతాం ప్రాప్నువన్తీత్యర్థః" (అహో. ౨౧౮ పు.) ఈయహోబలవ్యాఖ్యయె కవిజనమండననారాయణీయతద్వివరణకర్తలచే ననుసరింపఁబడెను. నన్నయాథర్వణసమ్మతస్వత్వసంశ్లేషము లహోబలపత్యాదులు గ్రహింపకుండుట యొకయనర్థము. మఱియు "క చ ట త పే" తరవర్ణములెల్ల బిందుసంశ్లేషలోపములకు నిమిత్తములని చెప్పినపుడు గ జ డ ద బలకు బిందునిమిత్తతగల్గుటకై వానిని 'క చ ట త ప'లలోఁ జేర్చుట యనావశ్యకము. ఇంతియకాక గ జ డ ద బలు బిందు

సంశ్లేషలోపములతోఁపాటు స్వత్వమందును నిమిత్తములు కానోపునుగాన నట్లు చెప్పకుండుటయు సరికాదు. కావున "తృతీయాఃస్యుః కపేతరే" అనుపాఠము సరికాదనియు "తృతీయేస్యుః కపేతరే" అనుపాఠమే గ్రంథకృదభిప్రేతమనియుఁ జెప్పుటకు సందేహము లేదు. "తృతీయేస్యుః" అనుపాఠముపక్షమునఁ బైయనుపపత్తులు కల్గనేరవు. మఱియు "తృతీయాః" అనుపాఠము నంగీకరించియు వివరణకర్తలు స్వత్వమందును "కపేతరములు" నిమిత్తము లగునని యెట్లు వ్రాయఁగల్గిరో తెలియకున్నది. (కవిజనమం. సంధి. ౧౯ కారి. వ్యా. నారా. గాణ. సంధి. ౧౨౨ కా. ౧౮ పద్యవివ.) "తే-గీ. ఎందును నిమిత్తమై స్వత్వబిందువులకుఁ।బరుషములు సరళంబులుఁబరఁగుచుండు" అనునారాయణీయపద్యపుగాణపతవివరణమున "సరళమన నాదేశసరళమును స్వతస్సిద్ధసరళమునగు. ('కపేతరే' అనుదానివివరణమునందలి పరుషాన్యములనఁగా) పరుషాన్యాన్తర్భూతసరళముగూడ నుభయవిధమె" అని ప్రామాదికముగ వ్రాయఁబడెను. ఇటఁ బరుషములనఁగా నాదేశసరళమాత్రమే యని యర్థముచేయక సరళశబ్దముచేతనే యాదేశసరళములను సయితము సంగ్రహించుటవలన నింక మిగిలినపరుషశబ్దము కేవలపరుషపరమె యగుచుఁ గేవలపరుషములుసైతము బిందుస్వత్వములకును నాదేశసరళములుసైతము లోపమునకును నిమిత్తము లగుననెడి యపార్థము దుర్నివారమగుచున్నది.

"వికల్పేన ద్రుతేలోపే। పరుషాః సరళాః పరే" (నారా. గాణ. సంధి. ౧౨౩ కారి.) అను ననన్వితప్రక్షిప్తకారిక నొకదానిని నారాయణీయ తద్వివరణకర్తలు కవిజనాంజనమునుండి గ్రహించిరి. "క. పరుషంబులు ద్రుతమునకున్। బరమై చూపట్టుచుండు పట్టుల నొకచోఁ। బరఁగ ద్రుతలోపమును బై। పరుషములకు సరళములు విభాష నెసంగున్ (నారా. సంధి. ౧౯ ప.) అని యిట్లు పైప్రక్షిప్తకారిక నారాయణీయమున నాంధ్రీకృతమయ్యెను. పరుషపరకత్వమున వికల్పముగా గజడదబాదేశమువచ్చి ద్రుతము లోపించుననఁగా బింద్వాదు లుండనేరవని దీనికర్థము తోఁచుచున్నది. ఇట్టిస్థితి యెందును నశ్రుతచరము. కాఁగా గాణపతవివరణకర్త "పరుషములు పరమైనపుడు ద్రుతము లోపించు. అప్పుడు పైనున్న పరుషములకు సరళములురావు. ద్రుతలోపము రానపుడు సరళాదేశంబువచ్చునని భావము." అని మూలమునలేనియర్థమును వివరించి కొన్ని ప్రయోగములను జూపెను. పై కారిక యాథర్వణముకాదు - ప్రక్షిప్తము. కవిశిరోభూషణమే కదా యథర్వణకారికలకు మూలము. అందులేని యిక్కారిక (ఇట్టి యింకను గవిజనాంజనమునఁ బ్రక్షిప్తములుగలవు) కవిజనాంజనకర్త కెట్లు లభించెను? ఆత

సకలిని లోకమూఢవ్యాఖ్యాగ్రంథము లోఁ కెననరాదా యని శంకింపఁజనదు. అతఁ డహో బలుసివలె కర్తృగ్రంథమును సాకల్యముగఁ దనటీకలోఁ బ్రదర్శింప లేదు. ఏవో ఫలంతికారికల నచ్చటచ్చటఁ జూపెను. మఱియు నీప్రత్తిష్ఠకారికను స్థాపింపఁజాలు ప్రయోగము నన్నయభారతమున నొక్కటేనియు లేదు. కొన్ని యలక్ష్యములను దిక్కనపద్యముల నీక్రింది వానిని గాణపతవివరణకర్త యుదాహరించెను. మ. ధృతరాష్ట్రుండును...కా । నతగం బొందుట...(ఉద్యో. ౧ ఆ. ౩౪౮). కం. నీచెప్పిన పెద్దలు... । ఏచక్కం బెట్టువాఁడ నే...(ఉద్యో. ౨ ఆ. ౨౪౦). వీనిలో, 'కానన్+తగన్' అనియు, "ఏన్+చక్కం బెట్టు" అనియు ఛేదము చేయరాదనియు "కాన్+అ+తగన్" అనియు, వారలంగాని । యే+చక్కం బెట్టువాఁడన్+ఏన్" అనియు ఛేదము చేయనగుననియు నీవఱకె మిక్కిలి విపులముగఁ జర్చించి సిద్ధాంతము చేయఁబడెను. (౭౩ IV విష. దీనివిస్తర. III.)

"నేచెల్లనోయమ్మ యీచక్కనన్న । రాచతేజముగలరత్నాలపెట్టె (హరిశ్చంద్ర ద్విపద. ౨ భాగ. ౨౧౨ పుట.) ఇట శబ్దరత్నాకరకర్త "ఏఁజెల్ల" ననియు రాజతేజముననియు దిద్దెనుగాని యచ్చుప్రతులలో "నేచెల్ల, రాచతేజము" అనియే గలదు." (గాణ. సంధి. ౧౯ పద్య. ౧౨౩ కారి.)

'ఏఁజెల్ల - నేఁజెల్ల' అను రెండును శబ్దరత్నాకరమందువలెనే సూ - రా - నిఘంటువునందును జూపఁబడెను. ఇవి దిద్దంబడినపాఠములనియుఁ దాఁజూచిన ప్రాఁతముద్రణములలోని పాఠములె కవిప్రయుక్తములనియు గాణపతవివరణకర్త వ్రాయుట కాధారమేమో తెలియకున్నది. ఇంక గాణపతవివరణకర్త యంగీకరించిన పాఠము పక్షమున మాత్రము "ఏచెల్ల" శబ్దములోని మొదటిది 'ఏను' శబ్దమనుట కాధారమేమి? 'మి' వర్ణము లోపించిన 'ఏమి' శబ్దపుసంక్షేపరూపము కారాదా? అపుడు 'ఏచెల్ల' శబ్దము 'ఓచెల్ల' శబ్దమువంటిదె యగును. "ఓచెల్ల-అవ్య-(ఓ+చెల్లెల) సంతాపాదులను దెలుపును" అను సూ.రా. నిఘంటుకారులు చూపిన వ్యుత్పత్తివలెనె "ఏమి+చెల్లెల=ఏచెల్ల" అని వ్యుత్పత్తిని గల్పింపనగునుగదా. శ.ర-కోశకర్త-"ఏఁజెల్ల" శబ్దము నంగీకరించిన వాఁడగుటచే "నేఁజెల్ల" శబ్దమును సైతము నంగీకరించెననియు వానినె సూ.రా.నిఘంటుకర్తలు సంగ్రహించికొనిరనియు నెన్ననగును. 'నేఁజెల్ల' శబ్దమునకు వారినుపురును జూపినప్రయోగమగు "అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార" (హరి.పూ.భా.౪అ.౧౪౮) అనుపద్యభాగమును "అకట యేచెల్ల యేచెల్ల హాకుమార" అని పఠించుటలో క్షతియేమియుఁ గానరాదు. "దేశ్యమ వ్యుత్పత్తిమత్త్వాత్" అను చొప్పున దేశ్యశబ్దములవ్యుత్పత్తి నిర్ణయింపరానిదిగదా. ఇట్టి వివాదస్థలప్రయోగ

ములు ప్రకృతనూతనసిద్ధాంతమును (ద్రుతలోప గ జ డ ద బాదేశపాక్షికతల) స్థాపింపనేరవుగదా! ఇట్లే గాణపతవివరణకర్త ముద్దరాజు రామకవి కృతపద్యభాగ ములు రెండిటిని బ్రమాణములనుగాఁ జూపెను. అందు స్వోపయోగార్థము గాణపత వివరణకర్త కొంత మార్చి యుదాహరించెను. సీ. అపరాధి నగుదునే నపరాశ్రితుఁ డగాన...(వావిళ్ళముద్ర. కవిజనసం. ౧ తరంగ. ౧౩ ప.) అవ్యయములమీఁద గసడ ద వాదేశము రాకుండుట కీయఁబడినయుదాహృతి యిదిగాన, "నేను+అ+పరాశ్రితుఁడ(శ్రేష్ఠాశ్రితుఁడ)" అని యర్థము చేసి యవధారణార్థకముమీఁద గ స డ ద వా దేశము రాలేదని సమన్వయించు కొననగును. ఇందు గాణపతవివరణకర్త "అప రాధి నగుదు నైనపదాశ్రితుఁడ... (కవిసం. ౧ ఆ.)" (సంజీవనీభాగము లాశ్వాస ములుకావు) అని సవరించి, "ఐనన్+పదాశ్రితుఁడను" అని యర్థము చేసికొని 'ఐనన్' అనునవ్యయముమీఁద గ స డ ద వాదేశము రాలేదని సమన్వయించికొని యుదాహరించెను. 'ఐనన్' అనుచోటి ద్రుతము లోపించి గ జ డ ద బాదేశము రాలేదని స్వపక్షమునందు దీనిని లక్ష్యముగావించికొనెను. యథాస్థితముగనే లక్ష్య లక్షణసమన్వయము కుదురుపడుచుండఁగా నిట్లు దిద్దుట కేవలము నకృత్యము. అందును గళమీఁది గ స డ వా దేశనిరాసపక్షమును వదలుకొని ద్రుతము మీఁది గ స డ ద వా దేశాభావమును సంజీవనికర్త యుదాహరించె ననుటయు నసంగతమె. ఇంక రెండవయుదాహృతి:—క. కృతిని సుమాగమములు ద । క్కత్త కారాంతంబులు......(గాణపకవి. సంజీవని) 'తక్కన్+తకారాంతంబులు' అనుచో ద్రుతలోప గ జ డ ద బాదేశరాహిత్యములు గలవని గాణపతవివరణకర్త యుదా హరించెను. కాని యిది కవిజనసంజీవనిలోని యచటిప్రస్తుతస్థితికి సందర్భపడలేదని చూచికొనలేదు - "ఉమాగమముతోఁగూడిన తకారము తేలఁగ" (జగత్తు = జగతు) అనునదియచట వక్తవ్యము కాన నాపద్యమున 'తక్కన్' అనుపదమునకుఁ బ్రసక్తియే లేదు. కావున నట "కం - కృతిని సుమాగమములయు । క్తతకారాంతంబులుందగం దేలఁగ" అని కవిప్రయుక్తపాఠము కానోపును. వావిళ్ళవారు ముద్రించిన కవి జన సంజీవని తప్పుల తిప్పయైయున్నది. కాన నిదియు ద్రుతలోప గ జ డ ద బాదేశాభావ సిద్ధాంతమును నిర్వహించులక్ష్యము కానేరదు. సీ. కనకంబు వర్షించుఘనులమ్రోల ...(విజయ. ౧ ఆ. ౮౦ ప.)ఇందు 'కనన్+కంబు' (ఉదకము)అని గాణపతవివరణకర్త ఛేదమని తలంచి దీనిని స్వపక్షసాధకముగ నుదాహరించియుండును. కాని యట - 'కనక+అంబున్' అనుఛేదము కవిచే నుద్దేశింపఁబడె ననఁదగునుగాన నిదియు గాణపతవి వరణకర్త కుపచరించులక్ష్యము కానేరదు .కం. ఈసుధరేంద్రము...అది । గో

వాక్యాంతగతపదానాంచ. (ఆం. చిం. సంధి. ౧౩ కా.

నన్నయాథర్వణ- అహో. ౨౩౪ పు.)

౪౩ విష, వాక్యావసానగస్య స్యా। ల్లోపో నః ప్రాయశోత్రహి-

---

కానంబడియె...(గాణ. వరాహ. ౬ ఆ. ౪౪ ప.) 'అదిగో'శబ్దము కేవల ద్రుతప్రకృతిక మనుతలంపుతో నిదిగాణపతవివరణకర్తచే స్వపక్షసాధకముగ నుదాహృతమయ్యెను. కాని "అదిగో - ఇదిగో" అనునవి కళలుగాను ద్రుతప్రకృతికములుగాను బ్రయోగ దృష్టములగుచున్నవి యని వ్రాయుచు సూ. రా. నిఘంటుకర్తలు కళాపక్షమున "క. ఈకుధరేంద్రము......" అను ప్రకృత పద్యమును ద్రుతప్రకృతికతాపక్షమున- క, పూఁబోఁడి యొకసికొని.. ఇది। గోఁ బురుషాహ్వాయము...(కళా. ౧ ఆ. ౩౫ప.) అను పద్యమును జూపిరి. ఒక్కశబ్దమె కళయు ద్రుతప్రకృతికమును నగుట యసంభ వము కాదు. శబ్దరత్నాకరకర్త యుదాహరించినట్లు "ఇది+కొమ్ము = ఇదిగో" అనువ్యు త్పత్తి నరసి కళగా గ్రహించుటయు, 'కోను' అని ద్రుతాంతావ్యయము నంగీ కరించి 'అది+కోన్' అనురీతిని కొనుధాతు నుజ్యంతరూపముతో వ్యుత్పత్తి నరసి (చూ. సర్వనామ ప్ర. ౨౧౫ II విష.) ద్రుతప్రకృతికముగా గ్రహించుటయు విరుద్ధ ములు కావనఁదగును. (కానశబ్దము. విస్తర III ౭౮ IV—విష) ఇంక గాణపత వివరణకర్త యుదాహరించిన "ఉ. శ్రీకరమత్స్యకూర్మ......ఎం। తేకృప...(దశావ. ౧ ఆ. ౧ ప.)" అనుపద్యమునందలి సరళాదేశాభావద్రుతలోపముల విషయ మీవ ఇకె విమర్శితమయ్యెను. (౪౨ III. విష. కల్పత.) ఇందు - నోరన్యస్యాపీత్యాద్యథ ర్వణవచనముచొప్పున నావయవికద్రుతమునకు లోపమువచ్చెనని యెఱుంగునది.

ఇంక నీసందర్భమున నన్నయాథర్వణులమతమందలి స్వత్వసంశ్లేషములను దెలిసి కొనక నారాయణీయ గానపతవివరణకర్తృప్రభృతులు పెక్కుప్రమాదములకు లోనైరి. "స్వత్వం ప్రశ్లేషతాబిన్దు। స్సమాసే న ప్రయోగతః" అను కారిక సార్వత్రిక సామాసికద్రుత లోపవిషయకమనియు, "అపరాన్తే సమాసేచ । శబ్దేనోబిన్దురిష్యతే" అనుకారిక పైకారిక కనువాదముగాఁ గ్వాచిత్కముగ సమాసములందు ద్రుతము లోపింపకుండుటను బోధించునదనియు నాంధ్రీకరింపక నారాయణీయమునఁ బరస్పర విరుద్ధముగ నీక్రిందిరీతిని వివరింపఁబడెను.

క. నిత్యంబుగ బిందువు శ్లి। ష్టత్వంబు సమాసమందు సాధ్వీమణి సా। ధుత్వ మునొందు...(నారా. సంధి. ౩౪ పద్య ౧౩౭ కారి) (౪౨. III విష. కల్పతరు)

గీ...బిందువుసమాస। ములఁ బదంబులఁ బద్యాంతములను లేదు। ధూర్వ హానుతం బిది; కవులె ధూర్వహు లిట. (నారా. సంధి. ౨౩ పద్య.)

(విక్ర - సంధి - ౩౩ కారి. అహో. ౨౩౫ పు.)

కల్పతరు - ౮౩ వివ:—వాక్యాన్తగతపదానామ్ = వాక్యాంతమున నున్న పదముల, ద్రుతస్యవాలుక్ చ = (చకారముచేఁ బూర్వసూత్రమునందలి "వాలుక్" అనునవి యాకృష్టములగును) ద్రుతమునకు వికల్పముగా లోపము కల్గును. గుర్వవసాయిపద్యములందలి తుది వర్ణము హ్రస్వమాయెనా దానితర్వాతిద్రుతమునకు లోపము రానేరదు. ఆయక్షరము దీర్ఘమాయెనా దాని తర్వాతి ద్రుతమునకు లోపమైచ్ఛికము. లఘ్వవసాయిపద్యముల తుదియక్షరముమీఁది ద్రుతము నిత్యముగ లోపించును. సంస్కృతమునందువలెఁగాక తెల్గునఁ బొల్లుహల్లుపరమందుఁగల హ్రస్వముసైతము గురువగును. గద్యములందు వాక్యము తుదిపదముమీఁది ద్రుతము నిత్యముగా లోపించుటయే శ్రుతిహితముగా నుండును. కాన వాక్యావసానద్రుతము తఱుచుగాలోపించుచునే యుండుననియు గుర్వవసాయిపద్యము తుదివర్ణము హ్రస్వమగునపుడు మాత్రమె ద్రుతము లోపింపదనియు విశదపడుట కయి యీవిధి ప్రాయికమని చెప్పుట యుక్తమనుతలంపున నథర్వణుఁ డట్లు సవరించుచున్నాఁడు. వాక్యావసానగస్య = వాక్యాంతమందున్న పదముతుదినున్న, నః = ద్రుతమునకు, అత్రహి = ఈయాంధ్రభాషయందు, లోపః = లోపము, ప్రాయశః = తఱుచుగా, స్యాత్ = అగును.

కల్పతరు. ౮౩ I వివ:—అహోబలపతి యిచటివాక్యశబ్దమునకుఁ బద్యపాదమని యర్థముచేసెను. ఆపక్షమున గద్యములందలి వాక్యాంతద్రుతమునకు లోపము దుర్లభమే యగునుగాన నట్టియర్థము సరికాదు. పద్యాంతమున వాక్యావసానము కాకున్నను ద్రుతము లోపింపవచ్చును. సీ....ఆ. వె....మహాముని ప్రణీతమైనదాని చ. వినుతపరాక్రముల్...భారతవీరుల సద్గుణాళికీ। ర్తనముల నొప్పుదాని వివిధంబగుదాని సభాంతరంబులన్ శా. ఆయుష్యం బితిహాస... వేదాంతవి। ద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁదొడఁగెన్ దద్భారతాఖ్యానమున్. (ఆది. 3 ఆ. ౯-౧౦-౧౧ ప.) ఈపద్యము లేకవాక్యగతములు. కాన వాక్యసమాప్తి కాకున్నను "ప్రణీతమైనదానిన్" అనుచోటి పద్యాంతద్రుతము లోపించినది. ఇట 'వినుత' అనుదాని వకారము పరమగుటచే లోపించెననరాదు. పద్యద్వయమధ్యగతవర్ణములకు సంధికార్యము సంప్రదాయవిరుద్ధము (౮౨ III కల్పత.) కావుననే "సభాంతరంబులన్" అనుచోటి పద్యాంత్యద్రుతమున కుత్తరపద్యాదిని స్వరమున్నను "లుక్సంశ్లేషౌవాచి" అనుసూత్రము వర్తిల్లక పూర్వోచ్చునత్తియుండుట లక్షణముగాఁగల సంశ్లేషము. పద్యభేదావసానేషు। శ్లిష్టతానస్యకథ్యతే" అను చొప్పున సంభవించినది. "వాక్యం చాత్రపాదఏవ. సీసాదిషు ప్రతిపాదం వాక్యమ్.

...పూర్వార్ధ ముత్తరార్ధంచ వాక్యద్వయమ్." (అహో. ౨౩౫ పు.) అను కవిశిరోభూషణపంక్తులు సరికావు. "వాక్యం స్యాద్యోగ్యతాకాంక్షా। సత్తియుక్తః పదోచ్చయః" (సాహిత్యద) అను ప్రసిద్ధలక్షణము నుపేక్షించి యీయనర్థలక్షణ మును వాక్యమునకుఁ గల్పించుట సరికాదు.

సంస్కృతమునందువలెఁగాక తెలుఁగుపద్యము లన్నిటియందును బదమధ్యపాదావసానదోషములేదు. పద్యమెల్ల నేకసమాసముగా నుండవచ్చును. పద్యద్వయాద్యంతవర్ణసంధిసంప్రదాయవిరుద్ధముగాని తక్కినపాదముల యాద్యంతవర్ణములకు సంధికల్గవలయును. పాదాంతద్రుతమున కుత్తరపాదాదిహల్లు పరమైనపుడు సరళాదేశము ద్రుతలోపాదులును జరుగును. అట్టి పాదాంతద్రుతమున కచ్పరమగునపు డాద్రుత మట్టిపచ్చుతోఁగూడి నిల్చునేకాని వాక్యాంతద్రుతలోపశాస్త్రము ప్రవర్తిల్లనేరదు. పద్యమధ్యమున వాక్యాంతమైనను వాక్యాంతద్రుతలోపశాస్త్రము ప్రవర్తిల్లనేరదు. పద్యాంతమున వాక్యసమాప్తి కాకున్నను లఘ్వవసాయిపద్యమైనచో ద్రుతము నిత్యముగా లోపించును. గద్యములందుమాత్రమె వాక్యాంతమున ద్రుతము సాధారణముగా లోపించుచుండును.

సంస్కృతమున శ్లోకద్వితీయచరణముతో సమానపదముగాని సమాసపదముగాని ముగియవలెను. తెలుఁగుననన్నడో పద్యాంతముతోమాత్రమె సమానపదముగాని సమాసపదముగాని సాధారణముగా (ద్విపదలు - మాలికలుతప్ప) ముగియుచుండును.

పయిసంప్రదాయములనుబట్టి పయియహోబలపతివ్రాఁత సరికాదనక తీరదు. సీసాదులందుఁ బాదముతోఁగాని వృత్తాదులందుఁ బూర్వార్ధముతోఁగాని సమానపదముసు సమాసపదముసు ముగియనక్కఱలేదనుట కుదాహరణములు:—సీ... వృత్తుల నుండక వీఁగి పాండు। ధృతరాష్ట్రనందనుల్ ధృతిచెడివారేమి...(ఆది. 3 ఆ. ౫ ప.) సీ....ధరణిదేవు। లనవరతాశ్వమేధావబృథస్నానపూతమూర్తులు కృతపుణ్యు లహిత। వర్గజయుల్...జన్మనిలయు। లాభరతాఁమహామహీ...(ఆది. 3 ఆ. ౮౬). సీ...అంతకాకారులై యార్చి యమర॥ ఆ. వె. వరులఁ దాఁకి... (ఆది. ౨ ఆ. ౨౧). క. తలరఁగ రేణుకధవ। ప్రలిహప్రరుజాశ్వకృంతపద. ఖులను ర। తులఁ గులిశనిశాతనఖా। వలిఁ బక్షీంద్రుండు ప్రచ్చి చందఱలాడెన్॥ (ఆ?. ౨ ఆ. ౧౦౧). క. కలహమున నిట్లు సురవీ। రులఁబల్వు నోర్చి యొక్కరుఁడ యమృతముఁ దె। క్కలిగొని (ఆది. ౨ ఆ. ౧౦౫). ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాస

మునన్ మనీషివి ! ద్వ్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవర్ణాశ్రమ ధర్మ...(ఆది. ౧ ఆ. ౬ ప.)

అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని
లోపంబు బహుళంబుగా నగు. ౨౦.

బాలవ్యాకరణ వివరణము. ౨౦౩ II విషయము.

వాఁడువచ్చెన్ - వాఁడు వచ్చె, వాఁడు వచ్చెను. ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబై యుండు. గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబులేదు. క. ఆతేజము మునఁగ బుద్ధిమంతుఁడగుబుధసేవన్.

సంజీవని. ౨౦౩ II విష:—"విరామోఽవసానమ్. (౧-౪-౧౧౦) వర్ణానామభావోఽవసానసంజ్ఞఃస్యాత్." "యదుచ్చారణోత్తరం వర్ణాన్తరం నోచ్చార్యతే సోఽంత్యవర్ణః అవసానసంజ్ఞ ఇత్యర్థః. (సి. కౌ. సంజ్ఞా. తత్త్వబో.) దేనినిబల్కిన వెనుకఁ గొంతసేపు (అర్ధమాత్రాధికకాలము) వర్ణాంతరోచ్చారణ ముండదో యది యవసానవర్ణ మనిపించుకొనును. పద్యము తుదివర్ణము వాక్యము తుదివర్ణము నవసానవర్ణము లనఁదగును. ఉదాహృతులలోఁ గేవలపదము తుదివర్ణమును నవసానవర్ణ మనిపించుకొనును. । నన్నయాంధ్రశబ్దచింతామణిలోని నకారమె ద్రుతస్వరూప మగుటంజేసి వారవసానద్రుతలోపమునుమాత్రమె విధించిరి. సూరి మతమున ద్రుతము 'ను' స్వరూపమగుటంజేసి యాతఁడవసానద్రుతస్వరమునకేని యవసాన 'ను' స్వరూపద్రుతమునకేని లోపముగల్గునని యుపదేశింపవలసినవాఁడయ్యెను. ద్రుతస్వరలోపమునకు 'వచ్చెన్' అనియు ద్రుతలోపమునకు 'వచ్చె' అనియు లోపాభావమునకు 'వచ్చెను' అనియు నుదాహరణంబులు. పద్యాంతమున వాక్యావసానము కాకున్నను ద్రుతలోపము కాఁదగియుండుటంజేసియుఁ బద్యమధ్యమున వాక్యసమాప్తియైనను వాక్యాంతద్రుతలోపశాస్త్ర మనావశ్యకమగుటంజేసియు నొకప్పుడు ప్రత్యేకపదము తుదివర్ణమును నవసాన మగుచుండుటంజేసియు సూరి చింతామణి వికృతివివేకకారికలలోని వాక్యశబ్దము నుజ్జగించియుండును. గుర్వవసాయిపద్యావసానమున ద్రుతస్వరలోపము నిత్యమనియు, లఘ్వవసాయి పద్యావసానమున ద్రుతలోపముగాని ద్రుత 'ను' స్వరూపస్థితిగాని జరుగవచ్చుననియు నిట్టి వ్యవస్థ యనఁగా నేర్పాటు బహుళగ్రహణమహిమచే సిద్ధమగుచున్నది. ఈసందర్భమందలి సూరివివరణము కొంత యనావశ్యకముగ నున్నది. "గుర్వవసాయి యగుపద్యంబు తుదను స్వత్వంబు లేదు." అనువాక్యమునఁ బద్యము

తుదను గురుప్రసక్తి లేనిచోట లఘువగు 'ను' స్వరూప ముండనేరదని చెప్పనేల? అట్లయ్యు నట్లు "పద్యావసానే సర్వేషాం। స్వత్వం నాప్నోతి సాధుతామ్" అను నథర్వణకారికచొప్పున "వైజయంతీ నవాంశుకవ్యాజమునను" అను జైమినీభారత ప్రయోగ మసాధు వనెడియహోబలోక్తి సరికాదనియు నాయథర్వణవచనము గుర్వవసాయిపద్యమాత్రవిషయకమనియు నిట్లు సూరి నన్నయాథర్వణమతమునందలి స్వత్వము స్వరూపమునుగ్రహింపజాలక భ్రాంతిమూలకమగు సవరణముచేసెనా యని యాలోచింపవలసియున్నది. (విస్తర) 'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' అను ద్రుతస్వరలోపోదాహృత భా. అరణ్య. ౭ ఆ. ౨౨౧ కందపద్యపు చతుర్థచరణమై యున్నది. ద్రుతలోపమునకు "ఆ. వె. ఆర్తనాదులై యరిగిరి హాస్తిపురికి" అనునదియు ద్రుతస్వరలోపాభావమునకు "వైజయంతీనవాంశుక వ్యాజమునను" (జై. భా) అనునదియు నుదాహృతులు. నేటిగద్యరచనములలో నుద్ధరణచిహ్నములనడుమ నుద్ధృతపదవాక్యముల నిల్పునపుడు తత్పూర్వాపర స్థలము లందుఁ గొంత (అర్ధమాత్రాధికము) వ్యవధానము గల్గుటుగాన నట్టియెడలఁ గొన్ని విరామకార్యములు సంభవించును. అతఁడు నాతో "ఆపనిచేసెదను" అని పల్కెను. ఈవాక్యమున "నాతో" అనుచోట ద్రుతము లోపించుట, 'చేసెదను+అని'అనుచో సంధి లేకుండుట విరామకార్యములని యెఱుఁగునది.

ఉవర్ణకశ్చేదవ్యస్తాత్తు । నువర్ణ ఉతో భవేత్. (వికృ.
అజం. ౨౩ కారి. అహో. ౨౧౯ పు.) స్త్రియశ్చస్త్రీ
సమన్వితో। ద్రుతఃస్యాన్నిశ్రుతః క్వచిత్ । (వికృ.

---

విస్తర. I. రా3 II. విష:—"గుర్వవసాయియనుటంజేసి లఘ్వవసాయి యగుపద్యముతుదను స్వత్వరూప ముండిన నుండఁదగును గాని యట్టిచోటులందును స్వత్వరూపముం ద్రుత ముండ రాదని "పద్యావసానే సర్వేషాం। స్వత్వం నాప్నోతి సాధుతామ్" అనునథర్వణవచనము విశదీకరించెడి." (బా. సా. పే. సంధి. ౨౦ సూ. వ్యా.) అని యిట్లు పేటికావ్యాఖ్యాతయు నథర్వణకారికాశయాజ్ఞతను వెల్లడించి కొనెను. అథర్వణమతమునందును 'ను' స్వరూపము ద్రుతస్వత్వము కానేరదుగదా.

విస్తర. II. రా3 II. విష:—'అతిశయముగ బుద్ధిమంతుఁ డగుబుధసేవన్' అనుచోటి పద్యాంతిమవకారము తెలుఁగులక్షణములచొప్పున గురువగును. సంస్కృతమున వ్యంజనపరమిట్లు గురువు కానేరదు. సంస్కృతమునందువలెఁ బాదాంతిమ లఘువునకే కాక పద్యాంతిమలఘువునకునైతము పాక్షికగురుత్వము తెలుంగునలేదు. వ్యంజనపరము తెలుంగున నిత్యముగ గురువేయగును.

హాలం. ౨౬ కారి. అహో ౮౫౩ పు.) ద్వోకతకాపర్థ

నన్నయాథర్వణీయము ఖేవస్య । చాన్యత్రాపి క్వచిద్భవేత్ ॥ 'ఉ, నూ' సువ్యే
౮౪ విషయము. వనియతా । వ-ముతావపిసంయుతా : (విక్ర. అజం.
౨౩ కారి. అహో. ౨౮౯ పు.)

నోహా ద్విత్వం క్వచిచ్ఛిష్టః । పరప్రాణేన సంగతేః ॥
ద్రుతాద్ద్రుతః క్వచిచ్చాత్ర । దృశ్యతే కవిభాషి
తే. (విక్ర. అజం. ౨౮ కారి. అహో. ౨౯౭ పు.)

కల్పతరు. ౮౪ విష:—ఆద్యన్తాత్ = అకారాద్యంతశబ్దములకంటెఁ బైని సముచ్చయాద్యర్థవిశేషబోధములకయి, ఉవర్ణకశ్చ = 'ఉ' శబ్దము నిల్చును. ఉతః = ఉకారాంతశబ్దముపైని, నువర్ణకస్తు = 'ను' శబ్దము, భవేత్ = నిల్చును. ఈ, 'ఉ-ను' శబ్దములు చార్థకావ్యయములు. "అన్యే ద్రుతప్రకృతయః" అనుచోప్పున ద్రుత ప్రకృతికములు - 'ఉన్ - నున్' అనురూపముగలవి. 'ఉవర్ణకశ్చ-నువర్ణకస్తు' అను చోటులందలి 'చ - తు' శబ్దముల సామర్థ్యమున నీ 'ఉ - ను' లు లోపించి ద్రుతములు మిగులుటయుఁగలదని గ్రహింపవలయును. ఉదా:—ఎల్లయున్ = ఎల్లన్. ఏమియున్ - ఏమిన్; పురారియున్ - పురారిన్. అతఁడునున్ = అదఁడున్; వివాహమహోద్యమునున్ = వివాహమహోద్యమున్. ద్రుతప్రకృతికములపైని 'ఉన్' నిల్చుటయు నందలి 'ఉ' శబ్దములోపించుటయుఁ గలదు. ఉదా:-నాకంటెన్+ఉన్ = నాకంటెనున్, నాకున్+ఉన్+ఆమెకున్+ఉన్ = నాకునున్+ఆమెకునున్ = నాకునునామెకును=నాకు నామెకును. మొ. పై వానిలోని 'నాకును' అనుదానియందలి 'ను' అను దానిలో 'ఉ' శబ్దము విఱుగుచున్నను నచట నఖండముగ 'ను' అనుదానికిఁ బ్రాణి యతియే చెల్లును (నోరు-'నో' మున్నగు వానితో) గాని స్వరప్రధానయతిచొప్పున 'ఉ' అనుస్వరమునకు యతివేయరాదని విశదపఱచుటకయి యథర్వణుఁడు 'ఉన్' అనున వ్యయశబ్దమును 'ఉ' వర్ణకమని వ్యవహరించెను. "ఎండు+అ = ఎండ" మున్నగు చోట్లఁ బ్రత్యయయోగమున స్వరప్రధానయతి చెల్లనేరదుగదా. 'ఉ' శబ్దతుల్య న్యాయమున 'ను' శబ్దమును సైతము 'ను' వర్ణకమని పేర్కొనుట వింతకాదు.

కల్పతరు. ౮౪ I. విష:—స్త్రీయశ్చ=స్త్రీలింగమైనట్టియు, స్త్రీసమస్య=స్త్రీలింగ సమమైనట్టియు, ఇతః=ఇకారాంతశబ్దముమీఁదనిల్చిన, ద్రుతః='ఉన్' శబ్దములోని'ఉ' అనునదిలోపించునపుడు మిగిలియుండు పొల్లు నకారమగుద్రుతము, నిశ్రుతిః=నిస్వ రూపముగలది, క్వచిత్ = కొన్నియెడల, స్యాత్ = అగును. నన్నయాథర్వణులమత మున ద్రుతము వ్యంజననకారరూపము గలదిగాన నిట్లు చెప్పవలసెను. (౧౩౮.I

విష.) ఉదా:—ఏమియున్=ఏమిన్=ఏమిని. మొ. క. అనుజులకు నడ్డపడియే। మిని జేయఁగనీమి.. (ఉద్యో.౨ ఆ.౧౩ప.) చ. అసిన సుయోధనుండు...జగంబుల। న్నిని నొకపెట్టి...(ఉద్యో. ౨ ఆ. ౩౨౨)క...నీవు మన్నించెదవే। నిని వచ్చెద నీపాలికి। ననఘా...(కర్ణ. ౨ ఆ. ౨౮౬)

అహోబలపండితుఁడు "యువర్ణకఃస్యాద్యాన్తాత్తు । నువర్ణకఉతోభవేత్" (ఇ+ఉ+అన్తాత్తు = యాన్తాత్తు) అను నపపాఠము నంగీకరించి యీక్రిందరీతిని వ్యాఖ్యచేసెను. "ఆదితాంయువర్ణాన్తత్వమేవ. తదుపరి నువర్ణక ఇతి వివేకః" (అహో. ౨౩౩ పుట.) (సంధి. ఆం. చిం. వాక్యాస్తదోంత్యాదిసూత్రవ్యాఖ్య) "కించ నువర్ణకే పుల్లోపే ద్రుతప్రకృతికత్వం సిధ్యతి" (అహో. ౨౩౨ పు.) అను నీతనివ్యాఖ్యల నరయఁగా నర్థవిశేషమున "యు" అనుకళాశబ్దము నిల్చుననియు వలయునేని దాని మీఁద 'ను' అనుకళాశబ్దము నిల్చుననియు నట్టిశబ్దము మీఁద స్వరములోపించినచో 'యున్' అనునది యేర్పడుననియు నాతఁడు తలంచెనని విశదమగుచున్నది. సంహితలోవచ్చు యకారముతోఁగూర్చి 'యు' వర్ణకమని చెప్పుట యొక యసంగతి. (విస్తర). అది కళయనుకొనుట యింకొక పొరపాటు. ఈపక్షమున "సీతయు+అంబయు= సీతయింబయు" అను ననిష్టరూప ముప్పతిల్లవలసివచ్చునుగదా, 'యు' అనునది పాక్షికముగ లోపించి ద్రుతమాత్రము మిగులవచ్చు ననునర్థము నీతఁ డంగీకరింపకుండుటచేతనే "తల్లిందండ్రియు నన్నుఁగానక" ఇత్యాదిప్రయోగస్వ్వాకరత్వాదుపేక్ష్యేవ. (అహో. ౨౮౯ పు.) 'త్రిమూర్తివిలాసవర్తిన్ ఇతిరూపం త్వసంగతమేవ' (అహో. ౨౩౨ పు.) అని సాహసముగా వ్రాయవలసినవాఁడయ్యెను. కవిబ్రహ్మసహితము యువర్ణకలోపముతోఁ బ్రాసస్థలఖచితముగా నీక్రిందిరీతిని బ్రయోగించియున్నాఁడు. క. అనుజులకు నడ్డపడియే। మిని జేయఁగనీమి...(ఉద్యో. ౨ ఆ. ౧౩) మ...ఇట్టిదిం। గలదే...(ఉద్యో. ౩ ఆ. ౯౫) చ...ప్రీతుఁజేయుకం। టెను హితమైనకృత్య మొకటిం గలదే... (ఉద్యో. ౩ ఆ. ౧౫౭ ప.) క....నీవు మన్నించెదవే। నిని వచ్చెద నీపాలక। ననఘా...(కర్ణ. ౨ ఆ. ౨౮౬)

'ఉన్' 'నున్' శబ్దములలోని 'ఉ - ను' శబ్దములులోపింపఁగా మిగిలిన నకారమాత్రముసయితము చార్థకము కావచ్చును. మ....ఇట్టిదెం।గలదే...(ఉద్యో. ౩ ఆ. ౯౫). మ...పూజామహో। త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్ సాధుసాంగ

---

విస్తర. I. ౮౮ I. త్రిలింగలక్షణశేషమున నీయథర్వణకారికల యర్థము సూత్రింపబడెను (ప్రాథ. శబ్ద. ౧౧౬ సూ.) అందును నహోబలపద్ధతినే 'యు' అనియే వేర్కొనఁబడెను.

త్యమున్. (ఆది. ౧ ఆ. ౧౨). "ఉవర్ణకశ్చాదన్యస్మాత్తు" అనుచోఁ ప్పునవచ్చు 'ఉ' వర్ణకము ద్రుతప్రకృతికము గాన 'ఉన్' అనురూపముతోనె నిల్చును. ఉ...న। న్నేలిన దేవయానికి నరేశ్వరభర్తవు గాన నాకును। బోలఁగ భర్తవీవ... (ఆది. 3 ఆ. ౧౭౪). 'నాకున్+ఉన్=నాకునున్' అని ప్రక్రియ నెన్నునది - శా... ప్రజలం బ్రోవఁగ దండింపనుం। గావన్నేర్చి...(శాంతి. ౧ ఆ. ౧౮౧ ప.) 'దండింపన్+ఉన్+కావన్' అని ఛేదము.

ద్యోతకావర్థభేదస్యేత్యాది:—అర్థభేదస్యచ = సముచ్చయాద్యర్థ విశేషములను, ద్యోతకౌ='ఉ - ను' శబ్దములు తెలుపునవగును, క్వచిత్=ఒకానొకప్పుడు, అన్యత్రాపి=అర్థవిశేషద్యోతకత లేనపుడును, భవేత్='ఉ - ను' శబ్దములలో నేనేని ప్రయుక్తము కావచ్చును. సంస్కృతమున 'చ' శబ్దమువలెనె పాదపూరణవాక్యాలంకారార్థకముగా నైతము 'ఉ - ను' శబ్దములు ప్రయుక్తములు కావచ్చునని భావము. సంస్కృతభాషావాసనాతిశయమున నథర్వణాచార్యుఁ డిట్లు వచించెనే కాని నన్నయాదిమహాకవు లట్లు తెల్గున నిరర్థకశబ్దప్రయోగము చేసియుండ లేదనియె నానమ్మకము. ఉదా. సీ. అదియును నాక మున్ గదుఁ డనువానిచే...(ఆది. ౭ ఆ. ౧౬౪). మధ్యాక్కరము. అదియునుంగాక పరప్రయోగమాయలుగల వెఱఁగి (అర. ౧ ఆ. ౨౦౦). ఇట్టియెడల 'అదియునుంగాక' అనుచోట నంత మాత్రమే కాక యనునర్థమున నదిశబ్దవాచ్యమగుభూతార్థపు టల్పత్వాతిశయమును బోధించుటకై చార్థకశబ్దద్వయము ప్రయుక్తమయ్యె ననఁదగును. (విస్తర II) 'క...। దరికొని తెగఁగాల్చునట్టి దయ యగుఁజుమ్మీ'. (ఉద్యో. ౨ ఆ. ౧౯౭). అనుచో సోమయాజి యవధారణార్థదార్ఢ్యమునకై (అట్టిది+అ+అ=అట్టిదయ) 'అ'

---

విస్తర. II ౮౪ I విష:—"ద్రుతాద్దుతిః క్వచిచ్చాత్ర। దృశ్యతే.... (అథ) గీ. ద్రుతముకంటెను మఱియొక్క ద్రుతముకూడఁ। గవితలను గొన్నిచోవులఁ గానిపించు. (నా రా. సంధి. ౧౧౭). అనురీతిని ద్రుతముమీఁద ద్రుతమువచ్చిన 'అదియునుంగాక' ఇత్యాదిరూపముల సాధించునథర్వణుఁడును 'ను' స్వరూపము కూడ ద్రుతమని యంగీకరించుచున్నాఁడు." (నా రా. గాణ. సంధి. ౨౬ ప. వివ. ౧౩౦ కారిక.) అనెడి గాణపతవ్యాఖ్య (బాల. సంధి. ౨౧ సూ. చూ.) సరికాదనియు 'అదియునుంగాక' అనుచోటిది యర్థవిశేషబోధకచార్థకశబ్దద్వయమె గాని 'ద్రుతాద్దుతిః' ఇత్యాదిసూత్రమునకు లక్ష్యము కాదనియు నన్నయాథర్వణుల మతమున ద్రుతమునకు 'ను' స్వరూపము లేదనియుఁ బైకల్పతరుసందర్భమువలన విశదమగుచున్నది.

శబ్దద్వయమును బ్రయోగించినట్లె యిట భట్టారకుఁడును విశేషార్థదార్ఢ్యమునకై చార్థకశబ్దద్వయమును బ్రయోగించె ననుట వింతకాదు. శబ్దార్థచింతామణి కోశమున 'చ' శబ్దముకడ్డ "ద్వావచకారా వవిఃమ్బసూచకౌ భవతః" అని యిట్టియభిప్రాయమె వివరింపఁబడెను. క. అనఘులు నరనారాయణు । లనవాదియుగంబునన్ సురాసురనుతు ల । య్యును నపుడు మనుజు లగుటను । వినయంబున మ్రొక్కి రమరవిభునకుఁ బ్రీతిన్. (ఆది. ౮ ఆ. 3౨౦). ఇట - "అయి+ఉన్ = అయియున్ = అయ్యున్+ఉన్+అపుడు=అయ్యునునపుడు" అని యిట్లు నరనారాయణుల శ్రేష్ఠ్యాతిశయబోధకై చార్థకశబ్దద్వితయము బ్రయుక్తమయ్యె ననఁదగును. క....ఆది పర్వకథ లె । ల్లను నిమ్ముగఁ జెప్పె...(ఆది. ౮ ఆ. 3౨౧). ఇందు 'ఎల్లయున్' అను దానిపర్యాయరూపమగు 'ఎల్లన్' అనుదానిపై సాకల్యాతిశయార్థబోధకముగా రెండవ చార్థకశబ్దము (ఎల్లయున్=ఎల్లన్+ఉన్=ఎల్లనున్) ప్రయోగింపఁబడెనని యెఱుంగునది.

"ఉకారాన్తాద్విహితస్య కేవల నువర్ణకస్యతు ప్రయోగః శబ్దానుశాసనగ్రంథే నార్థవిశేషద్యోతనాభావే శ్రూయతే" తథాప్యథర్వణవచనానుసరణేన "చంద్రు పొడుపున్నీరాకరంబుంబలెన్ (పాండు. 3 ఆ. 33). ఇత్యాదిప్రయోగస్సంగచ్ఛతఏవ." (అహో. ౨౮౯ పు) (ఈప్రయోగము పాండురంగమాహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానమందలిది. నిగమశర్మసోదరి నిగమశర్మతోఁ జెప్పుచున్నది. ఓయీ సోదరా మీఁబావ, (అనఁగాఁ దనభర్త) సముద్రము చంద్రోదయమును గోరుచున్నట్లు నీరాకను గోరుచుండునని చెప్పెను.) ఇందు "నీరాకరంబునుబలె" అనునెడనున్న 'ను' శబ్దము థర్వణసూత్రముచొప్పున నర్థవిశేషద్యోతకము కాదనియు నిరర్థకమనియు నిట్టి నిరర్థక 'ను' శబ్దప్రయోగము నన్నయభారతమున లేదనియు నహోబలపతివ్రాసెను. కాని యిందునైతము సముద్రమువంటివాఁడగు మీఁబావ యనుచోఁగల సముద్రపు ఘనతాతిశయమును నచటిచార్థకశబ్దముబోధించుచున్నది. కావున నది నిరర్థకముకాదు. మఱియు శబ్దానుశాసనభారతభాగమున నిట్టిప్రయోగములు లేవనెడి యహోబలపతివ్రాతయు నపరిశీలనమూలకమె. క. అనిన విని హంసపలుకులు । దనహృదయంబునకు నమృతధారాపాతం । బునుబోలెనైన... (అర. ౨ ఆ. ౧౫౭.) సీ...గాండీవధరుఁ డతిఘర్మసమయ । ఘర్మాంశుఁడునుబోలె... (శల్య. ౧ ఆ. ౨౨౯). ఈపద్యములందును 'అమృతధారాపాతంబునుబోలె' అనుచో మాధుర్యాతిశయరూపార్థవిశేషమును, "ఘర్మాంశుఁడునుబోలె" ననుచోఁ దైక్ష్ణ్యాతి

తిశయరూపార్థవిశేషమును, వానియందలి చార్థకశబ్దములచే బోధింపఁబడుచున్నవని గ్రహింపనగును. (విస్తర. III).

---

విస్తర. III ౪౮ I విష:—పయిసందర్భమునుబట్టి ప్రకృతమగు బాల. సంధి. ౨౧ సూత్రమునకు 'అదియునుంగాక' మున్నగువానిని లక్ష్యములుగ నిచ్చుట సరికాదనియు నట్లె "ప్రథమాంతములమీఁదిపోలె బలె పోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాషనగు" (ప్రౌఢ. సమా. ౩౬ సూ.) అనుత్రిలింగలక్షణసూత్రములోని ద్రుతాగమవిధానమును సరికాదనియుఁ జెప్పవలసియున్నది. "ద్రుతాద్దుతిః క్వచిచ్చాత్ర। దృశ్యతే..." అనుదాని। లక్ష్యములు వేఱువిధములయినవి. అట్టివి ముందు చూపఁబడును.

సంస్కృతానుకారముగా నథర్వణాచార్యుఁడుచెప్పిన "ద్యోతకావర్థభేదస్య। చాస్యత్రాపి క్వచిద్భవేత్త"నుదాని ననుసరించి త్రిలింగలక్షణశేషకర్త శబ్ద. ౧౧౬ సూత్రమును బూరించి యందు "...సముచ్చయార్థవిశేషపాదపూరణములందు 'ను' శబ్దంబు దఱచుగనగు..." అని వచించి "పాదపూరణమందు" అనుదాని క్రింది వానినిలక్ష్యములుగఁ జూపెను. కాని యాలక్ష్యములందును నర్థవిశేషములు గన్పట్టుచునెయున్నవి:—(చూ. నారచించిన చింతామణివిషయపరిశోధనము. ౧౩౪-౧౩౫-౧౩౬ విష.) అందఱున్ వివశులై (ఆది. ౫ ఆ.) ఇందలి 'ను' శబ్దము సర్వశబ్దార్థబోధమున నించుకేనిఁ గొఱంతలేమిని దెలుపుచున్నది. 'నిద్రయు నెప్పుడెఱుఁగక' (ఆది. ౧ ఆ.) ఇందలి చార్థకశబ్దము నిద్రాప్రాముఖ్యాతిశయమును బోధించుచున్నది. 'ఇదియు మొదలుగా' (ఆది. ౭ ఆ.) ఇందలి 'యున్' శబ్దమ వధారణార్థవిశేమును (ఇదే మొదలు) దెలుపుచున్నది. 'ఆధారములే। కను' (ఆది. ౨ ఆ.) ఇందలి 'ఉన్' శబ్దద్వయము "అనుపమదుఃఖితుల మగుటచేతను, నెవ్వరును నాధారము లేకుండుటచేతను" అనురీతిని సముచ్చయార్థదార్ఢ్యమును బోధించుచున్నది. (లేక+ఉన్=లేకన్+ఉన్=లేకనున్). 'ఊఱడకం దిగిచి' (ఆది. ౪ ఆ.) ఇందులోని (ఉన్) శబ్దము విరామాత్యంతాభావరూపార్థవిశేషమును బోధించుచున్నది. 'అనిలుఁడనుదూతవోయి తోడ్కొనియుఁ దెచ్చె' (ఆది. ౩ ఆ. ౧౫౬). ఇందలి యున్శబ్దము తోడ్కొని తెచ్చుటలోని యశక్యకరణరూపార్థవిశేషమును దెల్పుచున్నది. దూత్యము నడపుటే కాక తోడ్కొనియువచ్చె ననునర్థవిశేషమును బోధితమగుచున్నది. 'విషయోపభోగాభిలషణ మింకను నాకు, వదలక పెరుఁగుచున్నదియుఁ గాన' (ఆది. ౩ ఆ. ౯౫). వదలలేదు సరేకదా యింకను వార్ధకమందును బెరుఁగుచును నున్నదనునర్థవిశేషమును నిందలి 'ఉన్' శబ్దము బోధించుచున్నది. ఇట్లె యొల్లెడలను బరిశీలించిన నర్థవిశేషములు కన్పట్టుచునేయుండును.

'ఉ, నూ' సుప్స్వేవేత్యాది:—'ఉ, నూ'='ఉన్-నున్'అనుశబ్దములు, సుప్స్యేవ= సుబ్విభక్తులమీఁదమాత్రమే, నియతౌ=ప్రచురప్రయోగముగలవై యున్నవి. శ్లిష్టకుటచేత నడుమగఁ దిజ్విభక్తి ప్రభృతులమీఁదసైతము నిల్చుటగలవని యెఱుంగునది. సంయుతౌ=ఈ 'ఉన్ - నున్' శబ్దములు కూడియుండునవియు, అయుతౌ=కూడకుండునవియు నగును. సముచ్చయాద్యర్థవిశేషబోధ మావశ్యకమై యున్నపుడు నీ 'ఉన్ - నున్' శబ్దములు ప్రయోగింపఁబడుటయుఁ బ్రయోగింపఁబడకుండుటయుఁ గలదని తాత్పర్యము. ఉదా:...ఎల్లసుబ్విభక్తులపైని నిల్చుటకు—క. నాకంటెను మీకంటెను । లోకములో నధికుఁ డతిబలుఁడు—(ఆది. ౫ ఆ. ౨౪౦) 'నాకంటెన్+ఉన్+మీకంటెన్+ఉన్+లోకములోన్' అని ఛేదము. క. ...ఆయతమతులయ్యు నొరులకలవియె చెప్పన్ (ఆర. ౪ ఆ. ౧౨౫) (అయ్యున్ = అయియున్నట్టియు=అయ్యున్నను) మ...అడవియందుం జేసు వందించియున్ । బదుమూఁడేఁడులు నీవుసుం దిరిగిరా... (ఉద్యో. 3 ఆ. ౯౭) (ఇందు విజాతీయములు సముచ్చితములై యున్నవి) తిజ్విభక్తిప్రభృతులపైనిల్చుటకు:—క...ఏమేవురమును నీ। తనుమధ్య వివాహమయ్యెదము నని పలికెన్ (ఆది. ౭ ఆ. ౨౪౮)- ఇందలి 'న్' అనుచార్థకశబ్దము ధర్మజువాక్యములోని యయుక్తతాతిశయమును బోధించుచున్నది. చ. వినఁడును గానఁడున్ మఱియు నీకును నాకు మరల్పవచ్చునే (ఉద్యో. ౨ ఆ. ౧౪ ప.) మ...భూ। వర మున్నిట్టివి సూడరున్వినరు నెవ్వారున్ ద్రిలోకంబులన్ (ద్రోణ. 3 ఆ. ౧౬౨) మ...। అరు దా దేవునియందుఁ గంటి నొకకృత్యం బెవ్వరుం జేయరున్ (ఉ. హరి. ౨ ఆ-3.) ఉ...ఆతలకెద్దియుట లేదునేనియున్ (విరా. ౪ ఆ. ౧౯౨) ఉ...దాన నేమి సం। భావితభాగ్యుఁ డయ్యెను బ్రభాకరతేజుఁడు ధర్మజుం డిలన్. (సభా. ౨ ఆ. ౯౫) 'ఏమిసంభావితభాగ్యుఁడయ్యెన్+ఉన్+ప్రభాకరతేజుఁడు' అని ఛేదము. భాగ్యశాలితలోని యతిశయము నచటిచార్థకశబ్దము బోధించుచున్నది. ఉ...అంతకుఁ జాలరుం జుమీ (ఉద్యో. 3 ఆ. 33౫). ఉ...। అర్జునపక్షపాతి యితఁ డాలము మేకొనిచేయఁడుం జుమీ. (ఉద్యో. ౪ ఆ. ౨౪౨) సముచ్చయాద్యర్థవిశేషబోధమావశ్యకమై యున్నను 'చా' ర్థకశబ్దము ప్రయోగింపఁబడకుండుటకు:—క. అతిమానుష మత్యద్భుత। మతిదుష్కరమైన కేశవార్జున కృతిన్...(ఆది. ౮ ఆ. 3౧౯) చ. విను మఱిఁ జంపనుం జెఱుపవేచుట లెస్స (శాంతి. 3 ఆ. ౨౦) ఉ...వానిముక్కునన్ వాతను గర్ణరంధ్రముల వారకశోణితధార లొల్కఁగాన్ (సభా. ౧ ఆ. ౨౧౦) 'ఉ, నూ' సుప్స్యేవ నియతౌ।వయుతావపిసంయుతౌ" అనుచో 'యూ, నూ' సుస్స్యేవనియతౌ।వయుతా వచిస్సంయుతౌ" అనునపపాఠము నంగీ

కరించి 'సుస్యైవ' అనుటచే 'యు, ను' లు ప్రథమావిభక్తిపయినిమాత్రమె నిల్చునని యు 'అచి' అనుటచే నచ్చుపరమగునపుడు మాత్రము తప్పకవచ్చుననియు హల్లుపర మగునపు వైకల్పికముగా నిల్చుననియు నహోబలపతి యాక్రిందికీతిని బొరపాటుపడి వ్రాసెను. "అయుతౌ విభక్త్యన్తరే పరతోఽసంభవత ఇత్యర్థః, అచీత్యాభాషపి సంయుతౌ - అన్యత్ర తు సంయుతత్వ మసంయుతత్వమపీత్యర్థః." (అహో. ౨౮౯ పుట.) ఈవిషయములు కేవలము నకసిద్ధాంతములని "క. నాకంబెసు మీాకంబెను... (ఆది. ౫. ఆ. ౨౮౦) క. అతిమానుష పత్యద్భుతమతిదుష్కరమైన...కృతిని... (ఆది. ౭ ఆ. ౩౧౯)" అను భట్టారక ప్రయోగములు నిర్ణయించుచున్నవి.

నోవాద్విత్వమిత్యాది:—క్వచిత్ = ఒకానొకప్పుడు - శ్లిష్టః = స్వపూర్వాచ్చు నత్తియున్న, నః=నకారము, పరప్రాణేనసంగతేః=దానికిఁ బరమగు నచ్చుతోఁ గదుకు నపుడు, ద్విత్వమ్=ద్విత్వమును, వా=వికల్పముగానందును. క్వాచిచ్చ=క్వాచిత్క ముగ, అత్ర=ఈద్విత్వమువచ్చుసందర్భమున, ద్రుతాత్=ద్రుతమునకుఁ బరముగ, ద్రుతః=మఱొకద్రుతము, కవిభాషితే=మహాకవిప్రయోగములందు, దృశ్యతే=కనఁ బడుచున్నది. ఇట్టియెడలమాత్రమె ద్రుతముపై నుచ్చారణస్వభావమున నిరర్థక మగు మఱొకద్రుతము నిల్చునని తాత్పర్యము. ఇట్లుండఁగా "మూలమున ద్రుత మున కచ్చుపరముగా, నింకొక నకారమును విధించువిధ గానరామిని..." (బా. సా. పే. ౭౩ పుట.) అని పేటికావ్యాఖ్యాతవ్రాయుట సరికాదు. స్వరపరకత్వము నందలి ద్రుతద్విత్వమున కుదాహృతులు:—'వృత్రుఁడ న్నసుర గర్వించి' (అర. ౩ ఆ. ౩ ప.) మ...నం। దిని యన్నేటితరంగలన్...(ఆది. ౭ ఆ. ౭౯ ప.) సీ... వల్లి। యన్నిష్టసఖి నూఁది యున్నదాని (అర. ౩ ఆ. ౧౮౦) (అవయవికనకారము సమితము నన్నయమతమున ద్రుతమె) (౮౮-౮౫ II విష.) మత్తకోకిల... ఎన్నఁడు। న్నేనిమోఘముగాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగన్ (ఆది. ౭ ఆ. ౧౮౨.) చ - వరదుఁడు పార్థశౌర్యవిభవంబున నాతని ధైర్యవృత్తికి। న్నరుదుగ...(అర. ౧ ఆ. ౩౨౧). ('ధైర్యవృత్తికిన్ । యరుదుగ' అని తాళపత్రమాతృక) ఉ....తండ్రి పంపున। న్నివ్వనభూమియందుఁ జరియించెద...(అర. ౮ ఆ. ౩౨౮. ఎఱ్ఱాప్రెగడది) ('తండ్రిపంపునన్ । యివ్వనభూమి...' అని తాళపత్రమాతృక) క. తోయజలోచనుఁ డాఁకె। న్నాయతశరవర్షమొప్ప (ఉ. హరి. ౬ ఆ. ౨౦౭). (చిం. వి. పరి. ౯౭ విష.) (విస్తర IV.)

---

విస్తర. IV ౭౮ [1] విషః—'వృత్రుఁడన్నసుర' మున్నగుభట్టారకాదిప్రయో గములందలి ద్రుతద్విత్వము ననంతామాత్యాదు లపరిశీలితముగ దుస్సంధియని నిర

సించిరి:—క. శ్రుతిస్వరసంధిన కారం । బతిశయముగ నతఁడు నతఁడు ననుచో నతఁడు । న్నతఁడు నని యూఁదిపలికిన । సతతము దుస్సంధి యండ్రు సత్కవులు హరీ. (ఛందోదర్పణము. ౪ ఆ. ౨౦ ప.) క. దొరవీ వు న్నజుఁ డనిన దుఃసంధియగున్ (కవిజ. దోషా. ౧౫ ప.) తే. గీ. అచ్చుపరమైనసాంతపదాంతమునకు । సంయుతి యును లోపంబును జగతిలేవు । సంయుతం బగునేని దుఃసంధి యగును । లోపమైనను గ్రామ్యంబు లోకవినుత. ఆ. వె. చూచె నింతి ననెడుచోటఁ జూచె న్నింతి । ననిన సంధిదోషము...(అప్పక. ౫ ఆ. ౪౪-౪౫ ప.) క....విసంధి యనఁదగు నరిగె । న్నపరగిరి కినుఁ డనంగా ।...(నరస. ౪ ఆ. ౨౪ ప.). నన్నయప్రయోగములను నథర్వణసూత్రమును బయినివ్రాసినవానిని జూచికొనక యిట్లొకరినిజూచి యొకరు వ్రాయుట కేవలము పొరపాటు. పయివరసభూపాలీయాదినిరసనములను జూచి పేటికావ్యాఖ్యాత యీ క్రిందిరీతిని సమర్థింపఁజూచుటయు సరికాదు. “అన్నిష్ట సఖత్వాదులవంటివాని నాలంకారికులు దుస్సంధులనుటం జేసి “అన్న+ఇష్టసఖ=అన్నిష్ట సఖ” అని ప్రక్రియచూపి...సాధుత్వమును సంపాదించుట...” (బా. సా. పే. ౭౩ పుట.) ఇట్టి సమర్థనమునకుఁ జోటీయని “ఎన్నఁడు । న్నేనిమోఘముగాదు దిగ్గరణీపపీందులు...(ఆది. ౭ ఆ. ౧౪౨) (అనుబంధ.) ధైర్యవృత్తికి । న్నరుదుగ (ఆర. ౧ ఆ. ౩౨౧). క. తోయజలోచనుఁ డాఁకె । న్నాయతశరవర్ష మొప్ప... (ఉ. హరి. ౬ ఆ. ౨౦౭). రతిపయ్యెదకు న్ననువైన చేతులన్ (మను. ౩ ఆ.)” మహాకవిప్రయోగములు పెక్కుగలవు. ప్రౌఢవ్యాకర్తయు నీద్రుత ద్విత్వ

---

అనుబంధము. విస్తర. IV. ౪౪ I. విష:— ఆనందాప్రెస్సుముద్రణమున ‘ఎన్నఁడున్నేని’ అనుచోఁ డిప్పణముగా నిట్లు వ్రాయఁబడెను. “నేని ఇది ‘ఏని’ కి రూపాంతరము. ఉ. నీవును జూచి తట్టి సభనేని (సభా. ౨ ఆ. ౯౫)” కాని ‘యీ పద్యమున ‘ఈవును జూచి తట్టినసభయేని వినంబడ దేయుగంబునన్’ అనుపాఠము గ్రంథకృత్ప్రయుక్త మనఁ దగును. ఈపక్షమున నప్రసిద్ధ ‘నేని’ శబ్దసృష్టికిఁ బ్రసక్తి యుండదు. తుదికి ‘నీవునుఁ జూచి తట్టిసభ నేని’ అనుపాఠము నంగీకరించినను నిత్య యతిపద్ధతి చొప్పున ‘ఏని’ శబ్దమె యచటఁ బ్రయుక్త మనవచ్చును. నేనిశబ్దకల్పన మక్కఱలేదు. నేనిశబ్దము శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. నేనిశబ్దమె ప్రసిద్ధమైయున్నయెడలఁ బ్రాచీనలాక్షణికులు నిత్యయతి నంగీకరింపవలసిన ప్రసక్తియే లేకుండెడిది. ఆ. వె. ఏని యనుపదంబుతో నాదిపదమంది । సంధి నిత్యయతులు జరగుచుండు । నెట్టిపూరకర్తుఁ డేనిసద్గతినందు । నిన్ను నాత్మఁదలఁచెనేని కృష్ణ ॥ (అనంతుని ఛందోద. ౧ ఆ. ౧౦౩ ప.) అప్పకవియు నిట్లె చెప్పి యీ క్రింది శేషధర పద్యము

---

మును సూత్రించి పెక్కుప్రయోగములఁ జూపెను. మ...రక్తాస్యసర్వాంగు ని। న్నను భూతాప్రతిమ...(ఉ. హరి. ౬ ఆ.) ఉ...సర్వమున్నతనిదివ్యకళా మయ మంచు విష్ణునం। దుల్లము సేర్చి...(భాగ. ౭ స్కం.) మ...తార్కొన్న చోట్లుంబలె। న్నురుశోభా...(కళా. ౭ ఆ.) (ప్రౌఢ. సంధి. ౩ సూ.). ఆవయ వికనకారమునకును ద్విత్వమును సూత్రించి ప్రౌఢవ్యాకర్త పెక్కుప్రయోగములు చూపెను—అన్నిష్టసఖు (ఆది. ౩ ఆ.) అన్నుర్వీశుఁడు (నిర్వ. ౫ ఆ.) మొ. (ప్రౌఢ. సంధి. ౯ సూ.). నన్నయాథర్వణులమతమున నావయవికనకారమునైతము ద్రుతమెకాన నిట్టిప్రయోగములును ద్రుతద్విత్వలక్ష్యములె యనఁదగును. బాల కవిశరణ్యమునను ననేకప్రయోగములు చూపఁబడెను (౩౦౨ పు.)

---

నుదాహరించెను. "శేషధర్మములందు—క, మెట్టఁ డునారకమార్గం। బెట్టిమహాక్రూర కర్ముఁడైనియుఁ దుద ని। ట్టట్టనక నెమ్మనంబున। నెట్టన హరి తలఁపుగలగెనేని మహాత్మా" (అప్పక. ౩ ఆ. ౨౧౪). సూ. రా. నిఘంటుకర్తలు ముఖ్యముగా నన్నెచోడుని యాక్రిందికుమారసంభవోదాహృతులనుబట్టి పై శేషధర్మోదాహృతిని నిరసించి నిత్య యతి కాధారము చింత్యమని వ్రాయుచు 'నేని' శబ్దసృష్టి కంగీకరించిరి. చ"...తడ యారదునేనియు" (నన్నె. కు. ౫ ఆ. ౫౫౧) సీ. "నెలకన్నె ఱుంగవునేని..." (నన్నె. కు. ౬ ఆ. ౬౭౦) వీనిలోని 'ఆరదు - ఎఱుంగవు' అనునవి కళలగుటంజేసియు నుకారసంధి నిత్యమగుటంజేసియు నీప్రయోగములనుబట్టి 'నేని' అనెడిహలాది శబ్దము నంగీకరింపకతీరదని సూ. రా. నిఘంటుకారులయాశయము కానోపును. కాని "తనుమధ్యవివాహ మయ్యెదము నని పలికెన్" (ఆది. ౭ ఆ. ౨౪౮) అను నన్నయ ప్రయోగమునందువలెనె యానన్నెచోడుని ప్రయోగములందును వెనుకవ్రాసిన రీతిని దిజ్విభక్తులమీఁ దనర్థవిశేషబోధక చార్థకశబ్దము ప్రయుక్తమయ్యెననియు నీనన్నెచోడునిప్రయోగములు "ఆతల కెద్దుటలేదునేనియున్" (విరా. ౪ ఆ. ౧౯౨) అను తక్కినప్రయోగమువంటివేకాని యేవోయపూర్వ ప్రయోగములు కావనియు నక్కారణమున హలాది 'నేని' శబ్దసృష్టి యనావశ్యకమనియు గ్రహింపనగును.

గాణపతవ్యాఖ్యాత "ధైర్యవృత్తికి। న్నరుదుగ...(అర. ౧ ఆ. ౩౨౧), మున్నగువానిని సమర్థించుచు వాక్యమధ్యపాదాంతసంధ్యభావము నంగీకరించెను. "నస్యాద్వాక్యవిరామేతు। సంధ్యభావోపి దోషకృత్" అనునథర్వణకారికకు విరుద్ధ మగుటచే నది గ్రాహ్యముకాదు. (గాణ. ౩౬ సూ. సంధి. ౭౬ పుట.) మఱియుఁ బాదమధ్యద్రుతద్విత్వప్రయోగముల కేమిగతి?

ఇంకను సాహసముగా నేఁటిముద్రణసంస్కర్త లాయాభారతాదిప్రయోగము లందలి ద్రుతద్విత్వస్థలములను తొలఁగించి దిదివేసి తమకె తలను జొనుపుచున్నారు.

బాలవ్యాకరణవివృతి ౮౨ II. విష.

క్రొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడి యెడి. ౨౧.

అదియును న్గాక. దివంబునుంబోలె.

సంజీవని. ౮౨ II విష:—పయిరీతి నథర్వణాచార్యుఁడు చేసినవిస్తృత వివరణమునెల్ల నుజ్జగించి సూరియందలి ద్రుతాద్ద్రుత ఇత్యాదికారికనుమాత్రము ప్రకృతసూత్రముతో సంగ్రహించి యట్టి కారికకులక్ష్యములు కానట్టియుఁ దక్కిన కారికలకులక్ష్యము లగునట్టియుఁ బ్రయోగములనెల్లఁ దన యీసూత్రమునకె లక్ష్యములుగాఁ దలంచి యుదాహరించుట మిక్కిలి వింతగనున్నది. అది శబ్దముపై నర్థవిశేషబోధకమగు 'ఉను' చేరఁగా దానిపైఁ బ్రకృతసూత్రముచొప్పున నిరర్థక ద్రుతముచేరుటచే 'అదియునున్గాక' అనురూప మేర్పడినదని సూరిపక్షమున సమన్వయింపనగును. అట్లె 'దివంబు+ను+పోలె' అనుచో 'ను' అనునది యర్థవిశేషబోధకముగాఁ జేరియున్నది కాని యటఁ బ్రకృతసూత్రముచే నొక ద్రుతము నిరర్థకముగాఁ జేరుటచే 'దివంబునుంబోలె' అనురూప మేర్పడెనని సూరిపక్షమునందలి లక్ష్యసమన్వయము నెన్నునది. "అదియునున్గాక" అనుదానిలో 'ఉన్' శబ్దద్వయ మర్థవిశేషదార్ఢ్యబోధకముగా నిల్చియున్నదని ద్యోతకావర్థభేదస్యేత్యాదికారిక వ్యాఖ్యలో (౮౨ I విష.) నిరూపింపఁబడెను. అట్లె - 'దివంబునుంబోలె' అను చోటను నర్థవిశేషబోధక 'నున్' శబ్దము నిల్చియున్నదని యీవఱకు పై సందర్భము లోనె 'ఉకారాన్తాద్విహితస్యే' త్యాద్యహోబలపతివాక్యవిమర్శనసందర్భమున నిరూపింపఁబడెను.

సూరి పై రీతి నుజ్జగించిన యథర్వణకారికయర్థ మేదో యొకరీతిని ద్రిలింగ లక్షణశేషకర్త పూరించెను:—"నామసర్వనామంబులకును గళలగు నవ్యయము లకును గ డ ప ల సముచ్చయార్థవిశేషపాదపూరణంబులయందు 'ను' శబ్దంబు తఱచుగ నగును. క ళ ల గు నను దంతశబ్దములమీఁద నయ్యాది యువర్ణపూర్వకంబుగ విభాషనగు-మఱియు నది శేషషష్ఠియందు యొక్కలోపించినపుడు లాగమాంతబహు వచనంబుమీఁదను సముచ్చయమునం జూపట్టెడు" (ప్రౌఢ. శబ్ద. ౧౧౬ సూ.) "ప్రథమాంతములమీఁద పోలె - బలె - పోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాషనగు" (ప్రౌఢ. సమా. ౩౯ సూ.) వీనిలో శబ్ద. ౧౧౬ సూత్రమునఁ దిజ్విభక్తి ప్రభృతులపై 'యును - ను' శబ్దములు నిల్చుట సంగ్రహింపఁబడమింజేసి వెనుకనుదాహరించిన పెక్కుభారతాదిప్రయోగములు సంగ్రహింపఁబడవయ్యెను. ప్రౌఢ సమా. ౩౯ సూత్రమున ద్రుతాగవిధానముచేయుటచే నయ్యాడియు నర్థవిశేషబోధకమును

విషయమును దెలుపఁజాలకున్నది. పాదపూరణార్థకముగ ననఁగా నిరర్థకముగ నీ, 'ఉన్ - నున్' శబ్దముల నాంధ్రమహాకవులు ప్రయోగించిన ట్లగపడదని యీావ అకు విశదపఱిచియె యున్నాను. (౮౪ I విష)

౮౪ III సంజీవని:—బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణకర్తలు తలంచినట్లు కన్న ట్టదుగాని వారివ్యాకరణములచే సంగ్రహింపఁబడఁజాలని పెక్కుజాతులభారతాది ప్రయోగముల కీప్రకృతసూత్రముగతి యని కల్పింపఁదగునని తోఁచుచున్నది.

క...అతని నాతనినిన్ | గొని...(కర్ణ. ౧ ఆ. ౧౧౧) మ. ఇనతేజుం డతి భక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో | డ్కొనితెచ్చెం దనతల్లి సత్యవతి నిన్ క్షోణీజనుల్ మెచ్చ...(ఆది. ౪ ఆ. ౧౯౧). నన్నయాథర్వణీయసూత్రములచే 'ఆతనినిన్ - సత్యవతినిన్' మున్నగురూపములు సాధ్యములగును. బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణములచొప్పున - 'ఆతనిని - సత్యవతిని' అనురూపములుమాత్రము సాధ్యములగును. ఇట్టివాని తుదిని మఱొకద్రుతమును జేర్చుటకుఁ బ్రకృత సూత్రమె గతిగఁ గల్పించుకొనవలసియున్నది. గీ. ఎఱుఁగ నంటిని నిందఱ కిప్పు డెఱుఁగఁ | జెప్పె నాకాశవాణి ...(ఆది. ౪ ఆ. ౧౦౮). చింతామణిచొప్పున 'అంటినిన్' అనురూపము సాధ్యమగును. బాలవ్యాకరణముచొప్పున 'అంటిని' అనునదిమాత్రమె సాధ్యమగు. ఇచట నైతము ప్రకృతసూత్రమునె గతిగఁ గల్పింపనగునేమో ? క....ఈతపంబే | దొడఁగెద ననవుడును నయ్యధోముఖ విప్రుల్. (ఆది. ౨ ఆ. ౧౪౨). ఇట "అనవుడు" అనుభావార్థకరూపముమీఁద నర్థవిశేషబోధకమగు 'నున్' శబ్దము చేర్చుట నన్నయాథర్వణీయప్రక్రియ కనుకూల ముగనున్నది. బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములపక్షమున "అనవుడును, అన వుడున్" అనురూపములుమాత్రమె సాధ్యములగును (బా. క్రియా. ౪౨ ప్రౌఢ. క్రియా. ౧౨ సూ.) ఇట్టియెడలను బ్రకృతిసూత్రమునె గతిగఁ గల్పింపనగునేమో ?

ప్రక్రియ నడుపుటలో నన్నయాథర్వణీయపద్ధతిని మార్చుటచే బాలవ్యాక రణప్రౌఢవ్యాకరణముల కిట్టిపాటు లెన్నెన్నో సంభవించెను. విస్తరభీతిని జూప లేదు.

నన్నయాథర్వ ణీయము ౮౫ విష. సంజ్ఞా. ౧౦ కారి. అహో. ౧౪౪ పు.) నఖణ్డః ప్రథమాద్ధ్రస్వా | న్నస్యలోపశ్చనేష్యతే (వికృ.

కల్పతరువు. ౮౫ విష:—ప్రథమాత్ హ్రస్వాత్=పదము మొదటిహ్రస్వ మునకంటెఁ బరముగ, ఖణ్డః=అర్ధబిందువు, న=లేదు, అట్టియెడ, నస్య=ద్రుతమునకు, లోపశ్చ=లోపమునైతము, నేష్యతే=సమ్మతముకాదు. ఉదా:—కెంపు+తామర=

కెంపాపువ. చెన్ను+తోవ=చెందోవ. - ఇట్టియెడల, "కేఁదామర - చేఁదోవ" మున్నగు ఖండబిందుయుతరూపము లుండనేరవు. ఇట్లె - కన్దోయి మున్నగు చోటులందు ద్రుతలోపముగల్గిన 'కదోయి' మున్నగురూపము లుండనేరవు.

కల్ప. రా॥ I విష:—అహోబలపండితుఁడు 'ఇఁక' అనుచో నీసూత్రము ప్రతిఘటింపకుండుటకయి యిందలి హ్రస్వశబ్దమునకు "హ్రస్వాచ్చుతోఁగూడినహల్లు" అని యర్థముచేసెను. ఇట్లనుటచేత 'ఇంక' - అనుచో సార్ధబిందుకమగు 'ఇఁక' అను రూప ముండవచ్చుననియు 'కెందామర' మున్నగుచోట్ల "కేఁదామర" మున్నగు సార్ధబిందుకరూపము లుండరాదనియు నేర్పడుచున్నది. "హ్రస్వశబ్దేన హ్రస్వా జన్తోహల్ వివక్షిత ఇతి - తేన ఇఁక - ఇంకేత్యాదౌనదోషః" (అహో. ౧౭౪ పుట.) కాని యిట్టివ్యాఖ్యానముచేత ఇచ్చుధాతురూపమగు 'ఇందు' అనుదానికి రూపాంతరముగ 'ఇఁడు' అనుసార్ధబిందుకరూపముండవచ్చుననియు, "చుండు" అనుదానికిఁ బర్యాయముగ "చుఁడు" (రారుసుఁడీ) అనురూప ముండనేరదనియు ననిష్టార్థములు సంభవించుచున్నవి. కావున నీకవిశిరోభూషణవ్యాఖ్యానము సరికాదు. నఖణ్డ ఇత్యాదిసూత్రము సంధికార్యమాత్రసాధనపరమని వ్యాఖ్యచేసికొనుట యుక్తము.

బాలవ్యాకరణ వివరణము — అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. ౨౨.

రా॥ II విషయము. ముంగోంగు - క్రొంబసిఁడి - కన్దోయి.

సంజీవని. రా॥ II విష:—అఁటేఁకచుఁడుశబ్దములని చెప్పఁదగియున్నను— "అఁట యిఁక చుఁడు" అను తెనుఁగుశబ్దములను యథాస్థితముగ సంస్కృతమున ననుకరించి "అఁట యిఁక చుఁడు ఇతిశబ్దాః" అని సిద్ధసమాసము చేయఁబడెనని తలంపనగును. ముందు+కొంగు=ముంగోంగు=కట్టుబట్టచెఱఁగు కొంగు. క్రొత్త+పసిఁడి= క్రొంబసిఁడి=పుటమువేసిన బంగారము. కన్ను న్+దోయి=కందోయి=నేత్రద్వయము. మొదటిరెండుదాహృతులందును బా.సంధి.3౬-3౭-3౮ సూత్రములఁచొప్పున సంధి నరయునది. మూఁడవయుదాహృతిప్రక్రియ ౮౨ II విషయముచొప్పున నరయునది. మొదటి రెండుదాహృతులందును బా.సంధి. ౧౭ సూత్రముచొప్పున నరసున్న వచ్చుచుండఁగాఁ బ్రకృతసూత్రము వారించుచున్నది. మూఁడవయుదాహృతిలో బా. సంధి. ౧౮ సూత్రముచొప్పున ద్రుతలోపము సిద్ధించుచుండఁగాఁ బ్రకృత

సూత్రము వారించుచున్నది. కాన సంధి ౧౮ సూత్రముచొప్పున 'కన్దోయి' అను రూప మేర్పడుచున్నది. (విస్తర I.II.)

---

విస్తర. I లోని II విష:—"కన్దోయిఇత్యాదులందు 'కన్' శబ్దము ఏకాచ్చు కలదైనను నుగాగమప్రాప్తంబుగాదు గావున సహజనకారంబుతో సంశ్లేషరూపం బుండవచ్చును......కన్నుదోయి ఇట్లుండఁ బ్రకీర్ణపరిచ్ఛేదములోని యేడవ సూత్రంబున ద్విత్వనకారలోపంబుగలిగి 'కనుదోయి' అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదము లోని పదునాఱవసూత్రంబున కనుశబ్దంబుయొక్క ఉకారంబునకు లోపంబు రాఁగా 'కన్దోయి' అగును......కనుశబ్దనకారంబు ప్రథమప్రాస్వంబుమీఁదిది కాన నిరు వదిరెండవదియగు నీప్రకృతసూత్రంబున ద్రుతలోపంబు కలుగక 'కన్దోయి' అను సంశ్లేషరూప ముండును. ఈపరిచ్ఛేదములోని నుగాగమ నకారంబుతో సంశ్లేషం బుండదనియు సహజనకారంబుతో సంశ్లేషరూపంబు నిర్బాధంబనియు వెనుకచెప్పం బడియె." (బా. గు. ప్ర. ౯౭ పుట, ద్వి-ము.) అనుగుప్తార్థప్రకాశిక వ్రాఁత కేవ లము ప్రామాదికము. సహజనకారమునకు సూరిమతమున ద్రుతత్వమే లేమింజేసి ద్రుతకార్యములగు లోపబిందుసంశ్లేషాదికార్యములకుఁ బ్రసక్తియే లేకపోవలసి వచ్చును. మఱియు సంధిపరిచ్ఛేదములోని నుగాగమ నకారంబునకు సంశ్లేషంబు లేదని (సంధి. ౩౭ సూ.) సూరి యెంతమాత్రమును జెప్పియుండలేదు. సంధి. ౩౭ సూత్రపు నుగాగమ నకారమునకుమాత్రమె సంశ్లేషములేదని వచించెను. సంధి. ౨౯ సూత్రపు నుగాగమ నకారమునకు సంశ్లేషమును 'చిగురున్గయి దువు' మున్నగురీతి నుదాహరించియు నున్నాఁడు. (చూ. విస్తర. II లోని I విష. విస్తర. I లోని III విష.)

విస్తర. II లోని II విష:—"సమాసమున ద్రుతమునకే లోపముగల్గిన బిందు సంశ్లేషములు గుదురమి నపరూపములు గలుగుఁగాన ద్రుతలోపము గలుగనేర దనెను" (బా. సా. పే. ౮౦ పు. ౨౨ సూ. వ్యాఖ్య. సంధి.) "సంధి ౨౮ సూత్ర ముచే నగు సామాసికద్రుతలోపము ప్రథమప్రాస్వము తర్వాతిద్రుతమునకుఁ గలుగ కుండఁజేయను నీసూత్ర మారబ్ధము" (బా. సా. పే. సంధి. ౨౨ సూ. వ్యా. ౭౯ పు.) ఈపేటికావ్యాఖ్యలును బ్రామాదికములె. బా. సంధి. ౨౯ సూత్రముచే విధింపఁ బడిన నుగాగమ నకారమునకుఁ దద్విధానసామర్థ్యమున సామాసికద్రుతలోపము (బా. సంధి. ౨౮ సూ.) సంభవింపనేరదు. సూరిగా రీవిషయమును సంధి. ౨౯ సూత్రపువివరణమున స్పష్టముగా "విధానసామర్థ్యమున దీనికి లోపములేదు" అని

ప్రకృతసూత్రముచేఁ బయికితిని నుడి తొలిహ్రస్వముమీఁద ఖండబిందు ప్రసక్తిలేదు గావున 'ఇంక - అంట - చుండు' శబ్దముల బిందువు తేలఁగా నేర్పడు "ఇఁక - అఁట - చుఁడు" అనుశబ్దములలోని ఖండము బాధితమయ్యెను. అట్టిబాధ తొలఁగుటకయి ప్రకృతసూత్రమున నట్టిశబ్దములు మూఁడును బృథక్కరింపఁబడెను. (వి స్తర. III-IV) (అఁట కిలార్థకము. వత్తురు సుఁడీ.)

---

ప్రాసియే యున్నారు. కాన సంధి. ౨౭ సూత్రపు సామాసికద్రుతలోపమును వారించుటకుఁ బ్రకృతసూత్ర (సంధి. ౨౨ సూ.) మారబ్ధ మనుట మిక్కిలి పొరపాటు.

వి స్తర. III రా॥ II విషః—'అఁట=అంట' అను కిలార్థములకుఁ బ్రకృతము ప్రతిభారతములందుఁ బ్రబలమగు ప్రయోగములు లభింపకున్నవి. 'అంట' అని యుండఁదగుచోటులందు "అట్టె" అనియు, 'అఁట' అని యుండఁదగుచోటులందెల్ల 'అటె' అనియు నేఁటిముద్రణములం దగపడుచున్నవి. "పూర్వస్య నవికారోనో రిత్యనేన అంట వింట కంట ఇత్యాదిప్రయోగస్య భావార్థే నసాధుత్వమ్.కింతు అనుట ఇత్యాదిరేవ." (అహో. ౪౯ పు.) అనుకవి శిరోభూషణపంక్తులనుబట్టి ముద్రణసంస్కర్త లిట్లు దిద్ది వేసిరాయని యాలోచింపవలసి యున్నది. క. అనపత్యులు గాననోప రటె మునులయ్యెన్ (ఆది. ౫ ఆ. ౬౯). మ....మాధవుఁ డాదిక్కటె (ఉద్యో. ౧ ఆ. ౨౮౦). శా...డాఁగియుండెనటె రారాజిస్సిరో (శల్య. ౨ ఆ. ౫౮). క. తా నటె మాంసము తినదటె । యీనక్కయు...) శల్య. 3 ఆ. ౬౬ ప.) క...ఎవ్వియును బోలవటె సత్యంబున్ (ఆర. ౨ ఆ. ౮3.) పగవారి నడిగికొనఁబోవు టుచితంబటె, కయ్యంబు కర్జంబు కాదటె భంగంబునీగికొనఁ దగదటె (ఉద్యో. 3 ఆ. ౯౯ గద్యము.)

పయిస్థలములందెల్ల నాయొద్దనున్న తాళపత్రమాతృకలందును బ్రాచీనముద్రణములందును "అఁట" అనునదియె కన్పట్టుచున్నది. తాళపత్రమాతృకలందు ఖండబిందులేఖనము సాధారణముగా నుండదుగానఁ బైచోటులందలి 'అట' శబ్దము "అఁట." శబ్దమె యని విశ్వసింపనగును. "అంట" వి. (√ అను.) చ. ఒకరునిఁ జంపితేని సకలోర్వియుఁ గైకొనుమంట...(శల్య. ౨. ఆ. ౧౧౫). అవ్య=అఁట. గీ. దాతవఁట నీవు మేము సంఘాతలమఁట।గారవపుఁ బెండ్లికూఁతురు గౌరి యంట। శంభుఁ డఁట పెండ్లికొడుకు (పార. ౪ ఆ. ౬౫. రామా. ౨ ఆ. ౫౨. సూ. రా. ని.) క్త్వాకిలతూష్ణీమాద్యానిత్యాది చింతామణిసూత్రమున 'కిల' శబ్దముచే "అఁట - అంట" శబ్దములె యుద్దేశింపఁబడినవని విశ్వసింపనగును. "అటె - అట్టె" అనునవి

"అటు+ఎ=అటె; అట్టు+ఎ=అట్టె" అనురీతి నేర్పడిన వనఁదగుటంజేసి యవి కిలార్థకము లనిపించుకొనఁజాలవు. "కిలార్థా దుభయో ర్యోగః" (వికృ. క్రియా. ౧౫ కా.) అనుకారికలోని కిలార్థకము 'అఁట' శబ్దమె యనకతీరదుగదా. ఈ క్రిందిపద్యము నిట్టిదె క. మనుజాశనులఁట! బలులఁట! । మునులఁట! యాగంబులఁట! నమో విశ్వసృజేవిన మింతకు...(ఉ. హరి. ౧ ఆ ౯౪ ప.)

ఇంక శబ్దమునందలి పూర్ణము తేలినరూపము 'ఇఁక' అనునది భారతమునఁ గన్పట్టుచున్నది. క. వనటయుడుగు మిఁక దుర్మతి । యనుబోలెను వగచుచుండు టుచితమె నీకున్ ॥ (అశ్వ. ౧ ఆ. ౮ ప.) ఇంక శబ్దము భారతమున నతిప్రచురము. (విరా. ౧ ఆ. ౪౭. ఉద్యో. ౧ ఆ. ౩౨౬. సభా. ౨ ఆ. ౨౪ మొ.) చ...మూ! ర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్. (సభా. ౨ ఆ. ౨౪). చుండు - చుఁడు శబ్దములకు.—క....భయం । కరమూర్తులు దాల్చి యుండఁగావలయుఁ జుఁడీ (విరాఁ ౧ ఆ. ౧౭౬). క. మన కిది సమయము సుండీ । యని ద్రోణునిఁ జూపి (ద్రో. ౧ ఆ. ౩౭౮). "చుర్దేశ్యో మధ్యమానాం స్యాత్ । ప్రార్థనే ముమ్ముడుఙ్స్థితిః (వికృ. క్రియా. ౧౬ కారి. అహో. ౪౯౬ పు.) అనుచొప్పున నథర్వణుఁడును "చుము - చుమ్ము - చుఁడు - చుండు" అనురూపముల నుపదేశించియున్నాఁడు.

విస్తర IV-౮౫ II విష:—హరికారికాకర్తబాలవ్యాకరణమును జూచియుఁ బయిరీతి నున్ననన్నయాథర్వణులవచనముల నరయఁజాలనివాఁడగుటచే సాధారణముగఁ బ్రసిద్ధమయియున్న "ఇఁక - అఁట" అనుశబ్దములనుమాత్ర మంగీకరించి "చు" శబ్ద మేదో యప్రసిద్ధమనుకొని దాని నుజ్జగించియుండును. "శబ్దాద్యప్రాస్వతో నార్థ । బిన్దు ర్లోపో ద్రుతస్యచ । వినేఁ కాఁటౌ......" అని గీర్వాణించెను. బాలవ్యాకర్త మఱికొన్నిస్థలములందు వలెనే యిచట సయితము కవిజనమండనమునుండి "ఇఁక—అఁట—చుఁడు" అనువానిని సంగ్రహించికొని యుండును. "ఇఁక" అను దాని నహోబలపతియే చూపెను. నఖణ్డ ఇత్యాదిసూత్రపుఁగవిజనమండన వ్యాఖ్య:—....."ఇందలి చకారమువలన "చుఁడు" అనుచో సాధ్యఖండముఁ (సిద్ధఖండమని యుండుట ముద్రణస్ఖాలిత్యము) ప్రవర్తిల్లుచున్నది....ఇఁక - అఁట సిద్ధ ఖండము" (కవిజనమం. వికృ. సంజ్ఞా. ౯ కారి.) ఇట్లగుటచే, "అమర్చినదానిలో నత్త్రేలుపెట్టుట సులభముగాన..." (బా. గు. ప్ర. ౫౨౧ పు. ద్వి. ము) అనుగుప్తార్థప్రకాశికాకర్త యతిప్రసంగ మవిమర్శనమూలకమనియు హరికారికాకర్తకును బాలవ్యాకర్తకును ముందే వికృతివివేకటీకాకర్త యమర్చియుంచె ననియు గ్రహింపవలయును.

వాత్మాస్మదో ర్ద్రుతస్య, స్యాల్లుక్ (ఆం. చిం. సంధి. ౧౩ కా. అహో ౨౩౨ పు.)

వినా ద్వితీయం స్యా దస్మ। దాత్మనోః స్వన్తయోరపి।
నోరన్యస్యాపి సర్వం స్యాద్బహుళం సత్ప్రయోగతః॥
(వికృ. సంధి. ౩౨ కా. అహో. ౨౩౨ పు.)

కల్పతరువు. ౮౬ విష:—వినా ద్వితీయ మిత్యాద్యథర్వణకారిక (౮౨ III విష.) కీవఱకె వ్యాఖ్య చేయఁబడెను. వాత్మాస్మదోరిత్యాది:—ఆత్మాస్మదోః ద్రుతస్య = నేను తాను శబ్దముల 'ఉ' కారము లోపింపఁగా మిగిలిన 'నేన్ - తాన్' అను వాని ద్రుతమునకు, ('నేను - తాను' అనునవి కళలుగాన వాని 'ఉ' కారము కవిభల్లటసూత్రముచే లోపించునపు డవి ద్రుతప్రకృతికము లగును గావునఁ బైరీతి నర్థము వ్రాయఁబడెను) (విస్తర) వా = వికల్పముగా, లుక్ స్యాత్ = లోపము కల్గును. ఉదా:—నేన్ + వచ్చితిని = నేవచ్చితిని, నేన్వచ్చితిని. తాన్ + వినె = తావినె - తాన్వినె. మొ. ఈ పాక్షికలోపము "లుగ్వాద్రుతప్రకృతికా దిత్యాది సూత్రముచేతనే (౮౧ I విష.) సిద్ధించుచుండుటచే నీప్రకృతసూత్రము వ్యర్థమగు

---

విస్తర I. ౮౬ విష:—"తానున్, అనురూప మేర్పడి......'ఏను' అను నేకవచనరూపమును......ఇది ద్రుతప్రకృతికము గావున 'ఏనున్'......ఇట్లుండఁగా సంధియం దచ్చుపరమగునపుడు 'ఏనున్ + ఇప్పుడు' = ఏను నిప్పుడు, ఏను + ఇప్పుడు = ఏనిప్పుడు, తా (?) నున్ + ఇప్పుడు......ఏనున్ + పలికితి = ఏనుమ్బలికితి; ఏనున్బలికితి—ఏను + పలికితి = ఏను పలికితి......"కవిభల్లటైః క్రియాణామ్" అను మొదలగుసూత్రములచేత 'తా ను -' నేను' పదముల తుదియుత్వము లోపించినను మిగిలిన నకారపుఁబొల్లు ద్రుతమనుటకుఁ జింతామణియం దాధారము లేదు......" (ఆం. భా. చ. ౧౬౨౦. ౧౯౨౧ పుటలు) పయివిషయములెల్లనశాస్త్రీయములు. దేశ్యా దస్మ ద్యుష్మదిత్యాదిసూత్రములచేఁ బ్రథమైకవచనప్రత్యయమగు 'ను' వర్ణకముతోఁగూడిన 'నేను - ఏను-తాను' శబ్దములు ద్రుతప్రకృతికము లెట్లగును? అట్టిలేని ద్రుతమునకు "వాత్మాస్మదో" రిత్యాదిసూత్రముచేఁ బాక్షికలోపమేమి ? కవిభల్లటసూత్రముచే నుత్వ లోపమురాఁగా మిగిలిన నకారము ద్రుతమగుచున్నదని "వినా ద్వితీయం స్యాది" త్యాద్యథర్వణకారికచే ద్రుతత్వము కంఠోక్త మగుచునేయున్నది. అట్టివిషయము నన్నయప్రయోగములచే సిద్ధించుటచే నథర్వణుఁడు వచించుటలో లోపమేమి? దిక్ప్రదర్శకమగు చింతామణిలో నది లేదనుట వింతయా ?

చున్నది. కాన లుగ్వేతిసూత్రముచే వికల్పముగా వచ్చు లోపసంశ్లేషములలో "నేన్ - తాన్" అని వానికి సరళస్థిరపరకత్వమున లోపముమాత్రము వచ్చునని నియమించుట కీసూత్రమారంభింపఁబడె నని వ్యాఖ్య చేయవగును. కాన "అలుకీచ సంశ్లేషఃస్యాత్" అనుచోప్పున సంశ్లేషము రాదని తేలుచున్నది. (విస్తర) ఆదేశ సరళపరకత్వమున నెందును సంశ్లేషము నన్నయాథర్వణ సమ్మతము కాదని యీవఱకె సవిస్తరముగా వ్రాయఁబడెను (౮౦. ౮౦ I విష.) ఈవిషయములనె యథర్వణాచార్యుఁడు వినాద్వితీయమిత్యాది కారికచే వివరించెను. ఆత్మాస్మచ్ఛబ్దముల ద్రుతమునకు సరళస్థిరపరకత్వమున మాత్రమె కాక యాదేశ సరళపరకత్వమునను సంశ్లేషము రాదనియుఁ దక్కినవి యనఁగా నాదేశసరళపరకత్వమున బిందుస్వత్వములును, సరళస్థిరపరకత్వమున లోపస్వత్వములును వచ్చుననియు నావయవికనకారరూపద్రుతమునకు లోపాదు లెల్ల బాహుళకములనియు వినాద్వితీయ మిత్యాదికారికకుఁ దాత్పర్యము. ఇట నన్నయాథర్వణుల మతమందలి స్వత్వసంశ్లేషముల స్వరూపమును స్మరించునది. ఉ. తాఁజెప్పె—తాఞ్జెప్పె. తావినె - తాన్వినె. 'తాన్, చెప్పె. తాన్, వినె' అనెడి ద్రుతము పూర్వాచ్చు నత్తియుండుట లక్షణము గాఁగల సంశ్లేషము రాదని యెఱుంగునది. (చూ. ౮౨ III. విష.) (చూ. విష ౪౪ విష. దాని విస్తరము.)

పయిసందర్భమునుబట్టి యీ క్రింది గాణపతవివరణాక్షేపము పరాస్తమగుచున్నది. "వాగనుశాసనమతమున నకారపుఁబొల్లె ద్రుతమైనచో వికల్పవిధానము వ్యర్థము.......తాను నేను పదములకు సంశ్లేషము సకలలాక్షణికసమ్మతము కాదుగదా. ఒక్కలోపమునకు వికల్పవిధానము చేయఁబడదు. స్వత్వమునుగూడ ద్రుతముగా నంగీకరించిననేగాని వికల్పవిధానమునకు సార్థక్యము కలుగదు" (గాణ. సంధి. ౨౬ పద్యవివ. ౧౩౦ కారి.) నన్నయాథర్వణులమతమందలి స్వత్వసంశ్లేషములస్వరూపము నీయన గ్రహింపమింజేసి యిట్లే మేమో పెక్కుచోటుల వ్రాయుచువచ్చెను. నన్నయాథర్వణులమతమందలి సంశ్లేషము రాకుండుటకును వారిమతమందలి వ్యంజననకారరూపద్రుతము పరస్వరాంగముగఁ బల్కఁబడుట లక్షణము గాఁగల స్వత్వమువచ్చుటకును నిందు వైకల్పికత్వ ముపదేశింపఁబడెనని యెఱుంగనగును.

---

విస్తర II ౮౬ విష:—'తాఞ్జదివె - నేఞ్జూచితి' అనురీతినిగాని 'తాన్, చదివె - నేన్, చూచితి'అనురీతినిగాని ప్రామాణికప్రబలప్రయోగములు లభింపలేదు కాన నీవిషయమున మహాకవులు లాక్షణికులునగు నన్నయాథర్వణులసూత్రములె నిర్ణాయకములని ప్రమాణీకరింపనగును.

తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు
సూత్రము. లేదు. ౫౩.
ఉదాహరణము. తాను+చదివె=తాఁజదివె–తాను జదివె. తాను+వినె=
రా. I విషయము. తావినె–తాను వినె. దీర్ఘంబుమీఁదిదిగాన దీనికి
నెఱసున్న లేదు.

సంజీవని. రా. I విష:—'తాను+చదివె' అనునపుడు సూరిమతమున వచ్చెడి ఖండబిందుపూర్ణబిందుసంశ్లేషస్వత్వములలోఁ ప్రకృతసూత్రముచేత సంశ్లేషమును, బా. సంజ్ఞా. ౧౫ సూత్రముచేత నెఱసున్నయు నిషేధింపఁబడుటచే 'తాన్జదివె - తాంజదివె' అనురూపములు వారింపఁబడినవి. కొఱవడిన 'తాఁజదివె - తాను జదివె' అనురూపములు సూరిచే నుదాహృతము లయ్యెను. అట్లె 'తాను+వినె' అనునపుడు సూరిమతమున రాఁదగిన లోపసంశ్లేషస్వత్వములలో సంశ్లేషము ప్రకృత సూత్రముచే నిషేధింపఁబడెను. కాన కొఱవడిన 'తావినె' అనులోపరూపము 'తాను వినె' అను సూరిసమ్మతస్వత్వరూపమును నుదాహృతములయ్యెను.

"లుగ్వేతిసూత్రేణవాలుకః ప్రాప్తావపి బిన్దుసంశ్లేషయోరనిష్టత్వేన తన్నివారణార్థమిదంసూత్రమ్"....(విస్తర.) "లుగ్వేతిసూత్రేవాలుకస్సరళ స్థిరనిమిత్తకత్వేన

---

విస్తర. రా. I విష:—"బిన్దుసంశ్లేషయోరనిష్టత్వేన తన్నివారణార్థమిదం సూత్రమ్" అనుపయిప్రామాదిక వాక్యముననుసరించికావలయును"కూచిమంచి తిమ్మకవి" సరళస్థిరములుఁబరుషములును బరములగునపు డాత్మాస్మచ్ఛబ్దముల ద్రుతమునకుఁ బాక్షికలోపము నంగీకరించెను. క. విదితముగఁ దాను నే నను। పదములు ప్రథమాంతనాంతపదములగుటఁ దాఁ। జదివెను నేచదివితి నని। పదలక యిరుతెఱఁగు పలుకవచ్చు మహేశా॥ ఆదేశము రానందులకు—క. నీచెప్పిన పెద్దలు ద్రో। ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా। రై చన్నవారలం గొని। యేచక్కం బెట్టువాఁడనే పాండవులన్॥ (ఉద్యో. ౨ ఆ. ౨౫౦ ప.) (సర్వల. ౧ ఆ. ౧౧౯-౧౨౦ ప.) వాత్మాస్మదోరిత్యాదిసూత్రపై యర్థము పైకల్పతరుసంజీవనులలో వివరించినరీతిని సుసమాధేయ మగుటంజేసియు సథర్వణునివివరణ మందులకు మూలమై యుండుటంజేసియు "లుగ్వేతిసూత్రేవాలుకస్సరళస్థిరనిమిత్తకత్వేన క్లప్తత్వాత్" (అహో. ౨౩౨). అని యహోబలపతియు నాత్మాస్మచ్ఛబ్దముల ద్రుతలోపము సరళ స్థిరపరకత్వమందుమాత్రమే యని తుదికి నిర్ణయించుటంజేసియు "నీచెప్పిన..." అనునుద్యోగపర్వపద్యమునందలి "వారలం గొనియే" అనుచోటి "ఏ" అనునది యవధారణార్థకముగ నర్థముచేయుట కవకాశ ముండుటంజేసియు 'నేన్ - తాన్'

క్షప్తత్వాత్ అత్రాపి తన్నిమిత్తోపస్థితేః." (అహో. ౨౩-౨ పు.) అనుచు నహోబల పతియుఁ బ్రకృతసూత్రమునకు వ్యర్థతను శంకించి నియమార్థకత్వమున సార్థక్యమును గల్పించెను. తదనుయాయియగుసూరియు దానిపర్యవసానమునే సూత్రించెను. కాని యహోబలపండితుఁడును దదనుయాయిసూరియు నన్నయాథర్వణుల స్వత్వసంశ్లేషములస్వరూపమును దెలిసికొననివారగుటం జేసి నన్నయాథర్వణసమ్మతములగు ద్రుతము పరస్వరాంగముగఁ బల్కఁబడుట స్వరూపముగాఁగల స్వత్వరూపములను "తాన్జదివె - తాన్వినె" అనురీతి వానిని నిషేధించినవారైరి.

---

అనువానిద్రుతము పరుషపరకత్వమున లోపించుటకుఁ బ్రబలమగు మహాకవిప్రయోగములేమింజేసియుఁ దిమ్మకవి త్రోక్కినమార్గ మపమార్గమె యననగును. (విస్తర. II ౮ా II విష. విస్తర. III ౭ా IV విష.)

విస్తర II ౮ా I విష:—గుప్తార్థప్రకాశికాకర్త పై తిమ్మకవిమార్గమును నిరసించుచుఁ బ్రసక్తానుప్రసక్తముగ నీక్రింది రీతినివ్రాసెను. "కవవొనలును...ఏ। నువిదప డిగిమొద..." (శల్య. ౨ ఆ. 333) అనుపద్యమందలి 'ఏ। నువిదప' అనుచోటునఁ, గళయును బ్రథమయును నగుటచేత పకారము వకారముగ మాఱినదని 'ను' అనునదికళయని వాదించువారై సాహసించుచుండిరి......'ఏ। నువిదప' అనుచోట 'ఏ।నవిదప' అనియే యుండవలయును. 'ఏ। నవిదప' అనఁగా ఏనేయనియవధారణార్థకమైన అకారంబు అవ్యయంబుగావున 'అప్పుడు-ఇప్పుడు' శబ్దంబులంబోలెఁ బైపరుషములకు గసడదవాదేశము రావచ్చును" (బా. గు. ప్ర. సంధి. ౨౩ సూ. వ్యా.) ఈవ్రాతసరికాదు. ఈతఁడే—"క. నీచెప్పినపెద్దలు..." అనునుద్యోగపర్వపద్యమున "ఏ" అనుకాకుస్వరముపై గసడదవాదేశము రాదనివ్రాసి యిచట "అ" అనునవ్యయము మీఁదగసడదవాదేశము వచ్చునని వ్రాయుట భారతప్రయోగసంప్రదాయ విరుద్ధము. ఈతఁ డిట్టిప్రమాదమును స్థలాంతరములందును గావించెను (విస్తర. II ౭ా IV విష. విస్తర III ౭ా IV విష. దీనియనుబంధము. ౭ా IV విష.)

విస్తర III ౮ా I విష:—బాలవ్యాకర్త "నేన్జూచితి తాన్వినె" అనురీతి రూపములను నిరాధారముగాఁ బైరీతిని నిషేధించియుండఁగా గుప్తార్థప్రకాశికాకర్త "ఇచ్చట తాను నేను శబ్దములు ఉపలక్షణముగా గ్రంథకర్తగారిచే గ్రహింపఁబడినవిగాని యిట్టి దీర్ఘపూర్వకద్రుతాంతశబ్దముల కెచ్చటను సంశ్లేషంబు శ్రుతివిరసంబౌట నుండఁగూడదు. రాన్జూచితి - లెస్సగా న్జదివె - ఇత్యాదు లుండవు" (బా. గు. ప్ర. ౫౯ా పుట. సంధి. ౨౩ సూ. వ్యాఖ్య.) అని వివరించెను. "నేను ధానుల

ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు. (ఆ. చిం. ౯ కారి. సంధి. అహో. ౨౧౬ పు.)

నన్నయా ఆద్యతృతీయాతు । నయుక్తా శబ్దవిన్మతే । స్వాత్వం
థర్వణీయము. ప్రశ్లేషతాబిన్దు । స్సమాసేన ప్రయోగతః । క్వచిద్భ
౧౭ విషయము. వేత్సమాసేపి । ప్రాణిసూత్రస్య సంస్థితిః । (సంశ్రుతిః) అపరాస్తే సమాసేచ । శబ్దేనో బిన్దురిష్యతే ॥ (వికృ. సంధి. ౧౭-౧౮ కా. అహో. ౨౧౩-౪౦౦ పు. వికృ. సంధి. ౨౧ కా. అహో. ౨౧౪ పు.)

కల్పతరువు. ౧౭ విష. "ఆద్యతృతీయాతు...ఇష్యతే" అనునంతవఱకుఁగల వికృతివివేకకారికలకెల్ల నీవఱకె వ్యాఖ్య. ౧౭ III విషముగఁ జేయఁబడెను.

ద్రుతస్యేత్యాది—సమాసేషు = సమాసములందు, సర్వత్ర = అంతటను, ద్రుతస్య = ద్రుతమునకు, లుక్ = లోపము కల్గును. ఉదా:—'రామునియొక్క+గుణములు' అనుచో 'షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా । తత్పురుషసంస్థితానామ్నామ్' అనుచొప్పున 'రామునిన్+గుణములు' అని యేర్పడును. ఇందలి ద్రుతము ప్రకృత సూత్రముచే లోపింపఁగా "రామునిగుణములు" అని యేర్పడును. ఇట్లె - "రాముల యొక్క+రూపములు" = రాములన్+రూపములు = రాములరూపములు" మున్నగు

---

మీఁది(అనుబంధము) ద్రుతమునకు సంశ్లేషము గలుగదను నీవిధి దీర్ఘములమీఁది ద్రుతములకెల్ల నుపలక్షణమని ప్రయోగములంబట్టి గ్రహింపఁదగును" (బా. సా. పే. సంధి. ౨౩ సూ. వ్యా.) అని గుప్తార్థప్రకాశికావిషయమును జేటివ్యాఖ్యాత స్వీకరించెను. దీర్ఘముమీఁది హల్లు పరస్వరాంగముగాఁ బరహల్లుతో సంయోగింప రాదనుట నన్నయాథర్వణసమ్మతము కాదు. మఱి యేప్రామాణికులును జెప్పలేదు. అట్టి విషయమును స్థాపించుప్రయోగములును లేవు. మఱియు 'మత్తకోకిల...నాలుగే| న్నాడికుట్టులనీఁడె...(ఆది. ౫ ఆ. ౨౧౮) అనునిట్టిప్రయోగములును బయివిషయము నకు విరుద్ధమ్ములై యున్నవి.

---

అనుబంధము—విస్తర III ౧౬ I విష:—"నేను దానులమీఁది" అను చోటి ద్వంద్వమున గసడదవాదేశము మిక్కిలి వింతైనది. నేను తాను శబ్దంబులను కృతములగుచు సిద్ధద్వంద్వముగ నేర్పడునపు డాంధ్రశబ్దసంధికార్యమగు గసడదవా దేశమువచ్చుట దుర్ఘటము. కాన 'నేను తానులమీఁది' అనియే యుండవలయును. తెల్గున 'నేను-తాను' అనునవి ప్రథమైకవచనాంతములగుటచే సాధ్యద్వంద్వ మనుట పొసఁగదు.

షష్ఠీసమాసస్థలములెల్ల దీనికి లక్ష్యములగును. సమాసములందు విధింపఁబడిన యాగమద్రుతములకు (బా. సంధి. ౨౫-౩౭ సూ. మొ.) విధానసామర్థ్యమున లోపము గలుగదు. (విస్తర) ఉదా:—చిగురుంగైదువు, ప్రోఁగెంపు మొ. "క్వచిద్భ వేత్సమాసేపి । ప్రాణిమాత్రస్యసంస్థితిః" అను నథర్వణవివరణముచొప్పున నావయవిక నకారమునకు లోపమురాదు. అట్టి ద్రుతము పూర్వస్వరాంగమై యుండును గావున నచట సరళాదేశాదికమును రాదు. ఉదా:—గిరివ్రజమున్ఁబురంబు (సభా. ౧ ఆ. ౧౭౩). మొ. క్వచిద్భవేత్తనుటచేత కువలయంబునన్+వాసు=కువలయంబున వారు. (ఆది. ౨ ఆ. ౨౨౮). మున్నగు నలుక్సమాసములలోని ద్రుతము లోపించుటయు "తలఁబ్రాలు - తలంబ్రాలు" మున్నగు నలుక్సమాసములలోని ద్రుతము లోపింపక నిల్చుటయు సంభవించునని యెఱుంగునది. "అపరాన్తే సమాసేచ శబ్దేనో బిన్దురిష్యతే" అనుచొప్పున "తలఁబ్రాలు ప్రభృతులలో లోపింపని ద్రుతము ఖణ్డపూర్ణాన్యతరబిందువుగా మాఱును. ఆకారికలోని బిందుశబ్దము సరళాదేశమునకును నుపలక్షణము కావున "తలఁబ్రాలు - తలంబ్రాలు - తోడఁబుట్టువు - తోడంబుట్టువు మున్నగురూపములు సిద్ధించుచున్నవి. 'నావలనిభయము'

విస్తర. ౮౭ విషు:—"సమాసేషు అనునప్పుడు కేవలషష్ఠీసమాసములనే గ్రహింపఁగూడదు. నెలన్+తాల్పు=నెలతాల్పు. (ద్వితీయాతత్పురుషము.) నెలన్= నెలచేత తక్కువవాఁడు= (ఇచటఁ దృతీయకు ద్వితీయారూపమువచ్చి ద్రుతాంతముగా నున్నది.) నెలతక్కువవాఁడు......ఇట్లె దొంగభయము. (పంచమీతత్పురుషము.)......సరసపు+(నుమ్వ్యాతః) న్+(ద్రుతము) వచనము, అని యుండఁగా ప్రస్తుతసూత్రమువలన ద్రుతలోపముగల్గి 'సరసపువచనము' అయినది." (ఆం. భా. చ. ౧౬౧౫ పుట.) భాషను దార్ఢ్యముచేయుచున్నట్లె సూత్రములను దార్ఢ్యముచేసి వైయాకరణులను నిరసించు శేముషీధర్మము! పై విషయములెల్ల నపమార్గములె. నెలతక్కువవాఁడు మున్నగునవి సమాసకములు. అట్టివి యీప్రక్రియకు విషయములుకావు. "లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్క్షేషు" అనుచొప్పున వానిప్రక్రియ నరయఁదగును. 'దొంగభయము' మున్నగునవి పంచమీతత్పురుషాదు లనుటయు నట్టిపంచమికి ద్వితీయాతుల్యతచెప్పుటయు సరికాదు. మిశ్రసమాసములందుఁ బంచమీతత్పురుషాదులను జూపుట శాస్త్రవిరుద్ధము. ఇట్టియెడల శేషషష్ఠీసమాసమునె చెప్పవలయును. 'సరసపువచనములు' అనుచోట సామాసిక ద్రుతలోపము సంభవింపదు. ఇచట స్థిరపరకత్వమునఁ గల్గుద్రుతలోపమునుజేయుట శాస్త్రీయము.

సున్నగు-వోటు లలుక్సమాసములు - అచట 'ఇచ్ఛవిభక్త్యన్తిమస్య' అనుచోప్పున 'ఖ' అనునవి విభక్తి తుదియక్షరమున కాదేశముగా విధింపఁబడునుగానఁ బ్రకృత సూత్రమునకుఁ బ్రసక్తిలేదు. 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచోప్పున ధాతుజ విశేషణములు ద్రుతప్రకృతికములు. అవి సాధారణముగా సమాసపూర్వపదములై యుండును. అట్టివాని ద్రుతము ప్రకృతసూత్రముచే లోపించును. ఉదా:— చదివెడున్+పుస్తకము=చదివెడుపుస్తకము, చేయున్+పని=చేయుపని, చదివినన్+పాఠము=చదివినపాఠము. మొ. (౮౩ విష. చూ.)

సమాసంబునయందు (విస్తర) ద్రుతంబునకు లోపం బగు. ౨౮.

బాలవ్యాకరణ వికృతి ౮౭ I విశేషము. ఎల్లయర్థములు, ఎల్లకలుషములు, సర్వపర్యాయంబైన యెల్లశబ్దంబు ద్రుతాంతంబైన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబులేదు.

సంజీవని. ౮౭ I విష:—అర్థములు-ఎల్లయర్థములు=ఎల్లప్రయోజనములు-కలుషము=పాపము. అసమాసంబున=సమాసములేని వ్యస్తస్థితిలో.

---

విస్తరము. ౮౭ I విష: సమాసంబునయందు=సమాసమునందు. (ప్రౌఢ. శబ్ద. ౨౧ సూ.) క....ముని। ప్రవరుని తనువునయందు। ధ్యానమై...(అర. 3 ఆ. ౧౦౫). చ...దేవనీ। వనిమిషనాయకత్వమునయం దభిషిక్తుండవై...(అర. ౫ ఆ. ౨౨౬). చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదరదేశమునందు నోరు... (అర. ౬ ఆ. 3౫౭). తే॥ గీ....ఉదర। దేశమునయందు నున్నట్టి (శాంతి. ౨ ఆ. 33). భారతప్రయోగసమ్మతమైన (అనుబంధ) యిట్టి విశేషరూపమును దాను ప్రయోగించియు సూరి బాలవ్యాకరణమున సంగ్రహింపకుండుట వింత. ఇట్టి విశేషములను బెక్కిటిని సూరి సంగ్రహింపకుండుటచేతనె యట్టివానిలోఁ గొన్నిటిని త్రిలింగలక్షణశేషకర్త వివరింపవలసినవాఁ డయ్యెను.

---

అనుబంధము. విస్తరము. ౮౭ I విష:—ఈవిషయమునఁ గవిసంశయ విచ్ఛేద ప్రౌఢవ్యాకరణములలో నుదాహృతములగు ప్రయోగములెల్ల బా. గు. ప్రవ్యాఖ్యాత స్వీకరించి యుదాహరించెను. పేటికావ్యాఖ్యాత - "1 తనువున యందు. 2. అనిమిషనాయకత్వమునయందు. 3. ఉరమునయందు అను మున్నగు నన్నయభారత ప్రయోగములు." అని వ్రాసెను - వీనిలో మొదటిదిమాత్రమె నన్నయది - తక్కిన రెండును ఎఱ్ఱాప్రెగడవి.

"ఎల్లయర్థములు-ఎల్లకలుషములు" అనునవి కర్మధారయసమాసములు గావున 'ఎల్లన్+అర్థములు - ఎల్లన్+కలుషములు' అనుచోఁ బ్రకృతసూత్రమున ద్రుతలోపముకల్గెనని సూరియాశయము. మఱియు, మాకు నెల్లన్ (ఆది. ౮ ఆ. ౧౮౬). 'రాధేయుబోఁటి తులువలెల్లన్ (ఉద్యో. ౧ ఆ. ౩౬). మున్నగుచోటులందు విభక్తివచనములమార్పుల నందకయుండుటం జేసి "సదృశం త్రిషు లిఙ్గేషు । సర్వాసుచ విభక్తిషు । వచనేషుచ సర్వేషు । య న్న వ్యేతి తదవ్యయమ్" అనుచొప్పున 'ఎల్లన్' అనునది ద్రుతప్రకృతికమగు నవ్యయమని సూరి యభిప్రాయపడెను.

సంజీవని. ౧౭ II విష:—"సర్వపర్యాయంబైన యెల్లశబ్దమునకు సప్తమియు నసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగంబును జూపఁబడెడి. ఎట్లఁగె సకల శాస్త్రంబులనెల్లయందు । నధికసాత్వికుఁ డస్తికుఁ డనఁగ జనులు (భార. ఆది ౨ ఆ ౧౬౩) మత్తకోకిల. ఏవగింపక చేకొనుం డిదెయెల్లయందును ధర్మస । ద్భావ...(సభా ౨ ఆ. ౨౩౬) గీ. ఎల్లయందును దా వసియించుటెల్ల।...(ఉద్యో ౨ ఆ ౩౨౬) శా. ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ......(షష. ౨ ఆ.)" (ప్రౌఢ. సంధి. ౭ సూ) అని యిట్లు త్రిలింగలక్షణశేషకర్త యెల్లశబ్దమున కవ్యయత్వభంజక మగుస్థితిని జూపియుఁ దనశబ్దరత్నాకరమున "ఎల్ల - ద్ర - సమస్తము. ఇది యీయర్థమునందు ద్రుతాంతమైన యవ్యయముగా నుండియు" (శ. ర) అని వ్రాసియుండెను. "ఎల్ల-అవ్య - ద్రు." అని యిట్లు సూ. రా. నిఘంటువునందును నెల్లశబ్దము ద్రుతప్రకృతికమగు నవ్యయముగనె వ్రాయఁబడెను. (విస్తర I.) ఎల్లరు - ఎల్లరన్ - ఎల్ల - ఎల్లరచేతన్- ఎల్లరకున్ - ఎల్ల - ఎల్లయందున్ మున్నగురీతిని లింగవిభక్తివచనభేదములందు రూపభేదముల నందుచున్న యెల్లశబ్దమున కవ్యయత్వ మెట్లు పొసఁగును? (౨౧౧

---

విస్తర. I ౧౭ II విష:—లింగవిభక్తివచనభేదములచేత నొక్కటనైనను రూపభేదము నందనిదిమాత్రమె యవ్యయ మనఁజనును. "తద్ధితశ్చాసార్వవిభక్తిః" ఇతి సూత్రేభాష్యే 'స్త్రీపున్నపుంసకత్వాని సత్వగుణాః - ఏకత్వద్విత్వబహుత్వానిచ. ఏతా నర్థాన్ యే న వియన్తి తదవ్యయమితి. లిఙ్గకారకసంఖ్యాః అనాదృత్య య న్న వ్యేతి వికారం న ప్రాప్నోతి, కింతు సదృశమ్=ఏకప్రకార మేవభవతి తదవ్యయమిత్యుదాహృతశ్రుతేరర్థః.' ("సదృశం త్రిషు లిఙ్గేషు । సర్వాసుచ విభక్తిషు । వచనేషుచ సర్వేషు । యన్నవ్యేతి తదవ్యయమ్' అనునది యాథర్వణశ్రుతి)......అయంచ లిఙ్గకారకసంఖ్యాభావనియమోనిపాతానా మేవ - స్వరాదీనాంతు కతిపయానాం లిఙ్గకారకసంఖ్యాన్వయోఽస్త్యేవ. స్వరాదినిపాతమవ్యయమ్ ఇతి సూత్రేభాష్యే 'చాదీనా మసత్వవచనానా మేవ సంజ్ఞా. స్వరాదీనాంతు సత్వవచనానా మసత్వవచనా

౽ విష; ఇట్లయిన నీక మాకు-నెల్లన్-జనులకు నెల్లన్ మున్నగు ప్రయోగము లెట్లు పొసఁగుచున్నవని యాలోచింపవలసియున్నవి. మాకు నెల్లన్ (ఆది ౪ ఆ ౧౪౬) అను పాండ్వులనెల్లన్ (సభా ౧ ఆ ౩౯) వీనినెల్లన్ (సభా. ౨ ఆ. ౨౨౦.) బాలవృద్ధుల నెల్లన్ (సభా. ౨ ఆ ౬౫) క......జనములకు నెల్లను లోచనపర్వమయ్యె. (అర్య. ౪ ఆ ౧౫౯) గీ....రాధేయుబోటి । తులువలెల్లను...(ఉద్యో ౧ ఆ. ౩౬) ఇట్టి వానిని సంగ్రహించుటకై "ఎల్లశబ్దము చార్థకశబ్దయుక్తమై వివిధవిక్త్యంత విశేష్యమున కవ్యవహితపరవిశేషణముగఁ బ్రయుక్తంబగు" అని యొకసూత్రమును గల్పించుకొనుట యుక్తము. (విస్తర II) "ఎల్ల" అనుదానికి "ఎల్లరు-ఎల్లవి" అను మహదమహద్బహువచనములు రెండును గలవు. సీ. విరుము తీర్థములెల్లవియును మేల (అను. ౪ ఆ ౨౦౧) క......గుహ్యకుఁ । డచ్చుపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్

---

నాంచ.' ఇత్యుక్తత్వాత్. స్వస్తివాచయతి - స్వస్తివాచ్యఇతి. క్షీణే పుణ్యే స్వఃపతతి. ప్రాతర్యజతే ఇత్యాదౌ కర్మకారకయోగదర్శనాచ్చ" (బాఁమ - అవ్యయప్ర. సదృశమిత్యాది వ్యాఖ్య. ౪౯౧ పు.) స్వస్తివాచయతి=మాంగళ్యమును వచింపఁజేయుచున్నాఁడు. స్వస్తివాచ్యః=ఆశీర్వాదము వచింపఁదగినది. క్షీణేపుణ్యే స్వః పతతి=పుణ్యము క్షీణింపఁగా స్వర్గమునుండి పడుచున్నాఁడు. ఇట్లవ్యయశబ్దము నకు లింగవిభక్తివచనార్థవిశేషముల యన్వయము కల్గినపుడును నవి యించుకేని రూపభేదము నందక యొక్కరూపముతోనెయుండునని వైయాకరణసిద్ధాంతముగాన "ఎల్లరు - ఎల్ల-ఎల్లరన్ - ఎల్లరచేతన్ - ఎల్లరకున్ -ఎల్లయందున్ - మున్నగురీతిని లింగవిభక్తివచనభేదములందు రూపభేదములు గల్గియున్నపు డది యవ్యయమనుట పొసఁగదు. 'ఎల్ల' అను ప్రథమాంతమునకు సాకల్యాతిశయార్థమున 'ఉన్' చేరఁగా "ఎల్ల+ఉన్=ఎల్ల+న్=ఎల్లన్" అనురూప మేర్పడెనని గ్రహింపనగును.

విస్తర. II రా౭ II విష:—'మాకునెల్లన్' మున్నగుచోటులందు "సర్వనామ సంఖ్యాభిధానతద్విశేష్యములం దెయ్యది ముందు ప్రయోగింపఁబడుదాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు" (బాల. కార. ౨౬ సూ.) అనుసూత్రము చొప్పున "మేము నెల్లరకున్" అనురీతి నుండవలదా యని శంకింపఁజనదు. కొన్ని యెడల నారీతిని బ్రయోగింపరాదు. "మాకు నెల్లరకున్ - మాయెల్లరకున్" అను రీతినిమాత్రమె ప్రయోగములు కన్పట్టుచున్నవి. కావుననేకదా యీసందర్భమున కారకసూత్రములు కొన్నిమార్పులతో సూత్రించుకొనవలసియుండునని వ్రాయ వలసివచ్చెను. క. మాయిరువురలోఁ గయ్యము । ...(ఉద్యో. ౨ ఆ. ౧౩౫). గీ. పలికొను మీాపు మాయేవురందు (శల్య. ౨ ఆ. ౧౦౮). గీ. వానియన్నింటి

(ఉద్యో ౪ ఆ. ౩౯౭) (ఎల్లన్ = ఎల్ల విషయములను) గీ......అనుమాన । మింత లేక యాదు మెల్ల వినఁగ (ఉద్యో ౪ ఆ ౧౮౯) గీ. ఏఁగుడని పల్కె భార్గవుం డెల్ల వినఁగ (అను ౨ ఆ ౨౮౩). వీనిలోని "ఎల్ల" అనుదానికి 'ఎల్లరు' అని యర్థము. దీనినిబట్టి 'ఎల్లన్' అనుదానికి 'ఎల్లరన్' అనునర్థము వచ్చునన్న తలంపుతో "ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునా" అని శ్రీనాథుఁడు ప్రయోగించియుండు నన జను. (ఎల్లన్ శిష్యులన్ = ఎల్లరన్ శిష్యులన్) ఇట్లు మీఁద నుదాహరించినరీతిని 'ఎల్ల' అనుదానికి 'ఎల్లవి' అనునర్థము కవిసమ్మతమగుటచేత 'ఎల్లకలుషములు - ఎల్ల యర్థములు' అనుచోటులందుఁ బ్రథమాబహువచనాంతమగు 'ఎల్ల' అనువిశేషణ శబ్దము నిల్చెనని కాని 'ఎల్ల' అనుప్రకృతియె సమాసమునఁ నిల్చెనని కాని గ్రహింప వచ్చునుగాన నివి ప్రకృతసమాసద్రుతలోపశాస్త్రమునకు లక్ష్యము కావని గ్రహింపనగును.

సంజీవని. ౮౭ III విమః—షష్ఠీతత్పురుషములోని షష్ఠికిఁ జింతామణికర్త వలె ద్వితీయ నాదేశింపక సూరి - బా - సమా - ౨౫ సూత్రముచొప్పున లోపము విధించుటంజేసి కల్పతరువులోఁ జూపఁబడిన "రామునియొక్క + గుణములు= రామునిక్ + గుణములు = రామునిగుణములు" మున్నగు నుదాహృతులు బాలవ్యాకరణసమాసద్రుతలోపశాస్త్రమునకు లక్ష్యములు కానేరవు. "చేతతోడవలనల కిత్వంబు సమాసంబులందగు" (బా. సంధి ౪౩ సూ). అనుసూత్రముచే 'చేత' మున్నగువాని తుది 'అకారమునకె యాదేశముగ 'ఇ'త్వము విధింపఁబడుటంజేసి నీచేతి ప్రోవు మున్నగువానిసాధనమునఁ బ్రకృతసూత్రమునకుఁ బ్రసక్తిలేదని చెప్పవచ్చును. కల్పతరువులో వివరించినట్లు "గిరివ్రజమున్ పురంబు" మున్నగుచోటులందలి శబ్దావయవనకార మీసూత్రముచొప్పున లోపింపదు. అట్లు "తళుకుం గజ్జెలు' మున్నగుసమాసములందలి యాగము నకారము విధానసామర్థ్యమున లోపింపనేరదు. ధాతుజ విశేషణములు సూరి కళలుగా సాధించుటంజేసి

---

కంటె మేలైనశాంతి (ఉద్యో. ౨ ఆ. ౮౫). కం... । అనేకములు గలవు వాని యన్నిటిలోనన్. (అను. ౨ ఆ. ౧౩౮). ఇట్టియెడల "అవియన్నింటికంటె, అవియన్నిటిలోన్." అనికదా బాలవ్యాకరణసూత్రము చొప్పున నుండవలయును. అట్లని బాలవ్యాకరణ సూత్రానుకూలప్రయోగములు లేకపోలేదు. కం....మనకీచకులందఱను (విరా. ౫ ఆ. ౩౩౧). సీ...దిశలు పదింటను దీటుకొనఁగ (మహాప్ర. ౧ ఆ. ౪౮ ప.) ఈ రెండు తెఱంగులందు. (ఉద్యో. ౧ ఆ. ౭౫). చ. అతఁ డోకరుండ లోకముల కన్నిటికిన్ (అను. ౫ ఆ. ౩౧౭).

(బా. క్రియా, ౬౭-౬౭ సూ) 'చపలినపాతము' మున్నగు సమాసరూపము లను సాధించుటలోను నీసూత్రమున కావశ్యకతలేదు. ఇట్టి చిక్కులచేతనే సూరి యీసమాసద్రుతలోప సూత్రమునకు "ఎల్లన్" శబ్దమువంటిలక్ష్యమును సృజించుటకు యత్నించినవాఁడయ్యెను. కాని పైరీతి నదియుఁ లక్ష్యముకామిం జేసి యీబాలవ్యాకరణసూత్రమున కుదాహరణము మృగ్యము కావల సెను. అట్లగుటచే నే పేటికావ్యాఖ్యాత యీక్రిందిరీతిని వ్రాయవలసెను "ఈయొక్కదాని (ఎల్లశబ్దపు) తుది ద్రుతములోపింపఁజేయుటే సూరి యీ సూత్రమునకు ఫలము. సమాసములలో నెచటను నీద్రుతలోపసూత్రమునకుఁ బ్రసక్తియే యగపడదు....మఱియు నివ్విధిని విడిచిన నితరసమాసములందు ద్రుత లోప మసంభవమగుటంజేసి ౨౯ (సంధి) సూత్రమున విధానసామర్థ్యమున దీనికి లోపములే దనుప్రయాసమును దలఁబ్రాలు మొదలగు సమాసముల ద్రుతమునకు లోపంబులేదని సూత్రించుశ్రమయు లేకపోయెడిని" (బా. సా. పే. ౨౮. సూ. వ్యాఖ్య) ఈ పేటిక వ్రాఁత సరికాదు. సూరిగారు తలంపకున్నను నీసమాసద్రుత లోపసూత్రమునకుదాహృతి లేకపోలేదు. కువలయంబున + న్ + ఉన్న + వారు = కువలయంబునవారు మొదలగుస్థలములలోని సామాసికద్రుతమునకు లోపము బాలవ్యాకరణపక్షమున నీసూత్రముచేతనే కదా సిద్ధించును. తరల. కువ లయంబున వారికోరినకోర్కికిం దగనీవు" (ఆది ౨ ఆ. ౨౨౮) గీ. నీదుగర్భమున వాఁ డఖిలభువన। వహనమహనీయుఁడు (ఆది. ౮ ఆ. ౬౨). సీ. ఏకచక్రపురంబున వారలకు (ఆది. ౬ ఆ. ౨౯౭) వారణావతమున వారెల్ల (ఆది. ౬ ఆ. ౧౮౯) ఆ. వె. కౌరవేంద్రు నంతిపురంబున । వారలెల్ల (సభా. ౨ ఆ. ౨౯౩) కం. అక్కాలంబున రూపం। బిక్కాలమునందు (ఆర. 3 ఆ. 33౮)

సంజీవని. రా ౭ IV విషః—అప్పకవి "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అను చింతామణిసూత్రమును వివరించుటలో మిక్కిలిగఁ బ్రమాదపడెను. గీ. వనధి తనయేశ రైనటువంటి యనుచుఁ। జరపదవిశేషణము తేటపఱుచుకొనుచుఁ। దోలు తటిపదంబు కొనసుండు ద్రుతము గుడియు। సమసనమునందుఁ జెందు లోపములు కృతుల॥ క॥ కడపలిద్రుతమును గుడియును। బొడవడఁగినఁ బయిని బరుషములు సరళములౌఁ। జెడవు పెఱహల్లు లెల్లను। సడలక ప్రాణంబులెల్ల సంధులుగాం చున్॥ గీ. జగతిఁ జప్పనికూరకుఁ జప్పగూర। చనును జక్కనిచాయకుఁ జక్కజాయ। పొచ్చు పచ్చనిటోపికిఁ బచ్చడోపి। గరిమఁ గమ్మనితావికిఁ గమ్మదావి॥ ఆ. వె. చల్ల గాలితీయ విల్లు నాసరళస్థి। రాక్షరములు తొల్లి టట్ల నిలుచుఁ। బంచబాణజనక

పచ్చాపు నల్లావు । లనుచు నచ్చులెల్ల నదుకు నిట్లు॥ (అప్పక. ౫ ఆ. ౧౬౮ మొ. ౧౬౭ వ.) చేప్ప - చేక్క - తెల్ల మున్నగు నదంతగుణవాచకములపైని నిల్చు 'ని' అనునది "నివర్ణకః స్యాద్ద్వయాళ్ । మదన్తాద్గుణవాచకాత్." అను నథర్వణవచనము చొప్పున (విక్ర. అజం. ౬౮ కా. అహో. 3౫3 పు.) సమాసమునవచ్చు నాగమమే కాని యది ద్రుతప్రకృతికద్రుతము కాదు. అది ద్రుతమె యైనపక్షమున సమాసమున నిత్యలోపము నందవలసినదేకదా. అట్టియెడల "నల్లని క్రిమియై" (ఆది. ౨ ఆ. ౨౦౦ ప.) మున్నగు నన్నయప్రయోగము లెట్లుకుదురుపడును? మఱియు నిట్టిలోపములేని రూపములలోని ద్రుతమునకు బిందుపూర్ణకమువచ్చి "నల్లం క్రిమి" మున్నగు ననిష్టరూపములు దుర్వారములగునుగదా. ఇంతియకాక నన్నయాథర్వణులమతమున ద్రుతము నకారవ్యంజనమాత్రరూపమే యగుటంజేసి "న!ల్లని క్రిమియై" మున్నగుప్రయోగములు విరోధించును. మఱియు "నల్ల" మున్నగు నదంతములపైని ద్రుతమున కిత్వ ముండుట యసంభవముకాదా? "అన్యే ద్రుతప్రకృతయః" అనుచొప్పున నిట్టివిశేషణములు ద్రుతప్రకృతికములె యైనను నవి "తెల్లన్" మున్నగు వ్యంజన'న'కారాంతములై యుండుటయు విశేష్యముతోడి నిత్యసమాసమున నట్టిద్రుతము లోపించి "తెల్లపుస్తకము" మున్నగురూపములు సిద్ధించుటయు సహజము. (౧౨ I విష. దానివిస్తరము) ఇది యిట్లుండఁగా నప్పకవి పక్షమందు మాత్రము ద్రుతము లోపించునపుడు పరస్థితపరుషములకు సరళాదేశమువచ్చుట కేవలము వ్యాకరణసంప్రదాయవిరుద్ధము. శా......బాహాబల । శ్రీ కల్మిన్......(విరా. 3 ఆ. ౧౨౬) చ......పిన్నతునియలై. సౌప్తి. ౧ ఆ.౯౭ ప.) (౭౯ IV విష.) శ్రీయొక్క+కల్మిన్ = శ్రీన్+కల్మిన్ = శ్రీకల్మిన్ మున్నగు ప్రాసప్రయోగములు విరోధింపవా?

నన్నయాథర్వణీయము ౮౮ విషయము

సుమ్చోతః. (ఆం. చిం. సంధి. ౧౦ కా. అహో. ౨౧౯ పు.) సరళే పరుషేచైవ । సమాసే నుముతో భవేత్ ।అమిశ్రే స్త్రీసమూత్ కేచిత్ । ప్రయోగః శరణం కవేః । అద్రుతాత్ స్వరసాదందు । పట్టికూర్చి విభక్తిషు । తనేచ కుత్రచిదతో । వికారాచ్చాపికేచన ॥ (విక్ర. సంధి. ౨౩. ౨౮.కా. అహో. ౨౧౯ పు.) శబ్దానామాదిభాగేషు । నూతనత్వాదిబోధకాః । ఏకద్వివర్ణకాశ్శబ్దా । అర్థభేదోపిచక్వచిత్ (విక్ర. అజం. ౬౮. కా. అహో. 3౫౮ పు.)

కల్పతరువు. ౮౮ విషః—"ద్రుతస్య సర్వత్ర లుక్ సమేషు" అనుసూత్రము నుండి 'సమాసేషు' అనునది యనువర్తించును. సమాసేషు = సమాసములయందు, ఉతః = హ్రస్వోకారమునకుఁ బరముగా, సుమ్చ = సుమాగమమువచ్చుటయుఁ గలదు. 'సమాసేషు' అనుబహువచన స్వారస్యముచే విశేషణ సమాసములందేకాక శేషషష్ఠీసమాసమందును, సుమ్ము రావచ్చును. 'మిదన్త్యే'అనుప్రాకృతవ్యాకరణసూత్ర సంప్రదాయముచొప్పున సుమ్ము మిత్తుగాన నంత్యావయవముగా నగును. సుమ్ము లోని 'ఉ'కార ముచ్చారణార్థకము. 'సుమ్చ' అనుచోటి చశబ్దస్వారస్యమున నన్న యాథర్వణులకాలమున నీసుమ్ము నిత్యమును సార్వత్రికమును గాదనియుఁ బ్రయోగానుసారముగా నంగీకరింపవలయుననియు, విశేషణములు 'అన్యే ద్రుత ప్రకృతయః" అనుచొప్పున సాధారణముగా ద్రుతాంతములయి యుండునుగాన నట్టి ద్రుతమునకు సామాసికలోపము వచ్చినపిదపఁ బ్రయోగానుసారముగా నీ సుమాగమము రావచ్చుననియు గ్రహింపవలయును. ఉదా:—గండుం గో యిల - తళుకుం గజ్జెలు - పునుగుం దావి-కన్నుంగవ (కన్నులయొక్క కవ). మొ. చింతామణిలో సరళస్థిరపరకత్వమున మాత్రమె వచ్చు నన్నవిషయము వక్కాణింపఁబడలేదు. మఱికొన్ని విషయములతో నథర్వణుఁడు సవరించుచున్నాఁడు. (విస్తర I) అమిశ్రే = మిశ్రేతరసమాసమం దనఁగా నాచ్ఛికసమాసమందు (సాంస్కృతికమున రాదని వేఱ చెప్పనక్కఱలేదు) ఉతఃస్త్రీసమాత్ = ఉకారాంతస్త్రీసమశబ్దమునకంటెఁ బరముగ, సరళేపరుషేచైవ = పరుషసరళపరకత్వమందు మా

---

విస్త. I ౮౮ విషః—"సుమ్చోతో హాల్యథర్వణాచార్యమతాత్" అను నప్పకవీయచింతామణిపాఠము ప్రక్షిప్తము. ప్రాచీనుఁ డగునన్నయ యథర్వణుని స్మరించుట యసంభవము. అథర్వణుఁడు "సరళేపరుషేచైవ" అని సవరించుచుండఁగా హల్పరకత్వమున సుమ్మువచ్చుట యథర్వణమతమనుట కేవలము నసంగతము. అథ్వణునిదని వెలసియున్న వేఱొకగ్రంథమగు త్రిలింగశబ్దానుశాసనమున నీవిషయమే ప్రసంగింపఁబడలేదు. పరుషసరళపరకత్వమున మాత్రమె భారతమున నరుదుగా సుమాగమమునకుఁ బ్రయోగములు కన్పట్టుచున్నవి. స్థిరపరకత్వమున సుమ్ము వచ్చుట యర్వాచీనులకావ్యములలో నగపడుచున్నది. ఉ. సిబ్బెపు । న్మెతెలియబ్బురంపు జిగినిబ్బరపు...(అల్లసానిపెద్దన యుత్పలమాలిక) ఇట్టివిచూచియప్పకవియె యీపాఠమును బ్రక్షిప్తముచేసియుండును. క. అనవచ్చు నముఁగు వెలఁదికినముఁగున్వెలఁది యన శ్లిష్టముగు స్థిరపరతన్ (అప్పక. ౨ ఆ. ౧౩౦ ప.) ఇట్టిప్రయోగము భారతమున మచ్చునకైన లేదు.

త్రమె, నుమ్ = నుమాగమము, భవేత్ = అగునని, కేచిత్ = కొందఱు చెప్పుదురు. అద్రుతాత్ - స్వరసాత్ = ద్రుతము లేనట్టి యనఁగా లోపించినట్టి కవికి సమ్మత మైనట్టి యుదంతస్త్రీసమమునకుఁ బరముగాఁ మాత్రమె నుమాగమమగు నందురు. స్త్రీసమవిశేషణముల ద్రుతమునకు సామాసికలోపము చేసినతర్వాతనే కవిసమ్మత స్థలములందుమాత్రమె యీనుమ్ము వచ్చునని పైచింతామణిసూత్రయము విశదీకరింప బడెను. నలుగడలు ఇరుగడ - ఆఱువది - మున్నగుసంఖ్యావాచకస్థలము లందును 'చేయు - చేసెడు' మున్నగుధాతుజవిశేషణస్థలములందును నుమ్ము భారతాదిప్రాచీన కావ్యములం దెంతమాత్రమును లేదు. చ......గొంతి కుమద్దనే! యుకొఁడును (విరా. ౧ ఆ.౯౮) ధాతుజవిశేషణములపై నర్వాచీనకావ్యలం దరుదుగఁ గలదు. శా. వాలారుం గొనఁగోళ్ల సీరలపనన్ (మను. ౩ ఆ ౫౭) మ.....అయ్యింతి చె | క్కులఁబోలుం జెలనాకుల.....(పాండు. ౧ ఆ ౬౯) సంఖ్యావాచకములపై నుమ్ము లేమికి - ఉదా:—క—పదెదినము లైదుప్రొద్దులు! — (ఆది ౧ ఆ. ౯౮) ఉ...మూఁడుకృతులు (విరా. ౧ ఆ. ౬ ప.) ఇట్లగుటచేతనే యిది ప్రయోగశరణ మనుచున్నాఁడు-కవేః = సుకవియొక్క ప్రయోగమె యీవిషయమున - శరణమ్ ప్రమాణ మగుచున్నది.

అందు పట్టీత్యాదిః—అందు - పట్టి - కూర్చి విభక్తిషు=అందు - పట్టి - కూర్చి-విభక్తులు పరమగునపుడును, నుదంతములకు నుమ్ము వచ్చును. ఋకారమునకుఁ బరముగానైత మీనుమాగమము వచ్చును. (౧౫౬ విష.) ఉ. రామునందు-జ్ఞానముంబట్టి - వనముంగూర్చి - విధాతృనందు. మొ. ఇందలికూర్చి, 'గుఱిచి - గుఱించి' అనువానికిని నుపలక్షణము. ఉదా:—విష్ణుంగుఱిచి. పట్టికూర్చులు పర మగునపు డనుదంతములకుఁ బరముగ నైతము నుమాగమమువచ్చును. ఉదా:—హరిఁగూర్చి - కీర్తింబట్టి. మొ. ఇట్లు చెప్పుటకంటెఁ బట్టికూర్చులు ద్వితీయావిభక్తి మీఁదనిల్చు ననరాదాయని శంకింపఁజనదు. పట్టికూర్చులు భట్టారకునిచే విభక్తు లుగఁ జేర్కొనఁబడుటంజేసి యట్లు చెప్పుట పొసఁగదయ్యెను. (౨౩౫ విష.) అతశ్చ=హ్రస్వాకారాంతమునకుఁ బరముగా నైతము, తనే=తన ప్రత్యయము పర మగుచుండఁగా, క్వచిత్=కొన్నియెడల నుమాగమమువచ్చును - చకారముచే నుదంతముల కెట్లును వచ్చునని యెఱుంగునది. ఉదా:—సొగసుందనము - తెల్లందనము - చక్కందనము. మొ. కేచన కొందఱు, వికారాచ్చాపి=యువర్ణకస్థానమున వచ్చు పు ంపులకుఁ బరముగాను-శబ్దానామాదిభాగే ష్విత్యాదిచెప్పిన నాద్యక్షర శేష మగుట మున్నగువికారముల నందినశబ్దములకంటెఁ బరముగాను నుమాగ

మనుఁ బరుషసరళపరకత్వమున సమాసములం దగునందురు. తనవర్ణకపరకత్వమునఁ బు వర్ణకమయి ప్రసక్తముగునని సూరివలె యర్థముచేసినచో సరసంపుఁబల్కులు - వరవుడ పుంజక్రొమ్ము (రా III విష.) మున్నగుకవి ప్రయోగములును, గ్రొంజాయ మున్న గునవియు సంగ్రహింపఁబడక యథర్వణగ్రంథమునకు న్యూనతగల్గవలసివచ్చును. అహోబలపతి "వికారాత్=పుంప్వాదేశవికారాదిత్యర్థః" (అహో. ౨౨౦ పు.) అని పుంప్వాదేశవికారమాత్రపరముగ వ్యాఖ్యచేయుట సరికాదు (విస్తర. II) ఉదా:—సరసపుం బల్కులు - సరసంపుంబల్కులు - చిగురుంగొంజడలు. (రా III విష.) కేచన యనుటచేత సరసపుపల్కులు సరసంపుపల్కులు' అనురీతిని సమాగమ రాహిత్యము దుష్టముకాదని తెలియుచున్నది. కెంపు+తామర = కెందామర - మున్నగు వికారస్థలములందు సమాగమము నిత్యముగాఁ గన్పట్టుచున్నది. ఈవిషయము లెల్ల గవిప్రయోగవేద్యములు.

శబ్దానామాదిభాగే ష్విత్యాది:—శబ్దానామాదిభాగేషు = శబ్దములయాది భాగమందున్నట్టి,ఏకద్వివర్ణకాఃశబ్దాః=ఒకటిరెండక్షరములశబ్దభాగములు మాత్రమె, నూతనత్వాదిబోధకాః=క్రొత్త మొదలగునర్థములను దెల్పుశక్తి గలవగుచున్నవి. అనఁగాఁ గొఱవడినవర్ణములు లోపించుచున్నవని తాత్పర్యము. ఈసందర్భము చేత సంధిలోఁ గ్రొత్తాదు లాద్యక్షరశేషము లగుచున్నవనియు నట్టివికారము నందినవానికిఁ బరుషసరళపరకత్వమున సమాగమము వచ్చుచున్నదనియు విశదమగు చున్నది. 'వికారాచ్చాపి' అని ప్రత్యేకించిచెప్పుటచే నట్టి వికృతభాగ ముదంతము కాకున్నను క్షతి లేదని తోఁచుచున్నది. (పూఁబోదలు-చెందొవ-క్రొంబసిఁడి. మొ.) క్వచిత్=ఒకప్పుడు, అర్థభేదోఽపిచ=ఆద్యక్షరరూపశబ్దభాగమున కర్థభేదమును గల్గుట గలదు. ఉదా:—క్రొత్త+పసిఁడి=క్రొంబసిఁడి-- కెంపు+దూళి=కెందూళి. చెన్ను+

---

విస్తర. II రా విష:—గాణపతవ్యాఖ్యాతయు నిట్లుక్రొత్తాదిశబ్దములను 'వికారాచ్చ' అనుదానినుండి సంగ్రహించికొనక "లుప్తశేషంబులగు క్రొత్తాదులకుఁ బరుషంబులు పరంబగుచో సుమాగమంబగు" అను బాలవ్యాకరణము ననుసరించి ప్రత్యేకముగ సూత్రించెను. (గాణ. సంధి. ౮౫ సూ.) ఈరచనచేఁ గ్రొత్తాదు లను బ్రసంగించియు నథర్వణుఁడు సుమాగమవిధానపూర్వకరూపసాధనము చేయ లేదనవలసివచ్చును. మఱియు ద్వ్యక్షరశేషములగు సగపాలు మున్నగువానిని నైత మీక్రొత్తాదులలోఁజేర్చి యీతఁ డుదాహరించుటచేత (గాణ. సంధి. ౮౮ సూ. వివ.) 'సగఁబాలు' మున్నగు ననిష్టరూపములును నీపక్షమున నుప్పతిల్లు చున్నవి.

తొవ=చెంవొవ=ఎఱ్ఱకలువ. ఇట 'అందము' అనునర్థముగల చెన్నుశబ్దపుభాగమగు 'చె' అనుదానికి 'ఎఱ్ఱ' అనునర్థభేదము గల్గినది. కెందూళియకొలపై (భీష్మ. ౧ ఆ. ౨౮౨). వెను+దూళి=పెందూళి. (ద్రోణ. ౨ ఆ. ౨౬౯). కెంజడలు. (కెంపు+జడలు) (మను. ౧ ఆ. ౫౯). 'కెంధూళి' అని సూరి (బా. సంధి. ౩౮ వివ.) వర్ణచతుర్థమును నిల్పుటకుఁ దగినయాధారము లేదు. ఇట్లు సరళపరకత్వమునందును గొన్నియెడల నుమాగమము కన్పట్టుచుండుటచేత 'సరళే పరుషే ప్యైవ' అనుదానినుల్లంఘించి సూరిప్రభృతులు పరుషపరకత్వమందుమాత్రమె నుమ్మును విధించుట సరికాదు. (బా. సంధి. ౩౭ సూ.) ప్రాఁత+చదువు=ప్రాఁజదువు, లేఁత+కొమ్మ=లేఁగొమ్మ, పూవు+తోఁట=పూఁదోఁట, మీఁదు+కడ=మీఁగడ - మొదలగునవి, ప్రాఁత+ఇల్లు ప్రాయిల్లు, లేఁత+దూడ=లేదూడ, క్రొత్త+కుండలు=క్రొత్తకుండలు మొదలగునవియు మహాకవి ప్రయోగానుసారముగా నీసందర్భమున సాధించుకొనవలయును.

అద్విత్వంచ భవేద్ద్విత్వం । దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్ ।
(విక్ర. అజం. ౩౭ కారి. అహో. ౩౧౦ పు.) భాషేయ
మమితా తత్ర । దేశ్యా చిత్రస్వభావయుక్ ।తచ్చిత్ర
నన్నయా తా తు ద్రష్టవ్యా । పూజ్యపాదసుభాషితే ॥ (విక్ర.
థర్వణీయము. క్రియా. ౩౬ కా. అహో. ౫౧౩ పు)
౮౮ I విషయము. భూయసీదేశ్యశబ్దేషు । లోపవర్ణాగమశ్రుతిః ॥ (విక్ర.
అజం. ౯౮ కా. అహో. ౩౭౨ పు.)
తత్తత్పదం పరిగ్రాహ్యం । యద్యత్సహృదయే హితమ్
(విక్ర. అజం. ౯౨ కా. అహో. ౩౭౧ పు.)

కల్పతరువు. ౮౮ I విష:—అద్విత్వంచ=వర్ణలోపము జరుగునపుడుగాని, దీర్ఘమునకుఁ దర్వాతనున్నపుడుగాని, ద్విత్వము లేనివర్ణముసయితము, ద్విత్వమ్ = ద్విత్వము గలది, కేషుచిత్=కొన్నియెడల, భవేత్=అగును. అట్టియెడల ద్విత్వమునకుముందు దీర్ఘమున్నచో, దీర్ఘశ్చ = ఆదీర్ఘమున్నైతము, హ్రస్వః = హ్రస్వము నగును. (౨౧౫ I విష.) ఉదా:—వర్ణలోపము జరుగునప్పటి ద్విత్వమునకు—క్రొత్త+తావి=క్రొత్తావి - క్రొత్త+నన=క్రొన్నన - క్రొత్త+కారు=క్రొక్కారు - ఇట్లు క్రొత్తశబ్దస్థలమునందే కొన్నియెడల నుమాగమము కొన్నిట ద్విత్వము కొన్నిచోట్ల లోపాభావమును గల్గును. నెఱ+తఱి=నెత్తఱి. నెఱ+మది=నెమ్మది. నెఱి+నడుము=నెన్నడుము. నిక్కము+కల=నిక్కల. కవ+వడి=కవ్వడి. ఇట్లు వర్ణలోపము

గల్గునప్పుడు కొన్నియెడల ద్విత్వమువచ్చును. కొన్నిచోటులం దిట్లు ద్విత్వముఁ గాకుండుటయుఁ గలదు. రాచ+కొమరుఁడు=రాకొమరుఁడు, రాచ+చిలుక=రాచిలుక, వేలు+వేలు=వేవేలు=వేనవేలు, వేయి+వెలుఁగు=వేవెలుఁగు, వేఁడి+వెలుఁగు=వేవెలుఁగు, నిడుద+మోము=నిడుమోము, బాగు+పురె = బాపురె. మొ. దీర్ఘపూర్వకస్థలములందుఁ గొన్నిట హ్రస్వద్విత్వములు వచ్చుటకు:—పూవు+పొడి=పుప్పొడి, నాలుగు+నాళ్ళు = నానాళ్ళు, వేఁడి+నీళ్ళు = వేన్నీళ్ళు, మూఁడు+నాళ్ళు=మూనాళ్ళు. మొ. ఋమ్ము వచ్చునెడల ద్విత్వాదికమురాదు - కెంపు+చాయ=కెంజాయ - కెంపు+జడ = కెంజడ, సగము+కోరు=సంగోరు - ఇంత+దనుక =ఇందనుక, ఇంత+దాఁక=ఇందాఁక. మొ. ఇట్టి సామాసికవిచిత్రవికారములు (బాల. సమా. ౨౦ సూ.) సక్థ్యాదిసూత్రముచేతను ప్రౌఢ. సమా. 3౬ సూత్రముచేతను. సంగ్రహింపఁబడినవి. ఇట్టి విచిత్రవికారములు పలువిధములు వేనవేలు నగుటచేత నిరూపింప శక్యముకాదనియు, మహాకవులప్రయోగములవలనఁ దెలిసికొనవలయు ననియు సధర్వణుఁడు వచించుచున్నాఁడు. ఇయంభాషా = ఈయాంధ్రభాష, అమితా=పరిమితిలేనిది. తత్ర = అందును, దేశ్యా = ఆంధ్రదేశ్యము, చిత్రస్వభావయుక్=వింతవింతస్వభావములతోఁగూడినది. తచ్చిత్రతా=ఆవైచిత్ర్యము, పూజ్యపాదసుభాషితే=పూజ్యులగు మహాకవులప్రయోగములందు, ద్రష్టవ్యా=చూచి తెలిసికొనఁదగినదే, దేశ్యశబ్దేషు=దేశ్యశబ్దములందు, లోపవర్ణాగమశ్రుతిః=వర్ణలోపవర్ణాగమాదికము, భూయసీ=మిక్కిలి విస్తృతమైనది. యదృత్=ఏయేపదము, సహృదయే=మహాకవియందు, హితమ్=సమ్మతమైనదో లేదా, సహృదయ=మహాకవికి, ఈహితమ్=సమ్మతమో, తత్తత్పదమ్=ఆయాపదము, పరిగ్రాహ్యమ్=గ్రహింపఁదగినదగును. వైయాకరణు లిట్లు చెప్పుట తెలుఁగునందే కాదు. అసంఖ్యవైయాకరణాగ్రేసరసంస్కృతసంస్కృతభాషయందును గలదు. "౧౦3౮. పృషోదరాదీనియథోపదిష్టమ్. (౬-3-౧౦౯) పృషోదరప్రకారాణిశిష్టైర్యథోచ్చారితాని తథైవ సాధూనిస్యుః...ఆకృతిగణోయమ్." (బాలమ. సి. కౌ. ౪౪౦ పు.) "తథాచ ప్రాఞ్చః-కృత్తద్ధిత సమాసానా । మభిధానం నియామకమ్ । లక్షణం త్వనభిజ్ఞానాం । తదభిజ్ఞానసూచకమ్ ॥ (ముగ్ధబోధవ్యాకరణము, ౧౧౯3 సూ. వివ.)

"ఆదశ్యప్రకృతేరపి ప్రయోగానుసారిత్వమేవ. తదుక్తం ధనంజయాచార్యైః. వక్తావాచస్పతిర్యత్ర । శ్రోతాశక్రస్తథాపి తౌ । శబ్దపారాయణస్యాన్తం । న గతౌ తత్ర కేవయమ్ ॥ తథాపి కిఞ్చిత్ కస్మైచిత్ । ప్రతిబోధాయసూచితమ్ । బోధయేత్కియదుక్తిజ్ఞో । మార్గవిత్సహాయాతికిమ్ ॥ ప్రమాణమకలఙ్కస్య । పూజ్య

పాదస్యలక్షణమ్ ॥ అమరసింహాదిశాబ్దికైరపి - శేషం తు । జ్ఞేయం శిష్టప్రయోగత ఇత్యుక్తమ్" (అహో. ౫౧౮ పు.)

సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. ౨౫.

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచే మూఁడురూపంబులు. సరళంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకు లోపసంశ్లేషపూర్ణబిందువులచేత మూఁడురూపంబులు. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు. చిగురు+కయిదువు = చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు. తళుకు+గజ్జెలు=తళుగజ్జెలు, తళుకున్గజ్జెలు, తళుకుంగజ్జెలు. సింగపు+కొదమ=సింగపుంగొదమ - సింగపుఁగొదమ - సింగపున్గొదమ. ఉన్నతంపు+గోడుగు = ఉన్నతంపుగోడుగు - ఉన్నతంపున్గోడుగు - ఉన్నతంపుంగోడుగు. నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు. ఈయాగమం బొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి. గరువపున్నురువు.

బాలవ్యాకరణ వివరణము. ౨౫ II విషయము.

సంజీవని ౨౫ II విష:—చిగురుంగయిదువు=చిగురనెడియాయుధము-సింగపుంగొదమ=సింహపుపిల్ల - నలుగడలు=నాల్గుదిక్కులు - గరువపున్నురువు = గర్వంపుటొప్పిదము, స్త్రీసమంబులు=ప్రథమైకవచనమున డుజాదిప్రత్యయములు లోపించు నాచ్ఛికశబ్దములు. తండ్రి - తల్లి - గోడ మొ. తెల్ల - నల్ల - వాఁడి - వేఁడి - మొదలగు విశేషణములును స్త్రీసమములె యనఁదగును. చింతామణిపక్షమున 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచోట్పున విశేషణములు ద్రుతప్రకృతికములు కావున 'తెల్లన్ - నల్లన్ - వాఁడిన్ - వేఁడిన్ - చేయుచున్నన్ - చేసినన్ - చేయఁగలన్ - చేసెడున్ - చేసెడిన్ - చేయున్ మున్నగురీతి నీవిశేషణములరూపముల నెన్న నగును. ఆపక్షమునందును నిట్టివెల్ల—"చేయుచున్ - చేయుదున్ - చేయన్" మున్నగులాక్షణికావ్యయములతోపాటుగ స్త్రీసమములె యనుటలో విరోధమేమియు లేదు. (చూ. ౧౨ I విష. దీనివిస్తరము.) 'కర్మధారయంబు త్రికస్త్రీస

మ ముగంతధాతుజవిశేషణపూర్వకంబై యుండు' (బా. సమా. ౫ సూ.) అను సూత్రమున స్త్రీసమములను వచించి సూరిధాతుజవిశేషణములను వేఱుగఁ జేర్కొనుటచేత ధాతుజవిశేషణములు సూరిపక్షమున స్త్రీసమములు కానేరవని చెప్పనగును. కాన బాలవ్యాకరణపక్షమున ధాతుజవిశేషణములకుఁ బ్రకృతసూత్రముచేత నుగాగమము రానేరదని గ్రహింపవలయును. ఉదా:—చేయుపని - చేసెడుపని. మొ. (విస్తర I) సూరిగారి యీమార్పు సరిగానున్నట్లు తోఁచదు. "వికృతాసర్వేశబ్దాః...." అనుచింతామణి ననుసరించి సూరి "ఆచ్ఛికంబులెల్లం దలుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులయియుండు" (బా. ఆచ్ఛి. ౨ సూ.) "తలుచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొకకలవు" అని పైసూత్రమును వివరించెను. ఇట్టియెడల ధాతుజవిశేషణములు పుంస్త్రీక్లీబసమములలో నేతరగతియందును జేరకుండుట సరికాదు. మఱియు వీనికి స్త్రీసమత్వము లేనపుడు ప్రథమైకవచనలోపమునకు మార్గము లేమింజేసి పదత్వసిద్ధియుఁ బొసఁగదు.

ఈసందర్భమునందలి స్త్రీసమశబ్దమాచ్ఛికమాత్రవిషయకము. పిత - దూత మున్నగునవి ప్రథమైకవచనలోపాదికమునకై స్త్రీసమములుగా సూరిచే సూత్రింపఁబడినను నట్టితత్సమముల నిచటి స్త్రీసమములలోఁ జేర్పరాదు. ఉదంతముల కనుట చేత నీవిధి యూదంతములపట్ల వర్తింపనేరదు (విస్తర II.)

---

విస్తర. I రూ II విష:—ఇట్లు నుగాగమరహితముగనే భారతమునఁ బ్రయోగములు వెలయుచున్నవి. చ...గొంతినుద్దుసే। యుకొడుకు...(విరా. ౧ ఆ. ౯౮). మ....చూ। చు తలం పెత్తెడు...(భీష్మ. ౧ ఆ. ౨౦౬). క....త్రోఁ। చు తలం పలవలుచు...(ఆను. ౧ ఆ. ౭౨). ప్రాసస్థలఖచితము లగునిట్టి ప్రయోగములకు విరుద్ధముగ నర్వాచీనులు ప్రయోగించిరి. శా. వాలారుంగొనగోళ్ళ... (మనుచ. 3 ఆ. ౫౭). మ...అయ్యింతి చె। క్కులఁబోలుం దెలనాకుల... (పాండు. ౧ ఆ. ౨౯). వీని ననుసరించి యడిదము సూరకవి "ఆ. వె. కర్మధారయంబు గావించుచోటను। నూఁదిపలుకవచ్చు నొక్కచోట। స్ఫుటకృపావిభూతిఁ బొలుచున్ శివుఁడు మాకు।...(కవిసం. ౧ తరం. ౧౬ లక్ష. ౧౦3 ప.) అని లక్షణముచెప్పి యీక్రిందిపద్యమును బ్రమాణముగఁ జూపెను. శా...పా। ల్పారుచున్ రాముఁడు ప్రోచుఁగాత (కవులషష్ఠము) (చూ. విస్త. II ౯౫ విష.)

విస్తర. II రూ II విష:—ఉదంతములకని సూరియేకాక 'నుమ్చోతః' అని భట్టారకుఁడును 'సమానే సు ముతో భవేత్' అని యధర్వణుఁడును దపరకరణము తోడ విధించుటంజేసి యీనుమ్ము 'ఊ' దంతములకు వర్తిల్లనేరదు. కాన "దీర్ఘము

'పుంపులకున్' అను ప్రత్యేకవిధానమునం జేసి యవి తుదినిగలశబ్దములు స్త్రీసమములు కాకున్నను, దిత్సమములయినను నచట నుగాగమము వచ్చునని విశదపఱుచుచు సూరి 'సింగపుంగోదమ - ఉన్నతంపుంగోడుగు' అని యుదాహరించెను. (విస్తర III)

నన్నయాదర్వణులు ప్రాకృతవ్యాకరణపద్ధతి ననుసరించి 'నుమ్' అని యీ యాగమమును మిత్తుగా విధించినను సూరి ప్రసిద్ధమగుపాణినీయపద్ధతి ననుసరించి "౩౬. ఆద్యన్తౌటకితౌ" (౧-౧-౪౬) టిత్ కితౌయస్యోక్తౌ తస్య క్రమాదాద్యన్తావయవౌ స్తః" (సి. కౌ. బాలమ. ౧౯ ఫు.) అనుచొప్పున 'నుక్' అని యిట్లు కిత్తుగా నుపదేశించెను. రెండుమార్గములందును ద్రుతమంతావయవముగా వచ్చుచే యర్థముగాన ఫలభేదము లేదు. (విస్తర IV)

---

మీఁదనైనఁ బూర్ణబిందుసంశ్లేషములు రెండును నుండక న (య ?) ర్ధబిందురూపమెయగు ననుమాట మఱు (ఆ ?) వరాదు" (బా. సా. వే. ౮౪ ఫుట.) అను వేటికావాక్యము సరికాదు అటయిన 'పూఁదోఁట - పూఁబోద' మున్నగువాని సాధనమెట్లని శంకింపరాదు."వికారాచ్చాపి" అను ప్రత్యేకవిధానమునను మ్మువచ్చును (౮౮ విష.). 'పూవు+తోఁట - పూవు+పొద' మున్నగురీతిని ఛేదముచేసి సూరి పక్షమునఁ ద్రాఁతాదిసంధిచొప్పున నట్టివానిని సాధించికొననగును. బా. సంధి. 3౭ సూత్రమునొద్ద సూరి యట్లె "పూవు+తోఁట=పూఁదోఁట" అనియె యుదాహరించి యున్నాఁడు. ఇట్లగుటచేత "పూపూవు" (ప్రౌఢ. సంధి ౧౧ సూ.) అని సూత్రించి త్రిలింగలక్షణశేషకర్త పయి బాలవ్యాకరణమార్గమును సవరింపఁబోవుట సరికాదు. "ఊదన్తాత్ నుమోఽసంభవాదితిజ్ఞేయమ్" (అహో. ౩౧౦ ఫుట.)

విస్తర. III ౮౮ II విష:—"పుంపులుగూడ నుదంతములేయగుటంజేసి యీకార్య ముదంతములకుఁ గలుగుననినం జాలును. గాని సహజోదంతస్త్రీసమములమీఁదనే యని పాఠకు లర్థముంజేసికొందురేమో యని పుంపులమీఁదఁగూడ నగునని సూరి నిర్వచింపవలసివచ్చెను" (బా. సా. వే. సంధి. ౨౯ సూ. వ్యా. ౮౯ ఫు.) ఈవేటికావాక్యము ప్రామాదికము. పుంప్వంతశబ్దము లుదంతములగునేకాని స్త్రీసమములు కానేరవు. పుంపులు మువర్ణకమున కాదేశముగా వచ్చినవిగాన నవి తుదినిగలశబ్దములు స్త్రీసమములు కానేరవు.

విస్తర. IV ౮౮ II విష:—"చిగురు+ను+కైదువు.....కకారము పరుషము. ఇది పరముగా నుమాగమము కలిగె. 'నుమ్' అనునది పొల్లుమకారముపోవు ప్రత్యయముగాన మిత్తు. ఇది ప్రకృతియంత్యాచ్చుకంటె నవ్యవహితపర

"చిగురు+ను+కై యిదువు" అనుచో బా. సంధి. ౧౬ సూత్రముచొప్పున గకారాదేశమును ౧౭ సూత్రముచొప్పున ద్రుతమునకు ఖండపూర్ణబిందుసంశ్లేష ములును వచ్చునుగాన సూరి యీరూపత్రయమును నుదాహరించెను. ఇది సమాస స్థలమగుటచేత బా. సంధి. ౨౬ సూత్రముచొప్పునఁ బైచోట ద్రుతస్వత్వరూపము రానేరదని వివరించెను. 'తళుకు+ను+గజ్జెలు' అనుచో బాల. సంధి. ౧౮ సూత్రము చొప్పున ద్రుతలోపసంశ్లేషములును, ౧౯ సూత్రముచొప్పున నెఱసున్నరూపమును సిద్ధించినవి. ఇచట సైతము బా. సంధి. ౨౬ సూత్రముచేతనే ద్రుతస్వత్వము రా దయ్యెను. 'విధానసామర్థ్యమున దీనికి లోపములేదు' అనునీసూత్రముచే సమాస మందు ద్రుతాగమవిధానముచేసి వెంటనే దానికి బా. సంధి. ౨౪ సూత్రముచే లోపముచేసినచో నీప్రకృతసూత్రపు ద్రుతాగమవిధానము వ్యర్థమే యగునుగాన సమాసమునందు విధింపఁబడిన ద్రుతాగమమునకు సామాసికద్రుతలోపము కల్గనేర దని తాత్పర్యము. ఇంక నీసామాసికద్రుతాగమమునకు బా. సంధి. ౧౮ సూత్ర ముచేఁ బాక్షికలోపము రావచ్చును, అట్లులోపింపఁజేసినను బక్షాంతరమున ద్రుతమునకు పూర్ణబిందుసంశ్లేషరూపము లుండునుగాన ద్రుతాగమమునకు వ్యర్థత కల్గనేరదు. కాఁబట్టి యట్టిపాక్షికలోపము రావచ్చునని వివరించి సూరి యుదాహరించెను.

'సింగపుంగోదమ' అనునది 'పు' అనుదానికిఁ బరముగా నుగాగమమువచ్చుట కుదాహరణ మగుటయేకాక ప్రకృతసూత్రములోని 'సమాసంబులన్' అను బహు

---

ముగా నగును." (బా. సా. వే. ౮౪ పుట.) అను వేటికావ్యాఖ్య సరికాదు వేటికాకర్త యీవాక్యమందేకాక యీసూత్రపువ్యాఖ్యయంతటను నుమాగమ మునే సూరి విధించినట్లు వ్రాసెను. సూరిగారిమూలసూత్రము నుదాహరించు నపుడు మాత్రము పరస్పరవిరుద్ధముగా "నుగాగమ" మని వ్రాసెను. సూరి యీ సూత్రమందేకాక యెచ్చటను మిత్త్వమును వాడలేదు. మఱియు నిచట నుదంత ముల కంత్యావయవముగా ద్రుతము చేరవలసియుండుటచేతఁ బాణినీయపద్ధతిలోని "ఆద్యన్తౌటకితౌ" అనుచొప్పున "కిత్త్వమునే" యుపయోగించుట యర్హము. హలంతములకు విధించునపుడుగదా పాణినీయపద్ధతి చొప్పున "౩౭. మిదచోన్త్యా త్పరః. (౧-౧-౪౭) (సి. కౌ. బాలమ. ౨౦ పుట.) అనుసూత్రముచొప్పున మిత్త్వము నుపయోగింపవలయును. వేటికాకర్త యహోబలపండితీయపు తెలుఁగు టీకను (కొంపెల్లద్రాద్రిశాస్త్రిగారిది) జూచి (అహో. ౨౨౧ పు.) యిట్లు వ్రాసె నని తోఁచెడిని. మఱియు సూరిసూత్రమున నుక్కునాగమమని చెప్పియుండఁ బేటికలోఁ బ్రత్యయమను టేలకో ?

వచనస్వారస్యమున షష్ఠీసమాసములందును నీయాగమము వచ్చుననుటకును నుదాహృతి యగుచున్నది.

"ఉన్నతంపుంగొడుగు" అనునది 'ంపు' అనుదానికిఁ బరముగ నుగాగమము వచ్చుట కుదాహరణ మగుటయేకాక మిశ్రసమాసములందును "పు-ంపు" లకుఁ బరముగా నుగాగమమువచ్చుటకును నుదాహరణ మగుచున్నది.

సంజీవని. ౨౭ III విష:—ప్రయోగములు—చ... అ। ధరణము పెక్కు-కుంజపుల పాక। క్షేపము లాదరింప (అను. ౪౪. ౨౫౯ ప.) మ...వెనుం। గదుపు లక్షిమృగంబు లెంకయు...(ఆర. ౭ ఆ. ౨౯౫) చ...హరి యిట్లు చెప్పఁగా। వినమి కదుంజెదుంజెఱఁగు...(ఉద్యో. ౩ ఆ. ౩౭౪) మ. చిగురుంగెంపుఁదన లొప్పు... (హరి. ఉ. భా. ౭ ఆ. ౫౨౫.) షష్ఠీసమాసమున నాగమమువచ్చుటకు - యథాక్షరము. ఉవిద కన్నుంగవ మొగిచి తెలియకయుండె భయమున (ఆది. ౪ ఆ ౨౫౪ ప.) చ. ఇ।వ్వరవుశపుంజరిత్రమున వచ్చునె నీకొకపేర్మి. (అను. ౧ ఆ. ౨౧౯). ఇది పువ ర్ణోదాహృతియు, మిశ్రసమాసోదాహృతియు, షష్ఠీసమాసోదాహృతియు నగుచున్నది. క...చె। ప్పరవుం దెవుపున డప్పిం। బొరసినయెడ...(శాంతి. ౩ ఆ. ౪ ప.) చ...ప్రాణగొడ్డపుం। బనులగు నవ్విధంబు...(అను ౪ ఆ. ౧౩౪). మ... జగం।బుల వేరెవ్వరుఁ గయ్యపుంగఱ వున న్పొంచెం ద్రిలోకేశ (హరి. ఉ-భా. ౭ ఆ. ౧౯) పు - ంపులకు 'తన' పరకత్వమున నుమ్ముప్రయోగము లభింపలేదు. ఈనుగాగమము పాక్షికమని నిర్ణయింపఁజాలు ప్రాసస్థల ఖచితప్రాచీన మహాకవిప్రయోగములు లభింపలేదు. అట్లగుటనే కావలయు సూరి దీనిని నిత్యముగా విధించెను. కానియథర్వణకారికలలోని. "ప్రయోగశ్శరణంవేః। అమిశ్రేస్త్రీమాత్ కేచిత్ - అద్రుతాత్ స్వరసాత్ -వికారాచ్చాపికేచన" అనువచనములనుబట్టి యీయాగమము నిత్యము కాదనియే చెప్పనగును. క...। కరము వెస న్వచ్చుచేటు కాలము తెలిఁగున్ ("శాంతి. ౪ ఆ. ౪౩౫) అనురీతి ప్రయోగములు పెక్కు-కానంబడుచున్నవి, చిఱుచేప - నిఱుపేద-కీడు పని మున్నగుసహృదయసమ్మతప్రయోగములు పెక్కు వెలయుచున్నవి. "కేచిదిత్యుక్తేః పునుఁగుతావి - కుంచనపుచాయ ఇత్యాదీనిరూపాణి...స్వరసాదిత్యనేన (ఇచట సరసాదనుపాఠము ముద్రణసంస్కర్తృప్రభృతిప్రమాదకృతము) నలుగడలు ఇత్యాదివ్యావృత్తిః" (అహో ౨౨౧ పుట నుమ్చోత ఇత్యాదిసూత్ర వ్యాఖ్య.)

సంజీవని. ౨౭ IV విష:—'నలుఁగడలు' అని ఖండబిందువుతో బాలవ్యాకరణ ప్రథమముద్రణమునందు సైతము పడియున్నది. అట్లయినను "నలుగడలు

శబ్దాన్నైద వ్యాకృత్తిః" అనునహోబలపతివాక్యమే మూలమనఁదగు సూరివివరణమున నరసున్న సూరిచే బుద్ధిపూర్వకముగ నిల్పఁబడెననుట విశ్వసనీయముకాదు. (విస్తర) నలుగడలు-ఇరుగడ-ఇరువది-అఱువది-నలువది మున్నగుచోటులందెల్ల గసడదవా దేశమయ్యెనని(సమాసాశ్రయవిధిగ)యెఱుంగునది. (౭౮ IV విషచూడు.)

అప్పయా స్వత్వం ప్రశ్లేషతా బిన్దు । స్సమాసే న ప్రయోగతః.

౮౯ విష. (వికృ. సంధి. ౧౭ కా. అహో. ౨౧౩ పు.)

కల్పతరువు. ౮౯ విష:—ఈకారిక కీవఱకె ౮౨ III విషయమున వ్యాఖ్య సేయఁబడెను.

బాలవ్యా. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు.

౮౯ I విషయ. ౨౬.

సంజీవని ౮౯ I విష:—ఈసూత్రమునకు బా. సంధి. ౨౫ సూత్రపువివరణమున "స్వత్వము లేకుండుట" నుదాహరించియుండుటచే సూరి యిట మరల వివర

---

విస్తర ౮౯ IV విష:—గుప్తార్థప్రకాశికాకర్త యిచటి యరసున్న ముద్రణప్రమాదపతితమని గ్రహింపక యీక్రిందిరీతిని వ్రాసెను. "నలుఁగడలు మొదలైనవాని యందు నీయాగమము (ఇరువదియైదవసూత్రముచేత వచ్చు నుమాగమము = సంశ్లేషరూపము) 'లేదందురు.' అనఁగా 'నలుఁగడలు - నలుంగడలు' అనురూపము లుండవచ్చునుగాని నలున్గడలు అనురూపముండఁగూడదని భావము (బా. గు. ప్ర. ౬౮పు. ద్వి.ము). సంధిపరిచ్ఛేదములోని యాగమ న కారంబునకు సంశ్లేషరూపము లేదనెడి యపసిద్ధాంతము నంగీకరించినవాఁడుగాన (బా.గు.ప్ర.౫౭ పు. ప్ర. ము. ద్వి. ము) (చూ. విస్తర I ౮౫ II విష.) గుప్తార్థ ప్రకాశికాకర్త పైరీతినసంగతముగ వ్రాసెను 'నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు' అని కంఠోక్తముగా సూరి యుద్ఘోషించుచుండఁగా నచట ముద్రణప్రమాదపతిత మగు నర్ధబిందువు వాస్తవమని భ్రమించుటయు నింకను నచటియాగమశబ్దమునకు సంశ్లేష మర్థమనుచు నపార్థముచేయుటయు నట్టియపార్థముచొప్పునఁ దానంగీకరించిన 'నలుఁగడలు - నలుంగడలు,' అను రూపములు సూరికిని సమ్మతములనునట్లు సమన్వయించుటయు సరికాదని నేను లోఁగడఁ బత్త్రికాముఖమునఁ దెల్పఁ, గోపించి నిజాభిధేయవంచనమునపార్థమూర్తులగుచుఁ బ్రకాశికాకర్తగా రేమేమో యతిప్రసంగముచేసిరి. ఆప్రథమముద్రణమునకుఁ దప్పొప్పుల పట్టికను దగిలించి యందు సవరింపయత్నించిరి. కాని యాసవరణము తప్పులతిప్పయగు ద్వితీయముద్రణమున గ్రంథమున కెక్కలేదు. ప్రథమముద్రణమురీతినె పడియున్నది.

ణోదాహరణములను జూపలేదు. చిగురుంగ్రైదువు - తళుకుంజెక్కులు మున్నగు చోటులందు "చిగురును గ్రైదువు - తళుకును జెక్కులు" అనురీతిని 'ను' స్వరూపస్థితి సమాసములలో నుండదని సూరి యాశయము.

నన్నయాథర్వణమతమున ద్రుతమునకు (ర౨ III విష. చూ.) సమాసమందే కాక యెచ్చటను 'ను' స్వరూపము లేదు. "నుమ్‌చోత్తః" సమాసే "నుమతో భవేత్" అను నన్నయాథర్వణసూత్రములచే సమాసమున విధింపఁబడిన నుమ్ములో మకారమేకాక 'ఉ'కారమును నిద్వర్ణమె. మిత్త్వముచే ద్రుతాగమ మంత్యావయవ మగును. ఉకార ముచ్చారణార్థకము. కాఁగా వ్యంజన నకారరూపద్రుతమె సమాసములం దాగమమగునని గ్రహింపవలయును. కాన సమాసములందలి ద్రుతమునకు స్వత్వ మనఁగా వ్యంజననకారము పరహల్లుతో సంయోగించుట యనియె నన్నయాథర్వణులమతమున గ్రహింపవలయును. అట్లయినను దిక్కయజ్వ ప్రభృతులు ద్రుత'ను'స్వరూపమును వ్యస్తస్థితిలోఁ బ్రయోగించియున్నారు. (ర౨ III వి.) సమాసములోని యాగమద్రుతమునకు నుస్వరూపమేకాక ద్రుతము పర హల్లుతో సంయోగించుట లక్షణముగాఁగల సూరిప్రభృతులసంశ్లేషమునైతము కవిప్రయోగములం దెచ్చటను నిర్వహింపఁబడలేదు. ఇట్టిస్థితిలో సూరి స్వత్వము నిషేధించి సంశ్లేషము నంగీకరించుట కాధారమేమో తెలియకున్నది. నన్నయా థర్వణులు సమాసమున నుమ్మును విధించిరే కాని యచటిద్రుతమునకు వచ్చు నాకార ములవిషయమున విశేషవిధులను వచింపలేదు.

అరయ నరయ సూరిగారు పైనుదాహరించిన "స్వత్వం ప్రశ్లేషతా బిస్దు రిత్యాద్యథర్వణకారికను మూలముగాఁ గొని ప్రకృతసూత్రము నుపదేశించిరా యని యాలోచింపవలసియున్నది. ఆయథర్వణకారికయు నీసూరిసూత్రమును సామాసికద్రుతమునుగూర్చియే వెలసియున్నను నం దథర్వణకారిక, సమాసమందు విధింపఁబడిన యాగమరూపద్రుతము విషయముగాఁగలదికాదు. (ర౨ III విష.) సూరిసూత్ర మట్టియాగమరూపద్రుతమె విషయముగాఁగలది. మఱియు నాథర్వణ స్వత్వమువేఱు. సూరిమతమునందలి స్వత్వమువేఱు. కావునఁ బయియథర్వణ కారికను మూలముగాఁ గొని యిట్టి విధానమును సూరిచేయుట భ్రాంతిమూలకమె యనకతీరదు.

స్వత్వం ప్రశ్లేషతాబిస్దు । స్సమాసే న ప్రయోగతః ॥
(వికృ. సంధి. ౧౩ కా. అహో. ౨౧౩ పు.)
క్వచిద్భవేత్సమాసేఽపి । ప్రాణిమాత్రస్య సంస్థితిః

[illegible] (వికృ. హాలం. ౬ కా. అహో. ౪౦౦ పు.)
అథర్వణీయము. ప్రుతస్యపర్వత్ర లుక్ సమాసేషు (ఆం. చిం. సంధి. ౯
౯౦ విషయము. కా. అహో. ౨౧౬ - ౨౧౭ పు.)
అపరాన్తే సమాసేచ । శ్రద్ధె నో బిన్దురిష్యతే । ధూర్వ
హాస్యమతే తత్ర । కవివాఙ్మానముచ్యతేఁ (వికృ. సంధి.
౨౦ - ౨౧ కా. అహో. ౨౧౪).

కల్పతరువు. ౯౦ విష:—వీనిలోని యథర్వణకారికలకు ౭౨ III విషయము నందును ప్రుతస్యేత్యాదిచింతామణిసూత్రమునకు ౦౭ విషయమునందును వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యాకరణ వివరణము. ౯౦ I విషయము.
తలఁబ్రాలు మొదలగుసమాసంబుల ద్రుతమునకు లోపము లేదు. ౨౭.
తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - సేసఁబ్రాలు - ఊరఁబంది - ఊరఁబిచ్చిక - తోడఁబుట్టువు - తోఁబుట్టువు - ఒల్లఁబాటు - ఒడఁబాటు - ఇత్యాదులు.

సంజీవని. ౯౦ I విష:—"తలఁబ్రాలు - దే - వి - (తలన్+ప్రాలు) వివాహకాలమందు దోసిళ్ళతో తలమీఁదఁబోయునక్షతలు" (శ. ర.) అనుచెప్పున 'తలఁబ్రాలు' అనునది సప్తమ్యర్థకద్వితీయాఽలుక్ సమాసము. 'తలయందున్' అనుచో "జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగానగు" (బాల. కారక. ౨౨ సూ.) అనుచెప్పున ద్వితీయరాఁగా 'తలను+పోయు+ప్రాలు' అనువిగ్రహముగల మధ్యమపదలోపసమాసమున 'పోయు' అను మధ్యమపదలోపమును, (బా. సమా. ౨౦ సూ.) బా. సంధి. ౨౪ సూత్రముచెప్పున ద్రుతమునకు లోపమును, రాఁగా "తలప్రాలు" అను ననిష్టరూపము సిద్ధింపవలసివచ్చెను. కాననందలి ద్రుతలోపము ప్రకృతసూత్రమున వారింపఁబడఁగా 'తలన్+ప్రాలు=తలఁబ్రాలు - తలంబ్రాలు - తలన్బ్రాలు' అనురూపము లేర్పడును. ఇట్లు ద్వితీయారూపద్రుతము లోపింపకుండుటచే నిది యలుక్సమాస మగుచున్నది. ఇట్లె తక్కినరూపములను సమర్థించుకొనునది. ఇత్యాదులనుటచే 'ఒల్లఁబోవు' మున్నగువాని నెన్నునది. ఒల్లఁబోవు= మూర్ఛిల్లు...గీ. ఒల్లఁబోవుచు సిడమతఁ డూఁత గొనియె (భీష్మ. ౨ ఆ. ౨౪౩ ప.) (విస్తర.) ఇంకను ప్రయోగములు:—మ....నా। ధునిమాళిన్ దలఁబ్రాలు

విస్తరము. ౯౦ I విష:..."ఇందు ద్రుతము లెట్లు కల్గెనో? యివియే సమాసములో? తెల్పక నిపుణముగా సూరి ద్రుతమునకు లోపము గలుగదని సూత్రిం

వోసె నవలా... (మనుచ. ౫ ఆ. ౧౪). (సూ. రా. ని.). ద్వి...। ఒడిబియ్యము (పరమ. ౫ ఆ. ౪౩౭ సూ. రా. ని.). మ. లీలం బార్వతి నేసఁబ్రాలు శివమౌళిం బోసె (వీరభ. ౩ ఆ. ౪. ౪.) సీ. వైనతేయఖగంబుతో నూఁచిచ్చుక।...(చెన్నబ. ౫ ఆ ౭౧ సూ. రా. ని.) శా. తోడంబుట్టువుపాటు సూచి యలుకన్. (భీష్మ. 3 ఆ. ౧౦౭). శా. తోడంబుట్టువు లందఱుంబడిన (మహాప్రస్థా. ౧ ఆ. ౫౦). ఆ. వె. దాని తోఁబుట్టు గురుతర। సంగరసముదీర్ణసరణిఁ బరఁగ (రాఘ. ౨ ఆ. ౪౨). క. అనుచు నోడఁబాటులేకున్న...(విరా. ౬ ఆ. ౧౬). చ...ఇందోడం। బడమని దుర్జనత్వమున...(సభా. ౨ ఆ. 3౦ ప.) ఆ. వె...ఏవి నీప్రాణములయందు. నోల్లఁ బాటు నీకు నొలయఁజేసె (కూర్మ. ౧ ఆ ౬౦. సూ. రా. ని.)

---

చుట యసంగతముగా నున్నది." "మఱియు వీనిని సమాసములుగా నేల యంగీకరింపవలెనో తెలియకున్నది. వీనిని సమాసములనుటకు నుగాగమము గల్గుటయె ప్రయోజనముగదా. అట్టి ప్రయోజన మీవ్యాకృతిలో నుదంతేతరాచ్ఛికపదములపై సిద్ధింపమి నీసూత్రమున కర్థము కన్పట్టకున్నది....వీనిపై నుగాగమము సాంధింపకున్నను సమాసతను సాధింపకున్నను నిపుణముగా ద్రుతమునకు లోపము రావని సూరి తెల్పుట యసంగతముగా నున్నదనకతీరదు" (బా. సా. పే. ౮౭ పుట). ఈపేటిక కేవలము సాహిసైకమూలమై యున్నది. బా - సమా - 3 సూత్రము దాని వివరణము మున్నగునవి పైయుదాహృతుల సమాసవిషయమును విశదీకరింపఁజాలి యున్నవి. తలఁబ్రాల్వాదులు సమాసములని యంగీకరింపనిచో "తలయందుఁబోసిన ప్రాలు" మున్నగురీతి నర్థవిశేషము లెట్లు లభించును? సమాసములుగ వాని నంగీకరింపనపుడు 'తలన్' మున్నగునవి "ప్రాలు" మున్నగువానితో నన్వయింపక వేఱొక క్రియతో నన్వయింపవలసియుండుటచేత వివిక్షితార్థసిద్ధి కల్గనేరదు. సమాసాంగీకారమున నిట్టి ఫలవిశేషములు వెలయుచుండఁగా నుగాగమప్రాప్తియే ప్రయోజనమనుట యెంతమాత్రము సరికాదు. మఱియు వానిలోని ద్రుతము సామాసిక నుగాగమరూపము కాదు. 'తలన్-ఒడిన్ - నేసన్-ఊరన్' అనుచోటులందలి ద్రుతము ద్వితీయావిభక్తిసంబంధమైనది. 'తోడన్ - తోన్' అనునవి ద్రుతప్రకృతికము లగునవ్యయములు. 'ఒల్లన్ - ఒడన్' అనునవి భావార్థకద్రుతప్రకృతికనిపాతములు. ఇట్టివానికి వ్యస్తప్రయోగమెలేమింజేసి వీనికి నిత్యసమాసము నంగీకరింపవలసిదే. ఒడిన్ + కట్టు + ప్రాలు = ఒడిలోఁగట్టెడిబియ్యము. "ఒడిఁబ్రాలు - వి-బ ('√ఒడి') మంగళార్థము నూతనవధువునకు నొడిలోఁగట్టుబియ్యము" (సూ. రా. ని). నేసఁబ్రాలు = నేసన్ + కొనివచ్చిన + ప్రాలు = దేవతానిర్మాల్యములోనుండి కొనివచ్చిన

సమస్త పూ షత్వణీయము. ౯౧ విషయము.

సామానాధికరణ్యే, షూదన్తానాం టుగాగమోఽచి
స్యాత్ (ఆం. చిం. ౧౦ కా. సంధి. అహో. ౨౨౨ పు.)
తత్రాచ్యతోఽభవేన్నిత్య । మత్రతత్ క్వచిదిష్యతే
(వికృ. సంధి. ౧౧ కా. అహో. ౨౦౨ పు.)

కల్పతరు. ౯౧ విష:—సామానాధికరణ్యేషు = సమానాధికరణసమాసస్థలములందు, ఉదన్తానామ్ = హ్రస్వోకారాంతములకు, అచి=అచ్చు పరమగుచుండఁగా, టుగాగమః=టుగాగమము, స్యాత్ =అగును. సామానాధికరణ్య మనఁగాఁ దదధికరణవృత్తిత్వము. శ్వేతవస్త్రమనుచో వస్త్రత్వాధికరణమగు వస్త్రమందు శ్వేత

---

యక్షతలు. “శేషా · స్త్రీ - (శిష - ఘఞ్) నిర్మాల్యాదౌ” (శబ్దస్తో). “నిర్మాల్య.న. విసర్జితేతు దేవే శే । నిర్మాల్యం భవతి క్షణాదిత్యుక్తే...” (శబ్దస్తో). “వికృ - సేస - ప్రకృ - శేషా” (వైకృతదీపిక). “సేస - వై - వి - అక్షత.” (శ - ర). ఊరఁబంది= ఊరన్ + తిరిగెడి + పంది. “ఊరఁబంది దే - వి - (ఊరన్ + పంది) ఊరియందుఁ దిరుగుపంది.” (శ - ర). ఊరఁబిచ్చుక = ఊరన్ + తిరిగెడు + పిచ్చుక. “ఊరఁబిచ్చుక దే. వి. (ఊరన్ + పిచ్చుక) ఇండ్లపట్టునఁ దిరిగెడు ఒకదినుసుపిట్ట=చటకము” (శ - ర). “పిచ్చుక దే. వి. పిచ్చుకయొక్క రూపాంతరము.” (శ - ర). ఊరఁబంది - ఊరఁబిచ్చుక అను రెండుచోటులందలి ‘ఊరన్’ అనునది యాపవిభక్తికసప్తమ్యంతరూపము. తోడఁబుట్టువు = తోడన్ + గల్గిన + పుట్టువు. తోఁబుట్టువు = తోన్ + గల్గిన + పుట్టువు. “తోడ - దే - ద్ర -౧ కూడ...౨ వెంబడి” “తో - దే...ద్ర. ౧ కూడ... ౨ వెంబడి” (శ - ర). ఒల్లఁబాటు = ఒల్లమియొక్క + పాటు = ఒల్లన్+పాటు = అపేక్షయొక్క లేమి. ఒల్లమి రూపాంతరము ‘ఒల్లన్’ అనునది కానోపును. (బా. క్రియా. ౧౦౭ సూ.) “ఒల్లఁబాటు - ద్వ - వి - (ఒల్లమి + పాటు) అపేక్షలేమి । - ఒల్లమి” (శ - ర.). ఒడఁబాటు = ఒడ్డుటయొక్క + పాటు. ఒడన్ అనునది యొడ్డుధాతుభావార్థక నుజ్యంతరూపాంతరము. “ఒడఁబాటు - వి - (√ఒడఁబడు) ౧ సమ్మతి...” (సూ. రా. ని.). “ఒడ్డు - స - క్రి....౬ (దానాదికముపుచ్చుకొనుటకై హస్తాదికము) చాచు-పట్టు. గీ....ఒరుల యీగికినకటచే యొడ్డకుండు నాకు...(శాంతి.౨ఆ.౧౫౮)” (సూ. రా. ని.) చింతామణియందువలె బాలవ్యాకరణమున మధ్యమపదలోపాది సమాసము లుపదేశింపఁబడలేదుగాన సూరిపక్షమునఁ దలఁబ్రాల్యాదులను నిక్కలాదులలోఁ జేర్చిసాధించికొననగును. (బా. సమా. ౨౦ సూ.). ఇవియును సమాసము లే కాన వీనిలోని ద్రుతము లోపింపకుండుటచేఁ బ్రకృతసూత్రమున కివి లక్ష్యము లగుచున్నవి.

త్వము నైతము వర్తిల్లును గాన శ్వేతత్వవస్త్రత్వములు సమానాధికరణము లగుచున్నవి. ఇట్లగుటచేత సమానాధికరణసమాస మనఁగా విశేషణవిశేష్యముల సమాసమని తేలుచున్నది. అట్టిది సాధారణముగాఁ గర్మధారయసమాసమనఁ దగును. టుగాగమము కిత్తుగాన నుదంతముల కంత్యావయవముగా నిల్చును. (మా. ౮౮ II విష. విస్తృ. IV) 'కఱకున్+ఎలుక = (మోటగు నెలుకవాఁడు) అనుచో సామాసిక ద్రుతలోపము రాఁగా "సన్ధిర్నా చోఽచ్యుతః" అనుచోట్నఁ బరరూపసంధి రావలసియుండఁగాఁ బ్రకృతసూత్రముచొప్పున "టుక్కు" వచ్చుటచే 'కఱకు+టు+ఎలుక=కఱకు టెలుక' (ఆరణ్య. ౨ ఆ. ౯౧ ప.) అనురూపము సిద్ధించుచున్నది. సమానాధికరణసమాసములందెల్ల నిట్లు టుగాగమము రావలసియుండఁగా 'పేరురము - కప్రపనఁటి - పెక్కేండ్లు - పేడక్షౌహిణులు - తక్కన్నిటిన్' మున్నగుచోటులం దీ టుగాగమమురాక పరరూపసంధి యగుట క్వాచిత్కముగఁ గలదని యథర్వణుఁడు నవరించుచున్నాఁడు. తత్రేత్యాదిః—తత్ర=సమానాధికరణసమాసేతరములగు నాయాస్థలములందు, ఉతః=ఉకారమునకు, అచి=అచ్చుపరమగుచుండఁగా, నిత్యమ్=నిత్యముగాఁ బరరూపసంధి, భవేత్=అగును. అత్ర=ఈసమానాధికరణసమాసస్థలములందు, తత్=ఆపరరూపసంధికార్యము - క్వచిత్ = కొన్నియెడల మాత్రము, ఇష్యతే=సమ్మతమగుచున్నది.

అహోబలపండితుఁ డీయథర్వణకారికకు వేఱువిధముగ నర్థముచేసికొని దీనిని "అహమాదీనాం ద్విత్వ"మ్మను చింతామణిసూత్రమును సంబంధించినదానినిగా సమన్వయించి యుండుటచే (౧౧౫ విష.) నీటుగాగమాభావస్థలముల నీక్రిందిరీతిని వేఱువిధముగా సమర్థించికొనెను. "టుగాగమ ఇతివదన్ అనిత్యమాగమశాసనమితి పరిభాషాం జ్ఞాపయత్యాచార్యః, తేన చిగురాకు ఇత్యాది సిధ్యతి" (అహో. ౨౨౨-౨౨౩ పు.)

కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు. ౨౭.

కఱకు+అమ్ము=కఱకుటమ్ము. నిగ్గు+అద్దము=నిగ్గుటద్దము.
బాలవ్యాకరణ సరసపు+అలుక=సరసపుటలుక.

వివరణము.

౯౧ I విషయము.

కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. ౨౮.

పేరు+ఉరము=పేరుటురము-పేరురము. చిగురు+ఆకు=

చిగురుటాకు - చిగురాకు. పొదరు+ఇల్లు=పొదరుటిల్లు-పొదరిల్లు.

సంజీవని. ౯౧ I విష:—కఱకు=కఠినము=మోటు (ప్రథమద్వితీయముద్రణములు రెంటను 'కఱుకు' అనియె ముద్రణస్ఖాలిత్యము పడియున్నది.) నిగ్గు=ఉత్కృష్ట కాంతిగలది. సరసపుటలుక=ప్రణయకలహము. పేరు=పెద్ద. టుగాగమము కిత్తుగాన నుదంతముల కంత్యావయవ మగుచున్నది. "ఉత్తు" నకను తపరకరణముచే నూదంతముల కీయాగమము రానేరదని సూరి యాశయము. ఊదంతముల కీయాగమము వచ్చుననుట కాధార మేమియుఁ గానరాదు. కావున "పూ. వై - వి. పువ్వు. ఎ. గీ. కాలకంఠునిశిరసు పూగగనగంగ. (కాశీ. ౧ ఆ.) (దీనికి వృత్తియందు ఉకారమునకు వలె 'ను' మాగమాదికార్యము నెఱుంగవలెను. ఉ - పూఁగొమ్మ - పూటడిదము.)" అనుశబ్దరత్నాకరపువ్రాఁత నిరాధార మనకతీరదు. 'పూఁగొమ్మ' అనునది 'పూవు+కొమ్మ' అనుచ్ఛేదముగల ప్రాంతాదిసంధిచొప్పున (సంధి. బాల. ౩౬ సూ.) సాధించికొనవలెనని 'పూవు+తోఁట=పూఁదోఁట' అనుసూరియుదాహృతి విశదీకరించుచున్నది. స్వరపరకపూశబ్దమునకుఁ బ్రయోగము శ్రీనాథాద్యర్వాచీనులకావ్యములందును గన్పట్టలేదు. భారతాదిప్రాచీనకావ్యములలో 'పూ' అనుదీర్ఘాంతశబ్దమే కానరాదు.

'సామానాధికరణ్యేషు' అను చింతామణివాక్యమునకు సరిగ సూరియు "కర్మధారయంబులందు" అని బహువచనమును నిల్పెను. ఇట్టిబహువచనముచే రూపకాదిసమాసములందును వచ్చునని యహోబలపతి యీక్రిందిరీతిని వ్రాసెను "సామానాధికరణ్యేష్వితి బహువచనజ్ఞాపకాదసామానాధికరణ్యేష్వపిక్వచిత్ - తేన చెక్కుటద్దములు ఇత్యాది రూపం సిధ్యతి. జ్ఞాపకసిద్ధం న సర్వత్ర. చిగురమ్ము." (అహో. ౨౨౨ పు.) భట్టారకుఁడును "ద్విగుకర్మధారయౌ తత్పురుషద్వన్ద్వౌ తథా బహువ్రీహిః। అన్యేచ కేచిదుపమా, నోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః" అని యిట్లుపమితాదులను గర్మధారయేతరములనుగానే వచించెను. నన్నయ రూపకాదులందు "టుక్కు" నెచ్చటను బ్రయోగింపను లేదు. అట్లయినను 'పూవుటమ్ము' మున్నగు తిక్కయజ్వప్రయోగములచొప్పున నుపమితరూపకాదులందును "టుక్కు" నంగీకరింపకతీరదు. పరిశీలింపఁగా రూపకాదులందును విగ్రహమున సామానాధికరణ్యము గన్పట్టుచునె యున్నది. ఉ. చెక్కులు=చెక్కులనెడు+అద్దములు=చెక్కుటద్దములు. శాక=శాకప్రియ+పార్థివుఁడు=శాకపార్థివుఁడు. ఘన=ఘనసదృశ+శ్యామ=ఘనశ్యాముఁడు. మొ. "ఘనశ్యామః—ఘనశబ్దో లక్షణయా ఘనసదృశే రామేవర్తతే. శ్యామ

శబ్దోపి శ్యామే వర్తతే ఇతి సామానాధికరణ్యమ్" (బాలమ. సి. కౌ. ౭౩౪ సూ. ఉపమానానీతి సూత్రవ్యాఖ్య.) ఇట్టి యభిప్రాయముతోడనే కావలయును సాధు నికుండగు సమాసకుసుమావళికర్త యీయుపమితరూపకాదిసమాసములను కర్మ ధారయభేదములనుగా పఠించెను. "కవిభిస్సప్తవిధః స్యాదిత్యేవం కర్మధారయః కథితః ।......విశేషణ పూర్వపదకర్మధారయః నీలోత్పలాని ।...విశేష్యపూర్వ పద కర్మధారయః...మయూరవ్యంసకాః...విశేషణోభయపద కర్మధారయః... స్నాతానులిప్తాః...ఉపమానోత్తరపదకర్మధారయః...పురుషవ్యాఘ్రః...ఉపమాన పూర్వపదకర్మధారయః...ఘనశ్యామః...సంభావనాపూర్వపదకర్మధారయః - తమా లవృక్షాః...అవధారణాపూర్వపదకర్మధారయః...వినయధనమ్..." (సమాస కుసు మావళి) ఈపద్ధతినే-పూవులనెడు+అమ్ములు=పూవుటమ్ములు మున్నగుస్థలములందు సామానాధికరణ్యమును సంపాదింపనగును. క...పువ్వుటమ్ములపోదులున్ (విరా. ౨ ఆ. ౭౮). ఆ. వె. అలరువిలుతు పూవుటమ్మువోలె (విరా. ౧ ఆ. ౨౪౫). ఏడ్పుటె లుంగు(ఉద్యో.౧ ఆ. ౩౪౭). నెత్తురుటేఱులు (ద్రోణ.౫ ఆ. ౧౮౨). ఈతుది రెం టిని షష్ఠీసమాసమందలి 'టుక్కు' తో సమర్థించినను సమర్థింపవచ్చును. 'ఏడ్పురూప మగు నెలుఁగు-నెత్తురురూపమగు నేఱు' అన్నను ననవచ్చును. (౯౨ II వి.) 'ఏడ్పు నెలుంగు-నెత్తురు నేఱు' అని నుగాగమమును నిల్పినను నిలుపవచ్చును. భట్టారకుని భారతభాగమునఁ బయిరీతి టుగాగమములు కానరావు. నిర్వివాదస్థలములందే 'టుక్కు' కనఁబడుచున్నది. ఆ. వె. ఎఱుకలేని కఱకుటెలుఁగు కవేక్షించెఁ... (ఆరణ్య. ౨ ఆ. ౯౧). సీ. అరులునేసిన మహాపరిభవక్లేశంబు । వాపంగనోపక యేపుటడవి ।...(ఆర. ౧ ఆ.౭౯౪). సోమయాజియు నిట్టిటుక్కులను బెక్కిటఁ బ్రయోగించెను. క....తీపుటెలుఁ గుంజూపెన్ (అను. ౧ ఆ. ౩౫౭)చ....ఈయదితి ప్రసూతవం । శమ్మఖిలంబు దాల్చు నొకసన్నపుటీకన...(ఉద్యో. ౩ ఆ. ౭౯౮). ఎ. గీ...నరునుజ్జ్వలంపు । టేపుగని సూతపుత్త్రుతో నిట్టులనియె. (కర్ణ. ౩ ఆ. ౧౭౩) ఆ. వె. దుష్కరంపుటేఁడు తుదినేరఁ బాటె. (విరా. ౩ ఆ. ౧౩౧). ఉత్సాహ... దు । స్తరపుటుక్కి కొల్లఁబాటు దక్కఁడించుకేనియున్ (స్త్రీ. ౧ ఆ. ౪౮). గీ. గాండీ వధరుచేతి మెఱుఁగుటమ్ము (స్త్రీ. ౨ ఆ. ౯౦). క. శోకార్తపుటోడళులతో (స్త్రీ. ౨ ఆ. ౧౨౪). క...మణిమయంపుటెల్లులు(శాంతి.౪ ఆ. ౩౮౯).క...అనుగుణంపుటర్చన (అను. ౨ ఆ. ౭౯౨). కం. రుచిరపు । టరదంబున (అశ్వ. ౩ ఆ. ౨౬). క. అర దముసనుఁ గవిసె వాలుటమ్ములు నిగుడన్ (శల్య. ౧ ఆ. ౧౬౭). నాయొద్దనున్న తాళపత్త్రమాతృకలో నిట్లు టుగాగమమె కనఁబడుచున్నది. కాని నేఁటిముద్రణము

లందు "వాలురమ్ములు" అను నిడ్డాల మగు రేఫఘటితపాఠము వెలసియున్నది. శబ్ద రత్నాకరమునసయితము 'వాలు' శబ్దము నొద్ద—"సూతు నొక్కవాలమ్మున స్రుక్కనేసి। (భీష్మ. ౨ ఆ.) (రూ. వాలురమ్ము. హరి. పూ. ౯ ఆ.)" అని వ్రాయఁబడి యున్నది. ఇట్టి రుగాగమమును నిర్వహించు ప్రమాణ మేమియు చూపట్టలేదు. (౯౨ II విష. చూ.)

సంజీవని. ౯౨ I విష:—"తత్రాచ్యుతో భవేన్నిత్య" మ్మను నధర్వణకారికను సూరిగారి సంధి. ౨౯ సూత్రము చాలవఱకు సంగ్రహించుచున్నది. కాని పేర్వాది శబ్దములకు 'టు' గాగమము వైభాషికమని యీసూత్రమున సూరి వచించెను. పేరుశబ్దమునకు భారతమున 'టు' గాగమమువచ్చిన ప్రయోగ మొక్కటేని లభింప లేదు. చ...అష్మహీశుపే। రురమున నాటె (శల్య. ౧ ఆ. ౧౪౬). (పేరు=పెద్ద.) గీ. చెలులు చుట్టలు గలిసి పేరెమిఁబొంది. (ఉద్యో. ౩ ఆ. ౩౫౩). క. ఏనుఁగులు సుట్టిరాఁ జే। రేనుఁగుపై...(శాంతి. ౪ ఆ. ౩౪౯). గీ. అతఁడు పేరోలగంబున్న యవసరమున। (ఉద్యో. ౧ ఆ. ౨౭౦). కేతనయుఁ బేరుశబ్దమునకు 'టుగాగమము చేయలేదు. క. పేరనియెడుశబ్దంబే। పారం బెనుఁగులకు మొదల నధికతఁ బెలుపున్। బేరాఁకలి పేరామని। పేరాముదపాకు లనఁగఁ బేరింపనఁగన్ (ఆం. భా. ౧౨౬ ప.) సీ. చిగురుటాకులఁ గాసినేయు నీయడుగుల...(అను. ౧ ఆ. ౫౦). 'చిగురాకు' అను టుగాగమరహితరూపము భారతమునఁ గన్పట్టలేదు. క. ఈనెలఁ తుకఁ గని మన్మథుఁ। డై నను జిగురాకుఁ బువ్వుటమ్ములపాదులున్...(విరా. ౨ఆ.౨౪ సర్వల. ౧ ఆ. ౬౨ ప.) అని తిమ్మకవి 'చిగురాకు' అనురూపమునకు భారతప్రయోగమును జూపెనుగాని ప్రాఁతముద్రణములందు సయితము "మన్మథుఁ। డై నఁజిగురుగొడుగుఁ బువ్వుటమ్ములపాదులున్" అనుపాఠము గన్పట్టుచున్నది. అట్లని 'చిగురాకు' అనురూపము సాధువు కాదనరాదు. సీ. సుడిఁగొన్న చిగురాకు జొంపంబు గెంపారు తలమీఁద మల్లికాదామ మడఁచి (ఉ. హరి. ౫ ఆ. ౫౬). వాలుశబ్దమునకు 'టుక్కు' వికల్పముగ భారతమందె కన్పట్టుచున్నది. క. వాలుటమ్ములు నిగుడన్ (శల్య. ౧ ఆ. ౧౬౭). (నవీనముద్రణములలో "వాలురమ్ములు" అనియె యున్నది.) గీ. సూతు నొక్కవాలమ్మున స్రుక్కనేసి (భీష్మ. ౨ ఆ.) క. వాలంప తాఁకునకు ధృతి। ప్రీలఁగ (రాఘు. ౧ ఆ. ౨౨).

సంజీవని. ౯౨ II విష:—అర్వాచీనకవులు విశేషణముల 'పు-ంపు' లమీఁద సైతము 'టుక్కు' నుపేక్షించుట కలదు. క. అప్పడఁతుక లరిగి కప్ర పనఁటులచెంతన్ (యయా. ౪ ఆ. ౨౪ సూ. రా. ని.) (కప్రపనఁటులు=కప్రపు లోదవు ననఁటులు)

ఆనుదపాకు (ఆం. భూ. ౧౨౬ పద్య.) గీ. పట్టువేనుంగు శ్రీరంగపతికి (పాండు. ౧ ఆ. ౩౭). ఉ. సిబ్బెపు స్నైతెలియబ్బురంపు జిగినిబ్బరపుబ్బుగు (పెద్దనార్యుని యుత్పలమాలిక.)

కొన్ని తిక్కయజ్వప్రయోగములు షష్ఠీసమాసములందును గొన్నియెడల టుగాగమమువచ్చుననుట కనుపుగాసున్నవి. ఈ క్రింది కేతనవచనము లందులకు హస్తావలంబ మొసంగుచున్నవి. క. ధీనిధి గుణపదములపై మాసుగ హల్లున్న సంతిమములగు ములకున్ । పూని పునాదేశంబగు । భూనుతపై నచ్చు లున్నఁ బుటు లగు ములకున్॥ ౧౧౮. కం. వాదపుఁబంతంబులును బ్రమోదపుశృంగారములును ముత్యపుసరులున్ । జూదపుటాటలు నెయ్యపు । టాదరములు ననఁగ నివి యుదాహరణంబుల్. ౧౧౯. (ఆం. భూ.) ఈ కేతన లక్ష్యలక్షణములవలన మువర్ణకమునకు షష్ఠీసమాసములోఁ బుంపులు రావచ్చుననియు నట్టి 'పు-౦పు'లకు హల్లు పరమైనచో 'నుక్కును' నచ్చుపరమైనచో "టుక్కును" నిత్యముగా వచ్చుననియు విశదమగుచున్నది. 'జూదపుటాటలు - నెయ్యపుటాదరములు' అనియె యుండవలయునుగాని 'జూదపునాటలు - నెయ్యపునాదరములు' అని యుండరాదని కేతనవచనములు నిర్ణయించుచున్నవి. కొన్ని తిక్కనప్రయోగములందును నీషష్ఠీసమాసమందలి 'టుక్కు' ప్రయుక్తమయిన దనుట కనుపుగనున్నది. చ. పసరపుటెంపప్రోవులును...(శాంతి. ౩ ఆ ౨౮౮). ఎ. గీ. ఏన నీవను నైక్యంపు టెఱుకవాడము. (శాంతి. ౪ ఆ. ౨౪౩) ఇచట "పసరము నెంపప్రోవులును లేదా పసరము లెం పప్రోవులు. ఐక్యంబు నెఱుక" అనియు నుండిన నుండవచ్చునుగాని మాతృకలలోని టుగాగమస్థితియు నిర్బాధమె యనకతీరదు. మఱియుఁ దిక్కయజ్వప్రయోగములందలి షష్ఠీసమాసములలోని పుంపుప్రయోగబాహుళ్యమునుబట్టియు (౯౪ విష.) "పు-౦పు" ల మీఁద స్వరపరకత్వమున "టుక్కే" వచ్చుననెడి కేతనవచనమునుబట్టియుఁ దాదృశ సోమయాజిప్రయోగబాహుళ్యమునుబట్టియు (౯౧ I విష.) "పసరపుటెంపప్రోవులు-ఐక్యంపు టెఱుక" అనునవి వెనుక నుదాహరించిన కర్మధారయభేదములలో నెందును జేర్పరామిచే నవిశేషషష్ఠీసమాసములె యనక తీరమింజేసియుఁ దిక్కన షష్ఠీసమాసములందును 'టుక్కు' ను బ్రయోగించెననియె విశ్వసింపఁదగియున్నది.

సంజీవని. ౯౨ III విష:—ధాతుజవిశేషణముల "ఉకార" మునకు సామానాధికరణ్యమందును బా. సంధి. ౩౩ సూత్రముచొప్పున నుగాగమమె యగునుగాని టుక్కు రానేరదు. చ. "మాకుఁజే। యు నతిథిపూజలు" (ఆర. ౬ ఆ. ౧౬౮). అని ప్రాస్థలమున నకారమె శంభుదాసునిచేఁ బ్రయోగింపఁబడినది. చ....ఇది వచ్చును

ద్రాపదము (ఆది. ౧ ఆ. ౧౬౯). క. వివేకశూన్యుల ! కడనుండెడు నంతకంటెం గష్టము గలదే (ఆది. ౩ ఆ. ౧౬౯). అని భట్టారకుఁడును బ్రయోగించెను. ఇట్లె సామానాధికరణ్యమున్నను సంఖ్యావాచకముల "ఉకారము" నకు "టుక్కు" రానే రదు. "తత్రాప్యుత" ఇత్యాద్యథర్వణకారికచొప్పునఁ బరరూపసంధియె యగును. క. తక్కినమూఁడాశ్రమములు...(శాంతి. ౧ ఆ. ౭౬). మ...పదుమూఁడేండులు...(ఉద్యో. ౩ ఆ. ౯౭). శా. ఏడక్షౌహిణు లెన్నఁ బాండవ...(ఆది. ౧ ఆ. ౬౯). మత్స్యాకారము-వనమునఁ బనియు రెండేఁడులు...(ఆది. 3 ఆ. ౧౯). క. అయిదూళ్ళును మాకిచ్చిన (ఉద్యో. 3 ఆ. ౧౧).

పెక్కు - తక్కు మున్నగు కొన్నిశబ్దములకును 'టుగాగమము' రాదు. చ....నా ! కెవరినవారు పెక్కెడల...(ఉద్యో. ౪ ఆ. ౨౪౬). గీ. అట్టిగర్భంబు నిలుపు తక్కన్నిగర్భ ! ములును (సౌప్తి. ౨ ఆ. ౨౦. ఇట 'తక్కు' అనునది ధాతుజ విశేషణ మనరాదు. అట్లె యైనచో "తక్కు నన్ని గర్భములు" అని యుండవల యునుగదా. మఱియు ఉ. తక్కటివారలున్...(విరా. ౫ ఆ. ౨౬౫) మున్నగు నొపవిభక్తికాంతరూపములనుబట్టి 'తక్కు' అనునది ధాతుజవిశేషణమె కాక గుణ విశేషణమును గలదని యంగీకరింపకతీరదు.

పెను-పలు మున్నగుశబ్దములమీఁదను "టుగాగమము" రాదు. పెన్నూఁత-పెన్నుద్ది - పల్లఱపు - (అతిప్రసంగము.) ఇట్టివానిని, నిక్కలాదులలోఁ జేర్చి సాధించికొనవలయును (బా. సమా. ౨౦ సూ.) "తఱచుగఁ గర్మధారయసమాసమునం బెన్వాదుల కడ వాల్లున కచ్చుపరంబగునపుడు ద్విత్వంబు గానంబడియెడి" (ప్రౌఢ. సంధి. ౯ సూ.). తెనెటీఁగ - దుక్కిటెద్దు - పల్లెటూరు - పడుకటిల్లు - మిద్దెటిల్లు మున్నగు వ్యావహారికశబ్దములందీ టుగాగమము కన్పట్టుచున్నది. ఇట్టివానికి నిరాధారముగాఁ గోశకర్తలు గ్రాంథికత నంగీకరించుట యుక్తమని తోఁపదు. "దుక్కిటెద్దు. దే. వి. (దుక్కి+ఎద్దు)...(టుగాగమము సాధారణముగా ఉకారాంతపదములకు విధింపఁబడినదైనను దుక్కిటెద్దు-మిద్దెటిల్లు ఇత్యాదులయందును ప్రవర్తిల్లుచున్నది)" (శ. ర.). "తేనెటీఁగ - తేనెయీఁగ - తేనీఁగ. ఇది ఎదంత శబ్దమైనను ఉదంతములకువలె దీనికి "టు" గాగమమువచ్చినది...సీ. మధుమతీక తేనీఁగ జంటీఁగ నా నెసంగు. (ఆం. భా. ౨-౯౫)." (సూ. రా. ని.) "దుక్కిటెద్దు-దుక్కెద్దు-వి (దుక్కి+ఎద్దు)...సీ. కోరినయన్ని దుక్కిటెద్దుల బల్మితోడ నిచ్చు (నీలా. ౧-౪౯) చ. గొఱెయలమంద యాఁబసులగుంపు కృషిక్రియ దుక్కిటెద్ల దొడ్డి......(వేం. పంచ. ౧-౫౭3)" (సూ. రా. ని.) కోశకారు లిచ్చినప్రయోగ

ములలోని టుగాగమము యతిప్రాసాదిస్థలఖచితముకామింజేసి యట్టియెడల "తేనె యీఁగ-దుక్కిటెద్దు" మున్నగురీతిని నిల్పినను క్షతి యేమియు లేదు. తుదికాంధ్ర భాషాగ్రంథమందు సైతము 'తేనటీఁగ' అనునది వేర్కొనఁబడలేదు. ప్రామాణికప్రయోగముగాని ప్రామాణికమైన వ్యాకరణవచన ప్రామాణ్యముగాని లేనపుడు వ్యావహారికశబ్దములకు గ్రాంథికత నంగీకరించుట సంప్రదాయవిరుద్ధము.

దారార్థేఽత ఉదపి రః (ఆం. చిం. సంధి. ౧౧ కా. అహో. ౨౨౩ పు.)

[illegible] అజ్ఝలోరాలు శబ్దేన । సమానార్థకతాయది । సమా
ధర్వణీయము సస్తత్ర చోద్రః స్యా । ద్రేఫ ఏవ క్వచిద్భవేత్ (వికృ.
౯౩ విషయము సంధి. ౨౬ కా. అహో. ౩౮౬ పు.)

సంబన్ధే క్వచిదర్థస్స్యాదసంబన్ధే విలక్షణః (వికృ. సంధి. ౨౭ కా. అహో. ౨౨౮ పు.)

కల్పతరువు. ౯౩ విష:—సామానాధికరణ్యమందని పూర్వసూత్రమునుండి యనువృత్తి. దారార్థే = దారశబ్దార్థకమగు 'ఆలు' శబ్దము పరమగునపుడు, అతః = అకారమునకు, ఉదపి=ఉత్త్వమును, రః=రేఫాగమమును నగును. ఉదా:—ధీర+ఆలు=ధీరు+ర్+ఆలు=ధీరురాలు. ఆలుశబ్దమునకు విశేషణము లగుటంజేసి ధీరాదిశబ్దములు టాబంతములని భ్రమింపరాదనుటకు "గుణవతి" అని నిలువక 'గుణవంతే' అను ప్రాతిపదికము నిల్చుటయె నిదర్శనము. గుణవచ్ఛబ్దమునకు బా. తత్స. ౭౦-౭౧ సూత్రములచొప్పున 'గుణవంతే' అను ప్రాతిపదిక మేర్పడును. పిదప నుత్త్వ రత్వములు రాఁగా "గుణవంతురాలు" అనురూపము సిద్ధించును. ఇట్లె యంతటను సాధించునది. సూత్రారంభసామర్థ్యముననె యిట్టి యసాధారణమగు మిశ్రసమాసము సాధువగుచున్నది. ఈవిషయమునె యథర్వణుఁడు వివరించుచున్నాఁడు. అజ్ఝలోః=అజంతములకును హలంతములకును, (౧౭౧ విష.) ఆలుశబ్దేన సమానార్థకతాయది=ఆలుశబ్దముతో సామానాధికరణ్యము కల్గునపుడు, తత్ర=అచట, సమాసశ్చ=నిత్యముగా సమాసమును, ఉత్-రః-స్యాత్=భట్టారకుఁడు చెప్పిన యుత్త్వ రత్వములును నగును. ఇట్లనుటచేత 'ధీర యగు నాలు' అనువ్యస్తప్రయోగ మీయర్థమున నుండనేరదని యెఱుంగునది. వ్యస్తతలో నాలుశబ్దమునకు స్త్రీపరార్థము లేకుండుటంజేసి యట్టివాక్యము వివక్షితార్థదాయకము కానేరదు. క్వచిత్=ఒకానొకప్పుడు, రేఫఏవ=రేఫముమాత్రమె, భవేత్=అగును, ఉత్వము రాకుండుటయుఁ

ముద్దరాలు, గొడ్డు మున్నగుశబ్దములలోని 'ఉత్త్వము' శబ్దసిద్ధము. గొడ్డు+ఆలు= గొడ్డురాలు మొ. మఱియు నుత్త్వము తత్సమములకు మాత్రమె యని యథర్వణుఁడు వచింపమిం జేసి 'బల్లిద+ఆలు = బల్లిదురాలు' మున్నగు కొన్ని యాచ్ఛికశబ్దములం దుత్వమును గల్గునని యథర్వణాశయమును వర్ణింపనగును. (చూ. ౧౯౦ విష.)

వ్యస్తతలో నాలుశబ్దమునకు భార్య యనిమాత్రమె యర్థమైనను నీసందర్భములోని సమాసమున నది స్త్రీమాత్రపరమని యథర్వణుఁడు వివరించుచున్నాఁడు. అసంబన్ధే=సమాసము లేనపుడు, ప్రసిద్ధమగు దారార్థకమైన యాలుశబ్దమునకు, సంబన్ధే=సమాసమందు, విలక్షణః=విలక్షణమగు ననఁగా స్త్రీమాత్రపరమైన, అర్థః = అర్థము, క్వచిత్=ఒకానొకప్పుడు, స్యాత్=అగును. ధీరురాలు మున్నగు సమాసములందుమాత్రమె యిట్టి యర్థవైలక్షణ్యము కల్గుననియు, మగనాలు మున్నగుసమాసములలోనట్లు కల్గదనియు విశదపఱుచుటకయి 'క్వచిత్' అని చెప్పఁబడెను. ఉదా: ఆలు=భార్య. ధీరురాలు=ధీరయగుస్త్రీ. పై నన్నయాథర్వణవచనములనుబట్టి వ్యస్తతలో స్త్రీపరముగా నాలుశబ్దమును నన్నెచోడకవి ప్రయోగించుట కవులనిరంకుశత్వము విశదమగుచున్నది. చ. కలుచుటదోసమే మగలఁ గల్వక యాండురు దొల్లియాండురన్ । గలుతురె......(నన్నె. కు. ౮ ఆ. ౧౫౧) సంబన్ధేక్వచిదిత్యాదికారికకుఁ బ్రకృతస్థలమెకాక రామునిది-పెద్దది-చేసినది-మున్నగునవియు లక్ష్యములై యున్నవి. (౧౦౭ విష. చూ.)

పేదాదిశబ్దంబుల కాలుశబ్దంబు పరంబగునప్డు కర్మధారయంబునందు రుగాగమంబగు. ౩౦.

పేద+ఆలు=పేదరాలు - బీద+ఆలు=బీదరాలు. పేద - బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ - మనుమ - గొడ్డు - ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది. ఏకాంతమునందు నున్న జవరాండ్ర నని ప్రయోగము.

బాలవ్యాకరణవివరణము.

౯౩ I విషయము. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్త్వంబున కుత్త్వంబును రుగాగమంబు నగు. ౩౧.

ధీర+ఆలు = ధీరురాలు - గుణవంత+ఆలు = గుణవంతురాలు - ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.

సంజీవని. ౯౩ I విష:—పేదరాలు=బీదరాలు=దరిద్రస్త్రీ. ముద్దరాలు=ముగ్ధయగుస్త్రీ. బాలెంతరాలు=నవప్రసూత - కొమరాలు=సౌందర్యవతి- (వృత్తియందు కొమరుశబ్దముచోట 'కొమ' నిల్చెను.) జవరాలు=యౌవనముగలస్త్రీ. (విస్తర I) అయిదువరాలు = మాంగళ్యముగలస్త్రీ. ("ఐదువ. ద్వ - వి. ఐదువన్నెలుగలది. మాంగళ్యముగలస్త్రీ. వన్నెయనఁగా నిక్కడసుమంగలియొక్క యలంకారము. ఐదేవనఁగా:—మంగళసూత్రము - పసుపు - కుంకుమము - గాజులు - చెవ్వాకు.") (శ. ర.) మనుమరాలు=పౌత్రి. గొడ్డురాలు=వంధ్య. 'గొడ్రాలు' అనియుఁగలదు. కననీగొడ్రాలువిడ్డన్. (పాండు. 3 ఆ. ౧౨౭.)

వేదాద్యాచ్ఛికశబ్దములకును ధీరమున్నగు తత్సమశబ్దములకును 'ఆలు' శబ్దము పరమైనపుడు పూర్వపదంబునకు రుగాగమంబగును. రుక్కుకిత్తుగానఁ బూర్వపదంబున కంత్యావయవముగ నిల్చును. తత్సమపదము పూర్వపదమగునపుడు దానితుది 'అ' కారమునకు 'ఉ' కారమగును. ఇచటనఁగా సూత్రద్వయవిషయమునందును 'ఆలు' శబ్దముసమాసగతమేకాన నట్టిస్థితియందు దానికి 'స్త్రీ' అనియేయర్థము. వ్యస్తస్థితిలో నది భార్యకువాచకము. "మగనాలు - ఇల్లాలు" మున్నగుసమాసములు సమానాధికరణములు కామింజేసి యట్టియెడల రుగాగమము రాదయ్యెను - మగనియొక్క+ఆలు=మగనాలు=భర్తృమతి యగుస్త్రీ. ఇల్లాలు=గృహిణి. షష్ఠీసమాసమునందును సామానాధికరణ్యమును జూపనగుటంజేసి పైస్థలములలో రుగాగమము చేయరాదా యని శంకింపఁజనదు. అట్టి ప్రయోగము లున్నపుడు గత్యంతరాభావమున షష్ఠీసమాసమున సామానాధికరణ్యము నెట్లెటో చూపవలసినదే కాని యెల్లయెడల నట్లుచూపి షష్ఠీసమాసస్థితికి నిర్విషయత్వమును ఘటించుట యుక్తముకాదు. "సామానాధికరణ్యాభావాత్ వెలయాలు (పణ్యస్త్రీ) ఇల్లాలు ఇత్యాదౌ నాయం విధిః" (అహో. ౨౨౪ పు.)

---

విస్తర I. ౯౩ I విష:—'జవరాండ్రు' అనుదానికి సూరి యిచ్చిన ప్రయోగము మనుచరిత్రము (౨ ఆ. ౪౧). లోనిది. సూరియుఁ దదనుయాయికోశకర్తలును "జవ్వని+ఆలు - జవరాలు" అనురీతిభేదమునంగీకరించిరి-అహోబలపండితుఁడు "జవరాలు - వ్యతిరిక్తాభూయాంస ఇత్యాచార్యోక్తేః... నస్యలోపః. లోపాభావే న వర్ణే జేవ్వనురాలు" (అహో. ౨౨౩ పు.) అని వ్రాసెను. కాని 'జేవ్వనురాలు' అనుదానికిఁ గవిప్రయోగము కానరాదు. మఱియు "జవ్వన" శబ్దము బల్లిదాదులవంటి విశేష్యనిష్పన్నము కామింజేసి యట్టియాచ్ఛికశబ్దముయొక్క "అ" త్వమునకు "ఉ" త్వమువచ్చుట యెచ్చటను లేదు.

బా-సమా- ౫ సూత్రము- "కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశేషణ పూర్వపదంబై యుండు"అనుచో నప్పున 'ధీర+ఆలు' మున్నగుసమాసములకుఁ బ్రాప్తిలేమింజేసి ప్రకృతసూత్రారంభసామర్థ్యమున నిట సమాససిద్ధియు నందుఁ దత్సమప్రాతిపదికము పూర్వపదమైయుండుటయు సంభవించెనని యెఱుంగునది. అట్లుకానిచో ధీరపాలఁతి గుణవంతనెలఁతుక మున్నగు మిశ్రసమాసములు సిద్ధింప నేరకపోవచ్చును. (విస్తర II)

సంజీవని. ౯౩ II విష:— ప్రయోగములు:—క. కద్రువనిర్దయురాలై (ఆది. ౨ ఆ. ౧౩౬). బుద్ధిమంతురాలు (ఉద్యో. ౩ ఆ. ౩౮౨). సీ. వపుణ్యురాలొక్కో (ఆర. ౭ ఆ. ౩౪౪). ఉత్తమురాలు సుమీ (ఆర. ౭ ఆ. ౧౬౪). గుణవంతురాలవు గురువులందు. (ఆర. ౭ ఆ. ౩౧౫). పాపజాతురాలవు (ఆర. ౬ ఆ. ౩౦౭) ఇటఁ బూర్వపదము 'పాపజాతి' అనునది కాదు. "పాపజాత+ఆలు=పాపజాతురాలు" (జాత=జన్మ) అని ప్రక్రియ నెన్నునది. ద్వి. భార్య సద్భక్తితాత్పర్యురాలు (బసవ. ౬ ఆ. ౪౮౦ ప.) చ. ఇది కడుముద్దరాలు (విరా. ౧ ఆ. ౧౦౩). వినునీవ | యొడయురాలవు నీకు సుజ్జ్వలాంగి (ఆర. ౭ ఆ. ౩౩౮). (విస్తర.)

---

విస్తర. II ౯౩ I విష:—"కర్మధారయమున సంస్కృతమున స్త్రీలింగవిశేషణములకుఁ బుంవద్భావ మగుంగాన నట్టి పద్ధతి నిచ్చోటునను గుణవద్ధీరాదుల పుంలింగాదంతరూపము లె తొలి నిల్చె ననియు విభక్త్యభావమున నుత్వాభావము గుదిరె ననియు నేని గ్రహింపఁదగునని కొందఱందురు" (బా. సా. వే. ౯౧ పు.) అనువేటి కాదర్శితపక్షము పొసఁగనేరదు. గుణవంత మున్నగు ప్రాతిపదికరూపములు పుంలింగ నపుంసకలింగ సాధారణములె కాని పుంలింగరూపములుమాత్రమె కావు. ఉదా:— గుణవంతుఁడు-గుణవంతము-గుణవంతురాలు-మొ. మిశ్రసమాసవిషయమున సంస్కృతపుంవద్భావపద్ధతికిఁ బ్రసక్తి యెట్లో తెలియకున్నది. విభక్త్యభావమున నుత్వాభావము గుదిరె ననుట పొరపాటు. బా. తత్స-౭౧ సూత్రము విధించు నుత్త్వము విభక్తినిమిత్తకముకాదు. 'గుణవంతురాలు' అనునది 'గుణవతి' అనుదానికిఁ బర్యాయము. సంస్కృతసమత్వాతిదేశమున బల్లిదాదుల స్త్రీసమరూపము "బల్లిద" అని నిలువలేదు. 'బల్లిదురాలు' అని యేర్పడుచున్నది.

విస్తర. ౯౩ II విష:—"ఒడయురాలు దే.వి.(ఒడయుఁడు+ఆలు) స్వామిని" (శ. ర.) "ఒడయురాలు. విణ. (√. ఒడయుఁడు)" (సూ. రా. ని.) ఇట.'ఒడయ+ఆలు' అని యుదాహరించుట యుచితము. డుమంతశబ్ద మిందుఁ బూర్వావయవము కానేరదు. 'ఒడయ+ఆలు' అనుచో నొడయశబ్ద మాచ్ఛికమగుటచే నుత్త్వము

మోస్తు విభక్త్యేకవచనకే పు-ంపూ. (ఆం. చిం. సంధి. ౧౧ కా. అహో. ౨౨౬ పు.)

నన్నయా థర్వణీయము. నా విషయము. సామానాధికరణ్యేతు । బహుత్వార్థే పరేపిచ। ముబోర్వ్భవేతాం పు-ంప్వాఖ్యౌ । వాదేశా వత్ర సర్వదా (వికృ. సంధి. ౨౪ కా. అహో. ౨౨౬).

ప్రమనాన్యో౽పి మోః పుఃస్యా । త్సమాస ఇతి శాస్త్రకాః (వికృ. హలం. ౧౩ కా. అహో. ౭౧౨).

కల్పతరువు. ౯౭ విషః—'సామానాధికరణ్యేషు' అనునది పూర్వసూత్రము నుండి యనువర్తించును. సమానాధికరణసమాసములందు, విభక్త్యేకవచనకే=విభక్తుల యేకవచనమందలి, మోః=మువర్ణకమునకు, పు-ంపూ=పువర్ణముగాని పూర్ణబిందు పూర్వకపువర్ణముగాని యాదేశమగును. ఇచటి మువర్ణకము 'మ్ము-ంబు' అను వానికి నుపలక్షణము. ఉదా:—ఉగ్రము+బలము=ఉగ్రపుబలము. మో. "అకారాన్తాత్ప్రథమావిభక్త్యేకవచనే విహితస్య మోస్తు 'పు-ంపూ' ఇత్యాదేశౌ స్తః సామానాధికరణ్యే."(అహో. ౨౨౬ పు.) అని యహోబలపతి వ్యాఖ్యచేసెను. అథర్వణునిసవరణము:—సామానాధికరణ్యేతు=సమానాధికరణసమాసమున, బహుత్వార్థే పరే౽పిచ-బహువచనాంతశబ్దము విశేష్యమగునపుడు సైతము, ముబోర్వః='ము-మ్ము-ంబు' లకు, పు-ంప్వాఖ్యౌ. ఆదేశౌ=పు-ంపులాదేశములు, భవేతామ్=అగుచున్నవి. ఉదా: ఘోరపుమృగములు. (స్త్రీ. ౧ ఆ. ౭౩). ఇట నీప్రథమైకవచనబహువచనములు వ్యస్తము లనరాదు. 'ఉగ్రపగుబలము - ఉగ్రపులగుబలములు - ఉగ్రపగుబలముచేత' మున్నగురీతిని వచింపరాదు. "భ్యాదయ్యర్థవ్యవధానేతు । భేదస్స్యాని ఖిలం భవేత్ · (వికృ. అజం. ౭౧ కా.) అనుచొప్పున విశేషణగతతృతీయకుఁ బ్రథమ నిల్చుటచే నగుధాతు వ్యవధానమున నుగ్రమగుబలముచేత నని యేర్పడును. నన్నయాథర్వణీయము సమాసక ములందనఁగా నాచ్ఛికసమాసములందు మాత్రమె విభక్తిలోపాదికమును విధించునుగాని సాధ్యసాంస్కృతికమిశ్రసమాస

రానేరదు. కాఁగా 'ఒడయరాలు' అని యేర్పడును. కాని ఒడయశబ్దము బల్లిదాదులలోని దగుటచే బా. ఆచ్ఛి. 3 సూత్రముచొప్పున 'ఒడయురాలు' అను నుత్వఘటితరూపము సిద్ధించును. గీ. "యువతిమండలముల కొడయుఁడవుగమ్ము" (జై. భా. ౫ ఆ. ౧౧౭). (శ. ర.) ఇట్లుగుటచే ఉ. అత్తటి జోగివేల్పు టొడయందు. (అచ్చ. రా. బాలకాం. ౧౨౬). అను తిమ్మకవిప్రయోగము ప్రామాదికమనక తీరకున్నది.

మునుపు ప్రాతిపాదికమును విధింపలేదు. కావున "శోణార్తపుటోడలులతో"(స్త్రీ. ౨ ఆ. ౧౨౮ ప.) మున్నగుసమానాధికరణసమాసరూపములను సాధించునపుడు ముం దుగా ప్రథమాంతములతో విగ్రహము నిల్పి సమాసముచేసి సామాసికప్రకృతిరూప మును సంపాదించి పిదపఁ దత్తద్వాక్యానుకూలవిభక్తివచనములతోఁడిరూపములను యథాసంభవముగా గ్రహింపవలయునని ప్రకృతనన్నయాథర్వణసూత్రములచే విదితమగుచున్నది. ఈజ్ఞాపనముచేతనే ముపర్ణకాంతపూర్వపద (సాధ్యసాంస్కృ తికమిశ్ర) సమానాధికరణసమాసములలో ముపర్ణకము లోపింపకపోవుటయేకాక దానిచో 'పు-ంపు' లు నిల్చుటయు ముపర్ణకాంతేతరపూర్వపదసమానాధికరణ (సాధ్యసాంస్కృతికమిశ్ర) సమాసములలో 'సుపోధాతుప్రాతిపదికయోః' అను సూత్రాన (౨౭౮ I విష.) ప్రథమావిభక్తులలోపమును జరుగుటయుఁ బరిశిష్టములకుఁ బ్రాతిపదికత్వము లభించుటయు సంభవించునని గ్రహింపవలయును (౨౭౭ విష.)

గ్రామనామ్నోపీత్యాది:—గ్రామనామ్నోఽపి = జనపదాది వాచకముల యొక్కయు, మోః=ముపర్ణకమునకు, సమాసే=సమాసమున, పుః స్యాదితి='పు' అను నది యగునని, భావప్రకాశ=రసికు లగుకవులు తలంచుచున్నారు. 'పు' అనునది 'ంపు' అనుదానికిని నుపలక్షణము. ఉదా:—హస్తిపురపువార్త, హస్తిపురంపువార్త. మొ. ఈయథర్వణవచనము స్వారస్యముచే షష్ఠీసమాసములందును ముపర్ణకమునకు "పు-ంపు" లగునని తలంపవలసియున్నది. "సామానాధికరణ్యభావేఽపి గ్రామ నామ్నోఽపి మోః పుః స్యాదితి తద్వచనగతాపిశబ్దమహిమ్నా తయోః ప్రాప్తి రిత్యవగన్తవ్యమ్" (అహో. ౨౨౧ పు.) "కొల్లాపురపులక్ష్మిఁ గొల్చినాఁడ. ఇత్యా దికం ప్వాదేశ ఉదాహరణమ్. అపి శబ్దాత్ క్వచిత్ - గుజ్జుపుదడములు ఇత్యాదికమపి రూపమ్" (అహో. ౪౧౨ పు.) పైవిషయములకు హస్తావలంబముగా "వరపుడపుం జరిత్రము" (ఆను. ౧ ఆ. ౨౦౯). కాయ్యపువెరవు (శల్య. ౧ ఆ. ౨౨౧). మున్నగు తిక్కయజ్వప్రయోగములును వెలయుచున్నవి. అహోబలపతి శేషషష్ఠీసమాసమున సామానాధికరణ్యము లేదనియెనేకాని "రాజపురుషుడు = రాజసంబంధపురుషుఁడు" అనుచో సంబంధరూపషష్ఠ్యర్థమున సామానాధికరణ్యము వైవక్షికముగాఁ గల్పింప నగునని కవులు తలంచిరా యని యాలోచింపవలసియున్నది. తక్కినవిభక్తులు కారకములగుచుఁ గ్రియతో నన్వయించురీతి నీ'యొక్క'షష్ఠి క్రియతో నన్వయింపక యొక విశేష్యముతో నన్వయించునుగాన నిది కారకవిభక్తికాదు. శేషషష్ఠికిని సమానాధి కరణసమాసమునకునుగల సాన్నిధ్యము నీక్రింది ప్రబంధపరమేశ్వరుని ప్రయోగము

విశదీకరించుచున్నది. క...వాత్సల్యం । బున మత్స్యమైనరూపం । బున...(ఆర. ౪ ఆ. ౨౩౭ ప.) మత్స్యమైనరూపము=మత్స్యపురూపము=మత్స్యముయొక్కరూపము.

కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బు-ంపులగు.

బాలవ్యా. ౩౭.

౯౪ I విష. సరసము+మాట=సరసపుమాట - సరసంపుమాట. విర సము+వచనము=విరసపువచనము - విరసంపువచనము.

సంజీవని. ౯౪ I విష:—జీత్తుగ నాదేశింపక కేవలపువర్ణమును బూర్ణబిందు పూర్వకపువర్ణమును ప్రత్యేకముగా నాదేశించుటంజేసి పువర్ణము ఖండబిందుపూర్వకముగాదని విశదమగుచున్నది. "కర్మధారయంబులందు" అనెడి బహుత్వస్వారస్యనుచే సాంస్కృతికాచ్ఛికమిశ్రరూపత్రివిధసాధ్యసమాసములందును నీ పు-ంపా్వదేశము గల్గునని స్పష్టపడుచున్నది. ఉదా:—కఠినపువచనము. కఠినపుమాట బెడిదపుమాట. మొ. మువర్ణకంబున కనుదాసిచే, మువర్ణకమునకును ముగాగమము నకును "మ్ము-ంబు" లకును నీయాదేశము వచ్చునని యెఱుంగునది. చింతామణి లోని 'విభక్త్యేకవచనకే' అనుదానికి సరిగా సూరిగారు ప్రథమైకవచనమునందలి యుదాహృతులనుమాత్రమె చూపిరి. కల్పతరువులో నుదాహరింపఁబడినరీతిని బహువచనాంతవిశేష్యకత్వమునందును నీయాదేశమువచ్చునని యథర్వణాచార్యుఁడు వివరించియుండఁగా నట్టి భారతప్రయోగములు వెలయుచుండఁగా సూరి యట్టి వానిని సంగ్రహింపకుండుట వింత. విశేష్యములు బహువచనాంతము లైయున్నను ప్రథమేతరవిభక్త్యంతము లైయున్నను "పు-ంపా్వదేశమువచ్చుటకు భారతమునఁ బ్రబలప్రయోగములు గన్పట్టుచున్నవి. క...। పూజావచనములనెయ్యపుంబలుకుల...(ఉద్యో. ౩ ఆ. ౧౭౯). క. కృపి మున్నగు శిష్యులు...శోకా । ర్తపు టొడలులతో...(స్త్రీ. ౨ ఆ. ౧౨౪). చ....అమూల్యపుగోవులఁ బుచ్చికొమ్ము... (అను. ౪ ఆ. ౫౭). మ. కపటద్యూతమునన్....దురం । తపుదుఃఖంబులకోర్చి... అప్పాపక । ర్మపుజాతిం దెగటార...(శాంతి. ౧ ఆ. ౧౧౮). ఎ. గీ...అగ్ర । లంపు సందడినూష్మజనింప (అశ్వ. ౪ ఆ. ౩ ప.) తరోజ - మితిలేనిఘోరంపుమృగములు (స్త్రీ. ౧ ఆ. ౪౩). నన్నయభారతభాగమునఁ బయిరీతి యతిప్రాసాదిస్థలఖచితప్రయోగములు లభింపకున్నను నాతఁడు పుం-పులను బ్రయోగించెనని విశ్వసింపఁజేయఁదగు ప్రయోగములు గలవు. మధ్యాక్షరము...నల్లనైన దీర్ఘపుఁ దనువును జూచి (ఆది. ౪ ఆ. ౨౫౪). సీ...। బలితంపురక్కసు చెలియల...(ఆది. ౬ ఆ. ౨౧౪). ఆ. వె... లోకవిరుద్ధంపువరము...(ఆది. ౭ ఆ. ౨౬౨). తే. గీ...। వీనిపుట్టినపాపంపువేళ

చెందెను. (ఆది. ౧ ఆ. ౯౯). పరసంపు శాలపై (అర. ౩ ఆ. ౩౦౦) షష్ఠీసమాస స్థలములందలి పు-ంపులకుఁ బ్రయోగములు:—చ. నృపుఁడును భీష్ముఁడున్...ఉ। గ్రప్ప బలమేచి...క। యృపుంబలుపాడె దిష్ప...(కర్ణ. ౨ ఆ. ౨౪౬) చ. తపము సుదాత్త...। త్రిడిక। యృప్ప వెర వెక్కుడై...(కర్ణ. ౩ ఆ. ౨౪౧) చ. కృపకృతవర్మలం గడిమి... మహో। గ్రప్రవడి...క। యృపు వెర వేపు...(శల్య. ౧ ఆ. ౨౨౧) చ...ఇ। వ్వార పుఁడపుంజరిత్రమునవచ్చునె నీకొకపేర్మి...(అను. ౧ ఆ. ౨౦౯) క...పండితునను దుః। ఖపుఁ దెరువువాటిలదు...(శాంతి. ౬ ఆ. ౩౧౩) కం. ...ఆనం। దపు రూపము విష్ణుఁ గొలుతు...(శాంతి. ౨ ఆ. ౩౦ ప.) ("ఆనం। దపురూపుని" అను ముద్రణపాఠము ప్రామాదికము) గంధపుఁజెక్క...(అను. ౨ ఆ. ౩౭౮) వే। దపు గని (ఉ. హరి. ౨ ఆ. ౧౯౭) సీ. ననవిల్తుశాస్త్రంపుమినుకులు...(మనుచ. ౨ ఆ. ౪౩) ఇట్లు షష్ఠీసమాసములోని "పు-ంపు" లకుఁ బ్రాసస్థలస్థగితసోమయాజిప్రయోగము లుండఁగా నథర్వణుఁడును వానిని సంగ్రహించియుండఁగా సూరి సూత్రింపకుండుట వింత. సూరిసూత్రింపకున్నను నొకచో నద్దాని నుదాహరించెను. 'సింగపుఁగొదమ' (బా. సంధి. ౨౪ సూ. వివ.) (విస్తర I-II.)

"గ్రామనామ్నోఽపిమోః" అనుచోటి యపిశబ్దపుస్వారస్యమున నీషష్ఠీసమాస మందలి 'పు-ంప్వా' దేశము సార్వత్రికము నిత్యమునుగాదని విశదమగుచున్నది. చ. ఇతఁడు గదారణంబునకు...సాహసం। బు తఱియె మేదినీశ యిది బుద్ధిఁ దొలం గితి...(శల్య. ౨ ఆ. ౧౧౪). ఇట 'సాహసంపు' అని సవరింతమన్న "సాహసం।

---

విస్తర. I ౯౪ I విష:—"శేషషష్ఠియందు యొక్కలోపింప ముగాగమాంత ములైన పూర్వపదముల ముగాగమ మువర్ణమునకును నీవిధిగల్గునని కొందఱందురు; కాని ప్రాచీనకావ్యముల నిట్టివి గానరామిని..." (బా. సా. వే. సంధి. ౩౨ సూ. వ్యా.) అని వేటికావ్యాఖ్యాత వ్రాయుట కేవలము సాహసము.

విస్తర. II ౯౪ I విష:—"సామానాధికరణ్యేతు...బహుత్వార్థే బహువ చనేపరే...సరసంపుఁబలుకులు ఇత్యాది. కుందనపుఁజాయలు ఇతిరూపం త్వనాకర మేవ." (అహో. ౨౨౭ పు.) షష్ఠీసమాసమున నేకత్వమున "పుంప్వా" దేశము నంగీకరించి (అహో. ౨౧౯ మిరియంపుంబొడి కుదనంపుంజాయ) బహుత్వమున రాదనుటకు యుక్తిగాని ప్రమాణముగాని లేదు. తానే 'గుజ్జుపుదడములు' (ఉద్యో. ౧ ఆ. ౨౨౦). అను తిక్కనప్రయోగమును స్థలాంతరమున నుదాహరించెను. (అహో. ౪౧౨). తే.। ఏనుగయ్యపుశకునము లెన్నియేని। గంటి (ఉద్యో. ౩ ఆ. ౪౧). అని తిక్కన వేఱొకచోటను బ్రయోగించెను.

పుఁ దఱియె" అనురూపము నిల్చి ప్రాసభంగము కావలసివచ్చును. (బా. సంధి. ౨౫ సూ. సూరిపక్షమున (నిత్యనుగాగమము.) చ...సూతక్రి । త్యమునకుఁజొన్ప నేను ప్రమందంబున నప్పటి కియ్యకొంటి లో । కము సమరంబు లట్ల యని (విరా. ౫ ఆ. 332) ఇట షష్ఠీసమాసములో "లోకపుసమరము" లని సవరించినచోఁ బ్రాస భంగమగును.

సంజీ. ౯౭ II విష:—'సరసము+వచనము' అనుచో సమానాధికరణసమాస మున "సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁగాదు." (బా. సమా. ౨౫ సూ.) అనుచొప్పున ముఁవిభక్తికి లోపము కావలసియున్నను బ్రకృతసూత్రమున మువర్ణక మునకు 'పుంపుల' నాదేశముఁగ విధించిన సామర్థ్యమున నట్టిలోపము రానేర దయ్యెను. "సరసములతో+వచనములతో" అనుచో సమా. ౨౫ సూ. చొప్పున 'తో' అనువిభక్తికి లోపమువచ్చినను టట్టునకు లోపము రానేరదు. (ఇటఁ జింతా మణిమార్గము సూరిచేఁ జాల మార్పఁబడెను.) కాని యిచటను జింతామణిమార్గ మునె యనుసరించి బా. కార. ౨౦ సూత్రముచొప్పున విశేషణబహువచనమున కేకత్వమును ఘటించి (సరసముతో+వచనములతో) పిదప బా. సమా. ౨౫ సూత్రము చొప్పున 'తో' అనువిభక్తికి లోపముచేసి 'సరసపువచనములతో' అని సాధింపవలెను. 'సరసముతో' అనుచోటి 'తో' అనుదానితో 'ము' అనునది లోపింపదు. అచట ముగాగమము ప్రకృతికి విధింపఁబడినదిగాని ప్రత్యయమునకు విధింపఁబడలేదు.

నన్నయా ౯౭ విష. నస్యాత్తద్ధర్థోతః (ఆం. చిం. సంధి. ౨ కా. అహో. ౧౯౨ పు.)

కల్పతరు. ౯౫ విష:—దీని కీవలికె 33 విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యా ౯౫ I విష.
ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చు పరమగు
నపుడు నుగాగమంబగు. 33.
చేయు+అతఁడు = చేయునతఁడు, చేసెడు+అతఁడు =
చేసెడు నతఁడు.

సంజీవని. ౯౫ I విష:—బా. క్రియా. ౭౮.-౭౫ సూత్రములచొప్పున "తృ" వర్ణకార్థములుఁగ సూరి సాధించిన తద్ధర్మార్థకవిశేషణములు కళలగుచున్నవి. (విస్తర) కాన 'చేయు+అతఁడు' మున్నగుచోట్ల నిత్యమగు నుకారసంధిచేత 'చే

విస్తర. ౯౫ I విష:—బాలవ్యాకరణమునకు మూల మనఁదగు నాంధ్రశబ్ద చింతామణిమార్గ మీసందర్భమునఁ జాలవఱకు మార్పఁబడినది. విశేషణములు సాధారణముగా బాలవ్యాకరణపక్షమునఁ గళలగుచుండఁగాఁ జింతామణిపక్షమున

యతఁడు' మున్నగు ననిష్టరూపములు కలుగకుండఁ బ్రకృతసూత్రము నుగాగమ మును విధించుచున్నది. ఉదా:—చేయు+ను+అతఁడు=చేయునతఁడు. మొ. ప్రకృత సూత్రపువిధానసామర్థ్యమున నీనుగాగమమునకు బా. సంధి. ౨౮ సూత్రము చెప్పున సామాసికద్రుతలోపము కల్గనేరదు. ప్రకృతసూత్రలక్ష్యములు సయితము సమానాధికరణసమాసములె యైనను నీనుగాగమవిధిచే బాధిత మగునుగాన నిట 'టు' గాగమవిధి వర్తిల్లనేరదు.

---

నవి ద్రుతప్రకృతికము లగుచున్నవి. "నస్యాత్తద్ధర్మోతః" అనుచింతామణిసూత్రము చెప్పునఁ దద్ధర్మార్థకధాతూకారసంధి నిషేధింపఁబడుటచే నట్టి నిషేధసామర్థ్యమున నట్టి లక్ష్యములందు "ద్రుతస్య సర్వత్రలుక్ సమాసేషు" అనుసూత్రముచెప్పునఁ గల్గుసామాసికద్రుతలోపశాస్త్రము వర్తింపమిం జేసి "చేయున్+అతఁడు = చేయు నతఁడు" మున్నగురూపములు చింతామణిపక్షమున సంగ్రహింపఁబడుచున్న వనునది మొదలగువిషయములు ౨౩ విషయమునఁ గల్పతరువులో సవిస్తరముగా వ్రాయఁ బడియున్నవి.

'నస్యాత్తద్ధర్మోతః' అను చింతామణిసూత్రము తద్ధర్మార్థకప్రథమోత్తమ పురుషైకవచనముల సంధివిషయమునుమాత్రము వచించుచున్నదని తలఁచి యప్ప కవి 'ధాతుపదసంభవానాం, విశేషణానా ముత స్తథా నుముచి' అనునొకసూత్రమును బ్రక్షిప్తముచేసి సూరిగారిప్రక్రియకు మార్గదర్శకుఁ డయ్యెను. అట్టిసూత్రము బాలసరస్వతులచింతామణిలో లేదు. అహోబలపతియు నట్టిపాఠము నాదరింప లేదు. ప్రథమోత్తమపురుషైకవచనముల 'ఉ' కారముతోపాటు తద్ధర్మార్థకవిశేషణ ధాతూకారమునకును 'పరరూపసంధినిషేధముచేతనే' యిష్టరూపసిద్ధి కల్గుచుండుటం జేసి 'ధాతుపదసంభవానా' మిత్యాదిసూత్రము పునరుక్తమగుచుఁ బ్రక్షిప్తముగాఁ దలంపఁబడుచున్నది. పేటికావ్యాఖ్యాత "నః స్యాత్తద్ధర్మోతః" అను నపపాఠము నంగీకరించి చింతామణికర్తయు సూరివలెనె నకారాగమవిధానము చేసెనని సాహ సముగా వ్రాసెను. (బా. సా. వే. సంధి. ౩౩ సూ. వ్యాఖ్య. ౯౩ పుట.) "సంధిర్నాచోఽచ్యనుతః-వాఽతః - అనాదిషు విభక్తిషూతోవా - నిత్యమనుత్తమ పురుషక్రియాస్వితః - పరిమితౌ సమస్తానామ్ - నస్యాత్తద్ధర్మోతః - చోర్వాస్యాద్వర్త మానవిహితస్య...అని యిట్లు వరుసగా సంధినిషేధము సంధివిధానము సంధివికల్ప విధానము మున్నగువిషయమునే వచించుచున్న చింతామణిసూత్రములవరుసలో వాని నట్టనడిమిదగు నస్యాదిత్యాదిసూత్రముమాత్ర మట్టిప్రక్రమమునకు విరుద్ధము గా నకారాగమవిధాయకమని వ్యాఖ్యచేయుట కాతఁ డెట్లు సాహసించెనో తెలియ

సంజీవని. ౯౫ II విష:—ప్రయోగములు:—చ...మాకుఁ జేయు నతిథి పూజ లన్నియును నొక్కటనైనఁ గొఱంతలేక వచ్చినవి....(ఆర. ౬ ఆ. ౧౬౪ ప.) అడివచ్చు సుపాయము సేయ గొన్నొ......(ఆది. ౧ ఆ. ౧౪౯). క....వివేక శూన్యుల । కడనుండెడు సంతకంబెఁ గష్టము గలదే (ఆది. ౩ ఆ. ౧౪౯).సీ. రంగ దుత్తుంగతరంగహస్తంబుల; నాడెడు నడివోలె...(ఆర. ౩ ఆ. ౩౮.) సీ...... చూడు ॥ ఎ-గీ. మా మహాత్ములు దక్కున్యుగ్రచరుల । దండితులఁ జేత...(శాంతి.౧ ఆ. ౧౦౭). (చూడుమా=పరికింపుమా.). "తక్కు" అనునది ధాతువును ధాతుజవిశేషణమును నయియుండుటయేకాక గుణవిశేషణముగ నుండుటయుఁ గలదని 'ఉ. తక్కటివారలున్...' (విరా. ౫ ఆ. ౨౬౫) (విరా. ౫ ఆ. ౨౮౨) (ఉద్యో. ౧ ఆ. ౩౦౨) మున్నగు తిక్కయజ్వప్రయోగములనుబట్టి నిర్ణయింపనగును. కాన నట్టి గుణవిశేషణపక్షమున నకారాగమము రాకుండుటయు నిత్యమగు నుకారసంధిగల్గు

---

నున్నది. అథర్వణబాలసరస్వత్యహోబలపండితాది చింతామణివివరణకర్త లెవ్వరును నిట్టి విపరీతార్థమును జేసియుండలేదు. (అనుబం.) మఱియు "నస్యాత్తద్ధర్మోతః" అను తద్ధర్మార్థకధాతూకారసంధినిషేధకసూత్రమును జెలుచుకొన్నపు డింక ద్రుతప్రకృతికాద్రుతప్రకృతికసాధారణముగ "ఉ" కారసంధి నంగీకరించుచింతామణి పక్షమున "చేయుఁన్ - చేసెదున్" మున్నగు తద్ధర్మార్థకక్రియల 'ఉ' కారమునకుఁ బరరూపసంధి యెట్లు వారింపఁబడునని యాతఁడు తలంచెనో తెలియకున్నది. (చిం. వి. పరి. ౧౦౫ మొ ౧౦౮ వ. విష.) విస్తర. I ౭౩ I విషయమున నీపేటికావ్యాఖ్యా విషయములు విమర్శింపఁబడుటచే నిట నింకను విస్తరింపలేదు. ఆంధ్రభాషాచరిత్ర కర్తగారును "నఃస్యాత్త"ను నపపాఠమునె యంగీకరించిరి. (ఆం. భా. చ. ౧౬౦౪ పుట.)

---

అనుబంధము విస్తర. ౯౫ I విష:—ఆంధ్రభాషాచరిత్రకర్తగారు "అప్పకవి చెప్పినచొప్పున నఃస్యాత్ అనుపాఠమే సరియైనద"ని వ్రాయుట (౧౬౦౪ పుట.) వింత. అప్పకవి యీసూత్రమును వివరించిన యీ క్రిందిపద్యము లీయన కెట్టియర్థము నిచ్చెనో తెలియకున్నది. "మూ. సూ. నస్యాత్తద్ధర్మోతః. తే-గీ. ఉర్విఁ దద్ధర్మమునఁ బ్రథమోత్తమాఖ్య । పురుషముల నేకవచనముల్ పోవ విడిచి । కడమపదములు తిజ్మధ్యకములుగానఁ । గొమ్ములను బ్రాణసంధులు గూర్చు టొప్పు ॥ ...క. వదలక తద్ధర్మములను । బొందలెడు ప్రథమోత్తమాఖ్యపురుషైకవచః । పదములు ద్రుతప్రకృతులగుఁ । బదరును నతఁ డోర్తు నేను బలుమఱు ననఁగన్ (అప్పక. ౫ఆ. ౭౩-౭౫ పద్య.)

టయు సంభవించును. గీ. ఇతనివధియించుఁగాని త్రక్కితరజనము। లకు...(ఉద్యో. ౮ ఆ. ౫౪౭) గీ. అట్టి గర్భంబు నిలుపు తక్కన్నిగర్భ। ములును (సౌప్తి. ౨ ఆ. ౫౦) సీ...తక్కనుజులెల్లఁ (శాంతి. ౧ ఆ. ౯) "తక్క...,విణ - ఇతరము..." (శ. ర.). (విస్తర) ఇట్లగుటచేతఁ దిక్కవ తద్ధర్మార్థకవిశేషణోకారమునకుఁ బరరూప సంధిని బ్రయోగించెనని భ్రమింపరాదు.

---

విస్తర. ౯౪ II విష:—ఇట్టి ప్రాచీనమహాకవిప్రయోగములె, యర్వాచీనకవులు తద్ధర్మార్థకోకారసంధిని బాహుళకముగఁ బ్రయోగించుటకును, నుదంతతద్ధర్మార్థకవిశేషణముల ద్రుతము పరుషపరకత్వమునందు సైతము సామాసికలోపము నందకుండ నిల్పి ద్రుతకార్యములఁ గల్గించుటకును మూలము లయ్యెనా యని యాలోచింపవలసియున్నది. (చూ. విస్తర. II ౭౩-I విష.) "సీ. అమరులకడ వినోదము చూపు సమయ మాంత్రికునోరవెడ లగ్నిదీప్తు లనఁగ (హంస. ౪ ఆ.) ఇట్టివి... అగ్రాహ్యములు." (బా. గు. ప్ర. ౬౮ పు ద్వి. ము.) ఇచట "మాంత్రికునోరఁ జనునగ్ని..." అని కవిప్రయుక్తమైయుండునేమో? ద్విపద ఉరగేశశరణని యురగాలయముల। నురగ లింగములఁ గొల్చురగసంఘములు. (బసవ. ౩ ఆ. ౧౦౪౯) ఇది ముద్రణసంస్కర్తృప్రమాదకృతపాఠము. "ఉరగలింగము గొల్చు నురగసంఘంబు" అని తాళపత్త్రమాతృకాపాఠము కన్పట్టుచున్నది. ఇట్లు సమర్థింపరాని ప్రయోగములును గలవు. "నగిం చటుగాక యుండినన్." (వేంకటపతి పంచతంత్రము) చ. చీడపుర్వ్వదాఁ। జెడఁగొలు కింతె కాక...(భాస్కరశతక. ౧౮ ప.) దొరయఁజేయుదే వరరాజ్యంబు. (హ. న. ౨ ఆ. ౩౮) (దొరయఁజేయుదున్+ఏన్) ఒనర్పు దురుమహిమ (హ. న. ౨ ఆ. ౪౧) (ఒనర్పుదున్+ఉరు.) కన నయ్యె డనఘ (హ. న. ౬ ఆ. ౪౮) (కన నయ్యెడున్+అనఘ) ఎఱుఁగు దఖిలంబు. (హ. న. ౮ ఆ. ౬౦ ప.) (ఎఱుఁగుదున్+అఖిలంబు) (చూ. నారచించిన హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠిక ౯౭ మొ. ౧౦౧ వ. పు. ఈపీఠికనుండి స్వీకరించి వ్రాయఁబడిన గాణపత వ్యాఖ్య. ౭౪ పుట.) పైవెల్లఁ బరరూపసంధ్యుదాహృతులు. ఇంక సరళాదేశాద్యుదాహృతులు:—శా. వాలారుం గొనగోళ్ళ. (మనుచ. ౩ ఆ. ౪౭) మ. పలుకుం దొయ్యలి మాళికాంతి (పాండు. ౧ ఆ. ౨౯) (చూడు:—విస్తర I ౮౮ II విష. పెక్కుగలవు.) ఇట్టి మహాకవి ప్రయోగసిద్ధరూపములను బ్రాచీనగ్రాంథికాంధ్రభాషానియమన తత్పరుఁడగుసూరి సంగ్రహింపకున్నను బ్రౌఢవ్యాకర్త సంగ్రహింపకుండుట చింత్యము.

సన్నయా  షష్ఠ్యా ఉతోఽచినుమ్ సేచ. (ఆం. చిం. సంధి. ౫ కారి.
౯౬ విష.  అహో. ౨౧౧ పు.)

కల్పతరువు. ౯౬ విష:—షష్ఠ్యాః=షష్ఠీవిభక్తియొక్క, ఉతః=ఉకారమునకు, అచి=అచ్చు పరమగుచుండఁగా, సే=షష్ఠీసమాసమందు, నుమ్‌చ=నుమాగమము నైతము నగును. "షష్ఠీభవేద్ద్వితీయా, తుల్యాతత్పురుషసంస్థితానామ్నామ్." అనుచెప్పిన షష్ఠికి ద్వితీయాతుల్యతకాఁగా నట్టి ద్వితీయద్రుతమునకు "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అనుచెప్పిన లోపమువచ్చుటయు నచట మరలఁ బ్రకృత సూత్రముచే నుమాగమమగుటయు సమ్మతమని చకారమువలన నర్థము నెన్న నగును. అచ్పరకత్వాభావమున ననఁగా హల్లు పరమగునపుడు సామాసికద్రుతలోప మావశ్యకమనియు నుమాగమ నకారము విధానసామర్థ్యమున సామాసికద్రుతలోపము నందనేరదనియు నెఱుంగునది. ఉదా:—రాముయొక్క+ఆజ్ఞ = రామున్+ఆజ్ఞ = రాము+ఆజ్ఞ = రాము+న్+ఆజ్ఞ = రాము నాజ్ఞ. ఉకారేతరస్థలమున నుమ్ము లేదు. ఉదా:—రామునియొక్క+ఆజ్ఞ=రామునిన్+ఆజ్ఞ=రాముని+ఆజ్ఞ = రామునియాజ్ఞ. హల్పరకత్వమునను నుమ్ము నిల్వనేరదు. ఉదా:—రాముయొక్క+పుత్త్రుఁడు = రామున్+పుత్త్రుఁడు=రాముపుత్త్రుఁడు. మొ.

షష్ఠీసమాసమునందుకార ఋకారముల కచ్చుపరమగు
బాలవ్యాకరణ  నపుడు నుగాగమంబగు. ౩౪.
వివరణము  రాజుయొక్క+ఆజ్ఞ = రాజునాజ్ఞ, విధాతృయొక్క+
౯౬ I విషయ.  ఆనతి = విధాతృనానతి.

సంజీవని. ౯౬ I విష:—బా. సమా. ౨౫ సూత్రముచెప్పిన యొక్కవిభక్తి లోపింపఁగాఁ బ్రకృతసూత్రముచెప్పిన నుక్కు వచ్చి 'రాజునాజ్ఞ' అనురూప మేర్పడెను. ఋకారాంతములకు బా. తత్స. ౫౨ సూత్రముచెప్పిన నత్వస్త్రీవద్భావములు వచ్చునుగాన షష్ఠీసమాసములో ఋవర్ణాంతము సాధారణముగా సంభవింపనేరదు. (విస్తర) బా. తత్స. ౫౩ సూత్రముచెప్పిన విధాత్రాదిగణములోని

---

విస్తర I ౯౬ 1 విష:—"అథశబ్దానుశాసన మ్మనుచు సంస్కృతము ననుశాసించిన మహాభాష్యకర్తవలెఁ దెల్గు ననుశాసింపఁబూనిన యనుశాసనకర్తగారు "మాతృనాదరము" అని యుదాహరించుట వింత! (ఆం.భా. అ. సంధి. ౩౩ సూ. వివృతి) పై సంజీవనిలోని ప్రక్రియచెప్పిన "మాతృయొక్క" అనురూపమె సంభవింపనేరదు. "మాతయొక్క+యాదరము=మాతయాదరము" అనియే యుండును.

యలంతిశబ్దములకుమాత్ర మత్వస్త్రీవద్భావములు రానిపక్షమున "విధాతృయొక్క+ ఆనతి" అనుస్థితి సంభవించును. "విధాతృయొక్క+ఆనతి" అనుచో బా. సమా. ౨౫ సూత్రముచెప్పున యొక్కవిభక్తి లోపింపఁగా "విధాతృ+ఆనతి" అని యేర్పడును. అట్టియెడలఁ బ్రకృతసూత్రముచేత ఋకారమునకు నుక్కుచేరఁగా "విధాతృ+ను+ఆనతి = విధాతృనానతి" అని రూపసిద్ధి కల్గును. ఇట్టి స్థితి విధాతృ-ధాతృ-దాతృ-సవితృ - నేతృశబ్దములకు మాత్రము కల్గునని బాలవ్యాకరణము వలన విశదమగుచున్నది. నన్నయాథర్వణులు ఋకారమునకు నుక్కువచ్చుటను వచింపలేదు. నన్నయాదిప్రయోగముల నరసి సూరిగారే యీవిషయమును సంగ్రహించిరి. చ. అయనయ హీనుఁడౌ సవితృ నట్లు విఖండితపక్షతిద్వయుం|డయిన ఖగేంద్రు నట్లు...(సభా. ౧ ఆ. ౧౬౧ ప.) నన్నయభారతభాగమున నీనుక్కు నిత్యముగానే ప్రయోగింపఁబడియున్నది. ప్రభావశూన్యునట్లు...(సభా. ౨ ఆ. ౧౦౭). అధ్వరోత్సవంబు నన్నివాళ్ళ (సభా. ౨ ఆ. ౧౧౫). మఘువు నాజ్ఞఁజేసి (ఆర. ౧ ఆ. ౩౪౪) కురూత్తము నర్థమవైతి (సభా. ౨ ఆ. ౨౧౪) పురుషు నుత్తమగుణముల్ (సభా. ౨ ఆ. ౨౬౬) "సవితృనట్లు - ఖగేంద్రునట్లు - ప్రభావశూన్యునట్లు" అనుచోటులందు "......ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు..." (ప్రౌఢ. సమా. ౩౦ సూ.) అనుచెప్పున షష్ఠి నిలుచును.

సంజీవని. ౯౬ II:—తిక్కయజ్వ యీనుక్కు నుపేక్షించుటయుఁ గలదు. మ...ఆఱుంగలదీపము ట్లతఁడు మండుంగాక యే నార్చెదన్ (కర్ణ. ౩ ఆ. ౪౯) ఇచటనుక్కువచ్చినచో "దీపమునట్లు" అని యుండవలయును. సీ. గొడుగీగి యఖిల పీడలఁ బాపు...(అను. ౫ ఆ. ౧౯౬) 'గొడుగుయొక్క+ఈగి = గొడుగునీగి' అని నుగాగమరూప ముండును. (విస్తర-I) ఇట్టి కవిబ్రహ్మగారి ప్రయోగములను మూలముగాఁ గొని శంభుదాస శ్రీనాథ కవిపితామహాదులును నీనుగాగమమును గొన్నియెడల నుపేక్షించుచువచ్చిరి. ఉ...గోకుల మిల్లిలు దప్పకుండ ల| క్ష్మీపతి గ్రుమ్మరున్ (హరి. పూ. ౫ ఆ. ప్రౌఢ. సంధి. ౧౦ సూ.) గీ. అలరఁజేసితి నిషధరాజంతవాని (నైష. ౨ ఆ. ౯౨ ప.) (ఇట "అలరఁజేసితి నైషధు నంతవాని" అని సర్వంకషావ్యాఖ్యాత సవరించుట సాహసము. కూచిమంచి తిమ్మకవియు

---

విస్తర I ౯౬ II విష:—ఇట్లు కవిబ్రహ్మ ప్రయోగించియుండఁగా "ఇట్టి నుగాగమముగలుగని ప్రయోగములు 16 శతాబ్దినుండి ప్రవృద్ధినందిన ట్లనుమానింపనగును" (బా. సా. వే. ౯౫ పు.) అని పేటికావ్యాఖ్యాత వ్రాయుట వింత.

'నిషధరాజంతవాని' అనుపాఠమునే యుదాహరించెను. (సర్వల. ౧ ఆ. ౬౬.) క... తెల్లనిగట్టిఱుత...(మనుచ. ౮ ఆ. ౧౬) సీ. దిన వెచ్చమున కునై తనమేనఁగలసొమ్ము కొదుకక బచ్చింటఁగుదువ వైచు (పాండు. ౩ ఆ.) శిర సందం బరయన్ (కళా. ౩ ఆ.) (ప్రౌఢ. సంధి. ౧౦ సూ.) కం. అన్నన్న మొగము వెన్నని । యన్నన్నజయించుఁ (విజయ. సర్వల. ౧ ఆ. ౬౭) (వెన్నని యన్న = లక్ష్మి - దాని యన్నచంద్రుఁడు) ఉ...గట్టురా । జన్నఁడు...(రామాభ్యు. సర్వల. ౧ ఆ. ౬౩) (విస్తర-II) ఇంక నీక్రింది ప్రసిద్ధపదములునయిత మీసందర్భమునఁ జూపఁదగియే యున్నవి. ఇల్లుయొక్క+ఆలు=ఇల్లాలు= గృహిణి. ఉ. ఇంతటి మేటి రూపసికిఁ దానిల్లాలుగా...(ఉ. హరి. ౫ ఆ. ౧౫౬) మ...ధర్మసుతుఁ డీరైదమ్ముల మ్మద్రనా । యకుపై ...(శల్య. ౧ ఆ. ౨౨౬) రెంటియొక్క+ఐదు=ఈరైదు. ఉ. ...శరము లాఱయిదుల్ శ్రుతకీర్తిశల్యుమైః । గాడఁగనేయ (కర్ణ. ౧ ఆ. ౧౧౧) ఆఱిటియొక్క+అయిదులు = ఆఱయిదులు = ముప్పది.

సరశేపరుషేష్వైవ । సమాసే ను ముతో భవేత్ ।అద్రు
తాత్ స్వరసాదందు । పట్టికూర్చి విభక్తిషు ॥ క్వనేచ
కుత్రచి దతో । వికారాచ్చాపి కేచన (వికృ. సంధి. ౨౩ - ౨౮ కారి. అహో. ౨౧౯ - ౨౨౦ పు.)

నన్నయా ఛర్వణీయము ౯౭ విషయము.

కల్పతరువు. ౯౭ విష:—దీనికి ౮౮ విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

ఉదంతస్త్రీసమంబులకును బు-ంపుకు నదంతగుణవాచ
కంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

బాలవ్యాకరణ ౩౫.

వివృతి. ౯౭ I విష.

సొగసు+తనము = సొగసుందనము - సొగసుఁదనము - సొగసున్దనము. సరసము+తనము = సరసపుందనము - సరసపుఁదనము - సరసపున్దనము. తెల్ల+తనము = తెల్లందనము - తెల్లఁదనము - తెల్లన్దనము.

---

విస్తర II ౯౬ II విష:—"ఇట్టివి కవిప్రయోగంబులు ప్రాచీనంబులై గ్రాహ్యంబులు' (బా. గు. ప్ర. ౩౮ సూ. వ్యా.) అని గుప్తార్థప్రకాశికాకర్త వ్రాయుట సరికాదు. తిక్కన శంభుదాస శ్రీనాథ కవిపితామహాదులప్రయోగము లను మూలముగాఁ గొని ప్రయోగించినప్రయోగములు ప్రాచీనములు కాకుండు టచే నసాధువు లెట్లగును?

సంజీవని. ౯౭ I విష:—స్త్రీసమములు=ప్రథమైకవచనమున డ్వాదిప్రత్యయములు లోపించు నాచ్ఛికశబ్దములు. (చూ. ౮౮ II విష.) గుణవాచకములు=నల్ల-తెల్ల మొదలగుశబ్దములు. "గుణ. పుం...ద్రవ్యమాత్రాశ్రితే...వస్తుధర్మే" (శబ్దస్తో) అనుచెప్పిన పెద్ద-గొప్ప మొదలగునవియు గుణవాచకములైయైనను నీసూత్రములోని గుణవాచకశబ్దము బా. తద్ధి. ౬ సూత్రమునకు లక్ష్యములగు నల్లాదులనే వచించునని గ్రహింపవలెను. ఉదా:—నల్ల+ను+తనము=నల్లందనము-తెల్లందనము. మొ. పెద్దతనము-గొప్పతనము మున్నగుచోట్ల నీనుగాగమము లేదు. నుగాగమ ముదంతస్త్రీసమముల కంత్యావయవముగా నిల్పినపిదప బా. సంధి. ౧౬-౧౭ సూత్రములచెప్పిన ద్రుతకార్యములు సంభవించును. తద్ధితవృత్తియందును బా. సంధి. ౨౬ సూత్రముచెప్పిన స్వత్వము రానేరదను తలంపున నిందలి యుదాహృతులలో సూరి "సొగసునుదనము" మున్నగు ననిష్టరూపముల నుదాహరింపలేదు. సరసముయొక్కతనము=సరసమున్+తనము = సరసము+తనము = సరసపుతనము=సరసపు+న్+తనము=సరసపుందనము. ఇట్లు తనవర్ణకపరకత్వమున "పు-ంపులను వానిపయి నుగాగమమును సూరి యంగీకరించెనుగాని వీనిని నిర్వహించు ప్రయోగములు గానరావు (౮౮ విష.). మువర్ణకమునకు 'పు-ంపు.' లను 'తన' వర్ణకపరకత్వమున సూరియు విధింపలేదు. (బా. సంధి. 3౨ సూ.) ఇంక నేతత్సూత్ర నుగాగమవిధానసామర్థ్యమున 'పు-ంపు' లు వచ్చునని సూరి తలంచియుండును. (విస్తర. I-II).

---

విస్తర. I ౯౭ I విష:—"తనము పరుషాదిపదమగుటచే షష్ఠీతత్పురుష మనఁదగుతద్ధితవృత్తిని" "నుగాగమసరళాదేశబిందుసంశ్లేషములు పర్యాయమునఁ గలుగ..." (బా. సా. వే. ౯౬ పు.) ఈవాక్యములు సంప్రదాయవిరుద్ధములు. 'తనము' పరుషాదిప్రత్యయమేకాని పదముకాదు. తద్ధితవృత్తి షష్ఠీతత్పురుష మనఁదగదు. 'బిందుసంశ్లేషములు పర్యాయమున నగు' నన నగునుగాని వానితోపాటు 'నుగాగమసరళాదేశములును' బర్యాయమున నగుననుట పొరపాటు. ఉదాహృతులన్నిటను నవి (నుగాగమసరళాదేశములు) వచ్చునవేకాని పర్యాయముగావచ్చునవి కావు.

విస్తర. II ౯౭ I విష:—సూరి సరళేపరుషేచైవేత్యాదికారికలోని 'వికారాచ్చ' (పుంప్వాదివికారాత్) అనుచో సరళపరుషపరకత్వమున "పుంప్వాదివికారముమీఁద నయితము నుమ్మగునని యర్థముచేసికొనక 'తన' వర్ణకపరకత్వమున 'పు-ంపు' లపయి 'నుమ్మ'గునని కవిప్రయోగవిరుద్ధముగను నథర్వణాభిప్రాయవిలక్షణముగను నర్థముచేసికొని యిట్లు సూత్రించియుండును.

ప్రయోగములు:—చ. కీ। డును బొరయింతునే యిది కడుం జెడుగ్రుం ద్దస మేనుభీతి...(శాంతి. ౩ ఆ. ౨౧౩) సీ. అల్లందనంబున ననువు మైకొనఁజూచు. (విరా. ౧ ఆ. ౨౭౫) తే.గీ. దండంపుఁ బరుసఁదనము (ఉద్యో. ౨ ఆ. ౪౪) చ...విదురాదిసజ్జనులబుద్ధికి రా నుచితంబుతోడి మె। ల్పునఁ బరుసందనంబునను భూపతులెల్ల...(ఉద్యో. ౩ ఆ. ౨౩) మ...కానన। స్థలిలోఁ గారెలుకుందనం బునన యిందాకం బ్రవర్తిల్లినా। రు...(హరి. పూ. ౯ ఆ. ౫౬).

సన్నమాధ. ౯౯ విష.

శబ్దానామాదిభాగేషు। నూతనత్వావిబోధకాః। ఏకద్వి
వర్ణాకాశ్శబ్దా। అర్థభేదోఽపిచ క్వచిత్॥ (వికృ. అజం.
౬౯ కా. అహో. ౩౫౪ పు.)

కల్పతరు. ౯౮ విష:—వీని కివఱకె ౮౮ విషయమున వ్యాఖ్యచేయఁబడెను.

బాలవ్యాకరణ వివరణము. ౯౮ I విషయ.

సమాసంబునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణం
బులకెల్ల లోపంబు బహుళంబుగానగు. ౩౬.
ప్రాఁత+ఇల్లు = ప్రాయిల్లు - లేఁత+దూడ = లేదూడ -
పూవు+రెమ్మ=పూరెమ్మ.

సంజీవని. ౯౮ I విష:—పయి యథర్వణకారిక నయిదుసూత్రములతో సూరి వివరించుచున్నాఁడు. ప్రాఁతశబ్దములోని తొలియచ్చు 'ప్రా' అనుదాని మీఁది "ఆకారము". దానిమీఁది వర్ణములనఁగా ఖండబిందువు - తకారము దానిమీఁది 'అ' కారమును-వానికి లోపముకల్గునని తాత్పర్యము. ఇల్లె యంతటను నెఱుంగు నది. పూరెమ్మ - పూవులతో నున్నరెమ్మ - ఉత్తరపదలోపసమాసము. ప్రాఁతాదు లాకృతిగణము. కర్మధారయసమాసమునఁ బ్రాయికముగా నాద్యక్షరశేషమగుచుఁ బరుషపరకత్వమున ద్రుతకార్యముల నొదవించుచుండుశబ్దము ప్రాఁతాదులలోఁ జేర్పఁదగునని సూరియాశయము. (విస్తర-I.) ప్రాయిల్లు-ప్రాఁగెంపు - ప్రాఁబల్కులు. ప్రాఁజదువులు - ప్రామినుకులు. మొ. అథర్వణుఁడు పేర్కొనిన క్రొత్తశబ్దమునకిట్టి

---

విస్తర. I ౯౮ I విష:—పయియథర్వణకారికకుఁగవిశిరోభూషణవివరణము:— "క్రొన్నన - క్రొంజివురు - నెన్నడుము-చెంగలువ - నెత్తావి - నెత్తమ్మి - పొందామర - ప్రాఁతచదువులు - ప్రాఁజదువులు..." (అహో. ౩౫౪ పు) ఈయథర్వణ కారిక యాదృచ్ఛికసమాసములో మొదటిశబ్దమున నొకటి రెండక్షరములు మిగులుటకుమాత్రమె వచింపఁబడెననితలంచి కావలయు నహోబలపతి దీనిని 'నుమ్‌చోత్తః' అనుచింతామణిసూత్రమునొద్ద "సరశేషపుష్పైచై వేత్యాది" కారికతోపాటుగ నుదాహరింపలేదు. వానిసంబంధములేనిచో లుప్తశేషమునకుఁ బరముగ ద్రుత మెట్లు

ధర్మములు చాలవఱకున్నను గొన్నియెడల లేకుండుటయే కాక పరహల్లునకు ద్విత్వము నొదవించుధర్మము నైతమునుండుటచే దానిని బ్రాంతాదులలోనిదానిఁగ నంగీకరించియు సూరి దానికై ప్రత్యేకవిధులను (బా. సంధి. 3౮ సూ.) సూత్రించెను. కాని యొక్క క్రొత్తశబ్దమునకేయట్లు సూత్రించుట సరికాదు. అథర్వణుఁడు చెప్పినట్లు (నూతనత్వాదిబోధకాః) క్రొత్తాదులనుట యుక్తము. పూవుఁబోదరిండ్ల (మనుచ. ౨ ఆ. ౫౭) పూవిలుకాఁడు - పువ్విలుకాఁడు- పువ్విలుతుఁడు - పుప్పొడి-పువ్విలుతు తంద్రయచ్చుట (పాండు. ౫ ఆ. శ. ౭.) కెమ్మోవి - (నైష. ౨ ఆ. ౨౬) కెమ్మోము (దశా. 3 ఆ. ౧౦౪) మున్నగు ప్రయోగములనుబట్టి పూవు - పువ్వు - కెంపు మున్నగువానియందుఁ గ్రొత్తశబ్దలక్షణములఁ నెన్నఁనగును. పది మొదలగుశబ్దము లకుఁ బ్రాంతాదులధర్మములు ప్రాయికముగ నుండక యొక్కొకచోట మాత్రమె యగపడుటచేతను, నెఱ మొదలగుశబ్దముల కాద్యక్షరశేషిత్వధర్మ మున్నను బరుష పరకత్వమున ద్రుతకార్యముల నొదవించుధర్మ మొక్కొటనైన లేకుండుటచేతను, సట్టిశబ్దములనెల్లఁ బ్రాంతాదులలోఁ జేర్పక సూరి "అన్యంబులకు సహితము....." (బా. సంధి. 3౯ సూ.) అనుదానిని వేఱుగ సూత్రించెను.

---

లభించును? పయియథర్వణకారికకుఁ గవిజనమండనటీక:—"ప్రాతిపదికముయొక్క యాదిభాగమందైన నూతనాత్వాదిబోధకశబ్దము లొకటిరెండక్కరములుగలవి యగును. ఒకానొకచో నర్థవిశేషముండగును. ఉదా:—క్రొత్త+నన=క్రొన్నన - క్రొత్త+పసిఁడి=క్రొంబసిఁడి - క్రొత్త+కారు=క్రొక్కారు - ప్రాఁత+ఇల్లు=ప్రాయిల్లు - లేఁత+దూడ=లేదూడ - మీఁదు+కడ = మీఁగడ - కెంపు+తామర=కెందామర - చెన్ను+తోవ=చెందోవ ఇత్యాదుల నిత్యంబు; క్రింది+కడుపు=క్రీఁగడుపు - క్రింది+ ఊట=క్రియూట (క్రియ్యూట. సూ. రా. ని.) ఇత్యాదులవికల్పము. కొన్నియెడల నుత్తరవర్ణలోపము నిత్యము. కొన్నియెడల వికల్పము. కొన్నియెడల లుప్తశేషము నకు హల్మాత్ర నకారాగమము. కొన్నియెడల నుత్తరశబ్దాదివర్ణమునకు ద్విత్వము. కొన్నియెడల లుప్తశేషమునకు దీర్ఘము. కొన్నియెడల లోపాభావమును గల్గును. ఉదా:—'క్రొత్తకుండ' ఇచ్చట లోపంబులేదు. కొన్నియెడలఁ గర్మధారయేతరస్థలం బునను గలదు. రాకొమరులు - ఇందనుక - పూఁగొమ్మ. ఇవి మొ." (వికృ. టీక. ౯౭ పు.) పయివిషయములనెల్ల బాగుగ సంగ్రహించుకొని సూరి కొంతసవరించి యీప్రాంతాదులసంధికిఁ గొన్నియనుగమములను గల్పించెను. అవెల్ల సంజీవనిలో వివరింపబడును;

బాహుళకకార్యములు నాల్గిటికిని నీ ౩౬ సూత్రమున నుదాహృతులు వెలయుచుండుటచేఁ జూపఁబడుచున్నవి:—చెంబోవ - మీఁగడ మున్నగుచోట్లఁ బొలియచ్చుమీఁది వర్ణముల లోపమునకు నిత్యప్రవృత్తి. క్రొత్తకుండలు మున్నగు చోట్ల నప్రవృత్తి. లేఁతదూడ=లేదూడ మొదలగుచోటులందు విభాషాప్రవృత్తి. క్రీఁగడుపు - క్రీఁగాలు - క్రీఁదొడ మున్నగునెడల నన్యకార్యప్రవృత్తి. ఇట్టివిధి బాహుళకముగాన "ప్రాఁతయిల్లు" నియు నుండవచ్చును. "ప్రాఁతలెంకల మగు టన్." (రామాభ్యు. ౨ ఆ. శ. ర.) (విస్తర-II.) లుప్తశేషమునకుఁ బరుషపరకత్వ మున 'నుక్కు' విధింపఁబడునుగాన నిందుఁ గొఱవడిన స్వరసరళస్థిరపరకస్థలములు మూఁడును నుదాహృతములయ్యెను. ప్రకృతసూత్రంబులోని 'సమాసంబున' అను దాని కాచ్ఛికసమానాధికరణసమాసమని యర్థము. (విస్తర III-IV) 'పూరెమ్మ' అనునదినైతము సమానాధికరణసమాసభేదమె యనఁదగును. 'పూవులతోఁగూడిన రెమ్మ' అని మధ్యమపదలోపసమాసము. (చూ. ౯౧ I విష.)

---

విస్తర. II ౯౦ I విష:—"అత్వసంధి బహుళమగుట నిందుఁ గలుగదన్నఁ బ్రాతి ల్లనురూప మేర్పడదు" (బా. సా. పే. ౯౭ పుట.) ప్రాఁతిల్లు మున్నగు నకారసంధు లసాధువు లనుటకుఁ బ్రమాణము చూపకయె యిట్లు వ్రాయుట సరి కాదు. ప్రాఁతందలము (ఆము. ౨ ఆ. శ. ర.) అని శబ్దరత్నాకరమున నుదా హృతమయ్యెను, ప్రాయందలమని వావిళ్లవారి ముద్రణము. 'ప్రాయిల్లు' అనునదే తప్పని కీర్తిశేషులగు కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు వ్రాసి యున్నారు (వారు నాకొసంగిన బాలవ్యాకరణ ద్వితీయముద్రణపు మార్జిను.).

విస్తర. III ౯౦ I విష:—"ప్రాఁతేత్యాదులం దర్ధబిందువు, తన కాశ్రయ మగుపరుషముపోవుటచేఁ దానును దొలంగెనని" (బా. సా పే. ౯౭ పు.) అను పేటి కావ్యాఖ్య సరికాదు. అనుస్వారమున కాశ్రయము పూర్వస్వర మనుట సంప్ర దాయముగాన పరహల్లాశ్రయ మనుట పొరపాటు. "పూర్వస్యానుస్వారవిసర్జ నీయౌ - పార్షదవ్యాఖ్య:—స్వరాన్తరేవర్తమానౌ అనుస్వారవిసర్జనీయౌ పూర్వ స్వరస్యాఙ్గం·భవతః. (ఋగ్వేదప్రాతి. ౧ పటల. వై. పా. ౨౧౨ విష.)

విస్తర. IV ౯౦ I విష:—"సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుగాగమాదులు గానంబడియెడి ఉదా:—ముంగోపము - వింజామరము (వెల్ల+ చామరము) సంధియందు వర్ణవికారము." (ప్రౌఢ. సంధి. ౧౨ సూ.) సీ. పుష్క లావర్తకంబులు లోనుగాఁగలక్రొమ్మేఘములు పుష్పవృష్టి గురియ (భీమ. 3 ఆ. ౧౩

లుప్తశేషంబునకుఁ బరుషములు పరములగునపుడు
నుగాగమంబగు. ౩౭.

ప్రాఁత+కెంపు=ప్రాఁగెంపు - లేఁత+కొమ్మ=లేఁగొమ్మ -
పూవు+తోఁట=పూఁదోఁట - మీఁదు+కడ=మీఁగడ -

బాలవ్యాకరణ వివరణము. కెంపు + తామర = కెందామర - చెన్ను + తోవ =
చెందోవ.

౯౯ విషయము. చెన్నుశబ్దము వృత్తినిశోణార్థకంబు. బహుళగ్రహణ
ముచే మీఁదు ప్రభృతులయందు నిట లోపంబు
నిత్యంబు. వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లే
షంబులేదు.

సంజీవని. ౯౯ విష:—మీఁగడ = కాఁగినపాలమీఁదితెట్టు - కెందామర=ఎఱ్ఱ
తామర - శోణ=ఎఱ్ఱనిది.

లుప్తశేషమున కనఁగాఁ బూర్వసూత్రముచొప్పునఁ దొలియచ్చుమీఁది
వర్ణములు లోపింపఁగా మిగిలిన శబ్దభాగమునకుఁ బరుషములు పరమగునపుడు
నుగాగమ మగునని యర్థము. నుక్కు కిత్తుగాన నంత్యావయవ మగును. 'పూఁ
దోఁట' అనుదానినిఁ బ్రాఁతాదులలోఁ జేర్పనక్కఱలేదనియు "పూ" అనుశబ్దమే
కలదనియు సూత్రించిన త్రిలింగలక్షణశేషసూత్రము 'పూపూవు' (ప్రౌఢ. సంధి.
౧౧ సూ.) అనునది యీవఱకె విమర్శితమయ్యెను. (౯౧ I విష. విస్తర II ౮౭
II విష.) లుప్తశేషమునకు "నుక్కు" వచ్చిన పిదప సంభవించు ద్రుతకార్యము

---

సూ. రా. ని.) ద్వి...క్రొమ్మేఘంబులు గర్జిల్లి కురియ (రంగ. రా. ఉ. ౩౯ పు.)
(సూ. రా. ని.) క్రొంబులకలు (శ. ర.) నన్నయతిక్కనల భారతభాగమున నిట్టి
ప్రయోగములు గన్పట్టలేదు. ఎఱ్ఱనభారతభాగమున చ. నీవు నె। మ్మనమున సంత
సిల్లుడు సమస్తజగంబులు శాంతిఁబొందు (అర. ౪ ఆ. ౩౭౭) "నీవు నీ। మనమున"
అన్నను క్షతి కానరాదు. క...। నెమ్మనము నూఁకు నెఱుపఁగ। నుమ్మలికపు...
ఉ. హరి. ౧ఆ. ౧౪౯.

'పూఁదోఁట' మున్నగువానిసాధనమున్నకై 'పూవు' శబ్దమును బ్రాఁతాదు
లలోఁ జేర్పనక్కఱలేదని విశదమగునట్లు ప్రౌఢవ్యాకర్త పూశబ్దమే కలదనుచు
"పూవుపూ" (ప్రౌఢ. సంధి. ౧౧) అని సూత్రించెను. ఇది సరికాదని యీవఱకె
నిరాకరింపఁబడెను. (౯౧ I విష. విస్తర. II ౮౭ II వి.)

లలో స్వత్వము, బా. సంధి. ౨౬ సూత్రముచే నిషేధింపఁబడినవి. ఇంక మిగిలిన ఖండబిందు పూర్ణబిందు సంశ్లేషములలో "వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబులేదు" అనెడి సూరివివరణముచొప్పున సంశ్లేషమును నిషేధింపఁబడుచున్నది. ఈద్రుతంబున కనుటచే నీ ౩౭ సూత్రముచే విధింపఁబడినద్రుతమునకు సంశ్లేషము లేదని తాత్పర్యము. బా. సంధి. ౧౭ సూత్రములోని 'బిందుసంశ్లేషములు విభాష నగు' అను (౨౦ II విష.) వాక్యమునఁ జెప్పఁబడిన విభాష వ్యవస్థితవిభాష యనియు నట్టి వ్యవస్థితవిభాషచే నీసూత్రములోని ద్రుతాగమమునకు సంశ్లేషము లేదనియు సూరి వివరణమునకుఁ దాత్పర్యము. వ్యవస్థ=ఏర్పాటు - ఇట నిత్యము-ఇట వికల్పము - మున్నగురీతిని జేయునేర్పాటు వ్యవస్థ యనఁబడును. ప్రకృత సూత్రమున విధింపఁబడినద్రుతాగమమునకు మాత్రమె బా. సంధి. ౧౭ సూత్రముచేఁ గలుగుసంశ్లేషము రానేరదని యిచటి వ్యవస్థ నెఱుంగునది. (విస్తర I).

పయిసందర్భమునుబట్టి యీసూత్రమున విధింపఁబడినద్రుతము నుడి తొలియచ్చుల మీఁదిదే యగుటంజేసి హ్రస్వముమీఁదఁ బూర్ణబిందుమాత్రమును (బా. సంధి. ౨౨ సూ.) దీర్ఘముమీఁద ఖండబిందుమాత్రమును (బా. సంజ్ఞా. ౧౫ సూ.) నిట వచ్చునని తేలుచున్నది.

ఆథర్వణకారికనుబట్టి యీద్రుతాగమము పరుషసరళనిమిత్తక మని విశద మగుచున్నను బ్రచురముగాఁ గనఁబడు పరుషపరకస్థలప్రయోగములం గాంచి భ్రమించి సూరి యీద్రుతాగమమును బరుషపరకత్వమునమాత్రమే విధించెను. అట్లగుటంజేసియె "కెంధూళి - కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి" (బా. సంధి. ౩౮ సూ. వివ.) అని (దూళిని ధూళిచేసి) వింతగ వ్రాయవలసినవాఁ

---

విస్తర. I ౫౫ విష:—"చిన్నయ 'అన్పురము' అని పరిష్కరించినాఁడు." అని కీర్తిశేషులగు కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు వ్రాసియున్నారు. (వారు నాకొసంగిన బాలవ్యాకరణద్వితీయముద్రణపుస్తకము మార్జిను ౨౩ పుట.) దీనినిబట్టి బాలవ్యాకరణరచనకుఁ బూర్వము సూరి 'అను - కొను' ప్రభృతిధాతుజవిశేషణములను బ్రాఁతాదులలోఁ జేర్చి "అను+పురము=అ+పురము=అ+ను+పురము=అంబురము - అన్పురము" మున్నగురీతి నిట్టిరూపములను సమర్థించుచుండెనా యని యాలోచింపవలసియున్నది. "విభక్త్యాగమచార్థోనుర్ద్రుతః" (సంస్కృత సూత్రాంధ్రవ్యా. సంజ్ఞా.) అనుదానినిబట్టి సూరి మొదటినుండియు నావయవికవ్యంజన నకారమునకు ద్రుతత్వము నంగీకరించువాఁడు కాఁడని స్పష్టపడుచున్నది. "కన్యాదిభ్యోన్తలోపిభ్యః । పరుషాణాంగబామతాః । కజ్జెదరె ఇతి

48

డదియ్యెను. సరళపరకత్వమునందలి యుదాహృతులు:—సీ. ఖచరకాంతల యలక ములందుఁ గెందూళి యళులపైఁ బుప్పొడి ననుకరించు (భీష్మ. ౧ ఆ. ౨౪౨). సీ. పొఁబర్వ పెందూళి బ్రుంగె నేఁడు. (ద్రోణ. ౨ ఆ. ౨౩౯) పైయథర్వణ కారిక కనుకూలమైయున్న యిట్టిభారతప్రయోగముల నరసియె కవిపితామహుఁడు "మ. ధర కెందూళులు కృష్ణరాయల" (మను. ౧ ఆ. ౩౮) సీ. "ముడిచిన యొంటి కెంజడలమూయ (మను. ౧ ఆ. ౭౯) అని ప్రయోగించియుండును. ఈమనుచరిత్ర పద్యములనె చూచియు నిందుఁ బ్రసిద్ధమగు ధూళిశబ్దము లేఖకప్రమాదమునఁ బడినదని తలంపకయు నథర్వణుఁడు సరళపరకత్వమునందును నీద్రుతాగమమును విధించుటను జూచికొనకయు "కెంధూళి కెంజడలనియుఁ బ్రయోగంబులు గానం బడియెడి" అని సూరి వింతగవ్రాసెను. శబ్దరత్నాకరకర్త చాలవఱకు సూరిమార్గమునె యనుసరించి యీక్రిందిరీతిని వ్రాసెను. "పె. దే. విణ. వృత్తియందు పెనుపు శబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము ...(ఒకానొకచో స్థిరము పరమగునపుడు బిందువు కానంబడియెడి. సీ. పెంధూళి యొసఁగ నందంద కాల్ద్రవ్వుసుద, గ్రతమహీతలము గ్రక్కదలుచుండ. (మార్కం. ౬ ఆ.)" ఇట్టి ప్రాస స్థలగతప్రయోగమును గనియు 'దూళి' యనుతద్భవపదము నంగీకరింపక దథప్రా సము నంగీకరించి సూరిగారిప్రామాదిక స్థిరపరకనుక్కునుబట్టుకొని శబ్దరత్నాకర వాకన్నెదరె ఇతి వేతి సందేహః" (సం. సూత్రాం. వ్యా. సంధి.) (గబాఃగజడ దబాః) అను సూరిప్రామాదిక వాక్యముసయితము పైవిషయమునకుఁ దోడ్పడు చున్నది. సూరిగారు బాలవ్యాకరణరచనాసమయమునకుఁ బైప్రాఁత యపసిద్ధాం తములను బాపికొని యట్టివానిని బాలవ్యాకరణమునఁ జేరనీయకున్నను ప్రౌఢవ్యాకర్త త్రిలింగలక్షణశేషమున సంధిపరిచ్ఛేదమున నీబాల వ్యాకరణ ములోని ప్రాఁతాదిసంధిసూత్రములను సవరించుసందర్భమున సూరిగారి పురా తనాశయమును స్మరించి కావలయును "అనుకొను లోనగుధాతుజవిశేషణ ముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు ఉదా:—గిరివ్రజమన్పురంబు..." (భార. సభా. ౧ ఆ. ౧౭౨). అని సూత్రించి ధాతుజవిశేషణములు ప్రాఁతాదులలోనివి కావనియు నచటినకారము ద్రుతము కాదనియు నచట సరళాదేశము సమ్మతము కాదనియుఁ దన సిద్ధాంతమును విశదీక రించెను. ఇట్లు కానిచో బాలవ్యాకరణసంధిసూత్రములను సవరించుచున్న యా త్రిలింగలక్షణశేషసూత్రముల సందర్భములో (ప్రౌఢ. ౧౧-౧౨-౧౩-౧౪ సూ.) నీ ౧౩ సూత్రమప్రసక్తము కాఁగలదు.

కర్త యేల వ్రేలాఁడెనో తెలియకున్నది. మఱియు "పెనుంగదుపుల్ గట్టి...(ఆర. ౭ ఆ. ౨౫౮) అను ప్రయోగముచొప్పున స్త్రీసమ పెనుశబ్దము నంగీకరింపక కొంత భిన్న మగు 'పెసుపు' శబ్దపు రూపాంతరములు 'పె - పెసు' శబ్దములని యాతఁ డేల వ్రాసెనో తెలియకున్నది. సూ - రా - నిఘంటుకర్తలు 'కెంపు'శబ్దమునొద్ద 'కెంధూళి' అని ప్రమాదపడి వ్రాసినను 'దూళి' అను వైకృతరూపము నంగీకరించి యీక్రింది రీతిని వ్రాసిరి:—"దూళి వి. (సం. ధూళిః. క. దూళి) రేణువు. క. ఆదూళితోడఁ గుడిచిన । నీదుర్జన్మంబు పచ్చె...(భార. అను. ౪ ఆ. ౫౦) పెంపూళి=పెద్దపూళి. సీ. పెందూళి యెసఁగ నందంద కాల్ద్రివ్వ సు, గ్రతమహీతలము గ్రక్కదలుచుండ. (మార్కం. ౬ ఆ. ౧౦౭ ప.)" (సూ. రా. ని.) బాలవ్యాకరణపక్షమున శబ్దావయవ నకారము ద్రుతము కామింజేసి 'పెను' శబ్దమును బ్రాఁతాదులలోఁ జేర్పనిచో "పెందూళి" (మార్కం. ౬ ఆ. ౧౦౭) (ద్రోణ. ౨ ఆ. ౨౩౯) అను ప్రయోగములందలి ద్రుతకార్యములు సిద్ధింపనేరవుగదా. చింతామణిపక్షమునందును బ్రాఁతాదులలో జేర్చుటకుఁ బ్రతిబంధ మేమియు లేదు.

పరుషపరకత్వమునందలి ప్రయోగములు:—సీ. కెందమ్మిఁ జేఁకులయందంబు గల (భాస్కర. యుద్ధ. ౧౫౨౭) గీ. బలము లేఁ బ్రాయమును రూపుగలుగుసట్టి (అను. ౨ ఆ. ౪౬౦) గీ. కురుబలంబు కెందామరకొలనిఁబోలె (భీష్మ. ౧ ఆ. ౯౬) సీ. అర్పించునప్పు డయ్యంగన కెంగేలి, జిగిసొంపు...(అను. ౧ ఆ. ౪౮) గీ. చిగురు తఱచునఁ గెంజాయ మిగిలి చెలువు, వడయు...(ఉద్యో. ౪ ఆ. ౩౨౧) సీ. నలువ చెందొవలతేఁకులకు నన్నువు పెట్టఁగోరి... । పూర్వపయోరాశిపొంతఁ గెంజాయ చె, న్నొందవిన...(ద్రోణ. ౫ ఆ. ౨౭౫) ఉ. అట్టులు దుస్ససేనుఁ డపయాకృతి... ముందలపట్టి యీడ్వఁగా (ఉద్యో. ౧ ఆ. ౩౪౭) (ముందు+తల=ముందల) శా... ముం । గాలం ద్రోచు మొగంబు వ్రేయు...(కర్ణ. ౩ ఆ. ౨౧౦) (ముందు+కాలు=ముంగాలు) "క్రేగన్ను - దే - వి. (క్రేవ+కన్ను) కడకన్ను. కటాక్షము" (శ. ర.) అనుశబ్దరత్నాకరస్థితిని సవరించుచు సూ. రా. నిఘంటుకారు లిట్లు వ్రాసిరి. "క్రేఁగన్ను. వి. దే. (క్రేవ+కన్ను)..." (సూ. రా. ని.). ఉ... కెం। పెక్కినకంటి క్రేవ చెలువు (భీష్మ. ౨ ఆ. ౩౦) అనుదానినిబట్టి యిందలి పూర్వపదము 'క్రేవ' అనుట సప్రమాణముగనె యున్నది. కాని యీ రెండుకోశములస్థితికిని విరుద్ధముగ నున్న యీక్రింది పాల్కురికిసోమనారాధ్యుని ప్రయోగము (ప్రాసస్థలములోనిది) నరయఁగాఁ బ్రాఁతాదిసంధిలో లుప్తశేషమునకుఁ బరుషపరత్వమందును 'సుక్కు'

రాకపోవుట మనుటదసు తోఁచెడిని. ద్వి. క్రేకంటలింగంబు డాకన్నుసూచి । యీ కంటికిని మందు నీకన్నె కాక (బసవ. ౩ ఆ. ౮౦౭).

ఆధునికకావ్యములందు, "సీ. కెంపువాతెఱనొంపె"...(దశా. ౧ ఆ. ౧౬౪ సూ. రా. ని. కెంపుశబ్దము) "కెంపుపుప్పొడుల్" (చమ. ౧ ఆ. శ. ర. కెంపు శబ్దము) అనురీతిని బ్రయోగములున్నను భారతాదిప్రాచీనకావ్యప్రయోగమూలక మగు బాలవ్యాకరణమున "మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు" అని వ్రాయఁబడుట శంకాస్పదము కాదు. (విస్తర.)

క్రొత్తశబ్దంబున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. ౩౮.

క్రొత్త+చాయ=క్రొంజాయ - క్రొత్త+చెమట = క్రొం జెమట - క్రొత్త+పసిఁడి=క్రొంబసిఁడి - క్రొత్త+కారు= క్రొక్కారు - క్రొత్త+తావి=క్రొత్తావి.

బాలవ్యాకరణ వివరణము. పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

౧౦౦ విషయము. క్రొత్త+గండి = క్రొగ్గండి - క్రొత్త+నన = క్రొన్నన - క్రొత్త+మావి = క్రొమ్మావి. కెంధూళి కెంజెడలని ప్రయోగంబులు గానంబడియెడి. బహుళగ్రహణము చేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబులేదు. క్రీఁగ డుపు - క్రీఁగాలు - క్రీఁదొడ - ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహ ణముచేతనని యెఱుంగునది.

సంజీవని. ౧౦౦ విష:—క్రొక్కారు=వర్షకాలము - క్రొత్తావి = క్రొత్తపరిమ ళము - క్రొగ్గండి=క్రొత్తగాఁ బడినరంధ్రము - క్రొన్నన=క్రొత్తమొగ్గ - క్రొమ్మావి= క్రొత్తమామిడి. కెంధూళి=ఎఱ్ఱనిదూళి - క్రీఁగడుపు=క్రిందికడుపు = పొత్తికడుపు. క్రీఁగాలు=కాలిక్రిందిభాగము - క్రీఁదొడ=తొడయడుగుభాగము.

---

విస్తర. II ౯౯ విష:—"మీఁదు+కడ=మీఁగడ - కెంపు+తామర = కెంబా మర - చెన్ను+తోవ=చెందోవ - ఇత్యాదులందు నిత్యంబు" (విక్ర. టీక. అజం. ౬౫ కా. ౯౭ పు.) అను కవిజనమండనపంక్తులె సూరిగారి పైవ్రాఁతకు మూలమని తోఁచక మానదు.

సమాసమున నుడి తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము గొన్నియెడల లేకుండుటయు, 'గొన్నిటఁ బాక్షికముగా నగుటయు లుప్తశేషమునకుఁ బరుషపరకత్వమునఁ గొన్నింట నుగాగమమగుటయు మఱికొన్నిచోట్లఁ బరహల్లునకు ద్విత్వము వచ్చుటయుఁ బరుషేతరపరకత్వమున నిత్యముగా ద్విత్వమువచ్చుటయుఁ గ్రొత్తశబ్దసంధిలో సూరి తలంచినవింతలు. ఇట్టిలక్షణములు చాలవఱకు "పూవు - కెంపు" మున్నగుశబ్దములందును గన్పట్టుచుండుటంజేసి వానిని బూర్వసూత్రోదాహృతుల నుండి తొలఁగించి యిందుఁ జేర్చి 'క్రొత్తశబ్దమునకు' అనుటకు మాఱుగా "క్రొత్తాదులకు" అని నిల్పుట యుక్తము. కెంపుశబ్దమునకు సరళపరకత్వమునఁగూడ నుగాగమమగుట యింకొకవిశేషము. పూవు కెంపుశబ్దముల పైవిషయము లీవఱకు వ్రాయఁబడియున్నవి. (౯౦ I విష.)

ప్రయోగములు:—సీ. క్రొక్కారు మెఱుఁగుల యుక్కడంచి..(విరా. ౨ ఆ. ౮3) సీ. క్రొమ్మావిచాడ్పున భార్గవుండు (ఉద్యో. ౪ ఆ. 3౨౧) క్రొన్నెత్తురు లేఱులై (శాంతి. ౧ ఆ. ౨౮౭) క్రొమ్మించు (విరా. ౨ ఆ. 3౭) క్రొంబొగ (భాస్కర. యు. ౨౧౯) క్రొంజీఁకటుల్ (వసు. ౪ ఆ. ౧౦) క్రొంజిగురు (దశా. ౨ ఆ. ౨౮౨) క్రొందావులొల్కు (హంస, ౫ ఆ. 3౬౬) క్రొంజాయ (ఇందు. ౫ ఆ. ౧౭3) క్రొమ్మేఘము (భీమ. 3 ఆ. ౮౭).

నుడి తొలియచ్చుమీఁదివర్ణములు లోపింపమికి సూరి యిచ్చినయుదాహృతి 'క్రొత్తకుండలు' అనునది కవిప్రయుక్తముకాదు. గీ. వేఁడినిట్టూరుపోయన వెడలెఁ గ్రొత్త। తావి మాతులు నిచ్చు నెత్తమ్మివిరులు (విరా. ౨ ఆ. ౨3౬).

పూవుకెంపుశబ్దములకు:—పూవుం దీవెలనొప్పు (మనుచ. ౨ ఆ. ౨౨) పూవుఁబోదరిండ్లను (మనుచ. ౨ ఆ. ౫౧) పుప్పొడి ననుకరించు (భీష్మ. ౧ ఆ. ౨౪౨) క. పువ్విలుతు తండ్రియచ్చట...(పాండు. ౫ ఆ. శ. ర.) సీ. కెంపువాతెఱసొంపె... (దశా. ౧ ఆ. ౧౬౪. సూ. రా. ని.) కెంపుపుప్పొడుల్ (చమ. ౧ ఆ. శ. ర.) సీ. కెంగేలు గేలితోఁ గీలించి...(విరా. ౨ ఆ. 3౧౦. అను. ౧ ఆ. ౪౮) తే-గీ. లేయెండ కెంజాయనొప్పె (భీష్మ. ౨ ఆ. ౨౨ ద్రోణ. ౫ ఆ. ౨౭౫ ఉద్యో. ౪ ఆ. 3౨౧) సీ. కెందమ్మితేఁకులయందంబు (భాస్కరరా. యుద్ధ. ౧౫౨౭) గీ. కెందామరకొలనిఁబోలె (భీష్మ. ౧ ఆ. ౯౬) కెమ్మోవియాని (విరా. ౨ ఆ. 3౧౦) (నైష. ౨ ఆ. ౨౬) కెందూళి (భీష్మ. ౧ ఆ. ౨౪౨) (మను. ౧ ఆ. 3౮) చ. ముడిచిన యొంటికెంజడల (మనుచ. ౧ ఆ. ౫౯) (చూ. ౯౯ విష.)

క్రిందు శబ్దమునకు:—గీ. అద్రినేంద్ర । తనయుక్రీ నీడఁ దొలిచె (శాంతి. ౧ ఆ. ౭౧) గీ. తనకుఁ గ్రేదల యని భవత్తనయులకు నె । ఱుంగఁజెప్పిన...(భీష్మ. ౩ ఆ. ౯౭౧) (క్రీఁదలశబ్దమును సూరియుఁ గోశకర్తలును దడవలేదు.) క. ఇమ్మెయిన లాగి యొకవ్రే । తమ్మున క్రినీడ నిలిచి (అను. ౩ ఆ. ౭౫౮) "పొత్తికడుపు క్రీఁగ డుపునా ।...(ఆం. భా. ౨ ఆ. ౧౩౬ సూ. రా. ని.) గీ...మీఁది । గాడ్పు క్రీగా డ్పుతో మేళగించి (పి. శకుం. ౨ ఆ. ౧౧౩. సూ. రా. ని.) దీనిసంధియందును నుత్తరపదాదిద్విత్వము కన్పట్టుచున్నది. ద్విపద. క్రిగ్గాలి దూలఁదాఁకినఁ బొంగి తుదలు । బుగ్గలించిన యట్టి మొగ్గపుష్పములు (బసవ. ౪ ఆ. ౧౨౫) గీ...అందలి క్రీయ్యాట పసిమితేటఁ । బండు (పాండు. ౧ ఆ. ౧౧౮) సూ. రా. నిఘంటువున నిట్లున్నను శబ్దరత్నాకరకోశమునందు 'క్రీ' శబ్దమునొద్దను, కవిజనమండనటీకయందు అజం. ౬౯ కారికటీకయందును 'క్రీయూట' అనురూపమె చూపఁబడెను.

అన్యంబులకుసహిత మిక్కార్యంబులు కొండొకచోఁ । గానంబడియెడి. ౩౯.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరమగునపుడు తొంటియట్లు లోప నుగాగమంబులును, గొండొక శబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోప ద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

బాలవ్యాకరణ వివరణము. ౧౦౧ విషయము.

పది+తొమ్మిది = పందొమ్మిది - తొమ్మిది+పది = తొంబది - వంక+చెఱఁగు=వంజెఱఁగు (స్త్రీపార్శ్వచేలాంచలము. శ. ర.) సగము+కోరు (భాగము)=సంగోరు - నిండు+ వెఱ = నివ్వెఱ. (పారవశ్యము)—నిండు+వెఱఁగు = నివ్వెఱఁగు (పారవశ్యము) నెఱ+తఱి=నెత్తఱి. (నెఱ= నిండు) నెఱ+నడుము = నెన్నడుము - నెఱ+మది = నెమ్మది - నెఱ+వడి=నెవ్వడి. ఇత్యాదులు ప్రయో గంబులవలనఁ దెలియునది.

సంజీవని. ౧౦౧ విష;—:అన్యంబులకుసహితము = ప్రాంతాదులు క్రొత్తశబ్ద మునుదప్పఁ దక్కిన కొన్నిశబ్దములకు సైతము. "నెన్నడుము. వి. బొ. ౧ (నెఱ+నడుము) నట్టనడిమిప్రదేశము..." (సూ. రా. ని.) లేదా "నెఱ...౩ ప్రశ

స్తము...." (సూ. రా. ని.) అనుచొప్పునఁ బ్రశస్తమైన యనఁగా నందమైన కౌను. (విస్తర I).

పయినిజూపఁబడిన "పందొమ్మిది" మున్నగు నుదాహృతులందుఁ బ్రాంతాది సంధిలక్షణములుగాని క్రొత్తశబ్దసంధిలక్షణములుగాని సరిగా లేకుండుటచే నివి యన్యములుగాఁ జెప్పఁబడినవి. పదిశబ్దమునకుఁ దొమ్మిదిశబ్ద ముత్తరపదమగు నపుడుమాత్రమె లోప నుగాగమములు వచ్చునుగాని వేఱొకశబ్ద ముత్తరపదమగు నపు డిట్టి సంధికార్యములు—లోపనుగాగమములుగాని లోపద్విత్వములుగాని— లేవు. ఇట్లే తక్కినవిసయిత మేకైకస్థలవిషయకములై యున్నవి. కాని నెఱశబ్దము మాత్ర మట్టిదికాదు. నెత్తఱి - నెత్తావి - నెత్తమ్మి - నెచ్చెలి - నెవ్వగ - నెమ్మది - నెవ్వడి మున్నగు పెక్కుతావులలో లోపద్విత్వములువచ్చుటయు, "చ...క।వ్వడి నెఱకిన్క కెట్టి మగవాఁడను...(ఉద్యో. ౧ ఆ. ౨౮౭) మున్నగుచోటులం దట్టి లోపద్విత్వములు రాకుండుటయుఁ గలదు. అట్లయినను బ్రాంతాదుల కెల్లయెడ లను, క్రొత్తాదులకుఁ గొన్నియెడలను బరుషపరకత్వమున లోపనుగాగమములు వచ్చుట యనెడి యసాధారణధర్మ మొక్కచోనైన నెఱశబ్దసంధిలోఁ గన్పట్టకుండు టంజేసి యీనెఱశబ్దము ప్రాంతాదులలోఁగాని క్రొత్తాదులలోఁగాని చేర్పఁబడ దయ్యెనని యెఱుంగనగును. (విస్తర II).

---

విస్తర. I ౧౦౧ విష:—"నెన్నడాదులన్నెఱియగు - నెన్నడ - నెన్నడుము. ఇత్యాదులయందు నెఱిశబ్దము పూర్వపదముగా నుండుట యుక్తమని యర్థము. నెఱపూర్ణార్థకము - నెఱిరమ్యార్థకము." (ప్రౌఢ. సంధి. ౧౮ సూ.) శబ్దరత్నాకర కోశమందును నిట్టియభిప్రాయమె 'నె' శబ్దమునొద్ద వివరింపఁబడెను. ఇట్లు త్రిలింగ లక్షణశేషకర్త బాలవ్యాకరణమును సవరింపఁగడఁగెను. కాని పయిసంజీవనిలో వివరించినరీతిని సూరి వచించిన 'నెఱ' శబ్దమును బూర్వపదముగా నంగీకరించినను నసంగతిలేదు. నడుము సన్నముగాఁ జెప్పనగుటంజేసి పూర్ణార్థక నెఱశబ్దమును నిల్పుట యసంగతమని ప్రౌఢవ్యాకర్త భ్రమించెను. మఱెచ్చటను నెఱిశబ్దమున కిట్టి స్థితిలేదు.

విస్తర. II ౧౦౧ విష:—ఇట్టి సూరిగారియాశయమును బరిశీలింపక సుప్రార్థ ప్రకాశికాకర్త యీక్రిందిరీతిని వ్రాయుట సరికాదు. "పందొమ్మిది - తొంబది - వంజెఱుఁగు. ఇత్యాదిరూపంబులు ముప్పదియాఱవసూత్రముచే నగులోపంబుచేతను ముప్పదియేడవసూత్రంబుచే నగు నుగాగమంబుచేతను సిద్ధించుచుండఁగాఁ దిరిగి లోపనుగాగమంబులను విధించుచున్న యీముప్పదితొమ్మిదవసూత్రము 'ముప్పది

ప్రయోగములు:—సీ. నెత్తమ్మిఱేఁకులమెత్తందనము దెచ్చి (విరా. ౨ ఆ. ౫౨) సీ. తెలికన్నుఁగవకు నెచ్చెలిసైన...(విరా. ౨ ఆ. ౬౭) చ. తలఁకి కలంగి నివ్వెఱఁగు దక్కినఁజేష్టలు దక్క...(భీష్మ. ౨ ఆ. ౧౫౭) ఉ. నవ్వుల... । నెవ్వగఁ బొందుచున్...(కర్ణ. 3 ఆ. ౨౬౨ ప.) గీ. వేఁడినిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్త। తావిమూతులు విచ్చు నెత్తమ్మివిరుల (విరా. ౨ ఆ. ౨3).

"ఇత్యాదులు ప్రయోగంబులవలనఁ దెలియునది" అనుటచే 'నాలుగు+నాళ్ళు=నాన్నాళ్ళు - మూఁడు+నాళ్ళు = మూన్నాళ్ళు - వేఁడి+నీళ్ళు = వేన్నీళ్ళు - రెండు+నాళ్ళు=రెన్నాళ్ళు. (విస్తర III). మున్నగువానిని సంగ్రహింపనగును.

యాఱు ముప్పదియేడవసూత్రంబులకు ననువాదసూత్రము' (చెప్పినదానిని దిరిగి చెప్పునట్టిసూత్రము) గాని నూతనవిధిశాస్త్రంబుగాదు......ఆసూత్రము (3౧ సూత్రము.) 'క్రొత్తాదిశబ్దంబుల కాద్యక్షరశేషంబులకుం గొన్నియెడల నుగాగమం బును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు.' ఇట్లున్నయెడల ముప్పది తొమ్మిదవసూత్రములోని ద్విత్వవిధికూడ ననువాదమె యగును గాని నూతనవిధి గాకుండును. కాఁబట్టి ముప్పదితొమ్మిదవసూత్రము ప్రాయికంబుగా స్పష్టార్థము." (బా. గు. ప్ర. ౭౬ పుట.)

విస్తర. III ౧౦౧ విష:—ఇట్లు వేన్నీళ్ళు మున్నగునవి సిద్ధించుచుండఁగాఁ ద్రిలింగలక్షణశేషకర్త యీ క్రిందిరీతిని బూరింప నెంచుట యనావశ్యకమె యనఁ దగును. "౧౫. కొన్నియెడల నవర్ణకంబు పరంబగునపుడు పూర్వపదాంత్యడకారంబు నకారంబగు. ఉ. రెన్నాళ్ళు క. పదిదినము లైదుప్రొద్దులు । పదపడి రెన్నాళ్ళు (భార. ఆది. ౧ ఆ.) మూన్నాళ్ళు. గీ. చెఱఁగుమాసిన మూన్నాళ్ళు సిగ్గుతోడ।... (కాశీ. ౨ ఆ.) వేన్నీళ్ళు. గీ. వెళ్ళనీళ్ళులనొండె వేన్నీళ్ళనొండె (మార్కం. 3 ఆ.)" (ప్రౌఢ. సంధి. ౧౫ సూ.)

మూర్ధన్యడకారముతోఁగూడిన నకారము మూర్ధన్యణకారద్వయమగుట యుక్తమని తలఁచికావలయును బసవపురాణముద్రణసంస్కర్త "సమదాంధగంధ గజంబు లేణ్ణూరు" అని ముద్రింపించెను. కాని యిది కవులహృదయము కాదు. క. రెన్నెల్లదాఁక మీఁదట । నన్నెల్లకయున్న...(భాస్కర. సుందర. ౨౦౨) అని యిట్లు దంత్యనకారద్విత్వమె ప్రాసస్థలనిబద్ధముగఁ బ్రయుక్తమై యున్నది.

సూరి యిట్లు సమాససంధికార్యముల నుపదేశించి యామ్రేడితసంధికార్య ములసూత్రింప నారంభించుటంజేసి త్రిలింగలక్షణశేషకర్త పరిశిష్టములుగఁ దనకుఁ దోఁచినసమాససంధికార్యముల నీక్రిందిరీతిని బేర్కొనెను.

కాన్తి శబ్దాది శబ్దాస్తు । ద్విరుక్తాస్సన్తి నైకకే । సా
ధారణా స్త దన్యేచ । వైచిత్ర్యం భూరివర్తతే (వికృ.
అజం. ౬౫ కా. అహో. 3౫౨ పు.)

అప్రసృతానామజాదీనాం । ద్విరుక్తావన్త్యలోపితా ।
(వికృ. అజం. ౮౧ కా. అహో. 3౬౧ పు.)

నన్నయా క్వచిదన్యవిశేషేస్యుః । కేచిదాదావ్విపన్నకాః ॥ (వికృ.
ధర్వణీయము. అజం. ౬౭ కా. అహో. 3౫3 పు.)

౧౦౭ విషయము. అన్యేషాంచ ద్విరుక్తౌస్యు । ర్భవాంలోపాగమామతాః
(వికృ. అజం. ౮౧ కా. అహో. 3౬౧ పు.)

కుత్రచిత్సర్వశబ్దానాం । పునరుక్తిర్న దోషకృత్ ।
తత్రస్యాద్ద్విత్వమాద్యస్య । సమతాహ్రస్వదీర్ఘయోః
(వికృ. అజం. ౬౪ కా. అహో. 3౫౨ పు.)

కల్పితము. ౧౦౨ విష:—పరరూపసంధివిధానసందర్భమునఁ బ్రసక్తమగుటచే "అప్రసృతానామజాదీనా" మిత్యాద్యర్థర్వమును "అన్యేషాం చే"త్యాద్యర్థర్వమును ౭౪ విషయమున వ్యాఖ్యాతములయినవి. అట్లయినను నిట స్పష్టప్రతిపత్తి కయి మరల వ్యాఖ్యాతము లగుచున్నవి. కాన్తిశబ్ద=తళతళ మున్నగు కాంత్యనుకరణశబ్దములు, ఆది=మొదలగు, శబ్దాస్తు=వివిధానుకరణశబ్దములును, నైకకే=అనేకము, ద్విరుక్తాః=భృశాద్యర్థవిషయకద్విరుక్తిగలవి, సాధారణాః=సకలభాషాసాధారణములై, సన్తి=కలవు. తదన్యేచ=అనుకరణార్థకేతరములగు మఱికొన్ని ద్విరుక్తిశబ్ద

"హలవసానంబులు పరంబులగునపు డేమిశబ్దముయొక్క 'మి' కారమునకు (ఇంకారమున కనునది ముద్రణస్ఖాలిత్యము కానోపును) లోపంబు వైకల్పికంబు. ఉదా. శా....నీ కేబ్రాఁతియే వెన్నలుం । బాలున్...(హరి. పూ. ౫ ఆ. ౨3౪) (బ్రాఁతి=దుర్లభము) క...శవము క్రియ నుండెడిదే (భాగ. ౯ స్కం. ౪౦౮)" (ప్రౌఢ సంధి.౧౬సూ.) సీ. వనరాశిదగు మెత్తఁదన మెఱ్కి యేచుఁటే, బలమని బాడబానలము. దెగడు।కలితనం బెఱుగనికులగిరు లెత్తుటే, వాఁడిమి యని పవివలనఁ బలుకు (నన్నె.కు. ౧౦ ఆ. ౫౨౬ ప.) "షష్ఠీసమాసమందలి నిలలమీఁది యచ్చులకు హల్లుపరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి. శా. పెంపొందు నిద్రన్వలెన్ (ఉ. రా. ౨ ఆ.) తూలె రజనీచరభాస్కరబింబముల్ రుచుల్ (రామా. ౫ ఆ.) అబ్జాసనాండముల్ పెంపు. (చంద్రా. ౧ ఆ.)" (ప్రౌఢ. సంధి. ౧౭ సూ.) మ....అయ్యావిద పల్కు ల్వంటికప్రంపుఁ బల్కులతో...(పాండు. ౧ ఆ. ౨౯).

ములును గలవు. వానియందు,భూరి=మిక్కిలి, వైచిత్ర్యమ్=వర్ణలోపవర్ణాగమాదివి కారవైచిత్రి, వర్తతే=వర్తిల్లుచున్నది; ఉదా:—తళతళలు-తళత్తళలు-నిగనిగలు-నిగన్నిగలు-తళతమనెక్-నిగనిగమ్మనెక్-నిగనిగలాడెన్-"ఘుమంఘుమఘుంఘుమూర్జటీ" 'ధణంధణధాణుధింధిమీమాప్రాత' "ఘల్ఘలాచరనూపురఝాళఝళీ"(కవిపితామహుని యుత్పలమాల) మలమలమాడెన్ - ఫురపురంబొక్కెన్-గనగనననిప్పులు-నిగనిగనిమం వనము మొ. అట్టి ద్విరుక్తిసందర్భమున అద్రుతానామజాదీనాం ద్విరుక్తావన్త్యలోపితా=కళలగు నజాదిశబ్దముల ద్విరుక్తియందుఁ దొలిశబ్దము తుదివర్ణము లోపించును; ఉదా:—ఆహా+ఆహా=ఆహాహా, ఇంచుక+ఇంచుక=ఇంచించుక, నాఁడు+నాఁడు=నానాఁడు మొ. క్వచిత్=ఒకప్పుడు, అర్థవిశేషే=భృశాద్యర్థవిశేషమందు, కేచిత్=కొన్ని శబ్దములు, అదౌద్వివర్ణకాః=ఆద్యక్షరమందుమాత్రమే ద్విరుక్తవర్ణములు గలవి, స్యుః=అగుచున్నవి. అన్యేషాంచ ద్విరుక్తౌ=ఆదివర్ణద్విరుక్తియందు, శబ్దసాకల్యద్విరుక్తులందును, బహులోపాగమాః=వివిధములగువర్ణలోప వర్ణాగమాదివికారములు, మతాః=సమ్మతములగుచున్నవి. ఉదా:—కడ+కడ=క+కడ=క+ట్ట+కడ=కట్టకడ. ఇట్లే-ఎదురు+ఎదురు=ఎట్టయెదురు, అడుకులు+అడుకులు=అ+ం+దు+అడుకులు = అందదుకులు, చెదరు+చెదరు=చెల్లచెదరు, చెల్లాచెదరు, తుమురు+తుమురు = తుత్తుమురు, తునియలు+తునియలు = తుత్తునియలు, మిట్లు+మిట్లు = మిఱుమిట్లు, మొ. ఊరన్+ఊరన్=ఊరూరన్, అప్పటికిన్+అప్పటికిన్ = అప్పటికప్పటికిన్, అప్పటప్పటికిన్, నాటికిన్+నాఁటికిన్ నానాఁటికిన్, నాఁడునాటికిన్. మొ. లెమ్ము+లెమ్ము=లేలెమ్ము - లెమ్ము లెమ్ము, రమ్ము+రమ్ము=రారమ్ము - రమ్మురమ్ము; కొనుము+కొనుము=కొనుకొనుము - కొనుము కొనుము - కోకొనుము, పదుఁడు+పదుఁడు=పదుపదుఁడు-పదుఁడు పదుఁడు పదఁడు+పదఁడు = పదపదఁడు - పదఁడు పదఁడు, హరి+హరి = హరీహరి - హరి హరి; భళి+భళి=భళీ భళి - భళి భళి, వెంటన్+వెంటన్ = వెనువెంటన్ వెన్వెంటన్, తోడన్+తోడన్=తోడ్తోడన్ - తోడుతోడన్ - తోడుతోన్ - తోడ్తోన్ మొ. ఒక్కరు+ఒక్కరు = ఒక్కొక్కరు - ఒక్కరొక్కరు - ఒకానొకరు మొ. (చూ. విస్త. II. ౧౧౬ I విష.).

కుత్రచిత్=ఒకానొకప్పుడు నింద యర్థమగునపుడు, సర్వశబ్దానామ్=ఎల్లశబ్దములకును, పునరుక్తిః=పునరుక్తి, నదోషకృత్ = దుష్టముకాదు. తత్ర=ఆపునరుక్తియందు, ఆద్యస్య=మొదటిపదము మొదటియక్షరమునకు, గిత్వమ్='గి' అనెడియాదేశమగును. హ్రస్వదీర్ఘయోః=హ్రస్వదీర్ఘములకు, సమతా=సామ్యమగును. అనఁగా మొదటిపదము మొదటియక్షరము హ్రస్వమైనను దీర్ఘమైనను యాయక్షరముచోట 'గి' అని

నిల్చును-దీర్ఘమాయెనా 'గి' అనునది నిల్చును-చంద్రుఁడు గిండ్రుఁడు=అథముఁడగు చంద్రుఁ డని యర్థము. రావణుఁడు గీవణుఁడు=నింద్యుఁ డగురావణుఁ డని యర్థము. (ఆహా॰ ౩౫౭ - ౩౫౩ - ౩౬౧)

ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చు మీఁదివర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం

బాలవ్యాకరణ బగు. ౮౦.

వివరణము. ఈసూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు

౧౦౨ I విషయము. విషయం బని యెఱుంగునది. కడ+కడ = కట్టకడ - ఎదురు+ఎదురు=ఎట్టయెదురు. కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము - పగలు - పిడుగు - బయలు-మొదలు. ఇత్యాదులు కడాదులు.

సంజీవని. ౧౦౨ I విష:—పయి యథర్వణకారికలయర్థమునె సూరి బా. సంధి. ౮౦-౮౧-౮౨-౮౯ ప్రకీ. ౨౨ సూత్రములచే వివరించెను. (విస్తర I.) ఆమ్రేడితము=రెండుసారులు పలుకఁబడినశబ్దములలో రెండవశబ్దము. (చూ. ౭౮ II విష.) అదంతంబగు ద్విరుక్తటకారంబు = 'ట్ట' అనురూపము. భృశము=అత్యంతము ద్విరుక్తంబు=రెండుసారులు పలుకఁబడినది. తెరువు=తెన్ను=మార్గము. "మింటి తు ట్టందుదిదాఁక వైచి (భాస్క. యు. ౨౬౮) అని యింకను వింతప్రయోగము కన్పట్టుచున్నది. కావుననేకదా యథర్వణుఁడు "బహుళలోపాగమాముతాః" అని వచించెను. "మూలము (అథర్వగ్రంథము) దేశ్యవైచిత్రిని...తననాఁటి కిట్టివి లేమినో స్పష్టపఱుపదయ్యె" (బా. సా. వే. ౧౦౩ పు.) అనుపేటికావ్యాఖ్య సరికాదు.

---

విస్తర. I ౧౦౨ I విష:—త్రిలింగలక్షణశేషమునఁ బరిశిష్టములుసంగ్రహింపఁబడెను. ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నిటి కిందు నిగాగమంబగు. (ఇందున్ = కర్మధారయమునందు - )గనగనని నిప్పులు స్వా- ౮ ఆ ......" (ప్రౌఢ. సమా. ౧౨ సూ.) ధ్వన్యనుకరణశబ్దంబుల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమంబగు. ఉదా. కనకన మను - (రామా. ౬ ఆ.)...(ప్రౌఢ. సంధి. ౧౯) ధ్వన్యనుకరణశబ్దంబులు ద్విరుక్తంబులయగు; ఇయ్యవి క్రియావ్యవహితంబులునగు. ఉ. వడవడ జమదగ్ని సూతివడఁకెన్. (రామా. ౮ ఆ.) ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు. లేలెమ్ము - పోపొమ్ము (ప్రౌఢ. సంధి. ౨౦. ౨౧. ౨౩ సూ.)

తిక్కనయె యిట్టివానినిఁ బ్రయోగించె. గీ. పట్టపగలింటిసూర్యునిపగిది (కర్ణ. ౩ ఆ. ౧౮ ప.) చ....తనబీరముకాఁగొని విట్టువీఁగెడున్ (ద్రోణ. ౨ ఆ. ౪౬).

తొలియచ్చుమీఁదివర్ణంబులస్థానమున 'ట్ట' అనునది విధింపఁబడుటచే నీవిధి ప్రౌఢాదిసంధిసందర్భమున నుపదేశింపఁబడుట సుసంగత మగుచున్నది. వెనుకటి బా. సంధి. ౧౦ సూత్రములోని యామ్రేడితసంధి వ్యస్తపదవిషయకము, పరరూప సంధివిషయకమును; ప్రకృతసూత్రములోని ద్విరుక్తస్థలములు వ్యస్తస్థలవిషయకములు కావు. ఇవి కర్మధారయసమాసమువంటివి. (విస్తర. II) అట్లగుటచేతనే వీనిలో విభక్తిలోపాదికము సంభవించుచున్నది. ఉదా:—కట్టకడకు - పట్టపగలింటి

---

విస్తర II. ౧౦౨ [1] విష:—"కర్మధారయవదుత్తరేషు (౮. ౧. ౧౧) ఇహ ఉత్తరేషు ద్విర్వచనేషు (సంభ్రమము - అత్యంతము మున్నగునర్థములందలి ద్విరుక్తములందు) కర్మధారయవత్కార్యమ్. ప్రయోజనం సుబ్లోపపుంవద్భావాన్తోదాత్తత్వాని" (వార్తి. ౪౬౮౯). (సి. కౌ. ౨౧౪౬ సూ. పుట). "క్రియాసమభిహారేచ. (వార్తి. ౪౬౯౭)......నిత్యవీప్సయోరితి సిద్ధేభృశార్థేద్విత్వార్థమిదమ్......" "నిత్యవీప్సయోః. (౮ - ౧ - ౪) ఆభీక్ష్ణ్యే (పౌనఃపున్యము=మాటిమాటికి) వీప్సాయాంచ (కార్త్స్న్యము = ఇంటింటికి) పదస్య ద్విర్వచనం స్యాత్" (సి. కౌ. ౨౧౪౦ సూ.) ఇట్లు భృశార్థమందే కాక పౌనఃపున్యార్థమందు వీప్సార్థమందు మఱికొన్ని యర్థవిశేషములందును ద్విరుక్తులు కల్గును. ఉదా:—తెల తెల్లగా = ఈషదూనమగు తెలుపుగా మొ. సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధమగుటచే నీవిషయమును సూరి యుపేక్షింపఁగాఁ ద్రిలింగలక్షణశేషకర్త వివరించెను "ఆదరార్థంబున ద్విరుక్తియగు. కృష్ణకృష్ణ - హారిహారి మొ. అత్యంతార్థంబునందు నగు. ఘోరఘోర. కటకటా. మొ. కొన్నియెడలఁ ద్వరితానాదరార్థంబులు రెంటను నగు. లేలెమ్ము - పోపొమ్ము. మొ. కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతంబులగు. ఒండొండ - తరతరమ. (ఇట నర్థవిశేషము క్రమముగా ననుట)" (ప్రౌ-శబ్ద. ౧౧౧ - ౧౧౨ - ౧౧౩ - ౧౧౪ సూ.)

పయిప్రౌఢవ్యాకరణసందర్భములో నాదరార్థమున ద్విరుక్తి యనుట శాస్త్రవిరుద్ధము. కృష్ణ కృష్ణ - హారి హారి యనుచోటులం దాదరాతిశయార్థమున ద్విరుక్తి కల్గెను. కాన నట్టివి ప్రౌఢ. శబ్ద. ౧౧౨ సూత్రపుభృశార్థద్విరుక్తికే లక్ష్యములని గ్రహించునది.

"మిక్కిలి యనునర్థమున రెండుమాఱులు పలుకఁబడునవే యీవిధికి (బా. సంధి. ౪౦) విషయములని యీక్రింది (సూరిగారి) వివరణమున కభిప్రాయము.

సూర్యుఁడు. మొ. కట్టకడ మున్నగు నీసూత్రములోని యుదాహృతులందెల్ల "అత్యంతము కడపటిది" మున్నగురీతి నత్యంతార్థము గ్రహింపవలెనని "యీ సూత్రమునకు భృశార్థమునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది" అను సూరిగారివాక్యమున కర్థము.

ఎదురుశబ్దమునకు ద్విరుక్తిలో "ట్ట" అనునది రాకుండుట యీక్రిందిసోమయాజిప్రయోగమునఁ గన్పట్టుచున్నది. క...నాయెదురెదురన్ । విప్పచ్చుఁ జూపి సేనలు । క్రొప్పుఱ బలుకులను లిట్లు ద్రోణుఁడు పలికెన్ (విరా. ౪ ఆ. ౧౮౯).

"ఆచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగనగు" (బా. సంధి. ౧౦ సూ.) అనుసూత్రములోని 'తఱచుగ' అనుదానిచే సూరి యుదాహృతిలోని "ఎట్టయెదురు" అనుచోటి సంధ్యభావము సమర్థిత మగుచున్నది. (విస్తర III.) గీ. ఇంత యొప్పునె యుడులోక మెట్టయెదుర (కాశీ. ౪ ఆ. ౧౮౬ ప.) (చూ. ౭౪ III విష.)

ఆదరాద్యర్థముల ద్విరుక్తములయినవి దీని కుదాహరణములుగావని భావము. కాన పౌరాారే త్యాదులం దీనిధిగలుగదు." అను వేటికావ్యాఖ్య (బా. సా. వే. ౧౦౩ పు.) కేవలము ప్రామాదికము. శాస్త్రవిరుద్ధము. 'పౌర' మున్నగునవి కడాదులలోనివి కాకుండుటచే దీనికుదాహరణములు కావయ్యెనుగాని యవి భృశార్థద్విరుక్తులు కావనుట సరికాదు.

ప్రయోగములు:—క. నిండె సమయాబ్దములు......। నిండె ననుము నిండె ననుము నిక్కంబునకున్ (విరా. ౫ ఆ. ౩౭౦) క. రక్షింపుము రక్షింపుము రక్షింపుము యనిన......(ఆది. ౨ ఆ. ౨౧౭) ఇందు భృశార్థమునఁ ద్విరుక్తిప్రయోగింపఁబడెను. ఆ. వె. పరఁగు పొదరు పొదరు, పల్లంబు పల్లంబు । మ్రాను మ్రాను దుర్గమంపు చోటు । దుర్గమంపుచోటు, దొనదొన, గుహగుహ, । యాదిగాఁగ నెందు నరసి యరసి ॥ (విరా. ౩ ఆ. ౨౦౪) ఇందరసి యనునది భృశార్థద్విరుక్తి, తక్కినవెల్ల వీప్సార్థ ద్విరుక్తులు. తే. గీ... ..ఇతని। నెయిదు మెయిదుము.............(విరా. ౩ ఆ. ౨౦౪). ఇందు సంభ్రమాతిశయార్థకద్విరుక్తి. ఆ-వె....వినుదాసినే దాసినే। ...(సభా. ౨ ఆ. ౨౪౪). ఇందలిది యాక్రోశాతిశయార్థకద్విరుక్తి.

విస్త III. ౧౦౨ [I] విష:—"అదంతద్విరుక్తటకార మాదేశముగాఁ గల్గుననుటంజేసి యాద్విత్వటకారముపైనుండి అకార మత్వసంధికి విషయమై పోరాదనియు" (బా. సా. వే. ౧౦౩ పుట.) అను వేటిక సరికాదు. 'కట్టకడ' మున్నగు చోట్ల 'అ' కారయుక్త 'ట' కారస్థితి వెలయుచుండుటచే "అదంత"త్వోక్తికిసార్థక్యము గల్గియుండును. మఱియు నిట నత్వసంధికన్న, బ్రాయికమగు నామ్రేడితసంధి

ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు. ౪౧.

అప్పటికిన్+అప్పటికిన్ = అప్పటప్పటికిన్ - అప్పటికప్పటికిన్; అక్కడన్+అక్కడన్ = అక్కడక్కడన్ - బాలవ్యాకరణ వివరణము. అక్కడ నక్కడన్; ఇంటన్+ఇంటన్ = ఇంటింటన్ - ఇంట నింటన్; ఊరన్+ఊరన్ = ఊరూరన్ - ఊర ౧౦౩ విషయము. నూరన్.

ఇంచుక - నాఁడిత్యాదులందు బహుళగ్రహణముచే నంతిమాక్షరలోపంబునగు. ఇంచుక+ఇంచుక = ఇంచించుక - ఇంచుకించుక; నాఁడు+నాఁడు = నానాఁడు - నాఁడునాఁడు.

సంజీవని. ౧౦౩ విష:—ఈసూత్రము వ్యస్తపదసంధివిషయకమైయైనను బూర్వపదాంత్యవర్ణలోపప్రస్తావమునను నామ్రేడితసంధి ప్రస్తావమునను నిట నుపదేశింపఁబడుట సుసంగతమె యననగును. 'అప్పటికిన్+అప్పటికిన్' అనుచోఁ బ్రకృత సూత్రముచొప్పున విభక్తి లోపించుపక్షమున "అప్పటి+అప్పటికిన్ = అప్పటప్పటికిన్" అని సిద్ధించును. ఇట నామ్రేడితపరకస్వరపరరూపసంధి బా. సంధి. ౧౦ సూత్రముచొప్పున సంభవించెనని యెఱుంగునది. ఇంక విభక్తిలోపాభావపక్షమున బా. సంధి.౯ సూత్రముచే సంధి నిషేధింపఁబడినను నేమ్యాదులలో 'కి' షష్ఠినిబఠించిన సామర్థ్యమునఁ బాక్షికసంధిపక్షమున ౬౬ II విషయమునఁ జెప్పబడినరీతిని ద్రుతలోపము కల్గి పరరూపసంధి రాఁగా "అప్పటికప్పటికిన్ అప్పటికినప్పటికిన్" అను రూపములు సిద్ధించును. బా. సంధి. ౧౦ సూత్రములోని ప్రాయికసంధికి ద్రుతప్రకృతికములు కాని 'ఔరౌర - ఆహాహా' మున్నగుస్థలములందుఁ బ్రవృత్తికల్గుచుండుటచేత నిరవకాశవిధి కామింజేసి బా. సంధి. ౯ సూత్రపునిషేధమును బాధింపఁజాలదు. పయిరీతినె - 'అక్కడన్+అక్కడన్' అనుచో నైతము విభక్తిలోపపక్షమున నోపవిభక్తిక సప్తమియగు 'అన్' అనునది లోపింపఁగా "అక్కడ+అక్కడన్ = అక్కడక్కడన్" అని సిద్ధించును. విభక్తిలోపాభావపక్షమున "అక్కడ నక్కడన్" అను రూపము గల్గును. ఇట్లె "ఇంటింటన్ - ఊరూరన్" అనురూపములను సాధించుకొనునది.

---

కావలసియున్నది. కాని బా. సంధి. ౧౦ సూత్రములోని "తఱచుగ" అనుదళము చేతనే 'ఎట్టయెదుర' మున్నగుచోటులందుఁ బరరూపసంధి కలుగ దయ్యె ననుటయె లెస్స. (చూడు. విస్తర. II. ౭౪ III విష).

'అక్కడన్+అక్కడన్' అని యుదాహరించుటలోఁ బరపదాంతిమద్రుతస్వరమవసాన స్థలమగుటచే లోపించుట నిర్బాధము, కాని పూర్వపదాంతిమద్రుతస్వరము స్వరపరకమగుటం జేసి బాలవ్యాకరణపక్షమున లోపింపనేరదు గాన "అక్కడను+అక్కడన్" అనికాని "అక్కడను+అక్కడను" అనికాని సూరియుదాహరించుట యుక్తము. అట్లయినను జింతామణికృద్వ్యాఖ్యాతపతనవాసనావాసితుఁడై సూరి యిట్లుదాహరించుచుండునని తోఁచెడిని. "ఇంచుక+ఇంచుక" అనుచో సూరి వివరణముచొప్పున సంఖ్యాక్షరలోపపక్షమున "ఇంచించుక" అనియు లోపాభావపక్షమున 'ఇంచుకించుక' అనియు రూపముల నెఱుంగునది (విస్తర I. II.) సీ...రారాపు చనుబోయి రాయిడి (మను. చ. ౧ ఆ. ౫. కాశీ. ౧ ఆ. ౯౦) ఇంచించుక (భాగ. ౧ స్కం. ౯౫.)

విస్తర I. ౧౦౩ విష:—"దీన నిపియు (అపుడు) దీనింబోలు నిపు డెపుడులును గతిచిద్విభక్తులలో నేకవచనములందుమాత్రమె ప్రయుక్తములగు నవ్యయము లనుట స్పష్టము" (బా. సా. పే. ౧౦౫ పు.) ఇవి యప్పుడు మున్నగువానిరూపాంతరములగుటఁజేసియు నప్పుడు మున్నగునవి యవ్యయములు కామింజేసియు పై పేటికావ్యాఖ్య సరికాదు. (విస్తర. I ౮౭ II విష. ౨౧౧ I విష.) అపు డిపు డెపు డనునవి కతిచిద్విభక్తులలో నుండుననుటయు సరికాదు "అపుడు - అప్డు - అనునవి యితరవిభక్తులతోఁ గూడియుండవు." (సూ. రా-ని. అప్పుడు శబ్దముకొద్ద)

'అప్పటప్పటికిన్' అనుచో "అప్పటి+అప్పటికిన్ - ఇచ్చోఁ నేమ్యాదిసంధికి నిత్యప్రవృత్తిగలుగును—"(బా. సా. పే. ౧౦౭పు.) అనుపేటికావ్యాఖ్య. ప్రమాదికము. 'అప్పటి+అప్పటికిన్' అనుచో బా. సంధి. ౧౦ సూత్రముచొప్పున నామ్రేడితప్రాయస్సంధి వర్తిల్లుచుండఁగా నేమ్యాదిసంధిని దెచ్చిపెట్టనేల? ఏమ్యాది సంధి వైకల్పికమైయుండ నిట దానికి నిత్యప్రవృత్తిని గల్పింపనేల?

విస్తర II - ౧౦౩ విష; —"అక్కడన్+అక్కడన్:—ఆచోటును లేక యాదిక్కును అని యర్థముచేసిన నిది ద్వితీయాంతమగును. - — పొల్లు నకారము ద్వితీయాచిహ్నము లోపించిన 'అక్కడ+అక్కడ' అని యగును. పిదప నత్వసంధికేని యపదాదిస్వరసంధికేని నిత్యప్రవృత్తిగల్పించిన 'అక్కడక్కడ' అనురూప మేర్పడును" (బా. సా. పే. ౧౦౫ పు.) అనుపేటికావ్యాఖ్య కేవలము ప్రామాదికము. 'అక్కడన్' అనునది ద్వితీయాంతమనుచు ద్వితీయానకారలోపము గల్గునపు డది 'అపద'మనుట కీతఁ డెట్లు సాహసించెనో తెలియకున్నది. 'అక్కడ'శబ్దమాపవిభక్తికమై యుండ దాని ద్వితీయారూపము 'అక్కడన్' అని యెట్లగునో తోఁచకున్నది.

ప్రయోగములు:—ఆ. వె. బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ । డెచట నెచట నెవ్వ రెవ్వరి నేమేమి । సేసె...(ఉద్యో. ౩ ఆ. ౪౦౪) ఎచటను+ఎచటను=ఎచట నెచటను. ఇది విభక్తిలోపాభావోదాహృతి. ఎవ్వరిని+ఎవ్వరిని = ఎవ్వరి+ఎవ్వరిని= ఎవ్వ రెవ్వరిని. ఇది ద్వితీయావిభక్తిలోపమున కుదాహరణము. విభక్తిలోపము గల్గినపిదప బా. సంధి. ౧౦ సూత్రముచొప్పున ప్రాయస్సంధికల్గెను. గీ. పాయు నేఁటేట నొక్కొక్క? డాయతముగ (సభా. ౨ ఆ. ౨౪౨) ఇక్కడిక్కడ భవద్దర్పంబు గ్రక్కింతు. (ఉ. హరి. ౪ ఆ. ౨౬౫) క. ఆసాసలవచ్చితి నను । గాసింబెట్టి... (శాంతి. ౩ ఆ. ౧౫౩) ఆసలను+ఆసలను = ఆసాసలను. బాలవ్యాకరణపక్షమున 'లన్' అనునది ద్వితీయాప్రత్యయముకాదు. అయినను లట్టు విభక్తులకుఁ బూర్వాగమముగాన విభక్తులతోపాటుగ లోపించునని యెఱుఁగునది. వ్రాని వ్రానికిని (అర. ౬ ఆ. ౯౫ ప.) ఇంటింటికి (భాస్కరరా. యు. ౪౨౫ ప.) ఆమ్రేడితము రూపాంతరము నిల్చుటయుఁ బ్రయోగదృష్ట మగుచున్నది. ఉ. ఒక్కఁ డొకం డనేకవిధయుద్ధజయంబులు...(ఉద్యో. ౨ ఆ. ౧౬౨) క. కలఁడు కలం డనెడువాఁడు (భాగ. ) ఉ. ఏమిమహాద్భుతం బిది హరీహరి యెక్కడి యాంధ్ర శబ్దచింతామణి (బాలసరస్వతీయపీఠిక) "హరిహరీ దాని సౌందర్యమగునె పొగడ; భళిభళీత్యాదయోబహవః" (అహో. ౩౬౧ పు.) స్రగ్ధర. ఆలోకింపంగ నుగ్రం బగుజలనిధి యంతంతటన్ గంటి మంతన్ (ఆర. ౭ ఆ. ౧౬) అంతన్+అంతటన్ = అంతంతటన్ - ఇచట - 'అంత+అంత=అంతంత' అని సాధించి పిదప దానిసప్తమ్యంత రూపమును 'అంతంతటన్' అనుదానిని సాధించుకొనుట యుక్తమేమో? సీ. నానాఁటి కుప్పొంగు నవకంపు...(రాఘ. ౨ ఆ. ౩ ప.) మున్నగునవి పైప్రక్రియకు హస్తావలంబ మొసంగుచున్నవి. 'ఇంటికిన్+ఇంటికిన్=ఇంటింటికిన్' అని సిద్ధించునట్లు 'నాఁటికిన్+నాఁటికిన్=నాఁటినాఁటికిన్' అని సిద్ధించుట కన్పట్టదు. 'నాఁడు నాఁటికిన్' అని

---

మఱియు నిట సప్తమ్యర్థకద్వితీయ యని తానే మీఁద వ్రాసెనుగదా. ఔపవిభక్తికము 'అక్కడ'శబ్దమునకు సప్తమీవిభక్తియందు, బా. అచ్చి. ౩౮ సూత్రము'చొప్పున' అత్వము'వచ్చునని'యేల తలంపఁడయ్యెనో బోధపడకున్నది. మఱియుఁ బైరీతినే "ఇంచుకయించుక యను నత్వసంధ్యభావమున యడాగమముకలిగినరూపమును సభ్యముగాఁ దోఁచెడి" (బా.సా.వే. ౧౦౬ పు.) అని వ్రాసెను. ఆమ్రేడితసంధిస్థలములలో (బా. సంధి. ౧౦సూ.) నత్వేత్వాది సంధిశాస్త్రములకుఁ బ్రవృత్తి యెట్లు? 'ఇంచుక యించుక' అనెడి సంధ్యభావ మామ్రేడితపరకత్వమున నెట్లు పొసఁగును?

యేర్పడుట కలదు. కావుననేకదా యథర్వణుఁడు "బహులోపాగమాపతాః" అని మాత్రమె వచించినవాఁడయ్యెను.

బాలవ్యా. అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౪౭.

౧౨౪ విషయము. అందదుకు - ఇఱ్ఱింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదరు - చెల్లాచెదరు - తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు - ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౧౨౪ విష:—అదుకు+అదుకు = అందదుకు = మిక్కిలి యదుకు; ఇంకులు+ఇంకులు = ఇఱ్ఱింకులు = మిక్కిలి యింకుటలు, ఇగ్గులు+ఇగ్గులు = ఇల్లిగ్గులు = మిక్కిలి వెన్నకొలఁగుటలు; మిక్కిలి వెనుదీయుటలు, చెదరు+చెదరు = చెల్లచెదరు - చెల్లాచెదరు = మిక్కిలి చెదరునది, తుమురు+తుమురు = తుత్తుమురు = మిక్కిలి సన్నని చూర్ణము, తునియలు+తునియలు = తుత్తునియలు = మిక్కిలి చిన్నతునుకలు, మిట్లు+మిట్లు=మిఱుమిట్లు = కన్నులు మిక్కిలిగ మిట్టుటలు, మిట్టుట = ఎగురుట = త్రుళ్ళుట. (విస్తర.)

ప్రయోగములు:—మ...రాక్షసాం! గననే నందదుకైన యయ్యెడలు చెక్కల్ వాపెదన్...(హరి. ఉ. భా. ౧ ఆ. ౧౫) సీ...గృహదైవతంబు లిఱ్ఱింకు లింక (ఆము. ౪ ఆ. ౪౩ సూ. రా. ని.) క....। ఇల్లిగ్గులు గానవచ్చు హృదయము లోనన్ (ఉ. హరి. ౫ ఆ. ౧౧౮) సీ...నల్గడలఁ జెల్లచెదరుగాఁగ (భాస్క. రా. యు. ౪౭౨ సూ. రా. ని.) క. అనిలాస్త్రంబు ప్రయోగిం। చిన నది చొక్కాకు లట్ల చెల్లాచెదరై (హరి. ఉ. భా. ౬ ఆ. ౧౩౫ సూ. రా. ని.) ఉ...శైలముల్। తుత్తుమురై వడిం జెదరి తూలఁగ (భాస్క. రా. యు. ౯౧౦ సూ. రా. ని.) సీ... తుత్తునియలుగా బిట్టు ద్రుంచి త్రుంచి (విరా. ౫ ఆ. ౩౫) క. చూపులు మిఱు

---

విస్తర - ౧౨౪విష;—"మిట్లు+మిట్లు = మిఱుమిట్లు = చూచుట కశక్యమైన తేజస్సును జూచుటచే దృష్టి పలురంగులుగలదగుట యర్థము॥"(బా - సా - పే౧౦౭ పుట)-ఈవ్యాఖ్య సరికాదు - "మిట్టు - దే - అ - క్రి. ఎగురు-మిట్టించు" "మిఱుమిట్లు-దే-వి-బ. (మిట్లు+మిట్లు)కన్నులు మిక్కిలి మిట్టుట" (శ - ర)మిఱుశబ్దమునకునుమిఱుమిట్లుగలదనునర్థము గలదు. "మిఱు - దే. విణ - మిఱుమిట్లు గలది - క. మిఱుచూపులుగలిగి విభుఁడు మీనం బయ్యెన్(భాగ - ౧స్కం)క-దట్టపుఁ దుఱుముసుమీఁదికి। మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుజూడ్కుల్। నట్టాడు నడుము—(భాగ - ౯ స్కం - )" (శ - ర).

మిట్లు గొనఁగ । నేపారిన...(ద్రోణ. 3 ఆ. 3౪) ఇత్యాదు లనుటచే పఱువట్లు - తొప్పదోఁగు మున్నగువానిని గ్రహింపనగును. క. వదనము పఱువట్లు వట్టె (విరా. ౨ ఆ. ౮౮) వట్టు = ఎండుట. వట్టులు = వట్లు+వట్లు = పఱువట్లు = మిక్కిలి యెండుటలు. ఇట్లె - తోఁగు + తోఁగు = తొప్పఁదోఁగు = మిక్కిలి మునుఁగు. ఉత్సాహ. తుములబాణపటలవృష్టిఁ దొప్పదోఁగి (అర. ౭ ఆ. ౭౬) ఉ...నెత్తుటం । దొప్పఁగఁ దోఁగియున్న. (హరి. పూ. ౮ ఆ. ౪. ౪.) "తొప్ప - విణ - అధికము తొప్పన్+తోఁగు=తొప్పఁదోఁగు=తొప్పఁగఁ దోఁగు" అని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. ఆ. వె. వేడ్క మిగిలి వేనవేలభంగులఁ గొని । యాడియాడి... (అర. ౭ ఆ. ౩౪౪) వేలు+వేలు = వేనవేలు = అనేకసహస్రములు. విఱ్ఱవీఁగె డున్ (ద్రోణ. ౨ ఆ. ౪౬) వీఁగు = నిక్కు. వీఁగు+వీఁగు = విఱ్ఱవీఁగు = మిక్కిలి నిక్కు. సీ. ఒండొంటితోఁ బిఱుపీఁకులాఁడు. (ఆము. ౬ ఆ.) (శ. ర) పీఁకు = పెనఁగు. పీఁకు+పీఁకు = పిఱుపీఁకు=మిక్కిలి పెనఁగులాఁడు. శా...వగబుద్ధిం బీఁకుపీఁ కాడఁగాఁ । జేష్టాహీనతఁబొంది...(ద్రోణ. ౫ ఆ. ౩౨౦) అని సోమయాజి ప్రయో గించెను. "ముచ్చు ముఁడిగె (హరి. ఉ. భా. ౫ ఆ. ౮౮) ముడుఁగు+ముడుఁగు = ముచ్చుముడుఁగు = మిక్కిలి ముణుఁగు.

బాలవ్యా.
౧౦౪ I విష.

నిందయం దామ్రేడితంబు నాద్యక్షరంబులకు హ్రస్వ
దీర్ఘంబులకు గిగీలగు. ౨౨. (బా. ప్రకీర్ణపరిచ్ఛేదము.)
కుంభకర్ణుఁడు గింభకర్ణుఁడు, రావణుఁడు గీవణుఁడు.

సంజీవని. ౧౦౪ I విష:—భీష్ముని+భీష్ముని = భీష్ముని గీష్ముని. ఇందలి రెండ వదగు 'భీష్ముని' అనుదానిచో 'గీష్ముని' అని నిల్చెను - దానికి "అల్పుఁడగు = బల హీనుఁడగు" అని నిందార్థము నెన్నునది. క. తఱుముఁడు భీష్ముని గీష్ముని...(భీష్మ. ౨ ఆ. ౧౫౦ ప.) శా. వాలిం గీలియు వాయుపుత్త్రు సరియే...(నిర్వ. ౭ ఆ. ౯౯. మ...సాత్యకిన్ గీత్యకిం । బలభద్రున్ గిలభద్రు...(ఉ. హరి. ౪ ఆ. ౧౩౨) మొ)

ఇచ్చు విభక్త్యన్తిమస్య జేరలిచ. (ఆం. చిం. సంధి.
౧౧ కా.) (అహో. ౨౨౮ - ౨౨౯ పుటలు.)

నన్నయా
ధర్వణీయము
౧౦౫ విషయము.

సాశ్రయా నాశ్రయా పిస్యా । తత్రార్థగతసప్తమీ ।
(వికృ. అజం. ౧౬ కారి. అహో. ౨౬౭.)
అలాగ్యమః స్యా దంద్వం ద్వో । ర్భవేదిన్ జసి చేతయోః
తథా తోడవిభక్తేశ్చ । సమాసే కవిసమ్మతేః ॥ (వికృ.
సంధి. ౨౮ కా. అహో. ౨౨౮ పు.)

కల్పతరువు. ౧౦౪ పిష:—విభక్త్యస్త్యస్య='చేతన్' మున్నగు విభక్తిప్రత్యయముల తుదివర్ణముచోటు, ఇచ్చ = ఇకారాదేశమును నగును. విభక్తితుదివర్ణమున కికారాదేశముచేయుటచే నీసమాసమున విభక్తిలోపము కలుగదనియు నిది యలుక్సమాసమగుననియు మిశ్రమును గానోపుననియు, విభక్తిలోని తుదివర్ణమున కాదేశించుటచేత విభక్తి తుదిని జేరుద్రుతముసయితములోపించుననియు నెఱుంగునది - పై విషయము లిందలి 'ఇచ్చ' అనుచోటి చకారము వలనను వ్యక్తమగుచున్నవి- ఉదా: - నీచేతన్+అగు+ప్రోపు=నీచేత్+ఇ+ప్రోపు=నీచేతిప్రోపు. చ. ఒకరునిచేతి ప్రోపును (ఉద్యో. ౩ ఆ. ౭౭౫). ఇట్లె 'నాతోడి చెలిమి, నీవలనిభయము' అనువాని ప్రక్రియను నెఱుంగనగును. జేః = సప్తమీవిభక్తియొక్క యంతిమవర్ణమునకు, అలిచ=అలి యనునాదేశమును నగును. పయిరీతినె యిచటను విభక్తి లోపింపదనియు దాని తుదివర్ణమునకు ద్రుతముతోడిదానికి 'అలి' అనునాదేశ మగుననియు నెన్నవలెను. "అన్విందునాస్తుసప్తమీ" అనుసప్తమీవిభక్తులలో 'అందున్ ఇందున్' అనువాని తుదివర్ణమునకే యల్యాదేశమని గ్రహింపవలెను. ఉదా:-నాయందున్+ఉన్న+కరుణ=నాయందలికరుణ - (నాయంద్+అలి+కరుణ.) ఇందున్+ఉన్న+వారు= ఇంద్+అలి+వారు. = ఇందలివారు మొ.

'అందున్' అనెడిది విభక్తిప్రత్యయ మగుటయే కాక ప్రత్యేకపదముగను బ్రయోగింపఁబడుచున్నదని యధర్వణుఁడు వివరించుచున్నాఁడు. తత్రార్థగత సప్తమీ = ఆస్థలమం దనునర్థముగల సప్తమీప్రత్యయరూపశబ్దము, సాశ్రయా = ప్రకృతి యనునాశ్రయముగలదియు, అనాశ్రయా = అట్టియాశ్రయ మక్కఱలేని ప్రత్యేకశబ్దమును, స్యాత్ = అగును. ఉదా:—సాశ్రయము—నాయందున్ - రామునియందున్. మొ. అనాశ్రయము - అందున్ - అందులన్ - అందులకున్ - అందులవారు - అందలివారు - అందుండి. మొ. 'జేరలిచ' అనుసూత్రములోని చకారముచేత 'అందులవారు' మున్నగురీతినుండుటయేకాక 'అందలివారు' మున్నగు రీతి నల్యాదేశస్థితియు సాధువే యని విశదమగుచున్నది. 'అందులయొక్క+వారు' అనుషష్ఠీసమాసమున "షష్ఠీభవేద్వితీయాతుల్యా..." అనుచోప్పున "అందులన్+వారు" అని యేర్పడును. పిదప "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అనుచోప్పున ద్రుతలోపము రాఁగా "అందులవారు" అనురూపము సిద్ధించును. ఇట్లె "ఇందులవారు - ఎందులవారు' మున్నగువానిని సైతము సాధింపనగును. 'అందులన్' మున్నగునవి సప్తమ్యర్థకములనియు'అందులపుష్పములు'మున్నగునవి 'అందులనుండు పుష్పములు' అనురీతిని మధ్యమపదలోపిసమాసములనియు సప్తమీతత్పురుషము లనియుఁ గ్రహింపరాదు. కం. అందులహోమాంబుజముక! రందరసాస్వాదమ్ముదు

ఉరశ్వాసనుండు...(అర. ౩ ఆ. ౩౫౬ ప.) మున్నగు మిశ్రసమాసములందు సప్తమీతత్పురుషము నుత్తరపదలోపసమాసమును జింతామణిసమ్మతములు కానేరవు. చ.... క్రొమ్ముడులందులపుష్పముల్ పయిం ; వోరఁగ...(ఆది. ౭ ఆ. ౧౭౫) కం....ఇందులజీవన మేల సమ్ముదుక...(ఆది. ౬ ఆ. ౨౭౮) ఎందులదానవు (ఆది. ౪ ఆ. ౧౭౨) 'ఇందు' అనునది ప్రత్యేకప్రకృతియే కాని సప్తమీప్రత్యయము కాదని "సవిధవర్తినామింపు" అనుచింతామణిసూత్రమె విశదీకరించుచున్నది. 'ఇందు' అనుదానికి 'అలి' అనునది వచ్చుటకుమాత్రమె "అంస్విందునాస్తు సప్తమీ" అని చింతామణిలో సూత్రింపఁబడెను. ఇట్లగుటచేత 'ఎందు' అనుదానికి 'అలి' రాదనియు వ్యక్తమగుచున్నది.

చింతామణిసూత్రములలోని 'విభక్త్యన్తిమస్య' అనుదానిచే "చేత - తోడ - వలన" లు మాత్రమె గ్రహింపఁబడుననియు, 'జేకలిచ' అనుదానిచే 'అంద్విదు' లు మాత్రమె గ్రహింపఁబడుననియు నివి (ఇ-అలి) యాగమములన్నను ననవచ్చుననియు నథర్వణుఁడు వచించుచున్నాఁడు. కవిసమ్మతేః=మహాకవిప్రయోగసమ్మతి గల్గియుండుట వలన, సమాసే= ఉత్తరపదలోపసమాసమందు, అంద్విందోః= 'అందు - ఇందు' అను రెండిటికిని, అల్యాగమః= 'అలి' అనునాగమము, స్యాత్ = అగును. జసిచేతయోః= పంచమీవిభక్తియగు 'వలన' వర్ణకమునకును 'చేత' ప్రత్యయమునకును, తథా = అట్లె, తోడవిభక్తేశ్చ = తోడప్రత్యయమునకును, ఇత్ = హ్రస్వేకారాగమము (ఇత్+జసి = ఇజ్జసి) భవేత్ = అగును. ఉదా:—'నావలనన్ + ఇ + భయము' అనుచో సామాసికద్రుతలోపమును, (౫౭ విష.) ప్రత్యయాగమాద్యచ్పరకనిత్యసంధియుఁ (౬౯ విష. ౭౫ I విష.) గల్గఁగా "నావలనిభయము" అనురూప మేర్పడును, ఇట్లె తక్కినచోటులను సాధించునది.

బాలవ్యాకరణ వివరణము. ౧౦౫ I విషయము.

చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులందగు. ౪౩.
నీచేతన్ + ప్రోపు = నీచేతిప్రోపు, నాతోడన్ + చెలిమి = నాతోడిచెలిమి, నీవలనన్+భయము=నీవలనిభయము.

సంజీవని. ౧౦౫ I విష:—పయి నన్నయాథర్వణవచనములను సూరి. ౪౩-౪౪ సూత్రములతో వివరించుచున్నాఁడు. ఈయిత్వము చేతాదుల తుదియకారమునకు ద్రుతసహితమయినదాని కాదేశముగా నిల్చునని వ్యాఖ్యచేసినను చేయనగును. అల్యాగమసాహచర్యమున దీని నాగమముగా నెంచినచో నిట సామాసికద్రుతలోపముచేసి "అఫ" దాదిస్వరసంధిచేసినచో (బా. సంధి. ౧౧ సూ.) "నీచేతి

ప్రోపు" మున్నగురూపములు సిద్ధించును. నీచేత సంభవించు ప్రోపు మధ్యమపద లోపసమాసము నెన్ననగును. మధ్యమపదలోపము నంగీకరింపనిచో చేతాది విభక్తులకుఁ బ్రోపు మున్నగువిశేష్యములతో నన్వయము దుర్ఘట మగునుగదా. విభక్తిప్రత్యయముల కిత్వవిధానముచేసిన సామర్థ్యమున నిట సమాసవిభక్తి లోపింపనేరదు (బా. సమా. ౨౫ సూ.) గ్రహింపవలెను. వెనుకటిస్థలములందు వలెనె యిచటను సూరి "నీచేతను+ప్రోపు" అని చూపుటయె యుక్తము. సరళాదేశము చేయనియవస్థలో హల్ పరకత్వమున ద్రుతమునకు స్వరలోపముకలుట బాలవ్యాకరణపక్షమున దుర్ఘటముగదా.

"నీచేతఁ గలుగు ప్రోపు = నీచేతిప్రోపు - నీవలన నగుభయము = నీవలని భయము-నీతోడ నగుచెలిమి = నీతోడిచెలిమి" అని యిట్లంతటను నుత్తరపదలోప సమాసవిగ్రహములను గల్పించుకొనవలయును. "అత్ర సామానాధికరణ్యానువృత్తే స్తద్గుణార్థః అగమార్థత్వేనోహ్యః" (అహో. ౨౫౯ పు.) అని యిట్లుగ నిత్వము నకె యట్టియర్థమును గల్పింపవలెనని యహోబలపతి యభిప్రాయపడెను. "నీచేతను+ప్రోపు" మున్నగుచోట్ల సామర్థ్యము కుదురుపడమింజేసి సమాసవిగ్రహమె యసంభవమగుటచే నాగమమువచ్చుటకుఁ బ్రసక్తియె యుండదుగాన నిట నుత్తర పదలోపిసమాసము నంగీకరించుటే యుక్తము. (విస్తర.)

---

విస్తర. ౧౦౫ । విష:—కీర్తిశేషులగు కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు నాకొసంగిన బాలవ్యాకరణద్వితీయముద్రణము పుస్తకపుమార్జినులో నీసూత్రమునొద్ద నీక్రిందిరీతిని వ్రాసిరి "అనేకపదములకు 'ఇ' త్వము వచ్చును—అక్కడి, అప్పటి, పాలి, ఇచ్చటి, ఇంటి; తోడు+ఇ, వలను+ఇ; Not తోడన్+ఇ." ఇది సరికాదు - వారు చూపినశబ్దములందెల్ల నౌపవిభక్తికములగు 'ఇ - టి-ంటి' అనునవి నిల్చియున్నవనుట యుక్తమైయుండఁ గ్రొత్తగా నిత్వమును గల్పింపనేల? తోడుశబ్దమౌపవిభక్తికాంత మనుట కవిసమ్మతముకాదు. "ఆడుతోడునునుబుట్టవె" (మనుచ. ౪ ఆ. ౧౭౭ ప.) సాహాయ్యార్థకమగు 'తోడు' శబ్దమౌపవిభక్తికాంత మనుట కవిసమ్మతము కాదు. "సాహాయ్యమందు - సాయ్యముచేత" అను తృతీయా సప్తమ్యంతములకుఁ బర్యాయముగా నౌపవిభక్తికములకువచ్చు నత్వముతోఁ గూడినరూపము 'తోడన్' అనునది ప్రయుక్తమగుట యెచ్చటను లేదు. శబ్దచరిత్ర పరిశీలనమున 'తోడన్' అనునది 'తోడు' శబ్దసంబంధియై యుండిన నుండునేమో కాని చిరకాలముక్రిందటనే వానిసంబంధము మిక్కిలి యెడపడినది. "వానితోడి వైరము" మున్నగుచోటులందు "వానిసాహాయ్యము సంబంధమున నగువైరము"

అబుర్థము రానేరదుగదా. "ఉ. వాసవితోడికయ్యమునకు" (శాంతి. ౧ ఆ. ౯) అనుచో 'వాసవిసాహాయ్యమున నగుకయ్యమునకు' అని యర్థమనుట కేవలము నసంగతముకాదా. కాన "తోడివాఁడు. విణ - (తోడు+వాడు.) (తోడన్+వాఁడు - అని - శ. ర.) కూడనుండువాఁడు." (సూ. రా. ని.) ఇట్లు చింతామణి బాలవ్యాకరణసమ్మతమగు శబ్దరత్నాకరచ్ఛేదము నుపేక్షించి సూ. రా. నిఘంటు కర్తలు వ్రాయుట సరికాదు. ఈమార్గముననేయున్న "సుబంతస్వతంత్రశబ్దములె ప్రత్యయములుగ లెక్కింపఁబడుట, సమాసముల నెల్లెడల నొవవిభక్తికవర్ణములె గలిగె ననుటయు దాన 'చేయి, వలను, తోడు' ల కనుట సరసమనియుఁ దోఁచెడి" (బా. సా. పే. ౧౦౮ పుట) అనెడి పేటికావ్యాఖ్యయు సరికాదు. పురాతనకాల మున 'చేత - తోడ - వలన' ప్రత్యయములు 'చేయి - తోడు - వలను' శబ్దముల యాపవిభక్తికరూపములమూలమున వెలసిన వెలసియుండవచ్చునుగాని చాల కాలముక్రిందటనే వానికిఁ బరస్పరభేదము విస్తరించినది. ఈవిషయమునఁ దోడ శబ్దమునకుమీఁద శాంతిపర్వపద్య ముదాహరింపఁబడినది. చేత వలనల కుదా హృతులు:—"చ. ఒకరునిచేతిప్రోపునుదదున్నతిప్రాపును గల్గి,....." (ఉద్యో. ౨ ఆ. ౭౭) ఇట నొకనిమూలమున ననఁగా నొకనికారణమున నగుప్రోపని యర్థము వివక్షితముగాని యొకనిహస్తముచేత లేదా యొకనిహస్తమునందుఁ గలుగుప్రోపని కాదు. సీ...భూసురవరులవలన। వేదంబులును ధనుర్వేదాదివిద్యలుఁ గఱచుచు (ఆది. 3 ఆ. ౧౨) ఇట్టియెడ 'ఉపాధ్యాయాదధీతే' అనురీతి నపాదానపంచమి యనుటయుక్తముగాని 'వలను' శబ్దాపవిభక్తికరూపమనుట సరికాదు. బ్రాహ్మణుల దిశయం దభ్యసించిరనుట సంగతమగు కాదుగదా. ఇట్లె చ. నరనుతుఁడైన భీము వలనం బ్రభవించె హిడింబకున్ సుతుం। దురుతరభీమరూపుఁడు ఘటోత్కచ నాముఁడు,...(ఆది. ౬ ఆ. ౨3౫) ఇట భీముని దిశయందు హిడింబకు సుతుం డుద యించె ననుట సంగతముకాదుగదా. ఈక్రిందిచోటుల 'చేత వలన' ప్రత్యయములు కావనియు 'చేయివలను' శబ్దములరూపములె యనియుఁ జెప్పుట యుక్తము— "తరల - పారినివారలచేతియున్నత భూరుహాయుధముల్...(అర. ౧ ఆ. ౧౧౮) క. తనచేతిపువ్వములఁ జ। ల్లిన...(అర. 3 ఆ. ౧౦౯) ఇట్టియెడలఁ దనచేతిలో నున్నపువ్వములు మున్నగురీతి నర్థము సుసంగతమై యుండును. ఇట్లె ఆ. వె. అతనివలనఁ బ్రీతిఁజేసి (అశ్వ. ౨ ఆ. 3 ప.) సుతులవలని నెయ్యము (ఉద్యో. ౨ ఆ.) ఇట్టి స్థలములందు సుతులయందుఁ గలప్రీతి మున్నగురీతి నర్థ చేయుటయె సుసంగతమై యుండును. ఇట్టియెడల—వారలచేతి యున్నతభూరు

అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు. ౨౮.

బాలవ్యాకరణ నాయందున్ + కరుణ = నాయందలికరుణ - ఇందున్+
వివరణము. జనులు = ఇందలి జనులు - ఎందున్ + వారు = ఎందలి
౧౦౬. విషయము. వారు. ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు
లేదంద్రు.

సంజీవని. ౧౦౬ విష:—ఇచటసయుతము 'అందు'న కలిగాగమవిధానము సామర్థ్యముననే సామాసికవిభక్తిలోపము (బా. సమా. ౨౫) రాదు. కాన నిదియు నలుక్సమాసమె యనఁదగును. "నాయందును+అగు+కరుణ = నాయందును+అలి+

---

హాములు - తనచేతిపుష్పములు - అతనివలనఁ బ్రీతి - సుతులవలని నెయ్యము— బా. సంధి. ౨౩ సూత్రముచేత నిత్యమువచ్చెనని చెప్పరాదు. పైస్థలములందుఁ బ్రత్యయపరమగు నర్థమునకుఁ బ్రసక్తియేలేదు. కాన నట్టియెడల సంబంధషష్ఠీ సమాసముచే నర్థమును సమర్థించుకొనవలెను. "చేతిపుష్పములు = చేతియొక్క పుష్పములు = చేతిసంబంధమగుపుష్పములు = చేతిలోని పువ్వులు" అనురీతి నర్థమును సందర్భపఱిచికొనవలయును. 'పీతాంబరమువాఁడు - అరపదిమోములవేలుపు' మున్నగుచోలందు "పీతాంబరముయొక్క+వాడు = పీతాంబరముగలవాఁడు; అర పదిమోములయొక్క+వేలుపు=అరపదిమోములుగలవేలుపు" అని యర్థము చేయుట ప్రసిద్ధమేగదా. ఇట్లె "మహిలోనిరాజులన్ (సభా. ౧ ఆ. ౧౧౯) మున్నగుచోటు లందును 'నొపవిభక్తికలోను శబ్దపుషష్ఠీసమాసముచేతనే సమర్థించుకొనవలయును. చేతాదిప్రత్యయములకును చేయిప్రభృతిశబ్దములకును నర్థము భేదించినట్లు లోను శబ్దమునకును లోప్రత్యయమునకును నర్థము భేదింపకుండుటచేఁ జింతామణికర్త 'లో' ప్రత్యయమునకు నిత్యమును విధింపవలసిన ప్రసక్తిలేదయ్యెనని గ్రహింప వలెను. "ఇచ్చువిభక్త్యంతి మస్య—క. లలినాదేశములగుని। త్తులు సమ సనములను జేతతోడ వలనలో। పల ననునివి మొదలగుపలు। కులతుదిఁ దల కట్టులకు వికుంఠతనూజా" (అప్ప. ౫ ఆ. ౮౮ - ౮౫ ప.) అని 'లోపల' యనుదానిని సైతము చేత తోడవలన ప్రత్యయములతో నప్పకవి జోడించుట సరికాదు. "లోపల" అనునది నిర్ధారణార్థమందె ప్రత్యయముగాఁ జింతామణిచే నంగీకరింపఁబడెను. "మనుష్యులలో క్షత్రియుఁడు శూరుఁడు" మున్నగు నిర్ధారణస్థలములలో సమా సము దుర్ఘటముగాన నిత్యమునకుఁ బ్రసక్తియేలేదు. ఇంక నధికరణార్థకత్వమున దానికిఁ బ్రత్యయత్వకల్పనమే యనావశ్యకము. అపు డది విభక్త్యర్థాభిధాయక శబ్దముగనె యెన్నఁబడును.

కరుణ'' అనుచో సామాసికద్రుతలోపమువచ్చిన (బా. సంధి. ౨౮ సూ.) పిదప 'అలి' అను "అపదము" పరమగుటంజేసి బా. సంధి. ౧౧ సూత్రముచొప్పున నిత్యసంధి జరుగఁగా 'నాయందలికరుణ' అనురూపము సిద్ధించును. ఇట్లె తక్కినచోటులందును సంధిప్రక్రియ నెన్నునది. (విస్తర.) పూర్వసూత్రమునందువలెనె యిందును నుత్తర పదలోపసమాసము నంగీకరింపనిచో నంద్వాదిసప్తములకు విశేష్యాన్వయమే సిద్ధింపక యేకార్థత దుర్ఘటమగును. 'ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు' అనుట సరికాదు. చింతామణిప్రక్రియ వలననే 'ఎందు' శబ్దమున కలిగాగమము కాదని వ్యక్తమగుచున్నది. (చూ. ౧౦౫ విష. కల్పతరు.)

'అందున్ - ఇందున్ - ఎందున్' అనునవి యంద్వాదులని సూరి యుదాహృతులవలనఁ దెలియుచున్నది. 'అందు' అనునది సప్తమీప్రత్యయమును బ్రత్యేక ప్రకృతియునై యున్నది. (౧౦౫ విష. కల్పతరు.) ఇవి యేకత్వమున సప్తమ్యర్థకములుగా మాత్రమె కన్పట్టుచున్నవి. అందుండి - అందుమీఁదన్ - అందులోనన్ ఇత్యాదిరూపములును గన్పట్టుచున్నవి. బహుత్వమున (అందులయొక్క+వారు = అందులవారు = ఆస్థలమున నున్నవారు.) శేషషష్ఠీసమాసములును నలిగాగమాంత రూపములును 'కు' ప్రత్యయాంతరూపములును సప్తమ్యర్థక ద్వితీయాంత రూపములును (విస్తర. II) భారతమునఁ గన్పట్టుచున్నవి:—క...అందా । శ్వినులు...

---

విస్తర. I ౧౦౬ విష:—"అందు మొదలగువానికి అలిగాగమము పరంబగునపుడు "ఉకారసంధి నిత్యముగా నగునేకాని 'ప్రథమేతరవిభక్తి' అను రెండవ సూత్రంబున వికల్పము ప్రవర్తింపదు. కావున 'నాయందలికరుణ' అనియేకాని 'నాయందునలికరుణ' అను ననిష్టరూపం బుండదని భావము.''(బా. గు. ప్ర. ౮౧ పు. ద్వి. ము.) అనుప్రకాశికావ్యాఖ్యప్రామాదికము. దీని ననుసరించియే వ్రాయఁబడిన "ఈయలిగాగమము పరమగునపుడు ౨ సూత్రముచే నందునకు సంధి గలుగదని యెన్నవలెను. 'నాయందు నలివారు' గాదనుట...'' (బా. సా. పే. ౧౦౯ పు.) అనెడిపేటికావ్యాఖ్యయుఁ బ్రామాదికమె. "అలి'' అనునది 'అపదము' కాన నిట బా. సంధి. ౧ - ౨ సూత్రములకుఁ బ్రసక్తిలేదు బా. సంధి. ౧౧ సూత్రముచే నిత్యసంధియే సంభవించును. కాఁబట్టి "ఉకారసంధి నిత్యతను'' వ్యాఖ్యానమూలమున సంపాదించుకొననక్కఱలేదు. "అందు - ఇందు - ఎందులు కళలనెడి (బా. సా. పే. ౧౦౯ పు.) పేటికావ్యాఖ్య యీవఱకె నిరస్తమయ్యెను. (౮౨ II వి.)

విస్తర. II ౧౦౬ విష:—అర్వాచీనకవులు, అందులకై - ఇందులకై ఇందుకై - ఇందుకున్ - అందునకున్ - అందునన్ - అందుచేతన్ - అందు

(ఆర. 3 ఆ. ౧౯౦) క...అందు । ద్భవమయ్యె (ఆర. 3 ఆ. ౧౯౮) ఆ. వె. అందుఁగొంద అధికహాస్యంబుసేసిరి (ఆర. ౨ ఆ. ౧౦౨) గీ...ఇందిందువంశ । పరశురాముండు ముహుహాంసపథముఁజేసె. (ఆర. 2 ఆ. ౬౨౬) ఇందుఁ దొల్లి (ఆర. 3 ఆ ౨౨౧ గద్య.) సీ. ఇక్ష్వాకు యతిబాల యిందుద్భవంబగు । దౌహిత్రలాభంబు...(ఆది. ౬ ఆ. ౨౮౭) ఉ...వచ్చితి యెందుఁ బోయిరొకో వారనినన్ (ఆది. ౮ ఆ. ౨2) సీ. ఇభరాజగమన నీవెందుల కరిగి తత్కూరుకుచాభోగ యెందున్నదాన । వబల...(ఆర. ౨ ఆ. ౧౩౨) ఎందేనినుండివచ్చె (ఆది. 3 ఆ. ౧౭౧ ప.) క. ఎందుండివచ్చి తిందుల । కెందుండఁగ నీకు నిష్టము...(ఆది. ౫ ఆ. ౨౧3) ఇందుల కేమికారణంబున వచ్చి తనిన (ఆర. ౨ ఆ. ౧౭౫) క. చనుదెంచె నయోధ్యనుండి సరినిందుల కా । తని (ఆర. ౨ ఆ. ౧౭2) ఉ. ఏల సురాపభామ వయి యెందులదానవు నీవు నావుడున్ (ఆది. ౭ ఆ. ౧౫౨ ప) క. ఎందుండివచ్చి తిందుల । కెందుల కేఁగెదు మహామునీశ్వర (ఆది. ౮ ఆ. ౨3౧) ఉ...ఏ । నందుల కేఁగుదాననొ ।...(ఆర. ౨ ఆ. ౨౦3) క...ఇం । దులకు న్వచ్చితిమి దుష్టదూషణ

---

కొఱకున్ - అందువలనన్ మున్నగురీతిని బ్రయోగించిరి. సీ. వేటె యొక్కండులకై (బహుళా. ౫ ఆ. ౧౨౯ సూ. రా. ని.) అందు కచ్చెరువూన (చంద్రా. 3 ఆ. ౬ సూ. రా. ని.) ఉ. ఇందులకై వగంబొగులనేఁటికి (మనుచ. 3 ఆ. ౬3) చ... ఇందులో ననినన్ (జై. భా. ౫ ఆ. ౧33 సూ. రా. ని.) చ...ఇందుకై కనలకు (ఆము. ౬ ఆ. ౨౭ సూ. రా. ని.) కం...నీవిందుకుఁ దగుయత్నము...(జై. భా. ౫ ఆ. ౧౬౮ సూ. రా. ని.) గీ. జలధి మథియింపుఁ డందునఁ । గలుగు (దశా. ౨ ఆ. ౭౫ సూ. రా. ని.) అందునఁ గనలి (రామా. 2 ఆ. ౨౭౮ సూ. రా. ని.) చ. తలవరులార రంగపతిధామమునందున ... (విప్ర. ౫ ఆ. ౨౮ సూ. రా. ని.) ఉ...తమి నెందుకుఁగాక...(ప్రభా. ౨ ఆ. 2౧).

"అందుండి - ఇందుండి - ఎందుండి - అంద్వాదీనాంశక్తి మన్నాత్ర తాపిక్వచిత్ అందునుండి - అందులనుండి - అతఏవ - అందువలన - అందుకొఱకు - అందుదనుక - ఇందుదనుక ఇత్యాదిరూపాణిసాధూని" (అహో. 3౬౨ పుట.). పయి యహోబల పతివాక్యమున 'ఇష్యతే' అనుదానిని జేర్చి—"సాశ్రయానాశ్రయాపిస్యాత్..." (౧౦౫ విష.) అను నథర్వణవచనమునకుఁ బునరుక్తిగా నథర్వణకారికనుజూపి "అంద్వాదీనాంశక్తిమన్నా । త్ర తాపి క్వచిదిష్యతే" (బా. సా. వే. ౧౦౭ పుట.) అని యథర్వణుఁడు ప్రాతిపదికముపై కొన్నిప్రత్యయములతో నుండఁదగుటను సూచించినాఁడు" అని వేటికావ్యాఖ్యాతవ్రాయుట పొరపాటు.

బుద్ధిన్ (సభా. ౧ ఆ. ౧౮౮) (ఇవి యతిప్రాసస్థానగతము.) క. ఇం। దులజీవన మేల నమ్ముదురు తత్వజ్ఞుల్ (ఆది. ౬ ఆ. ౨౭౯) క. అందుల హేమాంబుజముక। రంద... (అర. ౩ ఆ. ౩౪౬) చ ... క్రొమ్ముడులందులపుష్పములల్ పయిం। దొరఁగ (ఆది. ౮ ఆ. ౧౩౪) ఇట్టిస్థలములందెల్ల "అందులయొక్క+హేమాంబుజములు = ఆస్థలము సంబంధమైన హేమాంబుజములు = ఆస్థలమందలి హేమాంబుజములు" అనురీతిని శేషషష్ఠీసమాసమును గ్రహింపవలయును. క....ఔరసుఁ డందులోన ముఖ్యుం డనయన్ (అను. ౨ ఆ. ౨౪౪) ఇందలి 'అందులోన' అనునది యధికరణార్థకవిభక్తి యని తలంచి కావలయు నర్వాచీనులు "అందునన్ - అందువలనన్" మున్నగురీతిని బ్రయోగింపసాగిరి. పరిశీలింపఁగా "అందు - లోనన్" అనునవి ప్రత్యేకపదము లనియు వానిషష్ఠీసమాసమున "అందు+లోన్ = ఆయుదాహరించిన పుత్త్ర భేదముల సందర్భము మధ్యమున" అనునర్థము లభించుననియు గ్రహించుట యుక్తమని తోఁచెడిని. వ. నీయందుల మాకు నొండు కార్యంబు గలుగుటం జేసి (సభా. ౧ ఆ. ౧౮౭) క.... నేనొక్కనిఁ గంటి నిప్పు డిందుల నతఁడున్. క. మనబాసనీఁడు... (వి రా. ౨ ఆ. ౯-౧౦ ప. సూ. రా. ని.) పై నిజూపిన - 'నీయందులన్-ఇందులన్' అను రెండు స్థలములు "నీయొక్క + అందులన్ = నీసంబంధమైనస్థలమందు, ఇందులన్ = ఈస్థలమందు" అని యిట్లు సప్తమ్యర్థకద్వితీయాబహువచనరూపములని గ్రహింపవలెను.

పయినుదాహరించిన 'అందుల - ఇందుల' అనువానికిఁ బర్యాయము లనఁదగు "అందలి - ఇందలి" అనురూపములును భారతమునఁ గలవుగాని యవి "ఇం। దుల జీవన మేల నమ్ముదురు..." (ఆది. ౬ ఆ. ౨౭౮) క. ఇం। దులకున్ వచ్చితిమి దుష్ట దూషణబుద్ధిన్" (సభా. ౧ ఆ. ౧౮౮) అనువానివంటిమార్పరాని యతిప్రాసస్థల ఖచితములు కావు. అట్లయినను 'అలి' గాగమము నన్నయాథర్వణోపదిష్టముగుటం జేసి యాయాభారతదృష్టప్రయోగములు కవిప్రయుక్తములె యని విశ్వసింపనగును. వ. అందలి మునులెల్ల (ఆది. ౪ ఆ. ౬౪ గద్య.) వ. తనయందలి యభిలాషయు (అర. ౪ ఆ. ౧౨౪ గద్య.) వ. నీయందలి పుణ్యతీర్థంబులు (అర. ౧ ఆ. ౩౪౭ గద్య.) ఈమూఁడుస్థలములందును 'అందలి' అనియే వావిళ్ళవారిముద్రణము నందును వేమూరివారిముద్రణమందును శ్రీవిక్రమదేవవర్మమహారాజావారిముద్రణ మందును నున్నవి. చ. అరిగినయప్డు పెద్దలగునందలివిప్రుల...(ఉద్యో. ౧ ఆ. ౩౬౪) వ. ఇందలి యందలి బంధుమిత్త్ర (ఉద్యో. ౧ ఆ. ౩౭౭ గద్య.) కం. సుయో। ధనుతో నిందలి పెద్దలు...(ఉద్యో. ౨ ఆ. ౩౦౦) వ. అందలి విప్రు లెదురువచ్చి

(ఉద్యో. ౩ ఆ. ౧౪౩) సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డంపలి, యింపలి విలుకాండ్రకెల్ల గురుఁడు (ఉద్యో. ౪ ఆ. ౨౯) చ. అరయఁగ భీముకంటె గదయందలి కౌశల మెక్కు డీమహీ। శ్వరునకు (శల్య. ౨ ఆ. ౧౧౬ ప.) తే-గీ. అంగనాజనమ్ములకు రహస్యరక్ష। ణంబునందలిశక్తి (శాంతి. ౧ ఆ. ౭౧) క. ..తత్త్వం బును మహాబ్ధియందలితరఁగల్ (అను. ౪ ఆ. ౨౩౧)క...పోరులయందలి మరణము (అను. ౫ ఆ. ౬౫)ఉ. ..అందలి మాన్యులు సంస్తుతింపఁగన్ (మహా. ౧ ఆ. ౬౬) వావిళ్ళవారిముద్రణమందును వేమూరి వారిముద్రణమందును నాయొద్దనున్న తాళ పత్త్రమాతృకలందును పై చోటులం దెల్ల "అలి" గాగమప్రయోగమె వెలయు చున్నది. విస్తరభీతి నుదాహరింపనయితిని గా యిట్టి వింకను ననేకములు గలవు (విస్తర III.)

---

విస్తర. III ౧౦౬ విష:—"ఇట్లి అలిగాగమము లకారముపై ('అందుల' అనుదాని లకారముపై) నికారము సమాసమునరాఁగాఁ గలిగె ననఁదగును." (బా. సా. పే. ౧౨౯ పు.) అను పేటికావ్యాఖ్య సరికాదు. "అందుల+ఇ=అందులి" అనికదా యేర్పడవలయును.

"ఎంద్విత్యనేన కిమపరాద్ధమ్. అనెడి యహోబలపండితీయపు వాక్యమును బట్టి ఎందునకుఁగూడ నల్యాగమము నంగీకరించె. అంద్వాదిశబ్దత్రయము నధి కరణలక్షణాభిధాయకములగు దేశ్యశబ్దములుగాన వీనిని సప్తమ్యంతములుగా నెన్ని యల్యాగమము చేయనగునని యహోబలపండితయాశయము" (బా. సా. పే. ౧౨౯ పుట.) దీనినిబట్టి పేటికావ్యాఖ్యాత యీక్రిందియహోబలపండితీయవాక్య ముల కపార్థముచేసికొని పైరీతిని వ్రాసెననఁదగును "అంద్విత్యస్యసాశ్రయత్వ మనాశ్రయత్వ మప్యస్తీతి...ఇంద్విత్యస్యతుకేవల మనాశ్రయత్వేన విభక్తిత్వా భావాత్. అత్రేత్యవ్యయపర్యాయత్వమేవేతి తస్య విభక్తిత్వేనోపాదానం కథ ముపపన్నం స్యాత్? కిఞ్చతస్య విభక్తిత్వేన గ్రహణే ఎంద్విత్యనేన కిమరాద్ధమ్... ఇతిచేత్ సత్యమ్. సామాన్యాకారేణ అంద్వితిగ్రహణాత్ 'అందలిపువ్వ జొంప ములు' ఇత్యాది ప్రయోగఃసిధ్యతి. ఇందు గ్రహణఫలంతు 'ఇందలి రత్నసాను వులు' ఇత్యాదిసిధ్యర్థ మేవేత్యవధారయ" (అహో. ౨౬౩ పు.) విభక్తితరమగు 'ఇందు' శబ్దపు తుల్యన్యాయమున 'ఎందు' శబ్దమును "అంద్విందు నాస్తుసప్తమీ" అనుసూత్రమున విభక్తిగా నేల పరిగణింపరాదు. అదిచేసిన యపరాధమేమి? అను శంకరాఁగా నహోబలపతి 'అందు' శబ్దమునకువలెనె 'ఇందు' శబ్దమునకును 'అలి'

శబ్దాత్తచ్ఛబ్దాతః. (ఆం. చిం. సంధి. ౪ కా. అహో.
కల్పయా ౧౯౭ పు.)
౧౦౭ విషయము. సంబన్ధేక్వచిదర్థఃస్యా । దసంబన్ధే విలక్షణః. (వికృ.
సంధి. ౨౬ కారి. అహో. ౨౨౪ - ౩౦౬ పుట.)

కల్పతరువు, ౧౦౭ విష:—శబ్దాత్ = సమాసమందలి పూర్వశబ్దమునకంటెఁ బరమైన, తచ్ఛబ్దాతః = తచ్ఛబ్దహ్రస్వాకారమునకు, లుగ్వాస్యాత్ = లోపము విభాష నగును. 'చారేరుపథాత్మనశ్చలుగ్వాస్యా' త్తనుసూత్రమునుండి "లుగ్వాస్యా" త్తను నవి యనువృత్తము లగును. ఉదా:—'రామునియొక్క+అది' అనుచో 'షష్ఠీభవే ద్వితీయాతుల్యే' త్యాదిసూత్రముచే 'రామునిన్+అది' అని యేర్పడును, 'ద్రుతస్య సర్వసర్వత్రలుక్సమాసేషు' అనుచోప్పున ద్రుతలోపము రాఁగా 'రామువి+అది' అని యగును (౨౭౦ విష.). అట్టియెడఁ బ్రకృతసూత్రముచే 'అది' శబ్దపు 'అ' కారము లోపింపఁగా 'రామునిది' అను రూప మేర్పడును. 'నీయొక్క+అది' మున్నగుస్థలములు షష్ఠీభవేది త్యాదిసూత్రమునకు విషయములు కామింజేసి 'శబ్దేభ్యోయుష్మదాదిభ్య' ఇత్యాదిసూత్రము (౨౭౧ విష.) చొప్పున షష్ఠీసమాస మంగీకరింపఁబడుటచే 'నీయొక్క+అది=నీ+అది=నీది' అను రీతి రూపములు కల్గును. 'మీది-నీవి-మీవి-నాది - మాది - నావి - మావి-తనది - తనవి - తమది - తమవి - మనది - మనవి' అనువాని నిట్లె సాధించునది. 'దిస్స్యాత్సంబన్ధార్థే' ఇత్యాదిసూత్రములు (౨౯౧ I విష.)

---

గాగమమువచ్చుటకై దాని సందుశబ్దముతోపాటు విభక్తిప్రత్యయముగాఁ బరిగణించుటసంభవించెనని సమాధానము చెప్పెను. దీనిచే "ఎందు" శబ్దమునకు 'అలి' గాగమము రానేర దనునర్థము లభించుచుండఁగా నీసందర్భమునుబట్టి 'ఎందు' శబ్దమున కలిగాగమమువచ్చునని యహోబలపతి యంగీకరించెనని విపరీతార్థము చేయుట కేవలము పొరపాటు.

"ఎందుశబ్దమునకు అలి అనునది వచ్చుటలేదని కొందఱు చెప్పుదురనుటచే ఎందు అనుదానికి నలిగాగమంబు వైకల్పికంబుగా ఫలించినది. కావున 'ఎందలివారు - ఎందువారు' అనురూపద్వయముకలదని మఱికొందఱయభిప్రాయము." (బా. గు. ప్ర. ౮౧ పు. ద్వి. ము.) ఈయభిప్రాయము కేవలము నగ్రాహ్యము. 'ఎందున్నవారు' అనునర్థమున "ఎందువారు" అని ప్రయోగించుట యెచ్చటను లేదు. ఎవ్వరును వచించియుండలేదు. అట్టియర్థమున 'ఎందుఁవారు' అని కవులవాడుకలోను 'ఎంటలివారు' అని లోక వ్యవహారమునను గలదు.

వ్యస్తవిషయకములు. ఉదా:—వానిది = వానియొక్క - రామునిది = రాముని యొక్క - నాదు = నాయొక్క - మాదు = మాయొక్క మొ. అచటి 'ది, వి, దు' అనునవి ప్రత్యయములు. అట్టిచోట "దానితోడిది - అందలిది" అని (గాణ. ౩౧౦ కారి. సమా. ౧౩ ప.) యుదాహరించుట పొరపాటు. 'చిన్నది - పెద్దది - చేసినది' మున్నగుచోటులు కర్మధారయాభాసములు (చిన్న + అది = చిన్నది - మొ.) గాన నచట సైతము ప్రకృతసూత్రముచే నొప్పునఁ దచ్ఛబ్దాకారలోపము కల్గును. ఇచటి తచ్ఛబ్దము స్వార్థమాత్రబోధకమగును గాన దీనిచే విశేషణములు విభక్తియోగయోగ్యములగును. ఈవిషయము నిట్లధర్వణుఁడు వివరించుచున్నాఁడు. సంబన్ధేత్యాది:—ఈకారిక ౯౩ విషయమున స్థలాంతరోపయోగిగ వ్యాఖ్యాతమయ్యెను. అసంబన్ధే = సమాసములేనిస్థలములందు, విలక్షణః = వేఱర్థముగలదయ్యు, శబ్దము (శేషపదము) సంబన్ధే = సమాసమందు, క్వచిత్, అర్థః = వేఱువిధమగునర్థము గలది. స్యాత్ = అగును. ఉదా:—చిన్నది = చిన్న, చేసినది = చేసిన మొ. పైయభిప్రాయముల నుద్దేశించియే 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అనుప్రకృత సూత్ర మారంభింపఁబడెను. ఉదా:—రామునియొక్క+అది = రాముని+అది = రామునిది = రామునియది. అకారలోపాభావపక్షమున సంహితలో యకారము నిల్చెనని యెఱుంగునది. చేసిన+అది = చేసినది - చేసినయది. తెల్ల+అది = తెల్లనిది - తెల్లది - తెల్లనియది. మొ. ఈసూత్రమును సమాసవిషయకముగా నంగీకరించుటచేత "దానినిజూచి యది సంతసించెను" మున్నగుచోటులందుఁ దచ్ఛబ్దాకారలోపము కల్గనేరదు. సూత్రములోని తచ్ఛబ్దముచేత "అది - అవి" శబ్దములను మాత్రమె గ్రహింపవలయును. కాన "రాని+అతఁడు = రాని యతఁడు" మున్నగుచోటులందుఁ దచ్ఛబ్దాకారలోపము కల్గనేరదు. ('రానితఁడు' అనురీతి నుండదు.) ఈసూత్రమునందలి వాశబ్దమును వ్యవస్థావాచిగా నంగీకరింపవలెను. అట్లగుటచేఁ దద్ధర్మార్థకవిశేషణపు ఉకారనుమీఁది తచ్ఛబ్దాకారమునకు లోపమే లేదనియుఁ దక్కిన "ఉ" కారములమీఁదను దద్ధర్మార్థకవిశేషణముల 'ఇ' కారము మీఁదను దచ్ఛబ్దాకారలోపము నిత్యమనియు నొకవ్యవస్థను గ్రహింపనగును. ఉదా:—చేయునది - చేసెడునది - చేసెడిది. రాజుయొక్క+అది = రాజుది - ఆఁడుది - కాఁపుది. మొ. అహోబలపతి యుదాహరించిన 'కాఁపది - కన్నునది' (అహో. ౧౯౭ - ౪౦౨ పు.) అనునవి సాధువులు కానేరవు. ఆఁడు+అది = ఆఁడది' అనియుఁ గానేరదు (సూ. ౧౦౭ [1] విస్త. II.).

అవి యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు
బహుళంబుగానగుఁ. ౨౫.

బాలవ్యాకరణ వివరణము. ౧౦౭ I విషయము.

నా+అది = నాది - నాయది, నా+అవి = నావి - నాయవి;
ఉదంతములగు తద్ధర్మ విశేషణములమీఁద లోపంబు
లేదనియు, నిదంతంబులగు తద్ధర్మ విశేషణములమీఁద
నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.
వచ్చునది - వచ్చునవి - వచ్చెడిది - వచ్చెడివి.

సంజీవని. ౧౦౭ I విష:—"అది యవి యనుశబ్దంబుల..." అని సూత్రించుట యుక్తము. 'నాయొక్క+అది' అనుచో బా. సమా. ౨౫ సూత్రము చెప్పున యొక్కవిభక్తి లోపింపఁగాఁ బ్రకృతసూత్రమున 'అది' అనుదాని 'అ' కారము లోపించుటచేత 'నాది' అనురూప మేర్పడును. అకారలోపాభావపక్షమున బా. సంధి. 3 సూత్రముచెప్పున యడాగమము రాఁగా 'నాయది' అను రూప మేర్పడును. ఇల్లె యంతటను బ్రక్రియ నెన్నునది. వృత్తిననుటచే సమాసేతరస్థలములం దకారలోపము లేదు. దానినిజూచి యది సంతసించెను. ఇట 'దానిని జూచిది' అనునని‌ష్టరూపము కల్గనేరదు. (విస్తర I.). బా. సమా. ౮ సూత్రము చెప్పున నెల్లశబ్దములును సంబంధార్థమునఁ దచ్ఛబ్దముతో (తత్ = ఆ - అది - అవి - వాడు - వారు. మొ.) సమసించును. మఱియు బా. సమాస. ౯ సూత్రము

---

విస్తర. I ౧౦౭ I విష:—"వృత్తి ననుటంజేసి వ్యస్తమునఁ బూర్వపదభూతములగు వీనికైన యత్తులకు లోపము గాదనుటయు స్పష్టము. సమాస. ౯ సూత్రముచే వీనికి య (?) ది య (?) వులు పరములగుట సంభవించును. క్రియ ౨౪-౨౫ సూత్రములచే నీవిశేషణము లేర్పడును." (బా. సా. వే. ౧౧౧ పుట.) ఈ వేటికావ్యాఖ్య ప్రామాదికము. తద్ధర్మార్థకవిశేషణములు పూర్వపదములుగా నుండు నపు డుత్తరపదములగు 'అది - అవి' అనువానితో వ్యస్తత యెట్లు సంభవించును? మఱియు నిదంతతద్ధర్మవిశేషణముమీఁది తచ్ఛబ్దాకారము నిత్యముగ లోపించునని సూరి చెప్పుచుండఁగా నట లోపము కాకుండు టెట్లు? మఱియు సమాసము ౯ సూత్రమునఁ దచ్ఛబ్దమను ప్రయుక్తమని చెప్పఁబడెనుగాన నది సమాసస్థలము కాదు. "ఇవియె (?) వులను శబ్దములను జేర్చినచో ముందేగాని పరమునఁ జేర్పరాదని (ఇవి నీవి, ఎవి నావి) దీనిచేఁ దెలుచున్నది" (బా. సా. వే. ౧౧౧ పు.) అనువేటికయుఁ బ్రామాదికమె. 'నీవివి = నీవి యివి; నా వెవి? = నావి యెవి?' అనుటలో విరోధ మేమియును లేదు.

చొప్పునఁ దచ్ఛబ్దము ధాతుజవిశేషణముల కనుప్రయుక్తమగును. ఈసూత్రము లోని ధాతుజవిశేషము లన్నది తక్కిన విశేషణములకును నుపలక్షణమగుటంజేసి విశేషణములకెల్ల విభక్తివివక్షయందుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. పైరీతిని "అది - అవి" అనుశబ్దము లుత్తరపదములయి నిల్చునపుడు వాని మొదటి 'అ' కారము బహుళముగా లోపించునని సూత్రార్థము. ఉదా:—నాయొక్క+అది = నాది - నాయది - రామునియొక్క+అది = రామునిది - రామునియది. అంతటను బా. సమా. ౨౫ సూత్రముచొప్పున 'యొక్క' విభక్తికి లోపము నెన్నునది. తనది - తనయది, మనది - మనయది, మొ. విశేషణములకు:—చేసిన+అది = చేసినది - చేసినయది - చేసినదానన్ - విననిది - విననియది - చిన్న+అది = చిన్నది - చిన్నయది - మొ. బహుళగ్రహణఫలమును సూరియే వివరించెను. వచ్చు+అది = వచ్చునది - వచ్చు+అవి = వచ్చునవి. ఇట బా. సంధి. 33 సూత్రముచే నుగాగమము వచ్చినది. ఇట 'అ' కారలోపము లేదు. వచ్చెడి+అది = వచ్చెడిది - వచ్చెడి+అవి = వచ్చెడివి. ఇట లోపము నిత్యము. ఉకారాంతశబ్దములపయినిల్చిన "అది - అవి" శబ్దముల 'అ' కారమునకు నైతము వ్యస్తపదములు కానపుడు లోపము నిత్యమని బహుళగ్రహణముచేతనే యని వ్యాఖ్యచేయనగును. ఉదా:—రాజుయొక్క+అది = రాజుది - ఆఁడుది - కాఁపుది. మొ. 'రాజునది - ఆఁడది - కాఁపది' అనునవి సాధువులు కావు. "కాఁపుది - కాఁపది." (అహో. ౧౯౭ పు.) "అతఏవ-కన్నునది ఇత్యాదౌనుమ్" (అహో. ౪౦౨ పు.) కన్నునది - రాజునది మున్నగురీతి నున్న నుగాగమఘటితరూపములు కవిప్రయోగములందు మృగ్యములు. మఱియుఁ గన్ను శబ్ద మాపవిభక్తిక మగుటచేత "కంటియొక్క+అది = కంటిది" అని యేర్పడును గాని "కన్నునది" అని యేర్పడ నేరదు. (విస్తర. II) ప్రయోగములు. క...షది నీయదియే (ఆది. ౭ ఆ. ౪౧) క...ఇది నీయది యనునూఁతన్ । మదినెయ్యది (శాంతి.

---

విస్తర. II ౧౦౭ I విష:—పై సందర్భమునుబట్టి యీ క్రిందియనుశాసనాశయము సరికాదని తోఁచెడిని. "కాఁపది - ఆఁడదియను చోట్ల అకారలోపము రాలేదు. ఉకారసంధివచ్చినదని తెలియునది. ప్రయోగములు:—క...అది యాఁ। డది యని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్. (యయాతి) దీనిరూపాంతరము 'ఆఁటది' 'ఆస్యగంబులసూద్రుఁడు నాఁటదియును" (కాశీఖం) (ఆం. భా. అ. సంధి. 3౬ సూ.) ఆఁడు+అది = ఆఁడది" అనురీతిని బరరూపసంధినె యుద్దేశించి యున్న యెడల తెలగనార్యుఁడు స్వరప్రధానయతిని బ్రయోగింపక యఖండయతి నంగీకరించి ప్రాణియతిని 'ఆఁ। డది యని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్' అని ప్రయో

౪ ఆ. ౧౩) క. విను మును చేసినది యనుభవింపఁగవలదే (కర్ణ. 3 ఆ. ౬౩) సీ. కీడొక్కఁడియది (అశ్వ. ౪ ఆ. ౮౭) ఆ- వె. ఏప్పుచున్నయది (అర. ౧ ఆ. ౧౩౯) 'ఇక్షయ కానియదియున్ (సభా. ౧ ఆ. ౧౬౭) చ. వినని భీముపాలఁ గడువింతలు వింటిమి (ఉద్యో. ౩ ఆ. ౫౨) క. ద్విరదము లొరగెడివియు నె। త్తురు గ్రక్కుచుఁ గూలెడివి గడుపులై కలయం। దిరుగఁ డువడియెడివియు భువిఁ। బొరలెడివియు నయ్యెఁ బవనపుత్త్రు మునుమునన్ (భీష్మ. ౨ ఆ. ౨౧౩).

ఆ. వె. మీరు నాకు నేను మీకు నెన్నండు ము। న్నహిత మాచరించినయది లేదు. (సభా. ౬ ఆ. ౧౮౬) ఇందు - 'ఆచరించిన+అది' అనుచోటఁ దచ్ఛబ్దాకారలోపాభావపక్షమున 'అ' కారపరరూపసంధి యగుటచేత స్వరప్రధానయతి చెల్లెననియు నట్లగుటచేతనే ప్రత్యేకయతికి విరుద్ధము కాదయ్యెననియు నెఱుంగ నగును.

ప్రథమావైభక్తికమో, ర్బిన్దుశ్చ మహాన్ పతిక్రియా
నన్నయా ర్థేషు (ఆం. చిం. సంధి. ౪ కారి. అహో. ౧౯౭ పు.)
ధర్వణీయము. ఆదన్తపాదిశబ్దేషు। పత్యర్థే బిన్దులోపకౌ। వర్ణక
౧౦౮ విషయము. స్యాత్రకథితౌ। క్వచిత్ సుకవిసమ్మతేః. (విక్ర. సంధి. ౯ కారి. అహో. ౧౯౮ పుట.)

కల్పతరు. ౧౦౮ విష:—పతిక్రియార్థేషు = పదుదాతురూపములు పరమగునపుడు, ప్రథమావైభక్తికమోః = ప్రథమావిభక్తిసంబంధమగు మువర్ణకమునకు,

---

గించియుండఁడు. "ఆఁ। టది యని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్." అనియె తెలగనార్యుఁడు ప్రయోగించిన పాఠమైయుండును. ఇట్టియెడల 'అది' శబ్దాకారలోపమునఁ బ్రాణియతి నిర్వివాదమై యుండును. 'ఆఁడది' అనురూపమసాధువు. 'ఆఁడుది' అనియే సాధురూపము. (౧౦౭ విష. కల్పత.) 'తళుకు+అది = తళుకది - సొగసు+అది = సొగసది' అనురీతిని 'అకారలోపాభావమును 'ఉ' కారసంధియుఁ గలరూపములు కావ్యములందే కాక వ్యవహారములందును నప్రసిద్ధములుగదా. లేఖకముద్రాపకాదిప్రమాదకృతమగు పయియయాతిచరిత్రాపపాఠమును సాధువనుకొని శబ్దరత్నాకరాదికోశకర్తలును 'ఆఁడది' అనురూపమును సైతమంగీకరించి 'ఆఁడుది - ఆఁటది' అనువానిని బర్యాయములుగా నుదాహరించిరి. "క. ఏటికి సీరాచటికం। బాఁటది మొఱవెట్ట (భాగ. ౯ స్కం. ౪౨౮) "ద్వి - ఆఁటదానికి వశమమ్మ యీమేటి। కోటలు దాఁటి" (ద్వి - హరిశ్చం. ఉ. ౨౪౦౭ సూ. రా. ని.)

బిన్దుశ్చ మహాన్ = పూర్ణబిందువునైతె మగును. అర్ధబిందువు రాదనుటకు 'మహాన్' అని వచింపఁబడెను. చకారముచేఁ బ్రకరణసిద్ధమగు లోప మెట్లును వికల్పముగా నగునని విశదమగుచున్నది. ముపర్ణక తల్లోప పూర్ణబిందువులు పర్యాయముగ నగునని పర్యవసితార్థము. ఉదా:—భయము+పడె = భయము పడె, భయపడె, భయంపడె. ఇచటి పడిధాతు పర్యాయమగు పడుధాతువునకుఁ బతన మర్థముకాదు. ఇది ప్రాప్త్యర్థకము. '(గోతిలో) గజముపడె' అనుచో 'గజ పడె' అని కానేరదు. మఱియుఁ బడుధాతువుతో నన్వయించు భయము మున్నగు నవి కర్మవాచకములు, ద్వితీయార్థక ప్రథమావిభక్తి ప్రత్యయాంతములు, నని గ్రహింప వలెను. అట్లైకాక ద్వితీయయె నిల్చినచో 'భయముఁ బడె' అని ప్రకృతకార్యకలిత రూపమె సిద్ధించును. 'పతిక్రియార్థేషు' అను బహువచనముచేత 'భంగపాటు - భంగంపాటు' మున్నగు పడుధాతుకృదంతరూపములు పరమగునపుడును 'ము' లోప పూర్ణబిందువులు విభాషనగును. ఇట్టి నన్నయాశయమునె యథర్వణుఁడు వివరించుచున్నాఁడు. ఆదన్తేత్యాది:—పత్యర్థే = పడుధాత్వర్థము వాచ్యమగు చుండఁగా, క్వచిత్ = ఒకప్పుడు, ఆదన్తపాదిశబ్దేషు = (అ+ఆ+త్ = ఆత్+అన్త = ఆదన్త) అకారాంతములును 'ఆ' కారాంతములునునగు, పాదిశబ్దేషు = పకారాదిశబ్ద ములనఁగా "పడు - పడుచు - పాటు" మున్నగుశబ్దములు పరమగుచుండఁగా, వర్ణ కస్య=మువర్ణకమునకు, బిన్దులోపకౌ = పూర్ణబిందువును మువర్ణకలోపమును, అత్ర = ఈసందర్భమున, కవిసమ్మతేః = మహాకవిప్రయోగసమ్మతిచొప్పున, కథితౌ = చెప్పఁబడు చున్నవి.

పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప
బాలవ్యాకరణ పూర్ణబిందులు విభాషనగు.• ౨౯.
వివరణము. భయము + పడె = భయపడె - భయంపడె - భయము
౧౦౫ 1 విషయము. పడె - సూత్రము+పట్టె = సూత్రపట్టె - సూత్రంపట్టె - సూత్రముపట్టె. ఈకార్యము కర్తృవాచిమువర్ణక మునకుఁ గలుగదు. గజము పడియె, అశ్వము పడియె.

సంజీవని. ౧౦౫ I విష:—వేటికావ్యాఖ్యాత నవీనముద్రణములచొప్పున "పూర్ణబిందువులు" అను వృగాగమఘటితరూపమును నిల్పెను. కాని ప్రాచీనముద్ర ణములలో 'బిందులు' అనియే యున్నది. ఈకార్యము కర్తృవాచి'ము'వర్ణకమునకుఁ గలుగదని సూరిగారివివరణము. 'గజము పడియె' అనువాక్యమునఁ బతనవ్యా పారాశ్రయము గజము కాన నది కర్త. 'గజము' అను శబ్దము కర్తృ

వాచకము. ఇట్టియెడల 'గజపడియె - గజంపడియె' అనురూపము లుండనేరవు. ఇట్లు నుటచే నిచటి పడుధాతువు ప్రాప్త్యర్థకమై కావలెననియు దానితో నన్వయించు కర్మవాచకము ద్వితీయార్థక ప్రథమాంతమై యుండవలెననియు (బా. కార. ౨౮ సూ.) నద్దాని మువర్ణకమునకు లోపపూర్ణములు పర్యాయముగ వచ్చుననియు విశదమగుచున్నది. సూత్రములో 'మువర్ణక' శబ్దముసయితము పైయర్థములను విశదపఱుచుచున్నది. భయమును+పడె - భయము+పడె = భయపడె - భయంపడె - భయముపడె. ఇట్లె సూత్రమును+పట్టె = సూత్రము+పట్టె = సూత్రపట్టె - సూత్రంపట్టె-సూత్రముపట్టె. మొ. మువర్ణకము లోపింపనియపుడు సైతము దాని మీఁది పడుధాతు పకారమునకు వకారాదేశము (బా. సంధి. ౧౩ సూ.) రాదని సూరి యుదాహృతివలన విశదమగుచున్నది. "సంతోషముపడీతిరూపేతు పకారస్యవకారాదేశోభవత్యేవ. పకారశ్రుతిస్తు అధర్వణవచనాదితిజ్ఞేయమ్" (అహో. ౧౯౯ పు.) అని యిట్లు పకారవకారములు రెండిటిస్థితిని నహోబలపతి యంగీకరించెను. 'ఆదన్తవాదిశబ్దే' అనక 'ఆదన్తపాదిశబ్దే' అని యధర్వణుఁడు సూత్రించుటచేత వకారాదేశాభావము వ్యక్తమగుచున్నదని యధర్వణాశయమును వర్ణింపనగును. కాని నన్నయాధర్వణులమతమునందును భారతప్రయోగసరళియందును గసడదవాదేశము వచ్చునపుడు నిత్యముగనే రావలయును (౭౭ - ౭౮ విష.) గాన వైకల్పికత్వ మధర్వణాచార్యవచనసిద్ధ మనుట సరికాదు. ఆపక్షమున నిట గసడదవాదేశము రాదనుటయె యధర్వణసమ్మత మనఁదగును. (విస్తర.) ఇట్టియెడల వకారాదేశస్థితిని నిర్వహింపఁజాలు ప్రయోగముసయితము లభింపలేదు.

నన్నయభారతమున నాతఁడుచెప్పినట్లు పడుధాతురూపములు పరమగునపుడుమాత్రమె మువర్ణకలోపపూర్ణములు పాక్షికముగఁ బ్రయోగింపఁబడి

---

విస్తర. ౧౦౮ I విష:—"జయపెట్టు. మి - అ - క్రి." (శ. ర.) "జయపె(వె)ట్టు. మి - అ - క్రి." (సూ. రా. ని.) ఇట శబ్దరత్నాకరము వకారాదేశము లేదనుచుండఁగా సూ. రా. నిఘంటువు పాక్షికముగా నుండుననుచున్నది. వకారాదేశస్థితిని నిర్ణయింపఁజాలుప్రయోగ మొక్కటేని సూ. రా. నిఘంటుకర్తలు చూపరైరి. పాక్షికత నంగీకరించిన యహోబలపండితుఁడు సయితము, మువర్ణకలోపపూర్ణస్థలములలో వకారాదేశము నంగీకరింపలేదు- "ననుసంతోషంపడీత్యాదౌ 'తస్యాః ప్రథమాచజడపదానాం స్యాత్' ఇతి ప్రథమాత్వే సత్యనుస్వారస్యస్థానివత్త్వేన మువర్ణకాంతత్వే 'గసడదవాః స్యుః ప్రథమామాత్రాత్' ఇతి పకారస్య వకారః స్యాత్; ప్రథమామాత్రాదితిమాత్రగ్రహణాత్ లుక్యపిస్యాత్ ...ఇతిచేత్స

యున్నవి. తిక్కయజ్వ పెట్టుధాతురూపపరత్వమందును మువర్ణకలోపపూర్ణములను ప్రయోగించెను. కాని సూరి యహోబలపతితోపాటు తిక్కన శంభుదాసుల ప్రయోగములను జూచికొనక పద్యాదులలోఁ బెట్టుధాతువును జేర్పమాని పట్టుధాతువును జేర్చుట వింత. "సీ. పరఁగ పికములు పురిసూత్రపట్టినట్లు" (ఆము. ౧ ఆ. ౫౩) అను నాముక్తమాల్యదాప్రయోగమును మాత్రము పరిశీలించినట్లు తోఁచెడిని. తిక్కన శంభుదాసుల యాక్రింది ప్రయోగములను జూచికొనక యహోబలపండితుఁ డిక్రిందివిధిని వ్రాయుట శోచనీయము. "అప్రస్తుతపాఠితనియమాంగీకారాత్ పంతోషపెట్టి ఇతిరూపం త్వసంగతమేవ 'పరఁగ పికములు పురిసూత్రపట్టినట్లు' ఇత్యాంధ్రకవిపితామహః - అత్రకవితేశ్చేదః. పంతోషపాటు ఇత్యాది." (అహో. ౧౫౭ పు.) తిక్కనాదిప్రయోగములు. సీ. సభలోన నట్లు దుశ్శాసనుం డవమాన, పెట్టంగ నచ్చటి పెద్దలెల్ల (అశ్వ. ౧ ఆ. ౧౪౭) (యతిస్థానగతము.) ఉ... నను నిమ్మెయి భంగపెట్టునే (ద్రోణ. ౫ ఆ. ౩౩౫) సీ. సంధించి జగముల్లు జయపెట్టఁ జెచ్చెర (ఆర. ౭ ఆ. ౧౫౧) దుఃఖపెట్టుచు (భాస్కర. అరణ్య. ౨ ఆ. ౨౬౭) ఇంకఁ బడుధాతురూపప్రయోగములు:—భయంపడి (ఆది. ౭ ఆ. ౩౬) భయంపడుచుండుదురు (ఆది. ౭ ఆ. ౩౭) భయంపడుదుమె (ఆది. ౭ ఆ. ౪౦ ప.) శ్రమం

---

త్యమ్—ముకారవిధేరల్విధిత్వేన తదభావాన్నోక్తదోషప్రసక్తిః...(అనుబంధ) నచలుక్యపి పకారస్య వకారః. మాత్రశబ్దస్య అప్పుడుదా వచ్చె...ఇత్యాదివిషయత్వేన క్లృప్తత్వాత్ ....అదస్తపాదీత్యథర్వణోక్తిరప్యత్రమానమిత్యపిసువచమ్.....సంతోషము-పడీతి రూపేతు పకారస్య వకారాదేశో భవత్యేవ, షకారశ్రుతిస్తు అథర్వణవచనాది తిజ్ఞేయమ్" (అహో. ౧౫౫ పు.) మఱియు నిత్యమగు గసడదవాదేశమును జేసినపిదప నట్టి వకారపరకత్వమున మువర్ణకమునకు బింద్వాదేశవిధానమె యనుపపన్నమగును. ఆంధ్రమున స్థిరపరకబిందువు సంప్రదాయవిరుద్ధముగదా.

---

అనుబంధము. విస్తర. ౧౦౮ I విష:—"మువర్ణలోపమును, పూర్ణబిందువును వచ్చునపుడును గసడదవాదేశము వచ్చునా యని యహోబలుఁడు శంకించుకొని 'స్థానివదాదేశోఽనల్విధౌ' అనుపాణినీయసూత్రమును స్మరించి గసడదవాదేశము వచ్చునని నిర్ణయించుట ప్రామాదికము. భయపడి - భయంపడి అను రూపములు లేవు" (ఆం. భా. చ. ౧౬౦౮ పు.) "అల్విధిత్వేన తద భావాన్నోక్తదోషప్రసక్తిః...నచలుక్యపి పకారస్య వకారః" అని యహోబలపతి యుద్ఘోషించుచున్నను భాషాచరిత్రకర్తగారి కాతఁడు వకారాదేశము వచ్చునని నిర్ణయించినట్లర్థమగుట వింత!

పడి (ఆది. ౬ ఆ. ౨౦౦) విస్మయపడి (అరణ్య. ౩ ఆ. ౧౭౯) విస్మయముపడి (ఆది. ౬ ఆ. ౨౨౩) తల్లడపడఁగన్ (అర. ౧ ఆ. ౧౬౫) సంతోషపడి (అర. ౬ ఆ. ౨౨౩) 'సంతసంబుపడి దర్విన్ వైశ్యులిష్టంబునన్ ఇత్యాద్యాచార్యః' (అహో. ౧౯౯ పు.) సందియముపడఁగ (ద్రోణ. ౫ ఆ. ౩౪౭) అడ్డపడి (ద్రోణ. ౧ ఆ. ౨౯౩ ఉద్యో. ౨ ఆ.) సూత్రపడఁగ (అను. ౧ ఆ. ౧౩౪) భంగపఱుతు (విరా. ౨ ఆ. ౧౫౬) ఆ. వె.... రా! గాదిదుఃఖములకు నగపడండు (అశ్వ. ౧ ఆ. ౨౧౦) ఆ. వె. ఓర్చి భంగపాటు తీర్చికొనుము (విరా. ౧ ఆ. ౫౪) దైన్యపాటు (శాంతి. ౩ ఆ. ౩౯౯) 'అగపడు' అనుదానికి 'అగంపడు - అగ్గంపడు' అనురూపములు కన్పట్టలేదు. "ఏవం సంకటపడి. పదంపడి ఇత్యాది" (అహో. ౧౯౭ పు.) 'పదంపడి' అనుదానికి 'పదము+పడి' అను ఛేదము శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. 'పదముపడి' అను ప్రయోగమును చూపట్టలేదు. "పదపడి - దే - అవ్య - పదంపడియొక్క రూపాంతరము. వెనక... మఱియు...అత్యంతము..." (శ. ర.)

నన్నయా
థర్వణీయము
౧౦౯ విషయము,

ఏకత్వేఽథబహుత్వే, ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః ।
(ఆం. చిం. క్రియా. ౧౦ కా. అహో. ౪౬౧ పు.)
వ్యతిరేకప్రార్థనార్థే । కుఃస్యాత్సువు పరశ్చసః । ప్రార్థ
నార్థే మురేకత్వే । కథ్యతే మధ్యమార్థకః । విభా
షాతో వదన్త్యేకే । నప్రాణేతుకదాపిచ ॥ (వికృ.
క్రియా. ౯ - ౭ కారి. అహో. ౪౬౬ - ౪౬౪ పు.)

కల్పతరు. ౧౦౯ విష:— ఏకత్వే=ఏకవచనమందును, అథ = పిమ్మట, బహుత్వే = బహువచనమందును, సంప్రార్థనార్థకేషు = ప్రార్థనాద్యర్థములందు, ముడుజౌ = మువర్ణకమును డుజ్ వర్ణకమును, వరుసగా, స్తః = అగును. 'సంప్రార్థనార్థకేషు' అనుబహువచనస్వారస్యముచేత విధ్యాద్యర్థములును వ్యాఖ్యాతము లగుచున్నవి. డుజ్జు జిత్తుగాన బిందుపూర్వకమగును. ఉదా:— నీవు రక్షింపుము, మీరు రక్షింపుఁడు - రక్షింపుండు. మొ. వ్యతిరేకప్రార్థనార్థే=ప్రార్థనాద్యర్థవ్యతిరేకమునందు, ముడుజ్విభక్తిపరకత్వమున, కుఃస్యాత్='కు' అనునాగమమగును, ౩౦౫ విషయముచొప్పునఁ బ్రార్థనాద్యర్థమున మధ్యమపురుష వు-రుల కాదేశముగా ముడుజ్జులు వచ్చును. సః = ఆకువర్ణము, 'ము-వు' పరశ్చస్యాత్ = ఏకవచనమున 'ము' విభక్తిపరకమగుటయేకాక 'వు' విభక్తిపరకమును నగును. చకారముచే నట్టి 'వు' వర్ణకము "ఎ-ఏ" శబ్దపరకమయియే యుండునని కవిప్రయోగములనుబట్టి వ్యాఖ్యచేసికొనవలయును. (౩౦౮ విష.) ఉదా:— చేయకుము - చేయకువే - చేయకుఁడు. మొ. అట్టి ముప

ర్థకమునకు 'ఏకత్వే' మందలి పాక్షికతను వివరించుచున్నాఁడు. ప్రార్థనార్థే = ప్రార్థనాద్యర్థములందు,—ప్రార్థనయందు - వ్యతిరేక ప్రార్థనమందు ;విధియందు - వ్యతిరేక విధియందు—ఏకత్వే = ఏకవచనమున, మధ్యమార్థకః = మధ్యమపురుషార్థముగలదై, ముః = మువర్ణకము, కథ్యతే = చెప్పఁబడుచున్నది. ఏకే = కొందఱు, విభాషాతః = విభాషతో, అనఁగా వైకల్పికముగా, వదన్తి = చెప్పుదురు. ప్రాణేతు = అచ్చు పరమగునపుడన్ననో, కదాఽపిచ = ఎన్నఁడును, న = అట్టివిభాష లేదు. నిత్యముగానే యగునని యర్థము. ప్రాణపరకత్వమునమాత్రమె వైభాషికత్వము లేదనుటచే హల్లు పరమగునపుడును నవసానమునందును వైకల్పికముగా నగునని పర్యవసితమగుచున్నది. ఉదా:—నన్నుం గృపఁ జూడు భారతీ. కృపఁజూడుము భారతీ- భారతీ నను౯ గృపఁజూడు - భారతీ నను౯ గృపఁజూడుము. కృపఁజూడుమంబ - ఇట "కృపఁజూడంబ" అనురూపము గల్గనేరదు. అలుగకు తల్లీ - అలుగకుము తల్లీ. తల్లీ యలుగకు - తల్లీ యలుగకుము. 'అలుగ కంబ' అనుసంధి సాధువుకాదు. "విభాషాంతంవదన్త్యేకే" అను కవిజనమండనపాఠము సరికాదు. అంతమందనఁగా నవసానమందేకాక హల్పరకత్వమందును మువర్ణకము వైకల్పికమని చెప్పవలయును గదా. అహోబలపండితీయమునుండి యథర్వణగ్రంథమును గ్రహించిన సీతారామకవి, దాని నేల యిట నిట్లు సవరింపవలసెనో తెలియకున్నది.

బాలవ్యాకరణ విమర్శము. ౧౦౫ I విషయము.

మధ్యమపురుష ము వర్ణకంబునకు హలవసానంబులు
పరంబులగునపుడు లోపంబు విభాషనగు. ౪౭.
చూడుము+నన్ను=చూడునన్ను - చూడుము నన్ను.
ఇటు+చూడుము=ఇటు చూడు - ఇటు చూడుము.
చూడు మనియె, విను మనియె. ఇచ్చట నచ్చు పరం
బైనది కాఁబట్టి లోపము లేదు.

సంజీవని. ౧౦౫ I విషు:—స్వరపరకత్వమునఁ బ్రార్థనాద్యర్థక మువర్ణకము నిత్యముగా నిల్చుననియు, వ్యతిరేక ప్రార్థనాద్యర్థమున స్వరపరకత్వమందు వైభాషికమనియు వచించువాఁ డగుటంజేసి సూరి యట్టి విభాగముతో ౪౭-౪౮ సూత్రములను వేర్వేఱ సూత్రించుచున్నాఁడు. మధ్యమపురుష మువర్ణకము = ప్రార్థనాద్యర్థకమువర్ణకము. (బా. క్రియా. ౬-౭౫ సూ.) 'చూడు నన్ను - చూడుము నన్ను' అనునవి హల్పరకత్వమున మువర్ణకపాక్షికలోపమున కుదాహృతులు. 'ఇటు చూడు - ఇటు చూడుము' అనునవి యవసానమునందలి పాక్షిక ము లోపమున కుదాహరణములు "చూడుము+అనియె = చూడుమనియె, వినుము+అనియె = విను

మనియె" అనునవి యచ్చు పరమగుటచే ములోపము లేదనుట కుదాహృతులు. 'చూడనియె విననియె' అనునవి సాధువులుకావని తాత్పర్యము. ప్రయోగములు— క. పుట్టినవిధ మెట్లు చెప్పు మాలుపుగ నాకున్' (సభా. ౧ ఆ. ౧౩౪ ప.) ఉ.... భస్మము చేయుము తక్షకాదికా । కోదరసంహతిన్ (ఆది. ౧ ఆ. ౧౨౪) ఆ. వె. రెండుపక్షములకుఁ బ్రియము హితంబును । నాత్మఁ గోరువారి నరసి చూడు (ఉద్యో. ౧ ఆ. ౩౦౦) మధ్యాక్షరము....ఓర్వఁ । గానున్న వీఁపుండ నొండుదక్కి లోఁగక చక్కనిలుము ॥ (ఇది నాల్గవచరణము) (ఆది. ౭ ఆ. ౨౦౨) క...నీ వా । తనివారింపు మది యనుచితం బని నెమ్మిన్ (అర. ౧ ఆ. ౭౮). శా...నిన్నతఁడు జాలింబెట్టెడుం జూడుమీ (ఉద్యో. ౩ ఆ. ౪౫) ఇట్లంతటను సరిగనే యున్నను నొక్కచోటమాత్రము తిక్కయజ్వ స్వరము పరమగునపుడును ములోపమును బ్రయోగించెను. చూచుధాతువు మధ్యమ ముడుజ్ఞులరూపములు 'చూడుము - చూడుఁడు' అనువానికి బా. క్రియా. ౧౦౧ సూత్రముచొప్పున 'చుమ్ము - చుండు - చుఁడు' అను భారతసమ్మతరూపాంతరములు గలవు. 'చుమ్ము' అనుదానికి హల్పరకత్వమునఁ బాక్షిక ములోపము రాఁగా 'చూ' అనురూప మేర్పడును. అచ్చుపరమగునపుడు 'ము' లోపము రారాదుగాన 'చుమ్మీ - చుమీ' అనురీతిని రూపము లేర్పడును. (బా. క్రియా. ౬౧ సూ.) మ...మాయల్వన్ను నేర్పింకఁ జె । ల్లదుసూ నీకని (ఉద్యో. ౩ ఆ. ౯౭) మ...మతమయిచూ వెలింగె విను మాతుల (సభా. ౨ ఆ. ౯౮) అచ్చుపరమగునపుడు:—క.... । దరికొని తెగఁగాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ (ఉద్యో. ౨ ఆ. ౧౯౭) ఇట్లు స్వరపకరత్వమున 'ము' లోపము రారాదు. అట్లయినను దిక్కయజ్వ ములోపమును బ్రయోగించెను:—క...మ । త్సాయకముల నినుఁ గూల్చెదఁ । జూ యెవ్వత నైతి నేమి చూచెదు నన్నున్ (భీష్మ. ౩ ఆ. ౩౨౫ ప.) ఇచట 'కూల్చెదఁ జుమ్మెవ్వత నైతినేమి' అని యుండవలసియుండఁగా స్వరపరక ములోపమును గవిబ్రహ్మగారే ప్రయోగించిరి. 'చూ యెవ్వత నైతినేమి' అనుచోటి సంహితాయకారము ప్రాసస్థలగతమగుటచే నిది ముద్రణాదిస్ఖాలిత్య మనుటకు వలనుపడదు. కాని తిక్కయజ్వ తనవిశాలభారతభాగమున మఱెచ్చటను నిట్టి ములోపమును బ్రయోగింపలేదు. పాల్కురికి సోమనారాధ్యుని బసవపురాణమున నిట్టి ప్రయోగ మగపడుచున్నది. ద్వి. తానచూ యీ జగత్ప్రాణుఁడ నన్న (బసవ. ౬ ఆ. ౮౫౭) ద్వి- కావున మాలింగదేవభక్తులకు । నేవేళ వెలిచియుం డింటియ చాలు (బసవ. ౨ ఆ. ౧౮౩) వీరికిఁ దర్వాతికవులును నిట్టి ప్రయోగమును జేయుచువచ్చిరి. కావుననే "మధ్యమపురుష ముపర్ణకమున కచ్చు

పరంబగునపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి. ఉ. అకటె నీవుపందెము (కళా. ౬ ఆ.) మ...భవచ్ఛిత్తేప్సితం బెద్ది చె। ప్పవినన్...(మార్కం. ౨ ఆ.)" (ప్రౌఢ. సంధి. ౧౫ సూ.) అని త్రిలింగలక్షణశేషకర్త బాలవ్యాకరణమును సవరించి ప్రయోగములను జూపెను. ఇంకను నిట్టిప్రయోగములు గలవు. సీ. కావు కా వనువారిఁ గడిసితుంగపయోధ, రపదాంతరంబు చేరంగ నీదు (వసు. ౧ ఆ. ౫౬) 'కావుము+కావుము+అను వారి = కావు కావను వారి' అని యొకయర్థమున ఛేదము. 'కావు కావు+అను' యెడ్చువారి నని మఱొకయర్థమునందలి ఛేదము. ఇట్లగుటచే దీని నర్థద్వయాకరించుటకు వలనుపడదు. తెనాలిరామకృష్ణకవియు దీని ననుసరించెను. సీ. కావు కావనుట దక్కసులభమూఁక నెకాని (పాండు. ౧ ఆ. ౧౪౫.)

కేవల ప్రార్థనార్థకస్థలములందే యిట్లు 'న ప్రాణేతుకదాచన' అను నథర్వణాచార్యవచనమును దిక్కయజ్వాయే యుల్లంఘించునపు డింక వ్యతిరేకప్రార్థనమున స్వరపరకత్వమునందు ములోప నుండుటలో వింత యేమున్నది? అట్లగుటచే నీక్రి ది కవిశిరోభూషణగ్రంథము సరికాదననగును. "కుపర్ణకస్య ము వర్ణకపూర్వత్వేన మోరచిపరే నిత్యత్వేనచ - జాగొనరింప కోజనకజాహ్మాదయేశ; మదిం దలంపకమ్మ - ఇత్యాదికం కవీనాం వచన మనాకరమేవేత్య నుసంధేయమ్" (అహో. ౪౮౬ పు.) అట్లయినను ప్రార్థనాద్యర్థక ముపర్ణకమునకుఁగాని వ్యతిరేకప్రార్థనాద్యర్థక ముపర్ణకమునకుఁగాని 'అ - ఈ' మున్నగు ప్రార్థనార్థానుప్రయుక్తమగు నేకస్వరశబ్దము పరమైనపుడు ములోపము రాదని చెప్పవచ్చును. ఉదా:—ఉ. ఎప్పుడు నిట్టి సాహసము లెంక నొనర్పకుమయ్య...। సన్నుత దీని కొండొకవిషాదము నొందకు మీా మనంబునన్ (ఆర. ౫ ఆ. ౪౩౪) చూడుమీా (ఉద్యో. 3 ఆ. ౪౫) ఇట్టియెడల— 'ఒందకుమీా - చూడుమీా' అనువానిచోట - 'ఒందకీ - చూడీ' అనురీతిని ములోపము గల్గనేరదని యెన్ననగును. "అలుగకోనాతి" (రంగ - రా.) అనుచోటి 'ఓ' శబ్దము ప్రార్థనార్థానుప్రయుక్తముకాదు.

బాలవ్యాకరణ వ్యతిరేకమధ్యము ముపర్ణకంబున కెల్లయెడల లోపంబు
వివృతి. విభాషనగు. ౪౮.

౧౧౦ విషయ. నమ్మకుము+ఇట = నమ్మకిట, నమ్మకు మిట.

సంజీవని. ౧౧౦ విష:—అచ్చు పరమగునపుడునైతము ములోపము వచ్చుననుటకై యీసూత్రము వేఱుగ నుపదేశింపఁబడెను. కావుననే తావన్మాత్రమునకే యుదాహృతులు సూరిచేఁ జూపఁబడెను. 'నమ్మకిట' అనునది ములోపోదాహృతి. 'నమ్మకు మిట' అనునది 'ము' లోపాభావపక్షోదాహరణము. హల్లుపరమగు

నపుడును నవసానమందును వ్యతిరేకప్రార్థనాద్యర్థక ము వర్ణక మెట్లును బాక్షిక లోప మందునని యెన్నన గును. ఉ. నమ్మకుము+వానిని=నమ్మకువానిని - నమ్మకుము వానిని; వానిని+నమ్మకుము = వానిని నమ్మకు - వానిని నమ్మకుము. మొ.

సూరిగారి ట్లొకరయి వేర్వేఱుగా సూత్రించిరే కాని యీద్వివిధవర్ణకముల కును లోపవిషయమున భేదమేమియు లేదు. నన్నయాథర్వణులు ద్వివిధ ముపర్ణక ములకును స్వరపరకత్వమున లోపము నంగీకరింప లేదు. అట్టియెడల రెండిటిలోప ములకును మహాకవుల ప్రయోగము లున్నవి. కాని యట్టిప్రయోగములలోఁ బ్రార్థనాద్యర్థక ముపర్ణకమునకు స్వరపరకత్వమునందలి ములోపము భారతమున నొక్కటిమాత్రము తిక్కయజ్వగారిదై యున్నది. క...'కూల్చెదఁ। జూయెవ్వత నైతినేమి...' (భీష్మ. ౩ ఆ. ౩౨౫) ఇదితప్ప మఱొక్కటియైన, ప్రార్థనాద్యర్థ మందుఁగాని వ్యతిరేకప్రార్థనాద్యర్థమందుఁగాని స్వరపరక ములోపమునకుఁ బ్రయోగము భారతమున లేదు. శోకింపకు మని (ఆర. ౧ ఆ. ౮౫) ఓడకు మని (విరా. ౫ ఆ. ౨౮౬ ఆర. ౨ ఆ. ౮౨) పోవకు మనుచు (ఆర. ౪ ఆ. ౨౦) పోకు మనుఁడు (విరా. ౫ ఆ. ౨౦౬) తలంపకు మాంబికేయు (కర్ణ. ౩ ఆ. ౨౭౧) దురపిల్లకుమయ్య (శల్య. ౨ ఆ. ౩౭౫) ఇట్లంతటను వ్యతిరేకప్రార్థనాద్యర్థమున స్వరపరకత్వమున మువర్ణకలోపాభావమె చూపట్టుచున్నది. అట్లని వ్యతిరేక ప్రార్థనమున స్వరపరక మువర్ణకలోపమునకు భారతేతరకవిప్రయోగములు లేక పోలేదు. గీ. నమ్మకిటమీఁద నేను ప్రాణానఁగలిమి (ఉ. హరి. ౫ ఆ. ౯౨) (దీనినె సూరి యుదాహరించెను) నావిని యలుగకొనాతినేవాయు। దేవుండ...(రంగ. రా. కిష్కిం. యూ. ము. ౧౧౮౩) "జాగొనరింప కొజనక జాహ్నదయేశ; మదిం దలంప కమ్మ" (అహో. ౪౮౬ పు.) (చూ. ౧౦౯ I విష.)

నన్నయా — అన్యేషాంచ ద్విరుక్తౌస్యు। ర్బహులోపాగమా

౧౧౧ విషయము. — మతాః. (వికృ. అజం. ౮౧ కా. అహో. ౩౬౧ పు.)

కల్పతరువు. ౧౧౧ విష:—

ఈకారికకు ౧౦౨ విషయమున వ్యాఖ్యానము చేయఁబడెను.

బాలవ్యాకరణ — ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్జులకు లోపంబు విభాషనగు. ౪౯.

వివరణము. — ఉండుము + ఉండుము = ఉండుండుము, ఉండు ముండుము.

౧౧౧ I విషయము. — కొట్టుఁడు+కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు - కొట్టుఁడు కొట్టుఁడు.

సంజీవని. ౧౧౧ I విష:—ప్రార్థనాద్యర్థకక్రియలు ద్విరుక్తము లగునపు డామ్రేడితపరక 'ము' వర్ణకమును నామ్రేడితపరక 'డుఞ్' వర్ణకమును వికల్పముగా లోపించును. ఈ ముడుఞ్లోప మచ్చుపరమైనను హల్లుపరమైనను వైకల్పికముగా సంభవించును. ఆమ్రేడితము పరమగునపుడు వచ్చువిధిగాన దీని కవసానమునందుఁ బ్రసక్తియుండదు. ఉండుండుము - ఇది ములోపోదాహృతి - ఉండుండుఁడు - ఇది బిందుసహిత డులోపోదాహరణము - ముడుఞ్జులకు లోపము రానపుడును వచ్చినపుడును బా. సంధి. ౧౦ సూత్రముచొప్పున నామ్రేడితస్వరపరకపరరూపనిత్యసంధి వచ్చి 'ఉండు+ఉండుము = ఉండుండుము' మున్నగురీతిని రూపము లేర్పడును.

ప్రయోగములు:—పోకు పోకు మనుఁడు (విరా. ౪ ఆ. ౨౦౬) పోవకు పోవకు మనుచు (అర. ౪ ఆ. ౨౧) ఓడ కోడకు మని (విరా. ౪ ఆ. ౨౮౬) పద పదఁ డంచు దిశలు గ్ర। క్కదలఁగ (నిర్వ. ౬ ఆ. ౯౨) ఓడకుఁ డోడకుఁ డని (ద్రోణ. ౧ ఆ. ౩౮౩) కం. పోవుఁ జుమీ పలకర్రాయి పోదపోదఁడనినన్. (ఉ. హరి. ౩ ఆ. ౧౩౯ ప.) । ఉ. పట్టుప। ట్టుండిటు తెందుపొండని కడున్ - (ఉ-హరి. ౨ ఆ. ౨౬ ప.) ద్వి - తొలతొలం దనుచును ద్రోవ కడ్డంబు।నిలిచి వాచఱి వక నిలునిలుఁ డనుచు (బసవ. ౪ ఆ. ౫౨౨) ద్వి - అడుగడ్డు నీ కీప్సితార్థ మిచ్చె దను. (బసవ. ౭ ఆ. ౪౯౯) అడుగుము+అడుగుము = అడుగడుగుము - అడు గడ్డుము. 'రమ్ము+రమ్ము' మున్నగుచోట్ల ముపర్ణకలోపము వచ్చునపుడు 'రారమ్ము' మున్నగురూపము లేర్పడును. బా. క్రియా. ౬౧ సూత్రముచొప్పున 'రా+ము - రా+డుఞ్' మున్నగువానినుండి వరుసగా 'రమ్ము - రండు' మున్నగు రూపములు 'ముడుఞ్జు' లమూలమున సంభవించునుగాన నట్టి ముడుఞ్జులకు లోపము వచ్చునపుడు వానిమూలమున వచ్చినయాకారవికారములుపోయి మరల 'రా' మున్నగు నిజరూపములు నిల్చుట న్యాయసిద్ధము. ఈవిషయమునె త్రిలింగలక్షణ శేషకర్త యీక్రిందిరీతిని వివరించెను. "ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు. ఉ. పోపొమ్ము - పోపొండు - లేలెమ్ము - లేలెండు" (ప్రౌఢ. సంధి. ౨౩ సూ.). ముడుఞ్జులు లోపింపనపుడు - 'రమ్మురమ్ము' మున్నగురీతిని నుండ వచ్చును. క. కరుణంబుగ నేడ్చుతలో। దరిఁ బోపొమ్మిచట నింకఁ దడయకుమని... (ఉద్యో. ౪ ఆ. ౨౮౨) మ...భీమపార్థులును 'గోకొమ్మంచు నొక్కుమ్మడిం। గవియన్...(భీష్మ. ౩ ఆ. ౩౧౯) మ...శిశువుం దేతెమ్ము తెమ్మంచు నా। కులుఁడై (హరి. పూ. ౪ ఆ. ౧౨౪) ఇందలి 'తెమ్ము' అనునది త్రిరుక్తము. క...। వేకంధ

మూలలక్షణములు ; కోకొండని యొసఁగ పండికొని నమలికపుల్ (భాస్క. రా. కిష్కి. ౭౫౯).

నపదాన్యవ్యయసుప్తిఙ్, క్త్వాతుమునామనుకృతేఽస్తి
వాక్యం తు (ఆం. చిం. సంజ్ఞా. ౧౪ కా. అహో. ౧౬౭ పు.)

ప్రబన్ధేకేవలాద్యస్య । ప్రయోగస్తు న దోషకృత్ ।
సంకీర్ణత్వం వికృత్యాద్యా । నుకృత్యా మఞ్జులం
భవేత్ । వినానుకరణం కేచి । దాద్యశబ్దం ప్రయు
ఞ్జతే । ప్రత్యయాన్తావ్యయస్యాపి । ప్రయోగః కుత్ర
చిద్భవేత్ ॥ (వికృ. సంజ్ఞా. ౨౬-౨౭ కారి. అహో. ౧౯౫.)

నన్నయా
థర్వణీయము.
౧౧౨ విషయము.

క్వచిత్ ప్రత్యయసంబన్ధే । శక్తేః స్యాదన్యథాస్థితిః ।
(వికృ. అజం. ౨౨ కా. అహో. ౨౧౨ పు.)
అవ్యయస్యేతరస్యాపి । ప్రయోగోవిష్ణుశర్మణా (వికృ.
సంజ్ఞా. ౨౧ కారి. అహో. ౧౯౫ పు.)

కల్పతరు. ౧౧౨ విష:—అవ్యయ = అపి - తు - చేత్యాద్యవ్యయములయు, సుప్ = రామః. కృష్ణ ఇత్యాది సుబంతములయు, తిఙ్=అస్తిభవతీత్యాది తిఙంతములయు, క్త్వా=త్యక్త్వా సంత్యజ్య మున్నగుక్త్వాప్రత్యయాంతములయు, తుమునామ్=కర్తుం భోక్తు మిత్యాది తుమున్నంతములయు, పదాని=సంస్కృతవిభక్త్యంతములు, న=తెలుఁగునఁ బ్రయోజ్యములుకావు. అనుకృతే=అనుకరణమునందు, వాక్యంతు=సంస్కృతవిభక్త్యంత ఘటితవాక్యమునైతము, అస్తి= ఉండును. ఈవిషయములను విస్తరించియు సవరించియు నథర్వణుఁడు వివరించుచున్నాఁడు:—ప్రబన్ధే = ఆంధ్రకావ్యములందు, కేవలాద్యస్య ప్రయోగః=సంస్కృతవిభక్త్యంతములయుఁ దద్ఘటిత వాక్యశ్లోకములయుఁ బ్రయోగము, నదోషకృత్=దుష్టము కానేరదు. సంకీర్ణత్వమ్=అట్లు తెల్గుకావ్యములలో సంస్కృతవిభక్త్యంత ప్రయోగరూపసంకీర్ణత, వికృతి='అను' మున్నగు తెలుఁగుశబ్దములయు, ఆద్యా = ఇతీత్థం ప్రభృతిసంస్కృతశబ్దములయు, అనుకృత్యా = అనుకరణముచేత, మఞ్జులమ్ = సుందరమైన దనఁగా నిర్దుష్టము, భవేత్ = అగును. కేచిత్ = కొందఱు, అనుకరణంవినా = అట్టి యనుకరణము లేకుండ, ఆద్యశబ్దమ్ = సంస్కృతవిభక్త్యంతమును, ప్రయుఞ్జతే = ప్రయోగింతురు. సంస్కృతవిభక్త్యంతములుఁ దద్ఘటితవాక్యశ్లోకములును దెలుఁగున సంస్కృతశబ్దాను

కరణము మూలమునఁగాని యాచ్ఛికశబ్దానుకరణముమూలమునఁగాని ప్రయోగింప వచ్చును. అట్టి యనుకరణములేని ప్రయోగము క్వాచిత్కమును గేచిన్మతమును నయియుండును. ఉదా:—రామ యనుశబ్దము (రామః+అనుశబ్దము) సంస్కృత ప్రథమైకవచనాంతము. ఇందు 'రామః' అను సంస్కృతపదము 'అను' అనెడి యాచ్ఛికశబ్దముచే ననుకృత మయ్యెను. అనుకృతి లేనందులకు—నీకు సదా మేల య్యెడున్. ఇందు 'సదా' అనుసంస్కృతవిభక్త్యంత మనుకృతి లేకయే తెనుఁగు వాక్యమున సంకీర్ణమయ్యెను.

శా. శ్రీవాణీగిరిజా శ్చిరాయదధతో వక్షోముఖాఙ్గేషుయే । లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్ । తే వేదత్రయమూర్తయస్త్రి పురుషా స్సంపూజితా వః సురై ; ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరాః శ్రేయసే॥' అని... స్తుతియించి (ఆది. ౧ ఆ. ౧ ప.). "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా|పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్। కిం కాలకూటః కిము వా యశోదా। స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే." అని నీవు తొల్లి రచించిన...(విరా. ౧ ఆ.౧౧ ప.) "నమః కైవల్యకల్యాణ । కల్యాణస్వ విధాయినే । నారాయణాయ మహతాం । వర దాయ వరీయసే." అని వినుతించిన...(హరి. ఉభా. ౧౦ ఆ. ౨౧౨) (విస్తర.). ఇతి ప్రభృతిసంస్కృతశబ్దములతో ననుకరించునపు డట్టి యితిప్రభృతులు సిద్ధసమాసగత

---

విస్తర. ౧౧౨ విషః—వాక్యమధ్యమున సంస్కృతాంధ్రవిభక్త్యంతశబ్దసంకీర్ణతమాత్రమె దుష్టమనియుఁ గేవలసంస్కృతవాక్యము లనుకరణములేకయే తెలుఁగు ప్రబంధములలో వాడవచ్చుననియు నిఁకఁ గొందఱు వాక్యమధ్యమందును సంస్కృతపదప్రయోగ మనుకరణరహితముగాఁ బ్రయోగింప నగునని రనియు నహోబలపతి యీ క్రిందిరీతిని బ్రామాదికముగ వ్రాసెను. "ఏతన్నిషేధ ఆన్ధ్రపద సంకీర్ణతాయామేవ, నాన్యత్ర. కేవలానాంతు ప్రయోగో నిర్బాధ ఏవ. అత ఏవోక్తం వికృతివివేకే, ప్రబన్ధే కేవలాద్యస్య । ప్రయోగస్తునదోషకృదితి. సీ. దమ్భోళిధర సతీతామ్బూలపేటీషు । దహన బింబాధరా స్తనభరేషు । క. హరయే జితమురుదరయే। తరయే భవవారిధేశ్చ ధన్యజనానామ్ । సురతరవే స్మరగురవే । స్థిరవేదమయాయ దేవదేవాయ । నమః. ఇత్యాది ప్రయోగాః ప్రబన్ధేషు బహవః ప్రవర్తన్తే. కిఞ్చ తత్రైవ. 'వినానుకరణం కేచి|దాద్యశబ్దం ప్రయుఞ్జతే'...ఇత్యుక్తమ్. అత ఏవ రామాభ్యుదయే రామభద్రకవినా. ఉ. అర్తులనీవ నేర్తు వరయంగనిత్యాదిపద్యే, కర్తుమకర్తుమన్యథాకర్తుముదారశక్తిపీత్యుక్తమ్....(" అహో. ౧౬౫ పు.) అహోబలపతివ్రాసినట్లు పైస్థలముఁ దనుకృతి లేకపోలేదు. "క. హరయే జితమురుద

మున్నై యుండెను, ఊ...ఆ! యాశ్చర్యము ముందటం జయజయధ్వను లిచ్చిరి.... (ప్రభా, ౨ ఆ. ౯౭) ఇచట 'జయజయఇతి ధ్వనయః = జయజయధ్వనయః' అను సంభావనాపూర్వపదకర్మధారయసమాసమం దితిశబ్దము లోపించినది. 'జయజయ' అను తిఙన్తశబ్దము లిచట నితిశబ్దముచే ననుకృతము లగుచుఁ దెలుఁగువాక్యమునఁ బ్రయోగింపఁబడినవి. దీని యనుసరణమె యాముక్తమాల్యదయం దీక్రిందిరీతిని విస్తరిల్లినది. శా. అధ్వావాగ్విబుధ మ్మహాంవచనకవ్యాహారమాహావచ। స్విధ్యమ్మాః కృతతాంగతః కలిరితి శ్రీసూక్తి విద్యాధర। మ్మిథ్యౌద్ధత్యమగాల్లయం హి కుధియా మిత్థం వదత్కన్నర। మ్మధ్వీశాగ్రణి గెల్పు టుత్సవమునం దయ్యెన్నభం బయ్యెడన్ (ఆము. ౪ ఆ. ౬ ప.) ఇందలి 'ఆహా' శబ్దమాశ్చర్య ప్రశంసార్థకము సంస్కృత కోశములలో లేదు. అయ్యది యాంధ్రపదము. సిద్ధు లాంధ్రదేశ్యపదముతోఁ దమయాశ్చర్యమునుఁ బ్రశంసించిరనిచెప్పకతీరదు. లేదా దీని నాశ్చర్యానుకరణ శబ్దముగానైన నెన్నవలెను. ప్రత్యయార్థేత్యాది:—ప్రత్యయార్థావ్యయస్యాపి= ము ప్రత్యయముచేరుట కర్హమైన యవ్యయములయు, ప్రయోగః = ప్రయోగము, కుత్రచిత్ = ఒకప్పుడు, భవేత్ = అగును. క్వచిత్ = ఒకప్పుడు, ప్రత్యయసంబన్ధే = అట్టి ముప్రత్యయయోగమున, శక్తేః = అర్థశక్తికి, అన్యథా స్థితిః = మార్పునైతము గల్గును. ఇతరస్య - అవ్యయస్యాపి = ముప్రత్యయముతోఁ జేరని యవ్యయము

---

రయే...(౫౬) స్రగ్ధర-శ్రీమన్నేత్రాంబుజలాయ శ్రితభరణ......మాం పాహిపాహీశ్వర వరద హరే శార్ఙ్గపాణే కృపాళో "(౫౭) వ. అని మఱియు. (౫౮)"(రామాభ్యు. ఆ.) ఇట్లనుకృతితోనె రామభద్రకవి పైశ్లోకములను వచించెను. ఇంక 'కర్తుమకర్తు' మిత్యాదిని, 'కర్తుమ్ అకర్తుమ్ అన్యథాకర్తు ముదారా శక్తిర్యస్యసః' అని సమాసముచేసికొని సమర్థింపనగును. ఇట్లె, చ. ఇనసమతేజ వింటివె - యతీవభుజక్రమ విక్రమక్రియా। ఘనులగు...(ఉ. హరి. ౫ ఆ. ౨౭) మున్నగుచోటులందును సమర్థించుకొనవలెను.

ఈయిరీతినున్న యహోబలుని ప్రమాదపద్ధతినే నారాయణీయతద్వివరణములు ననుసరించినవి. అట్లె - "ప్రబన్ధే కేవలాదవ్యస్య......వినానుకరణం కేచిత్... ప్రత్యయార్థావ్యయస్యాపి......అవ్యయస్యేతరస్యాపి" అను నధర్వణకారికలెల్లఁ బునరుక్తముగ నేకార్థమునే బోధించుచున్నట్లు వ్యాఖ్య చేయఁబడెను. ఇంతియ కాక "ప్రత్యయార్థావ్యయస్యాపి" "కథితస్తద్భవస్యాపి" అనువానికి వరుసగా 'ఇహేమ - విత' అనురీతివి యుదాహృతులనియు గ్రహించిన ట్లగపడదు. (నారా. గాణ. ౯౨ - ౯౩ - ౯౪ పద్య. సంజ్ఞా.)

యొక్కయు, ప్రయోగః = ప్రయోగము, విష్ణుశర్మణా = విష్ణుశర్మచే నంగీకరింపఁబడినది. ఉదా:—ఇహము = ఈలోకము. సంస్కృతమున 'ఇహ' శబ్దమున కీలోకమందని యర్థము. తెల్గున 'ఇహము' అనఁగా నీలోకమని యర్థము. ఇట్లర్థము మాఱుటచేతనే మరల దానిపైని 'అందు' ప్రత్యయము చేరుచున్నది. సీ...ఆ. వె. ఇహమునందుఁ బుణ్యహీనుఁడై చెడిపోవుఁ । బరమునందు దుఃఖభరము నొందు... (అర. ౫ ఆ. ౮౧) చ. చెడు నిహముం బరంబు నిది సిద్ధముగావు టెఱింగి (ఆది. ౧ ఆ. ౧౩౯) 'ఇహము = ఈలోకము' అని యిచటఁ బ్రథమార్థము నిచ్చుచున్నది. (ఇట్లే. ఆది. ౪ ఆ. ౮౨; ౬ ఆ. ౨౭౪) "అవ్యయీభావశ్చ. (౧-౧-౪౧) అవ్యయసంజ్ఞః స్యాత్." (సి. కౌ. ౪౫౧ సూ.) అవ్యయీభావసమాసపదములకు "నపదానీత్యాదిచొప్పునఁ దెల్గున సాధారణముగా వాడుక లేదు. కాని యరుదుగ గలదు. అట్టి యెడల నర్థమును మాఱును - ఉదా: - "దినే దినే = ప్రతిదినమ్ = (ప్రతిదినమందు)" అని సంస్కృతభాషయందు సప్తమ్యర్థకము. "విధిమనతిక్రమ్య = యథావిధి" విధి నతిక్రమింపకుండునట్లుగా నని సంస్కృతమున దీని యర్థము. "శక్తి మనతిక్రమ్య = యథాశక్తి" = శక్తి నతిక్రమింపకుండునట్లుగా నని యర్థము. "అక్ష్ణోస్సమీపే = ప్రత్యక్షమ్ =" ఇంద్రియముల కెదుటిభాగమందని యర్థము. కన్నులయెదుట ననియు నర్థము. వీని యర్థమందును మార్పు ప్రయోగదృష్ట మగుచున్నది. యథావిధిని...పుత్త్రకామేష్టిసేయించిన (ఆది. ౭ ఆ. ౧౭ గద్య.) ఇచట యథావిధితో నని తృతీయార్థక ద్వితీయావిభక్తి నిల్చినది. తే. గీ. నాయథాశక్తిఁ జేసి యన్యాయపథము । పరిహరించి......(సభా. ౧ ఆ. ౫౭). క.... ప్రతిదినంబు సేయుచునుండెన్ (ఆది. 3 ఆ. ౧౦౧) క.... । ప్రతిగృహముల కరుగుచున్న భవ్యుల......(ఆది. ౬ ఆ. ౨౩౭). క.... మహోక్షధ్వజుఁ బ్ర । త్యక్షము గావించె...(అర. 3 ఆ. ౪౯). తే. గీ. హరుఁడు వానికిఁ బ్రత్యక్షమయి వరంబు । వేఁడు మనవుడు...(అర. 3 ఆ. ౫౦) ప్రత్యయార్థావ్యయమునకే కాక యితరావ్యయములకును బ్రయోగము గలదనుటకు (విస్తర. ౧౧౨ II) యథాశక్తి - యథావిధి మున్నగునవి యుదాహృతులు కాఁగలవు. 'వృథా' అనునవ్యయము హ్రస్వమునొంది తత్సమమై తెల్గున వాడఁబడును. అట్లే 'హా' అనునవ్యయ మేకాక్షరకమగుటచే హ్రస్వమునందక ప్రయుక్తమగుచున్నది. వృథసేయఁగాఁదగదు....(ఆది. ౨ ఆ. ౨౩౧) హాహా పుట్టును (శల్య. ౨ ఆ. ౨౪౮). నారాయణీయ వివరణకర్త 'అవ్యయస్యేతరస్యాపి' అనుదానికట్టి యర్థవిశేషమును గ్రహింపక ప్రత్యయార్థావ్యయస్యాపీత్యాదికిఁ బునరుక్తమని-

పలుకు 'త్రాణాగోపాలకము' మున్నగువాని నవ్యయస్యేతరస్యాపీత్యాది కుదాహ రించెను, మఱియు వినానుకరణం కేచిదిత్యాదికిఁ బునరుక్తమని గ్రహింపక "అవ్యయాని స్వరూపేణ। సదా సర్వత్ర సర్వదా" అను ప్రక్షిప్తకారికనాథర్వణముగా నంగీకరించి యుదాహరించెను. (నా. రా. గా. ౧౧ - ౧౯ కా. సంజ్ఞా. ౯౮ - ౯౯ పద్య.)

బాలవ్యా. ౧౧౨ I విమ. — పయి నన్నయాథర్వణకారికలు బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడలేదు. ౨౦ సూత్రమునొద్ద సంగ్రహింపఁదగినవి.

సంజీవని. ౧౧౨ I విమ:—అనుకరణమున సంస్కృతపదవాక్యము లేకాక యే భాషలోని పదవాక్యములనైనఁ బ్రయోగింపవచ్చునని తలంచియో? తనయనుకరణ సంధివిధులజ్ఞాపకమున ననుకృతివిషయము విశదము కాఁగలదని భావించియో? సూరి గారివిషయమునందలి నన్నయాథర్వణకారికలను సంగ్రహింపరైరని తోఁచెడిని. కాని సంస్కృతమాంధ్రభాషలో నొకభాగ మగుటచే నందలి వాక్యములు తఱుచుగా ననుకృతములయినను నర్థస్ఫూర్తిభంగ ముండనేరదుగాని భాషాంతర వాక్యములనట్లుగ ననుకరించినచో నాంధ్రపండితుల కర్థమగుట దుర్లభమగునుగానఁ బ్రాయికముగా భాషాంతరవాక్యముల ననుకరింపరాదని సంస్కృతానుకరణవిషయక నన్నయాథర్వణకారికలవలన వ్యక్తమగుచున్నది గావున సూరి వానిని సంగ్రహింపకుండుట సరికాదని చెప్పకతీరదు. అర్వాచీనకవులు తురుష్కభాషావాక్యముల ననుకరించుట చాటువులలోఁ గన్పట్టును. అనుకరణము = ఇతిప్రభృతిసంస్కృత శబ్దములచేఁగాని 'అను' ధాతురూపములచేఁగాని సంస్కృతపదవాక్యముల ననుకరించి యథాస్థితముగాఁ బ్రయోగించుట. (విస్తర.)

---

విస్తర. ౧౧౨ I విమ:—"అనుకరణ మనఁగా నొకదాని నొకటిఁబోలుటకుఁ బాటుపడుట యని యర్థము. సంస్కృతశబ్దజాలమెల్లఁ దెనుఁగున వెలయించి సంస్కృతభాషాతౌల్యము తెనుఁగునకు సంపాదింపఁబడునట్టి పాటు...'అను' అను దానిం దుదినిఁజేర్చి సంస్కృతపదములు తెలుఁగుభాషలోనికి లాగఁబడుచున్నవిగాన ననుకరణమనుపేరు గల్గెను" (బా. సా. వే. ౧౧౪ పు.) ఈవేటికావ్యాఖ్య సరికాదు. సంస్కృతపదవాక్యములు యథాస్థితముగ ననుకరింపఁబడుటయె (అను=అనుసృత్య) యనుకరణమందుఁ బ్రసిద్ధముగాని యాసంస్కృతపదవాక్యములనుబోలునట్లు ప్రయోగించుట ప్రసిద్ధముకాదు. 'అనుకరణ' శబ్దములోని 'అను' అనునది 'అను' ధాతురూపముగా నెన్నినపుడు 'అనుకరణ' శబ్దము వివక్షితార్థబోధనక్షమము కానేరదు.

ఆచ్ఛికమగు 'అను' ధాతువునకు 'అని చెప్పు' అనియు నర్థము గలదుగాన 'రామాయనమయనియె' అనఁగా 'రామాయనమః' అని పలికె ననునర్థము లభించును. ఆచ్ఛికశబ్దకృతానుకరణమున నట్టి సంస్కృతపదవాక్యముల తుదివర్ణము మాత్రము 'అను' అనుదానితో సంధించునప్పటిసంధికార్యము లాంధ్రవ్యాకరణముల లోని యీయనుకృతి సంధిప్రకరణమున నుపదేశింపఁబడును, తక్కిన యనుకృత సంస్కృతవాక్యమునందలి సంధులెల్ల సంస్కృతవ్యాకరణోక్తములె సంభవించును. ఇతీత్థం ప్రభృతి సంస్కృతశబ్దకృతానుకరణస్థలములందుసయిత మట్టి యితిప్రభృతి సంస్కృతశబ్దములు సమసించియున్న సమాసముతుదిని నిల్చు తెలుఁగు విభక్తులకు సంస్కృతసంధ్యాదులె వర్తిల్లును. ఇంక నట్టి సంస్కృతవాక్యముల యాద్యంతాక్షరములు వానివానికిఁ బూర్వపరములనున్న యాంధ్రవాక్యముల యక్షరములతో నదుకునప్పటి సంధికార్యము లాంధ్రవ్యాకరణోక్తములగు తెలుఁగుసంధులె వర్తిల్లును. ఉదా:—ఆతఁ డమ్ముబాణాసాయనమ యనిపల్కెఁ. రామ ఇత్యాదులెల్లఁ బుంలింగములు. శా. ఆద్యావాగ్విబుధమ్మహాపచనక వ్యాహారమాహావచః। సిద్ధమ్మాః కృతతాంగతః కలితేతి శ్రీసూక్తివిద్యాధర। మ్మిద్ధౌద్ధత్య...(ఆము. ౪ ఆ. ౬ ప.) గీ. "కాశ్యదీప్తా వనంగ విఖ్యాతమైన" (కాశీ. ౫ ఆ. ౧౦) అనుపద్యమున "దీప్తా+అనంగ = దీప్తా వనంగ" అనుసంస్కృతసంధి కార్యము ముద్రణసంస్కర్తృప్రమాదకృతమె కాని కవిప్రయుక్తముకాదు. "కాశ్య దీప్తాయ నంగవిఖ్యాతమైన" అనునదే కవిప్రయుక్తపాఠమనఁ జనును. ద్వి. దత్త కైవల్యయుదాత్తసద్భక్తి। విత్తేశ, శ్రీగురవేనమో యనుచు।...అధ్వషట్కాతీతయతిపాతకౌఘు। విధ్వంస శ్రీగురవేనమో యనుచు (బసవ. ౨ ఆ. ౨౨౫-౨౩౦ ప.) వీనియందు 'శ్రీగురవేనమః' అనునదిమాత్రమె యనుకృతసంస్కృత వాక్యమనియుఁ దక్కినసంబోధనములెల్లఁ దత్సమశబ్దములె యనియు, గ్రహింపవలెను. సంబోధనశబ్దమున కభిముఖీకరణమాత్రమె యర్థమగుటంజేసి యయ్యాయి సంబోధనశబ్దము లాయాసంస్కృతవాక్యములలోఁ జేరకున్నను నన్వయభంగము లేదు. అట్లగుటనే పయిసంబోధనశబ్దములచోట సంహితాయకారము నిల్చుటయు శ్రీశబ్దపూర్వాక్షరములు గురువులు కాకుండుటయు ననెడియాచ్ఛికపద్ధతులు విరోధింపనేరవు. "దండకము...సురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః" (అర. ౧ ఆ. ౩౨౪)

---

మఱియు నీవ్యాఖ్యచే నథర్వణుఁడు వచించినట్లు 'ఆద్యానుకరణ' మ్మనఁగా 'ఇతీత్థం' ప్రభృతిశబ్ద ములతోఁ జేసినయనుకరణము సంగ్రహింపఁబడఁజాలదు.

షష్ఠ్యాంతక ప్రయోగమందును బహుపద్ధతి కన్పట్టుచున్నది. కాని 'కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా' అనుతత్సమశబ్దములకు 'ప్రసాదింపు' అనెడి పూర్వవాక్యములోఁ జేర్చినచోఁ శంకాంకూరమును గల్గనేరదు.

సంజీవని. ౧౧౨ II విష:—"వినానుకరణం కేచి" దిత్యాదికముచొప్పున ననుకరణవిరహితముగా "సదా సర్వత్ర" మున్నగుశబ్దములు తెల్గువాక్యముల నడుమ నిల్చుట నన్నయభారతభాగమందే కాక (విస్తర.) భారతమం దెచ్చటను జూపట్టలేదు. కావుననె యట్టిప్రయోగము కేచిన్మతమని యథర్వణునిచే వచింపఁ బడెను.

---

విస్తర. ౧౧౨ II విష:—"దండకము...భవత్పాద పంకేరుహాధ్యాన డిండీర ధారానుభూతిన్ సదా తృప్తులై......"(ఆర. ౧ ఆ. ౩౨౪) ఇచటి సదాశబ్దము వ్యస్తముకాదు. సదా తృప్తశబ్దము నిత్యతృప్తశబ్దమువంటి సిద్ధసమాసమని చెప్ప నగును.

క. స్వస్తి యొనర్పఁగ నవసర। మాస్తీకునకయ్యె...(ఆది. ౨ ఆ. ౨౧౯) క. వచ్చినయాశార్దూలవృథ। పుచ్ఛక (ఆది. ౩ ఆ. ౨౦౪) చ...ఈద్విజనాథుకోర్కి వెం। పున వృథసేయఁగాఁ దగదు...(ఆది. ౨ ఆ. ౨౩౧) శా. ఆహా పుట్టెడులాఁతి చూపఱకు హాహాపుట్టు మీవారికిన్ (శల్య. ౨ ఆ. ౨౪౮) ఈభారతప్రయోగము లలో "స్వస్తి - వృథ - హాహా" అనునవి తత్సమములెకాని సంస్కృతవిభక్త్యంత ములుకావు. 'నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు' (బా. తత్స. ౪౪ సూ.) అనుచొప్పున వృథాశబ్దమునకు హ్రస్వము రాఁగా 'వృథ' అను తెలుఁగుప్రాతిపదిక మేర్పడినది. 'ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు' (బా. తత్స. ౪౫ సూ.) అను దానిచొప్పున 'హా' శబ్దదీర్ఘమునకు హ్రస్వము రాదయ్యెను. కాన నయ్యది ద్విరుక్తముకాఁగా 'హాహా' అనురూప మేర్పడెను. శబ్దరత్నాకరకర్త పైరీతిని గ్రహింపక "హాహా - సం - అవ్య..." అని ప్రత్యేకశబ్దముగాఁ జూపుట పొరపాటు. శబ్దస్తోమమహానిధిలో 'హా' అనునదిమాత్రమె చూపఁబడియున్నది. పయిరీతి నేర్పడినవానిలో నొక్క 'స్వస్తి' అనుదానికిమాత్రము 'ఇగ్లౌరా...' (బా. తత్స. ౪౪ సూ.) సూత్రముచేఁ బ్రథమైకవచనలోపముకల్గునని చెప్పినఁ జెప్పవచ్చునుగాని - 'వృథ - హా' అనువానిప్రథమైకవచనంబునకు లోపమువచించు ప్రత్యేకసూత్రము నన్నయాథర్వణీయమునఁగాని బాలవ్యాకరణమునఁగాని లేదు. అకారణమున 'నఘఢానవ్యయసుప్తిఙ్క్త్వాతుమునామ్' అనుచింతామణిసూత్రముచేఁ బ్రథమైక వచనలోపము కల్గునని వ్యాఖ్యానము చేసికొనవలసియున్నది. ప్రాతిపదికములపై

సంస్కృతవిభక్తులను నిల్పి వానికిఁ దెలుఁగువిభక్తుల నాదేశించుప్రక్రియను నడపు చింతామణిలో సంస్కృతవిభక్త్యంతములు తెల్గున నుండవని మొదలఁ జెప్పుట యనావశ్యక మగుటం జేసి 'నపదాన్యవ్యయే'త్యాది చింతామణిసూత్రమున కిట్లుగ నేవేని స్థలములం దావశ్యకతగల్గునపుడు సంస్కృతవిభక్తిలోపము గల్గునని వ్యాఖ్య చేయుట యుక్తమే యనఁదగును - పయిరీతిని 'స్వస్తి - వృథ - హా' మున్నగునవి తత్సమపదములె కాని సంస్కృతవిభక్త్యంతములు కావని గ్రహింపవలయును. సర్వదా - సదా - మున్నగునవి వ్యస్తముగా నాంధ్రవాక్యమధ్యమునఁ బ్రయోగింపఁబడునపుడవి. "వినానుకరణం కేచిదిత్యాద్యథర్వణసూత్రమునకు లక్ష్యములగుచున్న వనఁదగును. 'సదా, సర్వదా—' మున్నగువాని దీర్ఘమునకు హ్రస్వము రాకుండుటచే నవి తత్సమపదములనుట పొసఁగనేరదు. "సర్వదా - సం - అవ్య - ఎల్లప్పుడు క....ఆనం । దకాననమునందు సర్వదా సిద్ధించున్" (కాశీ. ౨ ఆ. శ. ర.) "సదా - సం - అవ్య - సదానాననన్...(శ. ర.)" "వృథా. సం - అవ్య - వ్యర్థముగా వృథాశపింతురే. (స్వా. ౪ ఆ. శ. ర.)" నన్నయ 'వృథ' అనుతత్సమపదమునె ప్రయోగించెనుగాని 'వృథా' అనుసంస్కృతావ్యయపదమును బ్రయోగింపలేదు. గీ. 'సాధుసాధు మహాబుద్ధిబోధమహిత । మేలు మేలని శివశర్మ మెచ్చి పొగడె' (కాశీ. 3 ఆ. ౧౮౩ ప.) ఇట్టిప్రయోగములు నన్నయతిక్కనల భారతభాగమునఁ గన్పట్టలేదు. "అన్యథా - సం - అవ్య...(దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగములు కనఁబడవు)" అని సూ. రా. నిఘంటుకారులు వ్రాయుట సరి కాదు. ద్వి. 'అద్దము మాకింక నన్యథా లేదు' (బసవ. ౫ ఆ. ౧౬౧) ఇచట 'అన్యథ లేదు' అనుపాఠము నిల్పినను గణభంగము లేదు. "సర్వత్ర - సం - అవ్య...క. ధాత్రీశుల కర్జున స । ర్వత్ర జయము...(జై. ౭ ఆ. శ. ర.) 'సర్వత్ర' అనునది సప్తమ్యర్థక'త్ర'ప్రత్యయాంతావ్యయముగాన నిది సంస్కృతవిభక్త్యంతమనుటయె యుక్తమని తోఁచెడిని. ఇట్లు సుబంతములె కాక 'జయ' మున్నగు తిఙంతపదములు సయితము నిరనుకృతికముగాఁ బ్రయోగింపఁబడుటయుఁ గలదు. "ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి. తే. గీ. అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి. (జై. ౪ ఆ.)" "జయపదం బనుకరణవిరహితంబ తెలుచుగనగు. జయపూతనాఘాత జయదైత్యదమన (హరి. పూ. ౭ ఆ. ౫౮)."...(ప్రౌఢ. సంజ్ఞా. ౧౫ - ౧౬ సూ.) అని యిట్లు త్రిలింగలక్షణశేషకర్త 'వినానుకరణం కేచిది' త్యాద్యథర్వణకారికార్థమును సూత్రించి బాలవ్యాకరణమును సవరించెను. నాచనసోమనాథుఁడుత్తరహరివంశమునఁ బండ్రెండు తోదకవృత్తచరణములలోనుఁ దర్వాత మఱి

రెండవవృత్తములలోను "జయజయమంగళసంగతరూపా!....చ. జయజయ శంఖ చక్రధర...మ. జయనారాయణ పుండరీకనయనా..." (ఉ. హరి. ౬ ఆ. ౧౮ - ౧౯ ౨౯ ప.) అనురీతిని నిరనుకరణముగనె జయశబ్దపరంపరను బ్రయోగించెను. ఇట నొక్కవిషయము వివేకింపవలయును. "జయజయధ్వనులు" (సభా. ౨ ఆ. ౯౭) అను భట్టారకపద్యములోని 'జయజయశబ్దములు నిరనుకృతికములు కావు. అందు సంభావనాపూర్వపదకర్మధారయమున సమాసాంతర్గతమగు నితిశబ్దముచే జయజయశబ్దము లనుకృతము లయ్యెను (చూ. ౧౧౨ విష.)

త్రిలింగలక్షణశేషకర్త సంస్కృతవాక్యములైతము నిరనుకృతికముగాఁ బ్రయోగింపఁబడుటగలదని పయినుదాహరించినరీతిని సూత్రించెనుగాని యట్టివి సాధారణవాక్యములు కావు. "నమశ్శివాయ - నమోవిశ్వసృజే" మున్నగునవి కొన్ని వింతస్థలములలోమాత్రము ప్రయోగింపఁబడుట గలదు. "అంటితి 'నమశ్శివాయ' పాపాత్మురాలి" అనుచో నస్పృశ్యస్పర్శనపాపనోదనమునకై పంచాక్షరీమంత్రము స్మరింపఁబడెను. ఇట్లె "క. మనుజాశనులఁట! బలులఁట! | మునులఁట యాగంబులఁట 'నమోవిశ్వసృజే'! వినమింతకు...(ఉ. హరి. ౧ ఆ. ౯౮ ప.) ఇందుఁ బాపియగు నరకాసురుఁడు యజ్ఞభాగములను దనకిమ్మని కోరునపుడు ఋషులశ్రవ్యశ్రవణపాపహరణార్థము విశ్వసృజునికాక్రోశమున నమస్కరించినవాక్యము ప్రయుక్తమయ్యెను. ఇట్టి వింతస్థలములుదక్క సాధారణసంస్కృతవాక్యములు నిరనుకృతికముగాఁ బ్రయోగింపఁబడుట కానరాదు.

—, క. గిరిసుతతోలిపలుకుల సు | స్వరమొదవఁగ నోంనమశ్శివాయ సదాస్మ | ద్వరదాయ నమశ్శంకర | శరణుమహాదేవ నీవశరణనఁ జొచ్చెన్ (నన్నె. కు. 3 ఆ. ౨౭౭) ఇందలి చతుర్థచరణము ముద్రణసంస్కర్తృప్రమాదకృతము. 'శరణన, మహాదేవనీవశరణనఁజొచ్చెన్' అని కవిప్రయుక్తము కానోపును. చతుర్థచరణాదినున్న 'శరణ' అనునది'రక్షక' అను నర్థముగల సంబోధనైకవచనసంస్కృతపదము. అచటి తత్సమసంబోధనాకారసంధిదుష్టముకాదు. (౯౮ I విష.). "మహాదేవ నీవశరణు+అనన్" అనునది రెండవవాక్యము. రెండిటికిని 'చొచ్చెన్' అనుదానితో నన్వయము. "మహా. పు...ఉత్సవే - సతతానందజనకవ్యాపారే - తేజసి - యజ్ఞే..." (శబ్దస్తో) నీవశరణు = నీవరక్షకుఁడవు. శరణుశబ్దము 'శరణ' శబ్దతత్సమరూపాంతరము కాన ననుకరణరహిత సంస్కృతపద ప్రయోగము కాదు.

శివకవులు శ్రుతిస్మృతులనె యాధారముగఁగొని వింతయగువీరశైవమును స్థాపించినట్లె నన్నయతిక్కనాదిప్రయోగములనె యనుసరించుచు వింతవింతప్రయోగములను జేయుచువచ్చిరెకాని యాంధ్రలక్ష్యలక్షణోల్లంఘనము చేసినవారుకారు

నన్నయ భట్టీయము. లోపో నమ ఆదికే విసర్గస్య (ఆం. చిం సంధి. ౫ కా అహో. ౨౦౫.)

౧౧౩ విషయము. నమశ్శబ్దవిసర్గస్య । లోపఓత్వమపీష్యతే ॥ (వికృ. సంధి. ౧౩ కారి. అహో. ౨౦౫ పు-)

కల్పతరు. ౧౧౩ విష:—నమ ఆదికే = నమః ప్రభృతిశబ్దములందలి, విసర్గస్య = విసర్గమునకు, అనుకరణమునందలి 'అను' ధాతుప్రయుక్త 'అ' కారము పరమగు చుండఁగా, లోపః = లోపము కలుగును. ఆదికే యనునాదిశబ్దముచే ననుకృతిసందర్భమున సంస్కృతపదవాక్యాంతములఁ గల విసర్గాంతపదములెల్ల సంగ్రహింపఁబడు చున్నవి. అనుకృతియందుఁ దుదివిసర్గము లోపించునని ఫలితార్థము. అట్టి విసర్గాంతపదములలో నమశ్శబ్దవిసర్గమున కోకారమును నగునని యథర్వాణుఁడు సవరించుచున్నాఁడు. నమశ్శబ్దవిసర్గస్య = నమశ్శబ్దవిసర్గమునకు, లోపః = లోపమును, ఓత్వమపి = ఓకారాదేశమును, ఇష్యతే = సమ్మతమగుచున్నవి. విసర్గలోపపక్షమున సంహిత లోయకారాగమమురాఁగా 'రామాయ నమ యనియె' మున్నగురూపములు సిద్ధించును. సీ...ఎ-గీ. మనసిజాయనమోనమ యనుచు మ్రొక్కి వసుచ ౩ ఆ. ౧౭౦) ఓత్వపక్షమునఁ బూర్వస్థితసంస్కృతియహ్రస్వాకారమునకుఁ బరరూపనిత్యసంధిరాఁగా 'రామాయ నమో యనియె' మొదలగురూపములు సిద్ధించును. (విస్తర.). భారతమున "ఓ" త్వమునకుఁ బ్రయోగము కనఁబడలేదు.

---

చ. అనయముఁ జేతులందు భవదంఘ్రిసరోజయుగం నమామి నె। మ్మనమున సంస్మరామి యనుమాటల నిన్ వరివస్కరోమ్యహ। మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు భక్తలోకహృ। ద్వనజవిహారలోల బసవా బసవా బసవా వృషాధిపా ॥ (వృషాధిపశతకము. ౫౯ ప.) (వై. పా. ౪ విష.) సోమనారాధ్యుఁడు ప్రాచీన కర్ణాటవాఙ్మయప్రసిద్ధమగు (మలయాళమున మిక్కిలి ప్రచురము) మణిప్రవాళరీతిని జూపునపుడును ననుకృతిలో నిల్పియే పయిరీతిని సందర్భపఱిచెను. కావుననే యాతఁడు తనబసవపురాణాదులలో నీమణిప్రవాళరీతికిఁ దావీయలేదు. తుదికి భారతేతరగ్రంథములందుఁ గన్పట్టుచున్న - 'సదా - సర్వదా - వృథా' మున్నగు సంస్కృతవిభక్త్యంతముల ప్రయోగమునుసైతము చేసియుండలేదు. నన్నయ 'వృథ' అని ప్రయోగింపఁగా దానిని వింతగ ననుసరించుచు 'అన్యథ' (బసవ. ౫ ఆ. ౧౬౧) అని ప్రయోగించెను.

విస్తర. ౧౧౩ విష:—నృసింహపండితుఁడు 'నమో' అను నోదంతావ్యయము గలదనియు నథర్వణవచనానురోధమున దానికి 'అను' ధాతుపరకత్వమ్మునఁ బ్రయో

విసర్గంబున కనుకరణంబున లోపంబగు. ౫౦.

వర్ధతాం శ్రీః+అనియె = వర్ధతాం శ్రీ యనియె. అను

బాలవ్యాకరణ వివరణము. కృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాష నగు. ౫౧.

౧౧౩ I విషయము. తుభ్యం నమః+అనె = తుభ్యం నమో యనె - తుభ్యం నమ యనె. ఈకార్యంబు లాంతిచో సహితము గనం బడియెడి. గతానుగతికో లోకో యటంచున్.

సంజీవని. ౧౧3 I విష:—'వర్ధతాం శ్రీః+అనియె' అనుచో విసర్గము లోపించి సంహితలో యకారాగమము కాఁగా 'వర్ధతాం శ్రీ యనియె' అనురూప మేర్పడును. శ్రీః = లక్ష్మి, వర్ధతామ్ = వృద్ధిఁబొందుఁగాక యని యర్థము. నమశ్శబ్దపు తుదియత్తున కోత్వమును విధించుటచే సూరిపక్షమునఁ దత్సమాకారనిత్యసంధి నంగీకరింపవలసిన యావశ్యకత లేదయ్యె. నమశ్శబ్ద మకారముమీఁది హ్రస్వాకారమున కోత్వమును విధించుటచేత దానితోడి విసర్గమునకును నోత్వాదేశము గల్గుననుయర్థము లభించు చున్నది. తుభ్యంనమః+అనె = తుభ్యంనమ్+ఓ+అనె = తుభ్యం నమో యనె. సూరి యథర్వణవచనానుసారముగ నమశ్శబ్దాకారమునకుమాత్ర మోత్వాదేశ మును విధించినను నట్టి యోత్వము లాంతిచో సైత మనఁగా నితరములైన విసర్గ పరకములగు 'అ' కారములకును గల్గునని వివరించెను. ఈయోత్వము భారతేతర గ్రంథములందు ధారాళముగాఁ గనఁబడుచున్నను భారతమునఁ గన్పట్టలేదు. విసర్గ లోపముమాత్రమె భారతమునఁ జూపట్టుచున్నది. "అగ్నిర్మిత్రో యోని యనియు (అర. 3 ఆ. ౧౨౨ గద్య.) పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్ర యనువేదవచనంబు (ఆది. ౪ ఆ. ౮౯ గద్య) ఓత్వాదేశమునకు భారతేతర ప్రయోగములు:—శా...। జీవస్థాయ నమో యనంగ శుభముల్ చేకూరు మా కెప్పుడున్ (ఉ. హరి. ౨ ఆ. ౧3౦) ఉ. జలజాలయాశశి। త్రాయ నమో నిశాచరహరాయ నమో యనుఁగాని (వరాహ. బా. గు. ప్ర. ౮౮ పు.) ఉ. పాశహ। స్తాయ నమో నమో యనుచు దక్షతవారికి మ్రొక్కి వెండియున్ (అహో. ౨౦౫ పు.) ద్వి. శ్రుతియేక వీవరు

గము లేదనియు వచించెను. 'దేవదేవాయనమో' అనుదానికి రామాభ్యుదయమునఁ ('శ్రీమన్నేత్రాంబుజాయ' అనునది పరమైయున్నది) బ్రయోగము గలదనెను- కాని 'నమో' అను 'ఓ' దంతావ్యయమే సంస్కృతమున లేదు. రామభద్రకవిపద్య ములో 'దేవదేవాయనమః' అనియే పాఠ మంగీకార్యము. ఇట్లు నృసింహపండి తునిచర్చ నహోబలపతి నిరసించెను. (అహో. ౨౦౫ పు.)

ద్రోయన్నయట్లు । ఉ...(బసవ. ౬ ఆ. ౭౫౩) శ్రుతి సదాపశ్యన్తి శకార యోాయ నఁగ (బసవ. ౬ ఆ. ౮౦౧) 'గతానుగతి కోలోకో యటంచున్' అనునది సూరిచేతనే యుదాహరింపఁబడెను.

అహమాదీనాం ద్విత్వమ్. (అం. చిం. సంధి. ౫ కా. అహో. ౨౦౨)

నన్నయా థర్వణీయము. అ_న్త్యగస్య హలోద్విత్వం । భవేదనుకృతౌపరే (వికృ. సంధి. ౧౦ కారి. అహో. ౨౦౨ పు.)

౧౧౮ విషయము. శబ్దానామన్త్యభాగేషు । యోఽనుస్వారః ప్రదృశ్యతే । తస్యాచిపరతోమస్స్యా । త్సర్వత్ర కవిసమ్మతేః ॥ (వికృ. సంధి. ౧౧ కారి. అహో. ౨౦౩ పు.)

కల్పతరువు. ౧౧౮ విష:—అహమాదీనామ్ = 'అహమ్' మున్నగుశబ్దముల తుదిమకారమున కనుకృతియందు, 'అను' ధాత్వాకారము పరమగుచుండఁగా, ద్విత్వమ్ =ద్విత్వము కల్గును. అథర్వణుఁడు వి_స్తరించి వివరించుచున్నాఁడు. అనుకృతౌపరే = అనుకృతియందలి యనుధాత్వాకారము పరమగుచుండఁగా, అ_న్త్యగస్యహలః=పదము తుది నున్నహల్లునకు, ద్విత్వమ్ = ద్విత్వము, భవేత్ = అగును. అహమాదులలోని యేవో కొన్నిటి మకారమునకేకాక యెల్లహల్లులకును ద్విత్వమగునని యథర్వణుఁడు వి_స్తరించెను. ఉదా:—దాసోహమ్+అనె = దాసోహమ్మనె. కింతత్ + అనె = కింతత్తనె. మొ.

శబ్దానామిత్యాది:—శబ్దానామ్ = ధ్వన్యనుకరణాదిశబ్దములయుఁ బ్రాకృతాదిశబ్దములయు అ_న్త్యభాగేషు = తుదిభాగములయందు, యః అనుస్వారః = ఏపూర్ణానుస్వారము; ప్రదృశ్యతే = కనఁబడుచున్నదో, తస్య = దానికి, అచిపరతః = అచ్చుపరమగుచుండఁగా, సర్వత్ర = అంతటను, కవిసమ్మతేః = మహాకవుల సమ్మతి యున్నకారణమున, మః = మకారము, స్యాత్ = అగును. పిదపఁ బైసూత్రముచే నట్టి మకారమునకు ద్విత్వమగునని తాత్పర్యము. ఝుంఝుం+అనె = ఝుంఝుమ్+అనె = ఝుంఝుమ్మనె. రామేసుం+అనునది = రామేసుమ్+అనునది = రామేసుమ్మను నది. మొ. (వి_స్తర.)

---

వి_స్తర. ౧౧౮ విష:—"క_స్త్వమ్+అనియె...పదాంతమున వికల్పముగా సున్న యుండనోపునుగాన నట్టియెడల సున్నను మకారముగా భావించుటయేని మకారాంతమునె పరిగ్రహించి ద్విత్వమును గూర్చుటయేని చేయవలయును." (బా. సా. వే. ౧౧౭ పుట.) ఈవేటికావ్యాఖ్య శాస్త్రవిరుద్ధము. సంస్కృతపదాం

తెలుఁగునందు వ్యంజన మకారమే నిత్యముగా నిల్చునుగాని దానికిఁ బాక్షికత లేదు. మకారమునకు హల్పరకత్వమునమాత్రమె యనుస్వార మగును. స్వరము పరమగు నపుడు మకారమె నిల్చియుండును. "మోఽనుస్వారః. (౮ - 3 - ౨3) మాన్తస్య పదస్యానుస్వారః స్యాద్ధలి. హలి సర్వేషా మిత్యతోహలీత్యనువర్తతే...పదాన్తస్య మస్యేతి ఫలితమ్." (సి కౌ. ౧౨౨ సూ.)

ఈ క్రింది బాలసరస్వతీయముపై పేటికాప్రమాదమునకు మూలము కానో పును. "అహమాదీనాం = అహం మొదలైనవి యనుకరించునప్పుడు వానియంత్యమునకు, ద్విత్వం = ద్విత్వమువచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది. అహమ్మని - కిమ్మని - ఝుమ్మని." (బాలసరస్వతీయటీక. పరిష్మద్రణము. ఈవ్యాఖ్యానపుపంక్తులందలి సున్నలును దుష్టములె.) ఈసరస్వతీ వ్యాఖ్య నీక్రిందిరీతి నహోబలపండితుఁడు నిరసించుచున్నాఁడు. "బాలసరస్వత్యాత్వత్ర! అహమాదీనా మన్తగస్యానుస్వారస్య ద్విత్వాయోగాత్తత్ స్థానే మకారం కృత్వా ద్విత్వమిత్యుక్తమ్, ద్వితీయాచార్యేణాపి 'శబ్దానామన్త్యభాగేషు। యోనుస్వారః......'అత్రేయాచిన్త్యః—దాసోఽహమిత్యాది సంస్కృతవాక్యానాం హల్ పరత్వాభావే మాన్తత్వం నిర్వివాదమితి న తేషామనుకరణ మేతదావశ్యకమ్. కింతు - ఝుంఝుం ప్రముఖావ్యక్తానుకరణ ఏతద్వచనమ్. 'రామేసుం' ఇత్యాదీనాం ప్రాకృతశబ్దానా మనుకరణేప్యస్య వినియోగ ఇతిబోధ్యమ్...నతేషామపి మాన్తత్వమ్. తథాత్వే బాధకాభావే ప్యథర్వణవచనస్య నిరాకర్తు మశక్యత్వాత్" (అహో. ౨౦౪ పు.) శబ్దానామన్త్యభాగేష్విత్యాద్యథర్వణవచనమున నహమాది శబ్దములతుది ననుస్వార మున్నదని చెప్పఁబడలేదు. ఏవేని శబ్దములతుది ననుస్వార ముండునపు డాయనుస్వారమునకు స్వరపరకత్వమున మకార మగునని మాత్ర మందుఁ జెప్పఁబడియున్నది. కాన నట్టియెడల వేనితుదిని సున్న యుండునో యట్టి శబ్దములనె లక్ష్యములనుగా నెన్నుట యుక్తముగాన 'ఝుం' ప్రభృతిధ్వన్యనుకరణ శబ్దములును 'రామేసుం' ప్రభృతిప్రాకృతశబ్దములును నైయథర్వణవచనమునకు లక్ష్యములుగా వ్యాఖ్య చేయఁబడుట యుక్తముకాని వానియందును మకార మున్నదన్నను బాధలేదనియు నథర్వణవచనము నన్యథాకరింపరాకుండుటంజేసి యట్లు వ్యాఖ్య చేయఁబడెననియు నహోబలపతి వ్రాయుట యుక్తముకాదు. ధ్వన్యనుకరణశబ్దములలో సున్నయున్న దన్నను మకార మున్నదన్నను బాధలేదనిన నవచ్చునుగాని 'రామేసుం' ప్రభృతిప్రాకృతపదముల తుది నట్లుచెప్పుటకు వలను పడదు. ప్రాకృతపదములతుదిని సున్నయే యుండునుగాని మకార ముండనేరదు.

బాలవ్యా- అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. ౫౭.
౧౧౪ I విషయ. కింతత్+అనియె = కింతత్తనియె. కస్త్వమ్+అనియె = కస్త్వమ్మనియె.

సంజీవని. ౧౧౪ I విష:—కింతత్ = అదియేమి? కస్త్వమ్ = నీ వెవ్వఁడవు? కింతత్+అనియె = కింతత్+త్+అనియె=కింతత్తనియె. కస్త్వమ్+అనియె=కస్త్వమ్+మ్+అనియె = కస్త్వమ్మనియె. ఇట్టి యంశమును నెఱుంగునది. తచ్ఛబ్దము దకారాంత ప్రాతిపదికము - దాని ప్రథమైకవచనరూపములు. 'తత్ - తద్' అని ద్వివిధముగా నుండును. వీనిలో 'తత్' అనెడి చర్త్వరూపమునకె ప్రయోగప్రసిద్ధిగల్గుటచేఁ బ్రకృతసూత్రముచే నచ్చుద్విత్వము 'తత్' అనుదాని తకారమునకె గల్గుట సంప్రదాయము. ప్రయోగములు:—శా. ఆత్మార్థం పృథివీంత్యజేత్తనెడివాక్యం బశ్రుతం జే నృపా (కాశీ. సర్వల. ౧ ఆ. ౮౧ స.) శా. జ్ఞాతిశ్చేదనలేనకిమ్మనెడివాచారూఢి సత్యంబుగాన్ (వసు. 3. ఆ. ౧౦౧) శా. శీతాంశోరమృతార్పణ మ్మనుక్రియం జేకొమ్ము చేతోభవా (వసు. 3 ఆ. ౧౭౨)

ఇతి ప్రభృతి సంస్కృతశబ్దములతోడి యనుకరణమును సూరి సంగ్రహింప లేదు. అట్లయినను నది యథర్వణోక్తము, కవిసమ్మతము. అట్టి సంస్కృతశబ్దకృతానుకరణమునందుఁ దుదిహల్లునకు ద్విత్వము రానేరదు. ఉదా:—తస్మాదిత్యాదులు సర్వనామపదములు. మొ.

---

"మోబిన్దుః (౪ పరి. ౧౨ సూ.) అన్త్యహలో మకారస్య బిన్దుర్భవతి - అచ్ఛం (అక్షమ్) వచ్ఛం (వత్సమ్) భద్దం (భద్రమ్) అగ్గిం (అగ్నిమ్) దట్టం (దష్టమ్) వణం (వనమ్) ధణం (ధనమ్)" (భామహకృతమనోరమావృత్తిసహిత ప్రాకృతప్రకాశము. ౪౮ - ౪౯ పు.)

పయిసందర్భమునుబట్టి యీ క్రింది కవిజనమండనవ్యాఖ్య కేవలము ప్రామాదిక మనఁదగును. "శబ్దాంతమందైన యనుస్వార మచ్చుపరంబగునపుడు సంస్కృతాంధ్రములయందు మకారమగును. ఉదా:—కింభయమనిన చదువు సదువం దగునే. అరవిన్దసమానసున్దరాస్యా। మరవిన్దాసనసున్దరీముపాసే. ఇత్యాదులు." (వికృ. సంధి. ౧౧ కా.) "కింభయమ్+అనిన; సున్దరాస్యామ్ - సున్దరీమ్" అను మూఁడుస్థలములందును మకారస్థితియే శాస్త్రసిద్ధము - హల్పరకత్వములేనిదే 'మోఽనుస్వారః' అనుపాణినిసూత్రముచొప్పున సున్న రానేరదు. అట్టి లేనిసున్న మకారమగుటేమి?

మూలసూ. పదేతు తవ్యదాద్యన్తే । వా ద్విత్వం హరిసమ్మతేః
౧౧౫ విషయము. (వికృతివివేకమునుండి టీకాకర్త తొలఁగించె) (అహో. ౨౦౪)

కల్పతరు. ౧౧౫ విష:—తవ్యదాద్యన్తే = తవ్యత్ ప్రత్యయము మున్నగునవి తుదినిగల, పదే = పదమందుఁ, దుదినున్న హల్లునకు, హరిసమ్మతేః = హరికవిసమ్మతివలన, ద్విత్వమ్ = ద్విర్వచనము, వా = వికల్పముగా నగును. ఉదా:—ఇదం కర్తవ్యమ్+అనియె = ఇదంకర్తవ్యమ్+మ్+అనియె = ఇదంకర్తవ్యమ్మనియె = ఇదం కర్తవ్య మనియె. మొ. "తవ్యత్ తవ్యానీయరః. (3-౧-౯౬) (సి. కౌ ౨౮౩౪ సూ.) మున్నగుసూత్రములచేఁ బాణినీయమునఁ దవ్యదాదిప్రత్యయము లుపదేశింపఁబడినవి.

కవిజనమండనటీకాకర్త యీయథర్వణకారికను వికృతివివేకమునుండి తొలఁగించెను. అథర్వణకారికల ప్రత్యేకపుస్తక మెవ్వరికిని నేఁటికిని లభింపలేదనియు కవిజనమండనకర్తయు నహోబలపండితీయమునుండియే యథర్వణకారికలను స్వీకరించి కవిజనమండనటీకను వ్రాసెననియు నథర్వణకారికావిమర్శనమున నాచే విశదీకరింపఁబడెను. అట్టిస్థితిలో "అథర్వణేనాప్యుక్తమ్ - అన్త్యగస్య హలోద్విత్వం । భవేదనుకృతౌపరే । తత్రాచ్యుత్తోభవేన్నిత్య । మత్రతత్ క్వచిదిష్యతే ॥" (అహో. ౨౦౨ పు.) "........పదేతు తవ్యదాద్యన్తే । వా ద్విత్వం హరిసమ్మతేః ఇత్యాద్యథర్వణవచనారూఢహరి కవిమతే సాధుః" (అహో ౨౦౪) అనునహోబలపండితీయోదాహృతవచనములలో పదేతు తవ్యదాద్యన్తే । వా ద్విత్వమిత్యాద్యథర్వణకారికను కవిజనమండనటీకాకర్త విడిచికొనుట యుక్తము కాదుగదా. అట్లు విడుచుటేకాక దానియర్థమును సైతము సంగ్రహించుటకయి తత్రేత్యాదికారిక నీక్రిందిరీతిని మార్చియు నున్నాఁడు. "అన్త్యగస్య హలోద్విత్వం । భేవేదనుకృతౌపరే । తత్రోతోపుర్భవేన్నిత్య । మస్య తత్క్వచిదిష్యతే" (వికృ. సంధి. ౧౦ కారి. ౨౯ పు.) వీని కవిజనమండనటీక "........తా - అనుకరణము పరమగుచుండఁగా శబ్దాంతహల్లునకు ద్విత్వమగును. ఉకారాంతశబ్దమునకు 'పు' కారమగును. శబ్దాంతమకారమునకు ద్విత్వము వికల్పముగా నగును. ఉదా:—జగత్తనియె, పాపీచిరాయువనియె, దాసోఽహ మ్మనియె. ఇత్యాదులు" (వికృ. ౧౦ కారి. 3౦ పుట.) "తత్రోతోపుర్భవేన్నిత్యమ్మను ప్రతీకచరణమును మధ్యను జొనుపుటచే 'తత్' అనుదానికి ద్విత్వమనువివక్షితార్థము స్ఫురింపక 'పు' వర్ణమనునర్థము స్ఫురింపవలసివచ్చెను. "తత్రాచ్యుత్తోభవేన్నిత్య" మిత్యాద్యర్థపుమునకిచట సందర్భము లేకుండుట

చేతనే యహోబలపతి దానికి వివరణము వ్రాయఁడయ్యెను. అయ్యది "సామా నాధికరణ్యేష్విత్యాదిచింతామణికారికను సంబంధించునదై యున్నది. (చూ. ౯౧ విష.) ఈవిషయమును గ్రహింపఁజాలక డాఁచిచట నదుకుటకుఁ దలపడి యందొకపాదమును మార్చి యొకయనర్థకవిషయమును దెచ్చిపెట్టుకొని రెండవ పాదమును సైతము మించుకమార్చి దానిచే 'పదేతు తవ్యదాద్యన్తే' ఇత్యాదికారికార్థమును సంగ్రహింపఁగడఁగె యట్టి పదేతుతవ్యదాదిత్యాది కారికను విడిచికొనుట మిక్కిలి సాహసికవిషయమై యున్నది. "తత్రో తో వుర్వ వేన్నిత్యష్మ"ను ప్రతీకపాదము కేవలము నప్రామాణికము. దానికిలక్ష్యముగ 'పాపీ చిరాయు వనియె' అనునదిచూపఁబడెను. దానిలో ని 'వు' వర్ణము కవిప్రయోగము లలో నశ్రుతచరము, లక్షణశాస్త్రవిరుద్ధము. అచట "పాపీ చిరా యనియె" అను నదే సాధురూపము. మఱియు భట్టారకుఁడు 'అహమ్' అనుదాని మకారమున కను కృతిలో ద్విత్వము నిత్యముగా విధించి గణావెని నిల్పియుండఁగా నెట్టి యాధార మును జూపకయె యద్దాని ద్విత్వము పాక్షికమని యీటీకాకర్త వివరించుట సరి కాదు. ఇట్టి యప్రామాణికవిషయములను మూలముగాఁ గొనియె కావలయును సూరి బా - సంధి - ౫౩-౫౪ సూత్రముల నుపదేశించి ప్రమాదములకు లోన య్యెను. (విస్తర)

పయిరీతిగల ప్రమాదభూయిష్ఠమగు సూరి సూత్రమున కీక్రిందిబసవపురాణ ప్రామాదికపాఠము కాకతాళన్యాయమునఁ జేయూఁత యగుచున్నది.

విను 'యథాశివమయోవిష్ణు' వన్మాట ! లును........(బసవ.౬ఆ-౯౧౮ప. ఆంధ్రపత్రికాముద్రణాలయముద్రితము) ఇట "ధర్మోజయ తనుచు" (భీష్మ ౧ ఆ. ౮

---

విస్తర. ౧౧౫ విష:—కవిజనమండనటీకాకర్తచేసిన పయిసాహసకృత్యములను బరిశీలింపఁజాలక యన్నిగ్రంథములవిషయములను నెక్కింపకున్నచో స్వగ్రంథము నకుఁ బరిపూర్ణత ఘటిల్లనేరదన్నతలంపునఁ గావలయు నారాయణీయకర్త కవిజన మండనకారుఁడు మార్చినప్రతీకములను నహోబలపండితీయోదాహృతకారికలను మేళగించి యాంధ్రీకరించెను. తే. గీ. అంత్యమైనట్టి హల్లున కనుకరణము । పర మయిన యప్డు ద్విత్వము పరిఢవిల్లు । నయ్యది మకారమున కొక్కొకప్పు డిష్ట । ముత్వ పరవిసర్గమునకు వుత్వమె యగు ॥ (నారా. సంధి. ౧౫౮ కారి. ౫౪ ప.) తే. గీ. తవ్యదాదివర్ణకము లంతమునఁ గల్గు । పదములందలి కడపటివ్రాయి కిందు । కలుగు ద్విర్వచనంబు వైకల్పికముగ । హరికి సమ్మతమై యున్నయట్టికతన (నారా, సంధి. ౧౫౮ - ౧౬౦ కా. ౫౭ ప.)

గదన్ని.) అనుటాని చలెనె. 'విను యథా శివమయో విష్ణునుమాట । లును.........'
అనునది కవిప్రయుక్తపాఠమై యుండును. 'శివమయః+విష్ణు+వు' అనురీతిగల ప్రయో
గము లక్ష్యలక్షణవిరుద్ధమని ముద్రణసంస్కర్తకుఁ దోఁచకుండుట వింత. ఈయనకు
సంక్లిష్టత దుష్టమని స్థలాంతరములందును దోఁచలేదు. సర్వస్య గాత్రస్య శిరః
ప్ర । ధానం బనెడుమాట (బసవ. ౪ ఆ. ౪౦౩ పు.) ('గాత్రస్య శిరః ప్రధానంబు'
అనెడుమాట) అటు కృతం కర్మశుభాశుభం బనెడు (బసవ. ౬ ఆ. ౭౭౨) ('కృతం
కర్మ శుభాశుభంబు' అనెడు)

ప్రకృతమగు "విను యథాశివమయో విష్ణనుమాట" అనునది తాళపత్త్ర
మాతృకలలో నెట్లున్నదో యని పరిశీలింపఁబడెను. బ్రహ్మశ్రీ. ఆకుండి వేంకటశాస్త్రుల
వారు కాకినాడ పరిషత్పుస్తకభాండాగారములోని మాతృకలో నీక్రిందిరీతి నున్న
దని వ్రాసిరి.

"విను యథా శివమయం విష్ణు డన్మాట । లును.........రెండవమాతృకలో
"విను యథా శివమయో విష్ణు డనుమాట । లును........."

మద్రాసులో శ్రీనేలటూరి వేంకటరమణయ్యపంతులుగారి తాళపత్త్రమాతృక
నుండి తీసి తమిళవాఙ్మయపరిశోధనోపన్యాసకులు విద్వాన్ శ్రీవేంకటరాజులురెడ్డి
గారు వ్రాసినపాఠము:—"విను యథా శివమయో విష్ణుడన్మాట । లును..."

తిరుపతి పుస్తకభాండాగారములోని మాతృకచూచి బ్రహ్మశ్రీ 'ఉభయ
భాషాప్రవీణ' చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు వ్రాసినవి:—D - NO - ౯౬౭ - పుట
౧౮౮ - "విను యథా శివమయం విష్ణుడంమ్మాట । లును........."

D - NO - ౯౭౧ - పు ౧౭౧ - "విను యథా శివమయం విష్ణు డనుమాట ।
లును,........."

" ౪౮౪—"విను యథా శివమయం విష్ణు డన్మాట । లును......"

" ౯౬౮—పు ౨౫౦ - కాగితపు పుస్తకము:—"విను యథా శివ
మయం విష్ణు డన్మాట । లును........."

D - NO - ౯౭౦ - పు ౩౬౨ కాగి - "విను యథా శివమయం విష్ణు డను
మాట । లును........."

" ౯౬౫ - పు ౪౪ - కాగి - "విను యథా శివమయం విష్ణు డన్మాట ।
లును........."

" ౯౬౪ పు ౨౫౭ - కాగి - "విను యథా శివమయం విష్ణు డన్మాట ।
లును........."

ఇట్లు మాతృకలం దన్నిటను 'విష్ణుఁడు' అనియే యున్నది. బాలవ్యాకరణాభ్యాసవశమున ముద్రణసంస్కర్తగారు "విష్ణు+వు" అనుపాఠమును నిల్పి సంస్కారము చేసిరని తోఁచుచున్నది. అది యట్లుండ "శివమయః విష్ణుఁడు" అనుపాఠమునందును లక్షణశాస్త్రవిరుద్ధమగు సంస్కృతాంధ్రవిభక్త్యంతసంశ్లిష్టతతప్ప లేదు. కావున నీపాఠము లేఖకప్రమాదకృతమనియు నగ్రాహ్యమనియు "విను యథా శివమయో విష్ణనుమాట। లును,........" అనుపాఠమె కవిప్రయుక్తమనియు విశ్వసింపనగును.

అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరు

బాలవ్యాకరణ క్తివిభాషనగు - ౫౩.

విశ్వృతి. దాసోఽహమ్+అనె = దాసోఽహమ్మనె - దాసోఽహ

౧౧౫ I విష. మనె. తత్కర్తవ్యమ్+అనె = తత్కర్తవ్యమ్మనె - తత్కర్తవ్యమనె.

సంజీవని - ౧౧౫ I విషః— అహం దాసః = నేను దాసుండను. తత్ = అది - కర్తవ్యమ్ = చేయఁదగినది. 'దాసోఽహమనె' అను ద్విత్వాభావరూపము 'అహమాదీనాం ద్విత్వ' మ్మనెడి చింతామణిసూత్రమునకు విరుద్ధము. అట్టి ద్విత్వాభావమునకుఁ గవిప్రయోగములును గన్పట్టలేదు. వెనుక నుదాహరించిన కవిజనమండనవ్యాఖ్యాత యిచ్చిన యుదాహరణమును మూలముగాఁ గొని సూరి యిట్లు చింతామణివిరుద్ధముగ సూత్రించుట యుక్తము కాదు. 'అహమ్' అనుదాని మకారమున కిట్లు ద్విత్వాభావము సరికాకున్నను "పదేతు తవ్యదాదీ" త్యాద్యథర్వణసూత్రములోని యాదిశబ్దముచేఁ దవ్యాదిప్రత్యయమకారమునకేకాక కొన్ని యితరశబ్దములతుది మకారమునకున్నైతము ద్విత్వపాక్షికతసమ్మత మనకతీరదు. చ...కీచకముఖ్యులోచనం। బులు 'నయనం ప్రధానమ'నుపూర్వవచః స్థితిదప్పకుండఁగా। నెలమి వహించె... (విరా. ౨ ఆ. ౩౫) ఉ...అనా। శ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్యమ నన్నె యుంగవే (మను. ౩ ఆ. ౯౭) శా. నాస్తిశోకబహులతా నాస్త్యష్ణతా నాస్త్యపూ। పో నాస్త్యదనస్థావంచ కృపయాభోక్తవ్య మన్మాటలున్ (ఆము. ౧ ఆ. ౭౭) క...నరకే। సతిశో ద్యోషో మరణే। సతికింభయ మనెడి చదువు సదువంబోలున్ (అహో. ౧౬౭ పు.) సీ. గన్తుం పురీం రిపుం హన్తుం సుతం పాతు, మను తుమున్నంతంబు లరయఁ జొరవు (ఆం. భూ. ౨౦ ప.) ద్విపద - శిష్ట మన్నం విమిశ్రితమనుగాన (బసవ. ౭ ఆ. ౬౩౫) ద్వి. మసలిసర్వం విష్ణుమయ మనుచోటు (బసవ. ౭ ఆ. ౩౩౬) ద్వి. శ్రుతులు యజ్ఞస్య శిరోభిన్న మనఁగ (బసవ. ౬ ఆ. ౭౭౨) ద్విత్వస్థితి కిః— శా. శీతాంశోరమృతార్పణమ్మను క్రియం జేకొమ్ము చేతోభవా (వసు. ౩ ఆ. ౧౭౨) శా. జ్ఞాతిశ్చే

డగలేన కిమ్మనెడి వాచాహాధిపత్యమ్ము గాన్ (వసు. 3 ఆ. ౧౦౧) కిమ్మనెడి మున్నగు చోటులందు 'కిమనెడి' మున్నగు ద్విత్వాభావ ప్రయోగములు గన్పట్టువుగాన ద్విత్వా విధానము మకారాంతసాధారణము కాదు. కావుననే యధర్వణుఁడు తవ్యదాదులని గ్రహముగ వచించినవాఁ డయ్యెను.

ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు.

బాలవ్యా. ౫౪.

౧౧౬ విషయ. ఇయం ధేనుః+అనె = ఇయం ధేనువనె. అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండువలికె నది నిరాకరంబు. దుర్బలస్య బలం రాజాయన వినవే.

సంజీవని. ౧౧౬ విష:—"ధర్మోజయ త" నుచు (భీష్మ. ౧ ఆ. ౮ గద్య.) మున్నగుచోటులం దతివ్యాప్తిని నివారించుటకై కావలయు "ఉదంతనామంబులకు" అని సూరి వచించెను. కాని 'ప్రాతిపదికం హి నామ' అనుచింతామణిచొప్పు నను 'నామం బనఁగాఁ బ్రాతిపదికము' (బా. తత్స. ౨౧ సూ.) అను సూరివివరణము చొప్పునను నామ మనుదానిని బ్రాతిపదికవిషయమునందె ప్రయోగించుట యుక్తమగుటంజేసి యీసూత్రములోని 'నామంబునకు' అనునది విరుద్ధమగుచున్నది. 'ఇయం ధేనుః' అనులక్ష్యములోని 'ధేనుః' అనునది విభక్త్యంతముకాని ప్రాతిపదికము కాదుగదా. మఱియుఁ బ్రాతిపదికమునకు వాక్యమునఁ బ్రయోగమె యసంభవము గదా. 'ఇయం ధేనుః' అనుచో బా. సంధి. ౫౦ సూత్రము చొప్పున విసర్గలోపము గాఁగా 'ఇయం ధేను+అనె' అనురూప మేర్పడును. పిదపఁ బ్రకృతసూత్రముచే 'వుక్కు' వచ్చును. వుక్కు కిత్తుగాన 'ధేను' అనుదాని కంత్యావయవముగా నిల్చుట చే 'ఇయం ధేనువనె' అనురూపము సిద్ధించునని సూరి యాశయము. ఇట్టి వుగాగమప్రాప్తిని సమర్థింపఁజాలు కవిప్రయోగము లేమింజేసియు 'తత్రోతోపూర్వ వేన్నిత్య' మనునది కవిజనమండనకర్త నిరాధారముగఁ గల్పించిన ప్రక్షిప్తవచనమని (౧౧౫ విష. కల్పత.) నిశ్చితమగుటంజేసియుఁ దన్మూలకసూత్రము గ్రాహ్యము కానేరదు. కాన 'కుత్రచిత్సంస్కృతీయోపి' త్యాద్యథర్వణకారిక చొప్పునను (చూ. విష. ౬౯ - ౬౯ I) "ధర్మోజయ తనుచు" (భీష్మ. ౧ ఆ. ౮ గద్య.) ఇత్యాదికవిప్రయోగము చొప్పునను 'ఇయంధేను+అనె' అనుచోట 'ఇయంధేనవనె' అను పరరూపసంధి సాధువనియు 'ఇయం ధేనువనె' అని యుండరాదనియు గ్రహింపవలెను.

సంజీవని. ౧౧౬ I విష:—క...దుర్బలస్య బలంరా। జాయన వినవే ధరణీ। నాయకులకు......(మనుచ. ౪ ఆ. ౭౪) అను కవిపితామహుని ప్రయోగమును బట్టి యనుకృతిలో దీర్ఘమునకు హ్రస్వము కల్గునని యొకానొకఁడు పలికినది పరికా వని సూరి వివరించెను. (విస్తర I. II.).

---

విస్తర. I ౧౧౬ I విష:—"అనుకరణమున దీర్ఘమునకు హ్రస్వము గలుగు ననుమాట సూరికాలపువా రెవరో యన్నమాటగాని ప్రాచీనులన్నమాటగాదు గాన నొకండని యనాదరముగా సూరి వ్రాసియుండవలెనోపు" (బా. సా. వే. ౧౧౮ పు.) అనువేటికాక ర్తవ్రాత యపరిశీలనమూలకము. ఆమాటయన్నవాఁ డాంధ్రకవి ప్రపంచమునకెల్లఁ దెలిసినయప్పకవి. సీ. అనుకరించెడుచోట నవ్యయాదుల కొనఁ। గలబొట్టు గవకు దీర్ఘంబులకును। వచ్చులోపము కేశవాయ తుభ్యం నమ। యనఁగ రామోఽఘుసంహర్త యనఁగ...(అప్పక. ౫ ఆ. ౯౭) ఇతఁడు స్థలాంతరము నందును హ్రస్వమును బ్రయోగించెను. క. సాతత హేతిపరిజన। వ్రాతంబుగ శేష శయనువనరుహనయనున్। ఖ్యాతిగ నమ రేస్తు పర। స్త్రాతయనుటఁ దెలిసి కృతి మొదటఁదలఁచి వెసన్. (అప్పక. గ్రంథాదిపీఠిక. ౧౭ ప. ౨ పుట.)

విస్తర. II ౧౧౬ I విష:—ప్రౌఢవ్యాకర్త యీసందర్భమున ధ్వన్యను కరణశబ్దంబులు నిత్యముగా ద్విరుక్తములగుననియు వానికనుకరణంబున 'అను' ధాతురూపములు పరమగునపుడు ముగాగమంబగుననియు సంధి. ౧౯-౨౦ సూత్రములను సూత్రించి యీక్రింది ప్రయోగముల నిచ్చెను. 'సలసల మను' (పాండు. ౫ ఆ.) కన కన మను (రామా. ౬ ఆ.) ఆతఁ డర్వాచీనుల ప్రయోగముల నిచ్చెను గాని భారతమందె యిట్టివి గలవు. క. తళతళమనియెడు (కర్ణ. ౧ ఆ. ౬౦) ద్విరుక్తిప్రక్రియ ప్రౌఢ. శబ్ద. ౧౧౧ సూత్రము మొదలుగ నుపదేశింపఁబడెను. సంధివిషయములగుటచే వీని నీసందర్భమున సూత్రించెను. ద్విరుక్తధ్వన్యనుకరణశబ్దములు క్రియకు వ్యవహితముగా సైతము ప్రయుక్తం బగుట గలదని, సంధి. ౨౧ సూత్రము నుపదేశించి 'వడవడజమదగ్ని సూతి వడఁకెన్' (రామా. ౪ ఆ.) అని యుదాహరించెను. ఆతఁడు వ్రాయలేదుగాని యిం దింకను విశేషము గలదు. ఇం దనుధాతురూపమె ప్రయోగింపఁబడలేదు. ఇట్టివి తిక్కనాదులును బ్రయోగించిరి. సీ. వేసవిఁ గణకణ వేఁగు చట్రాతిపై। (నిర్వ. 3 ఆ. ౬3) మ...హారి యున్ భుగుల్ భుగులుగాఁ గ్రక్కెన్ వెసన్ నెత్తురుల్ (ఉ. హరి. ౪ ఆ. ౨3౧) మ...ధణం ధణం ధణధణధ్వానంబుతో (ఉ. హరి. ౪ ఆ. ౨౧౭) (ఇందు చతురుక్తము) మ. వెడలం డిండిమదుందుభుల్ గుభు లనన్ వేయించి (ఉ. హరి. ౪ ఆ.

కల్పతరు సూ. నస్యాద్వాక్యవిరామేతు । ససంధ్యభావోఽపిదోష
౧౧౭ విష. కృత్ (విక్ర. సంధి. ౨ కారి. అహో. ౧౮౭.)

కల్పతరువు. ౧౧౭ విష:—వాక్యవిరామేతు = వాక్యము ముగిసినస్థలమందు, సంధ్యభావోఽపి=సంధి కాకుండుటయు, దోషకృత్=దోషముచేయునది - నస్యాత్ = కాదు. ఇట్లు చెప్పుటచేత వాక్యమధ్యమందు సంధిచేయకుండుట దుష్టమె యని విశదమగుచున్నది. ఇచటి వాక్యశబ్దమునకుఁ బాదమనియు నర్థము చేయనగును. కాన పాదాంతమందలి వాక్యాంతమున సంధిమానుట దుష్టము కాదని వ్యాఖ్యానము చేసికొననగును. వాక్యమధ్యమందుఁ బాదాంతమైనను, పాదమధ్యమున వాక్యాంతమైనను సంధి మానరాదని యెఱుంగునది.

వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యా
బాలవ్యాకరణ ర్యులండ్రు. ౫౫.
వివరణము. సత్యము సర్వశ్రేయము. అదిలేనిచో సర్వధర్మములు
౧౧౭ I విషయము. వ్యర్థములు. ఇట్టి సంధివిరహంబు కావ్యములం
బాదాంతమందచూపఁబడు.

ఇది సంజ్ఞాపరిచ్ఛేదము

సంజీవని. ౧౧౭ I విష:—ఆర్యులు=కవిశేఖరులగు వైయాకరణులు. 'పాదాంతమంద' అనుటచేఁ గావ్యములం దనఁగాఁ గావ్యములలోని పద్యములందని యర్థమగుచున్నది. సూరియు దాహృతి గద్యవిషయముమాత్రము. వచనములలోఁ బూర్వవాక్యము తుదివర్ణముతోఁ బరవాక్యాదివర్ణము సంధింపకున్నను దోషము కాదు గాన 'శ్రేయము+అది' అనుచో నిత్యమగు నుకారసంధినైనను జేయక పోవచ్చునని తాత్పర్యము. 'సత్యము సర్వశ్రేయ మదిలేనిచో...' అని యిట్లు సంధిచేసినను జేయవచ్చునని యెఱుంగునది. ఇచట సంధి యనఁగాఁ బరరూపసంధియే కాదు. సంహితలోని యకారాగమరూపసంధికార్యము సరళాదేశాదికము వాక్యావసానమున మానినను మానవచ్చును. వాక్యావసానమున సంధిలేకుండుట దుష్టము కాదనుటచే వాక్యమధ్యమున సంధి మానరాదని స్పష్టపడుచున్నది. కావునఁ గేవలసంస్కృతసంధివిషయకమగు "సంహితైకపదేనిత్యా । నిత్యాధాతూపసర్గయోః । నిత్యాసమాసేవాక్యేతు । సావివక్షా మపేక్షతే" అనుచోవ్వునఁ దెల్గున

౧౦౨) ఇచట ద్విరుక్తిలేదు. ఇట్టివి సమ్మతమగుటచేతనే "కాన్తి శబ్దాదిశబ్దాస్తు... ద్విరుక్తాస్సన్తి...వైచిత్ర్యంభూరివర్తతే । అన్యేషాం చ ద్విరుక్తాస్యు । ర్బహులో పాగమా మతాః" అని యథర్వణుఁడు వచించెను. (౧౦౨. విష. కల్పత.)

వాక్యమధ్యమందును సంహితను వివక్షింపనియపుడు సంధి మానినను మానవచ్చునని యు, 'అతఁడు అప్పుడు చంద్రుని చూచెను' మున్నగుసంధిలేనివాక్యములు సాధువులే యనియుఁ జెప్పెడివాదము గ్రాహ్యముకాదు. (వి. స్త్రక. III ౨౮ I విష.) పద్యములందుఁ బాదమధ్యమున వాక్యాంతమైనను, వాక్యమధ్యమునఁ బాదాంతమయినను సంధి మానరాదు. వాక్యాంతమునఁ బాదాంతమగునపుడు మాత్రమె సంధి మానినను దోషములేదు. అట్టియెడల నైతము సంధిచేసినను జేయవచ్చును. పూర్వపద్యాంతమునకుఁ బరపద్యాదితో సంధిచేయరాదు. పద్యమాలికలం దనఁగా నేకప్రాసముతో ననేకపాదము లున్నపుడుమాత్రము పద్యపాదములందువలెనె సంధికార్యములను జేయవలెను. అనఁగా ద్విపదమాలికలందు రెండపాదమె పద్యాంతమనియుఁ దక్కినవృత్తాదులమాలికలందు నాల్గవపాదమె పద్యాంతమనియు తలంపక మాలికయెల్ల నేకపద్యమె యని తలంచి పైనిజెప్పినరీతిని సంధికార్యములను జరపవలెనని తాత్పర్యము. అట్లె సీసపద్యములందు సీసచరణములను గీతిచరణములను నేకపద్యముగా భావింపవలెను. ద్విపదలతోనె గ్రంథమెల్ల నడపఁబడునపుడు ప్రాసభేదములచే భిన్నపద్యములను నిర్ణయింపనగును. అట్టి పూర్వోక్తపద్యములకు సంధిచేయరాదని చెప్పఁబడియున్నను నట్టియెడల సంధులు ప్రచురముగాఁ జూపట్టుచున్నవి. మఱియు శబ్దమధ్యమునఁ బద్యములును ముగియుచున్నవి. "జాతులు మాత్రానుసంధానగుణవి। సీతులుగాన యనియ తగనై య॥ నియును బ్రాసోవా యనియు యతిర్వాయ। నియుఁజెప్ప...... (పండితా) "తమతమయిండ్లకుఁ దాశరథి నపుర। శమితాత్ములగు మునిసంఘంబులప్పు। డంతనావృత్తాంత...(రంగ. రా. ౩౭ పు.) విశ్వంబు కలగొని వెదకి నాయెదుట। నశ్వంబు గొనక మీ రరుదేరవలవ। దని పల్కనొఁగాక...(రంగ. రా. ౪౦ పు.) కౌసల్య సతివామకర మంటఁ బట్టి। కైసేత లుడివోయి గతపుష్పకర్ణి। శారశాఖయుఁ బోలి...(రంగ. రా. ౩౫ పు.) ఇట్లు భిన్నప్రాసముగల పద్యములు పదమధ్యమున ముగియుటయుఁ గలదుగాన "ద్విపదకు ద్విపదకుఁ దెగఁజెప్పవలయు।...ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద। మపుడు ప్రయోగింప నదియ యుక్తంబు।...(అష్టమహిషీకల్యాణము) అను తాళ్లపాక చిన్నన్నగారినియమములు ప్రాచీనకవిసమ్మతములు కావు. ఇతరగద్యపద్యములం దిట్టిపద్ధతి లేదు. వ. వెండియు నొక్కనాఁడు. క. అడవికిఁ బువ్వులు దేరఁగ।..." అనుచో నేకవాక్యమెయైనను బూర్వగద్యాంతాక్షరముతోఁ బరపద్యాదికి నిత్యమగు నుకారసంధియుఁ జేయఁబడదు. పాదాంతమందు వాక్యాంతమగునప్పటి సంధిలేమి

కుమారస్వాములు:—ఆ. వె. "పడగనున్న హనుమ భయవిహ్వలుఁడు గాఁడు । అరద మునకు సూతుఁ డచ్యుతుండు ఇత్యాదౌసంధ్యభావోపి నదోషాయ. నస్యాద్వాక్య విరామేతు । సద్యభావోపి దోషకృదిత్యథర్వణోక్తేః" (అహో. ౧౮౭ పు.) "పడగ నున్న..." అనుపద్యము భారతములోనిదని గాణపతవివరణకర్త వ్రాసెనుగాని యది భారతమునఁ గన్పట్టలేదు. గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద । సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు । ఎఱుఁగు మెల్లధర్మములకు నెంయుఁ బెద్ద । ...(ఆది. ౪ ఆ. ౯౫ ప.) ఇందు 'సరియుఁ గావ' అని దిద్ది సంస్కర్తలు టిప్పణములో "సరి యుఁగావు" అను దానిని పాఠాంతరముగాఁ జూపిరి. 'సరియు = సమానము సైతము కావు' అని చార్థకశబ్దముచే నర్థము చేయనగునుగాన 'సరియుఁ గావ' అను నవధారణార్థకశబ్దఘటితపాఠము సుసంగతముకాదు. నాయొద్దనున్న తాళపత్ర మాతృకలు రెండిటను 'సరియుఁ గావు' అనుపాఠమె వెలయుచున్నది. కొందఱు పాదాంతమాత్రమున సయుతము విసంధి నంగీకరింతురు. ద్విపద. ఇలనొప్పు చోళ మండలమున మఱియు । నలినీల నక్కనైనా రనుగణము । ఉవిదయుఁ దానును... (బసవ. 3 ఆ. ౨౮౪) ఇచటఁ బ్రాసభేదముచే భిన్నపద్యము లనకతీరదు. వాక్య మధ్యమెయైనను పాదాంతమున నిత్యమగు నుకారసంధి చేయఁబడలేదు. ద్విపద. ఇదిగదా భవదుఃఖగదకు నౌషధము । ఇదిగదా భక్తిమహీష్టతపంట । ఇదిగదా నా పుట్టినింటికల్పకము । ఇదిగదా ముక్తికి నిక్కదానసుచు । (బసవ. ౫ ఆ. ౨౭౮) పాదాంతములందు వాక్యాంతములగుటచే నిట నిత్యమగు నుకారసంధి చేయఁబడ లేదు. క. క్రొవ్వు దఱిఁగి సురగణంబు క్షోభము నొందెన్ । ఇవ్విధమున నుత్పా తము । నివ్వటిలన్ (ఉ. హరి. ౬ ఆ. ౧౫౯) ఇటఁ బాదాంతమందలి వాక్యాంతము గాన విసంధి నిర్దుష్టము. "చ...ఇమ్మెయిన్ । ఎలమి...ఇట్టిచోట్లఁ బాదాంతమున వాక్యాంతము కాకున్నను సంధిలేకపోవచ్చునని" గాణపతవ్యాఖ్య) సారా. గాణ. ౭౬ పు.) వచించెను.

నన్నయభట్టారకుఁ డుకారమునకేకాక ప్రథమమధ్యమపురుషముల 'ఇ' కార మునకు సైతము "నిత్యమనుత్తమపురుషక్రియాస్వితః" అనుచింతామణిసూత్రము చొప్పున నిత్యసంధినె తనభారతభాగమందెల్లఁ బ్రయోగించెను. అట్టి నిత్యసంధిని పాదాంతమందలి వాక్యాంతమున నుజ్జగించుచువచ్చెను. ఆ. వె. అంతఁ గొంద అధికహాస్యంబు నేసిరి । అడవి నేమిరోసె దనిరి కొంద । ఱు...(అర. ౨ ఆ. ౧౦3) ఆ. వె. క్రమము వడసి యొక్కసమయంబు నేసిరి । ఒనర దానిఁ దెల్లఁగు వినుము

తల్లి (ఆది. ౬ ఆ. ౨౬౭) (మూ. విస్తర. I ౭౧ I వి.) ఈ క్రింది హరివంశపద్యపు సంధి విచార్యము:—క... । వెన్నుఁడు మన కేల యిట్లు వేడుక చెయ్యూల్ । ఎన్నియుఁ గజపెను దైవము...(హరి. పూ. ౮ ఆ. ౧౩౦ ప.) ఇట వాక్యాంతము కాకున్నను పాదాంతమున విసంధి ప్రయోగింపఁబడెను. "పన్నుగఁ గజపెను దైవము" అని కవిప్రయుక్తపాఠమేమో ?

ఇది = ఇంతమాత్రమె, సంధిపరిచ్ఛేదము - ముగిసె నని యర్థము.

---

# ఆంధ్ర వ్యాకరణసంహితా సర్వస్వము

## తత్సమపరిచ్ఛేదము

సన్నయా. సమాస్తు సమాః
౧౧౮ విషయము. (ఆం. చిం. అజం. ౨౨ కారి.) (అహో. 3౪౧.)

కల్ప. ౧౧౮ విష:—సమాస్తు = సంస్కృతప్రాకృత శబ్దావయవములందు మార్పులేక యాంధ్రవిభక్తియోగవిషయకకార్యములతోమాత్రము కూడినపదములు - సమాః = తత్సమములు - అనఁగా సంస్కృతసమములు ప్రాకృతసమములు ననిపించుకొనును. ఇందలి ప్రాకృతసమము లాచ్ఛికములుగా వ్యవహరింపఁబడుచున్నవి. (చూ. ౪౯ విష. కల్ప. తుల్యాతు సమేతి సూత్రవ్యాఖ్య) (సంజీవని ౪౯ V విష.)

బాలవ్యా.
౧౧౮ I విష. తత్సమపరిచ్ఛేదము.

సంజీ. ౧౧౮ I విష:—తత్సమపరిచ్ఛేదము = సంస్కృతప్రాకృతప్రాతిపదికములను గొన్నియెడలఁ గొన్నిమార్పులతోఁ దత్సమప్రాతిపదికములనుగాఁ జేయుటయుఁ గొన్నియెడల నట్టిసంస్కృతప్రాకృతప్రాతిపదికములనే తెల్గునఁ బ్రాతిపదికములనుగా నంగీకరించుటయు నట్టి ప్రాతిపదికములమీఁద డుమ్వాద్యాంధ్రవిభక్తులు నిల్పుటయు మున్నగుకార్యముల నుపదేశించు వ్యాకరణభాగము తత్సమపరిచ్ఛేదమనఁబడును. (విస్తర.) ఈపరిచ్ఛేదములోని పెక్కుసూత్రములు స్త్రీపున్నపుంసకసమములగు నాచ్ఛికముల విభక్తియోగప్రక్రియకును సాధకము లగుచున్నవి. (బా. తత్స. ౨౪ - ౨౬ - ౨౭ - ౩౨ - ౩౩ సూ. మొ.)

---

విస్తర. ౧౧౮ I విష:—తత్సమపరిచ్ఛేదమునఁ బ్రాకృతసమములప్రసంగమే లేదనియు నట్లగుటచేఁ దత్సమశబ్దము సంస్కృతసమములకే వాచకమనియుఁ జేటికావ్యాఖ్యాత వ్రాసెను. (బా. సా. పే. ౧౨౧ పుట.) అది సరికాదు. బా. తత్స. ౪౮ సూత్రముచే 'సిరీ' అను ప్రాకృతప్రాతిపదికము తెలుఁగున 'సిరి' అనెడిహ్రస్వరూపము

౧౯ - ౫౯ విషయములలోఁ దత్సమస్వరూపాదులు వివరింపఁబడెను. ఆంధ్ర భాషాభూషణకర్త హలంతములకువలెనె యజంతములకును సంస్కృతప్రథమైక వచనములమీఁదఁ దెలుఁగువిభక్తులను నిల్పుప్రక్రియను సూత్రించెను. విభక్త్యంతములపై విభక్తులు మరలం నిల్పుట కేవలము నపమార్గము. (చూ. ఆం. భూ. ౨౯ - ౩౦ - ౩౩ - ౩౪ ప.) కం॥ ఇల సంస్కృతపదములపై। నెలకొని నిల్చిన విసర్జనీయంబులు సు। న్నలు నిలువవు తెనుఁగులలో। నలవడఁగాఁ బల్కుచోట నభినవదండీ (ఆం. భూ. ౨౯) క॥ వానునకున్ వంతుండును। మానునకును మంతుఁడును గ్రమంబున...(ఆం. భూ. ౩౫) పన్నకోట పెద్దనయు నీకేతన మార్గమునె యనుసరించెను. సూరి యట్లుగాక చింతామణి ననుసరించి సంస్కృతప్రాకృతప్రాతిపదికములనుండి తత్సమప్రాతిపదికముల నంగీకరించి విభక్తులను నిల్పు ప్రక్రియను సంస్కృతప్రాకృతవ్యాకరణపద్ధతిచొప్పున నుపదేశించెను.

డు ము వు ల వః ప్రథమస్యా। త్పూర్చి ల ను నయో
భవే ద్ద్వితీయాతు। తో చే చ తోడ చేత తృ। తీ
యాయాః కొఱకు కయి చతుర్థ్యాః స్తః। పట్టి వలన
నన్నయా. కంటె ఇతి। పఞ్చమ్య థ లోపల కి కు యొక్కాన్యా।
౧౧౯ విషయము. అం ద్వింద నాస్తు సప్త। మీ...(అహో. ౨౩౯)
(ఆం. చిం. అజం. ౧ - ౨ కా.)
కేచిత్తు వైకృతాశ్శబ్దా।విభక్త్యర్థాభిధాయకాః (వికృ.
అజం. ౧౪ కా. అహో. ౨౬౦ పు.)

కల్ప. ౧౧౯ విష:—వికృతౌ = తెలుఁగుభాషయందు, డు ము వులవః = డు - ము - వు - లు అనునవి, ప్రథమాస్యాత్ =(విస్తర.) ప్రథమావిభక్తి ప్రత్యయము

---

నందు ననిసూరియె యుదాహరించెను. మఱియు, జమో = జముఁడు, సింగారో = సింగారము, మున్నగు ప్రాకృతసమములు, "రామః = రాముఁడు, వనమ్ వనము" మున్నగువానివలెనె యీతత్సమపరిచ్ఛేదసూత్రములచేతనె సాధింపఁబడునుగదా.

విస్తర. ౧౧౯ విష:—"డు ము వులవః - అనునది సమాహారద్వంద్వసమాసముగా దీసికొనవలెను. సమాహారద్వంద్వమయినయెడల సమాసము నపుంసకలింగైకవచనమున నుండవలెను. ఇతరేతరయోగద్వంద్వమైనచో ప్రథమాః స్యుః అని యుండవలెను. ఈసూత్రము సంస్కృతసంప్రదాయమునకుఁ దప్పినది" (ఆం. భా. చ. ౧౬౨ పుట.) ఏమి సాహసము! నన్నయభట్టారకునకే తప్పు పట్టిరే! ఇట్లే "రోలోడటాముదితాంతస్యచ వాలుక్సలోలోశ్చ. అనునది

లగుచున్నవి. కూర్చిలనునయః = 'కూర్చి - ల - ను - ని' అనునవి, ద్వితీయాతు = ద్వితీయావిభక్తి, భవేత్ = అగును. తో = "తో" అనునదియు, చే చ = 'చే' అనునదియు, తోడ చేత = 'తోడ - చేత' అనునవియు, తృతీయాయాః=తృతీయా విభక్తికిఁ బ్రత్యయములగును. కొఱకు కయి = 'కొఱకు - కయి' అనునవి, చతుర్థ్యాః = చతుర్థీవిభక్తికిఁ బ్రత్యయములు, స్తః = అగుచున్నవి. "వాయి రవు ర్వ్యక్రత వా" అను చింతామణిసూత్రముచే నొప్పున 'కయి' అనుదానికి 'కై' అని పాక్షికరూప ముండును. పట్టి వలన కంటే ఇతి = 'పట్టి - వలన - కంటె' అని, పఞ్చమీ = పంచమీవిభక్తి యగుచున్నది. లౌకికసంస్కృతమున హ్రస్వవక్రము లప్రసిద్ధములుగాన 'కంటే' అని దీర్ఘముగాఁ జెప్పఁబడెను. "విషముకంటె దహనముకంటెన్" (సభా. ౨ ఆ. ౧౭) "ఏవన్తతాచ నామ్నామన్యతరస్యామి యాన్తావా" మ్మను సూత్రమునందును నిట్లె గ్రహింపఁబడెను. అథ = పిమ్మట, లోపల కికు యొక్క = 'లోపల - కి - కు - యొక్క' అనునవి, అన్యా = షష్ఠీవిభక్తి యగు చున్నది. అం ద్విందు నాస్తు = 'అందు - ఇందు - న' అనునవి, సప్తమీ = సప్తమీ విభక్తి ప్రత్యయము లగుచున్నవి. కేచిదిత్యాదిః—కేచిత్ - వైకృతాః శబ్దాస్తు = గుఱించి - గుఱించి - మెయిన్ - మయిన్ - మైన్ మున్నగు నాచ్ఛికశబ్దములును, విభక్త్యర్థాభిధాయకాః = విభక్తిప్రత్యయములయర్థమును వచించుచున్నవి గలవు. ఉదా:— వారిజాసనుగుఱించి (కర్ణ. ౧ ఆ. ౨౬౪) కూర్చి విభక్త్యర్థకము. ప్రీతిమెయిన్ (= ప్రీతితో) (ఆది. ౪ ఆ. ౮౭) బలిమి మైఁగొని (సభా. ౧ ఆ. ౧౮౨) మొ. 'ఇందున్' అనునది ప్రత్యయముకాదు. సప్తమ్యంతసర్వనామశబ్దము. 'సవిధ వర్తినా మిందు' అని భట్టారకుఁడే సూత్రించెను. 'జేరలిచ' అను సూత్రముచే 'అలి' అనునది వచ్చుటకై దాని నిందు గ్రహించెను. ఉదా:—ఇందలి వారు మొ.

---

యార్యాగీతియర్థభాగమునకుఁ గొఱవడియున్నది" (ఆం. భా. చ. ౧౬౪౩ పుట.) అని యవిమర్శితముగా భాషాచరిత్రకర్తగారు ఛందోభంగమని తలంచిరి. మహాను భావుఁడు భట్టారకునకు మనము సంస్కృతభాషాసంప్రదాయములు మప్పుటా? అయ్యో! 'డు ము వు లవః ప్రథమాస్యాత్' అన్నట్టులే యమరసింహుఁడును "ద్వౌద్వౌ మాఘాదిమాసౌస్యాదృతుః" (నామలిం. కాలవర్గు) అని ప్రయోగిం చెను. "అమానితత్తేన నిజాయశోయుగం। ద్విఫాలబద్ధాశ్చికురాః శిరస్థ్సితమ్." అని శ్రీహర్షుఁడు ప్రయోగించెను. ఇంక 'రోలోడలటామిత్యాది చింతామణిశ్లోకము 'ఆర్యాశ్లోకము' భాషాచరిత్రకారులు సరిగాఁ జూచికొనక యార్యాగీతియనుచు గీతి లక్షణము పట్టలేదనుచు ఛందోభంగమనుట కేవలము పొరపాటు.

డు-ము-వు-లు ప్రథమ ౧. సువర్ణకంబు ద్వితీయ
బాలవ్యా. ౨. చేత - తోడ తృతీయ ౩. కొఱకు, కయి
౧౧౯ I విష. చతుర్థి ౪. (విస్త. I) వలన - కంటె - పట్టి పంచమి
౫. కు-యొక్క-లోపల షష్ఠి ౬. అందు-న-సప్తమి ౭.

సంజీవని. ౧౧౯ I విష:—'వలన' రూపాంతరము 'వల్ల' అనునదియు, 'కంటె' అనుదానిపర్యాయము 'కన్న' అనునదియు భారతమున లేకున్నను నవి తర్వాతి మహాకవులచేఁ బ్రయుక్తములై యున్నవి. ఈచలిమలవల్ల నుల్లసిలు (మను. ౨ ఆ. ౧౦) అన్నినదములకన్నఁ దిన్ననయి (వసు. ౨ ఆ. ౫౬) వీనికిఁ బ్రాచీనప్రయోగములు లేమింజేసి సూరిచే గ్రహింపఁబడలేదు.

ప్రథమ = ప్రథమావిభక్తి. ఇట్లె 'ద్వితీయ' మున్నగువానికిని నర్థము నెన్నవలెను. (విస్తర. II) 'సు - ఔ - జస్' (ప్రథమ) 'అమ్ - ఔట్ - శస్' (ద్వితీయ) 'టా - భ్యామ్ - భిస్. (తృతీయ) 'ఙె - భ్యామ్ - భ్యస్'. (చతుర్థి) 'ఙసి - భ్యామ్ - భ్యస్. (పంచమి) 'ఙస్ - ఓస్ - ఆమ్'. (షష్ఠి) 'ఙి - ఓస్ - సుప్'. (సప్తమి) అనునివి సంస్కృతవిభక్తులు. ఇవి 'ఙ్యాప్ప్రాతిపదికాత్' (౪-౧-౧) అను పాణినీయసూత్రముచొప్పునఁ బ్రాతిపదికములపై నిల్చును. వీనిలోని మొదటి 'సు' అనుదానితోఁ దుది పకారపుపొల్లునుఁ జేర్చిన 'సుప్' అను ప్రత్యాహార మేర్పడును. కానఁ బై సంస్కృతవిభక్తులు సుప్పు లనఁబడును. చింతామణి సంస్కృతసుబ్విభక్తులకుఁ దెలుఁగుడ్వాదిప్రత్యయముల నాదేశములుగా విధించుచుఁ బ్రక్రియను నడ

విస్తర. I ౧౧౯ I విష:—'చేత తోడా కొఱకు కైచ' అను హరికారికయు 'కొఱకు కై' చతుర్థి (బా. గు. ప్ర. ౯౨ పు.) అనుపాఠమును బ్రామాదికములు. వీనిపక్షమున "కయి" అనురూపము సంగ్రహింపఁ బడనేరదు. బా. క్రియా. ౧౦౩ సూత్రముచే కయి అనుదానినుండి 'కై' అనురూపము సిద్ధించునేకాని 'కై' అను దానినుండి 'కయి' అనురూపము సిద్ధింపనేరదుగదా.

విస్తర. II ౧౧౯ I విష:—"చేత - తోడ అనువీనికిఁ దృతీయసంజ్ఞచేసె" (బా. సా. వే. ౧౨౨ పు.) అనుపేటికావ్యాఖ్య సరికాదు. అచట 'మూఁడవ దగు సంజ్ఞ' అని వక్తవ్యముకాదు. 'తృతీయ యనుసంజ్ఞ' అని వక్తృతాత్పర్యము. కాన 'గంగానది' మున్నగుచోటులందువలెనె 'తృతీయాసంజ్ఞచేసె' నని చెప్పవలయును. ఇట్లె ప్రథమావిభక్తి ద్వితీయావిభక్తి యని యనవలయునుగాని ప్రథమవిభక్తి, ద్వితీయవిభక్తి మున్నగురీతిని వాడరాదు.

ప్రసు. సూరి యట్లుగాక సంస్కృతప్రాకృతతుల్యప్రాతిపదికములపయిఁ దెలుఁగు విభక్తులను నిల్పు ప్రక్రియ నుపదేశించెను. చింతామణికర్తయు సూరియుఁ బ్రాతిపదికములపైఁ దెనుఁగువిభక్తులు నిల్చునపు డేవేనికొన్నిమార్పులు ప్రాతిపదికములందు విధించిరి. కొన్నిసంస్కృతప్రాతిపదికములకు బాలవ్యాకరణసూత్రములచేఁ దెలుఁగువిభక్తులు ప్రాప్తింపనపు డనుక్త న్యాయమున వానికి సంస్కృత విభక్తులనే చేర్చి యావిభక్తులకే తెలుఁగువ్యాకరణపుసూత్రములచే లోపాదులఁ జేయవలసియుండును. ఉ. గౌరి - దధి - వారి - రై మున్నగు శబ్దములకుఁ బ్రథమైకవచనమునఁ దెనుఁగువిభక్తులలో నేదియుఁ బ్రాప్తింపమింజేసి యట్టివానిపై సంస్కృత సుప్రత్యయమునె నిల్పి దానికే "ఇగ్లౌరా..." సూత్రముచేఁ (బా. తత్స. ౮౮) బ్రథమైకవచనలోపము చేయవలయును. ఇట్టి లోపశాస్త్రము సైతము లేనపుడు చింతామణిలోని "నపదాన్యవ్యయసుప్తిఙ్క్తాన్వితమునా" మ్మనుచెప్పున నట్టి సంస్కృతవిభక్తికి లోపముచేయవలయును. (౧౧౨ II విష.) సంస్కృతములగు నవ్యయములు సుబంతములు తిఙంతములు మున్నగునవి తెలుఁగునఁ బ్రయోగింపఁబడరాదని నపదానీత్యాది చింతామణి సూత్రమున కర్థము గాన నట్టి సుప్పులకు లోపము గల్గునని యాసూత్రమునకు వ్యాఖ్యానము చేసికొనవలయును. అట్లు లోపశాస్త్రములు లేనిస్థలములు మిక్కిలి యరుదు. సాధారణముగా 'చేసి - చేయక - చేయన్ - చేయుచున్' మున్నగు లాక్షణికావ్యయములకును ("చేసినన్ - చేయున్ - చేయుచున్నన్ మున్నగు ధాతుజవిశేషణములకును. ఇవి చింతామణిపక్షమునందలివి) 'చేసిన - చేయు - చేయుచున్న' మున్నగుధాతుజవిశేషణములకును నట్లై తెల్ల - నల్ల - మున్నగు గుణవిశేషణములకును స్త్రీసమత్వము నంగీకరించి స్త్రీలింగప్రథమైకవచనలోపమునుజేసి పదత్వమును సంపాదించికొన్నచో "అపదం న ప్రయుఞ్జీత" అనునభియుక్తోక్తికి విరోధము కల్గకుండ వానికి వాక్యములందుఁ బ్రయోగార్హత గల్గుచుండును (౮౨ I విష.). చింతామణిపక్షమున "మమ్ము - మిమ్ము - తమ్ము" అనుచోటులందు 'శస్సు' నకు లవర్ణాదేశము సంభవింపదు గాన నట్టియెడల శస్సునకు లోపమును బైరీతిని 'నపదాన్యవ్యయే' త్యాదిసూత్రముచేఁ జేసికొనవలసియుండును. (౧౧౨ II విష.)

విభక్తిప్రత్యయములనుఁ జేర్కొనుటలోను వానికిఁ గళాద్రుతప్రకృతికత్వములను సంఘటించుటలోనుఁ జింతామణి బాలవ్యాకరణములకుఁ గొంత భేదము

గన్పట్టును. కాని పర్యవసానమున నంతగా మార్పు గోచరింపదు. (విస్తర. III. IV. V.).

విస్తర. III ౧౧౯ I విష:—కల్పతరువులో వివరింపఁబడినరీతిని 'ఇందు' అనునది సప్తమీప్రత్యయము కామింజేసి యార్థానిని సూరి సప్తమీప్రత్యయము లలోఁ జేర్పఁగలేదు. 'ఇందలి' అనురూపము బాల. సంధి. ౭౭ సూత్రముచే లభించుచున్నది. 'కూర్చి' అనునది 'ఉండి - చేసి' అనువానివలె ననుప్రయుక్త మయ్యెడి శబ్దవిశేషమే కాని ప్రత్యయవిశేషముకాదని సూరి తలంచెను. "కూర్చి - చేసి" అనునవి చేరకున్నను కర్తృద్వితీయక్తులె తత్తదర్థముల నియ్యఁగల్గును. 'పట్టి' అనునదియు ద్వితీయమీఁద నిల్పునదేకాని యది చేరనపు డచటి ద్వితీయ, పట్టి చేరి నప్పటి యర్థము నియ్యఁజాలదు. 'కూర్చి - చేసి' అనునవి చేరనప్పుడును నవి చేరి నప్పటియర్థ మిచ్చుట కుదాహరణములు. చ. సుతుఁగూర్చి హాతుఁడయ్యె ననంగ విన్నయం । తన యితఁడాయుధంబుఁ దిగఁద్రావి యచేష్టతఁ బొందు... (ద్రోణ. ౫ ఆ. ౩౦౫) సుతున్ = సుతుని, కూర్చి = సుతు నుద్దేశించి. మ. అభీష్టవరంబు లిచ్చుటం । జేసి కృతార్థుఁడై... (ఆరణ్య. ౨ ఆ. ౭౯౫) ఇచట 'చేసి' లేకున్నను నది యున్నప్పటి యర్థము ధారాళముగ లభించును. 'జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు' అన్నచో 'పట్టి' అనుదానిని విడిచిన 'జ్ఞానమున్' అనుదాని కది యున్నప్పటి యర్థము రానేరదు. ద్వితీయావిభక్తి 'ను' ప్రత్యయమును షష్ఠీవిభక్తి 'కు' ప్రత్యయ మును బా. తత్స. ౨౬ సూత్రముచే 'ని - కి' అనురూపములు గలవిగాఁ గొన్ని యెడల మారును. (అనుబంధము) కాన 'ని - కి' అనువానిని సూరి వేఱుగఁ బఠింపఁడయ్యెను. 'ల' అనునది తృతీయాదివిభక్తులకువలెనే ద్వితీయ 'ను' ప్రత్య యమునకును బహుత్వమునఁ బూర్వాగమమగునట్లు (బా. తత్స. ౩౧ సూ.) సూరి సూత్రించికొనియుండుటచే 'ల' అనునది ద్వితీయాప్రత్యయముగఁ జేర్పఁగఁ బడలేదు. 'తోడ చేత' లకుఁ బర్యాయములగు 'తో - చే' అనునవి బా. తత్స. ౧౦ సూత్రముచే సంగ్రహింపఁబడును. ఈసూత్రముచే 'లోపల' అనుదానికిఁ బర్యాయ

అనుబంధము. విస్త. III ౧౧౯ I విష:—"తత్సమము ౨౩-౨౪-౨౫-౨౬ సూత్రములచే 'ను' వర్ణకమును 'ని' వర్ణకముగా మార్చి కృతార్థుఁడయ్యెను." (బా. సా. వే. ౧౨౨ పు.) అనువేటికావ్యాఖ్య సరికాదు. తత్స. ౨౩ - ౨౪ సూత్ర ములు 'ను' వర్ణకమును 'ని' వర్ణకముగా మార్చునవికావు. అవి వేఱొక నివర్ణము నాగమముగా విధించునవై యున్నవి. చింతామణియు నీ 'ని' అనునాగమమును వేఱుగ విధించుచున్నది.

మగుటంజేసి 'లోను' అనునదియు సంగ్రహింపఁబడెను. 'ఓ - ఓయి' అనునవి బా. తత్స. ౧౪ - ౧౫ సూత్రములచే సంగ్రహింపఁబడును.

విస్తరము. IV ౧౧౯ I విషః—విభక్తిప్రత్యయములు పయిరీతిని దిఙ్మాత్రముగఁ జెప్పఁబడినను బయి యథర్వణోక్తిచొప్పున మఱికొన్ని శబ్దములును విభక్త్యర్థబోధకము లగుచున్నవి. ద్వితీయాంతమున కనుప్రయుక్తములై 'కూర్చి - గుఱిచి - గుఱించి' అనునవి యుద్దేశార్థమున ననుప్రయుక్తము లగును. ఉ. అధిపుఁ గూర్చి (కాశీ. ౨ ఆ. ౭౫ ప.) చేత విభక్త్యర్థకశబ్దములకు 'చేసి' శబ్ద మనుప్రయుక్తమగును. ఉ. ఇచ్చుటంజేసి = ఇచ్చుటచేత. 'ఇచ్చుటన్' అనుచోఁ దృతీయార్థమున ద్వితీయ నంగీకరించుటచేత నది చేతవిభక్త్యర్థము నిచ్చుచున్నది. దానిపై నర్థవిశేషము లేనిదే 'చేసి' శబ్దము నిల్చినది. కాన నది యనుప్రయుక్తం బని చెప్పంబడును. ఇట్లె కోపమునంజేసి - మందగతులంజేసి. మొ. 'మెయి, మయి, మై' అనునవి తృతీయార్థమున వాడఁబడును. ప్రీతిమెయిన్ (ఆది. ౪ ఆ. ౭౭) ప్రీతిమెయిన్ = ప్రీతిచేత - ప్రీతితో. బలిమి మైఁగొని (సభా. ౧ ఆ. ౧౭౨) "జడపదంబులతోడకు మెయి మైలు వికల్పముగానగు" (ప్రౌఢ. శబ్ద. ౧౭ సూ.) అని త్రిలింగలక్షణశేషమున నుపదేశింపఁబడెను. కాని పై రీతిగల ప్రయోగములనుబట్టి 'చేత' వర్ణకార్థమునందును నవి వచ్చునని విశద మగుచున్నది. కేవల సహార్థమున వీనికిఁ బ్రయోగము కన్పట్టదు. "ప్రీతితోఁగూడి" అనుచో "ప్రీతిమెయిన్‌గూడి" అని వచింపరాదు (బాల. కార. ౬ సూ. వ్యాఖ్య.)

చతుర్థీవిభక్త్యర్థమున "పొంటెన్ - తదర్థము" అనుశబ్దములు వాడఁబడును. ఉ. హితము పొంటెన్ (అను. ౫ ఆ. ౨౬౨) నీతదర్థము (ఆది. ౨ ఆ. ౨౦౭) (నీతదర్థము = నీకొఱకు = నీనిమిత్తము) మ॥...చేయు పొం। టె వినమ్రాంగకులై మహాత్ముఁ డగుతండ్రిన్...(హరి. పూ. ౨ ఆ. ౨౦౬) 'కోసము ఇతి చతుర్థ్యర్థాభిధాయకో దేశ్యశబ్దః (అహో. ౨౮౪ పు.) ఉ. భూసుతకోసమే గనుక...(ఉ. రా. ౭ ఆ., శ. ౪.) ముక్తి కోసరము (నృసింహశతకము. సూ. రా. ని.) అనియునవ్వ్యలు వాడిరి. (కు+అవసరము = కోసరము-కోసము. అని వీనిచరిత్రము నూహించుట లెస్స. ఇవి దేశ్యము లనుట నిజము కాదేమో ?) పంచమీ సప్తమీ ద్వితీయల పైని 'ఉండి' శబ్ద మనుప్రయుక్తమయి వలనయొక్క యర్థమునె యిచ్చునని సూరి యాశయము. ఉ. వనమువలననుండి = వనమువలన, వనమందుండి = వనములో నుండి = వనమువలన, వనమునుండి = వనమువలన, మొ. లోను, లోపల శబ్దములు

సప్తమ్యర్థకములు. వనములోనన్ = వనమందు. వనములోపలన్ = వనమునందు. మొ. సీ॥ పుట్టలో...మసనంబులో (విజ్ఞా. ఆచా. ౩౮).

వి. స్త. V ౧౧౯ I విషః—విభక్తులలోఁ గొన్ని యవ్యయంతములై సుజ్ఞేయ చరిత్రములై యుండును. 'కూర్చు - గుఱించు - గుఱిచు' అనుధాతువుల క్త్వాంత రూపములె 'కూర్చి - గుఱించి - గుఱిచి' అనునవి. 'గుఱిచు' ధాతువుగల దనుటకుః—చం...ఐ! నను విను కార్యమున్ గుఱిచినన్..." (ఆశ్వ. ౨ ఆ. ౧౩ ప.) అను ప్రయోగము కన్పట్టుచున్నది. కున్+అయి = కయి = కై. నాకున్+అయి = ఐ = నాకై = నాకునై. దీనిలో 'కై' అనునదే చతుర్థీప్రత్యయముగా గ్రహింపఁబడెను. కొఱ = కార్యము. నాకొఱ+కున్ = నాకొఱకున్ = నాకార్యము నిమిత్త మనఁగా "నాకై" అనియేకదా యర్థము. అగుధాతు క్త్వాంతము 'అయి' శబ్దము. పట్టు ధాతు క్త్వార్థకరూపము 'పట్టి' అనునది. జ్ఞానముంబట్టి ముక్తికల్గు = జ్ఞానమును బట్టుకొని యనఁగా జ్ఞానమును మూలముగాఁజేసికొని ముక్తి కల్గు నని యర్థము. ఔపవిభక్తికమగు చేయిశబ్దపు తృతీయారూపము (చేయి - చేతి) చేతన్ - (తోడు - తోడి) తోడన్. కాలవ్యవధానమున శబ్దాకారములందును నర్థములందునుమార్పులు గల్గుట నవి ప్రత్యయములుగా గ్రహింపఁబడినవి. ఇపుడు 'తోడు' శబ్దమౌపవిభక్తికమే కాదు. పైవ్యుత్పత్తులచొప్పున నిపు డర్థస్ఫూర్తియే కల్గదు. 'రాముఁ డొక్క కోలచే వాలిం గూలనేసెను' అనుచో "ఒక్కకోలచేతిచే" నని యర్థముకాదుగదా. తోడ ప్రత్యయ మిపుడు సహార్థకమే కాని సాహాయ్యార్థకము కాదు. వలను = దిక్కు. దీని యౌపవిభక్తికరూపము - వలను - వలని—వలనన్ = దిక్కునందు. 'అయ్యింటివలనఁ బెఱవారు సనకుండన్" (ఆది. ౮ ఆ. ౧౧౫) 'దాని పోయిన వలనఁ జూచు' (ఆర. ౨ ఆ. ౨౯ ప.) ఇట్లిది సప్తమ్యర్థకమె యైనను గాలక్రమమున నపాదానార్థకప్రత్యయముగా వాడఁబడెను. హిమగిరివలన గంగ ప్రభవించెను. భీమునివలన ఘటోత్కచుండు పుట్టె, మొ. కున్+అన్నన్ = కన్నన్ - నీకన్నవాఁ డధికుఁడు = నీకు నన్నచో వాఁ డధికుఁడు. నీకు+అంటివి+ఏని = నీకంటేని వాఁ డధికుఁడు. కాలక్రమమున నర్థము కొంత మాఱి దీర్ఘము హ్రస్వమై ప్రత్యయావస్థ నందియుండును. నీకంటె వాఁ డధికుఁడు. లోపల - లోను - వీని యౌపవిభక్తికరూపములు లోపలన్. లోనన్. 'లోన్' అనునది లోనుశబ్దరూపాంతరమె. ఇది సప్తమ్యర్థకప్రథమాంతమై ప్రత్యయావస్థ నందియుండును. "అందున్ = ఆస్థలమందు - దానియందు" అను ప్రత్యేకప్రయోగములును నేఁటికినిఁ బ్రసిద్ధమై యున్నవి. క॥ అనఘుఁడు శర్యాతిముఖం। బొనరించె...అందా। శ్విసులకు సోమం బీఁబో। యిన...(ఆర. 3 ఆ. ౧౯౦) (అందు = దానియందు, ఆయజ్ఞమందు.)

తృతీయాదులకు నుగాగమంబగు. ఉ.

బాలవ్యా. ౧-౨౦ విషయము.
రామునిచేతను - రామునితోడను - రామునికొఱకును - రామునివలనను - రామునికంటెను - రామునకును - రామునియందును.

కయి - పట్టి - యొక్క-లకు నుగాగమంబు లేదు. ఉ.

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.

సంజీ. ౧-౨౦ విష:—చింతామణిప్రక్రియలో "తిజ్మర్థ్యే" త్యాదికారికల చొప్పున నెల్లశబ్దములకును గళాద్రుతప్రకృతికత్వము లేర్పడునుగానఁ దన్మూలము ననె విభక్తులకు ద్రుతాంతత్వము సిద్ధించును. (చూ. ౪-౨ విషయము) బాల వ్యాకరణమున నట్లుగాదు. ఈసూత్రము నందువలె నెల్లయెడలను ద్రుతవిధానము చేతనె ద్రుతప్రకృతికత్వ మేర్పడవలసియున్నది. ఇట్టి మార్పులో బాలవ్యాకరణ పద్ధతియందుఁ గొంత లోపము వాటిల్లినది. చింతామణిపక్షమున ద్వితీయావిభక్తు లగు 'ను - ని' వర్ణకములు తిజ్మర్థ్యసూత్రముచొప్పున ద్రుతప్రకృతికము లగుటం జేసి 'నున్ - నిన్' అనురూపములతో నుండును. బాలవ్యాకరణపక్షమునం దన్నో ప్రకృతసూత్రముచే ద్వితీయావిభక్తి ప్రత్యయములకు నుగాగమము లేమింజేసి "ను - ని" అనిమాత్రమే నిల్చియుండును. కాన నీక్రిందిభారతప్రయోగములు బాలవ్యాకరణపక్షమున సంగ్రహింపఁబడఁజాలకున్నవి. మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో। డ్కొని తెచ్చెం దనతల్లి సత్యవతినిన్ క్షోణీజనుల్ దన్ను బో। రనఁ గీర్తింపఁగ...(ఆది. ౪ ఆ. ౧౯౧) వ. అమ్ముని పుత్త్రునియందు నామనంబు దద్దయుం దగిలియున్నది. ఉ. నన్నును గౌఁగిలించుకొని నాహృదయంబునకున్ నిజాస్య మా। సన్నముచేసి...(ఆర. 3 ఆ. ౧౦౭) ఇందలి 'ను' అనునది 'నన్నున్' అనుదాని స్వత్వరూప మనరాదు. నన్నయమతమున 'ను'స్వరూప స్వత్వమే లేదు. కాన 'నన్నునున్' అనియే నన్నయపక్షమునఁ బదచ్ఛేదము చేయకతీరదు. ఇంక బాల. సంధి. ౨౧ సూత్రముచొప్పున నిరర్థకద్రుతా గమముచేసినంగాని 'సత్యవతినిన్ - నన్నునున్' అనురూపములు సిద్ధింపనేరవు. క॥...ఉ। త్తరకోసలేశుభాంగా। సరినిన్ గను మనఘ (ఆర. ౨ ఆ. ౧౬3) ఇదియుఁ బైప్రయోగములవంటిదె. ఇట్టి బాలవ్యాకరణపు పొరపాటుమార్గమునే నమ్మికొని కావలయును నారాయణీయమున ద్వితీయైకవచనప్రక్రియ దోషభూయిష్ఠముగ నడుపఁబడెను. అట్లె గాణపతవ్యాఖ్యాతయుఁ బై "సత్యవతినిన్ - భుంగాసరినిన్" అను భారతప్రయోగములను జూచికొనక యాక్రిందిరీతిని భ్రామాదికముగా

వ్రాసెను. "అచె = అ 'సి' లోపమే, ఇదాదిపై = ఇకారము మొదలగువర్ణము లంతమందుఁగలవానిపై, నిత్యము. ఉదా:—హరిన్ - హరిని. ఇవి ద్రుతప్రకృతిక ములు గాన సంశ్లేషస్వాత్వములు వచ్చినరూపములు. హరినిన్ - హరినిని - అను రూపములు గాకుండుటయే నిత్యలోపమునకు ఫలము" (సారా. గా. తత్స. ౨౨ ప. వివ. ౧౮౩ కారి.)

ప్రస్తుతమగు ఈ సూత్రముచొప్పున 'కయి షష్టి యొక్క' అనుసవితప్పఁ దక్కిన తృతీయాదుల విభక్తిప్రత్యయము లన్నిటికిని నుగాగమం బగునని యర్థము. అనఁగా నట్టి విభక్త్యంతములెల్ల ద్రుతప్రకృతికము లగుచున్నవని తాత్పర్యము. ద్వితీయా 'ను' ప్రత్యయము బాలవ్యాకరణపక్షమున ద్రుతప్రకృతికము కాకున్నను ద్రుతరూపమగుటచే నట్టి ద్వితీయావిభక్త్యంతములు ద్రుతప్రకృతికములు కాఁగ లవు. ఇట్టి ద్రుతప్రకృతికశబ్దములందలి ద్రుతము సముచ్చయాద్యర్థవిశేషబోధకము కాదని యెఱుంగునది. ప్రయోగములు:—ఉ. కావని పూని పల్కుటయుఁ గద్రువపన్నిద మేమి దీనికిన్ । వా దిది యేల కిత్త యనినన్ (ఆను. ౧ ఆ. ౧౮౪) తరల. మీకు నెగ్గొనరించియున్న (ఆర. ౩ ఆ. ౩౯౨) చ. కురుపతి కిన్ యుధిష్ఠిరున కున్...ఒక్కసభ...ఒనర్చి...(సభా. ౧ ఆ. ౫ ప.) కం. జర యనురాక్షసి నీకుం। గర ముపకారంబు...(సభా. ౧ ఆ. ౧౫౭.)

బాలవ్యా. ౧.౨౧ విమయ. చేత - తోడ - లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. ౧౦. ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరిం తురు. రామునిచే - రామునితో - వనములలో.

సంజీ. ౧.౨౧ విష:—'చేత - తోడ - లోపల' అనువాని మొదటియక్షరము శేషించు ననుటచేఁ దక్కినవి లోపించుననియు నట్టియెడ వైకల్పికముగా "చే - తో - లో" అనుప్రత్యయములును నేర్పడుననియుఁ దాత్పర్యము. వీనికి బాల. తత్స. ౮ సూత్రము చొప్పున నుగామము రాఁగా 'చేన్ - తోన్ - లోన్' అను ప్రత్యయము లేర్పడును. (వి_స్త.) సూరి యిటనిర్ధారణార్థక లోపల షష్ఠినిమాత్రమె చెప్పియుండుటచేత దానిరూపాంతరమగు 'లోన్' అనునదియు నిర్ధారణార్థకము

---

వి_స్త. ౧.౨౧ విష:—"రామునిచేను....రామునితోను....వనములలోను" అనునట్టి స్వాత్వరూపము లరుదని తోఁచెడిని" (బా. సా. వే. ౧.౨౫ పు.) అట్లు తోఁచుటకుఁ బ్రమాణము మృగ్యము. చ॥ కవిసీ...పామునీరిలో । ను వెడల కుండి...(ఆను. ౧ ఆ. ౨౩౨.) (చూ. తృతీయోదాహృతులు).

పూర్వమేకాని యధికరణార్థకము కాఁజాలదు. కాన నధికరణార్థకమగు 'లోన్' అనునది విభక్త్యర్థాభిధాయకశబ్దమే యని యెఱుంగునది. అట్లగుటచేతనే యిచటి యుదాహృతులలోఁ దక్కినవానికి భిన్నముగ "వనములలో" అని బహువచన ముదాహృత మయ్యెను. "ప్రత్యయ ఇహావర్ణకః" అను (3౦ విష.) చింతామణి ననుసరించి సూరి "ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు." అని వివరించెను. సూరి వన్నియ లనియు వ్యవహరించెను. (క్రియా. ౪౪ సూ.) వర్ణక శబ్దభవమె వన్నియ యగును. పయివిభక్తులకుఁ బ్రయోగములు:—

ప్రథమకు—రాజమనోహరుఁడు...రాజమహేంద్రుఁడు...(ఆది. ౧ ఆ. 3 ప.) పాలుర్ (ఆది. ౨ ఆ. ౯౨) విస్మితుల్గా జనుల్ (ఆది. ౨ ఆ. ౨3౪) సంతతంబు వినంగ నభీష్టమైంతయున్ (ఆది. ౧ ఆ. ౧౪) కాముశక్తి నోర్వఁగలరె జనులు (ఆది. 3 ఆ. 3 ప.)

ద్వితీయకు—తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ (ఆది. ౧ ఆ. ౯) నన్నునుఁ గౌఁగిలించుకొని (అర. 3 ఆ. ౧౦౭) తనతల్లి సత్యవతిసిన్ (ఆది. ౪ ఆ. ౧౯౨) భాంగా సరి నిన్(అర. ౨ ఆ. ౧౬3) నీచతవాని మత్స్యవిభునిన్ (విరా. ౨ ఆ. ౧౭౯.)

తృతీయకు—సీ...తోడరి మీానుప్వరతోడ నొండె...। ...ఒక్కని, తో నొండెఁబోడిచెద దోర్బలమున (సభా. ౧ ఆ. ౧౯౯) సీ...। ఈతండ వేల్పులచేత దివ్యాస్త్రముల్ (ఆది. ౫ ఆ. ౧౨౪) క. ఈచక్రము...। నీచేత...(ఆది. ౮ ఆ. ౨౫౭) ఆ. వె....కి తవుల। తోడఁ గడఁగి జూదమాడఁ దగదు (సభా. ౨ ఆ. ౧౬౭) అక్కర. ...అర్థలోభంబు। నంగురుకులహానికరుఁడు ధారుణీనాథ నీ సుతుఁడు (సభా. ౨ ఆ. ౧౮౨) క...సంపద। తో మూఁడుజగములు నోపుదుర సాధింపన్ (సభా. ౧. ఆ. ౧౧౫.)

చతుర్థికి:—గీ. అనఘ మామామ శకుని నాకై కడంగి (సభా. ౨ ఆ. ౧౭౪) సీ. చైద్యునికై పూని...(సభా. ౧ ఆ. 3౮) ఇట 'చైద్యునకై' అన్నను క్షతిలేదు. కాని లాక్షణికు లెవ్వరును 'కై' పరమగునపుడు నగాగమమును విధించియుండ లేదు. అట్టియెడల నవర్ణస్థితిని నిర్ణయింపఁగల్గు ప్రబలప్రయోగమును గన్నట్టదు. కాన 'చైదునకై' అని నిల్పరాదు. గీ. పూర్వులైన సగరనృపపుత్త్రులకును। దాత్త గతికయి తెచ్చె నిద్ధరణి కనఘ (అను. ౨ ఆ. ౧౧౭) 'కై' అనుదానియర్థమున 'కున్నై' - 'కుఁగాన్' - అనియుఁ బ్రయోగించుట కలదు. సీ. అడుగుము నీకుఁగా ననిసేయు టొక్కటి దక్కఁగ (భీష్మ. ౧ ఆ. ౧౫౭) గీ. పొదలుఁ దఱుఁగుటకై, పొడ వోదవుఁ బడుటకై, కడుంజేరుఁ బాయుటకై, జనించుఁ|బొలియుటకున్నై, సుఖం

సుఖంబొందు, దుఃఖ। మొందుటకునై,...(శాంతి. ౧ ఆ. ౨౧౬) 'కునై = కై' అనునవి పర్యాయరూపము లనఁదగియున్నను 'కునై' అనుదానికి ముందు 'న' అనునది నిల్చును. 'కై' అనుదానికి ముందు 'న' అనునది నిలువదు. "తత్కార్యముకై" (ఉ. హరి. ౬ ఆ. ౨౮౫) (మా. ౧౩౬ III విష.). కైవిభక్తి యిట్లు 'కున్+అయి' అనుశబ్దముల జంట మూలముగాఁ గలదనియు దీనిచోట స్వరయతిమాత్రమె చెల్లుననియు గ్రహింపక కూచిమంచి తిమ్మకవి యీక్రిందిరీతిని బ్రాణియతిని బొరపాటుగా నుదాహరించెను. "క. కై యనఁగ గకారముపై। నై యనఁగ విభక్తు లొప్పు...(సర్వల. ౧ ఆ. ౨౧ ప.) కైవచ్చుటకు—ఉ. నావుడు వాయునందనుఁడు నందనపొమ్ము చమూవధూటి నీ। కైవసమైన లెస్స యటుగాక నినుం దలమీఁతె నేసి...(జైమిని. సర్వల. ౧ ఆ. ౨౨ ప.)" ఇట 'కైవసము' అను వేఱుశబ్ద మనఁదగునుగాన 'కై' అను విభక్తి నిట నంగీకరింపవలసిన ప్రసక్తిలేదు. 'కైవసము' అనుదానిలోని 'కై' శబ్దము హస్తపర్యాయమైన యఖండశబ్దము. పైపద్యమున 'కై' విభక్తికి సంగతియు లేదు. క॥...స। మ్మానిత శాంతికొఱకు వి। జ్ఞానంబున... (శాంతి. ౫ ఆ. ౯౦) క....ఎఱిఁగిం। చితి నీపరిపాటి కర్మశీలతకొఱకున్ (శాంతి. ౪ ఆ. ౯౮.)

పంచమికిః—వారికం। టెను బలాధికులైనవారి కడిందివీకుల...(ఆది. ౨ ఆ. ౩ ప.) సీ...వారల, కంటె హితుల్ నీకుఁ గలరె యొరులు. (ఆది. ౮ ఆ. ౪౩) సీ...భూసురవరులవలన। వేదంబులును...కఱచుచు (ఆది. ౩ ఆ. ౧౨) చ. నరవరుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబుఁడన్...(ఆది. ౬ ఆ. ౨౩౫.)

షష్ఠికిః—చ. కురుపతికిన్ యుధిష్ఠిరునకున్,..విభవాభిరామునకు...(సభా. ౧ ఆ. ౫) యొక్కకుఁ బ్రయోగములేదు.

సప్తమికిః—ప్రజాపతు। లం దచింత్యాత్మకుఁడైనయట్టి (ఆశ్వ. ౭ ఆ. ౧౬౨) చ...క్షణం। బున డిభకుండు మృత్యుగతిఁబొందె......(సభా. ౧ ఆ. ౧౧౭)

డు ము వు న లేక వచనంబులు. ౧౧.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు.

రాముఁడు, సోముఁడు, వనము, ధనము, ధేనువు, భానువు.

లువర్ణంబు బహువచనంబు. ౧౨.

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు, సోములు, వనములు, ధనములు, ధేనువులు, భానువులు.

బాలవ్యాకరణ వివరణము. ౧౨ విషయము,

తక్కినవి యుభయంబులు. ౧౩.
మిగిలినప్రత్యయంబు లేకత్వబహుత్వములకు బోధకములని యర్థము. వనమును, వనములను, వనముచేతను, వనములచేతను, వనముతోడను, వనములతోడను.

సంజీవని. ౧౨౨ విష:—ఏకత్వసంఖ్యను బోధించు = పదార్థ మొక్కటినే తెల్పు. బహుత్వసంఖ్యను బోధించు = అనేకపదార్థములను దెలుపు. రాముఁడు = ఒక్కరాముఁడు. రాములు = అనేక రాములు. తక్కినవి = "డు - ము - వు - న - లు" అనునవితప్పఁ దక్కిన ప్రత్యయములు. ఉభయంబులు = ఏకత్వమును బహుత్వమును బోధించునని యర్థము. వనమును = ఒక్కవనమును. వనములను = అనేకవనములను. ఇచట ద్వివిధవచనములందును 'ను' ప్రత్యయమే నిల్చినది. లాగమపూర్వకములు (బా. తత్స. ౩౧ సూ.) బహుత్వబోధకము లగును. లాగమపూర్వకములు కానివి యేకత్వమును బోధించును. లడాగమలవర్ణము, 'లు' ప్రత్యయమూలకమనఁదగును.

సంస్కృతమున ద్వివచనము గలదు. ద్విత్వసంఖ్యను బోధించునది ద్వివచనము. కాన సంస్కృతమున రెండిటికన్న నెక్కువసంఖ్యను బోధించునదే బహువచనమగును. తెల్గున నొక్కటికన్న నెక్కుడుసంఖ్యను బోధించునది సయితము బహువచనమె. ఇట్టిస్థితి ప్రాకృతములనాఁటికే ప్రసిద్ధికెక్కినది. "ద్వివచనస్యబహువచనమ్—సర్వాసాం విభక్తీనాం సుపాంతిఙాంచ ద్వివచనస్య బహువచనం ప్రయోక్తవ్యమ్" (ప్రాకృతప్రకాశము. ౬ పరి. ౬౩ సూ.) (౧౫౭ పుట.) ౧౧ సూత్రపువివరణమున 'న' వర్ణకమున కుదాహరణ మీయఁబడలేదు. బా-కార-౧౮-౨౩ సూత్రములచొప్పునఁ దృతీయాసప్తమ్యేకవచములందు నవర్ణకము నిల్చును. వనమునన్ = వనముచేతన్, వనమునందున్. ౧౨ సూత్రమున "లు వర్ణంబు" అనియే బాలవ్యాకరణప్రథమద్వితీయముద్రణములందు సైతము గలదు. "ఈ సూత్రంబున 'లువర్ణం' బని యున్నది. లువర్ణకం బనుట యుక్తంబు" (బా. గు. ప్ర. ౬౬ పుట.) అని గుప్తార్థప్రకాశిక సుడువుచున్నది. కాని సూరి స్థలాంతరమునందును నిట్లు వాడియున్నాఁడు. అట్టియెడల నిట్లు గుప్తార్థప్రకాశిక సవరించియుండలేదు. "కొండొకచో సమాసంబులందు నామ్న్యాదికనుమ్న్యాదుల మువర్ణంబులు పువ్వర్ణంబులగు" (బా. సమా. ౧౯ సూ.)

ఓయీత్యామన్త్రణంచ వికృతౌ స్యాత్. (ఆం. చిం. తత్స. ౭ కా.) (అహో. ౨౮౧ పు.)

వికృతావత్ర వాలోప । స్స్యమ్యుద్ధ్యోయిపదేతుయేః ।
సపూర్వత్ర స్థితస్స్యాద్రో : ఇతి స్త్రీవాచకోభవేత్ ।
సన్నయా పరత్రైవ ప్రయోగస్తు । స్యాద్ద్వయోరపిచాద్యవత్ ।
ధర్వణీయము నీచతాయాం రి సీ స్యాతాం । క్వచిన్మైత్ర్యాం చ తచ్ఛ్రు
౧౨౩ విషయము. తిః । అన్యత్రాపి క్వచిద్రోస్యా ద్రావిడేశ్య ప్రయోగతః ॥ (వికృ. అజం. ౧-౨-౬. కారి.) (అహో. ౨౮౧ పుట.)

క్వచిదామన్త్రణేకానో । వైకృతాత్పరతోమతః. (వికృ. అజం. ౭౦ కా.) (అహో. ౩౪౪ పు.)

కల్ప. ౧౨౩ విష:—ఓయి+ఇతి = 'ఓయి' అని, ఆమన్త్రణమ్ = సంబోధన వాచకము, వికృతౌచ = తెల్గునందును - స్యాత్ = అగును. "ఓ ఇత్యామన్త్రణంచ" అని యహోబలపతిపాఠము. 'ఓ+ఇతి' = 'ఓ' అని యర్థము. "బాలసరస్వత్యాతు ఓయీతి ద్వ్యక్షరపాఠో వ్యాఖ్యాతః. ద్వితీయాచార్యేణాపి ద్వ్యక్షరశబ్దమేవాంగీకృత్య వికృతావత్రవాలోపః...ఇత్యుక్తమ్" (అహో. ౨౮౧ పు) ఓయిరామా - ఓరామా. ఓయిపదేతు = చింతామణిలోఁ జెప్పఁబడిన 'ఓయి' అనుపదమందలి, యేః = 'యి' అనుదానికి, అత్ర వికృతౌ = ఈ తెల్గునందు, లోపః = లోపము, వా = వికల్పముగా నగును. సః = అట్లు లోపింపఁగా నేర్పడిన 'ఓ' అనునది, పూర్వత్ర = సంబోధ్యవాచకమునకు ముందు, స్థితః = నిల్చునది, స్యాత్ = అగును. రోఇతి = 'రో' అనునది, స్త్రీవాచకః = స్త్రీసంబోధనవాచకము. భవేత్ = అగును. ప్రయోగః = ప్రయోగము, పరత్రైవ = సంబోధ్యవాచకమునకుఁ బరమందే; ద్వయోరపి = ఓ - రో - అను రెండింటికిని ('ఓయి' అనుదానికిని), ఆద్యవత్ = సంస్కృతభాషయందువలెనె యైచ్ఛికముగు వాడుక, స్యాత్ = అగును. ఉదా. ఓరామా - రామా, సీతరో - సీతా, ఓసీతా, ఓయిరామా మొ. నీచతాయామ్ = నీచపురుష స్త్రీసంబోధనమునందు, 'రి - సీ', = 'రి-సి' - అనునవి, స్యాతామ్=ఓశబ్దమునకుఁ బరముగా నిల్చును. నీచపురుషామంత్రణమున 'ఓరి' అనియు నీచస్త్రీసంబోధనమున 'ఓసి' అనియు వాడఁబడునని తాత్పర్యము. క్వచిత్ = ఒకానొకప్పుడు, మైత్ర్యాంచ = మిత్రసంబోధనమునందును, (వత్సలత్వాదులకు మైత్రి యుపలక్షణమని యెఱుంగునది.) తచ్ఛ్రుతిః = ఆ 'రి, సి,' శబ్దముల వినికి సంభవించుచున్నది.

ఉదా:—ఓరి దుర్జనుఁడా, ఓసి దుష్టురాలా, ఓరి ముద్దుకృష్ణ - ఓసి ముద్దుబాల - 'రో' అనుదానికి హ్రస్వమును, 'రి, సి,' అనువానికి దీర్ఘమును నైచ్ఛికముగ వాడుట గలదు. ఓరీ రాక్షస - మొ. 'రో' = 'రో' అనునది, రూఢదేశ్యప్రయోగతః = ప్రసిద్ధమగు దేశ్యప్రయోగమున, అన్యత్రాఽపి = స్త్రీవాచకేతరస్థలములందును, క్వచిత్ = ఒకానొకప్పుడు, స్యాత్ = అగును. అన్నరో - "పడఁబోవ, గొల్లెత బసవరోయనఁగ" (బసవ. ౨ ఆ. ౫౨౨ ప.) మొ. క్వచిత్ = ఒకానొకప్పుడు, వైకృతాత్ పరతః = అచ్చతెనుఁగుశబ్దమునకుఁ బరముగ, ఆమన్త్రణే = సంబోధనమునందు, కానః = 'కాన' అనునది, భవేత్ - ప్రయుక్తమగును. అమ్మకాన "ధర్మమేమరకుండు మీ తల్లి కాన" (నైష. ౭ ఆ. ౯.)

ఓ యామన్త్రణంబునందగు. ౧౪.

ఓ యమశబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపఁబడును. ఓశబ్దంబు తొలంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును. ఓరాముఁడ - ఓరాములార. రాముఁడ - రాములార.

బాలవ్యా. ౧౨౪ విష. ఓశబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబులందు, యి, సి - రి, వర్ణంబులు విభాష నంతాగమంబులగు. ౧౫.

ఓయిరాముఁడ - ఓరాముఁడ, ఓసిదుష్టురాల, ఓ దుష్టురాల, ఓరిదుష్టుఁడ - ఓదుష్టుఁడ.

ఓరి - ఓసిమైత్రియందుం గలవు. ౧౬.

ఓరిచిన్నికృష్ణ - ఓసిముద్దుబాల. ఓయి మొదలయిన వానికి స్వతంత్రప్రయోగముం గలదు. సంగతి యమో యి. ఓసి పోవే - ఓరోరి యింకెందుఁబోవచ్చు. దీనికి దీర్ఘంబుం గలదు. ఓయీ విప్రకులావతంస. ఓరీ దుష్టనిశాటులార. ఓసీ ననుఁ జెనకరాకు.

సంజీవ. ౧౨౪ విష:—ఆమంత్రణంబునందు = సంబోధనమునందు - సంబోధ్యవాచకము = పిలువఁదగినవానిని దెలుపుపదము. తొలంగి = విడిచి. ఓశబ్దము సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడునను నవధారణముచేతఁ బరముందుఁ బ్రయోగింపఁబడదని నిశ్చితమగుచున్నది. 'ముందే' అనునవధారణమున

నవ్యవహితప్రాప్యమని పీటికా వ్యాఖ్యాత యర్థము చేసెను (బా. సా. పే. ౧౨౭ పుట). ఇట్టి యర్థము చేసినట్లే సూరియుం దాహరించి కావలయుఁ ద్రిలింగలక్షణశేష కర్త "ఓకారం బొక్కచో సంబోధనవాచకమునకు ముం దితరశబ్దవ్యవహితంబయి కానంబడియెడి." అని సూత్రించి యుదాహరించెను. "ఓవిమలపీఠికున్న ఖచరోత్తములార (పీఠక. ౨ ఆ.) ఓకోమలజనేత్రుఁ గాంచితె వధూమణి (విజ. ౩ ఆ.)" (ప్రౌఢ. శబ్ద. ౧౬౩ సూ.)

సంజీవ. ౧౨౪ I విష:—"ఓకదా! జాఁ బోఁడుతుఁ జుంటో యని" (బసవ. ౪ ఆ. ౧౩) అనుచోటి 'ఓ' శబ్దము, "పొడుతుఁ జుంటోయి" అను నిట్టి "ఓయి - అయ్యా" మున్నగువానివంటి పదమున్నది. "ఓకావే" (ఉ. హరి. ౨ ఆ. ౧౨౯) ఇచటి 'ఓ' శబ్దము పిలుచునపుడు పలుకుటను దెలుపుచున్నది. కాన నిట్టి 'ఓ' శబ్దములు సంబోధనార్థకములని భ్రమింపరాదు. ప్రయోగములు—"ఉ॥ ఏజనకాత్మజం దశరథేశ్వరుకోడల నానుభార్య నౌ! ఓజగములార యక్షపక్ష రోసుకలార సురారికంచు..." (భాస్క. యుద్ధ. ౬౧ ప.) "ఉ॥ ఓచతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక"... (వసు. ౧ ఆ. ౩౦ ప.) "శా॥ ఓరాజన్యమహేంద్ర యోమణిగణప్రోతాసివాతాశన! ప్రోజ్జ్వత్కటిచక్ర యోముఖరశార్ఙ్గక్రూరబాణార్గళా! యోపక్షాచలకల్ప యోకవచితప్రాగ్భాంగ కావంగదే! యోరావుత్తశిరోమణీ నిరవధిప్రోద్యత్ప్రతాపారణీ." (మను. ౪ ఆ. ౩౧) "క॥ శరణాగతసంశ్రితభయ! హరణా సురవికరశేఖరానర్ఘమణి! స్ఫురణాపరిచయరంజిత! చరణా వనమాలికా భుజంగాభరణా" (విరా. ౧ ఆ. ౩౮) "మ॥ అనఘా మున్ను శమంత...(ఆది. ౧ ఆ. ౩౫.)

సంజీ. ౧౨౪ II విష:—అనీచపురుషసంబోధనమున 'ఓయి' అనునదియు, నీచ - పురుషసంబోధనమున 'ఓరి' అనునదియు, నీచస్త్రీసంబోధనమున 'ఓసి' అనునదియు సంబోధ్యవాచకమునకుఁ బూర్వమున నైచ్ఛికముగ నిల్చునని యర్థము. అట్లు 'యి - సి - రి' అనునవి యంతాగమములు కానపుడు 'ఓ' శబ్దముమాత్రమె వాని యన్నిచోట్లను నిల్చును. శీలము, జాతి, విద్య వయసు మున్నగువానిచేఁ దన కంటెఁ దక్కువవాఁ డిచటి నీచశబ్దవాచ్యుఁ డని యెఱుంగునది. అట్టివారివిషయమున 'ఓరి, ఓసి' అనునవి వాడఁబడుచుండును. మైత్రి, వత్సలత మున్నగువానిస్థలములందును నివి వాడఁబడును. ఇట్టి స్థలము కాకున్నను శత్రువిషయమగుచో నుత్తముల విషయమునందును నీయోరి - యోసి యనునవి వాడఁబడును. నీచతాతిశయస్ఫూర్తిలో 'ఓరోరి' మున్నగురీతిని ద్విరుక్తియుఁ గలదు. ప్రయోగములు:—సీ॥ కనుఁ

58

గొని జంఘాకితపదము: డోరోరి.....తొలఁగిపొండు.....(మౌసల. ౧ఆ.౧౮౫ప.) "కి...పాపాత్మక మగుకిరాతబలము".....అనెడి పూర్వ (౧౮౪) పద్యమునుబట్టి వారినే 'ఓరోరి' అని సంబోధించె ననుట స్పష్టము. ఇచటి 'ఓరోరి' అనునది సంబోధ్య వాచకమును బోధింపఁజేయు చున్నది. ఉ. 'ఓరిదురాత్మ యీయబల నోడక యేటికిఁ బట్టినాఁడవు" (ఆరణ్య. ౫ ఆ. ౧౭౯) ఉ. ఎవ్వఁడు రోరి తాను నొకయొక్కఁడు మీరుఁడపోలె (ఉ. హరి. 3 ఆ. ౪౩) శా. ఓరీ బ్రాహ్మణధూర్త (ఉ. హరి ౪ ఆ. ౧౮౭) శా. ఓరీ దానవధూర్త (ఉ. హరి. ౬ ఆ. ౨౧౦) ఉ. ఓసి దురాత్మురాల గృహ మొల్లక (మను. ౪ ఆ. ౮౨) శా. ఓసీ నీకొఱగామియే యిది (కళా. 3 ఆ. ౨౧౬) ఉ॥ ఓయి దయావిహీనమతి (మను. ౪ ఆ. ౮౭) (వి స్తర.) ఓరి యనునది బహుత్వమునందును వాడఁబడును. వెనుక నుదాహరించిన మౌసలపర్వపద్యము లోని "ఓరోరి...తొలఁగిపొండు" అనునది కిరాతబలమునుగూర్చి పలుకఁబడినది గదా: మఱియు, క. ఓరి యనెడుసంబోధన। పేరునఁ బెక్కండ్ర నొకనిఁ బిలువఁగ ననువౌ। నోరిజనులార యనఁగా। నోరిజనుండా యనంగ నుడుపతిమకుటా (సర్వల. ౧ ఆ. ౮౧ ప.) ద్వి. ఓరిరాక్షసులార యుర్విపై నేను। శూరతవిలసిల్లు సుగ్రీవు బంట (రంగ. సుందర. ౮౨ సర్వల. ౧ ఆ.)

సంజీ. ౧౨౪ III విష:—మైత్రి యనునది వాత్సల్యాదులకు నుపలక్షణము. 'ఓరిచిన్నికృష్ణ - ఓసిముద్దుబాల' అను నుదాహృతులు వాత్సల్యాదివిషయములె యనుట లెస్స. ఈసందర్భమెల్ల సూరి యహోబలపండితీయమునుండి యెత్తి వ్రాసి నదె యనవచ్చును. "వికృతావత్ర వాలోప। స్సంబుద్ధ్యోయిపదేతుయేః! స పూర్వాత్ర స్థితస్స్యాద్రో! ఇతి స్త్రీవాచకోభవేత్।...నీచతాయాం రిసీస్యాతాం। క్వచిన్మై త్ర్యాంచతచ్ఛ్రితిరి త్యుక్తమ్. యత్ర పురుషామన్త్రణం తత్ర లోపవికల్పః యత్ర స్త్ర్యాద్యామన్త్రణం తత్ర వ్యవస్థితవిభాషా. ద్వ్యక్షరస్య ప్రయోగాభావాత్. ఉభయత్రాపి తస్య పూర్వత్రైవ ప్రయోగః.... సంగతియ యోయియిసుమంత

---

వి స్తర. ౧౨౪ II విష:—పయి ప్రయోగములనుబట్టి యీ క్రిందిపేటికా వ్యాఖ్య నిర్మూలమని విశదమగుచున్నది. "అధమజాతిస్త్రీపురుషామంత్రణమున నోశబ్దమునకు 'సి. రి' వర్ణములు గలుగుట సూరి హృదయముగానట్లును అట్టి ప్రయోగము లగపడిన వానిని మైత్రిచేఁ గలిగినవానినిఁగా సమర్థింపవలెననియే యాతఁడు భావించినట్లును స్పష్టమయ్యెడి." (బా. సా. పే. ౧౨౮ పు.) సూరి గ్రంథమున నిట్టి యభిప్రాయము లేదు, మఱియుఁ బై ప్రయోగములయందు మైత్రిని సమన్వయించుట దుర్ఘటమునని గ్రహింపవలయును.

లింగత్వాప్రు (అను. ౪ ఆ. ౬౨) గత్యాదిషు ఘనసేష్విక్ష్విదిశబ్దవతి స్వాతన్త్ర్యేణాపి ప్రయోగోస్త్యేవ" (అహో. ౨౪౧ పు.) ఇట్టిహో బలపంచితియును జూచియు నందలి 'రో - కాన' మున్నగువానిని సూరి యుదాహరించకుండుట వింత. (విస్తర. I. II).

---

విస్తర. I ౧౨౪ III విమ:—"రో - రా - కాన - అల - అలా. అనునవి ప్రాచీనగ్రాంథికాంధ్రమున నట్టి ప్రయోగము లగపడమిని...సూరి వీనినిఁ దలంపఁ డయ్యె" (బా. సా. పే. ౧౭౦ పు.) "రో ప్రభృతులు ప్రాచీనగ్రాంథికభాషలో నగపడలేదను పేటికావ్యాఖ్యాత కేవలము నపరిశీలనకృతము. ఏ. గీ....కరంబున నుదక మప్పు! డించియమ్మరో దక్కొనయుంచు నుల్ల! ములుకు వారసై పురజనంబులు దలంకి (విరా. ౫ ఆ. ౩౬) తిక్కన కించుక పూర్వుఁడే యనఁదగు నథర్వణుఁడు సూత్రించుచుండ నవి యప్రసిద్ధములనుటయెట్లు పొసఁగును? ద్విపద. కడురొంపిఁ గాలు జాఱుడుఁ జల్లకడవ! పడఁబోవ గొల్లెత బసవరో యనఁగ (బసవ. ౨ ఆ. ౯౨) వీరభద్రయ్యరో విషము ప్రాణేశుఁ! డారగించె (బసవ. ౩ ఆ. ౭౯౪) అప్పరో స్వీ రెప్పరయ్యరో యనుచు (బస. ౩ ఆ. ౩౪౬) దేవరో యనఁగ శ్రీదివ్యలింగాంగ (బసవ. ౩ ఆ. ౯౪౯) వల్లభరో (భాస్క. రా. కిష్కిం. ౯౯ ప.) అథర్వణకారికలనుఁ గొన్ని మహాకవిప్రయోగములను మూలముగాఁ గొని త్రిలింగలక్షణశేషకర్త యీ క్రిందిరీతి నుపదేశించెను. "రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబు నకుఁ బరంబుగనగు. అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి. ఉదా:—చం॥ కమల దళాక్షిరో (ప్రభా. ౧ ఆ.) చ॥ రమణిరో భృత్యులందు...(భాగ. ౭ స్కం.)"

"ఒకానొక యాధునికగ్రంథమునందు 'అన్నరో - ఏనుంగురో' అను ప్రయోగంబులు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణికప్రయోగంబులు కానంబడవు" (ప్రౌఢ. శబ్ద. ౧౪ సూ.). (అనుబంధము.)

గుప్తార్థప్రకాశికాకర్త యీ ప్రౌఢవ్యాకరణగ్రంథము నెల్ల స్వీకరించియు నిందలి స్త్రీవాచకశబ్దమును మాత్రము మార్చి "స్త్రీలింగములైన సంబోధ్యవాచకముల తుదను" అని వ్రాసెను. సంస్కృతవ్యాకరణములం దట్లు త్రిలింగస్త్రీవాచక

---

అనుబంధము. విస్తర. I ౧౨౪ III విమ:—గాణపతవివరణకర్త యిట నిట్లు వివరించెను. "ద్విపద. అన్నరో నీవు నన్నన్నని పిలువ । నెన్నఁడు వినఁగల్గు నింక వీనులకు (రంగ. రామా. యుద్ధ.) సిగ్గు లజ్జయు లేనిచెనటిరో నన్ను । బగ్గించుచున్నారు పగతు రిబ్భంగి (రంగ. రామా. యుద్ధ.) ఏనుంగురో (అచ్చ. అరణ్య ౭౦) కంబ మయ్యరో (యయా. ౨ ఆ. ౩)

శబ్దములు పర్యాయములుగ వాడఁబడుట సంప్రదాయమె యైనను దెలుఁగువ్యాకరణములలో నట్లు వాడుట సంప్రదాయవిరుద్ధమై యున్నది. తెలుఁగువ్యాకరణములలో స్త్రీవాచకశబ్దము మహతీవాచకమాత్రపరముగా వ్యవహరించుట సంప్రదాయము. స్త్రీలింగశబ్దముచే లతావనితాదిశబ్దములెల్ల గ్రహింపఁబడునుగాన నది స్త్రీవాచకమాత్రపరము కానేరదు. మఱియు దారకళత్రాదిశబ్దములు స్త్రీవాచకములయ్యు స్త్రీలింగములు కానేరవు (చూ. విష. ౧౬౧ 1. విస్తర. II) "దేశ్యమునం గొన్నియెడల స్త్రీవాచకస్త్రీసమంబులగు సంబోధ్యవాచకశబ్దంబులమీఁద నేకవచనంబునఁ గాన శబ్దం బొండును అల యను నవ్యయం బొండును గానంబడియెడి. అల దీర్ఘాంతంబునగు. గీ. పలుక వేటికిఁ జిలుకలకొలికికాన (నైషధ. ౫ ఆ. ౫౦) ధర్మమేమరకుండుమీ తల్లి కాన (నైష. ౭ ఆ. ౯) మాసామికాన (సారం. ౧ ఆ.) (ఈకవి 'పాపజాతికాన' అని ప్రయోగించినాఁడు. అది విచార్యము.) ఉ. అక్కలకన్యకాత్వ మిటు లారడివోవ నకారణంబ నీ కెక్కడి చూలువచ్చె (నిర్వ. ౨ అ. ౨౪) చ. తొడిఁబడ నమ్మలక్క లని తూలుచు...(ఆము. ౨) క....సెలవుల। లాలలు దొరఁగంగ నన్నలా యని యెలుఁలున్ (ఉ. హరి. ౪ ఆ.)" (ప్రౌఢ. శబ్ద. ౧౫ సూ.) సీ....కలుషించి వైకారికస్వరూపుఁడు పద్మ, జన్ముండు మద్వ్యభిచారకారు. ఎ. గీ. లార కాన దురాచారులార కాన। కితవకృత్యంబు లిట్లు చేసితిరి మీరు (వరాహ. ౫ ఆ. ౫౨ ప.)

విస్తరము. II ౧౨౪ III విష:—శబ్దరత్నాకరకోశమునను వైకృతదీపికయందును 'హై' శబ్దభవము 'ఓయి' శబ్దమనియు నదియే 'ఓ' శబ్దమునకు మూలమనియు వివరింపఁబడెను. 'ఓరి - ఓసి' శబ్దములు "ఓ" శబ్దమునకు 'రి. సి' అనునవి చేర్చుటచే నేర్పడినవే యను తలంపున నట్టిశబ్దము లుదాహరింపఁబడలేదు. కావుననే సంబోధనార్థకముగా 'ఓ' శబ్దము వేఱుగఁ జూపఁబడలేదు. అలశబ్దము 'హళా' శబ్దభవముగాఁ జూపఁబడెను. రో - (రో) కానశబ్దములు దేశ్యములుగాఁ జూపఁబడెను. సూ. రా. నిఘంటువున "ఓ, ఓరి, ఓసి, ఓయి, కాన, అల" అనున వెల్లను వేర్వేఱు దేశ్యశబ్దములుగాఁ జూపఁబడెను. రోశబ్దపునిఘంటుభాగ మింకను ముద్రితము కాలేదు. పరిశీలింపఁగా 'హో' శబ్దమునుండి 'ఓ' శబ్దమును, 'హో+రే' శబ్దములనుండి 'ఓరి' శబ్దమును, యోషిచ్ఛబ్దమునుండి 'ఓసి' శబ్దమును, 'హో+ఆర్య' శబ్దములనుండి 'ఓయి' శబ్దమును, 'హళా' శబ్దమునుండి 'అలా, అల' శబ్దములును సంభవించియుండునని తోఁచెడిని. "హో - అవ్య...సంబోధనే". "హై - అవ్య...సంబోధనే". "రే - అవ్య...నీచాదేస్సంబోధనే". "హళా - అవ్య...నాట్యోక్తౌ

కర్మధా స్త్రీపశుజడాన్వినాన్యే । మహదాఖ్యాస్తద్విశేషణం
౧౩ విశేషణము. చాపి. (ఆం. చిం. అజం. 3 కారి.) (అహో. ౨౮౩ పు.)

కల్పతరు. ౧౩౫ వృ:—స్త్రీ = స్త్రీవాచక మనఁగా మహతీవాచకములను, పశు = పశుమృగపక్ష్యాదు లనఁగాఁ దిర్యగ్వాచకములను, జడ = అప్రాణివాచకములను, వినా = విడిచి, అన్యే = తక్కినవన్నియు, మహదాఖ్యాః = మహత్సంజ్ఞ గలవగును. తద్విశేషణంచాపి = ఆమహద్వాచకముల విశేషణము సైతము మహద్వాచకమే యనఁబడును. (విశేషణశబ్దమునపుంసకలింగము కాన 'తద్విశేషణాశ్చాపి' అను కవిశిరోభూషణపాఠము ప్రమాదికము.) ఇట్లనుటచేత స్త్రీవాచకములును దిర్యగ్వాచకములును జడవాచకములును నమహద్వాచకము లనంబడును. స్త్రీవాచకములు మహచ్ఛబ్దవాచ్యుల స్త్రీలకు వాచకము లగుటంజేసి మహతీవాచకములనియు వ్యవహరింపఁబడును. అనఁగా—మనుష్యదేవరాక్షసాదిపురుషులను దెల్పుశబ్దములు మహద్వాచము లనఁబడుననియు వారిస్త్రీలను దెలుపుశబ్దములు మహతీవాచకములు= స్త్రీవాచకములు, ననఁబడుననియు, నట్టిమహతీవాచకములును దిర్యగ్జడవాచకములును నమహద్వాచకము లనఁబడుననియు నెఱుంగునది. తిర్యక్కులలో నాఁడువానినిఁ జెప్పునవియు, మగవానినిఁ దెల్పునవియు నమహద్వాచకములె యగును. ఉదా:—ఆవు - ఎద్దు - మొ. 'గంగ' అనునది ప్రవాహరూపార్థ మిచ్చునపు డమహద్వాచకమె యైనను, గంగాదేవి యనునర్థ మిచ్చునపుడు స్త్రీవాచకము, మహతీవాచకము నని వ్యవహరింపఁబడును. మహద్విశేషణములు మహత్తులైనట్లే యమహద్విశేషణము లమహత్తు లగును.

శిఖండి స్త్రీరూపమున జన్మించి పిదపఁ బురుషుఁడయ్యెనని పురాణగాథ గలదు. తద్విషయమునఁ దలఁచుచుగా మహద్వాచకశబ్దములనె ప్రయోగించినను నరుదుగా మహతీవాచకశబ్దములను సోమయాజి ప్రయోగించెను. ఉ. ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగన్మగవానిఁగాఁగనా । కొవ్వమిఁజేసి యట్టి నిను నుగ్మలినేయఁగ నొల్ల... శిఖండినీ (భీష్మ. 3 ఆ. 3౨౨ ప.) క. ఏయు మొక నేర్పుమైని । శ్లేయక క్రీడించి

---

సంబోధనే". (శబ్దస్తో.). ఇంక రోశబ్దము—'ఔర, బళిర, ఏలర, ఏమిర' మున్నగుచోట్లఁ బ్రసిద్ధమగు 'ర' అనుదానిపై 'ఓ' శబ్దము నిలువఁగా నేర్పడియుండు నని తోఁచెడిని. (ర+ఓ = రో). (ర) అనునది 'రమ్ము' అనుదాని (రమ్ము = రా = ర) సంక్షేపరూప మనఁదగును. "ర—దే. అవ. । నీచమిత్రోద్దేశములందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వంబున అంతాగమం బగును...కాదుర—ఓరినక్తంచర...ఏలర యాచలంబు" (శ. ర.)

యుడగు మెన్నఁబడును మ । త్నాయకముల నినుఁ గూల్చెదఁ । జూ యెవ్వఁత నైతి నేమి సూచెదు నన్నున్ (భీష్మ. 3 ఆ. ౕ౨౫.) అర్జునుఁడు విరటుకొల్వున కేఁగు సందర్భమునఁ జేడి గావునఁ దద్విషయమునను సోమయాజి మహతీవాచకములను వాడెను. క. మానవపతి నన్నొక్కఁడి । దానవు నీవనియొనేని...నృత్యగురువ ననఁ గలవాఁడన్ (విరా. ౧ ఆ. ౯౦) క. చనుదెంచి పేడితనమును । వనితారూపంబు నమరవాసవసుతుఁడు...(విరా. ౧ ఆ. ౨౭౯) ఉ. ఆఁడుదనంబు నిక్కమున కారసి చూచిన లేదు పుంస్త్వముం । బోఁడిమితప్పియున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్యమై (విరా. ౧ ఆ. ౨౩౮) ఉ. కౌరవసేన కాదు త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినం । దేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వవచ్చు...(విరా. ౪ ఆ. ౨౨.)

స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును
బాలవ్యా. మహత్తు లనఁబడును. ౧౭.
౧౨౫ I విష. తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.

సంజీ. ౧౨౫ I విష:—'స్త్రీలు - పశుపక్ష్యాదులు - నచేతనములు' అను వానికి భిన్నములు మహత్తు లనుటచే స్త్రీపశుపక్ష్యాదులు నచేతనములు నమహత్తులని విశదమగుచున్నది. మహత్తులను దెల్పుశబ్దములు మహద్వాచకములని చెప్పఁబడును. పై సందర్భమునుబట్టి మనుష్యదేవయక్ష రాక్షస గంధర్వ కిన్నర కింపురుషాదులలోఁ బురుషులను దెలుపుశబ్దములు మహద్వాచకము లనిపించుకొనును. ఉదా:—మనుష్యుఁడు, రాముఁడు, విష్ణువు, కుబేరుఁడు, రావణుఁడు, హాహాహుఁడు మొ. ఆజాతులస్త్రీలను దెల్పుశబ్దములు మహతీవాచకములు స్త్రీవాచకములు ననఁబడును. ఉదా:—మానుషి - స్త్రీ - ఆఁడుది - సీత - గౌరి - మందోదరి - రంభ - మొ. మహతీవాచకములును దిర్యగ్వాచకములును నచేతనవాచకములును నమహద్వాచకము లనఁబడును. ఉదా:—ఆఁడుది - సీత - సింహము - ఎద్దు - ఆవు - కొండ - వనము - సముద్రము - చెన్నపురి మొ. మహద్వాచకవిశేషణములు మహద్వాచకములు. మహతీవాచకవిశేషణములు మహతీవాచకము లనఁబడును. అమహద్వాచకవిశేషణము లమహద్వాచకము లనంబడును. ఉదా:—మనోహరుఁడు పురుషుఁడు - మనోహరస్త్రీ - మనోహరము గృహము. మొ.

సంజీవని. ౧౨౫ II విషయ:—సంస్కృతభాషలో లింగము రెండువిధములు. (౧) 'లౌకికలింగము' (౨) 'పారిభాషికలింగము.' అనఁగా, శాస్త్రీయలింగము.

(౧) లౌకికలింగము:—పుంవ్యక్తి పుంలింగము. ఉదా:—మనుష్యుఁడు - సింహము - ఎద్దు - మొ. స్త్రీవ్యక్తి స్త్రీలింగము. ఉదా:—మానుషి - సింహి - ఆవు - మొ. తక్కినవానిని చెప్పునవి నపుంసకలింగము. ఉదా:—ఊరు - కొండ - కాయ - చెట్టు - మొ.

ఇట్టి లౌకికలింగమె తెనుఁగులోని మహత్తమహత్తులకు మూలమందురు గాని యీ రెంటికిని జాలభేదము గలదు. లౌకికపుంలింగమగు 'ఎద్దు' అనునది మహత్తుకాదు. అది యమహత్తు. లౌకికస్త్రీలింగమగు 'ఆవు' అనునది మహతి కాదు. అదియు నమహత్తుమాత్రమె.

(౨) పారిభాషికలింగము—సత్త్వైకవచనము పుంలింగము. సత్త్వగుణవాచకము స్త్రీలింగము. సత్త్వసామాన్యము నపుంసకలింగము. ఇట్టి చిహ్నములనుబట్టి ప్రాచీనతమకాలమున వ్యవహరింపఁబడిన లోకవ్యవహారముచే నేర్పడినది యీ శాస్త్రీయలింగము. ఇదె వ్యాకరణశాస్త్రప్రసిద్ధమై యున్నది. అట్టి ప్రాచీనతమ వ్యవహారమున రామేంద్రమనుష్యాదులతోపాటుగ దార - గృహ - వృక్షాదులును బుంలింగవంతములుగ లోకులచే వ్యవహరింపఁబడెను. సీతాదులతోపాటుగ దేవతా చంద్రికాలతాదులును స్త్రీలింగవంతములుగ వ్యవహరింపఁబడెను. ధనవనాదులతో పాటుగ దైవతకళత్రమిత్త్రాదులును నపుంసకలింగవంతములుగ వ్యవహరింపఁబడెను. అట్టి రామాదులకు వాచకములగుశబ్దములు పుంలింగశబ్దరూపములతోఁ బ్రసిద్ధము లయ్యెను. కొన్ని నియతలింగకములును గొన్ని త్రిలింగములును మఱికొన్ని ద్విలింగకములునునై ప్రసిద్ధములయ్యెను. విశేష్యలింగమె విశేష్యనిఘ్నవిశేషణ మునకును నగును. మనోహరుఁడు రాముఁడు, మనోహరస్త్రీ, మనోహరము వనము, నియతలింగము లిట్లు మాఱవు. బ్రాహ్మణుఁడు దానపాత్రము. సంస్కృతస్త్రీలింగ విశేష్యము మహతీవాచకము కానపుడు దానివిశేషణము సంస్కృతమున స్త్రీలింగమె కావలసియున్నను నది తత్సమరూపమునఁ దెనుఁగున వాడఁబడునపుడు వైకల్పికముగ నపుంసకలింగసదృశరూపమును బొందును. ఉదా:—మనోహరమగు లత, మనోహర యగులత. కులిశధారల్ కుంఠితంబయ్యె (ఆది. ౨ ఆ. ౮౧) (బా. తత్స. ౮౬ సూ.) (మా. విస్తర. II ౧౩౦ I విష.)

సంజీవని. ౧౨౪ III విష:—సంస్కృతసమేతరములయిన యాచ్ఛికశబ్దముల కట్టి పారిభాషికలింగవ్యవహారము లేదుగాని యందును బుంలింగసమంబులు, స్త్రీలింగ సమంబులు, నపుంసకలింగసమంబులు నని శబ్దములు మూఁడువిధములు. ప్రథమైక

వచనమున డుజ్జుతో నుండుశబ్దము పుంలింగసమము. ప్రథమైకవచనమున మువర్ణకముతో నుండుశబ్దము నపుంసకలింగసమము. "డు - ము" అను రెండిటిలోను నేదియుఁ బ్రథమైకవచనమున నిలువని శబ్దము స్త్రీలింగసమము. 'వు' అను ప్రథమైకవచనప్రత్యయము సంస్కృతసమములకుమాత్రమే నిల్చును. ఆచ్ఛికశబ్దములపై నది యెన్నఁడును నిలువదు. 'చెలువు' మున్నగువానిలోని తుది 'వు' వర్ణము శబ్దావయవమే కాని ప్రథమైకవచనప్రత్యయము కాదు. ఆచ్ఛికమందును వింతవింతవాడుకలు గలవు. కొమరుఁడు, మరుఁడు, మగఁడు మున్నగుశబ్దములతోపాటుగ "కొమ్ముకాఁడు (అడవిపంది), సాలీఁడు (సాలెపురుగు), ఇబ్బందిగాఁడు (బెబ్బులికిఁ జిఱుతపులికిఁ బుట్టినపులి), నీలఁడు (నీలాశ్వము), పులియఁడు (ఒకకుక్కపేరు), ఒకఁడు (ఒకవస్తువు). బసవఁడు (ఎద్దు) మున్నగునవియుఁ బుంలింగసమము లగుచున్నవి. తల్లి, కూఁతురు, కోడలు మున్నగువానితోపాటుగ తండ్రి, 'అన్న', బసవన, గోడ, మేడ మున్నగునవియు స్త్రీలింగసమములగుచున్నవి. సున్నము, సొన్నము, గారవము మున్నగువానితో పాటుగ సింగము మున్నగునవియు నపుంసకలింగసమము లగుచున్నవి. ఇందు విశేషణమునకు విశేష్యాకారము రానక్కఱలేదు. బల్లిదుఁడగుతండ్రి, బల్లిద మగుమేడ, మేటిమగఁడు, పెద్దవాఁడు, మున్నగురీతి నాచ్ఛికములలో స్త్రీసమము విశేష్యమగునపుడు పుల్లింగసమము విశేషణముగ నుండవచ్చును. "విశేష్య మాత్రే స్త్రీతాస్యా । ద్భేదకం తూభయాత్మక" మ్మని యథర్వణుఁడు వచించియున్నాఁడు బాల. తత్స. ౫౨ సూ. చొప్పున సంస్కృతశబ్దమునకు స్త్రీసమత్వము విధించునపుడును నిట్టి స్థితిసంభవించును. ఉదా:—మహాత్ముఁ డగుపితమొ. మహాత్పుంలింగమగు 'పుత్త్రుఁడు' అనుదానికి స్త్రీసమంబగు నాచ్ఛికమైన 'కొడుకు' శబ్దము పర్యాయము కానోపును.

సంజీవని. ౧౨౫ IV విష:—విశేష్యవిశేషణములు రెండును సంస్కృతసములె యగునపుడు విశేష్యలింగమే విశేషణములకును నగును (బాల. కార. ౧౯ సూ.) అట్లుగాక యచ్చతెలుఁగుశబ్దము విశేష్యమై దానివిశేషణము సంస్కృతసమశబ్ద మగునపుడు విశేష్యాచ్ఛికము మహద్వాచక మాయెనా విశేషణసంస్కృతసమము పుంలింగమగును. విశేష్యాచ్ఛికము మహతీవాచకమయ్యెనా విశేషణసంస్కృతసమము స్త్రీలింగమగును. విశేష్యాచ్ఛిక మమహద్వాచకమాయెనా విశేషణసంస్కృతసమశబ్దము నపుంసకలింగమగును. ఈవిషయము "వికృతౌచ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గక సర్వనామధేయాః స్యుః" అను చింతామణిసూత్రమున లక్షితమగుచున్నది.

(చూ. ౧౬౬ విష.) (విస్తర) మనోహరుఁడగుమగఁడు, మనోహర యగుపెండ్లము మనోహర మగుఇల్లు - మొ. "తే. గీ.... ఉన్మత్తవేషిణివైన లచ్చి! కరణి నిట వచ్చుచున్నది. (ఆర. ౭ ఆ. ౧౧౫) (చూ. ౧౬౬ విష.)

కల్పతరు   క్వచిదస్త్రవిశేషేతు । క్లీబేప్యుభయరూపతా । విచక్షణ
ఆథర్వణీయము.   మనోమోద ! కారిణీశబ్దకల్పనా (విక్ర. అజం. ౪ కారి.)
౧౬౬ విషయము. (అహో. ౨౮౮ పు.)

కల్పతరు. ౧౬౬ విష:—క్వచిత్ = ఒకానొకచో, అస్త్రవిశేషేతు = అస్త్రవిశేషమునందు, క్లీబేపి = నపుంసకలింగమందును, ఉభయరూపతా = ము - డుజంత రూపములు రెండును నగును. శబ్దకల్పనా = శబ్దరచన, విచక్షణ = పండితుల యొక్క, మనః = హృదయమునకు, మోదకారిణీ = ఆమోదకరమైనదై యుండును. కొన్ని నపుంసకశబ్దములకు డుజంతరూపము నైతము సహృదయామోదకర మగుటచే గ్రాహ్యమగుచున్నదని భావము. మిత్త్రుఁడు = మిత్త్రము. (స్నేహితుఁడు) ప్రధానుఁడు = ప్రధానము. (మంత్రి) మొ. 'అస్త్రవిశేషతు' అనుటచే నస్త్రీశబ్దములకే యర్థాంతరములం దస్త్రీరూపద్వయ ముండనేరదని తాత్పర్యము. మిత్త్రుఁడు = సూర్యుఁడు - సూర్యపరార్థమున దీనికి 'మిత్త్రము' అనురూపము లేదు.

బాలవ్యాకరణ   క్లీబంబులు మిత్త్రాదులు మహద్వాచకంబులు విభాషం
వివరణము.   బుంలింగతుల్యంబులగు. ౧౮.
౧౬౬ I విషయ.   మిత్రశరణప్రధానపాత్రాదులు మిత్త్రాదులు.

---

విస్తర. ౧౭౫ IV విష:—"వికృతౌచ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గకసర్వనామధేయాస్స్యుః" (ఆం. చిం.) కవిశిరోభూషణ వ్యాఖ్య—"సూత్రస్యాస్య 'సీతభర్త్తవత్సల' ఇత్యాదౌన తాత్పర్యమ్. నియత స్త్రీప్రత్యయస్తు సర్వా సామిత్యనుశాసనాత్... తద్విధానస్య అనావశ్యకత్వాత్. కిన్తు 'పంటచెలిపట్టి లోకైకభవ్యచరిత' ఇత్యాదౌ తాత్పర్యమవధార్యతే" (అహో. ౩౧౭ పు.) "సరస్వత్యాతు మిన్నేఱు శివజటావాసినీ" త్యుదాహృతమ్. తత్రన కేవలం స్త్రీసమత్వమ్. కింతు స్త్రీవాచకత్వమప్యవ్యాహతమేవేతి తద్రూపమపి సాధ్వేవ - ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు రూపం తూథయేతి సూత్రేణ సమంజసమితి జ్ఞేయమ్" (అహో. ౩౨౦ పు.) (చూ. విస్తర. II. ౧౬౧ I విష.) మిన్నేఱు=గంగ; శివజటాజూటవాసిని మిన్నేఱు గంగాదేవిగాన తద్విశేషణసంస్కృతశబ్దము "శివజటాజూటవాసిని" అని స్త్రీలింగమయ్యెను. ధరాపరాగపటలాక్రాంతము మిన్నేఱు గంగానది గాన తద్విశేషణసంస్కృతశబ్దము "ఆక్రాంతంబు" అని నపుంసకమయ్యె నని యిట్లు సమన్వయము నెఱ్ఱునది.

సంజీవని. ౧౨౬ I విష:—క్లీబంబులు = నపుంసకలింగవాచకసంస్కృత సమ శబ్దములు. మిత్రాదులాకృతిగణము. (విస్తర. I) కాన దైవ దైవత భాజనాపత్య ప్రభృతులును మిత్రాదులలోనివె యని యెఱుంగునది. సుహృదర్థకమిత్రశబ్దము, రక్షకార్థకశరణశబ్దము, సచివార్థకప్రధానశబ్దము, నర్హార్థకపాత్రశబ్దము నపుంసక లింగములు. "మిత్ర - న - (మిద్యతిస్నిహ్యతి - మిద - త్ర - మిదస్నేహే) స్నేహా స్నితే సుహృది...మి - క్షేపే - క్త్ర - సూర్యే. (శబ్దస్తో)" అనుకోశము చెప్పిన సుహృద్వాచిమిత్రశబ్దము ద్వితకారకమనుట యుక్తము. కాని హలంతరసంయోగ ముచే ద్వితకారస్ఫూర్తి సరిగా వినఁబడమింజేసి కావలయు శబ్దరత్నాకరాదికోశము లలో నేకతకారముగనే 'మిత్ర' శబ్దము చూపఁబడుచున్నది. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందును నేకతకారమిత్రశబ్దమె ముద్రితమై యున్నది.

"దైవం దిష్టం భాగధేయమ్..." అనుచెప్పిన నదృష్టార్థకమగు దైవశబ్దము మిత్రాదిగణములోఁ జేర్పఁబడనేరదు. దేవతార్థకమగు దైవశబ్దము మిత్రాదులలో గణింపఁదగును. మిత్రాదిగణగతశబ్దములు నపుంసకలింగములు మహద్వాచులు కావ లసియుండును. "దైవము...న. ౧ భాగ్యము - అదృష్టము. ౨ దేవత - వేలుపు. గీ. ఆరమాసతి రూపరేఖాతిశయము...। కాంచినప్పుడెచిత్రతఁ గాంచె సకల। దైవ దానవరాజిచిత్రంబుగాఁగ (దశా. ౨ ఆ. ౨౮౫) ...నిజాత్మదైవ। మనన్య... (సం. భాగ. ౩ - ౧ - ౩౮) (ఆత్మనః దైవం శ్రీకృష్ణమ్ వ్యాఖ్య)" (సూ. రా. ని.) క. ఏలినవానిని దైవము। నాలిని బంధులను సముచితారాధన...(ఉద్యో. ౨ ఆ. ౩౩) శా....ఇతం। డే దైవం బని...(హ. న. అవతా. ౨౨ ప.) మహద్వాచక ములగు మిత్రాదులు నపుంసకములై యుండఁగాఁ బ్రకృతసూత్రముచే వానికిఁ బుంస్త్వము పాక్షికముగా విధింపఁబడుటంజేసి, బాల. తత్స. ౨౧-౨౨ సూత్రముల చెప్పిన నుత్వడుజ్జులు రాఁగా 'మిత్త్రుఁడు' మున్నగు డుజంతరూపము లేర్పడును. పుంస్త్వాభావపక్షమున డుజ్జు రానేరదుగాన, బాల. తత్స. ౩౯ సూత్రముచెప్పిన నపుంసకలింగములగు మిత్రాదులకు మువర్ణకంబువచ్చి 'మిత్త్రము' మున్నగు మువర్ణ కాంతరూపము లేర్పడును. ఈవిషయమునే సూరి తత్స. ౩౯ సూత్రమునొద్ద

---

విస్తర. I ౧౨౬ I విష:—"మిత్రశరణపాత్రప్రధాన అను నీశబ్దంబులకు మిత్రాదులని పేరు." (బా. గు. ప్ర. ౯౭ పు. ద్వి. ము.) అను ప్రకాశికావ్యాఖ్య పొరపాటు. దైవ - దైవత - భాజనాపత్యాదులు పెక్కుమిత్రాదులలో గణింపఁదగి యున్నవి. సూరి "మిత్రశరణప్రధానపాత్రాదులు" అని యిట్లాదిశబ్దముచేదాని యాకృతిగణత్వము నుద్ఘోషించియే యున్నాఁడు.

“క్లీబంబుల మిత్రాదులను సూత్రంబునఁ బాఠీకంబుగం బుంలింగత్వం బతిదేశించు చుండెనేని మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ. మిత్రుండు - మిత్రము. శరణుండు - శరణము” అని వివరించెను. ప్రకృతసూత్రంబున “క్లీబంబులు” అను చుండెనేని సూర్యవాచకపుంలింగమిత్రశబ్దమునకు ద్వైరూప్యము లేదు. “మిత్రుండు = సూర్యుండు” అనిమాత్రమె కూడ నుండును. ప్రకృతసూత్రంబున మహాస్థాన కమును లుండెనేని గృహార్థకశరణశబ్దమునకును ద్వైరూప్యము లేదు. “శరణము = గృహము” అనిమాత్రమె యుండును. ఇట్లె పాత్రము = భోజనపాత్రము, ప్రధానము = సాంఖ్యశాస్త్రప్రసిద్ధప్రకృతి, మున్నగువానికి ద్వైరూప్యము లేదు. ఆయర్థములలో వానికి “పాత్రుండు - ప్రధానుండు” అనురూపములు లేవు. (విస్తర. II).

ప్రయోగములు—పుంసత్వరూపములకు—ఉ॥...పరాశరాత్మజాం । భోరుహామిత్రుఁ గొల్చి...(ఆది. ౧ ఆ. ౬౩ ప.) సీ॥...పాత్రు నాపస్తంబసూత్రు... (ఆది. ౧ ఆ. ౯) క॥ ఇచ్చునది ధనము పాత్రునకు...(ఆది. ౫ ఆ. ౨౦౪) మ॥... భా। ర్గవదౌహిత్రుండు పాత్రుఁడయ్యెనువు...(ఆది. ౫ ఆ. ౧౯౬) చ॥...ప్రధా। నులును బలంబు నేను సుమనోవిభు...(విరా. ౧ ఆ. ౨౦౩) ద్విపద । జనయ శంకర మహాస్థానంబునందు । నడిసన్న శరణుండు శంకరదాసి (బసవ. ౪ ఆ. ౩౭౫) (శంకరదాసి - దీని సాధుత్వము సమాసప్రకరణమునఁ జూపఁబడును) ద్విపద - నెట్టన శరణులనిలుకడ లరసి । పట్టిచూడంగ నీప్రాప్తియే చెప్పుము (బసవ. ౪ ఆ. ౨౯౮) మ॥ అవివే కాస్పదులైనపాండవులు...(సభా. ౨ ఆ. ౬౫) గీ. వీము కౌంతేయులము మఱి యెట్లు సెప్పు । మయ్య తపతి కపత్యులమైనతెఱఁగు (ఆది. ౭ ఆ. ౯౪) (విస్తర. III). ఉ॥ రాజకులైకభూషణుండు.. (ఆది. ౧ ఆ. ౩) ఆ - వె. అన్వయాభరణుఁడు. (ఆది. ౧ ఆ. ౯) కారణకారణా. (భాగవతము.)

---

విస్తర. II ౧౨౬ I విష:—మంత్రివాచకప్రధానశబ్దము నపుంసకమనుటయే సర్వసమ్మతము. “మహామాత్రాః ప్రధానాని” (అమర. క్షత్ర. ౫ శ్లో.) “ప్రధానం ప్రకృతౌ బుద్ధౌ । వృత్తమే పరమాత్మని।మహామాత్రే—ఇతి హైమః” (౧ కాం. ధీవర్గ. ౨౯ శ్లో. అమరసుధ.) “పుంలింగోపి—మహామాత్రః ప్రధానః స్యాదితిపుంస్కాండే వోపాలితాత్” (అమ. ౨ కాం. క్షత్ర. ౫ శ్లో. సుధావ్యాఖ్య.) అని యున్నను నిట్టి పుంస్త్వము సర్వసమ్మతము కామింజేసి సూరి దీనిని మిత్రాదులలోఁ జేర్చెనని యెన్నునది.

విస్తర. III ౧౨౭ I విష:—“పుంసీతికిమ్ - దశరథాపత్యము - బ్రహ్మము. తోకము - ఇత్యాదౌ మాభూత్ - నియమాభావే తనయాదిశబ్దవత్ మహత్త్వేన

నుపన్యస్తోదాహృతులు. "గీ. అధికవైరాగ్యసంపత్తి యబ్బెనేని । యతని కంపకు మిత్త్రంబు లరసిచూడ...తోడికిం బ్రాణమిత్త్రంబు ధవుఁడు...తనయబంధు కళత్త్రమిత్త్రములనెల్ల - నితి శాకుంతలే" (అహో. ౨౪౭ పు.) క....సజ్జనసంస్తుతి। పాత్త్ర మితఁడు మాద్రి తొలుత పట్టికేంద్రా (విరా. ౫ ఆ. ౩౨౬) కాని యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుఁ । బాత్త్రములు గారు...(శాంతి. ౧ ఆ. ౧౯) క. గురునకు నాకునుఁ బాండవు । లరయఁగఁ గూరిమికిఁ బాత్త్రమగుదుర గౌనన్. (ద్రోణ. ౫ ఆ. ౧౧౩) ఆ. వె. ఇంకనైన నన్ను నేల యాలింపవు । నాకు శరణ మగుము నాథ యనుచు (అర. ౨ ఆ. ౮౭) చ. చపలత మాన్చి యిట్లనుఁ బొసంగఁ బతంగకుల ప్రధానమో । నృపజయధీర...(హ. న. ౨ ఆ. ౫౦) పతంగకులప్రధానము=సూర్య వంశపుమంత్రి పత్యకీర్తి (హరిశ్చంద్రకథాపక్షము) పక్షికులశ్రేష్ఠమగుహంస (నల కథాపక్షము) ద్వి. ధరజినబౌద్ధులు దైవంబులేని (బసవ. ౬ ఆ. ౭౪౬) ఆ. వె... దైవ । తములనెల్ల నాదరమున నాకర్ణింపు (అను. ౪ ఆ. ౧౯౫) గీ....లోహజాతిఁ గాంచ । నమును జనులందు విప్రుండు సమధికత్వ । భాజనములందు...(శాంతి. ౧ ఆ. ౭౧). ౧౨౬ VIII వఱకుఁగల కారికల సూరి సంగ్రహింపలేదు.

నన్నయాథర్వ వివక్షాతః ప్రవృత్తిశ్చ । ప్రత్యయస్య క్వచిద్భవేత్
౧౨౬ II విష. (విక్ృ. అజం. ౩ కారి. అహో. ౨౪౬ పు.)

కల్పతరు. ౧౨౬ II విష:—క్వచిత్ = ఒకానొకప్పుడు - వివక్షాతః = మహత్త్వవివక్షవలన, ప్రత్యయస్య = డుజ్వర్ణకముయొక్క, ప్రవృత్తిశ్చ = ప్రాప్తియు, భవేత్ = అగును. శేషాదినాగములు, మేఘము, హిమవంతము,

---

డుజ్స్యాదేవ - అపత్యం తోకం తయోః స్సమే ఇత్యమరసింహేన అర్థద్వయేపి (పుత్త్రపుత్త్రికార్థములు రెంటను) క్లీబత్వానుశాసనాన్న డుజ్సులోపౌ. క॥ అత్యంత మధురజనకాపత్యమ్మగు కీరవాణి భావింతుమదిన్. క. నిత్యునిఁ గోసలరాజా । పత్య మ్మగు సత్యసంధుఁ బ్రణుతింతు నొగిన్. ఇతి. బహువ్రీహౌతు స్యాతామేవతౌ డుజ్సులోపౌ. మ. అరిభీమాద్భుతశౌర్యనిర్జితపులస్త్యాపత్యునిన్ నిత్యునిన్. ఇత్యాది." (అహో. ౨౪౫-౨౪౬ పు.) ఈకవిశిరోభూషణపుచర్చయెల్లఁ గేవలము ప్రామాదికమని పైసంజీవనిలోని 'అపత్యులము' అను భట్టారకప్రయోగమువలన స్పష్టపడుచున్నది. ఈ కవిశిరోభూషణము ననుసరించినపేటికయుఁ బ్రామాదికమే. (బా. సా. పే. ౧౩౨ - ౧౩౩ పు.) అపత్యశబ్దము మిత్త్రాదులలోఁ జేర్చుట కేమియుఁ బ్రతిబంధము లేదుగదా. "క్వచిదర్థవిశేషేతు । క్లీబేప్యుభయరూపతా" అనునథర్వణవచనముచొప్పున నిట "అపత్యులు" అనునది సాధు వనఁదగునుగదా.

సముద్రము, నగ్ని, ప్రాణాదివాయువులు మున్నగువానికి దేవమనుష్యాదులవంటి కామరూపములుగలవని పురాణప్రసిద్ధి గలదు. అట్టిరూపమునుబట్టి వానికి మహత్త్వమును వివక్షించుటయు సత్త్వమైన పురుషకమహత్త్వమును బుంలింగత్వమునుబట్టి తత్తద్వాచకములకు డుమంతత్వమున్నైతేను ప్రయోగింపఁబడుటయుఁ గలదు. అనఁగా వానికి డుమంతత్వము మువర్ణకాంతత్వమును ననెడి వైరూప్యము ప్రయోజ్యమగునని తాత్పర్యము. కట్టియెడల మువర్ణకాంతరూపములు నైతము వాని మహత్త్వమునకు వాచకములు కావచ్చునని యెఱుంగునది. సీ. ఘనులఁ గొండల పాలుగాఁ జేసినకొఱంతె (వసు. ౧ ఆ. ౧౦౭) సీ...విషమగోత్రుల నంటు వ్రజన మెల్ల (వసు. ౧ ఆ. ౬౨) చ॥ ఉరగులనెల్లఁ గాచిన మహోరగనాయకుఁడు (ఆది. ౧ ఆ. ౧౦౫) క॥ క్రూరాకారుల జగదపకారుల పన్నగుల (ఆది. ౨. ఆ. ౧౩౬) గీ. సకల భూతసంఘంబు పక్షస్యుఁ, బక్షి । సమితి బహుఫలవృక్షంబు, సమరు లింద్రు । న, నిశ మును నుపజీవించునట్లు (సభా. ౨ ఆ. ౭౯) చ॥ అమితపరాక్రమంబును రయంబును లావును గల్గుఖేచరో । త్తముఁడవు నీవు...విహగేంద్రుఁడు సంతసంబునన్ (ఆది. ౨ ఆ. ౫౭) చ॥ దినకరతిగ్మతేజము ప్రదీప్తహుతాశనుఁడు...జగత్త్రయముఁ దత్క్షణ మాత్ర నొనర్చునీయుగాన్ (ఆర. ౭ ఆ. ౨౭౭) ఉ॥ ప్రాజ్ఞ నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి (అను. ౫ ఆ. ౨౬౦) గీ॥... దీని । విభులుగా ముందుఁ గ్రోధుండు వని గెల్వ (అశ్వ. ౨ ఆ. ౧౫౩) వ...అందఱు విచారించి యధ్వారంభంబునకు సుముఖులుగాకయున్నఁ గద్రువ కోపోద్దీపితముఖియై క॥... ఉరగములకు శాపం బిచ్చెన్ (ఆది. ౨ ఆ. ౩౬) క॥ కడవఁబడి మున్నువహ్నిం । గడుకొని పడినవియ కాని కద్రూసుతులం । బడనీ నింక...(ఆది. ౨ అ. ౨౨౨) తే. గీ....తక్షకతనయుఁ డశ్వ । సేనుఁ డనుభుజంగమము...(ఆది. ౮ ఆ. ౨౭౩) ద్వి. గౌరియిందొకచిట్టిగణ మిట్టివాఁడు । (బసవ. ౨. ఆ. ౩౭౬) "గణ - పు -... శివానుచరే భూతే' (శబ్దస్తో).ద్వి.వ్యక్త మిక్లేఁగెడు వారా జంగమములు (బసవ.౩ఆ. ౧౦౭) (వ్యక్త మిక్లేఁ గుదుర లజంగమములు - తాటాకుప్రతి) (జంగమము = శివ భక్తుఁడు). ద్వి. అట్టిచో జంగమం బరుదెంచి యడుగ (బసవ.౭ఆ.౧౯). ద్వి కంచిలో నిత్యజంగమము లేప్రరకు (బసవ. ౭ ఆ. ౩౭౭) (జంగమములు = జంగమలింగములు = శివభక్తులు).

జనశబ్దము నపుంసకము కాకున్నను స్త్రీపురుషసాధారణవాచకమగుటచే నయ్యది డుమంతముగను మువర్ణకాంతముగను వాడఁబడుచున్నది. "జనములు" అనునది "జనులు" అనుదానికిఁ బర్యాయ మగుచున్నది. "జనము - లోకము -

"పాత్రముల్ నెత్తమాడు. నిత్యాగవాజడత్వవివక్షయైవథాతో రేకవచన ప్రయోగోఽపి సుసాధుః" (అహో. ౨౪౬ పుట.) ఇట్లు ప్రాణివర్గములందు జడత్వవివక్ష మహాకవిప్రయోగములందుఁ గన్పట్టలేదు. కాన నట్టివి సాధువులనుట సరికాదు.

భవేదమహతోఽప్యర్థ । విశేషేమహదాకృతిః ॥ (వికృ. అజం. ౫ కారి., అహో. ౨౫౫).

సహకారా  లిఙ్గభృఙ్గాదిశబ్దేభ్యో । మ్వాదిరాదుస్త్రణేతువ ॥ కేచిజ్జ
భృఙ్గశబ్దము.  నాఽవదన్త్యన్యే । ఏవారోపే తథాబ్రువన్ ॥ (వికృ.
౧౨౬ III విష.  అజం. ౧౧ కారి., అహో. ౨౫౩).

క్షేత్రనామాయామమహతః । క్వచిద్దాజపిసమ్మతః ॥ (వికృ. అజం. ౭ కారి., అహో. ౨౫౫).

కల్పతరు. ౧౨౬ III విష:—అమహతోఽపి = తిర్యగ్జడవాచకమునకు సైతము, అర్థవిశేషే = పురుషచర్య మున్నగు నర్థములవివక్షయందు, మహదాకృతిః = మహద్వాచకములరూపము, భవేత్ = కలుగును. అట్టి యమహత్పదార్థమునకుఁ గామరూపాదికము లేకున్నను నర్థవిశేషములందు మహద్వాచకరూపము కల్గునని యెఱుంగునది. ఉదా:—వాయసుఁ డోడెను, మర్కటుఁ డశోకవనమును జెక లించెను, మొ.

లిఙ్గభృంగాదిశబ్దేభ్యః = లింగ (శివలింగము) భృంగాది (తుమ్మెద) శబ్దముల కంటెఁ బరముగా, ఆదిశబ్దముచే సహకారాదుల నెన్నవలయును. ఆమన్త్రణేతు = సంబోధనమునందైనచో, మ్వాదిః = ము, మ్ము, ంబులు, న = నిలుచుటలేదు. ముపర్ణకము లోపించును. అదాగమముమాత్రమె నిల్చునని భావము. అన్యే ఏవారోపే = మహద్వస్త్వారోపమందుమాత్రమే, తథా = ఆరీతిగా, అబ్రువన్ = కవులు ప్రయోగించిరని, కేచిజ్జనాః = కొందఱు, వదన్తి = చెప్పుచున్నారు. "మహ ద్వస్త్వారోపమున 'భృంగ' 'సహకార' మున్నగు మహదాకృతి, సంబోధనమున నన్నయప్రయోగములలో వచ్చునేకాని 'సహకారమా' మున్నగునవి సాధువులు కాకపోవు" అని కొందఱు చెప్పుచున్నారని తాత్పర్యము. అట్లయినచో, "భృం గుఁడా, సహకారుఁడా," మున్నగురీతిని సైత ముండవలసివచ్చునని యథర్వణుఁడు కేచిత్పక్షముగా దానియం, దస్వారసతను జూపెనని తోఁచెడిని. కవిజనమండనటీకా కర్తయుఁ దదనుయాయి నారాయణీయతద్వివరణకర్తలు నిట "ఆమన్త్రణేతువా" 'ఆరోపేత అబ్రువన్' అనియు నహోబలపండితీయమునలేని పాఠాంతరముల నంగీక రించి మార్గాంతరమును బ్రొక్కిరి. "అన్యేః = బహువచనము, ఆరోపేతఏవ = నిత్య

ముగా సారభాగమయుక్తమే" అని యర్థముచేసిరి. బహుత్వమున 'సారభాగ ము' కాక మఱియేమివచ్చును? కేచిచ్ఛబ్దమే పాక్షికతను సంపాదింపఁగలదుకాన నిట మార్గాంతరమునకుఁ బ్రసక్తిలేదు.

అమహతః = అమహత్తులకు, శ్లేషతాయామ్ = శ్లేషత్వమున - ఇయ్యది నిందాదులకు నుపలక్షణము. క్వచిత్ = ఒకపుడు, డుఁజపి = డుజ్వర్ణకము నైతము, సమ్మతః = సమ్మతయగును. ఉదా:—అశ్వోత్తమున్ - తురగోత్తమువాలము మొ. ప్రయోగములు—క॥...ఁలసి యెగయలేక వాయసుఁడు వెగడొందెన్. (కర్ణ. ౨ ఆ. ౭౮) క॥ ఎక్కడిమర్కటుఁ డిటకును।...(భాస్క. సుందర. ౩౩౭) చ॥... వానరుం డొకం। డరుదుగ వచ్చి (భాస్క. సుంద. ౩౮౧) ఇచటి వానరుఁడు కామ రూపియగు హనుమంతుఁడే యైనను బ్రయోక్తల కట్లు తెలియదు. సీ॥ సహకార మత్ప్రియు సహకారుఁ బున్నాగ పున్నాగుఁ దిలకభూ భువనతిలకుఁ।జందన బుధహారి చందను...(ఆర. ౨ ఆ. ౯౩) (ఈపద్యమున నింకను ననేకప్రయోగము లిట్టివి గలవు. ఎందును ముర్వర్ణకప్రయోగము లేదు.) ఇందు దమయంతి వృక్షాదులను దనభర్త జాడ నడిగినట్లు వర్ణితమయ్యెను. సరమ యనుదేవశునికొడుకు సారమే యుండను కుర్కురు (కుక్క)కుమారుండు...ఆసారమేయు నడఁచిన నది యఱచుచుం బరతెంచి తమతల్లికిం జెప్పిన...క॥...నాపుత్త్రకు। నతిబాలకు ననపరాధు నడఁచిరి పెలుచన్ (ఆది. ౧ ఆ. ౮౩) సీ॥...కు, మారు లయ్యార్యులు మహితబుతువు। లు...(ఆది. ౧ ఆ. ౧౧౫) ఆక్కరు. పదపడి నిగృహీతుఁడయ్యెఁ దానొక్క పన్నగుచేత (ఆర. ౪ ఆ. ౧౦౩) శ్లేషతాద్యర్థములందలి మహదాకృతికి:—సీ. ఉల్ల లెల్లనితురగోత్తము వాలంబు (ఆది. ౨ ఆ. ౩౪) మ. అవదాతాంబుజఫేన పుంజని భమయ్యశ్వోత్తముం దవ్వులన్ (ఆది. ౨ ఆ. ౩౦) క. తురగపరీక్షావిదులగు। పురుషులఁ బిలిపించి యశ్వపుంగవుఁ గని తెం। డు (అశ్వ. ౩ ఆ. ౨౧౭) చ॥ భుజగ జాల్ముఁడు (తక్షకుఁడు) (ఆది. ౧ ఆ. ౧౨౩) కుత్సార్థమందు వైవక్షికమహత్త్వము పుంస్త్వము నుండుటంజేసి యుత్వడుజ్ఞులు వచ్చెను. ఉ. ఒప్పుగ విశ్వకర్మరచి తోజ్జ్వలబంధురసౌధనాథుపై। నప్పతగేంద్రుఁ నోలిడిగి (హరి. ఉత్తరభా. ౪ ఆ. ౨౨౭)...ఈదుష్టులాఁబోతుల్ (హరి. పూ. భా., ౬ ఆ. ౧౫౨) ఇట్టియెడల డుజ్ఞు మహత్త్వవివక్షచే వచ్చినదనరాదు. ఏతత్సూత్రవిషయములగు లక్ష్యములందును ముర్వర్ణకాంతరూపములు నైతము మహత్త్వమును బోధించుటయు, డు - ము-లు మిశ్రితముగా వాడఁబడుటయుఁ గలదు. ఉ. కాళియుఁ జుట్టలుం జెలులుఁ గాంతలుఁ బుత్త్రులు నైన దుర్దమ। వ్యాళమ్ము లెన్నియన్నియును (హరి. పూర్వభా. ౭ ఆ. ౨౬(

సీ... అందుఁగల నాగులెల్లఁ గనిపి పోడిమి | కలుగుచున్నవి (హరి. పూర్వభా. ౭ ఆ. ౨౫) తే. గీ... తక్షకతనయుఁ డశ్వ | సేనుఁ డనుభుజంగమును... (ఆది. ౮ ఆ. ౨౭౩) అశ్వమేధమునకు నర్పితంబైన యా | యశ్వరాజునిట్లు లపహరించి (ఆశ. 3 ఆ. ౬౩) ఇట 'అశ్వరాజు' అనునది 'స్వార్థప్రధానేత్యాద్యథర్వణకారికచొప్పున సిద్ధించును. (౧౭౮ I విష.)

నన్నయ — కేచిచ్చామహతశ్శబ్దా మతే కవిశిఖామణేః | పురు
భట్టీయము. — షాఖ్యాభవన్త్యత్ర ప్రయోగశ్శరణం కవేః (వికృతి.
౧౭౬ IV విష. అజంత. ౯ కారి., అహో. ౨౫౬).

కల్పతరు. ౧౭౬ IV విష:—కవిశిఖామణేః = కవిశిఖామణియను నాతని మతమున, కేచిత్ = కొన్ని, అమహతశ్శబ్దాశ్చ = అమహద్వాచకశబ్దములును, పురుషాఖ్యాః = మహద్వాచకరూపము లగుపేరులు, భవన్తి = అగుచున్నవి. అత్ర = ఈవిషయమున, కవేః ప్రయోగః = కవిప్రయోగమే, శరణమ్ = ప్రమాణమగుచున్నది. పాములు, పక్షులు, కుక్కలు మున్నగువానికి దుమంతరూపములగు నామములు వెలయుచున్నవని తాత్పర్యము. ప్రయోగములు—చ॥ తక్షకుం | డతి కుటిలస్వభావుఁడు... (ఆది. ౧ ఆ. ౧౨౧) తే. గీ... తక్షకుతనయుఁ డశ్వ | సేనుఁ డనుభుజంగమను... (ఆది. ౮ ఆ. ౨౭౩) క... కావించెద ననిన వారికి గరుడుం డనియెన్ (ఆది. ౨ ఆ. ౧౧౧) చ. పులియఁడుం బూచిగాఁ డసురపోతులరా జను మంతిగాఁడు చెం | గలువ సిపంగి భైరవుఁడు గత్తెర సంపఁగి వెండిగుండు మ | ల్లెల గుడి వాయువేగి చిటిలింగఁడు సాళ్వుఁడు వత్సనాభి యే | కలములమిత్తి గబ్బి యనఁగాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్ (మను. ౪ ఆ. ౩౨) (ఈపేరులు జాగిలములవి.)

నన్నయ — చన్ద్రశార్దూల నాగాద్యాః | పరేశ్రేష్ఠార్థగోచరాః |
భట్టీయము — ముదుజ్జన్తోఽమహత్ స్వార్థే | మహత్స్వార్థేరు
౧౭౬ V విషయము. చిర్యది. (విక్ృ. అజం. ౫ కారి., అహో. ౨౫౦ పు)

కల్పతరు. ౧౭౬ V విష:—చన్ద్ర = చంద్రశబ్దము, శార్దూల = శార్దూలశబ్దము, నాగ = నాగశబ్దము, ఆద్యాః = మొదలగుశబ్దములు, పరే = రాజాదిశబ్దములకుఁ బరమున నిల్చి, శ్రేష్ఠార్థగోచరాః = శ్రేష్ఠత్వరూపార్థమును బోధించును. అమహత్ స్వార్థే = అమహత్తగుస్వార్థమునందును, మహత్ స్వార్థే = మహత్తగు స్వార్థమందును, రుచిర్యది = ప్రయోక్త కభిరుచి కల్గునపుడు వరుసగా, ముదుజ్జన్తః = మువర్ణకాంతములును; డుజ్వర్ణ కాంతములును నగును. శ్రేష్ఠుఁడగురాజు అను నర్థము

వి. రాజసింహశబ్దములో సింహమునందలి యమహత్త్వము కవికి రుచించు నపుడు, 'రాజసింహము' అనియు, రాజునందలి మహత్త్వము రుచించునపుడు 'రాజ సింహుఁడు' అనియుఁ బ్రయోగింపఁబడునని తాత్పర్యము. "స్యురుత్తరపదే వ్యాఘ్ర । పుఙ్గవర్షభకుఞ్జరాః । సింహశార్దూలనాగాద్యాః । పుంసి శ్రేష్ఠత్వగోచరాః" (అమర. విశేష్యనిఘ్న. ౫౯ శ్లో.) అను నమరవచనమువలెనే పైయథర్వణవచనము లోని పూర్వార్థమున్నైత మేదేని కోశములోని దనుకొని కవిజనమండనకర్త యాయ ర్థచ్ఛము నథర్వణవచనముగా గ్రహింపఁడయ్యె. అట్లగుటంజేసి యాతఁడు గ్రహిం చినయుత్తరార్థముసందర్భశూన్యమయ్యెను. అథర్వణాచార్యవివక్షితార్థసిద్ధియుఁ గాదయ్యెను. ఎవ్వరికైన నథర్వణకారిక లహోబలపండితీయమునుండి లభింపవల సినదేకదా. అహోబలపతి "చన్ద్రశార్దూలనాగాద్యాః...రుచిర్యది. ఇత్యాథర్వణ మేవ వచనమ్" (అహో. ౨౫౨ పు.) అని స్పష్టముగా నుదాహరించి "ఆదిశబ్దేన సింహాదిశబ్దసంగ్రహః" అని పూర్వార్థమునకు వ్యాఖ్యయుఁ జేసియున్నాఁడు. "రాముఁడు రాజపుంగవుఁడు. రాజఋషభుఁడు. రాజసింహుఁడు. రాజసింహము. రాజహంసుఁడు. రాజహంసము." (అహో. ౨౫౧ పు.) ప్రయోగములు:—క... బాలహృదయమున నృపశా । ర్దూలు నిజాధీశు నిలిపి...(ఆర. ౨అ. ౯౩). క. బల యుతులు మనుజసింహులు । నలిఁ గృష్ణార్జునులు...(ఆది. ౮ ఆ. ౨౮౯) తరల. కడిఁదిపేరులు వీరు లిద్దఱు గర్వితుల్ గురుసింహముల్ (సభా. ౧ ఆ. ౧౯౩)తరల... ప్రకాశకీర్తుల ధీరులౕ । బురుషసింహముల న్నిజేశులఁ బూని(సభా. ౨ఆ. ౨౬౭) ఇట్లు విశేషణవిశేష్యములలో నొకటి మువర్ణకాంతమై యుండ నొకటి డుమంతమగు టయు నీవిషయమునఁ గన్పట్టుచున్నది. చ...కాం । చనరథ మెక్కి యాతఁడమ సాత్వతకుంజరుఁ డేఁగె భక్తి నాతని...(సభా. ౨ఆ. ౮౪). క. కురువృషభుఁ డశేష లోకగురుఁ బూజించెౕ (సభా. ౧ ఆ. ౧౦౩). "అమహత్త్వేతు గోనాగము-కరివృష భము - కాంతాతిలకము ఇత్యాదిరూపమూహ్యమ్" "కాంతాచంద్రుఁడు ఇతిరూపం, విశేష్యస్యామహత్త్వేపి స్వార్థే వృత్త్యావుదాహరణమ్" (అహో. ౨౫౧). 'విశేష్య స్యామహత్త్వేపి చన్ద్రాదిర్మహత్ స్వార్థే వర్తతే" (అహో ౨౫౦) 'కాంతా చంద్రము' అని యుండనేరదని భావము.

నన్నయాథర్వ. లిఙ్గభేదో భవేదిష్ట । ఆరోపే యదివా రుచిః ।
౧౨౭. VI తత్రానురఞ్జనాత్పుం సాం । డుజప్యమహతోభవేత్.
విష. (విశ్వ. అజంత. ఉకారి. అహో. ౨౫౮పు.)

కల్పతరు.౧౨౭.VI. విష—ఇందలి లింగశబ్దము మహత్త్వామహత్త్వపరమై

కాని పారిభాషికలింగము కాదు. ఆరోపవిషయవాచినః=ఆరోపితవస్తులింగమునఁ గలిగి రుచికల్గునప్పుడు, లిఙ్గభేదః = ప్రకృతవస్తులింగముకంటె భేదము, ఇష్టః=ఇష్టతమగును. తత్ర = ఆయారోపణస్థలమున, పుంసామ్=విషయభూతమహత్తులయొక్క, అనురఞ్జనాత్ = రుచి కల్గుటవలన, అమహతోఽపి = ఆరోపితము గు నమహత్తువాచకమున కున్న, ఉక్తిః = ఉక్తమైతమునచ్చును. సంప్రశాస్త్రాలాభిన్నము లగువస్తువుల యారోపణస్థలములందును, విషయవిషయులమహత్త్వామహత్త్వములు కవ్యనుమతముగఁ ప్రయోగింపఁబడునని భావము. ఆరోపితవస్తువు లమహత్తులైనను విషయనిష్ఠ మహత్త్వముచే నిట్టి దుష్టంతములు కానేరవని తాత్పర్యము. ప్రయోగములు:— క. శత్రు నృపకాలకూటము । మిత్రామృతవృష్టి బుధవిమోహితబుధ । క్షేత్రము సజ్జనసంస్తుతి । పాత్ర మితఁడు మాప్రి తోలుతపట్టి నరేంద్రా. (విరా. ౫. ఆ. ౩౭౨). చ.... నీయనుజసాగరముల్... సర్వజగంబుల నాక్రమింపవే (ఆర. ౬ఆ. ౧౫౬). "గీ. లలిత రవికంఠి ముక్తాఫలంబు రాముఁ । దలఁప...శా. నీకంఠాస్త్రిత కాలపాశము శిరోనిర్ఘాతపాతంబు ... జనకకన్యక...చంచలాలతిక. ... కలకంఠ రత్నము.... దాస మనోజ్ఞసారంగుఁడు. దాసపారిజాతుఁడు" (అహో. ౨౫౮). సీ. సహకారకమత్ప్రియు సహకారుఁ బున్నాగ పున్నాగుఁ డిలక భూభువనతిలకుఁ । జందన బుధహరిచందను (ఆర. ౨ ఆ. ౯౪).

నన్నయాభ. ప్రధానం ద్వ్యయహీనం ద్వే । అప్రధానోపసర్జనే ।
౧౭౬.VII. లలామం త్రిషు రమ్యం స్యా । న్ముఖ్యసామర్థ్యలక్ష్మసు
ఇష. (వికృ. అజంత. ౬ కారి. అహో. ౨౫౦)

కల్పతరు. ౧౭౬ VII. ఇష. ప్రధానమ్=ప్రధానశబ్దము, ద్వ్యయహీనమ్ = పుంస్త్రీలింగహీనమైనది. దాని ముఖ్యసచివార్థములు రెండిటియందును నపుంసకమె యని యర్థము. అప్రధానోపసర్జనే=అప్రధానమనఁదగు నుపసర్జనత్వమందనఁగా బహువ్రీహియందు, ద్వే = పుంస్త్వస్త్రీత్వములుగలదియునుగావచ్చును. ముఖ్యసామర్థ్యలక్ష్మసు = ముఖ్యసామర్థ్యలక్ష్మములనెడి త్రిషు = మూఁడర్థములందును, లలామమ్ = లలామశబ్దము, నపుంసకమయియే, రమ్యంస్యాత్ = కవిసమ్మతమగును. ఇట్లీరెండునపుంసకములును మిత్త్రాదులవలె ద్వైరూప్యమునందఁదగును. ఉః— రాముఁడు ప్రధానుఁడు ప్రధానము. రాముఁడు పురుషలలాముఁడు. పురుషలలామము మొ.

"రాముఁడు ప్రధాన మఖిల గీర్వాణులందు । నప్రధానంబు లందఱునరసి చూడ । ప్రధానం ద్వ్యయహీనం ద్వే । అప్రధానోపసర్జనే ఇత్యమరోక్తేః. ప్రధా

...మహామాత్రాః ప్రధానానీత్యమరోక్తేః" (అహోబల. ౨౫౦ పు). ఇందలి "ప్రధానం ద్వ్యయహీనం ద్వే । అప్రధానోపసర్జనే ఇత్యమరోక్తేః" అనునది ప్రమాదపతితము. "ఇత్యథర్వణోక్తేః" అనుచోట "అమరోక్తేః" అని పొరపడియుండును. పై ప్రధానమిత్యాదికారిక యమరమున నెచ్చటను లేదు. ప్రధానశబ్ద మమరకోశమున నాల్గుస్థలములలో నున్నది. (౧) మహామాత్రాః ప్రధానాని (అమర. ౨ కాం. క్షత్ర. ౫ శ్లో.) (౨) ప్రధానం ప్రకృతిః స్త్రియామ్ (౧ కాం. ధీవర్గ. ౨౯ శ్లో.) (౩) క్లీబే ప్రధానం ప్రముఖం । ప్రవేకానుత్తమోత్తమాః (౩ కాం. విశేష్యనిఘ్న. ౫౭ శ్లో.) (౪) ప్రధానం పరమాత్మాధీః (౩ కాం. నానార్థ. ౧౨౨ శ్లో.) ఇట్లు పొరపడుటను గ్రహింపక కవిజనమండనవ్యాఖ్యాత ప్రధానం ద్వ్యయహీన మిత్యాదికారిక యాథర్వణము కాదనుకొని వికృతివివేకమునఁ జేర్పఁడయ్యె. "ప్రధాన - న - (ప్ర - ధా - ల్యుట్.) సాంఖ్యమతసిద్ధాయాం సత్వరజస్తమోరూపత్రిగుణాత్మికాయాం ప్రకృతౌ - తత్కార్యేబుద్ధితత్త్వే - పరమాత్మని - ప్రశస్తే - సచివేచ. సేనాపత్యధ్యక్షే - పుం. శ్రేష్ఠే - త్రి" (శబ్దస్తో) ఇత్యాదులకు మూలములగు కొన్నికోశములనుఁబట్టి శ్రేష్ఠార్థమునందును సచివార్థమునందును, బుంస్త్వాదికము కల దనునభిప్రాయము చెల్లరాదని నిర్ణయించుటకై యథర్వణుఁడు పై కారిక నుపదేశించినవాఁడయ్యె నని యెఱుంగునది. ఇట్లుపదేశింపనిచో 'సీతప్రధాన' మ్మన్నగు ననిష్టరూపములు సాధువులు కావలసివచ్చునుగదా.

"లలామం త్రిషురమ్యం స్యా । న్ముఖ్యసామర్థ్యలక్ష్మసు" (అహో. ౨౫౦ పు.) అనియె కవిశిరోభూషణమున నున్నను నందలి "త్రిషు" అనుదానికి "త్రిషులింగేషు" అని యర్థమని భ్రమించి కవిజనమండనవ్యాఖ్యాత దీనిని వికృతివివేకమున నుదాహరించుటలో "త్రిషులిఙ్గేషు రమ్యః స్యాన్ముఖ్యసామర్థ్యలక్ష్మసు" అని పొరపాటుగా వ్రాసెను. శరీరమునుండి శిరస్సును దొలఁగించిన ట్లిందు లలామశబ్దమును దొలఁగించునపు డింక నీకారిక లలామశబ్దవిషయక మని యెట్లు తోఁచునని యాతఁడు తలంచెనో తెలియకున్నది. కవిజనమండనమునకు మూలమగు కవిశిరోభూషణమున నయిత మియ్యది త్రిలింగి యని ప్రమాదముగా వ్రాయఁబడెను. "రాముఁడు దేవలలాముఁడు - భూమిజకాంతాలలాము భువనములోసన్" "పక్షిలలామంబు నెక్కు బలియుం దలఁతున్." "లలామం త్రిషు రమ్యంస్యా । న్ముఖ్యసామర్థ్యలక్ష్మసు - ఇత్యుక్తేః" (అహో. ౨౫౦ పు.) "భూమిజకాంతాలలామ" అనునది యపప్రయోగము. "భూమిజకాంతాలలామము" అనియే యుండవలయును. లలామశబ్దము నిత్యనపుంసకము. లలామం పుచ్ఛపుండ్రాశ్వ । భూషాప్రాధాన్యకేతుషు" (అమర.

నానార్థ. ౧౪౩ శ్లో.) దీని సుధావ్యాఖ్యలో "ప్రధానధ్వజశృఙ్గేషు। పుణ్డ్రివాలధి లక్ష్మసు। భూషావాజి ప్రభావేషు। లలామం స్యాల్లలామచ. ఇతి రుద్రః." "పుణ్డ్రిమ్ = అశ్వాదిలలాటచిత్రమ్ - అశ్వో = వాజీ - భూషా - సామీప్యాద శ్వైశ్చైవ" అని యుదాహరింపఁబడెను. "నాంతోఽపి - యథా - కన్యాలలామక మనీయ మజస్య లిప్సోః. ఇతి రఘుః. ఇతి స్వామి ముకుటః." అని దాని టిప్పణ ములో నున్నది. ఇది 'అ' కారాంతమైనను 'న' కారాంతమైనను నిత్యనపుంసకమె కాన "రాముఁడు దేవ లలామము. భూమిజ కాంతాలలామము. పక్షిలలామము. అనురూపములు సహజముగ సిద్ధించును. మహత్త్వార మగునపుడు మిత్త్రాదులకువలెనె "రాముఁడు దేవలలాముఁడు" అను మహాంతరూపము సముచితము సిద్ధించును. 'లలామా' అను స్త్రీలింగరూపము సాధువుకాదు. కాన "భూమిజకాంతాలలామ భువనములోనన్" అనుదానికి సాధుత్వము సంపాదింపవలె నన్నచో "లలామము" అనుదానిని మిత్త్రాదులలోఁ (తత్స. ౪౮ సూ.) జేర్చి మువర్ణలోపమును సంపాదింప నగును. "పరమగుణైకాభరణను...సత్యవతికి" (ఆది. 3 ఆ. ౪౩) అనుచో గుణము లాభరణముగాఁ గలది యని బహువ్రీహి నెప్పునది. "శేరశ్శబ్దస్య ప్రయోగే దైవతశేరమగురాముఁడు ఇత్యేవ. శేరః ప్రధానే సేనాగ్ర ఇత్యభిధానోక్తేః. మజన్తత్వే తాదృశానాం నమోదకత్వమ్" (అహో. ౨౪౮ పు.). "జానకి కాంతా రత్నము - దైవరత్నము రాముఁడె... రత్నం శ్రేష్ఠేమణావపీత్యమరోక్తేః" (అహో. ౨౪౯) ఈయహోబలవ్యాఖ్య సరి యనఁదగదు. "రాజకులైకభూష ణుఁడు" (ఆది. ౧ ఆ. 3) అన్వయాభరణుఁడు (ఆది. ౧ ఆ. ౯) మున్నగువానివలె "దైవతశేరము - దైవతశేరుఁడు - దైవతరత్నము - దైవతరత్నుఁడు" అని యిట్లు మిత్త్రాదులవంటిదై ద్వైరూప్యము దీనికి సాధువె యనవగును.

కల్పతరు. ౧౨౬ VIII విష:—"మహత్సమూహార్థకశబ్దం బమహత్కార్య యుక్తంబయ్యుఁ దద్విశేషణక్రియలు మహత్కార్యయోగ్యంబులు విభాషనగు" (ప్రౌఢ. శబ్ద. ౧౭) ఉ. క...గీర్వాణగణంబు కాలకేయులతోడన్। గర్వించి రణము చేసి ర। ఖర్వపరాక్రములు కడిమిఁ గడునుద్ధతులై. (ఆర. 3 ఆ. ౪౧) ఇట్లు ప్రౌఢవ్యాకరణమునఁ గవిసమ్మతవిషయము సంగ్రహింపఁబడెను. విశేషణక్రియలలోఁ గ్రియ యమహత్కార్యఘటిత మగుచుండఁగా విశేషణములు మహత్కార్యఘటిత మగుటయుఁ గలదు. ఉ. నీవు ధరిత్రిఁబుట్టుటయు నీకు సహాయముసేయఁగోరి నా। నావిధదైత్యదానవగణంబులు రాజకులంబులందు స। ద్భావన నుద్భవించెఁ బటు బాహులు దివ్యమహాస్త్రకోవిదుల్। ద్రావితవైరు లుర్వి భగదత్తపురస్సరు లైన

[illegible]. (ఆర. ౬ ఆ. ౭౫) జనశబ్దము సమూహార్థకమువంటిదె కాన దత్ప్రయోగమునందును నైకరీతి గన్పట్టుచున్నది. క. అని యక్కౌరవసైన్యము । జనములు సంప్రీతి...నిద్రవోందె ధరణీనాథా (ద్రోణ. ౪ ఆ. ౨౮౧).

జిత్తు బిందుపూర్వంబగు. ౧౯.

బాలవ్యాకరణ వివరణము. ౧౨౮ విషయము.

జకార మిత్తుగాఁగలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమై ప్రయోగించునపుడు మానంబడువర్ణ మిత్తనాఁబడు. ఉదాహరణము మీఁద స్పష్టమగు.

సంజీవని. ౧౨౮ విష:—“ఇత్” అనునది యొకసంజ్ఞాశబ్దము. ఏదేని వ్యాకరణకార్యమును సూచించుటకై ప్రత్యయాదులం దొకస్వరముగాని వ్యంజనముగాని స్వరవిశిష్టవ్యంజనముగాని వ్యాకరణకర్తచేఁ జేర్పఁబడును. అట్లు చేర్పఁబడిన వర్ణముగాని వర్ణసంఘాతముగాని ‘ఇత్’ అనుసంజ్ఞగలది యగును. అట్టి యిత్తు వక్తచేనుద్దేశింపఁబడినకార్యమును సూచించి లోపింపఁగా మిగిలినప్రత్యయాదికమే ప్రకృత్యాదులను జేరును. దేనికి జకార మిత్తుగా నిల్పఁబడునో యది బిందుపూర్వకమగునని ప్రకృతసూత్రమున కర్థము. ప్రథమైకవచనమున డుజ్వర్ణకము సూరిచే విధింపఁబడును. అట్టియెడల నది బిందుపూర్వకమగును. అనిర్దిష్టముగా బిందుమాత్రము విధింపఁబడుటచే హ్రస్వముమీఁద ఖండపూర్ణములు రెండును నిల్చును. దీర్ఘముమీఁద ఖండబిందుమాత్రము నిల్చును. (చూ. బాల. సంజ్ఞా. ౧౪ - ౧౫ సూ.) ఇద్వర్ణలక్షణములు పాణినీయమునందును జిత్త్వఫలము ప్రాకృతవ్యాకరణములందును జెప్పఁబడియున్నను నవి సూరిప్రక్రియలో నుపచరింపకుండుటంజేసి యావిషయమును గ్రహింపక యుపేక్షించి (విస్త. I, II) సంస్కృతవ్యాకరణాంతరముల పద్ధతి ననుసరించి (విష. ౧౩౫ III) సూరి యిటఁ బైరీతినిఁ బ్రత్యేకముగా వానినుపదేశించినవాఁ డయ్యెను. “ఇత్ కృతే = (వృత్తి) కస్మైచిత్ కార్యాయోచ్చార్యమాణోవర్ణ ఇత్ సంజ్ఞఃస్యాత్. తస్యలోపః = తస్యేతోలోపః స్యాత్ (ముగ్ధ. సంజ్ఞా. ౨ - 3 సూ.). ఈ వోపదేవునిపద్ధతినే సూరి నూతనమార్గమునుఁ ద్రొక్కికొనెను.

---

విస్తర. I ౧౨౮ విష:—ఇట్లె స్థలాంతరములందును సూరి యిద్వర్ణములను వానిఫలములను బాణినీయపద్ధతికి విలక్షణముగా నుపదేశించుచువచ్చెను. “జిత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు” (బా. క్రియా. ౨౦ సూ.) ఇట్టి సూరిగారి జాగ్రత్తను గ్రహింపఁజాలక గుప్తార్థప్రకాశికాకర్త యీక్రిందిరీతి నతిప్రసంగము చేసెను. “ఇయ్యది సూరిగారి పాణినీయవ్యాకరణమందలి శ్రుతపాండిత్యమును

జాటుచుండు. 'సుజీ - మిజీ' యని యుచ్చరింపఁబడునేని 'జీ' అనుసముదాయము నను నేసూత్రంబున నిత్సంజ్ఞగలుగునో తెలియకున్నది." (బా. గు. ప్ర., ప్రకీర్ణ. ౫౨౫ పుట. ద్వి. ము.) ప్రకృతసూత్రములోని యుద్వర్ణవివరణముచొప్పున వర్ణ సంఘాత మిత్సంజ్ఞ గలదగుటలోఁ బ్రతిబంధ మేమో తెలియకున్నది. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రులవారు తనవలెనె సంస్కృతవ్యాకరణంబు బాగుగఁ దెలిసినవారగుటం జేసి పాణినీయవిరుద్ధముగ 'జీ' అనువర్ణసంఘాతమున కిత్త్వము నంగీకరింపక 'సుజీ, మిజీ' యున్నగుచోటులందరు 'సుజ్ - మిజ్' అని జిత్తులుగనే వానినైత నుపదేశించి రనియు నట్టియెడలఁ బ్రక్రియకుభంగములేకుండ 'అత్రజిత్యదుతోభవే' త్తని (హరికా. క్రి. 7 కా.) సూత్రించికొనిరనియు 'అత్ర = ధాత్వధికారే జీతిపరే ఉత అద్భవే దిత్యర్థః' అని యాసూత్రమున కర్థమగుటంజేసి ధాత్వధికారమందలి సూత్రములలోని జిత్త్వ ముకారమున కకారమగునని సూచించుననియుఁ దక్కిన చోటులందలి జిత్త్వము బిందుపూర్వకత్త్వమును సూచించుననియు గుప్తార్థప్రకాశికాకర్త చర్చించెను. (బా. గు. ప్ర. ప్రకీర్ణ. ౫౨౫. పు. ద్వి. ము.) ఈకృష్ణమూర్తిశాస్త్రిగారిమార్పు కేవలము ప్రామాదికమై యున్నది. ధాత్వధికారము లోనివేయగు "డుబ్రువురుచు ముజ్స్యాత్" (హరి. క్రియా. ౭ శ్లో.) లోడ్మధ్య పురోవ్యవధుజా (హరి. క్రియా. ౨౯ కా.) అనుసూత్రములందలి జిత్త్వమునకు ఫలము బిందుపూర్వకత్వమునె సూచించు ననకతీరదుగదా. ఇట్లు సూరిరచనను సంస్కరింపఁబోయి ప్రమాదపడుట బాలవ్యాకరణమె మూలగ్రంథమనుటను వెల్లడించుచున్నది.

విస్తర. II ౧౨౭ విష:—చింతామణికర్తయు "మహతస్సోర్డుబనితో భవేత్పుంసి" మున్నగుసూత్రములలో జిత్త్వమును వాడియు దానిఫలము నుపదేశించి యుండలేదు. అట్లయినను బ్రయోగముల బట్టి యట్టిజిత్త్వమునకు బిందుపూర్వకత్వము ఫలమని వ్యాఖ్యచేసికొననగునని యాతఁడు తలఁచియుండును. బాలసరస్వత్యహోబలపండితు లిట్లు వ్యాఖ్య చేయక యీక్రిందిరీతి నపమార్గమున వ్యాఖ్యచేసిరి. అనుక్తన్యాయమున, సానునాసికోచ్చారణం జిత్ అనెడి ప్రాకృతవ్యాకరణసూత్రము ననుసరించి సానునాసికత్వము జిత్త్వఫలమనుచు డువర్ణకము ఖండబిందుపూర్వకమగు నని వ్రాసిరి. "జకార మిత్తయ్యెను. సానునాసి కోచ్చారణం జిత్ - అను ప్రాకృత సూత్రముచేత దాఁపల నర్థబిందుయుక్తమౌను" (బాలసర. అజంత. 3 కారి. వ్యా. పరిష్కృద్రణము.) "అనుక్తమన్యశబ్దానుశాసనవదితి న్యాయేన సానునాసికోచ్చారణం జిత్ ఇతిసూత్రేణ సానునాసికత్వే రాముఁడు. హ్రస్వాత్ పరత్వాత్ - రాముండు.

బాలవ్యాకరణ డుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది డుమంతం బనం
వివరణము. బడు. ౨౦.
౧౨౭ విషయము, స్పష్టము.

సంజీవని. ౧౨౭ విష:—ప్రథమైకవచనమున 'డుజ్' ప్రత్యయము నిల్చు శబ్దము డుమంతం బనఁబడును. ప్రథమైకవచనమునందలి 'డుజ్' ప్రత్యయమునకు లోపంబు గల్గుశబ్దమునకు "డుమంతత్వ" సంజ్ఞ చెల్లదు. గ్లౌను, గ్లోను, వృద్ధును మొ. ఇట్టివానికి డుమంతములకు రాఁదగిన నిగాగమాదులు (బా. తత్స. ౨3 సూ.) రానేరవు. వృద్ధాదులకుఁ బాక్షికముగ డుజ్జు నిల్చునుగాన నట్టివానికిఁ బాక్షిక నిగాగమమువచ్చును. వృద్ధుఁడు - వృద్ధునిన్, మొ. ప్రకృతి యనఁగాఁ బ్రత్యయము నిల్వఁదగినశబ్దము. ప్రకృతులు రెండువిధములు:—౧. ధాతువులు ౨. ప్రాతిపదికములు. ఉదా:—చదువు, చేయు, వండు, పెట్టు, మున్నగునవి యాచ్ఛికధాతువులు. రక్షించు, పోషించు, ధరించు, జయించు, మున్నగునవి సంస్కృతమునుండి వచ్చినధాతువులు. వీనినిఁ దత్సమధాతువు లనఁదగును. చదువుట, వంట, వంటకము, చేయి మున్నగునవి యాచ్ఛిక ప్రాతిపదికములు. రామ, హరి, గురు, కర్తవ్య, కరణీయ, కార్య, కరణ, గుణవంతమ్, బుద్ధిమంతమ్ మున్నగునవి తత్సమప్రాతిపదికములు. ధాతువులపై "డుజ్, రు, వు, రు, ను, ముఞ్" మున్నగు క్రియాప్రత్యయము లనఁగాఁ డిజ్ ప్రత్యయములు నిల్చుటచేఁ డిజంతములగు సమాపకక్రియ లేర్పడును. ఉదా:—చదువుచున్నాఁడు, చదువుచున్నారు, రక్షించుచున్నాఁడు, రక్షించుచున్నారు, మొ. ప్రాతిపదికములపై డు, ము, వు, లు,

---

ఇతి రూపద్వయమ్" (అహో. ౨౮౮ పు.) ఈవ్యాఖ్యలును వీని ననుసరించిన నారాయణీయతద్వివరణములును (నారా. గాణ. తత్స. ౭౯ సూ.) ప్రామాదికములు. 'సానునాసికోచ్చారణం జిత్' అనుసూత్రముచే వచ్చుసానునాసికత్వము జిత్తగు ప్రత్యయములోని స్వరమునకె విధింపఁబడుచున్నది. కాననె "హిమ్, హిఞ్, హిభిసః" అనుచోప్పునవచ్చు భిస్సున కాదేశమగు 'హిఞ్' అనుదానిలోని హాకారము మీఁది 'ఇ' కారమె సానునాసిక మగునట్లుగ నుదాహరింపఁబడెను. 'రామేహిఁ' (షడ్భా.). ఈవిధమునఁ బ్రకృత డుప్రత్యయములోని డకారముమీఁది 'ఉకారమునకు' పరముగ నరసున్న యానునాసిక్యమువంటిది నిల్చునుగాని డువర్ణకమునకుఁ బూర్వమున నిలువనేరదు (చూ. వై. పా. 3౧౧ - 3౧౨ విష.) ఇట్టిప్రక్రియ సరిపడమింజేసియే సూరి వేఱురీతిని స్వయముగా 'జిత్తుబిందుపూర్వాకంబగు' అని ప్రత్యేకముగా సూత్రించికొనెను,

మున్నగు నామవిభక్తిప్రత్యయములు—సుబ్విభక్తులు—నిల్చుటచే సుబంతరూపము లేర్పడును. ఉదా:—రాముఁడు, రాములు, రామునిన్ మొ. ధాతువులపైఁ గృత్ప్రత్యయములు నిల్చుటచేఁ గృదంతప్రాతిపదికము లేర్పడును. కృత్ప్రత్యయములు ముందు వివరింపఁబడును. (బా. కృదంత. ౧-౨౭ సూ.). ప్రాతిపదికములపైని తద్ధితప్రత్యయములు నిల్చుటచేతఁ దద్ధితాంతప్రాతిపదికము లేర్పడును. తద్ధితప్రత్యయములు ముందు వివరింపఁబడును. (బా. తద్ధి. ౧ మొ. ౨౫ సూ.) తల్లి-తండ్రి మున్నగునవి యవ్యుత్పన్నములగు నాచ్ఛికప్రాతిపదికములు. ఇట్టి యాచ్ఛికము లగు, కృదంతతద్ధితాంతావ్యుత్పన్నప్రాతిపదికములపైని సంస్కృతమునుండివచ్చిన తత్సమప్రాతిపదికములపైని సుబ్విభక్తులు నిల్చును. సంస్కృతమునుండివచ్చిన "రక్షించు పోషించు" మున్నగు తత్సమధాతువులమీఁదను, వండు, చదువు, పోవు మున్నగు నాచ్ఛికధాతువులమీఁదను 'తి' జ్విభక్తులు నిల్చును. ప్రకృతులపైని ప్రత్యయముచేరునపుడు చేరువర్ణము లాగమము లనిపించుకొనును. ప్రకృతిప్రత్యయములలోని వర్ణములను ద్రోసి వానిచో నిల్చువర్ణము లాదేశము లనిపించుకొనును. "వర్ణవృద్ధిరాగమః - మిత్రవదాగమః - శత్రువదాదేశః" అని వైయాకరణులు చెప్పుదురు. "అపదం న ప్రయుఞ్జీత" అనునియమముచొప్పునఁ బ్రకృతులపై ననఁగా ధాతువులమీఁదఁ దిజ్విభక్తులును బ్రాతిపదికములమీఁద సుబ్విభక్తులును నిల్చి వానికి వాక్యప్రయోగయోగ్యమగు పదత్వపదవిని గల్గించును. అట్టి సుబ్విభక్తులయోగమునందలి విధు లింకఁ దెలుపఁబడును.

నన్నయాథ. మహతోఽత ఉద్విభక్తౌ

౧౨౯ విషయము. (ఆం. చిం. అజంత. 3 కా., అహో. ౨౪౪ పు.)

కల్పతరు. ౧౨౯ విష:—ఉత్తరసూత్రమునుండి 'పుంసి' అనుదాని నిందధ్యాహారము చేయునది. విభక్తౌ = విభక్తిపరమగుచుండఁగా, పుంసి = పుల్లింగమునందు, మహతః = మహద్వాచకశబ్దముయొక్క తుదినున్న, అతః = హ్రస్వాకారమునకు, ఉత్ = హ్రస్వమగు 'ఉకారము' ఆదేశమగును. ఉదా:—రామ - రాము, కృష్ణ - కృష్ణు, మొ. రామ మున్నగు మహత్పుంలింగసంస్కృతప్రాతిపదికములు తెల్గున నుదంతములగుచు విభక్తుల నందునని తాత్పర్యము. (ఉదా:—రామ+డుజ్ రాముఁడు.)

బాలవ్యాకరణ వివరణము. ౧౨౯ I వివరణము.

పుంలింగంబై మహద్వాచకంబైన నామంబు తుది
యత్వంబున కుత్వంబగు. ౨౧.
నామం బనఁగాఁ బ్రాతిపదికంబు. డిత్థ - రామ - భార్గవ -
రాజపురుష - ఇట్టివి ప్రాతిపదికములు. డిత్థు - రాము -
భార్గవు - రాజపురుషు.

సంజీవని. ౧౨౯ I విష:—“ప్రాతిపదికం హి నామ” అనుచింతామణి ననుసరించి “నామం బనఁగాఁ బ్రాతిపదికంబు.” అని వివరించెను. “౧౭౮ సూ అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్(౧-౨-౪౫) (వృత్తి) ధాతుం ప్రత్యయం, ప్రత్యయాన్తం చ వర్జయిత్వా అర్థవచ్ఛబ్దరూపం ప్రాతిపదికసంజ్ఞం స్యాత్. ౧౭౯ కృత్తద్ధితసమాసాశ్చ (౧-౨-౪౬) (వృత్తి) కృత్తద్ధితాన్తా సమాసాశ్చ ప్రాతిపదికసంజ్ఞాః స్యుః...” (సి. కౌ. ౧౧౦ - ౧౧౧ పు.) అని సంస్కృతవ్యాకరణమునఁ బ్రాతిపదికలక్షణ ముపదేశింపఁబడెను. ‘డిత్థ’ - ఇది సంజ్ఞావాచకోదాహృతి. ‘రామ’ - ఇది కృదంతోదాహృతి. ‘భార్గవ’ ఇది తద్ధితాంతోదాహృతి. ‘రాజపురుష’ ఇది సమాసోదాహృతి. (విస్తర.) పారిభాషికపుంస్త్వమహత్త్వములు రెండునుగలవాని తుది ‘అకారము’ మాత్రమే ప్రకృతసూత్రముచే ‘ఉకార’ మగును. “వృక్ష” ఇది పుంలింగవాచకమైనను మహద్వాచికాదుగాన “వృక్షు” అను ననిష్టరూపము కల్గనే

---

విస్తర. ౧౨౯ I విష:—“నామ - న...నమతి ఆఖ్యాతార్థం ప్రతి విశేషణీభవతీతి వ్యుత్పత్త్యా స్వాది విభక్త్యర్హే శబ్దే. యథా - ఉణాద్యన్తం కృదన్తఞ్చ | తద్ధితాన్తం సమాసజమ్ | శబ్దానుకరణం చైవ | నామ పఞ్చవిధం స్మృతమ్॥” (శబ్దా. చిం.) అనుచెప్పఁబడిన కృత్తద్ధితసమాసములేకాక యనుకరణశబ్దములైతము నామమనఁగాఁ బ్రాతిపదిక మనిపించుకొనును. శాకటాయనోపదిష్టములగు నుణాదులును గృత్తులలో నంతర్భూతములె.

“ధాతువుకానిది ప్రత్యయముకానిది ప్రత్యయముచేరనిది అర్థముకలదియగు శబ్దస్వరూపము ప్రాతిపదికము” (ఆం. భా. అ. సంజ్ఞా. ౪౬సూ. ౧౪ పు. తృ-ము.) అనిమాత్రమె ప్రాతిపదికలక్షణము ననుశాసనకర్త వచించుట సరికాదు. ఈ పక్షమునఁ గృదంత తద్ధితాంతములకుఁ బ్రాతిపదికత్వము లేక పోవలసివచ్చును. ఇట్టి లక్షణమునకు గ్రంథకర్త యుదాహరించిన ‘రామ - గురు - వన’ మున్నగునవి లక్ష్యములు కానేరవు. ఇవి కృత్ ప్రత్యయాంతరూపములు. ‘రామ - రమ్ - కర్తరిఘఞ్ ణవా’. - ‘గురు - గిరత్యజ్ఞానం, గృణాత్యుపదిశతి వా ధర్మమ్ - గ్రాఖు - ఉచ్చ’. (శబ్దస్తోమ) ‘వన - వనతి - వనసంభక్తౌ (ధ్వా. ప. సే.) పచాద్యచ్

పదు. 'దేవతా' = (దేవ) తత్స. ౪౮ సూత్రముచేఁ బ్రాప్తమునఁ గా 'దేవత' అగును. ఇది మహద్వాచకమైనను బారిభాషికపుంలింగవాచకము కాకుండుటచే 'దేవతుఁ' అను నసిష్టరూపము నందనేరదు. 'హాహా' = ఒకగంధర్వుఁడు. ఇది బా. తత్స. ౪౭ సూత్రముచేఁ బొప్పున 'హాహా' అని యగును. ఇది మహద్వాచి పుంలింగము నగుటఁ గాన 'హాహూ' అనురూపమునందును. ఇట్లె విశ్వపా (విశ్వము ను బాలించువాఁడు) = విశ్వప = విశ్వపు మొ. విభక్తి పరకత్వన 'స' వర్ణకము నిషేధించుటఁ గాన నిట 'విభక్తౌ' అను మూలము నుపేక్షించెను.

వ్యాఖ్యా. మహతః స్వోక్షజనితో భవేత్పుంసి (ఆం. చిం. అజం. ౧౩౦ విషయము. ౬ కారి., అహో. ౨౮౮ పు.)

కల్పతరు. ౧౩౦ విష:—పుంసి = పుంలింగమునందు - అనితః = హ్రస్వో కారాన్తముకాని, మహతః = మహద్వాచకమునకుఁ బరమగు, సోః = సుప్రత్యయ స్థానమున, డుజ్ = డుజాదేశము, భవేత్ = అగును, రామ + సు = రాము + సు = రాము + డుజ్ = రాముఁడు - రాముండు. మొ. జిత్త్వముచే డువర్ణకము బిందు పూర్వకమగునని వ్యాఖ్య చేయనగును. ఈవిషయమును జింతామణికర్త యెచ్చ టను జెప్పలేదు. కాని పెక్కుచోటుల నిట్లు బిందుపూర్వకత్వఫలకమగు జిత్త్వ మును వాడెను. "స్వాస్తా న్నామ్నః కుజ్ నో ర్బహువచనే" (ఆం. చిం. అజం. ౧౭ కారి.) (౨౦౪ విష.) "వ్యతిరేకార్థే ల్పటిలటిడుజ్ స్యాత్" (ఆం. చిం. క్రియా. ౭ కారి.) "కేషాంచిత్ ర్వ స్తశబ్దానాం|తథా డుజ్ వ్యారురా స్మృతా" (౧౯౩ విష.) (వికృ. అజం. ౪౩ కారి.) "సానునాసికోచ్చారణంజిత్" అను ప్రాకృతసంప్రదాయ మిచట నుపచరింపదు (విస్తర. II ౧౨౭ విష.)

పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు. ౨౨.

బాలవ్యాకరణ వివృతి. ౧౩౦ I విషయము. — ఇచట డుజ్జనుదానియందు జకార మిత్తు గావున "జిత్తు బిందుపూర్వంబగు" (తత్స. ౧౯ సూ.) అనుసూత్రముచే డువర్ణమునకు ముందు సున్నవచ్చును బిమ్మట

(౩ ౧-౧౩౮)'. (అమర సుధావ్యాఖ్య. ౧౮౪ పుట. వనౌషధి. ౧ శ్లో.) ఈ సూత్రముచే విధింపఁబడిన యుత్త్వమును గొందఱు నిరాధారముగా ముద్రణము లలో మానుచున్నారు. "నాకఁ డోకయేలినవాఁడని (నన్ని. కు. ౮ ఆ. ౮౧౮) ఇంద్రుఁడు నీవు దక్కఁ జే (నన్ని. కు. ౮ ఆ. ౮౧౮) గరుడుఁడు (ఆది. ౨ ఆ. ౭౨ వావిళ్లవారిముద్రణము.) "రంగుఁడు వై. వి." (శ. ర.) ఇట్టిది తద్భవముగా నంగీ కరింపఁబడినది.

ఉకారము లోపించును. ఉ. సిద్ధుఁడు - సిద్ధుండు -
రాముఁడు - రాముండు - భార్గవుఁడు - భార్గవుండు.

సంజీవని. ౧౩౦ I విష:—పూర్వసూత్రమునందువలెనే పారిభాషికపుంస్త్వ మహత్త్వములు రెండునుగల (విస్తరము I-II) ప్రాతిపదికములకె (విస్తర III.) ప్రథమైకవచన'డుఞ్'వర్ణకమువచ్చునని యర్థమునెన్నునది. పూర్వసూత్రముచే నుత్వ

విస్తర. I ౧౩౦ I విష:—పారిభాషికలింగమునకుఁ దెలుఁగునఁ బ్రసక్తి లేకుండఁ బ్రక్రియను నడపించుట కనుశాసనకర్త యత్నించెను. అక్కారణమున సంస్కృతవైయాకరణులెల్ల వ్యాకరణశాస్త్రపద్ధతిలో నుపయోగింపక యుపేక్షించిన లౌకికలింగమును దత్సమశబ్దవిషయమునందును నుపయోగింపఁజూచుచు నీక్రిందిరీతిని సూత్రించెను. "ప్రథమైకవచనమునందు డుప్రత్యయము కనఁబడునట్టి తత్సమాచ్ఛికనామములు 'డుమంతము' లనఁబడును". "మహద్వాచకములైన డుమంతములైన నామములకును కయిరాదులకును ప్రథమైకవచనమున 'డు' ప్రత్యయము వచ్చును." (ఆం. భా. అ. శబ్దప్ర. ౧-౪ సూ.) రాముఁడు మున్నగు తత్సమశబ్దములను సాధించుటలో నుపదేశింపఁబడిన యీసూత్రద్వయమునకు "ప్రథమైకవచనమున డుప్రత్యయము కనఁబడుశబ్దములకుఁ బ్రథమైకవచనమున డుప్రత్యయము వచ్చును" అను ఫలితార్థము తేలినది. డుప్రత్యయము వేనికి వచ్చునో తెలిసినపైని వానికి డుప్రత్యయము వచ్చునని యీసూత్రద్వయము తెల్పుచున్నది. ఇంక డుప్రత్యయము వేనికివచ్చునో తెలియుటకై మొదటిసూత్రపువివరణములో "అకారాంతములు మహద్వాచకములైన రామ - కృష్ణ - శివ - ధీర - సుందర - భార్గవ - రాజపురుష మొదలైనవి డుమంతముల"ని చూపెను. రామాదిశబ్దములకు డుప్రత్యయమువచ్చుననియు, రామాదిగణ మాకృతిగణమనియు వివరించినట్లు తేలినది. ఇట్లాకృతిగణపద్ధతి నవలంబించునపు డింక నకారాంతములు మహద్వాచకములు మున్నగుదళములతో సూత్రించుట నిష్ప్రయోజనమగుచున్నది. సూరిపద్ధతిచొప్పున మహత్పుంలింగములకు డుజ్ఞగునని స్పష్టముగాఁ దెలియుచుండఁగాఁ బ్రయోగములనుఁబట్టి డుజ్ఞు వచ్చు రామాదిశబ్దములను దెలిసికొనవలెనని యనుశాసనమువలనఁ దెలియవలసివచ్చుచున్నది. మఱియు మహత్త్వామహత్త్వములనుఁబట్టియే యంతటను రూపసాధనప్రక్రియ యనుశాసనమున నడపఁబడుటచేతనందు లౌకికలింగప్రసంగము సైతము తుదికి నిరుపయుక్తమే యగుచున్నది. పయిరీతినిఁ బారిభాషికలింగము నుపేక్షించియుఁ బారిభాషికస్త్రీలింగకార్యము లీక్రిందిరీతి నుపదేశించెను. రమాది పారిభాషికస్త్రీలింగవాచకముల ప్రథమైకవచనమునకు

లోపవిధానముగాని యట్టి రూపముల యుదాహృతులుగాని యనుశాసనమునఁ గన్పట్టవు. స్త్రీలింగ ప్రథమైకవచన లోపవిధానము లేమింజేసి, రమ - లత - మున్నగు నదంతాదుహృత్తులకు మువర్ణము దుర్వారమగుచునుగదా. (ఆం. భా. అ. శబ్ద. ౧౮ సూ.) ఇట్లు పారిభాషికస్త్రీలింగశబ్దముల ప్రథమైకవచనరూపమునైన సాధింపకయే పెక్కుచోట్ల స్త్రీసమత్వాతిదేశము చేయఁబడెను. (ఆం. భా. అ. శబ్ద. ౨౨-౨౪-౨౧-౮౯-౯౬-౯౭-౯౯-౧౦౦ మొ.) "ప్రథమైకవచనమున డు - ము - వు ప్రత్యయములలో నేదియుఁ గనఁబడనిశబ్దములు స్త్రీసమములు". "స్త్రీసమములనుటచే నట్టివానికి స్త్రీలింగశబ్దములకు నలెనె వ్యాకరణకార్యములగుననియు కొన్ని పుంలింగములై అకారాంతములుగఁ గనఁబడుచున్నను వానికి ఉత్వ డుప్రత్యయాదులు రావనియు గ్రహించునది" (ఆం. భా. అ. శబ్దప్ర. ౨ సూ.) స్త్రీలింగ కార్యము చెప్పకయే యట్టి స్త్రీలింగ కార్యాతిదేశము చేయుటలో నభిప్రాయమేమో తెలియకున్నది. కొన్నిపారిభాషిక స్త్రీలింగశబ్దము లనుశాసనమున స్త్రీసమములుగఁ బెక్కుచోట్ల వ్యవహరింపఁబడెను. "తత్సమాచ్ఛికములు రెంటను స్త్రీసమములు గలవు. ఉదా:—వేధ - ఇందిర - విద్య - హరి - రమణి - మతి - విశ్వకర్మ - ఆత్మ - మహిమ - దూత - సంపద - వాక్కు - రై - గ్లౌ - మొ. తత్స. అయ్య - అమ్మ - తల్లి - మేడ - గడి - కన్నె - గోనె - నీరు - ఏఱు మొ. ఆచ్ఛి" (ఆం. భా. అ. శబ్ద. ౯౪ సూ.) ఇందిరాదిశబ్దములు స్త్రీలింగములేకదా! వీనికి స్త్రీత్వాతిదేశ మేల?

విస్తర. II ౧౩౦ I విష:—అనుశాసనకర్త పారిభాషికలింగము నీక్రింది రీతిని విమర్శించెను. "సంస్కృతమున లింగము తఱుచుగా నర్థాశ్రయముగాదు..." "సంస్కృతశబ్దములలింగము లీవిధముగా నర్థము నాశ్రయింపక తాఱుమాఱయి కనఁబడుటచేతనే మహాభాష్యకారులు 'లిఙ్గమశిష్యం లోకాశ్రయత్వాల్లిఙ్గస్య' = లౌకికశబ్దజాలము నాశ్రయించియుండుటవలన లింగము శాసింపఁదగినది కాదనిరి." (ఆం. భా. అ. నామప్ర. ౧౪ సూ.) ఈవిషయములు పాణినీయసిద్ధాంతసమ్మతములు కావు. "స్తనకేశవతీస్త్రీస్యా ల్లోమశః పురుషః స్మృతః । ఉభయోరన్తరం యచ్చ । తదభావే నపుంసకమ్ ॥ ఇతి లక్షణలక్షితమ్ అవయవసంస్థానవిశేషాత్మకం లౌకికం స్త్రీపుంసయో ర్లిఙ్గమ్. తదభావే - తయోరుభయో రభావేసతి యదుభయోరన్తరం సదృశం తన్నపుంసకమిత్యర్థః. తదిదం లౌకికం లిఙ్గమస్మిన్ శాస్త్రే నోపయుజ్యతే. తస్యాఽచేతనే ఖట్వా మాలాదౌ బాధాత్ స్త్రీప్రత్యయానాపత్తేః, దారానిత్యాదౌ 'తస్మాచ్ఛసోనఃపుంసీ'తి నత్వాఽనాపత్తేశ్చ. కింతు సత్వరజస్తమసాం ప్రాకృత

మువచ్చినపుడప డుజ్జు చేయఁగా 'రాముండు, రాముఁడు' మున్నగురూపములు సిద్ధించును. 'జేత్తు బిందుపూర్వంబగు'' (బా. తత్స. ౧౯ సూ.) అనుసూత్రమున ఖండ

---

గుణానాం వృద్ధిః పుంస్త్వమ్. అపచయః స్త్రీత్వమ్. స్థితిమాత్రం నపుంసకత్వమ్. అత ఏవ ఉత్కర్షాపకర్ష సత్త్వేఽపి స్థితిమాత్రమాదాయ 'సామాన్యే నపుంసకమ్' ఇతి ప్రవాదః. ఉత్కర్షాపకర్ష సామాన్యాత్మకావస్థాత్రయ సాధారణస్థితిమాత్రవివక్షాయాం నపుంసకం భవతీతి తదర్థః. ఈదృశమవస్థాత్రయం కేవలాన్వయి. అయం పదార్థః. ఇయం వ్యక్తిః. ఇదం వస్తు. ఇతి వ్యవహారస్య సార్వత్రికత్వాత్. తచ్చేదం లిఙ్గమర్థనిష్ఠమేవ. తదుక్తం భాష్యే 'ఏకార్థే శబ్దాన్యత్వాత్ - దృష్టం లిఙ్గాన్యత్వమవయవాన్యత్వాచ్చ' ఇతి. ఏకస్మిన్నేవార్థే పుష్యస్తారకా - తారకం నక్షత్రమ్ - ఇతి - శబ్ద నానాత్వదర్శనాత్ - కుటీకుటీరాదౌ రేఫాద్యవయవోపజననే లిఙ్గభేద దర్శనాచ్చ. స్తనకేశాద్యతిరిక్తమేవ లిఙ్గ మిత్యర్థ ఇతికైయటః. పుంలిఙ్గశబ్ద ఇత్యాది వ్యవహారస్తు వాచ్యవాచకయో రభేదోపచారాద్బోధ్యః'' (సి. కౌ. ౪౫౩ సూ. 'స్త్రియామ్' (౪-౧-3) అనుసూత్రపువ్యాఖ్య.) పయిసందర్భమునుఁ బట్టి లిఙ్గమర్థాశ్రయము కాదనుట కేవలము సాహస మనఁదగునుగదా. ఇంకఁ బ్రాచీనతమకాలమున సత్త్వోపచయాదివివక్షచేఁ బుంస్త్వాదికము లోకప్రసిద్ధమయ్యెనుగాన నది లోకాశ్రితమని 'లిఙ్గమశిష్య' మిత్యాదిభాష్యోక్తికిఁ దాత్పర్యమని గ్రహింపవలెను.

విస్తర. III ౧౩౦ I విష:—"మహద్వాచకమునకు డుజ్జగు ఇత్యాదిస్థలంబులందు షష్ఠీవిభక్తివలన స్థానాద్యాదేశభావముతోఁచి 'మహద్వాచకశబ్దస్థానమున డుజ్జగు' ఇత్యాదివిధంబుగా నపార్థము సంభవించి దోష ముప్పతిల్లును. కావుననే శాస్త్రిగారి (శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారి) సంస్కృతసూత్రములలోఁ బాణినీయ వ్యాకరణమర్యాదతోఁ బంచమ్యంతములు ప్రయోగింపఁబడినవి. అట్టి పంచమ్యంతములయొద్ద 'ల్యబ్లోపేకర్మణ్యధికరణేచ' అనువార్తికంబున 'పుంలిఙ్గాన్మహతో డుజ్ స్యాత్' అనుసూత్రమునకు, 'పుంలిఙ్గమహద్వాచక మతిక్రమ్య డుజ్ స్యాత్' అనఁగాఁ బుంలింగమగుమహద్వాచకమును దాఁటి డుజ్జగునని యర్థమై దోషము లేకపోవును. ఇత్యాదిస్థలంబులయొద్ద 'పుంలింగమగు మహద్వాచకముకంటె డుజ్జగు' నని పంచమీవిభక్తితో సూత్రము రచింపవలసినది. కంటెవిభక్తి సందర్భంబునంజేసి యర్థవశంబునఁ బరశబ్దము తోఁచును'' (బా. గు. ప్ర. ప్రకీర్ణ. ౫౭ పు.) అని యిట్లు గుప్తార్థప్రకాశికాకర్త విపులమగుచర్చచేసి యిట్టి యజ్ఞుఁడగుసూరి బాలవ్యాకరణము రచింపఁజాలి యుండఁడనియుఁ గృష్ణమూర్తిశాస్త్రిగారే బాలవ్యాక

పూర్ణాన్యతరనిర్దేశము చేయింజేసి ద్వివిధానుస్వారంబులు పర్యాయముగ నగునని యెఱుఁగునది. (విస్తర IV.)

---

రణమూలమగు హరికారికావళిని దొలుదొల్త రచించినమాట నిశ్చయమనియు నతి ప్రసంగము చేసెను.

ఈకల్లూరివారికనే కృష్ణమూర్తిశాస్త్రిగారును సూరి యిటుఁబొరవడినట్లు భ్రమించి పవరించి బాలవ్యాకరణమును సంస్కృతీకరించినవారగుదురు. కాన సూరిచే మూలగ్రంథమునట సిద్ధాంతిత మగుచున్నది. ఇచటి సూరిరచనము శాస్త్రవిరుద్ధము కాదు. "మహద్వాచకముకంటె" ననునర్థమున "మహద్వాచకమునకు" అని షష్ఠినిఁ బ్రయోగించుటయు నాంధ్రభాషాసంప్రదాయసిద్ధమై యున్నది. ఇందు "పరముగ" అనునది యధ్యాహార్యమగు ననుటఁ బ్రతిపక్షు లంగీకరించినదేకదా. 'లోభంబుకంటె నితరంబు దోషంబులేదు. ఇచట షష్ఠియు నగు. కాముని కన్యుంపు ధానుష్కుండు లేఁడు. అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము - ఇత్యాద్యలవ్యాదులు' (బాల. కార. ౧౨ సూ.) క. విలువిద్య నొరులు నీకు । గ్గలముగ లేకుండ (ఆది. ౫ ఆ. ౨౪౫ ప.) ఇక్లై పరశబ్దము నధ్యాహార్య ముగఁ జేసికొని నన్నయభట్టు 'ప్రతిషేధవాచినాం నిఃర్భ్యాతార్థానాంతు నః క్రియాణాం స్యాత్'. 'చురితిక్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలేస్యాత్' ఇత్యాది రీతిని సూత్రించెను (ఆం. చిం. క్రియా.)

'మహద్వాచకమున కనునట్టి 'ను' వర్ణకాంతపదము సంబంధమును బోధించుచు వాని ప్రథమైకవచనమునకు డుముపులగుటం దెల్ప సమర్థమై యుండదు' (బా. సా. పే. ౧౩౨ పు.) అనుపేటికయు సరికాదు. సూరి చింతామణికర్తవలెఁ బ్రథమైక వచనముగా 'సు' ప్రత్యయమును నిల్పి దాని కాదేశముగా డుబ్జును విధించు ప్రక్రియను నడపలేదుగాన నీయర్థము వక్త్రభిప్రేతము కానేరదు.

విస్తర. IV ౧౩౦ I విష:—"బిందుపు ముందుగలిగిన డువర్ణకముపచ్చి 'డిద్దుఁడు' అని యైనది. తరువాత హ్రస్వమువిూఁదనున్న యఱసున్న నిండుసున్న యగును. అనునర్థ మిచ్చు సంజ్ఞాపరిచ్ఛేదమందలి పదునాల్గవసూత్రంబున 'డిద్దుండు' అని యగును." (బా. గు. ప్ర. ౯౯) అను గుప్తార్థప్రకాశికావ్యాఖ్య సరికాదు. "జిత్తు బిందుపూర్వంబగు' అనుసూత్రముచేత 'డు' వర్ణకమునకుఁబూర్వముగ బిందు వువచ్చునని చెప్పఁబడెనేకాని యర్ధబిందువువచ్చునని చెప్పఁబడలేదు. కావుననే సూరి యట్టి ప్రక్రియను జ్ఞాపక ఖండపూర్ణములు పర్యాయముగ వచ్చునటుల నుదాహరించెను. (బాల. సంజ్ఞా. ౧౪-౧౫సూ. ౪౭ III. ౪౯ I విషయ. సంజీవని.)

నిరమో మహతాం లుక్చస్యాత్. (ఆం. చిం. ౫ కా. అహో. ౨౫౯).

నన్నయాథర్వణీయము. ౧౩౧ విషయము.

మహతోఽమస్తునిః ర్లుక్ స్యాః దన్యత్రస్త్వత్ర నుర్భవేత్ । ఇదా దిభ్యస్తు నిత్యం; లుః గుదన్తాత్తు స వా భవేత్. (వికృ. అజం. ౧౩ కారి. అహో. ౨౫౯).

కల్పతరు. ౧౩౧ విష:—ఈసందర్భమునందలి మహతా మ్మనునది 'మహత స్సోఽర్ధజనితోఽభవేత్పుంసి' అనుదాని నుద్దేశించియే ప్రయుక్తమైనదనియు నక్కారణమున నిందలి మహతా మ్మనుదానికి మహత్పుంలింగముల కనఁగా డుమంతముల కనియే యర్థము చేయనగుననియు గ్రహింపవలయును. కాన మహతామ్ = డుజ్ప్రథమైకవచనమున వచ్చుశబ్దములయొక్క, అమః = అమ్మున కనఁగా ద్వితీయైకవచన ప్రత్యయమునకు, నిః = 'ని' అను తెలుఁగుప్రత్యయ మాదేశమగును. 'నిః' అనుదానికి 'ని' ప్రత్యయమాత్రమె యని నియమార్థము నంగీకరించుటచే నిట 'ను' ప్రత్యయము రాదని యెఱుంగునది. 'ని - ను'లును, 'కి - కు'లును నిట్లొకటి రాని దానికొకటిగ వచ్చునని యెఱుంగునది. అనఁగా 'ని' వచ్చుటకుఁ దగినచోట 'ను' ప్రత్యయము రాదు. ఇట్లె 'ను' వచ్చుచోట 'ని' ప్రత్యయమురాదు. ఇట్లె 'కి - కు'లకును స్థితి నెన్నవలెను. ఈనియమముచే 'ని' రానివానికి 'ను' ప్రత్యయము వచ్చునని యెన్నునది. లుక్చస్యాత్ = పైరీతినివచ్చు నిప్రత్యయము లోపించుటయుఁ గలదు. 'ని - ను'లు ద్వితీయాప్రత్యయములుగాన 'అన్యేద్రుత ప్రకృతయః' అనుచొప్పున ద్రుతప్రకృతికము లగును. ఉదా:—రామునిన్ - రామున్ - వనమునున్ - వనమున్ మొ.

చింతామణి నిరమ్నక తల్లోపములను డుమంతములకుమాత్రమె యిట కంఠోక్తముగ నుపదేశించి తక్కినస్థలములను స్పష్టపఱుపమిచే నథర్వణుఁడు వివరించుచున్నాఁడు. మహతోమస్త్వి త్యాది—మహతః అమః = డుమంతములద్వితీయైక వచనమునకు, నిః = 'ని' అనునాంధ్రప్రత్యయాదేశము కల్గును, లుక్ - తు - స్యాత్ (తుశబ్దము చార్థకము) ఆ 'ని' ప్రత్యయమునకు లోపమును గల్గును. ఇంతవఱకుఁ జింతామణి సూత్రార్థమున కనువాదమే. అత్ర = ఈసందర్భమున, అన్యతస్తు = డుమంతేతరస్థలములందెల్ల, నుర్భవేత్ = 'ను' ప్రత్యయము 'అమ్ము' నకాదేశ మగును. తుశబ్దమహిమచే నీ 'ను' ప్రత్యయమునకును నిప్రత్యయమునకువలెనె పాక్షికలోపము కల్గునని యెన్నవగును. ఉదా:—వనమునున్ - వనమున్ - గురువునున్ - గురువున్ - రమనున్ - రమన్ - రాజునున్ - రాజున్ - గ్లౌనున్ - గ్లౌన్ -

మువర్ణంబు వచ్చునను. ఇకారాంతాదిశబ్దములకంటెఁ బరమందు నిత్యముగా నివర్ణకము లోపించును. ఉకారాంతముకంటెఁ బరమందుఁ దఱుచుగా లోపించును.” (విక్ర. అజం. ౧౩ కారి. టీక.) ఇట్లు వీరెల్ల చెప్పుటచే మతినిన్ - దధినిన్ - మున్నగు నపుంసకశబ్దముల ‘ని’ వర్ణకమునకును, ‘అశ్వత్థామనున్ - విశ్వకర్మనున్ - నిగమశర్మనున్’ మున్నగు శబ్దములయు, గురువునున్ మున్నగుశబ్దములయు, ‘ను’ వర్ణకమునకును వీరిపక్షమునఁ స్థితియే లేకపోవుచున్నది.

డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగు
బాలవ్యా. నపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు. ...౨౩.
౧౩౧ I విష. రామునిని - రాముని, రామునిచేతను - రాముచేతను,
రామునికిని - రామునకును, సర్వత్ర యనుట నగాగమ
బాధనార్థము.

సంజీవని. ౧౩౧ I విష:—ప్రథమైకవచనమున డుజ్ఞువచ్చుమహత్పుంలింగశబ్దములకు ద్వితీయాదివిభక్తులయేకవచనములు పరమగునప్పు డంతటను నిగాగమము విభాషనగును. నిగాగమము కిత్తుగానఁ బ్రకృతి కంతాగమమగును. తత్స. ౨౧. సూత్రముచొప్పున ‘ఉ’ త్వము రాఁగా - ‘రామ’ అనుప్రాతిపదికము ‘రాము’ అని యేర్పడును. దానిపైని ద్వితీయా ను ప్రత్యయము నిల్చునపుడు నిగాగమము రాఁగా ‘రాము+ని+ను’ అని యేర్పడును. బా. తత్స. ౨౮ సూత్రముచొప్పున ద్వితీయా‘ను’ప్రత్యయోకార మికారము కాఁగా ‘రామునిని’ అనురూపము సిద్ధించును. నిగాగమాభావపక్షమున ‘రాము+ను’ అనుచో బా. తత్స. ౨౫ సూత్రముచొప్పున ‘ను’ వర్ణకోత్వమున కిత్వము రాఁగా ‘రాముని’ అనురూపము సిద్ధించును. ఈ ౨౫ సూత్రమునుఁబట్టి ‘రామును’ అనురూపము సాధువుకాదని విశదమగుచున్నది. ‘రామునిని - రాముని’ అనువానిలో ద్రుతస్వరలోపద్రుతలోపములు వికల్పమునఁ గలుగఁగా ‘రామునిని - రామునిన్ - రాముని - రామున్ - రాము’ అనురూపము లేర్పడును. ఇటఁ జింతామణికి బాలవ్యాకరణమునకునుఁ గొంత భేదము గలదు. ‘రామునిన్ - రామున్ - రాము’ అనురూపములు మాత్రమె చింతామణ్యథర్వణకారికలచే సాధ్యములగును. ‘రామునిని,’ అనురూపము నన్నయాథర్వణసమ్మతము కాదు. సర్వత్ర = అంతటను - ననుటచేత, బా. తత్స. ౨౭ సూత్రముచొప్పున వచ్చు నగాగమము దీనికి బాధకము కాదనియు నిగాగమాభావపక్షముననె నగాగమము వచ్చుననియు నిట్లు ‘కు’ వర్ణకపరకత్వమున ‘రామునికిన్ - రామునకున్’ అనురీతిని నిగాగమ నగాగమములు పర్యాయముగా నగుననియు విశదమగుచున్నది. ప్రయోగములు:—ఉ. నీచతవానిమత్స్యవిభునిం

పరివారము నుక్కుసేసినన్ (కర్ణ. ౨ ఆ. ౧౭౭) వ. ధృష్టద్యుమ్నుని రథంబుపై నొరగి మూర్ఛిల్లిన, క. అనిలజు సారథియును గుణ ! తనయుని రథచోదకుఁడు నతని బాలునినిన్ ! గొని...(కర్ణ. ౧ఆ.౧౧౦)చ...అతనినిన్ జయింతుమె ! ము...(హరి. ఉ. భా., ౯ ఆ. ౨౨౯) ఆ. వె. వృద్ధుబాలకునిని బుద్ధిహీను (విజ్ఞా. వ్యవ. ౫౨ ప.) "అతనినిన్—బాలకునినిన్" అను-చోటులందుఁ ఇంతావునీపక్షమున—అతనిన్+నిన్ (బా. విష. ౮౫ I) 'బాలకునిన్+నిన్' అనుకీతిని సముచ్చయార్థక ను శబ్దము ప్రయుక్త మయ్యెనని గ్రహింపవలెను. బాలవ్యాకరణపక్షమున "అతనినిన్ - బాలకునినిన్ -" అనుకేతిని బొల్లనకారమె సముచ్చయార్థక 'ను' శబ్ద సంధిరూప మని యెన్నవగును. లేదా 'అతనిన్+నున్', అనియు 'బాలకునిన్+నున్' అనియు ఛేదము నంగీకరించినను బాలవ్యాకరణపక్షమున క్షతిలేదు. ఆ॥ వె॥ విమలశీలుని రఘువీరకులోత్తంసు ! (రాఘ. ౨ ఆ. ౭౯) (అహో. ౨౯౯ పు.) "విమలశీలునిన్, రఘువీరకులోత్తంసున్" అని రామాయణపక్షమునందును, "విమలశీలున్, నిరఘున్, వీరకులోత్తంసున్" అని భారతపక్షమందును ఛేదము నెన్నవగును. సీ॥ తన కుల బ్రాహ్మణు ననురక్తు నవికళ, జపహోమతత్పరు...(ఆది. ౧ ఆ. ౯) (ఇట్టి వివుదృ మునఁ జెక్కుగలవు) చ...సద్గుణైక నిధిని జాగ్రదారహితకార్యభరాత్మతనుండఁ జూచి...(రాఘ. ౧ ఆ. ౪౩) "సద్గుణైకనిధిని = (వసిష్ఠుని) జాగ్రదారహిత" అని రామాయణపక్షమునందలి ఛేదము. "సద్గుణైకనిధిన్ - నిజాగ్రదారన్ - హితకార్య..." అని భారతపక్షమునందలి ఛేదము. క. ఏలినవానిని దైవము ! నాలిని బంధులను...(ఉద్యో. ౨ ఆ. ౬౩) తే. గీ. ఒకటఁగొని... ! వినిటిని గెల్చి... (ఉద్యో. ౨ ఆ. ౩౨) క...దాసీ ! నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్ (ఉద్యో. ౩ ఆ. ౧౫౬) క...ధీమంతుఁడు దే ! వకిహోడుకు గలఁడు ధర్మజు ! నికి నాతం డెత్తిరాక నిలుచునె యధిపా. (ఉద్యో. ౨ ఆ. ౧౮౨) క. నావుడుఁ గృష్ణుండు రామునకు ని ట్లనియెన్ (ఆది. ౮ ఆ. ౨౦౭) క. నావుడుఁ బార్థుండు గర్జునకు ని ట్లనియెన్ (ఆది. ౭ ఆ. ౧౯౯) ఆ. వె...ధృతరాష్ట్రు ! తనయునకు సమీరతనయు చేత (సభా. ౨ ఆ. ౮౭) క. ఇమ్ముల ధర్మజుతో జూ ! దమ్మాడఁగ (సభా. ౨ ఆ. ౧౩౮).

క్వచిదమహతో౽పి డుజ్ స్యా! దేకాదే రమహతాంచ
నన్నయా డావున్న ! (ఆం. చిం. అజం. ౧౩ కారి.) (అహో.
ధర్వణీయము. ౩౦౭).

౧౩౨ విషయము. సబిన్దుకస్య డోః స్థానే ! నిర్నిత్య ముపతిష్ఠతే (విక్ర.
అజం. ౧౧౦ కారి.) (అహో. ౩౭౬).

కల్పతరు. ౧౩౭ విష:—ఆచ్ఛికశబ్దరూపవిశేషములను వివరించుచున్నాఁడు. క్వచిత్ = ఒకానొకచోట. అమహతోఽపి = అమహచ్ఛబ్దములకంటెఁ బరమైన సుప్రత్యయస్థానమందును, డుజ్ = డుజ్ప్రత్యయము, స్యాత్ = అగును. ఉదా:—వన మొక్కఁడు, కైరఁడు, కత్తళఁడు, పులియఁడు, మొ. ఏకాదేః = ఒక - మగ - మనుమ - పాప - రాయ మున్నగుశబ్దములకును నమహత్తులకును, డౌ = డుజ్జు పరమగుచుండఁగా, ఉత్ - న = అత్త్వమున కుత్త్వము రాదు. ఉదా:—ఒకఁడు - మగఁడు - మనుమఁడు - పాపఁడు - రాయఁడు - కైరఁడు - కత్తళఁడు మొ. విలుకాఁడు - కొండీఁడు - పగలాఁడు మున్నగు "కా - ఈ - ఆ" ప్రత్యయాంతములును ప్రే - ఱశబ్దములును నేకాదులలోనివే యని యెఱుంగునది. "కొమ్ముకాఁడు = అడవిపంది - సాలీఁడు - సాలెపురుగు" మున్నగునవి యమహత్తులయినను "క్వచిదమహతోఽపిడుజ్స్యా"త్తను ప్రకృతసూత్రముచేత వానికి డుజ్జు వచ్చును. వీని యొక్క యనఁగా నేకాదులయు నమహత్తులయు, సబిందుకస్య డోః స్థానే = ప్రథమైకవచనమున బిందుసహితమగు డుప్రత్యయము మాత్రము వచ్చుచోట ననఁగా డుజ్ పరకత్వమున నుత్వమురాని ప్రాతిపదికలస్థలమున - నిః = నివర్ణము, ద్వితీయాద్యేకవచనపరకత్వమున - నిత్యమ్ = నిత్యముగా, ఉపతిష్ఠతే = నిల్చును. ఉదా:—ఒకనినిన్ - ఒకనిచేన్ - మగనినిన్ - మగనిచేన్ - కైరనినిన్ - కైరనిచేన్ - మొ. అచ్చతెనుఁగుశబ్దములయినను ప్రథమైకవచనమున డుజ్పరకత్వమున నుత్వము వచ్చుశబ్దములకిట్టి 'ని'-వర్ణనిత్యస్థితి లేదు. బల్లిదునిన్ - బల్లిదున్ - బల్లిదునిచేన్ - బల్లిదుచేన్ మొ. ఇట్టిచోటులం దుపయోగింపఁదగిన యీకారిక నహోబలపతి యాచ్ఛికసమాసస్థలమాత్రోపయోగిగా నుదాహరించుట సరికాదు. 'ద్వ్యక్షరాది చతుర్వర్ణ । పర్యన్తజననామసు । లోపః స్యాడ్డ్వాది వర్ణానాం । శబ్దేరాయాదికే పరే। ... । సబిన్దు కస్యడోఃస్థానే । నిర్నిత్యముతిష్ఠతే । ఆర్యామ్బాదికశబ్దాః స్యుః । శ్రేష్ఠతావాచకాయతః । తత స్తద న్తశబ్దేభ్యో । నైవ శ్రేష్ఠత్వగోచరాః । ...రామారాయఁడు - తిమ్మానాయఁడు...రామానాయనివంగసము, తిమ్మానాయనికొడుకు. ఇత్యాదౌ సర్వత్ర న్యాగమో నిత్యః" (అహో. ౩౭౬ - ౩౭౮) అహోబలపండితీయమునే యాధారముగాఁ గొని యథర్వణకారికల నెత్తి వ్రాసి దానికిఁ గవిజనమండనటీక వ్రాసిన సీతారామకవి యీసందర్భమున కిట్లు వ్యాఖ్యచేసెను. "సమాసమందు నిత్యముగా డుజ్జునకు నివర్ణకము వచ్చును. ఉదా:—రామినేనికులము. రంగారాయనివంగడము. ఇవి మొ." (వికృ. అజం. ౧౧౦ కారి. వ్యా. ౧౨౦ పు.) (నారా. గాణ. సమా. ౨౦ ప. ౩౧౭ కారి. ఇట్లె వ్రాయఁబడెను.)

అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము
నిత్యముగా నగును. ౬౪.

[illegible] మగనిని - మగనిచేతను - మగనికిని - అనుదంతంబగు
[illegible] పర్యుదాసముచేత తమ్మునిని - తమ్ముని - తమ్మునిచేతను -
[illegible] తమ్ముచేతను - అల్లునిని - అల్లుని-అల్లునిచేతను - అల్లు
చేతను - బల్లిదునిని - బల్లిదుని - బల్లిదునిచేతను - బల్లి
దుచేతను - ఇత్యాదులందు నిగాగమంబు వైకల్పికంబని
యెఱుంగునది.

సంజీవని. ౧౬౨ సూత్రము:—బల్లిదుఁడు = బలముగలవాఁడు. పర్యుదాసము = నిషేధము - "పర్యుదాస - పు - (పరి+ఉత్+అస - ఘఞ్) నివారణే - ఫలప్రత్యవాయశూన్యతయా ఫేదాప్తనఞాభాసే చ్యే. 'ప్రాధాన్యం హి విధేర్యత్ర । ప్రతిషేధో ఽప్రధానతా । పర్యుదాసః స్సవిజ్ఞేయో । యత్రోత్తరపదేనసఞ్' ఇత్యుక్తలక్షణ నిషేధేచ -" (శబ్దస్తో) నిషేధవిధి కెచటఁ బ్రాధాన్యమో? యనఁగా నెచట నశబ్దమునకుఁ గ్రియతో నన్వయ ముండునో యచట నది ప్రతిషేధ మనఁబడును. నిషేధవిధి కెచట నప్రాధాన్యమో యనఁగా సమాసములోని యుత్తరపదముతో నన్వయమో యచట నది పర్యుదాస మనఁబడును. కాన నిట న నుదంతమనుటచే నుదంతములకుఁ బర్యుదాసము చేయఁబడెనని యెఱుంగునది. ఆచ్ఛికశబ్దములలో డుమంతములెల్లఁ బుంలింగసమములు (బా. ఆచ్ఛి. ౩ సూ.) గాన వాని కాతిదేశికపుంస్త్వమును, మహత్త్వమును నుండుటచే బా. తత్స. ౨౧ - ౨౨ సూత్రములచొప్పున 'అల్ల - తమ్మ - పగత' మున్నగువాని కుత్వడుజ్ఞులువచ్చును. ఇట్లుదంతములగు బల్లిదు - అల్లు - తమ్ము - మున్నగువానికి సంస్కృతసమములకువలెనె నిగాగమము వైకల్పికమగును. కాన "బల్లిదునిచే - బల్లిదుచే" మున్నగురీతిని ద్వైరూప్యము సాధు వగుచున్నది. మగ - పాప - మనుమ - రాయ - ఒక - మున్నగు మగాది శబ్దములును బుంలింగసమములె యైనను, బా. ఆచ్ఛిక. ౮ సూత్రముచే వీని కుత్వము నిషేధింపఁబడుటచేత నివి యనుదంతము లగుచున్నవి. అనుదంతములకుఁ బ్రకృతసూత్రముచే నిగాగమము నిత్యముగాన మగనిని - మగనిచేతను - మగనికిని మున్నగురీతినిమాత్రమె రూపము లుండునుగాని నిగాగమము రాని "మగచేతను - మగకును" మున్నగు ననిష్టరూపములు సిద్ధింపనేరవు. "బసవఁడు - రంగఁడు" మున్నగు వైకృతములును నీమగాదులలోనివె యని యెఱుంగునది. ప్రయోగములు—గీ. తమ్ముచేసినదురితముల్ దలఁగఁ బూని (అరణ్య. 3 ఆ. ౨౭౯) (తమ్ము

యొక్క+చేసిన = తమ్ముచేసిన = తమ్ముఁడుచేసినదురితములని యర్థము. ప్రథమార్థకషష్ఠి - చూ. ప్రౌఢ. కార. ౧౫ సూ.) చ....సంధిక । కుృరుపతిఁ దమ్ముప్రోవు మొగకొల్పఁగఁజాలన (ఆశ్వ. ౩ ఆ. ౩౧ ప.) (తమ్ముప్రోవు = తమ్ములప్రోవు = సోదరవర్గము) క....తమ్ముని । పాటునుఁ గన్నారఁగంటి పాఱకు మింకన్ (విరా. ౫ ఆ. ౮౯) క. నీవును నాకతన మాలనికి నగపడవై । తీవిధమున (శాంతి. ౩ ఆ.౨౩౬).

బాలవ్యా. డుమంతంబుమీఁది సువర్ణకంబు నుత్వంబున కిత్వం బగు ౨౫.

౧౩౩ విషయము. 'సువర్ణకంబు ద్వితీయ'యనుసూత్రంబుచేత 'రామును' అని ప్రాప్తింపఁగా నీసూత్రముచే సువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె - రాముని - భార్గవుని.

సంజీవని. ౧౩౩ విష:—"నిరమోమహాతామిత్యాది నన్నయాథర్వణకారికలె బా. తత్స. ౨౫ సూత్రమునకును మూలము. (౧౩౧ విష.) బా. తత్స. ౨౩ సూత్రముచొప్పున నిగాగమము రానిపక్షమున 'రాము+ను' అని యిట్లు ద్వితీయా 'ను' ప్రత్యయముమాత్రము చేరునపు డా 'ను' ప్రత్యయము యొక్క 'ఉ' కారమునకు 'ఇ' కారమగునని సూత్రార్థముగాన 'రాముని' అని యేర్పడును. డుమంతములమీఁద 'ను' అనుద్వితీయా సు ప్రత్యయ ముకారముతో నిలువనేరదని ఫలితార్థము. 'రామును - భార్గవును' మున్నగురూపములు సాధువులుకావని యెఱుంగునది. 'రాము న్వంచించెను = రాము వంచించెను' అనుచో ద్రుతస్వత్వరూపము 'రాముని వంచించెను' అని యేర్పడునుగాని 'రామును వంచించెను' అని యేర్పడనేరదు.

బాలవ్యా. ఇకారంబుమీఁది కు - ను - వు - క్రియావిభక్తుల

౧౩౪ విషయ. యుత్వంబున కిత్వంబగు. ౨౬.

హరిని - హరికిని - శ్రీని - శ్రీకిని - వారిని - వారికిని.

సంజీవని. ౧౩౪ విష:—ద్వితీయా 'ను' వర్ణకోత్వమున కిత్వమును విధించుచుఁ బ్రసంగవశమున మఱికొన్నిటను గల్గునట్టి స్వరశక్తికృతములగు మార్పుల నుపదేశించుచున్నాఁడు. తపరకరణములేకుండ 'ఇ' కారంబు మీఁది యనుటచే 'ఈ' కారము సైతము గ్రహింపఁబడుచున్నది. "ఐకారం బీతుల్యంబు" (బా. తత్స. ౬౫ సూ.) అనుసూత్రముచొప్పున "ఐ" కారముసైత మేతత్సూత్రకార్యములకు మూలమగుచున్నది. కాన "ఇ - ఈ-ఐ" వర్ణములమీఁద నిల్చిన 'కు, ను, వు' ల యొక్కయు, "ను, ము, వు, రు" అను క్రియావిభక్తులయొక్కయు

హ్రస్వేకారమునకు హ్రస్వమగు 'ఇ' కారమగు ననువర్ణము తేలుచున్నది. ఉదా:— రామునిఁ+ను = రామునిని - మున్నగు రూపాంతరస్థలము లెవలఁ బుదాహరింపఁబడియె యున్నవి. హరి+ను = హరిని, హరి+కు+ను = హరికిని, శ్రీ+ను = శ్రీని, శ్రీ+కు+ను = శ్రీకిని, వారి+ను = వారిని, వారి+కు+ను = వారికిని, ఇకారము సహజమైనను, వాగమాదిసిద్ధమైనను దానిమీఁది 'ఉ' కార మికార మగును. "హరి+కు" అనుచోట బ్రకృతసూత్రమున నిత్వము రాఁగా 'హరికి' అని యేర్పడినపిదప "హరికి+ను" అనుచోటనైతము బ్రకృతసూత్రముననె 'ఇ' త్వమువచ్చి 'హరికిని' అనురూప మేర్పడుచున్నది. శ్రీకిని - వారికిని - మున్నగుచోట్లను నిట్లె ప్రక్రియ నడుపవలెను.

కారక ౬3 సూత్రముచెప్పిన యుష్మదస్మద్విశేషణములనుజేరు 'వు - ను' లకును నిత్యార్థ్యము వర్తిల్లును. నీవు కవి+వు = నీవు కవివి. ఇట్టివే ప్రకృత సూత్రములో 'వు' అనుదాని కుదాహృతులగును. నేను గవి+ను = నేను గవిని. క్రియావిభక్తుల కుదాహృతులు—బా. క్రియా. ౭ సూత్రమున నుపదేశింపఁబడిన దుజ్భిన్నములగు ప్రత్యయములకెల్ల భూతార్థమున నీసూత్ర ముపచరించును. నేను వచ్చితి+ను = నేను వచ్చితిని, మేము వచ్చితి+ము = మేము వచ్చితిమి, నీవు వచ్చితి+వు=నీవు వచ్చితివి, మీరు వచ్చితి+రు=మీరువచ్చితిరి, వారువచ్చి+రు=వారు వచ్చిరి. మొ. (చూ. బా. క్రియా. ౧౭ - ౧౮ సూ.) సముచ్చయార్థక 'ను' శబ్దముచోటను బ్రకృతసూత్రము వర్తిల్లును. ఉదా:—హరినిని గృష్ణునిని గొని రమ్ము - హరినిన్+ను = హరిని+ను = హరినిని మొ. కం. అనుజులకు నడ్డపడియే। మిని జేయఁగ నీమి (ఉద్యో. ౨ ఆ. ౧3 ప.) చ....ఇజ్జగంబుల। న్నిని నొకపెట్ట మ్రింగినను (ఉద్యో. ౨ ఆ. 3౨౨) ఏమియును = ఏమి+ను = ఏమిని, అన్నియును = అన్ని+ను = అన్నిని. మొ. (౮౪ I విష.)

నన్నయాథర్వణు లిస్వరోక్తికృతమగు మార్పు నుపదేశింపలేదు. చివుకు, చినుకు, కినుక మున్నగుచోట్లఁ బ్రకృతసూత్రముచెప్పిన "చివికి - చినికి - కినిక" మున్నగురీతి మార్పు కల్గనేరదుగదా. శబ్దస్వభావాదుల యనుగమములెల్ల నిట్లె సవ్యభిచారములుగదా. ఇట్టి నిలువరాని యనుగమము నుపదేశింపనేల యని కావలయునన్నయాథర్వణు లిట్టిసూత్రముల లక్ష్యములను వేఱువిధముగ సాధించుకొనిరి. "కూర్చి ల ను నయః; కి కు యొక్కన్యా" అని యిట్లు 'ను - కు' వర్ణకముల తోపాటు 'ని, కి' వర్ణకములు నైతము చింతామణిలోఁ జేర్కొనఁబడెను. క్రియావిభక్తుల నుపదేశించునపుడు "భూతా దుతాం పరేషా మిత్"అని యిట్లు భూతార్థక

క్రియా ప్రత్యయముల యిత్వమును వేఱుగ నన్నయ సాధించికొనెను. 'నేను రవిని' మున్నగువానిసాధనమునకై 'ను - వు' లతోపాటు 'ని - వి' అనునవి సైతము "అస్మ ద్యుష్మద్వాచ్యా దేకత్వ ఇతో నివీ..." అని యిట్లు చింతామణిలో నుదాహరింపఁబడెను. ద్రుతమునకు 'ని - ను' అను స్వరూపమె నన్నయాథర్వణులకు సమ్మతము కామింజేసి 'హారికిని - శ్రీకిని' మున్నగువానిసాధన మె ట్లనుశంక కె ప్రసక్తి లేదు. కం. అనుజులకు నడ్డపడియే । మిని జేయఁగ నీమి...(ఉద్యో. ౨ ఆ. ౧౩) చ. అనిన...జగంబుల । న్నిని నొకపెట్టి...(ఉద్యో. ౨ ఆ. ౩౨౨) అను నిట్టి సముచ్చయార్థవ్యవిశేషబోధక నుశబ్దము నుత్వమున కిత్వము "స్త్రియశ్చ స్త్రీసమస్యేతో । ద్రుత స్స్యాన్ని శ్రుతిః క్వచి" త్తను కారికచే సిద్ధించును. ఇందలి స్త్రీలింగస్త్రీసమశబ్దముల యిత్తున కనునది తద్భిన్నములకును నుపలక్షమని యెఱుంగునది. కం.... అతని నాతని నిం । గొని...(కర్ణ. ౧ ఆ. ౧౧౦) (చూ. ౮౮ I విష.)

బాలవ్యాకరణ ఈధాతుయుష్మదర్థంబుల మీఁదివాని యుత్వంబున
వివరణము. కిత్వంబు రాదు. ౨౭.

౧౩౮ I విషయము. ఈరు - ఈవు - ఈను - ఈము; ఈకు - నీకు - మీకు.

సంజీవని. ౧౩౮ I విష:—పూర్వసూత్రముచే నగు ననిష్టస్థలంబులందలి యిత్వమును బ్రకృతసూత్రము నిషేధించుచున్నది. "ఈరు - ఈవు - ఈను - ఈము" అనువానిలోని 'రు - వు - ను - ము' అనునవి క్రియావిభక్తులు. 'ఈకు - నీకు - మీకు' అనువానిలోని 'కు' అనునది షష్ఠీవిభక్తి. 'ఈరు' మున్నగునవి "ఇచ్చు" ధాతువ్యతిరేకరూపములు. ఈరు = ఇయ్యరు = ఈయరు మొ. ఈకు = నీకు మొ. పై చోటులందుఁ బూర్వసూత్రముచొప్పున "ఇత్వము" వచ్చినచో "ఈరి - ఈవి - ఈని - ఈమి - ఈకి - నీకి - మీకి" అను ననిష్టరూపములు గల్గునుగానఁ బ్రకృతసూత్రముచే నిత్యనిషేధము చేయఁబడినది. ఈధాతు = 'ఈ' అనురూపముతో నున్నధాతువుమీఁదివానికని యర్థము. 'ఇచ్చు' ధాతువుమీఁది వానికన్నచో 'ఇచ్చితిని' మున్నగుచోటులం దిష్టమగు 'ఇ' త్వము సైతము వారింపఁబడవలసివచ్చునుగాన "ఈధాతు" అని వచింపఁబడెను. యుష్మదర్థక మనఁగా నీశబ్దము. చింతామణిపక్షమున నట్టి యనిష్టరూపములు కల్గనేరవుగాన నం దిట్టిసూత్రమున కావశ్యకతయే లేదు. "ఇతాం జసః కిశ్చ" (అజం. ౯ కారి.) అనుచొప్పున నీశబ్దము పైని 'కి' ప్రత్యయము నిల్పుచుండఁగా దానిని 'కి ర్న జమః' (హలన్త. ౬ కారి.) అనుకారికచేఁ జింతామణి నిషేధించియున్నది.

లు జసో ల శసో౽ప్యత్ర. (ఆం. చిం., అజం. ౪ కారి., అహో. ౨౫౯).

కల్పతరు ౧౩౫ విషయము. కర్మప్రవచనీయకే కూర్చి (ఆం. చిం., అజం., ౫ కారి., అహో. ౨౬౦).

అంచు షష్ఠీ కూర్చి విభక్తిషు (వికృ. సంధి. ౨౩ కారి., అహో. ౨౬౧).

కల్పతరు. ౧౩౫ విష:—ఇచట సూరి ప్రక్రియకును జింతామణిప్రక్రియకును జాలభేదము గలదు. చింతామణి తత్సమప్రాతిపదికములపయి సంస్కృత సుప్పుల ననఁగా సంస్కృతనామవిభక్తులను నిల్పి వానికిఁ దెలుఁగువిభక్తుల నాదేశములుగా విధించుచునవచ్చును. సూరి యట్టిమార్గమును వీడి తత్సమప్రాతిపదికములపైఁ దెలుఁగువిభక్తులనే నిల్పుచుఁ బ్రక్రియను నడపెను. ఈమార్పువలన సూరి ప్రక్రియ "శ్వాన్తరా" ది సూత్రాదులయొద్ద (బా. అజం. ౪౪ సూ.) బాధితమయి యట్టిచోటుల మరలఁ జింతామణిమార్గమె యపేక్షితము కావలసివచ్చెను. అట్టి విషయములు ముందు చూపఁబడును. పై నుదాహరించిన చింతామణిసూత్రములు పై మార్పుమూలమున నిట బాలవ్యాకరణములోఁ జూపుట కంతగా నావశ్యకత లేదయ్యెను. వానిలోఁ గొన్నిటినిఁ గారకపరిచ్ఛేదములో సూరి సంగ్రహించికొనెను. చింతామణిప్రక్రియలోఁ దెల్గువిభక్తులెల్ల నిటఁ బ్రాతిపదికములపై సంస్కృతవిభక్తులకు నాదేశములుగా నిల్పుపద్ధతి నుపదేశించిన సూత్రము లుదాహరింపఁబడుచున్నవి. బాలవ్యాకరణములోని గతసూత్రములచేతనె యీచింతామణి చూపు విభక్తులు ప్రాతిపదికములపై నిల్పుట సాధ్యమగునుగాన నట్టిప్రక్రియను సూరి యిట వేఱుగఁ జూపవలసినప్రసక్తి లేదయ్యెను.

అలాన్తాత్ జసః = లవర్ణము తుదినిలేని బాలాదిశబ్దభిన్నమగు ప్రాతిపదికమునకుఁ బరముగా నిల్చిన జస్సున కనఁగాఁ బ్రథమాబహువచనసంస్కృతప్రత్యయమునకు - లు = తెల్గున 'లు' అనునది యాదేశమగును. శసః = అట్టి శస్సున కనఁగా ద్వితీయాబహువచనసంస్కృతప్రత్యయమునకు - ల = 'ల' అనునది యాదేశమగును. ఉదా:—రాములు - కృష్ణులు - రాములన్ కృష్ణులన్. ఇటఁ జూపఁబడిన యీ తెనుఁగువిభక్తులు "అన్యేద్రుతప్రకృతయః" (ఆం. చిం. సంజ్ఞా. ౧౭ కారి.) అను సూత్రముచే యథాసంభవముగా ద్రుతప్రకృతికము లగుచుండునుగాన 'రాములన్' ఇత్యాదిరూపమున నుదాహృతము లగుచుండును. ఇట్లగుటచే "రాములను"

అనునది ద్వితీయాబహువచనరూప మనుట చింతామణి సమ్మతము కాదు. (ఆం. భా. చ. ౧౬౦౬ పుట.)

కల్పతరు. ౧3౫ I:—కర్మప్రవచనీయకేకూర్చిః = సంస్కృతవ్యాకరణమునఁ గర్మప్రవచనీయ యోగమున విధింపఁబడిన ద్వితీయాప్రత్యయమునకుఁ దెల్గున 'కూర్చి' విభక్తి యాదేశమగును. భారతమున నిట్టి 'కూర్చి' విభక్తికిఁ బ్రయోగములేద నియు 'గుఱిచి'కిఁ బ్రయోగముగలదనియుఁ జెప్పుదురు. ప్రయోగములలోని గుఱి చిచో "కూర్చిని" నిల్పినను క్షతియుండదు (౨3౫ విష.). లిఙ్మధ్యసూత్రమునఁ గర్మ ప్రవచనీయార్థకము కళయని చెప్పఁబడెను. (౪౨ విష.) కాన నిది కళ యగును. "అందు పట్టి కూర్చి విభక్తిషు" అనునథర్వణకారిక కీవఱకె వ్యాఖ్యచేయఁబడెను. (చూ. విష. ౮౮) కాన దానిచొప్పునఁ బ్రాతిపదికమునకు 'ను' వాగమము వచ్చును. ఉదా:—రాముఁగూర్చి మొ. "ఆ. వె. ఆళిమీఁక పుత్త్రుఁ డంబుజసంభవుఁ। గూర్చి భక్తితోడ ఘోరతపము (ఆది. ౨ ఆ. ౧౬౯) వారిజాసనుగుఱించి (కర్ణ. ౧ ఆ ౨౬౪) ఇందలి 'గుఱించి' కూర్చి విభక్త్యర్థాభిధాయకశబ్దము. రాము+కూర్చి = రాము+ న్+కూర్చి - రాముఁగూర్చి - రాముంగూర్చి-రామున్గూర్చి-ఇట గుఱిచి, గుఱించి మున్నగు విభక్త్యర్థకశబ్దములును నిల్చును. ఉదా:—రాముగుఱిచి రాముగుఱించి, మొ. (విష. ౧౧౯. త్రిలింగ లక్షణశేషమున "ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱి చియు ననుప్రయుక్తంబగు". "అయ్యది వ్యవహితంబునగు. అబ్జాసనుఁడు తన్ను నర్థితో గుఱిచి, యజించుట..." (హరి. పూ. భా. ౧ ఆ.) (ప్రౌఢ. కార. ౨-3 సూ.) అని సూత్రింపఁబడెను. ఇందుఁ గర్మప్రవచనీయవిభక్తిని గ్రంథకర్త తలంప నైనలేదు.

నన్నయా ౧3౫ II విషయ.

> మహతో ని లౌ విభక్తౌ, టాదౌ వచనద్వయే క్రమేణ
> స్తః॥ టాదివిభక్తౌ నిర్ణేత్యేకే (ఆం. చిం. అజం. ౫-౬ కారి.,) (అహో. ౨౬౧ - ౨౬౨).
> శసః స్యాదుభయత్రాఽపి । లస్తస్మాట్టాది రుచ్యతే
> (వికృ. అజం. ౧౪ కారి.) (అహో. ౨౬౧ పు.)

కల్పతరు. ౧3౫ II విష:—టాదౌ - విభక్తౌ = తృతీయైకవచనము మొద లగు విభక్తి పరమగుచుండఁగా, మహతః = మహత్పుంలింగముల కనఁగా డుమంత ములకు - వచనద్వయే = ఏకవచన బహువచనములందు, క్రమేణ = వరుసగా - ని - లౌ = ని లలు, స్తః = అగుచున్నవి. ఏకత్వమునందు 'ని' వర్ణమును, బహుత్వమున 'ల' వర్ణమును నగునని యర్థము. 'మహతః' అనుదానికి డుమంతముల కని యర్థము

చేయునిచో హరినిచేత, శంభువునిచేత, రాజునిచేత యనునట్లు ననిష్టరూపము లుద్భవింపవలసివచ్చును. టాదివిభక్తౌ = తృతీయాద్యేకవచన పరకత్వమున, నిః = నివర్ణము, నేతి ఏకే = రాదని కొందఱందురు. వికల్పమని తాత్పర్యము. ఇట నివర్ణముతో పాటుగ లవర్ణమునునైతము డుమంతములకే విధించుట సరిగానై యుండలేదు. లవర్ణము డుమంతములకేకాక యెల్లశబ్దములకును బహుత్వమున నిత్యముగా నిల్చును. కావుననే యథర్వణుఁడు "శసస్యా" యిత్యాదిసూత్రముతో దీనిని సవరించుచున్నాఁడు. లః = లవర్ణకము, ఉభయత్రాపి = మహదమహచ్ఛబ్దములకెల్ల నంతటను, శసః = సంస్కృతద్వితీయా బహువచనప్రత్యయమున కాదేశమగును. ఇది చింతామణ్యుక్తార్థానువాదమె. తస్మాత్ = లకారాత్తనఁగా నట్టి బహువచన 'ల' వర్ణమునకుఁ బరముగా, టాదిః = తృతీయాది ప్రత్యయములు చేతాదులు (బహుత్వమున) మహదమహచ్ఛబ్దములకెల్లను నిల్చునని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. ఉదా:—రామునిచేతన్ - రాముచేతన్ - రాములచేతన్ - సీతలచేతన్ - వనములచేతన్ - హరులచేతన్ - శంభువులచేతన్ - మొ. ఇట నహోబలపతి "విభక్తౌ విత్యేకవచనేనాయమర్థో జ్ఞాప్యతే..." (అహో. ౨౬౭ పు.) అని యిట్లు చింతామణి సూత్రమునకే యథర్వణుఁడు వివరించిన వివరణ మభిప్రేతమని సాధింపఁజూచెను.

(ఈవిషయమును సూరి బాల. తత్స. ౨౩ - ౩౧ సూత్రములచే నుపదేశించెను. నివర్ణాగమమును గతించిన ౨౩ సూత్రముచే నుపదేశించెను. లవర్ణాగమను మున్ముందు ౩౧ సూత్రముచే విధింపఁగలఁడు. నన్నయాథర్వణులు తృతీయాదివిభక్తి పరకత్వమున 'ని ల' లను విధించుచుండఁగా సూరి ద్వితీయాదివిభక్తి పరకత్వమున వానిని విధించినవాఁడయ్యెను. నన్నయాథర్వణులు 'ని - ను - ల' అను వానిని ద్వితీయా ప్రత్యయములలోఁ బఠించియుండఁగా సూరి 'ను' అనువానిని మాత్రము ద్వితీయాప్రత్యయముగా నంగీకరించెను. కావున నిచట నట్టిమార్పు కల్గినది.)

నన్నయా థర్వణీయము. ౧౩౫ III విభ.

టాసశ్చేతో, జేసః కయి కొఱకూ, జసిస ఉచ్యతే వలనః।
తోడ సహార్థే టాసః పట్టీ తితు పఙ్చమీ గుణే హేతౌ।
కంటేఽన్యా రాదాదే, ర్గోపల నిర్ధారణోద్భవా షష్ఠీ।
యొక్క చ శేషే షష్ఠీ, విషయనిమిత్తాదజా తత్రైవా
ఽన్యా ॥ (ఆం. చిం. అజం. ౬, ౭, ౧ కారి.)
(అహో. ౨౬౩ మొ. ౨౬౫ వ.)
కేచిన్నాన్తాచ్చ కుర్వాదే। ర్ద్వ్యత్వరా త్పట్టి షూచిరే

(వికృ. క్రియా. ౧౯ కారి.) (అహో. ౪౯౯).
అందు । పట్టి కూర్చి విభక్తిషు । (వికృ., సంధి., ౨౩
కారి.) (అహో. ౨౨౦ పు.)
భావాదిజన్యజిప్తుల్య । స్సుసా స్యా దత్ర సర్వదా॥
సత్యర్థజా సప్తమీచ । వర్తమార్థతాం గతా ॥ (వికృ.
అజం. ౧౮ కారి.) (అహో. ౨౭౬ పు.)

కల్పతరు. ౧౩౫ III విష:—"ఆదిరన్త్యేన సహేతా" (౧-౧ - ౭౧) అను పాణినిసూత్రముచొప్పునఁ దుదినున్న 'ఇద్' వర్ణముతోఁగూర్చి పలికినదిమాత్రమే ప్రత్యాహారమనిపించుకొనుటంజేసియు "టా - భ్యామ్ - భిస్" మున్నగువానిలోని సకారాదు లిద్వర్ణములుకామింజేసియు 'టాస్' మున్నగునవి ప్రత్యాహారములను టకు వెలిచి యహోబలపతి వానినిఁ బ్రాకృతవ్యాకరణపద్ధతిచొప్పునఁ బ్రత్యాహార ములనుచు వ్రాసెను. ఒక్క "జీ - ఓస్ - సుప్" అన్నదిమాత్రమె పాణినీయ పద్ధతిచొప్పున నిత్తుతోఁ గూర్పఁబడిన దగుటంజేసి 'జిప్' అనుదానినిమాత్రమే ప్రత్యాహారమనుచు ధారాళముగా వ్రాసెను. "టాసితిప్రాకృతీయస్తృతీయావిభక్తి ప్రత్యాహారః" (అహో. ౨౬౩ పు.). "జేసితి చతుర్థీవిభక్తి ప్రత్యాహారః ప్రాకృతీయః"(అహో. ౨౬౪). "జసిసితిప్రాకృతీయః ప్రత్యాహారః" (అహో. ౨౬౫ పు.). "జమితి (జస్ - ఓస్ - ఆమ్) ప్రాకృతవ్యాకరణప్రత్యాహారః" (అహో. ౨౬౬). "జిబితిప్రత్యాహారః (అహో. ౨౬౬) అహోబలపతి యిట్లు వ్రాసెనేకాని ప్రాకృత వ్యాకరణములం దెందును నట్టి "టాస్" మున్నగు ప్రత్యాహారములను వాడుట కన్పట్టలేదు. పరిశీలింపఁగా, నన్నయభట్టారకుఁడే యిట్లు స్వతంత్రించి సంస్కృత వ్యాకరణాంతరమార్గానుయాయియై యిట్టివానిని వ్యవహరించెనని తోఁచుచున్నది. ఆతఁడు వీనినిఁ బ్రత్యాహారము లనలేదుగదా. క్షతియేమి? వీనికి సమాహారములు మున్నగుసంజ్ఞాంతరములను గల్పించుకొనుటలో బాధ యేమున్నది? ముగ్ధబోధ వ్యాకరణమున వోపదేవుఁ డిట్లె సమాహారముల నంగీకరించెను. (౧౨౭ విష.) ఆతఁ డక్షరములను బఠించుటలోఁ గొన్నిటి తుదిని 'ఇద్' వర్ణములను నిల్పలేదు. "హ య వ ర ల, ఞ ణ న జ మ..." మున్నగురీతిని బఠించి "ఏషాం మధ్యే యే వర్ణాస్తే ఆదివర్ణాన్తవర్ణసమాహారసంజ్ఞాః స్యుః" అని వచియించి - యల్ = య వ ర ల - ఞమ్ = ఞణనజము (ముగ్ధ. సంజ్ఞా. ౩ సూ.) మున్నగురీతిని సమాహారము లనుచు వ్యవహరించెను. "యలోద్విథాఽరోనిరను । నాసికస్సానునాసికః । ఞమోఽననునాసికస్తేన । తత్ స్థానే సానునాసికః" (ముగ్ధ. హల్సంధి. ౪౯ సూ.) బహు

గ్రంథపరిశోధకుఁడగు నన్నయభట్టారకుఁ డిట్లైదేని సంస్కృతవ్యాకరణములోని పద్ధతి ననుసరించి పయిరీతిని 'టాస్' మున్నగువానిఁ గల్పించెనని గ్రహింపనగును.

టాఙః = "టా - భ్యామ్ - భిస్" అను తృతీయైకవచనబహువచనములకు, చేతః = చేతవిభక్తి యాదేశమగును. ఇది 'చే' అనుదానికి నుపలక్షణము. ఙేసః = చతుర్థీ విభక్తి కనఁగా, "ఙే, భ్యామ్, భ్యస్" అను సంస్కృతవిభక్తులకు - కయి, కొఱకు = 'కయి, కొఱకు' అనునవి యాదేశములగును. 'కయి' అనుదానికి బా. క్రియా. ౧౦౬ సూత్రమునఁ జెప్పిన 'కై' అను రూపాంతరము లభించును. ఙసిసః = "ఙసి, భ్యామ్, భ్యస్" అనువానికి 'వలనః' = 'వలన' అను ప్రత్యయ మాదేశమగునని చెప్పఁబడు చున్నది. ఉదా:—రామునిచేతన్ రాములచేతన్ రామునికై రాములకయి, రామునివలనన్, రాములవలనన్ మొ. సహార్థాసః='సహ'అనుదానియర్థమునవచ్చు తృతీయావిభక్తికి, తోడ = తోడవర్ణక మాదేశమగును. ఇది తోవర్ణకమునకు నుపలక్షణము. (బా. కార. ౫ సూ.) ఉదా:—రామునితోఁగూడ లక్ష్మణుఁడు వచ్చెను. (రాములతోన్) గుణే = గుణము, హేతౌ = హేతు వగుచుండఁగా వచ్చు, పఞ్చమీతు = పఞ్చమీవిభక్తి యన్ననో, పట్టిఇతి = "పట్టి" అను తెన్గు విభక్తిగా నేర్పడును. (బా. కార. ౧౮ సూ. విస్తర. ౩౫౦ విష.) ఉదా:—"అందు పట్టి కార్చి విభక్తిషు" అను నీవఱకు వ్యాఖ్యాతమయిన యథర్వణవచనము చొప్పున (విష. ౮౮) నుమాగమము రాఁగా "జ్ఞానముంబట్టి ముక్తుఁడగున్" మున్నగునవి లక్ష్యములగును. కేచిత్ = కొందఱు, ద్వ్యక్షరాత్ = రెండక్షరములుగల, గుర్వాదేః = గుర్వక్షరము మొదటఁగల నాన్తాత్ = భావార్థనుజ్యంత మునకుఁ బరముగ, పట్టిమ్ = పట్టివిభక్తిని నిల్పుదానినిగా, ఊచిరే = పల్కిరి. ఉదా:—చేయన్+పట్టి = చేయఁబట్టి - మొ. విధానసామర్థ్యముచే నిట్టివానిపయి, పట్టి విభక్తిమాత్రము నిల్చును (చూ. ౩౦౯ విష.)

అన్యారాదాదేః = అన్యారాదిత్యాదులయోగమున వచ్చుపంచమికి, 'కంటె' వర్ణక మాదేశమగును (బా. కార. ౧౭ సూ.). ఉదా:—రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు. నిర్ధారణోద్భవా = నిర్ధారణార్థమందువచ్చు, షష్ఠీ = షష్ఠీ విభక్తి - లోపల = తెల్గున 'లోపల' విభక్తిరూపమున నిల్చును. (బా. కార. ౧౬) ఉదా:—మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు మొ. శేషే = సంబంధార్థము నందు వచ్చు - షష్ఠీ = షష్ఠీవిభక్తి - యొక్కచ = యొక్కరూపమున నిల్చును, చ శబ్దముచే సాధారణముగా యొక్కకుఁ బ్రయోగములేదని యెన్నునది (బా. కార. ౧౫ సూ.) ఉదా:—వానియొక్కతమ్ముఁడు = వానితమ్ముఁడు. విషయనిమి

త్తాదిజా = విషయ సప్తమి - "నిమిత్తాత్కర్మయోగే. (౧౪౯౦ వార్తికము. కార. సి. కౌ.) అనుచోప్పున వచ్చునదిమియు మున్నగు సప్తములరూపమున - అన్యా = తక్కినదగు తెలుఁగుసప్తమి - తథా = ఆప్రకారముగానే యగును. ఆది శబ్దముచేత నభివ్యాపకౌపశ్లేషికాది సప్తములును గ్రాహ్యాము లగుచున్నవి. ఉదా:—మోక్షమం దిచ్ఛగలదు. మోక్షవిషయ కేచ్ఛగలదని యర్థము. చర్మమందు ద్వీపిఁ జంపుచున్నాఁడు=చర్మమునిమిత్తమునఁ బెద్దపులినిఁ జంపుచున్నాఁడని యర్థము. "నిమిత్తాత్కర్మయోగే" = క్రియానిమిత్తమగునది కర్మపదార్థమునందు సంయోగ సంబంధముచేఁగాని సమవాయసంబంధముచేఁగాని నిల్చినచో నట్టినిమిత్తవాచక ముపై సప్తమి నిల్చునని యర్థము. (ఫలరూపమగుచర్మము కర్మపదార్థమగు ద్వీపి యందు సమవాయసంబంధముతో నున్నదిగాన నిమిత్తవాచియగు చర్మశబ్దముపై సప్తమీప్రత్యయము నిల్చెను.) బా. కార. ౧౭ సూత్రమునొద్ద నీవిషయము విపులముగా వ్రాయఁబడును. ఇచట నహోబలపతి పడినపొరపాటునైత మచటనె చూపఁబడును.

భావాదిజన్యజీప్ = "యస్యచభావేచ భావలక్షణమ్" (౨ - 3 - 3౭) ౬3౭ సూ. సి. కౌ.) "షష్ఠీచానాదరే" (౨ - 3 - 3౮) ౬3౫ సూ. సి. కౌ.) అనునవి మున్నగుసూత్రములచేతవచ్చు సప్తమి (జి - ఓస్ - సుప్ - = జీప్) అత్ర = యీతెల్గున, సర్వదా = ఎల్లప్పుడును - సుసా = ప్రథమా విభక్తితో, తుల్యః = సమానమైనదై యుండును. సత్యర్థజాసప్తమీ = అట్టి యెడల సంస్కృతమునందలి సత్యర్థజాతసప్తమి - వర్తమానార్థతాం గతాచ భవతి = వర్తమానార్థకత్వమును బొందిన దయియుండును. ఉదా:—రామేగతే సతి దశ రథోమృతః = రాముఁడు (వనికి) వెళ్లఁగా దశరథుఁడు మృతుఁడాయెను. పుత్రే రుద తిసతి = పుత్త్రుఁడు రోదనముచేయుచుండఁగా = ఏడ్చుచున్న పుత్త్రు ననాదరించియని యర్థము.

గోషు దుహ్యమానాసుసతీషు గతః = గోవులు పిదుకఁబడుచుండఁగా వెళ్లెను, మొ. కొన్నియెడల షష్ఠీకిని బ్రథమవచ్చుట గలదు. ఉదా:—రామస్య మహాను భావాత్స్యాత్ = రాముఁడు మహాపురుషుఁ డగుటవలన. పుత్రస్య రుదతస్సతః ప్రావ్రజీత్ = పుత్త్రుఁడు రోదనముచేయుచుండఁగా సన్న్యసించెను. రోదనము చేయుచున్నపుత్త్రుని ననాదరముచేసి సన్న్యసించెనని యర్థము.

(సూరి యీవిషయమునవిడిచిన చింతామణివిధులనెల్లఁ గారకపరిచ్ఛేదమున సంగ్రహించును.)

నః కౌటనః, కురనితామ్ (ఆం. చిం. ౨ కారి. అహో.

తత్సమా ౨౬౪ - ౨౬౬ పు.)

౧౩౬ విషయము. షష్ఠ్యేషా మేకవోకస్త । శబ్దానాం కౌ పరేభవేత్ ।
నః ప్రయస్స్యాత్ స్పృకారాచ్చ । సర్వత్రైతపష్మతేః
(వికృ. అజం. ౧౫ కారి. అహో. ౨౬౫ కారి.)

కల్పతరు. ౧౩౬ విష:—అనితామ్‌జసః = ఇకారాంతములు కానట్టిశబ్దముల షష్ఠీవిభక్తికి (ఙస్ - ఓస్ - ఆమ్ = ఙమ్) కుః = కుప్రత్యయ మాదేశమగును. "ఇతాంజసఃకిశ్చ" అనుసూత్రముచే నిదంతములకు షష్ఠ్యేకవచనమున 'కి' ప్రత్యయమును వచ్చును. బహుత్వమున నిదంతత్వము నిల్వదుగాన నట్టియెడల 'కు' వర్ణకమే యగును. నివర్ణకస్థలమునందువలెనె కువర్ణకము వచ్చుస్థలములందును 'కి' వర్ణకము పర్యాయముగా రాదు. అట్లె 'కి' వర్ణకము వచ్చుస్థలములందు 'కు' వర్ణకమును బర్యాయముగా రాదు. కౌ = కు ప్రత్యయము పరమగునపుడు - నః = 'న' అనునది నిల్చును. ఉదా:—రామునకున్ - రామునికిన్ - సీతకున్ - వదినెకున్ - కవికిన్ - కవులకున్ - మొ. 'ఇతామ్‌జసఃకిశ్చ' అనుదానిలోని తకార ముచ్చారణమాత్రార్థకమగుటచే నీకారాంతములకు నైకారాంతములకును బరముగా 'కి' వర్ణకమె యగును. (విస్తర.) ఉదా:—స్త్రీకిన్-శ్రీకిన్ - రైకిన్ మొ. "రాము-" అనునది 'ఇ' కారాంతము కాకున్నను నివర్ణాగమముచేరిన పై నవి నిదంతకార్యము నందఁగల్గునని యెన్నవగును. ఉః—రామునికిన్ - మొ.

---

విస్తర. ౧౩౬ విష:—అహోబలపతి "జ మః కురనితామితి ఇకారాన్తపర్యుదాసపూర్వక మన్యేషాం కుర్విహిత ఇతిపరిశేషాదిదన్తాత్, 'కి' స్సిద్ధ ఏవే త్యేకాతఃరాదీదంతాత్ 'కి' విధానార్థ మిదంసూత్రమ్" (అహో. ౨౮౮ పు.) అని యిట్లు "ఇతాంజసఃకిశ్చ" అను చింతామణిసూత్రమునకు వైయర్థ్యము చూపి తద్విధాన సామర్థ్యమున నేకాతఃరకములగు నీదంతములకు 'కి' వచ్చుననుచు "పూర్ణశ్రీకినిత్యాదౌ 'ఇతాం జసఃకిశ్చే'తి సూత్రారంభసామర్థ్యాత్కివర్ణకః" (అహో. ౩౦౧ పు.) అని వ్రాసెను. అహోబలపండితీయమునకుఁ దెల్గుటీక వ్రాయఁదలపడి కీ॥ శే॥ శాంతిభద్రాద్రిశాస్త్రిగారీయహోబలపండితుని యాశయములను గ్రహింపనేరక "కివర్ణకవిధి హారికిన్ మతికిన్ ఇత్యాదిలక్షచోటుల చరితార్థమైనది కావున సామర్థ్యమేది" అని (అహో. తెల్గుటీక. ౩౦౧ పుట.) యహోబలపతిని నిరసించుట పొరపాటు.

చింతామణి 'కు' విభక్తి పరకత్వమున నెల్లయెడలను నవర్ణాగమమును విధించుటచే నది సరికాదనియు నుకారాంత ఋకారాంతములకుఁ బరముగా మాత్రము వచ్చునని యు నుకారాంతములకుఁ బ్రాయికమనియు నధర్వణుఁడు సవరించుచున్నాఁడు.

సర్వేషామేవచ = సమస్తమైనట్టియు, ఉదన్తశబ్దానామ్ = ఉకారాంతశబ్దములకు, కౌపరే = కుప్రత్యయము పరమగునపుడు, ప్రాయః = తఱుచుగా, నః = నవర్ణాగమము, స్యాత్ = అగును. సర్వేషామ్మనుటచే 'ము - వు' అనునాగమములకుఁ బరముగాపయితము నవర్ణాగమ మగునని యెన్నఁనగును. ఉదా:—రామునకున్ శంభువునకున్, వనమునకున్, చివురునకున్, భ్రూవునకున్, మొ. సర్వపండితసమ్మతేః = ఎల్లపండితకవులసమ్మతివలన, ఋకారాచ్చ = ఋకారాంతములకన్నఁ బరముగా సయితము నవర్ణాగమము నిత్యముగా నగును. ఉదా:—విధాతృనకున్ సవితృనకున్ మొ. "ప్రాయోగ్రహణా దూకారాన్తాదపి భవతి" (అహో. ౨౬౫) అని యిట్లు ప్రాయశ్శబ్దము నుకారాంతత్వముతో నహోబలుఁ డన్వయించుట సరికాదు. ఏకాక్షరో (ఏకాక్షర+ఊకారాంత) కారాంతశబ్దములకు సయితము విభక్తిపరకత్వమున వుగాగమము నిల్చునుగాన నూకారము పయి కువర్ణకము నిల్చుట యసంభవము. ఉదా:—భ్రూవునకున్. మొ.

బాలవ్యాకరణ వివృతి. కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు. ౨౮.

౧౩౬ I విష. రామునకును - విష్ణునకును - సవితృనకును - విధాతృనకును. మొ.

సంజీవని. ౧౩౬ I విష:—సవితృనకు = సూర్యునకు - విధాతృనకు = బ్రహ్మకు. బా. తత్స. ౨౩ సూత్రముచొప్పున నిగాగమము రానిపక్షమున నుకార ఋకారములకుఁ బరముగా 'కు' ప్రత్యయము పరమగునపుడు - నిత్యముగా నగాగమమగును. ఈనగాగమము 'కి'త్తు గాన నది 'ఉ' కారాన్త ఋకారాంతముల కంతాగమమగును. ఉకారము శబ్దసిద్ధమైనను (గురునకున్) వ్యాకరణసిద్ధమయినను (రామునకున్ - వనమునకున్ - గురువునకున్) నీవిధి వర్తిల్లును. ఉదా:—రాము+న+కును = రామునకును - సవితృ+న+కును = సవితృనకును. బాల. తత్స. ౫౩ సూత్రముచొప్పున విధాత్రాదులకత్వస్త్రీవద్భావంబులు రానిపక్షంబున విధాతృఁడు మున్నగురూపము లుండును. అట్టిపాక్షికడుమంతత్వపక్షమున బా. తత్స. ౨౩. సూత్రముచొప్పున వైభాషికనిగాగమము రాఁగా "సవితృనికిని - విధాతృని

కిని" అనురూపము లేర్పడును. పిని కర్తృస్త్రీవాచ్యాపములు వచ్చునపుడు 'విధాత కును - సవితకును' అనురూపము లేర్పడును.

సంజీవని. ౧౩౬ II విష:—కవిత్రయమువారిప్రయోగములలో నీ నగాగమము నిత్యముగా నున్నను దక్కిన మహాకవిప్రయోగములలో నగాగమరాహిత్యము గన్పట్టుచున్నది. (విస్తర) ఆథర్వణుండును దీనిని ప్రాయికమని వచించెను. ఇట్టిస్థితిలో సూరి దీనిని నిత్యముగా విధించుట సరికాదు. ప్రయోగములు:— క॥ సకలక్షత్త్రభయంకరు నకు బాహ్లీకక్షితికి నని మొక్కన్నాన్న...(సభా. ౨ ఆ. ౭౬) విధాత్రుని కైనను నేరఁబోలునే (ఆది. ౧ ఆ. ౧౯) సీ॥ సంగరం బనిన నుత్సవము దైనెను క్రియ, సొలవక చనియెడుశూరులార (ఉ. హరి. ౬ ఆ. ౧౪౦) ఎక్కంగ వాహనం బీశకుఁ బసవఁ! డు...(బసవ. ౧ ఆ. ౧౧౬) కరుణించి శంభుండు కనకవస్త్రంబు । కటికాలచోడుకుఁ గురియించె నాఁడు! (బసవ. ౭ ఆ. ౪౭౩) కం॥ కనుపాదప్ర కైగని (భాస్కర. సుంద. ౩౮౨) మనువుకు (భాగ. ౧౦ స్కం. ఉత్త. ౫౧) త్రిలింగలక్షణశేషకర్త "కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులందక్కఁ దక్కినమహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు." (ప్రౌఢ. శబ్ద. ౧౯ సూ.) అని సూత్రించి కుత్సార్థదోషవిస్ఫురణంబు కలుగక పువర్ణాంతశబ్దంబులమీఁద నకారాగమము వచ్చుట...అత్యావశ్యకమని వివరించెను. కాని యట్టియెడలను నగాగమాభావమగపడుచున్నది. సీ॥ సీతూష్ణ కోరక నిటలాక్షుఁడును...(కవికర్ణ. ౩ ఆ. ౧౧౯)

---

విస్తర. ౧౩౬ II విష:—సీ॥ సహదేవ నకులవాసవసుతభీములఁ గ్రమమున నలువురఁ గౌరవేంద్రు! కొక్కొక్క మేటున నుక్కువంబున నొడ్డి...(సభా. ౨ ఆ. ౧౯౬. సర్వల. ౧ ఆ. ౩౩) అని తిమ్మకవి యుదాహరించెను. కాని "...కౌరవేంద్రుఁ। డొక్కొక్క యొడ్డున నొడ్డి తన్నును నొడ్డి" అని తాళపత్త్రమాతృకలలోను, నేఁటి ముద్రణములలోను పాఠము వెలయుచున్నది. మఱియు "కౌరవేంద్రుకు" అను షష్ఠి కచట నన్వయములేదు. ఇట "కౌరవేంద్రుఁడు"నఁగా ధర్మరాజని యర్థము. "పరుసదనంబు కోర్చి (కర్ణ. ౨ ఆ. ౨౯౯)" (బాలక. ౧౧౩ పుట.) తాళపత్త్రమాతృకలందును నిట్లె యున్నదనియు శరణ్యకర్త వ్రాసెను. కాని "అప్పరుసఁదనమున కోర్చి యతఁడుఁ బెనంగెన్" అని ముద్రణములలోని పాఠము వెలయుచున్నది. విశాలమగు తిక్కన భారతభాగమం దెచ్చటను నగాగమాభావప్రయోగము లేమిం జేసి యిచట నీముద్రణములపాఠమె తిక్కనయజ్వప్రయుక్తంబని విశ్వసింపఁదగును.

సీ॥...సౌం! పురుసం బుసం జూపు వాఁడికొనముకున్నన (భైరవకవి. శ్రీరంగ. ౧ ఆ. ౨౫౨ తాలకి. ౧౧౯ పు.)

సంజీవని. ౧౩౬ III విష:—'కంటె - అందు' వర్ణకంబులును బరంబులగునప్పుడు గొన్నిచోట్ల నమహత్తులకు నగాగమంబు కన్పట్టుచున్నదని ప్రౌఢవ్యాకరణమున వివరింపఁబడెను. (ప్రౌఢ. శబ్ద. ౨౦ - ౨౧ సూ.) అందుపరకత్వమున నగాగమమువచ్చుట తిక్కకవి సూరకవులచేత సయుక్త ముదాహరింపఁబడెను. (చూ. సంజీవని. ౧౩౭ I విష.) కంటె:—క...రుధిరా। భీలాన్నంబునకంటెను। మేలగు... (ఉద్యో. ౧ ఆ. ౩౬౯) చ॥...తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు (ఆది. ౪ ఆ. ౯౪ ప.) క॥...అనఘచరిత్రమునకంటె (నిర్వ. ౯ ఆ. ౫౨ ప.) ద్వి. తెలుఁగున్న కంటెను దెల్లంబుగాఁగ (బసవ. ౧ ఆ. ౨౭౧) అందు:—సీ॥ సభాలోకంబునయందు... (సభా. ౨ ఆ. ౧౫౭) క॥ తనువునయందు (ఆరణ్య. ౩ ఆ. ౧౦౫) చ....దేవసీ। వనివిమసనాయకత్వమునయం దభిషిక్తుఁడవై (ఆరణ్య. ౫ ఆ. ౨౨౬) గీ....ఉదర। దేశమునయందు నున్నట్టిదేవదేవు (శాంతి. ౨ ఆ. ౩౩) క॥ విను పిండదానసమయం। బున యందును...(హరి. పూ - భా. ౨ ఆ.) జవ్వనంబునయందు (కాశీ. ౧ ఆ.)

'కై' అనునది "కు ను+ఐ" అనువానిసంధిరూపమెయ్యైనను నిది పరమగునపుడు నగాగమమువచ్చుట కానరాదు. క. దనుజుని యాఁవుల వరుణుఁడు। తన దిక్కున నునిచినాఁడు తత్కార్యముకై। మనకుం బోవలె...(ఉత్త. హరి. ౬ ఆ. ౨౪౪) కైపరకత్వమున నగాగమము నెవ్వరును నుపదేశింపలేదు. అట్టియెడల నగాగమస్థితిని నిర్ణయించు ప్రయోగమును లభింపలేదు. (చూ. ౧౨౧ విష.)

నన్నయాథర్వ ౧౩౭ విషయము.

> అందు జీప స్సవిధవర్తినా మిందు (ఆం. చిం. అజం. ౭ కారి., అహో. ౨౬౬ పు.)
>
> సాశ్రయానాశ్రయాపిస్యా। త్తత్రార్థగతసప్తమీ।
> జేర్నః స్యాత్ సోపి ముబ్వన్తం। వినాప్రత్యయాన్వి
> తమ్।అమహాన్నా మజడగం। చోదన్తం నాన్యతోవిధిః॥
> (వికృ. అజం. ౧౬ - ౧౭ కారి. అహో. ౨౬౭).

కల్పతరు. ౧౩౭ విష:—జీపః = (జీ - ఓస్ - సుప్ = జీప్) సప్తమీవిభక్తికి - అంగు = అందు ప్రత్యయ మాదేశమగును. "విషయనిమిత్తాదిజా తతైవాన్యా" (౧౩౫ III విష.) అనుసూత్రముచొప్పున విషయాద్యర్థములందు వచ్చు జీప్పున కనఁగా సప్తమిచోట 'అందు' ప్రత్యయము నిల్చునని యర్థము. ఉదా:—మోక్షమునం దిచ్చగలదు = మోక్షవిషయమున నిచ్ఛగలదని యర్థము.

అదిశబ్దముచే రామునియందున్ మొ. మహతో 'ని - లా' పశ్చాదిః సూత్రమువే (౧౩౫ II విష.) బాహుళక 'ని' వర్ణము రాఁగా, 'రామునియందున్' అని యేర్పడును. నివర్ణాభావపక్షమున, 'రాము నందున్' అని యుండఁగా "అందు - వ్యు - కూర్చి విభక్తిషు" (౮౭ విష.) అను వొప్పున 'ను' మాగమము రాఁగా, 'రాము నందున్' అనురూప మేర్పడును. సవిధవక్తినామ్ = సమీపాన నిలుచువాని సప్తమ్యంతములకుఁ బర్యాయముగా 'అందు' అనుశబ్దము వాడఁబడును. 'అందున్' = దీనియందు - ఈస్థలమందు మొ. 'అందు' అనునది 'అందు' అనువానివలె సప్తమీ ప్రత్యయముకాదు. అయ్యది ప్రత్యేకప్రాతిపదికము. కావుననే భట్టాకరుఁడు "సవిధసక్తినా మందు" అని సూత్రించినవాఁడయ్యెను. ఇట్లు విభక్తి కానివానిని సప్తమీప్రత్యయములలోఁ జేర్ప నేల యనరాదు. 'నెరలిచ' అను వొప్పున 'అత్ర' అనుదానిసిద్ధికై యట్లు చేర్పఁబడెనని తెలియనగును. (౧౦౫ విష. మూ.) తత్రార్థగతసప్తమీ = "తత్ర" అనువాని యర్థముగల సప్తమీప్రత్యయమగు 'అందు' అనునది, సాశ్రయా = ప్రాతిపదికము సాశ్రయముగలదియు, అనాశ్రయాఽపి = అట్టిదికాక తత్ర శబ్దార్థకమగుచు స్వతంత్రప్రయోగముగలదియు, స్యాత్ = అగును. ఉదా:—రామునందున్ - అందు దైవ్వరు గలరు ? మొ. 'అందు' శబ్దము నిరాశ్రయమై "అత్ర" శబ్దార్థకమగుచుఁ బ్రత్యేకప్రయోగము గలదగునని యెఱుంగునది. "అంద్వింపు నాస్తు సప్తమీ" (౧౧౯ విష.) అనుసూత్రమునఁ జెప్పఁబడిన 'న' ప్రత్యయము 'అందు' ప్రత్యయమువలె నెల్లప్రాతిపదికములపైని నిలువనేరదు. "కేషాం చిదుదన్తానాం నేతివిభక్తౌ" (ఆం. చిం. అజం. ౭౦ కారి.) (౭౨౩ - ౭౩౬ విష.) అనుజ్ఞాపకసూత్రముచొప్పునఁ గొన్నియుదంతములపైనిమాత్రమె 'న' ప్రత్యయము నిల్చును. అట్టి 'న' ప్రత్యయము నిల్చు నుదంతశబ్దము లెవ్వియో యథర్వణుఁడు వివరించుచున్నాఁడు. ఙే: = సప్తమ్యేకవచనస్థానమున, నః = నప్రత్యయము, స్యాత్ = అగును. బహుత్వమున నవర్ణకము రానేరదు. సోఽపి = అ ట్లేకవచనమున వచ్చుటయు, ముబ్వాన్తమ్ = ము - మ్ము - ంబు - అనునవి ప్రథమైకవచనమున వచ్చునట్టియు, వుప్రత్యయాన్వితమ్ = వుప్రత్యయము ప్రథమైకవచనమున వచ్చునట్టియు, ఉదన్తమ్ = హ్రస్వోకారాంత మగునట్టియు - అమహన్నామ జడగమ్ = అమహద్వాచకమగు నప్రాణివస్తువులను దెల్పుశబ్దమును - వినా = వినాగా, అన్యతః = ఇతరశబ్దముకంటెఁ బరముగా - విధిః = నవర్ణకమువచ్చు విధి, న = లేదు. ఉదంత జడవాచకంబులగు శబ్దములసంబంధమయిన ము - మ్ము - ంబు - వు - అనునాగమమ్ముల పైని 'ఉదన్త' జడవాచకములపైని నేకవచనసప్తమీ 'న' ప్రత్యయము నిల్చునని

తాత్పర్యము. ఉదా:—వనమునన్ - వనమ్మునన్ - వనంబునన్ = వనమందున్; తరువునన్ = తరువునందున్ - చిగురునన్ = చిగురునందున్ మొ.

ఉకారఋకారంబుల కందువర్ణకము పరంబగునపుడు
నుగాగమంబగు. ౨౯.
బాలవ్యాకరణ 'రామునందును - విష్ణునందును - విధాతృనందును -
వివరణము. ఆగమ ము పువర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు
౧౩౭ I విషయ. నుగామంబు విభాషనగు. ౩౦.
వనమునందును - వనమందును - ధేనువునందును -
ధేనువందును.

సంజీవని. ౧౩౭ I విష:—అందువర్ణకము పరమగునపుడు "ఉకారంబునకును" "ఋకారంబునకును" నుగాగమమగును. కిత్తుగాననిది యంతావయవముగా నగును. రాము+ను+అందును = రామునందును, ఉకారము సహజమైనను వ్యాకరణసిద్ధమైనను నీవిధి వర్తిల్లును. "రామ" అను ప్రాతిపదికమునకు బా. తత్స. ౨౧ సూత్రముచొప్పున "ఉత్త్వము" రాఁగా "రాము" అని యేర్పడెను. 'విష్ణు' అనునది సహజోదంతము, విష్ణునందున్ మొ. బా. తత్స. ౨౩ సూత్రముచొప్పున నిగాగమమువచ్చునపుడు 'రామునియందును - విష్ణునియందును - విధాతృనియందును' అని రూపము లేర్పడును. నిగాగమాభావపక్షమునఁ బ్రకృతసూత్రమునకుఁ బ్రసక్తికల్గును. ఉదా:—విష్ణు+ను+అందును = విష్ణునందును. విధాతృ+ను+అందును = విధాతృనందును - మొ. బా. తత్స. ౪౦ సూత్రము చొప్పున వచ్చు ముగాగమమునకును. బా. తత్స. ౪౯ సూత్రముచొప్పున వచ్చు పుగాగమునకును, 'అందు' వర్ణకము పరమగునపు డట్టి నుగాగమము వికల్పముగా నగునని ముప్పదవసూత్రమునకుఁ దాత్పర్యము. నుగాగమాభావపక్షమున బా. సంధి. ౧౧ సూత్రముచొప్పునఁ బరరూపసంధి నిత్యముగా నగును. ఉదా:—వనము+ను+అందును = వనమునందును. వనము+అందును = వనమందును, బా. తత్స. ౪౨ సూత్రముచొప్పున సిద్ధించు "మ్ము-౦బు" అనువానిపయిని సయిత మీపాక్షిక నుగాగమము వచ్చును. ఉదా:—వనమ్మునందును - వనమ్మందును - వనంబునందును - వనంబందును మొ. పువర్ణముమీఁద ఉదా:—ధేనువునందును - ధేనువందును.

"అందు పట్టి కూర్చి విభక్తిషు" (౨౮-విష.) అనుచొప్పున నథర్వణుఁడు నుమాగమమును నిత్యముగా విధించియుండఁగాఁ దిమ్మకవిని సూరకవిని ననుసరించి సూరిగా రీవిధికిఁ బాక్షికతను సూత్రించిరి. కాని నుమాగమాభావమునకు నన్నయ

భారతభాగమునఁ బ్రయోగము గన్పట్టదు. ముగాగమముపై నకారాగమము లేని తిక్కనప్రయోగము నచిరము సూరకవి చూపెను. ప్రద్ధర...బాహాదండం బందొప్ప శుంభద్ధ్వజపటియుచు శాత్రంబుగాఁ బోఁచినన్...(ఉద్యో. ౧ ఆ. కవిసంశో. ౨ తరం. ౨ లక్ష. ౩౬) నేఁటిముద్రణములలో నిట "ప్రద్ధర...బాహాదండం బెపారి శుంభద్ధ్వజ..." (ఉద్యో. ౧ఆ. ౩౨౩ వావిళ్ల ముద్ర.) అని పాఠము వెలయుచున్నది. "రంగమందయిన వెండిలి..." (అను. ౧ ఆ. ౧౩ కవిసంశో. ౭ తరం. ౩౯) తిమ్మకవి భారతప్రయోగములఁ జూపలేదు. శ్రీనాథాదులప్రయోగములను జూపెను. మ...రాజశేఖర విభ్రాంతసహాయుఁ డింద్రగిరిదుర్గం బందు శ్రీవేంకటేశ్వరుఁ జొప్పన్.. (వసుచ.) కీ. అవిముక్తమందు నుపాస్యుఁ డాత్మ యటంచు..(కాశీ. ౫౧) మ. హరివశ్యాన్వయమందు దాశరథినై (కవికర్ణ) (పర్వోల. ౧ ఆ. ౫౧-౫౨-౫౩ ప.) ఇంకను గవిప్రయోగములు గలవు. ద్విపద. ఆవట ద్వాపరమందు విష్ణుండు (బసవ. ౬ ఆ. ౨౦౯) ఉ. యౌవనమందు యజ్వయు... (మను. ౧ ఆ. ౫౩) నకారాగమము వచ్చినప్పుడును రానప్పుడును నిట స్వరయతియె కన్పట్టుచున్నది. ఆ. వె...అంతరంగంబు నందుఁ జిక్కి కినుక సుఖంతఁజేసె (సౌప్తి. ౧ ఆ. ౨౯) (విస్తర) పువర్ణముపై నుక్కులేని ప్రయోగము నెవరును జూపలేదు. నన్నయాథర్వణులు "నన్', అనునది సప్తమీప్రత్యయమనియు "అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా" అనుచెప్పిన సద్దానికిఁ వృత్తియందును బ్రయోగముండుననియు నభిప్రాయపడియుండఁగా సూరి యిట దాని నుపేక్షించి కారకపరిచ్ఛేదమున నుపదేశించెను. "ఉకారాంతజడంబునకు నవర్ణకంబగు" (బా. కార. ౨౩ సూ.) "ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగు" (బా. కార. ౨౩ సూ.) "ఒక్కచో

---

విస్తర. ౧౩౭ I విషః—"...అమహద్వాచకముల ఆగమ పువర్ణకము మీఁదను వైకల్పికముగాను నగాగమ మగును" (ఆం. భా. అ. శబ్దప్ర. ౧౬ సూ.) "ఆగమ ము పు వర్ణముల కందు వర్ణకము పరమగునపుడు నుగాగమము విభాషనగు నని సూరి వ్రాసెను. కాని గురువందు - వధువందు - వంటి ప్రయోగములు ప్రామాణికప్రయోగములఁ గనరావు" (ఆం. భా. అ. ౧౩౩ పుట. తృ. ము.) అని యనుశాసనకర్త వ్రాసెనుగాని తా నంగీకరించిన యమహద్వాచకములపక్షమునందైనఁ దాఁ నుదాహరించిన 'తనువందు' అను దానికైనఁ బ్రామాణికప్రయోగము చూపలేదు. ఇంక "చెఱువందున్ తావందున్" మున్నగురూపముల కెవ్వరును సాధుత్వము నుపదేశింపలేదు. అట్టియెడల నిత్యనుగాగమమె బా. తత్స. ౨౯ సూత్రము చొప్పున లభించును. ఉదా:—చెఱువునందున్ - తావునందున్ మొ.

నుదంతంబగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి. ఉదా:—ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచే। రూపడఁగంగ మోఁదుచును (రా. యు. కాం.) (దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు)" (ప్రౌఢ. కార. ౧౭ సూ.) అని యిట్లు త్రిలింగలక్షణశేషకర్త విశేషప్రయోగమును జూపెను.

బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగామంబగు.

బాలవ్యా. ౩౧.

౧౩ర విషయము. రాములను - రాములచేతను - విధాతృలను - విధాతృలచేతను.

సంజీవని. ౧౩ర విష:—దీనికి మూలమగు చింతామణ్యథర్వణకారికలు ౧౩౫ II విషయమున నుదాహరింపఁబడినవి. విధాత = బ్రహ్మ. లట్టు టిత్తుగాన ద్వితీయాదివిభక్తిప్రత్యయముల కాద్యవయవముగా లకారము నిల్చును. ఉదా:— రాము+లను = రాములను. ఇట్లె రాములచేతను మొ. ఈవిషయమున సూరి నన్నయాథర్వణులప్రక్రియను మార్చికొనెను. (చూ. ౧౩౫ II విష.) అదంతామహత్తులకు ముగాగమమును నుదంతములకు వుగాగమమును సూరి విధించును గాన నీ లకారాగమమును బ్రకృతి కంతాగమముగా నుపదేశింపక ప్రత్యయమున కాద్యవయవముగా నుపదేశించినవాఁ డయ్యెను. (బా. తత్స. ౪౦-౪౯ సూ.) కొన్ని సర్వనామాదిశబ్దములపైని బాలాదిలాంత తత్సమ శబ్దములపైని నిలిచిన బహువచనలకారమునకు రేఫాదేశము ముందు విధింపఁబడును. ఉదా:—బాలురు - బాలురన్ - బాలురచేతన్ - వారు - వారిన్ - వారిచేతన్ - అల్లురు - అల్లురన్ - అల్లురచేతన్ మొ. (బా. తత్స. ౩ర ఆచ్ఛి. ౫ సూ. మొ.) లట్టునకుఁ బ్రయోగము—క. మమకారాహంకారము। ల మతిం జొరనీక నిశ్చలంబగు చూడ్కిన్ (ఆను. ౧ ఆ. ౩౬౭) 'నీ నాతా' శబ్దములకు ద్వితీయాదివిభక్తి పరకత్వమున నీలట్టురాదు. మనశబ్దమునకు ద్వితీయలోమాత్రము వచ్చును. ఆయారూపముల ప్రక్రియముందు వేఱుగఁ జూపఁబడును. ఉదా:—మిమ్మున్ - మీచేతన్ మమ్మున్ - మాచేతన్ - తమ్మున్ - తమచేతన్ - మనలన్ - మనచేతన్ మొ.

ఆమన్త్రణసుజసోః స్తః, క్రమేణ ఛాదారదాగమావన్తే
(ఆం. చిం. అజ. ౪ కారి.) (అహో. ౨౫౭ పు.)
సంబుద్ధౌనాత్ (ఆం. చిం. అజ. ౯ కారి.) (అహో. ౨౭౬).

సంబోధనే వా దీర్ఘః స్యాత్ ప్లుతిర్యోగస్య తద్గతేః
భవేత్ ప్రత్యయమేవ దీర్ఘత్వం విక్రతేః పరేః ॥
పక్షపాతాశ్రయ. (విక్ర. అజం. ౧౦ కా. అహో. ౨౫౭ పృ.)
౧౩౯ విషయము. నైకత్వే న దీర్ఘోపి ; ప్రాయో దీర్ఘోత్ర వాక్యవిత్ ॥
(విక్ర. అజం. ౩౦ కా. అహో ౩౧౭ పృ.)
సంబోధనే ప్లుతం ప్రాహుః కేచిద్గ్రామాదికేఽపి తే ;
(విక్ర. అజం. ౧౦ కా. అహో. ౨౫౭ పృ.)

కల్పతరు. ౧౩౯ విష:—అమన్తానుజసోః = సంబోధనసంబంధి ప్రథమైక వచన బహువచనముల, అన్తే = తుదిని, క్రమేణ = వరుసగా, 'అత్ - ఆరత్' ఆగమౌ = 'అత్ - ఆరత్' అను నాగమములు, స్తః = అగుచున్నవి. వీనిలోని తకార ముచ్చారణార్థకము 'క్రమేణ' అనుటచేత - ప్రథమైకవచనరూపముమీఁద 'అ' అనునదియు, ప్రథమాబహువచనరూపముమీఁద 'ఆర' అనునదియు నిత్య ముగా నిల్చునని యర్థము. ఉదా:—రాముఁడు+అ = రాముఁడ - రాములు+ ఆర = రాములార - ఓరాముఁడ - ఓరాములార - (౧౩౭ విష.) ఇతః = ఇకా రాంతములకు, సంబుద్ధౌ = సంబుద్ధియందు, అత్ = అదాగమము, న = లేదు. బహుత్వమున 'ఆర' యాగమము వచ్చునని భావము. ఉదా:—ఓహరి - ఓహరు లార మొ. ఇకారాంతములకుఁ బ్రథమైకవచనప్రత్యయము లోపించుచుండుటచే "అదాగమము"నకుఁ బ్రాప్తియే లేకుండఁగా నట్టిదానికిఁ జేసిన యీనిషేధమునుబట్టి ప్రథమైకవచనప్రత్యయము లోపించునపుడు లుప్తశేషము తుదినే 'అ వ్యము' నిల్చు ననునర్థము జ్ఞాపితమగుచున్నది. ఉదా:—ఓకాంత+అ=ఓకాంత - ఇట్లె "ఓయయ్య" మొ. ఇట సంధి నిత్యము (౭౫ I విషయము.)

"అత్ర సోర్లుకి కథ మదాగమప్రాప్తిః...తస్మాదనేన నిషేధే నాయమర్థో జ్ఞాప్యతే. యత్ర సోః శ్రవణం నాస్తి తత్రాగమః ప్రాతిపదికస్యైవేతి" (అహో. ౨౮౬).

సంబోధనమున ప్లుతస్వరము మఱికొన్ని కాకు స్వరములవలెనే సహజముగా నిల్చుననియుఁ వత్సమోపయోగికావ్య సంస్కృతవర్ణమాలయందును బ్లుతము లేమింజేసి తెలుంగునఁ బ్లుతము దీర్ఘరూపమే యనియు భట్టారకుఁడు తలంచి యుండుటంజేసియే సంబోధనదీర్ఘమును వేఱుగఁ జెప్పలేదనవగును. ఉదా:— రాముఁడా, రాములారా, హరీ మొ. (విస్తర) అహోబలపతి యిట్టిదీర్ఘమును

---

విస్తర. ౧౩౯ విష:—ఇట్లగుటచేత "అనితః, అని పూర్వసూత్రమునుండి యనువర్తింపక పోయినయెడల" హరియ (యా) అను మొదలగు సంబోధన ప్రథమైక

మార్గాంతరములచే సాధింపఁగడంగెను. "సంబోధనేదీర్ఘవికల్పోఽప్యాచార్యసమ్మత ఏవ - ననుం గృపఁ జూడు భారతీ - ఇత్యాద్యుక్తేః యద్వా ఆమన్త్రణసూత్రే "ఆ+అదితిఛిత్వా సవర్ణదీర్ఘేణ అకారస్యాపి ప్రశ్లేషః...తథా సతి సంబుద్ధౌనాత్ - ఇత్యత్ర ఆకారాకారయోర్నిషేధే ఇత్యమీాత్వంచ తత్రేష్టమిత్యర్థః ఫలతి..." (అహో. ౨౮౬) దూరాహ్వానాది ప్లుతస్థలములందును దీర్ఘములేని ప్రయోగములు వెలయుచుండుటంజేసియు "వదినే,రాములూ" మున్నగుదీర్ఘములు సాధువులు కామిం జేసియు నథర్వణాచార్యుఁ డీసంబోధనదీర్ఘము నిట్లు వివరించుచున్నాఁడు. సంబోధనే = సంబోధనవిషయమునఁ బదము తుదివర్ణమునకు, వా = వికల్పముగా, దీర్ఘః = దీర్ఘము, స్యాత్ = అగును. ప్రయోగస్య = మహాకవిప్రయోగము, తథా=అట్లు, గతేః = ఉండుటవలన నట్లు చెప్పఁబడెనని యర్థము. విక్రుతేః = ఆచ్ఛికపదమునకును, శుచేః = శుద్ధ మనఁగాఁ దత్సమపదమునకును, దీర్ఘత్వమ్ = దీర్ఘమువచ్చుట, అదితామేవ = అకారాంతేకారాంత శబ్దములకు మాత్రమే, భవేత్ = అగును. ఉః—రామా, హరీ, రాములారా, హరులారా మొ. వదినే, ఆంజనేయులూ, రాములూ, మున్నగునవి సాధువులు కానేరవని తాత్పర్యము. ఏకవర్ణే = ఏకాక్షరకతత్సమపదమునందును, దేశ్యేపి = దీర్ఘాంత దేశ్యపదమందును, హ్రస్వః = హ్రస్వరూపమగు "అదాగమము" న = లేదు - త్మో - నవలా మున్నగు వానికి "దీర్ఘాణాం హ్రస్వః స్యాన్నచ దేశ్యపదే న చైకవర్ణేపి" (ఆం. చిం. అజ. ౧౨ కా.) అను చింతామణిచెప్పున హ్రస్వము రానేరదుగాన నట్టి హ్రస్వము రానివానికి సంబోధనమునందును హ్రస్వరూపమగు "అదాగమము" రానేరదని భావము. దేశ్యప్రాతిపదికములకు హ్రస్వాంతరూపాంతరములును నుండుటచే నట్టివానికి సంబుద్ధియందును 'అదాగమము' రావచ్చునని చెప్పుచున్నాఁడు - దేశ్యేతు=దేశ్యపదమందు, క్వచిత్= ఒకానొకప్పుడు - వా = వికల్పముగా, హ్రస్వః = హ్రస్వమగు 'అ'దాగమఘటితరూపముండును. ఉదా:—ఓత్మో, గోపాలిగా = గోపాలిగ (అహో. ౩౫౫) ఓనవలా, ఓనవల మొ. "న చ దేశ్యపదే న చైకవర్ణేపి" అను చింతామణిసూత్రము నర్థమునె యథర్వణుఁడు వచించెనను నహోబలపతి తదనుయాయుల (నారా. తత్స. ౭౬ ప. ౨౦౭ కారి.) సమన్వయముకన్న నిట్లన్వయించుట లెస్స. "సంస్కృతభాషైకాక్ష

---

వచనరూపము లేర్పడును. అనువర్తించినయెడల హరి (రీ) మొదలగురూపములకుఁ జింతామణియందు దిక్కులేకుండును" (ఆం. భా. చ. ౧౬౨౫ - ౧౬౨౬) అను నాక్షేపము పరాస్తమగుచున్నది. "సంబుద్ధౌనాత్" అను చింతామణిసూత్రము నీభాషాచరిత్రకర్తగారు చూచుకొనకుండుటయు నిట స్మరింపనగును.

సంజీవని. ౧౩౭ I విష:—సంబోధన మభిముఖీకరణార్థకముగాన తత్తద్వస్తు వాచక ప్రథమాంతశబ్దములె సాధారణముగా నీవిషయమున వాడఁబడును. ఓగౌరి - ఓహరి - ఓతల్లి మొ. ప్రథమాంతముల తుది యుకారమునకును నత్వము వచ్చుట ౩౭ సూత్రమున నుదాహరింపఁబడెను. అట్లువచ్చిన సంబోధ నాకారము మున్నగు వ్యాకరణసిద్ధాకారముఁ కును శబ్దములతుదినుండు సహజా కారేకారములకునుఁ దత్సమములకును నాచ్ఛికములకును సంబోధనమున దీర్ఘము వచ్చుట వహుసగా ౩౩ సూత్రమున నుదాహరింపఁబడెను. (విస్తర) మఱియు ౩౭ సూత్రమున, 'ఏకార్థంబైన' యనుటచే "రాములు+అ = రాముల = రాములా" మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. 'పదంబుతుది' అనుటచే "గురు+అ = గుర, శంభు+అ = శంభ" మున్నగు ననిష్టరూపములు సంభవింపనేరవు. బా. అజం. ౧౪ సూత్రముచొప్పునఁ బాక్షికమగు 'ఓ' శబ్దమునుజేర్చి సూరి యుదాహరించెను.

నామన్త్రణే డుజీ త్వన్యే (ఆం. చిం. అజం. ౬ కారి.)
నన్నయా (అహో. ౨౬౨ పు.)
థర్వణీయము అర్థభేదే క్వచిచ్ఛబ్దా । దిగాస్యాచ్చ తతోఽపిడుజ్
౧౪౦ విషయము. నామన్త్రణే డుజ్ హ్రస్వశ్చ । బహుళత్వాత్ర నేష్యతే
(వికృ. అజం. ౭౧ కారి.) (అహో. ౩౪౪).

కల్పతరు. ౧౪౦ విష:—ఆమన్త్రణే = సంబోధనమందు, డుజ్ = డుప్రత్యయము, న = నిలువనేరదనఁగా లోపించునని, అన్యే = మఱికొందఱు చెప్పుదురు. ఉదా:—రాముఁడు = రాము+అ = రామ. మొ. ఇచట నహోబలపతివ్యాఖ్య వేఱురీతి నున్నది. "సంబోధనే, డుజ్న భవతి కింత్వదాగమఏవ నాఽగతోఽకారస్యేత్యన్యేవదన్తి. ఏజ్ హ్రస్వాత్సం బుద్ధేరితి సులోపః - ఓరామ..." (అహో. ౨౬౨

విస్తర. ౧౩౭ I విష:—"సంబుద్ధ్యన్తపదాన్తోతోఽ। ద్వాతస్యేతశ్చదీర్ఘతా।" (హరికా. తత్స. ౪౭ కా.) ఈ భాషాంతరీకరణము తప్పు. ఈకారికకు సంబుద్ధ్యంత పదము తుదినున్న 'ఉ' కారమునకు 'అదాగమము' వికల్పముగా నగుననియు నట్టి 'అకారము'నకును 'ఇకారము'నకును దీర్ఘమును వికల్పముగా నగుననియు నర్థ మగుటంజేసి 'ఉత్వమునకు' వచ్చిన 'అత్వము' నకే దీర్ఘము సిద్ధించునుగాని "సీత = సీతా" మున్నగుచోటులందలి సహజమగు "అకారమునకు" దీర్ఘము సిద్ధింపనేరదు. ఈసందర్భమునుబట్టి శబ్దసిద్ధాఽకారమునకు దీర్ఘమువచ్చుట సయిుతము స్ఫురింపని హరికారికావళి మూలగ్రంథము కానేరదనియు నది బాలవ్యాకరణభాషాంతరీకర ణమే యనియు విశదమగుచున్నది.

ప్రకృతసూత్రముచే డుజ్ఞు లోపింపనిపక్షమున "రాముఁడ - రాముఁడా-" అను రూపములు 3౨ - 33 సూత్రములచేతనే లభించును. ప్రకృతసూత్రంబునందలి "సంస్కృతనామంబు" అనుదళము స్వారస్యముచే సంస్కృతతుల్యత్వాతిదేశముగల (బా. ఆచ్ఛి. 3 సూ.) బల్లిదుఁడు మున్నగుశబ్దములందును సితరాచ్ఛికములగు 'తమ్ముఁడు' మున్నగువానియందును బ్రకృతసూత్రము వర్తిల్లనేరదుగాన "ఓతమ్మ - ఓబల్లిద" మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు. శుద్ధసంస్కృతనామంబులె యయ్యు సహజోదంతంబులగుటఁ గృతోత్వములు కామింజేసి "శంభుఁడు గురుఁడు" మున్నగు స్థలములందుఁ బ్రకృతసూత్రము ప్రవర్తింపనేరదుగాన "ఓశంభ - ఓగుర" మున్నగు ననిష్టరూపములు సంభవింపనేరవు. ఇట్లు సూరి ప్రయోగములనుబట్టి నన్నయాథర్వణీయమును సవరించెను. "రంగా" అను సంబోధనము 'రంగుఁడు' అను తత్సమ రూపమున సంభవించిన దనఁదగును. మఱియు నీసంబోధనము వాడుకలోనిది కాని కవిప్రయోగములఁ గన్పట్టదు.

నన్నయాథ. డు జ తౌ తు న, ప్లుతః స్యాత్సంబుద్ధావితి తుల్యతాం
౧౮౧ విషయము. విదుః కేచిత్ (ఆం. చిం. అజ. ౧౧ సూ.) (అహో. ౨౯౫ పు.)

కల్పతరు. ౧౮౧ విష:—"సర్వత్రోదోతోర్వ్యోర్భవతి మువత్; డుజ్మహత్పదానాం వా" అనుకారికకుఁ దర్వాతిదగుటంజేసి ప్రకృతసూత్ర ముదంత సంస్కృత నామములకంటెఁ బరముగఁ బ్రథమైకవచనమున వుప్రత్యయము రానిపక్షమందలి డుజ్ఞువచ్చుపక్షములోనిది గాన ఉతామ్ = ఉదంతసంస్కృతనామములకుఁ బ్రథమైకవచనమున డుజ్ఞువచ్చుపక్షమున, సంబుద్ధౌ = సంబోధనవిషయమున, డుజ తౌ తున = అట్టి డుజ్ఞును - అత్త్వమును రావు. అట్లు రానపుడు మిగిలియున్న యుదంతనామము తుదిస్వరమునకు - ప్లుతఃస్యాత్ = సహజముగు కాకు స్వరము వంటి ప్లుతస్వర మనఁగా దీర్ఘము కల్గును. ఇతి = ఇట్లని, కేచిత్ = కొందఱు, విదుః = తెలియుచున్నారు. ఇచటి ప్లుతశబ్దముచేఁ ద్రిమాత్రాకప్లుతస్వరము చెప్పఁబడుచున్నదని తలంపరాదు. చింతామణికర్త యాంధ్రమునఁ బ్లుతస్వరస్థితి నంగీకరించి వర్ణసమామ్నాయమున గణింపలేదు. (౫ II విష. దాని విస్త. II ౧౩౯ విష.) ఇచటి ప్లుతము ద్విమాత్రాకదీర్ఘస్వరమనియె భట్టారకహృదయ మనఁదగును. సంబోధనమున "కులదీప, మృడప్రియ, విష్ణువర్ధనా (ఆది. ౧ ఆ. ౧౬౨ ప.), అని యిట్లు తాను ప్రయోగించినరీతిని "అ" కారైకారములకు

దీర్ఘముకే విధించని భట్టారకుఁ డకించిత్కరముగు త్రిమాత్రాకస్వరము దూరా హ్వానాదికమైన లేకుండ యూరక యిట విధించియుండునని యెట్లు విశ్వసింపనగును? (సూ. ౧౬౯ విమ. కల్పతరువు.) అట్లయిన నిచట మాత్రము ప్లుత మనకా దీర్ఘము నేల విధింపవలయునని శంకింపరాదు. ఇచట దీర్ఘము నిత్యముగ విధింపనిచో “శంభు” మున్నగు శబ్దప్రత్యయాంతసంబోధనరూపములు నిలువవలసివచ్చును గాన దీనిచే నిత్యముగ దీర్ఘము విధింపఁబడెనని గ్రహింపవలయును. ఇచట నైతము దీర్ఘమునకే ప్లుతమని చెప్పుట వారి కాంధ్రమున నట్టి ప్లుతము సూచించుటకే యని యెఱుఁగ వలెను. ఇందలి కేవిష్ణుఁడను వాక్యరచన చెల్లదు. కాన విష్ణు సంబోధనమున వచ్చుపక్షమున “ఓశంభుఁడ - ఓశంభుఁడా” మున్నగు సంబోధనరూపములును చెల్ల నుచుండును. ప్రథమైకవచనమున ‘వు’ వర్ణకము వచ్చుపక్షమున “ఓశంభువ, ఓశంభువా” మున్నగురూపములు సిద్ధించును. విష్ణు కాక దీర్ఘమువచ్చు ప్రకృత సూత్రమునకు లక్ష్యమును భట్టారకుఁడే ప్రయోగించెను. “వాసు:...... జర త్కారుమహామునిపాలికింబోయి ......... శా॥ జరత్కారూ జగన్మాన్య యి కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారుఁడక్ మహీయాంజన్ ॥ (ఆది. ౨ ఆ. ౧౫౮) సీ॥ శ్రీకంఠ, ధర్మధురీణ, శంభూ, కమలాధిప,...(కాశీ. ౫౦ పద్యాల. ౧ ఆ. ౭౨ ప.)

బాలవ్యాకరణ ఉదంతసంస్కృతనామంబులమీఁది సంబుద్ధి డుజ్ఞునకు
వికృతి. సూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు. 3౫.
౧౬౧ 1 విమ. ఓవిష్ణూ౩, ఓశంభూ౩, పక్షంబునందు విష్ణుఁడ శంభుఁడ
ఇత్యాది.

సంజీవని. ౧౬౧ I విమ:—ప్లుతము త్రిమాత్రాకమను సిద్ధాంతముచొప్పునఁ బ్లుతస్వరము తర్వాతఁ బ్లుతత్వసూచకమగు ‘౩’ అను త్రిత్వానుమాపకలిపిని లిఖించుట సంప్రదాయము. శంభూ ౩ మొ. విభాషనగుటచేత, ‘ఊ’ కారప్లుతాదేశము రానిపక్షమున బా. తత్స. 3౨ - 33 సూత్రములచొప్పున “విష్ణుఁడ, విష్ణుఁడా” అని సిద్ధించుటేకాక బా. తత్స. ౫౦ సూత్రముచొప్పున సిద్ధించు వువర్ణకాంతరూపమునుండి “విష్ణువ, విష్ణువా” అనురూపములు నైతము సిద్ధించునని యెఱుంగునది. (విస్తర) ఆంధ్రవర్ణసమామ్నాయమున నేకాక కావ్యవాఙ్మయోపయోగి సంస్కృత

విస్తర. ౧౬౧ I విమ:—“బహుళగ్రహణముచే భగవానులూ ౩ హనుమంతులూ ౩ రాముఁడూ ౩ ఇత్యాదులు కొన్నిట నీకార్యము సిద్ధించును.” “తెలుఁగున దీర్ఘముప్రక్క 3 అంకె నిల్పుట ప్లుతమునకు గుర్తు” (ఆం. భా. అ. శబ్ద. 3౯ సూ.)

వాఙ్మయమందు నైతము ప్లుతాక్షరస్థితిని చింతామణిచెప్పిన నంగీకరింపని సూరి యిటఁ బ్లుతస్వరము నాదేశించుట సరికాదు. చింతామణిలోని ప్లుతశబ్ద మిట్లు సూరిని భ్రమింపఁజేసెనేకాని చింతామణిలోని యిచటి ప్లుతశబ్దము దీర్ఘమాత్రపర మని యీవలికే (౧౩౯ విష. ౧౮౧ విష.) కల్పతరువున విశదీకరింపఁబడెను. ఇది యిట్లుండఁగా "ఊకారంబు ప్లుతంబు" అని సూరి వచించుటయు సరికాదు. ఊకారము దీర్ఘమేకాని ప్లుత మెట్లగును ? ఈసూరిగారివచనప్రణాళినిఁబట్టిచూడఁగా "ఉ ౩" అనుదానిచేఁ బ్లుతోకారసిద్ధికల్గినను నది గురువు కానేరదని యాతఁడు తలంచినట్లు తోఁచుచున్నది. ప్లుతస్వరము గురువని లాక్షణికులు చెప్పలేదనికాఁబోలును ! ప్లుతస్వరమునకుఁ బ్రసక్తిలేదని తలంచి తెల్గునఁ బ్రాచీనులు దానిని వచింపరైరి. (౩౦ IV విష) ద్విమాత్రాకాలికోచ్చారణమాత్రమె గురుత్వసంపాదకము కాఁజాలినపుడు త్రిమాత్రాకాలికోచ్చారణ మెట్లు గురుత్వసంపాదకము కాకుండునని సూరి తలంచెనో తెలియకున్నది. "గురూణి దీర్ఘాణి" (ఋగ్వేదప్రాతిశాఖ్యము. ౧ పటలము) "పార్షదవ్యాఖ్య:—యోహిద్విమాత్రం గురుం కల్పయతి కల్పయత్యేవా ఽసౌ త్రిమాత్రిక మపీతి" (చూ. వై. పా. ౨౩౧ విష.) దూరాహ్వానాది రూపప్లుత స్వర ప్రసక్తినైనఁ బ్రసంగింపక యిట్లూరకయ యకించిత్కరమగు ప్లుతమును విధించుటేలకో తెలియకున్నది. (౧౩౯ విష.) దూరాహ్వానమందును హ్రస్వమగు లఘువును దెనుఁగుకవులు ప్రయోగింతురుగదా !

నన్నయాథ. ఆమన్త్రణ సుజసోః స్తః క్రమేణ చాదార దాగమా

౧౮౨ విషయము. వన్తే(ఆం. చిం. అజం. ౮ కారి.) (అహో. ౨౫౭ పు.)

కల్పతరు. ౧౮౨ విష:—దీని కీవలికె వ్యాఖ్య చేయఁబడెను. (౧౩౯ విష.)

సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం

బాలవ్యాకరణ, బగు. ౩౬.

౧౮౨ I విషయము. ఓరాములార, ఓకృష్ణులార, దీనికిం బాక్షికముగ దీర్ఘం

బగు. ఓరాములారా, ఓకృష్ణులారా.

---

హ్రస్వముప్రక్క "ప్లుత" పు గుర్తు నిల్పరాదనియు దీర్ఘముప్రక్క నిల్పవలెననియుఁ జెప్పుట నిరాధారము. అట్టి సంప్రదాయమును లేదు. అట్లైయున్నచో సూరి "ఊకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు." అని సూత్రించియుండఁడు గదా. మఱియు భగవానులు మున్నగురూపములు వ్యావహారికములు. మహాకవు లిట్లు ప్రయోగింపరు. చ. వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు...(ఆది. ౪ ఆ. ౧౮౧).

సంజీవని. ౧౮౭ I విష:—దీనికిం బాలికలుగ ప్రేరేచుచు ననఁగా "ఆర" అనుదాని తుదిహ్రస్వమునకు బా. తత్స. ౩౩ సూత్రముచెప్పిన దీర్ఘము వైకల్పికముగా నగునని తాత్పర్యము. సర్వనామములకు సంబోధనప్రసక్తి యుండదు కాని యనుప్రయుక్తముగు తచ్ఛబ్దరూపములు "వాఁడు - అది" అనువానికి సంబోధనరూపములు కన్పట్టుచున్నవి. ఓసిపిల్లవాఁడా, ఓసిచిన్నదానా - బహుత్వమున 'పిల్లలారా - చిన్నలారా - పెద్దలారా' - మున్నగునవి ప్రయోగములు గలయుచున్నవి. (వి. ప్రక.)

కల్పతరు. స్యాన్మధ్యమక్రియాయోగే వినాకుత్రచిదాగమమ్.
౧౮౭ సూత్రము. (విక్ర. అజం. ౧౭ శ్లో.) (అహో. ౫౭౭ పు.)

కల్పతరు. ౧౮౭ విష:—మధ్యమక్రియాయోగః = మధ్యమపురుషక్రియతోడియోగము, ఆగమంవినా = ఆరవాగమమునువిడిచి. క్వచిత్ = ఒకానొకప్పుడు స్యాత్ = ప్రయుక్తమగును. ఉదా:—వినుఁడు ప్రసిద్ధులైన పృథ్వీపతులు (ఆది. ౪ ఆ. ౧౭౨) కం. అశేషా ! స్వినాథులారవయఁ తి దానము నాకింపు (ఆది. ౭ ఆ. ౨౬).

మధ్యమపురుషయోగంబునం దారగాగమము విభాష
నగు. ౩౭.

బాలవ్యా. వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార - వచ్చితిరి
౧౮౭ I విష. కాంతలు - వచ్చితిరి కాంతలార - అన్నలార మిమ్ము
నడిగెద నొకమాట - మధ్యమపురుషయోగంబులేనిం
జేసి యారగాగమంబు నిత్యంబు.

---

విస్తర. ౧౮౭ I విష:—"సంబోధ్యవాచకములు వానిక్రియలును బహువచనాంతంబులైనను గ్రియమీఁదవచ్చెడి యమ్మాదులుమాత్ర మేకవచనాంతంబులగును. ఉదా:—ఆ. వె. మన యశోద చిన్నిమగవానిఁ గనెనఁట। చూచి వత్తమమ్మ సుదతులార. (భాగ. ౧౦ స్కం. పూ. భా.)" (బా. గు. ప్ర. తత్స. ౩౦ సూత్రవ్యాఖ్య.) ఇట్లు బా. గు. ప్ర. కారుఁడు ప్రౌఢవ్యాకరణములోని శబ్దపరిచ్ఛేదమునందలి ౭౮ సూత్రమును నుదాహృతులను స్వీకరించి యిటఁ బ్రసక్తిలేకున్నను జూపెను. దీనినిఁబట్టిచూడఁగా "ఆర" గాగమప్రయోగస్థలమందె యిట్టి కార్యమగునని యాతఁడు తలంచెనేమో? యని తోఁచుచున్నది. "మీరు చూచితిరమ్మ మెలఁత లిచట "ఇత్యాదు లుండరాదని తలంచెనుగాఁబోలును?

సంజీవని. ౧౮3 I విష:—మధ్యమపురుషక్రియా యోగంబునం దనఁగా మధ్యమపురుషక్రియకుఁ గర్తయగు యుష్మదర్థమును సంబోధించినదగునప్పుడాసంబోధ్యవాచకము వైకల్పికముగ నారగాగమము నందును. బా. తత్స. 3౬ సూత్రముచే నిత్యముగా సిద్ధించుచుండఁగాఁ బ్రకృతసూత్రము దానికిఁ బాక్షికతను విధించుచున్నది. ఉదా:—వినుఁడు బాలకులు, వినుఁడు బాలకులార. వినుఁడను మధ్యమపురుషక్రియకుఁ గర్తయగు యుష్మదర్థమునకు విశేషణముగాన నట్టి సంబోధ్యవాచకమున కారగాగమము వైకల్పికమగుచున్నది. "అన్నలార మిమ్ము నడిగెద నొకమాట". ఇందు మధ్యమపురుషమగు 'మిమ్ము' అనెడియుష్మదర్థకశబ్దము ప్రయుక్తమైనను సంబోధ్యులు మధ్యమపురుషక్రియాశ్రయులు కారు. ఇట 'నే నడిగెదను' అనునవి కర్తృక్రియలు. (విస్తర) సీ...ఏను మి। మ్మందఱ వేఁడెద నన్నలార (ఆది. ౨ ఆ. 3౮).

---

విస్తర. ౧౮3 I విషయ:—సంబోధనమున వర్తిల్లు నభిముఖీకరణ మచేతనముల కసంభవమని తలఁచి కావలయు "గీ...। స్త్రీపురుషశబ్దముల కొకచెంత నార। దొలఁగి ప్రథమాబహూక్తి యట్లడరు నభవ (సర్వల. ౧ ఆ. ౭౮) అని తిమ్మకవి వ్రాసెను. కాని యచేతనములకును మహత్త్వవివక్షయందు సంబోధనము సుప్రసక్తము కానోపును. సీ॥ సహకార, మల్లి్రియు సహకారుఁ బున్నాగ, పున్నాఁగు... కానరే...(ఆర. ౨ ఆ. ౯౫ ప.)

"మధ్యమపురుషక్రియ లేనిచో 'ఆర' లోపింపదు" (ఆం. భా. అ. శబ్ద. ౯ సూ.) ఇది సరికాదని తోఁచెడిని. మధ్యమపురుషక్రియ యధ్యాహార్యమైనపుడు నైత మారగాగమము లేకపోవచ్చును. చ॥...సంభ్రమకారణమేమి సంయముల్ (రామా. సర్వల. ౧ ఆ. ౮ ప.) సంయముఁల్ = సంయములారా "చెప్పుఁడు" అని యిందు మధ్యమపురుషక్రియ యధ్యాహార్య మగుచున్నది. ఇట్టి యధ్యాహారము వింతకాదు. చ॥...కురువృద్ధులార...నన్ను నేల దు। ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె (సభా. ౨ ఆ. ౨౧౮) చెప్పఁడా యని యధ్యాహార్యము. ఇట్టి ప్రయోగములచే "మధ్యమపురుషయోగమును ముఖ్యముగా సూచింప వినుఁడనుక్రియను మొదటనిడెను. గాన...'బాలకులు వినుఁడు' అని యుండరాదని సంభావించునది" (బా. సా. వే. ౧౮౬ పు.) అను నియమము సరికాదని విశదమగుచున్నది. "సంబోధ్యవాచకము మధ్యమపురుషక్రియకుఁ గర్తయై దానితో నన్వయించుటయే మధ్యమపురుషక్రియాయోగము" (బా. సా. వే. తత్స. 3౬ సూ. వ్యా.) సంబోధ్యవాచకమునకుఁ గ్రియతో నన్వయ మెట్లు? సంబోధన మభిముఖీకరణమాత్రార్థకము గదా.

వర్ణనము లాన్తాత్తు రుఠౌ తయోః క్రమేణ స్తః (ఆం.చిం.అజ.
౧౮౮ విషయము. ౪ కారి. అహో. ౨౦౭ పు.)

కల్పతరు. ౧౮౮ విష:—("లు జసో ల శసో ఉలాన్తాల్లాన్తాత్తు రుఠౌ తయోః క్రమేణ స్తః" అనుచింతామణి కారికలోని ప్రకృతసూత్రము) లాన్తాత్తు = అకారాంతలకారము తుదిగల శబ్దముకంటెఁ బరమైయున్న, తయోః = ఆ 'జస్, శస్' ప్రత్యయములకు, రుఠౌ = 'రు, ర' అనువర్ణములు, క్రమేణ = వరుసగా, నాదేశములు, స్తః = అగుచున్నవి. శస్సునకు నాదేశమగు 'ల' అనుదానికేకాక తృతీయాది విభక్తి పరకత్వమునవచ్చు 'ల' అనుదానికిని రత్వము కల్గునని లక్షించునది. అహోబలపతి "స్త్రీయామపి - బాలరఁ గనియెన్" (అహో. ౨౦౭) అనివ్రాసెనేకాని యట్టివిషయమును నిర్ణయించు ప్రయోగమును జూపలేదు. కం. ఇరువదియేవురు పాంచాలుర నూర్వురు కేకయులును బాహాంగకులై ।...(ద్రోణ. ౨ ఆ. ౨౭౭) అనురీతిని మహాత్ముంలింగలాంతముఁంచే యిట్టి రత్వము నిశ్చితముగాఁ గన్పట్టుచున్నది.

అదంతంబై దీర్ఘపూర్వలోపధంబైన మహాత్తుమీఁది
విభక్తి లకారంబునకు రేఫంబగు. ౩౦.

బాలవ్యాకరణ. బాలురు - బాలురను - బాలురచేతను - నృపాలురు -
౧౮౮ I విషయము. నృపాలురను - నృపాలురచేతను - దయాళుశబ్దంబున
కిట్లు రేఫంబు గానంబడియెడి. దయాళురు - దయా
ళురను - దయాళురచేతను.

సంజీవని. ౧౮౮ I విష:—"అలాన్తాల్లాన్తాదితిచోక్తేః లోపధస్యాప్యకారాంతస్యైవ గ్రహణమ్ - నత్వన్యస్య. ధీశాలురు" (అహో. ౨౦౭ పు.) అనుకవిశిరోభూషణపంక్తులను సహాయముచేసికొని మహాకవిప్రయోగానుకూలముఁగ నిట్లు సూరి చింతామణిసూత్రమును సవరించి వివరించెను. అదంతమనుటచే బుద్ధిశాలులు, మృదుతాలులు మున్నగుశబ్దములందు రత్వమురాదు. తపరకరణముచే 'బాలా' మున్నగువానికిని గాదు. "స్త్రీయామపి - బాలరఁ గనియెన్" (అహో. ౨౦౭ పు.) అను కవిశిరోభూషణవ్యాఖ్యకుఁ బ్రమాణము కన్పట్టదు. తపరకరణస్వారస్యముచేతనే యీవిధి తత్సమశబ్దములకుమాత్రమె యని వ్యక్తమగుచున్నది. తేలలు (మూఢులు) మాలలు (మాలశబ్దభవము - స్త్రీసమత్వము తద్భవతాబీజము) మున్నగు నాచ్ఛికస్థలములందును రత్వము లేదు. కూళలు మున్నగుచోట్ల నున్నళకారము లకారమున కన్నఁ బృథగక్షరమగు ళకారము గావునఁ జేసియచట రత్వము లేదనఁదగును. మాలశబ్దపుఁ దత్సమరూపము 'మాలుఁడు' కావలయును. "మాలాభిల్లాః కిరా

త్రాశ్చ । సర్వేపి మ్లేచ్ఛజాతయః" (శబ్దా. చిం. మాలశబ్దమునొద్ద) ఇట్టివి "విరళాన్ పేచోషాదికశబ్దాన్..." అనుచొప్పున నప్రయుక్తములని యెన్ననగును. కాన "మాలుఁడు - మాలురు" అని యుండునా యని శంకింపఁజనదు. దీర్ఘపూర్వ లోపధమనుటచే వరుసగా 'మహాబలులు - రాములు' మున్నగుచోట్ల రత్వప్రసక్తి లేదు. దీర్ఘపూర్వలోపధ మనఁగా దీర్ఘపూర్వకమగులకార ముపధగాఁగలశబ్దమని యర్థము. తుదివర్ణమునకు ముందటివర్ణ ముపధ యనఁబడును. "అలోఽన్త్యాత్పూర్వఉపధా" (౧-౧-౬౫) (సి. కౌ. ౨౪౯ సూ.) బాలశబ్దమునఁ దుదియక్షరమగు 'అ' కారమునకు ముందటి లకార ముపధ యని యెన్నునది. మహత్తులమీఁది యనుటచే "కాలములు" మున్నగుచోట్ల రత్వము లేదు. విభక్తి లకారంబున కనుటచే 'బాలురు' అనుచోటి శబ్దావయవలకారమునకు రత్వము లేదు. బాలురను - బాలురచేతను మున్నగుచోటులందలి లట్టు విభక్త్యవయవముగా విధింపఁబడుటంజేసి (బా. తత్స. ౩౧ సూ.) యద్దాని లకారమునకును రత్వము సిద్ధించుచున్నది. "దయాళురు - దయాళురను" అనుచోట్ల దయాళుశబ్దము "అదంతము" కామింజేసి యచట నీవిధి వర్తింపదుగాన "దయాళుశబ్దమున కట్లు రేఫంబు గానంబడియెడి" అనువాక్యముచే నద్దాని రత్వమును సూరి నిపతించెను. కాని యట్టిదాని నిర్ణయింపఁజాలు ప్రామాణికప్రయోగమును జూపలేదు. (చూ. ఆం. భా. చ. ౧౬౨-౬౬ పు. ౧౪ వివృతి.) (విస్తర.) ప్రయోగములు:—క. ఇరువది యేవురు పాంచా । లురు నూర్వురు కేకయులు...(ద్రోణ. ౩ ఆ. ౨౭౭)

---

విస్తర. ౧౪౪ I విష:—ఇట్లు 'దయాళురు' అనుదానిసాధుత్వమె సందేహాస్పదమైయుండ నీరీతివగు 'కరుణాళురు' మున్నగు పెక్కుశబ్దములకు సాధుత్వమును గల్పించు నీక్రింది బా. గు. ప్ర. వ్యాఖ్య సరికాదు. "దయాం లాతి (గృహ్ణాతి) దయాలః - కరుణాంలాతీతికరుణాలః" అని యిట్లు కప్రత్యయాంతకృతకశబ్దములను గల్పించి "దయాలురు - కరుణాలురు" మున్నగురూపములు బాలురు మున్నగువాని వలెనె సాధువులగుననియు నింక దయాళుశబ్దమునుండి "దయాళులు" అను ననిష్టరూప మొదవకుండ సూరి ప్రకృతసూత్రసందర్భమున "దయాళు" శబ్దమును జేర్చె ననియు గుప్తార్థప్రకాశికాకర్త వ్రాసెను. (బా. గు. ప్ర. ౧౧౧ పు.) కరుణాలాద్యకారాంతశబ్దములకుఁగాని "కరుణాలురు" మున్నగు రత్వఘటితశబ్దములకుఁగాని ప్రయోగయోగ్యత్వమును నిర్ణయించు ప్రామాణికప్రయోగములను జూపకయె యిట్టి కల్పనముచేయుట యుక్తముకాదుగదా. అనుశాసనకర్త సూరివలె నేమియు వివరింపకయె "లోకపాలురు" మున్నగువానితోపాటుగ 'దయాలురు' అనియు

సీ...క్షాత్త్రం బగుట మల్లురకును జెల్లి మైనను...(శాంతి. ౧ ఆ. ౧౯౩) క. పృథుహస్తాహతనుభ్యపదక్ష్మా। ఱుకు కేలిం పగ...(హ. హరి. ౨ ఆ. ౧౨౬) గీ. మల్ల గణంబుల లోకపాలురనుఁ జూచి (భీమ. ౫౦. పర్వల. ౧ ఆ. ౧౩౬) మ. మదనం భోరుహ...నాఁక కేర్కొనీ। ఱుకు సంఘోషము కొందువారు నెదుట లోఁగొంచు నర్తింపరే (పారిజా. పర్వల. ౧ ఆ. ౧-౩) అనుకొనకర్త యీవిధి నవానళ్యకముగ బహుళముం జేసెను. యుద్ధమల్లునిశాసనమునందలి "మలెనుడు" అనునదియు, రామా భ్యుదయమునలోని "మల్లురు" అనునదియు బహుగ్రహాణప్రయోజనములుగ వివ రింపఁబడెను. యుద్ధమల్లునిశాసనములోని రత్వము ప్రామాణిక మనఁజనదు. మఱియు నందలి ప్రయోగము ప్రామాణికవ్యాకరణసూత్రములను పూర్వ(జాలి నంతటి ప్రమాణము కానేరదు. (చూ. ఆం. భా. చ. ౧౬౨౩ పుట. ౧౫ విమర్శ ణము) "మల్లుడు" శబ్దమునందును రత్వము నిత్యముకాదు. దానియందలి పాక్షిక రత్వముసైత మర్వాచీనము. అయినను దానిసాధుత్వమును సంగ్రహించుటకయి "మల్ల" శబ్దముపట్టున నీవిధి పాక్షికమని సూత్రింప నగునుగాని నిత్యముగఁ బ్రవ ర్తించు నీరత్వశాస్త్రమునకు బహుళతను గల్పించుట సరికాదుగదా. త్రిలింగ లక్షణశేషకర్త "ద్విత్వయుక్తలాంతంబు మీఁది ఉలలకును రురలాదేశంబగు" (ప్రౌఢ - శబ్ద - ౨౩ సూ.) అని యిట నొక నిత్యవిధి నుపదేశించెను. ఈతఁ డుక్రింది తిమ్మకవి విమర్శమును సైతము చూచికొన్నట్లగపడదు. క. మల్లు లను శబ్దమునకున్। మల్లులు మల్లురని కృతుల మానుగఁ బలుకం। జెల్లును గవి యనుమతి నహి। వల్లభ కేయూర దురితవారకదూరా॥ (సర్వల. ౧ ఆ. ౧౬౫) అని చెప్పి యీక్రిందిలక్ష్యముల నాతఁడు చూపెను. గీ॥ వలసిననేలు మేను...జెట్టిమ। ల్లులవిఱుతున్...(విరా. ౧ ఆ. ౨౨౩) మ. అరరే యల్లియరామరాజు...వీరారిమ। ల్లురకున్ మట్టి యగుం దదీయబలధూళుల్...(రామాభ్యు. సర్వల. ౧ ఆ. ౧౪౦ - ౧౪౧ ప.)

తిక్కయజ్వస్థలాంతరమునందును రత్వరహితముగనే యీక్రిందిరీతిని బ్రయో గించియుండుట నరయఁగా నీశబ్దమునందలి రత్వ మర్వాచీనకవిసమ్మతముమాత్రమె యని యెన్న నగును. చ...జెట్టిమ। ల్లులవిఱుచుం గడంగి ప్రబలుం డనఁగాఁ జరి యించుచుండు వి। చ్చలవిడి భీముఁ డీతఁడు...(విరా. ౫ ఆ. ౩౨౩) మఱియుఁ

సుదాహరించుటనరయఁగా నాతఁడును నీగుప్తార్థప్రకాశికామార్గమునె యూఁతగాఁ గొని యట్లుదాహరించెనాయని యాలోచింపవలసియున్నది.

బైరామాభ్యుదయ ప్రయోగమాత్రమున ద్విత్వయుక్తలాంతశబ్దాయులందెల్ల ద్విత్వమును త్రిలింగలక్షణశేషకర్తవిధించి "భల్లులు" మున్నగువానికెల్ల నసాధుతను ఘటించుట సాహసమనియుఁ జెప్పకతీరదు.

స్యాద్ దమహతాం విభక్తౌ । సోశ్చము తదుపరి పునర్ము
బూ ప్రాచామ్. (ఆం. చిం. అజం. ౯ కా.) (అహో.
సన్నయాధ. ౨౭౯ - ౨౮౦).
౧౮౫ విషయము. ము।ర్వనాదికశబ్దేభ్యో । ముబూస్యాతాంచ తత్పరమ్
చాపరే మస్యబిందుః స్యా । న్మాపరే మేళనం భవేత్.
(వికృ. అజం. ౨౧) (అహో. ౨౭౯ - ౨౮౦ పు.)

కల్పతరు. ౧౮౫ విష:—అమహతామ్ = అమహద్వాచకములకు, విభక్తౌ = సుప్రత్యయేతరవిభక్తిపరమగుచుండఁగా, 'ము' = 'ము' అనునాగమము - స్యాత్ = అగును. అమహతామ్ = అనుహత్తులకుఁ బరమగు - సోశ్చ = సుప్రత్యయమునకును, ము = 'ము' అను ప్రథమైకవచన ప్రత్యయము - స్యాత్ = ఆదేశమగును. తదుపరి = ఆరెండువిధములైన 'ము' అనువానిమీఁదను - పునః = వేర్వేఱ - ముబూ = 'ము' అనున దొకసారియు, 'బు' అనున దొకసారియు, ప్రాచామ్ = పూర్వులమతమున ననఁగా వికల్పమున - స్యాతామ్ = అగుచున్నవి. 'తదుపరి' అనుచోఁ బూర్వ 'ము' అనుదానిమీఁద 'ము, బు' లు నిల్చుట స్వరవ్యవధానమున సంభవింప నేరదుగాన 'ము' అనుదానిమీఁద నున్న 'ఉ' కారము లోపింపఁగా మిగిలినమకారము మీఁద 'ము' అనికాని 'బు' అనికాని నిల్చునని గ్రంథకృదాశయమును గ్రహింపవలెను. ఇట్టి ప్రక్రియచే మువర్ణమకారముపై 'ము' నిల్చునపుడు రెండుమకారములకును మేళనముకల్గి 'మ్ము' అనురూప మేర్పడును. అట్టి మకారముపై 'బు' నిల్చునపు డామకారము పూర్ణబిందువగునని ప్రయోగప్రసిద్ధినిబట్టి వ్యాఖ్య చేయనగును. ఉదా:—వన+సు = వనము; వనము+ము = వనమ్+ము = వనమ్ము; వనమ్+బు = వనంబు; వన+జస్ = వన+లు = వన+ము+లు = వనములు; వనము+ము+లు = వనమ్+ము+లు = వనమ్ములు. వనమ్+బు+లు = వనంబులు - ఇట్లె వనమును, వనమ్మును, వనంబును మొ. "వనమ్+బు" అనుచో "బువర్ణకప్రయోగే ఉల్లోపే 'నశ్చాపదాంతస్యఝలీ' త్యనుస్వారేచ కృతే వనంబు" (అహో. ౨౮౧) అని యహోబలపతి యనుస్వారమును పాణినీయముచే సాధించెను. కాని యాసూత్రమును దెలుంగునవాడినచో 'కిన్క - మున్గు' మున్నగుచోటులందును ననుస్వారము

లోపించును. అట్టి యుల్లోపము కల్గునపుడు, బౌపరే='బు'అనునది పరమగునపుడు మస్య = మకార వ్యంజనమునకు - బిన్దుఃస్యాత్ = పూర్ణబిందువగును. మాపరే = 'ము' అనునది పరమగునపుడు, మేళనమ్ = రెండుమకారములకును సంయోగము, భవేత్ = అగును. వనాదికమాకృతిగణము.

అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు.

౩౯.

బాలవ్యా. వృక్షము - ఋక్షము - దైవము - కళత్రము - అప

౧౮౫౬ I విష. త్యము - క్లీబంబులు మిత్రాదులనుసూత్రంబునఁ బాక్షి

కంబుగం బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాది

---

"ఇతరత్రచ ద్వితీయా అనెడిసూత్రము నర్థమును అన్యస్యాః క్వచిద్భవేచ్ఛాన్యా అనుహలంతపరిచ్ఛేదసూత్రముచే సిద్ధించుచున్నది కావున నీసూత్రమున నొక్కద్వితీయకుఁ బ్రత్యేకముగ విధినిగల్పించు టనావశ్యకము" అనుచు (ఆం. భా. చ. ౧౬౩౭ - ౧౬౩౯ పుటలు.) దీని (ఇతరత్రచేత్యాది) యర్థము నీక్రిందిరీతిని మార్చిరి. "ఆజంతసంస్కృత నపుంసకలింగశబ్దములై మహన్మహతీవాచకము లగుపదములకును అజంతపులింగములై మహతీతరామహద్వాచకములైన పదములకును (ఇతరత్ర, అనుదానియర్థమిది) వాని సంస్కృతద్వితీయైకవచన (తుల్య) రూపములు ప్రథమైకవచనమున నిలుచును ('ద్వితీయా' అనుదానికర్థమిది.) మిత్రము—కళత్రము—వృక్షము..." (ఆం. భా. చ. ౧౬౩౭ పు.) ఇదిసరికాదు. వీని ద్వితీయైకవచనతుల్యరూపములు "మిత్రమ్ - కళత్రమ్ - వృక్షమ్" అనునవి. వీనికి 'ఉ' త్వవిధానములేనిదే 'మిత్రము' మున్నగురూపములసిద్ధి కల్గదుగదా. 'కళత్రము - వృక్షము' అనునవి స్యాదమహతామ్మను చింతామణిచేతను 'మిత్రము' అనునది నన్నయప్రయోగాభిప్రేతమగు "క్వచిదర్థవిశేషేతు క్లీబేపుంస్యుభయరూపతా" (౧౨౬ విష.) అనునథర్వణకారికచేతను సిద్ధించుచుండఁగాఁ బైప్రక్రియ సిద్ధసాధనదుష్టమే యగుచున్నది. ఇంతియకాక "తస్యాః ప్రథమాచేత్యాదిసూత్రమున భాషాచరిత్రకారులు విభక్తిపరముగఁ బునరుక్తి నంగీకరించిరి. దాని ప్రణాళినిబట్టి యందలి 'తస్యాః' అనుతచ్ఛబ్దమునుబట్టి "ఇతరత్ర" చేత్యాదిసూత్రమును విభక్తివిధాయకమే యని నిర్ణయింపఁబడుచుండఁగా దీని కీయపార్థమును జేయుటలో వారియుద్దేశమేమో తెలియకున్నది.

స్యాదమహతామిత్యాదిచే సిద్ధించు'దారములు' అనునది యిష్టరూపమే యని యహోబలపతివ్రాసెను (౩౮౬ పు.) లేదా దానిని వనాదులలోఁ జేర్చుట మానవచ్చును.

శబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ. మిత్రః
వు, మిత్రము - శరణుండు. శరణము.

సంజీవని. ౧౬౫౯ I విష:—స్థూలదృష్టి నుపదేశించిన చింతామణి నర్థవ్యాఖ్యుఁడు బాలవరులకు నవతరింపజేసినను నాకృతి గణాంగీకారముచే లక్ష్యజ్ఞానము సువ్యక్తము కాదయ్యెను. బహుశబ్దవిధానములు నాకృతిగణములును సుస్పష్టబోధమును గావింపఁజాలవుగదా. అట్లగుటంజేసి సూరి సూత్రాంతరముల నస్టిలోపములను బాలవరులకు సవరింపుచున్నాఁడు. సూరిసూత్రములను నింకను మిగిలినస్వల్పలోపములు ముందు వివరింపఁబడును. అర్థములు:—౧. ఋక్షము = నక్షత్రము - దైవము = దేవుఁడు. కం. ఏలినవానినిదైవము । నాలిని బంధువులఁ సముచితారాధనను । శీలతఁ ద్రిప్తులఁజేయని । పాలసుఁడు. (ఉద్యో. ౩ ఆ. 33 ప.) శా....ఖ్యాతం । దైవం బని...(హ. న. అవతారిక. ౨౨ ప.) (సూ. ౧౨౬ I విష.) కళత్రము = భార్య - అపత్యము = సంతానము - శరణుఁడు = శరణము = రక్షకుఁడు.

అకారాంతములయిన మహద్వాచకములకును, నపుంసకలింగములకును బ్రథమైకవచనమున మువర్ణకం బగునని సూత్రార్థము. వృక్షమనునది యమహత్తుల కుదాహరణము. ఋక్షమనునది నపుంసకముల కుదాహరణము. మహన్మహాతేత రుభయవాచకములలో నెద్దియైనను నపుంసకమైనచో మువర్ణకమె యగుననుటకు వరుసగా "దైవము - కళత్రము - అపత్యము" అని మూఁ డుదాహృతు లీయఁబడెను. పుంలింగమైనను నమహద్వాచకమగునపుడు మువర్ణకమె యగుననుటకు మొట్టమొదటి వృక్షమను నుదాహృతి చాలియున్నది. ఇంక "అదంతము లెవ్వై మహత్త్వపుంలింగత్వములు రెండును గలవాని కుత్వ డుజ్ఞులువచ్చునని యీవలికె తత్స. ౨౧ - ౨౨ సూత్రములయొద్ద వివరింపఁబడెను.

క్లీబంబులు మిత్రాదులను తత్స. ౧౮ సూత్రముచే మహద్వాచకములగు మిత్రాదినపుంసకశబ్దములకుఁ బాక్షికపుంస్త్వము వ్యాకరణసిద్ధమగుటంజేసి యట్టి మహద్వాచకములకుఁ బుంస్త్వపక్షమున నుత్వడుజ్ఞులును బుంస్త్వాభావపక్షమునఁ బ్రకృతసూత్రముచే మువర్ణకమును వచ్చి రూపద్వయముకల్గునని "క్లీబంబులు మిత్రాదులు..." అనుసూరివాక్యమునకుఁ దాత్పర్యము (విస్తర.).

---

విస్తర. ౧౮౫౯ I విష:—"హ్రస్వాకార (హ్రస్వ+అకారము) మంతమందుఁ గల యమహత్తులైన నపుంసకలింగశబ్దములకు మువర్ణకంబు వచ్చు" (బా. గు. ప్ర. తత్స. 3౼ సూ. వ్యా.) అనెడి గుప్తార్థప్రకాశికావ్యాఖ్య ప్రామాదికము. అమహత్త్వమేకాక నపుంసకత్వమునైత ముండవలయు ననెడి కర్మధారయపక్షమునె

సూరి యుద్దేశించి యున్నచో మొట్టమొదటఁ బుంలింగమగు "వృక్షము" అనుదాని నుదాహరించునా? అట్లె మహన్నపుంసకములగు "మిత్త్రము - శరణము - దైవము" అనువాని నుదాహరించునా ? ఇట్లు కర్మధారయపక్షార్థ మపార్థమని నే నాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికాముఖమునఁ (రాక్షససంవత్సర భాద్రపద మాసపత్త్రిక) దెల్పఁగా బా. గు. ప్ర. కర్త మిక్కిలి కోపించి వచింపరానిదుర్భాషలతో దేశమాతను నింపి యసంబద్ధప్రసంగముల కారంభించెను. ఎట్టి తిట్టులకైన నోర్వనగును గాని భాషాద్రోహము నోర్వరాదుగదా. అట్టి తిట్టుల నుపేక్షించి యావ్యాసము నందలి శాస్త్రవిరుద్ధవిషయములకు సమాధానము లిచ్చుచుఁ గొన్ని వ్యాసములను బరిషత్పత్త్రికాముఖంబునఁ బ్రకటించితిని. ఆంధ్రవ్యాకరణ విషయముననేకాక, సంస్కృతవ్యాకరణ విషయమునందును గల్లూరువారిప్రసంగమున "కాలుష్యము - అవ్యుత్పన్నత - అపార్థములు" మెండుగ నుండుటంజేసి కీర్తిశేషులగు, మహామహోపాధ్యాయ, తాతా సుబ్బారాయశాస్త్రులవారు సైతము నాతోపాటుగఁ గల్లూరువారి యతిప్రసంగములకోర్చి యాంధ్రలోకోపకారార్థముగఁ గల్లూరువారియపసిద్ధాంతములను నిరసించుచుఁ గొన్ని వ్యాసములను బరిషత్పత్త్రికాముఖముననె ప్రకటించిరి. అట్టి యాచర్చ లతివిస్తరము లగుటచే నిట నుదాహరింపలేదు. బా. గు. ప్ర. ద్వితీయముద్రణమునఁ గల్లూరువారిప్రసంగములు మాత్త్రమె ముద్రితములై యున్నవి. నావ్యాసములసార మీగ్రంథముననె యాయాసందర్భములలోఁ జూపఁబడుచున్నది. అట్లె యమహన్నపుంసకసూత్త్రవిమర్శనసందర్భములోని నా వ్యాసములసార మిటఁ జూపఁబడుచున్నది. శ్రీసుబ్బారాయ శాస్త్రులవారివ్యాసము లీగ్రంథము తుది ననుబంధముగా ముద్రింపఁబడును.

గ్రంథకర్తలు వివరణాదికమును వ్రాయకయే గతించినచో వారియుద్దేశములను నిర్ణయించునపుడు వివిధములగుమార్గములను ద్రొక్కుచు వారియుద్దేశములను నిర్ణయించుకొనవలయుంగాని గ్రంథకర్త స్పష్టముగా వివరించుచు నుదాహరించుచు గ్రంథమును నడపునపు డట్టిపోకడలకుఁ బ్రసక్తియుండదుగదా. అమహన్నపుంసకసూత్త్రమున సూరి యుద్దేశించినది కర్మధారయమా? ద్వంద్వమా? యనువిషయముగదా విమర్శనీయాంశము.

అమహన్నపుంసకసూత్త్రవివరణమునఁ బుంలింగామహచ్ఛబ్దము (వృక్షము) నుదాహరించుట మాత్త్రమె యమహన్నపుంసకదళమున సూరి ద్వంద్వసమాసము నుద్దేశించెనని నిశ్చయింపఁజాలియున్నది. మువర్ణకప్రాప్తికి నమహత్త్వ నపుంసకత్వములు రెండును నుండవలయునని యర్థమిచ్చెడు కర్మధారయసమాసమునే యాతఁ

నుద్దేశించి యున్నచోఁ బుంలింగవృక్షశబ్దము నుదాహరించుట కాతఁడు మత్తుఁడు కాఁడుగదా. ఇట్లే మహన్నపుంసకములగు "దైవము మిత్త్రము శరణము" అనువాని నుదాహరించుట కాతనికిఁ జిత్తవిభ్రమము లేదే! "అయ్యా! మీ కర్మధారయపక్షమున సూరి యిచ్చిన యుదాహృతులే కుదురుపడవే" అని ప్రాచీనవాదిమీఁద హుంకరించుచు "వృక్షాదులు సంస్కృతజన్మమునఁ బుంలింగకీర్తినొందినను నపుంసకములైన ధనవనాదులతో సమానముగ నమహన్నామము తెలుఁగున ధరించుటంజేసి తెలుఁగునఁ వృక్షాదంబులు నపుంసకములగు నన్నచో సులభంబు.....సంస్కృతమునఁ బుంలింగములైన దూతాదులకుఁ దెలుఁగున స్త్రీత్వము దొరయుచున్నదిగదా..." (బా. గు. ప్ర. ద్వి-ము. అనుబంధ. పార్థమ. ౩౨ పుట.) అని యసంబద్ధప్రసంగము గావించిరి.

"దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు" (బా. తత్స. ౬౧ సూ.) అని సూరి సూత్రించి యుదాహరించికొనెంగాన నచట సంస్కృతమునఁ బ్రసిద్ధమగు పారిభాషికలింగము మాఱినదిగాని యిచటఁ దెల్గగాదులకెల్ల లింగముఁ బేర్కొని సూరి సూత్రింపలేదే. అట్టిమార్పు సూరికి సమ్మతమని యెట్లు చెప్పనగును?

పై రీతినె మహన్నపుంసకములగు దైవము, మిత్త్రము, మున్నగు నుదాహృతులు కర్మధారయపక్షమునఁ గుదురుపడ వనఁగా లేచి ఖాంకరించుచు "నపుంసకశబ్దమునం బ్రసిద్ధములైన ధనవనాదిజకములె విషయములగుంగాని మిక్కిలి క్వాచిత్కములై యప్రసిద్ధములైన మహన్నపుంసకములు ఝషితి స్ఫూర్తివిషయంబులు గావు" (బా. గు. ప్ర. ద్వి. ము. అనుబంధ. పార్థమ. ౨౭ పు.) "ఇంతియకాక యమహన్నపుంసకసూత్రమునందలి యమహత్తులసాహచర్యమునం జేసి నపుంసకములుగూడ నమహత్త్వధర్మమున సదృశములైనవే గ్రహింపఁబడెడుంగాని సదృశములుగాని యప్రసిద్ధక్వాచిత్కమహన్నపుంసకము లెట్లు గ్రహింపఁబడును" (బా. గు. ప్ర. అనుబంధ. పార్థమ. ౨౮ పు. ద్వి. ము.) "ఇట్టి క్వాచిత్కమహత్తులయెడం గూడ నదంతనపుంసకత్వరూపసాధారణధర్మబాహుళ్యంబున నీసూత్రమె యుపలక్షణముగాఁ జెల్లును." (బా. గు. ప్ర. ద్వి. ము. అనుబంధ. పార్థమ. 33 పు.) అని యిట్లుగ నించుకేని సంకోచము లేక ప్రసంగించిరి. "దైవతము, మిత్త్రము" మున్నగు మహన్నపుంసకములు గల్లూరివారికి స్ఫూర్తికి రాకున్నను సూరికి స్ఫూర్తివిషయము లయ్యెనే. ఏమిచేయనగును? ఆతఁడు వానికై "క్లీబంబులు మిత్త్రాదులు...(బా. తత్స. ౧౮ సూ.) అని సూత్రించి యుదాహరించెనే! ప్రకృతసూత్రమందే "క్లీబంబులు మిత్త్రాదులు..." అని వివరించెనే! ఇట్టి స్థితిలో సూరికి స్ఫూర్తివిషయము

లుగా లేదని పుట్టఁబోవు కల్లూరివారివాదము నిలఁబడుట కై యెట్లు చెప్పనగును! వలయునేని బా. గు. ప్ర. కర్త యొకవికృతివ్యాకృతి నారంభించి యందుపలక్షణాదికమగు నవలక్షణములతో సూత్రించికొనుట యుక్తముగాని సూరి కనభిప్రేతములగు విషయములు సూరికి సమ్మతములని వ్యాఖ్యచేయుట యుచితమా?

"అదంతములగు నమహత్తులకును నపుంసకలింగశబ్దములకును మువర్ణకమగు ననెడి నావివరణవాక్యమున సముచ్చయార్థము వాకొనఁబడెనని ప్రామాదికముగఁ దలంచి సముచ్చయార్థమున ద్వంద్వము దుర్ఘటమనియు నట్లుచెప్పుట వ్యాకరణశాస్త్రవిరుద్ధమనియు గొప్పగ ఖాంకరించిరి. ఇట్టి వీరి యశాస్త్రీయప్రసంగముఁ నరసియే కీర్తిశేషులగు మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రులవారు సంస్కృతవ్యాకరణశాస్త్రసిద్ధాంతముల విశదపఱుచుచు నావివరణవాక్యమున "చార్థక'ను' శబ్దద్వయ" ముండుటచే నయ్యది సముచ్చయార్థకవాక్యము కాదనియు సముచ్చయార్థమున ద్వంద్వమును నేను వచింపలేదనియుఁ దీర్మానముచేసినవారైరి. (అను.) (ఆంధ్ర సా. పరి. నలసం. భాద్రపదాశ్వయుజమాసములు.) ఇంకను గల్లూరువారు ద్వంద్వపక్షమున ద్వంద్వగతపదార్థ మర్థమగుంగాన నట్టియెడల నీద్వంద్వము కర్మధారయపర్యాయమె యగుననెడి మఱొకచర్చచేసిరి. "అగ్నిసోముల కీహోమద్రవ్యము నిచ్చెద. ఇక్కడ నవినాభావముగా నున్నయగ్నిని సోముని వైశిష్ట్యమందు దేవతగా భావించి యిద్దఱకును నేకాహుతియే యిచ్చినట్లు స్ఫురించుంగాని వేర్వేఱు దేవతలుగాభావించి ప్రత్యేకప్రత్యేకముగా నాహుతు లిచ్చినట్లు గోచరింపదు. ఇట్టి శాస్త్రీయతాత్పర్యము శబ్దేందుశేఖరమందు..."(బా. గు. ప్ర.

అనుబంధము. ౧౮౫ I విష. విస్తరః—శ్రీసుబ్బారాయశాస్త్రులవారుగాని నేనుగాని యీకల్లూరువారి యపార్థములను విశదపఱుచుటెల్ల జిగీషచే నెంతమాత్రమునుగాదు. విద్యార్థు లపమార్గమునఁ బడకుండఁజేయుటకు మాత్రమె. బా. సా. వే. వ్యాఖ్యాకారునివంటివాఁ డెట్లు వీరివాదముచే భ్రమించి ప్రసంగించెనో యెఱయుఁడు. "ఇచ్చో 'అమహాన్నపుంసకములు అనుసముచ్చయద్వంద్వము సంస్కృతశబ్దశాస్త్రసరణిని బొసఁగదని....గుప్తార్థప్రకాశికాకారులు.....ద్వంద్వము శాస్త్రసమ్మతమగుఁగాక! కాకపోవుగాక!...ఇట ద్వంద్వము నెన్నకతీరదు..." (బా. సా. వే. తత్స. ౩వ సూ. వ్యా. ౧౮౮ - ౧౮౯ పుట.) 'అమహత్తులకుననపుంసకములకును' అనువిగ్రహముగల ద్వంద్వము "ఇతరేతరయోగద్వంద్వము" చార్థక 'ను'శబ్దద్వయముచే నది సముచ్చయార్థకము కానేరదు. సముచ్చయార్థకి మేకచకార ఘటితమై యుండును.

ఈసూత్రమున సూరి 'అదంతములకు' అనుదళమును నిల్పకున్న మేలై యుండును. అదంతేతరములపై ముపర్ణకము నిల్వనేరదని యాతఁడు తలంచి యుండును. కావుననె బా. ఆచ్ఛి. ౨ సూత్రమున "బియ్యము - నెయ్యము" మున్నగు నదంత నపుంసకసమములను మాత్రమె యుదాహరించెను. కాని యదంతేతరనపుంసకసమస్థలములు పెక్కిటియందు ముపర్ణకము కన్పట్టుచున్నది. ఓరెము (ఓగిరము), అన్నెము (అన్యము), పున్నెము (పుణ్యము), నాడెము (నాణకము), పీడెము (పీడియము), కల్లెము (కల్లియము), పళ్లెము (పళ్ళియము), దీము (దీమము), మోము (మొగము), గీము (గృహము), సాము (సగము), గారాము (గారవము), గాము (గ్రహము) మొ. ఇట్టివానిలో "ఓగిరము" మున్నగువానిలోనిది ముపర్ణకమగుట నిర్వివాదమగుటంజేసి వానిరూపాంతరములగు "ఓరెము" మున్నగు వానిలోనిది సైతము ముపర్ణకమె యనుటలో విప్రతిపత్తి యుండనేరదు. "ఏకార, అకారాంతము లనుటచే గీము - వాము - పాము - నాము - ప్రేము - మినుము - ఇనుము - వేము మొదలయినవి ముపర్ణాంతములు కాని ముప్రత్యయాంతములు కావనియు, వానికి జలశబ్దమునకువలె వ్యాకరణకార్యములు రావనియు, తెలియునది. ఇపుడు చూపిన గీము మొదలయినవి స్త్రీసమములు. ఇవియు నిట్టివియు ముందు చెప్పఁబోవు చెఱువుశబ్దమును బోలును" (ఆం. భా. అ. శబ్ద. ౭౫ సూ. వివరణము) అని యనుశాసనమున వ్రాయఁబడెను. "గృహము" అనుదాని వికృతి యగు గీము స్త్రీసమమనుట సరియని తోఁపదు. మఱియు "ఏకారాంతములు, అకారాంతములు" నగువానిలోనిది మాత్రమె ముపర్ణకమనియు, దక్కినవానిలోనిది ముప్రత్యయము కాదనియు, నవి స్త్రీసమములె యనియు ననుశాసనకర్త తలంచుటయు సరికాదు. గారాము (గారవము), ఏతాము (ఏతము), లాతాము (లాతము), గోతాము (గోతము) (బా. ప్రకీ. ౧౫ సూ.) మున్నగువానిలో నిది ముప్రత్యయము కాదనుట కెవ్వరును సాహసింపఁజాలరుగదా. ముపర్ణముచోట "మ్ము, ంబు" అను వ్యాకరణకార్యములు రాకుండుటచే నది ముప్రత్యయము కాదనుట సరికాదు. దీర్ఘాచ్చులమీఁద నిల్చు ముపర్ణకమునకు "మ్ము, ంబు" అను రూపాంతరములు రానేరవు. అంతమాత్రమున గీము (గృహము), గారాము

---

పయిరీతిని సూత్రములను ద్రెంచుమహాకార్యము వ్యాఖ్యానరచనాకాలమునఁ జేయలేదేమని శంకించుకొని యపుడు స్ఫురితిలేదయ్యెనని చెప్పుటకు మాఱుగ నిజాభిధేయ వంచకపార్థమూర్తికిఁ గైయటోపాధ్యాయ సమత సిద్ధించుట కని సుప్రార్థప్రకాశికాకర్త సంకోచింపక వచించెను.

(గౌరవము) పాము (పగము), మోము (మొగము), గాము (గ్రహము), ఏతాము (ఏతము), దీము (దీమము), మున్నగునవి త్రీసమములనియు వానిలో నిది మున ప్రత్యయము కాదనియుఁ జెప్పుట యుక్తముకాదుగదా. కావున ప్రకృతసూత్రము లోని "అసంతసంలకు" అనుదళము ప్రత్యాఖ్యేయము.

"స్త్రీవాచకత్వేఽపి స్త్రీలింగత్వాభావాత్ దారాదిభ్యో న ముఙస్ట్ర కవవ న సు లోపః. తేన దారములు ఇత్యాదికమేవ రూపమ్...బహుత్వే ఏవ దారశబ్దస్య పుం స్త్వమ్-ఏకత్వేతు స్త్రీత్వమేవ తేన నిజాప్రదార (రాఘునవాం) నిత్యాదిరూప మపి సాధ్వేవ" (దారాఃపుంసి చ భూమ్న్యేవ - అమరము) (అహో. ౩౮౬ పు.) అని యహోబలపతి వ్రాసెనుగాని బహుత్వమునందును "దారలందు" అనుప్రయోగ ములు కన్పట్టుచున్నవి. ఉదా:—క॥ పరదారలయందును సుఖ। గురువృద్ధ...... (అను. ౪ ఆ.౯౩ ప.) వావిళ్లవారిముద్రణమున 'పరదారములందును' అనుపాఠాంత రము చూపఁబడియున్నది. నాయొద్దనున్న తాళపత్త్రమాతృకలు మూఁడిటియందును 'పరదారలయందును' అనియేయున్నది. ఉ. దారలయందుఁ బుత్త్రధనధాన్యములందు ...(భాగ. ౧౧ స్కం.౯౬ ప.) బహుత్వమందును విశేషము లేకయే 'దారా'శబ్దము స్త్రీలింగముగఁ గోశములందుఁ గన్పట్టుచున్నది. "దారా - స్త్రీ. భార్యాయామ్ - ఇతిభరతః" (శబ్దా. చం.)

చీరశబ్దమునకు 'చిర' అనువైకృతరూపమే కాక 'చీరము' అనురూపమునుఁ బ్రయోగదృష్టమగుచున్నది. మ...ఱికద్దు చీ। రము కృష్ణాజినముం గమండలువునై...(నిర్వ. ౫ ఆ. ౪ ప.)

'పట్టణము' అనుదానిలోని "ట్టణ" అనుభాగమును నిర్వహించుప్రయోగ ములు గలవు. క. రణవిజయముఁ గైకొని ప। ట్టణ ముద్భట సుభట సంకటంబుగ... (నిర్వ. ౫ ఆ. ౭౯ ప.) సంస్కృతకోశములందు "పట్ట (త్త) న. న. (పట (త) న్తిజనాయత్ర - పట - పత-వా - తనన్ - నేట్) ప్రధాననగరే" (శబ్దస్తో) అని యుండుటంజేసి ణకారస్థితి యంగీకరింపఁబడలేదు.

సంజీవని. ౧౪౫ II విష:—"క్లీబంబులు..." అను బాల. తత్స. ౧౮ సూత్రముచేత మిత్త్రాదులకేకాక వానివిశేషణములకును బాహుళికపుంస్త్వమంగీకార్య మగుటంజేసి "సౌమ్యుఁడు మిత్త్రము" మున్నగురూపములును సాధ్యములు కాఁగ లవు. క...సజ్జనసంస్తుతి। పాత్త్ర మితఁడు మాద్రి తొలుతపట్టి నరేంద్రా (విరా. ౫ ఆ. ౩౨౬) గీ. కాని యన్యులు బ్రహ్మాస్త్రదానమునకుఁ। బాత్త్రములు గారు... (శాంతి. ౧ ఆ. ౧౯) (సూ. ౧౨౬ I విష.)

ఈసందర్భమునుబట్టి "జగద్రక్షకుఁడు దైవము, సౌమ్యుఁడు మిత్త్రము, ఇత్యాదిప్రయోగంబులు (అమహన్నపుంసకసూత్రములోని) ద్వంద్వసమాసపక్షమున సిద్ధింపనేరవు...కర్మధారయవృత్తి పూర్వోక్తప్రయోగములయెడ సాధకంబు" (బా. గు. ప్ర. అనుబంధ. ద్వంద్వోపశమనము. ద్వి. ము. ౯౯ పుట.) అనెడి కీర్తిశేషులగు కాశీనాథశాస్త్రులుగారి యభిప్రాయము సరికాదనుట స్పష్టము. ఇంక "మిత్త్రము" అనుమహద్వాచికిఁ గర్మధారయపక్షములో 'ము' వర్ణకమునచ్చుట యెట్లు పొసఁగునని వారు తలంచిరో తెలియకున్నది.

సంజీవని. ౧౪౫ III విష:—"అవ్యయీభావశ్చ" (౧-౧-౪౧) అవ్యయ సంజ్ఞః స్యాదితి శేషః" (౪౫౧ సూ. సి. కౌ.) అవ్యయీభావశ్చ (౨-౪-౧౮) (వృత్తి. అయం నపుంసకం స్యాత్) (౬౫౯ సూ. సి. కౌ.) అని యిట్ల వ్యయీభావమునకు నపుంసకసంజ్ఞయు నవ్యయసంజ్ఞయుఁ బాణినీయసమ్మతములు అయినను "అవ్యయాదాప్సుపః (౨-౪-౮౨) (వృత్తి - అవ్యయాద్విహిత స్యాపః సుపశ్చలుక్ స్యాత్)" అనుచెప్పున నవ్యయముమీఁది సుబ్విభక్తు లనఁగా నామ విభక్తులు లోపించునుగాన "ఆబాలగోపాలము" మున్నగుచోట్ల 'ము' ప్రత్యయము ప్రకృతసూత్రముచే వచ్చుననుట పొసఁగదు కాని "ప్రత్యయార్హావ్యయస్యాపి। ప్రయోగః కుత్రచిద్భవేత్" (౧౧౨ విష. కల్పతరువు) అనునథర్వణ వచనము చెప్పున నిట్టి యవ్యయముల ముప్రత్యయము సాధువగుచున్నదని యెఱుంగ నగును. ఈయథర్వణకారికచేతనే "ఇహము పరము చిరము" మున్నగు 'ము' ప్రత్యయాంతములగు సంస్కృతావ్యయశబ్దములు సాధువులగుచున్నవి. "చెడు నిహముం బరంబు (ఆది. ౧ ఆ. ౧౩౯) ఇహపరముల నెసక మెసఁగ (శాంతి. ౫ ఆ. ౨౫౭) "గంగఁ బ్రత్యక్షంబుగావించి. ఆ బాలగోపాలము (మను. ౧ ఆ. ౩౪) చాపంబులాకర్ణాంతంబు లగుచుండఁగా" (అహో. ౨౮౨ పు.)

* బాలవ్యాకరణ వానికి మువర్ణకేతరంబైన విభక్తి పరంబగునపుడు
  వివృతి. ముగాగమంబగు. ౪౦.

౧౪౬ విషయము. వృక్షములు, వృక్షమును, ఋక్షములు, ఋక్షమును.

సంజీవని. ౧౪౬ విష:—వానికనఁగా నదంతములగు నమహత్తులకును, నదంతములగు నపుంసకలింగములకును నని యర్థము. ముగాగమము కిత్తుగానఁ బ్రాతిపదికమున కంత్యావయవముగా నిల్చును. అమహత్పక్షమున వృక్షములనియు నపుంసకలింగపక్షమున ఋక్షములనియు సూరిచే నుదాహరింపఁబడెనుగాన నచట ఋక్షశబ్దము నక్షత్రపర్యాయమే కాని భల్లూకపర్యాయము కాదు. "ఎలుఁగుగొ..

మున్న గుణాదింపజెప్పినట్లు 'నమ(ఋక్షము)' నంతప్పుంలింగమె యగుంగాన వృక్షశబ్దము నకెనే ముపర్ణక ముగాగమ యోగ్యంబయ్యెడి". [బా. పా. పే. ౧౬౩ పుట.] అను చేటికావ్యాఖ్యవిశేషక శల్యకవర్గయములకు ముపర్ణకముగాగమములు రావచ్చు నుగాని యిచటియుకిశెక్క మక్ష్మియభిప్రాయముతో పూరించే సమాహరింపఁబడలేదు. ఉ. వృక్ష+ముగాలు = వృక్షములు-వృక్షగాలుగాలను = వృక్షములను-నెం. లట్టివిభక్తుల కాద్యవయవముగా విధింపఁబడినదిగాన వడియు విభక్తిభాగమె యని యొప్పవల యును. పూరిగాను వడిగాఁ జూచినొనక "ఉదంతమునకు" అను విశేషణము నిల్పి దనియు నది ప్రత్యాఖ్యేయమనియు నివజకె ప్రాయఁబడెను. (౧౬౫ ౮ విష.) కాన నమహత్తులగు గానాము - ఏతాము - ఓరెము - అన్నెము - మున్నగు వాని కిని ముపర్ణకేతరవిభక్తి పరకత్వమున ముగాగమమువచ్చును. ఉ:—గానాను చేతను - ఏతాములు - ఓరెముకొఱకును - అన్నెమును నెం.

ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు. ౭౧.

ముపర్ణకమునకు విధించు లోపాదేశాదికార్యములు ముగాగమమునకు గూడ వచ్చునని యర్థము.

బాలవ్యాకరణ వివరణము. ౧౬౪ విషయము.

ముపర్ణకంబునకు మూముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు. ౭౨.

వృక్షమ్ము, వృక్షంబు; ఋక్షమ్ము, ఋక్షంబు; పూర్వ సూత్రముచే ముగాగమమున కీకార్యంబగు. వృక్ష మ్ములు, వృక్షంబులు; ఋక్షమ్ములు, ఋక్షంబులు.

సంజీవని. ౧౬౪ విష:—౭౧ సూత్రము స్పష్టార్థకము. మకారముమీఁద నిల్పిన మకారము మూముడి యనఁబడును. ప్రథమైకవచనరూప ముప్రత్యయము లోని మకారమునకు మూముడి యనఁగా మకారాగమముగాని, యట్టి ప్రథ మైక వచన ముప్రత్యయముచోట 'ంబు' అనునాదేశముగాని విభాషనగునని ౭౨ సూత్రమున కర్థము. ఉదా:—మకారాగమపక్షమున, 'వృక్షమ్ము' అని యగును (వృక్ష+మ్+మ్+ఉ = వృక్షమ్ము) బిందుపూర్వక బువర్ణాదేశపక్షమున వృక్షంబు. ఈయాగ మాదేశములు రానిపక్షమున 'వృక్షము'. ఇట్లే యంతటను నెఱుంగునది. ౭౧ సూత్రముచొప్పున ముపర్ణకకార్యములగు నాగమాదేశ ములు విభాషగ ముగాగ మునకును వచ్చినచో 'వృక్షమ్ములు - వృక్షంబులు - వృక్షములు' అని యేర్పడును. ఇట్లు ౭౧ సూత్రముచే బా. తత్త్వ. ౫౯

సూత్రముచొప్పున వచ్చులోపము మున్నగునవియు ముగాగమమునకును సంభవించును. ఉదా:—చరిత్రము. చరిత్ర - చరిత్రములు - చరిత్రలు. చరిత్రమును - చరిత్రను - చరిత్రములను - చరిత్రలను మొ. ఇట్లె తత్స. ౫౭ సూత్రముచొప్పున స్త్రీలింగ ప్రథమైకవచనలోపము కల్గుననుటచే 'లత' మున్నగువాని ముపర్ణకమునకు లోపము కల్గునుగాన నట్టిలోపము ముగాగమమునకునుఁ గల్గును. అట్లె రమాది శబ్దములు మహతీవాచకములైనను నమహద్వాచకములె కాన వానికిని ముపర్ణక ప్రాప్తి యోగ్యత కలదు గావున వానికిని ముపర్ణక ముగాగమముల లోపము కల్గును. ఉదా:—లత - లతలు - లతలను - రమ - రమలు - రమలను - మొ. స్త్రీలింగముదాదులకు బా. తత్స. ౭౨ సూత్రముచేఁ బ్రథమైకవచనలోపనిషేధము చేయఁబడెనుగాన నట్టియెడల ముగాగమలోపమును రాదు. ఉదా:—ముదము ముదముచేతను మొ.

పయిరీతిని ముపర్ణక ముగాగమములె లోపించునపు డింక ముపర్ణకమునకాదేశముగ రావలసిన మకారాగమబిందుపూర్వక 'బు'వర్ణాదేశము లెట్లును రావని వేఱచెప్పనక్కఱ లేదుగదా. దీర్ఘ పూర్వక ముపర్ణక ముగాగమములకు "మ్ము - ంబు" అను రూపముల ప్రయోగములు దీర్ఘముమీఁది నిందునున్నకువలెనె లేవు. ఉదా:—మోము - గారాము - గాము - గీము - ఏతాము - గోతాము మొ. ప్రయోగములు:—కం. అమ్మానిసి...నె। య్యమ్మున...(సభా. ౧ ఆ. ౧౪౬) ఉ. ఇమ్మది...త। త్వమ్ములు...సా। దమ్మున...రూ। ఢమ్ముగ...(సభా. ౨ ఆ. ౩౯) కం....ప్రభవిం। చెం బాండురాజు కురువం। శంబుఁ బలిష్ఠింప (ఆది. ౪ ఆ. ౨౫౬) మ. హిమకరుఁ దొట్టి...యస్మదీయవం। శముఁనఁ బ్రసిద్ధులై...(ఆది. ౧ ఆ. ౧౪).

నన్నయాథర్వణీయము. ౧౪౮ విషయము.

వికృతౌ క్వచిచ్చలోపో। మోర్దీర్ఘశ్చాత ఆదిమస్య
భవేత్ (ఆం. చిం. అజం. ౧౦ కారి.) (అహో. ౨౯౧ పు.)
ప్రాయశో వైకృతపదే। లోపోదీర్ఘశ్చ మోరతః (వికృ. అజం. ౨౪ కా.) (అహో. ౨౯౧ పు.)

కల్పతరు. ౧౪౮ విష:—వికృతౌ = ఆచ్ఛికశబ్దమందు - క్వచిచ్చ = క్వాచిత్కముగా - మోః = ముపర్ణమునకు - లోపః = లోపమును - ఆదిమస్య - అతః = దాని కాదిగా ననఁగా ముందున్న "అకారము" నకు - దీర్ఘశ్చ = దీర్ఘమును - భవేత్ = అగును. ఉదా:—జొంపములు, జొంపాలు - పగడాలు మొ. తత్సమములందును గ్వాచిత్కముగా నిక్కార్యము కల్గుననుచు నథర్వణుఁడు సవరించు

మన్నారు. వైకృతపదే - యాచ్ఛికపదమందు - వా - ముగాగమునకు, లోపః=లోపమును, అతఃదీర్ఘః = పూర్వస్థితాకారమునకు దీర్ఘము - ప్రాయశః = పలుమరు, మతః = సమ్మతము - వాక్యార్థమాచ్ఛికమునందు వలయునటులే తత్సమములందును సరసముగ [illegible] లభించుచున్నది. ఉదా:—ప్రాణానన్ - ప్రాణమునన్ మొ. "ఉకారమత్రభవేద్వాప్రః" అనుపూర్వార్ధమునుండి "ద్వాదిపద్మే" అనుపదము నిండునట్లు గాకాక్షిన్యాయమున నన్వయించినచో (౧౫౬ కా.) లుప్త భృతి ప్రత్యయపరకత్వమున [illegible] లభించును. [illegible] నాగమము [illegible] యని యెఱుంగునది.

లు ల న లు పరంబగునప్పు డొకానొకచో ముగాగ
బాలవ్యాకరణ మంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబు
వివృతి. విభాషనగు. ౭౬.
౧౭౬ I విషయము. వజ్రాలు - వజ్రాలను - వజ్రాన - పగడాలు - పగడాలను - పగడాన - ఒకానొకచో ననుటచే నీకార్యంబు నకుం బ్రయోగవైరళ్యంబు సూచింపఁబడియె.

సంజీవని. ౧౭౬ I విష:—'లు' అనునది ప్రథమాబహువచనప్రత్యయము. 'ల' అనునది ద్వితీయాదిబహువచనములకగు లడాగమము. 'న' అనునది సప్తమీ ప్రత్యయము. ఇది బా. కార. ౨౩ సూత్రముచొప్పున దృతీయార్థమునందును వచ్చును. ములోపము వచ్చునపుడె దీర్ఘము వచ్చునుగాని రెండును బర్యాయమున రానేరవు. ముగాగమున కనుటచేత "ఎలమి - ఎలములు -" మున్నగుచోట్ల "ఎలాలు" మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు. (విస్తర I) "వజ్రాలు - పగడాలు" అను ద్వివిధములగు నుదాహరణములనుబట్టి యీవిధి యాచ్ఛికశబ్దములకే

విస్తర. I ౧౭౬ I విష:—"దీర్ఘశ్చాఽతః" అని నన్నయయు "లోపోదీర్ఘశ్చ మోరతః" అని యథర్వణుఁడును 'అ' కారముమీఁది ముపర్ణమునకే లోపమును బూర్వస్థితాకారదీర్ఘమును విధించియున్నారు. కావుననే ముగాగమలోపమును బూర్వస్వరదీర్ఘమును "అన్నెము - పున్నెము - ఓరెము" మున్నగుచోట్ల వర్తింప నేరవు. "దీర్ఘ మితరాచ్ఛులకును గన్పట్టెడి - ముత్తెము - ముత్తేలు. సీ. ముత్తేల చౌకట్లు మురువుమించ (ఇందు. ౧ ఆ. ౨౦) కొండెమునకు - కొండేనకు - (సారంగ. ౨ ఆ. ౨౭౭)" (నారా. గాణ. తత్స. ౩౧ ప. ౧౬౨ కారి.) అనుగాణపతవివరణము సరికాదు. "దీర్ఘశ్చాతః" అనియు "మోరతః" అనియు నన్నయాథర్వణు లిద్ద ఱును "అకారమునకే" దీర్ఘము విధించియున్నారు. పయి కవిప్రయోగములలో

తాక సంస్కృతసమశబ్దములకును గల్గునని విశదమగుచున్నది. అహోబలపండితీయా మలలో బు ఌ వ లు మాత్రమె చూపఁబడుటంజేసి సూరి వానినిమాత్రమె పేర్కొనెనుగాని నగాగమపరకత్వమునందును ములోపదీర్ఘములను దిక్కనాదులు ప్రయోగించియున్నారు.

ప్రయోగములు:—సీ. ఎల్లవంటకముల నేర్పడఁ బోనాలువెట్టింప (ఉద్యో. ౩ ఆ. ౨౭౯) (బోనము = భోజనశబ్దభవము) శా. గ్రాసవా। సోద్వైన్యంబులు గల్గు నాయనయు నీచుట్టాలకుం గావునన్। (ఉద్యో. ౧ ఆ. ౧౨) క॥...దెం। దానం జెయివెట్టికొని యతఁడు నిద్రించున్ (ఉద్యో. ౩ ఆ. ౧౯) ఆ. వె. ఎచట నున్నవాఁడ మేమైతి ప్రాణానఁ గలవె (ద్రోణ. ౧ ఆ. ౨౬౨) క॥...దండధరుని చం। దానం బావని మాగధ। సేనన్...(భీష్మ. ౨ ఆ. ౨౧౮) కం. మానుగధృతరాష్ట్రుఁడు ప్రా। ణానం గలుగంగ...(ఉద్యో. ౩ ఆ. ౩౮౫) ద్విపద...బసుమానన్...(బసవ. ౭ ఆ. ౨౧౯) ప్రధానవైరానన్ (నన్ని. ౮ ఆ. ౮౧౭) నగాగమస్థలములు:—సీ॥ కూర్తురు కయ్యాన కోర్తురు నేర్తు రాయుధములకెల్ల (ఉద్యో. ౮ ఆ. ౨౬౬) సాహసానకు (భాస్కర. యుద్ధ. ౭౩౮) భిక్షానకున్వత్తునో (భీమ. ౨ ఆ.) ద్వి. వీసానకై...। చేసాచికొనుచు (బసవ. ౭ ఆ. ౮౬౦) "ఒకానొకచోట"

---

"ముత్యాలచౌకట్లు" అని కవిప్రయుక్తపాఠమై యుండును. ఇఁక చేమకూరవారి సారంగధరచరిత్ర ప్రయోగసందర్భమున మిక్కిలి ప్రామాదికము నభేద్యము నగు ముద్రణసంస్కారము జరిగినట్లు కనఁబడుచున్నది. "ఉ॥ ఓ నృప నాకుఁ జూడ నలయుగ్మలి నీసుతునిన్ మనోహరా। నూనవిలాసుఁ జూచి నిలుపోపక పట్టిన లోనుగామి నెం। తేనెగలూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్నె నిట్లు కొం। డే నను ధర్మరాజులను నిక్కముగా మిముఁ జెప్పనేటికిన్ (సారంగ. ౨ ఆ. ౨౮౭)" (సూ. రా. ని. కొండె (డియ) ము, శబ్దమునొద్ద) అని సూ. రా. నిఘంటువునందు నిట్లు యిది యుదాహృతమైయున్నది. పరిశీలింపఁగా నిట "కొండీనికి ధర్మరాజులను" అని కవిప్రయుక్తపాఠమై యుండనోపును. ఇట్లె సూ. రా. నిఘంటువునఁ జూపఁబడిన సీ....కొండేలఁ గొంపలు గూల్చుపాతకురాలు (శ్రీరంగమా. ౫ ఆ. ౩౮) అనుచోటనైతము "కొండ్యాలఁగొంపలు గూల్చుపాతకురాలు" అని కవిప్రయుక్తపాఠము కానోపును. (చూ. ప్రౌఢ. శబ్ద. ౮౯ సూ.) అహో! ముద్రణ సంస్కారము వ్యాకరణముల నెట్టిప్రమాదములకు లోనుగావించుచున్నది? కవిప్రయుక్తమని విశ్వసింపఁదగిన ప్రబలమైన ప్రయోగము లభింపనిదే ప్రామాణికులగు నన్నయాథర్వణులసూత్రముల నన్యథాకరించుట యుచితము కాదుగదా.

నటుచే...ప్రయోగవైరళ్యంబు సూచింపఁబడియె". అని సూరి వచించుట బాలసరస్వతిప్రభృతుల (విస్తర. II) ననుసరించుటకని యెంచుకొనదగును. అట్లుకానిచోఁ బైరీతిని ధారాళముగా మహాకవిప్రయోగములు వెలయుచుండ నిట్లు వచింప నక్కఱలేదుగదా.

సోష్ణ్రేతః (ఆం. వి. ౯ కాలి. ౮౭ం.) (అహో. ౨౫౫),
స్త్రీవస్త్రాః (ఆం. విం. ౧౭ కాలి. ౮౭ం.) (అహో.
౩౨౩ పు.)

---

విస్తర. II ౧౮౭ I విష:—"హారిముఖసురసాలులకు | భరియింపఁగరాని వేల్పు పరమేశ మహో | హారహంసయానను సలలిత కరుణ శుభా లొసఁగు శైలకన్యా మాకున్". ఈపద్యములో సురసాలులకు - సరము - శుభాలు - శైలకన్య - అనెడివి యుక్తలక్షణములు గాకున్నవి. కాఁగా గ్రామ్యములు - ఇవి సలక్షణములైన సౌమ్యములు:—కి...సంతత | కరుణశుభము లొసఁగు శైల కన్యక మాకున్". (బాలస - అనియమా గ్రామ్య మిత్యాది చింతామణిసూత్ర వ్యాఖ్య - సాహిత్యపరిషన్ముద్రణము.) అపరిశీలితముగ నిట్లు బాలసరస్వతి "శుభాలు" అనునది గ్రామ్యమని తలంచెను. ఇట్లే యహోబలపతియు "ల్వావొలహాలనవనే క్వచిదేవ - ఆద్యశ్చకారోఽవధారణే - అత్ర వికృతావిత్యనేన సంస్కృతపదపర్యుదాసః క్రియతే - తత్రాపి లులయోః పరయోరేవాయంవిధిః ప్రవర్తతే (అహో. ౨౮౧ పు.) అని వచించెను. సంజీవనిలో నుదాహరించినరీతినిఁ దిక్కయ జ్వాదులప్రయోగము లీవిషయమున ధారాళముగఁ గన్పట్టుచుండఁగా "క్వచిదేవ" అనియు, "లులయోః పరయోరేవ" అనియు "శుభాలు" అనునది గ్రామ్యమనియు, దీనికిఁ బ్రయోగవైరళ్యమనియు నెవరికిఁ దోఁచినరీతిని వారు వ్రాయుట వింతగ నున్నది. "ప్రాణానన్ - నిటలానన్" అని తానే తిక్కయజ్వాదిప్రయోగములను జూపియు "సంస్కృతపదంబుగృతులఁ దత్సమము సేయు | నపుడు ముత్వమైనను దీర్ఘమైనఁ జెల్లు || నిత్యాద్యాధునికానాం లక్షణమతీవ దూషణగ్రస్తమితి స్పష్టమేవ" (అహో. ౨౮౧) అని యహోబలపతి నిరసించుట సరికాదు.

నన్నయభట్టారకుఁడుమాత్ర మిట్టివానినిఁ బ్రయోగింపలేదు. తుది శాచ్ఛిక శబ్దములందైన నీ ములోపదీర్ఘముల నొక్కటనైనఁ బ్రయోగింపలేదు. పరిశీలింపఁగా భట్టారకుఁడు తననాఁడె కొందఱుకవు లాచ్ఛికశబ్దములం దిట్టి ములోపదీర్ఘములను సమ్మతించుచుండుటం జేసి తాను వాడకున్నను బైరీతిని సూత్రించినని తోఁచుచున్నది.

నన్నయ ద్విత్వోత్వేత్వే సర్వహలాం ।
ధర్వణీయము. హ్రస్వాద్ద్విత్వం తు దీర్ఘాత్తో బహుళమ్ । అగుణ
౧౭౮ విషయము. వతాం సర్వహలాం । సోర్లోపో (ఆం. చిం. హలం.
౨ కా.) (అహో. ౬౭౧ పు.)

కల్పతరు. ౧౭౮ విష:—ఇతః = ఇకారముకంటెఁ బరమైన - సోః = సుప్రత్యయమునకు - లుక్ = లోపము కల్గును. ఉ:—హరి+సు = హరి. గిరి+సు = గిరి - దధి+సు = దధి. (వాతప్రమీః = పుం.) వాతప్రమి. (ధీః - పుం.) ధీ. మొ. గ్లౌః = పుంలింగమగు గ్లౌశబ్దము - స్త్రీవత్ = స్త్రీలింగమువలె రూపసాధన ప్రక్రియ నందును, స్త్రీలింగకార్యమగు ప్రథమైకవచనలోపాదికము కల్గును. గ్లౌ = చంద్రుఁడు. 'రై+సు' అనుచో "రై శబ్దస్య స్త్రీత్వ మప్యస్తీతి ర్లోపః. రాస్తుద్వయో రిత్యభిధానాత్" అనుచోప్పునఁ బ్రథమైకవచనలోపము రాఁగా, 'రై = ధనము' అనురూప మేర్పడును. (౧౬౯ విష.). అగుణవతామ్ = అగుణవర్ణములోఁ జేరిన శబ్దములయొక్క, హ్రస్వాత్ = హ్రస్వముమీఁది, సర్వహలామ్ = హల్లులకన్నిటికిని, ద్విత్వోత్వేత్వే = ద్విత్వము నుత్వము నగును. దీర్ఘాత్తు = దీర్ఘముమీఁది హల్లునకు, ద్విత్వమ్ = ద్విత్వము, బహుళమ్ — బహుళముగా నగును. (౧౬౮ - ౧౭౩ విష.) ఉ. ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు. అగుణవతామ్ = అగుణవచ్ఛబ్దములయొక్క - సర్వహలామ్ = సమస్తహల్లులకుఁ బరమయిన, సోః = సుప్రత్యయమునకు, లోపః = లోపముకల్గును. ఉదా:—ఇంద్రజిత్తు+సు = ఇంద్రజిత్తు - వాక్కు+సు = వాక్కు - వాకు+సు = వాకు మొ. బాలవ్యాకరణములోని "ఇగ్లౌరా" సూత్రములోని విషయముల సంబంధించినవగుటచేఁ బై చింతామణిసూత్రము లిచట నుదాహరింపఁ బడెను.

ఇగ్లౌరా యుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం
బాలవ్యాకరణ బగు. ౮౮.
నివృత్తి. ఇకారాంతములకు, గ్లౌ - రై - శబ్దములకును సుతో
౧౭౮ I విష. యుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపంబగు -
హరి - గిరి - శ్రీ - ధీ.

సంజీవని. ౧౭౮ I విష:—అర్థములు - గిరి = కొండ, శ్రీ = లక్ష్మి, ధీ = బుద్ధి, గ్లౌ = చంద్రుఁడు, రై = ధనము. సూత్రములోని 'ఇ' అనుదానికిఁ దపరకరణము లేమింజేసి "ఇకారాంతములు - ఈకారాంతములు" ననునర్థము లభించును. కాన హరి - గిరి - మున్నగు 'ఇ' కారాంతములకును, శ్రీ, ధీ మున్నగు నీకారాంతముల

జేసికొని ప్రాప్తియే లేదు. అట్లయినను "అపదం న ప్రయోక్తవ్యమ్ = న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా - నాఽపి కేవలః ప్రత్యయః" అను వైయాకరణసిద్ధాంతముచే 'సుప్తిఙన్తంపదమ్' (౧-౪-౧౪) (సి. కౌ. సంజ్ఞా.) అనుచెప్పిన విభక్త్యంతతాసిద్ధికై యనుక్తన్యాయమున వానిపై సంస్కృతప్రథమైకవచన'సు'ప్రత్యయము నిల్పి ప్రకృతసూత్రముచే దానికి లోపము నంగీకరింపవలసియున్నది. "మహాత సోస్ధ జనితోఽథ వేత్స్వంపి" "సోస్లగితః" ఇత్యాదిరీతి నెల్లెడలను బ్రాతిపదికములపై సంస్కృతవిభక్తులను నిల్పి వానికిఁ దెలుఁగువిభక్తుల నాదేశించు చింతామణిపద్ధతిని సూరి యుపేక్షించెనుగాని యిట్టి స్థలములం దట్టిపద్ధతి నంగీకరింపక తీరకున్నది. చింతామణిలో రైశబ్దమునకుఁ బ్రథమైకవచనలోపము విధింపఁబడలేదు. కావుననె దాని ప్రథమైకవచనలోపసిద్ధికై యయ్యది స్త్రీలింగమనుచు నహోబలపతి యొక మార్గముఁ ద్రొక్కెను. అహోబలపతి యుదాహరించిన 'రాస్తుద్వయోః' అనునది యేకోశములోనిదో తెలియలేదుగాని "రా ద్వయో ర్విభవే స్వర్ణే - ఇతి రుద్రః" (అమరసుధ. ౩౮౨ పుట.) "రాఃపుంవత్" (సి. కౌ. ౧౮౨ పుట.) "రాః స్త్రీత్యేకే ఇతి క్షీరస్వామ్యుక్తేః స్త్రీలింగోఽప్యయమితిభావః (బాలమ. వ్యా.)" అను ప్రమాణములవలన రైశబ్దమునకు స్త్రీత్వముకు గొంద అంగీకరించి రనకతీరదు. అట్లయినను "అర్థ రై విభవా అపి" అను నమరకోశముచెప్పినను "రాః పుంసి స్వర్ణవిత్తయోః" అను మేదినీకోశముచెప్పినను దీనికిఁ బుంస్త్వమె ప్రసిద్ధము, సర్వసమ్మతము ననుట నిశ్చయము. కావునఁనె శబ్దార్థచింతామణి ప్రభృతికోశములలో రైశబ్దము పుంలింగమాత్రమె చూపఁబడెను. "రై - పుం (రా - ద్రై.) ధనే - స్వర్ణేచ" (శబ్దస్తో) "రాః - పుం - స్వర్ణే - విత్తే - ధనే" (శబ్దార్థచిం.) ఇట్టి స్థితిలోఁ బ్రసిద్ధమగు పుంస్త్వమును బాటింపక యప్రసిద్ధస్త్రీత్వమును బాటించి ప్రథమైకవచనలోపమును సిద్ధింపఁజేయుట సరికాదని తలఁచి సూరి యాశబ్దమునుసైతము ప్రకృతమగు "ఇగ్లౌరా" సూత్రమునఁ జేర్చెనని యూహింపనగును. "రై - ఇది... మూఁడులింగములందును వర్తించునదగుటంజేసి..." (బా. సా. పే. ౧౪౮ పుట.) అను పేటికావాక్యము సరికాదు. దీనికి నపుంసకత్వ మేకోశమునందును లేదు. "౪౭ సూత్రము (స్త్రీలింగ ప్రథమైకవచనలోపశాస్త్రము) అనుహాత్తులై ముపర్ణకము నందఁదగిన యదంతస్త్రీలింగముల ప్రథమైకవచనలోపమును విధించెడిఁగాని తక్కినవానికిఁగాదు" (బా. సా. పే. ౧౪౮ పుట.) అను పేటికావ్యాఖ్య సరికాదు. ఈపక్షమున "పిత - విశ్వకర్మ - బ్రహ్మ" మున్నగువానికి స్త్రీత్వాతిదేశముచేసిన బా. తత్స. ౪౨ - ౭౪ - ౭౬ సూత్రములు విరోధించును.

ఉస్వహ్రాత్వే, ఇంబుద్రౌనా, [illegible]

[illegible] విరోగనిస్స్యాత్ టాదౌ, ఈదన్తాశ్చకృతహ్రస్వాః ఇదం.

౧౫౦ విధి. ౧౫౧. ఆజం. ౯ - ౧౧ కాం. మహతో. ౧౫౨ మొ.

౨౫౦ వ. పు.

కల్పతరు. ౧౫౦ విధి:—ఇతః = ఇకారమునకు, బహుత్వమునందు, ఉత్ = ఉకారాదేశమగును. ఉదా:—హరిఇలు = హరులు. హరిఇలన్ = హరులన్ - ఇట్లే దధులు, దధులన్, మొ. "ఇంబుద్రౌనాత్" అనుదాని గూర్చి వ్యాఖ్యచేయఁబడెను. (౧౩౯ విధి. కల్పతరు.) దీనికే అపవాదము. ఉదా:—ఓహరి - ఓహరీ - ఓహరులార - ఓహరులారా, ఇతః = ఇకారాంతములకు, టాదౌ = టాదివిభక్తి యనఁగాఁ దృతీయైకవచనము మున్నగువిభక్తి పరమగుచుండఁగా, నిః = 'ని' అను నాగమము, నస్యాత్ = కాదు. మహతో నిలా విత్యాదిసూత్రముచే నొప్పున నివర్ణాగమమిదంతములకు రాదని యర్థము. ఇది స్పష్టార్థకము. మహతో నిలావిత్యాదిలోని మహత్తనునది మకుమంతపదమును వ్యాఖ్యచే నిట గ్రాహ్యమ మెట్లగునో రాదు. ఉదా:—హరిచేతన్ - దధిచేతన్ - మొ. "రశ్మి - రాశి - పరదేశి - పేశి - ఇత్యాది శవర్ణపూర్వకేకారాంతములకు బహువచనంబు చేర్చునపుడు వానిశవర్ణంబు సవర్ణంబగు. ఉదా:—రస్ములు - రాసులు - పరదేసులు - పేసులు" (బా. సు. ప్ర. తత్స. ౪౫ సూ. టీ.) "బహువచనంబున రాశిప్రభృతుల శవర్ణమునకు సకారంబగు" (నారా. గాణ. తత్స. ౭౭ సూ.) ఇట్లు ప్రకాశికాకారాదులు వ్రాసిరి. ఈవిషయమును బ్రామాణికవైయాకరణులు చెప్పియుండలేదు. కవిప్రయోగసమ్మతియుఁ జూపఁబడలేదు. మఱియు నిట్లు సవర్ణముతో నుండురూపములు తద్భవములుగా శబ్దరత్నాకరాదులలో నుదాహరింపఁబడెను. "రాసి. వై..." (శ-ర). మఱియు, "గతాశః - ఆశ్రయాశః - జితాశః" మున్నగుస్థలములందు "గతాశులు - ఆశ్రయాశులు - జితాశులు" మున్నగునవి జనింపక యపార్థబోధకములగు 'గతాసులు - ఆశ్రయాసులు - జితాసులు" మొదలగురూపములు పుట్టవలసివచ్చును. నివర్ణకము వికల్పముగా లోపించును. ఉదా:—హరినిన్ - హరిన్ - (౧౩౧ విధి. కల్పతరు.)

ఇతామ్. = ఇకారాంతముల = జసః - షష్ఠ్యేకవచనమున కాదేశముగా - కిః = కివర్ణకమగును. కువర్ణకము రాదనియు నర్థము నెన్నునది. ఉదా:—హరికిన్. మొ. ఈదన్తాః = ఇకారదీర్ఘాంతశబ్దములు - కృతహ్రస్వాః = దీర్ఘాణాం హ్రస్వస్స్యాదితిసూత్రముచేఁ జేయఁబడిన హ్రస్వముకలవై - ఇద్వదేవ = ఇకారాంతములవలెనె రూపసిద్ధి నందుచున్నవి. ఉదా:— గౌరి - గౌరులు - గౌరినిన్ - గౌరిన్ - గౌరు

లన్ - ఓగాని - ఓగాని - గానికిన్ - మొ. ఈసూత్రము స్పష్టతకై మాత్రమె రచింపఁబడినది. ఇట్లె కృతహ్రస్వములగు నాకారాంతము లుకారాంతములవలెనె రూపసిద్ధి నందునుగదా.

ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు.

బాలవ్యాకరణ ౪౫.

వివృతి. హారులు - గిరులు - కవులు - రవులు - యామినులు -

౧౪౦ I వివ. భామినులు - తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు - స్త్రీలు - లకోరీలు.

సంజీవని. ౧౪౦ I విష:—అర్థములు - రవులు = సూర్యులు - యామినులు = రాత్రులు - భామినులు = స్త్రీలు. లకోరీలు = బాణములు. బహువచనము పరమగునపు డనఁగా లువర్ణకమును లట్టును బరంబగునపుడు, ఇత్తున కనఁగా హ్రస్వేకారమునకు "ఉ" త్వంబనఁగా హ్రస్వమైన "ఉ" కార మగును. దీర్ఘాంతములగు యామినీభామినీశబ్దముల యుదాహృతిచే బా. తత్స. ౪౨ సూ. చొప్పున హ్రస్వము వచ్చి "ఇ" కారాంతములయినవానికినిఁ బ్రకృతసూత్రపుఁ గార్యము వర్తిల్లునని విశదమగుచున్నది. "హారులు - గిరులు -" అను నుదాహృతులచే నీసూత్రము మహదమహత్సాధారణమని స్పష్టపడుచున్నది. హారి+లు = హార్+ఉ+లు = హారులు. ఇట్లె హారులను - హారులచేతను మొ. ప్రకృతసూత్రములోని 'ఇత్' అనెడితపరకరణముచే బా. తత్స. ౪౪ సూత్రముచే హ్రస్వమురాని శ్రీ మున్నగు నేకాక్షరతత్సమములకును దీర్ఘైకారాంతలకోరీప్రభృతి దేశ్యములకును నీకార్యము కలుగదని సూరి వివరించి "శ్రీలు - స్త్రీలు - లకోరీలు -" అనువాని నుదాహరించెను. (విస్తర.) ఉత్తరసూత్రముచేఁ దత్సమముల యుపోత్తమేత్వమున కుత్వము రానేరదనుటను విశదపఱుచుటకయి "యామినులు - భామినులు" అనునవి యుదాహరింపఁబడినవి.

---

విస్తర. ౧౪౦ I విష. :—సూరి 'లకోరీలు' అని యుదాహరించుటంబట్టి యాతఁడు చెప్పకున్నను "న చ దేశ్యపదే" అనుచింతామణి ననుసరించి దేశ్యములకు బా. తత్స. ౪౨ సూత్రముచొప్పున హ్రస్వము గలుగదనుతలంపు సూరికినిఁ గలదని నొక్కిచెప్పవచ్చునని పేటికావ్యాఖ్యాతయు (బా. సా. పే. ౧౪౪ పు.) నట్టివాగనుశాసనమతమును సూరి యనుసరించె నేకాని వానికి హ్రస్వమువచ్చుటయుఁ గలదని గుప్తార్థప్రకాశికాకర్తయు (బా. గు. ప్ర. ౧౧౪ పుట. ద్వి. ము.) వ్రాసిరి. కాని యుభయులకును సూరి హృదయము గోచరము కాలేదు. సూరి యిట చింతా

సప్తమా ఇదుపోత్తమోత్తమానాం, బహువచన ఉపోత్తమేత
భర్త్సనీయము. ఉద్భవతి (అం. చిం. హలం. ౧౩ కా.) (అహో.
౧౯౧ విషయము. ౪౧౯ పు.)

కల్పతరు. ౧౯౧ పు:—త్యాగ్యోరిఁవా ముత్తమ ముత్తమమ్. తత్సమీప ముపోత్తమము ప్రసిద్ధమగుటచేఁ జెప్పనక్కఱ లేని యక్షరములుగల శబ్దములలో దుదియక్షర ముత్తమ మనిపించుకొనును. దానికిఁ బూర్వాక్షర ముపోత్తమ మనఁబడును. ఇదుపోత్తమోత్తమానామ్ = ఇకార ముత్తమముగాను నుపోత్తమముగాను గలశబ్దములకు, బహువచనే = బహువచనము పరమగునపుడు, ఉపోత్తమేతః = ఉపోత్తమమగు 'ఇ' కారమునకును, ఉత్ = ఉకారము, భవతి = అగును. 'సమితులు' మున్నగునవి లక్ష్యములు కాకుండుటకై యీవిధి యాచ్ఛిక మాత్రపరమని వ్యాఖ్య చేయనగును. ఉత్తమేకారమునకు "ఉద్బహుత్వే" అను చింతామణిసూత్రముచేతనే 'ఉ' కారమగును. ఉ:—కలిమి = కలుములు. ఇటఁ బ్రకృతసూత్రముచే లకారముమీఁది యికార ముకార మయ్యెను. 'ఉద్బహుత్వే' అనుసూత్రముచే మకారముమీఁది యికార ముకార మయ్యెను. ఉపోత్తమ మనుటచే రెండక్షరములుగల 'జిగి' అనుశబ్దములోని 'జ' కారముమీఁది యికార ముపోత్తమ మనిపించుకొనదు. కాన 'జిగులు' అనియే యగును.

విక్రుతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు
బహువచనము పరంబగునపు డుత్వంబగు. ౪౮.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. కలిక - కలుకులు - ములికి - ములుకులు చెలిమి - చెలుములు - బలిమి - బలుములు - ఉపో

---

మణిని యథాస్థితముగ ననుసరింపలేదు. కొంత సవరించి సూత్రించికొనెను. లకోరి ప్రభృతులకు 'లకోరి' మున్నగుహ్రస్వరూపములు నైత ముండిన నుండవచ్చు నను నభిప్రాయముగలవాఁడు కావుననే సూరి చింతామణికారికలోని "న చ దేశ్యపదే" అనుదాని నుజ్జగించినవాఁడయ్యెను. అట్లుజ్జగింపనిచో నేకాక్షరకతత్సమశబ్దముల తోపాటు దేశ్యశబ్దములకును హ్రస్వరూపము లేకపోవలసివచ్చునుగదా. దేశ్యములలో హ్రస్వాంతములవలెనె దీర్ఘాంతములును దేశవ్యవహారప్రవాహసిద్ధములు కాఁగలవుగాన వానికి హ్రస్వమువచ్చుననికాని దీర్ఘమువచ్చుననికాని సూత్రించుట యనావశ్యకమని యాతఁడు తలంచియుండెనని నిశ్చయింపనగును.

త్తమేత్వం బగుటంజేసి జిగి - నిసి - ఇత్యాదులం

బాలవ్యాకరణ దుత్వంబు లేదు. జిగులు - నిసులు.

విశేషణము. కలడోపధనవార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబు

౧౫౧ I విషయం. గలుగదు. ౪౭.

పందిరి - పందిరులు - పిడికిలి - పిడికిలులు - రాపిడి

రాపిడులు - తొమ్మిది - తొమ్మిదులు.

సంజీవని. ౧౫౧ I విష:—అర్థములు. కలికి = స్త్రీ, ములికి = బాణము, చెలిమి = స్నేహము, బలిమి = బలము, జిగి = కాంతి, నిసి = రాత్రి, రాపిడి = ఒరయిక, నవార్థాదులు = తొమ్మిది ప్రభృతులు.

౪౬. సూ. వ్యాఖ్య. ఉత్తమోపోత్తమశబ్దార్థములు కల్పతరువున వివరింపఁ బడెను. మూఁడిటికిఁ దక్కువకాని యక్షరములుగల యిదంతశబ్దముల యుపాన్త్యాక్షరమగు 'ఇ' కారము బహువచనపరకత్వమున 'ఉ' కారమగునని యర్థము. ఆశబ్దములోని యుత్తమేకారమునకుఁ బూర్వసూత్రముచే (బా. తత్స. ౪౫) 'ఉ' త్వమగును. కలికి+లు = కలుకులు, మొ. మూఁడక్షరములకుఁ దక్కువ యక్షరములున్నపు డాశబ్దమున నుత్తమత్వోపోత్తమత్వముల వ్యవహారమె యసంభవముగాన రెండక్షరములుగల జిగి మున్నగుశబ్దములలో నీసూత్రము వర్తింపదనుచు వివరించి 'జిగులు, నిసులు' అని సూరియే యుదాహరించెను. సూత్రములోని వికృతిశబ్దమాచ్ఛికపరమనుచు సూరిగారే వివరించిరి. సంస్కృతసమములం దీకార్యము రాదనుటకుఁ బూర్వసూత్రమునందే "యామినులు - భామినులు" అనునుదాహృతు లీయఁబడెను. ఇకారాంతములను దళముచే 'తలిరు - ఉలివు' మున్నగుస్థలములలో నీసూత్రపుఁగార్యము సంభవింపదు. ఉ:—తలిరులు - ఉలివులు - మొ. హ్రస్వేకారాంతశబ్దముల యుపోత్తమేకారమునకే యుత్త్వము కల్గుననియు నెఱుంగునది. ఉ:—తనికీలు. మొ. మూఁడికిఁ దక్కువకాని యనుటచే నాల్గక్షరములుగల శబ్దములందును నీవిధి వర్తిల్లును. కావుననే కదా, పిడికిలి మున్నగుశబ్దములలో నీవిధి కల్గనేరదని సూరికిఁ జెప్పవలసివచ్చెను.

౪౭ సూ. వ్యా:—'ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము' అని సూరిగారివివరణము. (బా. సంజ్ఞా. ౧౦ సూ.) ర ల డ ల లో నేదేని యుపధగాఁ గల 'ఇ' కారాంతశబ్దములయుఁ దొమ్మిది ప్రభృతిశబ్దములయు నుపోత్తమేత్వమునకు బహువచనపరకత్వమున నుత్వము కలుగదని యర్థము. పందిరి+లు = పందిరులు - పిడికిలులు - రాపిడులు (విస్తర).

---

విస్తర. ౧౫౧ I విష:—పూర్వసూత్రమునకుఁ (బాల. తత్స. ౪౬ సూ.)

కల్పితేఽస్తి. ౧౫౮ విషః—ఉదోతోః = ఉకారాంతములకు నోకారాంతములకును, సప్తస్త్రే = తంబేటను సనగా స్త్రీలింగమునందు సయుతము, ముపత్ = 'ము' అనుదానివలెనె, వుః = 'వు' అనునది - భవతి = అగును, అదంతామహత్తులకు మువర్ణకమువలెనె, 'ఉ' దోదన్తములకుఁ బరముగా సయుతము వువర్ణకము ప్రథమైక వచనమగు సుప్రత్యయమున కాదేశమగును. మువర్ణకేతరవిభక్తి పరమగునపుడు 'ము' అనునాగమముచేరునట్లు వువర్ణకేతరవిభక్తి పరమగునపుడు 'వు' అనునది యాగమముగా నిల్చును. ఉదా:—తనువు - తనువులు - తనువున్ - తనువులన్ - తనువులచేతన్ మొ. ముందు చెప్పఁబోవు (బా. తత్స. ౫౦ సూ.) సూత్రము చొప్పున "ఉదంతమహత్పుంలింగములకు డుజ్వర్ణకము వికల్పముగ నిల్చునట్లు 'ఓ' దంతమహత్పుంలింగమగు గోశబ్దమునకును డుజ్జు వికల్పముగా నగుననుభ్రమ కల్గకుండ నథర్వణుఁడు వివరించుచున్నాఁడు. భిన్నత్వే = వ్యస్తతయందును, అభిన్నత్వేచాపి = సమాసమందును, ఓదన్తతః = ఓకారాంతముకంటెఁ బరమగు సుప్రత్యయమునకు, డుజ్ = డుజాదేశము, న భవేత్ = కాదు. ఉదా:—గోవు = ఆదిత్యుఁడు, తీక్ష్ణగోవు = తీక్ష్ణుఁడగునాదిత్యుఁడు. సమాసాన్తవిధానేతు = బహువ్రీహిసమాసమున నుత్వరూప హ్రస్వమనెడి సమాసాంతవిధి నందినపుడుమాత్రము - తత్ప్రయోగః = ఆడుజ్జుయొక్క ప్రయోగము, హితః = సమ్మతమైనది, భవేత్ = అగును. ఉదా:—భృతగుఁడు = భరింపఁబడిన వజ్రముగలవాఁడు. "గోవు - సం.

పోలికి - కోరికి - మున్నగువాని యుపోత్తమేత్వ ముత్వము కాకుండుటకై దోపథక మనక నవార్థాదులనిసూరి గ్రహించెననుట యుచితము" (బా. సా. వే. ౧౫౮ పుట.) అని వేటికావ్యాఖ్యాత వ్రాసెను. ఈతని (వేటికాకర్త) మతమున, మగటిములు, కోరికులు, చూడికులు - పోలికులు మున్నగురీతినే యుండవలెనుగాని 'మగటుములు - కోరుకులు' మున్నగురీతి నుండరాదని తేలుచున్నది. సూరిమతమున మగటుములు - కోరుకులు మున్నగురీతినే యుండవలయునుగదా. ప్రమాణములు చూపకయే యిట్లపరికిఁదోఁచినరీతిని వారు నిరాధారనియమములను జేయుట కేవలము నసంగత మనకతీరదు.

పందిళ్ళేసి (సలోలోక్త్యేతి బాలసరస్వతీయసూత్రవ్యాఖ్య. ౩౦ పు. పరిష్కరణము) రారాపిళ్ళభుజాంగదంబులమణుల్ రాలంగ...(మను. ౪ ఆ. ౭౬) మున్నగురీతి ప్రయోగములు గలవుగాని యవి విశ్రమస్థానాదిగతములు కామింజేసి సందేహనిర్ణాయకములు కాఁజాలకున్నవి.

వి. పి. పుం. ౧ ఆదిత్యుడు. ౨ వృషభము...స్త్రీ ౧ వాక్కు...౮ ఆవు...పుం. స్త్రీ ౧. స్వర్గము. ౨ వజ్రము...౮ కిరణము." (సూ. రా. ని.)

బాలవ్యాకరణ ఉకారాంతగోశబ్దంబుల కంతట వు వర్ణకంబగు. ౭౭.

సూత్రము. తరువు - ధేనువు - మధువు - గోవు - అంతట ననుట

ఇతి I నియమము. స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము.

సంజీవని. ౧౫౦ I వివ:—ఉదాహరణములు - తరువు = చెట్టు - ధేనువు = ఆవు, మధువు = తేనె. ఉకారాంతము హత్తుల 'వు' వర్ణకము బా. తత్స. ౫౭ సూత్రమున నుదాహరింపఁబడెను. కాన నిట నమహత్తులగు నుకారాంతములుమాత్రముదాహరింపఁబడుచున్నవి. అవి మూఁడులింగములందును నొక్కొక్కటిచొప్పున వరుసగా నుదాహృతము లగుచున్నవి. 'ధేనువు' అను స్త్రీలింగమునకు బా. తత్స. ౫౭ సూత్రముచొప్పునఁ బ్రథమైకవచనలోపము ప్రాప్తించుచుండఁగా నట్టిలోపమును వారించుటకై యీసూత్రమున 'అంతటను' అనుపదము నిల్పఁబడెను. అంతట ననఁగాఁ బుంస్త్రీనపుంసకములు మూఁటియందును వువర్ణకమె యగునను తాత్పర్యమును సూరిగారే "అంతట ననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థ"మని వివరించిరి. గోశబ్దంబునకుఁ బుంస్త్వస్త్రీత్వములు రెంటను వుప్రత్యయమె వచ్చును. "గోవు - సం - వి - ఓ - పుం - ౧ ఆదిత్యుఁడు ౨ వృషభము...స్త్రీ. ౧ వాక్కు...౮ ఆవు ..పుం. స్త్రీ. ౧ స్వర్గము. ౨ వజ్రము...౮ కిరణము..." (సూ. రా. ని.) క. గోవులు సూర్యునియుజ్జ్వల ౹ గోవుల యట్లగుట...(అను. ౨ ఆ. ౪౬౧) గౌణత్వమున గోశబ్దమునకు "గోస్త్రియోరుపసర్జనస్య" (౧-౨ ౪౮) (౬౪౬ సూ. అవ్యయీభావ. సి. కౌ.) అనుచొప్పున హ్రస్వము రాఁగా "చిత్రగుఁడు" (= చిత్రవర్ణముగలకిరణములుగలవాఁడు = చిత్రభానుఁడు = సూర్యుఁడు) అనురూపముసిద్ధించును. ఇట్లు బహువ్రీహియందుమాత్రము గోశబ్దము డుమంతత్వమునందును. "భీకరగతి నింద్రుఁ డేఁగె భృతగుం డగుచున్. ఇత్యాది తత్రోదాహరణమ్" (అహో. ౨౬౩ పు.). అనుపసర్జనత్వమున సమాసాంతవిధి (ఉకారరూపహ్రస్వము) లేమింజేసి "శ్వేతగోవు" అనురీతినె సమాసమందును వాడఁబడును. సంస్కృతమున "ఓ" కారాంతశబ్దములలో గోశబ్దముమాత్రమె ప్రసిద్ధమగుటంజేసి నన్నయాథర్వణు లోదంతములకు 'వు' వర్ణకమును విధించియున్నను సూరిగారు గోశబ్దమునుమాత్రమె పేర్కొనిరి. "ఊః = శమ్భుః స్మృతో యేన సః స్మృతోః - స్మృతావౌ - స్మృతావః" (సి. కౌ. అజం. ౨౬౩ పు.) అను నుదాహృతులచొప్పున 'స్మృతో' శబ్దమోకారాంతము గలదనవలసియున్నను, "సంకేతిత

నుప్రసిద్ధమేకేచిత్ప్రత్నే స్త్రీత్వే ప్రముఖస్త్వత్ర ప్రయోగః" (అహో. ౭౯-౮ పు.) అనునహోబలపతివాక్యముచెప్పున సూరి యట్టివి యప్రయుక్తములని తలంచి యుపేక్షించెను (చూ. ౧౮౭ విష.) తత్పరకరణము లేమింజేసి "ఊ" కారాంతములకు ప్రత్యయ మగును. ఉదా:—భ్రూవు = కనుబొమ. ఏకాక్షరకములు కాని యూకారాంతము లుదంతములయి తెల్గువిభక్తులనందును గాన నేకాక్షరకమగు నూకారాంతశబ్దముమాత్రమె పైరీతి నుదాహరింపఁబడెను. "భ్రూవు - సం - వి. ఊ - స్త్రీ - కనుబొమ" (శ. ర.). బాల. తత్స. ౮౦ సూత్రముచెప్పున సకార లోపముకల్గిన ధనుశ్శబ్దము మున్నగునవి "ఉ" కారాంతములై "ధనువు - ధనువులు" మున్నగురూపముల నందుచున్నవి. ఆచ్ఛికములగు పుట్టువు, బందువు, పండువు, మున్నగుశబ్దముల తుదినున్న 'వు' అనునది శబ్దావయవమె కాని ప్రథమావిభక్తి ప్రత్యయము కాదు. కాన నట్టి యాచ్ఛికములెల్ల స్త్రీసమములె యన నగును. (విస్తర.)

విస్తర. ౧౫౩ I విష:—"వువర్ణకోభవత్యత్ర । క్వచిన్నిత్యం క్వచిత్తువా (వికృ. అజం. ౫౩ కారి.) అన్నువు, పండువు, ఇత్యాదౌనిత్యః - అన్నుశబ్దోఽత్ర స్వల్పవాచకః" (అను). "పుట్టు, పుట్టువు, అన్ను, అన్నువు, ఇత్యాదౌవికల్పః - అన్ను శబ్దోఽత్ర స్త్రీవాచకోదేశ్యః" (అహో. ౩౩౫). అహోబలపతి పయియధర్వణ కారిక నన్వయించికొనుటలోఁ బొరవడెను. వువర్ణకోభవత్యత్రే త్యాదికారిక యాచ్ఛిక శబ్దములకు వువర్ణకమును విధించునది కాదు. అయ్యది "డుజ్ మహత్పదానాంవా" అనుచింతామణికారికను సవరించుచున్నది. (చూ. ౧౫౮ విష.) "మనువట్వాది శబ్దానాం । నడుజ్ నిశ్చప్రయుజ్యతే । వువర్ణకోభవత్యత్ర । క్వచిన్నిత్యం క్వచి త్తువా..." (వికృ. అజం. ౫౬ - ౫౩ కారి.) అని యధర్వణుఁడు సవరించెను. మను వట్వాదిశబ్దములకు డుజ్జురావనియు డుజ్జురానిపక్షమునఁ గొన్నియెడల నిత్యము గాను గొన్నియెడల వికల్పముగాను వువర్ణకము వచ్చుననియు నధర్వణుని సవరణ మునకుఁ దాత్పర్యము. మనువు - ఇట నిత్యము - రాహు - రాహువు - ఇట విక

అనుబంధ. విస్తర. ౧౫౩ I విష:—అన్నువుశబ్దమునకు స్వల్పార్థకత్వము శబ్దరత్నాకరమునందును, సూ. రా. నిఘంటువునందును వ్రాయఁబడలేదు. అన్నువ శబ్దమునకు స్వల్పార్థకత్వము రెండుకోశములందును వ్రాయఁబడెను. అన్నువుశబ్ద మునకు స్త్రీ యనునర్థము శబ్దరత్నాకరమున వ్రాయఁబడలేదు. "అన్ను = అన్నువు" శబ్దములు రెండిటికినిఁ బారవశ్యమనునర్థము రెండుకోశములలోను వ్రాయఁబడి యున్నది.

ల్పము. కం. వర్ణముగాకయును కావచ్చు ధాతునిఁ బట్టిన్ (శల్య. ౩ ఆ. ౨౯౦)
బట్టి ప్రామాణికప్రయోగానుకూలమును: జింతామణ్యనుకూలమును నగు పద
స్వరూపమును మాని యహోబలపతియుఁ దిదినయాయెను (నారా. గాణ. అచ్చి.
౫ ప. ౨౬౮ కారి. తత్స. ౭౭౦. ౫౪ కారి.) చింతామణిసిద్ధాంతవిరుద్ధముగఁ బైరీతిని
సమన్వయించుట కేవలము పొరపాటుగనే తోఁచెను. అహోబలపతి సమన్వయమునకు
నీ క్రిందిరీతిని జింతామణిసిద్ధాంతము విరోధించుచున్నది. "అనుకారాం స్త్రియాం
సమానాం ... స్త్రీపదస్యచ సులోపః" (బా. చిం. తజం. ౨౧ కారి.) (౧౬౧
విష.) అనుకారికచేఁ జింతామణిసూత్రము తత్సమశబ్దములలో ...కారాంతములు
తప్ప దక్కినవానియంత్యమునకు మాత్రమె సులోపమగుననియు నాచ్ఛికశబ్దములం
దన్నిటో పుంలింగపదములు నపుంసకలింగపదములును గాక స్త్రీపదసమస్తశబ్దములకును
సులోపమగుననియు స్పష్టముగా వక్కాణించుచున్నది. వువర్ణకమును సర్వత్రో
దోత్వోరిత్యాదిసూత్రముచేఁ దత్సమములకుమాత్రమె విధించుచున్నది. దీనినిఁ
బట్టి యాచ్ఛిక'వు'వర్ణాంతములెల్ల స్త్రీపదములె యనియు వానితుది వువర్ణము ప్రథ
మైకవచన ప్రత్యయము కాదనియుఁ జింతామణిసిద్ధాంతము స్పష్టపడుచున్నది.
"వువర్ణకము మన్వాదులకగు" (బా. కృ. ౧౭ సూ.) అను సూరిసూత్రముచొప్పున
('అన్ను, పండు, మను, పుట్టు,' మున్నగుధాతువులనుండి "అన్నువు, పండువు, పుట్టువు,
మనువు" మున్నగుకొన్ని 'వు'వర్ణాంతములు కృదంతస్త్రీపదములగుచున్నవని గ్రహింప
నగును. బందువు మున్నగునవి బాంధవశబ్దాదుల వికృతిరూపములనుటలో విప్రతి
పత్తియే యుండఁబోదు. పండువు, పుట్టువు, బందువు, మున్నగువాని వకారము
నకు గకారమువచ్చి పండుగు, పుట్టుగు, బందుగు మున్నగురూపాంతరముల నందు
టయు వాని స్త్రీపదత్వమునకుఁ బ్రబలనిదర్శనము కానోపును. ప్రథమైకవచన
'వు'ప్రత్యయ వకారమున కెన్నఁడును, బా. అచ్చి. ౨౭ సూత్రముచొప్పున గకారా
దేశము కానేరదుగదా. పైప్రామాదికమగు నహోబలపతిసమన్వయము సరియను
భ్రాంతిచేఁ గవిజనమండనము, నాంధ్రభాషానుశాసనము నారాయణీయగాణపత
వివరణములు (నారా. గాణ. అచ్చి. ౫ ప. ౨౩ కారి. ౧౧౮ సూ. గాణ. వివ.)
బా. గు. ప్ర. వ్యాఖ్య, బా. సా. వే. వ్యాఖ్య మున్నగుగ్రంథములలోనెల్లఁ
నాచ్ఛికశబ్దములకు వువర్ణకప్రాప్తి ధారాళముగా వచింపఁబడెను. బా. గు. ప్ర.
వ్యాఖ్యాత యింకను బ్రామాదికముగ "పుట్టు - చట్టు - తట్టు - రట్టు - మొద
లైన తెనుఁగుశబ్దములకు నేకవచనంబందు వువర్ణకలోపంబు వైకల్పికంబుగానగును"
(బా. గు. ప్ర. తత్స. ౭౮ సూ. వ్యాఖ్య. ౧౧౮ పుట. ద్వి. ము.) అని వ్రాసెను.

సన్నవాథర్వ. ఉతా మత్ర భవే ద్వావు ! రస్త్రియాం ల్వాదివర్ణకే.
౧౫౩ విషయము. (ఏక్సు. అజం. ౨౮ కారి.) (౭౯౧ - ౭౯౮ అహో.)

కల్పతరు. ౧౫౩ విసః—అత్ర = ఈ వువర్ణవిషయమున, అస్త్రియామ్ = మహతీవాచకస్త్రీలింగములు కానట్టి, ఉతామ్ = అమహత్తులగు హ్రస్వోకారాంతము లకుఁ (భ్రూశబ్దమునకు వువర్ణాగమము నిత్యము) బరముగా ల్వాదివర్ణకే = లువర్ణకము మున్నగు ప్రథమైకవచనేతరవిభక్తి పరమగుచుండఁగా, వుః=వువర్ణము, వా = వైకల్పికముగా, భవేత్ = ప్రాతిపదికమున కంతావయవముగా నగును. "సర్వత్రోదోత్రో ర్వర్ణ్యవతి మువత్" అనుచింతామణి సూత్రముచొప్పున "ము" వర్ణము వలెనె యీవువర్ణముసైతము ప్రథమైకవచనేతర విభక్తిపరకత్వమున నిత్యముగా సిద్ధించుచుండ మహతీవాచకములగు స్త్రీలింగములుతప్పఁ దక్కినహ్రస్వోకారాంత ప్రాతిపదికములమీఁద దానికిఁ బాక్షికత నథర్వణుఁడు సూత్రించెను. దీర్ఘోకారాంతములుసైతము "దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్" అనుచొప్పున హ్రస్వమునంది హ్రస్వోకారాంతములె యనిపించుకొనును. సూత్రములోని "అస్త్రియా" మ్మనుదానికి స్త్రీలింగేతరములకని వ్యాఖ్యచేయవలసియున్నను, "చంచునఁ దాల్చె" (ఆను. ౧ ఆ. ౨౭౦) "విమోహరజ్జులన్" (ఆర. ౨ ఆ. ౭౯) మున్నగు ప్రామాణికప్రయోగముల యనురోధమున మహతీవాచకములగు స్త్రీలింగములకు భిన్నమయినవాని కని వ్యాఖ్యచేయఁబడెనుగాన "చంచులు - రజ్జులు" మున్నగు స్త్రీలింగశబ్దములందు వువర్ణాగమరాహిత్యము సమ్మతమగుచున్నది. ఉదా:—ధేనువులు, ధేనులు, తనువులు, తనులు, చంచువులు, చంచులు, రజ్జువులు, రజ్జులు, తరువులు, తరులు, మధు

---

"చట్టువు, తట్టువు, రట్టువు" అను రూపము లేకోశమునందునుఁ గానరావు. ఈ గుప్తార్థప్రకాశికాకర్త కీస్త్రీలింగస్త్రీవాచక - స్త్రీసమశబ్దములయర్థ మమోఘయముగఁ గన్పట్టెనని తోఁచెడిని. బా. తత్స. ౫౧ సూత్రపువ్యాఖ్యలో "కద్రువ స్త్రీవాచకంబు గావున దీనిప్రథమైకవచనలోపము ఏఁబదియేడవసూత్రంబుచే లోపించెను" (లోపము లోపించె ననఁగా నేమో?) అని వ్రాయఁబడెను. కద్రూశబ్దమునకు "కద్రువు" అనురూప ముండవలసియుండఁగా 'వు' అనుచోట 'వ' అనునది నిల్చుట జరిగినది. ఇట్టిస్థితిలోఁ బ్రథమైకవచనము లోపించెననుట యెట్లు పొసఁగును? సంస్కృతసమశబ్దములందు వ్యాకరణకర్త విధించినస్థలములుతప్పఁ (పిత. భ్రాత. దూత. బ్రహ్మ. అశ్వత్థామ మొ.) దక్కినచోట్ల స్త్రీసమత్వ మశ్రుతచరము గదా.మఱియు సహజముగ స్త్రీలింగమగు కద్రూశబ్దమునకు స్త్రీసమత్వవిధాన మసంగతము కాదా?

వ్రులు, మధువు మొ. మహతీవాచకములకన్నను "వధువ్రులు" అనురీతిని వుగాగమము నిత్యమే యని యెఱుంగునది. "కాం జరత్కారుమునీంద్రునకు జరత్కారునకు సుకుమారైన మహా మునివరు నాస్తీకుని..." (ఆది. ౨ ఆ. ౨౩౮) "శా... జరత్కారున్ మునీంద్రాత్మజన్" (ఆది. ౨ ఆ. ౧౫౫) అని యిట్లు భట్టారకుడు ప్రయోగించియుండుటచే మహతీస్త్రీలింగజరత్కారుశబ్దమునకుమాత్రము వుగాగమపాక్షికత నంగీకరింపవలయును. అహోబలపతియు నీవిషయమున నిట్లు వ్రాసెను. "జత్స్త్రియామిత్యథర్వణవచనే స్త్రీవాచకత్వేనోక్తానా ముదన్తానామితి వ్యాఖ్యానాచ్చ తద్వ్యతిరిక్తేభ్యో వృగ్విషయత్వేనోక్తత్వాత్. జరత్కారున్ మునీయాను జన్మితి తదుక్తేస్తస్యాప్యస్య సాధుత్వమితి బోధ్యమ్" (అహో. ౨౫౬-౨౫౭ పుటలు.)

"ఉతామత్రే" త్యాది ప్రకృతసూత్రము మహదుదంతములయెడఁ బ్రవర్తింపనక్కఱలేదు. "పుఙ్ మహత్పదానాంవా" అను చింతామణిసూత్రముచే మహదుదంతములు పాక్షికముగ వుమంతరూపములనందును గాన నట్టి వుమంతత్వ పక్షమున వానికెట్లును 'వు' గాగమ రహితరూపములు సంభవించును. ఇట్లగుటం జేసి నారాయణీయమున "పురుషవాచకములకును వుగాగమము పాక్షి" కమని యాంధ్రీకరించుట సరికాదు. (నారా. తత్స, ౧౫౮ కారి. ౩౭ ప.)

చింతామణిలోని "సర్వత్రోదోతోర్ద్వ్యక్షరతిముః" త్తను సూత్రము నథర్వణుఁడు సవరించినకారికయగు "ఉతామత్రభవేద్వావు। రస్త్రియాం ల్వాదివర్ణకే। ప్రాయశో వైకృతపదే।లోపో దీర్ఘశ్చ మో రతః॥" అనుదానిలోని "ల్వాదివర్ణకే" అనుదళము ముఖ్యముగా "ఉతామత్రే" త్యాది పూర్వసూత్రమున నన్వయించుచున్నను గాకాక్షిన్యాయమునను త్తరసూత్రమగు "ప్రాయశః..."అనుదానియందును నన్వయింపనగును. (చూ. ౧౨౮ విమ.) అట్టిస్థితిలో నహోబలపతి "ల్వాదివర్ణకే" అను నాదళమును "ఉతామత్రే" త్యాది ప్రకృతసూత్రమున నన్వయించుటనే మాని యుత్తరసూత్రమగు "ప్రాయశః" ఇత్యాదిసూత్రమునందుమాత్రమె యన్వయించిన ట్లీక్రింది యాతనిపంక్తులవలన వ్యక్తమగుచున్నది. "ద్వితీయాచార్యేణతు అమహదుదంతేభ్యోఽపి వుర్వావిహితః - తేన తరు - తరులు - బాహు - బాహులు - ఇత్యాదిరూపంసిధ్యతి. 'అగ్గలంబుగ నాయెదుట బాహప్పళించి' 'పర్వము లేకయును రాహు భానునిఁ బట్టెన్' 'తనతనువు రాహు సోమామృతంబుమ్రింగె' 'దిక్పాలతను వెత్తి సిరిపెంబు తనుతోన' ఇత్యాద్యాస్తిక్కయజ్వాది కవిప్రయోగాః" (అహో. ౨౫౬ పు.) 'రాహు' 'బాహు?' అను వు ప్రత్యయరహిత ప్రథమైకవచనరూప ప్రయోగములనుజూచి భ్రమించి (బాహప్పళించియనుచో "బాహు+అప్పళించి"

ఆక్షేపము ౧౫౩ I విష.) యహోబలపతి యిట్లు ప్రథమైకవచనేతరస్థలములందు వలెనె ప్రథమైకవచనమునందును సాధారణముగా వుప్రత్యయస్థితి తల్లోపములు పర్యాయముగా నుండునని తలంచి "ల్వాదివర్ణకే" అనుదళము "ఉతామత్రే" త్యాది ప్రకృతసూత్రమున నన్వయించుటనూనెనని సుకవి శిరోభూషణపంక్తుల వలన స్పష్టపడుచున్నదిగదా. "రాహు" (బాహు?) అనుదానికిఁ బ్రయోగము లున్నపుడు దానికిమాత్రము ప్రథమైకవచనమందును వుప్రత్యయలోపము నంగీక రించుట యుక్తముకాని మహతీవాచకేతరములగు నుదంతములకెల్లఁ బాక్షికమగు "వు" ప్రత్యయలోపము సిద్ధించునట్లు సమన్వయించుట యుక్తముకాదుగదా. ఇట్టి సమన్వయమువలన నెచ్చటను ప్రయోగములేని "గురు - శంభు-తను - తరు-మధు" మున్నగు నశ్రుతచరములగు నుదన్త ప్రథమైకవచనరూపము లనేకములు సాధు వులుగా నంగీకరింపవలసివచ్చునుగదా. కవిజనమండనవ్యాఖ్యాత యహోబల పండితీయమె యాధారముగఁ గలవాఁడయ్యు నచ్చటచ్చట దాని సవరింపఁగడఁగి పంకమగ్నుఁ డగుచుండుట పెక్కుచోట్లఁగలదు. అట్లె ప్రకృతస్థలమందును "అస్త్రి యా" మ్మను దాని కహోబలపతిచొప్పున "స్త్రీవాచక వ్యతిరిక్తముల" కని వ్యాఖ్య చేయక "స్త్రీలింగ వ్యతిరిక్తముల" కని టీకవ్రాసెను. అట్లగుటచే నన్నయ తిక్క నల "విమోహరజ్జులన్" (ఆర. ౨ ఆ. ౭౮ ప.) "చంచునఁదాల్చె" (ఆను. ౧ ఆ. ౨౭౦) మున్నగు ప్రయోగములకు విరోధమును దెచ్చిపెట్టుకొనెను. కవిశిరో భూషణమున "ఉతామత్ర" అనుచో "అసంబుద్ధౌ" అని పాఠాంతరము చూపఁ బడెను. దీనిచే "రాహ - బాహ" అనెడి యనిష్టములగు సంబోధనరూప ములు నివారితమగుచున్నవని తత్పాఠకర్తల యాశయము, ఈపాఠమునె కవిజనమండన వ్యాఖ్యాత యాదరించెను. కాని యీ యథర్వణకారిక "సర్వత్రో దోతో" రిత్యాది చింతామణి సూత్రమును సవరించునదగుటంజేసి యిందు "ఓ" దంతములకు వువర్ణాగమపాక్షికత సంభవింపకుండుటకయి యథర్వణుఁడిందు "ఉతా మత్ర" అనియే యుపదేశించియుండు ననుట యుక్తముగఁ గనపట్టుచున్నది. సంబుద్ధ్యేకవచనము ల్వాదులలో నిది కానేరదుగాన నీపాఠమావశ్యకముకాదు.

వువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు
బాలవ్యాకరణ బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా వుగా
౧౫౩ I విషయము. గమంబగు. ౭౮.

తరువులు - తరులు - ధేనువులు - ధేనులు - గోవులు.

సంజీవని. ౧౫౩ I విష:—నన్నయాథర్వణులు చాలవఱకు విశదముగా

నైన (ఆది. ౨ ఆ. ౨౩౮) చ....అ। న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి..." (ఆర. ౨ ఆ. ౭౯) "రజ్జు - స్త్రీ...దామని" (శబ్దస్తో) "స్త్రీతురజ్జుః" (అమర. ౨ కాం. శూద్ర-సుధ. ౨౭ శ్లో.) సీ. విపులభూరుహశాఖ విఱిగిన మునిహితార్థంబుగాఁ జంచునఁ దాల్చె నితఁడె. (ఆను. ౧ ఆ. ౨౭౦) చక్షుస్త్రోటి పభే స్త్రీయా (అమర. ౧ కాం. సింహ. ౩౬ శ్లో.) "చక్షుః - పుం - సాడీచశాకే - వ్యడమ్బకే - రక్తైరణ్డే - ఏరణ్డసామాన్యే - క్షుద్రచఞ్చువృక్షే - స్త్రీ-పక్షిణామోష్ఠే - త్రోట్యామ్" (శబ్దా. చిం.) క.... । కలబదరీతరులఁజూచి కడువిస్మితుఁడై (ఆర. ౩ ఆ. ౩౦౮) మ. హాలికుండెంతయు...పెక్కుజం । తులు హింసావిధి గాదనంగవశమే దోషజ్ఞ యూహింపుమా. (ఆర. ౫ ఆ. ౫౭) సీ. ఆఖుతోఁజెఱలాడు నడవిపిల్లి (కాశీ. ౨ ఆ. ౮౩ ప.) శా. మీఁదం దారధరాధరంబుగల యామేరు స్నగంజాలి...(పాండు. ౧ ఆ ౮ ప.) సీ. దిక్పాలతను పెత్తి తిరిపెంబు తనుతోన (అహో. ౭౯౬ పు.)

---

యహోబలపతి వ్రాసెనేకాని యందులకుఁదగిన ప్రమాణమేమియుఁ జూపలేదు. అథర్వణుఁడు పేర్కొనిన వటుశబ్దముతోపాటు కటు పటు శబ్దములను సైతము ప్రాచీన లాక్షణికులు మన్వాదులలోఁ జేర్చియున్నారు. ఆ. వె...వటువును మనువును।బటువు 'డులకుఁ బాసి' పరఁగుచుండు।(ఆం. భూ. ౩౯ ప.) క. మను కటు పటు శబ్దాదుల । నొనరింప "డుకార మెపుడు నుండదు" కవితం। దెనిఁగించిచెప్పుచోటం । దనరు వుకారంబ యర్థదాయకముగుచున్. ఆ. వె. మనువు ధర్మశాస్త్రమతమున మిక్కిలి । కటువు బిరుదవినుతికరణములకుఁ । జాలఁ బటువు ధరణి సంగీత సాహిత్య । సరణి విశ్వనాథచక్రవర్తి (కావ్యాలం. ౯ ఉల్లా. ౨౯-౩౦ ప.) వీనిలోని "డులకుఁబాసి" "డుకార మెపుడునుండదు" అను వాక్యములనుఁబట్టి కటు పటు శబ్దములు సైతము మహత్తులె యుద్దేశింపఁబడెనని నిశ్చయింపనగును. విశ్వనాథచక్రవర్తికి విశేషణముగా నుదాహరించుటయు వాని మహత్త్వోద్దేశమునకు నిశ్చాయకమగుచున్నది. పటువు = సమర్థుఁడు. కటువు = అప్రియుఁడు. పైపద్యములలోని "బిరుదవినుతి కర్ణములకు" అనునపపాఠము ముద్రణములోనున్నది. దీనినిఁబట్టి కటువు అనునది యమహదర్థకమనుభ్రమకలుగును. "బిరుదవినుతికరణ"మనఁగా "బిరుదవినుతినిఁ జేయుట" అనియర్థము. ఇట్లు మహద్వాచకములగునపుడు మాత్రమె వీనికి వువర్ణక వువర్ణాగమములు నిత్యములని ప్రాచీనులయాశయముకాని వీనికర్థాంతరములందలి యమహత్త్వమునందును వువర్ణక వుగాగమనిత్యత గలదని వారి యభిప్రాయముకాదు. ఇట్టిస్థితిలో నీ కటు పటు శబ్దములకును వీనితోపాటు మఱికొన్ని యగు మధ్వాదులకును వువర్ణక వుగాగమములు నిత్యములని నిరాధారముగ వ్రాయుట యుక్తముకానేరదు.

డుజ్మహత్పదానాంవా (ఆం. చిం. అజం. ౧౧ కారి.)
(అహో. ౪౯౧ పు.)

నిషేధసూ: మనువట్వాదిశబ్దానాం న డుజ్ నిత్వం ప్రయుజ్యతే
౧౫౭ విషయము. (వికృ. అజం. ౭౬ కారి.) (అహో. ౭౯౭ పు.)
పువర్ణకోఽత్ర క్వచిన్నిత్యం క్వచిత్తువా. (వికృ. అజం. ౫౭ కారి.) (అహో. ౭౮౫ పు.)

కల్పతరు. ౧౫౭ విషః—మహత్పదానామ్ = మహద్వాచకములగు ఉకారాంతములకుఁ బరమగు సుప్రత్యయస్థానమున, డుజ్ = 'డుజ్జు' అనునది, వా = వికల్పముగానగును. "డుజ్" అనునది న్యాదులకును నుపలక్షణము. ఉదా:— శంభుఁడు - శంభులు - శంభునిన్ - శంభున్ - శంభులన్ - శంభునిచేతన్ - శంభుచేతన్ - శంభులచేతన్ మొ. సంబోధనమున శంభుఁడ - శంభుఁడా - శంభూ (చూ. ౧౮౧ విష.) శంభులార మొ. ఇట్లు డుజ్జు వచ్చుపక్షమున రామాదిశబ్దములకువలె డుమంతరూపములెల్ల సిద్ధించును. డుజ్జు రానిపక్షమునఁ జింతామణిలోని పూర్వసూత్రముచొప్పున (సర్వత్రోదోతోర్వ్య స్యవతి ముపత్) పువర్ణక పువర్ణాగమములు వచ్చును. ఉదా:—శంభువు - శంభువులు - శంభువ - శంభువులార - శంభువునున్ - శంభువున్ - శంభువులన్ - శంభువుచేతన్ - శంభువులచేతన్ మొ. 'అమహత్తు' లకుఁ బ్రథమైకవచనేతర ప్రత్యయములు పరగునపుడు పువర్ణాగమము పాక్షికమైనట్లు (౧౫౩ విష.) మహద్వాచకములకు పువర్ణాగమరహితరూపములుగు - శంభులు - శంభున్ - శంభులన్ - శంభుచేతన్ -శంభులచేతన్ - మున్నగునవి ప్రయోగసిద్ధములయియున్నవి. ఇట్టివి డుమంతత్వపక్షమున నెట్లును బైనుదాహరించినరీతిని సిద్ధించును. కావుననె "ఉతామత్రే"తిసూత్ర (౧౫౩ విష.) మమహత్పక్షముగా మాత్రము సమన్వయింపఁబడెను.

మనువట్వాదిశబ్దానామ్ = మను - వటు - ప్రభృతిశబ్దములమీఁది సుప్రత్యయమునకు, డుజ్ = డుజ్జు, నప్రయుజ్యతే = రాదు, నిత్వ = నివర్ణాగమమునురాదు. "మనుఁడు - మనునిన్ - మనునిచేతన్." మున్నగు డుమంతరూపములు సాధువులుకావని తాత్పర్యము. అత్ర = ఇట డుజ్జురానిశబ్దములకు, పువర్ణకః = పువర్ణకము, క్వచిత్ = కొన్నియెడల, నిత్యమ్ = నిత్యముగా, భవతి = అగును. క్వచిత్తు = కొన్నియెడల, వా = వికల్పముగా పువర్ణకమునిల్చును. ఈ పక్షములోని పువర్ణకము పువర్ణాగమమునకును నుపలక్షణము. ఉదా:—మనువు - మనువులు - మనువునున్ - మనువున్ - మనువులన్ - ఇవి నిత్యపక్షోదాహృతులు.

వికల్పమునకు ఉదా:—రాహువు, రాహు - రాహువులు, రాహులు - రాహు వునున్, రాహున్ - రాహువులన్, రాహులన్, మొ. 'బాహు' అను ప్రథమైక వచనరూప మథర్వణ సమ్మతముకాదని యీవలనె చూపియున్నాను. ముందు విస్త రింపఁబడును. (చూ. ౧౫౩ విష. ౧౫౮ I విష.). గాణపతవివరణమున "సడలంగ మెడ రజ్జు గడువడి (పాండు. ౫ ఆ. ౨౩౮)" అని యుదాహరింపఁబడెను. (నా రా. గాణ. తత్స, ౯౧ సూ.) కాని 'రజ్జు' అను ప్రథమైకవచనరూపమె యిచటఁ బ్రయుక్తమని చెప్పవలసిన నిర్బంధము లేదు. "సడలంగ మెడరజ్జుఁ గడువడి నిడు తమి, నతఁసూత్రావృత్తి యవ్వులఁజనియె" ననుచో, మెడన్ = మెడనుండి, సడలంగ = సడలిపోఁగా, రజ్జున్ = కట్టుత్రాటిని, కడువడిన్ = మిక్కిలి వేగముగా, ఇడుతమిన్ = నిలుపు త్వరచేత ననియు నర్థము చేయనగునుగదా. (విస్తర.)

| | |
|---|---|
| | ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళ |
| బాలవ్యా. | ముగానగు. ౫౦. |
| ౧౫౮ I విష. | విష్ణువు - విష్ణుఁడు - శంభువు - శంభుఁడు - వసువు వసుఁడు. |

సంజీవని. ౧౫౮ I విష:—నన్నయాథర్వణుల యనుగమములు సాధ్యసాధన విషయమునఁ జాలియున్నవని గ్రహింపక సూరియిచట సయితము బహుళవిధినె యారంభించుచున్నాఁడు. అర్థములు - వసువు = వసురాజు - వస్వష్టకాన్యతముఁడు. ఉదంతములయిన మహద్వాచకములకు డుమంతరూపములును వువర్ణకము వచ్చు పక్షమున వువర్ణక వుగాగమాంత (బాల. తత్స. ౪౯ సూ.) రూపములును సిద్ధిం చును. బహుళగ్రహణముచేత రాహు ప్రభృతిశబ్దములకు వువర్ణక వుగాగమాంత రూపములు పాక్షికములనియు వానికిని రాహుఁడు, రాహులు, రాహునిన్

---

విస్తర. ౧౫౮ విష:—కేతనాథర్వణుల కాలమునాఁటికి వటుఁడు మున్నగు డుమంతరూపములు కవిసమ్మతములు కాలేదు. కాని కాలక్రమమున నట్టివి ప్రయు క్తములయ్యెను. ఇట్లగుటచేతనే కావలయును. గావ్యాలంకార చూడామణికర్త వటుశబ్దము నెత్తలేదు. ఆ. వె.... వటువును మనువును। బటువు డులకుఁబాసి (ఆం. భూ. ౩౯ ప.) కం. మను కటు పటు శబ్దాదుల।నొనరింప...(కావ్యాలం. ౯ ఉల్లా. ౨౯ ప.) (చూ. విస్తర. ౧౫౩ I విష.) "శా. చండసూర్త్రి వటుండు కాంచె...(భాగ) శాంబరీవటుండు (వైజయంతీవి) చ. అలర మృపావటుండు... మాయావటుండు" (దశావ తార.) (బా. గు. ప్ర. తత్స. ౫౦ సూ. వ్యాఖ్య. ౧౧౯ పుట. ద్వి. ము.)

మున్నగు డుమంతరూపములు బాహ్యముగ నిల్పుచుండియు మన్వాదులకు డుమంత రూపములె యుండవలెనని చెప్పుచున్నారు. ఉదా:—విష్ణువు - విష్ణువులు - విష్ణువున్ - విష్ణువున్ - విష్ణుండు - విష్ణులు - విష్ణునిన్ - విష్ణున్; రాహువు - రాహు - రాహువులు - రాహులు - రాహువునున్ - రాహువున్ - రాహునున్ - రాహుండు - రాహులు - రాహునిన్ - రాహున్; మనువు - మనువులు - మనువునున్ - మనువున్ మొ. మనుశబ్దమునకు యుక్తిశబ్దమునకు ... విశ్వ మన్మథ ... (వైజయంతీ విలాసము. ప. అలక ద్రుపావ ...) ప్రయోగములుచూచి "మను, మధు, పశు, పటు, కటు, దను మొదలైనవి మన్వాదులు, కాని మధుశబ్దంబులకు ప్రయోగంబులు కానంబడుచున్నవి." (బా. వ్యా. ప్ర. తత్త్వ. ౫౦ సూ. వ్యాఖ్య.) అని సుప్తార్థప్రకాశికాకర్త వివరణము వ్రాయుట సుసంగతముగాలేదు. పటుశబ్దమునకు ప్రవర్ణ్ణకప్రగాగమములు నిత్యములని ప్రాచీనులు చెప్పిరేకాని దానితోపాటు మధు శబ్దమునకును నిత్యమని యెవ్వరును జెప్పలేదుగదా. మఱియు నాతఁడిచ్చిన మధుశబ్ద ప్రయోగము దాని డుమంతత్వమును నిర్ణయించునేకాని ప్రవర్ణ్ణక ప్రగాగమముల విషయమున నేమియు నిర్ణయింపఁజాలదుగదా. అట్లగుటచే సుప్తార్థప్రకాశికాకర్త రెుత్తిన పటుశాస్త్రీక మధుశబ్దము విష్ణుశబ్దమువలెనె డుమంతరూపములను ప్రవర్ణ్ణక ప్రగాగమాంతరూపములను బహ్వాయముగ నందుననియు నది మనువట్వాదులలో నిది కాదనియు గ్రహింపవలయును.

"వుప్రత్యయమును ప్రవర్ణ్ణాగమమును ఏశబ్దమునకు నిత్యములో వేనికి వైకల్పికములో పూర్వులు నిర్ణయించలేదు. కావున బూర్వప్రయోగములనుబట్టి కొంతవఱకు కానిర్ణయముచేయుచున్నాను" (ఆం. భా. అ. శబ్ద. ౬౧ సూ. వివరణము. తృ. ము. ౧౮౮ పు.) అనివ్రాసి యనుశాసనకర్త యాక్రింది రీతిని గొన్ని యనుగమములను జూపెను (ప్రవర్ణ్ణక ప్రగాగమములవిషయమున నన్నయాథర్వణులు చాలవఱకు లెస్సగాననఁగా నియమకంబు మేలుగా సూత్రించిరి). "పాండు - కురు - పూరు - శంతను - అభిమన్యు - కంతు మొదలగు కొన్నిటికి వుప్రత్యయము రాదు. 'డు' మాత్రమేవచ్చును." (ఆం. భా. అ. ౧౮౮ పుట. తృ. ము.) అని యనుశాసనకర్త నిరాధారముగ వ్రాసెను. ఇట్టి ప్రవర్ణ్ణక ప్రగాగమరూప నిషేధమును వైయాకరణులెవ్వరును జేసియుండలేదు. ప్రాచీనప్రామాణిక వైయాకరణ మహాకవీంద్రోపదిష్ట సూత్రములచొప్పున వీనికి ప్రవర్ణ్ణక ప్రగాగమాంతరూపములును డుమంతరూపములతోపాటు సమ్మతములె యైయున్నవి. ఈవిషయమును జూచి

శౌనక కోశకారులును నెవరికిఁ దోఁచినరీతిని వారు వ్రాయుచువచ్చిరి. ఆంధ్ర నిఘంటు రచనాసందర్భమునఁ దత్సమశబ్దములకుఁ బ్రయోగపరిశీలనము లేమింజేసి నిరాధారములగు నీకోశకారులవ్రాత లీవిషయమునఁ బ్రామాణికములు కాఁజాలవు. "కురువు. సం. వి. ఉ...పుం. ఒకరాజు" (శ. ర.) "కురువు. సం. వి. ఉ. పుం. ౧ అజమీఢుని మనుమఁడగు నొక చంద్రవంశపురాజు" (సూ. రా. ని.) ఇట్లు కొన్నియెడలఁ గోశములం దనుశాసనకర్తకు విరుద్ధరూపములె యుదాహరింపఁబడినవి.

గీ. ద్విత్వము విసర్గలోపంబువెలయుచోటఁ । జను నుకారాంతశబ్దంబుఁ దెనుఁగుసేయ । రఘు - రఘువు, బాహు బాహువు, రాహు రాహువు/వూ, రు వూ, రన మఱిమేరు మేరువనఁగ (కవిజనసం. ౨ తరం. ౧ ప. ౩౦ పుట.). ముద్దరాజు రామనచూపిన యీ యపసిద్ధాంతము తర్వాతి పెక్కురు లాక్షణికులను భ్రమింపఁ జేసినది. గీ॥ మొనసి కృతుల నుకారాంతములఁ దెనుంగు । సేయునెడలను వ్రాల్వచ్చుఁ జెడు నొకొక్క । తఱిని రాహువు బాహువు తరువనంగ । రాహు బాహును దరు నన రాజభూష (సర్వల. ౧ ఆ. ౮౩) "తరు - తరులు - బాహు - బాహులు - ఇత్యాది" (అహో. ౨౯౬ పు.) "రాహ్వాదులకుఁ బ్రథమైకవచనమున వుప్రత్యయమును, తక్కిన యెల్లవచనముల వుసర్ణమును వైకల్పికముగనగును ఉదా:—రాహు. రాహువు...ఇట్లె కేతు - బాహు - బిందు - మొ." (ఆం. భా. అ. శబ్ద. ౩ సూ.) ఇట్లు వీరెల్లవ్రాసిరేకాని యొక్కరును "రాహు - (బాహు?)" అను రెండుస్థలములందుఁదప్పఁ దక్కినచోట్ల నొక్కటనైనఁ బ్రథమైకవచనమున వువర్ణరాహిత్యమునకుఁ బ్రయోగముఁజూపినవారుకారు. అట్టి ప్రయోగమెచ్చటను గన్పట్టలేదు. అట్లు ప్రయోగములు లేకుండుటనే తిమ్మకవి "రఘున్-తరులు-జంతులు-ఊరులన్" అనువాని ప్రయోగములను మాత్రముచూపెను. ఇందు'రఘున్'అనునదిదుమంతత్వమున నిగాగమాభావపక్షమున సిద్ధించురూపమనఁదగును. తక్కినవి "ఉదంతాన్మహత్తు" లగుటంజేసి "ఉతామత్రే" త్యాథర్వణసూత్రముచే (విష. ౧౫౩) సాధ్యములగు ప్రథమైకవచనేతరస్థల రూపములననగును. "వువర్ణలోభవత్యత్ర । క్వచిన్నిత్యం క్వచిత్తువా" (౧౫౨ విష.) అను నథర్వణసూత్రములోని "క్వచిత్తువా" అనునది మహద్వాచకమాత్ర విషయమగుటంజేసి యద్దానిచే నొక్క 'రాహు' అను ప్రథమైకవచనరూపము మాత్రము సమ్మతమగుచున్నది. పర్వము లేకయును రాహు భానునిఁబట్టెన్ (శల్య. ౨ ఆ. ౨౪౦) అను తిక్కయజ్వ ప్రయోగ మద్దానికిఁ బ్రమాణమగుచున్నది. ఇంక "అగ్గలించి నాయెదుట బాహప్పళించి" (విరా. ౨ ఆ. ౭ ప.)క, "భాహప్పళించునప్పుడు" (భాస్కర. యుద్ధ. ౪౭౪) అను ప్రయోగములచే

ద్యర్థకమగునపుడు కద్రువు అని" (బా. పా. పే.). ఇది సరికాదు. పుల్లింగ కద్రు శబ్దము గోరోచనా సమ్యశవర్ణార్థకముగాని గోరోచనార్థకముకాదు.

విస్తర. II ౧౫౧ విషయః—"కద్రువ - కద్రువలు అనుచో ప్రవర్ణక పుగాగమముల 'వ' అనుదానిచో 'వ' అనునది నిల్చియుండఁగా 'కద్రువ' స్త్రీవాచకంబు గావున దీని ప్రథమైకవచనలోపము ఏఁబదియేడవసూత్రముచే లోపించెను." (లోపము లోపించెను?) (బా. గు. ప్ర. ద్వి. ము. ౧౨౦ పుట.)" అని గుప్తార్థప్రకాశికాకర్త వ్రాయుట కేవలము భ్రాంతిమూలకము. అచటి 'వ' అనునది ప్రథమైకవచనప్రత్యయ సంబంధిగాయుండఁగా నింక దానిమీఁదఁ బ్రథమైకవచన ప్రత్యయము నిల్చుటేమి? అది లోపించుటేమి? ఆస్త్రీలింగము స్త్రీసమమగుటేమి?

విస్తర. III ౧౫౧ విషః—"భూ - హృత్ - దివ్ - కద్రూ - నౌ శబ్దములు క్రమక్రమముగా భువి - హృది - దివి - కద్రువు - నావ లయి స్త్రీసమములగును. అర్వాచీనరూపమయిన 'కద్రువ' ముద్రణములకెక్కినది." (ఆం. భా. అ. శబ్ద. ౯౭ సూ.) ఈవ్రాఁత కేవలము ప్రామాదికమైయున్నది. ఈతఁడుదాహరించిన హృచ్ఛబ్దేతరములగు 'భూ' ప్రభృతిశబ్దములెల్ల స్త్రీలింగములెయైయుండఁగా వానికి స్త్రీసమత్వాతిదేశవిధానమెట్లు? మఱియు, "కద్రువు" అను వువర్ణకఘటితరూపమునే యంగీకరించుచు నది స్త్రీసమమనుట "మేమాతావన్ధ్యా" అను వాక్యమును స్మరింపఁజేయుచున్నది. అనుశాసనకర్త యర్థముతోఁ బేరొ్కనకున్నను "కద్రూ" అని యాజంతముగా వచించుటచేతను 'కద్రువ' శబ్దమర్వాచీనమని ప్రసంగించుటచేతను నాతఁడు నాగమాతృర్థక 'కద్రూ' శబ్దమునె యుద్దేశించెననియు సూరి నిపతించిన 'కద్రువ' అనురూపమర్వాచీనమనఁగాఁ బ్రాచీనకవి ప్రయుక్తముకాదనియు నాతఁడు తలంచినట్లు స్పష్టమగుచున్నది. గిడుగువారునైత మీక్రింది ప్రయోగములనుఁ జూచికొనలేదని తోఁచెడిని. "చిన్నయ ఆదిపర్వము. II ౨౭-౮౨ (పద్యములు) 'కద్రువు' అని ఉకారాంతముగా పాఠమున్నది" అని వారువ్రాసికొనిరి. (శ్రీగిడుగువారు నాకొసంగిన బాల. మార్జిను). తిక్కయజ్వ 'కద్రువ' అనురూపమునె స్థలద్వయమునందును మన్నించి యిట్లు యతిస్థానఖచితము గావించియున్నాఁడు. సీ. వరుసన యాకద్రువకు వినతకుఁబుట్టె...(అను. ౧ ఆ. ౧౬౭) సీ....ఎ. గీ....కద్రు। వయును మున్నీటిచేరువ వనమునందు।...(అను. ౧ ఆ. ౧౮౧) విశ్రమస్థానమునఁ బ్రయుక్తమగునపుడిట్లు "కద్రువ" అను నత్వయుక్తవకారమె స్థలద్వయమునందును వెలయుచుండుటచేతను నుకారయుక్త వకారమిట్లు విశ్రమస్థానసిబద్ధమై లభింపకుండుటచేతను 'కద్రువు' అనురూపము పాక్షికముగనైనఁ గవిసమ్మతముకాదని వైయాకర

నను స్పష్టప్రతిషిద్ధమాత్ర ఫలకమనియు యహోబలపతివాక్యముల యాశయము. ఉదా:—"పితృ+డాప్ = పిత్ + ఆ = పితా" అని యిట్లు ప్రాతిపదికమేర్పడఁగా "ఙ్యాపాం హ్రస్వస్స్యాత్" అను సూత్రముచొప్పున హ్రస్వమువచ్చి 'పిత' అని యగును. స్త్రీత్వముచే "అనుతాం స్త్రియాం" యిత్యాదిసూత్రముచొప్పున సులోపముగల్గును. పిత - పితలు - పితను - పితలనున్ - పితచేతన్ - పితలచేతన్ - మొదలగు రమాశబ్ద సదృశరూపముల నెన్నునది. విధాత్రాదిశబ్దములకు డాబంతత్వపక్షమున "పితృ" శబ్దమునకువలెనె విధాత - విధాతలు - విధాతను - విధాతలన్ - మొదలగు రూపములు సిద్ధించును. వీనికి డాప్పు రానిపక్షమున "మహాతస్స్వర్ధజనితో భవేత్పుంసి" అనుచొప్పున (౧౩౦ విష.) విధాతృఁడు మున్నగు డుమంతరూపములు కల్గును. ఉదా:—విధాతృఁడు - విధాతృలు - విధాతృనిన్ - విధాతృన్ - విధాతృలన్ - విధాతృనికిన్ - విధాతృనకున్ (౧౩౬ విష.) మున్నగు నీశశబ్దతుల్యరూపములు (ఈశుఁడు - ఈశులు మొ.) లభించును. "నుమ్చోతః" (౮౮ 1 విష.) అను చొప్పున నుకారముపై నుమాగమము వచ్చునుగాన 'ఈశునందున్' అను రూపము సిద్ధించునుగాని "విధాతృనందున్" అనునదెట్లు సిద్ధించునను శంక పొడముచున్నది. 'నుమ్చోతః' అను సూత్రములోని చకారమహిమచే ఋకారముమీఁద సైతము 'అందు - పట్టి - కూర్చి' విభక్తిపరకత్వమున, నుమాగమము వచ్చునని యెన్నునది. "విధాతృనందు ఇత్యాదౌ నుమః ప్రాప్తిస్తు నుమ్చేతి చకారేణైవ భవతి" (అహో. ౩౦౬ పు.) అని యహోబలపతి వ్యాఖ్యచేసియున్నాఁడు. విధాత్రాదిగణమాకృతి గణముకాదనుచు నథర్వణుఁడు విధాత్రాదులనుఁ జేర్కొనుచున్నాఁడు. "విధాతా (బ్రహ్మ) సవితా (సూర్యుఁడు) నేతా (పాలకుఁడు) । దాతా (దానముచేయువాఁడు), ధాతా (బ్రహ్మ)" అను నయిదుశబ్దములు, వాడుజీ = వైకల్పిక డుజ్విషయమున, భవన్తి = అగుచున్నవి, సః = అదియే (విధాతృ, సవితృ, నేతృ, దాతృ, ధాతృశబ్దములె) విధాత్రాదిః = విధాత్రాదిగణము. తదన్యే = వానికి భిన్నమయిన ఋదంత శబ్దములు, డుజీ = డుజ్ విషయమున, స్థితానభవన్తి = వర్తింపవు. విధాత్రాది భిన్న ఋదంతశబ్దములకు డుమంతరూపప్రాప్తిలేదని తాత్పర్యము. క...జగ। ద్వివితుఁడు మాంధాతృఁడు సం। పదఁ గ్రతువులఁజేసె...(అర. 3 ఆ. ౧౫౮) మాంధాతృ రామున్ (ఆది. ౨ ఆ. ౨౨౮) అను భట్టారకప్రయోగములచే మాంధాతృ శబ్దమును సైతము విధాత్రాదిగణములోఁ జేర్పనగును.

బాలవ్యా. ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు.౯౨.

౧౭౬ I విష. భ్రాత - జామాత - కర్త - భర్త - హర్త-గంత-హంత.

సంజీవని. ౧౫౬ I విషః—ఋకారములు - భ్రాత = అన్న, జామాత = అల్లుఁడు - కర్త = చేయువాఁడు - భర్త = భరించువాఁడు, మగఁడు - హర్త = హరించువాఁడు - గంత = పోవువాఁడు - హంత = చంపువాఁడు. వీనిలో "కర్త = చేయునది - భర్త = భరించునది" మున్నగు నర్థములయందు స్త్రీలింగములగుచున్నవి: నిట్లే కర్త - భర్త - మున్నగురూపములే యగును. ఈ ఋకారాంతశబ్దములు కొన్ని స్త్రీలింగములు కావచ్చును. అట్టిచోట బా. తత్స. ౫౭ సూత్రము చొప్పున స్వస్రాదిభిన్నములగు ఋకారాంతములు స్త్రీత్వరూపములే యగుటచేత నని "కర్త్రీ - భర్త్రీ - హర్త్రీ - గంత్రీ - హంత్రీ -" యని ఈకారాంత స్త్రీరూపములు కలుగును. "స్వసా తిస్రశ్చతస్రశ్చ ననాందా దుహితా తథా యాతా మాతేతి సప్తైతే స్వస్రాదయ ఉదాహృతాః" (సి. కౌ. అజంతస్త్రీ. ౩౦౮ సూ. ౩౪.) ఈస్వస్రాదులలో "తిసృ - చతసృ" శబ్దములకుఁ దత్సమరూపములు దెనుఁగునకు వచ్చు సంప్రదాయము లేదు. "నషట్ స్వస్రాదిభ్యః" (౪.౧.౧౦) (సి. కౌ. ౩౦౮ సూ.) అను సూత్రముచొప్పున స్త్రీలింగములైనను వీనికి ఋకారాంతములకు ఙీప్ప్రత్యయము కాదు. కాన స్వస్రాదులు ప్రకృతసూత్రము చొప్పున స్త్రీసమరూపములనందును. స్వసృ = సోదరి - ననాందృ = మగనితోఁబుట్టువగు నాఁడుబడుచు - దుహితృ = కూఁతురు - యాతృ = తోడికోడలు - మాతృ = తల్లి. "భ్రాతృ - జామాతృ - కర్తృ - భర్తృ - హర్తృ - గంతృ - హంతృ - స్వసృ - ననాందృ - దుహితృ - యాతృ - మాతృ" అనునవి వీని సంస్కృత ప్రాతిపదికరూపములు. ఇందు భ్రాత్రాది మహత్పుంలింగములకు బా. తత్స. ౫౭ సూత్రముచొప్పున డుజ్జువచ్చి భ్రాత్రుఁడు మున్నగు ననిష్టరూపములు కలుగవలసియుండఁగా నందుల కపవాదముగ నీసూత్రముపదేశింపఁబడెను. కర్తృ ప్రభృత్యమహత్తులకు కర్తమున్నగు తత్సమరూపముల ప్రాప్తికిని నేతత్సూత్ర మారంభింపఁబడెను. స్త్రీత్వాతిదేశమున "కర్తము-కర్తములు" మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. కర్త = చేయునది. హర్త = హరించునది. ఈ కర్త్రి ప్రాణములకు హర్త యెం. ఋకారాంతశబ్దముల ఋకారముచోట 'అ' కారము నిల్చుటయు నట్టిశబ్దములు స్త్రీలింగతుల్యములగుటయు సంభవించునని ప్రకృత సూత్రమునకుఁ దాత్పర్యము. "కుత్రచిచ్ఛబ్దభేదేషు । భవేత్పర్యస్తలిఙ్గతా" (విష. ౧ VIII.) అనుచొప్పునఁ దత్సమములందును నిట్లు లింగవ్యత్యాసము రూపసాధన ప్రక్రియలో ననేకస్థలములందుఁగలదు. భ్రాత మొదలగు పుంలింగ మహత్తులకు స్త్రీత్వమును 'ఈఖడ్గము ప్రాణహర్త' మున్నగుచోట్ల నమహత్పుంలింగములకు స్త్రీత్వమును లింగవ్యత్యాసమున కుదాహరణములగుచున్నవి. "విశేష్యమాత్రే

స్త్రీ౽న్యాః । స్తృహ్య న్యాతాంచ భేవకే." (మా. ౧౬౪ విష.) అను చెప్పున 'రక్షకుఁడు త్రాత -' మున్నగుచోట్ల స్త్రీసమశబ్దవిశేషణము డుమంతమగుచున్నది.

ఋవంత స్త్రీసమరూపప్రయోగములు:—చ... బహు వేదరవంబులు వింటి తత్పరీవ । కర్తలఁ బోడఁగాన నట్టియెడ ద్రావణరూప...(అను. ౧ ఆ. ౩౭౨ ప). (ప్రవక్తృ = ప్రవచనము చేయువాఁడు) చ... ప్ర । తలకును దండ్రికిన్ సువిదితంబుగ నంతయు విన్నవించిరన్ (ఆశ్ర. ౨ ఆ. ౬౩) సీ. ఆనందభరితాత్మయై రాజ మాత...(ఆర. ౨ ఆ. ౧౫౧ ప.) కం...అ । నాకృలు చుట్టములె యార్యలరులె విధాతా. (ఆర. ౧ ఆ. ౨౨౭ ప.)

విధాతృధాతృదాతృ సవితృనేతృశబ్దంబులకు మహ
బాలవ్యాకరణ — త్తుల కత్త్వ స్త్రీవద్భావంబులు విభాషనగు. ౫౩.
౧౫౭ విషయము. — విధాత - విధాతృఁడు - ధాత - ధాతృఁడు - దాత - దాతృఁడు - సవిత - సవితృఁడు - నేత - నేతృఁడు.

సంజీవని. ౧౫౭ విష:—మహదర్థవాచకములగు విధాతృ ప్రభృతిశబ్దములకు బా. తత్స. ౫౨ సూత్రము చెప్పున వచ్చు నత్వస్త్రీత్వములు వైకల్పికము లని ప్రకృతసూత్ర ముపదేశించుటంజేసి యత్వస్త్రీత్వాభావ పక్షమున బా. తత్స. ౨౨-౨౩ సూత్రములచెప్పున డుమంతరూపములు సిద్ధించును. ఉదా. విధాతృఁడు విధాతృలు - విధాతృనిన్ - విధాతృన్ - విధాతృలన్ - విధాతృనిచేన్ - విధాతృచేన్ - విధాతృలచేన్ - విధాతృనికిన్ - విధాతృనకున్ - మొ. అత్వస్త్రీత్వములు వచ్చుపక్షమున విధాత - విధాతలు - విధాతన్ - విధాతలన్ - మొ. మహత్తుల కనుటచేత 'ప్రాక్తనకర్మమె సుఖదుఃఖములకు విధాత' మున్నగురీతిని నమహదర్థకత్వమున విధాత్రాదులకు డుమంతరూపములు పాక్షికముగ సంభవింపనేరవు. ఇట్టియెడ విధాత విధాతలు మున్నగు నత్వస్త్రీత్వరూపములు మాత్రమె సిద్ధించును. (విస్తర.)

---

విస్తరము. ౧౫౭ విష:—విధాతా సవితేత్యాద్యథర్వణ వచనమునుఁ బట్టియు భట్టారకుని 'మాంధాతృఁడు' అను ప్రయోగమునుఁబట్టియు విధాత్రాది గణగతశబ్దము లివియని వచింపఁదగియుండఁగా నథునాతను లీక్రిందిరీతిని వ్రాయుచున్నారు. "విధాత్రాదులు కొన్నిటికి డుప్రత్యయము వైకల్పికము. ఉదా:—విధాతృఁడు - సవితృఁడు - నేతృఁడు - మొ. పక్షమున ౯౫ సూత్రముచే అత్వస్త్రీత్వములు:—విధాత - సవిత - నేత - మొ. కొన్నిటియనుటచే దాతృ - పితృ - ఇత్యాదులకు డువర్ణమురాదు." (ఆం. భా. అ. శబ్ద. ౧౯ సూ. తృ. ము. ౧౩౪) వైయాకరణాగ్రగణ్యుఁడును మహాకవీంద్రుఁడునునగు నథర్వణుఁడు దాతృశబ్ద

ప్రయోగములు:—సీ॥ దేవిగాఁ బ్రీతితో సేవించెఁ గాంధవిత్రి, నని యున్న చో విధాత్రనకు నిట్లు (ఆది. ౭ ఆ. ౨౪ ప.) సవిత్రుఁ డనఁదగుచు (కాశీ. ౨ ఆ. ౭౨) ఈక్రింది నన్నయ తిక్కనల ప్రయోగముల ప్రామాణ్యమున మాంధాతృశబ్దమును నైతము విధాత్రాదిగణములోఁ జేర్పఁదగును. క॥...జగ । ద్విదితుఁడు మాంధా తృఁడు సం । పదఁగ్రతువ్రలఁ జేసె (ఆర. ౭ ఆ. ౧౯౮) కం॥ అప్రతిహతపటుమన మాం । ధాతృఁడు లోకుగ విశిష్టతపముల...(శాంతి. ౬ ఆ. ౫౫౬ ప.)

దీర్ఘాణాం ప్రహ్వహ్స్వస్య న్మత దేశ్యత దేః న్యుకస్త్రైః
(ఆం. చిం. అజం. ౧౭ కా.) (అహో. ౭౯౯ పు.)
తద్భవస్యాపి శబ్దస్య దీర్ఘాన్తత్వం క్వచిద్భవేత్ (వికృతి. అజం. ౩౦ కా.) (అహో. ౩౦౩ పు.)
కథిత స్తద్భవస్యాపి । దీర్ఘాన్తత్వం క్వచిద్భవేత్ ।
(అహో. ౧౮౯ పు. పాఠాంతరము.)

నన్నయా యావన్త్యన్యాపి శబ్దానా । మప్రాధాన్యే కపోర్థితిః ।
థర్వణీయము. (వికృ. అజం. ౭౯ కారి.) అహో. ౩౦౧).

౧౫౮ విషయము. యథాప్రకృతి సర్వత్ర । సమాసాన్త విధి స్థితః ।
నిత్యతా క్వచిదిష్టా స్యా । ద్రూపసంగ్రాహ్యం సుధీహితమ్.
(వికృ. హలం. ౪-౫ కారి.) (అహో. ౭౯౦ పు.)
త్రిలిఙ్గ్యామపి రైనావో । స్సమాసే ప్రత్యయాన్త తాదో్య నావోఃక్వ చిదిష్టః స్యాత్ । క్లీబత్వే హ్రస్వ సంగ్రహః (వికృ. అజం. ౪౪-౪౫ కారి.) (అహో. ౩౨౨ పు.)

కల్పతరు. ౧౫౮ విష:—దీర్ఘాణామ్ = ప్రాతిపదికముల తుదియున్న దీర్ఘము

---

మును విధాత్రాదులలోఁ జేర్కొనియుండ నద్దానికిఁ బాతిక డుమంతరూపము రాదనుట యుక్తమా ? అట్లె ధాతృ, మాంధాతృశబ్దములను విధాత్రాదులలో నుదాహరింపకుండుట యుసరియా? శబ్దరత్నాకరకర్త విధాతృ సవితృశబ్దములకు ద్వివిధరూపముల నుదాహరించి తక్కినవానికి 'ధాత, దాత, నేత' అని యత్వత్రిత్వ ఘటితరూపములనుమాత్రమె యుదాహరించుట యుక్తముకాదు. ఇట్లె సూ. రా. నిఘంటువునందును 'ధాత, దాత, నేత' అను మూఁటిని శబ్దరత్నాకరములోని వానినె యెక్కించుటయు వాని డుమంతరూపముల నుజ్జగించుటయు సరికాదు. వీరు ప్రబంధములలోని తత్సమశబ్దములను వెదకించి కోశమున వ్రాయలేదుగదా.

లకు, హ్రస్వః = హ్రస్వము, స్యాత్ = అగును. ప్రాతిపదిక సామాన్యము తుది దీర్ఘమునకు హ్రస్వమును విధించుటచే దేశ్యాది ప్రాతిపదికములకు రాదని యుపదేశించుచున్నాఁడు. దేశ్యపదే = దేశ్యశబ్దమునందు, న = కాదు. ఏకవర్ణేఽపి చ = ఏకాక్షరముగల ప్రాతిపదికమందును, న = దీర్ఘమునకు హ్రస్వముకాదు. ఉదా:— రమా = రమ, హాహా = హాహ. (హాహాయఁడు = ఒక గంధర్వుఁడు,) విశ్వపా = విశ్వప, (విశ్వపుఁడు = ప్రపంచమును పాలించువాఁడు.) గౌరీ = గౌరి, వధూ = వధు - (వధువు.) శ్రీ - సిరి = (సిరి) ఇవి తత్సమ శబ్దోదాహృతులు. నేర్పుకాఁడు - పరికాఁడు - జానసీఁడు - పగలాఁడు - మున్నగు 'కా - ఈ - ఆ' అను తద్ధిత ప్రత్యయములతోడి శబ్దముల దీర్ఘములకు హ్రస్వములేదు. కం॥ నీవ కడునేర్పుకాఁడవు। గావలవదు. (ఆది. ౬ ఆ. 33) చ....వంతిము। ట్టిన పరికాఁడు మొత్తమువడిన్... (భీష్మ. ౧ ఆ. ౨౫౬. శ. ర. పరికాఁడు) "పరికాఁడమొత్తము" వావిళ్లవారి ముద్రణము. (ఏ) పరికాఁడు - (బహు) పరికాండ్రు - పరికాఁలు. ఉ. వేఁటోకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగ సంఘటించి న।స్మిఁటఁగ బానసీని నొకనిన్ బురిఁగానని యట్లు...(విరా. ౧ ఆ. ౭౭) క. మన బానసీఁడు వలలుం। డనుశూద్రుఁడు... (విరా. ౨ ఆ. ౧౦) ఇట్టివి దేశ్యములకు హ్రస్వములేనందుల కుదాహరణములు. శ్రీ - శ్రీలు - శ్రీనిన్ - శ్రీలన్ - స్త్రీ - స్త్రీలు - స్త్రీనిన్ - స్త్రీలన్ - నే = నేయి - ఇట్టివి యేకాక్షరకములు హ్రస్వమురామి కుదాహృతులు. కం. నావుడు...। నే వోసిన యగ్నిభంగి.నిగుడంజేయున్ (ఉద్యో. ౨ఆ. ౨౮3) సీ. నేయు నూనియయును..: (శాంతి. ౨ ఆ. ౨౮౮) (సూ. రా. ని.) యశోద। గారి గోపాలిగాఁడు... (అహో. 3౫౫ పు.) నవలా - నేజా - మున్నగు దేశ్యశబ్దములు నన్నయభారతమునలేవు. అథర్వణునినాఁటికి 'నవలా = నవల - నేజా = నేజ" మున్నగురీతి ద్వైరూప్యముగల శబ్దములు వచ్చియుండును. "నైకవర్ణే న దేశ్యేపి। హ్రస్వో దేశ్యేతు వాక్వచిత్ ఇత్యథర్వణోక్త్యా చక్కెర బాణము తేజీదోలు నిత్యాదౌ తేజ్యాది శబ్దానాం హ్రస్వో న విరుద్ధః" (అహో. 3౦3) అని యిట్లుగ నిక్కారిక నహోబలపతి యీసందర్భమున నన్వయించెను. కాని చింతామణిసూత్రమునకె యనువాదముగ నిటనిల్పుట యథర్వణాభిప్రేతముకాదని తలఁచి దీనిని స్థలాంతరమున సమన్వయించితిని (చూ. ౧3౯ విష.). అట్లు సంబోధనమున 'నవలా, నవల' అను హ్రస్వదీర్ఘముల పాక్షికస్థితి నంగీకరించుటచేతనె దేశ్య ప్రాతిపదికములందు క్వాచిత్కముగా దీర్ఘమునకు: వైకల్పిక హ్రస్వవిధి వ్యక్తమగుచున్నది. తద్భవ స్యాదీత్యాదికారిక ౧ VIII విషయమున వ్యాఖ్యాతమైనది. వృథాశబ్దభవము -

౧ ఆ. ౩౩) అని యిట్లు "నద్యృతశ్చేతి" నిత్యకప్ప్రత్యయము లేకుండనే సోమయాజి ప్రయోగించెను. పయిరీతిని గప్ప్రత్యయాభావస్థలములందు "గోస్త్రియోరుపసర్జనస్య (౧-౨-౪౮) ఉపసర్జనం యోగోశబ్దః స్త్రీప్రత్యయాన్తంచ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వఃస్యాత్" (సి. కౌ. ౬౫౬ సూ.) అను సూత్రముచేత సంస్కృతమునందే యుపసర్జనత్వమున హ్రస్వమువచ్చును. ఉదా:—"అజ్ఞీకృతగౌరిః - ఈశః; పారాశర్యవచః పనియోనిధి సుధాభజ్గిః హరిహరనాథః." ఇట్లు పాణిని సూత్రముచేత సంస్కృతమున నుపసర్జనత్వమునందు సైతము శ్రీ - లక్ష్మీ - భ్రూప్రభృతులగు స్త్రీప్రత్యయాంతములుకాని స్థలములందు హ్రస్వము రాదుగావున నట్టియెడలఁ బ్రస్తుతమగు "దీర్ఘాణాంహ్రస్వః స్యా" త్తను చింతామణిచొప్పున హ్రస్వమువచ్చును. ఉదా:—అకృతలక్ష్మీః = అర్జునః = అకృతలక్ష్మి యర్జునుఁడు. "అవీతన్త్రీ తరీ లక్ష్మీ। శ్రీ హ్రీ ధీ భ్వాదిశబ్దతః। అనీ బన్తతయా నేర్న (నోర్న)। లోపాగౌణ్యే న హ్రస్వతా" (ముగ్ధ. వ్యా. ౧౫౭ సూ. దుర్గాదాసవ్యాఖ్య.) పైవిషయములచొప్పుననే యహోబలపతియు నుదాహరించెను. "సుశ్రీకుఁడు రాముఁడు - సుశ్రీకి సీత - సుశ్రీకము ముఖము - ఇత్యాది....ధృతరాజ్యముఁడుఁ ధరింపఁబడిన రాజ్యలక్ష్మికలవాఁడు. ధృతక్ష్మాకుండు. ధృతరాజ్యమ - ధృతక్ష్మ నృపశక్తి ఇతి స్త్రియామ్ - ధృతరాజ్యమము రాజకులము - ఇత్యాది. ప్రాధాన్యేతు సకలక్ష్మానేలు." (అహో. ౩౦౨-౩౦౩ పుటలు.)

త్రిలిఙ్గ్యా మపీత్యాది:—త్రిలిఙ్గ్యా మపి = తెల్గునందును (మూఁడు లింగములందును ననికవిజనమండనాదులు) రైనావోః = రై నౌ శబ్దములకు, సమాసే = అన్యపదార్థప్రధాన సమాసమున, ప్రత్యయాన్తతా = కప్ప్రత్యయాంతత్వము కలదు. ద్యోనావోః = ద్యో - నౌ - శబ్దములకుసైత ముపసర్జనత్వమున - క్లీబత్వే = నపుంసకత్వమున - హ్రస్వసంగ్రహః = కప్ ప్రత్యయమురానపుడు సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధమగు హ్రస్వప్రాప్తియుఁగలదు. "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే" (౧-౧-౪౮) "ఆదిశ్యమానేషు హ్రస్వేషు ఏచఇగేవస్యాత్." (సి. కౌ. ౩౨౩ సూ.) అనురీతిని దెల్గునందును 'ఏ - ఐ' లకు 'ఇ' అనునదియు, 'ఓ - ఔ -' లకు 'ఉ' అనునదియు హ్రస్వములుఁగ నగునని యర్థము. అహోబలపతి యీవిషయమున నిట్లుదాహరించెను. "అతినౌకుఁడు పురుషుఁడు - అతీత నౌక కాంత - అతీత నౌకము విప్రకులము. రూపకే - సంసారార్ణవ నౌక, సీత. ఇత్యేవరూపమ్ - అతిరైకుఁడు పురుషుఁడు - ఇత్యాది - క్లీబత్వే హ్రస్వే అతినువు, బ్రాహ్మణకులము - ప్రద్యువు సురకదంబము." (అహో ౩౨౨ పు).

నామంబులతుది దీర్ఘంబులకు హ్రస్వంబగు. ౪౮.

ఉదాహరణ. రమా - రమ, వనితా - వనిత, విద్యా - విద్య,
వివరణము. లక్ష్మీ - లక్ష్మి, సేనానీ - సేనాని, ఇట్టి స్త్రీసమప్రాప్తము
౧౮౫ I విషయము. లకు హ్రస్వాంతములకుఁబోలెఁ బహుత్వంబగు. లక్ష్ములు -
సేనానులు - సిరులు.

బంధేనని. ౧౫౭ I విష:— లక్ష్ములు - సేనాని = సేనాధిపతులు. సిరులు = శ్రీలు = లక్ష్ములు. సంస్కృత ప్రాకృతశబ్దములు తత్సమములగునపుడు సంస్కృత ప్రాకృత ప్రాతిపదికముల తుదినున్న దీర్ఘము హ్రస్వమగునని యీ సూత్రమునకుఁ దాత్పర్యము. (విస్తర I) "సిరులు" అను యుదాహృతినిబట్టి ప్రాకృత ప్రాతిపదికముల పక్షమునను బ్రకృతసూత్రము ప్రవర్తింపఁజేయవలయునని విశదమగుచున్నది.

---

విస్తర. I ౧౫౭ I విష:— ఈసందర్భమునఁ బేఱికావ్యాఖ్యలలో నీక్రింది ప్రమాదములు కన్పట్టుచున్నవి. (1) "ప్రాతిపదికమునకుఁ బ్రత్యయముచేరని ప్రకృతి" (బా. సా. వే. ౧౬౩ పుట.) ఇది సరికాదు. "కృత్తద్ధిత సమాసాశ్చ" (౧-౨-౪౬) (సి. కౌ. ౧౭౯ సూ.) అను పాణినీయము చొప్పునఁ గృత్ప్రత్యయాంతములును తద్ధితప్రత్యయాంతములును బ్రాతిపదికములే యగునుగదా. (2) "అచ్చున కాశ్రయమైనహల్లు హ్రస్వమగును" (బా. సా. వే. ౧౬౩ పు.) హల్లులకు హ్రస్వ దీర్ఘత్వము లశ్రుతచరములు. "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః" (౧-౨-౨౭) (సి. కౌ. ౪ సూ.) అను పాణినీయముచొప్పున హ్రస్వత్వ దీర్ఘత్వములచ్చులకే విహితములు. మఱియు "అచ్చున కాశ్రయమైనహల్లు" నుటయు సంప్రదాయ విరుద్ధమె. అచ్చులు హల్లుల కాశ్రయములుగాని యచ్చులకు హల్లు లాశ్రయములుకావు. "అనుస్వారో వ్యఞ్జనంచాక్షరాఙ్గమ్" (ఋగ్వేద ప్రాతిశాఖ్య ౧ పటలము) అను చొప్పున నచ్చులే యక్షరములు. వ్యంజనములనఁగా హల్లులు. అచ్చులకంగములు. కాన హల్లు లచ్చుల నాశ్రయించియుండునవి. (3) "ఐ ఔలు దీర్ఘాచ్చులైనను వానికి హ్రస్వరూపము లేమిని హ్రస్వము సిద్ధింపదు. మఱియు శాస్త్రసిద్ధములైన (రై - గ్లౌ) దీర్ఘాంతములకు (రో - గ్లో) సిట్టివాని (బా. తత్స. ౬౪ సూ.) యోకారవిధానమునకు వ్యర్థతకలుగుంగాన హ్రస్వముకలుగదు." (బా. సా. వే. ౧౬౩ పుట.) ఈ వాక్యములెల్ల నసంగతములె. ఈచర్చకు విషయములగు "రై - రో - గ్లౌ - గ్లో" అనునవి యేకాక్షరకములగుటంజేసి యుత్తరసూత్రము (బా. తత్స. ౪౯ సూ) చొప్పున హ్రస్వమురాదు. దీర్ఘవిధానసామర్థ్యమున హ్రస్వమురాదననేల? (4) మఱియు "ఐ - ఔ" లకు హ్రస్వాదేశము లేదనియుఁజెప్పుటకు వలనుపడదు. త్రిలిఙ్గ్యా

శ్రీ (సంస్కృ) సిరి (ప్రాకృ) సిరి (ప్రాకృతసమము). ప్రకృతసూత్రముచొప్పున హ్రస్వముగలిగినపిదప దానికి సహజ హ్రస్వాంతములకువలెనె వ్యాకరణకార్యములగును. బా. తత్స. ౪౫ సూత్రముచొప్పున బహువచనపరకత్వమున "ఉత్త్వము" కల్గును. ఉదా:—లక్ష్ములు గౌరులు - సేనానులు - అగ్రణులు - మొ. ఈవిషయమునె "ఇట్లు కృతహ్రస్వములకు..." మున్నగు వివరణవాక్యముచే సూరి స్పష్టపఱిచెను. ఇట్లె "వధూ" మున్నగు నూదంతశబ్దములకును హ్రస్వమురాఁగా బా. తత్స. ౪౬ సూత్రముచొప్పున వువర్ణకమువచ్చును. ఉదా:—వధువు, మొ.

సూరి యుదాహృతుల స్వారస్యమునుబట్టి సూత్రములోని "నామంబుల" అనుదానికి "సంస్కృత ప్రాకృతనామంబుల" అనియే వ్యాఖ్యచేసికొనవలయును. ఆపక్షమున దేశ్యనామముల దీర్ఘమునకు హ్రస్వవిధానమే లేకుండుటంజేసి వ్యవహార ప్రవాహసిద్ధదేశ్యనామములు యథాస్థితముగనే గ్రహింపఁబడును. ఇట్లగుటచే దేశ్యములదీర్ఘమునకు హ్రస్వమురాదనువిధాన మనావశ్యకమయ్యెను. నేర్పకాఁడు బాససీఁడు వగలాఁడు మున్నగు దేశ్యశబ్దములందలి దీర్ఘములు బా. ఆచ్ఛి ౪ సూత్రములోని 'ఈ - ఆ - కా'- ప్రత్యయముల పఠనముచేతనే సమ్మతములగుచున్నవి. అట్లయిన నిఁక "నవలా-నవల - నేజా - నేజ - లకోరీ = లకోరి." మున్నగు స్థలములందలి హ్రస్వత యెట్లు సాధ్యమగునని శంకింపరాదు. నవలా నేజాప్రభృతుల దీర్ఘాంతరూపములవలెనె "నవల - నేజ - లకోరి" మున్నగు హ్రస్వఘటితరూపములు సైతము దేశవ్యవహార ప్రవాహసిద్ధములెయనియు వాని దీర్ఘరూపమునుండి హ్రస్వరూపమునుగాని హ్రస్వరూపమునుండి దీర్ఘరూపమునుగాని సాధించుకొనవలసిన ప్రసక్తిలేదనియు సూరి యాశయమునెన్నునది. (విస్తర. II. III.)

---

మపి రైనావోః। క్లీబత్వే హ్రస్వసంగ్రహః" (విషయ. ౧౫౮) అని యథర్వణుఁడు వచించియున్నాఁడు. అట్టి హ్రస్వము పాణినీయ ప్రసిద్ధమయియున్నది.

విస్తర. II ౧౫౮ I విష:—"అథర్వణుఁడు దీర్ఘాంతదేశ్యములకును గొన్నియెడల హ్రస్వమనుశాసించి...వానికి గతికల్పించుచుండ సూరి యట్టివానిం దలంపకుండుట చింత్యమనకతీరదు" (బా. సా. వే. ౧౬౭ పుట.) అని వేటికావ్యాఖ్యాత సూరిపయింజేసిన యాక్షేపము సరికాదని పయిసంజీవనీ సందర్భమువలన విశదమగుచున్నది.

విస్తర. III ౧౫౮ I విష:—అనుశాసనకర్త ప్రకృతసూత్రవిషయమును బహుళముగా నుపదేశించి "బహుళమనుటచే, అహో - సదా - అథవా - సర్వథా మొదలగునవి కావు" (ఆం. భా. అ. శబ్ద. ౯౨ సూ.) అని యిట్లు సదాప్రభృతులకు

బంజేరవి. ౧౫౮ II విష:— ప్రకృతసూత్రము తెల్గున సువిభక్తులను జేర్చుటకు ముందటియవస్థలోని ప్రాతిపదికమును పఠించు విధిమాత్రమె కాని విభక్త్యంతములు సమసించు సమాసములందలి పదముల దీర్ఘమునకన్నా శిష్టసమాస పదములలోని దీర్ఘములకు హ్రస్వతను ఘటించువిధి కాదు. కాన "గౌరీపతి" మున్నగు శిష్టసమాసములలోని "గౌరిపతి" అను రూపము దీనిచేఁగల్గునని భ్రమింపరాదు. "గౌరియొక్క పతి = గౌరిపతి" అను సాధ్యసమాసము నంగీకరించినచో "గౌరిపతి" అను రూపము శిష్టంపదమనని యొప్పవలెను. (విస్తర. I. II. III.)

దీర్ఘము కాదని వివరించెను. ఇది ఒప్పకాదు. యథా - సర్వత్ర మున్నగు శబ్దములు తెలుఁగు ప్రబంధములలోఁ బ్రయోగింపఁబడునప్పుడవి తత్సమములని తలంపరాదనియు నయ్యవి శుద్ధసంస్కృత విభక్త్యంతములనియు "వినాఽనుకరణం కేచి! ద్వ్యాద్యం శబ్దం ప్రయుఞ్జతే" అనునది మున్నగు నథర్వణకారికలఁజెప్పిన వాని సాధుత్వము నెన్నఁదగుననియు సీతఁడె వ్రాయఁబడెను (మూ. ౧౧౨ విష. కల్పతరు.). అట్లుగాక వానినిఁ దత్సమములుగఁ బ్రయోగించునపుడు వాని తుదిదీర్ఘము ప్రకృత సూత్రముచేతనె హ్రస్వతనందును. "వచ్చిన యాశాస్థల పృథ : పుచ్ఛక...(ఆది. 3 ఆ. ౨౦౮) (మూ. విస్తర. ౧౧౭ II విష.)

విస్తర. I ౧౫౮ II విష:— ఇట్టి యభిప్రాయమునె యహోబలపతి యీ క్రిందిరీతిని వివరించెను. "హ్రస్వవిధాయకం శాస్త్రం (దీర్ఘాణాం హ్రస్వస్స్యాదితి సూత్రోక్తమ్) భిన్నవిషయక మేవ - నతు సమాసవిషయక మపి...నచ గ్రామణి పుత్త్ర ఇత్యాదిస్తద్విషయ ఇతి వాచ్యమ్ - ఇకోహ్రస్వోఽఙ్యో గాలవస్యేతి తత్సిద్ధేః...తర్హి 'నదిసుతగురు కర్ణశల్యనాగపురీశుల్' (ఆది. ౧ ఆ. ౬౫ ప.) ఇత్యాదౌ కథంహ్రస్వ ఇతిచేత్ - హ్రస్వోదీర్ఘసమాసేఽపి । క్వచిన్నిషః ప్రయోగత ఇత్యథర్వణోక్తేర్హ్రస్వః...నచ జ్యాపో స్సంజ్ఞాచ్ఛన్దసో ర్బహుళమితి సూత్ర మత్రప్రవర్తతే. శబ్దస్యాస్యసంజ్ఞాత్వేన రేవతిపుత్త్రాదివత్ హ్రస్వవిషయతయాదృశ్య ప్రకృత్యాం వ్యవహారాభావాత్ ...వాగనుశాసన స్యాప్యత్ర రుచి రస్తీతిజ్ఞాయతే. ఆదిపర్వణి 'నళిన రజస్సుగంధియమునానదితుంగతరంగసంగతా । నిలశిశిరస్థలాంతర వినిర్మితనిర్మల హర్మ్యరేఖలన్. (ఆది. ౮ ఆ. ౨౬౨) ఇతి పాఠస్య బహుషుపుస్తకేషు దర్శనాత్" (అహో. ౨౯౯ పుట.) (అనుబం.)

---

అనుబంధము. విస్తర. I ౧౫౮ II విషయ:— అహోబలుఁడు "బహుషు పుస్తకేషు దర్శనా" త్తనుటకు సరిగ నేఁటి ముద్రణములందు "యమునాప్రాదత్తుంగ

ఈసందర్భమునుబట్టి "అథర్వణుఁడు హ్రస్వో దీర్ఘసమాసేఽపి...అని మూలమును (దీర్ఘాణాం హ్రస్వఃస్యాత్తను చింతామణిసూత్రమును) సవరించి" (బా. సా. వే. ౧౬౪ పుట.) అనెడి వేటికావ్యాఖ్య సరికాదని స్పష్టపడుచున్నది. "హ్రస్వో దీర్ఘసమాసేపి" త్యాద్యథర్వణవచనము "దీర్ఘాణాం హ్రస్వఃస్యా" త్తను చింతామణికి సవరణముకాదు. ఇంక "జ్యాపోస్సంజ్ఞా ఛన్దసోర్బహుళమ్" (౬-3-౬3) (సి. కౌ. ౧౦౦౧ సూ.) అను పాణిని సూత్రార్థమును సవరించునదై యున్నది. సంజ్ఞా వాచిత్వమున జ్యంతమునకు హ్రస్వము బహుళమను విషయమును సవరించి తెల్గున దీర్ఘసమాసమునందు సంజ్ఞావాచిత్వము లేకున్నను గ్వాచిత్కముగా జ్యంత దీర్ఘము హ్రస్వమగునని యథర్వణుఁడు పయికారిక నుపదేశించెను. పయి పాణిని సూత్రమును సంస్కృతమహాకవులె యుల్లంఘించి యథర్వణునివంటి యభిప్రాయముతోనె ప్రయోగించియున్నారు. పాణినీయము సంస్కృతమహాకవుల ప్రయోగ శతములను సంగ్రహింపఁజాలకున్నను (చూ. చింతామణి విషయపరిశోధనము. ౮౦ మొ. ౯౨ విష.) నట్లసమర్థమని చెప్పుట కిచ్చగింపక సంస్కృత వైయాకరణు లెట్లెటో దానిచేతనే సమర్థించుటకు యత్నించుచుండుట యొకవింత సంప్రదాయమైయున్నది. పయినుదాహరించిన "నదిసుతగురుకర్ణశల్య నాగపురీశుల్" అను దానిలోని "నది సుత" శబ్దము సంజ్ఞావాచికాదని యహోబలపతి వ్రాసెను. మల్లినాథుఁ డసంగతముగా "వైదేహి బంధు" శబ్దము రాముఁడను నర్థమున సంజ్ఞావాచి యనెనుగాన 'నదిసుత' శబ్దమును భీష్ముఁడనునర్థమున సంజ్ఞావాచియని చెప్పనగుననుచు నీక్రింది రీతిని బా. గు. ప్ర. కర్త వ్రాసెను. "వైదేహిబంధో ర్హృదయంవిదద్రే...దీని మల్లినాథకృత సంజీవనీవ్యాఖ్య - వైదేహిబంధోః=వైదేహీ వల్లభస్య. జ్యాపోస్సంజ్ఞాచ్ఛన్దసోర్బహుళమ్ ఇతి హ్రస్వః - కాళిదాసవత్ ... ఇట్లు వైదేహిబంధుశబ్దమే సంజ్ఞావాచకమైనప్పుడు నది సుతశబ్దము సంజ్ఞావాచకమగుట యేమివింత" (బా. గు. ప్ర. ౧౧౨ పుట. ద్వి. ము.) ఈమల్లినాథుఁడే స్థలాంతరములందు సంజ్ఞావాచిత్వము లేకున్నను జ్యాపోరిత్యాది సూత్రములోని బహుళగ్రహణముచే హ్రస్వమువచ్చునని వ్రాసియున్నాఁడు. "ఏత్య దూతికృత మార్గదర్శనః (రఘు. ౧౯ సర్గ. ౨3 శ్లో.) రతిదూతిపదేషు కోకిలాం। మధురాలాప నిసర్గ పండితామ్" (కుమార. ౪ సర్గ. ౧౬ శ్లో.) ఇట రఘువంశ శ్లోకవ్యాఖ్యలో—"జ్యాపోరితి బహుళగ్రహణాత్ హ్రస్వ ఇతివల్లభః". అనియు, రతి దూతి పదేష్విత్యాది కుమారసంభవ

తరంగ" అను పాఠము వెలయుచున్నది. "నది సుతగురుకర్ణే" త్యాది పద్యమే ప్రక్షిప్తమని నేటి వావిళ్లవారి ముద్రణమున వ్రాయఁబడెను.

సూత్రము. ఏకాచ్ఛబ్దంబులకు హ్రస్వంబు లేదు. ౫౫.

౧౫౫ విషయము. స్త్రా - మా - శ్వా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ - భీ - ప్రాప్రు.

---

శ్లోకవ్యాఖ్యలో "ఊకారయో బహుళేఇతి బహుళ గ్రహణాత్ హ్రస్వ ఇతివల్లభః. అపిమాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం త్యజేద్గిరామ్" అనియు మల్లినాథవ్యాఖ్యలు వెలయుచున్నవి. కాళిదాసాది మహాకవులు సుశబ్దములతో శ్లోకముల నల్లఁజాలక యపశబ్దములను ప్రయోగించిరనుట కేవలము నసంగతము గదా. అంతకన్న నపశబ్దములనుచేసినట్లు వ్యాకరణమును సవరించి సూత్రించికొనుట యుక్తము కాదా ?

విస్తర. II ౧౫౮ II విష:—సుప్తాప్రకాశికాకర్త ప్రకృతసూత్రపు వ్యాఖ్యలో నప్రసక్తముగ మఱొక సంస్కృతవ్యాకరణ సంప్రదాయమును వ్రాసెను. "సమాసములందేకాక వ్యస్తమందు సహితము స్త్రీ వాచకంబులైన ఈకారాంత శబ్దంబులు వికల్పంబున హ్రస్వాంతంబులగును ఉదా:—ధరణిః - ధరణీ - శ్రోణిః - శ్రోణీ...ఇత్యాదులు" (బా. గు. ప్ర. ౧౨౭ పు. ద్వి. ము.) ఈవిషయము సరికాదు. సంస్కృత వ్యాకరణములందు "ఇ" కారాంతములకు వికల్పముగా జీష్ ప్రత్యయమువచ్చి యీకారాంతములగునని యున్నదిగాని యీకారాంతములకు వికల్పముగా హ్రస్వమువచ్చునని చెప్పఁబడలేదు. "బహ్వాదిభ్యశ్చ. (౪-౧-౪౫) ఏభ్యోవాజీష్ స్యాత్ - బహ్వీ - బహుః - కృదికారాదక్తినః (గణసూ. ౫౦) రాత్రిః - రాత్రీ - సర్వతోఽక్తిన్నర్థాదిత్యేకే (గణసూ. ౫౧) శకటిః - శకటీ - అక్తిన్నర్థాత్ కిమ్ -అజననిః" (సి. కౌ. ౫౦3 సూ.)

విస్తర. III ౧౫౮ II విష:—పేటికావ్యాఖ్యాత పలు ప్రామాదికమగు బా. గు. ప్ర. వ్యాఖ్యనే యెక్కించుటలో మఱికొంత ప్రమాదమునకు లోనయ్యెను. " 'తి' అను వర్ణమంతమందుఁగల క్తిన్ ప్రత్యయాంతములుదప్పఁ దక్కిన కృదంతాకృదం తేకారాంతములెల్ల" (బా. సా. పే. ౧౬౫ పుట.). "క్తిన్నర్థక" ప్రత్యయాంతములు తప్ప నని వివరింపవలసియుండునని పైనివ్రాసిన "సర్వతోఽ క్తిన్నర్థా దిత్యేకే" అను వార్తికమువలన స్పష్టమగుచున్నది. అట్లె 'తి' అను వర్ణమంతమందుఁగల క్తిన్నునుటయు సరికాదు. కొన్ని క్తిన్నంతముల తుదిని 'తి' అనునది నిలువకపోవచ్చును. "ఋల్వాదిభ్యః క్తి న్నిష్ఠావద్వాచ్యః-(వా. ౪౯౨౬) తేన నత్వమ్. కీర్ణిః - గీర్ణిః - లూనిః - ధూనిః - పూనిః" (సి. కౌ.. 3౨౭౨ సూత్రమునొద్ద.)

సంజీవని. ౧౪౯ విష:—అర్థములు - క్ష్మా = భూమి; మా = లక్ష్మి - కాంతి; భా = కాంతి; శ్రీ = లక్ష్మి - కాంతి; స్త్రీ = ఆఁడుది; హ్రీ = లజ్జ; ధీ = బుద్ధి; భీ = భయము; భ్రూవు = కనుబొమ.

ఏకాక్షరంబున కనఁగా నేకాచ్క ప్రాతిపదికంబులతుది దీర్ఘంబునకు హ్రస్వత కలుగదు. క్ష్మా మున్నగు శబ్దములెల్ల స్త్రీలింగములగుటచేత బా. తత్స. ౪౭ సూత్రముచేతఁ బ్రథమైకవచనలోపము గల్గును. శ్రీశబ్దము రాగవిశేషార్థమునఁ బుంలింగము గాన నట్టి శ్రీశబ్దమునకు "ఇగ్లౌరా" సూత్రముచేఁ (బా. తత్స. ౮౯) బ్రథమైకవచనలోపము కల్గును. కం. శ్రీయును నారోగ్యమును (ద్రోణ. ౨ ఆ. ౧౫౨). కం...హ్రీయు ధృతియు (శాంతి. ౩ ఆ. ౮౧౭). బా. తత్స. ౮౫ సూత్రమునందప రకరణము లేమింజేసి దీర్ఘోకారాంతములకును 'వు' వర్ణక వుగాగమములు వచ్చును. ఆసూత్రమునందలి 'అంతట' అనుదళముచే బా. తత్స. ౪౭ సూత్రముచొప్పున వచ్చు స్త్రీలింగ ప్రథమైకవచనలోపము రానేరదు."సీ నిస్తులాస్య శ్రీవయస్తంభ నిక్షిప్త నింబచ్ఛదభ్రు వల్యంబు నిక్క— (ఆము. ౪ ఆ. ౬౭) ఇత్యాదయః కవీనాముక్తయస్త్వ నాకరావేవ" (అహో. ౩౦౨ పు.) అను చొప్పున నీయాముక్తమాల్యద ప్రయోగమునందలి హ్రస్వము ప్రామాదికమె యనఁదగును. (విస్తర.) "నింబచ్ఛదమువంటి భ్రువు = నింబచ్ఛద భ్రువు" అనెడి యుపమాన పూర్వపద కర్మధారయ సిద్ధసమాసమునైతము శాస్త్రవిరుద్ధమె (బా. సమా. ౩ సూ.) ఇట్టి యప ప్రయోగము లాముక్తమాల్యదయం దనేకములుగలవు. బా. తత్స. ౮౪ సూత్రమున 'ఇత్తునకు' అనెడి తపరకరణముచే నీదంతములకు బహుత్వమున నుత్వమురాదు. ఉదా:— శ్రీలు - స్త్రీలు - ధీలు - మొ. హా మున్నగు నేకాక్షరావ్యయములకును గ్లౌ - గ్లో - రై - రో మున్నగు శబ్దములకును నేకాక్షరములగుటచేతనే హ్రస్వము కలుగదు. ఉదా:—గ్లౌ - గ్లో - రై - రో - (బా. తత్స. ౬౮ సూ.) (చూ. ౧౮౯ విష. కల్పత.) హాశబ్ద ద్విరుక్తరూపమును దిక్కయజ్వ ప్రయోగించెను. శా. ఆహా పుట్టెడు లాఁతివారలకు హాహా పుట్టు మీ

---

విస్తర. ౧౪౯ విషయ:—ఈసందర్భమునుబట్టి "కొండొకచో నింబచ్ఛద భ్రువు అని హ్రస్వము గానంబడియెడి. కాన...౪౮-౪౪ సూత్రములలో నేదానియందేని బహుళపదముంజేర్చి యథాసంభవముగాఁ బ్రయోగసాధనమునకు దారిఁ జూపుట యుచితము" (బా. సా. వే. ౧౬౬ పు.) అను వేటికావ్యాఖ్య సరికాదని యెన్నఁనగును. అహోబలపతి భ్రూశబ్దమునకే యుపసర్జనత్వమున హ్రస్వముచేయుట

వారికిన్. (శల్య. ౨ ఆ. ౨౭౮) అనుపసర్జనత్వమున సమాసమందు నేకాక్షర శబ్దములకు హ్రస్వము లేదు. ఉదా:—సకలక్ష్మానేలు...(అహో. ౩౦౩ పు.) కం. అపూర్వ శ్రీఁ గావింపఁగ (సభా. ౧ ఆ. ౧౦) కం. విజయ! శ్రీయొసఁగ (సభా. ౧ ఆ. ౨౨౦) కం. రాజ్య! శ్రీ మనచే (ఆర. ౧ ఆ. ౨౩౮) సీ. భూషణ శ్రీ (ఆది. ౭ ఆ. ౭౩) క. కావలిమై సుర రాజ్య! శ్రీ వాలింపంగ...(ఉద్యో. ౧ ఆ. ౧౮౫) ఇక్ష్ము - స్వర్గ స్త్రీలు - శ్వేతగోవు - మొ. ఉపసర్జనత్వమున స్త్రీ ప్రత్యయాంతములగు నీదూదంతములకు సంస్కృతమున "కప్ప్రత్యయము" నిత్యయముగాన "బహుస్త్రీకుఁడు" మున్నగు రూపము లేర్పడును. కప్ప్రత్యయము రాని స్త్రీ ప్రత్యయాంతములకును గోశబ్దదీర్ఘమునకును హ్రస్వము సంస్కృతముననే కల్గును. ఉదా:—"ధృతరాజ్యమః = ధృతరాజ్యముఁడు. ధృతక్ష్మః = ధృతక్ష్ముఁడు" (అహో. ౩౦౨ పు) సుధాగుస్ర - సుధాగుఁడు = (చంద్రుఁడు). ఏకాక్షరశబ్దములలో సూరి యుదాహరించిన యీదూదంతములందు స్త్రీశబ్దేతరములు స్త్రీ ప్రత్యయాంతములు కామింజేసి వాని కుపసర్జనత్వమున 'నద్యృతశ్చ' అను పాణిని సూత్రముచొప్పున నిత్యముగు కప్ప్రత్యయము రానేరదు. ఇంక శైషిక వైభాషిక కప్ప్రత్యయము రానియప్పుడవి స్త్రీ ప్రత్యయాంతములు కామింజేసి వాని కుపసర్జనత్వమునందును "గోస్త్రియోరుపసర్జనస్య" (౧-౨-౪౮) 'ఉపసర్జనం యోగోశబ్దః స్త్రీ ప్రత్యయాన్తంచ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వఃస్యాత్. (సి. కౌ. బాలమ. ౬౫౬ సూ.) అను పాణిని సూత్రము వలన రావలసిన హ్రస్వమును రానేరదు. తత్సమములగునపుడును బ్రకృత సూత్రముచొప్పున నవి యేకాక్షరకము లగుటంజేసి హ్రస్వము రాదు. కాన 'సుధీ - సుశ్రీ' అను దీర్ఘాంతరూపములె యుపసర్జనత్వమునందును నిల్చును. "సుధి - సం - వి - ఈ - పు - విద్వాంసుఁడు - చదువరి" అను శబ్దరత్నాకరోదాహరణము సరి కాదని చెప్పకతీరదు.

"భ్రూశబ్దస్యతు అనుపసర్జనే సుభ్రూవునకున్ - ఉపసర్జనే హ్రస్వోభవత్యేవ - సుభ్రువు - రాముఁడు - సుభ్రుఁడు - సుభ్రునకున్ - సుభ్రునికిన్ - ఇత్యాది..." (అహో. ౩౦౨) ఈవ్రాత సరికాదని తోఁచెడిని. స్త్రీ ప్రత్యయాంతముకాని భ్రూశబ్దమున కుపసర్జనత్వమున హ్రస్వమువచ్చుననుట యెట్లు పొసఁగును. (విస్తర.)

(మూ. విస్తర. ౧౮౯ I విభ.) "భ్రూ-స్త్రీ-(భ్రమ+డూ)" (శబ్దస్తో)

---

సరికాకున్నను నతఁడుచూపిన 'సుభ్రుఁడు - సుభ్రునకున్' మున్నగు రూపములను సాధించుటకు మార్గము కన్పట్టుచున్నది. కొందఱు ప్రామాణికులు 'భ్రు' అను హ్రస్వాంతశబ్దము నంగీకరించుచున్నారు. "సుభ్రు - (భ్రూ) స్త్రీ. సుష్ఠుభ్రుర్యస్యాః -

అథర్వణ — ధూ_ర్తవృద్ధౌ మూర్ఖనీచౌ । ఉదన్తా అపిసమ్మతాః ।
ఛన్దోదర్పణము. ఉత్వే నైవ భవ_న్త్యన్యే । ప్రయోగ స్తత్ర కారణమ్.
౧౬౦ విషయము. (విక్రు. అజ. ౨౭ కా. అహో. ౭౯౩).

కల్పతరు. ౧౬౦ విషః—ధూ_ర్తవృద్ధౌ = ధూ_ర్త - వృద్ధశబ్దములును, మూర్ఖనీచౌ = మూర్ఖ - నీచశబ్దములును, ఉదన్తా అపి = ఉ_త్త్వ ఘటితత్వమాత్రముచేత నైతము, సమ్మతాః = సమ్మతములగుచున్నవి. ఉ_త్త్వ ఘటితములయి ప్రథమైక వచనలోపము నందియు సమ్మతములగుచున్నవని తాత్పర్యము. డుజ్‌లోపముచే దీనికి డుమంతత్వము 'పాక్షికముగ లేదని తాత్పర్యము. ఉదా:—ధూ_ర్త - ధూ_ర్తులు, ధూ_ర్తున్ - ధూ_ర్తులన్, ధూ_ర్తుచేన్ - మొ. పక్షంబున ధూ_ర్తుఁడు - ధూ_ర్తులు - ధూ_ర్తునిన్ - ధూ_ర్తున్ - ధూ_ర్తులన్ - మున్నగు డుమంతరూపములును గల్గును. ఇట్లి తక్కిన వృద్ధాదులకును రూపములనెన్నునది. అన్యే = మఱికొన్నిశబ్దములు, ఉ_త్త్వేనైవ = ఉ_త్త్వఘటితత్వము మాత్రముననే సమ్మతములు, భవ_న్తి = అగుచున్నవి. ఇట్టివానికి డుమంతపాక్షికరూపములు లేవని తాత్పర్యము. ఉదా:—నన్నయభట్టు - నన్నయభట్టున్ - నన్నయభట్టుచేతన్ - మొ. ఇట్లి నారాయణభట్టు - కంకభట్టు - మొ. తత్ర = అట్టిరూపముల విషయమున, ప్రయోగః = మహాకవిప్రయోగమె, కారణమ్ = మూలము.

బాలవ్యాకరణ — వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు. ౫౬.
వివరణము. — వృద్ధు - వృద్ధుఁడు, మూర్ఖు - మూర్ఖుఁడు, నీచు -
౧౬౦ I విషయము. నీచుఁడు, గృహస్థు - గృహస్థుఁడు, చార్వాకు -
చార్వాకుఁడు.

సంజీవని. ౧౬౦ I విషః—అర్థములు - చార్వాకుఁడు = చార్వాకమత ప్రచారకుఁడు. సూరి యథర్వణుఁడుచెప్పిన ధూ_ర్తశబ్దమును విడుచుటయు, నాతఁడు చెప్పని గృహస్థచార్వాక శబ్దములను జేర్పుటయు నిరాధారములు. గృహస్థశబ్దమును గవిజనమండనమునుండి గ్రహించియుండును. అనుశాసనక_ర్త వీనినన్నిటిని గ్రహించి 'దాసు - బందుగు' అను మఱిరెండిటిని జేర్చెను. 'బందుగు' అనునది

---

వాఊజ్ - నార్యామ్..." (శబ్దస్తో) "విమానినా సుభ్రుకుతః పితుర్గృహే" ఇతి కాళిదాసః - పుంసితుహే సుభ్రూః పురుష ఇత్యత్రనస్యాత్ - దూరాదరాళభ్రు వి భాతి వేలా । కళఙ్క రేఖా మలినేవధారా' ఇతి రఘూ. అరాళభ్రు ఇతి తన్వాదేర్వేతి ఊపిక్రుతే ఉవజ్‌స్థానా భావాత్ నదీసంజ్ఞాయాం హ్రస్వః" (ముగ్ధబో. అజ. ౧౫౩ సూవ్యా.)

తద్భవమగుటంజేసి యీతత్సమగణములోఁ జేర్చుట సరికాదు. అహోబలుఁడును 'శీతు' (శీతకాలము) అను తద్భవముఁ జేర్చుట యుక్తముకాదు. (అహో. ౨౯౩) అట్టి తద్భవములకు స్త్రీసమత్వముచేతనే యట్టిరూపములు సిద్ధించును. నన్నయ భట్టు మున్నగు శబ్దములకు ఘూర్ణాదిలోపనిత్యతను సూరిప్రభృతు లుపేక్షించిరి. "ఉత్త్వేనైవ భవన్త్యన్యే" అని యథర్వణుఁడు వానిని సంగ్రహించుచుండఁగా నవి కవిప్రయోగసిద్ధములును నగుచుండఁగా వానినాథర్వణకారికల నుపేక్షించుట యుక్తముకాదు. నన్నయభట్టాదిశబ్దములలోని భట్టశబ్దము సంస్కృతప్రాకము. "భట్ట - పు... వేదాభిజ్ఞే - నట్టతేవ" (శబ్దరత్నా) కవిజనమందన వ్యాఖ్యలలో నమహద్వాచియగు రూపశబ్దమును నీ వృద్ధాదులలోఁ జేర్పఁబడెను. మహద్వాచకములగు వృద్ధాదులగణములో దానింజేర్చుటకంటె "రూపు" ప్రభృతులను వేఱ సూత్రించుకొనుట యుక్తము (౧౬౩ విష. చూ.) (విస్తర).

'నన్నయభట్టుఁడు' మున్నగు డుమంతరూపముల ప్రయోగము గన్పట్టమిం జేసియు 'నన్నయభట్టు' మున్నగురూపములకుఁ బ్రయోగములు వెలయుచుండుటం జేసియు "ఉత్త్వేనైవభవన్త్యన్యే..." అను కారికకిట్టివే లక్ష్యములని గ్రహింపవలయును. ఉత్త్వేనైవేత్యాది విధానసామర్థ్యముచేతఁగాని 'ఉ'త్త్వఘటితములు

---

విస్తర. ౧౬౦ I విష:—"ఆథర్వణ మన్యశబ్దముచే నదంతపుంలింగమహద్వాచకములకేగాక రూపు - రూపము మున్నగువానికిఁగూడ నుత్వరూపమును గూర్చెడి. సూరి యట్టివానిని దద్భవములుగానెంచి కావలయు నుపేక్షించెను." (బా. సా. వే. ౧౬౭ పు.) ఇది సరికాదు. "ఉత్త్వేనైవభవన్త్యన్యే" అను నథర్వణ వచనము" ఘూర్ణవృద్ధావిత్యాద్యర్ధర్చమున కుత్తరార్థమగుటంజేసి ఘూర్ణవృద్ధాదులకు "ఉత్త్వ"మాత్రఘటితరూపములును, డుమంతరూపములును సమ్మతములనియు నన్యములకు "ఉత్త్వ"ఘటితరూపములు మాత్రమె సమ్మతమనియు వాని యర్థము గావున నందలి యన్యశబ్ద మనుమహత్తులను సంగ్రహించునది కానేరదు. మఱియు "ఉత్త్వేనైవభవన్త్యన్యే" అను దానిలోని యవధారణమువలన "ఉత్త్వఘటితరూపముమాత్రమెకల నన్నయభట్టు ప్రభృతిశబ్దములె లక్ష్యములు కానోపును గాని "రూపము - రూపు" అనెడి ద్వైరూప్యముగల శబ్దములు లక్ష్యములు కాఁజాలవు. గీ. చిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు । లయ్యె సర్వభూతములు... (ఉద్యో. ౪ ఆ. ౧౧౬) ద్వి. ఏల యీ బహురూపు లేనేమి నిన్ను (బసవ. ౪ ఆ. ౫౧౧౫) ఇట్టి కవిప్రయోగములనుబట్టి 'రూపు' అనునది తద్భవమనుటయు సరికాదు (చూ. ౧౬౩ విష).

లుప్తప్రథమైకవచనాంతములుగఁ దలంపఁబడుటచేతఁగాని వీనిపై బా. తత్స. ౪౦ సూత్రముచెప్పిన వువర్ణకము నిలువనేరదు. ప్రయోగములు:—క. జ్ఞానము గలఁడేనిన్ బాలుఁడైనఁ గడువృద్ధు మహిన్ (అర. 3 ఆ. ౨౪౦) గీ. ఉత్తమజ్ఞాన వృద్ధు నాసుండెనేని (సభా. ౨ ఆ. ౨౫) క...గుణ। వృద్ధని పూజించితిమి...(సభా. ౨ ఆ. ౨౭) సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే...(సభా. ౨ ఆ. ౧౧) క. శత వర్షవృద్ధుఁడవు నీవతికృశుఁడవు (అర. 3 ఆ. ౨౫౦) చ...నీవు మూ। ర్ఖవు శిశు పాల...(సభా. ౨ ఆ. ౨౪) ఉ...నన్నెచ్చుఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁడు (ఉద్యో. 3 ఆ. ౪౬) మ. ఇతఁ డాచార్యసుతుండు...తతోస్సోదర। ప్రతతింజంపిన నీచు వారలగతిం బ్రాపించు టర్హంబగున్ (మౌస. ౧ ఆ. ౪౭) క...నీచు గావున జంపిం। చినఁగాని మెత్తఁబడి పోఁ। డని...(విరా. ౨ ఆ. ౫౪) ద్వి. అని వేఁడు కొనుటయు సవ్వటుధూర్తు। మనసున వేఱొక్కమతము చింతించి (హరిశ్చ. ద్వి. ఉ. భా. ౧౦౨౩ పం.) (సూ. రా. ని.). (దీనికి భారతప్రయోగము లభింపలేదు. ఉ...విష్ణు దా। సెక్కడి భర్తగాఁగ (హంస. ౧ ఆ. ౮౯. సూ. రా. ని.) 'గృహస్థు' అనునది - శ - ర; సూ. రా. నిఘంటువులు రెంటను నుదాహృతమయ్యెనుగాని ప్రయోగములు చూపబడలేదు. 'చార్వాకు' అనునది కోశద్వయమునందును బ్రదర్శింపఁబడనైనలేదు.

"ఉత్త్వేనైవభవన్తి" అనుటకుదా:—ఉ...నన్నయభట్టు తెలుంగునన్ మహా। భారత సంహితారచన బంధురుఁడయ్యె....(ఆది. ౧ ఆ. ౨౫ ప.) ఉ...నా। రాయణ భట్టు వాఙ్మయ ధురంధరుఁడున్...(ఆది. ౧ ఆ. ౨౪) ఉ...మహితాత్ముఁడు నన్నయ భట్టు దక్షతన్ (విరా. ౧ ఆ. ౬) గీ. ఇంక నీమాట లుడుగుము కంకభట్ట (విరా. ౫ ఆ. ౨౫౦)

| | |
|---|---|
| నన్నయా | అనుతాం స్త్రియాం సమానాం। సర్వస్య స్త్రీసమస్యచ |
| థర్వణీయము | సులోపః. (ఆం. చిం. అజం. ౫౧ కారి. అహో. |
| ౧౬౧ విషయము. | 3౪౫ పు.) |

కల్పతరు. ౧౬౧ విష:—అనుతామ్ = ఉకారాంతములు నూకారాంతములు నగు శబ్దములకు భిన్నములైనట్టియు (ఉతామ్మనుచోటి తకార ముచ్చారణార్థకము) సమానామ్ = తత్సమములైనట్టియు, స్త్రియామ్ = స్త్రీలింగశబ్దములకును, సర్వస్య స్త్రీసమస్యచ = సర్వవిధములగు స్త్రీసమశబ్దములకును, సులోపః = 'సు' అను ప్రథమైకవచనమునకు లోపముకల్గును. ఉదా:—రమ - గౌరి. 'రమా - గౌరీ' మున్నగు వానికి 'దీర్ఘాణాం హ్రస్వః స్యా'త్తను చింతామణిచెప్పిన హ్రస్వమురాఁగా "స్యా

పమహాతా" మిత్యాదిసూత్రముచే ముప్రత్యయము రాఁదగియుండ దాని నివా రించుచుఁ బ్రకృతసూత్రము ప్రథమైకవచనలోపమును విధించుచున్నది. ఈప్రథ మైకవచనలోపశాస్త్రము ముగాగమము రాదనుటకును నుపలక్షణమగుచున్నది. రమలు - రమచేతన్ మొ. అనుతా మ్మాటచేత "తనువు - వధువు - భ్రూవు" మున్నగు స్త్రీలింగములకును వుప్రత్యయమువచ్చుట నిర్బాధము. సమానాన్మను దానికి "ప్రకృతిద్వయ" పరముగా వ్యాఖ్యచేసి—'జడా - జడ - మిరా - మీర' మున్నగు ప్రాకృతపదములకును సులోపము నహోబలపతి వచించెను. (అహో. 3౮౫ పు.) 'సర్వస్య స్త్రీపదస్య' అనుటచేత 'అమ్మ - అక్క - గోద - తల్లి - తండ్రి మున్నగు నాచ్ఛిక స్త్రీపదములకేకాక వాచనిక స్త్రీపదములగు "యోషిత - అప్సర" మున్నగు సంస్కృతశబ్దములకును - చదివి - చదువక - చదివినన్ - చదువుచున్ - చదువుచున్నన్ మొదలగు లాక్షణికావ్యయాదులకును సులోపముగల్గునని యెఱుం గునది. (చదివి మున్నగు వానికి 'నపదానీ'త్యాదిచే 'సు' లోపము గల్గవచ్చును.) (మా. విస్తర ౧౦౯ I విమ).

"నన్విదం సూత్ర మనావశ్యకమేవ, ప్రథమమేవ హల్ ఙ్యాదిసూత్రేణ సులోపః - అనన్తరమేవ హ్రస్వ ఆస్తామితి చేత్సత్యమ్. తల్లితండ్రి ప్రముఖశబ్దానాం సులోప ఏతత్సూత్రాభావే న సిధ్యతీతి. క్షేమమ్ (అహో. 3౮౫ పు) అని యహో బలపండితుఁడు దీనికి వ్యాఖ్యచేసెను. సంస్కృతవ్యాకరణములోని "హల్ఙ్యా"ది సూత్రముచే ననుక్తన్యాయమునఁ బ్రథమైకవచనమగు సుప్రత్యయమునకు లోప ముచేసినపిదప దీర్ఘాణామిత్యాది చింతామణిసూత్రముచే సమాగౌరీ ప్రభృతి స్త్రీప్రత్యయాంతముల దీర్ఘమునకు హ్రస్వముచేసినచోఁ బ్రకృతసూత్రములోని "అనుతాంస్త్రియాంసమానా" మ్మనుదళమనావశ్యకమె యగుననియు నట్టియెడ "సర్వస్య స్త్రీసమస్యచ సులోపః" అనునదే తల్లి - తండ్రి ప్రభృతులగు దేశ్య స్త్రీసమశబ్దముల సులోపమునకుమాత్రమె ప్రయోజనకారియగుననియుఁ బయికవి శిరోభూషణపంక్తుల యాశయము. అహోబలపండితుఁడిట్లు పొరపాటుగ వ్యాఖ్య చేసెనేకాని యున్నసూత్రమును దీసివేసి యనుక్తన్యాయము నసంగతముగాఁ దెచ్చి పెట్టుట యుక్తమా? మఱియు స్త్రీప్రత్యయాంతములు కానట్టి యుదంతేతరము లగు శ్రీ లక్ష్మీ ప్రభృత్యనేకశబ్దముల ప్రథమైకవచనలోపమునకయి ఘట్టకుటీ ప్రభాత న్యాయమున "అనుతా"మిత్యాదికము నాశ్రయింపకతీరదుగదా. శ్రీ లక్ష్మీ ప్రభృతి శబ్దములకు సంస్కృతమున "అవీ తన్త్రీ తరీ లక్ష్మీ। శ్రీ హ్రీ ధీ భ్యాదిశబ్దతః। అనీబన్తత యా సో న్న। లోపో గౌణ్యే న హ్రస్వతా (ముగ్ధబో. ౧౫౭ సూ. దుర్గాదాస వ్యాఖ్య) అను నభియుక్తోక్తిచొప్పున సులోపములేదు. వానికిఁ దెలుఁగున సులోపము చేయకతీరదు.

ఇట్టి ప్రామాదిక వ్యాఖ్యలోని "తల్లి - తండ్రి ప్రముఖశబ్దానా" మ్మను వాక్యమున మఱికొంత ప్రమాదమును జేర్చి "తే. గీ. తత్సమంబులును ననుదంత ములునైన । స్త్రీత్వ యుక్తశబ్దములయు దేశ్యములగు । నన్ని స్త్రీసమములయు ననంతరమున । నున్న ప్రథమైకవచనంబు లుడుగుసాధ్వి" (నారా. తత్స. ౭౭ ప. ౨౦౫కారి.) అనియాచ్ఛికములలో దేశ్యములగు స్త్రీసమములకుమాత్రమె నారాయ ణీయకర్త ప్రథమైకవచనలోపవిధానము నాంధ్రీకరించెను. ఈపక్షమున "కుడ్యమ్- గోడ, తామరసమ్ - తామర, సూచీ - సూది, అప్సరాః - అచ్చెర, పృథివీ - పుడమి, లక్ష్మీః - లచ్చి, వైద్యః - వెజ్జు" మున్నగు ననేక తద్భవ స్త్రీసమములకుఁ బ్రథమైక వచనలోప మెట్లు ఘటిల్లును ? జడ - మేర - సిరి మున్నగునవి ప్రాకృతసమములగు టచేఁ దత్సమములయినను బైనుదాహరించిన వైకృతముల కట్లు తత్సమత్వమును ఘటింప శక్యముకాదుగదా! మఱియు దేశ్యస్త్రీసమములకే సులోపము చెప్పునపుడు అసుర-యోధ - దూత మున్నగు సంస్కృత స్త్రీసమములకు సులోపము దుర్లభ మగునుగదా! ఇంతియకాక గాణపతవివరణమున తల్లితండ్రి మున్నగు దేశ్య ములతోపాటు 'గోడ - అక్క' అనువాని నుదాహరించుట మఱొకవిధమగు పొరపాటు.

స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు.

బాలవ్యాకరణ ౫౭.

౧౬౧ I విష. రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీన నేత్ర.

సంజీవని. ౧౬౧ I విష:—అర్థములు - క్షమ = భూమి; దేవత = విష్ణ్వాది దేవత, రమాదిదేవతయు; మీననేత్ర = చేఁపవలె సోగైనకన్నులుగలస్త్రీ.

రమాదిశబ్దము లాకారాంత స్త్రీలింగ సంస్కృతశబ్దములు. వానితుది దీర్ఘము, బా. తత్స. ౫౭ సూత్రముచేత హ్రస్వముకాఁగా రమ - క్షమ - మున్నగు ప్రాతి పదికము లేర్పడును. అట్టి సంస్కృతభాషా ప్రసిద్ధపారిభాషిక స్త్రీలింగవాచకము ల జంతములయినను హలంతములయినను వాని ప్రథమైకవచనము ప్రకృతసూత్రముచే లోపించును. క్షమ - ఘనత - విద్యయనునవి యదంతామహత్తులగుటచేతను, రమ - వనిత - దేవత - మీననేత్రమున్నగు నదంత మహతీవాచకములు నైత మమహత్తులేయగుటచేతను, బా. తత్స. ౩౯ సూత్రముచొప్పునఁ బ్రాప్తించు ఙువర్ణకము ప్రకృతసూత్రముచే లోపించును. నేత్రశబ్దము నపుంసకమైనను నుపసర్జనత్వమునవచ్చు స్త్రీత్వముసయితము ప్రథమైకవచనలోపసాధకమగునని

తెల్పుటకయి 'మీననేత్ర' అనునది యుదాహృతమయ్యెను. 'దేవత' అనునది మహద్వాచియగునపుడు ముపర్ణకము ప్రాప్తించదు. ప్రాప్త్యము లేమింజేసి స్త్రీసమను ప్రాప్తిలేదు. కాని సూరి చింతామణికర్తవలె యంతటను నంగీకరించకున్నను నిట సంస్కృత ప్రథమైకవచన సుప్రత్యయమునకిట్లు ప్రకృతసూత్రముచే లోపము చేసి దానికి ఐదత్వము సంఘటిల్లఁజేయవలయును (౧౬౬ I విష.). గౌరి - మతి మున్నగు నికారాంత స్త్రీలింగముల ప్రథమైకవచనమునకును ప్రకృతసూత్రము చేతనే లోపమును జేయవచ్చును. ప్రకృతసూత్రమున నపవాదమగు ఉకారాంతే త్యాది (బా. తత్స. ౪౮ సూ.) సూత్రముచే వధు - ధేను మున్నగు నుకారాంత స్త్రీలింగముల ప్రథమైకవచనమునకు పువర్ణకమగును. ఉదా:—వధువు - ధేనువు మొ. హలంతములగు సంపత్ప్రభృతి స్త్రీలింగశబ్దములకును బ్రకృతసూత్రముచేతనే ప్రథమైకవచనలోపము కల్గును. ఉదా:—సంపద - ఆపద - మొ. స్త్రీసమత్వాతి దేశమునంజేసి 'అసుర - దూత - అశ్వత్థామ - బ్రహ్మ - ఆత్మ మున్నగు సంస్కృత స్త్రీసమములకును, ఆవు - చిగురు - కొడుకు - గోడ-తల్లి - తండ్రి మున్నగు నాచ్ఛిక స్త్రీసమములకును చదివి - చదువక - చదివినన్ - చదువన్ - మొదలగు స్త్రీసమ శబ్దములకును బ్రకృతసూత్రముచేతనే ప్రథమైకవచనలోపము కల్గును. అదంతామహత్ స్త్రీలింగములగు రమాదిశబ్దములకు ముపర్ణకలోపము కల్గునపుడు ముపర్ణకేతరవిభక్తిపరకత్వమున ముగాగమమునువానికిఁ (బా. తత్స. ౪౦ సూ.) గల్గనేరదు. (౧౪౬ విష.) (విస్తర).

---

విస్తర. I ౧౬౧ I విష:—"ఆకారాంతములై ౫౪ చే హ్రస్వములైన స్త్రీలింగశబ్దములును, నత్వ స్త్రీవద్భావములనంది యదంతములైన యతిదిష్ట స్త్రీలింగ శబ్దములును నీసూత్రముచేఁ బ్రథమైకవచనలోపమునందుట కర్హములని పరిశేషి న్యాయమునఁ దేలినది. కావుననె యిందలి యుదాహృతులెల్ల నదంతములుగనె చూపఁబడినవి" (బా. సా. వే. తత్స. ౫౭ సూ. వ్యా.) ఈవ్రాఁతసరికాదు. తక్కిన స్థలముల మాటయటుండ, నుదంతములగు 'ఆవు - చిగురు - కొడుకు' మున్నగు నాచ్ఛిక స్త్రీసమశబ్దముల ప్రథమైకవచనలోపమునకు నైతమీ సూత్రమెకదా గతి యగుచున్నది! "మహతీవాచకాదంతములకు (మహతీతర స్త్రీలింగముల కక్కఱ లేదా ?) ముపర్ణకేతర విభక్తిపరమగునపుడగు ముగాగమమును లోపింపఁజేయుటకును నీ ప్రథమైకవచనలోపవిధి నుపలక్షణముగా నెన్ని..." (బా. సా. వే ౫౭ సూ. వ్యా.) ఇట్టి యుపలక్షణత్వకల్పనమేల ? ముపర్ణకము ప్రథమైకవచనమున వచ్చు వానికి మాత్రమె ముపర్ణకేతరవిభక్తి పరకత్వమున ముగాగమమువచ్చునని బా.

తత్స. ౪౦ సూత్రము వచించుచుండుటచేత నుగాగమమునకుఁ బ్రాప్తియే లేదు గదా.

వి_స్తర. II ౧౬౧ I విష:—"స్త్రీలింగములయొక్క ప్రథమైకవచనంబునకు లోపంబుగలుగును. అనఁగా స్త్రీవాచకపదముల కడపటి ప్రథమైకవచనంబునకు లోపంబుగలుగును" (బా. కౌ. ప్ర. తత్స. ౫౭ సూ. వ్యాఖ్య.) అను సుప్తార్థ ప్రకాశికావ్యాఖ్య సరికాదు. సంస్కృతమున స్త్రీలింగ స్త్రీవాచకశబ్దములు పర్యాయములైయైనను నాంధ్రవైయాకరణ వ్యవహారమున నవి విభిన్నార్థకములయి యున్నవి. ఆంధ్రవ్యాకరణములలో స్త్రీలింగశబ్దము పారిభాషిక స్త్రీలింగపరము గను స్త్రీవాచకశబ్దము మహతీవాచకపరముగను మాత్రమె వ్యవహరింపఁబడు చున్నవి. అచ్ఛికశబ్దములకు స్త్రీలింగవ్యవహారమే లేదు. అవి స్త్రీసమము లని మాత్రమె వ్యవహరింపఁబడుచున్నవి. వానిని స్త్రీలింగములనరాదు. అట్టి స్త్రీసమములలోని మహతీవాచకములగు నాచ్ఛికశబ్దములుమాత్రమె స్త్రీవాచకము లనఁబడుచున్నవి. ఉదా:—తల్లి - కూఁతురు మున్నగునవి స్త్రీవాచకములు. గోడ మేడ మున్నగు నమహద్వాచకములును తండ్రి - కొడుకు మున్నగు మహద్వాచకములును స్త్రీసమములనిమాత్రమె వ్యవహరింపఁబడును.

పయివిషయములను నేను "ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రికా"ముఖంబున వెల్లడింపఁగా సుప్తార్థప్రకాశికాక_ర్త నిజనామవంచనాపరత్వమునఁ బార్థమూ_ర్తినామముతోఁ గొంత యతిప్రసంగముచేయుచుఁ బత్త్రికావాదము నడపెను. ఈవిషయమున జరగిన వాద ప్రతివాదములలోఁ బార్థమూ_ర్తి వ్యాసములుమాత్రమె సుప్తార్థప్రకాశికా ద్వితీయముద్రణమున ననుబంధముగాఁ బ్రకటింపఁబడినవి. (చూ. పార్థమన్యు. ౩౭ మొ. ౪౭ పు. వ.) నావ్యాసములును. కీ. శే. మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రులవారి వ్యాసములును దత్వ ప్రదర్శనాభిలాష లేమిం జేసి యందు ముద్రింపఁబడలేదు. శ్రీశాస్త్రులవారివ్యాసము లీగ్రంథము తుది ననుబంధముగా ముద్రింపఁదలఁచియున్నాను. నావ్యాసములసారమిట సంక్షేపముగాఁ బ్రదర్శించెదను.

నావాదము:—

"స్త్రీవాచకత్వేపి స్త్రీలిఙ్గత్వా భావాద్దారాదిభ్యో ముపర్ణక ఏవ. నసులోపః - తేన దారములు ఇత్యేవరూపమ్" (అహో. ౩౪౬ పు.) అను నహోబలపతి వాక్యముచే స్త్రీలింగ స్త్రీవాచకపదములు పర్యాయములుగావనియు నవి పరస్పర విభిన్న విషయకములనియు విశదమగుచున్నది. భార్యావాచకమగు దారశబ్దము స్త్రీవాచ

కమేయయ్యె స్త్రీలింగముకాదని యహోబలపతియేయిట కంఠోక్తముగాఁ జెప్పి యున్నాఁడు.

సీతారామాచార్య వాదము:—

అహోబలపండితాదు లప్పటి ప్రకరణమున కనుకూలమైనందున 'స్తనకేశవతీ స్త్రీస్యా ల్లోమశః పురుషః స్మృతః' యను వచనమున స్త్రీవాచకపదముచే లౌకిక లింగవిశేషమును గ్రహించిరి. అందుచే నుపన్యాసకర్తలమైన నా స్త్రీయలింగము స్త్రీవాచకపదంబుచే గ్రహింపనోపదని చెప్పుదుమా? (వ్యా. సుధా. ౩౫ పు.)

నా వాదము:—

ఈయుపన్యాసము సరికాదు. ఆంధ్రవ్యాకరణములం దెచ్చటను స్త్రీవాచ శబ్దమిట్లు మహతీవాచకపరముగనే వాడఁబడుచున్నదిగాని పారిభాషిక స్త్రీలింగపర ముగా వాడఁబడలేదు. "హో ఇతి స్త్రీవాచకోఽభవేత్ । పరత్రైవ ప్రయోగః స్యాత్..." (వికృ. అజం. ౧ కారి. అహో. ౨౭౧ పు.) ఈయధర్వణసూత్రము లీక్రిందిరీతిని త్రిలింగలక్షణశేషమున ననువదింపఁబడినవి. "హో శబ్దంబొండు సంబో ధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగఁగు (ప్రాక్. శేష. ౧౬ సూ.) ఉదా:—కమల దళాక్షిహో (ప్రభా. ౧ ఆ.) రమణిహో (భాగ. ౪ స్కం.)"

బాలవ్యాకరణకర్తయు దీనినిట్లె వ్యవహరించెను. "బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమ సంబోధనాంతములకు సంధిలేదు. ఉదా:—అమ్మ యిచ్చెను - దూతయింతేఁడు - చెలువుఁడయింపము" (బాల. సంధి. ౪ సూ. వివృతి.)

"ఉతా మత్రభవేన్నావు । రస్త్రియాం ల్వాదివర్జకే । (వికృ. అజం. ౨౪ కా.) (అహో. ౨౫౧-౨౫౬ పు.) అను నథర్వణకారికలోని 'అస్త్రియా' మ్మనుదానికి 'స్త్రీలిం గేతరములగు' అనునది సహజమైనయర్థమనియు నట్లుచెప్పినచో ననిష్టముగ "తన్వాది" మహతీవాచకేతర స్త్రీలింగములును వారింపఁబడుననియు నక్కారణమున నస్త్రియామ్మనుదానికి నిజార్థమునువిడిచికొని స్త్రీవాచకేతరములకని వ్యాఖ్యచేసికొన వలసియుండుననియు నహోబలపతి యీక్రిందిరీతిని వివరించెను "అస్త్రియామిత్య థర్వణవచనే స్త్రీవాచక వ్యతిరిక్తానా ముదన్తానామితి వ్యాఖ్యానా న్నతన్వాదిభ్యో వువర్ణకవికల్పో విరుద్ధః." (అహో. ౨౫౬ పు.)

కల్లూరువారి వాదము:—

"వికృతౌచ స్త్రీలిఙ్గాః । స్త్రీలిఙ్గక సర్వనామధేయాః స్యుః" (ఆం. చిం. అజం. ౧౪) "వ్యా. వికృతౌచయే స్త్రీవాచకాశ్శబ్దాః తే సర్వే స్త్రీలిఙ్గకవిశేషణ విశేష్యా భిధాయనః స్యుః" (అహో. ౩౧౭ పు.) ఇట స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకశబ్దమే

స్పష్టార్థమై పర్యాయపదముగా నుపయోగింపఁబడినది. ౯౦ సూ. 'ఉభయవిధమమ తేషామ్.' అనుసూత్రమున వ్యాఖ్యయందు 'స్త్రీలిఙ్గవిశేషణస్య ప్రాప్తత్వాత్ అస్త్రీలిఙ్గ విశేషణవిధాన ఏవతాత్పర్యమ్.' (అహో.) 'విశ్రుతౌ చ' అనుపూర్వసూత్రమున నిట స్త్రీలింగవిశేషణము ప్రతివాదుల మతమునఁ బ్రాప్తింపనేరదుగదా. ౯౦సూత్రము వ్యాఖ్యానమున స్త్రీలింగవిశేషణ మే సూత్రమున బ్రాప్తించునని వ్యాఖ్యాత యా రీతిని వ్రాసెనో చెప్పవలసిన భారము ప్రతివాదులశిరముననే యొరఁగుచున్నయది. (ప్రార్థన, ౪౧ పు.)

నాసమాధానము:—

స్త్రీలింగశబ్దమునకు సహజమైనయర్థము చెప్పినచోఁ గూదురుపాటు కాదనియు, దానికి వేఱొకయర్థము ననఁగా స్త్రీవాచక పరమైనయర్థమును వ్యాఖ్య చేసికొనవలసి యున్నదనియు నహోబలపతి విశ్రుతౌ చేత్యాదిసూత్ర వ్యాఖ్యలో ననుపదముననే యీ క్రిందిరీతిని వచించుచుండఁగా నాపంక్తులనువంచించి బా. గు. ప్ర. కర్త వ్రాయుట కేవలము సాహసకృత్యమై యున్నది. "విశ్రుతౌ చ స్త్రీలిఙ్గాః .. వ్యాఖ్య. విశ్రుతౌ యే స్త్రీవాచకాశ్శబ్దాః తే సర్వే స్త్రీలిఙ్గ విశేషణ విశేష్యాభిధాయినః స్యుః. అత్రేయంచిన్తా—సూత్రస్యాస్య సీత భక్తవత్సల ఇత్యాదౌ న తాత్పర్యమ్. నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామిత్యనుశాసనాత్. స్త్రీప్రత్యయాన్తస్యైవ (విశేషణస్య) ప్రాప్తే... స్త్రీత్వ (స్త్రీలిఙ్గత్వ) వాచకత్వ మవ్యాహతమేవేతి తద్విధానస్య అనావశ్యకత్వాత్ - కింతు - పంటచెలిపట్టి లోకైక భవ్యచరిత. ఇత్యాదౌ తాత్పర్య మవధార్యతే" (అహో. ౩౧౭ పు.) సంస్కృత స్త్రీలింగశబ్దము విశేష్యమగు నపుడు తద్విశేషణమగు సంస్కృతవిశేష్య నిఘ్నశబ్దమునకు బా. తత్స. ౮౫ సూత్రమునకు మూలమగు "నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసా" మ్మను చింతామణిసూత్రము చొప్పున నర్హమగు స్త్రీప్రత్యయమువచ్చును. కాన ప్రకృతమగు "విశ్రుతౌ చ స్త్రీలిఙ్గాః" అను చింతామణిసూత్రమునకును నదేయర్థము చెప్పి వ్యర్థత నొదవించుట సరికామింజేసి యా విశ్రుతౌ చేత్యాదిసూత్రమునకు 'సీత భక్తవత్సల' అనునది లక్ష్యముగా నెన్నరాదనియు విశ్రుతౌ చేత్యాది సూత్రములోని 'స్త్రీలిఙ్గాః' అను దానికి "స్త్రీవాచకాః" అనఁగా "మహతీవాచకాః" అని వ్యాఖ్య చేసికొనవలయు ననియు నట్లుచేయుటవలన నాచ్ఛికమహతీవాచకము (పంటచెలిపట్టి) విశేష్యమై యుండఁగాఁ దద్విశేషణ సంస్కృతవిశేష్య నిఘ్నశబ్దమునకు (లోకైకభవ్యచరిత) స్త్రీప్రత్యయమువచ్చుటకు గతిగల్గుననియు నక్కారణమున విశ్రుతౌ చేత్యాది చింతామణిసూత్రమునకు "పంటచెలిపట్టి లోకైకభవ్యచరిత" అను రీతివే లక్ష్యము

లను యొన్నదగునని యహోబలపతి "ఆత్రేయం చిన్త్యే" త్యాది వాక్యముతో సమర్థించుచున్నాడు. ఇట్టి వ్యాకృతి బాధకములను వ్యాకృతిసాధకములుగా నుదాహరించుకొనుట శోచనీయము.

"వస్తుతస్తు 'మిన్నేఱు కలహంస' ఇత్యత్ర సాధుత్వమ్. అత్ర కేచిత్ స్త్రీపదత్వం - తత్తు స్త్రీవాచకత్వ మవ్యాహతమేవేతి కత్రప్రత్యయ..." అనెడి నియత స్త్రీప్రత్యయాన్తత్వాది సూత్రవ్యాఖ్యలోని పంక్తులను (అహో. ౬౪౭ పు.) చెప్పనితలపై యున్నదనుటచేత గంగాదేవియనెడి స్త్రీవ్యక్తియర్థము నుండుటచేత నచటి మిన్నేఱుశబ్దము స్త్రీసమమే కాక స్త్రీవాచకమును నగుగా మహతీవాచకమును నగుచున్నదిగాన నదియు విక్రుతా చేత్యాదిసూత్రమునకు "పంటచెలిపట్టి" త్యాది వాక్యమువలెనే లక్ష్యము కానోపునని యహోబలపండితుడు వివరించెను.

మఱియు నహోబలపతి స్త్రీలింగశబ్దమునకుఁ బర్యాయముగా స్త్రీవాచకశబ్దమును వాడుటలో నెంతపై మత్యముతోనున్నాఁడో యరయుఁడు:—"ఆత్రేయం చిన్త్యా...స్త్రీప్రత్యయాన్తస్యైవ ప్రాప్త్యే...స్త్రీత్వవాచకత్వ మవ్యాహతమేవేతి..." (అహో. ౬౧౭ పు.) అను పంక్తులలో స్త్రీవాచకశబ్దమనాయకమనఁగా మహతీపరార్థకమై యుండుటంజేసి స్త్రీలింగవాచకత్వమను నర్థమున స్త్రీవాచకత్వమని వాడుటకు సమ్మతింపక "స్త్రీత్వవాచకత్వ మవ్యాహతమేవ" అని వ్యవహరించినవాఁడయ్యెను. ఇట్లె స్థలాంతరమునందును 'అమహతామితిసామాన్య నిర్దేశేపి న స్త్రీత్వవాచకాదమహన్నామ్నోఽయం ప్రత్యయః" (అహో. ౨౭౯ పు.) అని యహోబలపతి వ్రాసియుండెను. కాని యచట లేఖక ముద్రాపకాది ప్రమాదవశమున నందలి 'స్త్రీత్వ' అనుదానిలో ని 'త్వ' అనునది భ్రష్టముకాఁగా నది సందుచేసికొని బా. గు. ప్ర. కర్త యీ క్రిందిరీతిని ఖాంకరించెను.

కల్లూరువారి వాదము:—

"అమహతామితి సామాన్య నిర్దేశేపి న స్త్రీవాచకాదమహన్నామ్నోయం ప్రత్యయః (అహో. ౨౭౯) ఇత్యాదులందు స్త్రీవాచకశబ్దము స్త్రీలింగశబ్దపర్యాయముగాక మహతీవాచకమే యర్థముగలదయ్యెనేని 'కాంత' ఇత్యాదులందే సులోపముగలిగి 'గంగ-విద్య' ఇత్యాదులందు సులోపము రాదుగాన...అహోబలపండితీయము సైతము గుప్తార్థప్రకాశికా వ్యాఖ్యానమువోలె నపార్థంబయ్యెడిని..." (పార్థమ. ౬౩-౬౩ పు.)

లుగ్భవేత్కుశాదే ర్మో:. (ఆం. చిం.) అజం. ౧౩ కా.)

నన్నయాథ. (అహో. ౩౧౮ పు.)

౧౬౨ విషయము. చరితాదికశబ్దానాం। రూపం తూభయథా భవేత్ (వికృ. అజం. ౪౦ కారి.) (అహో. ౩౧౩ పు.)

కల్పతరు. ౧౬౨ విష:—కుశాదేః = కుశ - దర్భ మున్నగుశబ్దముల, మోః = మువర్ణక ముగాగమములకు, లుక్ - భవేత్ = లోపముకల్గును. ఉదా:—కుశ - కుశలు, దర్భ - దర్భలు, మొ. కుశాదులకు ముఁలోపము నిత్యమైనను 'చరితా' దులకు ముఁలోపపాక్షికత భట్టారక ప్రయోగములందే కన్పట్టుచుండుటంజేసి యథర్వణుఁడా విషయమును సూత్రించుచున్నాఁడు. చరితాదికశబ్దానామ్ = చరిత - చరిత్రమున్నగుశబ్దముల, రూపంతు = రూపమన్ననో, ఉభయథాభవేత్ = ములోపతదభావరూప ద్వైవిధ్యముతో నుండును. ఉదా:—చరిత - చరితము, చరితలు - చరితములు, మొ.

అహోబలపండితుఁడు నన్నయాథర్వణోపదిష్టములగు నీరెండుగణములను గలిపివేసి కుశాదిగణముగానె యుదాహరించి కుశాదులకెల్ల మువర్ణక మనిత్యముగా లోపించునని వ్యాఖ్యచేసెను. "కుశాదేస్సోరితివక్తవ్యే మోర్లుగితి కథనేన లుకోఽనిత్యత్వం జ్ఞాయతే - తేన, హంస, హంసములు..." (అహో. ౩౧౮ పు.) కుశ - దర్భ మున్నగువాని ములోపాభావమునకుఁ బ్రయోగములను జూపకయె యిట్లు వ్యాఖ్యచేయుట యుక్తముకాదు, కుశ ప్రభృతులకు నిత్య'ము' లోపమును భట్టారకుఁడు సూత్రించుచుండఁగాఁ దిక్కనాదుల ప్రయోగమందైన 'కుశము' అను మువర్ణకఘటితప్రయోగమును జూపకయె దాని కనిత్యతను వ్యాఖ్యచేయుట యెట్లు పొసఁగనేర్చును? ప్రయోగములు:—గీ. కటకుదర్భ పూరిపటుపులు

---

నాసమాధానము:—

దీనికి మీఁదవిషయములోనె సమాధానమీయఁబడినది. స్త్రీలింగపర్యాయముగా వాడినపు డహోబలపతి పైనుదాహరించినరీతిని (౩౧౭ పు.) స్త్రీత్వవాచకమనియె వాడుచుండునుకాన నిచట నయితము "అమహతామితి సామాన్యనిర్దేశిన స్త్రీత్వవాచకాత్..." అనియె (౨౭౯) యహోబలపతి వ్రాసెననియు నక్కారణమున స్త్రీత్వవాచకాత్తనుటచే గంగ - విద్య మున్నగు స్త్రీలింగవాచకములకుఁ బరముగు 'ను' ప్రత్యయము లోపించుననియు దానిలో మువర్ణకము రాదనియు నహోబలపతి యాశయమని గ్రహింపనగుననుచుఁబైని విశదపఱిచియె యున్నాను. అతివిస్తరమగునని యింతతో నీవిషయమును ముగించితిని.

(అహో. ౩౧౮ పు.) అని యహోబలపండితుఁడు వివరింపఁగాఁ గవిజనమండన టీకాకర్త వీనిలోని పులకశబ్దమునువిడిచి వధశబ్దమునుజేర్చి చరితాదులనుచు నధర్వణ వచనానుసారముగామార్చి వివరించెను. ఘోషాదీనామ్మనుచు దీని నాకృతిగణముగ నహోబలపతి వ్రాసినను నీకవిజనమండనకర్త "ఇవ్వి చరితాదులు" అని పఠితగణముగా వ్రాయుట పొరపాటు. "దూతశబ్దంబున కమహత్త్వంబున స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబు దూతయగు జంబుకంబు...తుశబ్దంబువలన దర్భాదులకు (దర్భ. పనస. కుండ. అనువానికి) స్త్రీత్వంబు నిత్యంబు. తెలుఁగని భ్రాంతిఁజెందెదరు గాని కుండశబ్దము సంస్కృతము. నానార్థరత్నమాల:— కుండం పిఠరేతోయాధార విశేషే వహ్నిగర్తేచ" (విక్ృ. అజం. ౮౦ కారి. వ్యాఖ్య.) అని కవిజనమండన టీకాకర్త చర్చించెను. సూరి చరిత్రాదులకు బహుళముగ ములోపవిధానముచేసి కవిజనమండనములోని విషయములనెల్ల వరుసదప్పక స్వీకరించెను. కుండ కుశ శబ్దములను విడిచికొనెను. దూతశబ్దవిషయమును స్వీకరించియు బా-తత్స - ౬౧ సూత్రమునొద్ద వివరించెను. శబ్దరత్నాకరమునందును సూ. రా. నిఘంటువునందును లుప్త మువర్ణ రూపముతో మాత్రమె కుశశబ్దము చూపఁబడెను, కాని దర్భశబ్దమునొద్ద నర్థము వ్రాయుటలో 'కుశము' అని శబ్దరత్నాకరకోశమున వ్రాయఁబడుట దాని బహుజనకృతత్వమును స్మరింపఁజేయుచున్నది. కవిజనమండన టీకాకర్త వ్రాసినట్లు కుండ శబ్దము మృత్పాత్రార్థకముగ సంస్కృతకోశములందున్నను నట్టియర్థమున మువర్ణకముతో 'కుండము' అనురూప మాంధ్రమహాకావ్యములం దెచ్చటను గన్పట్టలేదు. శబ్దరత్నాకరమందును సూ. రా. నిఘంటునందును 'కుండము' అనునది సంస్కృత సమముగాఁ జూపఁబడెనేకాని దానికిఁ బ్రయోగము చూపఁబడలేదు. ఈకోశములు రెండిటను 'కుండ' అను శబ్దము చూపఁబడినను నది వైకృతముగాఁ జూపఁబడెనె కాని చరిత్రాదులలోనిదనుటకు వీలుగ సంస్కృతసమముగఁ జూపఁబడలేదు. సూరిగారును గవిజనమండనాశయమును బాటింపక కుండశబ్దమును జరిత్రాదులలోఁ జేర్పక విడిచికొనిరి. కుశశబ్దమును దర్భాదులలోనైనఁ జేర్పక సూరి విడుచుటయింత! అద్దాని లుప్తమువర్ణకరూప సాధుత్వమునకు భట్టారకుని "లుగ్వాపేత్ కుశాదేర్నః" అను సూత్రమె పరమప్రమాణమైయున్నది. దర్భశబ్ద మువర్ణలోపవిషయమునఁ గల్పతరువునఁ బ్రయోగములు చూపఁబడియుండుటచే నిటఁబునరుక్తముగఁ జూపలేదు. 'దర్భము' అనెడి మువర్ణకాంత రూపమెచ్చటను గన్పట్టలేదు. సూరి కవిజనమండనము ననుసరించి 'పనస' శబ్దమును దర్భాదులలోఁజేర్చెను. "పనస. వై. వి. ౧ వేదభాగము. ౨ వృక్షవిశేషము. (దీనిఁ గొందఱుకవులు వైకృతముగా

వాడియున్నారు. కనుక సంస్కృతమున 'పణస' అనియే పాఠముండునని తోఁచె డిని." (శ. ర.). ఇట్లు సూరిగారి 'పనస' అను ఉక్త మున్నక తత్సమరూపము శబ్దరత్నాకరమున వైకృతముగా గ్రహింపఁబడెను. అది యటులుండ నేమో యన్ని తెలుఁగుకావ్యములలో 'పనస' అనునది వాడఁబడినందునూ గ్రంథము సంస్కృతమునఁ బ్రసిద్ధమైయున్న సంస్కృతపదమైన 'పనస' శబ్దమును విడివికోవదలెను శబ్దరత్నాకరకర్త వ్రాయుట సరికాదు. "పనసః పుం. ఫలవృక్షభేదః. కణ్టకిఫలే...పనాయ్యతే - స్తూయతే - పన - అర్త్య విపదితమిత్యాదినా అసచ్." "పణసః పుం. పనసే... పణాయ్యతేస్మ. పణస్యవహారే స్తుతౌ చ. అర్త్యవిపదమిత మిత్యాదినా అసచ్" (శబ్దా. చిం.) ఇందలి మూర్ధన్యయుక్తశబ్దము శబ్దరత్నాకరములో చూపఁబడలేదు. దన్త్యయుక్తము మాత్రమె చూపఁబడినది. పనసవృక్షము మున్నగునవి వాడుకలో నైతముగలవు. "కదళీ పనసామ్రాద్య ప క్వానిచ ఫలానిచ" ఇత్యాదులు పెక్కులు గలవు.

'ఘోష - అభిలాష' అనువానిని మున్నుండుగ నహోబలపతి యీగణమునఁ జేర్చెను. తర్వాతి గ్రంథకర్తలెల్ల నహోబలపతినె యనుసరించిరి. వీని ముల్లోప మున కెవ్వరును బ్రయోగములు చూపలేదు. క. హరివిషయాభిలాషము | గాఁగణ ముగ...(ఆర. ౧ ఆ. ౩౨) శబ్దరత్నాకరమున లుప్తమునన్నకరూపము మాత్రము చూపఁబడుట చింత్యము. శబ్దరత్నాకరమునందును సూ. రా. నిఘంటువునందును "ఘోష" అనెడి లుప్త మునన్నకరూపమె చూపఁబడలేదు. శా॥ దానాంభః పట లంబునం బృథుపయోధారావళిందాల్చి గ | ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛా దించి...ద్విరదసంఘంబుల్...(ఆర. ౪ ఆ. ౧౪౪ ప) ఇట్లు ప్రయోగములుండఁగా శబ్దరత్నాకరమున 'ధ్వని' అనునర్థమె ఘోషశబ్దమునకు వ్రాయఁబడలేదు. చరిత్ర - చరిత అనువానికిఁ గల్పతరువులోఁ బ్రయోగము చూపఁబడెను. (౧౬౨ విష).

అలకలు:—"అలక (ము) సం. వి. అ. పుం. న. ఇది తఱుచుగా బహువచనమునందే కనఁబడుచున్నది..." (సూ. రా. ని.) శబ్దరత్నాకరమున నిది మువిభక్తితోమాత్రము చూపఁబడుట సరికాదు. నుదుటి పెంపలకల...(విరా. సర్వాల. ౨ ఆ. ౬౦) చ. అలకలపొల్పు...(నన్ని. కు. ౬ ఆ. ౭౮౮) సీ. నిటలాలకము లంటి...(భాగ. ౮ స్కం. సర్వ. ౨ ఆ. ౫౭) విభుని నిటలాలకముల్ (కవిక. సర్వాల. ౨ ఆ. ౫౭).

అక్షతలు:—క. లలితాక్షతములఁ గుసుమం | బుల...(శాంతి. ౬ ఆ. ౨౬౭) మ...ఆర్ద్రాక్షతం | బులు రాల్చెన్ (వసు. ౧ ఆ. ౧౫౨) సీ. అర్ఘ్యంబుణాక్షంగన

లక్షిత లలుకంగ (హరి. ఉ. భా. ౮ ఆ. ౬౫) సీ...గీ. అక్షతలు మాళిఁదాల్చిరి... (మనుచ. ౫ ఆ. ౯౫).

హంసః—క. బలశాలిమైన హంసము।...హం। సలతో...(కర్ణ. ౨ ఆ. ౬౦ ప.) చ...హం। సలకడ...(నన్ని. కు. ౬ ఆ. ౭౮౮).

వధః—తే. గీ. క్షత్త్రవధనైన పాపంబు గ్రాఁగవలయు। (ఆర. ౨ ఆ. ౨౬3) తే. గీ. వధకు నర్హుఁడై వచ్చినవానిఁ జంపి। తదియు (ఆది. ౬ ఆ. ౨౨౦).

పులకలు. దీని నహోబలపతి కుశాదులలోఁ జూపియున్నను గవిజనమండన కర్త చూపమింజేసి కావలయు సూరియు నుపేక్షించెను. ఆ. వె....అంగకములఁ। బులకలెగయఁ గేలుదలమోడ్చి...(విరా. ౫ ఆ. 3౮౧).

స్ఫురణ - విజృంభణః—"స్ఫురణ - న. స్ఫుర - ల్యుట్ - ఈషత్స్పన్దనే. యుచ్, తత్రైవ - స్త్రీ" (శబ్దస్తో).

"స్ఫురణే। స్ఫురణా" (అమర. 3 కాం. సంకీ.౧౦ శ్లో.) దీని సుధావ్యాఖ్య:- "స్ఫురస్ఫురణే - సఞ్చలనేచ - కుటాదిః - ల్యుట్ - స్ఫురణమ్ - ణ్యాసశ్రన్థోయుచ్ - స్ఫురణా." అను ప్రమాణములచొప్పున నపుంసక స్ఫురణశబ్దమును స్త్రీలింగ స్ఫురణాశబ్దమును సంస్కృతమున వెలయుచుండుటంజేసి 'స్ఫురణము - స్ఫురణ' అను ద్వివిధరూపములును సిద్ధించునుగావున నీస్ఫురణశబ్దమును జరిత్రాదులనుండి తొలఁగించుట యుక్తము. సంస్కృతవ్యాకరణమున "ల్యుట్ - యుచ్" అను రెండు కృత్ ప్రత్యయములు గలవు. ధాతువుపై నీరెండిటిలో నేదినిల్చినను "యువోరనాకౌ. (౭-౧-౧) (సి. కౌ. తద్ధి. చాతురర్థిక. 3౫౯ పు.) అను సూత్రము చొప్పున ధాతువుపై 'అన' అనునది నిల్చును రచ్ + అన = రచన. మొ. ణిజంత ములపైని 'ఆస' మున్నగు ధాతువులపయిని యుచ్ ప్రత్యయము వచ్చును. యుచ్ ప్రత్యయాంతమునకు స్త్రీత్వమున 'టాప్' ప్రత్యయమువచ్చి 'రచనా' మున్నగు రూపము లేర్పడును. ల్యుట్ ప్రత్యయాంతత్వపక్షమున "భావేల్యుడన్తః. (సి. కౌ. లింగా. ౧౧౯ సూ.) అను చొప్పున నపుంసకత్వముకల్గి 'రచనమ్' మున్నగురూప ములేర్పడును - కాన నిట్టివానిని జరిత్రాదులలోఁ జేర్చుట యనావశ్యకము. క. రాక్షసమాయా పరిస్ఫురణఁజెఱిచె...(ఆర. ౧ ఆ. ౧౦౮) (ఆర. ౪ ఆ. ౧3౯ ఆది. ౨ ఆ. ౪౭-౨౧౨). చ...దళత్కమల వైభవజృంభణముల్లసిల్ల...(ఆర. ౪ ఆ. ౧౪3 ప.) "జృంభణ. సం. వి. ఆ. స్త్రీ. విజృంభణము - అతిశయము. సీ. సుర

చిరంబుగ దేశకుక్షమార్గంబుల జృంభణ నటియించు సంభారేతి (ప్రభులిం. ౧-౯౫ సూ. శా, ని.) (విస్తర I).

---

విస్తర. I ౧౬౨ I విషః—"వరిత్రాదులకు ముప్ప్రత్యయము వైకల్పికము." (ఆం. భా. అ. శబ్ద. ౪౯ సూ.) అని సూత్రించియు నందుకు 'స్ఫురణ - విజృంభణ' అను వానిని జూపియు ననుశాసకర్త "కంఠరాదులకు ముప్ప్రత్యయము బహుళము" (ఆం. భా. అ. శబ్ద. ౫౪) "రచనాదులకు ముప్ప్రత్యయము బహుళము." (ఆం భా. అ. శబ్ద. ౫౫ సూ.) అని వేఱ సూత్రించెను. దీనినిబట్టి రచనాదులు కంఠరాదుల వలెనె స్త్రీలింగమాత్రములై యగుటంజేసి వానికి 'ము' ప్రత్యయప్రాప్తిని ఘటించుట కయి యాతఁడు యత్నించినట్లు కన్పట్టుచున్నది. రచనాదులును ల్యుడంతములు యుజంతములునై యుండుటంజేసి వానికి ద్వైరూప్యము సుసాధమై యున్నది. "రచనా-స్త్రీ - రచ - యుచ్ - రచనే...భావేల్యుట్-తత్రైవ-న." (శబ్దస్తో) ప్రసంగవశమున నిటఁ గొన్ని ల్యుడంత యుజంతరూపములు చూపఁబడుచున్నవి.

వర్తనః—"వర్తనః. పుం. వామనే...న. వృత్తౌ...న...స్త్రీ...యుచ్." (శబ్దా. చిం) చ...బ్రహ్మచర్య వ ׀ ర్తనకయి...(విరా. ౪ ఆ. ౧౬౦) చ...దుర్వ్య ׀ వ్యసనుల ధర్మవర్తనఁ బ్రవర్తితులయ్యు (ఆర. ౨ ఆ. 3౧౨) చ...ధర్మవ ׀ ర్తనములు గాక తోఁచి (ఉద్యో. ౧ ఆ. 33౪).

భావనః—"భావనా - స్త్రీ...కల్పనాయామ్...ఉత్పాదనాయామ్ - ఉత్పత్త్యర్థాద్భవతేః ణ్యన్తాద్యుచ్" (శబ్దా. చిం.) "భావన - న...భావేల్యుట్ - యుచ్-చిన్తాయామ్...స్త్రీ." (శబ్దస్తో) చ ...మృష్టభావనం బెరిఁగితి ...... (సభా. ౨ ఆ. ౨౫౫).

ఘట్టనః-"ఘట్టి-వన్ది-విదిభ్యశ్చేతి వాచ్యమ్. (యుచ్స్యాత్) (వార్తి.౨౨౨౨) ఘట్టనా - వన్దనా-వేదనా" (సి. కౌ. ఉత్తరకృత్. ౨౨౦౪ సూ) చ. ఘనతరదైత్య దానవ నికాయకళేబర పాతఘట్టనం। దనరి...(ఆర. ౧ ఆ. ౧౮౬) క. చను దెంచిరి సైన్యస్యం। దన ఘట్టన నవని తలము తల్లడపడఁగన్ (ఆర. ౨ ఆ. ౨౯) సీ. ఊరు ఘట్టనముల ధారుణీరుహములు (ఆర. 3 ఆ. 3౯౪ ప.) 'ఘట్టనము' అనునది ల్యుడంతరూపము.

వేదనః—"వేదనా - స్త్రీ. దుఃఖే. పీడాయామ్ - ణ్యాసేతియుచ్." (శబ్దా. చిం.) ఆ. వె...నిశితదివ్య। విశిఖతతులయట్ల వేదనగావించు। టిది...(ఆర. ౧ ఆ. 3౧౪) చ...ఘోరదుఃఖ వే। దనములు సైఁచె...(ఆర. ౫ ఆ. 33౪) 'వేదనము' అనునది ల్యుడంతరూపము.

పత్రాద్యాదులనుచు సూరి చరిత్రాదుల నాకృతిగణముగ నెంచుటచే - "ప్రయాగ - సంసర్గ" - మున్నగువాని నెఱ్ఱునది. ప్రయాగ:—ఆ. వె. విను ప్రయాగమునకుఁ జనుదెంచు (ఆను. ౨ ఆ. ౮౩) సీ... తే. గీ. పూషమకరస్థుఁడైన యప్పుడు ప్రయాగ (కాశీ. ౩ ఆ. ౯౨ పద్యచతుర్థపాదము) ఉ... ప్రయాగదాఁక (హరి. పూ. ౩ ఆ. ౧౦౨) సంసర్గ:—గీ. సాధుసం। సర్గఁజేసి సుగతిఁజనుట యొప్పు (ఆర. ౫ ఆ. ౮౧) నిశ్శంక:—సీ. నియతధర్మము నీవు నిశ్శంక నడపుము (శాంతి. ౨ ఆ. ౨౧౦).

చామరలు - లాజలు:—శా... చామరల్ కవలిడన్... (శాంతి. ౧ ఆ. ౩౪౯) చ. దనుజ విరోధిమీఁద నొక తన్వికరంబున లాజలెత్తిచ। ల్లిన ... (పారిజా) ఉ. మంగళా। చార మనోజ్ఞలాజములు చల్లిరి (వసు) వీనిని దిమ్మకవి యుదాహరించెను. (సర్వల. ౨ ఆ. ౧౩౦ - ౧౦౧ - ౧౦౩) ఈరెండుశబ్దములకును స్త్రీత్వనపుంసకత్వములు రెండునుగలవు. "చామరా చామరం వాల। వ్యజనం రోమ గుచ్ఛకమ్. ఇతిరభసః." (అమరసుధ - అమర. ౨ కాం. క్షత్ర. ౩౧ శ్లో. వ్యా.) "లాజ -

---

కీర్తన-సేవన:—"కీర్తనమ్ - న - ఉక్తౌ, కథనే. కాలాపాస్తు యుచమపీచ్ఛన్తీతి - ఊతియూతీత్యత్ర ప్రసాదకారః" (శబ్దా. చిం.) క. విదితముగ దీర్ఘకీర్తనఁ। జదివిన... (ఆర. ౨ ఆ. ౨౮౩) (విర్వా. ౩ ఆ. ౬) (ఆర. ౫ ఆ. ౨౪౯) చ. ధరణిఁ బ్రదక్షిణంబుగ ముదంబునఁ గ్రుమ్మరి తీర్థసేవనా। పరులగుచున్న ధన్యులు శుభస్థితినెట్టిఫలంబు నొందఁగాం। తురు బహు తీర్థకీర్తనముతో నెఱిఁగింపుము... (ఆర. ౨ ఆ. ౨౩౫).

ఘటన:—"ఘటనా - స్త్రీ. చురాదిః - ఘట - యుచ్. సంహతకరణే. యోజనే..." (శబ్దస్తో) సీ... ఆ. వె... దైవఘటనఁజేసి (ఆర. ౨ ఆ. ౭౭).

వర్ణన:—"వర్ణనమ్ - న - స్తవనే." "వర్ణనా - స్త్రీ. ప్రశంసాయామ్" (శబ్దా. చిం.) సీ. వర్ణనలెల్లచో వర్ణనకెక్కఁగ (నన్ని. ౧ ఆ. ౩౬),

ప్రేరణ:—"ప్రేరణ - న. ప్ర+ఈర+ణిచ్ - ల్యుట్... ణిచ్ - యుచ్ - ప్రేరణాప్యత్ర - స్త్రీ." (శబ్దస్తో) ఉ... సంతత। ప్రేరణ నాకుపద్రవము (సభా. ౧ ఆ. ౧౧౪).

నివారణ (ఆర. ౫ ఆ. ౯౧) నిర్ధారణ (ఉద్యో. ౪ ఆ. ౯౦) పరిపాలన (ఉద్యో. ౨ ఆ. ౯౩) పాలన (ఆది. ౩ ఆ. ౫౧) తపశ్చరణ (ఆది. ౩ ఆ. ౨౩) సాధన (ఆది. ౪ ఆ. ౮౫) అర్పణ-సమర్పణ (ఆది. ౨ ఆ. ౪౦) పూజన (సభా. ౧ ఆ. ౧౫౩) భక్షణ (ఆర, ౧ ఆ. ౧౧౩) సంచాలన (ఆర. ౩ ఆ. ౩౧౨) మొ.

నన్నయా  భవేద్ధర్మాది శబ్దానాం । ము శ్చోపు శ్చాత్ర కుత్రచిత్.
౧౬౩ విషయము. (వికృ. అజం. ౨౬ కారి. అహో. ౭౯౭).

కల్పతరు. ౧౬౩ విష:—అత్ర = ఈమువర్ణక సందర్భమున, కుత్రచిత్ = ఒకానొకచో, ధర్మాదిశబ్దానామ్ = ధర్మాదిశబ్దములకుఁ బరమైయున్న సుప్రత్యయమున కాదేశముగా, ముశ్చ = మువర్ణకమును, ఉపుశ్చ = ఉపువర్ణకమును, భవేత్ = పర్యాయముగానగును. ఉదా:—ధర్మువు - ధర్మము - ధర్మువులు - ధర్మములు. కవిశిరోభూషణమున 'ముశ్చ వు శ్చాత్ర కుత్రచిత్' అను పాఠము వెలయుచున్నది. తదనుయాయి కవిజనమండన నారాయణీయాదులందును నట్లె యుదాహరింపఁబడెను. (వికృ. అజం. ౨౬ సూ. వ్యా. నారా. ౩౮ ప. ౧౯౯ కా.) ఈపాఠము పక్షమున 'ధర్మవు' అని మాత్రమె రూపసిద్ధికల్గును. ఉత్త్వవిధాయకశాస్త్ర మిచట లేదు. "సర్వధ । ర్మువులు తొలంగు దేవముని ముఖ్యులు" (ఆది. ౪ ఆ. ౨౫౦) అను భట్టారకప్రయోగమున వువర్ణకమునకు 'ఉ' వర్ణపూర్వకత్వము విశ్రమస్థాననిబద్ధమై యుండుటచేత "ము శ్చోవుశ్చ"అనునదే యథర్వణోపదిష్ట పాఠమని విశ్వసింపఁదగును. "ఆదిశబ్దేనకర్మాది శబ్దాగృహ్యన్తే" (అహో. ౭౯౭ పు.) అను నహోబల పండితీయవాక్యముచొప్పున నథర్వణసూత్రములోని యాదిశబ్దముచే "కర్మాది" శబ్దములు గ్రహింపఁబడును. ఉదా:—కర్మువు - కర్మము - వర్మువు - వర్మము. మొ.

---

పత వివరణకర్త ప్రయోగసిద్ధములనుచుఁ గొన్నిటిని జూపెను:-"ఊష్మ (హార. ౬ ఆ. ౬౨) ఘూత (కవిక. ౩ ఆ. ౮౨) చిహ్న (రామాభ్యు) (భాస్కర. యు. ౧౬౦౦) ఉన్మేష. (శుక. ౩ ఆ. ౪౮౭) ధావన. (ఆము. ౪ ఆ. ౩౧) అంశ (కాళిందీ. ౧ ఆ.) ఫలక. (భాగ. ౧ ఆ. ౬౭౪) ప్రశ్న (భాగ. ౧౦ - ౨౩౬) గండూష (కాశీ. ౩ ఆ. ౨౩౫)" (గాణ. తత్స. ౪౮ ప. ౨౦౯ కారి. వ్యా.) అను శాసనకర్త మఱికొన్నిటిని జూపెను "విమర్శల్, (భోజ.) ఉద్ధతులమధ్య (కవిక) మాంజిష్ఠ (హారవి) నిష్కర్ష - సర్గ." (ఆం. భా. ఆ. శబ్ద. ౪౯ సూ.) ఇంకను బ్రయోగములు:—

మేలనగీతి. 'గలము రెండు నగణములును గలసి ప్రాసమెఱయు (కావ్యాలం. ౮ ఉల్లా. ౨౪ పు.) క. యరలవలును శషసహలును । నరయఁగ సంతస్థలూష్మలనఁగాఁ జెల్లున్ (ఆం. భూ. ౧౬ పద్య. కేతన.) ద్విపద. ఎడపక నిత్య వేయేసి ముట్టింప (బసవ. ౪ ఆ. ౮౮౪ ప.) ద్వి. ఆలిసేయుచుఁ బల్కునది తథ్యకాఁగ (బసవ. ౩ ఆ. ౫౭౦) ప్రశ్న (బసవ. ౬ ఆ ౩౩౨ - ౩౪౯) స్పర్శ. (బసవ. ౫ ఆ. ౩౭౩) చిహ్న. (నన్ని. కు. ౨ ఆ. ౧౫౮ ప.) మొ.

లెల్లఁ జూపఁబడినవి. కాని ప్రయోగ మొక్కటికయినఁ జూపఁబడ లేదు. గాణపతవ్యాఖ్యాత 'ఆదరము-ఆదరువు' అని (గాణ. తత్స. ౯౮ సూ. టీక.) మఱొక పదమును జేర్చెను. కాని తత్సమములగు ధర్మాదులలో వైకృతమగు 'ఆదరువు' అను దానిని జేర్చుట యుక్తము కాదు. కోశములలో 'ఆదరువు' శబ్ద మాధారశబ్దభవముగాఁ జూపఁబడియున్నది. "ఆదరువు - వి - (సం. ఆధారః. త. ఆధరవు) ఆధారము - ప్రాపు" (సూ. రా. ని.)

ప్రౌఢవ్యాకర్తచూపిన 'వర్గు' శబ్దమునకుఁ గవిప్రయోగము లభింపలేదు గాని 'శరణు - రూపు -' అనువానికిఁ బ్రయోగములు కన్పట్టుచున్నవి. (౧౫౦ I విష.) అట్లని 'రూపువు - శరణువు -' మున్నగు రూపములుగలవని భ్రమింపరాదు. ప్రయోగములు:—చ. అవని యరాజకంబయిన...సర్వ ధ। ర్మువులు దొలంగు దేవముని ముఖ్యులు...వృష్టిలే। దవు మఱి యర్థువుల్ దఱుఁగు (ఆది. ౮ ఆ. ౨౫౦ ప.) సర్వధర్మువులనుటచే సిద్ధసమాసమందును నిక్కార్యమగునని యెఱుంగునది. సీ...ఆ. వె. అర్థులోలిఁబెరిఁగె...(సభా. ౧ ఆ. ౨౭౨) (అర్థువోలిఁబెరిఁగె - పాఠాంతరము.) సీ... । బ్రహ్మచర్యమును ధర్మములు కావు. (శాంతి. ౧ ఆ. ౧౫౬) చ.... ధ । ర్మువున శోకింతయుం దొలఁగద్రొక్కమి...(శాంతి. ౧ ఆ. ౧౫౬) 'ధమ్మువు' అను తద్భవము కాదని యతివలన నిర్ణీతమగుచున్నది. క....కా । వ్యున సంతతివడయు ధర్మువున ధర్మసతీ (ఆది. ౫ ఆ. ౭౮) క...వే । ల్పుల లోపులఁ బెద్ద ధర్మువు నసత్యమునన్ (ఆది. ౫ ఆ. ౯౨ ప.) క. నముచి...అధ । ర్మమున వధియించె రిపువ । తుము...(సభా. ౨ ఆ. ౧౮౩) క.... ధ । ర్మమయే నెప్పుడు పరాక్రమప్రతుఁడనిలన్ (సభా. ౧ ఆ. ౧౯౬) శరణు మున్నగువానికిఁ బ్రయోగములు. శరణు:—సీ. ప్రోచుచు శరణన్నఁగాచుచు...(ఆది. ౧ ఆ. ౭) నన్నయ 'శరణ+అన్నన్' అనుఁ దత్సమాకారసంధిని బ్రయోగింపఁడుగాన నిట 'శరణ' అని విఱిచి చరిత్రాదులలో శరణశబ్దముం జేర్తుమనరాదు. ఆ. వె. వారు శరణు శరణు వర మునీంద్ర (అను. ౫ ఆ. ౩౫౦) సీ...తే. గీ. శరణు వేఁడినఁ గావఁడే కరుణ నట్టి (అను. ౫ ఆ. ౩౭౭) రూపు—తే. గీ. చిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు । లయ్యె సర్వభూతములు...(ఉద్యో. ౮ ఆ. ౧౧౬) (ఈసిద్ధసమాసఘటిత ప్రయోగముచే నిచటి 'రూపు' అనునది సంస్కృతసమ మనకతీరదు. సీ. శివురూపుఁ బల్మఱుచిత్రించి (నన్ని. కు. ౩ ఆ. ౨౭౧) ద్విపద. ఏలయీ బహురూపు లేనేమినిన్ను (బసవ. ౮ ఆ. ౫౧౫) ఇదియు సిద్ధసమాసఘటితమె. "బీభత్సు. సం. విణ - చెడిపోయినది - అసహ్యకరమైనది" (శ. ర) "పంచముని యింటఁ జరుగు భీభత్సుపెఱిగి (శివరాత్రి.

గాణ. తత్స. ౧౫౨ సూ. టీక.) ఇందలి 'భీభత్సు' అనునోటి పదానివర్తచతుష్టము సంస్కృతప్రమాదకృతము. 'బీభత్సు' అనియే శ్రీనాథుని ప్రయోగమును నెన్న వలెను. శబ్దరత్నాకరమునఁ గవిసంశయవిచ్ఛేదమునం 'సాప్రు' అనునది వైకృతముగఁ జూపఁబడెను. (కవిసం. 3 తరంగ. ౫౯ ప.) క. గురుప్రతిసాపు...(అప్ప. రా. బాల. ౧౪౭) అని తిక్కకవి ప్రయోగించెను.

నన్నయ స్త్రీత్వబహుత్వే సురాదే రసమాసే (ఆం. చిం. అజం

భట్టీయము. ౧౬ కారి. ఆహో. ౩౧౨ పు.)

౧౬౪ విషయము. యోధాసురాది శబ్దానాం ! స్త్రీసమత్వే మవిష్యతే.

(విక్ర. అజం. ౪౦ కారి. ఆహో. ౩౧౩ పు.)

కల్పతరు. ౧౬౪ విష:—ఇట - 'స్త్రీత్వబహుత్వే' అను ఛందోభంగపాఠమే బాలసరస్వతీయా (పరిష్కర్త్రణము) నాంబలసంహితీయ గాణపతవివరణాదులందెల్లఁ జూపఁబడియున్నది. మఱియు గాణపతవివరణమున మేళగింపఁబడిన నన్నయాథర్వణ కారికల పట్టికలో "యోధాసురాది శబ్దానాం ! నూపం శూభయథాంభవేత్" అని యీయర్ధర్చము చూపఁబడినది. ఇట రెండుచరణములు భ్రష్టములై తడఁబాటుగ నీయర్ధర్చము పడియున్నది.

అసమాసే = సిద్ధసమాసేతరస్థలములందు, సురాదేః='సుర' అనునది పూర్వపదమైయున్న శబ్దమునకు, స్త్రీత్వబహుతే = స్త్రీసమత్వ నిత్య బహువచనత్వములు సంభవించును. "లఘ్వ్యకాక్షర పూర్వక్రియే" త్యాది క్రియాపరిచ్ఛేద సూత్రము నందును నిల్లై యసమస్తక్రియయనుటకు మాఱుగాఁ బూర్వక్రియయని భట్టారకుఁడు వ్యవహరించెను. ఇట్లనుటచేతనే వ్యర్థత సిద్ధించుచుండఁగా 'అసమాసే' అనుపృథగుక్తిచే 'అసమాసే' అనుదానికి సిద్ధసమాసేతరస్థలములందను విశేషార్థము లభించుచున్నది. (విస్తర.) కాన 'భూసురుఁడు' ఇత్యాది సిద్ధసమాసస్థలములలో మాత్రమె స్త్రీత్వబహుత్వములు లేవనియు, 'ఎల్లసురలు' ఇత్యాదిసాధ్యసమాసస్థల

---

విస్తర. ౧౬౪ విష:—ఆంధ్రభాషాచరిత్రకారులు పయిరీతిని ఛందోభంగరహితపాఠమును జూపకయు నపార్థపాఠముచూపియు, బయిరీతిని 'సురాదేః' అనుదానికి వ్యాఖ్యచేయకయు, పాపము! నన్నయ నెంతెంతో యీక్రిందిరీతిని నిరసించిరి. ఆర్యాగీతి వేఱొకపద్యమని తెలిసికొనక చింతామణిలోని వెల్ల నార్యాగీతులనియే పలుమాఱు వచించుచుందురు. "చింతామణికర్త నేరక యార్యాగీతులలో సూత్రరచన నారంభించినాఁడు....గణముకుదురక 'సుర' శబ్దమును నాదిశబ్దముతోఁ గలిపి సమాసముచేసినాఁడు. కాని 'ఆది' శబ్దమువలన గ్రహింపఁదగిన సురశబ్ద

ములలో స్త్రీత్వబహుత్వములు నిత్యముగానే చెల్లుననియు గ్రహింపవలెను. స్త్రీత్వాతిదేశముచే సుత్వాదుజ్జులు రానేరవు. బహుత్వవిధానముచే 'సుర' అని కాని 'సురుఁడు' అనికాని యేకవచన వ్యస్తరూపము సిద్ధింపనేరదు. సురశబ్దమునకుఁ దప్ప మఱిదేనికిని నిట్టి స్త్రీత్వబహుత్వములువచ్చుట యెచ్చటను లేమింజేసి యిచట 'సురాదేః' అనుదానికి సురాదిగణమున కనెడియర్థము గ్రంథకృదభిప్రేతము కాదని యెన్నవలెను. అహోబలపతియుఁ దదనుయాయులును సురాదిగణమునకని వ్యాఖ్య చేసి యీక్రిందిరీతిని జిక్కువడిరి. "సురాదేర్మహతః...ప్రపూర్వసూత్రాత్ క్వచి దిత్యనువర్త్య.....స్త్రీత్వబహుత్వయోః క్వచిదేకత్రనివేశః - క్వచిత్ స్త్రీత్వస్య పార్థక్యేన స్థితి రున్నేయా. తేన యోధశుణ్ఠేత్యాద్యాః స్త్రీసమాస్సిద్ధాః. ఏవం వ్యాఖ్యానఏవసురాదే ర్గణత్వం సిధ్యతి. ఆదిశబ్దస్య సార్థక్యంచభవతి. శాస్త్రస్య అల్పవిషయతా దోషో నిరాకృతో భవతీతి కృతబుద్ధయో విదాంకుర్వన్తు. యోధా సురాదిశబ్దానాం। స్త్రీసమత్వ మపీష్యతే....ఇత్యథర్వణః." (అహో. 3౧3 పు.) ఇట్లు వ్యాఖ్యచేసినను సరిపడలేదు. యోధాదులకు నిత్యబహుత్వము లేకుండుటయే కాక స్త్రీత్వమును బాక్షికమైయున్నది. సురశబ్ద స్త్రీత్వబహుత్వములు నిత్యములు. మఱియు నథర్వణకారికలు ప్రత్యేకగ్రంథమని కొన్నియెడల భ్రాంతుఁడై యిట్ల హోబలపతి వ్రాయునేకాని చింతామణి శేషగ్రంథమగు నథర్వణగ్రంథమున జింతామణి సూత్రసిద్ధవిషయమగు యోధాదిస్త్రీత్వము పృథగుక్తమగునా ? పయి యహోబలపత్యుక్తవిషయములె గాణపతవివరణమున వ్రాయఁబడెను. "కొన్ని లక్ష్యంబులలో స్త్రీత్వబహుత్వంబులుభయమును, గొన్నిలక్ష్యంబులలో స్త్రీత్వ మొక్కటియు నగుననిగ్రహింపవలయును. అట్లుకానిచో సురాదులని గణనిర్దేశము వ్యర్థము. ఉదా:—యోధ - శుంఠ" (నారా. గాణ. అజం. ౪౭ ప. ౨౦౮ కారి.)

పయిరీతిని జింతామణి సురశబ్దరూపములను మాత్రమె సాధించియుండుటచేఁ గొఱవడిన వాని నథర్వణుఁడు వివరించుచున్నాఁడు:—యోధాసురాదిశబ్దానామ్=

---

మును బోలుపదములు లేవు. 'స్త్రీత్వబహుత్వే' అని సూత్రమునందుండవలెను. కాని యిట్లున్నచో గణభంగముఁగలుగును. 'స్త్రీత్వబహుత్వసమాసే' అని గణ ములకొఱకు వ్రాసిన నర్థమేయుండదు." (ఆం. భా. చ. ౧౫3౫ పుట. ౫౬ వివృతి.) 'స్థితస్యగతిశ్చింతనీయా' అను వ్యాఖ్యాతృ మహాశయులపద్ధతి నవలంబింపక 'యెచ్చ టనేని యేదేని ఛిద్రముదొరకునా ? దూషింతమా ?' అను నాశయముతో నన్వే షించుట ధర్మమా? చింతామణికర్తగణము కుదుర్చుకొనలేనంతటి యలంతికవియనుట యర్హమా ?

యోధ - అసురమున్నగు శబ్దములకు, స్త్రీసమత్వాభావము = స్త్రీత్వముచేతను, ఇష్యతే = సమ్మతమగుచున్నది. యోధాదుల కేకత్వమునందును బహుత్వమునందును స్త్రీసమత్వము పాక్షికముగానగునని యర్థము. అసురశబ్దము ప్రత్యేకముగ యోధాదులలోఁ జేర్పఁబడుటంజేసి షిద్ధసమాసగత సురశబ్దమైనను దానికిఁ బాక్షిక స్త్రీసమత్వముకల్గుట నిర్బాధము. 'అసమాసే' అనునది మీఁద లేకుండుటంజేసి సిద్ధసమాసమందును యోధాదులకు స్త్రీత్వము వైకల్పికముగఁ గల్గును. ఇక్క 'అసుర' శబ్దము నకుమాత్రము సిద్ధసమాసగతిలో స్త్రీత్వముగల్గదు. అదియు సురశబ్దసంబంధియే కాన 'అసమాసే' అను నిషేధముతగులునని యూహించునది. ఉదా:—యోధ - యోధుఁడు, కేవలయోధ - కేవలయోధుఁడు, అసుర - అసురుఁడు, రావణాసురుఁడు. 'రావణాసుర' అనరాదు. ఎల్లయసురలు - ఎల్లయసురలు, దూత - దూతుఁడు, ఉత్తమదూత - ఉత్తమదూతుఁడు. మొ.

అహోబలపతి దూతశబ్దము నిట్లు యోధాదులలోఁజేర్పక కుశాదులలోఁ జేర్చెను. "కుశాదేర్మ వర్ణకస్య లుక్స్యాత్ - హంస - కుశ - దక్ష - దూత - దూతశబ్దస్య జనశబ్దవ దమహద్వివక్షాయా మత్రస్థితిరన్యేషా - నిత్యపత్యత్ర నిషధేశ నీవు మా, కమరంగదూతవై యభిమతంబు, ఇత్యాద్యాచార్య ప్రయోగః. చరిత - చరిత్ర...కుశాదేస్సో రితివక్తవ్యే మోఘ్నగితి కిథనేన లుకోఽనిత్యత్వం జ్ఞాయతే - తేన హంస - హంసములు" (అహో. ౭౧౮ పు.) స్త్రీపురుష జనసమూహ వాచియగు జనశబ్దమునకువలె మహద్వాచియగు దూతశబ్దమునకు నమహద్వివక్ష యెట్లు పొసఁగును ? కుశాదుల మువర్ణకలోపమున కనిత్యత నంగీకరించుచున్నాఁడు గదా; 'నిషధేశుఁడు దూతము' అనుట కంగీకరించునా ? మఱియు నమహత్తునందు మహద్వ్యవహారముచే మహద్వివక్షయుక్తముగాని మహత్తునందు దూతత్వము నడపువానియందు "అమహద్వివక్ష" యెట్లు ఘటిల్లును ? ఇట్లే యోధాదులందును నమహద్వివక్షచే 'కుశాది' ములోపముచేసి 'యోధ' మున్నగు రూపములనేల సాధింపలేదో తెలియకున్నది. (౧౨౬ II విష.)

స్వర్గివాచిదేవ సురశబ్దంబు లేకత్వబహుత్వంబులం
బ్రయోగింపఁబడు. ౫౯.
దేవుఁడు - సకలసురులు. స్వర్గివాచియనుటచే భూదే
వులు - భూసురుఁడను ప్రయోగంబు లబాధితంబు
లయ్యె.

బాలవ్యాకరణ వివరణము. ౧౬౮ I విషయము. సురశబ్దంబు నిత్యముగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు; సంస్కృతసమాసంబులఁగావు. ఉం. సురలు, అసుర - అసురుఁడు. నిఖిలసురలు. రావణాసురుఁడు. ఎల్లసురలు - ఎల్లయసురలు.

మాతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగానగు. ఉ౧. దూత - దూతుఁడు, యోధ - యోధుఁడు, శుంఠ - శుంఠుఁడు; బహుళగ్రహణంబుచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు - సింగంబు దూతయగు జంబుకంబు.

సంజీవని. ౧౬౮ I విషయము:—౫౯ సూత్రపు వివరణమున 'సకలసురలు' అని బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందునైతము ప్రమాదముగఁ బడియున్నది. తర్వాతి ముద్రణములలో 'సకలసురులు' అని సరిగ సవరింపఁబడెను. కాని గుప్తార్థప్రకాశికయందును (చూ. ద్వి. ము. ౧౨౫ పు.) బా. సా. వే. ముద్రణమందును (౧౬౯ పుట.) నట్టి సవరణము లేకుండుట వింత! స్వర్గి = దేవత "దేవః - పుం. వసురుద్రాదౌ - సురే - అమరే... మేఘే - రాజ్ఞి..." (శబ్దా. చిం.) "సుర - పుం... దేవే - సూర్యే - పణ్డితేచ" (శబ్దస్తో) సురశబ్దమునకుఁ బండితార్థమునఁ గావ్యములందుఁ బ్రయోగము కానరాదు. "ఉ...రాచవారలుం! దేవులు నిందు నీవు చనుదెంచు టెఱుంగరు...(భోజ. ౫ ఆ. 33 ప.) ఈపద్యమున దేవులనఁగాఁ బ్రభువులని యర్థము. స్వర్గివాచి కాదుగాన బహువచనము నిర్బాధము" (నా రా. గాణ. తత్స. ౯౭ సూ.) దీనినిబట్టి "దేవశబ్దమున కింకొకయర్థము మృగ్యము" అని పేటికాకర్త వ్రాయుట సరికాదు. (బా. సా. వే. ౧౭౦ పు.) స్వర్గు లనునర్థమున దేవులు - దేవులన్ మున్నగురీతిని వాడరాదనియు స్వర్గియనునర్థమున 'సుర - సురసు - సురచేన్' మున్నగురీతిని వాడరాదనియు సూత్రార్థముగావున, శ్రీకృష్ణ బలదేవులనియుఁ బరశురామ శ్రీరామదేవులనియుఁ బ్రయోగింపవచ్చునని తేలుచున్నది. శ్రీరామాదులు స్వర్గులు కారుగదా. 'ఏకాదశమహాదేవులు' అనరాదు. ఏకాదశరుద్రులు స్వర్గులు. దేవశబ్దవిషయమును నిర్ణయించుటకుఁదగిన ప్రబల ప్రయోగములు లభింపలేదు. ప్రామాణిక వైయాకరణులెవ్వరును దద్విషయమును జెప్పలేదు. అట్లయనను సూరివాక్యమును మూలముగాఁజేసికొని తర్వాతివారెల్ల వద్దానినెత్తి వ్రాసికొనసాగిరి. "దేవుఁడు - సం - వి - అ - పుం. ౧ ప్రకాశించువాఁడు, దేవత - వేల్పు. (ఈయర్థమున బహువచనములేదు..." (సూ. రాని.)

రక్షుఁడను ద్రూతచేత (అర. 3 ఆ. ౮3.) క. చనదుజననాథులకు దూతునిఁ జంపిన నరకమగుట ప్రువమనిరార్యుల్ (శాంతి. ౨ ఆ. 3౭౮.) (సర్వ్వల. ౧ ఆ. ౨౮) ఈ తిక్కన ప్రయోగమున స్త్రీత్వాభావము యతిస్థానఖచితము. (విస్తర)

సంజీవని. ౧౬౪ II విష:—బా. తత్స. ౬౧ సూత్రపు వివరణమున సూరి "బహుళగ్రహణంబుచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబు దూతయగు జంబుకంబు" అని వ్రాసెను. ఇట్టి వ్రాఁతకు మూలము కవిజనమండన వ్యాఖ్య. "దూతశబ్దంబున కమహత్త్వంబున స్త్రీత్వంబు నిత్యంబు. సింగంబుదూత యగు జంబుకంబు ఇత్యాదులు" (వికృ అజం. ౪౦ కారి. టీక. ౭౫-౭౬ పుటలు.) ఇట్లనేకస్థలములలో సూరి కవిజనమండన విషయముల స్వీకరించుచువచ్చెను. సూరి గ్రంథమును దర్వాతివారు గతానుగతికముగా స్వీకరించుచువచ్చిరి. "అమహ ద్విశేషణము లగునపుడు స్త్రీసమత్వము నిత్యము. సింగంబు దూతయగు జంబు కంబు" (ఆం. భా. అ. శబ్ద. ౨౨ సూ.) "అమహదర్థమున స్త్రీత్వము నిత్యము. సింగంబు దూతయగు జంబుకంబు" (గాణ. తత్స. ౪౮ ప. టీక. ౨౦౯ కారి) ఇట్లెల్లరును దీనినిగ్రహించుట వింతగనున్నది. అమహత్త్వమున దూతశబ్దమునకు స్త్రీత్వము నిత్యమని ప్రాచీన ప్రామాణికు లెవ్వరును వచింపలేదు. "సింగంబు దూతుఁడగు జంబుకంబు" అనువాక్యము సాధువనుటలో బాధయేమో తెలియ కున్నది. దూత్యము తిర్యగ్జడ కర్తృకము కాఁజాలమింజేసి జంబుకమునందు మహ ద్వివక్షచే దూతశబ్దమును దద్విశేషణమును మహత్తులుకానోపును. అవి పుంలింగ ములె కాన స్త్రీత్వాభావపక్షమున దూతుఁడను ప్రయోగము నిర్బాధమగును. గీ...తక్షకతనయుఁ డశ్వ। సేనుఁడను భుజంగముము...(ఆది. ౮ ఆ. ౨౭3 ప.) అను భట్టారకప్రయోగము చొప్పున దూతుఁడగు జంబుకమనుటలో బాధ

---

విస్తర. ౧౬౪ I విష:—"ముద్దరాజు రామన్న కవిసంజీవనియందు 'దూత' యనియే కాని దూతుఁడని లేదనెను గాని రెండునుగలవని తిమ్మకవీంద్రుఁడు వచిం చెను." (బా. గు. ప్ర. తత్స. ౬౧ సూ. వ్యా.) అని గుప్తార్థప్రకాశికాకర్త వ్రాసెను గాని ముద్దరాజురామన 'దూతుఁడు' లేదని చెప్పలేదు. 'దూత' అను రూపముగలదనిమాత్రము వచించెను. "క. దూతపదము స్త్రీలింగము। రీతిఁ బ్రవ ర్తిల్లు సకలకృతులఁ బరఁగుటన్। దూతయగుచుఁ బాండుతనూఁ। జాతులకు హితం బొనర్చె శౌరియనంగన్. ఆరణ్యపర్వమందు—సీ...అమరంగదూతవై..." (కవి జనసంజీవని. ౨ తరం. 3౯ పద్య. 3౭ పుట.) లక్షణముచూపి కవిప్రయోగము లను బ్రదర్శించుపని కీతఁడె మార్గదర్శియనఁదగును.

ఏమున్నది? సీ...గీ. అరిబుడను మాతహాయి (ఆది. ౩ ఆ. ౧౪౬.) అను నన్నయప్రయోగముచొప్పున 'మాతయగు జంబుకుడు' అనియు నుండవచ్చును. ఉదప్ప్రలాంబోతుల్. (హరి. పూ. ౬ ఆ. ౧౪౨.) సీ...మ మూరు లయ్యాత్మభువులు మహితబుతువు। లు...(ఆది. ౧ ఆ. ౧౧౫) (సూ. ౧౨౬ II, III, వివ.) 'మాతుడగు జంబుకుడు' అనియు నుండనగును. క. పొలిసె మొగము లేక వాయసుడు వెగడొందెన్ (కర్ణ. ౨ ఆ. ౩౪.)

భూదివోస్తు తౌ యత్తత్ (ఆం. చిం. అజం. ౧౬
నన్నసూ. కారి. అహో. ౩౨౩ పు.)
౧౬ వివ. పృథ్వీపరస్తు భూ స్సాన్తో నాత్మభ్వాది రిహేష్యతే.
(వికృ. అజం. ౭౬ కారి. అహో ౩౨౩ పు.)

కల్పతరు. ౧౬౪ వివ:—భూదివోస్తు = భూ - దివ్ శబ్దములకన్నచో, తౌ = సంస్కృతసప్తమ్యేకవచనమున, యత్ = ఏరూపముండునో, తత్ = ఆరూపము వంటిది తెలుగున బ్రాతిపదికమగునని యర్థము. ఇహ = ఈరీతిగ బ్రాతిపదిక మేర్పడు సందర్భమున, భూశబ్దమన్నచో, పృథ్వీపరః = పృథివీవాచకమైనదే యగును. సాన్తః = సిద్ధసమాసముతుదిని భూశబ్దమునిల్చు, ఆత్మభ్వాదిః = ఆత్మభ్వాదికమును, నేష్యతే = ఇచ్ఛగింపబడదు. 'ఆత్మభ్వాదిః' అనుటచే బృథ్వీవాచి భూశబ్దము సిద్ధ సమాసోత్తర పదమగునపుడు "భువి" అను నాకారము కల్గవచ్చునని తోచు చున్నది. కాని యట్టి ప్రయోగములు లభింపలేదు. "ఆత్మనో మనసో దేహాద్వా భవతీ త్యాత్మభూః" అనురీతి వ్యుత్పత్తిగల బ్రహ్మాదివాచకమగు నాత్మభూశబ్దము మున్నగువానికి 'ఆత్మభువి' అనురీతిని బ్రాతిపదికము కల్గనేరదని యెఱుంగునది. సంస్కృతమున బృథ్వీవాచి భూశబ్ద సప్తమ్యేకవచనము 'భువి' అగును. అట్లే 'దివ్' శబ్దసప్తమ్యేకవచనరూపము 'దివి' అగును. ఇట్టిరూపములె తెలుగున బ్రాతి పదికములగుచున్నవి. ఇవి స్త్రీలింగములుగాన వీనికి బ్రథమైకవచనలోపము కల్గును. ఇకారాంతత్వముచేత సయితము వీనికి బ్రథమైకవచనలోపము రావచ్చును. కాన వీని ప్రథమైకవచనరూపములు 'భువి - దివి' అని యేర్పడును. 'ఉద్వ్రహ్వత్వే' అను చింతామణిచొప్పున బహువచన పరకత్వమున సుత్త్వమురాగా "భువులు - దివులు" మున్నగురూపము లేర్పడును. ఈనియమముచే "భూవు" మున్నగు రూపములు కల్గనేరవని యెఱుంగనగును. 'స్వాయంభువు' మున్నగుచోట్ల బ్రత్యేకభూశబ్దము కాదు కావున స్వాయంభ్వాదిశబ్దముల దీర్ఘమునకు హ్రస్వమురాగా వువర్ణకము వచ్చి ఆత్మభువు - స్వాయంభువు - మనోభువు మున్నగురూపములు సిద్ధించును.

యూవస్త్రాఖ్యాదిశబ్దానామిత్యాది చెప్పున (౧౫౮ విష.) 'ప్రాప్తభూకుండు' మున్నగురూపములును గల్గును.

బాలవ్యా. పృథ్వీవాచి భూశబ్దంబునకు భువియగు. ౬౨.

౧౬౫ I విష. భువి - భువులు - భువిని. - భువులను.

సంజీవని. ౧౬౫. I విష:—దివ్ శబ్దము హలంతపరిచ్ఛేదమున వివరింపఁబడును. (బా. తత్స. ౭౮ సూ) పృథ్వీవాచిత్వమున మాత్రమే 'భువి' అను ప్రాతిపదికరూపము కల్గుననుటచే నాత్మభ్వాదిశబ్దముల కెట్లును నీవిధి తగులనేరదని తలఁచి సూరి యీవిషయము నుజ్జగించెను. ప్రయోగములు:—ఆ. వె...పారాశర్యు। వీర్యమునన భువినవార్యబలుఁడు (ఆది. ౮ ఆ. ౨౬౦.) కం. భువి పశులు గలుగుకాఁపుల। నవనీశుఁడు (శాంతి. ౨ ఆ. ౩౭౭) చ. దివి భువినంతరిక్షమున... (అను. ౭ ఆ. ౩౮౭ ప.)

స్తోఽవావౌ రైనావోః స్త్రీవద్ గ్లౌః. (ఆం. చిం. అజం. ౧౬ కారి. అహో. ౩౨౨ పు.)

స్యాద్వక్రతమయుగ్మస్య । వక్రవర్ణో ద్వితీయకః ।
నన్నయా ఐకారాన్తం స్వరూపేణ । ముతే భవతి ధార్వహే.
ధర్వణీయము. (విక్ర. అజం. ౮౫-౮౬ కా. అహో. ౩౨౩ పు.)
౧౬౬ విషయము. త్రిలిఙ్గ్యామపి రైనావోః । సమాసే ప్రత్యయాన్తతా ।
దోర్నావోః క్వచిదిష్టఃస్యాత్ । క్లీబత్వే హ్రస్వసంగ్రహః. (విక్ర. అజం. ౮౮-౮౫ కారి. అహో. ౩౨౨ పుట.)

కల్పతరు. ౧౬౬ విష:—(స్తః+ఓ+అవ = స్తోఽవావౌ -). రైనావోః = రై నౌశబ్దములకు వరుసగా, అవావౌ = ఓకారమును 'ఆవ' అనునదియుఁ దుదిని, స్తః = అగుచున్నవి. అట్లగుటచే నవి ప్రాతిపదికములగునని యర్థము. గ్లౌః = గ్లౌశబ్దము, స్త్రీవత్ = స్త్రీలింగమువంటిదగును. (రై = ధనము - నౌ = ఓడ. గ్లౌ = చంద్రుఁడు) గ్లౌశబ్దము మహత్పుంలింగమగుటచే డుజ్జు ప్రాప్తించుచుండఁగా దాని నివారించుటకయి స్త్రీత్వమతిదేశింపఁబడెను. 'రై+ఓ = రో+సు' అనియుండఁగా రైశబ్దము స్త్రీలింగమునుగలదు గాన (చూ. ౧౪౯ I విష.) 'అనుతాం స్త్రియామిత్యాదిచే సులోపమురాఁగా 'రో' అను ప్రథమైకవచనరూపము సిద్ధించును. 'నౌ+ఆవ = నావ+సు' అనియుండఁగా "స్త్రియాం నౌస్తరణి స్తరిః" (అమ. వారి. ౧౦) అనుచెప్పున నౌశబ్దము స్త్రీలింగమగుటచే స్త్రీలింగ ప్రథమైకవచనలోపము

సంజీవని. ౧౬౬ I విష:— ౬౩ సూత్రము వ్యాఖ్య:— 'నౌ' అను శబ్దమునకు 'నావ' అనునది ప్రాతిపదికముగ నిల్చునని, నిపాతముగా నుపదేశించెను. నౌశబ్దము స్త్రీలింగమే కాన బా. తత్స. ౫౭ సూత్రము చెప్పునఁ బ్రథమైకవచన లోపము కల్గును. పిదప రమ మున్నగువానికివలెనె విభక్తిరూపములను సాధించునది. ఉదా:—నావ - నావలు - నావను - నావలను - మొ. సిద్ధసమాసగతముగు నప్పుడును నిల్లియుండునని తెల్పుటకయి మహానావయని యుదాహరించెను. 'నావి' అను నికారాంతముగలదని కొందఱందురని సూరి వ్రాసెనే కాని యయ్యది యేకోశమునందును గానరాదు. 'నావి' అను నాచ్ఛికశబ్దము సస్యరోగ విశేషార్థకము కోశములలోఁగలదు. 'ఓడగల' అను నర్థముగల 'నావిన్' అను సంస్కృతశబ్దము కన్పట్టుచున్నది "నావీ - త్రి - నౌమతి - నౌరస్త్యస్య. వ్రీహ్యాదిత్వాదినిః." (శబ్దా. చిం.) సూ. రా. నిఘంటువులో నావశబ్దము తద్భవముగానైతము చూపఁబడినది. "నావ...ఓడ. కలము. సీ. ఓడ నావయనంగ నొప్పుచుండుఁ దరణి... (ఆం. భా. ౧-౧౫౭)" "నావ - సం. వి - ఔ - స్త్రీ - తరణి - ఓడ." (సూ. రా. ని.) "నావ్యావః. (౧-౨-౧౦౫) ఐచ ఏఅత్యత ఐచ ఇత్యనువర్తతే. అత్ర ఏచః ఆవ ఇత్యాదే శోభవతి - టాప్, ణావేత్యాది, జాయావత్." (షడ్భా. ౭౭ పుట.) "నావ్యావః. (౧-౨-౧౦౮) నౌశబ్దే ఏచ ఆవ ఇత్యాదేశోభవతి - నావా" (త్రివిక్రమ ప్రాకృతశబ్దానుశాసనము) అనుచెప్పున 'ణావా, నావా' అనెడి ప్రాకృత శబ్దమునుండి "నావ" అను ప్రాకృతసమశబ్దమేర్పడనగును. అట్లగుటం జేసియు నచ్చాంధ్రకోశమగు నాంధ్రభాషార్ణవమున నుదాహరింపఁబడుటం జేసియు సూ. రా. నిఘంటుకారు లాచ్ఛికముగను దీని నుదాహరించుట తప్పనఁజాలముగాని నన్నపార్యుఁడు సంస్కృతసమముగ సాధించిన 'నావ' అనునది యుండఁగా రూపమందుఁగాని యర్థమందుఁగాని విశేషమేమియు లేనిదే యట్టిరూపమునకే వైకృతత్వ మంగీకరించుట సంప్రదాయవిరుద్ధముగానున్నది. నన్నయ సూత్రసమ్మతములగు 'మహానావ' మున్నగువానినిబట్టి తత్సమశబ్దము నంగీకరింపక తీరదుగదా.

౬౪ సూత్రపు వ్యాఖ్య:—రై శబ్దము స్త్రీలింగముగనైతము కోశములందుఁ జెప్పఁబడియున్నను (౧౪౫ I విష.) 'అర్థ రై విభవా అపి' అను నమరకోశము చెప్పున నది పుంలింగముగుటయె ప్రసిద్ధమైయున్నదని తలఁచి సూరి 'ఇగ్లౌరా' సూత్రమునఁ బ్రథమైకవచనలోపమునుఁ బ్రత్యేకముగా దీనికి విధించికొనెను. కావున నిట 'ఇగ్లౌ' సూత్రముచేత...మున్నగు వివరణమును జేయుచున్నాఁడు. ఇగ్లౌరా సూత్రముచేతనే (బా. తత్స. ౪౪ సూ.) గ్లౌ శబ్దమునకును గ్లో శబ్దమున

కును 'మన్నా' బోలనునుటుంజేసి యని మనుంతములు కానేరవు. కావుననే వానికి నిగాగమను రాజాలదు. 'నైచేత - నైచేతను' అను రీతినే వానిరూపము లుండ వలయును. కావున. "క. నోవ్రలుసెసుంగ నైనికు లక్కకతులు న నైవిన్మృతి..." (కావ్యాలం. ౯ ఉచ్ఛ్వా. ౭౭ ప.) అను పద్యములోని "నైకుల..." అనునది ప్రామాణికముగ నెంచవచ్చును. ప్రయోగములు:— శే. గీ. నాడ నీనాడు మదిభోగ నాటకాలు జలధికి నాడు భక్తిమజలధి నోడు! (అహో. ౭.౭౫ పు.) క. నై యున యుంచె ప్రమోదకరంబై మించన్ (అహో. ౭.౭౭ పు.) మ. ఘనశోభాఢి వియన్న గజలధి పైకన్ నాటనై నీడవోవన (అను. ౫ ఆ. ౧౮ ప.) ఉ. నాటెడు మస్తకంబుగోని నాటెడగొల్లక (కేయూర. ౩ ఆ. ౧౫౭) (సూ. రా. ౮). ఇందు ప్రత్యయాంతమౌనా నీప్రయోగమున నావశ్యపు వైకృతత్వము స్వీకృతమగుచని సూ. రా. నిఘంటు కారుల యాశయము కావోపును. కాని తత్సమంబులనైన తెలుగు ప్రత్యయములు నిల్చుట కౌచిత్యముగ లేకపోలేదు. "కపిబంటిసెత్తుకు కాలునన్ (గానూ. ౫ ఆ. ప్రౌఢ. తద్ధి. ౧౨ సూ.) క॥ ననుయంతి పోయిగా జూ నను చితోనాడఁగలిగెదను ధరణీ రా! జన్మము నీవు నాకుయ్యోయిడు మనుసంగ జూదంబు నీకు నభిమతమేనిన్ (ఆర. ౫ ఆ. ౨౨౫) క... లంజెలోఁ గొనిమగలన్ ; దోయిడఁవలఁచిన (విజ్ఞా. వ్యవ. ౬. ౧) ఉ. కోవెల నీగి వేణ్ణోటి నోయుఁదగన్ వెలయాలిసాంపముల్ (నన్ని. కు. ౮ ఆ. ౧౫౮) 'నావ - నై - నై - నై' శబ్దములకు భారతప్రయోగములు లభింప లేదు.

బాలవ్యా. ఐకారం చితుల్యంబు. ౬౯.

౧౬౭ విషయము. రైని - రైకి. కైని - కైకి. పైని - పైకి.

సంజీవని. ౧౬౭ విష:—'రై+ను' మున్నగుచోటులందు బా. తత్స. ౭౬ సూత్రముచే నిత్వము రానేరదుగాన దానిని సాధించుటకు సూరి దీనిని సూత్రించెను. ఐకార మీకారమువంటిదనుటచే బా. తత్స. ౭౬ సూత్రముచొప్పున ఐకారముమీఁది కు - ను - వు క్రియావిభక్తుల "ఉ" కారమునైత మికారమగును గాన రై+ను = రైని - రై+కు = రైకి - మొదలగురూపములు సిద్ధించుచున్నవి. "కయి (చేయి) = కై పయి = పై (ఉపరిభాగము)" (బా. క్రియా. ౧౦౩ సూ.) అనువానిలోని కై - పై శబ్దములునైతము 'ఐ' కారాంతములుగాన నీకారాంత తుల్యములగుచు 'కైని - కైకి - పైని - పైకి' అను సాధురూపముల నొదవింపఁ గల్గినవి. (ఆధునికులు పెక్కురు వాడెడి "పైనన్" అనునది యపశబ్దము) నీవు కైని =

నీవ్ర కవివి. "కయి = కై. వి. (సం. కవిః) కవి." (సూ. రా. ని).నీవె నాకు రై వి. (రై = ధనము - నీవే నాకు ధనమవు) ఐ+ను = ఐవి = అయివి. మొ.

"ఐకారం బితుల్యంబగు" అని సూత్రింపరాదాయని శంకింపఁజనదు. అట్లు సూత్రించినచో 'ఐ' కారాంత మిదంత తుల్యమగుంగాన బహువచన పరకత్వమున బా. తత్స. ౧౫౯ సూత్రముచొప్పున నై కారమునకు 'ఉ' త్త్వమువచ్చి "రై+లు= రులు" అని యనిష్టరూపము కల్గవలసివచ్చును. (విస్తర) 'రై లు = ధనములు' అనియే యుండవలయును - లేదా 'రోలు' అనవలయును. రై శబ్దరూపాంతరమగు రో శబ్దస్థలమున బా. తత్స. ౨ ౬సూ. చొప్పున 'ఇ' త్వమురాదు. ఉదా:—రో+ను= రోను=(ధనమును) మొ.

వన్నయా. క్వచిచ్ఛబ్దభేదేషు। భవేత్పర్యస్త లిఙ్గతా. (విక్ర. ౧౬౭ విషయము. అజ. ౬౨ కారి. అహో. 3౮౭ పు.)

కల్పతరు. ౧౬౭ విష:—క్వచిత్ = కొన్నియెడల, శబ్దభేదేషు = శబ్ద విశేషములందు, పర్యస్త లిఙ్గతా = లింగవిపర్యాసము, భవేత్ = సంభవించును. (౧ VIII విష. ౧౭౨ విష. చూమనది.) క్వచిత్తనుటచేఁ గొన్నిట వికల్పము గాను గొన్నిట నిత్యముగాను బారిభాషికలింగము తత్సమప్రయోగములందే వ్యత్యస్తమగునని గ్రహింపవలయును. స్త్రీలింగములగు కంధరాదులకుఁ గ్లీబ త్వముపాక్షికముగనగును. కంధర - కంధరము, నాసిక - నాసికము, మాయ - మాయము. మొ. ముదాదులకుఁ గ్లీబత్వము నిత్యముగాఁగల్గును. ముదము - స్రజము. ఉపానహము. మొ. "విడియము. (పీటికా) క్వచిచ్ఛబ్దభేదేషు। భవేత్ప ర్యస్తలిఙ్గతేత్యథర్వణోక్తేః క్లీబత్వమ్. అత ఏవ - మీసలు-గడ్డము-జడలు-ఇత్యాది ప్రయోగాస్సాధవః. (అహో. 3౮౭) అని యిట్లహోబలపతి ప్రకృతి వికృతుల లింగవ్యత్యాసమును సాధించుట కీసూత్రము నుదాహరించెను. 'మీసలు మీస ములు' అను దేశ్యముల యుదాహృతి యప్రసక్తము. 'జడలు.' (జటా) అనుచో

---

విస్తరము. ౧౬౭ విష:—"ఇవి 'కయి పయి' అను రూపములతోడనున్నను వీని కితుల్యతయే యగుననియు దాన 'కయులు - పయులు' మున్నగు ననిష్టరూప ములు గలుగుననియు సంభావించునది" (బా.సా.వే.౧౭౫పు.)అను వేటికావాక్యము ప్రామాదికము. కయి పయిశబ్దముల 'ఇ' త్వమునకు ఈతుల్యత యెట్లుగల్గును? ఇకారాంత కయి పయిశబ్దముల బహువచనరూపములు 'కయులు - పయులు' అనియే బా. తత్స. ౧౫౯ సూత్రముచే సిద్ధించును. అవి యనిష్టరూపము లెట్లగును? అప్రయుక్తములనిన ననవచ్చునే కాని యసాధువులుకావు.

స్త్రీసమత్వమె కలదు. వికృతి వివేక టీకాకర్త యహోబలపతిమార్గమునె యనుసరించెను. ప్రకృతి వికృతుల వ్యుత్పత్త్యాసాధనలను సాధించుటకు, 'వర్ణలోపాగమానేకే'మున్నగు కారికలే చాలియుండును. మఱియు వైకృతములలోఁ బ్రకృతిగతను మ్యాదిస్థితి మాఱుట మిక్కిలి ప్రచురమగుటచే 'కుత్రచి' దిత్యాది ప్రకృతకారిక తద్విషయవివరణమునకు బుష్టము కానేరదు. మఱియు వైకృతత్వమునకు పాణిభాషికి లింగపద్ధతియే లేదు. దానికి స్త్రీలింగతావిద్యవహారము సంక్రమించినట్లును. కాన నీకారిక సంస్కృతశబ్దములు తత్సమములగుటలోని లింగద్వైవిధ్యమును గుఱించెంచుచున్నదనుటయె యుక్తము. తుది యహోబలపతియు నీకారికకు విధామాయాది శబ్దముల క్లీబసమత్వమునైతము లక్ష్యముగా సంగ్రహించెను. "ఏవంచ వికృతౌ విధామాయాదిశబ్దానాం క్లీబసమత్వేన ప్రయోగేన దోషాయేత్యవధేయమ్" (అహో. ౩౭౭ పు.) 'సీమా - దామా' అను స్త్రీలింగములకును బాతుక నపుంసకత్వమున - 'సీమ - సీమము - దామ - దామము' అను రూపములు కల్గును. (మా. ౧౬౯ విస.)

కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు.

బాలవ్యాకరణ ౬౬.

వివరణము కంధరము - కంధర - విధాశబ్దంబునకుఁ గ్లీబతుల్య

౧౬౭ I విషయము. త్వంబు నిత్యంబు. విధము.

కంధరా - నాసికా - భిక్షా - దంష్ట్రా - గ్రీవా పాదుకోల్కా ప్రభృతులు కంధరాదులు.

సంజీవని. ౧౬౭ I విప:—కంధర = మెడ, విధా = ప్రకారము, నాసికా = ముక్కు, భిక్షా = బిచ్చము, దంష్ట్రా = కోఱపల్లు, గ్రీవా = మెడ, పాదుకా = పావకోడు, ఉల్కా = అగ్నికణము, అగ్న్యుత్పాతము - కొఱకచ్చు.

కంధరాదిశబ్దములు స్త్రీలింగములగుటంజేసి వానికి మువర్ణకాంతరూపసిద్ధికయి నపుంసక తుల్యత్వము బహుళముగా విధింపఁబడినది. బా. తత్స. ౩౯ సూత్రము మున్నగువానిచొప్పున నపుంసకత్వమున మువర్ణకాదులురాఁగా 'కంధరము, కంధరములు, కంధరమ్ము - కంధరమ్ములు. కంధరంబు - కంధరంబులు - మొదలగు రూపంబులు సిద్ధించుచున్నవి. క్లీబత్వాభావపక్షమున బా. తత్స. ౪౭ సూత్రమునఁ బ్రథమైకవచనలోపమువచ్చి కంధర - కంధరలు మున్నగురూపములు సిద్ధించును. విధాశబ్దమునకు 'విధ' అను స్త్రీలింగ ప్రథమైకవచనరూపము లేమింజేసి యద్దానికిఁ గ్లీబసమత్వము నిత్యమని సూరి బహుళప్రయోజనముగ వివరించెను. "విధో విధానే

హ_స్త్యన్నే ప్రకారే వేతనే౽పిచ" అని పుంలింగమునందును అజయుఁడు" (ప్రౌఢ. శబ్ద. ౨౪ సూ.) అని ప్రౌఢవ్యాకర్త సూరిగ్రంథమును సవరింపఁగడంగెను. విధా శబ్దమేకాక విధశబ్దమును బుంలింగముగ సంస్కృతమునఁ గలదుగాన నట్టి పుంలింగ విధశబ్దమే తెల్గునఁ దత్సమమయ్యె నన్నచో విధాశబ్దమును గంధరాదులలోఁ జేర్ప నక్కఱలేదని తలంచెను. "విధ - సం - వి - ఆ - స్త్రీ - సమృద్ధి. ఆ-స్త్రీ - అ - పు- ము - ప్రకారము..." (శ. ర.) అని శబ్దరత్నాకరమునందును వ్రాయఁబడెను. కాని ప్రసిద్ధమగువిధాశబ్దము తెల్గునఁ దత్సమముగా వాడఁబడలేదనియు నప్రసిద్ధపుంలింగ శబ్దమే తత్సమముగా వాడఁబడెననియుఁ జెప్పుటకన్న నీసూరిమార్గమే లెస్సయని తోఁచెడిని. శబ్దరత్నాకరమున నాసికాదంష్ట్రాగ్రీవా పాదుకోల్కాశబ్దములకు మువర్ణకాంత రూపాంతరము చూపఁబడకుండుట వింత. దాని ననుసరించుటచేతఁ గావలయు నేఁటికిఁ బ్రచురింపఁబడిన సూ. రా. నిఘంటు సంపుటములందు నాసికా దంష్ట్రోల్కాశబ్దములకు మువర్ణకాంత రూపాంతరములు చూపఁబడలేదు. ప్రయోగములు:—ఉ....మహోల్కముల్ । మొత్తము గట్టిరాలె...(సర్వ. ౨ ఆ. ౯౭) ద్వి. మఱికదాకోయుట మగువనాసికము (బసవ. ౪ ఆ. ౫౪౦ ప) కం. పడఁతి నను నిలిపి భిక్షం । బిడక కడునవజ్ఞ...(ఆర. ౫ ఆ. ౧౩ ప.) ద్వి. ఆచెల్వనాసికంబప్పుడు కోయ (బసవ. ౪ ఆ. ౫౩౩) చ....హయకంధరముల్ పొడఁగాంచి యప్పుడే (వసు) 'దంష్ట్రాశబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి' (ప్రౌఢశబ్ద. ౨౪ సూ.) అని ప్రౌఢవ్యాకర్త వ్రాసెనేకాని యందులకుఁదగిన ప్రమాణమును జూప లేదు. చ. ఘనభుజుఁడున్నత ద్విరదకంధర సంస్థితుఁడై ముదంబునన్ (ఆర. ౬ ఆ. ౪౯౯) ఇట కంధరశబ్దము స్త్రీలింగముగాఁ బ్రయోగింపఁబడలేదనుకొని యట్టి తప్పును వారించుటకుఁ గావలయు "ద్విరదకంఠతటస్థితుఁడై" అను పాఠాంతరము ముద్రణసంస్కర్తచేఁ జూపఁబడెను. కాని "ద్విరదకంధరన్ = ఏనుఁగుమెడపైని" అని వ్యస్తముగా స్త్రీలింగరూపమే వాడఁబడెనని యెన్నునది. 'సీమా - దామా' అను నాకారాంత స్త్రీలింగములను గంధరాదులలోఁ జేర్పనగును. క....। ఇవ్వ ననిధి సీమమున...(ఆర. ౭ ఆ. ౧౭ ప.) (చూ. ౧౬౯ విష.)

ద్విత్ర్యాదిసంఖ్యాశబ్దానా । ముల్పానాం నాత్ర సం
నన్నయా స్థితిః । సప్రత్యయత్వే మహితా । స్తే చైకోఽనవన్మతః.
థర్వణీయము. (వికృ. అజం. ౨౦ కా. అహో. ౨౭౮.)

౧౬౮ II విషయము. నబ్రూదన్తశ్చలన్తశ్చా । ప్యేదన్తశ్చాత్ర విద్యతే.
(వికృ. అజం. ౩౨ కారి. అహో ౩౦౬ పుట.)

గష్మ - శక్మ - సే ప్రభృతులును దెలుఁగునఁ బ్రయోజ్యములని వ్రాయుట సాహసము. అట్టివి యప్రయుక్తములనుట యుక్తము. గో - రో - గ్లో శబ్దముల స్థితిచే నోదన్తశబ్దములు నిషేధింపఁబడకున్నను ద్యోశబ్ద తత్సమరూపమునైత నప్రయుక్తమేయని యెఱుంగునది.

బాలవ్యా. బాలవ్యాకరణమున నీవిషయములు వివరింపఁబడ
౧౬౮ III విష. లేదు.

సంజీవని. ౧౬౮ III విష:—సూరి తలుచుగా ననుసరించుచున్న కవిజనమండన టీకలో బ్రూవన్త్రాదులు ప్రయోజ్యములెయని వ్రాయఁబడుటచేతను, "భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబులేదు" (బా. తత్స. ౨౭) అను తనసూత్రముచే ద్విత్రాదీత్యాది ప్రకృతకారికలును గతార్థములు కాఁగలవను తలంపునను గావలయుఁ బై కారికల నీయజంత ప్రకరణమున సంగ్రహింపఁడయ్యెను. కాని యట్టి భవచ్ఛత్రాది సూత్రము వివరణమునందైన నీవిషయములను బేర్కొనుటగాని యీయజంతశబ్దముల నుదాహరించుటగాని సూరి కావింపలేదు. ఆసూత్రపు వివరణమున భవదాదిహలంతశబ్దములకును శత్రురేఫాంతాదులకును దెలుఁగునఁ దత్సమముగా వ్యవహారము లేదనిమాత్రము వివరింపఁబడెను.

---

## ఇంక హలంతప్రకరణము

ప్రథమైకవచనతుల్యం, సర్వత్ర హలన్తమగుణవత్త్వాది
భృతి (ఆం. చిం. హలం ౧ కారి. అహో. ౩౧౦
పుట.)

సర్వహలా ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్ః దీర్ఘత్వాత్తు వి
ద్విత్వోత్వము. కల్పో బహుళత్వమ్ అగుణవతాం సర్వహలాం,
౧౬౯ విశేషము. సోర్లోపః ॥ (ఆం. చిం. హలం. ౭ కారి. అహో. ౩౧౧
పుట.)

క్వచిన్నామగ్రహాణైవ । ప్రయోగోఽత్ర హితో
భవేత్. (వికృ. హలం. ౪ కారి. అహో. ౩౧౮ పు.)

కల్పతరువు. ౧౬౯ విష:—అగుణవత్త్వాదిభృతి=గుణవర్ణవ్యతిరిక్తమగు న గుణవర్ణగతమైన, హలన్తమ్ = హల్లుతుదినిగలశబ్దము, సర్వత్ర = అంతటను, ప్రథమైకవచనతుల్యమ్ = సంస్కృత ప్రథమైకవచనాంతరూపమువంటి రూపముగల ప్రాతిపదికముగలదియగును. సంస్కృతవిభక్త్యంతమగు పదముపైఁ దెనుఁగు విభక్తులు నిల్పుననుట సంప్రదాయవిరుద్ధమగుటంజేసి సంస్కృతప్రథమైకవచనతుల్య రూపము తెల్గునఁ బ్రాతిపదికమగునని భట్టారకుఁడు వచించెను. (౧౧౦ I విష.)

హ్రస్వాత్ = హ్రస్వమునకుఁ దర్వాతనున్న, సర్వహలామ్ = అగుణవర్ణము లోని ప్రాతిపదికముల తుదినున్న హల్లులకెల్ల = ద్విత్వోత్వే = ద్విత్వమును దాని పైనుత్వమును నిల్చును. దీర్ఘతస్తు = దీర్ఘమునకుఁ దర్వాతనున్నయట్టి హల్లుల కన్ననో, బహుళమ్ = బహుళముగా, ద్విత్వమ్ = ద్విత్వముకల్గును. ఉత్వము నిత్య ముగానేయగును. అగుణవతామ్ = అగుణవర్ణములోని ప్రాతిపదికముల తుది నున్న, సర్వహలామ్ = ఎల్లహల్లులకునుఁ బయినున్న, సోః = 'సు' అనెడి ప్రథమైక వచన ప్రత్యయమునకు, లోపః = లోపముకల్గును. (ఈకారిక. ౧౪౬ విషయమున వ్యాఖ్యాతమయ్యెను. చూ. ౧౮౩ విష.). ఇట్లు 'హల్లులకుఁ దర్వాతనున్న' అనుట చేత "సుధన్వా - కర్మ" మున్నగు తుదిని హల్లులేని ప్రథమైకవచన తుల్యములగు నగుణవర్ణగత ప్రాతిపదికముల తర్వాతనున్న ప్రథమైకవచనము లోపింపదని గ్రహింపవలయును. ఉదా:—దిక్కు (సం. ప్ర. దిక్. దిశౌ. దిశః) సమ్రాట్టు

(సం. ప్ర. సమ్రాట్. సమ్రాజౌ. సమ్రాజః) విరాట్టు (సం. ప్ర. విరాట్. విరాజౌ విరాజః. మొ ) 'దిక్' మున్నగు నగుణవర్ణగత ప్రాతిపదికముల తుదినున్న కకారాది హల్లులకు ద్విత్వోత్వ సులోపములు రాఁగా "దిక్+సు = దిక్+క్+ఉ+సు" అను ప్రక్రియచొప్పున 'దిక్కు' మున్నగు రూపము లేర్పడును. 'సమ్రాట్' మున్నగు దీర్ఘపూర్వకస్థలములందు హల్లునకు ద్విత్వము వికల్పముకాఁగా "సమ్రాట్టు - సమ్రాటు - విరాట్టు - విరాటు - వాక్కు - వాకు" మున్నగు రూపద్వయము సిద్ధించును. సంస్కృతవ్యాకరణముచొప్పున. "దిక్ = దిగ్, సమ్రాట్ = సమ్రాడ్, విరాట్ = విరాడ్, వాక్ = వాగ్" అనురీతిని రూపాంతరములును గలవుగాని వానిలో వర్గప్రథమములకే యనఁగా చర్త్వరూపములకే ద్విత్వోత్వ సులోపములుగల్గుట తెల్గున సంప్రదాయసిద్ధమయి యున్నదిగాన "దిగ్ - దిగ్గు - సమ్రాడ్ - సమ్రాడ్డు" అనురీతిని వర్గతృతీయాక్షరములకు ద్విత్వోత్వములు - రానేరవని యెఱుంగునది. ఉత్వముగల్గినరూపములకుఁ బైరీతి సులోపమును విధించుటచేత 'ఉ' కారాంతముల 'సు' ప్రత్యయమున కాదేశముగా 'సర్వత్రోదోతో ర్వా ర్భవతి' అనుచొప్పున రావలసిన వువర్ణకము వీనికి రానేరదు. ఇంక "సుధన్వా - సుధన్వానౌ - సుధన్వానః" అనురీతిని సంస్కృత ప్రథమావిభక్తిరూపములుగల యగుణ వర్ణగత శబ్దముల ప్రథమైకవచన తుల్యప్రాతికపదిము 'సుధన్వా' అనురీతినుండును. ఇట్టివానితుదిని హల్లులేమింజేసి వీనికి ద్విత్వోత్వ సులోపములతోఁ బ్రసక్తిలేదు. కాన 'దీర్ఘాణాం హ్రస్వఃస్యాత్' అనుచొప్పున వీని దీర్ఘమునకు హ్రస్వముచేసి రామ శబ్దమునకువలెనె యుత్వడుజ్ఞులుచేయఁగా "సుధన్వుఁడు" మున్నగురీతిని రూపము లేర్పడును. 'కరీ - కరిణౌ - కరిణః' అనురీతిని సంస్కృత ప్రథమావిభక్తిగల శబ్దముల ప్రథమైకవచన తుల్యప్రాతిపదికము 'కరీ' అను రీతినుండును. అట్టి ప్రాతిపదికము దీర్ఘమునకు హ్రస్వముచేసి 'సోర్లుగితః' అను చొప్పున సులోపముచేయఁగా 'కరి' అనురీతిని రూపమేర్పడును. "కర్మ - కర్మణీ - కర్మాణి" అనురీతిని బ్రథమావిభక్తియుండెడి 'కర్మన్' అను శబ్దము నిత్యనపుంసకము. దీనికిఁ బుంలింగరూపము లేదు. కాన దీనికి నపుంసక ప్రథమైక వచనతుల్యమెయగు 'కర్మ' అనురూపమె ప్రాతిపదికమగును. దీనికి "స్యా దమహతాం విభక్తౌ సోశ్చము" అనుచొప్పున మువర్ణకమురాఁగా 'కర్మము' అను రూపము సిద్ధించును. ఇట్టి వాని స్త్రీలింగరూపము 'కరిణీ' అను రీతినుండును. ఇట్టివి గౌరీ నదీ ప్రభృత్యజంతశబ్దములవలెనె రూపసిద్ధి నందును. ( ఉదా:—కరిణి - కరిణులు - మొ. సీమా - సుధర్మా - దామా మున్నగునవి "డాబుభ్యామన్యతరస్యామ్. (౪-౧-౧౩) (సి. కౌ. ౪౬౧ సూ. స్త్రీ. ప్ర.)

అను పాణినిసూత్రమునందున్నట్లు డాప్పను స్త్రీప్రత్యయముతోఁ గూడియు నకారాంతములుగానుండియు స్త్రీలింగములగుచును. నపుంసకములగుచు వాని ప్రథమైకవచనరూపములు 'సీమా-సుధర్మా-దామా' అనియేయుండును. కొన్నిమతములకు హ్రస్వము వచ్చి స్త్రీలింగ ప్రథమైకవచనలోపము కలుగఁగా 'సీమ-సుధర్మ-దామ' అను ప్రథమైకవచనరూపములు తెలుఁగునేర్పడును. అందు 'సీమ-దామ' అనువానికి గంధదాదులకువలెఁ (౧౬౫ విష.) దాన్తకలింగవ్యత్యయముగ నుప్రత్యయమచ్చుటచేత "సీమము - దామము" అను రూపము లేర్పడును. క. కని ముని రత్నాకర మి / స్వానిధి సీమముఁగల్గు ననుమతిలోకన్. (ఆర. ౩ ఆ. ౧౩). "దామన్ - స్త్రీ-న. (హో. మనిక్.) దోహానకాలేకనాబన్ధనరజ్జు, రజ్జుమాత్రే, మాలాయాంచ. స్త్రీత్వే వా డాప్ - దామా - దామే" (శబ్దస్తో) అను కోశముచేఁ గల్గిన దామశబ్దము నపుంసకముగను గలదుగాన దానిని గంధదాదులలోఁ జెప్పకున్నను 'దామము' అను రూపము లభించును. ఇట్టిస్థితిలో శబ్దరత్నాకరమున 'సీమము' అను మువర్ణాంతరూపమే చూపఁబడకుండుటయు, "నపుంసి దామేతి నామలింగానుశాసనము నుపేక్షించి యది పుంలింగముగా వ్రాయఁబడుటయు వానికి స్త్రీత్వముఁగల్గు 'దామ' అను రూపము చూపఁబడకుండుటయు దేవసభార్థక సుధర్మాశబ్దమునకులేని పుంస్త్వము "సుధర్మ. సం. వి-ఆ-స్త్రీ-న్-పుం - దేవసభ" (శ - ర) అను రీతిని వ్రాయఁబడుటయుఁ గేవలము ప్రమాదములు.

కల్పతరువు. ౧౬౯ I విష:—గుణవదాదులుకానిశబ్దము లగుణవద్గణగతము లను చింతామణి వచనములనుబట్టి కళాప్రభృతి ప్రకృతికములు, మహదమహత్తులు మున్నగువానికివలెనె వీనికిఁ బ్రత్యేకస్థితియె యంగీకార్యమనియు నొక్కశబ్దమునకు రెండిటిలోనుస్థితి భట్టారకసమ్మతముకాదనియు విశదమగుచున్నది. "ఏకశబ్దము నకే ద్వివిధకార్యములుండుట విరుద్ధముకాదు. పాణినీయశాస్త్రమం దొకధాతువునకే గణాంతరపాఠముచే రూపభేదములు గలుగుటగలదు" (బాలసరస్వతీయము. అన్యేషాంచేత్యాది సూత్రవ్యాఖ్య. వావిళ్ళ వారి ముద్రణము) అనునీవాక్యములు గ్రాహ్యములుకావు. ఇవి పరిషన్ముద్రిత పుస్తకమునలేవు. ఇవి ప్రక్షిప్తములేమో? ఇవి యహోబలపండితీయమున సంగ్రహింపఁబడలేదు. "కళాశబ్దముకానిది ప్రభృతి ప్రకృతికము. మహత్తుకానిది యమహత్తు. గుణవదాదికము కానిది యగుణవద్గణము." అనురీతి నియమము పాణినీయమునందలి ధాతుగణముల లేదుగదా. 'ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు' అను గణద్వయరూపములు భట్టారకుఁడే ప్రయోగించెనేయని శంకింపఁజనదు. అట్టి ప్రయోగముల యనురోధమున సకా

కాంతవిషయముమాత్రము ప్రత్యేకరీతిగలదని ముందు వివరింపఁబడును. (౧౭౫ విష.) ఇది తప్ప నన్నయభారతభాగమున నెచ్చటను నొక్క-శబ్దమునకు గణద్వయ రూపద్వయ ప్రయోగములేదు. కాని తిక్కయజ్వ సత్యజిచ్ఛబ్దమును మాత్రము రూపద్వయతోఁ బ్రయోగించెను. ఆ. వె. సత్యజిత్తుమేన సాయకదశకంబు। (ద్రోణ. ౧ ఆ. ౨౮౮) క: కినిసి వెసన్ సత్యజితుని। ధనువు నఱికి...(ద్రోణ. ౧ ఆ. ౨౮౫) నన్నయ దీనిని గుణవర్ణకార్యముతో మాత్రమె ప్రయోగించెను. క....శౌర్యా। పేతుఁడు సత్యజితుండను। నాతఁడు...(ఆది. ౬ అ. ౨౧ ప.) పై సందర్భమునుబట్టి గణద్వయరూపము లొక్క-శబ్దమున కంగీకార్యములు కావనియు, నెంచేని యట్టి గణద్వయరూపము లొక్క-శబ్దమునకు మహాకవి ప్రయుక్తములయ్యే నేని యట్టి ప్రయుక్తశబ్దములకు మాత్రము సాధుత్వము నిపాతన్యాయమున నంగీకరింపఁదగునని యు నిర్ణయింపనగును. ఈనిర్ణయమునకు విరుద్ధమగు "ఋత్విగాదులు ద్వితీయైకవచనాంత తుల్యంబులు విభాషనగు" (బా. తత్స. 23 సూ.) అను సూరి సూత్రము నిర్మూలమె యనఁదగును. సూరి యీసూత్రమున నుదాహరించిన "ఋత్విక్కు-నీవృత్తు" అను రూపములుసయితము కవిప్రయోగ దృష్టములుకావు.

కల్పతరువు. ౧౬౯ II విష:—క్వచిదిత్యాది:—క్వచిత్ = క్వాచిత్కముగ, నాపగ్రహేణైవ = సంస్కృత ప్రాతిపదికమును గ్రహించుటచేతమాత్రమె, ప్రయోగః = ప్రయోగము, అత్ర = ఈయగుణవర్ణ సందర్భమున, హితోభవేత్ = సమ్మతమగును. ప్రథమైకవచనతుల్యముగాఁగాని ద్వితీయైకవచనతుల్యముగాఁగాని ప్రాతిపదికమేర్పడక, సంస్కృత ప్రాతిపదికమె యజంతములందువలెఁ గొన్ని యలంతి హలంతశబ్దముల స్థలమందును దెలుఁగునఁ దత్సమరూపసిద్ధికై ప్రాతిపదికమగునని తాత్పర్యము. "అత్ర = ఈయగుణవర్ణ సందర్భమందు" అనుటచేత నిట్టి ప్రాతిపదికములకును నగుణవర్ణగత ప్రాతిపదికములకువలెనె దుది హల్లునకు ద్విత్వోత్వ సులోపములు నిత్యముగాఁగల్గునని యెఱుంగునది. ఏవకారస్వారస్యముచే నట్టివానికి మఱి ప్రథమైకవచన తుల్యప్రాతిపదిక గ్రహణముగాని ద్వితీయైకవచన తుల్యప్రాతిపదిక గ్రహణముగాని లేదని స్పష్టపడుచున్నది. "కిమ్ - అవ్య. (కై + డిము) ప్రశ్నే"(శబ్దస్తో.) అను నవ్యయశబ్దముగు'కిమ్'అను ప్రాతిపదికమును గ్రహించి ద్విత్వోత్వ సులోపములుచేయఁగా 'కిమ్ము' అను రూపమేర్పడును. ఉదా:—ఇందు బింబముం గిమ్మన నీదుమోము...(మనుచ. 3 ఆ. ౬ ప.). 'కిమ్' అను నవ్యయశబ్దమును గ్రహింపనేల? సర్వనామ కింశబ్ద నపుంసకలింగ ప్రథమైకవచన తుల్యప్రాతిపదికమును (కిమ్. కే. కాని. సం. ప్ర.) నేల గ్రహింపరాదని శంకింపఁజనదు. గుణ

ద్గుణమునఁగాని యగుణవద్గుణమునఁగాని నపుంసకలింగరూపములున్నను బుంలింగ ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికమును, బుంలింగ ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికమును మాత్రమె గ్రహించుట యీ సందర్భమున వైయాకరణ సంప్రదాయమై యున్నది. కాన, 'కః - కౌ - కే' (సం. ప్ర.) అను వానిలోఁ 'కః' అను దానిని గ్రహింపవలసివచ్చును. "గుణవాన్ - గుణవన్తౌ - గుణవన్తః (పుం. లిం. ప్రథ.) గుణవత్ - గుణవతీ - గుణవన్తి (న. పుం. ప్రథ.)" అను రూపములలోఁ బుంలింగ గుణవచ్ఛబ్ద ప్రథమైకవచన తుల్యరూపమె యనుపూర్వమునందిట ప్రాతిపదికముగ గ్రహింపఁబడుచున్నదిగదా. ఉదా:—గుణవంతము - గుణవంతుఁడు - ను. పై రీతినే 'కించిత్' అను సంస్కృతావ్యయ ప్రాతిపదికమునుండి 'కించిత్తు' అను తత్సమరూపమును గ్రహింపవలసియున్నది. "కించిత్తు - సం - అవ్య... కి... కించిత్తయిన మనోధన! వంచన మిచ్చోటలే దవశ్యంబనినన్ (భై. భా. ౩ ఆ. ౧౨౯ సూ. రా. ని) అతఁడు పృథక్కుగాఁ బలికె (అహో. ౩౬౩) అవ్యయములన్ని విభక్తివచనములందును నేకరూపముతోనే యుండునుగాన వాని విషయమునఁ బ్రథమైకవచన తుల్య ప్రాతిపదికము ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికము నున్నగు రీతిని గణించుటకే యవకాశముండదు. ఇట్లు గనేచేసి కాదనమున గణస్థాయి పదమునఁ గుదురుపడని శబ్దములపట్లనే యీ "క్వచిన్నామ గ్రహేత్తైవలాశ్యసి" కారికచెప్పిన హలంత సంస్కృత ప్రాతిపదికమును గ్రహించుట కర్తవ్యమని యెఱుంగునది. సంస్కృతమున 'అప్' అను ప్రాతిపదికమునకు నేకవచనరూపము లుండవు. సంస్కృత ప్రథమా బహువచనరూపము 'ఆపః' అని యుండును. అట్లగుటచేత నిటఁ బ్రథమైకవచన తుల్య ప్రాతిపదికమును గ్రహించుట కవకాశము లేకుండుటంజేసి 'అప్' అను సంస్కృత ప్రాతిపదికమునే తెలుగునను బ్రాతిపదికముగా గ్రహింపవలయును. ఉదా:—"అప్ + ప్ + ఉ + సు = అప్పు = " (జలము) అని యిట్లు ద్విత్వోత్వ సులోపముల నెన్నవలెను. అట్టిశబ్దము సంస్కృతమున 'ఆపః స్త్రీభూమ్ని వార్ వారి' [వారివ. 3 శ్లో.) అను నామలింగాను శాసనముచెప్పిన నిత్య బహువచనముగానఁ దత్సమత్వమందును నేకవచనరూపములు సాధువులు కావను తలంపున నహోబలపతి యిట్లు వ్రాసెను. "అప్పుపాలైన శుభ్రాబ్జంబు రుచియెంత. దనకూర్మి తేని నప్పునమియుంచె" నిత్యాదయః కవిప్రయోగా స్తు న సాధవః - అప్పులపాలైన యబ్జంబు రుచియెంత. అలకూర్మి తేని నప్పులనెముంచె ఇత్యాదిపాఠ స్తుసాధుః" (అహో. 3౬౫ పు.) కాని యిట్లు దిద్దుట సాహసము. సంస్కృతమున నిత్యబహువచనమైనను దత్సమత్వమున దాని కేకవచనప్రయోగ మాంధ్రమహాకవి సమ్మత

మఱియ్యనుట యుక్తమనితోఁచెడిని. సీ...తన కూర్మితేని నప్పున నెముంచె (వసు. ౧ ఆ. ౩౬) ఈప్రయోగమునం దేకవచనము ప్రాసయతిస్థాన ఖచితమైయున్నది. సీ...అప్పుపాలైన శుభ్రాబ్జంబు రుచియెంత (నరస. ౧ ఆ. ౬౭ ప.)

కల్పతరు. ౧౬౫ III విష:—అహోబలపండితుఁడు 'పథిన్ - మథిన్ - ఋభుక్షిన్' అను సంస్కృత ప్రాతిపదికములనె తెల్గునఁ బ్రాతిపదికములనుగా గ్రహించి యీక్రిందిరీతిని "పథము-మథము - ఋభుక్షుఁడు" అను రూపములను సాధించెను. "అన్యేషాంచ వాలుగన్తస్య. (ఆం. చి. హలం.) వ్యాఖ్య:— వ్యవస్థిత విభాషయానకారస్య లోపే చకారా దికారస్య అకారాదేశే కృతే పథము - మథము - ఋభుక్షుఁడు ('మంథము' అను ముద్రణము పొరపాటు - 'మ-థము' అనునదే సాధువయినను నిచటి యహోబలపతి ప్రక్రియలో నట్టిరూపము కల్గ నేరదు.) ఇతిరూపాణి. నాయథాశక్తిఁజేసి యన్వయపథము ఇత్యాచార్యవచనేన సమాసాన్తోఽప్రత్యయః." (అహో. ౩౮౭ పు.) ఈశబ్దముల ప్రథమాద్వితీయైక వచన రూపములవంటి ప్రాతిపదికములతో నిష్టరూపసిద్ధి కల్గకుండుటంజేసి యహో బలపతి యివియు "క్వచిన్నామగ్రహేణైవే"త్యాద్యధర్వణకారికకు లక్ష్యములను జేయఁగడంగెను. "పథి మథ్యృభుక్షామాత్ (౭-౧-౮౫) ఏషామాకారోఽన్తా దేశఃస్యాత్ సౌపరే - పన్థాః - మన్థాః - ఋభుక్షాః...వ్యాఖ్య పథిన్ - మథిన్ - ఋభుక్షిన్ ఏతేనకారాన్తాః......మన్థదణ్డవాచీ మథిన్శబ్దః" - (బాలమ. సి. కౌ. ౩౬౫ సూ.) ఇట్టి పాణినీయ సూత్రములచొప్పున. "పన్థాః - పన్థానౌ - పన్థానః - (సం. ప్ర.) పన్థానమ్ - పన్థానౌ - పథః. (సం. ద్వి.) మన్థాః - మన్థానౌ - మన్థానః. (సం. ప్ర); మన్థానమ్ - మన్థానౌ - మథః (సం. ద్వి.) ఋభుక్షాః - ఋభుక్షాణౌ - ఋభుక్షాణః. (సం. ప్ర.) ఋభుక్షాణమ్ - ఋభుక్షాణౌ - ఋభుక్షః. (సం. ద్వి.)" అను రూపములు ప్రథమా ద్వితీయావిభక్తులందు సంస్కృతమున నేర్పడును. ఇట్లగుటచేతనే యహోబలపతి 'క్వచిన్నామ గ్రహేణైవేత్యాది కారికకు వీనిని లక్ష్యములుగాఁ జేయయత్నించెను. కాని 'పథము' మున్నగువాని రూపసిద్ధికయి 'పథిన్ - మథిన్ - ఋభుక్షిన్' అను ప్రాతిపదికములను గ్రహించుట సరికాదని తోఁచెడిని. అట్లు గ్రహించి వానితుది నకారమునకు 'అన్యేషాంచవాలుగన్తస్య' అను చింతామణి సూత్రముచే లోపముచేసినను వానితుది 'ఇకారమునకు' 'అత్వము' 'అన్యేషాంచే' తిసూత్రములోని చకారముచేఁ గల్గుననుట కేవలము నసంగతమై యున్నది. మఱియు నీప్రక్రియలో సిద్ధించు 'మథము' అనునది యనిష్టరూపమె కదా. 'మన్థము' అని కదా ప్రసిద్ధరూపము. మఱియుఁబాక్షికమగు నంత్యలోపము

రానపుడు వీనిరూపము లెట్లుండునని తలంచెనో? కన్నగుటచేత నీ'పథము' మున్నగు శబ్దములను 'పథిన్' మున్నగు శబ్దములనుండి సాధించుట సరికాదు. ఇవి తెలుఁగునఁ దత్సమములుగాఁ ప్రయోజ్యములు కావనియె చెప్పనగును. తే. కి. ...తనకెంత నడునకయున్నఁ బథము తప్పకుండుట నడపడియెఱుఁగ్గలేదు. (ఉద్యో. ౨ ఆ. ౧౫) మున్నగుకేతిని ప్రసిద్ధములైయున్న 'పథము - మస్థము - ఋభుక్షుఁడు' అను రూపముల నీక్రింది సంస్కృత శబ్దములనుండి సాధించుకొనుట యుక్తమైయుండును. “పథః - పుం - మార్గే - (పథతి, పథేగతౌ, పచాద్యచ్) పాటః పథశ్చమార్గశ్చేతి సుభూతిచన్ద్రౌ పురుషోత్తమా. పథఃపంథ ఇతి ద్విరూపేషు విశ్వశ్చ.” “మస్థః - పుం - మన్థానదణ్డే” “ఋభుక్షః - పుం - వజ్రే - స్వర్గే...ఇన్ద్రే” (శబ్దార్థచింతామణి కోశము) పథిన్ మున్నగువాని సామ్యమునకపియో? సఖిశబ్దమునకును 'సమాసాంత టచ్ ప్రత్యయవిధిని దలంచియో? 'సఖా' అను సంస్కృత ప్రథమైకవచనమును జూచి భ్రమించియో శబ్దరత్నాకరకర్త 'సఖి' అను సంస్కృతశబ్దము నకారాంతమని ప్రామాదికముగా వ్రాసెను. “సఖి - సం - వి - ఈ - స్త్రీ - చెలికత్తె - న్ - పుం. స్నేహితుఁడు” (శ. ర.) స్నేహితుఁడను పుంలింగ సఖిశబ్ద మికారాంతము. ఏకోశము నందును నిది నకాంతముగాఁ జూపఁబడలేదు. “అథమిత్రం సఖాసుహృత్. (గురు బాల ప్రబోధిక) సమానః ఖ్యాతః - సఖా - ఇ - పుం...” (నామలిం. క్షత్ర. ౧౨ శ్లో.). దీనికిఁ దత్సమరూపము తెల్గున 'సఖి' అని హ్రకిశబ్దమువలెనె నిల్చును. ఇది యిట్లుండఁగాఁ దెల్గున 'అ'కారాంత సఖిశబ్దము వేఱొకటి కవిప్రయోగములందు 'సఖుఁడు' అను రూపముతోఁ గన్పట్టుచున్నది. ఇది సంస్కృతకోశములలో శబ్ద స్తోమమహానిధి - శబ్దార్థచింతామణి కోశములలోఁ జూపఁబడలేదు. సర్వశబ్ద సంబోధినియందుఁ జూపఁబడినది. “సఖః - అ - పు - మిత్రః” “సఖః - త్రి - సహాయః.” “సఖా - ఇ - పు - మిత్రః” (సర్వశబ్దసం). అకారాంత సఖిశబ్దము సంస్కృత వ్యాకరణములచేత సాధింపఁదగియున్నది. “హానజనాద్ గమాదేర్డః. (వృత్తి.)హానో జనః ఆదన్తాత్ గమాదేశ్చడఃస్యాత్. ఘు. (కర్తరీత్యర్థః) ద్విపఃప్రహ్వః”(ముగ్ధబో. వ్యా. తృనాది ౯౯౭ సూ.) దీనిచే 'సమానంఖ్యాతీతిసఖః' అనుచొప్పున వ్యుత్పత్తి నెన్నవలెను. ఆదంతమగు ఖ్యాధాతువుపై డప్రత్యయము కర్త్రర్థమున వచ్చుటచే అకారాంతసఖశబ్దమేర్పడును. “అన్యేష్వపి దృశ్యతే. (౩-౨-౧౦౧) అపిశబ్దః సర్వో పాధివ్యభిచారార్థః-తేన ధాత్వన్తరాదపి - కారకాన్తరేష్వపిక్వచిత్ (డప్రత్యయః స్యాదిత్యర్థః)” (సి. కౌ. ౩౦౧౧ సూ. పూర్వకృత్) అను కౌముదీ గ్రంథము నైతము పైవోపదేవసూత్రమునకు సంవాదమగుచున్నది. సఖిశబ్దమునకును సఖ

శబ్దమునకును మహాకవి ప్రయోగములు కన్పట్టుచున్నవి. చ. పలుకుఁదనంబునం బలుకఁబాడియె నీ సఖినంచు...(ఆది. ౫ ఆ. ౨౦౩) (ద్రుపదుఁడు ద్రోణునితోఁ బల్కినవాక్యము) చ...సమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా (ఆర. ౪ ఆ. ౧౩౮ నన్నయప్రయోగము) క. విను మద్గోవిందుఁడు సఖుఁ। డును బంధుఁడుఁ గార్యకర్తయుడునై నిన్నున్ (శాంతి. ౩ ఆ. ౪౮ ప.) 'సఖియును' అని దిద్దరాదు. 'సఖుఁడును' అనునది యతిస్థానస్థగితము. అహోబలపండితుఁడు 'ఆత్మా - గరిమా' మున్నగు ప్రథమైకవచనములకుఁ దుల్యరూపములను బ్రాతిపదికములనుగా గ్రహింపక "పక్షే అన్త్యహల్లోపే ఆత్మము మహత్త్వేడుజ్ - ఆత్ముఁడు...గరిమము - ఇత్యాది" (అహో. ౩౮౨ పు.) అని ప్రక్రియనుజూపెను. (చూ. ౧౭౫-౧౭౭ విష. కల్పతరువు) గుణవద్గణగతము కానిదెల్ల నగుణవద్గణములోనిదె కావలసియుండుటం జేసి యట్టి ప్రథమైకవచనతుల్య ప్రాతిపదికగ్రహణముచే రూపసిద్ధి కుదురుపడని క్వాచిత్కస్థలములుమాత్రమె "క్వచిన్నామగ్రహేణైవేత్యాది సూత్రమునకు లక్ష్యములుగావున 'ఆత్మా' మున్నగు ప్రథమైకవచన తుల్యరూపములను బ్రాతిపదికములను గ్రహించి 'ఆత్ముఁడు - ఆత్మము' మున్నగు రూపములను సాధించుట యుక్తముగాని యిట్లీమార్గమున రూపసిద్ధి కుదురుపడెడిస్థలము లందీమార్గమును వీడి క్వచిన్నామగ్రహణేవేత్యాది సూత్రముచొప్పున సంస్కృత ప్రాతిపదికములగు 'ఆత్మన్' మున్నగువానిని గ్రహించి 'అన్యేషాంచ వాలుగన్తస్య' అనుచొప్పున నంత్యహల్లోపముచేసి రూపసాధనముచేయుట యుక్తముకాదు. మఱియు నీపక్షమున 'ఆత్మన్+సు' ఇత్యాదిస్థలములందు "వాలుగన్తస్య" అనుచొప్పున నంత్యహల్లోపాభావపక్షమున ననిష్టరూపోత్పత్తి సంభవించుటయు నట్టి యనిష్టరూపములను వారించుటకు 'వాలుగన్తస్య' అనుచోటి వాశబ్దమునకు వ్యవస్థావాచిత్వమును గల్పించుకొనుటయు మున్నగు చిక్కులు సంభవింపకతీరదు.

అహోబలపతి 'ప్రశాన్ - భగవాన్ - హనుమాన్' మున్నగు ప్రథమైకవచన తుల్యప్రాతిపదికములకు "ప్రశానుఁడు - ప్రథమైకవచన తుల్యత్వమ్ - దీర్ఘాత్ పరత్వాన్న ద్విత్వమ్." (అహో. ౩౮౨ పు.) "హనుమానుఁడు - భగవానుఁడు ఇతిరూపంత్వ గుణవద్గణత్వేన బోధ్యమ్." (అహో. ౩౮౫ పు.) అని యిట్లు ప్రక్రియనుజూపెను. ఇట్టియెడల "అగుణవతాం సర్వహలాం సోర్లోపః" అను చొప్పున నుత్వమువచ్చిన పైని సులోపమురావలసియుండఁగా 'డుజ్' ప్రత్యయమెట్లు వచ్చెనని తలంచెనో తెలియకున్నది. "క్వచిదన్యదేవ - ఇత్యద్విత్వే 'సదసులోని విప్రజనముఖ్యాద' (ఆది. ౨ ఆ. ౧౩౧) ('సదములోని' అనివావిళ్ళ ముద్రణము) నిత్యా

చార్యేణ ప్రయుక్తమ్. తేన "ఏడు వేఁటకాని యితనికే పవన సుతోద్వాహసంగసుఖ ము(పవన+సుతోద్వాహ సంగసుఖము-రామాయణార్థము. - పవనసుతో+ద్వాహసంగ సుఖము - భారతార్థము) ఇత్యాదయః కవీనాం ప్రయోగాస్సాధవః, ఇతిబోధ్యమ్." (అహో. ౯౯౦) అని యిట్లు ద్విత్వాంతు ప్రక్రియతో బహుళశబ్దము సూత్రములోని బహుళశబ్దమునకుఁ బ్రయోజనముగఁ జూపిన యీతఁడు ప్రకాశుఁడు మున్నగువాని నైతము ద్విత్వముపాక్షికముగా నైన రాకుండుటయు తప్పు మట్లుటయు నట్టి బహుళ విధిమూలముననె సంభవించెననినైన నేల ప్రాయఁడయ్యెనో తెలియకున్నది. 'ప్రకా సుఁడు-భగవానుఁడు హనుమానుఁడు' మున్నగురూపములు చింతామణిసమ్మతములు కానేరవు. హనుమంతుఁడు మున్నగునవి ద్వితైకవచన తుల్యప్రాతిపదికములనుండి సిద్ధించుచుండఁగా నట్టివానికిఁ బ్రథమైకవచనతుల్య ప్రాతిపదికముల నంగీకరించి 'హను మానుఁడు' మున్నగురూపములను సాధించుట యుక్తముకాదుగదా. మఱియుఁ బ్రయోగదృష్టములుకాని యీహనుమానుఁడు మున్నగురూపముల సాధనమున కయి 'హనుమాన్' మున్నగు ప్రథమైకవచన తుల్యప్రాతిపదికముల నంగీకరించు నపుడు 'హనుమంతుఁడు' మున్నగు గుణవర్జనరూపములను సాధించుట యుక్తము కాదనుట కంగీకరించియే కాఁబోలు నహోబలపతి 'హనుమంతుఁడు' మున్నగునవి ప్రాకృతసమములనఁగా నాచ్ఛికములని చెప్పుటయుఁ గేవల మపమార్గమే యనుటకు సందియము లేదు. "హనుమానుఁడు, భగవానుఁడు ఇతి రూపం త్వగుణవర్జనత్వేన బోధ్యమ్. హనుమంతుఁడు ఇతిరూపం ప్రాకృతసమమపి...విశేషణస్య గుణవర్జ నత్వే మంత్రవంతముగఁ గ్రమంబున నేవురు' ఇత్యాద్యాచార్యవచనం మానమ్" (అహో. 3౮౫ పు.) (విస్తర. ౧౭౧ I విష.) గుణవ్యాయప్రవృత్తి యొక్కశబ్దము నకు సమ్మతింపఁజాలకయేకదా హనుమంతుఁడు మున్నగు మత్వంత విశేష్యశబ్దము లను బ్రాకృతసమములనుజేసి సాధింప యత్నించెను. నన్నయప్రయోగానురోధ మున విశేషణమగుటంజేసి మంత్రవచ్ఛబ్దము గుణవర్జనముగా నంగీకరించుటలో క్షతిలేదని చర్చించెను.

హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యంబిందు నామం బగు. ౬౭.

వివరణము. రుక్ - రాట్ - మరుత్ - వీరుత్ కర్మ - వర్మ; శ్వశబ్దంబు

౧౭౦ విషయము. దప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచన తుల్యం

బాలవ్యాకరణ బులే యగునని యెఱుంగునది.

ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు. ౬౮.

ఉగాగమాంతంబుల కిగ్లా సూత్రముచే ప్రథమైక
వచనలోపంబగు. రుక్కు - రాట్టు-మరుత్తు - వీరుత్తు.
ఉగాగమంబు లేమింజేసి యిచట నామంబుల కస్త్రీలిం
గంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు. కర్మము -
వర్మము - చర్మము - సుధన్వుఁడు-సుత్రాముఁడు.
దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా
నగు. ఉదా.

వాక్కు - వాకు - స్వారాట్టు - స్వారాటు.

సంజీవని. ౧౭౦ విషః—అర్థములు:—రుక్కు = కాంతి, రాట్టు = రాజు, మరుత్తు = గాలి-దేవత, వీరుత్తు=లత, వర్మ = కవచము, (శ్వన్-శ్వానము = కుక్క) సుధన్వుఁడు = ఒకరాజు, సుత్రాముఁడు = ఇంద్రుఁడు, స్వారాట్టు = సూర్యుఁడు. పరమేశ్వరుఁడు - "స్వరాట్ - పుం - స్వతో భాసమానే సవితరి. ఇన్ద్రియా నపే క్షస్వతఃసిద్ధజ్ఞానే పరమేశ్వరే..." (శబ్దా. చిం.) "స్వరాజ్. పు. (స్వేనైవరాజతే. రాజక్విప్) ఈశ్వరే...వైదికచ్ఛన్దోభేదేచ" (శబ్దస్తో) "స్వారాజ్. పు. (స్వర్గేరాజతే రాజ. క్విప్.) ఇన్ద్రే." (శబ్దస్తో) "స్వారాట్టు. సం. వి. జ్. పుం. ౧ బ్రహ్మము. ౨ ఇంద్రుఁడు. (రూ. స్వారాటు)" (శ. ర.) ఇంద్రుఁడను నర్థము వ్రాయుటవింత.

| | | | |
|---|---|---|---|
| "రుచ్ - స్త్రీ. | సం - ప్రాతి. | రుక్ - రుగ్, రుచౌ, రుచః, | సం - ప్రథమావిభక్తి. |
| రాజ్ - పుం. | ,, | రాట్ - రాడ్, రాజౌ, రాజః, | ,, |
| మరుత్ - పుం. | ,, | మరుత్, మరుతౌ, మరుతః, | ,, |
| వీరుధ్ - స్త్రీ. | ,, | వీరుత్, వీరుద్, వీరుధౌ, వీరుధః, | ,, |
| కర్మన్ - న. | ,, | కర్మ, కర్మణీ, కర్మాణి, | ,, |
| వర్మన్ - న. | ,, | వర్మ, వర్మణీ, వర్మాణి, | ,, |
| సుధన్వన్ - పు. | ,, | సుధన్వా, సుధన్వానౌ, సుధన్వానః | ,, |
| సుత్రామన్ - పు. | ,, | సుత్రామా, సుత్రామాణౌ, సుత్రామాణః" | |

ఇట్టి శబ్దముల ప్రథమైకవచన తుల్యప్రాతిపదికముల తుదినున్న హల్లునకు ద్విత్వమును, 'ఉ' గాగమంబు నగును. అట్టియెడల బా. తత్స. ౭౮ సూత్రము చొప్పునఁ బ్రథమైకవచనమగు 'వు' వర్ణకము ప్రాప్తించుచుండఁగా "ఇగ్లా" సూత్రముచే (బా. తత్స. ౭౭ సూ.) నద్దానికి లోపంబుగలిగి, "రాట్టు - రుక్కు" మున్నగు రూపములు సిద్ధించును. ఉగాగమము కిత్తుగానఁ బ్రాతిపదికముల కంతాగమ మగును. 'రుక్ - రుగ్' అనురీతిని సంస్కృతమునఁ బ్రథమైకవచన రూపములు

రెండువిధముల నున్నను సంపు 'చ క్త్వ' రూపములై యనఁగా క-చ-ట-త-పాంత రూపములై తెల్గునఁ బ్రాతిపదికములగును. 'పచ్' మున్నగు స్త్రీలింగములకు బా. తత్స. ౫౩ సూత్రముచేఁ బ్రథమైకవచన లోపమెట్లును సిద్ధించుచున్నను 'రాట్' మున్నగు నస్త్రీలింగముల ప్రథమైకవచనలోపమునకై యీ సూత్రములోని "ఉగాగమ" గ్రహణము సార్థకమగుచున్నది. ప్రథమైకవచన తుల్యప్రాతిపదికములలో 'ఉ' గాగమాంతములమీఁది ప్రథమైకవచనమునకు మాత్రమె లోపమును సూత్రించుటచేత 'సుధన్వుఁడు - కర్మము' మున్నగు 'డు - మ్వాంత రూపములు నిర్బాధములగుచున్నవి. 'సుధన్వా' మున్నగు ప్రాతిపదికముల తుదియున్న దీర్ఘమునకు హ్రస్వముగాఁగా రామశబ్దమునకువలెనె "ఉత్వ - డుజ్ఞులు" వచ్చి సుధన్వుఁ డు మున్నగురూపములు సిద్ధించును. 'కర్మ' మున్నగు ప్రాతిపదికములకు 'అ'మహాన్నపుంసకసూత్రముచే ముపర్ణకముగాఁగా 'కర్మము' మున్నగు రూపము లేర్పడును.

సంజీవని. ౧౭౦ I విమః—వష్టి భాగురి ర్లోపమవాప్యో రుపసర్గయోః। ఆపంచైవ హలన్తానాం ! యథా వాచా నిశా దిశా॥ (సి. కౌ. ౪౫౭ సూ. విష్ర.) అను కారికచొప్పున 'వాచ - నిశ - దిశ -' అనురీతి రూపములు సయుక్తము సాధువులై యనఁదగియున్నది. "వాచా - స్త్రీ - వాచి - వాణ్యామ్. క్విబన్తాద్వా చోభాగురిమతే టాప్." (శబ్దా. చిం.). "వీరుధా - స్త్రీ - వీరుధి. భాగురిమతేన టాప్." (శబ్దా. చిం.) అని యిట్లు హలంతముల టాబంతత్వము కోశములందును నంగీకరింపఁబడెను. శా. జ్ఞాతిచ్ఛేదన లేన కిమ్మనెడి వాచ్ఛారూఢి సత్యమ్ముగన్ (వసు. 3 ఆ. ౧౦౧) అని భూషణుఁడు యతిస్థానమునఁ బ్రయోగించెను. కాని - వాచ - వాచలు - మున్నగురీతి తత్సమశబ్దములు ప్రయోగదృష్టములు కాలేదు. "వస్తుతస్తు భాగురి రితిశ్లోకో భాష్యే న దృశ్యతే....నిశ్ - దిశోరిగుపధలక్షణే 'కే' అదన్తత్వాట్టాపి నిశా దిశా ఇత్యాదిరూపసత్త్వేపి వాచాశబ్దః అసాధురేవేతి శబ్దేన్దుశేఖరేస్థితమ్" (సి. కౌ. బాలమ. ౪౫౭ సూ. వ్యా.) ఇట్లగుటచేతనే కావలయు భట్టారకుని ప్రయోగములలో 'దిశ' మున్నగునవి కన్పట్టినను 'వాచ' మున్నగునవి కన్పట్టలేదు. 'వాచ' అను తత్సమరూప మేకావ్యమునందును జూపట్టలేదు. ఉ. శాత్రవజైత్రతేజమున సర్వదిశల్ వెలుఁగొంద,.. (ఆది. ౫ ఆ. ౯౨) కం...సేనాధిపుఁడయి నిజతేజమెల్ల దిక్కులవెలుఁగన్ (సభా. ౧ ఆ. ౨౬౫) వాక్ఛబ్దమునకు 'వాకులు - వాక్కులు' అనునవిమాత్రమె ప్రయోగదృష్టములగుచున్నవి. క...నీ। వాకునకుఁదెచ్చు టుచితమె। నాకు సహోదరవు (సి. కౌ. ౫౧3 సూ.

సహన శ్లో విద్య మానపూర్వాచ్చ) (ఆది. 3 ఆ. ౧3౦) కం॥ నీకటపుల... । వాకులు శిక్షులు నుపద్రవంబులుకావే...(ఆది. ౮ ఆ. ౪౧ ప.)

సూరి క్వచిన్నామ గ్రహేష్వై వేత్యాద్యథర్వణ కారికార్థమును సంగ్రహింప మఱచెను. కాన - కిమ్ము - కించిత్తు - అప్పు మున్నగు రూపములు బాలవ్యాకరణ సాధ్యములు కానేరవు.

సంజీవని. ౧౭౦ II విష:—తకారాంతశబ్దములు సాధారణముగా ద్వితీయైకవచనాంత తుల్యప్రాతిపదికములమూలముననె తత్సమములగుట భట్టారక సమ్మతమనఁదగును. కం. మరుతుల యంశంబునఁ బు । ట్టిరి మువ్వురు...(ఆది. 3 ఆ. ౮౧) క. తక్షకుఁడను పన్నగుఁడు ప । రీక్షితుఁ గఱచునని......(ఆది. ౨ ఆ. ౧౮౯) సీ...ప్రథఁబరీక్షితుఁడు నాఁ బరఁగువాఁడు (ఆది. ౨ ఆ. ౧౬౫) క....శౌర్యో । పేతుఁడు సత్యజితుండను । నాతఁడు...(ఆది. ౬ ఆ. ౮౧ప.) (విస్తర. I-II-III-IV)

తర్వాతఁ దిక్కన ప్రభృతులు కొన్ని యలంతితకారాంత శబ్దములకు మాత్రము గణద్వయ ప్రయోగముగావించిరి. ఆ. వె-సత్యజిత్తుమేనసాయకదశకంబు। (ద్రోణ. ౧ ఆ. ౨౮౮ ప.) క. కినిసి వెసన్ సత్యజితుని । ధనువుసఱికి...(ద్రోణ. ౧ ఆ. ౨౮౯) తిక్కన సత్యజిచ్ఛబ్దమాత్రమునందిట్లు ప్రయోగించినఁ బరీక్షిచ్ఛబ్దమును గుణవర్ణ కార్యములతోనె ప్రయోగించెను. ఉ. ఉత్తర పుణ్యగర్భమున నుండి...పరీక్షితుఁ డుద్భవించినన్ (అశ్వ. 3 ఆ. ౧౬౬ ప.) (అనుబంధ.)

---

విస్తర. I ౧౭౦ II విష:—అహోబలపండితుఁ డీవిషయమున నీక్రిందిరీతిని వ్రాసెను. "మరుత్తు - ఇంద్రజిత్తు - పరీక్షితుఁడు - "భవజ్జనకుఁ బరీక్షితున్ ఇత్యాచార్యైః - అస్య - సులోపంచాప్యఙ్గీచకార. పరీక్షితు కాచినయట్లు ఇతి ప్రయోగాత్ - షష్ఠ్యన్తత్వేనవారూపం కథంచిదున్నేయమ్" (అహో. 3౮౭ పు.) అహోబలపతి యిచట మిక్కిలి పొరపాటుగ వ్రాసెను. క. పరీక్షిజ్జనపాలు చనుట...(ఆది.

---

అనుబంధ. ౧౭౦ II విష:—'మహాన్ - మహాన్తౌ - మహాన్తః' అను రీతి రూపములుగల మహచ్ఛబ్దము భవచ్ఛత్రాదులలోనిదిగాన (బా. తత్స. ౮౬ సూ.) దానికిఁ దత్సమరూప ప్రయోగముండనేరదు. ఇఁక "స్త్రీపశు జడాన్వినాన్యే మహాదాఖ్యాః" అనుసూత్రమునఁ బేర్కొనఁబడిన "మహత్ - అమహత్" అను వానికిని నట్టి యితరసంజ్ఞలకును ద్విత్వోత్వ సులోపములు విరుద్ధములుగావు. ఉ.—మహత్తు అమహత్తు - అచ్చు - హల్లు - టిత్తు - కిత్తు - జిత్తు - జిత్తు - మొ. జిత్తు బిందుపూర్వకంబగు (బా. తత్స. ౧౯ సూ.) మహత్తులగు మగాదులకు... (బా. అచ్ఛి. ౪ సూ. మొ.)

౨ ఆ. ౧౭౦ ప. ప్రథ. కార. ౧౫ సూ.) అనురీతి నతిక్రమణముగనున్న యీపద్య ప్రయోగమును "షష్ఠ్యర్థత్వేనవా కథంచిన్నేయ" (సూరి) వ్రాయుటయు నచట "పరీక్షితుఁడు కాచినయట్లు" అని యుండవలసియుండఁగా 'డు' లోపమును నన్నయ యంగీకరించెనని వ్రాయుటయు కేవలము నసంగతముగానున్నవి. 'స్పష్టుఁడు వృష్టు' అనురీతిని సులోపమయ్యెనని తలంచెనో? తెలియదు. శక్తి ప్రామాదికపు వ్రాతయే యీక్రిందియాధునికుల వివిధములగు వ్రాతలకు మూలముకానోపును. బాలవ్యాకరణకర్త "మరుత్తు" మున్నగు తకారాంతశబ్దములను నగుణవర్ణగతము లనుగా నుదాహరించెను. నీవృచ్ఛబ్దమును గణద్వయకార్య యుక్తముగా నుదాహరించెను. (బా. తత్స. ౬౫-౬౩ సూ.). "పరీక్షిత్తు - పరీక్షితుఁడు మరుత్తు - మరుతుఁడు" (గ్రాణ. తత్స. ౧౧౩ సూ. వివృతి.) అని గ్రాణపతవివరణకర్త యుదాహరించెను. అనుశాసనకర్త 'మరుత్తు' మున్నగు ద్విత్వాద్విత్వరూపముల నుదాహరించి తన సూత్రములోని బహుళగ్రహణముచే దీర్ఘముమీఁదనేకాక హ్రస్వముమీఁద నయితము ద్విత్వము పాక్షికమని యీక్రిందిరీతిని వ్రాసెను "బహుళమనుటచే ద్విత్వము వైకల్పికము. ఉదా:—సరస్సు - సరసు, వాక్కు - వాకు,...మొ. మరుతుల యంశమునంబుట్టి (భార)...(ఆం. భా. అ. శబ్ద. ౭౮ సూ. వివ.)" దీనినిబట్టి యీతఁడు 'మరుత్తు - మరుతు' అను రూపద్వయము నంగీకరించినట్లు తేలుచున్నది. "మరుతులయంశమున" అనుచోటి 'మరుతుల' అను రూపము గుణవర్ణగత మరుచ్ఛబ్దమునుండి యేర్పడినదని చెప్పక యనుశాసనకర్త నన్నయాథర్వణ సమ్మతపద్ధతికి విరుద్ధముగా హ్రస్వముమీఁది హల్లునకు ద్విత్వపాక్షికత నంగీకరించుట సరికాదు. సకారాంతములకుఁదప్ప మఱియేశబ్దములకును నగుణవర్ణగతమైనవానికి హ్రస్వము మీఁది హల్లు ద్విత్వమునందకుండుట యశ్రుతచరము. అట్టి ద్విత్వాభావమును నిర్ణయింపఁజాలు ప్రయోగ మొక్కటేని కానరాదు. ప్రాచీన వైయాకరణు లెవ్వరును నట్టి హ్రస్వముమీఁది హల్లునకు సకారేతరమైనదానికి ద్విత్వాభావమును వచింపలేదు. ఇది యిట్లుండఁగా 'మరుత్తు' అను నగుణవర్ణరూపమునకు సైతము మహాకవిప్రయోగము లభింపలేదు. "మరుతులయంశమున" అను (ఆది. 3 ఆ. ౮౧) గుణవర్ణ ప్రయోగముండుటచే దాని నగుణవర్ణ ప్రయోగము లేకుండుటయే యుక్తము. సంజీవనిలో నుదాహరించినరీతిని సత్యజిచ్ఛబ్దమునకు మాత్రము గణద్వయకార్య కలితప్రయోగములు తిక్కన భారతభాగమునఁ గన్పట్టుచున్నవి.

విస్తర. II ౧౭౦ II విష:—"ఇంద్రజితుఁడు" అనుదానికి నగుణవర్ణ కార్యకలిత ప్రయోగము "ఇంద్రజిత్తు" అనునది. "ఇంద్రజిత్తుఁడు" అను

నవియుఁ దిక్కనేతరకవుల ప్రయోగములలోఁ జూపట్టుచున్నవి. ఆ. వె. ఇట్లు సంగరమున నింద్రజిత్తు । పడిన...(అర. ౭ ఆ. ౧౩౬ ప.) సీ...గీ. ఇంద్రజితుఁడంతఁ దంత్రితో నిట్టులనియె ॥ (భాస్క. యుద్ధ. ౨౯౧ ప.) ఉ. నీకొడు కింద్రజిత్తు రజనీచరనాయక (భాస్క. యుద్ధ. ౧౦౬౩ ప.) ఇట్లు గణద్వయకార్య ఘటితత్వమే కాక "యింద్రజిత్తుఁడు" అను రూపముకూడఁ గొందఱుకవులచేఁ బ్రయోగింపఁబడుటయుఁగలదు. 'ప్రశానుఁడు - భగవానుఁడు - హనుమానుఁడు' అను చోటులందు "ఉ" గాగమము వచ్చినపిదప డుజ్వర్ణక మహాబలవత్త్వాదులచే నంగీకరింపఁబడినట్లె యిచటనైతము ద్వితోత్వములువచ్చిన పైని డుజ్జు కన్పట్టుచున్నది. సీ. జిత్వసంబున కింద్రజి త్తింద్రజిత్తుండు...(సర్వల. ౧ ఆ. ౨౧ ప. 3 పుట.) అను కూచిమంచి తిమ్మనపల్కుతప్ప దీనికి లాక్షణికసమ్మతి కానరాదు. చ. గొనకొని హేమచారు మణికుండలమండితమైన యింద్రజిత్తునితల తత్క్షణంబునన త్రుంచి... (భాస్కర. యుద్ధ. ౧౩౭౮ అయ్యలార్యుని ప్రయోగము) చ. ఘనః ఘు...ఇంద్రజిత్తుని..(భాస్కర. యుద్ధ. ౧౮౭౭ ప. అయ్యలార్యుని ప్రయోగము) క. నాకొమరుఁ డింద్రజిత్తుఁడు । లేకుండుట.....(అచ్చ. రా. యుద్ధ. బా. గు. ప్ర. తత్స. ౭౯ సూ. వ్యా.) ఆ. వె. ఇంద్రజిత్తుఁ డప్పు డినకులోద్భవునిచే । (మొల్లరా. యుద్ధ. బా. గు. ప్ర. తత్స. ౭౯ సూ. వ్యా.) ద్విపద - శ్రీమించు నయ్యింద్రజిత్తుని నగరు । (రంగ. రా. సుంద. (యూ. ము.) ౨౭౯ పుట.) ఇట్లె యిందు 3౦౭-౮౦౯ మున్నగు పెక్కుపుటలలో నీప్రయోగముగలదు. కాని ప్రామాణికులగు నన్నయాథర్వణుల సూత్రములకు విలక్షణమగు నీప్రయోగమును దిక్కన శ్రీనాథ నాచన సోమనాది ప్రామాణిక ప్రయోగముల ప్రామాణ్యమైన లేనిదే సాధువని యంగీకరించుట సరికాదని నాయభిప్రాయము. ఈజాతిలోనివే యనఁదగిన 'ప్రశానుఁడు - భగవానుఁడు - హనుమానుఁడు.' అను రూపములునైతము కవిప్రయోగ ప్రామాణ్యము లేమింజేసి యంగీకార్యములు కావని తోఁచుచున్నది. వీని కహోబలాదుల వివరణములు తప్ప సాధారాంతర మగపడదు. "ప్రశానుఁడు - ప్రథమైకవచన తుల్యత్వమ్. దీర్ఘాత్ పరత్వాన్నద్విత్వమ్. (అహో. 3౮౨ పు.) "హనుమానుఁడు - భగవానుఁడు ఇతిరూపం త్వాగుణవర్ధణత్వేన బోధ్యమ్" (అహో. 3౮౫ పుట.) క. హనుమద్భగవత్పదములు । పనివడి హనుమంతుఁడనఁగ భగవంతుఁడనన్ । హనుమానుఁడు భగవానుఁడు । ననుచుఁ బ్రయోగింపఁజెల్లు నంబరవసనా ॥ (సర్వల. ౧ ఆ. ౨౦ ప. 3 పుట.). "ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకార్థంబున కానాదేశంబు విభాషనగు." హనుమానుఁడు - హనుమంతుఁడు - భగ

వాసుఁడు - భగవంతుఁడు" (బా. తత్స. ౭౭ సూ.). తీక్ష్ణకవి యుజ్జగించుటచే గావలయు సూరికయు 'ప్రకాసుఁడు' అనువానిని సంగ్రహింపలేదు. (ప్రకాసుఁడు = శాంతుఁడు) అనుశాసనకర్తయుగాణపత వివరణకర్తయు నీసూరి మార్గమునే యనుసరించిరి (ఆం. శా. అ. శబ్ద. ౨౭ సూ. గాణ. వివ-తత్స. ౧౧౭ సూ.). ఇట్లో కరివనుసరించి యొకరు ప్రాచీనకాని యొవ్వరును మహాకవిప్రయోగ ప్రామాణ్యమునుగాని ప్రాచీనాంధ్ర లాక్షణికసూత్ర ప్రామాణ్యమును గాని ప్రదర్శింపలేదు. అగుణవర్ణకార్యమును సత్వముచేసికవివరు "అగుణవతాం సర్వనామ్నాం స్త్రోపః" అనుచోప్పన సులోపముగల్గుచుండఁగా మరల నుత్ ప్రత్యయ మెట్లువచ్చును?

పయిరీతినే ప్రయోగములను జూపకయే యహోబలపతి "ఉపానత్తు. (హాకారాంతము. ఉపానత్. ఉపానహౌ. ఉపానహః. పం. ప్ర) (అహో. 3౮౭) స్రక్కు - అసృక్కు (3౮౯ అహో.) (స్రక్. స్రజౌ. స్రజః. అసృక్. అసృజౌ. అసృజః. సం. ప్ర.)" అని యుదాహరించెను. - "సంపత్తు - సం - వి - ద్-స్త్రీ...... (రూ. సంపద) (శ. ర)" అని శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను. "వీరుత్తు (వీరుత్. వీరుధౌ. వీరు ధః) (బా. తత్స. ౬౮ సూ.) నీవృత్తు-నీవృతము-ఋత్విక్కు-ఋత్విజుఁడు" (బా. తత్స. ౭౨ సూ.) అని సూరియుదాహరించెను. గమికర్మీకృతనైక నీవృతుఁడనై (శృం. నై. ౨ ఆ. ౨౧ ప.) అనురీతిని ప్రయోగములున్నవిగాని పయిరీతిగల యగుణవర్ణరూపములకుఁ బ్రయోగములు లభింపలేదు. శబ్దరత్నాకరమున 'వీరుధము' అనియె చూపఁబడియున్నది.

విస్తర. III ౧౭౦ II విషః—హాకారాంత దకారాంత జకారాంత శబ్దములు ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికములు కలవగుచునే కవి ప్రయోగ దృష్టములగు చున్నవి. ప్రయోగములు:—సీ...యజ్ఞంబులును నీవ హవ్యవాహ...(సంబోధన రూపము) (సభా. ౧ ఆ. ౨౪౯). (హవ్యవాహమ్. హవ్యవాహౌ. హవ్యవాహః సం. ద్వి.). "తురాసాహుఁడు - అనడ్వాహము" (అనడ్వాహమ్. అనడ్వాహౌ అనడుహః. సం. ద్వి. ఎద్దు.) (అహో. 3౮౧). "తురాషావాఁడు - సం - వి - హ్ - పుం - ఇంద్రుఁడు" (శ. ర.). "తురాషాహుఁడు - సం - వి - హ్ - పుం - త్వరితముగ శత్రువులను అణఁచువాఁడు. ఇంద్రుఁడు" (సూ. రా. ని.) అని యీ యాంధ్రనిఘంటువులు రెంటను 'తురాషాహుఁడు' అని చూపుట ప్రామాదికము. "తురాషాట్-తురాషాడ్-తురాసాహౌ-తురాసాహః. (సం. ప్ర.) తురాసాహమ్-తురాసాహౌ-తురాసాహః (సం. ద్వి)" అని తురాషాట్ శబ్దమునకుఁ బ్రథమాద్వితీయావిభక్తిరూపములుసంస్కృతమున వెలయుచున్నవి. ఈశబ్దముద్వితీయైకవచనతుల్య

ప్రాతిపదికముగలదై తత్సమరూపమునందునుగాన "తురాసాహుఁడు" అనియే రూప ముండవలసియుండును. "సహేస్సాడస్సః (౮-3-౫౬) సాడ్రూపస్య సహేస్సస్య మూర్ధన్యాదేశఃస్యాత్" (సి. కౌ. 33౫ సూ.) అని ద్వితీయైవచన మున దీనికి 'సాడ్రూపము' లేమింజేసి షత్వము రానేరదు. కాన 'తురాసాహుఁడు' అనురూపమె సాధువనఁదగును.

దకారాంతములు:—కం...సుహృదులెట్టిపుణ్యాత్మొ యనఁగన్. (ఆది. ౫ ఆ. 3౨) (ఆర. ౧ ఆ. ౨౭౯. ఆర. 3 ఆ. ౨౫౨). కం...హృదయప్రియ సుహృదుఁ గాంచి (హరి. పూ. ౫ ఆ. ౧3౭) (సుహృద్. సుహృత్. సుహృదౌ. సుహృదః.) (సం. ప్ర.). సుహృదమ్ - సుహృదౌ-సుహృదః. (సం. ద్వి.). చ. ఉడిగి సభాసదుల్ పలుకకుండిరి...(సభా. ౨ ఆ. 3౧) (సభాసదమ్ సభాసదౌ. సభాసదః. సం. ద్వి.) సీ...బ్రాహ్మణప్రవరుల బ్రహ్మవిదుల।...(సభా. ౨ ఆ. ౧౨౧) (బ్రహ్మవిదమ్. బ్రహ్మ విదౌ. బ్రహ్మవిదః. సం. ద్వి.) చ....ధర్మ సం। విదులనున్న యీభరతవీరులవంశ మునేఁ డధర్మ సం। పద నతినింద్యమయ్యె...(సభా. ౨ ఆ. ౨౧౯) గీ...ధర్మసం విదుఁడవు...(సభా. ౨ ఆ. ౨౭౦) (ధర్మసంవిదమ్. ధర్మసంవిదౌ. ధర్మసంవిదః. సం. ద్వి.). (సంపదమ్. సంపదౌ. సంపదః. సం. ద్వి.) (ఆపదమ్. ఆపదౌ. ఆపదః.సం. ద్వి.). చ...వివిధాస్త్ర సం। పదయును...(ఉద్యో. ౭ ఆ. ౨౭౬). కం...ఎట్టియున్నత బలసం। పదులైన జీవులును నా। యెదురను ... (ఆర. ౭ ఆ. ౧౧౦). క. ఆపదఁ గడవంబెట్టఁగ। నోపి...(ఉద్యో. 3 ఆ. ౬) క...।ఆపదగా కవ్వి ధము సుఖావహమగునే (శాంతి. ౭ ఆ. 3౫). "మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్య సం। పదలోలినిత్యాద్యాచార్యవచనాత్ (సభా. ౧ ఆ. ౧౯ ప.) సంపద ఆపద ఇతిసిద్ధమ్" (అహో. 3౮౭ పు.). ప్రయోగస్థితి యిట్లుం డఁగా నాంధ్రకోశకర్త లీక్రిందిరీతిని నిరాధారముగ వ్రాయుట సరికాదు. "సంపత్తు - సం - వి - ద్ - స్త్రీ...(రూ. సంపద)" (శ.ర.). శబ్దరత్నాకరకర్త 'సంపత్తు' అనుదాని నంగీకరించి "ఆపత్తు" అనుదాని నుపేక్షించుటలో యుక్తియేమో ? తెలియకున్నది. "ఆపత్తు" "ఆపద" (సూ. రా. ని.) మహాకవి ప్రయోగప్రామాణ్యమునైనఁ జూప కయె చింతామణి విరుద్ధముగ నొక్కశబ్దమునకు గణద్వయకార్యకలితత్వము నంగీక రించుట సాహసము! క. నారాయణీయమగు నీ। సారాఖ్యానంబు వినినఁ జదివిన సంప। త్తారోగ్యాయు స్సద్గతు। లేరికి...(శాంతి. ౬ ఆ. ౫౭౧). అని ముద్రణము లలో 'సంపత్తు' అనురూపము కన్పట్టుచున్నదికాని నాయొద్దనున్న తాళపత్త్రమాతృ కలలో "సంప। త్త్యారోగ్యాయుస్సద్గతు। లేరికి" అని యున్నది. సంపత్తిశబ్దము

సర్వసమ్మతము. మఱియుఁ తిక్కయజ్వ "సంపత్తు" అనువానినిమాత్రము విడఁదీసి తక్కినవానిని సమాసముగ "ఆరోగ్యాయు స్సక్షతులు" అని ప్రయోగించెననుట విశ్వసనీయముకాదు.

జకారాన్తములు:—'రుక్కు - ఋత్విక్కు' అని సూరియును "స్రక్కు - అసృక్కు" అని యహోబలపతియు నుదాహరించిరి. సీ. "భుక్ పదంబునకు భూభుజులు భూభుక్కులు...(సర్వల. ౧ ఆ. ౨౧ ప. ౯ పు.) అని తిమ్మకవియు వచించెను. కాని యిట్టి యగుణవర్ధనకార్యములు ప్రయోగములందుఁ జూపట్టలేదు. గీ. భుక్పదమునకు భుజుఁడగు భూభుజుండు' (ఆం. భూ. ౪౦ ప.) అని ప్రాచీనుఁడు కేతన గుణవర్ధన కార్యముతోనె ప్రయోగించెను. పరిశీలింపఁగఁ బదాంతమందును ఝల్ పరకత్వమందును సంస్కృతమున "కుత్వము" వచ్చు జకారాంతములకు గుణవర్ధన కార్యములతోనే ప్రయోగములు గన్పట్టుచున్నవి. అట్టియెడల "కుత్వము" రాక షత్వమువచ్చువానికి "టకార" ద్విత్వోత్వరూపములు ప్రయోగదృష్టములగుచున్నవి. మత్తకోకిల...దో। షోద్ధతిన్ రుజలుద్భవింపఁగ (స్త్రీ. ౧ ఆ. ౪౧ ప.).సీ. ఋత్విజుండని విచారించి పూజించితే...(సభా. ౧ ఆ. ౧౧ ప.). మత్తకోకిల - స్నాతకుండును ఋత్విజుండును...పూజనీయులు...(సభా. ౨ ఆ. ౪ ప.) సీ...ఋత్వి। జుండుగఁ గ్రతువొనర్చుచునుండ...(శాంతి. 3 ఆ. ౧౧౬) ఇట్లంతటను "ఋత్విజుఁడు" అను గుణవర్ధనకార్య ప్రయోగమె కన్పట్టుచున్నది.

"అసృజః పదాన్తే కుత్వమ్. సృజేః క్విన్విధానాత్ - విశ్వసృడాదౌతున. సృజిదృశోరితిసూత్రే (౨౪౦౫ సూ. సి. కౌ.) రజ్జుసృడ్భ్యామితి భాష్య ప్రయోగాత్." (సి. కౌ. ౪౪3 సూ. వివృతి. ౨౧౪ పుట.). "విశ్వసృట్, విశ్వసృడ్ - విశ్వసృజౌ - విశ్వసృజః - ఇహాసృజియజ్యోః కుత్వన్నేతి క్లీబేవక్ష్యతే." (సి. కౌ. 3౭౯ సూ. వివృతి.) అను పాణీయ సిద్ధాంతము చొప్పున 'విశ్వసృజ్' అనునది కుత్వమునకు విషయముకాక షత్వమాత్రమునకే విషయమగుచుండఁగా "గీ. విశ్వసృజులను మునులచే వితతమగు..." (శాంతి. ౨ ఆ. ౨౬ ప.) అను తిక్కయజ్వ ప్రయోగము పైని వ్రాసినయేర్పాటును విరోధించుచున్నదని శంకింపరాదు. ముగ్ధబోధ వ్యాకరణవ్యాఖ్యాతయగు దుర్గాదాసుఁడు "విశ్వసృజః కుజ్ వాఫే ఇతివక్తవ్యమ్. విశ్వసృక్ - విశ్వసృట్ - విశ్వసృగ్భ్యామ్ - విశ్వసృడ్భ్యామ్" అని వివరించెను. (ముగ్ధ. వ్యా. ౨౧౧ సూ. వ్యాఖ్య.) ఇట్లగుటచేత 'విసృజ్' అనునది పాక్షికముగ "కుత్వ" మునకును విషయమగుటచే సోమయాజి ప్రయోగము పయి యేర్పాటునకు విరుద్ధముకానేరదు. "సమ్రాజ్ - విరాజ్"

మున్నగువానికి 'కుత్వము' రాక షత్వమేవచ్చునుగాన వానికిఁ బ్రథమైకవచన తుల్యప్రాతిపదికకార్యములు వచ్చుట నిర్వివాదము. క. విను నృపసమ్రాట్టు విరా| ట్టనియెడు శబ్దములఁ బొగడునాగమములు...(శాంతి. ౨ ఆ. ౨౭౨ ప.) సోమయాజి ప్రయోగమిట్లుండఁగా "క. భూభుగ్విరాట్పదంబులు | ... | భూభుజులు విరాజులనఁగఁ బొలుపైయునికిన్" అని విన్నకోట పెద్దిరాజు 'విరాజులు' అని పేర్కొనుట సరియైయుండలేదు. (కావ్యాలం. ౯ ఉల్లా. ౩౯ ప.) 'రాట్టు - స్వరాట్టు - స్వరాటు' అను సూరి యుదాహృతులును బైయేర్పాటున కనుకూలముగనే యున్నవి.

విస్తర. IV ౧౭౦ II విష:—శ్వశబ్దము తప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచనాంత తుల్యంబులె యగునను సూరివాక్యమీవఱకు వ్యాఖ్యాతమైనది. (౧౭౦ I విష.) 'పథిన్' మున్నగు నకారాంతములకుఁ దత్సమరూపము లప్రయుక్తములనియు వానికిఁ బర్యాయములగు 'పథ' మున్నగు 'అ' కారాంతశబ్దములె తెల్గునఁ దత్సమరూపములతోఁ బ్రయుక్తములగుచున్నవనియు నీవఱకె వివరింపఁబడెను. (౧౬౯ III విష.). సూరి 'సుధన్వుఁడు' అను శబ్దమును 'సుధన్వన్' అను నకారాంత ప్రాతిపదికమునుండి మాత్రమె సాధించెను. కాని దానికిని 'పథ' మున్నగువాని వలెనె "అ" కారాంత ప్రాతిపదికము సంస్కృతకోశములలోఁ గన్పట్టుచున్నది. "ధన్వ-న [సౌ - ధన్వ. అచ్.] చాపే." (శబ్దస్తో.). "ధనుశ్శబ్దపర్యాయోధన్వ శబ్దోప్యస్తి" (అహో. ౩౯౧ పు.). 'సుధన్వుఁడు' అను రూపమేకాక "సుధనువు-సుధనుఁడు - సుధనుషుఁడు" అను రూపములునైతము సాధువులెయని ప్రయోగాదుల వలన విశదమగుచున్నది. సకారాంతశబ్దములకుఁ బ్రత్యేకమగు వ్యవస్థచే గుణవద్ధణ కార్యములును సకారలోప పక్షమున నగుణవద్ధణకార్యములునువచ్చునని సకారాంత శబ్ద ప్రకరణమున విశదీకరింపఁబడును. (౧౭౯-౧౮౧ విష.). "ధనుషశ్చ. (౫-౪-౧౩౨) ధనురన్తస్య బహువ్రీహేరనజాదేశఃస్యాత్ - ద్విధన్వా - శార్ఙ్గధన్వా - వాసంజ్ఞాయామ్ (౫-౪-౧౩౩) శతధన్వా - శతధనుః" (సి. కౌ. ౮౭౦-౮౭౧ సూ. బహువ్రీహి.) అను సిద్ధాంతకౌముదీ గ్రంథమునుబట్టి యనఁగా నందలి 'శార్ఙ్గధన్వా' అను నుదాహృతినిబట్టి - శార్ఙ్గధన్వా = విష్ణువు - గిరిధన్వా = శివుఁడు - పుష్పధన్వా = మన్మథుఁడు - మున్నగునవి సంజ్ఞావాచులుకావనియు వాని కనజాదేశము నిత్యమేయనియు మనుజసంజ్ఞలగునపుడు మాత్రమె యనజ్జునకు వైకల్పికత్వమనియుఁ దెలుచున్నది. కాని యీసిద్ధాంతము ప్రయోగసమ్మతము కామింజేసి

"శార్ఙ్గధన్వేతి - స్వలాఘనాద్భశంసా । ధృతధనుష ఇత్యాద్య ముత్సృజ్యవదతి పుష్పధ_న్వ ప్రయోగ ఇతిచేత్ - అత్రాహుః - సమాసా_న్తవిధేరనిత్యత్వాన్నాత్ర దోషః ఇతి" (తత్వబోధిని. సి. కౌ. వ్యాఖ్య. ౧౩౧ పు. ధనుషశ్చేతి సూత్రవ్యాఖ్య) అని తత్వ బోధినీవ్యాఖ్యాకారుఁడు వివరించెను. సంస్కృతకోశకారులు "పుష్పధనుః - పుం - కామదేవే. పుష్పంధనురస్య - బాహుళ్యానానిత్యత్వాన్నాదేశే సాధుః." "పుష్ప ధన్వా - పుం - మదనే - కామే- పుష్పంధనురస్య, బాహుళ్యాదనానిత్యత్వాత్" (శబ్దా. చిం.) అనుచెప్పుట "పుష్పధన్వా-పుష్పధనుః" మున్నగునవి సంజ్ఞావాచకములని యనుచు నవి వైకల్పికత్వము నంగీకరించిరి. కట్టిగుట నైరి "పుష్పధన్వుఁడు- పుష్పధనుఁడు-పుష్పధనుఁడు-పుష్పధనుషుఁడు" అనుతత్సమరూపములెల్లను సాధువు లగుచున్నవి. క. శతధన్వుఁ డనిమి యతని...(హరి. పూ. 3 ఆ. ౨౦౫ క.) క.... అంతటఁ గడునలిగి యాతఁడా శతధను న । త్యంతక్రోధంబున...(హరి. పూ. 3 ఆ. ౨౧3) సకారాంత మహత్తులకు గుణవద్ధణకార్య ప్రయోగములు ముందు నిరూపింపఁబడును. (౧౭౯-౧౮౧ విష.). "మఘవంతుఁడు. సం - వి - న్ - పుం - ఇంద్రుఁడు...". "మఘవ్రుఁడు - సం - వి - న్ - పుం——పై——" (శ. ర.) అని శబ్దరత్నాకరమున రెండురూపములును నుదాహరింపఁబడినవి. రెంటికిని మూల మొక్క 'మఘవన్' అనునది యనియే వ్రాయఁబడెను. ఇచట నొక్కశబ్దమునకే గణద్వయకార్యములు గన్పట్టుచున్నవి. ఆరెండురూపములకు నొక్కశబ్దమే మూల మని పాణినీయులు సైతము సాధించియున్నారు. "మఘవాబహుళమ్. (౬-౪-౧౨౮)" (సి. కౌ. 3౬౦ సూ. హలంత) అను సూత్రముచే 'మఘవన్' అను శబ్దమునకే 'తృ' అనుదాని నంతాదేశముచేయఁగా 'మఘవత్' అను రూప మేర్పడునని పాణినీయులు సాధింతురు. "మఘవత్:——మఘవాన్ - మఘవన్తౌ- మఘవ_న్తః. (సం. ప్ర) మఘవ_న్తమ్ - మఘవన్తౌ - మఘవతః-(సం. ద్వి.) మఘవన్:—— మఘవా - మఘవానౌ - మఘవానః (సం. ప్ర)." అని వాని సంస్కృత విభ_క్త్యంత రూపములు. కాని సంస్కృతకోశములలో నివి పృథక్ శబ్దములుగాఁ జూపఁబడి యున్నవి. "మఘవత్ - పుం - (మహ. ఘుఙర్థే. క. హస్యఘః - మఘః = పూజా - అ_స్త్యర్థేమతుప్ - మస్యవః) ఇన్ద్రే...తత్పత్న్యాంజీప్ - మఘవతీ." "మఘవన్ - పుం. (మహ. కనిన్. ని.) ఇన్ద్రే...మఘోనీ" (శబ్దస్తో.) ఇవి యిట్లుండఁగా భట్టారకుఁ డంతటను 'మఘవన్' అనుదాని యగుణవద్గణ కార్యములతోనే ప్రయోగించి యున్నాఁడు. ఉ. ఆహవభూమిలోనఁ బరమార్థము పార్థుఁడు వైరివాహినీ । వ్యూహము వ్రచ్చుచోట మఘవుండును వానికి మారొ్కనంగ ను । త్సాహము

గుణవద్గణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ.
(ఆం. చిం. హలం. ౧ కా. అహో. ౩౮౧ పు.)
గుణవతాం డుముౘ్ ప్రాగ్వత్. (ఆం. చిం. హలం. ౨
కారి. అహో. ౩౮౧ పు.)
అజ్ఝలో రాలు శబ్దేన । సమానార్థకతాయ ది । సమాస
స్తత్ర చోద్రః స్యాత్ (వికృ. సంధి. ౨౬ కారి. అహో.
౩౮౬ పు.)
సంబద్ధే క్వచిదర్థఃస్యా । దసంబద్ధే విలక్షణః ॥ (వికృ.
సంధి. ౨౭ కారి. ౨౨౪ పు.)

నన్నయా థర్వణీయము. ౧౭౧ విషయము.

కల్పతరు. ౧౭౧ విష:—ఇందు "అజ్ఝలోః..." అనునది మొదలుగానున్న కారికలకు. ౯౩ విషయమున వ్యాఖ్యచేయఁబడినది. గుణవద్గణఇత్యాది—వికృతౌ= తెలుఁగునందు, గుణవద్గణః=గుణవదాదులలోఁ జేరినశబ్దము, ద్వితీయైకవచన తుల్యః= సంస్కృత ద్వితీయైకవచన తుల్యరూపముగలది ప్రాతిపదికము, భవేత్ = అగును. గుణవతామ్ = ఈగుణవద్గణగత ప్రాతిపదికములమీఁది సుప్రత్యయాదులకు 'డు - ము' మున్నగు తెలుఁగువిభక్తులు, ప్రాగ్వత్ = మునుపటి యజంతశబ్దములందు వలెనె యాదేశములగుటచే రూపసిద్ధిగల్గును. 'గుణవత్' అనునది గుణశబ్దముపైన స్వార్థకమగు 'మత్' అను తద్ధిత ప్రత్యయముచేరుటచే నేర్పడు తద్ధితాంతశబ్దము. అదన్తాదులపై నిల్చు 'మత్' ప్రత్యయ మకారము వకారమగును. ఇట్లేర్పడిన "గుణవత్" మున్నగు శబ్దములనుటచేత నీగుణవదాదులలో - శ్రీమత్ - బుద్ధిమత్ - ధనవత్ మున్నగు తద్ధితాంతములేకాక "విద్వస్" మున్నగు కృదంతములు సైతము ప్రయోగానుసారముగాఁ జేర్పఁబడుచున్నవి. గుణవదాదుల ద్వితీయా రూపములు:—"గుణవన్తమ్ - గుణవన్తౌ - గుణవతః; శ్రీమన్తమ్ - శ్రీమన్తౌ - శ్రీమతః; విద్వాంసమ్ - విద్వాంసౌ - విదుషః; సత్యజితమ్ - సత్యజితౌ - సత్యజితః; సంపదమ్ - సంపదౌ - సంపదః; ఋత్విజమ్ - ఋత్విజౌ - ఋత్విజః - శ్వానమ్ - శ్వానౌ - శునః; అప్సరసమ్ - అప్సరసౌ - అప్సరసః." అను రీతిని గ్రహింపవలెను. "అన్యేషాంచ వాలుగన్తస్య" అను చింతామణిసూత్రములోని వాశబ్దమునకు వ్యవస్థావాచిత్వము నంగీకరించిద్వితీయైకవచన తుల్యప్రాతిపదికముల

---

సేయఁడన్న...(ఆది. ౮ ఆ. ౪౬). తే. గీ.... । మఘువు కులిశంబు వ్రచ్చు నీమస్తకంబు ॥ (సభా. ౨ ఆ. ౨౪౦ ప.). సీ...ఆ. వె॥...మఘువు నాజ్ఞఁజేసి మాతలియు క్తమై । ...(ఆరణ్య. ౧ ఆ. ౩౪౪ ప.) 'మఘువంతుఁడు' అని కన్పట్టలేదు.

తుది మకారము కవిప్రయోగానురోధమున నిత్యముగ లోపించుననని వ్యాఖ్యానముచేసికొని వీనితుది మకారమునకునిత్యలోపమును సాధించికొనవలెను. లేదా గుణవతాం డుమూప్రాగ్వృత్తను దానివిధాన సామర్థ్యమున పుమ్వాదులుశిక్షించుట కర్తృముగ నీగుణవద్గణ ప్రాతిపదికముల తుది మకారము నిత్యముగ లోపించుననని వ్యాఖ్యానముచేసికొనినయెడ నట్టి మకారమునకు నిత్యమగులోపమును సాధించికొన వలయును. గుణవంతుఁడు మున్నగుచోటిని మకారలోపనిత్యతయే మహాకవి ప్రయోగసమ్మతమై యున్నది.

పయిరీతినేర్పడిన 'గుణవంత' మొదలగు ప్రాతిపదికములపై 'సు' మున్నగు నామవిభక్తి ప్రత్యయములు నిల్వఁగా 'రాముఁడు - వనము - మున్నగు నజంతశబ్దరూపములవలెనె గుణవంతుఁడు - గుణవంతము - మున్నగు రూపములు సిద్ధించును. ఇట్లు 'వీనికులము గుణవంతము' మున్నగుచోట్ల నపుంసకత్వము నందును బుంలింగ ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికమునె గ్రహించి రూపసాధనము చేయుట సంప్రదాయమైయున్నది. 'ఆపద - సంపద - అప్సరస' మున్నగునవి స్త్రీలింగములగుటంజేసి "అనుతాంస్త్రియాం" మిత్యాది సూత్రముచే సమాపశబ్దములకువలెనె ప్రథమైకవచనలోపము కల్గునని యెఱుంగునది. అనడ్వాహము=ఎద్దు, తురాపాహుఁడు=ఇంద్రుఁడు. శ్వానము = కుక్క. "శ్వశబ్దంబుదప్ప నకారాంతంబులెల్ల" నిత్యాదివివరణముచే సూరి నకారాంత శ్వశబ్దమునె గ్రహించెననియు నది ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికమునుండి రూపసిద్ధినందునని యాతఁడు తలంచెననియు స్పష్టమగుచున్నది. కాని సంస్కృతకోశములలో 'అ' కారాంత శ్వానశబ్దమును గన్పట్టుచున్నది. "శ్వాన. పు. (శ్వైవ. అణ్) కుక్కరే తజ్జాతి స్త్రియాంజీప్." (శబ్దస్తో.) "శ్వానీ - స్త్రీ - శున్యామ్" (శబ్దా. చిం.) "శ్వన్- పు - (శ్వి. కనిన్. ని.) కుక్కరే - తజ్జాతిస్త్రియాం, జీప్ - శునీ" (శబ్దస్తో) భట్టారకుఁడు ప్రసిద్ధ శ్వశబ్ద స్త్రీలింగరూపమునె ప్రయోగించియున్నాఁడు. "ఆప్రదేశంబునకు సరమయను దేవశునికొడుకు సారమేయుండు..." (ఆది. ౧ ఆ. ౮౮ వచనము (విస్తర). పయి గుణవదాది శబ్దములు స్త్రీత్వంబున ఙ్యంతములగును గాన "ఈలత శ్రీమతి - ఆ

---

విస్తర. ౧౭౧ విష:—నన్నయప్రయుక్తమిట దేవశునీశబ్దము. ఈకారాన్త స్త్రీలింగము. ఆం. భా. చరిత్రకర్తగారిటుల బొరవడి యీక్రిందిరీతిని వ్రాసిరి. "శ్వన్ శబ్దముయొక్క సప్తమ్యేకవచనరూపము తెనుఁగున ప్రథమైకవచనరూపమగును. (ఆది. ౧ ఆ. ౮౩. ఆం. భా. చ. ౧౩౬౮ పుట.). ఆంధ్రభాషా వికాసకర్తగారీవిషయము నుగ్గడించిరి (ఆం. భా. వి. ౨౧౮ పుట.). ఆంధ్రభాషాచరిత్రకర్తగారీసందర్భ

స్త్రీ గుణవతి - సీత విదుషి" మున్నగు నజంతరూపములె వెలయును. మఱియు మహతి వాచ్యమగునపుడు గుణవంత మున్నగువానితో 'ఆలు' శబ్దము సమసించి "దారార్థేత ఉత్" అనుచోప్పునఁ గుణవంతురాలు మున్నగు రూపములునైత మేర్పడును. ఇట్లు 'శ్రీమంతురాలు - శ్రీమతి - విద్వాంసురాలు - విదుషి' మున్నగు ద్వివిధరూపములును సిద్ధించును. ఈవిషయమునె "అజ్ఝలోరాలు శబ్దేనే." త్యాద్యథర్వణకారికలు విశదపఱుచుచున్నవి. (చూ. ౯౩ విష.). కళత్రశబ్దము నపుంసకలింగమగుటచే "వానికళత్రము గుణవతి" అని యుండ నేరదు. ఇంక 'వాని కళత్రము గుణవంతము' అను నమహద్రూపముగాని "వానికళత్రము గుణవంతురాలు" అను నాలుశబ్దసమాసపు రూపము గాని సిద్ధించును. "స్త్రియాం బహుష్వప్సరసః" అను చోప్పున (నామలిం. ౧ కాం. స్వర్గవ. ౫౨ శ్లో.) నప్సరశ్శబ్దము నిత్యబహువచనాంతమగుటంజేసి ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికమును గ్రహించుటకు వలనుపడదనియు నప్శబ్దమువలెనె యిదియు 'క్వచిన్నామగ్రహేణైవే' త్యాది సూత్రమునకు లక్ష్యముకాఁదగుననియు శంకింపరాదు. "బహుషు ఇతి ప్రాయోవాదః. అనచి చేతిసూత్రే (౮-౪-౪౭) అప్సరాః ఇతి భాష్యప్రయోగాత్" (అమర సుధావ్యాఖ్య. నామలిం. ౧ కాం. స్వర్గవ. ౫౨ శ్లో.) "అప్సరాః - స్త్రీ - స్త్రియాంబహు ష్వప్సరసః ! స్యాదేకత్వేఽప్సరా అపీతిశబ్దార్ణవః - ఏకాప్సరః ప్రార్థితయోర్వివాద ఇతిరఘుః. (శబ్దా. చిం.)" అనుచోప్పున 'అప్సరస' అను ద్వితీయైకవచన తుల్యప్రాతిపదిక సిద్ధరూపము నిర్బాధము. సీ. అందు జలక్రీడ లాడుచునున్న యప్సరస ఘృతాచియన్ సదమలాంగి (ఆది. ౫ ఆ. ౧౯౫) అని. భట్టారకుఁడును బ్రయోగించియున్నాఁడు. భట్టారక ప్రయోగానురోధమున సకారాంత పుం

---

మునఁ బెక్కు సంస్కృత శబ్దవిషయకములగు ప్రమాదములకు లోనయిరి. ఇకారాంత సఖిశబ్దమును 'సఖిన్' శబ్దమనిరి. (ఆం. భా. చ. ౧౩౯౪ పు.). ఇకారాంత శుచిశబ్దమును నైతము నకారాంతమనుకొనిరి (ఆం. భా. చ. ౧౩౯౪ పు.). "దకారాంత 'ముత్' శబ్దములోని ప్రథమైకవచనమగు తకారమునకు ద్ కారమును నపుంసకలింగమగుటచేత దానిపై అకారమును వచ్చును...ముదము" (ఆం. భా. చ. ౧౩౯౩ పు.) అని వ్రాసిరి. ముచ్ఛబ్దము స్త్రీలింగము. నపుంసకముకాదు. 'ముత్ - ముద్' అను రెండురూపములును బ్రథమైకవచనమున నిల్చునుగదా యట 'త' కారమునకు 'ద' కార విధానమేల ? ద్ కారమేమిటి? ఉచ్ఛశబ్దము "ఉచ్చైస్" అను నవ్యయపదమునుండి పుట్టినదనిరి. (ఆం. భా. చ. ౧౩౯౯) మొ. విస్తరభీతి నింకను జూపనయితిని.

స్త్రీలింగ మహన్మహతీవాచక శబ్దములకుమాత్రము గణస్థాయిపాకము నంగీకరించుటయు గుణవర్ధణరూపములనే కాక యగుణవర్ధణపక్షమునందలి ప్రాతిపదికాంత సకార లోపమున సిద్ధించురూపములనునైత నంగీకరించుటయు ముందు నిరూపింపఁబడును. (౧౭౫-౧౮౧ విష.) కావున - "అప్సరసమ్ - అప్సరాః" అను ద్వివిధ ప్రాతిపదికములనుండియు "అప్సరస - అప్సర" అను ద్వివిధరూపములు సుసాధములగుచున్నవి. అప్సరశ్శబ్దము స్త్రీలింగముగాన రెండిటను ప్రథమైకవచనలోపము కిత్రైకని చెల్లుంగునది. "అప్సరస్ - స్త్రీ - బహు. (అబ్భిస్సర్త్తి. సృ. అసున్....పచాద్యచ్). అప్సరాప్యత్ర. స్త్రీ -" (శబ్దస్తో.) అను చొప్పున నాకారాంత స్త్రీలింగమగు 'అప్సరా' అను శబ్దమునైతము సంస్కృతకోశములలోఁ గన్పట్టుచున్నది. కాన 'అప్సర' అను తత్సమపదమును నిర్బాధమె యనఁదగును.

అహోబలపండితుఁడు 'తురాసాహమ్ - అనడ్వాహమ్' మున్నగు ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికములతుది మకారమునకు బైరేతని లోపముచేయక "అన్త్యహలో ఒద్రుదదీ (౧-౧-౨౪). (షడ్భా. ౩౭ పు.) (వృత్తి) శబ్దే ష్వన్త్యహలో ఒన్త్యస్యవ్యఞ్జనస్య లోపస్స్యాచ్ఛ్రి దిత్యవ్యయ ము దిత్యపసర్జనంచ వర్జయిత్వా. ఇతి ప్రాకృతసూత్రేణ మకారస్యలోపః" (అహో. ౩౮౨ పు.) అని వివరించెను. ఇది సరికాదు. ఆంధ్రవ్యాకరణములలోఁ జెప్పఁబడనివిషయము లావశ్యకములగునప్పుడు ప్రకృతులగు సంస్కృత ప్రాకృతముల వ్యాకరణములనుండి "అనుక్తమన్య శబ్దానుశాసనవత్" అను చొప్పున గ్రహించుట సంప్రదాయముకాని 'అన్యేషాంచ వాలుగన్తస్య" అని చింతామణిలో సంత్యహల్లోప విషయముక్తమైయుండఁగా ననుక్త న్యాయమునకెట్లు ప్రసక్తికల్గును?

మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామం బగు. ౨౦.

శ్రీమంతమ్ - గుణవంతమ్ - విద్వాంసమ్ - అనడ్వాహమ్ - శ్వానమ్ - ఉపానహమ్ - అప్సరసమ్ - ఇత్యాదులు.

బాలవ్యాకరణ వివరణము.

౧౭౧ I విషయము. దాని యంతిమ మకారంబునకు లోపంబగు. ౨౧.

శ్రీమంత-గుణవంత - విద్వాంస - అనడ్వాహ-ఇత్యాది. వీని కజంతంబులకుంబోలె డు జాదులు యథాయోగ్యంబుగానగు. అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు - వానివంశము శ్రీమంతము - వీనివంశము

గుణవంతము - విద్వాంసుఁడు - విద్వాంసము - అన
డ్వాహము - శ్వానము - అప్సరస. వక్ష్యమాణ లక్ష
ణంబుచే స్త్రీత్వంబున మతుబాదికంబులు ఙ్యంతంబులె
యిందు గ్రహింపంబడు. శ్రీమతి - గుణవతి - విదుషి -
శుని. మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు -
గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయో
గింపఁదగు.

సంజీవని. ౧౭౧ I విష:—మతుబాదికంబు = మతుప్ ప్రత్యయము మున్నగు నవి. సంస్కృతమున న్తస్త్యర్థమున (అది దీనికిఁ గలదనునర్థమున) 'మతుప్' అను ప్రత్యయమువచ్చును. "తదస్యాస్త్యస్మిన్నితి మతుప్. (౫-౨-౯౪). (సి. కౌ. ౧౮౯౪ సూ.)" అను పాణినిసూత్రముచొప్పున నయ్యది సిద్ధించును. "మాదుపధాయాశ్చ మతో ర్వోఽయ వాదిభ్యః. (౮-౨-౯), ఝయః." (౮-౨-౧౦) (సి. కౌ. ౧౮౯౭-౧౮౯౮ సూ.) అనునవి మొదలగు సూత్రములచే నట్టి మత్ ప్రత్యయమకారము కొన్నియెడల వకారమగును. "మోఽజ్ఝఝపాద్వతుః" (వృత్తి) మకారోఽజః - అవర్ణోఽజః - మకారాన్తా దవర్ణాన్తాత్ - ఝపన్తాచ్చ వతుస్స్యా దస్త్యర్థే - లక్ష్మీవాన్ - యశస్వాన్ - భాస్వాన్ - కింవాన్ - జ్ఞానవాన్ - విద్యావాన్ - విద్యుత్వాన్ -" (ముగ్ధబో. ౪౪౨ సూ.) మకార ముపధగాఁగల శబ్దముల కంటెను, 'అ' వర్ణ ముపధగాఁగల శబ్దములకంటెను, మకారాంత శబ్దములకంటెను, 'అ' వర్ణాంత శబ్దములకంటెను, ఝప్ ప్రత్యాహారాంత వర్ణములకంటెను, (వర్గపంచమములుతప్పఁ దక్కిన స్పర్శములు) బరముగా వతు ప్రత్యయమువచ్చునని పై ముగ్ధబోధ వ్యాకరణసూత్రమున కర్థము. ఇట్టి మత్వంతములును వత్వంతములును మాత్రమేకాక యింకను విద్వస్ - మున్నగునవియును గుణవదాదులని యెన్న వలెను (విస్తర). 'సత్యజిత్ - ఇంద్రజిత్' మున్నగు నలంతిశబ్దములుతప్పఁ దక్కిన తకారాంతములును, (విస్తర II ౧౭౦ II విష.) దకారాంత హకారాంతములును

---

విస్తర. ౧౭౧ I విష:—అనుశాసనకర్త యీసందర్భమునందలి బాలవ్యాకరణ విషయములను సంగ్రహించుటలోఁ గొంత పొరపడినట్లు కన్పట్టుచున్నది. "మత్వర్థీయాంత వస్వంతముల ద్వితీయైకవచనరూపములు తెలుఁగున నామము లగును. అగుచోఁ దుదిమకారము లోపించును. ఉదా:—శ్రీమంతమ్ - శ్రీమంత; విద్వాంసమ్ - విద్వాంస; ఇత్యాదులు. ప్రాకృతమందు ప్రథమైకవచనమున 'శ్రీమంతో - భగవంతో - గుణవంతో' యనురీతిని మత్వర్థీయాంతశబ్దముల రూప

కుత్వమువచ్చెడి జకారాంతములును (విస్తర III ౧౨౦ II విష.) శ్వశబ్దమును మఘవచ్ఛబ్దమును గుణవద్గణములోనివేయని యీనాఁటికి వ్రాసియేయున్నారు. సకారాంత మహన్మహతీవాచకములు గణద్వయకార్యములతోఁ బ్రయుక్తము లగుననియు (విస్తర. IV ౧౨౦ II. ౧౨౧ విష. కల్ప.) నీనాఁడే వ్రాసియున్నారు. ముందు ప్రయోగ ప్రదర్శనపూర్వకముగ విస్తరింపఁబడును. (౧౨౯-౧౩౦ విష.) కావున నిటఁ బునరుక్తముగ నవ్వివిషయములు వ్రాయఁబడలేదు. శ్రీమాన్ - శ్రీమన్తౌ - శ్రీమన్తః - (సం. పుం. ప్ర.) శ్రీమన్తమ్. శ్రీమన్తౌ. శ్రీమతః. (సం. పుం ద్వి.) శ్రీమతీమ్ - శ్రీమత్యౌ - శ్రీమతీః. (స్త్రీ. సం. ద్వి.) శ్రీమత్ - శ్రీమతీ - శ్రీమన్తి (సం-న. ద్వి.) ఇట్లు మూఁడులింగముల రూపములున్నను నీ శేషవిభక్తు

---

ములుండును. ఆరూపములె తెలుఁగున అకారాంతములైన ప్రాతిపదికములయిన వనియు నూహింపవచ్చును." (ఆం. భా. అ. శబ్ద. ౨౫ సూ.) ఇట్లె ౨౬ సూత్రమందును మత్వర్థీయాంతములు వస్వంతములుమాత్రము చెప్పఁబడుటయు నాది శబ్దము చేర్పఁబడకుండుటయుఁ బ్రమాదికములె యనఁదగును. అట్లగుటచే "అనడ్వాహమ్ - శ్వానమ్" మున్నగునవి సంగ్రహింపఁబడవయ్యె.

ఈయనుశాసనపుఁ బ్రథమముద్రణమున నింకను బ్రమాదము చూపట్టుచున్నది. 'వస్వంతముల' అను దళముసైతము మీ ౨౫-౨౬ సూత్రములలో లేదు. అట్లయినను రెండుసూత్రముల వివరణములలోను 'విద్వాంస - విద్వాంసుఁడు' అనునవి యుదాహరింపఁబడెను. "మత్వర్థీయాంతములైన సంస్కృతశబ్దముల ద్వితీయైకవచనరూపములు తెలుఁగున నామములగును......ఉదా:—విద్వాంస..." (౨౫ సూ.). "మహద్వాచకములైన తత్సమ మతుబంతనామములు రామశబ్దతుల్యంబులు...ఉదా:—విద్వాంసుఁడు..." (౨౬ సూ.). (ఆం. భా. అ. శబ్ద. ప్రథమ ముద్రణము) పై సందర్భమునుబట్టి గ్రంథకర్త విద్వచ్ఛబ్దమును గుణవచ్ఛబ్దమువంటి మత్వర్థీయ తద్ధితాంతమని తలంచెననక తీరదు. అందు స్థలాంతరమునందును నిట్లె వ్రాయఁబడెను. "మహతీవాచకములైనచో నీమతుబంతములకు ఆలుశబ్దము చేరును. భగవంతురాలు - శ్రీమంతురాలు - విద్వాంసురాలు..." (ఆం. భా. అ. శబ్ద. ౨౭ సూ. వివరణము. ప్రథమముద్రణము.)

మఱియుఁ దృతీయముద్రణమునందు సైతము మత్వర్థీయములనెల్ల గ్రహించుటచే 'కరిణమ్ - తేజస్వినమ్' మున్నగునవియును నిందుఁ జేరనుగాన 'కరిణము తేజస్వినము మున్నగు ననిష్టరూపములు సంభవింపవలసివచ్చుచున్నది. "ప్రథమైక వచన తుల్యమ్...ద్వితీయైకవచన తుల్యః" అని భట్టారకుఁడును, నట్లె తుల్యశబ్దము

గుణవంతము - విద్వాంసుఁడు - విద్వాంసము - అన డ్వాహము - శ్వానము - అప్సరస. వక్ష్యమాణ లక్ష ణంబుచే స్త్రీత్వంబున మతుబాదికంబులు ఙ్యంతంబులె యిందు గ్రహింపంబడు. శ్రీమతి - గుణవతి - విదుషి - శుని. మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయో గింపఁదగు.

సంజీవని. ౧౭౧ I విష:—మతుబాదికంబు = మతుప్ ప్రత్యయము మున్నగు నవి. సంస్కృతమున నస్త్యర్థమున (అది దీనికిఁ గలదనునర్థమున) 'మతుప్' అను ప్రత్యయమువచ్చును. "తదస్యాస్త్యస్మిన్నితి మతుప్. (౫-౨-౯౪). (సి. కౌ. ౧౮౯౪ సూ.)" అను పాణినిసూత్రముచొప్పున నయ్యది సిద్ధించును. "మా దుపధాయాశ్చ మతోర్వోఽయ వాదిభ్యః. (౮-౨-౯), ఝయః." (౮-౨-౧౦) (సి. కౌ. ౧౮౯౭-౧౮౯౮ సూ.) అనునవి మొదలగు సూత్రములచే నట్టి మత్ ప్రత్యయమకారము కొన్నియెడల వకారమగును. "మోఙ్మఝపాద్వతుః" (వృత్తి) మకారోఙః - అవర్ణోఙః - మకారాన్తా దవర్ణాన్తాత్ - ఝపన్తాచ్చ వతుస్స్యా దస్త్యర్థే - లక్ష్మీవాన్ - యశస్వాన్ - భాస్వాన్ - కింవాన్ - జ్ఞానవాన్ - విద్యా వాన్ - విద్యుత్వాన్ -" (ముగ్ధబో. ౪౪౨ సూ.) మకార ముపధగాఁగల శబ్దముల కంటెను, 'అ' వర్ణ ముపధగాఁగల శబ్దములకంటెను, మకారాంత శబ్దములకంటెను, 'అ' వర్ణాంత శబ్దములకంటెను, ఝప్ ప్రత్యాహారాంత వర్ణములకంటెను, (వర్గపంచ మములుతప్పఁ దక్కిన స్పర్శములు) బరముగా వతు ప్రత్యయమువచ్చునని పై ముగ్ధ బోధ వ్యాకరణసూత్రమున కర్థము. ఇట్టి మత్వంతములును వత్వంతములును మాత్రమే కాక యింకను విద్వస్ - మున్నగునవియును గుణవదాదులని యెన్న వలెను (విస్తర). 'సత్యజిత్ - ఇంద్రజిత్' మున్నగు నలంతిశబ్దములుతప్పఁ దక్కిన తకారాంతములును, (విస్తర II ౧౭౦ II విష.) దకారాంత హకారాంతములును

---

విస్తర. ౧౭౧ I విష:—అనుశాసనకర్త యీసందర్భమునందలి బాలవ్యా కరణ విషయములను సంగ్రహించుటలోఁ గొంత పొరపడినట్లు కన్పట్టుచున్నది. "మత్వర్థీయాంత వస్వంతముల ద్వితీయైకవచనరూపములు తెలుఁగున నామము లగును. అగుచోఁ దుదిమకారము లోపించును. ఉదా:—శ్రీమంతమ్ - శ్రీ మంత; విద్వాంసమ్ - విద్వాంస; ఇత్యాదులు. ప్రాకృతమందు ప్రథమైకవచనమున 'శ్రీమంతో - భగవంతో - గుణవంతో' యనురీతిని మత్వర్థీయాంతశబ్దముల రూప

కుత్వమువచ్చెడి జకారాంతములును (విస్తర III ౧౩౦ II విష.) శ్వశబ్దమును మఘవచ్ఛబ్దమును గుణవద్గణములోనివేయని యీవఱకు వ్రాసియేయున్నాను. సకారాంత మహన్మహతీవాచకములు గణద్వయకార్యములతోఁ బ్రయుక్తము లగుననియు (విస్తర. IV ౧౭౦ II. ౧౭౧ విష. కల్ప.) సీవఱకే వ్రాసియున్నాను. ముందు ప్రయోగ ప్రదర్శనపూర్వకముగ విస్తరింపఁబడును. (౧౭౫-౧౯౧ విష.) కావున నిటఁ బునరుక్తముగ నయ్యెవిషయములు వ్రాయఁబడ లేదు. శ్రీమాన్ - శ్రీమన్తౌ - శ్రీమన్తః - (సం. పుం. ప్ర.) శ్రీమన్తమ్. శ్రీమన్తౌ. శ్రీమతః. (సం. పుం ద్వి.) శ్రీమతీమ్ - శ్రీమత్యౌ - శ్రీమతీః. (స్త్రీ. సం. ద్వి.) శ్రీమత్ - శ్రీమతీ - శ్రీమన్తి (సం-న. ద్వి.) ఇట్లు మూఁడులింగముల రూపములున్నను నీవిశేష్య నిఘ్న

---

ములుండును. ఆరూపములె తెలుఁగున అకారాంతములైన ప్రాతిపదికములయిన వనియు నూహింపవచ్చును." (ఆం. భా. అ. శబ్ద. ౨౫ సూ.) ఇట్లె ౨౬ సూత్ర మందును మత్వర్థీయాంతములు వస్వంతములుమాత్రము చెప్పఁబడుటయు నాది శబ్దము చేర్పఁబడకుండుటయుఁ బ్రామాదికములె యనఁదగును. అట్లగుటచే "అన డ్వాహమ్ - శ్వానమ్" మున్నగునవి సంగ్రహింపఁబడవయ్యె.

ఈయనుశాసనపుఁ బ్రథమముద్రణమున నింకను బ్రమాదము చూపట్టు చున్నది. 'వస్వంతముల' అను దళముసైతమ మీ ౨౫-౨౬ సూత్రములలో లేదు. అట్లయినను రెండుసూత్రముల వివరణములలోను 'విద్వాంస - విద్వాంసుఁడు' అను నవి యుదాహరింపఁబడెను. "మత్వర్థీయాంతములైన సంస్కృతశబ్దముల ద్వితీయైకవచనరూపములు తెలుఁగున నామములగును......ఉదా:—విద్వాంస..." (౨౫ సూ.). "మహద్వాచకములైన తత్సమ మతుబంతనామములు రామశబ్దతుల్యంబులు...ఉదా:—విద్వాంసుఁడు..." (౨౬ సూ.). (ఆం. భా. అ. శబ్ద. ప్రథమ ముద్రణము) పైసందర్భమునుబట్టి గ్రంథకర్త విద్వచ్ఛబ్దమును గుణవచ్ఛబ్దమువంటి మత్వర్థీయ తద్ధితాంతమని తలంచెననకతీరదు. అందు స్థలాంతరమునందును నిట్లె వ్రాయఁబడెను. "మహతీవాచకములైనచో నీమతుబంతములకు ఆలుశబ్దము చేరును. భగవంతురాలు - శ్రీమంతురాలు - విద్వాంసురాలు..." (ఆం. భా. అ. శబ్ద. ౨౭ సూ. వివరణము. ప్రథమముద్రణము.)

మఱియుఁ దృతీయముద్రణమునందు సైతము మత్వర్థీయములనెల్ల గ్రహించుటచే 'కరిణమ్ - తేజస్వినమ్' మున్నగునవియును నిందుఁ జేరునుగాన 'కరిణము తేజస్వినము మున్నగు ననిష్టరూపములు సంభవింపవలసివచ్చుచున్నది. "ప్రథమైక వచన తుల్యమ్...ద్వితీయైకవచన తుల్యః" అని భట్టారకుఁడును, నట్లె తుల్యశబ్దము

శబ్దములకు నపుంసకలింగ విశేషణత్వమునందును పుల్లింగ ప్రథమైకవచన తుల్య రూపమే ప్రాతిపదికమగుట సంప్రదాయమైయున్నది. ఉదా:—వాఁడు శ్రీమంతుఁడు; ఆమె శ్రీమతి - శ్రీమంతురాలు: ఆకులము శ్రీమంతము - వానికళత్రము శ్రీమంతము - శ్రీమంతురాలు - మొ.

ప్రయోగములు:— ఆ. వె....ఇమ్మణి। మంతుఁడిపుడు తనదు మదముపేర్మి (ఆర. ౪ ఆ. ౩౧ ప.) ఆ. వె. నిద్రనున్న ధర్మనిర్మలు హనుమంతు।...(ఆర. 3 ఆ. ౩౧౯) క.। వీఁడు హనుమంతుఁడనఁగ విందుఁ గపీంద్రా (ఆర. 3 ఆ. 3౨౭) చ. అనుపమ శౌర్యవంతులరు (ఆర. 3 ఆ. ౧౬౫) క. అలఘులగు వృద్ధ విద్వాం। సులకు మహాయాజ్ఞికులకుఁ జారనర్హాంబై।...(ఆర. 3 ఆ. ౨౪౭) సీ. యజ్ఞంబు

తోనె సూరియు సూత్రించియుండఁగా నట్టి తుల్యశబ్దమునుపీడి యనుశాసనకర్త ప్రథమైకవచన ద్వితీయైక వచనరూపములమీఁదనే తెల్గువిభక్తులు నిల్చునని సూత్రించుట వైయాకరణ సంప్రదాయవిరుద్ధమై యున్నది.

"హనుమంతుఁడు ఇతి ప్రాకృతసమమపి - 'మంత - మణ - వంత - మా - ఆలు - ఆల - ఇర - ఇల్ల - ఉల్ల - ఇంతా - మతుపః' (౨-౧-౧) (షడ్భా. ౧౧౨ పు.) ఇతి సూత్రేణ మతుపః స్థానే మంతాదేశ ఇతి విధానాత్" (అహో. 3౭౫ పు.) అను కవిశిరోభూషణ గ్రంథమును సంగ్రహింపఁదలఁచి పయిరీతిని వ్రాసిన యనుశాసన గ్రంథమును భ్రామాదికమె యనఁదగును. 'గుణవంత' మున్నగునవి ప్రాకృతసమములని యంగీకరించునపుడు ప్రాకృతసమము లాచ్ఛికములగుటంజేసి "మహాగుణవంతుఁడు" మున్నగునవి వైరిసమాసములు కావలసివచ్చును. కాన చ. అనుపమ శౌర్యవంతులరు...(ఆర. 3 ఆ. ౧౬౫) మున్నగు నన్నయప్రయోగములు విరుద్ధములు కావలసివచ్చును. మఱియు సంస్కృతమున 'మతు - వతు' అనునవి నిల్చిన చోటులందే ప్రాకృతమున 'మన్త - వన్త' అనునవి నిల్చుననుకొనుటయు సరికాదు. ఇంతియకాక సంస్కృతమునందలి శ్రీప్రభృతిశబ్దములు 'సిరి' మున్నగురూపములతోఁ బ్రాకృతసమములగుచుండుటంజేసి ప్రాకృతసమత్వమున 'సిరిమన్త' అనురీతిని 'శ్రీమాన్' మున్నగుశబ్దములు మాఱవలసియుండునుగాన 'శ్రీమన్త' మున్నగునవి ప్రాకృతసమములనుటయుఁ భ్రామాదికమె యనకతీరదు. పయిప్రాకృత వ్యాకరణ సూత్రము నీక్రిందిరీతిని లక్ష్మీధరపండితుఁడు వివరించెను "మత్ ప్రత్యయస్య మన్తాదయ ఆదేశా యథాయోగం భవన్తి. మన్త - శ్రీమాన్ = సిరిమన్తో, పుణ్యవాన్ = పుణ్ణమన్తో, మణ - ధనవాన్ = ధణమణో, వన్త - భక్తిమాన్ = భత్తివన్తో, మా - హనుమాన్ = హణుమా, పటవాన్ = పడమా..." (షడ్భా. ౧౧౨-౧౧3 పు.)

లును నీవ హావ్యవాహా । (సభా. ౧ ఆ. ౨౪౯) సీ. అంచు జలక్రీడ లాడుచునున్న యప్సరస ఘృతాచియన్ సదములాంగి (ఆది. ౫ ఆ. ౧౯౫) ఇంకను గొన్ని ప్రయోగము లీవలఱకును జూపఁబడెను. (మూ. ౧౭౦ I విష. ౧౭౦ II విష. విస్తర - III ౧౭౦ II విష.)

నన్నయా. కుత్రచిచ్ఛబ్దభేదేషు । భవేత్పర్యస్తలిఙ్గతా ॥ (విక్ృ. ౧౭౨ విషయము. అజం. ౬౨ కారి. అహో. 3౮౭ పు.)

కల్పతరు. ౧౭౨ విష:—ఈకారికకీవలఱకు ౧౬౮ విషమునందును ౧ VIII విషయమునందును వ్యాఖ్యచేయఁబడెను. స్రజమ్ - ఉపానహమ్ - ముదమ్ - మున్నగు ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికములమీఁది సుప్రత్యయము "అను తాంస్త్రియా" మిత్యాదిసూత్రముచే నిత్యలోపము నందవలసియుండఁగా నట్టి స్త్రీలింగశబ్దములకు "కుత్రచిది" త్యాది ప్రకృతసూత్రముచే లింగవిపర్యాసము కల్గఁగా నఁగా వానికి నపుంసకత్వము సంభవించుటచే నిత్యముగా ముపర్ణ కాదులు వచ్చునని యెఱుంగునది. ఉదా:—స్రజము - ఉపానహాము - ముదము - మొ. "ముచ్ఛబ్దస్య ముదంబు - లిఙ్గవ్యత్యయః - ముదం బొనరం గొనియాడి వేడుకన్- (ఆది. ౧ ఆ. ౨౮) ఇత్యాచార్యః." (అహో. 3౮౭.)

బాలవ్యా. ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబులేదు. ౭౨ ౧౭౨ I విషయము. ముదము - ఉపానహాము - స్రజము.

సంజీవని. ౧౭౨ I విష:—"ముదము - సం - వి - ద్ - స్త్రీ. సంతోషము. హర్షము." "ఉపానహాము. సం - వి - హ్ - స్త్రీ. చెప్పు (లు)." "స్రజము. సం. వి. జ్. స్త్రీ. పూలదండ. హారము." (శ. ర.) "ఉపానహాము. సం - వి - హ్. స్త్రీ. చర్మపాదుక - చెప్పు." (సూ. రా. ని.) "ముదమ్ - ఉపానహమ్- స్రజమ్" మున్నగు ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికములతుది మకారము లోపించినపిదప నివి స్త్రీలింగములగుటంజేసి బా. తత్స. ౫౭ సూత్రముచొప్పున వీనికిఁ బ్రథమైకవచనలోపము ప్రాప్తించుచుండఁగాఁ బ్రకృతసూత్రముచే నట్టి స్త్రీలింగ ప్రథమైకవచనలోపము సూరిచే నిషేధింపఁబడెను. అట్టియెడల నీముదాదు లమహాత్తులగుటంజేసి. బా - తత్స - 3౯ సూత్రముచొప్పున వీనికి ముపర్ణకముగాగమాదులు ప్రాప్తించుచున్నవి. ఉదా:—ముదము - ముదమ్ము - ముదంబు - ముదముచేతను. మొ. సీ..... । అదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును... (ఆది. ౧ ఆ. ౭ ప.) (ఆం. భా. చరిత్రకర్త ముచ్ఛబ్దము నపుంసకమనుట (౧3౬3 పుట.) పొరపాటు.

అహోబలపతి "ఉపానత్తు - (అహో. ౩౮౭) స్రుక్కు" (అహో. ౩౮౮ పు.) అని యుదాహరించెను. కాని వీని యగుణవర్ణస్థితికిఁ బ్రయోగములను జూపలేదు. (చూ. విస్తర. III ౧౭౦ II విష.). ఇట్లె సూరి 'వీరుత్తు' అని (బా. తత్స. ౬౮ సూ.) యుదాహరించెనుగాని యట్టి ప్రయోగము లభింపలేదు. "వీరుథము - సం - వి - ధ్ - స్త్రీ" అను శబ్దరత్నాకరో దాహృతిచొప్పున ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికముగలదానిఁగ నంగీకరించుటయె యుక్తమనితోఁచును. ఈపక్షమున దీనినిసైతము ముదాదులలోఁ జేర్పవలసియుండును. అట్లు కానిచో నిది స్త్రీలింగమగుటచే దీనికిఁ బ్రథమైకవచనలోపము రావలసివచ్చును. 'నీవృతము - నీవృత్తు' అని గణద్వయగతశబ్దముగా సూరి దీని నుదాహరించెనుగాని దీని యగుణవర్ణస్థితికిఁ బ్రయోగముకానరాదు. "గమికర్మీకృతనైక నీవృతుఁడనై" (శృం. నై. ౨ ఆ. ౨౧ ప.) అని యిట్లిది గుణవర్ణరూపముతోనే ప్రయోగదృష్టమగుచున్నది. "నీవృత్తు - సం-వి - త్ - పుం - ౧ గ్రామము. ౨ దేశము" (శ. ర.) (సూ. రా. ని.). అని యిట్లాంధ్రనిఘంటువులలో వ్రాయఁబడుటయు సరికాదు. మఱియు నీకోశద్వయమునందును నిది పులింగముగమాత్రమె చూపఁబడుటయు సరికాదు. శబ్దార్థచింతామణి శబ్దస్తోమ మహానిధికోశములలో నియ్యది పుం స్త్రీలింగములతోఁ జూపఁబడెను. "నీవృద్ద్వయో స్మృతా దేశే" ఇతి శబ్దాంబుధిః" అని శబ్దార్థచింతామణిలో ప్రమాణమునైతము చూపఁబడెను. కావున దీని స్త్రీత్వపక్షమున దీనినిసైతము ముదాదులలోఁజేర్చి స్త్రీలింగ ప్రథమైకవచనలోపమును వారించుకొనవలసి యుండును.

బాలవ్యా. ఋత్విగాదులు ద్వితీయైకవచనాంత తుల్యంబులు విభాషనగు. ౭౩.

౧౭౩ విషయము. ఋత్విజుఁడు - ఋత్విక్కు. నీవృతము-నీవృత్తు. ఋత్విగాదికం బాకృతిగణంబు.

సంజీవని. ౧౭౩ విష:—ఇది సూరిగారు స్వయముగాఁజేర్చినది. ఇది యాంధ్రశబ్దచింతామణికి సమ్మతముకానివిషయము. (చూ. ౧౬౯ I విష.) 'గుణవర్ణ భిన్నమగుణవర్ణము' అనెడి చింతామణిరచనయె గణద్వయకార్యము లొక్కశబ్దమునకసంభవములని విశదీకరించుచున్నది. ఇంతకును సూరియిచ్చిన లక్ష్యములు రెండిటికిని గవిప్రయోగ ప్రామాణ్యములేదు. భట్టారకుఁడెచ్చటఁ బ్రయోగించినను "ఋత్విజుఁడు" అను గుణవర్ణకార్యములతోడి రూపమునె ప్రయోగించుచు వచ్చెనని యీవఱకుఁ బ్రయోగ ప్రదర్శనపూర్వకముగఁ జూపఁబడెను. (విస్తర. III ౧౭౧ II విష.) "గమికర్మీకృతనైక నీవృతుఁడనై" (శృ. నై. ౨ ఆ. ౨౧) అని

శ్రీనాథుఁడు నీవృచ్ఛబ్దమును గుణవర్ణకార్యముతోనె ప్రయోగించెను. (మా. ౧౭౨ I విష.). సూరి ప్రథమైకవచన తుల్యప్రాతిపదికమునుండి సాధింపకున్నను నహోబలపతి యట్లు సాధించిన 'భగవానుఁడు హనుమానుఁడు' అను రూపములును "భగవంతుఁడు హనుమంతుఁడు" అను రూపములును గణ్వయకార్యస్థితికి నిదర్శనములగుచున్నవి. కాని 'భగవానుఁడు - హనుమానుఁడు' అను రూపములు కవి ప్రయోగదృష్టములు కామింజేసి యట్టి శంకకుఁ బ్రసక్తిలేదు. (విస్తర. II ౧౭౦ II విష.) సకారాంత మహన్మహతీశబ్దములందుఁ దక్క మఱెచ్చటను భట్టాకుఁడు గణద్వయకార్యము లొక్కశబ్దమునందుఁ బ్రయోగించియుండలేదు. కాని కుండలీంద్రుఁడును బ్రబంధపరమేశ్వర భాస్కరులును "సత్యజిత్తు - సత్యజితుఁడు - ఇంద్రజిత్తు - ఇంద్రజితుఁడు" అను రెండుస్థలములందుమాత్రము గణ్వయకార్యముల సాంకర్యమును బ్రయోగించిరి. ఆ. వె. సత్యజిత్తు మేనసాయక దశకంబు (ద్రోణ. ౧ ఆ. ౨౧౭ ప.) క. కినిసి వెసన్ సత్యజితుని । ధనువుచటికి (ద్రోణ. ౧ ఆ. ౨౮౫ ప.) సీ....ఆ. వె.... । ఇట్లు సంగరమున నింద్రజిత్తు । పడిన....(ఆర. ౭ ఆ. ౧౩౬) సీ....గీ.... । ఇంద్రజితుఁడంతఁ దండ్రితో నిట్టులనియె (భాస్క. రా. యుద్ధ. ౨౯౧) ఉ. నీకొడు కింద్రజిత్తు రజనీ చరనాయక...(భాస్క. రా. యుద్ధ. ౧౦౬౩) ఇట్టి కవి ప్రయుక్తరూపములను మాత్రము నిపాతన్యాయమున నంగీకరించి తక్కిన యెడలఁ జింతామణి విరుద్ధముగ గణద్వయకార్య సాంకర్యము సాధువుకానేరదని నిర్ణయించుట యుక్తము. సూరి పైనుదాహరించిన కవిప్రయోగ దృష్టములను సూత్రింపక కవిప్రయోగ ప్రామాణ్యముచూపకయె "ఋత్విగాదులు--అని" సూత్రించుట వింతగనున్నది.

నన్నయాథర్వణాశయములును మహాకవిప్రయోగములును బైరీతినుండఁగా గాణపతీ వివరణకర్తయు గుప్తార్థప్రకాశికాకర్తయుఁ బ్రమాణ ప్రదర్శనహీనమ్ముగ యథేచ్ఛముగ నీక్రిందిరీతిని వ్రాయుట సాహసము.

"ఉభయరూపముల కుదా:—ఋత్విక్కు - ఋత్విజుఁడు...పరిక్షిత్తు - పరిక్షితుఁడు - మరుత్తు - మరుతుఁడు......నీవృత్తు - నీవృతము, సంపత్తు - సంపద... సంపత్తులు - సంపదలు,...ఆపత్తు - ఆపద,...సమిత్తు - సమిధ..." (గాణ. తత్స. ౧౧౩ సూ. టీక.) "వణిక్కు - వణిజుఁడు, పుష్పముక్కు - పుష్పముచుఁడు, వేదవిత్తు - వేదవిదుఁడు, పాలితకకుప్పు - పాలితకకుభుఁడు, ఘృతస్పృక్కు - ఘృతస్పృశుఁడు, సురద్విట్టు - సురద్విషుఁడు, అమృతలిట్టు - అమృతలిహుఁడు, త్వక్కు - త్వచము, తటిత్తు - తటితము, జలముక్కు - జలముచము, మధులిట్టు - మధులిహము,

కకుప్పు - కకుభము, ప్రావృట్టు - ప్రావృషము, మొదలైనశబ్దంబులు ఆకారసామ్యం బునంజేసి ఋత్విగాద్యాకృతి గణంబులోనివని యూహించుకొనునది. ఆపత్తు - ఆపద, తృట్టు - తృష, సంపత్తు - సంపద, క్షుత్తు - క్షుధ, దృక్కు - దృశ, దిక్కు - దిశ, రుట్టు - రుష, త్విట్టు - త్విష, ఈ మొదలైనశబ్దంబులు ఋత్విగాదిగణంబులోనివి." (బా. కు. ప్ర. తత్స. ౨౩ సూ. వ్యాఖ్య.) (చూ. విస్త. I ౧౭౦ II విష. విస్తర. III ౧౭౦ II విష.) ఇట్లు ప్రమాణశూన్యముగను నన్నయాశయ విరుద్ధముగను యథేచ్ఛముగనుదాహరించు తత్తరపాటులో గుప్తార్థ ప్రకాశికాకర్త 'త్వచము-తటితము - కకుభము - ప్రావృషము' అను స్త్రీలింగములకుఁ బ్రథమైకవచనలోపమును మఱచి మువర్ణకస్థితిని మఱికొన్నిటి యాకారసామ్యమున నుదాహరించెను. వీనిని ముదాదులలోఁ జేర్చి సాధించుకొనరాదా యందమున్న నట్టితలంపున్నట్లు సూచింపనైనలేదు. మఱికొన్ని యస్త్రీలింగములమధ్యమున నివి పరిగణింపఁబడియున్నవి; ఆకృతిగణములలో శబ్దములను జేర్చుట కవిప్రయోగాది ప్రమాణము నాధారముగఁ గొని కదా చేయవలయును. అట్టి ప్రమాణము లేవియుఁ జూపఁబడ లేదుగదా!

ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్ప్రకారంబున
బాలవ్యా. కానాదేశంబు విభాషనగు. ౨౮.
౧౭౮ విషయము. హనుమానుఁడు - హనుమంతుఁడు - భగవానుఁడు -
భగవంతుఁడు ఇత్యాది.

సంజీవని. ౧౭౮ విష:—ఈసూత్రము సైతము సూరిగారు స్వయముగాఁ జేర్చినదే. ఇదియు నన్నయాథర్వణ సమ్మతము కాదు. 'హనుమానుఁడు భగవానుఁడు' అను రూపములను స్థాపించు మహాకవి ప్రయోగములును గన్పట్టలేదు. (చూ. ౧౬౯ III విష. విస్తర-II ౧౭౦ II విష.) ఈ క్రింది యహోబలపంక్తులె యీసూరిరచనమునకు మూలమని తోఁచెడిని. "హనుమానుఁడు - భగవానుఁడు ఇతి రూపం త్వగుణవద్గణత్వేన బోధ్యమ్. హనుమంతుఁడు ఇతి రూపం ప్రాకృతసమమపి...విశేషణస్య గుణవద్గణత్వే ఆ. వె. మంత్రవంతముగఁ గ్రమంబున నేవురు। ఇత్యాచార్యవచనం మానమ్ (ఆది. ౭ ఆ. ౨౧౨ ప.)"(అహో. ౩౮౫). తుది కహోబలపతిసైతము గణద్వయకార్య సాంకర్య మొక్కశబ్దమున సమ్మతింపఁజాలకయె 'హనుమంతుఁడు' అను రూపమును బ్రాకృతసమముగా సాధింపఁజూచెను. క.... హనుమద్భగవత్పదములు । పనివడి హనుమంతుఁడనఁగ భగవంతుఁడనన్ । హానుమానుఁడు భగవానుఁడు । ననుచుఁ బ్రయోగింపఁజెల్లు నంబరవసనా ॥ (సర్వల. ౧ ఆ. ౨౦ ప. ౩ పు.) అని యిట్లు తిమ్మకవి యహోబల పండితీయానుసారముగ వచిం

చెనే కాని యట్టిపదములకుఁ బ్రయోగ మెక్కడను చూపలేదు. శబ్దరత్నాకరమున, 'హనుమానుఁడు, హనుమంతుఁడు' అనునవి సంస్కృతసమములుగాను "అనుమఁడు - హనుమఁడు - హనుమ" అనునవి వైకృతములుగాను జూపఁబడినవి. 'హనుమఁడు - అనుమఁడు' అను వానిరీతిని 'హనుమ' అనుదానికి 'అనుమ' అను రూపాంతర మేల యంగీకరింపఁబడలేదో తెలియకున్నది. 'హనుమఁడు' అను దానికిని బ్రయోగము చూపఁబడలేదు.

ఆత్మన ఇమనస్తానాం డా వా(ఆం. చిం. హలం. 3 కారి,
సన్నకా అహో. ౩౯౨ పుట.)
ధన్వానియము. క్వచి న్మనుజసంజ్ఞాయాం । డుక్ నాస్తా న్నవిధీయతే॥
౧౨౫ విషయము. పుం బ్రహ్మణో వేధసశ్చ । హ్రస్వత్వేనైవ సంస్థితిః
(వికృ. హలం. ౧-౨ కారి. అహో. ౩౮౮ పుట.)

కల్పతరు. ౧౨౫ విషః—అత్ = హ్రస్వమగు 'అ' వర్ణమునకుఁ దర్వాతనుండు, మనః = 'మన్' అను దానికిని ఇమనస్తానామ్ = ఇమన్ ప్రత్యయాంతశబ్దములకును బరముగ, డా వా = డా ప్రత్యయము వికల్పముగానగును. (విస్తర.) ఈసూత్రము లోని వాశబ్దము వ్యవస్థావాచియగుటచేత నట్టి మన్నంతములు కాని '(యువన్ - యజ్వన్ ?) పూషన్' మున్నగు మఱికొన్ని కవిప్రయుక్తశబ్దములకును డా ప్రత్యయమువచ్చుననియు - 'అర్యమన్ - కర్మన్ - వర్మన్ - మహాత్మన్'-మున్నగు మన్నంతములకు డా ప్రత్యయము రానేరదనియు వ్యాఖ్యానము చేసికొనవలసియున్నది. సంస్కృత వ్యాకరణములోని "డాబుభాభ్యా మన్యతరస్యామ్"(౪-౧-౧౩) (సి. కౌ. స్త్రీ. ప్ర.) అను రీతినివచ్చు డా ప్రత్యయమువంటిదగుటచే ప్రకృతసూత్రము విధించు డా ప్రత్యయము స్త్రీప్రత్యయమనియు నీ డా ప్రత్యయాన్తములకు స్త్రీలింగకార్యమ్ము లగుననియు వ్యాఖ్యానము చేసికొనవలయును. అట్లు కానిచో 'ఆత్మా' మున్నగు మన్నంతముల ప్రథమైకవచన తుల్యప్రాతిపదికము 'ఆ' కారాంత మయియేయుండఁగా వానికి డా ప్రత్యయవిధానము సిద్ధసాధనమే కావలసివచ్చును

విస్తర. I ౧౨౫ విషః—'అత్+మనః' అనుచో తకారమునకు దకారము రాకపోవచ్చును. సంస్కృతమున "వాక్యేతు సావివక్షామపేక్షతే" అనుచొప్పున సంధివైవక్షికము. 'ఇమనన్తామ్' అనుచో 'ఇమన్నన్తానామ్' అని నకారద్విత్వము "జమోహ్రస్వాదచి జముణ్ణిత్యమ్ (౮-3.3౨)" అనుచొప్పున రావలసియున్నను "ఇకోయణచి-సనాద్యన్తాధాతవః - సుప్తిఙన్తం పదమ్" అను జ్ఞాపకములచొప్పున నట్టి ద్విత్వ మనిత్యమునఁదగును.

గవా. డా ప్రత్యయములోని డకార మిత్సర్ణము. అట్లగుటచే ఆత్మా - విశ్వ కర్మా - సుశర్మా - మొదలగు శబ్దములపైని డా ప్రత్యయము నిల్చునపుడు, "అచోన్త్యాదిటి (౧-౧-౬౪) అచాం మధ్యే యోఽన్త్యః స ఆదిర్యస్య తట్టి సంజ్ఞం స్యాత్." (సి. కౌ. ౭౯ సూ.) "టేః (౬-౪-౧౪౩) డితిపరే భస్య టేర్లోపః స్యాత్" (సి. కౌ. ౩౧౬ సూ.) అను పాణినీయసూత్రములచొప్పున 'మా' అను దానిలోని 'ఆ' అను భాగము లోపించి డిత్తగు డా ప్రత్యయమనఁగా 'ఆ' అనునది నిలువఁగా 'ఆత్మా - విశ్వకర్మా - సుశర్మా' మున్నగు రూపములె ప్రాతిపదికములగుచు నిల్చును. అట్టి ప్రాతిపదికముల దీర్ఘమునకు హ్రస్వము వచ్చినపిదప 'అను తాం స్త్రియామిత్యాది సూత్రముచేఁ బ్రథమైకవచనలోపమురాఁగా, 'రమ - సీత' మున్నగు శబ్దములవలెనె "ఆత్మ - విశ్వకర్మ - సుశర్మ" మున్నగు రూపములేర్పడును. ఇంక డా ప్రత్యయము రానిపక్షమున 'ఆత్మ' మున్నగు నకారాంతములు ప్రథమైక వచన తుల్యరూపములతోఁ బ్రాతిపదికములగును గాన 'ఆత్మా - విశ్వకర్మా - సుశర్మా' మున్నగు నామములేర్పడును. అట్టి ప్రాతిపదికముల దీర్ఘమునకు హ్రస్వమువచ్చి డుమ్వాది విభక్తులు యథాసంభవముగాఁ జేరఁగా "ఆత్ముఁడు - ఆత్మము - విశ్వ కర్ముఁడు - సుశర్ముఁడు" మున్నగురూపములు సిద్ధించును. చ...ఆ। త్ముని వలనన్ భవద్వచనముఁన్......(అశ్వ. ౨ ఆ. ౧౭) క. ప్రకృతి పదాఱు వికారము। లకు నాశ్రయ మాత్మ కది నెలవు విను మాత్ముం।డకుటిల...(శాంతి. ౫ ఆ. ౬౦౩) (ఆం. భా. చరిత్రము. ౧౬౪౭ పుటలోని యీవిషయమునందలి చర్చ సరికాదు.) ఇట్లె 'గరిమన్' మున్నగు 'ఇమనిచ్' ప్రత్యయాంతములకు రూపసాధనము చేయనగును. ఉదా:—గరిమ - గరిమము - మొ. "ఆత్మన్" మున్నగువానిలోని 'మన్' అను దానికిఁ బూర్వమున 'త'కారాదులున్నను నచ్చులలో 'అ' వర్ణమె వానికిఁ బూర్వ మున నుండుటచే 'అత్' అను భేదముచొప్పున 'అ' వర్ణపూర్వకత్వ మసంభవము కానేరదు.

అథర్వణుఁడును పై రీతి నర్థముచేసికొన్నవాఁడగుటచేతనే అశ్వత్థామాది కతిచిన్మనుజ సంజ్ఞలకు నగుణవర్ధన కార్యమగు డుజ్ ప్రత్యయము రానేరదనియు నింక డా ప్రత్యయాంత రూపముమాత్రమె కల్గుననియు నీక్రిందిరీతిని వివరించు చున్నాఁడు. క్వచిన్మనుజేత్యాది:—మనుజ సంజ్ఞాయామ్ = మనుష్యవాచకములలో క్వచిత్ = క్వాచిత్కముగా, నాన్తాత్ = నకారాంతముకంటెఁ బరముగా, డుజ్ = ప్రథమైకవచన డు ప్రత్యయము, నవిధీయతే = విధింపంబడదు. అనఁగా వానికి డా ప్రత్యమము నిత్యమని పర్యవసన్నమగుచున్నది. (౧౮౨ విష. చూ.). పుం

బ్రహ్మణః = పుంలింగ బ్రహ్మ(న్) శబ్దమునకును, వేధసశ్చ = వేధశ్శబ్దమునకును, గతి చిహ్నసుజ సంజ్ఞికములకువలెనే, హ్రస్వత్వేనైవ = హ్రస్వము కలుగుటచేత మాత్రమె, సంస్థితిః = ఉనికి సంభవించును. అనఁగా 'పుం బ్రహ్మవేధశ్శబ్దములకు నైతము డా ప్రత్యయమెవచ్చి ప్రాతిపదిక దీర్ఘమునకు హ్రస్వముకలిగిన రూపముతోనె స్త్రీలింగ ప్రథమైకవచనలోపము కల్గుటచే నునికి సంభవించునని భావము. మనుష్యవాచి యగు 'అశ్వత్థామన్' అను దానికివలెనె దేవతావాచియగు 'బ్రహ్మన్' అను దానికిని డా ప్రత్యయసిద్ధిఁ కిద్వివాదము. వేధశ్శబ్దము నద్దానితో జోడించుటచే దానికిని డా ప్రత్యయసిద్ధివ్యాఖ్యాతమయ్యెను. వీనికిట్లు డా ప్రత్యయము నంగీకరింపనిచో "మనోర్నాన్తాన్నవిధీయతే" అను పథర్వ్యావచనమాత్రమునఁ బ్రథమైకవచనలోపము సుసంభవము కానేరదుగదా. ఉదా:—అశ్వత్థామ - బ్రహ్మ - వేధ. "పుం బ్రహ్మణః" అను నియమముచేతఁ బుంలింగేతర బ్రహ్మశబ్దమునకు డా ప్రత్యయము పాక్షికముగ నైతము రానేరదనియు నయ్యది యగుణవర్ణకార్యములతోనే ప్రయుక్తమగుననియుఁ దాత్పర్యము నెన్నవలెను. ఉదా:—బ్రహ్మము - బ్రహ్మమ్ము - బ్రహ్మంబు = (వేదము. పరబ్రహ్మము. తపస్సు.). కం. శివమును బరమ బ్రహ్మము... (శాంతి. ౬ ఆ. ౬౭) తే. గీ... బ్రహ్మ। మంచితాధిదైవతమును నాగమములు (శాంతి. ౬ ఆ. ౯౭ ప.) బాలసరస్వతియు మహాబలపండితుఁడును 'ఆత్మన' ఇత్యాది ప్రకృతసూత్రమునకుఁ బైరీతినర్థము చేయలేదు. "ఆత్మ (న్) శబ్దాది మన్నన్తేభ్యశ్చ (విస్తర II). డా వాస్యాత్. చటూ. డిత్కార్యం హ్రస్వః. ఆత్మ. పక్షే అన్త్యహల్లోపే ఆత్మము. మహత్త్వే డుఙ్ = ఆత్ముఁడు..." (అహో. ౩౭౨ పు) ప్రథమైకవచన తుల్యప్రాతిపదికము గ్రహించి హ్రస్వముచేసి మహత్త్వవివక్ష యందా

---

విస్తరము. II ౧౨౫ విషః—ఇమనన్తానామ్మను దానికి "ఇమన్నన్తేభ్యశ్చ" అని యిట్లు విభక్తివిపరిణామాన్వయము చేయుట సరయఁగా నాత్మశబ్దముకంటెను నిమన్నంతములకంటెను బరమగు సుప్రత్యయస్థానమున డా ప్రత్యయమాదేశముగ వచ్చునట్లు మహాబలపండితుఁడు వ్యాఖ్యచేసెనని తోఁచుచున్నది. సుప్రత్యయ లోపమునకు గతిచూపకుండుటయు నీయభిప్రాయమునే బలపఱుచుచున్నది. ఉత్తరసూత్రమగు "డుః స్యాత్సదా రాజ్ఞః" అనుదానికి వ్యాఖ్య యీ క్రిందిరీతిని జేసెను. "తస్యసోః స్థానే డు రిత్యేత ద్వికృత్యను శాసస్థితిరితి (అహో. ౮౭౯ పు.) "రాజ (న్) శబ్దాత్తు డుఃస్యాన్నిత్యమ్. రాజు. డువర్ణకవిధానం మువర్ణకవర్జ్జ్ఞేయమ్" (అహో. ౩౭౩ పు.) అని సుప్రత్యయస్థానమున వచ్చిన మువర్ణకమువలెననెడి సామ్యమ్మును జూపిన సందర్భముకూడఁ బైయభిప్రాయమునే దృఢీకరించుచున్నది. విభక్తి

త్ముఁడనియు సపమహాత్త్వమున నాత్మమనియు రూపములను సాధింపవలసియుండఁగా నంత్యహల్లోపపద్ధతికిఁ బ్రసక్తి యెట్లుకల్గెనో తెలియకున్నది. (చూ. ౧౬౯ విష.) మఱియు "హ్రస్వే డుజ్ నిగమశర్మఁడు - సుశర్మఁడు" (అహో. ౩౬౪) అను దానిని బట్టి 'నిగమశర్మా - సుశర్మా' అను ప్రథమైకవచన తుల్యప్రాతిపదికముల నహోబల పతియే గ్రహించినట్లు స్పష్టమగుచున్నది. ఇట్లహోబలపతి "నిగమశర్మా - సుశర్మా" అను చోటులందుఁ బ్రథమైకవచన తుల్యప్రాతిపదికములను గ్రహించుటకును "ఆత్మా - గరిమా" అను చోటులందు "క్వచిన్నామ గ్రహేష్వై వేత్యాది క్వాచిత్క పద్ధతిని గ్రహించుటకును వినిగమకమేమో తెలియకున్నది. గుణవర్ధనా గుణవర్ధన పద్ధతి కుదురనపుడుగదా క్వాచిత్కముగా "క్వచిన్నామ గ్రహేష్వై" వేత్యాది పద్ధతి నాశ్రయించుట యథర్వణవచన తాత్పర్యము. (చూ. ౧౬౯ విష.)

ఇంక 'ఆత్మన ఇమనంస్తానా' మిత్యాది సూత్రమున కహోబలపండితుఁడు భిన్న మార్గముగా వ్యాఖ్యచేయుటచేతనే "నిగమశర్మేత్యాద్యడుజన్తరూపస్యతు 'క్వచిన్మనుజసంజ్ఞాయాం । డుజ్ నాన్తాన్న విధీయతే' ఇత్యథర్వణోక్తిశ్శరణమ్. ఏతేన ఆశ్వత్థామ ఇతిరూపం సమంజసమ్...చతుర్ముఖ పరత్వే బ్రహ్మేతిరూపంతు 'పుంబ్రహ్మణో వేధసశ్చ। హ్రస్వత్వేనైవ సంస్థితిరితి తదుక్త్యైవ సిద్ధ్యతి. సీ...గీ. తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళయొసంగి (వసుచ. ౪ ఆ. ౩౬) ఇత్యాది కవివచన మనాకరమేవ" (అహో. ౩౬౪ పు.) అని యిట్లతిసాహసముగ వ్రాయవలసినవాఁడయ్యెను. ఈసమన్వయమున "కృష్ణవర్త్మకు" అను రామరాజభూషణుని ప్రయోగమేకాక 'విశ్వకర్మ' అను నన్నయ ప్రయోగము సైతము నసాధువే యనవలసి వచ్చుచున్నది. ఉ—ఇమ్ముగ విశ్వకర్మ రచియించిన......(ఆది. ౮ ఆ. ౭౧) పృథ్వి - కళావిదుఁడు విశ్వకర్మతనకౌశలంబేర్పడన్ (ఆది. ౮ ఆ. ౧౦౩) సీ... ।

విపరిణామాన్వయములు నన్నయాభిప్రేతములుకావు. (౧౭౯-౧౮౧-౨౧౯ విష.) పై వ్యాఖ్యలోని "డిత్కార్యం హ్రస్వః" అను దానినరయఁగా నట్లు సుప్రత్యయ స్థానమునవచ్చిన డా ప్రత్యయదీర్ఘమునకు హ్రస్వముచేయనగునని యహోబలపతి చెప్పినట్లు విశదమగుచున్నది. "దీర్ఘాణాం హ్రస్వః స్యా"త్తను సూత్రము ప్రాతిపదికములతుది దీర్ఘమునకు హ్రస్వము విధించునదేకాని విభక్త్యంతముల తుదిదీర్ఘమునకు హ్రస్వము విధించునదికాదు. కాన నీపక్షము కేవల మనర్థమూలకమగుచున్నది. కావున 'ఆత్మ' శబ్దముకంటెను నిమన్నంతములకంటెనుఁ బరముగ ననఁగా 'ఆత్మా - గరిమా' మున్నగు ప్రథమైకవచన తుల్యప్రాతిపదికములకంటెఁ బరముగనె డా ప్రత్యయము విధింపఁబడెనని వ్యాఖ్యచేయకతీరదు.

పేర్మితో నవ్విశ్వకర్మపురము । నిర్మించె...(ఆది ౮ ఆ. ౩౦) భట్టారకుఁడిట్లే యదుజన్తరూపముననె విశ్వకర్మశబ్దమును బ్రయోగించియున్నాఁడు. ఇదిచూచి సూరి విశ్వకర్మాదులకు స్త్రీత్వమును నిత్యముగా విధింప (బా. తత్త్వ. ౭౫) సీ. విశ్వకర్ముని కూఁతు..."(ఉ. హరి. ౪ ఆ. ౪౫ ప.) అను నాచనసోముని ప్రయోగముంజూపి ప్రౌఢవ్యాకర్త దానికి స్త్రీత్వపాక్షికతను నెలకొల్పెను. మఱియు నీయహోబలపండిత సమన్వయము పక్షమున "శర్మాన్తం బ్రాహ్మణస్యస్యా । ద్వర్మాన్తం క్షత్రియస్యచ..." అను చొప్పున నిగమశర్మ - దేవశర్మ - తిక్కశర్మ - సుశర్మ - మిత్రవర్మ - సూర్యవర్మ - కేతువర్మ - మున్నగు ననేకములయిన యడుజంతరూపములకు శరణమనఁబడిన "క్వచి న్మనుజ సంజ్ఞాయామిత్యా ద్యథర్వణవచనములోని క్వాచిత్కత కేవలము నసంగతమగుచున్నది. ఇంతియకాక నిత్యముగ నడుజన్తమేయైయుండు నశ్వత్థామ శబ్దముతో (౧౭౫ I విష.) నిగమశర్మాది శబ్దములకు సారూప్యమును వచించుట యింకొక యసంగతి. నిగమశర్మాదులు డుజంతములు నడుజన్తములునగుచుఁ గవి ప్రయోగసిద్ధములై యున్నవి. క. తలపడియె సుశర్మతోడఁ దదనుజాతోడన్ (విరా. 3 ఆ. ౧౯౯) చ....దీన నరాతిసేన డొ । ల్లనడిచి యీ సుశర్ముని బలంబుఁ జలంబును మార్చి (విరా. 3 ఆ. ౨౦౫) చ. ఘనతరవత్సదంత శరఘాతమునం బడవైచి మిత్రవ । ర్ముని రథసూతు...(కర్ణ. ౧ ఆ. ౧౭3) తే. గీ....।సూర్యవర్ముని తమ్ముండు శూరవరుఁడు । కేతువర్మ గాండీవిపై శాతబాణ (అశ్వ. ౪ ఆ. ౧౦) చ....ఉజ్జ్వల ఘనశక్తివైచి కృతవర్ముని బాహులనొంచి (ద్రోణ. ౪ ఆ. ౧౭) చ. విను కృతవర్మ దివ్యశరవేది...(సౌప్తి. ౧ ఆ. ౬3). ఇట్లు డుజంతత్వాఽడుజంతత్వములు రెండునుగల యనేకశబ్దము లుండుటంజేసి యివి "క్వచిన్మను జసంజ్ఞాయా" మిత్యాదికారికకు లక్ష్యములనుట సరికాదనియు నివి నాచేసిన సమన్వయముచొప్పున 'అత్ మన ఇమనంతానా' మిత్యాది చింతామణిసూత్రమునకె లక్ష్యములనియు, డుజంతత్వములేని కేవల డాప్రత్యయాంతత్వమే కల మనుష్యవాచకములగు 'అశ్వత్థామ' మున్నగు కతిచిచ్ఛబ్దములు మాత్రమే "క్వచిన్మనుజ సంజ్ఞాయా" మిత్యాద్యథర్వణ కారికకు లక్ష్యములనుట యుక్తమనియు గ్రహింపవలెను.

అహోబలపండితీయానుయాయులలోఁ గవిజనమండన వ్యాఖ్యాతఁ క్వచిన్మను జేత్యాదికారికకు 'అశ్వత్థామ' అను దాని నుదాహరించెనుగాని నిగమశర్మాదుల నుదాహరింపలేదు. నారాయణీ యాంధ్రవ్యాకరణకర్త క్వచిదిత్యాది కారికను "క. ఒకచోట నకారాంతము । న కన్న మానవునిపేర నాతీ డుజ్వ । ర్ణక మవిహితము..." అని పరివర్తింపఁగా నద్దానికి "దేవశర్మ - విశ్వకర్మ - నిగమ

కర్మ - మిత్రవర్మ - కృష్ణవర్త్మ..." (నారా. గాణ. తత్స. ౭౦ పద్య. ౨౩౧ కారి.) అనునవి మున్నగువానిని గాణపత వివరణకర్త యుదాహరించెను. తక్కినవాని మాట యటుండఁగా 'విశ్వకర్మ - కృష్ణవర్త్మ' అనునవి మానవునిపేరులుగా నెట్లు దాహరింపఁబడెనో తెలియకున్నది.

విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు. ౭౫.

బాలవ్యాకరణ ౧౭౫ I విషయము. స్త్రీత్వాతి దేశంబుచేత నుత్వ డుజ్జులు లేవని యెఱుంగునది. విశ్వకర్మ - కృష్ణవర్త్మ. అశ్వత్థామ - యువ - యజ్వ - ఇత్యాదులు.

సంజీవని. ౧౭౫ I విషః—అర్థములుః—విశ్వకర్మ = దేవశిల్పి, కృష్ణవర్త్మ = అగ్నిదేవుఁడు, అశ్వత్థామ = ద్రోణాచార్యపుత్త్రుఁడు. యువ = యౌవనవంతుఁడు. యజ్వ = యజ్ఞముచేసినవాఁడు. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములలో 'అశ్వద్ధామ' అని పొరపాటుపడియుండుటచేఁ గొన్నిముద్రణములవఱకు నాపొర పాటు పడుచువచ్చెను. తప్పులతిప్పయగు సుప్తార్థ ప్రకాశికా ద్వితీయ ముద్రణమున నట్టి పొరపాటు విడువఁబడదయ్యె.

విశ్వకర్మాదులు నకారాంతములు. "విశ్వకర్మా - కృష్ణవర్త్మా - అశ్వత్థామా - యువా - యజ్వా" అనునవి ప్రథమైకవచన తుల్యప్రాతిపదికములు. ఇత్యాదులనుటచే విశ్వకర్మాదు లాకృతిగణము. నాంతములు ప్రథమైకవచనాంత తుల్య ప్రాతిపదికములు గలవగుటచే నట్టి ప్రాతిపదికముల దీర్ఘమునకు హ్రస్వముఁవచ్చి సుత్రాముఁడు మున్నగువానివలెనె విశ్వకర్ముఁడు, కృష్ణవర్త్ముఁడు - మున్నగు రూపములు సిద్ధించుచుండఁగా నట్టి డుమంతరూపములను సమ్మతింపక సూరి వీనికి నిత్య స్త్రీత్వాతిదేశము విధించెను. ఈవిశ్వకర్మాదులలోని యజ్వశబ్దమును స్త్రీసమరూపముతోఁ గవిపితామహుఁడు "ఉ. యౌవనమందు యజ్వయుఁ బ్రభూతధనాఢ్యుఁడునై..." (మను. ౧ ఆ. ౫౩ ప) అని ప్రయోగించెను. కాని యీయొక్క ప్రయోగము దానికి డుమంతరూపము లేదని నిరూపింపఁజాలదు. అందులకుఁ బ్రమాణాంతరమును గానరాదు. యువశబ్దమున కెట్టి ప్రయోగమును నాకీవఱకు లభింప లేదు. అశ్వత్థామశబ్దమునకు స్త్రీసమత్వము మాత్రమె ప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. అట్లగుటచేతనె క్వచిన్నుజ సంజ్ఞాయామిత్యాది సూత్రముచే నథర్వణుఁడు "అశ్వత్థామ" మున్నగు కతిచిచ్ఛబ్దములకు మాత్రము నిత్యస్త్రీత్వము నంగీకరించెనని విశ్వసింపఁదగియున్నది. క....మహా। బలుఁ డశ్వత్థామ రిపు। ప్రళయాంతకుఁడు...(ఆది. 3 ఆ. ౭౮) మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ

డశ్వత్థామ శ్రీరాముతో । సరిసేయంగవాఁడు (ద్రోణ. ౫ ఆ. ౩౩౧) మ॥... క్రోధవి । హ్వాలుఁడై యీతనిపై వడింబడక యశ్వత్థామ సైరించునే (ద్రోణ. ౫ ఆ. ౩౫౪) క....అశ్వత్థామయు । గొని కురుసేనయు...(ద్రోణ. ౫ ఆ. ౩౭౩) ఇట్లె యెల్లయెడలను స్త్రీసమరూపమె కన్పట్టుఁగాని పుంజంతరూపమెక్కడఁ జేని చూపట్ట లేదు. తుదికి ద్రౌణిపక్షముగాను గజపక్షముగాను సర్థద్వయముగల శ్లేషస్థలమందు సైతము సోమయాజి స్త్రీసమరూపమునె ప్రయోగించెను. తే. గీ. అచ్చుపడఁగ నశ్వత్థామ నచ్చెనసియె (ద్రోణ. ౫ ఆ. ౩౧౫.)

అశ్వత్థామ శబ్దమునువలెనె విశ్వకర్మశబ్దమును సైతము భట్టారకుఁడు స్త్రీసమరూపముతోమాత్రమె ప్రయోగించుట నరసి (సూ. ౧౭౫ విస.) సూరి యద్దానికిని స్త్రీసమనిత్యతను సూత్రించెనుగాని ప్రాఁకవ్యాకర్త యట్టి సూరిసూత్రమును భంజించుచు నాచనసోముని ప్రయోగముచూపి యీక్రిందిరీతిని సూత్రించెను. "విశ్వకర్ముఁడనియు రూపంబు. సీ. విశ్వకర్మునికూఁతు విశదలావణ్య సముజ్జ్వలఁజేకొని మూరిఁబోయి" (ఉ. హరి. ౪ ఆ. ౪౫ ప. త్రిలింగలక్షణశేషము, శబ్దపరి. ౨౭ సూ.) (విస్తర) ఆహా యీసందర్భమున వ్యాకరణసిద్ధాంతముల కెంతతడఁబాటు సంభవించినది! 'తే. గీ. తొలునొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళయొసంగి" ఇత్యాదికవివచన మనాకరమేవ" (అహో. ౩౮౪ పు.) అనుచు నహోబలపండితుఁడు 'కృష్ణవర్త్మ - విశ్వకర్మ' మున్నగు మనుష్యేతరవాచక శబ్దముల స్త్రీసమరూపము లసాధువులనియు "కృష్ణవర్త్ముఁడు-విశ్వకర్ముఁడు" అను డుమంతరూపములె సాధువులనియు సిద్ధాంతీకరించెను. వీనికే సూరి నిత్యస్త్రీత్వము నుపదేశించెను.

---

విస్తరము. ౧౭౫ I విషయము:—గుప్తార్థప్రకాశికాకర్త - పయినాచనసోముని సీసపద్యచరణమునుఁజూచి యాటవెలఁదియని భ్రమించి కావలయును గుప్తార్థప్రకాశికా ప్రథమముద్రణమున "విశ్వకర్మ కూఁతు అని సవరించినచో గణభంగము గలుగక సలక్షణముగా నుండునని యెఱుంగునది" (బా. గు. ప్ర. ప్రథమముద్రణము. తత్స. ౭౫ సూ. వ్యాఖ్య.) అని వ్రాసెను. అట్టి ప్రమాదమును నేను బరిషత్పత్త్రికా ముఖమున వెల్లడింపఁగాఁ దానట్లు ప్రమాదపడలేదని చదువరులకుఁ దోఁపించుటకయి, 'విశ్వకర్మకుకూఁతు' అని తాను సవరించినట్లును 'విశ్వకర్మకు' అనునది స్వార్థికకన్ ప్రత్యయాంతరూపమైయుండఁ దద్విషయమున వివాదము జరుగుచున్నట్లును దేశమాతృపత్త్రికాముఖమున నిందలనింపి యొకవ్యాసమును బ్రచురించెను. అదియె గుప్తార్థ ప్రకాశికా ద్వితీయముద్రణానుబంధమున నెక్కింపఁబడెను. (బా.గు. ప్ర. అనుబంధము. ౧౭౪-౧౭౫ పుటలు.) ఇట్లిచట నీతఁడుచేసిన యన్యా

యమును బాఠక మహాశయులకు విశదపఱుచుకొనుటకయి యిటఁ బ్రథమ ద్వితీయ ముద్రణములలోని యీతనిప్రాఁతను యథాస్థితముగఁ జూపుచున్నాను.

"కాని విశ్వకర్మకూఁతు అని సవరించినచో గణభంగముగలుగక సలక్షణముగ నుండునని యెఱుంగునది. ఉ. ఇమ్ముగ విశ్వకర్మ సృజియించిన కాంచన హర్మ్యశృంగ శృం। గమ్ముల...(భార. ఆది. ౮ ఆ.)" (ప్రథమముద్రణము)

"కాని విశ్వకర్మకు కూఁతు అని సవరించినచో గణభంగముగలుగక సలక్షణంబుగనుండునని యెఱుంగునది. ఉదా:—స్వార్థేకన్. ఇట్లు భార. ఆది. ౪ ఆ. ౨౩ 'కం...పడయం। గావలయువాఁడు సంతతిఁ। గావించు విచిత్రవీర్యకక్షేత్రములన్" (విచిత్రవీర్యక స్వార్థేకన్.) (ద్వితీయముద్రణము)

ఈపక్షమున 'త్రిలింగలక్షణ శేషకర్తచూపిన "సీ. విశ్వకర్మునికూఁతు విశద లావణ్య..." అను దానిలో గణభంగము లేమింజేసి ప్రకాశికాకారుని 'గణభంగ దోషముగలుగక' అను వాక్యము కేవల మసంగత ప్రసంగమగుచుఁ బ్రథమ ముద్రణమునఁ జేసిన పొరపాటును గప్పిపుచ్చుకొనుచున్న ప్రకాశికాకారుని యత్నమును వెల్లడించుచున్నది. ఇంతియకాక ప్రథమ ముద్రణమునఁ దాను సవరించిన 'విశ్వకర్మ' శబ్దపు స్త్రీసమరూప సాధుత్వమునకుఁ బ్రమాణముగఁ జూపఁబడిన "ఉ. ఇమ్ముగ విశ్వకర్మ సృజియించిన..." అను నన్నయపద్యమును విడిచికొని యీచోట ద్వితీయముద్రణపు సవరణములోని "విశ్వకర్మకః" అను శబ్దమును సమర్థించుకొనుటకుఁ బ్రమాణముగా 'క...పడయం। గావించు...విచిత్రవీర్యక...' అను నన్నయ పద్యమును నిల్పుటసయితము సుప్రార్థ ప్రకాశికాకర్త యన్యాయమును బయలువెట్టుచున్నది. ఇంతయేల! ప్రకాశికాకర్త "విశ్వకర్మక" శబ్దమును నిల్పి ప్రథమ ముద్రణమున సవరించుటే నిజమైనపక్షమున నాతఁ డద్దాని యనంతరమున "ఉ. ఇమ్ముగ, విశ్వకర్మ సృజియించిన,.." అను పద్యము నుదాహరించుటకుఁ బ్రసక్తియేమున్నది? తానచట స్త్రీసమ విశ్వకర్మశబ్దముతో సవరింపనే లేదుగదా. ఒకవేళ సుప్రార్థ ప్రకాశికాకర్త కాటవెలఁది భ్రాంతిలేకున్నను "విశ్వకర్మకుకూఁతు" అను స్త్రీసమ విశ్వకర్మశబ్దపు షష్ఠ్యంతముతో సవరించెననియైన యంగీకరింపనిచో "ఉ. ఇమ్ముగ విశ్వకర్మ సృజియించిన..." అనెడి నన్నయపద్యము నచట నుదాహరించుట కేవలము నున్మత్త విలసితమగు ననక తీరదుగదా. ఇట్లగుటంజేసి సుప్రార్థ ప్రకాశికా ద్వితీయా ముద్రణానుబంధములోని ౧౭౪-౧౭౫ పుటలందలి 'కన్' ప్రత్యయపు భాష్యశేఖరముల గడబిడ యప్రసక్త ప్రసంగమేయనుటకు సందియము లేదుగదా.

బాలవ్యాకరణ వివరణము. ౧౭౬ విషయము.

మహద్వాచకంబయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు. ౭౬.

బ్రహ్మ. ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు. తత్త్వతపోవేదయోగ వాచకంబగునేని బ్రహ్మము నాఁబడు.

సంజీవని. ౧౭౬ విష:—"పుం బ్రహ్మాణో వేధసశ్చైతాః ద్వ్యధర్వాణ కారిక కిది వివరణము అర్థము స్పష్టము.

"బ్రహ్మ. సం. వి. న్. పుం. ౧ నలువ...౨ విష్ణువు. 3 బ్రాహ్మణుఁడు. ౪ ఋత్విజుఁడు....న - ము. ౧ పరమాత్మ. ౨ వేదము. 3 తపము. పుం. ఒక గ్రహయోగము. (విష్కంభాది)" (శ. ర.).

బ్రహ్మశబ్దము సైతము విశ్వకర్మాదులలోఁ జేర్పఁదగినదే యైనను నది యమహద్వాచియగునపుడు మువర్ణకాంతరూపముతో నుండునుగాన దానికయి వేఱ సూత్రింపఁబడెను. ఈశబ్దము ౧౭౯ విషయమున వివరింపఁబడియున్నది. ప్రయోగములు:—ఉ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పదమైనవాఁడు (సభా. ౨ ఆ. ౧౮) (ఆది. ౭ ఆ. ౨౧3. సభా. ౧ ఆ. ౮౦. సభా. ౨ ఆ. ౨3౬. ఆర. 3 ఆ. 3 ప.) కం. శివమును బరమబ్రహ్మము...(శాంతి. ౬ ఆ. ౬౪). తే. గీ. బ్రహ్మ। మంచితాధి దైవతమను నాగమములు (శాంతి. ౬ ఆ. ౯౪) శా. ఏందే డెందము...ఆయింపే పరబ్రహ్మ మా। నందో బ్రహ్మయటన్న ప్రాఁజమవు...(మనుచ. ౨ ఆ. ౬౨ ప.)

మనుజవాచియగునపుడు "బ్రహ్మఁడనియు - బ్రహ్మఁడనియుఁ బాల్కురికి సోమన ప్రయోగించెనందురు. ద్విపద - వరవుఁడ బ్రహ్మఁడన్వాఁడ నేననుచు (బసవ. ౫ ఆ. 3౪౪ ప.) (చూ. విస్తర. ౧౨౯ విష.) సోమానారాధ్యునివంటి మహాపండితుఁ డిట్లు లక్షణవిరుద్ధ ప్రయోగమును జేసెననుట విశ్వసనీయముకాదు "వరవుఁడ బ్రహ్మయన్వాడ నేననుచు" అనునది కవిప్రయుక్తపాఠము కానోపును. "బ్రహ్మయ+ అనువాఁడ = బ్రహ్మయన్వాఁడ" అని రూపసిద్ధినరయఁదగును. ద్వి. కన్నడ బ్రహ్మయ్య గతి యెట్టిదనిన...కాక బ్రహ్మయకు శ్లాఘ్యమె పదార్థంబు (బసవ. ౫ ఆ. 3౮౮-3౯౬ ప.) ఇట్లు 'బ్రహ్మయ్య - బ్రహ్మయ' అని సోమనాథుఁడు ప్రయోగించియె యున్నాఁడు.

బాలవ్యాకరణ వివరణము. ౧౭౭ విషయము.

ఆత్మే మనిజంతంబులకు, నాంతంబులగు మనుజసంజ్ఞ
లకు స్త్రీత్వంబు బహుళంబుగానగు. ౭౭.

ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు, మహిమ - మహిమము,
అణిమ - అణిమము, గరిమ - గరిమము, లఘిమ -
లఘిమము, దేవశర్మ - దేవశర్ముఁడు.

సంజీవని. ౧౭౭ విషః—"ఆత్మన ఇమనన్తానాం డావా." "క్వచిన్మనుజ సంజ్ఞాయాం డుజ్ నాన్తా న్న విధీయతే" అనునన్న యాథర్వణకారికల యభిప్రాయమిదియను తలంపున సూరి యిట్లు వివరించెను. క్వాచిత్కముగా నేందేని మనుజసంజ్ఞకు డుజ్ నిషేధనిత్యత యథర్వణప్రోక్తమగుచుండఁగా నహోబలు ననుసరించి సూరి యనేక స్థలములందు స్త్రీసమత బహుళముగా నగునని సూత్రించెను. కావుననె యథర్వణాభిప్రేతమగు నర్వ్వాత్మాశబ్దమును విశ్వకర్మాదులలోఁ జేర్చి వానికి నిత్యస్త్రీత్వమును విధించెను. నాంతమనుజ సంజ్ఞలగు 'సుధన్వా - శతధన్వా' మున్నగు శబ్దములకు సూత్రములోని బహుళగ్రహణముచేత స్త్రీత్వాతిదేశము కల్గనేరదని సమర్థించుకొనవలయును. మహాత్ముఁడు మున్నగునవి మనుష్యవాచకములయినను మనుజ సంజ్ఞలనఁగా మనుష్యనామధేయనులు కామింజేసి వానికిఁ బాక్షికముగానైన స్త్రీత్వాతిదేశము లేదనియు 'మహాత్ముఁడు' అను రీతినే యట్టివి సాధువులనియు నెఱుంగునది. ప్రయోగములు:—చ...ఆత్మనివలనన్ భవద్వచనమున్ (అశ్వ. ౨ఆ. ౧౭) క. ప్రకృతి పదాఱువికారము। లకు నాశ్రయ మాత్మ కది నెలవు విను మాత్మం। డకుటిల...(శాంతి. ౫ ఆ. ౬౦౩) క. మన మధ్యాత్మము దానికి । ననఘా (శాంతి. ౬ ఆ. ౯౧ ప.) ఉ...సమస్త వ । ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహి నొప్పు...(ఆది. ౧ ఆ. ౬ ప.) ఉ...లోక సా । మాన్యవిధిం దగంగ గరిమంబు న నిచ్చినఁ బుచ్చికొంద । మనోన్యన్య...(ఉద్యో. ౧ ఆ. ౩౨ ప.) తే. గీ. సూర్య వర్మని తమ్ముండు శూరవరుఁడు। కేతువర్మ గాండీవిపై శాతబాణ (అశ్వ. ౪ ఆ. ౧౦) చ. ఘనతరవత్సదంత శరఘాతమునం బడవైచి మిత్రవ । ర్మని రథసూతు (కర్ణ. ౧ ఆ. ౧౭౩) చ...ఉ । జ్జ్వల ఘనశక్తివైచి కృతవర్మని బాహుల నొంచి (ద్రోణ. ౪ ఆ. ౧౭) చ. వినుకృతవర్మ దివ్యశరవేది (సౌప్తి. ౧ ఆ. ౬౩) తే. గీ. కృతిప । తిత్వమర్థించివచ్చితిఁ దిక్కశర్మ (విరా. ౧ ఆ. ౧౮ ప.)

నన్నయా. ౧౭౮ విషయము.

దుస్సాన్య త్సదారాజ్ఞః. (అం. చిం. హలం. ౩ కా. అహో. ౩౮౩ పు.)

స్వార్థ ప్రధానభావే స్యా। ద్రాజ్ఞో డుః పుంసి చేతనే. (వికృ. హలం. ౧ కారి. అహో. ౩౮౩ పు.)

కల్పతరువు. ౧౭౮ విషః—రాజ్ఞః = రాజ (న్) శబ్దముకంటెఁ బరమగు సుప్రత్యయస్థానమున, సదా = ఎల్లయెడలను, నకారాంతత్వమునందును 'ట' జంతత్వమునందును నని యర్థము. డుః = 'డు' అను ప్రత్యయము, స్యాత్ = ఆదేశమగును. పూర్వతమ సూత్రమునుండి—'అగుణవతాం సగ్వాహాలాం సోర్లోపః.' అను సూత్రమునుండి—'సోః' అనునది యనువర్తించును. అహోబలపతియు "డువర్ణకవిధానం మువర్ణకవజ్జ్ఞేయమ్." (౩౮౩ పు.) "కృత్తద్ధిత సూత్రేణ టజంతస్య ప్రాతిపదిక సంజ్ఞాయాం తస్మాదేవ సుప్రత్యయ ఇతి హ్యైదవ్యవ్యాకరణ మర్యాదా. తస్యసోఃస్థానే డురిత్యేత ద్వికృత్యనుశాసనస్థితిరితి టజన్తాదేవ డురితి ప్రతిభాతి" (అహో. ౪౪౯ పు.) అని పైరీతినె వ్యాఖ్యచేసియున్నాఁడు. ఉదా:- రాజు, మునిరాజు. 'రాజన్' అను నకారాంతశబ్దము ప్రథమైకవచన తుల్యప్రాతిపదికము గలదిగాన 'రాజా' అని నిల్చుటచే "సుత్రామా - సుత్రాముఁడు" మున్నగువానివలెనే 'రాజుఁడు' అను రూపము సిద్ధింపవలసియుండెను. అట్లె 'మునీనాం రాజా' అనుచో "రాజాహస్సఖిభ్య ష్టచ్" (౫-౪-౯౧) (సి. కౌ. ౭౮౮ సూ.) అను సూత్రముచొప్పున 'టచ్' ప్రత్యయము రాఁగా (విస్తర) 'మునిరాజః' అని యేర్పడినపిదప రామశబ్దమునకువలెనే యుత్వడుజ్ఞులు వచ్చుటచే 'మునిరాజుఁడు' అని సిద్ధింపవలసియుండెను. అట్లు ద్వివిధస్థలములందును డుజంతరూపములను సమ్మతింపక "సదారాజ్ఞః డుః" అని భట్టారకుఁడు 'రాజు - మునిరాజు' అనియే సిద్ధించునట్లుపదేశించెను. ఈ 'డు' ప్రత్యయములోని డకార మిద్వర్ణముగానఁ బూర్వసూత్రమునందువలెనె 'రాజా - మునిరాజ' అను ప్రాతిపదికములకు డిత్కార్యముగు టిలోపము రాఁగా 'రాజ్ - మునిరాజ్' అని యేర్పడును గాన వానిపయిని 'డు' ప్రత్యయములోని యిద్వర్ణమగు డకారముపోఁగా మిగిలెడి 'ఉ' అను వర్ణకము చేరఁగా 'రాజు - మునిరాజు' అని సిద్ధించును.

సహచరితన్యాయమునఁ బూర్వసూత్రమునందువలెనె యిందును డుప్రత్యయము ప్రాతిపదికముమీఁదనె నిల్చుననియు నీ 'డు' ప్రత్యయము నైతము స్త్రీ

---

విస్తర. ౧౭౮ విషః—"మునిరాజు నాత్రటచ్" (అహో. ౩౮౩ పు.) అని యిచట నహోబలపతి పొరపడివ్రాసినను స్థలాంతరమున నా వ్రాసినరీతినె వ్రాసెను. "మునిరాజు ఇత్యత్ర నాన్తాద్వా టజన్తాద్వా డు విధానస్య నవైరూప్యమ్... తథాపి కృత్తద్ధిత సూత్రేణ టజన్తస్య ప్రాతిపదిక సంజ్ఞాయాం తస్మాదేవ సుప్రత్యయ ఇతి హ్యైదవ్య వ్యాకరణమర్యాదా. తస్య సోః స్థానే డురిత్యేత ద్వికృత్యనుశాసనస్థితిరితి టజన్తాదేవ డురితి ప్రతిభాతి" (అహో. ౪౪౯ పు.)

ప్రత్యయమేయనియు నట్లగుటచేతఁ బ్రథమైకవచన లోపాదికము గల్గుననియు వ్యాఖ్యానము చేసికొనవలసియున్నను నాపక్షమున "సర్వత్రోదోతో ర్వ్యర్థవతి మువత్" అను చింతామణిసూత్రముచెప్పిన (౧౫౨ విష.) స్త్రీత్వమునందును బ్రథమైనకవచనమగు వుప్రత్యయమునకు లోపములేమింజేసి 'వధువు - తనువు' మున్నగుచోటులందు వలెనె వు ప్రత్యయమువచ్చి 'రాజువు - మునిరాజువు' మొదలగు ననిష్టరూపములు దుర్వారములు కావలసివచ్చును. గాన నట్లువ్యాఖ్యచేయ లేదు. ఇట్లగుటచేత "రాజన్+సు - అనుచో సువిభక్తిపరమగుచో డువర్ణకము డిత్తు గాన 'రాజన్' అను శబ్దములోనితుది 'అన్' లోపించి 'రాజు' అని యగును. ఈ డువర్ణకము స్త్రీత్వద్యోతకముగాన సులోపము" (నారా. గాణ. తత్స. ౬౭ ప. ౨౭౯ కారి. వివ.) అను గాణపతవివరణము సరికాదని గ్రహింపవలయును. మఱియుఁ బ్రథమైకవచన తుల్యప్రాతిపదికమును గ్రహించి 'రాజా' అను దానిపైఁ బ్రక్రియ నడపవలసియుండఁగా నీగాణపత వివరణకర్త "క్వచిన్నామ గ్రహాణైవేత్యా ద్యథర్వణ కారికచెప్పిన నగతికగతి నాశ్రయింపవలసిన ప్రసక్తియేమో తెలియకున్నది. ఇట్లె యీతఁడు "మహిమన్ శబ్దమునకు విభక్తి పరముగానుండ డా ప్రత్యయము వచ్చును...మహిమన్+డా = మహిమన్+ఆ.....మహిమ్+ఆ = మహిమాయని యగును...డా ప్రత్యయము రానిపక్షమునఁ బ్రథమైకవచనతుల్యము ప్రాతిపదికముగాన దాని పై ముప్రత్యయము వచ్చును" (గాణ. తత్స. ౬౮ ప. ౨౭౯ కారి. వివ.) అని యిట్లుగ నొక్కశబ్దమునకే యొకపక్షమున "క్వచిన్నామ గ్రహాణైవేత్యా" ద్యగతికగతివిధాయ కాథర్వణపద్ధతి నాశ్రయించుటయు నొకపక్షమునఁ బ్రథమైకవచన తుల్య ప్రాతిపదికమును గ్రహించుటయు నిర్మూలముగను సంప్రదాయ విరుద్ధముగను నడపెను. రెండుపక్షములందును బ్రథమైకవచన తుల్యప్రాతిపదికమునే గ్రహించినను నావ్రాసినరీతిని రూపసిద్ధి నిర్బాధముగ సంభవించునుగదా. (౧౬౯ - ౧౭౨ - ౧౭౭ కల్పతరు. విష.)

స్వార్థప్రధానేత్యాదిః—రాజ్ఞః = రాజశబ్దమునకు, స్వార్థప్రధానభావే = స్వార్థప్రాధాన్యమందును, ననఁగా ననుపసర్జనత్వమునందును, పుంసి = పుంస్త్వమునందును, చేతనే = చేతన వాచిత్వమునందును మాత్రమె, డుః = భట్టారకోక్త డు ప్రత్యయము, స్యాత్ = అగును. ఈయథర్వణుని సవరణము ననుసరించి యహోబలపతి యీక్రిందిరీతి నుపసర్జనత్వాదులందు డుప్రత్యయ రాహిత్యము నుదాహరించెను "నమస్మునిరాజుఁడు రాముఁడు; నమస్మునిరాజ సీత; హరరాజము; బహురాజము దేశము - బహురాజ యీపురి - ప్రాస్వః - సురాజయయ్యె వసుధ ఇత్యా

చార్యః. జీపి రాజ్ఞి - బహురాజ్ఞి - సురాజ్ఞి ఇత్యాది రూపమ్" (అహో. ౩౧౩) నమస్మునిరాజుఁడు = నమస్కరించుచున్న మునిరాజులు గలవాఁడు, నమస్మునిరాజ = నమస్కరించుచున్న మునిరాజులుగలది. బహురాజము = అనేకరాజులుగలది. బహురాజ = అనేకరాజులుగలది (పురి). సురాజవసుధ = మంచిరాజుగలది భూమి. బహురాజ్ఞి = అనేకరాజులుగలది. సురాజ్ఞి = మంచిరాజుగలది. ఇవి యెల్లస్వార్థ ప్రాధాన్యరాహిత్యమునకు నుదాహృతులె యనఁదగును. పుంస్త్వమునకు 'రాజ్ఞి' అనునది శుద్ధమగు ప్రత్యుదాహరణము - చేతనత్వమునకు హారరాజమను నది శుద్ధమగు ప్రత్యుదాహరణము. "పుంలింగమనుటంజేసి రాజ్ఞి - సురాజ్ఞి - బహురాజ్ఞి యిత్యాదులం దీకార్యమురాదు" (గాణ. తత్స, ౬౯ ప. ౨౩౦ కారి. వివ.) అను గాణపత వివరణోదాహృతులలో 'సురాజ్ఞి - బహురాజ్ఞి' అనువాని యం దుపసర్జనత్వము సైతముగలదు. "రాజ్ఞి - స్త్రీ - (రాజ్ఞః పత్నీ - జీప్ - స్వయం వా రాజతే = రాజ, కనిన్ జీప్ వా) (రాణీ) రాజపత్న్యామ్. స్వయం రాజకర్తృ కర్త్ర్యాఇచ్ఛ" (శబ్దస్తో). రాజశబ్దమునకు బహువ్రీహియందు (ఉపసర్జనత్వమున = స్వార్థ ప్రాధాన్య రాహిత్యమున) స్త్రీత్వము ధారాళముగఁగల్గును. "అన ఉపధాలోపి నోఽన్యతరస్యామ్. (౪-౧-౨౮) అన్నన్తాద్బహువ్రీహేరుపధాలోపినో వాజీప్ - స్యాత్ - పక్షేడాప్ జీబ్నిషేధౌ - బహురాజ్ఞీ - బహురాజా - బహురాజ్ఞ్యౌ - బహురాజే-బహురాజానౌ. "బాలమనోరమావ్యాఖ్యః—డాప్, జీబ్నిషేధావితి-కదాచిత్ జీబ్నిషేధః - కదాచిత్ డాప్చేత్యర్థః" (సి. కౌ. స్త్రీ. ప్ర. ౪౬౨ సూ.) "శోభనో రాజాయస్యాంసా" అను విగ్రహముగల బహువ్రీహిలో "సురాజ్ఞి" అను తత్సమరూప మేర్పడును. డాబంతత్వపక్షమున 'సురాజ' అను తత్సమరూప మేర్పడును - డాప్పును జీప్పును రానిపక్షమున నకారాంత స్త్రీలింగము సైతము "సురాజ" అను తత్సమరూపముతోనె నిల్చును. "సురాజా - సురాజే - సురాజాః" అనునది 'ఆ' కారాంత స్త్రీలింగ ప్రథమారూపము. 'సురాజా - సురాజానౌ - సురాజానః' అనునది నకారాంత స్త్రీలింగ ప్రథమావిభక్తిరూపము. (విస్తర III ౧౧౫ I విష.). సీ. భరతవంశోత్తముఁ బ్రభుధర్మనందను, రాజుగాఁ బడసి సురాజయయ్యె! వసుధ...(ఆది. ౧ ఆ. ౧౨ ప.) (అహో. ౩౧౩ పు.). అహోబలపండితుఁడుచూచి యుదాహరించిన యీపాఠము నేఁటిముద్రణములలోఁ గన్పట్టదు. "నపూజనాత్ (౫-౪-౬౯) అను పాణినీయసూత్రముచే దీనికి టచ్చురాదుగాన "సురాజ వసుధ" అని యుండనేరదని ముద్రణసంస్కర్తలు భ్రమించి "సురాజ్ఞి" అని సంస్కరించి రాయని యాలోచింపవలసియున్నది. బహువ్రీహిలో "టచ్" ప్రత్యయము

పూజార్థక సుశబ్దపూర్వకత్వమందే కాక యెచ్చటనురాదు. ఉపసర్జనత్వమున నకారాంత స్త్రీలింగ రాజశబ్దమును గలదని పైని సప్రమాణముగాఁ జూపఁబడెను "సురాజ్ఞీతి - శోభనో రాజా యత్ర - 'నపూజనాత్' (౫-౪-౬౯) ఇతి టచోఽభావ ఇతి ముకుటః - తన్న - బహువ్రీహౌ టచోఽప్రసంగాత్" (అమర సుధా వ్యాఖ్య. ౧౨౯ పు.)

బాలవ్యాకరణ వివరణము ౧౨౮ I విషయము.

మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజు నాఁబడు. ౨౮.

రాజు - ఖగరాజు. అమహత్త్వమునందు రాజము. వృక్షరాజము ఉపసర్జనత్వంబునందు హతరాజుఁడు పరశురాముఁడు.

సంజీవని. ౧౨౮ I విష:—స్వార్థపరత్వమనఁగా స్వార్థప్రాధాన్యము. ప్రాధాన్యమనఁగా వాక్యమునఁ గ్రియాన్వయిత్వము. 'రాజువచ్చె' నను వాక్యమున 'రాజు' అనునది క్రియతో నన్వయించుచున్నదిగాన నది ప్రధానమనఁగా స్వార్థపరమగుచున్నది. 'హతరాజుఁడు (పరశురాముఁడు) వచ్చెను' అను వాక్యములో రాజశబ్దమునకుఁ గ్రియాన్వయము లేదు. అది బహువ్రీహిలో నుపసర్జనీభూతమై స్వార్థప్రాధాన్యము లేనిదయ్యెను. కాన 'హతరాజ' శబ్దమునకుఁ బ్రకృతసూత్రము చెప్పిన 'హతరాజు' అను రూపము కల్గనేరదు. కాన 'హతరాజా' అను ప్రాతిపదికము 'సుత్రామా' మున్నగువానివలెనే హ్రస్వము నుత్వడుజ్జులును వచ్చుటచే "హతరాజుఁడు" అను రూపమునొందును.

రాజశబ్దంము రాజు నాఁబడుననఁగా 'రాజు' అనునది ప్రథమైకవచనరూపమై యుండుననియుఁ దక్కిన విభక్తివచన రూపములలో 'రాజు' అనునది పూర్వావయవముగా నుండుననియుఁ దాత్పర్యము. 'రాజు' అను ప్రథమైకవచనము వుప్రత్యయరహితముగా నిపతింపఁబడెనుగాన నితర విభక్తిపరకత్వమున వుగాగమమునకుఁ బ్రసక్తియే లేదు (౧౫౩ I విష.) 'మహత్త్వంబునన్' అనుదళముచే నధర్వాణవచనములోని "పుంసీ - చేతనే" అనునవి సంగ్రహింపఁబడునని సూరి యాశయము. తిర్యగ్వాచిత్వమున మహత్త్వవివక్ష యుండవచ్చునని యు సూరి యభిప్రాయము. కావుననె మహత్త్వవివక్షగల "ఖగరాజు = గరుత్మంతుఁడు" అనునది యుదాహృతమయ్యెను. అట్లగుటచే మహత్త్వవివక్ష లేనపుడు "ఖగరాజము - అశ్వరాజము" అను రూపములు బాలవ్యాకరణ సమ్మతములగుచున్నవి. అవి చేతనవాచకములగుటచేత నట్టియెడల నైతము 'డు' వర్ణకము వచ్చి "అశ్వరాజు - ఖగరాజు" అని

మహత్త్వవివక్ష లేనపుడును రూపసిద్ధికల్గునని యథర్వణకారికాశయము. ఆ. వె. అశ్వమేధమునకు నర్పితంబైన యీ। యశ్వరాజునిట్టు లపహరించి (అర. 3 ఆ. ౬౩) అని యిట్లు భట్టారకుఁడు ప్రయోగించెను. ఈపద్యమున నశ్వమునకు మహత్త్వ వివక్షకుఁ బ్రసక్తిలేకుండుటచేతఁ జేతనవాచకము గుటచేతనే డుప్రత్యయము వచ్చె నని గ్రహింపనగును. "శ్రేష్ఠతాయా మమహతః। క్వచిడ్డు జపి దృశ్యతే" (౧౭౬ III విష.) అనుచోప్పున నమహత్తులకు శ్రేష్ఠతయందు డుజ్వు వచ్చుటకలదు గాని "డుః స్యాత్సవారాజ్ఞః" అను ప్రకృతసూత్రముచోప్పునవచ్చు డుప్రత్యయము శ్రేష్ఠ్య మున వచ్చునని చెప్పుట కవకాశము లేదు. ప్రయోగములు:—గీ. రాజవరుఁడైన పార్థుతో రాజుగాని। యాతఁడని సేయఁగాఁదగఁడేని వీనినెల్ల వారలు చూడంగ నీక్షణంబ। రాజుఁ జేసెద నే నంగరాజ్యమిచ్చి॥ (ఆది. ౬ ఆ. ౪౫) క॥...ప్రభవిం। చెం బాండురాజు గురువం। శంబు ప్రతిష్ఠింప...(ఆది. ౪ ఆ. ౨౬౭) ఉ...భయ ముల్లముఁ జేరఁగనిచ్చు రాజు రా। జే గుణహీన పొమ్ము.....(అశ్వ. ౪ ఆ. ౫౭) సీ. భరతవంశోత్తముఁ బ్రభుధర్మనందను రాజుగాఁబడసి సురాజయయ్యె। వసుధ... (ఆది. ౮ ఆ. ౮౨ ప.)ఆ. వె. అశ్వమేధమునకు నర్పితంబైన యీ। యశ్వరాజునిట్టు లపహరించి। (అర. 3 ఆ. ౬౩) రాజశబ్దమునకు నకారాంతత్వమునందును 'ట' జంతత్వమునందును డుప్రత్యయ ఘటితరూప మొక్కరీతినే యుండును. (విస్తర)

విస్తర. ౧౭౪ I విష:—"రాజశబ్దమునకని 'అకారాంతముగ సూత్రమున నిర్దేశించుటం జేసి...టజంతమై 'అ' కారాంతమైన రాజన్ శబ్దమునకును...ఇవ్విధి గలుగుట సూచితము." (బా. సా. వే. ౧౫౧ పు.) నకారాంతశబ్దము నుద్దేశించినను 'రాజశబ్ద' మనియె యుండునుగాని 'రాజన్‌శబ్దము' అని యుండ నేరదు. ఈసూత్రపు వ్యాఖ్యలోఁ బెక్కుచోట్ల నిట్టిభ్రాంతి విస్తరిల్లియున్నది. "హతరాజుఁడు పరశు రాముఁ డిత్యాదులందలి రాజన్ శబ్దము (రాజశబ్దమునరాదని భ్రాంతి) స్వార్థపరము గాక పరశురాము నన్యపదార్థమును బోధించునదగుటం జేసి మహద్వాచకమయ్యు రాజురూపమునందక తాబోధించునర్థమున కాధారమగుపదమునకగు లింగమునే పొంది యుత్వడుజ్వులనం దెను. (బా. సా. వే. ౧౫౧ పు. ౭౪ తత్స. సూ. వ్యా.) రాజన్ శబ్దమొక్కటే పరశురాముని బోధించునా? "అర్థమున కాధారమగుపద మున కగులింగము నేపొంది" అర్థమునకును బదమునకును "ఆధారాధేయభావమా? సంబంధము, లింగమర్థాశ్రయము కాదా? ఈ బహువ్రీహిలో లింగవ్యత్యాసము గల్గలేదే!

నన్నయాథర్వణులిద్దఱును 'రాజు' అను రూపమును సంస్కృతసమముగానే సాధించియుండుటచేతను, నిరువురును 'చే - జే' ల దంతోచ్చారణము తద్భవదేశ్య మాత్ర విషయకమని వచించుటచేతను (౩౧ విష.) దంత్యచజల చ్చాంధ్రవర్ణ సమామ్నాయములో మాత్రమే పేర్కొనఁబడియుండుటచేతను (౨౦ విష.) 'రాజు' అను దానిలోని జకారము తాలవ్యమనుటయె నన్నయాథర్వణ సమ్మతమని నిశ్చయింపనగును. అరయనరయ నన్నయాథర్వణులనాఁటికి 'రాజు' అనెడి దంత్యజకారఘటిత వైకృతరూప మవతరించినదనుటకే యాధారమగపడదు. వైకృత దంత్యజకారఘటితతద్భవ రాజుశబ్ద మర్వాచీనాచ్చాంధ్ర కావ్యములలోఁ బ్రయుక్తమయ్యెననియుఁ దాలవ్యజకారఘటిత సంస్కృతసమరాజుశబ్దము వేఱనియుఁజెప్పుట యుక్తమై యుండఁగాఁ దానును సూరియు సంస్కృత సమరాజుశబ్దములోని జకారమే దంత్యమనిపొరవడి వ్రాసినంతమాత్రమున నవ్వాదమును నిల్పుకొనుటకై గుప్తార్థప్రకాశికాకర్త "మహాకవులు గ్రామ్యశబ్దములు సైతము గ్రంథములలోఁ బ్రయోగించినచో నవి గ్రాహ్యములుగా నెంచవలెను...నిరంకుశాఃకవయః......మహాకవులు నియమంబుదప్పి యన్యదేశ్యపదంబు లచ్చతెనుంగులోనికి నాహ్వానించి గౌరవించి నట్లే...తత్సమరాజ శబ్దంబును బొత్తుపఱచిరి. అచ్చతెనుంగు కావ్యములలో నీశబ్దంబును...మహాకవు లన్యదేశ్యాదులతోపాటుగఁ బ్రయోగించిరియని సంతృప్తిఁ జెందుచు నీశబ్దంబు దంత్యజకార ఘటితమైన తత్సమంబే యని..." (బా. గు. ప్ర. తత్స. ౭౮ సూ. వ్యా.) అని యిట్లు వేఱొక యపసిద్ధాంతమును నెలకొల్పుట యుక్తముకాదు. ఈవాదము నిరాధారము. ఇది యీవఱకె సప్రమాణముగ నిరసింపఁబడెను. (౩౬. మొ. ౪౧ విష.)

నన్నయా సాన్తాదపయః ప్రభృతేః, స్లోపో౽న్యేషాంచ వా లు
౧౭౯-౧౮౧ విష. గన్తస్య. (ఆం. చిం. 3 కారి. అహో. ౩౮౪.)

కల్పతరు. ౧౭౯-౧౮౧ విష:—అపయః ప్రభృతేః = పయః ప్రభృతులలోఁ జేరనట్టి, సాన్తాత్ = సకారాంతశబ్దముకంటె, స్వాదివిభక్తి పరమైయుండఁగా, స్లోపః = సకారలోపమగును. అనఁగా నట్టి సకారాంత ప్రథమైకవచనతుల్య ప్రాతిపదికశబ్దము తుదినున్న సకారమునకు వికల్పముగా లోపముకల్గుననియర్థము. 'వాలుగన్తస్య' అను నుత్తరసూత్రమునుండి వాశబ్ద మాకృష్టమగుచున్నది; ఇందలి వాశబ్దము వ్యవస్థావాచియగుటచేఁ బుంస్త్రీలింగ సకారాంత మహన్మహతీ వాచకములకు మాత్రము గుణవద్గుణకార్యములు సైతము సంభవించునని యెఱుంగునది. అట్లగుటచేత 'ఊర్ధ్వరేతాస్' మున్నగు ప్రథమైకవచన తుల్యప్రాతిపదికముల సకారము

లోపించి హ్రస్వము రాఁగా నేర్పడిన 'ఊర్ధ్వరేత' మున్నగువాని కుత్వడుజ్ఝులు రాఁగా 'ఊర్ధ్వరేతుఁడు' మున్నగు నగుణవర్ధనరూపములు సిద్ధించును. పైని వ్రాసినరీతి నీమహద్వాచకమునకు గుణవర్ధనకార్యములును గల్గును గాన 'ఊర్ధ్వరేతసమ్' మున్నగు ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికములతుది మకారమునకు "అన్యేషాంచ వాలుగన్తస్య" అను సూత్రములోని వ్యవస్థావాచి వాశబ్దమహిమచే లోపము నిత్యముగా సంభవించుటచేత 'ఊర్ధ్వరేతస' అను ప్రాతిపదికరూపమేర్పడఁగా నుత్వడుజ్ఝులు వచ్చుటచేత "ఊర్ధ్వరేతసుఁడు" మున్నగురూపములు సిద్ధించును. 'సాన్తాదపయః ప్రభృతేః స్లోపః' అను ప్రకృతసూత్రములోని "స్లోపః" అనగా సకారలోపమగునను నిర్దేశముచేతఁ బ్రథమైకవచన తుల్యరూపము 'ఊర్ధ్వరేతాః' అని నిలువక "ఊర్ధ్వరేతాస్" అని నిల్చునని గ్రహింపవలెను. "ప్రథమైకవచన తుల్యత్వేపి విసర్గస్య ద్విత్వా సంభవాత్ తత్ స్థానిక స్సకారస్యైవ గ్రహణమ్. అపయః ప్రభృతేరితి సూత్రప్రయోగశ్చ శబ్దశాసన స్యాత్రమానమ్" (అహో. ౩౯౦ పుట.) గుణవర్ధనకార్యములీరీతిగ సకారాన్త పుంస్త్రీలింగ శబ్దములకుమాత్రమె కల్గునుగాని సకారాంత నపుంసక లింగశబ్దములకుఁ గల్గనేరవు. ఉదా:-"మనము-మనస్సు-మనసు" అనియే యుండునుగాని 'మనసము' అని యుండనేరదు. ఈవిషయమె సకారాంతము లగుణవర్ధనములోనివే కాని గుణవర్ధములోనివి కావనుటకుఁ బ్రబలనిదర్శనమనవచ్చును. పైరీతిని సకారాంత పుంస్త్రీలింగ మహన్మహతీ వాచకములకు మాత్రము గుణవర్ధనకార్యములు నైతము గల్గునని వ్యవస్థావాచి వాశబ్దమహిమకృత వ్యాఖ్యానమున కీక్రింది భట్టారక ప్రయోగములు మూలమగుచున్నవి:—
తే. గీ. ఉత్తమాశ్రమనిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ । డైన కణ్వమహాముని (ఆది. ౪ ఆ. ౩౨) క....భూ। రితేజులందఱును నూర్ధ్వరేతసులైనన్ (ఆది. ౩ ఆ. ౬౦) సీ...। వచ్చి తానుగ్రశ్రవసుఁడను సూతుఁడు... (ఆది. ౧ ఆ. ౨౮) మ. మతిలోకోత్తరుఁడైన యంగిరసు మన్మండు...(ఆది. ౩ ఆ. ౧౧౮) తరలము - ప్రచేతసు పుత్త్రభక్తి (ఆది. ౧ ఆ. ౨౧ ప.) క....భా।సురయమనియమాభిరాము సోమశ్రవసున్ ॥ (ఆది. ౧ ఆ. ౮౮) సీ. అందు జలక్రీడలాడుచున్న యప్సరస ఘృతాచి సదమలాంగి (ఆది. ౫ ఆ. ౧౯౫) తే. గీ. తపనతేజ సరస్వతి దక్షిణమున । (అర. ౨ ఆ. ౨౫౯) స్త్రీలింగ సరస్వతీశబ్దమునకు విశేషణమగుటచేఁ దపనతేజశ్శబ్దము సకారాంత స్త్రీలింగము. "తపనతేజాః - తపనతేజసౌ - తపనతేజసః (సం. ప్ర.) తపనతేజసమ్ - తపనతేజసౌ - తపనతేజసః" (సం. ద్వి.) అనియుండును. ఇందు 'తపనతేజాస్' అను ప్రథమైకవచన తుల్యప్రాతిపదికము తుది సకారము ప్రకృతసూత్రముచొప్పున లోపింపఁగా స్త్రీలింగ

ప్రథమైకవచనలోపము కల్గుటచే 'తపనతేజ' అను సగుణవర్ధకార్య కలితరూపము సిద్ధించును. ఇంక ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికమగు "తపనతేజసమ్" అను దాని నుండి 'అప్సరస' అను దానివలెనె 'తపనతేజస' అను రూపమునైతము లభించును. "సలోపే - ప్రచేతసుఁడు - ప్రచేతుఁడు. ఇత్యాది - ప్రచేతసు పుత్త్రుభక్తిఁ దలంచుచున్ - మఱియు నంగిరసుఁ డన్వాసపుత్త్రునకు - ఊర్ధ్వరేతుండు - ఊర్ధ్వరేతసులైన నిత్యాదివచనే మాచార్యస్య" (అహో. ౩౮౭ పు.) అని యహోబలపతియు నుదాహరించెను. ఇట్లుదాహరించియు "పక్షేద్విత్వోత్వే ఆయుస్సు - బహుళగ్రహణా దద్విత్వే జటాయుషుఁడు ఇతిరూపంచ" (అహో. ౩౯౦ పు.) అని యహోబలుఁడు ప్రామాదికముగా నెట్లు వ్రాసెనో తెలియకున్నది. ద్విత్వోత్వములుగాని 'ఉ' త్వమాత్రముగాని వచ్చునపుడింక 'అగుణవతాం సర్వహలాం సోర్లోపః" అను రీతిని సులోపమువచ్చుచుండఁగా 'డుజ్' వర్ణకమువచ్చుట యెట్లు ఘటిల్లునని యహోబలపతి తలంచెనో తెలియకున్నది. ఇట్టి ప్రమాద మిచటనే కాదు - స్థలాంతరములందును గలదు. "ప్రశానుఁడు - ప్రథమైకవచన తుల్యత్వమ్ - దీర్ఘాత్పరత్వా న్న ద్విత్వమ్." (అహో. ౩౮౨ పు.) "హనుమానుఁడు భగవానుఁడు ఇతిరూపం త్వగుణవర్ధణత్వేన బోధ్యమ్" (అహో. ౩౮౫ పు.)

సకారాంత పుంస్త్రీలింగ మహన్మహతీవాచకములగు 'విశ్రవస్ - అప్సరస్' మున్నగుశబ్దముల సంస్కృత ప్రాతిపదికములనే "క్వచిన్నామ గ్రహైవే"త్యాద్యథర్వణకారికచొప్పున (౧౬౯ విష.) సగతిక గతికముగా గ్రహించి యట్టి ప్రాతిపదికములతుది సకారమునకు ద్విత్వోత్వములనుజేసి సులోపముచేయఁగా నేర్పడిన విశ్రవస్సు - అప్సరస్సు మున్నగు రూపములను గొందఱుకవులు ప్రామాదికముగాఁ బ్రయోగించియున్నారు. "చ. అనయము విశ్రవస్సునకు నారయ మన్నఁడవౌదు వెప్పుడున్ (భాస్కరరా. యుద్ధ. ౧.౨౭౮ ప. వేఱొకప్రతిలో. ౧౨౮౩ ప. అయ్యలార్యునిది.) "అప్సరస్సులు - సం - వి - స్ - స్త్రీ - బ - అప్సరః స్త్రీలు. తే. గీ. నారినీకన్నుఁ జక్కనివారె యప్స।రస్సులారయ (దశా. ౨ ఆ. ౩౭౨ ప.) ప్రయోగాంతరము కనఁబడలేదు" (సూ. రా. ని.) "సుమనస్సు - ఉగ్రశ్రవస్సు అనియుఁ బ్రయోగముగలదు." (ఆం. భా. అ. శబ్ద. ౩౦ సూ.) అని యనుశాసనకర్త వ్రాసెనెకాని యట్టి ప్రయోగములను జూపలేదు. పయిరీతిని గొందఱు సామాన్య కవులు ప్రయోగించియున్నను (ఆము. ౬ ఆ. ౯౯ 'సుమనస్సునకు' అచ్చుతప్పు. "నత...సుమనస్కునకు" అని యొప్పు.) నీరూపములు నన్నయాథర్వణ వచనములకు విరుద్ధములగుటంజేసి సాధువులు కాఁజాలవనుట సాహసముకాదు. 'విశ్రవస్'

మున్నగువాని ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికములనుండియు ద్వితీయైకవచన తుల్య ప్రాతిపదికములనుండియు రూపసిద్ధిగల్గుచుండుటచే నట్టి ప్రాతిపదికములు లభింపని య గతిక గతిస్థలములం దుపయోగింపఁదగు "క్వచిన్నామగ్రహేహైవే" త్యాద్యథర్వణ పద్ధతి నాశ్రయింపవలసిన ప్రసక్తియేలేదు. ఇంక సగుణవర్ణన ప్రాతిపదికములనే గ్రహింతుమందురేని "విశ్రవాస్ - అప్సరాస్" అను వానినుండి. "విశ్రవాసు - అప్సరాసు" అను ననిష్టరూపములే కల్గునుగాని "విశ్రవస్సు అప్సరస్సు" అను రూపములు కల్గనేరవుగదా! సీ....ఆ। విర్భావమును బొందెవిశ్రవస్సు। విశ్శ్రివస్సునకుఁ దపశ్శ్రీసనాథుండు...(కాశీ. ౪ ఆ. ౧౩౮ ప.) అని యిట్లు శ్రీనాథమహాకవియుఁ బ్రయోగించెనేయని శంకింపరాదు. "ఆ।విర్భావమునుబొందె విశ్రవసుఁడు" (లేదా 'ఆ। విర్భావమునుబొందె విశ్రవుండు) అనియు, "విశ్రవస్సునకుఁ దపశ్శ్రీస నాథుండు" అనుచో "విశ్రవసునకుఁ దపశ్శ్రీసనాథుండు" అనియు శ్రీనాథమహాకవి ప్రయుక్తపాఠములు కానోపును. అంతియకాని కవిసార్వభౌముఁ డట్టియపలక్షణ ప్రయోగములను జేసియుండునని విశ్వసింపరాదు. ముద్రణ సంస్కర్తల లోపములను బ్రమాణీకరించి నన్నయాథర్వణ సిద్ధాంతముల నన్యథాకరించుట యుక్తము కాదుగదా!

అగుణవర్ణనగతములు నమహాత్తులునగు మనః ప్రభృతి సకారాంతశబ్దములకుఁ బుంలింగరూపములు లేమింజేసి వాని నపుంసక ప్రథమైకవచన తుల్యరూపములనే ప్రాతిపదికములనుగా గ్రహింపవలెను. 'సాన్తాత్...స్లోపః' అను నిర్దేశములచే 'ఆయుష్ - అర్చిష్' మున్నగువాని ప్రాతిపదికములు సైతము 'ఆయుస్ - అర్చిస్' అను రీతిని సాంతములుగానె తెల్గున నిల్చునని వ్యాఖ్యచేయవలెను. ఉదా:— అయుస్సు - అర్చిస్సు - ధనుస్సు - మొ.

పయిరీతిని గ్రహింపఁబడిన 'మనస్ - సదస్' మున్నగు ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికము లగుణవర్ణనములోనివిగాన "ద్విత్వోత్వే సర్వహాలాం। హ్రస్వా; ద్విత్వంతు దీర్ఘతో బహుళమ్। అగుణవతాం సర్వహాలాం సోర్లోపః" అను చింతామణిసూత్రములచొప్పున ద్విత్వోత్వ సులోపములురాఁగా "మనస్సు - సదస్సు" మున్నగురూపములు సిద్ధించును. "సాన్తాదపయః ప్రభృతేః స్లోపః" అను ప్రకృత సూత్రముచొప్పున 'మనస్ - సదస్' అను ప్రాతిపదికములతుది సకారము లోపింపఁగా "స్యాదమహతాం విభక్తౌ సోశ్చము" అను చింతామణిసూత్రముచొప్పున ముపర్ణకాదులురాఁగా 'మనము - మనమ్ము - మనంబు - మనములు - సదము, సదమ్ము-సదంబు - సదములు' మున్నగురూపములు సిద్ధించును. "ద్విత్వంతు దీర్ఘతో

బహుళ" మ్మను సూత్రములోని బహుళశబ్దపు మహిమచే నమహత్సకారాంతముల హ్రస్వపూర్వక సకారమునకు సైతము పాక్షికద్విత్వమును నిత్యముగా 'ఉ' త్వమును గల్గునని వ్యాఖ్యానము చేసికొనవలయును. అట్లు ద్విత్వమురానపుడు 'మనసు - సదసు' మున్నగు రూపములును సిద్ధించును. "బహుళగ్రహణాత్ క్వచిదన్యదేవ ఇత్యద్విత్వే-ఎ. గీ. 'సదసులోని విప్రజనముమీఁద' (ఆది. ౨ ఆ. ౧౩౧ ప.) నితా్యచార్యేణ ప్రయుక్తమ్. తేన "ఆ. వె. ఎందు వేఁటరారె యితరులేమనస్సుతో। దారసంగసుఖముతప్పఁ ద్రోచి।తి" (రాఘవ. ౧ ఆ. ౩౧) ఇత్యాదయః కవీనాం ప్రయోగా స్సాధవ ఇతిబోధ్యమ్" (అహో. ౩౯౦ పు.) (పయిరాఘవ పాండవీయ పద్యమున:—"ఏమనన్ + సుతోదారసంగసుఖము" అని రామాయణార్థమున ఛేదము. "ఏమనసుతో+దారసంగసుఖము" అని భారతార్థమున ఛేదము.)

"అపయః ప్రభృతేః" అనుటవలన "పయః" ప్రభృతిశబ్దముల తుదిసకారమునకు లోపములేదు. "పయః ప్రభృతేస్తు - పయస్సు - వయస్సు - సరస్సు ఇత్యాది" (అహో. ౩౯౦) ఇట 'వయస్సు' అనుచో భద్రాద్రిశాస్త్రిగారి సంస్కరణమున 'ఆయుస్సు' అని పడుట పొరపాటు. 'ఆయువు' అనునది సుప్రసిద్ధము. ఆ. వె.। ఎఱుకలేని కఱకుటెఱుకవేఁటకుఁ జెఁగా। దనక తనకతి నాయువల్పమైన (ఆర. ౨ ఆ. ౯౧ ప.) "పయః ప్రభృతికి - పయస్సు - వయస్సు - అయస్సు - సరస్సు - ఇత్యాది" (బాలసరస్వతీయ టీక. పరిష్కృద్రణము. హలం. ౩ కా రి. వ్యాఖ్య.) అని బాలసరస్వతి యుదాహరించెను. 'సరము' అనురూప మర్వాచీనులచేఁ బ్రయోగింపఁబడినను బ్రాచీనకావ్యములలో లేదు.

అన్యేషాంచేత్యాది:—అన్యేషాంచ - అన్తస్య = సకారాంతములకేకాక మఱి కొన్ని ప్రాతిపదికములయొక్కయుఁ దుదిహల్లునకు, వాలుక్ = వికల్పముగా లోపము కల్గును. ఉదా:—ఇంద్రజిత్ = ఇందజి. జగత్ = జగ. ఇందు 'ఇంద్రజి' అను దానిమీఁది సుప్రత్యయమునకు "సోర్లుగితః" అను చొప్పున లోపమురాఁగా "ఇంద్రజి" అను ప్రథమైకవచన రూపమేర్పడును - పిదప హరిశబ్దమునకు వలెనె యితర విభక్తివచనరూపముల ప్రక్రియ నెన్నవగును. 'జగ' అను ప్రాదింపదికమునకు 'వన' శబ్దమునకువలెనె రూపము నెన్నునది. ఉదా:—జగము - జగమ్ము - జగంబు - జగములు - మొ. 'ఇంద్రజిత్' అనుచో నంత్య లోపాభావపక్షమున "ఇంద్రజిత్తు - ఇంద్రజితుఁడు" అను రూపములు సిద్ధించును (౧౯౯ I విభ.) ఇందలి వాశబ్దము వ్యవస్థావాచియగుటచేత జగచ్ఛబ్దమున కంత్యలోపము నిత్యమని వ్యాఖ్యచేయనగును. ('జగత్తు' అను రూపము ప్రయోగదృష్టము కాలేదు.) ఇట్లె

'గుణవంతమ్' మున్నగుచోట్లను నిత్యసు లోపముకల్గును. (౧౭౧ విష.), అహోబల పండితుఁ డీసూత్రమునకిట్టివి లక్ష్యములని వ్యాఖ్యచేయక "పథిన్ - మథిన్ - ఋభుక్షిన్" అనునవి లక్ష్యములని వ్యాఖ్యచేసెను. అది యీావలనె విమర్శిత మయ్యెను. (౧౬౯ III విష.)

అహోబలపండితుఁడు "సకారాంతముకన్నఁ బరమగు సకారమునకు లోపమగుననుట సుసంగతము కాదని తలంచి కావలయు విభక్తి విపరిణామాన్వయము నంగీకరించి ప్రకృతసూత్రమున కీక్రిందిరీతిని వ్యాఖ్యచేసెను. "అపయః ప్రభృతేః సకారాన్తస్య సస్య వాలుక్ స్యాత్" (అహో. 3౧౪ పు.) ఇందు 'సాన్తా' త్తను దానికి 'సాన్తస్య' అని విభక్తి విపరిణామముచేసి యన్వయించెను. ఇట్టి విభక్తి విపరిణామాన్వయములు నన్నయాభిప్రేతములు కావు. ప్రకృతసూత్రమున "సకారాంతాత్ పరతః సొపరే సస్య వాలోపఃస్యాత్" అని యన్వయించుటలో విరోధమేమియు లేదు. ఇంతయేల? భట్టారకుఁడే యిట్టి యన్వయమును గంఠోక్తముగాఁ బ్రయోగించెను. "లుగ్వా ద్రుతప్రకృతికాత్పరతః సరళేస్థిరేచ నస్యస్యాత్". అహోబలపండితుఁడును నిట్టి యన్వయము నచట నంగీకరించియే యున్నాఁడు."ద్రుతప్రకృతికేభ్యః పరస్య నస్య లుగ్వాస్యాత్సరళే స్థిరేచపరే" (అహో.౨౧౨ పుట.)

ఇచటనేకాక యింకను మఱికొన్ని స్థలములందును నీతఁ డీ విభక్తి విపరిణామాన్వయము ననావశ్యకముగా నంగీకరించుచువచ్చెను. "న్వన్తాన్నామ్నః కుజ్ నోర్బహువచనే. వ్యాఖ్యః—స్వన్తనామ్నో నోః కుజాదేశఃస్యాత్ - బహువచనే పరే, న్వన్తాదిత్యత్ర 'సదిరప్రతే' రిత్యాదావివ విభక్తేర్వ్యత్యయః." (అహో. 3౨౯ పు.). సదిరప్రతేరిత్యాది సూత్రములందువలెనె న్వన్తాదిత్యాది నన్నయసూత్రము నందును విభక్తి విపరిణామాన్వయము నెన్నునదని యహోబలపతి వ్రాసెను. "సదిరప్రతేః (౧-3-౬౬) వ్యాఖ్యః—సదిరితి షష్ఠ్యర్థే ప్రథమేత్యభిప్రేత్యాహ - సదేస్స స్యేతి." (సి. కౌ. ౨౨౭౧ సూ.). "న్వన్తాత్ నామ్నః = నువర్ణాంత ప్రాతిపదికము కంటె, బహువచనే = బహువచనము పరమగుచుండఁగా, నోః = 'ను' అనుదానికి, కుజ్ = కుజాదేశమగును" అని పై సూత్రము నన్వయించుటలోఁ బ్రతిబంధమేమో తెలియకున్నది. ఇట్లె "న్ను మ్మూ హ్రస్వశ్చాదే రమిళసిచ. వ్యా. అమ్ళసోః న్ను మ్ము ఇత్యేతౌ స్తః." (అహో. 3౯౬) ఇచట అమిఃళసిచ = 'అమ్ళస్' ప్రత్యయములు పరమగుచుండఁగా, న్నుమ్మూ = న్నుమ్ములు, ప్రకృతి కాగమములగునని యర్థముచేయనగును. (చింతా. విష. పరి. ప్రథమానుబంధ. ౧౪3 విష.) ఇట్లన్వయములు సరళములుగా వెలయుచుండఁగా నీ విపరిణామాన్వయముల కావశ్య

కతయేమో తెలియకున్నది. పాణినీయములోనున్న యగతిక గతులెల్ల నిందుండక తీరదా ?

జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు.

బాలవ్యాకరణ ౭౯.

౧౭౯ I విషయము. జగము - జగత్తు, ఇంద్రజి - ఇంద్రజిత్తు. ఋత్విగాది యగుటంజేసి యింద్రజితుండనియు వాడఁబడు.

సంజీవని. ౧౭౯ I విష:—చింతామణి "అన్యేషాంచ వాలుగన్తస్య" అని స్థలాంతరోపయోగిగా సూత్రింపఁగా నట్టికార్యము జగదింద్రజిచ్ఛబ్దమాత్ర విషయకముగా సూరి సూత్రించుచున్నాఁడు. "జగత్ - జగతౌ - జగతః" 'ఇన్ద్రజిత్ - ఇన్ద్రజితౌ - ఇన్ద్రజితః' అని వీని సంస్కృత ప్రథమావిభక్తిరూపములు. కానఁ దెల్గున 'జగత్ - ఇంద్రజిత్' అనునవి ప్రాతిపదికములు. వీని తుదితకారము లోపింపఁగా 'జగ - ఇంద్రజి' అని యేర్పడును. వానిలో 'జగ' అను దానికి వన శబ్దమునకువలెను 'ఇంద్రజి' అను దానికి హరిశబ్దమునకువలెను రూపసిద్ధికల్గును. ఉదా:—జగము - జగములు. ఇంద్రజి - ఇంద్రజులు - మొ. తకారలోపాభావ పక్షమున తుదిహల్లునకు ద్విత్వోత్వ సులోపములు రాఁగా 'జగత్తు - ఇంద్రజిత్తు' అని రూపములేర్పడుననుచు సూరి యుదాహరించెను. ఇంద్రజిచ్ఛబ్దమునకుఁ గవి ప్రయోగములనుబట్టి గణద్వయస్థితి యంగీకరింపఁబడుటచే 'ఇంద్రజితుఁడు' అను గుణవదాది గణరూపమును గలదనుచు ఋత్విగాదీత్యాది వాక్యమున సూరి వివరించెను. 'ఇంద్రజిత్తుఁడు' అను రూప మీవలకే విమర్శింపఁబడెను (విస్తర. II ౧౭౦ II విష.). 'హనుమత్' అను సంస్కృత ప్రాతిపదికములోని తకారమునకుఁ బ్రకృత సూత్రముచేత లోపముచేసి విశ్వకర్మాదులలోఁజేర్చి సాధించినచో 'హనుమ' అను సంస్కృత సమరూపమేర్పడును. కాని గణద్వయమునందును జేర్పుట కవకాశము లేని యగతికస్థలములందు మాత్రమె "క్వచిన్నామగ్రహేణైవే" త్యాద్యథర్వణ కారికకుఁ బ్రవృత్తి సిద్ధాంతితమగుటంజేసి హనుమచ్ఛబ్దమున కట్లుచేయుటకుఁ బ్రసక్తి లేదు. మఱియు విశ్వకర్మాదులెల్ల నకారాంతములు. ఇది తకారాంతము. విశ్వకర్మాదులెల్ల నగుణవద్గణములోనివి. 'హనుమత్' అనున దట్టిదికాదు. ఇంతకును 'మహాహనుమ' మున్నగు రీతిగల సిద్ధసమాస ప్రయోగములు లభింపమింజేసి 'హనుమ' అను రూపము సంస్కృతసమమనుటకును నవకాశములేదు. శబ్దరత్నాకరమున 'హనుమానుఁడు - హనుమంతుఁడు' అనునవి మాత్రము సంస్కృతసమము లన్నియు 'హనుమ - హనుమఁడు - అనుమఁడు' అను రూపములు వైకృతములనియు

నుదాహరింపఁబడెను. ఇందు 'హనుమఁడు' అను దానికిఁ బ్రయోగములు చూపఁబడలేదు. తక్కిన రెంటికి నీక్రిందిప్రయోగములు కన్పట్టుచున్నవి. క...హనుమకనిలజుఁడనియెన్ (ఆర. 3 ఆ. 3౪౫)క...గు। హాళియుఁడై యున్న హనుమయను కపి పెలుచన్. (ఆర. 3 ఆ. 3౧౪) ఆ. వె. పడఁగనున్న హనుమ భయవిహ్వలుఁడుగాఁడు...(అహో. ౧౮౭ పు.) క. విను మనుమఁడ విను మనుమఁడ। వనఁదనరిన నీకు నెందు నడ్డముగలదే (అచ్చ. రా. యు. కాం. శ. ర) దీనినిబట్టి 'హనుమఁడు' శబ్దము శబ్దరత్నాకర కర్తచేతఁ గల్పితమయ్యెనాయని యాలోచింపవలసియున్నది.

'ఇంద్రజి - జగము' అనువానికిఁ బ్రయోగములు:—కం. ఇంద్రజి ననిలోఁ జంపి (నిర్వ. ౧ ఆ. ౮౧ ప.) కం. ఎంతయు వెస నృపతనూజు నింద్రజి వైవన్ (ఆర. ౭ ఆ. ౧౨౧) జగచ్ఛబ్దమున కెల్ల యెడలను 'జగము' అను రూపముమాత్రమె కన్పట్టుచున్నది. ('జెగము' అను వైకృతరూప మర్వాచీనమనఁదగును.) బాలసరస్వతి హోబలపండితులు సైతము 'జగత్తు - జగము' అను రూపద్వయము నుదాహరించిరి. ఆంధ్రకోశములందును నీరూపద్వయము చూపఁబడియున్నది. కాని మహాకవిప్రయోగములం దెల్లెడలను 'జగము' అనునదే కన్పట్టుచున్నది. 'జగత్తు' అను రూపము కానంబడదు:—క...ఉ। ద్దామభుజ వీర్యసంపద। తో మూఁడు జగములు నోఫుదురు సాధింపన్ (సభా. ౧ ఆ. ౧౧౫) చ. జగములనెల్లెడన్ దురితసంతమసంబు...(ఉద్యో. ౨ ఆ. ౨౮౬) చ...జగముల నన్నిటిం దనవశంబుగ...(ఉద్యో. ౨ ఆ. 3౧౦) క. ఒకతల సమస్తజగములు (ఉద్యో. ౨ ఆ. 3౧౫) చ...ఞ్జగంబుల। న్నిని నొకపెట్ట...(ఉద్యో. ౨ ఆ. ౨౪౦) మొ.

"జరుఁడు - సం - విణ - (త్. ఈ. త్.) ముసలివాఁడు. క...ఉ। శసుఁడతనికి శాపమిచ్చి జరుఁడై యుండన్ ॥ (వి. పు. ౬ ఆ.)" (శ. ర) ఈశబ్దరత్నాకర పంక్తులనుబట్టి శబ్దరత్నాకరకర్త జరత్ శబ్దమును సైతము 'జగదింద్రజిచ్ఛబ్దములతో పాటుగ నీసూత్రమునఁజేర్చి రూపసాధనము చేసినట్లు తోఁచుచున్నది. గాణపత వ్యాఖ్యాతయు నీశబ్దరత్నాకరము ననుసరించి యిందుదాహృతమగు విష్ణుపురాణప్రయోగమునే చూపి జరచ్ఛబ్దమునకు సయితము తకారలోపము వ్యవస్థితవిభాషచే నిత్యమని వ్యాఖ్యచేసెను, (నారా. గాణ. తత్స. ౭౧ ప. ౨3౨ కారి.). కాని "జరన్ - జరన్తౌ - జరన్తః" అని సంస్కృతమున జరచ్ఛబ్దప్రథమావిభక్తి యుండునుగాన నీశబ్దరత్నాకర గాణపతవివరణమార్గములు పనికిరావు. కానఁ బయివిష్ణుపురాణ ప్రయోగమును జింతామణిపద్ధతిచే సాధించికొనవలయును. "అన్యేషాంచ వాఽ

గ_న్తస్య" అను చొప్పున 'జరన్' అను ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికముయొక్క నకారమునకు వ్యవస్థితవిభాషచే నిత్యలోపమును జేసి జరుఁడనురూపమును సాధించుకొనవలెను. ఇట్టి చిక్కులుండుటచేతనే కావలయును సాధారణముగ నంతటను దత్సమశబ్దములనెల్ల శబ్దరత్నాకరానుసారముగనే యుదాహరించుచున్న సూ. రా. నిఘంటుకర్త లిచట వేఱురీతి నుదాహరించిరి. "జరుఁడు - సం - వి. (అ. ఆ. అ.) జరావంతుఁడు. ముసలివాఁడు. క....శుక్రుఁడు I జనవరునకు శాపమిచ్చె జరుఁడై యుండన్ (వి. పు. ౬ ఆ, ౧౭౩ ప.). 'ఉ I శనుఁడతనికి' అనుదానికి బదులుగ "శుక్రుఁడు I జనవరునకు" అను పాఠాంతరము సూ. రా. నిఘంటువునఁ గలదుగాని యావిషయమును విమర్శించుటకిటఁ బ్రసక్తిలేదు. శబ్దరత్నాకరము ప్రసిద్ధజరచ్ఛబ్దపు సంస్కృత సమరూపము 'జరుఁడ'ని యుదాహరింపఁగా సూ. రా. నిఘంటువు 'అ' కారాంత జరశబ్దపు సంస్కృత సమరూపము జరుఁడని యుదాహరించుట విమర్శింపఁదగియున్నది. సంస్కృతశబ్దములను గ్రహించుటలో సూ. రా. నిఘంటుకర్తలు సాధారణముగా "ఆప్టి" కోశము ననుసరించుచుందురు. "జర - a. (జరా+అప్) Becoming old...జరః...." (ఆప్టికోశము) అని యిందు 'అ' కారాంతశబ్దము "వృద్ధుఁడు" అను నర్థముగలదిగ నుదాహృతమైయున్నది. కాని శబ్దార్థచింతామణి, శబ్దస్తోమ మహానిధి - సర్వశబ్దసంబోధినీకోశములలో 'అ' కారాంతశబ్దము లేదు. తకారాంత జరచ్ఛబ్దమె యుదాహృతమయియున్నది. ఈతకారాంత జరచ్ఛబ్దము నుండి 'జరుఁడు' అను రూపమును సాధించుకొనెడి పయి నుదాహరించిన మార్గమును గ్రహింపక కావలయు సూ. రా. నిఘంటుకారులు ప్రసిద్ధజరచ్ఛబ్దమును శబ్దరత్నాకరానుసరణమును నుజ్జగించి యప్రసిద్ధాప్టీ కోశస్థజరశబ్దము నాశ్రయించిరి. ఇట మార్గాంతరము సయితముకలదు. పై విష్ణుపురాణపద్యమున "శాపమిచ్చె జరియై యుండన్" అని కవిప్రయుక్త పాఠమైయుండఁగా ముద్రణసంస్కర్తలు జరిశబ్ద సాధుత్వమునరయక ప్రసిద్ధమగుచున్న "జరుఁడై" అను పాఠమును బ్రక్షిప్తముచేసియుందురనియు నాలోచింపనగును. జరిశబ్దము సంస్కృతమునందుఁ బ్రసిద్ధమైయున్నది. "జరీ - త్రి - వృద్ధే. ఇతి హేమచంద్రః" (శబ్దా. చిం.) "జరా-అస్యాస్తీతి జరీ" అను రీతిని 'జరిన్' అను తద్ధితాంతము సుసాధమైయున్నది. "వ్రీహ్యాదిభ్యశ్చ. (౫-౨-౧౧౬)...శిఖామాలా సఞ్జ్ఞాదిభ్య ఇనిః - యవఖలాదిభ్య ఇకః. (వా_ర్తి. ౩,౨౦౯) అన్యేభ్య ఉభయమ్." (సి. కౌ. ౧౯-౨౩ సూ.) అను చొప్పున - 'శిఖా - శిఖీ, మాలా - మాలీ, సఞ్జ్ఞా - సంజ్ఞీ' అను వానివలె 'జరా - జరీ' అని సిద్ధించును.

సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబు
బాలవ్యాకరణ గానగు. ౮౦.
వివరణము. ఉరము - ఉరస్సు, వక్షము - వక్షస్సు, అర్చి - అర్చిస్సు,
౧౮౦ విషయము. ధనువు - ధనుస్సు, ఆయువు - ఆయుస్సు, బహుళ
గ్రహణంబునంజేసి పయః ప్రభృతుల సకారంబునకు
లోపంబులేదు. పయస్సు - వయస్సు - సరస్సు.

సంజీవని. ౧౮౦ విషః—అర్థములుః—ఉరస్సు = రొమ్ము. అర్చిస్సు = మంట. ధనుస్సు = విల్లు. పయస్సు = పాలు.

'ఉరః - ఉరసీ - ఉరాంసి' అని యురశ్శబ్దసంస్కృత ప్రథమావిభక్తి. ఈ యురః ప్రభృతులకుఁ బుంలింగరూపములు లేవుగాన వాని నపుంసక ప్రథమైకవచన తుల్యరూపమె ప్రాతిపదికమగును. ద్విత్వోత్వములువచ్చుట కనువుగ విసర్గమునకు మూలమగు సకారముతోనె యీప్రాతిపదికములు నిల్చును. ఉదాః—ఉరస్ - వక్షస్. మొ. వీనికి ద్విత్వోత్వసులోపములు రాఁగా - ఉరస్సు - వక్షస్సు మున్నగు రూపములేర్పడును. పుంస్త్రీలింగ మహన్మహతీవాచక సకారాంతముల విషయ ముత్తరసూత్రసందర్భమున వచింపఁబడును. కాన నీసూత్రము నపుంసక సకారాంత మాత్రవిషయకమని యొఱుంగునది. ధనుః-మున్నగు షకారాంత ప్రాతిపదికములు సైతము సకారాంతములుగనె యేర్పడునని యీావఱకె కల్పతరువున వ్రాయఁబడెను. వానికి ద్విత్వోత్వసులోపములు రాఁగా 'ధనుస్సు - అర్చిస్సు - ఆయుస్సు-' మున్నగు రీతిని రూపములేర్పడును. వానికి నురఃప్రభృతులకును బ్రకృతసూత్రముచొప్పున సకారలోపపక్షమున 'అర్చి - ధను - ఆయు - ఉర' మున్నగు ప్రాతిపదికము లేర్ప డును. వానిలో 'అర్చి' మున్నగువానికి హరిశబ్దమునకువలెను, ధను మున్నగు వానికి 'తను' శబ్దమునకువలెను, 'ఉర' మున్నగువానికి 'వన' శబ్దమునకువలెను రూపసిద్ధికల్గును. ఉదాః—అర్చి - అర్చులు - ధనువు - ధనువులు - ధనులు - ఉరము - ఉరములు - మొ. "పయః ప్రభృతేస్తు పయస్సు - వయస్సు - సరస్సు" (అహో. ౩౯౦ పు.) అను నహోబలపతిననుసరించి సూరి యీమూఁడిటిని జూపెను. 'అయస్సు = ఇనుము" అను మఱొకశబ్దమును బాలసరస్వతిచేర్చెను. 'సరస్సు' అనుదానికి సకారలోపపక్షరూప మర్వాచీనుల ప్రయోగములలోఁ జూపట్టుచున్నది. తే. గీ....రుచిర। రసఝరభరంబు వొల్చు మానససరంబు॥ (ఘటికాచల మాహా త్మ్యము. ౧ ఆ. బా. గు. ప్ర. ౧౪౨ పు. ద్వి. ము.) చ....కో । మలినగు చంద్రి కా విసరమా సరమా సరమా సునాభి (సత్య. భా. ౧ ఆ.) "సీ...ఓజః పయోం

భస్సు । రశ్మబ్దములకుఁ జేరదు మువర్ణ । మరయ..." (సర్వల. ౧ ఆ. ౨౨ ప.) అని యవిమర్శితముగఁ దిమ్మకవి వచించెను (విస్తర).

మహద్వాచకంబులగు సాంతంబుల కంత లోపంబేని
బాలవ్యా. ద్వితీయైకవచనాంత తుల్యత్వంబె నగు. ౮౧.
౧౮౧ విషయము. అంగిరుఁడు - అంగిరసుఁడు, ఉగ్రశ్రవుఁడు - ఉగ్ర
శ్రవసుఁడు, ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు, ఊర్ధ్వ
రేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

సంజీవని. ౧౮౧ విష:—అంగిరుఁడు = బృహస్పతి తండ్రి. "ఉగ్రశ్రవసుఁడు (వుఁడు) = సూతునికొడుకు - రోమహర్షణుఁడు" (సూ. రా. ని) ఇదిశప్పు - "సీ. వచ్చి తానుగ్రశ్రవసుఁడను సూతుఁడు రౌమహర్షణి సుపౌరాణికుండు" (ఆది. ౧ ఆ. ౨౮ ప.). ప్రచేతుఁడు=౧ - వరుణుఁడు. ౨ - ఒకముని (వాల్మీకితండ్రి). ఊర్ధ్వరేతసుఁడు = ఊర్ధ్వగామియగు రేతస్సుగలవాఁడు. ౧ ముని ౨ శివుఁడు.

మహద్వాచకములగు సాంతములకుఁ దుది సకారము వికల్పముగా లోపించు ననియు, లోపాభావపక్షమునఁ బ్రథమైకవచనతుల్య ప్రాతిపదికములకు రావలసిన ద్వితో్వత్వసులోపములురాక ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికరూపములు సంభవించు ననియు సూత్రార్థము. "అంగిరాః - అంగిరసౌ - అంగిరసః - (సం. ప్ర.) ఉగ్రశ్రవాః - ఉగ్రశ్రవసౌ - ఉగ్రశ్రవసః (సం. ప్ర)" అని యిట్లు మహద్వాచక సకారాంతముల సంస్కృత ప్రథమావిభక్తిరూపము లుండును. కాన వెనుకవ్రాసినరీతిని "అంగిరాస్ -

---

విస్తర. ౧౮౦ విష:—పైతిమ్మకవి వచనము ననుసరించి కావలయు సుప్రార్థ ప్రకాశికాకర్త "ఓజస్సు - అనస్సు (బండి) అంభస్సు - వర్చస్సు - రక్షస్సు - పాథస్సు (జలము) సరస్సు - ఆయుస్సు - హవిస్సు - చేతస్సు - మహస్సు - అంహస్సు=(పాపము) ఆగస్సు (అపరాధము) ఇత్యాదిశబ్దములకు మువర్ణకంబురాదు" (బా. సు. ప్ర. ౧౪౪ పుట. ద్వి. ము.) అని యవివేకముగఁ బెంచివ్రాసెను. 'ఆయు - హవి' అనునవి 'ఉ' కారాంత ప్రాతిపదికములే కావుగదా వానికి మువర్ణక నిషేధ మేమి? వానికి సకారలోపరూపము లేదని క్రాఁబోలు నుద్దేశము! అదియు సరికాదు. తే. గీ. హవికిఁ బూర్వంబుగారణ మఖిలమంత్ర । ముల...(అను. ౨ ఆ. ౨౭౩) ఆ. వె. ఆయువల్పమైన (అర. ౨ ఆ. ౯౧) సీ....ఆ । యువుదెగినట్టి జంతువులు సచ్చు. (అను. ౫ ఆ. ౫౮) చేతము మున్నగువానికి:— ఉదా:—చేతము చల్లఁ జేయవలె...(కవి పితామహుని యుత్పలమాలిక) క. విలసిత సమాసభరితో । జ్జ్వల బంధం బోజమయ్యె సరి యన్యగుణం । బులు...(నరస. ౪ ఆ. ౬౯ ప.)

ఉగ్రశ్రవాస్" మున్నగురీతిని వీని ప్రాతిపదికము లేర్పడఁగా నట్టివాని తుదిసకారము ప్రకృతసూత్రముచేఁ బాక్షికముగా లోపించునపుడు కాయశబ్దమునకువలెనె "ఉత్వ" దుజ్ఞులు రాఁగా 'అంగిరుఁడు - ఉగ్రశ్రవుఁడు' మున్నగురూపము లేర్పడును. ఇంక నట్టి ప్రాతిపదికముల తుదిసకారము లోపింపనిపక్షమునఁ బ్రథమైక వచన తుల్యప్రాతిపదికములకు రావలసిన ద్విత్వోత్వసులోపములు రాక వానికిఁ బ్రథమైకవచన తుల్యప్రాతిపదికవత్త్వమె తప్పిపోయి ద్వితీయైకవచన తుల్యప్రాతిపదికవత్త్వము సంభవించును. ఉదా:—'అంగిరసమ్ - అంగిరసౌ - అంగిరసః" అనురీతిని సంస్కృతమున వాని ద్వితీయైకవచనము లుండునుగాన "అంగిరసమ్ - ఉగ్రశ్రవసమ్" మున్నగురీతిని వానికిఁ దెనుఁగునఁ బ్రాతిపదికము లేర్పడి 'అంగిరసుఁడు - ఉగ్రశ్రవసుఁడు' మున్నగురూపములు సిద్ధించును. మహాద్వాచకములగు ననఁగాఁ బుంలింగసాంతములగునని యర్థము. ఇది స్త్రీలింగసాంతములకును నుపలక్షణమని వ్యాఖ్య చేసికొనవలయును. అట్లగుటచే తపనతేజ సరస్వతి - తపనతేజస అప్సరస - అప్సర మున్నగురూపములు సిద్ధించును. (౧౭౯ - ౧౧౧ విమ. కల్పతరువు.) ౧౭౯ - ౧౧౧ విషయమునఁ గల్పతరువులో పుంస్త్రీలింగ మహన్మహతీ సకారాంత శబ్దముల రూపములు ప్రయోగ ప్రదర్శనపూర్వకముగ విస్తరింపబడెను గాన నిట మరలఁ బునరుక్తముగ విస్తరింపలేదు. (విస్తర).

---

* విస్తర. ౧౧౧ విమ:—"బహాళమనుటచే బహువ్రీహిని కొన్నిటికి సలోపమునిత్యము. దిగ్వాసుఁడు - దుర్వాసుఁడు - శ్రీవత్సవక్షుఁడు - మహాయశుఁడు-మొద—ఈకార్యము సుమనశ్శబ్దమునకురాదు. సుమనస్సు...కొన్నియనుటచే నవయస్కుఁడు - లబ్ధయశస్కుఁడు మొదలైనచోట్ల కప్రత్యయము వచ్చుచోఁ బైకార్యము రాదు" (ఆం.భా.అ.శబ్ద.౩౦సూ. విమ) ఇట్లయినచో 'మహాయశుఁడు' అనునెడ 'మహాయశస్కుఁడు'అను కప్రత్యయాంతరూపము లేదా? అట్టియెడ 'మహాయశుఁడు' అని తానేయుదాహరించిన రూప మెట్లుసాధువగును? సుమనశ్శబ్దమునకు రాదనఁగా "సుమనుఁడు" అను రూపముండ నేరదని యనుశాసనకర్తయాశయము - ఇట్టియభిప్రాయమున కీక్రిందియహోబలపతివ్రాత మూలముఁ గానోపును. "యథాప్రకృతి సర్వత్ర।సమాసాన్తవిధిర్హితః।నిత్యతాక్వచిదిష్టాస్యా।ద్రూపంగ్రాహ్యం సుధీ హితమిత్యథర్వణః"—(౧౫౮ విమ.) "క్వచిత్ సమాసాన్త స్యాద్యప్రకృత్యాం వైకల్పికత్వేపి అత్రతస్య నిత్యత్వేనైవ ప్రయోగఇష్టః - యద్యత్సమాసాన్తరూపం పణ్డితహృదయంగమం తత్తద్రూపం గ్రాహ్యమిత్యుత్తరార్థః. తేనవిశదమనస్కుఁడు ఇత్యాదీన్యేవరూపాణిగ్రాహ్యాణి. నతువిశదమనుఁడు విశదమనసుఁడు ఇత్యాదీని

నన్నయసూ. పుంబ్రహ్మణో వేధసశ్చ । హ్రస్వత్వేనైవ సంస్థితిః (వికృ.
౧౮౨ విషయము. హలం. ౧-౨ కా. అహో. ౩౧౮ పు.)

కల్పతరువు. ౧౮౨ విష:—౧౭౫ విషయమున నీకారికకు వ్యాఖ్యచేయఁబడెను. పుంలింగబ్రహ్మశబ్దమునకును వేధశ్శబ్దమునకును డాప్రత్యయము నిత్యముగ వచ్చును.అట్టి ప్రాతిపదికదీర్ఘమునకు హ్రస్వముకలిగినరూపమె స్త్రీలింగప్రథమైకవచన లోపము కల్గుటచేతఁ బ్రథమైకవచనాంతముగనుండుట సంభవించుననిభావము. డా ప్రత్యయము స్త్రీప్రత్యయమగుటచేత వీనికి స్త్రీలింగకార్యములు కల్గునని తాత్పర్యము. 'పుంబ్రహ్మణః.' అనుటచేతఁ బుల్లింగేతరబ్రహ్మశబ్దమునకు డాప్రత్యయము రానేరదనియు నయ్యది యగుణవద్గుణకార్యములతోనే ప్రయుక్తమగుననియు నెఱుంగునది. ఉదా:—బ్రహ్మ = చతుర్ముఖుఁడు - విప్రుఁడు - ఋత్విజుఁడు - వేధ= చతుర్ముఖుఁడు. బ్రహ్మము = పరబ్రహ్మము - వేదము - మొ.

---

......అంతర్మనుఁడై ఇతి రాఘవపాణ్డవీయే." (అహో. ౩౯౧) పయి యనుశాసనాహోబలపండితుల యాశయములు సరికావు. "తరల...విమనుఁడై పడియుండెహాయని వెచ్చనూర్చుచు విన్ననై". (సభా.౨ ఆ.౩౧౧) ఇట్లు భట్టారకుఁడు 'విమనుఁడై' అని ప్రయోగించియుండఁగా 'సుమనుఁడు' అని యుండనేరదని యనుశాసనకర్తయు "విశదమనుఁడు" అని యుండనేరదని యహోబలపతియు వ్రాయుట యుక్తముకాదు. కాన "అంతర్మనుఁడై" (రాఘు. ౨ ఆ. ౭౮) అను రాఘవపాండవీయప్రయోగమునైతము శంకాస్పదముకాదనియు నది సమూలమెయనియు గ్రహింపవలయును. సుమనశ్శబ్దము పుష్పవాచకమగునపుడు నపుంసకలింగరూపము సమ్మతమగునేని 'సుమనస్సు' అనురూపముండవచ్చును. సుమనః. న. పుష్పే...క్లీబత్వం ఛాన్దసమిత్యేకే" (శబ్దా. చిం.). "సుమనః-పుం - గోధూమే సుష్ఠుమన్యతే-మన జ్ఞానే - అచ్ - ధత్తూరే-త్రి. మనోహరే" (శబ్దా. చిం.). ఇట్లకారాంత సుమనశ్శబ్దమును మనోహరార్థకము గలదు - అపుడు - 'సుమనుఁడు - సుమన - సుమనము' అని మూఁడురూపములునుండును."దుర్వాసశ్శబ్దమును అకారాంతముగాఁ గొందఱు వాడిరి...దుర్వాసతీర్థ ముత్సుకతమైఁ జూడు (పండితా) దుర్వాసమహామునిపతిఁ-(ప్రభులిం) "(ఆం.భా. అ. శబ్ద.౩౦సూ.వివ) అనియనుశాసనమున వ్రాయుబడెను. ఒక్కదుర్వాసశబ్దమె యకారాంతముగల దన నేల? అకారాంతవస్త్రవాచకవాస శబ్దమే కలదు - "వాసస్ - న ...వస్త్రే" - "వాస—పు. వసఘఞ్. గృహే - వస్త్రే." (శబ్దస్తో.)

వేధ పురోధ పురోధసుఁడు. ౮౨౨.

బాలవ్యా. వేధశ్శబ్దంబునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దంబునకు
౧౮౨౨ I విషయము. వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిప
తింపఁబడియె.

సంజీవని. ౧౮౨౨ I విషః—వేధ = బ్రహ్మదేవుఁడు - పురోధ = పురోహితుఁడు. పై యథర్వణకారికలోఁ జెప్పఁబడిన బ్రహ్మశబ్దరూపసాధనము బాలవ్యాకరణ వివరణము ౧౭౬ విషయమునఁగలదు. "వేధాః - వేధసౌ వేధసః - (సం. ప్ర.) వేధసమ్ - వేధసౌ - వేధసః (సం. ద్వి.) పురోధాః - పురోధసౌ - పురోధసః-(సం. ప్ర.) పురోధసమ్ - పురోధసౌ - పురోధసః (సం. ద్వి.)" అని వీని సంస్కృత ప్రథమా ద్వితీయావిభక్తి రూపములుండును గాన, "అంగిరుఁడు - అంగిరసుఁడు" అను వాని వలెనె "వేధాస్ - వేధసమ్" అను వేధశ్శబ్ద ప్రాతిపదికములనుండి 'వేధుఁడు - వేధసుఁడు' అనియు, "పురోధాస్ - పురోధసమ్" అను పురోధశ్శబ్ద ప్రాతిపదికముల నుండి "పురోధుఁడు - పురోధసుఁడు" అనియు నీరుహాద్యాచక సకారాంత శబ్ద రూపము లేర్పడవలసియుండఁగా నవి యెల్లసాధువులు కావనియు నందు "పురోధసుఁడు" అను గుణవర్ధనరూపమొక్కటియె ప్రయోగదృష్టమగుచున్నదనియుఁ దక్కినవానికి మాఱుగ "వేధ - పురోధ" అను సలోప స్త్రీవద్భావములతోడి రూపములు కవిప్రయోగసిద్ధములైయున్నవనియు సూరిగారు వివరించిరి. వేధశ్శబ్దమునకు నిత్యముగాను బురోధశ్శబ్దమునకు వికల్పముగాను ప్రాతిపదికము తుదినున్న సకారమునకు లోపము స్త్రీవద్భావమును నగునని సూరిగారే తాము నిపతించినవాని యభిప్రాయమును వివరించిరి. ఈవిషయములలో వేధశ్శబ్దసలోప స్త్రీవద్భావ నిత్యత కథర్వణసూత్రము మూలమయియున్నది. ఇంకఁ బురోధశ్శబ్దసలోప స్త్రీవద్భావపాక్షికత విషయమున నీక్రింది శాంతిపర్వప్రయోగమును బ్రమాణముగాఁ గనిపెట్టి దానిలక్షమునుజూపుటలో మొదటిస్థానము నధిరోహించి వాసిగాంచినవారు సూరిగారే యగుచున్నారు. 'పురోధసుఁడు' అను గుణవర్ధనకార్యకలితరూపమునకు సైతము ప్రయోగము లభింపకున్నను భారతమున "పురోధ" అనుదాని ప్రయోగ మొక్కచోటను మాత్రమె చూపట్టుచుండుటచేత వేధశ్శబ్దమునకువలెఁ బురోధశ్శబ్దమునకు సలోప స్త్రీవద్భావములు నిత్యమని సూత్రించుటకు సాహసింపరైరి. వేధశ్శబ్దమెచ్చటఁ బ్రయోగింపఁబడినను 'వేధ' అను సలోప స్త్రీవద్భావములతోనె కనుపట్టుచుండుటచేతను నథర్వణవచన ప్రమాణముండుటచేతను నద్దానికి సలోప స్త్రీవద్భావములు నిత్యమని వివరించిరి. ప్రయోగములు:—

ము. కలఁగెన్ ధోయధిసప్తకంబు...సంక్షోభించె నవ్వేధయున్ (విరా. ౪ఆ. ౧౭౨ ప.)

శా....బ్ర। హ్మాక్షత్త్రంబుల కేకయోని జననం బవ్వేధ గల్పించె...(శాంతి. ౨ ఆ. ౩౨౩ ప.)

మ....అం। తట శోధించెద సీతఁజూపుమని వేధంబట్టి బాధించెదన్ (భాస్కర. రా. సుంద. ౧౨౭ ప.)

తే. గీ. కాన యెల్లవిధంబులఁ గలసియుండ । వలయు నృపుఁడు పురోధయు వసుమతీశ. (శాంతి. ౨ ఆ. ౩౧౬.)

శాంతిపర్వమునందలి యీసందర్భమునఁ బెక్కుసారులు "పురోహిత" శబ్దము వాడఁబడెను. క. పరిశుద్ధిలేని కుత్సిత। పురోహితులు నీచదశలఁ బొందుదురు... (శాంతి. ౨ ఆ. ౩౧౦) ఇట్లు పదునేనుమాఱులకుఁబైఁగాఁ బ్రయోగింపఁబడినది. అన్నియెడలను "పురోహిత" అనుచో "పురోధస" అను దానిని నిల్పినసుశ్రుతిలేదు. ఈక్రిందియొక్కచోటమాత్రము "పురోహిత" అనియే నిల్పకతీరదు. తే. గీ. ఎల్ల మూలంబు దగు పురోహితునిబుద్ధి (శాంతి. ౨ ఆ. ౩౦౬). విశ్రమస్థాన ఘటితమగుటచే నిటఁ బురోధసునిబుద్ధియని నిల్పరాదు. తక్కిన శాంతిపర్వము ద్వితీయాశ్వాసములోని ౨౯౭ - ౩౦౪ - ౩౦౭ - ౩౧౦ - ౩౨౦ పద్యములందును ఆదిపర్వమందలి ౧ ఆ. ౭౭ - ౭ ఆ. ౧౪౬ పద్యములందును బురోహితశబ్దమునుగాని 'పురోధస' అను దానిరూపములనుగాని నిల్పవచ్చును. కాని 'పురోహిత' శబ్దమె వీనియందెల్లఁ గన్పట్టుచున్నది. కాన 'పురోధసుఁడు' అను దానిస్థితికిఁ బ్రమాణము భారతమున మృగ్యమైయున్నది.

నన్నయా ద్విత్వంతు దీర్ఘతోబహుళమ్. (ఆం. చిం. హాలం. ౧౭౩ విషయము. ౨ కారి. అహో. ౩౭౧ పుట.)

కల్పతరువు, ౧౭౩:—౧౬౯ విషయమునందును ౧౪౯ విషయమునందును నిక్కారికకు వ్యాఖ్య చేయఁబడెను. దీర్ఘమునకుఁ దర్వాతనున్న ప్రాతిపదికము తుది హల్లునకు ద్విత్వము బహుళముగానగును. బహుళగ్రహణముచే దీర్ఘముమీఁది హల్లునకు ద్విత్వము పాక్షికముగావచ్చుచుండఁగా సకారాంతములగు నమహచ్ఛబ్దములందు హ్రస్వపూర్వకమగు సకారమునకు సయితము పాక్షిక ద్విత్వముకల్గునని వ్యాఖ్య చేసికొనవలయును. ఉదా:—వాక్కు - వాకు - మనస్సు - మనసు - మొ. (చూ. ౧౭౯ - ౧౭౧ విషయము - కల్పతరువు.) "బహుళగ్రహణాత్ క్వచిదన్యదేవ- ఇత్యద్విత్వే - ఎ - గీ-సదసులోని విప్రజనముమీఁద (ఆది. ౨ ఆ. ౧౩౧ ప.)నిత్యాచార్యేణ ప్రయుక్తమ్. తేన ఆ. వె. ఎందువేఁటరారె యి తరులేమనసుతో । దార

సంగసుఖము దప్పఁ ద్రోచి।తి (రాఘు ౧ ఆ. ౩౧) ఇత్యాదయః కవినాం ప్రయోగాః సాధవ ఇతిబోధ్యమ్" (అహో. ౩౯౧ పుట.) "సాన్తాదపయః ప్రభృతేః స్లోపః" అను సూత్రము చెప్పిన సకారలోపము వచ్చుపక్షమున మనము-సవము మున్నగు రూపములు సిద్ధించును - (౧౭౯మొ. ౧౮౧ విష.).

బాలవ్యాకరణ మనః ప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాషనగు.
వివరణము. ౭౩.

౧౮౩ I విషయము. మనసు - మనస్సు, శిరసు - శిరస్సు, సదసు - సదస్సు;
సలోపంబయ్యెనేని మనము - శిరము - సదము.

సంజీవని. ౧౮౩ I విష:—సదస్సు = సభ. బా. తత్స. ౭౦ సూత్రము చెప్పిన మనః ప్రభృతిసాంత ప్రథమైకవచన తుల్య ప్రాతిపదికముల తుదిసకారము పాక్షికముగాలోపింప 'మన - శిర - సద' మున్నగు రూపములేర్పడును. బా. తత్స. ౩౯ సూత్రముచెప్పిన వానికి మువర్ణకాదులు రాఁగా 'మనము - శిరము - సదము' మున్నగు ప్రథమైకవచనరూపములు సిద్ధించును. సకారలోపాభావపక్షమున బా. తత్స. ౬౮ సూత్రముచెప్పినవచ్చు ద్విత్వోత్వములలో నుత్వము నిత్యము గను ద్విత్వము వైకల్పికముగను వచ్చునని ప్రకృతసూత్రము బోధించుచున్నది. ఉదా:—మనస్సు - మనసు - మొ. ప్రయోగములు:—ఉ. పోరొలువంబు వెల్వడి సపుత్త్రబలుండయి చైద్యుఁడల్కతోన్. (సభా. ౨ ఆ. ౧౫) చ. మనసునఁ బక్షపాతగతి మాదెసమానుము...(ఉద్యో. ౩ ఆ. ౨౩ ప.) మ. మనసేకాగ్రతఁ బొంద......(శాంతి. ౫ ఆ. ౧౨౧ ప.) ఆ. వె. శిరముతన్నె భీముఁడొరయంగ... (శల్య. ౨ ఆ. ౩౦౬) తే. గీ. వామ : చరణమునఁ బెట్టిదముగాఁగ శిరముదన్నె (శల్య. ౨ ఆ. ౨౭౭) సీ....ఆ. వె. సదసులోని విప్రజనముమీఁద (ఆది. ౨ ఆ. ౧౩౧) ఆ. వె. ఎందు వేఁటరాదె యితరులేమనసుతోఁ దారసంగ సుఖముదప్పఁ ద్రోచి। తి...(రాఘ. ౧ ఆ. ౩౧ ప.) 'ఏమనన్+సుతోదార సంగసుఖముదప్పఁ ద్రోచితి' అని రామాయణార్థము. "ఏమనసుతో+దారసంగసుఖము..."అని భారత పక్షార్థము.

నన్నయా భూదివో స్తు జౌయ త్తత్. (ఆం. చిం. అజం. ౧౬ కారి.
౮౮౪ విషయము. అహో. ౩౨౩ పుట.)

కల్పతరు. ౧౮౪ విష:—౧౬౫ విషయమున నిశ్చాయికవ్యాఖ్యాత మయ్యెను. "ద్యోదివౌ ద్వే స్త్రియామ్" (నామలిం. వ్యోమవ. ౧ శ్లో.) అనుచెప్పు చనున్న 'ద్యో - దివ్' శబ్దములలో ద్యోశబ్దమునకు దత్సమరూపప్రయోగము

లేదు. (౧౬౮ II విష.) కావుననే 'భూదివోస్తు' అని 'దివ్' శబ్దమునే చింతామణి స్పృశించినది. "ద్యౌః - దివౌ - దివః (సం. ప్ర.) దివమ్ - దివౌ - దివః (సం. ద్వి.) దివి-దివోః-ద్యుషు (సం. స.)" అని 'దివ్' అనుదాని సంస్కృత ప్రథమాద్వితీయాసప్త మీవిభక్తుల రూపములు. హలంత మెయినను పైచింతామణి విశేషవిధిచే దీనికి గుణ వర్ధనాఽగుణవర్ధనరూపములు లేవు. "భూదివోస్తు జౌ యత్తత్" అను చింతామణి చెప్పిన సప్తమ్యేకవచనతుల్య రూపమె దీనితత్సమరూప సాధనవిషయమునఁ బ్రాతి పదికమగును గాన 'దివి' అను 'ఇ'కారాంతరూపము నామంబగుటచే దీనికి 'మతి' శబ్దమునకువలెనె రూపసాధనము చేయనగును. "అనుతాం స్త్రియాం సమానా మిత్యాదిచింతామణి సూత్రముచెప్పిన స్త్రీలింగప్రథమైకవచన లోపమురాఁగా - 'దివి' అనునది ప్రథమైకవచనరూపమగుచున్నది.

'దివ్' అనుదాని ద్వితీయైకవచనమునకుఁ దుల్యమగు 'దివమ్' అనుదానిని బ్రాతిపదికముగ గ్రహించి 'దివము' అనురూపమును సాధించుటకవకాశము కన్పట్టు చున్నది. "దివంబునుంబోలె నహిమకరభరితంబైనదాని (ఆది. ౨ ఆ. ౨౭ వచ.) ఆ.వె. తల్లిగోవృషము తండ్రిగర్భప్రదేశంబు దివము ధరణి సంప్రతిష (ఆను. 3ఆ. ౧౦)చ. దివమునుండి దేవతలుదివ్యములైన (ఉ. హరి. ౧౦ ఆ 3౧౪)అనిదానికిఁ బ్రయోగములును వెలయుచున్నవి-అట్లయినను 'దివ్' శబ్దము తత్సమమగునపుడు భట్టారకవిశేషవిధి చెప్పిన 'దివి' అనురూపముతోనే తెలుఁగునంజేరునని చెప్పక తీరదు - పై ప్రయోగములలోని 'దివము' అనునది 'అ' కారాంతనపుంసకమగు' దివ శబ్దపుఁదత్సమరూపమని గ్రహింపనగును. "దివ. న. (దివ+క) స్వర్గే - దివౌకసఃశత్య త్రాదన్తతా - ఆకాశే - దివసే - వనేచ" (శబ్దస్తో.) "దివమ్ - న - స్వర్గే - ఆకాశే - వనే - దీవ్యన్త్యస్మిన్ - దివ్ - ఇగుపధేతి కః" (శబ్దా. చిం.) అను ప్రమాణముల చెప్పిన 'అ' కారాంతనపుంసక దివశబ్దము గలదనుటలో విప్రతిపత్తి లేదు.

బాలవ్యా. ద్యుహృచ్ఛబ్దంబులకు దివి - హృదియగు. ౮౪.

౧౮౪ I విష. దివి - దివులు, హృది - హృదులు.

సంజీవని. ౧౮౪ I విషః—'దివ్-హృద్'అనుసంస్కృతశబ్దములు'దివి -హృది' అనురూపములతోఁ దెలుఁగున వాడఁబడునని నిపాతవిధిగ సూత్రింపఁబడెను. అట్లు నిపతింపఁబడుటచేత 'దివి - హృది' అనుప్రాతిపదికముల నంగీకరించి,'ఇగ్లౌ'రా సూత్రముచే (బా. తత్స. ౪౪) బ్రథమైకవచనలోపము, ('దివి' అనునది స్త్రీలింగ మగుటచేత దానికి బా - తత్స - ౫౭ సూత్రముచెప్పినను బ్రథమైకవచనలోపము వచ్చును.) రాఁగా 'దివి-హృది' అను ప్రథమైకవచనాంతరూపము లేర్పడును. బా.

తత్స - ౪౫ సూత్రముచెప్పిన బహువచనపరకత్వమున 'ఉ' త్వము రాఁగా-దివులు-హ్యాదులు మున్నగు రూపములుసిద్ధించును. తే. గీ. "నింగి దివి మొగులు దారి..." (ఆంధ్ర - సం. దేవవ - ౩౧ ప.) అనునాంధ్రనామసంగ్రముచెప్పిన 'దివి' అను నది యాదృచ్ఛికమని తలంపరాదు. భట్టారకుఁడు దానిని సంస్కృతసమముగా సాధించు నపుడు లక్షణకవి వాక్యము ప్రమాణము కానేరదు. 'హ్యాది' అనుదానికిఁ బ్రాచీన ప్రామాణికప్రయోగము లభింపలేదు - 'దివి' అనుదానిప్రయోగములు:—చ. ఉలి యుచునొక్కపెట్టె దివి నుద్గతమయ్యె...(ఆది. ౮ ఆ. ౨౬౩) సీ...తృప్తులఁగావించి దివికిఁజనిన (ఆది. ౭ ఆ. ౧౩౩) (కర్ణ. ౩ ఆ. ౩౩౧. ఆది. ౨ ఆ. ౮౪. ఆది. ౫ ఆ. ౧౯౬) మణిమాల. దివికేఁగి యందు మహనీయతేజ మెసఁగంగ... (స్త్రీ. ౧౯. ౧౦౮).

నియతః స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్. (ఆం. చిం. అజం.
సన్నయూ. ౧౫ కారి. అహో. ౩౨౦ పు.)
౧౮౫ విప. ఆద్యశాస్త్రానుసారేణ । టాబాది ప్రత్యయాన్వితః
(అహో. ౩౮౬ పు.)

కల్పతరువు. ౧౮౫ విప:—సర్వాసాం (స్త్రీణామ్) తు = సకల స్త్రీలింగ సంస్కృతశబ్దములకును (ఇటఁ బారిభాషికలింగమె వివక్షితము) స్త్రీప్రత్యయః = సంస్కృత స్త్రీప్రత్యయము తెలుఁగునందును, నియతః = నియతముగా ననఁగా నవ్యభిచరితముగానగును. ఆద్యశాస్త్రానుసారేణ=సంస్కృత వ్యాకరణముచెప్పిన నే, (వానినే మరలఁ జెప్పుట పునరుక్తమని భావము), టాబాదప్రత్యయః = ఆస్త్రీప్రత్యయములు, మతః=సమ్మతములగును. అట్టి స్త్రీ ప్రత్యయముతోఁ గూడినశబ్దమె తెల్గునఁ బ్రాతిపదికముగానిల్చి (స్త్రీప్రత్యయములు తద్ధితములెయగుటచే)స్వాదివిభక్తి ప్రత్యయములనందును. లతా - వనితా - విద్యా - గౌరీ-నదీ - వధూ ప్రభృతిశబ్దములెల్ల 'ఆ-ఈ - ఊ' అను స్త్రీప్రత్యయములతోఁ గూడినవెయని యెఱుంగునది. మఱియు నట్టివాని విశేషణములగు సంస్కృతశబ్దములును స్త్రీలింగములెయగునుగాన వానికిని సంస్కృతవ్యాకరణోక్త స్త్రీప్రత్యయములు నియతముగావచ్చును. ఉదా:— 'అధికా విద్యా - శక్తిమతీ గౌరీ - మనోహరా వధూః-విపులా నదీ.' వీనికిఁ దత్సమరూపములు - అధికయగువిద్య. శక్తిమతియగు గౌరి. మనోహరయగు వధువు. విపులయగునది. స్త్రీప్రత్యయములును దద్ధితములెయగుటచేత "కృత్తద్ధిత సమాసాశ్చ (౧ - ౨ - ౪౬) కృత్తద్ధితాన్తా సమాసాశ్చ ప్రాతిపదిక సంజ్ఞాఃస్యుః." (సి. కౌ. ౧౭౯ సూ.) అను చెప్పిన స్త్రీప్రత్యయాంతములును బ్రాతిపదికములె యగును. కాన నీసూత్రము సిద్ధార్థానువాదకమెయగుచున్నది.

స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబు
లంగూడి యిందుఁ బ్రవర్తిల్లు. ౧౮౫.

బాలవ్యాకరణ వివరణము. ౧౮౫ I విషయము.

| నామము | స్త్రీప్రత్యయాంతము | తత్సమరూపము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి. |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి. |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని. |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని. |
| శ్రీమత్ | శ్రీమతీ | శ్రీమతి. |
| గుణవత్ | గుణవతీ | గుణవతి. |
| విద్వస్ | విదుషీ | విదుషి. |
| వనజముఖ | వనజముఖీ | వనజముఖి. |
| | వనజముఖా | వనజముఖ. |
| మీననేత్ర | మీననేత్రా | మీననేత్ర. |

అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు జీప్రత్య
యంబు లేమింజేసి మీననేత్రి-పద్మనేత్రి ఇత్యాదు ల
సాధువులు.

సంజీవని. ౧౮౫ I విష:—కర్త్రి = కార్యకారిణియగు స్త్రీ, జనయిత్రి = జనని = తల్లి, భాగ్యశాలిని = భాగ్యముచేనొప్పెడి స్త్రీ, బుద్ధిశాలిని = బుద్ధిచే నొప్పెడిస్త్రీ, శ్రీమతి = శ్రీమంతురాలు, గుణవతి = గుణవంతురాలు, విదుషి = విద్వాంసురాలు, వనజముఖి = వనజముఖ = పద్మమువంటి ముఖముగల స్త్రీ, మీననేత్ర = చేఁపవలె సొగకన్నుగల స్త్రీ. స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయములు = ఆయాసంస్కృత విశేష్యశబ్దములకు సంస్కృతవ్యాకరణమున విధింపఁబడినరీతినివచ్చు స్త్రీ ప్రత్యయములు. అట్టి విశేష్యముల విశేషణములగు సంస్కృతశబ్దముల (బాల. కార. ౧౯ సూ.) కావిశేష్యలింగమే నియతమైయుండునుగాన నట్టి విశేష్యనిఘ్న సంస్కృతశబ్దములకును సంస్కృతవ్యాకరణోక్త స్త్రీ ప్రత్యయములు వచ్చునని యెఱుంగునది. అట్టి స్త్రీ ప్రత్యయములిచట దిఙ్మాత్రముగ వివరింపఁబడుచున్నవి.

“ఋన్నేభ్యో జీప్ (౪ - ౧ - ౫) ఋదన్తేభ్యో నాన్తేభ్యశ్చ స్త్రియాం జీప్ స్యాత్.” (సి. కౌ. ౩౦౬ సూ.) అను చొప్పున ఋదంతములగు కర్తృ జనయితృ శబ్దములకును, నకారాంతములగు “భాగ్యశాలిన్ - బుద్ధిశాలిన్” అను శబ్దములకును జీప్ప్రత్యయమువచ్చును. జకార - పకారము లిద్వర్ణములుపోఁగా మిగిలిన ‘ఈ’

ప్రత్యయమువచ్చి దీర్ఘమునకు హ్రస్వతయు స్త్రీలింగ ప్రథమైకవచన లోపమును రాఁగా—"కర్తృ+ఈ = కర్త్రీ+సు = కర్త్రి, జనయితృ+ఈ = జనయిత్రీ+సు = జనయిత్రి, భాగ్యశాలిన్+ఈ = భాగ్యశాలినీ+సు = భాగ్యశాలిని, బుద్ధిశాలిన్+ఈ = బుద్ధిశాలినీ+సు = బుద్ధిశాలిని—" అనురీతిని రూపములు సిద్ధించును.

"ఉగితశ్చ (౪-౧-౬) ఉగిదన్తాత్ ప్రాతిపదికాత్ స్త్రియాం జీప్ స్యాత్. (సి. కౌ. ౪౫౫ సూ.) 'ఉ-ఋ-ఌ' అను 'ఉక్' ప్రత్యాహారవర్ణము లిత్సంజ్ఞములుగాఁగల—'మతు-వతు-వసు-శతృ' ప్రభృతి ప్రత్యయములు తుదినిగల శబ్దములకు స్త్రీత్వమున జీప్ప్రత్యయమగును. శ్రీమతి-గుణవతి-విదుషీ-పచంతి (వండుచున్న స్త్రీ). మొ.

"స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్. (౪-౧-౫౪) అసంయోగోపధం - ఉపసర్జనం యత్ స్వాఙ్గం తదన్తా త్ప్రాతిపదికాత్ వా జీష్స్యాత్" (సి. కౌ. ౫౧౦ సూ.) సంయోగోపధము కానట్టియు నుపసర్జనీ భూతమైనట్టియు స్వాఙ్గవాచి శబ్దము తుదినిగల ప్రాతిపదికమునకు స్త్రీత్వమున వికల్పముగ జీష్ ప్రత్యయమగును. (జకార షకారము లిత్సంజ్ఞములు) వనజమువంటి ముఖముగల స్త్రీ = వనజముఖీ = వనజముఖ. సంయోగోపధ కలవగుటచేత మీననేత్రి - పద్మనేత్రి మున్నగురీతిని జీష్ ప్రత్యయము రానేరదుగాన నవి సాధువులుకావని సూరిగారు వివరించిరి. (విస్తర I-II-III.) ఈ స్వాఙ్గాదిత్యాది సూత్రమున విధింపఁబడినది జీష్ ప్రత్యయము. అట్లయినను "ఙ్యాప్ప్రాతిపదికాత్. (౪-౧-౧) ఙ్యన్తా దాబన్తాత్ ప్రాతిపదికా చ్చేతి..." (సి. కౌ. ౧౮౨ సూ.) అను సూత్రమున 'జీప్ - జీష్ - జీన్' అను

---

విస్తర. I ౧౮౫ I విష:—"మీననేత్రి ఇత్యాదులు మత్స్యములవంటి నేత్రములుగలదియను నర్థంబున నసాధువులయినను 'మీనంబులకు నాయకురాలు' అనునర్థంబున సాధువేయగును" (బా. గు. ప్ర. ౧౪౮ పు. ద్వి. ము.) నేతృశబ్దము ఋకారాంతముగాన జీప్రత్యయము వచ్చి "నేత్రి = నాయకురాలు" అని యేర్పడునని గుప్తార్థ ప్రకాశికాకారుని యాశయము, కాని 'మీననేత్రి - పద్మనేత్రి' అనునవి 'మీనములవంటి నేత్రములుగలది.' అనురీతిని 'నేత్ర' శబ్దమును నిల్పినపుడును సాధువులేయని చెప్పవచ్చును. అంగ గాత్ర కంఠాదిశబ్దములు కొన్ని సంయోగోపధములైనను వానికి జీష్ ప్రత్యయమువచ్చునని మునిత్రయమువారు స్పష్టముగా వచింపకున్నను గాశికావృత్తికారుఁ డట్టివి కొన్నిసాధువులని వచించెను. 'కృశాంగి - సుగాత్రి - కంబుకంఠి' మున్నగునవి మహాకవి ప్రయుక్తములగుచు వెలయుచున్నవి. అట్లె ముగ్ధబోధ వ్యాకరణవ్యాఖ్యాతయగు రామతర్కవాగీశుఁడు 'అంత్రా' ది

జూడు స్త్రీ ప్రత్యయములను గ్రహించుటలో 'ఙీ' అని వాడఁబడినట్లె యిట సూరి గారు 'ఙీష్' అనుడానిచోట 'ఙీ' అని వాడిరనియు నక్కారణమున "ఙీప్రత్యయము లేమింజేసి" అని యాతఁడువ్రాసియుండుననియు గ్రహింపవలెను- లేదా "ఙీష్ ప్రత్యయము లేమింజేసియని సవరింపనగును. "ఙీప్ప్రత్యయము లేమింజేసి" అని 'బా-పా-వే.' మున్నగుకొన్ని ప్రతులలోనుండుట పొరపాటు.

---

శబ్దములను మఱికొన్నిటిని సాధువులనుగా వివరించెను. "అఙ్గాన్త్రదన్త కణ్ఠంచ శృఙ్గ కర్ణోష్ఠ మిత్యపి । పుచ్ఛ నేత్రం తథాగాత్రం । జఙ్ఘ మఙ్గాది రీరితః." (ముగ్ధ. ౨౬౫ సూ. వ్యా.) అను నీకారికచొప్పున 'మీననేత్రీ' ప్రభృతులును సాధువులే యనఁదగును. ద్విపద - అగునగునట్టిద యంబుజనేత్రి (బసవ. ౧ ఆ. ౧౯౧ ప.) సత్ప్రమాణంబు మృగనేత్రి చారుగాత్రి (షట్చ. ౪ ఆ. బా. గు. ప్ర. ౧౪౬ పుట. ద్వి. ము.)

విస్తర. II ౧౮౫ I విష:—పయి గుప్తార్థప్రకాశికాకారుని 'మీనములకు నాయకురాలు' అనునర్థమును విమర్శించుచుఁ జేటికావ్యాఖ్యాత "కాని యిట్టివాని కుపమితసమాసమే ప్రసిద్ధము" అని వ్రాసెను. ఇది పొరపాటు. 'మీననేత్ర - పద్మనేత్ర' అనునవి యుపమిత సమాసములుకావు. "ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యా ప్రయోగే" (౨ - ౧ - ౫౬) (సి. కౌ. ౭౩౫ సూ.) అనుచొప్పున పురుష వ్యాఘ్రఁడు మున్నగునవి మాత్రమెయుపమిత సమాసములనియు మీననేత్ర మున్నగునవి యుపమానపూర్వపద బహువ్రీహిసమాసములనియుఁ జెప్పుట సంప్రదాయము.

విస్తర. III ౧౮౫ I విష:—సంస్కృత వ్యాకరణమున నీ స్త్రీప్రత్యయ ప్రకరణము మిక్కిలి విశాలమైయున్నది. కాన మఱికొన్ని ముఖ్యములగు విషయములనిటఁ జూపుచున్నాను:—"నక్రోడాది బహ్వచః (౪ - ౧ - ౫౬) క్రోడాదేర్బహ్వచశ్చ స్వాఙ్గాన్న ఙీష్" (సి. కౌ. ౫౧౨ సూ.) క్రోడాదిశబ్దములకును బహ్వచ్క-శబ్దములకును స్వాంగవాచకములయినను ఙీష్ ప్రత్యయమురాదు. కల్యాణక్రోడా = కల్యాణక్రోడ. క్రోడ = అశ్వముఱొమ్ము. సుజఘనా = సుజఘన- మొ. "నాసికోదరోష్ఠ జఙ్ఘా దన్త కర్ణశృఙ్గాచ్చ (౪ - ౧ - ౫౫) ఏభ్యోవా ఙీష్స్యాత్." (సి. కౌ. ౫౧౧ సూ.) నాసికోదరశబ్దములు బహ్వచ్కములయినను ఙీప్ప్రత్యయమువచ్చును. తక్కిన యోష్ఠాదులు సంయోగోపధములైనను ఙీప్ప్రత్యయమువచ్చును. ఉదా:- తుఙ్గనాసికీ = తుంగనాసికి. తుఙ్గనాసికా = తుంగనాసిక. కృశోదరీ = కృశోదరి. కృశోదరా = కృశోదర. బిమ్బోష్ఠీ=బింబోష్ఠి - బిమ్బోష్ఠా = బింబోష్ఠ . మొ. "పుచ్ఛాచ్చ- (వార్తి. ౨౪౮౯) సుపుచ్ఛీ - సుపుచ్ఛా" - మొ.

"మనః (౪-౧-౧౧) మన్నన్తాన్న జీప్" (సి. కౌ. ౪౫౯ సూ.) మన్ ప్రత్యయాంతములు నకారాంతములైనను వానికి జీప్పురాదు. ఉదా:—'సీమా - సీమానౌ - సీమానః' (సం. ప్ర). "అనో బహువ్రీహేః (౪-౧-౧౨) అన్నన్తాద్బహువ్రీహేర్న జీప్" (సి. కౌ. ౪౬౦ సూ.) నకారాంతములయినను 'అన్' అనునది తుదినిగల బహువ్రీహిసమాసగతశబ్దములకు జీప్పురాదు. ఉదా:— "బహుయజ్వా - బహుయజ్వానౌ - బహుయజ్వానః." (సం. ప్ర.). "డాబుభాభ్యామన్యతరస్యామ్ (౪-౧-౧౩) సూత్రద్వయోపాత్తాభ్యాం డా బ్వాస్యాత్." (సి. కౌ. ౪౬౧) పై రెండు సూత్రములస్థలములందును నగా 'మన్' తుదినిగల వానికిని 'అన్' తుదినిగల బహువ్రీహిలోనివానికిని 'డాప్పు' వికల్పముగానగును. ఉదా:—"సీమా - సీమే - సీమాః." (సం. ప్ర.). "బహుయజ్వా - బహుయజ్వే - బహుయజ్వాః" (సం. ప్ర.). డాప్పు రానిపక్షమునందలి నకారాంతములు పైనుదాహరింపఁబడెను. "అన ఉపధాలోపి నో న్యతరస్యామ్ (౪-౧-౨౮) అన్నన్తాద్బహువ్రీహేరుపధాలోపినో వా జీప్స్యాత్. పక్షే డాప్ - జీప్ నిషేధౌ" (౪౬౨ సూ. సి. కౌ.) 'అన్' అనునది తుదినిగల్గినట్టియు నుపధాలోపముగల్గినట్టియు బహువ్రీహిలోనివానికి జీప్పు సయితము వికల్పముగానగును. జీప్పురానప్పుడు డాప్పు వచ్చుటయు డాప్పు జీప్పును రాకుండుటయు సంభవించును. ఉదా:—జీప్పు - "బహురాజ్ఞీ - బహురాజ్ఞ్యౌ - బహురాజ్ఞ్యః" (సం. ప్ర.). తక్కిన రెండుపక్షములును పైనుదాహృతములయ్యెను. (చూ - ౧౩౮ పు.)

"న షట్ స్వస్రాదిభ్యః (౪-౧-౧౦) షట్ సంజ్ఞకేభ్యః స్వస్రాదిభ్యశ్చ జీప్ టాపౌ న స్తః. స్వసా తిస్రశ్చతస్రశ్చ। ననాన్దా దుహితా తథా। యాతా మాతేతి సప్తైతే। స్వస్రాదయ ఉదాహృతాః" (సి. కౌ. ౩౦౮ సూ.) షట్ సంజ్ఞగలవానికనఁగా నకారాంతాది సంఖ్యావాచకములకును స్వస్రాదిగణగత ఋకారాంతములకును మీఁది సూత్రములచొప్పున రాఁదగిన జీప్పు టాప్పునురావు. ఉదా:—"పఞ్చ స్త్రియః =" (ఐదుగురుస్త్రీలు). "స్వసా - స్వసారౌ - స్వసారః" (సం. ప్ర.) (స్వస = తోడఁబుట్టినది. "తిస్ర" = మూఁడు. "చతస్ర =" నాల్గు. ననాన్ద = ననన్ద = మగనితోఁబుట్టినది. దుహిత = కూఁతురు - యాత = తోడికోడలు. మాత = తల్లి.)

"బహ్వాదిభ్యశ్చ (౪-౧-౪౫) ఏభ్యో వా జీష్స్యాత్. బహ్వీ - బహుః. కృదికారాదక్తినః (గణ. ౫౦) కృతో య ఇకారః తదన్తాత్ప్రాతిపదికాద్వా జీష్ స్యాత్. రాత్రిః - రాత్రీ. (రాత్రి) ధరణిః - ధరణీ (భూమి)" (సి. కౌ. ౫౦౩ సూ.) బహు ప్రభృతిశబ్దములకు జీష్ ప్రత్యయము వికల్పముగానగును. బహ్వీ -

బహువు. కృత్సంబంధియగు 'ఇ' కారాంతమునకు జీష్ ప్రత్యయము వికల్పముగా నగును. రాత్రి. ధరణి. క్తిన్నంతమునకురాదు - కృతి - వసతి - మొ."

"పుంయోగా దాఖ్యాయామ్. (౪ - ౧ - ౪౮) గోపస్య పత్నీ గోపీ." (సి. కౌ. ౫౦౪ సూ.) ఇట్లె రామునిభార్య రామి మొ.

"జాతే రస్త్రీవిషయా దయోపధాత్" (౪ - ౧ - ౬౩) (సి.కౌ.౫౧౮ సూ.) జాతివాచకమునకు జీష్పగును. మృగీ = మృగి = ఆఁడులేడి. హంసీ = హంసి = ఆఁడుహంస. యకార ముపధగాఁగలదానికిరాదు - క్షత్రియా = క్షత్రియ = రాచది. నియత స్త్రీలింగములకురాదు. బలాకా = బలాక = పెంటికొక్కెర.

"అజాద్య తష్టాప్." (౪-౧-౪) అజాదిశబ్దములకును 'అ' కారాంతములకును స్త్రీత్వమున 'టాప్' ప్రత్యయమగును. మేధా. సర్వా. (౪౫౪ సూ. సి-కౌ.) "ఆపం చైవ హలన్తానాం । యథావాచా నిశాదిశా" (సి-కౌ. ౪౫౭ సూ. దగ్గఱ.) వాక్- వాచా. మున్నుగురీతిని హలంతములకుఁ బాక్షికముగ 'ఆప్' కల్గును. "వోతో గుణ వచనాత్ (౪ - ౧ - ౪౪) మృద్వీ - మృదుః" (సి. కౌ. ౫౦౭ సూ.) ఉకారాంత గుణవాచకముకంటెఁ బరముగా వికల్పముగా జీష్వనిల్చును. ఉదా:—మృద్వి = మృదువు.

"షిద్గౌరాదిభ్యశ్చ (౪ - ౧-౪౧) షిద్భ్యః గౌరాదిభ్యశ్చ జీష్స్యాత్ - నర్తకీ - గౌరీ" (సి. కౌ. ౪౯౮ సూ.). షకారమిద్వర్ణముగాఁగల ప్రత్యయము తుదినిగలదానికిని గౌరాదిగణగతశబ్దమునకును జీష్వవచ్చును. నర్తకి - గౌరి. మొ. "నర్తక - పు. నృత - ష్వున్...షిత్త్వాత్ స్త్రియాంజీష్." (శబ్దస్తో.) ఇట్లె ట కారమిద్వర్ణముగాఁగల ప్రత్యయము తుదినిగలదానికిని జీష్పగును. "టిడ్ఢాణఞ్...... (౪-౧-౧౫) (సి. కౌ. ౪౭౦ సూ.). పంచమీ=పంచమి. "పఞ్చమ - త్రి. ("పఞ్చానాం పూరణః. పఞ్చన్+మట్")... (శబ్దస్తో.) మట్ప్రత్యయము టిత్తుగాన జీష్వరాఁగా 'పంచమి' అగును. "ఊ ఙుతః. (౪-౧-౬౬) ఉకారాన్తా దయోపధా న్మనుష్యజాతి వాచినః స్త్రియా మూఙ్స్యాత్ -కురూః-అప్రాణిజాతే శ్చారజ్జ్వా దీనా ముపసంఖ్యా నమ్. (౨౫౦౨ వార్తి.) కర్కన్ధూః." (సి. కౌ. ౫౨౧ సూ.) యకారోపధముకానట్టి 'ఉ' కారాన్త మనుష్యజాతివాచకమునకుఁ బరముగ "ఊఙ్" ప్రత్యయమగును. కురు+ఊఙ్ = కురూః = కురువు = కురుక్షేత్రరాజపుత్రి. "కురూరితి:—కురుక్షేత్రస్య రాజా కురుః, తస్యాపత్యం స్త్రీత్యర్థః" (బాలమ. సి. కౌ. ౫౨౧ సూ. వ్యాఖ్య.) రజ్జు మున్నగువానికి భిన్నమగు నప్రాణిజాతివాచకమునకును ఊఙ్ ప్రత్యయమగును - కర్కన్ధూః = కర్కంధువు = రేఁగుచెట్టు. యకారోపధ మనుష్యజాతి

వికృతౌచ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గక సర్వనామధేయాః స్యుః.
(ఆం. చిం. అజం. ౧౪ కారి. అహో. ౩౧౭ పు.)

సన్నయాథ. విశేషణానాం మహతో । డస్త్రీ ఉభయథాపిచ. (వికృ.
౧౮౬ విషయము. అజం. ౩౭ కారి. అహో. ౩౦౭ పు.)
విశేష్యమాత్రే స్త్రీతాస్యా । ద్వైతా స్యాత్ తాంతు
భేదకే." (వికృ. అజం. ౪౦ కారి. అహో. ౩౧౩ పు.)

కల్పతరు. ౧౮౬ విప:—వికృతౌచ = అచ్చతెనుఁగులోనివి స్త్రైతను, స్త్రీలిఙ్గాః = మహతీవాచకములు, స్త్రీలింగక సర్వనామధేయాః = పారిభాషిక స్త్రీలింగములగు సంస్కృత విశేష్య నిఘ్నరూపములైన విశేషణ ప్రాతిపదికములు గలవి స్యుః=అగుచున్నవి. నామమనఁగాఁ బ్రాతిపదికము. నామమే నామధేయము. "పాదార్ఘాభ్యాంచ. (౫-౪-౨౫)......భాగరూప నామభ్యో ధేయః. (౫౩౩౦ వార్తి.)" (సి. కౌ. ౨౧౬౩ సూ.) అనుచెప్పిన స్వార్థమున ధేయ ప్రత్యయము రాఁగా నామధేయశబ్దమేర్పడును.

ప్రకృతసూత్రములోని "వికృతౌచ స్త్రీలిఙ్గాః" అనుచోటి మొదటి స్త్రీలింగ శబ్దమునకును బారిభాషిక స్త్రీలింగపరముగనే యర్థముచేసినచో "నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్" అను సూత్రముచే లభించునర్థమే వచ్చుచుగాన నీసూత్రము వ్యర్థముకావలసివచ్చును. కావున నిచటి "స్త్రీలిఙ్గాః" అనుదానికి మహతీవాచకపరముగా వ్యాఖ్యానముచేయఁబడెను. ఉదా:—"తే. గీ. ఉన్మత్తవేషిణియైన లచ్చి । కరణి నిటువచ్చుచున్నది..." (ఆక. ౩ ఆ. ౧౧౯ ప.) ఆచ్ఛికమగు 'లచ్చి' అనుదానికి విశేషణమగు "ఉన్మత్తవేషిణి" అను సంస్కృతవిశేషణము జెప్పఁబడియెను స్త్రీలింగమైయున్నది. "సూత్రస్యాస్య సీత భక్తవత్సల ఇత్యాదౌ నతాత్పర్యమ్. నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామిత్యనుశాసనాత్......తద్విధాన స్యానావశ్యకత్వాత్ - కింతు 'పంటచెలిపట్టి లోకైక భవ్యచరిత' ఇత్యాదౌ తాత్పర్య మవధార్యతే." (అహో. ౩౧౭ పు.) అని యిట్లు కవిశిరోభూషణమునందును వ్యాఖ్యానము చేయఁబడెను. ఇట్లు ప్రసక్తానుప్రసక్తముగఁ జింతామణికర్త యాచ్ఛిక మహతీవాచకములకు విశేషణములగు సంస్కృతశబ్దముల పారిభాషిక స్త్రీత్వవిషయమును మాత్రము వచింపఁగాఁ దుల్యన్యాయమున నాచ్ఛిక మహద్వాచకముల

వాచకమునకు రాదు. అధ్వర్యుః = అధ్వర్యుఁడు = ఋత్విజుఁడు. రజ్జ్వాదులకు రాదు. రజ్జువు = త్రాడు - మనుష్యభిన్న ప్రాణిజాతికి రాదు - ధేనుః = ధేనువు = కృకవాకుః = కృకవాకువు = కోడి - గ్రంథవిస్తరభీతిచే నింతతో విరమించితినాఁడ.

విశేషణములగు సంస్కృతశబ్దములు పారిభాషిక పుంలింగములగుననియు, నక్లు యాచ్ఛికామహద్విశేషణములగు సంస్కృతశబ్దములు పారిభాషిక నపుంసకలింగములగుననియు నథర్వణుఁడు వివరించుచున్నాఁడు. విశేషణానామిత్యాది:—మహతః= ఆచ్ఛిక మహద్వాచకముయొక్క, విశేషణానామ్ = విశేషణములగు సంస్కృతశబ్దములకు, డుజ్నిస్యాతామ్=డుజ్వర్ణకమును దత్సంబంధి న్యాగమాదులును నగును. అట్టి విశేష్యనిఘ్నములకు, ఉభయథాపిచ = డుమంతత్వ మువర్ణకాంతత్వములు రెండును విశేష్యములయొక్క మహత్త్వా మహత్త్వములనుబట్టి కల్గును. ఉదా:- తండ్రి సమర్థుఁడు. వానివంగడము సమర్థము. విశేష్యమాత్రే = ఆచ్ఛికవిశేష్యమందుమాత్రమె, స్త్రీతా = స్త్రీసమత్వము, స్యాత్ = అగును. భేదకే = అద్దాని విశేషణమగు సంస్కృతశబ్దమందు, డుజ్మూ = మహదమహత్తులకు వరుసగా, డుజ్వర్ణక మువర్ణకములు, అనఁగా మహత్ స్త్రీసమవిశేషణమందు. డుజ్వర్ణకమును, నమహత్ స్త్రీసమవిశేషణమందు మువర్ణకమును, స్యాతామ్ = నిల్చును. ఉదా:- తండ్రి సమర్థుఁడు, తంతువులనల్లుటలో సాలీఁడు సమర్థము. మిన్నేఱు ధరాపరాగపటలాక్రాంతంబు. (౧౮౬ II విష.)

ఆంధ్రవైయాకరణులు సంస్కృతశబ్దములకు స్త్రీత్వము నతిదేశించునపుడును నట్టి స్త్రీమములగు విశేష్యముల విశేషణములందును బైపద్ధతి వర్తించును. ఉదా:—దూతసమర్థుఁడు. సురలు మహాశక్తిమంతులు. అసుర భస్మసాత్కృతుఁడయ్యెన్. (ఆది. ౧ ఆ. ౧౩౨ ప.)

"స్త్రీవాచకములయ్యు నీరెండును (దార కళత్రశబ్దములు) స్త్రీలింగములు కామిం జేసి వీని విశేషణములకు...స్త్రీవాచకత్వమునె యాధారముగఁగొని యెల్ల యెడల వీని విశేషణములు స్త్రీలింగములై యమరుననియు గ్రహింపవలెనని తోఁచెడిని" (బా. సా. పే. ౨౦౧ పుట.) అని పేటికావ్యాఖ్యాత వ్రాయుట కేవలము పొరపాటు. పారిభాషికలింగ వ్యవహారముగల సంస్కృతశబ్దముల విషయమున నిట్టిపద్ధతి యశ్రుతచరము. 'దారా' అను స్త్రీలింగశబ్దమునైతము (౧౮౫ I విష.) వెలయుచుండుటం జేసి యట్టి స్త్రీలింగదారాశబ్దవిశేషణము స్త్రీలింగమైనంగావచ్చును గాని "కళత్రము మనోహారిణి" అనురీతిని బ్రయోగింపనగుననుట కేవలము శాస్త్రవిరుద్ధము. 'కళత్రము మనోహారి' అనియె యుండవలయును (బా. కార. ౧౯ సూ.). "మహాస్రగ్ధర...దశలక్షల్ భటుల్ వ్రేళ్ళఁ దేరుల్ । తిలింగాలంగోటి సంఖ్యల్... ఉ-హరి. ౬ ఆ. ౧౩౫ ప.) ఇట నాచ్ఛికామహద్విశేషణమగుటచే "కోటిసంఖ్యములు తేరులు" అని యుండనక్కఱలేదాయని శంకింపరాదు. ఇచటఁ గోటిసంఖ్యగల

తేరులను బహువ్రీహి గ్రంథకృద్వివక్షితము కాదు. "తేరులు కోటియొక్క సంఖ్యలు క్షితిఁగూలన్" అనురీతి నన్వయము కవిచే నుద్దేశింపఁబడెను. ఇట్టివాడుకలు లేక పోలేదు. క. క్షితిసంశోభితకులనఁగా । శతలక్ష సహస్రసంఖ్య జనియించిరి గ । ర్వితులై దనుజులు (అర. ౬ ఆ. ౪౭) క. వృద్ధులోక లక్షయున్నను (సభా. ౨ ఆ. ౨౭) మొ.

బాలవ్యాకరణ వివరణము. ౧౭౬ I విషయము. — సూరిగారు పై నన్నయాథర్వణీయ విషయములను బాలవ్యాకరణమున సంగ్రహించికొన లేదు. త్రిలింగ లక్షణశేషమునందును సంగ్రహింపఁబడ లేదు.

నన్నయాథర్వణీయము. ౧౭౬ II విషయము. —
ఉభయవిధ మమహతీనామ్. (ఆం. చిం. అజం. ౧౪ కారి. అహో. ౩౧౯ పు.)
అప్రాణివాచినా మత్ర । భవేదమహతాం స్త్రియామ్।
ద్విధావిశేషణం తత్ర ।మానం సువచసాం వచః (వికృ. అజం. ౪౩ కారి. అహో. ౩౧౯ పు.)

కల్పతరు. ౧౭౬ II విష:—అమహతీనామ్ = అమహత్తులగు స్త్రీలింగములకు, ఉభయవిధమ్ = ద్వివిధమగు విశేషణమునుండును. స్త్రీలింగవిశేషణము నస్త్రీలింగవిశేషణము నిలుపవచ్చుననియర్థము. స్త్రీలింగవిశేష్య సంస్కృతశబ్దమునకు స్త్రీలింగ సంస్కృతవిశేషణశబ్దముండుట సహజమె. ఇంక నస్త్రీలింగవిశేషణ సంస్కృతశబ్దముండుట విశేషమని యెఱుఁగునది. "స్త్రీలింగవిశేషణస్య ప్రాప్తత్వాత్ (నియత స్త్రీప్రత్యయ స్త్రీత్వాదిచే) అస్త్రీలింగవిశేషణవిధాన మేవతాత్పర్యమ్." (అహో. ౩౧౯ పుట.) అమహతీనామ్మను వశముచే మహద్వాచకములగు దేవతాది స్త్రీలింగముల విశేషణముల కుభయవిధ విశేషణముండరాదను నర్థము లభించుచున్నదిగాన "శ్రీరామదేవత యిష్టఫలదాయి" అనురీతి నుండరాదని విశదమగుచున్నది. ప్రయోగములు:—మాలిని...కులిశధారల్ గుంఠితంబయ్యె... (ఆది. ౨ ఆ. ౭౨ ప.) సీ. మహతినాఁ బొలుపారు మహనీయదేవత,...(అను. ౪ ఆ. ౩౯౭) శా....శ్రీమహాభారతా । ఖ్యానాఖ్యామృతసూతియొప్పు నిఖిలాఘధ్వాంత విధ్వంసియై॥(ఆది. ౩ ఆ. ౨౧) ఇందమృతసూతియనఁగా హిమమరీచి యందు మహద్వివక్షలేమింజేసి యిది యు నస్త్రీలింగవిశేషణత్వమునకే లక్ష్యమగుచున్నది.

ఇచట నమహత్ స్త్రీలింగము ప్రాణివాచకము నైతము కావచ్చునుగాన నట్టియెడఁ జెల్లరాదనియు నీసూత్ర మప్రాణివాచక స్త్రీలింగములవిషయమున మాత్రమె చెల్లుననియు నథర్వణుఁడు నవరించుచున్నాఁడు. అప్రాణివాచినామిత్యాది:—

అత్ర = ఈసందర్భమున, అప్రాణివాచినామ్ = జడవాచకములైన, అమహతాం స్త్రియామ్ = అమహత్ స్త్రీలింగములకుమాత్రమె, ద్విధావిశేషణమ్ = స్త్రీలింగ విశేషణమును నస్త్రీలింగవిశేషణమును నిల్చును. ఇంకఁ బ్రాణివాచ కామహత్ స్త్రీలింగముల విశేషణములు స్త్రీలింగములెయగునుగాని యస్త్రీలింగములు కానేర వని యెన్నునది. ప్రాణివాచ కామహత్ స్త్రీలింగవిశేషణము స్త్రీలింగమేయగుట కుదా:—గీ. కొన్ని కపిలధేనువు లతిక్రూరచిత్త । లేము వధియించెదము...(అను. 3 ఆ. ౨౪) ఆ. వె. సకలవర్ణధేను సమితికినెల్లను । గపిలగోవు శ్రేష్ఠగాఁగ,..... (అను. 3 ఆ. ౨౫.)

"ధరాపరాగ పటలాక్రాంతంబు" ఇతిరూపం తూభయేతిసూత్రేణ సమంజస మితిజ్ఞేయమ్" (అహో. 3౨౦ పు.) అను నహోబలపతివాక్యము ప్రామాదికము. ఇట్లనుటచే నీతఁడు "ధరాపరాగపట లాక్రాంత మిన్నేఱు" అనెడి రెండవపక్షపు రూపమునకును సమ్మతింపవలసివచ్చునుగదా. ఉభయేతిసూత్రము స్త్రీలిం గామహత్ విశేషణములకె యుభయవిధస్థితిని సమ్మతించుచున్నదిగాని స్త్రీసమములగు సమ హత్తుల విశేషణముల కుభయవిధస్థితి నుపదేశింపలేదు. "ధరాపరాగపటలా క్రాంతంబు మిన్నేఱు ప్రవాహరూపమగుటంజేసి శివజటావాసిని మిన్నేఱువలె గంగాదేవీపరముకానేరదుగాన నది మహతీవాచకము కామింజేసి "వికృతౌచ స్త్రీలిఙ్గా ఇత్యాదిసూత్రమునకును లక్ష్యము కాఁజాలమింజేసి "ధరాపరాగ పటలాక్రాంత మిన్నేఱు" అను స్త్రీలింగవిశేషణము సాధువుకానేరదు. శివజటావాసిని మిన్నేఱు గంగాదేవిగాన నచట "వికృతౌచ స్త్రీలిఙ్గా ఇత్యాదిచే స్త్రీలింగవిశేషణము సమ్మతమగుచున్నది. ఇట్లగుటచేత నమహదాచ్ఛిక స్త్రీసమమునకు విశేషణమగు 'ధరాపరాగపటక్రాంతంబు' అనుదాని మువర్ణకాంతరూపము "విశేష్యమాత్రే స్త్రీతాస్యా । ద్రుఙ్మా స్యాతాంతు భేదకే" అను నథర్వణకారికచే సమర్థితమగుచున్న దని యెన్నవలెను. (౧౨౬ విష.)

పయిరీతిగల ప్రామాదికాశయము గలవాఁడగుటచేతనే యహోబలపతి "విశేష్యమాత్రే స్త్రీతాస్యా।ద్రుఙ్మా స్యాతాంతు భేదకే" అనుకారికను "వికృతౌచ స్త్రీలిఙ్గా ఇత్యాది చింతామణికారికతో నన్వయింపక "స్త్రీత్వబహుతే ష్వరాదేరిత్యాదికారికతో సమన్వయించి యట్టి మహద్వాచక స్థలములందుమాత్రమె యుపయోగింపఁజేసికొనెను. (అహో. 3౧3 పుట.) నారాయణీయకర్తయు నీయహోబలపతిమార్గమునె యనుసరించెను (నారా. తత్స. ౪౯ ప. ౨౦౯ కారి.)

మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ
బాలవ్యాకరణ గ్లీబత్వంబు విభాషనగు. ౮౬.
వివరణము. పద్మలతమనోహారి. పద్మలతమనోహారిణి. హృద్యం
౧౮౬ III విష. బగు విద్య - హృద్యయగు విద్య. మొదవులలోఁ
గపిలవరిష్ఠంబు - కపిలవరిష్ఠ.

సంజీవని. ౧౮౬ III విష:—హృద్య = హృదయాహ్లాది. మొదవు = ఆవు. వరిష్ఠ = శ్రేష్ఠమైనది. "కపిలా - స్త్రీ - గోవిశేషే - స్వర్ణవర్ణాయాంగవి...నదీవిశేషే..." (శబ్దా. చిం.) మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులనఁగా మహతీవాచకములు కానట్టి (మహతీ+ఇతర) స్త్రీలింగముల విశేషణములని యర్థము. "ఉభయవిధమమహతీనా" మ్మను చింతామణిసూత్రములోని 'అమహతీనా' మ్మను దానికి (అ+మహతీనామ్) మహతీవాచక స్త్రీలింగ భిన్నానామ్మనఁగాఁ దిర్యగ్జడవాచి స్త్రీలింగశబ్దవిశేషణానామ్మని యర్థముచేసికొని యీరీతిని సూత్రించెను. 'మనోహారిన్' అనునది నకారాంతముగాన దానికి స్త్రీత్వమున జీప్పురాఁగా 'మనోహారిణీ' అని యగును. విశేషణము స్త్రీలింగముగానుండుటకిది (పద్మలత మనోహారిణి) యుదాహరణము. ఇంక "పద్మలత మనోహారి" అనునది స్త్రీలింగవిశేషణము నపుంసకరూపముననుండుట కుదాహరణము. ఇట్లప్రాణివాచకస్థలములందు వివాదములేదు. కాని "కపిలవరిష్ఠంబు" అను ప్రాణివాచకస్థలోదాహరణము "అప్రాణివాచినా" మిత్యాద్యథర్వణకారికకుఁ గేవలము విరుద్ధ మనకతీరదు. ఆవు ప్రాణియగుటచే దద్వాచకమగు సంస్కృత స్త్రీలింగ కపిలాశబ్దమునకు విశేషణము "వరిష్ఠ" అనునదియే యథర్వణసూత్రముచొప్పున సాధువు కానోపుఁ గాని "కపిల వరిష్ఠంబు" అను నుదాహృతి సాధువు కానేరదు. సూరిచేసిన యథర్వణ సూత్రోల్లంఘనమున కీక్రింది సోమయాజి ప్రయోగము మూలమైయుండును.

క. మొదవులలో నెల్లఁగపిల । మొదవు వరిష్ఠంబు రాజముఖ్య...(ఆను. 3 ఆ. ౧౯ ప.) ఈపద్యమునుండియే తీసి సూరి పైకీతి నుదాహరించెనని విశ్వసింపనగును; కాని యీప్రయోగము సూరి కుపచరింపదు. "కపిలవరిష్ఠంబు" అని కుండలీంద్రుఁడు ప్రయోగింపలేదు. 'కపిల మొదవు వరిష్ఠంబు' అని యాతఁడు ప్రయోగించెను. కపిలయనెడి మొదవు వరిష్ఠంబని యచట నర్థముచేయనగును. అట్టియెడల 'మొదవు' అను విశేష్యమాచ్ఛికామహత్ స్త్రీసమశబ్దమగుటంజేసి దానికి విశేషణ మగుసంస్కృత విశేష్య నిఘ్నశబ్దము "విశేష్యమాత్రే స్త్రీతాస్యాదిత్యా

(౧౮౬ విష.) దథర్వణసూత్రముచొప్పున మువర్ణకాంతమై "వరిష్ఠము" అను రూపమునందును. కాన నది సూరిగారిరచనకు హస్తావంబ మీయనేరదు. ఇంక— "క. సారములగు గోవులు...(అను. 3 ఆ. ౧౨ ప.) సీ. గోవు పవిత్రంబు... (అను. 3 ఆ. ౨౫)" అను కవిబ్రహ్మగారి ప్రయోగములు సూరిసిద్ధాంతమునకుఁ బ్రమాణములగుచున్నవి.

సంజీవని. ౧౮౬ IV విష:—సోమయాజి, మహతీతర ప్రాణివాచక స్త్రీలింగ విశేణముల విషయమునఁజేసిన యథర్వణ సూత్రోల్లంఘనము నరసియు మహతీ వాచకములుసైత మమహత్తులెయగుటను దలంచియుఁ గావలయుఁబాల్కురికి సోమనారాధ్యుఁడు మహతీవాచక స్త్రీలింగవిశేషణములకు సైత మస్త్రీలింగరూపమును ధారాళముగాఁ బ్రయోగించెను. కాని యీపద్ధతి కుండలీంద్ర శ్రీనాథాదిసమ్మతము కాదు. ద్విపద - వనిత యపూర్వలాంఛనధారి గాఁగ...।ఇట్టి లాంఛనధారి నిట్టివిరాగి। నిట్టి నిష్ఠాశాలి నేమనవచ్చు। (బసవ. 3 ఆ. ౨౨౭) పాపి బొమ్మని నిన్ను... (పాపి, ఇది స్త్రీసంబోధనము) (బసవ. 3 ఆ. ౨౯౩) అనుచుఁ బరిచ్ఛేదియై భక్తురాలు (బసవ. 3 ఆ, 3౦౨) (ఇందు మహతీస్త్రీసమ విశేషణ మస్త్రీలింగముగానున్నది) తవిలి నిత్యంబును ద్రావినద్రోహి (బసవ. 3 ఆ. ౭౮౬) ఇట్లు ధారాళముగా నీతఁడు ప్రయోగించుచుండఁగా "లాంఛనధారి" అనుచో "లాంఛనదారి" అని సవరించి సోమనారాధ్యుఁడు వైరిసమాసము నంగీకరించెనని ముద్రణసంస్కర్త వ్రాయుట యుక్తముకాదు. స్థలాంతరములం దాతఁ డంగీకరించెననకతీరని యీప్రయోగమును మాత్రము సవరింపనేల? వైరిసమాసమును వర్జింతునని శపథముచేసిన యాతఁ డద్దానిని బ్రయోగించెననేల? బసవపురాణ పీఠికాకర్తచూపిన సోమనారాధ్యుని వైరి సమాసస్థలములెల్ల సుసమాధేయములగుట స్థలాంతరమునఁ బ్రదర్శింపఁబడును. ముద్రణసంస్కర్త యంగీకరించి ముద్రింపించిన కొన్నిస్థలములందిట్టి యస్త్రీలింగ విశేషణత కవిప్రయుక్తము కాదనిచెప్పుట కవకాశము కన్పట్టుచున్నది. ద్విపద...ధర్మోపేత గాత్రి।...।కొడుకులు లేమికిఁ గడుదుఃఖియగుచు। (బసవ. ౧ ఆ. ౨౯౫) ఇట "కొడుకులలేమికిఁ గడుదుఃఖయగుచు" అని కవిప్రయుక్త పాఠమనుట యుక్తము. దుఃఖా = దుఃఖ = దుఃఖముగలది. "దుఃఖ - న...కష్టేచ... తద్వతిచ - త్రి...త్రిష్వేషాం భేద్యగామియత్ (నామలిం) ఏషాంమధ్యేయద్భేద్యగామి ద్రవ్యగామి తత్త్రిషు - దుఃఖాసేవా - దుఃఖస్స్నతః...సర్వందుఃఖం వివేకినః" (అమరసుధావ్యాఖ్య. నరక.) ద్వి. లలనలందఱు నట్టి లాంఛనధరులు (బసవ. 3

భాషయందు, యోగః = ఆంధ్రవిభక్తి యోగరూపమగు తత్సమశబ్దప్రయోగము, నస్యాత్ = లేదు. ఇతి = ఇట్లని, సిద్ధాన్తపద్ధతిః = ఆంధ్రమహాకవి సమయము. "యుష్మదస్మదోః"అనునది తక్కిన యత్తదాది సర్వనామశబ్దములకును నుపలక్షణము. కాన - యద్ - తద్ - ఏతద్ - ఇదమ్ - అదస్ - త్యద్ - మున్నగు సర్వనామములకును దెల్గునఁ దత్సమరూపమునఁ బ్రయోగము లేదని యెఱుంగునది. "ఆద్యయోః" అనుటచేత దేశ్యములగు నీ - నా - ప్రభృతి యుష్మదస్మదాద్యర్థకముల ప్రయోగము నిర్బాధమని తెలియుచున్నది.

౧౫౭ II విషయమునఁ జెప్పఁబడిన "ద్విత్ర్యాది సంఖ్యాశబ్దానా। మల్పానాం నాత్రసంస్థితిః" అనుచోటనున్న "అల్పానా మిత్యుక్తే ర్వింశంత్యాదీనాం ప్రయోగో ఽస్త్యేవ" (అహో. ౨౭౮ పు.) అను నహోబలపండితునివ్యాఖ్య చొప్పునఁ బంచ షట్ సప్తాష్ట నవదశాదిహలంత సంఖ్యావాచకశబ్దములకును దత్సమరూప ప్రయోగము లేదని యెఱుంగునది. భవచ్ఛబ్దము ద్వివిధము. "భవాన్ - భవన్తౌ - భవన్తః -" (సం. ప్ర) అను రూపములుగల యుష్మదర్థక సర్వనామశబ్దమొకటి. "భవన్ - భవన్తౌ - భవన్తః -" (సం. ప్ర.) అను రూపములుగల వర్తమానార్థక భవచ్ఛబ్దము వేఱొకటి. "భవత్ - త్రి. (భా+డవతు.) యుష్మదర్థే - సర్వనామ కాచాస్య. భవాన్ - భవత్యాః+పుత్త్రః = భవత్పుత్త్రః. (భూ. శతృ.) వర్తమాన కాలార్థే - భవనకర్తరిచ. భవన్ - స్త్రియా ముభయత్ర జీప్ - శత్రన్తస్య నుమ్ (భవతీ. భవన్తీ)" (శబ్దస్తో.). ఇట్టి ద్వివిధమగు భవచ్ఛబ్దపు రూపములకును దత్సమ రూప ప్రయోగము లేదు. 'భవత్' అను కారికలోనిది శత్రంతములకెల్ల నుపలక్షణమనియుఁ జెప్పనగును. సంస్కృతమున భవచ్ఛబ్దము యుష్మదర్థకమైయున్నను నా రెండిటికిని గొంత భేదముగలదు. భవత్కర్తృకక్రియ ప్రథమపురుషమగును - యుష్మత్కర్తృకక్రియ మధ్యమపురుషమగును. "స్మరత్యదో వా శరధిర్భవన్ భవాన్" (శిశుపాలవధ.). తత్సమరూప ప్రయోగము లేని యీశబ్దములు సిద్ధసమాస పూర్వావయవములై యథాసంభవముగాఁ బ్రయోగింపఁబడునని తెలియునది. ఉదా:— భవద్గుణములు - యుష్మద్గుణములు - అస్మదాశయము - తదర్థము - గీర్వాణి - గీర్దేవి - ధూర్వహము - మహాజనులు - భవద్భావిశతృక్తవదర్థంబులు మొ. "స ప్రత్యయత్వే మహితాః" అనుదాని కీవలికే వ్యాఖ్య చేయఁబడెను. (౧౫౭ II విష) ద్విత్ర్యాద్యజన్తములకువలెనె భవదాది హలంతములకును దద్ధిత ప్రత్యయయోగమునఁ బ్రయోగము సాధువేయని తెలియునది. ఉదా:—భవదీయము - త్వదీయము - యుష్మదీయము - యౌష్మాకము - అస్మదీయము - ఆస్మాకము - అదసీయము -

సామకము - శాపకము - మొ. సూత్రములోని ముఖశబ్దమునకు 'మహత్' మున్నగునవే కాక "ప్రాదులు - అకి - తు - ర - హా - త్రై" అనునవి మొదలగు వానికిని దత్పురుషాక ప్రయోగములేదని తెలియునది. 'ప్రాణ్వము-పదము-వచము' మున్నగు కొన్ని సర్వనామములకు దత్పురుషాక ప్రయోగములేదు.

బాలవ్యాకరణ వివరణము. ౧౭౭ I విషయము.

భవచ్ఛత్రాదుల కందుఁ బ్రయోగంబు లేదు. కాని,
భవదాదులగు హలంత సర్వనామములకును, శత్రు
రేఫాంతాదులకును, తెలుఁగుభాషయందు ప్రయోగా
రంబు లేదని యర్థము. సమాసంబులం దొలుతంగాని
యుంట ప్రయుక్తంబులగు. భవద్దీనంబులు - త్వదా
శ్రయము - మత్ప్రాణము - అస్మత్కము - భవిష్య
త్కాలము - ధూర్వహము. ఇత్యాదులు తెలియునది.
ఇది తత్సమపరిచ్ఛేదము

సంజీవని. ౧౭౭ I విష:—పై యధర్వణకారికలోని భవచ్ఛబ్దమునుండియు, సర్వనామభవచ్ఛబ్దమును శత్రంతములను సంగ్రహించి యుండలే నుఖశబ్దము సను రించి యాదిశబ్దమునుజేర్చి సూరి దీనిని సూత్రించెనని తెలియనగును. యుష్మదస్మ చ్ఛబ్దములకేకాక హలంత సర్వనామములలో దేనికిని దత్సమరూప ప్రయోగము లేదనుచు "భవదాదిహలంత సర్వనామములకు వ్యవహారములేదు" అను వాక్యముతో సూరి వివరించెను. శతృశబ్దముచే వర్తమానార్థక శతృప్రత్యయాంతములకెల్లఁ బ్రయోగములేదని తాత్పర్యమెన్నఁదగును. గిర్ శబ్దమునకేకాక రేఫాంతశబ్ద మాత్రమునకె ప్రయోగములేదని వివరించెను. ప్రయోగములు:—ద్విపద - ధర జినబౌద్ధులు దైవంబులేని! నరరూపులై యుండుదురె మహత్తణఁగి (బసవ. ౬ ఆ. ౭౨౬) ఇందు - 'మహత్తు = గొప్పది' అనురీతిని మహచ్ఛబ్దము ప్రయోగింపఁ బడెనని తలంపరాదు. "సప్రత్యయత్వే మహితాః" అను నథర్వణకారికచొప్పున భావార్థక ప్రత్యయాంతమగు 'మహత్త' అనునది కవిప్రయుక్తము. 'మహత్త+ అణఁగి = మహత్తణఁగి -' అని ఛేదము నెన్నవలయును. సోమనారాధ్యుఁడిసు స్థలాంతరములందును దత్సమాకారసంధిని బ్రయోగించెను (౬౫ I విష.). కాన 'మహత్తణఁగి' అనుచోటి తత్సమాకారసంధి శంకాస్పదముకాదు. ద్వి. వారించి యిది ప్రాఁతవార్తని యొద్ది! వారెల్ల నుడువ (బసవ. ౫ ఆ. ౧౬౬ ప.) "మహత్తు - సం - వి - త్ - న - దోరతనము. పుం - ౧ బుద్ధితత్త్వము. (సూ. తత్త్వము.) ౨ తెలుఁగువ్యాకరణమునఁ బురుషవాచకముల సంజ్ఞ - విణ - ౧ గొప్పది......"

(శ. ర.) అను శబ్దరత్నాకరము చొప్పున 'గొప్పది' అను నర్థమునందు దీనికి 'మహాత్తు' అను ప్రయోగము సాధువేయని తలంపరాదు. శబ్దరత్నాకరమున "గొప్పది" అని "మహాత్తు" అను దానికర్థమిచ్చుట సరికాదు. అట్టి యర్థముగల మహచ్ఛబ్దము న గుణవర్ణనమునఁ బరిగణింతుమేని 'మహాన్' అనునది ప్రాతిపదికము కావలయును. గుణవర్ణనమునఁ బరిగణింతుమేని "మహాంతమ్" అనునది ప్రాతిపదికము కావలయును. ఇట్టివానివలన 'మహాత్తు' అను రూపము సిద్ధింపనేరదుగదా. ఇంక "మహాత్ - మహతీ - మహాన్తి" అను నపుంసక ప్రథమావిభక్తిరూపములలో 'మహాత్' అనుదానిని బ్రాతిపదికముగా గ్రహింతుమందురేని నది సంప్రదాయ విరుద్ధము. పుల్లింగరూప మున్నపుడు నపుంసక ప్రథమైకవచన తుల్యరూపమును బ్రాతిపదికముగా గ్రహించుట వైయాకరణసమ్మతముకాదు. (౧౬౯ II విష.). "క్వచి న్నాను గ్రహాస్తైవే" త్యథర్వణకారికచొప్పున "మహాత్" అను సంస్కృత ప్రాతిపదికమునే గ్రహింతుమనుటకు వలనుపడదు. ప్రథమైకవచన ద్వితీయైకవచన రూపములులేని క్వాచిత్కస్థలములందు మాత్రమే యట్లు సంస్కృత ప్రాతిపదికమును గ్రహించుట యథర్వణాశయమైయున్నది. (౧౬౯ II విష.) కాన "మహాత్తు" అనునది మహద్వాచకమునకు సంజ్ఞయగునపుడు మాత్రమే యది ప్రయోగార్హమై యగుణవర్ణన కార్యములనందును. (అనుబంధ. ౧౭౦ II విష.) అట్లై మహదాది తత్త్వములలోని 'మహాత్' అనునదిసైతము సంజ్ఞయేకాన నట్టియెడనుసైతము "మహాత్తు" అనునది సాధువగును. తే. గీ. అణువు మహదాదులకును దానతి మహాత్తు (హరి. ఉ. భా. ౮ ఆ. 3౨౨ ప.) ద్వి. తన యింటియావత్తు ధనమును మున్న (బసవ. 3 ఆ. ౪౫౫). ఇందలి 'యావత్తు' అనునది ముద్రణ సంస్కర్తృ ప్రమాదమునఁ బడినది. తాళపత్త్ర మాతృకలో "తన యింటియాతురధనమును మున్న" అని యున్నది. కాన నిట "తన యింటియాతతధనమును మున్న" అని కవిప్రయుక్తపాఠమనుట యుక్తము. యావత్తావచ్ఛబ్దములకును దత్సమరూపము కవిప్రయోగదృష్టము కాలేదు.

ఇది తత్సమపరిచ్ఛేదము = ఇది—ఇంతమాత్రమే, తత్సమపరిచ్ఛేదము = తత్సమశబ్దములభాగము ముగిసెనని యర్థము.

---

ప్రాకృతభవ వికృతిభవాః = ప్రాకృతభాషలద్వారమునవచ్చి వికృతియందు వెలసిన శబ్దములు, ప్రాకృతభవ, సంస్కృతభవ, సంస్కృత వత్ (తుల్యార్థకవతి ప్రత్యయమునకుఁ బ్రత్యేకసంబంధము.):—ప్రాకృతభవవత్ = ప్రాకృతమున వెలసియున్న యవ్యుత్పన్నశబ్దములకు సమములును, సంస్కృతభవవత్ = సంస్కృతము నుండి పుట్టిన ప్రాకృతశబ్దములకు సమములును, సంస్కృతవత్ = సంస్కృతసమ ప్రాకృతములకు సమములును, నయి కొన్ని వేద్యస్వరూపములయి యుండును. అవ్యుత్పన్నములయి ప్రాకృతవాఙ్మయమున వెలసియున్న శబ్దములు ప్రాకృత వాఙ్మయము మూలమున వేద్యములగును. అట్లే సంస్కృతశబ్దములనుండి పుట్టిన ప్రాకృతశబ్దములు ప్రాకృతవ్యాకరణములవలన వేద్యస్వరూపములగును. సంస్కృత సమములగు ప్రాకృతశబ్దములు సంస్కృతశబ్దములె యనఁదగును గాన నవి సంస్కృత వ్యాకరణాదుల వలన వేద్యములగును. వ్యతిరిక్తాః = అట్టి ప్రాకృతసమములకు విలక్షణములగు ప్రాకృతశబ్దములును నవఁగాఁ బ్రాకృతశబ్దములు వికృతులనంది తెలుఁగునకు వచ్చు శబ్దములును, సంస్కృతభవములును, నవఁగాఁ బ్రత్యేకముగా సంస్కృతశబ్దములు వికృతులనంది తెలుఁగునకు వచ్చు శబ్దములును, భూయాంసః = అనేకములు తెల్గునఁ గలవు. వ్యతిరిక్తాః = అట్టి వ్యతిరిక్తశబ్దములు నట్టి తత్సమ తద్భవ శబ్దములకు వ్యతిరిక్తములగు దేశ్యశబ్దములును, సంప్రదాయతో వేద్యాః = శిష్టపరంపరా సంప్రదాయమువలనఁ దెలిసికొనఁదగినవగును. ప్రాకృతశబ్దములును, సంస్కృతశబ్దములును వర్ణలోపాగమాది వికారములనంది తెలుంగునకు వచ్చునప్పు డట్టివికృతుల ప్రక్రియను దెల్పెడి వ్యాకరణములు తననాఁటికి లేమిం జేసి యట్టి ప్రక్రియయును దేశ్యములతో పాటుగ సంప్రదాయవేద్యమె యని వచియించెను. (విస్తర I). ఈశ్లోకము క్లిష్టముగ నుండుటం జేసి కావలయు బాలసరస్వతి "ఈ

---

విస్తర. I—౧౮౮ విష:—నన్నయనాఁటికే యననేల ? నేఁటికిసయితమట్టి వైకృతముల వికృతులను వివరించి యివి దేశ్యములు నివి తద్భవములు నని నిర్దుష్టము గను సవిస్తరముగను దెల్పు వ్యాకరణము లేదు. నవ్వుఁడగు నడిదము సూరకవి, కవిసంశయవిచ్ఛేదమును తనగ్రంథమున మూఁడవతరంగమున నట్టివైకృతముల ప్రక్రియ దిఙ్మాత్రముగ నిరూపించెను. (వై. పా. II తద్భవప్రకరణము. ౮౭ మొ. ౧౮౦౭. విష.) శబ్దరత్నాకరమందును, వైకృతదీపికాదులందును సూ-రా. నిఘంటువునందును వికృతులప్రక్రియ లేకున్నను నివి తద్భవములనెడి వివరణముగలదు. చిరకాలముక్రిందటనే దేశ్యములు తద్భవములును గలసిపోవుటచేత ననేకశబ్దములు దేశ్యములని పైకోశములలోఁ జేర్పఁబడినవి తద్భవము లనఁదగియున్నవి. (విస్తర IV. ౫౧ I విష)

కోజ్జ్వలితమ్ = పుట్టించందికోజ్జలీయ ఇత్యాది.” (చండప్రాకృతలక్షణము - ప్రథమ విభక్తివిధానము-౧ సూ.) ఇట్లు దేశ్యమునకును సంస్కృతశబ్దజన్యములె యుదాహరింపఁబడుటంజేసి యీ దేశ్యభేదమన్నది ప్రాకృతవ్యాకరణ సాధ్యముకానట్టి సంస్కృతమూల దేశప్రసిద్ధశబ్దభాగమెయని ప్రాకృతలాక్షణికుల యభిప్రాయ మూహింపఁదగియున్నది.

సంస్కృతసమేతరములయిన శబ్దముల పరంపర నీప్రాకృతభవేత్యాది కారిక వివరించుచున్నది. ఇట్లు ప్రాకృతసమములును దత్సమములె యనుటయేకాని మహాప్రాణాద్యనాంధ్రవర్ణఘటిత ‘సొక్ఖ’ (సౌఖ్యమ్) ప్రభృతి ప్రాకృతశబ్దములకుఁ బ్రాకృతసమరూపముతోఁ దెల్గునఁ బ్రవేశములేదు. సంస్కృతసమేతరశబ్దము లచ్చాంధ్రవర్ణఘటితములు మాత్రమె తెల్గునఁ బ్రయోగ యోగ్యములని ప్రాచీనాంధ్రమహాకవి ప్రయోగములవలనను, చింతామణిలోని యచ్చాంధ్రవర్ణసమామ్నాయోపదేశమువలనను విశదమగుచున్నది. (సం॰ II విమ.) మహాకవులెవ్వరును ననాంధ్రవర్ణఘటిత ప్రాకృతసమశబ్దము నొక్కటినేనిఁ బ్రయోగించియుండలేదు. ఈసందర్భమునుబట్టి నన్నయనాఁటికే సంస్కృతసమేతరభాషయనఁగా సంస్కృతభవ ప్రాకృతసమము సయిత (సిరి అగ్గి. మొ.) మాచ్ఛికమెయను నభిప్రాయముండెడిదని యూహింపనగును. కావున “అచ్చతెనుఁగు కావ్యములుగ నెన్నికకెక్కిన యయాతి చరిత్రము, నీలాసుందరీపరిణయము మున్నగువానియందలి భాషనుబట్టి యీయచ్చ తెలుఁగను సంజ్ఞలాక్షణికమయ్యె” (ఆ. సా. వే. ౨౦౮ పు.) అనునది మొదలగు వేటికావ్యాఖ్య సరికాదని తోఁచుచున్నది.

అజన్యేత్యాది:—ఆచ్ఛికశబ్దములు వ్యుత్పన్నములు నవ్యుత్పన్నములు నని రెండువిధములనుచు నధర్వణుఁడు వివరించుచున్నాఁడు. అజన్యజన్యభేదేన = వ్యుత్పన్నా వ్యుత్పన్న భేదములచే, శబ్దాః = శబ్దములు, వికృతౌ = అచ్చ తెలుఁగునందు, మతాః = సమ్మతములగుచున్నవి. జన్యాన్తర్గత శబ్దానామ్ = వ్యుత్పత్తి దెలియఁదగు శబ్దములలో, విచిత్రతా = వైచిత్ర్యము, భూయసీస్యాత్ = మిక్కిలి యధికమైయుండును. అట్టివైచిత్రి యా యా సందర్భములలోఁ జూపఁబడుచుండును. జన్య = వ్యుత్పన్నః—చేయు+ఇ = చేయి = హస్తము - పనులుచేయునది. ఎండు + అ = ఎండ = సూర్యాతపము. వస్తువుల నెండునట్లుచేయునది. విల్లు+కాఁడు=విల్లుకాఁడు = విలుకాఁడు = విల్లుగలవాఁడు = ధనుర్ధరుఁడు. అజన్య = అవ్యుత్పన్నః— తల్లి - తండ్రి - విల్లు - మొ. వ్యుత్పత్తియూహింపఁదగునవి జన్యములు - తద్భిన్నము లజన్యములు.

బాలవ్యా. సంస్కృతసమేతరంబైన యాంధ్రం బచ్చ యనంబడు. ౧.
౧౨౫ I విమర్శము. స్పష్టము.

సంజీవని. ౧౨౫ I విమ:—సంస్కృతసమేతరభాష - ప్రాకృతము, ప్రాకృత భవ, సంస్కృతభవాంధ్ర దేశ్యము లను భేదములుగలభాష. కాని యన్యదేశ్యము నంగీకరింపలేదు గాని యుచితము నన్నయలోని దేయని తెలుపును. అచ్చతెలుగు కావ్యములలో నన్యదేశ్యశబ్దములును చేర్చబడి భాగముగా కూడియే యున్నవి. "ఆరూఢము నన్యదేశీయము..." (ఆది II. వివ్రుత. ౧౨ II విమ.) అని నన్నయ యొక్కడును నన్యదేశ్యము నంగీకరించియున్నాడు. నన్నయనాటి యన్యదేశీయములకు తురుష్కాదులతో నాంధ్రులకు సంబంధములేనందుచే నాతనికవితలో నన్యదేశ్య శబ్దములు చేరలేదు. అప్పకవి చింతామణిలోని యచ్చాంధ్రప్రకరణ వ్యాఖ్యయందు "భాసులు - మక్కా" మొదలగు నన్యదేశ్యశబ్దములలోని వర్ణములు మొదలగు వర్ణములు చెప్పబడలేదు. అధర్వణుడును వర్ణములను జెప్పి పూరింపలేదు. దీనిని బట్టి యన్యదేశ్యశబ్దములందలి యక్షరము లనాంధ్రవర్ణములలో నైనచో తత్సదృశ వర్ణము లనుసరించి యుచితములగు నాచ్ఛికవర్ణములను ప్రయోగింపవలయునని యాతఁడు భావించి సర్దిపెట్టవలెను. (౧౦-౧౧-౧౨ II విమ.) కాని యన్యదేశీయములనట్లు సర్దుబాటు లన్నిచేయక యనాంధ్రవర్ణములతోడి యన్యదేశ్యములను ప్రయోగించుచు వచ్చుచుండెనని కాబోలును, ప్రౌఢవ్యాకరణకర్త "అంధ్రభాషకు వర్ణంబు లేబదియైదు" (ప్రౌఢ. సంజ్ఞా. ౧ సూ.) అని సూత్రించెను. "అన్యదేశ్యములు మాత్రమాచ్ఛిక ములు కావా ? సంస్కృతసమములు మాత్ర మాంధ్రభాషలోనివి కావా ?" అని తలంచి యాతఁడట్లు సూత్రించియుండును.

అచ్ఛాశబ్దభవము "అచ్చము". అచ్చము+తెలుఁగు = అచ్చతెలుఁగు. అచ్ఛ యనఁగా స్వేతరవస్తు మిశ్రణములేనిది. ప్రకృతమున సంస్కృతసమ మిశ్రణము లేనిది యాచ్ఛికమని గ్రహింపవలయును. "ఆచ్ఛికము = అచ్ఛ = అచ్చతెలుఁగు = శుద్ధాంధ్రము" అనునవి పర్యాయములనఁబడును. కాని అచ్చతెలుఁగు" అను దానిని వివరించుటలో నాంధ్రలాక్షణికులు భిన్నభిన్నరీతుల వచించిరి. క. తలనెల వేసవి గుడి మడి। పులి చలి మడుఁ గూడు వేరు బూరుగు మగవాఁ। డలుకయని యెల్లవారికిఁ। దెలిసెడి యాపలుకు లచ్చ తెనుఁగనఁబరఁగున్. (ఆం. భూ. ౨౨ ప.)
క. ఈమూఁడు తెఱంగులలో। నేమిటనుం దొరలకున్న (లుచున్న?) నెల్లజనులకున్। లోమిగులఁ దేటపడియెడు ॥ నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౮ ప.) (ఈమూఁడుతెఱంగులు = తత్సమ తద్భవ

దేశ్యములు.) క. సూరిజను ల్లోకవ్యవ । హారంబగు భాస దేశ్యమం డ్రది యు హితం । ఛారఁగ నచ్చతెలుంగని। యారూఢిగఁ గొండఱందు రగజాధీశా॥ (సర్వల. ౧ ఆ. ౬౮ ప.)

అప్పకవి యాంధ్రశబ్దచింతామణిని వివరించువాఁడగుటంజేసి యాతఁడు చాల వఱకుఁ జింతామణి మార్గముననె వచించెను. క. నెలకొను సంస్కృతతత్సమ।ములు వొరలక తజ్జదేశ్యములు మూఁటను సం । ధిలి కేవలాంధ్రములునా । నలరుఁ గృతుల నచ్చతెనుఁగు లండ్రు తెనుఁగునన్ (అప్పక. ౧ ఆ. ౧౧౦) క. పుడమియు సిరియును బడఁతులు।వెడవిలుతుఁడు పసిఁడికడుపు వేల్పును గొడుకుల్।కడలి విడిమట్టు పాపల। నడఁచుగుజ్జును పాబి కనఁగ నచ్చతెనుంగుల్ (అప్పక. ౧ ఆ. ౧౧౮) (తజ్జ=సంస్కృత ప్రాకృతములనుండి కల్గు "ప్రాకృతభవ-సంస్కృతభవ" అని రెండు.)

అప్పకవి యెల్లరకును దేటగాఁ దెలియు శబ్దములు శుద్ధాంధ్రములనియుఁ, బ్రౌఢులకుమాత్రము దెలియుశబ్దము లన్యదేశజాంధ్రము లనియు వచించెను. గీ. ఆంధ్రదేశ పురస్థాయులైన సకల । జనములకును మఱుంగు లేశంబులేక । తేట తెల్లముగాఁ బల్కుమాటలెల్ల । నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁబడును (అప్పక. ౧ ఆ. ౧౦౬) క. పాలును బెరుఁగును నేయును । ......... శుద్ధాంధ్రంబుల్ (అప్పక. ౧ ఆ. ౧౦౩.)

క. కేశవ యాంధ్రులు నానా । దేశంబుల యందునిలిచి తెలుఁగులె తత్త । ద్దేశోక్తు లంటఁబలికిన । నాశబ్దము లన్యదేశ జాంధ్రములయ్యెన్॥ (అప్పక. ౧ ఆ. ౧౦౮) సీ. ఆలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు, దుర మని యొంటరి దొమ్మి కలను । వెలఁది యింతి పడంతి...(అప్పక. ౧ ఆ. ౧౦౯) 'ఆంధ్రులితర దేశవాసులై పలుకుటచే నీ తెనుఁగులె యన్యదేశ్యము లని పేరుపెట్టుట సరియనితోఁపదు. ఆంధ్రేతరతురుష్కాదిదేశజ శబ్దములనెడి యన్వార్థము దుర్వారముగాఁ దోఁపక మానదు. ఆలంబు మున్నగుశబ్దంబు లాంధ్రదేశ్యములుకావని యెవ్వరును జెప్ప జాలరుగదా. అప్పకవిస్థలాంతరమందు వేఱుగ నన్యదేశ్యంబులను వక్కాణించెను. "శవర శీవి శేవ శావును ఘాకయు । మొదలుగను ద్వితీయములు చతుర్థ । వర్ణములునుగలుగు వాక్యంబు లన్యదే । శ్యములుగాని వైకృతములుగావు. (అప్పక. ౨. ఆ. ౧౩౯ప.) (అహో. ౧౮౨ పు. (వి_స్త. ౨౨ II విష.)

అప్పకవి యచ్చతెనుఁగులనె తెలుఁగుమఱుఁగులు ప్రాఁదెలుఁగులు నని కొన్నిలక్షణములనుబట్టి వివరించెను. క. తొల్లింటిజనులవాక్యము । లెల్లను బ్రాఁ దెనుఁగులయ్యె నిప్పటివారల్ । చెల్లుబడివాడనివియే । తెల్లముగా నింకఁ బ్రాఁత

లిధు; ప్రాతత భుజదండ, మూరురాయరగండా (వసు. ౨ ఆ. ౧౫.) "ఉభయరగండ, మూరురాయరగండా" అనునవి కర్ణాటదేశీయములును సంస్కృతముగా ననుకరించిన తత్సమరూపములును ననకతీరదు. (చూ. ౨౭౫ విష.) తెలుఁగున బహువచనమున 'లు-ల' లు వచ్చునట్లే తమిళకన్నడములలో 'రు-ర' లు నిల్చును. ఉభయర = ఉభయులయొక్కయు (నరపతి గజపతుల,) గండ = వీరుఁడా, మూరురాయర=మూఁడు సంఖ్యగల రాజులను ఏలిన, అశ్వపతి - గజపతి - నరపతిరాజుల నేలిన గండా= శూరుఁడా. వీనియందలి మూరు 'ర' అనువానిసంబంధమున నివి కర్ణాటదేశ్యము లననగును. మఱియు నివి కర్ణాటరాజబిరుదములె యైయున్నవి. సంస్కృతసమముల సంబోధన ప్రథమైకవచనమునందలి 'డుజ్' ప్రత్యయమె లోపించును గాని యాచ్ఛికముల డుజ్ లోపింపదు (బా. తత్స. ౩౮ సూ.) గాన నవి సంస్కృతసమము లనకతీరదు (మగఁడా - రామా.) అట్లగుటంజేసి "ఉభయర గండ - మూరురాయరగండా" అనునవి యన్యదేశ్యములయినను నాబిరుదములు సంస్కృతముగా ననుకరింపఁబడుటంజేసి తత్సమశబ్దలక్షణములతో వెలయుచున్నవని యెఱుంగనగును.

మూరుశబ్దము కర్ణాటదేశీయమగుటను, రాయశబ్దము తద్భవమగుటను, నన్యదేశ్యమునైత మాంధ్రమున దేశ్యభాషాభేదములలో నొకటియగుటను, నివి యాచ్ఛికములను నొకయభిప్రాయముకల్గును. క. గండర గండని కభినవ। మాండలికాఖండమన్నె మార్తాండునకున్। చండప్రతాపపిహితా। జాండునకున్ లోబి మన్నియరగండనికిన్ (నర. ౧ ఆ. ౯౯) (షష్ఠ్యంతములలోనిది) ఇందలి 'గండనికిన్' అను సుత్వరహితరూపము సయితము (మగనికిన్ - రామునికిన్) దాని యాచ్ఛికతను స్థిరపఱుచుచున్నది. ఇట్టిప్రయోగములనుబట్టి "గండర గండనికిన్ లోబి మన్నియరగండనికిన్" అనునవి సంస్కృతములుగా ననుకరింపఁబడలేదనియు నివి యన్యదేశ్యములె యనఁగా నాచ్ఛికములెయనియు గ్రహింపవలయును. మఱియు "గండ-గండఁడు" అనునవి వైకృతములని కోశకారులు వ్రాసియున్నారు. "గండఁడు = వీరుఁడు—గండః" (వైకృతదీపిక.) "గండఁడు - వై. వి - శూరుఁడు" (శ. ర). "గండఁడు = గండ" "గండ. వి (సం - గండః......) శూరుఁడు" (సూ. రా. ని.) సీ. రాయరావుతుగండ, రాచయేనుఁగువచ్చి, యారట్లకోటఁ గోరాడునాఁడు (కవులచ. క్రీ. శ. ౧౮౯౫-సం॥ ముద్రణము. మధ్యకవులు. ౩౦ పు.) "గండుఁడు. సం-వి- అ- పు-శూరుఁడు. (కే. ని)." (సూ. రా. ని), అను చొప్పున 'గండుఁడు - తత్సమము. గండఁడు - ఆచ్ఛికము' అని యీపక్షమున వచింపనగును. ఇట్లయినను

నిట్టివి యాంధ్ర దేశ్యములనరాదు. తెల్గునందు 'ఉ-ల' ల చోట 'ద-ర' లు నిల్చుట లేకపోలేదు గాని యిట్టియెడల 'ద-ర' లు తెల్గున నిల్చుట సంప్రదాయము కాదు. బా. తత్స. ౩౭ సూత్రము చెప్పిన నదంత దేశ్యపూర్వాపదస్థలములందును సర్వ నామములందును (బా. అచ్చి. ౫౭ సూ.) (ప్రౌఢ. శబ్ద. ౮౬ సూ.) "పగతుఁడు" మున్నగు కొన్ని యాచ్ఛికశబ్దములందును (బాల. అచ్చి. ౬ ప్రక. ౧౧ సూ. వఱకు) మాత్రమె 'ఉ-ల' ల చోట 'ద-ర' లు తెల్గున నిల్చుట సంప్రదాయము. పదియు "పగవాఁడు"లలో నిట్టివి చేర్చుటకు వలనుపడదు. పగవాఁడులు బహువచనాంతర్గత మగుటచేత "పగతుఁడు - బలియుఁడు - నెయ్యుఁడు" మున్నగువంటివి బహువచన ప్ర కత్వమున వానియం దుత్వము రాకపోవదు. కాన 'గండరగండనికిన్' 'మూరురాయర గండనికిన్' మున్నగునవి యాంధ్ర దేశ్యములు కానేరవు. రాయశబ్దము బహువచన మునఁ దెలుంగున "రాయలు - రాయలన్" అనియుండుట ప్రసిద్ధము గాని 'రాయరు - రాయరన్' అనురీతి నుండుట ప్రసిద్ధము కాదు "సీ. క్షితిజోత్తమగండ బిరుద।.........ఉభయరగండబిరుద। గండరగండబిరుద।...గండభేరుండబిరుద (నరస. ౫ ఆ. ౨౦ ప.) అనియిట్లు మాత్రికవి పేరిని కర్ణాటరాజుల బిరుదములుగా వచించెను.

పెనిచరిత్ర మింకను విచిత్రముగా నగుచున్నది. "గణ్డ - ప్రు - హస్తక హాతే.........పితే - పీఠకే-స్ఫోటకే - గ్రన్థా - శ్వాఙ్గలేశ్రే వైవాహికజన్మలగ్నక్షే - అశ్వినాద్యదితారా గణ్డశ్చేదన" (శబ్దరత్నా). "గణ్డం దోషవిశేషం హానిం వా రాతీతి గండరః. (హానినిగలిగించువాఁడు) అను వ్యుత్పత్తిబోధకమైన గండరశబ్దమును దీని వంటివె యనఁదగు ద్రోహరశబ్దాదులును సంస్కృతశబ్దములుగ సాధ్యములగు చున్నవి. ఈపక్షమున నిందలి 'ర' అనునది బహుత్వబోధక ప్రత్యయమనరాదు.
క. గండఁడు శంభుద్రోహర। గండఁడు (గండరుఁడు) మహాసన్యాసైవ గండరులకుఁ దా। మిండఁడఁగు వీరభద్రుఁడు। దండెత్తె.........(వీర. ౪ ఆ. ౭౫ గండరుఁడు శబ్దముచొద్ద. సూ. రా. ని.) ఇట్టిప్రయోగములు వీని సంస్కృతత్వమును నిర్ణయించు చున్నవి. ఇట్టిసాధుమార్గమునఁ బై ప్రయోగములను జూపక సూ. రా. నిఘంటు కర్తలు "గండరుఁడు" అను నాచ్ఛికశబ్దమును గల్పించి పై ప్రయోగములందు వైరిసమాసస్థితి నంగీకరించి యుదాహరించుట సరికాదు. ఈపక్షమున—'గండర గండఁడు' మున్నగుచోటులందు—"గండర = హానిని గల్గించువారి నణఁచెడి, గండఁడు = శూరుఁడు" "ఉభయర = అశ్వపతి గజపతులను వశపఱచుకొను, గండఁడు = వీరుఁడు" అనురీతిని వ్యుత్పత్త్యర్థములను జూపనగును గాన నివి యన్య

విక్రుతా సర్వే శబ్దాః । క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే
స్యుః।క్లీబసమాఅమహద్వత్।స్త్రీవత్స్యుః స్త్రీసమాః...
నన్నయా. (ఆం. చిం. అజం. ౨౨ కా. అహో. 3౫౦-3౫౧పు.)
౧౮౯ విష. కేచిత్తు వైకృతాశ్శబ్దాః । పుంసి చాన్యత్ర సంగతాః ।
హితాః ప్రత్యయభేదేన । శబ్దా ఏకార్థవాచకాః(వికృ.
అజం. 33 కారి. అహో. 3౦౮ పు.)

కల్పతరువు. ౧౮౯ విష:—వికృతా = అచ్చతెలుఁగునందు, సర్వేశబ్దాః = అల్పసంఖ్యాక కతిచిత్పులింగసమేతరములైన సమస్తశబ్దములును క్లీబసమాః = నపుంసకలింగసమములును, స్త్రీసమాః = స్త్రీలింగసమములును, మాత్రమె యైయున్నవి. పుంలింగసమములు లేవని యహోబలపతివలె నర్థముచేయరాదు. "క్వచి దమహతోఽపి డుజ్ స్యాత్—ఏకాదే రమహతాంచడావున్న" అనుచింతామణిసూత్రములచేతఁ బుంలింగసమము లనఁగా డుజ్ప్రత్యయాంతశబ్దములస్థితి భట్టారకాభ్యుపేతరునుట స్పష్టమగుచున్నది. అన్యే = పున్నపుంసకస్త్రీసమేతర శబ్దము లనఁగా వువర్ణకాంతశబ్దములు, నస్యుః = లేవు. ఇట్టి యభిప్రాయమునే "అనుతాం స్త్రియాం సమానాం । సర్వస్య స్త్రీసమస్య చ సు లోపః" అనుకారిక సయితము విశదీకరించుచున్నది. క్లీబసమాః = నపుంసకలింగసమశబ్దములు, అమహద్వత్ స్యుః = వృక్షాద్యమహచ్ఛబ్దములవలె "స్యాదమహాతాం విభక్తౌ" విత్యాది సూత్రముచే మువర్ణకాదులు వచ్చినరూపములు గలవగును. స్త్రీసమాః = స్త్రీసమ శబ్దములు, స్త్రీవత్ స్యుః = రమాది స్త్రీలింగశబ్దములవలె "అనుతాం స్త్రియాం సమానా" మిత్యాదిసూత్రముచొప్పున స్త్రీలింగప్రథమైకవచనలోపాదికార్యములు గలవగును. బియ్యము, సన్నము, కప్పము, కయ్యము మున్నగునవి నపుంసకలింగ

దేశ్యములనియు సంస్కృతముగా ననుకరింపఁబడెననియు నంగీకరింప నక్కఱలేదు. "మూరురాయరగండా" అనుచోట "మూరు, రాయ శబ్దములు సంస్కృతేతరములై యైనను వాని సమాస మశ్వపతి గజపతి నరపతులనెడి త్రివిధరాజభేదములకు సంజ్ఞయై సంస్కృతముగ ననుకరింపఁబడినదనియు (చూ. ౨౭౫ విష.) నక్కారణమున "మూరురాయ = త్రివిధరాజులను, ర = వశపఱ్చుకొనునట్టి, గండా = ఘోరుఁడా" అని యర్థము చేయనగును. ఇట్టి సంస్కృతానుకరణపద్ధతి చొప్పుననే సీ.........ఎ. గీ. మూరురాయరగండ పెండారమణి మ। రీచి రింఛోళి......... (భను. ౧. ఆ. ౧౨ ప. పీఠిక.) అను స్థలము సయితము విరుద్ధము కానేరదని తెలియుంగునది.

రుఁడు - చంపమామ - కడియము ఇత్యాది. ఒక్కఁడు ఇత్యాదీనాం మహత్వ మత్వేపి విధానాన్నదోషః. (అహో. ౩౫౧ పు.) ఈయహోబలపతిమార్గము సరి కాదు. నిషేధము దేశ్యశబ్దమాత్రవిషయక మగునపుడు విధియు దేశ్యమాత్ర విషయకమె కావలయును. కానఁ దద్భవశబ్దముల రూపసాధనమును జింతామణి వచియింపలేదనవలసివచ్చును. గృధ్రము తద్భ - గద్ద, చణుఁడు - తద్భ - జాణ - గాయనుఁడు - తద్భ - గాణ - కుడ్యము - తద్భ - గోడ - స్నేహము - తద్భ - నెయ్యము - చూర్ణము - తద్భ - సున్నము, మున్నగు ననేకవైకృతశబ్దములకు గతి లేకపోవలసివచ్చును. మఱియు 'పగతుఁడు - అల్లుఁడు - మున్నగు ననేకదేశ్యశబ్దములును పుంలింగసమములు లేకపోలేదు.

బాలవ్యాకరణ వివరణము. ౧౮౯ I విషయము.

> ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱచుగ స్త్రీసమంబులుం గ్లీబ
> సమంబు లయియుండు. ౨.
>
> స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబు ను, గ్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న-మిన్న-అద్ద-గద్ద-జాణ-గాణ-ఓడ-గోడఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము-నెయ్యము-అల్లము-మొల్లము-సున్నము-సన్నము-ఇత్యాదులు క్లీబ సమంబులు.తఱచుగ ననుటచేఁబుంలింగతుల్యంబులుం గొండొకకలవని తాత్పర్యము. కొమరుఁడు - చందురుఁడు - జముఁడు - కందుఁడు ఇత్యాదులు.

---

ములు. ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుకయేనియు లేదు నీదెసన్. (విరా. ౧ ఆ. ౨౮౧ ప) ద్విపద. కుటిలవేషంబున గొల్లనిభాతి (బసవ. ౧౧ ఆ. ౧౧౨౦) క. తా నప్పుడు గొల్ల మెచ్చెఁ దనకులకాంతన్ (పంచ. ౧ ఆ. ౪౫౫ సూ. రా. ని.) ముఁదుక. చ...ఎట్టుగాఁ । గడఁగితి మూఁడుకాళ్ళముదుకన్ వరియింప (జై. ౪ ఆ. శ. ర.) ముదుకఁడు.........క. ముదుకం డయ్యును గుమారమూర్తింబోలెన్ (ద్రోణ. ౧ ఆ. శ. ర.) ఉ...మున్ను గొంటిమే।వన్నదండయొక్క మగవాఁడిడ (ఆము. ౧ ఆ. ౧౪) ద్విపద. ఎంగిలిపాల్ద్రావి రేవంబు లేక (బసవ. ౭ ఆ. ౩౨) చ.........పేరుకంటుఁడే।వపుఁగొలువైన నాకు నిలువ న్మది.........(విరా. ౧ ఆ. ౧౯౭) గీ. ఒరు లెఱుంగరు నన్నని యునికి మోస । (అను. ౧ ఆ. ౨౧౪) క. ఏగతి మోసంబులేదె యెవ్వరికైనన్ (మార్కం. ౭ ఆ. శ. ర.) ఇట్టివి మిశ్రస్థితి కింకను బెక్కులు ప్రయోగములుగలవు.

సంజీవని. ౧౯౫ I పేషః—అర్థములు:— మిన్న = శ్రేష్ఠుఁడు, అస్త్ర = పగము, గద్ద = గృధ్రము, జాణ = నేర్పరి, గాణ = పాటకాఁడు. పాటకత్తె, నెయ్యము = స్నేహము, మొల్లము = అధికము. జముఁడు = యముఁడు, కంముఁడు = స్కందుఁడు, కుమారస్వామి, కొంచెక = కొంచెము. అన్న మున్నగునవి స్త్రీసమంబులగుటంజేసి బా. తత్స. ౫౭ సూత్రముచొప్పున ప్రథమైకవచనలోపావికమువచ్చి 'డు' మున్నగువానికివలెనే వానికి రూపసిద్ధి యగును. ఉదా:—అన్న-అన్నలు-అన్నను-అన్నలను. మొ. బియ్యము మున్నగునవి నపుంసకలింగసమములగుటంజేసి 'బియ్య-నెయ్య' మున్నగు ప్రాతిపదికములకై బా. తత్స. ౩౯ సూత్రముచొప్పున ముగాగమమువచ్చి బియ్యము నెయ్యము మున్నగురూపములు సిద్ధించును. పిదప ముగాగమాదులువచ్చి బియ్యములు - బియ్యమును - బియ్యములను - బియ్యంబు - బియ్యమ్ము మున్నగురూపములును గల్గును. కవిశిరోభూషణానుకరణమునంజేసి సూరి తెలుగుశబ్దములచేతఁ బుంలింగసమముల సంగ్రహింపకేతని సూత్రరచనముఁ జేసె ననవలయును. కొమరుఁడు-చందురుఁడు - సగతుఁడు-అల్లుఁడు మున్నగుశబ్దములు మహత్తులు పుల్లింగసమములు నగుటంజేసి బా. తత్స. ౨౧-౨౨ సూత్రముల చొప్పున "కొమర - చందుర - సగత - అల్ల" మున్నగు ప్రాతిపదికములకు "ఉత్వాడుజ్ఞులు" వచ్చి కొమరుఁడు, చందురుఁడు, సగతుఁడు, అల్లుఁడు మున్నగు రూపములు సిద్ధించును.

స్త్రీసమములు మహద్వాచకములును, నమహద్వాచకములును మహతీ వాచకములును గానోపును. ఉదా:—అన్న - తండ్రి - గోడ - మేడ - అమ్మ - తల్లి - మొ.

ఇట్టి స్త్రీపున్నపుంసకసమముల విశేషణములవిషయ మీావలికు విపులముగా విశదీకరింపఁబడెను. (౧౯౮, విషయము.) ఉదా:—అన్నసమర్థుఁడు - చందురుఁడు - మనోహరుఁడు - కయ్యము భయంకరము - తల్లిసదయ - సదయురాలు. మొ.

కొన్ని డుమంతములునైత మమహద్వాచకములగుట కలదు. ఉదా:— సాలీఁడు = సాలెపురుగు, కొమ్ముకాఁడు = అడవిపంది, కత్తెఁడు = ఒకజాతిగుల్లము, కైరఁడు = ఒకగుల్లమువేరు. ఒకఁడు = ఒకటి. మొ. సూరిస్త్రీలింగసమములను 'అ' కారాంతములనుమాత్రమె చూపెనుగాని 'ఇ'దంతాదులును గలవు. ఉదా:—తల్లి - చెలి - పిల్లి - నవలా - నేజా - లకోరీ - అవు - తావు - చెఱువు - చెలువు -

పూవు - మనువు - చావు - కొడుకు - గొడుగు - పూ - వదినె - కన్నె - చిన్నె - వన్నె - రే - ప్రే - ముత్తో మొ. (విస్తర.)

అట్లె సూరి నపుంసకలింగసమములను సయితము 'అ'కారాంతములను మాత్రమె చూపినను దద్భిన్నము లనేకములు గలవు. ఉదా:—ఏతాము -

---

విస్తర. ౧౮౯ I విష:—ఇంకను వెనుక నుదాహరించినరీతిని చేసి - చేయక - చేయన్ - చేయుచున్ మున్నగు లాక్షణికావ్యయములును చేసిన - చేయుచున్న - చేయు - చేసెడు మొదలగుధాతుజవిశేషణములును (బాలవ్యాకరణపక్షమున నివి కళలు) తెల్ల - నల్ల మొదలగు గుణవిశేషణములును (బాలవ్యాకరణపక్షమున నివి కళలు) మున్నగునవిసయితము స్త్రీసమములని యంగీకరింపవలయును. అట్లంగీకరించి వానిపై సుప్రత్యయమును నిల్పి స్త్రీలింగప్రథమైకవచనలోపముచేసి (బా. తత్స. ౫౭ సూ.) పదత్వమును వానికి సంపాదింపవలయును. లేనిచో వానికి "అపదం న ప్రయుఞ్జీత" అనుచొప్పున వాక్యప్రయోగయోగ్యత కల్గనేరదు. అట్లు విభక్త్యంతములైనపిమ్మటనే వానికి "తిజ్మధ్య" సూత్రము చొప్పునఁ గళాద్రుతప్రకృతికత్వములను బరిశీలింపవలెను. (విస్త. I. ౪౨ I విష) పదత్వసిద్ధికై యంగీకరించిన యీసులోపమునుబట్టి యివి ప్రథమాంతములు గానఁ గళలని తలంపరాదు. ఇట్టి ప్రథమాంతత్వము కళాత్వసంపాదకము కానేరదు. (విస్తర. I. ౪౨ I విష. చూచునది.) 'చేసి - చేయక - చేయుచున్' మున్నగు లాక్షణికావ్యయములను స్త్రీలింగసమములనియు సుప్రత్యయాంతములనియుఁ జెప్పుట యెట్లని శంకింపరాదు. అవ్యయములపై విభక్తులను నిల్పుటయు "అవ్యయాదాప్సుపః" (౨-౪-౮౨) అనుచొప్పున విభక్తిలోపముచేయుటయు సంస్కృతమునందు సయితము ప్రసిద్ధమెకదా (సి. కౌ. ౪౫౨ సూ.) లేదా "నపదాన్యవ్యయే" త్యాది చింతామణిసూత్రముచొప్పుననైన వీనిమీఁదిసంస్కృతవిభక్తికి లోపముచేసి వీనికిఁ బదత్వమును సంపాదింపనగును (చూడు. ౧౧౨ విష. విస్తర. ౧౧౨ II విష. ౧౮౯ I విష.)

"చిట్టలు - విణ - ఆశ్చర్యము. అద్భుతము (చిట్ట. దే. వి. శ. ర; బ్రౌణ్య; చి - ని; = చిన్నయసూరినిఘంటువు. అముద్రితము)" (సూ. శా. ని.) పరిశీలింపఁగా "చిట్టలులు" అనుబహువచనరూపము లేమింజేసి "చిత్ర" శబ్దభవమగు 'చిట్ట' అనునది స్త్రీసమరూపమనియు నయ్యది నిత్యబహువచనాంతమనియు గ్రహించుట యుక్తమని తోఁచెడిని. ఉ. నీదు మహత్త్వ మెంతయుం । జిట్టలు గాదె (భార. ఆర. ౫ ఆ. ౨౨౩ ప.)

గోతాము - లాతాము - గాదాము - మోదాము - సీము - గాము - ఉస్నెము - పుస్నెము - సాదెము. మొ. వీనిని నపుంసకలింగసమములుగాఁ బరిగణించిన సామ ర్థ్యముచేతనే యదంతములు కాకున్నను బా. తత్స. ౩౯ సూత్రము-చొప్పున వీనికి ముపర్ణకాదులు వచ్చునని వ్యాఖ్యానము చేసికొనవలయును. ఉదా:—పుస్నెము - పుస్నెంబు - పుస్నెమ్ము - పుస్నెములు - పుస్నెమ్ములు - పుస్నెంబులు - పుస్నెంపు గని. మొ. వీతాము మున్నగుదీర్ఘపూర్వక ముపర్ణకములకు "మ్ము - ంబు - ంపు" మున్నగురూపములు గలుగనేరవని ప్రయోగానుసారముగ వ్యాఖ్యచేసికొన వలయును. ఉదా:—వీతాము - వీతాముకొన. సీము - సీముపేల్పు. మొ. (౧౪౫ I విష.) గాదాపులిష్ట మున్నగు సలంతిష్ఠలములలో బిందుపూర్వకముకాని పుపర్ణప్రయోగము హితముగఁ దోఁచుచున్నది. సంస్కృతమునఁ బారిభాషికలింగ మునువలెనె తెల్గున నిస్త్రీసమత్వాదికముచు మహాకవిప్రయోగములనుబట్టియె తెలిసికొనవయును.

పామ్ము - ఇరుమ్ము - ఉదుమ్ము - వేమ్ము మున్నగు తమిళశబ్దములతో, పాము - ఇనుము - ఉడుము - వేము - మున్నగు తెలుఁగుశబ్దములకుఁ గలసంబంధ మును, 'అంబకము' అనుసంస్కృతశబ్దప్రవికృతి యనఁదగు "అమ్ము = బాణము" శబ్దమును, బరిశీలించునపుడు (౧౪౫ I విష) పాము మున్నగువాని తుదివి ముపర్ణ మాత్రమేకాని ముపర్ణకము కాదనియు నట్టిపాము ప్రభృతులు స్త్రీసమములె యనియుఁ దోఁపకమానదు. అట్లెపుట్టుగు - పండుగు - నట్టుగుఁడు (సత్తురుఁడు) బందుగుఁడు (బాంధవుఁడు) మున్నగు శబ్దముల సంబంధమునుబట్టి పరిశీలించు నపుడు పుట్టువు - పండువు - నట్టువు - బందువు - మున్నగువాని తుదివర్ణము పువర్ణమాత్రమె యనియు పువర్ణకము కాదనియు నట్టియాచ్ఛిక పువర్ణాంతము లెల్ల స్త్రీసమములెయనియుఁ దోఁచకమానదు. "నాఽన్యేస్యుః" "అనుత్తాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః" అను చింతామణిసూత్ర ములు సయితము పైవిషయమును సిద్ధాంతీకరించుచున్నవి. (విస్తర. ౧౪౭ I విష. ౧౪౮ విష.) పువర్ణముచేరు 'పుట్టువు' మున్నగునవి నపుంసకలింగసమములను ఆ. భా. చరిత్ర (౧౬౮౫ పుట.) వ్రాఁత సరికాదు.

నన్నయా ౧౯౦ విషయము. విశేషణానాం మహాతో । దుజ్ఞ్నే ఉభయథాపిచ । క్వచి దుష్మాత్రకే స్యాత్ । విశేషణమిహోచ్యతే. (వికృ. అజం. ౩౨ కారి. అహో. ౩౦౭ పు.)

కల్పతరు. ౧౯౦ విష:—మహాతః = మహద్వాచకముయొక్క, విశేషణా నామ్ = విశేషణములగు సాంస్కృతికాచ్ఛికవిశేష్యనిఘ్నశబ్దములకు, దుజ్ఞ్నేస్యా

తామ్ = డుజ్ వర్ణకమును దస్త్రూలకన్యాగమాదులును నగును. అట్టి విశేష్యనిఘ్నములకు, ఉభయథాపిచ = డుమంతత్వ మువర్ణకాంతత్వములు రెండును మహత్త్వామహత్త్వములనుబట్టికల్గును. మహతీవాచకవిశేష్యనిఘ్నవిశేషణములవిషయము నన్నయచేఁ జెప్పఁబడెను గాన (౧౮౬ విష.) మిగిలిన మహదమహత్తులవిషయము నిట నథర్వణుఁడు వివరించెను. క్వచిత్ = కొన్నియెడల, స్వార్థవిశేషణమ్ = మహదర్థకాదులవిశేషణముగుశబ్దము, డుజ్ మాత్రకే = డుజ్వర్ణకాంతత్వమాత్రమునందె, ఇహ = ఈయాచ్ఛికప్రకరణమున, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. బల్లిదాదులలోఁ గొన్నింటికి మువర్ణకాంతరూపములు లేవని తాత్పర్యము.

బల్లిదాదు లాచ్ఛికములగు విశేష్యనిఘ్నశబ్దములు. బల్లిదుఁడు = బలిష్ఠుఁడు, అక్కజుఁడు = అధికుఁడు, కావలుఁడు = కావరుఁడు = మదముగలవాఁడు = గర్వి, బెట్టిదుఁడు = ఉద్ధతుఁడు, మిసిమింతుఁడు = అలసినవాఁడు, మొక్కలుఁడు = శూరుఁడు, ప్రల్లదుఁడు = దుష్టుఁడు, కుచ్చితుఁడు = కుత్సితుఁడు, నెయ్యుఁడు = స్నేహితుఁడు, ఒడయుఁడు = అధికారి. ఇట్టివి మహత్తులకు విశేషణములగునపుడు పుంలింగసమములు మహత్తులు నై యుత్వడుజ్జులనందును. ఉదా:—రాముఁడు బల్లిదుఁడు - అన్న బల్లిదుఁడు. మొ.

ఇవి యమహత్తులకు విశేషణములగునపు డమహత్తులును నపుంసకలింగసమములును నగును. ఉదా:—ఈవంశము బల్లిదము. ఆవంగడము బల్లిదము. నన్నయ వికృతౌచ స్త్రీలింగా ఇత్యాదిచింతామణికారికను మహతీవాచకవిశేషణములవిషయమున నుపదేశించెను. (౧౮౬ విష.) కాన దానిచొప్పున మహతీవాచకవిశేషణము లాచ్ఛికములగునపు డాలుశబ్దముతో సమసించి రూపసిద్ధినందును. సంస్కృత విశేషణము స్త్రీలింగమే యగును. ఉదా:—ఆమె బల్లిదురాలు, ఈమె సమర్థ. మొ. తత్సమములందే యుత్వమువచ్చునని నన్నయాథర్వణులు వచింపలేదుగాన నుత్వము నిర్బాధము. (౯౩ విష.)

పయిశబ్దములలోఁ గొన్నిటికి నపుంసకలింగసమరూపము లుండనేరవని "క్వచిడ్డుజ్మాత్రకే........" అనువచనమువలన విశదమగుచున్నది. ఉదా:—మిసిమింతుఁడు - మిసిమింతురాలు - ఒడయుఁడు - ఒడయురాలు. 'మిసిమింతమైనపక్షి' అను రీతి ప్రయోగములు లేవు. అన్న బల్లిదుఁడు - ఆమె బల్లిదురాలు - అది బల్లిదము. మొ.

బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు. 3.

బాలవ్యా. మహత్త్వంబున వీని కుత్వడుజాదులు నమహత్త్వంబున
౧౯౦ I విషయము. మువర్ణకాదులు, స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ
సమాసంబునుం గలుగునని యెఱుంగునది. బల్లిదుఁడు-

కల్పతరు. ౧౫౧ విష:—ఏనికి వ్యాఖ్య చేయఁబడెను. (౧౬౨ విష.). అహో బలపతి పాక్షికన్యాగమును విధించు విశేషణానాం మహత ఇత్యాది కారికను (౧౫౦ వి.) నిత్యన్యాగమము కావలసిన యేకాదులవిషయమున నుపయోగించు టయు, నిత్యన్యాగమును విధించు సబిన్దుకస్యేత్యాది ప్రకృత కారిక నిట నుపయో గించుకొనకుండుటయు, "క్వచి ద్డుజ్మాత్రకే స్వార్థేత్యాది"డుజ్‌రూపనిత్యతగల మిసి మింతాదులవిషయమున నుపయోగింపక (౧౫౦ విష.) "ఒక్కఁడు = ఒక్కటి" అనురూపద్వయముగల యేకశబ్దమాత్రవిషయమున వాడికొనుటయు నవిమర్శన కృతములు. (అహో. ౩౦౭ పు.)

"మగఁడు - అతఁడు - ఇతఁడు - ఎవ్వఁడు - గొల్లఁడు - మనుమఁడు - తేఁడు - అబ్బఁడు - అప్పఁడు - మిండఁడు - గండఁడు - ఇత్యాదీనాం, గంగఁడు - మంగఁడు - సింగఁడు ఇత్యాది జననామ్నాంచ ఏకాదిత్వమేవ. ఉత్వనిషేధార్థం బాప - హనుమ - రాయాదిశబ్దానామప్యేకాదిత్వమ్" (అహో. ౩౦౭-౩౦౮ పు.) అని యేకాదిగణము నహోబలపతి వివరించెను. వీనిలోని 'అతఁడు - ఇతఁడు - ఎవ్వఁడు' అనువానిని "భవే త్తదాదిశబ్దేభ్యో - డుజాది స్తుభ వేన్న చోత్" అను కారికచొప్పునఁ దదాదులలోఁ జేర్చుట యుక్తము. అహోబలపతి "ఉత్వనిషేధార్థం బాప హనుమరాయాదిశబ్దానా మప్యేకాదిత్వమ్" (అహో. ౩౦౮ పు.) అని వ్రాసెను. కాని వీనినేకాక యుత్వనిషేధప్రసక్తిలేని "ఈ-కా" ప్రత్యయాంతాదిశబ్దముల నెల్ల న్యాగమనిత్యతకై యేకాదులలోఁ బఠింపకతీరదు.ఏకాదులు పుంలింగసమములు తఱుచుగా మహద్వాచకములు నగుటచే వానికి జెముఁడు - కొమరుఁడు మున్నగు వానికివలెనె యుత్వడుజ్జు లెట్లును బ్రాప్తించును. అట్లు ప్రాప్తించు నుత్వమును వారించుటయు న్యాగమనిత్యతను విధించుటయుఁ నమహత్తులకు డుజ్జును విధించు టయుఁ బ్రకృతసూత్రములకుఁ బ్రయోజనములు. స్పష్టప్రతిపత్తికయి "అమహతాంచ డావున్న" అని చెప్పఁబడెనేకాని యమహత్తుల కుత్వప్రాప్తియే లేదు. డుజ్‌పరకత్వ మున నుత్వములేని యాచ్ఛికశబ్దములకెల్ల న్యాగమము నిత్యమగుటచేతనే తే-ప్రే ప్రభృతిశబ్దములును 'ఈ - ఆ - కా' ప్రత్యయాంతాదులును నేకాదులలోఁ జేర్పఁ బడుచున్నవి.

మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్జగు;

బాలవ్యాకరణ నుత్వంబుగాదు. ౮.

వివరణము. మగఁడు - మనుమఁడు - కయిరఁడు - కత్తళఁడు.

౧౫౧ I. విషయము. మగ - మనుమ - రాయ - పాప - ప్రే - తే - ఈ - కా - ప్రత్యయాంతంబులు - ఇత్యాదులు మగా

దులు. కయిర - కత్తెర - జన్ను - నీల ఇత్యాదులు కయి
రాదులు.

సంజీవని. ౧౬౧ I విషః—అర్థః—మగఁడు = భర్త - పెనిమిటి. మను
మఁడు = పౌత్రుఁడు - దౌహిత్రుఁడు, కయిరఁడు = ఒకగుఱ్ఱమువేరు. కత్తెరఁడు =
తెల్లనిగొరిజయుఁ దోఁకయు వానివెండ్రుకలును గలగుఱ్ఱము (శ.ర.). రాయఁడు=
రాజు. (వి స్తర. I) పాపఁడు = బాలుఁడు. ప్రేఁడు = గొల్లవాఁడు. ఱేఁడు = రాజు.
విలుకాఁడు కాప్రత్యయాంతము, కొండీఁడు ఈప్రత్యయాంతము. ఇత్యాదులను చే
మగాదికమాకృతిగణమని గ్రహింపవలయు. అదిశబ్దముచే వగలాఁడు 'ఆ' ప్రత్య
యాంతము. బా. తద్ధి. ౧౧ వెు. ౧౬ సూ.) జన్నుఁడు = ఒకగుఱ్ఱమువేరు.
నీలఁడు = ఒకనీలాశ్వము. ఇత్యాదులు కయిరాదు లనుటచే కయిరాదికము నాకృతి
గణమె యనవలయు. ఆదిశబ్దముచే "పులియఁడు - సురియఁడు - మొరియఁడు" మొద
లగువాని నెన్నవలె.

---

విస్తర. I. ౧౬౧ I విషః—"ఒకానొకఁడు........రాయన్ అని ప్రయో
గించె. అయ్యది ప్రామాదికంబు. ఈశబ్దంబునకు రామశబ్దంబునకుంబోలె సంబుద్ధి
యందు డుగ్వర్ణకలోపముమాత్రము మహాకవిప్రయోగంబులఁ గానంబడియెడి...
(బా. గు. ప్ర. ఆచ్చి. ౭ సూ. వ్యా.). ఈవ్రాఁత సరికాదు. 'రాయన్' అనునది
ప్రామాదికమైనం గావచ్చునుగాని సంబుద్ధియందు వ్యస్తతలో "రాయ" అనురీతిని
డుజ్వర్ణకలోపము సమ్మతముకాదు. అట్టి కవిప్రయోగమును లేదు. సీ. తోలు
నొల్ల.........గి.........ఫేలమగ్ర ప్రతాపాగ్నికృష్ణరాయ. (ఆము. పీఠిక.
౧ ఆ. ౩౬) సీ. సనకాది........."గీ.........కృతన భవవసి ననిఁ దెగి కృష్ణ
రాయ" (ఆముక్త. పీఠి. ౧ ఆ ౪౧ ప.) అని యిట్లు సమాసమునందట్టి ప్రయోగము
కన్పట్టుచున్నది. బా. తత్స. ౫౪ సూత్రముచొప్పున 'రాయఁడు' అనుదాని డుజ్
వర్ణకము సంబుద్ధిలో లోపింపనేరదు. కృతోత్కృసంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకే
లోపము సమ్మతమయియున్నది. పైయాముక్తమాల్యద ప్రయోగమున 'రాయ'
శబ్దము సంస్కృతముగ ననుకరింపఁబడి సిద్ధసమాసగతమయ్యెననియు నక్కారణమున
నచట 'కృష్ణరాయఁడు' అనుకృతోత్కృసంస్కృతనామమె కవిచే వివక్షితమయ్యె
ననియు నట్లగుటంజేసి 'కృష్ణరాయ' అనుసంబోధనము సాధువయ్యెననియు గ్రహింప
వలయును. అంతమాత్రమున "రాయా" అనువ్యస్తసంబోధనరూపము సాధువని
భ్రమింపరాదు. (అహో. ౪౧౨ పు.) ప్రౌఢవ్యాకర్త యిట్లు వ్రాయక "కర్మధా
రయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్లయగు" (ప్రౌఢ. సమా. ౬ సూ.) అని

చింతామణిలోని యేకాదులె బాలవ్యాకరణములోని మగాదులని యెఱుంగునది. మగాదులు మహత్తులును బా. ఆచ్ఛి. ౨ సూత్రముచొప్పునఁ బుంలింగసమములును నగుటచే వాని కుత్వడుజ్ఞులు యథాయోగముగా సంభవించుచుండ నుత్వమును వారించుట మగాదిగణప్రసంగమునకు ఫలము (విస్తర.) II గోపత్వ - నాయ

---

కీర్తసమాసవద్భావము నంగీకరించి సాధించికొనెను. ఆముక్తమాల్యదలో నిట్లు 'కృష్ణరాయఁడు' అని ప్రయోగింపఁబడినను గవిపితామహాదులు "కృష్ణరాయఁడు" అనురూపమునె ప్రయోగించియున్నారు. మ.........శ్రీకృష్ణరా । యల బాహా మృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్ (మనుచ. ౧ ఆ. (పీఠిక.) ౩౫ ప.) మ... కృష్ణరా । యనికిన్ వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై (పారి. ౧ ఆ. ౩ ప.) గీ.........అచ్యు । తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. (మను. చ. ౧ ఆ. ౩౧ ప.). గీ. అతఁడు దీవించి తగను రాయలకు నిమ్ము హొత్తురాలిని (కృష్ణ. ౪ ఆ.) అని యిట్లు వ్యస్తతలో "రాయఁడు" అనురూపమె వెలయుచున్నది. "ఒడయఁడు.........ఇట్లె రాయఁడు - నాయఁడు" (ఆం. భా. అ. శబ్ద. ౫సూ.) అని యుదాహరించుట కవిప్రయోగసమ్మతముగఁ గన్పట్టదు. ఒడయశబ్దము వ్యస్తతయందును "ఒడయఁడు - ఒడయుఁడు" అనురూపద్వయముతోఁ బ్రయోగదృష్టమగుచున్నది. కాన నుత్వఘటితరూపము బల్లిదాదులలోఁ జేర్చియు నుత్వములేని రూపము మగాదులలోఁ జేర్చియు సాధించికొనవలయును. ఉ. అత్తటి జోగివేల్పుటొడయండెద నాతని మెచ్చి (అచ్చ. రా. బాల. ౧౨౬ సూ. రా. ని.) గీ. యువతిమండలముల కొడయుఁడవుగమ్ము (జై. భా. ౫ ఆ. ౧౦౭) (శ. ర).

విస్తర. II ౧౯౧ I విమ:—"మగాదిగణమున డుజ్విధానమె చేయవలసివచ్చెను.........౨ సూత్రము.........ఆచ్ఛికశబ్దసామాన్యస్వరూపప్రకాశనపరమేకాని శబ్దసాధనవిషయప్రధానముగామిని యా (?) చ్ఛికశబ్దసాధనమునకయి యిట్టి విశేషశాస్త్రము లీపరిచ్ఛేదమునఁ బ్రసక్తములయ్యె" (బా. సా. వే. ఆచ్ఛి. ౪ సూ. వ్యా.) అనుపేటికావ్యాఖ్య సరికాదు. బా. ఆచ్ఛి. ౨ సూత్రమున వివరింపఁబడిన స్త్రీపున్నపుంసకసమత్వాతిదేశము శబ్దసాధనప్రక్రియాపరము కానపుడు బల్లిదాదిసూత్రమునకును మగాదిసూత్రమునకును విషయములు కాని అయ్య - అన్న - గోడ - మేడ - చందురుఁడు - కొమరుఁడు మున్నగు ననంతాచ్ఛికశబ్దసాధనమునకు గతియేమో తెలియకున్నది. స్త్రీసమత్వాతిదేశము లేనపుడు అయ్య - అన్న - గోడ - మున్నగువానికి స్త్రీలింగప్రథమైకవచనలోప మెట్లు? పుంలింగసమత్వాతిదేశము లేనపుడు కొమరుఁడు మున్నగువాని కుత్వడుజ్ఞు లెట్లు గల్గును?

ఏలు ప్రత్యయశబ్దముల, లో: = తుది ఉవర్ణమునకును, నిత్యంస్యాత్ = నిత్యముగా నాదేశమగును. నిత్యమ్మనుటచేత నలలో రిత్యాదిసూత్రములోని వాశబ్ద మాకృష్టము కాదయ్యెను. తత్ర = ఆస్థలమునందలి, లులయోః = బహువచన లులలకు, దరౌచ స్తః = వరుసగా దరలును నిత్యముగా నాదేశమగును. ఉదా:—అలు+లు= అ+ండు+లు = అండు+రు = అందురు. నలలోరిత్యాదిసూత్రములోని ‘ఉల్లుగపి’ అనునదియు నాకృష్టమై యట్టియుల్లోపమున్నైతము సూత్రములోని నిత్యశబ్దముచే నిత్యమగుచు “అంద్రు” అనురూపముమాత్రమె సిద్ధించు ననుభీతిచే నథర్వణుడు ‘ఉతోలోపశ్చ’అని సూత్రించి యుల్లోపపాక్షికతను వచించుచున్నాఁడు. ఉతః=అట్టి బిందుపూర్వక దువర్ణముయొక్క, ‘ఉకారమునకు’ లోపశ్చ= లోపమునయితము సంభవించును. అనఁగా ‘చ’ కారముచే లోపముపాక్షికముగ నగునని తాత్పర్యము. ఉదా:—అందురు = అంద్రు. అహోబలపండితుఁడు పైయథర్వసూత్రమును బయిరీతిని సమన్వయించికొనక ప్రకృతసూత్రములోని నిత్యశబ్దముచే నుల్లోపమునయితము నిత్యమె యని వ్యాఖ్యచేసి “అందురు” అనురూపమును సాధించికొనలేదు. “డాగాదేశ్చ నిత్యం బిన్దుయుతోదు, దుల్లోపశ్చ నిత్యం స్యాత్ లులయోః పరతః. తత్ర దారాదౌ స్థితయోః లులయోః క్రమాత్ దరౌ ఇత్యేతావాదేశౌచ నిత్యం స్తః. అల్వాదయో దారాదిగణః. అంద్రు - జవరాంద్రు - చెల్లెంద్రు - కోడంద్రు - ఇత్యాది” (అహో. 3౨౫ పు.) ఇది సరికాదు. ఈ సందర్భమున నడుచుచున్న “ఉతోలోపశ్చ” అనుసూత్రము నిచట బైరీతిని సుసంగతముగా నడికికొనక యుపేక్షించునపుడు “ఉతోలోశ్చ లులయో। స్తథా పుంసి దరౌస్మృతౌ” అనుదానివలన లభించు పగలాదుల రత్వవిధానము సిద్ధింపకపోవలసి వచ్చును. (అహోబలపతి యీకారికకు వివరణమునే చేయలేదు. 3౨౬ పు.)అందురు మున్నగు కవిప్రయోగములును సంగ్రహింపఁబడకపోవలసివచ్చును. (సూరివలె బిందుపూర్వకవ్యంజనడకార విధానమును జేయక బిందుపూర్వక దువర్ణాగమము చేసి యుల్లోపవిధానముచేసిన ప్రక్రియాగౌరవమే ‘అందురు’ మున్నగుచోట్టులందలి యథర్వణుని యుల్లోపపాక్షికతాభిప్రాయమును వక్కాణించుచున్నది.) నలలోరిత్యాదిసూత్రము మొదలుగ “ఔపవిభక్తికలీనామ్మ”ను సూత్రము వఱకుఁ జింతామణి తలంచిన యుల్లోపపాక్షికతాప్రక్రమము భగ్నముకావలసి వచ్చును. చింతామణిలో నీసందర్భమందంతటను నుల్లోపపాక్షికతయే వచింపఁబడినది. ఈసందర్భమున నటకిన యథర్వణకారికలందును నుల్లోపపాక్షికతయే యంగీకరింపఁబడెను. కేషాంచిద్ద్వ్యస్తశబ్దానామిత్యాదిసూత్రమున “తథా దుజ్” అనుచింతా

మాదేశిషష్ఠులబహువచనమునందలి 'ర' వర్ణముమీఁద నున్నట్టియు, ('రేమాత్రే' అనుపాఠము ప్రామాదికము.) ఉదతోః = ఉకారమునకును 'అ' కారమునకును (క్రమాన్వయము) ప్రాయశః = తఱుచుగా, ఇత్ హ్రస్వేకార మాదేశమగును. అనఁగా నేకవచనమున 'కూఁతురు' శబ్దము తుదినున్న 'ఉ'కారమునకును 'ఆలు' ప్రభృతుల తుదినున్న 'ఉకార' మునకును బ్రాయికముగా 'ఇ' కార మాదేశమగు ననియు, ద్వితీయాదుల బహువచనమునందలి లవర్ణమున కాదేశముగావచ్చు (లుల యోస్తథా పుంసిరశౌస్మృతౌ' అను (౧౯౨ విష.) చెప్పనవచ్చు) రవర్ణముమీఁది 'అ'వర్ణమునకును (తదాదులందని గ్రహింపవలెను. వారిన్. మొ.) ఇవర్ణ మాదేశమగు ననియుఁ దాత్పర్యము. సంస్కృతమున వాక్యసంధి వైకల్పికముగాన "అత్ర+ఇత్" అనుచో గుణసంధి లేదయ్యెను. ఉదా:—కూఁతురిన్ - కూఁతురిచేన్, ఆలిన్; ఆలిచేన్ - చెల్లెలిన్ - చెల్లెలిచేన్, వారిన్ - వారిచేన్ - ఇట్లు వీరిన్ - వేరికిన్ - ఏవారికిన్. మొ. వారుశబ్దపరిణామమె యనఁదగు గారుశబ్దమునందును నీవిధి వర్తిల్లును. ఉ. అత్తగారికిన్ - మామగారిచేతన్. మొ. ప్రాయోగ్రహణమున ఇరువురన్ - మూవురన్ - పలువురన్ - మున్నగుచోటులందు వారు శబ్దము వురురూపమునందు నవు డిత్వము లేదని వ్యాఖ్య చేయనగును. 'రేమాత్రే' అనుటచేత శకటాదేశస్థలములలో నిత్వమువచ్చుట నన్నయాథర్వణసమ్మతము కాదని యెన్ననగును. ఉదా:— అందఱన్ - ఇందఱన్ - ఎందఱన్ - కొందఱన్ - ఇద్దఱన్.

బాలవ్యా. పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు. ౫.

౧౯౨ I విష. పగతురు - అల్లురు - నెయ్యురు - మార్తురు.

సంజీవని. ౧౯౨ I విష:—అర్థములు:—పగతురు = శత్రువులు, అల్లురు = జామాతలు, నెయ్యురు = మిత్త్రులు, బలియురు = బలశాలులు - మార్తురు = శత్రువులు (మాఱుతుఁడు = మార్తుఁడు). పగతాదిశబ్దములు మహత్తులు పుంలింగసమములునుగాన వాని కుత్వదుజ్లులువచ్చును. పగతులు మున్నగు ననిష్టరూపములు సిద్ధింపకుండఁ బ్రకృతసూత్రమున నిత్యరత్వము విధింపఁబడెను. పగతుఁడు - పగతురు, పగతునిన్ - పగతున్, పగతురన్. మొ. 'నెయ్యుఁడు - నెయ్యురాలు - నెయ్యము' అను త్రివిధరూపములు నుండుటచేత నెయ్యశబ్దము బల్లిదాదులలోని దనఁదగును. గుప్తార్థప్రకాశికాకర్త 'మల్లురు - మల్లులు' అనురూపద్వయముగలదని వ్రాసెను. మల్లశబ్దము తత్సమమగుటంజేసి యది పగతాదులలోని దనుట సరికాదు. అద్దాని విమర్శము బా. తత్స. ౩౮ సూత్రమునొద్ద (౧౮౮ విష.) వ్రాయఁబడెను. ఇందు రేఫాదేశము నిత్యముగా విధింపఁబడుటచే 'అల్లుండ్రు' మున్నగునవి సూరి

కిని సమ్మతములు కావనందగును. అనుశాసనమున నీక్రింది ప్రయోగములు చూపఁబడినవి. గీ. దశు నల్లుండ్ర మెడ సూత్రములు కట్టి (కాశీ.) నడయాప జోకొట్టి నసకంపు టల్లుండ్ర (కవిక) కవలి రత్యుత్కంఠ నల్లుండ్రు పోదపల్. (చంద్రభా.) (ఆం. భా. ఆ. శబ్ద. ౭౮ సూ.) ఈమూఁడు ప్రయోగములందును "అల్లుండ్రు" అనుచోట "అల్లురు" అని నిల్పినను క్షతిలేమింజేసి యివి సందేహాస్పదాయక ప్రయోగములు కాఁజాలవు. పగతాదుల రత్వమునకుఁ బ్రయోగములు:—గీ. ఒహూహిఫంబులఁ బగతుర బరవసమున (విరా. ౪ ఆ. ౬౨). క. కాల్బురు ప్రస్తుఁ జేయుచును ప్రస్గిరి (ద్రోణ. ౧ ఆ. ౭౭౨ ప.) (కాల్బురు నిత్యబహువచనాంతము. పదాతిసైన్యము). క. నరుఁ డనుఁగుబంటు........సూతపుత్త్రుఁ డోకఁడు మాఱ్ఱుత మార్కొని యెదు...(ద్రోణ. ౫ ఆ. ౨౬ ప.) క.........నెయ్యురు దాను నగ్నియుచ్చి య సురపతి.....(శాంతి. 3 ఆ. ౫౧౨) క. బలియురఁ గృతవస్త్రాదుల నిలిపి (ద్రోణ. ౪ ఆ. 3౯) ద్విపద. పగతుల నసిలోన భంజించువాఁడు. (రంగ. రా. బా. 3 పు. ఆం. విశ్వ. ముద్ర.) ఇందలి శకటము ముద్రణసంస్కర్తృ ప్రమాదపతితమనఁదగును.

నన్నయా ౧౯౩ విషయము.

కాఁడు గ్గాఁడు ర్భవే దీఁడు । రస్త్రిత్వాద్యర్థబోధకాః
ఏకత్వ వాచకాత్పుంసి స్యా దాఁడు స్త్వన్యథా
మతః । స్త్రియా మాఁడి ర్బహుత్వే స్యా । త్పుంసి దీర్ఘా
న్నిరుచ్యతే. (వికృ. అజం. ౫౦-౫౧ కారి. అహో.
౬౨౯ పు.)

కల్పతరు:—౧౯౩ విష:—అస్త్రిత్వాద్యర్థబోధకాః = కలుగుట మున్నగు నర్థములను బోధించు (ఆనిశబ్దముచే స్వార్థమును సంగ్రహించునది). కాఁడుః= 'కాఁడు' అనెడిది, పుంసి = మహత్త్వము వాచ్యమగుచుండఁగా, ఏకత్వవాచకాత్ = ఏకవచనాంతమునకుఁ బరముగా, భవేత్ = అగును. ఇట్లె 'గాఁడుః-ఈఁడుః' అనునవియు నగునని వేర్వేఱ నన్వయించుకొనునది. తద్ధితవృత్తియందుఁ బ్రథమైకవచనము లోపించును. ఉదా:—నేస్తముకలవాఁడు = నేస్తము+కాఁడు = నేస్తకాఁడు, అందముకలవాఁడు = అందము+గాఁడు = అందగాఁడు, కొండెముకలవాఁడు = కొండెము+ఈఁడు = కొండీఁడు. (అపదాదిస్వరసంధి నిత్యము. ౭౫ I విష.) ఆఁడుస్తు = 'ఆ' (ఁడు) ప్రత్యయమన్ననో, అన్యథామతః = వేఱువిధముగా సమ్మతమైనది. అనఁగా నిది యేకవచనభిన్న బహువచనాంతముపై నిల్చుననియు, నట్టిబహువచన ప్రత్యయము తద్ధితవృత్తియందును లోపింపదనియు దీనియన్యథాత్వమునకు వ్యాఖ్యచేయునది. స్త్రియామ్ = మహతీత్వము వాచ్యమగుచుండఁగా, బహుత్వే=

బహువచనాంతమువీఁద, ఆఁడిః = 'ఆఁడి' అనునది, స్యాత్ = అగును. ఉదా:— 'ఆఁడు' అనువానికి; వగలుగలవాఁడు = వగలు+ఆఁడు = వగలాఁడు. 'ఆఁడి' అను దానికి:—వగలుగలయామె = వగలు+ఆఁడి = వగలాఁడి. మొ. పైప్రత్యయ ములలో, పుంసి = మహద్వాచకములయందలి, దీర్ఘాత్ = "కా-ఈ-ఆ" అనుదీర్ఘ ములకుఁ బరముగా, నిః = న్యాగమము, ద్వితీయాదివిభక్తి పరకత్వమున, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది. ఉదా:—నేస్తకానిన్, అందగానిన్, కొండీనిన్, వగలానిన్. మొ. ఈన్యాగమము నిత్యమెయని యెఱుంగునది. (బా. తద్ధిత. ౧౧ మొ. ౧౩ వ. ౧౫-౧౬-౨౨-౨౩ సూ.)

"కా-ఈ-ఆ" అనియే తద్ధితప్రత్యయములను జెప్పికొనుట యుక్తమైనను 'ఆ' ప్రత్యయకథనముచే ఆఁడ్యంతములగు 'వగలాఁడి' మున్నగునవి సంగ్రహింపఁబడ నేరమింజేసి "కాఁడు-ఈఁడు" మున్నగురీతిని వాని ప్రథమైకవచనాంతరూపములు జెప్పికొనఁబడెను. 'స్యాదాఁడుస్త్వన్యథామతః' అనుచోటి యన్యథాత్వమునకు మఱొకవిధముగను వ్యాఖ్య చేయనగును. "ఆఁడుస్తు = 'వగలాఁడు' మున్నగు స్థలములందలి 'ఆఁడు' అనురూపమన్ననో, అన్యథామతః= వేఱువిధముగా సాధించు కొనఁబడుట సమ్మతము - అనఁగా "వగలయొక్క+వాఁడు" మున్నగురీతి విగ్రహము గల 'వగలవాఁడు' మున్నగు నాభాసబహువ్రీహిరూపషష్ఠీసమాసములందలి తచ్ఛబ్ద వకారమునకు ౨౧౦ VIII విషయముచొప్పున లోపమునుజేసి 'అదాతోః క్వచిదేకతా' అనుచొప్పున నిత్యసంధిచేయఁగా 'వగలాఁడు' మున్నగురూపములు సిద్ధించు నని తాత్పర్యము. ఈరీతిని వ్యాఖ్యచేసినపుడు పూర్వపువ్యాఖ్యచే సాధ్యము గాని మాయలయొక్క+వాఁడు = మాయలాఁడు మున్నగురూపములును సుసాధ ములు కాఁగలవు. 'ఆ' ప్రత్యయమన్ననో 'మాయలు' మున్నగుసంస్కృతసమబహు వచనాంతములకుఁ బరముగా నిలుచుట సంభవింపనేరదు. శబ్దరత్నాకరమున 'మాయ లాఁడి' అనిచూపుట పొరపాటు. (చూ. విస్తర. ౨౫౧ VII వి.) మాయలాఁ డిట్లనియెన్ (పాండు. ౫ ఆ. ౪౨.) మ. ఇవియెల్లంగల మాయలాఁడు (హరి. పూ. ౮ ఆ. ౬౩) ఆఁడిప్రత్యయము పూర్వవ్యాఖ్యచొప్పుననె వర్తిల్లును. "కా-ఈ-ఆ" ప్రత్యయాంతము లేకాదిగణములోనివని యీవలికె నిరూపింపఁబడెను.(౧౩౨విష). కాఁడు మున్నగునవి స్త్రీసమములేవో యనెడిభ్రాంతి వారించుటకు న్యాగమవిధి యనువదింపఁబడెనని యెన్నునది. కాఁడు మున్నగురీతిని ప్రథమాంతములు వచింపఁ బడుటచే 'న చ దేశ్యపదే' అనుచొప్పున హ్రస్వాభావము స్పష్టపఱుపఁబడినది. కాప్రత్యయము తత్సమపదములమీఁదను గన్పట్టుచున్నదని కొందఱయాశయము.

"కోపగాఁడు. వి. విశే. (కోపము+కాఁడు) కోపముగలవాఁడు. గీ. నినుఁగల యుభ_క్త కోపగాఁ డనఁగనేల (పారం. ౧ ఆ.౧౧౫)క. ద్వైపాయనముని వెడలం|ద్రోపించిన కోపకాఁడు ధూర్జటి........(భీమ. ౮ ఆ. ౧౩) గీ. అన్న మీతండ్రి కోపగాఁ డగుచొ కాఁడొ (కాశీ. ౭ ఆ.౯౦)"(సూ. రా. ని.) ఈవిషయము, ముందు విమర్శితమగును. (౨౯౧ I విష.)

కేషాంచిద్ర్వ_న్తశబ్దానాం|తథా డుక్; వారు రౌస్మృ
తౌ:నిత్యం లుళొరరౌస్యాతాం | ముల్లోపో బహుళం

౧౯౩ I విషయము. డుజః. (విక్ర. అజం. ౫౩-౫౦ కారి. అహో. ౩౩౫-౩౭౯ పు.)

కల్పతరు. ౧౯౩ I విష:—కేషాంచిత్ = కొన్ని, ర్వ_న్తశబ్దానామ్ = బహువచనలకారస్థానికరేఫాదేశముగల శబ్దములకు (లులయో| స్తథాపుంసిరరౌస్మృతౌ. ౧౯౨ విష.) తథాడుక్ = ఆప్రకారముగానే 'డుక్' అనఁగా బిందుపూర్వక డువర్ణాగమమగును. "సలలో ర్బిన్దుయుతో డు ర్వా........నిత్యం డారాదేశ్చ స్యాత్........" అనుస్థలములందువలెనె బిందుపూర్వక డువర్ణాగమమును దానియుల్లోపమును లుళస్థానిక రుర పరకత్వమున వికల్పముగా నగును. కేషాంచిత్ = కొన్నియాచ్ఛికశబ్దములకు, వా = వికల్పముగా, రురౌ స్మృతౌ = బహువచన 'లుల'లచోట 'రుర'ల యాదేశమును గొన్నిటఁ బాక్షికముగ నగును. కొన్నిట రురాదేశమె పాక్షికమగునని యర్థము. లులయో_స్తథాపుంసీత్యాదిచే (౧౯౨ విష.) నిత్యముగా వచ్చునుగాన గొన్నిటఁ బాక్షికతయుఁ గలదని చెప్పవలసెనని తాత్పర్యము. కేషాంచిత్ = కొన్నిటికి, లుళౌ = బహువచనలులలు, నిత్యమ్ = నిత్యముగా, రురౌస్యాతామ్ = రురలగుచున్నవి. డుజః = బహుత్వమందుఁ బయిరీతిని లులస్థానిక రుర పరకత్వమున నాగమముగావచ్చిన బిందుపూర్వకడువర్ణమునకు, ఉల్లోపః=ఉవర్ణలోపము, బహుళమ్=బహుళముగానగును. ఇట్లీకారికలు మూఁడు సూత్రము లగుచున్నవి. (౧) ర్వాంతశబ్దములకుఁ బూర్ణబిందుపూర్వక డువర్ణాగమ తదుల్లోపములు పాక్షికముగా గల్గుట. వారు-వాండురు-వాండ్రు, వీరు-వీండురు-వీండ్రు, (౨౨౮ విష.) (౨) రురాదేశపాక్షికత:—"మిండలయ్యెడఁ (కవిక) సీ. నలకూబరాదులు ననుపుమిండలు (కాశీఖండము)" (గాణ. ఆచ్ఛి. ౬ ప. ౨౩౯ కారి.) మావటీలు - మావటీండ్రనియుఁ బ్రయోగించిరి. "తరలునని మావటీండ్రు కొందలపడంగ (కువలయాశ్వ)" (ఇట 'మావటీలు' అని నిల్పినను క్షతి లేదు) (గాణ. ఆచ్ఛి. ౮ ప. ౨౮౧ కారి.) ఉ.........డుక్కి—

బయి......(నిర్వ. ౩ ఆ. ౧౧ ప. ప్రాసస్థానగతము) ఇట్టి ప్రామాణిక ప్రయోగములు మావటీండ్రు, గండండ్రు-మిండండ్రు మున్నగువానికి లభింపలేదు. "గండండ్రు-అల్లుండ్రు." (అహో. ౩౨౫ పు.) "ఎల్లండ్రు" (అహో. ౩౩౬ పు.) వీనిని బట్టియె కావలయుఁ బ్రయోగము చూపకున్నను-సూ. రా. నిఘంటువున 'అల్లుండ్రు' అనురూప మంగీకరింపఁబడెను. 'పగతుండ్రు' మున్నగురూపములు లేమింజేసి పగతాదులలో నంగీకరింపఁబడిన "అల్లురు-ఎల్లరు" అనువానికి "అల్లుండ్రు-ఎల్లండ్రు" అను రూపాంతరము లున్నవనుట సరికాదని తోఁచుచున్నది. "అల్లుండ్రు" (శుక. ౩ ఆ. ౧౧౪ పారట. గాణ. ఆచ్చి. ౬ ప. ౨౩౫ కా.) అను నాధునిక సాధారణకవి పద్యఖండము చూపఁబడెను. (౩) నిత్యరురాదేశనిత్యడుజాగమములు. విలుకాండురు - విలుకాండ్రు - పగలాండురు - పగలాండ్రు - ఎనముండురు - ఎనమండ్రు - తొమ్మండురు - తొమ్మండ్రు - ఇరువండురు - ఇరువండ్రు - ముప్పండురు - ముప్పండ్రు. మొ. (౨౦౪ విష.)

ఈసూత్రములలోని బహుళశబ్దముచే "తేఁడులు - తేండ్లు" అనుచో రత్వము లేనిదే డుజాగమ తదుల్లోపములను నట్లె "విలుకాలు-చెయివులు" మున్నగు చోటులందు బహువచనలకారమునకు శకటాదేశమును సంగ్రహింపనగునని వ్యాఖ్యానముచేసికొనవలయును. గీ. కాఁడునకుఁ గాలుకాండురుగలుగునండ్రు. (కావ్యాలం. ౫ ఉల్లా. ౭౬ ప.)

బాలవ్యా. ౧౫౩ II విషయము. నగు. ౬.

కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు.

సంజీవని. ౧౫౩ I విష:—అర్థ. గండఁడు = శూరుఁడు, మిండఁడు = విటుఁడు. గండఁడు ప్రభృతులు మగాదులలోనివిగాన వీని కుత్వము రాలేదు. ద్వితీయాదులలో గండనిన్ - గండనిచేతన్ మున్నగురీతిని నిత్యనిగాగమము వచ్చును. "గండలు" అనియుండఁగా దీనిబహువచన 'లు' ప్రత్యయముచోట 'రు' అనునాదేశము వచ్చినపిదప దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారము (ండ్) నిల్వఁగా "గండ+ండ్+రు=గండండ్రు" అనురూప మేర్పడును. బిందుపూర్వక డువర్ణాగమముచేసి యుల్లోపము చేయనేల యని సూరి బిందుపూర్వకడకారమునె విధించెను. సూరిగారికి 'గండండురు' అనురీతి నుల్లోపము లేనిరూపములు సమ్మతములుకామింజేసి యిట్టిరచనబాధకము కాదయ్యె (విస్తర. III ౨౦౪-విష.).

ఈసూత్రమును సూరి నిత్యవిధిగా సూత్రించుటంజేసి "గండలు - మిండలు" మున్నగురూపములు సంగ్రహింపఁబడవయ్యెను. "మిండలయ్యెదరా (కవికర్ణ.) నల కూబరాదులు వనుపుమిండలు" (కాశీ. ౫౦) (గాణ. అచ్చి. ౬ సు. ౨౩౯ కా. వివృతి.)

బాలవ్యాకరణ వివరణము. ౧౫౪ విషయము.

కా ప్రత్యయాంతంబులమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులు లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబు నగు. 2.

విలుకాండ్రు - విలుకాఱు; వేఁటకాండ్రు - వేఁటకాఱు; వేడుకకాండ్రు - వేడుకకాఱు.

సంజీవని. ౧౫౪ విష:—అర్థ. విలుకాఁడు = ధనుర్ధరుఁడు, వేఁటకాఁడు = మృగయుఁడు, వేడుకకాఁడు=క్రీడాసక్తుఁడు = విటుఁడు.

"కా-ఈ-ఆ" అను ప్రత్యయములు సూరిచే మగాదిగణమునఁ బఠింపఁబడినవి గాన (బా. అచ్చి. ౪ సూ.) వీనికి నిగాగమము నిత్యము. ఉదా:—విలుకానికా - వేఁటకానికా. మొ. దీర్ఘముమీఁది దగుటంజేసి సూత్రములోని 'బిందుపూర్వక' అనుదానికి 'పూర్ణబిందుపూర్వక' అనియే యర్థ మేర్పడును. ఉదా:—విలుకా+లు= విలుకా+ండ్+రు = విలుకాండ్రు, 'విలుకా+లు' అనుచో లకారమున కలఘురేఫాదేశముగాఁగా "విలుకాఱు" అనురూప మేర్పడును. బిందుపూర్వకవ్యంజన డకారాగమవిధానముచే నధర్వణసమ్మతమగు "విలుకాండురు" అనురూపము సూరిపక్షమున సంగ్రహింపఁబడదయ్యె. (విస్తర. III ౨౦౪ విష.). వేడుకకాండురకు నిచ్చు వివిధార్థంబుల్ (విక్ర. ౨ ఆ.) ప్రయోగములు. ఉ:—వేడుకకాండ్రకై తిరుగు వేశ్యల (ఉ. రా. ౪ ఆ.) (శ-ర.) క. పాఱెడు నీరెడ త్రెవ్వఁగఁ। దాఱి బెడిదమైన యొండ దనుకఁగ నివ్వరం।బాఱె మడు వంత వేడుక।కాఱును జాలరులు చూచి క్రందుకొనంగన్ (శాంతి. 3 ఆ. ౧౫౨ ప.) తరువోజ. తెక్కలికాఱుదోఁతెంచి రాతనికి (స్త్రీ. ౧ ఆ. ౪3) ఉ. కన్నది లేదు మెల్ల మురికాఱు దిగీశులు (నిర్వ. ౬ ఆ. ౧౨౭) (మురికాఱు = గర్విష్ఠులు) గీ. కాఁడునకుఁ గాఱుకాండురు గలుగు నండ్రు (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౫౬ ప.) సూరి 'ఆ' ప్రత్యయాంతములవిషయము నీసందర్భమున స్మరింపలేదు. 'పగలాఁడు' మున్నగునవి 'పగల+వాఁడు' అనురీతినే యేర్పడియుండవచ్చును. కాఁగా 'వాండ్రు' అనుదానిరూపముతో "పగలాండ్రు" మున్నగురూపము లంగీకరింపఁదగినవే యనఁదగును. కాని యట్టిప్రయోగములు లభింపలేదు. 'ఈ' ప్రత్యయాంతముల బహువచనముల కిట్టిరూపము కన్పట్టలేదు. ఉ. కూలినవారిఁ జూచి.........ఉ।క్కీలయి నేర్పులేక తమకించి...(నిర్వ. 3 ఆ.

౧౧) ఉ. బాలుడు........ఉక్కళ్లయి యుట్టి (హరి. పూ. భా. ౧ ఆ. ౭౨ ప.)
గీ. వోకలు ప్రెగడలు మన్నీలు బిరుదు లొజ్జలూడిగీలు. (అచ్చ రా. అయో. ౫ ప.)
గాణపత్యవివరణకర్త యీక్రింది ప్రయోగమును జూపెనుగాని యది ప్రామాణికము
కాదు. ఆకవియైనఁ బ్రయోగించెనని విశ్వసింపఁదగియు నుండలేదు. గీ. తరలునని
మావటీంద్రు కొండలపడంగ (కువలయా. గాణ. ఆచ్ఛి. ౮ ప. ౨౮౧ కారి. వ్యా.)

బాలకవి శరణ్యమున "దండి తెక్కలికాండ్లకు మిండగీండ్లకు...(అచ్చ. తె. భా. పు. ౫౮౩) ముత్తుగాండ్లు (బసవ.III-ఆ.పు-౭౯.) సంగడికాండ్లు(రాధా. ౧ఆ. ౮) జూదరికాండ్లు (సానం II ఆ. ౨౯)" (బాలక. ౧౬౨ పు.) మున్నగు ప్రయోగములు చూపఁబడెను. పైయన్నిటను 'మిండగీండ్రు' మిండగీలు' మున్నగురీతిని వానివాని చోట్లఁ గవులు ప్రయోగించిరేమో యనుటలో క్షతియేమియు లేదు. ప్రాచీన వైయాకరణులు చెప్పినవ్యాకరణవిషయములను మీఱుటకుఁ బ్రాచీనాధునాతన మహాకవులు ప్రయోగించిరని విశ్వసింపఁదగిన ప్రయోగములను జూపుట యత్యావశ్యకము. తప్పులతిప్పలగు తాటియాకులపుస్తకమునుండియుఁ దన్మూలకములగు తప్పులముద్రణములనుండియు దొరకిన యెల్లకవుల ప్రయోగములను జూపుచు కేవల వ్యావహారికశబ్దములకుఁ బ్రామాణ్యమును గల్పించుట సరికాదు.

బాలవ్యాక తేప్రభృతులబహువచనమునకు ముందు డుఁజ్జగు. ౮.
౧౯౫. విషయము. తేఁడులు - తేండ్లు.

సంజీవని. ౧౯౫ విష:—దీనికి నన్నయాథర్వణులమూలము కానరాదు "జహ్యా స్తర్గతశబ్దానాం।భూయసీ స్యా ద్విచిత్రతా. (౧౮౮ విష.) భూయసీ దేశ్య శబ్దేషు।లోపవర్ణాగమశ్రుతిః (౮౮ I విష.)" ఇత్యాదివచనములె దీనికి గతియని తోఁచుచున్నది.

డుఁజ్జగుననఁగా బిందుపూర్వకడువర్ణకమగునని యర్థము. అయ్యది దీర్ఘపూర్వ స్థలములోనిదిగాన ఖండబిందుపూర్వకడువర్ణమె యాగమమగునని తాత్పర్యము. ఉదా:—తే+ఁడు+లు = తేఁడులు. దీనిలోని 'డు' వర్ణముమీఁది "ఉ" కారమునకు, బా. ఆచ్ఛి. ౧౨ సూత్రముచొప్పున వైకల్పికముగా లోపమురాఁగా "తేఁడ్లు" అగును. బా. ఆచ్ఛి. ౧౫ సూత్రముచొప్పున నిందలిసంయోగపరక ఖండము నిత్యముగాఁ బూర్ణముకాఁగా "తేండ్లు" అనుసాధురూప మేర్పడును. 'తేఁడ్లు' అనునది ప్రక్రియామధ్యావస్థలోనిదిగానఁ బ్రయోగార్హముకాదు. గీ. పుడమిలోనఁగల్గు పుడమితేఁడులకెల్ల (అచ్చ. రా. బాల. ౧౨౯) గీ. తపసి తేండ్లకు నెఱిఁగింపఁ దనివి సనక (నీలా. ౧ ఆ. ౧౧ ప.). తేశబ్దమునకుఁ ద్వితీయా

దేకవచనపరకత్వమున నాగమము కవిత్రయము పెట్టుటంజేసి యిది త్రికము వచన రాదు. క. జేసి యమునదరణమునఁ దన మేనువిడిచి వెఱ్ఱి కాంత..(శాంతి. ౩ ఆ. ౩౩౮ ప.) క. జేసికి సంతసముచేసి జేసిరికడఁకఁగా. (యు. ౨ ఆ. ౫. ౫.)

ఏకత్వేచ భవే ద్వారు స్త్రతా నాచ భవే త్సూత్రవిత్
నన్నయా (శబ్ద. ౩౫ కా. అజం. అహో. ౩౧౫ పు.)
౧౫౬ విషయము. తయో ర్న్యూనా చేమాత్రుకతో ర్నియమో ఽత్ర
ఇతి (శబ్ద. అజం. ౩౬ కా. అహో. ౩౧౦)

కల్పతరు:—౧౫౬ విష:—ఈకారికలు వ్యాఖ్యాతప్రాప్తములు. (౧౫౬ విష.), 'కూఁతురు - కూఁతు, కూఁతురులు - కూఁతులు' (అహో. ౩౧౮ పు.). అని యహోబలపతి యుదాహరించెను. ఇట్లథర్వణోపదిష్టము ల నహోబలపతి యుదాహరించెనని యెఱుఁగక బాలకవి శరణ్యకర్త "చిన్నకోట పెద్దిరాజు చెప్పినలక్షణములో కూఁతురని ఉన్నది. గాని కూఁతురులు లేదు. పశ్చాత్త నహోబలుఁడు 'కూఁతురులు' అనేరూపము చేర్చుకొన్నాఁడు." అని యిట్లు 'కూఁతురులు' అనునది పెద్దిరాజునాఁటికి లేనట్లు వ్రాసెను. (బాల. శర. ౪౫౬ పు.) ఏకత్వమునందంతటను బాహుళికముగా రువర్ణాగమ మగుననియు బహుత్వమున 'లు' ప్రత్యయపరకత్వమున మాత్రము క్వాచిత్కముగా 'రు' వర్ణాగమమగుననియు నథర్వణుఁడు పైకారికతో నవరించెను. కవిత్రయమువారి ప్రయోగములందన్నిఁటి యొక్క ప్రథమైకవచనము నందుమాత్రమె 'రు' వర్ణాగమము కూఁతుశబ్దమునకు నిత్యముగాఁ గన్పట్టుచున్నది. కేతన యిట్లు వచించెను. క. కూఁతురుపదము రుకారము। బ్రాఁతిగఁ దాఁ జెడు విభక్తిపైఁ బెట్టినచోఁ। గూఁతురు గూఁతుం గనియెను। గూఁతులచేఁ గూఁతువలనఁ గూఁతుల ధనముల్ (ఆ. భూ. ౯౯ ప.). అట్లయినను నథర్వణుఁడు తనకాలమున వాడుక కెక్కినకవులయాదృతిని గాంచిన రూపములను దానును సమ్మతించి పైరీతిని సూత్రించెను. చిన్నకోట పెద్దిరాజు కేతనవలెఁగాక చాలవఱ కథర్వణుని రీతినె వచించెను. కాని కేతన పెద్దిరాజు లిద్దఱును నన్నయాథర్వణకారికలను జూచినవారు కారు. గీ. పరఁగఁ గూఁతురుశబ్దంబు పైరుకార। మొక్కపలుకునఁ బైనైన నుండుఁబాయుఁ। బెక్కుపలుకుల పైనైనఁ దక్కిపోవు। కూఁతురుగఁ బొందెఁ గూఁతు గాఁ గోరె ననఁగ. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౧౧ ప.) ('కూఁతుఁ బడసెను గూఁతుఁగాఁ గోరె ననఁగ' అని గిడుగువారిచతుర్థచరణపాఠము) బహువచన లు ప్రత్యయపరకత్వమునందును క్వాచిత్కముగ రుగాగమ ముండుననువిషయమునుమాత్రము పెద్దిరాజు వచింపలేదు.

కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు. ౯.

బాలవ్యాకరణ కూఁతురు - కూఁతులు, కూఁతురులు - కూఁతుళ్ళు,

౧౯౬ I విమర్శము. కూఁతురి నిత్యాద్విరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

సంజీవని. ౧౯౬ I విమః—భారతప్రయోగములను గేతనవచనమును మూలముగాఁ గొని 'కూఁతురులు' మున్నగునవి గ్రామ్యములనఁగా నసాధువులని సూరి వచించెను. ప్రామాణికుఁడగు నథర్వణునివంటివాఁ డేకత్వమున నన్నివిభక్తులందును రువర్ణాగమము నంగీకరించియుండఁగా నట్టి యథర్వణాశయముల నంగీకరింపకుండుటయేకాక యట్టిరూపములు సూరి గ్రామ్యములనుట పొరపాటు. ఇట్లు ద్వితీయాద్యేకవచనములందు రువర్ణాగమమునె యంగీకరింపని సూరి దాని కిత్వము వచింపకుండుట వింతకాదు. ఆంధ్రభాషాభూషణమందును గావ్యాలంకారచూడామణియందును "కూఁతురుపదము-కూఁతురుశబ్దము" అని రువర్ణాంతమె స్త్రీసమమునియు విభక్తిపరకత్వమున దానితుదిరువర్ణము లోపించుననియుఁ జెప్పఁబడినను బ్రామాణికాగ్రగణ్యుఁడగు నథర్వణుఁడు 'రు' వర్ణమాగమమని వచించుటచేత సూరి వ్రాసిన రీతినె "కూఁతు" అనునదే ప్రకృతియని గ్రహింపనగును.

సూ. రా. నిఘంటుకర్తలు నుడివిన ట్లిది మొదట స్త్రీశిశువాచకమగుట నరయఁగా దీనికి 'కూన' శబ్దము మూలమనియు నద్దానిపై స్త్రీప్రత్యయ తకారము చేరుటచేత మొదట "కూంతు" అనియుఁ గాలక్రమమున బిందువు తేలఁగా'కూఁతు' అనియు నేర్పడియుండునని యూహింపనగును. (బాలకవిశరణ్యము ౪౧ పుట. చూ.) (విస్తర. I)

విస్తర. I ౧౯౬ I విమః—"చిన్నయగారు బెదరగొట్టినవారి అపస్మృతికి వ్యాకరణమఁదు 'కూఁతుశబ్దము ప్రథమైకవచనమునకు రువర్ణంబగు' అని ఉన్నందున కూఁతురుశబ్దమునకు కూఁతురూపాంతర మనుకొని 'కూఁతు' అనేరూపమె ప్రథమైకవచనముగా వాడుతున్నారు కొందరు.........శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు తమభారతములో(ఆది. IX - ఆ. ౧౯) తే. కూఁతు జగదేకకీర్తియై తలిర్పు!...... కూఁతు వైతివికదవే (౫ ఆ. ౫౬) (బాల. శర. ౨౯-30 పుటలు.) అని వ్రాసినారు.........ఛీ-ఛీ. (బాల. శర. ౨౯-30 పు.)" అని శరణ్యకర్తగారు మిక్కిలి దురుసుగా వ్రాయుట యుక్తముకాదు. 'కూఁతు' అనుస్త్రీసమశబ్దమునకే యథర్వణాచార్యుఁడు పాక్షిక రువర్ణాగమమును నేకత్వమున విధించెనుగదా. నేఁటి సూ. రా. నిఘంటుకర్తలును "కూఁతు" శబ్దమును వేఱుగను "కూఁతురు" శబ్దమును వేఱు

కూఁతురి చెలువంపుఁజేని ... (జహ్నుళా. ౧ ఆ. ౮ ప. బాల. శర. ౩౭ పు.) పైస్థలములందెల్ల "తయోశ్శ్నసాదా రేమాత్రాదుపతో ప్రాయశో౽త్రఇత్" (౧౯౭ విష.) (వికృ. అజం. ౩౬ కా. అహో. ౩౧౧ పు.)అనుచొప్పున ద్వితీయాద్యేకవచన పరకత్వమున 'ఇ' కారమువచ్చి 'కూఁతురిన్' మున్నగురూపము లేర్పడెనని యెఱుంగునది. (విస్తర. II)

---

విస్తర. II ౧౯౬ I విష.—"ఉత్తరాంధ్రములో 'కూఁతుర' ప్రాతిపదికము. ఊరు - నగరువలెనే ఔపవిభక్తికము. కూఁతురిని - కూఁతురికి - కూతుళ్ళు = (ర్లు) అనేరూపములు దానినుండివచ్చినవి" (బాల. శర. ౭౨ పు.) అని శరణ్యకర్తగారు వ్రాసిరి. "ఇది తొలుత ననౌపవిభక్తికముగనుండి కాలక్రమమున నౌపవిభక్తికమైనది. కూఁతురికి..." (ఆం. భా. అ. శబ్ద. ౭౭ సూ. వివృతి.) సూ. రా. నిఘంటు కర్తలును "కూఁతురు = కూఁతు...వి-ఔ" అని యిట్లు దీని నౌపవిభక్తికముగనే వ్రాసిరి. ఇట్లె వీరు "ఆల్వా"దులనుసయితము ఔపవిభక్తికములనియే వచించిరి. "కాలు-కాలిని - కాళితోఁ - కాలిక్రింద - ఇట్లు మోకాలు - వ్రేలు - కోడలు - మఱదలు - చెల్లెలు...ఆలు. మొ." (ఆం.భా.అ.శబ్ద. ౧౩౦ సూ.) అని యనుశాసనమున వ్రాయఁబడెను. "ఆలు. వి-ఔ" (సూ. రా. ని.) అని యిట్లుగ "ఆలు" ప్రభృతి శబ్దము లౌపవిభక్తికములని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. వైయాకరణ సంప్రదాయములను బరిశీలించునపుడు 'కూఁతురు' శబ్దమును నాల్వాదులును నౌపవిభక్తికము లనరాదని తోఁచుచున్నది. ప్రాణివాచకము లౌపవిభక్తికములగుట కవి పండితసంప్రదాయము కాదు. ఔపవిభక్తికముల ముఖ్యలక్షణమగు "తృతీయాసప్తమ్యర్థకమైన "అత్వము" వీనిపై నిలువనేరదు. "కూఁతురన్ = కూఁతురిచేతను, కూఁతురియందును; ఆలన్ = ఆలిచేతను, ఆలియందును" అనుస్థితి యెంతమాత్రము లేదు. ప్రామాణికులగు వైయాకరణు లెవ్వరును నీశబ్దము లౌపవిభక్తికము లని వచింపలేదు. ఉదాహరింపను లేదు. ఇట్లు కూఁతుశబ్దమునకును "ఆలు" ప్రభృతులకును బ్రాణివాచకములగుటంజేసి యౌపవిభక్తికత్వము దుర్ఘటమని తలంచియే ప్రామాణికాగ్రసరుఁడగు నథర్వణుఁడు వీనికి "తయోశ్శ్నసాదా విత్యాదిసూత్రముచే నిత్వమును బ్రత్యేకముగ విధింపవలసినవాఁడయ్యెను.

అహోబలపతి కూఁతురుశబ్దపు టిత్వమువిషయమును స్మరింపకున్నను నాలు ప్రభృతులయిత్వము కయి యథర్వణవచనముచొప్పున వచ్చినదనియె సాధించెను

గాని వైయాకరణసంప్రదాయవిరుద్ధముగ ప్రాణివాచకములకు సంబంధార్థశబ్దములకుఁ గాని యొట్యాదేశములకుఁగాని యిత్వ మౌపవిభక్తికత్వమున వచ్చునని వ్రాయలేదు. కాని యీతఁడు "తయోశ్చ్యాద్యా విభక్త్యాదికారికను పరిగ్రహముచేసికొని సరిగ నుపయోగించికొనలేదు.

"ఏకత్వేన బహుత్వేన సంబద్ధే విభక్తౌ తయోశ్చ్యాద్యా చేమాత్ర ఇకతోః ప్రాయశోర్థ్ర ఇత్. వారికి-వారికి - వారిగా-వీరిగా-వారిచేతగా - అరిగా-అరిచేతగా ఇత్యాది. వారిమాత్రము - వారిగుణములు - అతస్తు - అక్కడివారు - ఇక్కడివారు- తోడివారు...అయంశబ్దః సహార్థకశబ్దపర్యాయః..." (అహో. 3౧౦) అహోబల పండితుఁడు పయియర్థక్రియాకారికల నడుములో నొంత మార్పడి తనకుఁబాటుగ నుదాహరించె ననుకొందును. 'వారు వీరు' అను ప్రథమాబహువచనములమీఁద 'వి' వర్ణకము నిల్చుననుట యొకపొరపాటు. సంబంధార్థమునవచ్చు 'ఇ-వి' వర్ణకములు షష్ఠ్యర్థమున నిల్చునుగాని యొక్కఁడును ప్రథమాంతములపై నిల్వనేరవు. అట్లు కానిచో 'వి'వర్ణకము "వాఁడు - వీఁడు" మున్నగువానిపై నిల్చి 'వాఁడివి - వీఁడివి' మున్నగు ననిష్టరూపములు సంభవింపవలసివచ్చును. కాఁబట్టి "తయోశ్చ్యాద్యా" విభక్త్యాదికారికలోని 'తయోః' అనునది 'ఇ-వి' వర్ణకపరము కామింజేసి 'ఏకత్వేచే' త్యాదికారికతో "తయోశ్చ్యాద్యా" విభక్త్యాదికారికను జోడింపరాదు. మఱియు వారిగా - వీరిగా - వారిచేతగా మున్నగు ద్వితీయాదిబహువచనరూపములను సాధించు ప్రక్రియలో "వారు - వీరు" మున్నగు ప్రథమాబహువచనాంతములపై నసాది ప్రత్యయములు నిల్చుట కేవలము నసంభవము. కావున నా యోజించినరీతినే 'తయోశ్చ్యాద్యా' విభక్త్యాదికారికను సమన్వయించుట (౧౯౭ విష.) యుక్తము. ఆ కారిక చెప్పున 'అ' త్తున కిత్త్వమువచ్చుటకు "అతస్తు - అక్కడివారు..." (అహో. 3౧౦ పు.) అని యిట్లక్కడాదిశబ్దముల నహోబలపతి యుదాహరించుటయు సరి కాదు. అక్కడాదు లౌపవిభక్తికములగుటచేతనే వాని కిత్త్వము లభించును. 'తోడి వారు' అనునహోబలోదాహృతియు సరికాదు, అట్టియెడల "ఇచ్చవిభక్త్యుక్తిమస్య" అనుచింతామణిసూత్రముచెప్పుననే (౧౦౫ విష.) ఇత్త్వము వచ్చును. (విస్తర. ౧౦౫ I విష.). ఈపక్షమున "ప్రాయోగ్రహణాత్ - తోడఁబుట్టువు ఇత్యాదౌన" (అహో. 3౧౦ పు.) అని యహోబలపతిచూపిన యనుపపత్తికే ప్రసక్తి యుండఁ బోదు. మఱియు నహోబలపతి సమన్వయించినరీతి నత్త్వమున కిత్త్వమువచ్చుట నంగీకరించునపుడు "వారిగా - వీరిగా - వారిచేగా - వీరిచేగా." మున్నగుస్థలములలోని యిత్వమును సంపాదించుసూత్రమె నన్నయాథర్వణీయమున లేకపోవలసివచ్చును,

బహువచనమున 'రు' వర్ణాగమముగల ప్రయోగములు:— "...ఇత్తునీ తని యనుజన్మ మొంబునకుఁ దక్కినసహోదరులన్ భవదీయులఁ (...ఆ. ౯౬ ప. ...రా. ని.) చ. ...డక్కలుఁ బని రాచకొమరులు గాలికి... (...రా. ౨ ఆ. ౪౦. భా. అ. ప్రయోగ. వివే. ౧౫ పు.) అథర్వణుండు "రాచభవే" త్తనుచుఁ బ్రథమాబహువచనమునందే వచించినను నట్టి 'లు' వర్ణకము బహువచన లకార మునకును నుపలక్షణమగునని వ్యాఖ్యచేసికొని యిట్టిప్రయోగములను సమర్థించి

---

ఇట్టి యహోబలపండితీయప్రామాదికమార్గమునసే తదనుయాయివ్యాకర్తలెల్ల పైకారికల నడికి సమన్వయించుటచే వారివారివివరణములను వేఱుగ విమర్శింప నక్కఱలేదు. కవిజనమండనకర్తయుఁ దదనుయాయి నారాయణీయగాణపతవివరణ కర్తలును "తదో శ్వసాదా" అనుచో "తయోరమాదా" అనుపాఠము నంగీక రించిరి. (విక్ర. అజం. ౩౬ కారి. నారా. గాణ. ఆచ్ఛి. ౨౮ ప. ౨౫౭ కారి.) ఈపక్షమున నేకత్వమునం దిత్వమునకుఁ బ్రసక్తియే లేమింజేసి 'శసాదా' అనుచో "అమాదా" అనుసవరణము నిష్ప్రయోజనము.

బాలకవిశరణ్యకర్తగారు. "సీ. వినుము గాంధారి... ఎ-గీ...। రాచకూఁ తుంద్రు సుతుల సంగ్రామనిరత। హృదయు లగువారిఁ గాంచఁ గోరుదురకాదె" (స్త్రీ. ౨ ఆ. ౧౬౬ ప.) (బాల, శర. ౮౦ పు.) అనుసోమయాజిప్రయోగమును జూపుచు "కూఁతుంద్రు" అనురూపము సాధువె యని వచించిరి. కూఁతురుశబ్దబహువచన లకారమునకు రత్వ మెవ్వరికిని సమ్మతము కామింజేసి "కేషాంచిద్ వ్యస్తశబ్దానా"మ్మను (౧౫౩ I విమ.) బిందుపూర్వకడువర్ణవిధాయకశాస్త్రము కూఁతుశబ్దవిషయమున నెంతమాత్రము ప్రవర్తింపనేరదు. అట్టి బిందుపూర్వకడువర్ణవిధాయకశాస్త్రము దీని విషయమున వేఱొకటిలేదు. మఱియు శరణ్యకర్తగారు చూపినప్రయోగము లేఖ కాదిప్రమాదకృతమే కాని కవిప్రయుక్తము కాదు. తాళపత్రమాతృకలలో "రాచ కూంతులు సుతుల సంగ్రామనిరత..." అనిరె యున్నదిగాన నచట "రాచకూఁతులు సుతుల" అనియే సోమయాజిప్రయుక్తపాఠమని విశ్వసింపఁదగును. శరణ్యకర్తగారు చూపుప్రయోగములలో నేవో యలంతిస్థలములు తప్పఁ దక్కినవెల్ల నిట్టిప్రక్షిప్తము లనఁదగినవె యైయుండును. ప్రాచీవ్యాకరణసమ్మతములు కాని యపూర్వరూపములను సాధింపఁదలఁచినపు డట్టిరూపమును నిర్వహింపఁదగిన ప్రామాణిక కవిప్రయుక్తమని విశ్వసింపఁదగిన ప్రయోగములను జూపవలదా ? ఈదుర్బలప్రయోగమె పెక్కురు నేటివ్యాకర్తలు చూపుచున్నారు. (అం. భా. అ. శబ్ద. ౭౮ సూ. బాల. శర. ౨౦౦ పు.) (గాణ. ఆచ్ఛి. ౧౧ ప. ౨౮౮ కా. వివ.)

[illegible] ప.) 'చూపుఱులు' అనియుఁ గలదు. (౩౧౬ విష.) వ-గీ-చూపఱులచూడ్కి [illegible] (కా. ౧ ఆ. ౯౬ ప.) "చూపఱు - చూపఱులు. చూపరి [illegible] (అహో. ౧౨౫౬ పు.) ఈ ప్రాంత ప్రామాణికము. "చూపఱు. వ్యా. విశే. (చూపు+వాఁడు) చూచువాఁడు." (శ.ర.) "చూపరి. ద్వ్యా. విశే. (చూపు+అరి) చూడఁదగినవాఁడు. సౌందర్యవంతుఁడు." (శ.ర.) అను చెప్పిన 'చూపఱు - చూపరి' అనునవి విభిన్నశబ్దములు. ఒకటికొకటి రూపాంతరము కానేరదు.

పయి నుదాహరించిన భారతప్రయోగదృష్టములగు "చూపఱు-పగఱు" మున్నగువానికి "భూయసీదేశ్యభేదైః లోపవర్ణాగమశ్రుతిః" అను నథర్వణకారిక చెప్పి (౧౫౮ విష.) యుండఁగూడును.

నిత్యం దారాదేశ్చస్యాల్లో గ్లలయో రురౌచ తత్ర
స్తః(అం. చిం. అజం. ౧౮ కా. అహో. ౩౨౭ పు.)

నన్నయా. ఉతోలోపశ్చ (వికృ. అజం ౫౭ కా. అహో. ౩౨౮)

౧౫౮ విషయము. తయోశ్చసాదో రేమాత్ర। ఉవతోః ప్రాయశోఽత్ర
ఇత్. (వికృ. అజం. ౩౬ కా. అహో. ౩౧౦ పు.)

కల్పతరు. ౧౫౮ విష:—ఈకారికలు వ్యాఖ్యాతచరములు. (౧౫౭ విష.) ఆలు మున్నగుశబ్దముల లు వర్ణస్థానమున బహువచన లుఁబరకత్వమున నిత్యముగాఁ బూర్ణబిందు పూర్వక డువర్ణాదేశ మగుననియు నట్టిబహువచన 'లుల'లకు నిత్యముగా రురలాదేశ మగుననియు నట్టియాదేశ డువర్ణములోని 'ఉకారము' పాక్షికముగా లోపింపుననియు ద్వితీయాద్యేకవచనపరకత్వమున నాల్వాదుల లువర్ణమునుత్వమున కిత్వమగుననియుఁ బయికారికలలోఁ బ్రకృతవిషయమును సంబంధించిన భాగమున కభిప్రాయము నెన్నునది. ఉదా:—ఆలు - ఆండురు = ఆంద్రు. ఆలిక్ - ఆండురక్ = ఆండ్రక్. కోడలు - కోడండురు = కోడంద్రు. కోడలిక్ - కోడండురక్ = కోండండ్రక్. మొ. ఆలు - కోడలు - మఱఁదలు - చెల్లెలు - చెలియలు. ఇవి యాల్వాదులు. ౧౫౭ విష. కల్పతరువున వివరింపఁబడినరీతి నహోబలపండితుని సమన్వయముచొప్పున నాలుప్రభృతుల లువర్ణస్థానమున నిత్యడువర్ణాదేశమును నద్దానియుత్వమునకును నిత్యలోపమును గల్గునపుడు "ఆలు - ఆంద్రు" అనురీతినె రూపసిద్ధియగును. 'ఆండురు' మున్నగురీతిని రూపసిద్ధి కల్గనేరదు. కాని యట్టి డువర్ణోల్లోపనిత్యత నన్నయాథర్వణసమ్మతము కామింజేసి (౧౫౭ విష.) యట్టిసమన్వయము గ్రాహ్యము కానేరదు. ముందు నిర్ణయింపఁబడురీతిని "కోడంద్రురయందు" మున్నగు

[illegible] సంజీవనియందు 'అలిని' మున్నగు రూపములు గల్గుట [౧౫౮ I వి. సంజీ.]

[illegible], సవరణ విపులముగా వివరించియుండుటచే ([illegible] ౧౫౩ I విష.)

ఇట మరల వ్రాయలేదు.

పయిని వుదాహరించినరీతి నాంధ్రశబ్దచింతామణియందు యాలు ప్రభృతుల రూప సాధనప్రక్రియ విపులముగా నుపదేశింపఁబడియుండుటచేతఁ దచ్ఛేషగ్రంథమగు వికృతివివేకములోని స్థలాంతరోపయోగియగు [౧౫౩ I విష.] "నిత్యం లులా రురా స్యాతాముల్లోపో బహుళంఁడుజః." (వికృ. అజం. ౫౧ కా.) అనుకారికకు "అంఁడ్రు జవరాండ్రు - కోడండ్రు - చెల్లెండ్రు" అనునవి లక్ష్యములని కవిజనమండన వ్యాఖ్యాత యుదాహరించుట (వికృ. ౮౩ పుట.) కేవలము పొరపాటు.

బాలవ్యాకరణ వివరణము.

ఆల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు. ౧౧.

౧౫౮ I విషయము. అండ్రు - ఆండ్రను. ఆలు - చెలియులు - చెల్లెలు - కోడలు - మఱఁదలు ఇవి యాల్వాదులు.

సంజీవని. ౧౫౮ I విష:—ఆలుశబ్దము భార్యాద్యర్థకము. 'జవరాలు - ధీరు రాలు' ఇత్యాది సమాసస్థలములందు స్త్రీమాత్రపరము. (బా. సంధి. ౩౧ సూ.). వెంకనామాత్యుఁడాలుశబ్దమును వ్యస్తతలో సైతము స్త్రీమాత్రపరముగాఁ బ్రయోగించెను. చ. కలుచుట దోసమే మగలఁ గల్గిన యాండురు దొల్లి యాండురకా!గలు తురె...(నన్ని. కు. ౮ ఆ. ౧౫౧ ప.) ఇట సూరి "ఆండురు" మున్నగురూపములు తనకు సమ్మతములుకామింజేసి "బూర్ణబిందుపూర్వక డువర్ణకము" అని వచింపఁడయ్యె. బా. ఆచ్ఛి. ౧౫ సూత్రముచొప్పున సంయోగపరకఖండము నిల్వనేరదు. ఖండము నిల్చినను బూర్ణమె యగును గాన "పూర్ణబిందువని వ్యాఖ్యచేయఁబడెను. ఆండురు మున్నగు నుల్లోపాభావ రూపములు సూరికి సమ్మతములుకామింజేసియే ప్రక్రియా లాఘవార్థము "బిందుపూర్వకడకారము" అని వచించెను. కాని యధర్వణుఁడు భారతప్రయోగానురోధమున "ఉతోలోపశ్చ" అనుసూత్రముతో సవరించిన యుల్లోపాభావపక్షరూపములగు "ఆండురు - కోడండురు" మున్నగురూపముల నహోబలపండితీయానుయాయియై సూరి సంగ్రహించికొనకుండుట సరికాదు. అట్లె యాలుప్రభృతులకు ద్వితీయాద్యేకవచన పరకత్వమున నధర్వణుఁడు "తయోశ్శసాదా" విత్యాదిసూత్రముచే విధించిన యిత్వమును సూరి సంగ్రహించికొనకుండుటయు సరికాదు. అట్లగుటచేతనే సూరి ప్రక్రియచొప్పున "ఆలును - ఆలుచేత" మున్నగురూపములె సిద్ధించునుగాని "ఆలిని - ఆలిచేతను"

మున్నగు నిత్యఘటితరూపములు సిద్ధించవు. అట్లైన నిత్యవిభక్తికములని యుదాహరింపలేదు. అట్లనుట వైయాకరణసిద్ధాంతవిరుద్ధమని యీవఱకె వ్రాసియున్నాను. (వి స్తర. II ౧౯౬ I విష.)

అథర్వణోపదిష్టమగునట్టి యాల్వాదుల యిత్వమును నిర్వహించు యతిస్థానాదిగత ప్రయోగములు భారతమున లభింపలేదు. క. ఏలినవానిని దైవము నాలిని బంధులను.........(ఉద్యో. ౨ ఆ. 33 ప.) సీ. గొంతి సంకటపాటు కోడలి బన్నంబు...(భీష్మ. ౨ ఆ. 3౯3 ప.) ఇట్టివి పెక్కుగలవు. ఈక్రింది యితర కవుల ప్రయోగములు గొంతరజ త్వమును నిర్వహింపజాలు ననవగును. చ. కొంకక తోడఁబుట్టువులు గూరిమి చెల్లెలి కిచ్చి రిద్దఱున్ (నైష. 2 ఆ. ౧౧ ప.) ఆ. వె.........ఏకతస్వభూతి నెరపు నేను పుంవ్యక్తులకు నాలితనముతో సమాఖ్య మనుచు బెట్టు. (రాఘు. ౨ ఆ. ౭3 ప.) భారతార్థమున 'ఆలితనము = భార్యాత్వము.' రామాయణార్థమున 'నాలితనము=కొంచెపుదనము' అని యర్థము.

కోలో డలటా ముదితాం తస్య చ వాలుక్ ; పలోలో
శ్చ (ఆం. చిం. అజం. ౧౭ కా. అహో. 332-
సన్నసూత్రవ్యా. 33౯ పు.)
౧౯౯ విషయము. డ ల టా ము దితాం లుక్ స్యాత్ ప్రాయశో లే లుప
ద్ధకే వైకృతానాం లుక్ భవేల్లడయో రేకరూపతా.
(వికృ. అజం. ౫2 కా. అహో. 33౦ పు.)

కల్పతరు. ౧౯౯ విష:—పూర్వసూత్రమగు నిత్యం దారాదే శ్చేతిసూత్రము నుండి 'లులయోః' అనునది యనువర్తించును. లులయోః = బహువచన 'లుల' ల వ్యవహితపరము లగుచుండఁగా, రః=రేఫము, లః = అలఘులకారము, వా = వికల్పముగా నగును. వాశబ్దము 'డలటా' మిత్యాద్యుత్తరసూత్రమునుండి యాకృష్టమగును. ఉదా:—ఊరులు = ఊర్లు = ఊళ్లు, నీరులు = నీర్లు = నీళ్లు, వెదురులు = వెదుర్లు = వెదుళ్లు, మొ. ఈవిధి యిట్లు కొన్నిశబ్దములందే వర్తిల్లును. నన్నయ నాఁడు నేఁటివలె ద్రావిడళకారముపంటి యుచ్చారణ మలఘులకారమునకు రాలేదు. కావుననె నన్నయ "వర్త్య చవౌ గురురలౌ చ బిన్దుయుతౌ" అని యలఘులకారచిహ్నమును వేఱుగ వక్కాణించినవాఁడయ్యెను. (ప్రాచీనకాలమున లఘ్వలఘువులు రెండును 'ల.ల' అనురీతినె వ్రాయఁబడెడివి) అట్లయినను గాలక్రమమున నట్టియలఘులకారము (ల) ద్రావిడళకారమునకు సమీపస్థమగు నుచ్చారణము కలదగుచువచ్చెను. ఆకారణమునంజేసి యట్టియలఘులకారమునయిత మర్వాచీను

లచే వ్రాయిడళకారచిహ్నముతోనె వ్రాయఁబడుచున్నది. అట్టి యలఘులకారమును మూర్ధన్యముగాఁ బలుకక స్థానకరణశైథిల్యము సోకని దంత్యముగానె పలుకుట వైయాకరణపండితకవీంద్రసమ్మతము. భేదము తెలియుటకై యీసందర్భమున నయ్యది నన్నయోపదిష్టలిపితోనె లిఖింపఁబడుచున్నది. నేఁడు - బాల - బాలికా - చేల - తూలాదిసంస్కృతశబ్దములందు లఘులకారమును, గోళ వ్యాళగరళాది సంస్కృతశబ్దములందు నలఘులకారమును నుచ్చరించుట కెట్లు కవిపండితలోక వ్యవహారమె ప్రమాణమగుచున్నదో (ఒక్కరీతిగా వ్రాసినపుడును భేదోచ్చారణము కలదు) యట్లె నన్నయనాఁడును లఘ్వలఘులకారోచ్చారణభేదము కవిపండితాభిరుచిమూలకమై యుండెడిదని గ్రహింపనగును. కాన ప్రకృతసందర్భమున లకారమునకు బహువచనపరకత్వమునఁ గల్గు నలఘుత్వము నట్టియెడల బహువచన లకారమునకుఁగల్గు న లఘుత్వమును పండితవ్యవహారసిద్ధము లె యగుసుగాన వానికి వేఱువిధాన మక్కఱలేదని భట్టారకుఁడు తలంచియుండును. (విస్తర.) ఉదా:—కాలులు = కాళ్లు. రోఁకలులు = రోఁకళ్లు. ముందు వివరింపఁ బోవు నథర్వణసూత్రముచొప్పున డాకులత్వము కల్గునపుడును దాని కలఘుత్వమిట్లె పండితవ్యవహారముననె కల్గును. ఉదా:—త్రాడులు = త్రాళ్లు, గుడులు = గుళ్లు. మొ. (చిం. వి. పరి. ౩౦ మొ. ౩౯ విష.) (వై. పా. ౨౬౪-౨౬౫ విష.)

ఈసూత్రములోని వాశబ్దము వ్యవస్థావాచియగుటచేత 'తేరు - పోరు - గారు (ఏనుఁగు) మున్నగు పెక్కుశబ్దములలోని రకారముల కలఘులకారాదేశము

---

విస్తర. I ౧౯౯ విష:—ఇట్లు తలంపక యాంధ్రభాషాచరిత్రకర్త గారీ క్రింది రీతిని వ్రాయుట సరికాదు. "చింతామణియందు బహువచన 'డల'ల కాదేశముగా నలఘులకారమువచ్చునని చెప్పఁబడియుండలేదు. "రోలః" అనుసూత్రమువలనఁ గలిగిన లకార మలఘులకారమనికూడ నందు లేదు. కాఁబట్టి త్రాళ్లు - తళ్లు - చాళ్లు - అంబళ్లు - ఏళ్లు - గోళ్లు - మొదలగు నలఘులకారముతోఁగూడిన బహువచనరూపములు చింతామణివలన సిద్ధింపవు" (ఆం. భా. చ. ౧౬౪-౨ పు.) నన్నయనాఁడు "త్రాడ్లు" అనురీతినే యుండెడివి. కావుననె నన్నయ డాకు నలఘులకారవిధి చేయలేదు. 'త్రాళ్ళు-తళ్ళు' అనురూపములు నన్నయసమ్మతములుకావు. ఆథర్వణాంగీకృతములు. మఱియు వీనిలో 'ళ్లు' అనురీతిని ళకారము తర్వాత లకారము నుచ్చరించుట దుర్ఘటము కాన "ళ్ళు = ల్లు" అని యుండవలెను. "రోలః" అని చింతామణికర్త సూత్రించినపు డాతఁడు వేఱ యలఘులకారమని వక్కాణింపనేల? దస్త్వ్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ" అని సూత్రించియున్నాఁడుగదా. (౨౯ II విష.)

లేదని యెఱుంగునది. అలఘురేఫమున కెప్పుడును నలఘులకారాదేశము లేదని తెలియనగును. ఉదా:—ఏఱు - ఏఱులు, నూఱు - నూఱులు, నీఱు - (భస్మము) నీఱులు, ఊఱు - ఊఱులు, పాఱుడు - పాఱులు, నాఱు - నాఱులు, దూఱు - దూఱులు. మొ.

డలటామిత్యాది:—లులయోః = బహువచనలులకు పరమగుచుండఁగా, డలటామ్ = డకార లకార టకారములయొక్కయు, తస్యచ = అపూర్వసూత్రోక్త రేఫముయొక్కయు, ఉదితామ్ = హ్రస్వములగు ఉకారేకారములకు, వాలుక్ = వైకల్పికలోపము కల్గును. ఉదా:—త్రాడులు = త్రాళ్లు, (నన్నయనాఁటికాలమున 'త్రాళ్ళు' కాలేదు.) కాలులు - కాళ్లు (కాళ్ళు) పాటులు = పాట్లు, ఊరులు = ఊళ్లు, గుడి - గుడులు = గుళ్లు, (నన్నయనాఁడు గుళ్ళు కాలేదు.) రోఁకలి - రోఁకలులు = రోకళ్లు, (రోఁకళ్ళు) కోమటి - కోమటులు = కోమట్లు, పిడి = మెటి, పిడులు = పిళ్లు. మొ. ప్రకృతసూత్రములోని 'తస్యచ' అనుదానికి లఘువునకు నలఘువునకును ననునర్థము వ్యాఖ్యమహిమచేతనే గ్రహింపవలయును. కాన ఊళ్లు - పూళ్లు - పళ్లు మున్నగునవి సిద్ధించును.

సలోలోశ్చేతి:—లులయోః = బహువచన 'లుల' లు పరమగుచుండఁగా, సలః = లకారముతోఁగూడిన, లోశ్చ = 'లు' అనుదాని 'ఉ' కారమునకును, వాలుక్ = వైకల్పికలోపము, కల్గును. ఉదా:—విల్లు+లు = విల్ల్లు = విల్లు (విళ్ళు) సజాతీయవర్ణద్వయాధికసంయోగమున రెండుహల్లులుమాత్రమె నిల్చుట సహజము కాన నిట నొకలకారము లోపించినది (౧౭౫ I విష. విస్తర.) ఇట్లె ముల్లు+లు = ముల్లు (ముళ్ళు) పల్లు+లు = పల్లు (పళ్ళు.) అహోబలపతి యీసూత్రమున కిట్లు యుక్తమగునర్థము చేసికొనక యాక్రమించిరితి నపార్థము వ్రాసెను. "సలోలోశ్చ— వ్యా - లకారయుక్తస్య లోశ్శోఃఉకారస్య వాలుక్ స్యాత్, పందిళ్వేసి - అంబళ్గాచి - పందిళ్ళువేసి - అంబళ్ళుగాచి. ఇత్యాది. నీరుకోళ్, కొలకొలమంచు నితి కవిపితామహః. కేవల లువర్ణస్యాప్యల్లోప ఆచార్యస్యాభిమతఏవ. మ. ఉదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతాభ్యుదయుక్ ఇత్యాది తత్ప్రయోగాత్." (అహో. 33౯) ఈవ్యాఖ్య కేవలమును బూర్వాపరసందర్భశూన్యముగ నున్నది. పూర్వసూత్రమునందును బరసూత్రమునందును "లులయోః పరయోః" అనునది యనువర్తించుచుండఁగా నీసూత్రమున నట్టి యనువృత్తి నుజ్జగించి నన్నయసమ్మతము లగు "విల్లు (విళ్ళు) ముల్లు (ముళ్ళు)" అనురూపముల నుపేక్షించి, నన్నయాథర్వణ సమ్మతములు కానట్టియు నర్వాచీనకావ్యప్రయుక్తములైనట్టియు "నీరు కోళ్ కొల

కొల" మున్నగు ప్రయోగములను సాధింపఁగడఁగి యపార్థముచేయుట కహోబల పతివంటివాఁ డెట్లు కడంగెనో తెలియకున్నది. ఈతని యీప్రామాదికమార్గముననె నారాయణీయగాణపతవివరణకర్తలును వివరించిరి. (నారా. గాణ. అచ్చి. ౧౬ ప. ౨౮౯ కా.) సూరియు నిట్టి యపమార్గముననె కావలయు విల్లు ముల్లు మున్నగు వానికిఁ జింతామణిసమ్మతములగు విళ్లు (విళ్ళు) ముళ్లు (ముళ్ళు) మున్నగురూప ములను బాలవ్యాకరణమున సంగ్రహింపలేదు. ఇంతియకాక "బహుళగ్రహణ ముచే, విల్లులు - పిల్లులు - ప్రులులిత్యాదులందు లోపంబులేదు." (బా. అచ్చి. ౧౨ సూ.) అనియు వివరించెను.

ప్రకృతమగు 'సలోలోశ్చ' అనుసూత్రములోని చకారమహిమచేత నీవిధి సార్వత్రికము కాదనియుఁ బ్రయోగదృష్టములందే వర్తిల్లుననియు గ్రహింపనగును గాన పిల్లులు - కల్లులు - తెల్లులు మున్నగుచోట్ల నీవిధి వర్తింపదు. (విస్తర. II)

ప్రకృతసూత్రముచొప్పున సిద్ధించిన 'త్రాళ్లు - గుళ్లు' మున్నగునవి భట్టార కునికాలమున సాధురూపములె యైయుండెడివని తోఁచెడిని. అట్లుకానిచో రేఫకు ల త్వమును విధించిన యాతఁడు డకారమునకు నైతము లాదేశమును విధించియుం డఁడా ? అహోబలపతి 'లడళ'ల యభేదాభిధానముచేఁ బ్రకృతసూత్రముచొప్పున స్వరలోపము గల్గఁగా నిల్చిన "కాళ్లు - త్రాడ్లు" మున్నగుస్థలములందలి లడలకు ళత్వమె కల్గునని వ్యాఖ్యచేసెను. అలఘులకారమునకును ద్రావిడళకారమునకును గలభేదము నాతఁడు గ్రహించియుండలేదు. "త్రాడు - త్రాళ్ళు, అంబలి - అంబళ్ళు రోలు - రోళ్ళు.........'లడళా' నా మభేదాభిధానా ద్రూపమేతత్." (అహో. ౩౩౮ పు.) 'లడళ'ల కభేదాభిధాన మీాక్రిందిరీతిని వేఱొకచోఁ జెప్పఁబడెను. "తత్ర కేషాం చిద్వర్ణానాం క్వచి దభిన్నతావ్యవహారః, 'లడయో ర్లళయో రైక్య' వ| రలయో ర్వబయో ర్భ దేత్యుక్తేః. (అహో. ౧౩౭ పు.) ఈమార్గమే భట్టారకునకును

---

విస్తర. II ౧౫౫ విష:—"రోలోడలటాముదితాం, తస్యచవాలుక్ సలో లోశ్చ. అనునది యార్యాగీతియర్థభాగమునకుఁ గొఱవడియున్నది" (ఆం. భా. చ. ౧౬౮౩ పు.) ఆంధ్రభాషాచరిత్రకర్తగారు ప్రామాదికముగ నిట్లు వ్రాసిరి. ఇది గీతికాదనియు, నార్య యనియు వీరుగ్రహింపమిచే నిట్లు వ్రాసిరి. ఆర్యాగీతియనుట యింకొకపొరపాటు. ఆర్యాగీతిలక్షణము వేఱు. కొఱవడియున్నదనుటకు నున్నవఱ కైన నార్యాగీతిలక్షణముగలదా ? ఇంకను మఱియాఱుపద్యములు చింతామణి లోనివి గీతులుకావు వానియెడల వీరి కిట్టి సందేహ మేలపొడమలేదో ? (వైయా కరణపారిజాతము ౧౧ విషయము.)

సమ్మతమైనచో లడలకును నభేదాభిధానముండుటచే "ళోలః" అను సూత్రము నాతఁ డుపదేశించియే యుండెడువాఁడు. నన్నయకే కాక యథర్వణునకును నీయహోబలపండితుఁడు చూపినమార్గము సమ్మతము కాకుండుటచే నాతఁడు డీక్రిందిరీతిని డకారమునకు లత్వము నుపదేశించెను. నన్నయనాఁడు సమ్మతములై యుండు త్రాడ్లు-గుడ్లు మున్నగురూపము లుత్తరోత్తరపండితకవిప్రయోగ కళంకితములు కాకుండఁగా నట్టి యసిష్టరూపములను వారించుచు నథర్వణుఁడు "లడయోరేకరూపతా" అని యుపదేశించుచున్నాఁడు.

లడయోరిత్యాది:—ఈశ్లోకములోని రెండవచరణము "ప్రాయశోఽపిలు వర్ణకే" అని యహోబలపండితీయమున నున్నను నాయొద్దనున్న ప్రాఁతప్రతిలో 'ప్రాయశోలే లువర్ణకే' అని యుండుటచే నదియె యుక్తమని యంగీకరింపఁబడెను. లే-లు-వర్ణకే = ద్వితీయాదిబహువచనలకారమును లువర్ణకమును బరములగుచుండఁగా, వైకృతానామ్ = ఆచ్ఛికములగు, డలటామ్ = డలటవర్ణములయొక్క, ఉదితామ్=ఉకారాకారములను, (ఇది శేషమువిరాఁది "ఉ"దిత్తులకును నుపలక్షణము). ప్రాయశః = తఱుచుగా, లుక్ స్యాత్ = లోపముగలుగును. నన్నయపాతికలోపమును జెప్పఁగా నట్టిలోపము ప్రాయికమనియు నీవిధివైకృతములకె యగు ననియు నథర్వణుఁడు సవరించెను. మఱియు నట్లు, లుకి = లోపముగల్గఁగా, లడయోః = లడలకు, అనఁగా 'డు-డి' వర్ణములస్వరములు లోపింపఁగా మిగిలిన వ్యంజనడకారమునకును దానితో సంయోగించియున్న బహువచనలకారమునకును ఏకరూపతా = ఏకాకారము, భవేత్ = సంభవించును, అనఁగా డకారమునకు లకారాదేశముచేఁ గల్గునేకాకారము సంభవించునని తాత్పర్యము. ఉదా:—త్రాడులు (త్రాడ్లు) త్రాళ్లు, గుడులు (గుడ్లు) గుళ్లు, ఇచటి యలఘుత్వమును బండితవ్యవహారసిద్ధమె యని గ్రహింపనగును.

త్రాడ్లు - గుడ్లు మున్నగుచోటులందలి డాకు లత్వము నాదేశింపమిచే మాత్రమె నన్నయ కట్టిరూపములు సమ్మతములని వ్రాయఁబడెనుగాని నన్నయ భారతభాగమున నెచ్చటను నట్టిరూపములను నిర్వహింపఁజాలునట్టివిగాని నట్టిరూపములకు విలక్షణములయిన లత్వఘటితరూపములుగాని కవిప్రయుక్తములని విశ్వసింపఁదగిన యతిప్రాసాదిస్థలగతములు లభింపలేదు. కాని నన్నయనాఁటి శాసనములలో నట్టిరూపము లనఁగా లత్వములేనిరూపములు వెలయుచున్నవి. "గుడ్లు (గుడి-బ) ౧౨౪ పుట, మామిడ్లు ౧౧౭ పుట." (Nel. ins. R. ౩౬ శాసనము.)

ప్రకృతసూత్రమున "ఉదితా"మ్మని చెప్పుట యనావశ్యకమనియు 'ఇ'కార మెట్లును బహువచనపరకత్వమున "ఉద్బహుత్వే" అనుచో నొప్పున 'ఉ'కారమె యగు ననియు శంకింపరాదు. ఉకారరూపము నందినను నయ్యది లోపింపవలసినదే యగు నపుడు మొదటనే యనఁగా నుత్వమునందకమును వే లోపించుట ప్రక్రియాలాఘవముకాదా యని భట్టారకుని యాశయమును గ్రహింపనగును.

బహువచనము పరంబగునపుడు 'డ-ల-ట-ర'ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ౧౨.

బాలవ్యాకరణ వివరణము. ౧౯౯ I విషయము

గుండ్లు = గుండులు, గిండ్లు = గిండులు, కాళ్లు = కాలులు, మొసళ్లు=మొసలులు, గొంట్లు = గొంటులు, తుంట్లు=తుంటులు, గోర్లు=గోరులు, సీవిర్లు = సీవిరులు; బహుళగ్రహణముచే - విల్లులు - పిల్లులు - పులులిత్యాదులందు లోపంబు లేదు. తత్సమంబులం గోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు. కోట్లు = కోటులు, పిప్పళ్లు = పిప్పలులు.

సంజీవని. ౧౯౯ I విష:—అర్థములు:—గుండు = ఱాయి, గిండి = సన్నపు మెడగలచెంబు, గొంటు = దుష్టుఁడు, తుంటి = కటిపార్శ్వభాగము, సీవిరి = వింజామరము = వ్యజనము, కోటి = నూఱులక్షలు. 'సీవిరులు' అనుచో బా. తత్స. ౪౭ సూత్రముచొప్పున సుపోత్తమేత్వమున కుత్వము రాలేదు.

"నలడాదే ర స్త రుతశ్చ" అనుచింతామణిసంధిసూత్రమును దానివివరణము బా. ప్రకీ. ౧౭ సూత్రమును ప్రాతిపదికమధ్యగతోకారమునకుమాత్రమె లోపమును వచించునవగుటం జేసి విభక్తిపరకత్వమునందలి యుల్లోపమును వేఱుగ నిట్లు సూత్రింపవలసెను. బహువచన లులలు పరమగునపుడు 'డ-ల-ట-ర' అనువానిపై నున్న 'ఉ' కారము బహుళముగా లోపించును. శబ్దగతోకారమునకును బా. తత్స. ౪౫ సూత్రముచొప్పున సిద్ధించు 'ఉ' కారమునకును నట్టిలోపము కల్గును. కావుననె యొక్కొకదానికి 'ఉదంతము-ఇదంతము' అను రెండేసిశబ్దము లుదాహరింపఁబడినవి.

ప్రకృతసూత్రములోని రలలు లఘువులుమాత్రమె యని సూరి యభిప్రాయము నూహింపఁదగును. బా. ఆచ్ఛి. ౧౩ సూత్రముచొప్పున 'ఊళులు - పందిళులు - గోళులు' మున్నగురూపములను సాధించి యుదాహరించెనే కాని 'ఊళ్ళు - పందిళ్ళు - గోళ్ళు' మున్నగురూపముల నుదాహరింపలేదు. బా. ఆచ్ఛి. ౧౪ సూత్రమున బహువచనసంశ్లిష్ట 'డ-ల' లకే యలఘుళకారాదేశమును విధించెనుగాని

[బా. వ్యా. ౧౭ సూ.] కే 'ళ్లు-చప్పళ్ళు-వ్రేళ్లు' మహాకవిప్రయుక్తములు కావు 7లో శేషమునకు విధింపలేదు. కాఁగా "పాళ్ళు - పండ్లు - కోళ్ళు' మున్నగురూపములు సూరికి సమ్మతములుకావనక తెలియుచున్నది. కాని యిట్లు సూరికి సమ్మతములు కావనఁదగు "ఊళ్ళు-నీళ్ళు-వేళ్లు (వ్రేలులు)" మున్నగురూపములు ప్రయోగదృష్టములగుచున్నవి. సీ. అల యనాదిప్రవాహమునైన యేళ్లవం, కలు దిద్దుచే వివేకంబు కలిమి (నరస. ౫ ఆ. ౧౭౩ ప.) గీ. వేళ్ళనీళ్ళులపొంపె వేన్నెళ్ళనొంపె. (మార్కం. ౩ ఆ. ప్రౌఢ. సంధి. ౧౫ సూ.) (౧౯౫౫ III.) 'కోలః' అనుచింతామణిసూత్రము, 'పాళ్ళు-గోళ్ళు' మున్నగురూపములను సాధించుచున్నది. సూరి యుపేక్షించుట వింత.

ఈలోపమాచ్ఛికశబ్దములందుమాత్రమె వర్తిల్లును. ఉదా:— గౌరి-గౌరులు, వనచారి - వనచారులు, ఉళి - ఉళులు, కీలి (అగ్ని) కీలులు మున్నగుసంస్కృతసమశబ్దములందీవిధి వర్తిల్లనేరదు. కావుననేకదా సూరి బహుళగ్రహణప్రయోజనముగా "కోటి పిప్పలి" అనురెండుసంస్కృతసమశబ్దములందుమాత్ర మిక్కార్యము వర్తిల్లుటను సమర్థించికొనవలసెను. "పిప్పళ్ళు" ఇత్యాదిరూపంతుసంస్కృతసమప్రాకృతసమత్వేన జ్ఞేయమ్" (అహో. ౩౩౭ పు.) అని యహోబలపతిప్రాయుట సరికాదు. ఈపక్షమున నకారాంతములగు సంస్కృతసమశబ్దములు సంస్కృతసమప్రాకృతసమత్వమున నాచ్ఛికములు కావలసివచ్చును. కాన నిట్టి యుపమార్గమునఁబోవుట కంటెఁ దత్సమములందె క్వాచిత్కముగా నీవిధిప్రవర్తిల్లునని సూరి యంగీకరించుట యుక్తమనఁదగును. కాని యిట్టి కవిప్రయోగమగపడదు. క. సురపతిశత్రుకోట్లం బూర్వాపరపక్షదినముల...(శాంతి. ౭ ఆ. ౨౫ ప.) ఇట్టి సంస్కృతసమాసగతస్థలములం దహోబలపతి తనమార్గమును విడిచికొని సంస్కృతసమములం దీవిధికిఁ బ్రవృత్తి నంగీకరింపక తీరదుగదా. చ. తనచతురంగసేనలు శతంబులు వేలును గోట్లునున్...(ఉ. హరి. ౬ ఆ. ౮ ప.) వీనిలో 'కోటులు' నిల్పినను క్షతిలేదు.

నేటి ముద్రణసంస్కర్తలు కొందఱు భారతమున "దృష్ట్లు" అనుశబ్దమును బ్రక్షిప్తముచేయుచున్నారు. "దృష్టి-సం-వి-ఇ-స్త్రీ. (బ-దృష్టులు-దృష్ట్లు) ........ క......రా। గమ్మున నన్యోన్యసన్నిహమ్ములు సెడి దృష్ట్లునిలిపి రయ్యవనిపయిన్." (ఆది. ౮ ఆ. ౧౨౬) (సూ. రా. ని.) ఇట సుందోపసుందులను సోదరులు చూచుటలో బహువచనమావశ్యకమని ప్రక్షిప్తపాఠకారులయాశయమై యుండును. ఇట్లె మఱొకచోటను గలదు. ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డపహాసముచేయుచు గూఢరూపరేఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయముమీఁదను దృష్ట్లు నిల్పఁగా।...(విరా. ౪ ఆ. ౭౪ ప.) (వావిళ్ళముద్రణము) ఇట్టి చోటులందెల్ల బహుత్వమునందును జాత్యేకవచనప్రయోగము నిర్దుష్టమగుటంజేసి "దృష్టి నిల్పిరి" "దృష్టినిల్పఁగా" అనురీతిని

పై స్థలద్వయమందును గవప్రయుక్తపాఠములై యుండునని గ్రహింపనగును. "దృష్ట్లు కోట్లు-పిప్పళ్ళు" అనురూపములను నిర్వహింపఁజాలు కవిప్రయుక్తములని విశ్వసింపఁదగిన ప్రామాణికప్రయోగములు లేమిం జేసి యవి యుపేక్ష్యము లనఁ దగును.

బహుళగ్రహణముచేత నీవిధి సార్వత్రికము కాదనుచు సూరి "బహుళగ్రహణముచే విల్లులు - పిల్లులు - పులులిత్యాదులందు లోపంబు లేదు." అని ప్రకృత సూత్రమున వివరించెనుగాని "పిల్లులు - తల్లులు - పులులు- గాలులు (వాయవులు)" ఇత్యాదులందు వర్తిల్లదనుట యుక్తమైనను, "విల్లులు - ముల్లులు" మున్నగుచోట్ల "సలోలోశ్చ" అనుచింతామణిసూత్రముచొప్పున నుల్లోపముకల్గదనుటసరికాదు. అహోబలపతి "సలోలోశ్చ" అనుసూత్రమునకుఁ జేసిన ప్రామాదికవ్యాఖ్య యిట్టి పొరపాటునకు మూలమనఁదగును. (౧౯౯ విష. కల్పతరు.) పై రీతిని విల్లు-ముల్లు-పల్లు - మున్నగు ద్విరుక్త లకారస్థలములందే కాక చెట్టు - పట్టు - గ్రుడ్డు మున్నగు టడల ద్విరుక్తిస్థలములందును నుల్లోపముకల్గును. అట్టియెడల 'చెట్లు - గ్రుడ్లు' అనియె యుండఁదగియున్నను హలంతరసంయోగమున ద్విత్వోచ్చారణము వినఁబడ నేరదు కాఁబట్టి యట్టిచోట్ల నుత్వమేకాక ద్విత్వములోని యొకహల్లును లోపించునని గ్రహింపవలయును. (విస్తర.). ఉదా:—విళ్ళు - ముళ్ళు - చెట్లు- గ్రుడ్లు. మొ.

---

(విస్తర. ౧౯౯ I విష:—సంస్కృతమునందును నిట్టిపద్ధతిగలదు. (౪౫) అనచిచ (౮-౪-౪౭) అచః పరస్య యరో ద్వే వా స్తః నత్వచి. (౪౬) త్రిప్రభృతిషు శాకటాయనస్య (౮-౪-౫౦) త్ర్యాదిషు వర్ణేషు సంయుక్తేషు వా ద్విత్వమ్. ఇన్ద్రః= ఇన్ద్రః, రాష్ట్రమ్ = రాష్ట్రమ్, (౪౭) సర్వత్ర శాకల్యస్య (౮-౪-౫౧) ద్విత్వంన, అర్కః...(౪౮)దీర్ఘాదాచార్యాణామ్. (౮-౪-౫౨) ద్విత్వంన. దాత్రమ్-పాత్రమ్. (సి. కౌ. అచ్సంధి.)

"దీర్ఘాదాచార్యాణామ్...అనచిచేత్యత్ర వా గ్రహణ మనువర్తత ఇతి నాఝలాంవితిసూత్రే కైయటః - ఏవంచ అనచిచేత్యేవద్విత్వవికల్పసిద్ధౌ త్రి ప్రభృతిష్వి త్యాదిసూత్రత్రయం నారమ్భణీయమితి ప్రౌఢమనోరమాయాంస్థితమ్. ఏతత్సూత్రత్రయవిరోధా దనచిచేత్యత్ర వా గ్రహణం నానువర్త్యమితియుక్తం ప్రతిభాతి." (సి. కౌ. ౪౮ సూ. బాలమనోరమావ్యాఖ్య.). అచ్చుకంటెఁ బరమగునట్టియు, హల్పరకమగునట్టియు ద్విత్వములో నొకహల్లులోపించునని యీసందర్భమున వ్యాఖ్యచేసికొనుట యుక్తమని తోఁచుచున్నది. ఇట్టి యుద్దేశముచేతనే కావలయుఁ గొన్నికోశములఁదు తుత్రాదిశబ్దము లేక తకారకములుగఁ జూపఁబడియున్నవి

ప్రయోగములు:— చ. పుత్రులు జన్మమాత్ర ముడి......(హరి. పూ. ౫. ౧౬౯. ౨౦౫ప.) సీ. అర్కనిమనుదయంబు నస్తమయము నగు, పత్రి పౌత్రిమేకలైన... (ద్రోణ. ౨ఆ. ౯౯ప.) గీ. తోయధరవేణిపాదములఁ దుడిచి మెత్త వెట్టి...(వసు. ౯ఆ. ౯౯ప.) ఉ...దంతపుమెత్త వెంబడిం జేసడి...(ఆ. ము. ౧ఆ. ౯౯ప.) సీ. కొత్తు బెహాదుల గొనబుటుంగములందు,.. (అచ్చ. రా. బాల. ౭౭ ప.) (సూ. రా. ని.) చ. శిల లఖలంబు లింగములు చెన్నై సమస్తము కల్పభూజములె! (విక్ర. ౧ ఆ. ౧౯౯ సూ. రా. ని.) గీ. గుప్తు మిడికించుచును క్రుద్ధరూపకీర్తి (శుక. ౯ ఆ. ౩౦ సూ. రా. ని.) చ.........ఒంపు రెంపెసగ గొప్తక నోరికబోక ప్రక్కలన్. (వెం. పంచ. ౧ ఆ. ౯౩౩ ప.)

పంజే. ౧౯౯ II పిష:— 'కాలు - కాలులు - మొసలె - మొసలులు.' అను చోట్లఁ బ్రకృతసూత్రముచొప్పున నుత్వలోపముకాఁగా 'కాల్లు - మొసల్లు' అను

---

ఉదా:— శత్త్రు = శత్రు. మిత్త్ర = మిత్ర. క్షత్త్ర = క్షత్ర. పుత్త్ర = పుత్ర. పత్త్ర = పత్ర. మొ. ప్రయోగములు- శా- క్షత్రియసంశుద్ధులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనఁగా నతిరిక్తులైన నాలుగుజాతులన్ స్వచారిత్రము దప్పకుండఁగఁ బరికీర్తితులైనయట్లు రామమాంధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులన్ (ఆది. ౨ ఆ. ౧౭౭) క. క్షత్రియధర్మంబున మాంధాతృఁడు రాజ్యంబు నీతిఁదగఁ బాలించెన్. శాత్రవదహనంబుగ నిజగోత్రము వెలయంగఁ బ్రజలు గొనియాడంగన్ (నంబిసింగన బలరామవిజయములోనిదని సంగరాట్ఛందము మూఁడవయంకము సంయుతాసంయుతప్రాసపందర్భమున నుదాహృతము) క. శత్రుజనులు చెఱుచుటయును మిత్రులు బ్రదికించుటయును మిన్నక యాపాత్రాపాత్రతయును సంపదయు విధాతృఁడు సంధించుఁ జూవె తజితోఁ బురుషున్ (శాంతి. ౪ ఆ. ౩౭౪ ప.) "విధాత్రాజ్ఞంగలుగుఁజూవె" అని వావిళ్ళవారిముద్రణములోఁ జూపఁబడినపాఠాంతరము ప్రశస్తము. తాళపత్త్రమాతృకలందెల్ల 'విధాతృఁడు" అనుపాఠమె కన్పట్టుచున్నది. క్షత్త్రాదిశబ్దములలోని 'త్ర' ద్విత్వతకారకము. "క్షత్త్ర - పు. క్షణ - క్విప్ - క్షత్. తతస్త్రాయతే - (త్రై+క)........." "మిత్త్ర- న. (మిద్యతి+స్నిహ్యతి - మిద+త్ర)..." "శత్త్రు. పు. (శద+త్రున్)..." "పత్త్ర. న. (పత+ష్ట్రన్)..." "పుత్త్ర (త్ర) పు. (పుతస్త్రాయతే - పున్నామ్నోనరకాద్యస్మాత్। పితరం త్రాయతేసుతః।.........పూ+క్త్ర । హ్రస్వశ్చ)........." (శబ్దస్తో) ఇట్టి వ్యుత్పత్తులచొప్పున క్షత్త్రాదిశబ్దములలో నొకతకారములోపించిన దనుటకుఁ బైమహాకవిప్రయోగములు ప్రమాణము లగుచున్నవి.

రూపములు లభించును. బా. ఆచ్ఛి. ౧౪ సూత్రముచొప్పున వీని 'ల్లు' అనునది 'ళ్లు' అనురూపమును నిత్యముగానందును. కాన సూరి 'కాళ్లు - మొసళ్లు' అని యుదాహరించెను. పరిశీలింపఁగా నీరూపము లపశబ్దములని తోఁచుచున్నది. అలఘులకారము నుచ్చరించినవెంటనె దాని కవ్యవహిత పరముగా సంయోగించియున్న లఘులకారమును బలుకుట కేవలము నశక్యముగదా. కావుననే యథర్వణుఁడు "లడయో రేకరూపతా" యని వచించెను. కేతనయుఁ బెద్దిరాజును గంఠోక్తముగ నిట్టియెడల "ళ్ళు" అనుదానినే విధించిరి.

క. రులుడుడు లంత్యములై నకారులుల నడఁచి తదంత్యములకు ళ్ళృఱ్ఱగు బహుతం। బలుగోళ్ళని కొనవ్రేళ్ళని। కలగూళ్ళని లేళ్ళు నాఁగఁ గ్రమమై యునికిన్ (ఆం. భూ. ౭౭ ప.) గీ. పాలు కుందేలు గోరను పలుకులెల్లఁ। బాళ్ళు కుందేళ్ళు గోళ్ళు నాఁబడుఁ ధరిత్రి. (కావ్యాలం. ౯ ఉల్లా. ౮౮ ప.)

సంజీవని. ౧౯ III విష:—"రోలః" అని నన్నయ ప్రత్యేకముగా సూత్రించి యుండఁగాఁ బయిరీతిని గేతనయుఁ బెద్దిరాజును రేఫమునకు సైతము డలలతోపాటుగ 'ళ్ళు' అనురూపము విధించియుండఁగా సూరి "గోర్లు" మున్నగుచోట్ల సయితము "త్రాళ్ళు - మొసళ్ళు" మున్నగువానియందువలెనె 'బా. ఆచ్ఛి. ౧౪ సూత్రమున నలఘులకారవిధానము చేయకుండుట సరికాదనకతీరదు. సీ. నీతనూభవులు గన్నీళ్ళలు దొరఁగన,త్యంతశోకము (ద్రోణ. ౪ ఆ. 333) శా. వాలారుం గొనగోళ్ళనివలసత న్వాయించుచో...(మనుచ. 3 ఆ. ౫౭) సీ. రవయుంగరంబుల రత్నాల దీప్తులు వాలారుగోళ్ళపై జాలువాఱ (హర. ౫ ఆ. ౪౪ ప.) గీ. వేళ్ళనీళ్ళలనొండె వెన్నిళ్ళనొండె। (మార్కం. 3 ఆ. ప్రౌఢ. సంధి. ౧౫) పైవానిలోఁ గొన్నిట 'ళ్ళు' అనుచో 'ర్లు' అనియె కవిప్రయుక్త మనరాదా యని సూరిపక్షమున సమర్థించిన సమర్థింప నగునేమోకాని, పై ద్రోణపర్వప్రయోగమునందును మార్కండేయపురాణ ప్రయోగమునందును "నీళ్ళలు - నీళ్ళల" అనువానిలో "అపిసంయుక్తసమాప్తౌ భూయోన్తే లః ప్రదృశ్యతే నామ్నామ్" అనుచింతామణిసూత్రముచొప్పున 'ళ్ళు' అనురూపమె కవిప్రయుక్త మనకతప్పదు (౨౦౪ విష.) యతిప్రాసస్థలగతప్రయోగములు లభింపకున్నను బయినుదాహరించినరీతిని నన్నయ కేతన పెద్దిరాజులు కంఠోక్తములుగ సూత్రించుటయును బయిద్రోణపర్వపద్యదులలోని "నీళ్ళలు" మున్నగు ప్రయోగములును నలఘులకారస్థితిని నిర్వహింపఁజాలియున్నవి.

'ఏఱు' శబ్దములోనిది ఱకార మగుటంజేసి 'ఆఱు = ఆఱులు = ఆర్లు, నూఱు = నూఱులు = నూర్లు' అనుచోటులందువలెనే 'ఏళ్ళు' అనురూపము లభింపఁ

జాలవని పైనిర్ణాయింబడెడుగాని "వీఱు - వీళ్ళు" (బాలసర. కథం. ౧౫ కారి వ్యా.) అనుచోట్లన నీవిషయము నిశ్చయింపంజాలము. 'వీఱులు' అనుచో నుత్వ లోపము కల్గినపుడు 'వీర్లు' అనుచోటిని ఱకారము లఘురేఫముగనె మాఱును. బహువచనలకారసంయుక్తరేఫమునకు నలఘులకారాదేశము "గోర్లు = గోళ్ళు, నీర్లు = నీళ్ళు, పేర్లు = పేళ్ళు, నోర్లు = నోళ్ళు, ఊర్లు = ఊళ్ళు, పందిర్లు = పందిళ్ళు, వెదుర్లు = వెదుళ్ళు" మున్నగు ననేకస్థలములందు సమ్మతమైయున్నవి. తేరు = తేర్లు, దారి = దార్లు, దారు = దార్లు, గోరు (ఏఱుగు) గోర్లు, రెండుసారులు = రెండు సార్లు, నూఱు - నూర్లు - ఆఱు - అర్లు మున్నగు ననేకస్థలములందు "అలఘు"లాదేశము సమ్మతమైయుండ లేదు.

బహువచనంబు పరంబగునపు డసంయుక్తంబులయి
యుదంతంబులైన "డ - ల - ర" ల కలఘులకారంబు
బాలవ్యా. బహుళంబుగా నగు. ౧౩.
ఉదాహరణము. క్రాళులు = క్రాడులు, గుమ్మళులు = గుమ్మడులు,
మొగిళులు = మొగిలులు, పిడికిళులు = పిడికిలులు,
ఊళులు = ఊరులు, పందిళులు = పందిరులు.

సంజీవని. ౨౦౦ వివ:—అర్థ—మొగిళులు = మేఘములు. అలఘులకార మున కనుమాపకముగా ద్రావిడ శకారమును నిల్పుట కాలక్రమమున వాడుక కెక్కుటచే సూరి యట్టిపద్ధతి నవలంబించెను. (౧౯౯ వివ.)

ఉపంతత్వము ప్రకృతసూత్రమునందలిది శబ్దసిద్ధముగాని వ్యాకరణసిద్ధము గాని కావచ్చునని "గుమ్మళులు - పిడికిళులు" అను నుదాహృతులె సూరి గారి యట్టి యాశయమును విశదీకరించుచున్నవి. బా. తత్స. ౪౫ సూత్రముచే "గుమ్మడి" మున్నగువాని 'ఇ' కారమున కుత్వము కలుగుచున్నది. ఉదా:—"గుమ్మడి+లు = గుమ్మడులు" అనుచోట ప్రకృతసూత్రమున డా కలఘులకారాదేశమురాఁగా 'గుమ్మళులు' అనురూపము సిద్ధించుచున్నది. ఇట్లె పిడికిళులు - పందిళులు. మొదలగు వానిని సాధించుకొననగును. 'పిడికిలి - పందిరి' మున్నగుశబ్దములందు. బా. తత్స. ౪౬ సూత్రముచే రావలసిన యుపాత్తమేత్వము బా. తత్స. ౪౭ సూత్రముచే వారింపఁబడుచున్నది. సూత్రములోని "అసంయుక్తత్వ" విశేషణముచే "గుడ్డులు (గుడ్డు) గిడ్డులు (గిడ్డి) తల్లులు (తల్లి) మున్నగువానియందలి 'డల' ల కలఘులకారాదేశమురాదయ్యెను. ఇందలి రకారము లఘువే యను సూరి

యుద్దేశ మాతని 'ఊళులు' మున్నగులఘు రేఫమాత్రోదాహృతినిబట్టి యూహింప వచ్చును. బా. సంజ్ఞా. ౧౮ సూత్రము వివరణమున "వ్రేళులు - పాళులు - త్రాళులని బహుత్వమందు "రలడ"ల కాదేశమైన 'ళ' కార మలఘువు." అనువాక్యమునందును "ర" అనుదాని కాదేశమైన" అనియే సూరి వచించుటంజేసి రేఫమునకే యలఘులాదేశమనియు నందలి "వ్రేళు" లనుదాని యేకవచనము లఘురేఫఘటితమగు "వేరు - దే - వి - ఎద్దులనుగట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి.........౨తలనొప్పి......" (శ-ర) అని యుదాహరింపఁబడిన యేరుశబ్దమేయనియు నదీవాచకమగు 'ఏఱు' శబ్దము కాదనియు నిర్ణయింపనగును.

నేఁటిముద్రణములందును గొన్ని తాళపత్రమాతృకలందును, నీసూత్రమునకు లక్ష్యములు పెక్కు కన్పట్టుచున్నవి. బాలవ్యాకరణ తదనుయాయిలక్షణ గ్రంథములవ్యాప్తిచే నట్టిరూపములు గ్రంథములకెక్కినవో? అట్టిలేఖనముల చేతనే సూరి ప్రభృతులిట్లు సూత్రించిరో తెలియకున్నది. 'ఊళులు - వేళులు - గోళులు - మున్నగువానిలోని యలఘులకారాదేశమును నిర్వహింపఁజాలు ప్రాసాదిస్థలనిబద్ధప్రబలప్రయోగములు లభించుట కవకాశమున్నను కన్పట్టలేదు. కాని నేఁటిముద్రణాదులలో నిట్లున్నవి. తే-గీ. నేఁడు పదినాళు లేని...... (భీష్మ. ౩ ఆ. ౩౬౮ ప.) మ. వెలుచంగోళులనొత్తి.........(అను. ౧ ఆ. ౨౩౫) క. మొగిళులు లేకయు నుఱుములు.........(భీష్మ. ౧ ఆ. ౯) గీ. తఱిమి నీళులు ద్రావించి తడవిముగుడ.........(ద్రోణ. ౩ ఆ. ౧౬౩) ఆ-వె. కేలుదోయిగడుగ వ్రేళుల తుదనంటు.........(పాండు. ౩ ఆ. ౧౮౦) పై చోటులందెల్ల "పదినాఁడు లేనియు, గోరులనొత్తి - మొగిలులు - నీరులు - వ్రేలులు" అనియె కవిప్రయుక్తములనుటలో క్షతియేమియు లేదు. లఘ్వలఘులకారములకే కాక మూర్ధన్యళకారదంత్యలకారములకును యతిప్రాసమైత్రి కవిసమ్మతమైయుండుటచేత నీయలఘులకారాదేశ తదభావములను లకారపక్షమున నిర్ణయింపఁజాలు ప్రయోగములు దొరకుట దుర్లభమనఁదగును మహాకవిప్రయోగ ప్రామాణ్యము లేనపుడు ప్రాచీనప్రామాణిక వైయాకరణోపదేశరూప ప్రామాణ్యమైన నుండవలయును. ప్రకృతసూత్రమునకు లక్ష్యములగు "త్రాళులు - గుమ్మళులు - మొగిళులు - పిడికిళులు - ఊళులు - పందిళులు" మున్నగువానిలోని యలఘులకారాదేశమునకట్టి ప్రాచీనవ్యాకరణ ప్రామాణ్యముసైతము లేమింజేసి యట్టిరూపములు నిర్మూలములనకతీరదు. నాఁడు - మూఁడు మున్నగునవి సబిందుకములగుటచే వానిలోని యలఘులకారాదేశము వ్యాకరణ విరుద్ధమునగుచున్నది. (౪౮-౫౦ విష.) ఊరులు మున్నగువానిలోని

'ఊళ్లు' మున్నగుస్థలములందును నలఘులకారద్వయాదేశమును జేయకుండుటయు నవిమర్శితమూలకమె యనఁదగును. ఇట్టి సూరి ప్రక్రియ ననుసరించియే యనుశాసన గాణపతవివరణకర్తలును బహువచన లకారమునకు నలఘులకారాదేశమును సూత్రింపవైరి.

సహజోకారముతోఁ గూడిన లడలకేకాక బా. తత్స. ౪౫ సూత్రము చొప్పునవచ్చు నుత్వముతోఁ గూడిన లడలకును నలఘులకారాదేశము గల్గుననుచు సూరి యిట్టి ద్వివిధోదాహృతులను నొసంగెను. త్రాళ్లు - గుమ్మళ్లు. మొ. సూత్రమున నద్విరుక్తములనుటచే గ్రుడ్డు మున్నగుశబ్దముల బహువచనరూపములు "గ్రుళ్లు" మున్నగురీతి నేర్పడనేరవు. బహువచన శ్లిష్టంబులనుటచేత త్రాళ్లకా-త్రాళ్లచేతఁ మున్నగు ద్వితీయాది బహువచనరూపములందును బ్రకృతసూత్రము వర్తిల్లునని యెఱుంగునది. "ఏండ్లు - ఔండ్లు" మున్నగుచోటులందు బా. సంజ్ఞా. ౧౭ సూత్రముచే బిందుపూర్వకస్థిరస్థితి నిషేధింపఁబడుటంజేసి ప్రకృతసూత్రము చొప్పున 'వేళ్ళు - తెళ్ళు' అనురీతిని నలఘులకారాదేశము సంభవింపనేరదు.

కాలవాచకము - దినవాచకమునగు నాఁడుశబ్దమును బ్రిత్వవాచకమగు మూఁడుశబ్దమును సబిందుకములు గాన బా. సంజ్ఞా. ౧౭ సూత్రముచొప్పున వాని లోనిడకారమున కలఘులకారాదేశము రానేరదు. ఇంక బా. ఆచ్ఛి. ౧౫ సూత్రము చొప్పున వానిలోనిఖండము పూర్ణముకాఁగా రెన్నాండ్లు - మూన్నాండ్లు - మూాండ్లు, మున్నగురూపము లేర్పడును. "రెన్నాంళ్ళు - మూన్నాంళ్ళు - మూాంళ్ళు" అనురూపములు కల్గనేరవు. ఈవిషయమునే సూరిగారుత్తరసూత్రపు వివరణమునందు "ఏండ్లు - కాండ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి. తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు" అని స్పష్టముగా వివరించిరి. పైసందర్భమునుబట్టి "గురుమూర్తిశాస్త్రి పంళ్లు - పుంళ్లు - ఇంళ్లు - కంళ్లు మున్నగు నబిందుకరూపములును దనవ్యాకరణమున నుదాహరించెను." (ఆం. భా. అ. శబ్ద. ౭౩ సూ. వివ.) అనురీతి నుదాహృతములగురూపములు సాధువులు కానేరవని విశదమగుచున్నది. (విస్తర.)

---

విస్తర. ౨౦౧ విషః—క. పదిదినము లైదుప్రొద్దులు।పదపడి రెన్నాళ్ళు నొక్కపగలుఁ రేయున్ (ఆది. ౧ ఆ. ౬౯ ప.) గీ...।ఏఁగుదెంచితి మిన్నాళ్ళు నెల్ల యొప్పి।దములఁ జూచితి మిర్యోడ (ఉద్యో. ౧ ఆ. ౪౨) అని యిట్లు భారత ముద్రణములందు నిర్బిందు కాలఘులకారద్వయరూపములు చూపట్టుచున్నవి. కొన్ని తాళపత్త్రమాతృకలందును నీరూపములు కన్పట్టుచున్నవి. పండితవ్యవహారస్థమును

సర్వాచీనకవిసమ్మతమునునగు నీయాలక్షులకారవ్యయరూపము లేఖకప్రమాదస్థ-
స్థలమూలముచే నిట్లు ప్రామాణికగ్రంథముల కెక్కినదని తోచుచున్నది. "మూఁడు-
చే-స-రెండు నొకటి. ఇది సాధింపదగునటువంటి సవిత్రయాదుల ప్రయోగము
లందు దగినయుదాహరణములు లేకపోయిన యిది బహువచనమున మూళ్ళని
వాడఁబడుచున్నది." (శ-ర). అని యిట్లు శబ్దరత్నాకరకర్త మూళ్ళనురూపము
నాధారముగఁగొని మూఁడుశబ్దము నిర్బిందుకమని సాధించుట కేవలము సాహసము.
క. పోండిగ నగజతపక్షిభ మూండుజగంబులను దీప్రమునగు బద్వెర ప్రక్షించినవా
నాచిన కాంచనఖండము ప్రయం దాల్చె సర్వ్యభ్మాకాశితమై (సర్వ. ప. ౬ ఆ.
౧౧౫ ప.) ఇట్టి ప్రాచీనమహాకవిప్రయోగములచే మూఁడుశబ్దము సబిందుకమను
టలో విప్రతిపత్తియుండరాదు. శబ్దరత్నాకరకర్త నాఁడుశబ్దము నైత మిట్లు
రెన్నాళ్ళు మున్నగు వ్యావహారికరూపములనుబట్టి నిర్బిందుకమునుగ యితము కానట్లు
నని వ్రాసెను. "నాఁడు. దే. న. ఆకాలము. ఉ. వేఁడి...నాఁడే...నాఁడు...
(రా. అ. కాం.) ప్రామాణికకవిప్రయోగములం దిది నిర్బిందుకముగా [illegible]
యుది. క. మీఁటుగల...నొక్కనాటికి...లో నాఁటి... వేఁడూని...(ప్రా. శివ.
౧ ఆ.) మఱియు రెన్నాళ్లు - మున్నాళ్లు. మొ." (శ-ర). 'వేఁడూని' అనుచో
సబిందుకమని యంగీకరించి యీపద్యమున శబ్దరత్నాకరకర్త సఖండాఖండప్రాసము
నంగీకరించెనుగదా. ఇంక నాఁడుశబ్దము నిర్బిందుకమనుట కీపద్య మెట్లాధారమగు
నని యాతఁడు తలంచెనో తెలియకున్నది. 'వేఁట' శబ్దము సబిందుకమనుటకు విప్రతి
పత్తియే లేదుగదా. ఇంతయేల! యీపద్యమునెయుదాహరించి యుందలినాల్గు
చరణములలోని ప్రాసస్థలగతపదములు సబిందుకములె యనుచు సూ. రా. నిఘంటు
కర్తలు నాఁడుశబ్ద మెల్లయర్థములందును సబిందుకమె యని వ్రాసి దీని బహువచన
రూపము 'నాళ్లు' అని యుండునని యువ్రాసిరి. "నాఁడు. వి. ఔ. (బ. నాళ్ళలు.
నాళ్లు)..." (సూ. రా. ని). ఇట్టిభారత ప్రయోగమునుబట్టియు మీఁద నుదాహరిం
చిన రామాయణప్రయోగమునుబట్టియు "నాంటి - నాండు" మున్నగు ప్రాచీనలేఖన
ములనుబట్టియు నాఁడుశబ్దము సబిందుకమె యనుట నిశ్చయము. కానఁ బయిభారత
ప్రయోగములలో "రెన్నాండ్లు-ఇన్నాండ్లు" అనిదియె భట్టారకునిచేతను సోమయాజి
చేతను ప్రయోగింపఁబడెనని విశ్వసింపనగును. 'రెన్నాళ్ళు - ఇన్నాళ్ళు' అనురూప
ములలోని ళకారద్విత్వమును నిర్వహించుప్రాసస్థలఘటిత ప్రాచీనప్రయోగ మెచ్చ
టను లేదు. మూఁడు-నాఁడుశబ్దములు సబిందుకములగుటచేత "తృతీయే ప్రథమేవర్ణే"
(౫౦ విష.) అనునథర్వణసూత్రపునియమముచొప్పునను బా. సంజ్ఞా. ౧౬ సూత్రము

సంజీ. ౨౦౧ విష:—ప్రయోగములు:—ఆ. వె. అరిగి యుంకనైన నమ్ముదు నశ్శ్వయు।న ప్రశోకవహ్నినార్పవయ్య (అర. ౪ ఆ. ౧౨౧) సీ. సీళ్ళు సూపిన గంధ సింధురం బను రేఖ (ద్రోణ. ౨ ఆ. ౧౧౪). తే॥ గీ॥ రెండు వీళ్ళజనంబులు రేలు వివిధ।...(భీష్మ. ౨ ఆ. ౩౮౩) చ. నిరతముగాదు గాండివము నిల్వఁగ నోర్వ వుగాళ్ళ...(భీష్మ. ౧ ఆ. ౧౮౧) క. పెదవులు దడుపుచుఁ గాళ్ళన్।గుదివడ వడఁకుచు...(ద్రోణ. ౨ ఆ. ౨౫౩) కం. వాణి యనఁగ మాయరాని వాకిళ్ళివి

---

చొప్పునను "రెన్నాంళ్ళు - రెన్నాళ్ళు" మున్నగురూపములు వ్యాకరణసంప్రదాయ విరుద్ధములననగును. కాని, "తే-గీ. విల్లుపట్టిన పదియేనునాళ్ళలోన।వీఁకగలిగిన తడ విల్లువెదురువిల్లు।..." (కాళ. 3 ఆ. శ. ర. విల్లుశబ్దము) అనుధూర్జటికవిప్రయోగము మాత్రము నిపాతన్యాయమున ననింద్యగ్రామ్యముగా నంగీకరింపకతీరదు. 'మూఁడుచు' అనునది సబిందుకమె యయ్యు నుల్లోపమునందిన 'మూడ్చు' అను రూపములోని బిందువు సంయోగపరకత్వమున నిలువఁజాలక లోపించినట్లును వేసఁగి - పోఁడిమి మున్నగువానిలో స్థిరవర్ణాదేశము చికీర్షితముకాఁగా 'వేసవి - పోఁడిమి' అనువానిలోని బిందువు లోపించినట్లును 'నాండ్లు' అనుదానిలో సైతము ళాదేశమునకు ముందు నిలువఁజాలక బిందువులోపించెనని యర్వాచీనకవియగు ధూర్జటితలంచెనని గ్రహింపనగును. ఇట్లు మహాకవిప్రయోగము లున్నచోటులందు మాత్ర మంగీకరించుట యుక్తముగాని యెల్లయెడలను "తృతీయే ప్రథమేవర్ణే..." (౪౦ విష.) అనునథర్వణవచనమును దానివివరణమగు బా. సంజ్ఞా. ౧౬ సూత్రమును నుపేక్షించి పళ్ళు (పండ్లు) బళ్ళు (బండ్లు) తూళ్ళు (తూండ్లు) ఏళ్ళు (ఏండ్లు) గూళ్ళు (గూండ్లు) మూళ్ళు (మూండ్లు) గుళ్ళు (గుండ్లు) గళ్ళు (గండ్లు) గిళ్ళు (గిండ్లు) తేళ్ళు (తేండ్లు) దళ్ళు (దండ్లు) పిళ్ళు (పిండ్లు) వెళ్ళు (వెండ్లు) మున్నగు రూపముల నంగీకరించుట యుక్తముకాదు. (౮౮-౪౦ విష.). అనుశాసనకర్తగారు "ఏండ్లు - కాండ్లిత్యాదులందు..." (బా. ఆచ్ఛి. ౧౪ సూ. వివ.) అనుసూరిగారి వివరణము సరికాదని నిరాకరించి "బహువచనమునందు ఉకారము లోపించునపుడు పండు మొదలగు కొన్నిశబ్దముల డకారమునకు ళకారమును దానివెనుకనుండు సున్నకు లోపమును బహుళంబుగానగు" (ఆం. భా. అ. శబ్ద. ౭౩ సూ.) అని సూత్రించిరేకాని యద్దానిని సమర్థింపఁజాలు మహాకవిప్రయోగము నొక్కటి నేనియుఁ జూపజాలరైరి. తుదికి నేఁటిశ్రీకృష్ణభారతమునుండి "ఇప్పటికృతులలో నున్నవి. ఆ॰. లేళ్ళుందుప్పులు...।తూళ్ళోళ్ళతిండికి...(కృ. భా.)" అని యొక్క ప్రయోగమునుజూపిరి.

ప్రాస్వో త్వాఽర్ణోఽపి భవేద్దీర్ఘాచ్ఛే ఖండ ఏవ స జ్ఞేయః.
నన్నయా. (ఆం. చిం. సంజ్ఞా. ౮ కారి. అహో. ౧౨౬ పు.)
౧౦౩ విష. తృతీయే ప్రథమే వర్ణేపరఏవహి దృశ్యతే।బిన్దు ర్వైకృత మధ్యేతు।నాన్యవర్ణే పరేతు సః. (వికృ. సంజ్ఞా. ౧౦ కారి. అహో. ౧౨౭ పు.)

కల్ప. ౧౦౩ విష:—ఇక్కారికల కీవఱకు వ్యాఖ్య చేయఁబడెను. చూడు. ౭౮ విష. ౫౦ విష. ఈకారికలయర్థమును ప్రయోగానుసారముగ సూరియీక్రింది రీతిని విస్తరించి వివరించుచున్నాఁడు.

సమానపదంబునందు సంయోగంబు పరంబగునపు
డెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు. ౧౫.

బాలవ్యాకరణ వివరణము. :౧౦౩ I విషయము. అనఁటులు - అనంట్లు, పసఁటులు - పసంట్లు, గోఁటులు - గోంట్లు, తేఁటులు-తేంట్లు, ఏఁడులు-ఏండ్లు, కాఁడులు - కాండ్లు. ఏండ్లు, కాం డ్లిత్యాదులందు డాకు ళాదే శంబు కొందఱు వక్కాణించిరి. తెఱఁగున బిందు పూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబు కాదు.

సంజీ. ౧౦౩ I విష:—పసఁటి = కుండ, గోఁటు = ఒయ్యారము. ౨ స్వర్ణ కటకము, తేఁటి = తుమ్మెద, ఏఁడు = వత్సరము, కాఁడి = నాఁగలి మొదలగువాని యుగము. సమానపదంబునందు = అఖండపదంబునందు.

'అనఁటులు' అనునపుడు బా. అచ్చిక. ౧౨ సూత్రముచొప్పున నుత్వలోపము రాఁగా 'అనఁట్లు' అని యేర్పడును. అట్టియెడ 'ట్లు' అనుసంయోగము పరమయి యుండుటచే ముందటిఖండబిందువు నిత్యముగాఁ బ్రకృతసూత్రముచేఁ బూర్ణము కాఁగా 'అనంట్లు' అనురూప మేర్పడుచున్నది. ఇల్లె యంతటను బ్రక్రియ నెన్నునది. బహువచనపరకస్థలములందెల్ల నీవిధి యవ్యభిచరితముగ వర్తిల్లును. తక్కినయెడల యథాసంభవముగా వర్తించును. తీఁడిరించు = తీండ్రించు. ఇట్టియెడల వర్తించినది. 'మాఁడుచు = మాడ్చు' ఇట్టియెడల బిందువే లోపించినది. ఇల్లె ఖండబిందువునకుఁ దర్వాతనున్న హల్లునకు స్థిరవర్ణాదేశము గల్గునపుడు ప్రాయికముగ నట్టి స్థిరవర్ణా దేశము నివారితమగును. అట్టియెడలఁ గ్వాచిత్కముగా బిందువెలోపించి స్థిరవర్ణా దేశమె ప్రవర్తిల్లుటయుఁగలదు. ఉ. "ఏఁడులు = ఏండ్లు" అనుచోఁ బా. అచ్చి. ౧౮ సూత్రముచొప్పున రాఁదగిన ళాదేశము నివారితమగును. 'నాఁడు-నాఁడులు= నాండ్లు' అనుచో మాత్రముపాక్షికముగ ళకారాదేశము ప్రవర్తించి బిందు

గ్రహించునది. ముల్లు - ఇల్లు మున్నగునౌపవిభక్తిక సల లువర్ణాంతశబ్దములకు ముళ్ళు - ఇళ్ళు మున్నగురూపములు లభింపనేరవని సూరియాశయము. కాని "సణోర్లోశ్చ" అనుసూత్రముచే నట్టి రూపములు చింతామణిసమ్మతము లగుచున్నవి. (౧౯౯ విష.)

ఔపవిభక్తికలీనామిత్యాది:—లు ల యోః పరతః = (పూర్వసూత్రముల నుండి యథ్యాహార్యము.) బహువచన లు ల లు పరమగుచుండఁగా, ఔపవిభక్తిక లీనామ్ = ఔపవిభక్తికశబ్దముల తుదియుండు లివర్ణమునకు, ఇల్లుక్ = ఇకారలోపము, బహుళమ్ = బహుళముగా, స్యాత్ = అగును. తథైవ = ఆప్రకారముగానే, డుశ్చస్యాత్ = డువర్ణమునగును. అనఁగా లు ల పరకత్వమున బహుళముగా బిందుపూర్వకడువర్ణము లివర్ణస్థానమున నగును. డువర్ణమున కుల్లోపమును వికల్పముగా నగును. ఉదా:—రోఁకలి - రోకలులు. ఇకారలోపము రాఁగా, రోఁకల్లు (కాల్లు మొసల్లు మున్నగువానివలెనెయగును. చూ.౧౯౯ విష.). బిందుపూర్వకడువర్ణము వచ్చుపక్షమున 'రోఁకండులు,' అగును. దాని కుత్వలోపము రాఁగా "రోఁకండ్లు" అని యగును. ఇట్లె గుద్దలిమున్నగువానికిని రూపచతుష్టయంబు నెన్నునది. "బహుళగ్రహణాత్...గుద్దలి - గుద్దండ్లు, రోఁకలి - రోఁకండ్లు, కొడవలి - కొడవండ్లు, అటకలి-అటకండ్లు, ఇత్యాదౌ ప్రవృత్తిః. పందిలి-పందిళ్ళు, రాళ్ళు. అత్రాప్రవృత్తిః..." (అహో. 3౮౧ పు.) అని కవిశిరోభూషణమున వివరింపఁబడెను. ఇది సరికాదు. రోఁకలి ప్రభృతుల కీయాదేశము నిత్యమనుట నిరాధారము. ఈయి శబ్దము లివర్ణాంతము కామింజేసి యిటనుదాహరించుట యసంగతము.

ఔపవిభక్తికంబుల లివర్ణ సల లువర్ణంబులకు బహువచనంబుపరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగానగు. ౧౬.

కొడవలి - కొడవండులు, ఉల్లోపంబు - కొడవండ్లు.

బాలవ్యా. పక్షంబునందలఘులకారంబు-కొడవళులు - కొడవళ్లు-

వివరణము. కొడవలులు. రోఁకలిప్రభృతుల కిట్లు రూపంబు

౨౦౩ I విషయము. లెఱుంగునది. ఇల్లు - ఇండులు - ఇండ్లు - ఇల్లులు. ఇట్లు - కల్లు - పల్లు - ముల్లు విల్లుశబ్దంబులకు రూపంబులు తెలియునది. మద్యనిమ్నార్థకంబులైన కల్లు - పల్లుశబ్దంబులును తెల్లుప్రభృతిశబ్దంబులు నౌపవిభక్తికంబులగుటంజేసి వాని కీకార్యంబులేదు.

సంజీ. ౨౦౩ I విషః—కొడవలి = వరిచేను మున్నగువానిని గోసెడిపని ముట్టు. "కల్లు = ౧ కన్ను. ౨ బండికన్ను. ౩ తాయి. వై. ౧ మద్యము......" (శ. ర) పల్లు = ౧ దంతము. ౨ నిమ్నము. విల్లు = ధనుస్సు. కల్లుశబ్దమునకు నేత్రమనునర్థము సూ. రా. నిఘంటువునఁ జూపఁబడకుండుటకుఁ గారణము తెలియకున్నది. కల్లుశబ్దము మద్యమనునర్థమున నవైపవిభక్తికము. తక్కిన మూఁడర్థము లందును నౌపవిభక్తికమె. పల్లుశబ్దము నిమ్నార్థమున ననౌపవిభక్తికము. దంతమను నర్థమునం దౌపవిభక్తికము. కొడవలిశబ్దము భారతమునం దనౌపవిభక్తికముగఁ బ్రయోగింపఁబడినది. మధ్యకవులు దాని నౌపవిభక్తికముగఁ బ్రయోగించిరి." కొడవలి - వి - ఔప - అనౌ......క......కొడవంటఁగోయు నరవడి...(వరాహ. ౧౨ ఆ. ౨౪) గీ. ఒల్లయు వైరాగ్య మనుకొడవలిచేఁగాని (భా. శాంతి. ౪ ఆ. ౧౯౨ ప.)" (సూ. రా. ని.). 'కొడవలిశ్+అ - కొడవలిన' అని ప్రాసయతి స్థానప్రయుక్తమగుటంజేసి దీనియనౌపవిభక్తికత్వ మంగీకరింపక తప్పదు. కావున భారతపక్షమున "కొడవలులు - కొడవళ్ళు - కొడవళులు" (బా. అచ్చి. ౧౨-౧౩-౧౪ సూ.) అనుమూఁడురూపములె బాలవ్యాకరణసాధ్యములగును. అందు 'కొడవళులు' (బా. అచ్చి. ౧౩ సూ.) అనురూపము నిస్సారమని యాసూత్రపు వ్యాఖ్యలోఁ జెప్పఁబడినది. ఇఁక మధ్యకవిప్రయుక్తమగు నౌపవిభక్తికత నాశ్రయించినచోఁ, బ్రకృతసూత్రముచొప్పున "కొడవండులు - కొడవండ్లు" అనెడి మఱిరెండురూపములు నైతము సాధ్యములగును. బా. అచ్చి. ౧౪ సూత్రము చొప్పున శాదేశ మిందలిబిందుపూర్వకడకారమునకు రానేరదని సూరిగారె "పండ్లు-కాండ్లిత్యాదులందు........" అనువాక్యముతో బా. అచ్చి. ౧౫ సూత్రపు వివరణమున వక్కాణించియున్నారు. సూరిగారిమతముచొప్పున రోఁకలి - గుద్దలి మున్నగు నౌపవిభక్తికలివర్ణాంతశబ్దముల కెల్లఁ బైనివ్రాసినరీతిని రూపపంచకము సిద్ధించును. ఇంక నౌపవిభక్తికములగు లలువర్ణాంతములైన విల్లు - ముల్లు మున్నగుశబ్దములకు విల్లులు - ప్రకృతసూత్రముచొప్పున బిందుపూర్వడువర్ణము రాఁగా, "విండులు - విండ్లు" అనురూపత్రయము సిద్ధించును. ఇల్లె - ఇల్లు - పల్లు (దంతము) కల్లు (కన్ను - బండికన్ను - తాయి) మున్నగుశబ్దములకును రూపముల నెన్నవలెను. కల్లుశబ్దమునకు నేత్రమనునర్థమున "సీ. ఏవేల్పు తలఁపంగ నినచంద్రులను బండికండ్లుగాఁ గండ్లుగా ఘనతఁజేసె (భల్లా. ౧ ఆ.)" "(ఈయర్థమున నీప్రయోగ మొక్కండ కానంబడియెడి" (శ. ర) అను నీయొక్కప్రయోగముమాత్రమె లభించెనని శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. సూ. రా. నిఘంటువున దీని కీయర్థమే చూపఁ

బడలేదు. బాలకవిశరణ్యము ౧౬౩ పుటలోఁ జాలప్రయోగము లాధునికకవి ప్రయుక్తములు చూపఁబడినవి. అవియెల్ల ననుశాసనమునందును (త్రి-ము. ౧౫౫ పుట. శబ్ద. ౭౮ సూ. వి.) గాణపతవివరణమునందును (అచ్చి. ౧౨ ప. ౨౭౫ కారి. ౧౮౩ పు.) జూపఁబడియున్నవి. చ. కడువడిఁ బానొకొక్కయెడఁ గండ్లెఱచేయుచు (రాజశే. ౩ ఆ. ౨౬)........మొ. "బహుళగ్రహణముచే విల్లులు పిల్లులు పులులిత్యాదులందు లోపములేదు" (బా. అచ్చి. ౧౨ సూ. వివర.) అనుసూరిగారి వివరణముచొప్పున ముల్లు - విల్లు మున్నగువాని కుత్వలోపమే లేమింజేసి, ముళ్ళు-విళ్లు మున్నగురీతి రూపములు కల్గనేరవని సూరి యాశయము. (విస్తర. I-V.)

---

విస్తర. I ౨౦౩ I విష:—"కల్లు = కలు - వి - ఔ - అనొ...ఆయి...౨ బండిచక్రము." (సూ. రా. ని.) అని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెనేకాని దీని యనొపవిభక్తికత్వమును నిర్వహించు ప్రయోగ మొక్కటేని చూపఁబడలేదు. ఆ. వె...చీఁకటియనక ముండ్లు గండ్లనక తెరలి(ఆసి. ౬ ఆ. ౧౬౨ ప.)మున్నగునవి దానియాపవిభక్తికత్వమునె నిర్ణయించుచున్నవి. అనొపవిభక్తిక మద్యార్థక కల్లుశబ్ద మీకోశమునందు "కల్లు" అను వేఱుశబ్దమైయున్నది.

విస్తర. II ౨౦౩ I విష:—"ులలు పరమగునపుడు లి - ల్లు-న్ను వర్ణములు తుదఁగల కొన్నిశబ్దముల తుదివర్ణంబులకు నిండుసున్న పూర్వమునఁగల డువర్ణము బహుళముగా నగును" అని యిట్లు బాలవ్యాకరణసూత్రార్థమును సంగ్రహించుటలో ననుశాసనకర్తగారు బిందుపూర్వక డువర్ణమనక నిండుసున్న వెనుకఁగల డకారమని మార్చుటచేత, "ముండులు - రోఁకండులు" మున్నగురూపము లనుశాసనమునకు సాధ్యములుకానివయ్యెను. ఇట్లె పేటికావ్యాఖ్యాతయు నీసూత్రపు వ్యాఖ్యతుదిని "ండ్" అని మాత్ర మాదేశించినఁ జాలునని తోఁచెడి" (బా. సా. వే. ౨౨౩ పు.) అని ప్రామాదికముగా వ్యాఖ్యచేసెను.

విస్తర. III ౨౦౩ I విష:—"కండ్లుశబ్దము కన్నుశబ్దబహువచనరూపములలో నొకటి.........కల్లుశబ్దబహువచనము 'కండ్లు.' కన్నుశబ్దబహువచనములు 'కన్నులు - కండ్లు - కళ్లు'...వీనికిఁ బ్రయోగములు:—బొట్టు దిద్ది యంజనము గండ్లఁదీర్చి (కవిజ). కడగండ్లఁబడువారిఁ గడగండ్ల నీక్షించి (ని వి.రా)..." (ఆం.భా.అ.శబ్ద. ౭౮ సూ.)ఇట్లిచట నయిదాఱాధునికకవిప్రయోగములు చూపఁబడినవి. ఇట్లనుశాసనకర్త కండ్లుశబ్దము కన్నుశబ్దబహువచనరూపమును నని వ్రాసెనే కాని యందులకుఁదగిన యాధార మేమియుఁజూపలేదు. ప్రామాణికవైయాకరణులెవ్వరును 'కండ్లు' శబ్దము 'కన్ను' శబ్దబహువచనమగునట్లు ప్రక్రియచూపి సాధింప

లేదు. న్నువర్ణాంతశబ్దములలో మఱొక్కటికైన నిట్టిరూపము గలదని యనుశాసన కర్తగారును జెప్పలేదుగదా. మన్ను-మన్నులు, మిన్ను-మిన్నులు, వెన్ను - వెన్నులు మున్నగురీతినేకదా వానిరూపములు వెలయుచున్నవి. మఱియు "కండ్లు" అను ప్రయోగసిద్ధమగుచున్న బహువచనము "కల్లు" శబ్దమునుండి యుత్పన్నమగుచున్న దని చింతామణియే "సలలో ద్విందయుతో డుర్వా" అను ప్రకృతసూత్రముతో సాధించుచున్నదిగదా. ఇట్టిస్థితిలో "కండ్లు" అనునది కల్లుశబ్దమునకే కాక కన్ను శబ్దమునకు నయితము బహువచనరూపమని యంగీకరించుటకు బ్రసక్తి యేమున్నది? ప్రమాణ మేమున్నది? 'కండ్లు' అనురూపమునకును దాని నేత్రార్థకత్వమునకును ప్రాచీనకవిప్రయోగములు లేవు. అర్వాచీనులు "కల్లు" శబ్దమునకు బ్రసిద్ధమై యున్న "బండికన్ను" అనునర్థమునుబట్టి దానికి నేత్రార్థకత్వమును బ్రయోగించి రనియు దానిబహువచనరూపము 'కండ్లు' అనుటకు వివాదమే లేదనియు గ్రహిం చుట యుక్తము.

విస్తరము. IV ౨౦౩ I విషయము:—"విల్లుశబ్దప్రకృతరూపము (స్త్రీశబ్దము సంకేతార్థకము కాదు.) విలు. ఇదిద్విత్వరహితముగాన బహుత్వమున 'విలులు = విల్లు = విళ్లు' అనిరూపమందఁదగును." (బా. సా. పే. ౧౪ సూ. వ్యా. ౨౧౪ పు.) అనియు, "ఇల్లుమొదలగు లకారసంయోగాంతములకు ప్రకృతిర్ణ ౧౪ చే ఉత్వలోపము గల్గినపక్షమున (ఇలు+లు) ౧౨ చే నుత్వలోపముగలిగి ౧౪ చే నిత్యముగా నః ఘుళకారము సిద్ధించి బహుత్వమున ఇళ్ళు - ఇళ్లను మున్నగురూపములును బహుముగఁ గలుగుట కవకాశ మగపడెడి" (బా. సా. వే. అచ్చి. ౧౬ సూ. వ్యా.) అనియుఁ బేటికలో వ్రాయఁబడెను. ఇది యొకయపమార్గము. అహోబలపతి "సలో లోశ్చ" అనుచింతామణిసూత్రమునకుఁజేసిన యపవ్యాఖ్య ననుసరించి సూరి "ఇల్లు - విల్లు - పల్లు" మున్నగువానికిఁ జింతామణిసమ్మతములగు "ఇళ్ళు - విళ్ళు - పళ్ళు" మున్నగురూపముల నుపేక్షించియుండఁగా (౧౯౫ విష.) వల్లు "విల్లు" మున్నగువాని కుల్లోపమురాదని వివరించియుండఁగా (౧౯౫ I విష.) నట్టిసూరి సూత్రములనే యనుసరించుచు బయిరీతిని సూరికి సమ్మతములుగానిరూపములను సాధింప యత్నించుట సరియా? ఇట్టి లుప్తశేష "లు" వర్ణముల యుత్వము నైతము బా. అచ్చి. ౧౨ సూత్రముచొప్పున లోపింపరాదనికదా సూరి యాశయ మును వర్ణింపఁదగును.

విస్తర. V ౨౦౩ I విష:—ఈసందర్భమునందెల్ల సూరియుఁ దదనుయాయు లగు ననుశాసనపేటికాగాణపతాదికర్తలును శబ్దరత్నాకర, సూ. రా. నిఘంటు

సంజీవని. ౨౦౩ II విషయము:—ప్రకృతసూత్రములోని బహుళగ్రహణమునఁ బెండిలి మున్నగు కొన్నిశబ్దము లనౌపవిభక్తికములయ్యు నిందలికార్యములను బాక్షికముగ నందునని యెఱుంగునది. "పెండిలి - పెండిండ్లు. అనౌపవిభక్తికత్వే ప్యత్ర ప్రవృత్తిః." (అహో.౩౮౧ పు.). ఉదా:—పెండిలి-పెండిలులు-పెండిళ్ళు. (బా-అచ్చి. ౧౨-౧౮ సూ.). పెండిండులు-పెండిండ్లు. మొ. క. పెనుమినుకుఁ ద్రోవఁ బెండిం| డ్లొనరించి........(అచ్చ. రా. బాల. ౨౦౨ ప.). ఇట 'పెండిళ్ళు'అన్నను క్షతిలేదు.

"పెండ్లి. దే. వి. పెండిలియొక్కరూపాంతరము (బ. పెండ్లిండ్లు)" (శ. ర) పయిఁచింతామణిసూత్రమునుగాని సూరిగారిసూత్రమునుగాని పెండిలిశబ్దముపయి వర్తిల్లఁజేయు, నగునుగాని పెండ్లిశబ్దముపై వర్తిల్లఁజేయరాదు. 'పెండ్లి+లు' అనుచో 'లి' అనుదానికి బిందుపూర్వకడువర్ణ మాదేశమగునపుడు "పెండ్+ండు+లు" అనుననిష్టరూప మేర్పడును. కాన నీసూత్రము పెండిలిశబ్దము పయినిమాత్రమె వర్తింపనగును. ఉదా:—పెండిలి+లు = పెండి+ండు+లు = పెండిండులు. ఇట్లు బహువచనరూపము "పెండిండ్లు" అని యగునుగాని "పెండ్లిండ్లు" అని కానేరదు. మఱియు నీబహువచనరూపమును 'పెండిలి' శబ్దమునొద్దఁ జూపుట యుక్తముగాని "పెండ్లి" శబ్దమునొద్దఁ జూపుటయుక్తముకాదు. ఇట్టిప్రమాద భూయిష్ఠమగు శబ్దరత్నాకరము నాశ్రయించికావలయు ననుశాసనకర్త "పెండ్లి శబ్దమునకు లు ల లు పరమగునెడ నిండుసున్న వెనుకఁగల డువర్ణమాగమ మగును. ఉదా:—పెండ్లి+ండు+లు = పెండ్లిండులు. ఉకారలోపము. పెండ్లిండ్లు - పెండ్లిండ్లను." (ఆం. భా. అ. శబ్ద. ౮౧ సూ.) అని వ్రాసెను. మఱియు శబ్దరత్నాకర మట్టి ప్రాచీనవ్యాకరణసాధ్యముకానిరూపమును జూపెనేకాని యద్దానిని నిర్వహించు కవిప్రయోగమునేని చూపలేదు. ఇంతియకాక యీక్రింది సోమనారాధ్యుని ప్రాసప్రయోగము శబ్దరత్నాకరరూపమును బ్రతిఘటించుచున్నది. ద్విపద. పెండ్లిండ్ల నోములఁ బేరంటములను|బండుగుదినములఁ బాటిజాతరల (బసవ. 3 ఆ. 3౨౬ ప.)

ప్రయోగములు:—సీ. ఏవేల్పు తలఁపంగ నినచంద్రులను బండికండ్లుగాఁ గండ్లుగా ఘనతఁజేసె (భల్లా. ౧ ఆ. శ. ర.) చ. కడువడిఁ దానొకొక్కయెడఁ గండ్లెఱ

---

కర్తలును నుచ్చారణమునకు శక్యముకామింజేసియు నన్నయాథర్వణసమ్మతము కామింజేసియు నసాధువనఁదగు "ళ్లు" అనురూపమునె వాడియున్నారు. అందెల్ల 'ళ్ళు' అని సవరింపనగును.

కన్నులు, అంతలు సేసి, తమయంతలవారితోన. మొ. ప్రయోగము:—గీ...ఓటి| కడవ నీళ్ళులు వెట్టినకరణి...(శాంతి. ౧ ఆ. ౩౩౨.) ఎ-గీ చూపులులచూడ్కి కి (కళా. ౭ ఆ. ౭౬ ప.) (సూ-రా-ని). క. తక్కటిచూపులు లెంతయు | వెక్కసపడ (విరా. ౧ ఆ. ౮౨) ఉ. ఇంతలుకన్నులుండఁ దెవ| వెవ్వరి వేడెదు భూసురేంద్ర (మను. ౨ ఆ. ౮౧) ఉ. అంతలుసేసి పోనడిచి (ఉద్యో. ౩ ఆ. ౧౦౧). మ.....మీకుం గీడునాఁ డట్లు ము|ష్కరులై సేసిరి యంతసేసియును బశ్చాత్తాపముం బొందనో| పర.........(ఉద్యో. ౩ ఆ. ౩౬ ప.). ఉ. అంత కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్ (ఉద్యో. ౩ ఆ. ౧౦౧). వీనఁ బ్రత్యయము రాలేదు. క. చెలిమియు సంభాషణమును|బలిమి వివాదంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమ<u>యం|తల</u> వారితోన తగు నధి|కులహీనులతోడ నైనఁ గొఱగాదధిపా. (ఉద్యో. ౨ ఆ. ౮౬.)

జసీత్యాది:—అత్ర = ఈమానవాచకములందు, జసిచ = లు ప్రత్యయము మీఁద, ఏసిః = ఏసివర్ణకమును, భవేదితి = అగునని, మృదుభాషణః = మృదుభాషణుఁడనుపండితుఁడు, ఆహ = పల్కుచున్నాఁడు. ఉదా:—అంతలేసి - ఇంతలేసి మొ. మ. తలఁపంగూడునె యింతలేసిదొర లీదైన్యంబు.........(ఉద్యో. ౩ ఆ. ౫౯ ప.) ('ఏసిః' అనునది యపపాఠము.).

సమాప్తేత్యాది:—కేచిత్ = కొన్ని, సమాప్తవర్ణకాః = వివక్షితార్థబోధకములగుచు సమాప్తమగు ప్రక్రియగలవై యుండఁగా, దేశ్యే = దేశ్యశబ్దములందు, పునరపి = మరలఁ దదర్థబోధకప్రత్యయాంతరములై, శ్రుతాః = వినఁబడును. ప్రత్యయరూపము భిన్నమయినను నర్థపునరుక్తి వెలయుచుండునని తాత్పర్యము. ఉదా:—"సమాప్తవర్ణకాః కేచిత్...తరళేక్షణకలిపి కోలుతనమున <u>(విస్తర.)</u> మెలఁగెన్, ఇత్యాదౌ తాద్ర్థస్యోక్తత్వేపి తనవర్ణకః సాధుః" (అహో. ౩౮౨ పు.) సీ.........మద్వ్యభిచారకారు (తే-గీ.) <u>లారకాన</u> దురాచారు <u>లారకాన</u> ...... (వరాహ. ౯ ఆ. ౯౨.) ఆమంత్రణమందలి యారగాగమముపైని 'కాన' పునరుక్తమయ్యె.

---

విస్తర. I ౨౦౮ విషయము:—కలియు ధాతుప్రేరణరూపము కలుపు. ఆత్మనేపదార్థమున 'కొను' ధాతుయోగమున 'కలిపికొను - కలుపుకొను' అని యేర్పడును. "భావమునం దనుప్రయుక్తంబగు కొనునకుం గోలు విభాషనగు" (ప్రౌఢ. క్రియా. ౧౩ సూ.) అనుచొప్పున 'కలిపికోలు-కలుపుకోలు' అనుభావార్థకరూపము లేర్పడును. మరల స్వార్థమునం దనఁగా భావార్థమునందె "తనవర్ణకంబు తాద్ర్థంబునం దగు" (బా. తద్ధి. ౧) అనుచొప్పున 'తాద్ర్థమునం' దనఁగా భావార్థమందు తనవర్ణ

హలంతరసంయుక్తమగు బహువచన లుప్రత్యయమునకు మరల లుప్రత్యయము నిల్చుటకలదని చింతామణికర్త యుపదేశింపఁగా నట్టి లుప్రత్యయము క్వాచిత్కమనియు నట్టి స్వార్థిక లుప్రత్యయము హలాంతరములందును నిల్చుట గలదనియు "కథితాస్స్వార్థికాస్సామాన్యకారికతో" నథర్వణుఁడు వివరించెను. ఇట్టి వారు - వీరు - ఎవ్వారు - మీరు శబ్దముల బహువచనప్రత్యయము నందలి వర్ణములు హలంతరసంయుక్తములు కాకున్నను వానిపై నియమితము మరల లు లక్షణములు నిల్చుననియు నయ్యవి పరమగునపుడు ముందటి 'ఉ' వర్ణము 'అ' కారమగుననియు సర్వనామ ప్రకరణమున "జసః స్థానే పరస్త్రే స్యాత్ క్వచిదత్వం భవేద్ధలే" అనుసూత్రముతో వివరింపఁగలఁడు. ఉదా:—వారలు-వీరలు, ఎవ్వారలు-మీరలు. క్వాచిత్కమగుట చేత ఒకరులు మున్నగుచోటులయం దత్వము రాదని యెఱుంగునది. ఈరీతిని

---

కముచేరఁగా "కలిపికోలుతనము = కలుపుకోలుతనము" అనురూపములగును. పైవానిలో "కొనుధాతువు పరంబగునపు డీకాగమంబు బహుళంబుగానగు" (బా. క్రియా. ౫౩ సూ.) అనుచెప్పున నిత్యమువచ్చెనని యెఱుంగునది. "వ-తెచ్చికోలు వలపుదెలుపు కలుపుకోలుతనంబులు సలుపుమ" (రామా. ౫ ఆ. ౧౩౪ శ. ర.) శబ్దరత్నాకరమునందును దదనుయాయి సూ. రా. నిఘంటువునందును, "కలుపుఁగోలుతనము" అని సామాసికప్రత్తకావ్యములతో నుదాహరించుట సరికాదు. "కలుపు" అనునది యాత్మనేపదార్థమున ననుప్రయుక్తమగుకొనునకుఁ (కొను-భావార్థ-కోలు) ప్రకృతియగుటచేఁ బ్రేరణార్థకధాతు వనుటకు సందియములేదు. కాన బా. సంధి. ౫౫ సూత్రముచెప్పున ద్రీపదములపై నిల్చు నుగాగమము వచ్చుటకుఁ బ్రసక్తిలేదు. భావార్థకకృదంతకోలుశబ్దము ధాతువున కనుప్రయుక్తమగు కొనుశబ్దమున కాదేశమగుటచే ధాతువుపైనె నిల్చుట సంప్రదాయము. ఉదా:—గీ. తమి నెదుర్కోలుసేయుమాతల్లి చెలుల (కళా. ౭ ఆ. ౭౭)ఇచ్చుకోలు-పుచ్చుకోలు మున్నగుచోట్ల "ఇచ్చుఁగోలు-పుచ్చుఁగోలు" మున్నగురీతిని, 'ఇచ్చుకొనుట-పుచ్చుకొనుట' మున్నగుచోట్ల "ఇచ్చుఁగొనుట-పుచ్చుఁగొనుట" మున్నగురీతిని రూపము లుండనేరవుగదా. అట్లయినను "మ...అట్టివారలకుఁ గల్పుంగోలు పుట్టింప...మణిమైనన్ మూలికైన న్మనీ" (చంద్రా. 3 ఆ. ౧౦౮. శ. ర. సూ. రా. ని.) అను ప్రయోగము నాశ్రయించి పైకోశకర్తలు పైరీతిని వ్రాసిరి. ఆధునికకుఁడగు నీ పైఁడిమఱ్ఱి వెంకటపతి యిట్టి నిర్మూలప్రయోగములు పెక్కు ప్రయోగించెను. ఇట్టికవుల ప్రయోగములనుబట్టి ప్రాచీనాంధ్ర మహాకావ్యభాషాలక్షణములను మార్చుట సరికాదని తోఁచెడిని.

భట్టారకుఁడును నథర్వణుఁడును బ్రథమా లుప్రత్యయపునరుక్తినిమాత్రమె విస్తరించి చెప్పుటచేత వానికి వైయర్థ్యము కలుఁగకుండునట్లుగ సమాప్తేత్యాద్యథర్వణకారిక నన్వయించుట యుక్తమైయుండ నహోబలపతి యాక్రిందిరీతి నద్దానిని సమన్వయించుట సరికాదనఁదగును.

"అపి సంయుక్తసమాప్తౌ భూయోప్తే లుః ప్రదృశ్యతే సామ్నామ్.వ్యా... 'ఇది సొరంగ నశక్య మెవ్వరికి' నిత్యాది తరలపద్యే మొసళ్ళలు ఇత్యాచార్యప్రయోగః (విస్తర. II). సమాప్తవరకాః కేచిద్దేశ్యే పునరపి శ్రుతాః ఇత్యథర్వణోక్త్యా అత్రాపి (చింతామణియందలి) లువర్ణకస్యోపలక్షణత్వమ్ - ఏతచ్చాచార్యస్యాభిప్రేతమేవ - సుందరి నాకోడంద్రురయం దభ్యర్థితవు నీవు (సభా. ౨ ఆ. ౨౫౭) ఇత్యాది తత్ప్రయోగాత్ - అత ఏవ - తెలశేకుణ కలిపికొలుతనమున మెలఁగెర్ ఇత్యాదౌ త్వార్థస్యోక్తత్వేపి తనవర్ణకః సాధుః" (అహో. ౩౪౧-౩౪౨ పు.) ఇట్లహోబలపతి పునరుక్తస్వార్థికప్రత్యయములకెల్ల సమాప్తేత్యాదికారికనె మూలముగ నన్వయించుటంజేసి "కథితార్థా దిత్యాదికారికకేకాక" అపిసంయుక్తేత్యాది చింతామణికారికకును వైయర్థ్యము సంభవించుచున్నది. ఇట్టి యర్థమే సమాప్తేత్యాదికారిక కథర్వణాభిప్రేతమైయున్నచో నాతఁడు "కథితార్థాత్ క్వచి ల్లుః" అనుసూత్రమును మరలఁ జెప్పియుండునా? మఱియు నథర్వణుఁడు చింతామణి చెప్పిన లువర్ణపునఃప్రవృత్తి నంత విస్తరించి నవరించునపుడు "కోడంద్రురు" మున్నగురూపములే సమ్మతములై యున్నయెడల వానిని లువర్ణపునఃప్రాప్తి విధాయక సూత్రమగు కథితార్థాదిత్యాది సూత్రమున లువర్ణముతో జోడించి వచించునుగాని యేవేవో ప్రత్యయముల పౌనరుక్త్యమును వచించు సామాన్యవిధిలో ననిర్దిష్టముగఁ జొనుపునా? ప్రథమాప్రత్యయమునకుఁ దప్ప

---

విస్తర. II ౨౦౪ విష:—ఈతరలపద్యములో నేఁటిముద్రణములందు 'మొసళ్ళలు' అనుదానితో నున్నపాఠమె లేదు. "తరల. ఇది సొరంగ నశక్య మెవ్వరికి.........వీని నెన్నఁడు నాడనోడుదురు సన్మనులిందుఁ గోల్మొసదుల్ గొనుర్ వడిఁ జొచ్చుదుర్" అని నేఁటి వావిళ్ళవారిముద్రణమున నున్నది. (ఆది. ౮ ఆ. ౧౪౮ప.) "ఆడనోడుదురు సన్మనులున్ మొసళ్ళలు లోఁగొనుర్ వడిఁ జొచ్చుదుర్" అనునది యహోబలపండితుఁడు చూచినపాఠమై యుండును. (లడయతి). అయినను నిట్టిప్రయోగము లింకనుగలవు. తే-గీ......ఓటికడవ నీళ్ళలు వెట్టిన కరణియగు... (శాంతి. ౧ ఆ. ౩౩౨ ప.) తే-గీ. ప్రాప్తమైనది నీళ్ళలు పల్లమునకు (శాంతి. ౪ ఆ. ౪౧౩ ప.) ఉ.........వేనవేలైనవి యూళ్ళ లిట్లుమర (హరి. పూ. ౫ ఆ. ౭ ప.)

మఱియే ప్రత్యయమునకును నిట్టి రూపమునందును నర్థమునందును నభేదము గల పునఃప్రవృత్తి లేకుండుటచేతను ఉక్తైక పునఃప్రవృత్తివిషయమును ప్రత్యేకముగఁ దాను (అథర్వణుండు) విస్తరించి చెప్పుటంజేసి దానికి వైయర్థ్యము రాకుండ సూత్రాంతరము రచించుట యుక్తమగుటచేతను 'కోదండ్రము' మున్నగురూపములె స్వాభిమతములైనచో వానిని "కథితాక్తాదిత్యాదిసూత్రములో వేఱుగఁజెప్పుటవసరమగుటచేతను, సమాస్తేత్యాదికారిక సమాసార్థకప్రత్యయాంతరపునఃప్రవృత్తిమాత్ర విషయకమనియు ఉ - ప ప్రత్యయ పునఃప్రవృత్తి విషయకము కాదనియుఁ జెప్పుటకు సందియములేదు. అహోబలపతి తనసిద్ధాంతమునకు మూలముగ నుదాహరించినట్టి "కోదండ్రురయందు" అనురూపము తన పక్షమునకొప్పునట్లైనను నెట్లు సాధింపఁబడునని తలంచెనో తెలియకున్నది. అచట సమాస్తవర్ణకమగు "రు" వర్ణకము పునఃప్రవృత్తమగుచున్నదన్నచో "కోదండ్రురునందు" అను ననిష్టరూపము సిద్ధింపవలసివచ్చును. సమాస్తవర్ణకము రవర్ణక మన్నచో "కోదండ్రరయందు" అను ననిష్టరూపము సిద్ధింపవలసివచ్చును. "కోదండ్రురయందు" అనురూప మహోబలపతి సమన్వయమున సిద్ధింపనేరదు. ఇట్లే క. ఇక్కువవరు వాండ్రురలోఁ బొక్కుతే...(స్త్రీ. ౨ ఆ. ౧౬౨ ప.) అనుస్థలమునందును నహోబలపద్ధతి చొప్పున "ఆంధ్రురలోఁ - ఆంధ్రరలోఁ' అను ననిష్టరూపములె యుప్పతిల్లును గాని 'ఆంధ్రురలోఁ' అనెడి యహోబలపతివాంఛితరూపము సిద్ధింపనేరదు. (విస్తర. III)

అహోబలపతిమతమును విమర్శించుటకుఁ బయికితిని వ్రాసితినిగాని ద్వితీయాది బహువచనపక్షమున నీవిధి వర్తించుటయే దుర్ఘటము. "కోదండ్రురయందు, ఆంధ్రురలోఁ" మున్నగు చోటులందు 'అందు - లోఁ' మున్నగు ప్రత్యయములు చేరక ముందు సమాస్తవర్ణకత్వ మనఁగా సమాస్తప్రక్రియాకత్వ మెట్లు సంఘటిల్లును? అట్టియెడల "అందు-లోఁ" మున్నగు ప్రత్యయములు ప్రకృతిని జేరినపిదప వానికి సమాస్తవర్ణకత్వము సిద్ధించునే కాని, లాగమమునకును దదాదేశభూతమగు 'ర' అను

---

విస్తర. III ౨౦౮ పుట:—పయిరీతిని బ్రామాణికమగు నహోబలపతి సమన్వయమునే తదనుయాయులెల్లరు ననుసరించిరి. (ఆం. భా. అ. శబ్ద. ౮౩ సూ. వివ; గాణ. అచ్చి. ౯ ప. ౨౮౨ కారి. వివ; కవిజనమండన ౫౮ కారి. వ్యా; సూ. రా. ని. ఆలు.కోడలుశబ్దములయొద్దఁ జూడునది.) "దేశ్యంబునఁ గొన్నియెడల మహన్మహత్యర్థకబహువచనాంతనామంబులపై మరల బహువచనప్రత్యయంబులు చూపట్టెడు, ........ వేడుకకాండ్రురు - కోదండ్రురు... మొ" (ప్రౌఢశబ్ద. ౪౭ సూ.).

దానికిని నెట్లు సిద్ధించును? ఈ యనుపపత్తులెల్ల "నీళ్ళులన్ నీళ్ళులయందున్" మున్నగురూపములు సాధించుపట్లను సయితము నన్నయాథర్వణుల ప్రక్రియలో సంభవింపకతీరదు. కావున, "కోడంద్రురయందు-అంద్రురలోన్" మున్నగువానితో పాటుగ "నీళ్ళులయందున్ నీళ్ళులన్" మున్నగురూపములును నన్నయాథర్వణీయ సాధ్యములు కామింజేసి నిర్మూలములె యని చెప్పకతప్పదు. అట్టి ప్రయోగములును లేవు.

పయిరీతిని 'కథితార్థా'దిత్యాదిసూత్రమును బ్రకృతవిషయమున నుపచరింపఁ జేసికొనకపోవుటచేతనే యాసూత్రమునకు "చూపఱులు...మిమ్ము - మిమ్ములన్ ఇత్యాది" (అహో. 33౫ పు.) అని యుదాహరించికొనవలసినయవస్థ యహోబల పతికి సంభవించెను. 'మిమ్ములన్' అనురూపమె నన్నయాథర్వణసమ్మతము కాదు. కవిత్రయమువా రెల్లయెడలను 'మిమ్మున్' అనియే ప్రయోగించిరి. ఇంక 'చూప ఱులు' అనునదియు 'ఒకరులు' మున్నగువానితోపాటుగ 'సమాప్తవర్ణకా ఇత్యాది సూత్రమునకే యహోబలపతిపక్షమున లక్ష్యము కాఁదగియుండఁగా నట్లు చేయక దానిని 'కథితార్థా'దిత్యాదికారికకు నగతికముగ లక్ష్యముచేయుటకు యుక్తి యేమున్నది? ఇట్లహోబలపతిపక్షమున "కథితార్థాత్ క్వచి ల్లుః"అనుదానికి లక్ష్యమే లేకుండుటచే నిర్విషయత్వము ప్రసక్తమగుచున్నది.

నన్నయాథర్వణసూత్రములనుబట్టి పయిరీతి నిర్ణయముచేయఁబడెనే కాని "అందురు - ఎనమందురు - పెక్కండురు" మున్నగువానిలోఁ గేవల 'డు' వర్ణమె కలదనికాని "అంద్రురు - కోడంద్రురు - ఎనమంద్రురు" మున్నగురీతిని రేఫ సంయుక్త డకారముకలదనికాని నిర్ణయింపఁజాలు యతిప్రాసాదిస్థలగతప్రయో గము మహాకవి ప్రయుక్తమని విశ్వసింపఁదగినది లభింపలేదు. అట్లయినను నీ క్రింది ప్రయోగము లా రెండువిధములలో నొకరీతివి కవిసమ్మతములని నిర్ణయింపఁజాలును. పయిరీతిని నన్నయాథర్వణసూత్రములు 'కోడందురు - ఎనమం దురు - పెక్కండురు' అనురీతి రూపములుగలవని స్పష్టముగా వచించుచున్నవి. రువర్ణక పునఃప్రాప్తికి నన్నయాథర్వణీయసమ్మతి కన్పట్టలేదు. కాన "కోడంద్రురు - ఎనమంద్రురు-పెక్కండ్రురు" మున్నగురీతి రూపములు సాధువులు కావనుటకు సందే హింపనక్కఱలేదు. ప్రయోగములు:—ఈ క్రిందిపద్యములలో ముద్రణసంస్కర్తలు 'ద్రు' రూపముల నిల్పిరిగాని యవి ప్రక్షిప్తములు. క...దీప్తపటురథోదారులగుచు నెనమందురువీరులు దఱిమిరి.........(ద్రోణ. 3 ఆ. ౨౧౬) ఆ-వె. ఒక్కసతికిఁ బత్తులు పెక్కండు రగు టిది (ఆది. ౮ ఆ. ౨౫.) మ. పొరిఁ బెక్కండురు విచ్చుచుం

బోదువుచున్ (ద్రోణ. ౨ ఆ. ౨౩౬) సీ. ఒర్వక పెక్కండు దుర్వృత్తు లొక్కటఁ బైనెత్తివచ్చిన...(శాంతి. ౧ ఆ. ౨౩౮) చ........దుర్యోధనుఁ గూడియున్న వెలివాండురపల్లియఁజేరి యయ్యెడన్ (శాంతి. 3 ఆ. ౨౮౭) చ. ఏసినుది నాదు వల్లభకు పెండురు గ్రమ్మఱ నింతసేసిరే (విరా. 3ఆ. ౨౭ గాణ. ఆచ్ఛి. ౫౫-౨౭౨ కా. వ్యా. వావిళ్ళవారిముద్రణమున 'పెండ్రను' అని యున్నది.) క. వేదుకతాండురకు నిచ్చు వివిధార్థంబుల్ (విక్ర. ౨ ఆ.) క. సుందరి వాకోండురయుం దర్పిష్ఠాత్ము... (సభా. ౨ ఆ. ౨౪౭) తే.గీ. అచ్చెరువుగాదె యెవ్వరి యాండుర కింకి...(విరా. ౨ ఆ. ౧౪౨) క. ఇక్కడవరు వాండురలో నొక్కత...(స్త్రీ. ౨ ఆ. ౧౭౨) సీ...పతికి నిమ్ము. తే.గీ. జీవమాండురఁ జెక్కండ్రఁజేసికొనుట (అశ్వ. ౪ ఆ. ౬౫) తే.గీ. ఆండు రిద్దరుఁ దోనిల్వ నమృతకరుని (స్వర్గా. ౧ ఆ. ౬౪) చ. కలుముట దోసమే మగలఁ గల్గక యాండురు దొల్లి యాండురంగలుతురె (నన్ని. ౮ ఆ. ౧౪౧.)

ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం

బాలవ్యా. బయి బహువచనంబు నెనయు. ౧౭.

౨౭౮ I విషయము. కొడవన్లులు - కొడవన్లులను - కొడవళ్ళులు - కొడవళ్ళులను. ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

సంజీవని. ౨౭౮ I విష:—ఒకానొకచో ననుటచే నీవిధి యరుదుగ వర్తిల్లు నని భావము. నామంబు = ప్రాతిపదికంబు, సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి = బహువచనప్రత్యయముతోడి సంయోగము తుదినిగలరూపముతో సరియగు రూపముగలదై, బహువచనంబు నెనయు=బహువచనప్రత్యయమునుగూడును.బహువచన ప్రత్యయముతోఁ గూడినదానిపై మరల బహువచనప్రత్యయము నిల్పుట సరికాద నియు బహువచనసంయుక్తమువంటియాకారముగలదై నామము బహువచనము నెనయుననుట యుక్తమనియు సూరియాశయము. (విస్తర.).సంశ్లిష్టబహువచనాంత తుల్యంబనుటచేత 'కొడవలులులు' మున్నగురూపములు సిద్ధింపనేరవని తాత్ప

---

విస్తర. ౨౭౮ I విష:—ఇట్టి సూరిగారియాశయమును వ్యాఖ్యాతలు పాటించిన ట్లగపడదు. "ప్రాతిపదికము బహువచనలకారముతోఁ గూడికొని పున రుక్తంబుగ బహువచనంబు నొందును" (బా. గు. ప్ర. ఆచ్ఛి. ౧౭ సూ. వ్యా.) "కొన్ని సంశ్లిష్టబహువచనాంతములమీఁద మరల బహువచనప్రత్యయము నొక్కొకచో నగును." (ఆ. భా. అ. శబ్ద. ౮౩ సూ.) "ప్రాతిపదికము తుదియక్ష రము బహువచనముతోడఁ గలిసికొనియు మరల బహువచనప్రత్యయమును బొందు టయుఁ గలదు." (బా. సా. వే. ఆచ్ఛి. ౧౭ సూ.)

ర్థము. సూరి "ప్రథమైకవచనతుల్య"మ్మను (౧౬౭ విష.) చింతామణిపద్ధతి నిచట నైతమవలంబించి సంశ్లిష్టబహువచనాంతతుల్యరూపము నంది ప్రాతిపదికము బహువచనము నెనయుననుట యుక్తముగనే యున్నది. కాని యిట్లు చెప్పకయు విరుద్ధము కాకుండ నట్టి పునఃప్రవృత్తిగల 'లు' ప్రత్యయ మొకస్వార్థికప్రత్యయవిశేష మను నట్లుగ నన్నయాథర్వణులు వచించిరి. "ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది" అని సూరిగారు వ్రాసిరేకాని తాముదాహరించిన "కొండవండ్లులను - కొడవళ్ళులను" అనువాని కేమిప్రయోగప్రామాణ్యమును జూచుకొనిరో తెలుపలేదు. "కొండనంశ్లులు - కొడవళ్ళులు" అనువానికిఁ గవిప్రయోగములు దొరకినను దొరకకున్నను క్షతిలేదు. కాని పయికల్పతరువులో (౨౦౮ విష.) వివరించిన చొప్పున లువర్ణకసంశ్లిష్టరూపములపై లవర్ణకముయొక్క కాని లాగమముయొక్క కాని పునఃప్రవృత్తి నన్నయాథర్వణీయసాధ్యము కామింజేసి నిరాధారమగుచున్నది. (౨౦౮ విష.). సూరిగారిసూత్రముచేఁ బైరూపములు సాధ్యములగుచున్నను నట్లు సూత్రించుటకు సూరి కాధారమేమున్నది? మహాకవిప్రయోగములా, లేవు. నన్నయాథర్వణీయసమ్మతియైన లేదు. నన్నయాథర్వణులు సంయుక్తసమాప్తమయ్యెను లువర్ణకము మరల నామములపయిఁ గన్పట్టుచున్నదని వచింపఁగా సూరి స్వాభిమతరూపనిష్పత్తి కనుకూలముగా మార్చి నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యముగా నేర్పడి బహువచనంబు నెనయునని సూత్రించెను. కాని యట్లు ప్రామాణికవైయాకరణసూత్రమును మార్చుటకు మహాకవిప్రయోగములు తాఁజేసినమార్పును నిర్వహింపఁజాలునవి చూపనక్కఱలేదా ?

స్వన్తా న్నామ్నః కుజ్ నో ర్బహువచనే (ఆం. చిం.

నన్నయా. అజం. ౧౭ కా. అహో. ౩౨౬ పు)

౨౦౫ విషయము. కేషాంచి న్న్వన్తశబ్దానాం । కుజ్ స్యా ద్గుః సార్ధబిన్దుకః. (వికృ. అజం. ౪౧ కారి. అహో. ౩౨౬ పు.)

కల్పతరువు. ౨౦౫ విషః—స్వన్తాత్ = నువర్ణము తుదినిగలిగిన, నామ్నః = ప్రాతిపదికముకంటె, బహువచనే = బహువచనప్రత్యయము పరమగుచుండఁగా, నోః = అట్టి ప్రాతిపదికముతుదినున్న ను వర్ణస్థానమున, కుజ్ = కుజాదేశము నిత్యముగా నగును. జిత్త్వముచే 'కు' అనునది. బిందుపూర్వకమగునని వ్యాఖ్యచేయ నగును. (౧౨౭ II విస్తర. ౧౩౦ విష.) ఇచట "స్వన్తాత్" అను పంచమికి 'స్వన్తస్య' అనుషష్ఠ్యర్థమును జెప్పవలెనని యహోబలపతి వ్యాఖ్యచేసెను. "స్వన్తనామ్నో నోః కుజాదేశః స్యా ద్బహువచనే పరే. స్వన్తాదిత్యత్ర సదిరప్రతేరితా

దాదిష విభక్తి ప్రత్యయః. హల స్తస్మాత్ సానునాసికోచ్చారణం జిత్." (అహో. 3౨౬ పు.) ఇచటి 'సానునాసికోచ్చారణం జిత్' అను ప్రాకృతవ్యాకరణసంప్రదాయ మిచట నుపచరింపదని యీవఱకె నిరసింపఁబడెను. (౧౨౩ ౫ పు.). ఇంక విభక్తివిషయ సామాన్యవిషయముగ యుక్తము నన్నయాభిప్రేతము కావనియు నయ్యదియుచట నాల మాలినదనియు నీవఱకె చూపఁబడెను. (౧౬౫ పు. కల్ప.). "సంఖ్యావాచిత ప్రకృతి కాత్ పరతః పరే స్థితే చ నస్య స్యాత్తి"ని యిచటి సంకేతసు ఖవ్యాఖ్యానమును భట్టాకళంకుడే కంఠోక్తముగాఁ జూపియున్నాఁడు. ఉదా:— కొలఁకు+లు = కొలఁ–కుచ్+లు= కొలఁకులు - కొలంకులు - ఇక్కడ ప్రాఁకు+లు = ప్రాఁకులు. ద్విత్వమునిరాఁకుటిగాన ఖండమమాత్రమె నిల్చినది. ఇది సార్వత్రికముకాదని యుత్తరసూత్రమున సూచించుచున్నాఁడు.

కేషాంచిదిత్యాది. కేషాంచిత్ - స్వస్తశబ్దానామ్ = కొన్ని సువర్ణాంతశబ్దములకుమాత్రమె, కుచ్ స్యాత్ = భట్టాకుఁడు చెప్పిన కుఙ్ వచ్చును. కుఁస్యాత్తి'' యు పాఠము లేఖకాదిప్రమాదకృతము. కేషాంచిత్తనుటచే, మేఁకులు - పీఁకులు - కౌఁకులు మున్నగుచోట్ల నియమాదేశముకాదని యెఱుఁగునది. పుజ్యుఁడు గొన్నిట 'గు' వచ్చునని చెప్పుచున్నాఁడు. కేషాంచిత్ స్వస్తశబ్దానామ్ = కొన్ని సువర్ణాంత శబ్దముల ను వర్ణస్థానమున, సాస్థబిన్దుకః గుః = అర్ధబిందుపూర్వకముగ, 'గు' అనునాదేశము, స్యాత్ = అగును. ఇట్లనుటచేత నీగుక్నాదేశము దీర్ఘపూర్వక నువర్ణస్థానమునందే వచ్చునని వ్యక్తమగుచున్నది. ఉదా:— రేను+లు = రేఁగులు. గోలు+లు = గోఁగులు.

'కుజ్ నోఽష్టబహువచనే' అనుచింతామణిసూత్రములోని 'బహువచనే' అనునది కేషాంచిదిత్యాది ప్రకృతాథర్వణసూత్రమున ననువర్తించును. లేనిచో నథర్వణ విధానమున వాశబ్దము లేమింజేసి 'కలను - కొలను' మున్నగు నువర్ణాంతప్రథమైక వచనరూపములు లేకపోవలసివచ్చును. బహువచనమునందువలెనె యేకవచనము నందును 'కుజ్జు' నిత్యముగా వర్తింపవలసివచ్చునుగదా. అట్టియెడల "క......|పంట కలను పొలికలనిది|గంట నిధానంబు గంట గాచే మనకుఁ."(భీష్మ. ౧ ఆ. ౯౫) అను నది మున్నగుప్రయోగములు విరోధించును. ఇట్లగుటంజేసి యీక్రింది యహోబల పతివ్రాత సరికాదనఁదగును. "అత్రాథర్వణసూత్రే 'బహువచనే' ఇత్యస్య అనుపాదానాత్ గోఁగుచెట్టు ఇత్యాదిసమాసేప్యాదేశః సిద్ధః" (అహో. 3౨౬) అచ్చిక సమాసములో 'లోపశ్చ విభక్త్యాదేః' అనుచింతామణిసూత్రముచొప్పున 'వేల్పుల యొక్కదారి = వేల్పుదారి' అను చోటువలెనె "గోఁగులయొక్క+చెట్టు - గోఁగు

చెట్టు" అనుస్థలమును నిర్బాధమనఁదగును. "మనుజులయొక్క+దొర=మనుజులదొర" మన్నగుసాధ్యసమాసములలో షష్ఠీభవేద్ద్వితీయాతుల్యేత్యాదిచే లవర్ణలోపము సిద్ధింపదు. అట జాత్యేకవచనమన్నను క్షతిలేదు.

కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు ; బహువచనంబు పరం

బాలవ్యా. బగునపుడు నిత్యముగా నగు. ౧౮.

వివరణము. కలఁకు - కలను - కలఁకులు. కలను - కెలను - కొఱను -

౨౦౫ I విషయము. కొలను - గవను - నెఱను - మ్రాను - వరను - వలను.

ఇవి కలన్వాదులు.

సంజీవని. ౨౦౫ I విష:—అర్థములు. కలను = ప్రదేశము - యుద్ధము - కళ్ళము, కెలను = పార్శ్వము, కొఱను = దున్నకవిడిచినబీడు, కొలను = సరస్సు, గవను = దుర్గద్వారము - ద్వారము, నెఱను = మర్మస్థానము, మ్రాను = వృక్షము, వరను = చిక్కు - ఇక్కట్టు, వలను = దిక్కు, ప్రక్క - ఉపాయము - ప్రదక్షిణము.

కుజ్జు బహుత్వమున నిత్యమనుటచే నేకత్వమునఁ బాక్షికమని విశదమగుచున్నది. సూరి యేకవచనమున వైకల్పికరూపద్వయమునే యుదాహరించెను. జిత్త్వమునంజేసి కుజ్జుబిందుపూర్వకమని గ్రహింపవలయును. మ్రాను+కుజ్ = మ్రాఁకు, ఇట దీర్ఘముమీఁదిదిగాన ఖండబిందుమాత్రమె నిల్చెను. కలఁకు - కలంకు మున్నగుహ్రస్వపూర్వకస్థలములందు ఖండపూర్ణములు రెండును గల్గుచున్నవి.

నన్నయాథర్వణానుక్తమగు నేకత్వమునందలి కుజ్జును నిర్వహింపఁజాలు ప్రామాణికమహాకవిప్రయోగములు లేవు. ఆంధ్రభాషార్ణవమను నవీనకోశము నం (క్రీ. శ. ౧౭౫౦ ప్రాంతము) దట్టిరూపములు పేర్కొనఁబడుటమాత్రమె వాని స్థితికిఁ బ్రమాణ మగపడుచున్నది. "కలను = కలఁకు వి. ఔ. (కలఁకులు. దీని 'ను వర్ణమునకు ఏకత్వమున వికల్పముగాను, బహుత్వమున నిత్యముగాను బిందుపూర్వక కువర్ణము ఆదేశముగ వచ్చును. ఇట్లె కెలను - కొలను - కొఱను. మొ.) ౧. (సం. ఖలమ్.) స్థానము - ప్రదేశము." (సూ. రా. ని) కలఁకు - వి = కలను. (చూ) (ప్రదేశము) సీ. కలుషదేశమ్ములు చెలఁగుకలంకన.........(ఆం. భా. 3-౫౧)" (సూ. రా. ని). సూ. రా. నిఘంటుకర్త లిట్లు బాలవ్యాకరణసూత్రము నెక్కించివేసి కలన్వాదిశబ్దముల చోటులనెల్ల నాంధ్రభాషార్ణవకోశపద్యమును మాత్రమె యేకత్వమునందలి కుజ్జునకుఁ బ్రమాణముగఁ జూపుచువచ్చిరి. "సీ...పార్శ్వసంజ్ఞ కెల ననఁ గెలఁ కన.........కన్పట్టు." (ఆం. భా. ౨ ఆ. ౧౩౮) "గీ.........| కొఱఁకనంగను బీడు నాఁ గొఱ ననంగ||గంచె యన నప్రహతభూమికాఖ్య లెసఁగు.

(ఆం. భా. ౨-౬)" (సూ. రా. ని.). శ. ర. కోశమున నిట్లు. "కొలఁకులు మున్నగు బహువచనరూపములలోని కువర్ణాంతము నేకవచనరూపమని భ్రాంతిపడి యర్వాచీను లట్లు ప్రయోగించిరి. దానినిబట్టి యేకవచనమందు కువర్ణము వైకల్పికమనెడి సూత్రము పుట్టినది." (ఆం. భా. అ. శబ్ద. ౯౫ సూ. టిప్పణి.) అని యనుశాసన కర్తగారు వ్రాసిరేకాని యట్టిభ్రాంతకవు లెవ్వరో చూపరైరి. సూరిగారిసూత్రమునకు మూల మాంధ్రభాషార్ణవకోశమే యనుట నిజమని చెప్పనగును. ప్రాచీనులగు కేతన పెద్దిరాజులు నైతమేకత్వమునందలి కువర్ణము వచింపలేదు. బహుత్వమునందలి కువర్ణమాత్రమె యుపదేశించియున్నారు. అ-వె. కొఱను నెఱను వాఁగఁ గొలను మ్రానఁ గలను గవను కెలను వలను నాఁగఁ బరఁగుశబ్దములకు బహువచనంబులనులకుఁ గులు విధించె నాత్నదండి. క. కొఱఁకులు నెఱఁకు లనంగా మఱియుం గొలఁకులును రేఁగు మ్రాఁకు లనంగా మెఱయుం గలఁకులు గవఁకులు నెఱకెలఁకులు వలఁకు లనఁగ నెగడెడి కతనన్. (ఆం. భూ. ౭౨-౭౩ ప.) అ-వె. కొఱను నెఱను మ్రాను కొలనను నివియెల్ల బహుళచోనియుక్తిఁ బరఁగుచోట వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బైవనున నచ్చతెనుఁగువచనములకు. క. కొఱఁకులు నెఱఁకులు మ్రాఁకులుఁ దియుకొలఁకులు నయ్యె........(కావ్యా. ౯ ఉల్లా. ౭౬-౭౭ ప.) (విస్తర.) కేతనచెప్పనివొక్క 'వరను' అనునదిమాత్రము సూరిచేఁ జేర్పఁబడినది. "వఱఁకు-దే. వి. చిక్కు. చ. వరసతకోక్తి నేఁగి మునిసత్తము చిత్తమువచ్చునట్లుగా వరఁకులఁ బెట్టి తెచ్చెదరు వారవిలాసిను లెన్నిభంగులన్. (భాస్క. రా. బా. కాం.) వరనుయొక్కరూపాంతరము." (శ-ర.)

---

విస్తర. ౨౦౫ I విష:—పయిరీతిని నన్నయయే కాక ప్రాచీనవైయాకరణు లెవ్వరును నంగీకరింపలేవని తెలియక "కలఁకు - కొలఁకు" మున్నగు నేకవచనాంత రూపములు తెలుఁగునఁ బ్రసిద్ధములై యున్నవనియు "కలంకులు - కొలంకులు మున్నగు బహువచనరూపములనుండి యనుచితవిభాగమున (Incorrect breaking) నట్టి యేకవచనరూపముల నాంధ్రవైయాకరణులు సాధించిరనియు వానితుది 'కులు' అనునది తమిళకర్ణాటభాషాప్రసిద్ధ 'కళ్' ప్రత్యయసంబంధియనియు నేఁటివిమర్శకులు కొందఱభిప్రాయపడుచున్నారు. "ఈభాషలో ఎలుక - చిలుక - నక్క...కొలఁకు - కలఁకు - మ్రాఁకు - కొఱఁకు - గవఁకు - నెఱఁకు - గోఁగు - రేఁగు మొదలగు...కు గువర్ణములంతమందుఁ గలశబ్దములు కొన్ని యేర్పడి వ్యవహారమున నున్నవి ...ఈ కువర్ణసహితబహువచనరూపములు తమిళకన్నడములయాళములలోఁ జిరకాలము నుండి బహువచనప్రత్యయముగాఁ దలంపఁబడుచుండిన 'గళ్' అనుదానిని జేర్చుటచే

నేర్పడియుండుటచేతను, తెలుఁగునందలి కొలంకులు - ఎలికలు - మ్రాఁకులు మొదలగు బహువచనరూపములుగూడ ప్రాచీనభాషలోనే అనఁగా తమిళకన్నడాదులు తెలుఁగుతో విడిపోవనికాలముననే యేర్పడి యప్పటినుండియు నట్లె వ్యవహారమున నున్నవనియు నీభాషలు విడిపోయి కాలక్రమమున నాప్రాచీనరూపము లుచ్చారణవేగమునఁ గొంతమార్పుఁజెందినపిదప తెలుఁగువారు "లు" అనుదానినిమాత్రము బహువచనరూపములనుండి విడఁదీయుటచే కొలఁకు మ్రాఁకు శబ్దము లేకవచనమున కొలను మ్రానుశబ్దములకు రూపాంతరములుగా నీభాషలో నేర్పడుట తటస్థించినదనియు స్పష్టమగుచున్నది." (సంధి. భాషాలక్షణము. వ్యాకరణములు. ౧౦ మొ. ౧3 పు.) ఇట్లు సంధిగ్రంథకర్త వ్రాసెనేకాని, ప్రాచీనార్వాచీనాంధ్రమహాకావ్యములందుఁగాని శాసనములందుఁగాని మఱియే ప్రాచీననిదర్శనములలోఁగాని "కలఁకు - కొలఁకు" మున్నగు నేకవచనరూపముల వ్యవహారమును జూపఁగల్గునా? ఏప్రాచీనవ్యాకరణకర్తయేని "కలఁకు - కొలఁకు" మున్నగు నేకవచనరూపముల సాధించినట్లు చూపఁగల్గునా? ప్రాచీనాంధ్రవైయాకరణులు, 'కలను - కొలను' మున్నగురీతినె నువర్ణాంతప్రాతిపదికములనె యంగీకరించి 'కు' వర్ణము నద్దాని కాదేశమనిగదా చెప్పిరి. కూఁతుశబ్దమున రువర్ణాగమముచేయుటచే 'కూఁతురు-కూఁతురులు' మున్నగురూపము లేర్పడినట్లె యేదేని కారణమునఁ గలన్వాదులకు "కు" రాఁగా ఘుణాక్షరన్యాయమున "కళ్" ప్రత్యయాకారము కన్పట్టుఁగాక! అంతమాత్రమున నాంధ్రశబ్దప్రపంచమున సుప్రసిద్ధమయియున్న "లు" ప్రత్యయము విడఁదీయుట "అవిచారమూలకవిభాగ మ"నిపించుకొనునా? (సంధిగ్రంథము ౧౦ పు.) ఇంతకును "లు" ప్రత్యయమును విడఁదీయఁగా మిగిలిన 'కొలఁకు' మున్నగు కువర్ణాంతరూపములు ప్రాచీనాంధ్రమున లేనేలేవే. ఈయూహ యెట్లు పొసఁగును? ప్రాచీనాంధ్రమున "కొలను" మున్నగున్వంతశబ్దములుమాత్రమె వెలసియున్నవి. "న్వన్తానామ్నికుఙ్ నోర్బహువచనే" అనికదా భట్టారకుఁడు సూత్రించెను.

మఱియుఁ బ్రాచీనద్రావిడభాషలలో ననునాసికముపై నిల్చునపుడు నిత్యమైయున్న సరళోచ్చారణముచే నేర్పడవలసిన "కుళంగళ్ = కొలంగళ్" అనుదానివంటి ద్రావిడశబ్దమునుండి (కర్ణాటమున 'గళ్' అనుసరళాదికమె యైయున్నది.) "కొళంగులు = కొలంగులు" అనురీతి నేర్పడవలసియుండఁగా "కొలంకులు" అను పరుషాది 'కులు' శబ్ద మెట్లేర్పడును? ఇంతియకాక ప్రాచీనద్రావిడభాషలలో "కొలంకళ్, లేదా - కుళంగళ్" అనురీతిని వీనికి బహువచనమున 'కళ్' ప్రత్యయ

ఘటితరూపములు వానికలో నున్నట్లు ప్రమాణము చూపనక్కఱలేదా. ప్రాచీన తమిళమునందలి యుష్మదస్మద్వాచకములకు బహువచనరూపము వేఱుగనుండుట యరుదు. ఏకవచనరూపమే బహువచనార్థమునకు నుపయుక్త మగుట సంప్రదాయము.

తమిళాదులలో నర్వాచీనముగాఁ జేరిన "కళ్" ప్రత్యయము మూల ద్రావిడభాషలో నుండెడిదని యూహించుట యసంగతము. ద్రావిడవ్యాకరణములలోఁ బ్రాచీనతమమగు తొల్కాప్పియమునఁ బ్రాచీనతమిళమునందలి బహువచనములు "అ - ఆ - వ" అనునవి తుదిని గలవై యుండునని "అ. ఆ. వ........" (తొల్కా. ౧౭౦ సూ.) అనుసూత్రమున వచింపఁబడెను. అమహత్తుల యేకత్వబహుత్వములు తదన్వితక్రియలనుబట్టి తెలియునని "తెరినిలై........" (తొల్. ౬౫౫ సూ.) అనుసూత్రమున వచింపఁబడెను. దీనినిబట్టి తమిళమునందలి యమహత్తుల కేకవచనబహువచనరూపభేదము సాధారణముగా లేదనియు వానితో నన్వయించుక్రియనుబట్టియే వానియేకత్వబహుత్వములను దెలిసికొనవలయుననియు విశదమగుచున్నది. అట్లెప్పుటనేని క్రియచే వచనజ్ఞానము కల్గనపుడు కొన్నియెడల "కళ్" ప్రత్యయముచేరి బహుత్వబోధకమగునని "కళ్ళొడు........" (తొల్. ౬౫౩ సూ.) అనుసూత్రమున నుపదేశింపఁబడెను. ఈయుపదేశమునుబట్టి కాలక్రమమున నేవో యలంతిస్థలములం దేకత్వబహుత్వవివేచకజిజ్ఞాసకల్గఁగాఁ దమిళమున నర్వాచీనమగుచు 'కళ్' ప్రత్యయ మవతరించినదని చరిత్రాభిజ్ఞులు గ్రహింపనగును. ఇట్టిస్థితిలోఁ జరిత్ర కందని యత్యంతప్రాచీనకాలమందనఁగాఁ గొన్నివేలయేండ్లక్రిందట నట్టిశబ్దము మూలద్రావిడభాషలో నుండెడిదనియు నాంధ్రశబ్దప్రపంచమునం దెల్ల నుచ్చారణవేగమున నందలి క కారము నశించినను 'కొలంకులు' మున్నగు నలంతిశబ్దములలో నది నిల్చియున్నదనియుఁ జెప్పుట కేవలము నసంభవముకాదా.

ఏడవశతాబ్దములోని దనఁబడుచున్న యహదనకరశాసనమున "సంవత్సరంబుళ్ -ఊరిస్వాముళ్ -కొణ్డుకళ్ - కొణ్డుకళ్" మున్నగురీతిని ళ కారము బహువచనమునందుఁ గన్పట్టుచుండుటచే నది క కారము తెగిపోయి ళ కారము నిల్చినకాలమనుటకు నిదర్శనమని యింకొకనిదర్శనమును జూపుదురు. (ఆంధ్రభారతకవితావిమర్శనము. ౨౯-౩౦ పు.) ఇయ్యది యనర్థకమును నపభ్రష్టశబ్దప్రచురమును నగుశాసనము. ఇందు "కళరెని (కలరేని) కళ్గిన (కల్గిన) నరాళోక (నరాలోక) కొళుచె (కొలుచె) మున్నగుస్థలములందు లకారస్థానమున నపభ్రష్టముగా ళకారముపడినట్లె 'ఊరిస్వాముళ్' మున్నగుచోట్లను ళకారము పడినదే కాని యది కళ్ ప్రత్యయస్థ ళకారము కాదు. మఱియు నిట్టి యపభ్రష్టళకారముతోనె "కొణ్డుకళ్" అని

ప్రాచీనశాసనములందును, 'కొన్డుకళ్' అనునది యొకచోటను బడియున్నవి. వీనియెడల 'కొండుకళ్' అనుబహువచనమునకుఁ (చిన్నవారు) ప్రసక్తి కన్పట్టదు. ఆయొక్కచోటి 'కొన్డుకళ్' శబ్దమునకూడ 'కొన్దుకళ్' అనియె యుండవలసినదేమో? 'కొన్దుకళ్' శబ్దార్థమేమో యెవ్వరును జెప్పఁజాలరుగదా. మఱియు నందేకవచనము 'కొన్దు' అనునది లేదుగదా. అట్టిచో 'కళ్' ప్రత్యయమని యెట్లు తెలియనగును. భారతమున ఎలుక - కొండుక - చక్క మున్నగునవే కలవుగాని ఎలి-కొన్దు-వరి మున్నగునవి లేవు. భారతమంచేకాక మఱియే ప్రాచీనశాసనాదులందును నట్టివి లేవు. తే.గీ. బిలము వెచ్చి తిమెలి నం బెలుక నంపు. (ఆది. ౮ ఆ. ౩౦౭.) చ. అనుటయు నెల్క యిట్లు అను (శాంతి. ౪ ఆ. ౨౧౩.) ఆ-వె. నంతితాహితుండు కొండుకయుచుర్యను. (ఆది. ౬ ఆ. ౭౭.)

పయినుదాహరించినరీతి నమహద్వాచకములలోమాత్ర మేకత్వబహుత్వవివేచనము క్రియచేఁ గల్గనపుడు కొన్నిట నరుదుగఁ దమిళమునఁ బ్రయుక్తమగు 'కళ్' ప్రత్యయమె లుప్త కవర్ణకమై 'లు' స్వరూపమునఁ దెల్గులో మహదమహద్వాచకములందంతటను విశ్వరూపమును చాల్చెననుట యెంతయు నసంగతమయి యున్నది. తమిళకన్నడములందు రేఫమువలెనె తెల్గున 'లు' ప్రత్యయము బహువచనద్యోతకమై యున్నది. కొన్నిచోట్ల 'రు' ప్రత్యయమునుగలదు. ల ర ల విపర్యాసము సహజమేకదా. ఇట్టి స్థితిలో "కళ్" ప్రత్యయమూలకత్వమును గల్పించుట యుక్తమా?

ఇంక నీశబ్దతత్వశాస్త్రజ్ఞానమును మనవారికి వెదచల్లిన కాల్డువెల్లుదొరగారీవిషయమున మఱియు నింతగ వ్రాసిరి. వారి యింగ్లీషున కనువాదము వ్రాయుచున్నాను. "గళ్ ప్రత్యయమును సంబంధించినది తెలుఁగున 'లు' ప్రత్యయము.........అఱవకన్నడప్రత్యయములలోని గ కారము తెలుఁగున లోపించినట్లగపడుచున్నది. లు ప్రత్యయమునకు ముందు తెనుఁగులోఁగూడ నొక యచ్చుండినట్లు నిదర్శనములు గలవు. ఉ. గుఱ్ఱాలు. దీనిలోని "ఆ" కారము గుఱ్ఱ శబ్దముయొక్క తుది "అ" కారముతోఁ బ్రత్యయాదినున్న "అ" కారము సంధించుటచే (సవర్ణదీర్ఘసంధి?) నేర్పడియుండును. కాన బ్రాచీనాంధ్రమున "అలు" బహువచనప్రత్యయమై యుండవచ్చును.........కొన్ని నుకారాంతశబ్దములలోఁ దెనుఁగునసైతము గలు ప్రత్యయము కన్పట్టుచున్నది. ఉదా:—కొలను. (అఱ - కుళమ్) కొలంకులు (అఱ - కుళజ్గళ్) కొలంకులు శబ్దమును నన్నయ సాధించి యున్నాఁడు. గోను-గోన్గులు.........తెనుఁగులోవలెనె యఱవమునందును గ కారము లోపించుట కలదు. ఉ. అవర్గళ్ = అవాళ్. పిరామణకళ్ = పిరామ

యనుచుఁ గలదు. ఉ........సూఱులు వేలు మ్రోయఁగవన్నుల్ వడి వెల్వడి...
(రామా. ౯ ఆ. ౬౯ సూ. రా. ని.) మ........నిజామాదుల్ వజీరుల్ భజింతురు
నప్రత్నము కానలో ముసలిమానుల్గా వితర్కింపఁగన్. (వసు. ౧ ఆ. ౪౫౭ ప.)

బాలవ్యాకరణ ౨౦౬ విషయము. అట్లు రేను గోను శబ్దముల నువర్ణంబు గుఙ్గగు. ౧౯.
రేఁగు - రేను - రేఁగులు, గోఁగు - గోను - గోఁగులు.

సంజీవని. ౨౦౬ విష:—రేను = బదరి, గోను = పీలువు - జనుముని వాడుదురు. సూత్రమునందలి 'అట్లు' అనుదానిచేఁ గలన్వాదుల కుఙ్గువలెనె రేన్వాదుల గుఙ్గును నేకవచనమున వికల్పముగాను బహువచనమున నిత్యముగాను నగు నను నర్థము లభించుచున్నది. ఇదియు జిత్త్వముచే సబిందుకమగును. రేన్వాదుల నువర్ణస్థానిక గుఙ్గు దీర్ఘపూర్వకమే యగునుగాన ఖండబిందుపూర్వకమె యగుచుండును. ఉదా:—రేఁగు - రేను - రేఁగులు - గోఁగు - గోను - గోఁగులు. ఆ-వె........రిత్తబుద్ధి నకట రేఁగుఁబువ్వులరసమాను లెట్లు........(ఆర. ౬ ఆ. ౩౪౧.) గీ. తగు గోను గోఁ గనఁగను సుపీలు. (ఆం. భా. ౨ ఆ. ౪౩ సూ. రా. ని.) ఇది మాత్రమే దీనియేకవచనమునందలి గుఙ్గున కాధారము.

నన్నయాథర్వ. క్వచిన్ను లోపశ్చ. (ఆం. చిం. అజం. ౧౭ కా.
౨౦౭ విషయము. అహో. ౩౨౭ పు.

కల్ప. ౨౦౭ విష:—న్వన్తాత్ నామ్నః = నువర్ణాంతప్రాతిపదికముకంటెఁ బరముగా, బహువచనే = బహువచనప్రత్యయము పరమైనదై యుండఁగా, క్వచిత్ = ఒకానొకప్పుడు, నులోపశ్చ=ఆప్రాతిపదికముయొక్క ను వర్ణమునకు లోపము సయితము సంభవించును. ఉదా:—చేను+లు = చేలు (వరి మున్నగువానిసస్యములు) పేను+లు = పేలు, మీను+లు = మీలు, (చేఁపలు) కౌనులు - వీనులు - మేనులు, వీనియందు ను లోపము లేదు.

బాలవ్యా. ౨౦౭ I విషయము. బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు. ౨౦.
చేను - చేలు, పేను - పేలు, మీను - మీలు.

సంజీవని. ౨౦౭ I విష:—బహువచనమనుటచే చేలన్ - చేలచేతన్, పేలన్ - పేలచేతన్, మీలన్-మీలచేతన్. మొ. చేనుశబ్ద మాపవిభక్తికము. చేని చేతన్-చేనన్, మొ. సీ. చేనఁ బండిన విత్తు చేనికె ఫలకాంక్షఁ, జేర్చిఁ గ్రమ్మఱ వెద వెట్టినట్లు. (నన్ని. ౧ ఆ. ౪౯ సూ. రా. ని.) పేను - మీనుశబ్దములు ప్రాణివాచక

ములుగాన నోపవిభక్తికములు కానేరవు. కలన్వాదులలోఁగాని చేన్వాదులలోఁగాని చేన్వాదులలోఁగాని చేరని మేను ప్రభృతిశబ్దములు విశేషకార్యములులేక మేనులు కౌనులు పీనులు మున్నగుసామాన్యరూపముల గాంచును. శా. ........వేఁడ్మిం గిడ్పాటున తోర్చి పాజె విధి నామేఁ బ్రాణముల్ నిల్పె...(శృం. నై. ౨ ఆ. ౨౧.) అనుచోఁ బ్రూన మేశబ్దమును గలదు. దీనిబహువచనము 'మేలు' అనియుండనగును. "ద్వి. ఇరుమేల" (ఇరుపార్శ్వములందు) (భాగ. ౮ స్కం. ౪. ౯.)

'మీనులు' అనియుఁ గలదనుటకుఁ దిక్కకవి యిట్లుదాహరించెను. చ. కొలఁకులు చేరవచ్చి యాయకాలకేకంబుల నిల్చి ముగ్ధలయ్యలికులవేణులెయ్యెడ నిజానయనప్రతిబింబశోభఁగాఁ బలఁచుచు నుల్లమముల్ పొనఁగఁ బప్పుకె మూడఁబోడంగి కందులో|జలజములన్ మృణాలములఁ జక్రయుగంబుల గండుమీనులన్ (కవికర్ణ. సర్వాల. ౨ ఆ. ౨౮ ప.). ఇందు "గండుమీనులన్" అనుచోట "గండుమీలనున్" అనునది కవిప్రయుక్తపాఠము కానోపును. "జలజములన్ మృణాలములఁ జక్ర యుగంబుల" అనువానివెనుక సముచ్చయార్థక నుశబ్దముతోడి 'గండుమీలనున్' అనునది యుండుట సుప్రసక్తమైయుండును.

చేన్వాదుల తుదియుత్వము లోపించుటయుఁ గలదు. "ఆ-వె. వెలుగు చేన్నేసినఁ|గాచువార లేరుఁ గలరె జగతి. (ఉ. హరి. ౫ ఆ. ౮౨.) తరలము.— తనువు మీన్ పోలవల్చు జాలరిదాన. (ఆది. ౩ ఆ. ౮౦ ప.) ప్రయోగములు:— తే-గీ. వేను చేను మీఁ ననునవి పెక్కులైనఁ|బేలు చేలు మీలు ననఁగఁబోలు జగతి (ఆం. భూ. ౭౫ ప.) సీ. ఏటేట విరినీట నిరుగారునుం బండుఁ బ్రాసంగు వరిచేలఁ బసిఁడిచాయ (భీమ. ౨ ఆ. ౫౮ సూ. రా. ని.) క. జాలరులు వలల నచ్చటి| మీలఁ దిగుచుచుండి. (అను. ౨ ఆ. ౨౫౯ ప.) సీ. మగమీల నగఁజాలు తెగఁగీలుకొను వాలుఁగనుఁగవ కొకవింత కాంతి యొదవె. (పారిజా. సర్వాల. ౨ ఆ. ౨౭.) క. మీలుం దామరపూలు | న్నేలగునమ్ముద్దరాలి మినుకుఁ గనుఁగవన్|........(అచ్చ. రా. బాల. ౧౩౦ ప.)

నన్నయా. ౨౦౮ విషయము.

కేషాంచిద్ వ్యస్తశబ్దానాం । లు తీ స్యాత్తాం యథో
చితమ్ । క్వచి త్త్యాదేశ ఏవస్యాత్ । క్వచి న్నైవ
ప్రయోగతః । వర్ణస్యాన్త్యస్య లోపశ్చ।లు లయోః
ప్రాయశః క్వచిత్. (వికృ. అజం. ౮౮-౮౯ కారి. అహో.
౩౨౭ పు.)

కల్పతరువు. ౨౦౮ విష:—కేషాంచిద్ వ్యస్త శబ్దానామ్ = కొన్ని యప

ప్రాంతశబ్దములకు, లులయోః = 'లు - ల' అనుబహువచనముపరమగుచుండఁగా, యథోచితమ్=కవిప్రయోగానుసారముగా, లు - తీ=లువర్ణ తివర్ణములు, స్యాతామ్= అశబ్దములకును యువర్ణమున కాదేశములగుచున్నవి. ఉదా:—కాయి+లు = కా+లు+లు = కాలులు = కాళ్లు = (కాళ్ళు). ఇచట 'కాలులు - కాలు' అనుస్థలమందువలెనె యుత్వలోపాదికము నరయునది. (౧౫౯ విష.) కాయి+లు=కా+తి+లు = కాతులు, ఇవి 'లు-తీ' అనునవి రెండును నాదేశములగుట కుదాహృతులు. 'కాలు' అనురూపము ముందు సాధింపఁబడును. కాయిశబ్దమునకు బహుత్వమున 'తి' వచ్చునట్టి 'కాతులు - కాతులకా' మున్నగువానికిఁ గవిప్రయోగములు లభింపలేదు.

క్వచిత్ = ఒకానొకప్పుడు, త్యాదేశ ఏవ = ఒక్క తివర్ణాదేశముమాత్రమె, స్యాత్ = అగును. ఉదా:—గోయి+లు = గో+తి+లు = గోతులు, ఇట్లె వాయి - వాతులు, నూయి - నూతులు, చేయి - చేతులు, నేయి - నేతులు, రోయి - రోతులు. మొ.

క్వచిత్ = ఒకానొకచో, ప్రయోగతః = కవిప్రయోగానుసారముగా, నైవ= 'లు - తి' అనువానిలో నేదియు రాదు. ఉదా:—కూయి+లు = కూయులు, కుయి+లు = కుయులు. "ఆ-వె. ఎట్లు బ్రదుకువార మెందుఁ జేరెడువార।మధిప వినఁగఁదగదె యాఁడుకుయులు (భాగ. ౧౦ స్కం. పూ. ౯౮౨ ప.) కూయి = కుయ్యి, కుయి = మొ॥. ఇట్లె ప్రొయ్యి = ప్రొయ్యులు, పొయ్యి = పొయ్యులు, పోయి = పోయులు, దోయి = దోయులు. దీనికి యివర్ణలోపమును గలదు. "ఉ. వేలుపుటిల్లు విల్లు వెడవింకలపోకల నారి రెండుచే।దోలవెలుంగుతూపు...(కావ్యాలం. ౫ ఉల్లా. ౯౮ ప.) తే-గీ. వేయి కాయి దో యనియెడి వీనిబహుత।నోలిఁ దుద లుత్వ మొనఁగూడు వేలు కాలు।దోలునా.........(కావ్యాలం. ౯ ఉల్లా. ౯౦.)

ప్రాయశః = తఱుచుగా, అన్త్యస్య వర్ణస్య = యి - వు - ము - మున్నగు తుదివర్ణములకు, లులపరకత్వమున, లోపశ్చ = లోపమును, క్వచిత్ = కొన్నియెడల, స్యాత్ = అగును. ఉదా:—కాయి+లు = కాలు, రేయి+లు = రేలు, వేయి+లు = వేలు, వ్రాయి+లు = వ్రాలు, ఆవు+లు = ఆలు, జాము+లు = జాలు. మొ. 'ప్రాయశః' అనుటచేతను చకారముచేతను కాళ్లు, ఆవులు, జాములు మున్నగు లోపాభావరూపములును గొన్ని గలవని యెఱుంగునది. 'వర్ణస్యాన్త్యస్య' అనుటచే నీసూత్రము 'యి'వర్ణమాత్రపరము కాదు. పయి కారికలయర్థమును సరిగా గ్రహింపలేక కవిజనమండనటీకాకర్త పయికారికలను సవరించిన "లులా

స్యాతాం యథోచితమ్" "క్వచి ద్లాదేశవరస్యాత్" అనుపాఠము లుపేక్ష్యములు. అహోబలపతి "రాయి - రాయులు - రాలు - రాళ్ళు ఇత్యాదావికల్పోవర్ణస్య లోపః - రాళ్ళు ఇత్యత్ర లకారాదేశ ఇతిజ్ఞేయమ్" (అహో. ౩౨౨.) అని యుదా హరించెనుగాని 'రాయులు' అను ప్రయోగము లేదు. "క్వస్యాత్తత్వస్యలోపస్స్యాత్తను చెప్పిన లోపము రాఁగృహు 'లు - ల' అగునవి పర్యాయముగా వచ్చుచుగాన "క్వచిన్నైవ ప్రయోగతః" అనుసూత్ర మిచట ప్రవర్తింపనేరదు. ఈక్రిందిపోతనాది ప్రయోగములనుబట్టి 'రాయి - రాయి' అనురేఫద్వయఘటితరూపములును గలవు. క. చేసెఁగొని చూచ్చుకమలుట| రాత్రిపయిని నీళ్ళము గొనుట రాత్రి దధిమధూపేతం బుగఁ గుడుచుట...(భా. ౭ స్క. ౧...) క. నాయుల్ల మరయ నిను మో|హా రోం తా కిట్టు రూపఱక నిరనేర్చెన్. (భీష్మ. ౩ ఆ. ౭౧౯) (వై. పా. ౭౭౭ విష.)

బహువచనంబు పరంబగునపుడు రేయిప్రభృతుల తుది

బాలవ్యా. యకారంబు లోపించు. ౨౧.

వివరణము. రేయి - రేలు, తాయి - తాలు, వేయి - వేలు, వ్రా

౨౦౭ I విషయము. యి - వ్రాలు. ఇత్యాదులు. ఈలోపంబు సమాసంబు లందుఁ జూపట్టెడు. రేరాజు, మగతాపతకము వే వెలుఁగు.

సంజీవని. ౨౦౭ I విష:—రేయి = రాత్రి, వ్రాయి = అక్షరము, రేరాజు = చంద్రుఁడు, మగతాపతకము = వజ్రపుపదకము, వేవెలుఁగు = వేయికిరణములుగల సూర్యుఁడు. పతకము - ఇది పదకశబ్దభవము. తరళమని యర్థము. తరల మనఁగా నాయకమణి. 'తరలో హారమధ్యగః' (అమరము). 'రేయి+లు' అనుచోఁ దుదివర్ణ మగు 'యి' వర్ణము లోపింపఁగా 'రేలు' అనురూపము సిద్ధించును. రేలను - రేలచే తను. మొ. ఇట్లె తాయి - తాలు, తాలన్ - తాలచేతన్. మొ. (విస్తర.). రేయి యొక్క+రాజు = రేరాజు. మగతాతియొక్క+పతకము = మగతాపతకము, వేయి

---

విస్తర. ౨౦౭ I విష:—పయి యథర్వణకారికలయర్థమును సరిగాఁ జూచి కొనకయు, 'తే.గీ. వేయి తాయి దో యనియెడివీనిబహుతి|నోలిఁ దుద లుత్వ మొదవఁ గూడు వేలుతాలు|వోలునా.........(కావ్యాలం. ౮ ఉల్లా. ౯౦ ప.) తే.గీ. తాయి రేయి వేయి యనువో తాలు రేలు। వేలు నానొప్పు బహువచోవేళలందు. (ఆం. భూ. ౭౬.)' అను కేతన పెద్దనలవచనములనుబట్టి రేయి వేయిశబ్దములకువలెనే తాయిశబ్దమునకును యిలోపము నిత్యమని భ్రమించియుఁ, గావలయు సూరి తాయి శబ్దమునకు బహువచనరూపము'తాలు'అనుదానిని మాత్రమే సాధించెను.ఇట్టి సూరి

వెలుఁగులుగలవాఁడు = వేవెలుఁగు. ఇట్లు సమాసములందును నీయివర్ణలోపవిధి ప్రవర్తిల్లునని భావము. వేయిశబ్దరూపాంతరముగ వేశబ్దమును గలదు. క. వే నిద్రించుఁ బ్రభాతం|బైనను మేల్కని సృజించు...(అను. ౧ ఆ. ౩౨౨ ప.) వేయిశబ్దమునకును 'వే' అనురూపాంతరము గలదనుట కొంకయాధునికవిప్రయోగము శబ్దరత్నాకరమునఁ జూపఁబడియున్నది. "వే. యు. దే. స. వేయి. మొగములు వేగల శేషుండు. (కవిజనరంజనము. ౧ ఆ. అడిదము సూరకవి.) ప్రయోగములు. క. నియమా|భీల్యుఁడగుపతికి పవలుల్|రేలును నేమఱక పరిచరించుచు నుండెన్. (ఆది. ౨ ఆ. ౧౫౬ ప.) ఉ. రేలమృతాంశులో శశము రెమ్ముదమంచు దలంచి జాళువా|మేలిపసిండి...... (విజ. ౧ ఆ. ౬ ప.) సీ.........|మేలిపూగుత్తుల ఱాల రువ్వి. (పాండు. ౧ ఆ. ౧౨౬ ప.) క.........ఆ|ఱాకంబంబునఁ జమువుము | నీ కాలిపి తెలియునేని నీరజవదనా. (కళా. ౩ ఆ. ౧౦౭ ప.)

---

యభిప్రాయము ననుసరించి గుప్తార్థప్రకాశికాపేటికాదివ్యాఖ్యాత లీక్రిందిరీతిని వ్రాయసాగిరి. "ఱాయిశబ్దంబునకు బహువచనరూపంబు 'రాళ్ళు' అని వ్యాకరణంబులయందును గ్రంథములయందునుఁ బ్రయోగించుచుండిరి. అయ్యది ప్రామాదికము" (బా. గు. ప్ర. ఆచ్ఛి. ౨౧ సూ. వ్యా.) "ఱాయి+లు అనునపు డంతిమాక్షరలోపము నిత్యమగుటం జేసియు నింకొకలకారము సంభవింప నవకాశము లేమిం జేసియు రాళ్ళను వ్యవహార మలాక్షణికమయ్యెడి. సంశిష్టబహువచనాంతము మీఁదనేగాని మరల బహువచనప్రత్యయము చూపట్టమింజేసియు ఱాళ్లనున దపరూపమె యయ్యెడి." (బా. సా. పే. ఆచ్ఛి. ౨౧ సూ. వ్యా.) "సంశ్లిష్టబహువచనాంతముమీఁదనే కాక బహువచనమాత్రముమీఁదఁగూడ 'చూపఱులు - వేడుకకాఱులు' అని మరల బహువచనప్రత్యయముగ్రంథములఁ గానంబడియెడి" అని వ్రాసియు. (ఆచ్ఛి. ౧౭ సూ. వ్యా.) పేటికావ్యాఖ్యాత పైరీతిని వ్రాయుట వింత. "కేషాంచిద్ యస్త్వశబ్దానాం | లుతీస్యాతా" మ్మనునథర్వణవచనము చొప్పున "లు"వర్ణాదేశముచే సిద్ధించు "ఱాయి+లు = ఱా+లు+లు = ఱాళ్ళు" అనురూపమలాక్షణికము ప్రామాదికము నెట్లయ్యెడు ?

"కేషాంచిద్ యస్త్వశబ్దానాం | లుతీస్యాతామ్మ" నుచొప్పునఁ బాక్షికముగా ఱాయిశబ్దముయొక్క యివర్ణస్థానమున 'లు-తి' అనునవి యాదేశమగుటచేత 'ఱాళ్ళు-ఱాతులు - ఱాలు' అనురూపములు సిద్ధించును. "క్వచి త్త్యాదేశ ఏవస్యాత్తను చొప్పున నిత్యముగా వాయి - నేయి, గోయి - నూయి, చేయి మున్నగుశబ్దములు యివర్ణస్థానమునబహువచనపరకత్వమున "తి" వర్ణాదేశము రాఁగా,

వాయి - వాతులు, నేయి - నేతులు, గోయి - గోతులు, సూయి - సూతులు, చేయి - చేతులు మున్నగురూపములు సిద్ధించును. ద్వితీయాదిబహువచనములందు, "వాతులన్ - వాలన్ - వాళ్ళన్, వాతులచేతన్, నేతులన్ - నేతుల చేతన్" మున్నగురూపములు సిద్ధించును. ద్వితీయాదుల యేకవచనమున నౌప విభక్తిక తివర్ణ మాదేశమగుటచే వాతిన్ - వాతిచేతన్ - వాతన్, వాతిన్ - వాతి చేతన్ - వాతన్ మున్నగురూపములు సిద్ధించును. ఏకత్వబహుత్వములందు వేఱ్ఱేఱువిధములగు తివర్ణాదేశములు వచ్చు ప్రక్రియను బాలవ్యాకరణకారుఁడు విభక్తిక ప్రకరణమున "విభక్తిపరంబగునపుడు గోయిప్రభృతుల యుపధయుతికారంబు తివర్ణకంబగు" (బా. అచ్చి. ౨౭ సూ.) అనుచొప్పున నేకత్వబహుత్వములు రెంటను నేకవిధముగా నౌపవిభక్తిక తివర్ణము నాదేశించెను. ఉదా:—గోయి - గోతులు, గోతిన్ - గోతులన్, వాయి - వాతులు, వాతిన్ - వాతులన్, రోయి - రోతులు, రోతిన్ - రోతులన్. మొ. "బహుళమనుటచేఁ గొన్నిటికిఁ గొన్ని యేకవచనములు పరమగునప్పుడే వచ్చును. మఱి కొన్నిటికిఁ బ్రథమాదిబహువచనములు పరమగు నప్పుడుకూడఁ దైకార్యము కలుగునని తెలియునది. ఉదా:—సూయి - సూతులు - సూతులన్. మొ." (ఆం. భా. అ. శబ్ద. ఔప. ౧౭౭ సూ. వివ.) "చేయి మొదలగు వానికిఁ బ్రథమాబహువచనాదులు పరమగునప్పుడును సమాసమందును తివర్ణము వచ్చును. ఉదా:—చేయి - చేతులు, చేతిని - చేతులన్..." (ఆ. భా. అ. శబ్ద. ఔప. ౧౮౧ సూ.) బహుత్వమున నౌపవిభక్తికవర్ణములు నిలుచుట వైయాకరణ సంప్రదాయవిరుద్ధము. అట్లగుటచేత నేకదా యథర్వణుఁడు "లుతేస్యాతామ్... క్వచిత్త్వాదేశ ఏవస్యాత్ ...లులయోః" అని యిట్లు బహువచనపరకత్వమున తివర్ణ మును బ్రత్యేకముగా నాదేశించెను. ఏకత్వమున యివర్ణాంతములుకాని "అట్టు - కొట్టు" మున్నగువానితోపాటు వాయి గోయి మున్నగువానికిని "ఔపవిభక్తికసంజ్ఞా వర్ణాష్టింట్యాదయో భవన్తీహ" అను చొప్పునఁ జింతామణి సూత్రస్థాపిపద గ్రాహ్య మగుచు తివర్ణకమువచ్చును. "లులయోః పరయోః" అని సూత్రమున వెలయు చుండఁగా నేతత్సూత్రసిద్ధ తివర్ణమేకత్వమున నెట్లువచ్చును? "వాయిశబ్దము నకు ద్వితీయాద్యేకవచనములు పరమగునపుడు దీనివలన తివర్ణమువచ్చును. వాతిని- వాతిచేతన్-వాతికొఱకున్ మొ. చేయిప్రభృతులం దీతివర్ణము ప్రథ మైకవచనమునందక్కఁ దక్కుంగలవానియందగును. చేయి-చేతులు - చేతిని-చేతు లను-చేతిచేతన్. మొ" (నారా. గాణ. అచ్చి. ౧౭ ప. ౨౫౦ కా. వ్యాఖ్య) బహు వచనమాత్రపరకత్వమున విధింపఁబడిన యీతివర్ణమౌపవిభక్తికము కావించేసి

... ... ... ...తి. స్యాత్తా' మ్మని చిద్ఘటసరికాదు [ఆంధ్ర ౧ వి. సంజీ.]

... వర్ణస్యాన్త్యస్యలోపః స్యాత్ । ల్లులయోః ప్రాయశః
... క్వచిత్. (విక్ర. ఆజం. ౪౬ కా. అహో. ౩౨౭ పు.)

తల్పతపత్ర. ౨౧౯ విష:—ఈకారిక యీవఱకు వ్యాఖ్యాతమయ్యెను. (౨౧౯ విష.) 'వర్ణస్యాన్త్యస్య' అనుటచే నీసూత్రము యివర్ణమునకేకాక యితర వర్ణమునకును శబ్దాంతగతమగు దానికిఁ గొన్నియెడల లోపముగల్గు ననునర్థము

చేతన్ . ...తన్ మున్నగురూపములును నీయనపక్షమున సిద్ధింపనేరవు. గాణపత వివరణకర్త యీయథర్వణకారికయందలి "ఱతీస్యాత్తా" మ్మనుచోట "ళతీస్యాత్తా" మ్మని పఠించి "ఱాళ్లు-ఱాళ్లన్" అనురూపములను సాధించెను. ఇట్లె యీవఱకును (సాగా. గాణ. అచ్చి. ౧౪. ప. ౨౪౭ కా. వ్యా) "ఱాళ్లు-ఱోళ్లు" మున్నగు రూపములను సాధించెను. ఆటీకలో "ద్రావిడసంప్రదాయముచొప్పున నలఘుల కారము ళకారాకృతిని బొందినది" అనియు వ్రాసెను. ఇట్టిస్థితిలో "ళ్ల" అను సంయోగమున ళకారోచ్చారణమున కనుపదమంచే లఘులకారోచ్చారణ మెట్లు పొసఁగునని భావించెనో తెలియకున్నది. (౨౦౧ విష. సంజీవని).

ఱాయిశబ్ద బహువచనమున 'తి' వచ్చురూపములకుఁ గవిప్రయోగములు లభింపలేదు. అథర్వణసూత్రముచే నది సాధువనకతీరదు. తక్కిన వానికిఁ బ్రయోగ ములు చూపఁబడుచున్నవి. క. చేతఁగొని యుప్పు నమలుట । రాతిపయిని నినుము గొనుట రాత్రి దధి...(అను. ౪ ఆ. ౧౦౦ ప.) క....ఱాతికిఁ బైకొని యడరి తగరు దెరలని మాడ్కిన్ (ద్రోణ. ౩ ఆ. ౨౫౫) ఆ-వె...నామనంబు ప్రయ్యలై పో దిది।ఱాతఁ జేసినది యొకో తలంప (ద్రోణ. ౨ ఆ. ౨౪౯) సీ. తెలిపుల్గు బురదగోతు లకుఁ జనునె (నీలా. ౨ ఆ. ౭౬. సూ. రా. ని) గీ...ఇరువదేను । చేతులప్రమాణ మునఁ గల్గుఘరాతలంబు (పాండు. ౨ ఆ. ౧౧౬) ఉ. నుతజలపూరితంబు లగు నూతులు నూఱటికింటె (ఆది. ౪ ఆ. ౯౩) బాలవ్యాకరణవ్యాప్తిచే ఱాయిశబ్దబహువచనము 'ఱాలు' అనియే యుండుననునిశ్చయముతో ముద్రణసంస్కర్తలు నర్వాచీనలేఖకు లును భారతాదులలో "ఱాళ్లు-ఱాతులు" అనువానిని దొలఁగించిరని చెప్పనగును. తాళపత్రమాతృకలలో "ఱాళ్ళు" అనురూపములు పెక్కిటఁ గలవు. ప్రాసస్థలనిబద్ధ ప్రయోగములు భారతమున నేపక్షమునను లభింపలేదు. సీ. పదఘట్టనంబునఁ జదిసి ఱాలు-గీ. నుఱుముగాఁగ - (ఆది. ౬ ఆ. ౧౬౨) క. శిని వరుఁ డాఱాలెల్లను।దుని యలుగా (ద్రోణ. ౪ ఆ. ౮౫) క....తననిష్ఠుర తనుహతిఁజేసి ఱాలు చూర్ణంబు లుగాన్ (ఆది. ౫ ఆ. ౧౧౪) ఇట్టిచోటులందెల్ల "ఱాలు" అనుచో 'ఱాళ్ళు' అని నిల్పినను క్షతిలేదుగదా.

లభించుచున్నది. ఉదా:—పాయి+లు=పాలు, వేయి+లు = వేలు, వ్రాయి+లు=వ్రాలు, ఆవు+లు=ఆలు, జాము+లు=జాలు. మొ. 'ప్రాయశః' అనుటచేతను-చకారము మహిమచేతను లోపాభావరూపములును గొన్నియుండును. ఉదా:—ఆవులు - జాములు. మొ. ఇట్లె ఆవులన్-ఆలన్-ఆవులచేతన్-ఆలచేతన్ మొ. సమాసమున మిక్కిలి వైచిత్ర్యము గలదు. పూర్ణలోపము సకృత్పదకత్వమున ద్రుతాగమము ద్రుతసంధికార్యములు నగును. ఉదా:—ఆవు+తోక=ఆఁదోఁక - ఆవు+పోతు=ఆఁబోతు - ఆవు+మూడ=ఆమూడ (విస్తర).

ప్రయోగములు:—క. ఆలంగాచెడి యొక్కఁడు త్రైలోక్యము వెన్నెఁ గావఁ దగువాఁడవు. (హరి. పూ. 3 ఆ. ౨౬౬) సీ-అఁబెయ్య యుడికి నాయజ్ఞానమున నంపు, తాఁకునఁ గాలుడు......(కృష్ణ. ౨ ఆ. ౯౦ ప.) చ...చుట్టలు దగువారుఁ దండ్రియు నొడంబడఁజేయుము...(ఉద్యో. 3 ఆ. ౨౬౧) మ...చుట్టములానయ్యోఁ దదాత్మజుండయిన ధృష్టద్యుమ్నుఁడున్ వారితోఁ సహపీఠ్యం బొందఁగూడె...(ఆది. ౮ ఆ. ౪౪) శా...ప్రాసవాసోదైన్యంబులుంబచ్చు నాయురయు నీచుట్టాలకుం గావున్ (ఉద్యో. 3 ఆ. ౧౨) 'చుట్టములు' అనుచో బా. తత్స. ౪3 సూత్రముచొప్పున ముపర్ణలోపదీర్ఘములు రాఁగా "చుట్టాలు" అగును. ఇట్లె మ...చెప్పకు పిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్ (మను. ౨ ఆ. ౬౫) సీ...ఆ-వె. తనిసి మూఁడు జాలతఱి ప్రొద్దోకించుక (హరి. పూ. ౬ ఆ. ౧౦౧) ఉ......వలవంత నశ్రుపుల్. జాలుగ నాల్గుజాలు నిఁకఁ జాలు భవంబనునంతకాకకుం। బాలయి...(మనుచ. 3 ఆ. ౯3) ఉ...వీ।మీసరు లిట్లు క్రొవ్వి పులిమీసల నుయ్యెల లూఁగఁజొచ్చిరే. (భాస్క. యుద్ధ. ౮౬౯.)

బహువచనంబు పరంబగునప్పు డావుప్రభృతుల తుది
బాలవ్యా. యక్షరంబునకు లోపంబు విభాషనగు. ౨౨.
౨౦౯ I విష. ఆవు - ఆలు - ఆవులు, జాము - జాలు - జాములు,
చుట్టము-చుట్టలు-చుట్టములు, మీసము-మీసలు-మీసములు.

---

విస్తర. ౨౦౯ విష:—"వృత్తియందుఁ బూర్వపదమగునపుడును నావుశబ్దము తుది వ్రాయి లోపించుటయుఁ బరుషములు పరమగునపుడు నుమాగమమగుటయు .........ఆఁదోఁక-ఆదూడ-ఆలగా పరి' అని ప్రయోగము లగపడెడి" (బా. సా. వే. ౨౨౮ పు.) "ఆలగాపరి" (బా. గు. ప్ర. ౧౬౮ పు. ద్వి. ము.) 'ఆవులయొక్క + కాపరి' అను షష్ఠీసమాసములో ద్రుతాగమముగాని గసడదవాదేశముగాని రానేరవు. "ఆలకాపరి, దే. వి." (శ-ర) "ఆలకాపరి. వి (√ ఆవు)" (సూ. రా. ని.)

సంజీవని. ౨౦౯ I విషః—'చూట్టాలు - నీసాలు' అనియు రూపముల నెన్నునది. కల్పతరువునం బ్రయోగములు చూపఁబడెను.

ఏద న్తతా చ నామ్నాఽమన్యతరస్యా మియాన్తానామ్.
(ఆం. చిం. అజం ౨౧ కారి. అహో ౩౮౨ పుట.)

ఇచ్ఛామా ఛన్దోనియమము. ౨౧౦ విషయము.

ఇయాన్తా స్సాధవ శ్శబ్దాఃక్వచి దేదన్తతాపిచఽఇయా న్త
త్వే క్వచిత్ స్యాఽదత్వం యశ్చాపి తద్భవేఽలఘు స్సో
పిచ సంయుక్త ఇతి కేషాంచిదేరణా. (వికృ. అజం.
౬౧-౬౨ కారి. అహో. ౩౮౨-౩౮౪ పు.)
ఏవావ్యయ సమానార్థ । మేత్వ మత్వం చ దృశ్యతే.
(వికృ. అజం. ౭౪ కారి. అహో. ౩౯౯ పు.)

కల్ప. ౨౧౦ విషః—ఇయాన్తానామ్='ఇయ' అనునదితుదినిగల, నామ్నామ్= ప్రాతిపదికములకు, ఏద న్తతాచ = ఎకారాంతత్వము సయితము, అన్యతరస్యామ్ = వికల్పముగానగును. ఉదా:—కన్నియ=కన్నె, వన్నియ=వన్నె, డిగ్గియ=డిగ్గె, కొండియము=కొండెము, కొంచియము=కొంచెము. సంస్కృతమున హ్రస్వమగు నెకారములేమింజేసి సంస్కృతసూత్రమున "ఏద న్తతా" అనిచెప్పినను "ఎ" కారమె యుద్దిష్టమని యెన్నునది. "కంఠేత్వ్యారాదాదేః" అని యిట్లు స్థలాంతరములందును జెప్పఁబడుటగలదు.

నన్నయ యీవిధి పాక్షికమని వచింపఁగా నిది వైకల్పికవిధికాదనియు సార్వత్రికముకాదనుట యుక్తమనియు (విస్తర. I) నొకప్పుడు 'ఎ' అనుదానికై 'ఇయ' రావచ్చునుగాన 'ఇయ' అనుదానిని స్థానిగాఁ జెప్పరాదనియు విశదమగునట్లథర్వణుఁడు సవరించుచున్నాఁడు. ఇట్టిసవరణము సఫలమైయున్నది.

---

విస్తర I ౨౧౦ విషః— తనకాలమునాటికి మల్లె - లంజె - గద్దె - యొల్లె యనునవి కవిసమ్మతములు కామింజేసి కావలయుఁ బండితకవీంద్రుఁడగు కేతనామాత్యుఁడు "మల్లెయు లంజెయు గద్దెయు । నొల్లెయు ననుపగిది పలుకులొప్పవు కృతులన్ । మల్లియ లంజియ గద్దియ । యొల్లియ యని పలికిరేని యొప్పుం గృతులన్" (ఆం. భూ. ౧౭౬ ప.) అని యిట్లు వచించెను. తర్వాతికవులు వానినిఁ బ్రయోగించుటం గాంచి యహోబలాదులు కేతన నన్యాయ్యముగ నిరసించిరి. "కం-మల్లెయు...ఒప్పవుకృతులన్" ఇతీదానీ న్తనానా ము క్తిస్తు నిర్మూలైవ" (అహో. ౩౮౪ పు.) "క. మల్లెయు......పలుకు లొప్ప వటంచున్ । బొల్లెను మూరయ కేతనఽతెల్లంబుగ నవియుఁ గలవు త్రిపురాదాతీ. రగడ...మల్లెల (యయాతి) .రగడ

ఇయాన్తా ఇత్యాది కారిక పునరుక్తమని భ్రమపడి గవిజనముండనకర్త "ఇది గ్రంథాంతరశ్లోకమని తోఁచుచున్నది" అని వ్రాయుట పొరపాటు. అహోబలపతి యిది యాథర్వణునిదెయని వచించి యున్నాఁడు.

ఇయాన్తా ఇత్యాది:— ఇయాన్తాః='ఇయ' అనునది యంతమందుఁగల, శబ్దాః= శబ్దములు, సాధవః = సాధువులగును - క్వచిత్ = ఒకప్పుడు వానికన్త్యయరూపము నకు, ఏదంతతాపిచ = ఏకారాంతత్వమును సాధువు కానోపును. ఉదా:— కన్నియ= కన్నె - వన్నియ = వన్నె మొ. క్వచిత్తనుటచేత కాఁకియ, సందియము, సకియ, చెలియ మున్నగువానికి "కాకె - సందెము - సకె - చెలె" మున్నగు రూపాంతరము లుండనేరవని యెఱుంగునది. "అంతె = అంతియ, ఇంతె = ఇంతియ" వీనిలో "అంత+ఏ, ఇంత+ఏ" అనునవి మొదటిరూపములనుట యుక్తము. (విస్తర II). ఇయాంతప్రాతిపదికము లనక "ఇయాంత" శబ్దము లనుటచేతఁ బ్రాతిపదికములలోని

---

......మల్లె లెంతటి (వసు), సీ...బొండుమల్లె (ఆముక్త). క...లంజెతనమునందు ...(నాచనసోముని హరివంశము), ఆ-వె. లంజెతల్లులనఁగ...(కవికర్ణ), గీ.ముత్యాల గద్దె...(కాశీఖం) గీ...ఒంటొల్లెతో...(ఆముక్త)" (సర్వల. ౧ ఆ. ౯ మొ. ౧౬ ప.) అని యిట్లు కేతనకుఁ దర్వాతికవుల ప్రయోగములనె తిమ్మకవి చూపెను. గుప్తార్థ ప్రకాశికాకర్త "క. మల్లెయు లంజెయు గద్దెయు। నొల్లెయు ననుపగిదిపలుకు లొప్పుఁగఁ గృతులన్। మల్లియ లంజియ గద్దియ। యొల్లియ యనిపల్కు నేని యొప్పుం గృతులన్. (ఆంధ్రభాషాభూషణము) పై చెప్పినవానిలో ఇత్వలోపంబు గలుగదు. పై పద్యంబు యొక్క క-"మల్లెయు...పలుకు లొప్పవు కృతులన్" అనుపాఠంబును జూచి తిమ్మక వ్యహోబలపతులు నిరాకరించుట (అసమంజసమని భేదము) సమంజసంబు" (బా. గు. ప్ర. అచ్చి. ౨3 సూ. వ్యా.) అని వ్రాసి తిమ్మకవిచూపిన ప్రయోగములనెల్ల నెక్కించెను. మల్లె మున్నగునాల్గుశబ్దములుమాత్రమె యొప్పున నెడి ప్రక్షిప్త పాఠము కేతనదనుట విశ్వసనీయముకాదు. మఱియు నుత్తరార్ధమున మల్లియ మున్నగురీతిని బలికినచో నొప్పిదమగునని చెప్పుటచేఁ బూర్వార్ధమునందలి 'ఒప్పుఁగన్' అనుపాఠము సరికాదనియు "ఒప్పవు" అనుపాఠమె కవిప్రయుక్తమనియు విశదమగుచున్నది.

విస్తర. II ౨౧౦ విష. కల్ప:—"సీ...ఏత్వములఘుత్వము భజించు దానికి, నా దేశమియయగు నళికనేత్ర (కవిసం. 3 తరంగ. ర ప) ॥ ఉదా:-ఏత్వమునకు,ఇయాదేశము. కన్నె = కన్నియ-వన్నె = వన్నియ" (కవిసం. 3 తరం.). ఈ రచనము సరికాదు. వర్ణకశబ్దమునుండి వన్నియశబ్దమును, కన్యకాశబ్దమునుండి కన్నియశబ్దమును

వైకృత్యములయినవనియు నట్టివాని "ఇయ" అనుదానికి "ఎ"త్వము వచ్చెననియుఁ జెప్పుట సహజముగాన నిటు సూరకవిప్రక్రియ సరికాదనఁ దగును. కాన సూరకవి తనసూత్రమునకు "అంతె = అంతియ - ఇంతె = ఇంతియ" అని యుదాహరించి యుండినచో సరిమైయుండెడిది. వీని యిట్టిస్వరూపమును జూచికొనక యాంధ్రవిశ్వకళాపరిషన్ముద్రిత రంగనాథరామాయణమున "ఇంతియె-అంతియె" అని పెక్కు చోటులఁ బరిష్కర్త నిల్పుట పొరపాటు. ఇంతియెకాదు - (౧౨౫ పు. ౧౧ పం.) మొ. శా...ఇంతేపోతమ్ము కపిధ్వజప్రభలె యంధీభూతులం జేయవే. (ఉద్యో. ౧ ఆ. ౩౨౧) మ...పెక్కండ్రకింతియకాలం బయియుండ నీమనము శాంతింబొందఁగా నేర్చునే. (ఉద్యో. ర ఆ. ౪౭). అహోబలపతి పయిరీతి నధర్వణకారిక చెప్పిన "అంతియ - ఇంతియ" అనురూపములను సాధించికొనక మార్గాంతరమును బ్రోక్కెను. "అంతియ - ఇంతియ ఇతిశబ్దౌ ఎత్తియం-ఇత్తియమితి ప్రాకృతశబ్దయో స్తద్భవౌ. కిదతమక్ళేతి డెత్తియం డిత్తియం డిద్దహామితిసూత్రేణతన్నిష్పత్తిః." (అహో. ౩౫౮). ఈపంక్తులు కేవలము తప్పులు-"కిమిదమశ్చడేత్తి అ, డిత్తిల, డిద్దహాం (౨-౧-౩) అని యుండవలెను. (షడ్భా. తద్ధి. ౧౧౩ పు.) ఏతావత్ = ఇయత్-అనువానికి "ఇంత" అని యర్థము. "తావత్" అనుదానికి "అంత" అని యర్థము. కాని "ఏతావత్" మున్నగువానికి "ఇంతియ" మున్నగువానికిఁ గలయవధారణార్థవిశేషము లేదు. "ఏతావత్—ఇయత్" అనువాని ప్రాకృతరూపములు, "ఏత్తియం-ఇత్తిలం - ఏద్దహాం" అనునవి యీ సూత్రముచే సిద్ధించును. ఇట్లహోబలపతి చూపిన రెండును, "ఇంత" శబ్దార్థకములుమాత్రమె. ఇట్లె 'అంత' శబ్దార్థకమగు "తావత్" అనుదాని ప్రాకృతరూపములు "తేత్తియం - తిత్తిలం - తేద్దహాం" అనునవి. వీని నహోబలపతి స్మరింపనేలేదు. ఈ సందర్భములోని "వతుపో, డిత్తిఅమిదమే తల్లుక్ చైతదశ్చత్తదః" (౨-౧-౨) అనుసూత్రముచెప్పిన "ఏతావత్" అనుదాని ప్రాకృతరూపము "ఇత్తియం" అనియు "తావత్" అనుదానిప్రాకృతరూపము "తిత్తియం" అనియు నేర్పడును. వీనిని సైత మహోబలపతి స్మరించియుండలేదు. అట్లయినను నహోబలపతి చూపినవానికన్న నుచితతరములనఁదగియున్న "తిత్తియం" అనునది "అంతియ" అనుదానికిని "ఇత్తియం" అనునది "ఇంతియ" అనుదానికిని మూలమందమన్నను, నీమూలభూతప్రాకృతశబ్దములలో నవధారణార్థమే లేమిం జేసియు వానితుదినున్న 'య' వర్ణము తెనుఁగులోని "అంతియ, ఇంతియ" అనువాని యవధారణార్థకశబ్దమువంటి దనుభ్రాంతిని గల్గించుచున్నదే కాని యది "తావత్" ఏతావత్" అనువాని వకారమునఁగల్గిన దెయగుటం జేసియుఁ దెనుఁగుశబ్ద

కొంతభాగముసైతము శబ్దమునందులో విరోధములేమింజేసి శబ్దమధ్యమందును నీవిధి ప్రవర్తిల్లును-ఉదా:—చెల్లియలు=చెల్లెలు - "చకారబలేన (ఏవ స్తతాచ అనుచోటిది) శబ్దమధ్యేప్యయం విధిః పరిపూచకము - పరేచకము-పర్యాచకము ఇతి-తేన నన్నుఁ జర్యాచక మేలచేసెను సుహార్దములచేఁ గరుణింపవే చెలి ఇత్యాదిప్రయోగాః సాధుః" (అహో. ౨౮౦ పు) "పరేచకము - పర్యాచకము" అనుశబ్దములు శబ్దరత్నాకరమున సంగ్రహింపఁబడలేదు. అహోబలపతియిచ్చిన ప్రయోగ మెక్కడిదో తెలియదు. "పరిపూచక" శబ్దమధ్యమున "ఇయా" అనియున్నదిగాని "ఇయ" లేదు. ఇట్లే యహోబలపతి "ఇయె" అనువానికిని "ఎత్వము పయి సూత్రముచేఁ బ్పున నొకచో సాధించెను. "చనెన్ - వినెన్ - కనెన్ - ఇత్యాది క్రియాప్రయోగోఽపి ప్రబంధేషు వర్తతే...చనియెన్ - కనియెన్ - వినియెన్-ఇత్యాది - "ఇయాన్తా స్సాధవ శ్శబ్దాఃక్వచి దేవ స్తతాపివా" ఇతి వా ఎత్వమ్. అచోఽచి కుత్రచిల్లోపోబహుళం స్యా త్ప్రయోగతః-ఇతి ఇకారలోపః చనెన్ ఇత్యాది" (అహో. ౧౫౧ పు.) నన్నయ తిక్కనలు "చనియెన్" మున్నగురీతినె ప్రయోగింతురు; "చనెన్" అనురీతివి భారతమునఁ గన్పట్టలేదు. కాన నన్నయాథర్వణులసూత్రములచే "కనెన్-వినెన్" మున్నగువానిని సాధింప యత్నించుటెల? మఱియు నిట "చనియెన్" ఇత్యాదులలో నిది "ఇయ" కాదు. "ఇయె" అనువానికి ఎత్వము నెవ్వరును విధింపలేదు. "క్రియాస్వపి - కదియంబడె - కదెంబడె-ఇత్యాదిరూపమ్" (అహో. ౩౮౦ పు) ఇది సరియైనకాని ప్రయోగములు లభింపమింజేసి కావలయు శబ్దరత్నాకరమునందును సూ. రా. నిఘంటువునందును "కదెంబడు" అనుధాతు వుదాహరింపఁబడలేదు. క. పఱతెంచి కదియఁబడి యే క్షితిఁ బ్రేసిన మోముదాఁకి తిరిగెగరుడి... (నిర్వ. ౩ ఆ. ౨౭ ప, శ. ర; సూ. రా. ని.) అనుప్రయోగముతోఁ గోశద్వయమునందును "కదియంబడు" ధాతువుమాత్రమె చూపఁబడెను.

ఇయాన్తత్వ ఇత్యాది:—తద్భవే=తద్భవ శబ్దమందు, ఇయాన్తత్వే='ఇయ'అను నది తుదినిగలరూపము సిద్ధించియుండఁగా, కుత్రచిత్ = ఒకానొకప్పుడు, యః = యకారము, సంయుక్తోఽపి = పూర్వహల్లుతో సంయోగించినదగుటయు, అత్వంచాపి = దానిమీఁది యికారమకారమగుటయు, సోఽపి=ఆయకారముసైతము, లఘుః =

---

ములగు "అంత+ఎ = అంతె = అంతియు, = ఇంత+ఎ=ఇంతె = ఇంతియు," అనువాని వ్యుత్పత్తి శబ్దార్థ సహజస్థితిరూపమున నెంతయు విశ్వసనీయమై యుండుటంజేసియు "తిత్తియం" అనునది "అంతియ" అనుదానికి మిక్కిలివిదూరమగుటంజేసియు నీ యహోబలపతియుదాహృతి సరికాదు.

లఘుయకారమగుటయు, స్యాదితి=అగునని, కేషాంచిత్-కొందఱియొక్క, ఈరణా-పచనముగలదు. ఉదా:—మౌక్తికమ్ = ముత్తియము = ఇకారలోపము-అత్వము-యత్వములు రాఁగా, ముత్త్యము, ముత్తెము. హలంతర సంయోగమున సజాతీయ ద్విత్వశ్రవణము కలుగనేరదుగాన నిందలి తకారము సయుతము లోపించినదని గ్రహించునది. (౧౯౯ I విష. దీనివిస్తరము చూచునది). వీటికా (సం) వీడియము = వీడ్యము = విడియము = విడ్యము = వీడెము-విడెము. ఇట తద్భవమందు లింగవిపర్యాసము. (౧ VIII విష). కన్యకా (సం) కన్నియ=కన్య=కన్నె. కన్య=లేఁతది-చిన్నది - కన్యకాశబ్దమునకు నవివాహితస్త్రీ యని యర్థము. ఇట నర్థమునందును వికృతిగల్గెను. (౧ VIII-విష ) దీపికా (సం) దివ్వియ = దివ్య = దివ్వె. ఖలీనమ్ (సం.) (కలికా. వై. దీ) కళ్ళియము = కళ్యము = కళ్ళెము. ఘటికా (సం) గడియ = గడె - ('గడ్య' అని లేదు.) దీర్ఘికా (సం) డిగ్గియ = డిగ్గె. 'డిగ్య' అని యుండదు. తద్భవములందే కాక దేశ్యములందును నిత్యలోపాదిక మర్వాచీనకవితలోఁ గన్పట్టును. కొండియము = కొండ్యము - కొండెము. మొ.

ఏవావ్యయేత్యాది:—ఏవావ్యయ సమానార్థమ్= సంస్కృతములోని 'ఏవ' అనెడి యవధారణార్థకముతోఁ దుల్యమైన యర్థముగల, ఎత్వమ్ = 'ఎ - ఏ' అను శబ్దములును, అత్వంచ = 'అ' అను శబ్దమును దెలుంగున, దృశ్యతే = కనఁబడు చున్నవి. అట్టి 'ఎ' శబ్దమును, దానినుండి యేర్పడిన 'ఇయ' శబ్దమును నామాదులకుఁ జేర్పఁబడునని భావము (౨౩౩ III విష). ఉదా:—అంత + ఎ = అంతె = అంతియ. ఇంత + ఎ = ఇంతె = ఇంతియ. మొ. (విస్తర II ౨౧౦ విష) అ—క...పర్వం | బకదున్ మేలనఁగ శాంతిపర్వము వెలయున్ (ఆది. ౧ ఆ. ౯౮ ప). ఎ - ఏ—శా...ఇం | తేపోతమ్ముఁ గపిధ్వజప్రభలై యంధీభూతులన్ జేయవే (ఉద్యో. ౧ ఆ. ౩౨౧ ప) (ప్రభల. పాఠాంతర). గీ. అట్టికన్నులు లేవను టంతె కాక | యుత్తముఁడు గాఁడె (ఆది. ౫ ఆ. ౧౧౯ ప) మ...పెక్కండ్ర కిం | తియ కాలంబగునట్టె నీమనసు శాంతింబొందఁగా నేర్చునే. (ఉద్యో. ౪ ఆ. ౪౭) (విస్తర. II ౨౧౦ విష.)

ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహు
బాలవ్యాకరణ ళంబుగా నగు. ౨౩.
వివరణము. కన్నియ = కన్నె, జన్నియ = జన్నె, వన్నియ = వన్నె,
౨౧౧ I విషయము. కొంచియము = కొంచెము, కొండియము = కొండెము,
బహుళగ్రహణముచే సందియము, కాఱియ మొద

లగు శబ్దంబులం దెత్వము లేదు. ఇయశబ్దంబునం
దికారలోపంబు గొందఱు వక్కాణించిరి. అయ్యది
ప్రయోగంబులందు మృగ్యంబు. ముత్తియశబ్దంబు
నందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి.
ముత్తియము = ముత్తెము = ముత్యము.

సంజీవని. ౨౧౦ I విషః—అర్థములు - కన్య = [illegible] - అప్రౌఢము. జన్నియ = జన్నె = దేవతాదుల నుద్దేశించి విడుచుకట్టినవస్తువు, పన్నియ = పన్నె = [illegible] - ప్రత్యయము. గాజియు = హింస = యాతన.

ప్రాతిపదికము తుదనున్న 'ఇయ' అనుదానికి 'ఎ' అనునది బహుళముగా నాదేశమగును. కన్నియ - ఇందలి తుదనున్న 'ఇయ' పోయి యచట 'ఎ' నిలువఁగా 'కన్నె' అని యగును. కన్నియలు - కన్నెలు. కన్నియను - కన్నెను. మొ. పందియము కాజియ మున్నగుచోట్ల "పందెము - కాజె" మున్నగురీతి నెత్వము రాదని సూరిగారే వివరించిరి. ఇత్వలోపము గొన్నియెడలఁ గల్గునని యథర్వణాచార్యుఁడే వచించియుండఁగా నద్దానికిఁ బ్రయోగము మృగ్యమనియు ముత్తియ శబ్దమందుమాత్రమె యది గానంబడుననియు సూరి వ్రాయుట సరికాదు. కావుననె ప్రౌఢవ్యాకర్త "ముత్తియశబ్దేతరములయందును దఱుచుగ నిత్వలోపంబు గానంబడియెడి" (ప్రౌఢ. శబ్ద. ౭౯ సూ.) అని సూత్రించి యీ క్రిందిప్రయోగములు చూపెను. తే. గీ. గుఱ్ఱ గ్రద్ద పిట్టలుఁ బ్రువ్వ గూబ । యిల్లుసొచ్చిన శాంతిసేయింపవలయు (అను. ౪ ఆ. ౧౧౯) సీ. కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబుల...... (విరా. ౧ ఆ. ౯౫) సీ. జోడులతనువులు ఘటించి మోపులు కళ్యాలతోడఁ జెక్కలుగఁజేసి (కర్ణ. ౧ ఆ. ౧౪౦) (దీనిని ప్రౌఢవ్యాకర్త చూపలేదు.). సీ. ధృతిఁ గుంతి మద్రభూపతుల నెయ్యపుఁగన్యకల ననవాలుఁ దూపుల జయించి (రాఘవ. ౧ ఆ. ౭ ప.) ఇందు రామాయణార్థమునఁ గుంతి మద్రభూపతులను నెయ్యపుఁ గన్యకలని యందె యనఁగా నప్రౌఢయుద్ధమునందె జయించెనని యర్థము. భారతార్థమునఁ గుంతిమద్రభూపతుల కన్యకలను, ననవాలుఁదూపుల ననఁగా మన్మథాస్త్రములగు పుష్పబాణములచే జయించెనని యర్థము. ఉ...సూర్యపా । కంబున నాయితం బయిన కజ్జము భోజనశాలలోనఁ బళ్యంబు బిడినారు...(కాశీ. ౫ ఆ.) హత్తుకొల్పిరి లేఁతవీడ్యములడాలు (పాండు. 3 ఆ.) ప్రౌఢవ్యాకర్త చూపని మఱికొన్ని ప్రయోగములు:—దక్షిణాధీశు ముత్యాలశాల (శ్రీనాథుఁడు) సీ. ముత్యాలసేసల మొల్లంబుతోఁగూడ (ఉ. హరి. ౬ ఆ. ౨౧౫) ద్విపద. నిత్యనేమం బిది నేఁటి ముగ్గునకు ।

ముక్తాఫలహారి మాకు ముక్కుపవలయము (బసవ. ౨ ఆ. ౪౩౨ ప.). నిత్యశబ్దభవ ముబు - నిత్తియము = నిత్తెము = నిత్యము. (ఇత్వలోపరూప మియ్యది.). కాన నాన్తికముగు నిత్యము శబ్దముతోడి సమాసముగల నిత్యనేమము శబ్దము వైరిసమాసము కాదు. (విస్తర.). సీ. కొండెంబులఁ గొంపలఁ గూల్చు పాతకురాలు.. (శ్రీరం. మా. ౫-౩౪), సూ - రా - నిఘంటువ్రసంపమును, దదను యాయిగాణపత వివరణము నందును "కొండెలఁ గొంపలఁగూల్చుపాతకురాలు" అని యున్నది. ఆపాఠము ప్రక్షిప్తము. (విస్తర. I ౧౪౮ I విష). కొన్ని ప్రకీర్ణకవిషయములు ప్రసంగవశ మున నిచటఁ జూపఁబడుచున్నవి.

కవిభల్లటైః క్రియాణాం।నామ్నాం చోల్లోప ఇష్యతే
స్వార్థపూ । ప్రథమైకవచనమాత్రే । వికృతౌ నాన్త
పయోఽపి కథ్యతే. (ఆం. చి. హలం. ౮ కారి.

నన్నయా — ఆహో. ౩౯ పు.)

భవనీయము. — వినా ద్వితీయం స్యాదస్య । దాత్మనోః స్వ స్తయోరపి ।

౨౧౦ II విషయము. — నో కస్యస్యాపి సర్వం స్యా । ద్బహుళం సత్ప్రయో
గతః. (వికృ. సంధి. ౩౨ కా. అహో. ౨౩౨).
కుత్రచి ద్రేఫగస్య స్యా । దుతో లోపః ప్రయోగతః.
(వికృ. అజం. ౫౮ కా. అహో. ౩౩౯ పు.)

కల్ప. ౨౧౦ II విష:—కవిభల్లటైః = కవిభల్లటులనెడి నన్నయ నాఁటి) వైయాకరణునిచే, క్రియాణామ్ = తిజన్తపదములయొక్కయు, నా

---

విస్తర. ౨౧౦ I విష:—"ఇట్లిత్వలోపము గల్గినచోటులందు జడ్డ తోఁచెనేని పూర్వము తెల్పినప్రకారము ప్రకీర్ణ ౮ సూత్రముచే జడ్డలోపము గల్గుటను స్మరించు నది" (బా. సా. వే. అచ్చి. ౨౩ సూ. వ్యా.). ఇది సరికాదు. "అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు. (బా. ప్రకీ. ౮ సూ.) అకట = అక్కట - మొ. అక్కటాదులలో "ముత్తియము" మున్నగు శబ్దములున్నవన్నచో 'ముతియము' మున్నగు ననిష్టరూపములు పాక్షికముగ నిల్వవలసివచ్చును. ఇంక నిత్వము లోపించిన, "ముత్త్యము" మున్నగునవి యక్కటాదులలోనివన్నచోఁ బాక్షికముగ నైన జడ్డతోడి రూపము నిల్వకతీరదు. హలంతరసంయోగమున జడ్డ శ్రుతిగోచ రముకాదు గాన నుపేక్ష్యమన్న యనుగమము నిరర్థకమె యగును. (౧౯౯ I విష) మఱియు హలంతరసంయుక్తములగు జడ్డ లక్కటాదులలో నుద్దేశింపఁబడలేదు. కావుననె యట్టి దొక్కటేని యందుదాహృతము కాలేదు.

నామ్నాం = సుబన్తపదములయొక్కయు, యుల్లోపః = తుదినున్న 'ఉ' కారమున కగుచుండు లోపము, ప్రసక్తేపి = ఆగికరించఁబడుచున్నను, 'కవిభల్లటైః' అనుటచే నిట్టిలోపము వైభాషికమనుట్టము లభించుచున్నది. కేషు = ఏయే ప్రదేశము లలో, ఇత్యత = అనిచెప్పఁబడుచుండ, ప్రథమైకవచనమాత్రే = ప్రథమైకవచన సామాన్యమందు, ప్రథమైకవచన సదృశములైనయున్నను వివిధ ప్రథమైకవచనములం దని యర్థము. నాన్తాదయోపి = నకారాన్తప్రభృతులే, కథ్యన్తే = చెప్పఁబడు చున్నవి. ప్రథమైకవచనరూప నకారాన్తాదులమీఁది 'ఉ' కారమునకే సార్వత్రిక లోపము ప్రాయికమనియును నిక్కనచోట్లను, నమాంత్యాయుకరు నుల్లోపకరుణ గల దనియుఁ జెప్పఁబడెను. క్రియాపదముల తుదిని నిల్చు పురుషబోధకప్రత్యయములు ప్రథమాంతసర్వనామముల తుదివర్ణములయగుటంజేసి యవి సాక్షాత్తుగఁ బ్రథమా విభక్తులు కాకున్నను బ్రథమాపదసదృశములనఁదగునుగాన వాని సంగ్రహమునకై మాత్రశబ్దము ప్రయుక్తమయ్యెనని గ్రహింపవలయును. "నామ్నామ్" అనుటచే నీవిధి ప్రాతిపదికమాత్రవిషయకమని యహోబలపతి వివరించెను. ఆపక్షమున క్రియాణామ్మనుటచేత ధాతువులందే యుల్లోపము చెప్పవలసివచ్చునని తలంపఁ దయ్యెను; "మూడక్షరములు, వత్తురులు, ఇత్యాదికం క్రియోదాహరణమ్" (అహో. ౮౦౦ పు.) అని యెట్లుదాహరింపఁగడఁగెనో తెలియకున్నది. మఱియు నామపక్షమునం దుదాహరించిన "కన్దెఱచి, చన్గుడిపె, పిల్చొని, కల్గొవి" అను చోటులందలి 'కన' మున్నగునవి ద్వితీయార్థక ప్రథమావిభక్తులయియుండఁగా నవి ప్రాతిపదికములనుట యెట్లుపొసఁగును? ఇంతేకాను "ప్రథమైకవచనమాత్రే" అను చుండఁగా నీవిధి ప్రాతిపదికవిషయమనుటయెట్లు? చింతామణికర్త "నీ-నా-తా-మన" శబ్దముల సుబన్తరూపములను సాధించి వెంటనే యీకారికను వచించుటచేతను 'నాన్తాదయః' అనుటచేతను ముఖ్యముగా, నేను తాను శబ్దముల యుత్వలోపసాధ నమె యాతనికిఁ బ్రథమోద్దిష్టమనఁదగియుండఁగా నహోబలపతి యీవిధి నేను తాను శబ్దముల యుల్లోపవిషయమున నుపచరింపదనుచు నేవేవో యపమార్గముల మూలమున వాని యుల్లోపము సాధించెను. "వాత్మాస్మదోర్ద్రుతస్య స్యాల్లుక్. వ్యా. ఆత్మాస్మచ్ఛబ్దయోర్ద్రుతస్య వా లుక్ స్యాత్. సరళే స్థిరేచ పరే......సలో లోశ్చేతి చకారేణ ఉత్వలోపేకృతేఽవశిష్టస్య ద్రుతస్యాత్ర గ్రహణమ్........ న చాత్ర కవిభల్లటసూత్రవ్యాపారః - తస్య ప్రాతిపదికవిషయత్వాత్ - లుగ్విధి పర్యుదాసయోః సామర్థ్యాద్వా భవ త్యుల్లోప ఇతి సువచమ్"(అహో. ౨౩౨ పు.) తాను నేను శబ్దముల 'ను'వర్ణమునకు ద్రుతత్వములేమింజేసియు వాని ద్రుతమునకు

హాత్స్వస్వరోకిత్యాదిసూత్రము లోపమును విధించుచుండుటం జేసియు నట్టి విధాన సామర్థ్యమునను, గ ప డ వ వాః స్యురిత్యాదిసూత్రమునందు నేఁ తాను శబ్దములను బర్యుదాసించిన దాని సామర్థ్యమునను వాని కుల్లోపము సాధ్యమని వింతగ నహోబలపతి చర్చించెను. తానపాఠముచేసిన 'నలోలోశ్చ' అను సూత్రములోని చకారపు శక్తిచేనైన తానునేను శబ్దముల యుల్లోపము సాధ్యమని మార్గాంతరముచూపెను. పైరీతిని గ్రంథకర్త యుద్దేశించిన యుత్తమపద్ధతి నుజ్జగించి యిట్లు మార్గాంతరాన్వేషణము చేయనేల? అట్లు చింతామణికర్త తాను నేను శబ్దముల కుల్లోపమును సూత్రించినను నవశిష్ట నకారఘటితరూపములు ప్రథమైకవచనాంతములె యగుటచేతఁ దిజ్మధ్య సూత్రముచొప్పున నవి కళలే యగుననుశంకను వారించుచుఁ, గళాశబ్దములకు స్వరలోపముగల్గునపుడు పరిశిష్టమగు నకారము ద్రుతమగుట సమ్మతమని విశదపఱుచుచు నథర్వణుఁడు వినా ద్వితీయమిత్యాదికారికను వచించెను. వినాద్వితీయమిత్యాదికారిక వ్యాఖ్యాతపూర్వమగుటచే నిట వ్యాఖ్యచేయఁబడలేదు (౨౨ III విష. కల్ప.)

పయిసందర్భమునుబట్టి సుప్తిజంతములతుదినున్న నకారముమీఁది 'ఉ' కారమునకు వైకల్పికలోపము ప్రాయికమనియు నాదిశబ్దముచే నట్టి లకారము మున్నగువానిమీఁదనైత ముచ్చటచ్చట నుల్లోపము కల్గుచుండుననియు నట్టివాని బహుత్వమునందును గొన్నియెడల నుల్లోపము కల్గుననియుఁ గవిభల్లటసూత్రార్థము నిశ్చితమగుచున్నది. ఉదా:—తాను+చదివె = తాన్+జదివె = తాఁజదివె. నేను+చెప్పితిని = నేన్+జెప్పితిని = నేఁజెప్పితిని. ఇల్లు - కన్ను - చన్ను - విల్లు - కల్లు మున్నగువానికి "ప్రథమ లుగపిద్వినుల్వోః" అను చింతామణి సూత్రముచొప్పునఁ బ్రథమవర్ణలోపముకల్గినపిదపఁ బ్రకృతసూత్రముచే నుల్లోపమురాఁగా "కన్దెఱచి - చన్గుడిచి - విల్వూని - కల్ద్రావి మున్నగురూపములు సిద్ధించును. కన్నుదెఱచి - కనుదెఱచి - చన్నుగుడిచి - చనుగుడిచి - విల్లువూని - విలువూని - కల్లుద్రావి - కలుద్రావి మున్నగురీతిని బాహుళికరూపములును గల్గును. మిన్ను+పడెను=మిన్వడెను. మ్రాను+పడెను = మ్రాన్పడెను-చేసు+మేపి=చేస్మేపి. వినుము-విను-విన్ నేను పండితుఁడను=నేను పండితుఁడన్-అదియును=అదియున్, మున్నగునవెల్ల దీనికే లక్ష్యములని యెఱుంగునది. చింతామణిచొప్పున, "చేసెదనున్, చేయుదునున్, చేయనున్" మున్నగునవి సమాపకక్రియాపూర్ణరూపములు సిద్ధించును. అవసానద్రుత లోపానంతరముననిల్చు 'చేసెదను, చేయుదును, చేయను' మున్నగు క్రియల యుల్లోపమునైత మీసూత్రముచేతనే సిద్ధింపవలయును. చదివితినిన్-మున్న

కవచం బటువ్రాల్ సేసి... (భాస్క. యుద్ధ. ౫౮౭ ప.) ఉ... మునుంబుగ బొందితి నీకు ద్రోహిగాన్. (పద్యాంతము. నీకు ద్రోహిని గానని యర్థము.) క...భీమునకు నం గౌఱుఁ గిన్నరఁ గొడుకు పుత్త్రులుం గాఁకయుతుల్ (ఆది. ౫ ఆ. ౧౩౭ ప.)

బాలవ్యాకరణ విరోధము. సంజ్ఞా. ౨౧౦ III నియమము.

పదాంతంబులందు యుక్తంబులయిన ను లు రుల యుక్తంబునకు లోపంబు బహుళంబుగాగు. (బా. క్రి. ౧౬ సూ.)

ఇందు నగుల పున్నలోపంబు ప్రాయికంబుగ వాల్పరకం బటకుఁ జూపఁదగు. వ్రాల్పు - మిసువన్ = మిన్నన్. వస్త్రవుగాఁడ = వస్త్రగాఁడు. కాకకోలిని = కాకో- లిని. రాముఁలు - రాముఁడ్. వనములు - వనముల్.

సంజ్ఞ. ౨౧౦ III నియ:—కవిభల్లటసూత్రమును బాలకవి సూరి సంగ్రహింప పలుచుటచేతను వర్తిమాత్రమునే సూరి యనుసరించుటచేతను గవిభల్లటసూత్రపు వైశాల్యము సూరి సూత్రమునకు లేదయ్యెను. చనున్ మున్నగు రూపాలలో 'ను' అనునది ప్రత్యయము కాదింజేసి, బా. సంధి ౨౦ సూత్రము పొడ్వాఁ సుల్లోపము కలుగక 'వేఁడఁ జన్ పదములు' (ఆది. సభా. ౨ ఆ. ౨౬౬) మున్నగుచోటులందలి 'చన్' మున్నగురూపములు బాలవ్యాకరణముచొప్పున సాధ్యములుకావు. అట్లే "అను-చను" మున్నగు ధాతుజవిశేషణములందును సుల్లోపము రాక "గిరివ్రజమున్ పురంబు" (సభా. ౧ ఆ. ౧౭౩) మున్నగుచోటులందలి 'అన్' మున్నగునవియు బాలవ్యాకరణసాధ్యములు కాఁజాలవు. "కన్‌పట్టు - కన్పెబచె."(ఆను. ౨ ఆ. ౪౫౦ ప.) మున్నగునవియు సాధ్యములుకావు. సూరిసూత్రములోని "అసంయుక్తంబులయిన ను లు రుల" అనుదానిచే 'అటువ్రళ్ళ=అటువ్రళ్' (భాస్క. యు. ౫౪౮ ప.) 'నీరుకోళ్ళు = నీరుకోళ్' (ఆను. ౧ ఆ. ౭౧) మున్నగు ప్రయోగములు బాలవ్యాకరణమును బ్రతిఘటించుచున్నవి.'ను లు రు'లసంయుక్తమాత్రముననే లోపముచు విధించుటచే 'మార్పులుకంగ' (శల్య.౧ ఆ. ౬౧)'కీడ్పడుచెల్పుగుంచు.' (శాంతి. ౧ ఆ. ౩౦౭) 'కీడ్పడన్' (ఆది. ౫ ఆ. ౧౬౪) మున్నగురూపములు బాలవ్యాకరణసాధ్యములు గానేరవు, మఱియుఁ గవిత్రయమువారు పలుచూఱు ప్రయోగించిన 'నిన్ - నన్ - తన్' అనురూపములును బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడవయ్యె. "తత్పాలుర్ (ఆది. ౨ ఆ. ౯౨) నలువుర్ (ఆను. ౧ ఆ. ౩౧౬) చింతుర్ (శాంతి. ౨ ఆ. ౧౮౦)" మున్నగునవియు సూరిచే సంగ్రహింపఁబడలేదు. వీనిలో - 'పాలుర్' మున్నగు ప్రథమా రువర్ణోల్లోపమును (ప్రౌఢ. శబ్ద. ౧౬ సూ.) గిరివ్రజమున్ పురంబు

మున్నగునవియు (ప్రౌఢ. సంధి. ౧౩) 'నిన్ - నన్ - తన్' అను శబ్దములును (ప్రౌఢ. శబ్ద. ౭౩ సూ.) మాత్రము త్రిలింగలక్షణ శేషమున సంగ్రహింపఁబడినవి.

నన్నయా. ప్రథమ లుగపిద్విసులోర్వాః (ఆం. చిం. సంధి. ౧౧ కారి. అహో. ౨౨౭ పు.)

౨౧౦ IV విష. అన్యత్రాపి భవే దైక్యం। క్వచిత్ సుకవిసమ్మతేః.(వికృ. సంధి. ౨౭ కా. అహో. ౨౨౭.)

కల్ప. ౨౧౦ IV విష:—ద్విసులోర్వాః = శబ్దగతములగు "ల్లు - న్ను" అను వానిలో, ప్రథమలుగపి = దొలిహల్లునకు లోపము నైతము గలుగును. అనఁగా ను లుల ద్విరుక్తిలో మొదటిది పాక్షికముగ లోపించుననియర్థము. ఉదా:—కల్లు= కలు, కన్ను = కను, ఇట్లె పల్లు - విల్లు - ముల్లు మున్నగువానియందును, విన్ను - మిన్ను - మన్ను - మున్నగువానియందును నొక హల్లు లోపించునని యెఱుంగు నది. క్వచిత్ = ఒకానొకప్పుడు, అన్యత్రాపి = ఇతర స్థలములందును ననఁగా 'న్ను - ల్లు' అనువానియందే కాక యితర ద్విరుక్తవర్ణములందును, ఐక్యమ్ = ఏకత్వమనఁగా నొకహల్లులోపించి యొకటి మిగులుట, సుకవి సమ్మతేః - సత్కవులసమ్మతివలన సాధు వగుచున్నది. ఉదా:—అటు = అట్టు, కపురము = కప్పురము, అకట = అక్కట, అపుడు = అప్పుడు, గొటియ = గొట్టియ, అటులు = అట్టులు, అటు = అట్టు, అయ = అయ్య, అన = అన్న, అప = అప్ప, అమ = అమ్మ, అక = అక్క, సమాసములం దును:—తలిదండ్రులు - తల్లిదండ్రులు - కలుకుండ = కల్లుకుండ, విలువిద్య = విల్లు విద్య అద్ది = అది, ఎవ్వఁడు = ఎవఁడు, ఎద్ది = ఎది, ఇద్ది = ఇది, మొ.

అకారంబు క్రింది అకారంబునకుం దుది ను లల క్రింది న లలకు లోపంబు బహుళంబుగానగు. (బా. ప్రకీ. ౭ సూ.)

అట్టు = అటు, గొట్టియ = గొటియ, కన్ను = కను, నన్ను = నను, పల్లు = పలు, విల్లు - విలు. అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు. రా అకట అక్కట. అక్కట-అట్టిక-అట్టుక-అట్టె - అయ్యో- అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత -

వానజొట్టు = తుంపర, తెల్ల = తెల. చ. తెలతెల వేగెనప్డు (మాస. ౧ ఆ. శ. ర.) నెమ్మలి = నెమిలి. తే. గీ. మేపులొసఁగి రక్షించు నెమిళ్ళ (జై. ౪ ఆ. ౭౯. శ. ర.) 'నెమ్మలి' అనునదియుఁగలదు. "పుల్లియ = విస్తరాకు. క.... । పలాశపత్రముల పులియఁ బాయక ద్విజాండి । మ్ముల భోజనంబుసేసిన (విజ్ఞా. ఆచా. శ. ర.) ప్రాకెన్న= పెండ్లియందలి మూఁడవనాఁటి బువ్వము. బొమ్మికము = బొమ్మిడికము = బొమ్మిడీకము = కిరీటము. మజ్జ = ప్రశంసనుదెల్పును. క.... । గజిబిజిలేదు మొగంబున । మజే బాపురె పీనిఁబోలు మగలుంగలరే (ఉ. హరి. ౫ ఆ. శ. ర.) మల్లారము=మట్టి గాజులగుడి. మొక్కరము = స్తంభము. ఉ.—మెఱుంగుదేఱు తొగచుట్టపుటా మొకరంబు మాటుగా । ...(వసు. ౬ ఆ. శ. ర.) మొల్లాము=బంగారులోనగువాని పూఁత. రడ్డి = రెడ్డి. వయ్యాళి = విహారము. చ....పూ । విలుతువయాళికిన్... (వసు. 3 ఆ. శ. ర) సన్నియ = సన్నెకల్లు. అన్ని = అని. సీ...పురాణంబు, లనియును నొకవిద్య...(శాంతి. 3 ఆ. ౧౧౯ సూ. రా. ని.) "అన్నియు నొకవిద్య" యన్నను నిట క్షతి లేదు. ఎన్ని = ఎని. చ.... వెఱవ కోడక నొంపఁగ వాని కెన్దలల్ । గలవు......(ఉ. హరి. ౫ ఆ. ౮౭ ఎన్నితలలు = ఎన్దలల్) కొన్ని = కొని. క.... సరకు । గొనక మఱచియున్నయెడను గొనిదినములకున్ (నిర్వ. ౭ ఆ. ౬3) 'కొన్ని గొడంగికొన్గునిసి' (పాండు. ౪ ఆ. కొన్ని గొణఁగి-కొన్ని గునిసి.)

'కన్ను = కను' అని వ్యస్తముగనుగలదు. క. నరపతి యానందాశ్రులు । గర సరసిరుహముల నొత్తి కనుదనియగ నయ్యిరువురఁ జూచుచు (ద్రోణ. ౫ ఆ. ౧౬ ప.) క. పలువురకుఁబుట్టినిచ్చలు । కలు ద్రావుచుఁబెరిఁగి (కర్ణ. ౨ ఆ. ౪౭) ఇందు బింబము నూచి చెందుప్వఁ గలుసావి (సావి=అని) యఱులెత్తినాకంగ...(కాశీ.3 ఆ. శ. ర.) క. ఉఱవగు నాఱుగపంటలు । గొఱెయలపాఁడియును (ఆది. ౪ ఆ. శ. ర.) ఇట్టి ప్రయోగములచే నీవిధిపదాంతమందే కాక పదమునడుమనునైతము కల్గునని నిర్ణీత మగుచున్నది. దున్ను = దును. అన్న = అన మున్నగునవి యాదిపదగ్రాహ్యములు. చ. హాలికుండెంతయు నోజతో దునఁగ (అర. ౫ ఆ. ౫౭) క. దున నియ్యకొన్న కృషికుఁడు । దునకయ యున్నెని నొకని దున్నింపనగున్ । దునక దుననీక యాఁగినఁ। గొననగు......(విజ్ఞా. వ్యవ. ౧౫౧ ప.) చ. తనువు దొరంగఁగావలదు ధర్మమయాత్మక నీవు రావనా (మహాప్ర. ౧ ఆ. ౧౫౧) క....బావా । శ్రీవిశ్రుత కృష్ణపనుపు చెల్లింపవనా (మాస. ౧ ఆ. ౧౨3) క...బొంకక చెప్పుమా (విరా. ౧ ఆ. 3౧౪) చూతము చెపుమన్న (ఉద్యో. ౨ ఆ. 3౦౪) తే. గీ....కురుకులాగ్ర । గణ్య చెపుదురు పరిణయకల్పవిదులు (అను. ౨ ఆ. ౨౨౭.)

పయి. ౩౮ సూత్రములచే జెప్పఁబడిన హల్లోపము గల్గినవాని పై నుండు నచ్చునకుఁ బరరూపసంధి గల్గనేరదని ౯ సూత్రపు పర్యవసితార్థము. "అలు + ఎత్తె, కను + అదరె, ననున్ + అడిగె, పలు + ఒత్తె, విలు + అందె," ఇట్టిచోటులందుఁ బరరూప సంధి కల్గనేరదు. వాక్యమున విసంధిగ యథాస్థితితో నుండనేరదు. ఇట్టియెడల సంధిజరుగునపుడు "అల్లెత్తె - కన్నదరె, నన్నడిగె" మున్నగురీతినే యుండునని యెన్నవలెను. మ. అనిలంబప్పురిఁ బౌరచిత్తముల కత్యానంద మొదవంగ న౹ శ్రీని మిన్నేటితరంగలం బెనఁగుచున్ (ఆది. ౮ ఆ. శ. ౫). గుప్తార్థప్రకాశికలో "కన్నాకు మిక్కిలి" అనునవి యుదాహరింపఁబడెను. మిన్నుశబ్దమునకు 'మిలు' అను రూపాంతరము శబ్దరత్నాకరకోశమునఁ జూపఁబడలేదు. కాన నట ౯ సూత్రమునకుఁ బ్రసక్తియుండదు. "కన్నాకు-వి. (కను + ఆకు-ప్రౌఢవ్యాకరణము. సంధి. ౯ సూ.) తమలపాకులకట్టయందు మొదటనుండెడి కనఁబడెడియాకు. (శ.ర.)" కావుననే 'శ్రేష్ఠ' అను గౌణార్థముకల్గెనని కోశకారుల యాశయము) ఈయభిప్రాయములు సమ్మతించు నపుడు "కన్నాకు" అనునదియు ౯ సూత్రమున కుదాహృతి కానేరదు. 'కను+ఆకు' అనుఛేదమునందలివి "కను" ధాతువె కాని కన్ను శబ్దరూపాంతరము కాదుగదా.

౭ సూత్రములోని బహుళగ్రహణముచే "న్న-ల్ల" అనువాని హల్లోపము పాక్షికమనియు 'న్న-ల్ల' అనునవి శబ్దాంతిమస్థలములగునపుడే యీవిధివర్తిల్లుననియు శకటద్విత్వము పదమధ్యగమైనను నీవిధి వర్తిల్లనగుననియు నదియుఁగావ్యౌచిత్య మనియు నెఱుంగునది.

ఈ ౯ సూత్రము నియమముచే "ననున్ - నినున్ - తనున్ - మమున్ - మిమున్ - తమున్" అనువానికి స్వరపరకత్వమున బా. సంధి. ౨ సూత్రముచే జెప్పిన "ననేలె - మమేలె" మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. సూరి యిట్లు జాగ్రత్త పడెనని గ్రహింపక ప్రౌఢవ్యాకర్త "ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారము నకు స్వరంబు పరంబగుచో సంధిరాదు. ఉదా: ననునెఱిఁగె-నినునెఱిఁగె - మొ." (ప్రౌఢ. ముక్తలక్షణవివేచనము.) అని సూత్రించుట వృథ యగుచున్నది. "ప్రథమేతరసూత్రమున నద్విత్వములగు మిము తము నను మొదలగువానికిఁ బ్రవేశ మీసూత్ర మడ్డఁజాలమిని ద్రిలింగలక్షణ శేషకర్తకట్లుసూత్రించుట ప్రసక్తమయ్యె" (బా. సా. వే. ప్రకీ. ౯ సూ. వ్యా.) అని వేటికావ్యాఖ్యాత వ్రాయుటసరికాదు. సంధి చికీర్షితమగునపుడే ద్విత్వహల్లోపము నివారితమగునుగాన 'నను' ప్రభృతి శబ్దములె యాపక్షమున జనింపనేరవు. 'నన్నడిగె' అని సూరి యుదాహరించి యుండఁగా నిట్లువ్రాయుట సరికాదుగదా.

మ. మన సేకాగ్రతఁ బొందఁజేయ.....(శాంతి. ౫ ఆ. ౧౨౧) ఇట్టియెడల "౭-౮" సూత్రములచే ద్విత్వలోపము జరుగలేదుగాన "మనసేకాగ్రత" అని యుండుట నిర్బాధము.

నన్నయాధ. క్వచి దన్త్యస్య చాన్యస్య। లోపో దీర్ఘశ్చ కుత్రచిత్
౨౧౦ VI విష. (వికృ. అజం. ౯౦ కా. అహో. ౩౬౫ పు.)

కల్ప. ౨౧౦ Vi విష:—క్వచిత్ = ఒకానొకప్పుడు, అన్త్యస్య=పదముః తుది హల్లునకును, కుత్రచిత్ =ఒకానొకప్పుడు, అన్యస్య=అంత్యేతరమునకు=మొదటిహల్లునకును, లేదా నడిమిహల్లులకు, లోపశ్చ=లోపమువచ్చుటయుఁగలదు, దీర్ఘశ్చ=లోపించినహల్లునకు ముందటిస్వరమునకు, దీర్ఘమువచ్చుటయుఁగలదు. ఉదా:—"మొగసాల = మోసల,... మొగము = మోము,... చానేసెన్ = చావనేసెన్, నోవనాడెన్ = నోనాడెన్, మఱాకు = మఱవకు,...క్వచిన్న దీర్ఘః - నెలకొనియె = నెలవుకొనియె,... క్వచిద్దీర్ఘ ఏవ - ఏఁడు = ఎవఁడు, ఏరు = ఎవరు, వూనె - నెగసె - పొదవె - పొనరె - పొందె - నిత్యత్ర ఆద్యస్య హల్మాత్రలోపే ఊనె నిత్యాదిరూపాణి కవిప్రయోగ సిద్ధాని - నేర్తురు ఇత్యత్ర రేఫలోపే నేతురు ఇతి ప్రయోగోపి కవిసమ్మతః. నీవు = ఈవు, నేను = ఏను, మీరు = ఈరు, మేము = ఏము." (అహో. ౩౬౭ పు.) పయిరీతి నహోబలపతి "క్వచిదన్త్యస్య చాద్యస్య" అను పాఠము నంగీకరించి "ఆద్యహల్మాత్రలోపే" అని యుదాహరించెను. అన్యస్య, అనుపాఠమున "ఆద్యస్య" అను నర్థమును లభించునుగాన నదియె లెస్స. అహోబలపతి యట్లె యుదాహరించెను. "యుక్తాయుక్తావపి" (౨౧౯ విష.) అనునది గలదుగాన నిందు "నీవు - ఈవు" మున్నగువాని నుదాహరింపరాదు. 'అన్యస్య' అనుటచే - మఱవకు = మఱాకు, సగము = సాము మొదలగునవి సిద్ధించును. ఈకారిక కహోబలపతి విరివిగానె యుదారించెను. అట్టి యుదాహృతులలో సర్వనామములయుఁ గ్రియాపదములయు విమర్శమును బ్రయోగాదులును వానివివరించు సందర్భమునఁ జూపఁబడును. ఇచట "వూనె = ఊనె, నెగసె = ఎగసె, పొదవె = ఒదవె, పొనరె=ఒనరె, పొందె = ఒందె" అనునవిమాత్రమె సఁజీవనిలో విమర్శింపఁబడును.

హాదులయు నీలుగు లోనగువాని తొలిహల్లునకు
బాలవ్యాకరణ లోపంబు బహుళంబుగనగు. ౧౦.
వివరణము. హాడపము = అడపము, హారిదళము = అరిదళము,
౨౧౦ VII విష. హాలఁది = అళఁది, నీలుగు = ఈలుగు. నీలుగు,
నెగయు, పొందు, పొనరు. వూనుపొదవుల కాదిలో
పం బొకండు వచియించెనది యవిచారమూలకంబు.

సంజననీ. ౨౧౦ VII విష:—పొదవము = వక్కాణించుటలత్త. ఆరేడి = పాటిప్రాపక్షము - పెద్దపొందు. ('అంది' అను ఒకానొకఘటితరూపమె ప్రథమము ప్రమాణమునందునుగలదు. ఇది తప్పుపడినది. అంది = పాలుదిశబ్దమే లేదు) నిలుగు = ౧ ఒప్పుకొనుటకొను ౨ చచ్చు. పొందు = ప్రాప్తించు. పొదవు = కలుగు - సంభవించు.

హకారాదిశబ్దముల యాద్యక్షరమగు హల్లును నిలుగు మున్నగు కొన్నిశబ్దముల యాదిహల్లును బహుళముగా లోపించునని యర్థము. "పొప్పెము = ఒప్పైనత, పంచు = ఆజ్ఞాపించు, పంపించు, చెనయు = పోలు" మున్నగువానికి నయిత మాద్యక్షరలోప మర్థవిశేషములందుఁ గల్గునని, బా. గు. ప్రలో నుదాహరింపఁబడెను. ఈప్రాంత శబ్దరత్నాకరానుసారముగ వ్రాయఁబడినది.

ఆద్యక్షరలోపమున నేర్పడినవని యంగీకరించిన శబ్దములకును నాద్యక్షరలోపములేని మొదటిశబ్దములకును నర్థములం (సకర్మకత్వాదులందును) దించుకేని భేదముండరాదని సూరిగారియాశయము. సూరిగా రుదాహరించిన శబ్దముల కిట్టి యభేదస్థితిగలదు (విస్తర ౪). ఇట్లగుటంజేసియే సూరి "పూను పొదవుల కాదిలోపం బొకండు వచ్చియుంచె నది యవిచారమూలకంబు" అని వ్రాసెను. 'పూను' ధాతువునకు శ. ర. కోశమున సకర్మ కాకర్మకత్వములు రెండును గల్గియుండఁగా "ఊను" ధాతువు సకర్మకమమాత్రమె యైయున్నది. సూరానిఘంటువున నూనుధాతువునకును నకర్మకత్వ మంగీకరింపఁబడినను నకర్మకత్వమున"పూను"ధాతువునకు "కదఁగు" అని యర్థమగుచుండఁగా "ఊను" ధాతువునకు "నాటుకొను" అనునది యర్థమై యున్నది. శబ్ద మభిన్నమెయయి యాద్యక్షర లోపమాత్రమె గల్గినంతమాత్రముచే నిట్టియర్థభేదము కల్గుట సంభవింపనేరదని సూరిగారియాశయము. కొన్ని యర్థవిశేషములం దైక్యము నంగీకరించు టుచితమని శబ్దరత్నాకర బా. గు. ప్ర. వ్యాఖ్యాదులయాశయము. కావుననె శబ్దరత్నాకరమునన్క్రిందిరీతిని వ్రాయఁబడెను. "అప్పకవి - ఆ - వె - పూనె నెగనెఁ బొదవెఁ బొనరెఁ బొందె నటన్న। పలుకులందు మొదలఁ గలుగునట్టి। వ్యంజనంబులడఁగి వాని పై స్వరములు। నిలుచు వలసినపుడు నీరజాక్ష అని సామాన్యముగా విధించినవిధికి చిన్నయసూరిగారు వ్యవస్థయేర్పఱు

విస్తర. I ౨౧౦ VII విష:—తక్కిన మూఁడిటికిని నభేదమున్నను "ఒందు పొందు" ల కట్టి యభేదములేదు. 'పొందు' శబ్దము క్రియయు "సంధి = మైత్రి" అనునర్థములో విశేష్యమునునై యుండఁగా "ఒందు" శబ్దము క్రియ మాత్రమె యగుచున్నది. ఇది సూరిచూచికొనలేదు కాఁబోలును.

౭౯౩ "పొదవు = సంభవించు" అనుశబ్దము 'శ-ర' కోశమున లేదు. [౨౧౦ VIIవి.సంజీ.]

పక 'పూను పొదవుల కాడిలోపంబొకండు పచియించె నది యవిచారమూలకంబు' అని వ్రాయుటకు కారణమేమో తెలిసినది కాదు." (శ. ర. పూనుశబ్దమువొద్ద) అని సూరివ్రాఁత విమర్శింపఁబడెను. ఏవో కొన్నియర్థములం దైక్యము ఘుణాక్షరన్యాయమున సంభవించినను నాద్యక్షరలోపమున నేర్పడిన రూపాంతరమున కించుకేని యర్థభేదముండుట సహజముకాదని సూరియాశయము. 'పొదవు' అను శబ్దమే లేదన్నతలంపున నయ్యది శబ్దరత్నాకరమునఁ జూపఁబడమింజేసియు 'సూ. రా. నిఘంటువు పకారాదిపదముల పుస్తకమిప్పటికి ముద్రితమైయుండమింజేసియు "ఒదవు-పొదవు" ల విషయమునఁ గోశముల యాశయమును జూపఁజాలనైతిని.

ఒదవు - పొదవుశబ్దముల యభిన్నత నప్పకవి ప్రయోగ ప్రదర్శనపూర్వకముగా వివరించియున్నను శబ్దరత్నాకరకర్త సరిగఁ బరిశీలింపక యప్పకవి వ్రాఁతను జూచికొనక 'పొదవు' శబ్దమునె ప్రదర్శింపఁడయ్యెను.

'ఆ - వె - పూనె నెగసెఁ బొదవెఁ బొసరెఁ బొందెనటన్న । పలుకులందు మొదలఁ గలుగునట్టి । వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు । నిలుచు వలసినపుడు నీరజాక్ష (అప్పక. ౨ ఆ. ౭౫ ప.)............పొదవెనన్నందుకు నృసింహపురాణమున:—తే. గీ. అదరిపాటున వెసవిచ్చి, పొదవికొనినఁ । దొలఁగిపోవఁగఁ గూడక మలయపవనుఁ । డిందుఁ దలఁదూర్చికొనియెనో యిప్పుడనఁగ । నమరుఁ దాళవృంతముల మందానిలంబు" (అప్పక. ౨ ఆ. ౮౨ ప.) ఇందు మందానిలము వర్ణింపఁబడినది:—వీవనను విసరుకొనునపుడయ్యది మందానిలగమనమున కడ్డుపడఁగా డబ్బాటున నామందపవనము తొలఁగి యెటును బోవఁజాలక యావిసనకఱ్ఱలోనె దూఱెనోయను నట్లున్నదని యుత్ప్రేక్షింపఁబడెను. "పొదవికొనన్ = కవియఁగా = అడ్డుపడఁగా" అని యర్థముకాన "పొదవు = పయికొను = కవియు, అకర్మకము" అనఁదగును. "పడుజికొను లొకానొకచో స్వార్థంబునందను ప్రయుక్తంబులగు" చొచ్చు = చొరఁబడు...పండు = పండుకొను." (బా. క్రియా. ౧౦౯ సూ.) అనుచొప్పున 'పొదవికొను' అనుచోటి 'కొను' ధాతువు స్వార్థకము. "అందే = (నృసింహపురాణమందే) గీ. పొదవి యొండొండ దివియునుః భువియు దెసలుఁ । బొదివికొనియుండు చీఁకటి ప్రోవువలన । ..." (అప్పక. ౨ ఆ. ౮౩ ప.) ఇందుఁ జీఁకటివర్ణ్యము. "పొదవి = వ్యాపించి, ఒండొండ = క్రమక్రమముగా, దివిని, భువిని, దిక్కులను, పొదివికొని = ఆక్రమించి = క్రమ్మియుండుచీఁకటి..." అనియర్థము. ఇందు మొదటనున్న "పొదవి" అనునది ప్రకృతమున నుదాహరణము, రెండవది "పొదివి=సకర్మకపొదువుధాతుక్త్వార్థకరూపము." ఇది యుదాహృతి యను

[బా. ప్ర. ౧౦౨ సూ. 'పొదవు' అను దాని యాద్యక్షరలోపమున 'ఒదవు' ఏర్పడెననుట లెస్స కాని బా. గు. ప్రకర్త యిచట నొప్పుగా విజృంభించె. (విస్తర. II—౨౧౦ VII).

"అందే (= ఆ నృసింహపురాణమునందే) క. అది యట్లు కాదె నిప్పుడు ! జెద లంటునె దేవదేవు శ్రీరమణీశున్ ! మదినుంచికొన్న వానికిఁ ! బొదవునె యాపదలు కవిసి బొందునె తమమున్" (అప్పక. ౧ ఆ. ౧౭౮ ప.) ఇందు "మదినుంచుకొన్న వానికి" అను పాఠము ముద్రణస్ఖాలిత్యము. అర్థము స్పష్టము. ఇందు "పొదవునె= సంభవించునె" అని యర్థము. "అప్పుడు జిత్రధారతమునందు:—క. తదనంతరంబ... ఆశ్చర్యం బొదవ మనిచె" (అప్పక. ౨ ఆ ౧౫౯) "ఉద్యోగపర్వమునందు—క.... అదన [పొ]దవఁగ నైరించిరి" (అప్పక. ౨ ఆ. ౧౬౯) అని యిట్లుగ "ఒదవు=సంభవించు" అను నర్థమునకు మాత్రమే యుదాహరింపఁబడెను. సూ. రా. నిఘంటువున సకర్మకమగు పొదవు ధాతువునకు నర్థములు పెక్కు చూపఁబడినవి. ఎవరికి దొరకిన యర్థములు వారు చూపినను 'ఒదవు-పొదవులు' రెండును సకర్మకములై-అర్థములందును భేదము కన్పట్టదు. కాన నివి యభిన్నములే యనుట యుక్తము. పొదవు ధాతువు నాద్యక్షర లోపమున నొదవు ధాతు వేర్పడెననుట సమంజసమే యనఁదగును. (విస్తర II).

---

విస్తర II ౨౧౦ VII పుట:—సుప్తార్థప్రకాశికాకర్త పై యప్పకవీయ పొదవు ధాతూదాహృతులకుఁ బైని వ్రాసినరీతి నర్థముచేసికొనక యకర్మక పొదవుధాత్వర్థ మచటసందర్భపడ నేలేదనియు సకర్మకముల కాత్మనేపదార్థకపొసఁగుధాత్వనుప్రయోగ మశాస్త్రీయమనియు నప్పూఁడుదాహరణములందును సకర్మక 'పొదవు' ధాతువు కుదురుపడుచుండుటచే నప్పకవి "పూనె నెగసెఁ బొదవె..." అను పద్యమున "పొదివె" అని చెప్పియుండఁగా ముద్రణాదికృతస్ఖాలిత్యమున "పొదవె" అని పడి యున్నదనియుఁ బొదువుధాతువు నాదిమహల్లు లోపింపఁగా "ఒదువు" ధాతు వేర్పడుననియు, "ఒదువుపొదువు" లకుఁ గొన్ని యర్థము లందైక్యముగలదనియు నక్కారణమున నప్పకవీయములోని పై సందర్భమున "పొదవు" అనుచోటులం దెల్ల "పొదువు" ధాతురూపము నిల్పవలెననియు నిట్లగుటం జేసియె శబ్దరత్నాకరమున "పొదవు" ధాతువు ప్రదర్శింపఁబడదయ్యెననియు, మిక్కిలి విస్తృతమగు నయథార్థ ప్రసంగమును జేసెను. శబ్దరత్నాకరమునఁ బూనుశబ్దమునొద్ద నుదాహరించిన "పూనె నెగసెఁ బొదవె..." అను నప్పకవీయపద్యమున "అకార" మధ్యమగు 'పొదవె' అను రూపముపడియున్నను నదియు ముద్రణస్ఖాలిత్యము కానోపుననియు నచటనైతము 'పొదివె' అని సవరింపఁదగుననియు సంకోచింపక వ్రాసెను. మఱియుఁ బూనుపొదవుల యాద్యక్షరలోపమున "ఊను-ఒదవు" అనునవి యేర్పడినవనుట య విచారమూలకమని వ్రాసిన సూరివాక్యమున కపార్థముచేసి "ఊను - ఒదవు" అను

నన్నయ. తచ్ఛబ్ద వస్య లోప స్స్యా ద దాతోః క్వచి దేకతా
౨౧౦ VIII విష. విక్ర. అజ. ౮౦ కా. ఆహో. ౩౪౯ పు.)

కల్ప. ౨౧౦ VIII విష:—క్వచిత్ = ఒకానొకప్పుడు, తచ్ఛబ్దవస్య = తచ్ఛ బ్దార్థకము'ఆ' అను సర్వనామశబ్దపురూపములలోని పదాదివకారమునకు సమా సోత్తరపదత్వమున లోపఃస్యాత్ = లోపముకల్గును. అదాతోః = అట్టియెడనున్న 'అ' కార 'ఆ' కారములకు, ఏకతా = పరరూపైకాదేశసంధి నిత్యముగ జరుగును. ఉదా:—రక్షించిన+వాఁడు = రక్షించిన+ఆఁడు = రక్షించినాఁడు, రక్షించుచున్న + వాఁడు = రక్షించుచున్న + ఆఁడు = రక్షించుచున్నాఁడు, రక్షింపఁగల + వాఁడు = రక్షింపఁగల+ఆఁడు = రక్షింపఁగలాఁడు. రక్షించిన+వాఁడను = రక్షించిన+ఆఁడను = రక్షించినాఁడను. ఇట్లే రక్షించినాఁడవు - రక్షించినారు - రక్షించినారము - రక్షించినారరు - మొ. నన్నయ యిట్టివకారలోపమును బ్రయోగింపలేదు. (విస్తర).

---

ధాతువులున్నవనుటయె యవిచారమూలకమని సూరి సాహసముగా వ్రాసెననుచు వానికనావశ్యకముగఁ బెక్కుప్రయోగములను జూపెను. (బా. గు. ప్ర. ప్రకీర్ణ. ౧౦ సూ. వ్యా. ద్వి. ము. ౪౯౯ మొ. ౪౬౩ వ. పు.)

పేటికావ్యాఖ్యాతయు నవిమర్శితముగ నప్పకవి పొదవుధాతుప్రయోగ ములయర్థము సరిపడలేదనియు నొదవుపొదవుల నైక్యమునైతను గ్రాహ్యము కాదనియు వ్రాయుటసరికాదు. "సకర్మకాకర్మకభేదమునఁ బూనూనులును బొద వొదవులును భిన్నములగుటను, బైద్వంద్వములు సమానార్థకములనుట కొసంగిన ప్రయోగము లాయర్థమును సమర్థింప సమర్థములుగాకుండుటను,......పొదవను ధాతువు ప్రయోగసిద్ధమైతోఁపనపుడు 'ఒదవు' అనునది దాని యాదిమవర్ణలోప ముచేఁ గలిగినదనుట గగనకుసుమమునుండి ఫలముగల్గెననునట్టిదే. సూరి యూనొదవులను స్వతంత్రములనియె తలంచుట సరససాధారసయుక్తిక ప్రసంగం బనుటకు సందియములేదు" (బా. సా. పే. ప్రకీ. ౧౦ సూ. వ్యా.)

విస్తర. ౨౧౦ VIII విష:—వావిళ్ళవారి ముద్రణమున నొకవచనమున "పెట్టినాడవు" (ఆది. ౧ ఆ. ౧౦౦) అని కనఁబడినది. నాయొద్దనున్న తాళపత్ర మాతృకలురెంటను "పెట్టినవాఁడవు" అనియేయున్నది. తరువోజ.....కర్మవి పాకంబుఁ గడవంగలారె (ఆది. ౬ ఆ. ౨౪౦) ఇచటి టిప్పణిలో 'కడవంగలావె' అని పాఠాంతరము చూపఁబడినది. అదియె కవిప్రయుక్తము - నన్నయ వకారలోపము చేయఁడు. క...విధికృతము గడవనేరఁగలావే (ఆది. ౮ ఆ. ౩౦౪) అని వేఱొకచోటనైతము నన్నయప్రయోగించెను. పై రెండుచోట్లను కడవంగ = కడవ

వకారమునకు నిత్యలోపము సుసంగతముగనున్నది. తాన "అత్ + ఆతో = అదాత్రో" ... యద్దళ్ళాభిప్రేతమనదగును. అరయనగయ నీయథర్వణసూత్రము ... = తచ్ఛబ్దమునకును దానివకారమునకును" అని వ్యాఖ్యచేయుట ... ముచున్నది. (స్రజ్ మేఘాన్ మాయా దిన్యా - వ్యా. స్రక్ చ - ... తత్ తస్మాత్ -విభో్త్యుఽ స్యల్గ్రే విన్యా స్యాత్' అనురీతి నేకవచనము విరుద్ధముకాదు. ముద్గ. ౪౪౩ సూ. దుర్గాదాసవ్యాఖ్య) కొన్ని యెడలఁ దచ్ఛబ్దమునకును కొన్నియెడలఁ దచ్ఛబ్దసంబంధి వకారమునకును లోపము కల్గునని యెఱుఁగునది. ఉదా:—ఇట్టి+వా+ఁడు = ఇట్టిఁడు - ఇట్టి+వా+రు = ఇట్టిరు. ఇట్లే - అట్టిఁడు - అట్టిరు - ఎట్టిఁడు - ఎట్టిరు. ఇట్టి + దాని + అందు = ఇట్టియందు. ఇట్లే "అట్టియందు" - మొ. పుట్టిన+అది+కోలెన్ = పుట్టినదికోలెన్. పుట్టినకోలెన్ కన్న + దాని+కంటెన్ = కన్నకంటెన్ - చచ్చు+దాని+కంటెన్ = చచ్చుకంటెన్ - ఇచ్చు + దాని + కంటెన్ = ఇచ్చుకంటెన్ - చలుపు + దాని + పొంటెన్ = చలుపు పొంటెన్. మొ. ప్రయోగములు:—క. విమలతపోవిభవంబునఁ।గమలజు నట్టిఁడు (ఆది. ౨ఆ.౨౨౦) చ....చేసలువెట్టిన యట్టిరెరి (ఆది. ౪ ఆ. ౧౭) ఎ. గీ. ఇట్టిఁడేయని పొగడంగ నెల్లజనులు (ఆది. ౫ ఆ. ౨౩౦) చ....సురేంద్రకన్యకలు నిట్టిరె (ఆది. ౭ ఆ. ౭౪) 'ఎట్టిఁడు - ఎట్టిరు' - అనువానికి నన్నయప్రయోగములు దొరకలేదు. అట్టియందు నీతోనొక్కట నేకాసనంబెక్కి (ఇట్టి యందు. పా తా.) (అర. ౧ ఆ. ౩౭౨ వచ.). ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు డాత్మలన్ । నెక్కొని మోములం బొడమ నెవ్వగతోడ జనంబు లిట్టియం । దక్కట భీముఁడైన మనయర్జునుఁడైనను మాద్రిపుత్త్రులం । దొక్కరుఁ డైన నీపగఱ నుక్కడఁగింపరె యొక్కొ ప్రేల్మిడిన్. (ఉద్యో.౧ ఆ. ౨౮౭)(చూ-ప్రౌఢ -సమా. ౯ సూ.) పుట్టిన కోలెను. (శాంతి. ౩ ఆ. ౬౯) పుట్టినది మొదలు. "కోలె... గీ. పుట్టినకోలెను(భార. విరా. ౧ ఆ. ౭౪)పుట్టినకోలె=పుట్టినది మొదలుకొని" (సూ. రా.ని.) సీ. ఈబాల తన్నుఁ దానెఱిఁగినకోలె. (నన్ని. కు. ౩ ఆ. ౩౪౫)ద్విపద. పుట్టిన మొదలును బోఁకయుఁ బోగయు (బసవ.౭ ఆ.౯౨౯) తే... । ఎలుకచేఁ జచ్చుకంటె నీజ్వాలనశిఖలఁ । గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతుమేము (ఆది. ౮ ఆ. ౩౦౮ ప.) క. పురుషుల రక్షించుకంటెఁ బుణ్యము గలదే. (ఆది. ౮ ఆ. ౨౯౧) సీ.... తే. గీ. కంటి తనయుల నీకన్నకంటె నొప్పి । యుండుదురు వారు దివి సౌఖ్యయోగమెసఁగ (ఆశ్ర. ౨ ఆ. ౧౩౧) క. ధనముపడయుదానికంటెఁ దక్కువె చెప్పుమా. (విరా. ౩ ఆ. ౨౩౪) చ....అంబుజనాభుని బ్రీతుఁజేయుకం । టెను హితమైనకృత్య మొకటిం

ప్రయోగించియున్నాఁడు. సీ...ఆ. వె. కరుణగలుగుమమ్ము కమలనేత్ర। (ఆది. ౮ ఆ. ౪౫) ఉ. ఇంతులగోష్ఠిసున్న యతఁడెంత వివేకము గల్గెనేని (ఆది.౭ ఆ. ౫౯) సీ...ఆ. వె...వడి। గలదు మనముకంటె గాడ్పుకంటె (ఆది. ౧ ఆ. ౧౧౫) సీ...ఆ. వె...అధర్మవు సేయంగ। నగునె యెఱుకగలరె నుగువలెందు (ఆది. ౨ ఆ. ౩౪) సీ...వల్మీకమాత్రపర్వతము నెత్తి। కాని లావుగలఁడు వీఁడన...(సభా. ౨ ఆ. ౪౧) క...ఎఱుకగలరె తరుణులు ధరణిన్ (అర. ౩ ఆ. ౧౭౧) క...జ్ఞానము। గలఁడేనిన్ బాలుఁడైనఁ గడువృద్ధుమహిన్. (అర.౩ ఆ.౨౪౭) క. మగటిమి గలఁడని యెడున।మ్మిగఁజూచుచునుండు విషము మ్రింగినయేసిన్ (ఉద్యో. ౧ ఆ. ౩౧౫)సీ... సమర.తే. గీ. లంపటుండు శిఖండియు లావువెరవు।గలరు నీయెడ ననురక్తిగలరు సాలఁ। బెంపుగల రుక్కుముట్టిన తెంపుగలరు। గోరి పతులుగఁ జేయు మక్షౌహిణులకు (ఉద్యో. ౪ ఆ. ౧౦౯) అస్త్యర్థకములగు కలను - కలము - కలవు - మున్నగునవి తచ్ఛబ్దలోపమునఁ గల్గినవి కావు. అవి యకర్మక ప్రత్యేకక్రియలు, కలుగుధాతు లద్రూపములు (బా. క్రియా. ౧౦౪ సూ.) 'కలఁడు' మున్నగు ప్రాప్త్యర్థకములను (మగఁటిమిగలఁడు = మగఁటిమిగలవాఁడు) "కలవాఁడు = కలాఁడు = కలఁడు" అను రీతి నేల సాధింపరాదని శంకింపఁజనదు. 'కలాఁడు' మున్నగువాని దీర్ఘము హ్రస్వమగు ననుట యశాస్త్రీయము. కలాఁడు మున్నగువానినే ప్రయోగింపని నన్నయ, తజ్జన్యములగు 'కలఁడు' మున్నగువానిని బ్రయోగించెననుట కేవలము నసంగతము.

ఉన్న కల నవర్ణంబులమీఁది తచ్ఛబ్దనకారంబునకు లోపంబు విభాషనగు. ౧౧౭. (క్రియా.)

బాలవ్యాకరణ వివరణము. ౨౦౧ IX విషయము. బాహుళకంబుచే నిట సంధినిత్యంబు - వండుచున్న వాఁడు = వండుచున్నాఁడు, వండుచున్నవారు = వండుచున్నారు, వండుచున్నవాఁడవు=వండుచున్నాఁడవు, వండుచున్నవారరు = వండుచున్నారరు, వండుచున్నవాఁడను = వండుచున్నాఁడను, వండుచున్నవారము=వండుచున్నారము. ఇట్లు-వండఁగలవాఁడు = వండఁగలాఁడు, వండినవాఁడు = వండినాఁడిత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౨౧౧ IX విష:—బా. క్రియా. ౪౬ సూత్రమున 'ఉన్న - కల -

సదర్థకములు విధింపఁబడినవి. కృ. ౯ సూత్రముచొప్పున నట్టి ధాతుజవిశేషణ ములమీఁద ప్రథమార్థకములగు వాఁడు వారు శబ్దము లుపప్రయుక్తములు కాఁగాఁ బ్రకృతసూత్రముచే సంధి రాఁగా. వాఁడు శబ్దముల మొదటిహల్లగు వకారవ్యంజనము లోపించినపుడు బా. సంధి. ౭ సూత్రములోని బహుళగ్రహణమునంబట్టి నిత్యసంధి కలుగుటచే "వండుచున్నాఁడు" మున్నగురూపములు సిద్ధించుచున్నవి. బా. క్రియా. ౧౩-౧౪-౧౫ సూత్రములచే సాధింపఁబడు, వండుచున్నాఁడు మున్నగురూపములు సమాపకక్రియలనియు నియ్యవి విశేషణములనియు నెఱుంగునది. ఇట్టి విశేషణ ములు యుష్మదస్మదర్థములగునపుడు బా. కార. ౩౩ సూత్రముచొప్పున వండు చున్నవాఁడవు వండుచున్నవాఁడను మున్నగురూపములు కల్గును. అట్టివానిలోని తచ్ఛబ్దవకారము లోపింపఁగా "వండుచున్నాఁడవు" మున్నగురూపము లేర్పడును. నన్నయ "వండుచున్నవాఁడను" అను వకారలోపములేని రూపములనే యుపయో గించెను. తర్వాతి తిక్కనాదులు ధారాళముగా వకారము లోపించిన 'వండు చున్నాఁడను' అనువానివంటి రూపములను బ్రయోగించిరి. పిదప 'డ'కారము సైత ము లోపించినరూపములను వండుచున్నాను మున్నగువానిని కవులు ప్రయోగింప సాగిరి. ప్రాచీనములలో సయితము రంగనాథ రామాయణమువంటి సామాన్యకవుల గ్రంథ ములలో నీడకారలోపముగల ప్రయోగములు పొడచూపుచున్నవి. కవిపితామహుఁ డు రామరాజభూషణుఁడు మున్నగువారు సైతము లుప్తడకారక రూపములను బ్రయోగింపలేదు. ధూర్జటి "ఒనరించినాను" అని (కాళ. ౩ ఆ. ౨౧౮) ప్రయో గించెను. అది మొదలుగ నిరూపములు విస్తరించినవి. అట్లగుటచే భ్రమించి యహో బలపండితుఁడు చింతామణిసూత్రములచేత "రక్షించుచున్నాను," మున్నగు లుప్తడ కారకరూపములను సాధించెను. ఆయనమార్గముననె సూరి యట్టివిశేషణరూపము లను సమాపకక్రియారూపములనుగా సాధించెను. 'రక్షించినాను'మున్నగురూపము లర్వాచీనకవులచేఁ బ్రయోగింపఁబడినవగుటంజేసి నేఁడు వానిని సాధువులుగ నంగీక రించుట తప్పుగాదు. కాని యవి చింతామణి సాధ్యరూపములనిభ్రమించుట గొప్ప పొరపాటు (చిం. వి. ప. ౧౧౨-౧౧౩-౧౧౪ విపు.). వర్తమానకాలమున భవిష్య త్కాలమున సమాపకక్రియలను బ్రయోగింపవలయు నన్నచో "రక్షించెదను - రక్షింతును" మున్నగు తద్ధర్మాద్యర్థక రూపములను ప్రయోగించుకొనవలసినదే. కాని యీ"రక్షించుచున్నాను" మున్నగునవి యహోబలపతివంటివానిని వంచించి యాస్థానము నాక్రమించెను. కాలక్రమమున 'చదివినాను' మున్నగువానిలోని నకారము లోపించినరూపములుసైతము "చదివాను - చదివేను" మున్నగునవి

కాని 'వసతి' అనఁగా 'ఉన్న' కాదు. 'అస్తి' అనఁగా 'కల' కాదు. [౨౧౦ X వి. కల్ప.]

పండిత వ్యవహారములందును విస్తరించినవి - వీని నింకను కవులు ప్రయోగించినట్లు కనఁబట్టలేదు.

వర్తమాన భవిష్యత్కాలములలో సమాపక క్రియలు లేమింజేసి విశేషణ రూపముల నాయా కాలములలో నుపయోగించుకొనవచ్చునను తలంపునఁ గావలయు "వసతి రనుబన్ధకః స్యాద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర । అస్తి రనుబన్ధకః స్యాద్యత్ర ల్కృడర్థో వివక్షితో ధాతోః" అని చెప్పఁబడెను. కాన లడర్థమందనఁగా వర్తమానమున 'వసతి' యనఁగా 'ఉండు' ధాతువును, ల్కృడర్థమందనఁగా భవిష్యత్కాలమున "అస్తి" యనఁగా 'కలుగు' ధాతువును ధాతువుల కనుబంధముగా నిలుచునని యర్థమెకాని 'వసతి' యనఁగా "ఉన్న" అను ఉండు ధాతు భూతార్థక విశేషణరూపమును 'అస్తి' యనఁగా 'కల' యను కలుగు ధాతు వర్తమానార్థక విశేషణరూపమును నని యెంతమాత్రము నర్థము లభింపనేరదు. అహోబలపతి ప్రమాదమునితలఁపక చింతామణి యట్టిరూపములను సాధించుచున్నదనియు నక్కారణమున నాగ్రంథము నవ్యమనియు భ్రమింపరాదు.

నలడాదే ర న్త రుత శ్చాన్యేషాంచ ప్రయోగమహితానామ్ (ఆం. చిం. సంధి. ౧౩ కా. అహో. ౨౩౬-

సన్నయా ౨౩౭).

ధర్వణీయము. చౌ రే రుపధాత్మనశ్చ లు గ్వాస్యాత్ । శత్రర్థే తూత

౨౧౦ X విష. శ్చానో । స్తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి । (ఆం. చిం. సంధి. ౩ కారి. అహో. ౧౯౫ - ౧౯౬ పు.)

షోశ్చ తదా ద్యర్థవాచకే ష్వాతః. (ఆం. చిం. సంధి. ౪ కా. అహో. ౧౯౭ పు.)

కల్ప. ౨౧౦ X విష:—అన్తః = పదము నడిమినున్నట్టి, నలడాదేః = న-ల-డ మున్నగు వర్ణములమీఁదనున్న, ఉతశ్చ = ఉకారమునకును, వాలుక్ స్యాత్ = వైకల్పికముగ లోపముకల్గును. వాత్మాన్మదో రిత్యాది పూర్వకారికనుండి 'వాలుక్ స్యాత్' అనునది యనువర్తించును. కవిభల్లట ప్రభృతిసూత్రములచేఁ బదాన్త్యాది వర్ణముల లోపములు చెప్పఁబడుటంజేసి యీసూత్రము పదముల నడిమి యుకార లోపమునె చెప్పుచున్నదని "అన్తః" అను శబ్దముచే నిశ్చయింపనగును. ఆదిశబ్ద గ్రహణముచే - "పెరుఁగు = పెర్గు - కూరుకు = కూర్కు" మున్నగు నల దేతర వర్ణములమీఁది యుకారమునకును వైకల్పికోకారలోపము కల్గును. ఇట్లగుటచేత "అపుడు = అప్డు, ఇపుడు = ఇప్డు, ఎపుడు = ఎప్డు" అను చోట్లులందును ద్వైరీతి

ఉత్వలోపము కాదగియుండఁగా "షష్ఠ్యత ఏవాన్యత్రేతిసూత్రము పునర్విధాన మును జేయుచుండుటంబట్టి కొన్నిశబ్దములలోని నలడాదులమీఁది యుకారమునకు నైకము కాచిత్కముగఁ బాక్షికలోపమేని కాకపోవచ్చునని వ్యక్తమగుచున్నది. ఉదా:—పడుగు - పడుగు - వాలుగ - మొ. చౌ రేఫపదాన్తస్యేతి సూత్ర ముచేఁ బ్రైకాన్తక ముదన్తకపరకత్వమునను, శబ్దే న్తైపూత శ్చానోరితిసూత్రముచే శత్రన్తక ముదన్తకపరకత్వమునను, "రో లో డలటా ముదితాం తప్యచ వాలుక్ పలోపాశ్చే" తి సూత్రముచే బహువచన లు ప్రత్యయ లాగమాదిపరకత్వ మునను, "ఉత్వ" లోపము ప్రత్యేకముగా విధింపఁబడుటంబట్టి నలడాదులమీఁది యుత్వలోపవిధి ప్రత్యయపరకత్వ విషయకము కాదనియు నట్టి ప్రత్యేకవిధులెల్ల "అన్వే షాంచ ప్రయోగసహితానా" మ్మను సూత్రమునకు విషయములగుటయు స్తమనియు విశదమగుచున్నది. అహోబలపతి "విన్మ" అనునది నలడాదిసూత్రమునకే లక్ష్య మనుట సరికాదు. (అహో. ౨౩౭ పుట.). వినుము=విన్మ, కుడుతురు = కుస్తురు, నెగడుతన్=నెగడ్తన్, కాలుదుము = కాల్దుము, కనుము=కన్మ-విడుపను = విడ్వను, నిలుము = నిల్మ, అందురు = అంద్రు, మున్నగునవి "అన్వేషాంచే" త్యాద్యుత్తర సూత్రమునకు లక్ష్యములనఁదగును. (విస్తర) నలడాది ప్రకృతసూత్రమున కుదా హరణములు: ప్రయోగములు:—సీ. వ్రేలుచున్నవి లోక్షితిన వెంట దవిలి (శాంతి.

---

విస్తర. ౨౧౦ X విష:—"తేన ఏనుఁగు - అసు - పడుగు - పడుగు - పడుగు - వాలుగ - తెలియు - గద్దియ - ముంగర - తామర ఇత్యాదౌ న లుక్ప్రవృత్తిః" (అహో. ౨౩౭ పు) అను కవిశిరోభూషణవచనము సరికాదు. వానిలో 'ఏనుఁగు' మున్నగు కొన్నిటి కుత్వలోపరూపాంతరములు కన్పట్టుచున్నవి. సీ..... తే-గీ. వ్రేలుచున్నవి లోక్షితిన వెంటఁ దవిలి (శాంతి. ౪ ఆ. ౪౦ ప.) ద్విపద. అంజనం బను నేన్గు నచ్చోటఁగాంచి (రంగ. రా. బాల. ౪౦ పొ. సూ. రా. ని.) సీ. అడు గడ్గునకు మాధవానుచింతనసుధా, మాధుర్యమున మేను మఱచువాని (భాగ. ౭-౧౬౦ సూ. రా. ని.) మన్గు - దే - అ - క్రి...సీ. మున్మున్గు పుష్కరంబునకు నల్మడుఁగు పంపకు నినియన...(పాండు. ౩ ఆ. శ. ర.) మఱియు నహోబలపతి "ధాతుష్వపి - అలిగి = అల్గి - పలికి = పల్కి" (అహో. ౨౩౭ పు.) అను నుదా హృతులు చూపుటయు సరికాదు. "అలిగి పలికి" అనువాని నన్వేషాంచేత్యాది సూత్రమునకు లక్ష్యముగాఁ జేయనేల? అలుగు పలుకు మున్నగు నుకారమధ్య ధాతువులకు నలడాదిసూత్రముచేతనె పాక్షికోత్వలోపమును బ్రయోగాన్వేషణ ప్రయాస మక్కఱలేకయే ఘటింపవచ్చును. పిదప నట్టిధాతువులనుండి "అల్గి-పల్కి" అను క్త్వార్థకములనే కాక వివిధక్రియారూపములను సాధించికొనవచ్చును.

౪ ఆ. ౪౦ ప.) ద్విపద. అంజనంబను నెఱ్ఱ నచ్చోటఁగాంచి (రంగ. రా. బాల. ౪౦ పా. సూ. రా. ని.) చ. అనుటయు నెల్కయిఱ్ఱిలను...(శాంతి. ౩ ఆ. ౨౧౩.) ఇట్లె మెఱుఁత = మెఱ్ఱ - మొ. "నెఱఁత. దే. వి. నెలఁత" (శ. ర.) ఇదితప్పు. క. ముని।లోకము నేరుటఁగూ నఱ్ఱులఁత రొప్పుఁగెసఁగన్ (అను. ౩ ఆ. ౨౨౧ యతి స్థానగతము) గీ. అనిన విని కినుకఁబూనిన యఱఁతినగవు (ఉద్యో. ౩ ఆ. ౩౬౪.) చ.........।చెలి భుజశిరి నొఱ్ఱగిలి చిల్కను దువ్వఁచు (మను. ౫ ఆ. ౬౭) చ. పలుచని చెక్కులుం జిలుక పల్కులు మొఱ్ఱని మేనుఁ దీఁగలున్. (విక్ర. ౧-౭౯. సూ. రా. ని.) ఏమిరకన్న.........రెల్లు సం।గ్రామములోనఁ దప్పిదరిఁ గల్గిన యంతన యింతగరఁమే।లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్పు నెఱఁడే (ద్రోణ. ౪ ఆ. ౨౮౮ ప.) చ.........ఒప్పులొల్కునా।తెఱయును (ఆది. ౭ ఆ. ౭౪ ప.) ఉ.........బలగర్వితుఁ డిట్లని పల్కె నల్కతోన్. (సభా. ౨ ఆ. ౩౯ ప.) క. ఇద్దుల ధర్మజుతో జూ।దమ్మాడఁగఁ గాన్ప.........(సభా. ౨ ఆ. ౧౩౮.) చ. అడుగులు కర్గి ప్రీతియొసలారఁగ (అశ్వ. ౪ ఆ. ౨౨౩.) సీ...... గీ...।దేహము లొడ్డిచని ధనాధీశుచెలిమి (ఆశ్ర. ౨ ఆ. ౯ ప.) చ.........ఈ।శునకము విడ్వ నిఱ్ఱెఱఁగు.........(మహా. ౧ ఆ. ౫౬). ఉ.........శిరోజములం దెమల్చి పా।పాపహుఁ డీడ్చి తెచ్చె.........(సభా. ౨ ఆ. ౨౧౬ ప.) చ.........నా।కునకట చూఁగరే పవనుకొడ్కును.........(మహా. ౧ ఆ. ౭౦.). ఆ-వె. ఆర్తిఁ।గూరి నిలువలేక గూర్చుండఁబడి. (కర్ణ. ౨ ఆ. ౩౮౧ ప.) చ...... నరుఁడు దక్కొన నెఱ్ఱనె తన్ను మ్రుచ్చిలన్. (ఆది. ౪ ఆ. ౮౦.) క......తత్తురగంబుల సారథిని జిదుర్పలుసేసెన్. (ద్రోణ. ౪ ఆ. ౧౭౧.) మ.........దిశావితానము వడంకె న్నిన్నదిర్చెన్ మహీ।ధర...(ద్రోణ. ౫ ఆ. ౩౭౭) చ......హీనతం।బడుటకునోర్చి...క।వ్వడినెఱి కిన్కకెక్కి మగవారును నోర్తురె యిజ్జగంబులన్ (ఉద్యో. ౧ ఆ. ౨౪౭.) ఎర్కులు మొర్కులు నేకపాదులున్. (నన్ని. కు. ౬ ఆ. ౬౭౩.) ఉ. భగ్నం డంతక వాహినుల్ శరహతిం భంజించున న్నెమ్మెయిన్।దగ్గంగా రథపత్త్రముల్ విఱిగి వేదండాంకురా నీకముల్।నుగ్గాడన్.........మర్దింతుం బరసైన్య (నన్ని. కు. ౧౧ ఆ. ౬౦౪.). ద్విపద. సంతోషమునఁ గుద్వఁ జనుదెంచి. (బసవ. ౬ ఆ. ౫౦౦ ప.) ఉలి కుల్కి వీఁగి వీఁపులు విర్చికొనుచు । ఉఱి కుర్కి పడుచు. (బసవ. ౬ ఆ. ౫౧౩.) మూఁగి యర్చుచు. (బస. ౭ ఆ. ౭౭౨-౭౭౧-౭౭౨-౭౮౩ ప.) క.........।వఱలఁగ భీముఁడు భువనవలయం బద్రువన్. (అదురుచు - దకారము మీఁది యుత్వమునకు లోపము. ఇట్లె విద్రుచు - పద్రుచు -

ఎక్రచు - చిదుపు = చిద్రుప - చిదుప్ప. చ. ఎక్రిచిన కాలపాకమున... । పక్రిచిన వాడు........।విద్రుపఁగ...।చిద్రుపలు...(ఉ. హరి. ౪ ఆ. ౧౦౯.) చిదుప్పలు (ద్రోణ. ౪ ఆ. ౧౭౧) సీ. పలుకుల చెయ్యిలఁ బాండవ్రులకు (ఆది. ౮ ఆ. ౨౧ ప.) సీ........కెప్పోవియాని యొక్కింతుకాయ్య్ (విరా. ౨ ఆ. 3౧౦.) వచ్చి కప్పుడు (బసవ) ౭ ఆ. ౮౭3.) క. నీచిత్తమిగ్రుచు...(కవిజ. సంజ్ఞాధి. ౧౪ ప.)

"నెత్తురు = నెత్రు, అబ్బురము = అబ్రము, కప్పురము = కప్రము, అప్పుడు= అప్డు, ఇప్పుడు = ఇప్డు, ఎప్పుడు=ఎప్డు." అనునిట్టి స్థలములలో ౨౧౦ IV - V విషయములచొప్పున నకారములు లోపించినరూపములందుఁ బ్రకృతసూత్రముచే నుల్లోపము చేయఁగా "- ప్రము" మున్నగురూపములు సిద్ధించును. కాని యీమార్గము "అబురము - నెతురు" మున్నగురూపములు లేమింజేసి యిట్టివానియెడల నుపచరింపదు. కాన "అబ్బురము - నెత్తురు" మున్నగుచోటులందె "ఉ" త్వలోపము ప్రకృతసూత్రముచేఁగాఁగా ౧౯౯ I విషయముచొప్పున హలంతరసంయోగమున ద్విరుక్తవాల్లులలో నొకటి లోపించుటచే "అబ్రము - నెత్రు" మున్నగురూపములు సిద్ధించును. క........నాకు।స్వామికి నబ్రమగుప్రోలు వసుమతిఁ గలిగెఁ (ప్రభా. ౧ ఆ. ౫౬. సూ. రా. ని.) చ.........కప్రపుఁ । వలపులునీరజ...(ఆము. ౧ ఆ. ౭౧ ప.) ఉ...కప్రపు దమారముఁ రేఁచు సమీర డింభముల్. (వసు. ౧ ఆ. ౧౧౨) మ. ఖలు కప్రంపుటనంటి...(వసు. ౧ ఆ. ౧3౯) తే-గీ.........।నేత్రములు విప్పనట్టి యీనెత్రుఁగందు । వజలనే తెంచె...(పాండు. 3 ఆ. ౧౫౬ ప.) గీ. రథములను సామజములఁ దురంగమములు।నుఱక నెత్రుఁ టేఱులనీఁది తఱియ నడిచి (భీష్మ. 3 ఆ. ౨౭౫) చ.........అస్థిఖండములు శంఖములై తగు నెత్రుఁ టేర్లలో (నరస. 3 ఆ. ౨౦.) ఉ. చిత్ర...క్రొన్నెత్రు ధరాపరాగముల నిల్ప (భాస్క. యుద్ధ. ౪౮౦) (ప్రాసగతము).

అన్యేషాంచేత్యాది:— ప్రయోగమహితానామ్=కవిప్రయోగసమ్మతములగు, అన్యేషాంచ = ఇతరస్థలములందలి స్వరములకును, వాలుక్ స్యాత్ = వైకల్పికలోపముకల్గును. 'అన్యేషాంచ' అనుదానిచే నీక్రిందివిధములుగల స్వరలోపము లుద్దేశింపఁబడినవని యెఱుంగునది. (౧) ఆయాపరిచ్ఛేదములలోని యాయాసందర్భములయందుఁ జెప్పఁబడిన "రో ల్తో డలటామదితాం తస్యచ వాలుక్" అనునది యాదిగాఁగల్గు సూత్రములచే విధింపఁబడిన స్వరలోపవిధులకు సాధ్యములుగాని స్వరలోపములును. (౨) కవిభల్లటసూత్రసాధ్యములు కాని ప్రథమామాత్రోపరిస్థోకారేతర స్వరలోపములును. (3) నలడాదివర్ణములమీఁది యుకారేతరములగు స్వరముల లోపములును నుద్దేశింపఁబడినవి.

(౧) అంటఁ బ్రత్యయపరకస్వరలోపములు:—తరల...విన్నిదియ కాదివినోయేను (ఆది. ౭ ఆ. ౧౪౪.) ఉ. పట్టక విన్ను భోగిపసుపర్వులు. (కాశీ. ౫ ఆ. ౨౭౧.) మ... అగ్గలికం బెద్ద పెనంగిడన్నీ తిటు లింకంజాలు నిల్పంచు మెచ్చులు...(హరి. ఉత్త. ౪ ఆ. ౨౨౪.)మ...ఇం। పెనఁగన్ సాత్త్వికచేష్టితంబులు నిజం బిట్లాత్మఁ గన్గంతయున్. (ఆర. ౫ ఆ. ౯౭.)ఉ. వేయువిధంబులం బోరయు విన్ను తగన్...(శాంతి. 3 ఆ. 3౪౧) చ...అ।య్యను వొడఁగూడునట్టి యితిహాసము విన్ను నరేంద్ర చెప్పెదన్. (అను. ౧ ఆ. ౪3 ప.) చ. అలుగక విన్ను కుక్కలకు నావసథంబు త్రివిష్టపంబునం। గలుగునె (మహా. ౧ ఆ. ౫౪.) చ. నరసురసిద్ధకింపురుషనాగ నభశ్చరముఖ్యులెల్ల నీ।కరుణయ వేచి మండ్రు...పాకశాసనా (ఆది. ౨ ఆ. ౪౭.) ఆ-వె. నిష్కృతిపరులయందు నిష్కృతి సేయనివారు। వారినిష్కృతిఁజేసి వధ్యులండ్రు. (ఆర. ౧ ఆ. ౨౨౬). ఉ. రాజుల కెందునారయఁ బరాక్రమ జీవనవృత్తి దక్క నొం।డోజ నిషిద్ధ మండ్రు మునులు. (ఉద్యో. ౪ ఆ. ౧౪). క.........।కాపురుషగుణంబులండ్రు కౌరవనాథా (ఉద్యో. ౨ ఆ. 3౨). క. ఏలినవానిధనంబులు। బాలురు బంధువులు దారు బ్రదికినదినముల్। వేలారిచి తిండ్రాతని। యోలముగని పిదప భీతి నొందుగుదురాజా. (విరా. ౪ ఆ. ౨౧౭.) పయిప్రయోగములందెల్ల, "డ్రు" అనుచో 'ద్రు' అన్నను క్షతిలేదు. శా. తండ్రింబోలెఁ జరించు నెవ్వఁడు విశుద్ధఖ్యాతివంశోత్తరుం। డండ్రాపుణ్యుని (భాస్క. యుద్ధ. ౧౦౮౮ భాస్కరునిదె.) ఉ. తండ్రికిసూడు పట్టక వృథాస్థితి నుం డితి నింట నిందతో। మండ్రె మహాస్త్రసాధనులు మాసముదూలినవాని సజ్జనుం। డండ్రె సభాంతరంబుల మహాత్ములు నేలినవారు వానిఁ జే।కొండ్రె...(భాస్క. యుద్ధ. ౧౨౩౮ అయ్యలార్యునిది). క.........అఖిలసుధీ। లోకానందితకల్పా। నోకహుఁ డగు మల్లికార్జునుండు నెగడ్తన్. (నెగడుతన్.) (నన్ని. కు. 3 ఆ. ౨౪౪.) చ... వల్దు సు।మ్మురయని ధర్మజుండు (ద్రోణ. ౫ ఆ. 3౨౪). తాళపత్త్రమాతృకలలోనిట "వద్దుసుమ్మురు" అనియున్నది. అయిన నది లేఖకప్రమాదకృతమనియు 'వల్దుసుమ్మురు' అనునది సోమయాజి ప్రయుక్తమనియుఁ దలంపనగును. ముద్రణములలో "తప్పు సుమ్మురు" అని దిద్దుట పరమసాహసము. చ. చెడియును జెడ్క కయ్యమునఁ జేరఁగ (ఉ. హరి. ౬ ఆ. ౧౪౩.) ద్విపద. గుండముల్ ద్రవ్వించికొని కాల్దుమనిన (బసవ. ౭ ఆ. ౫౪౬.) కుడ్తురు (బసవ. ౭ ఆ. ౭౬౭.) చావనడ్తురు నన్ను సంశయంబేల (బస. 3 ఆ. ౪౪3.) "ఇస్సిరో లంజెక్కమే యిట్లునీకు" (బస. ౫ ఆ. ౪౯ ప.) అని ముద్రణపాఠము. "ఇస్సి లంజరుకమె యిట్టులనీకు" అని తాళపత్త్రమాతృక. కావునఁ బైముద్రణసంస్కర్తచేసిన సవరణము సరికాదు. "ఇస్సీ లంజెటికమె యిట్టులనీకు"

చౌ రే రుపధాత్మనశ్చేతి:—చౌ = (పరే) 'చి' అనునది పరమగుచుండఁగా, ఉపధాత్మనః = ఉపధయగు (అంత్యవర్ణమునకు ముందటివర్ణము) రేశ్చ = రివర్ణముయొక్క 'ఇ' కారమునకుసయితము, లుగ్వా స్యాత్ = లోపము వికల్పముగా నగును. ఉదా - చేరిచి = చేర్చి, కూరిచి - కూర్చి, అసరిచి - తసర్చి మొ - పరిశీలింపఁగా, సిట రేఫముమీఁది 'ఉ' కారము లోపించునని చెప్పుట యుక్తము. చేరుచు మున్నగుధాతువులలోని రేఫముమీఁది 'ఉ' కారము లోపింపఁగా "చేర్చు" మున్నగుధాతువు లేర్పడును. అపుడు చేరుచు ధాతుక్త్వార్థకరూపము 'చేరిచి' అనియు 'చేర్చు' ధాతువు క్త్వార్థకరూపము 'చేర్చి' అనియు నిట్లు రూపములేర్పడును. ఒక్కక్త్వార్థకమందేకాక చేర్చెను - చేర్తురు - చేర్చుచున్న మొదలగు స్థలములందెల్ల నిట్టి స్వరలోపరూపములు ప్రసిద్ధములై యున్నవి. కావున సూత్రములోని చకారమహిమచే 'చు' పరమగుచుండఁగా నుపధాభూతమగు 'ఉ' వర్ణమెట్లును లోపించు ననునర్థమును గ్రహింపవలయును. అట్లైని గ్రంథకర్త "చౌరోరుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్" అని సూత్రించియుండఁడాయని శంకింపరాదు. అట్లు సూత్రించినచో శత్రర్థక చువర్ణపరకత్వమున ననునపార్థముదోఁచి 'చేర్చున్' అను ననిష్ట శత్రంతరూప మేర్పడవలసివచ్చును. నేను బైనిచేసినవ్యాఖ్యచొప్పున నంగీకరించినచో నిట్టియర్థసందేహము కల్గఁబోదు. పైసందర్భమునుబట్టి యీసూత్రములోని 'చు' వర్ణము ప్రేరణార్థకమని విశదమగుచున్నది. గ్రంథకర్త "శత్రర్థేతు" అని యుత్తరసూత్రమును 'తు' శబ్దఘటితముగా రచించియుఁ బయిసందేహమును వారించెనని యెన్ననగును. "త్వన్తా దాది న పూర్వభాక్" (అమరకోశము. ౧ కాం. ౫ శ్లో.)

శత్రర్థఇత్యాది:—శత్రర్థేతు చౌ పరే=వర్తమానార్థక'చు'వర్ణము పరమైనచో, నోః, ఉతః=పూర్వస్థితమగు ధాతువుతుది 'ను' అనుదాని 'ఉ' కారమునకు, లుగ్వా స్యాత్ = లోపము వికల్పముగానగును. తస్య=ఆలుప్తోకార నకారమునకు, పూర్ణబిన్దురపి = నిండుసున్నయు, స్యాచ్చ=పాక్షికముగానగును. ఉదా:—అను+చున్ = అనుచున్ = అన్చున్ = అంచున్, వినుచున్ = విన్చున్ = వించున్. ఇట్లె - కను - కొను - మను - మొదలగువానికిని రూపము లరయునది.

పోశ్చేతి:—తదాద్యర్థ వాచకేషు = అప్పుడు మున్నగువానియందలి (ఆది శబ్దముచే - 'ఇప్పుడు - ఎప్పుడు' అనువాని నెన్ననది). పోశ్చ='పు' అనుదానియొక్క, ఉతః = ఉకారమునకును, లుగ్వాస్యాత్ = లోపము వికల్పముగానగును. ఉదా:- అప్పుడు = అప్డు, ఇప్పుడు = ఇప్డు, ఎప్పుడు = ఎప్డు.

"చౌరేరుః ఘాత్మనశ్చ....." "శత్రక్షే తూతేః..." "పాశ్చాత్యపాదక్షేఫ..." అను వైయాకరణులు "శత్రక్షత్యాదిసూత్రము "అన్యేషాంచ ప్రయోగ మహితానాం" నుసూత్రముచేతనుఁ బక్కినవిరెంటిను నలఘాదిసూత్రముచేతను స్వర లోపవిషయమున గతార్థములె యననగియున్న యుసీరెండుసూత్రములును ప్రయోగానుసారముగాఁ జెలిసికొనఁదగినవగుటచేతను, చౌరేత్యాదిసూత్రత్రయి విధించు పాత్తికస్వరలోపమున కట్టి సరిహద్దులేక ధారాళప్రవృత్తి వెలయుచుండుటచేతను సమ్మూడిని భట్టారకుఁడు ప్రత్యేకించి సూత్రించెనని గ్రహింపవలయునే కాని పునరుక్తియని భ్రమింపరాదు. చౌరేరిత్యాదిసూత్రత్రయికిఁ బ్రయోగములు:—చౌరేరిత్యాదికి. ఆ - వె - ఆర్తిఁ గూరి నిలువలేక కూర్చుండఁబడి (కర్ణ. ౨ ఆ. ౩౮౧.) చ......హీనతం। బమటకునోర్చి.....క। వ్వడి నెఱి కిన్క కెట్టివగవాఁడు నోర్తురె యిజ్జగంబులన్ (ఉద్యో. ౧ ఆ. ౨౪౭.) కనుఁగొని మల్లయ్య కౌఁగిటఁ జేర్చి (బస. ౩ ఆ. ౧౧౫౨ ప.). శత్రక్షత్యాదికి:—ఆ - వె. అంచుఁ బ్రీతిఁ గౌఁగిలించుకొనియె (సభా. ౨ ఆ. ౨౯౧). ఉ.....ఎల్లవారి బాధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి (ఆది.౩ ఆ. ౨౯౭.) (ఇట 'మాంసములు దిన్చును' అనియు గ్రహింపనగును). ఆ. వె. మంచిమగఁడు వలయు నంచుఁ గోరుచుండ।...(విజయ ౩ ఆ.౮౮ప.) శా. ప్రాంచద్భూషణ...హా శ్రీహరీ। యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీయాంస వ్వయం బంటి పొ।ష్మించుం ద్రోచె (మను. ౨ ఆ. ౬౮.) పాశ్చాత్యాద్యర్థేతి.. ఉ. అమ్ముడితన్...దానిఁ దనరమ్యపృథూరుతలమ్ము నెక్కఁగా।రమ్మని సన్న సేసె ధృతరాష్ట్ర సుతాగ్రజుఁడప్డు దాని దూ।రమ్మునఁ జూచి (సభా. ౨ ఆ. ౨౪౭.) చ...మాలనిఁ గాంచిన యప్డ త్రెంచెదన్ (శాంతి. ౩ ఆ. ౨౧౩.) చ. అమరవరేణ్యు పన్పయిన నావల నెయ్యదియైన నిప్డు ధా।ర్మ మహితు...(అర. ౫ ఆ. ౪౩౨.) చలంబున సాత్యకియిప్డు గెల్వఁడే (ద్రోణ. ౪ ఆ. ౬౮౮ ప.)

ఆచ్ఛికంబులం బదమధ్యంబుల న - ల - డ - ర - ల
యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. ౧౭.

(ప్రకీ.) కినుక = కిన్క, కానుక = కాన్క; చిలుక = చిల్క, కాలువ = కాల్వ; అడుగు = అడ్గు, కడుపు = కడ్పు; పెరుగు = పెర్గు, కూరుకు = కూర్కు.

లాఁతియచ్చునకుసహిత మొకానొకచో నుడి నడుమ
లోపంబు గానంబడియెడి - ౧౮. (ప్రకీర్ణక). కలికి = కల్కి; ములికి=ముల్కి, బుడిపి=బుడ్పి, పొలఁతి=పొల్తి.

ఇంచుక్ - చుక్ - పుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశలోపంబులు పెక్కుతెఱంగులం గానం బడియెడి. ౭౭. (క్రియా).

అగు - కావించు, వచ్చు - రావించు, రప్పించు, విన్న పము - విన్నవించు, మోఁకాలు - మోఁకరించు, కేక - కేకరించు, పలవ - పలవరించు, పలవించు, ఆల - ఆల కించు, ఆలించు, ప్రక్క - ప్రక్కలించు, నొచ్చు - నొంచు, నొప్పించు, ఉండు - ఉనుచు, ఉంచు, డిగు - డించు, డిగించు, పెరుగు - పెనుచు, పెంచు, తునుఁగు- త్రుంచు, మునుఁగు - ముంచు, మునుచు, మొగుడు- మొగుడుచు - మొగుచు - మోడుచు - మొగిడించు, చొచ్చు - చొనుపు, చొప్పించు, చినుఁగు - చించు, చింపు, త్రెగు - త్రెంచు - త్రెంపు, తిరుగు - త్రిప్పు, చచ్చు - చంపు; నిలుచు - నిలువరించు - నిలుపు, కొను - కొలుపు, పోవు - పుచ్చు - పనుచు - పంచు - పనుపు-పంపు, అనుచు-అంచు - అనుపు - అంపు; అను ప్రయుక్తంబగు పోవునకుం బుచ్చుమాత్రంబగు. మోసపోవు - మోసపుచ్చు, ఇత్యాదు లెఱుంగునది.

బాలవ్యాకరణ వివరణము. ౨౧౧ XI విషయము.

చువర్ణకంబు పరంబగునపు డన్యాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందు వేని విభాషనగు. ౫౫. (క్రియా).

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు; అన్చును - అంచును అనుచును, అను - కను - కొను - తిను - మను-విను ఇవి యన్వాదులు.

అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు. ౧౯ (ప్రకీర్ణక.)

అబ్బురము - అబ్రము. అబ్బురము - కప్పురము - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు - ఇత్యాదులు.

చుక్ పరకరువర్ణంబునకు ముందటి దువర్ణంబు నుత్వం బునకు లోపంబు విభాషనగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు. ౨౦ (ప్రకీర్ణక).

అడుసుము = అద్రుసు, ఎడుసుము = ఎద్రుసు, కడు
సుము = క్రద్రుసు.

సంజీవని. ౨౧౦ పుట. విష:—ప్రక్రి ౧౭ సూ:—చింతామణిలోని నలహాద్రి సూత్రము దీనికి మూలము. ఈవిధి యాచ్ఛికశబ్దమాత్రవిషయకమని విశదమగుట కయి 'ఆచ్ఛికంబులన్' అనుపదము చేర్పఁబడినది. "ఒక్కచోఁ దత్సమంబునను లోపంబు నాపట్టు. నడుమంతరము = నడుమంత్రము." (బాలా. గణ. సంధి. ౬౦ సూ.) అని గణపతివివరణమున వ్రాయఁబడెను. శబ్దరత్నాకరమున "నడుము+అంతరము" అని పదచ్ఛేదము చేయఁబడెను. రెండుశబ్దములును నేకార్థకములే యగుటచే నీపదచ్ఛేదము సరికాదనియు నిదియంతరము సంస్కృతశబ్దము మిశ్రితముకాలేదనియు, దలఁచి కావలయు సూ-రా - నిఘంటువున "నడుమంత్రము = నడుమంతరము, వి. (నడుము+మంత్రము=మంతరము.) ౧ కౌను. ౨ మధ్యకాలమునఁ గల్గినది. క. నడుమంత్రము పదభారము|నడుమంత్రము సైపదు...(శృంగారరసాలవాలము ౨ ఆ. ౫. ర.)" అని యుదాహరింపఁబడినది. ఇది మిశ్రితము ననింద్యగ్రామ్యము కావని వీరియాశయము.

నలహాదిసూత్రమునందలి యాదిశబ్దముచే గ్రహింపఁదగిన వివిధవర్ణములలో నొక్క రేఫమునే సూరి గ్రహించుట యుక్తమైయుండ లేదు. సీ. పలుకులఁజెయ్వులఁ బాండవులకు (ఆది. ౮ ఆ. ౨౧ ప.) సీ.....కెమ్మోవియాని యొక్కింతుఁ గాయ్వ (విరా. ౨ ఆ. ౩౧౦.) మున్నగు వెనుక నుదాహరించిన పెక్కునన్నయతిక్కనాదుల ప్రయోగములు సూరిపక్షమున సంగ్రహింపఁబడనేరవయ్యె. ఇఁక నిట్టివెల్ల బహుళగ్రహణముచే సూరిపక్షమున సాధించుకొనవలసియుండును.

౧౮. సూ. వ్యాఖ్య:—దీనికి "అన్యేషాంచ ప్రయోగమహితానామ్" అను చింతామణిసూత్రము మూలము. ఇందును జింతామణిసూత్రమునకుఁ గలవైశాల్యము తగ్గిపోయినది. ఇతరములయిన వివిధస్వరలోపములను జింతామణిసూత్రము సంగ్రహించుచుండఁగా నిది నుడినడుమనుండు నుకారేతరస్వరలోపమునుమాత్రమె సంగ్రహించుచున్నది. ఇట్లగుటచే వెనుక నుదాహరింపఁబడిన భారతాదిమహాగ్రంథములలోని విన్ను-కన్నుము మున్నగు ననేకములైన ప్రత్యయ పరకో కారేకారాదిలోపములును (అను. ౧ ఆ. ౪౩ ప. అర. ౫ ఆ. ౯౭ ప.) వెల్వొల్లఁగ (శల్య. ౧ ఆ. ౫. ర.) అయ్యును (ఆది. ౨ ఆ. ౨౦౯.) వెల్వొలఁబాటె (మను. ౩ ఆ. ౫౬.) మున్నగుపదాంతస్వరలోపములును బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడవయ్యెను. "విన్నిదియకాదు. ఇత్యాచార్యస్యప్రయోగాత్ చిలుకేత్యాది నామధేయేష్వే

వాయం విధిరితి నియన్తుం న శక్యతే" (అహో. ౨౩౭ పు.) అని కవిశిరోభూష ణమునందుసయితము వ్రాయఁబడియుండఁగా నట్టిప్రయోగములనెల్ల సూరి యుపే క్షించుట సరికాదు. ప్రకీర్ణక - ౧౭ - ౧౮ సూత్రములందు "పదమధ్యంబుల" "నుడి నడుమ" అనుపదములను నిల్పియు ప్రత్యయపరకత్వమునందలి స్వరలోపమున కొక్కఁడేని యుదాహృతినీయకయు సూరి "విస్సు" మున్నగు సన్నయాదిప్రయోగ ముల నుపేక్షించెను. త్రిలింగలక్షణశేషకర్తయు నట్టివానిని సంగ్రహింపలేదు.

క్రియా. ౭౭ సూ. వ్యాఖ్య. దీనికి "చా రే రుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్" అనుచింతామణిసూత్రము మూలము- ప్రేరణార్థకచువర్ణకపరకత్వమునందుమాత్రమే యుత్వమునకుమాత్రమే లోపమును జింతామణి సూత్రింపఁగా సూరి "ఇంచుక్ - పుగాగమములను సైతముచేర్చి సవిస్తరముగా లోపాదేశాదులను వివరించెను. కాని చువర్ణకపరకత్వమునందలి యుల్లోపమునుమాత్ర ముదాహరింపలేదు. చేరుచు-చెర్చు మొ. పెక్కువిధములగు లోపాదేశాదుల నుదాహరించియు నతిప్రచురమగు "కూర్చు-చేర్చు" మున్నగుతావులలోని యీయుల్లోపమునుమాత్ర ముదాహరింప లేదు. అట్లయినను "ఆగమాదేశలోపంబులు పెక్కుతెఱంగులం గానంబడియెడి" అని సూరి సూత్రించుటచే నీయుల్లోపముసయితము సంగ్రహింపఁబడెననుటలో సంది యములేదు. ఈసూత్రమునకుఁ గ్రియాపరిచ్ఛేదమున విపులముగ వ్యాఖ్య చేయం బడును.

క్రియా. ౫౫ సూ:—వ్యా. "శత్రర్థే తూత శ్చానో స్తస్య స్యాచ్చ పూర్ణ బిన్దురపి" అనుచింతామణిసూత్రము దీనికి మూలము. చింతామణి నువర్ణాంతధాతు వులకెల్ల నుల్లోపముకల్గునని చెప్పఁగా సూరి "అను - కను - కొను - తిను - మను - విను" ధాతువులకుమాత్ర మీవిధి వర్తిల్లునని వివరించెను. "అపిశబ్దాత్" చనుచున్ - ఎన్నుచున్-పూనుచున్, ఇత్యాదౌ నైతత్కార్య మితి జ్ఞేయమ్" అని యహోబలపతి యిట్టివిషయమును విశదపఱచియుండెను. సూరికిని నహోబలునకును నీ విషయమున నభిప్రాయభేదములేదని యెన్నునది.

ప్రకీర్ణక. ౧౯ సూ. వ్యా. చింతామణి - 'అప్పుడు; - ఇప్పుడు - ఎప్పుడు' అనువానికిమాత్రమె "షోశ్చ తదాద్యర్థవాచకే షూతః" అను సూత్రముచే నుల్లోపమును సూత్రింపఁగా సూరి "అబ్బురము - కప్పురము చప్పుడు - నెత్తురు" మున్నగువానికిని నిట్టిలోపము కల్గునని యబ్బురాదుల నొకగణ ముగ సూత్రించెను. 'షోశ్చ' అని చింతామణిసూత్రమున నున్నను "తదాద్యర్థ వాచకేషు" అనుటచేత "చప్పుడు" శబ్దమువంటివి గ్రహింపఁబడనేరవు. మఱియు

[illegible]. ప్రకీ. ౧౫౦[illegible] అప్పకవీయచింతామణిలోని పెక్కుసూత్రములు ప్రక్షిప్తము

లౌటచే నప్పకవిచ్ఛందము నప్పకవులలోఁ జెప్పనేకాని "నప్ప" అనురూపమునకుఁ ప్రయోగము కన్పట్టదేమ. అయినను నది లోకములందుఁ జెప్పఁబడియున్నది. సూరియు నాలంకారికప్రయోగ ముండునప్పుడు ద్విత్వప్రవృత్తి కల్గనేరమింజేసి ద్విత్వములో రాకపోల్లు లోపించునని [illegible] (౧౯౯ పుట.) యట్లు నాహరించి యుండుటచేగాని యాట్టి నిర్ణయము చెప్పుటకు వ్రాయలేము. "భో రద్యుతశబ్దార్థే" మున్నగు నప్పకవీయచింతామణిసూత్రములు ప్రక్షిప్తములు. (అప్పక. ౫ ఆ. ౧౦౦ మొ. ౧౧౪ ప.) "రో లో శ ల ష మ[illegible] నప్యుచ వాలుక్" అను చింతామణి సూత్ర మంగీకరింపఁబడునప్పుడు "నిష్పత్తిపదే కాంగోక్తి" (అప్ప. ౫ ఆ. ౧౦౭ ప.) అను నప్పకవీయచింతామణి సూత్రము పునరుక్త మనకతీరదుగదా. భారతమందే ప్రయోగముకానరాని 'అబ్రము' శబ్దమున కొక్కటికే "భో రద్యుతశబ్దార్థే"(అప్ప. ౫ ఆ. ౧౦౦.) అను సూత్రము చింతామణివంటి సంక్షేపవిషయక గ్రంథములో నుండుట విశ్వసనీయముకాదు. భారతాదిప్రాచీనమహాగ్రంథములందుఁ బ్రయుక్తములయిన పెక్కుప్రయోగములను సంగ్రహించు "న ల డా దే ర స్తరుత శ్చాన్యేషాం చ ప్రయోగమహితానామ్" అనుసూత్రములు చింతామణివంటి గ్రంథములో నుండఁదగినవి గాని న ల డ ల కు మాత్రమే యుకారేకారలోపముసు వచించు "పద మధ్య న ర ల డానా ముతశ్చ పూర్వప్రయోగసిద్ధానామ్ । తేషా మితశ్చ తద్వ త్త్రివిక్రమమతేన" (అప్ప. ౫ ఆ. ౧౧౭ - ౧౧౧ ప.) అనుసూత్రము లుండఁదగవు గదా. అందును బ్రాయికమగు పదమధ్య న ల డ ల యుల్లోపము ప్రయోగము లనుబట్టి గ్రహింపవలెననుటయు ననేకప్రయోగవిశేషములను సంగ్రహింపఁజాలు న ల డాద్యుల్లోపభిన్నస్వరలోపములను సంగ్రహించు "అన్యేషాం చేత్యాది సూత్రము లేకుండుటయుఁ జింతామణివంటిగ్రంథములో నుండఁదగినవి కావు. కావుననే యవి యెల్ల నహోబలపతిచే నుపేక్షింపఁబడినవి.

ప్రకీ. ౨౦ సూ. వ్యా:—దీని కీవలకు "30 V" విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

సంప్రార్థనార్థకా దీ।చోఁదాతౌ; ప్రశ్నలక్షణౌ భవతః।
ఏదోతా వ్యతిరేకా।దపి సంప్రార్థనపరౌ క్రియాణాం

నన్నయా థర్వణీయము. స్తః. (ఆం. చిం. క్రియా. ౧౫ కా. అహో. ౪౯౫-౪౯౬ పుట.)

.౨౧౦XIIవిషయము. అచ్చతు ష్కం భవే త్ప్రాణి।స్థితం ప్రశ్నాదివాచకమ్।
తత్రా దిచ్చ భవేద్దీర్ఘ।ఏదోతా వృథమాత్మకౌ । క్వచి

ఊచ్చ భవే దర్థవిశేషః ఇతి కేచన (వికృ. అజం. ౩౩-౭౮ శా. అహో. ౩౫౮ పు.)
ఆర్యాదిశబ్దోఽయుక్తః స్యాదసంబద్ధోఽర్థబోధనే (వికృ. క్రియా. ౧౫ శా. అహో. ౭౮-౯ పు.)

కల్ప. ౨౧౦ XII విష:—సంప్రార్థనార్థకాత్ = ప్రార్థనాద్యర్థక ‘ముఖుజ్’ ప్రత్యయాంతములమీఁద, ఈచ్చ+ఉత్+అ+ఆతౌ = ‘ఈ - ఉ - అ - ఆ’ అనుశబ్దములు స్వార్థమందు నిల్చును. ఇవి ‘అయ్యాదు’లకును నుపలక్షణములు. ఉదా:— రక్షింపుము+ఈ = రక్షింపుమీ, రక్షింపుము+ఉ = రక్షింపుము, ‘ఉ’ శబ్దవిధానము ‘ఈ - అ - ఆ - ’అనువాని పాక్షికత్వమును బోధించును. రక్షింపుము + అ రక్షింపుమ. రక్షింపుము + ఆ = రక్షింపుమా; చెప్పుమయ్య మొ. వ్యతిరేకాదపి = వ్యతిరేకక్రియలమీఁద నిల్చియు, ఏదోతౌ = ఏకారమును - ఓకారమును, క్రియాణామ్ = క్రియలకు, ప్రశ్నలక్షణౌభవతః = ప్రశ్నార్థానము గలవగును. మఱియు, సంప్రార్థనపరౌ = ప్రార్థనార్థమును బోధించునవి, స్తః = అగుచున్నవి. ఉదా:— రక్షింపవే = రక్షింపుము, రక్షింపవో = రక్షింపుము, రక్షింపరే = రక్షింపుఁడు, రక్షింపరో = రక్షింపుఁడు. మొ. (ఈకారికలకుఁ గ్రియాపరిచ్ఛేదమున (౩౦౮ విష.) విపులముగఁ బాతభేదముల వ్యాఖ్య చేయఁబడును. నారచించిన బాలసరస్వతీయ పీఠిక చూచునది. (౭౯-౩౭ విష.)

అచ్చతుష్కమిత్యాది:—అచ్చతుష్కమ్=‘అ-ఇ-ఎ-ఒ’ అనునచ్చులు, (చింతామణికారికలోఁ బ్రసంగింపఁబడిన యైదచ్చులలో ‘ఉ’ వర్ణదీర్ఘ ముత్తరకారికలోఁ జెప్పఁబడునుగాన నిట “చతుష్కమ్” అనుట యుక్తమె) ప్రాణిస్థితమ్ = సుప్తిజంత పదములతుది హల్లులమీఁద నిల్చి, ప్రశ్నాదివాచకమ్ = ప్రశ్నాద్యర్థవిశేషబోధకములగును. తత్ర=ఆయచ్చతుష్కమున, అత్ భవేద్దీర్ఘః=అత్తుదీర్ఘమును నగును. ఇచ్చ భవేద్దీర్ఘః = ఇకారమును దీర్ఘమగును. ఏదోతౌ = ఏకారము నోకారమును, ఉభయాత్మకౌ=హ్రస్వదీర్ఘరూపములగును. “అ-ఆ-ఇ-ఈ-ఎ-ఏ-ఒ-ఓ” అనునవి సుప్తిజంతపదముల తుదిహల్లులమీఁద నిలిచి ప్రశ్నాద్యర్థవిశేషములను బోధించుచుండునవగునని పర్యవసితార్థము. క్వచిత్=ఒకానొకప్పుడు, ఊచ్చ=‘ఊ’ శబ్దమును, అర్థవిశేషే = అర్థవిశేషమందు, భవేత్ = ప్రయుక్తమగునని, కేచన = కొందఱు చెప్పుదురు. అర్థబోధనే = అర్థబోధవిషయమున, అసంబద్ధః=జనకాది సంబంధార్థకము కాని, ఆర్యాదిశబ్దః = ‘అయ్య-అన్న’ మున్నగుశబ్దములు, అర్థవిశేషములందని, పూర్వకారిక నుండి యనువృత్తము. యుక్తఃస్యాత్=ప్రయుక్తమగును. ఉదా:—చెప్పితివె - చెప్పి

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ-ఈ-
ఏ - నీ - నా - మన - తా సంఖ్యావాచకంబులు"
అన్నిప్రభృతులు. వీనికిం బ్రథమాంతరూపంబు లుదా
బాలవ్యా. హరించెద. వీనిలో డుమంతంబులకెల్ల న్వాగమంబు
వివరణము పూర్వోక్తంబు స్మరించునది. బహువచన లకారంబు
౨౧౧ విషయము. నకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహు
వచనంబునకుంబోలె నెఱుంగునది. విశేషాకారంబులు
గలిగెనేనిఁ గొండొకచోఁ ద్వితీయవఱకును గొండొ
కచోఁ దృతీయయం దొక్కరూపంబువఱకును రూప
భేదంబులు వక్కాణించెద, శేషం బూహించునది. $\frac{౧}{౨౨}$.

సంజీ. ౨౧౧ విష:—నన్నయాథర్వణులు సర్వనామసంజ్ఞను వ్యవహరింప లేదు. సర్వనామశబ్దములరూపసాధనప్రక్రియను నడుపునపు డథర్వణుఁడు "భవేత్త దాది శబ్దేభ్యః........దన్యాత్తదాది శబ్దాత్స్యాత్" అనురీతిగాను, భట్టారకుఁడు "దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్...వచనద్వయేన్యయోరాత్మా......భూయఉభయార్థ వాచీ" అనురీతిగాను సర్వనామశబ్దములను సంస్కృతపర్యాయములతోఁ జెప్పెనిరేకాని యెచ్చటను సర్వనామసంజ్ఞను స్మరింపలేదు. సూరి యట్లుగాక సంస్కృత పద్ధతి ననుసరించి యొకతెగశబ్దములు సర్వనామములనుచుఁ బరిగణించి సర్వనామ సంజ్ఞను వ్యవహరించెను. సర్వప్రభృతులగు కొన్నిశబ్దములు సర్వనామసంజ్ఞగల వనుచు "సర్వాదీని సర్వనామాని. (౧-౧-౨౭.) సర్వాదీని శబ్దస్వరూపాణి సర్వనామ సంజ్ఞాని స్యుః" (సి. కౌ. అజం. ౨౧౩ సూ.) అని పాణిని సూత్రింపఁగా సూరియు సర్వశబ్దపర్యాయమగు 'అన్ని' శబ్దమాదిగాఁగల కొన్ని యాచ్ఛికశబ్దములు సర్వనామ ములని సూత్రించెను. నన్నయ 'ఏమి' ప్రభృతులను గిమాదులనియు 'ఒకఁడు' ప్రభృతులను నేకాదులనియు వ్యవహరింపఁగాఁ దద్విపరీతపద్ధతి నన్నాద్యదులను సర్వాదులనుగాఁ బరిగణించి సర్వనామసంజ్ఞను సూరి నిల్పెను. "సర్వాదయశ్చ పఞ్చ త్రింశత్. సర్వ - విశ్వ - ఉభ - ఉభయ - డతర - డతమ - అన్య - అన్యతర - ఇతర - త్వత్ - త్వ - నేమ - సమ - సిమ - పూర్వాపరావరదక్షిణోత్తరాపరాధరాణి ........స్వమ్.........అన్తరమ్......త్యద్ - తద్ - యద్ - ఏతద్ - ఇదమ్ - అదస్ - ఏక - ద్వి - యుష్మద్ - అస్మద్ - (భవత్.) భవతు - కిమ్ - ఇతి." (సి. కౌ. అజం. ౨౧౭ సూత్రమునొద్ద.) అనునవి సర్వనామసంజ్ఞికములని పాణినీయులు

వచించిరి. ఇంతకు నొక్కొక్కొన్ని కతిపయ గ్రంథములలో సర్వనామసంజ్ఞ గలదనియుఁ గొన్నిటికి వ్యాకరణములలో సర్వనామసంజ్ఞ లేదనియు వచించిరి. దీనినిబట్టి సూరియు "అన్ని ప్రభృతులు సర్వనామంబుల"ని సూత్రించి "అన్ని-ఇన్ని" మొదలగు నవి "అన్ని" ప్రభృతులనుచు వివరించెను. సంస్కృతసర్వనామములలోని తదాదులకుఁ బర్యాయముగ 'ఆ-ఈ-ఏ-నా-నీ-ఒక-రెండు' అనునవిమాత్రమె యాచ్ఛిక సర్వనామములు కన్పట్టుచున్నవి. ఇవెప్పుడు సాంస్కృతికాచ్ఛికసర్వనామములకు సామ్యము నూహింపుడు. ఇందుకి 'అన్ని' శబ్దమునకయితేను సర్వశబ్దపర్యాయమె గాయున్నను "తావత్" అనుసంస్కృతశబ్దమునకును బర్యాయమైయున్నది. కొఱవడిన "ఇన్ని - ఎన్ని - కొన్ని" శబ్దముల సాహచర్యమున నీ "అన్ని" శబ్దము నైతము తావద్వాచకముగమాత్రమె గ్రహింపఁబడుట యుక్తము. ఇన్ని ప్రభృతులకుఁ బర్యాయములగు "ఇయత్ - యావత్ - కియత్" మొదలగువానికి సంస్కృతమున సర్వనామసంజ్ఞ లేదు. తెలుఁగున "అన్ని" మొదలగుశబ్దముల సహప్రాయములగు "అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు" అనువానికిని 'అ-ఈ-ఏ' శబ్దములను సంబంధించు "అంత అతఁడు - ఆతఁడు - ఆమె - ఆపె - ఆకె - ఆవిడ - ఆయమ - ఆయప - ఆయక - ఆయన" మొదలగువానికిని నిట్లే 'ఈ-ఏ' శబ్దములను సంబంధించు వానికిని సర్వనామసంజ్ఞ శ. ర; సూ. రా. నిఘంటువులలోను, నంగీకరింపఁబడెను. సంస్కృతమున నిట్లు సర్వనామములను సంబంధించువానికిని వానితద్ధితాంతముల కును (ప్రత్యేకముగఁ జెప్పినచోటులుతప్ప) సర్వనామసంజ్ఞ లేదు. తాశబ్దపర్యాయ మగు 'ఆత్మ' (న్) శబ్దమునకు త్ర్యాదిసంఖ్యావాచకసంస్కృతశబ్దములకును సర్వనామసంజ్ఞ లేదు. "తత్సమసర్వనామములు:—సర్వము - విశ్వము.........ఏకము శతము - సహస్రము - ద్వితయము. మొ...."(ఆం. భా. అ. సర్వనా. ౧ సూ. వివ, ౫౦ పు. తృ. ము ) శతము - సహస్రము - ద్వితయము సర్వనామములనుట పొరపాటు. 'ఆయన - ఆపె - ఆకె - ఆమె' మొదలగువానికి సర్వనామసంజ్ఞ నంగీకరించి "అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అట - ఇట - ఎట." అనువానికిని "అట్టి - ఇట్టి - ఎట్టి - అట్టు - ఇట్టు - ఎట్టు - అందు - ఇందు - ఎందు." అనువానికిని సూరిప్రభృతులు సర్వనామత్వము నంగీకరింపకుండుట కేవలము నయుక్తికముగ నున్నది. 'ఎల్లరు' శబ్దము సర్వనామమనుచు 'ఎల్ల' శబ్దము సర్వనామము కాదనుట యెంతయు నసంగతముగా నున్నది. సూరి సంఖ్యావాచకములకును 'పెక్కు - పలు - కొన్ని' 'అతఁడు - ఆతఁడు - ఆపె - ఆకె - ఆమె' అనువానికిని సర్వనామత్వము నంగీకరించి (శ-ర, సూ, రా, నిఘంటువులు నంగీకరించెను.) "అంత-ఇంత - ఎంత - కొంత" అను

వాని నంగీకరింపకుండుటయు నీకను వింతగ "ఏమి - ఎల్ల - ఎల్లరు" అనువానికైన సర్వనామత నంగీకరింపకుండుటయుఁ గేవలము నయుక్తికముగా నున్నది. 'అందు ఇందు-ఎందు' అనువానిని సూరి సర్వనామములనుగాఁ జెప్పకుండుట యటుండ శ.ప. సూ. రా. నిఘంటుకర్తలు వానిని ప్రత్యాంతావ్యయములనుట మఱియు వింతగా నున్నది.

నన్నయా — ఉదన్తటాన్తాః స్థానార్థ । వాచకా ఉక్తబోధకాః । కౌప
థర్వణీయము — రేతు భవేదత్వం । ల్వన్తం లాన్తం ప్రకారియుక్ (వికృ.
౨౧౧ విషయము. ఆజం. ౫౯ కారి. ఆహో. ౩౮౨ పు.)

కల్పతరువు. ౨౧౧ విష:—'అటు - ఇటు - ఎటు-'శబ్దములు విభక్తిప్రత్యయాంతములుగాన నవ్యయము లనిపించుకొనువని యథర్వణుఁడు వచించుచున్నాఁడు. ఉదన్తటాన్తాః = ఉకారయుక్తటకారము తుదనిగల 'అటు-ఇటు-ఎటు' అనుశబ్దములు, స్థానార్థవాచకాః = ప్రదేశార్థవాచకములు. ఉదా:—అటు = ఆవైపు, ఇటు=ఈవైపు, ఎటు=ఏవైపు. ఉక్తబోధకాః=అనుకరణవాచకములునగును. (ఉక్త= అనూక్త). ఉదా:—లోకోయటంచుꣳ - ఇటంచుꣳ. మొ. (అటు+అను+చుꣳ= అటంచున్) కౌపరేతు భవేత్ 'అ'త్వమ్=కుప్రత్యయపరకత్వమున వానికి ముందు 'అ'కారము నిలుచును. ఉదా:—అటకుꣳ- ఇటకుꣳ - ఎటకుꣳ. ల్వన్తం - లాన్తమ్- యుక్ = ఆశబ్దము, 'లు' ప్రత్యయాంతమగునపుడును, 'ల' ప్రత్యయాంతమగునపుడును, ద్విత్వముతోఁగూడిన దగునపుడును, (అటులు - అటులన్ - అట్టులు - అట్టులꣳ. మొ.) ప్రకారి = ప్రకారార్థకమగును. ఉదా:—అటులు - అట్టులు = అట్టు = ఆప్రకారము. అట్టులన్ = ఆప్రకారముతోన్. బహుత్వ మవివక్షితము. ఇట్టివి యవ్యయములనుట సరికాదు. విస్తర.

---

విస్తర. ౨౧౧ విష:—"అవ్యయాదాప్సుపః. (౨-౪-౮౨) అవ్యయా ద్విహితస్య ఆప స్సుపశ్చ లుక్ స్యాత్.........ఆప్గ్రహణం వ్యర్థమ లిఙ్గాత్." (సి.కౌ. ౪౫౨-సూ-అవ్యయ.) అనుచొప్పున నవ్యయముమీఁది సుప్పులకనఁగా నావిభక్తులకు లోపముకల్గును గాన నవ్యయములమీఁద నేవిభక్తిప్రత్యయమును నిల్చియుండదు. కావున విభక్తిప్రత్యయములతోఁ గూడికొనియుండుశబ్దము లెవ్వియు నవ్యయము లనిపించుకొనవు. కొన్నినామములపైఁ గొన్నివిభక్తిప్రత్యయములు నిల్చుట ప్రయోగదృష్టము కాకున్నను నేవో కొన్నివిభక్తులతోఁగూడికొనుట ప్రయోగదృష్టమగునపుడు వాని నవ్యయము లనరాదు. ఎల్లశబ్ద మవ్యయముకాదని యీ

నలుకు ప్రాపించుచున్నాడు. (హరి. ౧౧ పద్య. ఇంచు, ఇంక, ఎంకయు:— క. నీకూర్మియు నీయలుకయు|నాకవి యేమిటికి...(సభా. ౨ ఆ. ౬౭.) ఉ-వె. ఇన్ని దినములయ్యె నేటికి నాతోడ...(సభా. ౨ ఆ. ౯౨ ప. అంత - ఇంత - ఎంత శబ్దములు:— క. అని భీష్ముడు........ఎక్కడెక్కడంబుల శౌరసుఁ దంతలోనఁ ముఖ్యుం గనుచుకా. (భార. అను. ౨ ఆ. ౨౫౪.) ఉ...పేరందుల కేఁకదాఁక నా (అర. ౩ ఆ. ౩౧౨.) క. వసుదెంచె నయోధ్యనుండి పతి ... రావని ........(అర. ౨ ఆ. ౧౯౩.) క. ఏనొక్కఁడనే కంటె నిక్కం బింకఁ గలదనఁగా, (విరా. ౨ ఆ. ౯.) ఉ. ఎంతయు ... వేకతము. (ఆది. ౪ ఆ. ౧౭౨.) సీ. ఇంత రాజకమున నింతయుఁ గలిగిన. (అర. ౨ ఆ. ౧౩౨.) క. ఎంతయు దీవచ్చి తింక నెంతయుఁ గాఁగ నీకు నిష్టము. (ఆది. ౫ ఆ. ౨౧౩ ప.) క. ఎందుండి యొందుఁబోవుచు|వింటుల కేతెంచినారలు. (మనుచ. ౧ ఆ. ౬౧ ప.)

అవ్యయమున లోకప్పుడు కారకాన్వయమున్నను దానిపై షష్టీకారకవిభక్తి నిలువనేరదు. "స్వరాది నిపాత మవ్యయమితిసూత్రే భాష్యే 'చాదీనామసత్త్వవచనానామేవ సంజ్ఞా, స్వరాదీనాంతు సత్త్వవచనానా మసత్త్వవచనానాంచ' ఇత్యుక్తత్వాత్. స్వస్తివాచయతి - స్వస్తివాచ్యః - తూష్ణీం పుణ్యే స్వః పతతి - ప్రాతర్జతే ఇత్యాదావా కర్త్రాదికారకయోగదర్శనాచ్చ." (సి. కౌ. బాలమ. ౪౭౨ సూ. "అవ్యయాదాప్సుపః," అనుసూత్రపువాఖ్య.) కొన్నియెడల నవ్యయములకు లింగకారకసంఖ్యాన్వయ మున్నను నట్టిలింగకారకసంఖ్యలవలన రూపభేదములేక యవ్యయ మన్నది యేకాకారముతోనె యుండును. "సదృశం త్రిషు లిఙ్గేషు। సర్వాసుచ విభక్తిషు। వచనేషు చ సర్వేషు। యన్న వ్యేతి తదవ్యయమ్" (సి. కౌ. పైసూత్రమునొద్దనె-అవ్యయప్ర.)

"అట-ఇట - ఎట - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు" అనునవి సర్వనామములనకున్నను విశేష్యములనియె కోశద్వయమునందును వ్రాయఁబడెను. 'అంత ఇంత ఎంత' అనునవి సర్వనామములనియే కోశద్వయమునందును గలదు. కాని పైవానినెల్ల సూరి సర్వనామ ప్రకరణమున స్మరింపలేదు. గీ. ఆదురాచారుఁడును దాఁటె నటకు మునుపు - (మనుచ. ౬ ఆ. ౫౧.) క......తమ। కాజికి నిటమీఁద నెవ్వ రాధారంబో - (భీష్మ. ౧ ఆ. ౬౩.) సీ. రావలసె నిటకు (ఆము. ౨ ఆ. ౨౧.) ఆ - వె - ఇటఁ।బట్టి రాత్రి లేనియట్టు (విరా. ౨ ఆ. ౩౧౩- సూ. రా. ని.) స్రగ్ధర...ఎటకుఁ బోఁగూడదు......(ఉ. రా. ౪ ఆ. ౯౨. సూ. రా. ని.) క. నినుఁ గనినప్పటఁగోలె (భా. రా. అర. ౧ ఆ. ౧౪౯.) క. అప్పటఁగోలెన్ (ఆది. ౬ ఆ. ౧౯౩.) క. అప్పటి నుండియు నెవ్వగ (ఉద్యో. ౨ ఆ. ౧౯.) గీ. ఎప్పటికి నిత్తునో లేక యీశరీర।మిప్పు

సంజీ. ౨౧౧ I వివః—పయిసందర్భమునుబట్టి సర్వనామసంజ్ఞావిషయమున సూరిపద్ధతికిని శ-ర. సూ. రా. నిఘంటులపద్ధతికిని భేదము కొంతగలదని చెప్పక

---

టికిఁజాలునో (శివరా. 3 ఆ. ౭౧ ప. సూ. రా. ని.) కోశద్వయమునందును నవ్యయము లనఁబడిన "అట్టు - ఇట్టు - ఎట్టు" అనువానికిసైతము "అట్టులు - ఇట్టులు - ఎట్టులు - అట్టులన్ - ఇట్టులన్ - ఎట్టులన్" అనువిభక్తిరూపములు కన్పట్టుచున్నవి. "ప్రాణములట్లన్" (అప్ప. ౫ ఆ. ౪౨) అంత-ఇంత - ఎంత - శబ్దములు:—క. వివేకహీనుల్కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే (ఆది. 3 ఆ. ౧౪౯ ప.) క... ఇంక నుద్ధురుండగు మద్రేశుం గూల్పు మంతతోడఁ దెగుం గురుపతి......... (శల్య. ౧ ఆ. ౯౪.) చ......నాయెఱిగినయంతనుండి.....(ఆది. ౭ ఆ. ౭3.) గీ......నీతెగునంతకుఁ గలన నిలువ (ఉద్యో. ౨ ఆ. ౨౪౯.).....వారును వత్తురింతకున్ (ఆది. ౪ ఆ. ౨౭) క. ఎంతకుఁ గృతకార్యుండగు (ఆది. ౭ ఆ. ౨౬౬) కొన్నియెడల విభక్త్యంతోడిరూపములవలె నున్నను విభక్త్యర్థమె వానికి లేకుండునపు డనఁగా వానికిఁ గారకాన్వయము లేనపు డవి యవ్యయము లనుపించుకొనును. "చిరాయ - చిరరాత్రాయ - చిరస్య - చిరమ్ - చిరేణ - చిరాత్. ఇతి షట్కం చిరార్థకమ్" (సి. కౌ. బాలమ. ౪౪౭ సూ. "స్వరాదినిపాతమవ్యయమ్" (౧ - ౧ - 3౭) అనుదానివ్యాఖ్య.) 'వలెన్ - పోలెన్' మున్నగుచోట్ల భూతార్థక ప్రథమపురుషైకవచనరూపము కన్పట్టుచున్నను నది వాస్తవముగ నట్టిక్రియాన్వయమున భాసిల్లమింజేసి యవి విభక్తిప్రతిరూపకావ్యయము లనఁదగును. "ఉపసర్గవిభక్తిస్వర ప్రతిరూపకాశ్చ" (గణ. సూ. ౧౬.) "చాదిగణసూత్ర మేతత్...... అవదత్తమ్. అత్ర ఆవేత్యుపసర్గప్రతిరూపకమ్. నతూపసర్గః.....అహం యురితి - అహమితి సుబన్తప్రతిరూపకమ్. అహఙ్కారే, అహం శుభమాయ్యస్ ఇతి మత్వర్థీయోయుస్. అత్ర అహమితిన అస్మచ్ఛబ్దస్య ప్రథమైకవచనమ్...అస్తిక్షీరంయస్యా ఇతి బహువ్రీహిః. అత్రాస్తీతి తిఙన్తప్రతిరూపక మవ్యయమ్ - న తు తిఙన్తమ్ - తథా సతి బహువ్రీహ్యనుపపత్తేః. స్వరప్రతిరూపకా నుదాహరతి అ ఇత్యాదినా:— అ సంబోధనే. ఆ-వాక్యస్మరణయోః. ఇ - సంబోధనజుగుప్సావిస్మయేషు. ఈ - ఉ - ఊ-ఏ-ఐ - ఓ - ఔ ఇతిసప్తకం సంబోధనే" (సి. కౌ. బాలమ. ౪౪౭-సూ-స్వరాదీతిసూత్రమునొద్ద. అవ్యయ.) దీనినిబట్టి తెల్గునందును నచ్చు లర్థవిశేషబోధకములగునపు డవి యచ్ ప్రతిరూపకావ్యయము లనఁదగును. 'అ' మున్నగునవి స్వరములవలెఁ గన్పట్టునే కాని పరమార్థముగా నవి స్వరమాత్రములు కావు. అర్థవంతములగుశబ్దములని తాత్పర్యము.

[illegible] గొన్ని సుబ్వి-
భక్తులు చేరవలసినను గొన్ని తద్ధితప్రత్యయములు చేరవలసినను సర్వనామముల కంటె వైలక్షణ్యము గల్గియుండిరి యట్టివాని సర్వనామసంజ్ఞను గల్పించికొనిరి. అందు సుబ్విభక్తియోగమునకు గల్గు [illegible] జూపబడుచున్నది.

నా మ ము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | రామః | రామౌ | రామాః |
| ద్వి. | రామమ్ | రామౌ | రామాన్ |
| తృ. | రామేణ | రామాభ్యామ్ | రామైః |
| చ. | రామాయ | రామాభ్యామ్ | రామేభ్యః |
| పం. | రామాత్ | రామాభ్యామ్ | రామేభ్యః |
| ష. | రామస్య | రామయోః | రామాణామ్ |
| స. | రామే | రామయోః | రామేషు |

స ర్వ నా మ ము.

| ఏ | ద్వి | బ |
|---|---|---|
| సర్వః | సర్వౌ | సర్వే |
| సర్వమ్ | సర్వౌ | సర్వాన్ |
| సర్వేణ | సర్వాభ్యామ్ | సర్వైః |
| సర్వస్మై | సర్వాభ్యామ్ | సర్వేభ్యః |
| సర్వస్మాత్ | సర్వాభ్యామ్ | సర్వేభ్యః |
| సర్వస్య | సర్వయోః | సర్వేషామ్ |
| సర్వస్మిన్ | సర్వయోః | సర్వేషు |

పుంలింగ శబ్దములకుఁ గొన్ని విభక్తివచనముల యోగమున నామసర్వనామములకుఁ గలభేదము పైనిజూపఁబడెను. నపుంసకలింగములకును నిట్టిభేదమె యుండును. ప్రథమా బహువచనమందుమాత్రము భేదముండదు. నామ - ప్ర - జ్ఞానమ్ - జ్ఞానే - జ్ఞానాని. సర్వనామ - ప్ర - సర్వమ్ - సర్వే - సర్వాణి. మెం. స్త్రీలింగశబ్దములం దీక్రిందిరీతి భేదముండును.

రమా

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. | రమా | రమే | రమాః |
| ద్వి. | రమామ్ | రమే | రమాః |
| తృ. | రమయా | రమాభ్యామ్ | రమాభిః |
| చ. | రమాయై | రమాభ్యామ్ | రమాభ్యః |
| పం. | రమాయాః | రమాభ్యామ్ | రమాభ్యః |
| ష. | రమాయాః | రమయోః | రమాణామ్ |
| స. | రమాయామ్ | రమయోః | రమాసు |

సర్వా

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| | సర్వా | సర్వే | సర్వాః |
| | సర్వామ్ | సర్వే | సర్వాః |
| | సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః |
| | సర్వస్యై | సర్వాభ్యామ్ | సర్వాభ్యః |
| | సర్వస్యాః | సర్వాభ్యామ్ | సర్వాభ్యః |
| | సర్వస్యాః | సర్వయోః | సర్వాసామ్ |
| | సర్వస్యామ్ | సర్వయోః | సర్వాసు. |

ఇట్లు సుప్ప్రత్యయములయనఁగా నామవిభక్తి ప్రత్యయములవిషయముననే కాకతద్ధిత ప్రత్యయవిషయమునను సమాసవిషయముననునీసర్వనామములకు సంస్కృతమునఁ బ్రత్యేకతకలదు. "౭౨౮ సూ. సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః (వా. ౧౩౭౬.) అపరశాలః (అపరస్యాం శాలాయాం భవః.)" "౨౦౨౬ సూ. అవ్యయ సర్వనామ్నామకచ్ప్రాక్టేః (౫ - ౩ - ౭౧) సర్వకే" (సి. కౌ.). "స్త్రిబహోస్త్రౌ ఉద్వ్యాదేః ప్త్యాః. సర్వనామ్నో బహోశ్చ పరస్యాః ప్త్యాఃవిభక్తేః త్రః స్యాత్. న ద్వ్యాదేస్తదుష్మదః. సర్వస్మిన్ = సర్వత్ర - తత్ర - బహుత్ర" (ముగ్ధ. ౫౧౩ సూ.) "త్రవత్థాచ్ప్రకారే. యేభ్యస్త్రడుక్తస్తేభ్యః ప్రకారే థాచ్ స్యాత్ -సర్వప్రకారం= సర్వథా" (ముగ్ధ. ౫౨౩.). పయిరీతి నొకతెగశబ్దములకుఁగల ప్రత్యేకతను పాటించి సంస్కృతవైయాకరణులు సర్వాదిప్రాతిపదికములకు సర్వనామసంజ్ఞను గల్పించిరి. సూరియు దదనుయాయులును నట్లె "అన్ని" ప్రభృతులగు నాచ్ఛికశబ్దముల కీక్రింది

మును విధించెను. "వరవర్ణంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు." (ప్రౌఢ. శబ్ద. ౯౧ సూ.) "ఇరుగురు - మూగురు........" ఇట్లు త్రిలింగలక్షణశేషమున 'గు' వొందటిరూప మని సూత్రింపబడెను. దానికి వకారమాదేశమయ్యెనని చెప్పుట, యపరిశీలనమూలకము. వీనికిట్లు తచ్ఛబ్దము చేరనపుడు 'లు' వర్ణకమె నిల్చును. ఉదా:—అనుకు లలునదివేలు. బ్రాహ్మణు లెనిమిదివేలు. (విష్ణు. ౧౮౬ IV విష.) క. గురువచనస్థితి మన కేవురకును నిది పత్నిగాఁదవుం గావున (ఆది. ౭ ఆ. ౨౧౩ క.) (ముద్రణములందు 'ఏగురకును నిది పత్నిగాఁదగుం గావున' అని పడియున్నది.) ఉ. అర్వురు చక్రవర్తులు పదార్వురు రాజులు నేటివారలే(యుర్వి బహుప్రకారముల (విక్ర. ౨ ఆ. ౩౪.) "ఆదేశశ్చ పురూ రశ్చ" అని యథర్వణాచార్యుఁడు 'వు' వర్ణాగమమునె యుపదేశించెను. దానికి గకారమువచ్చుట యర్వాచీనము. (విక్ర. అజం. ౮౮ కా. అహో. ౩౬౫ పుట.) 'క్వచిద్గకారోవః.' అనుచింతామణిసూత్రము వకారమునకు గకారమును గకారమునకు వకారమును నాదేశించుచున్నది. ఉదా:—ప్రవాళము - పవడము = పగడము. బాంధవుఁడు = బందువు=బందుగు. మొ. (వై. పా. ౧౯౯ విష.) సంఖ్యావాచకేతరాచ్ఛిక సర్వనామములలోఁ గొన్నిమహత్తులకు బహుత్వమున రు వచ్చును. కొన్నిటికి రాదు. ఉదా:—మేము - మనము - తాము. మూఁడు నాల్గిటికిమాత్రమె 'రు' వచ్చును. ఉదా:—వారు - వీరు - వేరు - ఎల్లరు-మీరు. (ఏవారు మున్నగువానిలోనిది వారుశబ్దమెకాని వేలుకాదు.) సర్వనామములుకాని మహత్తులితోఁధికముగా 'రు' వచ్చునని గలవు. (బా. ఆచ్ఛి. ౫-౬-౭-౧౧ సూ.) పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు - మార్తురు. గండంద్రు - మిండంద్రు - విలుకాండ్రు - ఆండ్రు - కోడండ్రు - చెలియండ్రు. మొ. బా. తత్స. ౩౮ సూత్రము చొప్పున బాలురు నృపాలురు మున్నగు తత్సమశబ్దములందు 'రు' వచ్చుటయుఁ గలదు. కొన్నిట శకటము నామములతోఁపాటు సర్వనామములకు వచ్చును. ఉదా:—వేటకాలు - చూపలు - చెయువులు - పగలు - అందలు - ఇందలు - ఎందలు - కొందలు - ఇద్దలు. మొ.

(౨) సర్వనామమహతీవాచకముల యేకవచనరూపము లమహత్తులవలెను బహువచనరూపములు మహత్తులవలెను నుండుననుటయు సరికాదు.

ఆచ్ఛికమహన్మహతీ బహువచనరూపములు సైతము సాధారణముగా నేకరీతినే యుండును. ఉ:—అన్నలు - అమ్మలు, తండ్రులు-తల్లులు, మొ. పుంలింగములక కుత్వము వచ్చుటమాత్రమె భేదము. "ఒకటి - ఒకఁడు" అను నమహద్రూపములు మహతీవాచకముల యేకత్వమున నుపయోగింపవు. ఒకతె

(బా. అప్పి. — ౨౭ సూ.) సర్వనామములు ప్రత్యేకసంజ్ఞాహేతువులు హేత్వాభాసములు

మొదలగునవే వ్యవహరింపవలయును. కన్ని యిత్యాదిపుంస్త్రీశబ్దములకును 'ఏవి' అనునది స్త్రీవాచకము కానేరదు. ఏవతె మొదలగునవి కావలయును. నీ-నా-తా-మనశబ్దములు మహత్త్వమహత్త్వమహతీత్వములందుంగూడ నొక్కరీతిరూపములతోనే యుండును. 'అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని' అనువానియెడల నైనియమము వర్తింపదు.' 'పుస్తకములన్నియు' అనునట్లని 'స్త్రీలన్నియు' అని వ్యవహరింపరాదు. ఇంక 'ఆ-ఈ' శబ్దములకుమాత్రమె యీనియమము బాగుగఁ జెల్లును. ఉదా:— ఇదిస్త్రీ - అదిస్త్రీ - ఏవిస్త్రీలు - వారుస్త్రీలు. 'ఏదిస్త్రీ' అనరాదు.

(౩) సర్వనామ విశేషణములలో మొదటఁ బ్రయోగింపఁబడువానికిఁ బ్రథమావిభక్తివచ్చుట యనునియమమును వ్యభిచారమె. క. వానియన్నింటికంటె మేలైనకాంతి (ఉద్యో. ౨ ఆ. ౮౫) (ఇట 'వానియన్నింటికంటె' నని ప్రయోగింపలేదు.). క. మాయిరువురలోఁ గయ్యము ! నేయ...(ఉద్యో. ౨ ఆ. ౧౩౫) (ఇందు 'మేమిరువురలో' అని ప్రయోగింపలేదు.). తే. గీ. వేఁడికొను మీవు నొకని మాయేవురందు (శల్య. ౨ ఆ. ౧౦౮). (ఇట "మేమేవురందు" అనిలేదు.) క...అనేకములు గలవు వానియన్నిటిలోనన్ (అను. ౨ ఆ. ౧౩౭ ప.) ఇట 'అవియన్నిటిలోనన్' అని ప్రయోగింపలేదు. సర్వనామేతరములందును విశేషణమునకుఁ బ్రథమవచ్చుట లేకపోలేదు. సుగుణుఁడు రామునకు - తల్లి ద్రౌపదికొడన్ - మొ. (బా. కార. ౨౭. ప్రౌఢ. కార. ౨౨ సూ.) విశేషణము మొదటనుండుటె సాధారణమగుస్థితి.

(౪) ఔపవిభక్తికత్వము:—మహద్వాచకములకును మహతీవాచకములకును నెచ్చటను నౌపవిభక్తికత్వముండనేరదు. సర్వనామములలోఁ బ్రధానములనఁదగు ఆ-ఈ-ఏ-నీ-నా-తా- (మన) శబ్దముల కమహత్త్వమునందును నౌపవిభక్తికత్వము లేదు. ఇంకఁ బయినివివరించిన సర్వనామధర్మము లెవ్వియులేని "అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని" శబ్దములయు సంఖ్యావాచకములయు నేకవచనరూపములందు మాత్ర మసంఖ్యాకములగు నాచ్ఛికామహత్తుల యేకవచనరూపములందు వర్తిల్లు నౌపవిభక్తికత యుండుట వాని ప్రత్యేకతను నిర్వహింపఁజాలదుగదా.

పయిరీతి విమర్శనముచేసికొనియే భట్టారకుఁడు సర్వనామసంజ్ఞ నుజ్జగించె ననియు సూరి తలంచిన సర్వనామముల ప్రత్యేకత యాభాసరూపముమాత్రమె యనియు గ్రహింపవలయును.

సంస్కృతవైయాకరణులు సర్వనామములకు వేఱొక ధర్మమును వచించి యున్నారు. "సర్వేషాంబుద్ధిస్థానం నామసర్వనామ" (ముగ్ధ.సంజ్ఞా. ౮౬ సూ. దుర్గాదాసవ్యాఖ్య.) ఇది సర్వనామముల కసాధారణధర్మము కాదు.

లందును సమూహవాచకములందును గవిప్రయోగప్రసిద్ధమైయున్నది. (విస్తర). సీ...ఆ-వె. మునికాయమెల్ల।వివిధపుణ్యకథలు విను వేడ్క నతనిఁ బూ।జించిరి... (భా. ఆది. ౧ ఆ. ౨౮ ప.) క. గీర్వాణప్రభుఁ డాదిగ। గీర్వాణగణంబు కాలకేయు లతోఁ డన్ । గర్వించి రణముచేసి ర। ఖర్వపరాక్రములు కడిమిఁ గడు నుద్ధతులై. (భార. అర. 3 ఆ. ౪౧ ప.) (ప్రౌఢ. శబ్ద. ౧౭ సూ.). ఇట్లె యన్ని ప్రభృతుల విశేషణంబులును బహువచనంబులగుటయు విరుద్ధముగాదు. ఆ. వె...వాని యన్నింటి ననుమాన। మింత లేక యాఁడు మెల్ల వినఁగ. (ఉద్యో. ౪ ఆ. ౧౮౯ ప.) క. బ్రాహ్మణ్య మవలిజాతులు మూఁటన్ (అను. ౧ ఆ.౭౫), ఇంకను నీవిషయమున వింతవింత ప్రయోగములు గలవు. క. విను...అఖిలపదార్థం। బును నశ్వరమని... (అశ్వ. ౧ ఆ. ౧౯౭ ప.) ఇది ప్రాసఘటితము. ఉ. నీవు ధరిత్రిఁబుట్టుటయు నీకు సహాయము సేయఁగోరి నా। నావిధదైత్యదానవగణంబులు రాజకులంబులందు స। ద్భావన నుద్భవించెఁ బటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్ । ద్రావితవైరు లుర్వి భగదత్తపురస్సరులైనవీరులై. (అర. ౬ ఆ. ౪౫ ప.) క. క్షితిసంశప్తకు లనఁగా। శతలక్షసహస్రసంఖ్య జనియించిరి ద। ర్పితులై దనుజులు...(అర. ౬ ఆ. ౪౭ ప.) (౧౭౬ III సంజీ. ఈవిషయమునఁ జూడఁదగును.)

మఱియు నన్ని ప్రభృతులకు ద్వితీయాద్యేకవచనములందుమాత్రమె వచ్చు

---

విస్తర. ౨౧౧ II విష:—పయి సంజీవనీ సందర్భమునుబట్టి యీక్రింది పేటికావ్యాఖ్యపంక్తులు సరికావని విశదమగుచున్నది. “కాని యన్నీత్యాదులు నాల్గును.....బహుపదార్థబోధకములగుటంజేసి వాని నేకవచనములుగ నెంచుట విచారవిదూరము. ఇకారాంతములకువలెఁ బ్రథమైకవచనము లోపించెనందమన్న బహుపదార్థబోధకమగు వీని కేకత్వమును నేకవచనమును గలుగుననుటకే యుక్తి యగపడకున్నది...వీనిని నిత్యబహువచనములుగనే యెంచుట సరసమని తోఁచెడి” (బా. సా. పే. ౨౩౭ పు.). “అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని.....నిత్యబహువచనాంతములు” (సర్వనా. ౨౫ సూ. ఆం. భా. అ.). సూ. రా. నిఘంటుకర్తలును నిట్లె పొరపాటుగ వ్రాసిరి. “అన్ని = అని. స - ఔ - (అంతశబ్దముయొక్క అమహ దర్థక బహువచనరూపము...) ౧ తావన్మాత్రసంఖ్యగలవి... ..క. దురితము లనేక ములుగల। వరయఁగ లోకమున వానియన్నిటికంటెన్ (భార. అను. ౪ ఆ. ౪3 ప.) “ఇన్ని - స - బ - ఔ - (త. ఇత్తనై.) ఇంతశబ్దముయొక్క అమహదర్థక బహువచనరూపము......క. ఇదె దేహం బిదె యర్థం। బిదె నాపరిజనసమూహ మిన్ని [illegible]” (ఆది. ౫ ఆ. ౨౪౨) (సూ. రా. ని.).

"టి - ంటాన్" దులు వచ్చుటయును ప్రథమాన్యమేకవచనములందు మాత్రమె రాదగిన 'ఇ' త్వము వచ్చుటయు 'లు' అను బహువచనప్రత్యయ మెచ్చటను లేకుండుటయు నవి యేకవచనరూపము లనుటకు ప్రబలనిదర్శనము లగుచున్నవి. అన్ని ప్రభృతుల కౌపవిభక్తికాంతము లగుచు నవి బహువచనరూపములని చెప్పుట కేవలము నసంగతము సంప్రదాయవిరుద్ధము నైయున్నవి. టి ంటాన్ యౌప విభక్తికవర్ణములు బహువచనములందు వచ్చుట నెవ్వరును నెచ్చటను జూడఁజాలరు గదా. 'నేతులు - నూతులు' ననున్నగువానిలోని 'తి' వర్ణమౌపవిభక్తికమనుట పొరపాటని నిరూపింపఁబడెను. (౨౦౫ - ౨౬౭ పుట.) "ఇవి ద్వితీయాద్యేకవచనం బులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగగు" (బా. అచ్చి. ౨౯ సూ.) అనుచెప్పుట నౌపవిభక్తికవర్ణములు ద్వితీయాద్యేకవచన పర కత్వమున మాత్రమె వచ్చుట సంప్రదాయము.

క. వానియన్నిటికంటెన్ (అను. ౪ ఆ. ౪౩) క. ఇన్నిటిలో (ఆది. ౫ ఆ. ౨౪౨) ఆ. వె. వానియన్నింటిని (ఉద్యో. ౪ ఆ. ౧౮౯) ఇట్లి యమహత్తులగు సంఖ్యావాచకములును నేకవచనరూపముతోనుండి బహుత్వమును బోధించును. "క. అవలిజాతులు మూఁటన్ (ఆ. ౧ ఆ. ౭౫ ప.) చ. సుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత। వ్రత యొకబావి మేలు నుఱిబావులు నూఱిటి కంటె...(ఆది. ౪ ఆ. ౯౪ ప.) పయిప్రయోగములనుబట్టి యన్ని ప్రభృతులవలెనె ద్విప్రభృతిసంఖ్యావాచకములును నేకవచనరూపములతో నుండియు బహుత్వమును బోధించునని యంగీకరింపకతీరదు. కాని యన్ని ప్రభృతులకువలె వీనికిని బహువచన రూపములు లేవనుచు సూరి బహువచనరూపముల నుదాహరింపమానుట సరికాదు. సూరిగారే ర ల డోపధేత్యాదిసూత్రమునఁ (బా. తత్స. ౪౭ సూ.) దొమ్మిది శబ్దమునకు బహువచనరూపమును "తొమ్మిదులు" అనుదానిని నుదాహరించి యున్నారు. అట్లె వేయిశబ్దమునకు బహువచనము "వేలు" అనియుండునని (బా. అచ్చి. ౨౦ సూ.) యుదాహరించిరి. ఉ...దిక్కుల। ల్లాడఁగఁ బోరిలో శరము లాఱుయిదుల్ శ్రుతకీర్తి శల్యుమైఁ। గాడఁగ నేయ......(కర్ణ. ౧ ఆ. ౧౧౧) సీ...భుజములు, రెండు రెండులు రెండు రెండ్లు మెఱయ (ఉ. హరి. ౬ ఆ. ౧౧ ప.)

మహత్త్వంబున "అన్ని" ప్రభృతుల ప్రథమా బహువచనరూపములు "అందఱు - ఇందఱు - ఎందఱు కొందఱు" అనునవి నిత్యబహువచనాంతము లనుటలో విప్రతిపత్తిలేదు. పలుపెక్కుశబ్దముల నన్నాద్యాదులలోఁ జేర్చుట సరికాదు. వానియందుఁ గొంతవైలక్షణ్య మున్నది. పలుశబ్దమున కమహత్త్వమున వ్యస్త

ప్రయోగమేలేదు. ఉదా:—పలుమాటలు - పలుపలుకులు. మొ. దీనిమహత్త్వమున "పలువుండ్రు - పలువురు" అనెడి నిత్యబహువచనరూపములె ప్రసిద్ధములు. పెక్కుశబ్దమునకును మహత్త్వమున "పెక్కురు - పెక్కుండ్రు" అను నిత్యబహువచనరూపములె వెలయుచున్నవి. అమహత్త్వమున దీని కేకవచనబహువచనరూపములు రెండును గలవు. ఉదా:—మాటలు పెక్కేల? మాటలు పెక్కులేల? సీ. మాటలు పెక్కేల మానిసి గుజ్జు మేనుంగను పేరెల్లఁద్రుంగె.........(సౌప్తి. ౧ ఆ. ౨౦౨.) 'మాటలు పెక్కిటికిన్' అనురీతి నేకవచనరూపమును బహుపదార్థబోధమును దీనియమహత్త్వమున నన్నయాదులకువలెనె కల్గును. "అందఱు ఇందఱు ఎందఱు కొందఱు పలుగురు పెక్కురు" మున్నగుమహద్బహువచనరూపములు మహతీబహువచనార్థమునుసయితము బోధించును. (బా. అచ్చి. ౨౫ సూ.)

త్రిలింగలక్షణశేషమున నిత్యైకవచన నిత్యబహువచనశబ్దనిరూపణము కొంత విపులముగఁ జూపఁబడెను. అట్టి త్రిలింగలక్షణశేషవిషయములకును బాలవ్యాకరణవిషయములకును నీక్రిందియథర్వణకారికలు మూలమనఁదగును. అట్టి మూలమునె ముందుగఁ జూపుట యిందనుక జరుపఁబడుచున్నను నది యతివిస్తరమగుటచే బాలవ్యాకరణపంక్తుల నవ్యాకులముగఁ జూపుటకై యిట నీమూలము వెనుక నిల్పఁబడెను.

నన్నయా<br>థర్వణీయము.<br>౨౧౧ III విషయము.

బహుత్వం క్వచిదేకత్వం। బహుత్వప్రత్యయః క్వచిత్॥
సామాన్యస్య వివక్షాయా। మేకత్వ మపిసమ్మతమ్॥ భవే
త్సర్వత్ర చ ద్విత్వ। మప్యజ్ఞైస్మర్యతే బుధైః॥ ఏకత్వే
సస్యవాచిత్వం। బహుత్వే ధాన్యవాచితా॥ లోపాదేశ
వికారస్తు। తత్రతత్ర ప్రదృశ్యతే॥ (వికృ. అజం. ౫౬
హలం. ౨౬-౨౭ అజం. ౬౭ కారి. అహో. ౩౩౫-
౪౫౫-౩౫౩.

కల్ప. ౨౧౧ III విష:—క్వచిత్=ఒకానొకప్పుడు, బహుత్వమ్=నిత్యబహువచనాంతత్వమును, క్వచిత్ = ఒకప్పుడు, ఏకత్వమ్ = నిత్యైకవచనాంతత్వమును, సమ్మతమైయుండును. క్వచిత్ = ఒకానొకప్పుడు, బహుత్వప్రత్యయః = బహుత్వవాచక ప్రత్యయస్థితిమాత్రమె యుండుననఁగా నర్థమునం దేకవచనమునకన్న భేదము చూపట్టదని తాత్పర్యము. ఉదా:—నిత్యబహు—అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు - పలుగురు - పెక్కురు. మొ. నిత్యైకవచన:— అన్ని - ఇన్ని-

[illegible] 'కేలు' [illegible]

[illegible]

[illegible] క్రింది ఉదా: అట్టు = అట్టులు, కప్పు = కప్పులు, [illegible], నిప్పు = నిప్పులు (సూ). నిప్పు [illegible] - నిప్పులు [illegible] - నిప్పులంగని = [illegible]. మొ. [illegible] "[illegible]" [illegible] ఇరులు [illegible], వప్పులం గని, వప్పులం గని నిప్పులు [illegible] నిప్పులు గాంచెంతు [illegible]." ([illegible]). 'ఇరులు - కేలు' అనునవి పూర్వపాదమున కుదాహరణములు. 'వప్పులన్ - వప్పులన్ - నిప్పు - నిప్పులు' అనునవి యుత్తరపాదమున కుదాహృతులు. 'ఇరులు' అనునది నిత్యబహువచనాంత మనుట సరికాదని తోఁచెడిని. ఇరులు నిత్యబహువచనాంతముగా నది బహుత్వ ప్రత్యయకల్పితమ దాని కేకవచన ప్రయోగము లేదనియు [illegible]. "ఇరులు = ఇర్లు - వి - ఏ...అంధకారము - చీకటి. సీ. ఇరులుగ నొంటిబో...(విజ్ఞా. ప్రా. ౧౦౫ ప.).........కి. ఇరులకు...(చం. రా. ౬-౩౬.) ప.........ఇరుల కిరవగు (ఉ. రా. ౩-౧౯౧.) సీ.........ఇరులమోవి. (అము. ౪-౧౩౫.)...(పై మూఁడు ప్రయోగములఁబట్టి నిత్యబహువచనాంతముగాఁ గూడఁ గన్పట్టుచున్నది.)......" (సూ. రా. ని.) "ఇరులునన్" అను ప్రయోగముచే నిది నిత్యైకవచనాంతమనియు, 'ఇరులకున్ - ఇరులమోవి' అను ప్రయోగములందలి లట్టునుబట్టి నిత్యబహువచనాంతముసైతమగుచున్నదనియు సూ. రా. నిఘంటుకారులు వ్రాసిరి. ఒక్కశబ్దమే నిత్యైకవచనాంతము నిత్యబహువచనాంతమునసుట యసంగతము. కాని 'ఇరులునన్' అను ప్రయోగముచొప్పున దీనిని నిత్యైకవచనముగనే నిర్ణయించికొని (ప్రౌఢ. శబ్ద. ౨౪ సూ.) దీనిలట్టు ప్రయోగములు యతిస్థానగతములుకామింజేసి 'ఇరులుకున్ - ఇరులుమోవి' అనియేకవి ప్రయుక్తపాఠమని తలంచుట యుక్తము. కేలుశబ్దములోని 'లు' అనునది బహువచన ప్రత్యయము కాదనియు 'కేలు' అనునదొక స్త్రీసమశబ్దమనియుఁ జెప్పుటకు సందియము లేదు. 'కేలన్' అనునొపవిభక్తికాత్వము తొడిరూపము ప్రయోగదృష్టమగుచున్నది. కావున నీవిషయమునఁ బ్రౌఢవ్యాకరణ విషయమె చాలవఱకు సరియని చెప్పనగును. "దేశ్యమునం దక్కడాదులు నిత్యైక వచనాంతములు. ఉ. అక్కడ - ఇక్కడ - ఎక్కడ - అచ్చట - ఇచ్చట - ఎచ్చట

(విస్తర I) మొ. ఆదిశబ్దముచేత ఇరులు - కేలు మొ. కొందఱు ఇరులు కేలుశబ్దంబులు బహువచనాంతంబులందురు. అట్లుకాదు. గీ. ఇరులున నొంటిఁబోఁ బరసతి నెట్టుట (విజ్ఞా. ప్రా. ౧౦౪ ప.) సీ. బలిమిఁదారొక్కని కిలభాషిణి వేసలి, యొక కేలఁ బట్టి వేఱొక్కకేలఁనొఱఁగత్తి వెఱికి (కళా. 3 ఆ. ౧౧౯.) సీ. ఉపధానవినిమయం బొండొండఁ జూపుటఁ బెఱకేలు లణఁచువఁ బ్రిదిలి బిగియు (కవిక. ౪ ఆ.)" (ప్రౌఢ. శబ్ద. ౨౮ సూ.) ఈప్రయోగములనుబట్టి 'కేలు' అనునది యేకవచనాంతమని యేర్పడునేకాని నిత్యైకవచనాంతమని నిశ్చితముకానేరదు. కానఁ ద్రిలింగలక్షణ శేషకర్త ఇరులుశబ్దముతో సరిగ 'కేలు' శబ్దము నిత్యైకవచనాంతమనుట సరికాదని తోఁచుచున్నది. 'ఇరులు' శబ్దమునకు 'ఇరుళ్ళు' అనుబహువచనరూపము చూపట్టమింజేసి దానిని నిత్యైకవచనాంతమన్న ననవచ్చునుగాని "కేలు" శబ్దమునకు "కేళ్ళు - కేలులు" అనురూపములు కనఁబడుచున్నవి. మ........బోడబాసికము దండల్వోలె కేళ్ళింతికిన్ (ఆము. ౫ ఆ. ౨౨ ప.) క. ఇరు।గేలులఁ గనుపట్టు నతనికిని దివ్యములై (వి. పు. 3 ఆ. ౧౦౧ సూ. రా. ని.) ఆ-వె. మూఁడుకాళ్ళు రెండుమూఁడుకేళ్ళు। గల...(హరి. ఉ. భా. ౮ ఆ. ౧౦౭ ప.) ఉ. క్రీడయపోలెఁ గిట్టి పెడకేళ్ళొగిఁ గట్టగ........(ఆర. ౭ ఆ. ౧౧౧.) మ. తనలోఁ జొచ్చి... కే।ళ్ళను మస్తంబులఁ గాళ్ళనుం దనకు నాల్గు న్నాల్గు నాల్గుం దగన్. (ఉ. హరి. ౬ ఆ. ౯౮ ప.) పెద్దిరాజును 'కేలు' శబ్ద మేకవచనరూపమని 'లు' అనువానిచేత బహువచనప్రత్యయభ్రాంతిగల్గకుండ వచించెను. క. కేలేకవచన మరయఁగ।బాలును దెమ్మెరలు సహజబహువచనంబుల్ (కావ్యాలం. ౯. ఉల్లా. ౯౧ ప) "తెమ్మెర" అని యుండదని భావము. (విస్తర. II).

---

విస్తర. I ౨౧౧ III విష:—అక్కడ మున్నగువానితోపాటుగ 'అచ్చట' మున్నగువానిని జూపుట ముద్రణస్ఖాలిత్యమని తోఁచెడిని. 'అచ్చట - ఇచ్చట - ఎచ్చట' అనునవి సప్తమ్యేకవచనాంతములు, కాన "అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు" అని చూపనగును. కేలుశబ్దము నిత్యైకవచనాంతమనుచు "పెఱకేలులు" అనుట స్వవచనవ్యాఘాతము. కాన "పెఱకేలియణఁచువ" అని యచటఁ బ్రౌఢవ్యాకర్త యుదాహరించియుండును.

విస్తర. II ౨౧౧ III విష:— ఆ. వె. పొర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి। తిరుగుఁ వేఁగుఁబోక తెమ్మెర లెలదీఁగ। కొనలవంకలొత్తు ననలఁబ్రోచు (ఉద్యో. ౨ ఆ. ౧౧౨) అర్వాచీను లేకత్వమును వాడిరి. క. తెమ్మెర నీకెం తెమ్మెర। కమ్మని విలుకాని.....(విజయ. 3 ఆ. ౪౮) "పాయి-ఉభ - వై-వి - పాలు - ద్విపద.....

ననెడు వీనికెల్ల నిట్టు। ప్రకటితంబులయ్యె బహువచనంబులు। నేకవచననియతి యెపుడు లేదు. (కావ్యాలం. ౯ ఉల్లా. ౯౧-౯౨ ప.) "కొళ్ళు. వి. బ. (సం. కుళుత్థః. త. కొళ్ళు.) = ఉలవలు" (సూ. రా. ని.) గీ.........ముత్యమబ్బు నెద్దునకు వరికి। నెడ్లు వడ్లు నాఁజన నెఱుఁగవలయు (కావ్యాలం. ౯ ఉల్లా. ౯౦ ప.) తే-గీ. పరఁగఁ జెక్కుటనౌనరు తెమ్మెరలు నీళ్ళు। వఱలుకొలుచులవెళ్ళెల్ల బహువచనము। గోదుమలు వడ్లు జొన్నలు కొఱ్ఱ లాళ్ళు। చోళ్ళు నుములు పెసలనఁ జెల్లుఁగాన (ఆం. భూ. ౭౯ ప.) (౨౧౧ I విమ. కల్ప.) ఈసందర్భమునఁ ద్రిలింగలక్షణశేషకర్త పయి యధర్వణాదుల లక్షణములను బునరుక్తముగ సంగ్రహించియుఁ గొన్నివిషయము లను బెంచియు విస్తరించెను. (ప్రౌఢ. శబ్ద. ౨౮ మొ. ౩౮ వ. సూ.) (విస్తర. III)

విస్తర. III ౨౧౧ III విమ:—"దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచ నాంతములు." (ప్రౌఢ. శబ్ద. ౨౮ సూ.) ఈసూత్రపువివరణ మీవలఁ ఉదాహరింపఁ బడెను. (౨౧౧ III విమ.) "సస్యవాచకశబ్దంబులును (౨౯ సూ.). ఉ. అరుగ - చోడి - వరి -", "కతిపయసంభారవాచకములును—ఉదా:—ఇంగువ, ఉప్పు, చముఱు........." (౩౦ సూ.). "లోహవాచకశబ్దములు— ఉదా:— ఇత్తడి- ఇనుము..." (౩౧ సూ.). "సమానార్థకంబులయిన యీడెన సరి సాటి లోనగు- దేశ్యవిశేషణశబ్దములును. ఉదా:—క. సతు లీభార్గవికి భాగ్యసంపద నెనయే (ఆది.౩ ఆ.) క...సభలెల్ల నరే। శ్వర చూచితి నవి వీనికి। సరిగావు (సభా. ౧ ఆ.)...... గీ. సరులులేని దృక్షంజనశాబకములు. అని యొకచోఁ బ్రయోగము కానఁబడు చున్నది. అది శబ్దాలంకారతత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁబడినదని గ్రహింప వలయును." (౩౨ సూ.). ఈప్రౌఢవ్యాకరణసూత్రమునకు విరుద్ధముగఁ బ్రయోగ ములు కన్పట్టుచున్నవి. ద్విపద. హరియును గిరియును నజుఁడును గిజుఁడు। సుర లును గిరలును హరుని సమంబె। (బసవ. ౬. ఆ. ౭౪౧). సిరి మహాదేవుఁ డాసిరి గిరి పతికి। సిరి వాసుదేవాదిసురలు సమంబె. (బసవ. ౬ ఆ. ౭౮౮ ప.) ఇట్లు దేశ్యవిశేష ణములకేకాక తత్సమవిశేషణములకును నేకవచనమును సోమనారాధ్యుఁడు ప్రయోగించెను. ద్వి. చావు పుట్టువు గల దేవతల్ సరియె। (బసవ. ౬ ఆ. ౭౮౨ ప.) ఇట్లు దేశ్యవిశేషణములకును శబ్దాలంకారాదులు లేనిచోటులందును బ్రయోగింపఁ బడెను. "స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహు వచనంబున కేకవచనంబు బహుళంబుగానగు (బా. కార. ౨౦ సూ.(" అను సూత్రము చొప్పున సమము సాటి మున్నగువాని యేకవచనము సాధ్యమగుచుండఁగా నీప్రౌఢ. శబ్ద. ౩౨ సూత్ర మేల యుపదేశింపఁబడెనో తెలియకున్నది. బహువచన

ప్రయోగనిరాకరణమైన దోషము [illegible] పొరపడెను. "గుణ వాచకములైన దేశ్యశబ్దములును నిత్యైకవచనాంతములగు [illegible]. ఉదా:—తెకాళ్ళు తెలుపు - ఆకాళ్ళ నలుపు [illegible]" (౨౨ సూ.). ఈసూత్రము చాలఁ బ్రమాదభూయిష్ఠముగా నున్నది. తే. గీ. నలుపు జగమున గలయట్టి నలుపు లెల్లఁ దెలుపులుగఁజేసి [illegible] తెలుపులేమ [illegible] బొదవుదు దుఃఖముగఁబోలె! సాంద్రచంద్రిక తుహిన బాష్పములు గురిసె [illegible] 3 ఆ. ౨౭ ప.) ఇట్లు తెలుపు మున్నగువానికి నిత్యైకవచనత్వము కవిప్రయోగ సమ్మతముకాదు. ఇంక సూత్రరచనమునందును ప్రౌఢవ్యాకర్తకు [illegible] చాలఁ గన్పట్టుచున్నది. తెలుపు మున్నగువానికోపాటుగఁ దీపు మున్నగునవి యును గుణవాచకములై యుండఁగా వానిని సంగ్రహించుటకై "గుణవాచ కంబులని "సూత్రించుట పొరపాటు. "శబ్ద స్పర్శ రూప రస గంధ సంఖ్యా పరిమాణ పృథక్త్వ సంయోగ విభాగ పరత్వాపరత్వ గురుత్వ ద్రవత్వ స్నేహ బుద్ధి సుఖదుఃఖే చ్ఛాద్వేషప్రయత్న ధర్మాధర్మ సంస్కారా శ్చతుర్వింశతి గుణాః". (తర్కసంగ్రహము.) ప్రౌఢ వ్యాకర్త కిట్టి లోపములనేకములు గన్పట్టుచున్నవి. "కర్తరిప్రయోగము - కర్మణిప్రయోగము - సకర్మకకర్తరిప్రయోగము - అకర్మకకర్తరిప్రయోగము" (ప్రౌఢ. వాక్య. 3 సూ.) "ఆదరార్థంబున ద్వికర్తృకము" (ప్రౌఢ. శబ్ద. ౧౧౧ సూ.) (మూ-విస్తర. II ౧౦౨ I విష.) మొ.

## నిత్యబహువచనాంతములు

"అందఱాదులు నిత్యబహువచనాంతములు. అందఱు - ఇందఱు-ఎందఱు కొందఱు - పెక్కండ్రు - పలుగుండ్రు." (3౫). "అదరులు లోనగుశబ్దములును. అదరులు - అలువుళ్ళు - ఎండువులు - మిడుఁగుఱులు. మొ. ఇవి వృత్తియం దేక వచనాంతంబుల యగును. ఉ. అదరుటగ్గి" (3౬). "తఱచుగ ధాన్యవాచకశబ్దము లును. ఆళ్ళు - చోళ్ళు.........తఱచుగ ననుటచే బియ్యము - జీలకఱ్ఱ - ఇవి ధాన్యవాచకములయ్యును నిత్యైకవచనాంతములె యని గ్రహింపవలయును.(3౭)."

"క్రీడావిశేషవాచకశబ్దములును. అచ్చనగాయలు.........గుజ్జెనగూళ్ళు .........గొబ్బిళ్ళు.........మొ. ఒకానొకకవి యిందుఁ గొన్నిటి నేకవచనాంత ములుగాఁ బఠించియున్నాఁడు. అది విచారణీయము." (3౮). 'అచ్చనగండ్లు' అనుశబ్దము నొద్ద శబ్దరత్నాకరమున "మ.........ఓ!మనగుంటల్ కనుమూసి గంత నలుగం బాలాట లోనైన ఖేలనముల్. (కళా. ౬ ఆ. ౨౦౨.)" అని యుదాహరింపఁబడెను. పరిశీలింపఁగా నీపింగళిసూరన నుద్దేశించియె "కనుమూసి గంత" అనుదానినిబట్టి

ప్రౌఢవ్యాకర్త యచ్ఛ్లోకానొక కవి యని వ్రాసెనని తోఁచుచున్నది. కాని నిఘంటు వులు బహుకర్తృకము లగుటంజేసియు విస్తృతములగుటంజేసియు వానియందుఁ బూర్వోత్తరసందర్భముండుట దుర్లభము. శబ్దరత్నాకరమునందే-"కనుమూసి గంత" శబ్దము నుదాహరించునపుడు వెనుకటి వ్రాఁతను మఱచి "కనుమూసిగంతలు. దే-వి-బ. కన్నులుగప్పి యాఁడెడియాట...మ ........ఓ|మనగుంటల్ కనుమూసిగంతలును గంబాలాట లోనైనఖే|లనముల్. (కళా. ౬ ఆ. ౨౦౨.)." అనునిట్టి సవరణముతోఁ జూపఁబడెను. ఇందుల కనుకూలముగా నందు 'కంబాలాట'శబ్దమె చూపఁబడెను. ఆటశబ్దమును జేర్చునపుడు బహుత్వము లేకపోవచ్చునని తలంచినట్లు విశదమగుచున్నది. గీ. గచ్చకాయలు దాఁగిలిమ్రుచ్చులాట। బంతి మెకమాట చిందఱపఱపులాట|యనెడు శైశవదుర్వృత్తు లధిగమించి| (ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసము. ౬౧౩.). సూ. రా. నిఘంటుకర్తలు శబ్దరత్నాకరములోని యీసందర్భమును బరిశీలించినట్లు కన్పట్టదు. 'కనుమూసిగంత - నలుగంబాలాట' అనుశబ్దములె యందుదాహరింపఁబడెను. ఇట్లె "గుజ్జెనగూడు. వి......౧ బాలికలాడుకొనెడియొకయాట. మ. దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం బొమ్మపెండిండ్లు గు|జ్జెనగూళ్ళచ్చనగండ్లు పింపిళులు కుచ్చిళ్ళ్ గీరనం గింజ లో|మనగుంటల్. .........(కళా. ౬ ఆ. ౨౦౨) అనిరొ యుదాహరింపఁబడెను. లక్ష్యములోని బహువచనములఁ నించుకేని పాటింపలేదు. "సంబంధంబున యుష్మదస్మచ్ఛంబులకుం గొన్నిగొడల బహుత్వంబగు. ఉ. మీయిల్లు - మాయిల్లు - మొ. సీ. మాయత్త పృథ్వీసమాన పృథాదేవి. (ఆర. ౫ ఆ. ౩౦౬.) గీ. అనఘ మామామ శకుని నాకై కడంగి (సభా. ౨ ఆ. ౧౭౪.) "(ప్రౌ. ౪౬ సూ.). ఇందలి 'మీయిల్లు' అను నుదాహృతి పూజార్థకమెయన నగునుగానఁ బూజ్యత లేనిస్థలము చూపఁబడుచున్నది. క. జన్నములు సేయునెడఁ బ|క్వాన్నములు గుడుచుచుండు మధిపతి నిన్నున్| జన్నియ విడిచె రణముతజే|మిన్నక కినువడక పొమ్ము మీగృహమునకున్. (విరా. ౪ ఆ. ౨౧౮ ప.) (ఉత్తరగోగ్రహణసందర్భమునఁ గర్ణుఁడు కృపు నధిక్షేపించినది.). ఇట యుష్మదస్మచ్ఛబ్దములకె యనుట సరికాదు. క. తమమామకుఁ దద్వృత్తాం|తము నంతను దెలియఁజెప్పి. (ఆర. ౩ ఆ. ౨౬౪.) కృష్ణ యనురైభ్యముని కోడలిని యవక్రీతుఁడు కామించి కోరఁగా నామె తనమామతోఁ జెప్పినసందర్భమిది. ఇట నాత్మార్థకమునకు సంబంధార్థమున బహుత్వము ప్రసఘటితముగఁ బ్రయుక్తమై యున్నది. సిద్ధసమాసములందును నీపద్ధతిగలదు. క. అనురాగము నెఱపి నడతు రస్మత్పతులున్. (విరా. ౧ ఆ. ౩౨౯. అస్మత్పతులు = నాభర్తలు.).

[illegible]

కల్ప. ౨౧౧ IV విధః—పూజ్యత్వవివక్షాయాం = పూజ్యతా వివక్షితమగు
నప్పుడు, మహతాం = మహత్వఖ్యాతివాచకములకు, బహుతా = నిత్యమునందే
బహువచనప్రయోగము, మహా = సమ్మతమైనను. స్యాత్ = అగును. క్వచిత్ =
ఒకప్పుడు, స్వపక్షే = తనకును, బహువచనప్రయోగము, [illegible]
[illegible] పూజ్యతా బహు
వచన సంపన్నమునందలి సంబోధ్యవాచక మేకవచనముచేఁ బ్రయుక్తమగును. (...
ప్రౌఢ.శబ్ద.౭౩సూ.) ఉ. క్రచ్చఱ వేటవచ్చి యిటు గణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి మెండుఁబోయితో వారనినన్ విని మాలతాంగి వారిచ్చుటనుండి
యాతిథ్యము యొసఁగి తానును బంధులు లేక మీ వచ్చు ... జనవల్లభ
వారును వత్తు రింతకున్. (ఆది. ౪ ఆ. ౨౩.) ఇందు దుష్యంతుఁడును శకుంతలయుఁ
గణ్వునివిషయమునఁ బూజ్యతాబహువచనముల నుపయోగించిరి. దుష్యంతుఁడు
చక్రవర్తి గావున స్వవిషయమున 'వచ్చితిమి' అని పూజ్యతాబహువచనము నుప
యోగించెను. శకుంతల దుష్యంతునివిషయమున 'మీవచ్చుట' అని పూజ్యతా
బహువచనమును వ్యవహరించి సంబోధ్యవాచకమును 'జనవల్లభ' అని యేకత్వమునఁ
బ్రయోగించెను. "ఖేదకంటూ భయాత్మకష్ట"ని చెప్పుచున్నాఁడు. పూజ్యతా బహు
వచనమైచ్ఛికము. క. అరుణాశ్వంబులఁ బూన్చిన । యరదంబున వీఁడె......ద్రోణుఁ
డొప్పె నుత్తరకంటె, (విరా. ౫ ఆ. ౧౧౩.) (ఇట నర్జునుఁడు వక్త.) క. తనతనయు
కంటె నెమ్మన।మున నాకుం గూర్పుభావమున; గురులకు మా।ర్గోన్నతియెదను రాచ
ధర్మం।బున......(విరా. ౫ ఆ. ౧౨౧.) (ఇందును నర్జునుఁడే వక్త.) క. అడవులఁ
బెద్దయుఁ గాలం।బిడుములఁ గుడిచితిమి మాకు నిది తఱి యని యి।ప్పుడు వచ్చితి
మి విపన్నుల।యెడఁ గృప సేయుటయ లెస్స యీ రలుగకుఁడీ. (విరా. ౫ ఆ. ౧౨౩
ప.) (ఇందును నర్జునుఁడే ద్రోణు నుద్దేశించి పలికెను.). వీ రెవ్వరయ్య ద్రుపదమహా
రాజులె (ఆది. ౬ ఆ. ౯౧.) క. అతఁడు।మీకుం బ్రియశిష్యుఁడటె యమిత్రాఖ్య

వచసా (ఆది. ౫ ఆ. ౨౪౦ ప.) 'మీరున్' అని బహువచనము నుపయోగించి భేదకము నేకవచనముగా నిల్పెను. భేదకం తూ భయాత్మకమ్మని చెప్పుచున్నాఁడు. ద్విపద. అతనికిఁ బ్రత్యక్షమై యేము నిలిచి........మతి నిష్ట మెయ్యది మకు వేఁడు మనిన!..(బసవ. ౧ ఆ. ౧౬౯.) (ఇవి శివుఁడనినమాటలు) ఉ. క్రచ్చఱ వేఁటవచ్చి యిటఁ గణ్వమహామునిఁ జూచిపోవఁగా ! వచ్చితిమి............(ఆది. ४ ఆ. ౨౩) (దుష్యంతమహారాజువాక్యము) క...వీనిఁ గొన్ని గఱచితి మేమున్.............చూపుదు ! మే వీరులు చూచి మేలుమేలని పొగడన్. (ఆది. ౬ ఆ. ౩౩.) (కర్ణుఁ డాడినగర్వోక్తులు.) గీ. ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగునొక్కొ (ఆది. ౬ ఆ. ౯౧.) (ద్రుపదుని దనశిష్యులచే గెలిపించి నిరసించు ద్రోణునికోపావేశపుమాటలు) ఇట్లు స్వవిషయమున బహువచనము పెక్కువిధములఁ బ్రయుక్తమగును. కాన నథర్వణుఁడు "క్వచిత్స్వస్య భవేదిష్టా ! రుచి స్యాద్యది మానసే" అని యుపదేశించెను. ఇట్లు యుక్తమగురీతి నర్థము చేసికొనక కవిజనమండనకర్త "సర్చ్ఛ భవేదిష్టా" అని పాఠమును గల్పించి సమాసమందును బూజ్యతాబహువచనము సమ్మతమని చెప్పుచు స్వవిషయకబహుత్వమున కహోబలకతియిచ్చిన "మాకెల్ల" నను నమరేశ్వరప్రయోగము నుపేక్షించికొనెను. నారాయణీయగాణపతవివరణకర్తల కీస్వవిషయకబహువచనప్రయోగ విషయ మథర్వణుఁ డుపదేశించిన ట్లర్థముకాలేదు. (నారా. గాణ. తత్స. ౫౯ ప. ౨౨౦ కారి.)

పూజ్యత్వఇత్యాది:—పూజ్యత్వే = పూజ్యతావివక్షయందు, సద్రుతఃగారుః= షష్ఠ్యాదేశమగు ద్వితీయారూపమైన ద్రుతము పూర్వమందుఁగల 'గారు' పదము సమాసగతమై నిల్చును. భేదకంతు = యీపూజ్యార్థకబహువచనములవిశేషణము, ఉభయాత్మకమ్ = ఏకవచనబహువచనాన్యతమమై నిల్చును. సంబోధనమునం దేకత్వముమాత్రమె నిల్చును. (ప్రౌఢ. శబ్ద. ४౩ సూ.). తచ్ఛబ్దస్య బహుత్వం స్యాత్ = కొన్నియెడలఁ దచ్ఛబ్దబహువచనమగు వారుశబ్దము సమాసగతమై నిల్చును, తథా తత్ర ద్రుతస్థితిః = అక్లే యచట సామాసికద్రుతము నైతము నిల్చును. లోకోక్తౌ= లోకోక్తులందును, వంశకథనే = కులములను బేర్కొనునపుడును, అన్యత్ర = ఇతర స్థలములందును, తచ్ఛ్రుతిః = ఈవారు శబ్దసమాసరూపముల శ్రవణము, భవేత్ = అగును. (లోకోక్తావిత్యర్ధర్చము ముద్రితాహోబలపండితీయమున భ్రష్టమయినది. కాని శాంతివారిటీకలో నెత్తఁబడినది. నాయొద్దనున్న వ్రాతప్రతిలో నున్నది.) ఉదా:—అయ్యయొక్క+గారు = అయ్య+ను+గారు = అయ్యగారు. "ద్రుతస్య

సర్వత్ర లుక్ సమాసేషు" అనుచోప్పున ద్రుతలోపము కల్గును. అట్టిచో "ప్రకృతిస్థితిః" అనిచెప్పుట సమాసమని విశదపఱుచుటకే యని యెఱుంగునది. "షష్ఠీభవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్" అనుచోప్పున ద్వితీయా'ను' ప్రత్యయము షష్ఠిచోట నిల్చి సామాసిక ద్రుతలోపము నొందుట చింతామణి షష్ఠీసమాసపద్ధతి. అమ్మయొక్క+వారు = అమ్మ+ను+వారు = అమ్మవారు - నిటులనుండగ కర్త "న ద్రుతః కారుః" అని కవిశిరోభూషణపాఠము నుదాహరించి "వారు శబ్దమందు ద్రుతముండదు" అని వ్యాఖ్యచేసెను. ఎవటను సత్వరమునుచెప్పిన ద్రుతము నిలిచి యుండదు. నారాయణీయమున "క. పూజార్థమందు ద్రుతము యోజిత మగునపుడు నొడఁగూర్పఁదగున్." (తత్స. ౫౭ వ. ౨౧౮ కా.) అని నిరూపింపఁబడెను. దీనికి "ద్రుతముతోఁగూడియున్న కారుపదము అనఁగా ద్రుతకార్యమగు నకారాదేశముతోఁ గూడినదగు 'గారు' అనునది చేర్పవలయునని భావము. ఉదా:—రాజుగారు........." అని గాణపతవివరణకర్త వివరణము వ్రాసెను. ఇది వ్రాయునప్పుడీతఁడు ద్రుతకార్యములను మఱచెనా యని యాలోచింపవలసియున్నది. రాజు+ను+కారు = రాజుఁగారు = రాజుఁగారు మున్నగు రూపములు తనవివరణము చొప్పునఁ బుట్టవలసియుండఁగా నిట్లేల యుదాహరింపఁగడఁగెనో తెలియకున్నది. అహోబలపండితీయమున ముద్రణసంస్కర్తృప్రమాదమున 'కారు' శబ్దము వచుట యిట్టి యసంభవపద్ధతులకుఁ గారణమయ్యెను. ఇట్లే నారాయణీయగాణపతవివరణకర్తలు ప్రౌఢవ్యాకరణములోని శబ్దపరిచ్ఛేదము ౮౧ సూత్రమున ద్వితీయాబహువచనముమీఁద వారుశబ్దము విధింపఁబడుట నరసి "తథా తత్ర ప్రకృతిస్థితిః" అనుపాఠము నుపేక్షించి "లవర్ణాత్సవిశేషణమ్" అని సాహసముగ సవరించిరి.(నారా. గాణ. తత్స. ౫౬-౨౧౯ కారి.) ఉదా:—అత్తగారు - మామగారు- అయ్యగారు- బాబుగారు - రాజుగారు - దేవిగారు- మహాత్ముఁడైన స్వాములవారు - మహాత్ములైన స్వాములవారు-అమ్మవారు - రాచవారు-పూసపాటివారు - ఆర్వీటివారు - నంద్యాలవారు - రావువారు - దేవరవారు-అత్తవారు. "ఆర్వేలవారు. వి. బ.........సీ. అఖిలరాజాధిరాజాస్థానజనహృద్య, విద్యావిహారు లార్వేలవారు." (ఉ.రా. ౧౪.౨౭ సూ. రా. ని.) "గీ.........ఈయశోద।గారి గోపాలిగాఁ బిల్తు గలదె జగతి. ఆ-వె. పిన్నపెద్దలైన పింగళి సూరయ్య।గారిఁ దలఁచి.........స్వాములవారికిన్ మిగుల సత్కృప పుట్టఁగ.........గీ. వరదరాజువారి వంగడంబు।..." (అహో. ౩౫౫-౩౫౬ పు.). ద్విపద. అయ్యవసరమున నమ్మల్లికార్జు।నయ్యగారంతఁ బ్రవాసికాసుల్లఁ దగుచుఁ।దనతోంటిభావంబుఁ దాల్చి నీమనసుఁ।గనుఁగొన నిట్లైతి ననుచు...

౨౬౬ 'సూ-రా-ని' మహాప్రమాణవచనములందలి యాపవిభక్తిరీతి [అ.౧౧ వి. కల్ప.]

(మనుచ, ౩ ఆ. ౧౨౫౬ ప.) నిట 'మల్లికార్జునయజ్వగారు' అనుదాని విశేషణములు "ప్రహసితారాధ్యుఁడు - తన" అనునవియేకవచనములు. 'తన' అనుదాని నకారము ప్రయుక్తసిద్ధము.

"గారు, వారు, ఇవి తఱుచుగా స్త్రీపదములకు నేకవచనాంతదేశ్యశబ్దములకుఁ గొన్నింటికిఁ జివరఁ జేర్పఁబడి పూజ్యతను దెలుపును. ఉ........ఎట్టి విహార మాత్మ జనియించెనో మామకు సత్తగారికిన్। (నైష. ౭ ఆ. ౭౮ ప.) గీ. కదిసి నిలుచున్న సౌమిత్రి వదినెగారి బిలుఁగువర్వులు. (ఉ. రా. ౬ ఆ. ౧౧౯ ప.)" (సూ. రా. ని.) ఇట్లు ప్రథమైకవచనాంతముపై నన్వయశూన్యముగా నిల్చు ననుభ్రాంతిని వారించుటకే యథర్వణాచార్యుఁడు షష్ఠీసమాసాన్వయమును సూచించు ద్రుత పూర్వకత్వవిధానమును జేసెను. 'ఆర్యులవారు - స్వాములవారు' అనునవి షష్ఠీ సమాసమనుటకుఁ బ్రబలనిదర్శనములు. మామగారికిన్ మున్నగు ప్రయోగములలోని యిత్వమునుబట్టి కావలయు సూ. రా. నిఘంటుకర్తలు 'గారు' అను మహద్బహువచనరూపము నిందుకేని సంకోచింపక యాపవిభక్తికమని యంగీకరించిరి. ఆప విభక్తికములకు బహువచనస్థితియ ప్రవచనము. మఱియు దీని తృతీయాసప్తమ్యర్థములలో 'మామగారన్' మున్నగు రూపములను సైతము నీరంగీకరింతురు కాఁబోలును? ఈ గారు వారు ప్రభృతిశబ్దములకు ద్వితీయాబహువచనాదులందు "తయోశ్చసాదారేమాత్ర ఉదతోః ప్రాయశోఽత్ర ఇత" (అ.౧౨ విష.) అను చొప్పున "ఇ"త్వమును గ్రహింపవలయును. మామగారిన్ మామగారిచేతన్. మొ. వారు శబ్దమున కెట్లును నిత్యమువచ్చును. శ్రీరాములవారు శ్రీరాములవారిన్ శ్రీరాముల వారి చేతన్. మొ.

అథర్వణుఁ డేల వచింపలేదో తెలియదుగాని 'వారు' శబ్దము వకారమునకు గకారాదేశమగుటచేత గారుశబ్దమేర్పడెనా యని యాలోచింపనగును. (అ.౨౬ విష.). అనుశాసనకర్తగారు 'గారు' శబ్దమేకాక 'వారు' శబ్దముసైతము వాక్యమున నన్వయశూన్యముగనే నిల్చుచున్నదని సూత్రించిరి. "ప్రథమాంతములపై నేకత్వబోధకమగుచుఁ బూజ్యార్థమున గారు వారు శబ్దములు బహుళముగా వచ్చును. వారు పరమగుచో బహువచనలు వర్ణకముయొక్క ఉకారమునకు అకారము వచ్చును. (ఆం. భా. అ. శబ్ద. ౭౩ సూ.). ప్రౌఢవ్యాకర్తయును నీట్లేకరీతి నన్వయశూన్యముగనే నిల్చుననియీవిషయమును గొన్నిసూత్రములతో సంగ్రహించెను. (ప్రౌఢ.శబ్ద.౩౯ మొ.౭౨సూ.). ప్రౌఢవ్యాకర్త సూ.రా.నిఘంటుకర్తలవలెఁ బ్రామా

[బా. ఆబ్ధి ౧-౪-౭/౩౭ సూ.] పూజ్యతా బహుత్వాదివిషయక బహువచనవిశేషములు వీటి

షికముగ నీమహద్బహువచనాంతరూపముల కౌపవిభక్తికత నంగీకరింపక "ద్వితీ
యాదులందు మరి యగు" (ప్రౌ. శబ్ద. ౮౦.) అనిసూత్రించికొనెను. (విస్తర.)

కిమాద్యర్థాధికా శబ్దా బహుత్వ స్యార్థవిశేషాః । భవ న్త్యజహ
నవ్యమాధ. వాదిత్వే (అపి) స్వాస్తా శబ్దా మనోహరాః । జహతా వాచ
౪౧౧ విష. కత్వేతు స్త్రీత్వస్తథా తత్ర దృశ్యతే. (వ్యా. అజం.
౭౮-౭౯ కారి. అహో. ౫౫౮ పుట.)

---

విస్తర. ౪౧౧ IV విష:—పూజ్యతాబహుత్వ సందర్భమునఁ బ్రౌఢవ్యా
కర్త యీక్రిందిరీతిని వివరించెను:—సంబోధ్యవాచకంబు బహువచనాంతంబయ్యుఁ
గ్రియలమీఁది యష్మాదు లేకవచనాంతంబుల యగు. (ప్రౌఢ. శబ్ద. ౭౭ సూ.)
ఆ.వె. మన యశోద చిన్నమగవానిఁ గనెనఁట! మూఁడి వత్తిమమ్మ సుదతులార.
(భాగ. ౧౦ స్కం. పూ.) మొ. పూజ్యతాతిశయంబున యుష్మదర్థబహువచనాంతం
బునకు మాఱుగ నాత్మార్థబహువచనంబు ప్రయుక్తంబగు (ప్రౌఢ. శబ్ద. ౭౯ సూ.)
స్వామీ తాము దయచేయవలయును.

కిమాద్యర్థకశబ్దంబులు క్రమంబున నజ్ఞాతవస్తూద్దేశ్యప్రశ్నమునందును, నిర్దిష్ట
స్త్రీపురుషాన్యతరప్రశ్నమునందును, నిర్దిష్టస్త్రీపురుషాన్యతరగ్రహణమునందును, అని
ర్దిష్టస్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమునందును, దఱచుగ బహువచనాంతంబులగు.
ఉదా:—౧. ఎవరక్కడ? సీతారాము లిద్దఱిలో నెవరు మిక్కిలి కరుణగలవారు?
౨. ఈ స్త్రీపురుషు లిద్దఱిలో వీని నొకరికిమ్ము, ఒకరుపోయినత్రోవ నొకరుపోరు.
వారొక్కరే వచ్చిరి. ఇత్యాదులు............తఱచుగ ననుటచే నీ వెవ్వరు
ఇత్యాదివిశేషప్రయోగంబులుం గలవు. క. నీ వెవ్వ రేమిపనికై।... (విరా. ౧ ఆ.)
చ.........నీవు మునిసత్తము యెవ్వఁడ వెట్టు.....మజ్జనని తా నది యెవ్వరు...
(మార్క. ౫ ఆ.) ఉ.........ఎవ్వ రవనిం దలివంద్రులవేరు నావుడున్. (జై. ౬
ఆ.) సీ. అది యెవ్వరని ప్రతీహారు లెవ్వరినన్న.........(నైష. 3 ఆ.) అది
యెవ్వరే పిలిచెదరు...(కళా. ౭ ఆ.) మొ. (ప్రౌఢ. శబ్ద. ౭౭ సూ.) ఏతత్సూత్ర
లక్ష్యము లనఁదగు నాకు లభించిన ప్రయోగములు:—క. వీ రెవ్వ రేమిపనికై
(విరా. ౧ ఆ. ౪౯౭.) చ. నరునకు నాత్మ యెవ్వఁడు ఘనంబుగ దైవికమైనచుట్ట
మెవ్వ రతనికిన్.........(ఆర. ౭ ఆ. ౮౮౮.) (ప్రాసస్థలనిబద్ధబహువచనము.) క.
పురుషాత్మున కభిముఖుఁడై । కరములు మోడ్చుటయు నతఁడు గారవమున నెవ్వ
ర వజ్ఞానన.........(శాంతి. ౫ ఆ. ౭ ప. ప్రాసస్థలము.) క. ఈవారిజనయన యెవ్వ
రేర్పడఁజెప్పుమా. (హరి. ఉత్త. ౮ ఆ. ౧౫౦ ప.)

కల్ప. ౨౧౨ వివ:—కియదర్థాదికాః = 'కియత్' మున్నగువానియర్థములు గల, శబ్దాః=శబ్దములు, అర్థవిశేషదాః=అర్థవిశేషముల నిచ్చునవియు, భవన్తి=అగుచున్నవి. కియత్=ఎంతపరిమితిగలది. ఎంత సంఖ్యగలభిన్నవస్తువులు, ఎంతసంఖ్యగల పురుషులు లేక స్త్రీలు. ఇట్టి యర్థము లెల్లఁ గియదర్థకాదులకుఁ (ఎందఱు మొదలగువానికి) గలవని తాత్పర్యము. 'అన్ని-అందఱు' అనునవి సర్వార్థకములు తావచ్ఛబ్దార్థకములును. 'ఇన్ని - ఇందఱు' అనునవి ఇయదర్థకములు. "ఎన్ని - ఎందఱు" అనునవి, "కియత్-యావత్" అనువానియర్థములు గలవి. "కొన్ని-కొందఱు" అనునవి కతిపయార్థకములు. ఈవిషయముల నే యథర్వణుఁడు వచించుచున్నాఁడు. అజడవాచిత్వే=మహన్మహత్యర్థవాచకత్వమున (ఇట జడశబ్దము తిర్యక్కులకును నుపలక్షణము.) ర్వన్తాః శబ్దాః మనోహరాః = (ఉ+అన్తాః = ర్వన్తాః) ఉవర్ణాన్తశబ్దములు 'అందఱు-ఇందఱు - ఎందఱు - కొందఱు' అనునవి కవిసమ్మతములు. జడతావాచకత్వేతు = తిర్యగ్జడవాచకత్వమున, తత్ర = ఆకియదర్థాదికశబ్దములందు, న్న్యన్తతా = (న్ని+అన్త+తా) న్నివర్ణాంతరూపములస్థితి, దృశ్యతే = కన్పట్టుచున్నది. ప్రౌఢవ్యాకర్త 'అంత' మున్నగుశబ్దములనుండియే 'అన్ని' ప్రభృతులను సాధించెను. "అంత+వారు = అందఱు" అనురీతి నందఱ్వాదులు సాధింపఁబడెను. అంతాదులలోఁ జేర్చియే "ఇద్దఱు - చూపఱు - పగఱు" అనువానినిసైతము సాధించుకొనవలెను. చూచు+వారు = చూపఱు, పగ+వారు = పగఱు. రెండు+వారు=ఇద్దఱు. (౨౨౦-౨౨౪ వివ.).

మ.

| | | | |
|---|---|---|---|
| బాలవ్యాకరణ | సర్వతావదర్థకము. 3/౨౪ | | అ. |
| వివరణము. | అందఱు | } | అన్ని. |
| ౨౧౨ I విషయము. ప్ర. | అందొఱు | | |

సంజీవని. ౨౧౨ I వివ:—సర్వ = 'సకల' అనునర్థముగల సర్వశబ్దముయొక్కయు, తావత్ = 'అంతపరిమితిగల' అనునర్థముగల తావచ్ఛబ్దముయొక్కయు నర్థముగల యాచ్ఛికసర్వనామశబ్దమునకు "అందఱు = అందొఱు" అనునవి మహదర్థక ప్రథమానిత్యబహువచనరూపములనియు, 'అన్ని' అనునది యమహదర్థక ప్రథమానిత్యైకవచనరూపమనియుఁ దాత్పర్యము. ద్వితీయాదివిభక్తులలో మహత్త్వమున "అందఱన్ అందఱచేతన్" మున్నగువానిని నమహత్త్వమున "అన్నిటినిన్-అన్నిటిచేతన్." మొదలగువానిని గ్రహింపవలెను. 'అన్ని-ఇన్ని - ఎన్ని - కొన్ని'

అనువానికి 'అని - ఇని - ఎని - రాని' అనురూపాంతరములును గలవు. "ఎని = ఎన్. రాని - రాన్" అనియుఁ గలవు. (౩౧౧ V విష.).

సంస్కృతమునందు యత్తచ్ఛబ్దములకుఁ గలసంబంధము తెలుఁగునందును గలదు. అనఁగా 'ఎన్ని - ఎందఱు' అను యావచ్ఛబ్దముచే నిర్దేశింపఁబడినయర్థము 'అన్ని - అందఱు' అనుతావచ్ఛబ్దముచే నియతముగాఁ బరామర్శింపఁబడుచుండునని యర్థము. క. ఏయది హృద్యము........అఘనిబర్హణ మేయది యొకట వినఁగ నిష్టము మాకున్. (ఆది. ౧ ఆ. ౩౦ ప.) క...ఇష్టం బే యది దానిన తెత్తు. (ఆది. ౨ ఆ. ౫౩.) వచ........నీకెయ్యది వేల్పు నారాధించితివి యావేల్పువచ్చి...... (ఆది. ౫ ఆ. ౧౮ గద్యము.) ఆ-వె...ఎవ్వఁ డేసె నాతని వరియింపు...(ఆది. ౭ ఆ. ౧౭౨.) సీ.........నిన్నెద్ది గఱపిరి నెమ్మితోఁ డదానిన చేయుట ధర్మువు...... (ఆది. ౮ ఆ. ౪౩.) సీ.........ఎవ్వరియింటను దానుంటె నయ్యింటివిపలనఁ బెఱవారు సనకుండ.........(ఆది. ౮ ఆ. ౧౧౫.) ఇట్టియెడల "హృద్యము నఘనిబర్హణము నగుకథను వినఁగ" "ఇష్టమైనదానిన తెత్తు" అనురీతిని ధాతుజవిశేషణముల వాక్యనిర్వాహణము చేయుట తెలుఁగు సంప్రదాయము. అట్టియర్థమును వైరీతిని సంబంధార్థకసర్వనామములతో నిర్వహించుట యరుదు. ఇట్లె "యెందఱు భటులుగల రందఱును వీరులు - ఎందఱు స్త్రీలుగల రందఱును బతివ్రతలు. ఎన్ని శ్లోకములుగల వన్నియు విష్ణుప్రణామరూపములు" (యావన్తః శ్లోకాస్తావన్తో-ఽచ్యుతప్రణామాః) అనురీతిని 'అన్ని - అందఱు' అనుతావదర్థకమునకు "ఎన్ని ఎందఱు" అనుయావదర్థకముతోడి సంబంధము నరయునది. అన్నిశబ్దము నిత్యైకవచనమనియు 'అందఱు' శబ్దము నిత్యబహువచనమనియు నీవఱకు నిరూపింపఁబడెను. (౩౧౧ II విష.). అన్నిశబ్ద మాపవిభక్తికము కాన ద్వితీయాద్యేకవచనములందు అన్నిటిన్-అన్నింటిన్-అన్నిటన్-అన్నిటిచేన్ మున్నగురూపములు సిద్ధించును. (బా. ఆచ్చి. ౩౧-౩౨ సూ.) 'అందఱు' మున్నగువానికి 'అందొఱు' మున్నగురూపాంతరములు కవిసమ్మతము లగుచున్నవి. మఱియు 'అందఱు' మున్నగుమహత్త్యర్థకశబ్దముల ద్వితీయాదిబహువచనము లందు 'అందఱన్-అందఱచేన్' మున్నగురూపములు భారతాది ప్రాచీనకవిసమ్మతములు. 'అందఱిన్-అందఱిచేతన్' మున్నగురీతిరూపములు నర్వాచీనకవిప్రయోగములలోఁ గన్పట్టుచున్నవి. సర్వార్థకమగు 'అందఱు' శబ్దము సాకల్యాతిశయబోధమున 'ను'శబ్దాంతమగుచు 'ఎప్పుడును' అనుదానివలె "ఎందఱువచ్చి రందఱును విద్వాంసులె" అనురీతిని ద్రుతకలితముగాఁ బ్రయుక్తమగుచుండును. ప్రయోగములు:— క. భీమునకు నంద్రోఱుఁ గిడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్. (ఆది. ౫

ఆ. ౧౬౪.) ఆ-వె.........అం|ద్రొఱకు నిట్టులనియె ద్రుపదవిభుఁడు. (ఆది. ౭ ఆ. ౨౫౪.) సీ.........దుర్యోధనా|దులు దురాధర్షులంద్రొఱును మనకు. (అర. ౧ ఆ. ౨౬౯.) క. మఱచి దయఁజూడు మిట్లం|దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్. (విరా. ౫ ఆ. ౩౫౭.) క. అనుటయు నాతం డందఱ|కును మెలపునఁ జెప్ప వగలఁ గుందుచు. (శల్య. ౧ ఆ. ౧౨.) క. దనుజుఁ బరిమార్చి యందఱ|కిని దానవబాధఁ దీర్చి కృతకృత్యుండై. (పివపీరభద్రుని శకుంతలాపరిణయము. బాలకవి శర. ౧౨౪ పు.) (విస్తర.)

---

విస్తర. ౨౧౨ I విష:—"అన్ని-అందఱు" శబ్దంబులకుఁ ద్రిలింగలక్షణశేషమున నీక్రిందిరీతిని రూపసాధనప్రక్రియ చూపఁబడెను. "అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థమగుచో నేకవచనంబున నంతాదుల తకారంబునకు ద్విరుక్తనకారం బగు." అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని. (ప్రౌఢ. శబ్ద. ౫౨.). "సర్వనామంబులకు మహదర్థంబునం దఱచుగ లు ల లకు రు ర లగు" (౭౬ సూ.). "అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రు ర లకు ఉ అ లాదేశంబు నగు" (౭౭ సూ.). అందఱు - అందఱన్. రు ర ల కనుటచేత ౯౦ సూత్రముచొప్పున 'ఇ'త్వముచేసినపిదప ఉ అ ఆదేశము చేయరాదు. "వా లోపంబుతఱి వాని తకారంబునకు దకారంబగు." (౭౯ సూ.). అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు. ద్వితీయాదులం దసంయుక్తరవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగనగు." (౯౦ సూ.) (ప్రౌఢ. శబ్ద.) వారిఁ - వీరిఁ.........వాండ్రన్ - వీండ్రన్. (సంయుక్తరవర్ణము కాన నిత్వము లేదు.........తఱచుగ ననుటచేత 'ఇరువున్' ఇత్యాదులం దిత్వంబు కలుగదు.). అసంయుక్తరవర్ణకం బనుటచే శకటాదేశముచేయునపు డిత్వము రాదు. కాన 'అందఱిన్ - అందఱిచేతన్' ఇత్యాదులు ప్రౌఢవ్యాకరణసమ్మతములు కావు. ఇట్లు త్రిలింగలక్షణశేషకర్త "అందఱన్ - అందఱచేన్" మున్నగువానినె యుదాహరించి వానికే రూపసాధనప్రక్రియనుజూపి 'ఇ'త్వమువచ్చుటకుఁ బ్రసక్తిలేకుండ సూత్రరచనముచేసియుండఁగా "ప్రౌఢవ్యాకరణములో ఆచార్యులవారైనా అందఱకు అనే ఉండవలెను. 'అందఱికి' అని ఉండకూడదు. అని అనుశాసించి ఉండలేదు." (బాలకవిశర. ౧౨౩ పు.) అని గిడుగువారు వ్రాయుట వింతగొలుపుచున్నది. వీరు పయి ప్రౌఢవ్యాకరణప్రక్రియను సరిగఁ జూచికొనలేదా యని యాలోచింపవలసియున్నది. వీరివలెనె గుప్తార్థప్రకాశికాకర్తలును వ్రాయుట మఱియు వింతయగుచున్నది. "ఈమార్గము ద్వితీయాదివిభక్తులందు బాధకంబగును. ఏలయన ద్వితీయాదివిభక్తులయందుఁ బైనిం జెప్పినచొప్పున 'అంతవారిన్' అనియుండ వాలో

| | | |
|---|---|---|
| | ష ఆ | ష ఆ |
| | ఇయుపదర్థకము. | కతిపయార్థకము. |
| బాలవ్యాకరణ | ప్ర. ఇందఱు - ఇన్ని | ప్ర. కొందఱు - కొన్ని |
| [illegible] | ఏయుపాఖ్యపదర్థకము. | 3 |
| | ప్ర. ఎందఱు - ఎన్ని | ౨౪ |

పంబును లఘురేఫంబున కలఘురేఫాదేశంబును బూర్వోక్తజ్ఞంబులోని తకారంబునను దాదేశంబును జేయఁగా "అందజీన్" అను ననిష్టరూపంబు గావలసివచ్చును." (బా. గు. ప్ర. ౧౮౦ పు. ద్వి. ము.). అలఘురేఫాదేశవిధాయకమగు ౮౮ సూత్రములో 'ఱ-ర'లకని చెప్పుటచే 'వారిన్' అనుదానిలోని 'రి' అనుదాని కలఘురేఫాదేశము రానేరదు. ఏస్వరముతో నున్నను రేఫమున కలఘురేఫాదేశము సమ్మతమైనచో సూత్రకర్త ఱ ర లకని చెప్పనేల? రాకు ఱా యగునని సూత్రింపఁడా? ఇంతయేల? సూత్రకర్తయే యలఘురేఫవిధాయకమగు ౮౮ సూత్రమునఁ దన ప్రక్రియచొప్పున సిద్ధించిన "అందఱున్" అనురూపము నుదాహరించియే యున్నాఁడు. ఇత్వవిధాయకమగు ౯౦ సూత్రమున రవర్ణమున కనిచెప్పుటచే నలఘురేఫాదేశము చేసినపిదప నిత్వము సంభవింపనేరదుగదా. క.........ఇరు వురకును వంశకరుండు పుట్టెఁ గురుఁ డున్నతుఁడై. (ఆది. ౪ ఆ. ౧౧౩.)

"అందఱి కిని"అను యతిస్థలనిబద్ధమగు పినవీరభద్రుని ప్రయోగము మార్పరానిది వెలసియుండఁగా నద్దానిని సూరిప్రభృతులు సంగ్రహించికొనకుండుట యుక్తముకాదు. అట్లు సూరి యుదాహరింప నంతమాత్రమున 'అందజీన్' మున్నగునవి యసాధువులని గుప్తార్థప్రకాశికాకారాదులు వ్రాయుట పొరపాటు, "అందఱిమతము - కొందఱిమతము ఇత్యాది ఇకారాంతశకటరేఫసహితరూపంబులు గ్రామ్యంబులు" (బా. గు. ప్ర. ౧౮౦ పుట. ద్వి. ము.) "ఇత్వవిశిష్టశకటరేఫముల తోడి రూపము లర్వాచీనకవి ప్రయుక్తములయినను నలాక్షణికములనియు, నత్వ విశిష్టశకటరేఫరూపములు లాక్షణికములనియు నీవ్యాకృతిపద్ధతింబట్టి సమ్మతింపక తీరదు." (బా. సా. పే. ౨౩౭ పు.) నేఁటి బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణపద్ధతులను బట్టి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని యతిస్థానగతప్రయోగము లాక్షణికముకాదని నిరసించుట సరియై యుండలేదు. ప్రాచీనలాక్షణికు లెవ్వరును నిందలియిత్వమును నిరసింపలేదు. బహువచనలకారమ్ముమీఁది 'అ'కారమున కికారము ప్రాయికమని (౧౯౨ విష.) యథర్వణుఁడు వచించెను. అంతాదులలోఁ జేర్చియే చూపఱు - పగఱు రూపములను సాధించికొనవలెను. చూచు+వారు = చూపఱు, పగ+వారు= పగఱు. ఇట్లు ప్రయోగసిద్ధములనుమాత్రమె సాధింపనగును.

సంజీవని. ౨౧౩ విషః—"సం-ఇయత్ (= ఇంతపరిమితిగల)" అనుదానికిఁ బర్యాయమగు నాచ్ఛికశబ్దము:— మహన్మహతీ ప్రథమానిత్య బహువచనాంతము "ఇందఱు" అనునదియు నమహత్ప్రథమానిత్యైకవచనాంతము 'ఇన్ని' అనునదియు నని సూరివివరణమున కర్థము. వీనినిబట్టి 'ఇందఱన్ - ఇందఱచేతన్, ఇన్నిటిన్-ఇన్నిటన్ - ఇన్నిటిచేతన్, మున్నగురూపములను నూహించుకొనవలయును. ఇట్లె 'ఇన్ని = ఇని - ఎన్ని = ఎని-ఎన్' మున్నగురీతిరూపములును గలవు. (౨౧౦ VI.) 'సం-కియత్-యావత్'అను రెండిటికిని బర్యాయమై యెంతమితిగలయను నర్థముగల యొక్క-టేశబ్దము- మహన్మహత్యర్థక ప్రథమానిత్యబహువచనాంతము 'ఎందఱు' అమహత్ప్రథమానిత్యైకవచనాంతము"ఎన్ని"అనురూపములతో నుండుననిగ్రహింపవలయును. దీనికిఁ గియదర్థపక్షమున "వీరెందఱు-ఇవియెన్ని"ఇత్యాదిప్రశ్నార్థవ్యవహారమును యావదర్థపక్షమున "ఎందఱుగలరో యందఱును వైయాకరణులె - ఇటనెన్నిపుస్తకములుగలవో యన్నియు వ్యాకరణములె"అనురీతినియత్తచ్ఛబ్దసంబంధార్థవ్యవహారమును గ్రహింపవలయును. ఈరీతినె "సం-కతిపయ=కొంతపరిమితిగల"అనుదానికిఁ బర్యాయమగు నాచ్ఛికశబ్దము:—మహన్మహతీప్రథమా నిత్యబహువచనాంతము'కొందఱు'అనునదియు,నమహత్ప్రథమానిత్యైకవచనాంతము 'కొన్ని' అనునదియు నని సూరివివరణమున కభిప్రాయము. (విస్తర I). పయివివరణములనుబట్టి

---

విస్తర I ౨౧౩ విషః—"కతిపయః-త్రి - కతిశబ్దార్థే" "కతి - త్రి - కియతి సంఖ్యాపరిమాణప్రశ్నే, కా సంఖ్యాపరిమాణం యేషామ్." (శబ్దార్థచిం) "కతి పయ-త్రి (కతి+అయచ్+పుక్చ.) కతిశబ్దార్థే" (శబ్దస్తో). ఇట్టి కోశములనుబట్టి కతిపయ శబ్దమునకు 'ఎన్ని' అనెడి కతిశబ్దార్థమును జెప్పవలసియున్నది. కాని యట్టియర్థమునఁ గతిపయ శబ్దమును మహాకవులు ప్రయోగింపలేదు. ఇంకను గొన్నియనునర్థమున నయ్యది ప్రయోగింపఁబడినది. "కతిపయదివసైర్వ్యయపన్న యావః" (నైష. ౪ సర్గ. ౧౨౧) "కతిపయదివసైః=ద్విత్రైరేవదివసైః" (నారాయణీయవ్యాఖ్య.) "కతిపయదిన స్థాయిహంసా దశార్ణాః" (మేఘు. ౧ స. ౨౩ శ్లో.) "కతిపయ సహకార పుష్పరమ్యః" (కిరా. ౧౦ స. ౩౦ శ్లో. సూ. రా. ని.) ఇట్టి మహాకవిప్రయోగములనుబట్టి సూరి సంస్కృతకోశముల నుల్లంఘించి 'కొన్ని'శబ్దము కతిపయార్థకమని వచించుట యుక్తమైయున్నది. కతిపయశబ్దమును సాధించుటకుఁ బాణినీయమున విధులు కన్పట్టలేదు. కావున నిది యవ్యుత్పన్నశబ్ద మనఁదగీరదు. రూపసామ్యమునుబట్టి సంస్కృతకోశ కర్తలు "అయచ్ ప్రత్యయము పుగాగమము గల్పించి కతిశబ్దమునుండి కతిపయ శబ్దమును సాధించుట యుక్తమేకాని యది కతిశబ్దార్థకమనుట సరికాదు. కింశబ్ద

[బా. అప్ప. ౩/౨౪ సూ.] అంతాదులకును నన్నాదులకును భేదములేదు కదా!
"ఎందఱన్ - ఎందఱచేతన్, ఎన్నిటిన్ - ఎన్నిటన్ - ఎన్నిటిచేతన్, కొందఱన్ - కొందఱచేతన్, కొన్నిటిన్ - కొన్నిటన్ - కొన్నిటిచేతన్." మున్నగు రూపములను గ్రహింపవలయును. వెనుక నుదాహరించిన కవిప్రయోగస్థములగు (౨౧౨ పుట.) "అందఱిన్" మున్నగువాని సమానన్యాయమున "ఇందఱిన్ - ఇందఱిచేతన్, ఎందఱిన్ - ఎందఱిచేతన్ - కొందఱిన్ - కొందఱిచేతన్ మున్నగు నన్యాపేక్షరూపములును సూరిచే సంగ్రహించికొనఁబడకున్నను గవిసమ్మతములగుటచే సాధువులే యని యెఱుంగునది. వెనుక నుదాహరింపఁబడిన "అంత+వారు=అందఱు" మున్నగువాని వలెనే "ఇంత-ఇన్ని-ఇందఱు; ఎంత - ఎన్ని - ఎందఱు; కొంత-కొన్ని - కొందఱు" అనురూపములు సయితము ప్రౌఢవ్యాకరణశబ్దపరిచ్ఛేదమునందలి ౫౧-౫౨-౫౩-౫౪ ౫౦ సూత్రములచే సాధింపఁబడినవి. (విస్తర II)

---

సంబంధియైనను దీనికి "కిమ్"చ్ఛబ్దమునకువలె నల్పార్థమును గ్రహించుట యుక్తము. తెల్గునందును గతిపదార్థకమగు కొన్ని శబ్ద మల్పార్థకమగు కొంతశబ్దము నుండి సాధింపఁబడునేకాని కింశబ్దసంబంధియగు 'ఎంత' శబ్దమునుండి సాధింపఁబడదు "ఒక+అంత = ఒకింత = కొంత" అనురీతిని సాధింపఁబడును. (ప్రౌఢ. శబ్ద. ౫౧ సూ.) ఒకశబ్ద మల్పార్థకము. (ప్రౌఢ. శబ్ద. ౬౭ సూ.).

విస్తర II ౨౧౩ పుట:—ఈసందర్భమునఁ బ్రౌఢవ్యాకర్తచూపిన ప్రక్రియ సరియైనట్లు కన్పట్టదు. 'అంత - ఇంత - ఎంత - కొంత' అనుశబ్దములు పరిమాణార్థకములేకాక "కియదర్థాదికా శ్శబ్దా ఘన స్త్వర్థవిశేషదాః" అను నథర్వణవచనము చొప్పున నర్థవిశేషబోధకములును నగుచున్నవి. కావుననే "అంతా"దులకును నన్నాదులకును నర్థస్ఫురణములో భేదము కన్పట్టుచున్నది. అట్లె "అంతవారు" మున్నగువానికిని"అందఱు" మున్నగువానికిని నర్థస్ఫూర్తిలో భేదము భాసిల్లుచున్నది. మ.... అంత నేసియును బశ్చాత్తాపముం బొందనో। పర వారెన్నఁడు.(ఉద్యో.౩ ఆ. ౩౬.) ఉ.........సంజయుతోడ నాడిన!ట్లంతకు నోపు మీరుఁ దెలియందగు ఖాండవ దాహ మాదిగా." (ఉద్యో. ౨ ఆ. ౧౬౪.) క. ఇంతలు పుట్టినచోటను।........। కౌంతేయాగ్రజుఁ డాలము।పొంతం బోనొల్లఁ డనుము. (ఉద్యో. ౧ ఆ. ౩౭౫.) ఉ. అంతలునేసి పోనడఁచి........(ఉద్యో. ౩ ఆ. ౧౦౧.) "నిను నంతవాఁడు-నీయంతవాఁడు - రాజునంతవాఁడు-(మ) ఒకనాఁ డింద్రునియంత వేలుపు-అటువగునే సురేశ్వరుని యంతటివానికి - అలరఁజేసితి నిషధరాజంతవాని - ఇత్యాదికవీనాం వచనమ్" (అహో. ౩౬౩ పు.) పైవానిలో "అంతా"దులచోట "అన్నా"దులను నిల్పిన నర్థభంగమె యగునుగదా. ఇట్లె 'అందఱు' మున్నగుచోటుల నంత

సంస్కృతభాషలోని ప్రశ్నార్థకమగు కింశబ్దము నర్థమందును, దచ్ఛబ్దసంబంధార్థమును బోధించుయచ్ఛబ్దము నర్థమందును దెల్గున 'ఏ' శబ్దముమాత్రమె వాడఁబడును. రెండిటికిని బ్రత్యేకముగా రెండుపర్యాయశబ్దములు లేవు. ఇమేకియ స్తః = వీరెందఱు? ఇందుఁ బ్రశ్నార్థము. ఎందఱు విద్వాంసులో యందఱును వృద్ధులె. ఇందుఁ దచ్ఛబ్దసంబంధియచ్ఛబ్దార్థము. ఇట్లగుటచేతనే యిది కియద్వ్యాపదర్థకమనఁబడెను.

అన్నిశబ్దమువలెనె 'ఇన్ని - ఎన్ని - కొన్ని' శబ్దములును నాపవిభక్తికములు. ఇన్నిటిన్ - ఇన్నింటిన్ - ఎన్నిటిన్ - ఎన్నింటిన్ - కొన్నిటిన్ - కొన్నింటిన్. మొ. (బా. ఆచ్ఛి. ३౧-३౨ సూ.). ఇందఱు మున్నగువానికిఁ బ్రయోగములు:—క. ఇమ్ముద్దియ నర్జునునకు । నిమ్మాపని బంధుజనుల కిందఱకుఁ గడున్ । సమ్మతము. (విరా. ౫ ఆ. ३౫౯.) చ. వెఱచితిరేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁగాక యొందఱు వలయున్. (విరా. ౪ ఆ. ౨౦౧.) గీ. ఎన్నిశరముల నభిమన్యుఁ డేసెఁ దమ్ముఁదారు నన్నియ శరములఁదఱిమి.........(భీష్మ. ౨ ఆ. ३౧౫.) మ. మును నీవెన్నితి విక్రమాఢ్యులని మమ్ముం గొందఱన్...(ద్రోణ. ౨ ఆ. ౨౯౪.)

---

వారు మున్నగునవి నిల్చిన వాక్యార్థము నిర్వహింపఁబడదుగదా. 'ఆ-ఈ-ఏ' మున్నగువానినుండియే సర్వతావదర్థావ్యర్థవిశేషములం దాయాకార్యములు జరుగునని ప్రక్రియను గల్పించుట యుక్తము. ఇట్లె 'ఇంత - ఎంత' అనుశబ్దములకు "ఈ+అంత = ఇంత - ఏ+అంత = ఎంత" అని ప్రౌఢవ్యాకరణమునఁ జూపఁబడిన ప్రక్రియయు సరికాదు. ఆ-శబ్దమునుండి యంతశబ్ద మేర్పడినట్లె 'ఈ-ఏ' శబ్దములనుండి 'ఇంత - ఎంత' శబ్దము లేర్పడెననుట యుక్తము. "ఈ-ఏ-ఒకశబ్దములకంటెం బరంబులయిన యంతశబ్దము నకారమునకు లోపంబగు. అగుచో నీ-యేల దీర్ఘమునకు హ్రస్వమును ఒకకు వర్ణవ్యత్యయసంహితలు నగు. ఇంత-ఎంత - కొంత" (ప్రౌఢ. శబ్ద. ౫౧ సూ.) ఈసూత్రమున "ఒక+అంత = కొంత" అను ప్రక్రియను జూపియుఁ బ్రౌఢవ్యాకర్త తనశబ్దరత్నాకరమున "కొంత. వై. స. (కొంచెము+అంత) ఇంచుక కొలఁది" అని యిట్లు చూపుట వింతయైయున్నది. సూ. రా. నిఘంటుకర్తలును దీనినె తమకోశమున నెక్కించిరి. అరయ నరయ నిందుఁ బ్రౌఢవ్యాకరణప్రక్రియయె యుక్తతరమని తోఁచెడిని "ఏక - త్రి (ఇణ్+కన్).........కేవలే - ముఖ్యే... అల్పేచ" (శబ్దస్తో.).

బహ్వార్థకము.

మ — ప్ర. పెక్కండ్రు - పెక్కుఁడు.

అ — పెక్కు — దీనికి బహువచనంబు గలదు. పెక్కులు.

ఈశబ్దంబు లోపవిభక్తికంబులగుటంజేసి అన్నిటి - అన్నింటి, ఇన్నిటి - ఇన్నింటి, ఎన్నిటి - ఎన్నింటి, కొన్నిటి - కొన్నింటి, పెక్కిటి - పెక్కింటి, యనురూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునప్పుడమహత్త్వంబునం దగునని తెలియునది.

బాలవ్యా. వివరణము. ౨౧౭ విషయము.

బహ్వార్థకము.

మ — ప్ర. పలుగురు - పలుగుండ్రు

అ — అమహత్త్వంబున దీనికి వ్యక్తి ప్రయోగములేదు. ౩/౨౭

సంజీవని. ౨౧౭ విష:—బహ్వార్థకమగు 'పెక్కు'శబ్దము మహన్మహతీ ప్రథమానిత్యబహువచనాంతరూపములు 'పెక్కండ్రు - పెక్కుఁరు' అనునవియు, నమహత్ప్రథమారూపములు 'పెక్కు - పెక్కులు' అనునవియు, బహ్వార్థక పలుశబ్దము మహన్మహతీ ప్రథమానిత్యబహువచనాంతరూపములు "పలుగురు - పలుగుండ్రు" అనునవియు నగుచున్నవని సూరిగారివివరణమునకుఁ దాత్పర్యము. పలుశబ్దమున కమహత్త్వమున పలుపలుకులు-పలువిధములు మున్నగురీతిని సమాసస్థితియే కాని విభక్తితోడి వ్యస్తప్రయోగము లేదు. "ఈశబ్దంబు లోపవిభక్తికంబులగుటంజేసి..."అను సూరివివరణములోని యీశబ్దంబు లనఁగా వెనుకను నిచటనుగల ౩/౨౭ సూత్రమున వివరింపఁబడిన "అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు" అనునైదుశబ్దములును లోపవిభక్తికములని యర్థము. వానికి 'టి-ంటు'లు రెండును వచ్చిన రూపముల నీ సూత్రమున సూరిగారె యుదాహరించిరి."అన్ని మొదలగుశబ్దంబు లాఱును ద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు. అమహదర్థంబు లేకవచనాంతంబులగు..." (అచ్ఛి. ౩/౨౭ సూ. ౨౧౧ I విష.) అను సూరివివరణము చొప్పున "పెక్కు-పలుశబ్దములు సైతము "అందఱు"మున్నగువానితోపాటుగ మహ

త్త్వమున 'పెక్కురు' మున్నగు రీతిని నిత్యబహువచనాంతములుగ నుదాహరింపఁబడెను. ఆమహత్త్వమున 'పలు' శబ్దమునకు వ్యస్తప్రయోగమే లేదు. పెక్కుశబ్దమునకు 'పెక్కులు' అను బహువచన రూపమును గలదని సూరిగారే వచించిరి. పలుశబ్దము మహత్త్వమున సర్వనామ మని వ్రాసి యమహత్త్వమున నట్లు శ-ర. కర్తవ్రాయకుండుట చింత్యము. "పలుగురు - దే - స - బ - అనేకులు" "పలు - దే......... విశే - అనేకము. (దీని కీయర్థమున నేకవచనమున వ్యస్తముగా ప్రయోగము లేదు.)" (శ-ర.)

ప్రయోగములు:—క. అలయక యేండ్లు గడుం బెక్కులు జీవించుట నరగలుగుటయుం దగువృ|ద్ధులలక్షణమే. (ఆర. 3 ఆ. ౨౮౮.) సీ.........పెక్కులయ్యుఁ గుక్క|లిభకుంభదళనమహిష్ఠ.....హరిమీఁద...(సభా. ౨ ఆ. 3౮.) ఉ. పెల్లునఁ గూలు తజ్జలము పెక్కున నొక్కట నమ్మహానలం|బెల్లను నాఁకిపోవు...(ఆర. ౪ ఆ. ౨౪౭.) 'పెక్కునన్ = అధిక్యముచేత" దీనిచే నిది యనోపవిభక్తికాంతము నైతము కానోపు ననవలసియున్నది. కాని యిట "పెక్కువన్" అని కవిప్రయుక్తమేమో? "ఉ. పెనంగిరి బాహుశౌర్యముల్|ద్రాసునఁ దూఁపవచ్చు ననఁ దక్కువ పెక్కువ లేక యిద్దఱున్" అని పెక్కువశబ్దమును బ్రసిద్ధమె. పలుపెక్కుశబ్దములు బహ్వర్థకములైనను వెనుక వివరించినరీతిని (౨౧౧ II విష.) సంఖ్యావాచకసమూహవాచకస్థలములందువలెనె వీని విశేష్యములును నేకవచనాంతములు నైతము కానోపును. మ...మా|ఱుదెసల్ గైకొనుచున్ గడంగి పలుమాఱున్ దాఁకుచున్. (శల్య. ౨ఆ. ౨౫౯ ప.) పల్తునియలు (ద్రోణ. ౪ ఆ. శ. ర.) చ. పెలుకుఱఁ బెక్కుభంగి విలపించె. (భాస్కర. యుద్ధ. ౧3౮౮ ప.) గీ. ఆననే పలుతెఱఁగుల తేనియలును. (కర్ణ. 3 ఆ. ౨౧౬.) క. పలువగ తురగముల మహా|బలచిత్రప్రౌఢిఁ దోలి. (హ. న. ౧ఆ. ౧౮ ప.) "(హరిశ్చం) పలుపగతుర = అనేకులగుశత్రులయొక్క, గములన్=సమూహములను, (నల) పలువగ = పెక్కువిధముల, తురగములన్ = గుఱ్ఱములను." అని యర్థము. క. ఆదెసఁ బెక్కండ్రు వారినందఱ విడువర్. (ఉద్యో. ౪ ఆ. 3౮.) క. నరకశిశుపాలురాదిగ|........ప|ల్వుర వధియింపఁగ (ఆర. ౧ఆ. ౧౨౮.) చ. ప్రకటబలాఢ్యులొక్కటఁ దిరంబయి పల్వురు వీఁక (ద్రోణ. ౨ ఆ. ౨౫.) తే-గీ. ఐన యోధులు పెక్కండు రథులదిశల|........(ద్రోణ. ౨ ఆ. ౧౧౭ ప.) వెనుక నుదాహరించిన పినవీరభద్రుని ప్రయోగము చొప్పున (౨౧౨ విష.) 'అందఱు' మున్నగుస్థలములు నాల్గింటియందే 'ఇ'త్వము కన్పట్టుచున్నది. ఉ. అందఱిన్ - అందఱిచేన్ - ఇందఱిన్-

ఎందఱేన్ - కొందఱేన్. తక్కినయెడల 'ఇ'త్వమే కన్పట్టుచున్నది. (విస్తర.) ఆ-వె. రాజునొద్దఁ బలువురకు సంకటముగాఁగ. (విరా. ౧ ఆ ౧౩౬ వ.) చ.....కృష్ణ రేవతీరమణులు దాఁకి రయ్యెకువురన్. (ఉ. హరి. ౪ ఆ. ౩౭౮.)

భవేత్తదాదిశబ్దే వో।ఙుకాదిస్తు భవే న్నవోత్। జరః
స్థానేరు రత్రస్యా। త్వాచి దత్వం భవే ల్లులే. (వికృ.
అజం. ౩౪ కా. అహో. ౩౧౮ పు.)
లు ల యో।స్తథా పుంసి రు రౌ స్మృతౌ. (వికృ. అజం.
సన్నయాధర్వ. ౫౨ కారి. అహో. ౩౭౫ పు.)
౨౧౫ వివయము. కేషాంచిద్ర్వస్తశబ్దానాం।తథా డుఙ్ వా రు రౌ స్మృ
తౌ. (వికృ. అజం. ౫౩ కా. అహో. ౩౩౫.)
తయో శ్శసాదా రేమాత్ర।డుదతోః ప్రాయశోఽత్ర
ఇత్. (వికృ. అజం. ౩౬ కా. అహో. ౩౧౦ పు.)

కల్ప. ౨౧౫ విష:—అధర్వణకారిక లహోబలపండితీయమునుండియే లభించిన వగుటంజేసి వానిని యథాస్థితముగాఁ గవి శిరోభూషణమునుండి గ్రహించుటయే యుచితము. అట్లయినను నీకారికలు సరిగా నర్థముచేసికోఁజాలక కొందఱు లేఖకటీకాకారాదులు కొన్నిచోట్లఁ బ్రామాదికపాఠములను జొనిపిన ట్లగపడుచున్నది. అట్లగుటంజేసి యిట "శబ్దేభోన్య"అనుచో "శబ్దేవో" అనియు,'శసాదౌసే' అనుచో 'శసాదౌ రే' అనియు నధర్వణప్రయుక్తము లయియుండునని తోఁచి యట్లు సవరించితిని. గాణపతవివరణకర్త యట్లుచేయక వుడాగమమును వేఱుగ సూత్రిం

---

విస్తర. ౨౧౪ విష:—"సర్వనామంబులకు మహద్బహువచనమునం దఱచుగ లు ల లకు రు ర లగు" (ప్రౌఢ. శబ్ద. ౮౬.) "రు ర వర్ణకంబులు పరంబులగునపుడు కొన్నిటికి నిత్యముగాను గొన్నిటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబు పూర్వాగమంబగు" (ప్రౌఢ. శబ్ద. ౯౩ సూ.) "బిందుపూర్వకడకారంబు పరంబగుచోఁ దుది యిత్వోత్వంబుల కత్వంబగు" (ప్రౌఢ. శబ్ద. ౯౪ సూ.) పెక్కు+రు = పెక్కు+ండ్+రు = పెక్క+ండ్+రు = పెక్కండ్రు. బిందుపూర్వకడకారము రాని పక్షమున 'పెక్కురు' అనియె నిల్చును. "పలుశబ్దంబునకు రు ర లు పరంబులగునపుడు 'గు' వర్ణంబును వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాషనగు" (ప్రౌఢ. శబ్ద. ౯౬.) పలుగురు - పలుగుండ్రు. ప్రౌఢ - శబ్ద - ౯౦ సూత్రములోని "తఱచుగన్" అనుదానిచేత 'ఇరుగురన్' అనుదానియందువలెనె ఇత్వము రాదు. ఉ. పలుగురన్ - పెక్కురన్.

చెను. (గాణ. అచ్చి. ౧౭౮ సూ.) కవిజనమండనకర్త "తదిదమోర్వాట్" అను వైకృతచంద్రికాసూత్రముచే వకారాగమము నసంగతముగఁ గల్పించెను. (ఎప్పటి వైకృతచంద్రిక ? ఎప్పటికారికావళి ?) తదాదిశబ్దే = ఆ ఈ ఏ శబ్దములందు, వః = వకారము పూర్వాగమమగును. డుజాదిస్తుభవేత్ = డుజ్ - ని-మున్నగునవి రామాదిశబ్దములకువలెనె వచ్చును. ఉత్=మహాత్తోఽత ఉ ద్విభక్తా వితిసూత్రముచే వచ్చు 'ఉ'కారాదేశము, నచ=కానేరదు. ఉదా:—వ్+ఆ+డుజ్=వాఁడు, వ్+ఈ+డుజ్ = వీఁడు, వ్+ఏ+డుజ్ = వేఁడు. 'వా' మున్నగుచోట్ల "నచదేశ్యపదే" అనుచొప్పున హ్రస్వము రాదు. ఉత్త్వనిషేధము "అతఁడు-ఇతఁడు" మున్నగుచోట్లకని యెఱుంగునది. వానిన్ - వానిచేతన్ - వారు. వీనిన్ - వీనిచేతన్ - వీరు. వేనిన్ - వేనిచేతన్ - వేరు మున్నగురీతి నంతటను వీనికి వకారపూర్వాగమమును గ్రహింపవలెను.

లు ల యో స్తథాపుంసీ త్యాదికిని, తయోశ్శసాదావిత్యాదికిని ౧౯౨ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. "కేషాంచిద్ర్వస్తే త్యాదికి ౧౯౩ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. అత్ర = ఈ తదాదిశబ్దములసందర్భమున జసఃస్థానే = ప్రథమాబహువచన లు ప్రత్యయముచోట, రుః స్యాత్ = రువర్ణక మాదేశమగును. క్వచిత్ = అరుదుగా, లులే=లు ల పరకత్వమున, అత్వం భవేత్=రువర్ణాగమమును రువర్ణముయొక్క 'ఉ' కారమునకు, 'అ' త్వాదేశమునగును. 'లులే' అనెడి లవర్ణ పరకత్వమునందలి 'అ'త్వవిధాన సామర్థ్యముచే ద్వితీయాది బహువచనములందును లవర్ణమునకుఁ బూర్వముస రువర్ణము నిల్చుటయు దానియుత్వమున కత్వ మగుటయు సంభవించునని యెఱుంగునది. "లు ల యో। స్తథా పుంసి రు రౌ స్మృతౌ" అనుచొప్పుననే లుప్రత్యయస్థానమున రువర్ణమాదేశ మగుచుండఁగాఁ బైనివ్రాసిన విశేషవిషయములను విధించుటకే "జసః స్థానే రు ర త్రే"తి కారిక మరల వచింపఁబడెనని యెఱుంగునది. ఉదా:—లు ల యో। స్తథాపుంసీతి సూత్రముచేత లు ల లచో రు ర లు రాఁగా 'వారు-వీరు-వేరు'=(ఎవ్వారు)అని యేర్పడును పిదప తయోశ్శసాదావిత్యాది సూత్రముచే 'ఇ'త్వము రాఁగా వారిన్ - వీరిన్ - వేరిన్ - వారిచేన్-వీరిచేన్-వేరిచేన్. మె. 'గారు' శబ్దము వారు శబ్దపరిణామమె. మామగారిన్-అత్తగారిన్. మె. కేషాంచిదిత్యాదిసూత్రముచే బిందుపూర్వక డువర్ణాగమము నుల్లోపమును బాక్షికముగ రాఁగా వాండురు - వాండ్రు - వాండురన్ - వాండ్రన్ - వాండురచేన్ - వాండ్రచేన్ - వీండురు - వీండ్రు - వీండురన్ - వీండ్రన్ - వీండ్రచేన్. మె. జసఃస్థానే రు ర త్రేత్యాదికారికచే వారలు - వీరలు -

వారలన్ - వీరలన్ - వారలచేన్ - వీరలచేన్ మున్నగునవి సిద్ధించును (విస్తర I)
'మీారలు' అను రూపమును ప్రయోగదృష్టమైయున్నది.

సంబుద్ధౌ క్వచిదర్థః స్యాత్ పదం బహువిలక్షణః (విక్ర. సంధి.
కన్నడసూ. ౨౬ కారి. అహో. ౨౩౪-౫౭౬ పు.)

౨౧౫ విషయము. అద్విత్వంచ భవే ద్విత్వం క్వచి ద్ధ్రస్వశ్చ శేషచిన్
(విక్ర. అజం. ౩౭ కా. అహో. ౩౧౦ పు.)

కల్ప. ౨౧౫ విష:—సంబుద్ధౌక్వచిదిత్యాదికారిక వ్యాఖ్యాతము-(౯౩ విష.). తచ్ఛబ్దార్థకమగు 'ఆ' అనువాచ్ఛికశబ్దము విశేషణములకు విశేష్యసాపేక్షనమాత్రార్థమున నప్రయుక్తమగుట యాంధ్రభాషాసంప్రదాయము. ఈవిషయమును "వానసంబోధనాదికే" అను నథర్వణసూత్రమును "శబ్దాత్తచ్ఛబ్దాతః" అను చింతామణిసూత్రమును వ్యక్తపఱుచుచున్నవి. చదివినది - చేయునది - చేసెడిది - చిన్నది - పెద్దది - తెల్లది - చిన్నదాన - పెద్దదానవు ఇట్టిచోటులందలి తచ్ఛబ్ద మూయావిశేషణములకు విభక్తియోగ యోగ్యత

---

విస్తర. I ౨౧౫ విష:—సూరి యిట్టి తదాదిశబ్దరూపసాధనప్రక్రియను జూపక తదాదిశబ్దపు సిద్ధరూపములను నిపాతరూపమునఁ జూపఁగాఁ బ్రిలింగలక్షణశేషమున నీయథర్వణప్రక్రియ సంగ్రహింపఁబడెను:—"ఆ-ఈ శబ్దములకును ఏ శబ్దమునకును మహదర్థంబున నన్నివిభక్తులయందును వకారంబు నిత్యముగాను వైకల్పికముగాను, అమహదర్థంబునం బ్రథమేతరవిభక్తులయందు వచనద్వయంబున గ్రమంబున దకార వకారంబులు నిత్యముగాను బూర్వాగమంబులగు" (ప్రౌఢ. శబ్ద. ౫౩ సూ.) "సర్వనామంబులకు మహదర్థంబునం దఱుచుగ లు ల లకు రు ర లగు" (ప్రౌఢ. శబ్ద. ౭౬ సూ.) "ద్వితీయాదులం దసంయుక్త రవర్ణంబు నత్వంబున కిత్వంబు తఱుచుగ నగు" (ప్రౌఢ. శబ్ద. ౯౦ సూ.) "రువర్ణంబులు పరంబులగునపుడు కొన్నిటికి నిత్యముగాను (౯౩ విష.) గొన్నిటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబు పూర్వాగమంబగు" (ప్రౌఢ. శబ్ద. ౯౩ సూ.) "దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్యర్థకబహువచనాంతనామంబులపై మరల బహువచనప్రత్యయంబులు చూపట్టెడు. అచ్చో వారు - వీరు - మీారు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు" (ప్రౌఢ శబ్ద. ౮౭ సూ.) (ఈసూత్రము చాలవఱకుఁ బ్రయోగవిరుద్ధమని నిరసింపఁబడినది. (౨౦౪ విష. దీని విస్తర III ౨౦౪ విష.) ముందు వివరింపఁబోవు తదాదుల "అమహత్" ప్రక్రియకూడ నిటఁ గొంత సంగ్రహింపఁబడినది. (విస్తర II ౨౧౫ విష.)

ననఁగా విశేషతనుమాత్రమె యాకలించుచున్నదిగదా. అట్లె ప్రయోగ ప్రసిద్ధినిబట్టి 'ఆ'శబ్దము త్రికసర్వనామవిశేషణముల కనుప్రయుక్తమగుటయు నందు ముఖ్యముగా 'ఏ' అను యత్కిమర్థకమున కనుప్రయుక్తమగుటయు నంగీకరింపవలసి యున్నది. ఉదా:—ఆయది = అది - ఆవానిన్ = దానన్, ఈయది = ఇది - ఈదానిన్ = దీనిన్; ఏయది = ఏది - ఎద్దానిన్ = దేనిన్. ఇట్లు మూఁడిటియందును నమహత్త్వమున వెలసియున్న యీపద్ధతి మహత్త్వమునందు సైతము 'ఏ' శబ్దమునకుఁ బ్రసిద్ధమైయున్నది. ఏవాఁడు = వేఁడు - ఏవానిన్ = వేనిన్. మొ.

అద్విత్వమిత్యాది:—ఈకారిక ౨౨ I విషయమున వ్యాఖ్యాతము. దానినిట వేఱువిధమగు సూత్రముగ నావృత్తిచేసికొనవలయును. అద్విత్వంచ = ద్విత్వము లేనిదియు, ద్విత్వమ్ = ద్విత్వమునుబొందును. అట్టియెడల, దీర్ఘశ్చ = ముందటి దీర్ఘముసయితము, హ్రస్వః=హ్రస్వము, కుత్రచిత్ = కొన్నియెడల, భవేత్ =అగును. చకారముచే ద్విత్వపూర్వము కానిదానికిని నొకప్పుడు హ్రస్వము కల్గుట గలదని వ్యాఖ్యచేసికొనవలయును. ఉదా:—ఆ+ది = అద్ది, ఈ+ది=ఇద్ది - ఏ+ది = ఎద్ది. ఏ+వాఁడు=ఎవ్వాఁడు. 'ఏవాఁడు-ఏవానిన్' మున్నగువానికిఁ గవి వ్యవహారముకలదు. "ఆది-ఈది" అనువానికిఁ గవి వ్యవహారము లేదు. 'ఏది' అనుదానికిఁ గవి వ్యవహారము గలదు. "ఎవ్వాఁడు" అనుదానిలోని 'వ్వా' అనుదానిదీర్ఘము ద్విత్వపరకము కాకున్నను పైనివ్రాసినరీతిని సూత్రములోని చకారమహిమచే హ్రస్వమై వెలయుచున్నదని యెఱుంగునది. ఉదా:—ఎవ్వఁడు. పైనుదాహరించిన యన్నిటిలోని ద్విత్వములలోను నొకవల్లు "అన్యత్రాఽపి భవేదైక్య"మ్మను (౨౧౦IV విష.) సూత్రము చొప్పున వైకల్పికముగ లోపింపఁగా "అది - ఇది - ఎది - ఎవఁడు" మున్నగు కవి ప్రయోగప్రసిద్ధరూపములు సిద్ధించుచున్నవి. ఈరీతినె "ఎవాఁడు" అని గ్రహింప వచ్చునా యని శంకింపరాదు. అట్టిది కవిప్రయోగసమ్మతముకాదు. ఇట్లె "క్వచిద స్త్యస్య చాద్యస్య" (౨౧౦ VI విష.) అను కారికచొప్పున 'వేఁడు' వేనిన్ వేరు మున్నగువానియందు నాద్యక్షరలోపము గల్గఁగా "ఏఁడు - ఏనిన్ - ఏరు" అను ప్రయోగదృష్టరూపములు సిద్ధించుచున్నవి. "ఆయది - ఈయది - ఏయది - ఏవాఁడు - ఆవానిని-ఈదానిని - ఏవానిని" మున్నగుచోటులందు "ఇద మద నేత ద్యత్త చ్ఛబ్దాదిత్యాది (ఆం. చిం. హలం. ౯ కా.) చింతామణికారికచొప్పుననే "అయ్యది-ఇయ్యది - ఎయ్యది - ఎవ్వాఁడు - అద్దానిన్ - ఇద్దానిన్ - ఎద్దానిన్" మున్నగు రూపములు సిద్ధించును. (విస్తర II)

---

విస్తర II ౨౧౫ విష:—సయి యథర్వణప్రదర్శితప్రక్రియను సూరి యుపే

నలఁ జూచి కేశవుఁడు వచ్చిన కార్యము సెప్పఁ డన్న నాకౌరవనాథుఁ డిట్లనియె... (ఉద్యో. ౧ ఆ. ౬౯.) "గోవాళ్ళు - (ళులు) వి - బ - (గోవ+వారలు శ-ర.) ౧ యాదవసంతుఁడు.........క. తిమిరంపువయసు గుబ్బల। కొమరాలవు నీకుఁ దగిన గోవాళ్ళ మహిన్। నెమకికొనరాదె (మనుచ. ౪ ఆ. ౮౩.) మ.........ఎలుకు గోవాళుల్ ప్రసూనాశుగ। (కాళ. ౩ ఆ. ౧౧.)" (సూ. రా. ని.) వ్యావహారికమగు "గోవాళ్ళు" అనుశబ్దమునకు గ్రాంథికతావస్థకల్గె నని నేఁటి విమర్శకు లభిప్రాయపడుచున్నారు. కాని పైప్రయోగములలో "గోవాండ్రమహిన్ నెమకికొనరాదె" అనియు "ఎలుకు గోవారల్" అనియుఁ గవిప్రయుక్తపాఠము లేమో యని యాలోచింపవలసియున్నది. యతిప్రాసాదిస్థలనిబద్ధప్రయోగములందు 'ళ్ళు' అనురూపము కన్పట్టలేదు. (విస్తర. III)

---

విస్తర. III ౨౧౫:—పైరీతిప్రయోగములకు మూలముగఁ బైయథర్వణకారికలు వచింపఁబడియుండఁగా వాని నోపికతో సరిపెట్టికొనక యహోబలపండితాదులు వివిధములగు నపపాఠములను నపవ్యాఖ్యలను వాని కొనరించిరి:—"జసి చాత్ర భవేదేని। రిత్యాహ మృదుభాషణః.........ఎయ్యేనియున్.........ఇత్యాదావపావ్యద్యర్థక ఏనిశబ్దః.........మృదుభాషణీయం రూపంతు న ప్రసిద్ధమ్..." (అహో. ౩౧౧ పు.) "జసి చాత్ర భవేదేసిః" అనుపాఠ మాథర్వణ మని తలంపక (౨౦౪ విష.) 'అపిశబ్దార్థకమగు నేని శబ్దమును మృదుభాషణపండితుఁడు వచించె ననియు "ఏమది" అనురీతిని "ఎయ్యేని" అనురూప మథర్వణసమ్మతమనియు నది ప్రసిద్ధముకాదనియు నహోబలపతి వ్రాసెను. ఈసందర్భము సాధారణముగా నర్థము కానిదిగాన నిటఁ దప్పులు తిప్పలుగఁ బడినవి. (నారా. గాణ. ఆచ్చి. ౨౬ ప. ౨౫౯ కా. పైరీతినె యున్నవి.)

"అద్విత్వం చ భవేద్ద్విత్వం। దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్.........ఏతత్సూత్రే నైవ అందోలు - ఒక్కోఁడు - ఒక్కఁడు ఇత్యత్ర ఓకారస్య హ్రస్వదీర్ఘౌ చోటు ఇత్యత్ర హ్రస్వోపి........." (అహో. ౩౧౦.) ఇచటి యీకవి శిరోభూషణ పంక్తులతాత్పర్యము బోధపడకున్నది. 'అందోలు - ఒక్కోఁడు' అనువానికి మూలరూపములు, 'అందోలు - ఒకోఁడు' అనునవి యని తలంచెనేమో? "అద్విత్వంచ భవేద్ద్విత్వమ్.........ఏతత్సూత్రే నైవ......గయ్యాళి = గయాళి, ఒయ్యారి = ఒయారి, నూవు = నువ్వు = నువు, పూవు = పువ్వు = పువు, నవ్వు = నవు, దవ్వు = ధవు ఇత్యాదీని రూపాణి సామఞ్జస్యం లభన్తే." (అహో. ౩౧౦ పు.) పైవానిలోని ద్విత్వమ్ములో నొకవాల్లు లోపించుట "అన్యత్రాపి భవేదైక్యమ్.........." (౨౧౦

౧౪ విష.) అనుసూత్రముచే సిద్ధించుచుండఁగా నిటఁ బునర్విధాన మేల? నారాయణీయ గాణపత వివరణములును నియమహోపలక్షితమునే యనుసరించినవి.(ప్రకీర్ణ. ౪౨౧ కా. ౨ ప)-"నిత్యం లులా పరా స్యాతాం మల్లోపో బహుతా దుడామ్. వాండ్రు - పేండ్రు - అల్లుండ్రు - గండండ్రు ఇత్యాది." (అహో. ౩౭౯ పు.) నిత్యం లు లా విత్యాదికారిక పరిలతోడి రూపాంతరములు లేని "విలుకాండ్రు" మున్నగు నిత్యస్థలములందు వర్తిల్లఁదగును. (౧౯౩ విష. కల్ప.) కాని "వాడు-వారలు-వాండురు-వాండ్రు - పేరు - పేరలు-పేండురు-పేండ్రు." మున్నగు పాక్షికస్థలములందు వర్తించునది కాదు. కట్టి వాని రూపసిద్ధికి "కేషాంచిద్ ర్వ్యస్తశబ్దానాం తథేత్యాదికారిక(౧౯౩ విష. కల్ప.) మూలమై యున్నవి. నిత్యం లు లా విత్యాదికారికచేఁ గవిజనమండనమున "అండ్రు. జవరాండ్రు, కోడండ్రు - చెల్లెండ్రు" అను రూపములు పొరపాటుగా సాధింపఁబడినవి. ఈయాల్వాదులు "నిత్యం వారాదేశ్చ స్యాల్లోప్లలయోరా పరౌచ తత్ర స్తః." (ఆం.చిం.అజం.౧౮ కారి.)అనుచింతామణిచే సాధింపఁబడుచుండఁగాఁ బైయథర్వణకారికచే సాధించుట కేవలము పొరపాటు. "కేషాంచిద్ర్వ్యస్త శబ్దానామ్మను" నథర్వణకారికను (౧౯౩ విష. కల్ప.) "కేషాంచిద్వ్యస్తశబ్దానామ్మని" మార్చి "ఉ+అ = వ+అ న్త = వాన్త" అని వ్యాఖ్యచేసి కవిజనమండనకర్త యక్కారిక "ఎల్ల" మున్నగు నదంతములచోటను, "పెక్కు" మున్నగు నుదంతములచోటను మాత్రము వర్తించునని సాహసముగను బ్రామాదికముగను వ్యాఖ్యచేసెను.

"ఏకత్వేచ బహుత్వేచ।సంబన్ధే ది వి వర్ణకౌ।తయో శ్చసాదౌనేమాత్రే।ఉవతోః ప్రాయశోఽత్రఇత్. వారిది - వారివి - వారిన్ - పేరిన్ - వారిచేతన్ - ఆలిన్ - ఆలిచేత నిత్యాది-వారిమాత్రము - వారిగుణములు - అతిస్తు - అక్కడివారు - ఇక్కడివారు - తోడివారు........ప్రాయోగ్రహణాత్ తోడఁబుట్టువు ఇత్యాదౌ న." (అహో. ౩౧౦ పు.) ఇక్క విశిరోభూషణవ్యాఖ్య పెక్కులి ప్రామాదికముగ నున్నది. "దిస్యాష్ఠ్యర్థే త్సంబన్ధార్థే"(ఆం.చిం.హలం.౧౦ కారి.)అనుదానికి "ఏకత్వేచ బహుత్వేచ। సంబన్ధేది వి వర్ణకౌ" అనుపూర్వార్థము వివరణము. ఏకత్వమున 'ది' ప్రత్యయమును జింతామణి చెప్పఁగా బహుత్వమున వి వచ్చునని వికృతివివేకము వివరించుచున్నది.ఇవి శేషషష్ఠ్యర్థమున వచ్చునవగుటం జేసి ద్వితీయాదితరవిభక్తులందువలెనే యీషష్ఠియందును 'ఇత్వము' వచ్చునుగాన "తయోః" అను దానికి దివులను నర్థ మథర్వణాభిప్రేతమై యుండదు. 'వారియొక్క' అనురూపము వారిన్-వారిచేతన్. మున్నగు వానివలెనే సిద్ధించునుగాన "దివివర్ణపరకత్వమున వేఱుగ 'ఇ' త్వవిధానమునా

దశ్యస్తా త్తదాదిశబ్దాత్ స్యా : ద్బహుత్వేతు వివర్జకః ।
డా-సి ర్ధిని ర్వేని రమి । వాన్యాది శ్శస ఉచ్యతే । న స్త్రి
యాః; మత్తు టాకో్యశ్చ । దాన స్సంబోధనాదికే ।

నన్నసూ. (వికృ. అజం. 3౭-3౮ కా. అహో. 3౧౧ పు.)

౬౧౫ I విషయము. అద్విత్వంచ భవేద్ద్విత్వం । దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్.
(వికృ. అజం. 3౭ కా. అహో. 3౧౦ పు.)
సంబన్ధే క్వచిదర్థః స్యా।ద సంబన్ధే విలక్షణః.(వికృ.సంధి.
౨౬ కా. అహో. ౨౨౮-3౮౬ పు.)

---

వశ్యకము. కావుననే తయోరిత్యాద్యుత్తరార్థము "ఏకత్వేచ బహుత్వే చేత్యాదికారికతో సంబంధించునది కాదనియు నయ్యది "ఏకత్వేచ భవే ద్వారః" అనుదానితో సంబంధించునదనియు నేను సమన్వయించియున్నాను. (౧౯౨ విష.). ఇట్లే 'వారిమాత్రము - వారిగుణములు' అనుచోట సైతము షష్ఠీ విభక్తిరూపముచేతనే "ఇ"త్వము సిద్ధించునుగాన, మాత్రశబ్దపరకత్వముననుసమాసమందును 'ఇ'త్వవిధాన మనావశ్యకముగాన 'సేమాత్రే' అనునది యథర్వణప్రయు క్తము కానేరదు. మఱియు "వారిన్ - వారిచేతన్ - వీరిన్" మున్నగుచోట్ల "ఉ"కారమేలేదు. ఇవి 'ఉ'కారమున కిత్వమువచ్చు నుదాహృతు లెట్లగునని యహో బలపతి తలంచెనో? తెలియకున్నది. 'వారు - వీరు' అను ప్రథమాబహువచనముల పయిని శస్ ప్రభృతులుగాని 'అమ్' ప్రభృతులుగాని (విభక్తిప్రత్యయములు) నిలువ నేరవుగదా. "వ్+అ=వా+లస్=వా+రన్" అనుచోటి 'ర' అనుదానిమీఁది 'అ'కార మికార మగుచున్నది గదా. "అతస్తు-అక్కడివారు ఇక్కడివారు తోడివారు" అని యుదాహరించెనే! త్రికసమాసకలిత కడ శబ్ద మాపవిభక్తిక మగుటంజేసి "అక్కడి వారు-ఇక్కడివారు"అనునవి సిద్ధించుచుండఁగా నీయసంగతవిధానమేల?'తోడివారు' అనుచో బా. సంధి. ౭3 సూత్రముచే "ఇ"త్వము వచ్చును. ఇట్టివానికై " తయో శ్శసాదౌ" అని కవిశిరోభూషణపాఠమై యుండఁగాఁ గవిజనమండన నారాయ ణీయాదులలో "అమాదౌ" అని సవరింపఁబడెను. కవిజనమండననారాయణీయ గాణ పతవివరణము లీసవరణమునుమాత్రము చేసికొని పైయహోబలపండితీయపద్ధతినే యనుసరించెను. గాణపతవివరణకర్త కొంత వివేకించి యీకారికయర్థము వ్యర్థమని తలఁచి యిది స్పష్టార్థమని వివరించెను. కవిశిరోభూషణసమన్వయ మిట్లు వ్యర్థత నాపాదించునదియు నసంగతిని ఘటించునదియు నగుటచే గ్రాహ్యము కాదయ్యెను.

కల్ప. ౨౧౨ I విష:—ద్యస్తాత్ - తదాదిశబ్దాత్ = 'అది - ఇది - ఏది' అను దివర్ణాన్తములగు 'ఆ-ఈ-ఏ' అనుశబ్దములకంటెఁ బరముగా, బహుత్వేతు = ప్రథమా బహువచనమందు, వివర్ణకస్స్యాత్ = వివర్ణకము కును. ఇట్టు సూత్రపుస్వారస్యము చేతనే తదాదిశబ్దములకుఁ బ్రథమైకవచనమందు దిప్రత్యయము విధింపఁబడుచున్న దనునర్థము లభించుచున్నది. అమి = ద్వితీయైకవచనము పరముగుచుండఁగా దదా దులకనఁగా 'ఆ-ఈ-ఏ' శబ్దములకు వరుసగా, దానిః - దీనిః - దేనిః - 'దాని - దీని- దేని' అనునవి యాదేశము లగుచున్నవి. 'అమి' అనునది తృతీయాద్యేకవచనముల కును నుపలక్షణమగుచున్నది. శసి = ద్వితీయాబహువచనమున కనఁగా (శస్) లప్రత్యయాంతములగు 'ఆ-ఈ-ఏ' శబ్దములకు, (నన్నయాథర్వణీయమున 'లస్' ద్వితీయాబహువచనప్రత్యయము.) వాన్యాదిః = వరుసగా 'వాని - వీని - వేని' అనునవి యాదేశములగును. ఇందలి 'శసి' అనునది తృతీయాదిబహువచనములం దాగమముగావచ్చు లకారముతోఁగూడిన "ఆ-ఈ-ఏ" శబ్దములకును నుపలక్షణమగుచున్నది. ఉదా:—అది - అవి, దానిన్ - వానిన్, దానిచేతన్ - వానిచేతన్; ఇది ఇవి, దీనిన్ - వీనిన్, దీనిచేతన్ - వీనిచేతన్; ఏది - ఏవి, దేనిన్ - వేనిన్ - దేనిచేతన్ - వేనిచేతన్. మొ. 'ఆ+ది' అనునపుడు "అద్విత్వంచ భవేద్విత్వే" మిత్యాది కారికచే 'అద్ది' అగును. ఇట్లే 'ఈ+ది = ఇద్ది - ఏ+ది = ఎద్ది'అనియు నగును. "అన్యత్రాపి భవేదైక్య మిత్యాదికారికచే (౨౧౦ IV విష.) ద్విత్వములోని యొకహల్లు లోపింపఁగా 'అది - ఇది - ఎది' అనునవి యేర్పడును. 'ఆ-ఈ-ఏ' అనువిశేషణములకు విధేయతావివక్షచే ననఁగా విభక్తివివక్షచే 'అది' శబ్దముచేరఁగా 'ఆయది - ఈయది - ఏయది' అనురూపములును, వానికి "ఇద యద నేతదిత్యాది" చింతామణి చొప్పునఁ ద్రికసంధిజరుగఁగా "అయ్యది - ఇయ్యది - ఎయ్యది" అనురూపములును సిద్ధించును. 'ఏ+అది' అనుచోట "శబ్దాత్తచ్ఛబ్దాతః" అనుచింతామణిసూత్రము చొప్పునఁ దచ్ఛబ్దాకారలోపము రాఁగా 'ఏది' అనురూపము సిద్ధించును. దీనిచొప్పున లభింపవలసిన 'ఆది - ఈది' అనురూపములకుఁ బ్రయోగము లేనందున నట్టివి సాధింపరాదు. ఇట్లె ప్రథమాబహువచన 'వి' ప్రత్యయపరకత్వమునందును బ్రక్రియ నడపఁగా "అవ్వి - అవి - ఆయవి - అయ్యవి, ఇవ్వి - ఇవి - ఈయవి - ఇయ్యవి ఎవ్వి - ఎవి - ఏయవి - ఎయ్యవి - ఏవి." అనురూపములును లభించును. ద్వితీయాదులందును నేకత్వమున "దానిని-ఆదానిని - అద్దానిని - దీనిని - ఈదానిని - ఇద్దానిని - దేనిని - ఏదానిని - ఎద్దానిని" అనురూపములు సిద్ధించును. బహుత్వమునందును "వేనిని - ఏవానిని - ఎవ్వానిని" అనురూపములు గల్గును. ఇట్లు బహు

త్వమున "ఈవానిని - ఇవ్వానిని - ఆవానిని - అవ్వానిని" అని 'ఆ-ఈ' అనువిశేషణములకును విధేయతావివక్షయందు రూపములు గల్గవచ్చునుగాని సూరి యేలకో వీని నుదాహరింపలేదు. ఇట్లె మహత్త్వమునందును "అవ్వాఁడు - అవ్వారు - ఇవ్వీఁడు - ఇవ్వీరు" మున్నగువానిని సయితము ప్రయోగాభావముచేఁ గాఁబలయు నుదాహరింపలేదు.

నస్త్రియామిత్యాదిః—'బహుత్వేతు వివర్ణకః - వాన్యాది శ్శసితూచ్యతే' అను రెండువిషయములును, స్త్రియామ్ = స్త్రీవాచకత్వమందు, న = సిద్ధింపవు. పరిశిష్టన్యాయమున మహద్వాచక కార్యములగు 'రు' ప్రభృతులె యగునని యర్థము. ఈసూత్రమునకు లక్షణాశక్తిమహిమచే మహత్త్వార్థకతదాదిశబ్దములకు (సంఖ్యావాచకములకును నని యాదిశబ్దార్థము నెన్నునది.) బహుత్వమున నమహత్కార్యములు రావనియు మహత్కార్యములె వచ్చుననియు నర్థము చేయనగునని వ్యాఖ్యానము చేసికొనవలెను. కాన 'అది సీత' అనునట్లు 'అవి సీతలు' అనరాదు. 'వారు సీతలు' అనవలెను. అట్లే వారిన్ - వారిచేతన్ - వీరి - వీరిచేతన్ - ఎవరు - ఎవరిన్ - ఎవరిచేతన్ - అందఱు - అందఱన్ - అందఱిన్. మున్నగునవెల్ల మహత్త్వార్థకములు సయిత మగుచున్నవని గ్రహింపవలెను.

అత్తు టాఙ్యోశ్చేత్యాది - టాఙ్యోశ్చ = తృతీయాసప్తమ్యేకవచనములందు చకారముచేఁ దృతీయాసప్తమీబహువచనములందును, అత్తు=అత్వ మీతవాదిశబ్దములకుఁ గల్గును. ఉదా:—దానన్ = దానిచేతను - వానన్ - వానిచేతను. మొ. కాకాక్షిన్యాయమున నస్త్రియామ్మనుసూత్ర ముత్తరసూత్రమగు "అత్తు టాఙ్యోశ్చ" అనుసూత్రమునందును నన్వయించుచున్నది. అనగా స్త్రీవాచకములకీవిధి వర్తింపదనుట. 'దానన్ = ఆస్త్రీయందు, దీనన్ = ఈస్త్రీయందు' అని ప్రయోగింపరాదని తాత్పర్యము. ఉదా:—దానన్ = దానిచేత దానియందు, వానన్ = వానిచేత వానియందు, దీనన్ = దీనిచేత దీనియందు, వీనన్ = వీనిచేత, వీనియందు, దేనన్ = దేనిచేత, దేనియందు, వేనన్ = వేనిచేత, వేనియందు. మొ. ఔపవిభక్తికములకుఁ దృతీయాసప్తమ్యేకవచనములం దిట్టి యత్త్వము వచ్చును. దానినిబట్టి యివి యౌపవిభక్తికరూపములని భ్రమింపరాదు. ఔపవిభక్తికాత్త్వము బహుత్వమునరాదు. వీనికి 'ఇ-టి-తి' వర్ణములలో నెద్దియు రాదు. ఇట్లివి యౌపవిభక్తికములు కాకుండుటచేతనే వీనియత్త్వము ప్రత్యేకముగా నుపదేశింపఁబడెనని యెఱుంగునది.

'దానస్సంబోధనాదికే' అనుదానివ్యాఖ్య:—సంబోధనాదికే=స్త్రీసంబోధనాది స్థలములందు ఏకత్వమున, దానః = దానశబ్దము విశేషణములతుదిని నిల్చును.

ఉదా:—ఓచిన్నవాఁ = ఓచిన్నవమచా? ఇక్కడ "అష్టమ్యాష్ష్యా చాద్యా దేకత్వ" ఇత్యాదివిధింతాముకేచో ప్వన యుష్మదస్మద్విశేషణములందును వానశబ్దము నిల్చునని యూవిశబ్దము చేత గ్రహింపవలయును. నీవు చిన్నవాఁడవు - నేను చిన్నవాఁడను. క. దమయంతి యవఃగఁ బరఁగినవాఁడవ్. (ఆర. ౨ ఆ. ౯౯ ప.) మొ. ఇత్త్రివిధులచేతను 'శబ్దాత్తచ్ఛబ్దాత్' అనువిధిచేతను విశేషణములకునిని విధేయశాబ్దిక్రియాపదంబుచ్ఛబ్దము నిల్చునను నన్నయాభట్టాంబుల యాశయము వ్యక్తమగుచున్నది. చదివినవాని-చదివినవానిని, తెల్లని - తెల్లవానిని. మొ. ఉ.........కలానవిశాలిక కోకళాకర్మునన నున్నవాని. (సభా. ౨ ఆ. ౨౬౭.) క. అడవులు నేలలు నవి నీ వడపిన యవి యొట్లు. (ఆది. ౩ ఆ. ౪౧.) సీ. కమనీయధర్మార్థకామమోక్షములకు, నత్యంతసాధనంబైనవాని......చ.........భారతవీరులవస్తుజానుకీర్తనముల నొప్పువాని విదితం బగువాని పథాంతరంబులన్. శా.........వేదాంతవిద్యాయుక్తం బగువానిఁ జెప్పఁదొడఁగెన్ వ్యాసకథాఖ్యానమున్. (ఆది. ౩ ఆ. ౯-౧౦-౧౧.) నన్నయ యిట్టి విధేయవిశేషణములను నింకను పెక్కిఁటి చిత్రముగ వాడుచుండును. "అయ్యుదంకుండు గురుహితకార్యానుబంధుండయి గురుపత్నినియోగంబునం బౌష్యుం డను రాజు దేవికుండలంబులం బ్రతిగ్రహించి తేరంబూని వనంబులో నొక్కయెడ చనువాఁ డెనుక.........ఒక్కదివ్యపురుషుం గని......" (ఆది. ౧ ఆ. ౯౪ ప.) వాక్యమధ్యమునఁ గర్త విధేయవిశేషణరూపమున నిల్పఁబడెను.

ప్రయోగములు:—ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పేరెయ్యది.........(విరా. ౧ ఆ. ౧౯౦.) క. ఏయది హృద్యము పూర్వంబేయది యొద్దాని వినిన నెఱుకసమగ్రంబై యుండు. (ఆది. ౧ ఆ. ౩౦ ప.) నిన్నెద్ది గఱపిరి. (ఆది. ౮ ఆ. ౪౩ ప.) క. పెద్దలు హీనతఁబొందిరి......నియమం బెద్ది విధియోగమునను (సభా. ౨ ఆ. ౧౪౧.) ఉ. ఇమ్ముగ సర్వలోకజను లెవ్వని యేని (ఆది. ౧ ఆ. ౭౭.) క. ఇం దేవాఁడు మగండు (విరా. ౨ ఆ. ౨౯౬.) మ... అ త్తరుణీశీల తదుత్ర మేటికి నసాధ్యంబౌట (ఆము.౪ఆ. ౩౦.) గీ. ఏనాజ్ఞ నింద్రియ ప్రతతి నడచునట్టి భీమేశ్వరుఁడు. (భీమ. ౪ ఆ. ౮౩ సూ. రా. ని. ఏని = ఎవ్వని) క. తరుణీ యేరికిఁ జెల్లునె. (కళా. ౧ ఆ. ౭౨ ప.) చ. ఇది మునికన్యయేని...... దానిది కలదా పెఱుంగ (ఆది. ౪ ఆ. ౩౦.) క. కనియెను సురకన్యవోని కన్నియ నంతన్. ఉ. దానిశరీరసౌరభము దానివిలోలవిలోకనంబులున్ । దానిమనోహరాకృతియు దానిశుచిస్మితవక్త్రకాంతులున్। దానివిలాసముల్ (ఆది.౪ఆ. ౧౭౧-౧౭౨.) తే.గీ. అనిన నలుగాలివాన గోవురు...మనుజుల విప్పుఁ డిందు సమధికత్వ। భాజనము

లం‌డ్రు. (శాంతి. ౧ఆ. ౭౧ ప.) (నలుగాలివానన్=నాలుగుకాళ్ళుగలపశువులలో.) చ...వానఁబడ కాత్మరతిన్ నిలు పిచ్చు మోక్షమున్. (శాంతి.౪ ఆ.3౫౪.) (వానన్=వానియందు) క. వీనం బరసేవ్య మెద్ది వినఁగా వలతున్.(అను. ౪ ఆ.౨౭౭ప.) క.........ఆతపంబు దూఱదు దీనన్. (అర. ౨ ఆ. ౧౦౭.) ఉ. ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసినదానఁ దత్కులం।బెల్లను.........(ఆది. ౧ ఆ. ౧౨౬.) క.........దానవిచిత్రా।తను రాగ ప్రోషివచ్చి తనుఁ బైకొనఁగాన్. (రాఘ. ౨ ఆ. ౪౧.) (దానన్+విచిత్రాతనురాగ-రామాయ) (దానవి+చిత్రాతనురాగ - భారతా) క. కాననము గిరులు నదులును।.........।వానను ధర్మములు సేయవచ్చు నిజేచ్ఛన్. (అను. ౨ ఆ. 3౯౫ ప.) (విస్తర)

---

విస్తర ౨౧౫ I విష:—పైరూపసాధనప్రక్రియను "దానన్-దీనన్ - దేనన్. వానన్ - వీనన్ - వేనన్" అనురూపములను సూరి యుపేక్షింపఁగాఁ ద్రిలింగలక్షణ శేషకర్త సంగ్రహించికొనెను. "ద్వితీయైకవచనబహువచనంబుల రెంటను నివర్ణం బగు" (౬౦). "అయ్యది తృతీయాదివిభక్తులు పరంబులగుచో నాగమంబుగానగు. (౬౧). "అది ఇది యెది యనువానికిఁ దృతీయాసప్తమ్యేకవచనంబులయందు దాన - దీన - దేన ననియు, వానిబహువచనంబులయందు వాన - వీన - వేన ననియు రూపంబులగు" (౬౨). (ప్రౌఢ. శబ్ద.). పైరీతి నథర్వణుఁడు విధించియుండఁగా నన్నయ తిక్కనలు ప్రయోగించియుండఁగాఁ బేటికావ్యాఖ్యాత యీక్రిందిరీతిని వ్రాయుట యపరిశీలనమూలకము. "దాన - దీన - దేన.........వాన - వీన - వేన- అనురూపములను సూరి నిరూపింపమింజేసి......త్రిలింగలక్షణశేషకర్త వానిని... చూపించెను. కాని నన్నయాదిప్రాచీనకావ్యములం దట్టిరూపములు గనరామిం జేసి.........ప్రాచీనప్రయోగసాధనమాత్రప్రవణుండగు సూరి వానిని నిరూపింపఁడయ్యె." (బా. సా. వే. ౨౪౦ పుట.). అనుశాసనకర్త "దానన్" మున్నగు వానిని బ్రత్యేకముగా సాధింపలేదుగాని కారకపరిచ్ఛేదమున'చేసి' శబ్దానుప్రయోగ సందర్భమున నిట్లు సూత్రించెను. "అమహత్తులయిన అది-ఇది శబ్దంబుల కాదే శంబులగు ద్దాని దీని యనువానిమీఁదిచేతను విభక్తికి 'అను'వర్ణకాదేశమును, (?) దానిమీఁద 'చేసియును' బహుళముగా నగును. ఉదా:—దాని+అను = దానను (ఇకారసంధినిత్యము) దానన్-దానిచేతన్.........దానం జేసి........."(ఆం. భా. అ. కార. 33 సూ.). ఈరచనలో 'దానన్ - దీనన్' అనువాని ప్రత్యేకస్థితి బహుళ గ్రహణసాధ్యము కాఁబోలును. 'వానన్-వీనన్' అనునన్నయ తిక్కన ప్రయుక్తము లెట్లును నిందుసాధ్యములు కావు. 'దేనన్ - వేనన్' అనువానికిఁ గవిప్రయోగములు

(ఆర. ౨ ఆ. ౨౬.). మహతీవాచకత్వమున నమహదేకవచనములును మహద్బహువచనములును సర్వనామములకుఁ (నేకవచనబహువచనములు) ప్రాయికముగ నగును గాన "అది స్త్రీ, వారు స్త్రీలు." అనురీతిని రూపములను గ్రహింపవలెను. చ. ఇది మునికన్యయేని........దానిది కలరూపు. (ఆది. ౪ ఆ. ౩౦.). దీని తృతీయా సప్తమీవిభక్తులందు 'దానన్ - వానన్' అనురూపములను నమహత్త్వంబున గ్రహింపవలయునుగాని మహతీత్వమున........నట్టిరూపము లుండవు. ఆధర్వణములగు "వాండురు - వాండురన్ - వాండురచేతన్" మున్నగురూపములు సూరికి సమ్మతములు కావు. అట్టివానియెడల "వాండ్రు - వాండ్రన్ - వాండ్రచేతన్" మున్నగవానిని నేటివారలు నిల్పుదురు. అవి సాధువులు కావు (౨౦౪ విష.). తృతీయాదివిభక్తులందు వానిచేతను - వారిచేతను, దానిచేతను - వానిచేతను మున్నగు రూపముల నూహించుకొనవలయును. 'ఆదానిని - అద్దానిని" అనునవి 'దానిని' అనుదానికిఁ బర్యాయములుగ వాడఁబడుచున్నట్లు 'ఆవానిని - అవ్వానిని' అనునవిఁ 'వానిని' అనుదానికిఁ బర్యాయములుగాఁ వాడంబడుసంప్రదాయము లేదని పైసూరి వివరణమునకుఁ దాత్పర్యము. పరిమాణాద్యర్థవిశేషములందు 'అంత' అనియు, నాస్థలమనెడియర్థమున 'అందు' అనియు నక్కాల మనునర్థమున 'అప్పుడు' అనియు, 'ఆ'శబ్దసంబంధిరూపములు ప్రసిద్ధము లయియున్నవి. అంత - అంతలు - అంతన్ - అంతకున్ - అంతటన్ - అంతలోన్ - అంతనుండి - మున్నగునవి

---

నిరతంబు మిక్కిలి; తైజంబు కర్మంబు ద్రినివిడిచి|........(సభా. ౨ ఆ. ౨౬౯ ప.) ఈశబ్దము యతిస్థానగతము.

'ఆ-ఈ - ఏ'శబ్దములు సంస్కృతములోని "తద్, ఇదమ్ - అదస్-ఏతద్, యద్ - కిమ్" అనువానివంటివే యైనను సమాసవిషయమునఁ గొంత భేదము గలదు. "తస్య+పుత్త్రః = తత్పుత్త్రః" అని సమాస మేర్పడినట్లు "వానియొక్క+కొడుకు = ఆకొడుకు" అని కానేరదు. 'వానికొడుకు' అనియే సమాసరూపమగును. కర్మధారయసమాసమున "తత్+కులమ్ = తత్కుల"మ్మని యగునట్లు "ఆ+కులము = ఆకులము" అని త్రికసమాస మేర్పడును. "పదాద్యంతగతం బాశబ్దం బమహదర్థంబు సమస్తంబు వ్యస్తంబునయి కొన్నియెడల నర్థశూన్యంబగు." ఉ...,అర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్" (ఆది. ౮ ఆ. ౭౬ ప.) చ. మఱిబావులు నూఱిటికంటె నొక్కస| త్క్రతు వది మేలు (ఆది. ౪ ఆ. ౯౪ ప.) (ప్రౌఢ. శబ్ద. ౬౩ సూ.) చ...వీని మది చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్ (విరా. ౪ ఆ. ౯౧) క.... రవి ప్రతాప విరహితుఁ డగునాక్రియ (శాంతి. ౪ ఆ. ౪౦౭ ప.).

చినట్టి వాఁగల్లయదిగో (కళా. ౮ ఆ. ౧౩౮) రూ. అదిగో. సీ. రామానుజుం డదిగో మహాయతిరాజు । నాయకుం డనఁగ నున్నాఁడు వెలసి (పర. ౫ ఆ.)" (శ-ర). ఇదిగో - దే - ద్ర - (ఇది+కొమ్ము) చూపుటను దెలిపెడిని. (రూ. ఇదిగో) క.... పూఁబోఁడి యొరసికొని చనఁ । గాఁ బయ్యెదయొడిసిపట్టెఁ గనుఁగొంటె చెలీ । లేఁ బొన్నను బళిరా యిది । గోఁబురుషాహ్వాయము నిలుపుకొనుసమయంబున్. (కళా. ౧ ఆ. ౩౫ ప.)" (శ-ర). ఈకళాపూర్ణోదయ ప్రాసస్థలప్రయోగమే 'అదిగో - ఇదిగో' అనునవి ద్రుతాంతావ్యయములని 'ద్ర' అనుగుఱుతో శబ్దరత్నాకరకర్త వ్రాయుటకుఁ బ్రమాణము. కాని యిట్టియెడల "ఇది+కొమ్ము" అని పదచ్ఛేదము చూపుట సరికాదు. కొమ్ముశబ్దమును దానిరూపాంతరమగు 'కో' శబ్దమును గళలగుటంజేసి 'అదిగో - ఇదిగో' మున్నగునవి కళలనక తీరదు. ఈ పదచ్ఛేదమును మహాకవి సమ్మతమె యైయున్నది. గీ. మనసు మ్రుచ్చిలిచొచ్చిన మత్తికాఁడు । వీఁడు గొమ్మని చేసాచి వెలఁది యపుడు (ఉ. హరి. ౫ ఆ. ౧౮౮ ప.) ఇందు స్వరపరకత్వమున "కొమ్ము" అనురూపము నందినను 'వీఁడుగో' అనియే కవ్యభిప్రేతప్రయోగమనియు నది కళయే యనియుఁ నిశ్చయింపవచ్చును. "వీఁడుగో+అని = వీఁడు గొమ్మని" అని సంధివిధులచే నగును. (౧౦౯ విష.) ఈప్రయోగమునకు సంవాదముగా నీక్రింది ప్రాసస్థలఘటితప్రయోగమును దీనికళాత్వమును నిర్వహించుచున్నది. క...ఈకుధరేంద్రము లోకా । లోకపు బల్గోడదట్టిలో నికటాద్రుల్ । మేకులుగా మెఱయుచునది । గో కానఁగఁబడియెఁ దెల్లఁ గొల్లైన భంగిన్ (వరాహ. ౬ ఆ. ౮౮ సూ.రా. ని.) ఇందు సరళాదేశాభావము ప్రాసస్థాననిబద్ధము. ఇంకొకవింత. శబ్దరత్నాకరమందె "గొ - గో" శబ్దములు కళలగు నవ్యయములుగఁ జూపఁబడినవి. "గో - దే - అవ్య. చూపుటయందువచ్చును. అదిగో - ఇదిగో మొ." "గొ - దే - అవ్య - చూపుటయందువచ్చును. అదిగొ - ఇదిగొ. మొ" (శ-ర). ఇట్లు స్పష్టముగాఁ బూర్వోత్తర సందర్భరాహిత్యము విశదమగుచున్నది. సూ. రా. నిఘంటువున ద్వివిధప్రయోగములు చూపఁబడినవి. "అదిగో = అదిగొ - అవ్య - ఇది కళగాను ద్రుతప్రకృతికముగానుగూడఁ గనఁబడుచున్నది." (సూ-రా-ని). ఇట్లె 'ఇదిగో - ఇదిగొ' శబ్దములయొద్దను గలదు. "అన్యే ద్రుతప్రకృతయః" అను చింతామణిచొప్పునఁ గళాభిన్నత్వము ద్రుతప్రకృతికతాలక్షణమై యుండఁగా నొక్కశబ్దమునందే కళాత్వద్రుతప్రకృతికత్వములు తేజస్తిమిరములవలె నెలకొనియుండుననుట వైయాకరణసిద్ధాంతవిరుద్ధమనకతీరదు. కాన "ఇది।గోఁ బురుషాహ్వాయము..." అను కవిప్రయోగమునకును బైవైయాకరణసిద్ధాంతమునకును విరోధము లేకుండ 'ఇదిగోన్' అనునది శబ్దాంతర

[బా. అవి.] $\frac{౫}{౨౭}$ సూ.] 'సూ.రా.ని' 'ఇదియో' అను పూర్వశబ్దపదావశ్యకము 871

పంక్తులయందే కీర్తింపబడిన [illegible] గ్రహింపవలయును. "ఇది+ఓ+అం=ఇదియో=ఇది కోన [illegible]" లేదా 'ఇది కోనంగాక' అనునర్థము (కీ వెల్లఁబాగాక [illegible] = బాగా [illegible]గాక.) [illegible] సమస్తాంతమగు ప్రత్యక్షప్రకృతికి కోనుచుండుటలో [illegible] [illegible] యందికరింపవలెను. "కా + అ = కాక. కాదక = కాక - ప్రత్యక్షప్రకృతి కము" అన్యార్థమును [illegible] [illegible] [illegible] (ఔ IV వి. ౫) భిన్నశబ్దములకైతి వాకలింపవలయును.

"ఇదియో - (ఇది+ఓ) = ఇదిగో. మ. ప్రమదాపాదియయుఃప్రపూర్ణ మిదియో పద్మాకరం బంచు... భార. అవి. ౬-౪. ౧౭౩ ప. ఇదిగో పాఠాంతరము" (సూ.రా.ని). "ఇదిగో" అను వర్ణాశ్రితశబ్దము నన్నయప్రయుక్తమనుట కేవలము నవిశ్వసనీయము గాన "ఇదిగో. పాఠాంతరము" అనునది గ్రాహ్యముకాదు. వావిళ్ళవారిముద్రణమున "ఇదిగో - (యా)" అని పాఠాంతరములు చూపఁబడెను. పరిశీలింపఁగా "ఇదియా" అనుపాఠమె నన్నయప్రయుక్తము కానోపును. "ఇదియో" శబ్ద మిట్టి యర్థము నిచ్చుటకు శక్తముకాదు. అట్టిశబ్ద మప్రసిద్ధము. మ. ప్రమదాపాది పయఃప్రపూర్ణమిదియాః బద్మాకరం బంచుఁదత్కమలామోదసుగంధమారుతము వీఁక న్మన్నెఱింగించె" (ఆది. ౬-౧౭౩) అను నీపద్యమునఁ బద్మాకర మెదుటలేకుండు టచే "ఇదిగో" అనుదానికిఁ బ్రసక్తియే లేదు. ఆసుగంధిమారుత మింపమింపవ ర్తి పద్మాకరసంబంధి కానోపునని యర్థము కాన 'ఇది యా'ననుపాఠమె నన్నయప్రయు క్తము - 'ఇదియో' అనుమూలశబ్దకల్పనమునకుఁ బ్రసక్తిలేదు.

## ఇదమర్థకము

| | మ | | అ | |
|---|---|---|---|---|
| బాలవ్యాకరణ వివరణము. ౨౧౬ విషయము. | ప్ర. వీఁడు | వీరు<br>వీరలు<br>వీండ్రు | ప్ర. ఇది<br>ఇద్ది<br>ఈయది<br>ఇయ్యది | ఇవి<br>ఇవ్వి<br>ఈయవి<br>ఇయ్యవి |
| | ద్వి. వీనిని | వీరిని<br>వీరలను<br>వీండ్రను | ద్వి. దీనిని<br>ఈదానిని<br>ఇద్దానిని | వీనిని |

$\frac{౫}{౨౮}$

సంజీవని. ౨౧౬ విషయము. ఈరూపములు ౨౧౫ విషయమున నథర్వణకారి కలచే సాధింపఁబడెను. అథర్వణరూపములలో "వీండురు" అను రూపముమాత్రము సూరిగారికి సమ్మతముకాదు. కాన నుదాహరింపఁబడలేదు. అట్టిరూపములచోట

నేఁటివారు "వీండ్రు" మున్నగురూపములను నిల్పుదురు. ఇవి సరికావనియు వీండురు - వీండురన్ - వీండురచేన్ మున్నగురూపములే నన్నయాథర్వణసమ్మతములును మహాకవిప్రయోగదృష్టములును ననియు నీపఱకు వ్రాసితిని (౨౦౪ విష). సంస్కృతమందలి 'ఇదమ్-అదస్ - ఏతద్' అనువానికిఁ బర్యాయము తెనుఁగునందలి 'ఈ' శబ్దము. దీనికి - మహత్త్వమున 'వీఁడు - వీరు - వీరలు - వీండ్రు' అనవియు నమహతీత్త్వమున నేకత్వమున 'ఇది-ఇద్ది-ఈయది-ఇయ్యది' అనియు మహతీబహుత్వమున 'వీరు - వీరలు' అనియు, నమహత్త్వమున నేకవచనమున 'ఇది - ఇద్ది' మున్నగునవియు బహుత్వమున 'ఇవి - ఇవ్వి' మున్నగునవియు నగునని యెఱుంగునది. తృతీయాదివిభక్తులందు మహత్త్వమున వీనిచేతన్ - వీరిచేతన్ మున్నగునవియు మహతీత్వమున దీనిచేతన్ - వీరిచేతన్ మున్నవియు నమహత్త్వమున దీనిచేతన్ వీనిచేతన్ మున్నగునవియుఁ గల్గునని యెఱుంగునది. ఇది = ఈస్త్రీ - చ. ఇది మునికన్యయేని......(ఆది. ౪ ఆ. ౩౦) నామపునర్గ్రహణమున నొకప్పుడు 'ఈ' శబ్దపువాడుకయుఁ గలదు. సీ. పురుషున కెందును నిరతంబు మిక్కిలి, తేజంబు కర్మంబు దీనివిడిచి (సభా. ౨ ఆ. ౨౬౫ ప.). అత్యంతసమీపార్థమున 'ఈ' శబ్దమును వాడుట కలదు. (ప్రౌఢ. సమాస. ౧౧ సూ.). క. ఈయున్న పౌష్య ప్రోలికిఁ। బోయి కడుంబెద్దదవ్వు వోయినయట్లు। త్యాయత......ఇన్నిదినంబు లేల మసలితి చెపుమా (ఆది. ౧ ఆ. ౧౯౭ ప). 'దీనిని-ఈదానిని - ఇద్దానిని' అని ద్వితీయాద్యేకవచనములందు వాడినట్లు బహుత్వమున, 'ఈవానిని-ఇవ్వానిని' అని వాడెడి సంప్రదాయములేదనియు 'వీనిని' అనిమాత్రమె యమహత్త్వమున వాడవలెననియు సూరివివరణమునకుఁ దాత్పర్యము నెన్నఁగును. పరిమాణాద్యర్థవిశేషములందు 'ఇంత' అనునదియు, నీస్థలమనెడియర్థమున 'ఇందు' అనునదియు నిక్కాలమనునర్థమున 'ఇప్పుడు' అనునదియు 'ఈ' శబ్దమును సంబంధించినరూపములని గ్రహింపవలయును (౨౧౧ విష. విస్తర.). "ఇంత - ఇంతలు - ఇంతకున్ - ఇంతటన్ - ఇంతలోన్" మున్నగునవి 'ఇంత' శబ్దపువిభక్త్యంతరూపములు. ఇందు - ఇందులన్ - ఇందులకున్ - ఇందుకున్ మున్నగునవి 'ఇందు' శబ్దము విభక్త్యంతరూపములు. "ఇప్పుడు - ఇప్పటికిన్ - ఇప్పటినుండి - ఇప్పటన్ మున్నగునవి "ఇప్పుడు" శబ్దపువిభక్త్యంతరూపములు. ౨౧౫ విషయమున వివరింపఁబడినరీతిని జూపుటను దెలుపునపుడు "ఇల్ల - ఇదె - ఇదిగో - ఇదిగో - వీడె - వీరె - వీఁడుగో - వీరుగో" అనురూపములు "ఈ"శబ్దమును సంబంధించినవినిల్చును. శా. వీఁడెవచ్చెం గుంతీసుతమధ్యముండు... (విరా. ౪ ఆ. ౯౫ ప.) క. ఇదె దేహం బిదె యర్థం। బిదె నాపరిజనసమూహ

ఆ

| | |
|---|---|
| ప్ర. ఏది | ఏవి |
| ఏది | ఏవి |
| ఎద్ది | ఎవ్వి |
| ఏయది | ఏయవి |
| ఎయ్యది | ఎయ్యవి |
| ద్వి. దేనిని | వేనిని |
| ఏవానిని | ఏవానిని |
| ఎద్దానిని | ఎవ్వానిని |

సంజీవని. ౨౧౭ విష:—పయివాని రూపసాధన ప్రక్రియ యథర్వణునిచే నిరూపితమయ్యెను. (౨౧౫-౨౧౫ I విష.) సంస్కృతములోని యచ్ఛబ్దము యొక్కయు "కిమ్" శబ్దముయొక్కయు నర్థములం దియ్యది వాడఁబడునుగాన నిది యత్కిమర్థక మనఁబడుచున్నది. ఉదా:—యచ్ఛబ్దార్థము—ఏయది హృద్యము... అది యిష్టము మాకు" (ఆది. ౧ ఆ. ౩౦ ప.) (౨౧౨ విష.). కిమర్థమనఁగాఁ బ్రశ్నార్థము—క......కురుపాండవులం। దెవ్వరు మును గడఁగిరి రణ। మెవ్విధి నూలుకొనిచెల్లె నెఱిఁగింపు తగన్ (భీష్మ. ౧ ఆ. ౨౩౨) ఆథర్వణములగు "వేఁడు - వేరు, వేనిన్ - వేరిన్" మున్నగురూపములను సూరి యుపేక్షించెను. త్రిలింగ లక్షణశేషమున నివి సోదాహరణముగా సంగ్రహింపఁబడెను. (౨౧౫ విష.) ఆథర్వణములగు "దేనన్ - వేనన్" అను తృతీయాసప్తమ్యర్థకములగు సమహాదర్థకములు సైతము సూరిచే నుపేక్షింపఁబడఁగాఁ ద్రిలింగలక్షణశేషమున సంగ్రహింపఁబడినవి - కాని - "దేనన్ - వేనన్" అనురూపములకుఁ బ్రయోగములు లభింపలేదు. ఏశబ్దరూపములు నుశబ్దాంతములగుచు "ఎల్లవారును" అనునర్థము నిచ్చును. కొన్నియెడల నుశబ్దప్రయోగము లేకున్నను గాకుస్వరశక్తివిశేషముచేత సైత మట్టి యర్థము వచ్చుటగలదు. ఉ. ఎవ్వరు నట్లుపో నెరసు లెన్నక మానరు ప్రాణభర్తలన్. (ఆముక్త. ౫ ఆ. ౫౬ ప. సూ. రా. ని.) క......। ఇమ్మహి ధన వంతుఁ డతఁడ యెవ్వరికంటెన్. (ఆర. ౨ ఆ. ౩౭౧ ప.) ఇట్లె నుశబ్దాంతమగు నీయత్కిమర్థకశబ్ద మత్యంతాభావమును దెలుపు వ్యతిరేకక్రియకు సహకారియగును. ఉ. ఇట నెవ్వరును లేరు = ఒక్కఁడైనను లేఁడని యర్థము. 'ఇ - ఈ' అనుస్వరములతోఁగూడిన యత్కిమర్థకశబ్దము "ఎక్కడ నున్నాఁడు" మున్నగు నర్థవిశేషముల నిచ్చును. కం. పార్థుఁడు వేఁడీ పొదువుదు......(ద్రోణ. ౩ ఆ. ౭౬) సీ...ఇంక।

నేఁ [illegible] ? [illegible] ? (అ. ౧ ఆ. ౫౫.) [illegible] [illegible] [illegible] [illegible] "[illegible]" [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. [illegible]

అ-ఇ-ఈ-స్త్రీవిషయాః. (ఆం. చిం. వ్యా. ౧౭ కా.
[illegible] [illegible]. [illegible]) అన్యేచ బహవో దేశ్యా [illegible]
[illegible] [illegible]. [illegible] (ఆం. [illegible]. [illegible] కా. [illegible].
[illegible])

కల్పతరు. ౨౧౭ విష:—అ - ఇ - ఈ = 'అ-ఇ-ఈ' అనునవి, స్త్రీవిషయాః = స్త్రీత్వమును దెల్పు ప్రత్యయములు - సంస్కృతమునందలి - 'ఆ - ఈ - ఊ' (టాప్, ఙీప్ - ఊఙ్) అనువానికి నివి యాచ్ఛికస్త్రీప్రత్యయములు. 'అ-ఇ-ఈ' అనునవి 'ఏ' అనువానికిని నుపలక్షణ మగుచున్నవి. తద్భవస్త్రీసమశబ్దములనేకము లీస్త్రీప్రత్యయములు తుదిని జేరుటచేత నేర్పడినవి యనియు నట్లగుటచే నవి స్త్రీసమము లగుచున్నవనియు నెఱుంగునది.

అన్యేచేత్యాది—అన్యేచ = చింతామణి యుపదేశించిన - 'దు - బి - క - చు' మున్నగు కృత్తద్ధితప్రత్యయములేకాక యింకను నితరములైన, బహవః=అనేకములైన, దేశ్యాః-పర్ణకాః = దేశ్యములగు కృత్తద్ధితప్రత్యయములు, అర్థభేదకాః = వివిధములగు నర్థభేదములుగలవి, కవిప్రయోగదృష్టము లగుచున్నవి. అట్టి కృత్తద్ధితములు ముందు వివరింపఁబడును. స్త్రీప్రత్యయములును దద్ధితములె కాన నీకారికల నిటఁ బ్రదర్శింపవలసెను. ఏకార్థమునకువలెనె యీయత్యిమన్థక శబ్దమునకును షష్ఠీబహువచనాంతతుల్యరూపములగు 'ఎవ్వారి - ఎవరి' అనునవి యీస్త్రీప్రత్యయములకుఁ బ్రకృతులై నిల్చును. వానిపైని - అ - ఇ - ఈ - ఎ - అనునవి నిల్చునపుడు తకారము పూర్వాగమమగును. ఉదా:—ఎవరి+త్+అ = ఎవ్వరిత-ఎవ్వరి+త్+ఇ = ఎవ్వరితి - ఎవ్వరి+త్+ఎ=ఎవ్వరితె - మొ. క్వచిద న్యస్య చాన్యస్యేత్యాదిచే (౨౩౦-౨౩౮ విషయ.) లోపమురాఁగా 'ఎవ_ర్త - ఎవ_ర్తె'

---

విస్తర. ౨౧౭ విష:—"ఏఁడే రే దేవిశబ్దంబు లర్థవిశేషంబునం దీకారాంతంబు లగు. శా. ఎఁడీ నాబలుమానికంబుల కోటా......(అచ్చ. రా. అయో.) శా...| వా రేరీ-సిరిమూటగట్టుకొని పోవంజాలిరే......(భాగ. ౮ స్కం.) ఉ. ఏది యేదీ యిది చాలఁ గ్రొత్త (కళా. ౧ ఆ.) హ్రస్వాంతంబులునగు - వాఁడేఁడి - వా రెరి. మొ." (ప్రౌఢ. శబ్ద. ౮౭ సూ.)

మున్నగురూపములు సిద్ధించును. నామ్నః కవర్ణకః స్యాత్. (అం. చిం. హలం. ౧౧ కా.) అనుచోప్పున ఎవర్తుకమున్నగునవి సిద్ధించును. ౨౨౧ విషయమున నిది విపులముగ వ్రాయఁబడును.

బాలవ్యాకరణ వివరణము. ౨౧౭ II విషయము.

మహతివాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థక
శబ్దంబు ఎవ్వరిత - ఎవ్వర్త - ఎవ్వత, ఎవరిత -
ఎవర్త - ఎవత, ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి, ఎవరితి - ౭
ఎవర్తి - ఎవతి, ఎవ్వరితె - ఎవ్వర్తె - ఎవ్వతె, ఎవరితె - ౪౮ సూ
ఎవర్తె - ఎవతె, ఎవ్వర్తుక - ఎవ్వతుక, ఎవర్తుక -
ఎవతుక, అని యిరువది రెండురూపంబులు వడయు.

సంజీవని. ౨౧౭ II విష:—'ఎవ్వరిత' మున్నగువానికి 'ఏస్త్రీ' అని యర్థము. ఇట్లె "ఒక" శబ్దపు మహతీరూపము లేఁబదిరెండని సూరి వేఱొకపట్టికను జూపెను. (౧౯/౪౮ సూ.) (౨౨౧ I విష.). (విస్తర.). ఈరెండుస్థలములందును మహతివాచ్యంబగునేని యీరూపములగునని కంఠోక్తముగ సూరిగారు వచించుటంజేసి యత్కిమ

---

విస్తర. ౨౧౭ II విష:—త్రిలింగలక్షణశేషమున నీరూపములకుఁ బ్రక్రియ చూపఁబడెను:—"తవర్ణకంబు ద్రవ్యార్థకంబగు". (ప్రౌఢ. శబ్ద. ౬౪ సూ.). "అయ్యది యేకత్వంబున సమాసగతషష్ఠ్యంత యత్కిమర్థకానైకార్థక శబ్దంబులపై నగు". (౬౫ సూ.). (యత్కిమర్థక = ఏ. అనైకార్థక = ఒక.). ఉ. 'ఎవ్వరిత - ఎవరిత- ఒక్కరిత - ఒకరిత - ఒక్కొరిత - ఒకొరిత. "దానియత్వంబున కిత్వైత్వంబులు పర్యాయంబున నగు. ఆదేశౌత్వంబుమీఁది దాని కెత్వంబురాదు" (౬౬ సూ.). ఉ. ఎవ్వరితి - ఎవరితి - ఎవ్వరితె - ఎవరితె - ఒక్కరితి - ఒకరితి - ఒక్కరితె - ఒకరితె - ఒక్కొరితి - ఒకొరితి - ఒక్కొరితె - ఒకొరితె, (ఆదేశౌత్వంబునుటచే 'ఓర్తె' అని యుండదు ౬౭ సూ.). "రేఫసంయుక్తంబగుచో నొక్కొకశబ్దంబులమీఁది తకారంబున కుత్వంబునగు" (౬౮ సూ.). ఉదా:—(చూ. మీఁదు.). "తవర్ణకంబు పరంబగుచో రేఫంబుమీఁది యిత్తునకు లోపంబు విభాషనగు" (౬౯ సూ.). ఉదా:—ఎవ్వర్త - ఎవర్త; ఎవ్వర్తి - ఎవర్తి; ఎవ్వర్తె - ఎవర్తె; ఒక్కర్త - ఒకర్త; ఒక్కర్తి - ఒకర్తి; ఒక్కర్తు - ఒకర్తు; ఒక్కర్తె - ఒకర్తె; ఒక్కొర్త - ఒకొర్త; ఒక్కొర్తి - ఒకొర్తి; ఒక్కొర్తు - ఒకొర్తు; ఒక్కొర్తె - ఒకొర్తె; "కొన్నియెడల రేఫసంయుక్త తవర్ణకంబు ముందటి యొక్కాదుల కోత్వం బాదేశంబగు" (౭౦). ఓర్త - ఓర్తి - ఓర్తు. "ఎవ్వరితాదులందలి రివర్ణకంబునకు లోపంబు

బాలవ్యాకరణ వివరణము. ౨౧౮ విషయము.

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు - అతఁడు - ఆతఁడు, ఇతఁడు - ఈతఁడు, ఎతఁడు - ఏతఁడు, అనురూపంబులు వడయు. ర

మహతీవాచకంబులు - ఆమె - ఆపె - ఆకె, ఈమె - ఈపె - ఈకె; ఏమె - ఏపె - ఏకె; అనురూపంబులు వడయు. ౨౮

సంజీవని. ౨౧౮ విష:—అతఁడు = పూజ్యుఁడగు నాపురుషుఁడు. ఇట్లె తక్కినవానికిని నర్థము లెన్నునది. "ఆ+అమ = ఆమె, ఆ+అప = ఆపె, ఆ+అక = ఆకె; ఈ+అమ = ఈమె, ఈ+అప = ఈపె, ఈ+అక = ఈకె; ఏ+అమ = ఏమె, ఏ+అప = ఏపె, ఏ+అక = ఏకె" అని యిట్లు వీనిచ్ఛేదము నెఱుంగునది. ఇట్లగుటచేతనే వీనికి "ఆపూజ్యస్త్రీ = ఆమె, ఈపూజ్యస్త్రీ = ఈమె" యన్నగురీతిని బూజ్యార్థకత్వము లభించుచున్నది. 'శ-ర.' 'సూ. రా.' నిఘంటువులలో నివియేకాక, "ఆయన, అతగాఁడు - ఆతగాఁడు - ఈయన - ఇతగాఁడు - ఈతగాఁడు" అనుమహదర్థకరూపములును "ఆయమ - ఆబిడ (ఆ+బిడ్డ) ఈయమ - ఈబిడ (ఈ+బిడ్డ)" యన్నగు మహతీరూపములును సర్వనామములుగా నుదాహరింపఁబడినవి. (౨౧౧ విష.). "అతఁడు - ఆతఁడు" యన్నగు పై శబ్దములకుఁ బూజ్యార్థకత్వము నియతముగ నగపడదు. అది వాఁడు యన్నగునవియుఁ బూజ్యతయందు వాడఁబడుట గలదు. ఉ. ఒక్కఁడొకం డనేకవిధయుద్ధజయంబులు గొన్నవారు వా। రెక్కడ; నేమిసేసె నితఁ డీతని తమ్మునిఁ గూలనేసి యు। క్కెక్కినపార్థుపైఁ గవిసెనే పనులాతఁడు గ్రమ్మరింపఁగా। నక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ గోల్పడె ఘోషయాత్రలో। (ఉద్యో. ౨ ఆ. ౧౬౨) ఒక్కచోటనే యొక్కనివిషయముననే, "వీఁడు - ఇతఁడు" అను రెండును సోమయాజిచే వాడఁబడెను. పయిపద్యము భీష్ముఁడు కర్ణుని నిరసించు సందర్భములోనిది. చ. ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్ ।... (సభా. ౨ ఆ. ౧౦ ప.) సీ. ఈతని వృద్ధని యొఱిఁగి పూజించితే, వసుదేవుఁడుండంగ వసుమతీశ...............ఆ-వె. పూజనీయులైన పురుషులలోపల। నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁడు......(సభా. ౨ ఆ. ౧౧ ప.). ఈపద్యములు శిశుపాలుఁడు కృష్ణుని నిరసించు సందర్భములోనివి. వ. వీఁడన్యులచేత నప్రతిహతుండు. కృష్ణునిచేత నిహతుండగు నది కారణంబుగా. చ. ఇతనికి నిట్లు నన్నుఱక యొగ్గులువల్కఁగఁబోలేఁ గాక యు। ద్ధతమతి నన్య లీతనివిధంబున......(సభా. ౨ ఆ. ౬౦-౬౨) ఈపద్యములు భీష్ముఁడు శిశుపాలు నిరసించుసందర్భములోనివి. ఉ. సందియ మేల సర్వ

గుణసంపద జూడఁగ బాహుళకంపు భూ| వంచితుఁడైన నైషధుఁ డనర్ఘము దానగు ధామసంబు నా పదముఁ బొందెనమస్త దిక్పురంబుగ వాఁ డిటువచ్చువాఁడో యే నంపుల నంగనావలో కయుంబున నాతని నిర్వ్యయింపఁగన్. (శృం. ౨ ఆ. ౭౧ ప.) "వాఁడు - ఆతని" అనువానిని నవ ప్రతిపదయుండుట నవయుంతి వ్యాహరించి రి. క. పురుషోత్తముఁ డచ్యుతుఁ డీ శ్వరుఁ డధవ్యుఁడు వీఁడె వీఁడె పద్మాక్షుఁ డయ్యెన్ (హరి. ఉ. భా. ౫ ఆ. ౨౧౩) ఇట నిర్వచనవిషయమున 'వీఁడు' శబ్దము ప్రయోగింపఁబడెను. పూజ్యార్థకశబ్దము ప్రయోగింపఁబడలేదు.

చ. కుసుమ మెఱుంగు గప్పినవి కుబ్బల ప్రబ్బియు నాతగానికిన్ మున మొదవించి......(శుక. ౨ ఆ. ౧౬౦ సూ. రా. ని.) 'అతగాఁడు - ఖతగాఁడు' అనునవి నైతము శబ్దరత్నాకరమున లేనివి సూ. రా. నిఘంటువునఁ జూపఁబడినవి. కాని ప్రయోగమొక్కటైనను జూపఁబడలేదు. క. ఆతని! కాయన చెప్పినవిధంబు నభివర్ణింతున్ (భీష్మ. ౨ ఆ. ౨౬౨) క. ఈయనతో రణ మిప్పుడు ! చేయఁగ మది గొల్పదు (భీష్మ. ౨ ఆ. ౨౫౨) (సూ. రా. ని.). ఆకె - ఆపె - ఆమె మున్నగునవి తెలుపుగఁ బూజ్యతయందె కన్పట్టుచున్నవి. క. నాకంటె నకట యుత్తమ! యాకె యగుట చెప్పవలయు నా......(ప్రభా. ౫ ఆ. ౧౨౧ శ. ర.) "ఆమె = ఆయమ. స - ప - (ఆ+అమ్మ.) ౧ ఆ. పూజ్యురాలు. ౨ ఆస్త్రీ" (సూ. రా. ని.) అని యిట్లు పూజ్యతలేనియర్థమునుగలదని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెనె కాని యట్టి ప్రయోగము చూపఁబడలేదు. "ఆబిడ. స - ప. (ఆ+బిడ్డ) ఆమె. చ...... ఆ| బిడమొగ మట్టె కన్గొని కుచేలునికూరిమిఁబట్టి యిట్లనున్ (ఉ. రా. ౪ ఆ. ౨౨౬ సూ. రా. ని.)" "ఈబిడ స - ప - (ఈ+బిడ్డ. త. ఇవళ్.) ఈమె - సీ. ఈబిడారు మృగీమదశ్రీ బిడారు. (విజ. వి. ౧ ఆ. ౧౩౦)" (సూ. రా. ని.). "ఏమె - స - ప (ఏ+అమ. త. ఎవ్వళ్) ఎవతె. ఏస్త్రీ. అవ్య - స్త్రీసంబోధనమందు ప్రయుక్తము. గీ. ఓమె యేమె యిదేమేమె లేమయేమె! మేఘపుష్పంబు దేవంచు మేలమాడ! మేమ మేమెలు దఱచయ్యె మేలుమేలు! మేఁక మేఁకన సభవారు మిగుల నగిరి. (నైష. ౬ ఆ. ౧౧౪)" (సూ. రా. ని.). "ఏమే = ఏమె - అవ్య - శా - ఏమే జాహ్నవి యేమి రాఘవ యిదేమేవైరి.........(దశా. ౧ ఆ. ౨౬) శా. ఏకే హేమలతా యటంచుఁ బని యేమే మాధవీయంచు (వసు. ౪ ఆ. ౭౬)" (సూ. రా. ని.). ఈస్థలద్వయమునందును, "ఏమె - ఏమే" శబ్దములకు "ఏపూజ్యురాలు" అని కాని "ఏస్త్రీ" అని కాని యర్థముకాదు. కాఁబట్టి యిట "ఏ+అమ" అనిఛేదము చూపుట యుక్తముకాదు, "ఏమి+ఎ" అనురీతిని ఛేదము చూపుట యుక్తము.

ఈప్రయోగములలోని "ఏమె - ఏమే" శబ్దములు స్త్రీసంబోధనార్థకములు కావు. ప్రశ్నార్థకములు. "ఆమె - ఈమె" శబ్దములవలె "ఏమె" శబ్దము "ఏపూజ్యురాలు" అనునర్థమున వాడఁబడిన కవిప్రయోగము లభింపలేదు.

దేశ్యాదస్మ ద్యుష్మచ్ఛబ్దా త్సు జసో ర్ను మూ వురూ
చ స్తః॥ న్ను ష్మూ హ్రస్వ శ్చాదే। రమి శసీ చాన్యతర
లుక్చ యుక్తస్య॥ ౫॥ కిర్న జమః ప్రథమాయా। మేవ
స్మద ఏతయో ర్బహుత్వే మః॥ హ్రస్వేటావా నమువాన్।
ద్వ్యయవద్వచనస్యోయే ౭ న్యయో రాత్తా॥ ౬. (ఆం.
చిం. హలం. ౫-౬ కా. అహో. ౩౯౫ మొ. ౩౯౮ వ.
నన్నయా పుటలు.)

ధర్వణీయము. సు ర్మురూ సుజసో ర్యుక్తా। యుక్తావపి మతౌ నమౌ, ౯-౧౨/౨౮ సూ
౨౧౯ విషయము. (వికృ. హలం. ౫ కారి. అహో. ౩౯౮ పు.)

భూయు ఉభయార్థవాచీ। యః కశ్చి ద్భవతి నిత్య
బహువచనః। తస్య జసో ము శసో లః। ప్రాగ్వత్సర్వం
భిసాదికేష్వత్ర (ఆం. చిం. హలం. ౭ కారి. అహో.
౩౯౯)

భూయసీ దేశ్యశబ్దేషు। లోపవర్ణాగమశ్రుతిః (వికృ.
అజం. ౯౮ కారి. అహో. ౩౭౨ పు.)

కల్ప. ౨౧౯ విష:—దేశ్యాత్ - అస్మద్యుష్మచ్ఛబ్దాత్ = దేశ్యములగు, నా - నీశబ్దములకంటెఁ బరమైన, సుజసోః = ప్రథమైకవచన బహువచనప్రత్యయములగు 'సు - జస్' అనువానిస్థానమున, ను మూ వు రూచ స్తః = ను ము లును వు రు లును వరుసగా నగును. అస్మత్ప్రథమైకవచనముచోట 'ను' ప్రత్యయమును దానిబహువచనముచోట 'ము' ప్రత్యయమును, యుష్మత్ప్రథమైకవచనము చోట వు ప్రత్యయమును, దాని బహువచనముచోట 'రు' ప్రత్యయమును నాదేశము లగునని తాత్పర్యము. ఉదా:—రానున్న సూత్రములచేఁ బ్రథమయందు నా శబ్దాకారమున కేత్వమును, నా నీశబ్దముల హల్లునకు బహుత్వమున మకారమును రాఁగా, నా + ను = నే + ను = నేను - నా+ము = నే+ము = మే+ము = మేము; నీ+వు = నీవు. నీ+రు = మీ+రు = మీరు. మీరు+లు = మీరలు (౨౧౫ విష.). (౨౨౮ విష.). అమి - శసిచ = ద్వితీయైకవచన బహువచనప్రత్యయములగు 'అమ్ - శస్' అనునవి పరమగుచుండఁగా, నా - నీశబ్దములు రెండిటికిని, న్ను - ష్మూ =

నసంగతము. పాణినీయవ్యాఖ్యాతలిట్టి విభక్తి విపరిణామాన్వయము నంగీకరించి నను ననావశ్యకముగ శబ్దమునకు లేనియర్థమునుజెప్పెడి యగతికగతి నాశ్రయించుట సరికాదు. అహోబలపతి చింతామణి సమన్వయమున నంగీకరించిన యీ యపమార్గ మనావశ్యకమని యీవఱకె నిరాకరింపఁబడెను. (౧౭౯-౧౭౮-౧౮౧ విష.) నారచించిన చింతామణి విషయపరిశోధనానుబంధమున నీవిషయము మిక్కిలి విస్తరముగా విమర్శితమయ్యెను. (చిం. వి. ప. అనుబం. ౧౮౨ మొ. ౧౮౫ వ. విష. "న్ను - మ్ము లాగమములా ? లేక యాదేశములా ?) (చూడుడు. శ్రీముఖ సం॥ మార్గశిర పుష్య. మాఘఫాల్గునముల పరిషత్పత్రికలు.)

అన్యతరలుక్ చేత్యాది - యుక్తస్య = ద్విరుక్తవర్ణమునకు, అన్యతరలుక్ చ = ఒకహల్లునకు లోపమును, 'చ' కారముచే వికల్పముగానగును. ఉదా:— నన్నునున్ - ననునున్ - మమ్మున్ - మమున్, నిన్నునున్ - నినునున్ - మిమ్మున్ - మిమున్, తన్నునున్ - తనునున్ - తమ్మున్ - తమున్. ఙసః = షష్ఠ్యేకవచన ప్రత్యయమగు ఙస్సునకు, కిన్న = "ఇతాం ఙసఃకిశ్చ" అనుచోఁజెప్పిన రావలసిన 'కి' వర్ణకమురాదు. ఇంక నచటను 'కు' వర్ణకమెయగును. ఉదా:—నీకున్ - మీకున్. అస్మదః = నాశబ్దమునకు, ప్రథమావిభక్తియందు, ఏత్ = ఏత్వమువచ్చును. 'నా-మా' లమీఁది 'ఆ' కార మేకారమగునని యర్థము. నేను - మేము. ఏతయోః = ఈ నానీశబ్దములు రెండిటికిని, బహుత్వే = బహువచనమునందు, మః = నకారముచోట మకారమునిల్చును. ఉదా:— మేము - మీరు - మమ్మున్ - మిమ్మున్ - మాచేతన్ - మీచేతన్ - మొ.

హ్రస్వేటాదావిత్యాది.—టాదౌ = తృతీయాది విభక్తిపరమగుచుండఁగా, హ్రస్వేసతి=హ్రస్వముకలిగినదై యుండ, ఆత్మా = తాశబ్దము, నమవాన్=ఏకవచనమున 'న' అనునదియు, బహువచనమున 'మ' అనునదియుఁ గలదియగును. ఉదా:— తా+చేతన్ = త+న+చేతన్ = తనచేతన్; త+మ+చేతన్ = తమచేతన్ - మొ. అన్యయోః = తృతీయాదీతరములగు ప్రథమా ద్వితీయావిభక్తులందు, తా శబ్దము - వచనద్వయే = ఏకత్వ బహుత్వములందు, ద్వయవత్ = వరుసగా నా నీశబ్దముల వంటి కార్యములు గలదగును. ప్రథమైకవచనమున 'ను' ప్రత్యయమును ప్రథమా బహువచనమున 'రు' ప్రత్యయమును, ద్వితీయైకవచన బహువచనములందు వరుసగా 'న్ను - మ్ము' అను నాగమములును బూర్వదీర్ఘమునకు హ్రస్వమును నగునని యర్థము. ద్విత్వములోని యన్యతర హల్లోపమునుగల్గును. ఉదా:—తాను ! తారు, తన్నునున్ - తనునున్, తమ్మున్ - తమున్. కవిభల్లట సూత్రముచెప్పిన

[బా. అప్ప. ౧౪-౧౦౫ / ౩౪ సూ.] "నుమూ" కాదు. 'నమా' అను పాఠము యుక్తము కాదు
(అప్ప. ౩ ౨౧ పద్య.) సద్లోకములును, [illegible] 'నస్మాకే - నోనకే -
నన - నిస్మాకే - ననకే - నన, తస్మాకే - తనకే - తకే' అను రూపములును [illegible]
చును. "క్వచి దత్వం భవే ల్లలే" (అప్ప. ౩ పద్య.) అనుదానిచే "మీరలు" అనియు
"కవిభల్లటసూత్రము" చేత (అప్ప. ౩ పద్య.) సద్లోకముచేతను 'మీరల్' అనియు
రూపములు లభించును.

నుమ్నమా ఇత్యాది—నుజహోః = తా శబ్దప్రకృతులైన వచన బహువచనములకు,
నుః = 'ను' వర్ణకమును, ముమా = 'ము' వర్ణ 'ము' వర్ణకములును వరుసగానగును,
చింతామణి చెప్పిన 'ను' అను ప్రత్యయ బహువచన ప్రత్యయమును విశేషించి
చెప్పఁబడెను. ఉదా:—తాను - తాము - తాము. సూత్రమునందు 'తముదు'
నన్నయాథర్వణీయ సమ్మతము కాదు. నమా = నేను మేము - నీవు మీరు' అను
వానిలోని నజాది నకార మకారరూపవ్యంజనములు, యుక్తాఽయుక్తావపి =
కూడియుఁ గూడకయు, మతౌ = సమ్మతములగును. ఉదా:—అకిశబ్దముచే నిపాతి
పాతికము. నేను = ఏను - మేము = ఏము. నీవు - ఈవు, మీరు = ఈరు -
ఈరలు. నిమిత్తము చెప్పఁబడమిచే - ప్రయోగదృష్ట విభక్తులం దీకార్యము
గల్గును. ఉదా:—ఈకు = నీకు - ఈరు = మీరు - మొ. ముద్రణసంస్కర్తృ
ప్రమాదమునఁ గాఁబోలును నిక్కారికలోని "నమా" అనుచోట "నుము" అని
యహోబలపండితీయమునఁ బడియున్నది. (అహో. కరా౦ పు.) అక్కారణమునఁ
గవిజనమండనకర్త "యుక్తాయుక్తావపి మతౌనుమూ" అను పాఠము సంగీకరించి
"నుమువర్ణకములు సద్విత్వములై ద్విత్వరహితములై ప్రవర్తిల్లుచున్నవి" (వికృ.
టీక. హలం. ౫ కారి.) అని వ్యాఖ్యచేసెను. దీనిననుసరించియే నారాయణీయ
మున నీక్రిందికీతి నాంధ్రీకరింపఁబడెను. "తే......యుక్తాయుక్తములుగఁగూడ।
సమ్మతములగును ను ము వర్ణమ్ము లబల (నారా. అచ్చి. 33 ప. ౨౬ కారి.)
ఈపాఠము "అన్యతర లుక్చ యుక్తస్య" అను చింతామణిసూత్రార్థమునకె పునరుక్త
మగుచున్నది. కావున నిది యథర్వణాభిప్రేతము కానేరదు. ఇట్లీపాఠము పున
రుక్తమగుటయేకాక "ఏను - ఏము - ఈవు - ఈరు - ఈరలు" మున్నగురూప
ముల నథర్వణుఁడు సంగ్రహింపలేనికొంతను సైతము ఘటించుచున్నదిగాన
"నమా" అను పాఠమె యథర్వణోక్తమనఁదగును.

భూయ ఇత్యాది - భూయః = నా నీశబ్దవ్యతిరిక్తమైన, ఉభయార్థవాచి =
యుష్మ దస్మ దర్థద్వయ వాచకమగు, నిత్యబహువచనః=నిత్యబహువచనమగు, యః
కశ్చిద్భవతి = ఒకానొక శబ్దమేదిగలదో, తస్య = ఆ 'మన' శబ్దముయొక్క, జనః =

ప్రథమాబహువచనమగు జస్ ప్రత్యయముచోట, ముః = మువర్ణకమును, శసో లః= ద్వితీయాబహువచనమగు శస్సుచోట 'ల' వర్ణకమును నగును. అన్యత్ర భిసాదౌ = తక్కిన భిస్సు మున్నగు తృతీయాదులందు, సర్వమ్ = అంతయు, ప్రాగ్వత్ = వెనుకటిరీతినెయగును. ఉదా:—మనము - మనలన్ - మనచేతన్ - మొ. 'శసోలః' అను నీకారికలోని పునర్విధానముచే "లు జసో ల శసః" అనుచొప్పున లవర్ణము నీ-నా-తా-శబ్దములకును నిలువనేరదు. మనశబ్దమునకును తృతీయాదులందు నిలువదు. ఈవిషయము లీవటకే వివరింపఁబడెను.

భూయసీ దేశ్యేత్యాదికారిక ౮౮ I విషయమున వ్యాఖ్యాతమయ్యెను. 'ననున్ - నినున్ - తనున్' అనువానిలోని 'ను' అనునది వికల్పముగా దీనిచొప్పున లోపించుట భారతప్రయోగములం దగపడుచున్నది. ఈవిషమునఁ బ్రత్యేకవిధి నన్నయాథర్వణీయమున లేదు. సూరియు దీనిని సంగ్రహింపలేదు. ప్రయోగములు:—చ. విని ముద మొందుచున్ శరణు వేఁడెదఁ గావుము నన్ను నీశ్వరా. (అను. 3 ఆ. ౨౬౨) తే.గీ.....విదురుఁడే తెంచి యొరులకు వినియు నెఱుఁగఁ। గాని యట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి। (ఆది. ౬ ఆ. ౧౪౪) సీ. పనియేమిపంచినఁ బడపడి చేసెద, ననక తన్ బంచిన యాతఁడంబ (ఆది. 3 ఆ. ౧౧౦) ఉ. 'మీరు' అను బహువచనముపై 'లు' వర్ణకము నిల్వఁగా 'అ'త్వమువచ్చుటచే 'మీరలు' అను రూపమేర్పడు. (౨౦౪ విష. ౨౧౫ విష.) తదాదులకుఁజెప్పఁబడిన. (౨౧౫ వి.) 'అత్వము' దీనికిని నుపలక్షణ మనఁదగును. మకారలోపము రాఁగా (యుక్తాయుక్తాపపి మతౌ న మా) 'ఈరలు' అని యేర్పడును.

$\frac{౯}{౨౪}$ సూ. యుష్మదర్థకము.

ప్ర. { నీవు } మీరు, మీరలు

ఈవు — ఈరు, ఈరలు

ద్వి. నిన్నును మిమ్మును

తృ. నీచేతను మీచేతను



$\frac{౧౦}{౨౪}$ సూ. అస్మదర్థకము.

ప్ర. { నేను } మేము, నేము

ఏను — ఏము

ద్వి. నన్నును మమ్మును

తృ. నాచేతను మాచేతను

$\frac{౧౧}{౨౪}$ సూ. ఉభయార్థకము

నిత్యబహువచనము.

ప్ర. మనము

ద్వి. మనలను

తృ. మనచేతను, మనలచేతను

$\frac{౧౨}{౨౪}$ సూ. ఆత్మార్థకము.

ప్ర. తాను { తాము, తారు, తమరు

ద్వి. తన్నును-తమ్మును

తృ. తనచేతను-తమచేతను

చెప్పిన "మిమ్మున్ - మమ్మున్ - తమ్మున్" అనువానిలో మాముడి లోపింపఁగా "మిమున్ - మమున్ - తమున్" అనురూపము లేర్పడును. 'మేము' అనుదానికి రూపాంతరమగు 'నేము' శబ్దమును, తారు శబ్దపర్యాయమగు 'తమరు' శబ్దమును, 'మనచేతన్' మున్నగువానికిఁ బర్యాయములుగా వ్యవహరింపఁబడుచున్న 'మనల చేతన్' మున్నగుశబ్దములును సూరిచేఁ జూపఁబడినవి. వీనికిమాత్రము భారతేతరమహా కవిప్రయోగములు కన్పట్టుచున్నవి. (చూ. ప్రయో.) 'మనలచేతన్-మనలకొఱకున్' మున్నగునవి గాణపతవివరణమునందు సంగ్రహింపఁబడినవి.(గాణ.ఆచ్ఛి.౧౩౬సూ.). గాణపతవివరణకర్త వీనినేకాక "మిమ్ములన్ - మమ్ములన్ - తమ్ములన్" అనురూపము లను సయితమంగీకరించెను. (గాణ. ఆచ్ఛి. ౩౦ పద్య. ౨౬౩ కారి.) (గాణ. ఆచ్ఛి. ౩౨ పద్య. ౨౬౫ కారి.) 'మిమ్ములన్ - మమ్ములన్' అనువాని ననుశాసనకర్తయు నంగీకరించెను. (ఆం. భా. అ. శబ్ద. ౧౧౩ సూ.). వీనికి మహాకవిప్రయోగప్రామా ణ్యముగాని ప్రాచీనాంధ్రవైయాకరణసమ్మతిగాని కన్పట్టలేదు. 'నేము - తమరు' అనువానికిమాత్రము సూ. రా. నిఘంటువులో నీక్రింది ప్రయోగములు చూపఁ బడినవి. "ఉ. నేము భవన్నియోగసరణిం జరియించుచు నొక్కశూద్రు నుద్దా ముని.........(శ్రీరం. ౩ ఆ. ౫౯౧ ప.). సీ. తమరు దెచ్చినప్రాణితతులముందట నుంచి.........(ఉ. రా. ౩ ఆ. ౩౧౬ సూ. రా. ని.) తే-గీ. తమరు పెద్దలరైతి రి త్తఱిని.........(కృష్ణ. ౨ ఆ. ౩౭ ప. సూ. రా. ని.) వీనిలోఁ 'తమరు' అను దానికిఁ బ్రమాణముగాఁ జూపఁబడినపద్యములు రెంటను "తారు"అని కవిప్రయుక్త పాఠములనుకొన్నను క్షతిలేదు.

"నన్నున్ - నిన్నున్ - తన్నున్" అనువానికి "నన్ - నిన్ - తన్" అను రూపాంతరములు సూరిచే సంగ్రహింపఁబడలేదు. ప్రౌఢవ్యాకరణమున సంగ్ర హింపఁబడినవి. (విస్తర II)

---

విస్తర. II ౨౧౯ I విష:—బాలవ్యాకరణమున లేనివిషయము లాంధ్రశబ్ద చింతామణిలో నున్నపుడు త్రిలింగలక్షణశేషకర్త యట్టివిషయములనుసైతము ప్రౌఢవ్యాకరణమున సంగ్రహింపఁడు. చింతామణి బాలవ్యాకరణములు రెండిటికిని బ్రౌఢవ్యాకరణము శేషగ్రంథమని యాతనియాశయము. కావున నీసందర్భమునఁ జింతామణిలోని దేశ్యా దస్మ ద్యుష్మచ్ఛబ్దా త్స్వఙసో రిత్యాదిశ్లోకత్రయముచే సాధిం పఁబడిన 'నా-నీ-తా' శబ్దరూపముల ప్రక్రియ ప్రౌఢవ్యాకరణమునఁ జూపఁబడలేదు. అమూఁడుశ్లోకములలోలేని విషయములే యథర్వణోక్తవిధులతోఁ జేర్చి తాను బ్రౌఢవ్యాకరణమున సంగ్రహించుచు వచ్చెను. "నీ-మీ-నే-మే హల్లులకు

స్త్రిఱుతవారల రనినన్ (ఆర. 3 ఆ. ౨౮౭) క......। ఏనోడితిఁ జెప్పు మెద్ది యిష్టము నీకున్ (సభా. ౧ ఆ. ౨౩౧) తే-గీ. ఏను నొకరాజసుతుఁడ నై యెట్లు దీని (సభా. ౨ఆ. ౧౦౭) క. నీమాటమెయిన చేయుదు। మే మెయ్యదమైన నెందు నెప్పుడు మాకున్ (భీష్మ. ౨ ఆ. ౯) 'నేము' అనుదాని కిట్టిప్రయోగము భారతమునఁ గన్పట్టలేదు. ఉ. నేముఁ భవన్నియోగ సరణిం జరియించుచు........ (శ్రీరంగ. 3 ఆ. ౪౯౧ ప.) (సూ. రా. ని.). ఉ. ఇమ్మదిరాక్షి దస్సె మన కీనడుమన్విడియంగ నొందుచో। టిమ్మునుగాదు నిక్కమున కేను దస్సితి నట్లు గాన... (విరా. ౧ ఆ. ౧౪౮). "నిక్కమున కేమును దస్సితి మట్లుగాన" అను వావిళ్ళవారి ముద్రణము సరికాదు. ఆపాఠముపక్షమున 'ఏము' అనుదానికి 'మనము' అని యర్థము చెప్పవలసివచ్చును. క. చేరువ గలనాగరకులుఁ। దారుఁ గలసి పలుకవలయు ధరణీశుకడన్ (విరా. ౧ ఆ. ౧౨౭) క. తా రరిగి మువ్వురు బలా। త్కారంబున......(సభా. ౧ ఆ. ౧౭౬) మ......వ। ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ తన్ ముద్దుసేయంగ।......(అను. ౧ ఆ. ౧౭౯) చ. విని ముదమందుచున్ శరణు వేఁడెదఁ గావుము నన్ మునీశ్వరా (అను. 3 ఆ. ౨౬౨). "సీ.....। పనియేమి పంచినఁ బదపడిచేసెద ననక తన్ బంచినయూత్షణాంబ।......(ఆది. 3 ఆ. ౧౧౦) ఉ......ని। న్నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ।... న న్నిలువంబెట్టితి.........(భాగ. ౧౦ స్కం. పూ.)" (ప్రౌఢ. శబ్ద. ౭౩ సూ.). తే-గీ. విదురుఁ డేతెంచి యొకపలుకు వినియు నెఱుఁగఁ। గానియట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి (ఆది. ౬ ఆ. ౧౮౪) సీ. పాండుభూ, జనపతి జీవించి మనలఁ గావ (ఆది. ౮ ఆ. ౬౩) క. దీనికి ధృతరాష్ట్రి నను। జ్ఞానము వడయుదును మనకు సమకూరు......(సభా. ౨ ఆ. ౧౦౦). క. ఆలంబులోన రక్కస। మేలంబులు గలవె మనల మేనుల రుధిరం। బేలా......(ఉ. హరి. ౬ ఆ. ౪౮) క......మనలవారల కొలఁదుల్ (భాస్కర. యుద్ధ. ౭౩౮) తే-గీ......మహి మనలగుణంబు లరసి। కరము ముదమందుదుగు (హరిశ్చం. నలో. ౨ ఆ. ౪౧ ప.). మహిన్+మనలగుణలు (హరిశ్చం). మహిమన్+నలగుణంబులు (నల). ఇట్లర్వాచీనమహాకవులు ద్వితీయేతర విభక్తులందును మనలచేతన్ - మనలయొక్క మున్నగురీతిని 'ల' అను నాగమమును బ్రయోగించియున్నారు. ఇట్టివి నన్నయాథర్వణసమ్మతములు కాకున్నను భారతేతర మహాకవిగ్రంథప్రయుక్తములగుటచే సాధువు లనకతీరదు. కావుననె సూరి 'మనచేతను - మనలచేతను' అని యుదాహరించినవాఁడయ్యెను. ద్విపద. ఉడుగక మనలకై యుచితమాడుటయు (రంగ. రా. యుద్ధ. ౬౮౮ ప.). మనలగుణ

శేషాశ్చ ప్రథమా దశ్చ । సబిన్దుర్ద్వస్తు మాత్పరః. (వికృ. అజం. ౧౭ కారి. అహో. ౩౬౫ పు.)

దవర్ణ స్యోత్వయోగః స్యాద్ద్విత్వాదేశా భవన్తిచ. (వికృ. ఆజం. ౧౯ కారి. అహో. ౩౬౫.)

ఏకాదశాదిసంఖ్యాయా।మును ర్డశ్చ సబిన్దుకః । ఆదేశః క్వచి దన్యాత్ర।మాదేశః స్యాత్తథైకతా. (వికృ.అజం. ౧౬ కారి. అహో. ౩౬౫ పు.)

ద్విత్వంచ క్వచిదిష్టం స్యా।దత్వ మాపవిభక్తితా।క్వచి దన్య విభక్త్యర్థే । ప్రథమాపి ప్రదృశ్యతే. (వికృ. అజం. ౧౫ కారి. అహో. ౩౬౫ పు.)

నిత్యం విభాషా సర్వత్ర । సమాసేఽవస్తు సర్వదా. (వికృ. అజం. ౧౯ కారి. అహో. ౩౬౫ పు.)

కల్పతరు. ౨౨౦ మొ. ౨౨౮ వ. విష:—క్వచి దమహతో౽పీత్యాదికారిక ౧౯౧ విషయమునందును లులయోరిత్యాదికారిక ౧౯౨ విషయమునందును కేషాంచిదిత్యాదికారిక ౧౯౩ విషయమునందును "కథితార్థాదిత్యాదిత్యాదికారిక" ౨౦౮ విషయమునందును వ్యాఖ్యాతము లయ్యెను. క్వచి దంత్యస్యేత్యాదికారిక ౨౧౦ VI విషయమున వ్యాఖ్యాతము. క్వచిదమహతో౽పీత్యాదిచే "ఒక్కఁడు- ఒకఁడు - ఒకోఁడు - ఒక్కోఁడు." అనునవి యమహదర్థకములు మహదర్థకములు నగును. లులయోరిత్యాదిసూత్రముచే మహత్త్వమున 'ఒకరు - ఒకోరు-ఒక్కరు- ఒక్కోరు' అని బహువచనరూపము లుండును. ద్వితీయాదిబహువచనములలో "తయో శ్శసాదౌ రే మాత్రే"త్యాది సూత్రముచొప్పున (౧౯౨ విష.) 'ఇత్వము' రాఁగా 'ఒకరిఁ - ఒకోరిఁ - ఒక్కరిఁ - ఒక్కోరిఁ' మున్నగురూపము లేర్పడును. కేషాంచిదిత్యాదికారికచే "ఒకండ్రు - ఒకోండ్రు - ఒక్కండ్రు - ఒక్కోండ్రు" మున్నగురూపములు సిద్ధించును. కథితార్థాదిత్యాదికారికచొప్పున 'ఒకరులు - ఒకో రులు - ఒక్కరులు - ఒక్కోరులు' అనురూపము లేర్పడును. పిదప 'రో ల్లోఽడలటా' మిత్యాదిసూత్రముల చొప్పునను 'డలటాముదితా'మిత్యాదిసూత్రములచొప్పునను (౧౯౯ విష.) "ఒకర్లు-ఒకట్లు" (ఒకళ్ళు) మున్నగురూపములు లభించును. "ఒక ళులు" మున్నగురూపములు నన్నయాథర్వణసమ్మతములు కావని యీవఱకె నిరూపింపఁబడెను. (౨౦౦ విష.)

చేయనగును. అంత్యలోపము లేనిపక్షమున - 'ఒకరుఁడు - ఒకొరుఁడు - ఒక్కరుఁడు- ఒకొక్కరుఁడు - ఒకరువ్రుఁడు - ఒకొరువ్రుఁడు - ఒకరులు - ఒకరువ్రులు' మొదలగునవి గల్గును. లోపపక్షమున - ఒరుఁడు - ఒరులు - ఒరువ్రుఁడు - ఒరువ్రులు - మొదలగు నవిగల్గును. అంత్యలోపమువచ్చి డుజాదులు వచ్చునపుడు దానిపై మఱి డుజ్ఞు ప్రథమైకవచన ప్రత్యయము నిలువదని యెఱుంగనగును. ఒండు - ప్రథమ ప్రాప్తముమీఁద ఖండము నిలువదు. ఆపెశబ్దముచే 'ఒడ్డు = ఇతరుఁడు - ఒడ్డులు = ఒడ్లు = ఇతరులు' - అనిసిద్ధించును. క్వచిద న్యస్యేత్యాది చెప్పునఁ గ్వాచిత్కముగా దీర్ఘముగల్గును. ఒకరాత్రి = ఓరాత్రి (కాశీ. ౫ ఆ. ౧౮౯). ఓరు+కల్లు = ఓరుగల్లు - ఈరాఱు - మొ. ఆదేశాశ్చేత్యాది:—రెండు మున్నగు శబ్దములకు మహద్వాచకత్వమున బహుత్వమునందలి రూపముల నుపదేశించు చున్నాఁడు. ఆదేశాశ్చ = రెండు ప్రభృతులకు వివిధములగు నాదేశములును, పురూ-బహువచన లు వర్ణముచోట పువర్ణపూర్వక రువర్ణమును, రుశ్చ = కాదా చిత్కముగా రువర్ణమాత్రమును (పదురు) నాదేశములగును. పువర్ణపూర్వక రువర్ణమాదేశ మగునపుడు బిందుపూర్వకడకారాగమము రాదని యెఱుంగునది. రెండుశబ్దమునకు 'ఇరు - ఇద్ద' మూఁడుశబ్దమునకు 'మూ' 'ము' నాలుగుశబ్దమునకు 'నలు' ఏనుశబ్దమునకు 'ఏ' ఎనిమిదిశబ్దమునకు 'ఎనమ' తొమ్మిదిశబ్దమునకుఁ 'తొమ్మ' అనునాదేశములగును. అట్లురాఁగా 'ఇరువురు - ఇద్దఱు (౨౧౨ విప.) మూవురు - ముప్పురు (ఇట వాకు ద్విత్వము) నలువురు - ఏవురు - ఐనువురు - ఆఱువురు - ఏడు వురు' అనురూపము లేర్పడును. ఇరువురు = ద్విత్వసంఖ్యగలవారని యిట్లర్థము చేయనగును. 'రెండు+వారు' అని ఛేదము. ఇట్లె ఇరువండ్రు - ముప్పండ్రు మున్నగు చోట్ల 'ఇరువదిసంఖ్యగలవారు-ముప్పదిసంఖ్యగలవారు' అనియర్థము నెన్నవలెను.

రుశ్చః—ఏవురు-ఐదువురు-ఆఱువురు - ఏడువురు. ఈసందర్భమునందంతటను "క్వచిద్గకారోవః" అనుచింతామణిచెప్పున 'ఇరుగురు - మూఁగురు - నలుగురు - ఏగురు - ఐదుగురు - ఆఱుగురు - ఏడుగురు' అనుపాతికరూపముల నెన్నవగును.

సబిన్దుర్డ స్త్విత్యాది:—సబిన్దు ర్డస్తు = బిందుపూర్వకడువర్ణాగమమున్నదో, మాత్ పరః = ఎనమ మున్నగునాదేశములకుఁ బరముగానే యగును. ఉదా:— ఎనమ+ండు+రు = ఎనమండురు - ఎనమండ్రు - తొమ్మ+ండు+రు = తొమ్మండురు - తొమ్మండ్రు. ఎనమండుగురు మున్నగునవి వ్యావహారికరూపములు.

దవర్ణస్యేత్యాది:—దవర్ణస్య = పదిశబ్దముయొక్క దవర్ణైకారమునకు, ఉత్వ తోరాగః = ఉకారాదేశము, స్యాత్ = అగును, వు రు మున్నగునవి చేరునపుడు

పది = పం+దొమ్మిది = పందొమ్మిది. లేదా దీనిని బ్రాఁతాదిసంధి (బా. సంధి. ౩౯ సూ.) చొప్పున సాధింపనగును. పదునొకఁడు మున్నగువానినుండి వానిమహాదర్థక రూపములను సాధించునపుడు వానియంత్యావయవములగు 'ఒకఁడు - రెండు,' మున్నగువాని మహాదర్థకరూపములను నిల్పి సాధించునది. ఉదా:—పదున్+ఒకం డ్రు = పదునొకండ్రు-పన్+ఇద్దఱు = పన్నిద్దఱు - పన్నివురు-పదు+మూవురు = పదుమూవురు మొ. క్వచిదున్మాత్రమ్ = కొన్నియెడల "ఉన్-ఉ" మున్నగు నాదేశములు రాక 'ఉక్' అనునదిమాత్రమె యన్నిటను నిల్చును. పదియు రెండు-పదియు మూఁడు-పదియు నాలుగు. పదియు నొకటి. పదియు నేను. మొ. అక్కరము:—వనమునఁ బదియురెండేఁడులు (ఆది. 3 ఆ. ౧౯.). పదియు నొక్కండ్రు రుద్రులు (కాశీ. ౭ ఆ.). "నిత్యం విభాషా సర్వత్రేతి వచనముచొప్పున "పదాఱవకళకు" (ఆర. ౨ ఆ. ౨౯౬ ప.). 'పదునొకఁడు = పదిచేత నధికమగు నొకఁడు' అని యిట్లు శాకపార్థివాదిరీతి నుత్తరపదలోపసమాసము నెన్నవలెను.

తథైకతేత్యాది:—తథా = ఆప్రకారముగా, ఏకతా = ఇరువది మున్నగు స్థలములం దేకవచనము నిల్చును. ఈయేకవచన మమహత్త్వమునమాత్రమె నిల్చును. ఇరువది = రెండుపదులు, ముప్పది = మూఁడుపదులు. మొ. నిత్యం విభాషా సర్వత్రేతివచనముచొప్పున 'ఏఁబది' అనుటకుమాఱుగా 'ఐదుపదులు' అనవచ్చును. "అబ్జనాభులు నూఱు నైదుపదులు" (కాశీ. ౬ ఆ.). మహత్త్వమున 'ఏఁబండ్రు' (ఏఁబదిసంఖ్య+వారు = ఏఁబదిసంఖ్యగలవారు) మున్నగురీతిని నిల్చును. వికృతివివేకటీకాకర్తయు నారాయణీయగాణపతవివరణకర్తలును "తథైకతా" అనుచో "తథావతా" అనుపాఠమును గల్పించి "ఇరువది-ఇరువది యొకఁడు" అని యుదాహరించిరి (వికృ. ౧౦౯ పు.) (నా రా. గాణ. ఆచ్ఛి. 3౬ ప. ౨౬౯ కారిటీక.).

ద్విత్వంచేత్యాది:—క్వచిత్ = కొన్ని సంఖ్యావాచకములలో, ద్విత్వంచ = పరపదాదిద్విత్వమును, ఇష్టంస్యాత్ =సమ్మతమగును. ఉదా:—మున్నూఱు - నన్నూఱు - ఏనవన్నూఱు - తొమ్మన్నూఱు - మొ. చకారముచే నీద్విత్వము పాక్షికము. గీ. తొమ్మనూఱును దొంబదితొమ్మిది (భీమ. ౬ ఆ.). రెండున కిర్వాదేశముచేసినచో 'ఇరు+నూఱు' అనినిల్చును. క్వచిదన్తశ్యస్యచాన్యస్యేత్యాదిచే 'రు' వర్ణలోపము వచ్చి పైరీతిని ద్విత్వమురాఁగా "ఇన్నూఱు" అని యేర్పడును. లేదా ఇనుమడి - మున్నగుచోట్లఁ గన్పట్టు 'ఇను' శబ్దముతో రూపసాధన మరయనగును. ఇను+ నూఱు = ఇన్నూఱు - మొ. క.....దీని కినుమడుంగగున్.....(ఆర. 3 ఆ. ౨౭౫.)

అత్వే మహానిష్ఠ క్త్రితా - పదమూఁడను మాఁటయొక్క మహావిభక్తి రూపముతో నిల్చి దానికయిన 'అత్వ'ము నిల్చుటయుఁ గలదు. ఉదా:—నూటయిరువది - నూటొకటి - మొ. క. బలయుతులు [illegible] వలుప్రదు సుతులు (ఆది. ౮ ఆ. ౧౧౨). నిత్యం విభాషేతిసూత్రముచే నిది వైకల్పికము అప్రవాధులు. నూఱు నైదుపదులు (శాం. ౬ ఆ.). ఈసూత్రమునకు ద్వితీయాద్యేకవచన పరకత్వమున వచ్చు నౌపవిభక్తికవర్ణముల నుదాహరించుట సరికాదు. వాని కితర స్థలములందునవలెనె యౌపవిభక్తికవర్ణయోగము కల్గును. దీనితోఁ బ్రత్యేకవిధానమేల. "ఒక్కటి - రెంటి - మూఁటి - నాల్గిటి - నాల్గింటి - ఇత్యాది. బాణ మొక్కటి నేసెన్......" (అహో. ౩౬౬ పు.) "ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే" అను చింతామణిసూత్రపులక్ష్యములను బైరితినహోబలపతి దీని కుదాహరించుట సరికాదు. "కం. ఎనిమిది తొమ్మిది పదియును | వనొకం డ్వంద్రెండు గాఁగఁ దగ నేర్పడుచున్ (ప్రబంధరా. ౧౬౩). ద్విత్వంచ క్వచిదిష్టం స్యా | దత్వమౌపవిభక్తితా. (అథర్వ.) ఉదా:—ముప్పది - పదమూఁడు - ఒంటరి - పదముగ్గురు" (ఆం. భా. అ. సర్వా. ౧౯ సూ. వివ. ౬౦ పుట. తృ. ము.). ఇది సరికాదు. "ఏకాదశాదిసంఖ్యాయా ముల్..." అని యథర్వణుఁడు పదిశబ్దవకారమున కత్వయోగమును విధించి పదునొకఁడు-పదమూఁడు - పదునేను - మున్నగురూపములను సాధించుచుండఁగా నీవ్యావహారికరూప మథర్వణసమ్మతమనుచు నిర్దేశముచేయుట కేవలము విరుద్ధమైయున్నది. ప్రబంధరాజ విజయప్రయోగము నవ్యమును నిర్మూలమునునగుటఁ బ్రామాణికముకాదు. ఇట్లర్థముమార్చుటచే "నూటయిరువది" (ఆది. ౮ ఆ. ౧౧౨) మున్నగురూపములు సంగ్రహింపఁబడఁజాలవు. అనుశాసనకర్తగారి యీమార్గమున కీక్రింది వికృతివివేకటీక మూలము కానోపును. "ఒకానొకచోట ద్విత్వము - నత్వము టత్వమును నిష్టంబగును. ఉదా:—ముప్పది-పదమూఁడు-ఒంటరి - ఒంటివాఁడు ఇత్యాదులు." (వికృ. అజం. ౧౦౯ పు.). 'పదమూఁడు' అను వ్యావహారికశబ్దములోని 'అ' త్వమును దీనిచే సాధించుట కేవలము పొరపాటు. ఈకవిజనమండన టీకాకర్త "దవర్ణ స్యాత్వయోగశ్చ | ద్విత్వాదేశాభవన్తిచ" అను కారికను బొత్తిగా మార్చి "రవర్ణస్య తయోగః స్యాత్ | ద్విత్వాదేశా భవన్తిచ" అని యుదాహరించెను. దీనిటీక:—"రేఫమునకు తకారయోగము గల్గును. ద్విత్వాదేశములును గలుగును. ఒకర్త - ఒకత - ద్విత్వాదేశా యని బహువచన ముండుటచే నాగమమును గలదు......" (వికృ. అజం. ౧౧౧ పు.) ఒకత - ఒకతి ఒకతె మున్నగురూపములు సాధింపకయె 'ఒకర్త' అను నొక్కదానిని సాధించెనుట.

పది = పం+దొమ్మిది = పందొమ్మిది. లేదా దీనిని బ్రాంతాదిసంధి (బా. సంధి. 3౯ సూ.) చొప్పున సాధింపనగును. పదునొకండు మున్నగువానినుండి వానిమహాదర్థక రూపములను సాధించునపుడు వానియంత్యావయవములగు 'ఒకండు - రెండు,' మున్నగువాని మహాదర్థకరూపములను నిల్పి సాధించునది. ఉదా:—పదున్+ఒకండ్రు = పదునొకండ్రు-పన్+ఇద్దఱు = పన్నిద్దఱు - పన్నివురు-పదు+మూవురు = పదుమూవురు మొ. క్వచిదున్మాత్రమ్ = కొన్నియెడల "ఉన్-ఉ" మున్నగు నాదేశములు రాక 'ఉన్' అనునదిమాత్రమె యన్నిటను నిల్చును. పదియు రెండు-పదియు మూండు-పదియు నాలుగు. పదియు నొకటి. పదియు నేను. మొ. అక్కరము:— వనమునఁ బదియు రెండేండులు (ఆది. 3 ఆ. ౧౯.). పదియు నొక్కండ్రురుద్రులు (కాశీ. ౭ ఆ.). "నిత్యం విభాషా సర్వత్రేతి వచనముచొప్పున "పదాఱువకళకు" (ఆర. ౨ ఆ. ౨౯౬ ప.). 'పదునొకండు = పది చేత నధికముగు నొకండు' అని యిట్లు శాకపార్థివాదిరీతి నుత్తరపదలోపసమాసము నెన్నవలెను.

తథైకతేత్యాది:—తథా = ఆప్రకారముగా, ఏకతా = ఇరువది మున్నగు స్థలములం దేకవచనము నిల్చును. ఈయేకవచన మహుత్త్వమునమాత్రమె నిల్చును. ఇరువది = రెండుపదులు, ముప్పది = మూండుపదులు. మొ. నిత్యం విభాషా సర్వత్రేతివచనముచొప్పున 'ఏఁబది' అనుటకుమాఱుగా 'ఐదుపదులు' అనవచ్చును. "అబ్జనాభులు నూఱు నైదుపదులు" (కాశీ. ౬ ఆ.). మహత్త్వమున 'ఏఁబండ్రు' (ఏఁబదిసంఖ్య+వారు = ఏఁబదిసంఖ్యగలవారు) మున్నగురీతిని నిల్చును.
వికృతివివేకటీకాకర్తయు నారాయణీయగాణపతవివరణకర్తలును "తథైకతా" అనుచో "తథావతా" అనుపాఠమును గల్పించి "ఇరువది-ఇరువది యొకండు" అని యుదాహరించిరి (వికృ. ౧౦౯ పు.) (నా రా. గాణ. ఆచ్ఛి. 3౬ ప. ౨౬౯ కారిటీక.).

ద్విత్వంచేత్యాది:—క్వచిత్ = కొన్ని సంఖ్యావాచకములలో, ద్విత్వంచ = పరపదాదిద్విత్వమును, ఇష్టంస్యాత్ =సమ్మతమగును. ఉదా:—మున్నూఱు - నన్నూఱు - ఎనమన్నూఱు - తొమ్మన్నూఱు - మొ. చకారముచే నీద్విత్వము పాక్షికము. గీ. తొమ్మనూఱును దొంబదితొమ్మిది (భీమ. ౬ ఆ.). రెండున కిర్వాదేశముచేసినచో 'ఇరు+నూఱు' అనినిల్చును. క్వచిదస్త ఇస్యచాన్యస్యేత్యాదిచే 'రు' వర్ణలోపము వచ్చి పైరీతిని ద్విత్వమురాఁగా "ఇన్నూఱు" అని యేర్పడును. లేదా ఇనుమడి - మున్నగుచోట్లఁ గన్పట్టు 'ఇను' శబ్దముతో రూపసాధన మరయనగును. ఇను+ నూఱు = ఇన్నూఱు - మొ. క.....దీని కినుమడుంగగున్.....(ఆర. 3 ఆ. ౩౪౫.)

అత్వ మౌపవిభక్తితా । సమాసమున పూర్వశబ్ద మౌపవిభక్తికరూపములో నిల్చి దానిపయిని 'అత్వ'ము నిల్చుటయుం గలదు. ఉదా:—మూఁటయినవది - మూఁటొకటి - మో. క. బలయుతులు మూఁటయినవది నలుగురు సుతులు (ఆది. ౭ ఆ. ౧౧౨). నిత్యం విభాషేతిసూత్రముచే ద్వ్యవ నిది వైకల్పికము అజ్ఞనాభులు. నూఱు నైదుపదులు (శాం. ౬ ఆ.). ఈ సూత్రమునకు ద్వితీయాద్యేకవచన పరకత్వమున వచ్చు యౌపవిభక్తికవర్ణముల నుదాహరించుట సరికాదు. వాని కితర స్థలములందువలెనె యౌపవిభక్తికవర్ణయోగము కలుగును. దీనితోఁ బ్రత్యేకవిధాన మేల. "ఒక్కటి - రెంట - మూఁట - నాల్గిట - నాల్గింట - ఇత్యాది. బాణ మొక్కటి నేసెన్......" (అహో. ౩౬౬ పు.) "ఔపవిభక్తికానామ్నామత్వం స్యాత్ప్రథమా తృతీయార్థే" అను చింతామణిసూత్రపులక్ష్యములను బైకొనినహోబలపతి వీని నుదాహరించుట సరికాదు. "కం. ఎనిమిది తొమ్మిది పదియుం బ । దనొకం డ్రెండుఁ గాఁగఁ దగ నేర్పడుచున్ (ప్రబంధరా. ౧౬౭). ద్విత్వంచ క్వచిదిష్టం స్యా । దత్వమౌపవిభక్తితా. (అథర్వ.) ఉదా:—ముప్పది - పదమూఁడు - ఒంటరి - పదముగ్గురు" (ఆం. భా. ఆ. సర్వా. ౧౯ సూ. వివ. ౬౦ పుట. త్రి. ము.). ఇది సరికాదు. "ఏకాదశాదిసంఖ్యాయా మున్..." అని యథర్వణుఁడు పదిశబ్దదకారమున కత్వ యోగమును విధించి పదునొకఁడు-పదుమూఁడు - పదునేను - మున్నగురూపములను సాధించుచుండఁగా నీవ్యావహారికరూప మథర్వణసమ్మతమనుచు నిట్లర్థముచేయుట కేవలము విరుద్ధమైయున్నది. ప్రబంధరాజ విజయప్రయోగము నవ్యమును నిర్మూలమునునగుటఁ బ్రామాణికము కాదు. ఇట్లర్థముచేయుటచే "మూఁటయినవది" (ఆది. ౭ ఆ. ౧౧౨) మున్నగురూపములు సంగ్రహింపఁబడఁజాలవు. అనుశాసనకర్తగారి యీమార్గమున కీక్రింది వికృతివివేకటీక మూలము కానోపును. "ఒకానొకచోట ద్విత్వము - నత్వము టత్వమును నిష్టంబగును. ఉదా:—ముప్పది-పదమూఁడు- ఒంటరి - ఒంటివాఁడు ఇత్యాదులు." (వికృ. అజం. ౧౦౯ పు.). 'పదమూఁడు' అను వ్యావహారికశబ్దములోని 'అ' త్వమును దీనిచే సాధించుట కేవలము పొరపాటు. ఈకవిజనమండన టీకాకర్త "దవర్ణ స్యాత్వయోగశ్చ । ద్విత్వాదేశాభవన్తిచ" అను కారికను బొత్తిగా మార్చి "రవర్ణస్య తయోగః స్యా । ద్ద్విత్వాదేశా భవన్తిచ" అని యుదాహరించెను. దీనిటీక:—"రేఫమునకు తకారయోగము గల్గును. ద్విత్వాదేశములును గలుగును. ఒకర్త - ఒకత - ద్విత్వాదేశా యని బహువచన ముండుటచే నాగమమును గలదు......" (వికృ. అజం. ౧౧౧ పు.) ఒకత - ఒకతె ఒకతె మున్నగురూపములు సాధింపకయె 'ఒకర్త' అను నొక్కదానిని సాధించెననుట సరి

కాదు. ఈవిషయము ముందు వివరింపఁబడును. (౨౨౧ విష.). 'ద్విత్యాదేశా' అనుదాని కింద ద్విత్వోదాహరణమె లేదు. ఒంటిశబ్దము నహోబలపతియె దీని కుదాహరించెను. అత్వసహయోగము విడిచి కేవలౌపవిభక్తికవర్ణము నిల్చుటయుఁ గలదని వ్యాఖ్యచేసి 'ఒంటి - ఒకటి - ఎక్కటి' అనువానిని గ్రహింపనగును. "క్వచిదన్యచాన్యస్య" త్యాదచే 'క' వర్ణలోపము చేయనగును. బిందు పూర్వక టివర్ణమును నౌపవిభక్తికమె. 'ఎక్కటి' అనుచో ఒక్కశబ్దమునకు 'ఏక్కా' దేశము చేయనగును. లేడా వైకృతమగు ప్రత్యేకశబ్ద మనందగును.

క్వచిదన్యవిభక్త్యర్థ ఇత్యాది:—షష్ఠీసమాసమున షష్ఠీవిభక్తిచోట ద్వితీయ నిల్చునని భట్టారకుఁడు 'షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా। తత్పురుషసంస్థితానామ్నామ్' అని యుపదేశించెను. అయ్యది సమాసపరిచ్ఛేదమున నుదాహరింపఁబడును. (౨౭౦ విష.). అట్టిసూత్రము నథర్వణుఁడు దీనిచే నవరించుచున్నాఁడు. క్వచిత్ = ఒకా నొకప్పుడు, అన్యవిభక్త్యర్థే = ఇతరవిభక్తులయర్థమునందు, ప్రథమాపి = ప్రథమా విభక్తియు, ప్రదృశ్యతే = కనఁబడుచున్నది. ఉదా:—క. బలయుతులు నూట యిరువది। నలువురుసుతులు. (ఆది. ౪ ఆ. ౧౧౨) ఇరువదియొకటి - ముప్పదియొకటి మున్నగుచోట్ల 'నిరువది యధికమగు నొకటి' మున్నగురీతిని సమాసార్థమును గ్రహింపవలయును. అట్టి యితరవిభక్తులయర్థమునందు 'ఇరువది-ముప్పది' మున్నగు ప్రథమాంతములు నిల్చునని గ్రహింపవలయును. ఇరువదిటియొకటి మున్నగురీతిని నీటిలోతు మున్నగువానియందువలె నౌపవిభక్తిక ద్వితీయాంతరూపము నిలువదని భావము. ఇట్టి సంఖ్యావాచకేతరస్థలములలో నీయుత్తరపదలోపసమాసములందు ద్వితీయ నిల్చుటయే సంప్రదాయము (౨౭౦ విష.). "జవ్వాజిసెట్టి - పచ్చళ్ళబాసెట- గాజులసెట్టి. ఇత్యాద్యా ఉత్తరపదలోపాః - స్యాదుత్తరస్యలోపేపి। ద్వితీయా నియతా భవేత్......ఇత్యథర్వణః" (అహో. ౪౪౪ పు.). ఈకారికస్థలాంతరవిష యమె కాని యిటఁ బనికిరాదని తలఁచి కావలయు నారాయణీయాదులలో నిది యీసందర్భమున నుజ్జగింపఁబడినది. అహోబలపండితీయమున నిది యీసందర్భము నందును నుదాహరింపఁబడినది. కవిజనమండనటీకాకర్త దీనిపాఠమును మార్చి దీనిని జెలిచెను. "క్వచిదన్యవిభక్త్యర్థే। ప్రథమాదిః ప్రదృశ్యతే.—తాత్పర్యః— ప్రథమేతరవిభక్తులయందుఁ బ్రథమాదివిభక్తులు గానవచ్చును. ఉదా:— రాముండు నాకు వరమొసంగె. ఇచ్చట చతుర్థ్యర్థంబున షష్ఠి......" (విక్ర. అజం. ౮౭ కారి. టీక. ౧౧౦ పుట.) అనురీతిని దీనికి "అన్యస్యాః క్వచిద్భవే చ్చానా" అనుచింతామణిసూత్రమునకుఁ బునరుక్తమగునట్లుగ వ్యాఖ్యచేసెను, ప్రకృతసందర్భ

[బా. అచ్చి. ౧౩/౨౪ సూ.] 'అవ' లేనప్పుడును సంఖ్యావాచకము పూరణార్థము నిచ్చును. మున దీని నుదాహరించియు నొకశబ్దమునకుఁ బ్రక్రియలో నీ ప్రసక్తి జూపఁ డయ్యెను. ఈతాటికకు 'వాఁడు నిన్నవచ్చెను' మున్నగువాక్యములందును నుపయోగముగలదు. (బా. కార. ౨౫ సూ. ౨౬౫ పుట.) దానిని యితఁ డుదాహరింపఁడయ్యె.

నిత్యంవిభాషేత్యాది:—పయిని జెప్పిన సంఖ్యావాచకవిషయకములగు విధులు సర్వత్ర = అంతటను గవిప్రయోగానుసారముగ, నిత్యమే = నిత్యముగాను, విభాషా = వైకల్పికముగాను వర్తించునని గ్రహింపవలయును.

సమాసఇత్యాది:—అపస్తు = పూరణార్థకమగు 'అవ' ప్రత్యయము, సర్వదా = ఎల్లయెడలను, సమాసే = సమాసమందే వర్తిల్లును. సంస్కృతమునందువలెఁ బూరణార్థకమగు 'అవ' ప్రత్యయముతోఁ గూడినశబ్దము వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడనేరదని యర్థము. ఉదా:—ఏఁడవపర్వము - ఎనిమిదియవపర్వము. మొ. "రెండవవాఁడు మూఁడవవాఁడు ఇత్యాదావవాదేశో నిత్యః. ఏఁడవపర్వము - ఎనిమిదియవపర్వము ఇత్యాదివచన మాచార్యస్య. ఏతేన పదియాఱ్వన్నియపట్టుపుట్టము ఇత్యాది వచన మసంగత మేవేత్యపాస్తమ్" (అహో. ౨౬౬ పుట.) ఇట్లహోబలపతి పర్వశబ్దమునుబట్టి యిది నిత్యమని వ్రాసెనుగాని సంఖ్యావాచకమాత్రము పూరణార్థము నిచ్చు సంప్రదాయము గలదు. "ఉ.........పదాఱువన్నె బంగరువున్నైన.........(పాండు. ౧ ఆ. ౧౨౬.) ఉ.........పదాఱ్వన్నె పసిండిమేడలకు రాఁబనియే మిలసౌధనామముల్. (విజయ. ౧ ఆ. ౭ ప.) సీ. పదియాఱువన్నెగుబ్బలి రాచకూఁతురు. (విజ. ౧ ఆ. ౧౨౨ ప.) ఉ. పదాఱ్వన్నియపట్టుపుట్టము.........(శ్రీనాథుఁడు)" (గాణ. అచ్చి. ౧౫౦ సూ. టీక.).

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద

మ

ఏకార్థకము. ౧౩/౨౪

ప్ర

ఒకఁడు ......... { ఒకరు / ఒకండ్రు

ఒకొఁడు ......... { ఒకొరు / ఒకొండ్రు

| | | |
|---|---|---|
| ఒక్కఁడు | .......... | ఒక్కరు<br>ఒక్కండ్రు |
| ఒకొక్కఁడు | .......... | ఒకొక్కరు<br>ఒకొక్కండ్రు |
| ఒకరుఁడు | .......... | ఒకరులు<br>ఒకళులు<br>ఒకళ్లు |
| ఒకొరుఁడు | .......... | ఒకొరులు<br>ఒకొళులు<br>ఒకొళ్లు |
| ఒక్కరుఁడు | .......... | ఒక్కరులు<br>ఒక్కళులు<br>ఒక్కళ్లు |
| ఒకొక్కరుఁడు | .......... | ఒకొక్కరులు<br>ఒకొక్కళులు<br>ఒకొక్కళ్లు |
| ఒకరువ్వుఁడు | .......... | ఒకరువ్వులు |
| ఒకొరువ్వుఁడు | .......... | ఒకొరువ్వులు |
| ఒక్కరువ్వుఁడు | ...... | ఒక్కరువ్వులు |
| ఒకొక్కరువ్వుఁడు | ...... | ఒకొక్కరువ్వులు |
| ఒరుఁడు | .......... | ఒరులు |
| ఒరువ్వుఁడు | .......... | ఒరువ్వులు |
| ఒండు | .......... | ఒండులు<br>ఒండ్లు |
| ఒడ్డు | .......... | ఒడ్డులు<br>ఒడ్లు |

బాలవ్యాకరణ వివరణము. ౨౨౦ I వివరణము.

ద్వితీయాదివిభక్తిరూపము లూహించుకొనునది. $\frac{\text{౧౩}}{\text{౨౪}}$

సంజీవని. ౨౨౦ I వివ:—"తదుక్త మభిధానకారేణ:—ఏకోఽన్యార్థే ప్రధానేచ। ప్రథమే కేవలే తథా। సాధారణే సమానే ల్పే। సఙ్ఖ్యాయాం చప్రయుజ్యతే" (అహో. ౩౬౬ పు.) శబ్దార్థసాదృశ్యముచేత సూ॰కశబ్దము

ఒకశబ్ద మేకత్వసంఖ్యావాచకమైనను బూజార్థకత్వాదులలో (ప్రౌఢ. శబ్ద. ౪౩-౪౭ సూ.) బహువచనప్రయోగము నందవచ్చును. తే. గీ. ఒకటనైనను వారియం దొకరి లోను। జిమరపాలునఁ బోలండు. (ఉద్యో. ౨ ఆ. ౧౬౧.) క. మాయం దొక్కొక్కళ్ళతు। రీయర్థముఁ దాల్చి శుభచరిత్రుండై... (ఆది. ౪ ఆ. ౧౩౧.) క. కడ వఁగ నొకళ్ళపసరము।నడఁచిన నొక్కరులు పెయ్య నడఁపవలయునే(ఉద్యో. ౩ ఆ. ౫౧) ('ఒకళులు' అని ముద్రణము. ఇది సరికాదు.) (౨౦౦-౨౦౧ విష. బా. ఆచ్ఛి. ౧౩ సూ.) క. గిరిజయు గిరీశుఁడును నొం। డొరువులకై తప మొనర్చి యొకరు లొకళ్ళన్. ('ఒకళులు' అను ముద్రణము సరికాదు.) (అను. ౩ ఆ. ౧౪౧ ప.) క. ఏవేళఁ జూచినం దన। శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్। వేవేల సంఖ్య లుండుదు। రావేళ నొకళ్ళు లేమి యద్భుతమయ్యెన్. (హర. ౨ ఆ. ౩౮ ప.) చ.........ఒకళ్ళొకళ్ళకై। యెదురుగ వచ్చివచ్చి యొకయిద్దఱు ముద్దియ లొత్తి రవ్విభున్. (శృం. నై. ౩ ఆ. ౮౬.) (ఒకతెకై యొకతె). 'ఒండు - ఒరుఁడు ఒరువ్రుఁడు - ఒడ్డు' శబ్దము లన్యార్థమందుమాత్రమె ప్రయోగదృష్టము లగుచున్నవి. 'ఒండొరులు - ఒండొరువులు' మున్నగుచోట్లమాత్ర మేకత్వసంఖ్యను బోధించుట గలదు. "పరస్పరార్థమున నిపు డొండొరులు ప్రయోగించుచున్నారుగాని ఒండొరున్ - ఒండొరులన్ అనునవియే ప్రాచీనరూపములు." (ఆం. భా. అ. సర్వనా. ౧౮ సూ. వివ. ౯౮ పు. తృ. ము.)" అను ననుశాసనవాక్యము సరికాదు. "అని యిట్లు గంగా వసువు లొండొరులు సమయంబుసేసికొని" (ఆది. ౪ ఆ. ౧౩౨ వచనము.) అని నన్నయ ప్రయోగించెను. క. గిరిజయు గిరీశుఁడును నొం।డొరువులకై తపమొనర్చి యొకరు లొకళ్ళన్। బెరయం బడసి.........(అను. ౩ ఆ. ౧౪౧ ప.) క. ఇరువురు నొండొరువులఁ గడు। సురుచిరముగఁ జూచు వాఁడిచూపులు......... (ఆది. ౪ ఆ. ౧౪౭.) అన్యార్థమందు:—క. నేఁ డింక నెఱిఁగి యొరువుల।వాఁడఁగదా యనుచు. (ఉద్యో. ౪ ఆ. ౩౯.) ఆ-వె.........ఒరువు। లనుభవింపఁ దెచ్చుకొనిన మాంసము.........హరించినట్టి నీచు. (అను. ౯ ఆ. ౫౫.) ఆ-వె. ఒరువు లొత్తిచెప్ప నుపకారులై తొలు।పుట్టునందుమనిన యట్టివారు. (అను. ౯ ఆ. ౮౫.) క.........వైదర్భియొరున్। వరియింప నంతధర్మే। తరచరితయె. (అర. ౨ ఆ. ౧౮౪.) క. మాయట్లిడుమలఁ। బడిన నరులుగలరె యొరులు పరమమునీంద్రా. (అర. ౨ ఆ. ౩ ప.) క. ఒరుసొ। మ్మెక్కటిఁ గుడువఁ దలంచితొ. (ఉద్యో. ౨ ఆ. ౨౨.) అన్యార్థకమగు ఒడ్డుశబ్దమునకు:—ఉ. నృపాలుఁడు.....ఏ।యోజనిదగ్ధుఁడై పలుకు నొడ్డులకుం దగదట్లు సేయఁగన్. (విరా. ౧ ఆ. ౧౨౩.) ఉ. ఉత్పలగంధి

[బా. అప్పి. ౧౪/౨౪ సూ.] 'ఒకటి' అను ప్రథమైకవచనము సోమయాజివాడెను (I)
నన్నయకు మొక్షసంబంధము గల్గునేంగనే. (భా. శా. ౩ ఆ. ౧౭౬.) చ. ఇతనికి క్రియం
బలోద్ధతి నహింస్తుంగల్గుంగ మొక్కెంచు. (శాస్త్ర. ౧ ఆ. ౧౭౪.) 'ఒక్క' అనువానా
నెల్ల 'ఒండ్లు' అన్నను జతి గానరాదు. ఒంటికొక్కటము సహాయ్మకమె. చ. అష్టకలో
గ్రపుమహిళాస్త్ర మొంక్కటకుగాదు మమకన్ననగ (శాస్త్ర. ౩ ఆ. ౯౦ ప.)

అ (ప్ర మ హా వి స్త్ర క ను)

ప్రథమైకవచనాంతములు:—ఒకటి - ఒకొంటి - ఒక్కటి -

బాలవ్యా. ఒక్కొంటి - ఎక్కటి - ఒకండు - ఒకొండు - ఒక్కం-

౨౨౦ II విషయము. డు - ఒక్కొండు - ఒండు. ఈకొంటియొకకు సంఖ్యా

వాచకంబునకు బహువచనము లేదు. ౧౪/౨౪

సంజీవని. ౨౨౦ II విష:—ఇందు 'ఎక్కటి' శబ్దమును 'ఒక' శబ్దసంబంధిగాం గాని 'ఏక'శబ్దవైకృతరూపముగాంగాని యెన్నవలెను. (౨౨౦-౨౨౪ విష.). ఇది "ఒంటి" అనుదాని యర్థమునందుమాత్రమె వాడంబడును. ఒకండు - ఒక్కండు మున్నగు డుమంతరూపములు "క్వాచి దమహతో౽పి డుప్ స్యా త్తదుచొప్పున నేర్పడును. ఒకటి మున్నగునవి 'ఒకండు' మున్నగునమహత్తులకుం బర్యా యములనియు నొపవిభక్తికత్వము ప్రథమైకవచనమున నథర్వణవచనముచొప్పునం (౨౨౦-౨౨౪ విష.) గల్గెననియు నట్టిరూపమును భట్టాకుండు వాడలేదుగాని సోమయాజి వాడెననియు నీవలను వ్రాయంబడెను. (౨౨౦ విష.) ఒండుశబ్దము నన్నయతిక్కనల కాలమున నన్యార్థకముమాత్రమెయైనను మధ్యకవులు దాని నేకత్వ సంఖ్యార్థకముగ నమహత్త్వమునందుమాత్రము వాడిరి. చ. మనమున క్రొంత్త రెండు మరుమంత్రములన్ (ఆము. ౪ ఆ. ౨౬౯ ప.) శా. ఒవాచంయమిచంద్ర సంద్రములు నేడొండైనవేళన్. (వశా. ౧ ఆ. ౨౨౭.) (సూ. రా. ని.) (విస్తర I).

---

విస్తర I ౨౨౦ II విషయము:—తిక్కనసోమయాజియె ప్రయోగించె ననుచు నప్పకవి యీక్రిందిరీతిని బొరపాటుగ నభిప్రాయపడెను. "చ.....మా! క్రొనరినసైన్యముల్ పదునొకొంటికిం బ్రాభవ మాచరింప. (ఉద్యో. ౪ ఆ. ౧౪౦.) (అప్ప. 3 ఆ. ౨౧౧.) దీనిమూండవపాదమునందు పదునొకొంటికి నని యున్న చోట సంధిం గూర్చి స్వరప్రధానవడిగా సోమయాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు దేశ్యనిత్యసమాసవడియని యనుకొందురు" (అప్పక. 3 ఆ. ౨౧౧ ప. క్రింద.) దీనినిబట్టి 'ఒకొంటికి' అనునది యిట నఖండపదమనుట సరికా దనియు (సోమయాజి యిట నఖండయతిని బ్రయోగించియుండెను.) "ఒక+ఒండు =

అహోబలపతి 'ఒక్కనవిరివికి' అనుకవిప్రయోగ మున్నదనుచు "ఒక్కన శబ్దోప్యస్తి - ఒక్కన విరివికి ఇత్యాదికవిప్రయోగాత్" (అహో. 3౬౬ పు.) అని

---

ఒకొండు - ఒకొంటికి" అనుసంధిఁగూర్చి సోమయాజులు ప్రయోగించినారనియు నప్పకవియాశయము విశదమగుచున్నది. ఈయప్పకవియాశయము ననుసరించియె వావిళ్ళవారిముద్రణమున సంస్కర్తలు "మీర లీ|యొనరినసైన్యముల్ పదునొకొంటికి" అని సవరించి ముద్రింపించిరని యెన్నవగును. ఇట్టి యపమార్గమె సూ. రా. నిఘంటుకారుల యాక్రింది నిరాధారకల్పనమునకు మూలము కానోపును. "ఒండు-స-వొ ఒకఁడు......ఈశబ్దమునకు నన్నయభట్టారకుని కవిత్వమునందును నంతకుఁ బూర్వము పుట్టిన కొన్ని శిలాశాసనములందును 'అన్యము' అనునర్థముమాత్రమె కన బడుచున్నది. తరువాతికవులు 'ఒకటి' అనునర్థమునం దీశబ్దమును వాడిరి. మఱియు నీశబ్ద మొక్కశబ్దమునకుఁ బరమైనపుడు 'ఒక్కొండు' అయి క్రమముగా 'ఒకొండు-ఒక్కండు - ఒకండు - ఒక్కఁడు - ఒఁడు' ఇత్యాదిరూపములనొంది 'ఒకటి' అను నర్థమున అమహదర్థప్రథమైకవచనరూపముగా వ్యవహరింపఁబడుచుండెను." (సూ. రా. ని.). నన్నయతిక్కనలు 'ఒకొఁడు - ఒక్కొఁడు' శబ్దములలోని 'కొ' అను దానికెల్లయెడలను నమహదర్థమందె కాక మహదర్థకత్వమందును బ్రాణియతినె ప్రయోగించిరి. స్వరసంధికి సూచకమగు స్వరప్రధానయతి నొక్కటనైనఁ బ్రయోగించియుండలేదు. తుదికి 'ఒకఁడు' శబ్దము పుట్టుటకుసయితము 'ఒక్క+ఒండు' అను జంటయె యాధారమనుట మిక్కిలి వింతగొలుపుచున్నది. 'ఒక్క' శబ్దమునకు సైతము 'ఒక్కొ' అనురూపాంతరము విశ్రమస్థానఖచితముగఁ బ్రయోగింపఁబడి యుండ నిట్లు శబ్దచరిత్రమును వచించుట సాహసము! మ......రారాజు సైన్యంబులొ|క్కొమొగిం బెల్లగిలంగ బిట్టడరె సక్రోధాంతరంగంబుతో (కర్ణ. ౨ ఆ. 3౫౨) క......ఉరుశస్త్రవృష్టి నాపైఁ| గురిసిన తత్క్షణమె యొక్కొకొనిపయి నేనున్| వరుసఁ బదిసేసి బాణము| లరుదుగ నేసితి మహాభయంకరవృత్తిన్ (అర. ౪ ఆ. ౬౧ ప.). ఇట్లె శంభుదాసుఁడును బ్రయోగించెను. సీ. వాతాపి యనుదైత్యవరు మ్రింగి యఱిగించుకొనఁడె భూదేవుఁ డొక్కొరుఁడు గినిసి (అర. ౫ ఆ. ౨౦ ప.). అమహాత్త్వంబునందును 'ఒక్కొఁడు' అనుదానిలోని 'కొ'అనుదానికి స్వరయతిలేదు. ప్రాణియతియె ప్రయుక్తమైయున్నది. కం. పాండవులవలనఁ గీడొ|క్కొండును లేదధిప నీదుకొడుకులు (స్త్రీ. ౧ ఆ. ౭3 ప.) చ. ఒ|క్కొటఁబడియెన్ హరార్జునుల ఘోరశరంబులు పందిపై......(అర. ౧ ఆ. 3౦౫) క. ఇటఁ బాండవ కౌరవులొ|క్కొట నందఱు గురు ననుజ్ఞ గొని (ఆది. ౫ ఆ. ౨33 ప.)

'అ-ఇ-ఉ' లెల్లు స్త్రీప్రత్యయములు ఇవి తుదినిగలవె స్త్రీసమములు [౨౨౧ వి. కల్ప.]

అ - ఇ - ఉ - స్త్రీవిషయాః. (ఆం. చిం. హలం. ౧౦ కా.

నన్నయా. ఆహో. ౮౦౩ పు.)

౨౨౧ విషయము. అన్యేచ బహవో దేశ్యా।వర్ణకా అర్థభేదకాః (వికృ.

అజం. ౫౨ కారి. ఆహో. ౩౨౮ పు.)

'అయవః స్త్రీవిషయాః' అని పాఠాంతరము.

కల్పతరు. ౨౨౧ విష:—ఈ కారికలకు ౨౧౭ I విషయమున సంక్షేపముగా వ్యాఖ్యచేయఁబడెను. అ-ఇ-ఉ = 'అ-ఇ-ఉ' అనునవి, స్త్రీవిషయాః = స్త్రీత్వమును దెల్పు ప్రత్యయములు. సంస్కృతమునందలి 'ఆ-ఈ-ఊ' (టాప్. జీప్. ఊఙ్.) అనువానివలెనె యివి యాదృచ్ఛికస్త్రీప్రత్యయము లగుచున్నవి. ఇవి 'ఎ' అనుదానికిని నుపలక్షణమగుచున్నవి. చింతామణిహలంతపరిచ్ఛేదమున "దిస్యాత్ సంబన్ధార్థే... నామ్నః కవర్ణకః స్యాత్ - చురితి క్రియాపదానామ్.........."అనునవి మొదలగు సూత్రములలో నల్పసంఖ్యాకములగు తద్ధితప్రత్యయములును కృత్ప్రత్యయములునుమాత్రము చెప్పఁబడుటచేతను నింకను ననేకములు చెప్పవలసియుండుట చేతను నథర్వణుఁడు అన్యేచేత్యాదికారిక నుపదేశించుచున్నాఁడు.

అన్యేచేత్యాది:—అన్యేచ = చింతామణియుపదేశించిన 'క'మున్నగు ప్రత్యయములె కాక యింకను నితరములైన - బహవః = అనేకములైన, దేశ్యాః వర్ణకాః = దేశ్యములగు తద్ధితములును కృత్ ప్రత్యయములును, అర్థభేదకాః = వివిధములగు నర్థభేదములుగలవి, కవిప్రయోగదృష్టములగుచున్నవి. ఉదా:—వన్నెకాఁడు - సాలీఁడు - వగలాఁడు - వగలాఁడి - కల్లరి - కట్టిఁడి - కన్నెటికము - ఎవ్వత - ఎవ్వతి - ఒకరిత మొదలగునవి తద్ధితాంతములు. చదువుచున్ - చదువు - ఎండ - చేయి - మాపు - మేపు - అడఁకువ మున్నగునవి కృదంతములు. ఇట్టి యాదృచ్ఛికములగు 'అ-ఇ-ఉ-ఎ' అనునవి తుదినిగలశబ్దములెల్ల స్త్రీప్రత్యయాంతములె యనఁదగును. స్త్రీప్రత్యయములును తద్ధితములలోనివె కావునఁ బ్రకృతసూత్రమిట్లు నుదాహరింపఁబడినది. యత్కిమర్థకమగు 'ఏ'శబ్దముయొక్కయు నేకార్థకమగు 'ఒక' శబ్దముయొక్కయు షష్ఠీబహువచనతుల్యరూపములగు "ఎవ్వరి-ఎవరి - ఒక్కరి - ఒకరి - ఒక్కోరి - ఒకోరి" అనునవి స్త్రీప్రత్యయములకుఁ బ్రకృతులగునని గ్రహింపవలయును. వానిపైని 'అ-ఇ-ఉ-ఎ' అను స్త్రీప్రత్యయములు నిల్వఁగా 'త'కారము పూర్వాగమమగును. ఉదా:—ఎవ్వరి+త్+అ = ఎవ్వరిత - ఒక్కరి+

---

ఒక్కటి - ఒక్కోటి - ఒకటి - ఒకోటి - (ప్రౌఢ. శబ్ద. ౧౨ సూ.). "ఎక్కటి యొక్కటి" (స్పష్టము) (ప్రౌఢ. శబ్ద. ౧౩ సూ.).

[బా. అచ్చి. ౧౫/౨౫ సూ.] 'అ-ఇ-ఉ-స్త్రీవిషయాః' ఇది వ్యావహారికశబ్దవిషయమనరాదు

త్ + అ = ఒక్కరిత - ఇట్లె - ఒక్కరితి - ఒక్కరితె - మొ. "క్వచిదన్త్యస్య చాన్యస్య లోపో దీర్ఘశ్చ కుత్రచిత్" (౨౨౦-౨౨౮ విషయము) అనుచోప్పున లోపాదికము రాఁగా, ఒక్కర్త - ఒక్కర్తి - ఒక్కర్తు - ఒక్కర్తె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఒకత - ఒకతి - ఒకతె మున్నగురూపములు గల్గును. ఇట్లు రూపసాధనము ప్రయోగానుసారముగఁ జేసికొనవలెను. "నామ్నః కవర్ణకః స్యాత్" అను వక్ష్యమాణచింతామణిసూత్రముచొప్పున 'ఒకర్త'శబ్దమునుండి 'ఒకర్తుక' అనురూపమును సాధించుకొననగును.

అహోబలపండితుఁడు పై రీతిని ప్రక్రియ నడపక 'అ-ఇ-ఉ స్త్రీవిషయాః' అనునది వ్యావహారికశబ్దమాత్రోపయోగియనుట సరికాదు. "అ-ఇ-ఉ-ఇత్యేతే వర్ణా లోకప్రసిద్ధవ్యావహారిక నామాన్తే ష్వనపాయిత్వేన వర్తంతే-గౌర - గౌరి - గౌరు, లచ్చ - లచ్చి - లచ్చు - ఇత్యాది" (అహో. ౪౦౩ పు.). ఈవిషయములనె నారాయణీయగాణపతవివరణకర్త లనుసరించిరి. క......స్త్రీలింగంబులఁ గొన్నిటి | నాలోకింపంగ న ది దుదంతంబులగున్......వివర. ఉదా:—గౌర - గౌరి - గౌరు- లచ్చ - లచ్చి - లచ్చు - మొ. (నారా. గాణ. తద్ధిత. ౨ పద్య. ౩౩౧ కా.)

అహోబలపతి బాలసరస్వతీయమును జాలవఱకు ననుసరించుచుండునుగాని యిచట బాలసరస్వతీయవిషయములను సరిగ సంగ్రహింపలేదు. పరిశీలింపఁగా బాలసరస్వతీయవిషయములె యిచట మేలుగఁ దోఁచుచున్నవి. "అ - ఇ - ఉ - ఈ మూఁడును, స్త్రీవిషయాః = స్త్రీనామములమీఁద వచ్చువర్ణకములు. గౌర - గౌరి- గౌరు - స్త్రీవిషయములయందె=తెలుఁగు స్త్రీలింగములమీఁద వచ్చుననియు నన వచ్చును. ముంత - పడి - తూము - స్త్రీసమములుచేసికొని సులోపముఁ దెచ్చుకొనునది. సర్వత్ర ఇట్లే." (బాలస—హలం. ౧౦ కారి. టీక.) (ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రణము.)"అయవః స్త్రీవిషయాః. టీక-అయవః(ఇది ద్వంద్వసమాసము) (అ+ఇ=ఏ+ఉ=అయు - దీని బహువచనము - అయవః) 'అ - ఇ - ఉ' అను నీమూఁడును స్త్రీవాచకములమీఁద వచ్చువర్ణకములని తెలియునది. ఉః—లచ్చ - లచ్చి - లచ్చు - రామ - రామి - రాము - గౌర - గౌరి - గౌరు.........ఇవే తెలుఁగు స్త్రీలింగములమీఁద వచ్చెడివని యనవచ్చును. ముంత - పడి - తూము. ఇట్టి వానిని స్త్రీసమములుచేసికొని సులోపముచేసికొనవలెను" (బాలస. హలం. ౯౨ శ్లో. వావిళ్ళవారిముద్రణము.).

దీనికి మహతివాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్య
మాణరూపంబు లెఱుంగునది.

మహత్యర్థకము

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక;
ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత -
ఒకొతుక;
ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు - ఒక్కర్తుక - ఒక్కత -
బాలవ్యా. ఒక్కతుక;
౨౨౧ I విషయము. ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు - ఒక్కొర్తుక -
ఒక్కొత - ఒక్కొతుక;
ఒకరితి - ఒకర్తి - ఒకతి;
ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి;
ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి;
ఒక్కొరితి - ఒక్కొర్తి - ఒక్కొతి;
ఒకరితె - ఒకర్తె - ఒకతె;
ఒకొరితె - ఒకొర్తె - ఒకొతె;
ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె;
ఒక్కొరితె - ఒక్కొర్తె - ఒక్కొతె; ౧౫
ఓర్త - ఓర్తి - ఓర్తు - ఓర్తుక. ౨౮

సంజీవని. ౨౨౧ I విష:—"మహతివాచ్యంబగునపు డేకత్వంబున" అని యిట్లు విశేషించి చెప్పుటచేత 'ఒకటి - ఒకఁడు మున్నగు నమహద్రూపములకు స్త్రీవాచకత్వము లేదు (బా. ఆచ్ఛి ౨౬ సూ.). "సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతికగు" (బా. ఆచ్ఛి. ౨౬ సూ.) అనుసూత్రము చెప్పిన మహద్బహువచనరూపములగు 'ఒకరు - ఒకండ్రు' మున్నగునవి మహత్యర్థకబహువచనరూపములును నగుచున్నవి. (విస్తర). ప్రయోగములు:—క. నీ వొకతవేల యిలఁ బడి । వేవుర నేవలచి (విరా. ౨ ఆ. ౨౫౬). సీ......చనియె

విస్తర. ౨౨౧ I విష:—ఒకశబ్దమహతీరూపముల రూపసాధనప్రక్రియ త్రిలింగలక్షణశేషములోనిది ౨౧౭ II విషయమునఁ బ్రదర్శితమయ్యెఁగాన నిచట మరలఁ జూపలేదు.

నొకతె (కళా. ౭ ఆ. ౧౮౭) ఉ.....ఒక్కతన్। బాలికఁ దొల్లి యేవురకు భామినిగా సృజియించి (ఆది. ౭ ఆ. ౨౧౧). వచనము-తొల్లి గౌతముండను జటిలుఁడను ఋషికూఁతురు తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతియ భార్యయయ్యె (ఆది. ౭ ఆ. ౨౫౧) తే-గీ.....వీణవాయింపఁ బొగడంగ విరులుగట్ట। నేర్చునట్టిది యొకరితనియతయోర్తు (కాశీ. ౫ ఆ. ౩౧౬) సీ. చక్రవర్తి నొకర్తు సక్కనికువలయం, బుల ముంచి (ఉ. రా. ౩ ఆ. ౨౧౫) తే-గీ. చిర కెంగేలఁ బూన నెచ్చెలి యొకర్తె (దశా. ౩ ఆ. ౧౮౮) శా. నే నిర్మించినకామినీమణులలో నీటొందు నీలాలకన్। నే నింకొక్కరితన్ సృజింతు (ఉ. రా. ౫ ఆ. ౨౮) సీ. పడఁతు లొక్క రొకళ్లపైఁ జల్లు జలబిందు, లొడలు సోకిన (ప్రభా. ౨ ఆ. ౧౦౬) చ.....ఒకళ్లొకళ్లకై। యెదురుగ వచ్చివచ్చి యొక యిద్దఱు ముద్దియలొత్తి రవ్విభున్ (నైష. ౩ ఆ. ౭౬) ఇట్లు స్త్రీవాచకములకు బ్రయోగము లరయునది. పయిప్రయోగములెల్ల సూ. రా. నిఘంటువునుండి యెత్తఁబడినవి. ఒకఁడు మున్నగువానికి 'ఒకొఁడు' మున్నగురూపాంతరములు మహాకవిప్రయుక్తములగుటంచేసి యంగీకరింపఁబడెను. అట్లవి యంగీకరింపఁబడుట కారణముగా "ఒకొత - ఒకొరిత - ఒక్కొత - ఒక్కొరిత" మున్నగురూపము లంగీకరింపఁబడెను గాని వీనిలోని 'ఒకొత' మున్నగువాని 'ఒ'త్వమును, ఒకత - ఒకతి - ఒకతె - మున్నగువానిలోని 'త - తి - తె' మొదలగువానిస్వరములను నిర్ణయించు యతిప్రాసాదిఘటితప్రయోగములు లభింపలేదు. ఇట్టివి ప్రయుక్తములుమాత్రమె గ్రాహ్యములనుట యుక్తము.

అహోబలపతి వీనిని బయిరీతిని సాధింపకున్నను "స్త్రీత్వే ఒక్కతె - ఒక్కర్తు - ఓర్తు - ఎవ్వతె - అవ్వతె - ఇవ్వతె - ఇత్యాద్యాః" (అహో. ౩౨౯ పు.) అని యన్యేచ బహవ ఇత్యా ద్యథర్వణకారిక నుదాహరించెను. కాని 'ఎవ్వతె' అనుదాని సామ్యమున నుదాహరింపఁబడిన 'అవ్వతె - ఇవ్వతె' అనునవి యశ్రుతచరములు.

ఇంక ద్విప్రతిభృసంఖ్యావాచకంబులు ప్రథమాంతరూపంబులు వక్కాణించెద.

| మ | అ |
| --- | --- |
| ఇద్దఱు<br>ఇరుగురు } | రెండు |

| | మ | అ |
|---|---|---|
| | మూగురు<br>ముగ్గురు<br>ముగురు | మూఁడు |
| | నలుగురు | నాలుగు |
| | అయిదుగురు | అయిదు |
| బాలవ్యా. | ఏగురు | ఏను |
| విష. ౨౨౨ వి. | ఆఱుగురు | ఆఱు |
| | ఏడుగురు | ఏడు |
| | ఎనమండ్రు | ఎనిమిది |
| | తొమ్మండ్రు | తొమ్మిది ౧౬/౨౪ |
| | పదుగురు<br>పదురు<br>పదుగుండ్రు<br>పదుండ్రు | పది |
| | పదునొకరు | పదునొకటి |

ఇచ్చట నేకశబ్దార్థకరూపంబులెల్ల నర్థానురూపంబులుగం గూర్చుకొనునది.
పదునొకొరు - పదునొకొటి ఇత్యాదులు

| | మ | అ |
|---|---|---|
| | పన్నిద్దఱు<br>పన్నిరుగురు | పండ్రెండు |
| | పదుమూగురు<br>పదుముగ్గురు<br>పదుముగురు | పదుమూఁడు |
| | పదునలుగురు | పదునాలుగు |
| | పదునయిదుగురు | పదునైదు |
| | పదునేగురు | పదునేను |
| బాలవ్యాకరణ | పదునాఱుగురు | పదునాఱు ౧౬ |
| వివరణము. | పదునేడుగురు | పదునేడు ౨౪ |
| ౨౨౨ విషయము. | పదునెనమండ్రు | పదునెనిమిది |
| | పందొమ్మండ్రు | పందొమ్మిది |

| మ | అ |
|---|---|
| ఇరువండ్రు | ఇరువది |
| ఇరువదియొకరు | ఇరువదియొకటి |

ఇత్యాదు లూహ్యంబులు

| | మ | అ |
|---|---|---|
| | ముప్పండ్రు | ముప్పది |
| మాలవ్యా. | నలువండ్రు | నలువది |
| విప. ౨౨౨ | ఏఁబండ్రు | ఏఁబది |
| విష. | అఱువండ్రు | అఱువది |
| | డెబ్బండ్రు | డెబ్బది |
| | ఎనుబండ్రు | ఎనుబది |
| | తొంబండ్రు | తొంబది ౧౬/౨౮ |
| | నూఱుగురు | నూఱు |
| | వేగురు | వేయి |
| | పదివేగురు | పదివేలు |

సంజీవని. ౨౨౨ విష:—ద్వి ప్రభృతిసంఖ్యావాచకములు మహదర్థంబులు నిత్యబహువచనాంతంబులనియు నమహదర్థంబులు నిత్యైకవచనాంతములనియుఁ దాను వివరించినవివరణమున (౨౧౧ II విష.) కనుకూలముగ ద్విప్రభృతి సంఖ్యావాచకములలో "ఇద్దఱు - ఇరుగురు" మున్నగువానిని నిత్యబహువచనాంతములుగాను, రెండు - మూఁడు మున్నగువానిని నిత్యైకవచనాంతములుగాను నిపాతరూపములను సూరి యుదాహరించెను.. (విస్తర.)

---

విస్తర. ౨౨౨ విష:—త్రిలింగలక్షణశేషమున వెనుక నుదాహరించిన యథర్వణకారికల ననుసరించి ద్విప్రభృతి సంఖ్యావాచకముల రూపసాధనప్రక్రియ శబ్దపరిచ్ఛేదమున నీక్రిందిరీతిని సూత్రింపఁబడెను. "౭౬. సర్వనామంబులకు మహదర్థంబునం దఱుచుగ లు ల లకు రు ర లగు. ఎల్లరు - ఎల్లరన్ - వారు - వీరు - వేరు - మొ. తఱచుగ ననుటచే తాము మేము........" (ఇట్లు - 'రెండు+లు = ఇరు+రు' అనియుండఁగా) "౯౧. రు ర వర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు. ఇరుగురు, మూగురు......మొ. సాధారణంబుగ ననుటచే ఎనమండ్రు.........ఇత్యాదులందు రాదు". (౯౭ సూత్రముచొప్పున 'రెండు' అనుదానికి 'ఇరు' ఆదేశము)

"౯౨. సంఖ్యావాచకంబులకు విభక్తిపరంబగునపుడు కొన్నిటి యంత్యాక్షరంబులకు లోపంబగు. మూగురు......ఎనమండ్రు......మొ (౯౪-౧౦౧ సూ. చొ. ఎనమండ్రు మున్నగువానిలోని తుది యిత్వోత్వముల కత్వంబు. నివర్ణంబున కత్వంబును)......". "౯౩. రు ర వర్ణకంబులు పరంబులగునపుడు కొన్నిటికి నిత్యముగాను, గొన్నిటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబు పూర్వాగమంబగు. ఉ. ఎనమండ్రు - ఎనమండ్రన్......ఇరునండ్రు - ఇరువండ్రన్......పెక్కండ్రు - పెక్కండ్రన్ - పెక్కురు - పెక్కురన్ - పందుండ్రు - పదుండ్రన్ - పదురు - పదురన్ - పదుగుండ్రు - పదుగుండ్రన్ - పదుగురు - పదుగురన్ - వాండ్రు - వాండ్రన్ - వారు - వారిన్" మొ. "౯౪ సూ. బిందుపూర్వక డకారంబు పరంబగుచోఁ దుది యిత్వోత్వంబుల కత్వంబగు. ఉ. ఉక్తము"(ఎనిమి. ఎనమండ్రు. పెక్కు. పెక్కండ్రు). "౯౫ సూ. కొండొకయెడ ఱు ఱ వర్ణకములు పరంబగునపుడును నత్వంబగు - చూపఱు". (౨౧౨ I చొప్పున ఱు ఱ లయ్యెను) (ప్రౌఢ. శబ్ద. ౪౮ సూ.-౨౦౪ విష. విస్తర. చూ. చూపఱులు.) "౯౬. పలుశబ్దంబునకు రు రలు పరంబుల గు నపుడుగువర్ణకంబును వలయుచో మీఁద బిందుపూర్వక డకారంబును విభాషనగు పలుగురు - పలుగుండ్రు". "౯౭. ఇరు రెండున కాదేశంబగు, ఉ. ఉక్తము." "౯౮. ఒకానొకచో నిరుగురున కిద్ద ఱా దేశంబగు." "౯౯. విభక్తిపరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగానగు. ముగురు. (శేషముక్తము)." "౧౦౦. ప్రాప్తహ్రస్వంబులగు మూడేలమీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగానగు. ఉ. ఉక్తము". (ముగ్గురు. ముప్పది. డెబ్బది.). "౧౦౧. ఎనిమిది నివర్ణబున కత్వంబగు. ఉ. ఉక్తము." ౧౦౨. "పదియిత్వంబున కుత్వంబగు. ఉ. ఉక్తము". (పదుండ్రు. మొ.). పై సూత్రములెల్ల ప్రౌఢవ్యాకరణశబ్దపరిచ్ఛేదములోనివి. ఈ క్రిందివి ప్రౌఢవ్యాకరణసమాసపరిచ్ఛేదములోనివి:—"౨౨ ఒకండ్వాదులు పరంబులగుచోఁ దఱచుగ నున్ బదికగు. ఉ. పదునొకండు, పదుమూఁడు...తఱచుగ ననుటంజేసి పదాఱిత్యాది......". "౨౩ పదికి రెం డిరు తొమ్మిదులు పరంబులగునపుడు బిందుపూర్వక డకారంబును ద్విరుక్త నివర్ణంబును బిందువును గ్రమంబుగ దివర్ణంబునకగు. పండ్రెండు - పన్నిరుగురు - పన్నిద్దఱు - పందొమ్మిది........" "౨౪. పదియుత్తరపదంబగుచో నేను తొమ్మిదుల నుమ్ములకు బిందువును ఎని కెనును. ఏడునకు వర్ణవ్యత్యయంబును ఆపరుషంబునకు సరళంబును గ్రమంబుగనగు. ఏఁబది......తొంబది......ఎనుబది......డెబ్బది" (శబ్ద. ౧౦౦ చొ. ద్విత్వము.). (శబ్ద. ౯౨ సూత్రమున నంత్యాక్షర లోపము.). "౨౫. పది యుత్తరపదంబగుచోఁ

ఇరుగురు - మూగురు మున్నగురీతిని సూరి యుదాహృతు లంతటను 'గు' వర్ణమే నిల్పఁబడినది. ప్రౌఢవ్యాకర్తయు "రు రవర్ణంబులు పరంబులగునపుడు సాధారణంబుగా సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు" (ప్రౌ. శబ్ద. ౯౧ సూ.) అని 'గు'వర్ణంబునె యుపదేశించెను. ఇట్టి గకారమునకు "అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. పలుగురు = పలువురు - ఇరుగురు ఇరువురు - వేగురు = వేవురు......" (బాల. అచ్చి. ౨౩ సూ.). అనుచొప్పునఁ బాక్షిక'వ'కారంబు గల్గునని బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణకర్తల యాశయము. "గురు అనునది ప్రాథమికరూపమని తోఁచుచున్నది". (గాణ. అచ్చి. 3౪ పద్య. ౨౬౭ కారి.) "అథర్వణాచార్యులు వురు అనిచెప్పెను. గురు అనిచెప్పలేదు. అన్నియెడలను గకారమునకు వకారము వచ్చుటయే కాన్పించుచున్నది......" (గాణ. అచ్చి. ౧౨౪ సూ.). ఈవిషయమిూవఱకు వేఱుసందర్భమున వివరింపఁబడెను. (౨౧౧ I విష.) గకారము ప్రాథమికమనుట సరికాదు. ఎల్లయెడలను గకారమునునిల్పనేల? వకారరూపమునె నిల్పి దానికి "క్వచిద్గకారోవః" అను చింతామణిచొప్పున వకారమునేలచేయరాదు. చింతామణిసూత్రమున 'గకారోవః' అనుటచే దేనిని మొదటనిల్పినను క్షతిలేదు. 'కాన్' మున్నగు రూపములనుబట్టి గకారనిశ్చయముగలఁ 'అగు' మున్నగుచోట్ల 'గకారమునకు వకారమగు' ననుసూత్రమావశ్యకము. ప్రవాళము = పవడము - బంధువుఁడు = బందువుఁడు. మున్నగు వకారనిశ్చయముగలచోట్ల "వకారమునకు గకారమగు" ననుసూత్ర మావశ్యకము, కావుననే భట్టారకుఁడు రెండుపక్షములకును నుపచరించు రీతిని సూత్రించెను - సూరి యదికానఁడయ్యెను. 'ఇరుగురు' మున్నగురీతిని గకారమును సమర్థించు యతిప్రాసాదిస్థలఖచితప్రయోగము భారతాదిప్రాచీనగ్రంథములలోఁ గానరాదు. ఇరువురు మున్నగురీతిని వకారమును సమర్థింపఁజాలు ప్రమాణములు ప్రబలములు కన్పట్టుచున్నవి. క. దేవరఁ బోలెడువాని మ। హా వీర్యగుణాఢ్యు నొక్కయాత్మజుఁ బడయం। గ్రావలతు నవేతగుణుల్। వేవురుసుతు లయ్యునెందు విఫలముగాదే (ఆర. ౨ ఆ. 3౪3) అని భట్టారకుఁడు 'వేవురు' శబ్ద

---

బూర్వపదంబు దీర్ఘంబునకు హ్రస్వంబగు. ఏను నేనురాదు. ఉ. ముప్పది-నలువది..." (శబ్ద. ౧౦౦ చొ. ద్విత్వము.) "౨౬. కొన్నియెడల నీసమాసపదంబులు యువర్ణవ్యవహితంబులు నగు. అక్కరము - వనమునఁ బదియు రెండేఁడు లజ్ఞాతవాసమొక్కేఁడు. (ఆది. 3 ఆ. ౧౯) తే.గీ.....ద్రోవఁబలగు వేలుపులలోన దొరసి యున్న। పదియు నొక్కండ్రు రుద్రులఁ బాఱవిడిచె" (కాశీ. 2 ఆ.)

మునందు వువర్ణమును ప్రాసగతముఁ బ్రయోగించెను. 'క. గురువచనస్థితి మన కే। వురకును నిది పత్నిగాఁదవుంగావున' (ఆది. ౭ ఆ. ౨౧౩ ప.) అని యింకొకచోట యతిస్థలగతము కలదుగానియట 'ఏ।గురకునునిది పత్నిగాఁదగుంగావున' అని ముద్రణములందు సవరింపఁబడినది. ఉ. ఆర్వురుచక్రవర్తులు పదార్వురురాజులు నేఁటి వార లే। యుర్విబహుప్రకారముల (విక్రమార్కచరిత్రము. ౨ ఆ. ౩౮ ప.) అని క్రీ. శ. ౧౪౩౦ ప్రాంతపు జక్కయకవి 'ఆర్వురు' అనుదానిలోని వకారమును బ్రాసమున నిల్పెను. తిక్కనకించుక పూర్వుఁడనఁదగిన యథర్వణాచార్యుఁడు "ఆదేశాశ్చ 'వురూ' రశ్చ" అని ('౨౨౦-౨౨౪' విష.) 'వురు' అనుదానినిమాత్రమె యుపదేశించెను. గువర్ణమునకిట్టిప్రాచీనస్థితిని నిర్వహించుప్రమాణములు చూప ట్టవు. కాన గువర్ణము ప్రాథమికమనుటకల్ల. అది యర్వాచీనము - మధ్యకవుల కాలమున దానికిఁ బ్రయోగములు కన్పట్టుచున్నవి. మహాస్రగ్ధర - లలనం గై సేసి కాంతల్ రమణగృహమహాలక్ష్మివై యొప్పుమంచుం। గలితాశీర్వాదలై రక్కడ మముగురుభాగ్యస్థితుల్ మీఱ (రాఘ. ౨ ఆ. ౬౩) "అక్కడ+మము+గురుభాగ్య స్థితుల్ మీఱ" అని భారతార్థము. 'అక్కడమ+ముగురు+భాగ్యస్థితుల్ మీఱ" అని రామాయణార్థము. కడమ - ముగురు = తక్కిన "ఊర్మిళామాండవీశ్రుత కీర్తులు. సీ......విన్న నేరికిఁ దరంబే గురు సంగరవిజయైకనిధులయి.........(హరిశ్చంద్రనలో. ౨ ఆ. ౧౧౧ ప.) తరంబే+గురు సంగరవిజయైకనిధులయి. (హరిశ్చం.) ఏగురు+సంగరవిజయైకనిధులయి. (నలకథార్థము) ఏగురు = అయిదుగురు.

పయిరీతిని 'ఇరుగురు - ఇరువురు' మున్నగునవి మహద్బహువచనములగు టయేకాక "సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలె మహతి కగు" (బా. ఆచ్ఛి. ౨౬) అనుచొప్పున మహతీబహువచనాంతములును నగుచున్నవి. ద్విప్రభృతి సంఖ్యావాచకము లమహత్త్వమున నిత్యైకవచనాంతములని సూరి వచించుట సరికాదని యీవఱకుఁ బ్రయోగప్రదర్శనపూర్వకముగ విశదీకరింపఁ బడెను. (౨౧౧ II విష.)

ప్రయోగములు:—చ......అ। యిర్వురువురుఁ బంపఁగాఁ బెటికిరెత్తె ననంతుఁడు తద్గిరీంద్రమున్ (ఆది. ౨ ఆ. ౧౦) ఆ. వె. రాజునొద్దఁ బలువుర్రకు సంకటముగాఁగ. (విరా. ౧ ఆ. ౧౨౬) చ......కృష్ణరేవతీ।రమణులు తాఁకిరయ్యిర్వురన్ (ఉ. హరి. ౪ ఆ. ౨౭౮) క. కోటివియుఁ గోటివియుఁదాఁకిన........ చూ।పఱు పొగడఁ దాఁటుటయు ని।ద్దఱదిక్కుల (భీష్మ. ౧ ఆ. ౨౮౮ ప.) చ... సదృశంబుతలంపఁగ నిద్దఱందు......(శల్య. ౨ ఆ. ౨౬౯) (ఇద్దఱు+అందు.) కం...

నరనాథ..........ము। వ్వూరు,.....(ఉ. హరి. ౬ ఆ. ౩౩) క. తరుణుల నజాత పతులు।......న। ల్వూర......(ఆది. ౮ ఆ. ౩౧౭) మ......వారి ద। ప్రతస్థుల్ సాల్వడి నల్లడన్ జెదరఁగా (ఆది. ౨ ఆ. ౯౨) చ......న। క్రడలను విస్ఫులింగములు (ఆది. ౨ ఆ ౧౫) క......దేవరఁ బోలెడువాని...। వేవ్రకసుతులయ్యు (ఆర. ౨ ఆ. ౩౫౩) క......అనిమిషలోక......వసువులు। నెనమంద్రం గాంచి గంగ యెంతయుఁబ్రీతిన్ (ఆది. ౪ ఆ. ౧౨౬) క...ఠ్ఠో। దాయలగుచు నెనమండురు। వీరలు......(ద్రోణ. ౩ ఆ. ౨౧౬) సీ......తొమ్మండ్రుకొడుకులఁ దొలి వేలుపులఁజేయఁ। బొడమించు నేదేవు బొడ్డుదమ్మి.....। పండ్రెండురూపులై పగలింటిరాజుగా......(ఉ. హరి. ౨ ఆ. ౧౪౪ ప.) చ. త్రిదరి భవత్తనూజులు పద్మండ్రు సముద్భటసింహనాదులై। (కర్ణ. ౩ ఆ. ౧౮౦) క. ననుఁ బదునొకఁ డక్షౌహిణు। లనూనవిభవమున (శల్య. ౨ ఆ. ౩౮౦) గీ. పదియునొక్కండ్రు రుద్రుల......కాశీ. ౭ ఆ. ౧౯౭) అక్కర - వనమునఁ బదియు రెండేఁడులు...... (ఆది. ౩ ఆ. ౧౯) శా. పండ్రెండేఁడులు...... । మండ్రాటంబిది......(ఉ. హరి. ౨ ఆ. ౧౬౭) ద్వి. పాటిబండారులు పన్నిద్దఱందు (బసవ. ౨ ఆ. ౪౪) సీ. మేలైన రెండుతొమ్మిదులు విద్యలలోన (కాశీ. ౩ ఆ. ౧౮౧) (విస్తర. ౧౫౧ I విష) ఆ. వె. తొమ్మనూటిమీఁదఁ దొంబదితొమ్మిది। వర్షములకు (నిర్వ. ౮ ఆ. ౮౪ ప.) ఉ. పొచ్చెమునొంద దీనడువఁబోయిన యేఁడులు తొమ్మనూటి పై। నచ్చుగ.........(వి. పు. ౨ ఆ. ౨౩౯ సూ. రా. ని.) ఆ. వె. తొలుత నెనమనూటతొమ్మిది పైఁ డిట్టి। కల......(జై. భా. ౮ ఆ. ౧౭౬) వీని సామ్యమునుబట్టి యీాక్రింది భీమఖండపద్యమునందు 'తొమ్మనూఱు'నియే కవిప్రయుక్తపాఠమని విశ్వసింపఁదగును. తే-గీ. తొమ్మనూఱును తొంబదితొమ్మిదియును। జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి। (భీమ. ౬ ఆ. ౬౮ ప.) ఈపద్యమున 'తొంబనూఱు'ను పాఠమును శబ్దరత్నాకరమును సూ. రా. నిఘంటువును నంగీకరించి 'తొంబనూఱు'ను నిర్మూలశబ్ద మంగీకరించుచున్నవి. "తొంబనూఱు - స - (తొమ్మిది+నూఱులు) తొమ్మిదివందలు. తే-గీ. తొంబనూఱును దొంబదితొమ్మిదియును।......," (సూ. రా. ని.) "తొంబనూఱు - ద్వ - స - (తొంబది+నూఱు) తొంబదినూఱులు. తే-గీ. తొంబనూఱును దొంబదితొమ్మిదియును।......" (శ. ర.). ఇట్లు తమతమకుఁదోఁచినట్లు నిర్మూలముగాఁ బదచ్ఛేదముల నంగీకరించి కోశద్వయము వారును నీనూతనశబ్దమును సృజించుట కాధారమేమో తెలియకున్నది. పయిభీమఖండ గీతపద్యము 'తొంబ'నూఱును

శబ్దములో బిందుపూర్వక బకారమును నిర్వహింపఁజాలదుగదా. అథర్వణకారికా సాధ్యరూపములు "తొమ్మన్నూఱు - తొమ్మనూఱు" (ద్విత్వంచ క్వచి దిష్టంస్యా। దత్వ మాపవిభ_క్తితా) అనునవే కాని తొంబనూఱు కాదుగదా. అట్లగుటంజేసియే శబ్దరత్నాకరకర్త బిందుపూర్వక బకారనిర్వహణమునకై 'తొంబది'శబ్దము దాని పూర్వావయవమని పదచ్ఛేదము చూపెను. ఆపక్షమున నొకటితక్కువ వేయియను నర్థము రాదుగదాయని సూ. రా. నిఘంటుకర్తలు "తొమ్మిది" అనియే యనను రూపముగఁ బదచ్ఛేదము చూపిరి. సీ. అనఘుఁడై యొనుబదితొమ్మిదివేవురు బ్రాహ్మణప్రవరుల........, ముప్పండ్రుదాసుల నొప్పనిచ్చి।ముదముతో రక్షించుఁ బదివేవు రుత్తమభూసురు లతని...(సభా. ౨ ఆ. ౧౨౧) ద్వి. ఎనయంగ నార్నూఱు నేఁబదియేండ్లు (బసవ. 3 ఆ. ౧౧౫౯) ద్వి. ఇటగూడ నేడు నూఱేండ్లకుఁ గాని (బసవ. 3 ఆ. ౧౧౬౧) సీ. ఎలమితో మఱి యిర్వదేడ్వురుసుదతుల...... (నన్ని. కు. ౧ ఆ. ౭౪ ప.) మధ్యకాలపుకవులగు శ్రీనాథాదులు 'ఇరువై - అఱువై' మున్నగు రూపములనుసయితము వాడిరి. అట్టివి యాథర్వణములు కానేరవు. మ. హరిదాటించె...... । ఇరువైనాలుగుమూర్ల మేర...... (కాశీ. ౧ ఆ. ౫౩) క...... । ఆయతగతి నిల నూటిరు। వైయొనిమిది భేదములను వఱలు దురెలమిన్ (నరస. ౨ ఆ. ౫౦ ప.). మ. అఱచేయింబలె......। అఱువైయోజనముల్ వెడల్పును.....(వరాహ. ౧౦ ఆ. ౧౩౭ ప.) (బాలక. ౧౫౧ పు.). "పదిమనుష్యులు - పదులు మనుష్యులు - మనుష్యులు పదులు" అనునవి వ్యవహారవిదూరము లగుటంజేసియు 'పదువురు మనుష్యులు' అనునది వ్యవహారమునకు సమ్మతమగుటంజేసియు 'రు' బహువచనప్రత్యయమనియు,'వు' ఆగమమనియు నథర్వణుఁ (౨౨౦-౨౨౪ వి.) డుపదేశించెను. కాని యట్టిశబ్దములచరిత్రమును బరిశీలించునపుడు "పది+వారు = పదువురు, పది+వాండ్రు = పదువుండ్రు = పదుండ్రు" అనురీతి నట్టిశబ్దము లేర్పడెననిఁ దోఁచకమానదు. అట్టి తచ్ఛబ్దముతోడి సమాసము ప్రాయికమగుటంజేసి యట్టిసమాసము కలుగనిపక్షమున 'పదులు' అనియే మహద్బహువచనరూప మరుదుగా నిల్చుచువచ్చెనని గ్రహింపనగును. ఉదా:—చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై (కర్ణ. 3 ఆ. ౧౮౦) "అబ్జనాభులు నూఱునైదుపదులు. (కాశీ. ౬ ఆ.). ఇట్టిప్రయోగములపద్ధతి దత్సమశబ్దములందును జూపట్టుచున్నది. గీ. వృద్ధులొకలక్షయున్నను (సభా. ౨ ఆ. ౨౭) సీ... మూఁడర్బుదములు......వీరభటులు (జై. ౫ ఆ.) ఉ. వేఁడివెలుంగులోలిఁ బదివేలసహస్రములు (భోజ. ౪ ఆ.) కం. వీరులు సహస్రసంఖ్యల। వారలు

జనియించి రసురవను లుద్ధతులై (ఆర. ౭ ఆ. ౧౪౪). అచ్చికశబ్దములందుఁ బ్రాయికముగాఁ దచ్ఛబ్దసమాసప్రయోగములె కవిసమ్మతములగుటచే 'శరపురు'మున్నగు 'పురు' శబ్దాంతరూపములు తఱచయ్యెను. తద్భిన్నములు మిక్కిలియరుదు. త్రిలింగలక్షణశేషకర్త యిట్టిచోత్ర నరయక యీ క్రిందిరీతిని బహుత్వమున రుప్రత్యయమురానివెల్ల నమహాత్కార్య విశిష్టములనుచు సూత్రించెను. "మహా ద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్నియెడల నమహాత్కార్యంబు చూపబడెడి. ఉదా:—వ. ఇందుఁ బౌలోమకాలకేయులను నరు లఱువదివేలుందురు. (భార. అర. ౪ ఆ. ౮౧) సీ.....బ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు సమిద్ధమతులు। తే.గీ...యతులు పదివేలు......(భార. అర. ౫ ఆ. ౩౦౬) వ......కనకభూషణాలంకృతులైన పరిచారకులు నూఱువేలు (భా. అర. ౫ ఆ. ౩౦౭.)......" (ప్రౌఢ. శబ్ద. ౧౨౪ సూ.) (చూ. విస్తర. ౧౮౬ IV. విష. (౨౧౧ I విష.)

రెండు మొదలగునవి యుపవిభక్తికశబ్దంబులగుటం జేసి ద్వితీయాదివిభక్తులు పరంబులగునపుడు 'టి-ంటు' లగునని యెఱుంగునది. రెండిటిని - రెండింటిని - మూఁడిటిని - మూఁడింటిని-మూఁటిని. ఇత్యాదులు. ఏకశబ్దమునకు "ఒంటి - ఒకానొకఁడు - ఒకానొకటి - ఒకానొకరిత - ఒరిమ - ఒండొకరు - ఓరట్టి - అను రూపంబులును, ద్విశబ్దార్థంబునకు ఇనుమడి - ఈరాఱు - అనురూపంబులు నర్థవిశేషంబులంజూపబడెను. ౧౭/౨౪

బాలవ్యాకరణ వివరణము ౨౨౩ విష.

"రెండు మొదలగునవి యాపవిభక్తిక శబ్దములగుటంజేసి......" అనెడి సూరివివరణము సరి కాదనకతీరదు. ఒకటిన్ - ఒకొటిన్ - ఒక్కటిన్ - ఒక్కొటిన్ - మున్నగురూపములుండుటచే "ఒకఁడు - ఒకొడు" మున్నగునవి యాపవిభక్తికములు కావా? ఈయేకశబ్దార్థకములకున్నైత నాపవిభక్తికత్వమును నిరూపించు ప్రయోగములు పెక్కు కన్పట్టుచున్నవి. ఇవి యాపవిభక్తికములని వచింపమిం జేసి 'ఒకంటన్ - ఒకొంటన్' మున్నగు బిందుఘటితరూపములు సూరిప్రక్రియలో లభింపకపోవలసివచ్చును. తే-గీ. తక్కొకంటను లేదు వేదజ్ఞలార (స్వర్గా. ౧ ఆ. ౮౨ ప.) క. ఇటఁ బాండవకౌరవు లొ। క్కొట నందఱు గురుననుజ్ఞఁ గొని (ఆది. ౫ ఆ. ౨౩౩) చ.....ఇట్టు లొ। క్కొటఁ బడియెన్ హరార్జునుల ఘోర శరంబులు......(ఆర. ౧ ఆ. ౩౦౫) చ.....మా। కౌనరిససైన్యముల్ పదునొ కొంటికిఁ బ్రాభవమాచరింప (ఉద్యో. ౪ ఆ. ౧౪౦) క.....యాగకరణం। బునఁ దక్కఁగ నొంటఁగలుగ ఁబోలునె చెపుమా (శాంతి. ౫ ఆ. ౩౦౭ ప.) ఒంటిశబ్దమునకుఁ బ్రయోగములు—ఒంటి యందరుగుటుడుగు (ఉద్యో. 3 ఆ. ౨౯) చ. ఇది గడుముద్దరాలు.....ఒం। టిదిరుగుదానికొర్వ దొకటిందనుదా సవరించుచొప్పెఱుం। గదు......(విరా. ౧ ఆ. ౧౦౩) చ. అసమున మీఁదెఱుంగక...... కౌరవసేనయేడ యొం। టి సనుటయేడ నాకిది కడిందివిచారము......(విరా. ౫ ఆ. ౨౩౪). (ఒంటి = ఒంటరి) అథర్వణునివలె సూరి షష్ఠీసమాసములోఁ బ్రథమయుఁ జూపట్టుటగలదని చెప్పమింజేసి (క్వచి దన్యవిభక్త్యర్థే। ప్రథమాపి ప్రదృశ్యతే. ౨౨౦-౨౨౪ విష.) యీ క్రిందిప్రయోగములు సూరిప్రక్రియను విరోధించుచున్నవి. చ.....తొమ్మిదివేలఁ దొమ్మిదిం। దునిమి (నిర్వచ. 3 ఆ. ౬౫ ప.) (తొమ్మిదిటి యొక్క+వేలు). చ. తన పదిదోయిచేతుల (నిర్వచ. ౫ ఆ. ౧౩౨) (పదిటియొక్క+దోయి). అబ్జనాభులు నూఱునైదుపదులు (కాశీ. ౬ ఆ.) (ఐదిటి యొక్క+పదులు). (వీనియందెల్ల 'ఐదిటిచే రెట్టింపఁబడిన పదులు' అను నుత్తరపద లోపసమాసమున షష్ఠినిల్చును. దానికిఁ బ్రథమవచ్చునని యథర్వణుఁ డుపదేశించెను. సూరిపక్షమున నిట్టివానియందెల్ల నాపవిభక్తిక బాహుళకతయె గతియని చెప్పకతీరదు.

సూరిగా రుదాహరించిన 'ఓరట్ట'శబ్ద మేకోశమునందును లేదు. ఒరిమశబ్దమునకు సరియగు నేకత్వార్థము లేకున్నను 'ఏకమతిత్వము = ఐకమత్యము' అను నర్థము గలదు. అయ్యది శబ్దరత్నాకరమునం జూపఁబడెను. సీ దుగ్ధాబ్ధికన్యక తోడికోడలుగాఁగ నొరిమమైనుంట సీకొప్పఁగాదె (నైష. 3 ఆ. ౧౪౬ ప.)

చ. ఒరిమయు భక్తియు న్నెనరు నోర్పు గనంబడ.........మెలఁగుచుండిరి పాండుకుమారులు......(విజయ. ౧ ఆ.౨౬ ప.), "అవ్యార్థమున ఒరిమయనియు... నేకత్వమున నోరట్టయనియు రూపాంతరము లేర్పడెడి" (బా. సా. వే. ౨౪౪-౨౪౫ పుటలు.) అను పేటికావ్యాఖ్య పొరపాటు. అట్టియర్థము లాశబ్దముల కేకోశమునందును లేవు. కవిప్రయోగములందును లేవు. ఇంకను నర్థవిశేషములలో నేకశబ్దార్థకమునకు వాడుకలుగలవు. ఒండొక = మఱియొక - ఇంచుక; ఒండొక రుఁడు = వేఱొకరుఁడు = ఇతరుఁడు - పరస్పరము; ఒండొండ = ఒకటివెంబడి నొకటి = వరుసగా; ఒండొండు = ఒకటినొకటి = పరస్పరము; కొండొక = ఒండొక = ఇంచుక. మఱియొక; "కొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయ యందు......" (బాల. ఆచ్ఛి. ౨౪ సూ. ౪౧ పుట.) అనుసూరి ప్రయోగము చొప్పున కొండొకశబ్దమునకట్టి "ఒకా నొక" అనునర్థము కోశములందుఁగాని కవిప్రయోగములందుఁగాని కన్పట్టలేదు. "కొండొక.....ఇంచుక. "కం. ద్యూత క్రీడకుఁ గొండొక। నేతున్ (విరా ౧ ఆ. ౧౯౬ ప.) "ఒకశబ్దంబొకచో నల్పార్థ కంబగు. ఉదా:—ఒకనూతేఁడుల్ (మార్క. ౫ ఆ.) ఏమొకకొందఱము (విక్ర. ౫ ఆ.)" (ప్రౌఢ. శబ్ద. ౬౪ సూ.).

ఒకానొకఁడు = అనిర్దిష్టార్థకము "ఒకానొక. వై. విణ.....ఉద్దేశింపఁ బడని......(దీనిని బ్రత్యయముతోఁ జేర్చిచెప్పునపుడు మహదర్థమున నొకానొకఁ డనియు మహత్త్వర్థమున నొకానొకతయనియు నమహదర్థమున నొకానొకటి యనియు రూపములు)" (శ-ర) (విస్తర.)

ఇనుమడి = రెండురెట్లు. "ఇను = ఇరు. స (వ్యుత్పత్తియందే దీనికిఁ బ్రయోగము) రెండు. కం. తన యొప్పటిరూపముఁ జే। కొని దీనికి నినుమడుంగగుం బ్రతిబలముం। గనిన.........(భా. అర. 3 ఆ. 3౪౫)......(ఇనుమడుఁగులు = ద్విగుణితము)......ఇబ్బడి - ఇబ్బడించు - ఇమ్మడి - ఇమ్మడించు -" (సూ. రా. ని.)

---

విస్తర. ౨౨౩ విష:—త్రిలింగలక్షణశేషమందలి దీని రూపసాధనప్రక్రియ- "ఒకాను, ఒకచో ననిర్దిష్టార్థమం దొకశబ్దమునకుం బూర్వాగమంబగు. ఒకానొకఁడు- ఒకానొకతె - ఒకానొకటి. ఒకచోననుటచే ఒకఁడు - ఒకతె - ఒకటి (అనఁగా నొకఁడు మున్నగువానికిని "ఒకానొకఁడు" మున్నగువాని యనిర్దిష్టార్థకత్వముగల దని తాత్పర్యము). ఒకశబ్దమొక్కాదులకు నుపలక్షణము. (ఒకానొకఁడు = ఒకా నొక్కఁడు = ఒకానొకొఁడు.) తక్కిన సూరియుదాహరించిన - ఒరిమ - ఓరట్టు మున్నగువానికి రూపసాధనప్రక్రియఁ జూపఁబడలేదు.

ఈరాఱు = (ఈరు+ఆఱు) పండ్రెండు. ఈరేడు = (ఈరు+ఏడు) పదునాలుగు.
తే-గీ. ఏను విల్లందుకొనిన నీరేడుభువన । ములును వడవడ వడఁకు (విరా. ౪ ఆ. ౨౧౯). రెండుశబ్దమునకు హల్లుపరమగునపుడు 'ఇరు' అనియు నజాదిసంఖ్యావాచకము పరమగునపుడు "ఈరు" అనియు నాదేశములగునని సూ. రా. నిఘంటువున "ఇరు - ఈరు" శబ్దములయొద్ద వ్రాయఁబడెను. "ఇరాఱుమేనులన్" (రుక్మి. ౧ ఆ. ౪౩) "చ......ఇరాఱుదెఱంగులు......(రుక్మి. ౧ ఆ.)" (బా. గు. ప్ర. ౧౯౦ పుట. ద్వి. ము.) అను నాధునిక తిమ్మకవి ప్రయోగములు మాత్రమె యచ్పరకత్వమున నీయాదేశము (ఇరు)వచ్చుటకుఁ బ్రమాణములయియున్నవి.

బాలవ్యా. సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు ౨౫.
౨౨౮ విషయము. రెండవవాఁడు-రెండవది; మూఁడవవాఁడు-మూఁడవది.

సంజీవని. ౨౨౮ విషః—దేనిచేత సంఖ్యపూరింపఁబడునో యది పూరణార్థకము. "పూర్యతే అనేనేతి పూరణః" అని పూరణశబ్ద వ్యుత్పత్తి నెఱుంగునది. "రామకృష్ణులలోఁ గృష్ణుఁడు రెండవవాఁడు" అనుచో రామకృష్ణులిద్దఱును ద్విత్వసంఖ్యావయవములెయైనను గృష్ణుఁడు ద్విత్వసంఖ్యను బూరించునుగానఁ గృష్ణుఁడు రెండవవాఁడయ్యెను. "ఏకాదశఃపుత్త్రః" ఇత్యత్ర - యేనకారణేన దశసంఖ్యా పూర్ణాభవతి స ఏకాదశఃపుత్త్రః-దశపుత్త్రేభ్యః పరఇత్యర్థః. (ముగ్ధబో. తద్ధి. ౪౫౦ సూ. దుర్గాదాసవ్యాఖ్య.) ఇట్లు వేఱువిధమున వివరింపఁబడెను.

సూరి 'అవగాగమమనుట సరికాదు'. 'అవ' అనునది యాగమమగునపు డింకఁ బూరణార్థకప్రత్యయ మెయ్యదియగునని యాతఁడుతలంచెనో తెలియకున్నది. సంస్కృతవ్యాకరణమున "మట్" మున్నగునవి యాగమములుకావాయని భ్రమించి నట్లగపడుచున్నది. కాని యచటి మడాగమాదులు పూరణార్థక డట్ ప్రత్యయమునకు విధింపఁబడినవి. "తస్యపూరణే డట్." (౫-౨-౪౮)......"నాన్తాదసంఖ్యాదేర్మట్ (౫-౨-౪౯) డటో మడాగమస్స్యాత్. పఞ్చానాం పూరణః పఞ్చమః(సి.కౌ. ౧౮౪౯-౧౮౫౦ సూ.)" "మటఃప్రత్యయత్వే అకారసహితో మకారోవిధేయః - ఆగమత్వేతు మకారమాత్రమితి" (తత్త్వబోధినీవ్యాఖ్య. ౨౮౬ పు.) (పఞ్చన్+మ్+అ=పంచమ.) (మట్టులో'మ' కారమును డట్టులో 'అ' కారమును నిద్వర్ణములుపోఁగా మిగిలెనని యెఱుంగునది.) 'అవ' అను ప్రత్యయ మాగమముగావచ్చునని సూరి యాశయమేమో ?

ప్రకృతిప్రత్యయముల స్వరములకు సంధినిత్యమెయైనను 'అందు - అవ' అను పరమగునపుడుమాత్రము సంధి యథాసంభవముగాఁ జేయవలయును. (బాల.

సంధి. ౧౧ సూ.) రాములందున్ - రాములయందున్ - హరియందున్ - ఎనిమిద వది - ఎనిమిదియవది - మొ.

ప్రత్యయాద్యచ్చునకు స్వరప్రధానయతినిల్పుట సంప్రదాయము కాదు. 'ఎండు+అ = ఎండ' అను కృదంతములో 'డ' అనుదానికిఁ బ్రాణియతినె నిల్పవల యునుగాని స్వరప్రధానయతిని నిల్పరాదు. కాని ప్రత్యయములలోని, 'అంప - అవ' అనువానియచ్చులకే (కయ్యి-చోటను) స్వరప్రధానయతినె నిల్పుట సంప్రదాయ మైయున్నది. సీ.....ప్రజాపతు! లంద చింతాక్రాంతకుండైనయట్టి...(అశ్వ. ౨ ఆ. ౧౬౨ ప.) గీ. అనఘ మామామశకుని నాకైకడంగి! (సభా. ౨ ఆ. ౧౨౪). "క. కవు లేర్పరించుచో రెం! డవ మూఁడవయనెడియెడల యతులచ్చులగున్ (కవిసం. ౧ తరంగ. ౨౭ లక్ష.) ప్రయోగము - సభాపర్వము-నన్నయభట్టు. సీ. ఆయంబునందు రెండవభాగమొండె మూఁడవభాగమొండె నందర్థమొండె. పారిజాతాపహరణము - ముక్కుతిమ్మన. చ.....కువలయపత్త్రనేత్ర కనుఁగొంటివె కన్నులపండువయ్యె రెం! డవ వినతాతనూభవునియందము" (కవిసం. ౧ తరంగ. ౧౩౦-౧౩౧ పద్య.) మ.....రెం! డవకైలాసముపోలె నున్నయది బ్రహ్మాండంబుతో రాయుచున్ (కాశీ. 3 ఆ. ౧౯౯) సీ. ఆయువువంద నాల్గవపాలు గురుపాల, దాసునియట్లు... (శాంతి. ౫ ఆ. ౧౩౬) (విస్తర.)

---

విస్తర. ౨౨౪ విష:—"కొన్నియెడల నవ కగు కానంబడియెడి. ఉదా:— కం. విన నేఁడగుపర్వము మే! లనఁగా......(భార. ఆది. ౧ ఆ. ౪౧) కం. అనుపమబలులగు కర్ణా! ర్జునవీరులశౌర్యమహిమ శోభిల్లంగా! నెనిమిదియగు పర్వంబిది. (భా. ఆది. ౧ ఆ. ౫౦) చ. పదియగు వేయునిండుటయుఁ బంక్తి ముఖుండు......(నిర్వ. 3 ఆ. ౬౭) ఇట్టియెడల అవ యనియె యుండవచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠమిట్లగపడుచున్నది". (ప్రౌఢ. శబ్ద. ౧౦౩ సూ.). పూరణార్థస్థలములందెల్ల 'అగు' ధాతు తద్ధర్మార్థక విశేషణరూపమును నిల్పినచో నర్థ మెట్టిటో సరిపడినట్లుండును. ఈవిషయమున 'అవ' ప్రత్యయములోని 'అ' అనునది విశ్రమస్థానమున వకారము ప్రాసస్థలమున నిల్చిన ప్రయోగములు లభించి నవేకాని యందలి వకారము విశ్రమస్థానముననిల్చిన ప్రామాణిక మహాకవిప్రయోగము లభింపలేదు. పాదాదిని 'అవ' అనునది నిల్చిన ప్రయోగములలో 'అవ' అనుదానిచోట 'అవు' అను నగుధాతురూపాంతరమునుండి యేర్పడిన (బా. అచ్చి. ౨౭ సూ.) 'అవు' అనెడి తద్ధర్మార్థద్యోతక విశేషణమును నిల్పినచో యతిప్రాసములకు భంగముగలుగనేరదుగాన నట్టిప్రయోగములు సందేహానిర్ణాయకములు కాఁజాలవు.

నన్నయా నస్త్రియామ్. (వికృ. అజం. ౩౮ కారి. అహో.
౨౨౫ విషయము. ౩౧౧ పు.)

కల్పతరువు. ౨౨౫ విష:—ఈసూత్రమునకు ౨౧౫ I విషయమున వ్యాఖ్య చేయఁబడెను. స్త్రీవాచకములగు తదాదిశబ్దములకు (సంఖ్యావాచకములకును) బహువచనమున మహద్వాచకముల కార్యములె యగుననియర్థము. వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు. మొ.

బాలవ్యా. సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తు
సకుంబోలె మహతికగు. ౨౬.
౨౨౫ I విషయము. వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు. వీరు ముగ్వురు శ్రీ
భూనీళలు.

సంజీవని. ౨౨౫ I విష:—మహత్వర్థక సర్వనామ బహువచనమునకును, మహత్వర్థక సర్వనామ కర్తృక క్రియా బహువచనమునకును మహద్బహువచన స్థలములందలి కార్యములవంటివె యగునని యర్థము. మహతీవాచకములు మహ ద్వాచక భిన్నములగుటచే నమహత్తులగుటంజేసి "అవి రెండును రుక్మిణీ సత్యభా

'అవ' లోని వకారము యతిస్థానముననిల్చిన ప్రయోగము సందేహనిర్ణయము చేయఁ గల్గునుగాని యట్టిప్రయోగము లభింపలేదు. అట్లయినను మహాకవి శేఖరుఁడును వైయాకరణాగ్రగణ్యుఁడును నగు నథర్వణాచార్యుఁడు "సమాసేఽవ స్తు సర్వదా" (౨౨౦-౨౨౮ విష.) అని 'అవ' ప్రత్యయమును, గంఠోక్తముగఁ జెప్పుటయె దాని స్థితికిఁ బరమప్రమాణమైయున్నది. 'అవ' అనుచో 'అవు' అని నిల్పునపు డర్థ సంద ర్భముగూడ నంతటను సరిపడదు. "ఆయువునందు నాలవపాలు" అనుతిక్కనప్రయోగ మున 'నాలవుపాలు' అని నిల్పినపుడు చతుర్థభాగమను నర్థమురాక నాలుగగు పాళ్ళనఁగా నాలుగుపాళ్ళను విరుద్ధార్థముకల్గును. "అగు" అను ధాతుజవిశేష ణము పరమగునపుడు నాలుగులోని గు లోపించుటెట్లు? ఇట్లె పైభట్టారకుని సభా పర్వపద్యమునందును "రెండవభాగము - మూఁడవభాగము" అనుచో 'ద్వితీయ తృతీయ' అను నర్థములురాక రెండగుభాగము - మూఁడగుభాగము 'అనఁగా' 'రెండుభాగములు మూఁడుభాగములు' అను నపార్థములు లభించును. 'ఇచ్ఛమైఁ బదుమూఁడవేఁటి యంత్యమున' (బసవ. ౪ ఆ. ౭౦౫ ప.) అను ప్రాచీన బసవపురాణ ప్రయోగమున 'అవు' అనెడి తద్ధర్మార్థక విశేషణమును నిల్పినచో "పదుమూఁడవు నేఁటి" అని సిద్ధించునుగాన ఛందోభంగమగును. పాల్కురికి సోమనారాధ్యుఁడు న సాల్యత్తద్ధర్మోతః, అను విధి నెచ్చటను నుల్లంఘించియుండ లేదు.

మలు. ఇవియూఁదును శ్రీభూనీళలు” అని యనవలసివచ్చుటచే నట్టి యపప్రయోగములు కలుగకుండ నీసూత్ర ముపదేశింపఁబడెను. కావున రుక్మిణీ సత్యభామలను దెల్పు సర్వనామములు 'వారు - ఇద్దఱు' అను మహద్రూపములతో నుండునని యీసూత్రముచే విశదమగుచున్నది. సంఖ్యావాచకములును సర్వనామములె యగుటంజేసి సూరియుదాహరణములు రెంటియందును 'వారు' అనుదానితోపాటు 'ఇద్దఱు' అనునదియు 'వీరు' అనుదానితోపాటు 'ముగ్గురు' అనునదియు మహద్బహువచనరూపములుగనే నిల్పఁబడెను. ఇట్లె సమాపక క్రియాస్థలములందును 'రుక్మిణీ సత్యభామలువచ్చిరి' అనవలయునుగాని 'రుక్మిణీ సత్యభామలువచ్చెను' అన రాదని యెఱుంగునది. (౭౯౬ I విష.). పై సూత్రము సందర్భమునుబట్టి సర్వనామ మహతీవాచకముల యేకవచనము లమహద్రూపములతోనె యుండునని విశదమగు చున్నది. 'ఏ - ఒక' అను శబ్దముల మహతీవాచకరూపములు సూరిచే వేఱుగ విశేషించి నిరూపింపఁబడుటంజేసి యాస్థలములందుమాత్రము 'ఏది-ఒకటి' మున్నగునవి మహత్త్వార్థకములు కానేరవు. 'ఎవతె ఒకతె' అనురీతినె వానిని వ్యవహరింపవలయునని యెఱుంగునది. (౨౧౭ II విష. ౨౨౧ I విష.)

ప్రయోగములు:—మ.—ధవళాక్షుల్ సనికాంచిరంత నెదురన్......... (ఆది. ౨ ఆ. 30) కం......పూజిం। చిరి నవకుసుమ మయాలం। కరణ విశేషముల నచటికాంతలు ప్రీతిన్ (ఆది. 3 ఆ. ౧౫౭). ఉ. నన్ను వివాహమై నమహిమ నందన యీలలితాంగి దొట్టి యీ। కన్నియ లందఱుం దివిజకన్యలతో నెనయైన వారు......(ఆది. 3 ఆ. ౧౬౧) సీ. అంగనాజనుల యుత్తుంగ సంగతకుచ, కుంకుమ చందనపంకములయు। వారివ ధమ్మిల్ల......। వారివ......। వారివ... (ఆది. 3 ఆ. ౧౫౬).

మహన్మహతీద్వయమును సంబంధించునపుడు సర్వనామక్రియల బహువచనము మహద్రూపఘటితమె యగుననుటలో సందేహమెలేదు. చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల బాధ్యమానలై।చలిపిరి......వ......ఇట్లిద్దఱు నన్యోన్య రూపగుణశ్రవణ సంజాతప్రీతులై (ఆర. ౨ ఆ. ౨౭-౨౫).

క్వచిద్గకారోవః (ఆం. చిం. అజం. ౧౬ కారి. అహో.

నన్నయా 3౨౫ పుట.)

౨౨౬ విషయము. ఆద్యగస్య గకారస్య । వకారస్తు నదృశ్యతే (వికృ. అజం. ౭౭ కారి. అహో. 3౨౫).

కల్పతరు. ౨౨౬ విష:—క్వచిత్ = ఒకప్పుడు, గకారః = గకారము, వకారః = వకారమగును. ఉదా:—అగు = అవు, తిగ = తివ, అగిసె = అవిసె. మొ. క్వచిత్ = ఒకానొకప్పుడు, వః = వకారము, గకారః = గకారమగును. ఉదా:— బాంధవ-బంధువు = బందుగు, ప్రవాళ - పగవడము = పగడము, (౨౧౧ IV వి.) వారు=గారు ఇవము=ఇగము = (హిమ) - ఇరువురు=ఇరుగురు, మూవురు=మూగురు, వేవురు = వేగురు. మొ. ఇట్లు రెండువిధములగు ప్రయోగములు నుండుటచేత ద్వివిధముగఁ జెప్పుటకు వీలుపడునట్లు భట్టారకుఁడు సూత్రించెను.

ఆద్యగస్య = పదాదిగతమయిన, గకారస్య = గకారమునకు, వకారస్తు = వకారాదేశము, నదృశ్యతే = కనఁబడలేదు. ఉదా:—గడియ - గని - గరుడి. మొ. "వాస్యాత్ క్వచి ద్వకారోఽవాది గతస్యాద్యపగ్గసకళస్య" అను నప్పకవీయ పాఠము ప్రక్షిప్తమని యీయథర్వణకారిక విశదపఱుచుచున్నది. ఇదియె చింతామణికర్తృ ప్రయుక్తమైయున్నచో "ఆద్యగస్యేత్యాదివచనము నథర్వణుఁ డుపదేశింపఁడుగదా. పర్యాయము లేమోయనఁదగు 'వారు = గారు' అనురీతిరూపము లుండుటచేతఁ గావలయు నథర్వణుఁడు పదాదివకారమునకు గకారము లేదని వివరింపఁడయ్యెను. (౨౧౧ IV విష.). అయ్యగారు - అయ్యవారు. మొ. 'ముప్వురు= ముగ్గురు, ఆర్వురు=ఆర్గురు' మున్నగురూపములు ప్రసిద్ధములై యుండుట సంయోగ స్థలములలో నీవిధివర్తింపదని యుపదేశింపలేదు. 'క్వచిత్' అను చింతామణి సూత్రములోని శబ్దమె యీవిధిని బ్రయోగములనుబట్టి యుపయోగించుకొనవలెనని విశదీకరించుచున్నది.

అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు
బాలవ్యా. వకారంబు విభాషనగు. ౨౭.

౨౨౬ I విషయము. పలుగురు = పలువురు, ఇరుగుర్రు = ఇరువురు, వేగురు = వేవురు, తోగ = తోవ, పగలు = పవలు.

సంజీవని. ౨౨౬ I విష:—'అపదాద్యంబయి' అనుటచేత - గెలుచు - గవను మున్నగుచోటులందలి గకారమునకు వకారము రాదు. 'అసంయుక్తంబయిన' అనుటచేత 'ఉగ్మలి - ఉంగ్రము - తగ్గు - అగ్గలము' మున్నగుచోటులలోని గకారమునకు వకారమురాదు. "క్వచిద్గ్రహణాత్ - రేఁగు - బాగు - వాఁగు - ఇత్యాదా వనాద్యస్యాపి (నవకారః)" (అహో. 3౨౬ పు.) అని కవిశిరోభూషణమున వ్రాయఁబడెను. బదరీవాచకమగుచో 'రేవు' అను వకారఘటితరూపమును గలదు గానఁ బైచోట 'రేఁగు = ఉద్రేకించు' అనుదాని నహోబలపతి యుద్దేశించె ననవల

యును "రేవు - దే - వి.........రేగుచెట్టు - వొవ్రులు రేవ్రలు మోదుగులు. (యయా. ౨ ఆ. శే. ర.)

ప్రయోగములు:—ఉ. క్రొంత యొకానొకశక్తి యుడిగ్గించఁగ శక్యమె యెట్టివారికిన్ (ఆది. ౭ ఆ. ౫౯) క. అవమానదుఃఖతుండయి । పొవయుచు రోషానలంబు పోడిమి వెలుగం । బవనసఖుఁడు గ్రక్కణములు । నెనయఁగఁ దనవాడవు చూపు నిషధునిన్నృపాలన్ (సభా. ౧ ఆ. ౨౫౫) క. అవమానావహమగు...... పుట్టువు గానిందెను పత్ క్షురు । మన్నుబ్రహ్మణులనుఁ నెంచ యక్కొంక్తు నాకన్ (ఆర. ౧ ఆ. ౨౮౨ వ.). చ. ఎనుముననేంద్ర విప్రుడర్ భైన్ జమదగ్నిసుతుండు శాపమి । చ్చె......(శాంతి. ౧ ఆ. ౩౫) కం. వివిధోత్పాతంబులకున్ । నవరు లలోఁ దోఁచుకీడునను......। అప్రను బురోహితునిచే......(శాంతి. ౨ ఆ. ౩౧౮) (నగరు = నవరు = రాజగృహము.) సీ. నవపద్మదళముల౯ దెప్పడు మెఱుఁగుఁ । గను దోయి. (ఆశ్వ. ౨ ఆ. ౪౨) క. శివునంగయష్టి నిజేయఁగ । నవిరళముగఁ బట్టి ప్రాక నని కడునెమ్మిన్ । నిద్రడు నవకల్పలతికల । పవిదిని మృదుబాహులతలు పార్వతికొప్పున్ (నన్ని. కు. ౩ ఆ. ౨౯౯) (నివురు = నిగుడు. పవిదిని = పగిదిని.) ఉ. వేవ్రట యెప్పుడో యకట వెమ్మనమంబున కెద్ది మంవొాయే । త్రోవల (హరి. ఉ. భా. ౭ ఆ. శే. ర.) (వేవ్రట = వేగుట) క. తివ్ర జడలరేయి ద్రిమ్మరి । పువుఁబోఁడి...(అచ్చ. రా. సుంద. శే. ర.) ద్వి. వేల్పుల వారిట్టి విధమెల్లఁ జెప్పఁ । గావిని (రం-రా. యుద్ధ. శే. ర.) క. ద్వివిధంబగు సాధర్మ్యము ।......। తప్రుట (నరస. ౫ ఆ. ౨౫) చ. అవిరళ పుష్పరేణుయుతమై పొలుపొందు మరందవృష్టిచే । నివము గొనంగ (కళా. ౪ ఆ. ౧౦ వ.) "ఇగము = ఇవము. తే-గీ. చల్లనయినం బిగంబు.........(ఆం. భా. ౧౮౦ సూ. రా. ని.) గీ...... ఈవయోగయనఁ గ।మతకిను నొప్పు (సాంబ. ౧౩. సూ. రా. ని.) "దువ - వై - స - దుగయొక్క రూపాంతరము" (శ-ర) "రావి - దే - వి - అశ్వత్థము - రాగి యొక్క రూపాంతరము" (శ-ర) "నవము - వై - వి - నగము యొక్క రూపాంతరము" (శ-ర) "తివ్రుచు = తిగుచు" (సూ. రా. ని.) మొ. (విస్తర.) వాదేశము వచ్చుచో ముందటిఖండము లోపించును. ఉ......వేసఁగి = వేసవి (౫౭ విష.).

---

విస్తర. ౨౨౬ । విష:—వేటికావ్యాఖ్యాత కొన్ని నిర్మూలవిషయముల నిట విస్తరించెను. ఉదాహృతులనయిన నీయలేదు. (బా. సా. వే. ౨౭౯ పు.)

౧. "రెండుపదములుగలిసి యొకానొక విలక్షణమగునర్థము నొసంగుచు నఖండపదము నాఁగభాసించెను వానియందీ వాదేశము చూపట్టదు" ఇది సరికాదు. అగుదెంచు = అవుదెంచు - మొదలగుచోట్ల వాదేశమురాలేదా!

ఔపవిభ_క్తికసంజ్ఞా, వర్ణా ష్టింటా్య దయో భవ స్తీహ।
రల్యాదే ర్నామ్నాం స్యు, స్తేహి విభక్తౌ సమాసేచ.
(ఆం. చిం. సంధి. ౧౨ కా. అహో. ౨౩౦ పు).
కేషాంచి దుదన్తానాం। నేతివిభక్తౌ పునో లుక్ స్యాత్।
ఔపవిభ_క్తిక నామ్నా। మత్వం స్యా త్స_ప్తమీ తృతీ
యార్థే. (ఆం. చిం. అజం. ౨౦ కారి. అహో. ౩౮౨-
౩౮౩ పుటలు.)

నన్నయా విభక్తౌచ సమాసే స్యు। రన్యే ప్యౌపవిభ_క్తికాః।
థర్వణీయము. ఆదేశాః కేవలాశ్చై_ష్షాం। భావో౽భావః ప్రయో
౨౨౭ మొ. గతః. (వికృ. అజం. ౬౦ కారి. అహో. ౩౮౮ పుట.)
౨౩౩-వ విషయము. విభాషయా భవ స్త్వత్ర। భవ స్త్యుపవిభ_క్తయః
భవ_న్తి కుత్రచి న్నై_ష్వ।నిదానం తత్ర సద్వచః॥బహులవో
౽త్రార్థ ౯భాషాయాం। వర్ణా ఔపవిభ_క్తికాః। ప్రవృ
_త్తి శ్చా ప్రవృ_త్తిశ్చ। వికల్పశ్చ క్వచిద్భవేత్।తద్వివేకః
ప్రయోగైక। శరణః స్యా ద్ధిశబ్దతః॥ యత్రైతే తత్రత

---

౨. "అఖండపద మధ్యగత గకారమునఁ దఱచుగ నీయాదేశమగుసు" 'తిగ = తివ, ఈగి = ఈవి, వేసఁగి = వేసవి, తీఁగ = తీవ' మున్నగు ననేకస్థలము లందుఁ బదాంత గకారమునకు వాదేశముగల్గుచుండఁగా నిట్లువ్రాయుట సరికాదు.

౩. "దీర్ఘముమీఁది గకారములకుఁ గ్వాచిత్కముగనగు" ఇది సరికాదు. ఈగి = ఈవి, ఈఁగ = ఈవ, తీఁగ = తీవ, రాగి = రావి, ఓగిరము = ఓవిరము, వేగు = వేవు, మూగురు = మూవురు, ఏగురు = ఏవురు, వేగురు = వేవురు, (ఇట్టి యెడల గు వర్ణాగమమె మొదటిదని యీవ్యాఖ్యాత మతముగాన నివి యుదాహృతములయ్యెను.) త్రాగు = త్రావు, మున్నగు ననేకస్థలములందు దీర్ఘము మీఁది గాకు వాదేశము వెలయుచున్నది.

౪. వకారము పరమందుఁగల గకారముల_కీయాదేశము సామాన్యముగఁ గన్పట్టదు. ఇదియు సరికాదు. తిగువన్ = తివువన్, తగవు = తవవు, ఉడుగవు = ఉడువవు మున్నగునవి పెక్కుగలవు.

౫. డు ము వులకు ముందటివాని కీయాదేశము గలుగదు. ఇదియు సరి కాదు. ఇగము = ఇవము, సగము = సవము, మొదలగునవి లేవా ?

త్సంజ్ఞా। నామ్నాం ఋస్య త్ర చాన్యథా. (వికృ. సంధి.
౨౯ కారి. మొ. ౩౧ కారి. వ. అహో. ౨౩౦ పుట.)

కల్పతరువు. ౨౨౭-౨౩౩ వివ:—ఇహ = ఈయాంధ్రభాషయందు టి-ంట్యా దయః = 'టి-ంటి' మొదలుగాఁగల, వర్ణాః = వర్ణములు, ఔపవిభక్తిక సంజ్ఞాః = ఔపవిభక్తికములనెడి సంజ్ఞగలవి, భవన్తి = అగుచున్నవి. తేహి = అవి, విభక్తౌచ = విభక్తిపరమగుచుండఁగాను, సమాసేచ = సమాసమందును, నామ్నామ్ = నామములయొక్క = ప్రాతిపదికములయొక్క, రుల్వాదేః = తుదినున్న - రు - లు - మున్నగు నక్షరముల కనఁగా వానిస్థానమందు లేదా వానికిఁ బరముగా, స్యుః = అగుచున్నవి. ఇందలి హి శబ్దము ప్రసిద్ధ్యర్థకముగానఁ గవిప్రయోగ ప్రసిద్ధినిబట్టి వీనిస్థితి నెఱుంగవలెనని యర్థము. ఉదా:—నీరు - నీరిని, పగలు - పగటిని - పగలిటిని, పగలింటిని, రెండు - రెండిటిని - రెండింటిని - రెంటిని. వేఁపచెట్టు - ఎంపముక్క - జనుపనార ఇత్యాదులు సమాసోదాహృతులు. 'రుల్వాదేః' అను నాది శబ్దముచేత, ల్లు - న్ను - సు - డు - లి - న్ని - యి-ట్టు మున్నగునవేకవర్ణములు గ్రహింపఁబడును. ఉదా:—ల్లు - ముల్లు - ముంటిని. పల్లు - పంటిని, విల్లు - వింటిని. న్ను - కన్ను - కంటిని, మన్ను - మంటిని - మిన్ను - మింటిని. సు - మేను-మేనిని, వలను - వలనిన్, మ్రాను - మ్రానిన్. డు - అప్పుడు - అప్పటికిన్, గూడు - గూటిన్. లి - రోఁకలి = రోకటిన్, ఆఁకలి - ఆఁకటిన్. న్ని - అన్ని - అన్నిటిన్. యి - గోయి - గోతిన్. ట్టు - అట్టు - అటితిన్. మొ. పది - పదిటిన్, ఏమి - ఏమిటికి, క్రిందు - క్రిందటికి, క్రిందిది, పెక్కు - పెక్కిటిన్, ఆఱు - ఆఱిటిన్, నూఱు - నూఱిటిన్ - మొ.

ఈయుపవిభక్తులు నిత్యముకావనియుఁ బహుళేములనియుఁ జింతామణిలోఁ జెప్పఁబడమింజేసి యథర్వణుఁడు వివరించుచున్నాఁడు:—విభక్తౌ = విభక్తిపరమగుచుండఁగాను, సమాసేచ = సమాసమందును, అన్యేప్యాప విభక్తికాః = టి-ంటీతరములగు మఱికొన్ని యౌపవిభక్తికవర్ణములును, ఆదేశాః = శబ్దాంతిమ వర్ణముల కాదేశములగుచును, కేవలాశ్చ = ఆదేశములు కాకయునవఁగా నాగమములగుచును వచ్చును. ఏషామ్ = వీనియొక్క, భావః = ఉనికియు, అభావః = లేమియు, ప్రయోగతః = మహాకవిప్రయోగములవలనఁ దెలియనగును. అత్ర = ఈయాంధ్రభాషయందు, ఉపవిభక్తయః=ఔపవిభక్తికములు, విభాషయా భవన్తి = కొన్నియెడలఁ వైకల్పికముగానగును. భవన్తి = కొన్నిచోటులందు నిత్యముగానగును. క్వచిత్ = కొన్నియెడల, నైవ భవన్తి = నిలువనేనిలువవు. తత్ర =

ఇట్టి వివిధస్థితులవిషయమున, సద్వాచః = మహాకవిప్రయోగములు, నిదానమ్ = మూలమగును. అత్ర - ఆన్ధ్రభాషాయామ్ = ఈయాంధ్రభాషయందు - ఔపవిభక్తికాః వర్ణాః = ఉపవిభక్తులగు (విభక్తులసమీపమున నిల్చునవి) వర్ణములు - బహులాః = అనేకములుగలవు. "ఇ - టి - ఇటి - ఇంటి - తి - ఇతి - అటి - ప - ంప - ంప" మున్నగునవి పెక్కుగలవని తాత్పర్యము. క్వచిత్ - ప్రవృత్తిశ్చ = ఒకచోట నిత్యప్రవృత్తియు, క్వచిత్ - అప్రవృత్తిశ్చ = ఒకచోటరాకుండుటయు, క్వచిత్ - వికల్పశ్చ = ఒకయెడ వైకల్పికముగ వచ్చుటయు, భవేత్ = అగును, హిశబ్దతః = 'టి-ంట్యాదయోభవన్తి హ,... తేహివిభక్తౌ" అను భట్టారకవాక్యములోని ప్రసిద్ధ్యర్థకమగు హిశబ్దమహిమచొప్పున, (చింతామణికి వికృతి వివేకము వివరణమనుటకిది ప్రబలప్రమాణము) తద్వివేకః = ఆయుపవిభక్తుల ప్రవృత్త్యప్రవృత్త్యాది వివేకము, ప్రయోగైకశరణః స్యాత్ = మహాకవిప్రయోగమె ముఖ్యమగు ప్రమాణముగలదియగుచున్నది. యత్ర = ఏశబ్దములందు, ఏతే = ఇవి, యుపవిభక్తులనుట, నిలుచునో, తత్ర = ఆశబ్దములందు, తత్సంజ్ఞా = ఆయౌపవిభక్తికములనెడి సంజ్ఞ, వర్తిల్లును, అన్యత్రచ = ఈయుపవిభక్తులు నిలువనిస్థలములందు, నామ్నామ్ = ప్రాతిపదికములకు, అన్యథా = వేఱువిధమనఁగా నన్నౌపవిభక్తికసంజ్ఞ కలుగును. ఉదా:—అన్నిటిన్ - అన్నిటన్ ఇత్యాదులందు నిత్యప్రవృత్తి. నెత్తురును, నెత్తుటిని 'ఆఁకలికి - ఆఁకటికి' ఇత్యాదులందు వైకల్పికప్రవృత్తి - తీరుమారు (పలుమారు. మొ.) మేలు - డాలు - వాలు మున్నగువానియం దప్రవృత్తి. సూ-రా-నిఘంటువున ఔపవిభక్తికత్వానౌపవిభక్తికత్వములు రెండునుగలవని నిర్ణయించునపుడు 'నీరునన్ - తోలునన్' మున్నగురీతిని 'న' ప్రత్యయముతోనున్న ప్రయోగములే యనౌపవిభక్తికత్వ నిర్ణాయకములుగాఁ జూపఁబడుచుండును. సప్తమ్యర్థమున 'అన్' అనునది నిలుచునప్పటివలెనె 'నన్' అనునది నిల్చునప్పుడును నది యౌపవిభక్తికశబ్దమెయని సూ. రా. నిఘంటుకారులు తలంపకుండుటంజేసి యట్లువ్రాయుట సంభవించెను. 'అన్' అనునది 'నన్' అనుదాని సంక్షేపరూపమే యనియు 'నన్' అనునది యౌపవిభక్తికశబ్దములకును విధింపఁబడెననియు నీక్రింది భట్టారకసూత్రమె విశదీకరించుచున్నది.

కేషాంచిదిత్యాది:—కేషాంచి దుదన్తానామ్ = కొన్ని 'ఉ'కారాంతములగు నౌపవిభక్తికశబ్దములకు, నేతివిభక్తౌ = 'నన్' అను విభక్తిపరమగుచుండఁగా, ఉనకారములోని 'ఉన్' అనెడి భాగమునకు, బహుళమ్ = బహుళముగా (ఔపవిభక్తిక

లీనా మిల్లుగ్బహుళేష్వను సూత్రమునుండి బహుళేష్వనుపద మనువర్తించును. లుక్
స్యాత్ = లోపముకల్గును. 'ఉదన్తానాం సేతివిభక్తౌ' అనుటచే 'న' అను విభక్తి
పరమగుచుండఁగా 'ఉ' దంతత్వమె నిల్చునని యర్థము లభించుచున్నది గాన నచట
రావలసిన 'ఇ' అను సుపవిభక్తి లోపించునని వ్యాఖ్యచేయనగును. ఉన్ లోపము
వచ్చుశబ్దములు 'ఇ' అను సుపవిభక్తివచ్చునవే కని ప్రయోగ దృష్టములయియుండు
టచే నట్లు వ్యాఖ్యచేయవలసెను. ఉదంత జడవాచకములకు 'నన్' అను సప్తమీ
విభక్తి వచ్చుననుటకును నీసూత్రమే జ్ఞాపకమగుచున్నది. (౧౩౭ విమ.). ఔపవిభ
క్తికములు జడవాచకములెయగుట సహజముగాన నౌపవిభక్తికోదంత జడవాచకము
లకును 'నన్' ప్రత్యయమగునని యెఱుంగునది. ఉదా:—చోటు+నన్=చోటు+ఇ+
నన్=చోట్+అన్ = చోటన్. ఇట్లె మేనన్-ఊరన్ - క్రిందన్-మీఁదన్-నడుమన్-
ప్రోలన్-పొరన్ మొ. అనౌపవిభక్తికోదంత జడవాచకములకును 'నన్' ప్రత్యయము
వచ్చునని యథర్వణుఁడు నవరించియున్నాఁడు. (౧౩౭ విమ.). వనమునన్ = వన
మందు, తరువునన్ = తరువునందు, చిగురునన్ = చిగురునందు. ఇట్టి యనౌపవిభక్తిక
ములకు "అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా" అను సూత్రముచొప్పునఁ దృతీయార్థము
నైతము లభించునని ప్రయోగానుసారముగా వ్యాఖ్యానము చేయనగును.
ఉదా:—వనమునన్ = వనముచేతను, వనమునందును - మొ.

ఔపవిభక్తిక నామ్నామ్ = పైసూత్రమునకు విషయములు కాని యనఁగా
'ఉన్' లోపముగలుగని యౌపవిభక్తికశబ్దములకెల్ల, సప్తమీ తృతీయార్థే = సప్త
మ్యర్థమందును దృతీయార్థమందును (కేషాంచిదిసూత్రముచొప్పున నున్ లోపము
కల్గిన యౌపవిభక్తికములకు సప్తమ్యర్థముమాత్రమె సమ్మతమగుటం జేసియే తద్భిన్న
ములగు నౌపవిభక్తికములకుఁ దృతీయార్థసిద్ధికై యీసూత్రమారంభింపఁబడెను)
అత్వంస్యాత్ = అత్వముకల్గును. ఉదా:—కంటి+అన్ = కంటన్ = కంటియందు,
కంటిచేత, పంటి+అన్=పంటన్=పంటిచేత,పంటియందు. ముంటి+అన్=ముంటన్=ముంటి
చేత-ముంటియందు. "వింటన్-కంటన్, ఇట్టివానిని చింతామణి వివరింపలేదు" అనుట
సరికాదు. (ఆం. భా-చ. ౧౬౭౭). అత్వము తృతీయాసప్తమ్యర్థకమగుటచేత ద్రుత
ప్రకృతికమయ్యెను. కేషాంచి దుదన్తానామిత్యాది పూర్వసూత్రలక్ష్యములు
సప్తమీమాత్రార్థకములనియు, నౌపవిభక్తిక నామ్నామిత్యాది ప్రకృతసూత్ర
లక్ష్యములు తృతీయాసప్తమ్యర్థకములనియు 'అంద్వాందు నాస్తు సప్తమీ' అను
చింతామణిసూత్రముచొప్పున 'న' వర్ణకము సప్తమీమాత్రార్థకమగుటచే నట్టిస్థితి
సంభవించెననియుఁ బర్యవసితమగుచున్నది. కావునఁ బూర్వసూత్రమునకు లక్ష్య

ములుకాని "అక్కడి+అన్ = అక్కడన్ - ఇక్కడి+అన్ = ఇక్కడన్ - అప్పటి+అన్ = అప్పటన్" మున్నగు ప్రకృతసూత్రలక్ష్యములకుఁ దృతీయార్థ మప్రసిద్ధ మగుటంజేసి యట్టివాని సప్తమీ మాత్రార్థకత్వము పూర్వసూత్రములోని బహుళానువృత్తిచే గలుగునని వ్యాఖ్యానము చేసికొనవలయును.

అహోబలపండితుఁడు 'చోటునన్ - మేనునన్' మున్నగురూపముల ప్రక్రియలో 'ఇ' అను నుపవిభక్తికి లోపమును నిరూపించి వానికి 'మేనన్ - చోటన్' మున్నగు నున్ లు గ్రూపములకువలెనె యూపవిభక్తిక శబ్దత్వమును వచింపకుండుట యన్యాయ్యము. నన్ ప్రత్యయాంతమునకు లేని యూపవిభక్తికత తజ్జన్యమగు నున్ లు గ్రూపమున కెట్లు సంభవింపఁగల్గును? ఇట్టి కవిశిరోభూషణ ప్రక్రియ మూలముననే వెనుక నుదాహరించినరీతిని సూ. రా. నిఘంటుకర్తలు 'నన్' ప్రత్యయాంతరూపము లనౌపవిభక్తిత్వ నిదానములను నపమార్గమునఁబడుట సంభవించెను. కేషాంచిదిత్యాది పూర్వసూత్రమునందలి బహుళశబ్దానువృత్తికి నావ్రాసిన రీతి నత్యావశ్యక ఫలాంతరములుండఁగా వానిని వచింపక "బహుళపదమను వర్త్య క్వచిత్ వేరున చోటున ఇత్యాదిరూపస్యాపి సాధుత్వ మవగన్తవ్యమ్". (అహో. ౩౭౨ పు.) అని వ్రాయుటసరికాదు. ధారాళముగాఁ బ్రయుక్తమగుచున్న యున్ లు గ్రూపములకు మూలమగు నన్ ప్రత్యయాంతరూపములకుఁ గ్రావిత్కతయేమి? క. కనకమయమైన యీప్రో। లునఁ దమ సుతులాహవంబుల్లో నమరులచే।......" (ఆర. ౨ అ. ౦౦) అని భట్టారకుఁడే ప్రయోగించియున్నాఁడు. ('న' వర్ణకము ప్రాసగతము. దీనిపాఠము విషయము ముందుఁ జర్చింపఁబడును.) మఱియు నహోబలపండితుఁడు "మింటన్ - మంటన్-పంటన్" మున్నగువానిని సయితము పూర్వసూత్రమునకె లక్ష్యములుగాఁ నంగీకరించుచుఁ జేసినచర్చవలన వానికిఁగల తృతీయావిభక్త్యర్థమునకు భంగముకలుగుచున్నది. ఇంతియకాక వానియం దుపవిభక్తి టివర్ణము సహజమైయుండ దానిని విడిచికొని "మిన్ను నన్=మిన్+అన్" అనురీతిని "కేషాంచిది"త్యాది సూత్రముచే లభించుచుండుటంజేసి తాను 'ట'కారాగమము కల్గునని వ్యాఖ్యచేసికొనవలసివచ్చును. "మింట - కంట - ముంట - వింట - మంట-పంట ఇత్యాది......నన్విదం సూత్ర మనారంభణీయమ్, పూర్వసూత్రేణైవ మింట నిత్యాదిరూపాణాం సిద్ధత్వాత్......గుద్దలి - కొడవలి - చేయి - వాయి - రాయి - దాయి ఇత్యాది శబ్దేభ్యః తృతీయా సప్తమ్యోః ప్రాప్తౌ గుద్దంట - కొడవంట - గొడ్డంట ఇత్యాదిరూప సిద్ధ్యర్థ మిదం సూత్ర మావశ్యక మిత్యవధేహి" (అహో. ౩౭౩ పు.)

[౨౮-౨౯, సూ.]'ఒక్కటి' అను ప్రథమైకవచనముమాత్రమే యుపవిభక్తికము వలెనున్నది.

ఉపవిభక్తుల కుదాహరణము:—ఇ - ఊరు - ఊరిన్, ంటి - రెండు-రెండింటిన్, టి - అన్ని - అన్నిటిన్, తి - గోయి - గోతిన్, ఇతి - అఱ్ఱు - అఱితిన్, అటి - క్రిందు . క్రిందటిన్. 'ప - ఁప - ంప' అనునవి సమాసమునందే వచ్చును. ప - జనుము - జనుపనార, ఁప - వేము - వేఁపచెట్టు, ంప - ఎమ్ము - ఎంపముక్క. మొ.

ఈయుపవిభక్తు లప్రాణివాచకములగు స్త్రీసమశబ్దములకు మాత్రమె ద్వితీయాద్యేకవచన పరకత్వమందుమాత్రమె ప్రయోగదృష్టము లగుచున్నవి."ఒక్కఁడు = ఒక్కటి = ఎక్కటి" అనుస్థలమందుమాత్రమె ప్రథమైకవచనమున నథర్వణ విధిచేతను దిక్కయజ్వ ప్రయోగప్రామాణ్యముననుసుపవిభక్తి రూపము నిలుచుట వైయాకరణ సమ్మతమగుచున్నది. 'ఏమిటి' అనునది వ్యవహారమున నున్నను మహాకవి ప్రయోగదృష్టము కాలేదు. ఉపవిభక్తులు జడవాచక స్త్రీసమములందే నిల్చుచుండుటంజేసి ప్రథమైకవచనమున విభక్తిపరకత్వముండదు గాన "తేహి విభక్తౌ" అను భట్టారక నియమముచొప్పున వానికిఁ బ్రాప్తియే లేదు. బహుత్వమున వీనికిఁ గవిప్రయోగము లేదు. మఱియు "క్వచిత్త్వాదేశ ఏవస్యాత్తనుచు (౨౦౮ విష.) నథర్వణుఁడు గోయిప్రభృతులకు బహుత్వమున 'గోతులు' మున్నగురూపముల సిద్ధికై ప్రత్యేకముగా విధించుటయు నుపవిభక్తులకు బహుత్వమునఁ బ్రవృత్తి లేదనుటకుఁ బ్రబలనిదర్శనమగుచున్నది. బహుత్వమున విభక్తిపరకత్వమందు 'ల' వర్ణము విహితమైయుండుటయు వీనికిఁ బ్రాప్తిసమ్మతముకాదని విశదమగుచున్నది.

ఇ - టి - తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు. ౨౮.

విభక్తి నిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబులయిన 'ఇ - టి - తి' అను వర్ణంబు లౌపవిభక్తికంబులనంబడు.

బాలవ్యాకరణ వివరణము. ౭౨ I విషయము. ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు. ఉదా.

కాలు - కాలిని - కాలిచే; నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే, నేయి - నేతిని - నేతిచే; ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్య లక్షణ విరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

సంజీవని. ౨౨౭ I విష:—చింతామణిలో 'టి - ంటి' అని చెప్పఁబడు చుండఁగా సూరి దానినిమార్చి 'ఇ - టి తి' వర్ణములను విధించి హ్రస్వముమీఁది టి వర్ణంబు పూర్ణబిందుపూర్వకము బహుళముగా నగుననియుఁ బదాదిహ్రస్వము మీఁది టి వర్ణము నిత్యముగాఁ బూర్ణబిందు పూర్వకమగుననియు (బా. అచ్చి. ౩౨- ౩౩ సూ.) సూత్రించెను. ఇది సరికాదు. 'క్రిందటికి - మీఁదటికి - ముందటికి - ఏమిటికి' మున్నగుచోటులందలి టి వర్ణము హ్రస్వపూర్వకమె యయినను నద్దానికి బిందుపూర్వకత్వము కవిప్రయోగదృష్టముకాదు. ఇంక బహుళగ్రహణముచే నిట్టియెడల బిందువురాదని సూరి చెప్పుకొనవలసియుండును. ఇట్లె - 'ఇటి - ఇంటి - అటి - ఇతి' మున్నగువానిని వేర్వేఱుగ నుపవిభక్తివిశేషములని వచింపక "టి - తి వర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు" (బా. అచ్చి. ౩౬ సూ.) అనియు, "టివర్ణంబు పరంబగునపుడు క్రిందు - మీఁదు - ముందు పువర్ణంబుల కత్వంబగు" (బా. అచ్చి. ౩౭ సూ.) అనియు సూరిగారు సూత్రించుటచే నీక్రిందిరూపములు బాలవ్యాకరణమున సిద్ధింపవయ్యె:—సీ. ముప్పదిరెంటను మూఁట నేనింటను, బదియింట నఱువది బాణములను।.......(ద్రోణ. ౩ ఆ. ౨౨౮ ప.) సీ. ఇంద్రియంబులు పదియింటిని గుదియించు టెక్కుడు వెరవది......(అశ్వ. ౨ ఆ. ౧౫౩) క. పదియును నూఱును వేయును। మొదవులుగలవారు దానములుగా నొక టిన్। బదియింటి నూటి నిచ్చిన। నదియు నదియు నదియు సదృశమగు ఫలము నెడన్ (అను. ౩ ఆ. ౩౦ ప.) క. ప్రదరంబులు పదియింటం। బదియింటం బదిట రెంట। బరువడినేసెన్ (ఉ. హరి. ౩ ఆ. ౭౮). 'ఇంటి' అనుదాని నుపవిభక్తి విశేషముగా నంగీకరించినంగాని యిట్టి మహాకవిప్రయోగములు సంగ్రహింపఁబడనేరవుగదా. ఇనుమునందు - పాముకు మున్నగురీతినె యుండునుగాన - 'ప - ఁప - ంప' అనునవి విభక్తిపరకత్వమున నిలువనేరవు. 'ఇనుపతునుక-పాఁపతేఁడు' అనురీతి నవి సమాసము లందు మాత్రమె నిల్చునవగుటంజేసి సూరి వాని నుపవిభక్తులలోఁజేర్పక సమాస కార్యములలో నుపదేశించెను (బా. సమా. ౧౬ సూ.). కాని భట్టారకుఁడును నథర్వణుఁడును సమాసములందు నుపవిభక్తులు వచ్చునని యంగీకరించియుండుటచేతను సమాసమందలి యుపవిభక్తులస్థితికి 'ప - ఁప - ంప' అనునవె సరియగు నుదాహృతులగుటచేతను వాని కుపవిభక్తి సంజ్ఞవాచనికముగ నుండిన నుండనగును. సూరి సమాసములం దుపవిభక్తులగునని వచింపనేలేదు. నాఁగటిచాలు - కాలిగోరు - నేతిముంత మున్నగుచోటులందు 'నాగటియొక్క చాలు' మున్నగురీతి నేర్పడు విగ్రహములలోఁ గన్పట్టు నుపవిభక్తులు విభక్తినిమిత్తకములయి యుండుటచే నవి

సమాసములందు వచ్చినవని విశేషించిచెప్పుట సరికాదని సూరియాశయము. ద్వితీ త్రైక వచన పరకత్వమున నుపవిభక్తులు రావని కొందఱు వక్కాణించినట్లు సూరి వ్రాసెను. కాని యట్లెవ్వరు వక్కాణించిరో తెలియకున్నది.

ఔపవిభక్తిక త్వానౌపవిభక్తికత్వము లొకటే శబ్దమునకు కొక్కటే కాలమున వాడుకయుండనేరదనియు 'న' అను సప్తమీవిభక్తి ప్రత్యయముతో ప్రయోగింపఁబడుట యద్దాని యనౌప విభక్తికత్వమునకు నిర్ణాయకమనియు నన్నయాదిత్ర కర్తృ ప్రభృత్యుత్తరాంధ్రకవులు భ్రమప్రమాదములకులోనై యౌపవిభక్తికత్వ మును దార్ఢ్యముచేసిరనియు నేఁటి విమర్శకులు కొందఱు తలంచుచున్నారు. కాని యట్టియాశయములు లక్ష్య లక్షణ సమ్మతములు కావు (విస్తర.).

---

విస్తరము. ౨౨౭ I విమ:—"తెలుఁగులో 'నీరిలో' అని నన్నయగ్రంథమం దున్నది. ఉత్తరాంధ్రమందు 'నీటిలో నీటికి' అని వాడుక, (తిక్కన 'నీటిని' అని వాడెనే ?). నోరు - 'నోరి' అని తిక్కనకాలమందు వాడుక. ఉత్తరాంధ్రమందు - 'నోటిలో - నోటికి' అని వాడుక. ఏకాలమందు ఎట్టిరూపములు గలిగియుండెనో తెలుసుకోవలెను" (బాలక. ౨౬౫ పుట.). ఈమాటలనుబట్టి నన్నయాది ప్రాచీను లొకశబ్దమునకు 'ఇ' వర్ణమును 'టి' వర్ణమును ననెడి రెండిటిని ప్రయోగింపరను వీరిసిద్ధాంతము విశదమగుచున్నది. ఇట్టి సిద్ధాంత మపరిశీలనకృతమగుటచే నపసిద్ధాంత మనఁగును. నన్నయ తిక్కనలే యొక్కశబ్దమునందె ద్వివిధములగు నుపవిభక్తులను బ్రయోగించుట కన్పట్టుచున్నది. క......ఆతని। మొదలిటి సంపదలతో సమా లంబు చెడున్. (సభా. ౨ ఆ. ౨౦౨ ప.) తే-గీ. మొదల నప్రియమయ్యును దుదిఁగరంబు। పథ్యమగు.........(సభా. ౨ ఆ. ౧౯౨) 'మొదలన్' అనునది 'మొదలి' అను నౌపవిభక్తిక శబ్దమునుండి యేర్పడినదేకదా. కుండలింద్రుఁడును నిట్టిరీతిని బ్రయోగించెను. ఆ. వె. ఇనుము ఱాత నీర ననలంబు విప్రుల। వలన రాజు లుద్భవంబుఁబొందు। టిది నిజంబు......(శాంతి. ౨ ఆ. ౧౭౧) క. నడవడియను మున్నీటం। గడవంబెట్టంగ నోడ కరణిం దగి (ఉద్యో. ౨ ఆ. ౩౯) సీ. మనము మనంబునఁబెనచి కేళికిఁజొచ్చి, సతిఁదేల్తు సౌఖ్యరసంబు నీంట। (విరా. ౨ ఆ. ౩౧౦) శా. సింగం బాకటితో గుహాంతరమునన్ (విరా. ౪ ఆ. ౯౫) ఆ. వె. అలిగి యాఁడుగఱచి యాఁకటి పెలుచన। నిలువ లేక (ఆది. ౬ ఆ. ౨౯౪) చ. ఫలముదళంబునుం దొడిమఁబాయుట రాలినవానిఁ గాంచునాఁ। కలికెరసేసి.........(అను. ౫ ఆ. ౫౫) సీ. విహగకులంబుల పెథ మున వసియింతు, నంతకంటెను నెక్కుడద్భుతంబు (శాంతి. ౬ ఆ. ౫౯౭)

సంజీవని. ౨౨౭ II విష:—చింతామణికర్త 'స' ప్రత్యయాంతమునుండి

క. అసదంతటికంటెఁ గలదె యగ్రిమవర్ణా (శాంతి. ౬ ఆ. ౬౦౩ ప.) ఉ. ఆరయ నాకు నీకుఁ గులమంతకు నీనృపకోటిపర్వికిన్ (ఉద్యో. 3 ఆ. ౨౬౨) మ. పటువేగంబున..............త। క్కటి భూపాలుర......నె। త్తుటఁ జొత్తిల్లఁగఁజేసె......(సౌప్తి. ౧ ఆ. ౧౨౬) మ. భటగాత్రంబుల.........నె। త్తుటఁ దేల్చెన్ (ద్రోణ. ౪ ఆ. ౮౩ ప.) మ. పటునారాచ పరంపరా............నె। త్తుటఁ బొత్తిల్లెడునట్లు (ద్రోణ. ౨ ఆ. ౩౦౭) క. కరులకరంబుల హయముల।......నె। త్తురు లేఁబులువఱపి వానిఁ దోఁలగంద్రోచెన్ (ద్రోణ. ౪ ఆ. ౧౮౨) క......నె। త్తురు రొంపిలోన రథ్య। స్ఫురణకతన దవులఁబడక శోభితగతిమై (కర్ణ. ౧ ఆ. ౧౭౫ ప.). ఈరీతి నౌపవిభక్తికత్వమునకు నిత్యతలేమి ప్రసిద్ధమై యుండుటంజేసియే యథర్వణాచార్యుఁడు "బహవో త్రాన్ధ్రభాషాయాం। వర్ణా ఔపవిభక్తికాః। ప్రవృత్తి శ్చాప్రవృత్తిశ్చ। వికల్పశ్చ క్వచిద్భవేత్। తద్వివేకః ప్రయోగైక।శరణం స్యాద్ధిశబ్దతః" (౨౨౭-౨౩౩ విష.) అని వివరించినవాఁడయ్యెను. ఇట్టి ప్రామాణిక ప్రాచీన కవిప్రయోగములను బ్రామాణిక వైయాకరణ సూక్తులను జూచికొనలేక యేదో కొంత యలంతిపరిశ్రమ చేసి వలంతినంచు నీక్రిందిరీతిని వసుచరిత్రకారాది మహాకవులను ధిక్కరించుట కేవలము సాహసము!

"ఉత్తరాంధ్రకావ్యములలో ఔపవిభక్తికములు తాఱుమాఱుకావడము వింతకాదు. ఆకాలములో నన్నయాదులప్రయోగములు మాఱిఉండవచ్చును. లేక ప్రాచీనప్రయోగములు సుపరిచితములు కాక కవులు భ్రమప్రమాదములకు లోనై ఉండవచ్చును.........యయాతిచరిత్ర వసుచరిత్ర మొదలైన ఉత్తరాంధ్రగ్రంథములలోని తెలుఁగు కృత్రిమ భాష." (బాలకవిశరణ్యము. ౨౬౪ ము. ౨౬౮ పుటలు.) ఏమి లోపములుచూపి వసుచరిత్రాదులనిట్లు నిరాకరించిరో తెలియకున్నది. ఔపవిభక్తికముల విషయమున నుత్తరాంధ్రకవులుచేసిన తాఱుమాఱేమి? వారికి సుపరిచితములు కాని ప్రయోగవిశేషములు నన్నయాదుల గ్రంథములనుండి పేరేమిచూపి యింతటి సాహసోక్తులు వల్కిరో తెలియకున్నది. ఔపవిభక్తికములను దాఱుమాఱుచేసిన యుత్తరాంధ్రకవులలోఁ గవిబ్రహ్మగారినిసయితము ద్రోసివేయుదురా? సోమయాజిచేయని తాఱుమాఱుత్తరాంధ్రకవులేమియుఁ జేయలేదే! భట్టారకుఁడు ప్రయోగించిన 'మొదలిటి - మొదలన్' మున్నగు ప్రయోగములను మూలముగాఁగొనియే తిక్కయజ్వసైతముపై రీతి నౌపవిభక్తికముల బాహుళకత్వమును బ్రాసఖచితముచేసి చూపినవాఁడయ్యెనని విశ్వసింపనగును.

యేర్పడెడి 'అన్' అనుదానితోఁగూడిన యౌపవిభక్తికశబ్దము (ఊరన్, చోటన్, మేనన్,) సప్తమ్యర్థమును మాత్రము బోధించుననియుః దద్భిన్నమగునట్టి 'ఆ' త్వముతోఁ గూడినశబ్దము తృతీయా సప్తమ్యర్థబోధకమగుననియు భట్టారకుఁడు చేసిన యేర్పాటు (కేషాంచి దుదన్తానామ్......ఔపవిభక్తిక నామ్నామ్......) సూరి గ్రహించి సంగ్రహింపలేదు. (బాల. ఆచ్ఛి. ౩౭ సూ.). కావుననే త్రిలింగలక్షణ శేషకర్త యట్టివిషయమును "ఊరు చోటు మేన్వాదు లున్‌లుగ్విషయంబులు" (ప్రాథ. శబ్ద. ౧౦౬ సూ.) అను సూత్రముచే సంగ్రహించికొనెను. కేషాంచి దుదన్తానామిత్యా దిని సూత్రించుటయేకాక భట్టారకుఁ డౌపవిభక్తికమగు ప్రోలుశబ్దమును 'న' ప్రత్యయాంతముగాఁ బ్రయోగించియు నున్నాఁడని యీావఱకె వ్రాయఁబడెను. 'ప్రోలునన్' అనుదానికి సయితము తృతీయార్థము ప్రయోగదృష్టము కామింజేసి యదియు నూరుచోటు మేన్వాదులలోనిదే యనుటలో సందియములేదు. (వి_స్త.) ఇవి ద్వితీయేత్యాది (౨౮) సూత్రములోని ప్రాయికశబ్దముచేఁ గొన్ని యౌపవిభక్తికము లనౌపవిభక్తికములును నగుననిసమర్థింపఁదగును.

---

వి_స్తర. ౨౨౭ II విష:—క. కనకమయమైన యా ప్రో । లునఁ దమసుతు లాహవంబులో నమరులచే। త నవధ్యులు గాఁదగ న। వ్వనజజుచేఁబడసి దనుజవనితలు గరుణన్ (ఆర. ౪ ఆ. ౮౦) (సర్వల. ౧ ఆ. ౫౭ ప.), ఈపద్యమున నేఁటి ముద్రణములలో "ఆప్రోలు న" అనుచో 'ఆప్రోలును' అను పాఠమె యగపడుచున్నది. నన్నయవంటివాఁ డౌపవిభక్తిక ప్రోలుశబ్దము ననౌపవిభక్తికముగాఁ బ్రయోగించునాయనుచు, 'న' ప్రత్యయాంతము లనౌపవిభక్తిక రూపములె యను నిశ్చయముగల సంస్కర్త లిట్టు సవరించియుందురనఁదగును.

"ప్రోలుశబ్దమును నన్నయ ఆదిపర్వములో ఉ......నీమదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలు ప్రోలికేఁగించెద......(ఆది. ౬ ఆ. ౨౫౪) అని ప్రయోగించినాఁడు. యుద్ధమల్లుని శాసనమందు చేంబ్రోలనుండి అని......ఉన్నందున ప్రోలు శబ్దము నన్నయకాలమందు ఔపవిభక్తికశబ్దమే అని అంగీకరించక తప్పదు. కనుక తిమ్మకవి ఉదాహరించిన పాఠము తప్పు. ఆనందముద్రణమందున్ను వావిళ్లవారి కూర్పులోనున్ను (ఆపద్యమున "ప్రోలున" అనుచోట) 'ప్రోలును' అని సముచ్చయార్థముతో కలిసి ప్రథమావిభక్తిరూపము కనఁబడుచున్నది. ప్రకరణమునుబట్టి చూస్తే ఆరూపమే సాధువు............సంస్కృత భాగతమందు తపసోఽ_స్తైత త స్తాభ్యాం। స్వయంభూ రద దద వ్వరమ్।అవధ్య తాంచ రాజేన్ద్ర సుర రాక్షస పన్నగైః॥పురం సురమణీయంచ। ఖరంచసు మహాప్రభమ్.(ఆర.అధ్యా. ౧౭౩ శ్లో. ౫-౬)

... నన్' అనునది, తజ్జన్యమగు 'అన్' అనునదియు నుపవిభక్తులే [౨౨౮. వి. సంజీ.]

బాలవ్యా. ఊరు మొదలగువాని కిత్వంబగు. ౩౦.

౨౨౮ వివ. ఊరు - ఊరిని, కాలు - కాలిని, మ్రాను - మ్రానిని,
నోరు - నోరిని, చోటు - చోటిని.

సంజీవని. ౨౨౮ వివ:—'ఊరు+ను' అనుచోఁ బ్రకృతసూత్రముచే 'ఇ'త్వము రాఁగా 'ఊరిను' అని యేర్పడును. పిదప, బా. తత్స. ౨౬ సూత్రముచే 'ను' వర్ణకముమీఁది 'ఉ' త్వమునకు 'ఇ' త్వము రాఁగా 'ఊరిని' అను రూపము సిద్ధించును. ఇట్లె తక్కినవాని ప్రక్రియ నెన్నునది. 'ఊరు+ఇ+కున్ = ఊరికున్' అని యుండఁగా బా. తత్స. ౨౬ సూత్రముచేతనే 'కు' వర్ణకముమీఁది 'ఉ' కార మికారము కాఁగా "ఊరికిన్" అను రూపమేర్పడును. ఊర్వాదిగణములోని నోర్వాదులకు బా. ఆచ్ఛి. ౩౧ సూత్రముచొప్పున 'టి' అను నుపవిభక్తి వచ్చుటయుఁ

---

అని యున్నది" అని యిట్లు బాలకవి శరణ్యమున విమర్శింపఁబడెను. (బాలక. ౨౬౭ పుట.) శరణ్యకర్తగారిచట నీసంస్కృత భారత శ్లోకములు తమయభిప్రాయమున కనుకూలము లనుకొని యుదాహరించిరే కాని యందలి యర్థాన్వయములను తెనుఁగుపద్యము లోనియర్థాన్వయములు పోలియుండ లేదు. భారతము యథామూలాంధ్రీకరణమునుగాదు. మఱియు "కనకమయమైన యా ప్రోలును, దమసుతు లాహవంబులో నమరులచేత న వధ్యులుగాఁగను, నవ్వనజజుచేఁ బడసిరి" (బాలక. ౨౬౭ పు.) అను వీరుచెప్పినయర్థ మసంగతముగానున్నది. 'అవధ్యులుగాఁగను' అను వీరిపాఠము వావిళ్లవారి పుస్తకమునందలి పద్యమున లేదు. మఱియు సముచ్చిత పదములలో నొకటి ద్వితీయార్థక ప్రథమయు వేఱొకటినుజ్యంతమునునగుట సుసంగతము కానేరదుగదా. ఇంకఁ దిమ్మకవి పాఠము పక్షమున "ఆ ప్రోలియందుఁ దమసుతు లవధ్యులగునట్లుగా వరముఁబడసిరనుట యెంతయు సరళముగాను సుసంగతముగానునున్నది. కావుననిటఁ దిమ్మకవిపాఠమే నన్నయప్రయుక్తమని విశ్వసింపనగును. "కేషాంచి దుదన్తా నామిత్యాది చింతామణిసూత్రమున్నైత మీపాఠమె భట్టారకప్రయుక్తమని తోఁపించుచున్నది. ఇట "అభరనుండు - చేంబ్రోలనుండి - ప్రత్యక్షబయ (యుకి) న్న - రమనతో" మున్నగు నపశబ్దముల కాకరమగు శాసనము శబ్దసాధ్వసాధుతా నిర్ణయవిషయమునఁ బ్రమాణమగునని శరణ్యకర్తలెట్లు తలంచిరో తెలియకున్నది. అయినను నిచట శాసనములోని 'ప్రోలన్' అను రూపము 'ప్రోలునన్' అను రూపమునుండి యుత్పన్నమేయగుటచే నిది శరణ్యకర్తగారి వాదమున కనుకూలమునుగాదు. మఱియు విరుద్ధము ననవచ్చును. 'అన్' అనునది యుపవిభక్తియగునని సమ్మతించునపుడింక దానికి మూలమగు 'నన్' అనునది యుపవిభక్తి కాదనుటెట్లు ?

[బా. ఆచ్ఛి. ౩౦ సూ.] పేరునన్ = పేరన్ = పేరిటన్ మొదలగువాని ప్రయోగములు గలదు. ఊర్వాదులకు 'నన్' అను సప్తమీవిభక్తి వచ్చుటయుఁగలదు. ఉదా:— నోరు - నోటిని - నోరిని. నోరునన్ = నోటియందు = నోరియందు. మొ. బా. ఆచ్ఛి. ౩౪ సూత్రముచొప్పున వీనికి 'అ' త్వము వచ్చుటయుఁగలదు. ఉదా:—ఊరన్ = ఊరియందు, నోరన్ = నోరియందు, నోటన్ = నోటియందు - మొ. ఇట్టివెల్ల "ఊరి+అన్ = ఊరన్. నోరి+అన్ = నోరన్. నోటి+అన్ = నోటన్" అనురీతి నౌపవిభక్తికరూపములనుండియె యేర్పడును గాన నత్వఘటితరూపములెల్ల బాలవ్యాకరణ పక్షమందును నౌపవిభక్తిక రూపములె యగుచున్నవి. ఇట్టివి చింతామణిపక్షమున 'ఉన్' లోపముచేత సిద్ధించు 'న' ప్రత్యయాంతమునకు సంక్షేపరూపములై యుండును. ప్రయోగములు:— నోరు:—క......నో। రికి వచ్చినయట్టు లాడిరే యిబ్భంగిన్ (కర్ణ. ౩ ఆ. ౮౪) గీ. తన్ను ధరణికిఁబొమ్మన్న ధాత నోటి। మాట నోటనె యుండ......(...కాళ. ౨ఆ. ౩౬ ప.). ప్రోలు:—క. కనకమయమైన యీప్రో। లునఁ దమసుతులు...... (అర. ౪ ఆ. ౮౦) (విస్తర. ౨౨౭ విష.). ఉ......వానినెల్లఁ గ్ర। క్కించెద నీమదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలు ప్రోలికేఁ। గించెద......(ఆది. ౬ ఆ. ౨౯౪ ప.). మ. ఘనతన్ జాలక జాలముల్ దళములున్ గన్పింప నప్ప్రోలునన్ (కృష్ణరాయ విజ. ౧ ఆ. ౪౫ బాలక. ౨౭౦ పు.) కేలు:—చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁదార......(విరా. ౫ ఆ. ౩౦) సీ...... పెలుకేల్గి యణఁకువ ప్రిదిలి బిగియ (కవిక. ౪ ఆ. ప్రౌఢ. శబ్ద. ౨౭ సూ.) చ. అనవిని......పైఁటకొంగు కే। లున నులివెట్టుచున్ (శుక. ౨ ఆ. ౪౬౯ సూ. రా. ని.). పోరు:—క......ధక్షణ। సేయుదు నమరాదులకు నజేయుఁడఁ బోరన్ (ఆర. ౧ ఆ. ౧౧౩) క.... । నిన్నోర్చెదఁ జక్కనెదిరి నిలువుము పోరన్ (ఆర. ౩ ఆ. ౩౮౮) చ......రయం। బునఁ బయికొన్న యేనుఁగుల పోరునఁ దేరులు తేరె నొత్తుటన్ (శల్య. ౧ ఆ. ౧౨౧) చ......లా। వెడలఁగ బట్టిత్రెఁయుటకు నెత్తెనం జను మల్లుపోరునన్ (ఆము. ౨ ఆ. ౯) చ......పో। రున కరుదెంచె వేల్పుకొమరుండు (పారిజా. ఆం. భా. ఆ. ౧౭౪ పు. శబ్ద. ౧౨౮ సూ.) పేరు:— చ. వెరవరిగాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య। చ్చెరువొక మ్రాని పేర నిటనేరఁగ వచ్చుచునున్నవాఁడు (విరా. ౪ ఆ. ౯౧) ఇట 'పేరన్' అను దానిని ద్వితీయార్థమునఁ దిక్కనవాడెను. చ......తదంఘ్రిమూలముల్। శరణము నందఁ బోలు ననిశంబు పదంబు మదంబు పేరిటన్ (వసుచ. ౧ ఆ. ౧౦౧ ప.) గీ. నోరు నీరును గోరను నుదువులకును। నోట నీటను గోటను నోర నీర। గోర నన

పుట్టె నోమన నీమన నన । గోరున ననంగఁ జనుమేరుకు ధరచాప (సర్వ. ౧ అ. ౫౭) సీ...... । నడుమింతయని కేలఁ దొడికిపట్టిన ధాత, యంగుళిరేఖ లబ్జాస్యవళులు (నైష. ౨ ఆ. ౧౫) క. శాక మహీజముపేరను । శాక ద్వీపంబునాఁగ (విష్ణు. ౩ ఆ. ౭౬ సూ. రా. ని.) సీ......గోర నొక్కినఁ బాలుగారు కెంజెక్కుల (దశా. ౬ ఆ. ౧౫. సూ. రా. ని.) చ......అ । చ్చెరువొక ప్రానిపేర నిటఁజేరఁగ (విరా. ౪ ఆ. ౯౧ ప.)

నీరు:—"నీటికిన్-నీటిమూలి-ఇత్యాదౌ సంస్కృతసమే ప్యాదేశ ప్రవృత్తిః" (అహో. ౨౩౦ పుట.). ఇది సరికాదు. నీరశబ్దభవమగు 'నీరు' అను తద్భవమున కౌపవిభక్తికత్వము నంగీకరించుట యుక్తము. చ. కవిసీ ఖరంబులైన మునికాళ్ళను ప్రేయఁగఁ బాము నీరిలో । ను వెడలకుండి (అను. ౧ ఆ. ౨౩౨) 'నీరిలోనుండి' అను దానిలోని 'ఉండి' లోపింపఁగా 'నీరిలోను' అను రూపమేర్పడినది. (ప్రౌఢ. కార. ౧౧ సూ.). ఆ. ఇనుముఁదాఁత నీర ననలంబు విప్రుల । వలన రాజు లుద్భవంబుఁ బొందు । టిది నిజంబు (శాంతి. ౨ ఆ. ౧౭౧) క. నడవడియను మున్నీటిం । గడవంబెట్టంగ నోడ కరణిన్ (ఉద్యో. ౨ ఆ. ౩౯) "తెలుఁగులోఁ నీరిలో" అని నన్నయ గ్రంథమందున్నది. ఉత్తరాంధ్రమందు 'నీటిలో-నీటికి' అని వాడుక" (బాలక. ౨౬౫ పుట.) అనురీతి శరణ్యకర్తగారి మాటలకుఁ దిక్కనయు నొడికట్టవలసినదేనా? సీ. మనము మనంబునఁ బెనచి కేళికిఁ జొచ్చి, సతిఁ దేల్తు సౌఖ్యరసంబు నీంట । (విరా. ౨ ఆ. ౩౧౧) నాయొద్దనున్న తాళపత్ర మాతృకలు రెండిటిలో నిట్టిపాఠ మేయున్నది. ఇట్టి తిక్కయజ్వ ప్రయోగము ననుసరించియే ప్రబంధ పరమేశ్వరుఁడు రెండుచోట్ల "నీంటన్ = నీటిలో" అను దానిని బ్రయోగించెను. ఉ......రసంబు పె । న్నీంటనుగూర్చు కామమును......... మనం । బొంటికిఁబోక భర్తృరతి కువ్విళులూర.........(హరి. ఉ. భా. ౭ ఆ. ౯౪) క. కంటిమి కన్నులపండువు । మంటిమనుచుఁ దద్గుణౌఘ మధువాహిని పె । న్నీంటం దేలుచు (హరి. ఉభా. ౬ ఆ. ౨౭ ప.) (విస్తర.) (ప్రాసగతములు).

---

విస్తర. ౨౨౮ విష:—దీర్ఘపూర్వక పూర్ణబిందువు లక్షణవిరుద్ధమన్న తలంపుతో నేటి పండితులు పై చోటులను సవరించివేసిరి. పయి విరాటపర్వ పద్యమునందు "రసంపు నిట్ట" అనియు హరివంశపద్యములలో "పెన్నింట" అనియు ముద్రణసంస్కర్తలు సవరించిరి. వానినె శబ్దరత్నాకర, సూ. రా. నిఘంటుకారులెత్తికొనిరి. అందు హరివంశపద్యములలో 'నీంట' అను పాఠమే గలదనుటలో బాధయేమియు లేదు. నీరుశబ్దమునకు బిందుపూర్వక టవర్ణమును 'అ'త్వమును

తేరు:—క.... ఒక । తేరం గృష్ణు లతిఘోర తేజస్సార । స్ఫారత...(ఉద్యో. ౨ ఆ. ౧౫౨) చ....తే । రిచెనుక కురుశక్తి యడరించెఁ జలింపక భీముఁ డత్తఱిన్. (ద్రోణ. ౪ ఆ. ౨౩౩) మ. మునుపే చంద్రబలంబుగల్గి మలయంపుం గమ్మతేగాడ్పుం దే । రున నేతెంచు లతాంతబాణునకు సూర్యుండుడున్.........(ఆము. ౫ ఆ. ౧౦౧) ఊరు:—ఉ. కౌరవుఁడపం(డ్రు) నిన్ మఱువునొచ్చుట శౌర్యముచొప్పె; మానమే । యూరికిఁబోయె.........(శల్య. ౨ ఆ. ౫౫) మేను:—క. మేనం బ్రాణంబులెట్లు మేకొని తాల్తున్ (ఆర. ౬ ఆ. ౨౧.)

నగరు:—క. పురోహితతత్త్వంబునేఁత భూపతి నగరన్ (శాంతి. ౨ ఆ ౩౧౦ ప.)

కాలు:—ఆ. వె. లీల నేలఁబెట్టి కాలఁజమర (శాంతి. ౩ ఆ. ౪౭౪.)

---

వచ్చునని చెప్పుట నన్నయాథర్వణీయము చొప్పున శాస్త్రీయమైయుండును. చింతామణి దీర్ఘపూర్వక పూర్ణమును నిషేధించుచున్నదని శంకింపరాదు. అది సామాన్య విషయము. విశేషవిధులలో నట్టి నిషేధము వర్తింపదు. ఉదా:—తేంట్లు - తేంట్లు - ఏండ్లు - వాండ్రు - మొ. తిక్కనకాలమున నిట్టి విశేషవిధిస్థలములందే కాక సాధారణస్థలములందు సైతము దీర్ఘపూర్వక పూర్ణములు ప్రయోగింపఁబడు చుండుటయుఁ బ్రయోగసిద్ధమైయున్నది. ద్వి. పాండురాంగంబైన పడఁతిగర్భమునఁ। బోండిగా నీగతిఁ బుత్త్రుఁడు..............(బసవ. ౧ ఆ. ౩౫౩) కం. పోండిగనగ జతపళ్ళిఖ । మూండు జగంబులను దీవ్రముగఁ బర్వెన బ్ర । హ్మాండము......(నన్ని. కు. ౬ ఆ. ౮౧౬). 'కాంచు' మున్నగు పెక్కుశబ్దములలో దీర్ఘపూర్వక పూర్ణము సర్వసమ్మతమైయున్నది. ఇట్టి స్థితిలో లక్షణవిరుద్ధముగ 'నింట' శబ్దమును సృజించు కొననేల? సూ. రా. నిఘంటుకర్తలు నిండుధాతువునుండి యీ 'నింట' శబ్దమును సాధింపనెంచిరి. అట్టియెడ - 'నిండుట = పూర్ణమగుట' అను నర్థమె లభించునుగాని 'జలము పూర్ణమగుట' అను నర్థము రానేరదుగదా. ఇంక విరాటపర్వపద్యమున 'నిట్ట' శబ్దమును నిల్పుటయు సరికాదు. అచట 'నీంట' అను సలక్షణశబ్దమె కవి ప్రయుక్తమగుటలో విరోధమేమియు లేదు. ప్రవాహార్థక 'నిట్ట' శబ్దమును నిర్వహించు నాధారమేదియుఁ గన్పట్టలేదు. సూ. రా. నిఘంటువున నుదాహరింపఁ బడిన గోపరాజుపద్యము నిట్టశబ్దము ప్రవాహార్థకమని నిరూపింపఁజాలదు. "ఆ. వె. అయిదు మానికంబులందు నాకిచ్చిన । నిట్టయవలిదరిని బెట్టువాఁడ (ద్వా 3 ఆ. ౧౦౭.) (సూ. రా. ని.).

ప్రాఁకు:—ఉ. ప్రాఁకను జాతనుంగలచె మాంసము (అను. ౪ ఆ. ౨౯౪.)

లోను:—ఉ. పృథా। పుత్త్రులలోనఁ జిన్న (విరా. ౫ ఆ. ౨౦౩.)

కెలను:—క. ఇారోయను దాసు నటఁ బోవఁబోవం గెలనన్ (శాంతి. ౩ ఆ. ౪౩౫.)

కలను, వలను:—క. కదలుండని పల్కి చనియెఁ గలని వలనికిన్ (స్త్రీ. ౧ ఆ. ౧౧౭.) క. సకల హి। తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్ (సభా. ౨ ఆ. ౨౬౧.)

మొదలు:—క. మొదల నప్రియమయ్యెను (సభా. ౨ ఆ. ౧౯౨ ప.)

క. మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్ (సభా. ౨ ఆ. ౨౦౨.)

మీఁదు:—మ. తనలావారయబుద్ధి వైశ్రవణు మీఁదన్ బోవ........ (శాంతి. ౨ ఆ. ౩౧౯) మీఁదటి వృత్తాంతము (మనుచ. ౫ ఆ. ౧౦౪.)

ఎదురు:— క. ఎదిరికి హితముకు బ్రియమును (ఉద్యో. ౨ ఆ. ౫౯.)

మధ్యాక్షరము:—ఎదురను దవ్వులఁజూచిన (ఆర. ౨ ఆ. ౧౭౦)

గీ. ఎంతచేసిన నాసింహా మెదుటి కడుగు। వెట్టదయ్యె.....(కళా. ౩ ఆ. ౭౭.)

నడుము:—క.....నడు। మున యుడుగును భూసురోత్తము నిమిత్తమునన్ (ఆది. ౨ ఆ. ౨౦౯.)

చోటు:—గీ. ఈశ్వరుఁడు క్రీడి కస్త్రంబు లిచ్చుచోట। మత్స్యముండవు గమ్మని,....,పల్కె (శల్య. ౨ ఆ. ౩౪౩ ప.) శా. డా యం దక్షిణదిక్కునందు నొకచోటన్ యోగదండంబునన్ (విక్ర. ౨ ఆ. ౧౭. సూ. రా. ని.)

అక్కడ - ఇక్కడ - ఎక్కడ:—కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది 'కడ' శబ్ద మాపవిభక్తికాంతమగును. ఉ. ఎక్కడినుండి యెక్కడికి నేఁగెడినో యిది యెక్క కాంత........(విరా. ౧ ఆ. ౩౦౩.) "అక్కడ - వి. (ఆ+కడ) అక్కడనుండి - అక్కడకు - మొ. వృత్తియం దాపవిభక్తి యగును. ఉ. అక్కడివారు-అక్కడిది" (సూ. రా. ని.). ఇది సరికాదు. 'అక్కడి యొక్క+వారు - అక్కడియొక్క+అది' అను రీతి విగ్రహములలో యొక్క విభక్తిలోపము వృత్తియందుఁ గల్గఁగా. 'అక్కడి వారు - అక్కడిది' అని యేర్పడును గాన వృత్తియం దంగీకరించిన యాపవిభక్తికత విభక్తి పరకత్వమున నయితము సంభవింపకతీరదు. యొక్కవిభక్తికిఁ బ్రాచీనుల కాలమునఁ బ్రయోగము సమ్మతము కామింజేసి 'యొక్క' అను దానిచోట దచ్ఛబ్దరూప

ములను నిల్పియు 'ది - వి-దు' అను ప్రత్యయములను నిల్పియుఁ బ్రయోగించుచు వచ్చిరి. (బా. సమా. ౮-౫-౧౧ సూ.) (౧౦౭ విష.) (దిః స్యాత్ స్వే౦బక్షార్థే...అం. చిం. హలం. ౧౨ కారి.). అట్లగుటంజేసి యట్టిచోటులందెల్ల 'యొక్క' విభక్తియున్న దనియే భావింపనగును. కాన 'అక్కడిది-ఎక్కడిది-ఎక్కడియది' మున్నగు చోటులం దలి యుపవిభక్తి యొక్క విభక్తికి ముందునిల్చుటచేతనే సంభవించినదని నిర్ణయింప నగును గాన సూ. రా. నిఘంటువునందలి "అక్కడకు" అను సంహాహ్యాతి ప్రామా దికమె యనకతీరదు. క. ఇక్కమలాక్షి శకుంతల । యెక్కడియది. (ఆ. ౪ ఆ. ౩౪) హ్రస్వతనందని త్రికసమాసములో నౌపవిభక్తికత్వము లేదు. కం. ఏకడకుసైనఁ జనియెద (ఉ- హరి. ౬ ఆ. ౨౪౬.)

టివర్ణంబు గొన్నిటి యంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయం బున రెండును బ్రాయికంబుగనగు. ౩౧.

ఆదేశము:—త్రాడు - త్రాటిని, కాడు - కాటిని, నోరు - నోటిని, ఏఱు - ఏటిని. ఆగమము:—అన్ని - అన్నిటిని, ఎనిమిది - ఎనిమిదిటిని, వేయి - వేయిటిని. ఉభయము:—ఏమి - ఏటిని - ఏమిటిని, పగలు - పగ టిని - పగలిటిని, మొదలు - మొదటిని - మొదలిటిని, రెండు - రెంటిని - రెండిటిని, మూఁడు - మూఁటిని - మూఁడిటిని, నూఱు - నూటిని - నూఱిటిని.

బాలవ్యాకరణ వివరణము. ౨౭౫ విషయము.

హ్రస్వంబుమీఁది టివర్ణకంబు ముందు పూర్ణబిందువు బహుళముగానగు. ౩౨.

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటిని - పగలింటిని - రెండింటిని - మూఁడింటిని.

పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు. ౩౩.

కన్ను - కంటిని, మిన్ను - మింటిని, ఇల్లు - ఇంటిని, పల్లు - పంటిని.

టి. తి వర్ణబులు పరంబులగునపు డుత్వంబున కిత్వం బగు. ౩౪.

522) పౌనఃపున్యార్థక 'టి' ఖండపూర్వకము కాదు 'నేటి'లోనిది సిద్ధము [౨.౨౬ వి. సంజీ.]

రెండిటికి - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొద
టిటికి - పెక్కుటికి - కొండొకచో నుత్వంబున కిత్వంబు
చూపట్టుడు. నెత్తుటికి.

సంజీవని. ౨.౨౬ విష:—అర్థములు:—కాడు = అడవి - శ్మశానము - కీడు. ఏఱు = నది.

'త్రాడు' మున్నగువానికి 'టి'వర్ణాదేశముర్యాఁగా, "త్రాడు+టి+ను = త్రాటి+ను" అగును, పిదప బా. తత్స. ౨౬ సూత్రముచొప్పున 'ను' అనుదాని 'ఉ'త్వము నకు 'ఇ'త్వముర్యాఁగా "త్రాటిని" అను రూపము సిద్ధించును. ఇట్లె తక్కినరూప ములను సాధించునది. 'త్రాడు' మున్నగువానిలోని తుది 'డు' అనునదిపోయి యాచోట 'టి' అనునది నిల్చెను గాన నది యాదేశమనఁబడెను. అన్ని మున్నగు శబ్దములలో వర్ణవృద్ధిగా 'టి' అనునది చేరెనుగాన నది యాగమమనఁబడెను. రెండు మున్నగు నుదాహృతులలో ద్వివిధకార్యములు సంభవించెనుగాన నుభయ విధముల కవి యుదాహృతులయ్యెను. అన్నిటిని - ఎనిమిదిటిని - వేయిటిని మున్నగు వానియందెల్ల ౩౨ సూత్రముచొప్పునఁ బూర్ణబిందువు టివర్ణమునకు ముందు నిల్వఁగా అన్నింటిని - ఎనిమిదింటిని - వేయింటిని - మొదలగురూపములు సిద్ధించి నవి. కన్ను - మిన్ను - ఇల్లు మున్నగువానిలోని టివర్ణము పదాదిహ్రస్వము తర్వా తిది గాన దానికిముందు నిత్యముగాఁ బూర్ణమునిల్చుచున్నది. కంటిని - మింటిని - ఇంటిని - మొ.

పయిరీతి నిచటిబిందువు హ్రస్వపూర్వకత్వమున వికల్పముగాను, నుడి తొలి వర్ణముమీఁద నిత్యముగాను నిల్చుచుండుటచే వానిలో నిండుసున్న నిలువనిపక్ష మున నచట నర్ధబిందువు నిల్చునని భ్రమింపరాదు. ఇట్టి సందేహము కల్గకుండుటకే చింతామణి - 'టి - ంటి' అని పూర్ణబిందు పూర్వకత్వము పృథక్కరించి యుపదేశిం చెను. పు - ంపులలోని పువర్ణము ఖండపూర్వకము కానేరనట్లె (కార I విష.) టి - ంటిలలోని 'టి'వర్ణమునైతము ఖండపూర్వకము కాదు. మూఁడు - నాఁడు మున్నగు శబ్దములలో సిద్ధఖండము వెలయుచుండుటంజేసియుఁ బరుషమగు 'టి'వర్ణమునకు ముందు బిందువునిల్చుట నిర్బాధమగుటంజేసియుఁ వానిలోని సిద్ధ ఖండము లోపించుటకుఁ బ్రసక్తిలేదు. ఉదా:—నాఁడు - నాఁటికిన్ - నేఁడు - నేఁటికిన్ - మూఁడు - మూఁటికిన్ - మొ.

సూరి చింతామణిప్రక్రియను మార్చుటచే బాలవ్యాకరణప్రక్రియలో నట్టి ఖండబిందుశంక యంకురింపవలసెను. మఱియు మొదటిని - నెత్తుటిని - క్రింద

[బా. అచ్చి. ౩౦-౩౩-౩౬ సూ.] 'పదియింటికి' అనునది బాలవ్యాకృతిసాధ్యముకాదు

ట్టికి - మిూఁదటికి - తంగేటి జున్ను మున్నగుచోటులందు. ౩౭ సూత్రముచొప్పున 'టి'వర్ణము పూర్ణబిందుపూర్వకము కావలయునేమోయను శంకయుఁ బొడమచున్నది. అట్లై "టి-తివర్ణంబు లిత్త్వాది (౩౬ సూ.) సూత్రముచే 'ఇ'త్వము నుపదేశించి "ఇటి - ఇంటి" మున్నగు నుపవిభక్తుల నుపదేశింపక 'ఇ.టి తి' వర్ణములు మాత్రమె యుపవిభక్తులని (బా. అచ్చి ౭౮ సూ.) చెప్పుటచేత "పదియింటి" మున్నగు రూపములు బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడవయ్యె (౨౨౭ I విమ.). ఇట్టి యనర్థములనెల్ల వారించుకొనుటకేక బా. అచ్చి. ౩౭ సూత్రములోని బహుళగ్రహణమును, ౭౯ సూత్రములోని ప్రాయికశబ్దమును సూరికి శరణములగుచున్నవి. ౩౬ సూత్రములోని సూరిగారి వివరణముచొప్పున 'నెత్తుటికి' అను చోటనేకాక 'ఎదుటికి, పురుటికి' మున్నగుచోటులందును 'ఉ'త్వమునకు 'ఇ'త్వము రాదని గ్రహింపవలయును.

ప్రయోగములు:—క......ఇప్పటి పదనుం। గడవఁబడుట త్రాఁటఁ దప్పకరణియచుమ్మీ. (కర్ణ. ౩ ఆ. ౨౭౩ ప.) (ఉద్యో. ౩ ఆ. ౨౨౦ ప.). క. పొదపైనుండఁగ......కాటిపొంత తెరువునన్ (అను. ౩ ఆ. ౨౧౨) చ......మానసు। బెరియఁగఁ జొచ్చె నేటి కై దురీఁదినచాడ్పున (మౌసల. ౯౮ ప.) క. అరయఁగ లోకమున వానియన్నిటికంటెన్ (అను. ౪ ఆ. ౪౩) గీ. వానియన్నింటికంటె మేలైన శాంతి (ఉద్యో. ౨ ఆ. ౮౫) గీ. ఒకటిగొని రెంట నిశ్చలయుక్తిఁ జేర్చి। మూఁటి నాల్గింటిఁ గడువశ్యములుగఁజేసి। యేనిటినిగెల్చి యాఱింటినెఱిఁగి యేడు। విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. (ఉద్యో. ౨ ఆ. ౩౭) క. ఆతని। మొదలిటి సంపదలతో సమూలంబు చెడున్ (సభా. ౨ ఆ. ౨౦౨) చ. సుతేజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె...(ఆది. ౪ ఆ. ౯౩) గీ. పట్టపగలింటిసూర్యునిపగిది (కర్ణ. ౩ ఆ. ౧౮) చ......తొంటితనతీవ్రతఁ గైకొని (ద్రోణ. ౫ ఆ. ౨౨౭) సీ. తొల్లింటియట్టులు వెల్లురేఁగి (ఆది. ౮ ఆ. ౨౬౧.) సీ......ఎ-గీ. కఱవెనర్జునుఁ డొంటిభార్గవుఁడు వింట। నిట్టిఁడేయని (ఆది. ౫ ఆ. ౨౩౦.) ఉ. అర్మిలినిల్పి యాగియుఁ బ్రియంబును నాయెడ నాఁటినాఁటికిన్ (విరా. ౧ ఆ. ౨౬౭.) తరల - వగవనేటికి నింకనైనను. (సభా. ౨ ఆ. ౩౧౫.) గీ. ఏలొకో యిప్పుడీ విప్రునింట నార్త। రవము వీతెంచె (ఆది. ౬ ఆ. ౨౪౨.) క. కటకట పేరిన పెన్నె। త్తుట జొత్తిలియున్న మేనితోఁ గొడుకే చ। క్కటి (ద్రోణ. ౨ ఆ. ౨౫౧ ప.) చ......ఏ। మిటికి నలందురన్ మొనలు మీఁకొని యాయుధ......(ద్రోణ. ౨ ఆ. ౨౫౭) క. కన్నుండఁగంటిపాపం। గొన్నట్లు (ఉ. హరి. ౫ ఆ. ౭౮.) ఉ. చంట భిషంబుమొత్తికొని

చంప్రను నక్కగనంచు......(హరి. ౪ ఆ. ౨౩౩.) సీ. ఇంద్రియంబులు పదియిం టిని గుదియించుట......(అశ్వ. ౨ ఆ. ౧౫౩ ప.) (౨౨౭ I విష.) ద్వి. అందంద బారెంట నలఁత మూరెంట (బసవ. ౪ ఆ. ౮౫౭ ప.) చ. కెరలక క్రమ్మఱింప నడు గెంటనె పట్టు (పాండు. ౧ ఆ. ౧౧౪ ) సీ. ఇవి గాలికనిన మూకవరాహ దను జేంద్రునైన జుట్టెంటిలో నాఁగఁజాలు (మనుచ. ౪ ఆ. ౩౧ ప.) (బారెఁడు = బారెంటన్, అడుగెఁడు = అడుగెంటన్, జుట్టెఁడు = జుట్టెంటన్,) ద్వి. గుడికడ నెన్నఁటఁ గూలియున్నదిరయు (బసవ. ౫ ఆ. ౫౧౫ మ.....ప్రకృతి నచ్ఛుండైన సన్మార్గి యె। న్నఁటికిన్ గూటమివంక. (మనుచ. ౩ ఆ. ౨౪ ప.) (ఎన్నఁడు. ఎన్నఁటికిన్. ఎన్నఁటన్.) (ఏ+నాఁడు = ఎన్నఁడు.) క......రెం। టిని ద్రెళ్ళఁగనేసెఁ గడు కత్తిన హృదయుండై (ఆది. ౫. ఆ. ౪౯.) సీ. కెలఁకులనున్న తంగెటి జున్ను గృహమేధి......(మను. ౧ ఆ. ౬౬.) ఎ-గీ. నేరెళేటి యసల్ దెచ్చి (మను. ౨ ఆ. ౩౬.) క......పేరాఁకలితో రేయెల్ల (శాంతి. ౩ ఆ. ౨౩౩.) శా. సింగం బాఁక టితో......(విరా. ౪ ఆ. ౯౫.) గీ. బలయు వైరాగ్యమను కొడవలినకాని (శాంతి. ౪ ఆ. ౧౯౨.) క. కొడవంటఁగోయు నురవడిఁ। దడఁబడి (వరాహ. ౧౨ ఆ. ౨౪.) ఉ. తా। మిన్నునుండి గోపకులమీఁద (భాగ. ౧౦ స్కం. పూ.) మ...అన్। మతి లంచంబుగ హేమటంకములు మింటంబొల్చు (ఆము. ౨ ఆ. ౫౨.) చ......బి। క్కొటఁబడియెన్ హరార్జునుల ఘోరశరంబులు...(ఆర. ౧ ఆ. ౩౦౫.) గీ. దక్కొ కంటను లేదు వేదజ్ఞులార (స్వర్గా. ౧ ఆ. ౮౨.) క. పటుగతిఁజని కురుపతి ముం। దట వైచెన్ (ద్రోణ. ౫ ఆ. ౨౨౩.) శా. వీటన్ వీథులనెల్ల......(విరా. ౫ ఆ. ౨౪౨.) ఉ. తక్కటివారలున్ సురల దైత్యులనైనను (విరా. ౫ ఆ. ౨౮౨.) క. ఎచ్చోటను న్నవాఁ డతఁ। డిచ్చోటికి నేలరాఁడొ యిప్పుడనుఁడుఁ దా। నచ్చట నంతర్హితుఁడై। యిచ్చఁజనియె: దోఁచునేఁటి యెల్లిటిలోనన్ (విరా. ౫ ఆ. ౩౦౧.) క. పటు శరముల మీఁదికి డా। పటికిన్ వలపటికి........(ద్రోణ. ౪ ఆ. ౩౨౨.) క. బెడిదముగఁ గత్తిగొడ్డటఁ। బొడువ (ఉద్యో. ౨ ఆ. ౬౧.) కం. పిదపటిపత్త్రంబె చెల్లు (విజ్ఞా. వ్యవ. ౩౭ ప.)

బాలవ్యా. టివర్ణంబు పరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వంబగు. ౩౭.

౨౩౦ విషయము. క్రిందు - క్రిందటిని, మీఁదు - మీఁదటిని, ముందు - ముందటిని, మాపు - మాపటిని, అప్పుడు - అప్పటిని.

సంజీవని. ౨౩౦ విష:—పువర్ణమున కత్వమనఁగా రేపు - మాపు మున్నగు

వాని కాగమ టివర్ణంబు పరమగునపుడును, 'అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు' అనువాని తుదివర్ణమున కాదేశముగావచ్చిన టివర్ణంబు లుక్తశేషములగు 'అప్పు-ఇప్పు-ఎప్పు' అనువానికిఁ బరంబగునపుడును 'అ'త్వము వచ్చునని యర్థము. క్రింద మీఁదు మున్నగువానికి 'టి'వర్ణమేకాక 'ఇ' అను నుపవిభక్తియు వచ్చును. (౨౨౭ విష.) "క్రిందు+టి = క్రిందు+అ+టి+ను = క్రిందటిను" అని యేర్పడును. బా. తత్స. ౨౬ సూత్రముచెప్పిన 'ను'వర్ణకముమీఁది 'ఉ'త్వమునకు 'ఇ'త్వముకాఁగా 'క్రిందటిని' అనురూపము సిద్ధించును. క్రిందుప్రభృతులు కొన్నిటికిఁ గొన్ని విభక్తి వచనములతో మాత్రమె ప్రయోగము కవిసమ్మతము. క్రిందటితో మున్నగు రూపములు వాడఁబడవు, క్రిందు మున్నగువానికెల్ల బా. ఆచ్ఛి. 3౭ సూత్రము చెప్పిన 'అ'త్వము తృతీయాసప్తమ్యర్థములందు వచ్చును. క్రిందటికిన్ - క్రిందికిన్ - క్రిందన్ మొ. 'క్రిందటికి - మీఁదటికి' మున్నగుచోట్ల హ్రస్వ పూర్వకమెయయ్యు 'టి'వర్ణము పూర్ణబిందు పూర్వకము కానేరదు. (బా. ఆచ్ఛి. 3౨ సూ.) ప్రయోగములు:—"అయ్యరదంబుక్రిందఁ దూఱెనను తలం పున......(ద్రోణ. ౪ ఆ. ౨3౬ వచన.) గీ. నాభికందంబు క్రిందట నలిన గంధి (కాశీ. ౨ ఆ. ౧౨౫.) క. పటుశరములమీఁదికి డా। పటికిన్ వలపటికి నపరభాగ మునకు ముం। దటికిఁ జదలనడపె. (ద్రోణ. ౪ ఆ. 3౨౨.) మీఁదటి వృత్తాంతం బానతీవలయు (మనుచ. ౫ ఆ. ౧౦౪.) చ. కటకట......అ। ప్పటఁగను విచ్చునప్డు విజ్ఞా. 3 ఆ. ౯౯.) సీ......వరుస రేపటి సంధ్యవార్చవలయు ।......మాపటి, సంధ్యావిధానంబు సలుపవలయు (విజ్ఞా. ఆచా. శ. ౪.) క. అప్పటిఁగోలెను (ఆది. ౬ ఆ. ౧౯3.) సీ. అప్పటికంటెను (నన్ని. కు. ౧౧ ఆ. ౭౦౨ ప.) సీ...... పడవైచి కదలునప్పంటికోడు (రాజవాహన విజయము. ౨ ఆ. ౬౯ సూ. రా. ని.) సీ. వంటపూఁటింటి కెప్పఁటికంటెను బాలు. (ఆము. ౬ ఆ. ౭౧ ప.) ఆ. వె...... ఒక్కింత సే। పునకుఁ దేటి యిట్టులనియె.........(అశ్వ. ౨ ఆ. ౮౯.) చ...... కొంతసే। పున కనుజాదిసేవకులఁబొమ్మని......(నిర్వ. ౧౦ ఆ. ౯౫.) క. నదిలో మఱికొంతసేపునకుఁ బాయును (శాంతి. ౪ ఆ. ౧౦.) (చూ-బా-ఆచ్ఛి 3౭ సూ).

అట్టు మొదలగుశబ్దంబుల కంతాగమంబు తివర్ణంబును
బాలవ్యా. రేఫంబున కొక్కటికిఁ లోపంబునగు. 3౪.

౨3౧ విష. అట్టు - అటతిని, అట్టు - కట్టు - కొట్టు - గొట్టు - మిట్టు - వట్టు - ఇవి యట్టు మొదలగునవి.

సంజీవని. ౨3౧ విష:—అర్థ - "అట్టు = మెడ - కంఠము, సమీపము,

కఱ్ఱు = నాఁగలిచూంపయం దమర్చెడి యినుపపాళము. (పాళము = లోహశలాక,) కొఱ్ఱు = ముల్లు - మేకు - శూలము. గొఱ్ఱు = దున్నినపొలముమీఁద దున్నెడు యంత్రము," (శ-ర) 'గొఱ్ఱు = దున్నినపొలమును జదునుచేయు సాధనము' (సూ. రా. ని.) "మిఱ్ఱు = ఉన్నతభూమి, వఱ్ఱు = ప్రవాహము" (శ-ర.)

"అఱ్ఱు+తి+ను = అఱు+తిటను =" అగును. టి తి వర్ణంబులు.....అను బా. అచ్చి. ౩౬ సూత్రముచొప్పున శకటముమీఁది 'ఉ'కారముచోట 'ఇ'కారము నిల్వఁగా, బా. తత్స. ౨౬ సూత్రముచొప్పునను విభక్తిమీఁది 'ఉ'కారముచోట 'ఇ'కారమునిల్వఁగా 'అఱితిని' అను రూపమేర్పడును. ఇట్లే అఱితిచే మున్నగు నవియు సాధ్యములగును. ఈరీతినే 'కఱ్ఱు' ప్రభృతులకు రూపంబులు సాధించికొనవలెను. వీనికెల్ల బా. అచ్చి. ౩౮ సూత్రము చొప్పునఁ దృతీయాసప్తమ్యర్థములందు 'అ'త్వము రాఁగా 'అఱుతన్' మున్నగురూపంబులు సిద్ధించును. 'అఱితి' అనుదానిలోని 'తి'వర్ణముమీఁది 'ఇ'కారము 'ఉ'కారముగా మాఱిపోవుటచే నట్టి తివర్ణనిమిత్త కత్వమున బా. అచ్చి. ౩౬ సూత్రముచొప్పునవచ్చిన ముందటి శకటముమీఁది 'ఇ'త్వముపోయి యథాస్థితముగ 'ఉ'త్వము న్యాయ్యముగానిల్చునని గ్రహింపవలయును. 'అఱితి = అర్తి, అఱుతన్ = అర్తన్' మున్నగురీతిని స్వరలోపమునుఁ బ్రయోగదృష్టమగుచున్నది.

ప్రయోగములు:—వ. అపగతప్రాణంబై పడియున్నపాముం దన వింటి కొప్పుననెత్తి యమ్మునియఱుతం దగులవైచి (ఆది. ౨ ఆ. ౧౬౭.) (సూ. రా. ని.). క. పిఱిఁదికిఁ బోనిచ్చిన వి। ల్లఱితికినై యల్లఁ జాప నదిగనుఁగొని పె। ల్లుఱికిచను (భాస్కర. రా. ఆర. ౨ ఆ. ౭౯. సూ. రా. ని.) క. తెల్లని గట్టఱుత (మనుచ. ౪ ఆ. ౧౬.) సీ. లికుచావళికి వృత్తలీల చెన్నగుఁగాక బొంగరంబుల గొర్తఁ బూన్ప వలదె (పి. శకుం. ౨ ఆ. ౭౫.) ద్వి. చంపి మాండవ్యుండు సరి కొర్తఁబడియె (బసవ. ౫ ఆ. ౩౮౨.) సీ. వరుణునికార్యంబు వఱుతిపాలుగఁజేసి (భాస్క. రా. యుద్ధ. ౧౩౯౧ ప.) మ. భరమైతోఁచు.....విజ్ఞాత చౌర్యక్రియా। విరసుండై కొఱతంబడుం గుకవి పృథ్వీ భృత్సమీపక్షితిన్ (మనుచ. పీఠి. ౯ ప.) చోరపక్షమున 'కొఱుతన్' అనియుఁ గవిపక్షమున 'కొఱఁతన్' అనియు నుండవలయును. ఇట్టి ప్రయోగము మహాకవిప్రయోగమగుటం జేసి నిపాతన్యాయమున సాధువని యంగీకరింపనగును. 'కొఱత వేయఁబడె'నను వాడుకలోని వ్యావహారికపదమునకుఁ బెద్దనార్యుఁడు గ్రాంథికతాపదవిని బ్రసాదించెనని యెన్నఁనగును.

నన్నయా. ౨౩౨ విషయము.

కేషాంచిద్ యన్తశబ్దానాం। లుతీస్యాత్తాం యథోచితమ్। క్వచిత్త్యాదేశ ఏవస్యాత్। క్వచిన్నైవ ప్రయోగతః। వర్ణస్యాన్త్యస్య లోపశ్చ లులయోః ప్రాయశః క్వచిత్. (వికృ. అజం. ౭౮-౭౯ కాౘి. ఆహో. ౩౨౭ పు.)

కల్పతరు. ౨౩౨ విష:—ఈకారికలకు ౨౦౮ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ఔపవిభక్తికములగు గోయిప్రభృతులయిన యివర్ణాంతశబ్దములకు 'లు ల' లు పరమగుచుండఁగా 'తి' అను నాదేశము నిత్యముగానగును. వీని కేకత్వమున నౌపవిభక్తిక తివర్ణము ద్వితీయాదివిభక్తి పరకత్వమున నాదేశమగును. అథర్వణాచార్యుఁ డీరీతిని బహుత్వమునందుమాత్రమె 'తి'వర్ణాదేశమును బ్రత్యేకముగా విధించెనేకాని యేకత్వమున 'తి'వర్ణాదేశమును విధింపలేదు. కావున నేకత్వమునందలి యౌపవిభక్తిక తివర్ణాదేశము వేఱనియు "క్వచిత్త్యాదేశ ఏవస్యా"త్తను సూత్రముచే విధింపఁబడిన 'తి'వర్ణము వేఱనియు నథర్వణుఁడు తలంచెనని విశదమగుచున్నది. ఆకారసామ్యమునుబట్టి భ్రమించి సూరి గోయిప్రభృతులగు నౌపవిభక్తికములకు బహుత్వమునందును 'తి' అను నుపవిభక్తివచ్చునని యుపదేశించెను. ఇట్టి ప్రక్రియచే నుపవిభక్తులు జడవాచకములకు ద్వితీయాద్యేకవచన పరకత్వమందుమాత్రమె వచ్చుననెడి వైయాకరణ సంప్రదాయము భగ్నమయ్యెను. (విస్తరము. ౨౦౮. I విష.)

బాలవ్యా. ౨౩౨ I విషయము.

విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యకారంబు తివర్ణంబగు. ౩౫.

గోయి - గోతులు, గోతిని - గోతులను, గోయి - చేయి దాయి - నూయి - నేయి - వాయి - రోయి - ఇత్యాదులు.

సంజీవని. ౨౩౨ I విష:—అర్థ:—దాయి = సమీపము, వాయి = నోరు, రోయి = కట్టెనిప్పుమీఁది నిగుఱు. (విస్తర.) చేయి = హస్తము - ఏనుఁగుతొండము.

---

విస్తర. ౨౩౧ I విష:—శబ్దరత్నాకరమున 'రోయి' శబ్దమునకు 'నిగుఱు' అను నర్థము చూపఁబడలేదు. "రొయ్యి - రొయి" అను శబ్దములకుమాత్ర మీయర్థము చూపఁబడెను. కాని రోయిశబ్దమునుండియే 'రొయ్యి - రొయి' అను శబ్దము లేర్పడెననఁదగి యుండుటంజేసి 'చేయి - చెయ్యి - చెయి - నూయి - నుయ్యి - నుయి' మున్నగువాని తుల్యన్యాయమున రోయిశబ్దమునునైత మంగీక

ఔపవిభక్తికములు ద్వితీయా ద్యేకవచన పరకత్వమునందుమాత్రమె వచ్చుట ప్రయోజనము. 'తి' అను నుపవిభక్తి యట్లుగాక యేకత్వమునందును బహుత్వమందును వచ్చుననుచు సూరి నన్నయాథర్వణీయ విలక్షణముగ నీసూత్రము నుపదేశించు చున్నాఁడు. 'విభక్తి పరమగునపుడు' అనుటచే స్త్రీసమంబులగు నీగోయి ప్రభృతులకు బా. తత్స. ౫౭ సూత్రముచొప్పునఁ బ్రథమైకవచనలోపము కల్గునుగాన విభక్తిపరకత్వము లేమిఁజేసి ప్రథమైకవచనమున 'తి' అను నాదేశమురాదనియుఁ దక్కినయెల్ల విభక్తిప్రత్యయములు పరమగునపుడును నేకత్వమునందును బహుత్వమునందును గోయిప్రభృతుల తుది యివర్ణముఁనకు 'తి'వర్ణమాదేశముగాఁ నిల్చుననియుఁ దాత్పర్యము. 'గోయి+తి+లు+గోతి+లు' అనుచో బా. తత్స. ౪౫ సూత్రముచొప్పున 'ఉ'త్వము రాఁగా 'గోతులు' అను రూపము సిద్ధించును. ఇట్లె - గోతిని - గోతులను మున్నగురూపముల ప్రక్రియ యూహ్యము.

ద్వితీయాద్యేకవచనములందు గోయిప్రభృతులకువచ్చు 'తి' అనునది యుపవిభక్తియనియు, వీనికి బహుత్వమునవచ్చు 'తి' అను నాదేశ ముపవిభక్తికాదనియు నది వేఱు 'తి'వర్ణమనియు వచింపఁబడిన యథర్వణవచనమును సరిగాఁదెలిసికొనక యాకారసామ్యమున భ్రమించి యేకవిధముగ నుపదేశించుటంజేసి యుపవిభక్తులు జడవాచకములకు ద్వితీయాద్యేకవచన పరకత్వమందుమాత్రమె వచ్చునని యథర్వణసిద్ధాంతమును నట్టి నియమముతోనె ప్రయోగించెడి మహాకవుల ప్రయోగములను బొరపాటుగా సూరి యుల్లంఘించినవాఁడయ్యెను. (విస్తర. ౨౦౮ I విష.)

'ఱాతులు' మున్నగు బహువచన తివర్ణప్రయోగము ఱాయిశబ్దమునకు లభింపమింజేసి కావలయు సూరి యద్దానిని రేయిప్రభృతులలోఁ జేర్చినేకాని గోయి ప్రభృతులలోఁజేర్చి యుదాహరింపఁడయ్యెను. (బాల. అచ్చి. ౨౧ సూ. ౨౦౮ I విష.). ఇట్లు గోయిప్రభృతులలోఁ జేరనపుడు 'ఱు' అనునది తుదిని లేమింజేసి "అఱు" ప్రభృతులందును జేరనేరదు. (బా. అచ్చి. ౩౮ సూ.) కావున నద్దానికేకత్వమున 'తి'వర్ణాదేశ మెట్లువచ్చునని సూరితలంచెనో తెలియకున్నది. ఉ. ఆతఁడు... చ। ట్రాతికి...। చేతికి (భాస్క. యుద్ధ. ౧౦౦౮.) ఆ-వె. ...నామనంబు వ్యయ్యలై పోవిది। ఱాతఁజేసినది యొకో తలంప (ద్రోణ. ౨ ఆ. ౨౮౯.) ఇట్లు మహాకవి

---

రించి దానికిని 'నిగుఱు' అను నర్థము నంగీకరించుట యుక్తము. "ఔప విభక్తికాంతములగు చేయి - నేయిలోనగు శబ్దంబుల యాద్యచ్చునకు హ్రస్వంబును మీఁదిహల్లునకు ద్విత్వంబును బ్రథమైకవచనము నంద వైకల్పికముగనగు" (ప్రౌఢ. శబ్ద. ౧౦౫ సూ.).

ప్రయోగ ప్రసిద్ధమయియున్న ఔఁయి శబ్దాపవిభక్తికరూపము బాలవ్యాకరణముచే సిద్ధింపఁబడఁజాలకుండుట యను ననర్థము దుర్వారమగుచున్నది. 'గోయి ప్రభృతులు' అనుచోటఁ బ్రభృతిశబ్దమున్నను ఔయిశబ్దమును రేయి ప్రభృతులలోఁ జేర్చి 'ఔలు' అని యుదాహరించి సూరి 'ఔతులను' అని యుదాహరింపమిచేత దీనిని గోయిప్రభృతులలో సయితము గణించె ననుట విశ్వసనీయము కాదు.

ప్రయోగములు:—సీ......తెలిపుల్లు బురదగోతులకుఁ జనునె (సీ. ౨ ఆ. ౭౬ సూ. రా. ని.) ఉ. ఆతఁడు......చ। ట్రాతికి......। చేతికి...(భాస్కర. రా. యుద్ధ. ౧౦౦౮ ప.) ఉ. నీతనయుండు......బల్। వాతిశరంబున మనిమె వారి వరూథిని......(శల్య. ౧ ఆ. ౨౪౦.) ఉ. భీముఁ డుదగ్రతంగడియఁ బెన్నగు నా కరిచేతి శీకర। స్తోమమునన్.........(ద్రోణ. ౧ ఆ. ౩౨౬.) గీ. పరమపద నాథుఁదిరిగిరా నిరువదేను। చేతుల ప్రమాణమునఁగల్గు భూతలంబు (పాండు. ౨ ఆ. ౧౧౬.) ద్వి. మూరెంట నొక్కొక్క మునిపల్లెగలదు। చేతెంట నొక్కొక్క సెల యేటుగలదు (పండితా. పర్వ. ౩౮౪ పు.) ద్వి. చేతులఁగట్టి డాచేతఁదాఁబట్టి। దాతిపై నిడి......(పండితా. పురా. ౯౬ పు.) ఉ. ఆతరళాక్షి......। రాతికిఁ దోడు పోయినది రాసుతుడెందము......దా। దాతికివచ్చియుండ......(సారంగ. ౨. ఆ. ౮౬ ప.) చ. నుతజల పూరితంబులగు నూతులు నూఱెటికింటె (ఆది. ౪ ఆ. ౯౩.) క. కామములు భోగములఁ దెగు। నే మెలఁతుక నేతఁనాఱునే చిచ్చు.... (అను. ౫ ఆ. ౨౩౩.) క. వేయేల బూదివెల్చిన। నేయునిబోలియును మీఁద నిష్ఫల మందున్ (వాసిష్ఠరామా. ౪. ఆ. ౬౬ సూ. రా. ని.) మడికిపింగన 'నేయి' శబ్ద మనాపవిభక్తికముగాఁ బ్రాసమునఁ బ్రయోగించెను. చ......శరీర పుం। జిద్రు పలుచేరఁ దత్సుతులచేతుల కాకకులంబు వాతులన్ (ఉ. హరి. ౪ ఆ. ౧౦౯.)

ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగానగు. ౩౮.

బాలవ్యా. ౨౩౩ విషయము. గోరను గీఱెను. ఊరనున్నాఁడు - గోడ్డటనటికెను. ఇంట లేఁడు - వఱుతఁగలిసె. కఱుతదూఱె పక్షము నందు గోరిచేత నూరియందిత్యాదులు.

సంజీవని. ౨౩౩ విష:—గోరను గీఱెను = గోరిచే గీఱెను. గోడ్డట నటికెను = గోడ్డటితో నటికెను. కఱుతదూఱెను = నాఁగటికఱితితోఁ (ఇనుపశలాక) బొడిచెను. ఊరనున్నాఁడు = ఊరియందున్నాఁడు. ఇంట లేఁడు = ఇంటియందు లేఁడు.

పఱుతెఁగలిసె = ప్రవాహమునఁగలిసెను. గోరి+అగను = బా. సంధి. ౧౧ సూత్ర ముచే నిత్యసంధి వచ్చినఁగా 'గోరను' అను రూపము సిద్ధించెను. తృతీయాసప్తముల కత్వమాదేశమగుటచేతఁ దృతీయా సప్తమీవిభక్తులగు 'చేత - అందు' మున్నగు వానిచోట 'అ' అనునది నిల్చినఁగా నయ్యది తృతీయాసప్తమీ విభక్తులవంటిదే యగును. కావున దానికి బా. తత్స ౧ సూత్రముచే 'ను'గాగమమువచ్చును. అట్లగుఁ నయ్యది ద్రుతప్రకృతికమై 'గోరను' అను నాకారముసుబొందును. ఇట్లె తక్కినచోటులందును బ్రక్రియనరయునది.

పైవానిలో 'ఊరన్ - ఇంటన్' అనువానికెచ్చటను దృతీయార్థమునఁ బ్రయోగము లేదు. ఇట్లె ఇచ్చోటను - మేనను - ఎదుటను - క్రిందను - మీఁదను మున్నగువానికిని దృతీయార్థమునఁ బ్రయోగము లేదు. కాన నీవిషయమును రెండువిధములుగా సూత్రించుట యావశ్యకము. సప్తమీమాత్రార్థకములు కొన్నియుఁ దృతీయా సప్తమ్యర్థకములు కొన్నియు నేర్పడునట్లు సూత్రించుట యుక్తము. కావుననె చింతామణికర్త యీవిషయమున కేషాంచిదిత్యాది సూత్ర మును, నోపవిభక్తి కేత్యాదిసూత్రమును నుపదేశించినవాఁడయ్యెను. సూరి యట్టి భట్టారక గంభీరాశయమును గ్రహింపక కేషాంచిదిత్యాదిసూత్రము వ్యర్థమనితలంచి కావలయును బ్రకృతసూత్రము నొక్కవిధముతోడి దానినె సూత్రించెను. సూరి ప్రక్రియచొప్పున "అచ్చోటన్" అనుదాని కచ్చోటిచేత నని యర్థముచెప్పుటకుఁ బ్రతిబంధమేమియు లేదు. ఇంక నీవిషయమున సూరికి "బహుళ"శబ్దమె గతియగు చున్నది. బా. సమా. ౧౬. సూత్రపువివరణమున 'చోటు' శబ్దమున కత్వము సప్తమియందుమాత్రమె వచ్చునని సూరితలంచెనా? యనియు నాలోచింపవలసి యున్నది. (౨౧౧ II. వి.) ఇంతియకాక చింతామణిప్రక్రియచొప్పున "ఊరునన్ - చోటునన్" మున్నగురూపములునైత ముండనగుననెడి విషయము బాలవ్యాకరణ మున సంగ్రహింపఁబడలేదు.

(బా. విశే ౨౩౩ I) ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

సంజీవని. ౨౩౩ I విశే:—ఇది యాచ్ఛికపరిచ్ఛేదము =

ఇంతతో నాచ్ఛికపరిచ్ఛేదము ముగిసినది.

గద్యము

ఇది శ్రీవత్స సగోత్ర పవిత్ర శ్రీమద్వేంకటాంబాముఖలింగేశ్వరశాస్త్రి
జ్యేష్ఠపుత్ర శ్రీమచ్చిన్నామణ్యుపాఖ్య షడ్దర్శనీపారంగత నారాయాఖ్య
పండితకవీంద్ర శమనిచయానంద గురుప్రకాండ పాదపద్మమధుకర
వివిధప్రబంధ శాస్త్రగ్రంథ విమర్శన వీరసింహమంజరీప్రబంధ
వైయాకరణ పారిజాత సుమ సమర్పితాంధ్రవాగ్దైవత శాత్స
సమాఖ్యఖండకావ్యపతిత్వబంధు రాంధ్రసారస్వత పరి
షద్బహూకృత వ్యాకరణోపాధ్యా యాంధ్ర విశ్వ
కళాపరిష ద్బహూకృత కళాప్రపూర్ణ బిరుద
భూషిత వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి
విరచి తాంధ్రవ్యాకరణసంహితా
సర్వస్వమునందు సంజ్ఞా సంధి
తత్స మాచ్ఛిక పరిచ్ఛేదముల
ప్రథమభాగము.
శ్రీ ర స్తు.

# గురుదేవతా నమస్కారము

శ్లో. వేదాన్తాద్వైతసిద్ధాన్త । దేశికం జనకం భజే,
కావ్యనాటకసాహిత్య । విద్యాచార్యం విపశ్చితమ్. ౧

గీ. గీర్వాణాన్ధ్రచ్ఛన్దో । వ్యాకర ణాలంక్రియే డ్యశాస్త్రాణామ్,
ఆచార్యం నారాయణ । పణ్డితవర్యం నమామి సద్భక్త్యా. ౨

శ్లో. స్కన్దత్రయాత్మక జ్యోతి । శ్శాస్త్రాచార్యం భజే సదా,
చినవేఙ్కటసిద్ధాన్తి । మత్కనిష్ఠపితామహమ్. ౩

శ్లో. దీపికాన్త న్యాయగురుం । పీసపాటికులోద్భవమ్,
తర్కశాస్త్రప్ర వక్తారం । వన్దే శ్రీవేఙ్కటేశ్వరమ్. ౪

శ్లో. ముక్తావళీ శ్రీవిశిష్టా । ద్వైతసిద్ధాన్తదేశికమ్,
వన్దేనడాధూర్యనన్తా । ళ్వారు విద్యా మహోదధిమ్. ౫

# అనుబంధము

ఆంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వము విస్తరము ౧౮౫౭ I విషయమున వ్రాయఁబడిన చొప్పున కీ॥ శే. బ్ర. శ్రీ. మహామహోపాధ్యాయ తాతా సుబ్బా రాయ శాస్త్రులవారి వ్యాసద్వయ మిట ననుబంధముగాఁ జూపంబడుచున్నది.

---

# ద్వంద్వయుద్ధోపశమనము

## మొదటి వ్యాసము

1916 సం॥ ఆగష్టు 2 తేదీ గలదేశమాతయందు "ద్వితీయప్రత్యభియోగ" మనుశీర్షికతో సమరాంగణపార్థమూర్తిగారిచే వ్రాయఁబడిన యొకవ్యాసము ప్రచురిత మై యున్నది. "అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగును" అను బాలవ్యాకరణసూత్రములోని "అమహన్నపుంసకములకు" అను దానికి బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాకారులు కర్మధారయపరముగా నర్థము చేసినట్లును పండిత చినసీతారామస్వామిశాస్త్రులుగారు ద్వంద్వసమాసపరముగా నర్థము చేసినట్లును నందుఁ గర్మధారయపర మగునర్థమే యుక్త మై యున్నట్లును ద్వంద్వపర మగునర్థము యుక్త మై యుండ నట్లును నై వ్యాసమునకు ఫలితార్థము లై యున్నవి. నై సూత్రమునకు సూత్రకారుఁ డుదాహరించిన "వృక్షము, దైవతము" మొదలగునుదాహరణము లాసూత్రమున కసాధారణము లగునుదాహరణము లని యుభయవాదులును గుప్తార్థప్రకాశికాకారులును నంగీకరించుచున్నట్లగ పడుచున్నది.

"అదంతము లగునమహత్తులకును నపుంసకలింగశబ్దములకును మువర్ణక మగు నని యర్థము" అను సీతారామస్వామిశాస్త్రులుగారి వివరణవాక్యమును బట్టి సముచ్చయార్థమున ద్వంద్వము వారిచే నంగీకరింపఁ బడినట్లు పార్థమూర్తి గారు నిశ్చయించిరి. ఈనిశ్చయమే వీ రీపత్రికను వ్రాయుట కవకాశమును గలుగఁ జేసినది. కాని సీతారామస్వామిశాస్త్రులుగారి వివరణ మితరేతరయోగ ద్వంద్వార్థ వివరణమే యని మొదట వీరికి స్ఫురించినయెడల వీ రిట్టిపత్రికను వ్రాసి యుండరు. సీతారామస్వామిశాస్త్రులుగారివాక్య మితరేతరయోగార్థవివరణ వాక్య మనిచెప్పుట కేమాత్రమును బ్రతిబంధము లేదు. సంస్కృతవుర్యాదనుబట్టి చూడ నీవివరణ మితరేతరయోగార్థవివరణమే కాని సముచ్చయార్థవివరణము కా దని కూడ స్పష్ట

పడుచున్నది. ఇచ్చట సంస్కృతమహావాక్యమును జూపుటకై సముచ్చయార్థము వివక్షితమైనప్పుడుండువాక్యసరణిని, నితరేతరయోగార్థము వివక్షిత మగునప్పు డుండు వాక్యసరణిని జూపుచున్నాఁడను. "ఈశ్వరంగురుంచభజస్వ" అనునది సముచ్చయార్థబోధకము. "ఈశ్వరంచ గురుంచ భజస్వ" అనునది యితరేతరయోగార్థబోధకము. సముచ్చయార్థము వివక్షిత మగునపుడు సముచ్చీయమానార్థబోధకపదములు రెండింటిలోఁ దుదిపదమునకు మాత్రమే చశబ్దసమభివ్యాహార ముండును. ఇతరేతరయోగార్థము వివక్షిత మగునపుడు సముచ్చీయమానార్థబోధకపదములు రెండింటికిని "చ"శబ్దసమభివ్యాహార ముండును. సంస్కృతభాషలోని చశబ్దమునకు మాఱుగ నాంధ్రభాషలో 'ను' శబ్దము వాడఁబడుట సహజము. సీతారామస్వామిశాస్త్రులుగారు వ్రాసినవాక్యమున సముచ్చీయమానార్థబోధకము లగు రెండుపదములును రెండు "ను" శబ్దములతోఁ గూడి యుండుటచే నయ్యది యితరేతరయోగార్థవివరణమే యనియుఁ గేవలసముచ్చయార్థవివరణము కా దనియు, స్పష్టముగాఁ జెప్పవచ్చును. సముచ్చయార్థమున నేకచశబ్దమును మాత్రమే ప్రయోగింపవలెననుటకుఁ బ్రమాణములు:—సిద్ధాన్తకౌముదిలో సముచ్చయార్థకోదాహరణ మగు "ఈశ్వరం గురుం చ భజస్వ" అనుచోట నేకచశబ్దమే ప్రయోగింపఁబడినది. సముచ్చయార్థ మని పార్థమూర్తిగారిచే నంగీకరింపఁబడిన "అదన్తానా మనుహాతాం క్లీబానాం చ మువర్ణకః" అను శిష్టు కృష్ణమూర్తిశాస్త్రులుగారి కారికయందును నేకశబ్దమే ప్రయోగింపఁబడి యున్నది. మహాభాష్యములోని "సముచ్చయే ప్లక్షశ్చే త్యుక్తే గమ్యతే ఏతత్ న్యగ్రోధ శ్చేతి" అనువాక్యమును వివరించునపుడు న్యగ్రోధో దృశ్యతా మిత్యుపక్రమ్య యదా ప్లక్ష శ్చే త్యుచ్యతే తదాన్యగ్రోధశ్చేతి గమ్యతే" అని కైయటమందుఁ జెప్పఁబడి యుండుటచేతను, "న్యగ్రోధశ్చేత్యుక్తే గమ్యతే ఏతత్ ప్లక్ష శ్చేతి" అనుభాష్యమును వివరించునపుడు "ప్లక్షో దృశ్యతా మి త్యుపక్రమ్య న్యగ్రోధ శ్చే త్యుక్తే ఇత్యర్థః" అని యుద్యోతమునందుఁ జెప్పఁబడి యుండుటచేతను "న్యగ్రోధో దృశ్యతాం ప్లక్ష శ్చ" అనునదియు, "ప్లక్షో దృశ్యతాం న్యగ్రోధ శ్చ" అనునదియు, భాష్యాభిప్రేత సముచ్చయార్థబోధకవాక్యము లని స్పష్టపడుచున్నది. వానియందును నేకచశబ్దప్రయోగమే యగపడుచున్నది. "సముచ్చయే చశబ్దేన స్వసమభివ్యాహృతపదార్థే ఇతరేతరసాపేక్షత్వం బుధ్యతే. తదసమభివ్యాహృతే తు న అత ఏ; వాత్రైకచశబ్దప్రయోగ ఏవ" అని శేఖరమునందు సముచ్చయమున నేకచశబ్దప్రయోగమే యుండవలయునని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. ఇతరేతరయోగార్థమున ననేకచశబ్దములను బ్రయోగింపవలయు ననుటకుఁ బ్రమాణములు:— సిద్ధాన్తకౌముదియందు "హరి

శ్చ హర శ్చ హరిహరౌ” అను నితరేతరయోగద్వంద్వ విగ్రహవాక్యమున రెండు చశబ్దములు ప్రయోగింపఁబడినవి. ఇట్లే “హోతృపోతృనేష్టోద్గాతారః” అను ద్వంద్వమునకును బాలమనోరమలో “హోతా చ పోతా చ నేష్టా చ ఉద్గాతా చ” అని యనేకచశబ్దఘటితముగ విగ్రహము చూపఁబడినది. మహాభాష్యమునందు “ప్లక్ష శ్చ న్యగ్రోధ శ్చ” అని చశబ్దద్వయఘటితముగ నితరేతరయోగాకారము చూపఁబడినది. “అత ఏ వా త్రానేకచకారప్రయోగః. య త్త్రైవ మన్వయ స్తత్రైతరేతరయోగః” అని యితరేతరయోగమునం దనేక చశబ్దప్రయోగ ముండు నని శేఖరమందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. “సముచ్చయోదాహరణమున నేకచశబ్దప్రయోగమే యుండవలయు” ననుదానికిఁ గారణము లీక్రిందిరీతిని గ్రహింపవలయును. ఎచ్చటఁ బదార్థాంతరముతో నన్వయించు సముచ్చీయమాన పదార్థములు రెండిటిలో మొదటిది రెండవదాని నపేక్షించినట్లు భాసిల్లదో, రెండవది మొదటిదాని నపేక్షించినట్లు భాసిల్లునో యచ్చోటనే చశబ్దము సముచ్చయార్థబోధకమై యుండును. చశబ్దమే పదముతోఁ జేరి యుండునో యాపదముయొక్క యర్థము రెండవపదార్థము నపేక్షించి యుండునట్లు భాసిల్లక మానదు. సముచ్చయార్థమున రెండవచశబ్దము గూడఁ బ్రయోగింపఁబడి యున్నచో మొదటిపదముయొక్క యర్థము సయితము రెండవపదముయొక్క యర్థము నపేక్షించినట్లు భాసిల్లక తప్పదు. కావున నపుడు పరస్పరాపేక్షత భాసిల్లుటచే నితరేతరయోగభానముకన్న వైలక్షణ్యము సిద్ధింప నేరదు.

పయియంశములకు “ప్లక్ష శ్చే త్యుక్తే గమ్యతే ఏతత్ న్యగ్రోధ శ్చేతి, తథా న్యగ్రోధ శ్చే త్యుక్తే గమ్యతే ఏతత్ ప్లక్ష శ్చేతి” అను భాష్యగ్రంథమును, “పరస్పరాపేక్షాణా మి త్యనేన సముచ్చయా ద్వైలక్షణ్య ముక్తమ్, అత ఏవ భాష్యే ప్లక్ష శ్చే త్యుక్తే గమ్యతే ఏతత్ న్యగ్రోధ శ్చేతి సముచ్చయస్యాకారః ప్రదర్శితః. తేన చైకః పరసాహిత్యమపేక్షతే నతుపరః ఇతరసాహిత్య మి త్యుక్తమ్” అను నుద్యోతగ్రంథమును, “ప్లక్ష శ్చే త్యుక్తే ఇతి । న్యగ్రోధో దృశ్యతా మి త్యుపక్రమోక్తౌ తు న ప్లక్ష శ్చే తి గమ్యత ఇతి భావః, న్యగ్రోధ శ్చే త్యుక్తే ఇతి । ప్లక్షో దృశ్యతా మి త్యుపక్రమ్య న్యగ్రోధ శ్చే త్యుక్తే ఇ త్యర్థః.” అను నుద్యోతగ్రంథమును “సముచ్చయేఽపి శాబ్దబోధే ఏక త్రైవ సాహిత్యం బుధ్యతే, ఏకో త్తరం చ ప్రయోగాత్” అను నుద్యోత గ్రంథమును, “సముచ్చయే చశబ్దేన స్వసమభివ్యాహృతపదార్థే ఇతర సాపేక్షత్వం బుధ్యతే తదసమభివ్యాహృతే తు న, అత ఏ వాత్ర ఏకచశబ్దప్రయోగ ఏవ” అను శేఖరగ్రంథమును బ్రమాణములై యున్నవి.

శ్రీతాతాచార్యస్వామిశాస్త్రులుగారి వివరణమునఁ జకారసమానార్థక "స"
ప్రత్యయ మగుటచే నయ్యది యితరేతరయోగమును బోధించును గాని కేవల
సముచ్చయమును బోధింప నేరదు. కాఁబట్టి యాయర్థమునందు ద్వంద్వ
మసాధు వగుట యశాస్త్రీయము. సముచ్చయమున ద్వంద్వసమాస ముండు నని
శ్రీతాతాచార్యస్వామిశాస్త్రులవారి గ్రంథమువలన స్ఫురింప కుండుటచే సముచ్చయమున
ద్వంద్వసమాస ముండ దనుటకు నాధారముగాఁ బార్థమూర్తిగా రుదాహరించిన
కైయటాదిగ్రంథములు ప్రకృతవాదమునకు సంబంధించి యుండ లేదు.

"ముపర్ణమును బొందుటలో మహదర్థముల యపేక్ష నపుంసకార్థముల
కును నపుంసకార్థముల యపేక్ష మహదర్థములకును, నెంతమాత్రమును లేనం
దున పేక్షార్థిభావరూప సామర్థ్యమ్ము లేమిం జేసి ప్రకృతసూత్రమున ద్వంద్వంబు
దుస్సాధంబు. ఇట్టి శాస్త్రీయాంశ మాలోచించి యే 'షడ్దర్శనీస్వతంత్రః' అని
నిర్ణయముగాఁ బ్రకటించుకొన్న శిష్టు కృష్ణమూర్తి శాస్త్రులుగారు మున్ను
'అదన్తానాం మహతాం క్లీబానాం చ ము వర్ణకః' అని ద్వంద్వం బొనరిం
పక స్వకారిక రచియించుకొనిరి.........అట్లే ప్రకృతంబునను నొకదాని
యపేక్ష యింకొకదానికి లేకుండ ముపర్ణకముం బొందఁ జాలిన యమహత్తున
కును నపుంసకమునకును నితరేతరయోగద్వంద్వ మశాస్త్రీయ మని స్పష్టపడు
చున్నది." అను మొదటగుపార్థమూర్తిగారి గ్రంథమును బట్టి చూడ నితరేతర
యోగాదులలో వివక్షిత మగున పరస్పరాపేక్షత శాబ్దబోధలో భాసిల్లుటయే
కాక క్రియానిష్పత్తియందును నుండ వలయు ననియుఁ బ్రకృతసూత్రమున ద్వం
ద్వమును గ్రహించినపుడు క్రియానిష్పత్తియందుఁ బరస్పరసాపేక్షత లేనియర్థము
లను బోధించెడి యమహద్వాచకములకును నపుంసకశబ్దములకును ముపర్ణకము
సిద్ధింప నేర దనియు నీ రభిప్రాయపడుచున్న ట్లగపడుచున్నది.

ఇతరేతరయోగాద్యాకారములను దెలుపుభాష్యగ్రంథమును జూడ శాబ్ద
బోధమునందు మాత్రమె సాహిత్యము భాసిల్లవలసి యున్నట్లు విశద మగుచు
న్నది. "ఇతరేతరయోగే ప్లక్షశ్చ న్యగ్రోధశ్చేత్యుక్తే గమ్యతే ఏతత్. ప్లక్షో
ఽపి న్యగ్రోధసహాయో న్యగ్రోధోఽపి ప్లక్షసహాయ ఇతి" అను భాష్యగ్రంథమున
"గమ్యతే" అని చెప్పఁబడి యున్నందున సాహిత్యము బోధలో భాసిల్లు నని యే
యర్థము తేలుచున్నది. ఇచ్చట జ్ఞానార్థక మగు 'గమ్' ధాతువు శాబ్దజ్ఞానమునే
బోధించును. కనుకనే కైయటోపాధ్యాయుఁడు "ఇతరేతరయోగః పరస్పర
నిరపేక్షాణా మనేకేషా మేకస్మి న్నర్థే సమన్వయే సతి సమ్భవతి" అను గ్రంథ

ముచే సమన్వయవిషయముననే పరస్పరసాపేక్షతను జూపించి యున్నాఁడు. "చకా ర్థేవ సాహిత్యం వాక్యే యత్ర ప్రాధాన్యేన భాసతే వృత్తౌ త్వభావే సమాసే న తత్ర సమాసశాస్త్రప్రవృత్తిః. సముచ్చయేఽపి శాబ్దబోధే ఏకత్రైవ సాహిత్యం బుధ్యతే ఏకోత్తరం చ ప్రయోగాత్." అను సుద్యోతగ్రంథమువలన నితరేతరయోగాదులలో వివక్షిత మగుసాహిత్యము శాబ్దబోధమాత్రవిషయక మని స్పష్టపడుచున్నది. ఇంత యేల? ఇతరేతరయోగోదాహరణమున సాహిత్యము భాసిల్లుట శాబ్దబోధమునందే గాని క్రియానిష్పత్తియందుఁ గా దని వ్యక్తిసూత్రప్రదీపోద్యోతమునందుఁ గంఠోక్తముగా వ్రాయఁబడి యున్నది. చిత్తగింపుఁడు. "మాతాపిత్రో స్మృతేఽహా నీతి వద్బోధే సాహిత్యం న తు క్రియానిష్పత్తౌ."

మఱియు శాబ్దబోధమునందే కాక క్రియానిష్పత్తియందు సాహిత్యముండవలయు నని యంగీకరించినపక్షమున సముచ్చయమునందును (పరస్పర సాహిత్య మక్కఱ లేకున్నను) బయిని జెప్పినరీతిని రెండవపదార్థమునకు మొదటి పదార్థముతో సాహిత్యము నంగీకరింపక తప్పదు. కానఁ బార్థమూర్తిగారి యభిప్రాయముచొప్పున ద్వంద్వసమాసము నొనరింప నంతమాత్రమున షష్ఠద్వివిస్వతంత్రులగుశిష్టు కృష్ణమూర్తిశాస్త్రులవారి "అదన్తానా మమహతాం । క్లీబానాం చ మువర్ణకః" అనుకారికకు మాత్రము పార్థమూర్తిగారి తరేతరయోగ ద్వంద్వమున వచ్చు ననుకొనుచున్న చిక్కు లెట్లు సంభవింపవో తెలియకున్నది. కావున నితరేతరయోగాదులలో వివక్షిత మగుసాహిత్యము శాబ్దబోధమునందు భాసిల్లునదే కాని కార్యనిష్పత్తియం దుండవలసినది కాదు.

పార్థమూర్తిగారు క్రియానిష్పత్తియందును సాహిత్య ముండవలయు ననుటకు "రామలక్ష్మణులు వనమున కేగిరి. ఈ ద్వంద్వమున రాముఁడును లక్ష్మణుండును నొండొరుల విడనాడకయే వనమున కేగినట్లు తోఁచును." అని యిట్లనేకోదాహరణములను జూపియున్నారు. ద్వంద్వఘటకపదార్థముల కవినాభావ ముండిన నుండవచ్చును గాని యుండక తప్ప దనునిర్బంధము లేదు. "దుర్యోధనార్జునులు శ్రీకృష్ణసహాయమును గోరి వచ్చిరి." అనుచో దుర్యోధనార్జును లొకరి నొకరు విడనాడక వచ్చి రని యెవ్వరైనఁ దలంతురా? ధవఖదిరములను ఛేదింపు మనుచో రెండిటిని జత చేసి ఛేదింపు మని యెవ్వరి కయినను స్ఫురించునా? "రాముఁడు శివకేశవాలయములకు వెళ్ళి శివకేశవులకు నమస్కరించెను" అను వాక్యమున రాముఁడు శివకేశవుల కేకకాలమున నమస్కరించె నని చెప్పుటకుఁ గూడ నవకాశము లేనప్పు డచ్చట శివకేశవుల కవినాభావ మెట్లు సంభవించును?

“శ్రావణకుంభకర్ణులు వ్యాప్తి నొందిరి.” అను వాక్యమునందు పరస్పరసంబంధక్రియ లేకకాలిక ములు కానప్పుడు వానికి మరణక్రియలో నెట్టి యితరేతరాపేక్ష యుండును ? “చార్థే ద్వన్ద్వః” అను సూత్రమునొద్ద నున్నభాష్యమునందు ద్వంద్వసమాస మని యుదాహరింపఁబడిన “మా త్వాంఽతాప్తాం కృతాకృతే” అను స్థలమున విరుద్ధఫలములను బుట్టించు సుకృతదుష్కృతములు తమఫలములను బుట్టించుటలోఁ బరస్పరనిరపేక్షము లై యుండక తప్పదుగాన నట్టి సుకృతదుష్కృతములకు బోధకము లగుకృతాకృతశబ్దములకు ద్వంద్వ మెట్లు సంఘటిల్లును ? వృద్ధిసూత్రో దాహృతమునం దుదాహరింపఁబడిన “మాతాపిత్రో ర్మృతేఽహాని” అను శ్లోకము లోని ద్వంద్వమునందుఁ గ్రియానిష్పత్తిలో నవినాభావము సంభవింప దనియే కదా “బోధే సాహిత్యం న తు క్రియానిష్పత్తౌ” అని వ్రాయఁబడెను. కాఁబట్టి ద్వంద్వఘటకపదార్థములు సంబంధించెడి క్రియ లేకకాలికములు కావలయు నను నిర్బంధము లేదు. ఏకకాలికములై యున్నట్లు వక్తృతాత్పర్య మువగత మయి నప్పు డట్లు గూడ స్ఫురించిన స్ఫురింపవచ్చును. వక్తృతాత్పర్యము లేనప్పుడు స్ఫురింపనేరదు. ఈ విషయమే “చార్థబలా దేవ సతి తాత్పర్యే సముభివ్యాహృత క్రియాయా మేకకాలికత్వాదికం గమ్యతే” అని శబ్దేందుశేఖరమున వర్ణింపఁబడెను.

ఇతరేతరయోగస్థలముల సముచ్చితపదార్థములకుఁ గార్యనిష్పత్త్యాదులం దును నవినాభావ ముండు నని స్థిరపఱుచుటకై పార్థమూర్తిగారీ క్రిందివిధమున వ్రాయుచున్నారు. “అగ్నిషోముల కీహోమద్రవ్యము నిచ్చెద” అనుచోట నవినాభావముతో నున్న యగ్నిని సోముని వైశిష్ట్యమందు దేవతగా భావించి యిద్దఱకును నేకాహుతి యే యిచ్చినట్లు స్ఫురించును గాని వేర్వేఱు దేవతలుగా భావించి ప్రత్యేకముగా నాహుతు లిచ్చినట్లు గోచరింపదు. ఇట్టి శాస్త్రీయ తాత్పర్యమె శబ్దేందుశేఖరమందు నీవిధమున నుద్ఘోషింపఁబడినది. “ద్వంద్వః ప్రథమాన్తానా మేవ న పరినిష్ఠితవిభక్త్యన్తానాం । చైత్రేణ మైత్రేణ చ కృత వాక్యే అవయవకర్తృత్వ స్యైవ ప్రతీతేః । చైత్రమైత్రాభ్యాం కృత మితి సమాసే సముదాయకర్తృత్వ స్యైవ ప్రతీతేః । తస్య వాక్యస్య సమాససమానార్థకత్వా భావేన తస్య తద్వాక్యత్వాభావాత్ ॥ అత ఏవ యదగ్నయే చ ప్రజాపతయే చే త్యాదౌ వ్యస్తే ప్రత్యేకం దేవతాత్వప్రతీతిః । అగ్నిషోమాభ్యా మి త్యాదౌ సముదాయే దేవతాత్వప్రతీతి రితి వ్యవస్థా సిధ్యతి । తస్యాపి తద్వాక్యత్వే తు సమాస ఇవ తత్రాపి సముదాయే దేవతాత్వ ప్రతీతి రేవ స్యాత్ ॥” ఈ శేఖర గ్రంథముఁ బార్థమూర్తిగారు తమవాదమున కేమో సాధక మగు నని తలంచిరి. కాని యీగ్రంథమును బాగుగాఁ బరిశీలించినచో నిది వారివాదమునకే భంజక

మగును. ఈగ్రంథములోని "య దగ్నయే చ ప్రజాపతయే చ" అనువాక్యమును పార్థమూర్తిగారు సముచ్చయోదాహరణముగా గ్రహింతురా ? లేక యితరేతరయోగోదాహరణముగా గ్రహింతురా ! అనేక చశబ్దవిశిష్ట వాక్యము సముచ్చయోదాహరణము కానేరదని శేఖరకారుఁడే పరిష్కరించి యుండుటచే శేఖర గ్రంథములోని యీవాక్యమును సముచ్చయోదాహరణవాక్య మనుటకు వలనుపడదు. మఱియుఁ బై వాక్య మితరేతరయోగద్వంద్వవిగ్రహ మగునా ? కాదా ? యను విచారణమున శేఖరకారుఁ డుదాహరించి యుండుటచే నది యితరేతరయోగోదాహరణవాక్యమే యని యంగీకరింపక తప్పదు. కాఁబట్టి దానిని సముచ్చయోదాహరణవాక్యముగా గ్రహించుటకు బొత్తిగా నవకాశము లేదు. ఇంతియ కాక సముచ్చయములో వాక్యభేద ముండు ననుట సర్వసమ్మత మగువిషయమే. ఇయ్యది పార్థమూర్తిగారికిని సమ్మతమే. పయి నుదాహరించిన "య దగ్నయే చ ప్రజాపతయే చ" అను వాక్యము నందు వాక్యభేదము లే దని మీమాంసాన్యాయప్రకాశమందు "చశబ్దశ్రవణాత్ పరస్పరసాపేక్ష స్యైవ పదద్వయ స్యాఖ్యాతాన్వయా న్న వాక్యభేదః" అని యిట్లు చెప్పఁబడి యుండుటచేఁ బయివాక్యము సముచ్చయోదాహరణ మనుటకు నెంతమాత్రము నవకాశము లేదు. ఇఁకఁ బయివాక్య మితరేతరయోగోదాహరణ మని యంగీకరించునపు డా వాక్యమువలనఁ బ్రత్యేకదేవతాత్వప్రతీతి కలుగు నని శేఖరకారుఁడు చెప్పుచుండుటచే నితరేతరయోగము భాసిల్లునపు డవినాభావ ముండక తీర దని వాదించు పార్థమూర్తిగారివాదమునకుఁ బయిశేఖర గ్రంథము కేవలము ప్రతిభట మై యున్న దని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు గదా ? పయివాక్యమునం దనేకచశబ్దప్రయోగము లుండుటచేతను నితరేతరద్వంద్వవిగ్రహవాక్య మిది యగునా ? కాదా ? యని శేఖరకారుఁడు విమర్శించుటచేతను నావాక్యములోని పదార్థములు పరస్పరసాపేక్షము లయి క్రియతో నన్వయించుచున్న వని పయిమీమాంసాగ్రంథమువలన స్పష్టపడుచుండుటచేతను నయ్యది యితరేతరయోగోదాహరణవాక్య మని యంగీకరింపక తీరదు గదా ?

పయిఁ బ్రశ్నమునందుఁ బ్రత్యేకదేవతాత్వప్రతీతికిఁ బ్రత్యేకచతుర్థ్యంతము లుండుటయును, "అగ్నీషోమాభ్యామ్" అనుస్థలమున నేకదేవతాత్వప్రతీతి కేకచతుర్థ్యంత ముండుటయును నియామకములు గాని యితరేతరయోగ భానము లేకుండుటయు నుండుటయు నియామకములు కావు, కావునఁ దమ వాదమున కుపష్టంభకముగాఁ బార్థమూర్తిగారు వ్రాసికొనిన పయిశేఖర గ్రంథము

వారివారి పదములకు సాధకము కాక సాధ్రుట రేమే కాక బాధకము కూడ నగుచున్న దని విద్వాంసులకు విశదము కాక మానదు.

"అగ్నీషోమాభ్యామ్" అనుస్థలమునందు విశిష్టదేవతాత్వము భాసిల్లినట్లే యనుచున్న పుంసకములకు ముఖ్యక మగు నను స్థలమునందును విశిష్టోద్దేశ్యతయె భాసిల్లును గాని ప్రత్యేకోద్దేశ్యత భాసిల్లనేర దని శంకింపఁజనదు. శాబ్దబోధములో విశిష్టోద్దేశ్యతవిషయ మైనను నుద్దేశ్యతావిశ్రాంతి ప్రత్యేకమును గావచ్చు ననుట సర్వసమ్మత మైనవిషయము.

దేవతాత్వ మనునది లోకమువలనఁ దెలియునది కాదు. అయ్యది శ్రుతుల వలన మాత్రము తెలియఁ దగినది. దేవతాత్వ మనఁగా శ్రుతివాక్యజన్య బోధీయ త్యాగోద్దేశ్యతారూపము. ఈయుద్దేశ్యత చతుర్థ్యంతాదులచే బోధిత మగును: "అగ్నీషోమాభ్యామ్" అనుచోట నేకచతుర్థ్యంతమున బోధిత మగున యుద్దేశ్యత యొక్కటియే యయి యున్నది. కనుక నచ్చట నేకదేవతాత్వ ప్రతీతి సమంజసము. వేద మపౌరుషేయ మగుటచే నీయుద్దేశ్యతకుఁ బ్రత్యేక విశ్రాంతిని నియమించుటకుఁ దగినవక్తృతాత్పర్య ముండదు. మఱియుఁ బ్రత్యేక విశ్రాంతిని నియమించు మంత్రవర్ణాదు లయిన లేవు. ప్రకృతమునం దన్నటో యట్లు కాదు.

"దేవదత్తయజ్ఞదత్తాభ్యాం గ్రామో గమ్యతే" అనుస్థలమునఁ దృతీయచే విశిష్టకర్తృత్వము బోధిత మగుచున్నది. కర్తృత్వ మనఁగా సమభివ్యాహృత ధాత్వర్థక్రియాశ్రయత్వము. పయిస్థలమున సమభివ్యాహృతధాతువు, 'గమ్' ధాతువు. తదర్థక్రియ గ్రామసంయోగానుకూలక్రియ. ఆక్రియ దేవదత్తయజ్ఞ దత్త పాదవిక్షేపణాదిరూపము. అట్టిక్రియ దేవదత్తునిది వేఱు; యజ్ఞదత్తునిది వేఱు. ఇట్టి వేర్వేఱుక్రియలకు దేవదత్తయజ్ఞదత్తులు వేర్వేఱ నాశ్రయము లై యున్నారు. ఆశ్రయములు వే ఱయినపు డాశ్రయత్వములును వే ఱయి యుండును. కనుక లౌకికము లగునీక్రియాశ్రయత్వ రూపకర్తృత్వములు భిన్నభిన్నము లగుటం జేసి యిచ్చటఁ గర్తృత్వవిశ్రాంతి ప్రత్యేకము గానే యగును. ఈయభిప్రాయమునే వైయాకరణులు "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనుపరిభాషచే బోధించిరి. ఇచ్చట వాక్యపరిసమాప్తి యనుదానికి "వాక్యజన్య బోధీయోద్దేశ్యతావిశ్రాన్తిః" అని యర్థము వ్రాయఁబడెను. ఇందుకు దృష్టాంతము "దేవదత్తాదయో భోజ్యన్తామి త్యత్ర భుజివత్" అనుగ్రంథముచేఁ జూపఁ బడినది. "లోకే విధేయభూత భుజిక్రియానిరూపి తోద్దేశ్యతాపరిసమాప్తిః యథా ప్రత్యేకం

దేవదత్తాదిషు." అని పయిదృష్టాంతము వివరింపంబడినది. ఇక్కడ ప్రకృతము నందును విధేయభూత మవస్థాపకభవనక్రియా నిరూపితోద్దేశ్యతకు విశ్రాంతి ప్రత్యేకముగా సమస్తములందును నపుంసకములందును గలుగును. "గర్గాః శతం దండ్యన్తామ్" అనునవి మొదలగు కొన్నిస్థలములందు సముదాయమందును వాక్య పరిసమాప్తి యంగీకరింపఁబడినది. ఈ వాక్యపరిసమాప్తి యొక్క వ్యవస్థయే పార్థ మూర్తిగారు తృతీయపక్షమున నుదాహరించిన "సంఖ్యైకశేషద్వంద్వేషు, కేచి త్సామర్థ్యలక్షణమ్" అనునది మొదలగువాక్యపదీయశ్లోకములచే బోధింపఁబడు చున్నది. కావునఁ బార్థమూర్తిగారు వ్రాసినట్లుగఁ బయికారికల ప్రకారము ప్రత్యేకవాక్యపరిసమాప్తి నంగీకరించినపు డితరేతరయోగార్థ పరిత్యాగమును నైకార్థీభావరూప సామర్థ్యపరిత్యాగమును సంభవించు నని తలంచుట శాస్త్ర సమ్మతము కాదు. పై కారికలలోని "కేచి త్సామర్థ్యలక్షణమ్" అనుదానిని జూచి యచ్చటిసామర్థ్యశబ్దమున కేకార్థీభావరూపసామర్థ్య మని యర్థము చేసి కొని యచ్చటి కేచిచ్ఛబ్దముచే నీవిషయమున మతభేద మున్న దని తలంచి ప్రత్యేకవాక్యపరిసమాప్తిస్థలమున నేకార్థీభావరూపసామర్థ్య ముండ దనుమతాంతర మున్నదని యనుకొని రేమో కాని యచ్చటిసామర్థ్యశబ్దమున కేకార్థీభావరూప సామర్థ్య మని యర్థము కాదు. "సామర్థ్యలక్షణ మితి, సామర్థ్యంసమస్తభావా త్మకమ్. అగ్రే నిరూప్యమాణం లక్షణం స్వరూపం యస్య త త్తథావిధమ్" అని సామర్థ్యశబ్దార్థము వివరింపఁబడినది. "భోజనం ఫలరూపాభావ్యా, మేకైకస్మిన్ సమాప్యతే, అన్యథా హి వ్యవస్థానే, న తదర్థః ప్రకల్ప్యతే, అన్నదానాదిరూ పంచ, సర్వే తృప్తిఫలాం భుజిం, ప్రత్యేకం ప్రతిపద్యంతే, న తు నాట్యక్రియా మివ." అను కారికలచేఁ బయికారికయందలిసామర్థ్యము నిరూపింపఁబడెను. భుజి క్రియ ప్రత్యేకముగాఁ బర్యవసిత మయినపుడే ఫలవంత మగు నని పై కారికల తాత్పర్యము. ఈ యంశము సముదాయవాక్యపరిసమాప్తిని బోధించు "శతా దానే ప్రధానత్వాత్" అను కారికవ్యాఖ్యానమున "ఏత దుక్తం భవతి, ప్రత్యే కం వాక్యపరిసమాప్తిః సముదాయే వాక్యపరిసమాప్తి రి త్యేతత్ న రాజాజ్ఞావ శాత్ వ్యవస్థాప్యతే, అపి తు అర్థతథాభావాత్, ఇతి న్యాయసిద్ధ మే వైత ద్వేదితవ్యమ్" అను గ్రంథముచే స్పష్టపఱుపఁబడినది. ఇందు "అర్థతథా భావాత్" అనుదానికి "అర్థస్వభావమునుబట్టి" అనియర్థము. ఈవిషయము వాక్యపదీయ మునందు "సంఖ్యైకశేషద్వంద్వేషు" అనుశ్లోకము మొదలుగ నెనిమిదిశ్లోకములను వానివ్యాఖ్యానములను బరిశీలించినచో స్పష్టముగాఁ దెలియును. విస్తరభీతి నుదాహరింపలేదు.

సమయము ఇతరేతరద్వంద్వమునకును నేకశేషమునకును నర్థబోధమున నేమియు భేదము లేదు. కావున నేకశేషమునందును సాహిత్యవివక్ష యుండవలసినదే. కాబట్టి ద్వంద్వపక్షాంగీకారమునఁ బార్థమూర్తిగారు చెప్పినదోషములు సత్యములే యయినయెడలఁ గర్మధారయపక్షాంగీకారమునందును "అమహాన్నపుంసకములకు" అనుచోట నేకశేషము వెలయుచుండుటచే నట్టిదోషములు వారికిఁ గూడ సంభవింపక తీరదు. ఈవిషయమును వారు గమనించియున్నచో ద్వంద్వపక్షాంగీకారమున నిట్టిదోషములను జెప్పియుండరు.

వీరు ద్వంద్వఘటితపదార్థములకుఁ గ్రియానిష్పత్తియందపినాభావము లేనిచో నేకార్థీభావరూపసామర్థ్య ముండ దని పలుమారు వ్రాయుచున్నారు. అట్లవినాభావము లేనప్పుడు సామర్థ్య మేకారణమున నుండదో తెలియకున్నది. పరస్పరసాపేక్షత్వ మేకార్థీభావరూప సామర్థ్యనియామక మ్మని వీరు తలఁచుచున్న ట్లగపడుచున్నది. ఇతరేతరయోగోదాహరణ వ్యస్తవాక్యములలోఁ బరస్పర సాపేక్షత్వము భాసిల్లినను నచ్చట నేకార్థీభావరూపసామర్థ్యము లేదు. "ద్విత్రాః" అను మొదలగు సమాసములం దేకార్థీభావరూపసామర్థ్య మున్నను బరస్పరసాపేక్షత్వము లేదు. కావునఁ బరస్పరసాపేక్షత్వమునకును నేకార్థీభావరూపసామర్థ్యమునకును నియమ్యనియామకభావము లేదు. ఏకార్థీభావసామర్థ్యమనఁగా వృత్తులయందు వైయాకరణులచే నంగీకరింపఁబడిన యొకశక్తి. ఇయ్యది వృత్తు లన్నిటియందును నుండును. ఈశక్తిచే నర్థోపస్థితి కలిగినప్పు డాయుపస్థితమగునర్థముతో నన్వితమగుపదార్థమును బోధించెడిపదము వృత్తిఘటకము కాఁ గూడదు. అట్లొకప్పుడు ఘటక మయినచో దాని నసమర్థసమాస మందురు. "అసూర్యంపశ్యాః" అనుస్థలమునందు "అసూర్య" అనుశబ్దమునకు వలెనే ప్రాతిస్వికరూపముగ సాధుత్వము బోధింపఁ బడనప్పు డట్టిసమాసములసాధువు లగును. కనుకనే సముచ్చయమునందు సమాస మసాధు వని సిద్ధాంతకౌముదియందు వ్రాయఁబడినది. "ఈశ్వరం గురుంచ భజస్వ" అను సముచ్చయస్థలములో నీశ్వరపదార్థమునకు గురుపదార్థముతోఁ గాని చార్థసముచ్చయముతోఁ గాని యన్వయ ముండదు. ఇచ్చట సమాస మున్నయెడల సమస్యమానపదార్థ మగు గురుపదార్థముతోఁ గాని చార్థసముచ్చయముతోఁ గాని యీశ్వరపదార్థమున కన్వయము లేకుండుటచే నసమర్థసమాస మగు నని సిద్ధాంతకౌముదీకారునితాత్పర్యము గాని పరస్పరావినాభావము లేకుండుటచే సామర్థ్యము లేదని యాతనితాత్పర్యము కాదు. "అసామర్థ్యాత్" అనుసిద్ధాంతకౌముదిలోనిప్రతీక ముందుకొని "అనేకసుబంతానాం చార్థే వృత్త్యభావేన ఏకార్థీభావరూప

సామర్థ్యాభావాత్" అని పై విషయమును శేఖరకారుఁడు స్పష్టపఱిచి యున్నాఁడు. పయి నుదాహరించినరీతిని "అమహన్నపుంసక శబ్దములు" ధర్మిపరము లయి నపుడు ద్వంద్వసమాసము నిర్బాధ మయి యుండఁగా నచ్చటిద్వంద్వమును సమ ర్థించుటకయి యమహన్నపుంసకశబ్దములను ధర్మపరములుగా నిర్దేశించి యంతట ననేక ప్రమాణములను జూపి ద్వంద్వమును గుదిర్చి యందును దమపరస్పరసాపేక్ష త్వమును జొనిపి తమకర్మధారయార్థముతో నభేదమును జూపి యావాదముపైని "వృతము" మొదలగులక్ష్యములయసిద్ధిని దోషముగాఁ జూపుటచే నీద్వితీయ పక్షమునందుఁ బార్థమూర్తిగారి కర్మధారయార్థమునందలిదోషములే వెల్లడింపఁ బడినవి. ఈపక్షము సీతారామస్వామి శాస్త్రులవారి వాదమున కేమాత్రమును సంబంధించి యుండనందున దీని నిచ్చట విమర్శింపలేము.

ఇఁక వీరిచతుర్థపంచమపక్షముల విమర్శింపవలసి యున్నది. ఈరెండు పక్షములకును నమహచ్ఛబ్దము సామాన్యవాచకము నపుంసకశబ్దము విశేష వాచకము ననువిషయము ముఖ్యాధార మయి యున్నది. సామాన్య మనఁగా వ్యాపక మనియు విశేష మనఁగా వ్యాప్య మనియు నర్థము. పార్థమూర్తి గారిచ్చిన యుదాహరణములు సయితము మిందులకు ననుకూలములు లయి యె యున్నవి. సామాన్యవాచకములకు సమభివ్యాహృతవిశేషాతిరిక్త విశేషపర త్వము లేనపుడు విశేషవాచకముతో ద్వంద్వసమాస ముండ దనునంశము శాస్త్రసమ్మత మయినదియే. ద్రవ్యశబ్దము ద్రవ్యముల నన్నిటిని బోధించినపు డది సామాన్యవాచకము గాన విశేషవాచక మగుఘటశబ్దముతో ద్వంద్వసమా సము నొంద నేరదు. గోశబ్దము సామాన్యవాచక మయినను బలీవర్దాతిరిక్త గోవిశేషపర మయినపుడు గోబలీవర్ద మనుసమాసము సాధువగును. ప్రకృత మున నీయమహచ్ఛబ్దమును నపుంసకశబ్దమును సామాన్యవిశేష వాచకము లగునా? కావా? అనువిషయము విచారింపవలసి యున్నది. ఏది లేనిచోట నేది యుండదో? ఏది యున్నచోట దేనియభావము కూడ నుండునో? దాని కది వ్యాప్యము. ఎట్లనఁగా:—ద్రవ్యత్వము లేని గుణాదులందు ఘటత్వ ముండదు. ద్రవ్యత్వ మున్నపటాదులందు ఘటత్వాభావ ముండును. కావున ద్రవ్యత్వమునకు ఘటత్వము వ్యాప్యము. దేని కేది వ్యాప్యమో దాని కది వ్యాపక మగును. ద్రవ్యత్వమునకు ఘటత్వము వ్యాప్యము గాన ఘటత్వమునకు ద్రవ్యత్వము వ్యాపకము. పయిరీతిని ద్రవ్యఘటశబ్దములు సామాన్యవిశేషవాచ కము లయినవి. ప్రకృతమునం దమహన్నపుంసకశబ్దముల కట్టిసామాన్యవిశేష వాచకత్వ మగపడదు. అమహత్త్వము లేని దైవతాదిశబ్దార్థములందు నపుంస

కత్వము కలదు. కనుక నమహత్త్వమునకు నపుంసకత్వము వ్యాప్యము (విశేషము) కానేరదు. నపుంసకత్వము లేని పృథివ్యాదిశబ్దార్థములం దమహత్త్వ ముండును గాన నపుంసకత్వమున కమహత్త్వమును వ్యాప్యము (విశేషము) కానేరదు. దీని కది వ్యాప్యము కానప్పుడు దాని కిది వ్యాపకము (సామాన్యము) కానేరదు. ఈరీతి నీయమహత్త్వనపుంసకత్వములకు సామాన్యవిశేషభావము లేనందున నమహన్నపుంసకశబ్దములు సామాన్యవిశేషవాచకములు కానేరవు. కావున "సామాన్యవిశేషవాచకములకు ద్వంద్వము రానేరదు." అనుసిద్ధాంత మిచ్చట నుప యోగింప దని యెల్లరకును విదితము కాకమానదు. పార్థసారథిగారును సామాన్య విశేషభావ మిచ్చట లే దని తెలిసికొని ప్రతిపక్షులవాదమును ఖండించు నభినివేశ ముతో నిట సామాన్యవిశేషభావము కుదుర్చుటకు మిక్కిలి ప్రయత్నించిరి.

ఇచట నపుంసకశబ్దముచేత ధనము వనము మొదలగునవి మాత్రమె స్ఫురించును గాని యపత్యము మిత్రము పాత్రము దైవతము మొదలగునవి స్ఫురింప వని చెప్పిరి. అవి స్ఫురించుటకును నివి స్ఫురింపకుండుటకును బ్రసిద్ధ్యప్రసిద్ధులు కారణము లనిరి. అపత్యమును మిత్రమును బాత్రమును దైవతమును నప్రసిద్ధము లనియు, ధనము వనము మొదలగునవి సుప్రసిద్ధము లనియు సామాన్యులకుం దోంచినం దోంచవచ్చును గాని పండితుల కట్లు తోంచనేరదు. మఱియు నానార్థక స్థలములలోఁ బ్రసిద్ధార్థము శీఘ్రోపస్థితికము నప్రసిద్ధార్థము విలంబోపస్థితికము నను నియమ మున్నను నేకప్రవృత్తినిమిత్తకములలో నట్టినియమము శాస్త్రములం దెచ్చటను నంగీకరింపఁబడి యుండలేదు. కాఁబట్టి వీరికి సామాన్య విశేషభావ మెట్లు కుదురును? వీరు తమవాదమున కుపష్టంభకముగా "సామాన్యాతిదేశే విశేషానతిదేశః" అనుపరిభాషను నచ్చటిపరిభాషేందుశేఖరగ్రంథమును నుదాహరించిరి. ఈవిషయము వీరివాదమున కేమాత్రమును సందర్భించి యుండలేదు. అతిదేశవిషయములలో నీపరిభాష ప్రవర్తించునది. దీనికి లోకములోని యొక యుదాహరణము నిచ్చిన నందఱకును విదిత మగు నని యట్టియుదాహరణము నిచ్చుచున్నాఁడను.

"క్షత్త్రియులు బ్రాహ్మణులవలెనే యాచారములను నడుపుచున్నారు" అను వాక్యమువలన క్షత్త్రియులు బ్రాహ్మణసామాన్యసిద్ధాచారములను నడుపుచున్నా రనునర్థము లభించును గాని బ్రాహ్మణావాంతరు లగునొకతెగవారి విశేషాచారము లను నడుపుచున్నా రనునర్థము లభింపనేరదు. ఇట్లే బల్లిదాదులకు సంస్కృతతుల్యత యతిదేశింపఁబడినందున వానికి సంస్కృతశబ్దసామాన్య, నిమిత్తకము లగు "కర

ధారయమునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును వగాగమంబును నగు" అనునది మొదలగుసూత్రములచే విధింపఁబడిన యుత్వా దులే సిద్ధించును గాని సంస్కృతశబ్దవిశేషము లగువృద్ధాది శబ్దములకు "వృద్ధాదుల దుజ్జునకు లోపము విభాషనగు" అనుసూత్రమునచే విధింపఁబడిన దుక్లోపము రానేరదు. ఇట్టి యతిదేశవిషయములే "సామాన్యాతిదేశే విశేషానతిదేశః" అనుపరిభాషకు లక్ష్యములు. ప్రకృత మగునమహన్నపుంసకసూత్రమున నతి దేశమే లేదు. కావున నీపరిభాష ప్రకృతమున కెట్లు సందర్భించునో? తెలియ కున్నది.

తత్పరిభాషావ్యాఖ్యానావసరమునఁ బరిభాషేందుశేఖరమునందున్న "సామా న్యోపస్థితికాలే నియమేన విశేషోపస్థితిజనక సామగ్ర్యభావోఽస్యావీజమ్" అనుగ్రంథమును జూచి వీరిది స్వవాదోపష్టంభక మగు నని యనుకొనిరేమో కాని యదియువారి కెంతమాత్రము నుపచరించి యుండలేదు. సామాన్య ధర్మ ముపస్థిత మయినపుడు విశేషధర్మములు నియమముగా నుపస్థితములు కావని యీగ్రంథమునకుఁ దాత్పర్యము. దీనినిబట్టి వీరు నపుంసకశబ్దముచే మహన్నపుంసక ములు గ్రహింపఁబడఁ జాల వని వ్రాసిరి. ఇచ్చట మహన్నపుంసకములు నపుంసక త్వరూప సామాన్యధర్మపురస్కారమున స్ఫురించినం జాలును. మహన్నపుంసక త్వరూప విశేషధర్మపురస్కారమున స్ఫురింపవలసిన యవసరము లేదు. అమహన్న పుంసకసూత్రమున నపుంసకత్వరూప సామాన్యధర్మపురస్కారమున మువర్ణకము విధింపఁబడెను గాని మహన్నపుంసకత్వరూప విశేషధర్మపురస్కారమున విధింపఁ బడ లేదు. అట్లు విశేషధర్మపురస్కారమున నుపస్థితములు కావలయునని యు న ట్లుపస్థితి కా దనియుఁ బార్థమూర్తిగా రభిప్రాయపడినయెడల ధనవనాదులు మాత్ర మహన్నపుంసకత్వరూప విశేషధర్మపురస్కారమున నపుంసకశబ్దముచే నుపస్థితము లగునా? అట్లే వృక్షాదులు పుంస్త్వవిశిష్టామహత్త్వరూప విశేషధర్మపురస్కారమున నమహచ్ఛబ్దముచే నుపస్థితము లగునా? ఇటులే నపుంసకత్వ విశిష్టామహత్త్వరూప విశేషధర్మపురస్కారమున ధనవనాదిశబ్దము లమహచ్ఛబ్దముచే నుపస్థితము లగునా? కావున విశేషధర్మపురస్కారమునఁ గార్యము విధింపఁబడనపుడు విశేషధర్మపుర స్కారముగ లక్ష్యము లుపస్థితములు కావలె ననుట సంగతము కాదు. ఉపాత్త సామాన్య ధర్మపురస్కారమున సామాన్యధర్మాక్రాంతము లన్నియు నుపస్థితము లగుటకుఁ బ్రతిబంధము లేదు.

మఱియుఁ బార్థమూర్తిగారు "సహచరితాసహచరితయోః సహచరితస్యైవ గ్రహణమ్." అనుపరిభాషచేతను దత్పరిభాషయొద్ద నున్నపరిభాషేందు శేఖర

గ్రంథము మొదలగువాని చేతను నిపటీనపుంసకశబ్దమున కమహత్తుల సాహచర్య
ముసంజేసి యమహత్తు లగునపుంసకములే యర్థ మనియు నట్టియమహత్తు లగునపుంస
కము లమహత్తులతో నంతర్భూతములే గాన వానిని బోధించు నీ నపుంసకశబ్దము
విశేషవాచక మగు ననియు సామాన్యవిశేషవాచకములకు ద్వంద్వము దుర్లభ
మగుటచే నిచ్చటి ద్వంద్వ మశాస్త్రీయ మనియుఁ జెప్పిరి. పయిపరిభాష గాని దాని
వివరణగ్రంథములు గాని వీరివాదమున కేమాత్రము నుపచరించి యుండలేదు.
మీఁదుమిక్కిలి వీరియభిప్రాయమున కవి బాధకములును నయి యున్నవి.

రామలక్ష్మణు లనుచోట రామశబ్దముచే దశరథాపత్యము బోధింపఁబడునా? లేక బలరామాదులు బోధింపఁ బడుదురా? అనుసంశయము గలిగినపుడు లక్ష్మణశబ్దసాహచర్యమువలన దశరథాపత్యమే బోధింపఁబడును. ఇట్టివే సహచరితపరిభాషకు విషయములు. దీనిని బట్టిచూడ దేని సాహచర్యముచేత సందిగ్ధార్థము నిర్ణయింపఁబడునో దానికంటెఁ దన్నిర్ణీతార్థము భిన్న మయి యుండవలయు నని యందఱకును విశదమె. లక్ష్మణశబ్దసాహచర్యమున నిర్ణయింపఁబడిన దశరథాపత్యరూప రామశబ్దార్థము లక్ష్మణశబ్దార్థముకన్న భిన్న మయియుండు నని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదుగదా. సాహచర్య మనఁగా సహచరణము. తత్సహచరణము తద్భిన్నమునకే యుండును గాని దానికే యుండదు. కావునఁ బ్రకృతమున నమహత్తుల సాహచర్యమునుబట్టి తదభిన్నము లగునమహత్తు లయిన నపుంసకములే గ్రహింపఁబడు నని సహచరితపరిభాష బోధింపఁజాలదు. పయిపరిభాషలోని సహచరితశబ్దమునకు సదృశము లనునర్థము గ్రహింపవలసియున్నను సదృశములును బరస్పరభిన్నము లయి యుండకతీరదు గదా. లోకములో సదృశవస్తువులు భిన్నము లయి యుండు నని యందఱకును విదితమె. కనుకనే తనతోఁ దనకు సాదృశ్యము వర్ణితమైనపు డాలంకారికు లచ్చటి యలంకారము నన్వర్థనామముతో ననన్వయ మని వ్యవహరించిరి. "వర్ణ్యమానోఽపి స్వస్య స్వేన సాధర్మ్యం నాన్వేతీతి వ్యుత్పత్తేః" అని యనన్వయశబ్దమునకుఁ గువలయానందమున వ్యుత్పత్తి చూపఁబడినది. తనతోఁ దనకు సాదృశ్యము బాధిత మని యాగ్రంథమునకుఁ దాత్పర్యము.

ఒకవేళ సాదృశ్యము భేదఘటితము కా నక్కఱ లేదను నాగేశమతము ననుసరించి యభిన్నము లయినను సదృశములు కావచ్చు నని శంకింతు రేమో? ఎచ్చట నైనఁ దనతోఁ దనకు సాదృశ్యము శాస్త్రములోఁ జెప్పబడినప్పు డుపపత్త్యంతరము లేక యచ్చటిసాదృశ్యము భేదఘటితము కాకపోయినను గాకపోవచ్చు ననునభిప్రాయముతో నాగేశుఁ డట్లు చెప్పినను సహచరితపరిభాషలో

సాహచర్య మనునది భిన్నములకే సంభవించును గనుక నట్టిసాహచర్యముచే నుప లక్షితమగు సాదృశ్యము భిన్నపదార్థవృత్తి యయి యే యుండు నని చెప్పక తీరదు. ఈయంశము "కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా" అనుసూత్రముకొద్దనున్న "యదత్రపర్యాయం పరి గ్రహ్వస్థాపచారో వర్జనే చాపర్జనే చ. అయంభ ల్యాపిశబ్దః అద్యస్థాపచారః వర్జనార్థ ఏవ కర్మప్రవచనీయః, తస్య కోఽన్య స్సహాయో భవితు మర్హతి అనో్య వర్జనార్థా, దన్యథాఽస్య గో స్సహాయే నార్థ ఇతి గౌరే వానీయతే నా శ్వో నగర్దభః" అనుభాష్యగ్రంథముచే విశదీకరింపఁబడినది. పైగ్రంథములోని "కోఽన్య స్సహాయో భవితు మర్హతి" అను వాక్యములోని "అన్యః, సహాయః" అనుపదముల నేమాత్రము పరిశీలించినను నీపరిభాషయందలి సాదృశ్యము భిన్న వస్తువృత్తియే యని స్పష్టము కాకమానదు. మఱియు భాష్యమునందలి "యథాఽస్య గో స్సహాయే నార్థ ఇతి గౌరేవానీయతే" అను దృష్టాంతవాక్య మందు "అస్య గోః" అనుదానిచే బోధిత మగు గోవ్యక్తికంటె "గౌరే వానీయతే" అనుదానిచే బోధిత మగు గోవ్యక్తి భిన్న మనియే యెల్లవారును గ్రహింతురు గాని యభిన్న మని యెవ్వరును గ్రహింపరుగదా. కావునఁ బయి నుదాహరించిన దృష్టాంతభాష్యగ్రంథము పార్థమూర్తిగారి కేమియు సాధకము గాలేదు సరేకదా బాధకముగాఁ గూడ నున్నది. ఇట్టిబాధ చదువరులకు స్పష్టముగా విశదపడకుండు టకై కాఁబోలుయును "కోఽన్య స్సహాయో భవితు మర్హతి" అనుభాష్యపంక్తి నుదా హరింపక యుత్తరభాష్యగ్రంథమునే యుదాహరించిరి. వారు పూర్వ భాష్యమును దాఁచినను వా రుదాహరించిన యుత్తరభాష్య గ్రంథమును వారి యభిప్రాయమునకు విరుద్ధమే యని విమర్శకులకు విశదము కాకపోలేదు.

పార్థమూర్తిగా రనుకొనినప్రకార మమహత్తుల సాహచర్యమునుబట్టి నపుం సకశబ్దముచేత నమహన్నపుంసకములే గ్రహింపఁ బడునపుడు నపుంసకశబ్ద సాహ చర్యమునుబట్టి యమహచ్ఛబ్దముచేత నపుంసకామహత్తులే బోధింపఁబడక తీరదు గాన రెండుశబ్దములును నమహన్నపుంసకములనే బోధించునపుడు వారనుకొనిన ప్రకారము సామాన్యవిశేషవాచకత్వ మాశబ్దముల కెట్లు కుదురును?

సహచరితపరిభాష సాదృశ్యప్రతియోగిలో నంతర్భూత మయినయర్థమును సాహచర్యమువలన నెన్నఁడును నియమింపదు. కాఁబట్టి ప్రకృతమున సహచరితపరి భాషను బ్రవర్తింపఁ జేసినపుడు సాదృశ్యప్రతియోగులయిన యమహత్తులలో నంతర్భూతములగు నమహన్నపుంసకములు సాహచర్యమువలన నియమింపఁబడుటకు నవకాశము లేదు. కాన నిది సహచరితపరిభాషకు విషయమే కాదు. కాఁబట్టి నపుం సకగ్రహణవైయర్థ్యమే లేనందున నపుంసకగ్రహణవైయర్థ్యాన్యథానుపపత్తిచే

పక్షాంతరకల్పనము చేసికొనవలసివచ్చు ననునాపత్తిని ద్వంద్వవాదులపై నిచ్చుట శక్తి కాదని చదువరులు గ్రహింతురుగాక.

పార్థమూర్తిగారు ద్వంద్వవాదులకుఁ జూపిన సామర్థ్యాభావాదిదోషములు వారు నుదాహరించిన సందర్భమును బట్టి చూడ, శంకించుటకయిన నవకాశము లేనందున నట్టిదోషముల నారోపించుచు వీరు వ్రాసినవ్యాసము పండితవిమర్శ్యకమము కానేరదు. ఇఁక నిచటఁ గర్మధారయసమాసమును జేయుట యెంతవఱ కుచితముగా నున్నదో విచారింతము.

"సంభవతి సామానాధికరణ్యే వైయధికరణ్యస్యాన్యాయ్యత్వాత్" అను న్యాయమున 'మహదర్థవాచకములు కానివై నపుంసకలింగములయి ప్రాప్యాకారమంతమందుఁ గలవానికి మువర్ణకము వచ్చును' అనిన సామానాధికరణ్యాన్వయమే సమీచీనముగా నున్న దని మాతాత్పర్యము." అను గ్రంథముచే ద్వంద్వసమాసముకన్నఁ గర్మధారయసమాసమునం దౌచిత్య మున్నట్లు వ్రాసియున్నారు. వా రుదాహరించిన న్యాయము వ్యస్తము లయిన రెండుపదముల వలన వేర్వేఱుగ నుపస్థితము లగు రెండుపదార్థముల కాకాంక్షాదివశమున లభించెడు నన్వయము సామానాధికరణ్యాన్వయముగాఁ దీసికొనుట కవకాశ మున్నప్పుడు వైయధికరణ్యాన్వయముగాఁ దీసికొనుట యన్యాయ్య మని బోధించును. "సామానాధికరణ్యాన్వయమె సమీచీనము" అనుపార్థమూర్తిగారి వాక్యరచనమునుబట్టి చూడ నీ న్యాయ మన్వయవిషయమున నుపయోగించున దనుట వారికి సమ్మతమే యని స్పష్టపడుచున్నది. అమహన్నపుంసకశబ్దము కర్మధారయ మయినచో నమహత్పదార్థము నపుంసకపదార్థముతో సామానాధికరణ్యాన్వయము నొందును గనుకఁ బయి న్యాయమును బట్టి యౌచిత్య ముండు ననియు వారితాత్పర్యమై యున్నట్లు స్పష్టపడుచున్నది. కాని వీరి యీయభిప్రాయము వైయాకరణసిద్ధాంతసమ్మతమై యుండ లేదు. "సమాసే ఖలు భిన్నైవ । శక్తిః పఙ్కజశబ్దవత్ । బహూనాం వృత్తిధర్మాణాం । వచనైరేవ సాధనే । స్యాన్మహ ద్గౌరవం తస్మా । దేకార్థీభావ ఆశ్రితః" అను వైయాకరణభూషణసార కారిక చొప్పున వైయాకరణమతములో సమాసమం దతిరిక్త శక్తి యంగీకరింపఁ బడినట్లు విశద మగుచున్నది. దీనినే యేకార్థీభావ మనియు, జహత్స్వార్థ యనియు నందురు "జహతి పదాని స్వార్థం యస్యాం సా జహత్స్వార్థా. పదే వర్ణ వదత్యన్తం పదానా మానర్థక్య మిత్యర్థః" అని జహత్స్వార్థా వృత్తి స్వభావము చూపఁబడెను. సమాసమునందు విశిష్టశక్తియే విశిష్టార్థోపస్థాపక మగును. సమాసఘటకపదములు ఘటశబ్దావయవములలోని ఘకారాదివర్ణములవలె శక్తిహీనము లగుటం జేసి యర్థోపస్థాపకములు కానందున నవి నిరర్థకము లని వైయాక

రణసిద్ధాంత మని పై గ్రంథమునకుఁ దాత్పర్యము. ఈసిద్ధాంతముప్రకారము ప్రకృతమున నమహాన్నపుంసకపదము ద్వంద్వమయినను గర్మధారయ మయినను నందలి యమహాచ్ఛబ్దమునకుఁ గాని నపుంసకశబ్దమునకుఁ గాని యర్థమే యుండదు. అర్థము లేనపు డన్వయము గగనకుసుమాయమాన మగును. ఇట్టి స్థితిలో నిచ్చట సామానాధికరణ్యాన్వయమా? లేక వైయధికరణ్యాన్వయమా? యను విచారణము గగనకుసుమసౌరభ్యపరీక్షాతుల్యముగ నుండును.

ఇఁక నైయాయికమతమున సమాసమునందు శక్తి లేదు గాన నప్పుడు సమాసఘటకపదములచేఁ బ్రత్యేకముగా నుపస్థితము లయినయర్థములకుఁ గలిగెడు నన్వయము నాశ్రయించి వీ రీవిచారణము చేసిరేమో? ఏకార్థీభావసామర్థ్య బాధ యని యుద్ఘోషించుచున్న వీరిచట మతాంతరము నవలంబించుట యర్థజరతీయముగా నున్నది. అట్లు నైయాయికమతము ననుసరించినను గర్మధారయసమాసమునందుఁ బూర్వోత్తరపదార్థములకుఁ బరస్పరాన్వయ మున్నను ద్వంద్వఘటకపదార్థములకుఁ బరస్పరాన్వయమే యుండదు. కావున నచట వైయధికరణ్యాన్వయప్రసక్తియే లేదు. ఇఁకఁ బ్రకృతన్యాయ మచట నెట్లు సంచరించును? ద్వంద్వఘటకపదార్థములకు విభక్త్యర్థముతో నన్వయము వైయధికరణ్యాన్వయ మని వీరితాత్పర్య మనుకొంద మన్న నిట్టివైయధికరణ్యాన్వయము కర్మధారయార్థము విభక్త్యర్థముతో నన్వయించునపుడును సంభవింపక తీరదు. కావున నీన్యాయము కర్మధారయార్థమునం దౌచిత్యమును సాధింపఁ జాలదు. మఱియు సమాసము లన్నిటిలో ద్వంద్వసమాసమున కుత్తమత్వమును "ద్వంద్వ స్సామాసికస్య చ" అను గీతావాక్యము బోధించుచున్నది.

మఱియు నిచట ద్వంద్వసమాసము సకలలక్ష్యసాధకము. కర్మధారయసమాస మట్టిది కాదు. కర్మధారయసమాసము నంగీకరించినచో నీసూత్ర మమహత్తు లయి నపుంసకలింగము లయిన ధనవనాదిపదములకుమాత్రమే మువర్ణకమును విధించును. మహాన్నపుంసకము లగు దైవతాదిశబ్దములకును నమహత్పుంలింగము లగు వృషభాదిశబ్దములకు మీఁదు మిక్కిలి మువర్ణక మనిష్ట మని యీసూత్రము సూచించును. విశేషణ మనఁగా వ్యావర్తక మని యందఱును నంగీకరించినవిషయమే. ఇచ్చట నపుంసకముల కమహత్తులు విశేషణము లయినపు డీవిశేషణము నపుంసకములకు మహద్వ్యావృత్తిని బోధించి యట్లు వ్యావృత్తము లయిన నపుంసకములే మువర్ణకోద్దేశ్యము లనియు; మహాన్నపుంసకములు మువర్ణకోద్దేశ్యములు కా వనియు, విశదపఱుచును. ఇట్లు సూత్రములోని నపుంసకశబ్దము లౌకికలింగబోధక మయినను శాస్త్రీయలింగబోధక మయినను నుభయ

బోధక మయినను వృషభాదిశబ్దములను బోధింపనేరదు. కావున వృషభము దైవతము మొదలగువానిసాధుత్వమును గ్రంథకర్త బోధింపలేదని యంగీకరింపవలసి వచ్చును. అట్లంగీకరించిన మన్నను గ్రంథకర్త పై సూత్రమునకు లక్ష్యములుగా నుదాహరించిన దైవతము మొదలగు నుదాహరణము లసంబద్ధము లగును. ఇట్టి నీయుదాహరణములను గుదుర్చుటకై పార్థసారథిగారు చూపిన మార్గముల నరయుదము——

ఇచ్చట నపుంసకలింగశబ్దముచే శాస్త్రీయలింగముగాని లౌకికలింగముగాని బోధింపఁబడ దంట! తక్కిన యన్నిస్థలములందును ప్రసిద్ధమే యైనను నీ సూత్రము నొద్దకు వచ్చునప్పుడు మాత్రము సంస్కృతలింగ మప్రసిద్ధ మగు నంట! లౌకికలింగ ముపచరింపదంట! అమహత్తులె నపుంసకలింగము లని యను కొనవలెనంట! (ఆంధ్రవైయాకరణు లెవ్వరును నిట్టిసంజ్ఞను జేసి యుండలేదు) ఈరీతినే మేమో స్వవాదమును నిలుపుకొనుటకుఁ గొన్ని నూతనకల్పనములను జేసిరి. వీరి యీయభిప్రాయము చొప్పున నపుంసకము లనఁగా నమహత్తులే కనుక వానిని బోధించు నమహన్నపుంసకశబ్దములు పర్యాయములే యగుటంజేసి యట్టివానికి సహప్రయోగమే లేకయుండఁగాఁ గర్మధారయసమాస మెట్లు సంఘటిల్లునో తెలియకున్నది. మఱియు సిం దొకపదము వ్యర్థ మని యంగీకరింపక తీరదు గదా. ఈ సందర్భమున వీరు వ్రాసిన విషయమునందలి యనౌచిత్య మా వ్యాసమును జదివిన ప్రాజ్ఞుల కెల్లరకును విశద మగు నని తలఁచి యావిషయమునుగూర్చి యిచట విపులముగాఁ జర్చింపలేదు.

వీ రిట్టినూతనసృష్టి చేయుటచే నమహత్పుంలింగము లగువృషభాది శబ్దములు మాత్రమే కుదిరినవి గాని మహన్నపుంసకము లగుదైవతాది శబ్దములు కుదిరినవి కావు. వానిని గుదుర్చుటకై యీసూత్ర ముపలక్షణముగాఁ జెల్లు నని వ్రాసిరి. "ఈసూత్ర ముపలక్షణ మగును" అను వీరిధోరణినిఁ బట్టిచూడ మహన్నపుంసకములకు ముపర్ణకమును విధించు వాక్యాంతరమును గల్పించుకొనవలయు నని వీ రభిప్రాయపడిన ట్లగపడుచున్నది. ద్వంద్వపక్షమున వాక్యభేదము సంభవించు ననుచున్నవీరి కిపుడు స్వమతమున వాక్యద్వయాపత్తి యపరిహార్య మగును. ఈయుపలక్షణత్వమును జెప్పుట కుపష్టంభకముగా వీరు పాణినీయాదులనుండి కొన్నియుదాహరణముల నిచ్చిరి. కాని వానిలో సూత్రములలోని కొన్నిపదము లుపలక్షణములుగా నున్న ట్లున్నవి గాని సూత్రము లుపలక్షణములై యున్న ట్లగపడదు. వా రిచ్చిన లౌకికోదాహరణములోఁ గ్కాకేభ్యో దధి రక్ష్యతా మను వాక్యమున కాకపదము దధ్యుపఘాతకోపలక్షణ మయినను నావాక్య ముపలక్షణ

మని యెవ్వరును నంగీకరించి యుండ లేదు. సూత్ర ముపలక్షణ మనునపుడు సూత్రస్థ మగుపద ముపలక్షణ మని వీరితాత్పర్య మంద మన్న నాపద మేదో వీరు నిరూపించి యుండ లేదు. అమహన్నపుంసకసూత్రములో నుద్దేశ్యకోటియందు "అమహన్నపుంసకములకు" "అదంతములకు" అను రెండుపదము లగపడు చున్నవి. ఈ రెండుపదములలో నేది యుపలక్షణమో యూహింప వలసి యున్నది. "అదంతములకు" అనుశబ్ద మభిధావృత్తిచేతనే యదంతము లగుమహన్న పుంసకములనుగూడ బోధించును గాన నది యుపలక్షణ మనుటకు పీలుపడదు. ఏపద మైన నభిధావృత్తిచే బోధింపఁబడనియర్థము బోధింపవలసినపుడె యది యుపలక్షణ మని యందురు. ఇఁక నమహన్నపుంసకశబ్ద ముపలక్షణ మనవలసి యున్నది. ఇచట నపుంసకశబ్దముచే సామాన్యముగ మహన్నపుంసకములు గూడ బోధింపఁబడుచుండఁగా వానివ్యావృత్తి కై యమహద్విశేషణము వేసి మహన్న పుంసకములకు గ్రహణము లేకుండఁ జేసి తుదకు వీనిసంగ్రహమున కై యిది యుపలక్షణ మనుట యుక్తిసహ మై యుండ దని యెల్లరకును స్ఫురింపకపోదు. శుక్లవస్త్రమును మాత్రము దెప్పింపఁ దలఁచినవక్త వస్త్రమును దెమ్మని చెప్పి నచో శుక్లేతరవస్త్రములు కూడ బోద్ధకు స్ఫురించి స్వాభిప్రాయము నెఱవేఱ దేమో యని తలఁచి వస్త్రమునకు శుక్లవిశేషణ ముంచుట లోకమర్యాద యై యున్నది. ఇట్టిచోట శుక్లవస్త్రశబ్దముగాని వస్త్రశబ్దముగాని రక్తాదివస్త్రము లకుఁ గూడ నుపలక్షణ మగునని చెప్పుట యుచిత మని యెవ్వ రైనఁ దలంతురా?

మఱియు నన్వయానుపపత్తి గాని తాత్పర్యానుపపత్తి గాని లేక లక్షణా వృత్తి నంగీకరించుట శాస్త్రవిరుద్ధము గాన నిచట లక్షణను జెప్పుట కవకాశము లేమిం జేసి యుపలక్షణ మని చెప్పుట కవకాశము లేదు. ఇచట నన్వయానుపపత్తి లే దనుట స్పష్టమే గదా. ఇఁక దైవతము మొదలగు లక్ష్యములు సూరిగారి బుద్ధిగోచరములగుటచే వానిని సాధించుటయందుఁ గూడ సూరిగారికిఁ దాత్పర్య మున్నందున నట్టితాత్పర్యమున కనుపపత్తి యిచట లక్షణాబీజ మని యనవలసి యున్నది. ఇచటఁ గర్మధారయము సూరిగారి కభిప్రేత మయినపుడు దైవతాది మహచ్ఛబ్దంబుల వ్యావృత్తికే గదా యమహచ్ఛబ్దమును గంఠోక్తముగా సూరి గారు సూత్రములో నిలిపి రని చెప్పవలసియున్నది. అట్లు మహన్నపుంసకము లందు వ్యావృత్తి సూరిగారి కభిప్రేత మని కర్మధారయపక్షమున సూత్రములోని యమహచ్ఛబ్దము చాటుచుండఁగా మహద్వాచకోపలక్షణతాత్పర్యము సూరిగా రికిఁ గల దని కల్పించుట యుచితమా? మహన్నపుంసకములకుఁ బర్యుదాసము బోధిత మయినపుడు పర్యుదస్తము లయినవాని కాకార్యము రా దనియే కదా

శబ్దమహిమవలన లభించును. అట్లు శబ్దమహిమచే నిషేధింపఁబడిన యర్థమును సంగ్రహించుట కుపలక్షణత్వకల్పనము శాస్త్రీయ మగునా? కర్మధారయార్థసంపత్తి కై యమహాద్విశేషణమును నిలిపి మహాద్వ్యక్తివ్యావృత్తిని జేసి వ్యావృత్తిమాత్రసంగ్రహమున కై యుపలక్షణత్వమును జెప్పుట "ప్రక్షాళనాద్ధి పఙ్కస్య దూరా దస్పర్శనం వరమ్" అను న్యాయమునకు విరుద్ధముగా నుండును. కాఁబట్టి సూత్రమునం దమహచ్ఛబ్దమును బ్రయోగించి దైవతాదిమహన్నపుంసకముల నుదాహరించిన సూరిగారికిఁ గర్మధారయార్థమునందుఁ దాత్పర్యము లే దని స్పష్టపడుచున్నది.

మఱియు నీపార్థమూర్తిగారు తమకర్మధారయసమాసమున లక్ష్యసిద్ధి లేమిం జేసి లక్ష్యసిద్ధి కై యీసూత్రమున నమహన్నపుంసకగ్రహణ మవివక్షిత మని వ్రాసిరి. ఎచట నయిన సూత్రస్థములవలన బాధ స్ఫురించునపుడు తద్బాధాస్ఫోరకముల కవివక్ష చెప్పుట కలదు. పార్థమూర్తిగారు చూపిన "గోత్రాణిత్" అనుస్థలమునందు గకారమువలనఁ దపరకరణవైయర్థ్యరూపబాధ స్ఫురించుటం జేసి యది యవివక్షితమని చెప్పవలసి వచ్చెను. ఇట్లె "త స్యాదిత ఉదాత్తమర్ధహ్రస్వమ్" అనుసూత్రమున హ్రస్వగ్రహణ మఖండవర్ణవ్యక్తిబోధక మగుటం జేసి తదోష్ఠ్యార్థమున కర్థపదార్థసంబంధము బాధిత మగును కాఁబట్టి తాదృశబాధాస్ఫోరక మగుహ్రస్వగ్రహణ మతంత్ర మని వ్రాయఁబడెను. మఱియు నిట్లె "ఉపేయివా ననాశ్వా ననూచానశ్చ" అనుసూత్రమునందు "ఉప" అను పదము "ఈయివాంస మతిత్రిథ" అను మొదలగు ప్రయోగములకు బాధను స్ఫురింపఁ జేయుటచే దాని కవివక్ష చెప్పఁబడెను. ప్రకృతమున నమహన్నపుంసకపదము ద్వంద్వపర మనియె యంగీకరించునపు డేమియు బాధ లేదు. అట్లు బాధ లేనపు డవివక్ష చెప్పుట సరి కాదు. కర్మధారయ మనినపుడు ప్రయోగబాధ గల దని శంకింపఁ గూడదు. అట్టిబాధ యున్నచో నాబాధ కర్మధారయ మగ్రాహ్య మని బోధించును గాని సూత్రస్థపదముల కవివక్షను బోధింపఁజాలదు. ఎన్నివిధముల నైనను దుర్నివార మగుబాధ గదా యవివక్షను బోధించును. ఇచ్చటి బాధ కర్మధారయవాదుల స్వకపోలకల్పితము గాని స్వతస్సిద్ధము కాదు. కావున నిచట నమహన్నపుంసకగ్రహణమున కవివక్ష యని చెప్పుట శాస్త్రసమ్మతము కాదు.

ఇఁక నమహన్నపుంసకగ్రహణ మక్కఱలేకుండ లక్ష్యసాధనము చేయుటకుఁ బార్థమూర్తిగారు కొంత ప్రయత్నించిరి. అమహన్నపుంసకగ్రహణ మన

న్యథాసిద్ధ లక్ష్యసాధకము కానపుడు దానిని ప్రత్యాఖ్యానము చేయవచ్చును. కాని యమహన్నపుంసకపద ఘటితసూత్రార్థమును విమర్శించునపు డాపదమునకు వైయర్థ్యమును సంపాదించుమార్గములను జూపుట శాస్త్రవిరుద్ధము. "ఉపదేశ ఆద్యోచ్చారణమ్" అనుసిద్ధాంత కౌముదీగ్రంథమును వివరించుతఱిని "పరేత్యిత్యాది" గ్రంథముచే స్వాభిప్రాయమును వివరించుచు "యది తు ఉపదేశే ప్రత్యయత్వాదివిశిష్టాంత్య ఇ దిత్యర్థ ఉచ్యతే తదా ఉపదేశ ఇతి వ్యర్థమ్" అను గ్రంథముచే శేఖరకారుఁడు పై యంశమును సిద్ధాంతీకరించి యున్నాఁడు. సూత్రమునం దమహన్నపుంసకగ్రహణ మున్నపు డది ద్వంద్వమా లేక కర్మధారయమా యను విచారణమునకుఁ బ్రసక్తి యున్నది గాని యాపదమే యక్కఱ లేదనునపుడు వీరి కీవిచారణమునకుఁ బ్రసక్తియే లేదు. సూత్రమునుండి వివాదస్థమగు నమహన్నపుంసకపదమును దొలఁగించినం గాని యది కర్మధారయ మనుటకు వీలుపడ దని వీరి యీయుపన్యాసశేషమువలన విశద మగుచున్నది.

మఱియు "(39) సూత్రములో నమహన్నపుంసకగ్రహణ మజాగళస్తనాయమాన మని బోధించు చున్నయది. కాన నయ్యది యవివక్షితము. అందున నీ సూత్రము 'గోతోణిత్' ఇత్యాదులువోలె నుపలక్షణ మని యెఱుంగునది." అను వీరివాక్యములనుబట్టిచూడ నమహన్నపుంసకగ్రహణ మవివక్షిత మనుటకును నీసూత్ర ముపలక్షణ మనుటకును హేతుహేతుమద్భావ మున్న దని వీరు తలఁచుచున్నట్లు స్పష్టపడుచున్నది. అమహన్నపుంసకగ్రహణ మవివక్షితమయినపుడు "అదంతంబులకు మువర్ణకం బగు" నను వాక్యము లక్ష్యసిద్ధి కుపచరించు నర్థము బోధించును. బాధకశాస్త్రమును విడిచి లక్ష్యసాధుత్వమును జెప్పుట బాధ్యశాస్త్రమునకు స్వభావ మగుటచేఁ బైవాక్యము వాచ్యవృత్తిచేతనే పార్థమూర్తిగారు ప్రదర్శించిన రీతి నభీష్టసకల లక్ష్యసాధక మై యుండఁగా నుపలక్షణత్వము నంగీకరింపవలసిన యావశ్యకత లేదు. అట్టిస్థితిలో వా రుపలక్షణత్వము నేల యంగీకరించిరో తెలియకున్నది. ప్రకృతమున నుపలక్షణత్వమునకే యావశ్యకత లేనందున నట్టి లేని యుపలక్షణత్వమునకు నవివక్షను గారణముగా నెంచుట సరి కాదు. ఇ ట్లొకపదమున కవివక్ష చేసినందున మిగిలినభాగము లక్ష్యసాధకార్థబోధక మగునపు డుపలక్షణ మని యెంచుటను నెవ్వరును వ్యవహరించి యుండ లేదు. "త స్యాదిత ఉదాత్త మర్ధహ్రస్వమ్" అనుసూత్రములో హ్రస్వగ్రహణమును "ఉపేయివా ననాశ్వా ననూచాన శ్చ" అను సూత్రములో "ఉప" అనుపదమును నవివక్షితము లని చెప్పినపు డచట నుపలక్షణత్వము నెవ్వరును జెప్పి యుండ లేదుగదా. గకారావివక్షయు నోకారాంతత్వోపలక్షణతయు నను

రెండవ దగు "గోతోణిత్" అను నొకసూత్రమునం దగపడుచుండుటచే నవివక్షోపలక్షణత్వముల కెట్టి యొకసంబంధ మున్నట్లు పార్థమూర్తిగారు తలంచి రని "గోతోణిత్" "ఇత్యాదులువోలె" అను వీరియుపమానవాక్యముల వలన నూహింప వలసియున్నది. "గోతోణిత్" అనుసూత్రమునందుఁ దపరకరణ మున్నది. వర్ణనిర్దేశము లేనప్పుడు తపరకరణము నిరర్థక మగును. పాణినిశాస్త్రములో నిరర్థకవర్ణోచ్చారణ ముండ దని వృద్ధిసూత్ర భాష్యమునందుఁ జెప్పఁబడియున్నది. కావున నిచటఁ దకారోచ్చారణమునకు సార్థక్యము చెప్పకతీరదు. ప్రకృతస్థలమున గోశబ్దము స్వరూపబోధక మగునపుడు తపరకరణసార్థక్యము సిద్ధింపదు గనుక తకారము నుచ్చరించిన పాణిని కర్థాంతరమందుఁ దాత్పర్య మున్నట్లు నిశ్చయింప నగును. అట్టి యర్థాంతరము ననఁగా "ఓకార" రూపార్థమును బోధించుటకు గోశబ్ద ముపలక్షణ మనకతీరదు. కావున "గోతః" అను పద ముపలక్షణ మని యంగీకరించిరి. ఉపలక్షణ మనఁగా లక్షణావృత్తిచే నర్థమును బోధించునది యని కదా యర్థము. లక్ష్యార్థమునకు శక్యార్థమునకును సంబంధము లేనప్పుడు లక్షణావృత్తి యుండ నేరదు. కాన ప్రకృతమున గోశబ్దశక్యార్థ మగు "గో" అనువానితో లక్ష్యార్థ మగు "ఓకారమునకు" తద్ఘటకత్వమే లక్షణాబీజ మగుసంబంధము. ఈసంబంధమే గకార మవివక్షిత మని చెప్పుగ్రంథములచే బోధింపఁబడుచున్నది. కనుకనే "గోతః" అనునది "ఓకారాంతోపలక్షణము" అని గ్రంథకర్తలు వ్రాసిరి. పార్థమూర్తిగారి యభిప్రాయము చొప్పున నన్నచో "ఓతః" అనునది గాని "గోతోణిత్" అనుసూత్రము గాని యుపలక్షణ మని వ్రాయవలసి యుండును. అట్లెచ్చటను వ్రాయఁబడియుండలేదు. అమహాన్నపుంసకసూత్రమున నమహాన్నపుంసకశబ్దమున కవివక్ష నంగీకరించినపు డుపలక్షణత్వ మక్కఱలేకయే సరిపడునట్లు "గోతోణిత్" అను స్థలమున గకారమున కవివక్ష చేసినంతమాత్రమున సరిపడదు. గకారము నవివక్షింపఁగా మిగిలిన "ఓతః" అనునది పదైకదేశ మగుటచే నర్థబోధకము కానందున నర్థబోధక మగు "గోతః" అనుపదమే ఓకారాంతముల కుపలక్షణ మని కైయటాదులు వ్రాసిరి. కాఁబట్టి ప్రకృతమున దృష్టాంతదార్ష్టాంతికముల కేమాత్రమును సంబంధము లేదు.

మఱియుఁ బాణిని సూత్రస్థము లగుపదములకుఁ గాని వర్ణములకుఁ గాని యవివక్షను జెప్పువారి తాత్పర్యమును బాగుగ గమనించినచో నీబాలవ్యాకరణ సూత్రములందలి పదములకుఁ గాని వర్ణములకుఁ గాని యవివక్షను జెప్పుట

శాస్త్రసమయసిద్ధము కా దని చదువరులకు విశదము కాక మానదు. కావున నిచటఁ బాణిని సూత్రములం దవివక్షను జెప్పువారి తాత్పర్యము నుదాహరించు చున్నాఁడను. అవివక్షిత మనఁగాఁ జెప్పవలె నను నిచ్ఛలో విషయము కాని దని యర్థము. ఇచ్ఛలో విషయము కానియంశమును జెప్పుట యసంభవము. ఒకఁడు చెప్పినది వాని యిచ్ఛలో విషయ మై యుండ లేదని యెవ్వ రయినఁ దలఁతురా? కావున నొకవిషయమును జెప్పినపు డందులకుఁ బ్రయోజకముగా వక్తకు నేదేనొకతాత్పర్యము గల దని చెప్పకతీరదు. పాణినీయసూత్రములను జెప్పుటలోఁ బాణినికి రెండుతాత్పర్యములు గలవని భాష్యాదిగ్రంథకర్తల తాత్పర్యము. అందు మొదటిది తాను జెప్పిన పదములు లక్ష్యసాధకార్థబోధకము లయి యుండ వలయు ననునది. రెండవది తనచే నిర్దిష్ట మగునానుపూర్వి గల గ్రంథము యొక్క పారాయణము చేయుటవలన నదృష్టఫలము లభించు ననునది. పాణిని గ్రంథములోని పదముల విషయమునఁ గాని వర్ణములవిషయమునఁ గాని మొదటి తాత్పర్యము బాధిత మగునపుడు రెండవతాత్పర్యముచేతనే యాతఁడు వానిని బఠించె నని చెప్పుట సంప్రదాయ మై యున్నది. కనుకనే పాణిని శాస్త్రములోని యవివక్షితములకును బ్రత్యాఖ్యాతములకును బారాయణ ఫలకత్వమును వైయాకరణులు చెప్పియున్నారు. "అనుబంధా శ్చ మహేశ్వరకృతా ఏ వేత్యనుపదం స్ఫుటీభవిష్యతి. "ఇదుజణన" మి త్యత్ర మకారప్రత్యాఖ్యానపర భాష్యంతు కిమదృష్టార్థమేవ తదుచ్చారణ ముత దృష్టార్థ మ పీ త్యేవం విచారపరం, సర్వత్ర ప్రత్యాఖ్యాన మేవంపర మేవ. అన్యథాఽఙ్గానా మపి పారాయణే ధర్మశ్రవణేన తత్రతత్ర పాణినిన్యాస ప్రత్యాఖ్యాన స్యాప్యసంగతి స్స్యాత్. త దుక్త మి కోయణ్ణచీతిసూత్రే భాష్యే. సామర్థ్యయోగా న్నహి కించి దత్ర। పశ్యామి శాస్త్రేయ దనర్థకం స్యాదితి. కించి ద్దృష్టాదృష్టార్థవత్, కించి చ్ఛుద్ధాదృష్టార్థవత్. సర్వథాఽనర్థకం న కించి దితి తదర్థః" అని శేఖరమునఁ బ్రారంభము నందే వ్రాయఁబడెను. బాలవ్యాకరణము వేదాంగము కాకుండుటచేతను దీనిని బారాయణము చేయుటవలన ధర్మము గలుగు నని యెచ్చటను జెప్పఁబడి యుండకపోవుటచేతను బాలవ్యాకరణములోని "అమహన్నపుంసకములకు" అను దానికిఁ బారాయణఫలకత్వమును జెప్పుటకు వీలుపడదు. పార్థమూర్తిగారి వ్యాఖ్యానము చొప్పున నది లక్ష్యసాధకమును గాలేదు. కాఁబట్టి పాణినిగ్రంథ మందువలె బాలవ్యాకరణమం దవివక్షితములకు ఫలాంతరము లేనందునఁ బాణినిగ్రంథమునందువలెఁ నిందును నవివక్షితపదము లుండుట కవకాశము లేదు.

తత్త్వపక్షపాతులును భాషాభిమానులును నగు విమర్శకాగ్రగణ్యులారా! పై యుపన్యాసాంశములనుబట్టి చూడఁగా "అమహన్నపుంసక" సూత్రమున "అమహన్నపుంసక" అనుపదము ద్వంద్వసమాస మనుట శాస్త్రసమ్మతమే యనియు నందు శాస్త్రవిరోధ మేమియును లేదనియు, నదియే లక్ష్యసాధనక్షమ మనియు గ్రంథకర్త కదియే యభిప్రేత మనియు విశదము కాక మానదు గదా! మఱియును నచటఁ గర్మధారయమును గ్రహింపవలె ననినచో నది లక్ష్యసాధకము కాదనియు గ్రంథకర్త కనభిప్రేత మనియుఁ దత్పక్షమున లక్ష్యసాధనమునకుఁ జూపఁబడినయంశములు శాస్త్రసమ్మతములు కాకపోవుటయే గాక శాస్త్రవిరుద్ధములు నై యున్న వనియు నట్టియంశములు గ్రంథకర్త కభిప్రేతము లని యంగీకరించునెడల నాతఁ డప్రయుక్తప్రయోక్త యని యంగీకరింపవలసివచ్చు ననియు, వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు గదా!

"అమహన్నపుంసక" సూత్రమున ద్వంద్వమా? కర్మధారయమా? యనువాదభేదములచేఁ జదువరు లెవ్వరికైన సూత్రార్థవిషయమున నట్టిసందేహము గలుగునప్పుడు దాని నివారించుటకు మాత్రమే నాయీయుపన్యాసము వ్రాయఁబడినది గాని వేఱుతలంపున వ్రాయఁబడలేదు. శాస్త్రీయాంశములను బురస్కరించుకొని పార్థసారథిగారివాదమునకు విరుద్ధముగా వ్రాయవలసి వచ్చినందులకు వారు నన్ను క్షమింతురు గాక. గుణగ్రహణపారీణు లగుపండితులు నాయీ వ్యాసమునందలి గుణదోషములను విమర్శించి నన్ను మన్నింతురుగాక.

నలసంవత్సరభాద్రపదాశ్వయుజ మాసపరిషత్పత్రికనుండి ముద్రితము.

తాతా సుబ్బారాయశాస్త్రి.

# ద్వంద్వయుద్ధోపసంహారము

## II వ్యాసము

"అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు" అనుబాల వ్యాకరణసూత్రముయొక్క యర్థమును గూర్చి సమరాంగణపార్థమూర్తిగారిచే వ్రాయఁబడి 1916 సం॥ ఆగస్టు 7 తేదీ గలదేశమాతపత్రికయందు ద్వితీయ ప్రత్యభియోగ మనుశీర్షికతోఁ బ్రచురింపఁబడినవ్యాసమునందుఁ బార్థమూర్తి గారు తమవాదమున కుపష్టంభకము లనియెంచి యుదాహరించిన సంస్కృత వ్యాకరణాదివిషయములను విమర్శించుచు ద్వంద్వయుద్ధోపశమన మనువ్యాసమును నలసంవత్సర భాద్రపదాశ్వయుజమాసముల యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు నేను బ్రచురించియున్నాను. అద్దానిని విమర్శించుచు బ్ర. శ్రీ. కల్లూరి వేంకట రామశాస్త్రులవారు ద్వంద్వోపశమన మనువ్యాసమును వ్యాసఘట్టములుగ విభజించి 1917 సంవత్సరమున ఏప్రెల్ 4,18,24 మేయి 7 తేదులదేశమాతయందు వరుసగా నాలుగువ్యాసఘట్టములను బ్రదర్శించిరి.

"అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు" (బాల.తత్స. 39 సూ.) అనుసూత్రమున "అమహన్నపుంసకపదము" కర్మధారయసమాస మనునపుడు మహన్నపుంసకము లగుదైవతాదిశబ్దములకును నమహత్పుంలింగము లగువృక్షాదిశబ్దములకును ముపర్ణకము సిద్ధింపకపోవుటచేఁ దత్సిద్ధికై సమరాంగణ పార్థమూర్తిగా రవివక్షోపలక్షణత్వాదులను నుపాయములను గల్పించిరి. అందలి యుక్తాయుక్తతలను ద్వంద్వయుద్ధోపశమన మనునాపూర్వవ్యాసమునఁ జర్చించి యుంటిని

పిదప బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారు కర్మధారయసమాస మును స్థిరపఱుపయత్నించి యాపక్షమున సిద్ధింపని రూపములసిద్ధికయి పార్థ మూర్తిగారిచేఁ జూపఁబడినయుపాయములయం దరుచిచేతనో లేకయభ్యుచ్చయ వాదముచేతనో కొన్నినూతనోపాయములను బ్రథమవ్యాసఘట్టమునందుఁ జూపించిరి. వానియుక్తాయుక్తతలు విమర్శకులు విమర్శినతురుగాక యని యిచ్చట తద్వి మర్శనీయాంశములను వానిపయిని నాయభిప్రాయములను విశదీకరించుచున్నాను.

ఈ ప్రథమవ్యాసఘట్టమున నాకొకసందేహము పొడముచున్నది. బాల వ్యాకరణమునందలి దుఙ్ముపర్ణకవిధాయక సూత్రములలోని పుంలింగనపుంసక

లింగశబ్దములు శాస్త్రీయలింగతాత్పర్యమున వాడఁబడినవని వీరు తలచెదరా? లేక లౌకికలింగతాత్పర్యమున వాడఁబడిన వని తలచెదరా?

శాస్త్రీయలింగతాత్పర్యమున వాడఁబడె ననుపక్షమున దైవతశబ్దము సహజముగా నపుంసకలింగమై యుండ దానినపుంసకత్వసంపత్తికై యగతికగతిభూతమైన "సామాన్యే నపుంసకమ్" అను ప్రవాదము నంగీకరించి దానిని దృఢపఱచుటకై యనేక ప్రమాణముల నుపన్యసింపనేల? ఈపక్షమున వృషభాదిశబ్దములు నపుంసకలింగములుగఁ దలంపఁబడుచున్న వనువీరివాక్యము లెట్లు సంగతములగును? మఱియు "నామిత్రము దయావంతము" ఇత్యాదు లప్రయోగము లనుటకు వీరి కవకాశ మెట్లు చిక్కును?

ఇఁక లౌకికలింగతాత్పర్యమున వాడఁబడిన వనువక్షమున వృక్షశబ్దము సహజముగా నపుంసకలింగమయి యుండఁగా నద్దానికి నపుంసకత్వసిద్ధికయి "వృక్షః, కాకః—ఇత్యాదిపుంలింగములు గూడఁ దెలుఁగున నపుంసకము లేవిధిచే నగు నందురేని యవధరింపుఁడు. ఈసూత్రములోని యనుహాత్పదంబున యావదమహత్తుల నుద్దేశించి "అప్రాప్తేశాస్త్ర మర్థవత్" అనుమీమాంసా న్యాయంబునఁ బ్రాప్తాప్రాప్తపర్యాలోచన చేసినచో నపుంసకత్వ మీవిధియే విధించుచుండు. అందున వృక్షాదులు తెలుఁగున నపుంసకము లగుచ్చు" అను గ్రంథముచేఁ గ్రొత్తగా నపుంసకత్వమును విధించి యాయంశమును స్థిరపఱచుటకుఁ బూర్వమీమాంసాన్యాయములను సంస్కృత వ్యాకరణగ్రంథములను, నుదాహరించి యుపన్యసింపనేల? మఱియు శాస్త్రీయలింగమును దెలుపుటకయి సత్త్వాదిగుణముల యుపచయరూపము పుంలింగమనియు, నపచయరూపము స్త్రీలింగమనియు, స్థితిరూపము నపుంసకలింగమనియు, నుపచయాపచయము లున్నప్పుడు స్థితికూఁడనుండునుగాన నుపచయాపచయములను వివక్షింపక స్థితినిమాత్రము వివక్షించునపుడు నపుంసక ముండవచ్చు ననియు, "సామాన్యే నపుంసకమ్" అనుప్రవాద మేతన్మూలకమే గాని వేఱు గా దనియు "అజా ద్యత ష్టాప్" అనుసూత్రపు శేఖరమునఁ జెప్పఁబడినందున "సామాన్యేనపుంసకమ్" అను ప్రవాదము శాస్త్రీయలింగవివక్ష నాశ్రయించియుండఁగా నీ లౌకికలింగపక్షమున నద్దానిని జెప్పుట యెట్లు సంగత మగునో తెలియకున్నది.

ఈ ప్రథమవ్యాసఘట్టమునందలి పూర్వోత్తరసందర్భములను శాస్త్రదృష్టితోఁ బరిశీలించినప్పుడు, దుష్టువర్ణకవిధాయకశాస్త్రములలో గ్రంథకర్త ప్రయోగించిన పుంలింగ నపుంసకలింగశబ్దములు శాస్త్రీయలింగపరము లని శాస్త్రులవారు తలంచిరో లేక లౌకికలింగపరము లని తలంచిరో, యనువిషయము నిరూపించుటకు వలనుపడ దని చెప్పక తప్పదు.

శాస్త్రులవారి యుపన్యాసధోరణినిబట్టి చూడఁగా నీరెండుసూత్రములలోను లౌకికలింగమును వీ రాశ్రయించినట్లు నాకుఁ దోఁచుచున్నది. అట్లే కానిచో వీరు దైవతాదిశబ్దములకు నపుంసకత్వసంపాదనమునకై యంత ప్రయత్నము చేసియుండరు. "తీర్థప్రధానాదిశబ్దములు మహాద్వాచకము లగునపుడు "తీర్థుఁడు" అనుటకు బదులుగా 'తీర్థము' అనవలసివచ్చును. మంత్రివాచకమై మహార్థక మైన నపుంసక ప్రధానశబ్దమునకు "ప్రధానుఁడు, ప్రధానుని" అని కావలసియుండఁగా 'దైవతము' అన్నట్టులు "ప్రధానము" అనవలసియుండును. ప్రధానశబ్దము మంత్రివాచక మైనపుడు పుంలింగముగూడఁ గల దందురేని వైకల్పికముగాఁ బ్రధానమన్న రూపము తప్పక విధి నొందవలసి వచ్చును." అను మొదలగు నాపత్తిబోధక వాక్యములను వ్రాసియుండరు. వారియభిప్రాయవిషయమున నే నూహించిన పై యూహ నిజమె యయినచో శాస్త్రులవారు "సామాన్యేనపుంసకమ్" అను ప్రవాదము శాస్త్రీయలింగవిషయక మని గమనించియుండలేదా యనుసందేహము పొడముచున్నది. విద్వాంసులగు శ్రీశాస్త్రులవారు గమనించియుండలే దనుకొనుట సమంజసము కాదు. కాని, వా రేయుద్దేశముతో నట్లువ్రాసిరో తెలియకున్న దనుకొనుటయే సమంజస మని నేను దలంచుచున్నాను.

వృత్తశబ్దము లౌకికనపుంసక మే యై యుండఁగా నద్దానినపుంసకత్వసిద్ధికై యమహాన్నపుంసకసూత్రము నపుంసకత్వాతిదేశబోధక మని యుపన్యసించుట మఱింత వింతను గొలుపుచున్నది. అరయనరయఁ జిన్నయసూరిగా రమహాన్నపుంసకసూత్రమునకు మొదటియుదాహరణముగా వృత్తశబ్దము నిచ్చియుండుటచేఁ దత్పఠనాభ్యాసపాటవమున వీరు దాని నుదాహరించిరి గాని స్వవాదమునకుఁ బ్రతికూల మగునని గమనించిరేని దీని నెత్తికొనకయే యుందు రని తోఁచుచున్నది. వీ రొకప్పుడు వృత్తశబ్దోదాహరణమును విడుచుకొనినను, జిన్నయసూరిగారు వీరు వర్ణించినయభిప్రాయమే తమయభిప్రాయ మని స్థిరపఱుచుటకై తా ముదాహరించియున్న వృత్తశబ్దము నిపుడు తీసివేయఁ జాలరుగదా!

శాస్త్రులవారు వర్ణించినయభిప్రాయము సూరిగారిదికా దని వ్యక్తపఱుచుటకు నిచ్చటఁ గొన్ని కారణముల నుదాహరించుచున్నాను.

I. వృత్తశబ్దము సహజముగా నపుంసకలింగ మై యుండ నమహాన్నపుంసకసూత్రము నపుంసకత్వాతిదేశబోధక మని తలఁచినపుడు దాని నీయతిదేశమునకు లక్ష్యముగా నుదాహరింతురా?

II. సుహృదాదివాచకములును మహద్వాచకములును నగుమిత్రాదిశబ్దములు లౌకికపుల్లింగము లగుటచే మిత్త్రుఁడు మొదలగురూపములును, శాస్త్రులవారు

వర్ణించినరీతిని "సామాన్యే నపుంసకమ్" అనుప్రవాదముచొప్పున 'మిత్రము' మొదలగురూపములును, సిద్ధించుచుండఁగా "క్లీబంబులు మిత్రాదులు, మహాద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులు" అని మరల నతిదేశశాస్త్రమును గల్పింతురా ?

"ఇట్లు మిత్రము (మహద్వాచకమగుచో) ఇత్యాది క్వాచిత్కరూపంబులందుంగూడ సూత్ర మక్కఱలేకయే లింగసర్వనామం బగు నపుంసకలింగము (ము) విభక్తిన్యాయప్రాప్తం బగు" ననుశాస్త్రులవారివాక్యమును జూడఁగా వీరియతిదేశవిధానమును న్యాయప్రాప్తానువాద మని యందురేమో యని తోఁచుచున్నది. నివర్తక మగుపురుషారంభము లేనపుడు న్యాయప్రాప్తము నతిదేశించుట శాస్త్రసమ్మత మగునా? అట్లతిదేశించినను నగలికగతిభూత మగు "సామాన్యే నపుంసకమ్" అనుప్రవాదమువలన సిద్ధించునపుంసకత్వము నతిదేశించినఁ గొంతవఱకైన నుచితముగా నుండును గాని సహజముగా నున్న పుంలింగత్వము నతిదేశించుట యుచితముగా నుండునా ? "క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వ మతిదేశించుటం జేసి" అని సూరిగారు వ్రాసియుండఁగాఁ బయియతిదేశసూత్రము ప్రాప్తవిభాష యనియుఁ, బ్రాప్తవిభాషలకభావవిధియందుఁ దాత్పర్య మనియుఁ, గల్పించి పుంలింగత్వాభావాతిదేశ మని చెప్పి దానికి నపుంసకత్వాతిదేశమునందుఁ బర్యవసాన మని చెప్పుట కవకాశముండదుగదా.

III. స్త్రీలింగప్రథమైకవచనలోపవిధాయక శాస్త్రమునందు స్త్రీలింగశబ్దము శాస్త్రీయలింగపర మని శ్రీశాస్త్రులవారిపక్షమునఁ గూడ నంగీకరింపఁబడి యున్నందున, నర్ధజరతీయముగ, డుజ్మువర్ణకవిధాయక శాస్త్రములందుమాత్రము లౌకికలింగపర మనుట యుచితమా ?

చిన్నయసూరిగారిగ్రంథమునందుఁ గలయిట్టియితరకారణముల నెల్ల వివరించినచో గ్రంథవిస్తర మగు నని యింతతో విరమించుచున్నాను.

శాస్త్రులవా రెన్నిప్రయత్నములు చేసినను 'అమహాన్నపుంసక' సూత్రమునందుఁ గర్మధారయపక్షాంగీకారమున, దైవతాదిశబ్దములకు మువర్ణకము సిద్ధించుటకై, నపుంసకములకు, మువర్ణకము విధించుశాస్త్ర మొకటి కల్పించుకొనక తీరదు. అట్లు శాస్త్రమును వేఱుగఁ గల్పింపక, యీయమహన్నపుంసక సూత్రమునకే "నపుంసకములకు మువర్ణక మగును, అమహత్తులు నపుంసకములగును" అని యర్థము చేసెద మందురేని, ద్వంద్వసమాసాశ్రయణమున, వాక్యద్వయాపత్తి రూపగౌరవము నాపాదించి, తన్నివృత్తికయి కర్మధారయసమాసాశ్రయణము చేసిన వీరికి, వాక్యద్వయాపత్తి దుర్వార మై ఘట్టకుటీప్రభాతవృత్తాంతమును స్మరింపఁజేయును.

ఇంక నిచట నీవాక్యద్వయము లభించుట యెట్లో విమర్శింపవలసియున్నది. శాస్త్రులవారియభిప్రాయప్రకారము మహన్నపుంసకసూత్రమున నమహాత్తులయిన నపుంసకములకు ముమవర్ణకం బగుననుసర్థము వాచ్యవృత్తిచేతనె లభించుచున్నది. ఇందు విధేయముగా భాసిల్లుచున్న ముమవర్ణక మితరశాస్త్రములచే నప్రాప్త మగుటం జేసి, తద్విధాయకమై శాస్త్రము సార్థక మగుచుండఁగా, నమహాత్తులయందు నపుంసకత్వాతిదేశము నెట్లు బోధించును? కావున శాస్త్రులవారు చేసినయతిదేశ వాక్యకల్పనము సరిగా నుండలేదు. ఈయతిదేశవాక్యకల్పనమున కుపష్టంభకముగా శబ్దేందుశేఖరాదిగ్రంథములను శాస్త్రులవా రుదాహరించిరి. అవి వీరివాదమునకు సాధకములు కానేరవు. "నబహువ్రీహౌ" అనుసూత్రపుశేఖరమున "సర్వాది సూత్రస్య చాయ మర్థః, సర్వాదీని తదంతానిచ, ఉక్తసర్వార్థవాచకత్వ సమానాధికరణ సర్వనామపదవంతీతి, తత్ర ప్రాప్తాప్రాప్తవివేకన్యాయేన సర్వనామపదవత్త్వాంశ ఏవ విధిః, సర్వార్థవాచకత్వస్య లోకత స్సిద్ధేః" అని వ్రాయఁబడియున్నది. ఇచట సర్వాదులును దదంతములును, నుద్దేశ్యములు, సర్వార్థవాచకత్వసమానాధికరణ సర్వనామపదవత్త్వము విధేయము. విధేయము కించిద్విశేషణవిశిష్టమైనపుడు, విధేయతాపర్యవసానము విశేషణమందా? లేక విశేష్యమందా? లేక విశిష్టము నందా? యనుసంశయమును నిశ్చయింపవలసివచ్చినపుడు, ప్రాప్తాప్రాప్తవివేక న్యాయముచేత, నప్రాప్త మయినదానియందే పర్యవసాన మనియు, నాకారణముచేత నిచట సర్వనామపదవత్త్వాంశమునందే పర్యవసాన మనియుఁ బైశేఖరగ్రంథమునకుఁ దాత్పర్యము. ప్రకృతమునందన్ననో, యదంతములై, యమహాత్తు లగు నపుంసకము లుద్దేశ్యములు, ముమవర్ణకము విధేయము. ఇందు విధేయాంశము విశిష్టమే కాదు. కావున నిటఁ బ్రాప్తాప్రాప్తవివేకన్యాయమునకుఁ బ్రసక్తియే లేదు. ఉద్దేశ్యఘటకములు విధేయములగునని యెవ్వరైన నంగీకరింతురా? ఇట్టే "లోహితోష్ణీషా ఋత్విజః ప్రచరంతి" అనుచోటనయితము వికృతియాగమున విధింపఁబడిన లోహితోష్ణీషవిశిష్ట ఋత్విక్కర్తృకప్రచరణము విధేయ మగుటం జేసి, యందువిధేయతాపర్యవసానము నిశ్చయింపవలసి వచ్చినపుడు, ప్రకృతివత్త్వాతిదేశమున నుష్ణీషవిశిష్ట ఋత్విక్కర్తృకప్రచరణము వికృతియాగాంగముగాఁ బ్రాప్త మగుటచే నప్రాప్తమగునుష్ణీషమునందలి లౌహిత్యాంశమునందు మాత్రమె విధేయతాపర్యవసానమని తాత్పర్య మంతయు యున్నది. కావున నిదియుఁ బైరీతిని శాస్త్రులవారివాదమున కుపష్టంభకము కానేరదు.

ఒకప్పుడు, నపుంసకములకు ముమవర్ణకం బగు ననువాక్యము వేఱుగఁ గల్పించినను, శాస్త్రులవా రుదాహరించినరీతిని బ్రాప్తాప్రాప్తవివేకన్యాయమున, నుష్ణీషము

నందు లాహిత్యవిధికిఁ బర్యవసానము కలిగినట్లు నపుంసకములయం దమహత్త్వవిధికిఁ బర్యవసానము లభించును గాని, యమహత్తులయందు నపుంసకత్వవిధికిఁ బర్యవసానము కలుగనేరదు.

ఇఁక శాస్త్రులవా రనుకొనినప్రకారముగ నమహత్తులయందు నపుంసకత్వ విధిపర్యవసానము కలుగవలె నన్నచో, నమహత్తులకు మువర్ణక మగు నను విధిని వేఱుగఁ గల్పించి శాస్త్రులవారు వివరించినప్రకారముగ, నమహత్తులు నపుంసకము లగు ననునతిదేశవిధికల్పనము చేయవలసియుండును. అట్లే చేసెద మన్నను, దైవతాదిపదములకు మువర్ణకము సిద్ధింపనేరదు. ఇఁక వానికిని మువర్ణకమును సిద్ధింపఁ జేయుటకు నపుంసకములకు మువర్ణకమగు నని వేఱొక శాస్త్రమును గల్పించుకొనవలసియుండును. అట్లును జేసెదమన్నచో, నమహన్నపుంసకపదము ద్వంద్వసమాస మన్నపుడు వచ్చునర్థమునే పై రెండుశాస్త్రములును బోధించును. అపు డమహన్నపుంసకసూత్రము వ్యర్థ మగుట యే శాస్త్రులవారి వాదమునఁ గల్గులాభము.

మఱియు నపుంసకములకు మువర్ణకము వచ్చు ననియు, నమహత్తులు నపుంసకము లగు ననియుఁ గదా శాస్త్రులవారివాదమునందలి ఫలితార్థము. అట్టి స్థితిలో నమహత్తులకు నపుంసకత్వాతిదేశద్వారమున మువర్ణకమును విధించుట కంటె నమహత్తులకు సాక్షాత్తుగా మువర్ణకమును విధించుటయే యుచిత మయి యుండదా ?

ఇఁక ద్వంద్వసమాసవాదులపక్షమునఁ గొన్నిప్రయోగముల కనుపపత్తి గల్గు నని శాస్త్రులవారు వ్రాసియున్నారు. దానియాథార్థ్యము నిట విమర్శింప వలసియున్నది. ఉపాధ్యాయాది మహదర్థకము లగుతీర్థప్రధానాదిశబ్దములు 'తీర్థుఁడు' 'ప్రధానుఁడు' అని యిట్లు, డుజ్వర్ణకాంతము లయి యుండవలెనుగాని, మువర్ణకాంతము లై యుండఁగూడ దనియు, నట్టిమువర్ణకాంతరూపములు భ్రష్ట ప్రయోగము లనియు, నట్టిప్రయోగములు, ద్వంద్వపక్షాశ్రయణమున దుర్వారము లనియు, శాస్త్రులవారు స్పష్టముగాఁ జెప్పుచున్నారు, గాని, యవి భ్రష్టప్రయోగము లనుటకుఁ దగినప్రమాణములను జూపరైరి. ఇతరశబ్దముల విషయమున నెట్లువ్రాసినను బ్రధానశబ్దవిషయమునందును నట్లువ్రాయుట యత్యద్భుతముగా నున్నది. సూరిగారు, "క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు" నని సూత్రించి, "మిత్రశరణప్రధాన పాత్రాదులు మిత్రాదులు" అని మిత్రాదులలోఁ బ్రధానశబ్దమును జేర్చి వివా[illegible] మగునమహన్నపుంసకసూత్రమునొద్ద, మిత్రాదిశబ్దంబులకు దైశ్వరూప్యం

చెలుంగునది. "ఉ—మిత్త్రుఁడు=మిత్త్రము, శరణుఁడు = శరణము" అని వ్రాసి యుండుటచే, మహద్వాచకప్రధానశబ్దమునకు 'ప్రధానుఁడు' 'ప్రధానము' అను ద్వైరూప్యము గ్రంథకర్తచే నంగీకరింపఁబడె నని స్పష్టపడుచుండఁగా శా గ్రంథ విమర్శనమునే చేయుచు నతనియభిప్రాయమునకు విరుద్ధముగా "ప్రధానము" అనునది భ్రష్టప్రయోగ మని వ్రాయుట యెంతసంగతమో చదువరులే గ్రహింతురుగాక !

మహద్వాచకములును, నపుంసకలింగములును నగు నేసంస్కృతశబ్దములకు, డుజ్వర్ణకాంతరూపములు ప్రమితములో, వానిని మిత్త్రాదులలోఁ జేర్చికొని రూపసిద్ధిని జేసికొనవలయు నని గ్రంథకర్త మిత్త్రాదులకుఁ బుంలింగతుల్యత్వాతిదేశము జేసియుండుటచే వానికి డుజ్వర్ణకాంతరూపములు ద్వంద్వవాదులకు సిద్ధింపనేర వని చెప్పుట కెంతమాత్రమును నవకాశము లేదు. అట్లె వాని మువర్ణకాంతరూపములును, 'మిత్త్రము, శరణము, ప్రధానము' అను వానికలె సాధువులె యనఁదగును గాని భ్రష్టప్రయోగము లనఁ దగదు.

మహద్వాచకములై నపుంసకలింగము లగుతత్సమశబ్దములు మువర్ణకాంతము లయి యున్నప్పుడు, వానివిశేషణము లగుసంస్కృతవిశేష్యనిఘ్న శబ్దములకు, డుజ్వర్ణకాంతరూపములె సాధువు లనియు, "జగన్నాటకప్రవర్తకం బైన దైవమే రక్షణంబు" అను మొదలగుమువర్ణకాంతప్రయోగములు, భ్రష్టము లనియు, నట్టిభ్రష్టప్రయోగములు ద్వంద్వవాదులకు దుర్వారము లనియు శాస్త్రులవారు వ్రాసియున్నారు. కాని యట్టిస్థలములందు మువర్ణకాంతరూపములు భ్రష్టము లనుటకును, డుజ్వర్ణకాంతరూపములు సాధువులనుటకును దగినప్రమాణములను జూపరైరి. మీఁదుమిక్కిలి వారు భ్రష్టప్రయోగములనుకొనుచున్న మువర్ణకాంతప్రయోగములు సుప్రార్థప్రకాశికయందు వారిచేఁ బ్రామాణికుఁడుగా గ్రహింపఁబడిన తెనాలి రామకృష్ణమహాకవిచే రచింపఁబడిన పాండురంగమాహాత్మ్యమునం దగపడుచున్నవి. చిత్తగింపుఁడు.

"సర్వోత్కృష్టంబు లగుతీర్థక్షేత్రదైవతంబుల" (పాండురంగమాహాత్మ్యము. 1 ఆశ్వా, 217 గద్యము.)

"నిఖిలభువనప్రధానధన్యంబు లగుమాన్యదైవతంబులం గొనియాడి" (పాండురంగమాహాత్మ్యము. 1 ఆ, 16 గద్యము.)

"అత్యుత్కటప్రభావంబుల దీప్రమైన, దైవతంబును గూడి" పాండురంగమాహాత్మ్యము. 1 ఆ, 193 పద్యము.)

పైనుదాహరించినరీతిని సూరిగా రంగీకరించిన "ప్రధానము" మొదలగుమువర్ణకాంతశబ్దములును, పాండురంగమాహాత్మ్యములోఁ బ్రయుక్తము

లగుమువర్ణకాంతవిశేష్యనిఘ్నశబ్దములును భ్రష్టప్రయోగము లని వీ రనుకొను టయే వీరి ప్రథమవ్యాసఘట్టమునకుఁ బునాది యై యున్నది. నేను బయి నుదాహరించినవిషయములను గమనించి యీ ప్రథమవ్యాసఘట్టపుఁ బునాదిబల మెట్టిదియో రచనాబల మెట్టిదియో చదువరులే గ్రహింతురుగాక.

ఇఁక రెండవవ్యాసఘట్టబలమును విమర్శింతము. "అదంతము లగునమహత్తులకును, నపుంసకలింగశబ్దములకును, మువర్ణక మగు నని ఫలితార్థము" అని సీతారామశాస్త్రులవారు వ్రాసిరి; అది కేవలసముచ్చయార్థ వివరణవాక్య మనియుఁ, గేవలసముచ్చయార్థమున, ద్వంద్వ మసాధు వని శాస్త్ర ముద్ఘోషించుచుండుటచే సీతారామశాస్త్రులుగారు చేసినయర్థమున, ద్వంద్వ మసాధు వనియు వ్రాసి, పార్థమూర్తిగారు సీతారామశాస్త్రులవారు వ్రాసినయర్థమును దూషించిరి. పార్థమూర్తిగారియభిప్రాయము సరి కాదని చూపుటకై కేవలసముచ్చయార్థమును బోధించునపుడు రెండుచశబ్దము లుండ వనియు, సీతారామశాస్త్రులవారివివరణమున, 'చ' శబ్దసమానార్థక "ను" శబ్దములు రెం డుండుటచే నది యితరేతరయోగార్థవివరణమే గాని, కేవలసముచ్చయార్థవివరణముకాదనియుఁ బార్థమూర్తిగారి దూషణ మట్టివివరణమును జెందనేర దనియు, నేను ద్వంద్వయుద్ఘోషణమన మనువ్యాసమున వ్రాసి యుంటిని. నావ్యాస మందలి యీయంశమును ఖండించుటకై, శాస్త్రులవారిచే ద్వితీయ వ్యాసఘట్టము రచింపఁబడెను.

సీతారామశాస్త్రులవారి వివరణవాక్యములను బోలినసంస్కృతవాక్యములలో నయినను, దెనుఁగువాక్యములలో నయినను 'చ' శబ్దద్వయముగాని, 'చ' శబ్దసమానార్థక "ను" శబ్దద్వయము గాని యున్నపు డావాక్యము లితరేతర యోగార్థవివరణబోధకములె యగును గాని కేవలసముచ్చయార్థబోధకములు కానేర వని నావ్యాసమున వ్రాసియుంటిని, గాని, చశబ్దద్వయ మేవాక్యమున నున్నను నది యితరేతరయోగార్థము గాకతీరదనియు, 'చ' శబ్దద్వయఘటితవాక్యము లెల్ల ద్వంద్వవివరణవాక్యములె కావలయు ననియు నేను వ్రాసియుండలేదు. చశబ్దద్వయము గల వాక్యము లెల్ల ద్వంద్వవివరణవాక్యములు కాక తీర దని నేను వ్రాసినట్లు శ్రీశాస్త్రులవా రభిప్రాయపడి, "నీలంచ, తత్ ఉత్పలంచ," అను మొదలగు కర్మధారయార్థవివరణవాక్యములోఁగూడ 'చ' శబ్దద్వయ ముండును గాన నదియు ద్వంద్వవిగ్రహవాక్యమె యనవలసివచ్చు నని నావ్యాసముపై దోషమును మోపి, యావాక్యము ద్వంద్వవిగ్రహము కాదనుట కనేక ప్రమాణములను జూపిరి. నేను జెప్పిన యితరేతరయోగార్థ వివరణవాక్యములోని చశబ్దసమభివ్యాహృత పదార్థములందుఁ బరస్పరాభేదము భాసిల్లకుండు ననియు, "నీలంచ, తత్, ఉత్పలంచ"

అనునది మొదలగు వాక్యములలోని, చశబ్దసమభివ్యాహృత పదార్థములయందుఁ బరస్పరాభేదము భాసిల్లుచున్నదనియు, నచ్చటిసర్వనామ మభేదమును స్ఫుటముగా భాసిల్లఁజేయు ననియు నట్టిసర్వనామములు లేకున్నను, గర్మధారయార్థ వివరణ వాక్యములలో నభేదము భాసిల్లకతీరదనియు, నభేదభానజనకము కానివాక్యము చశబ్దద్వయఘటిత మయినను గర్మధారయవివరణవాక్యము కానేరదనియు నేను జూపినవాక్యములను బోలినవాక్యము లెన్నఁటికిని నభేదభానజనకములు కావనియు, శ్రీశాస్త్రులవారు గ్రహించినచో నీక్రింద నేను సమాధానము చెప్పఁబోవువిషయము తప్పఁ దక్కినభాగము నెల్లను వ్రాయకయె యుందురు. కావున నీవిషయమున శ్రీశాస్త్రులవా రుపన్యసించినవిషయములను జర్చించుట యప్రసక్తమయినందున వానిని విడుచుచున్నాను. నావాదమునం దశాస్త్రీయాంశము లేదని చూపవలె ననియే నాయభిప్రాయము గాని నావాదమునకు సంబంధింపని, శ్రీశాస్త్రులవారు వ్రాసినయంశముల నెల్లఁ జర్చింపవలె నని నాయభిప్రాయము కాదు.

ఇఁక నీవ్యాసఘట్టమున "ద్వంద్వార్థవివరణవాక్యము లన్నియుఁ బ్రథమాంత ఘటితము లయియే యుండవలయును గాని, తత్తద్విభక్త్యంతఘటితములయి యుండఁగూడదు." అనునొక్కవిషయమునకు మాత్రమే సమాధాన మీయవలసి యున్నది. ఈవిషయమును స్థిరపఱుపఁదలఁచి శ్రీశాస్త్రులవారు కొన్నిశాస్త్రవిషయము లయినచర్చలు చేసి యున్నారు. వానికెల్లఁ బ్రతివిమర్శనము వ్రాసినచో నాయాశాస్త్రములయందుఁ బరిచయము లేనిపాఠకులకు దుర్బోధముగా నుండు ననియు, గ్రంథవిస్తర మగు ననియుఁ దలఁచి శాస్త్రచర్చలను మాని, శ్రీశాస్త్రులవా రుండ దని యనుకొనినరీతి గలప్రయోగములు ప్రమిత గ్రంథములనుండి చూపి శాస్త్రులవా రనుకొనినరీతి సరికా దని చదువరులకు విన్నవించుకొనుచున్నాను.

"సిద్ధే శబ్దార్థ సంబంధే" అనువార్తికమును వివరించుతఱిని "అథ కం పునః పదార్థం మత్వా ఏషవిగ్రహః క్రియతే సిద్ధే శబ్దే అర్థే సంబంధే చేతి ఆకృతి మిత్యాహ" "అథ ద్రవ్యే పదార్థే కథం విగ్రహః కర్తవ్యః, సిద్ధే శబ్దే అర్థసంబంధే చేతి" అని యిట్లు మహాభాష్యమున, (పస్పశాహ్నికము) "శబ్దార్థసంబంధే" అను ప్రథమేతరవిభక్త్యంతద్వంద్వమునకుఁ బ్రథమేతరవిభక్త్యంత పద ఘటితముగనే విగ్రహము వ్రాయఁబడెను.

"ఆచార్యాచారా త్సంజ్ఞాసిద్ధి ర్యథా లౌకికవైదికేషు" అనువాక్యమునందలి, "లౌకికవైదికేషు" అనుప్రథమేతరవిభక్త్యంత ద్వంద్వమునకు "లౌకికేషు, వైదికేషుచ," అని ప్రథమేతరవిభక్త్యంతపదఘటితవివరణవాక్యమె వృద్ధిసంజ్ఞాసూత్రభాష్యమున వ్రాయఁబడెను.

"ఘ్వసో రేద్ధా వభ్యాసలోపశ్చ" అనుపాణినిసూత్రమునకు (సిద్ధాంత కౌముది-అదాది) భట్టోజిదీక్షితులచే "ఘోః ర స్తే శ్చ ఏత్వం స్యాత్ హలాపరే" అని వృత్తి వ్రాయఁబడెను. ఇచట "ఘ్వసోః" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "ఘోః అ స్తేశ్చ" అని షష్ఠ్యంతపదఘటిత వివరణమే యగపడుచున్నది.

"అ స్తిసిచో పృ క్తే" అనుసూత్రమునందలి (సిద్ధాంతకౌముది-భ్వాది) "అస్తి సిచః" అనుపంచమ్యంతద్వంద్వమునకు "విద్యమానాత్ సిచః అ స్తేశ్చ" అని పంచమ్యంతపదఘటితవివరణవాక్యమె యగపడుచున్నది.

"సి జభ్య స్త విదిభ్యశ్చ" అనుసూత్రములోని (సిద్ధాంతకౌముది-భ్వాది)పంచమ్యంతద్వంద్వమునకు "సిచో ఒభ్యస్తాత్ విదేశ్చ" అని పంచమ్యంతపదఘటిత వివరణ వాక్యమె యగపడుచున్నది.

"తా స స్త్యో ర్లోపః" అను సూత్రములోని (భ్వాది) "తాసస్త్యోః" అను షష్ఠ్యంతద్వంద్వమునకు "తాసే ర స్తేశ్చ" అనుషష్ఠ్యంతపదఘటితవివరణవాక్యమె యగపడుచున్నది.

"షష్ఠీసమాసమునం దుకారఋుకారంబుల కచ్చు పరమగునపుడు నుగాగ మంబగు" (బాలవ్యాకరణము-సంధి-34సూ.) అనుసూత్రములోని "ఉకార ఋకారంబులకు" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "(షష్ఠీసమాసమునందు) ఉకారమునకును, ఋకారమునకును, (అచ్చుపరం బగునప్పుడు నుగాగమంబు గల్గును) అని యిట్లు షష్ఠ్యంతపదఘటితముఁగనే శ్రీశాస్త్రులవారే గుప్తార్థప్రకాశికయందు వివరణవాక్యము వ్రాసియున్నారు.

"ఉకారాంతగోశబ్దంబుల కంతట వుపర్ణకం బగు" (బాలవ్యాకరణము. తత్సమ. 48సూ.) అనుసూత్రములోని "ఉకారాంతగోశబ్దంబులకు" అనుషష్ఠ్యంత ద్వంద్వమునకు "ఉకారాంతంబులకును, గోశబ్దంబునకును" అని యిట్లు షష్ఠ్యంత పదఘటితముఁగనే శ్రీశాస్త్రులవారు గుప్తార్థప్రకాశికలో వివరణవాక్యమును వ్రాసియున్నారు.

"ఆత్మే మనిజంతములకు నాంతంబు లగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు" (బాలవ్యా. తత్సమ. 77 సూ.) అనుసూత్రములోని "ఆత్మే మనిజంతములకు" అనుషష్ఠ్యంతద్వంద్వమునకు "ఆత్మన్ శబ్దంబునకును, ఇమనిచ్ ప్రత్యయాంతంబులకును" అని యిట్లు షష్ఠ్యంతపదఘటితముఁగనే శ్రీశాస్త్రులవారు గుప్తార్థప్రకాశికలో వివరణవాక్యమును వ్రాసియున్నారు.

పయియుదాహరణములనుబట్టి చూడఁగా ద్వంద్వసమాసార్థమును వివరించునపుడు ద్వంద్వసమాసోత్తరవిభక్తిసజాతీయవిభక్తిని సమాసావయవపదార్థబోధక

పదములకుఁ జేర్చి వివరించుచున్నట్లు స్పష్టపడుచున్నది. ఆవివరణవాక్యము లన్నియు భ్రష్టవాక్యము లని యంగీకరించినవారు సీతారామస్వామిశాస్త్రులుగారి వివరణవాక్యమును సైతము భ్రష్టవాక్యముగా నంగీకరింపవచ్చును. ఆవిధముగా వివరించినయర్థమునందుఁ బైనుదాహరించినద్వంద్వము లసాధువు లనువారు సీతారామస్వామిశాస్త్రులుగారు వివరించినయర్థమునందు ద్వంద్వ మసాధువని యన వచ్చును. సీతారామస్వామిశాస్త్రులుగారు చెప్పినవి తప్పని చెప్పెడు పట్టుదలతోఁ బైనుదాహరించిన ప్రయోగము లన్నియుఁ దప్పులే యని చెప్పుట యుచితమో? లేక పైప్రమితప్రయోగములతోపాటుగ సీతారామస్వామిశాస్త్రులుగారు చెప్పినదియు సాధువే యని యంగీకరించుట యుచితమో? చదువరులె గ్రహింతురుగాక. ఒకప్పు డితరులు పైప్రయోగములు తప్పనిన, ననవచ్చును గాని సీతారామస్వామిశాస్త్రులుగారు చెప్పినరీతినే బాలవ్యాకరణములోని ద్వంద్వసమాసములను వివరించిన శ్రీశాస్త్రులవారు మాత్ర మట్లనుటకు వలనుపడదు. ఈవిషయమున సీతారామస్వామిశాస్త్రులవారు చెప్పినది తప్పనిచెప్పుటకు యత్నించుట శాస్త్రులవారు తాము చెప్పినది తప్పని చెప్పుటకుఁ బ్రయత్నించుటయె గాని వేఱు కాదు.

ఇఁక మూఁడునాలుగువ్యాసఘట్టములను విమర్శింతము. శ్రీశాస్త్రులవారి మూఁడవవ్యాసఘట్టమం దంతటను ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మని స్థిరపఱుచుటకై యనేకప్రమాణములు చూపఁబడినవి. నావ్యాసమునందు ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మని వ్రాసితిని గాని కా దని యెచ్చటను వ్రాసియుండలేదు. ద్వంద్వసమాసము సాహిత్యవిశిష్టబోధక మనునంశ ముభయవాదసిద్ధ మయి యుండఁగా నావిషయమునే స్థిరపఱుచుటకు ననేకప్రమాణము లుపన్యసించుట శ్రీశాస్త్రులవారి బహుగ్రంథద్రష్టృత్వమును బోధించుట కుపచరించును గాని నావాదమును ఖండించుట కుపచరింపదు. ఇఁక నీవిషయమున మాయుభయులకుఁ గలభేద మేమనఁగా "ద్వంద్వసమాసార్థ మగుసాహిత్యము శాబ్దబోధములో భాసిల్లక తీర దని నియమము గలదుగాని ద్వంద్వసమాసఘటితవాక్యముచే బోధితమగుక్రియయొక్క నిష్పత్తిలో నుండు ననునియమము లేదు. కొన్ని వాక్యములందు ద్వంద్వసమాసఘటితవాక్యబోధితము లగుక్రియల నిష్పత్తిలోఁ గూడ సాహిత్య ముండిన నుండవచ్చును. ఇట్టివాక్యములె "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయములు. కొన్నివాక్యములందు ద్వంద్వసమాసఘటితవాక్యబోధితము లగుక్రియలనిష్పత్తిలో సాహిత్య ముండదు. అట్టివాక్యములె "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయము లని నాయభిప్రాయము. ద్వంద్వసమాసార్థసాహిత్యము క్రియాని

ష్పత్తిలోఁ గూడ నుండకతీరనిదియే యని శ్రీశాస్త్రులవారి యభిప్రాయము. ఈవిషయమున నాయభిప్రాయమును స్పష్టముగా బోధించుభాష్యప్రదీపోద్ద్యోతాది గ్రంథములను నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసమునఁ జూపియుంటిని.

శాస్త్రులవారివ్యాసమున ద్వంద్వసమాసార్థము సాహిత్య మగు నని స్థిర పఱుచుట కుపయోగించుప్రమాణములే యగపడుచున్నవి గాని, క్రియానిష్పత్తి లో సాహిత్య ముండనక్కఱలే దనుటకు నేఁజూపిన "మాతాపిత్రోర్మృతేఽహాని ఇతివత్ బోధే సాహిత్యం నతు క్రియానిష్పత్తౌ" అనుప్రమాణమును బోలునట్లుగఁ గ్రియానిష్పత్తిలోఁ గూడ నీసాహిత్య ముఁడక తీర దని నిర్ణయించు ప్రమాణ మొక్కటియైనఁ గానరాదు. శ్రీశాస్త్రులవారు ద్వంద్వసమాసార్థ సాహిత్యము క్రియానిష్పత్తిలో నుండు నని లోకులకు స్ఫురింపఁ జేయుటకై కొన్నిద్వంద్వసమాసముల నుదాహరించి వానియర్థ మగుసాహిత్యము క్రియా నిష్పత్తిలోఁ గూడ నుండునట్లుగఁ జూపిరి. ఆయుదాహరణము లెల్ల "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయము లయియే యున్నవి గాని "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయము నిర్విషయ మని నిర్ణయించుటకు సమర్థము లయి యుండలేదు. ప్రకృతవివాదవిషయక మగు ద్వంద్వము "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయమై యున్నది. ఇదియే యననేల? వ్యాకరణశాస్త్రమునందలి ద్వంద్వసమాసము లెల్లఁ దఱుచుగ నీన్యాయమునకే విషయము లని చెప్పవచ్చును.

శ్రీశాస్త్రులవారు చూపినరీతులు గల "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయము లగుద్వంద్వములే కాక తత్సమకక్షములై "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయము లగు ద్వంద్వములు లెక్కకు మీఱి యున్న వని గ్రహించినచదువరులకు శాస్త్రుల వారి తృతీయవ్యాసఘట్ట మెల్ల నిరుపయోగ మని తోఁచు నని తలఁచియే కావలయును "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయము ముఖ్యపక్ష మనియు, "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయము కక్కుఱితిపక్ష మనియు, స్ఫురింపఁ జేయుటకయి చతుర్థవ్యాసఘట్టమునఁ జాలవఱ కుపన్యసించిరి. కాని యాయుపన్యాసములో "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనునది ముఖ్యపక్ష మనియు, "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనునది కక్కుఱితిపక్ష మనియు, నేగ్రంథమునందైన నున్నట్లు శ్రీశాస్త్రులవారు కనఁబఱుపలేదు. సరే కదా యీరెండున్యాయములును సమబలము లనియు, నివి లక్ష్యముల ననుస రించి వ్యవస్థితము లయి ప్రవర్తిల్లు ననియు, శ్రీశాస్త్రులవారే యీవ్యాసఘ

ట్టమున వ్రాసియున్నారు. "పయిని జూపినప్రత్యేకపరిసమాప్తి సముదాయపరిసమాప్తిన్యాయంబులు సమానబలంబులై యుండఁగా నీరెండింటిలో నిదియే గ్రహింపవలయు నని సుగ్రీవాజ్ఞ లేదు." అని యిట్లు పయిన్యాయములు సమానబలములని యిచటవ్రాసి, వేఱొకచో నీన్యాయములలో నొకటి కక్కుటీతిపక్షమని తలంచుటయు, లక్ష్యానురోధమున నివి వ్యవస్థితము లగు నని వేఱొకచోఁ దా మంగీకరించినయంశమును గణింపక "ఈరెండిటిలో నిదియే గ్రహింపవలయు నని సుగ్రీవాజ్ఞ లేదు" అని యిచట వ్రాయుటయు వింతగ నున్నవి.

శ్రీశాస్త్రులవారి ధోరణినిబట్టి చూడఁగా న్యాయములకు లక్ష్యానురోధమునుబట్టి వ్యవస్థ చేయుట లక్ష్యైకచక్షుష్కులపని గాని లక్షణైకచక్షుష్కులపని కాదని వా రభిప్రాయపడినట్లు తోఁచుచున్నది. కాని లక్షణైకచక్షుష్కులగు పరిభాషేందుశేఖరాదిగ్రంథకర్తలుగూడ న్యాయములు లక్ష్యానురోధమున వ్యవస్థితము లనియే వ్రాసిరి. పరిభాషేందుశేఖరమునఁ బయిన్యాయములనే చూపి "లక్ష్యానురోధేనచ వ్యవస్థా" అనియే వ్రాయఁబడెను.

వ్యవస్థితము లయినపక్షములలో నొకపక్షముచేతఁ గార్యసిద్ధి యగునపుడు పక్షాంతరము నవలంబించి దూషణదానము చేయుట యనుచిత మని వైయాకరణు లందఱు నంగీకరించియుండఁగాఁ బ్రకృతమున "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయముచేత లక్ష్యసిద్ధి యగుచుండఁగా "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయము నాధారముగాఁ జేసికొని శంకించుట యెంతవఱ కుచితముగా నుండునో చదువరులే గ్రహింతురుగాక.

పై రీతిని "ప్రత్యేకంవాక్యపరిసమాప్తిః" అనున్యాయము గమక మక్కఱ లేకయే ప్రకృతమునఁ బ్రవర్తింపఁదగి యున్నది. అయినను గమకముగూడఁ గావలయునని పట్టుదల యున్నయెడల "సంస్కృతమునకు వర్ణంబు లేఁబది." "దృతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనఁబడు" "ద్వంద్వంబునం బదంబులయి పరుషంబులకు గసడదవ లగు" అనుమొదలగు సూరిగారినిర్దేశములె యిచట "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయము ప్రవర్తించుటకు గమకములని గ్రహింపనగును.

నేను ద్వంద్వార్థసాహిత్యమును విడనాడినట్లు చదువరులకుఁ దోఁచురీతిని శ్రీశాస్త్రులవా రుపన్యసించుచు వచ్చిరి. నే నటులు ద్వంద్వార్థసాహిత్యమును విడనాడ లేదు. ఆసాహిత్యము శాబ్దబోధములో భాసిల్లు నని చెప్పియుంటిని. "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు లక్ష్యము లగుద్వంద్వములందును సాహిత్యము శాబ్దబోధములో భాసిల్లుచునే యుండును. సాహిత్యబోధకవాక్యార్థవిశ్రాంతి సము

దాయము దుండునా? లేక ప్రత్యేకవ్యక్తులం దుండునా? అనునది వివాదాంశము. ఇందుఁ బ్రత్యేకవ్యక్తులయందు వాక్యార్థవిశ్రాంతి యత్నసాధ్య మనియు నందువలన నిది కక్ష్యాటితపక్ష మనియు సముదాయమందు వాక్యార్థవిశ్రాంతి సహజ మనియు నందున నదిముఖ్యపక్ష మనియు శ్రీశాస్త్రులవారి యభిప్రాయమై యున్నట్లగపడు చున్నది. అట్లు సముదాయమున వాక్యార్థవిశ్రాంతిమాత్రమే సహజ మైనయెడల సముదాయమున వాక్యార్థవిశ్రాంతి కావలసినచోట "సహగ్రహణం కర్తవ్యమ్" అనువార్తికమేల యారంభింపఁబడును. తద్వార్తిక ప్రత్యాఖ్యానమునకు భాష్య కారులు న్యాయప్రశ్నన మేల చేయవలయును? కావున సాహిత్యము క్రియాన్విష్ప త్తిలో నుండవలయు నని బోధచేయుటకు సహగ్రహణాదులు గాని "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయము గాని సమర్థ మగును, గాని, కేవలద్వంద్వాదులు సమర్థములు కావు.

ఈసందర్భమున ద్వంద్వాదిఘటితవాక్యస్థలములలో నీరెండున్యాయములకుఁ గలయుపయోగమును విశదపఱుచుట యావశ్యకమని తోఁచి యిచట విశదీకరించు చున్నాను.

ద్వంద్వాదులు, అవయవమును, సముదాయమును గూడ బోధించును. అట్లు బోధితము లగునవయవసముదాయములలో నవయవములయందుఁ దాత్పర్యమును సముదాయము నాంతరీయకమును, అని కాని, సముదాయమునందుఁ దాత్పర్యమును నవయవములు నాంతరీయకములు ననిగాని నిర్ణయించుట యావశ్యకము. "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయము సముదాయమునందుఁ దాత్పర్య మనియు, నవయవములు నాంతరీయకము లనియు, బోధించును. అట్లే "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమును నవయవములయందుఁ దాత్పర్య మని యు సముదాయము నాంతరీయక మనియు బోధించును. ఈయంశము "సముదాయావ యవసన్నిధౌ క్వ తాత్పర్యం క్వచ నాంతరీయకత్వమితి విచార్యతే" అనుగ్రంథ ముచే నైయటుఁడు స్పష్టపఱిచి యున్నాఁడు.

తాత్పర్యనిర్ణయ మన్ననో యర్థస్వభావమునుబట్టియే సంభవించును. కావు ననే "శతాదానే ప్రధానత్వాత్" అనువాక్యపదీయ కారికయొక్క, వ్యాఖ్యానమున "ఏత దుక్తం భవతి, ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః, సముదాయే వాక్యపరిసమాప్తి రిత్యేతత్ నరాజాజ్ఞావశాత్ వ్యవస్థాప్యతే, అపితు అర్థతథాభావాత్, ఇతి న్యాయ సిద్ధమేవైత ద్వేదితవ్యమ్" అని వ్రాయఁబడెను. అనఁగా, నర్థస్వభావమునుబట్టి యీరెండు న్యాయములు వ్యవస్థితము లగు నని పైగ్రంథమునకుఁ దాత్పర్యము. ఈయభిప్రాయము గర్గదండనన్యాయమును, దేవదత్తాదిభోజనన్యాయమును, వివ

రించుతఱిని శ్రీశాస్త్రులవారే యంగీకరించి యున్నారు. అర్థస్వభావము లక్ష్యదర్శనమువలనఁ దెలియఁదగినదై యున్న దని "సంఖ్యైకశేషద్వంద్వేషు" అనునది మొదలుగ నెనిమిదివాక్యపదీయశ్లోకములును వానివ్యాఖ్యానములును బరిశీలించిన విశదపడును. ఈయభిప్రాయముతోడనే "లక్ష్యానురోధేనచ వ్యవస్థా" అని పయి రెండున్యాయములకు వ్యవస్థ చూపఁబడెను.

పై విషయము నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసమునందే 11 పుటలో సమగ్రముగా వ్రాసియున్నాను. పయిసందర్భముచొప్పున నీరెండున్యాయములును నర్థస్వభావము ననుసరించినవగుటచే, వీనిలో నొకటి ముఖ్య మనియు నొకటి గౌణమనియుఁ జెప్పుట కవకాశము లేదు.

ఇఁక వృద్ధిసంజ్ఞాసూత్రకైయటమున వృద్ధిసంజ్ఞకు నవయవము లన్నిటియందును విశ్రాంతి కలుగుటకయి "మాలాదీనాంచ" అనుజ్ఞాపకమును జూపుటచేఁ "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయము యత్నసాధ్య మనియు "సముదాయే వాక్యపరిసమాప్తిః" అనున్యాయ మట్టిది కాదనియు శాస్త్రులవారభిప్రాయ పడుచున్నారు గాని "సముదాయే వాక్యపరిసమాప్తిః" అను న్యాయమునకు విషయము లగు సంయోగసంజ్ఞా సమాససంజ్ఞలకుఁగూడ సముదాయమునందు విశ్రాంతికి మహాసంజ్ఞాకరణము వలన నన్వర్థత్వము సాధకముగఁ జూపఁబడినది. ఈసందర్భమును బట్టి "సముదాయే వాక్యపరిసమాప్తిః" అను న్యాయముకూడ యత్నసాధ్య మనియే యంగీకరింపవలసి వచ్చును. కావున నెన్నివిధముల నాలోచించినను నీరెండున్యాయములవిషయమునను శాస్త్రులవా రొకచోటను వ్రాసినట్లు సమబలము లనుమాటయే స్థిరపడును గాని వేఱొకచోట వ్రాసినట్లుగ, నొకటి ముఖ్యము వేఱొకటి గౌణము ననుమాట సిద్ధింపనేరదు.

వేయేల "ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః" అనున్యాయమునకు విషయము లగుద్వంద్వము లు కక్ష్యాతిరిక్తములోనివే యయినయెడ శ్రీశాస్త్రులవారట్టి వానినే గుప్తార్థప్రకాశికలోఁ బ్రయోగింపనేల? "ఇంచుగ్వక్రంబులకు (240 పుట.) యుష్మదస్మచ్ఛబ్దంబులు (167 పుట.) ప్రథమమధ్యమపురుషములకు (169) ఉకారాంతఋకారాంతశబ్దములకు (73 పుట.)"

పార్థసారథిగారివలెనే శ్రీశాస్త్రులవారును నమహత్త్వ నపుంసకత్వములకు సామాన్యవిశేషభావ మున్నటు లీచతుర్థవ్యాఘఘట్టమున వ్రాసిరి. వీనికి సామాన్యవిశేషభావము లేదని స్పష్టపఱుచునట్టి నాద్వంద్వయుద్ధోపశమనవ్యాస భాగమును (నలసం॥ భాద్రపదాశ్వయుజమాన సాహిత్యపరిషత్పత్రిక 14-15 పుటలు.) నొకసారి చిత్తగింప శ్రీశాస్త్రులవారిని బ్రార్థించుచున్నాను. మఱియు వివాద

ష్ఠములగు నుపలక్షణత్వాద్యంశములనుగూర్చియుఁ బయినుదాహరించినద్వంద్వ యుద్ధోపశమనవ్యాసమును శ్రీశాస్త్రులవారు సావధానచిత్తులయి చిత్తగించియున్న మొదల నాయంశములను గూర్చి మరల నీవ్యాసఘట్టమునఁ జర్చించినరీతిని జర్చించి యుండ రని నమ్ముచున్నాను.

ఇఁక నావ్యాసములోఁ బ్రయోగింపఁబడిన "దుర్యోధనార్జునులు శ్రీకృష్ణ సహాయముఁ గోరి వచ్చిరి" అనువాక్యములో "దుర్యోధనార్జునులు" అనుచో దుర్యోధనపదమును మొదటఁ బ్రయోగించుటయు మఱియు నావాక్యము నందు సహాయపదమును బ్రయోగించుటయుఁ బ్రమాదకృతము లని యభిప్రాయ పడిరి. నేను వ్రాసినది తెనుఁగుభాష. తెనుఁగుభాషలో సహాయశబ్దమును నే నుపయోగించినరీతిని బ్రయోగించుట సుప్రసిద్ధము. అట్టిప్రసిద్ధిని జూపుటకయి భారతమునుండి కొన్నితిక్కనసోమయాజిప్రయోగముల నిట నుదాహరించెదను. చిత్తగింపుఁడు.

ఉ. వారలఁ జూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
 క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము సేయువగన్ సహాయముం
 గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
 కారయ నొక్కరూప హృదయంబునఁ జేర్చినబాంధవంబునన్.

(భార. ఉద్యో. 1 ఆ. 69 ప.)

క. అనుటయు నాతఁడు హరికి, ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్
 విను సుప్రసిద్ధుఁడవు నీ, వనిసేసినఁ జేరు నీక యగు నెప్పాటన్.

(భార. ఉద్యో. 1 ఆ. 86)

ఇట్లు ఛందఃప్రతిబంధము గలపద్యములందే కాక గద్యములందును వగ పడుచున్నవి.

"సంపద సహాయంబు నపేక్షించి యుండు. సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లును" (భార. ఉద్యో. 2 ఆ. 69 గద్యము.)

దుర్యోధనుఁడు రారా జగుటచేత నతఁ డభ్యర్హితుఁ డనఁదగును గాన దుర్యోధనశబ్దమును ద్వంద్వపూర్వపదముగఁ బ్రయోగించుట దుష్టము కానేరదు. మఱియు దుర్యోధనుఁ డభ్యర్హితుఁడు కాఁడని శాస్త్రులవారికిఁ బట్టుదల యున్నను బయిప్రయోగము, "లక్షణహేత్వోః క్రియాయాః" "సముద్రాభ్రాద్ఘః" అను పాణినినిర్దేశములవలనఁ బూర్వనిపాతప్రకరణమున కనిత్యత్వమును జెప్పి వైయాకరణులచేత సాధింపఁబడిన "కతిపయదినస్థాయిహంసా దశార్ణాః" అను మొదలగు మహాకవిప్రయోగములవంటి దని శ్రీశాస్త్రులవారు గ్రహింపఁదగును గాని

వేఱొకటిఁగా గ్రహింపఁ దగదు. మఱియు నాప్రయోగము శ్రీశాస్త్రులవారి యపరావతారమగు పార్థమూర్తిగారు ప్రయోగించిన "కైయటోపాధ్యాయ" అనుప్రయోగమువంటిదే యని దయిన గ్రహించి మన్నింతురుగాక.

"కైయటోపాధ్యాయ" అనునది కర్మధారయసమాసము. కర్మధారయ సమాసమున, విశేషానుశాసనము లేనపుడు విశేషణము పూర్వపద మై యుండవలయు నని, "విశేషణం విశేష్యేణ బహుళమ్" "ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్" "ఉపసర్జనం పూర్వమ్" అనుశాస్త్రములచే వ్యక్త మగు చున్నది. ఇచట సమస్యమానపదములలో "కైయట" పదము సంజ్ఞాశబ్దము. "ఉపేత్యాస్మా దధీయతే" అనువ్యుత్పత్తిచొప్పున నుపాధ్యాయశబ్దము క్రియా శబ్దము. సంజ్ఞాశబ్దమునకుఁ గ్రియాశబ్దముతో సమభివ్యాహార మున్నపుడు, సంజ్ఞా శబ్దము విశేష్యమే కావలయు ననియుఁ గ్రియాశబ్దము విశేషణమే కావలయు ననియు నియమము. "తత్ర జాతిసంజ్ఞయోః గుణక్రియాభ్యాం సమభివ్యాహారే విశేష్యత్వైవ" అని "విశేషణం విశేష్యేణ బహుళమ్" అనుసూత్రమునందలి శబ్దేందుశేఖరమునఁ జూపఁబడియున్నది. కావున విశేషణ మగునుపాధ్యాయశబ్దము పూర్వనిపాతశాస్త్రముచేఁ బూర్వపద మై "ఉపాధ్యాయకైయట" అనురూ పము సిద్ధింపవలసియున్నది. కాఁబట్టి "కైయటోపాధ్యాయ" అనుదానికి సాధు త్వము పూర్వనిపాతప్రకరణమున కనిత్యత నంగీకరింపకున్న సంభవింపదుగదా.

ఈసందర్భమున శాస్త్రవిషయములె విమర్శించుట యావశ్యకము గాని యుపన్యాసస్థభాషను విమర్శించుట యావశ్యకము కాదని యెంచి పార్థమూర్తి గారియుపన్యాసభాషను గూర్చి కాని శ్రీశాస్త్రులవారియుపన్యాసభాషను గూర్చి కాని నే నిచ్చట విమర్శింపఁ దలంచుకొనలేదు.

నాద్వంద్వయుద్ధోపశమనవ్యాసములో "పార్థమూర్తిగారి కర్మధారయ" అనియు "తమ కర్మధారయార్థము" అనియు "పార్థమూర్తిగారు తమకర్మధారయ" అనియు నాచేఁ బ్రయోగింపఁ బడినవి. వీనిని బరుషోక్తులుగా గ్రహించి నేనాగ్రహ ముతో వానిని వ్రాసినట్లు శ్రీశాస్త్రులవారు వ్రాసియున్నారు. అవి నేను బరుషోక్తు లని యనుకొనలేదు. వానిని నేనాగ్రహపూర్వకముగా వ్రాయను లేదు. అవి పరుషములె యని వారికిఁ దోఁచినయెడల నే నట్లు గ్రహింపలేక యట్టిప్రయోగ ములు సందర్భవశమునఁ బ్రయోగించినందులకు నాక్షమార్పణమును దయతోఁ బరిగ్రహించి నన్ను మన్నింతురుగాక.

ఇప్పటికిఁ బ్రాయఁబడిన యుభయవాదుల వ్యాసములనుబట్టి "అమహాన్నపుంసక" సూత్రార్థతత్త్వము చదువరులు గ్రహింపలేకపోరు. ఇటుపయి నేమి వ్రాసినను వివాదమును బెంచుకొనుటకును స్వస్వపాండిత్యప్రకర్షములను లోకమునకు వెల్లడించుకొనుటకును మాత్రమె యుపయోగించును, గాని, తత్త్వనిర్ణయమున కంతగా నుపకరింప వని నాయభిప్రాయము. కావున నిటుపయి నీవిషయమున నెవ్వ రేమి వ్రాసినను నేను బ్రత్యుత్తర మీయఁ దలఁచుకొనలేదు.

శ్రీమాన్ ప్రతివాదిభయంకరం రాఘవాచార్యులుగారు లోకమునకుఁ దత్త్వమును వెల్లడించుటకై సమరాంగణపార్థమూర్తియగు ద్వంద్వోపశమనంబును బుస్తకరూపమున ముద్రింపించి బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికకుం జేర్చి ప్రచురించునపుడు శ్రమ యని యెంచక నా ప్రార్థనమును మన్నించి నాయీ రెండు వ్యాసములను గూడ నందుఁ జేర్చి ప్రకటించిన నేను వారియెడలఁ గృతజ్ఞుఁడనగుచున్నాను. అట్లు ప్రకటించుటవలన లోకమునకుఁ దత్త్వమును వెల్లడింపవలయు ననువారియభిప్రాయము మఱింత బాగుగాఁ గొనసాఁగఁగలదు. కావునఁ దత్త్వప్రకాశనపరు లగువారు నా ప్రార్థనమును దప్పక మన్నించెద రని నమ్ముచున్నాను.

పింగళసంవత్సర
భాద్రపదాశ్వయుజమాస
పరిషత్పత్రికనుండి ముద్రితము

తాతా సుబ్బరాయశాస్త్రి.

ఈ వ్యాసములు రెండిటిని నిం దనుబంధముగా ముద్రింపించికొనుట కనుజ్ఞనొసంగిన శ్రీ "ఆంధ్రసాహిత్యపరిషత్తు" వారియెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడనగుచున్నాను.

22-3-1951
విజయనగరము

ఇట్లు సుజనవిధేయుండు
వఝల చినసీతారామస్వామిశాస్త్రి.

విస్తరభీతి నింపఁ జేయఁదగిన సవరణములలో ముఖ్యములయినవి మాత్రమె యీక్రిందఁ జూపఁబడుచున్నవి, కొలఁదిపడిన యిలంటి తప్పులను పాఠకమహాశయులు సవరించికొననగును.

ఇందలి '+' అనుగుర్తు తరువాతిశబ్దము లాయాచోట్లఁ జేర్పఁదగినవని యెన్నఁదగును. త్యాజ్యములుగాఁ జూపఁబడిన యాయాశబ్దములు గ్రంథమునుండి తొలఁగింపఁదగునని యెఱుంగునది.

# సవరణములు

౧ ౧౬ చెప్పన+ను 'పితృపితా' అను నమరసింహప్రయోగము చెప్పనను.

౨ ౬ కాదు)+ఆహోబలశబ్దభేదములు-'ఓబల-ఓబ' అనునవి కవిప్రయుక్తములయియున్నవి. ఓబామ్బికాయాం నరసత్రిలోక్యాత్ (చూడు. ౨౭౪ విష.)

౩ ౮ కాదు+(చూ. ౨౭౪ విష)

౪ ౧౨ కా)+ 'శుభవర్ణా ల్పుభిశబ్దాః...' (సంజ్ఞా ౧౪ కా).

౪ ౧౯ (హల ౬౮ కా)+నమ్చోతః... (సంధి ౨౮ కా)

౨౯ ౨౪ ఈపంక్తి క్రిందిగీత (line) త్యాజ్యము.

౩౧ ౧౦ మ్యము+(చూడు. వాచస్పత్యము. ౧౬౦౦ పుట. వ్యంజనవర్ణవిభాగాదిసందర్భము (వై. పా. ౧౪౮ విష.)

౪౬ ౪ యెన్నఁదగును.+(ఆంధ్ర)కర్ణాటసాధారణలిపిలో 'ಯ' అనునది వావడిపైని గొమ్ము నిల్పు రూపముకావ "మ" అను యకారపుపొల్లుతో సాంకర్యము కల్గును. '✓' అను నది 'ఉ'కారంలిపి కావ దీనితో "ಲ" అను లకారపుపొల్లునకు సాంకర్యము కల్గును. కాన 'యా' గుణితలిపి 'ಯಾ' అనియు, లా గుణితలిపి 'ಲಾ' అనియుం నేర్పఱుపఁబడెను.)

౬౭ ౯ లేదు+విసర్గ పూర్వము గురువె. దుఃఖము మొ.

౭౧ ౧౪ చుక్క+(చూ. ౩౨౮ I. విష.)

" ౮ మొ+'న రేఫతతోః' (పాఠాం). ఆపఱచుసన ఇట్టి. వట్టి. మొ.

౭౪ ౧౭ తాలవ్యములనియు+(చూ. ౧౯ విష. వై. పా. ౧౪౮ వి.)

౮౩ ౧౩ "నిబద్ధనేషు ప్రాచాంచే" దిత్యాదికారిక నిటఁ జేర్పనగును. (చూ. ౩౦౯ విష.)

౮౭ ౧౮ నుగాగమాంతములు+(పదమధ్యగతములగుటచే నివి ద్రుతప్రకృతికము లనరాదుగాని యహోబలపత్యనుయాయి సూరి వానిని ద్రుతప్రకృతికము లనవచ్చును.)

౮౮ ౧౦ దగును+(చేయుచు మున్నగువానికిఁ బదత్వసిద్ధికల్గిన వివఁప ప్రకృతసూత్రముచే ద్రుతప్రకృతికత కల్గును.)

" ౧౭ కానోపును.+(క్త్వాంతముల కళాత్వోపదేశము బయినవిషయములకు సాధకమగుచున్నది.)

౧౦౮ ౨౮ యుదాహరించెను +(ప్రౌఢ. శబ్ద. ౧౧౭ సూ.)

౧౧౭ ౨౨ లేదుకదా.+అందు ఖండమేలేనిచో బా. క్రి. ౮౮ సూ. చెప్పిన 'తోవన్' అనునవిష్టరూప మప్పులిల్లునుగదా.

క

౧౨౩ ౩ యోఁయటంటం జేసిన+(౩౭౯ I విష.)

,, ౨౩ చుస్వాఁడునిచుస్య = యకారమునకు, సర్వత్ర = సంధి సందర్భమునందంతటను, అజ్వత్కార్యమ్ = స్వరసదృశకార్యము కల్గనగఁగా వ్యంజన యకారము లోపించి దానిమీఁదిస్వరము నిల్చునని, జ్ఞేయమ్ = తెలియవలెను.

,, ౨౪ "బరనుగా" అనునది త్యాజ్యము.

౧౪౩ ౨౯ ఉదా. వృట్రువ. పేర్మి.)+(౪౧-౪౨ విష. వై. పా.)

౧౬౦ ౨౧ ఆసివదేవుఁడు+('అంచయాన' అనువానివంటి తద్భవము.)

౧౮౨ ౩౨ సూత్రించెను.+ఇంకను ననేకములుగలవు. చూడు. ౩౨౭ విష.

౧౯౪ ౩౧ తమలయ్యె.+ఇంకను ననేకస్థలములుగలవు. చూడు. ౩౨౪ విష. ఉంటిని—అ కొండును. మొ.

౨౦౪ ౧౨ 'పయిసందర్భమునబట్టి' త్యాజ్యము.

౨౧౧ ౨౯ ఇవి+ననునున్ - నినునున్. మొ.)

౨౨౩ ౯ బడును+) బహుళతకు:—హారియందు. మొ.

,, ౧౬ ౧౫౧ పు.)+(చూ. ౩౨౦ విష.)

౨౨౫ ౧౦ కనుఁ దాత్పర్యము.+(చూ. ౨౭౩ విష.)

,, ౨౮ పూజ్యార్థకములతో+(౨౭౩ వి. చూ.)

౨౨౬ ౧౫-౧౬ "కం... వరదాయ... (౧౧౨ II వి)" త్యాజ్యము.

౨౪౮ ౧౯ సమ్మతమైనచో+ద్రుతలోపము.

౨౫౨ ౨ వచ్చుట+శబ్దతత్త్వ.

,, ౫ తోఁచును+తమిళమునందును 'ఏగు' అనునది నిరనునాసికము.

౨౫౫ ౨౬ మాత్రమున+నర్థభేదముగల.

౨౫౮ ౬ (విస్తర II+III.

౨౬౨ ౧౨ (అహో ౨౨౨ పు.)+పలువగతురగముల...హా-వ. ౧ ఆ. ౧౯, పలు+వగతుర+గముల. పలు+వగ+తురగముల )

౨౬౩ ౨౭ తలఁడు+(ఇదితలఁచు ధాతురూపమైనను గావచ్చునని నెడి 'బా-గ-ప్ర.' 'బా-శా-పే' వ్యాఖ్యలు సరికావు. చూ. ౩౪౧ I వి)

౨౬౫ ౩౦ నవ్యయములను+ప్రథమాంత.

౨౭౩ ౪ రానేరదు.+'క్వచి న్నైవ వికారః స్యా, ద్ద్రుతత్వా చ్ఛబ్దపల్లవే.' (౩౪౮ విష.)

౨౭౭ ౯ ప్రబల+ప్రాచీన.

౨౮౭ ౨౦ తాఁకుడు+వ్యస్తస్థితిలోని.

౨౯౫ ౨౫ 'సంశ్లేష' త్యాజ్యము.

౩౦౦ ౩౦ యనావశ్యకము.+మఱియుఁ బరుషపరత్వమందువలెనె సరళపరకత్వమందును ఖండ బిందువు వచ్చునని నెడి యనర్థమును దుర్వారమగుచున్నది.

౩౦౪ ౩౨ ఈ ౩౨ పంక్తి నీపుటలోని నాల్గవపంక్తిక్రింద నయిదవపంక్తిగా నిల్పవలెను.

౩౧౧ ౫ (కర్ణ ౨ ఆ. ౨౮౬)+ఇవి దాన్యాదులయు వాన్యాదులయుం ద్రుతమునకు (౨౧౫ I విష) నుపలక్షణము. ఉదా:—దానిని-వానిని. మొ.

౩౧౫ ౧౬ ద్రుతమునిల్చు+టచేఁ బూర్వసూత్రోక్తద్విత్వము సంభవించు.

౩౩౭ ౩ చేసినచో+(ప్రాఁకాదిఖిలాపమును సూరి యిందుఁజేర్పమిచే నిట్లు వ్రాయవలసెను.)

౩౪౪ ౨౬-౨౮-౨౯. 'ఝా-౨౮' పంక్తులను, ౨౯ పంక్తిలో 'వలయును' అనువఱకును త్యాజ్యములు.

౩౪౯ ౨౯ ఇట్టివానికి+వివక్షితార్థమందు.

౩౬౨ ౧౦ సమాసములలో+వాఁడివిశిమయూఖములు = వాఁడిమయూఖములు, మూఁడుశిలోక ములు = మూఁడులోకములు.

౩౭౦ ౭ విస్తర+II.)

౪౨౪ ౩౧ వలసి నన్నది+(చూ. విస్తర I. ౪౨ I విమ. ౧౯ I విమ.)

౪౪౬ ౧౨ లేనప్పుడు+(వ్యర్థనేమాఁగా - హాహాపుట్టు.)

౪౬౭ ౧౭ వివక్షాశ=+పురాణప్రసిద్ధకామరూపమూలక.

౪౬౯ ౧౮ "గీ...దీని విభుఁడు గామండుఁ గ్రోధనుండు వీనిగెల్వ (అశ్వ. ౨ ఆ ౧౫౩ ప.)" కని నిచటఁదీసివేసి ౪౮౧ పుట. ౧౮ పంక్తిలోని 'పెకలించెను' అను దానితర్వాత నిల్ప వలయును.

,, ౨౭ శివభక్తులు).+జంగమలింగము లను భావనచేత సమహత్త్వము సాధింపగును.

౪౮౧ ౨ పాత్రముల్+(నటులు.)

,, ౩ ఇట్టి+మహాత్ములను.

,, ౨౧ భావము+సహకారుఁడా మున్నగు ప్రయోగములు లేమిఁజేసి "శిలేపకపాత" ఇత్యాదికి విషయములు గావచు సధర్వణుఁడు మార్గాంతరమున సాధించెను.

౪౮౫ ౨౯ మము. మొ.పలికన దీని నుల్లంఘించెను. "సీ...సావిత్రి ప్రధాన" (అశ్వ. ౨ ఆ. ౧౬౧.)

౪౭౬ ౧౪ వ్యాఖ్య)+శబ్దార్థ్రితమను భట్టోజీదీక్షితమతము పూర్వపక్షభావ్యమూలకము.

౫౦౩ ౧౧ నివర్ణకస్థలమునందు+నువర్ణకము.

౫౧౧ ౩౦ 'ఇట్టిగుటచేత+ననఁగాఁ గాకుస్వరమగు దీర్ఘరూపము సహజముగా నిల్చనటచేత.

౫౧౭ ౧౧ వైరి+(చూ. ౩౦ IV విమ.)

౫౫౯ ౮ విన+మా

౫౮౬ ౧౬ విస్తర+I

,, ౧౬ విస్తర+I

,, ౩౦ 'అహోబలపతి' అన్నది మొదలుగఁ గ్రిందిపంక్తి త్యాజ్యము.

౫౮౮ ౨౮ విస్తర+II.

,, ౨౯ 'సరికానన్నను' అనుదానికి ముందుగ "విస్తర II ౧౫౯ విమ:—అహోబలపతి భూ) శబ్దమునకే యుపసర్జనత్వమున హ్రస్వముచేయుంట" అనుదానినిఁ జేర్పవలెను.

౫౭౧ ౯ తండ్రి+బందువు-పుట్టువు-చిగురు (చూడు. విస్తర. ౧౫౨ I విమ.)

,, ౨౭ శబ్దముల+యు, రై-రో-సంపద మున్నగు ననేకశబ్దములయుఁ

౬౦౮ ౨౪ గదా+రైశబ్దనిరాసమె యీయర్థర్చమునకుఁ బ్రయోజనము.

౬౪౫ ౧౩ 'హ్రస్వమగు' అనునది త్యాజ్యము.

౬౫౫ ౨౩ మఁనిరాజు+రాజులు-రాజునున్-రాజులనున్-మునిరాజులు-మొ. (చూ. ౧౭౯-౧౩౧ విమ.)

౬౮౮ ౨౧ '(స్త్రీ ప్రత్యయములు తద్ధితములై యగుటచే)' అనునది త్యాజ్యము.

౬౭౩ ౨౯ ఋత్విజుఁడు+అధ్వర్యువు = అధ్వర్యుశాఖాధ్యాయిని స్త్రీ.

౬౯౧ ౨౧ వివరించెను+'పథిన్ మథిన్ ఋభుక్షిన్' అనువానికిని దత్సమత్వమునఁ బ్రయోగము లేదు.

౮౪౩ ౪ ద్వితీయూను+న్=నొ (చూడు. ౧౩౧ విష. ౨౩౦ విష.)

౮౪౭ ౭ వకారము+విభక్తిపరకత్వమున మహత్త్వమందు.

,, ౧౨ 'గుణస్థాగమము' త్యాజ్యము.

౮౬౪ ౨ అన్వానిని+(చూడు. ౮౪ I విష )

౮౮౨ ౪ పరికాడు+ ఈయుహో బలపతి సమన్వయము కష్టమున ద్వితీయావిభక్తి వచనములందు వచ్చెడి ఆగమనిషేధము లేమింజేసి "మాలచేతక్-మాలచేతన్" మున్నగు సశిష్టరూపములు దుర్వారములగుచున్నవి.

౮౯౦ ౨౭ చొప్పున+ననుకము (మున్ముందు వేఱువిధముగ నైతము సాధింపఁబడును.)

౮౯౧ ౪ లోపేః-చ.

౮౯౨ ౨౭ చిన్నగును+పుశ్చ. ఉదా:—పదుడ-పదుండ్రు.

౮౯౩ ౧౯-౨౦ 'లేదా...నగును' అను వాక్యము త్యాజ్యచిహ్నముల (brackets) నడుమ నిల్పవలయును.

౯౨౧ ౨౭ బాధ్యమానవై+(చూ. విస్తర. III. ౨౯౯ విష.)

౯౨౬ ౬ తాత్పర్యము.+పైని వివరించిన బహుళత చింతామణిలోని ప్రసిద్ధార్థక 'హి' శబ్దమునకు వివరణమె యని వచించుచున్నాఁడు.

,, ౧౩ పీశబ్దములందు.+వి ప్రాతిపదికముల మనినని తాత్పర్యము.

,, ౧౬-౧౨ నసాపవిభక్తికసంజ్ఞ కలుగును. + ఊరన్ - చోటన్ మున్నగు చోటులుం దుత్తర సూత్రముచొప్పున "ఇ" అనునది లోపించి నంతమాత్రమున నట్టివి యసాపవిభక్తికము లనరాదు. అపక్షమున "కాలన్ - (కాలిచేతన్) మున్నగునవియు నసాపవిభక్తికములె యనవలసివచ్చునుగదా.

౯౨౮ ౧౬-౧౩ సంభవించెను+ఏకవచనప్రత్యయమేది పరమైనను 'ఇ' అను నుపవిభక్తి వచ్చు శబ్దములకు 'నన్' ప్రత్యయపరకత్వమున మాత్ర మయ్యది నియతముగా రాదనుట యుక్తియుక్తము కాదు. కాన 'నన్' ప్రత్యయపరకత్వమున నయ్యదివిల్చి లోపించునని నాచే వ్యాఖ్యచేయఁబడెను. ప్రాణిపేరన్ = (విరా. ౪ ఆ. ౯౧) ప్రాణిపేరిచేత. గోరనొక్కి = (దశా. ౬ ఆ. ౧౭) గోరిచేత మున్నగునవి యాపవిభక్తికములె యని యంగీకరించి, 'ఊరన్=ఊరియందు 'ఎదురన్'=ఎదురిభాగమున మున్నగునవి యసాపవిభక్తికములనుట కేవలము నరంగపము కాదా ?

౯౩౪ ౧౦ రూపమేర్పడును+'ఇ' అను నుపవిభక్తి నవహోబలపతి యందాహరింపనేలేదు. (అహో. ౨౩౦ పృ. చూ.) "ఆది. ౬ ఆ. ౨౯౪. ఉద్యోగ. ౨ ఆ. ౭౯. ద్రోణ ౪ ఆ. ౨౩౩ కర్ణ [illegible] ఆ. ౮౮. శల్య. ౨ ఆ. ౭౭" అను స్థలముల గాని నన్నయ తిక్కనల మార్పు రాని ప్రయోగములందలి 'ఇ' వర్ణము నెట్లు సంపాదింపఁదలఁచెనో తెలియకున్నది.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫ | ౧౨ | అనుసాల్గును | అనునయిదును |
| ౫ | ౧౪ | 'అనుమూఁదును' | 'అనుసాల్గును' |
| ౧౩ | ౬ | అగుచున్నది. | అపచున్నవి.' |
| ౨౭ | ౧౦ | అటిపరే | అశిపరే |
| ౩౩ | ౧౪ | సంసరా | సంసర్గా |
| ౬౫ | ౨౩ | స్వతా | స్వరా |
| ౪౦ | ౨౪ | శేవ | తేవ |
| ౪౨ | ౩౦ | ఢుంతి | ధుంఢి |
| ౪౩ | ౧౯ | అక్షరములు ప | అక్షరములు పది |
| ,, | ౨౯ | ఆం-భా. ఆ | ఆం-భా. ఆ. సంజ్ఞా |
| ౬౩ | ౧౨ | (౩౧ II | (౩౧ I |
| ,, | ౧౩ | విస్త | విస్తర II |
| ౭౧ | ౨౫ | ఇట్లు | సూచించెప్పినంతమాత్రమున |
| ౭౬ | ౨ | ద్రుత | ద్రుతోపజీవినః |
| ౧౦౩ | ౪ | రములకు | రేని గాగమములకు |
| ,, | ౧౮ | (విస్తర I) | (విస్తర I. II) |
| ౧౨౧ | ౧౨ | 'రీమేషు' | 'రీమాణి' |
| ౧౨౨ | ౬ | | |
| ౧౩౨ | ౭ | మసంగతముగదా | మసంగతమని కానలయు నీ పాఠము బయలువెడలెను |
| ౧౪౪ | ౬౪ | ౭౮ | ౭౭ |
| ౧౫౭ | ౮ | పగతుఁ | బగతుఁ |
| ౧౬౧ | ౧ | ధర్మకవిక | ధర్మకవితె |
| ,, | ౩౨ | (౬౩ III వి) | (విస్తర III. ౬౩ III వి) |
| ౧౭౫ | ౧౭ | కఱకంటము ఖాః | కఱకంటుముఖాః |
| ౧౯౦ | ౭ | అనసేల | అనసేల) |
| ౧౯౨ | ౧౮ | మనశబ్దమునకు | 'మనలవు' అనుదానికి |
| ౧౯౬ | ౧ | యఖండ | ప్రాస |
| ౧౯౭ | ౧౧ | కవివెల | కవిలెవ |
| ౨౦౭ | ౨౧ | సంజీవని | కల్పతరువు |
| ౨౧౯ | ౪ | విస్త IV | విస్త III |
| ౨౬౩ | ౪ | 'లోపః...నగును' | 'సంధిః=పరరూపసంధి, నిత్యమ్ = నిత్యముగా నగును.' |
| ,, | ౬ | తత్సమ | శుద్ధసంస్కృత |
| ,, | ౯ | తత్సమా | శుద్ధసంస్కృతా |
| ,, | ౧౫ | ప్రయోగతఇతీ | ప్రయోగతఇతివ |
| ,, | ,, | (చని+ఎన్) | (చను+ఇయ=ఎ+ఎన్) |
| ౨౩౨ | ౩ | యాశయ | యాశయము |

| పుటం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౭౨౯ | ౭ | నాభిఃపలేము | నాభిఃపతేమః |
| ౭౩౨ | ౨ | విశ్వ్యరూపములు | విశ్వరూపములు |
| ౭౩౭ | ౧౦ | యవహోబల | ముద్రితాపరాకపటి |
| ౭౩౯ | ౬ | విశ్వవిశ్వుల | పశ్వసిష్ణను |
| ౭౪౨ | ౮ | శ్వ | ష్ణు |
| ,, | ౨౦ | పశ్వసీశ్వల | పశ్వసీర్ణను |
| ౭౪౫ | ౨౮ | కవ్యవహితముగా | కవ్యవహితపరముగా |
| ౭౬౨ | ౮ | పథితార్థాదిత్యాది | పదూత్రైత్యాది |
| ,, | ౯ | సూత్రమునకు | పథితార్థాదిత్యాదిసూత్రమునకు |
| ౭౬౨ | ౧౦ ౧౧ | యుందాహరించికొనవలసిన యవస్థ యవహోబలపతికి సంభవించెను | అని యహోబలపతి యుదాహరించెను. |
| ౭౮౨ | ౩౧ | వకారపు న | వకారలోపమున |
| ౭౮౩ | ౧౩ | ఇతి ఇకారలోపః | ఇతి ఎకారలోపః |
| ౭౮౪ | ౨ | లఘుయకారమగుటయు | ఆదిలఘుయకారమైనప్పటికిని, |
| ౭౯౬ | ౩౦ | హాలఁది | హాళఁది |
| ౮౦౪ | ౨౬ | ౨౦౧ IX | ౨౧౦ IX |
| ౮౦౭ | ౧౧ | సూత్రమునకు విషయములమట | సూత్రప్రపంచమేయగుట |
| ౮౧౧ | ౩ | (౩౦ IV పవ) | (విస్తృ II ౩౦ IV పవ) |
| ౮౪౧ | ౨౧ | రూపమైన | సంబంధియైన |
| ౮౪౨ | ౩౧ | అయ్య+ను | అయ్య+న్ |
| ౮౪౩ | ౬ | అమ్మ+ను | అమ్మ+నున్=న్ |
| ౮౪౬ | ౧౬ | అందఱ్వ | అందర్వ (ఱ్వ) |
| ౮౪౮ | ౨౦ | ఇరువున్ | ఇరువురన్ |
| ౮౫౬ | ౨౦ | ఋవర్ణము | రివర్ణము |
| ,, | ,, | యుత్వమునకు | యిత్వమునకు |
| ,, | ౩౧ | కారికచే | సూత్రములచే |
| ౮౬౨ | ౩ | ర్దనిరమి | ర్దనిరమో |
| ౮౬౩ | ౬ | అమి=ద్వితీయైకవచనము, పరమగుచుండఁగాఁదదా | అమః=ద్వితీయైకవచన ప్రత్యయాంశములకు తదా |
| ,, | ౮ | అమి | అమః |
| ౮౭౫ | ౧౯ | ను దద్ధితములై | తద్ధితములుకావు |
| ౮౯౧ | ౫ | కల్లఁగా | కల్లునపుడు |
| ,, | ౬ | పుశ్చ | పుః |
| ౮౯౨ | ౨౩ | రుశ్చ | పురూ, రుశ్చ |
| ౯౦౪ | ౨౪ | ను దద్ధితములలోని వె | తద్ధితములుకావు |
| ౯౩౨ | ౩౦-౩౧ | బాహుళ్కత్వము | బహుళప్రవృత్తి |
| ౯౪౪ | ౬ | అయు+లిటను | అయు+లిను |